# న్యాయ దర్శనము

(గోతమ ముని ప్రణీతము)




దార్శనిక్, "కళాప్రపూర్ణ", దర్శన తత్త్వవేత్త, వేదవేదాంగ పారంగత్

పండిత గోపదేవ్

విరచిత - అంబా వ్యాఖ్యానము



# న్యాయ దర్శనము

(గోతమ ముని ప్రణీతము)


దార్శనిక్, కళాప్రపూర్ణ, వేదవేదాంగ పారంగత్, దర్శన తత్త్వవేత్త

**పండిత గోపదేవ్**


విరచిత - అంబా వ్యాఖ్యానము


ప్రకాశకులు :

ఆర్య సమాజము - కూచిపూడి - 522 313

గుంటూరు జిల్లా, ఆం.ప్ర.

అంబా దర్శన గ్రంథమాల - 4.

సర్వస్వామ్యములు : సురక్షితము

చతుర్థ ముద్రణము : 500 ప్రతులు

దుర్ముఖినామ సం॥ సంక్రాంతి 2017

మూల్యము : ₹ **120/-**

ప్రతులకు :

ఆర్యసమాజము, కూచిపూడి - 522 313 (తెనాలి తాలూకా).
గుంటూరు జిల్లా. ఫోన్ : 08644-252789. (ఆం.ప్ర.)

శ్రీ మాశెట్టి శ్రీనివాస్ ఆర్య, # 5, మాశెట్టి బిల్డింగ్,
3-3-736 to 740, కంచరిబజార్, సికింద్రాబాద్-3. (తెలంగాణ)
ఫోన్ : 040-66320200.

ఆర్యసమాజము, సీతాఫలమండి, సికింద్రాబాద్ - 61. (తెలంగాణ)
ఫోన్ : 040-27071816

ఆర్యసమాజము, గాంధీచౌక్ దగ్గర, తెనాలి,
గుంటూరు జిల్లా. (ఆం.ప్ర.)

ఆర్యసమాజము, పిచ్చుకలకుంట, అరండల్‌పేట్,
గుంటూరు. (ఆం.ప్ర.)

Designed & Printed at
**PRINTSHOP**
Sec'bad. Ph : 6632 0300

MAHARAJAH
OF
JEYPORE

FORT
JEYPORE (Orissa)

## ఆశయము

ఇప్పటి వఱకు ననువదింపఁబడకుండిన దర్శనముల ననువదించి సాధారణ జనులకు విజ్ఞానముఁ గలిగింపఁగొందఱు పండితులు పూనుకొనుట సంతోషకరమగు విషయము.

పండిత శ్రీ గోపదేవ్‌గారు మూడవది యగు "న్యాయ దర్శనము"ను దెలుఁగు దెలియువారికిఁ జక్కగాఁ దెలియునట్లు తేటమాటలతోఁ బ్రకటించి పాఠకుల కృతజ్ఞతకుఁ బాత్రులయిరి. అప్పొత్తము పాఠ్యాపుస్తకముగా నేర్పడునని నమ్మువాఁడను.

ఇట్లు

శ్రీ విక్రమదేవ వర్మ

జయపురము

5-8-1950

## సర్. సర్వేపల్లి రాధాకృష్ణన్

యం.ఏ., డి.లిట్ (Hon.)

భారతీయ రాయబారి - మాస్కో

## ప్రస్తావన

భారతీయాలోచన అంతస్ఫురణమే కాని కారణాత్మకము కాదను సామాన్యాభిప్రాయము లోకమున వ్యాపించి యున్నది. జీవిత - భావ సమస్యలను పరిష్కరించుపట్ల హేతువాదమునకు సముచితబల మీయలేదను తలంపు నియ్యది పెంపు చేయరాదు. న్యాయ దర్శనమున కిచ్చిన ప్రాధాన్యమిందులకొక ప్రమాణము.

భారతదేశమునగూడ నేడు కేవలము సంస్కృత విద్వాంసులో లేక ఆంగ్ల విపశ్చితులో భారతీయ సంస్కృతి సంపద నేఱుగ గలిగియున్నారు. దేశభాషలలో ననువాదముల, వ్యాఖ్యల మూలమున జనసామాన్యమునకు గూడ నీ సంస్కృతి సంపదనందించు యత్నము లధికముగ జరుగుచున్నవి.

ఈ మార్గమున పండిత గోపదేవ్ రచించిన తెలుగు 'న్యాయ దర్శనము' ప్రశంసింపదగిన ప్రయత్నము. దీనికి తగిన పాండిత్యము, వివేచనాత్మ కాంతర్దృష్టి, అనురాగము నీ గ్రంథకర్తకు గలవు. వీరి గ్రంథమును విశాలమగు పాఠకలోకము పఠించునని ఆసించుచున్నాను.

**ఎస్. రాధాకృష్ణన్**

భారతీయ దౌత్యకార్యాలయము

మాస్కో 1 ఆగష్టు 1950

(అనువాదము)

# మైసూరు విశ్వవిద్యాలయము

సి. ఆర్. రెడ్డి
ప్రొ. - చాన్సలర్

వెస్టు లేక్
యెల్ వాల్ రోడ్డు
మైసూరు, 6 ఆగష్టు 1975

మిత్రులు, పండిత గోపదేవ్ గారు,

గౌతముని న్యాయదర్శనము మీద మీరు రచియించిన ఉద్గ్రంథము నాకు చేరినదని తెలుపుటలో జరిగిన యాలస్యమునకు క్షమింప గోరెదను. ఈ యాలస్యము అభిరుచి లోపమువలన గాక యనివార్యములగు పరిస్థితులవలన గలిగినది.

మీరు రచించిన యీ గ్రంథముతోబాటు ఆస్తికవాదమును, వైశేషిక దర్శనమును మన సంస్కృతిని సరిగ గ్రహించు నాలోచనను రేకెత్తించు గ్రంథములలో జేరును. అద్భుతమగు చక్కని మీ తెలుగు వచన రచనమునకును, విజ్ఞానదాయకములగు మీ వివరణములకును, వ్యాఖ్యానమునకును మిమ్ము నే నభినందింపవలసియున్నది. ప్రమాణ గ్రంథములనుండి సందర్భోచితములగు నుట్టంకింపులవలన మీ యభిప్రాయములను బలపఱచిన పద్ధతి మీ పాండిత్యమును, అభిరుచిని, విచక్షణాశక్తిని నిరూపించుచున్నది.

మీకు నా యభివందనములు.

సి. ఆర్. రెడ్డి

(అనువాదము)

# పరిచయము

మానవు డాలోచనాశీలుడు. ఈ యాలోచనాశక్తియే మానవునికి తక్కిన ప్రాణివర్గమునుండి యౌన్నత్యము నాపాదించును. కనుక నీ యాలోచన లేని మానవుడు మానవుడే కాదన్నను అట్టే అబ్బురం పడనక్కఱయుండదు.

ఈ యాలోచనల కంతులేదు. ఇవి యాతని మనఃపాటవమును బట్టియు, సంస్కార విశేషమును బట్టియు, నితర పరిస్థితులను బట్టియు నెన్నియో విధములుగ, నెన్నియో మార్గములుగ సంచరించుచుండును. అయినను ఈ రీతులన్నియు క్రమబద్ధములనియు, క్రమవికాసములనియు ననజాలము.

కాని యివి యన్నియు నొక క్రమమార్గమును బట్టినప్పుడే మానవుడొక యథార్థమును – నిశ్చితసిద్ధాంతమును దెలిసికొనగల్గును. లేనిచో నాతడాతత్త్వమును దెలిసికొనగల్గుట కలలోని వార్త.

మహర్షులగు మన పూర్వులు ఈ యాలోచనాప్రవాహము నటు నిటు పోనీయక సూటిగా ప్రవహించుటకై కొన్ని కట్టుదిట్టము లేర్పఱచిరి. వీని ననుగమించినచో సామాన్యులును చక్కని బాటలలో సంచరింపగలరు. ఈ ప్రణాలికలనే దర్శనము లందుము. ఈ దర్శనములవలన మానవుడు పదార్థ యథార్థస్వరూపము నెఱుగగలడు. కనుకనే యివి దర్శనము (దృశ్యతే అనేన ఇతి దర్శనమ్) లయ్యెను.

భారతీయదర్శనములు ముందు శాఖోపశాఖాలుగా చీలి ప్రచారము నందినట్లే పాశ్చాత్యదేశములందును ఇవి చిలవలు పలవలుగా జీలి యిప్పుడిప్పుడు క్రమవికాసము నందుచున్నవి. శాస్త్రములు వికాసముపొందుట కీ విధాన మత్యుత్తమమైనది. ఆయా శాస్త్రముల ప్రధానప్రయోజనమును సూక్ష్మముగ నిర్వచించుటలో భిన్నాభిప్రాయము లుండుట వింత కాదు. అయినను అనేక పండితుల యభిప్రాయసారమును ఇందు సంగ్రహింతును. చూడుడు వారి విభాగ విధానము.

మెటఫిజిక్సు (తత్త్వశాస్త్రము) : ఇది 'సత్' పదార్థమును వివేచించును. ప్రకృతిలో నెన్నియో 'సత్పాదార్థములు' 'స దాభాసములు' నున్నవి. ఈ శాస్త్రము ఆ 'సత్తు'ను 'ఆభాసము'ను వేరుచేసి సత్తును సత్తుగాను, ఆభాసమును ఆభాసముగాను ప్రత్యేక ప్రత్యేకముగా చూపుచుండును. ఈ సత్పదార్థములు రెండువిధములుగా

నుండును. ఒకటి వృక్షసర్వతాది భౌతిక పదార్థములు, రెండు సుఖదుఃఖాది మానసిక స్థితులు.

ఈ రెండు పదార్థముల తారతమ్యమునుబట్టి యీ శాస్త్రము రెండు విధము లగుచున్నది.

ఈ సత్పదార్థములలో భౌతిక పదార్థములకు మాత్రము స్వతంత్రమగు సత్తా కలదనియు, మానసికదశలు ఆ భౌతిక పదార్థముల సత్యత కాభాసమాత్రము లనియు కొందఱి తలంపు. వీరిని (మెటీరియలిస్టులు) భౌతికవాదులు అందురు.

మఱికొందరు సుఖదుఃఖాది మానసికదశలను - అనగా మనస్సును మాత్రము స్వతంత్రసత్తా యనియు, వృక్ష పర్వతాది భౌతిక పదార్థములు మానవసత్తాకు ప్రతీతిమాత్రము లనియు ననుచుందురు. వీరిని (ఐడియలిస్టులు) భావవాదులు అనుచుందురు.

మఱికొందఱు శాస్త్రజ్ఞులు ఈ భౌతికజగత్తును, మానసజగత్తును రెంటిని నిరపేక్షములుగ - సత్యములుగనే భావించుచుందరు. వీరిని (ద్వ్యయలిస్టులు) ద్వైతవాదు లందురు.

పైన జెప్పిన భావవాదులకు విరుద్ధమగు సిద్ధాంతమును (రియలిజమ్) యథార్థవాదము అనుచుందురు. వీరి భావము ననుసరించి జగత్తులోని పదార్థములు మన కేరూపమున గానబడుచున్నవో యా రూపమున సత్యములు. ఈ యథార్థవాదము భావవాదముకంటె నధిక విజ్ఞాన శాస్త్రసమ్మతమనియు, విషయప్రధానమనియు ననేక విద్వాంసుల యభిప్రాయము.

(ఎపి స్తమాలజీ) ప్రమాణమీమాంస : అనగా జ్ఞానవివేచన, జ్ఞాన స్వరూపమేమి ? జ్ఞానమున కవధియేది ? జ్ఞానప్రామాణ్యమెట్లు ? దాని సత్యాసత్యములు, వాని నిర్ణయము మున్నగు గొప్పగొప్ప విషయము లనేకము లీశాస్త్రమున వివేచింపబడుచుండును. ఇందు జ్ఞానసీమతోబాటు జ్ఞానగమ్యత్వమును, జ్ఞానాతీతత్వమును గూడ జేరుచుండును. కొన్ని పదార్థములు అనుభవ మూలమున తెలియనగుచుండును. మఱికొన్ని యనుభవమున కతీతములు. ఈ ద్వివిధ పదార్థములను దేనికది వేరుచేయుట యత్యావశ్యకము. వీని నీ శాస్త్రము చక్కగ సమీక్షించుచుండును.

(లాజిక్) తర్కశాస్త్రము : జ్ఞానవిషయ చర్చయందు వ్యావహారిక ప్రక్రియలో నీ శాస్త్ర ముపయోగించుచుండును. ఈ తర్కము సత్యముగా – ప్రామాణికముగా నుండవలయునన్న కొన్ని కొన్ని నియమము లావశ్యకములు. ఈ నియయముల యథార్థస్వరూపము ఈ శాస్త్రమున వర్ణింపబడును.

ఈ శాస్త్రమునందు రెండు భాగములు గలవు

(అ) (డిడక్టివ్) నిగమనము : సామాన్యముద్వారా విశేషము నన్వేషించుట.

(ఆ) (ఇన్‌డక్టివ్) ఆగమనము : విశిష్టదృష్టాంతములను బరిశీలించి తన్మూలమున సామాన్యసిద్ధాంతమును గుర్తించుట.

(ఎథిక్సు) నీతిశాస్త్రము : అనగా కర్తవ్యశాస్త్రము, మన జీవితము కష్టమెఱుగకుండ గడపుటకేనా ? లేక యేదైన లక్ష్యమును సంపాదించుటకా ? కర్తవ్యమనగా నేమి ? అది యెన్ని విధములు ? ఇది కర్తవ్యమనియు, నది యకర్తవ్యమనియు, దేనినిబట్టి నిర్ణయింపనగును? మనుష్యునికి సుఖము స్వాభావికమా? లేక ఆగంతుకమా ? మన జీవితమున బహుళముగా నున్న దుః ఖము సత్యమా? అనగా శాశ్వతమా ? లేక యశాశ్వతమా ? ఇత్యాది విశేషముల నిది వివేచించును.

దుఃఖము శాశ్వతము. దానిని తొలగించుకొనుట తలకు మీరిన పని కనుక మనము దుఃఖములో మ్రగ్గవలసినదే యని కొందఱందురు వీరు నిరాశావాదులు. మఱికొంద ఱందురుగదా ! సుఖము మనకు స్వాభావికము. దుః ఖము అస్వాభావికము. అయనను మనము సరియగు మార్గములందు సంచరింపక అజ్ఞానవశులమై దుఃఖములను కొనితెచ్చుకొనుచుందుము. వీని నివృత్తి మన ప్రయత్నముమీద, ప్రవర్తనముమీద నాధారపడియుండును. కనుక మన మట్టి సుఖసాధన మార్గముల సంచరింపవలయును అని. ఇట్టివా రాశావాదులు.

(సైకాలజీ) మనోవిజ్ఞానము : ఇందు మన స్సనగానేమో, దాని స్వరూప స్వభావములేమో, మనోవృత్తులేమో మొదలగు విషయములు వివేచింపబడును. నేడు మానసిక స్థితులు – దశలు ప్రయోగశాలలందు కూడ పరిశీలింపబడుచున్నవి. అందువలన బెక్కు విషయములు ఆసందిగ్ధములుగ నిర్ధారికము లగుచున్నవి. ఇందు ఎప్పటికప్పుడు నూత్నాంశముల నావిష్కరించుచున్నారు. కాగా మన దేశముననో ! సంప్రదాయసిద్ధముగ నున్న యిట్టి శాస్త్రములను క్రొంగ్రొత్త విషయములతో

పెంపొందింపక పోవుటయేగాక ఉన్నవానిని సయితము చదివి సూక్ష్మాతి సూక్ష్మవిషయములు నూహించి శాస్త్రములుగ సంగ్రథించిన పూర్వ మహర్షుల ప్రతిభా విశేషములను సయితము ప్రశంసింపలేకున్నాము. ఇది దేశ దౌర్భాగ్యము.

పాశ్చాత్య దర్శనశాస్త్రమార్గమునకును, భారతీయ దర్శనశాస్త్ర మార్గమునకును నొక ప్రధానభేధమున్నది. ఆ భేదము నొక దార్శనిక పండితు డిట్లు వర్ణించియున్నాడు.

'గంతవ్యస్థానమును నిర్ణయించుకొనక మహాసముద్ర మధ్యమున పయనముచేయ లంగరెత్తిన నావికులు పాశ్చాత్య దర్శనకారులు. వీరి కొక లక్ష్యము లేదు. వారు విడిచిన నావ యొక యెడ్డునకు చేరవచ్చును. లేదా, యొక ప్రవాహమున బడి కొట్టుకొని పోవనువచ్చును. ఎటులైనను వారికి దిగులులేదు. వారి లక్ష్యము ప్రయాణము చేయుటయే.

ఇక భారతీయ దర్శనకర్తల యుద్దేశ్య మదిగాదు. వీరికొక యాదర్శమున్నది. వీరి గంతవ్యస్థానము దుఃఖనివృత్తి. వారు దానినే లక్ష్య మొనరించుకొని తమ యాలోచనా నావను నడుపుకొనిపోయినారు. కనుక పాశ్చాత్య దర్శనశాస్త్ర నౌకలలో పయనము చేయువారి కేగతి గల్గునో తెలియదుగాని భారతీయనౌక నారోహించినవారు దుఃఖములకు దూరమగు నొక నిర్మల స్థానమునకు జేరగలరనుట నిశ్చయము.

భారతీయములగు ఆస్తికదర్శనము లాటింటిలో న్యాయదర్శనమున కొక ప్రత్యేక స్థానము గలదు. న్యాయమనగా వాత్స్యాయనుడు చెప్పినట్లు (ప్రమాణైరర్థపరీక్షణం న్యాయం) భిన్నభిన్న ప్రమాణముల మూలమున వస్తుతత్వమును పరీక్షించుట. దీనినే అన్వీక్షికి యందురు. అన్వీక్ష యనగా నేమో న్యాయభాష్యమున నిట్లు వివరింపబడియున్నది. "ప్రత్యక్షాగ మాశ్రితమ్ అనుమానమ్ సా అన్వీక్షా" ప్రత్యక్షమును, ఆగమమును అనుసరించిన యనుమానమేయన్వీక్ష, "అథవా ప్రత్యక్షాగమాభ్యాం ఈక్షితస్య అన్వీక్షణం అన్వీక్షా తయా ప్రవర్తతే ఇతి అన్వీక్షికీ న్యాయవిద్యా" ప్రత్యక్షాగమముల సహాయముతో తెలిసిన విషయమును సాధక బాధక యుక్తులతో నిశ్చయించుట.

ఇట్టి నిశ్చయమునకు గావలసిన సాధనసామాగ్రి యంతయు నీ శాస్త్రమునం దీయబడినది గనుక నిది యాన్వీక్షికి యయినది.

ఈ మన న్యాయశాస్త్రమునకు గర్తగోతమమహర్షి. ఇతనినే గౌతము డనియు ననుచుందురు. ఈ పేరుగలవారు జైనమతానుయాయులలో నొకరున్నారు. కాని యాతడు వేద ప్రామాణికుడు కాకుండుటచే నీ యాస్తిక దర్శనకర్త కాజాల డనుట నిక్కువము. మఱి బుద్ధుడయి బౌద్ధమతస్థాపకుడయిన సిద్ధార్థుని వంశ మూలపురుషులలో నొక గౌతముడున్నాడు. అందువలననే బుద్ధుడు గౌతమబుద్ధుడయినాడు. కాని యీ గౌతముడును మహర్షి కాడు. కనుక నితడును మన ప్రస్తుత దర్శనశాస్త్రకర్త కాజాలడనుటలో సంశయముండదు. కాగా మహర్షి యగు గోతమనాముడు రామాయణ కర్త యగు వాల్మీకిమహర్షి సమకాలికుడొకడు గలడు. ఇతడే యీ దర్శనకర్త కావచ్చునని యూహింప ననువగుచున్నది. ఈతని ప్రశంస వాల్మీకిమహర్షి తన రామాయణకవ్యాములో బాలకాండమున జేసియున్నాడు.

ఈ గోతముని భార్యయే రామాయణమున బ్రసిద్ధినొందిన యహల్యాదేవి. జనకమహారాజు పురోహితుడగు శతానందు డీమహర్షి కుమారుడే యని రామాయణమువలన మనకు స్పష్టమగుచుండును. ఇతని యాశ్రయము మిథిలాపుర ప్రాంతమున నున్నది.

ఇతడును జనకరాజుల పురోహితుడనియు, రహూగణ మహర్షి పుత్రు డనియు శతపథబ్రాహ్మణమునుబట్టి స్పష్టమగుచున్నది.

ఈ గోతమ యనునది కాలక్రమమున వంశనామముగా మాఱిపోయినది. కాని యీ వంశమున మూలపురుషుడగు గౌతము డెవ్వడో !

మఱికొందఱ యభిప్రాయములో బుద్ధుని మూలపురుషుడగు గౌతముడును, ఈ గోతమవంశమునకు మూలపురుషుడగు గౌతముడును నొక్కరే యనియు, ఆ యేక వంశమే క్రమక్రమమున నీ రెండు వంశములుగా జీలినదనియు దలచుచున్నారు. ఎటులైనను ఇది పరిశోధనార్హము.

మన న్యాయశాస్త్రకర్తయగు గోతమునికి అక్షపాదుడను నామముగలదు. ఈ పేరు వచ్చుటకు గల కారణములను గూడ వివిధవిధములుగా జెప్పుచుందురు.

(1) ఈయన యొకనా డేదియో యాలోచించుకొనుచు త్రోవనుబోవు చుండెనట ! పోవుచుండగా నతని కాలు ఒక పల్లములోబడి యత డొఱగి ముందునకు బడిపోయెనట ? పడి 'కాళ్ళకుగూడ గన్నులున్నచో నీ యవస్థ గల్గెడిదికాదు గదా!' అని తలచెనట ! అందువలన నప్పటినుండియు నితనిని 'అక్షపాదుడు' అనుచు

వచ్చిరట !

(2) గోతమునియొద్ద పెక్కురు శిష్యులు విద్య నభ్యసించుచుండు వారట! ఒకమా రొక శిష్యుడు ఏదో యపచారము చేయగా మహర్షి యాతని గోపించి 'యీ కన్నులతో నీ మొగము చూడను' అని శపించెనట ! శిష్యుడు తన పశ్చాత్తాపమును బ్రకటించి తన్ననుగ్రహింపుమని మఱి మఱి వేడుకొనెనట ! చివరకు మహర్షి చిత్తము మెత్తవడగా శిష్యుననుగ్రహించి తనమాట వ్యర్థము కాకుండునట్లు తన పాదముల కక్షులు గల్పించుకొని పాదాక్షులతో నా శిష్యుని వీక్షించెనట ! అందువలన నా మహర్షి యక్షపాదు డయ్యెనట !

(3) ఈ మహర్షి యెప్పుడు నేదియో యొక విషయము నాలోచించుచునే యుండువాడట ! ఎచ్చటికి వెళ్ళుచున్నను నీతడు తలయెత్తికొని కాక తలవంచుకొని యాలోచించుచునే వెళ్ళువాడట ! కనుక నితని దృష్టి యెప్పుడును పాదములవైపే యుండెడిదట ! కనుక నితని నక్షపాదు డనిరట !

ఇందేది సత్యమో నిర్ణయింపబూనుట మాపనిగాదు.

న్యాయసిద్ధాంతములు కొన్ని మన వేద–ఉపనిషద్వాఙ్మయములగూడ గానబడుచున్నవి 'కథ మసత స్సఞ్జాయేత' మొదలగు వాక్యము లిట్టివి. ఇక భగవద్గీతాదులలో నిట్టివి యుండుటలో వింతలేదు. 'నాసతో విద్యతే భావోనా2భావో విద్యతే సత:' ఇత్యాదులు.

కాలక్రమమున నీ వాఙ్మయమును పోషించి యభివృద్ధి చేసినవారు పెక్కురున్నారు వారిలో వాత్స్యాయను డొకడు. ఇతడు క్రీ.పూ. 1, 2 శతాబ్దములలోనివా డనుచున్నారు. ఇతని భాష్యము న్యాయవాఙ్మయములో నత్యున్నతస్థానమున నలరారుచుండును, ఇత దుదాహరించిన కొన్ని కొన్ని వాక్యములనుబట్టి యింతకుపూర్వము న్యాయదర్శనమునకు ఒకటి రెండు వ్యాఖ్య లుండినట్లు తెలియుచున్నది. కాని యవి మన కలభ్యములు.

ఉద్యోతకరుడు :– (క్రీ. 6 శతము) వేదానుకూలమగు నీ న్యాయదర్శన భాష్యాదులపై దండెత్తిన సుప్రసిద్ధ బౌద్ధమత ప్రచారకుడగు దిఙ్నాగాచార్యుని సిద్ధాంతమును ఖండించుచు 'న్యాయవార్తికము'ను రచియించినాడు. ఇతని బౌద్ధదర్శన పాండిత్యమును, స్వరచిత వార్తికప్రౌఢత్వమును ప్రశంసార్హములు.

వాచస్పతిమిశ్రుడు : (క్రీ. 9 శత) ఉద్యోతకరుని 'న్యాయ వార్తికము'నకు

'తాత్పర్యటీక'ను రచించినాడు. ఇతడు మిథిలానివాసి. తన యఖండ పాండిత్యమువలన సర్వతంత్ర స్వతంత్రు డను బిరుదమును పొందినవాడు. షడ్దర్శనములలో సర్వతంత్ర స్వతంత్రు డను బిరుదమును పొందినవాడు షడ్దర్శనములలో నొక్క వైశేషికమునకుదక్క మిగిలిన వానికి చక్కని టీకలు రచియించినాడు. ఇవన్నియు ప్రామాణికములుగా భావింపబడుచున్నవి.

జయంతభట్టు :- (క్రీ.శ. 94) 'న్యాయమంజరి'ని రచించినాడు. ఇది గోతమ న్యాయసూత్రములలో కొన్ని కొన్నింటి నేరి వానికి వృత్తి వ్రాయుచు చార్వాక, బౌద్ధ, మీమాంసా, వేదాంత సిద్ధాంతములను అమోఘయుక్తులతో ఖండించినాడు.

భాసర్వజ్ఞుడు : (క్రీ. 10 శ.) ఇతని 'న్యాయసారము' కొన్ని యెడల నపూర్వయుక్తులతో శోభిల్లుచుండును.

ఉదయనాచార్యుడు : (క్రీ. 10 శ.) ఇతడు వాచస్పతిమిశ్రుని తాత్పర్యటీకకు 'తాత్పర్యపరిశుద్ధి' యను పేరితో అమూల్యమగు వ్యాఖ్యరచించినాడు. ఇతని 'న్యాయకుసుమాంజలి' అద్వితీయమని పేరు పడసినది.

గంగేశోపాధ్యాయుడు:- (13. శ.) మిథిలానివాసి. ఉదయనాచార్యు ననంతర మింతటి యుద్ధండపండితు డాప్రాంతమున లేడు. పూర్వన్యాయమార్గము నీతడు మార్చి నవ్యన్యాయమార్గమునకు నాంది యైనాడు. ఇతని 'తత్త్వచింతామణి'యే తర్కశాస్త్రమునందలి అవచ్ఛేదకావచ్ఛేద్యములు, నిరూప్య నిరూపకాది పదములను ప్రారంభించినది. ఈ గంగేశోపాధ్యాయుడు 12వ శతాబ్దిలోని శ్రీహర్షుని 'ఖండనఖండఖాద్యము'ను ఖండించినాడు. ఇతని తత్త్వచింతామణిమీద 13వ శతాబ్దాపు చివరనున్న జయదేవుడు ఆలోక'మను నొక టీకను రచియించియున్నాడు.

ఈతని కుమారుడగు వర్ధమానోపాధ్యాయుడును తండ్రివలె నఖండ విద్వాంసుడు, ఇతడు ఉదయనాచార్యుని గ్రంథములమీదను, తన తండ్రి గారి 'తత్త్వచింతామణి' మీదను, వల్లభాచార్యుని 'న్యాయలీలావతి' మీదను చక్కని వ్యాఖ్యానములను రచించినాడు.

ఆ కాలమునందున్న జయదేవపండితు నెదుర్కొన గలవా డప్పటి పండితమండలిలో నొక్కడు లేడట ఇతడు తన పక్షమును సమర్థించు కొనుచు పక్షము దినములైనను ప్రతిపక్షులతో డీకొనువాడట. అందువలన నితడు 'పక్షధరమిశ్రు'డని ప్రఖ్యాతినొందినాడు. ఇతని శిష్యుడగు రుచిదత్తమిశ్రుడే

వర్ధమానుని కుసుమాంజలిప్రకాశముమీద 'మకరందము' చింతామణిమీద 'ప్రకాశము'నను టీకాగ్రంథములు రచించినాడు.

ఇంతవఱకు న్యాయవిద్యకు కేంద్రము మిథిలాప్రాంతము. 15వ శతాబ్దమునుండియు నా కేంద్రము వంగదేశమునందలి నవద్వీపమునకు మాఱినది. అందీ న్యాయవిద్యలో పెక్కురు ప్రవీణులైనారు. వారిలో వాసుదేవసార్వభౌముడు ప్రథమగణ్యుడు. ఇతని సేవాశుశ్రూషామహిమచే ననేకులు దిగ్దంతులు బయలుదేఱినారు.

రఘునాథశిరోమణి:- (16శ) వంగదేశపు నైయాయికులలో నితనికి దుల్యుడు మఱియొకరు లేరని పేరు పొందినాడు. విద్వన్మండలిలో 'శిరోమణి' యని బిరుదు సంపాదించుకొన్నాడు. ఇతని పుస్తకములలో నుత్తమమైనది 'దీధితి'. ఇది గంగేశోపాధ్యాయుని 'తత్త్వచింతామణి'కి విపులమగు వ్యాఖ్యానగ్రంథము మూలమువలెనే యిదియును పాండిత్యప్రకర్షకు ప్రమాణమయినది. ఇది గ్రంథకర్తయొక్క ఉన్నతభావములకు, మనోహర కల్పనలకు, అఖండ యుక్తి ప్రతియుక్తులకు విధానము.

మధురానాథుడు:- 'శిరోమణి' శిష్యులలో నగ్రగణ్యుడు. ఇతడు 'ఆలోకము' చింతామణి' 'దీధితి' మున్నగు గ్రంథముల గూఢార్థములను ప్రకాశింపజేయు 'రహస్యము' లను టీకలను రచించినాడు.

జగదీశభట్టాచార్యుడు:- (13శ.) మధురనాథుని తర్వాత నితడు నవద్వీపములో గొప్ప పండితుడు. ఇతడును 'దీధితి' మీద ఒక విస్తృత వ్యాఖ్యను రచించినాడు. మఱియు శబ్దశక్తినిగూర్చి 'శబ్దశక్తి ప్రకాశిక' యను నుత్కృష్టగ్రంథ మీతని సర్వస్వమందురు.

గంగాధర భట్టాచార్యుడు:- (17 శ.) వంగదేశమునందలి నైయాయిక రత్నత్రయములో నితడు మూడవవాడు. (మధురానాథుడు, జగదీశుడు, గంగాధరుడు) ఇతని ప్రధాన రచన 'దీధితి' మీది మహావ్యాఖ్యదీనిని 'గాదాధరి' యందురు. ఇట్టి మఱికొన్ని వ్యాఖ్యా గ్రంథములను. ఏబదికి మీఱిన స్వతంత్రగ్రంథములును రచించి కీర్తి నార్జించినాడు.

ఈ రీతిగా న్యాయము మిథిలాప్రాంతమున నంకురించి నవ్యన్యాయరూపముగా విస్తృతిజెంది నవద్వీపమున మహావృక్షమై విలసిల్లినది.

కాని న్యాయశాస్త్రమన లేలపుట్టినదో యాయుద్దేశము రానురాను మరుగుపడిపోయినది. సనాతన న్యాయము సులభభాషలో అమూల్యవిషయములను దెలుప బ్రయత్నింపగా నవ్యన్యాయము దానికి ప్రతిపక్షముగ విషయమును టెంకాయ పిచ్చికొండచేసి మాటల భేషజముతో ......వలె పరుల నెదుర్కొనుటకు తయ్యారుచేసినది. విషయగౌరవము నెఱిగినవారు ఈ వెఱ్ఱితలలకు విచారపడక మానరు.

ఈ విషయము లెస్సగ దెలిసికొన్న మిత్రులు పం. గోపదేవ్‌గారు ప్రాచీన శాస్త్రము లభిమానముతో ప్రచారముచేయు దలంపున నీ శాస్త్రము నీ రూపమున రచియించుట ప్రశంసాపాత్రము.

వీరు నైష్ఠికబ్రహ్మచారులు, కాశ్యాది విద్యాపీటములలో పెక్కువర్షములు పండితులను సేవించి సంస్కృతాదిభాషలలో సాహిత్యసంపదను సంపాదించుటయే గాక సమర్థులగు నాచార్యులయొద్ద షడ్దర్శనములను సమగ్రముగ నభ్యసించినవారు. పాతంజలి మార్గమున మంచు గొండలలోఁబెక్కేండ్లు అష్టాంగయోగము నభ్యసించియు వైదికధర్మమును బ్రచారము చేయు తలంపున తమ పురిటిగడ్డ యగు నాంధ్రదేశమున కరుదెంచినవారు. ఈ శాస్త్రమున కాంధ్రభాష యింతవఱకు నోచుకోలేదనుట యాంధ్రాభిమానమున కాఘాతము. ఆంధ్రులు దీనిని ఎల్లవిధముల బ్రోత్సహించి నిజమగు విజ్ఞానము నాంధ్రదేశమున బ్రచారము గావింప నవకాశము గల్పింతురు గాక !

వినీతుడు,

**వడ్లమూడి వెంకటరత్నం**

## ప్రథమాధ్యాయము



# పండిత గోపదేవ్

| | |
|---|---|
| జననము | : క్రీ.శ. 1896 |
| మరణము | : 1996 |
| జన్మస్థలము | : కూచిపూడి, తెనాలి తాలూకా |
| జననీజనకులు | : శ్రీ అంబమాంబా రామయర్యులు |

| | |
|---|---|
| విద్యాభ్యాసము | : కూచిపూడి,అమృతలూరు, కాశ్యాదిపీఠములు, సంస్కృతాంధ్ర హిందీ సాహిత్యములు |
| వృత్తి | : వైదిక ధర్మ ప్రచారము, వైదిక సంస్కార వ్యాపకత |
| అభిమాన విషయములు | : షడ్ దర్శనము, నైష్ఠిక బ్రహ్మచర్యము, యోగమార్గ ప్రావీణ్యము |
| స్థాపకులు | : అంబా దర్శన గ్రంథమాల, కూచిపూడి,అంబా రామార్య సత్యార్థ ప్రకాశ ట్రస్టు, సికింద్రాబాద్ మరియు ఎన్నో ఆర్యసమాజములు |

**సన్మానములు :**

1. **"కళాప్రపూర్ణ"** - ఆంధ్ర విశ్వవిద్యాలయం, విశాఖపట్టణం
2. రూ. 10,000/- **"మహర్షి దయానంద సరస్వతి నిధి పురస్కార్"** న్యాస్, ఆర్యసమాజం, పులేరా
3. రూ. 5,001/- ఆర్యప్రతినిధి సభ, ఆంధ్రప్రదేశ్, సుల్తాన్ బజార్, హైదరాబాద్.
4. రూ. 25,000/- **వేదవేదాంగ పురస్కార్**, ఆర్యసమాజము, శాంతాక్రూజ్, బొంబాయి
5. రూ. 1,00,000/- శత జయంతి సందర్భముగా **"దర్శన తత్త్వవేత్త"** బిరుదు - శతజయంతి ఉత్స సమితి,సికింద్రాబాద్. తేది. 30-7-1995

**రచనలు,అనువాదములు :** సత్యార్థ ప్రకాశము,ఋగ్వేదాది భాష్యభూమిక, నిరుక్తము, ఋగ్వేద భాష్యభాస్కరము I,II,III, వైదిక వినతి I, II, వైదిక దినచర్య, న్యాయ, వైశేషిక, సాంఖ్య, యోగ, వేదాంత దర్శనములు,ఈశ, కేన, కఠ, ప్రశ్న, ముండక, మాండూక్య, ఐతరేయ, తైత్తిరీయ, శ్వేతాశ్వతర, ఛాందోగ్య, బృహదారణ్యకోపనిషత్తులు, ఆస్తికవాదము, అర్థధర్మ మీమాంస, సంస్కారవిధి, భగవద్గీత,ఏసుక్రీస్తు రహస్య జీవనము, పూజ, వైదిక పర్వ పద్ధతి,అపశూద్రాదికరణము మొదలగునవి చిన్న గ్రంథములు 25 (నాలుగు భాగాలలో) చిన్నవి,పెద్దవికలిపి ఆఋవదికి పైగా వైదిక గ్రంథములు తెలుగులో రచించినవారు వీరొక్కరే.

ఓమ్

# న్యాయ దర్శనము

## ప్రథమాధ్యాయము

(ఆధ్యాహ్నికము)

మోక్షప్రాప్తికి కారణభూతమైన పదార్థ తత్త్వజ్ఞానమును వివరముగా నుపదేశింపదలచి కరుణానిలయుడయిన గౌతమ మహర్షి న్యాయశాస్త్రము నారంభించుచు మొదటి సూత్రమును రచించుచున్నాడు.

**"ప్రమాణ, ప్రమేయ, సంశయ, ప్రయోజన,**
**దృష్టాంత సిద్ధాంతా వయవ, తర్క, నిర్ణయ, వాద,**
**జల్ప, వితండా, హేత్వాభాస, చ్ఛల, జాతి నిగ్రహ**
**స్థానానాం, తత్వజ్ఞానా న్నిః శ్రేయసాధిగమః." 1.1.1.**

(ఈ సూత్రమున నిర్దేశింపబడిన పదములన్నియు సర్వ పదార్థ ప్రధానమగు ఇతరేతర యోగ ద్వంద్వసమాస ఘటితములు. విగ్రహము యథావచనము చేయవలయును.)

ప్రమాణాని (చ) = ప్రమాణములు, ప్రమేయమ్ (చ) = ప్రమేయము, సంశయః (చ) = సంశయము, ప్రయోజనం (చ) = ప్రయోజనము, దృష్టాంతః (చ) = దృష్టాంతము, సిద్ధాంతః (చ) = సిద్ధాంతము, అవయవాః (చ) = అవయవములు, తర్కః (చ) = తర్కము, నిర్ణయః (చ) = నిర్ణయము, వాదః (చ) = వాదము, జల్పః (చ) = జల్పము, వితండా (చ) = వితండ, హేత్వాభాసాః (చ) = హేత్వాభాసములు, ఛలం= (చ)ఛలము, జాతయః (చ) = జాతులు, నిగ్రహస్థానాని (చ) = నిగ్రహస్థానములు, నను నీ పదునారు పదార్థముల, తత్వజ్ఞానాత్ = యథార్థజ్ఞానమువలన, నిఃశ్రేయసాధిగమః= మోక్షప్రాప్తియగును.

ప్రమాణాది షోడశపదార్థముల తత్వమును సాక్షాత్కరింప జేసికొనుటవలన నిఃశ్రేయసము సిద్ధించునని సూత్రాభిప్రాయము. సూత్రమున వర్ణింపబడిన ప్రమాణాది పదార్థములు క్రమముగా ముందు గ్రంథమున వర్ణింపబడును.

"య ఇత్త ద్విదుస్తే ఉ_మృతత్వమానశుః" (ఋ.2-3 18.23)
"తమేవ విదిత్వాఉ_తి మృత్యుమేతి, నాన్యః పన్థా
విద్యతేఉ_యనాయ" (యజు. 31,18)
"తమేవ విద్వాన్నబిభాయ మృత్యోః" (ఆథ్వర్య 1.5.44)
"యస్మిన్ ద్యౌః పృథివీ చాంతరిక్షమోతం మనః సహ
ప్రాణైశ్చ సర్వైః తమే వైకం జానథ ఆత్మాన మన్యో
వాచో విముంచథామృత స్యైషసేతుః (ముం.2.2 5)

ఇట్టి శ్రుత్యుపనిషద్వాక్యములవలన నీశ్వర తత్వజ్ఞానము మోక్షమున కసాధారణ కారణమైనట్లు బోధపడుచున్నది. ఇదియే వైదిక సిద్ధాంతము. కాని, ఆ యీశ్వర తత్వజ్ఞానము కలుగుటకు జీవాది ఇతర పదార్థముల తత్వజ్ఞాన మత్యంతావశ్యకము. ఆ జీవాది పదార్థజ్ఞానము శాస్త్రము వలన లభించును. శాస్త్రాది శ్రవణము వలన కలుగు పదార్థజ్ఞానము జటిలము, కుటిలము నగు యుక్తులద్వారా సంశయ గ్రస్తమగునేని మోక్షసాధనము కాజాలదు. అట్టి సంశయాదులను బోనాడి దృఢమైన జ్ఞానము కలుగజేసి మముక్షువులకు తోడ్పడునదియే న్యాయవిద్య = ఆన్వీక్షికి... (ఈక్షితస్య అన్వీక్షణం అన్వీక్షా) శాస్త్రాత్ ఈక్షితస్య = శాస్త్ర శ్రవణము ద్వారా విన్న విషయమును అన్వీక్షణం = సాధక బాధక యుక్తులతో నిశ్చయించుట అన్వీక్ష యనబడును. ఆ యన్వీక్షతో ప్రవర్తించు విద్య ఆన్వీక్షికి యనబడును. దీనినే వేదాంతవిదులు మననమందురు. వేదాది శాస్త్రముల ద్వారా ప్రతిపాదింపబడిన విషయములు వాదులచే ప్రయోగింపబడు కుటిలయుక్తులచే దూషితము లయినప్పుడు వానిని నిర్దుష్టమొనర్చి ప్రమాణీకరింప తోడ్పడునట్టి దీ న్యాయవిద్యయే - న్యాయశాస్త్రమే. దీనికి ప్రతిపాద్య విషయములు ప్రమాణాది షోడశపదార్థములు. అందు ప్రమాణము నిఖిలపదార్థవ్యవస్థాపక మగుటచే ప్రప్రథమమున నుదాహరింప బడినది. ప్రమాణములద్వారా తెలియబడునది ప్రమేయము గనుక దాని తరువాత లెక్కింపబడినది. మిగిలిన సంశయాది పదార్థము లన్నియు ప్రమాణముననో, ప్రమేయముననో చేరిపోవును. కాబట్టి వానిని వేరుగా నుపదేశింపవలసిన యగత్యము లేదు. అయినను సంశయము కలుగకున్న తర్కాదులకు ప్రవృత్తి కలుగదు గనుక సంశయాదుల నిట ప్రత్యేకముగా నిర్దేశింపవలసివచ్చెను. ఇట్లు ప్రమాణాది సర్వ పదార్థముల తత్వజ్ఞానము నిః శ్రేయసమునకు సమానసాధనము గాకున్నను కొన్నిటి జ్ఞానము సాక్షాత్తుగాను,

కొన్నింటి జ్ఞానము పరంపరగాను సాధనమే యగుటవలన, మొత్తమున నిః శ్రేయసప్రాప్తికి సాధనముగా మహర్షి యీ సూత్రమున ప్రతిజ్ఞ చేసియున్నాడు.

తత్త్వజ్ఞానమువలన నెట్లు నిఃశ్రేయసము సిద్ధించునను

**"దుఃఖ జన్మ, ప్రవృత్తి దోష, మిథ్యాజ్ఞానానా**
**ముత్తరోత్తరాపాయే, తదనంతరాపాయా దపవర్గః" 1.1.2.**

అధర్మము వలన కలిగి, అనుభవమున కింపుగాని గుణము దుః ఖమనబడును. అపూర్వములైన శరీరేంద్రియ మనోవేదనలతో నాత్మ కేర్పడు సంబంధమునకు జన్మయని పేరు.

ప్రవృత్తిసాధనముగాగల ధర్మాధర్మము లీ సూత్రమున ప్రవృత్తి శబ్దముచే వ్యవహరింపబడినవి. రాగద్వేషములు దోషమనబడును. మిథ్యాజ్ఞానము, అవివేకము, భ్రాంతి, అవిద్య ఇవి పర్యాయపదములు, ఇట్లు దుఃఖము, జన్మము, ధర్మాధర్మములు, దోషము, మిథ్యాజ్ఞానము నను నీ యైదింటిలో

ఉత్తరోత్తరాపాయే = మొదట మిథ్యాజ్ఞానము, తరువాత దోషము, అటుపై ధర్మాధర్మములు, అనంతరమున జన్మము పిమ్మట దుఃఖము తొలగిపోయిన, తదనంతరాపాయాత్ = దానికి సమీపముననున్న దోషము మున్నగునవి తొలగిపోయి, అపవర్గః = మోక్షము సిద్ధించును.

(అతస్మిన్ తద్‌జ్ఞానమ్, మిథ్యాజ్ఞానమ్) ఒక వస్తువును మరియొక వస్తువుగా నెఱుగుట మిథ్యాజ్ఞాన మనబడును. ఆత్మ మొదలుకొని యపవర్గము వరకుగల నిఖిల ప్రమేయము లందును మిథ్యాజ్ఞాన మనేక విధముల కలుగును. అయినను, ముఖ్యముగా అనిత్యమున నిత్యబుద్ధిని, అశుచియందు శుచి జ్ఞానమును, దుఃఖమున సుఖమతిని, శరీరాద్యనాత్మపదార్థము లందాత్మబుద్ధిని కలిగించి మిథ్యాజ్ఞానము జన్మ మరణ పరంపరాయుతమగు సంసారమునకు కారణమగుచున్నది. యోగశాస్త్రమున నిట్లే వర్ణింపబడినది.

**"అని త్యాశుచి దుఃఖానాత్మసు నిత్య శుచి సుఖాత్మ**
**ఖ్యాతి రవిద్యా" (యో. సూ. 2.5.)**

ఈ యవిద్యామూలకములే రాగద్వేషములు. తత్త్వము నెఱింగిన వ్యక్తియెన్నడు దేనియందును రక్తుడుగాడు - దేనిని ద్వేషింపడు. కాబట్టి రాగద్వేషములకు మూలము మిథ్యాజ్ఞానమే. రాగద్వేషగ్రస్తబుద్ధులే లోకమున ధర్మాధర్మములందు ప్రవర్తింతురు. అందువల్లనే వైశేషిక దర్శన కారుడగు కాణాద మహర్షియు తన గ్రంథమున ("ఇచ్ఛా ద్వేషపూర్వికా ధర్మాధర్మ ప్రవృత్తిః వై.

7.2.15) ధర్మాధర్మ ప్రవృత్తి ఇచ్ఛాద్వేషమూలకమని వర్ణించియున్నాడు. ఇట్టి ధర్మాధర్మ ప్రవృత్తిమూలకమైనదే జన్మము. వీతరాగులకు జన్మముండనేరదని యీ శాస్త్రముననే ముందు బోధింపబడును. (వీతరాగ జన్మాదర్శనాత్ 3.1.15) ప్రపంచమున కలుగు దుఃఖములన్నియు జన్మమూలకములనుట నిస్సంశయము. శరీరమే లేకున్న తన్మూలమున ననుభవించు దుఃఖమునకు స్థానమెద్ధి? కాబట్టియే (ఆత్మోవైసశరీరః ప్రియాప్రియాభ్యామ్ ఛాం. 8.12.1) సశరీరుడే ప్రియాప్రియముల ననుభవించునని ఛాందోగ్యమున జెప్పబడినది. ఇట్లు దుఃఖములకు మూలము మిథ్యాజ్ఞానమని బోధపడినది. అవిద్య యున్నంతకాలము దుఃఖమనువర్తించును కారణముండగా కార్యము నివృత్తి నొందనేరదు. కారణనాశమున కార్యము నశింపగలదు. కాబట్టి నిః శ్రేయసకాములు ప్రయత్నపరులై మిథ్యాజ్ఞానమును తొలగింపవలయును. అటుపై క్రమముగా దోషాదులుపోయి త్రివిధదుఃఖములు నశించి మోక్షము ననుభవింపగలరు.

ప్రమాణములను విభజించి ప్రమాణ సామాన్య లక్షణమును నిరూపించుచున్నాడు.

**"ప్రత్య క్షానుమా నోపమాన శబ్దాః ప్రమాణాని" 1.1.3.**

(ప్రమీయతే అనే నేతి ప్రమాణమ్) దేనిచే నొక విషయము తెలియదగునో అది ప్రమాణము. ప్రమ యన జ్ఞానము. ప్రమాకరణము ప్రమాణము. అనగా జ్ఞాన సాధనము ప్రమాణమని తాత్పర్యము. ఇదియే ప్రమాణ సామాన్య లక్షణము. ఆ ప్రమాణము ప్రత్యక్షానుమానోపమాన శబ్దాః= ప్రత్యక్షము, అనుమానము, ఉపమానము, శబ్దమునని నాలుగు విధములు. ఈ ప్రమాణములలో ప్రత్యక్షము ప్రధానమగుటచే ప్రథమమున నిర్దేశింపబడినది. అనుమానము ప్రత్యక్షపూర్వక మగుటచే, తదనంతరము లెక్కింపబడినది ఉపమానము అనుమానప్రమాణతుల్యమగుటచే మూడవదిగా గణింపబడినది. ప్రత్యక్షానుమాన ప్రమాణపూర్వక ప్రవృత్తి కలదగుటచే శబ్దము చివర నిర్దేశింపబడినది.

ఉద్దేశము, లక్షణము, పరీక్షయని యీ శాస్త్రము ముచ్విధముల ప్రవర్తించును. నామములతో పదార్థములను పేర్కొనుట యుద్దేశము. ఉద్దిష్టపదార్థముయొక్క యసాధారణ ధర్మము లక్షణము. ఆ లక్షణము లక్షితపదార్థమునకలదా, లేదా యని ప్రమాణములతో నిర్ణయించుట పరీక్ష

యనబడును, వేరు వేరు పేర్లతో వేరువేరు పదార్థములను చెప్పుట విభాగ మనబడును. ఇదియు నుద్దేశముననే చేరగలదు. అందువలన శాస్త్రప్రవృత్తి త్రివిధమే యనుట యసత్యము కానేరదు.

ప్రత్యక్షప్రమాణ లక్షణము : -

**'ఇంద్రియార్థ సన్నికర్షోత్పన్నం జ్ఞాన, మవ్యపదేశ్య, మవ్యభిచారి, వ్యవసాయాత్మకం ప్రత్యక్షమ్." 1.1.4.**

(యతః = దేనివలన) ఇంద్రియార్థ సన్నికర్షోత్పన్నం = ఘ్రాణా - సన్నికర్ష మారు విధములు. 1. సంయోగము 2. సంయుక్త సమవాయము, 3. సంయుక్త సమవేత సమవాయము, 4. సమవాయము. 5. సమవేత సమవాయము, 6. విశేషణ విశేష్య భావము: సంయోగము ద్రవ్య ప్రత్యక్షమునందును, సంయుక్త సమవాయము ద్రవ్య గత రూపాదిగుణ ప్రత్యక్షమునందును సం యుక్త సమవేత సమవాయము ద్రవ్య సమవేత రూపాది సమవేత రూపత్వాది సామాన్య ప్రత్యక్షమునందును, సమవాయము శబ్దప్రత్యక్షము నందును, సమవేత సమవాయము శబ్దగత శబ్దత్వాది సామాన్య ప్రత్యక్షమునందును, విశేషణ విశేష్య భావము ఆ భావముల ప్రత్యక్షము నందును కారణమగునని వివేకము. ఘ్రాణాదీంద్రియములకు గంధాది పదార్థములతో సంబంధము కలుగుటచే (నే) జ్ఞానము కలుగుచున్నదో, ప్రత్యక్షమ్ = (అది) ప్రత్యక్ష ప్రమాణమనబడుచున్నది. ఆ కలుగుజ్ఞానము, అవ్యపదేశ్యం = గంధజ్ఞానము, రసజ్ఞానమునని విషయనామములచే పేర్కొనబడనిదిగాను, అవ్యభిచారి = స్వార్థమును విడువనిదిగాను వ్యవసాయాత్మకం = నిశ్చయాత్మకముగాను నుండ వలయును.

ఇంద్రియార్థముల సన్నికర్షమువలన నుత్పన్నమై, స్వార్థమున విడువనిదై, సంజ్ఞచే చెప్పబడనిదై నిశ్చయాత్మకమైన జ్ఞానము దేని వలన కలుగునో అది ప్రత్యక్ష ప్రమాణమని యీ సూత్రాభిప్రాయము.

ఇంద్రియార్థ సన్నికర్షోత్పన్న జ్ఞానమే ప్రత్యక్షము అని లక్షణము చెప్పినచో, ఇది జలము, ఇది మామిడిపండు అని యా యా వాచ కపదములచే నేర్పడు జ్ఞానము సైతము ఇంద్రియార్థ సన్నికర్షోత్పన్నమే యగుటవలన నందు లక్షణము అతి వ్యాప్తమగును. దానిని వారిం చుటకు అవ్యపదేశ్యమను విశేషణము (లక్షణమున) చేర్పబడినది. వ్యపదేశమనగా సంజ్ఞాపదము - నామవాచకము. వ్యపదేశమువలన నేర్పడు జ్ఞానము వ్యపదేశ్యము - అది కానిది అవ్యపదేశ్యము.

ఇంద్రియార్థ సన్నికర్షోత్పన్నమై యవ్యపదేశ్యమయిన జ్ఞానము ప్రత్యక్షమని లక్షణము చేయబడినను అల్పప్రకాశమున త్రాటిని చూచినపుడు కలుగు సర్పభ్రాంతియందును, ఎండమావులలో కలుగు జలభ్రాంతియందును అతివ్యాప్తి తప్పదు. కారణమేమన, భ్రాంతి జ్ఞానము ఇంద్రియార్థ సన్నికర్షమువలననే కలుగును. కాని యది వ్యపదేశ్యము కాదు. కాబట్టి యీదోషమును వారించుటకు లక్షణమున అవ్యభిచారి = స్వార్థమును విడువనిదై యుండ వలయునను విశేషణము చేర్చబడినది.

ఇట్లు రెండు విశేషణములు చేర్చబడినప్పటికి దూరము నుండి యొక వస్తువును చూచునపుడు కలుగు – ధూమమా లేక ధూళియా, స్థాణువా లేక పురుషుడా యను సంశయ జ్ఞానమున నతివ్యాప్తి తప్పదు. కారణమేమన? సంశయ జ్ఞానమును ఇంద్రియార్థ సన్నికర్ష జన్యమే; అవ్యపదేశ్యమే; మఱియు భ్రమయును కాదు. కాబట్టి యిటదోషమును వారించుటకు లక్షణమున నిశ్చయాత్మకమై యుండవలయునను విశేషణము చేర్చబడినది. సంశయజ్ఞానము నిశ్చయాత్మకము కాకపోవుటచే నిప్పుడు దోషము వాటిల్లదు.

లోకమున ప్రమాణ వ్యవహారమువలన వస్తుజ్ఞానము కలుగును అటుపై యావస్తువును గ్రహించుటో, విడుచుటో లేక యుపేక్షించుటయో కలుగును. కాబట్టి యింద్రియము ప్రమాణ మైనపుడు వస్తు జ్ఞానము ఫలమగును. వస్తుజ్ఞానము ప్రమాణ మైనపుడు గ్రహణ త్యాగోపేక్షా బుద్ధులు ఫలమగును.

తరువాత అనుమాన ప్రమాణము : –

**"తత్పూర్వకం త్రివిధ మనుమానం; పూర్వవత్**
**శేషవత్ సామాన్యతోదృష్టంచ" 1.1.4.**

ఈ సూత్రమున పూర్వ సూత్రమునుండి 'జ్ఞానమ్' అను శబ్దము అనువర్తించును.

తత్ పూర్వకం = తత్ అనగా ప్రత్యక్షము. ఇట్టి అనుమానమునకు కారణ భూతమగు లింగదర్శనము, లింగ లింగి సంబంధ దర్శనము గ్రహింపబడును. కాబట్టి లింగ ప్రత్యక్షము, లింగ లింగి సంబంధ ప్రత్యక్షము కారణముగా గల లింగిజ్ఞానము అనుమానమ్= అనుమానమనబడును, త్రివిధమ్ = ఆ యనుమానము ముప్విధములు పూర్వవత్, శేషవత్, సామాన్యతో దృష్టంచ = పూర్వవత్తు, శేషవత్తు సామాన్యతో దృష్టము అని.

పూర్వవత్ = పూర్వవత్తు. పూర్వమన కారణము, కారణజ్ఞానము ద్వారా

కార్యజ్ఞానము కలిగిన నది పూర్వవత్తనబడును. ఉదా హరణము: - మేఘోన్నతిని జూచి వర్షించునని తెలిసికొనుట లేక పూర్వవత్ అను నీ పదమున మతుప్ప్రత్యయము నెంచక 'వత్' ప్రత్యయముగా గ్రహించిన పూర్వవత్ = పూర్వమన కారణము. పూర్వవత్ = ఏ కార్యకారణములకు గల వ్యాప్తి పూర్వము గ్రహింపబడినదో - అనగా ప్రత్యక్షజ్ఞానము కలిగినదో అట్టి కారణ జ్ఞానమువలన నటువంటి కార్యము - సాధ్యము తెలియబడిన నది పూర్వవత్తు అనబడును. ఉదాహరణము:- ధూమమును జూచి వహ్ని నెఱుంగుట.

సాధారణముగా మనము మహానసమున (వంటయింట) ధూమమును, అగ్నిని, వాని సంబంధమును జూతుము. తరువాత నెటనేని ధూమము కానవచ్చిన ధూమాగ్నులకు గల సంబంధము స్మరణకు వచ్చును. అటుపై ధూమమున్న చోట వహ్నియుండునని తెలిసికొందుము. ఇది యనుమాన ప్రకారము.

శేషవత్ = శేషము అనగా కార్యము. కార్యజ్ఞానము వలన కారణ జ్ఞానము కలిగిన నది శేషపదనుమాన మనబడును. ఉదా :- నది యందు క్రొత్తగా వచ్చిన మలిన జలముతో కూడిన వేగవంతమగు ప్రవాహమును జూచి యెటనో వర్షించియుండునని తెలిసికొనుట.

శేషవత్ - పరిశేషము పరిశేషమన, (ప్రసక్త ప్రతిషేధే అన్యత్రా ప్రసంగాత్ శిష్యమాణే సంప్రత్యయః పరిశేషః) ప్రసక్తిగల చోట నిషేధింపబడి మఱి యితరత్ర - ప్రసక్తి లేక మిగిలి యున్నదాని యందు ప్రసక్తమగుట - సంబద్ధమగుట. ఉదాహరణము : - శబ్దము పృథివ్యాద్యష్ట ద్రవ్యము లందనాశ్రితమై, ద్రవ్యాశ్రితమగుటచే శిష్టద్రవ్యమగు నాకాశము ఆశ్రయముగా గలదని తెలిసికొనుట, దీనికి పరిశేషానుమానమనియు పేరు గలదు.

సామాన్యతోదృష్టం= లింగ లింగి సంబంధము ప్రత్యక్షము కాని చోట్ల ఒకానొక వస్తువునందు లింగ సాదృశ్యముండుటవలన తద్ద్వారా లింగి తెలియబడును. అనగా అప్రత్యక్ష వస్తువొందు తెలియబడును. లింగ సాదృశ్యము వలన నెఱుగుట యని భావము ఉదా : - ఇచ్ఛ, ద్వేషము, రాగము మున్నగు గుణములద్వారా ఆత్మ తెలియ బడుట, ఇచ్ఛా - రాగ - ద్వేషాదులు రూప రస గంధాదులవలె గుణములు. అవి యొకానొక ద్రవ్యమునాశ్రయించి యుండును. ఈ యిచ్ఛాదుల కాశ్రయమగు పదార్థము ఆత్మ.

లింగము, సాధనము, హేతువు, కారణము నను పదము లిట

హేతుపర్యాయములుగా వాడబడును. కార్యము, సాధ్యము, లింగి యను పదము సాధ్యసమానార్థకములు. సాధన సాధ్య సాహచర్యము, లేక లింగముతో లింగికి గల నియమ సంబంధము వ్యాప్తి యనబడును. వ్యాప్తిబోధ కలుగని పక్షమున ననుమతి కలుగనేరదు. ధూమమున్నచోట అగ్ని తప్పకయుండునన్న జ్ఞానము లేనివానికి ధూమము కనిపించినను అట నగ్ని యుండునని వాడు తెలిసి కొనజాలడు.

ఈ వ్యాప్తియు మూడు రకములు. విశేషవ్యాప్తి, సామాన్యవ్యాప్తి. వ్యతిరేక వ్యాప్తి. ధూమహేతుక వహ్ని సాధ్యమైనపుడు 'ఎట ధూమమో అట వహ్ని' యను ధూమాగ్నుల సంబంధము విశేషవ్యాప్తి. శబ్దహేతుక గగనము సాధ్యమైనపుడు – 'ఏది గుణమో అది ద్రవ్యాశ్రితము (యో గుణః సద్రవ్యాశ్రయః ) అను గుణత్వ ద్రవ్యత్వములనెడు సామాన్యముల సంబంధము సామాన్యవ్యాప్తి – గంధవత్వహేతుక పృథివీతర భేదము సాధ్యమైనపుడు – 'ఎక్కడ ఇతరభేదము లేదో అక్కడ గంధవత్వాభావము' అను అభావమూలక సంబంధము వ్యతిరేక వ్యాప్తి – (అనబడును)

ఇట్లు పూర్వవత్తు, శేషవత్తు, సామాన్య తోదృష్టముననను నీ ముప్విధము లయిన యనుమానములకు క్రమముగా విశేషవ్యాప్తి – సామాన్యవ్యాప్తి – వ్యతిరేకవ్యాప్తి యను మూడు వ్యాప్తులు మూలములు – జనకములు అని భావము

అటుపై నుపమానము : –

"ప్రసిద్ధ సాధర్మ్యాత్ సాధ్య సాధన ముపమానమ్" **1.1.6.**

ప్రసిద్ధసాధర్మ్యాత్ = పూర్వము బాగుగా నెఱిగిన గోవు మున్నగు వస్తువుల సాదృశ్యమువలన సాధ్యసాధనమ్ = సాధ్యమగు గవయ పద వాచ్యపదార్థమును సాధించుట – తెలిసికొనుట ఉపమానమ్ – ఉపమానమనబడును.

ఒక పురవాసి గోవు అన నేమో యెఱిగినవాడై యరణ్యమున నుండు గవయ నామక జంతువు నెఱుగగోరి గవయమెట్లుండునని యొక యాటవికుని నడుగు ననుకొనుడు. ఆ యాటవికుడు 'గవయము గోవువలెనుండు' నని చెప్పుననుకొనుడు. అనంతర మొకప్పు డా నాగరికుడు అరణ్యమునకు వెళ్లి యట నకస్మాత్తుగా ఎదుటబడిన గవయమును చూచి, గవయము గోవువలె నుండునను ఆటవికుని వాక్యము స్మరించును. వెంటనే తన యెదుట ప్రత్యక్షమయిన జంతువు గవయపద వాచ్యమని యెఱుగును. ఇట్లు 'గవయము'

అను సంజ్ఞకు, గవయపదార్థమునకు (సంజ్ఞికి) గల సంబంధజ్ఞానము దేనివలన కలుగునో అదియే యుపమాన ప్రమాణమని సూత్రతాత్పర్యము.

సంజ్ఞా సంజ్ఞి సంబంధజ్ఞాన ముపమానమని భావము.

అనంతరము శబ్ద ప్రమాణము : -

**"ఆప్తోపదేశః శబ్దః" 1.1.7.**

ఆప్తోపదేశః = ఆప్తవాక్యము శబ్దః = శబ్ద ప్రమాణము. ఆప్తః= యథార్థవక్త - లేక - ఆప్తిః= అర్థావ్యభిచారిత్వము దానితో ప్రవర్తించునది ఆప్తము. ఉపదేశము = వాక్యము, కాబట్టి ఆప్తోపదేశమనగా అర్థమును వీడని వాక్యమని భావము.

ఆ శబ్దప్రమాణ విభాగము : -

**"స ద్వివిధో దృష్టాదృష్టార్థ త్వాత్" 1.1.8.**

సః= ఆ శబ్దప్రమాణము ద్వివిధః= రెండు విధములు, దృష్టా దృష్టార్థత్వాత్ = దృష్టార్థము, అదృష్టార్థము అని, ప్రవక్త- (వాక్య ప్రయోక్త) ద్వారా చూడబడిన అర్థము (విషయము - ప్రయోజనము) గలది దృష్టార్థము, ఏ ప్రయోజనము ప్రవక్తకు ప్రత్యక్షమువలన గాక శబ్దము వలనగానీ, అనుమానము వలనగానీ తెలియనగునో యది యదృష్టార్థము.

సర్వద్రష్టయగు నీశ్వరుని ప్రోక్తము దృష్టార్థము. ఋషి ముని ప్రోక్తము అదృష్టార్థము.

ఋగ్వేదము, యజుర్వేదము, సామవేదము, అథర్వ వేదము నను నాలుగు వేదములు నీశ్వరప్రోక్తములు స్వతః ప్రమాణములు.

ఆయుర్వేదము, ధనుర్వేదము, గాంధర్వవేదము, అర్థవేదముననను నాలుగు ఉపవేదములు, ఐతరేయ శతపథ గోపథ తాండ్య బ్రాహ్మణములు, ఐతరేయ తైత్తిరీయా రణ్యకములు, కేనాదిదశోప నిషత్తులు, శిక్ష, కల్పము, వ్యాకరణము, ఛందస్సు, జ్యోతిషము నను షడంగములు, వైశేషికము, న్యాయము, సాంఖ్య యోగములు, పూర్వోత్తరమీమాంసలు నను ఉపాంగములు, మన్వాది ధర్మశాస్త్ర ములు, రామాయణము, మహాభారతాది జీవన చరితేతి హాసములు ఋషి ముని ప్రణీతములు. ఇవి పరతఃప్రమాణములు, వేదాను కూలముగాని వప్రమాణములని భావము. వేద ప్రతిపాదిత విషయ మునకు విరుద్ధములయిన తావులందు వీనీ ప్రామాణ్యము విజ్ఞులచే నంగీకరింప బడదు. ఇట్లే శాస్త్రములందు పలు తావుల వర్ణింప బడినది.

దృష్టాదృష్టార్థమన ఇహమున జూడబడిన యర్థము గలది దృష్టార్థ మనియు, పరమున జూడబడిన యర్థము గలది యదృష్టార్థ మనియు కొందఱు వ్యాఖ్యానము చేయుదురు.

పై ప్రమాణములచే తెలియదగిన ప్రమేయము,
తద్విభాగము : -

**"ఆత్మ శరీ రేంద్రి యార్థ బుద్ధి మనః ప్రవృత్తిదోష**
**ప్రేత్యభావ ఫల దుః ఖాపవర్గాస్తు ప్రమేయమ్" 1.1.9.**

ఆత్మ, శరీరము, ఇంద్రియములు, అర్థములు, బుద్ధి, మనస్సు, ప్రవృత్తి, దోషములు, ప్రేత్యభావము, ఫలము, దుఃఖము, అపవర్గము నను నీ పండ్రెండును ప్రమేయ పదముచే వ్యవహరింపబడును.

ప్రమేయమన ప్రమాణ విషయమని సామాన్యముగా తెలియనగును. కాని సూత్రమునందలి 'తు' శబ్ద ప్రయోగమువలన ఆత్మాది పదార్థము కేవలము ప్రమాణ విషయరూపముననే గ్రహింపబడక వీని సమ్యక్ జ్ఞానమువలన మోక్షప్రాప్తియు కలుగగలదని గ్రహింపనగును.

ఆత్మ=సుఖ దుఃఖముల భోగించు జీవుడు, శరీరము = భోగాయతనము - సుఖ దుఃఖానుభవమునకు నిలయము, ఇంద్రియములు = భోగసాధనములు, అర్థములు = భుజింపదగు- అనుభవింపదగు విషయములు, బుద్ధి= భోగము, మనస్సు= సర్వమును గ్రహింపయోగ్యతగల అంతఃకరణము, ప్రవృత్తి = ధర్మాధర్మములు, దోషములు = ప్రవృత్తి, రాగద్వేషములును, ప్రేత్యభావము = పునర్జన్మము, ఫలము= సాధనసహిత సుఖదుఃఖముల ఉపభోగము, దుఃఖము = అనుభవించుట కనుకూలముగాక కష్టము గలిగించునది, అపవర్గము = దుఃఖనివృత్తిపూర్వకమగు నానందోపభోగము. ఆత్మాది పదములకీ యర్థమునే యీ శాస్త్రమున గ్రహింపవలయునని వివేకము. ఉపర్యుక్తపదార్థముల తత్త్వజ్ఞానమువలన మోక్షము, మిథ్యాజ్ఞానమువలన సంసారము నేర్పడునని భావము.

ప్రమేయమున ప్రథమోద్దిష్ట ఆత్మస్వరూప నిరూపణ:-

**"ఇచ్ఛా ద్వేష ప్రయత్న సుఖ దుఃఖ జ్ఞానా**
**న్యాత్మనో లింగమ్" 1.1.10.**

ఇచ్ఛాద్వేషప్రయత్న సుఖదుఃఖ జ్ఞానానిః ఇచ్ఛ(కోరిక), ద్వేషము, ప్రయత్నము, సుఖము, దుఃఖము, జ్ఞానము నను నీ యారును ఆత్మనః =

ఆత్మయున్నదనుటకు, లింగమ్ = ప్రమాణము - హేతువు.

ఇచ్ఛాదిగుణములు ఆత్మయునికికి ప్రమాణములు. ఆత్మ ప్రత్యక్షప్రమాణములగు నింద్రియములచే గ్రహింపబడకున్నను, ఇచ్ఛాదిగుణముల కాశ్రయరూపమున, ననుమాన విషయము కాగలదని సూత్రాభిప్రాయము.

ఇచ్ఛ, సుఖము, దుఃఖము మున్నగునవి గుణములు. అవి యొకానొక ద్రవ్యము నాశ్రయించి యుండును. పృథివ్యాది పదార్థములు గంధాది గుణముల కాశ్రయములుగాని సుఖాదులకు కావు. సుఖాదుల కాశ్రయమగు ద్రవ్యము ఆత్మయని యూహింపనగును.

తనకొఱకుగానీ, పరులకొఱకు గానీ యొకా నొక పదార్థము కావలయునని కోరుట ఇచ్ఛ యనబడును ఏ వస్తువు లభించుటవలన నాత్మ సుఖము ననుభవించునో యట్టి వస్తువును మరల నభిలషించుట లోక విధితము. ఈ యభిలాష - ఇచ్ఛ శరీరమునకు భిన్నముగా ఆత్మయను నొక పదార్థ ముండినప్పుడే కలుగగలదు. పూర్వ మొకప్పుడు తా ననుభవించిన పదార్థమువంటి పదార్థము తనకు లభించినపుడా వస్తువు పూర్వవస్తు సదృశమగుటచే నిదియు తనకు సుఖము గలిగింపగలదను జ్ఞానము ఆత్మలేకున్న కలుగనేరబోదని భావము. ఇట్లే ద్వేష ప్రయత్నాదులు నాత్మసాధకములని యెఱుగునది.

శరీర లక్షణము : -

**“చేష్టేంద్రియార్థాశ్రయః శరీరమ్” 1.1.11.**

హితమును గ్రహించుటకును, అహితమును పరిహరించుటకును చేయు ప్రయత్నము చేష్ట యనబడును. భోగసాధనములు (ఘ్రాణాదులు) ఇంద్రియములు. భోగింపదగు శబ్దస్పర్శరూపాదులు అర్థములు. వీని కన్నిటికి నాశ్రయము శరీరమనబడును.

శరీరమునందే హితప్రాప్తి, అహితపరిహారానుకూలమగు క్రియ జరుగును. ఇంద్రియములును శరీరము నాశ్రయించియే స్వగ్రాహ్యములగు శబ్దాది గుణములను గ్రహించును. శబ్ద స్పర్శాదుల గ్రహణమువలన శరీరమునందే సుఖ దుఃఖసంవేదనము అనుభూతియు కలుగును. కాబట్టి చేష్టాదుల కాశ్రయమగునది శరీరమని లక్షణము చెప్పబడినది.

ఇంద్రియములను విభజించి వాని లక్షణముల నిట వర్ణించు చున్నాడు.

**"ఘ్రాణ రసన చక్షుస్త్వక్ శ్రోత్రాణింద్రియాణి భూతేభ్యః" 1.1.12.**

ఘ్రాణ ... ఇంద్రియాణి = నాసిక, జిహ్వ, చక్షువు, త్వక్కు, శ్రోత్రము ఈ యైదు నింద్రియములు, భూతేభ్యః= పృథివ్యాది పంచ భూతముల వలన నేర్పడు నని సూత్రార్థము.

ఇంద్రియం సామాన్యలక్షణము భోగసాధనము. శరీరము నాశ్రయించియుండి తనతో సంయుక్తమయిన వస్తువు యొక్క ప్రత్యక్ష జ్ఞానమాత్మకు కలిగించు ద్రవ్యము ఇంద్రియమని విశేషించి చెప్పనగును. (శరీరాశ్రయమై స్వసంయుక్త పదార్థాపరోక్షజ్ఞానము జ్ఞాతకు కలిగించు ద్రవ్యము ఇంద్రియము) అభ్యంతరము, బాహ్యములు నని ఇంద్రియములు రెండు విధములు. సర్వవిషయములను గ్రహించు నంతఃకరణము – మనస్సు ఆభ్యంతరము. ఘ్రాణాదులు బాహ్యములు.

ఆత్మ, గంథమును దేని ద్వారా గ్రహించునో అది ఘ్రాణము – నాసిక; దేని ద్వారా రసము గ్రహించునో అది రసన– జిహ్వ; దేని ద్వారా రూపము గ్రహించునో అది చక్షువు – నేత్రము; దేని ద్వారా స్పర్శము గ్రహించునో అది త్వక్కు; దేని ద్వారా శబ్దమును గ్రహించునో అది శ్రోత్రము అని ప్రత్యేకేంద్రియ లక్షణము.

నాసిక పృథివీప్రకృతికము. రసన జలప్రకృతికము. చక్షువు అగ్నిమూలకము. త్వక్కు వాయుకారణకము. శ్రోత్రము ఆకాశము. అనగా నేయింద్రియమే – విశేషగుణమును గ్రహించునో ఆ గుణమునకు సమవాయు కారణమగు ద్రవ్య మా యింద్రియమునకు ప్రకృతి యని సూత్రగత 'భూతేభ్యః' పదము వలన నెఱుగవలయును.

ఇంద్రియములకు ప్రకృతులగు భూతములు : –

**"పృథివ్యాపస్తేజో వాయురాకాశ మితి భూతాని" 1.1.13.**

– విశేషగుణములు : – రూపము, రసము, గంధము, స్పర్శము, స్నేహము (స్నిగ్ధత) సాంసిద్ధిక ద్రవత్వము, శబ్దము, బుద్ధి, సుఖము, దుఃఖము, ఇచ్ఛ, ద్వేషము, ప్రయత్నము, ధర్మము, అధర్మము

పృథివి, జలము, తేజస్సు, వాయువు, ఆకాశము నను నైదును భూతపద వాచ్యములు.

బాహ్యేంద్రియముచే గ్రహింపదగు విశేషగుణమునకు సమవాయి

యైయుండుటయే భూతలక్షణము.

**"గంధ రస రూప స్పర్శ శబ్దాః పృథివ్యాది గుణాః తదర్థాః"**

**1.1.14.**

పృథివ్యాది గుణాః= పృథివి మున్నగు భూతముల విశేషగుణములు గంధ రస రూప స్పర్శ శబ్దములని చెప్పబడును. తదర్థాః= (ఇట తచ్ఛబ్దమున కర్థము బాహ్యేంద్రియములని గ్రహింపవలయును.) కాబట్టి ఆ బాహ్యేంద్రియములకు అర్థములు, అనగా విషయములగు పదార్థములు అర్థములని చెప్పబడును.

వైశేషిక దర్శనమున 'అర్థ' పదము ద్రవ్యగుణ కర్మలకు వాచకముగా నెంచబడినది. (అర్థ ఇతి ద్రవ్యగుణ కర్మసు 8.2.3.వై). అట్లుగాక యీ న్యాయశాస్త్రమున అర్థ పదము విషయపద పర్యాయమని గ్రహింపవలయును.

అనంతరము బుద్ధి లక్షణము : -

**"బుద్ధి రుపలబ్ధిర్ జ్ఞాన మిత్యనర్థాంతరమ్" 1.1.15.**

బుద్ధిః (బోధ), ఉపలబ్ధిః (ఉపలంభము), జ్ఞానమ్ (జ్ఞప్తి, జ్ఞానము) ఇత్యనర్థాంతరమ్ = ఈ మూడు పదములు నీ శాస్త్రమున పర్యాయ పదములుగా నెంచబడును.

శాస్త్రాంతరమున బుద్ధి వృత్తిని జ్ఞానమనియు, ఆత్మ వృత్తిని ఉపలబ్ధి యనియు వాడుదురు. ఆ వ్యవహారమీ శాస్త్రమున కనభిమతమని సూచించుటకు బుద్ధి, ఉపలబ్ధి, జ్ఞానము పర్యాయములని వర్ణింపబడినది.

మనోలక్షణమును వర్ణించుటకు ముందు తన్ని రూపక హేతు వర్ణన : -

**"యుగపత్ జ్ఞానా నుత్ప త్తిర్మనసోలింగమ్" 1.1.16.**

యుగవత్ జ్ఞానానుత్పత్తిః = ఆత్మ, ఇంద్రియములు, అర్థములు పరస్పర మొకదానితో నొకటి సంబద్ధములైయున్నను ఆయా వస్తువుల జ్ఞాన మొక్కసారిగా కలుగకపోవుట, మనసః= మనస్సు కలదనుటకు లింగమ్ = హేతువు. ప్రమాణమని సూత్రార్థము.

బాహ్యవస్తువులతో నింద్రియములకు, నాయింద్రియములతో నాత్మకు సంబంధము కలిగినను ఒక్కమాటుగా రూప రస స్పర్శాదిజ్ఞానములు కలుగవు. క్రమముగా కలుగును. ఒక వ్యక్తి అగ్నిజ్వాలకు సమీపమున కూర్చుండి జిలేబి తినుచున్నాడనుకొనుడు. ఆవ్యక్తియాత్మతో చక్షు రసన త్వగింద్రియములకు సంసర్గమున్నదికదా! అతని యింద్రియములలో - సమీపమున నున్న అగ్నిజ్వాల యందలి యుష్ణతతో త్వగింద్రియమునకును, జిలేబి తినుచున్నాడు కనుక

జిలేబిలోని యెఱుపు రంగుతో చక్షువునకును, తద్గత రసముతో రసనేంద్రియమునకును సంసర్గము కలదు. అట్టి యెడ ఒకే క్షణమున రంగు, రుచి, ఉష్ణత వీని జ్ఞాన మొక్కసారి కలుగవలయును. లోకానుభవమున నట్లు కలుగక ఒక క్షణమున రూపజ్ఞానము, మరియొక క్షణమున రసజ్ఞానము, వేరొక క్షణమున నుష్ణజ్ఞానము కలుగుచుండుట మన మెఱుగుదుము, దీనినిబట్టి ఆత్మేంద్రియములకు మధ్య ఒక క్షణమున నొకేంద్రియముతో సంసర్గమును కల్పించి యొకే జ్ఞానము కలుగునట్లు చేయు మఱియొక సాధన ముండితీరవలయు నని తేలుచున్నది. ఆ సాధనమునేమన స్సందురు.

ప్రవృత్తి లక్షణము : –

**"ప్రవృత్తి ర్వాగ్బుద్ధి శరీరారంభఇతి" 1.1.17.**

వాక్ బుద్ధి శరీరారంభః= వాక్కు, మనస్సు, శరీరము వీని వ్యాపారము, ప్రవృత్తిః= ప్రవృత్తి యనబడును.

ఈ సూత్రమున బుద్ధిపదము మనస్సునకును, ఆరంభము, వ్యాపారము చేష్టకును బోధకములు.

వాఙ్మనః శరీరముల ద్వారా ప్రతి వ్యక్తియు ప్రవర్తించును. ఈ ప్రవృత్తి ద్వివిధమని శాస్త్రముల వర్ణింపబడినది. ఇది పుణ్యాపాప శబ్దములచే పేర్కొనబడును.

శరీరము ద్వారా, పరిత్రాణము (రక్షణ), పరిచరణము (సేవ), దానము చేయబడును. వాగింద్రియముద్వారా సత్యము, హితము, ప్రియము, స్వాధ్యాయము నొనర్చబడును. మనస్సుద్వారా దయ, అస్పృహ, శ్రద్ధయు నను ప్రవృత్తి కలుగును. ఈ దశవిధప్రవృత్తి పుణ్య శబ్దమున పేర్కొనబడును.

శరీరముద్వారా హింస, స్తేయము (చౌర్యము), ప్రతిషిద్ధమైథునము (వ్యభిచారము), వాణిద్వారా అనృతము, పరుషము, సూచన (చాడీలు చెప్పుట), అసంబద్ధముల నాడుట, మనస్సు ద్వారా పరద్రోహము, పరద్రవ్యాభీప్స, నాస్తిక్యము నను దశవిధములగు ప్రవృత్తి కలుగును. దీనిని పాప ప్రవృత్తి యందురు.

ఇట్లు కాయిక, వాచిక, మానసిక పుణ్యాపాపాత్మక కర్మ ప్రవృత్తి యనబడునని సూత్రాభిప్రాయము.

దోషలక్షణము : –

**"ప్రవర్తనా లక్షణా దోషాః" 1.1.18.**

ప్రవర్తనా లక్షణాః= ప్రవర్తన - పురుషుని ధర్మాధర్మ కర్మలందు ప్రవర్తింపజేయు లక్షణము - గలవి, దోషాః= దోషము లనబడును. ఆ దోషము లెవ్వియన, రాగ ద్వేష మోహములు.

రాగము, ద్వేషము ననునవి మోహమువలన జనించును. మోహసమన్వితము లయిన రాగద్వేషములచే ప్రేరితుడై మనుజుడు పుణ్యాపాప కర్మలందు ప్రవర్తించును.

ప్రేత్యభావ లక్షణము : -

**"పునరుత్పత్తిః ప్రేత్యభావః" 1.1.19.**

పునరుత్పత్తిః = మరణించి - పూర్వశరీరమును విడిచి మరల జనించుట- మరియొక శరీరమును పొందుట ప్రేత్యభావః= ప్రేత్యభావ మనబడును.

ప్రేత్య = మరణించి, భావః= జనించుట, పూర్వము సంబద్ధమైన దేహేంద్రియాది సంఘాతమును విడిచి మఱియొక దేహేంద్రియాది సంఘాతముతో సంబద్ధమగుటకు ప్రేత్యభావమని పేరు. ఈ సూత్రమున 'పునరుత్పత్తి' యని పునఃశబ్దప్రయోగముచే సూత్రకారుడు సంసార మనాది యని సూచించియున్నాడు. జీవునకు శరీరాది సంబంధమనాది, యపవర్గాంత మని శాస్త్రకారుల దృష్టి.

ఫల లక్షణము : -

**"ప్రవృత్తి దోషజనితోఽర్థః ఫలమ్" 1.1.20.**

ప్రవృత్తిదోష జనితః= పూర్వ సూత్రముల వర్ణింపబడిన ప్రవృత్తి దోషములవలన కలిగిన, అర్థః= అర్థము, ఫలమ్ = ఫలమనబడును.

సుఖదుఃఖోప భోగము ఫలమనబడును. పైన వర్ణింపబడిన ప్రవృత్తి - కర్మ సుఖదుఃఖ ఫలమును కలిగించును. ఇట్టి సుఖ దుఃఖములు దేహేంద్రియాదులద్వారా అనుభవింప వీలగును. దేహమే లేకున్న సుఖముగానీ, దుఃఖముగానీ జీవుడనుభవింప జాలడు.

సుఖ దుఃఖరూప ఫలము ప్రవృత్తి జనితమై యుండ సూత్రమున దోష పదమును గ్రహించి సూత్రకారుడు దోషములు కూడా ఫలమునకు హేతువులని సూచించి యున్నాడు.

("సతి మూలే జాత్యాయు ర్భోగాః" 2.15.) అని యోగ దర్శనమున జన్మ, ఆయువు, భోగము కర్మఫలముగా వర్ణింపబడినవి.

దుఃఖ లక్షణము : -

**"బాధనా లక్షణం దుఃఖ మితి" 1.1.21.**

బాధనాలక్షణం = బాధ (తాపము – పీడ) లక్షణముగా గలది, దుఃఖమ్ = దుఃఖమని సూత్రార్థము.

అనుభవించుట కేది యనుకూలముగా నుండదో, అనగా పీడ కలిగించునో అదిదుఃఖము. శరీరాదులు పీడాయుక్తము లగుటచే నవియ దుఃఖపదవాచ్యములే యగును. ఇట్లు ప్రపంచమున బహుభాగము దుఃఖభూయిష్టముగా జూచి దుఃఖమును విడువనెంచు జనుడు జన్మయే దుఃఖ కారణమని యెంచి నిర్విణ్ణుడగును. ఆ నిర్వేదము విరక్తికి కారణమగును. క్రమముగా నతడు దుఃఖమునుండి ముక్తుండగును.

అపవర్గ లక్షణము : –

**"తదత్యన్తవిమోక్షోఽపవర్గః" 1.1.22.**

నిఃశ్రేయసము, కైవల్యము, ముక్తి, అపవర్గము ఇవి పర్యాయ పదములు. తదత్యన్త విమోక్షః = జీవున కుపర్యుక్త జన్మరూప దుఃఖము నుండి పూర్ణవిముక్తి, అపవర్గః= అపవర్గమనబడును.

పూర్వసూత్రమున వర్ణింపబడిన జన్మాదిరూప దుఃఖమునుండి జీవునకు కలుగు అన్తరహిత విముక్తి – వియోగము అపవర్గమని సూత్రాభిప్రాయము.

దేహమే యాత్మగా భావించి యతిరిక్తాత్మ సంగీకరింపని చార్వాకాదులు మృత్యువే మోక్షమందురు. బౌద్ధులలో శూన్యవాదులయిన మాధ్యమికులు ఆత్మోచ్ఛేదమే మోక్షమందురు. యోగాచారప్రభృతులు భావనా బలము వలన దుఃఖవాసనలు – దుఃఖజనక సంస్కారములు నశింపగా విశుద్ధ విజ్ఞాన సంతతి యుదయించుటయే మోక్షమందురు. జైనులు ఆవరణము తొలగుటయే మోక్షమందురు. 'అహం బ్రహ్మాస్మి' 'అయమాత్మా బ్రహ్మ' ఇత్యాది మహావాక్య విచారణమున అఖండవృత్తి యేర్పడుననియు, దాని వలన అవిద్య తొలగుననియు, అటుపై జీవునకు సచ్చిదానందాత్మక స్వస్వరూపాధిగమము కలుగుననియు, నదియే మోక్షమనియు, మాయావాదులగు శాంకరులు నుడువుదురు. జగత్కర్తృత్వము' తప్ప మిగిలిన సర్వజ్ఞత్వాది సమస్త కల్యాణగుణప్రాప్తి పూర్వకమగు వాసుదేవ యథాత్మ్యానుభవము మోక్షమని రామానుజీయులలో విశిష్టాద్వైతులు వాదింతురు. జగత్కర్తృత్వము' లక్ష్మీపతిత్వము, శ్రీవత్సమును దక్క భగవంతుని జ్ఞానాయత్త దుఃఖరహిత పూర్ణసుఖము మోక్షమని మాధ్వులు పలుకుదురు. ద్విభుజధారియగు

కృష్ణునితోకూడి గోలోకమున తదంశభూతులగు జీవుల లీలానుభవము మోక్షమని శుద్ధద్వైత వాదులగు వల్లభేయుల మతము. ఇంద్రియాదుల నియంత్రణ ద్వారా గౌణ దుఃఖమును, ఆత్మాది పదార్థతత్వజ్ఞానముద్వారా జన్మాది రూప ముఖ్య దుఃఖమును బోనాడి చిత్స్వరూపమగు స్వాత్మతో బ్రహ్మానందము ననుభవించుటయే మోక్షమని వేదవాదులగు గోతమ ప్రభృతి మహర్షుల దర్శనము.

పై సూత్రమున సూత్రకారుడు దుఃఖాత్యంత నివృత్తి మోక్షమని సూత్రించినను, దుఃఖనివృత్తి పూర్వక బ్రహ్మానందానుభవమే మోక్షమని మహర్షి యభిప్రాయము. వైదికులు తత్వజ్ఞానము ద్వారా దుఃఖనివృత్తి నొనరించి బ్రహ్మానందము నుపభోగించుటయే మోక్షమని యంగీకరించిరి. బ్రహ్మానందానుభవము దుఃఖనివృత్తి యనంతరమే కలుగును. దుఃఖనివృత్తి యత్నసాధ్యము. తదనంతరమున బ్రహ్మానందప్రాప్తి అయత్న సిద్ధమగుటచే సూత్రమున దుఃఖ నివృత్తినే ప్రధానముగ సూత్రకారుడు నిర్దేశించి యున్నాడని వివేకము.

ఇట్లు ప్రమేయ లక్షణ మొనరించి యనంతర ప్రాప్త సంశయ లక్షణమును సూత్రించుచున్నాడు.

**"సమానానేక ధర్మోపపత్తే ర్విప్రతిపత్తే రుపలబ్ధ్యనుప లబ్ధ్యవ్యవస్థాతశ్చ విశేషాపేక్షో విమర్శః సంశయ" 1.1.23.**

సమానానేక ధర్మోపపత్తేః= (సమాన ధర్మమనగా సాధారణ ధర్మము. అనేక ధర్మమన అసాధారణ ధర్మము) ఇట్లు సాధారణా సాధారణ ధర్మములు లభించుట వలన అనగా సాధారణా సాధారణ ధర్మములతో కూడిన యొకానొక వ్యక్తి ప్రత్యక్షమగుట వలన, విప్రతిపత్తేః= విరుద్ధకోటి ద్వయజ్ఞాన ముపస్థిత మగుటచే, ఉపలబ్ధ్యు నుపలబ్ధ్యవ్యవస్థాతః= ఏకతరకోటిని నిశ్చయింపగ విశేష ధర్మమొకట లభించి మరియొకట లభింపకుండుటచే కలుగు నవ్యవస్థవలన, విశేషాపేక్షః = సామాన్య విశేషస్మృతిపూర్వకమగు, విమర్శః= ఒకేవ్యక్తియందు విరుద్ధనానా ధర్మములను బోధించునట్టి యీవస్తువేమగునా యను జ్ఞానము సంశయః= సంశయ మనబడును.

ఈ సూత్రమున, విమర్శః సంశయః = విమర్శము సంశయము అనునది సంశయ సామాన్య లక్షణము. అందు సంశయము లక్ష్యము' విమర్శము లక్షణము. ఒక వస్తువు నందు విరుద్ధ నానాధర్మములను తెలియజేయు జ్ఞానము

విమర్శమనబడును.

సూత్రమున మిగిలిన పదములు మూడును విశేష లక్షణములను దెలియజేయునని వార్తికకారుల మతము.

1) 'సమాన ధర్మోపపత్తేరుపలబ్ధ్యనుపలబ్ధ్య వ్యవస్థాతో విశేషాపేక్షో విమర్శః సంశయః' అనునదొక లక్షణము.

2) 'అనేక ధర్మోపపత్తే రుపలబ్ధ్యనుపలబ్ధ్య వ్యవస్థాతో విశేషాపేక్షో విమర్శః సంశయః' అనునది రెండవ లక్షణము.

3) 'విప్రతిపత్తేరుపలబ్ధ్యనుపలబ్ధ్యవ్యవస్థాతో విశేషాపేక్షో విమర్శః సంశయః ' అనునది మూడవ లక్షణము.

(1) సమాన ధర్మోపపత్తేః = స్థాణువా పురుషుడా యను రెండు కోటులందు నుండు సమానధర్మమగు నున్నతత్వాది గుణములు లభించుట వలన అనగా నెదుట కనిపించు నొక పదార్థమునందు నున్నతత్వము గోచరమయి (కనబడి), ఉపలబ్ధ్యనుపలబ్ధ్యవ్యవస్థాతః = వక్రకోటరాది విశేషధర్మము స్థాణువు నందుపలబ్ధమై పురుషునందుపలబ్ధము కాకుండుట వలన, ఇట్లే శిరఃపాణ్యాది విశేషధర్మము పురుషునందు కనబడి స్థాణువు నందు కనపడకపోవుట వలన, విశేషాపేక్షః = స్థాణుత్వ పురుషత్వరూప జాతి విశేషము నభిలషించు, విమర్శః = స్థాణువా? పురుషుడా? అను జ్ఞానము, సంశయః= సంశయ మనబడును.

(2) అనేక ధర్మోపపత్తేః = (అనేక ధర్మమనగా నసాధారణ ధర్మము - విశేషధర్మము) శ్రావణత్వాది విశేష ధర్మయక్తమగు శబ్ద ప్రత్యక్షము వలన, ఉపలబ్ధ్యనుపలబ్ధ్యవ్యవస్థాతః = విభాగజన్య విశేష ధర్మము శబ్దమునందుండి ద్రవ్యమునందు లేకుండుటచే, విశేషాపేక్షః= గుణత్వ, ద్రవ్యత్వాది సామాన్య విశేషము నపేక్షించు, విమర్శః= శబ్దము గుణమా, ద్రవ్యమా లేక కర్మయా యనుజ్ఞానము, సంశయః= సంశయ మనబడును.

(3) విప్రతిపత్తేః= ఆత్మకలదని కొందరు, ఆత్మలేదని కొందరు పలుకుట వలన కలుగు విరుద్ధ జ్ఞానము వలన, ఉపలబ్ధ్యనుపలబ్ధ్యవ్యవస్థాతః= ఆత్మాస్తిత్వ, నాస్తిత్వముల నిశ్చయించు ప్రామాణికత- అప్రామాణికతల, వ్యవస్థ యేర్పడ కుండుటచే, విశేషాపేక్షః= అస్తిత్వ నాస్తిత్వరూప సామాన్య విశేషస్మృతి పూర్వకమగు విమర్శః= ఆత్మ (అస్తి-నాస్తి) కలదాలేదా యను విరుద్ధ నానా కోటికి జ్ఞానము, సంశయః= సంశయమనబడును.

భాష్యకారుడు (వాత్స్యాయనుడు) మాత్రము సంశయమునకు కారణ

మైదువిధములని వర్ణించియున్నాడు. అది యెట్లన; (1) సమానధర్మోపపత్తి, (2) విశేష ధర్మోపపత్తి, (3) విప్రతిపత్తి (4) ఉపలబ్ధ్యవ్యవస్థ, (5) అనుపలబ్ధ్యవ్యవస్థ ఇందు సమాన ధర్మోపపత్తి, విశేష ధర్మోపపత్తి, విప్రతిపత్తియను మూటికి నుదాహరణములు పైన వర్ణింపబడినవి. మిగిలిన రెంటికి నుదాహరణము లిట్లు భావింపవలయును.

(1) ఉపలబ్ధ్యవ్యవస్థ : - ఉపలబ్ధియనగా జ్ఞానము, దాని యవ్యవస్థ. ఒక పదార్థమునకు సంబంధించిన జ్ఞానము రెండు విధముల కలుగును. ఆ పదార్థ మున్నను జ్ఞానము కలుగును. లేకున్నను కలుగును. అది యెట్లన, చెఱువునందుదక ముండును, దానిని చూచినపుడు చెఱువున జలమున్నదని జ్ఞానము కలుగును. ఎండమావులలో జలము లేకున్నను అట జలము కలదను జ్ఞానము కలుగును. ఇట్లొక వస్తు వుండియు లేకుండియు జ్ఞానము కలుగుటచే, వస్తువున్నపుడే జ్ఞానము కలుగును; లేకున్న కలుగదను వ్యవస్థ లేకుండుట వలన (ఉపలబ్ధ్యవ్యవస్థవలన) ఒకానొక జ్ఞాన విషయమున నా జ్ఞానము వస్తువుండుటచే కలుగుచున్నదా? లేక వస్తువు లేకుండుటచే కలుగుచున్నదా? యను సంశయము కలుగును.

(2) అనుపలబ్ధ్యవ్యవస్థ : - అనుపలబ్ధి యన జ్ఞానా భావము. దాని యవ్యవస్థ. ఇదియు రెండు విధముల కలుగును. వస్తువున్నప్పుడు; లేకున్నపుడు తరుమూలముల జలముండియు తెలియబడదు. వస్తువు లేకున్న తెలియబడకుండుట సహజమే. ఇట్లొకచో జ్ఞాన మొక వస్తువు విషయమున కలుగకున్న నట వస్తువుండి జ్ఞానము కలుగదా? లేక కలుగునా? యని సంశయము వొడమును.

ఇట్లు భాష్యకారుడు సంశయ కారణ మైదువిధములుగా భాష్యమున వర్ణించియున్నాడు.

ప్రయోజన లక్షణము : -

**"యమర్థమధికృత్య ప్రవర్తతే తత్ప్రయోజనమ్" 1.1.24.**

యమ్ అర్థమ్ = ఏయే విషయమును, అధికృత్య = ఉద్దేశించి, ప్రవర్తతే = వ్యక్తి ప్రవర్తించునో, తత్ = ఆ సర్వమును, ప్రయోజనమ్ = ప్రయోజనమని చెప్పబడును.

పురుషుడు ప్రేరితుడై దేనికొఱకు యత్నించునో యది ప్రయోజనమని సూత్రాభిప్రాయము.

సూత్రమునగల 'అర్థ' పదము, ద్రవ్యగుణ కర్మాది వస్తువులను తెలుపదు. అర్థమన అర్థింపబడునది – కోరబడునది – ప్రవృత్తికి హేతువు. (ప్రయుజ్యతే అనేన) పురుషుడు దేనిచే ప్రయోగింపబడునో అది ప్రయోజనమని వివేకము.

దృష్టాంత లక్షణము :–

**"లౌకిక పరీక్షకాణాం యస్మిన్నర్థే బుద్ధి సామ్యం**
**సదృష్టాంతః" 1.1.25.**

లౌకిక పరీక్షకాణామ్ = సహజముగాగానీ, విద్యాభ్యాసము ద్వారాగానీ విశేషబుద్ధిని సంపాదింపనివారు లౌకికులు. సంపాదించిన వారు పరీక్షకులు. వీరిరువురికి అనగా వాది ప్రతివాదులకు, యస్మిన్నర్థే = ఏ విషయమున, బుద్దిసామ్యం = (లౌకికుల జ్ఞానమునకు) భిన్నము గాని జ్ఞానము అనగా సమాన జ్ఞానము కలుగునో సదృష్టాంతః = అది దృష్టాంత మనబడును.

వాది ప్రతివాదులు (లౌకికులు, పరీక్షకులు లేక పండిత పామరులు) ఎందు విరోధింపరో అది దృష్టాంత మనబడును.

సిద్ధాంత లక్షణము : –

**"తంత్రాధికరణాభ్యుపగమ సంస్థితిః సిద్ధాంతః" 1.1.26.**

తంత్రాధి... సంస్థితిః = తంత్రమనగా శాస్త్రము, అధికరణము = అధారము ఆశ్రయము, అభ్యుపగమః = స్వీకారము సంస్థితిః = సంశయ రహితస్థితి, ఇట్లు ప్రమాణభూతమగు శాస్త్రాధారముచే చేయు స్వీకార (ము యొక్క) నిశ్చితస్థితి, సిద్ధాంతః= సిద్ధాంత మనబడును. సంక్షేపమున శాస్త్రితార్థస్థితి సిద్ధాంత మనబడును. ప్రామాణికముగా నంగీకరింప బడినది సిద్ధాంతమని తాత్పర్యము.

సిద్ధాంత విభాగము : – శాస్త్ర భేదమువలన సిద్ధాంతము చతుర్విధము.

**"సర్వతంత్ర ప్రతితంత్రాధికరణాభ్యుపగమ సంస్థి**
**త్యర్థాంతర భావాత్" 1.1.27.**

శాస్త్రములు భిన్నము లగుటచే వాని సంస్థితియు భిన్నమగును. వాది ప్రతివాదుల సంస్థితి యొకేవిధము కానేరదు గదా! అందువలన సిద్ధాంతము సైతము సర్వతంత్ర సిద్ధాంతము, ప్రతితంత్రసిద్ధాంతము, అధికరణసిద్ధాంతము, అభ్యుపగమసిద్ధాంతము నని నాలుగు విధములు.

వానిలో సర్వతంత్రము : –

**"సర్వతంత్రావిరుద్ధః తంత్రేఽధికృతోర్థః**

**సర్వతంత్రసిద్ధాంతః" 1.1.28.**

అర్థః = ఏ విషయము, తంత్రే = స్వశాస్త్రమున, అధికృతః= ఉపదేశింపబడి, సర్వతంత్రావిరుద్ధః= ఇతర శాస్త్రములచే విరోధింప బడదో, ఆ విషయము, సర్వతంత్ర సిద్ధాంతః= సర్వతంత్ర సిద్ధాంతమనబడును.

వాది ప్రతివాదు లేవిషయమున విప్రతిపన్నులుకారో, యే విషయమును ప్రామాణికముగా నుభయులు నంగీకరింతురో అది సర్వతంత్ర సిద్ధాంతమని సూత్రాభిప్రాయము.

ఘ్రాణాదు లింద్రియములనుట సర్వతంత్రసిద్ధాంతము, ఇట్లే గంధాదులు విషయములు (ఇంద్రియార్థములు) అనుట. ప్రమాణములచేతనే అర్థజ్ఞానము కలుగుననుటయు.

ప్రతితంత్ర సిద్ధాంతము : -

**"సమానతంత్రసిద్ధః పరతంతత్రాసిద్ధః ప్రతితంత్ర సిద్ధాంతః" 1.1.29.**

సమాన తంత్రసిద్ధః= తనశాస్త్రమున సిద్ధమై, పరతంత్రాసిద్ధః= ఇతర శాస్త్రమున సిద్ధము కానిది, ప్రతితంత్రసిద్ధాంతః= ప్రతితంత్ర సిద్ధాంత మనబడును.

ఒకానొక విషయమొక శాస్త్రమున నంగీకరింపబడి తదితర శాస్త్రము లందంగీకరింప బడకున్న ప్రతితంత్ర సిద్ధాంత మనబడునని సూత్రాశయము.

ఉదాహరణము : - బౌద్ధుల క్షణభంగవాదము వైదికుల జీవేశ్వర ప్రకృతి వాదము.

అధికరణ సిద్ధాంతము : -

**"యత్సిద్ధా వన్య ప్రకరణసిద్ధిః- సోఽధికరణ సిద్ధాంతః" 1.1.30.**

యత్సిద్ధౌ= ప్రమాణముద్వారా కొండొక ప్రకృతార్థము సిద్ధింపగా, అన్యప్రకరణ సిద్ధిః = అనుషంగముగా - అంతర్భాగములుగా - నితర విషయములు సిద్ధించునెడల, సః = అప్రధానార్థము, అధికరణ సిద్ధాంతః = అధికరణ సిద్ధాంత మనబడును.

ఏయర్థము సిద్ధించుటచే కొన్ని యితరార్థములు తదంతర్భావరూపమున సిద్ధించునో ఆయర్థము అధికరణ సిద్ధాంతము.

ఉదాహరణము : - దేహేంద్రియములకు భిన్నముగా నాత్మపదార్థము సిద్ధించిన, తదనుషంగమున - తదంతర్భావమున ఇంద్రియము లనేకము

లనియు. ఒక్కొక్క యింద్రియ మొక్కక్క విషయమునే గ్రహించును (ఇంద్రియములు నియత విషయములు) అనియు సిద్ధములగును.

ఈశ్వరుడు జగత్కర్తయని సిద్ధించిన, తదనుషంగ రూపమున ఈశ్వరుని సర్వజ్ఞత్వాది గుణములును, జీవాత్ముడు నిత్యుడని సిద్ధించిన తదంతర్భావరూపమున క్షణభంగ భంగత మున్నగు విషయములు సిద్ధించుననియు వైదికులు ఉదాహరింతురు.

అభ్యుపగమ సిద్ధాంతము : -

**"అపరీక్షితాభ్యుపగమాత్తద్విశేషపరీక్షణ**
**మభ్యుపగమసిద్ధాంతః" 1.1.31.**

అపరీక్షితాభ్యుపగమాత్ = ఒకానొక పదార్థమును పరీక్షింపకయే అంగీకరించి, తద్విశేషపరీక్షణమ్ - ఆపదార్థధర్మమును విశేష రూపమున పరీక్షించుట, అభ్యుపగమ సిద్ధాంతః= అభ్యుపగమసిద్ధాంత మనబడును.

ఒక యపరీక్షిత పదార్థమును గ్రహించి విశేషరూపమున దాని ధర్మమును పరీక్షించుటకు పరీక్షణ సమయము వరకు సిద్ధాంతముగా నంగీకరించుట అభ్యుపగమ సిద్ధాంతము.

ఉదాహరణము :- శబ్దము ద్రవ్యమని యంగీకరించి యది నిత్యమా అనిత్యమా యని పరీక్షించుటయు, జీవాత్మను జన్యమని యంగీకరించి అది సకారణమా? అకారణమా? యని పరీక్షించుటయు, బ్రహ్మము జగత్తునకు కారణమైనచో నాబ్రహ్మము ససహాయముగ వివర్తించునా? అసహాయముగ వివర్తించునా? అని విచారించుటయు, బ్రహ్మము అవిద్యాసహాయమనిన, ఆ య విద్యబ్రహ్మాతిరిక్తమా కాదా? అని విచారించుటయు ఇత్యాదులు.

ఇందు ముందుగా నంగీకరింపబడిన 'శబ్దము ద్రవ్యము' 'జీవాత్మ జన్యము' అను విషయములు పరీక్షింపకయే సిద్ధాంతములని కొంత తడవున కంగీకరింపబడినట్లెంచ వలయును.

సిద్ధాంతానంతరము క్రమప్రాప్త అవయవ లక్షణము సూత్రించుచు ప్రథమమున తద్విభాగమును సూత్రించుచున్నాడు.

**"ప్రతిజ్ఞాహేతూదాహరణోపనయనిగమనాన్యవయవాః" 1.1.32.**

ప్రతిజ్ఞ, హేతువు, ఉదాహరణము, ఉపనయము, నిగమనము నని యవయవము లైదు.

తాను సాధింపవదలచిన యర్థము నితరులకు బోధింపనెంచి ప్రయోగించు

శబ్దసముదాయమున నొక్కొక్క భాగమున కవయవ మని పేరు. అనుమాన వాక్యాంగమున కవయవమని నామము. ఆ యవయవములు ప్రతిజ్ఞాది నామములతో నైదని సూత్రభావము.

కొందఱు ఉపనయమునే అవయవముగా నంగీకరింతురు. ఉదాహరణము, ఉపనయము నను రెండవయవములే యని బౌద్ధులు, సాంఖ్యులు, యోగులు, పూర్వోత్తర మీమాంసకులు ప్రతిజ్ఞాహేతూ దాహరణములు మూడే యవయవములని యంగీకరింతురు. గౌతమ వైశేషికులు మాత్రము ప్రతిజ్ఞాది పంచావయవముల నంగీకరింతురు.

ప్రయోక్త తనకొఱకనుమానమును ప్రయోగించినచో ప్రతిజ్ఞాది అవయవత్రయమే చాలును. అనుమాన ప్రమాణమున తా దెలిసిన యర్థము నితరులకు బోధించునెడల ప్రతిజ్ఞాది అవయవ పంచకము నావశ్యకమగును.

పర్వతముపై కనబడు ధూమమునుజూచి, ఆపర్వతమున నగ్నియున్నది. అని యొకడు ప్రతిజ్ఞచేసిన, ప్రతిపత్త(వినువ్యక్తి) హేతువు నపేక్షించును. అపుడు ప్రయోక్త పర్వతముపై ధూమము కనపడుచుండుటవలన - అని హేతువు ప్రయోగించును. ధూమమున్నంత మాత్రమున నటనగ్ని యున్నదనుటకు ప్రమాణమేమని ప్రతిపత్త ప్రమాణము నపేక్షించిన, ధూమ మున్నయెడల వహ్ని(అగ్ని) యున్నదనుటకు మహానసము (వంటయిల్లు) ప్రమాణమని దృష్టాంతము చెప్పును. ఇట్లుదాహరణమును జెప్పి హేతువును సమన్వయించుటకు, మహానసమున ధూమమున్నచో వహ్ని యున్నట్లు పర్వతమునను వహ్నియుండునన యుపనయించును. కాబట్టి యెదుటనున్న ధూమయుక్తపర్వతము కూడా వహ్నిమంతమని నిగమనము చేయుట యవసరమగును. -

-కొండయం దగ్ని గలదు' పొగయుండుట వలన' వంటయింటనెట్లో; నట్లే నిదియు; కావున నీ కొండయందగ్ని గలదు.

సంస్కృతమున (అయం పర్వతో వహ్నిమాన్, ధూమాత్, యథామహానసః , తథా చాయమ్, తస్మాత్తథా యం పర్వతోవహ్నిమాన్,) అని అనుమాన వాక్య ప్రయోగము.

కొందఱీయైదుగాక, జిజ్ఞాస, సంశయము, శక్యప్రాప్తి, ప్రయోజనము, సంశయవ్యుదాసము నని మఱియు నైదు కలిపి పది యవయవము లందురు. వీనిని అర్థసిద్ధికి సాధనములు కావని భాష్యకారుడు నిరాకరించియున్నాడు.

నిరాకరణ క్రమమిట గ్రంథ విస్తరభీతితో వర్ణింపనైతి.

ప్రతిజ్ఞా లక్షణము : -

**"సాధ్యనిర్దేశః ప్రతిజ్ఞా" 1.1.33.**

సాధ్యనిర్దేశః = సాధింపదగిన ధర్మయుక్తధర్మి - సాధ్యమనబడును దాని నిర్దేశము = అభిధాయకశబ్దము, ప్రతిజ్ఞా= ప్రతిజ్ఞయనబడును.

సాధనీయ ధర్మయుక్తధర్మిని బోధించు శబ్దసమూహము ప్రతిజ్ఞ యనబడునని సూత్రాభిప్రాయము.

నవీన నై యాయికులు "సాధ్యతావచ్ఛేద కావచ్ఛిన్న సాధ్యప్రకారక, పక్షతావచ్ఛేదకావచ్ఛిన్న పక్షవిశేష్యక బోధజనకః శబ్దః ప్రతిజ్ఞా" అని వాక్రుత్తురు.

ఉదా :- (1) పర్వతము వహ్నిమంతము. (2) శబ్దము అనిత్యము. ఇందు ప్రథమోదాహరణమున వహ్ని సాధనీయధర్మము. తద్యుక్త పర్వతము ధర్మి. ద్వితీయమున అనిత్యత్వము సాధనీయధర్మము. తద్యుక్త ధర్మి శబ్దము.

నవీనుల లక్షణ సమన్వయము :- సాధ్యతావచ్ఛేదకము వహ్నిత్వము. తదవచ్ఛిన్నసాధ్యము వహ్ని. తత్ప్రకారకము అనగా అదివిశేషణముగా గలిగి, పక్షతావచ్ఛేదకము పర్వతత్త్వము. తదవచ్ఛిన్నపక్షము పర్వతము. తద్విశేష్యకము - అనగా పర్వతము. విశేష్యముగాగల బోధ= జ్ఞానము - పర్వతము వహ్నిమంతమను జ్ఞానము - తజ్జనక శబ్దః= అజ్ఞానమును గలిగించు 'పర్వతమువహ్నిమంతము' అనుశబ్దము - ప్రతిజ్ఞయని లక్షణ సమన్వయము - ఇట్లే ద్వితీయము నెఱుగునది.

హేతు లక్షణము : -

**"ఉదాహరణసాధర్మ్యాత్ సాధ్యసాధనం హేతుః". 1.1.34.**

ఉదాహరణము = దృష్టాంతము, సాధర్మ్యము = సమాన ధర్మము, ఉదాహరణసాధర్మ్యాత్ = దృష్టాంత సామ్యమువలన, సాధ్య సాధనమ్ = సాధనీయ ధర్మవిశిష్ట ధర్మి దేనివలన సిద్ధించునో దానిని బోధించు శబ్దము, హేతుః = హేతువనబడును.

సందిగ్ధసాధ్యము (సాధనీయ వస్తువు) నకు అధికరణము = ఆధారము (సాధ్యమెందు సాధింపబడునో అది) పక్షమనబడును. సాధ్యమెట నిశ్చితముగా తెలియబడునో అది సపక్ష మనబడును. సపక్షము, ఉదాహరణము ఇవి సమానార్థకములు. ఉదాహరణమున సాధ్య సాధనములకుగల నియత సంబంధము (వ్యాప్తి) గృహీతమై యుండును. పూర్వమే గ్రహింపబడియుండునని

భావము.

ఉదాహరణసామ్యమును పురస్కరించుకొని పక్షమున సాధ్యమును సాధించునది హేతువు.

ఉదాహరణము : - (1) ధూమము కలదగుట వలన (2) ఉత్పత్తిధర్మము కలదగుట వలన.

మహానసమున, ధూమవహ్నులకు గల నిత్యసంబంధము ఎల్లరచే గ్రహింపబడును. ధూమమున్న చోట వహ్ని తప్పక ఉండునను (యత్రధూమః తత్రవహ్నిః) నది వాని సంబంధము. ఇదియే అన్వయవ్యాప్తి యనబడును. మహానసమున ధూమము ధర్మముగా గ్రహింపబడి (మహానసము ధూమవంతము) పర్వతమున తత్సామ్యముచే సాధ్యమగు వహ్నిని సాధించును. ఇట్లే ద్వితీయహేతువును గ్రహించునది.

హేతువులు రెండువిధములు. అన్వయిహేతువు. వ్యతిరేకిహేతువు. పై సూత్రమున అన్వయి హేతువును వర్ణించి యిందు వ్యతిరేకిహేతు లక్షణము వర్ణించుచున్నాడు.

**"తథా వై ధర్మ్యాత్" 1.1.35.**

తథా= ఉదాహరణసామ్యమువలన సాధ్యసాధనము హేతువైనట్లు, వై దర్మ్యాత్ = ఉదాహరణవై ధర్మ్యము వలన సాధ్య సాధనము వ్యతిరేకి హేతువు అని సూత్రార్థము.

ఉదాహరణము : - శబ్దము అనిత్యము; ఉత్పత్తి ధర్మము కలదగుట వలన; అనుత్పత్తి ధర్మవంతమగు ఆత్మాది పదార్థము నిత్యమగుటచే, ఉత్పత్తిధర్మము దానికి విరుద్ధమగుట వలన శబ్దము అనిత్యమని తేలుచున్నది.

ఉదాహరణ స్థలమున వ్యతిరేక వ్యాప్తి గ్రహింపబడి, పక్షమున సాధ్యమును సాధించునది వ్యతిరేకి హేతువని సూత్రాభిప్రాయము.

సాధారణముగ హేతువు పంచమ్యంతమో లేక తృతీయాంతమో వాడబడును.

ఉదాహరణ లక్షణములు : -

**"సాధ్య సాధర్మ్యాత్తద్ధర్మభావీ దృష్టాంతః ఉదాహరణమ్." 1.1.36.**

సాధ్య సాధర్మ్యాత్ = సాధనీయదర్మ వివిష్టదర్మి సాధ్యము (పక్షము) అనబడును. సాధర్మ్యము = సమాన ధర్మత, సాధ్యధర్మమగు హేతురూపధర్మము కలదగుటవలన, తద్ధర్మభావీ = హేతువు కంటె భిన్నమగు సాధ్యరూప ధర్మమును

భావింపజేయునట్టి - దృష్టాంతః = దృష్టాంతము, ఉదాహరణమ్= ఉదాహరణ మనబడును.

ఏ దృష్టాంతమున హేతురూప ధర్మముండుట వలన, సాధ్యరూప ధర్మము నుండునో అదృష్టాంతమును బోధించు శబ్దము ఉదాహరణ మనబడును.

ఉదాహరణము :- పర్వతము వహ్నిమంతము, ధూమము కలదగుట వలన' మహానసమువలె. అను స్థలమున, పర్వతము సాధ్యము (పక్షము) దాని ధర్మము వహ్నియు ధూమమును అట్టి వహ్ని ధూమ రూపధర్మములు మహానసమునను గలవు. అందువలన పర్వతమునకు మహానసము సమానధర్మి. కాబట్టి అది పక్షమున సాధ్యరూప = వహ్నిరూప ధర్మమును బోధింప (భావింప) జేయగలదు. ఇట్లు మహానసము ఉదాహరణము.

ధూమమున్న తావున వహ్ని తప్పక యుండునను వ్యాప్తిని గ్రహింపజేయుచు ధూమవంతము వహ్నిమంతమే; మహానసమువలె నను బోధను కల్పించి మహానసము ఉదాహరణముగా వ్యవహరింపబడునని సూత్రాభిప్రాయము.

మఱియొక ఉదాహరణ లక్షణము : -

**"తద్విపర్యయా ద్వా విపరీతమ్." 1.1.37.**

తద్విపర్యయాత్ వా = సాధ్యవై ధర్మ్యమువలన, పక్షమునగల సాధ్యరూప ధర్మమునకు విరుద్ధమగు సాధ్యాభావరూప ధర్మాశ్రయమగుటవలన, విపరీతమ్ = హేతురూప ధర్మముకంటె భిన్నమగు సాధ్యరూప ధర్మమును బోధింపక దానియభావమును భావింపజేయు దృష్టాంతము సైతము ఉదాహరణ మనబడును దీనిని వ్యతిరేక ఉదాహరణ మనియునందురు.

ఉదాహరణము : - శబ్దము అనిత్యము, ఉత్పత్తి ధర్మము కలదగుట వలన అను నీ స్థలమున ఘటము అన్వయ దృష్టాంతము. ఆత్మాదులు వ్యతిరేకి దృష్టాంతములు.

ఉత్పత్తిధర్మమునకు వ్యతిరేకము అనుత్పత్తిధర్మము. అనుత్పత్తి ధర్మకము నిత్యము; ఆత్మవలె. శబ్దము ఆత్మవలె అనుత్పత్తి ధర్మము కలది కాకుండుటవలన నిత్యమును కాదు - అని సూత్రాభి ప్రాయము.

ఉపనయనము : -

**"ఉదాహరణాపేక్షస్తథేత్యుపసంహారో న తథేతివా
సాధ్యస్యోపనయః" 1.1.38.**

ఉదాహరణాపేక్షః = దృష్టాంత బలముచే, తథా ఇతి నతథేతి వా సాధ్యస్య

ఉపసంహారః= అట్లేయనిగానీ, లేక, అట్లుకాదు అని గానీ సాధ్యము నుపసంహరించుట - సాధ్యమును సిద్ధింపజేసి ముగించుట - ఉపయనయః = ఉపనయన మనబడును.

ఉదాహరణము - శబ్దము అనిత్యము; ఉత్పత్తి ధర్మము కలదగుటవలన; ఘటమువలె; ఆత్మాదివలె కాక పోవుటచే; అట్లే శబ్దము ఘటమును దృష్టాంతముగా గొని దాని సామ్యమువలన ఉత్పత్తిధర్మకమగుటచే శబ్ద మనిత్యము, ఘటమువలె, అనియు, ఆత్మాదిని దృష్టాంతముగా తీసికొని ఆత్మాదివలె అనుత్పత్తి ధర్మకము కాకుండుటచే ఆత్మాదివలె నిత్యముగాక అనిత్యమనియు చెప్పుట యుపనయ మనబడునని భావము.

నిగమన లక్షణము : -

**"హేత్వపదేశాత్ ప్రతిజ్ఞాయాః పునర్వచనం నిగమనమ్." 1.1.39.**

హేత్వపదేశాత్ = హేతువ్యపదేశము వలన, ప్రతిజ్ఞాయాః= ప్రతిజ్ఞా విషయమగు నర్థమును, పునర్వచనమ్ = కాబట్టి యిదియునట్లే యని మరల చెప్పుట, నిగమనమ్= నిగమన మనబడును.

ఉదాహరణబలమున హేతువునందు వ్యాప్తి జ్ఞానము కలిగించి యట్టి హేతువునకు పక్షముతో సంబంధమును జూపి, వ్యాప్తి విశిష్టపక్షధర్మము కలదగుటవలన ప్రతిజ్ఞాత సాధ్యమును అట్లేయని చెప్పుట నిగమన మనబడును.

ఉదాహరణములు : -

సాధర్మ్యహేతువు : (ప్ర) శబ్దము అనిత్యము. (హే) ఉత్పత్తిధర్మము కలదగుటవలన, (ఉదా) ఉత్పత్తి ధర్మక ఘట పటాదులు అనిత్యములు. (ఉపనయము) అట్లే (ఘటపటాదులవలె) శబ్దము అనిత్య ధర్మకము. (నిగమనము) కాబట్టి (ఉత్పత్తిధర్మము కలదగుటవలన) శబ్దమనిత్యము.

వైధర్మ్యహేతువు :- (ప్ర) శబ్దము అనిత్యము. (హే) ఉత్పత్తిధర్మక మగుట వలన. (ఉ) అనుత్పత్తి ధర్మకమగు ఆత్మాది నిత్యము (ఉప) అట్లు (ఆత్మాదివలె) శబ్దమనుత్పత్తి ధర్మకము కాదు. (ని) కాబట్టి (ఉత్పత్తి ధర్మము కలదగుట వలన) శబ్దము అనిత్యము.

తర్క లక్షణము : -

**"అవిజ్ఞాత తత్త్వేఽర్థే కారణోపపత్తిత స్తత్త్వజ్ఞానార్థమూ హస్తర్కః" 1.1.40.**

అవిజ్ఞాత తత్త్వే = తెలియబడని తత్త్వము (స్వరూపము) గల అర్థే =

పదార్థవిషయమున, కారణోపపత్తితః = తత్త్వమును తెలుపు సాధనము లభించుట వలన, తత్త్వజ్ఞానార్థమ్ = తత్త్వజ్ఞానము కొఱకు చేయబడు, ఊహః= ఈ కారణమున నిదియిట్లే కావలసి యుండునను కల్పన (జ్ఞానవిశేషము) తర్కః= తర్కమనబడును.

ఏ పదార్థము (తత్త్వతః) సరిగా నెఱుగబడదో దానిని తెలిసికొన కోరిక (జిజ్ఞాస) కలుగును. ఇట్లు తా తెలిసికొన గోరినవస్తువు విషయమున, ఈ వస్తు వెట్టిది? ఇది యిట్లా లేక అట్లా? యని విమర్శించును. విమర్శించి యెట్టిదని నిర్ణయించుటకు కారణము (ప్రమాణము) లభించునో అట్టిదిగా నిర్ణయించును.

ఉదాహరణము : – జ్ఞాతవ్య విషయము నెఱుగ గోరునట్టి యాజ్ఞాత (పురుషుడు) ఉత్పత్తి ధర్మియా లేక అనుత్పత్తిధర్మియా? అనునది విమర్శ. ఇట్లు విమర్శింపబడుచు తాత్త్వికముగా తెలియబడని విషయమున, నేధర్మము నుపపాదింప కారణము లభించునో దాని నంగీకరించును. ఆత్మ నిత్యమా? అనిత్యమా? యని సంశయించి నిత్యమని నిరూపించు ప్రమాణము లభించిన నట్లంగీకరించునని భావము. ఆత్మ యనుత్పత్తి ధర్మకము – నిత్యమగునేని స్వకృత కర్మ ఫలము ననుభవించును. దుఃఖజన్మ ప్రవృత్తిదోష మిథ్యా జ్ఞానము ప్రవృత్తి వలన సంసారము, నివృత్తివలన నపవర్గము కలుగును. ఆత్మయుత్పత్తి ధర్మకము – అనిత్యము అగునెడల నీ సంసారాపవర్గములు సంభవింపవు. కారణమేమన : ఆత్మయనిత్యమైన, నుత్పన్న సమయమున దేహేంద్రియాదులతో సంబద్ధమగునను ఈ సంబంధము స్వకృత కర్మఫలము కానేరదు. ఉత్పన్న వస్తువు నశించును. కాబట్టి స్వకృత కర్మఫల భోగమును సిద్ధింపదు. ఇట్లు విమర్శించి సకారణ పక్షము నంగీకరించును. ఇట్టి యూహకే తర్కమని నామము.

నిర్ణయ లక్షణము : –

**"విమృశ్యపక్ష ప్రతిపక్షాభ్యామర్థావధారణం నిర్ణయః" 1.1.41.**

విమృశ్య = సందేహించి, పక్ష ప్రతిపక్షాభ్యామ్ = సాధనోపాలంభముల ద్వారా, అర్థావధారణం = వస్తువిషయక నిశ్చయ జ్ఞానము, నిర్ణయః = నిర్ణయ మనబడును.

ఇట, 'పక్ష ప్రతిపక్ష' శబ్దములు ఒకే యధికరణము (వస్తువు) న నుండు రెండు పరస్పర విరుద్ధ ధర్మములను తెలుపును. పక్షశబ్దము సాధనబోధకము. ప్రతిపక్ష శబ్దము ఉపాలంభబోధకము. ఉపాలంభము = పరపక్షదూషణ.

ఎదుట కనబడునొకవస్తువును గురించి యిది పురుషుడా? లేక స్థాణువా యని సందేహించి, పురుషుడైన పక్షమున పురుషత్వసాధక హస్తపాదాదులును, లేక స్థాణువైన స్థాణుత్వ బోధక వక్రకోటరాదులు నుండవలయునని ఏకతర పక్షసాధనము, అన్యతర పక్షప్రతిషేధము నొనరించి స్థాణువనియో, లేక పురుషుడనియో నిర్ణయము జరుగును.

(ప్రథమాధ్యాయమున ఆద్యాహ్నికము)

# న్యాయ దర్శనము

## ప్రథమాధ్యాయము

(ద్వితీయాహ్నికము)

వాద లక్షణము :

**"ప్రమాణ తర్క సాధనోపాలంభః, సిద్ధాంతావిరుద్ధః**
**పంచావయవోపపన్నః పక్ష ప్రతిపక్షపరి గ్రహో వాదః"**

**1.2.1.**

ప్రమాణ తర్క సాధనోపాలంభః = ప్రత్యక్షాది ప్రమాణముల ద్వారా, వానికనుకూలించు తర్కములద్వారాను, తనపక్షమును సాధించుచు, పరపక్షమును నిషేధించు నట్టిదియు, సిద్ధాంతా విరుద్ధః = సిద్ధాంత పదార్థమును విరోధింప నట్టిదియు, పంచావయవోపపన్నః = ప్రతిజ్ఞాది పంచావయవముల ప్రయోగములు గలదియు, పక్షప్రతిపక్ష పరిగ్రహః = వాది ప్రతివాదులచే "ఆత్మకలదు - ఆత్మలేదు" అనునిట్టి పక్ష ప్రతిపక్షములు కలదియునగు కథావిశేషము (చర్చ) వాదః = వాదమనబడును.

అనేకు లొకచోగూడి విషయమును విచారించుచు జేయు వాక్యరచన 'కథ' యనబడును. ఆ కథయు వాదము, జల్పము. వితండ యని ముప్విధములు. అందు, స్వపక్ష సాధనము పరపక్ష ప్రతిషేధము నను నీరెండును ప్రత్యక్షాది ప్రమాణములతోను వాని కనుకూలించు తర్కములతోను చేయబడుచు ఆ తర్కములు తామంగీకరించిన శాస్త్రమునకు విరుద్ధములు కానివైయుండి, అవసరమని తోచినయెడల ప్రయోగించు న్యాయవాక్యములు ప్రతిజ్ఞాదిపంచావయవములతో కూడియున్న పక్షమున నట్టి కథకు వాదమని పేరు.

అనధిగత తత్వావబోధము (తనకింత వరకు తెలియని యొకానొక తత్వము నెఱుంగుట), సంశయ నివృత్తి, అధ్యవ సితాభ్యనుజ్ఞానము (నిశ్చితార్థము నంగీకరించుట) యను నీ మూడుఫలముల నభిలషించు నొక శిష్యుడు తనగురువుతో గానీ, తోడి బ్రహ్మచారులతోగానీ చేయుచర్చ (కథావిశేషము) - వార్తాలాపము, తత్వనిర్ణయమే ఫలముగా గల్గదైన పక్షమున వాద మనబడును. ఇందొకరినొకరు జయించుట కానీ, ఓడించుటకానీ యుండనేరదు.

జల్ప లక్షణము :

**"యథోక్తోపపన్నశ్ఛలజాతి నిగ్రహస్థానసాధనోపాలంభోజల్ప" 1.2.2.**

యథోక్తోపపన్నః= పూర్వము చెప్పిన వాదలక్షణముతో కూడినదై, ఛల....... సాధనోపాలంభః= ఛలము. జాతి, నిగ్రహస్థానము వీని ద్వారా స్వపక్షమును స్థాపించుటయు, పరపక్షమును నిషేధించుటయు గల కథావిశేషము - వార్తాలాపము, జల్పః= జల్పమనబడును.

ఇందు వాది ప్రతివాదులు తమతమ పక్షమును సాధింతురు. ఇతరుల పక్షమును ఖండితురు - ప్రతిషేధింతురు. తమపక్షమును సాధించుటలోను ఇతర పక్షమును ఖండించుటలోను వీలైనట్లు ప్రత్యక్షాది ప్రమాణములు, తర్కములు, ఛలము, జాతి, నిగ్రహస్థానములు వీనినన్నిటిని ప్రయోగింతురు. ఇట్టివాక్య సమూహమే జల్పమనబడును. ఈ జల్పమున వాదమునందు ప్రయోగింపనట్టి ఛలము, జాతి, నిగ్రహస్థానములు ప్రయోగింపబడును.

ఛలజాతి నిగ్రహస్థానము లననేమో ముందుజెప్పబడును.

వితండాలక్షణము:

**"సప్రతిపక్షస్థాపనాహీనో వితండా." 1.2.3.**

ప్రతిపక్షస్థాపనాహీనః= ప్రతివాదిచే స్వీకరింప బడిన పక్షము ప్రతిపక్ష మనబడును. దానిని ప్రమాణాదుల ద్వారా సాధించుట స్థాపనయనబడును. అట్టిసాధన రహితమైన, సః= ఆ జల్పము, వితండా = వితండయనబడును.

పూర్వసూత్రమున వర్ణింపబడిన జల్పలక్షణమే ప్రతి పక్షస్థాపనలేనిదై వాదిని జయించు బుద్ధితో నడుపబడిన వార్తాలాపము గలదగుచో వితండ యనబడును. ప్రతివాది తన సిద్ధాంతమును స్థాపింపక వాది సిద్ధాంతమును ప్రమాణ తర్క ఛల జాతి నిగ్రహస్థానముల ద్వారా ఖండింప నెంచిన, వితండ యనబడునని సూత్రాభిప్రాయము. మఱియు సంక్షేపముగా జెప్పిన, స్వపక్షమును స్థాపింపక పరపక్షమును ఖండించుటయే ఫలముగాగల వార్తాలాపము (కథావిశేషము) వితండయనబడును.

హేత్వాభాసములు :-

**"సవ్యభిచార విరుద్ధ ప్రకరణసమ సాధ్యసమ**
**కాలాతీతాః హేత్వాభాసాః" 1.2.4.**

హేత్వాభాసాః = హేతులక్షణము లేకుండి హేతువులవలె తోచునవి. పక్షసత్వము, సపక్షసత్వము, విపక్షాసత్వము, అబాధితత్వము, అసత్ ప్రతిపక్షితత్వము నను నైదును హేతులక్షణము, ఇట్టి లక్షణము లేక పంచమ్యంతాది సామాన్యలక్షణము కలిగియుండుటచే హేతువువలె తోచునవి

హేత్వాభాసము లనబడును.

ఆ హేత్వాభాసములు సవ్యభిచారము, విరుద్ధము, ప్రకరణ సమము, సాధ్యసమము, కాలాతీతము నని యైదు విధములు.

ఇందు ప్రకరణసమమునకు సత్ప్రతిపక్షమనియు' సాధ్యసమమునకు అసిద్ధమనియు, కాలాతీతమునకు బాధిత మనియు నామాంతరములు గలవు. వానిలో సవ్యభిచారము :-

**"అనైకాంతికః సవ్యభిచారః" 1.2.5.**

అనైకాంతికః = (ఒకచో నియతముగా నుండునది ఏకాంతికము దానికి విపరీతముగా నుండునది అనైకాంతికము.) అనియతముగా నుండునది, సవ్యభిచారః= సవ్యభిచార మనబడును.

ఏ వస్తువు (సాధ్యము) సాధింపబడుచున్నదో అదియొక యంతము. దానియంభావము రెండవయంతము. ఇట్లు సాధ్యముండుచోటు నొకయంతముగను, సాధ్యములేని చోటునొక యంతముగను మనమూహింపవచ్చును. దీనినే సంస్కృతమున సాధ్యవంతము సాధ్యాభావవంతము నని చెప్పవచ్చును. ఇట్టి రెంటిలో నొకదానియందు నియతముగా నుండని హేతువు అనైకాంతికము - సవ్యభిచార మనబడును.

ఏ హేతువు సాధ్యమున్నచోట (సాధ్యవతి) నుండి సాధ్యాభావమున్నచోటను (సాధ్యాభావవతి) నుండునో ఆ హేతువు సవ్యభిచార హేత్వాభాస మనబడునని సూత్రాభిప్రాయము.

ఒకచోట వ్యవస్థితము కాకుండుట వ్యభిచార మనబడును వ్యభిచారముతో కూడినది సవ్యభిచారమనబడును.

ఉదాహరణము :- శబ్దము నిత్యము స్పర్శములేనిదగుట వలన స్పర్శముగ ఘటపటాదులు అనిత్యములుగా చూడబడుచున్నవి. స్పర్శము లేకుండుట వలన శబ్దము నిత్యమని సాధింపనెంచి, 'స్పర్శము లేనిదగుటవలన' అను హేతువు నిట గ్రహించిన నదిహేతువుగాక సవ్యభిచార హేత్వాభాసమగును. కారణ మేమన: శబ్దము నిత్యము అను తావున నిత్యత్వము సాధ్యము; అనిత్యత్వము సాధ్యాభావము. స్పర్శము లేని దగుట వలన నను నీహేతువు సాధ్యాభావముగల- అనిత్యమయిన బుద్ధియందును గలదు. కాబట్టి యిది యహేతువు - హేత్వాభాసము.

విరుద్ధ హేత్వాభాసము :

**"సిద్ధాంత మభ్యుపేత్య తద్విరోధీ విరుద్ధః" 1.2.6.**

సిద్ధాంత మభ్యుపేత్య = సాధనీయధర్మము - సాధ్యము సిద్ధాంత మనబడును. దానినంగీకరించి, తద్విరోధీ = దానిని విరోధించు స్వభావము గల - సాధ్యాభావ స్థలమున నుండు హేతువు, విరుద్ధః= విరుద్ధహేత్వాభాసమనబడును.

ఉదాహరణము :- ఈ హ్రదము (మడుగు) వహ్నిమంతము, హ్రదత్వము కలదగుట వలన ఇక్కడ వహ్ని సాధ్యము. హ్రదత్వము హేతువు. హ్రదత్వము హ్రదమున నుండును. అక్కడ వహ్ని యుండనేరదు. కాబట్టి యీ హ్రదత్వము సాధ్యాభావ స్థలముననుండి విరుద్ధ హేత్వాభాస మనబడును.

ప్రకరణ సమము :-

**"యస్మాత్ప్రకరణ చింతా స నిర్ణయార్థ మప దిష్టః ప్రకరణ సమః" 1.2.7.**

యస్మాత్ = సమాన బలముగల మరియొక హేతువుచే నిరోధింపబడిన సామర్థ్యముగల యే హేతువు వలన, ప్రకరణచింతా= (సాధ్యాశ్రయమగు పక్షము ప్రకరణ మనబడును. ఆ ప్రకరణకు సంబంధించినచింత) పక్షము (ప్రకరణము) సాధ్యమున కాశ్రయమా లేక అనాశ్రయమా? యనుజిజ్ఞాస కలుగునో, సః= ఆహేతువు, నిర్ణయార్థమ్ = పక్షము సాధ్యాశ్రయమేయని నిర్ణయించుటకు, అపదిష్టః= ప్రయోగింపబడినచో, ప్రకరణసమః= ప్రకరణసమము- సత్ప్రతిపక్ష హేత్వాభాసమనబడును.

విమర్శ నధికరించు పక్ష ప్రతిపక్షములు ప్రకరణమని భాష్యకారులు (వాత్స్యాయనుడు).

పక్షమున(సాధ్యవంతమున) సాధ్యనిర్ణయార్థమై ప్రయోగింపబడిన హేతువునకు ప్రతికక్షిగా మఱియొక హేతువున్న పక్షమున ప్రథమ హేతువు సత్ప్రతిపక్ష = ప్రకరణసమహేత్వాభాస మనబడును.

సాధ్యాభావమును సాధించుహేతువు ప్రతికక్షిగా నే హేతువున కుండునో ఆ హేతువు ప్రకరణ సమహేత్వాభాసము.

ఉదాహరణము :- శబ్దమనిత్యము; నిత్యధర్మము లభింపకుండుట వలన శబ్దము నిత్యము; అనిత్య ధర్మము లభింపకుండుట వలన.

ఇందు నిత్యధర్మముకానీ, అనిత్యధర్మముకానీ లభింపనందున శబ్దము నిత్యమా? అనిత్యమా? అను సంశయము కలుగుచున్నది. నిత్యమో అనిత్యమో

నిర్ణయింపజాలనందున నీ హేతువులు ప్రకరణ సమము లనబడును.

సాధ్యసమహేత్వాభాసము :-

**"సాధ్యావిశిష్టస్సాధ్యత్వా త్సాధ్యసమః" 1.2.8.**

సాధ్యత్వాత్ః = సిద్ధము కాకుండుట వలన నేహేతువు, సాధ్యా విశిష్టః = సాధ్యముతో తుల్యమో అది, సాధ్యసమః = సాధ్యసమహేత్వాభాస మనబడును.

ఏ హేతువు (స్వరూపతః) సిద్ధముకాదో అది సాధ్యము వలెనే సిద్ధము చేయదగినదగుటచే సాధ్యసమ మనబడును. దీనినే అసిద్ధహేత్వాభాసమనియు నందురు.

ఉదాహరణము : - తమస్సు (అంధకారము) ద్రవ్యము, గతి గలదగుటవలన, ఇందు గతిగలదగుటవలన అనుహేతువు సాధ్యసమము. కారణమేమన, అంధకారము ద్రవ్యమనుట సాధింపదగిన విషయమెట్లో అట్లే అంధకారమున గతి - గమనము = చలనము నున్నదనుట సాధింపదగినవిషయమే. ఉభయ పక్షమువారును, అంధకారము చలించునను విషయము సిద్ధమని యంగీకరింపరని భావము.

కాలాతీతము :-

**"కాలాత్యయాపదిష్టః కాలాతీతః" 1.2.9.**

కాలాత్యయాపదిష్టః= హేతువును ప్రయోగించుకాలము కాలమనబడును. దాని నతిక్రమించి ప్రయోగింపబడు హేతువు, కాలాతీతః = కాలాతీత మనబడును.

ఉదాహరణము - వహ్ని అనుష్ణము; ద్రవ్యమగుట వలన, శబ్దము నిత్యము; సంయోగవ్యంగ్యమగుటవలన

ఇట భేరీదండ సంయోగమువలన శబ్దము వ్యంగ్యమగును. సంయోగమువలన కలుగు నీ శబ్దము మనము గ్రహించువేళ సంయోగముండదు. ఆ సంయోగ మంతకు పూర్వమే కలుగును. సంయోగ సమయమున మనము శబ్దము గ్రహింపము. అనంతరమున గ్రహింతుము. వ్యంగ్య వ్యంజకములు రెండు నొక్కకాలమున గ్రహింపబడవు.

ఆలోకసంయోగము రూపవ్యంజకము. ఆలోకరూపములు రెండు నొకేసమయమున జూడబడును. శబ్దమట్లు కాదు కాబట్టి యీ హేతువు కాలాతీతమగును. దీనిని బాధిత హేత్వాభాసమనియు నందురు. అనగా నీ హేతువు ప్రత్యక్షాదిప్రమాణములచే బాధింపబడును. ఇక్కడ జూపబడిన

యుదాహరణములలో మొదటి యుదాహరణమున ద్రవ్యమగుటవలన వహ్ని యనుష్ణమనుట ప్రత్యక్ష ప్రమాణ బాధితము

ఛల లక్షణము :-

**"వచనవిఘాతోఽర్థ వికల్పోపపత్త్యాఛలమ్" 1.2.10.**

అర్థవికల్పోపపత్త్యా = వాదికిష్టమైన (అభిప్రేతమైన) యర్థమునకు విరుద్ధమైన యర్థమును కల్పించుటయే లక్షణముగాగల యుక్తితో, వచనవిఘాతః = వాదిచే ప్రయోగింపబడిన వాక్యమును దుష్టమొనర్చుట, ఛలమ్ = ఛలమనబడును.

వాదియే యభిప్రాయమును మనమున నిడుకొని యొక వాక్యమును ప్రయోగించునో ఆ యభిప్రాయమునకు విరుద్ధమైన యర్థము నా వాక్యమునకు కల్పించి యా వాక్యమును వ్యర్థమొనర్చుట ఛలమనబడునని సూత్రాభిప్రాయము,

ఛల విభాగము :-

**"తత్ త్రివిధం వాక్ఛలం సామాన్యచ్ఛల ముపచారచ్ఛలంచ" 1.2.11.**

తతః = పై జెప్పిన ఛలము వాక్ఛలము, సామాన్యచ్ఛలము, ఉపచారచ్ఛలము నని మూడు విధములు.

అందు వాక్ఛలము :-

**"అవిశేషాభిహితేఽర్థే వక్తురభిప్రాయాదర్థాంతరకల్పనా వాక్ఛలమ్" 1.2.12.**

అవిశేషాభిహితే = శబ్దశక్తి వలన ననేకార్థములనిచ్చు శబ్దము అవిశేష మనబడును. అట్టి శబ్దముచే చెప్పబడిన అర్థే = అర్థమునందు, వక్తుః = వాదికి, అభిప్రాయాత్ = ఇష్టమైన దానికంటె, అర్థాంతర కల్పనా = భిన్నమైన మఱియొక యర్థమును కల్పించుట, వాక్ఛలమ్ = వాక్ఛల మనబడును.

అనేకార్థకమగు నొక శబ్దమును కొండొక యర్థమును తెలుపనుద్దేశించి యొకడు ప్రయోగింప, ప్రయోక్తయభి ప్రాయమునకంటె భిన్నార్థము నాశబ్దమునకు కల్పించుట వాక్ఛలమనబడునని సూత్రాభిప్రాయము.

ఉదాహరణము : - "ఇతడు నవకంబలుడు". అను వాక్యమును 'ఇతడు క్రొత్త కంబళి కలవాడ' ను నర్థమును బోధింపదలచి యొకడు ప్రయోగింప, ఆ వాక్యమునకు తొమ్మిది కంబళ్ళు కలవాడని యర్థమును కల్పించి ఈ దరిద్రునకు రెండు కంబళ్లైన లేవే తొమ్మిదియెటనుండి వచ్చినవని యాక్షేపించుట వాక్ఛలమగును.

**"సంభవతోఽర్థస్యాతిసామాన్యయోగా దసంభూ**
**తార్థకల్పనా సామాన్యచ్ఛలమ్. 1.2.13**

సంభవతః - సంభావింప వీలగు, అర్థస్య = వాదిచే ప్రయోగింపబడిన వాక్యార్థమును ప్రతిషేధించుట కొరకు, అతిసామాన్యయోగాత్ = సంభావింప వీలయిన అర్థముకాక సామాన్యధర్మమును పురస్కరించుకొని వీలయినట్టి, అసంభూతార్థ కల్పనా = అసంభవమైనట్టి అర్థమును కల్పించుట, సామాన్య చ్ఛలమ్ = సామాన్యచ్ఛల మనబడును.

ఒక సామాన్యధర్మమును పురస్కరించుకొని వాది తాత్పర్యమునకు విషయమైన యర్థమునకు విరుద్ధార్థమును కల్పించుట సామాన్యచ్ఛలమని సూత్రాభిప్రాయము.

ఉదాహరణము :- దూరమునుండి వచ్చుచున్న శ్రీమత్పరమహంస పరిప్రాజకాచార్యవర్యులగు దయానంద భగవత్పాదులను చూచి యొకడు "వీరా! జగద్విఖ్యాతకీర్తులు! అఖిలజనవంద్యులు! దేశాత్మోద్ధారార్థము వైదిక ధర్మము నుపదేశించు పరివ్రాజకులు !" అని సహచరులతో నన నందొకరు 'పరివ్రాజకునకు దేశాత్మోద్ధారార్థము వైదికధర్మోపదేష్టృత్వము సంభవమే' యని యనెననుకొనుడు. అంతట నొక ఛలవాది, పరివ్రాజకునకు వైదిక ధర్మోపదేశము సంభవమేని, కలరుగదా! యెందరో పరివ్రాజకులు నేడు భారతమున వారియందున పరివ్రాజకత్వము కలదుగదా? కాని, వారిలో నెందఱు సత్కారార్హులు? బకబిడాలవ్రతులై భారత భూమికి భారభూతులై యున్నారే! వారెల్లరు వైదిక ధర్మోప దేశకులేనా? అని యెదుర్కొనును. ఇక్కడ వాదిచే హేతువుగా నుద్దేశింపబడని పరివ్రాజకత్వసామాన్యమును వైదిక ధర్మోపదేశమునకు హేతువుగాగొని యాక్షేపించుట సామాన్యచ్ఛలమని సూత్రాభిప్రాయము.

ఉపచారచ్ఛలము :-

**"ధర్మవికల్పనిర్దేశే అర్థ సద్భావ ప్రతిషేధ ఉపచారచ్ఛలమ్" 1.2.14**

ధర్మవికల్ప నిర్దేశే = (శబ్ద వృత్తులయిన 'శక్తి - లక్షణ' లు ఇక్కడ ధర్మ పదమున వ్యవహరింపబడినవి.) శక్తి - లక్షణా వృత్తులలో నొకదానిచే నిర్దేశింపబడిన శబ్దమున, అర్థసద్భావప్రతిషేధః= రెండవ వృత్తిచే నట్టి యర్థ మా శబ్దమునకు లేదని ఖండించుట, ఉపచారచ్ఛలమ్ = ఉపచారచ్ఛల మనబడును.

శబ్దమున నర్థబోధకవృత్తులు రెండు గలవు. ఒకటి శక్తి. రెండు లక్షణ. ఇందు శక్తి ముఖ్యవృత్తి. లక్షణగౌణ వృత్తి. ఇట్టి రెండు వృత్తులో నొకదానిని మనస్సున నిడుకొని వాదిచే ప్రయోగింపబడిన శబ్దమునకు మఱియొకదానితో నాయర్థమును కాదనుట ఉపచారచ్ఛలమనబడునని సూత్రాభిప్రాయము.

ఉదాహరణము : లక్షణావృత్తి నుద్దేశించి "మంచెలు (అరచుచున్నవి) కేకలు పెట్టుచున్నవి" అని యొకడన, శక్తి వృత్తి ననుసరించి "మంచెలెట్లు కేకలు పెట్టగలవయ్యా? మంచెల మీదనున్న మనుజులు కేకలు పెట్టుచున్నారు కాని" యని ఖండించుట ఉపచారచ్ఛలమగును.

ఇట్లు ఛలము ముప్విధములని నిరూపించి యంతకంటె నెక్కువ తక్కువ కావని ధృవపరుప పూర్వపక్ష మొనర్చుచున్నాడు సూత్రకారుడు.

**"వాక్ఛలమేవోపచారచ్ఛలం తదవిశేషాత్" 1.2.15.**

ఉపచారచ్ఛలము, వాక్ఛలమేవ = వాక్ఛలమే. తదవిశేషాత్ = వాక్ఛలముకంటె భిన్నము కాకుండుట వలన.

వాక్ఛలమున వాదిచే ప్రయోగింపబడిన శబ్దమున కర్థాంతరము కల్పించి ఖండించుటనట్లు ఉపచారచ్ఛలమునను వాది ప్రయోగించు శబ్దమునకు దతభిప్రేతార్థమునకంటె భిన్నార్థము కల్పింపబడును. వాక్ఛలము, ఉపచారచ్ఛలము రెండు వేరుగావు.

ఖండన సూత్రము :-

**"న తదర్థాంతరభావాత్" 1.2.16.**

న = వాక్ఛలము ఉపచారచ్ఛలముకాదు. కారణమేమి? తదర్థాంతర భావాత్ = ఆరెంటిలోను భేదముండుట వలన.

వాక్ఛల = ఉపచారచ్ఛలములలో సామాన్య దృష్టికి భేదము కన్పింపకున్నను వానిలోచాలా భేదము కలదు. వాక్ఛలమున శక్తివృత్తిచే బోధింపబడిన అర్థము శక్తివృత్తిచే బోధింపబడిన అర్థాంతరముచే ఖండింపబడును, ఉపచారచ్ఛలమున శక్తివృత్తిచే బోధింపనెంచిన యర్థము లక్షణావృత్తిచే కల్పితమగు అర్థముచేతను, లక్షణావృత్తిచే బోధింపనెంచిన యర్థము శక్తివృత్తి కల్పితార్థముద్వారాను ఖండింపబడును. కాబట్టి రెండును భిన్నములని సూత్రాభిప్రాయము.

**"అవిశేషేవా కించిత్సాధర్మ్యా దేకచ్ఛల ప్రసంగః" 1.2.17.**

వా = మరియు, కించిత్సాదర్మ్యాత్ = ఏ కొంచెపు సమానత వలననో, అవిశేషే = భేదము లేదన్నచో, ఏకచ్ఛల ప్రసంగః= ఒకేఛ లమనవలసి వచ్చును.

పై జెప్పిన భేదమతిస్వల్పమనియెంచి వాక్ఛలోపచారచ్ఛలములో భేదములేదని యెంచిన పక్షమున సామాన్యచ్ఛలమును సైతము భిన్నముగా నెంచక ఒక్కటే ఛలమని యెంచవలసివచ్చును. కాబట్టి యత్కించిద్భేదమును గూఢ భేదముగానెంచి సూత్రకారుడు ఛలము మూడు విధములని వర్ణించియున్నాడు.

జాతిలక్షణము :-

**"సాధర్మ్య వైధర్మ్యాభ్యాం ప్రత్యవస్థానం జాతిః" 1.2.18.**

సాధర్మ్య వైధర్మ్యాభ్యామ్ = సమాన విశేషధర్మము ద్వారా, ప్రత్యవస్థానమ్ = వాదిస్థాపిత సాధ్యధర్మమును ఖండించుట, జాతిః= జాతి యనబడును.

వాదిచే స్థాపింపబడిన సాధ్యధర్మమును ఖండించుటకు వ్యాప్తిరహితమగు హేతువును గ్రహించుట జాతియనబడును.

నిగ్రహస్థాన లక్షణము :-

**"విప్రతిపత్తి రప్రతిపత్తిశ్చ నిగ్రహస్థానమ్" 1.2.19.**

విప్రతిపత్తిః = విరుద్ధ జ్ఞానము, అప్రతిపతిః = ఆరంభింపవలసిన యెడ ఆరంభింపకుండుట, (వాది సాధించిన దానిని దూషించుటయో, వాది దూషించిన దానికి సమాధానము చెప్పుటయో ఆరంభ మనబడును. అట్లు చేయకుండుట ఆనారంభము – అప్రతిపత్తి). నిగ్రహస్థానమ్ – నిగ్రహస్థాన మనబడును.

పరుడు చెప్పినదానిని సరిగా గ్రహింపక విపరీతముగ గ్రహించుటయు, పరుడు స్థాపించిన దానిని ఖండింపకుండుటయు పరాజయమునకు కారణములు కాబట్టి విప్రతిపత్తి – అప్రతిపత్తి యనునివి నిగ్రహస్థానము లనబడును.

జాతి నిగ్రహస్థానము లెన్నియన :

**"తద్వికల్పాజ్జాతి నిగ్రహస్థాన బహుత్వమ్." 1.2.20.**

తద్వికల్పాత్ సాధర్మ్య వైధర్మ్యము ద్వారా చేయు ఖండనము వలనను, విప్రతిపము అప్రతిపత్తులు అనేక విధములగుట వలనను, జాతి నిగ్రహస్థాన బహుత్వమ్ = జాతి, నిగ్రహస్థానము లనేక విధములు.

పై జెప్పిన జాతి నిగ్రహస్థాన లక్షణములో గల బేధము ననుసరించి జాతి నిగ్రహస్థానము లనేక విధములని సూత్రాభి ప్రాయము.

న్యాయదర్శనమున ప్రథమాధ్యాయము.

# న్యాయ దర్శనము

## ద్వితీయాధ్యాయము

(ఆద్యాహ్నికము)

ప్రథమాధ్యాయమున ప్రమాణాది పదార్థములు నామములతో పేర్కొనబడి వాని లక్షణ విభాగములు చేయబడినవి. ఈ యధ్యాయమున నాయా పదార్థములను క్రమముగా పరీక్షింప దలచి సూత్రకారుడు ముందుగా సంశయమును పరీక్షించుచున్నాడు. పాఠక్రమము ననుసరించి ప్రమాణములను ముందు పరీక్షింప వలసియుండ, వానిని విడిచి సంశయమును పరీక్షించుటకు కారణము, సంశయింపక విచారణ కులుగకుండుటయే.

పూర్వపక్షము :

**"సమానానేక ధర్మాధ్యవసాయాదన్యతర ధర్మాధ్యవ సాయాద్వా న సంశయః" 2.1.1.**

సమాన...... సాయాత్ = సాధారణ = అసాధారణ ధర్మ నిశ్చయ జ్ఞానము వలనగానీ, అన్యతర ధర్మాధ్యవసాయాత్ = సాధారణ అసాధారణ ధర్మములో నొకదానిని నిశ్చయ జ్ఞానము వలనగానీ సంశయః = సందేహము, న = కలుగదు.

("నమానానేక... సంశయః" 1.1.23) అనునీ సూత్రమున చెప్పబడిన సంశయ లక్షణము సరికాదు. సమానానేక ధర్మముల గ్రహణమువలనగానీ, అన్యతధర్మగ్రహణమువలనగానీ ధర్మియందు సంశయము కలుగుననుట యుక్తముగాదు. ధర్మధర్ములు వేరు వేరు పదార్థములు గదా! రూపమును చూచినపుడు స్పర్శమందు సందేహము కల్గునా? దేవదత్తుని జూచిన గోవిందునియందు సందేహమెట్లు గల్గును? మఱియు, నమానధర్మాధ్యవసాయమువలన నంశయము కలగుననుటలో, అధ్యవసాయమన్న నిశ్చయ జ్ఞానము గదా? నిశ్చయ జ్ఞానమువలన సంశయజ్ఞాన మెట్లుకల్గును? కార్యకారణములలో సారూప్యమేమియు కనబడదే? కాబట్టి సమాన ధర్మనిశ్చయ జ్ఞానమువలన సంశయము కలుగనేరదు. ఇట్లే అనేక అన్యతర ధర్మముల నిశ్చయజ్ఞానము వలనను సంశయము కలుగనేరదని సూత్రాభిప్రాయము.

**"విప్రతిపత్త్యవ్యవస్థాధ్యవసాయాచ్చ" 2.1.2.**

పూర్వాధ్యాయమున లక్షణసూత్రమున జెప్పిన, విప్రతిపత్తి – అవ్యవస్థల

యధ్యవసాయము వలనను సంశయము కలుగనేరదు.

విప్రతిపత్తిః = విరుద్ధ జ్ఞానము – లేక – (ఆత్మ ఉన్నది – ఆత్మ లేదు) అను నిట్టి విరుద్ధమగు లోకమతము. ఇట్లు లోక మతమును నిశ్చయముగా నెఱిగినందున ఆత్మయందేల సందేహము కలుగును? కలుగజాలదు. ఇట్లే విప్రతిపన్న వస్తువును నిశ్చయింపగల కొండొక ధర్మోపలబ్ధి = ధర్మగ్రహణము అవ్యవస్థితమైయున్నదనియు లేక అట్టి ధర్మానుపలబ్ధి– ధర్మగ్రహణము అవ్యవస్థితిమైయున్నదనియు లేక అట్టి ధర్మానుపలబ్ధి – ధర్మాగ్రహణము అవ్యవస్థితమైయున్నదనియు స్పష్టముగా – వేరువేరుగా నెఱిగినవ్యక్తి యేల సందేహించును? దేని వలనల నేది జనింపదో అది యుద్ధానికి కారణమనుట యుక్తము కాదని సూత్రాభిప్రాయము.

విప్రతిపత్తివలన సంశయము కలుగకుండుటకు కారణ మేమన–

**"విప్రతిపత్తౌచ సంప్రతిపత్తేః." 2.1.3.**

విప్రతిపత్తౌచ = పూర్వము చెప్పబడిన విప్రతిపత్తియందు, సం ప్రతిపత్తేః = వాది ప్రతివాదుల కుభయులకును నిశ్చయజ్ఞాన ముండుట వలన సంశయము లేదని సూత్రతాత్పర్యము.

ఆత్మయున్నదని చెప్పువాదికిగానీ, ఆత్మలేదని చెప్పు ప్రతివాదికిగానీ, వారి ఆత్మాస్తిత్వ – ఆత్మనాస్తిత్వ సిద్ధాంతములందు ఎట్టి సంశయమును లేదు. నిశ్చయమే కలదు. కాబట్టి అట్టియెడ సంశయమునకు తావేది? సంప్రతిపత్తి యన నిశ్చయజ్ఞానము. నిశ్చయము సంశయమునకు కారణమెట్లు కాగలదు? అసంభవము. నిశ్చయమువలన సంశయము కలుగునెడల కార్యకారణములో వైరూప్యమేర్పడగలదు.

విప్రతిపత్తివలన సంశయము కలుగకున్న పోనిండు. కాని ఉపబ్ధ్యనుపబ్ధ్య వ్యవస్థవలన నేల సంశయము కలుగదన : –

**"అవ్యవస్థాఽఽత్మని వ్యవస్థితత్వా చ్చావ్యవస్థాయాః" 2.1.4.**

అవ్యవస్థాయాః = ఉపబ్ధ్యనుపలబ్ధిరూప అవ్యవస్థ, అవ్యవస్థాత్మని = తన స్వరూపమున, వ్యవస్థితత్వాత్చ = వ్యవస్థితము – ప్రతిష్ఠితమైయుండుట వలన సంశయము కలుగదు.

ఏ యవ్యవస్థ సంశయమునకు కారణముగా చెప్పబడుచున్నదో అది తన స్వరూపమున వ్యవస్థితమైయున్నదా? లేదా? తన స్వరూపమున స్థిరమైయున్న నది సంశయమునకు కారణమెట్లగును? అవ్యవస్థ తన స్వరూపముననే

వ్యవస్థితము గాని పక్షమున స్వరూపరహితమైన యవ్యవస్థ సంశయమునకు కారణ మెవ్విధమునను కాజాలదని సూత్రాభిప్రాయము.

సమానానేకాది ధర్మోపపత్తి వలన సంశయము కలుగుచుండుట లోకమున జూచుచున్నామే! కాదందురే? యనిన:

**"తథాఽత్యంత సంశయస్తద్ధర్మ సాతత్యోపపత్తేః" 2.1.5.**

తథా = సమానధర్మజ్ఞానాదుల వలన సంశయము కలుగునెడల, అత్యంత సంశయః = అత్యంత సంశయము కలుగును. సంశయ నివృత్తి కలుగుటయే దుర్లభమగును. కారణమేమన: తద్ధర్మ సాతత్యోపపత్తేః = ఆ సమాన అసమాన ధర్మముల గ్రహణ మెల్లపుడు కలుగుచుండుట వలన.

ఎట్టి ధర్మజ్ఞానముల వలన సంశయము కలుగునని చెప్పబడు చున్నదో ఆ ధర్మమావస్తువునందెల్లపుడు (వస్తువున్నంత కాలము) నుండునుగదా? వస్తు (ధర్మి) వెల్లపుడును ధర్మ గ్రహణపూర్వకముగనే గ్రహింపబడును. కాబట్టి ధర్మిగ్రహణ మున్నంతకాలము ధర్మగ్రహణము నుండును. అట్టియెడ నమానాదిధర్మగ్రహణము సంశయమునకు కారణమైనచో కారణమున్నంతకాలము కార్యమయిన సంశయమును కలుగుచుండును. అందుచే సంశయోచ్ఛేద మెన్నడును కలుగనేరదని సూత్రాభిప్రాయము.

ఉత్తర పక్షము :

**"యథోక్తాధ్యవసాయాదేవ తద్విశేషాపేక్షాత్ సంశయే**
**నాసంశయో నాత్యంతసంశయోవా" 2.1.6.**

తద్విశేషాపేక్షాత్ = దేనియందు సంశయము కలుగుచున్నదో దాని విశేషధర్మము (స్థాణుత్వ పురుషత్వాదుల) నపేక్షించుట వలన, యథోక్తాధ్యవసాయాదేవ = పూర్వము చెప్పబడిన ఉపలబ్ధ్యనుప లబ్ధ్యవ్యవస్థలతో కూడిన సమాన ధర్మోపపత్త్యాదుల వలననే, సంశయే = సందేహము కలుగుచుండ, నఅసంశయః = సంశయము కలుగకుండుట గానీ, నఅత్యంత సంశయోవా = సంశయ మెన్నటికి దూరము కాకుండుటగానీ లేదు.

సమానధర్మగ్రహణము మాత్రము సంశయమునకు కారణమని చెప్పిన సంశయముకలుగకుండుటయో అత్యంత సంశయము కలుగుటయో సంభవించును. కాని సంశయ కారణములను జెప్పిన సూత్రమున విశేషధర్మముల నపేక్షించు సమాన ధర్మోపపత్త్యాదుల వలన సంశయము గలుగునని చెప్పబడినది. అందువలన నెట్టిదోషమును కలుగదు.

స్థాణువు (నిలబడియున్న కొయ్య) లోను, పురుషునిలోను సమానముగ నుండు ఎత్తు, లావు మున్నగు సమాన గుణములను జూచుచు - వంకర, తొఱట, చేతులు, కాళ్ళు మున్నగు విశేషగుణము లట కనబడకపోవుటవలన నెదుట కనబడువస్తువునందు స్థాణువా పురుషుడా యను సంశయము కలుగును. ఇక్కడ విశేషగుణముల యాకాంక్షతో గూడిన సమానగుణము జ్ఞానము సంశయమునకు కారణము గాని, సమానగుణజ్ఞానముమాత్రము కారణము కాదు. విశేషగుణములు చూడబడగానే సంశయము విడిపోవును. కాబట్టి పూర్వమున జూపబడినదోషములు నిర్హేతుకములని సూత్రా భిప్రాయము.

**"యత్ర సంశయ స్తత్రైవ ముత్తరోత్తర ప్రసంగః" 2.1.7.**

యత్ర సంశయః = పరీక్షింపదగిన విషయమునందెట్లైన నను కలుగు సంశయమును పూర్వపక్షులెవరైన నాక్షేపించిన, తత్ర = ఆ స్థలమున, ఏవమ్ = పై సూత్రమున వర్ణించినట్లు, ఉత్తరోత్తర ప్రసంగః= పూర్వ పక్షమునకు తరువాత జూపినట్లు సమాధానము చెప్పవలసియుండును.

ముందువ్రాయబోవు శాస్త్రమున నాయాస్థలములందు జూపబడిన సంశయము విషయమున నెవరేని పూర్వపక్ష మొనర్చిన (ఖండించిన) పై సూత్రమున జెప్పినట్లు సమాధానము చెప్పవల యునని సూత్రాభిప్రాయము.

పరీక్షకు అంగమైన సంశయమును ముందుగా పరీక్షించి యనంతరమున ప్రత్యక్షాది ప్రమాణములను పరీక్షింపదలచి సూత్రమును రచించుచున్నాడు.

పూర్వపక్షము :

**'ప్రత్యక్షాదీనా మప్రామాణ్యం త్రైకాల్యాసిద్ధేః" 2.1.8.**

ప్రత్యక్షాదీనామ్ = ప్రత్యక్ష, అనుమాన, ఉపమాన, శబ్దప్రమాణములలో, అప్రామాణ్యం = ప్రమాణత్వము సంభవింపదు. ఎందువలన నన? త్రైకాల్యాసిద్ధేః = ముక్కాలములందును సిద్ధింప కుండుట వలన.

ప్రమాణ్యమనగా ప్రమేయసిద్ధికి హేతుత్వము. ప్రమాణమున నుండు ధర్మమే ప్రామాణ్యమనియు చెప్పనగును. కాబట్టి ధర్మిసిద్ధించి నపుడే ధర్మము సిద్ధింపగలదు. ప్రమాణములు ఆకాశపుష్పమువలె నసంభవములు. అవి ప్రమేయమునకు పూర్వముగానీ, ప్రమేయసమయమునగానీ, ప్రమేయమున కనంతరముగానీ సిద్ధిం పనేరవు. కాబట్టి ప్రామాణ్యమెట్లు సిద్ధింపగలదని సూత్రాభి ప్రాయము.

త్రికాములందెట్లు సిద్ధింపవన :

**"పూర్వంహిప్రమాణసిద్ధౌ నేంద్రియార్థ సన్నికర్షా త్ప్రత్యక్షోత్పత్తిః" 2.1.9.**

హి = ఎందువలన ననగా, పూర్వం = ప్రమేయము సిద్ధించుటకు పూర్వము, ప్రమాణసిద్ధౌ = ప్రత్యక్షాది ప్రమాణములు సిద్ధించినచో, ఇంద్రియార్థ సన్నికర్షాత్ = ఇంద్రియములతో వస్తువులకు సంబంధము కలుగుటవలన, ప్రత్యక్షోత్పత్తిః = ప్రత్యక్ష ప్రమాణ మేర్పడుననుట, న = తప్పుగదా?

ఇట ప్రమాణము జ్ఞానము, ప్రమేయము వస్తువు. వస్తుసిద్ధికి పూర్వమే ప్రమాణము సిద్ధించినచో ప్రమాణముల ద్వారా ప్రమేయములు (వస్తువు) సిద్ధించును కాబట్టి ప్రమాణములకంటె ప్రమేయము పూర్వము అనజెల్లదు. అట్లందుమేని, పూర్వము రచింపబడిన "ఇంద్రియార్థముల సన్నికర్షము వలన కలుగుజ్ఞానము ప్రత్యక్షము (1.1.4)" అను సూత్రమునకు విరుద్ధమగును. సూత్రమునగల అర్థశబ్దమువలన ప్రమేయమే గ్రహింపబడుచున్నదిగదా? ఆ ప్రమేయము ప్రత్యక్షోత్పత్తికి కారణమగుటవలన ప్రత్యక్ష ప్రమాణముకంటె ముందున్నట్లు తెలియుచున్నది. కాబట్టి ప్రమాణము ప్రమేయము కంటె పూర్వమును టెట్లును పొసగదని భావము.

ప్రమాణము పూర్వముకాకున్న తరువాత నందుమేని,

**"పశ్చాత్ సిద్ధౌ న ప్రమాణేభ్యః ప్రమేయసిద్ధిః" 2.1.10.**

పశ్చాత్ = ప్రమేయసిద్ధికి తరువాత, సిద్ధౌ = ప్రమాణము సిద్ధించునేని, ప్రమాణేభ్యః= ప్రమాణముల వలన, ప్రమేయసిద్ధిః= ప్రమేయము సిద్ధించుననుట, న = తగదు

ప్రమాణము వలన ప్రమీయమాణమగు = తెలియనగు వస్తువు ప్రమేయ మనబడుచున్నది. కాబట్టి ప్రమేయసిద్ధికి తరువాత ప్రమాణసిద్ధి యనిన, ప్రమాణము లేనిది ప్రమేయమెట్లు సిద్ధింపగదు? అను ప్రశ్న కలుగును. ఏలయన, ప్రమాణమే లేనిది దేనిచే ప్రమీయమాణమై (తెలియబడి) ప్రమేయమనబడును? వస్తుస్వరూపము ప్రమాణముద్వారా యేర్పడకున్నను, దాని ప్రమేయత్వము మాత్రము ప్రమాణము వలననే కలుగుచున్నది. కాబట్టి ప్రమాణము ప్రమేయముకంటె ముందు సిద్ధించుట తప్పనిసరియని భావము.

దీనింబట్టి ప్రమేయము పూర్వమై, ప్రమాణము తరువాతనేయనిన ప్రమాణములవలన ప్రమేయసిద్ధియనుట విరుద్ధమగును. కాబట్టి ప్రమేయానంతరము ప్రమాణమనుటయు ననుచితమని సూత్రాభిప్రాయము.

పూర్వపరములు విడిచి ప్రమాన ప్రమేయములు రెండును సమకాలీనము లందుమేని,

**"యుగపత్సిద్ధౌ ప్రత్యర్థ నియతత్వాత్ క్రమవృత్తి త్వాభావో బుద్ధీనామ్." 2.1.11.**

యుగపత్సిద్ధౌ = ప్రమాణప్రమేయము లొకే కాలమున సిద్ధించుననిన, బుద్ధీనామ్ = ప్రమాణ జ్ఞానములకు, క్రమవృత్తిత్వాభావ ః = క్రమవృత్తిత్వము – ఒకదాని తదుపరి యొకటి కలుగుట యనునది యుండనేరదు. కారణమేమన, ప్రత్యర్థనియతత్వాత్ = ప్రమేయక్రమమునందు నియమముండుట వలన.

ప్రమాణ ప్రమేయము లొకేసమయమున సిద్ధించునని రూపరస గంధస్పర్శాది ప్రమేయముల జ్ఞానమొకదాని తరువాత నొకటి కలుగునట్టి లోకానుభవమునకు విరుద్ధమగును. కాబట్టి ప్రమాణ ప్రమేయములు రెండునొకేమాటు సిద్ధించుననుటయు తగదని పూర్వపక్షము.

**"త్రైకాల్యాసిద్ధేః ప్రతిషేధానుపపత్తిః "2.1.12.**

త్రైకాల్యాసిద్ధేః = ప్రత్యక్షాది ప్రమాణములు ముక్కాలము లందును సిద్ధింపవనుటవలన ప్రతిషేధానుపపత్తిః = వాది ప్రామాణ్యమును ఖండించుటకే వీలులేదు.

ప్రమాణములే సిద్ధింపవని చెప్పు పూర్వపక్షి యా ప్రమాణముల ప్రామాణ్యమును ఖండింపబూనుట హాస్యాస్పదమని సూత్రాభి ప్రాయము. ప్రామాణ్యము ప్రమాణము ధర్మము ప్రమాణములే (ధర్మి) సిద్ధింపనపుడు ప్రామాణ్యమును ఖండించుటెట్లు? కాబట్టి ప్రత్యక్షాది ప్రమాణములో ప్రమాణ్యములేదనుట తగదని భావము.

ప్రత్యక్షాదిప్రమాణముల ప్రామాణ్య నంగీకరింపకుండుట యననేమి? ఆ ప్రమాణములే లేవనుటయా? లేక ఆ ప్రమాణములో నర్థమును సిద్ధింపజేయుశక్తి లేదనుటయా? శక్తిలేదందుమేని ప్రమాణములున్నవి కాని వానిలో ప్రమేయజ్ఞానము కలిగించు సామర్థ్యములేదని యర్థమగుచున్నది. అట్లుగాక ప్రమాణములే లేవనిన, ప్రమాణములన్నియు లేవా? లేక యేదేని యొక్క ప్రమాణములేదా? తెలుపవలసియుండును. ప్రమాణములన్నియు లేవనుట యిష్టమేని సూత్రమున (1.1.8.) ప్రత్యక్షాది యని విశేష నామముల పేర్కొనుట యనుచితము. కొండొక ప్రమాణము ప్రామాణ్యము నిషేధించుట యిష్టమేని మిగిలిన ప్రమాణము లంగీకరించినట్లగును. ఏదేని యొక

ప్రమాణమంగీకరించినను ప్రమాణములే లేవనుట సముచితముగాదు. కాబట్టి 'ముక్కాలములందును సిద్ధింపనందువలన' అను హేతువు సరియైనది కాదని యీ సూత్రాభిప్రాయము.

ప్రమాణముల ప్రామాణ్యమును ఖండించుట తగదనుటలో మరియొక హేతువు.

**"సర్వప్రమాణ ప్రతిషేధాచ్చ" 2.1.13.**

పై సూత్రమునుండి ప్రతిషేధానుపపత్తిః' అను పద మీ సూత్రమున ననువర్తించును. ఈ సూత్రమునగల చకారమునకు 'కూడ' అని యర్థము.

సర్వప్రమాణప్రతిషేధాచ్చ = ప్రత్యక్షాది ప్రమాణము నన్నింటి ప్రామాణ్య మంగీకరింపనందువలనకూడా (ప్రత్యక్షాది ప్రమాణము ప్రామాణ్య మంగీకరింపదగదను) పై ఖండన సరియైనదికాదు.

ఏ ప్రమాణమువలన ప్రత్యక్షాది ప్రమాణముల ప్రామాణ్య మంగీకరింపదగదని చెప్పబడునో అదియు ప్రత్యక్షాది ప్రమాణములలో నొకటియేగదా! పూర్వసూత్రమున ప్రమాణము నన్నిటిని ఖండించెను. మఱి ప్రామాణ్యమును నిషేధించు ప్రమాణమెద్ది? ప్రమాణమే లేనియెడల ఖండన నంగీకరించుటెట్లు? కాబట్టి పూర్వసూత్రమున జెప్పబడిన ప్రమాణ్యఖండన సరియైనదికాదని సూత్రాభిప్రాయము.

ఏ ప్రమాణబలమున ప్రత్యక్షాది ప్రామాణ్యము నిషేధింపబడు చున్నదో ఆ ప్రమాణము మాత్ర మంగీకరింపబడుననిన,

**"తత్ప్రామాణ్యేవా న సర్వప్రమాణవిప్రతిషేధః" 2.1.14.**

తత్ప్రామాణ్యేవా = ప్రతిషేధక ప్రమాణ ప్రామాణ్య మంగీకరింప బడినచో, సర్వప్రమాణ విప్రతిషేధః = సర్వప్రమాణ ప్రతిషేధము (ఖండన) న = తగదు అని సూత్రార్థము.

ప్రత్యక్షాదిప్రమాణముల ప్రామాణ్యమును ఖండిపనేదేని యొక ప్రమాణమంగీకరింపవలయునుగదా? ఖండన కొఱకు అంగీకరింపబడు ప్రమాణము ప్రత్యక్షాదులలో చేరునా? లేక వానిలో చేరదా? చేరునెడల ప్రత్యక్షాదులన్నియు నప్రమాణములన నొప్పదు. వేరగునెడల, ప్రత్యక్షాదుల ఖండనార్థము వానికంటె భిన్నముగా నొక ప్రమాణ మంగీకరించుచు నన్ని ప్రమాణములు ఖండింపబడినవనుట యంతకంటె హాస్యాస్పదము.

ప్రత్యక్షాదులు ప్రమాణములు కావనుటకు హేతువుగా చెప్పిన

"త్రైకాల్యాసిద్ధేః అను కారణమును సరియైన కారణముకాదని యొక విధముగా ఖండించి ప్రస్తుతము మఱియొక సమాధానము చెప్పబడుచున్నది.

**"త్రైకాల్యాప్రతిషేధశ్చ శబ్దాదాతోద్యసిద్ధివత్**
**తత్సిద్ధేః' 2.1.15.**

త్రైకాల్యాప్రతిషేధశ్చ = ప్రత్యక్షాదులు ముక్కాలములందు సిద్ధింపవనుటయు వీలుపడదు. కారణమేమన? శబ్దాత్ = వెనుక సిద్ధించు శబ్దమువలన, ఆతోద్య సిద్ధివత్ = శబ్దముకంటె పూర్వమే సిద్ధించిన వీణమున్నగు వాద్యములు సిద్ధించునట్లు – తత్సిద్ధేః= తరువాత సిద్ధించుప్రమాణమువలన పూర్వమేసిద్ధించిన ప్రమేయముకూడా సిద్ధించునని సూత్రార్థము.

ప్రమేయముకంటె పూర్వముగానీ తరువాతగానీ సమకాలమున గానీ ప్రమాణములు సిద్ధింపనేరవని చెప్పుటతగదు. ప్రమేయము తరువాత ప్రమాణము సిద్ధించునన్నను దోషము వాటిల్లదు. ప్రమాణవేం లేకున్న ప్రమేయమెట్లుండగలదని గదా! దోషము చెప్పబడినది. చూడుడు; వీణ, తంబుర మున్నగు వాద్యములు ముందుగా సిద్ధపరుపబడును గదా ! అటుపై వీణాదులు వాయించగా శబ్దము లేర్పడును. ఇట్లు తరువాత బుట్టిన శబ్దములను విని వాని ద్వారా వీణ లేక తంబుర వాయింపబడుచున్నది యని తెలిసికొందు ముగదా? దీనిని బట్టి (తరువాత నేర్పడుశబ్దము ప్రమాణముగా అంతకు పూర్వమే మేర్పడియున్న వ్యాదవిశేషముయిన ప్రమేయములు తెలియబడునట్లు) తరువాత నేర్పడు ప్రమాణముల బట్టి పూర్వము సిద్ధించియుండు ప్రమేయములు తెలియబడుననుట దోషముకాదు. కాబట్టి ప్రమాణములు ముక్కాలములందును సిద్ధింపనేరవు (త్రైకాల్యాసిద్ధేః) అనుట సరిగాదు, ప్రత్యక్షాదుల ప్రామాణ్యము ఖండింపబడనేరదు.

'శబ్దమువలన వీణాదులు సిద్ధించునట్లు' అనుటలో శబ్దము ప్రమాణముగా తీసికొనబడినది. కాని యది సరికాదు. కారణమేమన, శబ్దము ప్రమేయముగాని ప్రమాణముగాదు. కాబట్టి పై హేతువు సరిగాదన్నచో,

**"ప్రమేయాచ తులాప్రామాణ్యవత్." 2.1.16.**

తులా = త్రాసు, ప్రమేయాచ = ప్రమేయమయ్యు, ప్రామాణ్యవత్ = నిమిత్తవశమున ప్రమాణమైనట్లు శబ్దము సైతము ప్రమాణము కాగలుగునని సూత్రార్థము.

ప్రపంచమున నేదియు స్వభావవశమున ప్రమాణముగానీ, ప్రమే

యముగానీ కానేరదు. కాబట్టి శబ్దము ప్రమేయమేగాని ప్రమాణము కాదని చెప్పుటెట్లు? గురుత్వగుణము గల సువర్ణాదులభార పరిమాణాదులను తెలిసికొనగోరినపుడు త్రాసు ప్రమాణమగును. ఇట్లు తూచబడిన సువర్ణాదుల ద్వారా మరియొక త్రాసు సరియైనదా కాదాయని యెఱుగ గోరుదుమేని యపుడు సువర్ణము ప్రమాణమును త్రాసు ప్రమేయమునునగును. కాబట్టి సిద్ధికి హేతువు ప్రమాణము అనియు, సిద్ధికి విషయమగునది ప్రమేయమనియు మనమెంచు దుము. దీనింబట్టి యే వస్తువైనను స్వభావవశమున ప్రమాణ ప్రమేయ వ్యవహారమును బొందక నిమిత్తవశమున ప్రమాణమనియో, ప్రమేయమనియో వ్యవహరింపబడునని తెలియుచున్నది.

ఒక వస్తువొకట ప్రమేయమయ్యు మరియొకట ప్రమాణము కావచ్చును. జ్ఞానమునకు విషయమైనచో ప్రమేయము అనబడును. జ్ఞానమునకు సాధనమయినచో ప్రమాణమగును. కాబట్టి సువర్ణ గురుత్వము జ్ఞానవిషయమైనపుడు తుల, (త్రాసు) జ్ఞానసాధనమై ప్రమాణమనబడుచున్నది. త్రాసుసరియగునా? కాదా? యని తెలిసికొననెంచినపుడు జ్ఞానమునకు విషయమై ప్రమేయ మగుచున్నది. అపుడు సువర్ణాదులు ప్రమాణము లగుచున్నవి. అట్లేశబ్దముకూడా జ్ఞానవిషయమైనపుడు ప్రమేయమయ్యు వీణాదుల జ్ఞానమునకు సాధనమైనపుడు ప్రమాణము కాగలదు. కాబట్టి 'శబ్దాదాతోద్య సిద్ధివత్' అనుటలో నెట్టి దోషమునులేదని తెలియుచున్నది. ఇట్లే శాస్త్రమున జెప్పబడు విషయమంతయు తెలియనగును.

ఉదా : ఆత్మ పదార్థము ఉపలబ్ధికి విషయమగుటచే ప్రమేయములందు చెప్పబడినది. అది ఉపలబ్ధి (జ్ఞానమున) యందు స్వతంత్రమగుటచే ప్రమాత యనబడును. బుద్ధిజ్ఞాన సాధనమయి ప్రమాణమనబడును. జ్ఞానవిషయమై ప్రమేయమగును. ప్రమాణమును ప్రమేయమును కానపుడు ప్రమితియనబడును. ఇట్లే కారకశబ్దములు నిమిత్తవశమున నొకేవస్తువున నన్నియు వర్తించుట మనమెఱుగుదుము. వృక్షమున్నదియనుటలో స్వస్థితిలో స్వతంత్రమ గుటచే వృక్షము కర్తయనబడును. వృక్షమును చూచుచున్నా డనుటలో నదియే కర్మ. వృక్షముతో (ద్వారా) చంద్రుని చూపుచున్నాడనుటలో కరణము. వృక్షముకొఱకు నీరుపోయుచున్నాడనుటలో సంప్రదానము. వృక్షమునుండి ఆకురాలుచున్న దనుటలో అపాదానము. వృక్షమున పక్షులున్నవనుటలో నదియే యధికరణము అగుచున్నది. దీనింబట్టి

ద్రవ్యమైనంతమాత్రమునగానీ, క్రియయైన మాత్రమున గానీ అది కారకమన వీలుపడదు. కాని, క్రియావిశేషమో, క్రియాసాధనమోయై కారకమనబడుచున్నది. ఇట్లే ప్రమాణ ప్రమేయ శబ్దములును కారకములే యగుటచే ప్రత్యక్షాది ప్రమాణములును జ్ఞాన సాధనములయి ప్రమాణములును, జ్ఞానవిషయములయి ప్రమేయములు ననబడును. అని వివేకము.

పూర్వపక్షము :-

ఈ ప్రత్యక్షాది ప్రమాణము మరియొక ప్రమాణము వలన సిద్ధించుచున్నవా లేక ప్రమాణము లేకయే సిద్ధించుచున్నవా? ఇట్లు ప్రశ్నించుటలో నుద్దేశమేమన?

**"ప్రమాణతః సిద్ధేః (ప్రమాణానాం) ప్రమాణాంతర సిద్ధి ప్రసంగః" 2.1.17.**

ప్రమాణానాం = ప్రత్యక్షాది ప్రమాణములు, ప్రమాణతః= వేరొక ప్రమాణమువలన, సిద్ధేః సిద్ధించునెడల, ప్రమాణాంతర సిద్ధిప్రసంగః= ప్రత్యక్షాది నాలుగు ప్రమాణములకంటె వేరుగా మరియొక ప్రమాణ మంగీకరింపవలసి వచ్చునని సూత్రార్థము.

ప్రత్యక్షాది ప్రమాణములే ప్రమాణమువలన సిద్ధించుచున్నవో యా ప్రమాణము ప్రత్యక్షాదులకంటె వేరగునెడల ఆ ప్రమాణము దేనివలన సిద్ధించునో యదియునొక ప్రమాణమగును. దానిని సిద్ధింప వేరొకటియు నంగీకరింపవలసివచ్చును.

ఇట్లు ప్రమాణముల సంఖ్య మేరయే లేని స్థితియేర్పడును. ఈ స్థితిని శాస్త్రమున 'అనవస్థ' దోషమందురు. 'ప్రత్యక్షానుమానోప మానశబ్దాః ప్రమాణాని' (1.1.3) యని పూర్వము చెప్పబడిన సూత్రమునగల ప్రమాణసంఖ్యకును విరుద్ధమగును. కాబట్టి ప్రత్యక్షాది ప్రమాణములు ప్రమాణాంతరమువలన గాక స్వయముగానే సిద్ధింపగల వందుమేని,

**"తద్వినివృత్తేర్వా ప్రమాణసిద్ధివత్ ప్రమేయసిద్ధిః" 2.1.18.**

వా = లేక, తద్వినివృత్తేః = ప్రమాణాంతరము వలన గాక ప్రత్యక్షాది చతుర్విధ ప్రమాణములు తమంతతామే సిద్ధించునెడల, ప్రమాణ సిద్ధివత్ = ప్రమాణములు సిద్ధించినట్లు, ప్రమేయసిద్ధిః = ప్రమేయములును సిద్ధించును.

ప్రత్యక్షాది ప్రమాణము తమకంటె భిన్నమగు ప్రమాణము నపేక్షింపకయే సిద్ధించు పక్షమున ప్రమేయములు మాత్రము స్వయముగా నేల సిద్ధింపవు ! వాని సిద్ధి కొఱకు ప్రత్యక్షాది ప్రమాణముల నంగీకరింపనేల? అక్కఱ

లేదందుచేని ప్రత్యక్షాది ప్రమాణములే లోపించును. వేరుగా ప్రమాణమంగీకరింతుమేని యనవస్థాదోషము వాటిల్లునని పై సూత్రముల యభిప్రాయము.

ఉత్తర పక్షము:-

**"న ప్రదీప ప్రకాశవత్ తత్సిద్ధేః" 2.1.19.**

న = పై జెప్పినది సరికాదు. ప్రదీప ప్రకాశవత్ = ఒకదీపపు కాంతి మరియొక దీపసహాయ మమేక్షింపకయే సిద్ధించునట్లు, తత్సిద్ధేః= ప్రత్యక్షాది ప్రమాణములు వేరొకప్రమాణము నపేక్షింపకమే సిద్ధించును.

దీపపుకాంతి ఇతర వస్తువులను ప్రకాశింపజేయును. మఱియు తన్ను తానే ప్రకాశింపజేసికొనును. ఆ దీపకాంతిని తెలుపుటకు మఱియొక దీప మపేక్షింపబడదు. అట్లే ప్రత్యక్షాది ప్రమాణములును ప్రమేయముల జ్ఞానము కలిగించుచు తమ జ్ఞానమును తామే కలిగింపగలవు. కాబట్టి భిన్న ప్రమాణ మంగీకరింపవలసిన యవసరముండదు. అందువలన ననవస్థయు వాటిల్లదు. ప్రత్యక్షాది ప్రమాణములు నాలుగే యను సూత్రము విరుద్ధము కాదు.

పూర్వ పక్షము :

ప్రత్యక్షాది ప్రమాణములు ప్రమేయ సాధనములని సామాన్యముగా పరీక్షించి విశేషముగ పరీక్షించుచున్నాడు.

**"ప్రత్యక్ష లక్షణా నుపపత్తి రసమగ్ర వచనాత్" 2.1.20.**

ప్రత్యక్ష క్షణానుపపత్తిః = " ఇంద్రియార్థ పన్నికర్షోత్పన్నం.....

ప్రత్యక్షమ్ 1.1.4." అని పూర్వము చెప్పిన ప్రత్యక్ష ప్రమాణ లక్షణము సరికాదు. కారణమేమన? అసమగ్ర వచనాత్ = లక్షణము పూర్ణముగ చెప్పకుండుట వలన.

ఇంద్రియములకు వస్తువుతో సంయోగాది సంబంధము కలిగినపుడేర్పడు జ్ఞానము ప్రత్యక్షమని పూర్వము చెప్పిన లక్షణము సంపూర్ణము కాకుండుటవలన సరికాదని సూత్రార్థము.

ఇంద్రియార్థము సన్నికర్షమువలననే జ్ఞానము కలుగనేరదు. దానితో బాటు ఆత్మ మనస్సు సన్నికర్షము సైతమవసరము. అట్టి యాత్మ మనః సన్నికర్షము ప్రత్యక్ష లక్షణ సూత్రమున జెప్పియుండ లేదు. కాబట్టి యా లక్షణము సమగ్రము కాదు.

ఆత్మ మనః సన్నికర్షము ప్రత్యక్షమునకెట్లు కారణమన,

**"నాత్మ మనసోః సన్నికర్షాభావే ప్రత్యక్షోత్పత్తిః" 2.1.21.**

ఆత్మమనసోః = ఆత్మమనస్సులకును, సన్నికర్షాభావే = వానితో ఘ్రాణాదీంద్రియముకును సంబంధము కలుగనపుడు, ప్రత్యక్షోత్పత్తిః న= ప్రత్యక్షము కలుగదు.

ఇంద్రియార్థ సన్నికర్షము లేనపుడు ప్రత్యక్షము కలుగనట్లు ఆత్మ మనః సన్నికర్షము లేక ప్రత్యక్షము కలుగదు. కాబట్టి ఆత్మ మనః సన్నికర్షము కూడ ప్రత్యక్ష కారణమే. ఏది లేకున్న నేదికలుగక, యేదియున్న నేదికలుగునో అది దానికి కారణమనుట నియమమే కదా! ప్రత్యక్షము కలుగ వలయునన్న ఇంద్రియముతో వస్తు సన్నికర్షమేగాక ఆత్మ మనః సన్నికర్షము నుండవలయును. కాబట్టి ప్రత్యక్ష లక్షణమున నదియు చేర్పవలయునని సూత్రాభిప్రాయము.

**"దిగ్దేశ కాలాకాశేష్వప్యేవం ప్రసంగః" 2.1.22.**

ఏవమ్ = ఇట్లే, దిగ్దేశకాలాకాశేష్వపి = దిక్కు, దేశము, కాలము, ఆకాశము వీనికిని, ప్రసంగంః = ప్రత్యక్షజ్ఞాన కారణత్వమున్నది.

ఆత్మమనస్సన్నికర్షము ప్రత్యక్షమునకు కారణమైనట్లు దిగ్దేశకాలాకాశములు సైతము ప్రత్యక్షమునకు కారణములగును. ప్రత్యక్ష లక్షణమున వాని కారణత్వము జెప్పకుండుటయు కొఱతయే యగునని యీ సూత్రాభిప్రాయము.

ఉత్తరపక్షము : –

దిగాదులు కారణమేల కావనుశంకను తొలగించుచు ఆత్మమనః సన్నికర్షము కార్యమే కాగలదని వ్యవస్థ చేయుచున్నాడు.

**"జ్ఞానలింగత్వా దాత్మనో నానవరోధః" 2.1.23.**

ఆత్మనః = ఆత్మ, జ్ఞానలింగత్వాత్ః జ్ఞానమను గుణము లింగముగా కలదగుటవలన, అనవరోధః = కారణముగా సంగ్రహింపకుండుట, న = కలుగనేరదు.

"ఇచ్ఛాద్వేష... జ్ఞానాన్యాత్మనోలింగమ్. 1.1.10". అను సూత్రమున జ్ఞానము ఆత్మకు లింగముగా వర్ణింపబడినది. ఆజ్ఞాన మాత్మమనః సన్నికర్షము లేనిదే కలుగనేరదు. సన్నికర్షమువలన కలుగుజ్ఞానము అది లేకున్న కలుగదు. ప్రత్యక్షాది జ్ఞానమాత్మగుణమై సన్నికర్షము వలననే జనించునది కాబట్టి దానికి సన్నికర్షము కారణమని వేరుగా చెప్పవలసిన యవసరముండదు. ఇట్లు జ్ఞానము దిగాదులకు లింగము కాదు. దిగాదులున్న జ్ఞానము కలిగి యవి లేకున్న నది కలుగదను నియమమును లేదు. కాబట్టి ఆత్మ మనః సన్నికర్షము జ్ఞానమునకు

కారణమైనట్లు దిగాదులయునికి కారణము కానేరదని సూత్రాభిప్రాయము.

అట్లయిన ప్రత్యక్ష లక్షణసూత్రమున ఆత్మమనః సన్నికర్షమును కారణముగా చెప్పక ఇంద్రియార్థ సన్నికర్షము నేలచెప్పిరనగా:

**"తదయౌగపద్యలింగత్వాచ్చ మనసః" 2.1.24.**

ఈ సూత్రమున పై సూత్రమునుండి 'నానవరోధః' అనుపదము అనువర్తించును.

మనసః = మనస్సు, తదయౌగపద్యలింగత్వాచ్చ = ఒకేసారి యనేక విషయములకు సంబంధించిన జ్ఞానము కలుగకుండుటయే లింగముగా కలదగుటవలన, అనవరోధః న = మనః సన్నికర్షమును కారణముగా సంగ్రహింపకుండుట కలుగనేరదు. సంగ్రహింపబడి నట్లెంచవలయును.

యుగపత్ జ్ఞానానుత్పత్తి మనస్సునకు లక్షణముగా (సూ. 1.1.16) పూర్వము వర్ణింపబడినది. జ్ఞానోత్పత్తికి ప్రయోజకమగు మనఃసన్నికర్షము నంగీకరింపకున్న జ్ఞానమే కలుగనేరదు. కాబట్టి సూత్రమున నుల్లేఖింపకున్నను సంగ్రహింపవలసినదేయని సూత్రాభిప్రాయము.

ఉత్తర పక్షము : -

**"ప్రత్యక్ష నిమిత్తత్వా చ్చేంద్రియార్థయోః సన్ని**
**కర్షస్య స్వ శబ్దేన వచనమ్" 2.1.25.**

ఇంద్రియార్థయోః సన్నికర్షస్య = ఇంద్రియార్థముల సన్నికర్షము, ప్రత్యక్షనిమిత్తత్వాచ్చ = ప్రత్యక్షజ్ఞానమునకే కారణమగుట వలన, స్వశబ్దేన వచనమ్ = ఇంద్రియార్థ సన్నికర్షమనెడి పదమున సూత్రమున నుల్లేఖించి ప్రత్యక్ష ప్రమాణ కారణముగా జెప్పబడినదని సూత్రార్థము.

ఇంద్రియార్థ సన్నికర్షము ప్రత్యక్ష ప్రమాణమునకు మాత్రమే కారణము. ఆత్మ మనః సన్నికర్షము ప్రమాణముల కన్నింటికి కారణము. కాబట్టి యాత్మతో మనః సన్నికర్షము ప్రత్యక్షా నుమానోపమాన శబ్దప్రమాణముకు నన్నిటికి సాధారణ కారణము ఇంద్రియార్థ సన్నికర్షము ప్రత్యక్ష ప్రమాణమున కసాధారణ కారణము. లక్షణమనగా నసాధారణ కారణ మగుటవలన ప్రత్యక్ష లక్షణమున నింద్రియార్థ సన్నికర్షమే చేర్చబడినదని సూత్రాభిప్రాయము.

**"సుప్త వ్యాసక్త మనసాంచ సన్నికర్ష నిమిత్తత్వాత్" 2.1.26.**

చ = మఱియు, సుప్తవ్యాసక్త మనసామ్ = గాఢనిద్ర యందో, ఇతర విషయమునందో లగ్నమైయున్న మనస్సుగలవారికి, సన్నికర్ష నిమిత్తత్వాత్ =

తీవ్రమైన ధ్వని స్పర్శముల సన్నికర్షము వలన గలుగు శ్రావణ స్పర్శ ప్రత్యక్షములకు ఇంద్రియార్థ సన్నికర్షమే కారణమగుట వలన నది స్వశబ్దముచే సూత్రమున పేర్కొనబడినది.

గాఢనిద్రాగతుడైన వ్యక్తియేమియు నెరుగజాలడు. ఒకానొక విషయమున లగ్నమైయున్న మనస్సుగలవాడును తదితర విషయముల నెఱుగజాలడు. ఇట్లు సుప్తమో, కొండొక విషయమున వ్యాసక్తమో అగు మనస్సుగల వ్యక్తి తీవ్రమగు స్పర్శమువలనగానీ, తీవ్రమైన శబ్దమొనరించినగానీ, ప్రత్యక్షము ననుభవింపగలుగు చున్నాడు. అట్టియెడ ఆత్మమనః సన్నికర్షము కారణము కాజాలదు. సుషుప్తియందున్న వ్యక్తికి అకస్మాత్తుగా బాహ్యస్పర్శ జ్ఞానము కలుగునపుడు ఇంద్రియార్థ సన్నికర్షమేగాని, ఆత్మప్రేరణ వలన మనస్సు ప్రేరేపింపబడి యింద్రియముతో సన్నికృష్టమగుట లేదుగదా! కాబట్టి యింద్రియార్థసన్నికర్షమే ప్రత్యక్ష లక్షణమున గ్రహింపబడినది.

**"తైశ్చాపదేశో జ్ఞానవిశేషాణామ్." 2.1.27.**

చ = మఱియు, జ్ఞానవిశేషాణామ్ = గంధాది విషయములకు సంబంధించిన జ్ఞానములు, తైః = ఆయా ఇంద్రియార్థములద్వారా, అపదేశః చెప్పబడును. (కాబట్టి యింద్రియార్థ సన్నికర్షము సూత్రమున గ్రహింపబడినది.)

రూప రస గంధాదులకు సంబంధించిన ప్రత్యక్ష జ్ఞానము లింద్రియముల ద్వారమున నర్థముల ద్వారమునను చెప్పబడును.

ఉదా: కంటితో చూచుచున్నాడు. జిహ్వతో రుచి చూచు చున్నాడు. నాసికతో నాఘ్రాణించుచున్నాడు. శ్రవణముతో వినుచున్నాడు. త్వగింద్రియముతో స్పర్శము నెఱుగుచున్నాడు. ఇట్లే రూపజ్ఞానము, రసజ్ఞానము, గంధ జ్ఞానము, శబ్దజ్ఞానము, స్పర్శజ్ఞానమును. ఈ వ్యవహారమున నింద్రియములు నర్థము ప్రధానముగ గ్రహింపబడుట లోక విదితము. కాబట్టి ప్రత్యక్ష లక్షణమున నింద్రియార్థ సన్నికర్షము ప్రధానముగ గ్రహింపబడెనని సూత్రాభిప్రాయము.

పూర్వపక్షము : -

పై సూత్రముల వర్ణించిన సమాధానమును దృఢపరుపనెంచి మరల శంకించుచున్నాడు.

**"వ్యాహతత్వా దహేతుః" 2.1.28.**

ఇంద్రియార్థసన్నికర్షము, వ్యాహతత్వాత్ = ఆత్మమనఃసన్ని కర్షము లేనియెడల శక్తిలేనిదగుట వలన, అహేతుః = హేతువు - ప్రత్యక్ష జ్ఞానకారణము

కాజాలదని యర్థము.

ఇంద్రియార్థ సన్నికర్షము తనలోగల జ్ఞానజనకశక్తి వ్యాహతము కాకున్నంతవరకు జ్ఞానము జనింపజేయ గలుగును. ఆత్మమనః సన్నికర్షము లేనపుడాశక్తి వ్యాహతమగుచు జ్ఞానము జనింపదు. ఇందు కుదాహరణము : మనస్సు సావధానముగా లేనపుడు ఇంద్రియార్థములు సన్ని కృష్టములై యుండినను జ్ఞానము కలుగకుండుటయే. కాబట్టి యింద్రియార్థసన్నికర్షము మాత్రము ప్రత్యక్ష జ్ఞానకారణము కాక ఆత్మమనః సన్నికర్షము గూడ కారణము అని తెలియుచున్నది. స్పష్టముగా జెప్పదచిన ఆత్మ మనఃసన్నికర్షము, ఇంద్రియము మనః సన్నికర్షము, ఇంద్రియార్థ సన్నికర్షము నను మూడును ప్రత్యక్ష జ్ఞానకారణ మనవలయును. ఇట్లు చెప్పకుండుట వలన ప్రత్యక్ష లక్షణ మసమగ్రమని భావము.

ఉత్తర పక్షము : -

**"నార్థ విశేష ప్రాబల్యాత్" 2.1.29.**

అర్థవిశేష ప్రాబల్యాత్ = ఇంద్రియార్థ సన్నికర్షము ప్రత్యక్ష జ్ఞానమునకు ప్రాధాన్యమగుటవలన నదియే కారణముగా చెప్పబడినది. కాబట్టి న = ఆ హేతువు వ్యాహతము కాదు.

ఇంద్రియార్థ సన్నికర్షమును ప్రత్యక్ష జ్ఞాన లక్షణముగా జెప్పుటలో ఆత్మమనః సన్నికర్షమును జ్ఞానకారణముగా నంగీకరింపకుండుట యుద్దేశము కాదు. ఆత్మమనః సన్నికర్షముల జ్ఞానముల కన్నింటికు సాధారణ కారణము; ఇంద్రియార్థ సన్నికర్షము అసాధారణ కారణము. అసాధారణ కారణము లక్షణముగా నంగీకరింప వలయును. కాబట్టి ప్రత్యక్ష లక్షణమున నింద్రియార్థ సన్నికర్షమే గ్రహింపబడినది. అందువలన నేదోషము లేదని సూత్రా భిప్రాయము.

ఇట్లు ప్రత్యక్ష లక్షణమును జెప్పి యాప్రత్యక్షము అనుమానమేల కాదని శంకించుచున్నాడు.

పూర్వ పక్షము : -

**"ప్రత్యక్ష మనుమానమేకదేశ గ్రహణా దుపలబ్ధేః" 2.1.30.**

ప్రత్యక్షం = ప్రత్యక్ష ప్రమాణము, అనుమానమ్ = అనుమానప్రమాణమే, కారణమేమన, ఏకదేశగ్రహణాత్ = ఇంద్రియముద్వారా పదార్థములో కొంతభాగమే గ్రహింపబడినందువలన, ఉపలబ్ధేః = పదార్థమంతయు గ్రహింపబడుచున్నది.

ఇంద్రియార్థ సన్నికర్షమువలన ప్రత్యక్షముగలుగు నని చెప్పబడినది. కాని, ఇంద్రియార్థ సన్నికర్షమువలన పదార్థమంతయు మొదట గ్రహింపబడక యెదుటనున్న భాగము మాత్రమే గ్రహింపబడును. అటుపై పదార్థమంతయు కనబడును ఒకడొక చెట్టును చూచుచున్నాడనుకొనుడు, అపుడు ప్రథమమున నతని కాచెట్టులో కొంత (ఎదుటనున్న) భాగము కనబడును. అది చూచి తరువాత చెట్టును పూర్ణముగా నెఱుగును. కాబట్టి యీ ప్రకారము అనుమానమువలె నున్నది. అనుమానమునను ముందు ఇంద్రియార్థ సన్నికర్షముచే వహ్నిలో నేకదేశమగు ధూమము తెలియబడును. అటుపై ధూమముద్వారా వహ్ని తెలియబడును. అనుమానమున నెట్లు ఇంద్రియముచే ధూమమును జూచి యటుపై వహ్ని నెరుగుచున్నామో అట్లే ప్రత్యక్షమునను ముందు ఇంద్రియముచే వస్తువున నొకభాగమును జూచి యటుపై వస్తువును పూర్ణముగా నెరుగుచున్నాము. కాబట్టి ప్రత్యక్షమునకును. అనుమానమునకును నెట్టి భేదము లేదు. కాగా ప్రత్యక్ష మనుమానమే యని భావము.

నైయాయికులు అవయవముల ద్వారా అవయవియను నొక పదార్థము అవయవములకంటె భిన్నముగా నేర్పడునని యంగీకరింతురు. ఇట ప్రత్యక్ష మనుమానమేయను పూర్వపక్షి అవయవి యను పదార్థమెుండు అవయవములకంటె వేరుగా నుండునని యంగీకరింపడు. అతని దృష్టిలో వాస్తవమున అవయవములు తప్ప అవయవి లేదు. ఆ యవయవములును గంధ రస రూప స్పర్శ పరమాణువులు. అయ్యవి అతీంద్రియము లయ్యు నొకదానితో నొకటి చేరి ప్రత్యక్షములగును. కాబట్టి యతని మతమున నెదుటి యవ యవములు ఇంద్రియముతో సన్నికృష్టములై గ్రహింపబడియటుపై మొత్తమవయవముల విషయమున నేర్పడు జ్ఞానము అనుమానమగునని యభిప్రాయము.

ఉత్తర పక్షము : –

**"న ప్రత్యక్షేణ యావత్ తావదప్యుపలంభాత్" 2.1.31.**

న= ప్రత్యక్ష మనుమానము కాదు కారణమేమన, ప్రత్యక్షేణ = ప్రత్యక్ష ప్రమాణముద్వారా, యావత్తావదపి = (ఎంతో యొకం తైనను). పదార్థమున నొక కొంతయైనను, ఉపలంభాత్ = గ్రహింపబడు చున్నదని యంగీకరించుచుండుట వలన.

ప్రత్యక్ష మనుమానమే యని చెప్పు వ్యక్తి యేకదేశ గ్రహణమని దేని

నంగీకరించుచున్నాడో ఆ యేకదేశ గ్రహణము ప్రత్యక్షమా? కాదా? ప్రత్యక్షమగునెడల ప్రత్యక్ష మనుమానమే యనుటలో నర్థమేమి? ప్రతిజ్ఞావ్యాఘాతమే గదా! ఆ మొదట గ్రహింపబడునది ప్రత్యక్షమున గాకున్న మఱియే ప్రమాణముననో చెప్పవలసి యుండును. అనుమాన మనుటకు వీలులేదు. ఇంద్రియార్థ సన్నికర్షమువలన తెలియబడునది యనుమాన మెట్లగును? కాబట్టి ప్రత్యక్ష మనుమానమనుట తగదు. ప్రత్యక్షానుమానములోగల భేదము నెవ్వరు తొలగింపజాలరు.

పూర్వపక్ష సూత్రమున కనబఱచిన అవయవ అవయవి విషయమును ముందురాబోవు సూత్రములందు సూత్రకారుడు స్వయముగా చర్చించును.

**"న చైకదేశోపలబ్ధి రవయవి సద్భావాత్." 2.1.32.**

ఏకదేశోపబ్ధిశ్చ = ఇంద్రియ సన్నికర్షము వలన నేక దేశోపలబ్ధి కలుగుననుటయు, న = సరిగాదు. కారణమేమన? అవయవి సద్భావత్ = ఏకదేశముతోబాటు అవయవియు నుండుట వలన.

వస్తువున నేయేకదేశము (భాగము) తో నింద్రియ సన్నికర్షము కలుగునో యాభాగమున నవయవి లేకున్న నా యింద్రియార్థ సన్నికర్షముచే నదిగ్రహింపబడకుండును. ఏక దేశము (భాగము) మాత్రమే గ్రహింపబడును. కాని యట్లు గాక యవయవియు నటతప్పక గ్రహింపబడును. ఏకదేశము, అవయవము, భాగముననను పదములు పర్యాయములు. అవయవములకు, నవయవికి గల సంబంధము నిత్యము (సమవాయము). కాబట్టి యే యవయవములతో (ఏకదేశముతో) నింద్రియము సంబద్ధ మగుచున్నదో యాయవయవములతో నిత్యసంబంధముగల యవయవితో మాత్రమింద్రియమేల సంబద్ధముగాదు? ఇంద్రియసన్నికర్షమేర్పడిన నవయవి గ్రహింపబడక యవయవము (ఏకదేశమే) మాత్రమేల గ్రహింపబడును? కాబట్టి యేక దేశముతో బాటు అవయవియు తప్పక గ్రహింపబడును. ఏకదేశము మాత్రము గ్రహింపబడు ననుట సాహసము.

అవయవి నంగీకరింపని వారి నిట్లు ప్రశ్నింపవలయును. ఏకదేశమననేమి? (ఏకశ్చ అసౌదేశః) ఒక దేశమనికదా యర్థము. దేశమన్న ఆధారమన్నను ఒక్కటియే. అట్లయిన ఆధారము దేనికి? ఆధేయము లేని ఆధారమున కర్థమేమి? ఏక దేశము నంగీకరించుచు ఏకదేశి (అవయవి) నంగీకరింపకుండుటకు వీలేమి? దేశమన్న భాగమందువేని, దేనికది భాగము

! అవయవములకా? అవయవికా? అవయవములకనుటయుక్తము కాదు ఏలయన: అవయవములు పరమాణువులే కదా! అవి నిరవయములు - నిర్భాగములు. కాబట్టి వానికి భాగమను టెట్లు కుదురును? కుదురదని భావము. అవయువికి భాగమందువా? అవయవి నంగీకరింపవలసి వచ్చును. అవయవములలో వానికంటె భిన్నముగా అవయవి యొకటి లేదనుట తగదు. అట్లుగాక, ఇంద్రియసన్నికృష్టములగు నెదుటిభాగములచేత పరభాగముల ననుమానింతుమందువేని, పూర్వపర భాగములకు సంబంధము (వహ్ని ధూమములకువలె) ప్రత్యక్షముగా గ్రహింపబడినదా? లేదా? గ్రహింపబడిన పక్షమున పూర్వపర భాగములు రెండును ప్రత్యక్షములయి ప్రత్యక్షము సిద్ధించును. ప్రత్యక్ష మనుమానమనుటెట్లు పొసగును? ప్రత్యక్షముగా వాని సంబంధము గ్రహింపబడని పక్షమున పూర్వ భాగముచే పరభాగ మనుమానింతుమనుట పొసగదు. సంబంధము గ్రహింపబడని రెండు పదార్థములలో నొకదానిచే మరియొకటి యనుమానించుట సంభవము కాదు. కాబట్టి యవయవ వ్యతిరిక్తముగా నవయవి యొకటి యంగీకరింపక తప్పదు. అవయవి యంగీకరింపబడుటచే నేకదేశోపలబ్ధి యనియు, ప్రత్యక్ష మనుమానమే యనియుననుట యెవ్విధ మునను పొసగదని సూత్రాభిప్రాయము.

పూర్వ పక్షము : -

పూర్వ సూత్రమున జెప్పబడిన 'అవయవి సద్భావాత్ అను హేతువు నంగీకరింపక శంకించుచున్నాడు.

**"సాధ్యత్వా దవయవిని సందేహః" 2.1.33.**

అవయవిని = అవయవియందు, సందేహః= సంశయమున్నది. కారణమేమన, సాధ్యత్వాత్ = అవయవముకంటె వేరుగా నవయవి యొకటి కలదని సాధింపవలసి యుండుట వలన

అవయవి సిద్ధమైనపుడు (ఉభయులు నంగీకరించిన మీదట) 'అవయవి సద్భావాత్' అవయవి యుండుట వలన నను హేతువు ప్రయోగింపవీలగును. అవయవి యొకటి కల దందువేని, యది యవయవము లందున్నదై ప్రతి అవయవమునను సంపూర్ణముగా నుండునా? లేక ఏకదేశముగా నుండునా? ఒకయవయవమున సంపూర్ణముగా నుండునన్న మిగిలిన యవయవములు వ్యర్థములగును. మఱియు అవయవి ప్రత్యక్షమే యనుచున్నావు కాబట్టి, ఒక్కయవయవమున సంపూర్ణముగాగల యవయవి ప్రత్యక్షము కావలయునన్న

వస్తుప్రత్యక్షమునకు కారణములగు మహత్త్వానేకద్రవ్యత్వములునటనుండ వలయునుకదా? అదియెట్లు పొసగును? ఇంతియకాక ప్రత్యవయవమునకు అవయవి సంపూర్ణముగా నున్న శృంగమున స్తనకార్యము సంపన్నముగా వలసియుండును. అదియెటను కానరాదు. కాబట్టి ప్రత్యవయవ మునను అవయవి సంపూర్ణముగా నుండునన వీలుపడదు. కనుక ఏకదేశముగా - అసంపూర్ణముగ నుండునన్న నదియు పొసగదు. అవయవి కాధారమగు నవయవములకు మించి దానికి గల యేకదేశములేమి? అందువలన 'అవయవి సద్భావాత్' అను హేతువు సందిగ్ధమై సిద్ధాంతపక్షమును సాధింపజాలదని సూత్రాభిప్రాయము.

ఉత్తరపక్షము : -

**"సర్వాగ్రహణ మవయవ్యసిద్ధేః 2.1.34.**

అవయవ్యసిద్ధేః= అవయవములకంటె భిన్నముగా అవయవిలేని యెడల, సర్వాగ్రహణమ్ = ద్రవ్యాది పదార్థములన్నియు ప్రత్యక్షము కాకుండుట సంభవించును.

ద్రవ్యగుణకర్మాది పదార్థములన్నియు నింద్రియములచే గ్రహింపబడుచున్నవి కదా! లోకమున నెల్లరచే, 'ఇది జలము' ' ఇది భూమి' 'ఇది యగ్ని' యని ద్రవ్యములు' 'ఇది నలుపు' 'ఇది తెలుపు' 'ఇది పరిమాణము' నని గుణములు' 'తినుచున్నాడు' 'వండుచున్నాడు ' 'నడుచుచున్నాడ'ని క్రియలు గ్రహింపబడుచుండుట నిర్వివాదము. అవయవములకంటె వేరుగా నవయవియే లేక యవయవ సముదాయములే ద్రవ్యాదులగునెడల నవయమము లతీంద్రియము లయినందువలన ద్రవ్యాదులు మనచే నెన్నడు గ్రహింపబడకుండవలయును. కాబట్టి, యవయవి నంగీకరింపని పక్షమున సర్వము గ్రహింపబడకుండవలసిన స్థితి యేర్పడును.

అవయవి విషయమున నది యవయవములో నేక దేశముగ నుండునా? సంపూర్ణముగా నుండునా? యని ప్రశ్నించుటయు తగదు. కారణమేమన' ఏకదేశ మనునది యనేకములో నొకదానికి పేరు. అనేకావయవములో కొన్నింటినో యొకదానినో యేకదేశమని వ్యవహరించుట యుచితము. అవయవి యొక్కటే కాబట్టి యం దేకదేశమనియు సంపూర్ణమనియు వ్యవహారము పొసగదు. అట్లయిన, ననేకావయవములలో నొక యవయవి యెట్లున్నది' అందువా: ఆశ్రయాశ్రిత భావమున -సమవాయమున నందుము. ఆశ్రయాశ్రితములన

నే మందువా? ఏవి దేనికంటె భిన్నముగా నుండజాలవో (స్వయముగా సిద్ధింపవో) యవి యాశ్రయములు – అవయవములు, అది యాశ్రితము అనగా అవయవి. అవయవములను విడిచి యవయవి యుండనేదరు. ఇదియు యాశ్రయాశ్రితభావము = సమవాయము. ఇట్లు సమస్తావయవాశ్రితమగు నవయవి నంగీకరించినందువలన నెట్టిదోషము నుండజాలదు.

అవయవములకంటె వేరుగా నవయవి యొకటి కలదని తెలిసికొను టెట్లన:

**"ధారణాకర్షణోపపత్తేః" 2.1.35.**

ధారణాకర్షణోపపత్తేః = ధారణ ఆకర్షణవలన నవయవి తెలియబడును.

అవయవికి సంబంధించిన ఏక దేశమును గ్రహించినపుడు వయవియు గ్రహింపబడును. ఒక పదార్థములో నొకభాగమును పట్టుకొననపుడాభాగము (ఏకదేశము) తో బాటు ఆ పదార్థమంతయు పట్టుకొనబడును. అపుడాయవయవి (పదార్థము) మఱియొక స్థానమునకు పోజాలదు. ఈ స్థితియే ధారణమనబడును. అవ యవిలో నొకభాగమును పట్టుకొనినపుడు దానితోపాటు అవయవియు పట్టుకొనబడి మఱియొక స్థానమునకు చేర్పబడుట ఆకర్షణమనబడును. అవయవియే లేని పక్షమున నీ ధారణాకర్షణ ములు సంగతములుకావు. కాబట్టి ధారణాకర్షణముల సంగతియే అవయవయముల కంటె అవయవి భిన్నముగా నున్నదని తెలుపుచున్నది.

ఆశంకాపూర్వక సమాధానము : –

**"సేనావనవద్గ్రహణమితిచే న్నాతీంద్రియత్వా దణూ నామ్"**

**2.1.36.**

సేనావనవత్ = (మనుష్యులు, వృక్షములు ననువానికంటె భిన్నములు గాని) సేనావనములవలె, గ్రహణమ్ = అవయవములకంటె భిన్నము కాని ఘటపటాది వస్తువులు గ్రహింపబడును. ఇతిచేత్ = అందువేని, న = అట్లు కాజాలదు. (కారణమేమన) అణూనామ్ = అవయవము లనబడు పరమాణువులు, అతీంద్రియత్వాత్ = ఇంద్రియములచే గ్రహింపబడని స్వభావము కలవగుట వలన.

వృక్షములుగానీ, మనుష్యులుగానీ యతీంద్రియములు – ఇంద్రియములచే గ్రహింపబడనివికావు అవి వేరుగా గ్రహింపబడన ప్పుడు వనమనియు, సేనయనియు నందుము. మనము వస్తువులలో నేకదేశమనియు, నవయవములనియు వేనిననుచున్నామో యవిపరమాణువులేకదా! అవి వృక్ష

మనుష్యులవలె కాక యతీంద్రియములు. కాబట్టి యింద్రియములచే గ్రహింపబడవు. అట్టియెడ వాని సముదాయములలో ఘటపటాది బుద్ధియెట్లు కలుగును? అవయవము లతీంద్రియము లయినప్పుడు వాని సముదాయ మింద్రియ గోచరమనుట పొసగదుకదా? మఱియు ఘటపటాదులను చూచినపుడు 'ఇది యొక ఘటము' 'ఇదియొక పటము' నని బుద్ధికలుగును. అట్టియెడ, అవయవములకంటె వేరుగా నవయవి యొకటి యంగీకరింపకున్న 'ఒకఘటము, ఒకపటము' నను జ్ఞానములో ఒక్కటి యననేమి? ఒక్కటి యనుదానికి విషయము అనేకావయవములు కాజాలవు కదా? అవయవముల కంటె వేరుగా నవయవి యొండులేనియెడ ఒక్కటియను బుద్ధియెట్లు సమన్వయింప వీలగును? కాబట్టి యవయవి యొకటి యంగీకరింపక తప్పదు. ఇట్లు ప్రత్యక్ష మనుమానము కానేరదు.

పూర్వ పక్షము :- (అనుమాన ప్రమాణ పరీక్ష)

**"రోధోపఘాత సాదృశ్యేభ్యో వ్యభిచారా దనుమాన మప్రమాణమ్". 2.1.37.**

అనుమానమ్ = అనుమానప్రమాణము, అప్రమాణమ్= ప్రమాణము కాదు కారణమేమన, రోధోపఘాతసాదృశ్యేభ్యః = రోధోపఘాత సాదృశ్యము వలన కలుగు అనుమానిక జ్ఞానములందు, వ్యభిచారాత్ = ప్రామాణ్యము వ్యభిచరించుటవలన.

ప్రవాహమున కడ్డుగట్టుట (రోధము)చే నిండిన నదిని చూచి వర్షము కురిసినదని యనుమానింతుమేని యటప్రామాణ్యముండదు. చీమలుండు తావునకు ఉపద్రవము (ఉపఘాతము) కలగించుటచే బారులుతీర్చి స్థానాంతరమునకేగు చీమలను జూచి వర్షము కురియునని యూహించిన నటను ప్రామాణ్యముండదు. ఇట్లే మయూరమువలె నెవడేని యరచిన యరుపులో సాదృశ్యముండుటచే వర్షము కురియనున్నదని యనుమానింతుమేని యట్టియెడను ప్రామాణ్య ముండనేరదు. ఈ మూడుతావులందును అనుమాన స్వరూపముండినను ప్రామాణ్యము సున్న. ఈ యనుమానములో ననుమాన లక్షణము లేకపోలేదు కాబట్టి యనుమాన మప్రమాణము.

ఉత్తరపక్షము : -

**"నైకదేశ త్రాస సాదృశ్యేభ్యోఽర్థాంతరభావాత్" 2.1.38.**

న = పూర్వ సూత్రమున చెప్పినది సరికాదు. ఏలయన, ఏకదేశ త్రాస

సాదృశ్యేభ్యః= ఏకదేశ త్రాస సాదృశ్యముల వలన కలుగు జ్ఞానములు, అర్థాంతర భావాత్ = అనుమాన జ్ఞానము కంటె భిన్నములగుటచే,

పూర్వ సూత్రమున గట్టు, ఉపద్రవము, పోలికల వలన ననుమాన మేర్పడుచున్నది కాని, అందు ప్రామాణ్యము లేదనుట సరికాదు. కారణమేమన, నదీప్రవాహమునకు రోధమేర్పరుచుటవలన (అడ్డు కట్టుట వలన) నేర్పడు నదీపూర్ణత వర్షము కురిసిన దనుటకు పూర్ణహేతువు కాదు. అది హేతువున నేకదేశమే. వర్షము కురిసిన దని యనుమానించుటకు హేతువు నది నిండుటయే కాక నురుగు, మురికితో కూడిన క్రొత్తనీరు ప్రవాహమున నగపడ వలయును. అట్టి ప్రవాహమే హేతువగును. చీమలుండు తావున కుపద్రవము (ఉపఘాతము) కలిగించినపుడట చీమలు భయము (త్రాసము) తో పరువిడును. అట్టి త్రాసయుక్త పిపీలికల పంక్తి యొక్కటియే కురియబోవు వర్షమునకు హేతువు కాదు. ఉపద్రవాదుల వలన కలుగు భయము లేనపుడు పలుతావులలో చీమలు తమ యండములను తీసకొని యున్నత స్థానముల కేగుట కురియబోవు వర్షమునకు హేతువు. మఱియు నిట్లే మయూరకేకాసాదృశ్యము గల యితర ధ్వనులు కురియనున్న వర్షమునకు హేతువుగాక మయూరకేకలే హేతువగును. కాబట్టి హేతువులు కాని వానిని హేతువులని చెప్పి వాని వలన గలుగు ననుమితి యనుమితి గాదనుట తగదు. హేతువు సరిగాకున్న అనుమానమున ప్రామాణ్యము లేకున్నను దోషము లేదు. హేతువు సరియై యను మాన మప్రమాణమైన దోషమగును. పూర్వపక్షమున నట్టి దోషమొండును చూపబడలేదు, కాబట్టి భూత భవిష్య ద్వర్త మాన విషయికమగు ననుమాను ప్రమాణమే.

పూర్వపక్షము :-

భూత భవిష్య ద్వర్తమాన కాలములు సిద్ధించిన గదా తద్విషయిక మగు అనుమానము సిద్ధింపగలదు. కాగా వర్తమానకాలమే లేదని పూర్వపక్షము చేయుచున్నాడు.

**"వర్తమానాభావః పతతః పతితపతితవ్యకాలోపపత్తేః" 2.1.39.**

పతతః = తొడిమనువీడి క్రిందపడుచున్న ఫలమునకు, పతిత పతితవ్యకాలోపపత్తేః = పడినకాలము. మరికొంత పడనున్న కాలము తక్కవేరు సమయము లేకుండుట వలన వర్తమానాభావః = వర్తమానకాలమునునదిలేదు.

తొడిమనుండి యూడి క్రిందబడుచున్న ఫలమునకా ఫలము భూమిని చేరువరకు తొడిమకు భూమికి గల యంతరము (దానికి) మార్గమననగును.

ఆ ఫలము భూమిని చేరక మధ్యలోనే యున్నపుడు అంతవరకు గడచిన మార్గముతో కూడిన కాలము పతితకాలము (భూతము) ముందా ఫలము భూమిని చేరువరకు గల మార్గసంయుక్త కాలము పతితవ్య (భవిష్యత్తు) కాలముననుట తగును. ఫలము భూమిని చేరుట కింతకంటె వేరొక మార్గమున్నదన వీలులేదు. కాబట్టి భూత భవిష్యత్తులు కాక వేరొక వర్తమాన మెటనున్నది?

ఉత్తరపక్షము : -

**"తయోరప్యభావోవర్తమానభావే తదపేక్షత్వాత్" 2.1.40.**

తదపేక్షత్వాత్ = వర్తమానము నపేక్షించుటవలన, వర్తమానా భావే = వర్తమానము లేనియెడల, తయోరస్యభావః = భూత భవిష్య త్కాలములు నుండవు.

కాలము మార్గముచే వ్యక్తము చేయబడదు. క్రియచే వ్యక్తము చేయబడును. ఫలము పడుచున్నదను తావునపడుట యను క్రియ సమాప్తమైన పతితకాలము = భూతకాలమనబడును. పడనున్న క్రియ పతితవ్యకాలమును (భవిష్యత్తును) తెలుపును. ఈ రెండు దశలందును ఫలమున క్రియ యుండనేరదు. పడుట యను క్రియ ఫలమున వర్తించు కాలము వర్తమానకాలమనబడును. ఇట్లు క్రియకు, వస్తువునకు గల సంబంధమును తెలుపునది వర్తమాన కాలము. ఆ వర్తమానకాలము నపేక్షించి భూత భవిష్యత్కాలము లేర్పడును. కాబట్టి వర్తమానమే లేదనని భూత భవిష్యత్తులు నుండజాలవు.

**"నాతీతా నా గతయో రితరేతరాపేక్షాసిద్ధిః" 2.1.41.**

అతీతానాగతయోః = భూత భవిష్యత్తులకు, ఇతరేతరాపేక్షా సిద్ధిః = ఒకదానినపేక్షించి మరియొకటి సిద్ధమగుట, న = లేదు

మఱియు భూతకాలము భవిష్యత్తునుగానీ, భవిష్యత్తు భూత కాలమునుగానీ యపేక్షించి సిద్ధింపనేరవు. ఒక సిద్ధవస్తు వన్యవ స్తువును సిద్ధింపజేయునుగాని స్వయముగా నసిద్ధమై యన్య వస్తువును సిద్ధింపజేయు ననుట యసంభవము. భవిష్యత్తు సిద్ధించుటకు పూర్వమే భూతముగతించును. భూతకాలము గతించిన యనంతరముకాని భవిష్యత్తు కలుగనేరదు.

వీనిలో పరస్పరాపేక్ష కానిపింపదు. హ్రస్వదీర్ఘములు పరస్పరాపేక్షములు. హ్రస్వము నపేక్షించి దీర్ఘము దీర్ఘమగునుగాని హ్రస్వము లేని దీర్ఘమున కర్థములేదు. అట్లే దీర్ఘమున్న హ్రస్వము సిద్ధించునుగాని యదిలేనినాడది సిద్ధింపదు. అట్టియపేక్ష భూతభవిష్యత్తులో కానరాదు. కాబట్టి వర్తమాన కాల

మంగీకరింప తప్పదు.

వర్తమాన కాలము వస్తువున్నదని తెలుపును. వర్తమాన మంగీకరింపనియెడల ద్రవ్యమున్నది, గుణమున్నది, కర్మమున్నదని ప్రయోగింపజాలమని వివేకము.

భూతభవిష్యత్తులు పరస్పరాపేక్షములు కాకున్న పోనిండు, వర్తమానాపేక్షములు మాత్రమెట్లు కాగలవలన,

**"వర్తమానాభావే సర్వాగ్రహణం ప్రత్యక్షానుపపత్తేః" 2.1.42.**

వర్తమానాభావే = వర్తమానమే లేనియెడల, ప్రత్యక్షానుపపత్తేః= ప్రత్యక్ష ప్రమాణముపపన్నము కాదుగనుక, సర్వాగ్రహణమ్ = ప్రపంచమున నే పదార్థమును గ్రహింపబడ జాలదు.

ప్రమాణములలో ప్రత్యక్షమున వర్తమాన వస్తువిషయికము. ఉన్న వస్తువును తెలిసికొన నుపయోగించును. వర్తమానమే లేకున్న ప్రత్యక్ష ప్రమాణము సిద్ధింపనేరదు. అనుమానాదులు ప్రత్యక్ష మూలములగుటచే ప్రత్యక్షము సిద్ధింపనినాడు ప్రమాణము లేవియు సిద్ధింపవు. కాబట్టి ప్రమేయ జ్ఞానము కలుగుటయే దుర్లభమగును. అందువలన వర్తమానము రెండు విధముల సిద్ధించుచున్నదని తెలియుచున్నది. ఒకటి క్రియాసంతాన వ్యంగ్యము. రెండవది యర్థసద్భావవ్యంగ్యము. అనగా అనేక విధక్రియవలన వర్తమానము తెలియనగును. వస్తువుయొక్క యునికి వలనను తెలియనగును. క్రియాసంతాన వ్యంగ్యమున కుదాహరణము: - వండుచున్నాడు. నరుకుచున్నాడు. పొయ్యి మీద పాత్రనుంచుట, అందు నీరు పోయుట, బియ్యమందులో పోయుట, పొయ్యిలోని పుల్లల నెగదోయుట, అగ్నిని ప్రజ్వలింపజేయుట, తెడ్డుతో కలియబెట్టుట, గంజివార్చుట, పాత్రను దింపుట మున్నగు క్రియాసమూహము వండుటను తెలుపును. పెక్కుమార్ల గొడ్డలి నెత్తివేయుట నరుకుట యనబడును.

అర్థ సద్భావ (వస్తుసత్తా) వ్యంగ్యమున కుదాహరణము : - ద్రవ్యమున్నది. గుణమున్నది. ఘటపటాదులున్నవి. కాలము నిత్యమగుటచే వర్తమానత్వమందు సిద్ధించినను అతీతానాగతత్వము లెట్లు సిద్ధింపగలవలన,

**"కృతతా కర్తవ్యతోపపత్తేస్తూభయథా గ్రహణమ్" 2.1.43.**

కృతతా కర్తవ్యతోపపత్తేః = వ్యంజకమగు క్రియవలన భూత భవిష్యత్తులు సిద్ధించుటచే. ఉభయథాగ్రహణమ్ = కాలము నిత్యమయ్యు భూతభవిష్యచ్ఛబ్దములచే వ్యవహరింపబడును.

కాలము నిత్యమైనను దానిని వ్యక్తపరుచు క్రియ క్షణికమగుటచే భూత భవిష్యచ్ఛబ్దముచే నది వ్యవహరింపబడుట యసంగతము కాదు. కాలముక్రియా వ్యంగ్యమనుట సర్వతంత్ర సిద్ధాంతము. క్రియ క్షణికమై కృతము, కర్తవ్యము, క్రియమాణమునని విభజింపబడును. క్రియ విభజింపబడుటచే నాక్రియచే వ్యక్తమగు కాలమును ముప్విధము లవిభక్తమై వ్యవహరింపబడుచున్నది. అందు కృతక్రియచే వ్యక్త కాలము అతీతము - భూతమనబడును. కర్తవ్యక్రియావ్యక్త కాలము. అనాగతము - భవిష్యత్తనబడును. క్రియామాణక్రియచే వ్యక్తమగుకాలము వర్తమాన మనబడును. ఇట్లు క్రియాసంబంధము వలన కాలము భూత భవిష్యద్వర్తమాన శబ్దముచే వ్యవహరింపబడుచు లోకమున నెల్లరచే గ్రహింపబడు చున్నది. కాబట్టి ప్రత్యక్షానుమాన ప్రమాణములును నిర్దుష్టములని తేలుచున్నది.

పూర్వ పక్షము : - (ఉపమాన పరీక్ష)

**"అత్యంత ప్రాయైకదేశ సాధర్మ్యా దుపమానాసిద్ధిః" 2.1.44.**

అత్యంత ప్రాయైకదేశ సాధర్మ్యాత్ = (ఇందలి సాధర్మ్య పదము అత్యంత - ప్రాయ- ఏకదేవ శబ్దము లన్నింటితో నన్వయించును.) అత్యంత సాధర్మ్యము వలనగానీ, ప్రాయస్సాధర్మ్యము వలన గానీ, ఏకదేశ సాధర్మ్యము వలనగానీ, ఉపమానా సిద్ధిః= ఉపమాన ప్రమాణము సిద్ధింపనేరదు.

ఒక వస్తువు నందుండు ధర్మములన్నియు మరియొక దానియందుండుట అత్యంత సాధర్మ్య మనబడును. దాని వలన నుపమానము సిద్ధింపదు. ఒక గోవుతో మఱియొక గోవు నుపమింతుమా? 'ఆవు ఉన్నట్లు ఆవుండును' అనము కదా?

ఒక వస్తువు నందలి యనేక ధర్మము మరియొక వస్తువునందుండుట ప్రాయస్సాధర్మ్య మనబడును. ఇదియు నుపమాన సాధకము కాదు. ఎద్దులోనుండు ననేక ధర్మములు మహిషమున నుండును. కాని ఎద్దున్నట్లు మహిషముండుననుట కూడదు.

ఒక వస్తువునందలి యే కొంచెము ధర్మమో మరియొక దాని యందుండుట యేక దేశసాధర్మ్యమనబడును. ఇందునను ఉపమానము సిద్ధింపదు. ఏకదేశసాధర్మ్యము లేనివస్తువులు ప్రపంచమున నుండవు. కాబట్టి ఆవగింజయున్నట్లు మేరు పర్వత ముండుననియు నుపమింప వీలగునుగదా !

పై జెప్పిన యుదాహరణమునుబట్టి సాధర్మ్యము లక్షణముగాగల

యుపమానము అర్థసాధనము కాదని పూర్వ పక్షాభిప్రాయము.

ఉత్తరపక్షము : –

**"ప్రసిద్ధసాధర్మ్యా దుపమానసిద్ధేః యథోక్తదోషానుప పత్తిః" 2.1.45.**

ప్రసిద్ధసాధర్మ్యాత్ = ప్రసిద్ధసాధర్మ్యమువలన, ఉపమానసిద్ధేః= ఉపమాన ప్రమాణము సిద్ధించుటచేత, యథోక్త దోషానుపపత్తిః= పై జెప్పబడిన దోషము లుండజాలవు.

పూర్వము తనచే తెలియబడిన పదార్థముతో నితర పదార్థములకు గల సమానధర్మము ప్రసిద్ధ సాధర్మ్యమనబడును. దానియందు సాధ్యమును సాధించు భావముండును. అత్యంత సాధర్మ్యాదులు సాధ్యసాధనములుగా లక్షణ సూత్రమున చెప్పి యుండలేదు. కాబట్టి పూర్వము తనచే నెఱుగబడిన గోవునందుగల ధర్మములు గవయమున జూచిగోసదృశమగు నీ జంతువు గవయపదవాచ్యమని యెఱుగుటలో నెట్టి దోషము నుండజాలదని భావము.

అత్యంత సాధర్మ్యాదులును ప్రకరణమును బట్టి సాధ్య సాధకములు గావచ్చును. (1) రామరావణుల యుద్ధము రామరావణుల యుద్ధము వలెనే యుండును. ఇట యుద్ధక్రియయా యుద్ధక్రియతోనే యుపమింపబడినది. (2) ఎద్దువలె నీ మహిషమున్నది. ఇందు రెండు జంతువులోగల జలప్రకర్షమున నెక్కుడు సాధర్మ్యముండుటచే ఎద్దువంటి బలము కలది మహిషమని యుపమానము. (3) ఆవగింజవంటిదే మేరువు : – అనుటలో ఆవయెట్లు ఉనికి (సత్త) గదియో అట్లే మేరువు నునికి గలదియని స్వల్పసాధర్మ్యము ఉపమానమని యెఱుగునది.

పై యుదాహరణము ద్వారా పూర్వపక్షమున జూపిన దోషముల నుద్ధరించుటచే నుపమాన ప్రామాణ్యమును దొలగింప నేరికిని శక్యము గాదని వివేకము.

పూర్వపక్షము : –

**"ప్రత్యక్షే ణాప్రత్యక్ష సిద్ధేః" 2.1.46.**

ప్రత్యక్షేన = ప్రత్యక్ష గోచరమైన గోసాధర్మ్యాదులచే, అప్రత్యక్షసిద్ధేః = అప్రత్యక్షమగు గవయ సంజ్ఞావిశిష్టమగు గవయము తెలియబడుట వలన నుపమాన మనుమానమే యగుచున్నది.

ప్రత్యక్షధూమముచే నగ్నిననుమానించునట్లు ప్రత్యక్ష గోసాదృశ్య ముచే గవయము నెరుగుటచే యుపమానము. కాబట్టి యనుమాన మునకును,

నుపమానమునకును నెట్టి భేదము లేదు. అందువలన నుపమాన మనుమానాంతర్గతమే.

**"నా ప్రత్యక్షగవయే ప్రమాణార్థ ముపమానస్య పశ్యామః" 2.1.47.**

ఉపమానస్య = ఉపమాన ప్రమాణముయొక్క, ప్రమాణార్థమ్ = ప్రమాణ శబ్దార్థమును, అప్రత్యక్షే = ప్రత్యక్షముకాని, గవయే = గవయ సంజ్ఞతో కూడిన గవయ పదార్థమున, న పశ్యామః= అంగీకరింపము.

గో సాదృశ్యముచే నప్రత్యక్ష గవయమును సాధించుట యుపమాన ప్రమాణార్థమైనచో నది యనుమానాంతర్గతమగును. కాని, ప్రత్యక్షముగా గ్రహింపబడు గవయము గవయ పద వాచ్యమను సంజ్ఞా సంజ్ఞి సంబంధమును సాధించుట మాయుపమానమునకు ఫలము. కాబట్టి ప్రత్యక్షమగు గో సాధర్మ్యముచే నా సంబంధము తెలియబడినప్పటికి ధూమమును వహ్ని ననుమానించి నట్లెన్నడు కాజాలదు అనుమానమున ధూమమున్న తావున వహ్నియుండునను వ్యాప్తిస్మరణ ముండును. ఉపమానమున నట్లుగాక 'గోవెట్లో గవయ మట్లు' అను నారణ్యకవచనము స్మరింపబడును. గో సాదృశ్యము ప్రత్యక్షమగును. ఇట్లు అనుమానోపమానములలో మహదంతర మున్నదని సూత్రాభిప్రాయము.

**"తథేత్యుపసంహారా దుపమానసిద్ధే ర్నావిశేషః" 2.1.48.**

తథేత్యుపసంహారాత్ = ఉపమానము (యథాగౌస్తథాగవయః = గోవెట్లో గవయమట్లు) అను వాక్యముద్వారా, సిద్ధేః = సిద్ధించుట వలన, న అవిశేషః = అనుమానముతో సమానముకాదు.

'గోవెట్లో గవయమట్ల' ను వాక్యము ద్వారా ఉపమానము సిద్ధించును. అనుమానమున నట్టి వాక్యజ్ఞానమునకు తావులేదు. కాబట్టి ఉపమాన మనుమానము కాదు.

పూర్వపక్షము : - (శబ్దపరీక్ష)

**"శబ్దోఽ నుమానమర్థస్య అనుపలబ్ధే రనుమేయత్వాత్." 2.1.49.**

అర్థస్య = శబ్దవిషయమగు నర్థము, అనుపలబ్ధేః= ప్రత్యక్షముగా నుపలబ్ధముకాక, అనుమేయత్వాత్ = అనుమానింపవశ్యమగుట వలన, శబ్దః = శబ్దప్రమాణము, అనుమానమ్ = అనుమానమే.

పరోక్షము, అపరోక్షమునని యర్థము రెండు విధములు. అందపరోక్షము ప్రత్యక్ష ప్రమాణముచే నుపలబ్ధమగును. పరోక్షమట్లు కాదు. కాబట్టి యది

యనుమానమునకు విషయమగును. పరోక్షా పరోక్షములకు మించి మఱియొండు పదార్థము ప్రపంచమున గానము. అట్టియెడ శబ్ద ప్రమాణమును వేరుగా నంగీకరింపనేల? విషయభేదము ననుసరించియే ప్రమాణభేదమును స్వీకరింప వలయును. అనుమానమెట్లు ప్రత్యక్షముకాని విషయమును తెలుపునో అట్లే శబ్దమును పరోక్ష విషయమునే బోధించును. కాబట్టి శబ్ద ప్రమాణము అనుమానాంతర్గతమేల కాదు?

**"ఉపలబ్ధే రద్విప్రవృత్తిత్వాత్" 2.1.50.**

ఉపలబ్ధేః= శబ్దమువలనను, అనుమానము వలనను కలుగు జ్ఞానము, అద్విప్రవృత్తిత్వాత్ = రెండువిధములగు ప్రవృత్తులు కలది కాకుండుట వలన శబ్దమనుమానమే.

అనుమాన ప్రమాణముకంటె శబ్దము భిన్నమగునెడల అనుమానమువలన కలుగు జ్ఞానము (ఉపలబ్ధి) కంటె శబ్దము వలన కలుగు జ్ఞానము భిన్నప్రకారముగా నుండవలయును. ప్రత్యక్ష ప్రవృత్తి ప్రత్యక్షార్థమున నుండును. అనుమాన ప్రవృత్తి ప్రత్యక్షార్థమున నుండును. అట్లే శబ్దమును భిన్నార్థ విషయిక ప్రవృత్తికల్గదైయున్న ప్రమాణాంతరము కాగలదు. అట్లుగాక యనుమానమువలె నదియు పరోక్షార్థమునే తెలుపుచున్నందువలన శబ్ద మనుమానమే.

**"సంబంధాశ్చ." 2.1.51.**

సంబంధాశ్చ = వాచ్యవాచక భావలక్షణాత్మక నియతసంబంధము వలనను శబ్దమనుమానమే.

దృష్టిగోచరమైన ధూమాదిలింగములు తమతో సంబన్ధముగు వహ్ని మున్నగు పదార్థము జ్ఞానమును కలిగించుచున్నవి. అట్లే శబ్దమును శ్రవణగోచరమై స్వసంబంధియగు నర్థమును బోధించును. కాబట్టి శబ్దమనుమానమే.

ఉత్తరపక్షము : –

**"ఆప్తోపదేశ సామర్థ్యా చ్ఛబ్దా దర్థసంప్రత్యయః" 2.1.52.**

ఆప్తోపదేశ సామర్థ్యాత్ = ఆప్తోపదేశమువలన కలుగు (యథార్థ జ్ఞానమునుత్పన్న మొనర్చుట యను) సామర్థ్యముగల, శబ్దాత్ = శబ్దమువలన, అర్థసంప్రత్యయః= అర్థజ్ఞానము కలుగును.

లింగమువలన లింగితెలియబడినట్లు శబ్దమువలననే శబ్దార్థము గోచరమగునెడ శబ్దప్రమాణ మనుమానము కానగును. కాని ఆప్తోపదేశ

సామర్థ్యముగ శబ్దమువలన నర్థ ప్రత్యయము కలుగుటచే నట్లు కానేరదు.

అనుమానమున నాప్తోపదేశమునకు తావులేదు. శబ్దమోయాప్తోపదేశకృత సామర్థ్యసహకారము లేక యర్థబోధకము కానేరదు. కాబట్టి శబ్దానుమానములలో భేదము లేకపోలేదు. శబ్దమనుమానమువలె పరోక్షార్థమును బోధించినను ఆప్తులచే నుపదిష్టమగుట చేతనే ప్రమాణమై, అర్థజ్ఞానము కలిగించుట కాప్తులచే నుపదిష్టమై ప్రమాణము కావలయునను నియమములేని యనుమానముకంటె నెంతో భిన్నమగుట నిర్వివాదమని సూత్రతాత్పర్యము.

అనుమానముకంటె శబ్ద ప్రమాణము భిన్నమని తెలుపబడినది. ప్రాసంగికముగా శబ్దార్థములకుగల సంబంధమెట్టిదో పరీక్షింపదలచి ముందుగా శబ్దార్థములకు సంబంధమే లేదనుచున్నాడు.

(ఈ ప్రకరణమున శబ్దార్థముకుగల సంబంధ మవినా భావమని పూర్వపక్షము; కాదు సామయికము - సాంకేతికమని సిద్ధాంతము).

పూర్వపక్షము : -

**"పూరణ ప్రదాహ పాటనానుపలబ్ధేశ్చ సంబంధాభావః." 2.1.53.**

పూరణప్రదాహపాటనానుపలబ్ధేః= మోదకము, అగ్ని, కత్తియను శబ్దముల నుచ్చరించినపుడు ముఖము (నోరు) నిండుటగానీ, దహింపబడుటగానీ, చీల్చబడుటగానీ జరుగుటలేదు, కాబట్టి, సంబంధాభావః = శబ్దార్థముకు సంబంధము లేదు.

శబ్దార్థముకు సంబంధమున్న శబ్దసమీపమున నర్థము, అర్థసమీపమున శబ్దము నుండవలయును. అర్థ సమీపమున శబ్దమున్నదని చెప్పవలనుపడదు. అట్లన్న పక్షమున, శబ్దముకంఠ తాల్వాది ముఖావయవముచే నుచ్చరింపబడుచున్నదికదా! అదియెట్లు సంభవమగును? అర్థము (ఘటపటాది వస్తువులు) న్న చోట కంఠ తాల్వాది అవయవములు లేవుకదా! శబ్ద సమీపమున నర్థమున్న దందుమా, నోటిలోని తాల్వా ద్యవయవ ప్రదేశములచే నగ్ని, మోదకాది శబ్దముల నుచ్చరించినపుడు తత్సమీపమున నుండు నగ్ని, వస్తువులచే నోరు దహింపబడుటయు, నిండుటయు జరుగవలయును కదా' అట్లు జరుగకపోవుటచే శబ్దాంతికమున నర్థమున్నదనుటయు పొసగదు. కాబట్టి శబ్దార్థములకు సంబంధము లేదు.

**"శబ్దార్థవ్యవస్థానా దప్రతిషేధః" 2.1.54.**

శబ్దార్థ వ్యవస్థానాత్ = శబ్దములవలన కలుగు నర్థజ్ఞానమున

వ్యవస్థయుండుట వలన, అప్రతిషేధః= శబ్దార్థముకు సంబంధము లేదనుట తగదు.

శబ్దార్థములు పరస్పరము సంబద్ధము కానియెడ శబ్దమువలన కలుగు నర్థజ్ఞానమున (ఒక శబ్దమొక యర్థమును తెలుపునుకాని సర్వార్థములను తెలుపదను) వ్యవస్థ యుండనేరదు. వ్యవస్థ కనబడుచున్నది కాబట్టి సంబంధమున్నదనియే తేలుచున్నది. కానియా సంబంధము కుండకు అందలి రేగుపండ్లకు నున్న సంబంధమువలె సంయోగముకాదు. తంతు పటములకువలె సమవాయమునుకాదు. సంయోగ, సమవాయ సంబంధములో నొకటి శబ్దార్థములకుగల సంబంధమగునెడల మోదకాది శబ్దోచ్చారణవలన పూరణ దాహాదులు కలుగవలసియుండును. కాబట్టి శబ్దార్థముల సంబంధము సంయోగముగానీ, సమవాయముగానీ కాక యవినాభావమని పూర్వపక్షి యభిప్రాయము.

ఉత్తరపక్షము : -

**"న, సామయి కత్వాచ్ఛబ్దార్థ సంప్రత్యయస్య" 1.1.55.**

శబ్దార్థ సంప్రత్యయస్య = శబ్దమువలన కలుగు నర్థజ్ఞానము, సామయికత్వాత్ = (ఈ శబ్దమువలన నీయర్థము తెలిసికొనదగునను నీశ్వర సంకేతము సమయమనబడును) సామయిక మగుటవలన, న = అవినాభావ సంబంధము కాదు.

'ఈ శబ్దమున కిదియర్థము' లేక 'ఈశబ్దముచే నీయర్థమని తెలియనగును' అనునియమము - సమయము (సంకేతము) అనబడును. అట్టి సమయమే శబ్దార్థము సంబంధమునకు హేతువు. కాబట్టి శబ్దార్థసంబంధమును వాచ్యవాచక భావ సంబంధమనియు, వృత్తియనియు, శక్తియనియు వాడుదురు. పరంపరగా వృద్ధవ్యవహారాదులవలన నా (సమయము) సంబంధము తెలియబడును. దానింబట్టి శబ్దమువలన నర్థ ప్రత్యయము కలుగును. వ్యవస్థయు నేర్పడును. శబ్దార్థమునకు గల సంబంధము స్వాభావికమని యంగీకరించు వారును ఆ సంబంధము జ్ఞాతమయినవారికే శబ్దమువలన నర్థబోధము కలుగునని యంగీకరించక తప్పదు. జ్ఞాతమగుటయన, ఈ శబ్దమీయర్థమునకు వాచకమనియో, ఈ శబ్దముచే నీయర్థమెరుగదగుననుటయోకదా. ఇదియే సమయము, కాబట్టి శబ్దార్థముల ప్రత్యయము సాంబంధికముగాక సామయికమే యగును.

**"జాతివిశేషేచా నియమాత్." 2.1.56.**

జాతివిశేషేచ = ఘటాదిజాతిభేదమునందును, అనియమాత్ = పటశబ్దవాచ్యత్వ నియమము లేకుండుట వలన శబ్దార్థసంబంధ మవినా భావముకాక సామయికమే యని యర్థము.

మఱియు శబ్దార్థములు స్వాభావిక సంబంధము కలవగుచో ఘటాద్యర్థములు పటశబ్దముచేతను బోధింపబడవలసియుండునను నియమ ముండియుండెడిది. అట్టిది కానము. కాబట్టి సంకేత హేతుకమే శబ్దార్థ జ్ఞానము.

శబ్దప్రామాణమును సామాన్యముగ పరీక్షించి విశేష రూపమున పరీక్షింపనెంచి సూత్రమును రచించుచున్నాడు.

పూర్వ పక్షము : -

**'తదప్రామాణ్యమనృతవ్యాఘాతపునరుక్తదోషేభ్యః" 2.1.57.**

(అయథార్థమును జెప్పుట యనృతమనబడును. అసంబద్ధమును జెప్పుట వ్యాఘాత మనబడును. చెప్పినది మరల జెప్పుట పునరుక్త యనబడును.) అనృతవ్యాఘాతపునరుక్తదోషేభ్యః= అనృతాది దోషములవలన, తత్= బ్రాహ్మణప్రభృతి అదృష్టార్థబోధక శబ్దము, అప్రామాణ్యమ్ = ప్రమాణములు కావు.

శబ్దములు దృష్టార్థప్రపక్తృకములు. అదృష్టార్థ ప్రపక్తృకములు నని రెండు విధములు. అందు వైదికశబ్దములు దృష్టార్థప్రవక్తృకములు. ఈశ్వరుడు సర్వజ్ఞుడును, సర్వద్రష్టయు నగుటంజేసి, ఈశ్వరీయములయిన ఋగ్యజుస్సా మాథర్వములనబడు వైదిక శబ్దములు దృష్టార్థప్రపక్తృకములనుటలో నెట్టి సందియము నుండదు. కాబట్టి వైదికశబ్దములు అనృతవ్యాఘాత పునరుక్తాది దోషయుక్తములు కానేరవు. ఋగ్యజుస్సామము బ్రహ్మపద వాచ్యములు. కారణము బ్రహ్మప్రభవములగుటయో బృహదర్థకములగుటయో యననగును. వేదములు బ్రహ్మపదవాచ్యములనుట కుదాహరణము.

**"బ్రహ్మణః ప్రణవంకుర్యా దాదావంతేచ సర్వదా**
**స్రవత్యనోంకృతం పూర్వం పరస్తాశ్చ విశీర్యతే"**

**(మను. 2.74)**

బ్రహ్మ, ఛందస్సు, వేదము, మంత్రమునను పదములు పర్యాయములు. వేదమంత్రముల కాద్యంతములలో ప్రణవము నుచ్చరింపవలయునని శ్లోకాభిప్రాయము.

ఇట్లు బ్రహ్మపదవాచ్యములగు ఋగాది వేదములకు వ్యాఖ్యానములు. ఋషులచే వ్రాయబడి బ్రాహ్మణము లనబడును. అందు ఋగ్వేద వ్యాఖ్యానము ఐతరేయ బ్రాహ్మణము. యజుర్వేద వ్యాఖ్యానము శతపథ బ్రాహ్మణము, సామవేద వ్యాఖ్యానము, తాండ్యబ్రాహ్మణము, అథర్వవేద వ్యాఖ్యానము గోపథ బ్రాహ్మణము.

ఇట్టి బ్రాహ్మణములలో నొకట (పుత్రకామః పుత్రేష్ట్యాయజేత) పుత్రకామి పుత్రేష్టియాగము నొనరింపవలయునని విధిగలదు. ఆ విధిననుసరించి పుత్రకామేష్టి నొనరించినను పుత్రులు కలుగకుండుట చూచుచున్నాము. కాబట్టి యనృత దోషయుక్తమైన యీ వాక్యము అ ప్రమాణము. ఇట్లే (ఉదితే హోతవ్యమ్, అనుదితే హోతవ్యమ్, సమయాధ్యుషితే హోతవ్యమ్.) సూర్యుడుదయించిన తర్వాత హోమము చేయవలయును. ఉదయింపకముందు హోమమొనరింప వలయును. సమయము గతించిన తదుపరి హోమము చేయవలయును. అని హోమమును విధించి, (శ్యావోఽస్యాహుతి మభ్యవహరతి య ఉదితే జుహోతి, శబలోఽ స్యాహుతి మభ్యవహరతి యోఽ నుదితే జుహోతి, శ్యావశ్యబలవాఽ స్యాహుతి మభ్యవహరతః యః సమయాధ్యుషి తేజుహోతి) ఉదయించిన మీదట హోమమొనర్చిన శ్యావము ఆ యాహుతిని తినుననియు, ఉదయింపక పూర్వమొనర్చిన యాహుతిని శబలము తినుననియు, సమయాతిక్రమణమొనర్చి చేసిన యాహుతిని శ్యావ శబలములు తినుననియు చెప్పుటచే నసంబద్ధములై యీ వాక్యములు అర్థబోధకములు కాజాలవు.

మఱియు, (సవైత్రిః ప్రథమామన్వాహత్రిరుత్తమామ్. శత. 1.2.2.6.2) ఈ వాక్యముచే ప్రథమోత్తమము 'సామిధేని' ఋక్కులను ముమ్మారుచ్చరింప వలయునని చెప్పుటచే చెప్పినదానిని మరలచెప్పుట యను పునరుక్త దోషముండుటచే నప్రమాణమని యభిప్రాయము.

పైన వర్ణించిన యుదాహరణముల వలన బ్రాహ్మణ గ్రంథములలోని శబ్దము లనృతాది దోషయుక్తములగుటచే అర్థ ప్రత్యాయకములు - అర్థబోధకములుకాక య ప్రమాణములగునని సూత్రాభి ప్రాయము.

ఉత్తరపక్షము: (అనృతదోషనివారణ.)

**"న కర్మకర్తృసాధనవైగుణ్యాత్" 2.1.58.**

కర్మకర్తృసాధనవైగుణ్యాత్ = కర్మ, కర్త, సాధనము వీని వైకల్యము వలన ఫలము గలుగదు. కాబట్టి, న= అనృతదోషము శబ్దమున లేదు.

శాస్త్రమున చెప్పినట్లనుష్టింపకుండుట కర్మవైగుణ్యము, అనభిజ్ఞత, నిందితాచరణముకలవాడగుట కర్తృ వైగుణ్యము. సహకారి కారణములన్నియు లేకుండుట కర్మవైగుణ్యము.

కర్మచేయువ్యక్తియు, సాధనములును, స్వయముగా కర్మయును గుణయుక్తములుగా నుండవలయును. నాడే శాస్త్ర విహిత కర్మ సమయమున ఫలము నొసంగగలుగును. కర్మ, కర్త, సాధనములు వీని మూటిలో నేవి గుణరహితమ్ములైనను ఫలము లభించుట దుర్లభము. కాబట్టి శాస్త్రవిహిత కర్మలు ఫలోదయములు కాకుండుటకు కారణము సాధనాదుల లోటే గాని, శబ్దమనృతమగుటకాదు.

(వ్యాఘాతదోషపరిహారము)

**"అభ్యుపేత్యకాలభేదేదోషవచనాత్" 2.1.59.**

అభ్యుపేత్య = ఒకడొక కాలమును తానగ్నిహోత్ర మొనర్చుట నంగీకరించి, కాలభేదే = ఆ కాలము నతిక్రమించిన, దోషవచనాత్ = దోషమని చెప్పుటవలన వ్యాఘాత దోషమును లేదు.

కాలము రెండు విధములు. ఉదితము. అనుదితమునని సమయాధ్యుషిత మనుదితములోనే చేరును. ప్రాతఃసంధి కాలము సమయాద్యుషితమనియు, సాయం సంధికాలము సమయావిషతమనియు జెప్పబడును.

ఒకడు అగ్న్యాధాన సమయమున (ఉదితేజుహవాని) ఉదితమున నగ్నిహోత్రము చేయుదునని యంగీకరించి, యగ్నిహోత్రముజేయ నారంభించి ప్రమాదాలస్యాది దోషములకు లోనై, తానంగీకరించిన కాలము నతిక్రమించి యగ్నిహోత్రము చేయునెడల వాని యగ్నిహోత్ర ముచ్ఛిన్నమగునని చెప్పుట వ్యాఘాతమనబడదు. నియత సమయమున నగ్నిహోత్రము జేయునెడల నెట్టి దోషము నుండదని సూత్రాభిప్రాయము. కాబట్టి వ్యాఘాతమను శబ్దదోషమిటలేదని వివేకము.

(పునరుక్త దోషనివారణ)

**"అనువాదోప పత్తేశ్చ" 2.1.60.**

ఒకమాటు చెప్పినదానిని మరలచెప్పుట యనువాద మనవచ్చును. కాబట్టి పునరుక్త దోషమును లేదని సూత్రార్థము.

అనర్థకాభ్యాసము పునరుక్తదోషమనబడును. అర్థవంతమగు నభ్యాస మనువాదమనబడును. చెప్పినది మరల జెప్పుట (అభితాహితాభిధానము)

సార్థకము, నిరర్థకము నని రెండు విధములు సంభవము. అందు నిర్థకము పునరుక్త దోషయుక్తమగును. సార్థకము అనువాద మనబడి దోషముగా నెంచబడదు. ('సవైత్రిః ప్రథమామన్వాహత్రిర్త్తుమాం' శత. 1.3.2.6.) అనుస్థలమున ప్రథమోత్తమ 'సామధేను' లను ముమ్మారుచ్చరింపవలయునను విధానము అనువాదమేగాని పునరుక్తముకాదు.

("సమింధేసామి ధేనీ భిర్ హోతాతస్మాత్ సామిధేన్యో నామ" శత 1.3.21.) అను శతపథప్రమాణము ననుసరించి (" ప్రవోవాజా అభిద్యతోహవిష్మంతో ఘృతాచ్యా, నేవాంజిగాతి సుమ్నయః" ఋ. 3.1.35.1.) ప్రభృతి ఋక్కులు పదునొకండు వహ్నిసమింధన వేళలో పాడబడును. కాబట్టి సామధేని ఋక్కులనబడును. ఈ సామిధేనులు ప్రకృతి యాగమున పద్నైదును, వికృతి యాగమున పదునేడును అనువదింపవలయునని విధింపబడియున్నది. ("సప్తదశసామిధే నీరనుబ్రూయాత్" ఐత 1.1.1.) ("పంచదశసామిధేనీ రన్వాహ" తై. సం. 2.6.8.2.) అనువాక్యము లిందు ప్రమాణము. ఇట్లు విధివిహితమైన యనువాదము నిరర్థక మనంజనదు. కాబట్టి పునరుక్తదోషము లేదని భావము. అనువాదము స్వీకరింపక సమాధానము చెప్పుట (పరిహరించుట) సరికాదు. అనగా,

**"వాక్య విభాగస్య చార్థగ్రహణాత్" 2.1.61.**

వాక్యవిభాగస్యచ = బ్రాహ్మణ వాక్యములలో నను వాదాది భేదముల విభాగము, అర్థగ్రహణాత్ = అర్థవశమున శిష్టులచే స్వీకరింపబడుటవలన పై జెప్పిన సమాధానము తగినదే.

శిష్టులు అర్థవైచిత్ర్యము నెఱింగి బ్రాహ్మణ వాక్యముల ననువాదాది భేదముల విభాగించిరి. ఒకానొక యర్థమును విధించువాక్యము విధివాక్య మనబడును. విహితార్థస్తుతిగానీ, ప్రతిషిద్ధార్థ నిందగానీ చేయు వాక్యము. అర్థవాద మనబడును. ఒకానొక విశేష విషయమును విధింపదలచి యొక మారు చెప్పిన దానిని మరల చెప్పుట యనువాదమనబడును.

బ్రాహ్మణ వాక్యములను శిష్ట లెన్నివిధముల విభజించిరనగా

**"విధ్యర్థ వాదానువాద వచన వినియోగాత్" 2.1.62.**

ఈ సూత్రమున వినియోగశబ్దము భేదార్థకము. విధివచనము, అర్థ వాదవచనము, అనువాద వచనము నను బేధముతో బ్రాహ్మణ వాక్యములు ముత్విధములని సూత్రాభిప్రాయము.

అందు విధివాక్యము : -

**"విధిర్విధాయకః" 2.1.63.**

విధాయకః = ఉపదేశకము (ప్రవర్తకము - చోదకము) అగు వాక్యము, విధిః= విధివాక్యమనబడును. ఒకవాక్యము ద్వారా ఏదే నొక కార్యమున ప్రవర్తింపుమనియో లేక వలదనియో విధించుట, 'ఇది చేయుము. "ఇది చేయకుము" అనుట విధియందురు.

ఉదా:-

**'స్వాధ్యాయోఽ ధ్యేతవ్యః' (శత. 11.58.3.)**
**'అగ్ని హోత్రం హోతవ్యం' (శత. 2.2.2.18)**
**"సత్యంవద' ధర్మంచర; స్వాధ్యాయాన్మా ప్రమదః;**
**ప్రజాతంతుం మా వ్యవచ్ఛేత్సీః; దేవపితృ కార్యాభ్యాం**
**నప్రమదితవ్యం; మాతృదేవోభవ; పితృదేవోభవ."**

**తై. శి. 111.**

అర్థవాదము : -

**"స్తుతిర్నిందా పరకృతిః పురాకల్ప ఇత్యర్థవాదః" 2.1.64.**

స్తుతిః = స్తుతి, నిందా: = నింద, పరకృతిః = పరకృతి, పురాకల్పః= పురాకల్పము, ఇతి = అని, అర్థవాదః = అర్థవాదము నాలుగు విధములు.

ఒకని నొక కర్మయందు ప్రవర్తింపజేయుటకో, లేక యొక కర్మనుండి మరలించుటకో విధివాక్యముద్వారా యపేక్షింపబడి కొండొక యర్థమును ప్రశంసించుచునో లేక నిందించుచునో ప్రవర్తించు వాక్యము అర్థవాద మనబడును. ఆ వాక్యము స్తుత్యాదిభేదముల నాలుగువిధములనిసూత్రార్థము.

స్తుత్యాత్మకార్థ వాదము : -

**"సయథా ఽ హిస్త్వచో నిర్ముచ్యేతఏవం సర్వస్మాత్**
**పాప్మనో నిర్ముచ్యతే యేఏవం విద్వానగ్ని హోత్రం**
**జహోతి" (శత. 2.2.36)**

పాము కుబుసమునుండి విడివడునట్లు అగ్నిహోత్రము చేయు వ్యక్తి సర్వపాపములనుండి విముక్తుడగునని యభిప్రాయము.

**"ఏతద్ధవై దేవా వ్రతం చరంతి యత్ సత్యం, తస్మాత్**
**తేయశః యశోహవతి య ఏవం విద్వాన్ సత్యం**
**వదతి" (శత. 1.1.1.5.)**

విద్వాంసులు సత్యవ్రతము నాచరింతురు. సత్యమాడు వారు యశస్సును బొందుదురని యభిప్రాయము.

**"శిరోవైయజ్ఞ స్యాతిథ్యమ్" (శత. 3.4.2.1)**

ఆతిథ్యము యజ్ఞమునకు శిరస్సువంటిది.

నిందాత్మకార్థవాదము : -

**"సమూలోవాఏష పరిశుష్యతి యో ఽనృత మభివదతి"**

**(ప్ర. ఉ. 6.1.)**

అనృతమాడు వ్యక్తి సమూలము నశించును.

పరకృతిలోణార్థవాదము : -

ఇతరునిచే చేయబడిన వ్యాహత విధివచనము పరకృతి,

**"హుత్వావపామేవాగ్రేఽ భిఘారయత్యథపృషదాజ్యం,**
**తదుహ చరకాధ్వర్యవః పృషదాజ్యమేవాగ్రేఽభి**
**ఘారయన్తి ప్రాణా అగ్నేః పృషదాజ్యసమితివదన్తః"**

**(శత. 3.8.3.24)**

వపను ముందు హోమముచేసి యటుపై పృషదాజ్యము నభిఘరించునని చెప్పి, మరల చరకాధ్వర్యులు పృషదాజ్యమగ్నికి ప్రాణములు కాబట్టి ముందు పృషదాజ్యమునే యభిఘరించుననుట పరస్పర విరుద్ధమగుటచే నిది పరకృతి.

ఇతిహాసము ద్వారా చెప్పునది పురాకల్ప మనబడును.

"ఏతేన హేంద్రోతోద్రైవాపః, శౌనకోజనమేజయం పారిక్షితం యాజయాంచకార, తేనేష్ట్వాసర్వాంపాపకృత్యాం, సర్వాం బ్రహ్మహత్యా మపజఘాన, సర్వాంహవై పాపకృత్యాం సర్వాం బ్రహ్మహత్యా మపహన్తి యోఽ శ్వమేధేన యజతే" (శత. 13.5.6.1)

శౌనకుడు జనమేజయునిచే నశ్వమేధమును జేయించెను. అతడశ్వమేధము నొనర్చి సర్వపాపకృత్యమును తొలగించుకొనెనని యభిప్రాయము. ఈయర్థవాదములు విధివాక్యముతో కూడి యర్థవంతములగును. స్వతంత్రముగా వీనికి సార్థకత యుండదు.

అనువాద లక్షణము :-

**"విధి విహిత స్యాను వచన మనువాదః" 2.1.65.**

విధి విహితస్య = విధిచే విధింపబడినదానిని, అనువచనం = పునర్వచనము = మరల చెప్పుట అనువాదః= అనువాదమనబడును.

విధినిగానీ విహితార్థమునుగానీ ఉద్దేశించి యనేక పర్యాయములు చెప్పెడు వాక్యమనువాద మనబడును. ("త్రిః ప్రథమా మన్వాహ....") అను నుదాహరణము నిట స్మరింపదగును. (అనువాదోపపత్తేశ్చ" 2.1.60) అను సూత్రమున అనువాద రూపార్థవాదము స్పష్టపరుపబడినది. మఱియు, (ఓదనం పచేత్) 'అన్నము వండుము' అనునిది విధి వాక్యము. (ఆయుర్వచోబలం సుఖం ప్రతిభానం చాన్నే ప్రతిష్ఠితమ్) అని యర్థవాదము. (పచతు పచతు భవాన్) ఇది యనువాదము. ఇందు (పచతు పచతు) వండుము వండుము అని రెండుమార్లు చెప్పుటలో త్వరగా వండుమని బోధయగును. ఇట్టి యర్థమునుద్దేశించి యొక శబ్దము పెక్కుమారులనబడుట యనువాద మనబడునని సూత్రాభిప్రాయము.

**"నానువాద పునరుక్తయోర్విశేషః శబ్దాభ్యాసోపపత్తేః" 2.1.66.**

శబ్దాభ్యాసోపపత్తేః= చెప్పిన శబ్దమును మరలచెప్పుట యభ్యాసమనబడును. అట్టి యభ్యాసము అనువాద పునరుక్తములలో రెంటియందుండుటచే, అనువాద పురుక్తయోః = అనువాద పునరుక్తములలో, నవిశేషః = భేదము లేదు.

అనువాద పునరుక్తములలో నభ్యాసము (ఒక శబ్దము ననేక పర్యాయములనుట) సమానముగ నుండుటచే రెంటియందును భేదము లేదు.

ఉత్తర పక్షము : -

**"శీఘ్రతర గమనోపదేశ పదభ్యాసాన్నా ఽవిశేషః" 2. 1.67.**

శీఘ్రతర గమనోపదేశపదభ్యాసాత్ = లోకసిద్ధమైన శీఘ్రతర గమనోపదేశమువలె నభ్యాసమును సార్థకమగుటవలన, నఅవిశేషః= అనువాద పునరుక్తములు సమానములు కావు.

అనువాద పునరుక్తులలో నభ్యాసము సమానమైనను అర్థగతభేదము లేకపోలేదు. ఒకనిని త్వరగా వెళ్లుమని చెప్పదలచి 'వెళ్లు వెళ్లు' అని చెప్పుట లోక సిద్ధవిషయము. ఇందొక శబ్దము రెండుమార్లుచ్చరింపబడుటలో త్వరితము తెలుపబడును. కాబట్టి యిట పునర్వచనము సార్థకమై అనువాద మనబడును. నిరర్థకముగా నొకపద మనేక పర్యాయము లుచ్చరింపబడుట పునరుక్తి యనబడును. కాబట్టి భేదము లేకపోలేదని సూత్రాభిప్రాయము.

అనృతాది దోషము లేవన్నంత మాత్రమున బ్రాహ్మణ వాక్యాదు లు ప్రమాణములా? యన,

**"మంత్రాయుర్వేద ప్రామాణ్యవచ్చ తత్ప్రామాణ్య మాప్తప్రామాణ్యాత్" 2.1.68.**

మంత్రాయుర్వేద ప్రామాణ్యవత్ చ = (మంత్రమనగా నిటవేదమని యర్థము) వేదము, ఆయుర్వేదము నెట్లు ప్రమాణములో అట్లే, తత్ప్రామాణ్యమ్ = బ్రాహ్మణవాక్యప్రామాణ్యము ననియెఱగ వలయును. కారణమేమన' ఆప్తప్రామాణ్యాత్ = బ్రహ్మావాదులగు ఋషులు ఆప్తులు వారు ప్రమాణమగుటవలన.

ఆయుర్వేదము, ధనుర్వేదము, గాంధర్వవేదము, అర్థవేదమునని నాలుగు ఉపవేదములు. చరకసుశ్రుతాదిఋషులు ఋగ్వేదాదుల నాధారముగా తీసికొని చరకసుశ్రుతాది గ్రంథములు రచించిరి. ఆ గ్రంథము లాయుర్వేద నామముచే వ్యవహరింపబడుచున్నవి. ఇందు వేదానుకూలముగా నున్నంతవరకు సఫలములగుచు ప్రమాణము లగుచున్నవి. కాబట్టి వాని నుదాహరించుచు, నట్లే బ్రాహ్మణ వాక్యములును వేదానుకూలముగా నున్నంతవరకు ప్రమాణము లనియు ప్రతికూల స్థలముల నప్రమాణములన్నియు మహర్షి గోతముడు సూత్రమున తన యభిప్రాయమును వెల్లడించెనని భావము.

ద్వితీయాధ్యాయమున ఆద్యాహ్నికము

# న్యాయ దర్శనము

## ద్వితీయాధ్యాయము

(ద్వితీయాహ్నికము)

పూర్వపక్షము : - (ప్రమాణ సంఖ్యానిర్ణయము)

**"న చతుష్ట్వ మైతిహ్యార్థాపత్తి సంభవాభావ ప్రామాణ్యాత్"**

**2.2.1.**

ఐతిహ్యార్థాపత్తి సంభవాభావ ప్రామాణ్యాత్ = ఐతిహ్యము, అర్థాపత్తి, సంభవము, అభావమునను ప్రమాణములుండుటచే చతుష్ట్వమ్ = ప్రమాణములు నాలుగే యనుట, న = తగదు.

(ప్రత్యక్షానుమానోపమాన శబ్దాః ప్రమాణాని) యని సూత్రించి ప్రమాణములు నాలుగేయని పూర్వాధ్యాయమున చెప్పియుండుట సరికాదు. కారణమేమన, ఐతిహ్యము. అర్థాపత్తి, సంభవము, అభావము నను మరి నాలుగు ప్రమాణములున్నవి. కాబట్టి ప్రమాణము లెనిమిదియని చెప్పవలయునని సూత్రాభిప్రాయము.

''ఇట్లు చెప్పిరి'' అను పరంపరగావచ్చు నైతిహాసిక జ్ఞానము ఐతిహ్యమనబడును. ఉపపాద్యజ్ఞానము ద్వారా ఉపపాదక కల్పన అర్థాపత్తి యనబడును. ఏదిలేకున్న ఏది కలుగు నేరదోయది ఉపపాద్యమనబడును. పగట భుజింపని వాడు రాత్రి వేళ భుజింపకున్న స్థూలుడు కాజాలడు. అతని యందు పీనత్వము కలుగజాలదు. రాత్రిభోజన మిట ఉపపాదకము, పీనత్వము ఉపపాద్యమునని భావము.

అవినాభావవర్తియగు నొకవస్తువుయొక్క సత్తాజ్ఞానము వలన కలుగు మఱియొక పదార్థ సత్తాజ్ఞానము సంభవమనబడును. కుంచెడు ధాన్యమున్నదనిన మానెడునున్నదని వేరే చెప్పనవసర ముండదు. ఇట్లే యొక రూప్యమున్న దనిన పావులా యున్నదనుటలో నెట్టిసందియము నుండదు.

అభావమన విరోధి. కొండొకచో వస్తువుయొక్క జ్ఞానము కలుగకుండుట యభావమనబడును.

ఉత్తరపక్షము:-

**"శబ్దఐతిహ్యానర్థాంతరభావాదమానేఽ_ర్థాపత్తిసంభవా భావా నర్థాంతర భావాచ్చా ప్రతిషేధః 2.2.2**

శబ్దే = శబ్దప్రమాణమున, ఐతిహ్యానర్థాంతర భావాత్ = ఐతిహ్య ప్రమాణ

మంతర్భావ మగుట వలనను, అనుమానేచ = అనుమాన ప్రమాణమున, అర్థాపత్తి సంభవాభావానర్థాంతర భావాత్ = అర్థాపత్తి మున్నగు ప్రమాణము లంతర్భావములగుట చేతను, అప్రతిషేధః = ప్రమాణములు నాలుగు కావని చెప్పుట తగదని సూత్రార్థము.

ఐతిహ్యాదులు ప్రమాణములు కావని మేము చెప్పము. కాని యవి ప్రమాణములయ్యు పూర్వము వర్ణింపబడిన ప్రత్యక్షాది ప్రమాణములలోనే చేరిపోవుటచే వానిని వేరుగా లెక్కింపము, కాబట్టి ప్రమాణములు నాలుగనుట దోషము కాదని భావము.

పూర్వపక్షము:-

**"అర్థాపత్తిరప్రమాణమ్ అనైకాంతికత్వాత్" 2.2.3**

అనైకాంతికత్వాత్ = వ్యభిచారియగుటవలన, అర్థాపత్తిః = అర్థాపత్తి, అప్రమాణమ్ = ప్రమాణము కానేరదు.

ఒక విషయమునుగూర్చి చెప్పగా మరియొక విషయము తెలియును. దాని నర్థాపత్తియందుము. మేఘములు లేకున్న వర్షము కురియదని చెప్పగా మేఘములున్న వర్షము కురియునని బోధపడును. ఇట్లే స్థూలుడైన దేవదత్తుడు పగట భోజనమే చేయడనిన, రాత్రి భోజనము చేయుచున్నాడనికదా తెలియును. కాని యీ జ్ఞానము సరియైనదనుటెట్లు? కారణమేమన: ఒకప్పుడు మేఘములున్నను వర్షింపవు. పగట భోజనము చేయకున్నను వాతరోగాదుల వలనను కలుగవచ్చును. అర్థాపత్తి ప్రమాణమేయగునెడల నది యిట్లర్థమును వ్యభిచరించరాదు వ్యభిచారము కాననగుచున్నది. కాబట్టి యర్థాపత్తి ప్రమాణముగా నంగీకరించి యనుమానమున నంతర్భావము జేయుట తగదని సూత్రాభిప్రాయము.

ఉత్తరపక్షము:-

**"అనర్థా పత్తా పర్థాపత్త్యభిమానాత్" 2.2.4**

అనర్థాఫత్తౌ = అర్థాపత్తి కాని దానియందు, అర్థాపత్త్యభిమానాత్ = అర్థాపత్తియని భావము కలుగుటచే, వ్యభిచారము కనబడుచున్నది.

అర్థాపత్తి కానిదానిని - అర్థాపత్త్యాభాసమును అర్థాపత్తిగానెంచి పూర్వపక్షమున దోషము జూపబడినది. మేఘములున్నంత మాత్రమున వర్షము తప్పక కురియును అనుట తగదు. ప్రతిబంధక రహితమగు మేఘములున్న వర్షము కురియును. రోగములేని యొక వ్యక్తి పగలు భుజింపక స్థూలుడుగానున్న

అతడు రాత్రి భుజించుచున్నాటనుట సిద్ధము. ఇట్లు కారణములేనియెడల కార్యము కలుగదన్నపుడు దానికి వీపరీతముగ కారణమున్న కార్యము కలుగునని యర్థాపత్తి ద్వారా తెలియను. కారణముండియు ప్రతిబంధకము (అడ్డు) వలన కార్యోత్పాదనము కలుగకుండుట యర్థాపత్తి కానేరదు. కాబట్టి అర్థాపత్యాభాసము నర్థాపత్తియని యెంచి దోషము జూపుట తగదని భావము.

**ప్రతిషేధా ప్రామాణ్యం చానైకాంతి కత్వాత్" 2.2.5.**

అనైకాంతికాత్వాత్ = వ్యభిచారి యగుటవలన, ప్రతిషేదా ప్రామాణ్యమ్ = (వ్యభిచారి యగుట వలన) అర్థాపత్తి ప్రమాణము కాదను పూర్వపక్ష కథనము (ప్రతిషేధము) ప్రమాణము కాదు.

'అర్థాపత్తి ప్రమాణము కాదు. అనైకాంతికమగుట వలన' అను నీ పూర్వపక్ష కథన మిట ప్రతిషేధమనబడును. ఈ ప్రతిషేధముచే నర్థాపత్తి యొక్క ప్రామాణ్యము నిషేధింపబడుచున్నది. కాని యర్థాపత్తియునికి నిషేధింపబడుట లేదు. కాబట్టి యీ ప్రతిషేధము స్వయముగా ననై కాంతికము - వ్యభిచారియగుటవలన పూర్వపక్షి కథనమును సాధింపనేరదు.

పూర్వపక్షి తన ప్రతిషేధమునకు అర్థాపత్తులన్నియు విషయమనక కొండొక యర్థాపత్తియే విషయము అనగా

**"తత్ర్పామాణ్యే వా నార్థాపత్త్య ప్రామాణ్యమ్" 2.2.6.**

తత్ర్పామాణ్యే వా = పూర్వపక్షి ప్రతిషేధమనై కాంతికమయ్యు ప్రమాణమగునెడల, అర్థాపత్త్యప్రామాణ్యమ్ న = అర్థాపత్తి అప్రమాణము కాదు.

అనైకాంతికత = (వ్యభిచారిత్వము) కొండొకతావున ప్రమాణమగునెడ మా చెప్పు నర్థాపత్తియు ప్రమాణమే యగును. అర్థాపత్తికి విషయము. కార్యోత్పత్తియున్న యెడల కారణము తప్పక ఉండితీరుననుటయే. ప్రతిబంధకమున్నచోట కారణము గార్యము నుదయింపజేయుననుటకాదు. కాబట్టి యర్థాపత్తి ప్రమాణమై యనుమానాంతర్గతమగు ననుటలో నెట్టి దోషమును లేదని వివేకము.

పూర్వపక్షము: -

అభావము అనుమానాంతర్గతమా?

**"నాభావ ప్రామాణ్యం ప్రమేయాసిద్ధేః" 2.2.7.**

అభావప్రమాణ్యం = అభావమున ప్రామాణ్యము, న = లేదు, ప్రమేయాసిద్ధేః = అభావమునకు ప్రమేయమే లేకుండుటవలన.

ప్రతి ప్రమాణమున కేదో యొక ప్రమేయముండి తీరవలయును కదా! ప్రమేయములేని ప్రమాణముండదు. ప్రమాణమనగా ప్రమేయ బోధకమనికదా యర్థము. అభావమనగా లేకుండుట కాబట్టి యది యొకానొక ప్రమేయము నెట్లు బోధింపగలదు ?

ఉత్తరపక్షము : –

**"లక్షితేష్వలక్షణ లక్షితత్వా దలక్షితానాం తత్ప్రమేయ సిద్ధేః" 2.2.8.**

లక్షితేషు = లక్షితులలో కలిసియున్న, అలక్షితానాం = లక్షితులు కానివారు, అలక్షణలక్షితత్వాత్ = లక్షణాభావమువలన తెలియబడుటచే, తత్ప్రమేయ సిద్ధిః = అభావప్రమాణప్రమేయము సిద్ధించుచున్నది.

లక్షణముతో కూడినవారు లక్షితులు. లక్షణమనగా వ్యావర్తకము – వేరు చేయునది. ఒక గురుకులమున ననేకులు బ్రహ్మచారు లున్నారనుకొనుడు. అందుకొందఱు హస్తములో వేదాది గ్రంథము లుంచుకొని తోడి బ్రహ్మచారులతో కలిసి యుపదేశార్థము గురు సమీపమున కేగిరనుకొనుడు. అపుడాచార్యుడు గ్రంథహస్తులనెడు లక్షణముతో కూడియుండని వారి నిటకు కొనిరమ్మని సంరక్షకునాజ్ఞపింపగా నతడు లక్షణ రహితులను – అలక్షితులను వేరుచేసి యాచార్యుని సమీపమున జేర్చును. ఇట లక్షణాభావమే కదా సంరక్షకున కా బ్రహ్మచారుల జ్ఞానమును కలిగించినది కాబట్టి యభావమునకు ప్రమేయము లేదనుట సరిగాదు.

ఉత్తర పక్షము : –

**"అసత్యర్థే నాభావ ఇతిచేన్నాన్య లక్షణోపపత్తేః" 2.2.9.**

అర్థే = అభావప్రతియోగియగు లక్షణరూప వస్తువు. అసతి = అలక్షిత బ్రహ్మచారులలో లేకుండుటవలన, అభావః= లక్షణాభావము సిద్ధింపనేరదు, (అలక్షిత బ్రహ్మచారులలో లక్షణమే లేకుండుట వలన నటలక్షణాభావమున్నదనుట యుచితముకాదని భావము) అందుమేని, న = అట్లు కాదు. అన్యలక్షణోపపత్తేః లక్షితబ్రహ్మ చారులలోగల లక్షణాభావమిట సిద్ధించుచున్నది.

ఏ వస్తువవెక్కడనుండునో యక్కడనే దాని యభావము నుండవలయును. అలక్షిత బ్రహ్మచారుల హస్తములలో వేదాది గ్రంథములుండుట యను లక్షణమే లేదు. కాబట్టి యిట లక్షణాభావ మొప్పదందుమేని సరికాదు. కారణమేమన, ప్రతియోగి స్థలముననే యభావముండవలయునన్న నియమమొందులేదు.

ఒకచోటనున్న వస్తువున కభావము మరియొకచో లభించుట లోక సిద్ధము కాబట్టి, అలక్షిత బ్రహ్మచారులందుగల లక్షణము లేకుండుటయు నభావమే. ఆయభావమే వారిని సంరక్షకునకు బోధించి ప్రమాణమగుచున్నది. అభావమిట్లు ప్రమేయవంతమై ప్రమాణమగుటలో నెట్టి దోషమును లేదు.

పై జెప్పిన విషయమునే స్పష్టపరుపదలచి ఛలముగా శంకించుచున్నాడు.

**"తత్సిద్ధేరలక్షితే ష్వ హేతుః" 2.2.10.**

తత్సిద్ధేః = లక్షితులలోనున్న లక్షణము యొక్క అభావము, అలక్షితేషు = లక్షితులుకాని వారిలో. అహేతుః= హేతువుకాదు.

లక్షణాభావము సిద్ధించినమీదట నది యలక్షితులకు బోధకము కాగలదుకాని, యది సిద్ధింపక కానేరదు. లక్షణముండగా దాని యభావమెట్లు సిద్ధింపగలదు? లక్షణముకలదు. లేదు అనుట వ్యాఘాతమగును. లక్షితులలో లక్షణముండుటచే లేదనుట చెల్లదు. కాబట్టి లక్షణాభావమే సిద్ధింపనపుడది యలక్షితుల ప్రతిపత్తి (జ్ఞానము) కి హేతువెట్లు కాగలదు?

**"నలక్షణావస్థితాపేక్షాసిద్ధేః" 2.2.11.**

లక్షణావస్థితాపేక్షాసిద్ధేః = లక్షితులలోనున్న లక్షణము యొక్క యభావము అలక్షితులో సిద్ధించుటవలన, న = ప్రతిపత్తి హేతువు కాదనుట తగదు.

లక్షణముండు స్థలముననే దాని యభావమున్నదనినది సిద్ధింపనేరదుకాని, లక్షితులలోగల లక్షణమునకు అలక్షితులలో దాని యభావము సిద్ధించుటలో నెట్టి దోషము నుండదు. అలక్షితులన లక్షణాభావము కలవారనుటయే కదా! లక్షణమొకచోనుండి మరియొకచోదాని యభావమున్నదనుటలో వ్యాఘాతమునుకాదు. కాబట్టి లక్షితులలో గల లక్షణముయొక్కయభావము అలక్షితులలో సిద్ధించియది ప్రతిపత్తి హేతువగుటలో నెట్టి దోషములేదు.

అయినను ఉన్నది లేదనుట వ్యాఘాతమే కదాయన,

**"ప్రాగాత్పత్తే రభావోపపత్తేశ్చ" 2.2.12.**

సూత్రము నందలి చకారము ధ్వంసాదులకుబోధకము. ప్రాగుత్పత్తే = ఉత్పత్తికి పూర్వముండు, అభావోపపత్తేః = అభావము సిద్ధించుట వలన.

పూర్వసూత్రమున జెప్పబడిన లక్షితులలోగల లక్షణము యొక్క యభావమే యలక్షితులలో సిద్ధించుచున్నదనుట రుచింపకున్న, అల క్షితులలో నాలక్షణ మేర్పడుటకు ముందుదాని యభావ ముండును గదా. ఉత్పత్తికి పూర్వముండు నభావము ప్రాగభావమన బడును. అట్టి ప్రాగభావమైనను ప్రతిపత్తిహేతువు

కాగలదు.

ప్రమాణ లక్షణమును జెప్పుచు నాప్తోపదేశము శబ్దము ('ఆప్తోపదేశః శబ్దః' 1.1.7.) అని చెప్పబడినది. ఆ శబ్దము నిత్యమా? యనిత్యమా యని యిపుడు విచారింపబడును. ఆకాశగుణమగు శబ్దము విభువు, నిత్యము, అభి వ్యక్తిధర్మకమునని కొందఱు' గంధాదిగుణముతో కూడి ద్రవ్యములతో నుండి యభివ్యక్తి ధర్మకమని కొందఱు. ఆకాశగుణమై ఉత్పత్తి వినాశములు కలిగి బుద్ధివలె ననిత్యమని కొందఱు' మహాభూత సంక్షోభము వలన కలిగి యానాశ్రితమై యుత్పత్తి వినాశములు కలిగినదని కొందఱు అందురు. కాబట్టి శబ్దము నిత్యమా? యనిత్యమా యని సంశయము కలుగగా అనిత్యమనిసిద్ధాంత పక్షమును సూత్రించుచున్నాడు.

**"ఆది మత్త్వాదైంద్రియకత్వాత్ కృతకవదుపచారాచ్చ" 2.2.13.**

ఆదిమత్త్వాత్ = (ఆదియన కారణము) కారణము గలదగుటవలన, ఐంద్రియకత్వాత్ = ఇంద్రియముచే గ్రహింపబడుట వలన, కృతకవదుపచారాచ్చ = (కృతకమ్ = కార్యము) కార్యమువలె వ్యవహరింపబడుటవలనను శబ్దమనిత్యము.

కారణమువలన నేర్పడునది కారణవంతమనబడును. కారణవంతము అనిత్యము. ఉదాహరణము ఘటపటములే. శబ్దము సైతము సంయోగవిభాగాదులవలన కలుగును. కాబట్టి కారణముగలదై యనిత్యమగుచున్నది. ఇట్లే దర్శనాంతరములను జెప్పబడినది ("సంయోగవిభాగాచ్ఛబ్దాచ్చ శబ్ద నిష్పత్తిః" వై. ద. 2.2.31.)

ఇంద్రియముచే గ్రహింపబడు సంయోగ విభాగాది గుణము నిత్యములైనట్లు శబ్దమును శ్రవణేంద్రియముచే గ్రహింపబడుచున్నది. కాబట్టి యనిత్యమని తెలియుచున్నది. శాస్త్రాంతరమునను ఇట్లే చెప్పబడినది. ("శ్రోత్ర గ్రహణోయోఽర్థ స శబ్దః" 2.2.21. వై. ద.)

కృతకము (కార్యము) కృతకమువలె వ్యవహరింపబడును. అకృతకము (నిత్యవస్తువు) కృతక సమానముగ నెన్నడు వ్యవహరింపబడదు. కృతకములగు ఘటపటాదులుత్పత్తి వినాశములు కలవిగా చూడబడుచున్నవి. శబ్దమునట్లు వ్యవహరింపబడును. 'శబ్దము జనించినది. శబ్దము నశించినది' యనుట వ్యవహారసిద్ధము. కృతకములందు తీవ్ర మందభేద వ్యవహారమున్నట్లు శబ్దమునను. తీవ్రశబ్దము, మందశబ్దమను వ్యవహారములు చూడబడుచున్నవి.

కాబట్టి శబ్దమనిత్యమని భావము.

పూర్వ పక్షము : -

పై జెప్పిన హేతువులలో దోషమును జూపుచున్నాడు.

**"నఘటాభావ సామాన్య నిత్యత్వాత్ నిత్యేష్వ**
**ప్యనిత్యవదుపచారాచ్చ" 2.2.14.**

ఘటాభావ సామాన్య నిత్యత్వాత్ = ఘటాభావము (ధ్వంసము), గోత్వాదిసామాన్యము రెండును నిత్యములగుటవలనను. నిత్యేష్వ ష్యఇనత్యవదుపచారాచ్చ = ఆకాశాది నిత్యపదార్థములు ననిత్యములవలె వ్యవహరింపబడుటవలనను, న = ఆదిమత్త్వాది కారణములచే శబ్దము అనిత్యమనుట తగదు.

ఆది కది (కారణవంతము) యగుటచే శబ్దమనిత్య మనుట సరిగాదు ఘటధ్వంసము ఆదికలదియైనను నిత్యముగా చూడబడుచున్నది. ధ్వంసమునకు ప్రతియోగి కాకుండుటయే నిత్యత్వముకదా? (ధ్వంసాప్రతియోగిత్వం నిత్యత్వమ్.) ఘటధ్వంసమునకు మరల ధ్వంసము కలుగనేరదు. కాబట్టి యది ధ్వంసమున కప్రతియోగియై నిత్యమనబడుచున్నది. అందువలన శబ్దమాది కలదగుటచే ననిత్యమనుట వ్యభిచరించుచున్నది.

ఐంద్రియకమగుటచే శబ్దమనిత్యమనుటకూడ గోత్వాది సామాన్యములు (జాతులు) ఐంద్రియకములయ్యు నిత్యములగుటచే వ్యభిచరించుచున్నది.

ఇట్లే కృతకవదుపచార హేతువును వ్యభిచరించుచున్నది. కారణమేమన, 'ఆకాశైకదేశమున భూమియున్నది' యని నిత్యమగు నాకాశమున నేకదేశవ్యవహారము చూడబడుచున్నది. ఇట్లు ఆదిమత్త్వాది కారణములు మూడును (శబ్దమనిత్యమని సాధింపనుద్దేశింపబడినవి.) వ్యభిచరించుటచే శబ్ద మనిత్యమనుట తగదు.

ఉత్తరపక్షము : -

**"తత్త్వభాక్తయోర్నానాత్వవిభాగా దవ్యభిచారః" 2.2.15.**

తత్త్వభాక్తయోః= (నిత్యత్వము) తత్త్వము, భాక్తమునని, నానాత్వ విభాగాత్ = రెండు విధములగుటచే, అవ్యభిచారః= వ్యభిచారములేదు.

ముఖ్యము గౌణము (తత్త్వభాక్తములు) నని నిత్యత్వము రెండు విధములు. ఉత్పత్తి వినాశములు లేకుండుట ముఖ్యనిత్యత్వము. ఉత్పత్తియో లేక వినాశమో లేకుండుట గౌణ నిత్యత్వము. ఘటధ్వంసాత్మక అభావము ఆత్మాదుల వలె

**"అనుపలంభా దప్యనుపలబ్ధి సద్భావన న్నా వరణానుప పత్తి రనుపలంభాత్" 2.2.20.**

అనుపలంభాదపి = ఆవరణానుపలబ్ధి యుపలంభము కాకుండుట వలనను, అనుపలబ్ధి సద్భావవత్ = ఆవరణాద్యనుపలబ్ధి యున్నదని యంగీకరించినట్లు, అనుపలంభాత్ = ఆవరణానుపలంభమువలన, ఆవరణానుపపత్తిః న = ఆవరణ సద్భావమును సిద్ధింపగలదు.

మఱియు ఉచ్చారణకు పూర్వము శబ్దము గ్రహింప బడకుం డుటకు ప్రతిబంధకముగా నావరణాదులుండిన, నందు వలన గ్రహింపబడలేదనవచ్చును. కాని యావరణాదులుపలబ్ధములగుట లేదు. వాని యనుపలబ్ధియట నున్న దనుటకు కారణము వాని యుపలంభా భావమేకదా? ఉపలంభాభావము ఆవరణానువలబ్ధి కలదనుటకు హేతువైనట్లు, ఆవరణాదులు యుపలంభాభావము సైతము వాని సద్భావమును (ఉనికిని) ఎట్లు బోధింపదు? బోధించుననియే భావము. కాబట్టి యావరణముండుటచే శబ్దోచ్చా రణకు పూర్వమది గ్రహింపబడుటలేదుగాని శబ్దములేక కాదు.

ఉత్తరపక్షము : -

**"అనుపలంభాత్మకత్వా దనుపలబ్ధే రహేతుః 2.2.21.**

అనుపలబ్దేః= ఆవరణాదులు యనుపలబ్ధి, అనుపలంభాత్మకత్వాత్ = ఆవరణాద్యుపలబ్ధ్యభావాత్మక మగుటవలన, అహేతుః= (తదనుపలబ్ధేః 2.2.19. అను సూత్రమున జెప్పబడిన) హేతువు సరికాదు.

ఉపలబ్ధమగు వస్తువు ఉన్నదందుము. ఉపలబ్ధము కాకున్న లేదందుము. ఇట్లు లబ్ధ్యనుపలబ్ధులు సదసద్విషయములు. అనుపలబ్ధియన నుపలబ్ధ్యభావమే. అభావమగుట వలన నుపలబ్ధము కాదని భావము.

ఆవరణమో సద్వస్తువు - భావాత్మకము. అట్టిదున్న పక్షమున నుపలబ్ధము కావలయును. ఉపలబ్ధి యగుట లేదు. కాబట్టి లేదనుచున్నాము. కాబట్టి యనుపలంభము వలన నావరణాదు న్నవనుట యహేతువు - పొసగదని భావము.

పూర్వపక్షము : -

**"అస్పర్శత్వాత్" 2.2.22.**

అస్పర్శత్వాత్ = స్పర్శరహిత మగుటచే, శబ్దము నిత్యము.

ఆకాశాదులు స్పర్శములేనివై నిత్యము లనబడుచున్నవి. అట్లే శబ్దమును

స్పర్శములేనిదగుట వలన నిత్యమే.
ఉత్తరపక్షము : -

**'న కర్మానిత్యత్వాత్ " 2.2.23.**

కర్మానిత్యత్వాత్ = స్పర్శ రహితమయ్యు కర్మము అనిత్యమగుట వలన, న = శబ్దము స్పర్శలేనిదగుటచే నిత్యమనుట తగదని యర్థము.

స్పర్శరహితమైనదెల్ల నిత్యమను నియమము లేదు. కర్మము స్పర్శరహితమేకాని నిత్యముకాదు. కాబట్టి శబ్దము నిత్యమనుటకు జెప్పబడిన అస్పర్శత్వహేతువు సరికాదు.
పూర్వపక్షము : -

**"సంప్రదానాత్" 2.2.24.**

సంప్రదానాత్ = సంప్రదానము వలన శబ్దము నిత్యము.

గురువు శిష్యునకు శబ్దములను సంప్రదానము చేయును. (ఇచ్చును.) శిష్యుడు వానిని గ్రహించును. శబ్దము నిత్యమగు నెడల నియ్యది సంభవింపదు. కాబట్టి శబ్దము నిత్యము.
ఉత్తరపక్షము : -

**"తదంతరాలానుపలబ్దే రహేతుః" 2.2.25.**

తదంతరాలానుపలబ్ధేః = గురుశిష్యుల మధ్య శబ్దమవస్థితము కానందున, అ హేతుః = సంప్రదానహేతువు సరికాదు.

సంప్రదీయమాన వస్తువు దాతృపరిగ్రహీత మధ్య (అంతరాలమున) నవస్థితమై గోచరించును. అట్లు గురుశిష్యుల

**"నాణు నిత్యత్వాత్"**

అణునిత్యత్వాత్ = అణువు రూపము గలదయ్యు నిత్యమగుట వలన. న = శబ్ద నిత్యత్వ సాధక హేతువు సరికాదని సూత్రాభిప్రాయము.

'నాణు నిత్యత్వాత్' అనునిది వాస్తవమున సూత్రముకాదు. భాష్యవాక్యము కాబట్టి వార్తి కాదుల నియ్యది కానరాదు. అందువలన సూత్రముల జేర్పనైతి.

మధ్య నిచ్చిపుచ్చుకొను వేళ శబ్దమవస్థితమైయున్న సంప్రదాన హేతువు శబ్దనిత్యత్వమును సాధింపగలదు. కాని యట్లు శబ్దమవస్థితము కాకుండుటవలన నీ హేతువు సరికాదు.
పూర్వపక్షము : -

**"అధ్యాపనా దప్రతిషేధః" 2.2.26.**

అధ్యాపనాత్ = అధ్యాపనమువలన, అప్రతిషేధః= సంప్రదాన మహేతువనుట సరిగాదు.

గురుశిష్యుల మధ్య శబ్దము ప్రత్యక్షముగా గ్రహింపబడకున్నను అనుమానమున నది తెలియనగును. గురువుచే నీయబడి శిష్యునిచే నదిగ్రహింపబడకున్న నధ్యాపనము జరుగనేరదు. గురువుచే సంప్రదీయమాన శబ్దమును శిష్యుడు పొందుటయే యధ్యాపన మనబడునుగదా. కాబట్టి సంప్రదాన హేతువు శబ్దనిత్యత్వమును బోధింపగదని భావము.

ఉత్తరపక్షము : –

**"ఉభయోః పక్షమో రన్యతరస్యాధ్యాపనా దవిప్రతిషేధః" 2.2.27.**

ఉభయోః పక్షయోః = శబ్దము నిత్యము, అనిత్యమునను రెండు పక్షములందును, అన్యతరస్య = ఏదో ఒక పక్షమంగీకరించుటచే అధ్యాపనాత్ = అధ్యాపనము జరుగగలదు. కాబట్టి, అవి ప్రతిషేధః = పైన జెప్పిన సమాధానము సరిగాదని యర్థము.

గురువుచే నీయబడు శబ్దము గురుశిష్యులకుమధ్య నవస్థితమైయుండి శిష్యునిచే గ్రహింపబడుట యధ్యాపనము కాబట్టి యంతరాలమున శబ్దావస్థితి దాని నిత్యత్వమును సాధింపగలదనిగదా! పూర్వ పక్షి యభిప్రాయము.

శబ్ద మనిత్యమని సిద్ధాంతించు మేము గురువుచే నీయబడు శబ్దము సంతానవృత్తితో శిష్యుని ప్రాప్తించుట యధ్యాపన మందుము. ఇట్లుభయపక్షమందు సిద్ధించు నధ్యాపనము గురుశిష్యుల మధ్య శబ్దావస్థితిని సాధించి తద్వారా దాని నిత్యత్వమును సాధించును గాని శబ్దసంతానమును బోధించి యనిత్యత్వమును సాధింపనేరదని చెప్పనేరము గదా! కాబట్టి యధ్యాపనము నిత్యత్వమును సాధింపనేరదని యభిప్రాయము.

భాష్యకారులు (వాత్స్యాయనుడు) ఆచార్యస్థ శబ్దమంతేవాసిని చేరుట యధ్యాపనమా? లేక, నృత్యోపదేశము వలె గ్రహింపబడిన దాని ననుకరించుట యధ్యాపనమా? యని శంకించి యధ్యాపనము సంప్రదానమునకు లింగము కాదని నిరాకరించి యుండిరి.

పూర్వ పక్షము : –

**"అభ్యాసాత్" 2.2.28.**

అభ్యాసాత్ = అభ్యాసము వలన శబ్దము నిత్యము.

ఒక్క విషయమునకు సంబంధించి యనేక క్రియలు కలుగుట యభ్యాస మనబడును. ఒక శబ్దమును మరల మరల నుచ్చరించుటయు, ఒకే రూపము ననేక పర్యాయములు దర్శించుటయు నభ్యాస మనబడును. అనేక పర్యాయము లొకే శబ్దము నుచ్చరింప వలయునన్న నది యవస్థితమై యుండవలయును. ఒకచో నవస్థితమై యుండని రూపమును మరల మరల చూచుట సంభవింపదు గదా! 'ఒక రూపము ననేక పర్యాయములు చూచుచున్నారు' యనువాకమునసేక పర్యాయములు అధ్యయనము చేయుచున్నాడు' అను తావులందు సమానముగ నభ్యాసము గోచరించుచున్నది. అభ్యాస మవస్థితమునకే సంభవించును. కాబట్టి శబ్దము నిత్యము.

ఉత్తరపక్షము : -

**"నాన్యత్వేఽ ప్యభ్యాసస్యోపచారాత్" 2.2.29.**

అన్యత్వేఽపి = శబ్దమనేక మైనను, అభ్యాసస్యోపచారాత్= అభ్యాసము సంభవ మగుట వలన, న = పూర్వపక్షి చెప్పినది సరికాదు.

ఒకే రూప మనేక పర్యాయములు దర్శింపబడునట్లు, ఒకే శబ్ద మనేక పర్యాయము లనుట యభ్యాసము అను నియమము లేదు. శబ్దమొక్కటికాక యనేకములైనను అభ్యసింప వీలగును. అగ్ని హోత్రాది కర్మము లనేకములయ్యు నభ్యసింపబడుచున్నవి. (ద్విర్భుంక్తే ద్విర్జుహోతి. ద్వి రనృత్యత్, త్రిరనృత్యత్) రెండుమారులు భుజించుచున్నాడు. రెండు మారులు హోమము చేయుచున్నాడు. మూడుమారులు నృత్యము చేసెను. అనునిట్టి యనేకకర్మలందును అభ్యాసమును జూచుచున్నాము కాబట్టి గురువుచే నీయబడు శబ్దమొక్కటిగా నుండి యభ్యసింపబడుచున్న దను నియమములేదు. గురువుచే నుచ్చరింపబడు శబ్దము సంతానవృత్తితో ననేకము లగుచు శిష్యునిచే గ్రహింపబడి పునఃపునః అభ్యసింపబడును.

ఇట్లు ఒక విషయముననే గాక యనేక విషయమునను అభ్యాసము సంభవమగుట వలన నభ్యాసహేతు వనై కాంతికమై శబ్ద నిత్యత్వమును సాధించుననుట పొసగదని సూత్రాభిప్రాయము.

పూర్వపక్షము: -

**"అన్యదన్యస్మా దనన్యత్వా దన్య దిత్యన్యతాఽ భావః" 2.2.30.**

అన్యాస్మాత్ = అన్యముకంటె, అన్యత్ = దేనినన్యమనుచున్నావో యది, అనన్యత్వాత్ = తనకంటె నన్యముకాదు, కాన, అన్యత్ ఇతి = అన్యము

అనుదానిలో, అన్యతా ఽ భావః= అన్యత్వమేలేదు.

"అన్యత్వేఽ ప్యభ్యాసస్యోపచారాత్" అను సూత్రమున అన్యత్వము కలదని యెంచి హేతువునందు వ్యభిచారము చూపబడినది. లోకమున నెచ్చటను అన్యత్వమనునదియే లేదు. ప్రతివస్తువును తాను తనకంటె నన్యము కానేరదు. ఇట్లు ఏ వస్తువునందు నన్యత్వము సిద్ధింపనపుడు పూర్వ సూత్రమున జూపిన దోషము సరికాదని సూత్రభావము.

ఉత్తరపక్షము: –

**"తదభావే నాస్త్యనన్యతా తయోరితరేతరాపేక్షసిద్ధేః" 2.2.31.**

తదభావే = అన్యత్వమే లేనియెడల, అనన్యతా నాస్తి = అనన్యతములేదు. తయోః= అన్యత్వ – అనన్యత్వములు, ఇతరేతరాపేక్షసిద్ధేః = ఒకటి యుండిననే మఱియొకటి యుండును.

జగత్తున నన్యత్వమే లేకున్న, అనన్యత్వమును లేదని సిద్ధమగును. అన్యత్వము నపేక్షించియే అనన్యత్వము సిద్ధించును కదా! కాబట్టి యందొకటి లేదు; రెండవది కలదనుట యసంగతము. మఱియు లోకమున నొక వస్తువు తాను తన కంటె నన్యము కాకపోవచ్చును. కాని మఱియొకదాని కంటె నన్యము కాదనుట యనుభవ విరుద్ధము. నీలము తనకంటె నన్యము కాకున్న పీతముకంటె నన్యము కాక యనన్యమే యనుట ఎట్లు పొసగును? కాబట్టి యన్యతా ఽ భావమును సాధింపబూనుట వివేకము కాదు. (స్వాపేక్షయా) తనకంటె నితరము అన్యమే యగును. అందువలన (నాఽ న్యత్వేఽ ప్యభ్యా సస్యోపచారాత్) అను సూత్రమున జూపబడిన వ్యభిచార దోషము యుక్తమే యని అభిప్రాయము.

పూర్వపక్షము : –

**"వినాశ కారణానుపలబ్ధేః" 2.2.32.**

వినాశకారణానుపలబ్ధేః = వినాశకారణము లభింపనందున.

లోకమున ఘటఘటాది కార్యము లనిత్యములు. వాని వినాశ కారణములును మనము జూడగలుగుచున్నాము. శబ్దమునకు వినాశకారణము లభింపనందువలన నదినిత్యమే యని భావము

ఉత్తర పక్షము : – (ప్రతిబంధి సమాధానము)

**"అశ్రవణ కారణానుపలబ్ధేః సతత శ్రవణ ప్రసంగః" 2.2.33.**

అశ్రవణ కారణానుపలబ్ధేః= శబ్దము వినబడకుండుటకుగల కారణము లభింపనందువలన, సతతశ్రవణ ప్రసంగః = శబ్దమెల్లప్పుడు వినబడుచుండవలసి

యుండును.

శబ్దము నిత్యమగునెడల నెల్లపుడు సది వినబడుచుండ వలయును. నిత్యమై వినబడకుండుటకు కారణమేమి? అట్టి కారణమేదైన నున్న నది తెలియబడవలయును కదా! కారణము లేకయే శబ్దము నిత్యమై యుండియునది యెల్లప్పుడు వినబడక యప్పుడప్పుడు వినబడుచుండునని కల్పించుట యుక్తము కానేరదు. ఉన్న శబ్దము కారణము లేకయే యెల్లపుడు వినబడదని యంగీకరించు నెడల వినాశకారణము లభింపకున్నను శబ్దము నశించ చునేయున్నది కాబట్టి యది యనిత్యమనుటలోను దోషము లేదు.

ప్రతిబంధి యుత్తరము నొసగి ముఖ్య సమాధానమిచ్చుచున్నాడు.

**"ఉపలభ్యమానేచానుపలబ్ధే రసత్వాదనపదేశః" 2.2.34.**

ఉపలభ్యమానేచ = (మఱియు) శబ్దవినాశ కారణము లభించుచుండ, అనుపలబ్ధేః = దానియనుపలబ్ధి, అసత్వాత్= లేకుండుటచే, అనపదేశః= వినాశకారణము లభింపలేదనుట సరికాదు.

ఘటాదులవలె నుత్పన్నవస్తువు నశించును అను నను మానము ననుసరించి సంయోగ విభాగాదులవలననే శబ్దము జనించుచున్నది కాబట్టి తప్పక నశించునని సిద్ధించుచున్నది. అవశ్యముగా నేర్పడు వినాశమయినను కారణములేకున్న నేర్పడనేరదు కాబట్టి వినాశకారణ మూహింపబడును. ఇట్లు కారణముపలబ్ధముగుచుండ వినాశకా రణానుపబ్ధివలన శబ్దము నిత్యమనుట తగదు. అనుమానము ద్వారా సిద్ధించు వినాశకారణమువలన శబ్దము అనిత్యమే యని సూత్రాభిప్రాయము. పూర్వశబ్ద వినాశమునకు కారణము తరువాతి శబ్దమే. అన్నిటికంటె చివరి శబ్దము తనకంటె పూర్వముండు శబ్దమే వినాశ కారణముగా గలిగియుండునని వివేకము.

వినాశకారణము ప్రత్యక్షముగా సిద్ధింపవలయుననిన,

**"పాణి నిమిత్తప్రశ్లేషాచ్ఛబ్దాభావే నానులపబ్ధిః" 2.2.35.**

పాణినిమిత్తప్రశ్లేషాత్ = వాయింపబడి మ్రోగుచున్న కంచుగంట మున్నగు వస్తువులతో చేతినిసంయోగింపజేసినందు వలన, శబ్దాభావే= శబ్దము నశించుచుండగా, నానుపలబ్ధిః= వినాశకారణము లభింప దనుటతగదు.

ఉత్పన్న శబ్దము దేనివలన నశించుచున్నదో అదియే దానికి వినాశకారణమనుట నిస్సంశయము. ఒక కంచుగంటను వాయించి యందు శబ్దము బయలుదేరినపుడు చేతితో నాగంటను తాకిన వెంటనే శబ్దము నశించుట

లోకసిద్ధము. ఇట్లు హస్తస్పర్శమువలన శబ్దము నశించుట చూచుచున్నాము. ఇది ప్రత్యక్ష సిద్ధము. కాబట్టి వినాశకారణము లభింపకుండుట వలన శబ్దము నిత్యమే యనుట చెల్లదు.

**"అస్పర్శత్వా దప్రతిషేధః" 2.2.36.**

అస్పర్శత్వాత్ = శబ్దాశ్రయము స్పర్శింపవీలుగాని దగుటవలన నది నిత్యమేయనుట, అప్రతిషేధః = ప్రతిషేధముకాదు.

మఱియు 'పాణినిమిత్త ప్రశ్లేషా' దను సూత్రమున శబ్దమును నశింపజేయుకారణము ప్రత్యక్షముగా సిద్ధించుచున్నట్లు నిరూపింపబడినది. కాబట్టి అస్పర్శత్వమను హేతువు శబ్ద నిత్యత్వమును సాధింపనేరదు. ఇట్లు శబ్దమనిత్యమనియే సిద్ధమగుచున్నది.

**"విభక్త్యంతరోపపత్తేశ్చ సమాసే" 2.2.37.**

(పై సూత్రమంతయు నిందనువర్తించును) సమాసే = వ్యాకరణ శాస్త్రమున ప్రసిద్ధమగు సమాసమునందు, విభక్త్యంతరోపపత్తేశ్చ= పూర్వముండు విభక్తిస్థానములో మఱియొక విభక్తి జనించుట వలనను, శబ్దమనిత్యమని సిద్ధించుచున్నది.

అనేక పదముల నొకపదముగాచేసి వ్యవహరించుట వ్యాకరణ శాస్త్రమున సమాసమనబడును. ఇట్లు కొన్ని పదములను జేర్చి యొక్కటిగా జేయునపుడాయా పదములలో గల విభక్తి లోపించి మఱియొక విభక్తి యేర్పడును. ఇది యొక శబ్దసంస్కారము. శబ్దము నిత్యమగునెడల నిట్టి సంస్కారము పొసగనేరదు. నిత్యమున తరుగు పెరుగులు కలుగజాలవు. సమాసమున నొకవిభక్తి పోవుటయు, మఱియొకటి యట చేరుటయు వ్యాకరణసిద్ధము. కాబట్టి శబ్దమనిత్యమేయని సూత్రాభిప్రాయము.

ఇంతవరకు శబ్దమనిత్యమని నిర్ణయింపబడినది. ప్రస్తుతమున మఱియొక విషయమును పరీక్షింపదలచి ముందుగా సంశయమును ప్రదర్శించుచున్నాడు.

**"వికారాదేశోపదేశాత్ సంశయః 2.2.38.**

వికారాదేశోపదేశాత్ = వికారము, ఆదేశము నను నీ రెండునుపదేశింప బడుటవలన, సంశయః= శబ్దమునగల యొకవర్ణస్థానమున నేర్పడు మఱియొక వర్ణము వికారమా? ఆదేశమా? యను సంశయము కలుగును.

'దధ్యత్ర' (దధి+ అత్ర) యనునిట్టి సంధిస్థలములందు (ఇకోయణచి) అను నిట్టి వ్యాకరణ సూత్రము ద్వారా ఇకార స్థానమున యకార

ముపదేశింపబడుట వ్యాకరణ శాస్త్ర సిద్ధము. సంధిస్థలమున ఇకారము ఇత్వమును విడిచి యత్వమును బొందును. ఈ స్థితిని వికారమని కొందఱు పలుకుదురు. ఇకారమును విడిచి దాని స్థానమున యకారము ప్రయోగింపబడుట అదేశమని కొందరు చెప్పుదురు. కాబట్టి వికారమా? ఆ దేశమా? యని సందేహము కలుగుట స్వభావము. ఇందు వికారమనుట పూర్వపక్షము. ఆ దేశమనుట సిద్ధాంతమని భావము.

(వికారవాదము)

**"ప్రకృతి వివృద్ధౌ వికార వివృద్ధేః" 2.2.39.**

ప్రకృతివివృద్ధౌ = ప్రకృతి వృద్ధినొందిన, వికారవివృద్ధేః= వికార మందును వృద్ధికలుగుట వలన, ఇకారాదికి కలుగు యకారాది వికారముకాదని సూత్రార్థము.

లోకమున మూల పదార్థము (ప్రకృతి) సవృద్ధి యేర్పడిన, దానిచే నేర్పడు (వికారము) కార్యము నందును వృద్ధి కలుగుట చూచుచున్నాము. సువర్ణమున పెంపుగలిగిన దానిచే నొనరింపబడు భూషణములందును వృద్ధికలుగును. క్షీరమున నెంత పెంపుగలిగిన దాని వలన నేర్పడు దధి (పెరుగు) యందును సంతపెంపు గలుగును. దధి, భూషణములు క్షీర సువర్ణ వికారములగుట లోక విధితము. ఇట్లే 'ఇ' కారమునకు 'య' కారము వికారమే యగునెడల ఇకారమున వృద్ధి కలిగినపుడు యకారమునను వృద్ధి కలుగవలసి యుండును. అట్లు కలుగకుండుట వ్యాకరణశాస్త్రసిద్ధ విషయము. ఎట్లన, (దధి+ అత్ర= దధ్యత్ర) ఈస్థలమున 'ఇ' కారము హ్రస్వము, (సుధీ+ ఉపాస్యః= సుధ్యుపాస్యః ) ఈ స్థలమున 'ఈ' కారము దీర్ఘము. ఈ, 'ఇ' కార, 'ఈ' కారస్థానముల నేర్పడు యకారమొకటిగానే యుండును. ఈ రెండవ యుదాహరణమున 'ఈ' కార స్థానమున నేర్పడు 'య' కారమునకును 'ఇ' కార స్థానమున నేర్పడు 'య' కారమునకును నెట్టి భేదమును లేదు. ఇది వికారమగునెడల ప్రకృతి భూతమగు 'ఇ' కారమున వృద్ధి (పెంపు) కలుగుటచే 'య' కారమునను పెంపు గలుగవలసి యుండును. అట్లు కలుగక పోవుటచే వికారము కాదని యభిప్రాయము.

పూర్వపక్షము : -

**"న్యూన సమధికోపలబ్ధేః వికారాణా మహేతుః 2.2.40.**

వికారాణామ్ = వికారములు (కార్యములు) న్యూనసమధికోపలబ్ధేః=

ప్రకృతిభూత (మూల పదార్థములకంటె హెచ్చుతగ్గులుగా నేర్పడుట లోకమున చూచుటచే, ఆహేతుః= ప్రకృతి ననుసరించి వికారమున హెచ్చుతగ్గులు కలుగవలయుననెడి హేతువు సరియైనదికాదు.

మూలపదార్థము (కారణపదార్థము) ననుసరించి మూలమున పెంపుగలిగిన పెచ్చుగా నేర్పడి, తగ్గుగలిగిన తక్కువగా నేర్పడునదియే వికారమను నియమము లేదు. నారికేళ బీజమునుండి యేర్పడు నారికేళాంకురము బీజముకంటె చిన్నదిగా జూడబడుచున్నది. మఱ్ఱివిత్తనమునుండి యేర్పడు వటాంకురము విత్తనముకంటె పెద్దదిగా నుండును. కాబట్టి మూలముకంటె వికృతులలో హెచ్చుతగ్గులుండవలననుట సరికాదు. అందువలన 'ఇకార' స్థానమున ప్రయోగింపబడు యకారము వికారముకాక ఆదేశమే యగుననుట పొసగదు.

ఉత్తరపక్షము: –

**"నాతుల్య ప్రకృతీనాం వికార వికల్పాత్" 2.2.41.**

అత్యు ప్రకృతీనామ్ = ప్రకృతి పదార్థములు భిన్నములయి నపుడు, వికార వికల్పాత్ = వికార పదార్థములందును భేదముండవలసి యుండుటచే, న = పూర్వోక్తశంక సరికాదు.

"ప్రకృతి వివృద్ధౌ" అనుసూత్రమున ప్రకృతి పదార్థము నను సరించి వికారమున హెచ్చుతగ్గులు కలుగవలయుననుట (ఆదేశవాదులమగు) మా యభిప్రాయము కాదు. ప్రకృతిపదార్థము భిన్నమైనపుడు వికారమును భిన్నము కావలసియుండుననుట మా యభిప్రాయము. నారికేళబీజము నుండి వటాంకురముగానీ వటబీజమునుండి నారికేళముగానీ కలుగనేరదు. వటబీజమునుండి వటాంకురమే ఉద్భవించును. అట్లే 'ఇ' కారమునకు 'య' కారము వికారమగునెడల 'ఈ' కారమునకు 'య' కారముగాక మరియొకటియై యుండవలయును. అట్లుగాక 'ఇ' కార 'ఈ' కారములకు రెంటికిని యకారమే ప్రయోగింపబడుటచే 'య' కారము వికారము కాదు. ఆ దేశమే యగును.

పూర్వపక్షము :–

**"ద్రవ్య వికారే వైషమ్యవత్ వర్ణవికార వికల్పః" 2.2.42.**

ద్రవ్యవికారే వై షమ్యవత్ = ద్రవ్యరూపమున వట నారికేళములు తుల్యములయ్యు విలక్షణములైనట్లు, వర్ణవికార వికల్పః= ఇకార ఈకారస్థానమున ప్రయోగింపబడు యకారములు వర్ణరూపమున సమానములయినను విషమములే.

వట నారికేళ వృక్షములు ద్రవ్యభావమున సమానము లైనను, ప్రకృతి (బీజ) భేదమువలన వికారములగు నంకురములు భిన్నములు (విలక్షణములు) అయినట్లు ఇకార ఈకార స్థాన ప్రయుక్త యకారములు ప్రకృతి భేదమువలన విలక్షణములే యని యెఱుగవలయునని వికారవాది యభిప్రాయము. కాబట్టి ఇకార స్థానిక యకారము వికారమేగాని యా దేశము కానేరదు.

ఉత్తరపక్షము: –

**"న వికారధర్మానుపపత్తేః" 2.2.43.**

వికార ధర్మానుపపత్తేః = యకారమున వికృతి ధర్మము లేకుండుటవలన. న = వికారవాది యభిప్రాయము సరికాదు.

వికారములలో ప్రకృతి ధర్మము కానరానంత వరకు ప్రకృతులు భిన్నమైనంత మాత్రముచేత తద్వికారములును భిన్నములే యనుట యెట్లుపొసగును? వట నారికేళ వృక్షములు, వాని మూలములగు బీజములు భిన్నములగుటవలన భిన్నములనుట తగదు. బీజధర్మము వృక్షమున చూడబడుచున్నది. అందుచే నవి భిన్నములనుట యుచితమే. యకారమున ప్రకృతి ధర్మములగు హ్రస్వత్వ దీర్ఘత్వములు కనబడకుండుటచే ఇకార ఈకారములో వచ్చు యకారము వాని వికారము కానేరదు.

ప్రకృతి భూతమగు వస్తువులో నేధర్మములుండునో ఆధర్మములు కలిగియుండి వ్యూహభేదము (పూర్వరూపము పోయి క్రొత్తరూపము) కలుగుట వికారమనబడును. క్షీరము ప్రకృతిభూతమగు వస్తువు. పెరుగుదానికి వికృతి. పెరుగులో క్షీరధర్మముండును కాని క్షీరరూపము పోయి క్రొత్తరూపమొకటి యేర్పడును. కాబట్టి పాలకు వికృతి పెరుగు.

**"వికారప్రాప్తానా మపునరాపత్తేః" 2.2.44.**

వికారప్రాప్తానామ్ = వికృతి రూపము నొందిన ప్రకృతివస్తువులు, అపునరాపత్తేః= మరల స్వస్వరూపమును బొందవు.

వికారము మరల ప్రకృతి రూపమును బొందదు. పెరుగు మరల పాలరూపమును బొందకుండుట లోకవిధితమే కాని, దధ్యత్ర అను పదమున సంధినపేక్షించినపుడు ఇకార స్థానమున యకారమును ప్రయోగింతురు. సంధి నపేక్షింపనపుడు (దధి+ అత్ర) ఇకారముచే ప్రయోగింతురు. కాబట్టి ఇకారస్థానమున ప్రయోగింపబడు యకారము దాని వికారము గాక ఆదేశమే యని సూత్రాభి ప్రాయము.

పూర్వ పక్షము : –

**“సువర్ణాదీనాం పునరాపత్తే రహేతుః” 2.2.45.**

సువర్ణాదీనాం = బంగారము మున్నగువని, పునరాపత్తేః= నగల రూపమున వికృతములయ్యు మరల పూర్వరూపమును బొందుట చూచుచున్నాము. కాబట్టి, అహేతుః= వికృతులు మరల ప్రకృతిరూపమును బొందవని చెప్పిన హేతువు సరికాదు.

బంగారము నగలరూపమున వికృతరూపమును బొందియు మరల స్వస్వరూపమును బొందుచుండుట చూచుచున్నాము. అట్టియెడ వికారము ప్రకృతిరూపమును బొందనేరదనుట తగదు. కాగా యకారము ఇకారవికారముకాదనుటయు హేతుబద్ధము కాదు,

ఉత్తర పక్షము: –

**“న తద్వికారాణాం సువర్ణభావావ్యతిరేకాత్” 2.2.46.**

తద్వికారాణామ్ = సువర్ణవికారములయిన నగలు, సువర్ణభావా వ్యతిరేకాత్ = సువర్ణమే కాని, దానికంటె విలక్షణమైన వికృతిని బొందలేదు. కాబట్టి, న = వికారము ప్రకృతిరూపమును బొందవని చెప్పిన హేతువు అహేతువు కాదు.

ప్రతి యల్పవికారమును ప్రకృతిరూపమును బొందదని సమాధానకర్త యభిప్రాయముకాదు. ప్రకృతిధర్మము కలిగియుండి విజాతీయరూపమున పరివర్తించు వికారము మరల ప్రకృతి రూపమును బొందదని యభిప్రాయము. కాబట్టి క్షీర వికృతి దధియైనట్లు ఇకార స్థానమునవచ్చు యకారము దాని వికృతికాక యా దేశమే యగును.

**“నిత్యత్వేఽ వికారాత్ అనిత్యత్వేచానవస్థానాత్” 2.2.47.**

నిత్యతే = వర్ణములు నిత్యములయిన పక్షమున, అవికారాత్ = వికారమ సంభవము. అనిత్యత్వేచ = నిత్యములుకాని పక్షమున, అనవస్థానాత్ = అవస్థాయిత్వము (స్థితి) లేనివగును.

వర్ణములు నిత్యములో లేక యనిత్యములో యగును. ఉభయపక్షములందును యకారము వికారమననొప్పదు నిత్య పక్షమున వర్ణము వికృతినొందజాలదు. వికృతి నిత్యత్వమునకు విరోధి. అనిత్యమైనచో ఇకారము నశించిన తదుపరి వచ్చు యకారము ఇకార వికృతియనుట ఎట్లుచెల్లును? ప్రకృతి భూత వస్తువు అవస్థాయియై (స్థిరమై) న కదా వికృతి నొందగలుగును? కాబట్టి యుభయవిధముల నెట్లు చూచినను ఇకార స్థానిక యకారము ఆ

దేశమే యననొప్పును. వికారమనుట పొసగదు.

పూర్వపక్షము : -

వికారవాది వర్ణములు నిత్యములను పక్షము నంగీకరించి తనవాదమును స్థిరపరుప నుద్దేశించుచు సమాధానము నిచ్చుచున్నాడు.

**"నిత్యానా మతీంద్రియత్వాత్ తద్ధర్మ వికల్పాచ్చ వర్ణవికారాణా మప్రతిషేధః" 2.2.48.**

నిత్యానాం = నిత్యపదార్థములు, అతీంద్రియత్వాత్ = (కొన్ని ఇంద్రియగోచరములయినను) అతీంద్రియములగుటవలన, తద్ధర్మవికల్పాత్ = వాని ధర్మములలో వికల్పము కలుగుట కవకాశముండుటచేత, వర్ణవికారా = ణామ్ = వర్ణములు నిత్యములైనను వానికి వికారములు, అప్రతిషేధః = కలుగవని చెప్పవీలుపడదు.

నిత్య పదార్థము లన్నియు నొకే విధముగ నుండు నన వీలుపడదు. కొన్నిట నొక ధర్మము, మరి కొన్నిట మరియొక ధర్మము చూచుచున్నాము. ఆకాశ పరిమాణ్వాది నిత్యపదార్థములు ఇంద్రియములకు గోచరములు కావు. గోత్వ పృథివీత్వాది జాతులు నిత్యము లైనను ఇంద్రియ గోచరములేయని శాస్త్ర మంగీకరించు చున్నది. ఇట్టి వికల్పము నిత్య పదార్థములలో నంగీకరించు చున్నాము. కాబట్టి, ఆకాశాది నిత్య పదార్థములలో వికారము లేకున్నను వర్ణములు నిత్యములయినప్పటికీ వికారవంతము లని చెప్పిన దోషమేమి? కాగా వర్ణములు నిత్యములని యంగీకరించిన పక్షమున ఇకారస్థానిక యకారము వికారమని చెప్పవలను పడదనుట తగదు.

**'అనవస్థాయిత్వేచ వర్ణోపలబ్ధివత్ తద్వికారోపపత్తిః' 2.2.49**

అనవస్థాయిత్వేచ = వర్ణముల నిత్యములై స్థాయిత్వము లేనివైనను, వర్ణోపలబ్దివత్ = అవి శ్రవణేంద్రియములచే గ్రహింపబడుచున్నట్లు, తద్వికారోపపత్తి: = వర్ణవికారమును సంభవమే.

వర్ణము లనిత్యము లను పక్షమున నవి స్థాయిత్వము లేనివగుటచే వానికి వికారములు కలుగుట కవకాశము లేదందులేని యది సరికాదు. కారణమేమన, అనిత్యము లయినను శ్రవణేంద్రియముచే గ్రహింపబడుచున్నట్లాదేశవాదులయిన మీరు నంగీకరించుచున్నారుకదా! స్థాయిత్వము లేనివై శ్రవణముచే గ్రహింపబడునట్లు వికారము నేల పొందజాలవు? పొందగలవు. కాబట్టి యుభయపక్షములందును ఇకారస్థానిక

యకారము వికారమేగాని యాదేశము కాదని పై రెండు సూత్రముల తాత్పర్యము:-

ఉత్తరపక్షము :-

"వికార ధర్మిత్వే నిత్యత్వాభావాత్ కాలాంతరే వికారోపపత్తేశ్చాప్రతిషేధః" **2.2.50**

వికారధర్మిత్వే = వర్ణములు వికారము కలవగుచో, నిత్యత్వా భావాత్ = నిత్యములు కాజాలవు. చ = మరియు, కాలాంతరే = వర్ణస్థితి కాలముకంటె భిన్నమైన కాలములో, వికారోపపత్తేః= వికారము కలుగు చున్నది. కాబట్టి, ప్రతిషేధః= వర్ణములు నిత్యములు, అనిత్యములునను నుభయపక్షములందును వికారవాద మయుక్తమనుట నిషేధింపబడదు.

నిత్యవస్తువుల స్వరూపము మారజాలదు. మారినట్లయిన నవి నిత్యముకావు. నిత్యత్వము, వికారము నను నీ రెండు ధర్మములు పరస్పర విరుద్ధములు. కాబట్టి యవి రెండు నొక వస్తువున నుండనేరవు. అందువలన వర్ణములు నిత్యములు, వికారవంతములు ననుట పొసగదు.

వర్ణముల నిత్యములను పక్షమున నవి స్థాయిత్వము (స్థిరత) లేనివగుటచే వికారము కలుగు సమయమున నుండి జాలవు. కాబట్టి యేది లేదో దాని వికారమెట్లు గలుగగలదు? వికృతివేళ ప్రకృతి యుండి తీరవలయును. దధి+ అత్రయనునపుడు ఇకారముండును' యకారముండదు. దధ్యత్ర యని సంధించి పలుకునపుడు యకారముండును, ఇకార ముండదు. అట్టిచో ఇకార యకారములకు ప్రకృతి వికృతి భావమెట్లు చెప్పనగును? కాబట్టి ఇకార స్థానిక యకారము భయపక్షములందును ఆదేశమే యగునుకాని వికారము కాజాలదు.

"ప్రకృత్యనియమాత్" **2.2.51.**

ప్రకృత్యనియమాత్ = వర్ణవికారములకు ప్రకృతినియమము లేక పోవుటవలనను వికారవాదము యుక్తము కానేరదు.

మఱియు లోకమున, నేది దేనికి ప్రకృతియో యది దాని కెన్నడును వికృతికాక ప్రకృతిగా నుండుటయే చూచుచున్నాము. ఇట్లే ఏది దేనికి వికృతియో యదిదానికి సర్వదా వికృతియే యగును' గాని ప్రకృతి కానేరదు.

క్షీరము దధికి ప్రకృతి. దధి క్షీరమునకు వికృతి. ఈ దధి క్షీరములో నొకప్పుడు దధి క్షీరమునకు ప్రకృతియగుటయు, మరియొక యెడ వికృతి యగుటయు జూడనేరము. క్షీరము సర్వదా ప్రకృతియే. దధి వికృతియే.

వర్ణవికారములో నిట్టి ప్రకృతి వికృతి నియమములు కానరావు. 'దధ్యత్ర' యను స్థలమున ఇకార స్థానమున యకారము ప్రయోగించుచున్నాము. కాబట్టి యట ఇకారము. ప్రకృతి, యకారము వికృతియగును.

'విధ్యతి' అను స్థలమున వకారోత్తర ఇకారము యకారస్థలమున ప్రయోగింపబడుచున్నది. కాబట్టి యిట యకారము ప్రకృతి, ఇకారము వికృతి యగుచున్నది. కాగా ఇకార యకారములు ఒకచో ప్రకృతి భావమును, మరియొకచో వికృతిభావమును పొందుచు ప్రకృతి వికృతి నియమములను వ్యభిచరించు (నుల్లంగించు) చున్నవి. కాబట్టి వికార వాదము యుక్తి సంగతము కాదని సూత్రాభిప్రాయము

(విద్యతి). వ్యధ = హింసాయా, అను ధాతురూపము, 'ఇగ్యణః సంప్రసారణమ్' అను సూత్రము ననుసరించి వకారోత్తరయకార మునకు ఇకారమాదేశమగును.

పూర్వపక్షము : -

**'అనియమే నియమాన్నానియమః" 2.2.52.**

అనియమే = ప్రకృత్యనియమమున, నియమాత్ = నియమముండుట వలన, అనియమః= అనియమము, న = లేదు

ఇకార స్థానమున యకారము, యకారస్థానమున ఇకారము ప్రయోగింపవలయునను వ్యవస్థయొకటి వర్ణవికార విషయమున గాననగుచుండుట వలన అనియమ మెక్కడ నున్నది? నియమమే కలదు.

ఉత్తరపక్షము: -

**"నియమానియమవిరోధాదనియమే నియమాదప్రతిషేధః" 2.2.53.**

నియమానియమ విరోధాత్ = నియమము: అనియమము నను రెండును పరస్పర విరుద్ధములు. (అవి రెండు నొకయధికరణమున నుండజాలవు) కాబట్టి, అనియమే = ప్రకృత్యనియమమున, నియమాత్ = నియమముండుట వలన, అప్రతిషేధః= ప్రకృత్యనియమము కాదనుటతగదు.

ప్రకృత్య నియమములో నొక వ్యవస్థయున్నను ప్రకృతి కుండవలసిన నియమమున్నట్లు కానేరదు. నియమమనగా నొక యర్థము నంగీకరించుట. అనియమ మన దాని నిషేధము. కాగా నియమానియమములు పరస్పర విరుద్ధములై యొక యధికరణమున నుండజాలవు. అంగీకృతార్థము, ప్రతిషిద్ధార్థము రెండు నొక్కటి కానేరవుకదా! అ నియమములలో వ్యవస్థ

యున్నంతమాత్రమున అ నియమము నియమ మెన్నడును కాజాలదు. కాబట్టి ప్రకృతి వికారము కుండవలసిన నియమము లేకపోవుటవలన ఇకార స్థానిక యకారమాదేశమే కాని వికారమెన్నడును కానేరదు.

(ఆదేశమే వికారమని వ్యవహరింపబడుట)

**"గుణాంతరాపత్త్యుపమర్దహ్రాస వృద్ధిలేశ శ్లేషేభ్యస్తు వికారోపపత్తే ర్వర్ణవికారాః" 2.2.54.**

గుణాంతరాపత్తిః= ధర్మియుండగా ధర్మాంతరము కలుగుట. ఒకానొక పదమున అనుదాత్తముపోయి దాని స్థానమున నుదాత్త మేర్పడుట (ధధ్నా)

ఉపమర్దః= ధర్మిపోయి దాని స్థానమున మరియొక ధర్మిప్రయోగింపబడుట (అస్థిస్థానమున భూప్రయోగము)

హ్రాసః= దీర్ఘమునకు హ్రస్వము ప్రయోగించుట, (శ్రీపమ్)

వృద్ధిః= హ్రస్వమునకు దీర్ఘము (ఆచీకమత)

లేశః= లాఘవము, తగ్గింపు (స్తః)

శ్లేషః = ప్రకృతికో, ప్రత్యయమునకో యధికముగా చేరుట = ఆగమము. (సంస్కర్తా)

గుణాంతరా....... శ్లేషేభ్యః= గుణాంతరాదులవలన, వికారోపపత్తేః= ఒకదాని ప్రయోగమున కన్యమును ప్రయోగించుట యను వికారము సంభవించుట వలన, వర్ణవికారాః= ఇట్టితావులో వర్ణవికారమని చెప్పుట తగును.

పైన జూపినట్లు వ్యాకరణ శాస్త్ర రీతి ననుసరించి యా యా స్థలములందు కలుగు ప్రయోగవిధులలో వికార శబ్ద ప్రయోగము చేయబడును.

(పదనిరూపణము)

**"తే విభక్త్యంతాః పదమ్" 2.2.55.**

తే = ఆవర్ణములు, విభక్త్యాంతాః= అంతమున విభక్తిగలవై పదమ్ = పదమని వ్యవహరింపబడును.

విభక్తులు రెండు విధములు. నామికి. అఖ్యాతికి. నామ విభక్తి 'సుప్' అనియు, ఆఖ్యాతవిభక్తి (క్రియావిభక్తి) 'తిజ్' అనియు ననబడును. ఈ 'సుప్' 'తిజ్' లు అంతము నందుగల వర్ణములు పద మనబడును. వ్యాకరణాచార్యుడు పాణిని (సుప్ తిజంతం పదమ్) సుబంతము. తిజంతము పదమని సూత్రించియున్నాడు. ఇట్లు పదము నామము, ఆఖ్యాతము నని రెండు విధములగును.

(పదార్థ నిరూపణమున సంశయము)

**"వ్యక్త్యాకృతి జాతి సన్నిధా వుపచారాత్ సంశయః" 2.2.56.**

వ్యక్త్యాకృతి జాతి సన్నిధౌ = వ్యక్తి, ఆకృతి, జాతి యను నీ మూడు నత్యంతసమీపవర్తులు (అవినాభావ వృత్తు) అగుటచే, ఉపచారాత్ = గోవు అను పదప్రయోగమువలన, సంశయః= పదమునకు వ్యక్తి అర్థమా? ఆకృతియా? జాతియా? యని సంశయము కలుగును.

లోకమున సర్వత్ర పదమునకు, పదార్థమునకు సంబంధప్రాప్తి యుండుటచేతనే పదప్రయోగము చేయబడుచున్నది. వ్యక్తి, ఆకృతి, జాతి యను నివి పదార్థము కాకున్నచో నాయర్థమున 'పదము' ప్రయోగింపబడనేరదు. వ్యక్త్యాకృతి జాతులు పరస్పర మవినాభావ సంబంధము కలవిగా తెలియనగుచున్నవి. గో పదము వలన గో వ్యక్తియు, గో జాతియు తదాకృతియు తెలియుటచే నిందు పదమున కర్థమేది యని సంశయము పొడమును.

కొందఱు వ్యక్తి పదార్థమందురు. మరికొందరు ఆకృతియని నుడువుదురు. వేరొక కొందరు జాతి యందురు. వైదికులు మాత్రము వ్యక్త్యాకృతివిశిష్టజాతి అని వాకొనుచున్నారు.

గోవుమున్నగు ద్రవ్యము వ్యక్తులనియు, అవయవ సన్నివేశము ఆకృతియనియు, గోత్వాదులు జాతి యనియు వివేకము.

వ్యక్తియే పదార్థమను వాని సమాధానము.

**"యాశబ్దసమూహత్యాగపరిగ్రహసంఖ్యావృద్ధ్యుపచయ**
**వర్ణసమాసానుబంధానాం వ్యక్తావుపచారాత్ వ్యక్తిః" 2.2.57.**

యా శబ్ద.. అనుబంధానమ్= యచ్ఛబ్దాదులు, వ్యక్తౌ = వ్యక్తి యందు, ఉపచారాత్ = ప్రయోగింపబడుటవలన, వ్యక్తిః= వ్యక్తి పదార్థము

(1) యాశబ్దః= 'యా' అను పదముతో కూడిన వాక్యము (యాగౌస్తిష్ఠతి. యాగౌర్నిషణ్ణా. ఏయావు నిలుచున్నదో, ఏ యావుకూర్చున్నదో) ఈ వాక్యములో ఆవునకు కూర్చుండుట, నిలుచుండుటయను క్రియకు సంబంధము తెలియుచున్నది. గోపదమునకు వ్యక్తి అర్థముకాక ఆకృతి జాతులగునెడల వాని కా క్రియలతో నెట్లు సంబంధము పొసగును? వ్యక్తి ద్రవ్యమగుటచే నందు క్రియ గలుగనగును. ఆకృతి జాతులు నిష్క్రియలగుటచే వానికి క్రియలతో నన్వయము వీలుపడదు. కాబట్టి గోపదమున కర్థము ద్రవ్యమగు వ్యక్తియే యని యభిప్రాయము.

(2) సమూహః= సముదాయము (గవాంసమూహః) గోవుల సమూహము. ఆవుల సముదాయమును చూచి గోసమూ హమనిన నట ద్రవ్యసముదాయ మర్థమగునుకాని జాత్యాకృతులు బోధపడవు.

(3) త్యాగః = దానము, తన స్వత్వమును విడిచి యందితరులకు స్వత్వమును కలిగించుట. (యాచకాయ గాందదాతి) యాచకునకు గోవు నిచ్చుచున్నాడు ఇట త్యజింపబడునది ద్రవ్యముకాని జాత్యాకృతులు కావు.

(4) పరిగ్రహః= ఒకనిచే నీయబడిన దానిని ఆదరపూర్వకముగా గ్రహించుట. (గాం పరిగృహ్ణాతి) గోవును గ్రహించుచున్నాడు. ఇట ద్రవ్యమే గ్రహణ యోగ్యముకాని జాత్యాకృతులు కానేరవు.

(5) సంఖ్యా = గణన. (వింశతిర్గావః) ఇరువదియావులు పదియావులు. ఇటను ద్రవ్యమే.

(6) వృద్ధిః= వర్ధిల్లుట. (వర్ధతేగౌః) ఆవు పెరుగుచున్నది. ఇందునను ద్రవ్యమే.

(7) అపచయః= క్షయము. (గౌరకృశ్యత్) గోవు కృశించినది.

(8) వర్ణః= రంగు.

(9) సమాసః = బాగుగా కూర్చుండుట.

(10) అనుబంధః = సరూప ప్రజననము. తనవంటి దానిని జనింపజేయుట. ఇట్టి తావులందన్ని యెడల పదార్థము వ్యక్తియగును కాని జాత్యాకృతులు కాజాలవని సూత్రాభిప్రాయము.

(వ్యక్తివాద నిరాకరణము).

**"న తదనవస్థానాత్." 2. 2.58.**

తదనవస్థానాత్ = యాశబ్దాదులు వ్యక్తియందే వ్యవస్థితము కాక పోవుట వలన, న = వ్యక్తియే పదార్థమనుట తగదు.

యాశబ్దాదులు కేవలము వ్యక్తినే బోధించు పక్షమున వ్యక్తి పదార్థము కాగలదు. గోవు నిలుచున్నది అనినపుడు గోత్వవిశిష్ట గో వ్యక్తి నిలుచున్నది యను నర్థము సూచింపబడును. జాతిరహిత వ్యక్తి మాత్రము నిలుచున్నదను వ్యవస్థ యెన్నడును కలుగనేరదు. కాబట్టి జాతివిశిష్ట వ్యక్తియే పదార్థము కాగలదు.

ఒకానొక పదప్రయోగమున కేవల వ్యక్తియే తెలియబడిన వినువానికి వ్యక్తి మాత్రము బోధపడి జాతి తెలియబడకుండ వలసియుండును. లోకమున

నట్లు చూచుట లేదు. నిలుచుండుట మున్నగు క్రియలు జాత్యాకృతులతో నన్వయింపజాలవు. కాబట్టి వ్యక్తియే పదార్థమనుటయు సరిగాదు. కారణమేమన, క్రియాగుణములు జాత్యాకృతులతో సాక్షాదన్వయము బొందజాలక పోయినను వ్యక్తిద్వారా అన్వయింపవీలగును. కాబట్టి యే దోషము నుండదని సూత్ర తాత్పర్యము.

వ్యక్తి మాత్రము పదార్థముకాక జాతివిశిష్టవ్యక్తి పదార్థమగు పక్షమున కొన్ని యెడల కేవల వ్యక్తి యందు పద ప్రయోగమేల చూడబడుచున్నదన.

**"సహచరణ స్థాన తాదర్థ్యవృత్త మాన ధారణ**
**సామీప్య యోగ సాధనాధిపత్యేభ్యో బ్రాహ్మణ**
**మంచ కట రాజసక్తు చందన గంగా శాటకాన్న**
**పురుషేష్వతద్భావేఽపి తదుపచారః" 2.2.59.**

సహచరణ స్థాన ....... ఆధిపత్యేభ్యః= సహచరణాదు వలన, బ్రాహ్మణాద్యర్థములు లేకున్నను, ఆయర్థములం దెట్లా పదములు ప్రయోగింపబడుచున్నవో యట్లే, తదుపచారః= వ్యక్తి మాత్రమర్థము కాకున్నను వ్యక్త్యర్థముననే కొన్ని యెడల ప్రయోగింపబడును.

సహచరణమ్ = సాహచర్యము - అవినాభావ సంబంధము స్థానమ్ = స్థితి, తాదర్థ్యమ్ = తదర్థత, వృత్తమ్ = హిత ప్రవర్తనాది చరిత్ర, మానమ్ = పరిమాణము, / ధారణమ్ = ధృతి, సామీప్యమ్ = సమీపత, యోగః= గుణాదుల సంబంధము, సాధనమ్ = హేతువు, ఆధిపత్యమ్ = స్వామ్యము.

బ్రాహ్మణః= బ్రాహ్మణుడు, మంచః= మంచెమీదనున్న వ్యక్తి, కటః= వీరణము, గంగా= గంగాసమీప ప్రదేశము, శాటకః= వస్త్రము. అన్నమ్ = ప్రాణమ్

ప్రయోగములు : - (యష్టికాన్ భోజయ; బ్రహ్మ దండాన్భోజయ) యష్టికులను భుజింపజేయుము, బ్రహ్మ దండులను భుజింపజేయుము. ఇట్టియెడల యష్టిక బ్రహ్మదండ శబ్దములకు వైదిక జ్ఞానోపదేశకులైన బ్రాహ్మణులని యర్థము. యష్టిక బ్రహ్మదండ శబ్దములు దండవాచకములయ్యు బ్రాహ్మణార్థమున ప్రయోగింప బడినవి; కారణము సాహచర్యము.

(మంచాః క్రోశన్తి) మంచెలు కేకలువేయుచున్నవి. ఇట మంచె శబ్దము మంచెమీదనున్న వ్యక్తిని తెలుపును. స్థితి కారణము.

(కట మానయ) కటమును తెమ్ము. కటమనగా చాప. కాని యిట చాప

అల్లుట కనువైన తుంగను తెమ్ము అని యర్థము. (కటమునకు వీరణమని భాష్యకర్తలు ప్రయోగించిరి. వీరణ మనగా తృణ విశేషమని వాచస్పతి మిశ్రు లభిప్రాయపడుచున్నారు. కాబట్టి నేను తుంగ యని వాడితిని.)

(యమోరాజా, కుబేరోరాజా) యముడురాజు. కుబేరుడు రాజు. ఇట యమ కుబేర శబ్దములకు రాజని యర్థము కాకున్నను రాజువలె ప్రవర్తించు వ్యక్తులయెడ ప్రయోగింపబడినవి.

(అధకం సక్తవః) అద్దెడుపేలపిండి. మానెడు పేలపిండి.

(తులాచందనమ్) తులము చందనము.

(గంగాయాం గావశ్చరన్తి) గంగలో గోవులు మేయుచున్నవి.

(కృష్ణః శాటకః) చీర నలుపు.

(అన్నం ప్రాణః) అన్నమే ప్రాణము.

(అయం పురుషః కులమ్ – గోత్రమ్) ఇతడు కులము ఇతడు గోత్రము.

ఈ వాక్యములందును పైన జూపినట్లు కొలత, బరువు మున్నగు కారణములవలన నొకపదము కొండొక విశేషార్థమున ప్రయోగింపబడుట మనము చూచుచున్నాము. కాబట్టి పదమునకు జాతివిశిష్ట వ్యక్తియే యర్థమైనప్పటికి కొన్ని యెడల కేవల వ్యక్తియందు నౌపచారికముగా ప్రయోగింపబడునని భావము.

(ఆకృతియే పదార్థమనువాదము)

**"ఆకృతిస్తదపేక్షత్వాత్ సత్వ వ్యవస్థాన సిద్ధేః" 2.2.60.**

(సత్వః= గోవు మున్నగు ప్రాణి) సత్వవ్యవస్థానసిద్ధేః = ఇది గోవు, ఇది అశ్వము; అను వ్యవహార వ్యవస్థాసిద్ధి, తదపేక్షత్వాత్ = ఆకృతి జ్ఞానము నపేక్షించుట వలన, ఆకృతిః= ఆకృతి పదార్థము.

ప్రాణుల యవయవముల నియతమైన సన్నివేశము ఆకృతి యనబడును. అట్టి యాకృతి తెలియనంతవరకు 'ఇదియావు'; ఇది గుఱ్ఱము' అను లోకవ్యవహారమే సిద్ధింపదు. ఈ లోక వ్యవహారమును సాధించుటయే శబ్ద ప్రయోజనము. కాబట్టి ఆకృతియే శబ్దమునకు అర్థము.

(పదమునకు జాతియే అర్థము.)

**"వ్యక్త్యాకృతియుక్తేప్యప్రసంగాత్ ప్రోక్షణాదీనాం మృద్గవకే జాతిః" 2.2.61.**

వ్యక్త్యాకృతియుక్తేపి = వ్యక్త్యాకృతులతో కూడియున్నను, మృద్గవకే =

మట్టితో చేయబడిన ఆవు విషయమున, ప్రోక్షణాదీనాం = ప్రోక్షణము (నీళ్ళు చల్లుట) మున్నగుక్రియలు, అప్రసంగాత్ = ప్రసక్తము కాకపోవుట వలన, జాతిః= జాతియే పదార్థము.

గోదాన కర్మ విషయమును 'గోవును ప్రోక్షింపుము' గోవును 'తీసికొనిరమ్ము' 'గోవునిమ్ము' అనునిట్టి వ్యవహారము మృణ్మయు గోవు విషయమున ప్రయోగింపబడదు. కారణమేమి? మృణ్మయ గోవునందు వ్యక్తి, ఆకృతియు నుండినను గోత్వమను జాతి యుండదు. ఏదీ లేకుండుటచే పై ప్రయోగములు చేయబడుట లేదో అదియే పదార్థము కాగలదు. కావున జాతియే పదార్థమని తేలుచున్నది.

మృణ్మయ గోవును సైతము గోవు పదముచే వ్యవహరించునపు డట గోత్వమేల యుండదని శంకింప జనదు. గోత్వము నిత్యమైనను ఆకాశమువలె సర్వగతముకాదు. సాస్నాదులతో కూడిన గోపిండము లందే యుండును. మట్టితో చేయబడిన గోవు (బొమ్మ)లో గోత్వజాతి యుండదని అభియుక్తుల మతము. గోత్వము లేనియెడ గోపద వ్యవహారమెట్లు పొసగునందురేని వ్రాసిన చిత్రములను చూచి 'అదిగో ఆవు 'అదిగో గుఱ్ఱము' అనునట్లు గౌణప్రయోగము నట స్వీకరించుటచే నెట్టి దోషము లేదు. కాగా, జాతియే పదార్థమని సూత్రాభిప్రాయము.

**"నాకృతి వ్యక్త్యపేక్షత్వా జ్జాత్యభివ్యక్తేః" 2.2.62.**

జాత్యభివ్యక్తేః= జాత్యభివ్యక్తి (ప్రత్యక్షముగా కలుగు జాతిజ్ఞానము) ఆకృతి వ్యక్త్యపేక్షాత్ = ఆకృతితో కూడిన వ్యక్తిజ్ఞానము నపేక్షించుట వలన, న = జాతి పదార్థము కాదు.

వ్యక్త్యాకృతులు గ్రహింపబడకున్నను జాతిజ్ఞానము కలుగునెడల జాతి పదార్థము కాగలుగును. వ్యక్తి, ఆకృతియు గ్రహింపబడని జాతిజ్ఞానము కలుగనే కలుగదు. కాబట్టి, కేవల జాతి పదార్థమనుట యుక్తముకాదు.

వ్యక్తికానీ, ఆకృతికానీ, జాతికానీ పదార్థముకానిచో నెయ్యది పదార్థమున.

**"వ్యక్త్యాకృతి జాతయస్తు పదార్థః" 2.2.63.**

వ్యక్త్యాకృతి జాతయః= వ్యక్తి, ఆకృతి, జాతియను నీమూడును నొకచోనొకటి, మఱియొకచో మఱియొకటియు ప్రధానతను వహించుచు పదార్థః = పదార్థమగును.

సూత్రమునందలి 'తు' పదము గౌణ ప్రాధాన్యభావము నందలి

యనియమమును సూచించును. ఒకానొక పదమును ప్రయోగించినపుడా పదముచే వ్యక్త్యాకృతి జాతులు మూడును బోధింపబడును. కాని వానిలో నొకటి ప్రధానముగను, మిగిలినవి యప్రధానముగను తెలియును. భేదము వివక్షితమైనపుడు వ్యక్తి ప్రధానమగును. ఉదా : – ఆవు నిలుచున్నది. ఆవు పండుకొని యున్నది. సామాన్యము వివక్షితమగుచో జాతి ప్రధానము. ఉదా: – గోవును కాలితో తన్నరాదు. ఆకృతి ప్రధానస్థలమున కుదాహరణము; పిండితో గోవును చేయుము.

(వ్యక్తి నిరూపణము)

**"వ్యక్తిర్గుణవిశేషాశ్రయోమూర్తిః" 2.2.64.**

గుణవిశేషాశ్రయః= రూపాదిగుణవిశేషముల కాశ్రయమయిన, మూర్తిః = వ్యాపకముగాని పరిమాణముగల యవయవసంస్థానాత్మక మైన ద్రవ్యము, వ్యక్తిః= ఇంద్రియగ్రాహ్యామై వ్యక్తియని చెప్పబడును.

వ్యాపక పరిమాణము కలిగియుండక రూపాది గుణ విశేషముల కాధారముగానుండు ద్రవ్యము వ్యక్తియనబడును. ఇంద్రియములచే తెలియబడునది వ్యక్తియని భావము.

(వ్యజ్యతే గృహ్యతే ఇంద్రియైః ఇతి వ్యక్తిః)

(ఆకృతి నిరూపణ)

**"ఆకృతిర్జాతిలింగాఖ్యా" 2.2.65.**

జాతిలింగాఖ్యా= జాతి, లింగము (సంజ్ఞ)గా గలిగినది – జాతిని తెలుపుట కసాధారణకారణము, ఆకృతిః= ఆకృతి యనబడును.

దేనిద్వారా జాతియు దాని లింగములును తెలియబడునో యవి యాకృతియని వాత్స్యాయనులు.

దృష్టి గోచరమగుటయే తడువుగా దేనిద్వారా గోత్వాది జాతి చిహ్నితమగునో – తెలియబడునో – యదియే యాకృతి. నియత సన్నివేశముగల యవయవముల జ్ఞానము వలననే జాతి (గోత్వాది) గ్రహింపబడుచుండుట లోక సిద్ధము. (జాతే రస్త్రీ విషయా దయోపధాత్. అష్టా. 4.1.63.) అను వ్యాకరణ సూత్రమును వ్యాఖ్యానము చేయుచు భాష్యకారుడు పతంజలి మహర్షి (ఆకృతి గ్రహణాజాతిః) ఆకృతిచే గ్రహింపబడునది జాతి యని నిర్వచించియున్నాడు. (ఆకృతిః= అవయవసన్నివేశవిశేషము. గ్రహణం = గ్రహణ సాధనముగా గలిగినది. జాతిః= జాతియని యర్థము) అనయవ సన్నివేశ

విశేషముచే వ్యక్తపఱపబడినది జాతియని భావము. కాగా, గో మనుష్యాది ప్రాణుల శిరః పాణ్యాద్యవ యవముల నియత సన్నివేశమును చూచినపుడు గోత్వమనుష్యాత్వాది జాతులెట్లు తెలియంబడుచున్నవో యట్లు బ్రాహ్మణత్వాదికములు తెలియబడకుండుటచేనవి జాతులు కావు. ఉపాధులని వైదికుల సిద్ధాంతము. బ్రాహ్మణత్వాదులు యోని వ్యంగ్యములుకాని యాకృతి వ్యంగ్యములు కావనజెల్లదు. అట్లందువేని యనేక వ్యంజకముల నంగీకరింపవలసివచ్చును. మఱియు, ఐతరేయ వ్యాస ప్రభృతి ఋషివర్యులలో బ్రాహ్మణత్వ ముండి, యోని (బ్రాహ్మణుననకు బ్రాహ్మణి యందు జన్మించుటయను) లేకుండుటచే నట్టివారియెడ జాతి లక్షణ మవ్యాప్తమగును. కాబట్టి ఆకృతియే జాతి లక్షణము. కాగా బ్రాహ్మణత్వాదులు జాతులుగావు.

(జాతినికూపణము)

**"సమాన ప్రసవాత్మికా జాతిః" 2.2.66.**

సమాన ప్రసవాత్మికా = సమానాకారముగల జ్ఞానమును జనింపచేయ గలిగినది. జాతి = జాతి యని యర్థము.

అనేక భిన్నాధికరణములలో సమాన జ్ఞానమును కలిగించునది జాతి యని చెప్పబడును. అనేకములయిన ఘటపటాది వస్తువులలో ఇది ఘటము, ఇది ఘటము, అనియ అట్లే ఇది పటము, ఇది పటము అని యొకే విధమగు జ్ఞానమును కలిగించునది జాతి యనబడునని సూత్రాభిప్రాయము.

న్యాయదర్శనమున ద్వితీయాధ్యాయము

# న్యాయ దర్శనము

## తృతీయాధ్యాయము

(ఆద్యాహ్నికము)

పూర్వాధ్యాయమున ప్రమాణములు పరీక్షింపబడినవి. ప్రమేయ మిట పరీక్షింపబడవలసియున్నది. అదియు ద్వాదశ విధమని పూర్వమే యుద్దేశింపబడినది. అందు ప్రథమోద్దిష్టమయిన యాత్మను పరీక్షింపగోరి యది శరీరముకంటె భిన్నమైన దనుటలో హేతువును చూపుచున్నాడు.

**"దర్శన స్పర్శనాభ్యామే కార్థగ్రహణమ్" 3.1.1.**

దర్శన స్పర్శనాభ్యాం = (దర్శనము- చక్షురింద్రియము, స్పర్శనము - త్వగింద్రియము,) ఈ రెండింద్రియముల ద్వారమున, ఏకపదార్థ గ్రహణాత్ = ఒకేవిషయము గ్రహింపబడుట వలన.

మనము ముందు కంటితోచూచి తెలిసిన వస్తువును చేతితో స్పృశించి తెలిసికొనుచున్నాము. 'నేను దేనిని కంటితో చూచితినో దానిని స్పృశించుచున్నాను' అని యందుము. ఇట్టియెడ ఒకే విషయమును గ్రహించు దర్శన స్పర్శనముల (నేత్రత్వగింద్రియముల) కంటె భిన్నమగు కర్త యొకడు లేకున్న నిట్లు సంభవము కానేరదు. కన్నుచూచి తెలిసికొనినదానికి కన్ను కర్తయై, స్పృశించి తెలిసినదానికి త్వగింద్రియమే కర్తయగునెడల నీరెండు జ్ఞానములు భిన్న కర్తృకము లగుటచే కంటితో చూచినదానినే చేతితో స్పృశించుచున్నానను ప్రతిసంధానము (పూర్వాపరముల కలయిక) కలుగనేరదు. దేవదత్తుడు తెలిసికొనినదానిని, యజ్ఞదత్తుడు "నేను పూర్వము గ్రహించినదాని నిపుడు గ్రహించుచున్నా" నని ప్రతిసంధింపజాలడుగదా! కాబట్టి దర్శన స్పర్శనముల ద్వారా యొక యర్థమును గ్రహించునట్టి యాత్మయొకటి శరీరేంద్రియాదులకంటె భిన్నముగా నున్నదని యంగీకరింపవలయును.

పూర్వపక్షము: -

**"న విషయ వ్యవస్థానాత్" 3.1.2.**

విషయవ్యవస్థానాత్ = ఇంద్రియముచే గ్రహింపబడు విషయము వ్యవస్థితములగుటవలన, న = శరీరేంద్రియములకంటె వేరుగా నొక చేతనాత్మ యన్నదనుట తగదు.

ఇంద్రియములు తమ తమ విషయములనే గ్రహించును. చక్షువు రూపమును గ్రహించును. జిహ్వారసమునే గ్రహించును. నాసిక గ్రంధమును

గ్రహించును. ఇట్లు ఒక ఇంద్రియమొక విషయమును గ్రహించు ననునది విషయ నియమము - విషయవ్యవస్థ. చక్షువుండిన రూపము గ్రహింపబడును. చక్షువులేకున్న రూపము గ్రహింపబడదు. కాబట్టి చక్షువే రూపగ్రహణకర్త అంతకంటె భిన్నముగా నొక చేతనాత్మ కల్పించుట యనుచితమని సూత్రభావము.

ఉత్తరపక్షము: -

**"తద్వ్యవస్థానా దేవాత్మసద్భావా దప్రతిషేధః" 3.1.3.**

తద్వ్యవస్థానాదేవ = ఆ విషయనియమ ముండుట వలననే, ఆత్మ సద్భావాత్ = ఆత్మయొకటి యున్నదని చెప్పవీలగుచున్నది. కాబట్టి అప్రతిషేధః= ఆత్మలేదనుట తగదు.

ఇంద్రియములు తమతమ విషయములనే గ్రహింపగలవను నియమము (వ్యవస్థ) లేకున్న నేదోయొక యింద్రియమన్ని విషయములను గ్రహింపగలిగి యుండెడిది. ఇంద్రియములు నియతవిషయములగుటచే నేత్రేంద్రియమునకు విషయమైన రూపము త్వగింద్రియముచే తెలియబడదు. కాబట్టి యింద్రియాతి రిక్తముగా వేఱొకయాత్మ యుండిననే గాని దర్శన స్పర్శనముల ద్వారమున నొకే యర్థమును గ్రహించుటకు వలనుపడదు. ఇట్లాత్మ సద్భావమంగీకరింపక తప్పదు. చక్షువున్న రూపము గ్రహింపబడి యది లేకున్న గ్రహింపబడకుండుట యను నన్వయ వ్యతిరేకములవలన చక్షువు రూపగ్రహణమున కారణమగును కాని కర్తను నిషేధింపజాలదు. అట్లుకాని పక్షమున అంధకారమున దీపముండిన రూపగ్రహణము కలుగును, లేకున్న కలుగదు కావున, దీపము రూపమును గ్రహించుచున్నదనవలసి వచ్చును. కారణముగా నంగీకరించు పక్షమున నెట్టి దోషము వాటిల్లదు. కాబట్టి శరీరేంద్రియముల కంటె వేఱుగా ఆత్మయొకటి శరీరమున నుండి యింద్రియాదుల సహాయమున నెల్ల విషయములు గ్రహించు చున్నదనియు, పూర్వాపర ప్రత్యయముల ప్రతిసంధించుచున్న దనియు నంగీకరించుట న్యాయ్యము.

(శరీరాత్మ వాదము)

**"శరీరదాహే పాతకాభావాత్." 3.1.4.**

శరీరదాహే = శరీరమును దహించుటలో, పాతకాభావాత్ = పాతకము లేకపోవుట వలన, శరీరము చేతనము కాదు.

హింసాకృత పాపము పాతకమనబడును. శరీరము చేతన మగునెడల

దానిని దహించువానికి హింస యొనర్చిన పాప మొదవును. లోకము ననుసరించిగాని, శాస్త్రముననుసరించిగాని, శరీర దాహికి పాతక మొదవుననుట చూడము. మాతాపితరుల యంత్యేష్టి నొనర్చువాడు పాతకి యనబడునా? శరీరము చేతనయైన యెడల ఆత్మహింసాపాపము తప్పక కలుగును. కాబట్టి శరీరము చేతనము కాదని భావము

పూర్వపక్షము : –

**"తదభావః సాత్మకప్రదాహేపి తన్నిత్యత్వాత్" 3.1.5.**

తన్నిత్యత్వాత్ = ఆత్మనిత్యమగుటవలన, సాత్మక ప్రదాహేపి = భిన్నమైన యాత్మతో గూడిన శరీరమును దహించినప్పటికీ, తదభావః= దగ్ధముచేయు వ్యక్తికి పాపము సంభవింపదు.

కేవల శరీరమును దహించిన వానికెట్లు పాపముండదో యట్లే ఆత్మతోకూడిన శరీరమును దహించినను పాపము కలుగనేరదు. ఆత్మ నిత్యము, శరీరము జడము నగుటచే హింసకలుగుట యసంభవము. నిత్యమైన యాత్మను హింసింపగల వాడెవడు? హింసింపబడు నెడల నిత్యమెట్లగును? ఆత్మనంగీకరించు వారది నిత్యమందురు గదా! కాబట్టి ఆత్మయున్నను, లేకున్నను శరీర దాహమున నెట్టి పాతకమును కలుగనేరదు.

ఉత్తరపక్షము : –

**"న కార్యాశ్రయ కర్తృవధాత్ 3.1.6**

కార్యాశ్రయ కర్తృవధాత్ = సుఖదుఃఖానుభవమిట కార్యమనబడును. దానికాశ్రయము శరీరము. ఆ శరీరముతో కూడిన ఆత్మకర్త అట్టి యాత్మను వధించుట వలన, న = సాత్మకశరీరమును దహించిన పాతకము లేదనుట తగదు.

నిత్యమయిన ఆత్మను నశింపజేయుట హింస యనబడదు. సుఖ దుఃఖ రూప భోగాయతనమైన శరీరముతో కూడిన యాత్మనాశము – శరీరాత్మల విశిష్టసంబంధనాశము హింస యనబడును. సాత్మక శరీర దాహమున నిధి సంభవమే కాబట్టి ఆత్మ నిత్యమగుటచే జడ శరీరమును దహింప జేసినను పాతకము లేదనుట తగదని వివేకము.

**"సవ్యదృష్ట స్యేతరేణ ప్రత్యభిజ్ఞానాత్" 3.1.7.**

సవ్యదృష్టస్య = వామచక్షువుతో చూచినవస్తువు, ఇతరేణ = దక్షిణ నేత్రముతో చూచి, ప్రత్యబిజ్ఞానాత్ = ప్రతిసంధించుట వలన – గుర్తుపట్టుట వలన,

ఒకప్పుడు వామనేత్రముతో చూచి తెలిసికొనిన వస్తువును మఱియొకప్పుడా వామనేత్రము నశించిన తదుపరి కుడికన్నుతో నావస్తువును చూచి 'ఇది నేను నాడు చూచిచ వస్తువే' యని గుర్తించు చుండుట లోకవిదితము. ఇంద్రియములే చేతనములై వేఱుగా ఆత్మయొండు లేకున్న నిట్టి (ప్రత్యభిజ్ఞ) అదే యిది యనుజ్ఞానముదయింపనేరదు. మొదట వస్తువును చూచినకన్ను నశింప మఱియొక కన్ను దానినెట్లు గుర్తింపగలుగును? ఆత్మయొకటి వేఱుగా శరీరమున నున్న దనిన నేత్రము కరణములుగా నాత్మకు నుపయోగించును. ఆత్మ యొకకంటితో నొకవస్తువును చూచినపుడు ఆవస్తు సంబంధమైన సంస్కార మొకటి యేర్పడును. మఱియొక కంటితో నా వస్తువును చూచునదియు పూర్వాత్మయే కాబట్టి పూర్వజనిత సంస్కార సహాయముతో ఆ వస్తువే యిది యని గుర్తింప గలుగుటలో నెట్టిఆయాటంకము నుండనేరదు. కాబట్టి ఆత్మ శరీరేంద్రియ భిన్నమే యని భావము.

పూర్వ పక్షము : -

**"నైకస్మిన్నాసాస్థి వ్యవహితే ద్విత్వాభిమానాత్" 3.1.8.**

ఏకస్మిన్ = రెండు నేత్రములొకే యింద్రియ మైనప్పటికి, నాసాస్థి వ్యవహితే = నాసికకు సంబంధించిన యెముకచే వ్యవహితమై - రెండుగా చీల్చబడి, ద్విత్వాభిమానాత్ = రెండుగా కనబడుటవలన, న = పూర్వోక్తము సరికాదు.

నేత్రేంద్రియములు రెండగుచో ప్రత్యభిజ్ఞ వలన చేత నాత్మ వేఱుగా సిద్ధింపగలదుకాని, నేత్రేంద్రియ మొక్కటియే, నూతిపై నొక కొయ్యనడ్డముగా వైచినది రెండుగా తోచునట్లు, నాసికచే వ్యవహితమై యొకే నేత్రము రెండుగా కనబడుచున్నది. కాబట్టి వామనేత్రముతో చూచిన దానిని కుడి నేత్రము గుర్తింపజాలదను హేతువును పురస్కరించుకొని యాత్మ సిద్ధింపనేరదు.

ఉత్తరపక్షము: -

**"ఏక వినాశే ద్వితీయావినాశాన్నైకత్వమ్" 3.1.9.**

ఏకవినాశే = ఒకటినశించిన, ద్వితీయావినాశాత్ = రెండవది నశింపకుండుట వలన, నై కత్వమ్ = నేత్రేంద్రియ మొక్కటికాదు.

వామనేత్రము చెడిపోయిన దక్షిణనేత్రము చెడుట కాని, దక్షిణ చక్షువుచెడిన వామము చెడుట కాని మనము చూచుటలేదు. నేత్ర మొక్కటియైె నాసికావ్యవధానముచే రెండుగా తోచునెడల నొక్కటిచెడిన రెండవదియు చెడవలసియుండును. ఒకే యవయవిలో కొన్ని యవయవములు చెడి

మఱికొన్ని సరిగా నుండుటచే నవయవి చెడకుండుటకు వీలులేదు. కాబట్టి నేత్రము రెండు కావనుట యుక్తి సంగతము కాదు.

పూర్వపక్షము :-

**"అవయవ నాశే ऽ ప్యవయ వ్యుపలబ్ధే రహేతుః" 3.1.10.**

అవయవనాశేऽపి = కొన్ని శాఖలు నశించినను, అవయవ్యుపలబ్ధేః = వృక్షరూపావయవి లభించుటవలన, అహేతుః= ఒకటి నశించిన మరియొకటి నశింపవలయుననుట సరియైన హేతువుకాదు.

ఒక వృక్షమున్నదనుకొనుడు. దాని శాఖలే దాని కవయవములు. వానిలో కొన్ని ఖండింపబడినను ఆ వృక్షము నశింపదు. కాబట్టి కొన్ని యవయవములు నశించిన మాత్రమున నవయవియు నశించునను హేతువుతో నేత్రము రెండనుట సరికాదని భావము.

ఉత్తరపక్షము : -

**"దృష్టాంత విరాధా దప్రతిషేధః" 3.1.11.**

దృష్టాంత విరోధాత్ దృష్టాంత వైరుధ్యము వలన, అప్రతిషేధః= హేతువు సరికాదనుట చెల్లదని యర్థము.

నేత్ర వృక్షములో సామ్యములేకుండుట వలన దృష్టాంతము సరికాదు. నేత్రస్థానము, వాని మూలములు భిన్నముగా మనము చూడగలము. శిరస్సునకు సంబంధించిన ఎముకను పరీక్షించిన నందు రెండు కన్నులుండుటకు రెండు స్థానములు వేఱువేఱుగా కనబడును. కాబట్టి యవియొక దాని కింకొకటి యవయవములు కావు. అవయవములే యగునెడల అవయవనాశమున నవయవి నశింపక తప్పదు. వృక్షము నందును కొన్ని శాఖలు నశించిన నా వృక్షము పూర్వమున్నట్లుండుననుట ప్రత్యక్ష విరుద్ధము. కొన్ని శాఖలు నశించిన తదుపరి మిగులువృక్షము మొదటి వృక్షమెన్నడును కాజాలదు. కాబట్టి నేత్రములొక్కటే యనుట తగదు. ఇట్లు ఒక నేత్రముతో చూచిన దానిని రెండవ నేత్రముతో చూచి గుర్తించు ప్రత్యభిజ్ఞాత వేఱుగా నుండుననుట నిర్వివాదమని భావము

**"ఇంద్రియాంతర వికారాత్" 3.1.12.**

ఇంద్రియాంతర వికారాత్ = మరియొక ఇంద్రియములో వికారము కలుగుట వలన ఆత్మవేరుగా నున్నది.

మఱియును ఒకానొకప్పుడాసాధించిన ఫలము మరల కనిపించినపుడో

లేక దాని గంధము పలబ్ధమైనపుడో యాఫలరసము స్మరింపబడి యందలి యాశచే నోట నీరూరుట లోకవిదితము. ఇదే యింద్రియాంతర వికారమనబడును. రసాస్వాదమును స్మరించుట వలన రసనేంద్రియములో నిట్టి వికారము కలుగును. రసము ననుభవించు నాత్మయొండు శరీరేంద్రియముకు మించి లేకున్న నిది యెట్లు సంభవింపగలదు? కర్త లేక క్రియము కలుగదు. స్మరించుట క్రియయేయగును. ఇంద్రియమే కర్తయందుమా? వీలుపడదు. రసమునాస్వాదించిన యింద్రియము జిహ్వ. ప్రస్తుత రూపోపలబ్ధి చక్షువునకు కలుగుచున్నదిగదా! ఒకరు చూచినది మరియొక రెట్లు స్మరింపగలరు? కాబట్టి ఇంద్రియములకంటె భిన్నముగా నాత్మయొండుకలదనక తప్పదు.

పూర్వపక్షము : -

**"నస్మృతేః స్మర్తవ్య విషయత్వాత్ " 3.1.13.**

స్మృతేః= స్మరణము, స్మర్తవ్యవిషయత్వాత్ = స్మరణీయార్థ విషయమగుటవలన, న = పూర్వము చెప్పినది సరిగాదు.

ఏ విషయమునకు సంబంధించిన స్మృతి కలుగునో ఆస్మృతి యా విషయమును స్మరింపజేయును కాని యన్యమును స్మరింపజేయ జాలదు. ప్రస్తుతమిటరూపాదులతో నుండు రస (విషయ) మునకు సంబంధించిన స్మృతి రసము ననుమానింపజేయును కాని ఆత్మనెట్లు చేయగలదు? ఆత్మననుమానింపజేయునందువేని ఆత్మస్మృతికి కారణమా? లేక విషయమా? స్మృతికి కారణము సమస్కారము' విషయము రసము. కాబట్టి యుభయ విధములను స్మృతిచే నాత్మయూహింపబడదు.

ఉత్తరపక్షము : -

**"తదాత్మగుణ సద్భావాదప్రతిషేధః" 3.1.14.**

తదాత్మగుణ సద్భావాత్ = స్మృతియాత్మగుణ మగుటవలన, అప్రతిషేధః = స్మృతియాత్మానుమాపకమే.

స్మృతి యాత్మకు కారణమనిగానీ, విషయమనిగానీ చెప్పినచో పై దోషము వాటిల్లును. స్మృతి యాత్మగుణము. ఆత్మస్మృతి కాశ్రయమని భావము. కాబట్టి ఆశ్రయరూపమున నాత్మస్మృతి ద్వారమున అనుమానింపబడును. స్మృతి జ్ఞానములోచేరి గుణమనబడును. గుణమున కాశ్రయమొకటి యుండవలయును. స్మృతికాశ్రయము విషయము కానేరదు. సంస్కారమునకు

నట్టి యోగ్యతలేదు కాగా, స్మృతి కాశ్రయ మాత్మయొకటి సిద్ధించుటలో నేయాటంకమునుండదు.

పూర్వపక్షము : –

**"నాత్మ ప్రతిపత్తి హేతూనాం మనసి సంభవాత్" 3.1.15.**

ఆత్మప్రతిపత్తి హేతూనాం = ఆత్మసిద్ధికి చెప్పబడిన హేతువులు, మనసిసంభవాత్ = మనస్సనెడి ఇంద్రియమున సమన్వయింప వీలగుట వలన, న = శరీరేంద్రియములకు మించి యాత్మయెందు లేదు.

ఆత్మకలదని పై జెప్పిన మూడు హేతువులును మనస్సునందన్వయింపనగును. మనస్సు సర్వార్థములను గ్రహించును. నేత్రాది ఇంద్రియములచే గ్రహింపబడు విషయములలో నొక్కటియు మనస్సుచే గ్రహింపబడనిది యుండదు. అన్ని యింద్రియములతోను మనస్సునకు సంబంధముండును కాబట్టి చక్షువుతో చూచి తెలిసికొనినదానిని స్పృశించి యెఱుగుటకును, వామనేత్రముతో చూచిన దానిన దక్షిణనేత్రముతో గుర్తించుటకును, ఇంద్రియాంతర వికారమునకు హేతువైన స్మృతి కాశ్రయమగుటకును మనస్సునకు వీలున్నది. చక్షువుతో చూచును; జిహ్వతో నాస్వాదించును; నాసికతో నాఘ్రాణించును' త్వగింద్రియముతో స్పృశించును అను నిట్టి ప్రయోగములను మనస్సున నన్వయింపవచ్చును. కాబట్టి, యే హేతువులతో సిద్ధాంతి ఆత్మను సిద్ధింపజేయ యత్నించుచున్నాడో యా హేతువులన్నియు మనస్సునందు వర్తింపగలవు. కావున, మనస్సుకంటె వేఱుగా ఆత్మయొకటి లేదని పూర్వపక్షి తాత్పర్యము.

**"జ్ఞాతుర్జ్ఞాన సాధనోపపత్తేః సంజ్ఞాభేదమాత్రమ్" 3.1.16.**

జ్ఞాతుః= జ్ఞాతయైన మనస్సునకు, జ్ఞాన సాధనోపపత్తేః= బాహ్య జ్ఞాన సాధనములవలె నాభ్యంతర జ్ఞానమున కొక సాధనముండుట యగత్యము కాబట్టి, సంజ్ఞాభేదమాత్రమ్ = సంజ్ఞలలో భేదముమాత్రమే.

జ్ఞాతకు చక్షురాదీంద్రియములు బాహ్యజ్ఞానసాధనములున్నట్లు, అభ్యంతర జ్ఞానముకు సాధనమొండుండవలసియుండును. సుఖ దుఃఖాదులనేకము లాభ్యంతర విషయములున్నవి. వానిని తెలిసికొనుటకు అంతరింద్రియ మొకటితప్పక కావలసియుండును. బాహ్యేంద్రియముచే సుఖ దుఃఖాది జ్ఞానము కలుగనేరదు. మనస్సు నాయావిషయ జ్ఞానములకు కర్తగా నంగీకరింతుమేని దానికి కరణముగా నుపయోగించు అంతరింద్రియము వేరొండు

కావలసియుండును. ఒకే వస్తువు కర్తృకరణములుగా నంగీకరింప వీలుండదు. కారణము కర్తృకరణ ధర్మములు వేరగుటయే కాగా, ఉభయపక్షములందును జ్ఞాతృ పదార్థ మంగీకరింపక తప్పదు. ఆ పదార్థము నొకరు ఆత్మయనియు; మఱియొకరు మనస్సు అనియు నందు రేని నామములో భేదమేర్పడుచున్నది. పూర్వపక్షి యభిప్రాయము ననుసరించి జ్ఞాతృ పదార్థము మన స్సనబడినచో వేరొక నామముగల యంతరింద్రియము నంగీకరింపవలసివచ్చును. సిద్ధాంతి పక్షమున జ్ఞాత ఆత్మయనబడును. అంతరింద్రియము మనస్సనబడునని వివేకము.

బాహ్యవిషయములను తెలిసికొనుటకు బాహ్యేంద్రియములను కరణము లపేక్షితము లయినట్లు అభ్యంతర విషయముల కరణాపేక్ష నియమము లేకుండుటచే నాభ్యంతరకరణము వేరొండేలా యన.

**"నియమశ్చ నిరనుమానః" 3.1.17.**

నియమశ్చ = బాహ్యవిషయములకు బాహ్యకరణములుండ వలయును కాని అభ్యంతర విషయముల కట్టి కరణాపేక్ష యుండదను నియమము, నిరనుమాన ః= నిర్యుక్తికము - నిష్ప్రమాణము.

ఎవడేని కరణవ్యాపారము లేకయే కర్మగోచర క్రియను కలిగింపగలుగుచో పై నియమమంగీకరింపనగును కాని యట్లు కానరాదు. కుఠారము (గొడ్డలి) నాడింపకయే యెవ్వడైనను కొమ్మను నరుక గలుగునా? లేదు. బాహ్యక్రియలకు కరణము కావలసి యుండును కాని అభ్యంతర క్రియల కక్కఱ లేదందుమా? క్రియలలో నట్టి భేదము నభియుక్తులు (శాస్త్రవేత్తలు) అంగీకరింపరే. కాబట్టి యొకక్రియకు కరణమావశ్యకము. మరియొకటి కనావశ్యకమనుట నిర్యుక్తికము. బాహ్య విషయజ్ఞానమున కరణమెట్లు కావలయునో ఆభ్యంతర విషయజ్ఞానమును విషయుజ్ఞానమే కావున కరణము కావలసియే యుండును. కాబట్టి బాహ్యవిషయజ్ఞానార్థము చక్షురాది బాహ్యకరణము నెట్లుపయోగించునో అట్లే యాభ్యంతర సుఖదుఃఖాది జ్ఞానార్థము మనస్సును వ్యాపార వంతముగా చేయునట్టి యాత్మ యెండు స్వీకరింపక తప్పదు.

(ఆత్మనిత్యత్వ విచారణ)

**"పూర్వాభ్యస్త స్మృత్యనుబంధా జ్జాతస్య హర్షభయ శోక సంప్రతిపత్తేః" 3.1.18.**

జాతస్య = జన్మించిన బాలునియందు, పూర్వాభ్యస్త స్మృత్యను బంధాత్

= పూర్వమనేక పర్యాయము లనుభవించిన పదార్థము స్మృతి సంబంధహేతువైన సంస్కార విశేషమువలన, హర్షభయశోక సంప్రతిపత్తేః= హర్షభయశోకములు లభించుటవలన, ఆత్మ నిత్యము.

జన్మించిన తదుపరి బాలుడు కొండొకవేళ నవ్వును. మరియొక ప్పుడు కంపించును. ఇంకొకయెడ నేడ్చును. నవ్వు. కంపము. రోదనము నను నీభావములు హర్షభయ శోకములు లేక కలుగ నేరవు. లోకమున హర్షము కలిగినపుడు నవ్వుటయు, భయము కలిగినపుడు కంపించుటయు, శోకములవలన నేడ్చుటయు మనము చూచుచున్నాము. కాబట్టి హర్షాదులు నవ్వు మున్నగువానికి నిమిత్తమ్ములని తెలుచున్నది. క్రొత్తగా జన్మించిన బాలుడు తనకు క్రొత్తగా ప్రత్యక్షమగు పదార్థములలో నేదియిష్టమో – సుఖకరమో – దుఃఖకరమో యెఱుగ జాలడు, కాని యిష్టానిష్ట వస్తువులు ప్రాప్తించి నపుడా బాలుడు సంతసించుటయు, దుఃఖించుటయు చూచుచున్నాము. ఈ హర్ష శోకములకు కారణము పూర్వానుభవస్మరణ తక్క వేఱొండు కానరాదు. స్మరణము సంస్కార జన్యము. బాలునిలో నిట్టి సంస్కారము లెన్నడు కలిగియుండును జన్మించుటకు పూర్వ మా బాలుడు లేని పక్షమున? కావున ఈ జన్మకు పూర్వమే వేఱొక జన్మమందీ సంస్కారమునకు తగిన యభ్యానము కలిగియుండవలయునని తేలుచున్నది ఇట్లాయా జన్మలలో కనబడు హసిత శోకాదులను చూచి పూర్వపూర్వజన్మల నూహింపనగును. అందువలన ఆత్మనిత్యము అనాదియని సుఖముగా సిద్ధముగుచున్నది.

ఒక విషయమునకు సంబంధించిన యనేక విజ్ఞానముల నుదయింపజేయుట యభ్యాసము. ఒకానొక ప్రత్యక్షజ్ఞానము నశించిన తదుపరి అజ్ఞానమునకు విషయమైన వస్తువే విషయముగాగల జ్ఞానము స్మృతి. స్మృతి సంబంధమునకు కారణమైన భావనా సంస్కారము అనుబంధము మరణాదులకు సాధనములైన సర్పాదులు సమీపించినపుడు వానినుండి తొలగగోరిన వ్యక్తికి కలుగు "దీనిని తప్పుకొనజాలను" అను భావము భయము. ఇష్టమైన పదార్థము వియుక్తమైనపుడు మరల దానిని బొందజాలనను జ్ఞానము శోకము. ప్రాప్తి, అనుభవము, సంప్రతిపత్తి యనుని పర్యాయపదము.

పూర్వపక్షము : –

**"పద్మాదిషు ప్రబోధసమ్మీలన వికారవత్తద్వికారః" 3.1.19.**

పద్మాదిషు = తామరపువ్వులు మున్నగువానియందు కనబడు,

ప్రబోధసమ్మీలన వికారవత్ = పుష్పదళముల వికాససంకోచముల వలె, తద్వికారః = బాలకునందు కలుగు హసితాదివికారములు స్వాభావికములగుటచే హర్ష శోకాదులవలన ననుట యుక్తముకాదు.

కమలాది పుష్పములలో కలుగు వికాసాదులు వస్తుస్వభావ జన్యముయినట్లు బాలకునందు కలుగు హసితాదులును స్వభావ జన్యములేకాని యన్యముకాదు. హసితాదులకు కారణములుగా హర్షాదుల నూహించియటుపై ఆత్మనిత్యమని తర్కించుట గౌరవము.

ఉత్తరపక్షము : -

"నోష్ణ శీతవర్షకాల నిమిత్తత్వాత్ పంచాత్మక వికారాణామ్"

**3.1.20.**

పంచాత్మక వికారాణామ్ = పాంచభౌతికములయిన పద్మాదుల వికారములకు, ఉష్ణశీత వర్షకాల నమిత్తత్వాత్ = ఉష్ణ శీత వర్షకాలములు నిమిత్తములగుట వలన, న = (ప్రభోధాదులు స్వభావ జన్యములగుటచే) హసితాదులు నట్లేయనుట తగదు.

పద్మాదులలో కలుగు ఉన్మీలన నిమీలనములు నిర్నిమిత్తములు కావు. ఉష్ణశీతాదులు వానికి నిమిత్తములు. ఉష్ణాదులున్నపుడే వికాసాదులు కలుగును. లోకమున కలుగు వికారమున్నియు సనిమిత్తకములే. నిమిత్తములేని వికారమొన్నెడను చూడనేరము. ఇట్లే బాలునిలో నేర్పడు హసితాదులును వికారము లనుట నిర్వివాద విషయము. వానికి కారణములు హర్షాదులు. అందులకు నిమిత్తము పూర్వాభ్యస్త సంస్కార జనితస్మృతి యనకతప్పదు. కాబట్టి ఆత్మయనాది, నిత్యమనియే సిద్ధాంతము.

"ప్రేత్యాహార్యాభ్యాస కృతాత్ స్తన్యాభిలాషాత్" **3.1.21.**

ప్రేత్య = మరణించి మరల జనించిన బాలకుని - ఆహారభ్యాసకృతాత్ = ఆహారాభ్యాసము వలన జనించిన, స్తన్యాభిలాషాత్ = మాతృ స్తనములోని పాలను గ్రహించుకోరిక వలన.

బాలకుడు జన్మించినతోడనే తల్లిస్తనములనుండి స్తన్యమును గ్రహింపవయునని యత్నించుట లోక సిద్ధ విషయము స్తన్యముకొఱకు బాలునిలో నేర్పడు నీ ప్రవృత్తి యభిలాషాపూర్వకము. బాలునిలో నేర్పడు నీస్తన్యాభిలాషయు నాహారాభ్యాసము వలన కలుగును. ఆహారము తీసికొనుట కలవాటు పడినవారే యాకలి గొన్నపుడు దాని నివారణ కొఱకు మరల

నాహారము తీసికొన యత్నింతురు. క్రొత్తగా జన్మించిన బాలు డంతకుపూర్వము క్షుత్పీడితుడై పాల నాహారముగా గ్రహించియుండడేని ప్రస్తుత ప్రవృత్తియతనిలో కలుగనేరదు.

కాబట్టి బాలుడీజన్మకు పూర్వమే క్షీరగ్రహణమున కభ్యస్తుడై యున్నట్లు తేలుచున్నది. పూర్వాభ్యాస స్మరణమువలననే యీ జన్మమందు క్షుత్పీడితుడై స్తన్యమునకై ప్రవర్తించుచున్నాడు. అందువలన నీ బాలునకీశరీర ప్రాప్తికి పూర్వము మరియొక శరీరముతో సంబంధమున్నట్లు తేలుచున్నది. ఇట్లే శరీరాంతరమును. కాబట్టి యాత్మయనేక శరీరములతో సంబద్ధమగుచు నిత్యముగా నుండును.

పూర్వపక్షము : –

**"అయసోఽ యస్కాంతాభిగమనవత్ తదుపసర్పణమ్" 3.1.22.**

అయసః= ఇనుపముక్కలు సూదులు మొదగునవి, అయస్కాంతాభి గమనవత్ సూదంటురాతి నెదుర్కొని సమీపించునట్లు, తదుపసర్పణమ్ = బాలకుడు జన్మించుటయే తడవుగా స్తనములచెంత జేరును

సూదులు సూదంటురాతిని సమీపించుట స్వాభావికమైనట్లు బాలుడు జన్మింపగానే మాతృస్తనతటముల చెంతకేగుట స్వాభావికమే యగును. ఇందు పూర్వాభ్యాస జనితస్తన్యాభిలాష కారణమనుట పొసగదు. కాబట్టి జన్మజన్మాంతరముల నూహించి యాత్మనిత్యమనుట యుక్తి విరుద్ధము.

ఉత్తరపక్షము: –

**"నాన్యత్ర ప్రవృత్త్యభావాత్" 3.1.23.**

అన్యత్ర= లోహముకాక యితర లోష్ఠాదులో, ప్రవృత్త్యభావాత్= సూదంటు రాతిని సమీపించుట జూడకపోవుట వలన, న = స్తన్య ప్రవృత్తి స్వాభావిక మనుట తగదు.

సూదులు సూదంటురాతిని సమీపించుట నిర్నిమిత్తమై స్వాభావిక మగునెడల నితర లోష్ఠాదులు నట్లేల నమీపింపవు? సూదుల యభిసర్పణముననమిత్త మొండు లేకున్న ఇతర పదార్థములు నట్లే సూదంటురాతి నభిగమింపవలసియుండును. అట్లు చూడబడకపోవుటచే సూదుల యభిసర్పణమునకు కొండొక నిమిత్తమట నుండి తీరవలయును. అది యదృష్టమైన వస్తుశక్తి రూపమే కావచ్చు. అట్లే బాలకుని స్తన్యాభిలాష నిర్నిమిత్తము కానేరదు. ఆ నిమిత్తమును పూర్వజన్మాభ్యాసజనిత

సంస్కారోద్బుద్ధమగు స్మృతియే కావలయును. కాబట్టి జన్మాంతరసిద్ధి పూర్వకముగ నాత్మ నిత్యమనియే స్థిరపడు చున్నదని వివేకము.

**"వీతరాగ జన్మాదర్శనాత్" 3.1.24.**

వీతరాగ జన్మాదర్శనాత్ = రగద్వేషాదులు నశించినయోగి జన్మించుట చూడము. కాబట్టి యాత్మ నిత్యము.

మఱియు పుట్టునట్టి ప్రతిప్రాణియు రాగముతో కూడియుండుట మనము చూచుచున్నాము. రాగరహిత జన్మమొండును కానరాదు. రాగమనునది పూర్వానుభూత విషయ చింతన వలననే కలుగును. పూర్వానుభూత విషయము స్మరింపకయే యట్టివాని యందు రక్తుడగుటయసంభవము. ఇప్పుడిప్పుడే జన్మించిన బిడ్డకు విషయముల పూర్వానుభవ మీ జన్మమందు కలుగనేరదు. మరియొక జన్మమందు శరీరము లేక యనుభవము కలుగదు. కాబట్టి జన్మజన్మాంతరములనుండి యాత్మ యనాదియై, నిత్యమనక తప్పదు. పూర్వ సూత్రమున కేవల స్తన్యమున ననురాగము వర్ణింపబడినది. ఇట పదార్థమాత్రమున రాగము ప్రాణులకున్నట్లు ప్రదర్శింపబడినదని వివేకము.

పూర్వ పక్షము : -

**"సగుణ ద్రవ్యోత్పత్తివత్తదుత్పత్తి" 3.1.25.**

సగుణ ద్రవ్యోత్పత్తివత్ = ఘటపటాది వస్తువులు గణసమేతములై పుట్టుట స్వాభావిక మైనట్లు, తదుత్పత్తిః= రాగముతో జన్మించుట యాత్మకు స్వాభావికము.

ఘటపటాది వస్తువులన్నియు పుట్టుకతోనే సగుణములై యుండుట స్వభావముగా చూచుచున్నాము. గుణసమేత మగు నుత్పత్తికి కారణాంతరము చూడజాలము. అట్లే యాత్మయు సరాగముగ జన్మించుట స్వాభావికమగును. కాగా జన్మజన్మాంతరముల నూహించి యందువలన నాత్మయనాదియనియు, నిత్యమనియు నెంచుట సరిగాదు.

ఉత్తరపక్షము : -

**"న సంకల్ప నిమిత్తత్వాద్ రాగాదీనామ్" 3.1.26.**

రాగాదీనాం = రాగద్వేషాదులు, సంకల్పనిమిత్తత్వాత్ = (ఇది నాకిష్టమును సాధించును, ఇది నాకనిష్టమును కలిగించును అనుపూర్వానుభూతవిషయాను చింతనము సంకల్పము) ఇట్టి సంకల్ప జనితమగుట వలన, న = సరాగజన్మ స్వాభావికము (నిర్నిమిత్తము) అనుట యుక్తముకాదు.

ఘటపటాది ద్రవ్యములు సగుణములై జనించుట స్వాభావికము కాదు.

ఘటము కపాలరూప కారణజన్యమైనట్లు ఘటమునందలి గుణములను కపాలములలోని గుణము నిమిత్తములుగా జనించును. కాబట్టి సగుణ ఘటోత్పత్తి నిర్నిమత్తకమనుట న్యాయసంగతము కాదు.

శాస్త్రాంతరమున నిట్లే వర్ణింపబడినది. (ద్రవ్యాణిద్రవ్యాంతర మారభంతే గుణాశ్చ గుణాంతరమ్. వై. 1.1.10.) ద్రవ్యము ద్రవ్యాంతరమును, గుణములు గుణాంతరమును జనింవజజేయునని సూత్రాభిప్రాయము. ఘటపటాదులగుణములు సకారణకములైనట్లు రాగాదులను సనిమిత్తకములే. ఇట నిమిత్తము పూర్వానుభూత విషయానుచింతనకుమించి మఱియెందు కాజాలదు. కాబట్టి, పూర్వానుభవము జన్మాంతరము నూహింపజేయగా నాత్మ యనాదియై, నిత్యమగుచున్నది.

(శరీరపరీక్షణ)

**"పార్థివం తద్విశేషగుణోపలబ్ధేః" 3.1.27.**

తద్విశేష గుణోపలబ్ధేః= పృథివికి సంబంధించిన విశేషగుణము లభించుట వలన, పార్థివమ్ = మనవంటి ప్రాణుల శరీరము పార్థివము.

పృథివి గంధవతి. శరీరము గంధవంతము. కాబట్టి యీ మన శరీరము పృథివ్యాత్మకమని బోధపడుచున్నది. జలము, అగ్ని మున్నగు ద్రవ్యములు, రసరూపాదులు శరీరమున గాననగుచుండుటచే శరీరము పార్థివ మనుటెట్లన, రసరూపాదులు శరీరమున నున్న వనుట సత్యమే. కాని శరీరము పార్థివ మనుటలో నితర ద్రవ్యములకు సంబంధించిన యణువులు శరీరమున సంయుక్తములు కావని సూత్రార్థము కాదు పార్థీవేతర పరమాణువులు శరీరారంభకములుకావు శరీరము పార్థివమనగా పార్థివ పరిమాణువులు ప్రాధాన్యములై శరీరారంభకముగుననియు, తదితర ద్రవ్యాణువులు సంయుక్తములై యప్రధానములుగా నుండుననియు సూత్రాభిప్రాయము. కాబట్టి శరీరము పార్థివ మనుట దోషరహితమే యని భావము.

**"శ్రుతి ప్రామాణ్యాచ్చ" 3.1.28.**

శృతి ప్రామాణ్యాచ్చ = శృతి ప్రామాణ్యమువలనను,

(......... భస్మాంతగ్ం శరీరమ్. యజు. 10.15) అను నిట్టి శ్రుతులనుబట్టి చూచినను, శరీరము పార్థివమనియే తెలియుచున్నది. శరీరము భస్మాంతమని శ్రుతి చెప్పుచున్నది. భస్మము పార్థివము కాబట్టి శరీరము పార్థివమే.

పూర్వపక్షము : - (ఇంద్రియ పరీక్షణ)

**"కృష్ణ సారే సత్యుపలంభాత్ వ్యతిరిచ్య చోపలంభాత్ సంశయః" 3.1.29.**

కృష్ణసారేసతి = కంటిలోని నల్లనిభాగము కృష్ణసారమనబడును. అది యున్నపుడు, ఉపలంభాత్ = వస్తువు గ్రహింపబడుటవలన, వ్యతిరిచ్యచ ఉపలంభాత్ = అదిలేనపుడును (విషయములు దానికి దూరముగా నున్నపుడు) ఉపలబ్ధి కలుగుట వలన సంశయః= కృష్ణసారమే యింద్రియమా? మరియొండా? యని సంశయము కలుగుచున్నది.

కంటిలోని కృష్ణసారము (నల్లగ్రుడ్డు)న్నపుడు వస్తువులు గ్రహింపబడుచున్నవి. దానికి దూరముగానుండు వస్తువులును తెలిసికొనబడుచున్నవి. నల్లగ్రుడ్డు నేత్రేంద్రియము కాక మరియొకటి యగునేని అదిలేనపుడు వస్తువలు తెలియబడవలయును. అట్లు తెలియబడవు. నల్లగ్రుడ్డు మాత్రమింద్రియమైన దానికి దూరముగానుండి దానితో సంయుక్తములు కాని వస్తువులు తెలియబడకుండవలయును. అట్లుగాక దూరమున నున్న వస్తువులను తెలియబడుచున్నవి. కాబట్టి నల్లగ్రుడ్డే నేత్రేంద్రియమా? లేక యందుండు తైజస పదార్థ మింద్రియమా? యని సందేహాభి ప్రాయము.

నల్లగ్రుడ్డు పార్థివపదార్థము. అది తనతో నసంయుక్త వస్తువును గ్రహింపనేరదు. కంటితో సంయుక్తముకాక దూరముగనుండు వస్తువులు నిత్యము మనము గ్రహించుచునే యున్నాము కాబట్టి నల్లగ్రుడ్డు ఇంద్రియముకాదు. అందుతేజస్సునకు సంబంధించిన పదార్థము వేరుగా నుండును. అదియే నేత్రేంద్రియమని వైదికుల సిద్ధాంతము. బౌద్ధులు నల్లనిగ్రుడ్డే యింద్రియమందురు.

ఉత్తరపక్షము : -

**"మహ దణుగ్రహణాత్" 3.1.30.**

మహదణుగ్రహణాత్ = నల్లగ్రుడ్డుకంటె పెద్ద వస్తువులు దానికంటె చిన్న వస్తువులు గ్రహింపబడుచుండుటచే నది నేత్రేంద్రియము కాదు.

కృష్ణసారము మాత్ర మింద్రియమగునెడల దాని కంటె మహత్తులు, మహత్తరములు, మహత్తమములునైన వస్తువులుకానీ, దానికంటె నణువులు, నణుతరములు, నణుతమములునైన వస్తువులుగానీ దానిచే గ్రహింపబడకుండ వలయును. తైజస పదార్థములలో తక్కతదితర ద్రవ్యములలో స్వపరిమాణమునకు మించిన పరిమాణము కలవానిని గ్రహింప జేయగల

సామర్థ్యము లేదు. కాబట్టి కృష్ణసారమింద్రియము కాదు. అందుండు తైజస పదార్థ మతి సూక్ష్మమిం్రదియము. కృష్ణసారము దాని కధిష్ఠానము మాత్రము.

అయినను ఇంద్రియముతో సన్నికృష్ణములు కాక దూరమున నున్న చిన్న, పెద్దవస్తువులు దానిచే నెట్లు గ్రహింపబడునన.

**"రశ్మ్యర్థ సన్నికర్ష విశేషాత్ తద్గ్రహణమ్" 3.1.31.**

రశ్మ్యర్థసన్నికర్ష విశేషాత్ = నేత్ర రశ్మితో వస్తువులు సంయుక్తము లగుట వలన, తద్గ్రహణమ్ = చిన్న పెద్దవస్తువులు గ్రహింపబడుచున్నవి.

దీపపుకాంతి దీపమునకు దూరముననుండు వస్తువులను జేరి వానిని ప్రకాశింపజేయునట్లు కృష్ణసారగోలకమున నుండు నేత్రేంద్రియరశ్మి దూరమున నుండు వస్తువులతో సంయుక్తమై వానిని గ్రహింపజేయును. నేత్రేంద్రియము కంటె వస్తువు చిన్నదైనను, లేక పెద్దదైనను దానితో రశ్మి (కాంతి) సంయుక్తమగుటకెట్టి యాటంకము నుండదు. కాబట్టి మహదణు భేదము లేక యన్నిటిని గ్రహింప వీలగుచున్నదని తాత్పర్యము.

పూర్వపక్షము : –

**"తదనుపలబ్ధేర హేతుః" 3.1.32.**

తదనుపలబ్ధేః= ఇంద్రియవస్తు సంయోగమునకు కారణమైన రశ్మి ప్రత్యక్షము గాకపోవుటవలన, అహేతుః= రశ్మ్యర్థ సన్నికర్షము వలన, ననెడి హేతువు సరికాదు.

నేత్రేంద్రియమునకు సంబంధించిన రశ్మియొండు ప్రత్యక్ష ప్రమాణ సిద్ధమగునెడల గోలకముకంటె భిన్నమైన నేత్రేంద్రియమునకు దూరమున నుండు వస్తువు లారశ్మితో సంయుక్తములై గ్రహింపబడగ వలనుట యుచితమగును. నేత్రరశ్మి ప్రత్యక్షముకాదు. కాబట్టి రశ్మియేలేదు. రశ్మియున్న నది తైజస మగుటచే రూపవంతమై దీపకాంతివలె ప్రత్యక్షముగా గ్రహింపనగును. గ్రహింపవడకుండుటచే రశ్మ్యర్థ సన్నికర్షమువలన దూరస్థ వస్తుగ్రహణమని చెప్పుట ప్రమాణవిరుద్ధము.

ఉత్తరపక్షము: –

**"నానుమీయ మానస్య ప్రత్యక్షతోఽనుపలబ్ధి రభా**
**వ హేతుః" 3.1.33.**

ప్రత్యక్షతః= ప్రత్యక్షముగా, అనుపలబ్ధిః= తెలియబడకుండుట, అనుమీయ మానస్య = అనుమానముచే తెలియబడు వస్తువుయొక్క, అభావహేతుః=

అభావమునకు హేతువున = కాదు.

కొండొక వస్తువు ప్రత్యక్షము కానంతమాత్రమున నది లేదని యనుట తగదు. వస్తుసద్భావము అనుమాన ప్రమాణము చేతను సిద్ధము కాగలదు. చంద్రుని పరభాగముకానీ, భూమి యధోభాగముకానీ ప్రత్యక్షముగా గ్రహింపబడనంత మాత్రమున లేదందుమా? అనుమానముచే నవి సిద్ధించుచున్నవి. అట్లే నేత్రరశ్మియు ననుమానముచే తెలియనగును. నేత్రమునకు, వస్తువునకు మధ్యలో నేదేని యావరణము (అడ్డు)న్న నావస్తువు గ్రహింపబడదు. లేకున్న గ్రహింపబడును. ఇట్టి యావరణాదుల ద్వారా నేత్రేంద్రియముతో వస్తువును సంయుక్త మొనర్చు సంయోజకము నేత్రరశ్మి యెుండు కలదని యూహింపనగును. కాబట్టి ప్రత్యక్షాగ్రహణము రశ్మ్యభావమును సిద్ధింపజేయనేరదని వివేకము.

రశ్మి సద్భావము సిద్ధించినను నది రూపవంత మగుటచే ప్రత్యక్షగ్రాహ్య మేలకాదనగా,

**"ద్రవ్యగుణ ధర్మభేదాచ్చోపలబ్ధినియమః" 3.1.34.**

ద్రవ్యగుణధర్మ భేదాచ్చ= ద్రవ్యధర్మ విశేషమువలనను, గుణ ధర్మ విశేషము వలనను, ఉపలబ్ధినియమః= చాక్షుష ద్రవ్యోపబ్ధినిమయ మేర్పడుచున్నది.

రూపవంతమగు ప్రతి ద్రవ్యమును ప్రత్యక్షము కావలయునను నియమములేదు. అట్లగుచో రూపవంతములగు ద్వ్యణుకములును ప్రత్యక్షము కావసియుండును. కావున కొండొక వస్తువు ప్రత్యక్షము కావలయుననిన నది మహత్త్వముగలదై యనేక ద్రవ్యవంతమై ఉద్భూత రూపము కలదై యుండవలయును. రశ్మిలో రూపమున్నను ఉద్భూతత్వమను గుణధర్మవిశేషము లేకపోవుటచే నది చాక్షష ప్రత్యక్ష గోచరము కాదు.

ఈ సూత్రమున ద్రవ్యధర్మభేదము మహత్వాది విశేమమనియు, గుణధర్మభేదము ఉద్భూతత్వ విశేషమనియు వివేకము.

పూర్వపక్షము: - (తటస్థుడు)

**"మధ్యందినోల్కా ప్రాకాశానుపలబ్ధివత్ తదనుపలబ్ధిః" 3.1.35.**

మధ్యందినోల్కా ప్రకాశానుపబ్ధివత్ = పగటివేళనుల్కా ప్రకాశము ప్రత్యక్షముకానట్లు, తదనుపలబ్ధిః చాక్షుషరశ్మియు గ్రహింపబడదు.

రాత్రియందు ఆకాశమునుండి యప్పుడప్పుడు నేర్పడునుల్కా పాతములను మనము చూచు చుందుము. పగటి యందు నట్టివి జరుగుచుండును. కాని

మనము వానిని జూడనేరము. కారణము సూర్యకాంతి యెక్కువగా నుండుటచే నందుల్కాకాంతులు తిరోభూతము లగును. అధికకాంతి యల్పకాంతిని తనలో నిముడ్చుకొనును. అందువలన నది వేరుగా గ్రహింపబడదు. ఈ స్థితినే యభిభవ మందురు. ఇట్లే నేత్రరశ్మి సూర్యరశ్మిచేనభిభూతమై గ్రహింపబడదని భావము
ఉత్తరపక్షము : –

**"న రాత్రావప్యనుపలబ్ధేః" 3.1.36.**

రాత్రావపి = రాత్రియందును, అనుపబ్ధేః= ప్రత్యక్షము కాకుండుటవలన, న = అభిభూతమగుటచే నేత్రరశ్మి ప్రత్యక్షము కాదనుట యుక్తి విరుద్ధము.

సూర్యకాంతిచే నేత్రరశ్మి యభిభూతమై గ్రహింపబడకున్న రాత్రియందైనను ప్రత్యక్షము కావలసియుండును. ఉల్కాపాతము పగలు కనబడకున్నను రాత్రి కననగుచున్నది. అందువలన నుల్కాప్రకాశము పగలు అభిభూతమయి ప్రత్యక్షము కాదనుట యుక్తి సంగతమే యగును. కాని నేత్రరశ్మి కిది వర్తింపదు.

అట్లయిన నేత్రరశ్మి యేల ప్రత్యక్షము కాదన,

**"బాహ్య ప్రకాశానుగ్రహాత్ విషయోపలబ్ధే రనభి
వ్యక్తితోఽనుపలబ్ధిః" 3.1.37.**

బాహ్యప్రకాశానుగ్రహత్ = బాహ్యప్రకాశ సాహాయ్యము వలన, విషయోపలబ్ధేః= వస్తుగ్రహణ మేర్పడు చుండుట చేత, అనభివ్యక్తితః= ఉద్భూతము కాకుండుట వలన, అనుపబ్ధిః= నేత్రరశ్మి గ్రహింపబడదు.

ఎయ్యది స్వవిషయమును గ్రహింపజేయుటలో బాహ్యప్రకాశము నపేక్షించునో యది యనుద్భూతమగుట చేతనే గ్రహింపబడదు. అభిభవమక్కడ కారణము కాదు. చాక్షుషరశ్మి స్వవిషయమును గ్రహింపజేయుటకు బాహ్యప్రకాశ సాహాయ్యము నపేక్షించును. కాబట్టి యది యనుద్భూత మగుటచేతనే చాక్షుషము కాకున్నది. అన్యకాంతిచే నభిభూతమగుట దాని యనుపలబ్ధికి కారణము కాదు.

ఉల్కా ప్రకాశమువలె నభిభూతమై నేత్రరశ్మి ప్రత్యక్షము కాకున్నదని యేల నుడువరాదన,

**"అభివ్యక్తౌచాభిభవాత్" 3.1.38.**

అభివ్యక్తౌచ = ఉద్భూతమై బాహ్యప్రకాశ సాహాయ్యము నపేక్షింపనిది, అభిభవాత్ = అభిభూతమగును.

చక్షురింద్రియముచే గ్రహింపబడి (ఉద్భూతమై) బాహ్యప్రకాశ సాహాయ్యము నపేక్షింపనట్టిది యభిభూత మగును. ఉల్కా ప్రకాశమిట్టిదే.

బాహ్యప్రకాశము లేనపుడది చక్షుర్గోచర మగుచున్నది. అందువలన అది యుద్భూతరూపవంతము. కాబట్టి దానికంటె మించిన సూర్యకాంతిచే పగటివేళ నది యభిభూతమగుచున్నది. నేత్రరశ్మి యట్లు కాదు. అదియెన్నడు నభివ్యక్తముకాదు. ఉద్భూత రూపవంతమై చక్షుర్గోచర మగునదికాదు. స్వవిషయమును గ్రహింపచేయుటలో బాహ్యప్రకాశసాహాయ్యము నపేక్షించును. కాబట్టి, నేత్రరశ్మియుండియు నభిభూతమగుటచే నుపలబ్ధముకాదనుట తగదు. అనుద్భూత మగుటచే నుపలబ్ధముకాదనుటయే యుక్తి సంగతము.

**"నక్తంచర నయనరశ్మి దర్శనాచ్చ" 3.1.39.**

రాత్రియందు చరించు మార్జాలము మున్నగు జంతువుల నేత్రములందు రశ్మిచూడబడుట వలన ప్రాణుల నేత్రములందు రశ్మి(కాంతి) యున్నదని తెలియుచున్నది. మార్జాలాది జంతువుల జాతి తదితర ప్రాణులకంటె భిన్నమగుటచే వాని కన్నులందు రశ్మియున్నను ఇతర ప్రాణులకన్నుందు రశ్మియుండదన వలనుపడదు. జాతిభేదమున్నను ఆవరణ మున్నపుడు మార్జాలాదులును జూడజాలవు. కావున వాని కన్నులు నితర ప్రాణుల కన్నుల వంటివేయని తేలుచున్నది. కాబట్టి నేత్రరశ్మి సద్భావము నిర్వివాద సిద్ధము.

ఇంద్రియములు రశ్మిద్వారా వస్తువును చేరి దాని నెఱుగజేయు (ప్రాప్యకారిత్వ) పక్షమున రశ్మ్యర్థసన్నికర్ష విశేషము హేతువు కాగలదు. అట్లుకాక యప్రాప్యకారిత్వ పక్షమున రశ్మ్యర్థ సన్నికర్షవిశేషము హేతువు కానేరదని శంకించుచున్నాడు.

**"అప్రాప్యగ్రహణమ్ కాచాభ్రపటల స్ఫటికాంత రితోపలబ్ధేః" 3.1.40.**

కాచాభ్రపటల స్ఫటికాంతరితోపలబ్ధేః= గాజు, అభ్రకము, స్ఫటికము వీనిలో నేదేని యావరణముగా నున్నను నేత్రేంద్రియము వస్తువును గ్రహింపగలుగుచున్నది. కాబట్టి, అప్రాప్యగ్రహణమ్ = ఇంద్రియముతో సన్నికృష్టమై వస్తువు గ్రహింపబడుచున్నదనుట సరికాదు.

ఆవరణము (అడ్డు) లేని తావుందు దూరస్థ వస్తువులెట్లు చక్షురింద్రియముచే గ్రహింపబడుచున్నవోయట్లే స్ఫటికాదుచే నడ్డగింపబడిన వస్తువులును చాక్షుష ప్రత్యక్షమునకు విషయములగు చున్నవి. ఇంద్రియము వస్తు స్థలమున కేగి దానితో సన్నికృష్టమై యద్దానిని ప్రకాశింపజేయునదగు నెడల అవ్యవహితములే గ్రహింపబడవలయును. వ్యవహితములు (ఆవరణముకలవి) గ్రహింపబడవు. వ్యవధానము (అడ్డు) న్నపుడు ఇంద్రియము వస్తువుతో సన్నికృష్టము

కాజాలదుకదా! స్ఫటికాదులచే వ్యవహితములయ్యు వస్తువులు నేత్రముచే గ్రహింపబడుచుండుట లోకసిద్ధమగుటం జేసి ఇంద్రియము ప్రాప్యకారి కాక యప్రాప్యకారియని తెలియుచున్నది. అట్లంగీకరించిన వస్తుగ్రహణమున రశ్మ్యర్థ సన్నికర్షము హేతువు కానేరదు.

ఉత్తరపక్షము : –

**"కుడ్యాంతరి తానుపలబ్ధే రప్రతిషేధః" 3.1.41.**

కుడ్యాంతరి తానుపబ్ధేః = గోడచేనడ్డగింప బడిన వస్తువులు గ్రహింపబడకుండుటవలన, అప్రతిషేధః= రశ్మ్యర్థ సన్నికర్షము హేతువు కాదనుట యుక్తముకాదు.

ఇంద్రియము అప్రాప్యకారి యగునెడల కుడ్యాదులచే నడ్డగింప బడిన వస్తువుల జ్ఞానమును కలుగవలయును. అట్లు కలుగుట లేదు. కాబట్టి యింద్రియము అప్రాప్యకారికాదు. ప్రాప్యకారియే. ఇంద్రియము రశ్మిద్వారా వస్తువును ప్రాపించి యద్దానిని ప్రకాశింపజేయునని యభిప్రాయము.

ప్రాప్యకారియైన కుడ్యవ్యవహితమువలె కాచాభ్రస్ఫటికాదులచే నడ్డగింపబడిన వస్తువు లేల గ్రహింపబడకుండవన,

**"అప్రతి ఘాతాత్ సన్నికర్షోపపత్తిః" 3.1.42.**

అప్రతీఘాతాత్ = (ప్రతీఘాతః= ప్రతిబంధము.) కాచాదులు నేత్రరశ్మికి ప్రతిబంధకము కాకపోవుట వలన, సన్నికర్షోపపత్తిః= రశ్మ్యర్థ సన్నికర్షము కలుగగలదు.

నేత్రరశ్మి తైజస మగుటవలన స్వచ్ఛమైన వస్తువులు దాని నడ్డగింపవు. స్ఫటికాదులు స్వచ్ఛద్రవ్యములు కాబట్టి యట్టి పదార్థముల చే నడ్డగింపబడిన వస్తువులతో నేత్రరశ్మి సన్నికృష్టమగుటలో నెట్టి యాటంకము లేదు. అందువలననే యా వస్తువులు గ్రహింప బడుచున్నవి.

స్ఫటికాదులు నేత్రరశ్మి నడ్డగింపవని యెట్లు విశ్వసింపవలయు ననిన,

**"ఆదిత్యరశ్మేః స్ఫటికాంతరితేఽపిదాహ్యేఽవిఘాతాత్" 3.1.43.**

ఆదిత్యరశ్మేః= సూర్యరశ్మికి, స్ఫటికాంతరితేఽపి దాహ్యే= దహింపజేయదగిన వస్తువు స్ఫటికాదులచే వ్యవహితమై యున్నప్పటికి దానిని, అవిఘాతాత్ = దహింపజేయుటలో నెట్టివిఘాతము కలుగకుండుట వలన నేత్రరశ్మినిఅవి యడ్డగింపవని విశ్వసింప వలయును.

తపింపజేయుటకో లేక దహింపజేయుటకో వీలయిన వస్తువులు గాజు,

స్ఫటికము మున్నగువానిచే నావరింపబడి యున్నను సూర్యకిరణములు స్ఫటికాదుల ద్వారా ప్రవేశించి యా వస్తువును దహించుట చూచుచున్నాము. కిరణసంగ్రాహక కాచయంత్రము (భూతద్దము) ద్వారా సూర్యకిరణములను, సులభముగా దహింపజేయదగు దూదిమున్నగు వస్తువుపై పడునట్లు చేసిన నాకిరణము లావస్తువును దహించుట చూచుచున్నాము. అట్లే నేత్రరశ్మియు తైజస మగుటచేత కాచాదులచే నడ్డగింపబడదని విశ్వసించుట కెట్టి యభ్యంతరము నుండదని భావము.

పూర్వపక్షము: -

**"నేతరేతర ధర్మప్రసంగాత్" 3.1.44.**

ఇతరేతర దర్మప్రసంగాత్ = కుడ్యాదుల ప్రతిబంధక ధర్మము కాచాదులందును, కాచాదుల యప్రతిబంధక ధర్మము కుడ్యాదులందును ప్రసక్తమగుటంజేసి, న = పైన చెప్పినట్లు విశ్వసింప జనదు.

కుడ్యాదులు రశ్మిప్రతిబంధకములు కాచాదులు కావని నిర్ణయింపదగిన నియమ మొండులేకుండుటచే ఒకదాని ధర్మము మరియొక దానియందు ప్రసక్తము కాగలదు. కాబట్టి సూర్యరశ్మివలె నేత్రరశ్మియు కాచాదులచే వ్యవహిత వస్తువులను చేరుట కాటంకములేకపోవుట వలన వాని యుపలబ్ధి కలుగుచున్నదనుట సరికాదని శంకాభిప్రాయము.

ఉత్తరపక్షము :-

**"ఆదర్శోదకయోః ప్రసాదస్వాభావ్యాత్ రూపోపలబ్ధివత్త దుపలబ్ధిః" 3.1.45.**

ఆదర్శోదకయోః = అద్దము, జలమునను రెండును, ప్రసాద స్వాభావ్యాత్ = స్వచ్ఛస్వభావము కలవగుట వలన, రూపోప లబ్ధివత్ = ప్రాణుల ముఖాదులు రూపములు కనబడునట్లు తదుపలబ్ధిః= ప్రసాద స్వభావముగల కాచస్ఫటికాదులచే నడ్డగింపబడిన వస్తువుతో నేత్రరశ్మి సన్నికర్ష మేర్పడుట వలన నావస్తు వింద్రియముచే గ్రహింపబడుచున్నది.

దర్పణము, జలము మున్నగువస్తువులు స్వచ్ఛములగుటచే వానియందు వస్తువులుప్రతిబింబించును. కాని, కుడ్యాదులలో నట్లుకాదు. కాచాదులు స్వచ్ఛమగుటచే నవి నేత్ర రశ్మినడ్డగింపవు అందువలన రశ్మిసన్నికృష్టములయి వస్తువులు తెలియబడును. కాబట్టి స్వభావమే యిట నియమకారణము. కాచస్వభావము కుడ్యమునకుగానీ, కుడ్యస్వభావము కాచాదులకు గానీ లేదు.

కావున నొక వస్తుధర్మము మరియొక వస్తువు నందు ప్రసక్తమగుననుట యుక్తి సంగతము కాదు.

స్వభావము నియామకకారణమైన, కాచస్ఫటికాదులు ప్రతిబంధకములై కుడ్యాదులప్రతిబంధకము లేలకావు?

**"దృష్టానుమితానాం నియోగ ప్రతిషేధానుపపత్తిః" 3.1.46.**

దృష్టానుమితానాం = దృష్టములు, ననుమితములునైన వస్తువుల విషయమున, నియోగప్రతిషేధానుపత్తిః= ఇట్లగుగాక, ఇట్లుకాకుండుగాక యను నియోగ ప్రతిషేధములు కూడవు.

లోకమున పదార్థములు దృష్టములు, అదృష్టములు లేక యనుమితములు నని రెండు విధములు. ప్రమాణముల ద్వారా దృష్టానుమితపదార్థములు మరియొక విధముగ నేల యుండరాదని ప్రశ్నించుట యుక్తముకాదు. చక్షువుచే తెలియబడురూపము నాసికచే నేల తెలియబడ రాదని కానీ నాసికచే గ్రహింపబడు గంధము నేత్రముచే తెలియబడుగాత యని గానీ నియోగించుట కెవరికి శక్యమగును? రూపగంధాదులెట్లు నియత స్వభావములు, నియతధర్మములు కలవై యన్యథా నియోగింపననువుకాకున్నవో యట్లే కాచాదులును నియత స్వభావము కలవై యుండి మఱియొక విధమున నేల యుండగూడదని నియోగింపననువుపడవు. కాబట్టి కాచాదులు ప్రతిబంధకములు కాకపోవుటం జేసి ఇంద్రియరశ్మి వస్తువును జేరి దానిని ప్రకాశింపజేయును. ఇట్లు నేత్రేంద్రియము ప్రాప్యకారియనుట సిద్ధము.

శ్రోత్రేంద్రియము తక్క యిత రేంద్రియములన్నియు చక్షురింద్రియమువలెనే గోలక భిన్నములై ప్రాప్యకారులు (వస్తుసన్నికృష్టములై ప్రకాశింపజేయునవి) అని గ్రహింపవలయును.

ఇంద్రియముల యేకత్వానేకత్వములు పరీక్షింపదలచి సందేహించు చున్నాడు.

**"స్థానాన్యత్వేనానాత్వా దవయవినానాస్థానత్వాచ్చ**
**సంశయః 3.1.47.**

స్థానాన్యత్వే = స్థానములనేకము లయినపుడు, నానాత్వాత్ = స్థానినానాత్వము చూడబడుట వలనను, అవయవినానాస్థానత్వాచ్చ = ఒకేయవయవి యనేకస్థానములు కలదగుటవలనను, సంశయః= నానా స్థానములలోనుండు స్థానులవలె నింద్రియము లనేకములా? లేక యనేక

స్థానములందుండు అవయవివలె నింద్రియ మేకమా? యని సంశయము కలుగును.

అనేక భాండములందుంచబడిన ఫలములవలె స్థానము లనేకములయిన స్థానులు ననేములగుట చూచుచున్నాము. అనేక తంతువులచే నేర్పడు వస్త్రమువలె యవయవాత్మక స్థానము లనేకము లయినను స్థాని (యవయవి) యొక్కటిగా నుండుటయు చూచుచున్నాము. కాబట్టి, శరీరమున నానా స్థానములుగల యింద్రియములగు నానాస్థానములలో నుండు ఫలములవలె ననేకములా? లేక నానాస్థానిక - అవయవాత్మక అవయవివలె నేకమా? యని సంశయము వొడమును, ఇంద్రియమొక్కటే యనుట పూర్వపక్షము. ఇంద్రియము లనేకములనుట సిద్ధాంతమని వివేకము.

పూర్వపక్షము : -

**"త్వగవ్యతిరేకాత్." 3.1.48.**

అవ్యతిరేకాత్ = సర్వేంద్రియస్థానము లందును సంబంధ ముండుటవలన, త్వచ్ = త్వగింద్రియమొక్కటే

త్వక్కు సమస్త శరీరమునందును వ్యాపించియున్నది. త్వక్కుచే వ్యాపింపబడని యింద్రియస్థాన మొండును శరీరమున గాంచము. నేత్రగోలకములందును స్పర్శజ్ఞానము కలుగుట సర్వవిదితము. కాబట్టి యనేకస్థానములుగల యొక యవయవివలె నానాస్థానములు గల త్వగింద్రియ మొక్కటే యీ శరీరమున నున్నట్లంగీకరింప వలయును. అనేకేంద్రియముల నంగీకరించుట యుక్తముకాదు.

ఉత్తరపక్షము : -

**"న యుగప దర్థానుపలబ్ధేః" 3.1.49.**

యుగవత్ = ఒకేక్షణమున, అర్థానుపలబ్ధేః = సర్వేంద్రియార్థములు గ్రహింప బడకుండుట వలన, న = పూర్వోక్తము సరికాదు.

శరీరమున త్వగింద్రియము తక్క ఇతరేంద్రియములు లేనియెడల, స్పర్శజ్ఞానముతో బాటు రూపాదులను తెలియబడవలయును. ఘటమును స్పృశించి నపుడు కఠినత్వము స్పృశింపబడి రూపమున స్పృశింపబడకుండునా? త్వగింద్రియ సన్నికర్షము కఠినత్వమున కుండి రూపమునకు లేకపోదుగదా? అట్టియెడ స్పర్శ తెలిసి రూపమేల తెలియకుండును? ఒకేక్షణమున రెండును తెలియకుండుట లోకసిద్ధవిషయము. కాబట్టి త్వగింద్రియము లేదనుట యుక్తి

సంగతముకాదు.

**"ఇంద్రియార్థపంచత్వాత్" 3.1.50.**

ఇంద్రియార్థపంచత్వాత్ = ఇంద్రియార్థములయిన గంధాదులు ఐదగుటవలన నింద్రియములు నైదు

గంధము, రసము, రూపము, స్పర్శము, శబ్దమునను నవి యైదు నింద్రియార్థము లనబడును. ఈ పంచార్థములలో స్పర్శత్వగింద్రియము చేతనే గ్రహింపబడి రూపాదులు గ్రహింప బడకుండుట సర్వవిదితము. కాబట్టి స్పర్శగ్రాహకము అగు త్వగింద్రియము నంగీకరించినట్లు రూప, రస, గంధ, శబ్దములను గ్రహించుటకు యోగ్యమయిన నేత్రము, జిహ్వా నాసిక, శ్రవణము నను నింద్రియముల నంగీకరింప తప్పదు, ఇట్లు అర్థములయిదగుటవలన నింద్రియములు నైదనుట యుచితమని భావము.

పూర్వపక్షము : -

**"న తదర్థ బహుత్వాత్" 3.1.51.**

తదర్థబహుత్వాత్ = ఇంద్రియార్థము అనేకములగుటవలన , న = ఇంద్రియము లైదనుట తగదు.

ఇంద్రియార్థము లైదేయయిన పక్షమున వానిని గ్రహింపగల యింద్రియములు నైదనుట యుక్తమేయగును; కాని అర్థము లనేకముగుటవలన నింద్రియము లైదేయను టెట్లు పొసగును? అర్థము లనేకములెట్లన? సుగంధము, దుర్గంధము ననిగంధములు రెండు, మధురము, ఆమ్లము (పులుసు) లవణము, కటువు (కారము), కషాయము (ఒగరు), తిక్తము (చేదు) నని రసము లారు; ఇట్లే నీలాది భేదముతో రూపము నేడు; శీతము, ఉష్ణము, అనుష్ణాశీతమునని స్పర్శములు మూడు; వర్ణము, ధ్వని యని శబ్దములు రెండు రకములు. ఇట్లనేక అర్థములుండవానిన గ్రహించుటకు సాధనములయిన ఇంద్రియము నేకము లుండవలయును.

పూర్వపక్షము : -

**"గంధత్వాద్యవ్యతిరేకాద్ గంధాదీనామప్రతిషేధః" 3.1.52.**

గంధాదీనాం గంధత్వాద్యవ్యతిరేకాత్ = సుగంధము, దుర్గంధము నను గంధభేదము - గంధత్వమును విడిచియుండనేరదు. కాబట్టి, అప్రతిషేధః= ఇంద్రియపంచత్వమును కాదన వలనుపడదు.

అర్థము లైదగుట వలన నింద్రియము లైదని చెప్పి యుంటిమి. ఆ

యర్థములు గంధాదులు. అయ్యవి సుగంధ దుర్గంధాది భేదయుక్తములే. అయినను, గంధత్వాదుల కాశ్రయములే యగును. కాని భిన్నములు కావు. ఇట్లు ఆశ్రయభేదము ననుసరించి యింద్రియభేదమని మా యభిప్రాయము. సర్వవిధ గంధములును గంధత్వమున కాశ్రయమనక తప్పదు. ఇట్లే సర్వ రసములు రసత్వమున కాశ్రయములు. రూపాదులు నిట్లే యెంచవలయును. ఇట్లు గంధత్వాద్యాశ్రయభేదమువలన నర్థము లయిదు విధములే యగును. కాగా, వాని గ్రాహకము లింద్రియములు నైదే

పూర్వపక్షము : –

**"విషయత్వాతిరేకాదేకత్వమ్" 3.1.53.**

విషయత్వావ్యతిరేకాత్ = గంధాదివిషయములు విషయత్వము నతిక్రమింపజాలవు, ఏకత్వమ్ = ఇంద్రియైకత్వము.

గంధాదులు గంధత్వము నతిక్రమింపకుండుటచే నైదగు నేని, గంధాదులు విషయములగుటచే విషయత్వమున కాశ్రయములై విషయత్వము నతిక్రమింపమిచే నేకత్వమును సిద్ధించును. ఇట్ల ర్థములలో నేకత్వము సిద్ధింపవలనర్థగ్రాహకములైన ఇంద్రియములలో నేకత్వము సిద్ధించును.

ఉత్తరపక్షము : –

**"నబుద్ధి లక్షణాధిష్ఠాన గత్యాకృతి జాతిపంచత్వేభ్యః" 3.1.54.**

బుద్ధి.......... పంచత్వేభ్యః= బుద్ధి, లక్షణము, అదిష్ఠానము, గతి, ఆకృతి, జాతియను నీయారింటి పంచత్వము వలన, న = పూర్వ సూత్రోక్తము సరికాదు.

గంధ సామాన్యమైన గంధత్వముచే సుగంధ దుర్గంధములు, ఇట్లే రసత్వసామాన్యముచే షడ్విధరసములు, రూపత్వముచే శుక్లాది రూపములు, స్పర్శత్వముచే శీతోష్ణాది స్పర్శలు, శబ్దత్వముచే వర్ణధ్వన్యాత్మక శబ్దములు వ్యవస్థా పూర్వకముగా నొక్కొక యింద్రియముచే గ్రహింపబడుచున్నట్లు, విషయత్వమనెడి సామాన్యముద్వారా వ్యవస్థితములై గంధాదులొక్కే యింద్రియముచే గ్రహింపబడి యన్యేంద్రియములనపేక్షింపని పక్షమున నింద్రియములనేకములు కాక యొకటి యనదగును. అట్టి నియమము కానరానంతవరకు నింద్రియమొక్కటే యనుట ప్రమాణవిరుద్ధము. గంధత్వ, రసత్వ, రూపత్వ, స్పర్శత్వ, శబ్దత్వసా మాన్యముల ద్వారా ఐదువిధములుగా విషయము లన్నియు వ్యవస్థితములై నాసికా దీంద్రియములచే వేరువేరుగా గ్రహింప బడుటచే నింద్రియము లైదనకతప్పదు. గ్రహింపదగిన విషయములు

(అర్థములు) అయిదగుటచే గ్రాహకముయిన యింద్రియము లైదని భావము. ఇంద్రియార్థము లైదనుట వలన నింద్రియములైదైనట్లు బుద్ధ్యాదులు నైదగుటచే నింద్రియము లైదనుట యుక్తము.

(1) బుద్ధి = జ్ఞానము, ఇంద్రియములచే నేర్పడుజ్ఞానము పంచవిధము, ఘ్రాణజము, రాసనము, చాక్షుషము, స్పార్శనము, శ్రావణము. కాబట్టి నాసిక రసన, చక్షువు, స్పర్శనము, శ్రవణము నని ఇంద్రియము లైదు.

(2) లక్షణము : –గంధగ్రాహక మింద్రియము ఘ్రాణము, రసగ్రాహక మింద్రియము రసన. రూపగ్రాహక మింద్రియము చక్షువు. స్పర్శగ్రాహక మింద్రియము త్వక్కు శబ్దగ్రాహక మింద్రియము శ్రవణము. ఇట్లింద్రియలక్షణము లయిదగుటచే నింద్రియము లైదు.

(3) అధిష్ఠానము = ఇంద్రియస్థానము. నాసాది ఇంద్రియస్థానము లైదును భిన్నము లగుటచే నింద్రియము లైదు.

(4) గతి = అర్థగ్రహణ పద్ధతి. గతిభేదముచే నింద్రియము లైదు. నాసిక, జిహ్వా, త్వక్కు నను నీ మూడింద్రియములు తమదగ్గరచేరి తమతో సన్నికృష్టములైన స్వవిషయములను గ్రహించును. చక్షువు తనకిరణములతో దూరముననున్న విషయమును చేరి గ్రహించును, శ్రవణము సంతాన వృత్తితో తన చెంత జేరిన శబ్దమున గ్రహించును.

(5) ఆకృతి = ఇంద్రియాధిష్ఠానముల సంస్థానవిశేషము. ఇంద్రియముల యాకృతియు నైదువిధము లగుటచే నింద్రియము లైదు.

(6) జాతి = ఘ్రాణత్వాదిధర్మము. ఇంద్రియములలోని ఘ్రాణత్వాదిధర్మమునైదువిధముగుటచే నింద్రియములైదే.

ఇంద్రియములు కిమాత్మకములన,

**"భూతగుణవిశేషోపలబ్ధేః తాదాత్మ్యమ్" 3.1.55.**

ఘ్రాణాదులయిన యింద్రియములద్వారా, భూతగుణ విశేషోపలబ్ధేః = పృథివ్యాది పంచభూతములలోని గంధాది విశేషగుణములు తెలియబడుట వలన, తాదాత్మ్యమ్ = ఇంద్రియములు పంచభూతాత్మకములు.

ఏది యేభూతమునందలి గుణవిశేషమును తెలుపునో యది తదాత్మకమగుట నియమము. ఘ్రాణేంద్రియము గంధ రస– రూప– స్పర్శ– శబ్దములలో గంధమునే తెలుపును. కాబట్టి యది పార్థివము – పృథివ్యాత్మకము రసనేంద్రియము ఆప్యము – జలాత్మకము. రసమునేగ్రహించును. చక్షువు

తైజసము - అగ్న్యాత్మకము రూపమును గ్రహించును. స్పర్శనము వాయ్వాత్వకము. స్పర్శనుగ్రహించును. శ్రవణము ఆకాశాత్మకము. శబ్దమునే గ్రహించును. ఇట్లు ఘ్రాణాదీంద్రియములు పంచభూతాత్మకములు.

(అర్థపరీక్షణ)

**"గంధ రసరూప స్పర్శశబ్దానాం స్పర్శపర్యంతాః పృథివ్యాః " 3.1.56.**

గంధరసరూప స్పర్శశబ్దానాం = గంధము, రసము, రూపము, స్పర్శము, శబ్దము నను వీనిలో, స్పర్శపర్యంతాః= శబ్దముతక్క మిగిలిన గంధ రస రూప స్పర్శములు, పృథివ్యాః= పృథివికి సంబంధించిన గుణములు.

గంధము, రసము. రూపము, స్పర్శము ఇవి పృథివి యందుండును.

**"ఆప్తేజోవాయూనాం పూర్వపూర్వమపోహ్యాకాశస్యోత్తరః" 3.1.57.**

గంధ, రస రూప, స్పర్శములలో. పూర్వం పూర్వం = పూర్వపూర్వ గుణములు, ఆపోహ్య = విడిచిన మిగిలినవి ఆప్తేజోవాయూనాం = జాలాగ్ని వాయువుల గుణములగును, ఉత్తర ః= శబ్దము, ఆకాశస్య = ఆకాశమునకు సంబంధించినది.

జలమున రసము రూపము స్పర్శము నను గుణములును, అగ్నియందు రూపస్పర్శలును, వాయువునందుస్పర్శము, ఆకాశమున శబ్దమునను గుణములున్నవని భావము.

పూర్వపక్షము: -

**"నసర్వగుణానుపలబ్ధేః" 3.1.58.**

నర్వగుణానువలబ్ధేః= ఆయాభూతాత్మక ఇంద్రియంవముచే నాయాభూతగుణములన్నియు గ్రహింపబడకుండుటచే, న = పై సూత్రములందు వర్ణింపబడినట్లు గుణములంగీకరింపతగదు.

పృథివియందు గంధ రస రూపస్పర్శము, జలము నందు రసరూప స్పర్శములు, అగ్నియందు రూపస్పర్శములు, నున్న యెడల పార్థివమైన ఘ్రాణేంద్రియముచే గాంధాదులు, బలీయమైన రసనేంద్రియముచే రసాదులు, తైజసమగు చక్షురింద్రియముచే రూపస్పర్శములు గ్రహింపబడవలయును. అట్లు గ్రహింపబడుట లేదు. ఘ్రాణముచే గంధము, రసనచే రసము, చక్షువుచే రూపముమాత్రమే గ్రహింప బడుచున్నది. కాబట్టి యేభూతాత్మతకమైన యింద్రియముచే నేగుణము గ్రహింపబడుచున్నదో యాగుణమే యా

భూతముననున్నట్లెంచ వలయును. అన్యగుణములుండుట యుక్తి విరుద్ధమని సూత్రార్థము.

ఉత్తరపక్షము :– (ఏకదేశి సమాధానము)

**"ఏకైకశ్యేనోత్తరోత్తర గుణ సద్భావాదుత్తరోత్తరాణాం తదనుపలబ్ధిః." 3.1.59.**

ఉత్తరోత్తరభూతానం = తరువాతి తరువాతి జలాధిభూతములలో, ఏకైకశ్యేన = ఒక్కొటొక్కటిగా ఉత్తరోత్తరగుణసద్భావాత్ = తరువాతి తరువాతి రసాదిగుణములుండుటవలన, తదనుపలబ్ధిః= వృధివ్యాధులలో ఘ్రాణాదులచేనవి తెలియబడవు.

గంధరసరూపస్పర్శ శబ్దములలో నొక్కటొక్కటిగ క్రమముగా నొక్కొక్కభూతము నందుండుట వలన రసాదులు భూమియందును, రూపాదులు జలమునందును, స్పర్శాదులగ్నియందును తెలియబడకపోయినను దోషములేదు. పృథివి యందు గంధగుణము మాత్రముండును. అది ఘ్రాణముచే గ్రహింపబడుచునేయున్నది. జలమునందు రసమున్నది. అది రసనచే నుపలబ్ధమగుచున్నది. ఇట్లగ్ని వాయ్వాకాశములలో రూప స్పర్శ శబ్దము లొక్కటొక్కటిగానుండి యాయాచక్షురాదీంద్రియములచే నుపలబ్ధము లగుచునేయున్నవి. ఏవియుపబ్ధముగుటలేదో యవి యా భూతములందు లేనేలేవు. కాబట్టి దోషము లేదు.

పృథివ్యాధులలో రసాదులేల యున్నవని,

**"విష్టం హ్యపరం పరేణ." 3.1.60.**

అవరం = పూర్వము, పరేణ = పరముతో, విష్టంహి = సంయుక్తమైయున్నది.

పృథివియందు శీతస్పర్శము వాస్తవమున లేకున్నను 'శిలాతల మతిశీతలము' అనుతావులందు జలసంయోగముచేనట శీతలత యని తెలియనగును. కాబట్టి యది యౌపాధికము. ఒక భూతముతో మఱియొక భూతము సంయుక్తమై యున్నదనుట నిర్వివాద విషయము, కాబట్టి యొక భూతము నందువేరొండు భూతగుణములుపలబ్ధము లగుచునే యుండునని సూత్రాభిప్రాయము.

ఉత్తర పక్షము : – (సిద్ధాంతి)

**"నపార్థివాప్యయోః ప్రత్యక్షత్వాత్." 3.1.61.**

పార్థివాప్యయోః= పృథివీజలముల రసరూపములు, ప్రత్యక్షత్వాత్ = రసనచక్షువులచే నుపబ్ధములగుటవలన, న = పై మూడు సూత్రములందు చెప్పబడినది సరికాదు.

మధురాది భేదయుక్తమైన రసము పృథివియందుండుటను రసనేంద్రియముద్వారా తెలిసికొనుచున్నాము. ఇట్లే జలమునందలి శుక్ల రూపము చక్షువుచే గ్రహింపబడుచున్నది. ప్రత్యక్షప్రమాణ మితర ప్రమాణముకంటె నెక్కుదు ప్రామాణ్యము కలదగుటవలన ప్రత్యక్షముగా చూడబడుదాని నపలాపము చేయుట (కాదనుట) యుక్తి యుక్తముకాదు. ఉత్తరోత్తర భూతముల సంయోగమువలన నవి యుపలబ్ధమగుచున్నవనుట యుక్తముకాదు. అట్లయిన జలమునందు మధురరసముతో బాటు తక్కిన రసములేల యుండవు? అట్లే తేజస్సునందు లోహితరూపముతోబాటు శుక్లరూప మేలయుండవు? కాబట్టి అన్యభూత సంయోగముచే నన్యగుణము లుపలబ్ధములగుచున్నవి; అవి యౌపాధికము లనుట తగదు. భూతాంతర సంయోగమువలన నుపలబ్ధములగుచో జలమున షడ్విధరసము, అగ్నియందు శుక్లరూపము నుపలబ్ధము కావలసియుండును. అట్లుకాకపోవుటచే పృథివ్యాదులలో గంధాదులెట్లు స్వాభావిక గుణములో యట్లే రసాదులు స్వాభావికము లని యెఱుంగ వలయును.

రసాదులును పృథివ్యాదు స్వాభావిక గుణములయిన పక్షమున గంధమువలె రసమును నాసికచే నేలగ్రహింపబడుదన

**"పూర్వంపూర్వం గుణోత్కర్షాత్ తత్ప్రధానమ్" 3.1.62.**

పూర్వం పూర్వం = నాసికాదీంద్రియములలో పూర్వపూర్వేంద్రియము - నాసికాది ఇంద్రియము, గుణోత్కర్షాత్ = గంధగుణము ప్రాధాన్యముగా గలదగుటవలన, తత్ప్రధానమ్ గంధగుణమును ప్రధానముగ గ్రహించును.

ఏ ద్రవ్యమున నేగుణము ప్రధానముగనుండునో యా ద్రవ్యము ద్రవ్యాంతరమున నున్న యాగుణమునే ప్రకటించును. నాసికాది ఇంద్రియములందు ఇతరగుణములున్నను, గంధాది గుణములు ప్రధానముగనున్నవి, కాబట్టి యవి యాయాద్రవ్యములలోని గంధాది గుణములనే ప్రకాశింపజేయును - గ్రహించును. నాసిక గంధమును, రసనరసమును, చక్షువురూపమును, స్పర్శనము స్పర్శను, శ్రవణము శబ్దమునే గ్రహించును. అన్య గుణములను గ్రహింపవు. కాబట్టి రసాదులు పృథివీగుణము లైనను

నాసిక గంధమునే గ్రహించును; రసాదులను గ్రహించ దనుట దోషముకాదు.

నాసికాదులిట్లు పాంచభౌతికములని సిద్ధించుచుండ గంధాదులేక ప్రధానములయి రసాదులు కాకున్నవన,

**"తద్వ్యవస్థానంతు భూయస్త్వాత్" 3.1.63.**

భూయస్త్వాత్ = ఇంద్రియమునకు ప్రకృతి యగు భూతద్రవ్య మధికముగా నందుండుట వలన, తద్వ్యవస్థానం = ఒక యింద్రియమున నొకగుణము ప్రధానము; మిగిలినవి యప్రధానము ను వ్యవస్థయేర్పడు చున్నది.

సామాన్యముగ నింద్రియమున్నియు పాంచభౌతికములయినను, నొక్కొక యింద్రియమున నొక్కొక ప్రకృతి ద్రవ్య మధికముగా నున్నది. నాసికేంద్రియమున పృథివీ ద్రవ్యాంశ మధికము. రసనయందు జలము, చక్షువునందు తేజస్సు, త్వక్కునందు వాయువు శ్రోత్రమున నాకాశము అధికము. ఏ ద్రవ్యమే యింద్రియమున నెక్కువగా నున్నదో దాని గుణమున కలదు ప్రాధాన్యమని వివేకము. కాబట్టి ఘ్రాణాదులలో గంధాదులు ప్రధానములు; రసాదులు కాదను వ్యవస్థ యుచితమే.

ఘ్రాణాదీంద్రియములలో గంధాదిగుణములు ప్రధానములు గనున్నచో నాయా యింద్రియములోని గుణము లాయా యింద్రియములచే నేల గ్రహింపబడవన,

**"సగుణానామింద్రియభావాత్" 3.1.64.**

సగుణానాం = గంధాదిగుణములతో కూడిన ఘ్రాణాదులే ఇంద్రియ భావాత్ = ఇంద్రియము లనబడును.

ఘ్రాణాది ఇంద్రియము గంధాదిగుణయుక్తములు కానిచో వానియం దింద్రియభావము - విషయగ్రాహకత యుండనేరదు. నిర్గుణములు గుణగ్రాహకములు కానేరవు. దీపము రూపరహితమగుచో నది యితర ద్రవ్యములందలి రూపమును ప్రకాశింపజేయనేరదు. కాబట్టి ఘ్రాణాదీంద్రియము తమలోని గంధాదిగుణములను వేరుచేసి తాము గుణ రహితములయి గంధాదిగుణములను గ్రహింపనేరవు. కారణము వానిలో నపు డింద్రియత్వము లేకపోవుటయే.

**"తేనైవ తస్యాగ్రహణాచ్చ" 3.1.65.**

తేనైవ = దానిచేతనే, తస్యాగ్రహణాచ్చ = అది గ్రహింప బడకుండుట వలన ఘ్రాణాదీంద్రియములు స్వగుణములను గ్రహింపనేరవని యర్థము.

ఘ్రాణాదులలో గంధాదిగుణములు లేనియెడ నవి యింద్రియము స్వరూపమునే పొందజాలవు. కాబట్టి గంధాది గుణములే ఇంద్రియస్వరూపములని తెలియుచున్నది. అట్టి యెడ ఇంద్రియములు స్వగుణముల నేలగ్రహింపవని ప్రశ్నించుట చక్షువు తన్ను తానేల గ్రహింపదని ప్రశ్నించుటయగును. అది యసంభవము. కాబట్టి ఇంద్రియములు స్వగుణములను గ్రహింపనేరవని భావము

పూర్వపక్షము: -

**"న శబ్దగుణోపలబ్ధేః" 3.1.66.**

శబ్దగుణోపబ్ధేః= శ్రోత్రేంద్రియముచే శబ్దగుణముపబ్ధమగు చుండుటవలన, న= ఇంద్రియములు స్వగుణములను గ్రహింప నేరవనుట యుక్తముకాదు,

కర్ణఛిద్రముచే నావరింపబడిన యాకాశమేకర్ణేంద్రియ మనబడును, ఆకాశాత్మకమగుకర్ణము స్వగుణమయిన శబ్దమును గ్రహించుచున్నందున ఇంద్రియములు స్వగుణగ్రాహకములు కావనుట ప్రమాణవిరుద్ధము.

ఉత్తరపక్షము : -

**"తదుపలబ్ధి రితరేతర ద్రవ్యగుణవైధర్మ్యాత్" 3.1.67.**

ఇతరేతర ద్రవ్యగుణవైధర్మ్యాత్ = ఘ్రాణాదిద్రవ్యములు, వాని గంధాది గుణములు పరస్పరము విలక్షణ ధర్మము కలవగుటచే, తదుపలబ్ధిః= శబ్దగుణము శ్రోత్రేంద్రియముచే గ్రహింపబడుచున్నది.

ఘ్రాణాదులు తమలో ఇంద్రియత్వము సంపాదించుటకై గంధాదిగుణముల నెట్లపేక్షించునో యట్లు (శ్రోత్రేంద్రియము) ఆకాశము ఇంద్రియమగుటకు శబ్ద గుణ సాహాయ్యము నపేక్షింపదు. గంధాదులు గంధాదులచే వ్యక్తములగునట్లు శబ్దము శబ్దాంతరముచే వ్యంజకముకాదు. శబ్దము సంతానవృత్తితో శ్రవణేంద్రియమును చేరును. గంధాదులట్లు చేరవు. ఇట్టి భేదములుండుటచే దానియుప లబ్ధియందును భేద ముండుట సహజము. కాబట్టి శ్రోత్రేంద్రియముచే స్వగుణమైన శబ్దగ్రహణము కలిగినప్పటికి ఘ్రాణాదీంద్రియములు స్వగుణగ్రాహకములు కావనిని వచ్చుదోషమొందును కానరాదు. శ్రవణముకాక మిగిలిన ఇంద్రియములు స్వగుణములను గ్రహింపవను నియమము నచలమేయని సూత్రాభిప్రాయము.

తృతీయాధ్యాయమున ఆద్యాహ్నికము.

# న్యాయ దర్శనము

## తృతీయాధ్యాయము

(ద్వితీయాహ్నికము)

క్రమము ననుసరించి యింద్రియము తరువాత బుద్ధిని పరీక్షింపగోరి ముందు సంశయించుచున్నాడు.

**"కర్మాకాశ సాధర్మ్యాత్ సంశయః" 3.2.1.**

కర్మాకాశసాధర్మ్యాత్ = కర్మ, ఆకాశము నను నీ రెంటితోను సమానమయిన ధర్మము కలదగుటవలన, సంశయః= బుద్ధికర్మవలె ననిత్యమా? లేక యాకాశమువలె నిత్యమా? యని సందేహము కలుగును.

కర్మయందును, ఆకాశమునందును స్పర్శధర్మము లేదు. కర్మ యనిత్యము. ఆకాశము నిత్యము. ఇట్లు స్పర్శ ధర్మములేని వస్తువులు నిత్యము, అనిత్యమునని రెండు విధములుగా చూడబడుచున్నవి. ఇట్లే బుద్ధియందును స్పర్శ ధర్మము లేదు. కాబట్టి, యస్పర్శత్వమున బుద్ధి కర్మతోను, ఆకాశముతోను సమమగుచున్నది. సమానధర్మము కలదియై కర్మవలె ననిత్యమా లేక యాకాశమువలె నిత్యమా? యని సంశయము కలిగించుచున్నది.

న్యాయశాస్త్రమున బుద్ధిశబ్దము జ్ఞానార్థమున వాడబడును. కాని సాంఖ్యదర్శనము నాత్మ, మనస్సు, అంతః కరణము, చిత్తమునని దానికి నామాంతరము లని యెంచుదురు. ఇంద్రియములు గోలక ములు, వానియందు ప్రతిబింబితములయిన విషయములు ఇంద్రియసంస్పృష్టమయిన బుద్ధియందు ప్రతిబింబించుచుండునని వారి మతము. బుద్ధియం దా విషయము ప్రతిబింబింపగా నా బుద్ధి యాయా విషయాకారతను పొందును. ఇట్టి విషయాకారతయే 'ఇది ఘటము ఇది పటము' నను విషయజ్ఞానము. కాబట్టి సాంఖ్యుల దృష్టిలో బుద్ధియొక్క విషయాకారతయే జ్ఞానమనబడును. ఈ బుద్ధి నిత్యమని సాంఖ్యులమతము. ఇదియే యీ సూత్రమున పూర్వ పక్షము. ఆత్మేంద్రియార్థము సన్నికర్షమువలన కలుగు జ్ఞానము బుద్ధి యనబడును. అది యాత్మకాదు. మనఃస్సం యుక్తమైన యాత్మకు గుణము అది యనిత్యము నని న్యాయమతము. ఇదియే సిద్ధాంత పక్షము.

పూర్వపక్షము : –

**"విషయప్రత్యభిజ్ఞానాత్" 3.2.2.**

విషయప్రత్యభిజ్ఞానాత్ = విషయసంధానముచే బుద్ధి నిత్యము.

పూర్వమొకప్పుడు తా జూచినవస్తువును మరల వేరొక పర్యాయము చూచిన 'అదే యిది' యని కలుగు జ్ఞానము ప్రత్యభిజ్ఞాన మనబడును. ఈ జ్ఞానమున కధికరణము బుద్ధియేయగును. బుద్ధి స్థిరముకాక నశ్వరమగునేని ప్రత్యభిజ్ఞానమున కధికరణము కాజాలదు. ప్రథమ పర్యాయమున జూచిన బుద్ధివేరు. కాలాంతరమున జూచు బుద్ధి వేరగును. అట్టియెడ ప్రత్యభిజ్ఞానమే కలుగనేరదు. ఒకరుచూచిన దానిని మరి యొకరుచూచి తాను పూర్వముచూచిన దిదియే యని యెట్లు చెప్పగలరు? చైత్రుడు చూచి తెలిసికొనినదానిని మైత్రుడు గుర్తుపట్టగలుగునా? ఎన్నడు నట్లు జరుగనేరదు. కాబట్టి బుద్ధి స్థిరమై, నిత్యమైననాడే ప్రత్యభిజ్ఞానము సంభవించును. అందువలన బుద్ధి నిత్యము.

పూర్వపక్షము : -

**"సాధ్యసమత్వా దహేతుః" 3.2.3.**

సాధ్యసమత్వాత్ = సాధ్యముతో సమానమగుట వలన, అహేతుః= విషయప్రత్యభిజ్ఞచే బుద్ధి నిత్యమనెడి హేతువు సరికాదు.

సిద్ధవిషయమే హేతువు కాగలదు. అసిద్ధము హేతువు కాజాలదు. బుద్ధినిత్యత్వ మెట్లు సాధ్యమో యట్లే బుద్ధికి ప్రత్యభిజ్ఞ కలుగునను నదియు సాధ్యవిషయము. కాబట్టి హేతువుగా ప్రయోగింపజనదు. ప్రత్యభిజ్ఞ యనునది చేతన ధర్మము. అది యచేతనమైన బుద్ధికి ధర్మముగా చెప్ప వలనుపడదు. చేతనము పూర్వమెరిగిన దానిని గుర్తించి (అదే యిది) ప్రత్యభిసంధి చేయగలుగును. అచేతన మెన్నడు నట్లు చేయనేరదు సాంఖ్యులబుద్ధి యచేతనము కాగా అచేతనమైనబుద్ధియందు ప్రత్యభిజ్ఞ కలుగదు. ప్రత్యభిజ్ఞ సిద్ధింపకున్న బుద్ధి స్థిరమగుటచే నిత్యమనుటయు అసంగతము.

**"న యుగపదగ్రహణాత్" 3.2.4.**

యుగవత్ = ఒకేసారి, అగ్రహణాత్ = అనేకవిషయములు గ్రహింపబడకుండుటవలన, న= బుద్ధిచేతనముకాదు.

బుద్ధిచేతనమే యగునెడల, ఇంద్రియగోలకముల కది సర్వదా సమీపమున నంటియుండుటచే అన్నియింద్రియగోలకముందును ఒకేలక్షణమున ప్రతిబింబించు నానా విధవిషయములు నొక్కసారిగా గ్రహింపబడవలయును. బుద్ధికి ఇంద్రియముకు మధ్య నొక్కొక్క యింద్రియముతో బుద్ధిని సంయుక్త

పరచు అంతఃకరణము వేరుగా లేదుకదా! కాబట్టి నియమముగా నొకటివెంట మరియొకటిగా రూప రసాదులు గ్రహింపబడక అన్నియు నొకేసమయమున గ్రహింపబడ వలయును. అట్లు గ్రహింపబడకుండుటచే బుద్ధి చేతనముకాక యచేతనమనియే ధ్రువపడుచున్నది.

**"అప్రత్యభిజ్ఞానేచ వినాశప్రసంగః" 3.2.5.**

అప్రత్యభిజ్ఞానేచ = ప్రత్యభిజ్ఞానమే కలుగనిపక్షమున, వినాశ ప్రసంగః= బుద్ధికి నాశప్రసక్తికలుగును

ప్రత్యభిజ్ఞాన బలమువలననే బుద్ధిస్థిరమనిచెప్పవీలగును. అది యంగీకరింపని పక్షమున బుద్ధిస్థిరమని యెట్లు చెప్పగలము? హేతువులేని బుద్ధిస్థైర్యము యుక్తిసంగతముకాదు. కాబట్టి బుద్ధిస్థిరము, నిత్యము నని చెప్ప వలనుపడదు. నిశ్చితముగ నశించు ననవలసివచ్చును.

పూర్వపక్షము: -

**"క్రమవృత్తిత్వా దయుగపద్గ్రహణమ్" 3.2.6.**

క్రమవృత్తిత్వాత్ = విషయములతో క్రమముగా సంబంధము కలుగుటచే అయుగపద్గ్రహణమ్ = ఒకేలక్షణమున బుద్ధిగ్రహింపదు.

బుద్ధిచేతనము కానందువలన యుగపద్గ్రహణము కలుగదనుట యుక్తముకాదు. విషయముతో క్రమముగా సంబంధము కలుగుటచే బుద్ధికిక్రమముగా జ్ఞానముకలుగుచున్నది. ఆత్మచేతనమయ్యు నసంబధమగు నర్థమును గ్రహింపనేరదు కదా! కాబట్టి యుగపద్గ్రహ ణము కానందున బుద్ధియచేతనమనుట యుక్తముకాదు.

వస్తువులతో యుగపత్సంబంధ మున్న యెడను యుగపత్ జ్ఞానమేల కలుగదన;

**"అప్రత్యభిజ్ఞానంచ విషయాంతరవ్యాసంగాత్" 3.2.7.**

ఈ సూత్రమున ప్రత్యభిజ్ఞానశబ్దము నానార్థమున వాడబడినది, అనేకవిషయములతో సంబంధమున్నప్పటికీ, విషయాంతర వ్యాసం గాత్ = అన్యవిషయమున మిక్కిలి యాసక్తిగలిగియుండుటవలన, అప్రత్యభిజ్ఞానంచ = మిగిలిన విషయము జ్ఞానము కలుగదు.

కొన్నియెడల సన్నికర్షమున్నప్పటికీ జ్ఞానముకలుగని మాట సత్యమే యయినను బుద్ధి యచైతన్యమనిసిద్ధింపదు, బుద్ధికొండొక విషయమును గ్రహించుటలో వ్యాసక్తమై యుండుటవలన తదితర విషయములను

గ్రహింపదనవచ్చును. అన్యమును విడిచి యొకదాని యందు లగ్నమగుట వ్యాసంగమనబడును. ఒకచో వ్యాసక్తుడైన వ్యక్తి అన్యమును తెలిసి కొనజాలడనుట వైదికులైన మీరు అంగీకరింతురు. "అన్యత్రమనా అభూవం నాదర్శమ్, అన్యత్రమనా అభూవమ్ నాశ్రౌషమ్" (బృ. ఉ. 3.5.3) నా మనస్సు అన్యత్రలగ్నమైయున్నది. కావున నేను చూడలేదు. వినలేదు. అనునిది లోకానుభవ సిద్ధమును. కాబట్టి యొకప్పుడు బుద్ధియు సన్నిహితార్థమును గ్రహింపనంతమాత్రమున నది య చేతనమును నొప్పదని యభిప్రాయము. చేతనమై నాశరహితమగుటచే నిత్యమనియు తేలుచున్నది.

ఉత్తరపక్షము : -

**"గత్యభావాత్" 3.2.8.**

గత్యభావాత్ = బుద్ధి గతిరహితమగుటచే పూర్వపక్ష మయుక్తము.

బుద్ధి స్థిరమై, గతిరహితమగుటచే నది విషయస్థలమునకు బోనేరదు. గతిలేనిదగుటచే నది యొక్కొక్క విషయమునుచేరి యందు కొండొక దానియందు వ్యాసక్తమై అన్యమును గ్రహింపదనిగానీ, క్రమముగా గ్రహించుననిగానీ యనుట పొసగదు. సాంఖ్యుల మతమున విషయము ఇంద్రియ గోలకములందు ప్రతిఫలించి బుద్ధియందు ప్రతిబింబించుటయేకదా జ్ఞానమనబడును. ఇంద్రియగోలకములు సదా తెరువబడియుండును. వానిద్వారా వస్తువు బుద్ధి యందు ప్రతిఫలించును. ఒక్కొక్క యింద్రియ మొక్కొక్కసారి వస్తువు ప్రతిఫలమునకు తావిచ్చిన క్రమ మేర్పడును. కాని, క్రమవృత్తికి వేరొండువిధానమేమున్నది? అట్టి ప్రసక్తి యింద్రియముల కానము. క్రమవృత్తి యసంభవమైనపుడు యుగపత్ విషయగ్రహణమేల కలుగదు? కలుగవలసియేం యుండును. అనుభవమున యుగపద్గ్రహణముకలుగకుండుటచే బుద్ధి యచేతన మనుట నిశ్చితము. కాబట్టి బుద్ధి యెఱుగును. దానికి జ్ఞానము కలుగుననుట చెల్లదు. అచేతన మెట్లెఱుగగలదు? విషయాంతర వ్యాసక్తికూడ బుద్ధియందు అను పపన్నమగుటచే అయ్యది నశింపదనుటయు తగదు. కాబట్టి యనిత్యమగుట నిర్వివాదము జ్ఞానము (బుద్ధి) ఉత్పన్నమై నశించుట ప్రత్యక్షసిద్ధము. రసబుద్ధి కలుగుటయు రూపబుద్ధి నశించుటయు లోకసిద్ధము. కాబట్టి బుద్ధి యనిత్యము, అనేకము నని సిద్ధాంతము.

ప్రస్తుతము బుద్ధి క్షణికమయి యాత్మయనబడును వాదమును

ఖండించుటకు సూత్రము.

**"స్ఫటికాన్యత్వాభిమానవత్ తదన్యత్వాభిమానః" 3.2.9.**

స్ఫటికాన్యత్వాభిమానవత్ = అనేక కుసుమముల సన్నిధానమున నొకే స్ఫటిక మనేకముగా తోచినట్లు, తదన్యత్వాభిమానః= గంధాది విషయభేదముచే బుద్ధియు ననేకము.

నానావర్ణములుగల కుసుమములు సమీపమున నుంచబడిన పుడొక స్ఫటికమణి పుష్పవర్ణములతో కూడి యెఱ్ఱగాను, పచ్చగాను, మఱియు ననేక విధముల భాసించుచు ననేకముగా తోచుట లోక సిద్ధము. అట్లే బుద్ధి యేకమయ్యు గంధాది నానావిషయసాన్నిధ్యము వలన గంధజ్ఞానము, రూపా జ్ఞానమునని యనేకవిధముల భాసించును. కాబట్టి నానా విధకుసుమసన్నిధానముచే స్ఫటికము నానా వర్ణముతో నొప్పుచు 'నానా' యనితోచునట్లు, బుద్ధియు వాస్తవమున నొక్కటియై విషయసాన్నిధ్యమున ననేకముగా భాసించుచున్నదని భావము'

పూర్వపక్షము : – క్షణికవాది.

**"స్ఫటికేఽ ప్యపరాపరోత్పత్తేః క్షణికత్వాత్ వ్యక్తీనా మహేతుః" 3.2.10.**

వ్యక్తీనామ్ = భాసించువస్తువులన్నియు, క్షణికత్వాత్ = క్షణికములగుటవలన, స్ఫటికేఽ పి= దృష్టాంతముగా చెప్పబడిన స్ఫటికమణి యందును, అపరాపరోత్పత్తేః= అన్యాన్యస్ఫటికవ్యక్తు కలుగుచుండుట వలనను, అహేతుః= ఒక్కటే యనేకముగా భాసించుచున్నదనుట హేతువుకాదు.

లోకమునగల భావపదార్థము (వ్యక్తులు) లన్నియు నొక్క లక్షణము స్థితిగలవై యన్యలక్షణమున నశించును. కాబట్టి క్షణికము లనబడును. పూర్వలక్షణమున నున్న వ్యక్తులుత్తర లక్షణమున నుండవు. ఉత్తర లక్షణమున క్రొత్తవి యుద్భవించును. ఇది స్వశరీరమున ప్రత్యక్షముగా చూడనగును. అస్మదాదులశరీరము ప్రతిలక్షణము మార్పునొందుచు క్షయ వృద్ధుల నొందుచుండుటచూచి క్షణపరిణామి శరీరమని యెవరెఱుగరు? శరీరము ప్రతిక్షణపరిణామి యైన పూర్వవ్యక్తి నశించి క్రొత్తవ్యక్తి యేర్పడుచున్నదనక తప్పదు, కాబట్టి ఒక వస్తువునందు కలుగు నానాత్వము ఔపాధికమనుట సరికాదు. ఇట్లే బుద్ధియు ప్రతిలక్షణము నశించుచు, పుట్టుచునుండుటచే నది 'నానా' యని యంగీకరింపక తప్పదు అందలి నానాత్వమౌపాధికము – నానావిషయ సన్నిధానముచే నేర్పడునది యని చెప్పుట ప్రమాణ సంగతముకాదని

భాగము.

ఉత్తరపక్షము : -

**"నియమహేత్వభావాత్ యథాదర్శనమభ్యనుజ్ఞా" 3.2.11.**

నియమహేత్వభావాత్ = ప్రతిభావవస్తువు క్షణికమనుటకు తగిన ప్రమాణము లేకుండుటవలన, యథాదర్శనమ్ = ఏ వస్తు వెట్లుచూడబడిననట్లు, అభ్యనుజ్ఞా = అంగీకరింపవలయును.

(యత్ సత్ తత్ క్షణికమ్) ప్రతిభావపదార్థము క్షణికము అను నియమమును రూపించు ప్రమాణ మొందును కానరాదు. సత్వమన భావపదార్థము. అనగా అర్థక్రియాకారి. క్షణికమన క్షణకాలము స్థితిగలది. ఏది సత్వమో యది క్షణికమనుటకు, సత్వక్షణికములకు ధూమాగ్నులవలె వాని యవినాభావ సంబంధ మెట్టనైన ప్రత్యక్షముగ గ్రహింపబడునని చెప్ప వలనుపడదు. క్షణిక వస్తువువలన నర్థక్రియా కారిత్వము (కొండొక ప్రయోజనసిద్ధి) సిద్ధింపదు. ఇట్లు ప్రత్యక్షాను మాన ప్రమాణములో దేనిచేతను వస్తువు క్షణికమని చెప్ప వీలుకాని పక్షమున నెట్లంగీకరింపనగును? కాబట్టి యేవస్తువు ఎట్లు తెలియ బడిన నట్లే యంగీకరింపవలయును. స్ఫటికము భావపదార్థమని గ్రహింపబడినట్లు క్షణికమని తెలియబడదు. కాబట్టి యనేకత్వము అందు సిద్ధింపనేరదు. బుద్ధివిషయముననో రసజ్ఞానము నశించి గంధజ్ఞానము, అదియు నశింపరూపజ్ఞానము నుదయించుట చూచుచున్నాము. కాబట్టి బుద్ధి నానా యని సిద్ధమగుచున్నది. స్ఫటికము నిట్లే యనుటకు తగిన ప్రమాణము లేనందున నందలి నానాత్వ మౌపాధికమే కాని వాస్తవము కాదని సూత్రాభిప్రాయము.

శరీరముభావపదార్థమై, క్షణికమైనట్లు స్ఫటికమేలకాదన,

**"నోత్పత్తివినాశ కారణానుపలబ్ధేః" 3.2.12.**

ఉత్పత్తివినాశ కారణానుపలబ్ధేః = శరీరమునకువలె నుత్పత్తి, వినాశకారణము లభింపమి, న = స్ఫటికము క్షణికమన నొప్పదు.

శరీరమున పూర్వవ్యక్తి నశించి క్రొత్తవ్యక్తి కలుగుచున్నదనుటకు తగినహేతువుయిన వృద్ధిక్షయము లభించుచున్నవి. కాబట్టి శరీరము క్షణికమనుట ప్రమాణయుక్తమగును. అట్టి హేతువు స్ఫటికమున కానరాదు. కాబట్టి యది క్షణికమనుటెట్లు? శరీరము భావ (సత్వ) మైనట్లు స్ఫటికము భావమేకదా యని క్షణికమనచెల్లునా? చెల్లదు. ఒక కుసుమమున రక్తవర్ణమున్న

నితరకుసుమములు కుసుమములే యని వానియందును ఎఱుపు కల్పింపగలమా? కాబట్టి (భావ (సత్వ) పదార్థమైనంతమాత్రమున శరీరమువలె స్ఫటికమును క్షణికము కానేరదు.

క్షణికవాదులవలె వైదికులును శరీరము క్షణికమని యంగీ కరింతురు. కారణ మేమన చిచ్ఛక్తి (చేతన పదార్థము) తక్క మిగిలిన భావపదార్థములన్నియు క్షణపరిణతి నొందుచుండుట నంగీ కరింతురు. అయినను, బౌద్ధుల క్షణవాదమునకు, వైదికుల పరిణామ వాదమునకు చాల భేదమున్నది. క్షణికవాదులు ప్రతి క్షణమునను వస్తువు క్రొత్తదగుచున్నట్లెంతురు. అనగా పూర్వపువస్తువు నశించి క్రొత్తది యుత్పన్నమగునందురు. వైదికులు మాత్రము ఒకే వస్తువు పరిణతి నొందునందురు. వస్తువట్లేయుండి యవస్థలు భేదించుచుండు నందురు. ఒక వ్యక్తి వృద్ధావస్థనుబొంది, "బాల్యయౌవనములం దత్యంత సుందరము, సుదృఢమునైయున్న నాశరీరము నేడు వికృతము, శిథిము నైన' దని చెప్పుట మన మెరుగుదుము. అట్టియెడ శరీరమొక్కటియే యనియు, నందనేక అవస్థలు కలిగినవనియు స్పష్టపడుచున్నది. జ్ఞానము, కర్మ, శబ్దము రెండు లక్షణముల వరకు స్థాయిత్వము కలిగియుండి యటుపై నశించును. వైదికులు ద్విక్షణావస్థాయిత్వమును క్షణికమందురు. బౌద్ధుల క్షణికత్వము ఒక్కలక్షణము స్థాయిత్వము కలిగియుండుటచే యని వివేకము.

పూర్వపక్షము : -

**"క్షీర వినాశే కారణా నుపలలబ్ధివత్ దధ్యుత్పత్తి వచ్చ తదుపపత్తిః" 3.2.13.**

క్షీర వినాశే కారణానుపలబ్ధివత్ = క్షీర నాశమునకు కారణము లభింపని యట్లు, దధ్యుత్పత్తివచ్చ = దధి యుత్పన్న మగుటకును కారణము లభింపని విధమున, తదుపపత్తిః= స్ఫటిక వినాశోత్పత్తులకు గల కారణము లభింపకున్న దోషములేదని యర్థము.

శరీర పరిణతకు కారణములైన క్షయ వృద్ధులు ప్రమాణ గోచరము లయినట్లు స్ఫటికమున పూర్వవ్యక్తులు నశించి యపూర్వవ్యక్తు లుత్పన్నము లగుచున్నట్లు గ్రహించుటకు తగిన హేతువు లభింప కున్నను అట్టి కారణమున్నట్లూహింపవలయును. వస్తువు లేదనుటకు అనుపలబ్ధికారణము కాదుగదా? దధినిచూచు వ్యక్తి క్షీరవినాశ కారణమునుగానీ, దధ్యుత్పత్తి కారణమును గానీ చూడ నేరడు, అంతమాత్రమున కారణము

లేదనువలనుపడదు. వస్తు వినాశోత్పత్తులు కారణము లేక కలుగనేరవు. కాబట్టి క్షీర వినాశ దధ్యుత్పత్తులకు కారణము లుపలబ్ధములు కాకపోయినను నవి యున్నవని యంగీకరించినట్లు, స్ఫటికము నందును పూర్వ పరవ్యక్తు వినాశోత్పాద కారణము లుపలబ్ధములు కాకున్నను ఉన్నట్లంగీకరింప నగునని సూత్రభావము.

ఉత్తరపక్షము : -

**"లింగతో గ్రహణా నాన్నానుపలబ్ధిః" 3.2.14.**

లింగతః= అనుమానము వలన, గ్రహణాత్ = గ్రహింపబడుట వలన, అనుపలబ్ధిః= క్షీర వినాశమునకు, దధ్యుత్పత్తికి కారణము లభింపవనుట, న = సరిగాదు

క్షీర వినాశమునకు, దధ్యుత్పత్తికిని గల కారణములు ప్రత్యక్షముగా గోచరింపక పోయినను, లింగము ద్వారా యవి యుపలబ్ధము లగుట సంభవమే. వినాశోత్పత్తులు సకారణకములు. ఘటపటాదుల వినాశోత్పత్తులను మనము సకారణకములుగా చూచుచున్నాము. అట్లే క్షీరవినాశము. దధ్యుత్పత్తియు వినాశోత్పత్తులే కాబట్టి వానికిని కొండొక కారణముండక తప్పదు. కాగా అవియు సకారణములని యనుమానింతుము. ఇట్లు దధిక్షీరములవలె స్ఫటికమున పూర్వ పర వ్యక్తులు కానరామిచే వానికిగల కారణములు నూహింపజాలము. భావ పదార్థమున్నియు వినాశోత్పత్తులు కలిగియుండును. కాబట్టి స్ఫటికమునందు కారణము నపేక్షింపవలసిన యవసర మేమున్నదని యనరాదు. వినాశోత్పత్తులు భావపదార్థమున స్వాభావికము లైనను అవి కారణములేక కలుగనేరవు. పక్వము కాగలస్వభావము బియ్యమునందున్నను, జలదహనము సంయోగములేక తండులములు పక్వములగునా? కొయ్యలు పగులునట్టి స్వభావము కలవైనను కుఠారాదుల సంయోగము లేకయే పగులునా! పగులవు. కాబట్టి శరీరమువలె స్ఫటికము క్షణికమనుట యయుక్తము.

పూర్వపక్షము : - (గుణపరిణామవాది.)

**"న పయసః పరిణామ గుణాంతర ప్రాదుర్భావాత్" 3.2.15**

"పయసః= క్షీరమున క్షీరమట్లేయుండ, పరిణామగుణాంతర ప్రాదుర్భావాత్ = పరిణామమువలన పూర్వగుణమునశించి క్రొత్తగుణము కలుగుట వలన, న = క్షీరమునశించి దధియేర్పడినదని యనుట తగదు.

క్షీరముకంటె దధి భిన్నమగునెడల క్షీరము నశించి దధ్యుత్పన్నమైనదని

చెప్పనగును. క్షీరమున అమ్ల (పులుపు) గుణ సంయోగముచే పూర్వగుణము నశించి క్రొత్తగుణ మొందు కలుగుటయే క్షీరమే దధి యనబడుచున్నది. క్షీరము నశించి దధియేర్పడుచున్నదనువాని మతమున, దధ్యుత్పత్తి సమయమున నశించిన క్షీరము దానికి కారణమెట్లు కాగలదో చెప్పవలసియుండును. వినష్టమృత్తిక ఘటోత్పత్తికి కారణము కాగలుగునా? కాజాలదు. కారణము కార్యాన్వయము కావలసియుండును. మా యీ గుణపరిణామ వాదమున నట్టి దోషము ప్రసక్తముకాదు. ద్రవ్యమట్లేయుండి గుణము మాత్రమే మారును. కాబట్టి గుణపరిణామవాదమే శ్రేష్ఠమని శంకాభిప్రాయము.

ఉత్తరపక్షము : -

**"వ్యూహాంతరాత్ ద్రవ్యాంతరోత్పత్తి దర్శనంపూర్వ ద్రవ్యనివృత్తే రనుమానమ్." 3.2.16.**

వ్యూహాంతరాత్ = ఒకరకమగు నవయవ సంస్థానముగల ద్రవ్యమునుండి, ద్రవ్యాంతరోత్పత్తి దర్శనం = మరియొక రకమగు నవయవ సంస్థానము ద్రవ్యముత్పన్నమైనట్లు గ్రహింపబడుట, పూర్వద్రవ్యనివృత్తేః= పూర్వద్రవ్య నాశనమునకు, అనుమానమ్ = లింగము - హేతువు.

కారణము సర్వథా నశించిన తదుపరి కార్యముజనించునని చెప్పిన పై సూత్రమున జూపిన దోషము వాటిల్లును. కారణద్రవ్యమునగల యవయవ వ్యూహము పోయి మరియొక విధమగు నవయవ వ్యూహ ముత్పన్నమగునని మా యభిప్రాయము. ఈ పక్షమున కార్యోత్పత్తి సమయమున కారణ ద్రవ్యముండనిచో కార్యమెట్లుత్పన్నము కాగలదు? అను ప్రశ్నకు తావుండదు. కారణ వ్యూహముపోయి మరియొక వ్యూహము కార్యమున కలుగుచుండుట ప్రత్యక్ష సిద్ధమే. పూర్వవ్యూహము నశింపనిది వ్యూహాంతరము కలుగుట యసంభవము. కాబట్టి కారణవ్యూహనివృత్తి (నాశము) అనుమానింపనగును. అందువలన క్షీరవినాశము కలుగగా దధ్యుత్పన్న మగుననుట యుక్తమే యగును. గుణపరిణామవాదము నంగీకరించిన కార్యద్రవ్యమున నేర్పడు వ్యూహాంతరమునకు సమాధానము చెప్పజాలము. కాగా ఆ వాదము శ్రేష్ఠ మనజాలము.

మేఘమండలమున విద్యుత్తుత్పన్నము లగుటకు, నశించుటకు కారణములు లేవు. కాబట్టి స్ఫటికవ్యక్తులు మాత్రము నిష్కారణకము లేకావన,

**"క్వచిద్వినాశ కారణానుపలబ్ధేః క్వచిచ్చోపలబ్ధే రనే కాంతః" 3.2.17.**

క్వచిత్ = విద్యుత్తు విషయమున వినాశకారణానుపలబ్ధేః= వినాశోత్పత్తి కారణములు లభింపనందువలన, క్వచిచ్చ ఘటపటా దులయుత్పత్తి వినాశముల విషయమున ఉపలబ్ధేః - కారణములు లభించుచున్నందు వలనను, అనేకాంతః = స్ఫటికవ్యక్తు వినాశోత్ప త్తులు నిష్కారణకములనుట యేకాంతవాదము కాదు.

మేఘమండలమున నప్పుడప్పుడు స్ఫురించు విద్యుదుత్పత్తి వినాశములకుగల కారణము మనకు గోచరములు కానట్లు స్ఫటికవ్యక్తుల యుత్పత్తి వినాశములకు కారణములు తెలియకున్నను నవి నిష్కారణకము లనుటకు వలనుపడదు. విద్యుదుత్పత్తి వినాశములకు హేతువులు కానరాకున్నను ఘటపటాదుల యుత్పత్తి వినాశములకు హేతువులు చూడబడుచున్నవికదా? విద్యుత్తువలె స్ఫటిక వ్యక్తులు నిష్కారణకము లందువేని ఘటపటాదులవలె సకారణకము లేలకావు? కాబట్టి స్ఫటిక దృష్టాంతముతో భావపదార్థ ములు క్షణికములని సాధించుట యుక్తముకాదు. ఒక బుద్ధి నశించి మరియొక బుద్ధి యుత్పన్న మగుచుండుటచే, బుద్ధ్యుత్పత్తి వినాశము సకారణకములని తెలియుచున్నది. కాబట్టి బుద్ధి యనిత్యము, అది రెండు క్షణములుండి మూడవ క్షణమున నశించుటచే క్షణిక మనబడును. కాబట్టి బుద్ధి ఆత్మకాదు ఆత్మకు సంబంధించిన గుణమని భావము.

**"నేంద్రియార్థయో స్తద్వినాశే ఽపి జ్ఞానావస్థానాత్." 3.2.18.**

తద్వినాశేఽపి = ఇంద్రియార్థము నశించినను, జ్ఞానావస్థానాత్ = స్మృతిరూపమైన జ్ఞానముండుట వలన, ఇంద్రియార్థయోః (బుద్ధి) ఇంద్రియార్థములకు సంబంధించిన గుణము, న = కాదు.

బుద్ధి యింద్రియములకుగానీ, అర్థములకుగానీ సంబంధించిన గుణముకాదు. వానికి సంబంధించినది యగుచో నింద్రియార్థములు నశించిన నదియు నశింపనగును గుణినశించిన గుణముండనేరదు కదా! చక్షురింద్రియము నశించి యొక వ్యక్తి యంధుడైనను 'నేను చూచియుంటిని' అనును. చూచితినను నది జ్ఞానరూపమే. కన్ను నశించినది. చూడబడిన వస్తువు నశించినది. అయినను చూచితినను జ్ఞానముండును. కాబట్టి బుద్ధి (జ్ఞానము) ఇంద్రియార్థముల గుణముకాదని భావము.

**"యుగపత్జ్ఞేయానుపలబ్ధేశ్చన మనసః." 3.2.19.**

యుగపత్ = ఒకేలక్షణమున, జ్ఞేయానుపలబ్ధేః= గంధాది విషయము

తెలియకుండుట వలన, మనసశ్చ = మనోగుణమును, న = కాదు.

జ్ఞానము (బుద్ధి) మనోగుణమగుచో మనస్సు జ్ఞానాశ్రయ మగుచున్నది. మనస్సు మధ్యమ పరిమాణముకలదియని వైదికుల మతము. జ్ఞానాశ్రయమగు మనస్సుతో నింద్రియములన్నియు నొకేక్షణమున సంబద్ధములై యుండ, ఇంద్రియము లర్థములతో సన్నికృష్టములు కాగా సర్వవిషయములు నొకే క్షణమున గ్రహింపబడవలయును. అట్లు గ్రహింపబడుట లేదు. కాబట్టి బుద్ధిమనోగుణమును కాదు.

పూర్వపక్షము : –

**"తదాత్మగుణత్వేఽపితుల్యమ్" 3.2.20.**

ఆత్మగుణత్వేఽపి = బుద్ధి ఆత్మగుణమైనను, తత్ = ఆదోషము తుల్యమ్ = సమానమే యగును.

ఆత్మ యణుస్వరూపము. అయినను ఆత్మ మనస్సుతోను, మనస్సు ఇంద్రియములతోను, సంబద్ధములై యుండుట వలన నొకేక్షణమున సర్వవిషయిక జ్ఞానము కలుగవలయుననెడి దోషము బుద్ధి ఆత్మగుణము అని యంగీకరించినపుడును కలుగును.

ఉత్తరపక్షము: –

**"ఇంద్రియై ర్మనసః సన్నికర్షాభావాత్ తదనుత్పత్తిః." 3.2.21.**

ఇంద్రియైః= ఘ్రాణాదీంద్రియములతో, మనసః = మనస్సునకు, సన్నికర్షాభావాత్ = ఒకేసారి సన్నికర్ష మేర్పడక పోవుటవలన, తదనుత్పత్తిః= సర్వవిషయకజ్ఞాన మొకేలక్షణమున కలుగదు.

ఆత్మ మనస్సు, ఇంద్రియములు నివి పరస్పరము సంయుక్తము లగుటయే జ్ఞానమునకు కారణమని యంగీకరించిన పై దోషమిటను వాటిల్లగలదు.

అదృష్టవంతమగు నాత్మ మనస్సుతో సంయుక్తమై ప్రయత్నించును. అట్టిప్రయత్నముతో మనస్సునకు ఇంద్రియ ప్రదేశమున వృత్తికలుగును. అప్పుడింద్రియములతో మనస్సునకు సంబంధము కలుగును. అటుపై నర్థములతో నింద్రియములకు సన్నికర్ష మేర్పడిన జ్ఞానము కలుగును. ఇట్టి సన్నికర్షము సర్వేంద్రియములతో నాత్మ కొకేలక్షణమున కలుగనేరదు. ఆత్మప్రయత్న పూర్వకముగా కలుగు సంబంధము కాబట్టి యొకప్పుడొక యింద్రియముతోను, మఱియొక యెడ మఱియొక యింద్రియముతోను కలుగును. అందువలన సర్వ విషయిక జ్ఞాన మొకే లక్షణమున

కలుగవలయుననెడి ప్రసక్తి యిట కలుగదు. మనస్సు జడమై, ప్రయత్నవంతము కాకపోవుటచే దానికిగల సర్వేంద్రియ సన్నికర్షమును వారింప నెవరికి తరమగును? అందువలన మనస్సు జ్ఞానాశ్రయమగుచో సర్వ విషయక జ్ఞానమొక్కమాటుగా కలుగవలయుననెడి దోష ప్రసక్తి కలుగును. ఆత్మగుణ మగుచోనట్టి ప్రసక్తి కలుగనేరదని భావము.

ఆత్మ మనస్సుతోను, మనస్సు ఇంద్రియముతోను సన్నికృష్ట మగుటచే జ్ఞానకారణముగా నేల యంగీకరింపరాదన,

**"నోత్పత్తి కారణా నుపదేశాత్" 3.2.22**

ఉత్పత్తి కారణానువదేశాత్ = జ్ఞానోత్పత్తికి కారణముగా నుపదేశింపపోవుటచే, న = అట్లంగీకరింపలేదు.

అదృష్టవంతమగు నాత్మ మనస్సుతో సన్నికృష్టమై ప్రయత్నించినపు డాయా యింద్రియములతో మనస్సు సంబద్ధమగును. ఆత్మ మనః సన్నికర్షము, ప్రయత్నవంతమగు నాత్మతోకూడిన మనస్సుతో నింద్రియమునకు సన్నికర్షము కలుగుటయే జ్ఞానోత్పత్తికి కారణముగా నాచార్యులుపదేశించి యున్నారు. ఆత్మ, మనస్సు, ఇంద్రియము వీని సన్నికర్షము మాత్రము జ్ఞానోత్పత్తికి కారణమని యుపదేశింపరైరి. అందువలన నిట్టి సన్నికర్షము జ్ఞానకారణము కాదు.

పూర్వపక్షము : - బుద్ధి యాత్మగుణమైనను నిత్యమే.

**"వినాశ కారణానుపలబ్ధేశ్చావస్థానేతన్నిత్యత్వ ప్రసంగః" 3.2.23.**

వినాశ కారణానుపలబ్ధేశ్చ = వినాశ కారణము లభింపనందు వలనను, అవస్థానే = తప్పకస్థితికలది యగుటవలన, తన్నిత్యత్వ ప్రసంగః= బుద్ధి నిత్యము కావలసి యుండును.

విరోధి గుణమువలనను, అశ్రయనాశము వలనను గుణము నశించును. బుద్ధికి విరోధిగుణ మొందులభింపదు. దాని కాశ్రయమైన యాత్మనిత్యమగుటచే నదియు నశింపదు. కాబట్టి బుద్ధియు నిత్యము కావలసియుండునని భావము.

ఉత్తరపక్షము: -

**"అనిత్యత్వగ్రహాద్ బుద్ధేర్బుద్ధ్యంతరాద్ వినాశః శబ్దవత్." 3.2.24**

శబ్దవత్ = శబ్దమువలె, బుద్ధేః= బుద్ధికి, బుధ్యంతరాత్ = విరోధియగు మరియొక బుద్ధివలన, వినాశః= వినాశము కలుగుచున్నదని కల్పింపనగును. కారణమేమన, అనిత్యత్వగ్రహాత్ = బుద్ధియనిత్యమని గ్రహించుట వలన.

బుద్ధి (జ్ఞానము) యనిత్యమని యెల్లరు నెఱుగుదురు. ఒక జ్ఞానము

తరువాత మఱియొక జ్ఞానము కలుగుచున్నపుడు వస్త్రజ్ఞానము నశించి కలశజ్ఞానము కలుగుచున్నదని గ్రహింపని వారెవరుందురు? జ్ఞానాశ్రయమగు నాత్మ నశింపదనుట వాస్తవమే. కాబట్టి బుద్ధినాశనమునకు కారణము దానికి విరుద్ధమగు మఱియొకటి యుత్పన్న మగుటయేయని యంగీకరింప వలసియుండును. ఉత్తరోత్తర శబ్దము జనింపగానే పూర్వశబ్దములు నశించినట్లు ఒకబుద్ధి మఱియొకబుద్ధి జనించిన నశించుచున్నట్లు అంగీకరింప వలసి యుండును. కాబట్టి బుద్ధి యాత్మగుణ మయ్యు నిత్యము కాదు.

బుద్ధి యాత్మగుణ మగునెడల దాని యుత్పత్తికి కారణమయిన ఆత్మమనస్సంయోగము, సంస్కారములును నాత్మయందుండుట వలన నొకేలక్షణమున నానావిధ స్మృతి రూప బుద్ధులు కలుగవలసి యుండునని శంకించి యందులకు ఆత్మ విభువని యంగీకరించువా డిచ్చు సమాధానము దూషించుచున్నాడు.

**"జ్ఞానసమవేతాత్మ ప్రదేశ సన్నికర్షాన్మనసః స్మృత్యుప**
**పత్తేర్నయుగప దుత్పత్తిః." 3.2.25**

మనసః= మనస్సునకు, జ్ఞానసమవేతాత్మప్రదేశ సన్నికర్షాత్ = జ్ఞానసాధన సంస్కారముతో కూడిన యాత్మప్రదేశముతో సన్నికర్షము కలుగుట వలన, స్మృత్యుత్పత్తేః= స్మృత్యాత్మక బుద్ధికలుగుచుండుట వలన, నయుగపదుత్పత్తిః= అనేకస్మృతు లొకేక్షణమున కలుగవు.

ఆత్మ విభువు; అంతటా వ్యాపించియుండును. ప్రతివిషయ ప్రదేశమున నుండును. విషయానుభవము వలన కలిగిన సంస్కారము స్మృతికి హేతువ్వులై, యా యా విషయములతో కూడిన ఆత్మ ప్రదేశమందు సమవాయ సంబంధముతో నుండును. శరీరముననుండు ఆత్మయందుండవు. విషయమెట నుండునో దానిని తెలిసికొనుటవలన కలిగిన సంస్కారమును ఆవిషయ దేశమున నున్న యాత్మయందే సమవేతమైయుండుట యుచితము. కాబట్టి, యట్టి సంస్కారయుక్తమగు నాత్మప్రదేశమునకు పోయి మనస్సు సన్నికృష్ట మైనపుడే తద్విషయక స్మృతి కలుగును. విషయము భిన్నభిన్న ప్రదేశముందుండును. మన స్సణు వగుటచే నది యెల్లయెడల నొక్కసారి సన్నికృష్టమును కాజాలదు. అందువలన ననేక స్మృతులు యుగపత్తున కలుగనేరవని విభువాది మతము.

**"నాంతః శరీర వృత్తిత్వాత్" 3.2.26**

అంతఃశరీర వృత్తిత్వాత్ = మనస్సు శరీరమునందు వర్తించునదగుట

వలన, న = విభువాది చెప్పిన సమాధానము సరికాదు.

మనస్సు శరీరమునందే వర్తించును. శరీరమునకు వెలుపల నది వర్తింపదు. శరీరము నందుండు నీమనస్సు, బాహ్యమున నున్న విషయప్రదేశమునందలి జ్ఞానసమవేత మగు నాత్మతో సన్నికృష్టము కావలయుననిన నాప్రదేశమునకు వెళ్లవలసియుండును. మనస్సు శరీరమును విడిచి బయటకు వెళ్లునెడల మరణమే సంప్రాప్తమగును. ఇంద్రియములు, శరీరము మున్నగు సమస్త సంఘమునకు నాయకమగు మనస్సు శరీరమును విడచిపోయిన శరీరమెందుకు పనికివచ్చును? కాబట్టి మనస్సు శరీరమునందే యుండునని యొప్పుకొనవచ్చును. అట్టియెడ నానాస్మృతు లోకేలక్షణమున కలుగకుండుటకు పై జెప్పిన సమాధానము యుక్తము కాదు.

పూర్వపక్షము:-

**"సాధ్యత్వాదహేతుః" 3.2.27**

సాధ్యత్వాత్ = 'మనస్సు శరీరమునందు వర్తించుట వలన' నను హేతువు సాధింపదగిన దగుటచే సాధ్యసమ హేత్వాభాస మగును. కాబట్టి, అహేతుః= హేతువుకాదు.

'మనస్సు శరీరమునందే యుండును. శరీరమునకు వెలుపల నదిపోదు' అను విషయమింతవరకును సిద్ధము కాలేదు. కాబట్టి సాధింపదగిన విషయము. అట్టి సాధ్యవిషయము హేతువుగా నుపయోగింపజనదు ఉపయోగించిన నది సాధ్య సమహేత్వాభాస మగును.

ఉత్తరపక్షము :-

**"స్మరతః శరీర ధారణోపపత్తే రప్రతిషేధః" 3.2.28.**

స్మరతః= స్మరించునట్టి వానికి, శరీరధారణోపపత్తేః= శరీర ధారణము కలుగుటచే మనస్సు శరీరమునందుండునని సిద్ధించుట వలన, అప్రతిషేధః= అహేతువని చెప్పుట సరికాదు.

'మనస్సు శరీరము నందుండునది. బాహ్యమున వర్తింపదు' అను నీ విషయము సాధ్యముకాదు. సిద్ధమే. కొండొక విషయమును స్మరించునపుడు శరీరధారణము చూచుచున్నాము. ధారక ప్రయత్నములేక శరీరధారణ మేర్పడనేరదు. ఆ ప్రయత్నము ఆత్మ మనఃసన్నికర్షము వలనగాని కలుగదు. అట్టి సన్నికర్షమును మనస్సు శరీరము నందున్నపుడే కలుగగలదు. లేనిచో కలుగనేరదు. శరీరమునకు వెలుపల నెటనో ఆత్మమనస్సన్నికర్షము వలన

కలుగు ప్రయత్నము శరీరమును ధరింపజేయ జాలదు. కాబట్టి మనస్సు శరీరమునందే యుండుననుట సిద్ధమేకాని సాధ్యముకాదు. ఇట్లు మనస్సు శరీరమునుండి వెలుపలకుపోక లోపలనేయుండి సర్వకార్యము నొనరించుచుండుట వలన సాధ్యసమమైఅహేతు వనుట తగదని భావము.

**"న తదాశుగతిత్వాన్మనసః" 3.2.29.**

మనసః= అంతరింద్రియమైనమనస్సు, ఆశుగతిత్వాత్ = శీఘ్రగతి గలదగుట వలన, తత్ = శరీరధారణము, న = మనస్సునకు బాహ్యగతియున్నను అనుపపన్నము కాదు.

మనస్సునందు శీఘ్రగతి యంగీకరింపబడుచున్నది. కాబట్టి యది శరీరమునందలి యాత్మతో సన్నికృష్టమైయనుట శరీరధారణకు తగిన ప్రయత్నము నుద్భవింపజేసి యతిశీఘ్రముగా శరీరమునకు వెలుపల విషయములుండు ప్రదేశమునకుబోయియట సంస్కారయుతమగు నాత్మతో సన్నికృష్టమై జ్ఞాన మొదవజేయును. లేక ముందు బాహ్యజ్ఞానమును కలిగించివచ్చియనంతరమున నతిశీఘ్రమున నాత్మతో సన్నికృష్టమై శరీరధారక ప్రయత్నము నుద్భవింపజేయు వచ్చును. అందువలన నానాస్మ ృతు లోకేలక్షణమునగాని, శరీర పతనముగానీ కలుగవని మరలశంకించుచున్నాడు.

**"న స్మరణ కాలానియమాత్" 3.2.30**

స్మరణకాలానియమాత్ = స్మరణకాలమున నియమము లేకుండువలన, న = పై జెప్పినవాదము సరికాదు.

స్మరణలో స్వల్పకాలమే పట్టునను నియమము లేదు. ఒక విషయము శీఘ్రముగా స్మరింపనగును. మఱియొక విషయమును స్మరించుటలో దీర్ఘ కాలమును పట్టును. కాలనియమము లేనందువలన కొండొక విషయమును స్మరించుటలో దీర్ఘకాలము వ్యయించినపుడు శరీరధారణ కలుగుటెట్లు పొసగును? కాబట్టి మనస్సు శీఘ్రగతి కలదగుటచే బాహ్యవిషయమును స్మరింపజేయుటకై యటకేగినను వెంటనే శరీరమున ప్రవిష్టమై యాత్మతోకూడి శరరీధారక ప్రయత్నమును కలుగజేయుననుట యుక్తి విరుద్ధము.

యుక్తియుక్తము గాకున్నను కొండొక విషయము నిమిత్తవశమున నట్లు జరుగునని యంగీకరించిన దోషమేమన, నిమిత్తమును దురూహ్యామే యనుచున్నాడు.

**"ఆత్మప్రేరణయదృచ్ఛాజ్ఞతాభిశ్చ న సంయోగవిశేషః" 3.2.31**

ఆత్మప్రేరణమ్ = జీవాత్మప్రేరణము, యదృచ్ఛా = ఆకస్మికత, జ్ఞతా= జ్ఞానము ఆత్మప్రేరణ యదృచ్ఛాజ్ఞతాభిశ్చ = ఆత్మప్రేరణాదుల చేతను, సంయోగవిశేషః= జ్ఞాన సమవేతమగు నాత్మతో మనస్సునకు సంయోగము, న = కలుగదు.

శరీరమునకు వెలుపల విషయములుండు తావులందున్న జ్ఞానసమవేతమగు నాత్మతో సంయుక్తమగుటకై మనస్సు శరీరమునుండి బయటికి పోవలయునని తగిన కారణములు మూడు కల్పింపనగును. ఒకటి యాత్మప్రేరణము, రెండవది యాకస్మికత. మూడవది (మనస్సునందు) జ్ఞానము. ఈ మూటిలో నొక్కటియు నిమిత్తముగా నంగీకరింపవలనుపడదు. కొండొక విషయమును స్మరింపగా స్మరణహేతువైన సంస్కారము ఆత్మయం దే ప్రదేశమునను న్నదో తెలిసికొనిన గదా యాత్మ మనస్సు నటకు వెళ్ల ప్రేరించును? ప్రేరణ సమయమున విషయవిజ్ఞాన ముండుటచే మనస్సును ప్రేరించుటే? అది శరీరమును విడిచి యటకేగనేల? వ్యర్థమేకదా? కాబట్టి యాత్మప్రేరణము నిమిత్తమననొప్పదు. ఆకస్మిక ప్రవృత్తి యసంభవమగుటచే నదియు పొసగదు. మనస్సు నందు జ్ఞానము లేకపోవుటచే తెలియకయే విషయదేశమునందాత్మతో సన్నికృష్ట మగుటకై మనస్సు శరీరమునుండి బయటికి వెళ్ళ ప్రవర్తించు ననుటయు నసంగతము. జ్ఞానములేని ప్రవృత్తి యెన్నడును కలుగనేరదు. కాబట్టి యాత్మ ప్రేరణాది నిమిత్తము వశముననైనను మనస్సు బహిః ప్రదేశమునకేగి యాత్మతో సన్నికృష్టమై క్రమస్మృతిని కలిగించునని యంగీకరింప వలనుపడదని సూత్రాభిప్రాయము.

అన్యత్ర వ్యాసక్త మనస్కుడైయున్న వ్యక్తికి పాదతలమున కంటకము ప్రవేశింప బాధయెట్లు వొడముచున్నదన,

**"వ్యాసక్తమనసః పాదవ్యథనేవ సంయోగ విశేషణ**
**సమానమ్ః" 3.2.32**

వ్యాసక్తమనసః= కొండొక దృశ్యమయిన మనస్సు లగ్నమైయున్న పుడా వ్యక్తి, పాదవ్యథనేన = కంటకాదులచే పాదతలము పీడింపబడినపు డా స్థలమున నాత్మతో గలుగు మనఃస్సన్ని కర్షవిశేషము, సంయోగ విశేషేణ = శరీరమునకు వెలుపల విషయదేశమునను న్న యాత్మతో నేర్పడు సంయోగ విశేషముతో, సమానమ్ = తుల్యమే.

శరీరమునకు వెలుపల విషయప్రదేశమునందున్న యాత్మ ప్రదేశముతో

మనస్సునకు సంసర్గము కలుగుటెట్లు పొసగదో యట్లే శరీరమునను భిన్నభిన్న ప్రదేశములలో నాత్మతో సన్నికర్షము నుపపన్నముకాదని సూత్రాభిప్రాయము. కాబట్టి మనస్సు అణుపరిమాణము కలదియనియు, క్రమముగా నాయాప్రదేశ ములలో నాత్మతో సన్నికృష్టమై క్రమికజ్ఞానమును కలిగింప సాధనమగుననియు చెప్పుట ప్రమాణసిద్ధము కాదని తెలియుచున్నది. కాగా వైదికుల మతమున ఆత్మ యణువు. మనస్సు మధ్యమ పరిమాణము కలది.

బుద్ధి యాత్మగుణమైన నొకే క్షణమున నానాస్మృతి బుద్ధులేల కలుగవో సిద్ధాంత పక్షమున సమాధాన మేమన'

**"ప్రణిధాన లింగాది జ్ఞానానా మయుగపద్భావాద్**
**యుగప దస్మరణమ్" 3.2.33**

ప్రణిధాన లింగాదివిజ్ఞానానమ్ = ప్రణిధానము, మున్నగు జ్ఞానములు, అయుగపద్భావాత్ = ఒకే క్షణమున కలుగనందువలన, యుగపదస్మరణమ్ = ఒకే క్షణమున ననేక స్మృతులు కలుగవు.

ప్రణిధాన లింగాదు లీయాహ్నికముననే నలువది యొకటవ సూత్రమున వర్ణింపబడును. అందువాని వివరణమును చూడవచ్చును.

ఆత్మ మనః సన్నికర్షము సంస్కారము స్మృతికెట్లు కారణమో, యట్లే ప్రణిధానాదులును సంస్కారమునులద్బోధింపజేయుచు స్మృతికి కారణములగుచున్నవి. ఆత్మమనః సన్నికర్షము, సంస్కారములు నుండినను సంస్కారముల నుద్బోధించునట్టి ప్రణిధానాదు లొకేలక్షణమున కలుగక క్రమముగా కలుగుటచే స్మృతులును క్రమముగానే కలుగును. ఒకేక్షణమున నన్నియు కలుగనేరవు.

ఇచ్ఛాది గుణములు బుద్ధిసమానాధికరణములుగా తోచుచుండుట చేత ఇచ్ఛాదులు ఆత్మగుణము లైననేకదా బుద్ధి యాత్మగుణము కాగలదన,

**"జ్ఞస్యేచ్ఛా ద్వేష నిమిత్తత్వాదారంభ నివృత్త్యోః" 3.2.34**

ఆరంభనివృత్త్యోః= ఆత్మప్రవృత్తి నివృత్తులు, ఇచ్ఛాద్వేష నిమిత్తత్వాత్ = ఇచ్ఛాద్వేష నిమిత్తకము లగుటవలన, జ్ఞస్య = ఇచ్ఛా దులు ఆత్మగుణములే.

ప్రాణి తనకు సుఖము కలిగించు వస్తువును కావలయునని కోరును. దుఃఖమును కలిగించు దానిని ద్వేషించును. తానుకోరిన దానిని సంపాదించుటకు ప్రవర్తించును. ద్వేషించుదాని నుండి నివృత్తిజెందును. ఇట్లు ప్రవృత్తి నివృత్తులకు కారణము ఇచ్ఛాద్వేషములగుట లోకవిదితము. హితమును

సంపాదించుటకు అహితమును విడుచుటకు కలుగు ప్రవృత్తి నివృత్తిరూపమగు క్రియలు అజ్ఞాతములు. నవ్యజ్ఞాతములు నగువస్తువుల విషయమున కలుగనేరదు. కాబట్టి యెవనికి వస్తుజ్ఞానము కలుగుచున్నదో వానికే ప్రవృత్తి నివృత్తును కలుగుచున్నవి. అందువలన జ్ఞానమును ఆత్మగుణమే యనుట సిద్ధము. ఇచ్ఛాద్వేషములు జ్ఞానసమానాధి కరణము లగుటంజేసి యవియు నాత్మగుణములే.

పూర్వపక్షము: –

**"తల్లిఙ్గత్వా దిచ్ఛా ద్వేషయోః పార్థివాద్యేష్వ ప్రతిషేధః." 3.2.35**

తల్లిఙ్గత్వాత్ = ప్రవృత్తి నివృత్తులు లింగముగా గలవగుట వలన ఇగ్ఛాద్వేషయోః= ఇచ్ఛాద్వేషములకు, పార్థివాద్యేషు = శరీరేంద్రియాదులందు. అప్రతిషేధః= ప్రతిషేధములేదు.

ఇచ్ఛ ప్రవృత్తి లింగకము. ద్వేషము నివృత్తి లింగకము. ప్రవృత్తిని చూచి కోరిక (ఇచ్ఛ) ను, నివృత్తిని జూచి ద్వేషమును ఊహింతుము. కాబట్టి ఇచ్ఛా ద్వేషములకు ప్రవృత్తి నివృత్తులు లింగములు ధూమమున్నయెడ వహ్నియున్నట్లు, ప్రవృత్తి నివృత్తు లెటనుండునో యిచ్ఛాద్వేషములు నట నుండవలయును. ప్రవృత్తి నివృత్తులు శరీరేంద్రియములలో చూడబడుచున్నవి. కాబట్టి ఇచ్ఛాద్వేషములను పార్థివము లయిన శరీరేంద్రియము లందుండి వానివే యననొప్పును. ఇట్లే జ్ఞానమును శరీరేంద్రియాదుల గుణమని యంగీకరించిన సామానాధికరణ్యమును కుదురగలదు. కాగా జ్ఞానేచ్ఛా ద్వేషాదులు శరీరాదుల గుణములే కాని యాత్మగుణములు కానేరవు.

ఉత్తరపక్షము : –

**"పరశ్వాది ష్వారంభ నివృత్తి దర్శనాత్" 3.2.36**

పరశ్వాదిషు = గొడ్డలి మున్నగువానియందు, ఆరంభ నివృత్తి దర్శనాత్ = ప్రవృత్తి నివృత్తు చూడబడుచుండుటవలన,

ప్రవృత్తి నివృత్తులున్నచోట నిచ్ఛాద్వేషాదులుండుననిన, ఛేదనాదులకు సాధనములైన గొడ్డలి మున్నగు వాని యందు ప్రవృత్తి నివృత్తులు కాననగుచున్నవి. కాబట్టి, వానియం దిచ్ఛాద్వేషాదు లంగీకరింపవసి వచ్చును. గొడ్డలి యందు కలుగు ప్రవృత్తి నివృత్తులకు కారణము లన్యము లందుమేని, శరీరాదులందు కలుగు ప్రవృత్తి నివృత్తులకు నిమిత్తము లితరములే యనవచ్చును. ప్రవృత్తి నివృత్తులు గొడ్డలి యందు కనబడినను ఇచ్ఛాద్వేషాదులు

దాని గుణములు కానట్లు శరీరేంద్రియాదులందు కనబడు ప్రవృత్తి నివృత్తులకు నిమిత్తములైన ఇచ్ఛాద్వేషాదులు శరీరాదుల గుణములు కాక యాత్మగుణములే యగును.

**"నియమానియమౌ తు తద్వి శేషకౌ." 3.2.37**

నియమానియమౌతు = ప్రవృత్తి నివృత్తులు కలుగుటలోగల నియమానియములు, తద్విశేషకా = గొడ్డలికి శరీరాదులకుగల భేదమును నిరూపించును.

ఆత్మ, శరీరాదుల కధిష్ఠాత, కాబట్టి, నియమముగా శరీరాదులందు ప్రవృత్తినివృత్తులు కలుగుచుండును. గొడ్డలి యందట్లు నియమముగా ప్రవృత్తినివృత్తులు కలుగవు. అందువలన శరీరాదులకు గొడ్డలికి భేదము లేకపోదు.

ఇచ్ఛాదులు మనోగుణము లేలకావన,

**"యథోక్త హేతుత్వాత్ పారతంత్ర్యా దకృతా భ్యాగ మాచ్ఛ న మనసః." 3.2.38**

యథోక్త హేతుత్వాత్ = ఆత్మ ప్రవృత్తి నివృత్తు లిచ్ఛాద్వేష పూర్వకము లగుటవలన, పారతంత్ర్యాత్ = పరాధీన మగుటవలన, అకృతాభ్యాగమాచ్ఛ = చేయని కర్మభోగ ప్రసక్తి కలుగును కావునను, ఇచ్ఛాదులు, న మనసః= మనోగుణములు కావు.

ఇచ్ఛాద్వేషములు మనోగుణములగుచో జ్ఞానమును దానిగుణమే యగును. జ్ఞానమున్నగాని యిచ్ఛాద్వేషములు కలుగవు. ఇచ్ఛాద్వేషములు కలిగినగాని ప్రవృత్తి నివృత్తులు కలుగవు. జ్ఞానము మనోగుణమని పూర్వము చెప్పి యుండమైతిమి. కాబట్టి యిచ్ఛా ద్వేషములును మనోగుణములు కావు. మనస్సు కరణమగుటచే నది పరతంత్రము. గొడ్డలి కరణమగుటచే నితరాధీనమై ప్రవర్తించుట మనము చూచుచున్నాము. మనస్సునందు జ్ఞానము లేకుండుటచే నిచ్ఛాద్వేష నిమిత్తకములగు ప్రవృత్తి నివృత్తి రూప కర్మల భోగము మనస్సునకు లభించుట యుక్తము కాదు. సుఖదుఃఖానుభవమే భోగ మనబడును. ఇచ్ఛాద్వేషములు మనోగుణములని యంగీకరించిన, జ్ఞానముగల యాత్మలో నిచ్ఛాద్వేషములు లేకుండుటవలన తన్నిమిత్తక కర్మ చేయునది యాత్మ కానేరదు. అట్టియెడ కర్మచేయని యాత్మకు భోగము సంభవించును. అందువలన అకృతాభ్యాగమ ప్రసక్తి గలుగును. (అకృతస్య = చేయనికర్మకు, అభ్యాగమః=

భోగము) ప్రసక్తి కలిగిన కలుగనిమ్మందువేని, శాస్త్రానుభవములకు విరుద్ధమగును. శాస్త్రమున కర్మచేయువాడు. (కర్త) ఫలము ననుభవింపవలయునను నియమము జూచుచున్నాము, 'ఉపాసింపుము. ధ్యానింపుము' అనిశాస్త్రమాదేశించుచున్నది. ఒకడు చేసిన కర్మకు ఫలము మఱియొకనికి లభించిన నీ యాదేశము లెట్లుపొసగును? కాబట్టి జ్ఞానమాత్మ గుణమైనట్లు ఇచ్ఛాద్వేషము నాత్మగుణములే.

**"పరిశేషాద్ యథోక్త హేతూపపత్తేశ్చ" 3.2.39**

పరిశేషాత్ = పరిశేషానుమానము వలన, యథోక్త హేతూపపత్తేశ్చ= పూర్వోక్త హేతువుల వలను, బుద్ధి (జ్ఞానము) ఆత్మగుణమే యగుచున్నది.

శరీరేంద్రియ మనస్సులలో నొక్కదానికిని బుద్ధి గుణము కాజాలదు. ఆత్మ తక్క మిగిలిన ద్రవ్యములకు నది గుణము కాజాలదు. కాబట్టి జ్ఞానము (బుద్ధి) ఆత్మగుణమని సిద్ధమగుచున్నది. ('దర్శన స్పర్శనాభ్యామేకార్థ గ్రహణమ్' 3.1.1.) మున్నగు సూత్రములలో చూపబడిన యుక్తులు నాత్మయందే వర్తించును. శరీరేంద్రియాదుల వర్తింపవు, కాబట్టి బుద్ధి యాత్మగుణమే కాగలదని తేలుచున్నది.

స్మృతి దేనిగుణము ? అన.

**'స్మరణం త్వాత్మనో జ్ఞస్వాభావ్యాత్" 3.2.40.**

జ్ఞస్వాభావ్యాత్ = (జ్ఞస్యస్వభావః= జ్ఞస్వభావః, జ్ఞానమ్ తస్యభావః = జ్ఞస్వాభావ్యం = జ్ఞానత్వమ్, తస్మాత్ జ్ఞానత్వాత్) జ్ఞానమగుటవలన, స్మరణంతు = స్మృతియును, ఆత్మనః= ఆత్మగుణమే 'ఎఱిగితిని, ఎఱుగుచున్నాను, ఎఱుగగలను' అను జ్ఞానము ఆత్మకే కలుగుచున్నదనుట మన మెఱుగుదుము. స్మృతిభూత కాలిక విషయజ్ఞానమే. అందువలన నదియు నాత్మగుణమే యగునని భావము.

యుగపత్తుస్మృతి కలుగకుండుటకు గల నిమిత్తాంతరములు ప్రణిధానాదులు కలవని పూర్వసూత్రములందొకచో చెప్పియుంటిమికదా? అని యేవియన,

**"ప్రణిధాన నిబంధాభ్యాస లింగలక్షణ సాదృశ్య పరిగ్రహాశ్రయాశ్రిత సంబంధానంతర్య వియోగైక కార్యవిరోధాతిశయ ప్రాప్తి వ్యవధాన సుఖ దుఃఖేచ్ఛా ద్వేష భయార్థిత్వ క్రియారాగ ధర్మాధర్మ నిమిత్తేభ్యః" 3.2.41**

ప్రణిధాన .................. నిమిత్తేభ్యః= ప్రణిధానాది నిమిత్తములవలన

స్మృతి కలుగును.

ప్రణిధానము = స్మరించు నిచ్ఛతో చిత్తము నేకాగ్రము చేయుట.

నిబంధః= అర్థముల నొక గ్రంథమున నుపనిబంధించుట

అభ్యాసః= ఒక విషయమునకు సంబంధించిన జ్ఞానము నావృత్తి చేయుట.

లింగమ్ = వ్యాప్యము, ధూమము వహ్నికివలె.

లక్షణమ్ = సాంకేతిక చిహ్నము.

సాదృశ్యమ్ = సామానత.

పరిగ్రహః = స్వీకారము.

ఆశ్రయః= అధిష్ఠానము.

ఆశ్రితమ్ = అధిష్ఠేయము.

సంబంధః= సంయోగాది సంబంధము.

ఆనంతర్యమ్ = అవ్యవధానము. నియతక్రమము.

వియోగః= విరహము, శోకము.

ఏకకార్యమ్ = ఒకపని, సమానకార్యము.

విరోధము = విరోధము, అసామానాది కరణ్యము.

అతిశయః= అధిక్యము.

ప్రాప్తిః= ఆప్తి, లాభము.

వ్యవధానమ్ = వ్యవధాయకము (ఖడ్గకోశమువలె)

సుఖమ్ = అనుకూలవేదనీయము.

ఇచ్ఛా = ఇదినాకు కలుగుగాక యను నభిలాష.

ద్వేషః= ఇది నా కనిష్టమును కలిగించు నను జ్ఞానముచే జనించు రాగము నడ్డగించు గుణము.

భయమ్ = భీతి.

అర్థిత్వమ్ = యాచన.

క్రియా = కార్యము,

రాగః = రాగము, స్నేహము.

ధర్మః= చేయదగిన విహిత క్రియాజన్యగుణము.

ఆధర్మః= చేయగూడదని నిషేధింపబడిన క్రియాజన్యగుణము.

ఇవి యన్నియు నొకే క్షణమున కలుగవు. ఇట్టి నిమిత్తములచే నేర్పడు స్మృతులు నొక్కసారి కలుగక క్రమముగనే కలుగును.

ఈ సూత్రమున వర్ణింపబడిన నిమిత్తములేకాక మరికొన్ని నిమిత్తములున్నను, ఈ ప్రణిధానాదులు తెలిసిన వీనివలె నితరములు నూహింపగలరని సూత్రకారుడు కొన్నిటినేయిట పొందుపరచెనని యెఱుంగవలయును.

బుద్ధి స్థిరమా అస్థిరమా యన,

**"కర్మానవస్థాయి గ్రహణాత్" 3.2.42**

గ్రహణాత్ = గ్రహణము వలన, కర్మానవస్థాయి = కర్మవలె ననవస్థాయి - యనిత్యము.

కర్మయెట్లు అనవస్థాయి (అనిత్యము) గా గ్రహింపబడుచున్న దోయట్లే బుద్ధియుఅనవస్థాయిగా గ్రహింపబడుచున్నది. కావున నది యనిత్యము. ఇంద్రియార్థ సన్నికర్షము వలన కలిగిన ఘటబుద్ధి పటబుద్ధి కలిగినపుడుండదు. అట్లే పటబుద్ధి ఘటబుద్ధి సమయమున నుండదు. కాబట్టి యది స్థిరము అవస్థాయి కాదని స్పష్టమే. అనవస్థాయిత్వమన క్షణికత్వము. రెండు క్షణములుండి మూడవ క్షణమున నశించునని భావము.

పూర్వపక్షము :-

**"అవ్యక్తగ్రహణ మనవస్థాయిత్వాత్ విద్యుత్సంపాతే రూపావ్యక్త గ్రహణవత్" 3.2.43**

విద్యుత్సంపాతే = మెరుపు మెరసినపుడు, రూపావ్యక్తగ్రహణవత్ = (ఇట రూపమన రూపముగల వస్తువులు) వస్తువులు స్పష్టముగా తెలియబడనట్లు. అనవస్థాయిత్వాత్ = బుద్ధి యనవస్థాయి యగుట వలన అవ్యక్తగ్రహణమ్ = అస్పష్టముగా వస్తువులు గ్రహింపబడ వలయును.

విద్యుత్ప్రకాశ మనవస్థాయి. అందువలన నా ప్రకాశమున వస్తువు లస్పష్టముగా గ్రహింపబడును, అట్లే బుద్ధియు ననవస్థాయి యయినపక్షమున ఘటపటాది వస్తుగ్రహణము (బుద్ధియు) ను నస్పష్టము - అవ్యక్తము కావలయును. అట్లు గాక వ్యక్తముగా వస్తుగ్రహణము కలుగుచున్నందున బుద్ధి యనవస్థాయి కాదు.

ఉత్తరపక్షము : -

**"హేతూపాదానాత్ ప్రతిషేద్ధవ్యాభ్యనుజ్ఞా." 3.2.44.**

హేతూపాదానాత్ = అనవస్థాయిత్వమును హేతువుగా ప్రయోగించుట వలన, ప్రతిషేద్ధవ్యాభ్యనుజ్ఞా = ప్రతిషేదింపదగిన అనవస్థాయిత్వము

నంగీకరించినట్లు తెలియుచున్నది.

బుద్ధి యనవస్థాయి యగుటవలన విద్యుత్ప్రకాశమువలె నవ్యక్త గ్రహణము కలిగించునని చెప్పుటలో బుద్ధియనవస్థాయియని యంగీకరించినట్లు తెలియుచున్నది. లేకున్న ననవస్థాయిత్వమును హేతువుగా ప్రయోగించుట పొసగదు. కాబట్టి బుద్ధి యనవస్థాయి యనుట నిర్వివాద విషయము.

**"ప్రదీపార్చిః సంతత్యభివ్యక్త గ్రహణవత్ తద్గ్రహణమ్." 3.2.45.**

ప్రదీపార్చిః= దీపకాంతి, సంతత్యభివ్యక్త గ్రహణవత్ = అనవస్థాయి యైనను విషయము వ్యక్తముగా గ్రహింపబడినట్లు, బుద్ధి యనవస్థాయి యైనను, తద్గ్రహణమ్ = విషయము వ్యక్తముగా గ్రహింపబడినట్లు తెలియదగునని యర్థము.

మఱియు, ప్రకాశ మనవస్థాయి యైనంతమాత్రమున విషయ మస్పష్టముగా గ్రహింపబడవలయు నను నియమము లేదు. దీపకాంతి యనవస్థాయి యని యెల్లరు నంగీకరింతురు. అయినను విషయము - ఘటపటాదులు – వ్యక్తముగానే గ్రహింపబడును. అట్లే బుద్ధియు ననవస్థాయి యైనప్పటికి వస్తువులు స్పష్టముగా గ్రహింపనగుననుట కెట్టియాటంకమును లేదు. కాబట్టి బుద్ధి యనవస్థాయి యనియే భావము.

(బుద్ధిగత విశేషపరీక్ష)

**"ద్రవ్యే స్వగుణ పరగుణోపలబ్ధేః సంశయః." 3.2.46**

ద్రవ్యే = ఒకానొక ద్రవ్యమున, స్వగుణ పరగుణోపలబ్ధేః= స్వపరగుణములు గ్రహింపబడుట వలన, సంశయః= బుద్ధి స్వగుణమా? లేక పరగుణమా? యని సందేహము కలుగును.

ఒక ద్రవ్యమున నా ద్రవ్యగుణములేకాక ఇతర ద్రవ్య గుణములును చూడబడుచున్నవి. జలమున అభాస్వర శుక్ల రూపము స్వగుణము. ఉష్ణము తేజోగుణము ఈ రెండు గుణములు జలముననప్పుడప్పుడు చూడబడును. అట్టియెడ ఉష్ణము జలగుణమా? లేక తేజోగుణమా? యని సందేహము వొడమును. అట్లే (గోరోఽహంజానామి – స్థూలోఽహంజానామి) తెల్లవాడను. నేనెఱుగుచున్నాను. స్థూలుడను, నేనెఱుగుచున్నాను, అని ప్రయోగింతుము. అట్టియెడ బుద్ధి (ఎఱుక) స్వగుణమా? పరగుణమా? యని సంశయము కలుగును. ఇట స్వశబ్దము శరీరపరము. ఎఱుపు, స్థౌల్యము నను నవి శరీర గుణములే కదా! పరశబ్దము ఆత్మపరము. కాబట్టి స్వగుణము పూర్వపక్షము.

పరగుణము సిద్ధాంతమని వివేకము.

**"యావద్ద్రవ్యభావిత్వాద్ రూపాదీనామ్" 3.2.47**

రూపాదీనామ్ = రూపాదిగుణములు, యావద్ద్రవ్యభావిత్వాత్= స్వాశ్రయ ద్రవ్యమున్నంతకాలమున్నంతకాలముండునట్టి స్వభావము కలవగుటవలన, బుద్ధి యాత్మగుణమే.

ద్రవ్యమందలి స్వగుణములు ద్రవ్యమున్నంతకాలమందుం దును. జలమున నభాస్వర శుక్లము జలమున్నంత కాలమునందు గోచరము. ఉష్ణత యట్లుగాక తేజః సంయోగమున్నంతకాలముండి యటుపై జలమున కనిపింపదు. అట్లే బుద్ధియు శరీరగుణ మగునెడల శరీరమున్నంతకాల ముండును. అట్లు లోకమున మనము చూచుట లేదు. కాబట్టి బుద్ధి శరీర గుణము కాదని తెలియనగును.

పూర్వపక్షము : -

**"న పాకజగుణాంతరోత్పత్తేః" 3.2.48.**

పాకజగుణాంతరోత్పత్తేః= (పాక మన విక్షణతేజః సంయోగము) తేజః సంయోగముచే గుణాంతరము లుత్పన్నము లగుచుండుట వలన, న = రూపాది గుణములు స్వాశ్రయ ద్రవ్య మున్నంత కాలముండు ననుట తగదు.

ఒక ద్రవ్యమున ఉన్న రూపాదులను మార్చి మరియొక విధమగు రూపాదుల నుత్పన్నము చేయునట్టి విలక్షణ తేజః సంయోగము పాకమనబడును. దానివలన కలుగు గుణములు పాకజము లనబడును. పాకము వలన ద్రవ్యముందున్న శ్యామాది రూపములు నశించి రక్తాది రూపములు కలుగుచుండును. ఆకుపచ్చని మామిడికాయను గడ్డిలో కొంతతడవుంచిన పచ్చని రంగుగలది యగును. దీనిని బట్టి రూపాది గుణములు స్వాశ్రయ ద్రవ్యమున్నంతకాల ముండునని (యావద్ద్రవ్యభావి) యని చెప్పజనదు. కాబట్టి బుద్ధియనవస్థాయి యైనను శరీరగుణ మగుటలో దోషము లేదు. అందువలన నది శరీర గుణమే కాని యాత్మగుణము కాజాలదు.

ఉత్తరపక్షము: -

**"ప్రతిద్వంద్విసిద్ధేః పాకజానా మప్రతిషేధః" 3.2.49.**

పాకజానామ్ = పాకజగుణములు, ప్రతిద్వంద్విసిద్ధేః= పూర్వమున్న గుణములకు బదులుగా నుత్పన్నము లగుటవలన, అప్రతిషేధః = రూపాదులు యావద్ద్రవ్య భావులు కావనుట తగదు.

పాకమువలన జనించు గుణము పూర్వగుణములకు ప్రతి ద్వంద్విగా నుత్పన్నమగును. రూపమునకు రూపము, రసమునకు రసము, గంధమునకు గంధము, స్పర్శకు స్పర్శము నుత్పన్నమగును. ఇట్లుత్పన్నములయి స్వాశ్రయ ద్రవ్యమున్నంతకాల మవి యుండును. కాబట్టి యావద్ద్రవ్యభావులు కావనుట పొసగదు.

ద్రవ్యమున్నంతవరకు రూపాదులుండునేకాని యవి పూర్తిగా నెన్నడు నశింపవు. బుద్ధియట్లుగాక క్షణస్థాయియై యది నశించును. శరీర మున్నంతకాలము బుద్ధియుండదు. కాబట్టి బుద్ధి శరీరగుణము కానేరదని భావము.

**"శరీర వ్యాపిత్వాత్" 3.2.50.**

శరీర వ్యాపిత్వాత్ = రూపాదిగుణములు శరీరమంతటను వ్యాపించి యుండుటవలన, బుద్ధి శరీరగుణముకాదు.

రూపాదులు శరీరగుణములు, అందువలన శరీరమంతట నవి వ్యాపించి యుండును. బుద్ధియు నట్లు శరీరగుణమగుచో నదియు శరీరమంతట వ్యాపించి యుండవలసి యుండును. అట్లుండగ పోవుటచే బుద్ధి శరీరగుణము కాదనుట స్పష్టమే.

పూర్వపక్షము : -

**"న కేశనఖాది ష్వనుపలబ్ధేః 3.2.51.**

కేశనఖాదిష్వనుపలబ్ధేః= రూపాదులు, వెంద్రుకలు, గోళ్లు మున్నగు వానియందు లభింపక పోవుటవలన, న = శరీరమునందంతటను వ్యాపించియుండవు.

రూపాదులు శరీర వ్యాపిత్వము కలవైనచో శరీరము నందంతటను నుండవలయును కదా! శరీరమున నగపడు రూపరసగంధాదు లాశరీరమునకు సంబంధించిన కేశనఖాదులందు కనపడవేల? శరీరము నందొకయెడ లేనపుడవి శరీరవ్యాపకము లెట్లు కాగలవు? కాజాలవు. కాబట్టి రూపాదులు శరీర వ్యాపులనుట తగదని తేలుచున్నది.

ఉత్తరపక్షము :-

**"త్వక్పర్యంతత్వాచ్ఛరీరస్య, కేశనఖాధిష్వప్రసంగః" 3.2.52.**

శరీరస్య = శరీరము, త్వక్పర్యంతత్వాత్ = త్వక్కువరకే యగుట వలన, కేశ నఖాదిషు = కేశ నఖాదులందు, అప్రసంగః= శరీరమునకు సంబంధించిన రూపాదులు కేశాలందు లేవనుట తగదు.

త్వగింద్రియ సంబంధమున్నంతవరకే శరీర మనబడును. శరీరమున నింద్రియాశ్రయమేకదా! కేశనఖాదులతో త్వగింద్రియ సంబంధములేదు. అందువలననే హస్తపాదాదులు ఖండింపబడిన బాధ కలుగునట్లు కేశ నఖ ఖండనమున బాధ కలుగదు. కాబట్టి త్వగింద్రియముతో సంబంధములేని కేశనఖములు శరీరము కావని భావము. శరీరము గాని తావున రూపాదులు వ్యాపకము కానందున నవి శరీర వ్యాపకములు కావనుట యుక్తముకాదు.

**"శరీర గుణవైధర్మ్యాత్" 3.2.53.**

శరీర గుణవైధర్మ్యాత్ = శరీరగుణ ధర్మముకంటె విరుద్ధ ధర్మము కలదగుట వలన బుద్ధి శరీరగుణము కాదు.

మఱియు శరీర గుణములయిన రూపాదుల బాహ్యేంద్రియములచే గ్రహింపదగు ధర్మము కలవిగా చూచుచున్నాము బుద్ధి శరీరగుణ మగునెడల అదియు బాహ్యేంద్రియముచే గ్రహింప బడవలయును. బుద్ధి రూపాదులవలె బాహ్యేంద్రియముచే గ్రహింపబడక మనస్సుచే గ్రహింపబడుటచే నది శరీరగుణము కాదని యభిప్రాయము.

పూర్వపక్షము : -

**"న రూపాదీనామితరేతర వైధర్మ్యాత్". 3.2.54.**

రూపాదీనాం = రూపాదులు, ఇతరేతర వైధర్మ్యాత్ = పరస్పర విరుద్ధగుణము కలవగుటవలన, న = శరీరగుణములకంటె భిన్న ధర్మము కలిగియుండుట శరీరగుణము కాదనుటను సాధింపదు.

రూపాది గుణములన్నియు నొకే యింద్రియముచే గ్రహింపబడక భిన్న భిన్నేంద్రియములచే గ్రహింపబడును. రూపము చక్షువుచే, స్పర్శము త్వక్కుచే, గంధము నాసికచే, అందువలన నివి పరస్పర విరుద్ధధర్మము కలవే. అంత మాత్రమున నివి శరీరగుణములు కాకపోయినాయా? పోవు. బుద్ధియు భిన్నేంద్రియ గ్రాహ్యమైనంత మాత్రమున శరీరగుణమెట్లు కాకుండును?

ఉత్తరపక్షము : -

**"ఐంద్రియ కత్వాద్రూపాదీనా మప్రతిషేధః" 3.2.55.**

రూపాదీనాం = శరీరగుణములయిన రూపాదులు, ఐంద్రియ కత్వాత్ = బాహ్యేంద్రియ గ్రాహ్యములగుట వలన, అప్రతిషేధః= విరుద్ధధర్మము సాధ్యసాధకము కాదనుట చెల్లదు.

రూపాదులు విభిన్నేంద్రియ గ్రాహ్యము లయినను బాహ్యేంద్రియ

గ్రాహ్యత్వమను సామాన్యధర్మము గలవనుటలో సందియము లేదు. బుద్ధి బాహ్యేంద్రియములలో నొక్కదానిచేతను గ్రహింపబడక రూపాదులకంటె విరుద్ధమగు దానిచేతను గ్రహింపబడక రూపాదులకంటె విరుద్ధమగుచున్నది. కాబట్టి యది శరీరగుణము కాదు. ఆత్మగుణమే.

(మనః పరీక్ష)

**"జ్ఞానా యౌగపద్యాదేకం మనః" 3.2.56.**

జ్ఞానాయౌగపద్యాత్ = ఇంద్రియార్థ సన్నికర్షములున్నను యుగపదనేక జ్ఞానము లుదయింపమి, మనః= మనస్సనెడి యంతరింద్రియము, ఏకం = ఒక్కటే.

ఆత్మచే నధిష్ఠితమయిన మనస్సు ఏ యింద్రియముతో సంయుక్తమగునో యా యింద్రియార్థమునకు సంబంధించిన జ్ఞానము కలుగును. మఱియొక యింద్రియమునకు సంబంధించిన జ్ఞానము కలుగదు. అట్టి మనస్సులు శరీరమునందనేకము లయినచో ఇంద్రియము లన్నింటితో నన్ని మనస్సులు సంయుక్తములై యనేకార్థ విషయక జ్ఞానమొకే క్షణమున కలుగును. అనేకేంద్రియములు స్వస్వవిషయములలో సన్ని కృష్టములై యున్నను ఒక్క విషయజ్ఞానమే కలుగుటవలన నొక్కొక్క శరీరమున నొక్కొక్క మనస్సే యున్నదని తెలియుచున్నది.

పూర్వపక్షము : -

**"న యుగప దనేక క్రియోపలబ్ధేః" 3.2.57.**

యుగపత్ = ఒకే క్షణమున, అనేక క్రియోపలబ్ధేః= అనేక క్రియల జ్ఞానము కలుగుటచే, న = కాదు

ఒక డేదేని వస్తువు భక్షించునపుడు దానిని చేతితో పట్టుకొని నోటియందుంచుకొని భక్షించును. అట్టియెడ నతనికి చాక్షుషరాసన ఘ్రాణజ స్పార్శన ప్రత్యక్షము లొకేమాటు కలుగును. ఒక పదార్థమును భుజించునపు డతడు దానిని కంటితో చూడడనిగానీ, నాసికతో దాని గంధము నాఘ్రాణింపడని గానీ, చేతితో స్పృశింపడనిగానీ యనగలమా? కాబట్టి మనస్సు శరీరము నందొక్కటే యగునెడలనిన్ని జ్ఞానములు ఒక్కసారిగా నెట్లు గలుగును? కలుగవు. అందువలన నొక్కొక్క శరీరమున మనస్సు ఒక్కటి కాక యనేకము లున్నవని యంగీకరింపవలయును.

ఉత్తరపక్షము : -

**"అలాత చక్రదర్శనవత్తదుపలబ్ధి రాశు సంచారాత్ " 3.2.58.**

అలాత చక్రదర్శనవత్ = కొఱవిని త్వరగా త్రిప్పిన నది చక్రము వలె కనబడును, దానివలె ఆశుసంచారాత్ = జ్ఞానమును కలిగించు సంబంధము కొఱకు మనస్సు ఆయా యింద్రియ ప్రదేశముల కతివేగముగ సంచరించుట వలన, తదుపలబ్ధి= ఆయా జ్ఞానము లుదయించును.

కొఱవి తిరుగునపుడు శీఘ్రగమనమువలన చక్రమువలె ప్రకాశమంతట నగుపడునట్లు ఒక పదార్థమును భక్షించునపుడు రాసన, చాక్షుష, ఘ్రాణజ, స్పార్శన జ్ఞానములు క్రమముగా కలిగినను నతివేగముగా మనః సంబంధ మన్ని యింద్రియములతో నేర్పడుటచే వేగదోషము వలన క్రమము గ్రహింపబడక యొకే క్షణమున జ్ఞానము లుదయించినట్లు గోచరించును. అయినను ఇది భ్రమ. వాస్తవమున నొకదాని తరువాత మఱియొక జ్ఞానమే కలుగును. కాబట్టి శరీరమున మనస్సొక్కటియే యని భావము.

(మనః పరిమాణము)

**"యథోక్తహేతుత్వాచ్చాణు" 2.2.59.**

యథోక్తహేతుత్వాత్చ = పూర్వోక్త (జ్ఞానాఽయౌగపద్య) హేతువుచే మనస్సు, అణు = చిన్నది - మధ్యమ - పరిమాణము కలది.

క్రమిక జ్ఞానము వలన మనస్సు ఒక్కటే యని యెట్లు తెలిసినదో అట్లే యది మధ్యమ పరిమాణము కలది యనియు తెలియును. సూత్రమునందలి యణు శబ్దము అల్పపరిమాణమునే బోధించును. కాని పరమాణు పరిమాణమును గ్రహింపజేయదు. మనస్సు పరమాణు పరిమాణము కలదగునెడల అతీంద్రియమగును. అందువలన తదాశ్రిత జ్ఞానములు నతీంద్రియములగును. అట్టియెడ జ్ఞానాయౌగపద్యమును, హేతువుగా గ్రహింపవలనుపడదు. సామాన్యముగానో, విశేషముగానో ప్రత్యక్షముగాని విషయము హేతువుగా ప్రయోగింపబడదు. జ్ఞానమాత్మాశ్రితమగుటచే మనస్సతీంద్రియమయిన నష్టమేమి అనరాదు. ఆత్మ నిర్వికారమ గుటచే కేవలాత్మ జ్ఞానాది గుణముల కాశ్రయము కాదు. మనస్సు జడమగుటచే కేవల మనస్సును ఆశ్రయము కాదు. కాబట్టి మనో విశిష్టమగు నాత్మయే జ్ఞానాదుల కాశ్రయమనవలయును. విశిష్టము నందలి ధర్మములు విశేషణమునందు నంగీకరింపబడుట వలన జ్ఞానాదులకు మన స్సాశ్రయము కాగలదు. కాబట్టి మనస్సు పరమాణు పరిమాణము కలదని యంగీకరించిన తదాశ్రిత జ్ఞానాదులు

ప్రత్యక్షములు కావలసివచ్చును. అందువలన అణు వనమధ్య పరిమాణ మనియే చెప్పవలయును. మధ్యమ పరి మాణము గలదగుచో మనస్సు సర్వేంద్రియములతో యుగపత్సం బద్ధమై సర్వజ్ఞానములు నొకే క్షణమున నేర్పడవలసియుండు ననరాదు. సర్వేంద్రియ సన్నికర్షమున్నను జ్ఞాన ప్రయోజక సంబం ధము కలుగనంతవరకు జ్ఞాన ముత్పన్నము కానేరదని పూర్వమే వర్ణించి యుంటిమి. అందువలన దోషమావంతయును లేదని భావము.

(మనస్సు జన్యము)

**"పూర్వకృత ఫలానుబంధా త్తదుత్పత్తిః" 3.2.60.**

పూర్వకృత ఫలానుబంధాత్ = పూర్వసర్గమునందు చేయబడిన మనోవాక్కాయకర్మల ఫలసంబంధమువలన, సూక్ష్మభూతముల నుండి, తదుత్పత్తిః= మనస్సు జనించును.

ప్రాకృతిక వస్తువులన్నియు ప్రళయవేళ ప్రకృతిలో లీనమగును. ఆ ప్రాకృతికములే వేరుగా నుండును. ప్రకృతి పురుషుడు, ఈశ్వరుడు నను నీమూటికంటె నితర నిత్యము లంగీకరింపబడక పోవుట వలన మనస్సు ప్రాకృతికమగుట నిస్సంశయము. ప్రకృతియందు లీనమై ప్రకృతిసామ్యమును బొందిన మనస్సు కారణ రహితముగా మరల సర్గారంభమున సూక్ష్మభూతముల నుండి జనింపనేరదు. ఒకవేళ జనించినను నొకే విధమగు మనస్సు జనించును. కాని ప్రతిజీవికి భిన్న భిన్న ధర్మయుక్తమగు మనస్సు లభించుట జూచుచున్నాము, కాబట్టి కర్మవైచిత్ర్యము వలన మనో వైచిత్ర్యమేర్పడునని యంగీకరింప వలయును. అందువలన పూర్వసర్గమున జేసిన శుభాశుభకర్మజన్య మగు నదృష్ట సహకారమున భూతసూక్ష్మములనుండి మనస్సు జనించుచున్నది.

**"భూతేభ్యో మూర్త్యుపాదాన వత్తదూపాదానమ్" 3.2.61.**

భూతేభ్యః= అదృష్టసహకృతములైన భూతములనుండి, మూర్త్యుపాదానవత్ = శరీరమేర్పడినట్లు, తదుపాదానమ్ = మనస్సుకలుగును.

పంచభూతములనుండి శరీర ముత్పన్నమైనట్లు సూక్ష్మ భూతముల నుండి మనస్సు జనించునని భావము.

పూర్వపక్షము: –

**"న సాధ్యసమత్వాత్" 3.2.62.**

సాధ్యసమత్వాత్ = సందిగ్ధ సాధ్యముతో సమానమగుటవలన, న = అదృష్ట సహకృత భూతమునుండి శరరీ ముత్పన్నమైనట్లను నుదాహరణము

యుక్తముకాదు.

అనిశ్చిత విషయమును ఉదాహరణముగా నీయరాదు. మాతా పితరులు శరీరమునుండి యేర్పడు శుక్లశోణితము వలన శరీరోత్పత్తి కలుగుచుండ వానిని విడిచి అదృష్ట సహకృత భూతములనుండి శరీర మేర్పడుచున్నదను విషయము సిద్ధపరుపవలసియున్నది. కాబట్టి సాధ్యసమమై యుదాహరింప నయోగ్యమగుచున్నదని భావము.

ఉత్తపక్షము : -

**'నోత్పత్తి నిమిత్తత్వాత్ మాతా పిత్రోః" 3.2.63.**

మాతాపిత్రోః= మాతాపితరులకు సంబంధించిన శుక్ల శోణిత ములును అదృష్ట సహకృతములై, నిమిత్తత్వాత్ = నిమిత్తమగుటవలన న = సాధ్యసమమగుటచే నుదాహరణము కాదనుట తగదు.

కేవల శుక్ల శోణితములు శరీరమున కుపాదానము కాక యదృష్ట సహకృత శుక్ల శోణితములు కారణములుగా నంగీకరించుటవలన, అదృష్ట సహకృత భూతములు శరీరోత్పత్తికి ఉపాదానకారణ మనుట సిద్ధవిషయమే' సాధ్యముకాదు, కాబట్టి యుదాహరణమున దోషములేదని భావము.

**"తథాహారస్య" 3.2.64.**

తథా = శుక్ల శోణితము శరీరమున కుపాదానమైనట్లు, ఆహారస్య= తల్లితిను నాహారమును కారణమగును.

గర్భ ధారణానంతరము తల్లి తిను పదార్థములన్నియు క్రమముగా గర్భపోషకమగుట నందరెరిగిన విషయమే కాబట్టి శుక్ల శోణితములేకాక మాతృభుక్తాహారమును శరీరోత్పత్తికి కారణమగు చున్నదని భావము

అదృష్ట సహకృత శుక్లశోణితములే కారణమననేల?

**"ప్రాప్తౌచానియమాత్" 3.2.65.**

ప్రాప్తౌచ= శుక్లశోణితములు గర్భాశయమున చేరినను, అనియ మాత్ = శరీరోత్పత్తి కలుగు నియమము లేనందున కొందఱు దంపతులు ప్రయత్నపూర్వకముగా ప్రతి రాత్రి గర్భాశయమున శుక్ల శోణితము చేర్చుచుందురు. కాని సంతానోత్పత్తి కలుగదు. కేవల శుక్లశోణితములు శరీరోత్పత్తికి కారణమగునేని నిట్టియెడ గర్భధారణ కలుగవలసి యుండును. అట్లు కాకపోవుటచే అదృష్ట సహకారమపేక్షించుచున్నట్లు తెలియనగును. కాబట్టి యదృష్ట సహకృత శుక్ల శోణితముల ప్రాప్తి శరీరోత్పత్తికి కారణమని యెంచ

వలయును.

**"శరీరోత్పత్తినిమిత్తవత్సంయోగోత్పత్తి నిమిత్తంకర్మ" 3.2.66.**

శరీరోత్పత్తి నిమిత్తవత్ = శరీరోత్పత్తియందదృష్టము నిమిత్తమైనట్లు, సంయోగోత్పత్తి నిమిత్తం = సంయోగమిట మనస్సు, దాని యుత్పత్తికి నిమిత్తము, కర్మ = అదృష్టమని యర్థము.

అదృష్ట సహకృత భూతములవలన శరీరోత్పత్తి కలుగుచున్నట్లు, అదృష్ట సహకృత సూక్ష్మ భూతములనుండి మనస్సుత్పన్న మగుచున్న దనిన నెట్టి వైలక్షములేదని భావము.

**"ఏతేన అనియమః ప్రత్యుక్తః" 3.2.67.**

ఏతేన = అదృష్టమును నిమిత్తముగా చెప్పుట వలన, అనియమః= కొన్ని యెడల శుక్లశోణితము లొకచో గర్భాశయమున చేరినప్పటికి గర్భోత్పత్తి కలుగకుండుట యను అనియమము, ప్రత్యుక్తః= ప్రత్యాఖ్యానము చేయబడినది.

అదృష్ట సహకార మున్నపుడే శుక్లశోణితములు శరీరోత్పత్తికి కారణమని నుడువుటచే అదృష్ట సహకారములేని శుక్లశోణితములు శరీరోత్పత్తికి కారణము కాకున్నను దోషము లేదు. శరీరాది కార్యజాత ముత్పన్నమగుటకు అదృష్టము నిమిత్తమని స్థాపింపబడినది. అదృష్ట ముత్పత్తి వినాశములు కలదై మనోవిశిష్టమగు నాత్మకు గుణ మగుచున్నది. మనోవాక్కాయములచే జీవాత్మ యదృష్టమును సంపాదించు చున్నదని రాద్ధాంతము.

అదృష్టము భూతములకు, మనస్సునకు స్వాభావిక ధర్మమనియు, అదృష్ట నిమిత్తముగా శరీరమేర్పడుననియు, శరీరమున మనస్సంయోగమును కలుగుననియు కొందఱందురు.

ఈ వాదమును శంకించి నివారించుచున్నాడు.

**'తదదృష్ట కారితమితిచేత్ పునస్తత్ప్రసంగోఽపవర్గే" 3.2.68.**

తదదృష్టకారితమితిచేత్ = భూతముల యదృష్టముచే శరీరమేర్ప డినదని తలంచిన, అపవర్గేపునః= మోక్షమునందును, తత్ప్రసంగః= శరీరప్రసక్తి కలుగును.

అదృష్టము భూతధర్మమనువారు "ఆత్మలు చేతనములు; స్వకర్మవశమున బంధింపబడును. తపశ్చర్యాదుల ద్వారా ముక్తముల గును. జీవుల యుపయోగము కొఱకు స్వాభావికమైన తమ యదృష్టమువలన భూతములు శరీరములను కలిగించును. మనస్సుకూడ తన స్వాభావికధర్మమైన

యదృష్టవశమున శరీరము నందు ప్రవేశించును శరీరారంభమునందు, భూతసమావేశము నందును మనస్సుయొక్క స్వాభావికమగు అదృష్టము తప్ప జీవాత్మల కర్మాపేక్ష యుండదు. జీవులు విముక్తులు కానంత వరకు శరీర పరంపర పరిసమాప్తము కాదు," అని యెంచుదురు. కాని యిది యుక్తము కాదు. బంధకాలమున స్వాదృష్టముచే ప్రేరింపబడి శరీరము నారంభించు భూతములు మోక్షకాలమున నవి శరీరమును కలిగింపవనుటకు కారణమూహింప జాలము. భూతముల స్వాభావిక ధర్మమయిన యదృష్టమప్పుడెక్కడికేగును? ఒకప్పు డుండి మరియొకప్పుడు లేకున్న స్వాభావిక ధర్మమెట్లగును? మోక్ష కాలమునందును శరీరసంబంధ మంగీకరించుట యనిష్టమగును. కాబట్టి యదృష్టము భూతస్వాభావిక ధర్మమనుట యుక్తి యుక్తము కాదు.

**"మనః కర్మనిమిత్తత్వాచ్చ సంయోగావిచ్ఛేదః" 3.2.69.**

మనః కర్మ నిమిత్తత్వాచ్చ = మనస్సులోనుండు అదృష్టము మనః కర్మయనబడును. అది నిమిత్తమగుటవలన సంయోగావిచ్ఛేదః= మనః శరీర సంయోగమెన్నడు విచ్ఛిన్నము కాదు.

మఱియు నిమిత్తము నశించిననైమిత్తకము నశించును. మనస్సున నుండు నదృష్టవశమున శరీరమనః సంయోగమేర్పడు చున్నది. మనస్సు నిత్యమగుటచే తద్ధర్మమైన యదృష్టమును నిత్యము. అందువలన నది నశింపదు. కాబట్టి తన్నిమిత్తక మగు శరీరమనఃసంయోగమును నశింపదు. ఇదియు ననిష్టమే యగుచున్నదని భావము.

**"నిత్యత్వప్రసంగశ్చ ప్రాయణా నుపపత్తేః" 3.2.70.**

ప్రాయణానుపపత్తేః = ప్రాయణము - మరణము సిద్ధింపనందున నిత్యత్వ ప్రసంగః= శరీరమనః సంయోగము నిత్యమగును.

విచ్ఛిన్నము కానిది నిత్యమగును. కాబట్టి శరీరమనః సంయోగము నిత్యమగునెడల మోక్షమే సిద్ధింపదని భావము.

పూర్వపక్షము : -

**'అణుశ్యామతానిత్యత్వవదేత త్స్యాత్' 3.2.71.**

అణుశ్యామతానిత్యత్వవత్ = పరమాణువు నందలి శ్యామతా గుణము నిత్యమైనట్లు, ఏతత్స్యాత్ = సంయోగమును అగును.

పరమాణుశ్యామతాగుణము నిత్యమై నశించునట్లు, సంయోగము

నిత్యమైనను నశించును. కాబట్టి దోషములేదు.

ఉత్తరపక్షము : –

"నాకృతాభ్యాగమ ప్రసంగాత్" **3. 2. 72.**

అకృతాభ్యాగమ ప్రసంగాత్ = చేయబడకయే – నిర్నిమిత్తముగా సంయోగనాశ ప్రసక్తి కలుగును. కావున, న = దోషము లేదనుట తగదు.

పరమాణువులలోని శ్యామతాది గుణములు నిర్నిమిత్తముగా నశింపవు. పాకమువలన శ్యామత నశించి దానికి ప్రతిద్వంద్విగా రక్తగుణ మేర్పడును. ఇట్లే సంయోగ నాశమును కొండొక నిమిత్తము వలన నేర్పడిన యుక్తమగును. నిమిత్తము లేకయే సంయోగము నశించుననుట తార్కికుల మనస్సును రంజింపజేయదు. కాబట్టి భూతముల యదృష్టము వలన శరీరమేర్పడు ననుట సాధువు కానట్లు మనోనిష్ఠమగు నదృష్టమువలన శరీరసంయోగము మనస్సున కేర్పడు ననుటయు సాధువు – ప్రమాణ సంగతము కానేరదని భావము.

తృతీయాధ్యాయమున ద్వితీయాహ్నికము

# న్యాయ దర్శనము

## చతుర్థాధ్యాయము

(ఆద్యాహ్నికము)

(ప్రవృత్తిపరీక్ష)

**"ప్రవృత్తిర్యథోక్తా" 4.1.1.**

ప్రవృత్తిః= ప్రవృత్తి, యథోక్తా = లక్షణసూత్రమున వర్ణింపబడిన విధమున పరీక్షింపబడిన ట్లెంచవలయును.

లక్షణసూత్రమున (1.1.17.) వాగాదులను గురించి వివరముగా జెప్పియుండుటచేతను, వాని యారంభమననేమో ప్రసిద్ధమగుటవలనను, నంశయంము కలుగనందుననను ప్రస్తుతమిట పరీక్షింపవలసిన విషయమేమియులేదని భావము.

**"తథాదోషాః" 4.1.2.**

తథాదోషాః = ప్రవృత్తివలె దోషములు నని యర్థము.

(దోషవిభాగము)

**"తత్త్రైరాశ్యం రాగద్వేషమోహార్థాంతరభావాత్" 4.1.3.**

రాగద్వేష మోహార్థాంతరభావాత్ = రాగద్వేష మోహములు భిన్నములగుటచే, తత్త్రైరాశ్యం = దోషము ముర్విధములు.

కామక్రోధాది దోషము లనేకములైనను లన్నియు ముర్విధముల విభజింపనగును (1) రాగము (2) ద్వేషము (3) మోహము, కామము, మత్సరత, స్పృహ, తృష్ణ, లోభము, మాయ, దంభము నను వివి రాగమున చేరును. క్రోధము, ఈర్ష్య, అసూయ, ద్రోహము, అర్షము' అభిమానము, ద్వేషమున చేరును. విపర్యయమురాగ సంశయము, మానము, ప్రమాదముననను నివి మోహమున నంతర్భావములగును, కాబట్టి రాగ, ద్వేష, మోహముని దోషములు ముర్విధములు.

రతి నభిషించుట కామము తన ప్రయోజనమును చూడకయే యితరుల యభిమతమును చెరుపనెంచుట మత్సరత. పరుల ద్రవ్యమును గ్రహించు కోరిక స్పృహ. తనకు ప్రాప్తింపని దానిని కోరుట తృష్ణ. ప్రమాణ విరుద్ధముగా పరధనము నపహరింపగోరుట లోభము. విశేషలాభేచ్ఛ మాయ. కపటముతో తన గొప్పతనమును ప్రకటింపగోరుట దంభము. శరీరేంద్రియాధిష్ఠానముల వికృతికి హేతువగు ద్వేషవిశేషము క్రోధము. (సాధారణ) ఉమ్మడి వస్తువునందు

ఇంతరుల యభినివేశమును వారించుటకు హేతువగు ద్వేష విశేషము ఈర్ష్య యనబడును. పరులగుణములను సహింపలేకుండుట అసూయచెడుగు చేయవలయునను కోరిక ద్రోహము. అపకారమును క్షమింపలేమి అమర్షము. అపకారము చేసినవాని నేమియు చేయలేక తన్నుదా ద్వేషించుట అభిమానము. భ్రాంతి జ్ఞానము విపర్యయము ఒక ధర్మియం దనేక విరుద్ధ ధర్మజ్ఞానము సంశయము. లేని గుణములను తనలో నారోపించుకో 'తాను గొప్పవాడ'ననుకొనుమానము. భావము కర్తవ్యము చేయకుండుట ప్రమాదము ననబడును.

పూర్వపక్షము : –

**"నైక ప్రత్యనీక భావాత్" 4.1.4.**

ఏక ప్రత్యనీక భావాత్ = ఆత్మతత్త్వబోధమనునదొక్కటే విరోధిగా గలవగుటవలన, న= దోషములు మువ్విధములు కావు.

ఆత్మ తత్త్వజ్ఞానము కలుగగానే మోహముగానీ, రాగ ద్వేషముగానీ యుండనేరవు. రాగద్వేషాదులకు ఆత్మ తత్త్వజ్ఞానము విరోధి – నివర్తకము. రాగద్వేషాదులు పరస్పరము భిన్నములై మువ్విధములగునెడల నొక యాత్మతత్త్వ జ్ఞానముచే నివర్తింపబడుటెట్లు సంభవించును? ఒకటి నివర్తకమయిన నివర్త్యము నొక్కటియే యగును. నివర్తకమొక్కటియై నివర్త్యము లనేకముయిన రాగద్వేషాదులేకాక తదితర ఘట పటాదులు నివృత్తి కావలసి వచ్చును. కాబట్టి రాగద్వేషాది దోషములు మువ్విధములుకాక ఒకేవిధ మన వలయునని భావము.

ఉత్తరపక్షము : –

**"వ్యభిచారా దహేతుః" 4.1.5.**

వ్యభిచారాత్ = అనైకాంతికమగుటవలన, అహేతు = పూర్వోక్త హేతువు సరిగాదు.

ఒకదానిచే నివర్తింపబడునవి పరస్పర భిన్నములు కాగూడదను నియమము లేదు. ఒకే పాకసంయోగమవలన రూపరసగంధస్పర్శలు మారుచుండుట జూచుచున్నాము కాబట్టి 'ఏకప్రత్యనీక భావాత్' ఒక్కటే విరోధిగాగలవగుట వలన త్రైరాశ్యము కాదనుట యుక్తముకాదు.

**"తేషాంమోహః పాపీయాన్ నామూఢస్యేతరేతరోత్పత్తేః" 4.1.6.**

నామూఢస్య= మూఢునకు. ఇతరేతరోత్పత్తేః= రాగద్వేషములుత్పన్నము లగుటవలన, తేషాం = రాగద్వేష మోహములో, మోహః= మోహమనెడి దోషము,

పాపీయాన్ = మిక్కిలి పాపము.

మోహమున్న చోటనే రాగద్వేషములు కలుగును. అది లేనియెడ నవియు కలుగవు. మోహనిమిత్తకములు రాగద్వేషము లనుట దీనివలన బోధపడుచున్నది. రాగద్వేషములు సంసారమునకు హేతు భూతములైన శుభాశుభ ప్రవృత్తులకు మూలము లగుటచే మోహము మిక్కిలిపాపము. కార్యముకంటె కారణమున దోషమెక్కు డంగీకరించుట యుక్తము. కాబట్టి ఆత్మతత్వజ్ఞానము ద్వారా మందు మోహమును తొగింపవలయును. మోహము తొలగిన రాగ ద్వేషము స్వయముగానే తొలగును.

పూర్వపక్షము: -

**"నిమిత్త నైమిత్తికభావా దర్థాంతర భావో దోషేభ్యః" 4.1.7.**

నిమిత్తనైమిత్తిక భావాత్ = కార్య కారణభావమువలన, మోహము, దోషేభ్యః = దోషముకంటె, అర్థాంతరభావః= భిన్నము

రాగద్వేషములకు మోహము నిమిత్తమగునెడల, మోహము రాగద్వేషములకంటె భిన్నముకావలసియుండును, కాన దోష మనబడరాదని భావము, నిమిత్తనైమిత్తికములు పరస్పర భిన్నములగును. చాక్షుషజ్ఞానమునకు నిమిత్తమగు ప్రకాశము దానికంటె భిన్నమగుట నిశ్చిత సిద్ధాంతము. కాబట్టి మోహము దోషములలో పరిగణింపబడరాదు.

ఉత్తరపక్షము : -

**"న దోషలక్షణావరోధాన్మోహస్య" 4.1.8.**

దోషలక్షణావరోధాత్ = దోషలక్షణముచే నవరుద్ధమగుటచే, మోహస్య = మోహమునకు, అర్థాంతరభావము, న = లేదు.

"ప్రవర్తనాలక్షణాదోషాః" (1.1.18.) అనెడి సూత్రమున దోషలక్షణము వర్ణింపబడినది. ఆ లక్షణముచే మోహమును లక్షింపబడుచున్నది. దోషలక్షణము దోషము కాని దానిని నిరోధింపజాలదు. కాబట్టి మోహమును దోషమే.

మోహము దోషమగునెడల రాగద్వేషములకు సమాన జాతీయమగుటచే వానికి నిమిత్త మెట్లగునన,

**"నిమిత్తనైమిత్తికభావోపపత్తేశ్చతుల్యజాతీయానా**
**మప్రతిషేధః" 4.1.9.**

తుల్యజాతీయానామ్ = సజాతీయములలో, నిమిత్తనైమిత్తిక భావో పపత్తేశ్చ = కార్యకారణభావ ముపపన్నమగుట వలన, అప్రతిషేధః = నిమిత్తము కాదనుట

యుక్తముకాదు.

దండము ఘటమునకు నిమిత్తము, దండ ఘటములు రెండును ద్రవ్యములగుట సమాన జాతీయములే. అయినను నిమిత్తనైమిత్తిక భావమున కెట్టి లోపమును లేదు. అట్లే మోహము రాగద్వేష సజాతీయ మైనంతమాత్రమున నదివానికి నిమిత్తమగుటలో నెట్టి దోషమును లేదు. సజాతీయములు నిమిత్తనైమిత్తికభావము నందజాల వను నియమము లేదని సూత్రాభిప్రాయము. కాబట్టి మోహము దోషముల కంటె అర్థాంతరముకాదు.

(ప్రేత్యభావలక్షణము)

**"ఆత్మనిత్యత్వే ప్రేత్యభావసిద్ధిః" 4.1.10.**

ఆత్మనిత్యత్వే = జీవుడు నిత్యమైన, ప్రేత్యభావసిద్ధిః= ప్రేత్యభావము (పునరుత్పత్తి) సిద్ధించును.

పునరుత్పత్తి ప్రేత్యభావ మనబడును. పునరుత్పత్తియన చచ్చి మరల పుట్టుట – పూర్వశరీరమును విడిచి మరియొక శరీరమును గ్రహించుట. ప్రత్యగాత్మ (జీవుడు) అనిత్యమైన నిది సిద్ధింపదు. జీవుడు నిత్యముగాక శరీరముతో బాటు నశించునేని శరీరాంతర గ్రహణము పొసగదు. జీవుడు నిత్యడేయని పూర్వగ్రంథమున ననేక విధముల సిద్ధపరుపబడినది. కాబట్టి ప్రేత్యభావమును సిద్ధించినట్లే. విశేషించి పరీక్షింపదగిన యవసరములేదని భావము.

(వస్తువులయుత్పత్తి)

**"వ్యక్తాద్వ్యక్తానాం ప్రత్యక్షప్రామాణ్యాత్" 4.1.11.**

ప్రత్యక్షప్రామాణ్యాత్ = ప్రత్యక్షప్రమాణ సిద్ధమగుట వలన, వ్యక్తాత్ = భావపదార్థములవలన, వ్యక్తానాం = భావపదార్థముల యుత్పత్తి జరుగును.

మృత్తికవలన ఘటము, తంతువులనుండి పటము, బీజమునుండి యంకురము కలుగుచుండుట ప్రత్యక్ష గమ్యము. ప్రత్యక్ష సిద్ధము నిష్టము లేకున్నను నంగీకరింపక యేకిరిని శక్యముకాదు. ఇట్లు భావపదార్థముల (ఉనికిగల వస్తువుల) నుండి భావపదార్థము లుత్పన్నములగుచుండుట ప్రత్యక్షాది ప్రమాణ సిద్ధము. కావున ప్రపంచమునగల సర్వ భావపదార్థములును కొండొక యదృష్ట భావపదార్థ మూలకముగా నుద్భవిల్లుచున్న ట్లంగీకరింప వలసివచ్చును. ఆ భావపదార్థమే జగత్తునకు మూలకారణము – ప్రకృతి యనబడును. సత్పదార్థమునుండియే సత్పదార్థ ముత్పన్నమగు నని వైదికుల

మతము. కావుననే ఛాందోగులు "సదేవసోమ్యేదమ గ్ర ఆసీత్" అన్నారు. కాబట్టి ప్రత్యక్షాది ప్రమాణములద్వారా సత్పదార్థమునుండి సత్పదార్థ ముత్పన్నమగునని యంగీకరింప బడుచున్నది.

పూర్వపక్షము : -

**"న ఘటాద్ ఘటానిష్పత్తేః" 4.1.12.**

ఘటాత్ = వ్యక్తమగు ఘటమునుండి, ఘటానిష్పత్తేః= మఱియొక ఘటముత్పన్నము కాకుండుట వలన, న = వ్యక్తము నుండి వ్యక్తముత్పన్నమగుననుట సరికాదు.

వ్యక్తమునుండి వ్యక్తముత్పన్నమైననొక ఘటము నుండి మఱియొక ఘట ముత్పన్నము కావలయును అట్లగుటలేదు. కాబట్టి వ్యక్తము నుండి వ్యక్తముత్పన్నముకాదు.

ఉత్తరపక్షము : -

**"వ్యక్తాత్ ఘటనిష్పత్తే రప్రతిషేధః" 4.1.13.**

వ్యక్తాత్ = వ్యక్తమగు కపాలముల వలన, ఘటనిష్పత్తేః= ఘటముత్పన్న మగుచుండుటవలన, అప్రతిషేధః= వ్యక్తమువలన వ్యక్తము కలుగదనుట సరికాదు,

వ్యక్తమువలన వ్యక్తము కలుగునన, వ్యక్తకారణ పదార్థమువలన వ్యక్తకార్య పదార్థము కలుగునని యభిప్రాయము. అందువలన వ్యక్తకార్యమువలన మఱియొక కార్యము కలుగుకున్నను దోషములేదు. ఘటోత్పత్తికి కారణ భూతములయిన కపాలాది వస్తువులు వ్యక్తములే కదా?

పూర్వపక్షము : - (శూన్యవాది)

**"అభావాద్ భావోత్పతి ర్నానుపమృద్య ప్రాదుర్భావాత్" 4.1.14.**

నానుపమృద్య = కారణమును నశింపజేసి, ప్రాదుర్భావాత్ = కార్య ముత్పన్నమగుటవలన, అభావాత్ = అభావమునుండి, భావోత్పత్తిః= భావము జనించును.

బీజము నశించిన మీదట అంకుర మేర్పడుచున్నది. కాబట్టి కారణ నాశానంతరము కార్యము జనించుచున్నదని తెలియుచున్నది. కారణ నాశము భావము కాజాలదు. కాబట్టి యభావమునుండి భావము జనించుచున్నది.

ఉత్తరపక్షము : -

**"వ్యాఘాతా దప్రయోగః" 4.1.15.**

వ్యాఘాతాత్ః విరుద్ధార్థకమగుటవలన, అప్రయోగః= నశింపజేసి పుట్టుచున్నందువలన అను ప్రయోగము సరికాదు.

కారణమును నశింపజేసి కార్యము పుట్టుచున్నదని కదా శంకాభిప్రాయము! అట్లయిన నశింపజేయునది యుండిన కదా! నశింపజేయగలుగును. కాబట్టి నశింపజేసి పుట్టుచున్నదన నర్థమేమి? పుట్టునది పుట్టక ముందుండదుకదా? లేనిది నశింపజేయుటెట్లు? ఉండిన పుట్టుచున్నదన నర్థమేమి? కాబట్టి (ఉపమృద్యప్రాదుర్భవతి) నశింపజేసి పుట్టుచున్నదనుట నిరర్థక ప్రయోగమగును.

పూర్వపక్షము : –

**"నాతీతానాగతయోః కారకశబ్ద ప్రయోగాత్" 4.1.16.**

అతీతానాగతయోః= కారణ కార్యలక్షణముగ భూత భవిష్య ద్విషయములందు, కారక శబ్దప్రయోగాత్ = కర్మ, కర్త ఆది కారక శబ్దమును గౌణముగా ప్రయోగించుట వలన, న= పూర్వోక్త ప్రయోగము అనర్థముకాదు.

కారణము నశించి కార్య ముత్పన్నమగును. కారణ నాశానంతరము కార్య ముత్పన్నమగు ననుటలో కర్మ కారకము, కర్తృకారకము ప్రయోగింపబడినవి. ఈ కారకము లిట ఆనంతర్యమునే బోధించును. ఇంతియగాని, కారణ కార్యములకంటె భిన్నముగా నొక వస్తువిట కారణమును నశింపజేసి కార్యము నుద్భవింపజేయునని కానీ, అదే కార్యముగా నుద్భవించునని కానీ యుద్ధేశింపబడలేదు. కాబట్టి కారణము నశించి కార్యము ప్రాదుర్భవించునని ప్రయోగించుటలో దోషములేదు.

ఉత్తరపక్షము: –

**"న వినష్టేభ్యో ఽ నిష్పత్తేః" 4.1.17.**

వినష్టేభ్యః= వినాశము పొందినవానినుండి, అనిష్పత్తేః= కార్యము జనింపనందువలన, న = పూర్వోక్తము సరికాదు.

నశించిన కారణములు కార్యమును కలుగజేయవు. విద్యమాన కారణము వలననే కార్యములుత్పన్నములగును. వినష్టకారణము వలన కార్యము జనించు పక్షమున కర్షకులు వినష్ట బీజములను క్షేత్రముల నేలవిత్తురు? కారణవినాశమున భేదముండదు కాబట్టి, వరివిత్తనము వలన గోధూమాంకురము, యవబీజమువలన శాల్యాం కురము లేల కలుగవు? భిన్న బీజము వలన భిన్నాంకురములుద్భ వించుటకు బీజమున విశిష్ట శక్తియొకటి యంగీకరింపవలసి వచ్చును. అట్టిశక్తి విద్యమాన వస్తువున నుండును గాని

నశించినదానియం దుండజాలదుకదా? కాబట్టి పూర్వోక్త ప్రయోగ మయుక్తముకాకున్నను వినష్ట కారణములవలన కార్యోత్పత్తి కలుగుననుట పొసగదు. కారణము కార్యమున అన్వయింప వలసియుండును. వినష్టతంతువు పటమున నెట్లు సమన్వయము పొందగలవు? కాబట్టి యభావమువలన భావముద్భవించునను ప్రమాణవిరుద్ధము.

**"క్రమనిర్దేశా ద ప్రతిషేధః" 4.1.18.**

క్రమనిర్ధేశాత్ = (బీజము యొక్క పూర్వాపరావస్థలిట క్రమమనబడును.) ఉపమర్ధ పదముచే నిట్టి క్రమము నిర్దేశింపబడుట వలన, అప్రతిషేధః= భావమునుండి భావ ముత్పన్న మగుననుట ప్రతిషేధింప బడదు.

బీజోపమర్దము బీజనాశముగా నంగీకరింపుము. బీజము నందు రెండు దలములుండును. వాని సంయోగము పూర్వావస్థ యనబడును. భూసలిలాది సంబంధము వలన కలుగు వాని విభాగము అపరావస్థ యనబడును. ఈ పూర్వాపరభావమే యుపమర్ద మనబడును. ఇట్లు బీజ మొక యవస్థనుండి మరియొక వయస్థనుబొంది క్రమముగా నంకుర మగును. అందువలన భావమునుండి భావముద్భవించు ననుటలో దోషము లేదు. ఇట్లు సర్వభావ పదార్థముల కాది భావపదార్థము ప్రకృతి యనబడును.

(ఈశ్వరుడు జగత్కర్త)

**"ఈశ్వరః కారణమ్ పురుష కర్మాఫల్య దర్శనాత్" 4. 1.19.**

పురుష కర్మాఫల్య దర్శనాత్ = జీవులు చేయు శుభాశుభ కర్మముల నైష్ఫల్య జ్ఞానము వలన, ఈశ్వరః= క్లేశకర్మ విపాకాశయములచే నస్పృష్టుడు, నిరతిశయ జ్ఞానక్రియాశక్తి సంపన్నుడునగు నీశ్వరుడు, కారణమ్ = ముఖ్యకారణము.

రాజుగాని, వ్యవస్థాపకుడు గాని లేని రాజ్యమున మనుజులు తాముచేయు శుభాశుభ కర్మములకు తగిన ఫలమును పొందజాలరు. లోకమున పురుషులు తాము చేయు కర్మములకు తగిన ఫలమును సుఖ దుఃఖ రూపమున పొందుచుండుట జూచుచున్నాము. జన్మము మొదలు కొందఱు సుఖము ననుభవించుట, మఱికొందఱు దుఃఖము ననుభవించుట, వేరొక కొందరు సుఖ దుఃఖము ననుభవించుటయు జూచుచున్నాము. గదా! ఈ యనుభవము కర్మములు లేక కలుగనేరవు. ప్రకృతి జడమగుటచే దానిచేగాని, జీవులొనరించు కర్మములచేగాని యిట్టి వ్యవస్థ యేర్పడజాలదు. ఆకస్మికముగా నిట్టి ఫలారంభము

కలుగు ననుటయు యుక్తముకాదు. జీవాత్మలే స్వయముగా తమతమ కర్మములకు తగు ఫలము వ్యవస్థ యొనరించుకొందు రందుమా! వారల్పశక్తిమంతులు. కాబట్టి యీ విలక్షణమై, భోక్తృభోగ్యమైన జగత్తున కధిష్ఠాతయన నొప్పు సర్వశక్తిమంతుడగు సర్వేశ్వరుడొక డంగీకరింపబడు చున్నాడు. జీవులు చేయు కర్మానుకూలముగా నీశ్వరుడు శాశ్వతకాలమునుండి యీ ప్రకృతి నధిష్ఠించియుండి దీనిని దృశ్యమాన జగత్తుగా నిర్మించుచున్నాడు. భోక్తలగు జీవులును నిర్మిత జగత్తునందు జన్మమునంది తమతమ కర్మములకు తగు ఫలమును యథాసమయ మనుభవించుచున్నారు.

ఆ యీశ్వరుడీ చరాచర జగత్తునకు జీవనహేతువగుటచే ప్రాణ శబ్దముచే వ్యవహరింపబడును. శాసించుటచే శాసకుడు – రాజు. సర్వ మతని వశమున నుండును. సర్వ విద్యల కాకరమగు వేదముం దిట్లే వర్ణింపబడి యున్నది.

"ప్రాణాయనమోయస్యసర్వమిదంవ శే" (అథర్వ. 11.2.41.)

ఇట్లే యుపనిషత్తులందును వర్ణింపబడియున్నది.

**"సవా అయమాత్మా సర్వేషాం భూతానా మధిపతిః**
**సర్వేషాం భూతానాం రాజా" (బృహ. 2.5.15.)**

పూర్వపక్షము : –

**"న పురుషకర్మాభావే ఫలానిష్పత్తేః" 4.1.20.**

పురుష కర్మాభావే = జీవుడుచేయు కర్మము లేకున్న, ఫలా నిష్పత్తేః= ఫలము కలుగనందున, న = ఈశ్వరుడు కారణము కాదు.

అన్వయ వ్యతిరేకము కార్య కారణ భావమును నియమించును. జీవకర్మయున్న ఈశ్వరుని వలన జగత్తు ఉత్పన్నమగును. లేకున్న కలుగదు. ఇట్లు పురుషకర్మ జగత్తున కన్వయ వ్యతిరేకముగా కారణమని తెలియుచున్నది. కాబట్టి పురుషకర్మయే జగత్కారణ మగును కాని యీశ్వరుడు కాదు.

ఉత్తరపక్షము: –

**"తత్కారితత్వా దహేతుః" 4.1.21.**

తత్కారితత్వాత్ = కర్మయున్నను నీశ్వరునిచే జగత్తు నిర్మింపబడుట వలన అహేతుః= పూర్వోక్తహేతువు సరికాదు.

జగదుత్పత్తికి కర్మ నిమిత్తమైనను నది స్వతంత్ర కారణము కాదు. కర్మ జడము. అది చేతనముచే నధిష్ఠింపబడక స్వతంత్రముగా నొకింతయు నిర్మింప సమర్థము కానేరదు. జడమగుటచేత ప్రకృతియే జగత్తును నిర్మింపజాలనపుడు

పురుషకర్మ మెట్లు నిర్మింపగలదు? నిరతిశయములయిన జ్ఞాన క్రియాశక్తులు కలవాడగుటచే లోకపతి పరమేశ్వరుడే యీ విచిత్ర జగత్తును భోగ్యముగా నిర్మింప గలుగుచున్నాడు.

పురుషకర్మ జగద్వైచిత్ర్యమునకు కారణమగును కాని జగత్కర్త కానేరదు. ఈశ్వరుడే కర్త కాగలడు.

(స్వభావ వాదము)

**"అనిమిత్తతో భావోత్పత్తిః కంటకతైక్ష్ణ్యాది దర్శనాత్ " 4.1.22.**

కంటకతైక్ష్ణ్యాది దర్శనాత్ = నిమిత్తము లేకయే కంటకాదులందు తైక్ష్ణ్యము మున్నగునవి చూడబడుటవలన, అనిమిత్తతః = కారణము లేకయే స్వభావముగా, భావోత్పత్తిః= కార్యపదార్థములన్నియు పుట్టుచున్నవి.

కంటకమున తీక్ష్ణత, మయూరమున చిత్రవర్ణములు స్వభావముగా నేర్పడుట చూచుచున్నాము. అట్లే లోకమున నుత్పన్నములగు వస్తువు (భావములు) నని తలంపవలయును. ఒకటి నిమిత్తము లేకయే జనించిన తక్కినవి జనింపవనుట యుక్తముకాదు. కాబట్టి భావపదార్థములన్నియు నిమిత్తము లేకయే జనించుచున్నవి.

ఉత్తరపక్షము : - (ఛలముతో)

**"అనిమిత్తా నిమిత్తత్వాన్నానిమిత్తతః" 4.1.23.**

అనిమిత్త నిమిత్తత్వాత్ = అనిమిత్తమే నమిత్తమగుటవలన అని మిత్తతః = నిమిత్తము లేక, న = భావోత్పత్తి కలుగదు.

అనిమిత్తమువలన భావోత్పత్తి కలుగునని చెప్పుచు ననిమిత్తమును కారణముగా నంగీకరించుచున్నావుకదా! అట్టి యెడ భావోత్పత్తి నిర్నిమిత్తమనుటెట్లు పొసగును?

ఉత్తరపక్షము : - (వాస్తవము)

**"నిమిత్తా నిమిత్తయో రర్థాంతర భావాదప్రతిషేధః" 4.1.24.**

నిమిత్తానిమిత్తయోః= నిమిత్తము, అనిమిత్తముననువిని, అర్థాంతరభావాత్ = భిన్నార్థము లగుటవలన, అప్రతిషేధః= భావోత్పత్తి నిర్నిమిత్తమనుట యుక్తముకాదు.

ప్రత్యక్ష ప్రమాణముచే సిద్ధించుదానిని స్వీకరింపకుండుట శక్యముకాదు. ప్రతి భావకార్యమునకును నిమిత్తములేవో, యనిమిత్తములేవో రెండును తెలియనగును. ప్రత్యక్షముగా నివి తెలియకున్న ననుమానముచే నైనను

తెలియనగును. ప్రతికార్యమును కారణజన్యమగుటచే కొండొక కార్యమనిమిత్తక మనుట తగదు. స్వభావముచేతనే కార్యము సిద్ధమగుచుండ కారణము నంగీకరింపనేల? యనుట యుక్తముకాదు. స్వభావమననేమి? దాని కాశ్రయమేది? స్వభావమున కొక యాశ్రయముండవలయునుగదా! ఆ యాశ్రయమే నిమిత్తమగును. కాబట్టి భావోత్పత్తి నిర్నిమిత్తమనుట యుక్తముకాదు. ప్రకృతినామమున వర్ధిల్లుననాది భావపదార్థము నుండి పురుషకర్మ ననుసరించి యీశ్వరుని ద్వారా భావోత్పత్తి కలుగుననియే యంగీకరింపవలయునని భావము.

(సర్వ మనిత్యమను వాదము)

**"సర్వమనిత్య ముత్పత్తి వినాశధర్మకత్వాత్" 4.1.25.**

ఉత్పత్తి వినాశధర్మకత్వాత్ = ఉత్పత్తి వినాశధర్మము కలదగుట వలన, సర్వమ్ = భావజాతమంతయు, అనిత్యం = అనిత్యము.

ఉత్పత్తి వినాశములు కలది యనిత్యము. భావ పదార్థముల న్నియునుత్పత్తి వినాశవంతములే. కాబట్టి సర్వభావములు ఘటాదులవలె ననిత్యములేయని సూత్రార్థము.

ఉత్తరపక్షము :-

**"నానిత్యతానిత్యత్వాత్" 4.1.26.**

అనిత్యతా నిత్యత్వాత్ = సర్వగతమగు ననిత్యత నిత్యమగుటవలన, న = సర్వమనిత్యముకాదు.

సర్వము ననిత్యమందువేని, సర్వమునందొక యనిత్యత్వ మను ధర్మ మంగీకరింప వలయును కదా! ఆ యనిత్యత్వము నిత్యమా? లేక యనిత్యమా? చెప్పవలసి యుండును. అనిత్యమందువేని, యానిత్యముకాని యనిత్యత కాశ్రయము నిత్య మనవలసివచ్చును. అందువలన సర్వ మనిత్యమనుట తగదు. నిత్యమందువేని సర్వమ నిత్యమను ప్రతిజ్ఞకు భంగము వాటిల్లును. కాబట్టి సర్వ మనిత్యమనుట యుక్తి విరుద్ధము.

పూర్వపక్షము : -

**"తదనిత్యత్వమ్ అగ్నేర్దాహ్యం వినాశ్యానువినాశివత్" 4.1.27.**

అగ్నేః= అగ్ని, దాహ్యం = దహింపదగు కాష్ఠాదులను, వినాశ్య= నశింపజేసి, అనువినాశివత్ = వెంటనే నశించునట్లు, తదనిత్యత్వమ్ = అనిత్యత్వము నిత్యముకాదు.

అగ్ని తన కాశ్రయమగు దాహ్యమును నశింపజేసి యనంతరము తాను

నెట్లునశించునో యట్లే యనిత్యత్వమును తన కాశ్రయమగు సర్వమును నశింపజేసి తదుపరి తానును నశించును. కాబట్టి యనిత్యత యనిత్యమే యగును. అందువలన ననిత్యత కాశ్రయమగు సర్వము నిత్యమగుననజనదు. అది పూర్వమే నశించును. కాబట్టి సర్వము అనిత్యమే.

ఉత్తరపక్షము : -

**"నిత్యస్యాప్రత్యాఖ్యానం యథోపలబ్ధి వ్యవస్థానాత్" 4.1.28.**

యథోపలబ్ధి వ్యవస్థానాత్ = ప్రమాణము ననుసరించి వ్యవస్థిత మగుటవలన, నిత్యస్య = నిత్యమగు భావపదార్థము, అప్రత్యాఖ్యానం = నిరాకరింప సంభవముకాదు.

ప్రమాణము ద్వారా యేది యుత్పత్తి వినాశ ధర్మముకలదిగా సిద్ధముకాదో యది నిత్యమగును. ఏది యుత్పత్తి వినాశ ధర్మకమో యది యనిత్యము. ఇట్లు ప్రమాణము ద్వారా వ్యవస్థితమై యుండి దానిని నిరాకరింప నేరికిని శక్యము కాదు. ప్రకృతి పురుషేశ్వరు లుత్పత్తివినాశ ధర్మకములని ప్రమాణముల ద్వారా సిద్ధింపనందున నవి యనిత్యములననొప్పదు. కాబట్టి సర్వమనిత్య మనుట ప్రమాణ సిద్ధముకాదు.

(సర్వనిత్యత్వవాదము)

**"సర్వంనిత్యం పంచభూత నిత్యత్వాత్" 4.1.29.**

పంచభూత నిత్యత్వాత్ = పంచభూతములు నిత్యములగుట వలన, సర్వం = ఘటపటాది సర్వవస్తు జాతము, నిత్యం = నిత్యము

దృశ్యమాన వస్తుజాత మంతయు పాంచభౌతికము. భూతములు నిత్యములగుటవలన సర్వము నిత్యమని భావము

**"నోత్పత్తి వినాశ కారణోపలబ్ధేః" 4.1.30.**

ఉత్పత్తి వినాశకరాణోపలబ్ధేః = ఉత్పత్తి వినాశకారణ ముపలబ్ధము లగుటవలన, న = సర్వము నిత్యముకాదు.

వినాశోత్పత్తులకు కారణములు లభించు వస్తువు నిత్యమెన్నడును కానేరదు. నిత్యమన వినాశోత్పత్తులు లేనిదనికదా యర్థము! ఘటపటాదుల యుత్పత్తి వినాశకారణములు ప్రమాణగమ్యము లగుటవలన సర్వనిత్యవాద మయుక్తము.

పూర్వపక్షము : -

**"తల్లక్షణావరోధాత్ అప్రతిషేధః" 4.1.31.**

తల్లక్షణావరోధాత్ = ఘటపటాది సర్వవస్తు వ్రాతము భూత లక్షణముచే

నవరుద్ధ మగుటవలన, అప్రతిషేధః= సర్వము నిత్యమే.

ఘటపటాదులు భూతస్వభావము కలవగుటచే భూత లక్షణముచే నవియు నవరుద్ధము (లక్షితము) లగుచున్నవి. భూతములు నిత్యము లగుటవలన తత్స్వభావము కలిగి, తలక్షణ లక్షితముయిన సర్వవస్తువును నిత్యము కాకుండు టెట్లు పొసగును? కాబట్టి నిత్యములే.

ఉత్తరపక్షము : –

**"నోత్పత్తి తత్కారణోపలబ్ధేః" 4.1.32.**

ఉత్పత్తి తాత్కారణోపలబ్ధేః= ఉత్పత్తి వినాశముకు కారణము ప్రత్యక్షముగా నుపబ్ధము లగుటవలన, న = నిత్యమనుట తగదు.

ఉత్పత్తి వినాశములు, వాని కారణములు దేనికి ప్రత్యక్షముగా లభించునో యా వస్తువు నిత్యమెన్నడును కాదు. ఘట పటాదుల కన్నిటికి నుత్పత్తి వినాశమును, తత్కారణమును ప్రత్యక్షము లగుటచే నవి నిత్యములనుట ప్రమాణ విరుద్ధము. కాబట్టి సర్వనిత్యవాద మసంగతము.

పూర్వ సూత్రమున నుత్పత్తి వినాశ కారణోపలబ్ధి హేతువుగా గ్రహింపబడినది. ఈ సూత్రమున నుత్పత్తి వినాశముల యుపలబ్ధియు, ఉత్పత్తి వినాశకారణోపలబ్ధియు, హేతువుగా గ్రహింపబడుటచే పునరుక్తి దోషములేదు.

ఉత్పత్తి వినాశములయు, తత్కారణములయు నుపలబ్ధి స్వప్నో పలబ్ధివలె భ్రమయేల కాదన,

**"న వ్యవస్థానుపపత్తేః" 4.1.33.**

వ్యవస్థానుపపత్తేః= 'ఇది కారణము' ' ఇది కార్యము' నను లోక సిద్ధమగు వ్యవస్థ వ్యర్థమగును. కావున, న = భ్రమకాదు.

స్వప్నమున గోచరించు భావములలో కార్యకారణ వ్యవస్థయెుండు కానరాదు. క్రమరహితముగా ననేకభావములందు యుగపద్గోచరము లగుచుండును. కాని లోకమున 'నిది కారణము. ఇది కార్యము' నను వ్యవస్థ ప్రత్యక్షపూర్వకమై యుపపన్నమగుచుండ స్వప్నోపలబ్ధివలె భ్రమయనుట పొసగదు. కాబట్టి సర్వనిత్యవాదము ప్రమాణ సంగతముకాదు.

(అవయవ వాదము)

**"సర్వంపృథగ్ భావలక్షణ పృథక్త్వాత్." 4.1.34.**

భావలక్షణ పృథక్త్వాత్ = (లక్ష్యంతే భావాః ఏభిః ఇతిభావ లక్షణాని అవయవాః ఇతియావత్) భావలక్షణము లన నిట నవయవములు.

వానినానాత్వము వలన, సర్వమ్ = ఘటపటాది వస్తుజాతమంతయు, పృథక్ = భిన్నము.

'రూపాదులకంటె వేరుగా ద్రవ్యమనునది యొకటి లేదు. అవయవములకు మించి యవయవియను భావమెందులేదు' అని పృథగ్వాదుల మతము. అందువలన రూపాది లక్షణావయవము లొక్కటిగాక యనేకములు. వాని సముదాయములే ఘటపటాది భావములు. కాబట్టి యవియు ననేకములే యగునని భావము.

(తన్మత నిరాకరణము)

**"నానేకలక్షణై రేకభావ నిష్పత్తేః" 4.1.35.**

అనేక లక్షణైః= అనేకావయవములచే, ఏకభావ నిష్పత్తేః= అవయవి యను నొక భావోత్పత్తి కలుగుటవలన, న = సర్వము (అనేకము) కాదు.

ఆవుదాని యవయవములకంటె భిన్నముకానిపక్షమున నావుచే చేయబడు కార్యము తదవయవములచే సంపాదింపబడవలయును. ఇట్లే ఘటాదులచే నగు జల+ఆనయన+ఆది జలమును తెచ్చుట నయనాదికార్యములు తదవ యవములచే సంపన్నము కావలయును. అట్లెన్నడును కాజాలదు. కాబట్టి యవయవము వలన నుత్పన్నమగు నవయవి యొకటి వేరుగానుండును. అది యొక్కటే కాని యనేకము కాదని భావము.

విలక్షణ కార్యమును సంపాదించినంత మాత్రమున నవయవ ములకంటె నవయవి భిన్నమన నక్కఱలేదు, అవయవములకంటె నవయవ సముదాయములు విలక్షణ కార్యసంపాదకములు కావచ్చునన,

**"లక్షణ వ్యవస్థానాదేవాప్రతిషేధః" 4.1.36.**

లక్షణ వ్యవస్థానాత్ = ప్రతిభావమునకు నవయవములు వేరు వేరుగా వ్యవస్థితములయి యుండుట వలన, అప్రతిషేధః= అవయవి నిరాకరణము సంగతముకాదు.

'ఇవి ఘటమున కవయవములు' 'ఇవి గోవున కవయవములు' 'ఇవి వస్త్రమునకు' నని భిన్నభిన్నములుగా నవయవము లొక్కొక్క వస్తువునకు వ్యవస్థితములై గ్రహింపబడుట వలన, అవయవములకంటె భిన్నముగా నవయవియొకటి యున్నట్లంగీకరింపక తప్పదు. కాబట్టి ప్రతివస్తువు భిన్నమనుట తగదు.

(అభావవాదము)

**"సర్వమభావో భావేష్వితరేతరాభావసిద్ధేః" 4.1.37.**

భావేషు = భావపదార్థములందు, ఇతరేతరాభావసిద్ధేః= అన్యోన్యాభావము సిద్ధించుటవలన, సర్వమ్ = సమస్తవస్తుజాతము, అభావః= అభావమే.

మట్టికుండ, బంగారు కుండలము. అనుతావులలో మట్టి కుండకు, బంగారము, కుండలమునకు తాదాత్మ్యము కలదు. అందువలననే వానిలో సామానాధికరణ్యమున్నది. కాబట్టి సామానాధికరణ్యమున్న తాదాత్మ్యమున్న ట్లంగీకరింపవలెను. ప్రతి భావపదార్థమునకు నభావముతో సామానాధి కరణ్యము లోకమున చూడబడుచున్నది. ఉదా: – అఘటము పటము. ఘట మపటము, గోవనశ్వము, అశ్వమగోవు. దీనింబట్టి ఘటాభావము. (అఘటము), పటము సమానాధి కరణములు. అశ్వాభావము (అనశ్వము) గోవు సమానాధి కరణము, కాబట్టి ఘటాభావమునకు పటమునకు తాదాత్మ్యమున్న దనవలయును. ఇట్లే అశ్వాభావమునకు గోవునకు తాదాత్మ్యమంగీకరింప వలయును. అందువలన గోఘటము అభావమునుట సిద్ధము. ప్రతీతి ననుసరించి లోకమున భావ వ్యవస్థ యేర్పడును. కాబట్టి పై ప్రతీతుల ననుసరించి ప్రతిభావపదార్థమును అభావ తాదాత్మ్యమై యభావమన నొప్పునని భావము.

(తన్మతనిరాకరణము)

**"న స్వభావ సిద్ధేర్భావానామ్" 4.1.38.**

భావానామ్ = గోఘటాది భావములు, స్వభావ సిద్ధేః = స్వభావముగానే సిద్ధించుట వలన, న = సర్వ మభావము కాదు.

గోఘటాదులు స్వభావముగానే సిద్ధించుచున్నవి.గోవు గోత్వముతో సిద్ధింపకున్న దాని యభావమెట్లు సిద్ధించును? గోవు అభావాత్మక మగునెడల నది స్వభావమైన గోత్వముతో నెన్నడును సిద్ధింప నేరదు. అభావము గోత్వాది ధర్మము కాశ్రయము కాజాలదు. గోవు అనశ్వము: ఘటము అపటము: అనునిట్టి ప్రతీతివలన గోఘటము భావాత్మకము లని సిద్ధింపవు. ఇట్టి ప్రయోగములందలి సామానాధికరణ్యము వలన గోవు అశ్వము కంటె భిన్నమనియు, ఘటము పటము కంటె వేరనియు బోధ కలుగునని యంగీకరింప వలయును. కాని యవి యభావాత్మకము లనవలసిన యవసరము లేదు. పై ప్రయోగము వలన అశ్వమున గోత్వముకాని, పటమున ఘటత్వముగాని లేదని తెలియును కాని, అభావమెట్లుబోధ పడగలదు? గోవునందు గోత్వము, ఘటమున ఘటత్వము

నుండి ననియే బోధయగును. కాబట్టి సర్వమభావముకాదు.

పూర్వపక్షము : -

**"న స్వభావ సిద్ధిరాపేక్షికత్వాత్" 4.1.39.**

ఆపేక్షికత్వాత్ = పరాపేక్షసిద్ధిగల వగుటవలన, స్వభావసిద్ధిః= స్వభావము ద్వారా సిద్ధికలవి, న = కావు.

గోఘటాది భావపదార్థము లన్నియు భిన్నస్వభావము కలవి. లోకమున భిన్న స్వభావము కలవివరము నపేక్షింపక సిద్ధింపవు. దీర్ఘము నపేక్షింపని హ్రస్వముకానీ, హ్రస్వము నపేక్షింపని దీర్ఘము కానీ, పుత్రుడు లేక తండ్రిగానీ సిద్ధింపనేరరు. కాబట్టి భావపదార్థములు స్వభావ సిద్ధములనుట లోక విరుద్ధము. ఇట్లు భావములన్నియు పరాపేక్షలేక సిద్ధింపనందున గోఘటాదులు అశ్వాదుల నపేక్షింపక సిద్ధింపవు. సాపేక్ష సిద్ధి వాస్తవము కాదు. అందువలన సర్యమవాస్తవమే.

ఉత్తరపక్షము : -

**"వ్యాహతత్వాదయుక్తమ్." 4.1.40.**

వాహతత్యాత్ = అన్యోన్యాశ్రయముతో వ్యాహతమగుట వలన, ఆయుక్తమ్ = భావము లాపేక్షికములనుట యుక్తము కాదు.

అశ్వాదిభావములు గోఘటాదుల నపేక్షించిన గోఘటాది భావము లశ్వాదిభావాపేక్షికములు కావు. స్పటికలోహితము (ఎఱుపు) కుసుమ లోహితము నపేక్షించును కాని, కుసుమలోహితము స్పటికలోహితము నపేక్షింపదు. అట్లుకాక అశ్వాదిభావము గోఘటాది భావమును, గోఘటాదు లశ్వాదిభావము నపేక్షించు నందువేని అన్యోన్యాశ్రయ దోష మేర్పడును. అన్యోన్యాశ్రయమున నొకభావమును సిద్ధింపనేరదు. హ్రస్వదీర్ఘాదుల నుపమించి దోషములేదన వలనుపడదు. హ్రస్య దీర్ఘాదులును గ్రహణ సమయమున పరస్పర మపేక్షించినను స్వోత్పత్తి విషయమున నొండొంటి నపేక్షింపవు. ఇట్లే పితాపుత్రాదులు జన్య జనక భావమును బోధించుటలో పరస్పరాపేక్షయున్నను స్వోత్పత్తి కన్యోన్యాపేక్ష యుండదు. కాబట్టి భావము స్వసిద్ధియందు పరాపేక్షికములనుట యుక్తముకాదు. అందువలన సర్వనుభావ మనుట చెల్లదు.

'సర్వము నేక కారణకమగుటచే నేకము. అందువలన సర్వత్ర ఏకత్వ సంఖ్యా నియమముండవలయును' అనుట సంఖ్యైకాంతవాదము అనబడును. దాని నిరాకరణము.

**"సంఖ్యైకాంతాసిద్ధిః కారణానుపపత్త్యుపపత్తిభ్యామ్" 4.1.41.**

కారణానుపపత్త్యుప పత్తిభ్యామ్ = నిః సహాయుమగు నేకాక్రి కారణముపపన్నము కాకపోవుట వలనను, ససహాయ కారణ ముపపన్న మగుట వలనను, సంఖ్యైకాంతాసిద్ధిః= సంఖ్యైకాంత వాదము సిద్ధింపదు.

ఒకే తత్వము కారణమగుటవలన నీసర్వమునేకవే యునిన ప్రశ్నింపవలయును. నిఃసహాయుమా? లేక ససహాయుమా? యని ప్రశ్నింపవలయును నిఃసహాయమనిన, నానావిధ జగత్తున కది కారణమనుట యుక్తముకాదు. ససహాయ మనినదానికి సహాయమగునది పదార్థమా? అపదార్థమా? యని యడుగవలెను. అపదార్థమనుట తగదు. అపదార్థమయిన నది స్వయముగా లేనిదై యితరమునకు సహాయమెట్లు చేయగలదు? పదార్థమే యునిన, ద్వితీయు పదార్థ మంగీకరించినట్లగును, అందువలన సంఖ్యైకాంతవాదము సిద్ధింపనేరదు.

పూర్వపక్షము : –

**"న కారణావయవ భావాత్" 4.1.42.**

కారణావయువ భావాత్ = ఒకే తత్వము కారణమైనను దాని కవయములుండుటవలన, న= సంఖ్యైకాంతవాదము సిద్ధింపదనుట తగదు.

నానావిధమగు నీజగత్తునకు కారణము ససహాయము కాదు. నిః సహాయమే. నిఃసహాయమగు నేకకారణము నానా విధ కార్యజాతమునెట్లు పుట్టింపగలదని ప్రశ్నింతురేని, నా కారణమున ననేక కార్యోత్పాదక సామర్థ్యముగ యనేకావయవములున్నవని యంగీకరింతుము. కాబట్టి దోషములేదు.

ఉత్తరపక్షము: –

**"నిరవయవత్వా దహేతుః" 4.1.43.**

నిరవయవత్వాత్ః = సర్వమునకు కారణమైన యేకతత్వము నిరవయవ మగుట వలన, అహేతుః = కారణమున నవయవములుండుట వలన, నను హేతువు అహేతువు.

అవయవము కలది సావయవ మనబడును. సావయవము కార్యమగును. కారణముకాదు. సర్వమునకు కారణమగు నేకతత్వము సావయవమయిన నది కార్యమగును కాని కారణముకాదు. సర్వమునకు కారణము నిరవయవమే యని యంగీకరింపబడినది. అట్టిది నిఃసహాయుమగుచో ననేకవిధ కార్యజాతమునుత్పన్నము చేయనేరదు. ససహాయ మనిననేకకారణము

కాకపోవుటచే సర్వమేక మను సంఖ్యైకాంత వాదము సిద్ధింపనేరదు.

ప్రేత్యభావమును పరీక్షించి తరువాత ఫలమును పరీక్షింపదలచి ముందు సంశయించుచున్నాడు.

**"సద్యఃకాలాంతరేచ ఫలనిష్పత్తేః సంశయః" 4.1.44**

సద్యః= వెంటనే, కాలాంతరేచ = కాలాంతరముననను, ఫలనిష్పత్తేః= ఫలప్రాప్తి దర్శనము వలన, సంశయః= అగ్ని హోత్రాది కర్మలు సద్యః ఫలములా? లేక కాలాంతర ఫలములాయని సంశయము కలుగుచున్నది.

పాకమునకు ఫలము తండులపచనము. అది సద్యః ఫలము. కృష్యాదికర్మముకు ఫలము సస్యనిష్పత్తి కాలాంతరమున సిద్ధించును. అందువలన అగ్ని హోత్రాది విహితకర్మలు, సురాపానాది నిషిద్ధకర్మలును సద్యఃఫలములా? లేక కాలాంతర ఫలములా? యని సంశయము వొడమును.

కర్మనిష్పత్త్యనంతరమున నవ్యవహితకాలము సద్యః కాలము. కర్మనాశానంతరకాలము కాలాంతరము. కర్మనాశానంతరమున నెన్నడో ఫలనిష్పత్తి కలిగిన నదృష్టము దానికి ద్వారమగునని వివేకము.

సద్యః ఫలనిష్పత్తి పూర్వపక్షము కాగా సమాధానము.

**"న సద్యః కాలాంతరోప భోగ్యత్వాత్" 4.1.45.**

కాలాంతరోపభోగ్యత్వాత్ = కాలాంతరమున నుపభోగ్యము లగుటవలన, విహిత ప్రతిషిద్ధ కర్మకు, నసద్యః = సద్యఃఫల నిష్పత్తి కలుగదు.

అగ్ని హోత్రాది కర్మలు విహితములు. సురాపానాదు నిషిద్ధము. విహితముకు ఫలము స్వర్గము. నిషిద్ధములకు ఫలము నరకము. స్వర్గనరకములు సుఖదుః ఖ విశేషములే. అవివెంటనే కలుగనేరవు. కొండొక ఫలవిశేషము సిద్ధింపవలయునన్న దేశకాల విశేషము లపేక్షింపబడును. కాబట్టి అగ్ని హోత్ర సురాపానాదుల వలన కలుగు ఫలము కాలాంతరముననే కలుగునని భావము.

పూర్వపక్షము : -

**"కాలాంతరేణానిష్పత్తిః హేతువినాశాత్" 4.1.46.**

హేతు వినాశాత్ = హేతువు నశించుట వలన, కాలాంతరేణ = కాలాంతరమున, అనిష్పత్తిః= ఫలనిష్పత్తికాదు.

కారణముండిన కార్యముత్పన్న మగును. కారణము నశించిన కార్యముజనింపదు. ఫలమునకు కారణము కర్మము. అది కాలాంతరమున నుండదు. నశించును. కారణాత్మక కర్మము నశించిన ఫల ముదయింప నేరదు.

కాబట్టి కాలాంతరమున ఫలనిష్పత్తి యనుట యుక్తము కాదు.

ఉత్తరపక్షము : –

**"ప్రాజ్ నిష్పత్తేర్వృక్షఫలవత్ తత్స్యాత్" 4.1.47.**

వృక్షఫలవత్ = వృక్షఫలమువలె, ప్రాజ్ నిష్పత్తే = ఫలోత్పత్తికి పూర్వమే కర్మనశించినను, తత్స్యాత్ = స్వర్గాదిపద వాచ్యఫ ల ముద్భవించును.

ఒకడు ఫలముల నపేక్షించి వృక్షమునకు సేచనాది కర్మల నాచరించును. ఆకర్మలు నశించిన తదుపరి కాలాంతరమున నతనికి వృక్షమునుండి ఫలము లభించును. సేచనాదికర్మ నశించినను దానివలన రసద్రవ్యముత్పన్నమై యది ఫలరూపమున కాలాంతర మున నుత్పన్న మగుచున్నది. అట్లే అగ్ని హోత్రాది కర్మలు నశించినను వానివలన ధర్మాధర్మలక్షణము గల యదృష్ట ముత్పన్నమై కాలాంతరమున స్వర్గాత్మక ఫలము నిష్పన్న మొనర్చును. ఈ యదృష్టమునే మీమాంసకులు 'అపూర్వము' అందురు. అట్లయిన నదృష్టముచే ఫలము నిష్పన్నమగును కాన కర్మవలన కాదని యనరాదు. కర్మకు ఫలమునకు మధ్య అదృష్టము వ్యాపార మనబడును. కర్మ వ్యాపారి యగును. వ్యాపార నిష్పన్నము వ్యాపారి నిష్పన్నము కాకపోదు అట్లంగీకరింపమేని, అనుమాన ప్రమాణము నందు, లింగ దర్శనానంతరము వ్యాప్తి స్మరణకలిగినగాని యనుమితి కలుగదు. అట్టియెడ అనుమితి వ్యాప్తిస్మరణజన్య మగుటచే హేతుజన్యము కాదందు మేనియది లైంగికజ్ఞాన మననొప్పదు. కాబట్టి కర్మవలన నదృష్టము ద్వారా కాలాంతరమున ఫలనిష్పత్తి కలిగినను దోషము లేదు.

కర్మవలన జనించు నీ ఫలము నిష్పత్తికి పూర్వమున్నదా? లేదా? యని జిజ్ఞాసకలుగగా పూర్వపక్షము : –

**"నాసన్నస న్నసదసత్ సదసతోర్వైధర్మ్యాత్" 4.1.48.**

(ఈ సూత్రమున 'ఉపాదాన నియమాత్, ఉత్పత్త్యసంభవాత్' అను రెండు హేతువులు కల్పింపవలయును.)

ఉపాదాన నియమాత్ = కొండొక కార్యముద్భవింపవలయు ననిన కొండొకకారణ విశేషము నుపాదానముగా గ్రహింపవలసిన నియమముండుటవలన, నుత్పన్నమగుటకు పూర్వము ఫలము, అసత్న = అసత్తుకాదు. ఉత్పత్త్య సంభవాత్ = ఉన్నది యుత్పన్నము కానేరదు కాబట్టి, సత్ = ఉత్పత్తికి పూర్వము సత్తు, న = కాదు, సదసత్ న = ఉత్పత్తికి పూర్వము సదసత్తును కాదు. సదసతోర్వైధర్మ్యాత్ = సత్తు అసత్తు నను రెండును

విరుద్ధములగుటవలన.

ఘట ముత్పన్నమగుటకు పూర్వము మృత్తికలో నది లేకున్న దాని నుత్పన్న మొనర్చుటకు మృత్తికనే యే గ్రహింపవలెను? ఘటము మృత్తికలో లేనట్లు తంతువులో నుండదు. బంగారములో నుండదు. ఇట్లే యితరములందు నుండదు. అట్టియెడ ఘటోత్పత్తికి నుపాదాన కారణముగా మృత్తికనే యేల గ్రహింపవలసి యుండును? తంతువు నేలగ్రహింపరాదు? మృత్తిక తప్ప తదితరములు ఉపాదానముగా గ్రహింపకుండు నియమమెందులకు? నియమ ఉపాదానముగా గ్రహింపకుండు నియమమెందులకు? నియమ ముండుటచే ఘటోత్పత్తికి పూర్వము ఘటము లేదు అన వీలుకాదు.

ఉత్పత్తికి పూర్వము కార్యము (సత్) ఉన్నదందుమా! అదియునొప్పదు. సత్తాసంబంధమునే యుత్పత్తి యందుము. కాబట్టి యుత్పత్తికి పూర్వమే సత్తనిస'సత్తు' మరల సత్తు ఎట్లు కాగలదు? ఉత్పత్తికి పూర్వమే యుత్పన్నమైయున్న పునరుత్పత్తి యెట్లు సంభవమగును? కాదని భావము. కాబట్టి యుత్పత్తికి పూర్వము కార్యము 'సత్తు' అనరాదు.

సదసత్తనియు ననవీలుపడదు. సదసత్తులు రెండును పరస్పర విరుద్ధము లగుటచే నవి యొక్కమారుగ సంభవింపవు. కాబట్టి యుత్పత్తికి పూర్వము కార్యము 'సదసత్' అనియు నన వీలుపడదని భావము.

ఉత్తరపక్షము : -

**"ఉత్పాదవ్యయ దర్శనాత్" 4.1.49.**

ఉత్పాదవ్యయ దర్శనాత్ = ఉత్పత్తికి పూర్వము కార్యోత్పత్తి వినాశము చూడబడుట వలన, కార్యము 'సదసత్' అనియే యంగీక రింపవలయును.

ఉత్పత్తికి పూర్వము కార్యమసత్తయిన నది యెన్నడు నుత్పన్నము కానేరదు. కుందేటికొమ్ము ఎన్నడైన జనింపగలదా? కాబట్టి 'సత్' విద్యమాన మందుమేని యది నశింపనేరదు. కార్యముత్పన్నమై నశించుట జూచుచున్నాము. అందువలన కార్యముత్పత్తికి పూర్వమసత్తు కాదు' సత్తుకాదు. కాని సదసత్తనియే యంగీకరింప వలయును. సదసత్తులు ఒకే మాటెట్లు సంభవింప గలవన,

**"బుద్ధిసిద్ధంతు తదసత్" 4.1.50.**

తదసత్ = సదసత్తులో నొకటగునసత్తు, బుద్ధిసిద్ధంతు = బుద్ధి సిద్ధమే - బుద్ధిసహామే.

కార్యముత్పత్తికి పూర్వమే రూపమున సత్తనుచున్నామో యదే రూపమున

నసత్తనిన పరస్పర విరుద్ధము లగుటచే సదసత్తు లొక క్షణమున సంభవింప వనుట యుక్తమే. కాని మేమట్లు చెప్పము. కార్య ముత్పత్తికి పూర్వమొక రూపమున సత్తు, మరియొక రూపమున నసత్తు నగుటలో నెట్టి దోషము నుండదు. బుద్ధిచే నంగీకరింప వచ్చును. ఉత్పత్తికి పూర్వము కార్యము కారణ రూపమున సత్తనియు, కార్యరూపమున నసత్తనియు నంగీకరించిన బుద్ధివిరోధ ముండనేరదు కదా ! కాబట్టి యుత్పత్తికి పూర్వము కార్యము 'సదసత్' రూపమున నుండు ననిన సహభావము సంభవమే.

పూర్వపక్షము : –

**"ఆశ్రయవ్యతి రేకాద్ వృక్షఫలవ దిత్యహేతుః" 4.1.51.**

ఆశ్రయవ్యతిరేకాత్ = కర్మాశ్రయమైన శరీరము ఫలపర్యంతము వృక్షమువలె నియమముగా నుండకపోవుటం జేసి, వృక్షఫలవదిత్య హేతుః= వృక్షఫలమువలెనను దృష్టాంతము సరికాదు.

జలసేచనాది కర్మ కాశ్రయమైన వృక్షము ఫలోద్గమ పర్యంత ముండునట్లు అగ్నిహోత్రాది కర్మల కాశ్రయమైన శరీరము స్వర్గాది సుఖవిశేష ప్రాప్తి పర్యంత ముండునను నియమము లేదు. శరీరము నశ్వరము. నేడున్న శరీరము రేపుండునని యెవరెఱుగుదురు. ఆశ్రయము నశించిన ఫలమెట్లు సంభవింపనగును? కాబట్టి వృక్షఫలముల వలెనను దృష్టాంతము యుక్తముకాదు.

ఉత్తరపక్షము : –

**"ప్రీతేరాత్మాశ్రయత్వా దప్రతిషేధః" 4.1.52.**

ప్రీతే = సుఖదుఃఖాత్మకమగు ఫలమునకు, ఆత్మాశ్రయత్వాత్ = ఆత్మ యాశ్రయమగుట వలన, అప్రతిషేధః= దృష్టాంతము అయుక్తము కాదు.

విహిత కర్మలుగాని నిషిద్ధకర్మలుగాని యనుష్ఠించుట వలన కలుగు నదృష్టము ఆత్మయందు జనించును. ఆ యదృష్టజన్యమగు ఫలమును ఆత్మనే యాశ్రయించును. ఆత్మ నిత్యమగుటవలన నది ఫలపర్యంత ముండును. కాగా, వృక్ష దృష్టాంతమవిరుద్ధమే.

పూర్వపక్షము : –

**"న పుత్ర పశు స్త్రీ పరిచ్ఛద హిరణ్యాన్నాది ఫనిర్దేశాత్" 4.1.53.**

పుత్ర..... ఫలనిర్దేశాత్ = పుత్ర – పశు – స్త్రీ – వస్త్ర – హిరణ్య –

అన్నాదులు ఫలముగా నిర్దేశింపబడుట వలన, న = సుఖ దుఃఖములు ఫలముకాదు.

పుత్ర పశ్వాదులు కర్మ ఫలములుగా నిర్దేశింపబడుచుండుట వలన సుఖ దుఃఖాత్మకము ఫలముగా జెప్పి యది యాత్మాశ్రయమగుట వలన దృష్టాంతమున దోషము లేదనని పొసగదు.

ఉత్తరపక్షము : -

**"తత్సంబంధాత్ ఫల నిష్పత్తేస్తేషు ఫలవదుపచారః" 4.1.54.**

తేషు = పుత్రాదులు, ఫలవదుపచారః= ఫలముగా నిర్దేశించుట యౌపచారికము - గౌణము. కారణమేమన? తత్సంబంధాత్ = పుత్రాదుల సంబంధమున, ఫలనిష్పత్తిః= ఫలోత్పత్తి కలుగుచున్నది.

అన్నము ప్రాణము, ఆయువు ఘృతము, నాగలి జీవనము. అనుతాపులందు అన్నాదులు ప్రాణాదులకు సాధనములయినను ప్రాణాదులు గానే ప్రయోగించుటకు కారణము వానికిగల సాధ్యసాధన భావసంబంధమే. అట్లే సుఖదుఃఖాత్మకమగు ఫలము పుత్రాది సాదన సాధ్యము. సాధనములను సాధ్యమగు ఫలరూపమున నటనట ప్రయోగించు గౌణప్రయోగమని తెలియవలయును. కాబట్టి దోషములేదు.

(దుఃఖపరీక్షణము)

**"వివిధ బాధనాయోగాత్ దుఃఖ మేవ జన్మోత్పత్తిః" 4.1.55.**

వివిధ బాధనా యోగాత్ = నానావిధ దుఃఖ సాధనమగుట వలన జన్మోత్తతి = జన్మలక్షణమగు నుత్పత్తి దుఃఖమేవ = దుఃఖమే.

జన్మకలుగుట వలన ననేక దుఃఖములు వాటిల్లుచున్నవి. జన్మయేలేకున్న నిష్టవియోగము, ననిష్టసంప్రాప్తియునను దుఃఖవ్రాతము సంభవింప నేరదు. కాబట్టి నానా బాధలకు సాధనమైన యీ జన్మ దుఃఖమేయనుట యుక్తము.

పూర్వపక్షము :-

**"న సుఖస్యాప్యంతరాలోత్పత్తేః" 4.1.56**

సుఖవ్యాపి = దుఃఖమువలె సుఖము సైతము, అంతరాలోత్పత్తేః = దుఃఖమధ్యమున నుత్పన్నమగుటచే, న = జన్మము కేవల దుఃఖ మనుట తగదు.

జన్మము వలన దుఃఖములుద్భవించుచున్నట్లు మధ్య మధ్య ననేక సుఖములు నుత్పన్నములగుచున్నవి. సుఖములననుభవించుచు జన్మము కేవలము దుఃఖమనుట అయుక్తము.

ఉత్తరపక్షము

**"వివిధ బాధనానువృత్తే ర్వేదయతః పర్యేషణ దోషా దప్రతిషేధః" 4.1.57.**

వేదయతః= దుఃఖ మధ్యమున సుఖము ననుభవించు వానికి, పర్యేషణ దోషాత్ = తృష్ణా దోషమువలన, వివిధ బాధనానువృత్తేః= నానా విధ దుఃఖములు పునః పునః సంభవించుట వలన, అప్రతిషేధః = జన్మము దుఃఖమే యనుటను ప్రతిషేధింప వలనుపడదు.

ప్రాణి కొండొకవేళ సుఖము ననుభవించుచున్నను, తృష్ణావశమున ననేక దుఃఖములకు మాటిమాటికి లోనగు చున్నాడు. ప్రతిక్షణము సుఖమనుభవింప వలయుననికోరియు సుఖమును పొందజాలడు. సుఖ మెుకప్పుడు సంప్రాప్తించినను మిక్కిలి కష్టసాధ్యము, నతిస్వల్పము నగును. లభించియు విలయమగును. తృష్ణ ప్రతిక్షణము వర్ధిల్లును. అందుపై రాగ ద్వేష మోహాదుల ద్వారా అనేక దుఃఖము లుప్పతిల్లును. మధ్యలో నొకింత సుఖము కల్గినను విషాక్తదుగ్ధమువోలి, దుఃఖ భూయిష్ఠతచే నావరింపబడి హేయమై తోచును. అందువలన నదియు దుఃఖముననే చేర్పబడును. కాబట్టి దుఃఖమే జన్మమనుట ప్రతిషేధార్హము కానేరదు.

**"దుఃఖవికల్పే సుఖాభిమానాచ్చ." 4.1.58.**

దుఃఖ వికల్పే = దుఃఖాభావమున, సుఖాభిమానాచ్చ = సుఖము నారోపించుటవలనను.

మఱియు దుఃఖముల మధ్య సుఖము కలుగుచున్నదనుట వాస్తవముకాదు. దుఃఖము కలుగకుండుటను సుఖమని చెప్పుచున్నారు. దుఃఖ రూపాంతరమును గ్రహింపక యవివేకులు సుఖముగా నుడువుదురు. కాముకులు ప్రణయ కలహముచే కుపితలగు కురంగలోచనల శిరః పాదతాడనమును సుఖ విశేషసాధనముగా నెంచుట లోకవిదితము కాదా వాస్తవమున పాద తాడనము సుఖ సంపాదకమెట్లు కాగలదు? అయినను మూఢబుద్ధులు - కాముకులు దానసుఖము ననుభవింతురు. వివేకులు వివిధ బాధనలతో ననుషక్తమై యుండుటచే జన్మము దుఃఖమేయని భావింతురు. కాబట్టి జన్మము దుఃఖమే యనుట యుక్తమే.

పూర్వపక్షము : - (అపవర్గ పరీలక్షణము)

**"ఋణక్లేశ ప్రవృత్త్యనుబంధా దపవర్గాభావః" 4.1.59.**

ఋణక్లేశ ప్రవృత్త్యనుబంధాత్ = ఋణములతోను, క్లేశములతోను, ప్రవృత్తితోను సంబంధముండుటవలన, అపవర్గాభావః = ఆత్మకు మోక్షములేదు.

"ఋణగ్ంహవై జాయతేయోఽస్తి, సజాయమానేవ దేవేభ్య ఋషిభ్యః పితృభ్యోమనుష్యేభ్యః" శత. 1.7.5.1. అను నిట్టి వాక్యములద్వారా ఉత్పన్నవ్యక్తికి ఋణములుండుట తెలియుచున్నది. ఇట్టి ఋణానుబంధ మున్నంత వరకు నాత్మకు అపవర్గ ముండజాలదు.

తైత్తిరీయసంహితలో "జాయమానోవై బ్రాహ్మణ స్త్రిభిర్ ఋణవాజాయతేబ్రహ్మచర్యేణార్షి భ్యోయజ్ఞేన దేవేభ్యః ప్రజయా పితృభ్యః ఏష వా అనృణో యఃపుత్రీయజ్వా బ్రహ్మచారీ" (6.3.10.) మనుష్యుడు పుట్టుచు మూటిచే ఋణి యగుచున్నాడు. బ్రహ్మచర్యముచే ఋషి ఋణమును అగ్నిహోత్రాది యజ్ఞముల నాచరించుటచే దేవఋణమును సంతతిద్వారా పితౄణమును తీర్చుకొనుచున్నాడని యున్నది.

**"ఋణాని త్రీణ్యపాకృత్యమనో మోక్షేనివేశయేత్**
**అనపాకృత్య మోక్షంతు సేవమానో పతత్యధః"**

మూడు ఋణములను తీర్చి మోక్షసాధనమున మనస్సు నుంపవలయును. ఆనృణ్యమును సంపాదింపక మోక్షమును సాధింప యత్నించి యధః పతితుడగునని మనుస్మృతి. ఇట్లు జీవితమున్నంత వరకు ఆనృణ్య సంపాదనకై యత్నించిన మోక్షసాధన మెన్నడు చేయగలుగును? శాస్త్రమున నగ్నిహోత్రాదులు (ఏతద్వై జరామర్యం సత్రం యదగ్నిహోత్రం జరవాహ్యేవాస్మాద్ ముచ్యం తేమృత్యునావా) జరామరణ పర్యంత మాచరింప దగిన సత్రములుగా వర్ణింపబడియున్నవి. ఇంతియగాక, అవిద్య, అస్మితము, రాగము, ద్వేషము, అభినివేశము నను క్లేశముల నుండియు విడివడ వలయును. కాబట్టి క్లేశాదులచే సంబద్ధుడై మరణించినవాడు మరలవానితో నేపుట్టుచుండును. అందువలన క్లేశములుండగా నాత్మకుమోక్ష ముండదు.

మఱియు, పుట్టినదాది మరణపర్యంత మొక్కక్షణమైన నూరకుండక యేదేని చేయుచుండును. ఇట్టి ప్రవృత్తి సంసారమునకు మూలము. అందువలనను మోక్షప్రాప్తి లేదు.

పూర్వపక్షము : -

**"ప్రధానశబ్దానుపపత్తే ర్గుణశబ్దే నానువాదో**
**నిందాప్రశంసోపపత్తేః" 4.1.60.**

నిందా ప్రశంసోపపత్తేః= వివక్షిత నిందాప్రశంస లుపపన్నము లగుటవలన, ప్రధానశబ్దానుపపత్తేః= ఋణశబ్దమిట ప్రధానము కాకుండుట చేతను, గుణశబ్దేనానువాద= గౌణార్థమున ప్రయోగింపబడినది.

ముఖ్యవృత్తితో స్వార్థమును ప్రయోగింపబడు శబ్దము ప్రధాన మనబడును. ఉదా : – అగ్ని దాహకము. గోవు గంగడోలుకలది. ఇట అగ్ని గో శబ్దములు స్వార్థమున ముఖ్య వృత్తితో ప్రయోగింపబడినవి. లక్షణావృత్తితో ప్రయోగింపబడు శబ్దము గుణశబ్ద మనబడును. ఉదా: – 'ఈ బాలుడు నిప్పు' ' ఈ మాణవకుడు సింహము'. ఇట 'నిప్పు' 'సింహము' ననురెండు శబ్దములు లక్షణావృత్తితో బాలునియందు ప్రయోగింపబడి గుణశబ్దము లనబడును. ఇట్లే "ఋణంహజాయతేయోఽస్తి" అనువాక్యములందు ప్రయోగింపబడిన ఋణశబ్దము ప్రధాన శబ్దముకాదు. ఒకడు మరల తాను తీసికొన దగినదని యెంచి యొక వస్తువు నన్యున కిచ్చును. అన్యుడును దానిని మరల తనకిచ్చిన దాత కీయదగినదిగా దానిని గ్రహించును. ఇట్లు అప్పుగా నిచ్చి పుచ్చుకొను తావులందు ఋణశబ్దము ప్రధానమగును. అన్యత్రగౌణ మగును. అప్పుగా నిచ్చిపుచ్చుకొను తావులందు ప్రధానముగా వాడబడు ఋణ శబ్దమిట వాక్యములందు గౌణముగా ప్రయోగింప బడినది. (ఋణంహ జాయతే...) ఇత్యాది వాక్యములందు అనృణియై పుట్టియు, కర్మచేయకున్న ఋణము గ్రహించిన వానివలె ఋణియని నిందింప బడును' కర్మచేసిన అనృణియని ప్రశంసింపబడుననియే వాక్యార్థము. పై వాక్యములు ఋణానుబంధమును తెలుపక, యథాశక్తిని నియమపూర్వకముగా కర్మము ననుష్ఠించుటయే బోధించును. ఈ యభిప్రాయమునే (ఏతద్వైయజ్జరామర్యం సత్రంయదగ్ని హోత్రం......' ) వాక్యమున జెప్పబడిన జరామర్యవాదము పోషించును. శక్తి కలవానిచే యావజ్జీవము అగ్ని హోత్రాది వైదికకర్మము లనుష్ఠింప దగిన వనియే యిందలి తాత్పర్యము. నియమ పూర్వకముగా వైదికకర్మల ననుష్ఠించుట యపవర్గ సాధనమునకు విరుద్ధమును కానేరదు. కాబట్టి ఋణానుబంధము వలన నపవర్గాభావము సిద్ధించుననుట యుక్తము కాదు.

సన్యాసులకు అగ్నిహోత్రాది కర్మానుష్ఠానము లేనందువలన వారికి మోక్షము లేదనవలయుననిన,

**"సమారోపణాదాత్మ న్యప్రతిషేధః" 4.1.61.**

ఆత్మని = తనశరీరమున, సమారోపణాత్= అగ్నులను సమారోపణ

చేయుటవలన, అప్రతిషేధః= సన్యాసుల కపవర్గము ప్రతిషేధింప జనదు.

చతుర్థాశ్రములయిన పరివ్రాజకులు బాహ్యముగా నగ్ని హోత్రాది వైదిక కర్మల నాచరింపరు. వా రుపకరణముల నన్నిటిని సన్యసింతురు కావున కర్మానుష్ఠానము నుండును. కర్మ సంపాద్య ఫలాదుల నా మహానుభావులు చక్కగానాలోచించి నిర్వేదమును బొందినవారై, నిఃశ్రేయసమును పొందగోరి సన్యాసము నంగీకరింతురు. అట్టియెడ కర్మలోపము కాకుండుటకై కర్మ సాధనమగు నగ్నిని తమ యందారోపించుకొందురు. బాహ్యమునగాక శరీరమునందే కర్మల నాచరింతురని భావము. జీవన నిర్వాహార్థము. యదృచ్ఛాలాభ సంతుష్టులై భిక్షాచర్యము నొనరించుచు, ప్రాణము నపానము నందును, అపానమును ప్రాణమునందును హోమము చేయుచుందురు. ఇదియే సన్యాసులు చేయు నగ్నిహోత్రము. దీనినే కర్మఠులు దేవయజ్ఞమందురు. సన్యాసులు నిత్యముచేయు వేదధర్మోపదేశము వారికి బ్రహ్మయజ్ఞము. దీనిని స్వాధ్యాయమందురు. "స్వాధ్యాయోవై బ్రహ్మయజ్ఞః" (శత. 11.5.83.) వైదిక మర్యాదల నుల్లంఘింపకుండుట సన్యాసులకు పితృయజ్ఞము ఆత్మ భావనతోనే ప్రాణిని పీడింపకుండుట వారికి భూతయజ్ఞము. ప్రాణుల యుపకారార్థము దేశమున నెల్లయెడల భ్రమించుచు, చెంత జేరిన జిజ్ఞాసువులకు సంశయములను బోనాడి తత్వజ్ఞానమును కలిగించుట వారి కతిథియజ్ఞమగును. ఇట్లు చతుర్థాశ్రమవాసులు, పరివ్రాజకులును నగ్నిహోత్రాది కర్మలను స్వాత్మయందు అనుష్ఠించుచుందురు కావున వారి కపవర్గము ప్రతిషేధించుట యుక్తముకాదు.

సన్యాసులును కర్మానుష్ఠాన పరుయిన కర్మఫలము ననుభవింపవలసిన వారగుటచే మోక్షము సిద్ధింపదన,

**"పాత్రచయాంతానుపపత్తేశ్చ ఫలాభావః" 4.1.62.**

పాత్రచయాంతానుపపత్తేశ్చ = పాత్రచయ మంతమునగల కర్మయనుపపన్న మగుటవలన, ఫలాభావః= ఫలముండదు.

మరణించిన కర్మఠుని హస్తాద్యవయవములలో 'జుహూ' ప్రభృత్యగ్ని హోత్ర పాత్రల నుంచవలయునను నియమము గల కర్మను నియమపూర్వకముగా నాచరించు వారికే స్వర్గాది లక్షణముగల ఫలాదులు లభించును. ఫలముల నర్థించు వారిట్టి పాత్ర చయాంతకర్మ నామరణ మనుష్ఠింతురు. చతుర్థాశ్రము లట్టి కామ్యకర్మ నాచరింపరు. వారు పాత్రాద్యుపకరణములను త్యజించి బ్రహ్మనిష్ఠ లగుదురు. లోకోపకారార్థము వారాచరించు ధర్మోపదేశాది కర్మలు

మోక్షమున కభ్యంతర కరమగు ఫలమును కల్పింజాలవు. వారు "తేహస్మపుత్రైషణాయాశ్చలోకైషణాయాశ్చవ్యుత్థాయాథ భిక్షాచర్యం చరన్తి" అనువాక్యములందుపదేశించినట్లు ఈషణ(కోరిక) ను విడిచి కర్మపరులగుదురు కాబట్టి ఫలదాయకములుకావు. కావున నగ్నిహోత్రాది కర్మలను సన్యాసు లాచరించినను వారి కవి ఫదాయకములు కాక పోవుట వలన మోక్షసిద్ధికెట్టి యాటంకము నుండబోదు.

**"సుషుప్తస్య స్వప్నాదర్శనే క్లేశాభావవ దపవర్గః" 4.1.63.**

సుషుప్తస్య = సుషుప్తిని బొందిన వ్యక్తికి, స్వప్నాదర్శనే = స్వప్నము వలన కలుగు దుఃఖము లేకుండుట వలన, క్లేశాభావవత్ = క్లేశము కలుగనట్లు అపవర్గః= మోక్షము సిద్ధించును.

సుషుప్తియందు క్లేశానుబంధమున్న జాగ్రత్స్వప్నావస్థందువలె జీవికి కష్టము కలుగ వలయును. క్లేశమున్న దుఃఖముండకపోదు. దుఃఖము లేదననిన క్లేశసంబంధము లేదని భావము. సుషుప్తియందు క్లేశము లేదనుట లోకసిద్ధము. కాగా సుషుప్తి క్లేశానుబంధము లేనిదైనట్లు అపవర్గమును. క్లేశరహితమని యెఱుంగ వలయును తత్వజ్ఞానము వలన క్లేశములు విచ్ఛిన్నముయి యపవర్గము సిద్ధించును కాబట్టి క్లేశానుబంధము వలన అపవర్గము లేదనుట యుక్తముకాదు.

**"నప్రవృత్తిః ప్రతిసంధానాయ హీనక్లేశస్య" 4.1.64.**

హీనక్లేశస్య = తత్వజ్ఞానము వలన క్లేశము నశించినవానికి, ప్రవృత్తిః= ప్రవృత్తి, ప్రతిసంధానాయ = పూర్వజన్మము పోగా ఉత్తరజన్మము నారంభించుట ప్రతిసంధాన మనబడును. అందులకు న= సమర్థముకాదు.

బ్రహ్మవిదులగు తత్వజ్ఞులు తత్వజ్ఞాన వశమున క్లేశములను విచ్ఛిన్న మొనర్తురు. అట్టివారి కంతిమదేహమున నేర్పడు ప్రవృత్తి పునర్జన్మ నారంభింపనేరదు. క్లేశములనెడి పొట్టుతో కప్పబడి యున్నపుడే కర్మయనెడి వరిబీజము జన్మరూపమగు మొలక నారంభింప గలుగును. పొట్టు తీయబడిన బియ్యపు గింజ యంకురింపజాలనట్లు క్లేశవిచ్ఛిన్నానంతర ప్రవృత్తి జన్మారంభకము కానేరదు. కాబట్టి ప్రవృత్త్యనుబంధము వలన నపవర్గము సిద్ధింపద నుట యుక్తిసహము కాదు.

పూర్వపక్షము : –

**"న క్లేశ సంతతేః స్వాభావికత్వాత్" 4.1.65.**

స్వాభావికత్వాత్ = అనాది యగుట వలన, క్లేవసంతతేః= క్లేశ సంతానమునకు, న = తత్వజ్ఞానమువలన విచ్చేదము లేదు.

ఆకాశాదుల నాదు గుటవలన విచ్ఛిన్నము కావు. అట్లే క్లేశము ననాదుగుటవలన తత్వజ్ఞానము చేత నని విచ్ఛిన్నమగు ననుట పొసగదు.

ఉత్తరపక్షము: -

**"ప్రాగుత్పత్తే రభా వానిత్యత్వవత్ స్యాభావికే ప్యనిత్యత్వమ్" 4.1.66.**

ప్రాగుత్పత్తే రభావానిత్యత్వవత్ = ఉత్పత్తికి పూర్వము క్షీరాదులందు గల దధ్యాదుల యభావము అనిత్యమైనట్లు, స్వాభావికే ఽపి = క్లేశము లనాదులైనను, అనిత్యత్వమ్ = తత్వజ్ఞానమువలన నవి నశించును.

ఉత్పత్తికి పూర్వము కారణమున నుండు కార్యాయోగము (ప్రాగభావము) అనాదియైనను కార్యముత్పన్న మగుటయే తడవుగా నశించును. అట్లే క్లేశ సంతతియు స్వాభావికము (అనాది) అయినను తత్వజ్ఞానమువలన నశించును. కాబట్టి దోషము లేదని భావము.

(క్లేశనాశ విధానము)

**"అణుశ్యామతాఽనిత్యత్వవద్వా" 4.1.67.**

వా = లేక, అణుశ్యామతానిత్యత్వవత్ = పార్థివ పరమాణువు నందలి శ్యామత్వము అనాదియైనను నశించుచున్నట్లు క్లేశ సంతతియు నశించును.

పార్థివ పరమాణువులలోని శ్యామత యనాదియయ్యు పాక వశమున నశించునట్లు క్లేశసంతతి స్వాభావికము (అనాది) అయినను తత్వజ్ఞానమువలన నశించును. అందువలన మోక్షోపలబ్ధి కెట్టి యాటంకము నుండదు.

**"న సంకల్పనిమిత్తత్వాచ్చరాగాదీనామ్" 4.1.67.**

రాగాదీనామ్ = రాగాదిక్లేశములు, సంకల్ప నిమిత్తత్వాచ్చ = సంకల్ప హేతుకము లగుటవలన, న = నివృత్తి లేదనతగదు.

రాగాదులు మిథ్యాజ్ఞానము వలననే కలుగును. తత్వ జ్ఞానము వలన మిథ్యాజ్ఞానము నశించిన, దానివలన కలుగు రాగాదులును నశించును. నిమిత్తమే లేకున్న నైమిత్తికము లెట్లుండగలవు? కాబట్టి మిథ్యాజ్ఞానముతో బాటు తన్నిమిత్తకముయిన రాగాది క్లేశములు నివర్తింపగా మోక్షము సిద్ధించు ననుటలో నావంతయు దోషములేదని సూత్రాభిప్రాయము.

చతుర్థాధ్యాయమున ఆద్యాహ్నికము

# న్యాయ దర్శనము

## చతుర్థాధ్యాయము

(ద్వితీయాహ్నికము)

పూర్వాహ్నికమున నపవర్గము పరీక్షింపబడినది. ఇటదానికి హేతువయిన తత్త్వజ్ఞానము పరీక్షింపవలసి యున్నది. తత్త్వజ్ఞానము మిథ్యాజ్ఞానమును నశింపజేసి యపవర్గమునకు కారణమగును. నిమిత్తము. నైమిత్తకమునని మిథ్యాజ్ఞానము రెండు విధములు. అనాత్మయయిన శరీరమునందు ఆత్మజ్ఞానము నిమిత్తమిథ్యాజ్ఞానము. అన్నపానాదులందును, స్త్రీపుత్ర మిత్రాదులందును సుఖసాధన జ్ఞానము నైమిత్తికము. శరీర మాత్మయనుట నిమిత్త మిథ్యాజ్ఞాన మనియు, స్త్రీ పుత్రాదు సుఖమును కలిగించు వారనుకొనుట నైమిత్తిక మిథ్యాజ్ఞాన మనియు భావము. ఈనిమిత్తనైమిత్తిక మిథ్యా జ్ఞానములో మొదటిది ప్రధానము' రెండవది గౌణము. ముందు తత్త్వజ్ఞానమువలన గౌణ మిథ్యాజ్ఞాన నివృత్తి కలుగును.

**"దోషనిమిత్తానాం తత్త్వాజ్ఞానా దహంకారనివృత్తిః" 4.2.1.**

దోషనిమిత్తానాం = రాగాది దోషములకు నిమిత్తములయిన జడచేతనాత్మక విషయములయొక్క, తత్త్వజ్ఞానాత్ = యథార్థ జ్ఞానము వలన, అహంకార నివృత్తిః= అహంకారము తొలగును. మిథ్యాజ్ఞాన వశమునగల స్త్రీ అన్నపానాది చేతనాత్మక విషయములు సుఖకరములని యెంచి ప్రాణివాని ననుభవింపగోరును. వానిప్రాప్తికొఱకు మనోవాక్కాయముతో ప్రవర్తించును. తనకోరిక ననుసరించి యవి లభింపకున్న సంతప్తుడగును. లభించిన వానియం దాతుర్డుడై యనురక్తుడగును. ఇట్లు విషయము రాగాదులకు హేతువులగును. వానిస్వరూపమును తత్త్వరూపమున నెఱిగిన నవి సుఖహేతువు కావని తెలిసికొనును. అప్పుడు మిథ్యా జ్ఞానము నివర్తించును. అట్టియెడ విషయప్రాప్తికి యత్నింపడు. ప్రాప్తించిన వానిలో కొన్నింటిని కామించి రమింపడు. కొన్నిటిని ద్వేషించి దుఃఖింపడు. రాగద్వేషము లేకున్న శుభాశుభ ప్రవృత్తియు నుండదు. అందువలన జన్మయు నేర్పడదు. దుఃఖముండదు. అదియే యపవర్గము.

(దోషకారణములు)

**"దోషనిమిత్తం రూపాదయోవిషయాః సంకల్పకృతాః" 4.2.2.**

సంకల్పకృతాః= సంకల్పము (మిథ్యాజ్ఞానము) వలన విషయములుగా చేయబడిన, రూపాదయః= రూపము మున్నగు, విషయాః= విషయ పద

వాచ్యములు, దోషనిమిత్తం = రాగాదిదోషములకు కారణము.

ప్రాణివర్గము మిథ్యాజ్ఞానమువలన మతిచెడి, రూపమును జూచి స్త్రీ యందును, రసము నాస్వాదించి యన్నపానాదులందును. గ్రంథము నాఘ్రాణించి చందన లేపాదులందును, ఇట్లే యితర విషయములందును రంజించును. వానికి విఘాతము కల్పించువానిని ద్వేషించును. మిథ్యాజ్ఞానమే లేకున్న నిట్టి రాగ ద్వేషాదులు ప్రాణికి నాయా విషయములయెడ కలుగనేరవు.

వివేకులొక్కయెడ రంజించుటయు, నొండొకయెడ కుపితులగుటయు, వేరొక విషయమున ముగ్ధులగుటయు జూడ నేరము. కాబట్టి మిథ్యాజ్ఞానముచే రూపాది విషయములు దోషనిత్తముల గుచున్నవని తెలియుచున్నది.

(మిథ్యాజ్ఞానము కలుగుటకు కారణము )

**"తన్నిమిత్తం త్వవయవ్యభిమానః" 4.2.3.**

అవయవ్యభిమానః= శరీరేంద్రియా ద్యనాత్మపదార్థములందు ఆత్మాభిమానము - (శరీరాదులే తానని కలుగుజ్ఞానము), తన్నిమిత్తం దోషకారణములైన విషయములందు కలిగెడి మిథ్యాజ్ఞానమునకు కారణము.

శరీరవే యాత్మయను మిథ్యాజ్ఞానియే కొన్నివిషయములు సుఖసాధనములనియు వేరొకకొన్ని దుఃఖసాధనము లనియు తలంచును. శరీరాత్మలు పరస్పరము భిన్నములను వివేకి విషయములు సుఖసాధనములని యెంచడు. తత్త్వవిదులు పరమాత్మ యందుండి యంతకు మించిన సుఖసాధనము నన్యమును జూడక యట రంజింతురు. కాబట్టి శరీరాదులలో నాత్మజ్ఞానము కలవారికే విషయములందు మిథ్యాజ్ఞానము కలుగును. అందువలన శరీరమున నాత్మాభిమానము వైషయిక మిథ్యాజ్ఞానమునకు కారణమని యెఱిగి ముముక్షువులు ఆత్మతత్త్వజ్ఞానమును సంపాదింప వలయును.

(అవయవ పరీక్షణ)

**"విద్యాఽవిద్యా ద్వై విధ్యాత్ సంశయః" 4.2.4.**

విద్యాఽవిద్యాద్వై విధ్యాత్ = ఉపలబ్ధి, యనుపలబ్ధి యను సదసద్విషయములు రెండు విధములగుటచే, సంశయః= పరమాణు పుంజము కంటె వేరుగా నొక యవయవి యున్నదా? లేదా? యని సంశయము.

ఉపలబ్ధమగు వస్తువు ఒకచో నదియుండి యుపలబ్ధమగును. మఱియొకచో నదిలేకుండియు నుపలబ్ధ మగును. ఉదా: - సరస్సున నుదకముండి యుపలబ్ధమగును. ఎండమావులలో జలము లేకున్నను

నదియున్నట్లుపలబ్ధమగును. ఈ విధముగానే యొకచో వస్తువుండియు నుపలబ్ధము కాదు. అందువలన నుపలబ్ధమగు నవయవియు నున్నదా? లేదా? యని సందియము కలుగును.

పరమాణు పుంజమునకు మించి యొండు అవయవి లేదని పూర్వపక్షము కలదని సిద్ధాంతము.

**'తదసంశయః పూర్వ హేతు ప్రసిద్ధిత్వాత్ 4.2.5.**

పూర్వహేతు ప్రసిద్ధత్వాత్ = పూర్వోక్తహేతువులచే నవయవి సిద్ధించుటవలన, తదసంశయః = సంశయము తగదు.

కొండొకవస్తువును గురించి సామాన్యముగా తెలిసి విశేషముగా తెలియకున్న నందు సంశయము కలుగును. సంశయ లక్షణము నిట్లే పూర్వము వర్ణించియుంటిమి. ద్వితీయాధ్యాయమున నవయవిని గురించి యనేక హేతువులను ప్రదర్శించి యదియున్నదని విశేషరూపమున సిద్ధపరుపబడినది. కాబట్టి విశేషరూపమున తెలిసిన విషయమున సంశయము కలుగనేరదని సిద్ధాంతి యభిప్రాయము.

పూర్వపక్షము : –

**"వృత్త్యనుపపత్తే రపి తర్హినసంశయః" 4.2.6.**

తర్హి= అట్లయిన, వృత్త్యనుపపత్తేరపి = అవయవి యవయవములలో నుండు పొసగనందుననే, నసంశయః= సంశయమేర్పడదు.

అవయవము లందుండు నవయవి యా యవయవములలో ప్రత్యవయవము నందును సంపూర్ణముగా నుండునా? లేక కొంతభాగమే యుండునా? అవయవి సంపూర్ణముగ ప్రత్యవయవ మున నుండు ననవలనుపడదు. కారణమేమన, అవయవము లణుపరిమాణము కలవి అవయవి మహాత్పరిమాణముకలది. అణుపరిమాణమున మహత్పరిమాణమెట్లుండగలదు? సంపూర్ణముగ నుండక యేకదేశముగ (కొంత) ఉండు నందుమా! యదియును పొసగదు. ఏకదేశమన్నను అవయవమన్నను ఒక్కటియే. ఇట్లు ఒక యవయవమున మఱియొకటి, అందింకొకటి యని అనవస్థ యేర్పడును. కాబట్టియవయవములందు తద్భిన్నముగా నవయవి యొకటి లేదనియే తేలుచున్నది. అందువలననే సంశయము తగదని యనవలసివచ్చును.

అవయవములో నుండకున్నను అవయవివేరుగా నుండుటచే సంశయ

మేర్పడవచ్చు నందురేని,

**"పృథక్ చాయవవేభ్యో౽ వృత్తేః" 4.2.7.**

అవయవేభ్యఃపృథక్ = అవయవములను విడిచి యన్యస్థమునను, అవృత్తేః = అవయవి యండనందున సంశయ మేర్పడదు.

అవయవములందు అవయవియుండునట్లు అవయవములను విడిచియన్యస్థలమున నున్ననది అవయనియే యనవొప్పదు. కాబట్టి అవయవియే లేనందున సంశయము కూడదనుట సిద్ధము.

అవయవి అవయములకంటె భిన్నమై వాని యందు గానీ, తదితర స్థలమునగానీ సిద్ధింపకున్న సిద్ధింపకుండనిందు కాని, యభిన్నమై తాదాత్మ్యమున నవయవి యవయవములం దేయుండరాదు? ఉండవచ్చును. కాబట్టి సంశయము సిద్ధించు నందురేని,

**"నచావయవ్యవయవాః" 4.2.8.**

అవయవీ = అవయవి, అవయవాఃనచ = అవయవములకు భిన్నము కాదు.

అవయవము ధర్మమే అవయవియని వ్యవహరింపబడును. ఈధర్మధర్మి భావము సైతము భేదములేనిచోట వర్తింపదు. తాదాత్మ్యమునందు ధర్మధర్మి భావము కలుగదు. తనకుతాను ధర్మమెట్లగును? అవయవి అవయవాభిన్నమన నేమి? తంతువు వస్త్రమా? కపాలములు ఘటమా? యెన్నడును కాదు. కాబట్టి అభిన్నమనుటయు సంభవింపదు. ఏవిధముగను నవయవి సిద్ధింపనందున సంశయము పొసగదనవలెను,

ఉత్తరపక్షము : -

**"ఏకస్మిన్ భేదాభావాత్ భేదశబ్ద ప్రయోగానుపపత్తేరప్రశ్నః" 4.2.9.**

ఏకస్మిన్ = ఒకటియన అవయవియందు, భేదాభావాత్ = భేదము లేనందున, భేదశబ్ద ప్రయోగానుపపత్తేః= భేదశబ్దమును ప్రయోగింపవలనుపడదు. కాబట్టి, అప్రశ్నః= అవయవి అవయవముందు సంపూర్ణముగా నుండునా? లేక యేకదేశమున నుండునా? యను ప్రశ్నము సరికాదు.

అనేకమును సంపూర్ణముగ గ్రహింపవలసి వచ్చునపుడు కృత్స్నశబ్దమును ప్రయోగింతురు. అనేకములో నొకదానిని చెప్పవసిన సమయమున ఏకదేశము అందురు. కాబట్టి కృత్స్న - ఏకదేశ శబ్దము అవయవి విషయమున ప్రయోగింప

వలనుపడదు. అవయవి యొక్కటియె' అనేకముకాదు. అనేకముగా భిన్నముకాని వస్తువునందు, భేదమున్న తావులో ప్రయోగింపదగు కృత్స్న ఏకదేశశబ్దము ప్రయోగించుట యుక్తముకాదు. అందువలన అవయవి ప్రత్యవయవమునందు కృత్స్నముగా (సంపూర్ణముగా) నుండునా? లేక ఏకదేశముగా నుండునా? యని ప్రశ్నించుటయే యొప్పదు.

**"అవయవాంతర భావేఽప్యవృత్తే రహేతుః" 4.2.10.**

అవయవాంతరాభావేఽపి = మరియొక యవయవ మున్నప్పటికి అవృత్తేః = అవయవి అవయవములందుండ నందున, అహేతుః= అవయవాంతర సద్భావము హేతువుకాదు.

మరియు, అవయువికి అవయువాంతరములున్నవని యొకవేళ కల్పించనను, అవయవికి అవయవములందు వృత్తి నంగీకరింప వలనుపడదు. వృత్తినియామక సంబంధమట కానరాదు. సాక్షాత్సంబంధము వృత్తి నియామక సంబంధమగును. అవయవికి అవయవములతో సాక్షాత్సంబంధమొందు కానరాదు. ఒకదానికి అనేకమునందు ఆశ్రయాశ్రిత సంబంధలక్షణముగల ప్రాప్తి వృత్తి యనబడును. ఏది దేనియందు స్వస్వరూపమును బొందగలుగునో యది దాని కాశ్రయము. కార్యము కారణ ద్రవ్యమునందు స్వస్వరూప మును బొందును. కాబట్టి కారణద్రవ్యము కార్యమునకు ఆశ్రయము. కార్యము ఆశ్రితము. కాబట్టి అవయవియెక్కడ ఎట్లుపలబ్ధమయిన నట్లంగీకరింప వలయును సమస్తావయవములందును ఆశ్రయాశ్రిత భావసంబంధము (సమవాయుము)తో అవయవి యుపలబ్ధ మగుచున్నట్లు ద్వితీయాధ్యాయమున ('సర్వాగ్రహణ మవయవ్యసిద్ధేః' 2.1.34.) చక్కగా వివరింపబడినది. కాబట్టి దోషములేదని భావము.

పూర్వపక్షము : –

**"కేశ సమూహే తైమిరికోపలబ్ధివత్ తదుపలబ్ధిః" 4.2.11.**

కేశసమూహే = కేవసముదాయమునందు, తైమిరికోపలబ్ధివత్ = తిమిరమను నేత్రరోగముగల వ్యక్తికి చాక్షుషజ్ఞానము కలుగునట్లు' తదుపలబ్ధి= పరమాణు పుంజాత్మకమగు నవయవియు చక్షువుచే తెలియబడును.

నేత్రములందు తిమిర (చీకటి) రోగము కలవాని కొక్కొక్క కేశము కనిపింపకున్నను కేశములు చేర్చి గుంపుగా జేసిన నతనికి కనిపించును అట్లే ప్రత్యేక పరమాణువు చక్షుర్గోచరము కాకున్నను పరమాణు పుంజము

మాత్రమెల్లరి నేత్రములకు గోచరింపగలదనిన హాని యుండదు. కాబట్టి ఘట పటాదుల యుపలబ్ధి అవయవి విషయము కాక పరమాణు పుంజ విషయకమని యెంచవయును.

ఉత్తరపక్షము : -

**"స్వవిషయానతిక్రమేణేంద్రియస్యపటు మంతభావాత్ విషయ గ్రహణస్య తథాభావోనావిషయే ప్రవృత్తిః" 4.2.12.**

ఇంద్రియస్య= ఇంద్రియమునకు, స్వవిషయానతిక్రమేణ = స్వవిషయము నతిక్రమింప వీలుకానందున, పటుమందభావాత్ = ప్రకృష్ట నికృష్ట భావమువలన, విషయగ్రహణస్య= విషయగ్రహణ మునకు, తథా భావః= ప్రకృష్ట నికృష్ట భావము కలుగును. ఆ విషయమే = ఉపలబ్ధి యోగ్యముకాని విషయమునందు, న ప్రవృత్తిః= ప్రవృత్తి కలుగదు.

ఇంద్రియములు పటుత్వముకలవియై యుండును. లేదా పటుత్వములేక మందస్వభావము కలవియై యుండును. ఇట్లు ఇంద్రియములందు బలమున్నను, లేకున్ననునవి స్వవిషయములనే గ్రహించును. అన్య విషయములను గ్రహింపవు. ఎంతబలము గలదైనను చక్షువు తనకు విషయముకాని గంధమును గ్రహింపనేరదు కదా! ఇంద్రియమున శక్తి (పటుత) బాగుగా నున్నపుడు సూక్ష్మవిషయమును గ్రహింపగలుగును. శక్తి తిరిగి మందమైయున్న స్థూల వస్తువునే గ్రహింపగలుగును. నేత్రమునందు దోషము లేకున్న కేశము నాక్ష్మమయ్యు గోచరము కాకపోదు. వస్తు వింద్రియముచే గ్రహింపబడవయునన్న దానియందు మహత్వముండవలెను. కేశమునందది యున్నది. అందువలననే యది చక్షుర్గోచరమగు చున్నది. అట్టి మహత్వము పరమాణువునందు లేదు. కాబట్టి యది గ్రహింపబడదు. పరమాణు పుంజముకంటె భిన్నముగా ఘటము -పటము నని యుపలబ్ధి కలుగుచున్నది. ఆ యుపలబ్ధివలన అవయవి పుంజాతిరిక్తముగా నున్నదని తెలియును.

పూర్వపక్షము : -

**"అవయవావయవి ప్రసంగశ్చైవమా ప్రలయాత్" 4.2.13.**

ఏవమ్ = ఇట్లవయవి నంగీకరించిన, అప్రలయాత్ = ప్రలయ పర్యంతము, అవయవావయవి ప్రసంగః= అవయవావయవి ప్రసక్తి కలుగును.

అవయవి నంగీకరించు పక్షమున, ఘటము దాని యవయవ ముకు అవయవియగును. దాని యవయవములును వాని యవయవములకు

అవయవులు. ఇట్లే యా యవయవములును వాని యవయవములకు అవయవులగును. ఇట్లు పోగా పోగా ప్రలయ మున విశ్రాంతి కలుగును. సర్వభావ వస్తువుల వినాశము ప్రలయ మనబడును. ఇట్లు సర్వనాశము కాగా భావ పదార్థములుండనందున పునఃసృష్టి కలుగనేరదని చెప్పవలెను.

ఉత్తరపక్షము : –

**"న ప్రలయోఽ ణు సద్భావాత్" 4.2.14.**

అణుసద్భావాత్ = మూలకారణమయిన పరమాణు వుండుట వలన, ప్రలయః న = ప్రళయముండదు.

అవయవ రహితమ్ములైన పదార్థములు నశింప వీలులేనందున, సమస్త భావపదార్థముల నాశము ప్రళయ మనజనదు. సమస్త భావపదార్థముల నాశము ప్రళయ మనబడును. మృణ్మయములగు ఘటము, శరావము (మూకుడు) మున్నగు వస్తువులు నాశమును బొందిన మృత్తికలో విలయమగును. అట్లే కుండలాదిభూషణములు నాశమై కనకమున నంతర్భూతము లగును. వీని కన్నిటికి మూల కారణము ప్రకృతి యను పేరుగల పరమాణువులు. అవి నిరవయవములు. వానిలో నవయవావయవి అను భావముండదు. ఈ మూల కారణమయిన ప్రకృతియందు సమస్త కార్యపదార్థములు లయించును (అప్యయమందును) ఆ మూలకారణమైన ప్రకృతి కారణము లేనిదగుటచే నశింపదు. అదియే భావపదార్థముల అవయవావయవి భావ ప్రసంగమునకు విశ్రామస్థానము. అది ప్రలయమునందు నుండును. కాబట్టి పునః సృష్టి కలుగుటకెట్టి యాటంకము నుండదు.

**"పరంవాత్రుటేః 4.2.15.**

త్రుటేః = త్రసరేణువుకంటె, పరం = సూక్ష్మము

గవాక్షాది ఛిద్రమునుండి ప్రసరించు సూర్య కిరణములలో నెగురుచుండు దుమ్మురేణువు త్రసరేణువు (త్రుటి) అనబడును. తైత్తిరీయ, చాందోగ్య ఉపనిషత్తులలో చెప్పిన క్రమము ననుసరించి వైదికులీ త్రుటినుండియే పంచమహా భూతోత్పత్తి నంగీకరింతురు. ఈత్రసరేణువునకు కారణమగునది ద్వ్యణుక మనబడును. ఈద్వ్యణుకమునే సాంఖ్య, యోగ వేదాంతములో తన్మాత్రమనియు, భూతసూక్ష్మమనియు నందురు. ఈద్వ్యణుకమునకు కారణభూతమైన నిరవయవసూక్ష్మద్రవ్యము పరమాణు వనబడును. విభజింప వీలుపడని యత్యంత సూక్ష్మమగు నిరవయవ పదార్థము పరమాణువన్నమాట.

పూర్వపక్షము : - (సర్వశూన్యవాది)

**"ఆకాశవ్యతిభేదాత్ తదనుపపత్తిః" 4.2.16.**

ఆకాశ వ్యతిభేదాత్ = ఆకాశ మంతః సమావిష్టమై యుండుట వలన, తదనుపపత్తిః= ప్రలయమున పరమాణువు లుండునుటనుట యుపపన్నముకాదు.

ఆకాశము యొక్క అంతఃసమావేశము వ్యతిభేదమనబడును. ఘటపటాదులవలె నాకాశముచే వ్యతిభిన్నమగునదంతయు సావయవము కావలసియుండును. పరమాణువులును ఆకాశ వ్యతిభిన్నములగుట వలన ననియు సావయవములగును. సావయవము ప్రలయమున నశించుననుట ధ్రువము, కాబట్టి పరమాణువులు ప్రలయమున నుండుననుట పొసగదు.

**"ఆకాశా సర్వగతత్వంవా" 4.2.17.**

వా = అట్లుకాని పక్షమున, ఆకాశాసర్వగతత్వం = ఆకాశము సర్వగతము కాదని యంగీకరింపవలసి వచ్చును.

ఆకాశము పరమాణువునందు లేదందురేని యదిసర్వగతము కానేరదు. ఆకాశము సర్వగతమనుట నిర్వివాదము. కాబట్టి పరమాణువు సాయవయమనియే యంగీకరింపవలెను.

ఉత్తరపక్షము : -

**"అంతర్బహిశ్చ కార్యద్రవ్యస్య కారణాంతర వచనాత్ అకార్యేతదభావః" 4.2.18.**

కారణాంతర వచనాత్ = బహిరంతః శబ్దములచేత కార్యముకంటె భిన్నమైన యవయవ లక్షణములుగల కారణవిశేషము చెప్పబడుట వలన, కార్యద్రవ్యస్య = కార్యద్రవ్యమునకే, అంతర్బహిశ్చ = లోప, వెలుపలుండును. అకార్యే= కార్యద్రవ్యము కానిదానియందు, తదభావః= అంతరబాహ్యాము లుండవు.

అవయవాంతరములచే పిహితమగు (కప్పబడు) అవయవము అంతః శబ్దముచే వ్యవహరింపబడును. అట్లు కప్పబడకుండు నవయవము బహిః శబ్దముచే చెప్పబడును. సంస్కృతమున వ్యవహితా వయవములు. వ్యవధాయ కావయవములు (అంతర్బహిః) అనబడును. తెలుగున లోపల, వెలుపల అనబడును. ఈ యంతర్బహిర్వ్యవహారము సావయవములగు కార్యద్రవ్యములకే వర్తించును. కాబట్టి ఆకాశము కార్య ద్రవ్యమునందంతః సమావిష్టమై తద్వ్యతి భిన్న మనబడును. నిరవయవము లయిన పరమాణువుం దీయంతర్బ

హిర్వ్యవహారమే యనుపపన్నము కాబట్టి 'ఆకాశవ్యతిభేదాత్' అని చెప్పినది యుక్తముకాదు.

**"శబ్ద సంయోగ విభవాచ్చ సర్వగతమ్" 4.2.19.**

శబ్దసంయోగ విభవాత్ = శబ్దమువలె మూర్తద్రవ్య సంయోగము విభుభావము (సర్వత్ర ఉండుట) వలన, సర్వగతమ్ = ఆకాశము సర్వగతము.

శబ్దము లాకాశమున సర్వత్ర ఉండును. శబ్ద సంయోగములేని తావొండునులేదు. అట్లే శబ్దాశ్రయ మగు నాకాశము యొక్క సంయోగమును సర్వమూర్తద్రవ్యములకు నుండుననుట నిర్వివాదము. సర్వ మూర్తద్రవ్య సంయోగ ముండుటవలననే ఆకాశము సర్వగత మనబడుచున్నది. సర్వాంతః సమావేశమువలన కాదు.

ఆకాశము సర్వగతమగునెడ ప్రతిఘాతియు, గతి మంతమునగు ద్రవ్యముచే నదియే మరలింపబడదు? దానిచే గతిమంతమగు ద్రవ్యమే నిరోధింపబడదన,

**"అవ్యూహావిష్టంభ విభుత్వాని చాకాశధర్మాః" 4.2.20.**

అవ్యూహావిష్టంభవిభుత్వాని = అవ్యూహము, అవిష్టంభము, విభుత్వమునను నీ మూడును, ఆకాశధర్మాః= ఆకాశమునందలి యసాధారణ ధర్మము.

ఎదురుతాకిడిచే వెనుకకు మరలుట వ్యూహమన బడును. దానికి భిన్నమైనది అవ్యూహము. ముందునకు పోకుండు నట్లడ్డగించుట విష్టంభము. అదికానిది అవిష్టంభము. సర్వమూర్త ద్రవ్యములతో సంయోగము విభుత్వము.

స్పర్శగలిగిన ద్రవ్యము గతిమంతమగు ప్రతిఘాతి ద్రవ్యముచే నెదుర్కొనబడివ్యూహాంతరమును. బొందును గతిమంతమగు ద్రవ్యము నడ్డగించును. ఉదా: – ఉదకము స్పర్శగలదగుటచే గతిమంతమగు ప్రతిఘాతి ద్రవ్యమైన నావచే నెదుర్కొనబడి వెనుకకు మరలును. నావలను ముందునకు పోనీక యాపును. ఆకాశమట్లుకాక నిఃస్పర్శ మగుటచే స్పర్శవంతమగు ద్రవ్యమున నుండు గుణము లందేల యుండదని శంకింపరాదు. కాబట్టి ఆకాశము సర్వగతమైనను అవ్యూహాది విశేష గుణములు కలదగుట వలన నెట్టి దోషమును లేదు.

పూర్వపక్షము : –

**"మూర్తిమతాంచ సంస్థానోపపత్తేరవయవసద్భావః" 4.2.21.**

మూర్తిమతాం = పరిచ్ఛిన్న పరిమాణముగల ద్రవ్యములకు, సంస్థానోపపత్తేః = అవయవ సన్నివేశ విశేష ముపపన్న మగుటవలన, అవయవ సద్భావః=

పరమాణువున నవయవము లుండవలయును.

సర్వగతముకాని ద్రవ్యముల పరిమాణము మూర్తి యనబడును. అట్టిమూర్తి పరిచ్ఛిన్న పరిమాణముగల పదార్థములు సంస్థానము గలవైయున్నవి. ఘటపటాదున్నియు నిందులకు దృష్టాంతములు. సంస్థానము అన నవయవసన్నివేశ విశేషము. అది సావయవ వస్తువులందే యుండగలదు. పరమాణువు సర్వగతము కాకపోవుటచే నదియు మూర్తి - పరిచ్ఛిన్న పరిమాణము కలదేయగును. కాబట్టి యదియు సావయవి కావలయును.

**"సంయోగోపపత్తేశ్చ" 4.2.22.**

సంయోగోపపత్తేః= ద్వ్యణుకోత్పత్తికి కారణమైన అణుద్వయ సంయోగ ముపపన్న మగుటవలనను.

మఱియు, ద్వ్యణుక ముత్పన్నము కావలయుననిన రెండు పరమాణువుల సంయోగ మంగీకరింపవలయును. ఆ సంయోగము పరమాణువు సావయవ మయిన కలుగగదు. లేకున్న కలుగనేరదు. సంయోగము వ్యాప్యవృత్తి కాకపోవుట వలన పరమాణువు లొండొంటితో నేదోయొక యంశమున (ఏకదేశమున ) సంయోగము నందగలవు, ఏయంశమున నవి సంయుక్తము లగునో ఆ యంశము అవయవమే యగును కాని మరియొండు కాదు. కాబట్టి పరమాణువు సావయవమే.

ద్వ్యణుకోత్పత్తికి కారణమయిన పరమాణువుల పరస్పర సంయోగము వ్యాప్యవృత్తియా? లేక అవ్యాప్యవృత్తియా? వ్యాప్యవృత్తి యందుమేని యొక పరమాణువు మఱియొక పరమాణువుతో సంపూర్ణముగ సంయుక్తమై రెండు పరమాణువులను సమాన దేశ వర్తులగును. ద్వ్యణుకమున ప్రథిమానము = పృథుత (వృద్ధి) యుండనేరదు. కాబట్టి ద్వ్యణుకము సైతము అణువేయగును. అట్లుకాక సంయోగము అవ్యాప్య వృత్తి యంఁదుమా) పరమాణువు సావయవము అవయవములుకలది) అగును. సంయోగి యగుటవలన పరమాణువు అవయవము కలదే యగును. ఘటమువలె అని యూహింపనగును;

ఉత్తరపక్షము : -

**"అనవసాకారిత్వా దనవస్థానుపపత్తే శ్చాప్రతిషేధః" 4.2.23.**

అనవస్థాకారిత్వాత్ = అనవస్థకు హేతువగుటచేతను, అనవస్థానుపత్తేశ్చ = అనవస్థ యుపపన్నము కాకపోవుట చేతను. అప్రతిషేధః= పరమాణువు నిరవయవమనుట ప్రతిషేధింపవలను పడదు.

పరమాణువు సావయవమని యంగీకరించిన అవయవధారకు విశ్రాంతియుండనేరదు. అందువలన అనవస్థయేర్పడగలదు, అది యుక్తము కాదు. యుక్త మందుమేని మేరువు సర్షపము (ఆవగింజ) నను రెండును అనంతావయవములు కలవగుటచే సమానములగును. ఈ దోషమును వారించుటకు అవయవధార యొకచో విశ్రాంతి నొందునని యంగీకరింపక తప్పదు. ఇక నవయవవిభాగము కానేరదని యెటనాగుదుమో యదియే పరమాణువు. అందు అవయవములు లేవు కాబట్టి పరమాణువు నిరవయవ మనుట సిద్ధము.

పరమాణువు నిరవయవమైన ద్వ్యణుకోత్పత్తికి హేతువయిన సంయోగముపపన్నముకాదు కావున నది సావయవమే యనుట యుచితము కాదు. సంయోగము వ్యాప్య వృత్తియైనను లేక అవ్యాప్య వృత్తియైనను ఉభయవిధములందును. దోషము లేదు. వాస్తవమున ప్రదేశము నాక్రమించు ద్రవ్యము మఱియొక ప్రదేశవంతమగు ద్రవ్యముతో సంయుక్తమైనపుడా సంయోగము అవ్యాప్యవృత్తియగును. నిష్ప్రదేశ వంతమగు ద్రవ్యముల సంయోగము అట్టిదికాదు. పరమాణువుల నిష్ప్రదేశము. కాబట్టి పరమాణువుల సంయోగము అవ్యాప్యవృత్తి కానేరదు. పరమాణుద్వయ సంయోగము అవ్యాప్యవృత్తి కానేరదు. పరమాణువులును సమానదేశ వర్తులగుటచే పృథుత యడ్డగింపబడు ననుటయు సరికాదు. సంయోగము వలన కలుగు పదార్థముల సమాన దేశత ప్రథిమో విరోధి కాదు. సమవాయము వలన కలుగు పదార్థ సమాన ప్రథిమా విరోధి. కుండలో రేగుపండ్లనుంచిన వాని సంయోగము వలన కుండకు, బదరీఫలముకు సమానదేశత కలిగినను బదరీఫలమున స్థౌల్యము నది వారింపదుకదా! కాని, సమవాయ సంబంధమువలన ద్రవ్యమునగల రూపరస గంధముల సమానదేశత వానిలో ప్రథిమానము నడ్డగించును. ద్వ్యణుకములోని పరమాణువులు సమవేతములు కావు. కాబట్టి వాని ప్రథిమానమేల యడ్డగింపబడును? అందువలన పరమాణువు సంయోగము వ్యాప్యవృత్తియైనను, లేక అవ్యాప్యవృత్తియైనను ఉక్తదోషములు కలుగునేరవని భావము. సంయోగము అవ్యాప్యవృత్తి యనియే యెంచుము. అయినను పరమాణువు సాపయవము కావలసిన యవసరముండదు. తమః ప్రకాశములు సావయవములు కావు. కాని వాని సంయోగము అవ్యాప్యవృత్తియే. దిశకువలె పరమాణువునందు ఔపాధికావయవ ములను కల్పించి

తత్సంయోగము నంగీకరించినను దోషముండ నేరదు. కాబట్టి పరమాణువులు నిరవయవము లనియే వివేకము.

పూర్వపక్షము : -

(విజ్ఞానవాది)

**"బుద్ధ్యావివేచనాత్తు భావానాం యథాత్మ్యానుపలబ్ధి స్తంత్వ పకర్షణే పట సద్భావానుపలబ్ధివత్ తదనుపలబ్ధిః" 4.2.24.**

తంత్వపకర్షణే = తంతువులను వేరుచేసిన, పటసద్భావా నుపలబ్ధివత్ = వస్త్రముస్థితి లభింపనట్లు, బుద్ధ్యా= బుద్ధితో, వివేచనాత్ = వివేచించి నందువలన, భావానాం = ఘటాది వస్తువు, యాథాత్మ్యానుపలబ్ధిః= సద్భావము ఉపలబ్ధముకాదు. కాబట్టి. తదనుపలబ్ధిః= ఘటపటాది వస్తువులే లేవు.

వస్త్రము నందలి తంతువులను వేరుచేసిన తంతువులు తక్కవేరువస్త్ర మనునది స్వరూపమున గోచరింపదు. వాస్తవమున వస్త్రమను నొక భావములేదని తెలియుచున్నది. వస్త్రమని కలుగు ప్రతీతి మిథ్యాప్రతీతి యని భావము. వస్త్ర మనునది ప్రతీతిమాత్రమే కాని వస్తువొండు లేదని వివేకము. ఇట్లే యితర ఘటాది సమస్త భావపదార్థములును తత్వ బుద్ధితో విచారించిన వాని యాథాత్మ్యము కనిపింపదు. వాస్తవమున నీ భావపదార్థములన్నియు నుండు పక్షమున గోవుకంటె భిన్నముగా అశ్వము ఉపలబ్ధమైనట్లు కపాల తంత్వాదుల కంటె వేరుగా ఘటపటాదులు ఉపలబ్ధము కావలసియుండును. అట్లు ఉపలబ్ధము లగుటలేదు. కావున నవి యాథాత్మ్యమున లేవని యెఱుగ వలయును. ఇట్లు పరమాణువుల వరకు బుద్ధితో ప్రతిభావమును వేరుచేసి చూచిన స్థూలపదార్థము కాని, సూక్ష్మపదార్థముగాని యొక్కటియు స్వస్వరూపమున నుపలబ్ధములుకావు. అట్టియెడ వాని జ్ఞానమును యథార్థము కానేరదు. అందువలన విజ్ఞానము తక్క బాహ్యావస్తువు లేదని భావము.

ఉత్తరపక్షము : -

**"వ్యాహతత్వా దహేతుః" 4.2.25.**

వ్యాహతత్వాత్ = వ్యాఘాత దోషదూషిత మగుటవలన, అహేతుః= బుద్ధితో వివేచించుట వలన' ననుహేతువు అహేతువు.

ఏ బుద్ధితో వివేచించినందువలన పదార్థము యాథాత్మ్యము ఉపల బ్ధముకాదో ఆబుద్ధి యథార్థమా లేక అయథార్థమా యథార్థ మగునెడల బుద్ధియాథాత్మ్యము ఉపలబ్ధమైనట్లగుచున్నది. అట్టియెడ సర్వభావము

యాథాత్మ్యమనుపలబ్ధమనుట విరుద్ధము – వ్యాహతమగును. అయథార్థమగు నెడల స్వయమ్ అయథార్థమై యన్యభావముల యథాత్మ్యము నెట్లు సిద్ధపరుపగలుగును? కాబట్టి రెండవ పక్షము సుతరాం విరుద్ధమగును. ఇంతయేల? బుద్ధితో చేయబడు వివేచనము సావధికమా? నిరవధికమా? వివేచనము నిరవధిక మెన్నడును కాదు. కాబట్టి సావధికమే కావలయును. పట వివేచనమునకు తంతువులు అవధికాకున్న నదియెట్లు వివేచింపనగును, సావధిక పక్షమున నేది అవధియగునో అది యాథాత్మ్యమున (స్వస్వరూపమున) నుపలబ్ధ మగుటచే సర్వ భావము యనుపలబ్ధి యనుట వ్యాహత మగును. కాబట్టి బుద్ధితో వివేచించిన సర్వభావము యాథాత్మ్యముపలబ్ధము కాదనుట యుక్తము కాదని తెలియుచున్నది.

బుద్ధితో వివేచించినచో తంతువు కంటె వస్త్రము వేరుగా సిద్ధము కాదనుటయు తగదు. ప్రతీతి. అర్థక్రియయను నీ రెంటిద్వారా అది సిద్ధించును. తంతువులవలన పటము కలుగునను ప్రతీతి లోకసిద్ధమే. తంతువులకంటె పటము వ్యతిరిక్తముకాకున్నచో నిట్టిప్రతీతి కలుగదు 'తంతువులుపటము' అని కలుగవలసి యుండును అర్థక్రియ యన ప్రయోజనసిద్ధి వస్త్రము వలన సిద్ధించు ప్రయోజనము తంతువుల వలన సిద్ధింపదు. వస్త్రముచే నొకవస్తువు కప్పబడినట్లు తంతువులచే కప్పబడునా? ఘటముచే జలనయ నాదులు సిద్ధించునట్లు కపాలముల వలన నగునా? కాబట్టి తంతువులకంటె వస్త్రము, కపాలములకంటె ఘటము వ్యతిరిక్తమనుట తేటతెల్లము, ఇట్లే సర్వభావపదార్థములును స్వకారణములకంటె భిన్నములనియే తెలియనగును. కారణముకంటె భిన్నముగా వస్తువుల యాథాత్మ్యములు గోచరము లగుటచే వానియుపలబ్ధులును, యథార్థము లగును. కాబట్టి బాహ్యాఆకారము లేకున్నను ఉన్నట్లు గోచరించి వస్తువులు మిథ్యాభూతము లైనందున విజ్ఞానమొక్కటి సత్యమనుట ప్రమాణ విరుద్ధమని భావము.

**"తదాశ్రయత్వాదపృథగ్ గ్రహణమ్" 4.2.26.**

తదాశ్రయత్వాత్ = తంత్వాదులాశ్రయములగుటవలన, అపృథక్ గ్రహణమ్ = పటాది వస్తువులు వేరుకానేరవు.

పరస్పర మాశ్రయాశ్రిత భావసంబంధములేని వస్తువులు ఒకదానికంటె నొకటి భిన్నముగా గ్రహింపబడును. ఘటము పటముకంటె వేరుగా సిద్ధింపగలదు. పై సంబంధమున్నయెడల నట్లు వేరుగా గ్రహింపబడవు.

కార్యకారణము ఆశ్రయాశ్రిత భావ సంబద్ధము. అందాశ్రితములు ఆశ్రయమును విడిచి యన్యత్ర వేరుగా నాత్మసిద్ధిని బొందనేరవు. కాబట్టి తంత్వాదులకంటె పటాదులు భిన్నములయ్యు వేరుగా గ్రహింపబడవని భావము.

**"ప్రమాణ తశ్చార్థ ప్రతిపత్తేః" 4.2.27.**

ప్రమాణతః= ప్రత్యక్షాది ప్రమాణము వలన, అర్థప్రతిపత్తేః= వస్తుజ్ఞానము కలుగుట వలన.

ప్రమాణమువలన తెలియబడు దానిని కాదన వశము కాదు. ఘటపటాది పదార్థములు విజ్ఞాన వ్యతిరిక్తములుగా ప్రమాణము వలన తెలియబడుచున్నవి. వ్యతిరిక్తము కాకున్న నట్లెల తెలియనగును? శశ విషాణాదులు (కుందేటి కొమ్ము) ఎటనైన నుపలబ్ధము లగుచున్నవా? కాబట్టి, ప్రమాణము వలన పదార్థము విజ్ఞాన వ్యతిరిక్తములుగా తెలియచుండగా కాదనుట తగదు.

**"ప్రమాణానుపపత్త్యుపపత్తిభ్యామ్" 4.2.28.**

సాధించు ప్రమాణము యుపపత్యనుపపత్తుల ద్వారా పదార్థము విజ్ఞాన వ్యతిరిక్తమునుట యనుపపన్నము కాదు.

'సర్వభావపదార్థములు విజ్ఞాన వ్యతిరిక్తములు కావు అని చెప్పు వ్యక్తి తాజెప్పు వాదమును సాధించుట కేదైన ప్రమాణ మంగీకరించునా? లేదా? చెప్పవలసియుండును. ప్రమాణ మంగీకరింపని పక్షమున తాజెప్పునది సిద్ధింపనేరదు. అట్టిదాని నెవరంగీకరింతురు? ప్రమాణమొండు కలదనిన విజ్ఞానవ్యతి రిక్తముగా తానంగీకరించిన ప్రమాణమే సిద్ధించుచున్నదిగదా? కాబట్టి సర్వభావ పదార్థము విజ్ఞానమే యనుట అయుక్తము.

పూర్వపక్షము : -

**"స్వప్నవిషయాభిమానవ దయంప్రమాణప్రమేయాభిమానః" 4.2.29.**

స్వప్న విషయాభిమానవత్ = స్వప్నమున విషయములు లేకున్నను వానిజ్ఞానము కలుగునట్లు, అయంప్రమాణ ప్రమేయాభిమానః = ఈ ప్రమాణ ప్రమేయజ్ఞానము కలుగును.

కలలో వస్తువులుండవు' కాని సంస్కారబలమున ఉన్నట్లు భాసించును. అట్లే జాగ్రదవస్థవయందును ప్రమాణ ప్రమేయములు వాస్తవమున లేకున్నను అనాది వాసనాబలమున నున్నట్లు గోచరించును. కల్పనా మాత్రమున తోచు ప్రమాణ ప్రమేయ భావము వాస్తవముకాదు. కాబట్టి విజ్ఞాన వ్యతిరిక్తముగా నొక వస్తువును సిద్ధింపదు.

**"మాయాగంధర్వ నగర మృగతృష్ణికావద్వా" 4.2.30.**

వా = లేక, మాయా......... వత్ = ఐంద్రజాలికునిచే నిర్మింపబడిన నగరమువలెగానీ, ఎండమావువలెగానీ, ప్రమాణప్రమేయ భావమని యెరుంగునది.

జాగ్రదవస్థ యందు గారడి వానిచే నిర్మింపబడు మాయా నగరాదులు వాస్తవములు కాకున్నను ఉన్నట్లు తోచును. ఎండమావులలో జలము లేకున్నను ఉన్నట్లు జ్ఞానముదయించును. అట్లే ఈఘటపటాది వస్తుజాతమును వాస్తవమున నయథార్థములయ్యు అనాదివాసనా బలముననున్నట్లు భాసించుచున్నవి. కాబట్టి విజ్ఞానమే సత్యము. దానికి భిన్నముగా భావపదార్థ మొండును లేదు.

ఉత్తరపక్షము : –

**"హేత్వభావాదసిద్ధిః" 4.2.31.**

హేత్వభావాత్ = కారణము లేనందున, అసిద్ధిః= ప్రమాణ ప్రమేయాభిమానము సిద్ధింపదు.

ప్రమాణ ప్రమేయ జ్ఞానము కార్యము. కాబట్టి దాని కొక కారణము – హేతువుండవలయును. కారణములేని కార్యమొండు కానరాదు. విజ్ఞానవాది మతమున ప్రమాణప్రమేయాభిమానమునకు కారణము కనిపింపదు. విజ్ఞానము తక్క మఱియొక భావమే వారి మతమున నంగీకరింపబడదు. విజ్ఞాన మొక్కటే ప్రమాణ ప్రమేయ జ్ఞానమునకు కారణము కాజాలదు. విచిత్రమైన అనాది వాసన దానికి కారణమందురేని, ఆ వాసన విజ్ఞాన వ్యతిరిక్తమా? లేక అభిన్నమా? వ్యతిరిక్తమనిన విజ్ఞాన వ్యతిరిక్తముగా నొక భావపదార్థము సిద్ధించును. అప్పుడు విజ్ఞాన వ్యతిరిక్తము లేదనుట వ్యాహతమగును. వాసన వ్యతిరిక్తముకాని పక్షమున విజ్ఞానమువలన నానా విచిత్ర వస్తుజాతమెట్లు ఉత్పన్నమగునో చెప్పవలసియుండును. స్వరూపమున విచిత్రముకాని విజ్ఞానము విచిత్రము కావలసి వచ్చును. మఱియు నీ వాసనదేనిది? అదియొకదానికి సంబంధించినది కాని పక్షమున వాసనయే కాజాలదు' వాసన నిర్విషయకమనుట తగదు. భావజాతమునకు సంబంధించిన దందుమా? అప్పుడు విజ్ఞాన వ్యతిరిక్తముగా భావజాతము సిద్ధించును. కాబట్టి విజ్ఞానమెట్లు పరమార్థమో యట్లే విజ్ఞాన వ్యతిరేకముగా భావజాతమును పరమార్థ సత్యమనియే భావింపవలయును.

**"స్మృతి సంకల్పవచ్చ స్వప్న విషయాభిమానః" 4.2.32.**

స్మృతి సంకల్పవత్ = స్మ ృతి సంకల్పవిషయమువలె, స్వప్న విషయాభిమానశ్చ = స్వప్న విషయజ్ఞానమును అసద్విషయముకాదు.

పూర్వమొకమాటు ఎరిగిన విషయమును మరువ కుండుట స్మృతి యనబడును. పూర్వానుభూత విషయమును మరల చింతించుట సంకల్ప మనబడును. కాబట్టి స్మృతి సంకల్పము అసద్విషయములు కావు. అట్లే స్వప్న జ్ఞానమును అసద్విషయము కాదు. జాగ్రదవస్థయందు వేనిజ్ఞానము కలుగునో ఆవస్తువులే స్వప్నమున తికమకలుగా తెలియును. స్వప్నమున తనతల నరుకబడినట్లు చూతుమే! యది జాగ్రదవస్థయందెన్నడు జరిగినదని యనవలదు. తల నరకబడుట మున్నగు విషయములు వేరువేరుగా తెలిసికొనియుందుము. ఆ విషయములే భిన్నక్రమమున స్వప్నమున తోచును. కాబట్టి స్వప్నజ్ఞానము అసద్విషయమని యెంచి యట్లే ప్రమాణ ప్రమేయ జ్ఞాన మసద్విషయమనుట సముచితము కాదు. భావ పదార్థము లన్నియు వాస్తవములే. ప్రమాణ ప్రమేయ జ్ఞానమును వాస్తవమేయని భావము. అందువలన, పరమాణుపుంజ వ్యతిరిక్తముగా నొక యవయవి యున్నది. తన్మిథ్యాజ్ఞానము కారణముగా, చేతనాచేతనా త్మక బాహ్యవిషయములందును మిథ్యాజ్ఞానము కలుగుచున్నదని యెఱుంగవలయును.

**"మిథ్యోపలబ్ధే ర్వినాశస్తత్త్వ జ్ఞానాత్, స్వప్న విషయాభి మాన వినాశవత్ ప్రబోధే" 4.2.33.**

ప్రబోధే = జాగ్రత్ప్రత్యయము కలిగిన, స్వప్నవిషయాభిమాన వినాశవత్ = స్వప్న విషయజ్ఞానమెట్లు నశించునో అట్లు, తత్వజ్ఞానాత్ = తత్వజ్ఞానము వలన, మిథ్యోపలబ్ధేర్వినాశః= మిథ్యాజ్ఞాన నాశముకలుగును.

నిద్రనుండి మేల్కాంచిన తదుపరి కలుగు జ్ఞానము ప్రబోధ మనబడును. ప్రబోధము కలుగగానే స్వప్నజ్ఞానము నశించును. అట్లే ఆత్మ (తత్వ) జ్ఞానము కలుగగానే శరీరేంద్రియాదులందు కలుగు మిథ్యాజ్ఞానము నశించును. తమః ప్రకాశమువలె తత్వజ్ఞాన మిథ్యాజ్ఞానము రెండును పరస్పర విరుద్ధములు. కాబట్టి యొకటి యుండిన రెండవది నశించును.

తత్వజ్ఞానము కూడ జ్ఞానమేయగుట వలన మిథ్యాజ్ఞానము నశించినట్లు అదియు నేలనశింపదు? నశించినచో తత్సంపాదనము నిరర్థకమేల కాదు? అన,

**"బుద్ధేశ్చైవం నిమిత్త సద్భావోపలంభాత్" 4.2.34.**

నిమిత్త సద్భావోపంలభాత్ = యథార్థజ్ఞాన మగుటవలన, బుద్ధేః= తత్వజ్ఞానమునకు, ఏవం = మిథ్యాజ్ఞానమువలె వినాశములేదు.

విషయస్వరూపమునకు విపరీతమైన రూపము విషయముగా నుండును కాబట్టి మిథ్యాజ్ఞానము యథార్థ జ్ఞానముచే నివర్తింపబడును. విషయమున్నదున్నట్లు తెలిసిన నది సత్య జ్ఞానము. అది నశింపదు. ఆత్మజ్ఞానము యథార్థము కాబట్టి అది నశింపనేరదని భావము.

**"తత్వ ప్రధాన భేదాచ్చ మిథ్యాబుద్ధేర్ద్వై విధ్యోపపత్తిః" 4.2.35.**

తత్వప్రధానభేదాచ్చ = గౌణ ముఖ్య, నిమిత్తనైమిత్తిక భేదము వలన, మిథ్యాబుద్ధేః= మిథ్యాబుద్ధి, ద్వైవిధ్యోపపత్తేః= రెండు విధములగుచున్నది. కాబట్టి, ఆత్మ తత్వజ్ఞానమువలన మిథ్యాజ్ఞాన నివృత్తిదోషము కాదు.

రాగద్వేషాది దోషములకు నిమిత్తములైన జడచేత నాత్మక బాహ్య పదార్థములు సుఖసాధనములని కలుగు మిథ్యాజ్ఞానము గౌణము = నైమిత్తికము, జడములైన శరీరేంద్రియ మనస్సులే ఆత్మయని తెలిసికొనుట ప్రధాన మిథ్యాజ్ఞానము (నిమిత్త మిథ్యాజ్ఞానము) ఇట్లు మిథ్యాజ్ఞానము రెండు విధములు. ఇందు నైమిత్తిక మిథ్యాజ్ఞానము విషయ తత్వజ్ఞానమువలన తొలగిపోవునని పూర్వ సూత్రమున (4.2.1.) చెప్పబడినది. ప్రస్తుతము ఆత్మ తత్వజ్ఞానమువలన ప్రధాన మిథ్యాజ్ఞానము నివర్తించునని చెప్పబడినది.

**"సమాధి విశేషాభ్యాసాత్" 4.2.36.**

సమాధి విశేషాభ్యాసాత్ = సంప్రజ్ఞాత (నిర్విచార)సమాధి నభ్యసించుట వలన, తత్వజ్ఞానము కలుగును.

విషయములందు విరక్తుడై యమనియమాదుల నభ్యసించుటవలన చిత్తవృత్తులు నశించును. చిత్తము క్రమముగా నిర్మలమగును. దీర్ఘ కాలాభ్యాసమువలన చిత్తమున విశారదత యేర్పడును. అటుపై అధ్యాత్మ ప్రసాదము కలుగును. ఈ స్థితినే యోగులు 'ఋతంభరాప్రజ్ఞ' యందురు. అప్పుడు పర్వతమున నెక్కిన పురుషుడు భూమిమీదనున్న వారిని సులభముగా చూడగలిగినట్లు యోగి సర్వపదార్థముల యాథాత్మ్యమును తెలిసికొనును. హస్తామలకమువలె స్వాత్మను సాక్షాత్కారము జేసికొనగలడు. ఇట్లు ఆత్మతత్వజ్ఞానము కలుగునని భావము.

పూర్వపక్షము : –

**"నార్థవిశేష ప్రాబల్యాత్" 4.2.37.**

అర్థవిశేష ప్రాబల్యాత్ = విషయముకు చెందిన సంస్కార ప్రాబల్యమువలన, న = సమాధివిశేషాభ్యాసము సిద్ధింపదు.

సమాధి విశేషము కలిగినగదా దాని యభ్యాసము సిద్ధించును? విషయసంస్కార వ్యుత్థానము ప్రబల ప్రతిబంధకమగుటవలన సంప్రజ్ఞాత సమాధియే కలుగనేరదు. కాబట్టి ఆత్మజ్ఞానము కలుగనేరదు.

**"క్షుధాదిభిః ప్రవర్తనాచ్చ" 4.2.38.**

క్షుదాదిభిః= క్షుత్పిపాసాదులచే, ప్రవర్తనాత్ చ = ఆకలి దప్పులను తీర్చు సాధనములందు ప్రవృత్తి కలుగుట వలనను.

సమాధి నభ్యసించుటకు యత్నింపదలచినచో మనస్సు క్షుత్పిపాసాదులచే పీడింపబడి వాని నివృత్తికి సాధనములయిన వస్తువుల సంపాదనకు పూనుకొనును. కాబట్టి సమాధి సిద్ధింపనేరదు. సమాధి సిద్ధింపకున్న ఆత్మతత్వజ్ఞానము కలుగుట సున్నయగును.

ఉత్తరపక్షము : -

**"పూర్వకృత ఫలానుబంధాత్ తదుత్పత్తిః" 4.2.39.**

పూర్వకృతఫలానుబంధాత్ = పూర్వజన్మ యందభ్యసించిన సమాధి సాధనానుష్టానమువలన కలిగిన అదృష్ట సంబంధమువలన, తదుత్పత్తిః= సమాధి విశేషము (సంప్రజ్ఞాతము) ఉత్పన్నమగును.

కేవలమొక్క జన్మయందు చేయబడు అభ్యాసము వలన సంప్రజ్ఞాత సమాధి సిద్ధింపకున్న పూర్వజన్మందు చేయబడిన యత్నములద్వారా సంపాదించిన అదృష్ట సహాయమున నది సిద్ధింపగలదు. అభ్యాస వశమున సంస్కారమును అణచి సమాధిని పొందు అవకాశము లేకపోలేదు.

పూర్వపక్షము : -

**"అపవర్గేఽప్యేవం ప్రసంగః" 4.2.40**

అపవర్గేఽపి= మోక్షము నందును, ఏవంప్రసంగః= పూర్వకృత కర్మఫలానుబంధమువలన నీ జన్మయందు సమాధి జనించునట్లు దుఃఖాదులును జన్మించును.

పూర్వకృత కర్మ ఫలానుబంధమున నీ జన్మయందు సమాధి జనించు నందువేని అపవర్గమున దుఃఖ ముత్పన్నము కావలసివచ్చును.

ఉత్తరపక్షము : -

**"న నిష్పన్నావశ్యంభావిత్వాత్" 4.2.41.**

నిష్పన్నావశ్యం భావిత్వాత్ = కార్యోత్పత్తి సమయమున కారణము తప్పక ఉండవలసి యుండుటవలన, న = అపవర్గమున దుఃఖోత్పత్తి యుండదు.

కార్యోత్పత్తి సమయమున కారణము తప్పక యుండవలయు ననుట నియమము. అపవర్గమున దుఃఖరూప కార్యముదయింపవలయు ననిన నట తత్కారణమైన యదృష్ట ముండవలయును. అపవర్గమున నదృష్ట సంబంధ ముండదు. ఆత్మతత్వజ్ఞానమువలన బ్రహ్మసాక్షాత్కారమునకు పూర్వమే యది క్షీణించి పోవును. సమాధి జనించునపుడట్టి యదృష్టముండును కాబట్టి యేదోషమును లేదని భావము.

**"తదభావశ్చాపవర్గే" 4.2.42.**

అపవర్గే = మోక్షమునందు, తదభావః= పూర్వకృత ఫలానుబంధ ముండదు.

మోక్షమున పూర్వకృత ఫలానుబంధ ముండదను విషయము వేదాదిశాస్త్ర వాక్యమువలన తెలియనగును. సమాధి విశేషము నభ్యసించి ఆత్మతత్వమును హస్తామలకము వలె నెఱిగిననాడు బ్రహ్మ సాక్షాత్కారము కలుగును. అట్టివానికి హృదయగ్రంధి భిన్నమగును. సంశయవ్రాతము విచ్ఛిన్నమగును. కర్మపుంజము క్షీణించును. అందువలన సర్వ దుఃఖములనుండి విముక్తుడై స్వాత్మతో బ్రహ్మసంవిష్టుడై బ్రహ్మానందము ననుభవించును. ఉపనిషత్తులోనిట్లే వర్ణింపబడినది.

**"భిద్యతేహృదయగ్రంధిః ఛిద్యంతే సర్వ సంశయాః,**
**క్షీయంతే చాస్యకర్మాణి. తస్మిన్ దృష్టేపరాపరే"**

**ముం. 2.2.8.**

**"తదర్థయమనియమాభ్యామాత్మసంస్కారో**
**యోగాచ్చాధ్యాత్మవిధ్యుపాయైః" 4.2.43.**

తదర్థం= సమాధి ఉత్పత్తి కొఱకు, యమనియమాభ్యాం = యమ నియమముతోను, యోగాత్ = యోగమువలనను, ఆధ్యాత్మవిధ్యుపాయైశ్చ = ఆత్మతత్వజ్ఞానమును గూర్చి విధింపబడిన ప్రాణాయామాదివిధుల ద్వారాను, ఆత్మసంస్కారః= మనఃశుద్ధి సంపాదింపవలయును.

అహింస, సత్యము, అస్తేయము, బ్రహ్మచర్యము, అపరిగ్రహము ననునవి యమములు. శౌచము, సంతోషము, తపస్సు, స్వాధ్యాయము, ఈశ్వర ప్రణిధానము ననునీయైదును నియమములు. ఉచ్ఛ్వాస నిఃశ్వాసల గతిని నిరోధించుట ప్రాణాయామము. స్థిరమై సుఖము కలిగించునది ఆసనము.

ఇంద్రియములు స్వవిషయములందు వర్తింపక చిత్తస్వరూపము ననుసరించు చున్నట్లుండుట ప్రత్యాహారము. దేహమున హృదయాది దేశములందొకచో చిత్తమును నిలుపుట ధారణ యనబడును. అట్టియెడ నొకేజ్ఞానము తైలధారవలె తెంపులేక యుండుట ధ్యానము. ఆధ్యానమే అర్థమాత్ర భావము కలదగుచో సమాధి యనబడును. ఈ సాధనములన్నియు యోగవ్యాఖ్యానమున ప్రవచింతును. అట విశేషముగా చూడనగును.

**"జ్ఞానగ్రహణాభ్యాసస్తద్విద్యైశ్చ సంవాదః" 4.2.44.**

జ్ఞాన గ్రహణాభ్యాసః= (ఆత్మతత్వజ్ఞానము దృఢముగా ఏ శాస్త్రమువలన గ్రహింపబడునో అదే న్యాయశాస్త్రము) అ శాస్త్రమును మాటిమాటికి నభ్యసించుట, తద్విద్యైశ్చ = ఆశాస్త్రజ్ఞులతో, సంవాదః= సంవాదమును, ఆవశ్యకము.

సమాధి నిమిత్తము యమనియమాదుల యభ్యాస మెట్లావశ్యకమో అట్లే ఆత్మజ్ఞానము దృఢపరుచుకొనుటకై పదార్థమును వివేచించు న్యాయశాస్త్రపఠన మావశ్యకము. అట్టి శాస్త్రము నెఱిగిన విద్వాంసులతో సంవాదము అత్యంతావశ్యకము. ఇట్టి యభ్యాస సంవాదములు శాస్త్రమేలేకున్న సంభవింపనేరవు. కాబట్టి న్యాయశాస్త్రము సఫలమే కాని విఫలము కాదు.

**"తం గురు శిష్య సబ్రహ్మచారి శిష్ట శ్రేయోఽర్థిభి రనసూయుభి రభ్యుపేయాత్" 4.2.45**

అనసూయుభిః= అసూయారహితులై జయేచ్ఛలేని, గురు....... శ్రేయోఽర్థిభిః= గురు, శిష్య, సబ్రహ్మచారి, శిష్ట, శ్రేయస్కాములు నైనవారితో, తం= ఆసంవాదమును, అభ్యుపేయాత్ = సమ్ముఖమున కేగి చేయవలయును.

శాస్త్రోపదేష్ట గురువు. శాస్త్రోపదేశమును పొందదగిన వాడు. శిష్యుడు. తనతోపాటు చదువుకొనువాడు సబ్రహ్మచారి. గురుశిష్య సబ్రహ్మచారులకంటె అన్యుడై శాస్త్రము నేర్వదగినవాడు, శిష్టుడు. శాస్త్ర ప్రతిపాద్యమైన మోక్షము నందు శ్రద్ధాలువులయిన ముముక్షువులు శ్రేయోఽర్థు ఇట్టివారితో తానేర్చిన విషయమును ధ్రువపరుచు కొనుటకై సంవాద మొనరింపదగును.

**"ప్రతిపక్ష హీనమపివా ప్రయోజనార్థత్వ మర్థిత్వే" 4.2.46.**

వా = లేక, అర్థిత్వే= తత్వజ్ఞానేచ్ఛ కలిగినపుడు, ప్రయోజనార్థం= తత్వజ్ఞానము బలపరుచు కొనుటకై, ప్రతిపక్షహీనమపి= ప్రతిపక్షము లేకున్నను పై వ్యక్తులతో వాదింపదగును.

తత్వజ్ఞానమును దృఢపరుచుకొన నిచ్ఛ జనించినపుడు గురు శిష్యాదులకు ప్రతిపక్షగ్రహణము రుచింపదేని ప్రతిపక్ష హీన సంవాదము నైనను వారితో జరుపవచ్చునని భావము.

(జల్పవితండ ప్రయోజనము)

**"తత్వాధ్యవసాయ సంరక్షణార్థం జల్పవితండే బీజ ప్రరోహ సంరక్షణార్థం కంటక శాఖావరణవత్" 4.2.47.**

బీజప్రరోహ సంరక్షణార్థం మొక్కను రక్షించుటకు, కంటక శాఖావరణవత్ = ముండ్లకంచెవలె, జల్పవితండే = జల్పవితండులు, తత్వాధ్యవసాయ రక్షణార్థం = అభ్యాస సంవాదజనిత తత్వనిశ్చయమును రక్షించుటకు.

పైరును రక్షించుటకు కంచె యుపయోగించునట్లు, శాస్త్రాభ్యాస సంవాదముచే నేర్పడిన తత్వజ్ఞాననిశ్చయమును, పరులచే నుట్టంకింపబడు నప్రామాణ్యాది శంకలను దోషము నుండి రక్షించుటకు జల్ప వితండలు అవసరములు.

**"తాభ్యాం విగృహ్య కథనమ్" 4.2.48.**

తాభ్యాం = జల్ప వితండల ద్వారా, విగృహ్య = విగ్రహ మొనర్చి, కథనమ్ = తత్వమును చెప్పవలయును.

మఱియు జ్ఞానము వలన దుర్విదగ్ధుడైన యనార్యుడు కానీ, లాభ పూజాదుల అపేక్షించిన యార్యుడుకానీ, "జగత్పతి యీశ్వరుడెక్కడ? వేదము వానివచనము లెట్లగును? వానికిగల ప్రమాణ్యమెంతటిది? ఆత్మతత్వ జ్ఞానమననేమి? అపవర్గమెట్టిది?" అను నిట్టి ప్రశ్నలతో వైదిక సిద్ధాంతము నపలాపింప యత్నించినపుడు, వైదికులు తమపక్షమును సిద్ధమొనర్ప సమర్థులయ్యు, సమయమునకు పరపక్షము నుద్ధరింపదగు హేతువులు స్ఫురింపని పక్షమున, నిశ్శంకతో జల్పవితండలను ప్రయోగించి శత్రువుల నోడించి తన్నుదా రక్షించుకొనుటలో వెనుకంజ వేయరాదు. అట్టియెడ నుపయోగించుటకే శాస్త్రమున నివి బోధింపవబడినవని భావము.

చతుర్థాధ్యాయమున ద్వితీయాహ్నికము.

# న్యాయ దర్శనము

## పంచమాధ్యాయము

(ఆద్యాహ్నికము)

పూర్వాధ్యాయములందు ప్రమాణ ప్రమేయములు పరీక్షింపబడినవి. ఈ యాధ్యాయమున జాతి నిగ్రహములను పరీక్షింపవదలచి ముందు జాతిని విభాగించుచున్నాడు.

**"సాధర్మ్య వైధర్మ్యోత్కర్షాపకర్షవర్ణ్యావర్ణ్యవికల్ప సాధ్యప్రాప్త్యప్రాప్తి ప్రసంగ ప్రతిదృష్టాంతానుత్పత్తి సంశయప్రకరణ హేత్వర్థాపత్త్య విశేషోపపత్త్యు పలబ్ధ్యనుపలబ్ధి నిత్యానిత్య కార్యసమాః" 5.1.1.**

సాధర్మ్యసమము, వైధర్మ్యసమము, ఉత్కర్షసమము అపకర్షసమము, వర్ణ్యసమము, అవర్ణ్యసమము. వికల్పసమము, సాధ్యసమము, ప్రాప్తిసమము, అప్రాప్తిసమము, ప్రసంగసమము, ప్రతిదృష్టాంత సమము, అనుత్పత్తిసమము. సంశయ సమము. ప్రకరణసమము, హేతుసమము, అర్థాపత్తిసమము, అవిశేషసమము, ఉపపత్తిసమము, ఉపలబ్ధిసమము, అనుపలబ్ధిసమము, నిత్యసమము. అనిత్యసమము, కార్యసమము, అను నీ యిరువది నాలుగును జాతిలోగల భేదములు.

వారి సాధ్యధర్మమును స్థాపించుటకు హేతువుప్రయోగించినచో ప్రతివాది దానిని నిషేధింపగోరి ప్రయోగించు అసమర్థహేతువు జాతి యనబడును. అది యిరువదినాలుగు విధములు.

అందుసాధర్మ్య వైధర్మ్య సమము :

**"సాధర్మ్య వైధర్మ్యాభ్యాముపసంహారే తద్ధర్మ విపర్య యోపపత్తేః సాధర్మ్య వైధర్మ్య సమౌ" 5.1.2.**

సాధర్మ్యవైధర్మ్యాభ్యామ్ = సమాన విశేషధర్మము ద్వారా, ఉపసంహారే = పక్షమున సాధ్యధర్మము నుపసంహరింపగా, తద్ధర్మ విపర్యయోపపత్తేః = సాధ్యధర్మప్రతిషేధము సిద్ధించినందువలన, సాధర్మ్యవైధర్మ్యసమౌః= సాధర్మ్యవైధర్మ్య సమములు అనబడును.

వారి అన్వయవ్యాప్తిగల సాధర్మ్యముతో పక్షము నందు సాధ్యధర్మము నుపసంహరింపగా, ప్రతివాది సాధర్మ్యముతోనే సాధ్యమును ఖండింప నుంకించిన సాధర్మ్య సమజాతి యనబడును.

వాది వ్యతిరేక వ్యాప్తిగల వైధర్మ్యముతో పక్షమునందు సాధ్యమును సాధింప,

ప్రతివాది వైధర్మ్యముతోనే దానిని ప్రతిషేధింపగోరిన నది వైధర్మ్య సమజాతి యన బడును.

సాధర్మ్య సమమున కుదాహరణము : –

శబ్దము అనిత్యము. ప్రయత్న జన్యమగుట వలన ఏది ప్రయత్న జన్యమో యది అనిత్యము. ఘటమువలె శబ్దము ప్రయత్న జన్యమే. అందువలన నది అనిత్యము. శబ్దము, ఘటము నను నీ రెంటిలోను ప్రయత్న జన్యత్వమును సామాన్య ధర్మమున్నది. దాని నాధారముగా గొని శబ్ద మనిత్యమని సాధింప, జాతివాది మరియొక సమాన ధర్మముతో శబ్దము నిత్యమనును.

శబ్దము నిత్యము, అస్పర్శమగుటవలన, ఏది యస్పర్శమో యది నిత్యము. ఆత్మవలె శబ్దము అస్పర్శమే అందువలన నది నిత్యము. ఇట శబ్దము, ఆత్మ అను నీరెంటియందును గల అస్పర్శత్వమను సమాన ధర్మమును తీసికొని యవి నిత్యములని సాధించెను.

ప్రయత్న జన్య సామ్యముచేత ఘటాదులవలె శబ్దము అనిత్యమేకాని, అస్పర్శత్వ సామ్యముచేత ఆత్మవలె శబ్దము నిత్యముకాదని సాధింపగల విశేష హేతువు ఇట చూపబడ లేదు. అట్టి విశేషహేతువు లేనంతవరకు కొండొక ధర్మసామ్యముచే నొకవస్తువు అనిత్యమైన మరియొక ధర్మసామ్యముచే నిత్యమేకాదని జాతివాది మతము.

వైధర్మ్య సమమున కుదాహరణములు : –

శబ్దము అనిత్యము ప్రయత్న జన్యమగుటవలన, ఏది ప్రయత్న జన్యముకాదో యది నిత్యము. ఆత్మవలె శబ్దమట్లు ప్రయత్న జన్యము కాకపోదు – కాబట్టి శబ్దము అనిత్యము

జాతివాది:– శబ్దము నిత్యము అస్పర్శమగుటవలన, ఏది అస్పర్శము కాదో అది యనిత్యము. ఘటాదులవలె, శబ్దము అస్పర్శముగాక పోదు. కాబట్టి శబ్దము నిత్యము.

**"గోత్వాద్గోసిద్ధివత్ తత్సిద్ధిః" 5.13.**

గోత్వాత్ = గోత్వము (సాస్నాదిమత్యము) వలన, గోసిద్ధివత్ = గోవుసిద్ధించినట్లు, తత్సిద్ధిః= శబ్దమున అనిత్యత్వమును సిద్ధించును.

సామాన్య విశేషధర్మములు మాత్రమే సాధ్యమును సాధించునని చెప్పినచో జాతివాది వాదము యుక్తమే యగును, సాధ్యముతో స్వభావముగా సంబద్ధమయిన ధర్మమునే సాధనముగా చెప్పియున్నందున జాతివాది ఖండనము

యుక్తముకాదు. సాధ్యవ్యాప్తి విశిష్ట సాధనము సాధ్యసాధక మగును. జాతివాది ప్రయోగించిన హేతు వట్టిదికాదు.

శబ్దమున అనిత్యత్వము సాధ్యము. దానికి హేతువు ప్రయత్న జన్యత్వము. ఇది సాధ్యవ్యాప్తి విశిష్ట హేతువు. ఎటనెట ప్రయత్నజన్యత్వముండునో అట అనిత్యత్వము. తప్పకయండును. ఇందు వ్యభిచార ముండనేరదు. కాబట్టి సాధ్యసాధనము.

జాతివాదిహేతు వట్టిదికాక వ్యభిచరితమగును. శబ్దమున నిత్యత్వము. సాధ్యము. అస్పర్శత్వము హేతువు. ఎట నెడ అస్పర్శత్వముండునో అట నిత్యత్వ ముండవలయును కదా! అది ఆత్మయందున్నను, బుద్ధియందులేదు. బుద్ధియందు అస్పర్శత్వమున్నదికాని నిత్యత్వములేదు. కాబట్టి అస్పర్శత్వ హేతువు వ్యభిచరిత మగుచున్నది. సాధ్యసాధనము కాజాలదు ఉత్కర్షసమ ఆది జాతిషట్కము :-

**"సాధ్యదృష్టాంతయోర్ధర్మ వికల్పాదుభయ సాధ్యత్వా చ్చోత్కర్షాపకర్ష వర్ణ్యావర్ణ్య వికల్పసాధ్యసమాః" 5.1.4.**

సాధ్య దృష్టాంతయోః = (సాధ్యము - పక్షము ) పక్షమునందు, దృష్టాంతమునందును, ధర్మవికల్పాత్ = నానావిధ ధర్మకల్పనవలన

ఉభయసాధ్యత్వాచ్చ= పక్ష దృష్టాంతములు రెండును సాధ్యములగుట వలన, ఉత్కర్షాపకర్ష వర్ణ్యావర్ణ్యవికల్ప సాధ్యసమాః= ఉత్కర్షసమము, అపకర్షసమము, వర్ణ్యసమము, అవర్ణ్య సమము, వికల్పసమము, సాధ్యసమము అను నారు జాతిభేదము లేర్పడుచున్నవి.

(1) పక్షమున సాధ్యమును సిద్ధముచేయగా, దృష్టాంత సామ్యముతో నట ననిష్టధర్మము. నుపపాదించుట ఉత్కర్షసమ మనబడును. ఉదా: - శబ్దము అనిత్యము. ప్రయత్న జన్యమగుటవలన. ఘటము వలె. ఇట శబ్దము పక్షము అనిత్యత్వము సాధ్యము. ఘటము దృష్టాంతము. ప్రతివాది :- ప్రయత్న జన్యమగుటచే ఘటమువలె శబ్దము అనిత్యమగునెడల, ఘటమువలె శబ్దము రూపవంతము కావలయును. ఘట సామ్యమున ఘటమువలె రూపవంతము కాకున్న అనిత్యమును కానేరదని భావము.

(2) పక్షమునందు సామ్యబలముచేత విద్యమాన ధర్మమున కభావము నాపాదించుట అపకర్ష సమము. వాది : - శబ్దము అనిత్యము. ప్రయత్నజన్య మగుటవలన ఘటమువలె. జాతివాది: - శబ్దము అశ్రావణము ' ప్రయత్న

జన్యమగుట వలన' ఘటమువలె ఇట ప్రయత్న జన్యసామ్యము చేత ఘటము వలె శబ్దమనిత్యమైన, అట్టి సామ్యముచేతనే ఘటము అశ్రావణము. కాబట్టి శబ్దమును అశ్రావణము కావలయును. అశ్రావణము కాని యెడల అనిత్యమును కాదని యభిప్రాయము.

(3) దృష్టాంతమున పక్షధర్మము నాపాదించుట వర్ణ్యసమము. వాది : - శబ్దము, అనిత్యము ప్రయత్న జన్యమగుటవలన, ఘటమువలె, జాతివాది: - ప్రయత్న జన్యతాసామ్యము వలన ఘటమువలె శబ్దము అనిత్యమైన, (ఇట శబ్దము పక్షము, అనిత్యత్వము సాధ్యము) పక్షమైన శబ్దమునందలి ప్రయత్న జన్యత్వ సామ్యము ఘటమునందుండుట వలన, 'ఘటము అనిత్యము' అని వర్ణింపుము. అట్లు వర్ణింపవేని శబ్ద మనిత్యమనియు వర్ణింపవలదు' అని ప్రతిషేధము.

ఘటము అనిత్యమని వర్ణించిన ఘటము దృష్టాంతము కాక పక్షమగును. పక్షమున సాధ్యము సందిగ్ధమై - అసిద్ధమై యుండును; అని యంగీకరించి నట్లగును అట్లంగీకరించిన దృష్టాంతముగా దానిని ప్రయోగింప వీలుండదు. కారణమేమన; దృష్టాంతమున సాధ్యము సందిగ్ధముగా నుండక నిశ్చితముగా సిద్ధమై యుండును. కాబట్టి ఘటము దృష్టాంతము కాని పక్షమున, వాది తన సాధ్యమును సిద్ధింపజేయుటకు దృష్టాంతము నంగీకరింపకపోవుటచే అసమర్థుడగునని భావము.

(4) పక్షమున దృష్టాంతధర్మాపాదనము అవర్ణ్యసమము.

వాది : - శబ్దము అనిత్యము; ప్రయత్నజన్యమగుట వలన ఘటమువలె జాతివాది : - ప్రయత్న జన్య సాధర్మ్యము వలన ఘటమువలె శబ్ద మనిత్యమందువేని, ఆ సాధర్మ్యము వలననే ఘటమునందువలె శబ్దమునందు అనిత్యత్వము అసందిగ్ధమే - నిశ్చితమే యగును. నిశ్చితమే యనిన శబ్ద మనిత్యమని శబ్దమున ననిత్యత్వము సాధింపనేల? అని యెదుర్కొనును.

(5) సాధనధర్మముతో కూడిన దృష్టాంతమునందు, ధర్మాంతర దర్శనమువలన, పక్షమునందు సాధ్యధర్మవికల్పము నాపాదించుట - వికల్ప సమము. వాది : - శబ్దము అనిత్యము. ప్రయత్న జన్యమగుటవలన ఘటమువలె. జాతివాది : - ప్రయత్న జన్యమయిన ద్రవ్యములో ఘటకర్పరములు పరుషములు గాను. దుకూలాదలు మృదులములుగాను చూడబడుచున్నవి. ఘటాదులలో మృదుపరుష విరుద్ధ ధర్మమున్నట్లు ప్రయత్న

జన్యమగుటచేత శబ్దమునందును నిత్యత్వము, అనిత్యత్వము నను విరుద్ధధర్మము లుండవలయును. కాబట్టి శబ్దము నిత్యము నగును.

(6) పక్ష దృష్టాంతము సామ్యము చేత సాధ్యత్వము నాపాదించుట సాధ్యసమము. వాది : – శబ్దము అనిత్యము. ప్రయత్న జన్యమగుట వలన, ఘటమువలె. జాతివాది : – శబ్దము ఘటమువంటిదియైన ఘటము శబ్దమువంటి దనుటలో సందేహము లేదు. అట్లయిన శబ్దము అనిత్యమనుటెట్లు సాధ్యవిషయమో ఘటము సైతమట్లే సాధ్యవిషయమగును. ఘటమనిత్యమనుట సాధ్యము కాదందువేని శబ్దము అనిత్యము. ఘటమువలె నను టెట్లు పొసగును? పొసగదు.

ఇట్లీ సూత్రమున సాధ్య దృష్టాంతముల ధర్మవికల్పము వలన నైదు జాతిభేదములు, పక్షము దృష్టాంతము రెండును సాధ్యమనుటవలన సాధ్యసమమను నొకజాతిభేదమును వర్ణింపబడినవని వివేకము.

**"కించిత్ సాధర్మ్యా దుపసంహారసిద్ధేః వైధర్మ్యా దప్రతిషేధః" 5.1.5.**

కించిత్సాధర్మ్యాత్ = వ్యాప్తితో కూడిన సాధర్మ్యము వలన, ఉపసంహారసిద్ధేః = పక్షమున సాధ్యసాధనము సిద్ధించుటవలన, వైధర్మ్యాత్ = వ్యాప్తిరహితమైన సాధర్మ్యమువలన, అప్రతిషేధః పక్షమున సాధ్యవిపర్యయము సిద్ధింపనేరదు.

ప్రయత్న జన్యత్వము అనిత్యముతో వ్యాప్తమై యున్నది. జాతి వాదిచే చెప్పబడిన రూపాదులు అట్లు వ్యాప్తములు కావు. కాబట్టి యతని వాదము నిస్సారము.

(1) ప్రయత్న జన్య మనిత్యమైనట్లు, ప్రయత్న జన్యమైనదంతయు రూపవంతముకాదు. ఉదా :- కర్మ ప్రయత్న జన్యమే కాని రూపవంతము కాదు.

(2) ప్రయత్నజన్యమయిన అశ్రావణము కావలయునను నియమములేదు. శబ్దధ్వంసము ప్రయత్నజన్యమేకాని అశ్రావణము కాదు. శ్రావణమే.

(3) ప్రయత్నజన్యమైనది యనిత్యమనుటలో సందిగ్ధమని కాని, అసందిగ్ధమని కానీ నియమింపవలనుపడదు, ఘటము ప్రయత్నజన్యమే' కాని దాని యనిత్యత్వము సందిగ్ధమెన్నడు కాదు. నిశ్చితమే. కాని శబ్దము ప్రయత్న జన్యమైనను, అది నిత్యమా? యనిత్యమా? యని సందేహింపబడుచున్నది వాది ప్రతివాదుకు విరోధములేని తావుందు సందేహము కలుగదు. విరోధబుద్ధి యున్న యెడ సందేహము కలుగును ఘట మనిత్యమనుట ఇరువురకు సమ్మతమే

...........ఘటమున అనిత్యత్వము సందిగ్ధముకాదు. శబ్దము........ సందిగ్ధమగుచున్నది.

(4) ప్రయత్న జన్యము నిత్యమనుటయు తగదు. ఘటాదులు ప్రయత్న జన్యములే' కాని నిత్యములు కావు.

(5) సాధర్మ్య మున్నంతమాత్రము నిది యిట్లే యుండవలయునని కానీ, నిది యిట్లుండరాదని ప్రతిషేధించుట కానీ వలనుపడదు.

**"సాధ్యాతిదేశాచ్చ దృష్టాంతోపపత్తేః" 5.1.6.**

సాధ్యాతిదేశాత్ = సాధ్యాతి దేశమువలన, దృష్టాంతోపపత్తేః= దృష్టాంత ముపపన్నమగుటచే ప్రతిషేధము తగదు.

(ఒక వస్తు ధర్మమునకు మఱియొక వస్తువునందు గల సంబంధము అతిదేశ మనబడును.) ఘటము ప్రయత్న జన్యమై యనిత్యమైనట్లు శబ్దము సైతమనియన్న శబ్దమున ఘటము యొక్క అభేదమును అతి దేశించినట్లగును. అట్టియెడ శబ్దము వలె ఘటము సైతము అనిత్యమని సాధింపవలసి యుండును. దృష్టాంతదార్ ష్టాంతములో భేదముండుట తప్పనిసరి కాబట్టి యభిన్నములనుట తగదు. కాబట్టి అభేదము నతిదేశింపజనదు. ఘటమునగల అనిత్యత్వ ధర్మము మాత్రమే శబ్దమున నతిదేశించుచున్నాము. ధర్మము నతిదేశించినంత మాత్రమున ధర్ములభిన్నములని సాధింపబడవు. కాబట్టి పక్షమున సాధనీయ ధర్మ విపర్యయములు పొసగదని భావము.

ప్రాప్త్యప్రాప్తి సమములు : -

**"ప్రాప్యసాధ్య మప్రాప్యవాహేతోః ప్రాప్త్యాఽవిశిష్ట త్వాత్**
**అప్రాప్త్యాఽసాధకత్వాచ్చ ప్రాప్త్య ప్రాప్తి సమౌ" 5.1.7.**

సాధ్యం = సాధ్యధర్మ విశిష్టమును (పక్షమును) ప్రాప్య= చేరికాని, అప్రాప్యవా = చేరకకానీ, హేతోః= హేతువు సాధ్య సాధకమైన, ప్రాప్త్యప్రాప్తిసమౌ = ప్రాప్తిఅప్రాప్తిసమ జాతిభేదములగును. కారణమేమన, ప్రాప్త్యా = హేతువు సాధ్యప్రాప్తిచే, అవిశిష్టత్వాత్ = విశేషభేదము లేనిదగుటవలన, అప్రాప్త్యాచ = సాధ్యమును చేరకపోవుటచేతను, అసాధకత్వాత్ = సాధింపనందువలన.

శబ్దము అనిత్యము. ప్రయత్న జన్యమగుటవలన. అనుస్థలమున ప్రయోగింపబడిన హేతువు సాధ్యమునుచేరి సాధించునా? లేక చేరకయే సాధించునా? సాధ్యమును చేరి యందు మేని హేతువు సాధ్యములో కలిసి సాధ్యమే యగును. సాధ్యసాధనముకు భేదమే లేకుండును. అట్టియెడ దేనికేది

సాధ్యమగును? భేదము లేకున్న సాధ్యసాధనభావ ముపపన్నము కాదు. కాబట్టి హేతువు సాధ్యముతో చేరి దానిని సాధించు ననుట తగదు. చేరకయే సాధించునందుమా? అన్నియు అన్నిటిని సాధింపనగును. ఈ సాధ్యమున కిదియే సాధకమున చేరక దానిని సాధించుననుటయు నొప్పదని భావము. ఇట్లు ప్రాప్తి క్షణ అప్రాప్తిక్షణ హేతు సాధర్మ్యముతో నెదుర్కొనుటను ప్రాప్తిసమము అప్రాప్తి సమము అందురు.

**"ఘటాది నిష్పత్తి దర్శనాత్" 5.1.8.**

"ఘటాది నిష్పత్తిదర్శనాత్ = సాధ్యమును చేరి దండాది సాధనము ఘటాదుల నుత్పన్నముచేయుట చూచుచున్నాము కావున ప్రతి షేదము తగదు.

హేతువు పక్షము నందుండకున్న నది యసిద్ధమగును. కాబట్టి పక్షమును చేరి హేతువు సాధకమగును. డండ చక్రాదులు హేతువులు అవి పక్షభూతమైన మృత్తికను చేరి ఘటాదులను ఉత్పన్నము చేయును. దండాదులు మృత్తికను చేరినంత మాత్రమున మృత్తికకు అభిన్నము కావు. కాబట్టి అభిన్నములైన సాధ్యసాధకభావము సంభవము కాదనరాదు.

ప్రసంగసమ - ప్రతిదృష్టాంత సమ జాతిభేదము : -

**"దృష్టాంతస్య కారణానపదేశాత్ ప్రత్యవస్థానాచ్చ**
**ప్రతిదృష్టాంతేన ప్రసంగ ప్రతిదృష్టాంతసమౌ" 5.1.9.**

దృష్టాంతస్య = దృష్టాంతము, కారణానపదేశాత్ = సాధ్యవంత మనుటకు ప్రమాణము చెప్పకపోవుట వలన, ప్రతిదృష్టాంతేన = ప్రతికూల దృష్టాంతముతో, ప్రత్యవస్థానాత్ సాధ్యవిపర్యయము నాపాదించుట వలనను. ప్రసంగ ప్రతిదృష్టాంతసమౌ = ప్రసంగసమ - ప్రతి దృష్టాంతసమజాతి భేదములు.

పక్షమునందు సాధ్యమున్నదని ఋజువు చేయుటకు గాను ఘటము నుదహరింతురు గదా ! అట్టి ఘటమునందు సాధ్యమున్నదని చెప్పుటకు ప్రమాణము చెప్పవలసియుండును. అట్లు చెప్పబడదు. పక్షమునందు సాధ్యమున్నదా? లేదా? యని ప్రశ్నించుట కవకాశమున్నట్లు దృష్టాంతము నందును సాధ్యధర్మమున్నదా? లేదా యని యడుగుట కవకాశము లేకపోలేదు. కాబట్టి దానికి ప్రమాణ మొసంగ వలయును. ఇత్తురేని నట మరల ప్రమాణప్రసక్తి గలుగును. ఇట్లనవస్థ యేర్పడ గలదని యెదుర్కొనుట - పక్షమున సాధ్యాభావము నుపపన్న మొనర్చుటకు చేయు ప్రసంగము- ప్రసంగ సమము.

శబ్దము అనిత్యము; ప్రయత్న జన్యమగుటవలన, ఘటమువలె.

అనుస్థలమున ఘటము దృష్టాంతము. ఆకాశము ప్రతిదృష్టాంతము ఘటమువలె శబ్దమనిత్యమైన ఆకాశము వలె శబ్దము నిత్యమే కాదని కేవలము ప్రతికూల దృష్టాంతముతోనే సాధ్యాభావమును సాధింపనెంచుచు హేతువు నుపేక్షించుట ప్రతిదృష్టాంత సమము.

**"ప్రదీపోపాదాన ప్రసంగనివృత్తివత్ తద్వినివృత్తిః" 5.1.10.**

ప్రదీపోపాదాన ప్రసంగ నివృత్తివత్ = ప్రదీపమును దర్శించుటకు మరియొక దీపమును గ్రహింపవలయునను ప్రసక్తి నివృత్తి చెందినట్లు, తద్వినివృత్తిః= దృష్టాంతము సాధ్యవంతమని ఋజువు చేయుటకు ప్రమాణగ్రహణ ప్రసంగమును నివర్తించును.

ఘటపటాది ద్రవ్యములను చూచుటకు దీపమును గ్రహింతుము. ఆ దీపమును చూచుటకై మరియొక దీపము గ్రహింపనవసర ముండదు. అది స్వయముగానే తెలియబడును. అట్లే పక్షమున సాధ్యమును సిద్ధింపజేయుటకు దృష్టాంతమును గ్రహింతుము. కాని దృష్టాంతమున సాధ్యమున్నదని రూపింపవేరొక దృష్టాంతము గ్రహింప నవసరముండదు. దృష్టాంతమున సాధ్యమున్నట్లంతకు పూర్వమే నిశ్చయింపబడును. అట్లు నిశ్చిత సాధ్యము కదియే దృష్టాంత మన బడును. సందిగ్ధ సాధ్యమెన్నడు దృష్టాంత మనబడదు. అది పక్షమే యనబడును, కాబట్టి దృష్టాంతమున సాధ్య సాధనమునకై ప్రమాణము చూపవలయునని యెదుర్కొనుట యుక్తము కాదు.

**"ప్రతి దృష్టాంతహేతుత్వేచ నా హేతుర్దృష్టాంతః" 5.1.11.**

ప్రతిదృష్టాంత హేతుత్వేచ = ప్రతిదృష్టాంతము సాధకమగు నెడ, దృష్టాంతః = వాదిచేనీయబడిన దృష్టాంతము, నా హేతుః= అసాధకముకాదు.

ప్రతి దృష్టాంతమెట్లో దృష్టాంతమునట్లే యగుటవలన, ప్రతిదృష్టాంతము సాధకమగునెడ దృష్టాంతమును సాధ్యసాధక మగును. దృష్టాంతము సాధకముకాక ప్రతిదృష్టాంతమే సాధకమగు ననుటకు విశేష హేతువు చెప్పవలసి యుండును. అట్లు చెప్పలేదు దృష్టాంతము సాధ్యసాధక మనుటకు విశేష హేతువున్నది అదే సాధ్యవ్యాప్తి. సాధ్యవ్యాప్తి ప్రతిదృష్టాంతమున నుండదు. కాబట్టి ప్రతిదృష్టాంతము సాధకము కాదు.

అనుత్పత్తి సమలక్షణము: –

**"ప్రాగుత్పత్తేః కారణాభావాదనుత్పత్తి సమః" 5.1.12.**

ఉత్పత్తేఃప్రాక్ = ఉత్పత్తికి పూర్వము, కారణాభావాత్ = సాధకమైన హేతువు

లేకుండుటవలన, అనుత్పసమః= అనుత్పత్తి సమజాతి భేదమగును.

శబ్ద మనిత్యము' ప్రయత్నానంతరీయక మగుటవలన, ఇట, శబ్ద మనిత్యమైన నది యుత్పత్తి ధర్మము కలదనవలయును. అగుచో నుత్పత్తికి పూర్వమనుత్పన్నమగును. శబ్ద ముత్పన్నము కానపుడు దానియందనిత్యత్వమును, సాధించు ప్రయత్నానంతరీయకత్వమను హేతువును లేదని యొప్పుకొనక తప్పదు. ఇట్లు ప్రయత్నానంతరీయ కత్వాభావము వలన శబ్దము నిత్యమని సిద్ధించును కాని యనిత్యము కాదు. అనుత్పన్న తంతువులు పటమునకు కారణము కాజాలనట్లు, శబ్దోత్పత్తికి పూర్వము అనుత్పన్న ప్రయత్నానంతరీయకత్వమును అనిత్యత్వమునకు కారణము కాదని అనుత్పన్నమైన హేతు సాధర్మ్యముతో సాధ్యవిపర్యయమును సాధింప నెంచుట అనుత్పత్తి సమజాతిభేద మనబడునని భావము.

**"తథాభావాదుత్పన్నస్య కారణోపపత్తేర్న కారణ ప్రతిషేధ" 5. 1.13.**

ఉత్పన్నస్య = ఉత్పన్నమైన తదుపరి, తథాభావాత్ = సాధ్యధర్మాశ్రయముగా సందేహింపబడుటవలన, కారణోపపత్తేః= హేతువు పపన్న మగుటవలన, కారణప్రతిషేధఃన = కారణనిషేధము యుక్తము కాదు.

శబ్ద ముత్పన్నమైన తరువాతనే యం దనిత్యత్వము సాధ్యముగా సాధింపబడును. ఉత్పత్తికి పూర్వము శబ్ద మనిత్యమని యెవరును సాధింపబోరు. ఉత్పన్న శబ్దమునందు ప్రయత్నానంతరీయకత్వమను హేతువుపపన్న మగుటలో నెట్టి యాటంకమును లేదు. కాబట్టి పై ప్రతిషేధము నిర్హేతుకము. సంశయసమము :-

**"సామాన్య దృష్టాంతయో రైంద్రియకత్వే సమానే**
**నిత్యానిత్య సాధర్మ్యామ్యత్సంశయః" 5.1.14.**

సామాన్య దృష్టాంతయోః= పక్షముననుండు సామాన్యము దృష్టాంతముననను నీ రెండును, ఐంద్రియకత్వే = ఇంద్రియగ్రాహ్యము లగుటలో, సమానే = సమానముకాగ, నిత్యానిత్యసాధర్మ్యాత్ = నిత్యమైన సామాన్యము యొక్కయు, అనిత్యమైన దృష్టాంతము యొక్కయు సాధర్మ్యమువలన, సంశయః = సంశయసమజాతి భేదము.

నిత్యానిత్యము సామ్యముచేత పక్షమున సాధ్యసంశయము నుద్భావించుట సంశయసమ మగును.

శబ్ద మనిత్యము. ప్రయత్నానంతరీయకమగుటవలన, ఘటమువలె. ఇట

శబ్దము పక్షము. అందలి సామాన్యము శబ్దత్వము. శబ్ద మైంద్రియక మగుటచే తద్గత సామాన్యము (శబ్దత్వము) ను ఐంద్రి యకమే (ఇంద్రియగ్రాహ్యమే). కాని యది నిత్యము. దృష్టాంతముగా నొసగబడిన ఘటమును ఐంద్రియకమే. కాని యది యనిత్యము. ఇట్లు అనిత్యమైన శబ్దము, నిత్యమైన శబ్దత్వమనెడి సామాన్యము, రెండును ఇంద్రియ గ్రాహ్యములే. అందు ఘటసామ్యముగల ప్రయత్నాంతరీయకత్వ హేతువుచే శబ్దమున అనిత్యత్వము నిర్ణయింతురేని, నిత్యమైన శబ్దత్వము, అనిత్యమైన ఘటము నను నీ రెండిటి సామ్యముగల ఐంద్రియకత్వ హేతువుచే శబ్దమున అనిత్యత్వమే సందేహింపరు? సందేహము కలుగదేని నిర్ణయమునుకలుగదని యెదుర్కొనుట సంశయసమమనబడును.

**"సాధర్మ్యత్ సంశయే నసంశయో వైధర్మ్యా దుభయథాచ సంశయేఽత్యంత సంశయ ప్రసంగోనిత్యత్వానభ్యుపగమాచ్చ సామాన్యస్యాప్రతిషేధః" 5.1.15.**

సాధర్మ్యాత్ = సమానధర్మజ్ఞానము వలన, సంశయే = సంశయము కలిగినప్పటికి, నసంశయః= సంశయము కలుగుట సంభవింపదు. వైధర్మ్యాత్ = విశేషధర్మ జ్ఞానమువలన, ఉభయథాచ = సాధర్మ్య వైధర్మ్యజ్ఞానము వలనను, సంశయే = సంశయము కలుగునని, అత్యంత సంశయః= అత్యంత సంశయ ప్రసక్తికలుగును, సామాన్యస్యచ = విశేష ధర్మజ్ఞాన సహితమైన సాధర్మ్యజ్ఞానము, నిత్యత్వానభ్యుప గమాత్ = నిత్యసంశయ హేతువని యంగీకరింపనందున, అప్రతిషేధః= సాధ్యప్రతిషేధము తగదు.

సమానధర్మజ్ఞానము మాత్రమే సంశయమునకు కారణమయిన, నిత్యానిత్యములైన శబ్దత్వ ఘటోభయ సాధారణ ధర్మమైన ఐంద్రియక త్వ జ్ఞానమువలన సంశయము కలుగును. కాని సమానధర్మజ్ఞానము సంశయకారణము కాదు. విశేష ధర్మజ్ఞానము లేని సామాన్య ధర్మజ్ఞానము సంశయమునకు కారణము. శబ్దమున నైంద్రియకత్వ సాధర్మ్యజ్ఞానమున్నపుడు అనిత్యత్వ సాధకమయిన కృతకత్వమనెడి విశేష ధర్మజ్ఞానము లేకపోలేదు. అది యున్న సంశయము కలుగనేరదు. శిరః పాణ్యాది విశేష ధర్మజ్ఞాన మున్నపుడు ఉన్నతత్వాది సామాన్య ధర్మజ్ఞానము స్థాణువా? పురుషుడా? యను సందేహము కలిగింపలేదుకదా! విశేష ధర్మజ్ఞాన మున్నపుడును సామాన్య ధర్మజ్ఞానము సంశయము కలిగించునెడల సంశయము విచ్ఛిన్నము కానేరదు. కారణమైన సాధర్మ్యజ్ఞానముండ కార్యమైన సంశయము నశింపనేరదని భావము.

విశేష ధర్మజ్ఞాన సహితమయిన సామాన్య ధర్మజ్ఞానము సంశయమునకు కారణముగా నంగీకరింప బడదు. కాబట్టి సంశయము నుద్భావించి పక్షమున సాధ్యమును ప్రతిషేధించుట యుక్తము కాదని భావము.

ప్రకరణసమలక్షణము : -

**"ఉభయ సాధర్మ్యాత్ ప్రక్రియా సిద్ధేః ప్రకరణ సమః" 5.1.16.**

ఉభయ సాధర్మ్యాత్ = నిత్యానిత్యోభయముతో సాధర్మ్యముండుట వలన, ప్రక్రియాసిద్ధేః = ప్రకరణము సిద్ధించుటవలన, ప్రకరణ సమః= ప్రకరణ సమమగును.

వాది అనిత్యసాధర్మ్యముతో పక్షమున సాధ్యమును సాధింప ప్రతివాదినిత్య సాధర్మ్యముతోను, వాది నిత్యసాధర్మ్యముతో సాధ్యమును పక్షమున సాధింప ప్రతివాది యనిత్యసాధర్మ్యముతోను సాధ్యాభావ మును సాధింప యత్నించుట ప్రకరణసమ మనబడును.

వాది : - శబ్దమనిత్యము, ప్రయత్నానంతరీయకమగుట వలన ఘటమువలెనని శబ్దమున ననిత్యత్వము సాధింపగా, జాతివాది :- శబ్దము నిత్యము శ్రవణగ్రాహ్యమగుట వలన శబ్దత్వము వలెనని శబ్దమున నిత్యత్వమును సాధించును. వాది : - శబ్దము నిత్యము. శ్రావణ మగుటవలన, శబ్దత్వము వలెనని, జాతివాది : - శబ్ద మనిత్యము. ప్రయత్నానంత రీయకమగుటవలన, ఘటమువలె నను.

**"ప్రతిపక్షాత్ప్రకరణ సిద్ధేః ప్రతిషేధా నుపపత్తిః**
**ప్రతిపక్షోపపత్తేః " 5.1.17.**

ప్రతిపక్షోపపత్తే తః= ప్రతిపక్ష ముపపన్నమగుటవలన, ప్రతిపక్షాత్= ప్రతిపక్ష సాధనమువలన, ప్రకరణసిద్ధేః = ప్రతిపక్షము సిద్ధించుట వలన, ప్రతిషేధానుపపత్తిః= వాదిపక్షము ప్రతిఘటింపబడదు.

నిత్యానిత్యములగు ఉభయసాధర్మ్యముద్వారా తన పక్షము సిద్ధించుననిచెప్పు ప్రతివాది వాదిపక్షసిద్ధిని సైతము మంగీకరించిన వాడగును. ప్రతివాదిచే నుపపాదింపబడు రెండు పక్షములలో నొకపక్షము వాదిదియై యుండును. కావున నట్లంగీకరింప తప్పదు. కాబట్టియీ ప్రతిషేధము నిరుపయోగమని భావము.

అహేతుసమ లక్షణము : -

**"త్రైకాల్యాసిద్దేర్హేతో రహేతు సమః" 5.1.18.**

హేతోః = సాధనము, త్రైకాల్యాసిద్ధే ః = సాధ్యమునకు పూర్వోత్తర సమకాలములందు సాధకముగా సిద్ధింపనందున, అహేతుసమః= అహేతు సమమగును.

శబ్దమనిత్యము. ప్రయత్నానంతరీయక మగుటవలన, ఘటమువలెనని వాది ప్రయోగించును. ఇట ప్రయత్నానంతరీకయక మను నీ హేతువు సాధ్యమునకు పూర్వమేర్పడునా? లేక తరువాతనా? పూర్వమందువేని హేతుత్వమే సిద్ధింపదు. సాధ్యము లేనిది హేతువుదేనికి? సాధ్యమన హేతుమంతము, హేతుమంతము లేనిది హేతువెట్లు సిద్ధించును? తరువాత సిద్ధించునందువా? అదియును పొసగదు. సాధ్యము ముందే సిద్ధించిన హేతువు (సాధకము) తరువాత సిద్ధించి చేయునదేమి? సాధ్యమును సిద్ధింపజేయుటకే కదా సాధన ముపయోగించును? సాధ్యముతో హేతువునకు సహభావ మందువా? అదియు నిరర్థకమే. హేతువు హేతుమంతము నను రెండును ఒకే సమయమున నెట్లేర్పడగలవు? సమభావము కలవానిలో నేది దేనికి కారణమో, దేనికెయ్యది కార్యమో నిశ్చయించుటెట్లు సవ్యదక్షిణ శృంగములో సాధ్యసాధన భావ మంగీకరింపనగునా? యని యిట్లు హేతువును అహేతువుగా నిరూపించి ప్రతిఘటించుట అహేతుసమ మనబడును.

**"న హేతుతః సాధ్యసిద్ధేస్త్రైకాల్యాసిద్ధిః" 5.1.19.**

హేతుతః = సాధనమువలన, సాధ్యసిద్ధేః= సాధ్యము సిద్ధించుట వలన, త్రైకాల్యాసిద్ధిః= హేతువు త్రికాలములందు సిద్ధింపదనుట, న = తగదు.

దేనివలన నేది సిద్ధించునో యది దానికంటె ముందుండవ లయుననునది నియమము. హేతువువలన సాధ్యము సిద్ధించుట ప్రత్యక్ష విషయము. ప్రత్యక్షమున ప్రశ్నలు తగవు. సాధ్యము లేనపుడు దేనికి హేతువని ప్రశ్నించుటయు తగదు. ఏది సాధింపబడునో దానికిది హేతువని చెప్పనగును కదా? కాబట్టి హేతువు త్రికాలములందు సిద్ధింపదనుట అయుక్తము.

**"ప్రతిషేధానుపపత్తేశ్చ ప్రతిషేద్ధవ్యాప్రతిషేధః" 5.1.20**

ప్రతిషేధానుపపత్తేశ్చ = ప్రతిషేధ ముపపన్నము కాకుండుట వలనను, ప్రతిషేద్ధవ్యాప్రతిషేధః= హేతు ప్రతిషేధము అయుక్తము.

హేతువు సాధ్యమునకు పూర్వముకాని, పరమునకానీ, తోడ్తోకానీ, సిద్ధింపదనిన, ప్రతివాదిచే చేయబడు హేతు ప్రతిషేధము సైతము, తాను ప్రతిషేధింపదలచిన హేతువు కంటె పూర్వ – పర – సమకాలములో నెట్లు

సిద్ధించునో చెప్పవలసియుండును హేతువుకంటె పూర్వమే ప్రతిషేధ మనిన దేనికది ప్రతిషేధము? తరువాత ననిన ప్రతిషేద్ధవ్యమగు హేతువు పూర్వమే ప్రతిషేధింపబడిన తరువాత ప్రతిషేధమెందుకు? సమభావమనిన నేది దేనికి ప్రతిషేధము? కాబట్టి ప్రతిషేధము నిర్యుక్తికము.

అర్థాపత్తిసమలక్షణము : –

**"అర్థాపత్తితః ప్రతిపక్షసిద్ధే రర్థాపత్తిసమః" 5.1.21**

అర్థాపత్తితః= అర్థాపత్తిచే, ప్రతిపక్షసిద్ధేః= ప్రతిపక్షము సిద్ధించుటవలన, అర్థాపత్తిసమః = అర్థాపత్తిసమ మనబడును.

పక్షమున సాధ్యాభావము సిద్ధమొనర్చుటకు అర్థాపత్తి సాధర్మ్యముతో ప్రతిఘటించుట అర్థాపత్తి సమమగును.

శబ్ద మనిత్యము ఘటమువలె ప్రయత్నానంతరీయక మగుటవలన నని ప్రయోగింప, ఘటసామ్యమువలన శబ్దమనిత్య మయిన నాకాశముతో నస్పర్శత్వ సామ్యముండుట వలన శబ్దము నిత్యమని తేలుచున్నదని యర్థాపత్తితో చేయు ప్రతివాదిప్రతిషేధము అర్థాపత్తిసమ మనబడును'

**"అనుక్తస్యార్థాపత్తేః పక్షహానేరుపపత్తిరనుక్తత్వా దనైకాంతిక త్వాచ్చార్థాపత్తేః" 5.1.22.**

అనుక్తత్వాత్ = ప్రతివాదిచే చెప్పబడక పోవుటవలన, అర్థాపత్తేశ్చ = అర్థాపత్తివలన ప్రాప్తించుట వలనను, అనైకాంతికత్వాత్ = ఒకేపక్షము నియతము కాకపోవుటవలన, అనుక్తస్య = ఉక్తముకాని దంతయు, అర్థాపత్తేః= అర్థాపత్తివలన, పక్షహానేః= ప్రతి పక్షహానికి, ఉపపత్తిః= ఉపపత్తి కలుగును.

వాక్యార్థము నుపపాదించు సామర్థ్యము కలిగిన చోటుననే వాక్యార్థము అనుక్తమయినను అర్థమువలన సిద్ధించును. 'దేవదత్తుడు బలము కలిగియున్నాడు' పగట భుజింపడు' అనిన రాత్రియందు భుజించుచున్నాడని అర్థాపత్తివలన తెలియును. ఇట్టియెడ సామర్థ్యము గోచరించును. కాని ప్రకృతమున వ్యభిచరింపని సాధర్మ్యముతో సాధ్యము (శబ్దమున ప్రయత్నాంతరీయకత్వ సాధర్మ్యముతో అనిత్యత్వము ) సాధింపగా నిత్యత్వమును వ్యభిచరించు అస్పర్శత్వ సాధర్మ్యముతో శబ్దమున నిత్యత్వము అర్థాపత్తివలన సిద్ధించుననుట యుక్తముకాదు. దేవదత్తుని బలమును రాత్రి భోజన మెట్లు సమర్థించునో 'శబ్దము అనిత్యమ'న 'శబ్దము నిత్యము' అను నర్థమట్లు సమర్థింపబడదు. సామర్థ్యము లేనియెడ సయితము అర్థాపత్తివలన కొండొక

యర్థము కల్పింప నిష్టమగుచో, ప్రతివాది పక్షమునకే హాని కలుగును. అతడు శబ్దము నిత్యమనిన శబ్ద మనిత్యమని అర్థాపత్తివలన నుపపన్న మగునుకదా? కాబట్టి యీ ప్రతిషేధము నిరుపపన్న మని భావము.

అవిశేష సమలక్షణము : –

**"ఏకధర్మోపపత్తే రవిశేషే సర్వావిశేష ప్రసంగాత్**
**సద్భావోపపత్తే రవిశేష సమః" 5.1.23.**

ఏకధర్మోపపత్తేః దృష్టాంత సాధర్మ్యము పక్షమున సిద్ధించుట వలన, అవిశేషే = పక్షదృష్టాంతము సమానముకాగా, సద్భావోపపత్తేః= సత్తాఖ్య ధర్మమంతట సిద్ధమగుటవలన, సర్వావిశేష ప్రసంగీత్ = సర్వము సమానమనెడి ప్రసక్తి కుగుటవలన, అవిశేషసమః= అవిశేష సమమగును.

ప్రయత్నానంతరీయకత్వసామ్యమున ఘటసమానమై శబ్దమనిత్యమగునెడల, సత్తా సామ్యమువలన నన్నియు నన్నిటితో సమానము లగును. అట్లు కాదందువేని శబ్దము ఘట సమానమైన యనిత్యము కానేరదు. ప్రయత్నానంతరీయకత్వ సామ్యమున శబ్దము ఘటసామ్యమై యనిత్యమగును కాని సత్తాసామ్యమున సర్వభావపదార్థము పరస్పర సామ్యములై సర్వము సమానమగుననుట సరికాదందువేని యందులకు ప్రమాణము చెప్పవలసి యందువని ప్రతిఘటించుట అవి శేషసమ మనబడును.

**"క్వచిత్ తద్ధర్మోపపత్తేః క్వచిచ్చానుపపత్తేః ప్రతి షేధాభావః" 5.1.24.**

క్వచిత్ = ఒకానొకతావున, తద్ధర్మోపపత్తేః= అవిశేష హేతుధర్మ ముపపన్నమగుటవలన, క్వచిచ్చ= మఱియొకతావున, అనుపపత్తేః= అవిశేష హేతుధర్మమనుపపన్న మగుటవలన, ప్రతిషేధాభావ ః= ప్రతిషేధము సిద్ధింపదు.

శబ్దము పక్షము. ఘటము దృష్టాంతము. ఈ రెంటియందును ప్రయత్నానంతరీయకత్వమును ధర్మము విశేష హేతువగును. ప్రయత్నానంత రీయకత్వమునకు అనిత్యత్వము వ్యాపకము. ఎట ప్రయత్నానంత రీయకత్వముండునో యట అనిత్యత్వముండును. అను నిట్టివ్యాప్తి కాశ్రయమై ప్రయత్నానంతరీయకత్వమనెడి హేతువు శబ్దఘటములో సామ్యము (అవిశేషత) సంపాదించుచున్నది. అట్లే సత్తాధర్మము వ్యాప్తి కాశ్రయమైనచో సామ్యమును సంపాదింపగుగు ధర్మము మఱియొకటి యేదిగలదు? అట్టి ధర్మము సిద్ధింపదు. కారణమేమన: నిత్యత్వము సత్తావ్యాపక ధర్మమందుమేని యది దృష్టాంతముతో నుపపన్నము కావలసియుండును కాని అట్లు కాజాలదు. 'సర్వము నిత్యము.

సత్తావంత మగుటవలన అనిన దృష్టాంతముగా నీయగల వస్తు వొండేమిగలదు? సర్వము పక్షములో చేరును. పక్షములో చేరినదానిని దృష్టాంతముగా గ్రహింపవీలు పడదు. పక్షము సందిగ్ధసాధ్యము. దృష్టాంతము నిశ్చితసాధ్యము కలది. సర్వము సందిగ్ధ సాధ్యాశ్రయమైన నిశ్చితసాధ్యము కలది. సర్వము సందిగ్ధ సాధ్యాశ్రయమైన నిశ్చితసాధ్యమున కాశ్రయమెయ్యది? దృష్టాంతము లేక హేతువు సాధ్యసాధకమెట్లగును? కాబట్టి సత్తాసామ్యముతో సర్వము అవిశేష మగుటచే శబ్దము నిత్యమగునని ప్రతిఘటించుట యుక్తివిరుద్ధమగునని భావము.

ఉపపత్తి సమలక్షణము : -

**"ఉభయ కారణోపపత్తే రుపపత్తిసమః" 5.1.25.**

ఉభయ కారణోపపత్తేః= పక్షప్రతిపక్షహేతూపత్తివలన, ఉపపత్తిసమః= ఉపపత్తిమమగును.

శబ్ద మనిత్యమని సాధించుటకు ప్రయత్నానంతరీయ కత్వ హేతువు సిద్ధించిన, 'శబ్దము నిత్యము అస్పర్శమగుట వలన ఆకాశమువలెనని ప్రతిపక్ష సాధక హేతువు సిద్ధించును. విశేష హేతువు లేనందునశబ్ద మనిత్యమేకాని నిత్యము కాదనరాదని ప్రతిఘటించుట ఉపపత్తిసమమనబడును.

**"ఉపపత్తి కారణాభ్యనుజ్ఞానా దప్రతిషేధః" 5.1.26.**

ఉపపత్తి కారణాభ్యనుజ్ఞానాత్ = వాదిపక్ష సిద్ధికి కారణము నంగీకరించి నందున, అప్రతిషేధః= ప్రతిషేధము అయుక్తము.

ఉభయ పక్షపు హేతువుల నంగీకరించువాడు వాది పక్షమును నంగీకరించును కాని ప్రతిషేధింపడు, అంగీకరింపని పక్షమున 'ఉభయ కారణోపపత్తివలన' అని ప్రయోగించుటయే తగదు. హేతువు నంగీకరించి సాధ్యము నంగీకరింపకుండుటలో నర్థమేమి? హేతువు = వ్యాప్యము నంగీకరించిన సాధ్యము (వ్యాపకము) నంగీకరించినట్లే యగును. రెండు హేతువు లుపపన్నములైనను శబ్దము నిత్యము, అనిత్యము ననుట పొసగదు. అట్లనుట పరస్పర వ్యాఘాతమగును. ఉభయ కారణోపపత్తివలన అనిత్యత్వము వ్యాహతమగునెడ నిత్యత్వమును వ్యాహతమగును. కాబట్టి ఉపపత్తిసమముతో ప్రతిఘటన అసంగతమని భావము.

ఉపలబ్ధి సమలక్షణము : -

**"నిర్దిష్ట కారణాభావేఽప్యుపలంభాదుపలబ్ధిసమః" 5.1.27.**

నిర్దిష్టకారణాభావేఽ పి = వాదిచే చెప్పబడిన హేతువు లేకున్నను, ఉపలంభాత్= సాధ్యముపలబ్ధమగుట వలన, ఉపలబ్ధిసమః= ఉపలబ్ధిసమ మగును.

పక్షమున నొకచో హేత్వసిద్ధిని చూపుట యుపలబ్ధి సమమన బడును. వాయు వశమున చెట్టుకొమ్మ విరిగిన నపుడు శబ్దముత్పన్నమై నశించును. దానింబట్టి శబ్దమనిత్యమని తెలియుచు న్నది. అందువలన, శబ్ద మనిత్యమని ప్రయత్నానంతరీయకత్వ హేతువుచే సాధించుట యుక్తముకాదు. ప్రయత్నానంతరీయకత్వ హేతువే శబ్దానిత్యత్వమును సాధించునెడల శాఖాభంగమువలన శబ్ద మనిత్యమని తెలియబడకుండవలయును. తెలియబడుచుండుట చేత శబ్దమనిత్యము ప్రయత్నానంతరీయకమగుటవలన నని సాధించుట అయుక్తకమని ప్రతిఘటించుట ఉపలబ్ధిసమము.

**"కారణాంతరాదపి తద్ధర్మోపపత్తే రప్రతిషేధః" 5.1.28.**

కారణాంతరాదపి = మఱియొక హేతువువలనను, తద్ధర్మోపపత్తేః= సాధ్యధర్మము సిద్ధించుట అయుక్తము కాదు కాబట్టి, అప్రతిషేధ ః= దోషము లేదు.

ఏ శబ్దమున ప్రయత్నానంతరీయకత్వము వలన అనిత్యత్వము సిద్ధింపదో అట మఱియొక కృతకత్వము మున్నగు హేత్వంతరమున నది సిద్ధింపగలదు కృతకముకాని శబ్దమొందునులేదు. కాబట్టి దోషము లేదు. ఒక కారణముచే సిద్ధించు సాధ్యము మఱియొక కారణమునగల కారణత్వమును వారింపజాలదు. కాబట్టి యుపలబ్ధిసమయుక్తమని భావము.

అనుపలబ్ధిసమము : -

**"తదనుపలబ్ధే రనుపలంభాదభావసిద్ధౌ తద్విపరీతోపపత్తే రనుపలబ్ధిసమః" 5.1.29.**

తదనుపలబ్ధేః= ప్రతిబంధకానుపబ్ధి, అనుపలంభాత్ = ఉపలంభము కానందున, అభావసిద్ధౌ= అభావము సిద్ధింపగా, తద్విపరీతో పపత్తేః= ప్రతిబంధ కోపలబ్ధి యుపపన్నమగుటవలన, అనుపలబ్ధిసమః= అనుపలబ్ధిసమమగును.

నేలను త్రవ్వుటకుముందు భూమియందు జలముండియు మృత్తికాదులు ప్రతిబంధకము లగుటవలన నుపలబ్ధముకాదు. అట్లే ఉచ్చారణకు ముందు శబ్దముండియు ప్రతిబంధకము వలన నుపలబ్ధ మగుటలేదు. అంతియే కాని 'యనిత్యమగుట వలనకాదు, అనినుడువ వీలులేదు. కారణమేమన జలమునకు

మృత్తిక ప్రతిబంధకమున్నట్లు శబ్దమునకు ప్రతిబంధకమేదియు కానరాదు. కాబట్టి శబ్దము నుచ్చరించుటకు పూర్వమది లేదనియే యెంచవ లయునని వాది సిద్ధపరుప, ప్రతివాది ప్రతిబంధకానుపలబ్ధివలన శబ్దాభావము సిద్ధించిన, ప్రతిబంధకానుపలబ్ధియు నుపలబ్ధము కానందున ప్రతిబంధకానుప లబ్ధ్యభావమును సిద్ధించును. అనగా ప్రతిబంధకోపలబ్ధి సిద్ధించును. కాబట్టి శబ్దముండియు నుపలబ్ధము కాకున్నదని ప్రతిఘటించుట అనుపలబ్ధి సమమగును.

**"అనుపలంభాత్మ కత్వాదనుపలబ్ధే రహేతుః" 5.1.30.**

అనుపబ్ధేః= ఆవరణాది ప్రతిబంధకానుపలబ్ధి, అనుపలంభాత్మ కత్వాత్ = (ప్రతిబంధకోపబ్ధ్యభావమిట నుపలంభము) అనుపలంభ స్వరూపక మగుట వలన - అభావ స్వరూపమగుటవలన ననిభావము అహేతుః= ప్రతిబంధ కానుపబ్ధి అనుపలంభ మగుటవలన నను హేతువు ప్రతిబంధకోపలబ్ధికి సాధకము కాదు.

దేనికేది విషయమో యది దాని యస్తిత్వమును తెలుపును. నాస్తిత్వమును తెలుపదు, ఉపలబ్ధికి విషయము భావము. అనుపలబ్ధికి విషయము అభావము. ఆవరణాది ప్రతిబంధకానుపలబ్ధి అభావా త్మకము. అందుప్రవర్తించు అనుపలంభము దాని యభావత్వము నెట్లు తీసివేయ గలుగును? కాబట్టి, ఆవరణాది ప్రతిబంధకానుపలబ్ధి అనుపలంభము వలన ప్రతిషేధింప బడనిదై ప్రతిబంధకోపలబ్ధికి సాధనమెట్లు కాగలదు? కాజాదు. అందువలన ప్రతిబంధకము లేనందున ఉచ్చారణకు పూర్వము శబ్దము లేదనియే సిద్ధమగునని భావము.

**"జ్ఞాన వికల్పానాంచ భావాభావసంవేదనా దధ్యాత్మమ్" 5.1.31.**

అధ్యాత్మమ్ = మనస్సుతో, జ్ఞానవికల్పానాం = జ్ఞాన విశేషము, భావాభావ సంవేదనాత్ = సత్త్వాసత్త్వము తెలియుటవలన, అహేతుః = అనుపబ్ధ్యనుప లంభమువలన నను హేతువు సరికాదు.

మనస్సు ద్వారా జ్ఞానము భావము తెలియబడినట్లు వాని యభావమును తెలియబడును. (ఏ యింద్రియముచే నే విషయము గ్రహింపబడునో యందలి జాతియు, దాని యభావమును నాయింద్రియము చేతనే గ్రహింపబడునను నియమమిందు ప్రయోజకము.) ఆవరణాది ప్రతిబంధకానుపలబ్ధియు జ్ఞానాభావవమే' కావున నుపబ్ధి (జ్ఞానము) వలె నదియుమనస్సుచే

గ్రహింపబడుచున్నది. ఆవరణాద్యుపబ్ధిలేదని తెలియుచున్నది. కాబట్టి, ఆవరణానుపబ్ధి సిద్ధించి తదనుపలంభము సిద్ధింపనందున, ఉచ్చారణకు పూర్వము శబ్దము లేకయే యుపలబ్ధము కాకున్నదని తెలియుచున్నది. అందువలన ననిత్యమనియు ధ్రువమగుచున్నదని భావము.

అనిత్యసమము : –

**"సాధర్మ్యాత్తుల్యధర్మోపపత్తేః సర్వానిత్యత్వ ప్రసంగా దనిత్యసమః" 5.1.32.**

సాధర్మ్యాత్ = దృష్టాంత సాధర్మ్యమువలన, తుల్యధర్మోపపత్తేః= పక్షమునందు దృష్టాంతమునకు సమానమైన ధర్మముపపన్నమగుట వలన, సర్వానిత్యత్వ ప్రసంగాత్ = సర్వము అనిత్యము కావలసిన ప్రసక్తికలుగును. కాబట్టి, అనిత్యసమః= అనిత్యసమమగును.

పక్షమునందు సాధ్యధర్మ విపర్యయమును సాధించు నిమిత్తము దృష్టాంతసాధర్మ్యముతో సమస్తభావ పదార్థముల నిత్యములని యుద్భావించుట అనిత్య సమమగును.

ప్రయత్నానంతరీయకత్వ సామ్యముచే ఘటమువలె శబ్ద మనిత్యమగునెడ, ఘటము నందలి సత్వగుణ (ఉనికి) సాధర్మ్యముతో సర్వభావ పదార్థములేల అనిత్యములు కావు? కావనుపక్షమున శబ్దమును అనిత్యము కానేరదు. ఘటమునందలి కొండొక (ప్రయత్నానంతరీయకత్వ) గుణ సామ్యముచే శబ్దము అనిత్యమగును కాని, వేరొక (ఉనికి– స(త్వ)గుణ సామ్యమముచే నితర భావపదార్థములు అనిత్యములు కావనుటకు విశేషహేతువేమి? యని ప్రతిఘటించుట అనిత్యసమములగును.

**"సాధర్మ్యాదసిద్ధేః, ప్రతిషేధాసిద్ధిః, ప్రతిషేధ్య సాధర్మ్యాత్" 5.1.33.**

సాధర్మ్యాత్ = దృష్టాంత సాధర్మ్యము వలన, అసిద్ధేః= పక్ష మున సాధ్యము సిద్ధింపని పక్షమున, ప్రతిషేధ్య సాధర్మ్యాత్ = వాదిపక్ష సాధర్మ్యము వలన, ప్రతిషేధాసిద్ధి ః= ప్రతివాది పక్షమును సిద్ధింపదు.

శబ్దమనిత్యమని వాదిపక్షము సర్వమనిత్యమని ప్రతివాది పక్షము. శబ్ద మనిత్య మనుటకు వాది ఘటమును దృష్టాంతముగా గ్రహించుచున్నాడు. ఘటమునందలి ప్రయత్నానంతరీయకత్వ ధర్మసామ్యమున శబ్దమున ననిత్యము సిద్ధింపని పక్షమున, వాదివలె ప్రతివాది తానును ప్రతిజ్ఞా ద్యవయవమును

ప్రయోగించి (సర్వమనిత్యము. సత్వముగలను దగుటవలన ఘటమువలె) దృష్టాంతమునందలి సత్తాసాధర్మ్యముతో సర్వమనిత్యమనుటయు సిద్ధింపదు. కాబట్టి ప్రతివాది ప్రతిషేధము నిరర్థకమని భావము.

**"దృష్టాంతేచ సాధ్యసాధనభావేన ప్రజ్ఞాతస్యధర్మస్య హేతు త్వాత్తస్య చోభయథాభావాన్నావిశేషః" 5.1.34.**

దృష్టాంతే = దృష్టాంత స్థలమున, సాధ్యసాధనభావేన = సాధ్య వాప్యమని, ప్రజ్ఞాతస్య = నిశ్చయముగా తెలియబడిన, ధర్మస్య= ధర్మము, హేతుత్వాత్ = హేతువగుటవలన, తస్యచ = ఆధర్మము, ఉభయథాభావాత్ = కొండొకదానితో సమానముగను, మరియొక దానితో విశిష్టముగను ఉండుట వలన, అవిశేషః = సాధ్యవ్యాప్యము కాని ధర్మము, న = హేతువుకాదు.

ఒక ధర్మము సమానమైనను లేక విశిష్టమైనను, దృష్టాంతమునందు సాధ్యమును విడిచియుండదు. సాధ్యవ్యాప్యము అని తెలియబడని పక్షమున ఆ హేతువు సాధ్యసాధకము కానేరదు. ప్రయత్నానంతరీయకత్వ మనెడి సమాన ధర్మము ఘటమునందు, అనిత్యత్వ మనెడి సాధ్యధర్మమున కవినా భావి (సాధ్యవ్యాప్యము) అని తెలియబడుచున్నది. కాబట్టి యది పక్షమున - శబ్దమున అనిత్యత్వమును సాధించుచున్నది. సత్వధర్మము సాధ్యావినాభావి - సాధ్య వ్యాప్యముకాదు. కారణమేమన, ఆత్మాకాశాదులో సత్వమున్నది కాని అనిత్యత్వము లేదు. కాబట్టి అది వ్యభిచారిధర్మము. అందుచే నదియనిత్యత్వ సాధకము కానేరదు. కాబట్టి ప్రతివాది ప్రతిఘటన యుక్తి సంగతము కాదని భావము.

నిత్యసమమము : -

**"నిత్యమనిత్య భావాదనిత్యే నిత్యత్వో పపత్తేర్నిత్యసమః" 5.1.35.**

అనిత్యే = అనిత్యత్వము సాధ్యముగా గల వస్తువునందు, ననిత్యమ్ = ఎల్లపుడు, అనిత్యభావాత్ = అనిత్యత్వ ముండుటవలన, నిత్యత్వో పపత్తేః= నిత్యత్వము సిద్ధించుటవలన, నిత్యసమః నిత్యసమమగును.

ప్రయత్నానంతరీయకత్వహేతువుచే శబ్దమునందు సాధింపబడెడి అనిత్యత్వము నిత్యమా? లేక యనిత్యమా? అనిత్యమగునెడ శబ్దము నిత్యమగును కాని యనిత్యముకాదు. అనిత్యత్వమునందలి యనిత్యత పోయిన నిత్యత్వము సిద్ధించునని భావము. లేక అనిత్యత్వము నిత్యమందువేని ధర్మనిత్యతవలన ధర్మియైన శబ్దము నిత్యమగుట సుంతైన సందేహముండదు

కాబట్టి యుభయ విధములను శబ్దము నిత్యమే యగునని ప్రతిఘటించుట నిత్యసమమగునని భావము.

ధర్మము యొక్క నిత్యా నిత్యభావ వికల్పము ద్వారా ధర్మియందు నిత్యత్వమును సాధించుట నిత్యసమము.

**"ప్రతిషేధ్యే నిత్యమనిత్యభావా దనిత్యే అనిత్యత్వోప పత్తేః ప్రతిషేధాభావః" 5.1.36.**

ప్రతిషేధ్యే = ప్రతిషేధింపదగిన శబ్దమునందు, నిత్యం = ఎల్లప్పుడు, అనిత్యభావాత్ = అనిత్యత్వముండుటవలన, అనిత్యే = అనిత్యమయిన శబ్దమునందు, అనిత్యత్వోపపత్తేః= అనిత్యత్వము సిద్ధించుటవలన, ప్రతిషేధాభావః = ప్రతిషేధము సరికాదు.

ప్రతివాదిచే ప్రతిషేధింపదగు శబ్దమును నెల్లపుడు ననిత్యత్వ ముండుననుటచే నది యనిత్యమగుచున్నది. ఎల్లపుడు ననిత్యభావముతో దేనికి సంబంధముండునో యది యనిత్యము అనిత్యభావ సంబంధము దేనికుండునో అది నిత్యము అనుట వ్యాహత మగును. అనిత్యత్వ మనుధర్మము. నిత్యమగుటచే దానికాశ్రయమైన ధర్మియు నిత్యము అనుట యుక్తముకాదు. అనిత్యత్వ మన ధ్వంసము కాబట్టి శబ్దము ధ్వంస ప్రతియోగి యగును. ప్రతియోగి దేనికది ప్రతియోగియో దానికి ఆశ్రయము కాదు. ఘటాభావమునకు ఘటము ప్రతియోగి భూతము అట్లే ధ్వంసమును అభావాంతర్గత మగుటచే నది ప్రతియోగియగు శబ్దాశ్రితము కాజాలదు. కాబట్టి శబ్దము అనిత్యము.

కార్యసమము : –

**"ప్రయత్నకార్యానేకత్వాత్ కార్యసమః" 5.1.37.**

ప్రయత్నకార్యానేకత్వాత్ = ప్రయత్నముచే సంపాదింపదగిన కార్యము లనేకములగుటవలన, కార్యసమః= కార్యసమమగును.

హేతువునకు రెండు అర్థములు కల్పించి తద్వారా పక్షమునందు సాధ్యసంశయము నాపాదించుట కార్యసమ మనబడును. శబ్దమనిత్యము ఘటమువలె ప్రయత్నానంతరీయక మగుట వలన. ఇట ప్రయత్నానంతరీయక మన ప్రయత్నకార్యమని గదా యర్థము! ప్రయత్నము వలన కలుగుకార్యము రెండు విధములుగా నుండును. ఒకచో ప్రయత్నకార్యము కపాలములనుండి ఘట ముత్పన్న మగుట మఱియొకచో, మృత్తికాదులను తొలగించి జలమును అభివ్యక్తపరుచుట(ఉన్నదానిని బయటపెట్టుట). కాబట్టి ప్రయత్నానంతరీయ

కత్వము శబ్దమునుత్పన్నము చేయుచున్న దనుటకంటె నభివ్యక్తము చేయుచున్నదని యేల యనరాదు? ఉత్పాద్యమగుటచే అనిత్యమందుమేని అభివ్యజ్యమగుటచే నిత్యమని చెప్పుట కభ్యంతరమేమి? అని సందేహము కలిగించుట కార్యసమ మనబడును.

**"కార్యాన్యత్వే ప్రయత్నాహేతుత్వ మనుపలబ్ధికార ణోపపత్తేః" 5.1.38.**

అనుపలబ్ధి కారణోపపత్తేః= అనుపలబ్ధికి కారణముపపన్న మగుట వలన, కార్యాన్యత్వే = ప్రయత్నకార్యము లనేకము లయినను, ప్రయత్నా హేతుత్వం = శబ్దాభివ్యక్తియందు ప్రయత్న హేతుత్వము ఉపపన్నము కాదు.

ఒక వస్తువుండియు తెలియబడకుండుటకు ఆవరణాది వ్యవధాన ముండవలయును భూమిలో జలమున్నది. కాని యది యున్నట్లు తెలియకుండుటకు వ్యవధానము కల్పించు ఆవరణము మృత్తికాదులుండును. ఆ యావరణము తొలగిన జలము అభివ్యక్తమగును. అట్లే శబ్ద మభివ్యక్తమయిన దాని కావరణమున్నట్లు తెలియవలయును. అనుపలబ్ధికి హేతువైన ఆవరణాదులను పోగొట్టి ప్రయత్ని మభివ్యక్తికి కారణమగును కాని సాక్షాత్తుగా కాదు. శబ్దమునకు వ్యవధానమున్నట్లే తెలియదు. కాబట్టి ప్రయత్నము దానిని అభివ్యక్తపరుచుటెట్లు? ప్రయత్నకార్యము లనేకములయినను శబ్దమభివ్యక్తమనుట యుక్తము కాదని భావము.

ప్రతివాది జాతిని ప్రయోగించి సిద్ధాంతమును ప్రతిఘటించినపుడు వాది శాస్త్రమునం దుపదేశించినట్లు సత్యమైన సమాధానము నిచ్చుటకే యత్నింప వలయును. తాను కూడా జాతిని ప్రయోగించి అసదుత్తరము నొసంగుట తగదు. అట్లుగాక యిరువురును జాతి ప్రయోగముల నాశ్రయించిన అట్టి ప్రసంగము తత్వ నిర్ణయమును జేయజాలదు. తత్వ నిర్ణయమునకు విఘాతకమైన చర్య యెట్లుండునో తెలిపి శిష్యులకు హితవు చేకూర్పదలచి పరమ కారుణికుడైన మహర్షి సూత్రము నారంభించుచున్నాడు.

**"ప్రతిషేధే ఽపి సమానోదోషః" 5.2.39.**

ప్రతిషేధే ఽపి = ప్రతిషేధ హేతువునందును, సమానః= స్థాపనా హేతువునకు సమానమైన, దోషః= అనైకాంతిక దోషముండును.

తత్వనిర్ణయార్థ మారంభింపబడిన చర్య (కథ) యందు ప్రవృత్తుడై ప్రథమపక్షము నవలంబించిన యొకవ్యక్తి, 'శబ్దము అనిత్యము ఘటమువలె,

ప్రయత్నానంతరీయకమగుటవలన' అని ప్రయోగిం చును. ద్వితీయ పక్షావలంబియైన మరియొకవ్యక్తి జాతిని ప్రయోగింపదలచి, పూర్వహేతువును ప్రతిఘటించుచు, 'ప్రయత్న కార్యము లనేకము లగుట వలన, అని ప్రతిషేధ హేతువును ప్రయోగించును. తృతీయ పక్షమున ప్రథమ స్థాపనాహేతువాది 'శబ్ద ముపలబ్ధము కాకుండుటకు గల ఆవరణాదులుపలబ్ధము కాకుండుటవలన నాహేతువు వ్యభిచరింప' దని సదుత్తర మీయక, నా హేతువు (శబ్దమభివ్యక్తమగుటవలన) వ్యభిచారి యందువేని 'ప్రయత్న కార్యానేకత్వ' మను నీహేతువును శబ్దమునందలి యనిత్యత్వము మాత్రము ప్రతిషేధించుచున్నది. సర్వమును ప్రతిషేధింపదు. కాబట్టియనై కాంతికమగునని ప్రతిఘటించును.

**"సర్వత్రైవమ్" 5.1.40.**

ఏవమ్ = పైజెప్పిన కార్యసమమను జాతి స్థానమునందువలె సర్వత్ర = ఇతరజాతి ప్రయోగస్థలములందును అసదుత్తరమీయవచ్చును.

తత్వనిర్ణయము నభిలషించు స్థాపనాహేతువాది ప్రతివాది యెట్టిజాతిని ప్రయోగించినను తానుమాత్రము జాతిని ప్రయోగింపడు. తత్వము నభిలషింపని వాని కట్టి నియమముండదు. ప్రతివాది యెట్టిజాతిని ప్రయోగించినను తానును జాతినవలంబించి యసదుత్తర మీయ దగును. స్థాపనాహేతువాది తృతీయ పక్షమున సమాధానాభాసము చెప్పగా జాతివాది చతుర్థపక్షమున ప్రతిఘటించును.

**"ప్రతిషేధవిప్రతిషేధే ప్రతిషేధదోషవద్దోషః" 5.1.41.**

ప్రతిషేధ దోషవత్ = నాచే చేయబడిన ప్రతిషేధమున వ్యభిచార దోషమున్నట్లు, ప్రతిషేధ విప్రతిషేధే = నీచే చేయబడిన విప్రతిషేధమునందును, దోషః= అనైకాంతిక దోషముకలదు.

నా ప్రతిషేధమున ననై కాంత దోషమున్న నీ విప్రతిషేధమునందు నట్టి దోషమే యందునని ప్రతిఘటించును, పంచమ పక్షమున స్థాపనాహేతువాది

: **"ప్రతిషేధం సదోష మభ్యుపేత్య ప్రతిషేధ విప్రతిషేధో సమాన దోషప్రసంగో మతానుజ్ఞా" 5.1.42.**

ప్రతిషేధం = తనచే చేయబడిన ద్వితీయ పక్షమును, సదోషః= దోషయుక్తమని, అభ్యుపేత్య= అంగీకరించి, ప్రతిషేధ విప్రతిషేధేస్త్రే= తృతీయ పక్షమున, సమానదోష ప్రసంగః = చెప్పబడిన సమానదోష ప్రసక్తి, మతానుజ్ఞా=

మతానుజ్ఞయగును. మతమును అంగీకరించుట.

ప్రతివాదినగు నీవు నా చెప్పబడిన హేతువున గల దోషము నుద్ధరించి యుటుపై నా చెప్పిన ప్రతిషేధమున దోషము నాపాదింపవలయును. అట్లు చేయక "నా ప్రతిషేధము దోషయుక్తమైన నీ పక్షమును సదోషమే" యని నీదోషము నంగీకరించుటయే మతానుజ్ఞయగును. మతానుజ్ఞ నిగ్రహస్థానము. కాబట్టి నిగ్రహింపబడితివి - ఓడిపోయితివి.

"స్వపక్షలక్షణాపేక్షోపపత్త్యుపసంహారే హేతునిర్దేశే
పరపక్షదోషాభ్యుపగమాత్ సమానోదోషః" **5.1.43.**

స్వపక్ష.......... ఉపసంహారే = వాదిపక్షము నిమిత్తము కాగా పుట్టిన దోషమును పోనాడకయే పరపక్షమున నట్టి దోషము కలదను నుపసంహారమును, హేతునిర్దేశే = హేతువుగా ప్రయోగించిన, పరపక్షదోషాభ్యు పగమాత్ = ప్రతిపక్షదోషము నంగీకరించుట వలన సమానోదోషః= మతానుజ్ఞయనెడి దోషము సమానమే.

ప్రతిపక్షినైన నాదోషయుక్త ప్రతిషేధము నంగీకరించి వాదిపక్షమునను అట్టి దోషమే కలదని దోషము నాపాదించుటచే మతానుజ్ఞ యను నిగ్రహస్థానమునకు నేను గురియైనట్లు, వాదివైన నీవును నీస్థాపనాహేతువు సదోషముగా నంగీకరించుచు నాచే చేయబడిన ప్రతిషేధమునందు అట్టి దోషమునే యుద్భావించినందున నీవును మతానుజ్ఞయను నిగ్రహస్థానమునకు గురియైతివి. కాబట్టి యిరువురి దోషమును సమానమే యని ప్రతివాది యనును.

ఈ చర్చయందు ప్రథమ తృతీయపంచమ పక్షములు వాదివి. ద్వితీయ చతుర్థ షష్ఠ పక్షములు ప్రతివాదివి ఈ పక్షములన్నియు పౌనరుక్త్యము. మతానుజ్ఞ మున్నగు దోషయుక్తములే. అందువలన నొక్కపక్షమును సాధ్యసాధకము కానేరదు. కాబట్టి యిట్టికథ (చర్చ) వలన తత్వనిర్ణయము కాజాలదని వివేకము.

(పంచమాధ్యాయమున ఆద్యాహ్నికము)

# న్యాయ దర్శనము

## పంచమాధ్యాయము

(ద్వితీయాహ్నికము)

పూర్వాహ్నికమున జాతి పరీక్షింపబడినది. ఇందు నిగ్రహస్థానము పరీక్షింపబడవలసి యున్నది. ముందుగా విభజించుచున్నాడు.

**"ప్రతిజ్ఞాహాని ప్రతిజ్ఞాంతరం ప్రతిజ్ఞావిరోధః ప్రతిజ్ఞాసంన్యాసో, హేత్వంతర మర్థాంతరం నిరర్తక మవిజ్ఞాతార్థమపార్థక మప్రాప్తకాలం న్యూన మధికం పునరుక్త మననుభాషణ మజ్ఞాన మప్రతిభా విక్షేపో మతానుజ్ఞా పర్యనుయోజ్యోపేక్షణం నిరనుయోజ్యానుయోగోఽపసిద్ధాంతో హేత్వాబాసాశ్చ నిగ్రహస్థానాని" 5.2.1.**

ప్రతిజ్ఞాహాని మున్నగు నామములు గలిగినవి యిరువదిరెండు నిగ్రహస్థానములు. ప్రథమాధ్యాయమునందు (1.2.19) నిగ్రహస్థాన లక్షణము సామాన్యముగా చెప్పబడినది. పై జెప్పిన ఇరువది రెండు నిగ్రహస్థానములలో అననుభాషణము, అజ్ఞానము, అప్రతిభ, విక్షేపము, పర్యనుయోజ్యోపేలక్షణము, అను నీయైదును అప్రతిపత్తి నిగ్రహస్థానము లనియు, మిగిలినవి విప్రతిపత్తి వాచ్యములనియు నెంచవలయును.

**"ప్రతిదృష్టాంత దర్మాభ్యనుజ్ఞా స్వదృష్టాంతే ప్రతిజ్ఞాహాని." 5.2.2.**

స్వదృష్టాంతే = వాది తన పక్షమున, ప్రతిదృష్టాంత ధర్మాభ్య నుజ్ఞా = ప్రతివాది పక్షధర్మము నంగీకరించుట, ప్రతిజ్ఞాహానిః= ప్రతిజ్ఞాహాని యనబడును.

శబ్ద మనిత్యము ఇంద్రియగ్రాహ్యమగుటవలన, అని వాది ప్రయోగింప, నిత్యమైన సామాన్యము ఇంద్రియగ్రాహ్యమే కదా? కాబట్టి నిత్యమేలకాదని ప్రతివాది యెదుర్కొనిన, ప్రతివాది యాపాదించిన అనైకాంతిక దోషమును పోనాడ లేక, అట్లయిన 'శబ్దము నిత్యమే కానిమ్ము' అని వాది యంగీకరించిన ప్రతిజ్ఞాహాని నిగ్రహస్థానమగును. ఇదియోటమికి స్థానము.

**"ప్రతిజ్ఞాతార్థప్రతిషేధే ధర్మవికల్పా త్తదర్థనిర్దేశః ప్రతిజ్ఞాంతరమ్" 5.2.3.**

ప్రతిజ్ఞాతార్థప్రతిషేధే= వాదిచేప్రతిజ్ఞ చేయబడిన అర్థము ప్రతివాది ప్రతిషేధింప, ధర్మవికల్పాత్ = దృష్టాంత ప్రతిదృష్టాంతము ధర్మబేధము వలన,

తదర్థనిర్దేశః= ప్రతిజ్ఞాతార్థమును దృష్టాంత ధర్మవిశిష్టముగా నిర్దేశించుట, ప్రతిజ్ఞాంతరమ్ = ప్రతిజ్ఞాంతరము.

'ఘటమువలె ఐంద్రియకమగుటవలన శబ్దమనిత్యమ' ని వాది ప్రయోగింప, 'సామాన్య మైంద్రియకమైనను నిత్యముకదా! యని ప్రతివాది వ్యభిచారమును చూపును. అప్పుడు వాది, 'సామాన్య మైంద్రియకమయ్యు సర్వగత మగుటచే నిత్యమగును. కాని, ఘటము ఐంద్రియకమేకాని సర్వగతము కాదు. కాబట్టి యనిత్యమగును. అందువలన 'ఘటము సర్వగతముకాక యనిత్యమైనట్లు శబ్దమును అసర్వగతము అనిత్యమగును' అని ప్రతిజ్ఞను మార్చును. ముందు 'శబ్ద మనిత్యమ' నియు, తదుపరి 'అసర్వగతమగు శబ్ద మనిత్య మ' నియు ప్రతిజ్ఞ చేయును. కాబట్టి పరోక్తదోషమును బోగొట్టదలచి పూర్వప్రతిజ్ఞాతార్థమున విశేషణము జేర్చి మరల ప్రతిజ్ఞ జేయుట ప్రతిజ్ఞాంతర మనబడును.

**"ప్రతిజ్ఞాహేత్వోర్విరోధః ప్రతిజ్ఞావిరోధః" 5.2.4.**

ప్రతిజ్ఞ హేతువు నను నీరెంటి యందునుగల పరస్పర విరోధము ప్రతిజ్ఞావిరోధ మనబడును.

ప్రతిజ్ఞకు హేతువుతోను, హేతువునకు ప్రతిజ్ఞతోను విరోధము ప్రతిజ్ఞావిరోధ మనబడును. 'ద్రవ్యము గుణవ్యతి రిక్తము అని ప్రతిజ్ఞ చేసి 'రూపాదులకంటె వేరుగా నుపలబ్ధము కానందున' అని హేతువుగా చెప్పిన, నిట ప్రతిజ్ఞాహేతువు పరస్పర విరుద్ధములగును.

**"పక్ష ప్రతిషేధే ప్రతిజ్ఞాతార్థాపనయనం ప్రతిజ్ఞాసంన్యాసః" 5.2.5.**

పక్షప్రతిషేధే = హేతువునందు వ్యభిచార దోషము నుద్భావించుట ద్వారా, పక్షము నాక్షేపింపగా, ప్రతిజ్ఞాతార్థాపనయనం = ప్రతిజ్ఞా తార్థమును విడుచుట, ప్రతిజ్ఞాసంన్యాసః= ప్రతిజ్ఞాసంన్యాస మనబడును.

శబ్దమనిత్యము, ఐంద్రియక మగుటవలన, అని వాది ప్రయోగింప, ప్రతివాది ఐంద్రియకమైన సామాన్యము నిత్యమగుచున్న దని వ్యభిచార దోషము నుద్భావింపగా నాదోషమును పోగొట్టదలచి 'శబ్దమనిత్యమని యనువారెవరు?' అని తన ప్రతిజ్ఞను మరుగుపరచ యత్నించును. అట్టియెడ ప్రతిజ్ఞా సంన్యాస నిగ్రహస్థాన మగును.

**"అవిశేషోక్తే హేతౌ ప్రతిషిద్ధే విశేష మిచ్ఛతో హేత్వంతరమ్" 5.2.6.**

అవిశేషోక్తే = విశేషరహితముగా చెప్పబడిన, హేతౌ= హేతువు, ప్రతిషిద్ధే

= ప్రతిషేధింపబడగా, విశేష మిచ్ఛతః= హేతు దోషమును పోగొట్టుటకై దానికి విశేషణము చేర్చుకోరిక గలిగిన హేత్వంతరమ్ = హేత్వంతర నిగ్రహస్థానమగును.

శబ్ద మనిత్యము, ఐంద్రియక మగుటవలన అని హేతువును ప్రయోగించి హేతువున వ్యభిచార దోషమును జూపి ప్రతిఘటింప 'సామాన్యవంతమై ఐంద్రియమగుటవలన' నని హేతువున విశేషణమును జేర్చిదోషమును దిద్దుకొనుట హేత్వంతర నిగ్రహస్థానము.

**"ప్రకృతాదర్థాద ప్రతిసంబద్ధార్థ మర్థాంతరమ్" 5.2.7.**

ప్రకృతాత్ అర్థాత్ = వివాదగ్రస్తమైన ప్రస్తుతవిషయముకంటె, అప్రతిసంబద్ధార్థమ్ = అన్యమైన అసంబద్ధార్థ విషయమును చెప్పగోరిన, అర్థాంతరమ్ = అర్థాంతర నిగ్రహస్థాన మగును.

వాదిగానీ, ప్రతివాదిగానీ ప్రయోగించిన హేతువు నందు వ్యభిచారాది దోషము గ్రహింపబడినపుడు దానిని దాచుటకు గాను ప్రస్తుత విషయమును విడిచి యసంబద్ధ విషయమును ప్రస్తావించుట అర్థాంతర నిగ్రహస్థాన మనబడును.

'శబ్దము నిత్యము. అస్పర్శమగుటవలన' అని ప్రయోగింప సుఖ మస్పర్శమేకాని నిత్యము కాదని హేతువున వ్యభిచార ముద్భావింపగా, హేతువు హినోతి ధాతువునకు 'తున్' ప్రత్యయము చేర్చిన సిద్ధమగును. ఇది కృదంతము. నామము, ఆఖ్యాతము, ఉపసర్గము, నిపాతమునని పదములు నాలుగు విధములు. సుబంతము నామము. కృదంతము ఆఖ్యాతము.' అని యేమోమో యసంబద్ధ ప్రసంగము లాడుటకు ప్రారంభించిన అర్థాంతర నిగ్రహస్థాన మగును.

**"వర్ణక్రమ నిర్దేశవన్నిరర్థకమ్" 5.2.8.**

వర్ణక్రమ నిర్దేశవత్ = వర్ణక్రమమున నున్నట్లు అక్షరమును ప్రయోగించుట, నిరర్థకమ్ నిరర్థకము.

శబ్దము నిత్యము జబగడద వలన' నని యర్థములేని యక్షరమును క్రమముగా ప్రయోగించుట నిరర్థక నిగ్రహస్థానమనబడును.

**"పరిషత్ప్రతివాదిభ్యాం త్రిరభిహిత మప్యవిజ్ఞాత**
**మవిజ్ఞాతార్థమ్" 5.2.9.**

త్రిరభిహితమపి = ముమ్మారు వాదిచెప్పినను, పరిషత్ప్రతివాదిభ్యాం =

మధ్యస్థుల ద్వారా గాని, ప్రతివాదిచే గాని, అవిజ్ఞాతమ్ = తెలియబడకున్న, అవిజ్ఞాతార్థమ్ = అవిజ్ఞాతార్థమగును.

పరుల కజ్ఞానము నాపాదించిన తనకు జయము కలుగునన భ్రమపడి మధ్యస్థులకుగానీ, ప్రతివాదికిగానీ ముమ్మారు చెప్పినను తెలియని విధమున క్లిష్టపదమును ప్రయోగించుట గానీ, వేగముగా నుచ్ఛరించుటగానీ అవిజ్ఞాతార్థ నిగ్రహస్థానమగును.

**"పౌర్వాపర్యాయోగాదప్రతిసంబద్ధార్థ మపార్థకమ్" 5.2.10.**

పౌర్వాపర్యాయోగాత్ = పూర్వాపర సంబంధములేని, అప్రతి సంబద్ధార్థమ్ = పరస్పర మన్వితముకాని పదమును ప్రయోగించుట, అపార్థకమ్ = అపార్థక మనబడును.

పదములు క్లిష్టములు కాకున్నను, అతివేగముగా నుచ్ఛరింపబడకున్నను, అన్వితము కానిపూర్వపర సంబంధములేని పదమును ప్రయోగించుట అపార్థకనిగ్రహస్థాన మనబడును.

వాచ్యార్థములేని పదప్రయోగము నిరర్థక మనియు సముదాయార్థము లేని ప్రయోగము అపార్థక మనియు వివేకము.

**"అవయవ విపర్యాస వచన మప్రాప్తకాలమ్" 5.2.11.**

అవయవ విపర్యాసవచనమ్ = ప్రతిజ్ఞాది అవయవ వాక్యమును క్రమము విడిచి ప్రయోగించుట, అప్రాప్తకామ్ = అప్రాప్తకాల మనబడును.

అనుమాన వాక్యమున, ప్రతిజ్ఞ, హేతువు, ఉదాహరణము, ఉపనయము, నిగమనము నను క్రమమునఅవయవములను ప్రయోగింపవలయును. అట్టిక్రమమును విడిచి ప్రయోగించుట అప్రాప్తకాల మనబడునని భావము.

**"హీన మన్యతమే నాప్యవయవేన న్యూనమ్" 5.2.12.**

అన్యతమేనాపి = అవయవములో నొక్క, అవయవేన హీనమ్ = అవయవము తక్కువైనను. న్యూనమ్ = న్యూనమనబడును.

అనుమాన వాక్యమున ప్రయోగింప వలసిన ప్రతిజ్ఞాది అవయవముల నొక్కటియైనను ప్రయోగింపకుండుట న్యూననిగ్రహస్థాన మనబడును.

**"హేతూదాహరణాధిక మధికమ్" 5.2.13.**

హేతూదాహరణాధికమ్ = హేతువుగానీ ఉదాహరణముగానీ యధికముగా ప్రయోగించిన, అధికమ్= అధికమనబడును.

శబ్దమునిత్యము, శబ్దత్వము కలిగియుండుట వలన, శ్రావణత్వము

కలిగియుండుట వలనను, అని రెండు హేతువులను ప్రయోగించుట, అధిక నిగ్రహస్థాన మనబడును. ఒకేహేతువు వలననర్థము సిద్ధింపజేయుదునని యధిక హేతువును ప్రయోగించిన నిగృహీతుడగును. అట్టి నియమమును ముందుగా నంగీకరింపక అర్థసిద్ధిని బలపరచుట కనేక హేతువులను ప్రదర్శించుట నిగ్రహస్థానము కానేరదని భావము

**"శబ్దార్థయోః పునర్వచనం పునరుక్త మన్యత్రానువాదాత్" 5.2.14.**

అన్యత్రానువాదాత్ = అనువాద స్థలమున తప్ప, శబ్దార్థయోః= శబ్దార్థమును, పునర్వచనం = మరలచెప్పుట, పునరుక్తమ్ = పునరుక్తమనబడును.

అనువాద స్థలమున తక్క తదితరమున, పూర్వోచ్చాంత శబ్దమును మరల నుచ్చరించుట, పునరుక్త మనబడును. శబ్దపునరుక్తము. అర్థపునరుక్తము నని యది రెండు విధములు 'శబ్దము అనిత్యము' శబ్దమనిత్యము, అనిన శబ్దపునరుక్తము, 'శబ్దమనిత్యము' 'నాదమువినాశి' అనిన అర్థపునరుక్తము.

**"అర్థాదాపపన్న స్య స్వశబ్దేన పునర్వచనమ్" 5.2.15**

అర్థాత్ = అర్థమువలన, అపన్నస్య= ప్రాప్తమైన దాని, స్వశబ్దేన అయర్థమునుచెప్పు శబ్దముచేత, పునర్వచనమ్ = మరలచెప్పుట, అర్థపునరుక్తము.

మేఘములు లేక వర్షింపదు; అని "మేఘములున్న వర్షించు" నని చెప్పుట అర్థపునరుక్తమనబడును. ఇట్లే, స్థూలుడగు దేవతద్తుడు దినమున భుజింపడని 'రాత్రి భోజనము చేయును' అనుటయు, అర్థపునరుక్తము.

**"విజ్ఞాతస్య పరిషదా త్రిరభిహితస్యా ప్యప్రత్యుచ్చారణ మననుభాషణమ్" 5.2.16**

పరిషదా = మధ్యవర్తులుగానున్న పరిషత్తు ద్వారా, విజ్ఞాతస్య = తెలియబడి, త్రిరభిహితస్యాపి = వాదిచే ముమ్మారు చెప్పబడినట్టి దానినిసైతము, అప్రత్యుచ్చారణమ్ = అనువదింప లేకుండుట, అననుభాషణమ్ = అననుభాషణము.

మధ్యవర్తులకు తెలిసినట్టిదియు, వాదిచే ముమ్మారు చెప్పబడినట్టిదియు వాక్యము ననువదింప లేకుండుట అననుభాషణ నిగ్రహస్థానమనబడును.

**"అవిజ్ఞానంచా విజ్ఞానమ్" 5.2.17**

అవిజ్ఞానం = పరిషత్తుచే తెలియబడి, వాదిచే ముమ్మారు ప్రయోగింప బడినను తెలిసికొన జాలకపోవుట అవిజ్ఞాన విగ్రహస్థాన మనబడును.

**"ఉత్తరస్యాప్రతిపత్తి రప్రతిభా" 5.2.18**

ఉత్తరస్య = ఉత్తరము, అప్రతిపత్తిః = స్ఫురింపకుండుట, అప్రతిభా = అప్రతిభ యనబడును.

పరపక్షమును ఖండించుటకు తగిన ప్రత్యుత్తరము స్ఫురింపకపోవుట అప్రతిభ యనబడును.

"కార్యవ్యాసంగాత్ కథావిచ్ఛేదో విక్షేపః" **5.2.19**

కార్యవ్యాసంగాత్ = కొండొకకార్యవశమున, కథావిచ్ఛేదః = స్వీకరించిన చర్యను విడుచుట, విక్షేపః = విక్షేప మనబడును.

కొండొకవిషయమును తాత్త్వికముగ నిర్ణయింపనుద్దేశించి, వార్తాలాపము ప్రారంభించి, మధ్యలో కార్యనెపమున రేపో మాపో మరల చెప్పుదునని ప్రసంగమును విడుచుట విక్షేప నిగ్రహస్థానమనబడును.

"స్వపక్షే దోషాభ్యుపగమాత్పరపక్షే దోషప్రసంగో
మతానుజ్ఞా" **5.2.20**

స్వపక్షే = తన పక్షమున, దోషాభ్యుపగమాత్ = దోషమును పరపక్షి చూపగా నంగీకరించి, పరపక్షే = ప్రతివాది పక్షమున, దోషప్రసంగః = దోషము నుద్భావించుట, మతానుజ్ఞా = మతానుజ్ఞ నిగ్రహస్థానము.

ప్రతివాది తన పక్షమున నొక దోషమును చూప దాని నంగీకరించుచు, నాదోషమునే ప్రతివాది పక్షమునందును జూపుట మతానుజ్ఞ యనబడును.

"నిగ్రహస్థాన ప్రాప్తస్యానిగ్రహః పర్యనుయోజ్యోపేక్షణమ్" **5.2.21.**

నిగ్రహస్థాన ప్రాప్తస్య = నిగ్రహస్థానమును పొందినపుడు, అనిగ్రహః = నిగ్రహస్థానమును ప్రకటింపకుండుట, పర్యనుయోజ్యోపేక్షణమ్ = పర్యనుయోజ్యో పేక్షణ మనబడును.

వాది ప్రతివాదులలో నొకరు నిగృహీతులయినపుడు 'నీవు నిగ్రహహింప బడితివి' అని తెలుపకుండుట పర్యనుయోజ్యోపేక్షణ మనబడును. ఇదియు నొక నిగ్రహస్థానమే.

"అనిగ్రహస్థానే నిగ్రహస్థానాభియోగో నిరనుయో
జ్యానుయోగః" **5.2.22**

అనిగ్రహస్థానే = నిగ్రహింపబడని తావున నిగ్రహస్థానాభియోగః = నిగ్రహింపబడితివని యాపాదించుట, నిరనుయోజ్యానుయోగః= నిరమయోజ్యానుయోగము.

నిగ్రహస్థానమును గ్రహింపలేక, తదభావ స్థలమున "నీవు

నిగ్రహింపబడితివి" అని పలుకుట నిరనుయోజ్యానుయోగ మనబడును.

**"సిద్ధాంత మభ్యుపేత్యానియమాత్ కథాప్రసంగోఽ ప సిద్ధాంతః"**

**5.2.23**

సిద్ధాంతం = ఒకానొక సిద్ధాంతమును, అభ్యుపేత్య = అంగీకరించి, అనియమాత్ = అంగీకరించిన దానికి విరుద్ధముగా, కథా ప్రసంగః = చర్చ జరుపుట, అపసిద్ధాంతః = అపసిద్ధాంత మనబడును.

ఒక సిద్ధాంతము నంగీకరించి, చర్చ జరుగునపుడు మధ్యలో ప్రతిపక్షి చూపిన దోషమును తొలగింప జాలకనో మరియే కారణముననో పూర్వసిద్ధాంతమునకు విరుద్ధసిద్ధాంతము నవలంబించుట అపసిద్ధాంత నిగ్రహస్థానమనబడును.

**"హేత్వాభాసాశ్చయథోక్తాః" 5.2.24**

హేత్వాభాసాః = సవ్యభిచారాది హేత్వాభావములు, యథోక్తాః = ఎట్లు చెప్పబడినవో యట్లే నిగ్రహస్థాన పదవాచ్యములని యర్థము.

హేత్వాభాసములకు పూర్వ మేలక్షణము చెప్పబడినదో యట్టి లక్షణముతోనే యవి నిగ్రహస్థానములనబడుచున్నవని భావము. హేత్వాభాసములే నిగ్రహస్థానములు. వానికి వేరుగా లక్షణము చెప్పనవసరము లేదని తాత్పర్యము.

నిఖిలశాస్త్ర నిష్ణాత శ్రీమత్పండిత ముక్తిరామ
ఉపాధ్యాయశిష్య పండిత గోపదేవ విరచిత
'అంబా' వ్యాఖ్యానము
న్యాయదర్శనము సమాప్తము



# యోగ దర్శనము

(పతంజలి ముని ప్రణీతము)

"కళాప్రపూర్ణ"

**డా. పండిత గోపదేవ్**

విరచిత అంబా వ్యాఖ్యానము

ప్రకాశకులు :

**ఆర్యసమాజము, కూచిపూడి, 522 313**

గుంటూరు జిల్లా

అంబాదర్శన గ్రంథమాల - 5
ఆరవ సంస్కరణము - 500 ప్రతులు
జూన్- 2016



వెల : రూ.**80/-**

ప్రతులకు :

ఆర్యసమాజము, కూచిపూడి - 522 313 (తెనాలి తాలూకా).
గుంటూరు జిల్లా. ఫోన్ : 08644-252789. (ఆం.ప్ర.)

శ్రీ మాశెట్టి శ్రీనివాస్ ఆర్య, # 5, మాశెట్టి బిల్డింగ్,
3-3-736 to 740, కంచరిబజార్, సికింద్రాబాద్-3. (తెలంగాణ)
ఫోన్ : 040-66320200.

వైదిక సాహిత్య భండార్, ఆర్యసమాజము,
సుల్తాన్‌బజార్, హైదరాబాద్ - 500 095. (తెలంగాణ)
ఫోన్ : 040-24751656

ఆర్యసమాజము, సీతాఫలమండి, సికింద్రాబాద్ - 61. (తెలంగాణ)
ఫోన్ : 040-27071816

విద్యా బుక్ డిపో, ఆర్యసమాజము ఎదురుగా,
సుల్తాన్ బజార్, హైదరాబాద్. (తెలంగాణ)

*Printed at :* **PRINTSHOP** 040-6632 0300

# పండిత గోపదేవ్

| | |
|---|---|
| జననము | : క్రీ.శ. 1896 మరణము : 26-10-1996 |
| జన్మస్థలము | : కూచిపూడి, తెనాలి తాలూకా |
| జననీజనకులు | : శ్రీ అంబమాంబా రామయార్యులు |
| విధ్యాభ్యాసము | : కూచిపూడి, అమృతలూరు, కాశ్యాదిపీఠములు, సంస్కృతాంధ్ర హిందీ సాహిత్యములు |
| వృత్తి | : వైదిక ధర్మ ప్రచారము, వైదిక సంస్కార వ్యాపకత |
| అభిమాన విషయములు | : షడ్ దర్శనము, నైష్ఠిక బ్రహ్మచర్యము, యోగమార్గ ప్రావీణ్యము |
| స్థాపకులు | : అంబా దర్శన గ్రంధమాల, కూచిపూడి, అంబా రామార్య సత్యార్థ ప్రకాశ ట్రస్టు, సికింద్రాబాద్ మరియు ఎన్నో ఆర్యసమాజములు |

**సన్మానములు :**

1. **"కళాప్రపూర్ణ"** – ఆంధ్ర విశ్వవిద్యాలయం, విశాఖపట్టణం
2. రూ. 10,000/- **"మహర్షి దయానంద సరస్వతి నిధి పురస్కార్"** న్యాస్, ఆర్యసమాజం, పులేరా
3. రూ.5,001/- ఆర్యప్రతినిధి సభ, ఆంధ్రప్రదేశ్, సుల్తాన్ బజార్, హైదరాబాద్.
4. రూ. 25,000/- **వేదవేదాంగ పురస్కార్**, ఆర్యసమాజము, శాంతాక్రూజ్, బొంబాయి
5. రూ. 1,00,000/- శత జయంతి సందర్భముగా **"దర్శన తత్త్వవేత్త"** బిరుదు – శతజయంతి ఉత్సవ సమితి, సికింద్రాబాద్. తేది. 30-7-1995

**రచనలు,అనువాదములు :** సత్యార్థ ప్రకాశము, ఋగ్వేదాది భాష్యభూమిక, నిరుక్తము, ఋగ్వేద భాష్యభాస్కరము I,II,III, వైదిక వినతి I, II, వైదిక దినచర్య, న్యాయ, వైశేషిక, సాంఖ్య, యోగ, వేదాంత దర్శనములు, ఈశ, కేన, కఠ, ప్రశ్న, ముండక, మాండూక్య, ఐతరేయ, తైత్తిరీయ, శ్వేతాశ్వతర, ఛాందోగ్య, బృహదారణ్యకోపనిషత్తులు, ఆస్తికవాదము, అర్థధర్మ మీమాంస, సంస్కారవిధి, భగవద్గీత,ఏసుక్రీస్తు రహస్య జీవనము, పూజ, వైదిక వర్ణ పద్ధతి,అపశూద్రాదికరణము మొదలగునవి చిన్న గ్రంథములు 25 చిన్నవి, పెద్దవికలిపి 60కి పైగా వైదిక గ్రంథములు తెలుగులో రచించినవారు వీరొక్కరే.

# ?

వడ్లమూడి వంశాబ్దిసోముడై జన్మించి, విద్యాజీవియై శిక్షా శాస్త్రమునందు లబ్ధ ప్రతిష్ఠుడై వెలసి, ఆంధ్రలోకమునకు 'సఫలత' ప్రభృతి యమరకృతుల నందజేసి, ఉదారచరితుడు, పరమసాధకుడు, ముక్తసంగుడునై, తెలుగున దర్శనములను రచియింప నెంతయు నన్ను ప్రోత్సహించుటయే కాక నాకు చేదోడువాదోడుగా నుండి యా కార్యము పూర్తిగ కొనసాగకముందే మొన్న మొన్న (25-10-1951) ఆత్మీయుల నపార శోకాంబుధిని ముంచి

కీర్తిశేషుడయిన **శ్రీ వేంకటరత్నం గారికి**

నీ కృతి నెట్లందజేయుదును ?

**గోపదేవ్**

## తొలి పలుకు

ప్రాచీన భారతీయ విజ్ఞానము సంస్కృత వాఙ్మయములో గుప్తమై యున్నది. అందును ప్రామాణిక గ్రంథములు సూత్రప్రాయముగ నున్నవి. ఏత త్కారణమున సంస్కృతమునందే అట్టి గ్రంథములకు వ్యాఖ్యానములు రచింపబడియున్నవి. ఈ కాలమున సంస్కృత భాషాజ్ఞానము మిక్కిలి క్షీణించి యుండుటచేత అట్టి గ్రంథములను వ్యాఖ్యతో పఠించి గ్రహించువారు అల్పసంఖ్యాకులు. అందుచేత అట్టి గ్రంథములకు వ్యావహారిక భాషలలో సులభగ్రాహ్యముగ వ్యాఖ్యానములు వ్రాయుట ఆత్యావశ్యకమై యున్నది. ఈ మహత్కార్యమును నిర్వహించుటకు బూనుకొన్న మహానుభావులలో ఒకరు శ్రీ పండిత గోపదేవ్ గారు.

న్యాయ వైశేషక దర్శనములను రచించి వందనీయులైన వారిప్పుడు పతంజలి మహర్షి రచించిన యోగసూత్రములకు తెనుగున వ్యాఖ్యానము రచించి ప్రశంసనీయులైనారు.

యోగశాస్త్రమునకు హైందవ విజ్ఞానమున 'మహోన్నతమైన ప్రత్యేకస్థానము గలదు. ఈ శాస్త్రము భరతవర్షమున ప్రబలిన విధముగా ఇక నే దేశమునందును వెలయలేదు. ఈ శాస్త్రమెంత గొప్పదో ఇప్పుడిప్పుడు విదేశీయులు కనుగొంటున్నారు. కాని మనవారు అజ్ఞానము చేత బోధపడక అవజ్ఞ సేయుచున్నారు. ఈ యజ్ఞాన తిమిరాన్ని నిర్మూలించుటకు శ్రీ గోపదేవ్ గారి యీ గ్రంథము మిక్కిలి యుపకరించును.

జగత్ ప్రఖ్యాతములైన పతంజలి సూత్రములు అతి క్లుప్తములు, క్లిష్టములు. సంస్కృతమున వీటికి అనేక వ్యాఖ్యానము లున్నవి. వ్యాస, వాచస్పతిమిశ్ర, భోజ, రామానంద సరస్వతీ ప్రణీతములు. తెలుగుభాషలో ఇంత విపులమైన వ్యాఖ్యానము లేదని నా యభిప్రాయము. ఇట్టి గ్రంథమును రచించి ఆంధ్రలోకమునకు మహోపకార మొనర్చినారు గోపదేవ్ గారు. వీరు ఇట్టి గ్రంథముల నింకను వ్రాయవలయునని నా ప్రార్థన.

24-12-51 (మద్రాస్)

(సం.)
పా. వెం. రాజమన్నారు

# గ్రంథ పరిచయము

యోగదర్శనము భారతీయ దర్శనములలో నన్యతమము. ఇందలి సిద్ధాంతములు సాంఖ్య సిద్ధాంతములకు సమానములని చెప్పదగును. సాంఖ్య సిద్ధాంతముల నాచరించు విధానమే యోగమని చెప్పినను చెప్పవచ్చును. యోగ విధానములను క్రియా రూపమునకు దెచ్చి ప్రపంచమునకు మూల తత్త్వములైన ప్రకృతిని, ఆత్మను, బరమాత్మను సాక్షాత్కారము చేసికొనవచ్చును. ఆత్మతత్త్వము ననుభవగమ్య మొనర్చుటకు యోగమే సాధనము.

ఈ గ్రంథమున నాలుగు పాదములు గలవు.

**(1) సమాధి పాదము (2) సాధన పాదము**

**(3) విభూతి పాదము (4) కైవల్య పాదము**

**(1) సమాధి పాదము :–** ఇందుగల సూత్రములు ఏబది యొకటి. ఈ సూత్రములలో సూత్రకారుడు ముందుగా యోగలక్షణము వర్ణించి యటుపై యోగమును విస్తారముగా వివరించియున్నాడు. యోగమన కలయిక యని సామాన్యముగ పలువురు తలంచుచుందురు ; కాని, యీ శాస్త్రమునందు యోగమునకు సమాధి యని యర్థము. చిత్తములో కలుగు సంకల్పములు (వృత్తులు) నిరోధింపబడుటయే సమాధి – యోగము అనబడును. కాబట్టి యీ పాదమునందు చిత్తవృత్తులు, వాని నిరోధించుటకనువగు నుపాయములు వివరింపబడినవి. వృత్తి నిరోధము సమాధియగును. కావున సమాధియన నేమో యందలి సూక్ష్మభేదము లేవో కూడ నీ పాదమునందు వర్ణింపబడినవి. చిత్తము నేకాగ్ర మొనర్చి సమాధి స్థితిని సంపాదించిన యోగి స్వస్వరూపమును (జీవాత్మ స్వరూపము) నెఱుగగలడు. ఆ యవస్థయందు జీవాత్మ పరమాత్మయం దుండి సుఖించును. ఇయ్యదియే జీవనసాఫల్యము. ప్రసంగ వశమున నీ పాదమున నీశ్వరుని యునికిని, లక్షణమును, నామమును సైతము సూత్రకారుడు వివరించియున్నాడు.

ఈ శాస్త్రమునందు ప్రత్యక్షము, అనుమానము, ఆగమము నని మూడు ప్రమాణములే యంగీకరింపబడును. వానిని గుఱించి సూత్రకారుడు 'ప్రత్యక్షానుమానాగమాః ప్రమాణాని' అను సూత్రమున సామాన్యముగ నిర్దేశించియున్నాడు. న్యాయ వైశేషికములందువలె ప్రమాణములను గుఱించి

విశేషముగ నిందు వర్ణింపయత్నము జరుగలేదు. ఈ ప్రమాణములను విశేషరూపమున నెఱుగదలచువారు నాచే రచియింపబడిన న్యాయదర్శనమున జదువ ప్రార్థించున్నాడ.

ఈ పాదమున సూత్రకారుడు చిత్తమును సమాహిత (స్థిర) మొనర్చుటకు ప్రాణాయామాది సాధనము లనేకములు వివరించియున్నాడు. ఇయ్యవి హఠయోగాదులం దెచ్చటను గానరావు ఈ యుపాయములన్నియు నార్షములు; సాత్వికములు. ఎల్లరు నీ యుపాయముల నెఱిగి యాచరించిన సుఖింతురు. చిత్తవిక్షేపమును బోనాడగలుగుదురు. ఇందులకై యరణ్య వాసాదులుకాని, గృహత్యాగముకాని, గుహానివేశాదులుకాని యవసర ముండవు.

**(2) సాధన పాదము :** ప్రథమ పాదమునందు జెప్పిన సాధనములన్నియు సాత్విక బుద్ధిగలవారి కుపకరించును. ఈ పాదమునందు మందబుద్ధులు, విక్షిప్తచిత్తులు యోగమును సాధించు నుపాయములు చూడనగును. సాధించుట కనువగు విషయమిందు జెప్పబడుటచే నియ్యది సాధన పాద మనబడినది. ఈ పాదమున నేబదియైదు సూత్రములున్నవి.

ప్రాణి యనుభవించు దుఃఖముల కన్నిటికి మూలకారణము అవిద్య. దానిని గుఱించి వివరముగా నిందు సూత్రకారుడు వర్ణించియున్నాడు. ఆయవిద్యా మూలకములే రాగద్వేషాది క్లేశములు. క్లేశములవలననే జన్మము, ఆయువు, భోగము నేర్పడుచున్నవి. ఈపాదమున 'సతి మూలే తద్విపాకో జాత్యాయుర్భోగాః 13' అను సూత్రమునందు జన్మమేర్పడు విధము చక్కగ వివరింపబడినది.

ఈపాదమునందే జీవుడు, ప్రకృతి యను నీ రెండింటి స్వరూపము వర్ణింపబడినది. ఇందే జిజ్ఞాస, జిహాన, ప్రేప్స, చికీర్ష, శోకము, భయము, నికల్పము నను నేడును తొలగిపోవుటకు వలయు సప్తవిధ ప్రజ్ఞ యననేమో వర్ణింపబడినది. ఇంతియేగాక పతంజలి మహర్షిచే జెప్పబడిన నీ యోగమునకు అష్టాంగ యోగమని పేరు. ఈ నామమునకు కారణములయిన యమము - నియమము - ఆసనము - ప్రాణాయామము - ప్రత్యాహారము - ధారణ - ధ్యానము - సమాధి అను నెనిమిది యంగములు విస్తారముగా నిందు వర్ణింపబడినవి. అట నా నేర్చిన కొలది ప్రాణాయామ మొనర్చు విధముకూడా వ్రాసియున్నాను. చదువరు లా యా సూత్రములందు వివరముగా జూడగలరు.

**(3) విభూతి పాదము :-** ఇందు సంయమము, దానివలన యోగికి కలుగు సిద్ధులు వివరముగ వర్ణింపబడినవి. అష్టాంగములలోని చివరి ధారణ, ధ్యానము, సమాధి యను మూడంగములు స్వాధీనపఱచుకొనినగాని సంయమము సిద్ధింపనేరదు. సంయమము సాధించిన యోగి సాధించు మహాకార్యము లెన్నో యున్నవి. అవి యన్నియు కైవల్యము నపేక్షించు యోగికి రుచింపవు అందువలన నతడు వానిని ప్రదర్శించుటకు యత్నింపడు స్వయముగ తాను నా సిద్ధులను ఉపయోగించుకొనును. ఈ పాదమునందు నేబదియైదు సూత్రములున్నవి.

**(4) కైవల్య పాదము :** - ఈ పాదమునందు ముప్పది నాలుగు సూత్రములున్నవి. ఇందు చివర కైవల్య లక్షణము చెప్పబడినది. ప్రథమమున సిద్ధులు, వానిలోగల భేదములు వర్ణింపబడినవి. యోగి తన కర్మఫలముల ననుభవించుటకు క్రొత్త శరీరముల నెట్లు నిర్మించుకొనగలడో వివరముగ చెప్పబడినది. విజ్ఞానవాదము, చిత్తమే యాత్మయను వాదము రెండును ఖండింపబడినవి. ధర్మమేఘ సమాధియు వర్ణింపబడినది. వివరములన్నియు నా యా సూత్రస్థలములందే చూడగలరు. ఇట్లీ పుస్తకము నాలుగు పాదములతో రచియింపబడినది. అనేక విషయములిందు పొందుపఱపబడినవి.

**పతంజలి - సూత్ర రచయిత**

ఈ యోగదర్శనము రచియించిన మహానుభావుడు పతంజలిమహర్షి, అందువలననే ఈ యీ గ్రంథము యోగదర్శన మనియేకాక పాతంజల సూత్రము లనియు వ్యవహరింపబడును. పతంజలి యెప్పటివాడో, యెక్కడివాడో యేరికిని నిశ్చితముగ తెలియదు. అభియుక్తుల (శిష్టుల) దృష్టిలో నీ పతంజలి మహర్షియే వ్యాకరణ భాష్యమును, చరకసంహితను రచియించినాడని తెలియుచున్నది. ఈ విషయమును ధ్రువపఱచుటకై యీ క్రింది శ్లోకము నుదాహరింతురు.

> **"యోగేన చిత్తస్య, పదేన వాచాం,**
> **మలం శరీరస్య చ వైద్యకేన**
> **యోఽపాకరోత్తం ప్రవరం మునీనాం**
> **పతంజలిం ప్రాంజలి రానతోఽస్మి'**

ఈ శ్లోకార్థము ననుసరించి చరకము, మహాభాష్యము రచియించిన పతంజలియే యోగదర్శన కర్తయగునెడల నతడు చారిత్రకుల మతమున విక్రమార్క

శకమునకు పదునైదు శతాబ్దాములు పూర్వ మున్నట్లు తెలియుచున్నది. అనగా మూడువేల సంవత్సరములకు పూర్వ మీ మహర్షి యున్నట్లు తెలియుచున్నది. ఇందుల కైతిహాసికులే ప్రమాణము.

నా ప్రార్థనను త్రోసివేయక, అత్యంత కార్యాభారముచే నవకాశము లేనివారయ్యు నా యీ గ్రంథమునకు తొలిపలుకుగా కతిపయ వాక్యములను దయతో వ్రాసి యనుగ్రహించిన శ్రీ పా. వెం. రాజమన్నారు (ప్రధాన న్యాయమూర్తులు, మదరాసు హై కోర్టు) గారికి నా కృతజ్ఞతావందనములు.

– గోపదేవ్

## యోగాభ్యాసము నా స్వల్పానుభవము

నాకు కొంచెము ప్రపంచానుభవము కలుగగానే వివేకానందస్వామి, రామకృష్ణ పరమహంస, గౌతమబుద్ధుడు ప్రభృతుల జీవితములు చదువునవకాశము కలిగినది. ఆ చదువు ఫలమో లేక మఱియే యితర కారణముననో తెలియదు కాని యొంటరి జీవితము నడుపు భావమంతఃకరణమున నవ్యక్తముగా నేర్పడినది. అనంతర మందులకు విపరీతముగ నేర్పడిన అంతరాయము లెట్లో తొలగిపోయినవి. ఆ భావము బలపడినది. ఒంటరితనమును సఫలము జేసికొనుటకై యోగాభ్యాస మవసరమని యెట్లో పొడకట్టినది. అందు సహాయపడగల వారెవరాయని కొన్నాళ్లు దక్షిణా పథమున నా యా యాశ్రమములను దర్శించితిని. అందు ముఖ్యమైన తావులు మదరాసు నగరమున నున్న దివ్యజ్ఞానసమాజ మొకటి, రెండవది రామకృష్ణాశ్రమము. అడయారులోనున్న దివ్యజ్ఞానసమాజమువారి ఆశ్రమవాసి కార్యకర్తతో మాట్లాడగా యోగవిషయమున నా కట తోడుపడువారు లేరని తోచినది. అటుపై రామకృష్ణాశ్రమమున జేరి విచారించితిని. నా యభిలషిత సాహాయ్యము వారివలనను లభింపనేరదని స్పష్టమయ్యెను. అనంతరము ఏర్పేడులో మళయాళస్వామి యాశ్రమమిందుల కుపయుక్తస్థానమని తెలిసి యటచేరి స్వామివారిని కలిసికొని మాట్లాడితిని. ఆశ్రమవాసులలో పెక్కురు భోజనార్థ మక్కడజేరి శ్రీవారి సేవయందు మగ్నులై యున్నట్లు నాకు బోధపడినది. వారెల్లరు నిరక్షరాస్యులు, కుక్షింభరులును. స్వాములతో సంభాషించిన మీదట వారును నాకు యోగాభ్యాసము నందుపకరింపరని నాహృదయమున తోచెను. ఇట్టి యభిలాషతో చేరినవారి కేవో కొన్ని కఠిన నియమములు చెప్పి తన చిత్రము నొకదానిని వారికందజేసి దానికి పూజా పురస్కారములు చేయుడని చెప్పి పంపు నలవాటు స్వాముల కున్నట్లు నాకు గుర్తు. ఇయ్యది ముప్పది సంవత్సరములనాటి మాట. స్వాములకు నాడు సంస్కృతము గానీ, తెలుగు గానీ బాగుగ తెలియదు. భజనలు, పాదపూజలు నాటికే ప్రారంభింపబడినవి. అంతకుపూర్వము వారు తిరుపతి దగ్గఱ నుండువారనియు, నటనుండి కారణాంతరములచే నేర్పేడు చేరినారని తెలిసినది. పరిస్థితులన్నియు తెలిసినమీదట నిజము చెప్పినచో నాకు వారియెడ శ్రద్ధ యేమాత్రము కలుగకపోగా మూఢజనులలో నంధకారము నొకింత పెంపుచేయుచున్నారేమో యని తోచి వారి నుండి సెలవు తీసికొంటిని.

ఇట్లు సహాయకులం గానేక నా తోచిన విధమున నియమబద్ధ జీవనము

గడప నారంభించితిని. సాత్వికాహారము తీసికొనుచు నిద్రాహారముల నత్యల్పముగా నొనరించి యథాశక్తి సంస్కృతము నభ్యసింప నారంభించితిని. రెండు మూడు సంవత్సరములిట్లు గడచిపోయెను. అప్పటికి నా కిరువదియైదు వర్షములు గడచినవి.

అది క్రీస్తుశకము 1927 సంవత్సరము. శ్రద్ధానందుని స్మారక పాఠశాల యొకటి ఢిల్లీ నగరమున నారంభింపబడినది. అందు విద్యాభ్యాసమొనర్చు నిమిత్తముతో నుత్తరాపథమును జేరితిని. ఒకటి రెండు సంవత్సరములు విద్యాభ్యాసము చేయుచు యోగమతి నెట్లో బలపఱచుకొనుచు కడకు (1929లో) హిమవంతుని పాదతలమున నెలకొనియున్న గురుకులము (పోతోహార్)ను జేరితిని. యోగాభ్యాసమునకు వలయు సాధన సామగ్రిని సంపాదింప నీ లోపల నెంతేని యత్నించితిని. యోగము నెఱుగుదుననిన ప్రతివ్యక్తితోను సంభాషించి చూచితిని. కాని యెవరికి నిందు చక్కని ప్రవేశమున్నట్లు కనిపింపదయ్యె. తెలియనివారిని మోసగించు పెద్దలెందఱో దర్శనీయమూర్తులు కనుపింపలేదని పాఠకులూహింప కుందురుగాక. కట్టకడపటికి గురుకులమున నాచార్యులుగా నాడు పనిచేయుచున్న నిఖిలశాస్త్ర పారంగతులు, ఆబాల బ్రహ్మచారులు, కర్మయోగులు, నత్యంత శ్రద్ధేయులునగు శ్రీ పండిత ముక్తి రామోపాధ్యాయులవారి యంతేవాసిత్వము నంగీకరించి యట పాతంజల యోగదర్శనము చదువు భాగ్యము పొందగలిగితిని. దానిని చక్కగా పఠించిన మీదట యభ్యాసమునకై యోగులమని చెప్పుకొనుచు, మూర్ఖులను, సాంసారికులను మోసగించువారి నాశ్రయించుటకంటె స్వయముగానే యభ్యాసమొనర్చుట మిక్కిలి శ్రేయస్కరమని తోచినది. 'స పూర్వేషామపి గురుః కాలేనానవచ్ఛేదాత్' అను యోగ సూత్రమున పఠించిన మీదట, పవిత్రాంతః కరణులగు పరమర్షులకు నాది గురువయిన దేవదేవునే గురువుగా భావించి యభ్యసించుట యుక్తమని నాకు స్ఫురించినది. గురువు లేక యోగము నభ్యసింపరాదనుటచే నేర్పడిన భయమంతటితో దూరమయ్యెను. అటుపై నేను యోగము నభ్యసించిన విధము నిట నంకిత మొనర్చుచున్నాడ. పాఠకులలో నెవరికేని అది రుచించునో నట్లాచరించి లాభము నందవచ్చునను నాశతో నిట్లు చేయుచున్నాను. ఇయ్యదియు మిత్రుల యనురోధ కారణమున వ్రాయుచున్నట్లు పాఠకులకు విన్నవించుకొనుచున్నాడ. భారతమున నేడు యోగులమని చెప్పుకొనుచు యోగాశ్రమముల నేర్పఱచి యట శిష్యులను జేర్చి యాచరించు అనాచారములను

జూచుచు నే నొక యోగాభ్యాసినని చెప్పుకొనుట కెంతయు భయపడుచున్నాను; కాని, సాధకభావముతో దొంగగురువులను జేరి జీవనమును వ్యర్థపఱచుకొనకుండుటకై నా యీ వాక్యము లెవరికేని తోడ్పడగలవను నాసతో నిట్లు చేయుచున్నందులకు క్షంతవ్యుడ.

క్రీ.శ. 1930లో బ్రహ్మచారులతో కలిసి ఆచార్యుల వెంట పర్వతయాత్రజేసి 'పూంచ్' స్టేటు (కాశ్మీరాంతర్గతము) లో నున్న 'బూఢా అమరనాథ్' అను పేరుగల యొక దివ్యక్షేత్రమును జేరితిని. అయ్యది యా సంస్థానమున పుణ్యస్థలముగా నెంచబడును. అట నొక మందిరము (గుడి) పురాతనమని చెప్పబడినది కలదు. అట నా దేవాలయమును కనిపెట్టుకొని యిద్దఱు సంన్యాసు లుండెడివారు. యాత్రికు లప్పు డప్పుడు వచ్చి పోవుచుండువారు. ఈ స్థలము 'పూంచ్' పట్టణమునకు పదునాఱు మైళ్ల దూరమున నరణ్య మధ్యమున గలదు. కాలినడకను దప్ప అటకు వెళ్లను వలనపడదు. అది హిమాలయ మధ్యస్థానమున కొండచరియయందున్నది. స్థాన మతిరమణీయము. దేవాలయము స్వర్ణముఖి యనెడి నదీతీరమున నొక గండశిలపై యొంటిరాతితో నిర్మింపబడినది. ఆ దేవాలయమున కిరువైపుల నాకాశమును చుంబించు పర్వతశిఖరములు, ఎలుగుబంట్లతోను, చిరుతపులులతోను భయంకరములయ్యు అరణ్యములు చూడనింపు గలిగించుచుండును. ఇక్కడ నొక మాసము రోజులుండి మా యాచార్యులు అంతేవాసులను వెంట నిడుకొని గురుకులాభి ముఖులైరి. నేను మాత్రము అక్కడనే ఉండుటకు నిశ్చయించుకొని యాచార్యుల యనుమతిని బడయగలిగితిని.

సహజ సుందరమైన ఆ పర్వత భూమియందు నేను దేవాయలార్చకులైన సంన్యాసులతో నుండసాగితిని. యోగదర్శనమునగల సూత్రములను కంఠస్థ మొనర్చుచు వానిని మననము చేయుచుండువాడ.

చాల దినములనుండి యోగము నభ్యసింపవలయునని యున్న సంస్కారమెట్లో తీవ్రత వహింప నందులకై స్వయముగ ప్రారంభించితిని. నా యభ్యాసమునకు అనువైనవేళ ఉదయము (తెల్లవాఱకముందే) నాలుగు గంటలనుండి యెనిమిది గంటల వరకు అని నిశ్చయించుకొంటిని. సరిగ్గా నా సమయమునకు ముందే శౌచాదిక నిత్యకృత్యములను నిర్వర్తించుకొని యభ్యాసస్థలమునకు చేరుకొనువాడ. అభ్యాసి నియతముగ నిత్యము నొకే క్షణమున నాచరించుటకై దేవాలయమునకు కొంత దూరముననున్న ఒక పురాతన కట్టడము

స్థానముగ నేర్పఱచుకొంటిని. (తరువాత విచారింప నయ్యది 'ఫ్రెంచ్' రాజవంశము వారిలో నొకరి యస్థులను స్థాపించి కట్టిన సమాధి గృహమని తెలిసినది. అభ్యాసము నారంభించుటకు ముందు నీశ్వరుని స్తుతి ప్రార్థనలను వేద మంత్రములతో జేయుచుండెడివాడ. అటు తరువాత శివసంకల్ప సూక్తమును పఠించెడివాడ. ఈ మంత్రములు తెనాలి ఆర్యసమాజము వారిచే ప్రచురింపబడిన 'వైదికసంధ్య' యను పుస్తకమున నెల్లరు జూడగలుగుదురు.) అనంతరము పతంజలి ప్రభృతియోగసిద్ధులను మనస్సుననే స్మరించి నమస్కరించి యలసట గలుగువఱకు ప్రాణాయామము చేయుచుండెడివాడ.

**అభ్యసించిన ప్రాణాయామ ప్రకారము :**

ముందుగా నొక కంబళి పఱచి దానిపై నొక వస్త్రమును మడిచివేసి యాసనము నొకింత యెత్తుగా నేర్పఱచుకొని, యందు సిద్ధాసనముతో కూర్చుండెడివాడ. వెన్నెముక తిన్నగా నుండునట్లు చూచుచుండెడివాడ. గుదద్వారమున గట్టిగా బిగించి కొంచెము పైకిలాగి పట్టి యుంచి రెండు నాసికాపుటములతోను కొంత తడవు భస్త్రికా ప్రాణాయామము చేయుచుండెడివాడ. శ్వాసకోశములందున్న గాలిని బలముతో బయటికి నిశ్వసించి వెంటనే మరల శ్వాసకోశములను గాలితో నింపుటను భస్త్రికా ప్రాణాయామముందురు. కంసాలి వాని తిత్తితో కొలిమినూదినట్లు గాలిని నాసికాపుటములతో బయటికి, లోపలకు నడుపుట జరుగును కాబట్టి దీనిని భస్త్రికయందురు. ఈ ప్రాణాయామమున రేచకపూరకములే యుండును. కుంభకముండదు. విరామము లేకుండ అలసట గలుగువఱకు నిట్లు సుమారు పదునైదు నిముషములు చేసి యీ క్రియను ముగించెడివాడ. ఇట్లు చేయుట వలన రెండు నాసికా పుటములనుండి ధారాళముగ ఉచ్ఛ్వాస నిశ్వాసములు జరుపగలుగుదుము. నాసికా పుటములనుండి సమముగ గాలి ప్రవహించును. శ్లేష్మాదుల యాటంకము తొలగిపోవును. నాసిక కెదురుగా నొక ప్రాతగుడ్డ నుంచుకొనవచ్చును. నాసికవెంట వెలువడు శ్లేష్మాది మలములు దానితో శుభ్రపఱచుకొనవచ్చును. అందులకై యాసనము నుండి లేచుట తగదు. అభ్యాసి యొకేయాసనమున కనీసమొక యఱంగంటకాలము కదలక కూర్చుండుటకై యలవడి యుండవలయును.

అనంతరము కుంభక సహిత ప్రాణాయామము నారంభించి యొక గంటతడవు దాని నాచరించెడివాడ. ఈ ప్రాణాయామము రెండు విధములు :

(1). బాహ్యకుంభకము, (2). అంతఃకుంభకము. బాహ్య కుంభకమనగా ఊపిరి తిత్తులలోని సంపూర్ణ వాయువును బలపూర్వకముగ బయటికి నిశ్వసించి వెలుపలి వాయువును లోపల ప్రవేశింపనీయకుండుట. ఇట్లు అఱనిముషము మొదలు ఒక నిముషమువఱకు ఊపిరితిత్తులను ఖాళీగా నుంచవచ్చును. మొట్టమొదట అఱనిముషముండలేక పోవుదురు. కాని క్రమముగ సమయము పెరుగును. అట్లు వెలుపలి గాలిని లోపల ప్రవేశింపనీయక యుండగలిగినంత తడవుండి యటుపై నెమ్మది నెమ్మదిగ గాలిని లోపలికి పోనీయవలెను. ఇది యొక ప్రాణాయామము. ఇట్లొక యఱగంట వఱకు బాహ్యకుంభక ప్రాణాయామములు చేసితిని. ఎవరేని అంతతడవు సేయలేకున్న ఓపిక యున్నంత తడవే చేయవచ్చును. కాని ప్రాణాయామ మొకదాని తరువాత మఱియొకటి నిరంతరము చేయవలయును. మధ్యలో నాగి యాగి చేయరాదు. బలముతో గాలిని బయటికి రేచించి యూపిరితిత్తులను ఖాళీచేయునపుడు శరీరము కదలరాదు. కన్నులు మూసియుంచుట శ్రేయస్కరము. ప్రాణాయామ సమయమున నితర చింతలుండరాదు. ఈ బాహ్యకుంభకము అభ్యాసికి నెక్కుడు శుభకరము. త్వరగా ఫలము నిచ్చునది.

**అంతఃకుంభకము ప్రాణాయామము :**

బాహ్యకుంభకము చేసిన తదుపరి యంతఃకుంభకము చేసితిని. వెలుపలనున్న గాలిని నెమ్మది నెమ్మదిగా గాలిని లోపలికి పీల్చి (పూరించి) యూపిరితిత్తులను పూర్ణముగా నింపవలయును. అనంతర మట్లు నింపినగాలిని బయటికి రాకుండునట్లు ఆపవలయును. ఇక నిలువజాలమని తోచినపుడు నెమ్మది నెమ్మదిగ బయటికి విడువవలయును. ఇట్లొకమాఱు చేసిన నొక ప్రాణాయామమగును. అఱగంట కాలము ప్రథమమున నిట్లు ప్రాణాయామములు చేసితిని. ఇందు పూరక సమయముకంటె కుంభకసమయము నాలుగు రెట్లుండ వలయును. రేచక సమయము రెండు రెట్లుండునట్లు యత్నింప వలయును. ఇందులకై గడియారము నుపయోగింపవచ్చును. పూరకము అఱనిముషమైన కుంభకము రెండు నిముషములు, రేచకము ఒక నిముషము ఉండునట్లు చూడవలయును. ప్రథమమున నిట్లు నియమబద్ధము చేయలేకపోవచ్చును. కాని క్రమముగ నియమమునకు తేగలుగుదుము. ఈ కుంభక సమయము మూడు నిముషముల వఱకు పెంచవచ్చును. నే నంతవఱకే చేయగలిగితిని. ఇంతకంటె నెక్కుడు కాలముంచుట హానికరమని నా యభిప్రాయము. ఇంతకంటె నెక్కుడు

సమయము అంతఃకుంభకము నభ్యసించిన సాధకులును నాకు గనిపింపరైరి. సమయమును తెలిసికొనుట గడియారముకంటె 'ఓం ఒకటి, ఓం రెండు, ఓం మూడు' అని ప్రణయ సహితమయిన గణన నుపయోగించుట శ్రేయస్కరమేమో? సాంప్రదాయకులు మోకాటిచిప్ప నఅచేతితో ముమ్మాటు స్పృశించి చిటికె వేయుటకు మరియు సమయము ఒక మాత్ర యందురు. ఇట్టి మాత్రలతో రేచక పూరక కుంభకముల సమయమును గుర్తింపవచ్చును. ఎవరికేది సులభము, ఏకాగ్రతకు నుపయుక్తము నగునో దాని నుపయోగింపవచ్చును. ఇట్లు ప్రార్థన సమయము మొదలు ఒకటిన్నఱగంటకానీ, రెండుగంటలుకానీ సమయము వెచ్చించి యటుపై చిత్తైకాగ్రత కొఱకు నీ క్రింది క్రియ నాచరించెడివాడ.

**ప్రణవ జపము :**

పై విధముగ ప్రాణాయామము నభ్యసించినందున మనస్సు(చిత్తము) అలసిపోయి చాంచల్యమును విడిచి యుండెడిది. అట్టి చిత్తమును భ్రుకుటి యందుంచి ప్రణవము నర్థ సమేతముగ ననేక పర్యాయములు స్మరించెడివాడ. ఇట్లొకగంటసేపు నిత్యము నభ్యసించితిని. ఈ సమయమున నుచ్ఛ్వాస నిశ్వాసములు నాసికాభ్యంతరముననే జరిగెడివి. బయటికి లేనట్లే తోచెడివి. ఒక్కొక్క వేళ తన్ను తా మఱచెడి స్థితియు నేర్పడుచుండెడిది. ఉచ్ఛ్వాస నిశ్వాసములు లేకుండుస్థితిని సంపాదించుటయు నొకవిధమగు ప్రాణాయామమే. ఇయ్యది కేవల కుంభక మనబడును. ఈ స్థితి యెంత పెరిగిన నంత యభ్యాసికి మంచిది. ఇట్లు నిత్యము నుదయము మూడుగంటలు, సాయంకాలము రెండుగంటలు అభ్యాసమునకై యుపయోగించితిని.

పది దినములు శాంతముగ గడచినవి. అభ్యాసమున రుచి పెంపయినది. ఒకనాడు అంతఃకుంభక ప్రాణాయామము సేయ మొదలిడి యొకటి రెండు ప్రాణాయామము లాచరించితిని. మూడవసారి పూరకము పూర్తిఅయి, కాకముందే నాభిస్థానమున నొకవిధమగు సంచలన మతివేగముగా ప్రారంభమై నాభి ప్రదేశము ముందువెనుకలకు ఊగసాగెను. ఒక మనుజుడా భాగము నట్లు చలింపజేయ బుద్ధి పూర్వకముగ యత్నించిన నెన్నడు సఫలము కా జాలడు. వేగముగ నట్లు చలింప నారంభింపగానే నేను నా యాసనమున స్థిరముగ కూర్చుండ జాలకపోయితిని. పూరించిన వాయువెటుపోయినదో తెలియదు. నా కా స్థితి

వింతగా దోచినది. ఇట్లు జరుగునని యెన్నడు చదివికాని, వినికాని యెఱుగనైతి. చిత్తము నొకవిధముగ కుదుట పఱచుకొని మరల ఆసన బద్ధుడనై కూర్చుండి ఒకమాటు పూరించి కుంభింప యత్నించితిని. రెండవమాటు నట్లే సంచలించి నేను ముందుకో వెనుకకో పడిపోయినట్లు గుర్తు. పడిపోయినపుడు తగిలిన దెబ్బకూడ నాకు తెలియదు. ఈ మాటు కొంచెము భయమేర్పడినది. అందువలన నాటి కా ప్రాణాయామమాపి మిగిలిన కార్యక్రమము యథాపూర్వకముగ నడిపితిని. దినమంతయు చిత్త మా విషయముననే లగ్నమై యుండెను. యోగదర్శన మంతయు గాలించి చూచితిని. ఎక్కడను నే వ్యాఖ్యానకారుడు నీ విషయము నుల్లేఖించినట్లు కనజాలక పోయితిని. సాయంతనము కూడ మరల ధైర్యముతో నంతఃకుంభకము చేయ నారంభించితిని. ఒక మాటు ముందుకు మఱియొకమాటు వెనుకకు పడుటయు, ఫాలముననను శిరస్సుననను బొప్పులు గట్టుటయు సంభవించినది. ఇట్లు వరుసగా మూడు నాలుగు రోజులు ఎన్ని సారులు యత్నించి యెన్ని దెబ్బలు తింటినో యిప్పుడు గుర్తులేదు. కాని యత్నము విడువనైతి. పరిస్థితిని తెలిసికొని నాకు తోడ్పడు వ్యక్తిని గానక కొంత చింతించియుంటిని. నా యీ స్థితిని చూచి యటనున్న సంన్యాసులలో నొకడు (బంగాలీ సంన్యాసి) 'నీవు కూర్చుండి యభ్యసించు స్థలముసమాధి. అందువలన నీకాస్థానవర్తి క్షుద్రదేవతలు బాధ కల్గించుచున్నవి. కాబట్టి నీ వా స్థలమును విడిచిపెట్టు' మని తన విశ్వాసము ననుసరించి నన్ను బలవంత పెట్టుటయు జరిగినది. కాని నా కా స్థానిక దేవతలయందు కానీ, దయ్యములందుకానీ విశ్వాసమే లేదు. అందువలన నా యభ్యాసమును విడువనైతి.

దాదాపు వారము రోజులిట్లే పడుచు లేచుచు నెన్ని దెబ్బలకు గురియైనను నభ్యాసము సాగించుచునే యుంటిని. అనంతర మొకనా డా నాభికమలమువద్ద నేమి జరుగెనో తెలియదుకాని, అంతఃకుంభకము సరిగా జేయగలుగుటయేగాక నాభికి దిగువగా వాయువు పోవుచున్నట్లు నాకు తోచినది. అట్లు వాయుసంచారము వెన్నెముక చివరిభాగమువఱకు జరిగినట్లు తెలియవచ్చెను. ఆ వాయు సంచార మే నాడీ ద్వారమున జరిగెనో గ్రహింప జాలక పోయితిని. శ్వాసాశయములందు కుంభింపబడిన వాయువే యట్లు సంచరింపసాగెనా? లేక యా వాయువుచే ప్రేరేపింపబడి నాభిస్థలమున నున్న వాయువులో గతి కలిగెనా? స్పష్టముగ నిశ్చయింపజాలకపోయితిని. కాని కుంభకానంతర మొకవిధమగు వాయు

సంచారము నాభికి క్రిందకలుగుట నిక్కువమని చెప్పగలుగుదును. అయ్యది స్పష్టమైన యనుభవము. శరీరశాస్త్రజ్ఞులకిది యందరాని విషయము. ఈ యనుభవము శాస్త్రవిరుద్ధమని వారనవచ్చును. వారి శాస్త్రమున మానవుడు లోపలికి తీసికొను వాయువు శ్వాసాశయములలో జేరి యా యాశయముల నల్లుకొనియున్న యసంఖ్యాకములగు నాడులలో హృదయమునుండి చేరిన చెడు రక్తమును శుభ్రమే చేయగలుగును. కాని యన్య స్థలమునకది పోజాలదు. కావున వారి కీ యనుభవము వింతగా నుండును.

మఱియు నాటినుండి నా నాభికమలమునం దేదో మార్పేర్పడినట్లు నాకు తోచినది. స్థూలముగ నేను చూడగలిగిన మార్పు నాభి పూర్వముకంటె నిమ్నమై గంభీరమగుట యొకటి. సాధకులలో నెందఱ కీ యనుభవ మున్నదో చెప్పజాలను.

ఇట్లు వాయు సంచారము నాభిక్రింది ప్రదేశమునందు కలిగి యది గుదద్వార సమీపమున వెన్నెముకలో ప్రవేశింపసాగెను. ఈ సంచారానుభవము కలిగిన తదుపరి మరల నాభిప్రదేశము కదలుట కానీ, ఆసనబంధము విడిపోవుటకానీ, ఇటునటు పడిపోవుటకానీ యెన్నడును జరుగలేదు. ఇట్లొక వారము పది దినములు గడచియుండును. నిత్యము నా కార్యక్రమము సక్రమముగ జరుగుచునే యుంటిని. ఈ యనుభవము వలన నభ్యానమున శ్రద్ధాసక్తులెక్కుడయ్యెనని చెప్పక తప్పదు. అనంతర మొకనాడు మూలస్థానమున ప్రవేశించిన వాయువు వెన్నెముక నుండి యూర్ధ్వమునకు కొంత దూరము(మూడు నాలుగుంగుళములు) పోయి యట నడ్డగింపబడ నారంభించెను. ఈ యనుభవమును నాకు వింత గూర్చకపోలేదు. పంట కాలువలో ప్రవహించు నీరు ఒక యడ్డుకట్టను భేదించుకొని పోయి కొంతదూరమున మఱియొక యడ్డుకట్టకు తాకి యూగుచున్నట్లు నాకియ్యది తోచెడిది. ఈ వాయు సంచార మార్గమున నీ యడ్డు కట్టలేమో నేను చెప్పజాలను. ఈ యడ్డంకులు గలిగిన స్థానములన్నియు నాడీగ్రంథులేమోయని నా యూహ. పది దినములకొక స్థానము చొప్పున నాఱో యేడో స్థానములు భేదింపబడినట్లు గుర్తు. కుంభించిన వాయువు శ్వాసాశయములనుచేరి యటనుండి క్రమముగా నాభి, మూలస్థానము (గుదద్వారము) లగుండ వెన్నెముకలో ప్రవేశించి యనంతర మూర్ధ్వముఖమై యట నట నాఱేడు స్థానములను భేదించుకొనుచు ముచ్చిలిగుంటవఱకు చేరినది. ఇది యొక వింతయైన యనుభూతి. ఇయ్యది యోగసాధకుల పరిభాషలో చెప్పిన షట్చక్ర

భేదన మనవచ్చును. చక్రములు, వాని దలములు, ఆయా దలములకు రంగులు, బీజాక్షరములు, దేవతలు నన్నియు కల్పితములని నా యూహ.

ఈ కాలమున నభ్యాస క్రమములో ప్రణవజపము చేయుచు చిత్తమును భ్రుకుటియందు నిలిపి కేవల కుంభకము సాధించునపుడు నాకు కనబడిన వింత దృశ్యములు, వాని క్రమము, నిట వివరింప జాలకున్నందులకు పాఠకులు క్షమింతురుగాక. బహు దినములు గడచినందున క్రమము స్మృతి పథమున లేదు. అవి యన్నియు నియమ పూర్వకముగ నభ్యసించు ప్రతి సాధకునకు సాధారణముగ కనిపించు దృశ్యములే యనియు నా తలంపు. అందువలన వాని నిట వివరముగ వ్రాసి పుస్తక కాయమును పెంచుట యనవసరమనియు నెంచుచున్నాడ.

కాని, ఈ కాలమునందు నాకు గలిగిన ఒక విచిత్రమైన యనుభూతిని పాఠకులకు వినిపింపకుండుట భావ్య మనిపింపకున్నది. ఆ యనుభూతి నా కీ మార్గమున నెంతటి యువకృతిని కలిగించినదో మాటలతో చెప్పజాలను. అట్టి మహోపకృతి నొనర్చిన యనుభవమును వ్రాయక విడుచుటకు మనస్సంగీరింపకున్నది. కాని దానిని వివరించుటెట్లో తెలియక తటపటలాడవలసి వచ్చుచున్నది. మఱియు నీ వైజ్ఞానిక యుగమున దానిని ఆ సాధకులకు బుద్ధి గమ్యమొనర్చి నమ్మింపజేయు విధియు కనిపింపకున్నది. కాబట్టి మౌనము వహించుటయే యుత్తమ మనిపించుచున్నది. అయినను ఓపికతో నాలుగు వాక్యములు చదువుదురు గాక!

ఇంత తీవ్రముగ నే నభ్యాస మొనరించునపుడు శరీరమున నేవో కష్టములు కలుగకుండుట యస్వాభావికము. శరీరమలసటచెంది నిత్యము కొఱగానిదివలె నగుచుండెడిది. అంగములలో నప్పుడప్పుడేవో కొన్ని బాధలు కలుగుచుండెడివి. ఇవి యెట్లు తొలగునా యని యొకింత చింతవొడముచుండెడిది. కాని, రాత్రి విశ్రాంతి నపేక్షించి మేను వాల్చినచో లేక మధ్యాహ్నమున శ్రమదీర్చుకొనుటకై శవాసనమున దేహమును శిథిలమొనర్చి యున్నపుడో యెవరో యపరిచితమూర్తి నా శరీరమున నావేశించి యంగమునగల నొప్పుల నన్నిటిని చేతితో తీసివేసినట్లు తొలగించుచుండెడివాడు. ఆ యనుభూతిలోగల వింతయైన వేదన (ఫీలింగ్) నెట్లు వర్ణింపవలయునో తెలియకున్నది. రెండు మూడు క్షణములలో నా శరీరమున గల బాధలు, అలసట యంతయు నెటు పోయెడిదో తెలిసెడిదికాదు. శరీరము నూతన శక్తితో నుత్సాహభరితమై యలరారు చుండెడిది. ఈ యనుభవము నా కీ

మార్గమున నెంతటి యుపకారము చేసినదో వర్ణింప జాలను. ఇట్టి యనుభవము లెన్నియో కలవు. వాని నీ గ్రంథమున పొందుపఱచుట యుక్తము కాదని విడుచుచున్నాఁడ. ఆఱు మాసములలో నిట్టి యనుభవముల సంపాదింపగలుగుట నాకే యాశ్చర్యము గొలిపినది. ఇట్లే యభ్యాసము చేయుచు శారీరకముగాను, మానసికముగాను నేను మిక్కిలి లాభము పొందగల్గితిని. ఆత్మదర్శనాదులకు వలయు సాధన యింకను చేయవలసినదెంతయో మిగిలియున్నది. పాతంజల దర్శనము పఠించుచు నేర్చిన కొలది నిత్యము నా యభ్యాసము (నింకను) స్వల్పముగా నైనను సాగించుచున్నాఁడ. పాఠకుల లాభము కొఱకిట కొంచెముగ నంకితము చేసితిని.

లోకమున ప్రచారములోనున్న నేతి, ధౌతి, బస్తి, నౌళి మున్నగు హఠయోగసాధన లెన్నో గలవు. అవి యన్నియు శారీరకముగ నొకింత యుపయోగించినను ఆధ్యాత్మిక దృష్టితో చూచిన ప్రయోజనము స్వల్పమని నా యభిప్రాయము. ఇవి యన్నియు నేర్చియు నే నభ్యసింపనైతి. ఇందు పొరపాట్లుపడి యనేక రోగములకు గురియైనవారిని నేనెఱుగుదును. మానసికముగాను, ఆధ్యాత్మికముగాను వారిలో నెట్టి వికాసము కలుగక పోవుటయు నిశ్చితము.

అభ్యాసము చేయగోరు వ్యక్తులకొకింత యుపయోగ ముండగలదను నభిప్రాయముతో నీ వాక్యములను వ్రాసితిని. అన్యథా భావింపకుందురుగాక!

–గోపదేవ్.

## విషయ సూచిక

ఓమ్

# యోగదర్శనము

## సమాధి పాదము

జీవుడు ప్రకృతి (శరీరము) లోనుండి కష్టసుఖముల నొందుచున్నాడు. శరీర సంబంధముచే నేర్పడు నానావిధ కష్టములునుండి వేరై కైవల్యము ననుభవింప గోరునేని ప్రకృత పురుష వివేకజ్ఞానము (శరీరము తాను కాదు అను తెలివి) కలుగవలయును. అందుకు చిత్తము సమాహితము కావలయును. చిత్తసమాధానము - చిత్తైకాగ్రత - మనోనిశ్చలత యోగము నభ్యసింపక సంభవింపదు. కాబట్టి కరుణానిలయుడగు పతంజలి మహర్షి జగత్తు నుద్ధరించు బుద్ధితో యోగమును వివరముగా బోధింపదలచి శాస్త్రము నారంభించుచున్నాడు.

**అథ యోగానుశాసనమ్ 1**

యోగానుశాసనమ్ = సమాధి శాస్త్రము, అథ = ఆరంభింపబడినది . అథ శబ్దము అధికారమును తెలుపును. అధికార మన ప్రారంభము. 'యుజ్ సమాధౌ' అను క్రియచే యోగమేర్పడుచున్నది. కాబట్టి యోగమన సమాధి. సమాధి యన నేమో, దాని సంపాదన యుపాయము లేవో, ప్రయోజనమేమో తెలుపు విధము అనుశాసనము - శాస్త్ర మనబడును..

యోగలక్షణము, యోగమున కుపాయములు, యోగప్రయోజనాదులు వివరముగా తెలుప ఋషి ప్రారంభించినాడని భావము.

(మధుమతి, మధుప్రతీక, విశోక, సంస్కార శేషము నని చిత్తమునకు కొన్ని యవస్థలు కలవు. వీనిని చిత్తభూములనియు నందురు. చిత్తము యొక్క సార్వభౌమిక ధర్మమే సమాధి.)

అవతారిక - యోగలక్షణము :

**యోగశ్చిత్తవృత్తి నిరోధః** 2

చిత్తవృత్తినిరోధః = చిత్తవృత్తులను ఆపుట, యోగః = యోగము.

మనస్సు, బద్ధి మున్నగు శబ్దములచే చెప్పబడు అంతఃకరణ మీ శాస్త్రమున చిత్త మనబడును. శాంతము, ఘోరము, మూఢము నని వృత్తులు ముివ్విధములు ముందు వివరింపబడును. మనము వస్తువుల నెఱుగునపుడు చిత్తము ఇంద్రియములద్వారా వస్తువును చేరి దాని యాకృతిని పొందును. నీరు కాలువల ద్వారా పొలము చేరి దాని యాకారమును పొందునట్లు చిత్తము వస్తువు యొక్క ఆకారమున మార్పుచెందుట వృత్తి యనబడును. అభ్యాసము, వైరాగ్యమున్నగు రీతులతో చిత్తమును వృత్తి రూపము నొందకుండ చేయుటయే యోగము. కాగా నొక విధముగ చిత్తావస్థయే యోగమని భావము. ఆ యోగము సంప్రజ్ఞాతము, అసంప్రజ్ఞాతము నని రెండు విధములు. అభ్యాసము, వైరాగ్యము మున్నగు సాధనముల ననుష్ఠించుటవలన వృత్తులన్నియు నిరోధింపబడును. అపుడు చిత్తముచే ధ్యాన విషయమైన తత్త్వమొక్కటి తక్క మఱియొండు తెలియబడదు. ఇట్టి శుద్ధసాత్విక చిత్త పరిణామము సంప్రజ్ఞాత సమాధి యనబడును. చిత్త మెట్టి స్థితియందుండ ధ్యేయ వస్తువు నిస్సంశయముగా ఉన్నదున్నట్లు తెలియబడునో ఆ యవస్థావిశేషమే సంప్రజ్ఞాత సమాధి యని భావము. వృత్తుల నిరోధము యోగ మని కదా యోగ లక్షణము సంప్రజ్ఞాత సమాధియుందు ధ్యేయ వస్తువునకు సంబంధించిన వృత్తియొకటి యున్న పక్షమున నది యోగమెట్లు కాగలదని సందేహింప వీలగును. కానీ, ధ్యేయాకారమైన సాత్త్వికవృత్తి యొండు మిగిలియున్నను రాజస తామస వృత్తులన్నియు నిరోధింపబడును. కాబట్టి, వృత్తుల నిరోధము యోగమను లక్షణమున దోషము లేదని తెలియనగును. సంప్రజ్ఞాత సమాధితో కూడిన చిత్తమే యేకతత్త్వము ఆలంబనముగ కలదగుట వలన ఏకాగ్రమనియు, సమాధి కలదగుట వలన సమాహిత మనియు యోగులచే చెప్పబడును.

చిత్త మేకాగ్రము కాగా ఏ సమాధి పారమార్థిక తత్త్వమును తెలియజేయునో, అవిద్యాది క్లేశములను క్షయింపజేయునో, కర్మ బంధములను శిథిలము చేయునో, వృత్తి హీనత కభిముఖము చేయునో యా సమాధి సంప్రజ్ఞాత

సమాధి యని వ్యాసమహర్షి

పర వైరాగ్యముతో నభ్యాస మొనర్చు యోగిపైన వర్ణించిన ధ్యేయాకార చిత్తస్థితిని సైతము నిరోధింపగా వేయించిన విత్తనమువలె కార్యకారి కాక వాసనా రహితమై సంస్కార మాత్రముగా నిలిచియుండు ఒకానొక చిత్తావస్థ అసంప్రజ్ఞాత సమాధి యనబడును. సకల వృత్తులు నిరోధింపబడుటచే సమాహితమై చిత్తము నిరుద్ధ మనబడును. పైన వర్ణింపబడిన రెండు విధములగు చిత్తావస్థలే యోగమనబడును. మిగిలిన అవస్థలు క్షిప్తము, మూఢము, విక్షిప్తము నని ముప్విధములు. రజోగుణాధిక్యముచే నెల్లపుడు నాయా విషయములందు ప్రేరేపింపబడుచు నెక్కుడు చంచలముగా నుండు చిత్తము క్షిప్తమనబడును. తమోగుణాధిక్యముచే నిద్రాదివృత్తులు కలదై జడత వహించియుండు చిత్తము మూఢమనబడును, సత్వగుణమెక్కుడు గలదై యప్పుడప్పుడు పరమార్థతత్త్వమగు ధ్యేయవస్తువునందు నిలుచునదై క్షిప్తావస్థతో కూడియుండు చిత్తము విక్షిప్తమనబడును. ఇట్టి యవస్థలు యోగ మనబడవు.

చిత్తము స్వభావముచే త్రిగుణము. ప్రకాశ స్వభావముచే సత్వగుణము, ప్రవృత్తి స్వభావముచే రజోగుణము, స్థితిశీలముచే తమోగుణము చిత్తమునందు తెలియనగును. ప్రకాశ మన జ్ఞానము. జ్ఞానము, ప్రసన్నత, ప్రేమ, లాఘవము మున్నగునవి సత్వగుణమును తెలుపును. కాబట్టి వీనిని సాత్వికము లందుము. ప్రవృత్తి యన క్రియ, ఇచ్ఛ, పరితాపము, శోకము మున్నగునవి రజోగుణములు – రాజసములు. స్థితి యన క్రియారాహిత్యము – నిలకడ. గురుత్వము, దీనత మున్నగు గుణములు తామసములు.

అవ ॥ చిత్తము విషయములందు ప్రవృత్తి కలదై యున్నపుడు జీవాత్మ ఆయా విషయముల నెఱుగుచుండును. అనగా జీవాత్మ ప్రకృతి యందుండును. చిత్తవృత్తులు నిరోధింపబడినపుడు జీవాత్మ (పురుషుడు) యెట నుండు నన;

**తదా ద్రష్టుః స్వరూపేఽవస్థానమ్ 3**

తదా = చిత్తవృత్తులు నిరోధింపబడినపుడు, ద్రష్టుః = పురుషుడుచితిశక్తి, స్వరూపే = తనయందు, అవస్థానమ్ = స్థితికలవాడగును.

చిత్తవృత్తులు నశించి సమాధి యేర్పడినపుడు జీవుడు తన రూపమున తా నుండును. దృశ్య ప్రపంచ మతని యందు భాసింపదు. స్ఫటిక మణికి

సమీపమున నానావిధములయిన రంగులు గల పువ్వులుండిన నది రంగులతో భాసిల్లును. వానిని తొలగించిన నయ్యది స్వచ్ఛముగా ప్రకాశించును. ఏ రంగును నం దుండదు. అట్లే చిత్తవృత్తులు లేనపుడు పురుషుడు తాను స్వచ్ఛముగా నుండును. ఈ స్థితినే కైవల్యమందురు.

సూత్రమున నున్న ద్రష్టుః అను పదమును రెండుమాఱులు చెప్పుకొని యందొక ద్రష్టృపదమునకు పరమాత్మపరముగాను, రెండవదానికి జీవాత్మ పరముగాను అర్థము చెప్పవచ్చును. అప్పుడు–

తదా = చిత్తవృత్తులు నశించినపుడు, ద్రష్టుః = జీవాత్మునకు, ద్రష్టుః స్వరూపే = జగద్రష్టయైన పరమాత్ముని స్వరూపమునందు, అవస్థానమ్ = స్థితి కలుగును అని యర్థమేర్పడును.

చిత్తవృత్తులుడిగినపుడు జీవుడు ప్రకృతియందు నర్తించుట మాని తనయందు తానుండువాడై పరమాత్ముని యానందము ననుభవించుచు నతనియం దిమిడియుండును. పరమాత్మయే సర్వప్రాణులకు గతి.

**'ఏషాఽ_స్య పరమా గతిః.....!'** బృ. 4.3.32

అవ ॥ చిత్తవృత్తులు నిరోధింపబడినపుడును, పురుషుడు పరిణామము నొందని వాడగుటచే స్వస్వరూపమున నుండి పరమాత్మానందమును – కైవల్యసుఖమును ఏల అనుభవింపడన:

**వృత్తి సారూప్య మితరత్ర** **4**

పూర్వసూత్రమునుండి 'ద్రష్టుః' అను పదము ఈ సూత్రమున నన్వయించును.

ఇతరత్ర = చిత్తవృత్తు లేర్పడుసమయమున ద్రష్టుః = స్వస్వరూపమున నున్న జీవునకు, వృత్తి సారూప్యం = చిత్తవృత్తులతో సమానమైన రూపము కలుగును.

జీవుడు (పురుషుడు) పరిణామి కాడు. అతని రూపమున మార్పులు కలుగవు. స్వచ్ఛమైన స్ఫటికమణివంటిది పురుషస్వరూపము. సమీపమున నున్న పువ్వుల రంగులు స్ఫటికమున ప్రతిఫలించి స్ఫటికము రంగులు కలదిగా తోచును. అట్లే చిత్తవృత్తులు చిత్త సమీపమున నున్న పురుషుని యందు చేర్చబడును. అందువలన పురుషుని స్వరూపము చిత్తవృత్తి స్వరూపముతో

పోలి నమానమగును. పురుషుడు బుద్ధి (చిత్త) సమీపమున నుండి యందు ప్రతిబింబించి బుద్ధి వృత్తులతో కూడినవాడై యా వృత్తులు తనవి కావని గుర్తింపక - వివేకములేనివాడై 'నేను శాంతుడను, నేను ఘోరవృత్తికలవాడను, నేను మూఢుడను' అని యనుకొనును. ఇట్లు తలంచుటయే వృత్తిసారూప్యము. అట్టిచో చిత్తవృత్తుల రూపమే పురుషుని రూపము. మలినదర్పణమున తన ముఖము మలినముగా కనబడుట చూచి 'నేను మలినముఖము కలవాడను' అనుకొనుట లోకవిదితమే కదా

అవ ॥ నిరోధింపదగిన చిత్తవృత్తు లెన్నివిధము లన:

**వృత్తయః పంచతయ్యః క్లిష్టాక్లిష్టాః** 5

క్లిష్టాః = అవిద్యాది క్లేశములు హేతువులుగా గలవియై ధర్మాధర్మ సంస్కారములకు ఉత్పత్తిస్థానము లగు రాజస తామస వృత్తులు క్లిష్టములు, అక్లిష్టాః = క్లిష్టములు కానివి - సాత్త్వికవృత్తులు. ఇట్లు క్లిష్టా క్లిష్ట శబ్దములచే చెప్పబడు రెండు విధములగు, వృత్తయః = చిత్తవృత్తులు, మరల, పంచతయ్యః = ఐదు విధములు

చిత్తవృత్తు లెన్ని విధములో తెలియకున్న వాని నిరోధింప సనువుకాదు. కాబట్టి వృత్తులు క్లిష్టములు, అక్లిష్టములు నని రెండు విధములుగా విభజించి మరల నవి యైదు విధములు గలిగియున్నట్లు స్పష్టపఱపబడినది.

క్లేశము - కష్టము కలిగించు వృత్తులు క్లిష్టము లనబడును. పురుషుడు ప్రత్యక్షాది ప్రమాణములద్వారా వస్తువుల నెఱుగును. అటుపై వానియం దాసక్తుడో ద్వేషము కలవాడో యగును. ఇట్లు ప్రత్యక్ష ప్రమాణాది వృత్తులు ఆసక్తిచేత అనుకూల వాసనలనో లేక ద్వేషముచే ప్రతికూల వాసనలనో కలిగించును. కాబట్టి వృత్తులు వాసనలకు - సంస్కారములకు ప్రసవభూములు - ఉత్పత్తిస్థానము లగుచున్నవి. ఇవి రాజస తామస వృత్తులు. కష్టదాయకము అని భావము.

సాత్త్విక వృత్తులు అక్లిష్టము లనబడును. వానివలన సత్త్వ పురుషాన్యతా ఖ్యాతి - ప్రకృతి పురుష వివేక జ్ఞానము కలుగును. అటుపై ప్రకృతి కార్యము నశించును. పురుషుడు స్వస్థుడగును.

వృత్తుల సంఖ్య నిర్ణయించుట కష్టము. అయినను స్థూలముగా

రెండు విధములని చెప్పి వాని ప్రకారము లైదుగా నిర్ణయించి వాని నిరోధింప వలయునని సూత్రమున వర్ణింపబడినది.

అవ ॥ ఐదు విధములయిన వృత్తులు:

**ప్రమాణ విపర్యయ వికల్ప నిద్రా స్మృతయః 6**

ప్రమాణ... స్మృతయః = ప్రమాణములు, విపర్యయము, వికల్పము, నిద్ర, స్మృతి యని వృత్తు లైదు విధములు.

అవ ॥ అందు ప్రమాణ వృత్తిని విభజించుచు ప్రమాణ సామాన్య రూపమును వర్ణించుచున్నాడు.

**ప్రత్యక్షానుమానాగమాః ప్రమాణాని 7**

ప్రత్యక్షా... గమాః = ప్రత్యక్షము, అనుమానము, ఆగమము అని, ప్రమాణాని = ప్రమాణములు, ముప్విధములు.

ప్రమాకరణము ప్రమాణమని ప్రమాణ లక్షణము. ప్రమ యన జ్ఞానము. దానికి కరణము – సాధనము ప్రమాణ మనబడును. జ్ఞాన సాధనము ప్రమాణ మని భావము.

చక్షురాది ఇంద్రియముల ద్వారా జనించి, అంతకు పూర్వము తెలియబడని, ముందు బాధితము కాని వస్తు విషయకమైన చిత్తవృత్తి ప్రత్యక్ష ప్రమాణ మనబడును. లింగ పరామర్శ జన్యమై అనధిగతము, అబాధితము నగు వస్తు విషయకమైన చిత్త వృత్తి అనుమాన ప్రమాణ మనబడును. ఆప్తునిచే చూడబడియో లేక అనుమానింపబడియో యొక వస్తు వే శబ్దముచే నుపదేశింపబడునో యట్టి శబ్దముచే జన్యమై, అనధిగ తాబాధిత వస్తు విషయకమగు చిత్తవృత్తి శబ్దప్రమాణ మనబడును.

ఇంద్రియ ప్రణాళిక ద్వారా బాహ్య వస్తువుతో చిత్తము సంబద్ధ మగుటచే ఆయా వస్తు విషయకమైన – సామాన్య విశేషాత్మకమగు వస్తువుయొక్క విశేషమును ప్రధానముగా నిశ్చయించు – వృత్తి ప్రత్యక్ష ప్రమాణమని భాష్యకారులు – వ్యాసమహర్షి

అవ॥ విపర్యయ లక్షణము :

**విపర్యయో మిథ్యాజ్ఞాన మతద్రూప ప్రతిష్ఠమ్ 8**

అతద్రూప ప్రతిష్ఠమ్ = జ్ఞానప్రతిభాసి రూపమున స్థిరముగా నుండని,

మిథ్యాజ్ఞానమ్ = బాధితజ్ఞానము – అట్టిది కాని దాని యందు అట్టిదియని కలుగు జ్ఞానము, విపర్యయః = విపర్యయము.

సర్పము కాని దానిని సర్ప మనియు, రజతము కాని దానిని రజతమనియు తెలిసి కొనుట (విపర్యయము) మిథ్యాజ్ఞానము – అవిద్య యనబడును. ఈ యవిద్య యైదు విధములు. 1. అవిద్య, 2. అస్మిత, 3. రాగము, 4. ద్వేషము, 5. అభినివేషము. ఇవే వరుసగా తమస్సు, మోహము, మహా మోహము, తామిస్రము, అంధతామిస్రము నని చెప్పబడును.

అవ॥ వికల్ప లక్షణము :

**శబ్దజ్ఞానామపాతీ వస్తుశూన్యో వికల్ప: 9**

వస్తుశూన్యః = వస్తువులేని – నిర్విషయకమైన శబ్దజ్ఞానానుపాతీ = శబ్దజ్ఞానము కలిగిన వెంటనే కలుగు చిత్తవృత్తి, వికల్పః = వికల్ప మనబడును.

ఆకాశ కుసుమము, గొడ్రాలి బిడ్డడు, కుందేటి కొమ్ము మున్నగు జ్ఞానములు వికల్ప వృత్తివలన కలుగును. ఆకాశ కుసుమాది వస్తువులే లేకుండుట వలన నీ వికల్పవృత్తి ప్రమాణము కాదు. సంశయమును కాదు. ఇది బాధిత జ్ఞానమయ్యు లోకమున వ్యవహరింపబడుచున్నది. శబ్దజ్ఞానమే యిందులకు కారణము.

అవ॥ నిద్రా లక్షణము :

**అభావ ప్రత్యయాలంబనా, వృత్తి ర్నిద్రా 10**

పూర్వసూత్రము నుండి వృత్తి పదమిందు అనువర్తింప వీలున్నప్పటికి నిందు ప్రత్యేకముగా వృత్తి పదమును వాడినందున సూత్రకారుడు నిద్రను వృత్తిగా చెప్పదలచెనని యెంచవలయును.

అభావ ప్రత్యయాలంబనా = జాగ్రత్స్వప్నాది వృత్తుల యభావము విషయముగాగల, వృత్తిః = చిత్తవృత్తి, నిద్రా = నిద్ర యనబడును.

త్రిగుణాత్మకమగు చిత్తసత్వమున తమోగుణము సత్వరజస్సులను ఆవరించి అంధకారము వ్యాపింపగా, బుద్ధి విషయాకారమున పరిణమింపదు. ఇదియే సుషుప్తావస్థ. పురుషుడపు డంతః సంజ్ఞ కలిగియుండును. సుషుప్తి యందంతః సంజ్ఞ కలదనుటకు ప్రమాణము నిద్రనుండి మేలుకొనుటయే తడవుగ 'సుఖముగ నిద్రించితిని. నా మనస్సు ప్రసన్నముగా నున్నది. నిద్ర సుఖముగా లేదు. ఒడలు బరువుగా నున్నది' అని యనుటయే, సుషుప్తి యందు

జ్ఞానమే లేకున్న నిట్టి ప్రత్యవమర్శ కలుగదు. కాబట్టి నిద్రయు (తమోరూప ప్రత్యయ విషయమయిన) వృత్తి - జ్ఞాన మనవలయునని భావము. సమాధియందు ఇతర వృత్తులవలె నిద్రావృత్తియు నిరోధింప బడవలయును.

సుషుప్తియందు చిత్తసత్త్వము అంధకారమును మాత్రము తెలుపుచు పరిణామ రహితమై యుండుటచే నిరుద్ధ ప్రాయమగును. పురుషుడు వృత్తులు లేనందున స్వస్థుడై పరమాత్మసుఖము ననుభవించును. సమాధిమోక్షావస్థ లందువలె బ్రహ్మానందము ననుభవించుచు శోకమును తరించి సుఖించును.

**'సతా సౌమ్య తదా సంపన్నోభవతి'** ఛాం. 6.8.1

**'తద్యథా ప్రియయా స్త్రియా సంపరిష్వక్తో**
**న బాహ్యం కించన వేద నాంతరమ్**
**ఏవ మేవాయం పురుషః ప్రజ్ఞానే నాత్మనా**
**సంపరిష్వక్తో న బాహ్యం కించన వేద నాంతరమ్'**

బృ. 4.3.21

'సుసుప్తియందు జీవుడు సత్యస్వరూపుడగు పరమాత్మతో కలిసి సుఖించును.'

'ప్రియురాలయిన స్త్రీని కౌగలించుకొని ప్రియుడు బాహ్యాభ్యంతరములను విస్మరించునట్లు జీవుడు పరమాత్మతో చేరి సర్వమును విస్మరించును.

మున్నగు ఉపనిషద్వాక్యములు పై విషయమునే ధ్రువపఱచును.

అవ॥ స్మృతి లక్షణము :

**అనుభూత విషయా సంప్రమోషః స్మృతిః** **11**

సంప్రమోషః = దొంగతనము - పరుల అర్థమును గ్రహించుట, పూర్వము తెలిసిన విషయము స్మృతికి స్వార్థము. పూర్వము అనుభూతము కానిది పదార్థము. కాబట్టి, అనుభూత విషయా సంప్రమోషః = పూర్వము తెలిసికొనినదానిని ఎక్కువ తక్కువలు లేకుండ తెలిసికొను వృత్తి, స్మృతి = స్మృతి యనబడును.

చిత్తమొకప్పు డేవస్తువును చేరి దానియాకారమును పొందియుండెనో ఆ విషయాకారమే చిత్త ధనము. అట్టిదానిని మరల గ్రహించు వృత్తి స్మృతి యనబడును. ఇట్టియెడ చిత్తము పూర్వజ్ఞానమునే గ్రహించునా! లేక విషయమును సైతము గ్రహించునా! యన ఉభయమును గ్రహించునని

సమాధానము. ప్రమాణాది వృత్తులవలన నేర్పడు ప్రత్యయము (జ్ఞానము) విషయము, జ్ఞానము నను రెంటికి సంబంధించిన సంస్కారమునే యుదయింపజేయును. ఆ సంస్కారమే ఉద్బోదకము ద్వారా వ్యక్తమై ఉభయాత్మక స్మృతిని కలిగించును. పూర్వము తెలియబడని – అనగా క్రొత్తగా తెలియబడు – వస్తు విషయక చిత్తవృత్తి జ్ఞానము. ఇందు ఘటమును తెలిసికొనుచున్నాను. 'ఘటము' అనునది స్మృతి. ఇందు విషయము (వస్తువు) ప్రధానమగును. 'ఆ ఘటమే యిది' అనునది ప్రత్యభిజ్ఞ. భావితస్మర్తవ్యము. అభావిత స్మర్తవ్యము నని స్మృతి రెండు విధములు స్వప్నమున భావిత (కల్పిత) స్మర్తవ్యము, జాగరణ సమయమున అభావిత( యథార్థ) స్మర్తవ్యము, చిత్తవృత్తుల యనుభవమువలన సంస్కారము కలుగును. ఆ సంస్కారము వలన స్మృతులేర్పడును. వృత్తులన్నియు సుఖ దుఃఖ మోహరూపములే. ఇవి యన్నియు నిరోధింపదగినవే. సర్వవృత్తి నిరోధము వలననే సంప్రజ్ఞాత సమాధి కలుగును.

అవ॥ వృత్తి నిరోధమున కుపాయము :

**అభ్యాస వైరాగ్యాభ్యాం తన్నిరోధః 12**

అభ్యాస వైరాగ్యాభ్యాం = అభ్యాసము వైరాగ్యము నను రెంటిచే, తన్నిరోధః = చిత్తవృత్తుల నిరోధము కలుగును.

అభ్యాస వైరాగ్యము లననేమో ముందు వర్ణింపబడును. ఇందు వైరాగ్యమువలన వృత్తి నిరోధము కలుగును. అభ్యాస మట్టి నిరోధమును స్థిరపఱచును.

చిత్తమనెడి నది కైవల్యాభిముఖమై వివేక విషయ మనెడి నిమ్నమార్గమున ప్రవహించును. లేకున్న సంసారాభిముఖమై అవివేక మార్గమున ప్రవహించును. వైరాగ్యము విషయాభిరతిని శిథిలమొనర్చి వివేకమును కలిగించును. అభ్యాస మా స్థితిని స్థిరపఱచునని భావము.

అవ॥ అభ్యాస లక్షణము :

**(తత్ర) స్థితౌ యత్నోఽభ్యాసః 13**

స్థితౌ = వైరాగ్యము ద్వారా చిత్త వృత్తులు నిరోధింపబడగా నేర్పడు ఏకాగ్రత కొఱకు చేయు, యత్నః = చిత్తమును నిలుపుటకై యమనియమాది సాధనముల నాచరణలో నుంచుటకగు ఉత్సాహాది యత్నము, అభ్యాసః =

అభ్యాస మనబడును.

**(స తు) దీర్ఘకాల నైరంతర్య సత్కారాసేవితో దృఢభూమిః 14**

స తు = పై సూత్రమున చెప్పబడిన యభ్యాసము, దీర్ఘకాల.... సేవితః = మరణ పర్యంతము గాఢనిద్రాసమయము విడిచి మిగిలిన సమయమంతయు శ్రద్ధతో నాచరింపబడి, దృఢభూమిః = నిశ్చలస్థితికలదియగును.

చిత్తమును బాహ్య ప్రపంచమున వర్తింపకుండునట్లు చేయు యత్నము మరణ పర్యంతము నిరంతరము చేయవలయును. ఇందు తపస్సు, బ్రహ్మచర్యము, శ్రద్ధయు మిక్కిలి తోడ్పడగలవు. అభ్యాస మట్లు చేయకున్న చిత్త నిరోధ మేర్పడదు.

అవ॥ వైరాగ్య లక్షణము :

**దృష్టానుశ్రవిక విషయ వితృష్ణస్య**
**వశీకారసంజ్ఞా వైరాగ్యమ్ 15**

దృష్టే విషయే = ఐహిక విషయములందు, అనుశ్రవికే విషయే = వేదశాస్త్ర బోధిత పారలౌకిక విషయములందు, వితృష్ణస్య = ఆశ లుడిగిన యోగి యొక్క, చిత్తస్థితి - దివ్యములు అదివ్యములు నగు వస్తువుల నాకాంక్షింపని బుద్ధి, వశీకార సంజ్ఞా వైరాగ్యమ్ = వశీకారమను పేరుగల వైరాగ్య మనబడును.

స్త్రీలు, అన్నపానములు, ఐశ్వర్యము మున్నగునవి ఐహికములు - దృష్ట విషయములు, అనుశ్రవమన వేదము, గురువులు చెప్పగా విని నేర్వబడునది. దాని వలన కలుగు జన్మాంతర (విదేహ ప్రకృత్ లయ) ములకు సంబంధించిన విషయములు అనుశ్రవికములు. ఆ విషయములు పరిణామములను చెందుచు ఒక క్షణమున సరసములయినను క్షణాంతరమున విరసములయి దోషములతో కూడినవగుటచే యోగారూఢుడు కాదలచు వ్యక్తి వానియందు విరక్తుడగును. వానిని సంపాదింప యత్నింపడు. వానిని తాపత్రయముతో కూడినవిగా తెలిసికొనును. అతనికి విషయములందుపేక్షా బుద్ధి కలుగును. ఇదియే ప్రసంఖ్యానము. ఇట్టి వితృష్ణ వశీకారమనబడును. దీనినే అపరవైరాగ్యమందురు.

వైరాగ్యమునకు నాలుగు పేరులని ఆగమికు లందురు. 1. యతమాన

సంజ్ఞ, 2. వ్యతిరేక సంజ్ఞ, 3. ఏకేంద్రియ సంజ్ఞ, 4. వశీకార సంజ్ఞ.

చిత్తమునందుండు అనురాగాది మలములు ఇంద్రియములను తమతమ విషయములందు ప్రవర్తింపజేయును. అట్లు ఇంద్రియములు విషయములందు ప్రవర్తింపకుండునట్లు చేయు యత్నము యతమాన సంజ్ఞగల వైరాగ్యము. ఇట్లు యత్నింపగా చిత్తమునందలి రాగాది మలములు కొన్ని పక్వము లగును. కొన్ని పక్వములు కావలసియుండును. ఇట్లు పక్వములు కావలసినవానికంటె పక్వములయిన వానిని వ్యతిరేకముగా నిర్ణయించుట వ్యతిరేక సంజ్ఞగల వైరాగ్యము. పక్వములయిన మలములు ఇంద్రియములను విషయములందు ప్రవర్తింపజేయగల సమర్థత లేని స్థితిలో చిత్తమునందుండుట ఏకేంద్రియ సంజ్ఞగల వైరాగ్యము. దివ్య – అదివ్య విషయములు ఉపస్థితములై యున్నను ఉపేక్షించుట వశీకారసంజ్ఞగల వైరాగ్యము నాలుగవది. ఇదియే అపర వైరాగ్యము. తక్కిన మూడు సంజ్ఞలుగల వైరాగ్యము కలుగకున్నచో నీ యపర వైరాగ్యము కలుగనేరదు. కాబట్టి ఋషి దీనినే వర్ణించియున్నాడు.

ఈ యపర వైరాగ్యము వలన రాజస తామస చిత్తవృత్తులు నిరోధింపబడి సంప్రజ్ఞాత సమాధి యేర్పడగలదు. కాబట్టి ఇది సంప్రజ్ఞాత సమాధికి అంతరంగ సాధనము – ముఖ్య కారణమనదగును.

ఆవ॥ సాత్విక చిత్తవృత్తులను సైతము నిరోధింప ననుకూలించు పర వైరాగ్యము :

**పరం పురుషఖ్యాతేర్గుణవైతృష్ణ్యమ్ 16**

పురుషఖ్యాతేః = గుణత్రయాత్మక ప్రకృతికంటె పురుషుని భిన్నునిగా నెఱుగుట వలన, (కలుగు), గుణవైతృష్ణ్యమ్ = గుణవిరక్తి, పరమ్ = పరవైరాగ్య మనబడును.

ఐహికాముష్మిక విషయములందుగల దోషముల నెఱిగి వానినుండి చిత్తమును మరలించుకొని విరక్తుడగును. అటుపై సత్వవృత్తికలవాడై ఆచార్యోపదేశాదుల ద్వారా తెలిసికొనిన పురుషుని దర్శించుట కభ్యాసము చేయును. ఇట్టి సాత్విక వృత్తిచే ప్రకృతి పురుష వివేకజ్ఞాన ముదయించును. పురుషుడు శుద్ధుడనియు గుణములు(ప్రకృతి) పురుష విపరీతము – మలినము లనియు తెలిసికొనును. గుణములనుండి విరక్తుడగును. ఇట్టి స్థితియే

ధర్మమేఘసమాధి యనబడును. ఇట్లు యోగి పురుషప్రకృతులలోగల బేధమును గుర్తెఱుగును. ఈ జ్ఞానమే శుద్ధసాత్వికవృత్తి. ఇదియు గుణ (ప్రకృతి) వికారమే యని దానినుండియు విరక్తుడగును. ఇట్లు అపర వైరాగ్యమున రాజసతామస వృత్తులనుండి విరక్తుడై, పరవైరాగ్యమున సాత్విక వృత్తినుండియు విరక్తుడగును. పరవైరాగ్యమున వివేక జ్ఞానము కలవాడై 'పొందదగినది పొందితిని. అవిద్యాది క్లేషములు క్షీణించినవి. ధర్మాధర్మ సంస్కార సమూహము వలన నేర్పడు జన్మపరంపర తెగినది' అని యెంచును. ఈ జ్ఞానపరాకాష్ఠయే పరవైరాగ్యమనబడును. కైవల్యమన నియ్యదియే. 'జీవన్నేవ విద్వాన్ ముక్తో భవతి'

అవ॥ అభ్యాస వైరాగ్యముల లక్షణములను చెప్పి యటుపై అభ్యాస వైరాగ్యముల ద్వారా రాజస తామస వృత్తులు నిరోధింపబడగా నేర్పడు సంప్రజ్ఞాత సమాధిని వర్ణించుచున్నాడు.

**వితర్క విచారానందాస్మితామగమాత్ సంప్రజ్ఞాతః 17**

వితర్క....గమాత్ = వితర్కము, విచారము, ఆనందము, అస్మిత, వీని సంబంధమువలన, సంప్రజ్ఞాతః = సంప్రజ్ఞాత సమాధి కలుగును.

కొండొక స్థూలమైన భౌతిక వస్తువును ఆధారముగా నుంచుకొని యందు చిత్తమును నిలుప నది దానియాకృతి కలది యగును. ఇట్టి సాత్విక చిత్తపరిణామమే వితర్క మనబడును. విషయము స్థూలమగుటచే స్థూలమైన సాత్విక పరిణామము కలుగును. ఇదియే భావన యనియు చెప్పబడును.

స్థూల భూతములకు కారణములైన పంచతన్మాత్రలు ఆధారముగా నిడుకొని యందు చిత్తమును నిలుప, చిత్తము పంచతన్మాత్రల యాకృతిని పరిణమించును. ఇట్టి సూక్ష్మ సాత్విక పరిణామము విచార మనబడును.

విషయములను సమీపింపజేసి యానందము (హ్లాదము) ను కలిగింప జేయుటకు కారణములగుటచే నింద్రియములు ఆనందమనబడును. అట్టి ఇంద్రియమునందు చిత్తము నిలుపగా నేర్పడు స్థూల సాత్విక పరిణామము ఆనంద మనబడును.

'పురుషుడే తాను' అను అహంకారముతో కూడిన బుద్ధి అస్మిత యనబడును. ఈ యస్మిత యనెడి సూక్ష్మవిషయమున చిత్తము నిలుపుట వలన

నేర్పడు సూక్ష్మ సాత్విక పరిణామము అస్మిత యనబడును.

ఇట్లు వితర్క సంబంధముచేత వితర్కానుగత సంప్రజ్ఞాత సమాధి విచార సంబంధమున విచారానుగత సంప్రజ్ఞాత సమాధి, ఆనంద సంబంధమున ఆనందానుగత సంప్రజ్ఞాత సమాధి, అస్మితాసంబంధమున అస్మితానుగత సంప్రజ్ఞాత సమాధి అని సంప్రజ్ఞాత సమాధి నాలుగు విధములు. ఇందు మొదటి రెండును బాహ్య విషయములకు సంబంధించినవి, మూడవది ఇంద్రియమునకు సంబంధించినది. నాలుగవది గ్రహీతృ(బుద్ధి) విషయకమని గ్రహింపవలయును.

మూలకారణమగు ప్రకృతి, దానిచే నేర్పడు బుద్ధి, అహంకారము పంచతన్మాత్రలు, ఇంద్రియములు, స్థూల భూతములు, శరీరము మున్నగు కార్యవిషయములనుండి పురుషుని వేఱుగా నెఱుగుటకై యోగ మభ్యసింపబడును. పాలు నీళ్లు కలిసియున్నట్లు భేదము గ్రహింప వీలులేని విధమున ప్రకృతి పురుషులు కలిసియుండుటచే తేలికగా వాని వివేకము కలుగజాలదు. అందువలన శరీరాదులు ఒక్కొక్కటిగా పురుషునికంటె వేఱని వివేకించి సాక్షాత్కారము చేసికొనవలయును. ఇందులకు యోగము మిక్కిలి యుపయుక్తమని యెంచి ఋషి మొదట సాలంబన (ఆధారముతో కూడిన) యోగము - సంప్రజ్ఞాత సమాధిని గూర్చి వివరించినాడు. సంప్రజ్ఞాతమే సబీజసమాధి యనబడును. ముక్తికాములు దీనిని హేయము (విడువదగినది) గా నెంతురు.

అవ॥ పరవైరాగ్యముచే కలుగు అసంప్రజ్ఞాత సమాధి, దాని లక్షణము, ఉపాయము :

**విరామప్రత్యయాభ్యాసపూర్వః సంస్కారశేషోఽన్యః 18**

విరామ ప్రత్యయాభ్యాసపూర్వః = పరవైరాగ్యము కారణముగాగల, సంస్కారశేషః = నిరోధ సంస్కారరూపమున నుండు చిత్తశుద్ధి, అన్యః = అసంప్రజ్ఞాత సమాధి - నిర్బీజసమాధి యనబడును.

సాత్విక రాజస తామస వృత్తులలో నొక్కటియు లేకుండుట (సర్వవృత్తుల యభావము) విరామము, దాని కే జ్ఞానము కారణమో అది పర వైరాగ్యము, అట్టి వైరాగ్యమును మాటిమాటికి అలవఱచుకొనుట వలన చిత్తము సంస్కార

రూపమున మిగిలియుండును. అనగా పర వైరాగ్యమును బాగుగ నభ్యసించుటవలన వృత్తులు, వృత్తుల సంస్కారములు నన్నియు నిరోధింప (నడ్డగింప) బడును. చివరకు చిత్తము నిరోధ సంస్కారరూపమున మాత్ర ముండును. ఇట్టి చిత్తస్థితియే అసంప్రజ్ఞాత –నిర్బీజ సమాధియని చెప్పబడును.

ఇట్టి సమాధిని పొందిన యోగులే బ్రహ్మవిద్వరిష్ఠు లనబడుదురు. యోగమునకు పరమావధియు నిదియే. వృత్తులు, వాని సంస్కారములు నన్నియు లేకుండుటచే చిత్తము నశించినట్లే యగును. కాబట్టి పురుషుడు స్వస్వరూపమున బ్రహ్మానందము (కైవల్యసుఖము) ననుభవించును.

అవ॥ ఈ నిర్బీజ సమాధి ఉపాయ ప్రత్యయము, భవ ప్రత్యయమునని రెండు విధములు. అందు భవ ప్రత్యయము :

**భవ ప్రత్యయో విదేహ ప్రకృతిలయానాం 19**

విదేహ ప్రకృతి లయానామ్ = విదేహులకు, ప్రకృతి లయులకు కలుగు అసంప్రజ్ఞాత సమాధి, భవప్రత్యయః = అవివేకపూర్వకము - భవప్రత్యయ మనబడును.

పృథివ్యాది పంచభూతములలో కొండొకదానిని ఆత్మగా తలచి దానినుపాసించి కేవలము సంస్కారరూపమున మిగిలియున్న చిత్తము గలవారై, స్థూలదేహరహితులై మరణానంతరము తా ముపాసించిన భూతములందు లీనులై యుండువారు విదేహు లనబడుదురు.

పంచభూతములు కాక మిగిలిన అవ్యక్తము, మహత్తత్త్వము, అహంకారము, పంచతన్మాత్రములలో నేదేని యొక దాని నుపాసించి ఆయా వాసనలచే వాసితములగు నంతఃకరణములతో శరీరాపాతానంతరము అవ్యక్తాది ప్రకృతి వికారములలో లీనులై యుండువారు ప్రకృతి లయులనబడుదురు.

వీరికి దేహాదులలో విరక్తి కలిగినను పురుషఖ్యాతి కలుగదు. వైరాగ్యమువలన సమాధి యేర్పడినను చిత్తము బొత్తుగా నశింపక ప్రకృతియందు లీనమై యుండును. వైరాగ్యమువలన నేర్పడిన సంస్కారనిరోధబల మున్నంతవఱకట్లే యుండి అనంతరమున జన్మహేతు వగును. ఇట్టి చిత్తము సాధికార చిత్తమనబడును. సాధికారమన ఆచరితార్థము వివేకఖ్యాతి – ప్రకృతి పురుష వివేక జ్ఞానము కలిగించిన చిత్తము చరితార్థమగును. వివేకఖ్యాతి కలిగింపని చిత్తము ఆచరితార్థమయి కొంతకాలమది ప్రకృతి మహత్తత్త్వాదులలో

లీనమైయుండి వృత్తిశూన్యతవలన సమాధిలో కలుగు కైవల్యసుఖమువంటి సుఖము కలిగించి నిరోధబలము నశింపగానే మరల జన్మహేతువగునని భావము. కాబట్టి భవప్రత్యయ సమాధి ముముక్షువులకు హేయమేకాని ఉపాదేయము కాదు.

**'వివేకఖ్యాతి హీనస్య సంస్కార శ్చేతసో భవః'**

వివేక ఖ్యాతి కలుగని చిత్త సంస్కారము జన్మహేతువు.

**'దశ మన్వ న్తరాణీహ తిష్ఠ న్తీంద్రియచింతకాః**

**భౌతికాస్తు శతం పూర్ణం సహస్రం త్వాభిమానికాః**

**బౌద్ధా దశసహస్రాణి తిష్ఠన్తి విగతజ్వరాః**

**పూర్ణం శతసహస్రం తు తిష్ఠం త్యవ్యక్త చింతకాః**

**పురుషం నిర్గుణం ప్రాప్య కాలసంఖ్యా న విద్యతే'**

అని వాయుపురాణమున చెప్పబడినది.

అవ॥ ఉపాయ ప్రత్యయ సమాధి :

**శ్రద్ధా వీర్యస్మృతి సమాధి ప్రజ్ఞాపూర్వక ఇతరేషామ్ 20**

ఇతరేషామ్ = కైవల్యము నభిలషించు యోగులకు, శ్రద్ధా.....పూర్వకః = శ్రద్ధ, వీర్యము, స్మృతి, సమాధి, ప్రజ్ఞ యనెడి ఉపాయముల ద్వారా అసంప్రజ్ఞాత – నిర్బీజ సమాధి కలుగును.

ఐహికాముష్మిక విషయములందు తృష్ణారహితుడు కాగా చిత్తమునందు కలుగు యోగవిషయకమైన అభిరుచి – మిక్కిలి కోరిక శ్రద్ధ (చిత్త సంప్రసాదము) అనబడును. ఇట్టి చేతఃసంప్రసాదము (శ్రద్ధ) జనని వలె యోగిని కాపాడును. దేహేంద్రియాదుల నాత్మగా భావించువారి కిట్టి యభిరుచి – చిత్తప్రసాదము కలుగనేరదు.

శ్రద్ధావంతునకు వివేక సంపాదన కొఱకు గలుగు ఉత్సాహము వీర్యమనబడును. ఆగమములు, అనుమానము, ఆచార్యోపదేశాదుల ద్వారా తెలియబడిన యమనియమాది యోగాంగముల యనుష్ఠానము (ఆచరణ) కొఱకు వీర్యవంతునకు కలుగు స్మరణము స్మృతి యగును. ధ్యానమనియునందురు. యోగాంగానుష్ఠానమువలన కలుగు సంప్రజ్ఞాత సమాధి ఇట సమాధి యనబడును. సమాహితచిత్తునకు కలుగు వివేకజ్ఞానము ప్రజ్ఞయనబడును. దీనినే వస్తుయాథార్థ్యము బోధపడును.

ఇట్లు శ్రద్ధవలన వీర్యము, దాని వలన (ధ్యానము) స్మృతి, యద్దానివలన సంప్రజ్ఞాత సమాధి, అందున ప్రజ్ఞయు కలుగును. ఇట్టి యుపాయములచే కలుగు నిర్బీజ సమాధిని మోక్షాపేక్షకలవారు కామింతురు.

**తీవ్రసంవేగానా మాసన్నః 21**

పైన వర్ణించిన నిర్బీజసమాధి, తీవ్రసంవేగానామ్ = త్వరగా లభింప వలయునని నిరంతరము నభ్యసించుటలో నెక్కుడు కోరిక గలవారికి,ఆసన్నః = త్వరగా లభింపగలదు.

శ్రద్ధాద్యుపాయములందు తీవ్రత గలవారికి సమాధి త్వరగా లభింప గలదు.

ఉపాయములు మృదువులు, మధ్యమములు, అది మాత్రములు నని ముబ్విధములు. ఆ యుపాయముల ననుష్ఠించు యోగులును ఆయా భేదములచే నవ విధముల పేర్కొనబడుదురు. 1. మృదూపాయ మృదుసంవేగము కలవారు, 2. మృదూపాయ మధ్యసంవేగము కలవారు, 3. మృదూపాయ – అధిమాత్ర సంవేగము కలవారు, 4. మధ్యోపాయ మృదుసంవేగము కలవారు, 5. మధ్యోపాయ మధ్య సంవేగము కలవారు, 6. మధ్యోపాయ – ఆదిమాత్ర సంవేగము కలవారు, 7. ఆదిమాత్రోపాయ మృదుసంవేగము కలవారు, 8. ఆది మాత్రోపాయ మధ్యసంవేగము కలవారు, 9. ఆదిమాత్రోపాయ – ఆది మాత్ర సంవేగము కలవారు.

**మృదుమధ్యాధిమాత్రత్వా త్తతోఽపి విశేషః 22**

పైన వర్ణించిన తీవ్రసంవేగమునందలి తీవ్రతయు, మృదు మధ్యాధి మాత్రత్వాత్ = మృదువు, మధ్యమము, అధిమాత్రమునని మూడు భేదములు కలదగుటవలన, తతోఽపి విశేషః = అంతకంటెను త్వరగా సమాధి లభింపగలదు.

ఎక్కుడు తీవ్రతతో శ్రద్ధాద్యుపాయముల ననుష్ఠించుటచే నతిత్వరలో సమాధి సిద్ధించును. కైవల్యప్రాప్తి కలుగగలదని భావము.

అవ।। త్వరలో సమాధి సిద్ధించుటకు వేఱొండు ఉపాయముకలదాయన:

**ఈశ్వర ప్రణిధానా ద్వా 23**

ఈశ్వర ప్రణిధానా ద్వా = ఈశ్వరుని యెడ చూపబడు భక్తి విశేషము వలనను

భక్తి విశేషముచే నభిముఖమైన ఈశ్వరతత్త్వము తీవ్ర వేగముగల యోగికి సమాధి శీఘ్రముగా కలుగునట్లు అనుకూలించును. ఈశ్వర ధ్యానము వలన యోగి త్వరలో నిర్బీజ సమాధి లాభము నందగలడని భావము.

అవ॥ ప్రకృతియు పురుషుడును గాక యీశ్వరు డన నెవరన:

**క్లేషకర్మ విపాకాశయై రవరామృష్టః**
**పురుషవిశేష ఈశ్వరః** 24

క్లేశకర్మ విపాకాశయైః = అవిద్యాది క్లేశములు, ధర్మాధర్మములనెడి కర్మములు, కర్మఫలములయిన జాతి ఆయువు భోగము ననెడి విపాకము, విపాకమున కనుగుణమైన వాసనలు, వీనిచే, అపరామృష్టః = సంబంధములేని, పురుషవిశేషః = పురుషోత్తముడు, ఈశ్వరః = ఈశ్వరు డనబడును.

క్లేశాదులు మనస్సునందుండి జీవునియందు చేరి వ్యవహరింపబడును. జీవుడే వాని ననుభవించును. ఇట్టి యనుభవముతో సంబంధము లేని పురుషుడు ఈశ్వరు డనబడునని భావము.

కైవల్య మనుభవించు జీవులును క్లేశాదులతో సంబంధము లేనివారెందరో ఉండగా వారికంటె భిన్నముగా ఒక ఈశ్వరు నంగీకరింపనేలయని సందేహింప వలను పడదు. కైవల్యము ననుభవింపకముందు జీవులకు క్లేశాదులతో సంబంధముండును. విదేహులకు, ప్రకృతి లయులకును కాలాంతరమున క్లేశాదులతో సంబంధము కలుగగలదు. కాని ఈశ్వరుడు పూర్వమునగాని పరమునగాని యెన్నడును క్లేశాదులతో సంబద్ధుడు కాక సదా ముక్తుడై యుండును. అతడాప్త కాముడు. సర్వజ్ఞుడు, సర్వశక్తి మంతుడును.

అవ॥ ఇట్టి లక్షణములుగల ఈశ్వర తత్త్వమొండు కలదనుటకు ప్రమాణమేమి?

**తత్ర విరతిశయం సర్వజ్ఞ బీజమ్** 25

తత్ర = ఈశ్వరునందుగల, నిరతిశయం = అతిశయము నుండి విడివడిన, సర్వజ్ఞబీజమ్= సర్వజ్ఞతకు నిమిత్త కారణమగు జ్ఞానము ప్రమాణము.

ఈశ్వర పదముచే చెప్పదగు తత్త్వమొకటి కలదనుట కీ సూత్రమున అనుమాన ప్రమాణము చూపబడినది.

మనుజులలో భూత భవిష్యద్వర్తమాన విషయములకు సంబంధించిన

జ్ఞానము ఒకనియందు స్వల్పముగాను, మఱియొకనియం దంతకంటె కొంచె మధికముగాను, వేఱొకనియం దంతకంటె నెక్కుడుగాను కనబడుచున్నది. ఇట్లు ప్రతివ్యక్తి యందు నుండు జ్ఞానము ఇతరుల జ్ఞానము కంటె కొంచెమెక్కుడుగానో లేక తక్కువగానో కనబడుట లోక సిద్ధము. విషమమైన యీ జ్ఞానమే సాతిశయ (జ్ఞాన) మని శాస్త్రమున చెప్పబడును. ఒకచో సాతిశయముగా తెలియబడునది మఱి యెటనేని ఒక్కయెడ నిరతిశయమైయుండుట నియమము. ఇందుల కుదాహరణము పరిణామము. ఉసిరికాయ, వెలగకాయ, గుమ్మడికాయ మున్నగు పదార్థములతో హెచ్చుతగ్గులుగా కనబడు పరిమాణము ఆకాశాది నిత్య విభుపదార్థములలో నిరతిశయమై యుండును. అట్లే నీవు, నేను, వాడు అని పేర్కొనబడు వ్యక్తులలో హెచ్చుతగ్గులుగా కనబడు జ్ఞానము సాతిశయము. అది యొకచో నెటనైనను నిరతిశయముగ (పూర్ణముగ – ఆ జ్ఞానమును మించిన జ్ఞానము మఱియొకచో నుండని విధముగ) నుండవలయును. అట్టి జ్ఞానాశ్రయ తత్త్వమే ఈశ్వరుడని భావము. ఇట్లే నిరతిశయమగు క్రియాశక్తియు ప్రమాణముగ గ్రహింపనగును. ఇట్టి పదార్థమునకు ఈశ్వరుడు,బ్రహ్మ, విష్ణువు, హిరణ్యగర్భుడు మున్నగు నామములు భారతీయ శాస్త్రములందు పేర్కొనబడినవి. ఈ నామముల వ్యుత్పత్త్యాదులను వివరముగా తెలిసికొనగోరువారు దయానంద మహర్షికృత సత్యార్థప్రకాశమున ప్రథమ సముల్లాసము చదువుట శ్రేయస్కరము.

అవ॥ సర్వజ్ఞానసమయమగు వేదమును ప్రకాశింప జేసిన ఋషులు నిరతిశయజ్ఞానవంతులై యుండ వేఱుగా నీశ్వరతత్త్వ మెుండేల యంగీకరింపవలయు ననః

**పూర్వేషామపి గురుః కాలేనానవచ్ఛేదాత్ 26**

ఈశ్వరుడు, పూర్వేషామపి = వేదప్రకాశకు లయిన పూర్వఋషులకును, గురుః = గురువు – ఉపదేశకుడు, కారణమేమన, కాలేనానవచ్ఛేదాత్ = ఆద్యంతములులేని వాడగుట వలన.

ఈశ్వరు డొకప్పు డుండి మఱియొకప్పుడు లేకుండువాడు కాడు. కాబట్టి కాలమతనిని నియమింపదు. కాలవ్యవధి లేక యెల్లకాలములందుండు వాడు కావున పూర్వ ఋషులకును జ్ఞానదాతగా నీశ్వరుడిట వర్ణింపబడెను.

పూర్వేషామపి = పూర్వ పూర్వ సర్గాదులలో నుత్పన్నములగు బ్రహ్మ, విష్ణు, మహేశ్వరాదులకును, గురుః = పిత – అంతర్యామి. విద్యాద్వారమున

జ్ఞానచక్షువు నొసంగువాడు. కారణమేమన, కాలేనానవచ్ఛేదాత్ = కాల పరిమితిగల బ్రహ్మాదులు కాలపరిమితిలేని గురువు లేక సంభవింపరని వార్తిక కారులు.

అవ॥ ఈశ్వర ప్రణిధానము చేయు విధమును వర్ణింపదలచి ముందుగా తద్వాచకము (నామము) ను వర్ణించుచున్నాడు.

**తస్య వాచకః ప్రణవః 27**

తస్య = ఆ యీశ్వరుని, వాచకః = నామము, ప్రణవః = ఓంకారము

ఓం కారము ఈశ్వరతత్త్వమును తెలుపును. కాబట్టి ఓంకారము వాచకము. ఈశ్వరుడు వాచ్యము. శబ్దార్థములకు గల సంబంధము నీశ్వర సంకేతము నియమించును. శబ్దార్థములకు స్వాభావిక సంబంధ మొండుండుసు. ప్రతి శబ్దము ప్రత్యర్థమును బోధించుటయే వానికి గల స్వాభావిక సంబంధము. ఒక శబ్ద మొక్కయర్థమునే బోధింపవలయునను నియమము లేక శబ్దములన్నియు పదార్థముల నన్నింటిని తెలుపుననుటయే శబ్దార్థములకుగల స్వాభావిక సంబంధమని భావము. 'ఈ శబ్దముచే నీ యర్థము తెలియునగున'ను నీశ్వర సంకేతము శబ్దార్థములకుగల స్వాభావిక సంబంధమునకు ద్యోతకము, నియామకము నగునని భావము. పితాపుత్రులకుగల జన్యజనకభావ సంబంధమును సంకేతము ద్వారా 'ఇత డితనికి పిత, ఇతడితనికి పుత్రుడు' అని తెలుపబడుట లోక విదితము. ఇట్లు వాచ్యవాచకత్వ సంబంధముచే ప్రణవము (ఓమ్) ఈశ్వరుని తెలుపునని భావము.

అవ॥ ఈశ్వర నామమును తెలిపి ప్రణిధానమును వర్ణించుచున్నాడు.

**తజ్జప స్తదర్థ భావనమ్ 28**

తజ్జపః = ప్రణవజపము, తదర్థ భావనమ్ = ప్రణవ శబ్దమున కర్థమైన ఈశ్వరుని భావించుటయు ప్రణిధాన మనబడును.

ప్రణవము (ఓమ్) ను మాటిమాటికి మనస్సున స్మరించుచు, సర్వజ్ఞమైన ఈశ్వర తత్త్వమును భావించు యోగికి చిత్త మేకాగ్ర మగును.

'స్వాధ్యాయాద్ యోగమాసీత
యోగాత్ స్వాధ్యాయ మామనేత్
స్వాధ్యాయ యోగసంపత్త్యా

**పరమాత్మా ప్రకాశతే'**

స్వాధ్యాయ మన ప్రణవజపము. యోగమన ఈశ్వరభావన. ప్రణవజపము, ఈశ్వరభావన యను నీ రెంటితో ఈశ్వరతత్త్వ మభిముఖమగును. యోగి చిత్త మనాకులమై సమాహితమగును. పురుషఖ్యాతి కలుగును. పరవైరాగ్యము ద్వారా అసంప్రజ్ఞాత సమాధి - నిర్బీజ సమాధి యేర్పడును.

అవ॥ ఈశ్వర ప్రణిధాన మొనర్చు యోగికి కలుగు లాభము సమాధి మాత్రమేనా? యన:

**తతః ప్రత్యేక్చేతనాధిగమోఽప్యంతరాయాభావశ్చ** **29**

తతః = ఈశ్వర ప్రణిధానము వలన, ప్రత్యక్చేతనాధిగమోపి = ప్రకృతి కంటె భిన్నుడైన జీవుని స్వరూప ప్రాప్తియును, అంతరాయాభావశ్చ = రాబోవు సూత్రమున వర్ణింపబడు వ్యాధి మున్నగు విఘ్నముల నివారణమును నేర్పడగలవు.

ప్రత్యక్ చేతనము :- ప్రత్యక్ = విపరీతముగ నెఱుగునట్టి, చేతనము = జీవపదార్థము. జీవుడు ప్రకృతి సంబంధముచే తన స్వరూపము నున్నదున్నట్లు తెలిసికొనక విపరీతముగ తెలిసికొనును. ఈశ్వర ప్రణిధానము వలన యోగి రోగాది విఘ్నములనుండి తొలగి క్రమముగా సంప్రజ్ఞాత సమాధి కలవడును. అటుపై తన స్వరూపమును గుర్తించును. అంతట పరమ వైరాగ్య మేర్పడి నిర్బీజ సమాధిని పొందును. అనంతరము పరమాత్మ ప్రకాశ మేర్పడును. జీవుడు కైవల్య సుఖము - బ్రహ్మానంద ప్రాప్తి నందును.

ఇందు ఈశ్వరుని కొఱకు యత్నించు యోగికి ఆత్మ స్వరూప (తనరూప) ప్రాప్తి యెట్లు కలుగ గలదని సందేహింప వలదు. జీవుడు కూటస్థుడు(జన్మ మరణములు లేనివాడు), ప్రసన్నుడు(అవిద్యాది క్లేశరహితుడు), కేవలుడు (ధర్మాధర్మ సంస్కార రహితుడు), మఱియు జాతి, ఆయువు, భోగము నను వానిచే రహితుడు నయినపుడు ఈశ్వరుని వలె నుండును. జీవేశ్వరులలో నొకింత భేదముతో సమానత యేర్పడును. సామ్యము వలన ఈశ్వరునకై యత్నించుచు స్వస్వరూపమునుగూడ తెలిసికొనును. కొండొక శాస్త్రము నభ్యసించువాడు దానికి సమానమైన మఱియొక శాస్త్రము నభ్యసింపకయే తెలిసికొనగలుగుట మన మెఱుగుదుము కదా!

అవ॥ అంతరాయములు :

**వ్యాధి స్త్యాన సంశయ ప్రమాదాలస్యావిరతి**
**భ్రాంతిదర్శ నాలబ్ధభూమిక త్వానవస్థితత్వాని**
**చిత్త విక్షేపాః తేఽన్తరాయాః** **30**

వ్యాధి....అనవస్థితత్వాని = వ్యాధి మున్నగునవి, చిత్తవిక్షేపాః = చిత్తమును చలింపజేయునవి. తే2న్తరాయాః = అవి యంతరాయములు - యోగమలములు అనబడును.

వ్యాధిః :- శరీరమునందలి వాతపిత్తాది ధాతువులయు, అవయవములయు వికారమువలన కలుగు జ్వరాదులు.

స్త్యానమ్: - కోరికయున్నను యోగసాధనకు తగిన సామర్థ్యము చిత్తమున లేకుండుట.

సంశయః :- యోగము తనకు సాధ్యమగునో కాదో యని సందేహము.

ప్రమాదః :- యమనియమాది యోగాంగముల ననుష్ఠింపకుండుట.

ఆలస్యమ్ :- యోగాంగములయిన యమనియమాదుల నాచరింప ప్రవృత్తి కలిగింపని శరీరస్థూలత, చిత్తమాలిన్యమును.

అవిరతి :- శబ్దస్పర్శాది విషయములందు అనురాగము కలిగియుండుట.

భ్రాంతిదర్శనమ్ :- ఆచార్యులచే బోధింపబడిన యోగాంగములను యోగాంగములు కావని యెంచుట.

అలబ్ధభూమికత్వమ్ : - యోగాంగముల నభ్యసించినను మధుమత్యాది నామములు గల చిత్త దశలను పొందకుండుట.

అవనస్థితత్వమ్:-చిత్త భూములను పొందియు నట నిలకడ లేకుండుట.

ఇవి యన్నియు యోగమునకు విరోధులు. సమాధి కంతరాయములు. ఇవి చిత్తమును విక్షిప్త మొనర్చి వృత్తి నిరోధ రూపమగు సమాధిని కలుగనీయవు. కాబట్టి యోగమలము లనియు వీని నందురు.

అవ॥ ఈ యంతరాయములతో బాటు :

**దుఃఖ దౌర్మన స్యాఙ్గమేజయత్వ శ్వాస**
**ప్రశ్వాసా విక్షేపసనహాభువః** **31**

దుఃఖ.... ప్రశ్వాసాః = దుఃఖాదులు, విక్షేపసహభువః = వ్యాధి మున్నగు విక్షేపము (అంతరాయము) లుండగా గలుగును.

ఆధ్యాత్మికము, ఆధిభౌతికము, ఆధిదైవికము నని ముప్విధములుగ చెప్పబడు బాధలు దుఃఖము, కోరికలు నెఱవేఱనందువలన కలుగు చిత్త వైకల్యము దౌర్మనస్యము. ఆసనము (కూర్చుండుస్థితి), మనస్సు వీని స్థిరతకు భంగము కలిగించు శరీరావయముల కంపనము అంగమేజయత్వము. ప్రయత్నము లేకయే వెలుపలి వాయువు లోపలికి తీసికొనబడుట శ్వాసము. ఇట్లే లోపలి వాయువు బయటికి విడుచుట ప్రశ్వాసము.

దుఃఖము, దౌర్మనస్యము, అంగమేజయత్వము, శ్వాసము, ప్రశ్వానము నను నీ యైదును చిత్తము విక్షిప్తావస్థయం దుండగా కలుగును. సమాహితమై యున్నపుడు కలుగనేరవు.

అవ॥ సమాధికి విరోధులగు నీ విక్షేపములు (అంతరాయములు) వాని సహచరములయిన దుఃఖాదులు నివారింప నేమి చేయవలయు నన :

**తత్ప్రతిషేధార్థ మేక తత్త్వాభ్యాసః** **32**

తత్ప్రతిషేధార్థమ్ = ఆ యంతరాయముల నడ్డగించుటకు, ఏకతత్త్వాభ్యాసః = ఈశ్వరతత్త్వము నభ్యసింపవలయును.

లోకమునందలి విషయములను ఒకదాని తరువాత నొకటిగా మన మెఱుగుచున్నాము. అనగా చిత్తము ముందు ఒక వస్తువు(విషయము) ను చేరి దాని యాకృతిని బొంది యది గ్రహించి యటుపై వెంటనే మఱియొక వస్తువును చేరి దాని యాకృతిని బొంది యదియు గ్రహించును. ఇట్లే యొకదాని తరువాత నొకటిగా వస్తువులు గ్రహింపబడుచుండును.

చిత్త మెల్లపుడు నిలకడలేని దైవస్త్వాకారముల నొందుచుండునని భావము.ఇట్టి చిత్తమును అభ్యాస వైరాగ్యముల ద్వారమున స్థిరమొనర్ప వలసియున్నది. దానిని వస్త్వాకారమున పరిణతి నొందకుండ జేయవలయును. అందుల కభ్యాసము ముఖ్య సాధనము. ఆ యభ్యాసమునకు విషయ మెయ్యదియో నిర్ణయింప దలచి ఋషి యేకతత్త్వమును బోధించుచున్నాడు. ఏకతత్త్వమిట యీశ్వర తత్త్వమే యని వాచస్పతిమిశ్రులు స్పష్టపఱచియున్నారు. 'ఈశ్వర ప్రణిధానా ద్వా' యని పూర్వ సూత్రమున వర్ణించిన ఈశ్వర విషయ మిట ప్రకృత మగుటయే యిందులకు కారణము.

కొందఱు (భోజాదులు) ఏకతత్త్వమున ఏదేని యొక స్థూలతత్త్వమని వ్రాయుట చింత్యము.

బుద్ధ మతానుయాయి యగు యోగాచారుని (క్షణిక విజ్ఞానవాది) మతమున పదార్థము లన్నియు క్షణికములు. ఒక క్షణమున నుండి మఱియొక క్షణమున నశించును. కాబట్టి చిత్తము కూడ క్షణికమే యగును. మఱియు క్షణమున నొక వస్తువును గ్రహించి యాచిత్త మా వస్తువుతోబాటు నశించును. మఱియొక క్షణమున నా వస్తువుకానీ, ఆ చిత్తముకానీ యుండ నేరవని భావము. కాబట్టి చిత్తము క్షణికమే కాక ప్రత్యర్థనియతమనియు చెప్పవలసి వచ్చును. అట్టి యెడ చిత్తము సదా యేకాగ్రమే (ఏకవస్తు విషయకమే) యని తేలుచున్నది. వారి మతమున సమాధికై యభ్యాస మనవసరము. ఇంతేకాక చిత్తము క్షణికము. ప్రత్యర్థ నియతమనుటయును తగదు. చిత్తము ప్రత్యర్థ నియతమై క్షణిక మగు నెడల ఒక క్షణమున తెలిసిన వస్తువు మఱియొక క్షణమున 'అదే యిది' యని గుర్తింపబడ కుండవలయును. కారణమేమన: మొదటి క్షణమున తెలిసికొనిన చిత్తముకానీ, వస్తువుకానీ రెండును రెండవ క్షణమున నుండ నేరవుకదా! కాబట్టి అనుభవ విరుద్ధము. క్షణికవాదుల మతమున బుద్ధ భగవానుని చిత్తనిరోధము నిమిత్త మొనర్చు ఉపదేశమును వ్యర్థము కాగలదు.

అవ॥ చిత్తము రాగద్వేషాది మాలిన్యములతో కూడియున్నపుడు ఏకతత్త్వాభ్యాసము (ఈశ్వర ప్రణిధానము) సాధ్యము కానేరదు. అందులకు చిత్తప్రసాద మవసరము. కాబట్టి చిత్తమునందలి మలినతను దూరమొనర్చి శుద్ధ మొనర్చుకొను విధ మెద్ది యన :

**మైత్రీ కరుణా ముది తోపేక్షణాం సుఖదుఃఖపుణ్యా**
**పుణ్య విషయాణాం భావనాత శ్చిత్త ప్రసాదనమ్ 33**

సుఖ....విషయాణామ్ = సుఖులు, దుఃఖులు, పుణ్యులు, పాపులు క్రమముగా విషయము గలవైన, మైత్రీ.... పేక్షాణామ్ = సుహృద్భావము, కృప, ముదము - సంతోషము, ఉపేక్ష - ఉదాసీనతలను, భావనాతః = భావించుటవలన - మాటిమాటికి చిత్తమున నిడుకొనుటవలన, చిత్తప్రసాదనమ్ = చిత్తనైర్మల్యము సంపాదింపనగును.

సుఖులయెడ సుహృద్భావము (మైత్రి)ను, దుఃఖులయిన వారియెడల కృపను, పుణ్యులయెడ ముదమును, పాపులయెడ నుదాసీనత (ఉపేక్ష)ను కలిగి

యున్నందున చిత్తము ప్రసన్నమగును. కాలుష్యము దూరమగును.

చిత్తమున ఈర్ష్య, పరాపకారబుద్ధి, అసూయ, అమర్షము – అసహనత యనెడి నాలుగు విధములయిన కాలుష్యము లుండును. ఇందు సుఖసంపన్నులైన వారిని జూచి వారియెడల మిత్రభావము కలిగియున్నందున ఈర్ష్యయనెడి కాలుష్యము తొలగును. సుఖియైన మిత్రునిజూచి యీర్ష్యపడువారుండరు. మిత్రుని సుఖము చిత్తప్రసన్నతకు కారణమగును. అట్లే సుఖులయిన ప్రాణులు మిత్రములా? అమిత్రములా? యని విచక్షణ చేయకయే యెల్లప్రాణులయెడను మిత్రభావన కలిగియున్నచో చిత్తమునసీర్ష్య కలుగనేరదు. దుఃఖితులైన ప్రాణులనుజూచి వారియెడల జుగుప్స చెందక 'పాపము! వీరికీ దుఃఖమెట్లు పోగలదా!' యని యనుకంప..కరుణ కలిగియున్నందున పరాపకారబుద్ధి యనెడి కాలుష్యము తొలగును. పుణ్యవంతులు – సుకృతులయినవారియెడల (ముదము) హర్షము కలిగియున్నందున అసూయ నశించును. తనవలె సుకృతమొనర్చి తనకంటె నెక్కుడుగానో లేక తక్కువగానో పుణ్యసంపాదన మొనర్చువారిని జూచి యసూయపడుట లోకమున జూచుచున్నాము. అట్టి యెడల తనవలె నితరులును పుణ్యవంతులగుట శ్రేయస్కరమని సంతసించువారికి అసూయ కలుగనేరదు. పాపులను జూచినపుడు అసహనము (అమర్షము) కలుగుట సామాన్యము. కాబట్టి పాపులయెడల నుపేక్షాభావము (ఉదాసీనత) కలిగియున్నందున అసహనత యనెడి చిత్తమాలిన్యము దూరమగును.

యోగము నభ్యసించువారు ఈశ్వరప్రణిధానము (ఏకతత్త్వాభ్యాసము) కొఱకు తమ చిత్తమునందలి యీర్ష్యాది కాలుష్యములను నశింపజేయగోరి సదా మైత్ర్యాదుల నభ్యసింతురు. అందువలన వారి చిత్తము ప్రసన్నమగును. చిత్తమున శుక్లధర్మమేర్పడును – సత్వగుణము వర్థిల్లును. ఈశ్వర ప్రణిధానము సులభమగునని భావము.

అవ॥ ప్రసన్న చిత్త మీశ్వర ప్రణిధానము వలన నేకాగ్రము – సమాహితమగునని వర్ణించి, చిత్తైకాగ్రత కుపకరింపగల యితరోపాయములను చెప్పుచున్నాడు.

**ప్రచ్ఛర్దన విధారాణాభ్యాం వా ప్రాణస్య** **34**

ప్రాణస్య = కోష్ఠమునందలి (లోపలి) వాయువుయొక్క ప్రచ్ఛర్దన విధారాణాభ్యాం = రేచనకుంభకములద్వారా, చిత్తము స్థిరమగును.

కోష్ఠము (శ్వాసాశయము) నందలి వాయువును రెండు నాసికా పుటములద్వారమున బయటికి వెడలగ్రక్కుట ప్రచ్ఛర్ధన మనబడును. విధారణమన ప్రాణాయామము. బయటికి తీసినవాయువు వెంటనే నాసికా పుటములద్వారమున శ్వాసాశయములందు ప్రవేశింపనీయకుండుట విధారణము - ప్రాణాయామ మనబడును. ఇట్లే శ్వాసాశయములను నెమ్మదినెమ్మదిగా వెలుపలి వాయువుతో పూరించి యటుపై కొంత తడ వా వాయువును కుంభించి యటనేయుంచుటకును యత్నింపవలయును. ఇట్లు చేయుటచేతను చిత్తము స్థితిపదమొందును- సమాహితము కాగలదు.

యోగము నభ్యసించువ్యక్తి నిత్యము నిశ్చిత సమయమున తనయభ్యాస స్థలమునచేరి యట నభ్యస్తమయిన ఆసనము (సిద్ధాసనము, పద్మాసనము) స్థిరముగా కూర్చుండవలయును. పరమేశ్వరునకును, యోగోపదేశకులైన పతంజలి ప్రభృతిఋషులకును - సిద్ధులకు భక్తితో మానసిక నమోవాకములొనర్చి యటుపై ప్రాణాయామమునకు గడంగవలయును. గుదద్వారమును గట్టిగా బిగించి, పైకిలాగి పట్టియుంచి, పొట్టనక్కళించి శ్వాసాశయములందలి వాయువును రెండు నాసికా పుటములద్వారమున నొక్కమాఱు బయటికి వెడలునట్లు బలపూర్వకముగాను, వేగముగాను, రేచింపవలయును - నిఃశ్వసింపవలయును. అట్లు బయటికి వెడలగ్రక్కిన వాయువు వెంటనే నాసికాపుటముల ద్వారమున లోపల ప్రవేశింపకుండునట్లు కొంతతడవు యత్నింపవలయును. శక్తికొలది యత్నించి యటుపై నెమ్మదిగా లోపలికి పోనిచ్చి శ్వాసాశయములు పూర్ణముగ నిండునట్లు పూరింపవలయును - ఉచ్ఛ్వసింపవలయును. అట్లు నింపి మరల యథాశక్తి కుంభించి యుంచవలయును. లోపలనే వాయువు నుంచవలయునని భావము. ఇట్లు అంతర్బాహ్య కుంభకములద్వారా నిత్యము ప్రాణాయామము నభ్యసించుట వలన చిత్తము సమాహితము కాగలదు. ఈ సూత్రమున చెప్పబడిన ప్రచ్ఛర్దన విధానమును వర్ణించుచు వ్యాసమహర్షి కోష్ఠగత వాయువును నాసికాపుటముల జంటతో ప్రయత్న విశేషమున నమనము చేయుట యని వ్యాఖ్యానము చేసియున్నాడు. ప్రయత్న విశేషమున కర్థము 'యోగశాస్త్రమున చెప్పినట్లు' అని వాచస్పతిమిశ్రులు. నాసికాపుటాభ్యాం (రెండు నాసికాపుటములతో) అను వ్యాసవచనమునకు కొందఱు అధునికులు ఒకే నాసికాపుటముతో నని యర్థము

వ్రాసియున్నారు. ఈ యుద్ధములు మూలము నెంతవఱ కనుసరించుచ్చునవో పాఠకు లాలోచింతురుగాక!

**విషయవతీవా ప్రవృత్తి రుత్పన్నామనసః స్థితి నిబంధినీ 35**

వా = లేక, విషయవతీ = శబ్దస్పర్శాది విషయములు గల, ప్రవృత్తిః = ఆయా విషయ సాక్షాత్కారమగు చిత్తవృత్తి, ఉత్పన్నా = జనింపనిదై, మనసః = చిత్తమునకు, స్థితిబంధినీ = నిలకడ గడిగించునదియగును.

నాసికాగ్రభాగమున చిత్తమును నిలిపి యట ధ్యానసమాధులను సంపాదించుటవలన దివ్యగంధజ్ఞానము కలుగును. ఇయ్యది గంధసంబంధమైన విషయవతీ ప్రవృత్తి యనబడును. ఇట్లే తాలువునందు, జిహ్వామధ్యమున, జిహ్వామూలమున చిత్తమును నిలిపి ధ్యానసమాధులను సంపాదించినందున క్రమముగా దివ్యములయిన రూప, స్పర్శ, శబ్దముల జ్ఞానము కలుగును. ఇట్టి దివ్యగంధప్రవృత్తి, దివ్యరూపప్రవృత్తి, దివ్యస్పర్శప్రవృత్తి, దివ్యశబ్ద ప్రవృత్తియును చిత్తస్థైర్యమునకు కారణములగును.

శాస్త్రములం దుపదేశింపబడిన కైవల్యాది సుఖవిషయములు యథార్థములయినను సూక్ష్మములగుటచే వానిస్థితియందు సందేహము కలుగవచ్చును. అట్టి సందేహము దివ్యములయిన ఉపర్యుక్తగంధాది విషయవతీప్రవృత్తులు తొలగించును. సమాధిప్రజ్ఞను కలిగించుటలో నివి ద్వారములగును. యోగి ప్రథమమున నాసికాగ్రాది స్థానములలో నొకయెడ చిత్తమును నిలిపి ధ్యానసమాధులు సంపాదించిన త్వరలోనే దివ్యగంధాదులు ప్రత్యక్షము కాగలవు. ఇట్టిగంధాది ప్రవృత్తి చిత్తమును స్థిరపఱచును. తదుపరి సూక్ష్మములయిన జీవేశ్వరాది విషయములందు శ్రద్ధాళువు కాగలడు. క్రమముగా నిర్బీజసమాధి సంపాదనకు గడంగి పురుషఖ్యాతిని సంపాదించి కైవల్యసుఖము నందగలడని భావము.

**విశోకా వా జ్యోతిష్మతీ 36**

వా = లేక, విశోకా = శోకరహితమైన, జ్యోతిష్మతీ = ప్రకాశవంతమగు ప్రవృత్తి చిత్తస్థైర్యమునకు కారణమగును.

చిత్తసత్వము (మనస్సు) హృదయ పుండరీకమున నుండును. చిత్తసత్వమునకు కారణము అస్మిత. అదియును హృదయస్థానికమే. హృదయమున చిత్తమును స్థిరపఱచిన జ్యోతిష్మతీ (ప్రకాశవంతమగు) ప్రవృత్తి

యేర్పడును. చిత్తసత్త్వము విషయముగాగల ప్రవృత్తి (విషయవతీ విశోకా జ్యోతిష్మతీ) విషయవంతము, శోకరహితము, ప్రకాశవంతమునై యుండును. అస్మిత విషయముగాగల ప్రవృత్తి (విశోకా జ్యోతిష్మతీ) శోకరహితము, ప్రకాశవంతమునై యుండును. ఇట్టి ప్రవృత్తులున్నపుడు రజస్తమో గుణములకు సంబంధించిన దుఃఖము (శోకము) లుండవు. ఈ ప్రవృత్తులును చిత్తస్థిరతకు నుపయోగించునని భావము.

**వీతరాగ విషయం వా చిత్తమ్** **37**

వా = లేక, వీతరాగవిషయం = రాగాదులులేని పుణ్యమూర్తులయిన మహర్షుల చిత్తము విషయముగాగల, చిత్తమ్ = మనస్సు, స్థితిపదమును బొందునని యర్థము.

రాగద్వేషాదులు లేని మహర్షుల చిత్తమును తన చిత్తమునకు విషయమొనర్చు యోగిచిత్తము సమాహిత మగునని భావము.

**స్వప్ననిద్రా జ్ఞానాలంబనం వా** **38**

వా = లేక, స్వప్న...బనమ్ = స్వప్నము (కల) లోని జ్ఞానము నిద్రించునపుడు జ్ఞానము విషయముగాగల చిత్తము స్థిరపడును.

కలలో నేదేని యొక విచిత్ర దృశ్యమును చూచుట సామాన్యము. అట్టి దృశ్యమునందు చిత్తమును నిలుపుటచేతను చిత్తము సమాహితము కాగలదు. అట్లే సుఖముగ నిద్రించి లేచిన తరువాత 'సుఖముగ నిద్రించితిన'ని తోచును. అట్టి జ్ఞానమునందు చిత్తమును నిలుపుటచేతను చిత్తము సమాహిత మగునని భావము.

**యథాభిమతధ్యానా ద్వా** **39**

వా = లేక, యథాభిమతధ్యానాత్ = ఏదేని ఇష్టమైన విషయమును ధ్యానించుటవలనను చిత్తము స్థితపదము నందును.

నాభిచక్రము, హృదయము, మూర్ధజ్యోతి మున్నగు విషయములందుగానీ, చంద్రసూర్యాది ప్రాకృతిక విషయములందుగానీ చిత్తము నిలిపి ధ్యానాదుల నొనర్చుటవలన నది సమాహితము కాగలదని భావము.

అవ॥ ఇట్లు చిత్తసమాహితమునకు పలయు నుపాయము లనేకములు చెప్పి, చిత్తస్థితియొక్క పరిపక్వావస్థను తెలిసికొనువిధమును వర్ణించుచున్నారు.

**పరమాణు పరమమహత్వాంతో௨స్య వశీకారః** **40**

అస్య = చిత్తము నిలుపుట కొఱకు ఉపాయముల ద్వారమున యత్నించుయోగియొక్క చిత్తమునకు, పరమాణుపరమ మహత్వాంతః = సూక్ష్మమున ప్రవేశింపజేసిన పరమాణువుపఱకును, స్థూలమున ప్రవేశింపజేసిన పరమమహత్వ పరిమాణమునకు ఆశ్రయమయిన ఆకాశమువఱకును, వశీకారః = స్థిరత కలుగుటలో నాటంక ముండనేరదు.

ఏదో యొక విషయమున మాత్రము చిత్తము స్థిరమగును. మఱియొక విషయముకాదు, అను నియయములేక – స్థూలసూక్ష్మభేదము లేక – కోరిన విషయములందెల్ల చిత్తము స్థిరమై – సమాహితమయిననాడు చిత్తైకాగ్రత పరిపక్వమైన ట్లెంచవలయును. అటుపై యోగి చిత్తస్థితికై యత్నింపవలసిన యవసర ముండదని భావము.

అవ॥ ఇట్లు యా విషయములందు చిత్తము ఏకాగ్రము – సమాహితమైనపు డేవిషయమున నెట్టి సంప్రజ్ఞాతసమాధి కలుగగలదో వర్ణించుచున్నాడు.

**క్షీణవృత్తే రభిజాతస్యేవ మణేర్ గ్రహీతృ గ్రహణ**
**గ్రాహ్యేషు తత్స్థ తదంజనతా సమాపత్తిః** **41**

అభిజాతస్య = కులీనమైన – సహజముగా నిర్మలమైన, మణేరివ = స్ఫటికమువలె, క్షీణవృత్తేః = అభ్యాస వైరాగ్యముల ద్వారమున తామస రాజస వృత్తుల నన్నింటిని దూరముచేసి నిర్మలముచేయబడిన చిత్తసత్వమునకు గ్రహీతృగ్రహణ గ్రాహ్యేషు = (అస్మిత, ఇంద్రియములు, విషయములు) అభ్యాసక్రమమున చెప్పినచో = శబ్దాది విషయములు, ఇంద్రియములు, ఆస్మితఅను నిట్టి విషయములందు, తత్స్థ తదంజనతా = పై విషయములందు స్థిరముగానుండుటవలన – ఆయా విషయాకారములు కలిగియుండుటవలన వానియాకారముగల, సమాపత్తిః = సంప్రజ్ఞాత సమాధి కలుగును.

స్వచ్ఛమైన స్ఫటికమునకు సమీపమున రంగులుగల పుష్పములున్నపుడా స్ఫటికము తన రూపమును విడిచి ఆయా పువ్వులరంగులతో కూడి యెఱుపుగాను, పసుపుగాను ప్రకాశించును. అట్లే అభ్యాసాదుల ద్వారమున చిత్తమునందలి రాజస తామసవృత్తులు నశింపగా నా చిత్తము సత్వగుణముతో క్రమముగా రూపరసాది విషయములందును, వానిని గ్రహింప సాధనములైన

యింద్రియములందును, గ్రహీత యనబడు అస్మితయందును నిలుపబడి వానియాకారముకలదై ప్రకాశించును. అట్టియెడ చిత్తమున రాజస తామస వృత్తులుండక సాత్త్వికవృత్తి మాత్రముండును. అభ్యాసి ముందు శబ్దాదిస్థూలవిషయములం దట్టి వృత్తి సంపాదించును. అటుపై సూక్ష్మములయిన యింద్రియములందు చిత్తమును నిలిపి వాని యాకృతిని సంపాదించును. అటు తరువాత నంతకంటె సూక్ష్మమైన అస్మిత (చిత్తవృత్తులు తనవే యనుకొనెడిస్థితి) యందు చిత్తమును నిలిపి చిత్తమునకు అస్మితాకారత సంపాదించును. ఇట్లాయా శబ్దాది విషయములకు, ఇంద్రియములకు, అస్మితకు సంబంధించిన చిత్తము యొక్క సాత్విక పరిణామమే సంప్రజ్ఞాత సమాధి యనబడును.

శబ్దాది విషయములు గ్రహింపదగినవి. కాబట్టి వీనిని గ్రాహ్యము లందురు. ఈ గ్రాహ్యములును స్థూలములు, సూక్ష్మములు నని రెండు విధములు. స్థూలములయిన గ్రాహ్య విషయములందు నేర్పడు చిత్తసాత్విక పరిణామము వితర్కానుగత సంప్రజ్ఞాత సమాధి యనబడును. సూక్ష్మగ్రాహ్య విషయములం దేర్పడు చిత్తసాత్విక పరిణామము విచారానుగత సంప్రజ్ఞాత సమాధి యనబడును.

విషయములను గ్రహించుట కుపయోగించును. కాబట్టి ఇంద్రియములు (చక్షురాదులు) గ్రహణము లనబడును. ఇట్లు చక్షురాది గ్రహణములందు చిత్తము నిలుపుటచే నట నేర్పడు చిత్తసాత్విక పరిణామము ఆనందానుగత సంప్రజ్ఞాతసమాధి యనబడును.

విషయాదులను గ్రహించు అస్మిత (దృక్దర్శన శక్తుల యేకాత్మత) గ్రహీత యనబడును. అట్టి గ్రహీతయనబడు అస్మితయందు చిత్తము నిలువగా నేర్పడు అస్మితాకార సాత్విక్పరిణమము అస్మితానుగత సంప్రజ్ఞాత సమాధి యనబడును. ఇట్లు సంప్రజ్ఞాత సమాధి నాలుగు విధములు. ఈ పాదముననే పదునేడవ సూత్రమున (వితర్క...సంప్రజ్ఞాతః) సంప్రజ్ఞాత సమాధి నాలుగు విధములని చెప్పబడినది. ఈ సూత్రమున గ్రహీతృ, గ్రహణ, విషయభేదమున ముప్విధములని చెప్పబడినట్లు సామాన్యముగ తోచును. కాని విషయములను స్థూల సూక్ష్మములుగ విభజించి ఆయా ఆకారపరిణితులను రెండుగ లెక్కించిన పూర్వాపరవిరోధముండజాలదు. శబ్దాది విషయములు గ్రాహ్యములయినట్లు

ఇం(ద్రియములును, అస్మితయుగూడ వానియందు చిత్తము నిలుపునపుడు (గాహ్యములేయగును. ఇట్లు (గహీతృ (గహణ, (గాహ్యములన్నియు (గాహ్యములే కాబట్టి సామాన్యముగ సం(ప్రజ్ఞాత సమాధి (గాహ్యవిషయకమై యొక్కటిగానే యెంచబడును. అవాంతరభేదములను గుర్తించినపుడు చతుర్విధము లగునని భావము.

అవ॥ (గాహ్యవిషయమునకు సంబంధించిన స్థూలసూక్ష్మభేదముల వలన సం(ప్రజ్ఞాత సమాధి రెండు విధములు. అందునను రెండు భేదము లుండుటచే సవితర్కము, నిర్వితర్కము, సవిచారము, నిర్విచారము నని నాలుగు విధములగుచున్నది. ఇఃదు స్థూల (గాహ్య విషయము గల సవితర్క సం(ప్రజ్ఞాత సమాధి లక్షణము వర్ణించుచున్నాడు.

**శబ్దార్థ జ్ఞానవికల్పైః సంకీర్ణా సవితర్కా సమాపత్తి ః 42**

శబ్దార్థజ్ఞానవికల్పైః = శబ్దము, అర్థము, జ్ఞానము అను నీ మూడును (అభిన్నములు) ఒకటిగా తోచినందున, సంకీర్ణా = మి(శమముగా – అభిన్న విషయకమైన, సమాపత్తిః = సమాధి, సవితర్కా = సవితర్క మనబడును.

(శో(త్రేం(ద్రియముచే (గహింపదగు ధ్వనియొక్క పరిణామభేదము శబ్దము. సామాన్యమునకు (ఘటత్వగోత్వాదులకు) ఆ(శయమైన వ్యక్తి అర్థము. అట్టి వ్యక్తి విషయకమైన శబ్దమువలన జనించిన బుద్ధివృత్తి జ్ఞానమనబడును.

సం(ప్రజ్ఞాత సమాధి చిత్తముయొక్క సాత్త్వికవృత్తియని పూర్వమే చెప్పబడినది. ఇట్టి చిత్తవృత్తికి బాహ్యమున (గాహ్యములనబడు స్థూలములయిన గోవు, ఘటము మున్నగు వస్తువులు విషయములయినపుడు ఆయా గో ఘటాది విషయములు మున్నగు స్వవాచకశబ్దము, శబ్దసంకేతస్మృతి, స్వవిషయకజ్ఞానము నను వానితో గూడి జలదుగ్ధములవలె నభిన్నములై మి(శమములుగా భాసించును. అట్టి చిత్తస్థితి సవితర్క సం(ప్రజ్ఞాత సమాధి యనబడును.

లోకమునగల వస్తువులన్నియు శబ్దములచే వ్యవహరింప బడుచుండును. వ్యవహరించువారి కా వస్తువులకు, శబ్దములగుగల సంబంధమును తెలిసియుండును. నిత్య వ్యవహారమువలన వస్తువు తెలియుటతోబాటు దాని తెలుపు పదము, ఆ పదమున కా వస్తువుతోగల సంబంధము, ఈ వస్తువియ్యది యనుజ్ఞానము నన్నియు కలుగుచుండును. ఇయ్యవి వేఱువేఱుగా నుండక అన్నియు కలిసి యొకే క్షణమున భాసించుచున్న ట్లుండును. రాజన తామస

వృత్తులు లేక కేవలము సాత్త్వికవృత్తి చిత్తమున నున్నపు డిట్టి శబ్దార్థ జ్ఞానములతో గూడిన బాహ్యస్థూలవస్తువిషయక భావము సవితర్క సంప్రజ్ఞాత సమాధి యనబడునని భావము.

అవ॥ స్థూలగ్రాహ్య విషయమునకు సంబంధించిన నిర్వితర్క సంప్రజ్ఞాత సమాధి :

**స్మృతిపరిశుద్ధౌ స్వరూపశూన్యే**
**వార్థమాత్రనిర్భాసా నిర్వితర్కా** **43**

'సమాపత్తిః' అను పద మీ సూత్రమున అన్వయించును. స్మృతి పరిశుద్ధౌ = శబ్దసంకేతమునకు సంబంధించినస్మృతి తొలగిపోగా, (శబ్దమును, జ్ఞానమును ఉపస్థితములుకావు) అట్టియెడ, అర్థమాత్రనిర్భాసా = గోవు, ఘటము మున్నగు వస్తువులు మాత్రము ప్రకాశించుస్థితి, స్వరూపశూన్యేవ = వస్తువుయొక్క (ఈ వస్తు వియ్యది యను జ్ఞాన) స్వరూపము గూడ లేనట్లుండునది నిర్వతర్క సంప్రజ్ఞాతసమాధి యనబడును.

సవితర్క సమాధియందు ప్రతిభాసించు స్థూలవస్తువు (గో ఘటాదులు) నందు వృద్ధవ్యవహారాదులవలన తెలియు శబ్దశక్తికి సంబంధించిన స్మృతితోబాటు శబ్దమును, జ్ఞానమును గలిసియుండును. నిర్వతర్క సమాధియందు అభిధావృత్తియనెడి సాంకేతికస్మృతి యుండదు. అట్టియెడ వస్తుబోధక శబ్దమును, 'ఈ వస్తు వియ్యది' యను జ్ఞానమును రెండునుగూడ అస్ఫుటముగా భాసించును. ఉండియు లేనట్లుండునని భావము. కాబట్టి వస్తువు మాత్రము స్ఫుటముగా భాసించును. ఇట్టి శుద్ధసాత్త్విక చిత్తవృత్తియే నిర్వితర్క సమాధి యనబడునని తాత్పర్యము.

ఈ సమాపత్తి (సంప్రజ్ఞాత సమాధి), నిర్వికల్పమై (శబ్దముతోను, జ్ఞానముతోను, మిశ్రితముకాక) అర్థము (వస్తువు) మాత్రము భాసించును కాబట్టి పరప్రత్యక్షమనబడును. సమాధి సిద్ధులైన ఆచార్యు లీ సమాపత్తి ద్వారమున సద్రూపమయిన అర్థమును (వస్తువు) ప్రత్యక్షమొనర్చుకొని శబ్దజ్ఞానములతో చేర్చి యుపదేశింతురు.

అవ॥ సూక్ష్మగ్రాహ్య విషయకములైన సవిచార, నిర్విచార, సంప్రజ్ఞాత సమాధుల లక్షణములు:

**ఏతయైవ సవిచారా నిర్విచారా**
**చ సూక్ష్మవిషయా వ్యాఖ్యాతా 44**

ఏతయైవ = పూర్వము వర్ణింపబడిన సవితర్క నిర్వితర్క సంప్రజ్ఞాతసమాధి లక్షణముల ద్వారముననే, సూక్ష్మ విషయా = సూక్ష్మవిషయములు ఆలంబనముగా గల, సవిచారా నిర్విచారా చ = సవిచార సంప్రజ్ఞాత సమాధియు, నిర్విచార సంప్రజ్ఞాత సమాధియును, వ్యాఖ్యాతా = లక్షణపూర్వకముగా వ్యాఖ్యానము చేయబడిన ట్లెంచవలయును.

స్థూలగ్రాహ్య వస్తువులకు కారణములు స్థూలములయిన పంచ భూతములు. అట్టి స్థూల పంచభూతములకు సూక్ష్మకారణములు పంచతన్మాత్రములు, పంచతన్మాత్రములవలన నాయా దేశకాలములందు స్థూలములయిన ఘటపటాది వస్తువులు అభివ్యక్తములు - ప్రకటములు - ఉత్పన్నములగును కాబట్టి సూక్ష్మగ్రాహ్యములగు తన్మాత్రలు దేశ, కాల, కారణముల యనుభవములతో గూడి, అభివ్యక్తములగు ఘటపటాదులు ధర్మములుగా గలిగియుండును. ఆ తన్మాత్రలయందు ఏర్పడు శబ్దార్థజ్ఞానములతో గూడిన శుద్ధసాత్త్విక చిత్తవృత్తి సవిచార సంప్రజ్ఞాతసమాధి యనబడును. దేశకాల కారణముల యనుభవములతో నసంబద్ధములయి, అభివ్యక్తములగు ఘటపటాదులు ధర్మముగాగల సూక్ష్మగ్రాహ్య విషయము (తన్మాత్ర) లందు శబ్దార్థజ్ఞాన మిశ్రమముకాక కేవల తన్మాత్ర రూపమైన అర్థమును భాసింపజేయు సాత్త్విక చిత్తవృత్తి నిర్విచార సంప్రజ్ఞాత సమాధి యనబడును.

సవిచార, నిర్విచార సంప్రజ్ఞాత సమాధులందు చిత్తమునకు ఆలంబనము సూక్ష్మవిషయములని యీ సూత్రమున నిర్దేశింపబడినది. దీనిని బట్టి సవితర్క నిర్వతర్క సంప్రజ్ఞాత సమాధులు స్థూల విషయములు గలవిగా పూర్వసూత్రమున వ్యాఖ్యానము చేయబడినట్లు తెలియనగును.

అవ॥ సవిచార నిర్విచార సంప్రజ్ఞాత సమాధులందు గ్రహింపబడు సూక్ష్మ విషయము లెంతవఱకు గ్రహించవలయునన్న :

**సూక్ష్మవిషయత్వం చాలిఙ్గ పర్యవసానమ్ 45**

సూక్ష్మ విషయత్వం చ = సవిచార నిర్విచార సమాధులకు చెప్పబడిన సూక్ష్మవిషయత్వం, అలిఙ్గ పర్యవసానమ్ = ప్రకృతి యంతముగా గలదిగ నెంచవలయును.

సవిచారనిర్విచార సంప్రజ్ఞాతసమాధి యందు చిత్తమునకు గ్రాహ్యములుగా పంచతన్మాత్రములు (సూక్ష్మ భూతములు) చెప్పబడినవి. చిత్తము సూక్ష్మభూతములనబడు పంచతన్మాత్రములందు నిలుపబడునని భావము. పంచతన్మాత్రముల కంటెను సూక్ష్మమైనది అహంకారము. దానికంటెను సూక్ష్మము మహత్తత్త్వము అంతకంటెను సూక్ష్మము ప్రధానము – ఆలింగము – ప్రకృతి. ఇట్లు యోగి పంచతన్మాత్రములకంటెను క్రమముగా సూక్ష్మాతి సూక్ష్మములయిన అహంకారాదులందు చిత్తమును నిలుపుచు నన్నిటికంటెను సూక్ష్మమైన ప్రధానమునందును చిత్తమును నిలుపుచు నన్నింటికంటెను సూక్ష్మమైన ప్రధానమునందును చిత్తము నిలిపి సంప్రజ్ఞాత సమాధిని సంపాదించును. చిత్తమున కాలంబనముగా (గ్రాహ్యముగా) నుండు వస్తువులలో ప్రధానము కంటె సూక్ష్మమైన వస్తువు మఱియొకటి లేదని భావము.

**తా ఏవ సబీజః సమాధిః** **46**

తా ఏవ = పూర్వము వర్ణించిన నాలుగు విధములయిన (సవితర్క, నిర్వితర్క, సవిచార, నిర్విచార) సమాపత్తులు – సమాధులు, సబీజః = సమాధిః = సంప్రజ్ఞాత సమాధి – సంప్రజ్ఞాత యోగము.

సవితర్కాది చతుర్విద సమాధులు సంప్రజ్ఞాత సమాధి యనబడునని భావము.

సంప్రజ్ఞాత సమాధియే సబీజ సమాధి యనబడును. బీజమనగా ధ్యేయము. సంప్రజ్ఞాత సమాధి యందు ధ్యేయము – ఆలంబము – ఒకటి యుండును. కాబట్టి సబీజసమాధి యనబడునని తెలియునది.

అవ॥ అట్టి చతుర్విద సమానపత్తులలో :

**నిర్విచార వైశారద్యేఽధ్యాత్మ ప్రసాదః** **48**

నిర్విచార వైశారద్యే = నిర్విచార సమాపత్తికి సంబంధించిన విశారదత్వ మేర్పడినపుడు, అధ్యాత్మ ప్రసాదః = ప్రజ్ఞాప్రసాద మేర్పడును.

రజస్తమోగుణముల యాధిక్యము అశుద్ధి యనబడును. అయ్యదియే యావరణమనెడి చిత్తమలము. ఈ మలము తొలగగా చిత్తసత్త్వము ప్రకాశాత్మకమగును. రజస్తమములచే నభిభూతముకాని – ఆవరింపబడని ప్రకాశాత్మక చిత్తసత్త్వము యొక్క స్వచ్ఛమైన స్థితి ప్రవాహము వైశారద్య మనబడును.

తన్మాత్రములు మొదలుకొని క్రమముగా ప్రధాన పర్యంతము సూక్ష్మ విషయములందు రాజస తామస రూప మాలిన్య రహితమైన (బుద్ధి) చిత్తసత్త్వ ప్రవాహము స్థిరమైనపుడు - నిర్విచారవైశారద్య మేర్పడినపుడు యోగికి వ్యవహితము (అడ్డంకు కలిగిన వస్తువు) విప్రకృష్టము (దూరమున నుండునది), స్థూలము, సూక్ష్మము, సామాన్యము, విశేషము నను భేదము లేక ఉన్న వస్తువులన్నియు సాక్షాత్కారములగును. ఇదియొక విశిష్ట చిత్తవృత్తి. దీనినే 'స్ఫుట ప్రజ్ఞాలోక' మందురు. ఇది 'ప్రజ్ఞాప్రసాద' మనియు ననబడును.

**'ప్రజ్ఞా ప్రసాద మారుహ్యాశోచ్యః శోచతోజనాన్**
**భూమిష్ఠానివ శైలస్థః సర్వాన్ప్రాజ్ఞోఽనుపశ్యతి'**

పర్వతము నెక్కినవాడు భూమిపై నుండు జనులను చూచునట్లు, ప్రాజ్ఞుడు (యోగి) ప్రజ్ఞాప్రసాదమునుపొంది శోకరహితుడై యితర ప్రాణులను తాపత్రయపరీతులనుగా తెలిసికొనును.

ఈ నిర్విచార సమాధివలన నేర్పడు వైశారద్యమే 'సత్త్వపురుషా న్యతా ఖ్యాతికి' పరమోపాయము. దీనికంటె పురుష ప్రకృతి వివేకమునకు వేఱొకండుపాయము లేదు. నిర్విచార వైశారద్యమును పొంది, యధ్యాత్మ ప్రసాదము కలవాడై, యోగి ప్రకృతిని, దాని కార్యజాతమును వేఱువేఱుగా తెలిసికొని వానికంటె పురుషుడు (జీవాత్మ) భిన్నుడని యెఱుగును. అందు వలననే యధ్యాత్మ ప్రసాదము స్ఫుటప్రజ్ఞాలోకమనియు, ప్రజ్ఞాప్రసాదమనియు, సమాధి ప్రజ్ఞయనియు, ఋతంభరా ప్రజ్ఞయనియు, సత్త్వపురుషాన్యతా ఖ్యాతి యనియు ననేక నామములతో చెప్పబడును. ఇయ్యది నిర్విచార సంప్రజ్ఞాత సమాపత్తి వలననే కలుగును. కాబట్టి నిర్వచార సమాపత్తి యితర సమాపత్తులకంటె శోభనమని భావము.

**ఋతంభరా తత్ర ప్రజ్ఞా** **48**

తత్ర = నిర్విచార వైశారద్యము కలిగినపుడు, యోగికి కలుగు, ప్రజ్ఞా = సమాధి ప్రజ్ఞ, ఋతంభరా = ఋతంభర యనబడును, ఋతం = శబ్ద జ్ఞానాదులతో మిశ్రమముకాని సద్వస్తువును, బిభర్తి = విషయముగా ధరించునది ఋతంభర యనబడును. సత్యమునే తెలుపునది కావున విపర్యాస మొకింతయు నుండదని భావము.

అవ॥ నిర్విచారసమాపత్తి శబ్దమునకును, అనుమానమునకును, విషయములగు వస్తువులకు సంబంధించిన భావన యగుటచే దానివలన నేర్పడు సమాధిప్రజ్ఞయు నా యా విషయములకు సంబంధించినదేయగును. కాని ప్రత్యక్ష విషయమెట్లు కాగల దన:

**శ్రుతానుమాన ప్రజ్ఞాభ్యా మన్యవిషయా విశేషార్థత్వాత్ 49**

శ్రుతానుమాన ప్రజ్ఞాభ్యామ్ = శాస్త్ర శ్రవణము వలన కలిగిన ప్రజ్ఞ శ్రుత ప్రజ్ఞ. అనుమానమువలన కలిగిన ప్రజ్ఞ అనుమానప్రజ్ఞ. వీని రెంటికంటె సమాధి ప్రజ్ఞ, అన్యవిషయా = భిన్న విషయము కలదిగా నెంచవలయును. కారణమేమన, విశేషార్థత్వాత్ = అర్థవిశేషము విషయముగా కలదగుటవలన

శ్రుతానుమానము లన నిట శబ్ద ప్రమాణము, అనుమాన ప్రమాణము నని భావము. ఈ రెండు ప్రమాణముల వలన తెలియు జ్ఞానము వస్తు సామాన్య విషయకమై యుండును. శాస్త్రముగానీ, అనుమానముగానీ విశేష వస్తువును బోధింపక వస్తు సామాన్యమును బోధించునని భావము. 'ఈ శబ్దము వలన నీ యర్థము (వస్తువు) తెలిసికొనదగును' అను శబ్ద సంకేతము ఏదో యొక వస్తువును మాత్రము తెలుపక ఆ వస్తు సామాన్యమును (జాతిని) తెలుపును. గో శబ్దము వలన గోజాతి గ్రహింపబడును కాని ఏదో ఒక గోవు కాదు. ఇట్లే అనుమానము (హేతువు) వలన కలుగు జ్ఞానమును సామాన్య విషయకమై యుండును. ధూమప్రాప్తి వలన (ధూమ హేతుజ్ఞానమున్న) కలుగు అగ్నిజ్ఞానము సామాన్య విషయకమే కాని యేదో యొక విశిష్టమగు అగ్ని విషయకము కాజాలదు. ఇట్లు శబ్దానుమాన ప్రజ్ఞలు రెండును సామాన్య (జాతి) విషయకములని తేలుచున్నది. కాని, సమాధిప్రజ్ఞ యట్లుకాక ఏ వస్తువున చిత్త సమాపత్తి కలుగునో ఆ వస్తు విశేషము నయ్యది సాక్షాత్కరింపజేయుచు శ్రుతానుమానముల కంటె భిన్నవిషయకమగుచున్నది. ఇట్లు సమాధి ప్రజ్ఞ ప్రత్యక్షాత్మకమగుటచే ప్రత్యక్ష విషయమని భావము.

అవ॥ శబ్దాది విషయముల ననుభవించుటచే నేర్పడిన అనాది వాసనలు శత్రువులుగా నుండగా సమాధి ప్రజ్ఞ స్థితి పదము నెట్లు పొందగలదు? సంసారమునకు నిమిత్తములయిన క్లేశకర్మాశయముల నెట్లు నిరోధింపగలదు? అనగా :

**తజ్జః సంస్కారోఽన్య సంస్కార ప్రతిబంధీ** **50**

తజ్జః = నిర్విచార సంప్రజ్ఞాత సమాధి వలన కలిగిన, సంస్కారః = సంస్కారము, అన్యసంస్కార ప్రతిబంధీ = ఇతర సంస్కారములను రేకెత్తనీయదు.

చిరకాలమునుండి శబ్దాది విషయముల ననుభవించుటచే నేర్పడిన సంస్కారములు ఆయా ప్రమాణాది వృత్తుల ద్వారా రేకెత్తుచుండును. కాని వస్తుతత్త్వము నెఱుగక యేర్పడిన సంస్కారముగుటచే నయ్యవి బలహీనములై సమాధి ప్రజ్ఞవలన (వస్తుతత్త్వము ప్రత్యక్షమగుటచే) గలిగిన సబల సంస్కారముచే జయింపబడును. అందువలన నవి రేకెత్తజాలవు. వాని వలన కలుగు జ్ఞానములిట్లు నిరుద్ధములగును. సమాధి ప్రజ్ఞవలన గలిగిన సంస్కారము క్రమముగా స్థిరపడి సంసారమునకు నిమిత్తములయిన క్లేశకర్మాది వాసనలు బొత్తిగా నిరోధింపబడును. క్లేషకర్మాది వాసనలు నిరోధింపబడినను, సమాధి ప్రజ్ఞ వలననేర్పడిన సంస్కారముండును. కాబట్టి యది సంసారహేతు వేల కాదు? అన జనదు. సంస్కారవంతమగు చిత్త కార్యములు రెండు. ఒకటి శబ్దాది విషయ భోగములను కలిగించుట. రెండు వివేక ఖ్యాతిని కలిగించుట. క్లేశకర్మాది సంస్కారయుక్తమైన చిత్తము శబ్దాది విషయముల ననుభవింపజేయును. అట్టి వాసనలు నిరుద్ధములగుటచేత (సమాధి ప్రజ్ఞవలన జనించిన సంస్కారమువలన) శబ్దాదుల ననుభవింప జేయజాలక సంసార హేతువు కాజాలదు. సమాధి ప్రజ్ఞాజన్య సంస్కారముతో గూడిన చిత్తము వివేకఖ్యాతిని కలిగించును. ఇట్లు చిత్త కార్యములు రెండును ముగియుటచే చిత్తము సాధికారము కాదు. సాధికార చిత్తమే సంసారహేతువని పూర్వమే వర్ణించియున్నాము.

అవ॥ సమాధి ప్రజ్ఞయును, దాని సంస్కారమును నుండగా నిర్బీజ సమాధి కలుగు విధ మెద్ది? అన :

**తస్యాపి నిరోధే సర్వనిరోధాత్ నిర్బీజః సమాధిః** **51**

తస్యాపి = ప్రజ్ఞ, దాని వలన నేర్పడిన సంస్కారము అను రెండును, నిరోధే = విలయము కాగా, సర్వనిరోధాత్ = వ్యుత్థాన సంస్కారములును, ప్రజ్ఞయు ప్రజ్ఞాజన్య సంస్కారములును నన్నియు నిరోధింపబడుటవలన, నిర్బీజః = వాసనలనెడి బీజములేని –నిరాలంబనమయిన, సమాధిః = చిత్తము యొక్క

యవస్థావిశేషము - అసంప్రజ్ఞాత సమాధి యేర్పడును.

నిర్విచార వైశారద్యము - (జ్ఞాన ప్రసాదము) వలన పరవైరాగ్యమేర్పడును. దానివలన సంప్రజ్ఞాతసమాధి కలుగు ప్రజ్ఞ, ఆ ప్రజ్ఞవలన కలిగిన సంస్కారము రెండును నశించును. ఇట్లు సంస్కారములన్నియు విలయముకాగా నేర్పడు చిత్తస్థితి అసంప్రజ్ఞాత సమాధి యనబడును. ఇయ్యదియే నిర్వికల్ప సమాధి. కైవల్యము నభిలషించువారి కియ్యది సర్వదా ఉపాదేయము.

నిర్వికల్ప సమాధిని సంపాదించినవారి చిత్తము ప్రకృతియందు లీనమైపోవును. జీవాత్మ స్వస్వరూపముననుండి, పరమాత్మను సాక్షాత్కారము చేసికొని, పరమాత్మ స్వరూపమగు నానందము ననుభవించుచు శుద్ధుడు, ముక్తుడు, కేవలుడు నగును.

**'యదా పశ్యః పశ్యతే రుక్మవర్ణం**
**కర్తార మీశం పురుషం బ్రహ్మ యోనిమ్**
**తదా విద్వాన్ పుణ్యపాపే విధూయ**
**నిరంజనః పరమం సామ్య ముపైతిః**

(ముం. 3.1.3,)

సమాధి పాదము

# యోగ దర్శనము

## సాధన పాదము

చిత్తశుద్ధిగలవారు ప్రథమ (సమాధి) పాదమున చెప్పబడిన యోగమును సాధింపగలుగుదురు. చిత్తశుద్ధిగలవారికే యోగసాధనములైన అభ్యాస వైరాగ్యములు రెండును సాధ్యములు. కాని విక్షిప్త చిత్తులకు రాగద్వేషాది చిత్తకషాయము లెక్కుడుగా గలవారికి అభ్యాసవైరాగ్యములు సులభములు కావు. కాగా వారికి సమాధిపాదమున వర్ణించిన యోగము లభింపదు. కాబట్టి చిత్తశుద్ధిలేని మందబుద్ధులు యోగయుక్తులగుటకును, అందులకై యభ్యాస వైరాగ్యములను సంపాదించుటకును ననువగు చిత్తశుద్ధి సాధనములనీ పాదమునందు మహర్షి వివరముగా వర్ణింపదలచి ముందుగా నల్పాయాససాధ్యమగు క్రియాయోగమును చెప్పుచున్నాడు.

**తపః స్వాధ్యాయేశ్వర ప్రణిధానాని క్రియాయోగః 1**

తపః........నాని = తపస్సు, స్వాధ్యాయము, ఈశ్వర ప్రణిధానము, క్రియాయోగః = క్రియాయోగమనబడును.

శీతోష్ణాది ద్వంద్వములను సహించుట, హితము మితము నైన ఆహారమును గ్రహించుట మున్నగునవి తపస్సు. ఇట్టి తపస్సు చేయని వానికి యోగము సిద్ధింపదు. అనాది కర్మ క్లేశవాసనలచే చిత్రవిచిత్రముగా నుపస్థితమగు విషయజాలము వలన నేర్పడు చిత్త మాలిన్యము తపస్సు చేయని వారికి తొలగనేరదు. కాబట్టి తపస్సు క్రియాయోగమున చెప్పబడినది. ఈ తపశ్చరణమును శరీరమునందలి ధాతువులు విషమింపని విధమున నాచరింపవలయును. ధాతువైషమ్య మేర్పడు విధమున మితిమీఱి తపశ్చరణ మొనర్చిన నయ్యది చిత్త ప్రసాదము కలిగించుటకు బదులు యోగమునకు ప్రతిబంధకమగును.

పవిత్రులైన ప్రణవాదుల జపముగానీ, మోక్షశాస్త్రములయిన వేద – ఉపనిషదాదులు పఠించుటగానీ స్వాధ్యాయ మనబడును.

పరమగురువైన జగదీశ్వరునందు సర్వకర్మల నర్పించి, కర్మఫలమును త్యజించుట యీశ్వర ప్రణిధాన మనబడును.

ఇట్టి తపస్సు, స్వాధ్యాయము, ఈశ్వర ప్రణిధానము నను మూడును క్రియాయోగమని భావము. వీని వలన చిత్తశుద్ధి యేర్పడును. యోగము సాధింప వీలగును. ఈ క్రియా యోగము వ్యుత్థిత చిత్తులకు (చిత్తశుద్ధిలేని వారికి) సులభ సాధనము.

అవ॥ క్రియా యోగ ప్రయోజన మేమన :

**సమాధిభావనార్థః క్లేశతమాకరణార్థ శ్చ** **2**

క్రియాయోగము, సమాధిభావనార్థః = పూర్వపాదమున వర్ణించిన సమాధిని చిత్తశుద్ధిద్వారమున నుత్పన్నము చేయుటయే ప్రయోజనముగా గలది. క్లేశతనూకరణార్థశ్చ = మఱియు సమాధికి విరోధములై, వివేకఖ్యాతి గలుగనీయని అవిద్యాది క్లేశములను తగ్గించుటయే ప్రయోజనముగా గలది.

ఫలము నపేక్షింపకజేయు క్రియా యోగము అనాదిక్లేశకర్మవాసనలతో చిత్రమై యుండు చిత్తమాలిన్యము (పాపము) ను తొలగించును. చిత్తైకాగ్రత యనెడి సమాధిని సంపాదించును. సమాధి ప్రతిపక్షము (విరోధు) లైన అవిద్యాది క్లేశములను శిథిలమొనర్చి, వివేకఖ్యాతి వలన దగ్ధబీజములవలె వానిని ప్రసవధర్ములుకాకుండ చేయును. కాబట్టి విక్షిప్త చిత్తు డీ క్రియాయోగమును తప్పక యభ్యసింపవలయునని భావము.

అవ॥ క్రియాయోగమువలన శిథిలములగు క్లేశము లెయ్యవియన :

**అవిద్యాఽస్మితా రాగద్వేషాభినివేశాః (పంచ) క్లేశాః** **3**

అవిద్యా..........క్లేశాః = అవిద్య, అస్మిత, రాగము, ద్వేషము, అభినివేశమునని క్లేశములైదు. వీనిని విపర్యములనియు నందురు. క్లేశము (కష్టము) ను కలిగించునవి కాబట్టి క్లేశములు.

అవిద్యాది క్లేశములు వర్ధిల్లి గుణాధికారము (కార్యరంభ సామర్థ్యము) ను బలపఱచును. కార్యకారణ స్రోతస్సు నుద్భవింప జేయును. క్లేశకర్మములు పరస్పరము తోడ్పాడుతో జాతి, ఆయువు, భోగము ననెడి కర్మవిపాక (ఫల)ములను గలిగించును. కాబట్టి యత్నపూర్వకముగ క్లేశములను శిథిల మొనర్పవలయు నని భావము.

అవ॥ ఈ క్లేశములలో మూలమెద్ది యన :

**అవిద్యా క్షేత్ర ముత్తరేషాం ప్రసుప్తతను విచ్ఛిన్నోదారాణామ్** **4**

ప్రసుప్తతను విచ్ఛిన్నోదారాణామ్ = ప్రభోదకములు లేనందున చిత్తమున శక్తి (సంస్కార) రూపమున నుండునవి 'ప్రసుప్తములు' క్రియా యోగము చేత శిథిలము చేయబడినవి 'తనువులు'; సజాతీయమో లేక విజాతీయమో యైన క్లేశాంతరముచే నభిభూతములయినవి (అణగి యుండునవి) 'విచ్ఛిన్నములు' (ఇయ్యవి భవిష్యత్కాలమున మరల వృత్తిరూపము నందుచుండును); విషయప్రాప్తి గలిగినపుడు వృత్తి రూపములనంది 'ఉదారములు' ననబడును. ఇట్లు ప్రసుప్తములు, తనువులు, విచ్ఛిన్నములు,ఉదారములు నని చతుర్విధ భేదములచే భిన్నములయిన, ఉత్తరేషామ్ = అస్మిత, రాగము, ద్వేషము, అభినివేషము నను నాలుగింటికి, క్షేత్రం = ఉత్పత్తిస్థానము, మూలము, అవిద్యా = అవిద్య,

అస్మితారాగద్వేషాభినివేశము లను నాలుగు క్లేశములును అవిద్యయున్న నుండును. అవిద్య లేనపు డవి యుండవు. కాబట్టి యవిద్య అస్మితాదులకు మూలమని భావము.

వివేకఖ్యాతి యేర్పడని కారణమున విదేహ ప్రకృతిలయులయిన వారి చిత్తమున అస్మితాది క్లేశములు ప్రసుప్తములై యుండును(బీజభావమున నుండును) ఆలంబనము లభింపగానే మరల ప్రబుద్ధములగును. ప్రసంఖ్యానము (వివేకఖ్యాతి) కలిగినవారి క్లేశములు, దగ్ధబీజము లంకురింప యోగ్యములు గానట్లు వస్తువుల యాలంబనము లభించినను ప్రబుద్ధములు కావు.

ప్రతిపక్షభావనలవలన అవిద్యాది క్లేశములు క్షీణములయి తనుత్వము నందును. ప్రతిపక్షభావన యన నిట క్రియాయోగము నభ్యసించుటయే లేక, సమ్యక్ జ్ఞానము (యథార్థజ్ఞానము) అవిద్యకు, భేదదర్శనము (ప్రకృతిపురుష వివేకము) అస్మితకు, ఉదాసీనత రాగద్వేషములకు, ఉపకారబుద్ధి అభినివేషమునకును ప్రతిపక్షములని యెంచి వానిని సదా భావించుటవలన నవిద్యాది క్లేశములు క్షీణములగునని భావము. అవిద్యాదులలో ఒక క్లేశము సజాతీయమో విజాతీయమో యైన మఱియొక క్లేశ మావిర్భవించుటచే విచ్ఛిన్నమగును. రాగమున్నపుడు క్రోధము విచ్ఛిన్నమగును. ఇట్లే క్రోధమున్నపుడు రాగము విచ్ఛిన్నమగును. 'ఒకానొక విషయమున రాగమున్నచో మఱియొక విషయమున రాగము లేద'నరాదు. అట భవిష్యత్తున గలుగగలదని భావము. చైత్రుడొక స్త్రీయందు రక్తుడై యున్నాడనిన అన్యస్త్రీలయందు

విరక్తుడనికాదు. అనురక్త స్త్రీయం దతని రాగములబ్ధవృత్తి కలదనియు, అన్యస్త్రీలయం దది భవిష్యద్వృత్తి కలదనియు నెంచవలయును. ఇట్లు భవిష్యద్వృత్తిగల క్లేశములు ఆ సమయమున ప్రసుప్తతను విచ్ఛిన్నరూపములలో నొక రూపమున నుండిన ట్లెంచవలయును. క్లేశములు విషయములందు వృత్తిని పొందినపుడు ఉదారము లనబడును.

క్లేశములన్నియు అవిద్యాభేదములే. అవిద్యచే వ్యాప్తముకాని క్లేశమెందును లేదని భావము. అవిద్య (విపర్యయజ్ఞానము) ఉన్నపుడు క్లేశములుండి, అది లేకున్న నవి లేకుండుటయే యిందులకు ప్రమాణము.

**'ప్రసుప్తా స్తత్త్వలీనానామ్ తన్వవస్థాశ్చ యోగినామ్**
**విచ్ఛిన్నోదారరూపాశ్చ క్లేశా విషయసంగినామ్'**

ప్రకృత్యాది సూక్ష్మతత్త్వములందు లీనులయిన విదేహ ప్రకృతిలయుల క్లేశములు ప్రసుప్తస్థితియందుండు ననియు, క్రియా యోగుల క్లేశములు క్షీణములయి యుండునినియు, విషయాసక్తుల క్లేశములు విచ్ఛిన్నో దార స్థితియందుండు ననియు వివేకము.

అవ॥ అవిద్యా స్వరూప మెట్టిదన:

**అని త్యాశుచిదుః ఖానాత్మసు**
**నిత్యశుచిసుఖాత్మ ఖ్యాతి రవిద్యా** 5

అనిత్యా....నాత్పసు = అనిత్యము, అశుచి, దుఃఖము, అనాత్మ. వీనియందు గలుగు, నిత్య...ఖ్యాతిః = నిత్యము, శుచి, సుఖము, ఆత్మయను జ్ఞానము, అవిద్యా = అవిద్యయనబడును.

ఖ్యాతి, బుద్ధి, జ్ఞానము సమానార్థకములు. అట్టిది కానిదానియం దట్టిదియని కలుగు జ్ఞానము అవిద్య యనబడును. నిత్యము కాని కార్యజగత్తును నిత్యమనియు, అశుచియైన దేహమును శుచి యనియు, సుఖములేని విషయభోగాదులను సుఖమనియు, ఆత్మకాని బుద్ధి, స్త్రీ, పుత్రాదులను ఆత్మయనియు నెంచుట (తెలిసికొనుట) యవిద్యయని భావము. ధ్రువములుకాని పృథివిని, చంద్రనక్షత్రాదులతో గూడిన దినమును, దేవతలను ధ్రువములని యెంచుట అవిద్య.

**'స్థానాద్ బీజాదుపష్టంభా న్నిస్యందాన్నిధనాదపి**
**కాయమాధేయ శౌచత్వాత్ పండితా హ్యశుచిం విదుః'**

దేహమును శుచియని లోకమెంచును. కాని, ఉత్పత్తిస్థానము ఉత్పత్తికి కారణమైన బీజము, పోషకరసములయిన అన్నపానాదులు, స్వేదాదులు, నిధనము మున్నగునవన్నియు శరీరమెంత జుగుప్సాకరమో తెలుపును. స్వభావమున నశుచియైన దేహమునకు శుచిత్వము జలాదులతో సంపాదింపవలసి యున్నందున పండితులు శరీరము నశుచిగా నెంచుదురు. ఇట్లే అపుణ్యమును పుణ్యమనియు, అనర్థమును అర్థమనియు నెంచుటయు అవిద్య యనబడును.

అవిద్య యనేకవిధముల లోకమున రూపొందుచున్నను నాలుగు విధములైన యవిద్యయే యీ సూత్రమున వర్ణింపబడినది. ఇయ్యదియే ముఖ్యముగ క్లేశ సంతానమునకు మూలము. దీనిని కర్మాశయములకు కారణముగా నెంచవలయునని భావము.

అవ॥ అవిద్యా స్వరూపమును జెప్పి యనంతరము రాగాదులకు హేతువైన అస్మితను వర్ణించుచున్నాడు.

**దృగ్దర్శనశక్త్యో రేకాత్మతే వాస్మితా 6**

దృగ్దర్శనశక్త్యోః = జీవాత్మ, బుద్ధి వీని రెంటియొక్క, ఏకాత్మతేవ = ఏకాకారత, అస్మితా = అస్మిత యనబడును.

దృక్శక్తిః = జీవాత్మ – పురుషుడు, దర్శనశక్తిః = బుద్ధి, ఈరెండు పదార్థములు అత్యంత విభిన్నములు. ఒకటి ఆత్మ. మఱియొకటి అనాత్మ. అవిద్యవలన ననాత్మయైన బుద్ధియం దాత్మజ్ఞానము గలుగును. వాస్తవమునకు బుద్ధి యాత్మకాకున్నను ఆత్మవలె వ్యవహరింపబడును. ఇట్లు బుద్ధి పురుషుల యేకాత్మత – ఏకాకారత – వాస్తవముగాక యవిద్యా మూలకమని తెలుపుటచే సూత్రమున ఏకాత్మతా ఇవ అని ఇవ శబ్దము ప్రయోగింపబడినది.

పురుషుడు భోక్తః బుద్ధి భోగ్యము: అని తెలుపుట కొఱకు దృగ్దర్శన శబ్దములతోబాటు సూత్రమున శక్తిశబ్దము ప్రయోగింపబడినది.

'అస్మిత' యనెడి క్లేశమువలననే పురుషుడు తాను సుఖిననియు, దుఃఖిననియు, కర్తననియు, భోక్తననియు ననుకొనును. వివేకఖ్యాతి వలన అస్మిత తొలగి జీవాత్మ తన్ను బుద్ధికంటె సర్వదా భిన్నుడనని గుర్తించినపుడు ముక్తిపదము నందును. ఈ యస్మితా క్లేశమునే ఉపనిషత్కారులు హృదయగ్రంధి యందురు. వివేక ఖ్యాతిచే నీ గ్రంధి విడివడును.

**'భిద్యతే హృదయగ్రంథి శ్ఛిద్యంతే సర్వసంశయాః**
**క్షీయంతే చాస్యకర్మాణి తస్మిన్ దృష్టే పరాపరే'**

అవ॥ రాగ లక్షణము :

**సుఖామశయీ రాగః** **7**

సుఖానుశయీ = సుఖము నెఱిగిన పురుషునకు, సుఖమునుగానీ, సుఖసాధనములనుగానీ పొందుటకుగాను సుఖసర్మణ పూర్వకముగా నేర్పడు చిత్తవృత్తి – అభిలాష, రాగః = రాగ మనబడును.

ఈ సూత్రమునందును, రాబోవు సూత్రమునందును గల సుఖదుఃఖ శబ్దములు సుఖదుఃఖముల యనుభవమును తెలుపునని యెంచవలయును. సుఖము నెఱుగని వానికి సుఖస్మృతి కలుగదు. స్మరింపబడు సుఖము నందు కలుగు నభిలాష సుఖానుస్మృతి పూర్వకముగా నుండును. సుఖము ననుభవించునపుడు అనుస్మృతి కలుగదు.

అవ॥ దుఃఖ లక్షణము :

**దుఃఖానుశయీ ద్వేషః** **8**

దుఃఖానుశయీ = దుఃఖము ననుభవించువలన గలుగు, దుఃఖమునకు, దుఃఖసాధనమునకు సంబంధించిన క్రోధమనెడి చిత్తవృత్తి విశేషము, ద్వేషః = ద్వేష మనబడును.

దుఃఖము నొకమాటు అనుభవించిన మీదట నట్టి దుఃఖమును స్మరించుటచేత దుఃఖము ననుభవించిన పురుషుని చిత్తమున క్రోధమనెడి వికారము కలుగును. ఇయ్యదియే ద్వేషము. దీనివలన గష్టము కలుగును. కాబట్టి క్లేశ మనబడును.

అవ॥ అభినివేశ లక్షణము :

**స్వరసవాహీవిదుషోఽపి తథారూఢోఽభినివేశః** **9**

స్వరసవాహీ = పూర్వ పూర్వ జన్మములందు అనుభవించిన మరణ దుఃఖమువలన గలిగిన వాసనాసముదాయము స్వరస మనబడును. అట్టి స్వరసరూపమున నెల్లపుడు నుండు, విదుషోఽపితథా = మూఢునకు వలె జ్ఞానియైన విద్వాంసునకును, రూఢః = ప్రసిద్ధమైన, 'నేను చావకుందును గాక, జీవింతునుగాక' అను మరణ భయము, అభినివేశః = అభినివేశ మనబడును.

ప్రతి ప్రాణియు 'నేను చావకుందునుగాక', జీవింతునుగాకః' అని నిత్యము కోరుచుండును. మరణమననేమో యెన్నడు నెఱుగని ప్రాణికిట్టి యాశ – కోరిక – కలుగజాలదు. కాబట్టి ప్రతి ప్రాణియందును కనబడు నీ కోరిక లేక మరణభీతి పూర్వ జన్మానుభవమును తెలియజేయును. ఈ మరణ త్రాసము విశేషజ్ఞానముగల ప్రాణులందేకాక క్రిమికీటకాదులందును మనము చూడగలుగుచున్నాము.

ఇప్పుడిపుడు జన్మించిన క్రిమికి మరణత్రాసమెట్లు కలుగుచున్నది? అట ప్రత్యక్షానుమానాగమ ప్రమాణములలో దేనివలనను అట్టి జ్ఞానము కలుగుట కవకాశములేదు. జ్ఞానము లేని కోరిక యొండు కలుగనేరదు. మరణ దుఃఖజ్ఞాన మొకమాటు కలిగిన నట్టి దుఃఖము మరల రాకుండ వలయునను కోరిక జనించుట యుచితము. కాబట్టి ప్రాణులకు కలుగు నీ మరణ భయము – పూర్వ జన్మమందనుభవించిన దుఃఖము ననుమానింప జేయుచున్నదనక తప్పదు.

మిక్కిలి మూఢులైన వారియం దెట్లు మరణ భయము కనబడుచున్నదో యట్లే జ్ఞానులయిన విద్వాంసులందును నీ క్లేశము సమానముగా కనబడుచున్నది. మరణ దుఃఖానుభవ మెల్లరికి సమానమని భావము.

ఈ యైదు విధములగు క్లేశములే యన్య శాస్త్రములందు తమస్సు, మోహము, మహా మోహము, తామిస్రము, అంధతామిస్రము నని వర్ణింపబడినవి.

**'తమో మోహో మహామోహ స్తామిస్రోహ్యంధసంజ్ఞకః**
**అవిద్యా పంచపర్వైషా సాంఖ్యయోగేషు కీర్తితాః'**

అవ॥ క్లేశములు, వాని లక్షణములు చెప్పబడినవి. ఇయ్యవి హేయములు. వీనికిగల ప్రసుప్త – తను – విచ్ఛిన్న – ఉదార రూపములయిన యవస్థలును వర్ణింపబడినవి. ప్రస్తుతము వాని దగ్ధబీజ భావమనెడి సూక్ష్మమగు పంచమావస్థ వర్ణింపబడుచున్నది.

**తే ప్రతి ప్రసవహేయాః సూక్ష్మాః** **10**

తే = పూర్వోక్త పంచక్లేశములు, సూక్ష్మాః = మైత్ర్యాది భావనలతో గూడిన క్రియా యోగము ద్వారమున క్షీణమొనర్పబడి, యనంతరము ప్రసంఖ్యానాగ్ని (వివేకఖ్యాతి)తో దగ్ధబీజములవలె నయి, ప్రతి ప్రసవహేయాః

= భోగము, నపవర్గము ననెడి యుభయవిధకార్యముల నొనర్చి చిత్తము తనకు కారణమైన ప్రకృతియందు లీనమగుట ప్రతి ప్రసవ మనబడును. అట్టి స్వకారణమున లయమైన చిత్తముతోబాటు క్లేశములు హేయములు – విడువదగినవి – అగును.

ఈ సమాధిపాదమున వర్ణింపబడిన మైత్రి, కరుణ మున్నగు భావనలతోబాటు క్రియాయోగము నభ్యసించుటచే అవిద్యాది క్లేశములు క్షీణములయి సూక్ష్మములగును. అనగా బీజరూపము నొందును. వివేకఖ్యాతి కలుగగా నయ్యవి దగ్ధ బీజములవలె కొఱగానివై చిత్తముతోబాటు హేయము లగును. ప్రకృతియందు లీనమగునని భావము.

అవ॥ క్లేశములు సూక్ష్మములై బీజభావము నొందియుండును గదా! వాని వృత్తులెట్లు హేయము లన :

**ధ్యాన హేయా స్తద్వృత్తయః 11**

తత్ వృత్తయః = బీజభావమును బొంది దగ్ధముకాని క్లేశముల స్థూలవృత్తులు – ఉదారావస్థలను, క్రియాయోగము ద్వారమున సూక్ష్మములొనర్చి, ధ్యానహేయాః = ధ్యాన మన ప్రసంఖ్యానము – వివేకఖ్యాతి, అధ్యాత్మ ప్రసాదము. దాని వలన దగ్ధ బీజభావము కలవిగా చేయవలయును.

క్లేశములకు ప్రసుప్తతను – విచ్ఛిన్న – ఉదారములనెడు నాలుగు అవస్థలు పూర్వము చెప్పియుంటిమి. అందు ఉదారావస్థ క్లేశముల స్థూల స్థితి. అప్పుడు చిత్తము విషయాసక్తమై యుండును. క్రియాయోగము ద్వారమున నీ యవస్థ సూక్ష్మము చేయబడును. అటుపై ప్రసంఖ్యాన బలమున బొత్తిగా నశించును. వివేకఖ్యాతి జనించిన పిదప క్లేశములు నిరుపద్రవములై చిత్తముతోబాటు విలయము నందునని భావము.

అవ॥ ఈ క్లేశముల నేల వర్జింప వలయు నన :

**క్లేశమూలః కర్మాశయో దృష్టాదృష్ట జన్మవేదనీయః 12**

దృష్టా....నీయః = ఐహిక అముష్మిక జన్మములలో ననుభవింపదగు, కర్మాశయః = శుభాశుభ కర్మముల ననుష్ఠించుటచే నేర్పడు పుణ్య పాపాత్మక ఆశయము – సంస్కారము. క్లేశమూలః = అవిద్యాది క్లేశములు నిమిత్తముగా గలది.

దృష్ట జన్మము వర్తమానము – ఐహికము అదృష్ట జన్మము

భవిష్యజ్జన్మము. ఈ యైహికాముష్మిక జన్మములలో సుఖదుఃఖముల ననుభవింపజేయు కర్మాశయములు క్లేశములున్న కలుగును. లేకున్న కలుగవు. కాబట్టి కర్మాశయమేర్పడకుండ వలయుననిన క్లేశములు హేయములగును.

అవ॥ కర్మాశయములకు హేతువులైన క్లేశములు తొలగినను, పూర్వజన్మ పరంపరయందు సంచితమయిన కర్మాశయము లనంతముగా నుండుటచే నవి పరిపక్వములు గాక తప్పదు. కాబట్టి క్లేశములున్న నేమియనః

**సతి మూలే తద్విపాకో జాత్యాయుర్భోగాః 13**

మూలే = కర్మాశయమునకు మూలకారణమైన క్లేశములు, సతి = ఉండగా, జాత్యాయుర్భోగాః = జన్మము, జీవనకాలము, సుఖదుఃఖానుభవము నీ మూడును, తద్విపాకః = కర్మాశయమునకు విపాకమగును. విపాకమున కర్మసాధ్యఫలము అట్టి ఫల మేర్పడునని భావము.

కర్మాశయమునకు క్లేశములు మూలము. మూలమున్నంతకాలము కర్మాశయము విపాకము నారంభించును – ఫలజనకమగును. (ఛిన్నే మూలే నైవ సత్రం న శాఖా) మూలము ఛిన్నమైన వృక్షము చిగురింపనట్లు వివేక ఖ్యాతి వలన క్లేశ మూలము నశింప కర్మాశయ మనంతమయ్యు నకించిత్కరమే – నిష్ప్రయోజనమే యగునని భావము.

'జాత్యాయుర్భోగములు కర్మఫలములని చెప్పుటచే కర్మము జన్మము (జాతి) నకు హేతువని తెలియుచున్నది. ఇట నొక కర్మమొక జన్మమునకు కారణమా? లేక యనేక జన్మములకు కారణమా? యని విచారింప ననువగును. మఱియు ననేక కర్మము లనేక జన్మములను కలిగించునా? లేక యొక జన్మమును కలిగించునా? యని విచారింప వీలగును. ఇందు ఒక్క కర్మ మొక్క జన్మమునకు కారణ మన వీలుపడదు. అనాది కాలము నుండియు సంచితకర్మము లెన్నియో యుండును. ఈ జన్మమునందు చేయబడుననియు ననేకము లగును. ఇవి యన్నియు క్రమముగా నొక్కటొక్కటి యొక్కొక్క జన్మమునకు కారణములయిన జన్మముల కంతముండదు. కావున ముక్తి కామన యసంభవము నవిష్టము నగును. ఇట్లే యొక్క కర్మ మనేక జన్మములకు కారణమనుట మిక్కిలి యసంభవమగును. ఒక్క కర్మము ఫలమే యనేక జన్మములయిన మిగిలిన కర్మముల ఫలానుభవమునకు కాలమే లేకుండును గదా! ఇక ననేక కర్మము లనేక జన్మముల నొక్కసారి కలిగించునందుమా

యదియును పొసగదు. ఒకే క్షణమున ననేక జన్మములు కలుగునెట్లు? కలుగ వలను పడదు. అందు వలన క్రమముగా నొకదాని తరువాత మఱియొక జన్మము కలుగవలసియుండును. అప్పుడొక్క కర్మమున కొక్క జన్మమనియే తేలును. అందువలన పూర్వ దోషమే వాటిల్లును. కాబట్టి యనేక కర్మములు కలిసి యొక్క జన్మమును కలిగించుననియే యూహింపనగును. ఒక జన్మమున మరణించుటకు పూర్వము చేయబడు పుణ్యాపుణ్యకర్మముల వాసనలు (జీవాత్మ విశిష్ట చిత్తమునం దేర్పడినవి) చిత్రములై ప్రాయణ (మరణ) సమయమున కొన్ని ప్రధాన భావమును, మఱికొన్ని యప్రధాన భావమును పొంది యభివ్యక్తములగును. అందుకొన్ని వెంటనే ఫలమునిచ్చునవిగాను, మఱికొన్ని కాలాంతరమున ఫలమొసంగునవిగాను నుండును. వానికి కారణభూతములయిన కర్మముల స్వభావమే యిందులకు కారణము. కాలభేదముచే ఫలము నొసంగుటను బట్టి వీనికి ప్రధాన అప్రధాన భావమును కల్పంప వీలగును. తమ తమ ఫలములను జన్మాదిరూపమున ననుభవింపజేయుటలో లోలములైన ఈ సంస్కారములు ఒక్కటిగా కలిసి మరణమును సాధించి జన్మమును కలిగించును. ఆ జన్మము లబ్ధాయుష్కమగుటకు నా విచిత్రవాసనాప్రచయమే కారణము. భోగము నా కర్మ సముదాయము వలననే సంభవించును. కాబట్టి కర్మాశయము జన్మాయుర్భోగహేతువై త్రివిపాకమని చెప్పబడుచున్నది. అని వ్యాస మహర్షి యాశయము.

అవ॥ పుణ్యపాప కర్మాశయములకు మూలమగుటచే నవిద్యాది క్లేశములు హేయములు కావచ్చును; కాని కర్మాశయ విపాకములయిన జాత్యాయుర్భోగములు వేనికి మూలములై హేయము లగుచున్న వన :

**తే హ్లాద పరితాపఫలాః పుణ్యాపుణ్య హేతుత్వాత్ 14**

పుణ్యాపుణ్య హేతుత్వాత్ = ధర్మాధర్మములు హేతువులుగా గలవగుట వలన, తే = జన్మము, ఆయువు, భోగము నీ మూడును, హ్లాదపరితాపఫలాః = సుఖదుఃఖములనెడి ఫలముల నిచ్చును.

ధర్మమూలకములైన జన్మాదులు సుఖదాయకములగును. అధర్మ మూలకములైన జన్మాదులు దుఃఖదాయకము లగునని భావము.

అవ॥ అట్లయిన దుఃఖదాయకములైన కర్మాశయములు హేయములగును; సరే, సుఖదాయకముల నేల విడువలయును నన:

**పరిణామతాప సంస్కారదుఃఖై గుణవృత్తి**
**విరోధాచ్చ, దుఃఖమేవ సర్వం వివేకినః** **15**

వివేకినః = సుఖదుఃఖములను వివేకించుయోగికి, పరిణామ తాప సంస్కార దుఃఖైః = పరిణామ, తాప, సంస్కారరూప దుఃఖము చేతను, గుణవృత్తి విరోధాచ్చ = సుఖజ్ఞానమునకు హేతువులయిన చిత్తరూపమున పరిణామమునొందు సత్త్వరజోస్తమో గుణములలోగల వైరుధ్యము వలనను, సర్వం = దృష్టానుశ్రవిక విషయమువలన కలుగు సమస్త సుఖము, దుఃఖమేవ = దుఃఖమే యగును – ప్రతికూలమే యగును – అనుకూలముకాదని భావము.

చేతన పదార్థముల వలనగానీ, యచేతన పదార్థముల వలనగానీ, లభించు సుఖము రాగముతో కూడియుండును. అనురక్తిలేని యెడల సుఖానుభవముండనేరదు. రాగము ప్రవృత్తికి కారణము. ప్రవృత్తివలన పుణ్య పాపముల నొనరింతురు. కాబట్టి రాగము వలన నేర్పడు కర్మాశయము (వాసన) కాయికము, వాచికము, మానసికము నని ముప్విధములు. సుఖము కొఱకిది యాచరింప వలయునని సంకల్పించుటచే నేర్పడు వాసన మానసికము. చెప్పుటచే నేర్పడునది వాచికము. చేయుటచే కలుగునది కాయికము. 'నానుపహత్య భూతాన్యుపభోగః సంభవతి' భూతములను హింసింపక భోగము లభింపదు – కాగా కాయిక కర్మాశయము హింసాకృతమగును. ఇట్లు సక్తుడై మనుజుడు సుఖము ననుభవించు నెడ ఎవడేని సుఖవిచ్ఛిత్తి కలిగిన దానికి కారణమైన దుఃఖ సాధనములను ద్వేషింప సాగును. అట్టి దుఃఖ సాధనములను పరిహరింప నసమర్థుడై మోహము నందును. ఇట్లు ద్వేష మోహములకు సంబంధించిన కర్మాశయములును కాయికవాచిక మానసిక భేదములతో ముప్విధముల నేర్పడును. ఇట్టి కర్మాశయముల పరిణతియే దుఃఖము. ఇదియే పరిణామ దుఃఖము.

మానవుడు సుఖము ననుభవించునపుడు తనకెన్నడును సుఖవిచ్ఛిత్తి కలుగకుండవలయునని యెంచి సుఖవ్యతిరేక సాధనములను ద్వేషించుచు నంతువ్నడగును. అంతట నా సాధనములను వారింవదలచి ప్రయత్నపరుడగును. అట్టియెడ ద్వేషమునకు సంబంధించిన కాయిక, వాచిక, మానసిక సంస్కారములు (కర్మాశయములు) కలుగును. దుఃఖసాధనములను పరిహరింప నసమర్థుడై మోహితుడగును. కాగా మోహజనిత కర్మాశయములు

నేర్పడును. ఇట్లే సుఖమునం దనురక్తుడైన వ్యక్తి సుఖము నభిలషించుచు నితరుల ననుగ్రహించును. దుఃఖసాధనముల నుపహననము చేయును. కాబట్టి రాగజన్య కర్మాశయములు నేర్పడును. వానివలన దుఃఖమేర్పడును. ఇదియే తాపదుః ఖము.

సుఖదుఃఖముల ననుభవించుట వలన నాయా విషయములకు సంబంధించిన సంస్కారము లేర్పడును. సుఖ విషయక సంస్కారము వలన మరల స్మృతి కలుగును. స్మృతి వలన రాగమేర్పడును. రాగము వలన మనోవాక్కాయములందు ప్రవృత్తి కలుగును. ప్రవృత్తి వలన మరల సంస్కారములు (కర్మాశయములు) అందువలన సుఖదుఃఖములు, వాని యనుభవము వలన సంస్కారములు; వాని వలన మరల స్మరణము, మరల రాగము, మరల ప్రవృత్తి, మరల కర్మాశయములు, మరల సుఖము, మరల దుఃఖమునని సంస్కార చక్రము వలన నేర్పడు దుఃఖమునకు మేరయుండదు. ఇదియే సంస్కార దుఃఖము.

ఇట్టి పరిణామ, తాప, సంస్కార దుఃఖత్రయముతో కూడియుండుట చేత విషయసుఖము దుఃఖమే యగుచున్నది.

ఇక సత్త్వరజస్తమో గుణములు స్వభావముచే పరస్పర విరుద్ధములు. సత్వగుణము ప్రఖ్యా (ప్రకాశ) స్వభావము, రజోగుణము ప్రవృత్తి స్వభావము. తమోగుణము స్థితిశీలమని పూర్వమే చెప్పియున్నాము. గుణములిట్లు విరుద్ధ స్వభావము కలవైనను పరస్పరము గుణప్రధాన భావముతో కలిసి (జీవాత్మ కొఱకు) శాంత, ఘోర, మూఢ స్వరూపము గల కార్యజాతమును సృష్టించుచుండును. ఇందొకటి ప్రధానమైన మిగిలిన రెండును గౌణము (అప్రధానము) లగును. ఇట్లు ప్రతి కార్య వస్తువు త్రిగుణమైనను, ప్రధాన గుణశబ్దముచే వ్యవహరింపబడుచు సాత్విక రాజస తామసము లనబడును. కాబట్టి కొండొక వస్తువిషయకమైన సుఖ ప్రత్యయము సైతము ప్రధానముగ సాత్వికమైనను రజస్తమో గుణాత్మకము నగుటలో సంశయముండదు. అందువలన సుఖానుభవము కేవల సుఖానుభవము కాక దుఃఖమోహములతో కూడియుండుట నిశ్చితము. పరస్పర విరోధాత్మకములగు నీ గుణముల వృత్తము నతి చంచలము. విషయములకు సంబంధించిన వృత్తులు (జ్ఞానము) క్షణక్షణము మాఱుచుండును. ఒక వృత్తిచే మఱియొకవృత్తి యభిభూత మగుచుండును.

కాబట్టి వైషయిక సుఖము క్షణమాత్రమై యస్థిరమే యగును. ఇట్లు గుణవృత్తులలోగల వైరుధ్యము వలన విషయసుఖము దుఃఖమయమే యని భావము.

అందు పరిణామ దుఃఖము భవిష్యద్దుఃఖము తాపదుఃఖము భవిష్యద్వర్తమానములకు సంబంధించినది. సంస్కారముల యానంత్యమున నేర్పడు సంస్కార దుఃఖము భవిష్యద్దుఃఖమగునని వివేకము.

ఇట్లు వివేకియైన యోగికి విషయజన్య సుఖమంతయు దుఃఖమే యగును. కాబట్టి యదియు హేయము యగుచున్నదని భావము.

అవ।। ఇంతవఱకు శాస్త్ర ప్రతిపాద్య విషయమును సంక్షేపముగ చెప్పి యిప్పుడు హేయము, హేయ హేతువు, హానము, హానోపాయమునని నాలుగు విధములుగ విభజించి వివరముగా శాస్త్రమును చెప్పదలచినవాడై ఋషి ముందుగా హేయ పదార్థ మననేమో చెప్పుచున్నాడు.

**హేయం దుఃఖ మనాగతమ్ 16**

అనాగతం = రాబోవు, దుఃఖం = త్రివిధ దుఃఖము, హేయమ్ = విడువదగినది.

భూతకాలిక దుఃఖము భోగము ద్వారమున నశించియుండును. వర్తమానదుఃఖము అనుభవింపబడుచు కాలాంతరమున నదియు విడువబడును. కాగా మిగిలినది అనాగత దుఃఖమే. అయ్యది రాకుండ చేసికొనవలయునని భావము.

అవ।। ఈ హేయ దుఃఖమునకు కారణ మేమైయుండు ననః

**ద్రష్టదృశ్యయోః సంయోగో హేయహేతుః 17**

ద్రష్టృదృశ్యయోః = ద్రష్ట, దృశ్యము నను నీ రెంటియొక్క, సంయోగః = సంబంధము, హేయహేతుః = హేయమగు సాంసారిక దుఃఖత్రయమునకు హేతువు - కారణము.

బుద్ధిసంవేది పురుషుడు ద్రష్టయనబడును. బుద్ధిగత ధర్మములను తనవిగా భావించు జీవాత్మ ద్రష్టయని భావము. బుద్ధి, అహంకారము మున్నగు రూపముల పరిణమించు ప్రకృతి దృశ్యమనబడును. అవిద్య వలన నీ జీవాత్మ ప్రకృతులకు స్వస్వామి భావాత్మకమగు ననాది సంబంధము కలదు. ఈ సంబంధమే దుఃఖములకు మూలమని భావము.

బుద్ధిసత్వము స్వచ్ఛమై విషయాకారతను పరిణామముల నొందుచు పురుష సమీపముననుండి యుపకరించును - దృశ్యమగును. ద్రష్టయైన పురుషునకిది 'స్వమ్' పురుషుడు స్వామి. ఇదియే వీనికిగల స్వస్వామి భావసంబంధము. పురుషుని భోగమునకు విషయమై - పురుషునిచే భుజ్యమానమగుచు - బుద్ధి 'స్వమ్' (ధనము) అగుచున్నది. బుద్ధిసత్వము స్వయం ప్రకాశముగదా! పురుష భోగమునకు విషయమెట్లగు నన జనదు. బుద్ధి చైతన్యమయినచో స్వయం ప్రకాశమయ్యేడిది. అది జడమగుటచే చైతన్యస్వరూపుడైన పురుషుని సామీప్యము వలన స్వరూపమొంది - విషయాకారతను పొంది - యతని యనుభవమునకు విషయమగుచున్నదని భావము.

ప్రకృతి పురుషునకుగల వాసనారూపమైన యవిద్యచే నేర్పడిన సంబంధము వలన దుఃఖము లేర్పడుచున్నవి. దుఃఖకారణమైన సంబంధమును త్యజించుటచే అత్యంతిక దుఃఖ ప్రతీకారము కలుగునని పంచశిఖాచార్యుడును వర్ణించియున్నాడు.

**'తత్సంయోగ హేతు వివర్జనాత్**
**స్యాదయ మాత్యంతికో దుఃఖ ప్రతీకారః'**

అవ॥ దృశ్యస్వరూప మెట్టిదన;

**ప్రకాశ క్రియా స్థితి శీలం భూతేంద్రియాత్మకం**
**భోగాపవర్గార్థం దృశ్యమ్ 18**

భోగాపవపర్గార్థం = భోగము, అపవర్గము, ప్రయోజనములుగా గలది, భూతేంద్రియాత్మకం = పృథివ్యాది భూతముల, శ్రోత్రాదీంద్రియముల రూపమున పరిణమించునది, ప్రకాశ క్రియా స్థితిశీలం = ప్రకాశము, క్రియ, స్థితి స్వభావముగాగలది, దృశ్యమ్ = దృశ్య మనబడును.

భోగాపవర్గములు ప్రయోజనముగా గలిగి భూతేంద్రియాది రూపమున పరిణతి నొందునట్టిదియు, ప్రకాశక్రియాస్థితులు స్వభావముగా గలిగినట్టిదియునగు కొండొక పదార్థము దృశ్యమని భావము.

ఈ సూత్రమున సుఖము, దుఃఖము ననెడి విషయానుభవము భోగమనబడును. ప్రకృతి పురుష వివేకఖ్యాతి అపవర్గ మనబడును. దృశ్యపదార్థము భోగము కొఱకు అపవర్గము కొఱకు నగుటచే భోగాపవర్గములు

ప్రయోజనముగా చెప్పబడినవి.

దృశ్య పదార్థము (ప్రకృతి) పంచతన్మాత్రములు, ఇంద్రియములు. సూక్ష్మ భూతములు, స్థూల భూతములుగా పరిణమించును. దృశ్య స్వభావముగా చెప్పబడిన ప్రకాశమనగా బుద్ధివృత్తులనబడు జ్ఞానమును, లోకమున గల వెలుతురునని గ్రహింపవలయును. ఇట్లే యత్నమును, చలనాదులను క్రియయనియు, ప్రకాశమునకు, క్రియగలుగు ప్రతిబంధకమును స్థితియనియు, తెలియవలయును. ప్రకాశము, క్రియ, స్థితి, యనునవి క్రమముగా సత్త్వరజస్తమో గుణముల స్వభావమని పూర్వమనేక పర్యాయములు వర్ణింపబడినది. ఇట్టి త్రిగుణాత్మకమే ప్రకృతి – దృశ్యము.

ప్రకృతి, ప్రధానము అను శబ్దములచే వ్యవహరింపబడు గుణత్రయము పురుషుని భోగాపవర్గముల కొఱకే బుద్ధి రూపమున పరిణమించును. కాని యా భోగాపవర్గములు రెండును పురుషునకు వాస్తవములు కావు. పురుషుడు బద్ధముక్త స్వభావుడయ్యు స్వరూపమున నట్లు కాదని యభియుక్తుల మతము. కాబట్టి భోగాపవర్గములు వాస్తవమున బుద్ధిగతములై పురుషునివిగా వ్యవహరింపబడునని భావము. యోధులయెడ గలుగు జయాపజయములు రాజునందు వర్తించునట్లని యిట నుదాహరింతురు.

పురుషార్థము పరిసమాప్తము కానంతవరకు బుద్ధికి బంధము, వివేకఖ్యాతి యనెడి పరమపురుషార్థము సిద్ధించుటయే మోక్షము నని భావము. మఱియు వాస్తవమున బుద్ధిగతములైన, గ్రహణము, దారణము, ఊహ, అపోహ, తత్త్వజ్ఞానాభివేశాదులు పురుషారోపితములై వ్యవహరింపబడునని గ్రహింపవలయును. (గహణము = స్వరూపమాత్రమున వస్తువులను తెలిసికొనుట, దారణము = స్మృతి)

**విశేషావిశేషలింగమాత్రాలింగాని గుణపర్వాణి 19**

విశేషా .... లింగాని = విశేషములు, అవిశేషములు, లింగమాత్రము, అలింగము నను నాలుగు, గుణసర్వాణి = దృశ్యములయిన సత్త్వరజస్తమస్సులను గుణముల యవస్థలు.

1. విశేషములు :– పృథివి, జలము, అగ్ని, వాయువు, ఆకాశము నను నైదు భూతములు; త్వక్కు, చక్షువు, శ్రోత్రము, జిహ్వా, ఘ్రాణేంద్రియముసను జ్ఞానేంద్రియములైదు, వాక్కు, పాణి, పాదము, పాయువు,

ఉపస్థము నను నైదు కర్మేంద్రియములు, మనస్సు, ఈ పదునాఱు పదార్థములు విశేషము లనబడును.

2. అవిశేషములు :- శబ్దతన్మాత్రము, స్పర్శతన్మాత్రము, రూపతన్మాత్రము; రసతన్మాతమ్రు గంధతన్మాత్రము అను నైదు తన్మాత్రములు, ఇయ్యవి యాకాశాది పంచమహాభూతములకు కారణములు. ఈ శబ్దాది తన్మాత్రములు మిళితములై యుండుటచేతను, పూర్వ తన్మాత్రముత్తర తన్మాత్రమునకు కారణమగుటచేతను ఏకద్విత్రిచతుష్పంచ లక్షణములు కలవిగా చెప్పబడును. ఇట లక్షణము ధర్మవాచకము. శబ్దతన్మాత్రమున్నింటికంటె పూర్వము కాబట్టి యది యేకలక్షణము ఏకధర్మకము - శబ్దలక్షణము. స్పర్శతన్మాత్రము ద్విలక్షణము - శబ్దస్పర్శ లక్షణము. రూపతన్మాత్రము శబ్దస్పర్శ రూపలక్షణమై త్రిలక్షణము. రసతన్మాత్రము చతుర్లక్షణము - శబ్దస్పర్శ రూపలక్షణమై త్రిలక్షణము. రసతన్మాత్రము చతుర్లక్షణము - శబ్ధస్పర్శ రూపరస లక్షణము. గంధతన్మాత్రము పంచలక్షణము. శబ్ద స్పర్శరూప రసగంధలక్షణము. ఇట్టి శబ్దాది తన్మాత్రములైదు; శ్రోత్రాది ఏకాదశ ఇంద్రియములకు కారణమైన అహంకారమొకటి కలిసి ఆఱును అవిశేషము లనబడును.

3. లింగమాత్రము :- పంచతన్మాత్రములకు, అహంకారమునకు కారణమైన మహత్తత్త్వము లింగమాత్ర మనబడును.

4. అలింగము :- మహత్తత్త్వమునకు కారణమైన సత్వరజస్తమో గుణాత్మకమగు ప్రకృతి - ప్రధానము అలింగ మనబడును. లయమును బొందునది లింగము లయము పొందనిది - నాశము కానిది కాబట్టి ప్రధాన మలింగమనబడును.

సత్త్వరజస్తమోగుణముల సామ్యావస్థ ప్రకృతి ప్రధానము అవ్యక్తము అనబడును. మహత్తత్త్వము మొదలు పంచమహాభూతముల వఱకు చెప్పబడిన లింగమాత్ర, అవిశేష, విశేషములన్నియు గుణముల విషమావస్థలని వివేకము.

ఇందు విశేషములన వికారములు - కార్యములు. అయ్యవి శాంతఘోరమూఢతా లక్షణములతో కూడియుండును. ఇట్టి లక్షణములు లేని తన్మాత్రముల వికారములే కాబట్టి యివి విశేషము లనబడునని భావము. శ్రోత్రాది జ్ఞానేంద్రియములు సత్వప్రధానమైన అహంకారము (అస్మిత) యొక్క వికారములు - విశేషములు. వాగాది కర్మేంద్రియములు రజోగుణ ప్రధానమైన

అహంకారము యొక్క విశేషములు - వికారములు - కార్యములు, మనస్సు మాత్ర ముభయ ప్రధానమని తెలియవలయును.

ప్రకృతి విశేషములు మహదహంకారములు అహంకార విశేషములు ఏకాదశేంద్రియములు మహత్తత్త్వముయొక్క విశేషములు పంచతన్మాత్రములు. పంచతన్మాత్రముల విశేషములు పంచమహాభూతములు.

ప్రకృతినుండి మహదహంకారములు, మహత్తత్త్వమునుండి పంచతన్మాత్రములు, అహంకారమునుండి ఏకాదశేంద్రియములు, పంచతన్మాత్రములనుండి పంచమహాభూతములు జనించినవని యోగుల మతము. పంచతన్మాత్రములును మహత్తత్త్వమునుండి జనించినట్లు సాంఖ్యులు చెప్పుదురు.

అవ॥ దృశ్యము దాని స్వరూప పరిణామములు నన్నియు వర్ణించి ద్రష్టృ స్వరూపము చెప్పుచున్నాడు.

**ద్రష్టా దృశిమాత్రః శుద్ధోఽపి ప్రత్యయాను పశ్యః 20**

దృశిమాత్రః = జ్ఞానమే స్వరూపముగాగల పురుషుడు, ద్రష్టా = ద్రష్టయనబడును, శుద్ధోఽపి = జ్ఞానమున కాశ్రయము కాకున్నను, ప్రత్యయానుపశ్యః = బుద్ధియందలి ప్రత్యయము - జ్ఞానము ననుసరించి చూచువాడు.

జ్ఞానమాత్రుడైన పురుషునందు స్వరూపమున ద్రష్టృత్వములేదు. కాని, శబ్దాది విషయాకారతను పరిణమించి వృత్త్యాత్మకమైయున్న బుద్ధియందు పురుషుడు (జీవాత్మ) ప్రతిబింబించి. బుద్ధి సమానమైన యాకారమునుపొంది, వివేకము లేనందున శబ్దాదుల నెఱుగు బుద్ధివృత్తులను తనయం దారోపించుకొని, తానే శబ్దాదులను తెలిసికొనుచున్నట్లు - దర్శించు చున్నట్లెంచును. ఇట్లు పురుషుడు శుద్ధుడయ్యు దృష్టికాశ్రయు డగుచున్నాడు. ఇట్టివాడే ద్రష్టయని భావము.

పురుషుడు దృక్ శక్తి మాత్రమే. ఇతర విశేషణ రహితుడని భావము. అట్టి పురుషుడు బుద్ధి ప్రతిసంవేదియై ద్రష్ట యనబడును. బుద్ధియనెడి దర్పణమున పురుషుని ప్రతిబింబ సంక్రమణమే బుద్ధి ప్రతి సంవేదిత్వము. దృక్ శక్తి ఛాయతో కూడిన బుద్ధితో సంసృష్టములయి శబ్దాదులు దృశ్యములగును కాబట్టి పురుషునందు ద్రష్టృత్వమారోపితమేకాని స్వాభావికము కాదని భావము.

స్వాభావిక ద్రష్టృత్వ మంగీకరించినచో పురుషుడు పరిణామియగును. శబ్దాది జ్ఞానము కలిగిన రూపమొకటియు, లేని రూప మొకటియు నగునని భావము. పురుషుడు పరిణామి కాదు. బుద్ధి పరిణామి. గవాదిరూపమున పరిణమించినపుడు బుద్ధికి గవాదుల జ్ఞానము కలుగును. పరిణామము లేనపుడు కలుగదు. పురుష డట్లుకాక సదా జ్ఞాత. అతనికి విషయము బుద్ధియే. బుద్ధి యొకప్పుడు తెలియబడి, మఱియొకప్పుడు తెలియబడకుండుట యనునది యుండదు. కాబట్టి పురుషుడు సదా జ్ఞాతయై – దృక్ శక్తిగా – అపరిణామియై యుండునని తాత్పర్యము.

అవ॥ ద్రష్టృదృశ్యముల స్వరూపమును చెప్పి దృశ్యము ద్రష్ట కొఱకేయని చెప్పుచున్నాడు.

**తదర్థ ఏవ దృశ్య స్యాత్మా 21**

దృశ్యస్యాత్మా = దృశ్యము యొక్క స్వరూపము, తదర్థ ఏవ = పురుషార్థమే ప్రయోజనముగా గలది.

దృశ్యము యొక్క స్వరూపము తనకొఱకుకాక దృక్శక్తి = పురుషుని – యొక్క భోగాపవర్గములనెడి ప్రయోజనము కొఱకేయని భావము.

అవ॥ అటులయిన ద్రష్ట యొక్క ప్రయోజనము సిద్ధింపగానే దృశ్యము నశించును. అటుపై ప్రపంచము చిన్నము కాగల దన:

**కృతార్థం ప్రతి నష్ట మన్యనష్టం తదన్యసాధారణత్వాత్ 22**

తత్ = బుద్ధి రూపమున పరిణమించు గుణత్రయాత్మకమగు దృశ్యము (ప్రధానము), కృతార్థం ప్రతి = భోగాపవర్గలక్షణ ప్రయోజనము సిద్ధించిన పురుషుని విషయమున, నష్టమపి = నాశమునొందియు, అన్యసాధారణత్వాత్ = అకృతార్థుడైన పురుషుని విషయమునను సమానమగుటవలన, అనష్టం = నష్టము కాదు. స్వరూపనాశము నందదు.

గుణత్రయాత్మకమగు ప్రకృతి యొక్కటే. పురుషులు అనేకులు. ప్రకృతి పరమాత్మని మూలమున పురుషులందఱియెడ సమాన భావముతో వారి భోగాపవర్గార్థము సదా ప్రవర్తించుచుండును. కొండొక పురుషుని భోగాప వర్గములు సిద్ధించి యతనికి నష్టమయ్యు నితరుల – అకృతార్థుల – కొఱకది నష్టము కాజాలదు. కాబట్టి యొకానొకడు ముక్తుడైనందున సంసారము (ప్రపంచము) ఛిన్నము కావలసిన యగత్యముండదు.

మఱియు ప్రకృతి నిత్యము. దాని స్థితి పురుషార్థము కొఱకు కాదు. ప్రకృతి యొక్క పరిణామ స్వరూపము మాత్రము పురుషార్థ నిమిత్తము. కాబట్టి యట్టి దృశ్యరూపము కొండొకయెడ నాశమందినను ప్రకృతితత్త్వతః నశింపదని భావము.

అవ॥ ద్రష్టృ దృశ్యములను వివరించి వాని సంయోగమును వర్ణించు చున్నాడు.

**స్వస్వామిశక్త్యోః స్వరూపోపలబ్ధి హేతుః సంయోగ ః 23**

స్వస్వామిశక్త్యోః = స్వశక్తి ప్రకృతి, స్వామిశక్తి పురుషుడు, వీని రెంటియొక్క, స్వరూపోపలబ్ధిహేతుః = స్వరూప సాక్షాత్కారమునకు కారణమైన స్వస్వామిభావ లక్షణమైన సంబంధము, సంయోగః = సంయోగమనబడును.

దృశ్యము ద్రష్ట కొఱకు, దృశ్యము వలన కలిగిన భోగము, అపవర్గము ననెడి ఉపకారమును పొంది పురుషుడు స్వామి యగుచున్నాడు. దృశ్యము 'స్వమ్' అతని ధనమగుచున్నది. శబ్దాది విషయ రూపమున పరిణమించి సుఖ దుఃఖములు కలదియైన బుద్ధి – ప్రకృతి స్వరూప జ్ఞానము లేని పురుషున కుపలబ్ధమై భోగమగును. ద్రష్టయొక్క స్వరూపజ్ఞానముకంటె – బుద్ధ్యాది ప్రకృతికంటె పురుషుడు తన స్వరూపమును వేఱుగా నెఱుగుట – అపవర్గ మనబడును. భోగాపవర్గములకు హేతువైన స్వస్వామిభావదృశ్య ద్రష్టభావ – భోగ్యభోక్తృభావ – లక్షణమైన సంబంధము సంయోగ మనబడునని భావము.

భోగాపవర్గములకు హేతువైన ప్రకృతిపురుష సంయోగము ఘటపటముల సంయోగములవంటిది కాదు. ఇది యోగ్యత లక్షణముగా గల సంయోగము. దృశ్యమున జడత్వము, విషయత్వము ననెడి భోగ్యత్వ యోగ్యత కలదు. ద్రష్టయైన పురుషునందు చేతనత్వమనెడి భోక్తృత్వయోగ్యత కలదు.

ఇట్టి యోగ్యతలు లక్షణములుగాగల ప్రకృతి పురుషుల సంయోగము అనాది విపర్యయ జ్ఞానవాసనచే జనించి యవిద్యా నిమిత్తము తొలగగానే నశించును. ఈ యవిద్యా నిమిత్తము తొలగుటకు సమ్యక్ జ్ఞానము తక్క వేఱొండు సాధనము లేదు. సమ్యక్ జ్ఞానమే విపర్యయ జ్ఞానమునకు ప్రతిద్వంద్వి – విరోధి.

అవ॥ భోగాపవర్గములకు హేతువైన ప్రకృతి పురుష సంయోగమునకు కారణమే మన:

**తస్య హేతు రవిద్యా** **24**

తస్య = ఆ సంయోగమునకు, హేతుః = కారణము – నిమిత్తము, అవిద్యా = అవిద్య

అవిద్య, విపర్యయ జ్ఞానము, మిథ్యాజ్ఞానము, భ్రాంతి జ్ఞానము, అజ్ఞానము, అవివేకము, భ్రమ ఈ శబ్దము లన్నియు నొకే యర్థమును బోధించును.

అవ॥ హేయమగు దుఃఖమును, హేయ కారణమైన సంయోగము, దాని నిమిత్తమును చెప్పి హానమన నేమో చెప్పుచున్నాడు.

**తదభావాత్ సంయోగాభావో హానం తద్దృశేః కైవల్యమ్** **25**

తదభావాత్ = అవిద్యా నాశమువలన కలుగు, సంయోగాభావః = ప్రకృతి పురుష సంయోగనాశము, హానం = హాన మనబడును, తత్ = ఆ హానమే, దృశ్యేః = జ్ఞానస్వరూపుడైన పురుషుని, కైవల్యమ్ = నిః శ్రేయనము – మోక్ష మనబడును.

పురుషుడు బద్ధుడు, ముక్తుడు నని యనబడినను స్వరూపముతో నతడు బద్ధుడుకాడు. స్వరూపముతో బద్ధుడైనచో ముక్తి యసంభవమగును. కాబట్టి యవిద్యా నిమిత్తమున దుఃఖహేతువగు బుద్ధి సంయోగమే యతనికి బంధము. సమ్యక్ జానము – వివేక ఖ్యాతి వలన – నవిద్య తొలగగా అవిద్యచే నేర్పడిన బుద్ధి సంయోగమును తొలగును. బుద్ధి సంబంధము తొలగుటయే మోక్షము. ఇంతకుమించి మోక్షమున పురుష స్వరూపమునందు కలుగు మార్పు ఒండేమియు నుండదు. సంయోగ నివృత్తియే దుఃఖనివృత్తి. దుఃఖనివృత్తియే బ్రహ్మానందానుభవము. కాబట్టి సంయోగము నశించుటయే హాన మనియు, ఆ హానమే కైవల్యమనియు సూత్రమున చెప్పబడినదని భావము.

అవ॥ హాన ప్రాప్తికి నుపాయమే మన:

**వివేకఖ్యాతి రవిప్లవా హానోపాయః** **26**

అవిప్లవా = నిర్మలమైన, వివేకఖ్యాతిః = ప్రకృతి పురుషు లత్యంత భిన్నులను వివేకము, హనోపాయః = కైవల్యమున కుపాయము.

వాసనతో కూడిన మిథ్యాజ్ఞాన మనెడి కాలుష్యము విప్లవ మనబడును. ఇట్టి కాలుష్యము – మాలిన్యము – లేని ఖ్యాతి అవిప్లవ ఖ్యాతి యగును. ఆచార్యోపదేశమువలన వివేకము నెఱిగి, మననము ద్వారమున దానిని

స్థిరపఱచుకొని, దీర్ఘకాలమువఱకు నిరంతరము శ్రద్ధతో సేవించుటవలన నేర్పడిన భావనా ప్రకర్షము వలన నుత్పన్నమైన ప్రత్యక్షాత్మకమగు సమాధిప్రజ్ఞ – ఆధ్యాత్మ ప్రసాదము – వివేకఖ్యాతి వాసనాసహిత మిథ్యాజ్ఞానమునకు దగ్ధబీజభావము కల్పించి నిర్విప్లవమై కైవల్యప్రాప్తి కుపాయమగునని భావము. వివేకఖ్యాతి వలన మిథ్యాజ్ఞానము నశించును. అటుపై ప్రకృతి పురుష సంయోగము నశించును. అందువలన దుఃఖత్రయ విఘాత మనెడి కైవల్య మొదవును.

**తస్య సప్తధా ప్రాంతభూమిః ప్రజ్ఞా** **27**

తస్య = వివేక ఖ్యాతియందు నిష్ఠగల యోగికి, సప్తధా = ఏడువిధములయిన, ప్రాంతభూమిః = ప్రాంత భూములుగల, ప్రజ్ఞా = బుద్ధి కలుగును.

వివేకఖ్యాతి కలిగిన యోగికి తామస జ్ఞానములు కలుగక యతని వివేకఖ్యాతి నిర్విప్లవమగును. అట్టివాడే ధర్మమేఘయోగి యనబడును. అతనికి సప్త విధములయిన ప్రజ్ఞ యేర్పడును. ఆ ప్రజ్ఞ జిజ్ఞాస, జిహాస, ప్రేప్స, చికీర్ష శోకము, భయము, వికల్పము నను నేడును తొలగిపోవుటయే ఫలముగా గలిగియుండును. అందు (1). హేయమననేమో తెలిసినది, హేయమున తెలిసికొనదగిన యంశ మొండులేదు అను జ్ఞానము కలుగుటచే జిజ్ఞాస యుండదు, (2). హేయమునకు కారణములైన అవిద్యాది పంచక్లేశములు త్యజింపబడినవి. వీనిలో నిక త్యజింప దగినది లేదు అను జిహాస తొలగును, (3). హానము – కైవల్యము ప్రాప్తించినది ప్రాప్తవ్యమొకింతయు నికలేదు అను ప్రేప్స – ప్రాప్తి కోరిక యుండదు. (4) వివేకఖ్యాతి రూపమగు హానోపాయము లభించినది. ఇక సంపాదింప వలసినది లేదు అను చికీర్ష – కర్తవ్యేచ్ఛ తొలగిపోవును. ఈ నాలుగు విధములయిన ప్రజ్ఞయు కర్తవ్య సమాప్తి రూపమగుటచే కార్యవిముక్తి నామకప్రజ్ఞ యనబడును, (5). నా బుద్ధి సత్త్వము కృతార్థమైనది (6). బుద్ధి రూపమున పరిణమించిన గుణములును పర్వత శిఖరమునుండి పడిన రాళ్లవలె స్థానరహితములై స్వకారణమైన ప్రకృతియందు లీనమై బుద్ధిసత్త్వముతోబాటు విలయమొందును. ఇయ్యవి మరల నుత్పన్నము కావు (7) త్రిగుణాతీతుడై స్వరూపమాత్రమున స్థితిగల కేవల పురుషుడు పరమాత్మ సాక్షాత్కారము నొందును అను నీ మూడును చిత్తవిముక్తి

రూపములగుటచే చిత్తవిముక్తి నామకప్రజ్ఞ యనిపించుకొనును. ఇట్లు కార్యవిముక్తి సంజ్ఞగల ప్రజ్ఞయు, చిత్తవిముక్తి సంజ్ఞగల ప్రజ్ఞయు కలిసి సప్తవిధప్రజ్ఞగా వ్యవహరింపబడునని భావము. భూములన నవస్థలు; ప్రాంతభూము లన అవసానముగల యవస్థలని భావము.

ఉపర్యుక్త సప్త విధప్రాంతభూమి ప్రజ్ఞగల పురుషుడు నిర్వికల్పుడు, జీవన్ముక్తుడు - కుశలుడు నని చెప్పబడును.

అవ॥ వివేకఖ్యాతి కలుగుట కనుష్ఠింపవలసిన దేమన:

**యోగాంగానుష్ఠానా దశుద్ధిక్షయే జ్ఞాన దీప్తి రావివేకఖ్యాతేః 28**

యోగాంగానుష్ఠానాత్ = ముందు సూత్రమున చెప్పబడు యోగసాధనములను సరిగా సంపాదించినందువలన, అశుద్ధిక్షయే = అవిద్యా రూపమైన అశుద్ధి నశింపగా, ఆ వివేకఖ్యాతేః = వివేకజ్ఞానపర్యంతమైన, జ్ఞానదీప్తిః = సమ్యక్ జ్ఞానము ప్రకాశించును.

యోగాంగములను సాధించిన కొలది యశుద్ధి - అవిద్య - క్షీణించును.అవిద్య క్షయించినకొలది సమ్యక్ జ్ఞానము వర్థిల్లును. వివేకఖ్యాతి కలుగునప్పటికి జ్ఞానప్రకాశము వర్థిల్లును. కాబట్టి సాంగయోగానుష్ఠానమే వివేకఖ్యాతిని కలిగింపగలదని భావము. గొడ్డలి ఖండింపదగిన కాష్ఠమును ఖండించి వేఱు చేయునట్లు యోగాంగానుష్ఠానము అశుద్ధిని వేఱుచేయును. ధర్మము సుఖమును ప్రాప్తింపజేయునట్లు వివేకఖ్యాతికి యోగాంగానుష్ఠానము ప్రాప్తి కారణము.

అవ॥ ఆ యోగాంగము లెవ్విః మఱియు నెన్ని యన :

**యమ నియ మాసన ప్రాణాయామ ప్రత్యాహార**
**ధారణా ధ్యాన సమాధయోఽష్టావంగాని 29**

యమ.....ధయః = యమములు, నియమములు, ఆసనము, ప్రాణాయామము, ప్రత్యాహారము, ధారణ, ధ్యానము, సమాధి అను అష్టౌ = ఎనిమిది, అంగాని = యోగమున కుపాయములు.

వీని లక్షణాదులు ముందుసూత్రములందు వర్ణింపబడును. సమాధి పాదమున చెప్పబడిన అభ్యాసాదులు నీ యుపాయములందే చేరిపోవును. అందు అభ్యాసము సమాధియందును, వైరాగ్యము సంతోషమునందును, శ్రద్ధ, వీర్యము మున్నగునవి నియమాంతర్గత తపః స్వాధ్యాయాదులందును, మైత్రీ,

కరుణాదులు ధారణాదులందును చేరునని గ్రహింపవలయును.

అవ॥ యమములు :

**అహింసా సత్య మస్తేయ బ్రహ్మచ ర్యాపరిగ్రహా యమాః 30**

అహింసా = మనో వాక్కాయములతో నెల్లపుడు నే ప్రాణికి పీడ కలిగింపకుండుట, సత్యమ్ = చెప్పదలచినపుడు (త్రికరణశుద్ధిగా) చూచినది చూచినట్లు, విన్నది వినినట్లు, ఊహించినది ఊహించినట్లు చెప్పుట, ఆలోచించుటయు, అస్తేయమ్ = సర్వదా పరద్రవ్యము నపేక్షింపకుండుట, బ్రహ్మచర్యమ్ = గుప్తేంద్రియమైన ఉపస్థయొక్క సంయమము, అపరిగ్రహాః = దేహయాత్రకు కావలసినవానికి మించి భోగసాధనములను స్వీకరింపకుండుట అను నీ యైదును, యమాః = యమములు.

అహింస, సత్యము, అస్తేయము, బ్రహ్మచర్యము, అపరిగ్రహము నను నీ యైదును మనస్సుతోపాటు ఇంద్రియములను విషయములనుండి యమింప – ఉపరమింప జేయును కాబట్టి యమము లనబడును.

ఇందు అహింస ముఖ్యము. మిగిలిన సత్యము మున్నగునవన్నియు నా యహింసాశుద్ధికొఱకే యనుష్ఠింపవలయును. సత్యాదుల ననుష్ఠింపకున్న నహింసావ్రతము మలినమగును. అవదాతము కానేరదు. ఆగమికులు నిట్లేయనిరి.

**'న ఖల్వయం బ్రాహ్మణో యథా యథా వ్రతాని బహూని సమాదిత్సతే తథాతథా ప్రమాదకృత్యేభ్యో హింసానిదానేభ్యో నివర్తమాన స్తామే వావదాత రూపామ్ అహింసాం కరోతి'**

సత్యాది వ్రతముల నాచరించిన కొలది మానవుడు ప్రమాదకృత హింసా కారణములనుండి తొలగి యహింసను శుద్ధము చేయునని భావము.

తనకు తెలిసిన దానిని ఇతరులకు దెలుపదలచి ప్రయోగించు వాక్యము అస్పష్టముగా నుండరాదు. అనగా నా వాక్కు వలన గలుగు జ్ఞానము వంచితముగానీ, భ్రాంతముగానీ యుండరాదు. వాక్కు సర్వభూతోపకారకము కావలయునుకాని భూతోపఘాతము కొఱకు గారాదు. ఇట్లు ప్రయుక్తమయ్యు వాక్కు భూతోపఘాతము – భూతహాని – కొఱకగునేని అది సత్యముకాదు. పాపమేయగును. పుణ్యమువలె తోచును. కాని యది పుణ్యాభాసము. దాని

వలన కష్టము సంభవించును. కాబట్టి పరీక్షించి సర్వభూత హితమగు సత్యము పలుకవలయునని వ్యాసమహర్షి

అవ॥ ఇందు యోగులచే గ్రహింపదగు విశేషము :

**జాతి దేశ కాల సమయావ సచ్ఛిన్నాః**
**సార్వభౌమా మహావ్రతమ్ 31**

పూర్వసూత్రమున జెప్పబడిన యమములు, జాతి...చ్ఛిన్నాః = జాతి, దేశ, కాల, సమయములచే సంకుచితము కాని పక్షమున, సార్వభౌమాః = పై జెప్పిన జాత్యాది స్థానములలో నెక్కడను ఖండితములు కానివై, మహావ్రతమ్ = మహావ్రతమనబడును.

జాతిసంకుచితము : కొందరు మత్స్యజాతి ప్రాణులను హింసింతురు. మఱికొందరు మేక, లేడి మున్నగు జాతికి చెందిన ప్రాణులను హింసించి భక్షింతురు. అట్టివారు 'మత్స్యములను తక్క వేనిని హింహింపన'నియు, 'మేకలనో', లేళ్లనో తక్క మఱివేనిని హింసింపన'నియు నని యట్లు వర్తించుట జాత్యవచ్ఛిన్న హింస యనబడును. అట్టిది మహావ్రతము కాజాలదు.

దేశసంకుచితము :- 'కురుక్షేత్రమున ప్రాణహింస చేయను' 'కాశియందు ప్రాణిహింస చేయను'. అని కొన్ని ప్రదేశములలో హింసను వర్జించుట.

కాలసంకుచితము :- 'ఏకాదశినాడు ప్రాణి హింసను చేయను'. 'పూర్ణిమనాడు హింసింపను' అనుట

సమయ సంకుచితము :- సమయమున ప్రతిజ్ఞ లేక సంకేతము. ఇతరుల కొఱకు హింసింతును కాని నా కొఱకు హింసింపననియో 'ఇతరులు హింసింపుమనియు హింసింతును లేకున్న హింసింపను' అనియో ప్రతిజ్ఞచేసి హింస నుండి విరమించుట.

ఇట్టి యపవాదములు లేక యేప్రాణిని నెన్నడు నెక్కడ నే విధముగను హింసింపకుండుట మహావ్రతమగును. ఇట్లే సత్యాదులును పాటింపవలయును. యోగి యిట్టి వ్రతములనే యాచరింపవలయునని భావము.

అవ॥ ఇక నియమములు :

**శౌచ సంతోష తపః స్వాధ్యా యేశ్వర**
**ప్రణిధానాని నియమాః 32**

శౌచ...నాని = శౌచము, సంతోషము, తపస్సు, స్వాధ్యాయము, ఈశ్వరప్రణిధానము నను నైదును, నియమాః = నియయములు, శౌచము = శుద్ధి. ఇది రెండు విధములు, బాహ్యము – అభ్యంతరము, మృత్తిక, జలము మున్నగువానితో శరీరమును, సాత్వికాహారాదుల భక్షణమువలన నుదరమును శుద్ధిచేసికొనుట బాహ్యమనబడును. మైత్రి, కరుణ మున్నగువాని ద్వారమున చిత్తములయిన రాగద్వేషములను పోగొట్టుకొనుట అభ్యంతరశుచి యనబడును.

సంతోషము :– జీవనయాత్రకు కావలసిన పరికరములకు మించి సాధనసామగ్రిని సంపాదింపకుండుట, ప్రాప్తించిన సాధనములతో తృప్తిపడవలయును. సంగ్రహేచ్ఛ యుండరాదని భావము.

తపస్సు :– శీతోష్ణములు, మానావమానములు, ఆకలిదప్పులు, మున్నగు ద్వంద్వములను సహించుట హితము మితము నైన భోజనము చేయుట.

స్వాధ్యాయము :– పవిత్రములైన ప్రణవాదులను జపించుట, మోక్షశాస్త్రములగు వేదోపనిషదాదులను పఠించుట

ఈశ్వర ప్రణిధానము :– పరమగురువైన పరమేశ్వరునందు సర్వకర్మల నర్పించి కర్మఫలమును త్యజించుట.

ఇయ్యవి తప్పక చేయదగినవని నియమింపబడుట – విధింపబడుట చేత నియమము లనబడుచున్నవి.

అవ॥ శ్రేయాంసి బహువిఘ్నాని మంచికెన్నో యాటంకములు అను సామెత ననుసరించి యమనియమాదుల నాచరింపబూనినపుడు హింసాదులచే బాధ యుపస్థితమైనచో చేయవలసిన దేమన:

**వితర్కబాధనే ప్రతిపక్షభావనమ్ 33**

హింసాదులు వితర్కము లనబడును. యమనియమములను పాటించు యోగికి వితర్కబాధనే = హింసాదుల వలన విఘ్న ముపస్థితమైనచో, ప్రతి పక్షభావనమ్ = ప్రతిపక్షమును భావింపవలయును.

యమ నియమములను పాటించు యోగికి అపకారిని హింసింతును, అనృతము పలుకుదును, పరుల ధనము నపహరింతును, పరదారల నబిగ మింతును శుద్ధిని విడుతును అను నిట్టి తలంపులు కలిగి బాధించుచో వానికి విపరీతమైన ప్రతిపక్షభావనములు చేయవలయును. ఘోరమైన సంసారాగ్ని యందు తపించుచు సర్వభూతముల కభయమిచ్చు యోగధర్మము

నాశ్రయించితిని. దుఃఖఫలకములైన హింసామిథ్యా భాషణాదులను త్యజించి సుఖఫలకములయిన అహింసాది యమనియమముల నాశ్రయించితిని, అట్టి నేను, క్రక్కినకూటి కాసపడు కుక్కవలె హింసాది వితర్కములను త్యజించి మరల గ్రహించుటచే నీవృత్తము కలవాడనగుదును. అయ్యది నాకు తగదు అని యిట్లు భావించుట ప్రతిపక్షభావన మనబడును.

అవ॥ ఆ వితర్కము లెయ్యవి? వానివిధ మెట్టిది? వాని ధర్మమేమి? వానికి కారణము లేమి? వానిఫలము లెయ్యవి? ప్రతిపక్షభావన మెట్టిది అన:

**వితర్కా హింసాదయః కృతకారి తామమోదితా**
**లోభ క్రోధ మోహ పూర్వకా మృదు మధ్యాధి**
**మాత్రా దుఃఖాజ్ఞానానంతఫలా ఇతి ప్రతిపక్ష భావనమ్ 34**

హింసాదయః = ఏ యనృతాదులకుముందు హింస పేర్కొనబడునో అట్టి హింసాదులు, వితర్కాః = వితర్కములనబడి, దుఃఖాజ్ఞానానంతఫలాః = అనంతమైన దుఃఖము; అజ్ఞానము, ఫలముగాగలవి; ఇతి = అవి, ప్రతిపక్షభావనమ్ = ప్రతిపక్షభావనము చేయవలయును. మఱియు నవి యెట్టివన, కృతాకారితాను మోదితాః = స్వయముగా చేసినవి కృతములు, ఇతరుల ప్రేరణచేత చేసినవి కారితములు, మేలు మేలుఅని యితరులచే ననుమోదింపబడినవి యనుమోదితములు మఱియు నెట్టివన, లోభక్రోధ మోహపూర్వకాః = లోభము, క్రోధము, మోహముచే చేయబడునవి. ఇంకను నెట్టివియన, మృదుమధ్యాధిమాత్రాః = లోభాదులలోగల మృదుమధ్యాధి మాత్రభేదములచే నయ్యవి యొక్కటొక్కటి తొమ్మిది విధములగును. ఇట్లు కృతాకారితాది భేదములచే హింసాదులు ముప్విధములయ్యు లోభాది భేదములచే తొమ్మిది విధములగును. ఆ లోభాదులు మృద్వాది భేదములచే నొక్కటొక్కటి మరల తొమ్మిది విధములయి మొత్తము ఎనుబది యొక్క విధములగును. ఇట్లు వితర్కములు అనంతదుఃఖము, ననంతమైన యజ్ఞానమును నుదయింపజేయును. ప్రతిపక్షభావన మొనరింపవలయును.

కృతము, కారితము అనుమోదితము నని హింస ముప్విధములు, మరల నయ్యది మాంసచర్మాదులందలి లోభము చేతను, తన కపకార మొనరించెనను క్రోధముచేతను, గీని నిట్లు హింసించినందున ధర్మము కలుగగలదను మోహము చేతను చేయబడి తొమ్మిది విధములగును. ఆ

లోభక్రోధ మోహములలోగల మృదు - మధ్య - అధిమాత్రభేదములచే నిరువది యేడు విధములగును. అందునను తీవ్రతలోగల మృదు -మధ్య - అది మాత్రభేదములచే మరల ముప్విధములై యెనుబది యొక్క విధములగును. ఇట్లే అసత్యభాషణాదులు నూహింపవలయును.

యమనియమపరుడైన యోగి హింసాది వితర్కములు తన నడ్డగించునపుడు ఇయ్యవి దుఃఖమును కలిగించునవి కాబట్టి యనిష్టములని విపక్షముగా భావించినచో వానియెడ నతనికి ద్వేషము కలుగును. అందువలన వానినుండి విరతుడగును. విఘ్నములు తొలగును. యమనియమముల నిట్లు నిరాటంకముగా నాచరించి సఫలుడగును. చిత్తము నిర్మలమగును. కైవల్యము సిద్ధింపగలదు. కాబట్టి ఆ యా సమయములందు యోగి ప్రయత్నపూర్వకముగా విపక్షభావన మొనరింపవలయునని భావము.

అవ॥ యమనియమములు పాలించు యోగికి అవి సిద్ధించినట్లు తెలిసికొనుటకు చిహ్నము లెయ్యవి యన:

**అహింసా ప్రతిష్ఠాయాం తత్సన్నిధౌ వైరత్యాగః 35**

అహింసాప్రతిష్ఠాయాం = అహింస సిద్ధించిన, తత్సన్నిధౌ = యోగి సమీపమున, వైరత్యాగః = సదావిరోధులైన, అహి నకులాదుల వైరముండదు.

విరోధస్వభావముగల జంతువులు సైతము అహింసను సాధించిన యోగి సమీపమున తమ పారస్పరిక వైరమును విడుచును. ఒండొరులను హింసంపనేరవని భావము.

**సత్య ప్రతిష్ఠాయాం క్రియాఫలాశ్రయత్వమ్ 36**

సత్యప్రతిష్ఠాయాం = సత్యము సిద్ధించిన, యోగివాక్కు, క్రియాఫలాశ్రయత్వమ్ = ధర్మాధర్మములనెడి క్రియకు, సుఖదుఃఖములనెడి ఫలమునకు నాశ్రయమగును.

సత్యనిష్ఠగల యోగివాక్కు అమోఘమగును. ధార్మికుడ వగుమనిన పాపియు ధార్మికుడగును. సుఖపడుము అనిన దుఃఖితుడును సుఖియగునని భావము.

**అస్తేయ ప్రతిష్ఠాయాం సర్వరత్నోపస్థానమ్ 37**

అస్తేయప్రతిష్ఠాయాం = అస్తేయము సిద్ధించిన యోగికి, సర్వరత్నోపస్థానమ్ = సంకల్పమాత్రమున సర్వరత్నములు చేకూరును.

**బ్రహ్మచర్య ప్రతిష్ఠాయాం వీర్యలాభః** **38**

బ్రహ్మచర్య ప్రతిష్ఠాయా = బ్రహ్మచర్యముసిద్ధించిన యోగికి, వీర్యలాభః = మిక్కిలి సామర్థ్యము కలుగును.

బ్రహ్మచర్యము సిద్ధించిన యోగికి అణిమాద్యష్ట గుణములు ప్రాప్తించును. తారము, సుతారము, తారతారము, రమ్యకము, సదాముదితము, ప్రమోదము, ప్రముదితము, ప్రమోదమానము నను సిద్ధులును గలవాడై యోగి తన శిష్యులకు యోగవిషయక జ్ఞానము కలుగజేయగలడు. మృత్యువును జయింపగలడు.

**బ్రహ్మచర్యేణ తపసా దేవా మృత్యు ముపాఘ్నత**
**ఇంద్రోహ బ్రహ్మచర్యేణ దేవేభ్యః స్వరారభత**

(అథ. 11.3.5.19)

దేవాః = ఇంద్రియములు, బ్రహ్మచర్యేణ తపసా = బ్రహ్మచర్యమనెడి తపస్సుతో, మృత్యుమ్ = విషయ గ్రహణశక్తిని నశింపజేయు రోగజాతమును, ఉపాఘ్నత = నశింపజేసినవి, ఇంద్రః = జీవాత్మ, బ్రహ్మచర్యేణ = బ్రహ్మచర్యముతో, దేవేభ్యః = ఇంద్రియముల ద్వారమున, దేహమును, స్వః = సుఖమయము, ఆరభత = చేసెను.

**అపరిగ్రహస్థైర్యే జన్మకథంతాసంబోధః** **39**

అపరిగ్రహస్థైర్యే = అపరిగ్రహమునందు స్థిరత యేర్పడిన యోగికి, జన్మకథంతాసంబోధః = జన్మముయొక్క కింప్రకారత (విధానము) బోధపడును.

అపూర్వములైన దేహేంద్రియాదులతో (జ్ఞానహేతుకమగు) సంబంధము జన్మమనబడును. (కోఽహమాసమ్ః కథమహమాసమ్ః కిం స్విదిదమ్? కథంస్విదిదమ్? కేవాభవిష్యామః కథంవా భవిష్యామః?) నేనెవడను? ఎట్లయితిని? ఇది యేమి? ఇది యెట్టిది? ఎవరమగుదుము? ఎట్లగుదుము? అను నిట్టిది కథంత – కథంభావ మనబడును.

అపరిగ్రహమున స్థిరుడైన యోగి తన జన్మోదంతమును తెలియగోరిన నతనికంతయు సాక్షాత్కారము కాగలదని భావము.

**శౌచాత్ స్వాంగజుగుప్సా పరై రసంసర్గః** **40**

శౌచాత్ = బాహ్యశౌచము సిద్ధించిన యోగికి, స్వాంగ జుగుప్సా = తన శరీరమునందు ఘృణయేర్పడును, పరైః = ఇతరుల శరీరములతో, అసంసర్గః

= అసంబంధము కలుగును.

శరీరోత్పత్తి స్థానాదుల పర్యాలోచనవలన బాహ్యశౌచము సిద్ధించిన యోగికి తన శరీరమునందు ఘృణ (ఏవగింపు) కలుగుటయేకాక యితరుల శరీరములతో కలుగు సంబంధము (ఏకాంతవాసాదులవలన) బొత్తిగా గిట్టదు. ఇందువలన దేహధ్యానము తొలగునని భావము.

అవ॥ బాహ్యశౌచముతోబాటు అభ్యంతర శౌచసిద్ధివలన కలుగు విశేషము లిందు తెలుపుచున్నాడు.

**సత్వశుద్ధి సౌమనస్యైకాగ్ర్యేంద్రియ**
**జయాత్మదర్శన యోగ్యత్వాని చ** **41**

శౌచసిద్ధివలన యోగికి, సత్వ... యోగ్యత్వాని = బుద్ధిసత్త్వము శుద్ధమగును, సౌమనస్యము, ఏకాగ్రత, ఇంద్రియజయము, ఆత్మదర్శన యోగ్యత యనునివి క్రమముగా కలుగును.

మైత్రి, కరుణ మున్నగువాని భావనవలన రాగాదులయిన చిత్తమలములు క్షాళితములుకాగా బుద్ధిసత్త్వము నిర్మలమగును. అటుపై సత్వగుణోత్కర్షమువలన సౌమనస్యము - స్వచ్ఛత యేర్పడును. అందువలన నియత విషయమున ఏకాగ్రత యేర్పడును. దానివలన బాహ్యేంద్రియములు మనస్సున కధీనములై యుండునవి కాబట్టి యవి కట్టుపడును. అటుపై పురుషఖ్యాతి కలిగి ఆత్మదర్శన యోగ్యత కలుగునని భావము.

**సంతోషా దనుత్తమ సుఖలాభః** **42**

సంతోషాత్ = సంతుష్టచిత్తుడైన యోగికి, అనుత్తమ సుఖలాభః = మిక్కిలి సుఖప్రాప్తి కలుగును.

**'సంతోషం పరమాస్థాయ సుఖార్థీ సంయతో భవేత్**
**సంతోషమూలం హి సుఖం దుఃఖమూలం విపర్యయః'** (మ4.12)

సుఖార్థి పరమసంతోషము కలవాడై సంయతుడు కావలయును. సుఖము సంతోషమూలకము. దుఃఖము అసంతోషమున కలుగునని మనువు. కాబట్టి తప్పక యోగి సంతోషి కావలయునని యుపదేశము.

**కాయేంద్రియసిద్ధి రశుద్ధిక్షయాత్ తపసః** **43**

తపసః = తపస్సు సిద్ధించిన యోగికి, అశుద్ధిక్షయాత్ = పాపక్షయము వలన, కాయేంద్రియసిద్ధిః = శరీరసంపద, ప్రతిభ మున్నగు నింద్రియసిద్ధి

కలుగును.

కాయసిద్ధియన అణిమాది సిద్ధులనియు, ఇంద్రియసిద్ధియన దూరశ్రవణాదులనియు వ్యాసమహర్షి భాష్యము.

**స్వాధ్యాయా దిష్టదేవతాసంప్రయోగః** **44**

స్వాధ్యాయాత్ = స్వాధ్యాయము – ప్రణవజపాదులు – సిద్ధించిన యోగికి, ఇష్టదేవతాసంప్రయోగః = అభీష్టులైన దివ్యగుణులగు దేవతల ఋషుల –సిద్ధుల దర్శనము లభించును.

స్వాధ్యాయశీలుడైన యోగికి సిద్ధులు దర్శనమిత్తురు. అతని కార్యమున సాహాయ్య మొనర్తురు.

**సమాధిసిద్ధిరీశ్వర ప్రణిధానాత్** **45**

ఈశ్వర ప్రణిధానాత్ = ఈశ్వరప్రణిధానము సిద్ధించిన యోగికి సమాధిసిద్ధిః = సంప్రజ్ఞాత సమాధి సిద్ధింపగలదు.

అవ॥ ఇట్లు సిద్ధిని తెలుపు చిహ్నములతోబాటు యమనియమములను వర్ణించి తరువాతిదియైన ఆసనమన నేమో చెప్పుచున్నాడు.

**స్థిరసుఖ మాసనమ్** **46**

స్థిరసుఖమ్ = నిశ్చలమై సుఖము కలిగించునది, ఆసనమ్ = ఆసనమనబడును.

(అస్యతేఽత్ర నా అనేన వా ఇత్యాసనమ్) ఆసనము బాహ్యము, శారీరము నని ద్వివిధము. అందు చైలాజినకుశోత్తర మనునది బాహ్యము. యోగి తన యభ్యాసము నిమిత్తమొకచో కూర్చుండుటకై సమప్రదేశము దర్భాసన మొందుపఱచి దానిపై మృగచర్మమో లేక యున్ని వస్త్రమో వేసి యటుపై నొకగుడ్డ పఱచి యాసన మేర్పఱచుకొనును. ఇట్టిది బాహ్యాసనము. యోగము నభ్యసించుటకై దానిపై సిద్ధాసనము, పద్మాసనము, భద్రాసనము, వీరాసనము నని చెప్పబడు కూర్చుండు పద్ధతులు శారీరములు – శరీరమునకు సంబంధించిన ఆసనము లనబడును. అందెట్లు కూర్చుండిన స్థిరతయు, సుఖము నేర్పడునో యదియే యోగమున కుపకరించు ఆసనమని గ్రహింపవలయును.

అవ॥ ఈ యాసన మెట్లు సిద్ధించు ననః

**ప్రయత్నశైథిల్యానంత సమాపత్తిభ్యామ్** **47**

ప్రయత్న... భ్యామ్ = ప్రయత్న శిథిలత – ప్రయత్నోపరతి –

చేష్టాభావము వలనను, అయత్నసిద్ధములైన ఆసనములుగల సర్పాదిప్రాణి జాతమును జూచి వాని ననుకరించుటచేతను ఆసనము సిద్ధించును.

స్వభావసిద్ధముగా నుండు శారీరకచేష్ట ప్రయత్నమనబడును. అట్టి ప్రయత్నము వలన శరీరమున కదలిక కలుగును. అది లేకున్న శరీరము స్థిరపడగలదు. పశువులు, పక్షులు, సరీసృపాదులు నేర్వకయే ఆసనసిద్ధి కలవై యున్నవి. వానిని చూచి యట్లనుకరించుటచేతను ఆసనము సిద్ధింపగలదని భావము.

అవ॥ ఆసనము సిద్ధించినదని తెలుసుకొనుటెట్లన:

**తతో ద్వంద్వానభిఘాతః** **48**

తతః = ఆసనము సిద్ధించిన, ద్వంద్వానభిఘాతః = శీతోష్ణాది ద్వంద్వముల వలన బాధ కలుగదు.

ఆసనసిద్ధి యేర్పడిన యోగికి శీతోష్ణాది ద్వంద్వముల వలన బాధ కలుగనేరదని భావము.

అవ॥ తరువాత ప్రాణాయామము:

**తస్మిన్‌సతి శ్వాసప్రశ్వాసయో ర్గతివిచ్ఛేదః ప్రాణాయామః** **49**

తస్మిన్‌సతి = ఆసనసిద్ధి కలిగిన మీదట, శ్వాసప్రశ్వాసయోః = బాహ్య వాయువును లోపలికి తీసికొనుట శ్వాసము, కోష్టమునందలి వాయువును బయటికి విడుచుట ప్రశ్వాసము. ఇట్టి శ్వాసప్రశ్వాసముల – ఉచ్ఛ్వాస నిః శ్వాసముల యొక్క, గతివిచ్ఛేదః = స్వాభావికగతి విరోధము, ప్రాణాయామః = ప్రాణాయామ మనబడును.

రేచకము, పూరకము, కుంభకము, కేవల కుంభకమునని ప్రాణాయామము నాలుగు విధములు. కుంభకమునందు, కేవల కుంభకమునందు శ్వాసప్రశ్వాసము లుండవు కాబట్టి రెండే నిజమైన ప్రాణాయామము లనవచ్చును. కాని, రేచక ప్రాణాయామమున శ్వాసముండదు; ప్రశ్వాస ముండును. పూరక ప్రాణాయామమున ప్రశ్వాసముండదు; శ్వాసము మాత్రముండును. కాబట్టి యొకటి యున్నను రెండుండవు గనుక యొకవిధమగు గతివిచ్ఛేద ముండుటచేత ననియు ప్రాణాయామము లనదగును.

శ్వాస ప్రశ్వాసముల గతివిచ్ఛేదము ప్రాణాయామమునకు లక్షణము. ప్రాణాయామము లక్ష్యము.

ఆవ॥ ఇట్లు సామాన్యముగ లక్షణము చెప్పి విశేష లక్షణము నిట వర్ణించుచున్నాడు.

**బాహ్యాభ్యంతర స్తంభవృత్తి ర్దేశకాల సంఖ్యాభిః**
**పరిదృష్టో దీర్ఘ సూక్ష్మః 50**

ఆ ప్రాణాయామము, బాహ్యాభ్యంతర స్తంభవృత్తిః = బాహ్యావృత్తి కలది, అభ్యంతరవృత్తి కలది, స్తంభవృత్తి కలదియని మువ్విధములు. ఈ మువ్విధములైన ప్రాణాయామమును, దేశకాల సంఖ్యాభిః = దేశకాల సంఖ్యలతో, పరిదృష్టః = చక్కగా తెలియబడినదై, దీర్ఘసూక్ష్మః = దీర్ఘము, సూక్ష్మము నగును.

(1). లోపలి వాయువును బయటికి తీసి యట స్తంభింపజేయుట బాహ్యావృత్తి ప్రాణాయామమగును. ప్రశ్వాసపూర్వక గత్యభావముగల ప్రాణాయామమని భావము. ఇదియే రేచక ప్రాణాయామము.

(2). శ్వాసపూర్వక గత్యభావాత్మక ప్రాణాయామము. ఇందు బాహ్య వాయువు లోపలికి తీసికొని యట స్తంభింప జేయబడును. అభ్యంతరవృత్తి లేక పూరక ప్రాణాయామ మనబడును.

(3). స్తంభవృత్తి ప్రాణాయామము. ఇందు శ్వాసప్రశ్వాసములు రెండు నుండవు. ఎక్కడి వాయువు నక్కడనే నిలుచునట్లు చేసి లోపలికి వాయువు వెలుపలికికానీ వెలుపలి వాయువు లోపలికిగాని పోకుండ చేయవలయును. బాగుగా కాలిన రాతిమీద వేయబడిన నీటిబిందువు క్రమముగా నయ్యది యన్నివైపులనుండి సంకుచించుచు చివరకు లేకుండపోవును. అట్లే శ్వాసప్రశ్వాసములగతి నొక్కమాటు నడ్డగించుటచే ప్రాణగతి సంకుచించి విరుద్ధమగును. ఇదియే స్తంభవృత్తి – కుంభక ప్రాణాయామ మనబడును. కుంభములోని జలము కదలకుండునట్లుండును. కాబట్టి కుంభకమని భావము.

ఇట్టి ప్రాణాయామము దేశకాల సంఖ్యలతో కూడి దీనికింత ప్రదేశము విషయము, దీనికిన్ని క్షణముల స్థిరత యనియు, ఇన్ని శ్వాసప్రశ్వాసములతో ప్రథమ ఉద్ఘాతము ఇన్ని శ్వాసప్రశ్వాసములతో ద్వితీయ ఉద్ఘాతము, ఇన్నిటితోతృతీయ ఉద్ఘాతము ననియు, ఇది మృదువు, ఇది మధ్యము, ఇది తీవ్రము ననియు తెలియనగును.

దేశపరిమితి :– సాధకుడు రేచించునపుడు నాసికాగ్రమునకు ఎదురుగా నుండు లొడితెడో లేక జేనెడో లేక మూరెడో పరిమితి దూరముగల బాహ్య

ప్రదేశము రేచకమునకు విషయమగును. నాసిక కెదురుగా నుంచబడిన చిన్న దూదిపింజ కదలికవలన దూరపరిమితి తెలిసికొనవచ్చును. ఇట్లే పూరకమునకు శరీరమున నాపాదతల మస్తకపర్యంతము లోపలి ప్రదేశము విషయము, వాయుపూరణ సమయమున లోపల చీమలు ప్రాకునట్లు స్పర్శ కలుగుటచే నాభ్యంతర దేశపరిమితి తెలియనగును. కుంభక ప్రాణాయామమునకు లోపలి వెలుపలి ప్రదేశమంతయు విషయమగును. ఇందు పిపీలికాస్పర్శకాని, తూలికా చలనముకాని తెలియబడ కుండుటయే గుర్తు.

కాలపరిమితి :- మోకాటి చిప్పను చేతితో ముమ్మాటు బాగుగా స్పృశించియొక చిటికె వేయుట కెంతకాలము పట్టునో యంతకాలమొక మాత్రయనబడును. అట్టి పంద్రెండు మాత్రలకాలము కుంభకమునకు స్థిరత యేర్పడిన ఉద్ఘాతమనబడును. అదిప్రథమ ఉద్ఘాతము - మృదువు. ఇరువది నాలుగు మాత్రల కాలము స్థిరత కలిగిన ద్వితీయ ఉద్ఘాతము - మధ్యము. ముప్పది యాఱుమాత్రల కాలము స్థిరమయిన తృతీయ ఉద్ఘాతము - తీవ్రము అనబడును.

అవ॥ నాలుగవ ప్రాణాయామ లక్షణము :

**బాహ్యాభ్యంతర విషయాక్షేపీ చతుర్థః** **51**

ఈ సూత్రమునందలి విషయ శబ్దము దేశమును తెలుపును. దానింబట్టి కాలము సంఖ్యయు నిందు గ్రహింపబడును. బాహ్యాభ్యన్తర విషయాక్షేపీ = రేచకపూరకముల నపేక్షించని శ్వాసప్రశ్వాసముల గత్యభావమనెడి కేవల కుంభక ప్రాణాయామము, చతుర్థః = నాలుగవది.

పూర్వసూత్రమున చెప్పబడిన కుంభక ప్రాణాయమమునకును, ఈ కేవల కుంభక ప్రాణాయమమునకును స్వల్ప భేదమున్నది. కుంభకము శ్వాసప్రశ్వాసముల నపేక్షించును. కేవల కుంభకము శ్వాసప్రశ్వాసముల నపేక్షింపదు. దేశకాల సంఖ్యా పరిదృష్టత్వము మాత్ర ముభయత్ర సమానమే. నిద్ర, ఆలస్యము మున్నగు వృత్తులచే బాధింపబడు సాధకులు శ్వాసప్రశ్వాసముల నపేక్షించు కుంభకము నభ్యసించుట శ్రేయస్కరము. అట్టిబాధలు లేనివారు కేవల కుంభకము నభ్యసించిన చాలును.

అవ॥ ప్రాణాయామము సిద్ధించినదని తెలిసికొను టెట్లన :

**తతః క్షీయతే ప్రకాశావరణమ్ 52**

తతః = ప్రాణాయామము సిద్ధించిన, ప్రకాశావరణమ్ = బుద్ధిసత్త్వ ప్రకాశమునకు ఆవరణమైన క్లేశము, క్లేశజన్య మాలిన్యము – పాపము, క్షీయతే = దుర్బలమై తొలగిపోవును.

ప్రాణాయామము సిద్ధించినకొలది యోగికి సత్త్వప్రకాశ మెక్కుడగును. అవిద్యాది క్లేశములు, వానివలన కలుగు తామస వృత్తులు నశించును. అతనికి కలుగు స్వప్నాది వృత్తులును సత్త్వప్రకాశయములై యుండును. ఈ స్థితియే ప్రాణాయామ సిద్ధికి చిహ్నమని భావము.

**ధారణాసు చ యోగ్యతా మనసః 53**

మఱియు, ప్రాణాయామము సిద్ధించుట వలన ధారణాసు = ముందు చెప్పబడు ధారణలందు – చిత్తము నిలకడలందు, మనసః = చిత్తసత్త్వమునకు, యోగ్యతా = సామర్థ్యము కలుగును.

ప్రాణాయామము ద్వారమున ఆవరణము క్షీణింప బుద్ధిసత్త్వమునెట నిలిపిన నట నిలుచును. విక్షేపము కలుగదని భావము.

అవ॥ ప్రాణాయామము తరువాత ప్రత్యాహార లక్షణము :

**స్వవిషయా సంప్రయోగే చిత్తస్వరూపానుకార**
**ఇవేంద్రియాణాం ప్రత్యాహారః 54**

స్వవిష యా సంప్రయోగే = శబ్దాదులైన స్వవిషయములతో సంయోగము లేనందున కలిగిన, ఇంద్రియాణామ్ = చక్షురాదీంద్రియముల యొక్క చిత్తస్వరూపానుకార ఇవ = చిత్తస్వరూపము ననుకరించినట్లుండు ఉనికి, ప్రత్యాహారః = ప్రత్యాహార మనబడును.

యమనియమాదుల ద్వారమున సంస్కరింపబడి చిత్తసత్త్వము విషయ దోషములను గుర్తించి విరక్తమగును. మోహము, రాగము, ద్వేషము కలిగించు శబ్దాది విషయములతో సంబద్ధముకాదు. విరుద్ధమై తత్త్వాభిముఖమగను. ఇందువలన చిత్తమునకు లోబడియుండు నింద్రియములును శబ్దాదులైన స్వస్వవిషయములతో సంబద్ధములుకాక స్వయముగానే విరుద్ధములగును. ఇట్లు చిత్తమువలెనే ఇంద్రియములును విషయములతో సంప్రయుక్తములు కాకుండుటయే ప్రత్యాహార మనబడునని భావము.

అవ॥ ప్రత్యాహారము వలన కలుగు ప్రయోజన మేమన:

**తతః పరమావశ్యతేంద్రియాణామ్** **55**

తతః = ప్రత్యాహారము సిద్ధించినందువలన, ఇంద్రియాణామ్ = ఇంద్రియములయొక్క పరమమా = ఉత్కృష్టమైన - మిక్కిలి, వశ్యతా = వశీకరణము కలుగును.

ప్రత్యాహారము సిద్ధించినచో నింద్రియములు బాగుగ జయింపబడునని భావము. ఇంద్రియ జయ విషయమున ననేక భిన్నాభిప్రాయములు కలవు. కొందఱు విషయములయిన శబ్దాదులందు ఆసక్తి - వ్యసన రాహిత్యము ఇంద్రియజయ మందురు. వేదవిరుద్ధముకాని విషయములను సేవించుచు, విరుద్ధములైన విషయములందు ప్రవర్తించకుండుట ఇంద్రియజయమని మఱికొందరు. శబ్దాది విషయములందు ఇంద్రియములను విషయాధీనులై కాక స్వేచ్ఛగా ప్రవర్తింపజేయుట ఇంద్రియ జయమని వేఱొక కొందరు. రాగద్వేషములు లేక సుఖదుఃఖశూన్యమైన శబ్దాదుల జ్ఞానము ఇంద్రియ జయమని ఇతరులు. చిత్తైకాగ్రతవలన చిత్తమింద్రియములతోబాటు విషయములందు ప్రవర్తింప కుండుటయే ఇంద్రియ జయమని జైగీషవ్య మహర్షి. చిత్తవిరోధమున నింద్రియములు విరుద్ధములగుటయే ఇంద్రియముల పరమ వశీకారత, జైగీషవ్య మహర్షి చెప్పిన ఇంద్రియ జయమునకే యోగులు యత్నింతురు.

సాధన పాదము

# యోగదర్శనము

## విభూతి పాదము

ప్రథమ ద్వితీయ పాదములలో సమాధి, దాని సాధనములు వర్ణింపబడినవి. ఇందు - తృతీయ పాదమున యోగసాధన విషయమున మందబుద్ధులకు శ్రద్ధ కలిగించుటకుగాను విభూతులు చెప్పవలసియున్నవి. ఆ విభూతులు సంయమమువలనగాని సంపాదింప వలనుపడదు. ధారణ, ధ్యానము, సమాధి యను నీ మూటి సముదాయమే సంయమము. ఇంతకు పూర్వము వర్ణించిన యమనియమాసన ప్రాణాయామ ప్రత్యాహారము లను నైదు యోగాంగములు బహిరంగ సాధనములు. ధారణాది సాధనత్రయము అంతరంగ సాధనములు. ఇందు ధారణ యననేమో వర్ణించుచున్నాడు.

**దేశబంధ శ్చిత్తస్య ధారణా** **1**

చిత్తస్య = బాహ్యవిషయములను విడిచి తత్త్వమున కభిముఖమైన చిత్తముయొక్క, దేశబంధః = నాభిచక్రాది స్థానములందు వృత్తరూపమున నేర్పడు సంబంధము, ధారణా = ధారణయనబడును.

యమాదుల ననుష్ఠించుటచే నిర్మలమై చిత్తసత్త్వము విషయవిముఖమై తత్త్వాభిముఖ మగును. అట్టి చిత్తము జీవేశ్వరులకు స్థానభూతములైన హృదయ పుండరీకము, మూర్ధజ్యోతి మున్నగువానియందు కానీ, దివ్యములైన ప్రాకృతిక పదార్థములందు (చంద్రసూర్యాదులందు) కానీ నిలుపబడి వాని యాకారములను పొందును. ఇట్లొకచో చిత్తము నిలువబడుట ధారణ యనబడునని భావము.

అవ॥ ధ్యాన లక్షణము :

**తత్ర ప్రత్యయైక తానతా ధ్యానమ్** **2**

తత్ర = చిత్తస్థితికి విషయమైన ధ్యేయవస్తువునందు, కలుగు ప్రత్యయైకతానతా = జ్ఞానప్రవాహము, ధ్యానమ్ = ధ్యానమనబడును.

ధ్యేయవస్తువునందెట చిత్తసత్త్వము నిలువబడినదో యట బుద్ధియందు ఆ ధ్యేయవస్తువునకు సంబంధించిన ప్రత్యయము - జ్ఞానము తక్క యితర వృత్తి - ప్రత్యయము కలుగక యున్నచో నట్టి చిత్తస్థితి ధ్యాన మనబడును.

అవ॥ సమాధి లక్షణము :

**తదేవార్థమాత్రనిర్భాసం స్వరూప శూన్యమివ సమాధిః** 3

తదేవ = ఆధ్యానమే, అర్థమాత్ర నిర్భానం = కేవలము ధ్యేయవస్తురూపమున భాసించుచు, స్వరూపశూన్యమివ = ధ్యేయరూపము మాత్రము వ్యక్తమగుటచేత జ్ఞానరూపము - ప్రత్యయ రూపము - లేనట్లుండుట, సమాధిః = సమాధి యనబడును.

పుష్ప స్వభావావేశమున స్ఫటికమణి తన స్వరూపమును విడిచి పుష్పరూపమును పొందునట్లు ధ్యాన మభ్యసించినకొలది ప్రత్యయాత్మకమైన స్వస్వరూపమును విడిచి కేవల ధ్యేయాకారమున భాసించును. ధ్యేయవస్తు జ్ఞాన మటనుండక ధ్యేయము మాత్రము భాసించునని భావము. ఇయ్యదియే సమాధి యనబడును. చిత్తైకాగ్రత కలిగిన మీదట ధ్యాత, ధ్యానము, ధ్యేయము వేఱువేఱుగా తెలియబడుచున్నపుడు - యోగి తా నొక వస్తువును తెలిసికొనుచున్నాడని గుర్తించునపుడు - ఉండు స్థితి ధ్యానమనబడును. అట్టి ధ్యానము కేవలము ధ్యేయావభాసముగా మాఱిన సమాధి యనబడునని భావము.

అవ॥ ముందు శాస్త్రమున సులభముగా ప్రయోగింప వీలగునట్లు ధారణా ధ్యాన సమాధులకు మూటికి నొక సంజ్ఞ యేర్పఱచుచున్నాడు.

**త్రయ మేకత్ర సంయమః** 4

ఏకత్ర = ఒక వస్తువు విషయముగాగల, త్రయమ్ = ధారణాదిత్రయము, సంయమః = సంయమ మనబడును.

సమాన విషయముగల ధారణాధ్యాన సమాధులు సంయమ మనబడును. ఇయ్యది శాస్త్రీయ పరిభాష.

అవ॥ ఇట్టి సంయమసిద్ధివలన కలుగున దేమన:

**తజ్జయాత్ ప్రజ్ఞాఽఽలోకః** 5

తజ్జయాత్ = సంయమ స్థిరత వలన, ప్రజ్ఞాఽఽలోకః = సమాధి ప్రజ్ఞ నిర్మల మగును.

సంయమ స్థిరత సంపాదించిన కొలది సమాధి ప్రజ్ఞ విశదమగునని భావము.

అవ॥ ఇట్టి ఫలమును వినియోగించు స్థాన మెయ్యదియనః

**తస్య భూమిషు వినియోగః 6**

తస్య = పూర్వము నిర్దేశింపబడిన ఫలము గల సంయమము, భూమిషు = సంప్రజ్ఞాత యోగభూములందు, వినియోగః = విజిత భూమిని విడిచి యవిజిత భూమియందు వినియోగింపబడ వలయును.

ముందుగా స్థూల విషయమునకు సంబంధించిన సమాధి పాదమున చెప్పబడిన సవితర్క సంప్రజ్ఞాత సమాధియందు సంయమము వినియోగింప వలయును. అక్కడ విజయము లభించిన తదుపరి నిర్వితర్క సమాధియందు వినియోగింపవలయును. అట విజయము కలిగిన సూక్ష్మవిషయక సవితర్క సమాధియందును అటుపై సూక్ష్మ విషయక నిర్వితర్క సమాధియందును క్రమముగా సంయమమును వినియోగింపవలయును. ఇట్లు వినియోగింపగా నందు కుశలత యేర్పడును. ప్రజ్ఞాఽఽలోకము సంపాదింప బడును.

అవ॥ యమనియమాది యోగాంగములలో ధారణా ధ్యాన సమాధులకే యోగభూములందు వినియోగ మేల చెప్పబడిన దన:

**త్రయ మంతరంగం పూర్వేభ్యః 7**

పూ ర్వే భ్యః = యమనియమాది పంచయోగాంగములకంటె త్రయమ్ = ధారణాది త్రయము, అంతరంగమ్ = యోగమున కంతరంగ సాధనము; కాబట్టి వీని వినియోగము చెప్పబడినది. యమాదులైదు చిత్తమాలిన్యమును దూరమొనర్చి చిత్తైకాగ్రతకు సాధనములై యోగాంగములైనను నయ్యవి భిన్నభిన్న విషయకములు. అందువలన నవి బహిరంగ సాధనములనియు, ధారణాదులు మూడును ఏక విషయకములై యోగాంగము లనబడుటచే నంతరంగము లనియు చెప్పబడునని భావము.

అవ॥ అసంప్రజ్ఞాత సమాధియందు విషయమే నుండదు. సమాన విషయత్వ మట నుండదు, కాబట్టి ధారణాదుల కట అంతరంగత్వ మెట్లు పొసగు నన:

**తదపి బహిరంగం నిర్బీజస్య 8**

తదపి = ధారణాది సాధనత్రయమును, నిర్బీజస్య = అసంప్రజ్ఞాత యోగమనెడి నిర్బీజసమాధికి, బహిరంగం = బహిరంగ సాధనమే.

ధారణాది సాధనత్రయము సంప్రజ్ఞాతసమాధికే అంతరంగ సాధనము, అసంప్రజ్ఞాత సమాధికి కాదని భావము.

అవ॥ 'పరిణామ త్రయ సంయమాత్' (3.16) అను సూత్రమున చెప్పబోవు విషయమున నుపయోగించు పరిణామత్రయ మన నేమో చెప్పదలచి యిట నిర్బీజసమాధి ప్రసంగవశమున నిట్టి సమాధికాలమున నేర్పడు చిత్త నిరోధ పరిణామమును చెప్పుచున్నాడు.

**వ్యుత్థాన నిరోధ సంస్కారయో రభి వప్రాదుర్భావౌ**
**నిరోధక్షణచిత్తాన్వయో నిరోధ పరిణామః 9**

వ్యుత్థాన నిరోధ సంస్కారయోః = సంప్రజ్ఞాతము పర వైరాగ్యము ననువాని సంస్కారములయొక్క. అభిభవ ప్రాదుర్భావో = క్షయ, అభ్యుదయము లనువానియందు, నిరోదక్షణ చిత్తాన్వయః = ఏ క్షణమున విరోధముండునో ఆ క్షణాలు నిరోధక్షణము, అప్పుడుండు చిత్తము నిరోధక్షణ చిత్తము, ఆశ్రయరూపమున నిట్టి చిత్తము యొక్క సంబంధము, నిరోధ పరిణామః = నిరోధకాలమునకు సంబంధించిన దగుటచే నిరోధమను నామముగల ధర్మపరిణామ మనబడును.

ఈ సూత్రమున గల వ్యుత్థాన శబ్దమునకు సంప్రజ్ఞాతమని యర్థము వ్రాయబడినది. అసంప్రజ్ఞాతముకంటె సంప్రజ్ఞాతము వ్యుత్థానమగుటయే యిందులకు కారణము. ఇట్లే నిరోధమన పరవైరాగ్యమని యర్థము. పరవైరాగ్యముచేతనే సంప్రజ్ఞాతము నిరోధింపబడును, కాబట్టి నిరోధ మనబడినదని భావము.

అసంప్రజ్ఞాత సమాధి యుదయించుకాలమున ప్రతిక్షణము వ్యుత్థాన సంస్కారము క్షయించును. నిరోధ సంస్కారము ప్రతిక్షణము మభ్యుదయమగును. ఇట్టి సమయమున నిరూధక్షణవృత్తి చిత్తము – నిరోధ చిత్తము నిరోధాఖ్య ధర్మపరిణామమున కాశ్రయమై నిరోధ పరిణామ మనబడును. ప్రతి నిరోధక్షణమునందు నొక స్థిరచిత్తమున ధర్మముగా నన్వయించబడు వ్యుత్థాన సంస్కారముల క్షయము. నిరోధ సంస్కారముల యుదయమును నిరోధ పరిణామ మనబడునని భావము.

విచ్ఛక్తి (ఆత్మ) తక్క మిగిలిన భావపదార్థములన్నియు క్షణ పరిణామములు – ప్రతిక్షణము మార్పు నొందునని అని యంగీకరించుట వలన ప్రతిధర్మి (భావపదార్థము) యొక్క పరిణామము ధర్మము, లక్షణము, అవస్థ యని ముప్విధముల చెప్పబడును. (1) అవస్థితమైయున్న ధర్మియందు

పూర్వధర్మము క్షయించి ధర్మాంతర ముదయించుట ధర్మపరిణామము, (2). ఉదయించిన ధర్మమునకు అనాగతము (భవిష్యత్కాలికము) అనెడి లక్షణము పోయి వర్తమాననమనెడి లక్షణము కలుగుట లక్షణపరిణామమనబడును. (3) ఇట్లు వర్తమాన లక్షణముగల ధర్మములకును ప్రతి క్షణము అవస్థాతారతమ్య మేర్పడుట అవస్థా పరిణామ మనబడును.

అవ॥ నిరోధ సంస్కార పాటవమువలన వ్యుత్థాన సంస్కారములన్నియు క్షయింపగా చిత్తస్థితి యెట్లుండు నన:

**తస్య ప్రశాంత వాహితా సంస్కారాత్ 10**

సంస్కారాత్ = అభ్యాస వశమున బలపడిన నిరోధ సంస్కారము వలన, తస్య = వృత్థాన సంస్కారములనెడి మలము బొత్తుగా నశించిన మీదట నేర్పడు విరుద్ధ చిత్తసత్త్వము, ప్రశాంత వాహితా = సంపూర్ణముగా వ్యుత్థాన సంస్కారములు తొలగినందున నిరుద్ధ సంస్కార రూపమున నిర్మలమై శాంతముగా నుండును.

వృత్తులను నిరోధించుటచే నేర్పడిన నిరోధ సంస్కారము అభ్యాస వశమున బలపడి సర్వథా వ్యుత్థాన సంస్కారములను నశింపజేయును. అందుచే చిత్తము నిర్మలమై కేవలము నిరోధమనెడి సంస్కార రూపమున మిగిలి శాంతముగ నుండునని భావము. ఇందు వర్తమాన లక్షణముగల నిరోధ సంస్కారముల యభివృద్ధిని తెలిపి అవస్థా పరిణామము బోధింపబడినదని గ్రహింప వలయును.

అవ॥ సంప్రజ్ఞాతావస్థయందు చిత్తమున నెట్టి పరిణామము కలుగు నన:

**సర్వార్థ తైకాగ్రతయోః క్షయోదయౌ**
**చిత్తస్య సమాధి పరిణామః 11**

సర్వార్థతైకాగ్రతయోః = విక్షేపము, ఏకాగ్రత అనువాని, క్షయోదయౌ = క్షయము, ఉదయమును, చిత్తస్య = సమాధి చిత్తముయొక్క సమాధి పరిణామః = సమాధి పరిణామ మనబడును.

విక్షేపనాశము, ఏకాగ్రత యుదయము నను నీ యుభయ ధర్మములతోను సమాధి క్షణచిత్తము ధర్మిగా నన్వయించును. ఈ సూత్రమునందలి సర్వార్థతకు నానార్థములను తెలిసికొనుట యని యర్థము. కాబట్టి విక్షేపమని వ్రాయబడినది.

సమాధి కాలమున ప్రతి క్షణము నందును స్థిర చిత్తమున ధర్మముగా

నన్వయింపబడు సర్వార్థత (విక్షేపము) యొక్క క్షయము ఏకాగ్రతయొక్క యుదయము నను నీ యుభయమును ధర్మియైన చిత్తము యొక్క సమాధి పరిణామ మని భావము.

అవ॥ అభ్యాస బలమున విక్షేపము నశించి సమాహితమైన చిత్తమునందు మరల నెట్టి పరిణామము కలుగు నన :

**శాంతోధితౌ తుల్యప్రత్యయౌ**
**చిత్తస్యైకాగ్రతా పరిణామః 12**

చిత్తస్య = సమాహిత చిత్తము యొక్క, శాంతోదితౌ = అతీతము, వర్తమానమునను, తుల్యప్రత్యయౌ = సమాన విషయకములగుటచే సమానములైన రెండు ప్రత్యయములు ( ఈ రెండు ప్రత్యయములకును ఏకాగ్రతాకాలికచిత్తము ధర్మిగా నన్వితమైయుండును) ఏకాగ్రతా పరిణామః = ఏకాగ్రత పరిణామ మనబడును.

ఏకాగ్రత యేర్పడిన కాలమున స్థిరమైన చిత్తమునందు ఒకే విషయమునకు సంబంధించిన ప్రత్యయములు ఒకదాని తదుపరి మఱియొకటి యుదయించి యస్తమించుచుండును. ఏకాగ్రతారూప సమాధి భగ్నమగు వఱకు సమాన ప్రత్యయ ప్రవాహమిట్లు నడుచుచుండును. నశించిన ప్రత్యయము శాంత మనబడును. తదుపరి యుదయించు ప్రత్యయము ఉదితమనబడును. శాంతోదితములు ఒకే విషయమునకు చెందిన వగుటచే తుల్య ప్రత్యయము లనబడును. ఇట్టి తుల్య ప్రత్యయము లాస్థిర చిత్తమున ధర్మముగా నన్వయించును. అందుచే నియ్యవస్థ ఏకాగ్రతా పరిణామ మనబడునని భావము.

అవ॥ ధర్మియైన చిత్తసత్త్వము యొక్క పరిణామ త్రయము చెప్పి యట్టి పరిణామములు చిత్తమువలెనే త్రిగుణాత్మకము లైనందున పంచభూతములందును చక్షురాదింద్రియములందును కలవని చెప్పుచున్నాడు,

**ఏతేన భూతేంద్రియేషు ధర్మలక్షణావస్థా**
**పరిణామాః వ్యాఖ్యాతాః 13**

ఏతేన = పూర్వము చెప్పబడిన చిత్తసత్త్వముయొక్క పరిణామత్రయ వ్యాఖ్యానము ద్వారమున, భూతేంద్రియేషు = వృధివ్యాధి పంచమహాభూతములందు, చక్షురాధి సర్వేంద్రియములందును, ధర్మలక్షణావస్థా పరిణామాః = ధర్మ పరిణామము, లక్షణపరిణామము, అవస్థా పరిణామము

నను ముప్విధములగు పరిణామములు, వ్యాఖ్యాతాః = వ్యాఖ్యానము చేయబడిన ట్లెంచవలయును.

పృథివ్యాధి పంచభూతములు ధర్మిరూపమున స్థితమైయుండ వాని వలన నేర్పడు గోమనుష్యాది శరీర రూపములు, ఘటపటాది వస్తురూపములు నెన్నో యేర్పడుటయు, నశించుటయు కలుగుచున్నది. ఇట్లు భూతము లవస్థిములై యుండగా పూర్వ రూపము నశించి గ్రొత్త రూపమేర్పడుట ధర్మ పరిణామ మనబడును. ఇట్టి ధర్మములకు అతీత వర్తమాన అనాగతములనెడి లక్షణములు ప్రాప్తించుట లక్షణ పరిణామ మనబడును. వర్తమానాది లక్షణములుగల ఘటపటాది ధర్మములందు నవీనత, పురాణతలు, గోమనుష్యాది ప్రాణుల శరీర రూపములందు బాల్యయౌవనాదులు కలుగుట అవస్థా పరిణామమనబడును. ఇట్లే చక్షురాదింద్రియముల విషయమునను ఊహింపనగును.

అవ॥ ఇట్టి పరిణామ త్రయము దేనికి కలుగుచున్నదో యట్టి ధర్మియొక్క లక్షణ మేమన:

**శాంతోదితా వ్యపదేశ్య ధర్మానుపాతీ ధర్మీ 14**

శాంతో... పాతీ = శాంతములు, ఉదితములు, అవ్యవ దేశ్యములునయిన ధర్మములం దన్వయించునది, ధర్మీ = ధర్మి యనబడును.

తమ తమ వ్యాపారములనొనర్చి యుపరమించునవి శాంతములు – అతీతములు ఉదయించి స్వవ్యాపారము నొనర్ప నుద్యమించునవి వర్తమానములు – ఉదితములు. శక్తిరూపముననుండి భేదించి వర్ణింప వీలు కానివి అవ్యపదేశ్యములు – భవిష్యత్తులు ఇట్టి యతీత వర్తమాన భవిష్యద్ధర్మములలో వానితో నన్వయించు స్వభావముగల వస్తువు (సామాన్య విశేషాత్మకమైన) ధర్మి యనబడును. మృత్తిక, సువర్ణము మున్నగునవి యుదాహరణములు.

అవ॥ త్రివిధ పరిణామములలో ప్రత్యేక మొక్కటియా లేక నానావిధ భేదములు కలవై భిన్నములా? భిన్నములేయైన భేదహేతువేమి? యన :

**క్రమాన్యత్వం పరిణామాన్యత్వే హేతుః 15**

పరిణామాన్యత్వే = ధర్మాది పరిణామములు ప్రతిదియు భిన్నము లగుటలో, క్రమాన్యత్వం = కనబడు పరిణామమునగల పౌర్వాపర్యమనెడి

క్రమ భేదము, హేతుః = కారణము.

ధర్మలక్షణాది పరిణామములలో ప్రతిదియు ననేక భేదములు కలిగి యున్నది. అందుకు కారణము వాని పరిణామమునందలి పౌర్వాపర్యక్రమభేదమే యని భావము.

అందు, మృత్తికవలన మృత్పిండము దాని వలన కపాలములు, కపాలములవలన ఘటము నేర్పడును. మృత్తిక (దువ్వమన్ను) – పిండములు, పిండకపాలములు, కపాల ఘటములు అను వీనిలో నొకటి పూర్వము, మఱియొకటి పరము. ఇట్టి పూర్వ పరక్రమము మృత్పిండాదులకంటె భిన్నము. ఇయ్యది పిండాదులైన ధర్మపరిణామములోని భేదమునకు కారణము.

అనాగతమనెడి లక్షణముగల ధర్మమునకు వర్తమాన మనెడి లక్షణము లభించుటయు, వర్తమాన లక్షణముగల ధర్మమునకు అతీత లక్షణప్రాప్తి కలుగుటయు సంభవము. ఇట్లు అనాగత వర్తమాన లక్షణ పరిణామములు పూర్వ పరములయి వానిక్రమము వానిలోగల భేదమునకు కారణమగును. ఇట్లే అవస్థా పరిణామములోగల క్రమము వాని భేదమునకు కారణమని తెలియనగును.

ధర్మ పరిణామము, లక్షణ పరిణామమును ప్రతిక్షణము కలుగక అప్పుడప్పుడు కలుగుచుండును. అవస్థా పరిణామము మాత్రము నియమముగా ప్రతిక్షణమును కలుగుచుండును.

అవ॥ ఇంతవరకు పరిణామ త్రయము వివరముగా దేని నిమిత్తము వర్ణింపబడినదో యది యిట చెప్పుచున్నాడు.

**పరిణామత్రయ సంయమాత్ అతీతానాగతజ్ఞానమ్ 16**

పరి... మాత్ = పూర్వము వర్ణించిన పరిణామత్రయమునందు సంయమ మొనర్చిన నయ్యది ప్రత్యక్షమై యోగికి, అతీతానాగతజ్ఞానమ్ = భూత భవిష్యత్కాలిక సర్వవస్తు సాధారణమైన ధర్మలక్షణావస్థా పరిణామ త్రయ విషయమునకు సంబంధించిన సాక్షాత్కారము కలుగును.

**శబ్దార్థ ప్రత్యయానా మితరేతరాధ్యాసాత్ సంకరస్తత్**
**ప్రవిభాగసంయమాత్ సర్వభూతరుతజ్ఞానమ్ 17**

శబ్దార్థ ప్రత్యయానామ్ = వాచకము, వాచ్యము వాని జ్ఞానము నను నివి వాస్తవమున విభక్తములు. అట్టి వీనియొక్క ఇతరేతరాధ్యాసాత్ = పరస్పర

విభాగము గ్రహింపబడకుండుట వలన, సంకరః = శబ్దార్థ ప్రత్యయముల యభేద జ్ఞానము కలుగుచున్నది. తత్ప్రవిభాగసంయమాత్ = ఆ శబ్దార్థముల భేదము నందు సంయమమును చేయుటవలన భేద సాక్షాత్కారము కలిగి యోగికి, సర్వభూత రుతజ్ఞానమ్ = పశు – మృగ – సరీసృపాది సర్వ ప్రాణుల ధ్వనుల జ్ఞానము కలుగును. అవి తమ తమ ధ్వనులచే నే యర్థమును తెలుపుచున్నదనియు తెలియునని భావము.

**సంస్కార సాక్షాత్కరణాత్ పూర్వజాతి జ్ఞానమ్ 18**

సంస్కారసాక్షాత్కరణాత్ = పరస్పరానుబంధము గలిగి, పూర్వ పూర్వ జన్మములం దుత్పన్నములైన సంస్కారములందు సంయమమొనర్చుటచే వాని సాక్షాత్కారము కలిగినందున, పూర్వజాతి జ్ఞానమ్ = పూర్వజన్మల పరంపర తెలియును.

వాసనా రూపములు, ధర్మాధర్మ రూపములు నని సంస్కారములు రెండు విధములు. అందు వాసనారూపములు స్మృతి క్లేశమునకు హేతువులు, ధర్మా ధర్మములు జాత్యాయుర్భోగములు హేతువులు నని వివేకము.

తనయందలి సంస్కారముల సాక్షాత్కారమువలన తన పూర్వ జన్మ పరంపర తెలియునట్లు పరుల సంస్కారముల సాక్షాత్కారము వలన పరుల జన్మ పరంపర తెలియునని గ్రహింపవలయును.

**ప్రత్యయస్య పరచిత్తజ్ఞానమ్ 19**

ప్రత్యయస్య = పరచిత్తమున సంయమము చేయుట వలన క్షాత్కారము కాగా, పరచిత్త జ్ఞానమ్ = పరుని చిత్తము తెలియును.

అవ॥ పరుని చిత్తమున కాలంబనమును తెలియునాః యనః

**న చ తత్సాలంబనం తస్యావిషయీభూతత్వాత్ 20**

తత్ = పరుని చిత్తము, సాలంబనమ్ = ఆలంబన (విషయ) సహితముగా, న చ = సాక్షాత్కారము కాదు. తస్య = ఆలంబనముతో కూడిన ఆ చిత్తము అ విషయీభూతత్వాత్ = సంయమమునకు విషయము కాదు.

ఇతరుల చిత్తము అనురక్తమా లేక కాదా యనియే తెలియునగును కాని యీ చిత్త మెవరియం దనురక్తమో ఎవరియందనురక్తమో కాదో తెలియబడదు. ఇట రాగాది సంస్కార సహిత చిత్తమే సంయమమునకు విషయము. కాబట్టి రిక్త చిత్త జ్ఞానమే కలుగును కాని ఆ చిత్త మే విషయమునకు

రాగము కలిగియున్నచో యా విషయము తెలియదని భావము. పరుని చిత్తమున కేది విషయమో యట సంయమమొనర్చిన నదియు సాక్షాత్కారము కాగలదని దీనింబట్టి తెలియనగును.

**కాయరూప సంయమాత్ తద్గ్రాహ్యశక్తి స్తంభే**
**చక్షుః ప్రకాశా సంప్రయోగేఽ_న్తర్ధానమ్ 21**

కాయరూప సంయమాత్ = యోగి తన శరీరపు రంగునందు సంయమము చేయుటవలన, తద్ గ్రాహ్యశక్తిస్తంభే = గ్రహింపబడు శక్తి స్తంభితమై, ప్రకాశాసంప్రయోగే = ఇతరుల నేత్రరశ్మి తన శరీర రూపముతో సంబద్ధము కాకపోవుటవలన, అంతర్ధానమ్ = యోగి కనబడడు.

యోగి తన శరీరమునందలి రూపము సంయమము చేసినపుడు అతడితరులకు కానరాడు. అట్టి సంయమ సాక్షాత్కారమువలన శరీరమునగల గ్రాహ్యశక్తి ప్రతిబంధింపబడును. ఇతరుల చక్షురశ్మితో శరీరరూపము (సంయమముచే ప్రతిబద్ధమగుటంజేసి) సంయుక్తము కాదు. కాబట్టి శరీరము ప్రత్యక్షము కాదని భావము.

**సోపక్రమం నిరుపక్రమం చ కర్మ తత్సంయమాత్**
**అపరాంతజ్ఞాన మరిష్టేభ్యోవా 22**

కర్మ = ఆయుర్విపాకమగుకర్మ, సోపక్రమం నిరుక్రమంచ = సోపక్రమము నిరుపక్రమము నని రెండు విధములు తత్సంయమాత్ = అట్టి కర్మద్వయము సాక్షాత్కారమగు వఱకు చేయు సంయమము వలన అరిష్టేభ్యోవా = ఆధ్యాత్మిక - ఆదిభౌతిక - ఆధిదైవిక అరిష్టముల వలన యోగికి, అపరాంతజ్ఞానమ్ = ఈ కాలమున నీదేశమున నాదేహమాపాతము జరుగును. అని మరణజ్ఞానము కలుగును.

ఉపక్రమమన వ్యాపారము. ఫలము ననుభవించుటకై తీవ్ర వ్యాపారముతో కూడి బహుభోగమును కలిగించి కొంచెము ఫలము మిగిలియున్న కర్మము సోపక్రమ మనబడును. దానికి విపరీతము నిరుపక్రమము. సోపక్రమము, నిరుపక్రమము ననబడు ద్వివిధములగు వాయుష్కర్మమునందు సంయమ మొనర్చుట వలన యోగి తానెప్పు డెక్కడ మరణించు నదియు తెలిసికొనగలడు. అరిష్టము వలనను మరణ జ్ఞానము కలుగును.

చెవులను గట్టిగా మూసికొనినపుడు శరీరమునందలి ప్రాణధ్వని వినబడకుండుట, కన్నులను మూసి హస్తముతో కొంచెమదిమిన నిప్పు కణమువలె లోపల ప్రకాశము కనబడకుండుట ఆధ్యాత్మికారిష్టమని యెంచవలయును. అకస్మాత్తుగా భీషణాకారులైన పురుష రూపములనుగాని గతించిన మాతాపితరులనుగాని తన యెదుట నిలబడినట్లు చూచుట ఆదిభౌతికారిష్టమగును. గ్రహతారామండల సంయుక్తమైన ద్యులోకము విపరీతమైనట్లుగానీ, సర్వప్రపంచము విపరీతమైనట్లు కానీ అకస్మాత్తుగా తెలియుట ఆధిదైవికారిష్టమగును.

ఈ యరిష్టజ్ఞానము సామాన్య మానవునకును కలుగును. దానింబట్టి వారును మరణవార్తను చెప్పగలుగుదురు. కాని యోగి యిట్టి యరిష్టముల వలన నెప్పుడెక్కడ మృత్యువు వాటిల్లునదియు వివరముగా తెలిసికొగలడు. సామాన్య మనుజుడట్లు వివరముగ జెప్పజాలడని వివేకము.

**మైత్ర్యాదిషు బలాని 23**

మైత్ర్యాదిషు = సమాధి పాదమున వర్ణింపబడిన మైత్రి - ఆది భావనలందు సంయమ మొనరించినందున, బలాని = మైత్ర్యాదులు అమోఘములగును - వానిశక్తి పెరుగును.

మైత్ర్యాది భావనలందు సంయమము సిద్ధించిన యోగి యితరులను సుఖులను చేయుటలో సఫల ప్రయత్నుడగునని భావము. మైత్ర్యాది అనుటలో ఆది పదము వలన ఉపేక్ష గ్రహింప నవసర ముండదు. పాపశీలురనుపేక్షించుటకు సంయమము చేయవలసిన యగత్యముండదు.

**బలేషు హస్తి బలాదీని 24**

బలేషు = ఏనుగు మున్నగువాని బలములందు సంయమ మొనర్చిన యోగికి, హస్తిబలాదీని = హస్తిబలము, సింహబలము మున్నగునవి లభించును.

ఆజన్మ బ్రహ్మచర్య వ్రతమున సఫలులైన భీష్మాచార్యులు, దయానంద సరస్వతి ప్రభృతులయిన సంయమములకు లభింపని బలము లోకమున నొండు కలదా?

**ప్రవృత్త్యాలోకన్యాసాత్ సూక్ష్మవ్యవహిత విప్రకృష్టజ్ఞానమ్ 25**

ప్రవృత్త్యాలోకన్యాసాత్ = విశోక, జ్యోతిష్మతి మున్నగు ప్రవృత్తి వలన

కలిగెడు సత్త్వప్రకాశమును సంయమ బలమున విన్యసించుటవలన సూక్ష్మ జ్ఞానమ్ = సూక్ష్మములు వ్యవహితములు విప్రకృష్టములు నయిన ప్రకృత్యాది పదార్థముల జ్ఞానము కలుగును.

సమాధి పాదమున వర్ణింపబడిన మనస్సు యొక్క విశోక జ్యోతిష్మతియు ననబడు వృత్తి యీ సూత్రమున ప్రవృత్తి శబ్దముచే చెప్పబడినది. అట్టి ప్రవృత్తి యొక్క సాత్త్విక ప్రకాశము ఆ లోక మనబడును. సూక్ష్మములు, వ్యవహితములు, విప్రకృష్టములునైన ప్రకృతి, పరమాణువులు మున్నగు సూక్ష్మ పదార్థములందు సంయమము ద్వారమున నట్టి యా లోకము నుంచుట వలన నా యా సూక్ష్మ పదార్థముల జ్ఞానము కలుగునని భావము.

**భువనజ్ఞానం సూర్యే సంయమాత్ 26**

సూర్యే = సూర్యమండలమున, సంయమాత్ = సంయమ మొనర్చిన యోగికి, భువనజ్ఞానమ్ = భూనభోంతరాలములను ముల్లోకముల జ్ఞానము కలుగును.

**చంద్రే తారావ్యూహజ్ఞానమ్ 27**

చంద్రే = చంద్రమండలమున సంయమము చేసినందువలన యోగికి తారావ్యూహజ్ఞానమ్ = నక్షత్రముల సన్నివేశ జ్ఞానము కలుగును.

**ధ్రువే తద్గతి జ్ఞానమ్ 28**

ధ్రువే = ధ్రువ నక్షత్రమున, సంయమ మొనర్చినచో, యోగికి, తద్గతిజ్ఞానమ్ = నక్షత్రముల గతిజ్ఞానము కలుగును.

**నాభిచక్రే కాయవ్యూహజ్ఞానమ్ 29**

నాభిచక్రే = నాభిచక్రమున సంయమ మొనర్చినచో యోగికి కాయవ్యూహ జ్ఞానమ్ = శరీరమునందలి పదార్థముల సన్నివేశము తెలియును.

వాతపిత్త శ్లేష్మములు దోషములు, త్వక్కు, లోహితము, మాంసము, స్నాయువులు, అస్థులు, మజ్జ, శుక్రము నను నేడును ధాతువులు శరీరమున నివి యెట్లు సన్ని విష్టములై యున్నదియు యోగికి తెలియునని భావము.

**కంఠకూపే క్షుత్పిపాసానివృత్తిః 30**

కంఠకూపే = జిహ్వాకు క్రింద తంతువొకటి యుండును. దానిక్రింద కంఠము, కంఠము క్రింద కంఠ కూపము నుండును. అందు సంయమమొనర్చిన యోగికి, క్షుత్పిపాసానివృత్తిః = ఆకలి దప్పులుండవు.

కంఠ కూపము రసస్థానికమగుటవలన నట సంయమ మొనర్చినందున యోగికి ఆకలి దప్పులుండవని భావము

**కూర్మనాడ్యాం స్థైర్యమ్ 31**

కూర్మనాడ్యాం = కంఠ కూపమునకు క్రింద వక్షస్థలమున కూర్మాకారముననుండు నాడి యందు, సంయమ మొనర్చినచో యోగికి, స్థైర్యం = చిత్తస్థిరతకానీ, శరీరస్థిరతకానీ కలుగును.

**మూర్ధజ్యోతిషి సిద్ధదర్శనమ్ 32**

మూర్ధజ్యోతిషి = బ్రహ్మ రంధ్రమున నంతర్భాగమున నున్న ప్రకాశము మూర్ధజ్యోతి యనబడును. అందు సంయమ మొనర్చిన యోగికి, సిద్ధ దర్శనమ్ = యోగమున సిద్ధులైన పరమయోగులు దర్శనమిత్తురు.

**ప్రాతిభాద్వాత్సర్వమ్ 33**

వా ప్రాతిభాత్ = లేక, ప్రాతిభజ్ఞానము వలన, యోగి, సర్వమ్ = సర్వ మెఱుగగలడు.

ప్రతిభ = ఊహ, ఊహ వలన జనించిన జ్ఞానము ప్రాతిభము అనబడును. అది భవసాగరమునుండి తరింపజేయునది కాబట్టి తారకమనబడును.

ప్రసంఖ్యానము – వివేకఖ్యాతి కొఱకు విశేషముగ సంయమ వంతుడైన యోగికి ప్రసంఖ్యాన ముదయించుటకు పూర్వ చిహ్నముగా (ఉదయించు సూర్యునికి పూర్వదీప్తివలె) నుదయించు మానసిక జ్ఞానమును ప్రాతిభమని యోగులు వ్యవహరింతురు. ఇట్టి ప్రాతిభజ్ఞానము వలన అతీతానాగత సూక్ష్మవ్యవహిత విప్రకృష్ట సర్వ వస్తువులను యోగి యెఱుగ గలడని భావము.

**హృదయే చిత్తసంవిత్ 34**

హృదయే = హృదయ పుండరీకమున సంయమ మొనర్చిన యోగికి, చిత్తసంవిత్ = వృత్తులతో కూడిన చిత్తము తెలియును.

**సత్వపురుషయో రత్యంతా సంకీర్ణయోః ప్రత్యయావిశేషో**
**భోగః పరార్థాత్ స్వార్థసంయమాత్ పురుషజ్ఞానమ్ 35**

అత్యంతా సంకీర్ణయోః = పరస్పరము విరుద్ధ ధర్మము కలిగియుండుటచే మిక్కిలి భిన్నములైన, సత్వపురుషయోః = బుద్ధిసత్త్వము, పురుషుడునను రెండు పదార్థములయొక్క ప్రత్యయావిశేషః = సమానమైన జ్ఞానము, భోగః =

భోగమనబడును (బుద్ధి వృత్తులే పురుషునకు సంక్రమించుటచే ప్రత్యయము సమానము) పరార్థాత్ = పరార్థకమైన - బుద్ధి ప్రత్యయముకంటె భిన్నమైన, స్వార్థ సంయమాత్ = స్వార్థమున - పౌరుషేయ ప్రత్యయమున - చిద్రూప ప్రత్యయమున సంయమ మొనర్చినందున, పురుష జ్ఞానమ్ = జీవాత్మ జ్ఞానము కలుగును. యోగికి స్వాత్మ సాక్షాత్కారము కలుగునని భావము.

అవ॥ స్వార్థ సంయమమువలన పురుష జ్ఞానము కలుగుటకు పూర్వ మేమి కలుగ నన:-

**తతః ప్రాతిభ శ్రావణ వేదనాదదర్శాస్వాద వార్తా జాయంతే** **36**

తతః = పురుష జ్ఞానోత్పత్తికి పూర్వము, యోగికి, ప్రాతిభ.. వార్తాః = ప్రాతిభాది సంజ్ఞలుగల సిద్ధులు కలుగును.

ప్రాతిభము పూర్వమే వర్ణింపబడినది. చెవికి కలుగు దివ్యశబ్దములను విను సామర్థ్యము శ్రావణము. త్వక్కునకు కలుగు దివ్యస్పర్శములను తెలిసికొనుసామర్థ్యము వేదన, చక్షువునకు కలుగు దివ్యరూపమును దర్శించు సామర్థ్యము ఆదర్శము. జిహ్వకు కలుగు దివ్యరసము నాస్వాదించు సామర్థ్యము ఆస్వాదము. నాసికకు కలుగు దివ్యగంధము నాఘ్రాణించు సామర్థ్యము వార్త ప్రాతిభాది సంజ్ఞలు.

అవ॥ ఆత్మజ్ఞానము కలుగుటకు పూర్వ మీ ప్రాతిభ ప్రభృతి సిద్ధులు ఆఱు కలుగునని భావము. యోగి యీ సిద్ధులను పొంది కృతార్థుడనైతినని యెంచరాదు. కారణమేమన :

**తే సమాధావుపసర్గా వ్యుత్థానే సిద్ధయః** **37**

తే = ప్రాతిభాదులు, ఆఱును, సమాధౌ = ఆత్మసాక్షాత్కారమును కలిగించు సమాధియందు, ఉపసర్గాః = విఘ్నములు, వ్యుత్థానే = వ్యుత్థానావస్థయందు, సిద్ధయః = సిద్ధులు - ఐశ్వర్యములు.

ప్రాతిభాది సిద్ధులు సమాధికి విఘ్నకారకములు. కాబట్టి మోక్షకాములగు యోగులు వానియందు రమింపరు. వానిని హేయములని విడుతురు.

అవ॥ జ్ఞానాత్మక విభూతు లింతవఱకు వర్ణింపబడినవి. ఇప్పుడు క్రియాత్మక విభూతులు వర్ణింపబడుచున్నవి.

**బంధకారణ శైథిల్యాత్ ప్రచార సంవేదనాచ్చ**
**చిత్తస్య పరశరీరావేశః** **38**

బంధకారణ శైథిల్యాత్ = శరీరమునందు చిత్తబంధనమునకు కారణములైన ధర్మాధర్మముల శైథిల్యమువలన ప్రచార సంవేదనాచ్చ = చిత్తగమనమునకు మార్గములైన నాడుల యనుభవమువలనను, చిత్తస్య = యోగిచిత్తమునకు, పరశరీరావేశః = ఇతరుల శరీరమున ప్రవేశము కలుగును.

ధర్మాధర్మరూపమగు నదృష్టమువలన శరీరమున చిత్తము బంధింపబడును. సంయమము ద్వారమున నట్టి బంధనమున శైథిల్యమేర్పడును. ఇట్లే సంయమము ద్వారమున చిత్తగమనమునకు ఆధారములైన నాడుల జ్ఞానమును కలుగును. అటుపై యోగి తన చిత్తమును శరీరమునుండి బైటికి పంపి యితరుల శరీరమున బ్రవేశింపజేయ కలుగును. ఇంద్రియములు చిత్తము ననుకరించునవి కాబట్టి దానివెంట నవియు పోయి తమ స్థానముల చేరుకొనును.

**ఉదానజయా జ్జలపంకకంటకాది**
**ష్వసంగః ఉత్క్రాంతి శ్చ** **39**

ఉదానజయాత్ = ఉదానజయమువలన, జల పంకకంటకాదిషు = అగాధమైన జలమునందుగాని, ఊబివంటి బురదలోకానీ, తీక్ష్ణకంటకము లందుకానీ, అగ్ని జ్వాలాదులందుకానీ, అసంగః = వికారము కలిగించునట్టి సంబంధము కలుగదు. ఉత్క్రాంతిశ్చ = మరణ కాలమున స్వేచ్ఛగా ఉత్క్రమణమును కలుగును. ఉదానజయమును సంపాదించిన యోగి జలాదులపై భూమిపై నడుచునట్లు నడువగలడు. వాని నవి యడ్డగింపవని భావము. మఱియు నతనికి స్వచ్ఛందమరణము కలుగును.

జీవనమనుపేరు గలిగి క్రియాశక్తి ప్రధానముగాగల యంతఃకరణవృత్తి ప్రాణమనబడును. అయ్యది ప్రాణసమానాపానోదానవ్యానములని యైదు విధములు. అందు నాసికాగ్రభాగము మొదలు హృదయము వఱకు నుండి ప్రాణ సక్రియకు కారణమ్మైనది ప్రాణమనబడును. అన్నపానముల పరిణామమయిన రసమును ఆ యా స్థానములకు పంపుటలో కారణమై హృదయము మొదలు నాభివఱకు నుండునది సమానము. మూత్ర పురీషాదుల నపనయించుటకు హేతువై నాభి మొదలు పాదతలము వఱకు నుండునది అపానము ఊర్ధ్వనయనమునకు హేతువై నాసికాగ్రము మొదలు శిరః పర్యంతముండునది ఉదానము. దేహశుద్ధికి హేతువై శరీరమంతటను వ్యాపించి

యుండునది వ్యానము. వీనిలో ప్రాణము ప్రధానము. అది యుత్క్రమించిన తక్కినవి యుత్క్రమించునవి ఉపనిషత్తుల వర్ణణ వలన తెలియును.

**సమానజయా జ్జ్వలనమ్ 40**

సమాన జయాత్ = సంయమము వలన సమానమును జయించినచో యోగికి, జ్వలనము = తేజస్సు వలె జ్వలనము కలుగును.

సమానమును జయించిన యోగి శరీరమునందలి యగ్ని నుత్తేజింప జేయుచు నగ్నివలె జ్వలించునని భావము.

**శ్రోత్రాకాశయోః సంబంధసంయమాత్ దివ్యం శ్రోత్రమ్ 41**

శ్రోత్రాకాశయోః = శ్రవయేంద్రియము, ఆకాశము నను నీరెంటియొక్క సంబంధజయాత్ = సంబంధమున సంయమ మొనర్చినందున యోగికి, దివ్యం = సూక్ష్మశబ్దమును గ్రహించు, శ్రోత్రం = శ్రవణేంద్రియమగును.

ఇట్లే ఆ యా సంబంధ సంయమమువలన నాయా యింద్రియములును దివ్యము లగునని భావము.

**కాయాకాశయోః సంబంధ సంయమాత్**
**లఘుతూలసమాపత్తే శ్చాకాశగమనమ్ 42**

కాయాకాశయోః = శరీరాకాశముల, సంబంధ సంయమాత్ = వ్యాప్యవ్యాపక సంబంధమున సంయమజయమువలన, లఘుతూల సమాపత్తేశ్చ = లఘువైన తూలాదులందు సంయమము ద్వారమున చిత్తము తత్స్థ, తద్రూపముల నొందుట చేతను, బరువు లేని శరీరము కలవాడైన యోగి, ఆకాశగమనమ్ = ఇచ్ఛవచ్చినట్లు ఆకాశమున సంచరింపగలడని యర్థము.

శరీరాకాశముల సంబంధమును జయించుటచేత కానీ, లఘువైన వస్తువుల యందు తద్రూపుడై కానీ యోగి తన శరీరమును లఘువుచేసి కొనును అటుపై యిష్టము వచ్చినట్లు ఆకాశమునను జలముపైనను చరింపగలడని భావము.

**బహి రకల్పితా వృత్తి ర్మహావిదేహా తతః**
**ప్రకాశావరణక్షయః 43**

బహిః = శరీరమునకు వెలుపల, అకల్పితా = కల్పింపకయే (శరీరమునకు వెలుపల నా మనస్సుండుగాకయని) యేర్పడిన, వృత్తిః = మనోవృత్తి, మహావిదేహా = మహావిదేహ యని నామము గల ధారణ

సంయమమువలన సిద్ధించినపుడు, తతః = ఆ ధారణవలన, ప్రకాశావరణక్షయః = బుద్ధి సత్త్వ ప్రకాశమునకు ఆవరణమగు క్లేశకర్మ విపాకములు నశించును.

'నా మనస్సు శరీరమునకు వెలుపల నుండుగాక' యని కల్పన ద్వారమున బాహ్య విషయమున మనోవృత్తి కల్పింపబడినదై విదేహధారణ యనబడును. అట్టి ధారణసాహాయ్యమున యోగి సంయమము ద్వారమున ధారణకు ఫలరూపమైన మహావిదేహ యనెడు అకల్పిత బాహ్యావృత్తిని సాధించును. ఇట్లు సిద్ధమైన అకల్పిత మహావిదేహ ధారణగల యోగికి సత్త్వ ప్రకాశమును నావరించు రజస్తమో మలములయిన క్లేశకర్మ విపాకములు నశించును. అవాంతరఫలముగా పరశరీరావేశాదులును కలుగునని భావము.

అవ॥ ఇంతవఱకు ననేకవిధములగు సంయమములు, వానివలన కలుగు విభూతులు వర్ణింపబడినవి. ఇప్పుడీ శాస్త్రమున ముఖ్యములని యెంచబడు గ్రహీతృ, గ్రహణ, గ్రాహ్య విషయములకు సంబంధించిన సంయమసిద్ధులను వర్ణింపబూని ముందు గ్రాహ్య విషయక సంయమసిద్ధిని వర్ణించుచున్నాడు.

**స్థూల స్వరూప సూక్ష్మా న్వయార్థ వత్త్వ**
**సంయమాత్ భూతదయః** **44**

స్థూల.. మాత్ = స్థూలము, స్వరూపము, సూక్ష్మము, అన్వయము, అర్థవత్త్వము నను భూతముల పంచరూపములందు సంయమమొనర్చుట వలన, యోగికి భూతదయః = పృథివ్యాధి పంచమహాభూతముల వశీకారము కలుగును.

గంధము, రసము, రూపము, స్పర్శము, శబ్దము నను పంచవిశేషగుణములలో క్రమముగా నొక్కొక్క విశేషగుణము తక్కువగా గలవై చూడబడు పృథివ్యాదులే భూతముల ప్రథమ రూపము – స్థూలము. కాఠిన్యము, స్నేహము, ఉష్ణత మున్నగు ధర్మములచే వ్యక్తమగు పృథివీత్వము, జలత్వము మున్నగునవి భూతముల ద్వితీయరూపము – స్వరూపము, భూతములకు కారణములైన పరమాణువులు తన్మాత్రములు భూతముల తృతీయ రూపము – సూక్ష్మము, పరమాణువులకు కారణములై వానియందు అన్వితములై యుండు గుణత్రయము భూతముల చతుర్థ రూపము అన్వయము. అట్టి గుణములందు భోగాపవర్గార్థత అన్వయించి యుండును. గుణములు, తన్మాత్రములు భూతభౌతికములం దన్వయించి యుండును. ఇదియే భోగాపవర్గార్థసత్త్వము.

ఇది పంచమ రూపము.

యోగులు ధర్మధర్ములను అభిన్నములుగా నెంచుదురు. కాబట్టి సామాన్య విశేషముల సముదాయమే ద్రవ్యము. న్యాయవైశేషికుల మతమున సామాన్య విశేషములకు ఆశ్రయము ద్రవ్య మనబడునని వివేకము.

అవ॥ భూతజయము వలన యోగికి కలుగున దేమన:

**తతో௨ణిమాది ప్రాదుర్భావః కాయసంప**
**త్తద్ధర్మానభిఘాత శ్చ** **45**

తతః = భూత జయము వలన, యోగికి, అణిమాదిప్రాదుర్భావః = అణిమాదులు ప్రాప్తమగును. కాయసంపత్ = ముందుచెప్పబోవు కాయ సంపత్తి, తద్ధర్మానభిఘాతశ్చ = పృథివ్యాది భూతధర్మములైన కాఠిన్యాదులచే బాధ కలుగదనియు కలుగును.

అణిమాదులు :- పరమాణువువలె సూక్ష్మమగుట అణిమ, ఇషీక, తూలములవలె తేలికయగుట లఘిమ, ఆకాశమువలె మహద్భావము కలుగుట మహిమ సర్వపదార్థ సాన్నిధ్యము ప్రాప్తి. కోరికలు వ్యర్థముకాకుండుట ప్రాకామ్యము, భూతములు, భౌతిక పదార్థములు, వీనిని నియమించుట వశిత్వము. భూతభౌతికముల ఉత్పత్తి స్థితిలయములకు, సమర్థుడగుట ఈశితృత్వము. సత్యసంకల్పత యత్రకామానవస్థాయిత్వము. అని అష్టసిద్ధులు.

ఇందు అణిమ, లఘిమ, మహిమ, ప్రాప్తి యనెడు నాలుగు సిద్ధులు భూతముల స్థూలరూపమున సంయమ మొనర్చుటవలన కలుగును. స్వరూపసంయమ విజయమువలన ప్రాకామ్యసిద్ధి కలుగును. సూక్ష్మ సంయమమువలన వశిత్వము సిద్ధించును. అన్వయమునందు సంయమ మొనర్చుట వలన ఈశితృత్వము కలుగును. అర్థవత్త్వమున సంయమ మొనర్చుటచేత యత్రకామానవస్థాయిత్వము సిద్ధించును.

యోగి భూతములను జయించిన తదుపరి యతడు భూమియందు ప్రవేశింప నెంచినచో పృథివి యందలి కాఠిన్య మతని నడ్డగింపదు. జలధర్మమైన స్నేహ మతనిని క్లిన్నము చేయదు. ఉష్ణత యతనిని దహింపదు. వాయు నతనిని చలింపజేయదు. ఆకాశమున నెగురుచు నతడెవరికి కనబడడు. అష్టసిద్ధులను బొందిన యోగి చేయుటకు చేయకుండుటకు విపరీతముగ చేయుటకు సమర్థుడయ్యు పదార్థశక్తులను మార్చగలడే కాని పదార్థములను

మార్చజాలడు.

అవ॥ కాయ సంపత్తి :

**రూపలావణ్య బలవజ్రసంహననత్వాని కాయసంపత్ 46**

రూప... త్వాని = రూపము, లావణ్యము, బలము, వజ్రసంహననత్వము నను నాలుగును, కాయసంపత్ = శరీరసంపత్తి యనబడును.

చూడదగిన రూపము రూపము. సర్వాంగసుందరత లావణ్యము. వీర్యాధిక్యము బలము. వజ్రమువలె శరీరావయముల వ్యూహదార్ఢ్యము వజ్రసంహననత్వము:

అవ॥ గ్రహణ సంయమము వలన గలిగెడి సిద్ధులు :

**గ్రహణ స్వరూపాస్మి తాన్వయార్థవత్వ**
**సంయమాత్ ఇంద్రియ జయః 47**

గ్రహణ... మాత్ = గ్రహణము, స్వరూపము, అస్మిత, అన్వయము, అర్థవత్వము ననెడు పంచేంద్రియ రూపములందు సంయమ మొనర్చుటవలన, ఇంద్రియజయః = చక్షురాది ఇంద్రియముల వశీకారము కలుగును.

శబ్దాదులు గ్రాహ్యములు, గ్రాహ్యములైన శబ్దాదులందు ఇంద్రియములవృత్తి గ్రహణమనబడును. చక్షుష్ట్వాదికము స్వరూపము. వానికి కారణము – సాత్వికమైన అహంకారము అస్మిత. అందు అనుగతమైయున్న గుణత్రయము అన్వయము. గుణత్రయమునందనుగతమైయున్న భోగాపవర్గార్థత అర్థవత్వము అని వివేకము.

అవ॥ ఇంద్రియజయ ఫల మేమన:

**తతో మనోజనిత్వం వికరణభావః ప్రధానజయశ్చ 48**

తతః= ఇంద్రియజయమువలన, మనోజవిత్వం = మనస్సువలె శరీరమునకును అధికవేగము సంభవించును. వికరణభావః = శరీరము నపేక్షింపకయే ఇంద్రియములకు ఇష్టము వచ్చిన దేశకాల విషయములందు వృత్తి కలుగును. ప్రధానజయశ్చ = ప్రకృతి వికారములన్నియు వశమున నుండును.

ఇంద్రియ జయమువలన యోగికి మనో జనిత్వము, వికరణ భావము,

ప్రధాన జయము కలుగును. ఈ సిద్ధులనే యోగశాస్త్ర నిష్ణాతులు మధుప్రతీకము లందురు. ఇందు మనోజవిత్వము గ్రహణ సంయమమునకు ఫలము. వికరణ భావము స్వరూపసంయమ ఫలము. ప్రధాన జయము అస్మితాన్వయార్థ సత్త్వ ఫలమని గ్రహింపవలయును.

అవ॥ గ్రహీతృ సంయమ సిద్ధిః

**సత్త్వ పురుషాన్యతా ఖ్యాతి మాత్రస్య**
**సర్వభావాధిష్ఠాతృత్వం సర్వజ్ఞాతృత్వం చ** **49**

సత్త్వపురుషాన్యతాఖ్యాతిమాత్రస్య = బుద్ధివేఱు; పురుషుడు వేఱు; అను ఖ్యాతిమాత్ర రూపమున నిలుకడగల చిత్తము సంపాదించిన యోగికి, సర్వభావాదిష్ఠాతృత్వం = సర్వ పదార్థముల నియంతృత్వము, సర్వజ్ఞాతృత్వం చ = సర్వపదార్థముల విజ్ఞాతృత్వమును కలుగును.

సత్త్వ పురుషాన్యతాఖ్యాతిమాత్రుడైన యోగిని నియమించుట కెవరికిని శక్యముకాదు. అట్టి యోగికి తెలియని పదార్థతత్త్వ ముండనేరదని భావము. పై రెండు సిద్ధులును కలిసి విశోక యనబడును. ఈ స్థితిని పొందిసర్వజ్ఞుడై క్షీణించిన క్లేశకర్మ బంధనములు కలవాడగుటచే శోక రహితుడై యోగి విహరించునని తెలియనగును.

**తద్వైరాగ్యాదపి దోషబీజక్షయే కైవల్యమ్** **50**

తద్వైరాగ్యాత్ = వివేకఖ్యాతియందును వైరాగ్యము గలుగుటవలన, దోషబీజక్షయే = దోషములైన క్లేశముల సంస్కారము నశింపగా ససంప్ర జ్ఞాత సమాధి కలిగిన యోగికి, కైవల్యం = కైవల్య ఫలము కలుగును.

వివేకఖ్యాతి యనెడు వృత్తియును నశించిన తదుపరి కైవల్యము ప్రాప్తించునని భావము.

అవ॥ కైవల్యమును సాధించుటకై ప్రవృత్తుడైన యోగికి మధ్యలో కలుగు విఘ్నముల నాశంకించివాని నిరాకరింప నుపాయము వర్ణించుచున్నాడు.

**స్థామ్యుపనిమంత్రణే సంగస్మయాకరణం**
**పునరనిష్ట ప్రసంగాత్** **51**

స్థాన్యుపనిమంత్రణే = ఆ యా స్థానస్వాములు, గొప్పయైశ్వర్య వంతులునయిన గృహస్థులచే అయ్యా ఇట కూర్చుండుడు. ఇదియను భవింపుడు; ఇది కమనీయమైన భోగము; ఈ కన్యకమనీయ; ఈరసాయనము

జరామృత్యువులను తొలగింపజేయును. అనునిట్టి సత్కార పూర్వక వాక్యములతో నాహ్వానము చేయబడినచో యోగి, సంగస్మయాకరణం = సంగమనప్రీతి; 'అహో, నా యోగప్రభావమెట్టిది' యను కృతార్థతాభిమానము స్మయము; ఇట్టి ప్రీత్యభిమానములకు తనలో తావీయరాదు. పునరనిష్ట ప్రసంగాత్ = ప్రీత్యభిమానములు కలిగినచో మరల ననిష్టము కలుగగలదు. కైవల్య సంపాదనమున ననుత్సాహము కలుగునని యర్థము.

ప్రాథమ కల్పికులు, మధుభూమికులు, ప్రజ్ఞాజ్యోతులు, అతిక్రాంతభావనీయులు నని యోగులు నాలుగు తెగలుగా నుందురు. అందు యోగమున ప్రవృత్తమాత్రులు, సవితర్క సమాధిని సంపాదించినవారు, వశపడని పరచిత్తాది జ్ఞానము కలవారు ప్రథములు. నిర్వితర్క సమాధి ద్వారమున మధుమతీ భూమిని, ఋతంభరా ప్రజ్ఞను సంపాదించి భూతేంద్రియములను జయింప కోరికగలవారు ద్వితీయులు, స్వార్థసంయమముతో విశోక, సంస్కారశేషము నను రెండుభూములను (అవస్థలను) సంపాదింపనెంచు జిత భూతేంద్రియులు తృతీయులు, మధుమతి, మధుప్రతీక, విశోక యనెడు భూములందు విరక్తులై కృతార్థులై చిత్తవిలయము మాత్రము మిగిలియున్నవారు మఱియు సంస్కారశేషమనెడి చిత్తస్థితిని సంపాదించినవారు, సప్తవిధప్రాంతభూమిప్రజ్ఞకలవారు, చరమదేహులు నయిన జీవన్ముక్తులు చతుర్థులు. వీరిలో ప్రథమ శ్రేణికి చెందిన యోగిని విశేష యోగ్యత లేనందున స్థానికులైన ఐశ్వర్యవంతు లెవ్వరు సత్కరింపరు. తృతీయ చతుర్థ శ్రేణులకు చెందినవారు తమకు స్వాధీనము కానివారు కాబట్టి వారి జోలికి పోరు. కాని ద్వితీయ శ్రేణికి చెందిన ఋతంభరా ప్రజ్ఞగలయోగి, ధర్మమేఘ సమాధిని సంపాదించినవాడై ఐశ్వర్యవంతులచే పైన చెప్పినట్లు సత్కరింపబడుట సంభవము. అట్టియెడ ప్రీత్యభిమానములు కలుగరాదు. నిశ్చల మనస్కుడై సమాధిభావనయందే రతుడు కావలయును. లేకున్న సత్కారాదులందు చిక్కుకొని విషయానురక్తుడై అధఃపతనము చెందగలడు. అభిమానవంతుడు తనను కృతార్థునిగా నెంచును. సమాధికై యత్నింపడని భావము.

అవ॥ వివేకమువలన కలుగు జ్ఞానమునకు సాధనమైన సంయమమును వర్ణించుచున్నాడు.

**క్షణతత్క్రమయోః సంయమాత్ వివేకజం జ్ఞానమ్ 52**

క్షణ తత్క్రమయోః = క్షణము దాని ప్రవాహము యొక్క అవిచ్ఛిన్నత, వీనియందు సంయమ మొనరించుటవలన వివేకజం = వివేక పూర్వక సమస్తవస్తుజ్ఞానము కలుగును.

ద్రవ్యముల సూక్ష్మతకు అవధి పరమాణు వైనట్లు కాలమున నత్యంత సూక్ష్మకాలము క్షణమనబడును. లేక ఎంతకాలములో పరమాణువు తన స్థానమును పొందగలదో ఆ స్వల్పకాలము క్షణమనబడును. అట్టి క్షణముల ప్రవాహము తెంపులేమి క్రమమనబడును. సమస్త విశేషములతోను వస్తువుల నొకదానినుండి మఱియొక దానిని వేఱుచేయుట వివేకము.

చిచ్ఛక్తి యనబడు చేతనము తక్క మిగిలిన పదార్థములన్నియు ప్రతిక్షణము మాఱుచుండును. యోగి యా వస్తువుల పరిణామ క్షణము నందును, క్షణముల క్రమమునందును వాని సాక్షాత్కార మేర్పడువఱకు సంయమ మొనర్చినచో నతనికి నా వస్తువుల సాక్షాత్కారము కలుగును. వస్తు సాక్షాత్కారము వలన వాని జ్ఞానము కలుగును. ఇదియే వివేకజ జ్ఞానము.

వివేకజ జ్ఞానము (యోగశాస్త్రసంజ్ఞ) యోగుల పరిభాష, సాంఖ్యులు యోగులు క్షణాత్మక కాలమును వాస్తవమందురు. అంతకుమించిన ముహూర్తము, యామము, దినము మున్నగు నామములచే పేర్కొనబడు కాలము అవాస్తవము. వైశేషికుల మతమున మహాకాలమే వాస్తవము. దానికి మించి క్షణాది వ్యావహారికకాలము అవాస్తవము.

అవః వివేకజజ్ఞానము వలన కలుగున దేమన:

**జాతిలక్షణదేశై రన్యతానవచ్ఛేదాత్తుల్యయో**
**స్తతః ప్రతిపత్తిః** **53**

తుల్యయోః = జాతి, లక్షణము, దేశము ననువానిచే సమానములైన రెండు పదార్థములయొక్క జాతి లక్షణదేశైః = గోత్వాది జాతి చేతను, కపిలత్వాది లక్షణము చేతను, పూర్వాది దేశము చేతను, అన్యతానవచ్ఛేదాత్ = భేదము నిశ్చయించుట సంభవముకాదు కాబట్టి, ప్రతిపత్తిః = అట్టివాని భేద నిశ్చయము, తతః = వివేకజ జ్ఞానము వలన కలుగును.

జాతి, లక్షణము, దేశము నను మూడింటిచే పదార్థముల భేదము (ఇది దీనికంటె వేఱు అని) లోకమున తెలియబడును. దేశము చేతను లక్షణము చేతను సమానములుగానున్న గోగవయములలో గలభేదము (గోవు

కంటె గవయము వేఱుఅని) గోత్వగవయత్వ జాతిభేదముచే తెలియనగును. దేశమునందు జాతియందు సమానములైన రెండు గోవులలో గల భేదము (దీనికంటె నిదివేఱు అని) వానియందుగల కపిలత్వము శ్వేతత్వము నను లక్షణ భేదమువలన తెలియనగును.

ఇట్లే, జాతియందు, లక్షణము నందును సమానములైన రెండు ఆమలకములలో గల భేదము (దీనికంటె నిది వేఱు అని) వానిలోగల దేశ భేదముచే తెలియనగును. కాని జాతి, లక్షణము, దేశము నను మూటియందును సమానములైన – ఒకేచోట పెట్టియున్న రెండు ఆమలకములలోగల భేదము. ఆమలకత్వజాతిచేకానీ, గోలకత్వాది లక్షణముచేకానీ, పూర్వాది దేశముచేతగానీ తెలియజాలనపుడు వివేక జ్ఞానమువలన వాని భేదము తెలియనగునని భావము. దీనింబట్టి సమానములైన పరమాణువులలో గల భేదము కూడ వివేకజజ్ఞానము వలననే తెలియనగు నని తేలుచున్నది.

అవ॥ వివేకజజ్ఞాన లక్షణ మేమన :

**తారకం సర్వవిషయం సర్వథా విషయ**
**మక్రమం చేతి వివేకజం జ్ఞానమ్ 54**

తారకం = తన ప్రతిభవలననే కలుగునది(ఇతరుల యుపదేశము నపేక్షింపక కలుగునది), సర్వ విషయం = సమస్తవస్తు విషయకము (వివేకజ జ్ఞానమునకు విషయము కాని వస్తువొకండు నుండదు) సర్వథా విషయం = అన్ని విధములైన అవాంతరభేదములతో కూడి త్రికాలములకు సంబంధించిన వస్తువులన్నియు విషయముగాగలది అక్రమంచ = క్రమము లేక యొకేక్షణమున నన్ని విషయములు నన్ని విధముల కరతలామలకమువలె తెలుపునది, ఇట్టి జ్ఞానము, వివేకజం జ్ఞానమ్ = వివేకజజ్ఞాన మనబడును.

ఈ వివేకజ జ్ఞానమే సంపూర్ణజ్ఞానము. దీని ద్వారమున తెలియని వస్తువు ఎక్కడను, ఏ విధముగాను ఎన్నడు నుండజాల దనవలయును. సంప్రజ్ఞాత మను యోగప్రదీపము దీనియంశమే. ఋతంభరాప్రజ్ఞ, మధుమతి మున్నగు నవస్థలన్నియు నిందే పరిసమాప్తము లగునని నిశ్చయింప నగును.

అవ॥ వివేకజ జ్ఞానము కలుగని వానికి కైవల్యప్రాప్తి కలుగదాయన:

**సత్వ పురుషయోః శుద్ధిసామ్యే కైవల్య మితి 55**

సత్వ పురుషయోః = బుద్ధి పురుషులలో, శుద్ధిసామ్యే = సమానమైన

శుద్ధి యేర్పడినపుడు, కైవల్యమ్ = పురుషునకు కైవల్యము - మోక్షము లభించును.

వివేకజ జ్ఞానము కలిగినను కలుగకున్నను సత్వపురుషాన్యతా - ఖ్యాతి వలననే కైవల్యప్రాప్తి కలుగును. ఇందుకు బుద్ధిసత్వమున క్లేశ బీజములు దగ్ధములు కావలయును. ఈ దగ్ధక్లేశ బీజతయే బుద్ధియొక్క పురుష సమానశుద్ధి.

సత్వపురుషాన్యతాఖ్యాతి కలుగుటయే తడవుగ పురుషుని యవిద్య తొలగును. అవిద్య తొలగినచో దానివలన నేర్పడు రాగాది క్లేశములుండవు. అటుపై కర్మముండదు. కర్మాభావమువలన జన్మాభావము కలుగును. జన్మము నివర్తించిన దుఃఖాత్యంత నివృత్తి కలుగును. ఇట్టి స్థితిలో చరితార్థము లగుటచే గుణములు (సత్వరజస్తమములు) మరల పురుషునకు దృశ్యములుగా ప్రవర్తింపవు. నాడు పురుషునకు కైవల్య మేర్పడును. స్వరూపమున ప్రకాశించు పురుషుడు కేవలుడై బ్రహ్మానందము ననుభవించును.

## విభూతి పాదము

# యోగ దర్శనము

## కైవల్య పాదము

పూర్వపాదములందు యోగము, యోగ సాధనములు, వాని వలన కలుగు విభూతులు వర్ణించి యిందు యోగమునకు పరమ ఫలమైన కైవల్యమును వర్ణించుచున్నాడు. సిద్ధ చిత్తములలో కైవల్య ప్రాపక చిత్తమును నిర్ణయింపదలచి ముందుగా పంచవిధము లయిన సిద్ధులను చెప్పుచున్నాడు.

**జన్మౌషధి మంత్రతపః సమాధిజాః సిద్ధయః** 1

జన్మౌషధి జాః= జన్మజము, ఓషధిజము, మంత్రజము, తపోజము, సమాధిజమునని, సిద్ధయః = ఐశ్వర్యములు ఐదు.

అందు జన్మసిద్ధి స్వాభావికము, అయ్యది జ్ఞానాత్మకమో క్రియాత్మకమో యగును. కపిలాదులలో జ్ఞానరూప జన్మజసిద్ధి చూడనగును. క్రియాత్మకజన్మజసిద్ధి ఆకాశగమనాదులు జన్మతో సిద్ధించిన ప్రాణులందు చూడనగును. పాదరసము మున్నగువాని భస్మములను తినుటచే కలుగు శరీరసంపద ఓషధీసిద్ధి, స్వాధ్యాయాదులవలన కలిగెడు ఇష్టదేవతా సంప్రయోగము (స్వాధ్యాయాదిష్ట దేవతాసంప్రయోగః 2.44) మంత్రజసిద్ధి. తపస్సు వలన కలిగెడి సిద్ధి తపోజసిద్ధి. విభూతిపాదమున చెప్పబడిన సిద్ధులన్నియు సమాధి సిద్ధులనియే గ్రహింపవలయును.

అవ॥ మంత్రాదులవలన కాయేంద్రియములలో జాత్యంతర పరిణామము కలుగును. దానికి కారణ మేమనః

**జాత్యంతర పరిణామః ప్రకృత్యాపూరాత్** 2

జాత్యంతర పరిణామః = మంత్రాదులవలన శరీరేంద్రియములలో కలుగు పూర్వజాతికంటె విలక్షణమైన మఱియొక జాతికి సంబంధించిన పరిణామము, ప్రకృత్యాపూరాత్ = శరీరమునకు ప్రకృతి భూతపంచకము, ఇంద్రియములకు ప్రకృతి అహంకారము (అస్మిత) ఈ రెండును స్వజాతి కనుకూలించు నవయవాంతరములతో కూడి ప్రవేశించుటవలన కలుగును.

కాయేంద్రియ ప్రకృతులు (పంచమహాభూతములు, అస్మిత)

మం(త్రాదులవలన కలుగు ధర్మాదినిమిత్తముల నపేక్షించుచు, కొత్త యవయవములలో నను(ప్రవేశించుట యను నాపూరముతో తమవలన కలుగు (క్రొత్త శరీరేం(ద్రియములను అను(గ్రహించును. అందువలననే పూర్వ పరిణామము పోయి (క్రొత్త పరిణామము కలుగునని భావము.

అవ॥ కాయేం(ద్రియ(ప్రకృతు లిందుకొఱకు చేయునదేమన :

**నిమిత్త మ(ప్రయోజకం (ప్రకృతీనాం వరణభేదస్తు**
**తతః క్షే(త్రకవత్ 3**

నిమిత్తం = మం(త్రాదులవలన నేర్పడు ధర్మాది నిమిత్తము (ప్రకృతీనాం = కాయేం(ద్రియ (ప్రకృతులకు, అ(ప్రయోజకం = అపూరమున (ప్రయోజకము కాదు, వరణభేదస్తు = (ప్రతిబంధకములైన అధధర్మాదుల నశింపజేయుటయే, తతః = ఆ నిమిత్తము వలన కలుగును. క్షే(త్రకవత్ = ఒకకేదారము నుండి మఱియొక కేదారమునకు వెళ్లి దానిని నింపు నీటికి కర్షకుడు (ప్రయోజకుడు కాడు; కాని, మడిలోనికి నీరు పోవుట కడ్డముగా నున్నగట్టు మా(త్రము తొలగించును.

కేదారములను నీటితో నింపదలచు కర్షకుడు నీటిని నడుపుటకు తాను చేయవలసిన దేమియు నుండదు. కాని కేదారమునందు నీటిని (ప్రవేశింపనీయక యడ్డముగా నుండుగట్టును మా(త్రము తొలగించును. అంతట నీరు స్వయముగా కేదారము నా పూరించును. అట్లే దర్మాది నిమిత్తములు (మం(త్రాదుల వలన జనించినవి) కాయేం(ద్రియ (ప్రకృతులయిన భూతాహంకారములను (ప్రేరింప పనియుండదు. కాని యవి, అధర్మాదులను తొలగించును. ఇట్లు అధర్మాది ఆవరణములు తొలగినచో ఆ యా (ప్రకృతులు స్వభావముచేతనే తమచే నేర్పడు వికారముల నాపూరించు నని భావము.

అవ॥ యోగి తన భోగము కొఱకు కాయేం(ద్రియ (ప్రకృత్యాపూరణము ద్వారమున ననేక శరీరేం(ద్రియము లొకేసారి నిర్మించుకొను నపుడనేక చిత్తములను దేనినుండి నిర్మించుకొను నన:

**నిర్మాణచిత్తా న్యస్మితామా(త్రాత్ 4**

నిర్మాణ చిత్తాని = సంకల్పముచే నిర్మించుకొను చిత్తములు, అస్మితామా(త్రాత్ = చిత్తమునకు ఉపాదానకారణమైన అహంకారమునుండి నిర్మించుకొనును.

యోగి యొకే సమయమున ననేక శరీరములను నిర్మించుకొని వాని ద్వారమున కర్మఫలము నంతటిని భోగించి నివారించు కొనదలచి నపుడా శరీరములకు తగినట్లు చిత్తములను కూడ అహంకారమునుండి నిర్మించుకొనునని భావము.

అవ॥ క్రొత్తగా నిర్మింపబడిన చిత్తములును చిత్తములే కాబట్టి పూర్వచిత్తముతో సమానములే యగును. ప్రతి శరీరమునందును వేఱువేఱుగా నుండు చిత్తములను ఒకే చిత్తమను నభిప్రాయముతో ప్రవృత్తిని కలిగింప వలనపడదు. కాబట్టి యోగికి వానివలన భోగ మెట్లు సంభవమగు నన:

**ప్రవృత్తిభేదే ప్రయోజకం చిత్తమేక మనేకేషామ్ 5**

క్రొత్త చిత్తములను నిర్మించు యోగి, ఏకంచిత్తం = పూర్వము తనకు ప్రాప్తమైయున్న చిత్తమును, అనేకేషాం = అనేక శరీరములకుగాను నిర్మించిన క్రొత్త చిత్తములను, ప్రవృత్తిభేధే = భిన్నభిన్న ప్రవృత్తులందు, ప్రయోజకం = ప్రేరించు నాయకచిత్తముగా నిర్మించును. యోగి తనకు ప్రాప్తమైయున్న పూర్వ చిత్తమును క్రొత్తగా నిర్మింపబడిన చిత్తములకు నాయకచిత్తముగా నొనర్చుట వలన దానిచే ప్రేరేపింపబడి క్రొత్త చిత్తములు ప్రవృత్తి కలవై యోగికి భోగము కలిగించును. దేనికది స్వతంత్రముగా ప్రవర్తించి స్వతంత్ర భోగము కలిగింపనేరవు. కాబట్టి దోషము లేదని భావము.

అవ॥ పూర్వము చెప్పబడిన జన్మజాది సిద్ధులతో కూడిన చిత్తములలో అపవర్గము ననుభవింపజేయు సిద్ధచిత్తమును నిశ్చయించుచున్నాడు.

**తత్ర ధ్యానజ మనాశయమ్ 6**

తత్ర = సిద్ధ చిత్తములైన నైదింటిలోను, ధ్యానజమ్ = సమాధి జ సిద్ధితో కూడిన చిత్తము, అనాశయమ్ = క్లేశవాసనలు, కర్మవాసనలు లేనిదై యుపవర్గ ప్రాపకమగుచున్నది.

పంచవిధములైన సిద్ధ చిత్తములలో వాసనారహితమై సమాధిజసిద్ధియుక్త చిత్తము కైవల్యమును కలిగింప యోగ్యమగును. మంత్రాది సిద్ధియుక్త చిత్త మట్లుకాదని భావము.

అవ॥ యోగులు కాని వారి చిత్తము కర్మానుబంధముతో కూడియుండునట్లు, యోగిచిత్తమును కర్మాశయసంబద్ధ మేలకాదు? అనాశయ మెట్లగునన:

**కర్మాశుక్లాకృష్ణం యోగినస్త్రివిధ మితరేషామ్ 7**

యోగినః = యోగియొక్క, కర్మ = సమాధి ప్రభృతి కర్మము, అశుక్లాకృష్ణం = శుక్లంకాదు, కృష్ణముకాదు – (పుణ్యముకాదు, పాపము కాదు)

ఇతరేషాం = యోగులుకానివారి చిత్తము, త్రివిధం = శుక్లము, కృష్ణము శుక్ల కృష్ణము నని ముప్విధములు.

యోగికిని కర్మసంబంధ ముండును. కాని యతడొనర్చు కర్మము క్లేశకర్మవాసనాపూర్వకముకాదు. యోగి యొనర్చు సమాధి ప్రభృతి కర్మము క్లేశకర్మాది వాసనలను నశింపజేయును. ఫలాభిసంధితో చేయమిచే పుణ్యముకానీ, నిషిద్ధ కర్మల నాచరింపమిచే పాపముకానీ యతనికర్మము కాదు. కాగా యోగి చిత్త మనాశయ మగును. ఇతరులట్లుగాక ఫలాసక్తితో పుణ్యపాపకర్మల నాచరింతురు. కాబట్టి వారి చిత్తము ఆ యా కర్మ వాసనలచే చిత్రితమై శుక్లము, కృష్ణము, శుక్ల కృష్ణము నగునని భావము.

తపస్సు, స్వాధ్యాయము, ధ్యానము మున్నగు సాత్విక కర్మములు శుక్లములు. గోహత్యాదులు తామస కర్మములు కృష్ణములు. పశుహింసాదులతో కూడిన కర్మములు శుక్ల కృష్ణములు నని వివేకము.

అవ॥ యోగులు కానివారి చిత్తములు వాసనలతో కూడియుండుట వలన కర్మవిపాకము తప్పదు. కాబట్టి యొకజన్మమును విడిచి మఱియొక జన్మమును పొందినపుడు సమస్త వాసనలు అభివ్యక్తములై యొకజాతియందే యితర జాతులకు సంబంధించిన భోగములను అనుభవింపవలసి వచ్చునుగదా యన :

**తత స్తద్విపాకానుగుణానా మేవాభివ్యక్తి ర్వాసనానామ్ 8**

తతః = పూర్వోక్త త్రివిధమైన కర్మము పక్వమై ఫలోన్ముఖమైనపుడు తద్విపాకానుగుణామేవ = ఆ యా కర్మముల విపాకమనదగు జాత్యాయుర్భోగ లక్షణ ఫలమున కనుగుణమైన, వాసనానాం = ఆయా జాతియందు భోగింపదగు సంస్కారముల, అభివ్యక్తిః = ( ఆయా విషయములను స్మరింపజేయుట యను) అభిముఖ్యము కలుగును.

కర్మము విపచ్యమానమగుచు నే జాతికి సంబంధించిన విపాకము నారంభించునో దాని కనుగుణమైన వాసనలచే యభివ్యక్తము చేయును.

అందువలననే పుట్టిన తోడనే ప్రాణి స్వజాతికి తగినభోగమునే యనుభవింప నారంభించును. ఒంటెపిల్ల ముండ్లపొదనే తిననారంభించును. బిడాల కిశోరము మూషిక శిశువులచే వేటాడును ; గడ్డి పఱకల నంటుకొనదు. కాబట్టి దోషము లేదు.

అవ॥ మనుష్యుడు చనిపోయిన తదుపరి వెంటనే కర్మ పరిపాకము ననుసరించి మార్జాల భావము నందినపుడు పూర్వక్షణము వఱకు నున్న వ్యవధానములేని – మనుష్య వాసనయే అభివ్యక్తము కావలయును. అట్లుగాక యెంతో వ్యవధానముగల మార్జాల వాసన యెట్లు వ్యక్తమగును? వ్యవహితా వ్యవహితముల (దూరసామీప్యముల) లో అవ్యవహితమే వ్యక్తము కావలయును కదా యన:

**జాతి దేశ కాల వ్యవహితానామ ప్యానన్తర్య**
**స్మృతి సంస్కారయో రేక రూపత్వాత్** **9**

జాతి.. మపి = మధ్యలో గలుగు ననేక జన్మముల చేతను, పూర్వోత్తరాది దేశము చేతను, అనేక సంవత్సరాత్మక కాలము చేతను, వ్యవహితములైనను వాసనలు, అనంతర్యమ్ = ఫలము నిచ్చుటలో వ్యవధానములు కావు. స్మృతి సంస్కారయోః = స్మరణము, వాసనలు నను రెండును, ఏకరూపత్వాత్ = సమానవిషయము లను నియమ ముండుటవలన

అభివ్యక్తములయిన వాసనలు తమ కార్యమును చేయును. అభివ్యక్తములు కానివి చేయవు. వాసన అభివ్యక్తము లగుటకు వ్యవధానము కానీ, అవ్యవధానముకానీ కారణము కాదు. వానిని వ్యక్తపఱపగల వ్యంజనము ఉపస్థితమైనపు డవి వ్యక్తము లగును. కాబట్టి అభివ్యంజక సాన్నిధ్యమే కారణము. అభివ్యంజకమున కే సంస్కారములు సమీపములో యవియే వ్యక్తములగును. వ్యవహితములట్లుకావు. మార్జాల వాసనలకు అభివ్యంజకము ఆ వాసనలకు నిమిత్తములైన పూర్వకర్మాశయములకు సంబంధించినదై యిప్పుడు పచ్యమానమగు మార్జాలకర్మమై యున్నది. అయ్యది మనుష్యవాసనలకు కాదు. వాసన కర్మము వలన నేర్పడును. స్మృతి వాసన వలన కలుగును. స్మృతి వలన మరల వాసన కలుగును. వాసనల వలన మరల కర్మము కలుగును. ఆ కర్మము తన కభివ్యంజక మగు దేశకాలాది నిమిత్తము ద్వారమున ఫలమునిచ్చుట కభివ్యక్తమగును. దానిచే నభివ్యక్తములైన వాసనలు

సన్నిహితములై పూర్వజన్మమునందే విషయమునకు సంబంధించినవై యనుభవముచే సంచితములైనవో ఆ విషయమునకు సంబంధించిన స్మృతినే యిప్పటి మార్జాల జన్మమునందు కలిగించును. కాని మనుష్య జన్మమునం దనుభవించిన విషయమునకు సంబంధించిన స్మృతిని కలిగింపవు. స్మృతి సంస్కారములు రెండును ఏకరూపము లగుటయే యిందులకు కారణము.

అవ॥ ప్రథమ జన్మమునందు పూర్వవాసన లుండవు. కాబట్టి యందు ప్రారంభించిన (ప్రారబ్ధ) కర్మమువలన నెట్టి వాసనలు నభివ్యక్తములుకావుగదా! అప్పుడు ప్రాణులు తమతమ జాతికి యోగ్యమయిన భోగమునందెట్లు ప్రవర్తింప గలిగిన వన:

**తాసా మనాదిత్వం చాశిషో నిత్యత్వాత్** **10**

అశిషః = (నేను చావకుందునుగాక! ఎల్లపుడు నుందునుగాక) అను ఆత్మస్పృహ, నిత్యత్వాత్ = నిత్యమగుటవలన, తాసామ్ = వాసనలకును, అనాదిత్వం చ = అనాదిత్వము కలదు.

'నేను చావకుందునుగాక! సదా జీవింతునుగాక!' అను మరణభయము పూర్వమెన్నడు మరణ దుఃఖము ననుభవింపని ప్రాణికి కలుగనేరదు. పుట్టిన శిశువున కా జన్మమునందు మరణమువలన కలుగు దుఃఖము ప్రత్యక్షానుమాన – ఆగమములలో నే ప్రమాణము చేతను కలుగనేరదు. కాబట్టి స్వాభావిక మనజెల్లదు. కానీ మరణదుఃఖస్మృతి మరలభీతివలన చూడబడుచున్నది. ఖడ్గాదులతో నెవడేని శిశువును కొట్టబోగా నా శిశువు మరణ దుఃఖమును సంస్మరించికదా కంపించుచున్నది? అట్టి స్మృతి వాసనలేక కలుగజాలదు. వాసన యనుభవము వలనగాని కలుగదు. అనుభవ మీ జన్మమునందు కలుగలేదు. కాబట్టి పూర్వజన్మమునకు సంబంధించినదనక తప్పదు. పూర్వజన్మమునందును ఇట్లే మరల ఊహింపదగును. కాబట్టి వాసన అనాదియగును. అపుడు ప్రథమ జన్మమిదియని యేదియు నిర్ణయింపవీలుకాదు. వాసనవలె దానికి హేతువైన జన్మమును అనాదియగు నని భావము.

అవ॥ వాసన అనాదియని సిద్ధపడిన చిచ్ఛక్తివలె నదియు నిత్యమగును. అది యెన్నడు నశింపజాల దన :

**హేతుఫలాశ్రయాలంబనై సంగృహీతత్వా**
**దేషామభావే తదభావః** **11**

వాసనలు, హేతుఫలాశ్రయాలంబనైః = హేతువు, ఫలము, ఆశ్రయము,
లంబనము నను వానిచే, సంగృహీతత్వాత్= సంచితములగుట వలన, ఏషామ్
: హేత్వాదుల, అభావే = వినాశము కలుగగా, తదభావః = వాసనలు
శించును.

ఇందు అవిద్యాదిక్లేశములు, శుక్లాది కర్మములును హేతువుననబడును. జాతి (జన్మము), ఆయువు, భోగము నీ మూడును ఫలము; సాధికార చిత్తము (చరితార్థము కానిది) ఆశ్రయము; శబ్దాది విషయములు ఆలంబనము అని వ్యవహరింపబడును.

కర్మాశయములు క్లేశములవలన కలుగును. క్లేశములు అవిద్యవలన నేర్పడును. కాబట్టి యవిద్య రాగద్వేషములు, సుఖదుఃఖములు, ధర్మాధర్మములు నను ఆఱు ఆకులుగల సంసారచక్రమును నడుపునదై వాసనలకు హేతువగుచున్నది. ఫలము, ఆశ్రయము, ఆలంబనము నను నీ మూడును అవిద్యచే వ్యాప్తములై యుండును. అందుచే నవిద్య నివర్తించిన నవియు తొలగును. అట్టి యవిద్య ప్రసంఖ్యాన బలమున నశించును. అవిద్య నశింపగా దాని నాశ్రయించిన వాసన లనాదులయ్యు నశించును. ఆశ్రయానాశ మాశ్రితనాశనమునకు కారణము. అనాది వాసనలు నశించినపుడు అనాదియైన చిచ్ఛక్తి మాత్రమేల నశింపదన వలనుపడదు. చిచ్ఛక్తికి నాశకారణమేదియులేదు. కాబట్టి చిచ్ఛక్తి యుదాహరణముతో వాసనల నిత్యత్వము సాధింప వీలులేదని భావము.

అవ॥ యోగులు సత్కార్యవాదులు; కాబట్టి వినాశకారణమున్నను వాసన లెట్లు నశింపగల వన:

**అతీతానాగతం స్వరూపతోఽస్త్యధ్వభేదాత్**
**ధర్మాణామ్** **12**

ధర్మాణామ్ = వాసనాది ధర్మములయొక్క, అధ్వభేదాత్ = భూతభవిష్యద్వర్తమాన లక్షణ కాలభేదమువలన, అతీతానాగతం = (వినాశము పొందినది అతీతమనబడును. భవిష్యత్తున వ్యక్తమగునది అనాగత మనబడును) అతీతానాగత ధర్మముల ద్వయము, స్వరూపతః = అతీతానాగత లక్షణ రూపమున, అస్తి = ఉన్నది.

వాసనలు స్వరూపనాశము నందవు. వాసనలందు అతీతత్వము

అనాగతత్వము కలుగుటయే వాని నాశనమనబడును. అందువలన సత్కార్యవాదమునకు క్షతి కలుగదు. అతీతత్వాది రూపమున చిత్తమునందు వాసనలున్నచో చిత్తము పూర్వమువలె సాశయమై (కర్మాశయములతో యుక్తమై) భోగ హేతువగు ననరాదు. వర్తమానత్వ లక్షణముగల వాసనలతో కూడిన చిత్తమే సాధికారమగును. భోగహేతు వగును.

అవ॥ ఈ ధర్మములన్నియు పరమార్థమున నెట్టివన :

**తే వ్యక్తసూక్ష్మా గుణాత్మాన ః** **13**

వ్యక్తసూక్ష్మాః (వర్తమానములు వ్యక్తములు; అతీతానాగతములు సూక్ష్మములు) వ్యక్తములు, సూక్ష్మములైన, తే = మహదాది ప్రకృతి కార్యములన్నియు, గుణాత్మానః = గుణ స్వరూపములే.

యోగశాస్త్రమున ప్రకృతి, దాని వికారములైన - మహదాదులు భిన్నాభిన్నములని యంగీకరింపబడినందున, ప్రకృతి భూతములైన గుణములు (సత్వరజోస్తమములు) పరిణామి నిత్యములు. వాని వికారములైన సర్వభావ పదార్థములు (ధర్మములు) ను ప్రకృతియైన గుణత్రయముకంటె నభిన్నములైనందున (భిన్నములు కానందున) నిత్యము లైనప్పటికీ స్వరూప నిత్యములు కావు; నశ్వరములే. పురుషుడు మాత్రము కూటస్థుడు నిత్యుడు.

అవ॥ గుణములు త్ర్యాత్మకములగుటచే ఒక శబ్దము, ఒక యింద్రియము, ఒక భూమి అని గుణాత్మక వస్తువులలో నేకత్వ మెట్లు చెప్పబడునన

**పరిణామైకత్వా ద్వస్తుతత్వమ్** **14**

పరిణామైకత్వాత్ = పరిణామ మేకమగుటవలన, వస్తుతత్వం = వస్తువులు (శబ్దాదులు) గుణత్రయ పరిణామము లగుటచే నేకత్వము వస్తుతత్వమగుచున్నది.

వత్తి, తైలము, అగ్ని, వీని పరిణామము దీపము. అది యొక్కటే అట్లే సత్వరజోస్తమములు మూడైనను వాని పరిణామముగా నేర్పడు శబ్దాది వస్తువు సైతము ఒక్కటియే యని భావము.

అవ॥ విజ్ఞానమునకు మించిన మతి యొకండేదియు లేదు. అట్టియెడ భావపదార్థములు త్రిగుణాత్మకములనియు త్రివిధము లనియు నన నేల యన:

**వస్తుసామ్యేఽపి చిత్తభేదా త్తయో ర్విభక్తః పంథాః** **15**

వస్తుసామ్యేఽపి = విషయమున భేదము లేకున్నను, చిత్తభేదాత్ = ఆ విషయమునకు సంబంధించిన జ్ఞానములలో భేదము కనబడుటవలన, తయోః = వస్తువు (గ్రాహ్యము), చిత్తము (గ్రహణము) నను రెంటి యొక్క విభక్తః పంథాః = మార్గము భిన్నము.

బౌద్ధులలో విజ్ఞానవాదులు విజ్ఞానమునకు మించి వేఱొండు పదార్థము నంగీకరింపరు. జ్ఞానముచేతనే వస్తువున్నదనియు, అది యిట్టిదనియు తెలియుచున్నది. జ్ఞానములేకున్న వస్తువున్నట్లు తెలియదు. కాబట్టి జ్ఞానమే పదార్థము. అంతకుమించి మఱియేమియు లేదనియందురు. లోకమున వ్యవహరింపబడు ఘటపటాది వస్తువులు స్వస్వరూపమున నలీకములై అనాది వాసనవలన ప్రతిచిత్తము కల్పితములై తోచుచున్నవి. అవి చిత్తమేకాని వేఱుకాదు అను నీచ విజ్ఞానవాదము యుక్తముకాదు. చిత్తమునకు మించి చిత్తమునకు విషయమగు వస్తువు వొండు లేకున్నచో ఒకవస్తు వనేక చిత్తములకు విషయము కాకుండవలయును. మఱియును అదే యిది యను ప్రత్యభిజ్ఞయు కలుగకుండవలయును. ఒక చిత్తమువలన కల్పిత విషయము ఇతరుల చిత్తమునకు విషయమెట్లు కాగలదు? లోకమున నిందులకు విపరీతముగ నొకవస్తు వనేక చిత్తములకు విషయమగుట చూచుచున్నాము. అంతేగాక అదే యిది యని ప్రత్యభిజ్ఞయు కలుగుచున్నది. కాబట్టి చిత్తమునకు మించి వేఱే వస్తువు చిత్తమునకు విషయమగునది యున్నదనియే యంగీకరింపవలయును.

అవ॥ చిత్తవ్యతిరిక్తముగా విషయభూతవస్తువు సర్వదా లేదనము. కాని, చిత్త క్షణమునకు పూర్వోత్తర క్షణములలో చిత్తమునకు మించి వేఱు విషయము లేదందుము. చిత్తమున్నపుడేకదా విషయము తెలియును. కాబట్టి నానా చిత్తములకు విషయము కాదగు వస్తువొండు లేదు అన :

**న చైకచిత్త తంత్రం వస్తు తద ప్రమాణకం**
**తదా కిం స్యాత్ 16**

వస్తు = ఘటాది గ్రాహ్య విషయము, ఏకచిత్తతంత్రం = ఏకచిత్తాధీనము – ఏక చిత్తసమయమున మాత్రముండునది, న చ = కాదు, తదా = ఆ చిత్తమే యితర వస్తువున సంలగ్నమైనపుడు, తత్ = ఆ వస్తువు అప్రమాణకం = ప్రమాణమైన చిత్తముచే గ్రహింపబడనిదై, కింస్యాత్ = ఏమగును? వినష్ట మగునా? లేక పూర్వమువలె నుండునాయని ప్రశ్నము కలుగును.

చిత్తమునకు వ్యతిరిక్తముగా నొకవస్తువు చిత్తక్షణముననుండి యన్య క్షణముననుండదని యంగీకరించినట్లయిన ఆ వస్తువు చిత్తకారణకమా? లేక అన్య కారణకమా? అని యడుగవలయును. చిత్తకారణకమేయనిన పూర్వవిజ్ఞానవాదమున నే దోషము చెప్పబడినదో యదియే యిట ప్రసక్తమగును. అన్యకారణక మందురేని, గ్రాహకమైన చిత్తము లేనపుడది యెట్లు నశించును? నాశకారణ మేదైన నుండవలయునుగదా! గ్రహణము లేనంత మాత్రమున గ్రాహ్యము నశింపవలయు నను నియమము లేదుకదా! విషయము నశింపక యట్లే యుండగల దనిన ఏకచిత్తతంత్రము - ఏకచిత్తవిషయక మను నెట్లు చెల్లును? ఇతర చిత్తములకు నది విషయమై సాధారణమే యగును. అట్లే యొకవస్తువు వనేక చిత్తములకు విషయమగుట లోకమున చూచుచున్నాము. కాబట్టి ఏకచిత్తతంత్రమే వస్తువనుట యెట్లును తగదు.

అవ॥ ఘటపటాది వస్తువులు చిత్తముకంటె భిన్నములే యైన నెల్లపుడు చిత్తముచే నేల గ్రహింపబడ వన:

**తదుపరాగాపేక్షితత్వాత్ చిత్తస్య వస్తు జ్ఞాతాజ్ఞాతమ్** 17

చిత్తస్య = చిత్తమునకు వస్తువుల జ్ఞానము కలుగుటకు, తదుపరాగాపేక్షితత్వాత్ = ఇంద్రియములద్వారమున వస్తువులతో చిత్తము సంబద్ధమైవాని యాకారమును పొందుట అవసరము కాబట్టి, వస్తు = ఘటపటాదివస్తువులు, జ్ఞాతాజ్ఞాతం = సంబంధముకలిగినచో జ్ఞాతములు, సంబంధము కలుగకున్నచో అజ్ఞాతములు నగును.

ఘటపటాది వస్తువులు అయస్కాంతమణి వంటివి. అయ్యవి లోహగుణము వంటి గుణముగల పరిణామ స్వభావియగు చిత్తమును తనువంకకాకర్షించి తమలో కలుపుకొని రంజిత మొనర్చును - తమయాకృతిని చిత్తమునకు కలిగించును. ఏ వస్తువుతో చిత్తము కలిసిదాని యాకారమును తాను పొందునో యా వస్తువు తెలియబడును. ఇతరములు తెలియబడవని భావము.

అవ॥ అటులయిన నా యా వస్త్వాకారచిత్తవృత్తులు నెల్లపుడు తెలియబడ కుండవలయును కదా! యన:

**సదా జ్ఞాతా శ్చిత్తవృత్తయ స్తత్ప్రభోః**

**పురుష స్యాపరిణామిత్వాత్** **18**

తత్ప్రభోః = చిత్తసత్వమునకు స్వామియైన, పురుషస్య = జీవాత్మ, అపరిణామిత్వాత్ = పరిణామ స్వభావము లేనిదగుట వలన, చిత్తవృత్తయః = ఆ యా విషయాకారములుగల చిత్త సత్వజ్ఞానములు, సదా = ఎల్లపుడును, జ్ఞాతాః = గ్రహించబడుచుండును.

చిత్తమువలె దానికి స్వామియైన జీవాత్మయు(పురుషుడు) పరిణామమునొందు స్వభావము గలిగియుండినచో శబ్దాది విషయములవలెనే శబ్దాది విషయక చిత్తవృత్తులును జ్ఞాతములు, అజ్ఞాతములునై యుండెడివి. పరిణామము చెందినపుడు తెలియబడి చెందనపుడు తెలియబడకుండుట సంభవమని భావము. కాని పురుషుడు పరిణామి కాడు. అతడు కూటస్థనిత్యుడు; కాబట్టి చిత్తవృత్తులతనికి సదా జ్ఞాతములే యగును; కాని యజ్ఞాతములు కాజాలవు.

అవ॥ వైనాశికుని మతము ననుసరించి శంకించి సమాధానము చెప్పుచున్నాడు. చిత్తమే ఆత్మ; అంతకుమించి వేఱేమియు లేదు. చిత్తమే అగ్నివలె స్వయముగా భాసించుచు వస్తువులను భాసింపజేయును. కాబట్టి చిత్తము స్వప్రకాశము, క్షణికమును అన ;

**న తత్స్వాభావం దృశ్యత్వాత్** **19**

తత్ = చిత్తము, దృశ్యత్వాత్ = దర్శనమునకు విషయ మగుట వలన ఘటాదులవలె జడము, పరిణామి యగుటవలనను, స్వాభావం = స్వయంప్రకాశము, న = కాదు.

చిత్తము దర్శనమునకు విషయము. మఱియు నది ఘటపటాదులవలె జడము, పరిణామము నొందునదియును కాబట్టి అగ్నివలె స్వప్రకాశమెన్నటికిని కాదు.

**ఏకసమయే చోభయానవధారణమ్** **20**

చ = మఱియు, ఏకసమయే = ఒకే క్షణమున, ఉభయానవధారణమ్ = చిత్తము, చైత్తము (విషయము) నను రెండును తెలియబడవు.

వైనాశికులు క్షణికవాదులు. కావున చిత్తము క్షణికము – ఒక్క క్షణముమాత్ర ముండును. అన్యక్షణమున నశించును. క్షణికవాదుల మతమున చిత్తముయొక్క యుత్పత్తి క్రియయే దానికి కారకము కావలసి వచ్చును. ఇతరుల

మతమున ముందు ఉత్పత్తి, తరువాత క్రియ, అటుపై కారకమునగును. వైనాశికు లిట్లే చెప్పియున్నారు. 'భూతి ర్యేషాం క్రియా సైవ కారకం సైవచోచ్యతే' ఉత్పత్తి క్రియయే కారకమని యభిప్రాయము. ఉత్పత్తి రూపక్రియతో తనను తెలిసికొనును. కాని యాక్రియతోనే యితర పదార్థమును తెలిసికొన వలన పడదు. ఒకే విధమగు క్రియ విలక్షణములైన రెండు కార్యముల నుత్పన్నము చేయజాలదు. ఒకే క్షణమున తనను తెలిసికొను వ్యాపారము వలన ఇతర జ్ఞానముగూడ కలుగు టెట్లు పొనగును? రెండవ క్షణమున తెలిసికొనగలుగునందు మనినచో చిత్తము క్షణికము కావున రెండవ క్షణమున నది యుండదు. అట్టి యెడ చిత్తము స్వప్రకాశకమై పరప్రకాశ మెట్లు కాగలదు? కాబట్టి వైనాశికులమత మెవ్విధమునను సంభవముకాదని భావము.

అవ॥ చిత్తము విషయము నెఱుగును. అట్టి విషయ విజ్ఞాన మనెడి చిత్తమును వెంటనే కలుగు మఱియొక చిత్త మెఱుంగగలదు. కాబట్టి దోషము లేదన :

**చిత్తాంతరదృశ్యే బుద్ధిబుద్ధే రతి ప్రసంగః**
**స్మృతిసంకర శ్చ** **21**

చిత్తాంతరదృశ్యే = మఱియొక చిత్తముచే గ్రహింపబడినట్లంగీకరించిన, బుద్ధిబుద్ధేః = (వృత్తి జ్ఞానము = బుద్ధి, అదియే విజ్ఞానాత్మవాదుల చిత్తము) ఇట్టి చిత్తము విషయముగా గల చిత్తమునకు, అతిప్రసంగః = అతిప్రసక్తి కలుగును. అందువలన, స్మృతి సంకరిశ్చ = వానివలన కలుగు స్మరణమును సంకరమగును.

చిత్తము నీలవర్ణమును గ్రహించు ననుకొనుడు. ఆ నీలవర్ణాకారమున మాఱిన వృత్తిజ్ఞానమనెడి చిత్తము తదనంతరమున కలిగిన చిత్తమునకు విషయమగునెడల నీ రెండవ చిత్తమును చిత్తమే కాబట్టి యది మఱియొక చిత్తమునకు విషయమగును. అదియు మఱియొకదానికి ఇట్లు విరామ ముండదు. ఇట్టియెడ నీలవిషయక చిత్తమొకటి అది విషయముగాగల నీలచిత్తచిత్తము రెండవది. అదియు విషయమైన నీలచిత్త చిత్త చిత్తము మూడవది యగును. అదియు మఱియొకదానికి విషయమగును. కాబట్టి నాలుగవది నీలచిత్త చిత్త చిత్త చిత్త మగును. ఇట్లు వీని కంతముండదు. ఇట్లే స్మృతి

నియమమును నుండదు. చిత్తము లనేకములు. వానివలన సంస్కారము లుద్బుద్ధములైన నొకేక్షణమున ననేకస్మృతులేర్పడును. వివేకము కలుగనేరదు. కాబట్టి రెండు దోషము లేర్పడునని భావము.

అవ॥ చిత్త మిట్లు స్వాభాసము కాక చిత్తాంతర దృశ్యమును కాక పోయినచో నది పురుషునిచే నెట్లు తెలియబడును? చిత్తమునకు ఇంద్రియము ద్వారమున వస్తు సంబంధము కలుగునట్లు పురుషసంబంధము లేదు కదా! యన :

**చితే రప్రతిసంక్రమాయా స్తదాకారాపత్తౌ**
**స్వబుద్ధి సంవేదనమ్ 22**

అప్రతిసంక్రమాయాః = (విషయ సంబంధమునకు హేతువయిన వృత్తి యనెడు సంచారము ప్రతి సంక్రమమనబడును) ప్రతి సంక్రమములేని, చితేః = చిచ్ఛక్తికి – పురుషునకు, తదాకారాపత్తౌ = చిత్తమునందు ప్రతిబింబితమగుటచే చిత్తాకారమునకు సమానమైన ఆకారము కలుగగా, చైతన్యముయొక్క ప్రతిబింబమును పొందిన చిత్తమును పురుషుడనుకరించుచున్నట్లుండుటయే, స్వబుద్ధి సంవేదనం = స్వామియైన పురుషుడు తనకు భోగ్యమైన బుద్ధిని – చిత్తమును తెలిసికొనుట యగును.

పురుషుడు పరిణామి కాకపోవుటవలన వృత్తియనెడి ప్రతిసంక్రమణము లేక, చిత్తముతో సంబద్ధుడు కానిమాట వాస్తవమే; కాని సామీప్యము వలన పురుషుడు చిత్తసత్వమున ప్రతిబింబించును. అట్లు ప్రతిబింబించి విషయాకారతను బొందిన చిత్తాకారమును పొందినవాడై చూచుచున్న – తెలిసికొనుచున్న బుద్ధిని అనుకరించుచున్నట్లుండును. ఇదియే పురుషుని ద్రష్టృత్వము. కాబట్టి పురుషుడు ద్రష్ట. చిత్తమతని దృశ్యమునని భావము.

అవ॥ ఇట్లు బుద్ధి, పురుషుడు వేఱు వేఱుగనుండ విజ్ఞానవాదులొకే చిత్తమును ద్రష్టృదృశ్యములుగ నేల భావించుచున్నారన:

**ద్రష్టృదృశ్యోపరక్తం చిత్తం సర్వార్థమ్ 23**

ద్రష్టృదృశ్యోపరక్తం = చేతన పురుషుడు ద్రష్ట; శబ్దాది విషయములు దృశ్యము. ఈ రెంటితోను, ఉపరక్తము – ప్రతిబింబములతో కూడినదై, చిత్తం = చిత్తము, సర్వార్థం = గ్రహీత, గ్రహణము, గ్రాహ్యము అను భిన్నార్థముల యాకారము కలదై యున్నది.

స్ఫటికమణి కొకవైపున నీలవర్ణముగల నీలమణిని, మఱియొక వైపున రక్తవర్ణముగల కెంపును నుంచిన నా స్ఫటికము వాని ప్రతిబింబములతోకూడి త్రివర్ణములగలదిగ భాసించును. అట్లే చిత్తసత్త్వమునకు సమీపమున నున్న పురుషుడా చిత్తమునందు ప్రతిఫలించును. బాహ్య వస్తువులును ఆ చిత్తమున ప్రతిబింబించును. ఇందు పురుషుడు ద్రష్ట - గ్రహీత; బాహ్య వస్తువులు గ్రాహ్యములు - విషయములు. చిత్తము స్వయముగ గ్రహణము - జ్ఞానము. ఈ మూడు నొకచో సమావేశమైయున్నట్లు చిత్తము గృహీతృ గ్రహణ గ్రాహ్యరూపమై యొప్పుచుండును. ఇట్లు త్రిరూపమున భాసించు చిత్తము విషయములో భ్రాంతులైన విజ్ఞానవాదులు వివేకింపజాలక చిత్తమే యాత్మయందురు. కాబట్టి వా రనుకంపనీయులు. ద్రుష్టృదృశ్యములచే నుపరక్తమైన చిత్తము వారి భ్రాంతికి కారణమని భావము.

అవ॥ సుఖదుఃఖముల ననుభవింప జేయుటకు హేతువైన చిత్రవిచిత్ర వాసనలతో కూడిన చిత్తమే యాత్మగా నంగీకరించి దానికి భిన్నముగా నొక భోక్త - జీవాత్మ నంగీకరింపకున్నచో గౌరవము కలుగదు గదా యన:

**త దసంఖ్యేయవాసనాభి శ్చిత్ర మపి**
**పరార్థం సంహత్యకారితత్వాత్** **24**

తత్ = ఆ చిత్తము, అసంఖ్యేయవాసనాభిః = విపాకారణములైన అసంఖ్య వాసనలతో, చిత్రమపి = చిత్రితమైనను, సంహత్యకారితత్వాత్ = దేహేంద్రియాదుల సహకారముతో కలిపి ప్రయోజనకారి యగుట వలన, పరార్థమ్ = పురుషుని భోగాపవర్గముల కొఱకే యగును; తన కొఱకుగాదు.

లెక్కింప వీలులేని సంస్కారములు, వాని వలన కలుగు విపాకములు చిత్తమునే యాశ్రయించును. కాని అంత మాత్రమున నది భోక్తకాదు. నానావిధ పదార్థములతో నిర్మింపబడిన యొక గృహ మెట్లు ఇతరుల కుపకరించునో యట్లే, శరీరము, ఇంద్రియములు మున్నగువానితో కలిపి చిత్తము ప్రయోజనకారి యగుచున్నది. కాబట్టి యది పరార్థమగుచున్నది. అదీ యెవరి కొఱకు భోగాపవర్గములను సాధించుచున్నచో యతడే పురుషుడు - భోక్త యని భావము.

అవ॥ జన్మాది సిద్ధుల ద్వారా కైవల్యమునకు యోగ్యమైన చిత్తమును తెలిపి దానివలన అర్థవివేకపూర్వకమైన కైవల్యమునకు మూలకారణమగు

వివేకము పురుషునకు యుక్తిగా చెప్పబడినది. అట్టి వివేకము దర్శించు స్వభావముగల యధికారి పురుషున కింకేమి కలుగు నన :

**విశేషదర్శినః ఆత్మభావ భావనానివృత్తి 25**

విశేషదర్శినః = వివేకమును సాక్షాత్కారము చేసికొనిన యోగ్యవ్యక్తికి, ఆత్మభావభావనా వినివృత్తిః = నే నెవడను? ఎట్లయితిని? ఇది యేమి? ఇది యెట్లేర్పడినది? ఏమగుదుము? ఎట్లగుదుము? అను నిట్టి జిజ్ఞాస తొలగిపోవును.

చిత్తసత్త్వము, పురుషుడు నను నీ రెంటి విశేషమును బాగుగా గుర్తించినపుడు ఇది యంతయు విచిత్రమైన చిత్తపరిణామమే. పురుషునకు సంబంధించినది కాదు. శుద్ధుడైన పురుషుడు అవిద్య తొలగగానే చిత్త ధర్మములలో సంబద్ధుడుకాక శుద్ధుడగును అని తెలిసికొనును. అప్పుడు సూత్రార్థమున చూపించిన (ఆత్మభావన) జిజ్ఞాస తొలగి స్వస్థుడగు నని భావము.

అవ॥ జిజ్ఞాస తొలగిన విశేషదర్శి చిత్తమెట్లుండు నన:

**తదా వివేకనిమ్నం కైవల్యప్రాగ్భారం చిత్తమ్ 26**

తదా = అప్పుడు, చిత్తం = చిత్తసత్త్వమనెడి జలము, వివేక నిమ్నం = వివేక మనెడి (ప్రవహింప యోగ్యమైన) నిమ్న ప్రదేశముకలదై, కైవల్యప్రాగ్భారం = మోక్షమనెడి ప్రవాహావధియైన ఉన్నత ప్రదేశము కలదగును.

విశేషమును దర్శించిన పురుషుని చిత్తము విషయాభి ముఖ్యమనెడి యజ్ఞాన మార్గమున సంచరించుట మాని వివేకమార్గమున నడచి కైవల్యాభిముఖమగునని భావము.

అవ॥ లోకమున వివేకులకును వ్యుత్థాన చిత్తవృత్తులు కలుగ కారణమే మన:

**తచ్ఛిద్రేషు ప్రత్యయాంతరాణి సంస్కారేభ్యః 27**

తచ్ఛిద్రేషు = వివేక ప్రత్యయమునకు మధ్య మధ్య, ప్రత్యయాంతరాణి = ఇతర ప్రత్యయములు, సంస్కారేభ్యః = వ్యుత్థాన అనుభవము కలిగిన సంస్కారములవలన కలుగుచుండును.

వివేక ప్రత్యయము కలిగిన తరువాతను అప్పుడప్పుడు వ్యుత్థాన అనుభవముచే కలుగు సంస్కారమువలన వ్యుత్థాన ప్రత్యయములు కలుగవచ్చునని భావము.

అవ॥ వానిని తొలగించుకొను నుపాయ మెద్దియన:

**హానమేషాం క్లేశవ దుక్తమ్** 28

ఏషామ్ = ఈ వ్యుత్థాన సంస్కారముల, హానమ్ = నివృత్తి, క్లేశవత్ = క్లేశములను తొలగించునట్లు, ఉక్తమ్ = తొలగింపవలయునని చెప్పినట్లే భావింపవలయును.

క్రియా యోగాదుల ద్వారా అవిద్యాది క్లేశము లెట్లు క్షీణింపజేయబడి తొలగింపబడునో యట్లే వ్యుత్థాన సంస్కారములను తొలగింపవలయును. వీనికి వేఱుగ ఉపాయము చెప్పనక్కఱలేదని భావము.

**ప్రసంఖ్యానేఽప్యకుసీదస్య సర్వథా**
**వివేకఖ్యాతేః ధర్మమేఘః సమాధి** 29

ప్రసంఖ్యానేఽపి = వివేకఖ్యాతియందును, అకుసీదస్య = అనురక్తుడు కాని యోగికి, సర్వథా = అన్ని విధములను - ఎల్లపుడు, వివేకఖ్యాతేః = వివేకఖ్యాతి కలుగుట వలన, ధర్మమేఘః = కైవల్యఫలము నొసంగు క్లేశములను నిర్మూలమొనర్చు ధర్మమేఘమనెడి(ధర్మం మేహతి - ధర్మమును వర్షించు) సమాధిః = యోగము కలుగును.

యోగికి వివేకఖ్యాతి కలిగినపుడు ఆ వివేకఖ్యాతిని పరిణామముగా నెంచి దానియందు నతడు విరక్తుడైనచో వ్యుత్థాన సంస్కారము లుదయించవు. అట్టి యెడ జ్ఞానము పరిపక్వమై ధర్మమేఘసమాధి యేర్పడును.

సంప్రజ్ఞాత సమాధికి ఫలము వివేకఖ్యాతి - ప్రసంఖ్యానము. దాని పరాకాష్టయే ధర్మమేఘ సమాధి. అప్పుడు వ్యుత్థాన సంస్కారము లుదయింపనేరవు. ధర్మమేఘసమాధి వలన జ్ఞానప్రసాదమనెడి పరవైరాగ్య ముదయించును. పరవైరాగ్యమువలన వివేకఖ్యాతియు విరుద్ధమగును. అటుపై నిర్బీజసమాధి కలుగునని భావము.

అవ॥ వివేకఖ్యాతి వలన ధర్మమేఘసమాధి కలిగిన కలుగనిమ్ము. క్లేశ హాన మెట్లు కలుగు నను ప్రశ్నమునకు సమాధాన మేమన:

**తతః క్లేశకర్మనివృత్తిః** 30

తతః = ధర్మమేఘసమాధివలన, క్లేశకర్మ నివృత్తిః = వాసనలతో కూడిన అవిద్యా క్లేశములు, వాని వలన కలుగు శుక్లకృష్ణాది కర్మములు నన్నియు నివర్తించును - తొలగిపోవును.

ధర్మమేఘసమాధి యుదయించిన తదుపరి అవిద్యాది క్లేశములుకానీ,

వానివలన జనించు శుక్లాది కర్మములు కానీ మరల జనింపనేరవు. ఇట్టిస్థితియందే నిర్మల ప్రసంఖ్యానము కలవాడై యోగి జీవన్ముక్తు డనిపించుకొనును.

అవ॥ క్లేశకర్మనివృత్తి కలిగిన నేమగు నన:

**తదా సర్వావరణ మలాపేతస్య**
**జ్ఞానస్యానంత్యాత్ జ్ఞేయ మల్పమ్** **31**

తదా = క్లేశకర్మనివృత్తి కలిగిన మీదట, సర్వావరణ మలాపేతస్య = చిత్తసత్వము నావరించు క్లేశములు, కర్మములు ననెడు మలములన్నియు తొలగినట్టి, జ్ఞానస్య = చిత్తసత్వముయొక్క అనంత్యాత్ = అనంత ప్రకాశము వలన, జ్ఞేయం = చిత్తముచే తెలియదగు చేతనాచేతనాత్మక మగు విషయజాతమంతయు, అల్పం = స్వల్పమగును.

చిత్తసత్వము స్వభావముచే ప్రకాశమయ మగుట వలన వస్తువు లన్నింటిని తెలుపగలిగినదే; కాని రజస్తమోమయములయిన క్లేశకర్మాది ఆవరణమలములచే నాచ్ఛాదితమై కొంచమునే తెలుపును. ధర్మమేఘసమాధి కలిగినపుడా చిత్త సత్వము మేఘపటలముక్తమైన శరచ్చంద్రుని ప్రకాశము దశదిశల వ్యాపించి వస్తుజాతము సువ్యక్తము చేయునట్లు, మలరహితమై విషయములను ప్రకాశింపజేయును. నాడాచిత్తసత్వముచే తెలియబడనిది యొకింతయు నుండదు. అంతటి ప్రకాశము ఆ చిత్తసత్వమునకు కలుగునని భావము. ఇట్టి స్థితియే ధర్మమేఘసమాధి పరాకాష్ట యనబడును. ఈ పరాకాష్టయే జ్ఞానప్రసాదము. యోగికి కలుగు నీ జ్ఞాన ప్రసాదమే పర వైరాగ్య మనబడును. ఇయ్యది వ్యుత్థాన సంస్కారములను దూరమొనర్చును. చిత్తమును నిర్బీజసమాధియందు సంయోజింపజేయును.

అవ॥ ధర్మమేఘసమాధి వలన జ్ఞేయమల్పమైననేమి? గుణపరిణామ క్రమము సమాప్తము కాలేదుకదా! కాబట్టి యోగికి మరల దేహారంభమేల కలుగదన:

**తతః కృతార్థానాం పరిణామ క్రమసమాప్తి ర్గుణానామ్** **32**

తతః = జ్ఞాన ప్రసాదము కలిగిన మీదట, కృతార్థానాం = పురుషునకు భోగాపవర్గములను కలిగించిన, గుణానాం = ప్రకృతి భూతములగు సత్వరజస్తమో గుణముల యొక్క పరిణామ క్రమసమాప్తిః = దేహేంద్రియాది

కార్యముల నారంభించుట యను పరిణామ క్రమము సమాప్తమగును.

పురుషునకు భోగాపవర్గములు కలిగించి కృతార్థములు కానంతవఱకే గుణములు పరిణామము చెందును. దేహాది కార్యముల నుత్పన్నము చేయును. ధర్మమేఘ సమాధి కలుగుటయే గుణముల కృతార్థత. ధర్మమేఘ సమాధి కలిగిన పురుషునియెడ గుణములు కృతార్థత సంపాదించినవై యతని కొఱకు దేహేంద్రియాది ప్రకృతి పరిణామములను కలిగింపవు. కాబట్టి గుణముల పరిణామ క్రమము సమాప్తమైనదని భావము.

అవ॥ గుణముల పరిణామక్రమ మేమన:

**క్షణప్రతియోగీ పరిణామాపరాంతనిర్గ్రాహ్యః క్రమః 33**

పరిణామాపరాంతనిర్గ్రాహ్యః = (పూర్వధర్మముపోయి క్రొత్త ధర్మము కలుగుట పరిణామము. అపరాంత మన విరామము. నిర్గ్రాహ్యః = ఊహింపదగినది) ధర్మాంతరోత్పత్తి విరామముచే నూహింపదగిన, క్షణప్రతియోగీ = క్షణిక భావపదార్థము నిరూపకముగాగల పరిణామ పౌర్వాపర్యము, క్రమః = క్రమ మనబడును.

ధర్మపరిణామము, లక్షణ పరిణామము, అవస్థాపరిణామము నని పరిణామము త్రివిధము. అందు ధర్మపరిణామమునందును లక్షణపరిణామామమునందును గల క్రమము ప్రత్యక్షము కాగలదు; కాని అవస్థాపరిణామమునందలి క్రమము గోచరింపదు. అదియే ముఖ్య పరిణామము. ధర్మ లక్షణ పరిణామములు నిందే యిమిడియుండును. ఒక ధర్మియందు(వస్తువునందు) పూర్వధర్మముపోయి క్రొత్త ధర్మము కలుగుట అవస్థయే యగును. ఇట్లే యొక ధర్మమున లక్షణాంతర మేర్పడుటయు నవస్థయే యగును. కాబట్టి పరిణామములన్నియు నవస్థామాత్రమైనను సూక్ష్మభేదమును గమనించి యాచార్యులు పరిణామము త్రివిధమనిరి. నూతన వస్త్రమునందు కాలము గడచిన తదుపరి గమనింపబడు ప్రాతదనము అనెడు పరిణామ మొక్కమాటు కలుగదు. ముందు సూక్ష్మతమముగాను, అటుపై సూక్ష్మతరముగాను, తరువాత సూక్ష్మముగాను, అనంతరము స్థూలముగాను కలుగును. ఇట్లు చిట్టచివరకు ప్రత్యక్షమైన స్థూలపురాణత అనెడు పరిణామము దానికి పూర్వ మాయా క్షణములందు దృష్టి గోచరముకాని పరిణామావస్థలను అనుమింపజేయును. ఈ యనుమితావస్థల పూర్వాపరతయే క్రమ మనబడునని

భావము.

అవ॥ గుణముల పరిణామ క్రమము సమాప్తము కాగా పురుషున కేర్పడు కైవల్య లక్షణ మెట్టిదన:

**పురుషార్థశూన్యానాం గుణానాం ప్రతి ప్రసవః**
**కైవల్యం స్వరూప ప్రతిష్ఠా వా చితిశక్తిరితి 34**

ఈ సూత్రమునగల 'ఇతి' శబ్దము శాస్త్ర పరిసమాప్తిని తెలుపును. పురుషార్థ శూన్యానాం = భోగాపవర్గ ప్రయోజనములు కలిగించి కృతార్థములైన, గుణానాం = కార్యకారణరూపములైన బుద్ధ్యాది గుణములయొక్క ప్రతిప్రసవః = స్వస్వకారణములలో విలయమగుట, వా= లేక, స్వరూప ప్రతిష్ఠా = తన రూపమునందున్న, చితిశక్తిః = పురుషుడు – చిచ్ఛక్తి స్వస్వరూపమున నుండుట, కైవల్యం = కేవలభావము – మోక్ష మనబడును.

కార్యకారణాత్మకములగు గుణములు – బుద్ధ్యాది కార్యములు పురుషునకు భోగాపవర్గములను నిర్వర్తించినమీదట కృతకృత్యములై స్వస్వకారణములందు లీననమగుచు నంతతిమగు ప్రధానమందు విలయమగును. (వ్యుత్థాన సమాధి విరోధ సంస్కారములు మనస్సునందును, మనస్సు అస్మిత యందును, అస్మిత మహత్తత్త్వమునందును, మహత్తత్త్వము అలింగమైన ప్రధానమందును ప్రలయము నొందును) ఇట్టి గుణప్రలయమే లింగ శరీరభంగ మనబడును. లింగశరీరభంగమువలన వృత్తిసారూప్య ముండనేరదు. కాబట్టి పురుషుడు స్వస్వరూపమున స్థితుడై బ్రహ్మమును నిరంతరము సాక్షాత్కరింపజేసికొని తత్స్వరూపమైన ఆనందము ననుభవించును. ఇందు పురుషార్థశూన్యములైన గుణముల ప్రతిప్రసవము – ప్రలయము సిద్ధింపగానే పురుషుడు స్వస్వరూప స్థితుడగును. కాబట్టి గుణప్రలయమో లేక చిచ్ఛక్తి స్వరూప స్థితియో కైవల్యమనబడినదని భావము.

ఇది
నిఖిలశాస్త్ర నిష్ణాత శ్రీ మత్పండిత ముక్తి రామ
ఉపాధ్యాయశిష్య పండిత గోపదేవ విరచిత
'అంబా' వ్యాఖ్యాన సహిత యోగ దర్శనమున కైవల్య పాదము
ఓమ్ తత్ సత్

## 1. విశిష్టపదసూచి

## 2. ఆకారాధి సూత్రానుక్రమణిక

యోగ దర్శనము

₹ 80-00



యోగాభ్యాసి (శ్రీ గోపదేవ్)

1940 నాటి చిత్రము

ప్రకాశకులు :

అంబా దర్శన గ్రంథమాల,

ఆర్యసమాజము, కూచిపూడి - 522 313

తెనాలి తాలూకా, గుంటూరు జిల్లా.

PRINTSHOP - 040-66320300

"వేదాంత విజ్ఞాన సునిశ్చితార్థా ః

సంన్యాసయోగాద్యతయః శుద్ధసత్వాః

తే బ్రహ్మలోకేషు పరాంతకాలే

పరామృతా ః పరిముచ్యంతి సర్వే."

ఓ3మ్

# వేదాంత దర్శనము

(వ్యాసకృత - బ్రహ్మ సూత్రములు)

"కళాప్రపూర్ణ, వేదవేదాంగ పారంగత్, దర్శన తత్త్వవేత్త

పండిత గోపదేవ్ శాస్త్రి (దర్శనాచార్యులు)

విరచిత వ్యాఖ్యానము

ప్రకాశకులు :

ఆర్య సమాజము - కూచిపూడి

గుంటూరు జిల్లా - ఆంధ్రప్రదేశ్

అంబా దర్శన గ్రంథమాల - 33

తృతీయ సంస్కరణము - 1000

సర్వస్వామ్యములు : ఆర్య సమాజము - కూచిపూడి

శ్రీ వృష - యుగాది - 2001

మూల్యము : రూ. 80-00

ప్రతులకు :

1) ఆర్య సమాజము, కూచిపూడి,
తెనాలి తాలూకా, గుంటూరు జిల్లా - 522 313

2) మాశెట్టి శ్రీనివాస్, Shop No. 5, మాశెట్టి బిల్డింగ్,
3-3-736 to 740 , కంచరి బజార్, సికింద్రాబాద్ - 3.
ఫోన్ : 781 2904

3) వైదిక సాహిత్య భండార్, సుల్తాన్ బజార్, హైదరాబాద్ - 95.



# పండిత గోపదేవ శాస్త్రి

జననము : క్రీ.శ. 1896 మరణం : 21-10-1996

జన్మస్థలము : కూచిపూడి, తెనాలి తాలూకా

జననీజనకులు : అంబమాంబా రామయార్యులు

విద్యాభ్యాసము : కూచిపూడి, అమృతలూరు, కాశ్యాదిపీఠములు, సంస్కృతాంధ్ర హిందీ సాహిత్యములు

వృత్తి : వైదిక ధర్మ ప్రచారము, వైదిక సంస్కార వ్యాపకత

అభిమాన విషయములు : షడ్ దర్శనములు, నైష్ఠిక బ్రహ్మచర్యము, యోగమార్గ ప్రావీణ్యము

స్థాపకులు : అంబా దర్శన గ్రంథమాల-కూచిపూడి, అంబా రామార్య సత్యార్థ ప్రకాశ ట్రస్టు-సికింద్రాబాద్ మరియు ఎన్నో ఆర్య సమాజములు.

**సన్మానములు :**

1. "కళాప్రపూర్ణ" - ఆంధ్ర విశ్వవిద్యాలయం, విశాఖపట్టణం.
2. రూ. 10,000/- "మహర్షి దయానంద సరస్వతి నిధి పురస్కార్" న్యాస్, ఆర్య సమాజం, పులేరా.
3. రూ. 5,001/- ఆర్యప్రతినిధి సభ, ఆంధ్రప్రదేశ్, సుల్తాన్ బజార్, హైదరాబాద్.
4. రూ. 25,000/- "వేదవేదాంగ పురస్కార్", ఆర్యసమాజము, శాంతాక్రూజ్, బొంబాయి.
5. రూ. 1,00,000/- "దర్శన తత్త్వవేత్త" బిరుదు -శతజయంతి సందర్భముగా (30-7-95) శత జయంతి ఉత్సవ సమితి, సికింద్రాబాద్.

**రచనలు, అనువాదములు :** సత్యార్థ ప్రకాశము, ఋగ్వేదాది భాష్యభూమిక, నిరుక్తము, ఋగ్వేద భాష్య భాస్కరము I, II, III. వైదిక వినతి I, II. వైదిక దినచర్య. న్యాయ, వైశేషిక, సాంఖ్య, యోగ వేదాంత దర్శనములు : ఈశ, కేన, కఠ, ప్రశ్న, ముండక, మాండూక్య, ఐతరేయ, తైత్తిరీయ, శ్వేతాశ్వతర, ఛాందోగ్య, బృహదారణ్యకోపనిషత్తులు : ఆస్తికవాదము, అర్థ ధర్మ మీమాంస, సంస్కారవిధి, భగవద్గీత, ఏసుక్రీస్తు రహస్య జీవనము, పూజ, వైదిక పర్వ పద్ధతి, అపశూద్రాధికరణము మొదలగునవి చిన్న గ్రంథములు 25. చిన్నవి, పెద్దవి కలిపి అఱువదికి పైగా వైదిక గ్రంథములు తెలుగులో రచించినవారు వీరొక్కరే.

# సంపాదకీయము

(పండిత శ్రీ గోపదేవ్ గారిచే సంశోధిత ద్వితీయ సంస్కరణ)

. . . . క్రీ.శ.19వ శతాబ్దమున జన్మించిన శ్రీ మద్దయానంద మహర్షి వైదిక ధర్మమును పునరుద్ధరించి ప్రపంచమున వ్యాపింపజేయుటకై "ఆర్యసమాజమును" స్థాపించెను. దయానందు డాదిత్య బ్రహ్మచారి, అతడు కేవల పుస్తక పండితుడు కాడు. సమాధినిష్ఠుడై మంత్రార్థముల నెఱింగిన మహర్షి. అతడు తన ప్రచారమునకు వేదముల నాధారముగా గొనెను. భారతమున నేమి, ప్రపంచముననేమి ప్రబలిన మతమతాంరతములలోగల లోపములను జూపి ఖండించుచు ప్రపంచమందు వైదిక ధర్మమే సత్యధర్మమని, విశ్వశాంతికి ముఖ్యకారణమని బోధించెను. 'వేదో z ఖిలో ధర్మమూలమ్' అని మనువు వక్కాణించియున్నాడు గదా !

ఆర్యసమాజము మతసంస్థగాని, రాజకీయ సంస్థగాని కాదని, కేవల మొక తెగవారికొఱ కేర్పడినదియుగాదని, వైదిక ధర్మములను ప్రజలలో వ్యాపింపజేయుట కేర్పడిన సంస్థయనియు పాఠకులు మరువరాదు. ఆర్యసమాజమన సజ్జనుల సంఘమని యర్థము. ఆ యభిప్రాయముతోనే మహర్షి దయానందుని యడుగుజాడలలో మెలగుచు, అవిద్యను పోనాడి వైదికమతమును, ప్రాచీన ఆర్షవిజ్ఞానమును పునరుద్ధరించుటకు, వైయక్తిక మతములు సంప్రదాయములు పోయి విజ్ఞానముతో గూడిన జీవితవిధానమును మానవ సమాజములో నెలకొల్పుటకును ముప్పది యేండ్లనాడు తెనాలి తాలూకా కూచిపూడి గ్రామములో పం. గోపదేవ్ 'ఆర్యసమాజము'ను స్థాపించి అప్పటినుండి తదాశయసిద్ధికై శక్తికొలది పాటుపడుచు, ప్రాచీన ఆర్షసాహిత్యమును తెలుగున వ్రాసి అచ్చొత్తించి ఆర్యసమాజం ద్వారా తెలుగు పాఠకుల కందించు చున్నారు.

విశేషించి - శ్రీ శంకరభగవత్పాదాద్యాచార్య విరచిత ప్రస్థానత్రయ భాష్యముల మూలకముగ వైయక్తిక మతములు అవైదికములు - వ్యాప్తిలో నున్నందున వేదానుకూలముగ నా ప్రస్థానత్రయమునకు తెలుగున వ్యాఖ్యానములు రచించి వేదమతమును, ఆర్షవిజ్ఞానమును పాఠకలోకమున కందింప ఈ సమాజము ద్వారా పం. గోపదేవ్ గారు సంకల్పించిరి. ఈ సంకల్పముతోనే ఈశకేనాద్యుపనిషత్తులు తొమ్మిది వేదానుకూలముగ తెలుగులోనికి తేబడినవి. భగవద్గీత వ్యాఖ్యానింపబడినది.

ప్రస్థానత్రయములో మూడవదిగ వేదాంత దర్శన (బ్రహ్మ సూత్రములు) మిప్పుడు తెలుగులో వెలుగునకు వచ్చుచున్నది. ఇంకను ఉపనిషత్తులలో నొండు రెండు తెలుగులోనికి రావలసినవి గలవు. ఆ ప్రయత్నముకూడ జరుగుచున్నది. ఇట్లు వేదానుకూలముగ పండిత గోపదేవ్ గారి వ్యాఖ్యానములతో వెలువడిన యీ ప్రస్థానత్రయమును పఠించుచో వేదమతము - ఆర్షమతము పాఠకులకు బోధపడగలదు. దీనికితోడు తెలుగులో, నీ సమాజమువా రందించిన మహర్షి దయానంద రచిత ఋగ్వేదాది భాష్యభూమిక, సత్యార్థప్రకాశములను గూడ జదువుచో వేదసిద్ధాంతములు పాఠకులమనసున దృఢపడగలవు. దానివలన ప్రస్థానత్రయమునకు డొంకతిరుగుడు అర్థకల్పనలతో భాష్యములు రచించి మతత్రయమువారు వేదవిరుద్ధముగ వైయక్తికమతముల నెట్లు వ్యాపింపజేసిరో బోధపడగలదు. యుక్తితో నాలోచించినను ఎంత సామాన్యుడగు కవియైనను పరస్పర విరుద్ధ అంశములతో నొక గ్రంథము రచింపడని తెలియకపోదు. అట్టిచో బ్రహ్మవిద్యను బోధింప మహర్షులు రచించిన ఉపనిషత్తులలో, బ్రహ్మసూత్రములలో పరస్పరవ్యతిరేకములగు వేదవిరుద్ధాంశము లెట్లుండును ? విభిన్న మత సిద్ధాంతము లెట్లుండును ?

ఇట మరొకవిశేష మేమన : ఆ యా సంప్రదాయములవారు ఉపనిషత్తులు ఈశ్వరీయములగు వేదములశిఖలని, కాన వేదాంతములను న్యవహారము వానికి కలదని, అందువలన వానియాధారముతో బోధించు తమ మతము వేదమతమే యనియు ప్రచారము చేసిరి. నాడే కాదు ; నేడును ఆ యా సంప్రదాయముల నంటిపెట్టుకొనియున్న విద్వాంసులు తెలిసి కొందరు, తెలియక కొందరు నదేరీతిని - ఉపనిషత్తులు వేదభాగములే యని ప్రచారము, వితండవాదము చేయుచుండుట చూతుము. కనుకనే వేదమతము మరుగునపడగా వైయక్తిక మతములు వెలసి ప్రజలను పెడదారుల బట్టించినవని వ్రాయుచున్నాను.

ప్రస్థానత్రయముతో బాటు షట్ శాస్త్రములలో న్యాయ వైశేషికములు, సాంఖ్య యోగములు కూడ శ్రీ గోపదేవ్ గారి తెలుగువ్యాఖ్యానములతో ఈ సమాజము ప్రకటించినది. ఇంకను ఆస్తికవాదము, అర్థధర్మమీమాంస, అపశూద్రాధి కరణము మున్నగు గ్రంథములు చిన్నవి పెద్దవి కలిపి ముప్పదిమూడు కడచిన ముప్పది యేండ్లలో తెలుగున వెలువరించుట జరిగినది. ఈ సమాజపు పుస్తకశాఖ - అంబా దర్శన

గ్రంథమాలలో - తొలి పుష్పము వైశేషిక దర్శనము కాగా నీ వేదాంతదర్శన మిప్పుడు ముప్పదిమూడవ పుష్పముగ వెలువడుచున్నది.

శ్రీ పండిత గంగాప్రసాద్ ఉపాధ్యాయులు, ఎమ్.ఏ గారి ప్రోత్సాహముతో శ్రీ గోపదేవ్‌గారిచే స్థాపింపబడిన ఈ సమాజము పండితగోపదేవ్ గారి తోడ్పాటుతో - వారి రచనలతో కడచిన ముప్పదేండ్లుగా వైదిక ధర్మప్రచారము చేయుచున్నది. ఇంచుమించుగ నన్ని గ్రంథములు. (ప్రస్థానత్రయము, దర్శనములు, ఆస్తికవాదాది - ఇతరములు) ఒక్కరిచే రచింపబడుటయు, ఉత్తమభారతీయ సంస్కృతిని దెలియజేయు సత్యుత్తమ వైదిక సాహిత్యమును తద్ గ్రంథకర్త యైన శ్రీ గోపదేవ్ గారిచే నీయబడిన ధనముతో ఈ చిన్న సంస్థ వెలువరించి ప్రచారము చేయుచుండుటయు మిక్కిలి యాశ్చర్యకరమగు విషయము. ఈ రచనలమూలకముగ నైష్ఠికబ్రహ్మచారులు, యోగనిష్ఠాగరిష్ఠులు నగు పండిత గోపదేవ్ గారి వైదిక విజ్ఞానము, వైదిక ధర్మ ప్రచారాసక్తి, ఆర్షదృష్టి బోధపడగలవు.

సంధ్యాగ్నిహోత్రములు నేర్పుచు, గ్రంథరచన - ప్రవచన - ఉపన్యాసముల మూలమున వైదిక ధర్మప్రచారమే వృత్తిగ బెట్టుకొని విసుగు విరామము లేక సాంఘికసేవ యొనర్చుచుండుటయేగాక యోగమార్గమున నాదర్శగురువుల నిత్య జీవితము గడుపుచున్న పండిత గోపదేవ్ గారి సర్వతోముఖ సహకారమున ఈ ఆర్యసమాజ మిన్నేండ్లనుండి యింతటి సేవచేయగలుగుచున్నది. అంగబలమున, అర్థబలమున చిన్నదియయ్యునియ్యది విలువగల వైదిక వాఙ్మయము నాంధ్రములో వెలువరించి పాఠకలోకమున కందింపగలుగుటకు ముఖ్యకారణము ధర్మ ప్రచారమునకు మెచ్చి శ్రీ గోపదేవ్ గారికి ఉదారులైన దాతలు బహూకరించిన ధనమే. వారినే శ్రీ గోపదేవ్ గారు తన గ్రంథమాలకు పోషకులుగాను, రాజపోషకులుగాను, ప్రచురించుచున్నారు.

తెనాలి
ది. 11-1-1971

ఇట్లు
జాస్తి వేంకట నరసింహారావు

## నాలుగు మాటలు

యం. రాజగోపాలరావు
Head of the Dept. Philosophy

ఆంధ్రక్రైస్తవ కళాశాల
గుంటూరు

...పందొమ్మిదవ శతాబ్దంలో ప్రభవించిన దయానందుడు ఒక వినూత్న దృక్పథంతో వైదిక వాఙ్మయాన్ని నిశితంగా పరిశీలించాడు. వేదం పేరుతో చలామణీ అయే వైదిక వాఙ్మయం నిజంగా వైదికంగాదని ఆయన గ్రహించాడు. అనేక సంప్రదాయాలు ఆధారంగా వల్లించే మహావాక్యాలు ఔపనిషదికాలని, ఉపనిషత్తులు వేదభాగాలుగావని, అందువల్ల లభ్యమయ్యే - పరతః ప్రామాణ్య వాఙ్మయాన్నంతటినీ స్వతః ప్రమాణాలైన వేదాలతో సరిపోల్చితదనుగుణంగా వున్న వాని నంగీకరించి తద్భిన్నమైన వానిని తిరస్కరించాలని తీర్మానించాడు. ఆయన వేదాలనొక అపూర్వ పద్ధతిలో వివరిస్తూ 'ఋగ్వేదాది భాష్యభూమిక' వ్రాసి, ఋగ్వేద, యజుర్వేదాలకు భాష్యం కూడ వ్రాశాడు. వేదాల యథార్థదృష్టి ప్రచారానికి 'సత్యార్థ ప్రకాశ్' ను ప్రకటించాడు. ఆయన దృష్టికి వేదాలలో అద్వైత, విశిష్టాద్వైత, ద్వైతాలకు ఆధారాలు గనిపించలేదు. వేదాలు జీవేశ్వర ప్రకృతుల యథార్థతను ప్రతిపాదిస్తాయని ఆయన భావించి త్రైతవాదాన్ని ప్రతిపాదించి, తన భావ ప్రచారానికి ఆర్యసమాజాన్ని స్థాపించాడు. తాత్త్విక చింతనలో ఒక సంచలనాన్నిగలిగించాడు దయానందుడు.

ఆర్యసమాజ్‌లో మనకొక విశిష్టత గోచరిస్తుంది. బహుకాలంగా సంఘంలో పేరుకొనిపోయిన మూఢనమ్మకాలను అనవసర ఆచారాలను, సాంఘిక సమైక్యతామార్గ కంటకమైన వర్ణవ్యవస్థను, అభివృద్ధి నిరోధకమైన శూద్ర, స్త్రీ విద్యా - అనర్హతను అవైదికాలని అది ఆక్షేపిస్తుంది. అసత్యము అహేతుకము అయినదేదీ వేదార్థ ప్రతిపాదకం గావటానికి వీలు లేదని అది భావిస్తుంది. జడోపాసన మానవులను గూడ జడులను జేస్తుందని- అదే భారతీయులను నిశ్చైతన్యులను జేసిందని అది నిరసిస్తుంది. మానవులందరూ కేవలం రెండే రెండు తెగలుగా విభజింపబడాలని - వారే ఆర్యులు - అనార్యులని అది ప్రతిపాదిస్తుంది. గౌరవనీయులందరూ ఆర్యులు, కడమవారు అనార్యులని

అది వివరిస్తుంది. ఆర్యులు అనాదిగా భారతీయులేనని - వేదాలు భారతీయాలని - అవే భారతీయులందరికీ శిరోధార్యాలు గావాలని, వేద విహితధర్మానుసారంగా భారతీయులందరూ జీవితాలు సాగించాలని అది వాంఛిస్తుంది. ప్రజల నందరినీ విద్యావంతులను జేయుటానికి విద్యాలయాలు స్థాపించి వైదిక సత్యాలనందరికీ అందించి, వైదిక దృక్పథాన్ని అభివృద్ధిజేయనిదే భారతీయ సంస్కృతే విస్మృతమయే ప్రమాదమున్నదని భావించి - వైదిక వాఙ్మయాన్ని అన్నివర్గాల వారికి అందించి, ఎన్నో సంఘ సముద్ధరణ కార్యకలాపాల్లో ఆర్యసమాజికులు పాల్గొంటున్నారు.

దక్షిణాదిని - ముఖ్యంగా మన రాష్ట్రంలో దయానందుని దృక్పథాన్ని ప్రచారం చేయుటానికి జీవితాన్నంకితంజేసినవారిలో ప్రముఖులు పండిత గోపదేవ్ శాస్త్రిగారు. వేదాధ్యయనం అందరికీ అందుబాటులో లేని రోజుల్లో ఉత్తరదేశం వెళ్ళి నైష్ఠిక బ్రహ్మచర్యమువలంభించి, వేదాధ్యయనం జేసి వేదవిహిత సత్యాల నర్థంజేసుకున్నారు గోపదేవ్‌గారు. వారు ఆంధ్రులుగావటం - మనందరిమధ్యలో జీవించటం మన అదృష్టం. ఆంధ్రదేశంలో గ్రామగ్రామానికి వెళ్ళి గత ముప్పది సంవత్సరాలుగా వైదిక ధర్మ ప్రచారం గావిస్తున్నారు. అంతేకాక సంస్కృతంరాని ఆంధ్రజిజ్ఞాసువులు ఆంగ్లానువాదాలు వ్యాఖ్యానాలు ఆధారంగా వైదిక వాఙ్మయాన్ని అర్థం జేసుకునే దురదృష్టకర పరిస్థితులనుండి తప్పించటానికి, దానిని తేట తెలుగులో సర్వజన సుబోధకంగా ఉండేటట్లు ఆంధ్రీకరించి స్వలాభాపేక్షతో గాక, సర్వవ్యాపకతాదృష్టితో అందరికీ అందుబాటులో వుండే ధరలకు అందిస్తున్నారు. వారి కృషి ఫలితంగా మనకిప్పుడు ఇతర గ్రంథాలతో పాటు తొమ్మిది ఉపనిషత్తులు, భగవద్గీత, అయిదు దర్శనాలు తెలుగులో లభిస్తున్నవి. ఆ కోవలో అయిదవదే మన చేతిలో నున్న 'బ్రహ్మసూత్రాలు' అను వేదాంతదర్శనం. వారే ఛాందోగ్య బృహదారణ్యకోపనిషత్తులను గూడ తెలుగులో వ్యాఖ్యానిస్తే ప్రస్థానత్రయాన్ని ప్రప్రథమంగా తెలుగులో ఒక్కచేతిమీదుగా వ్యాఖ్యానించిన ఘనతవారికే దక్కుతుందనుకుంటాను. వారు ఆయురారోగ్యాలతో అభివృద్ధి జెందుతూ ఆకార్యాన్ని నిర్వహించగలరని ఆశిస్తాను.

పండిత గోపదేవ్ శాస్త్రి గారి తెలుగుసేతలో గూడ ఒక విశిష్టత ప్రస్ఫుటమౌతుంది. ప్రతి సంస్కృతపదార్థాన్ని అందరికీ అర్థమయ్యే భాషలో అందిస్తారు. దానివల్ల ఆ శ్లోకాన్నో, వాక్యాన్నో అర్థంజేసుకుని, ఆలోచించుకొని మనంతట మనమొక నిర్ణయానికి రావటానికి అవకాశ మేర్పడుతుంది. దానికి తాత్పర్యాన్ని జోడిస్తారు. దీనిలో ఆర్యసామాజిక దృక్పథం గోచరించినా అనవసర గందరగోళాన్నది సృష్టించదు. వారి దృక్పథం యే విధంగా హేతుబద్ధమయిందో, తక్కిన దృక్పథాలలోని దొసగులేమిటో అది వివరిస్తుంది. ఈ విషయాలు ఈ వ్యాఖ్యానం చదివే ప్రతివారికి అవగతమవుతాయి.

ఇక్కడ ఇంకొక్క విషయం ప్రస్తావించటం అప్రస్తుతం గాదనుకుంటాను. వారి తెలుగుసేత యే గ్రంథానికి అనువాదం గాదు. 'ఋగ్వేదాదిభాష్య భూమిక' ఆది ఉద్గ్రంథాలను వారు అనువదించలేకపోలేదు. అయితే భగవద్గీత, ఉపనిషత్తులు మొదలుకొని షడ్దర్శనాలను ఆర్యసామాజిక దృక్పథంతో రచించిన గ్రంథాలు చదివి, జీర్ణించుకొని స్వయంకృషితో తెలుగులో వ్యాఖ్యానిస్తున్నారు. ఇది వైదిక వాఙ్మయాన్నంతటినీ అవలోడనం జేయందే అనువయేవనిగాదు - అది అందరికి సాధ్యమూ కాదు. వారి పాండిత్యప్రజ్ఞాపాటవాలను గురించి నేను ఉట్టంకించపూనుకోలేదు. వారి ఉపన్యాసాలు విన్నవారికి, వారి గ్రంథాలు చదివినవారికి వారెంత సాధికారంగా వ్యాఖ్యానిస్తారో కరతలామలక మవుతుంది. వారిని మరింత ప్రోత్సహపరచి, వారి సత్ప్రయత్నానికి ఉత్తేజాన్ని గలిగించి వారి పాండిత్యాన్ని అందరికీ అందుబాటులోకి తెచ్చుకోవలసిన బాధ్యత ఆంధ్రులందరిపైనా ఉన్నదని విన్నవించుకోవటమే ఈ నాలుగు మాటల లక్ష్యం. ఆ లక్ష్యమేపాటి నెరవేరినా నేను కృతార్థుడనని భావించుకుంటాను.

ANDHRA UNIVERSITY
Post Graduate Centre

Prof. K. Satchidananda Murty
Head, Dept. of Asian Philosophies & Cultures
Special Officer & Principal

GUNTUR-5
(ANDHRA PRADESH)

# తొలిపలుకులు

ఉపనిషత్తులు అపౌరుషేయ ప్రామాణిక గ్రంథాలుగా గుర్తింపబడిన తర్వాత వాటిని సమన్వయించి వాటి సిద్ధాంతాలను ఒక దార్శనిక వ్యవస్థగా ఏర్పరచే ప్రయత్నాలు చాలా జరిగినవి. ఇట్లాంటి ప్రయత్నాలు చేసిన వారిలో కొందరు వీరు: ఆశ్మరథ్యుడు, ఔడులోమి, కాశకృత్స్నుడు ఇత్యాదులు. వీరందరి ప్రయత్న ఫలితాలు ఇప్పుడు లభ్యం కావటం లేదు. కాని బాదరాయణుడు రచించిన వేదాంత సూత్రాలు మాత్రం ఇప్పుడు ఉపలభ్యంగా ఉన్నవి. ఈయన ఎవరో ఇప్పుడెవ్వరికి నిశ్చయంగా తెలియదు. పురాణాలు అన్నిటిని, మహాభారతాన్ని వ్రాసిన వ్యాసుడే బాదరాయణుడు అని కొందరి నమ్మకం. పురాణ ఇతిహాసాలన్నిటిని వ్రాసింది ఒకే వ్యక్తి అనటానికి, ఆయనే వేదాంత సూత్రాలు వ్రాశాడు అనటానికి ప్రబల ప్రమాణం లేదు. ఇప్పుడు మనకు దొరుకుతున్న రూపంలో వేదాంత సూత్రాలను అన్నిటిని బాదరాయణుడే వ్రాసి ఉండకపోవచ్చుకూడా. సాంఖ్య వైశేషిక దర్శనాలను, జైన బౌద్ధాలను, వేదాంత సూత్రాలు పేర్కొనటంచేత, ఇవి వాటి తర్వాతవై ఉండాలి. ఇవి భగవద్గీతను కూడా ఉదహరించినవి అని భాష్యకారుల అభిప్రాయము. శుంగ - కాణ్వ వంశాల అనంతర కాలంలో వేదాంత సూత్రాలు ప్రస్తుత రూపానికి తేబడినవి అనటంలో పెద్ద దోషము కన్పడదు.

వేదాంత సూత్రాలు మొత్తం 550 ; వీటిలో ఒక్కొక్క దాంట్లో మూడు నాలుగు మాటలకంటే ఉండవు. ఏ సూత్రం యొక్కగాని అర్థం నిస్సందేహంగా ఇది అనో అది అనో చెప్పటం ఇప్పుడు ఎవ్వరితరం గాదు. కాబట్టే ఎంతోమంది ఆచార్యులు వీటికి అనేకరకాల అర్థాలు వ్రాశారు. పరస్పరం తమ వ్యాఖ్యానాలు

ఖండించుకొన్నారు. అయినా, వేదాంతసూత్రాలు ప్రతిపాదించిన కొన్ని ముఖ్య సిద్ధాంతాలలో కొన్ని ఇవి అంటే చాలామందికి సమ్మతము కావచ్చు: (1) జగత్కారణం బ్రహ్మ ; (2) శాస్త్రం ద్వారానే బ్రహ్మం తెలియబడుతుంది ; (3) బ్రహ్మము జగత్తు అనన్యము కావు ; (4) జీవుడు బ్రహ్మము యొక్క అంశం లేదా ఆభాసము ; (5) జగత్తు బ్రహ్మ యొక్క లీల; (6) సంరాధన మందు బ్రహ్మమును చూడవచ్చును. (7) బ్రహ్మనిష్ఠునికి మోక్షం లభిస్తుంది.

జగత్తు నిజమని, ఇది బ్రహ్మమునకు భిన్నమని జీవులు చైతన్యపదార్థాలని, అవి బ్రహ్మ భిన్నములని విశ్వసించే వేదాంత ప్రస్థానాలు చాలా ఉన్నయ్యి. వీటికి సమాన తంత్రమైనట్టిది స్వామి దయానంద ప్రచారం చేసిన ఆర్యసమాజ సిద్ధాంతము. ఈ సిద్ధాంతానికి అనుకూలంగా వేదాంతసూత్రాలు ఈ పుస్తకంలో వ్యాఖ్యానము చేయబడినవి. జగత్కారణమైన పరమేశ్వరుడు అవయవాలు, ఆయుధాలు, భార్యాబిడ్డలు, అవతారాలు లేనివాడు ; ఆయన కుమ్మరి కుండలు చేసినట్లుగా ఈ జగత్తును నిర్మాణము చేసినాడు ; కొంతవరకు అనుమానప్రమాణం ద్వారా ఆయన ఉనికిని నిశ్చయించ గల్గినా శ్రుతిమూలంగానే ఆయనను గురించిన సమగ్ర జ్ఞానం ప్రాప్తిస్తుంది; ఆయన మహిమని గుర్తించి ప్రవర్తిస్తే మోక్షం వస్తుంది - ఇదంతా సత్యం అని, ఇది వేదాంతసూత్రాల్లో విస్తరించబడింది అనిన్ని చెప్పటమే ఈ వ్యాఖ్యానం ఉద్దేశ్యం. ఈ వ్యాఖ్యానం స్పష్టంగాను, సులభంగాను ఉంది.

ఈ వ్యాఖ్యానాన్ని రచించిన శ్రీ పండిత గోపదేవ్ గారు విద్వాంసులు ; షడ్దర్శనాలను పాత పద్ధతిలో మహా పండితులవద్ద కాశీలో చదివారు ; శాస్త్రాలను చదవటమేకాకుండా మననం కూడా చేశారు ; వాటి సత్యాన్ని గ్రహించామనే విశ్వాసాన్ని కల్గించుకున్నారు ; ఆర్యసమాజ గురువుగా ఆంధ్రదేశంలో చాలా కృషి చేశారు. ఇదివరకే నాల్గు దర్శనాలకు, భగవద్గీతకు, ఛాందోగ్య బృహదారణ్యక ఉపనిషత్తులను మినహాయించి తక్కిన పెద్ద ఉపనిషత్తులమీద వ్యాఖ్యానాలు వ్రాశారు. ఇప్పుడు తమ వేదాంత సూత్రాల వ్యాఖ్యానాన్ని ప్రచురిస్తున్నారు. ఇలా వీరు చేసింది గొప్ప సాహసం. తెలుగుదేశంలో వర్ధిల్లిన శాస్త్రాన్ని బాగా అధ్యయనం చేయటమే కాకుండా, దాన్ని మన భాషలోకి ఇంతటి పట్టుదలతో తెచ్చినవారు ఇంకెవరన్నా ఉన్నట్లు నాకు తొందరగా జ్ఞాపకం రావటం లేదు.

ఈ పుస్తకం చాలామంది కొని చదువుతారని ఆశిస్తాను.

## శ్రియైనమః

తర్క వేదాన్త మహావిద్వాన్ అప్పికట్ల
పండిత - వేదాన్తం జగన్నాథాచార్యులు గుంటూరు జిల్లా
(తిరుమల తిరుపతి దేవస్థానం - ఆస్థానవిద్వాన్)

ఈ గ్రంథకర్తయగు శ్రీ గోపదేవ్ గారు సుప్రసిద్ధ భారతీయులు: దర్శనవేత్తలు, బహుగ్రంథకర్తలు, ఆంధ్రావని కనుపమానోపకృతింజేయగోరి న్యాయ, వైశేషిక, సాంఖ్య యోగాది దర్శనములకు ఆంధ్ర భాషలో వ్యాఖాన్యములను రచించి భారతీయుల కందజేయుటయే గాక దర్శనమూర్ధాయమానమగు వేదాన్తదర్శనమునకును (బ్రహ్మసూత్రములకు) ఆంధ్రభాషలోనే వ్యాఖ్యానమును రచింపబూనిరి.

వీరి వ్యాఖాన్యములు అతిసరళములై అతిమృదులములై అతిమధురములై హార్దభావములను కరతలామలకముగా భారతీయుల కందజేయ సమర్థమగు లలితరచనావైఖరితో నడుచుచుండును.

ఈ దర్శనవ్యాఖ్యానము అవిశేషగతితో పయనించిన పూర్వదర్శన వ్యాఖ్యానములవలె గాక విశేషగతితో పయనింపవలసియుండ ద్వ్యర్థకరీ న్యాయముగా దయను సర్వత్ర ప్రవహింపజేయజూచిన శ్రీ దయానంద సరస్వతీ భావములతో మేళవించి రచింపగలిగిరి.

ఉత్తరమీమాంస - అనంబడు వేదాన్తదర్శనము చతురధ్యాయాత్మకమై షోడశపాదత్మకమై యలరారుచున్నది. వీరు అటులనే అభిమానించి మాయనుతొలగించి జీవేశ్వరప్రకృతిరూపమగు తత్త్వత్రయమునకు సత్యత్వ నిత్యత్వముల నంగీకరించి వ్యాఖ్యానమున కారంభించిరి. మరియు సమన్వయ, అవిరోధ, సాధన, ఫలరూప ప్రయోజనములను క్రమముగా నధ్యాయముల కందజేయుచు బ్రహ్మజ్ఞానేచ్ఛను పురికొల్పి, లక్షణ, ప్రమాణ సమన్వయములచే చతుస్సూత్రిని సంమానించి, అన్యయోగవ్యవచ్ఛేద, అయోగవ్యవచ్ఛేద, అత్యంతాయోగవ్యవచ్ఛేద, రూప ప్రయోజనములతో అరంభాధ్యాయపాదములను బహూకరించిరి. ఇటులనే ఉత్తరములను గౌరవించిరని తలంచుచున్నాను.

కాని బాదరాయణునకు బాదర్యాదిముఖప్రీతి, మానవునకు గుణకర్మవర్ణసిద్ధి, ముక్తునకు సంసారాన్తముక్తివలె ముక్త్యంతసంసారము మొదలగు విషయములను ప్రశంసించిరి.

విజ్ఞానసముద్రము లనేక విధములగు తరంగములు వేయకమానవు. ఏవియు రమణీయతను కోల్పోయి యుండనేరవు. కాన మనూక్తసన్మార్గమే శరణ్యముగా దలంపదగియున్నది.

నియమనిష్ఠావిహారస్థానమగు శ్రీ గోపదేవుగారికి పరమేశ్వరుడాయు రారోగ్య సౌభాగ్యములను సమకూర్చుగాక !

# అభిప్రాయము

'ఆర్ష విద్యాలంకార'
కల్లూరి చంద్రమౌళి

చంద్రమౌళినగర్
గుంటూరు - 2

దర్శనము సర్వవిషయములను సమగ్రముగ మనచే దర్శింప జేయును. కావుననే దీనిని దర్శన మనిరి. ప్రకృతి, జీవులు, పరమాత్మ అనెడిపదార్థములకు సబంధించిన సాంగోపాంగమగు చర్చను సప్రమాణముగ, సహేతుకముగ నిదర్శనముతో మనచే దర్శింపజేయునవియే దర్శనములు. నిఖిల భౌతి కాధ్యాత్మిక భావవైఖరులను హృదయరంగస్థలముపై చర్మచక్షువులయెదుట ప్రదర్శన మొనర్చి సాధకులను సంతృప్తి పఱచునవియే దర్శనములు. వీనిలక్ష్యము ముక్తి - వీనిధ్యేయము బ్రహ్మ -నందరససిద్ధి. వీనిపరమార్థము దుఃఖనివారణాత్మక - సుఖప్రదానాత్మక - శాంతియుత జీవనగమనము.

మనము దర్శనము లనువానిని పాశ్చాత్యులు తత్త్వశాస్త్రము లందురు. వారితత్త్వశాస్త్రమునకు ప్రత్యేకధ్యేయముగాని - లక్ష్యముగాని - పరమార్థముగాని లేదు. వారును వాదము లొనర్తురు. చర్చలు సాగింతురు. తథ్యమిథ్యా భావములపై తర్కవితర్కములు కొనసాగింతురు. కాని వాని కొక పరమావధి లేదు. వారియూహలనావను తీరమును జేర్చవలెననెడి యూహ వారి కెన్నటికిని రాదు. తాళప్రమాణతరంగములమధ్య సంక్షుబ్ధమై అట్లే జలధిగర్భమున దేలియాడుచుండును.

భారతీయదర్శనములు ఆఱు. ఇవి ఆస్తికములు. శ్రీ గోపదేవ్ శాస్త్రి గారు లోగడ నాలుగింటికి తమవ్యాఖ్యలను ప్రకటించిరి. ఇప్పుడు ప్రకటించెడి వేదాంతదర్శన మయిదవది. దీనినే బ్రహ్మసూత్రములు - ఉత్తర మీమాంస అందురు. దీనికర్తబాదరాయణుడు (వ్యాసుడు) ఈ దర్శనముపై పలువురు విద్వద్వరేణ్యులు తెలుగుభాషలో వ్యాఖ్యల నిదివరకే ప్రచురించియున్నారు. కాని, శ్రీ గోపదేవ్ శాస్త్రిగారి వ్యాఖ్యానవైఖరి విశిష్టమైనది. వినూతన మైనది. మూలగతభావములకు భంగమురాని తెఱగున సూత్రములకు న్యాయమును జేకూర్చుచు యథామాతృకానువాదమును సహేతుకవ్యాఖ్యతో - సహృదయముతో వివరించుటే గోపదేవ్‌గారి క్రొత్తపద్ధతి. వీరి వ్యాఖ్య వక్రతకు తావీయలేదు. సంకుచితత్త్వమునకు స్థానమొసగలేదు. విశాలభావనల

కాశ్రయ మిచ్చి నిర్మమతతో ద్వేషాసూయారహితముగ సత్యప్రకటనావేశముతో వీరు వ్యాఖ్యాన కొనసాగించిరి. ప్రతి పదమునకు యౌగికార్థమును (వ్యుత్పత్త్యర్థమును) వ్యక్తీకరించిరి.

విషయములను వివరించుపట్ల సుదీర్ఘపరిశోధనల నొనర్చి, సునిశిత పరిశీలనల గావించి, నిస్సంశయాత్మకముగ నిర్ణయముల గైకొనుట వీరి నిస్తులవ్యాఖ్యానపద్ధతికి నిరుపమానశోభను గూర్చుచున్నది.

జటిలసమన్యలను, క్లిష్టాన్వయము గల విషయములను వివరించునపుడు సైతము వీరివ్యాఖ్యానము సులభమై -సువేద్యమై 'అరటిపండు నొలిచి చేతనిడిన తెఱుగున' మధురతను వెలయించుచుండును. చూడుడు! 'శూద్రశబ్దము జాతివాచకము కాదు. గుణవాచకము. శూద్రునకు శాస్త్రాధ్యయనము చేయు నధికారము కలదు.' అను బాదరాయణ - ఋషి నిర్ణయమును స్పష్టముగ నిరూపించి చూపెట్టుటలో వీరినిర్మలధీశక్తి కొనియాడదగినది. (216 పుట.)

'భావం తు బాదరయణోఽస్తి హి' (1-3-33) ''వేదమును చదువు నధికారము శూద్రసంజాతులకు లేదనుట తగదని వ్యాసమహర్షి సిద్ధాంతము'' (218పు.)

''శూద్రులకు వేద శాస్త్రాధ్యనాధికారము లేదు''. అను జైమిని భావము శాస్త్రసమ్మతము గాదని వ్యాసమహర్షి స్పష్టముగ నిరూపించెను (214పు.)

ఇట్టి విశేషములతో గ్రంథము నిండియున్నది. శాస్త్రజ్ఞానశూన్యులైన సామాన్యులు సైతము చకచకగ నర్థ మొనర్చుకొను పగిది - ఆనందించురీతి సులభవ్యాఖ్యానపాండిత్యమును శ్రీ గోపదేవ్ శాస్త్రిగారు ప్రకటించిరి. పండితులను సైతము మెప్పించు తెఱగున గ్రంథమునడకను సాగించిరి. ఈ విధముగ శ్రీ గోపదేవ్ శాస్త్రిగారు లోకమునకు మహోపకార మొనరించిరి.

ఆంధ్రలోకము శాస్త్రిగారి గ్రంథమును కేవలము వాగ్రూపమునగాక సర్వవిధముల సమ్మానింతురని ఆశించుచున్నాను.

# పరిచయము

ఓమ్ విశ్వాని దేవ సవితర్
దురితాని పరాసువ
యద్ భద్రం తన్న ఆసువ.

వేదాంతము :

వేదములు నాలుగు. ఋగ్వేదము, యజుర్వేదము, సామవేదము, అథర్వవేదము. వేదవిదు లెల్లరు చతుర్వేదములని వీనినే చెప్పుదురు. భూమండలమున వేదనామముతో ప్రసిద్ధము లయినవియు నియ్యవియే. యజుర్వేదమునగల పురుషసూక్తమునందు పరమాత్మజనితములుగా నీ వేదములే యిట్లు వర్ణింపబడినవి.

"తస్మాద్ యజ్ఞాత్ సర్వహుత ఋచః సామాని జజ్ఞిరే
ఛందాగ్ంసి జజ్ఞిరే తస్మాత్ యజు స్తస్మా దజాయత".

ఇందు ఋక్కులు, సామములు, ఛందస్సులు, యజుస్సు అను శబ్దములచే వర్ణింపబడినవి యావేదములే. ఇట్లే ముండకోపనిషత్తునందు పరాపరవిద్యలను వివరించుచు వేదముల నిట్లుల్లేఖించియున్నాడు ఉపనిషత్కారుడు.

"ద్వే విద్యే వేదితవ్యే ఇతిహస్మ యద్
బ్రహ్మవిదో వదంతి పరా చైవాపరా చ"

"తత్రాపరా ఋగ్వేదో యజుర్వేదః
సామవేదోఽథర్వవేదః". ముం. ౧-౧-౪,౫.

మరియు ఛాందోగ్యమునందు,

"స హోవాచ ర్గ్వేదం భగవోఽధ్యేమి
యజుర్వేదగ్ం సామవేద మాథర్వణం చతుర్థమ్".

అని నాలుగువేదముల నామములు స్పష్టముగా నుట్టంకింపబడినవి.

ఈ నాలుగు వేదముల అంతము వేదాంతమని సామాన్యముగ జెప్ప దగును. 'వేదానాం అంతః వేదాంతః' అని వేదాంత మను సమస్తపదము నకు విగ్రహము చెప్పవచ్చును. వేదములు నాలుగని పైన తెలిపియున్నాము. వాని అంతము అనగా పర్యవసానమని యొకయర్థము చెప్పనగును. ఏ యర్థమున - ప్రయోజనమున పైన వర్ణించిన ఋగాదివేదములు నాలుగును వర్తించునో - ఏ యర్థమునం దీనాలుగు వేదములు సాక్షాత్తుగానో పరంపర గానో పర్యవసితము లగునో - ఇదియే మా ముఖ్యప్రయోజనమని చెప్పి ముగించునో - అదియే వేదాంతము. లేక, యీ వేదములు మానవమాత్రు లకు శబ్దములమూలమునను, తాత్పర్యముమూలమునను ముక్తిప్రాప్తిహేతు వుగా నే యర్థముమ బోధించునో యా యర్థమే - ప్రయోజనమే - వేదాం తము అని వేదాంతవిదులు పలుకుదురు.

మానవులయెడ మిక్కిలి దయగలవారైన తలవకారప్రభృతి మహ ర్షులు అనుగ్రహవశులై యుపర్యుక్తవేదాంతమును - వేదార్థమును - బోధిం చుటకే సరళమైన సంస్కృతభాషలో కేనకఠాద్యుపనిషత్తులను రచియిం చిరి. ఆ యుపనిషత్తులుకూడ వేదాంతపదముచే వ్యవహరింపబడుచున్నవి. కావుననే ముండకమున -

"వేదాంత విజ్ఞాన సునిశ్చితార్థాః" ౩-౨-౬. అనియు,

ఈవేదాంతదర్శనమునందు -

"సర్వవేదాంతప్రత్యయం చోదనాద్యవిశేషాత్". ౩-౩-౧.

అనియును వేదాంతపదము ఉపనిషదర్థమునందే వాడబడినది.

"అధియజ్ఞం బ్రహ్మజపే దాధిదైవిక మేవ చ

ఆధ్యాత్మికం చ సతతం వేదాంతాభిహితం చ యత్" మను.౬-౮౩.

అని మనువుకూడ నీశ్లోకమునందు వేదాంతపదము నుపనిషదర్థమున వాడుట సుస్పష్టము. కావున వేదాంతమన ఉపనిషత్తు లనియు వ్యవహరింపబడుట లోకశాస్త్రప్రసిద్ధము.

వేదార్థము :

వేదములు బోధించు అర్థము ముప్విధములు. కర్మ, ఉపాసన, జ్ఞానము. అందు ప్రథమము కర్మ; మధ్యమము ఉపాసన; అంతిమము జ్ఞానము. కర్మ, ఉపాసన అను నీ రెండింటివలన ఐహికాముష్మికాభ్యుదయము సిద్ధించును. మానవుడు శుభకర్మములను వేదవిహితములను ఆచరించి, వేదప్రతిపాదితుడగు పరమేశ్వరు నుపాసించి యిహపరములకు సంబంధించిన యౌన్నత్యమును పొందును. కావుననే "కర్మణా పితృలోకః విద్యయా దేవలోకః" (బృ. ౧-౫-౧౬) కర్మములమూలమున పితృలోకము, విద్యచే - ఉపాసనచే దేవలోకము సాధింపబడునని యుపనిషత్తు చెప్పును.

కాని యీ యైహికాముష్మిక సుఖసంపత్తి శాశ్వతము కాదు నిరతిశయమును కాదు. సాతిశయము. వృద్ధిక్షయములు కలది. కావున వేదార్థము ఇంతటితోనే పర్యవసితము కాదు - చరితార్థము కాదు. వేదప్రతిపాద్య ప్రయోజన మింతటితోనే ముగియదని భావము. క్రమముగా ననుభవము వలన క్షయించునట్టి, నీ చోచ్చభేదములతో గూడిన కొండొక స్వల్పార్థమును బోధించుటకే వేదములు భగవత్ప్రసాదితము అగుచో వానియందు గల విశేషమే మగును? విశిష్టము, విలక్షణము నగు నర్థమును బోధించుటకే యవి ప్రసాదింపబడిన వనుట నిస్సంశయము. కావున వేదబోధిత ప్రయోజనము ఐహికాముష్మికాభ్యుదయమే కాదు; అంతకంటెను నెక్కుడు పరమార్థము నిఃశ్రేయసము - మోక్షము అనదగియున్నది. అయ్యది జ్ఞానలభ్యము. అట్టిజ్ఞానము మానవులకు ప్రసాదించుటకే వేదము లవతరించినవి. ఆ జ్ఞానమే వేదములకు పర్యవసితార్థము.

"ప్రజ్ఞానే నైన మాప్నుయాత్" కఠ. ౨-౨౩.

"జ్ఞానాన్ ముక్తిః" సాం. ౩-౨౩.

అని పరమర్షులు జ్ఞానము ముక్తిసాధనముగా బోధించుటలో పర మార్థ మిదియే.

"ఋచో అక్షరే పరమే వ్యోమన్
యస్మిన్ దేవా అధివిశ్వే నిషేదుః,
య స్తన్న వేద కిమృచా కరిష్యతి
య ఇత్తద్విదు స్త ఇమే సమాసతే." ఋ. ౨-౩-౨౧-౩౯.

"సర్వే వేదా యత్పద మామనంతి
తపాంసి సర్వాణి చ యద్ వదంతి
యదిచ్ఛంతో బ్రహ్మచర్యం చరంతి
తత్తె పదం సంగ్రహేణ బ్రవీ మ్యోమి త్యేతత్" కఠ. ౨-౧౫.

అను నీ మంత్రోపనిషత్తులు జ్ఞానమును పరమార్థముగా బోధించుట సువ్యక్తము. ఈ జ్ఞానమును సంపాదించియే మానవసింహము రాగద్వేషాది దావానలముచే దందహ్యమానమగు నీ సంసారారణ్యమునుండి ముక్తమై బ్రహ్మానందము ననుభవించును. కావున నట్టిజ్ఞానమును బోధించుటయే వేదములకు, ఉపనిషత్తులకు పరమార్థము. అందువలననే యుపనిషత్తులను వేదాంతములని విపశ్చితులు వ్యవహరించుచున్నారు.

## ప్రకృతి, జీవులు, బ్రహ్మము :

దృశ్యమానప్రపంచమునకు మూలపదార్థములు ముచ్విధములుగా వేదములచే ప్రతిపాదింపబడుచున్నవి. ప్రకృతి, జీవులు, పరమేశ్వరుడు - బ్రహ్మము. వేదమంత్రములందు బ్రహ్మమును ముఖ్యముగా బోధించు మంత్రములు వేదాంతము లనబడును. యజుర్వేదమున నలువదియవ

యధ్యాయమున గల 'ఈశావాస్య మిదం సర్వమ్' అను నిత్యాదిమంత్ర ములు వేదాంతపదముచే వ్యవహరింపబడుచున్నవి. వానియందు ముముక్షువులకు బోధపడునట్లు సంక్షేపముగా బ్రహ్మము వివరింపబడినది. ఈ బ్రహ్మము ముఖ్యప్రతిపాద్యముగా నెంచబడు మంత్రములు, ఉపనిషత్తులు నన్నియు వేదాంతపదముచే జెప్పబడుచున్నవి.

ఉప, ని పూర్వక సద్ ధాతువునకు క్విప్ ప్రత్యయము చేర్చిన ఉపనిషత్ శబ్దము సిద్ధించును. బ్రహ్మము నుపదేశించునది యని యుపనిషత్పదార్థ మగును. గురువులవలన ఉపనిషత్తులను విని మానవుడు బ్రహ్మజ్ఞానమును సంపాదించును. కావుననే శ్రీ శంకరాచార్యులు ముండకోపనిషద్ భాష్యభూమికయం దిట్లు నుడివియున్నారు.

"య ఇమాం బ్రహ్మవిద్యా ముపయం త్యాత్మభావేన శ్రద్ధాభక్తి పురఃసరాః సంతః తేషాం గర్భజన్మజరారోగా ద్యనర్థపూగాం నిశాతయతి, పరం వా బ్రహ్మ గమయతి. అవిద్యాదిసంసారకారణం చాత్యంత మవసాదయతి వినాశయ త్యుపనిషత్. ఉపనిపూర్వస్య సదే రేవ మర్థస్మరణాత్."

శిష్యుడు గురువును సమీపించి శ్రద్ధాభక్తిసమన్వితుడై బ్రహ్మోపదేశములగు నతనివాక్యముల నాలించి, యమనియమాది యోగాంగానుష్ఠానమొనర్చి బ్రహ్మను సాక్షాత్కారము చేసికొనును. ఇట్లు వేదములకు ముఖ్య ప్రతిపాద్యమగు బ్రహ్మము నుపదేశించు ఉపనిషత్తులు వేదాంతపదముచే చెప్పబడుట ఉచితమే.

కొందఱు మంత్ర, బ్రాహ్మణములు రెండును వేదములే యని యంగీకరించి, వేదములయు, బ్రాహ్మణములయు నంతిమభాగములు వేదాంతములనియు, అయ్యవియే యుపనిషత్తు లనియు చెప్పుదురు. అయ్యది సమంజసము కాదు. శతపథము, గోపథము నను నామములతో

వ్యవహరింపబడు బ్రాహ్మణములు వేదము లెన్నడును కావు. అవి వేదము లకు వ్యాఖ్యానములు. వ్యాఖ్యానములు, వ్యాఖ్యేయములు రెండును సమము-ఒక్కటెట్లు కాగలవు? కావున వేదాంతములన వేదబ్రాహ్మణాత్మక గ్రంథముల యంతిమభాగములని యెన్నడు నెంచరాదు. అందువలననే, ఉపనిషత్తులు వేదభాగము లనియు, నవి వేదములవలె స్వతఃప్రమాణము లనియు నెంచుట శిష్టసమ్మతము కాదు. ఒక్క ఈశావాస్యోపనిషత్తు మాత్రమే యజుర్వేదముయొక్క యంతిమభాగము. మిగిలిన కేనకఠా ద్యుపనిషత్తులు ఋషిప్రణీతము లగుటవలన నవి బ్రాహ్మణాదుల కంత ర్భాగములయ్యు వేదభాగము లన నొప్పవు. వానికి స్వతఃప్రామాణ్యము కూడ వేదవిదు లంగీకరింపరు. అవి వేదానుకూలముగా బ్రహ్మము నుప దేశించి వేదాంతపదవాచ్యము లగుట కెట్టి యాటంకము నుండదని భావము.

కాని ప్రసిద్ధములగు ఈశాదులయిన పదిపదునొకండు ఉపనిషత్తు లలో ఈశావాస్యోపనిషత్తు యజుర్వేదమున కంతిమభాగ మగుటవలన దానికి వేదాంతపదము ముఖ్యముగా వర్తించుననియు, తన్మూలకముగా నితరకేనా ద్యుపనిషత్తులకు వేదాంతపదము గౌణముగా వర్తించుననియు చెప్పిన నెవరికి నెట్టి యాపత్తియు నుండరాదు.

వేదవేదాంతములను జదివి బహుకాలము జనులు బ్రహ్మజ్ఞానమును సంపాదించి మోక్షలాభము వడయుచుండెడివారు. కాని కాలచక్రము పరి భ్రమించినకొలది వేదవేదాంతముల ప్రచారము సడలిపోవుటవలన సంప్ర దాయభేదము లేర్పడి వేదాంతములగ్రహణములో సంశయగ్రస్థులైరి. బ్రహ్మోపాసనమా ముక్తిదాయకము? లేక బ్రహ్మజ్ఞానమా? బ్రహ్మ జ్ఞానము కర్మసముచ్చితమై యపవర్గము నొసంగునా? లేక కేవలబ్రహ్మ జ్ఞానమా? కేవలబ్రహ్మజ్ఞానము విశుద్ధమనస్సువలన జనించునా? లేక స్వాత్మను సాక్షాత్కారము చేసికొనుటచేతనా? శాస్త్రములందు విధించినట్లు

అనుష్ఠించిన కర్మోపాసనలకు జ్ఞానకారణమైన మనోవిశుద్ధి యొక్కటియే ఫలమా? మరియొండు కలదా? అన్యఫల మేదైన లభించిన నద్దాని నా బ్రహ్మోపాసకులకు కర్మోపాసనలే యొసంగునా? లేక జగజ్జన్మాదికారణ మగు బ్రహ్మమొసంగునా? ఆ ఫలముకూడ నీ జన్మమందే యనుభవింతురా? లేక మరియొకజన్మమం దెట నైన ననుభవింతురా? చచ్చి అన్యజన్మమున అనుభవించునెడల జీవుడు మరియొండు పురుషునిచే గొంపోబడునా? లేక జీవుడొానర్చు క్రతువులకు సహాయపడు సూర్యరశ్మిలచే గొంపోబడునా? కర్మఫలముల ననుభవించు జీవులు వ్యాపకులా? లేక యణుస్వరూపులా? అణుస్వరూపు లగుచో వానిసంఖ్య యెంత? లేక యసంఖ్యేయములా? జన్మాంతరములందు జీవులకు లింగశరీరముండునట్లు ముక్తియందు నుండునా? అది నశించునా? ముక్తియన జీవుడు బ్రహ్మభావమును పొందుటయా? లేక బ్రహ్మానందప్రాప్తియా? ముక్తజీవులు మరల నెన్నడేని జన్మింతురా? లేక జన్మింపరా? ఈ ప్రపంచము స్థితి కలదా? లేనిదా? లేని దగుచో మిథ్యయా? లేక సత్యమా? సత్యమగునెడల దీనికి ఉపాదానకారణము బ్రహ్మమా? ప్రకృతియా? జీవప్రకృతులు తమయునికి (సత్తా)కి బ్రహ్మము నపేక్షింపనట్లు స్వస్థితికి (జీవనము) బ్రహ్మము నపేక్షించునా? అపేక్షింపవా? జీవప్రకృతుల కధిష్ఠానమగు బ్రహ్మము వ్యాపకమా? పరిచ్ఛిన్నమా? అది పరిచ్ఛిన్నముకాక వ్యాపకము (విభువు) అయినను దానికంటె పరమ మింకొకటి యున్నదా? లేక యదియే సర్వమునకు పరమై సర్వాధిష్ఠానమై, సర్వజ్ఞమై, సర్వశక్తిమంతమై, సచ్చిదానందస్వరూపమై వెలయుచున్నదా? అను నిట్టిసంశయములకు గురియైన మానవులు కోరి యిహపరసౌఖ్యములు కాని, నిఃశ్రేయసమును గాని పొందనేరరుకదా? సంశయము ప్రవృత్తిని కలుగనీయదు. అది ప్రవృత్తివిఘాతకము. కావుననే భగవద్గీతయం దిట్లు నుడువబడినది.

"అజ్ఞ శ్చాశ్రద్దధానశ్చ సంశయాత్మా వినశ్యతి
నాయం లోకోఽ స్తి న పరో, న సుఖం సంశయాత్మనః" ౪-౪౦.

మానవులు శబ్దార్థములందు సంశయితమనస్కులై సిద్ధాంతనిర్ణయము చేయజాలక కింకర్తవ్యవిమూఢులగుదురు. ఐహికాముష్మికసుఖములకు దూరులై కడకు నిఃశ్రేయసపదము నందజాలరు. నానావిధసంసారావర్తానలమున కింధనభూతు లగుచుందురు. ఇయ్యది సహింపజాలక కరుణార్ద్రహృదయుడగు వ్యాసమహర్షి (బాదరాయణాపరనామ్నా ప్రసిద్ధుడగు ముని) వేదాంతార్థములను నిర్ణయించుట కనువుగా సిద్ధాంతార్థ నిరూపణ పరమగు వేదాంతదర్శనమును రచించియున్నాడు. అదియే కర్మకండె ను త్తరములగు జ్ఞానోపాసనలను మీమాంసించున దగుటవలన ఉత్తర మీమాంస యనబరగుశాస్త్రము. ఇందు నాలుగు అధ్యాయములు కలవు. ప్రతియధ్యాయము నాలుగుపాదములు కలిగియుండును. ఇయ్యది సూత్రాత్మకగ్రంథము. ఇందు బ్రహ్మము ప్రధానముగ నిరూపింపబడుటచే బ్రహ్మసూత్రము లనియు నీ గ్రంథము వ్యవహరింపబడును. పాణినికి పూర్వ మీ సూత్రములు చతుర్థాశ్రమవాసులగు భిక్షువులచే నభ్యసింపబడుటచే భిక్షుసూత్రము లనియు కీర్తింపబడుచుండెడివి. కావుననే పాణిని వ్రాసిన యష్టాధ్యాయియందు-

"పారాశర్య శిలాలిభ్యాం, భిక్షునటసూత్రయోః ౪-౩-౧౧౦ అను సూత్రమును చూతుము.

ఈ సూత్రము నందు సూచించిన భిక్షుసూత్రములు బాదరాయణ సూత్రములకు మూల సూత్రములని కొందఱు వాకొందురు. అది యెంత వరకు సత్యమో ఆలోచింపదగిన విషయము.

పూర్వ భాష్యకారులు :

ఈ బాదరాయణ సూత్రములకు వేదాంత శాస్త్రమునకు ఉపవర్ష బోధాయన మునులు ప్రప్రథమమున వ్యాఖ్యానము వ్రాసినట్లు దర్శనేతిహాస కోవిదులు చెప్పుదురు. వారిలో బోధాయనముని ద్రవిడదేశవాసి యనియు, అతడు బ్రహ్మసూత్రములకు వృత్తినామముతో నొక విస్తరవ్యాఖ్యానము వ్రాసియున్నట్లు నుడువుదురు. విశిష్టాద్వైతు లావృత్తినామక బోధాయన ముని వ్యాఖ్యానము విశిష్టాద్వైత పరమని వాక్రుత్తురు. అయ్యది వైదిక సిద్ధాంతపరమని కొందఱు వచింతురు. వాస్తవమున బోధాయనముని విశిష్టాద్వైత సంప్రదాయమునకు చెందినవాడే యగునెడల నతని వ్యాఖ్యానము వేదాంతార్థమును సరిగా నుపపాదించుననుటకు వీలుండదు. సంప్రదాయ దోష సంవృత మనస్కుడు యాథార్థ్యమును వేదానుకూలముగ వివరించుట దుర్ఘటముకదా। బోధాయనముని మంత్రసంహితలకువలె బ్రాహ్మణములకును వేదత్వ మంగీకరించువారిలో నొకడు. కావునను నతడు వైదిక సిద్ధాంతమును బాగుగ నిరూపించునని యెంచుటకు వలను పడదు. అందువలననే విశిష్టాద్వైతముకూడ వైదిక సిద్ధాంతము కాదని వైదికులమతము.

ఉపర్యుక్త బోధాయనముని కృత వృత్తిని ఆధారము చేసికొని విశిష్టాద్వైత సంప్రదాయానుయాయు లయిన టంక, ద్రమిడ, గురుదేవ, భారుచి, కపర్ది, భర్తృహరి మున్నగు ఆచార్యులు పెక్కురు బ్రహ్మసూత్రములకు వ్యాఖ్యానాదులు వ్రాసియుండిరి. వీరి వ్యాఖ్యానాదులమూలమున వృత్తి కొంతకాలము వ్యాపకతను సంపాదించియు శ్రీరామానుజాచార్యుల కాలము నాటి కది నష్టప్రాయమయిన దనక తప్పదు. శ్రీ రామానుజస్వామి తన బ్రహ్మసూత్ర భాష్యము నారంభించి యొకయెడ నిట్లు వ్రాసియున్నాడు. "బోధాయనముని బ్రహ్మ సూత్రార్థములను బోధించుట కొక వృత్తి

విస్తరముగ వ్రాసియున్నాడు. కాని తరువాత వచ్చిన ఆచార్యులు ఆవృత్తిని సంక్షేపించియున్నారు. బోధాయన బ్రహ్మసూత్రవృత్తిని అనుసరించి వ్రాసిన పూర్వాచార్యుల సంక్షిప్త వర్ణనల కనుకూలముగ నేను సూత్రార్థములను వ్రాయుదును. బోధాయన వృత్తి పూర్వాచార్యుల వ్యాఖ్యానము లందు శబ్దరూపమున కొంత, అర్థరూపమున కొంత యటనట లబ్ధమగు చున్నది.

బోధాయనుడు బ్రహ్మ సూత్రములకువలెనే ఉపనిషత్తులకును, భగవద్గీతకును వ్యాఖ్యానములను రచించియుండును. కావుననే శ్రీ శంకరాచార్యులు తన బ్రహ్మసూత్ర భాష్యమునందును, ఉపనిషద్ భాష్యమునందును బోధాయన వృత్తిగత వాక్యములను పూర్వపక్షమున నుట్టంకించి సమాధానములను వ్రాసియున్నారు. బోధాయనముని వ్యాఖ్యానమును పూర్వపక్షమున నుదాహరించి తమ యద్వైత మతమును సాధించుటకు పలుతావులందు యత్నించుట చూడనగును. బోధాయనముని కపఖ్యాతి కలిగించుటకే యట్లు చేసియుందు రనుట నిస్సంశయము. కాని తమ యద్వైతమును సాధించుటకు భర్తృహరి వ్రాసిన బ్రహ్మసూత్ర భాష్యము నెంతయు నుపయోగించుకొని యున్నారు. శంకరాచార్యులకు పూర్వము అద్వైతపరముగ బ్రహ్మసూత్రములకు వ్రాయబడిన భాష్యము భర్తృహరి భాష్యముతప్ప మరియొండు కనిపింపదు. ప్రస్తుతము పాఠకులకు లభించు భాష్యములలో మొదటి భాష్యము శ్రీ శంకరాచార్యుల భాష్య మనక తప్పదు. తదుపరి శ్రీ రామానుజాచార్యులు శ్రీ మధ్వాచార్యులు మున్నగు వారు పెక్కురు బ్రహ్మసూత్రములకు భాష్యములు వ్రాసియున్నారు. కాని యీ భాష్యముల కన్నింటికి రాచబాట నేర్పరచినది శాంకరభాష్య మనక తప్పదు. శ్రీరామానుజా ద్యాచార్యు లెల్లరు శంకరపాదుల భాష్యముల ననుకరించి యున్నారనుట నిస్సందిగ్ధము.

శంకరాచార్యులు మొదటి ఒకటి రెండు అధ్యాయముల భాష్యము నందు ఇతర మతములను ఖండించుటలో నెంతో యుగ్రభావమును ప్రకటించియున్నారు. అనంతర భాష్యకారులు- రామానుజాచార్యులు కూడ శంకరు ననుకరించి అట్లే పరమతములను ప్రత్యాఖ్యానము చేయుట చూడ నగును. కాని సూత్రకారుడు స్వయముగ తన సూత్రములను అన్యమతములను ఖండించుటకు వ్రాసినట్లు కనిపింపదు. అంతేకాక సూత్రకారుడు తన సూత్రములందు బ్రహ్మముతక్క మరియొందు పదార్థమే లేదని నిరూపింపదలచినట్లును కనిపింపదు. మరియు వివర్తవాదమునకు సంబంధించిన సంకేతములుకూడ సూత్రములందు కానరావు. కాబట్టి బ్రహ్మము జగత్తునకు ఉపాదానకారణమని కల్పించుటయు సూత్రానుసరణము కానేరదు. సాంప్రదాయిక భావనను విడిచి సూత్రపదముల నాకళింపుచేసికొన యత్నించువారికి పై విషయము స్పష్టము కాగలదు.

బ్రహ్మాద్వైతభావము :

ఉపనిషత్తులం దటనట గల కొన్ని వాక్యముల నాధారముగ గ్రహించి వాని మూలమున శంకరాచార్య ప్రభృత్యద్వైతవాదులు బ్రహ్మాద్వైత భావమును ప్రతిపాదింప యత్నించుట వారి భాష్యములందు జూడ నగును. కాని, ఆ వాక్యములు బ్రహ్మాతిరిక్త పదార్థములయునికిని నిషేధించి కేవల మొక్క బ్రహ్మమును ప్రతిపాదించునని నిస్సందిగ్ధముగ నెవ్వరును చెప్పజాలరు. అయ్యవి బ్రహ్మతత్త్వమును మాత్రము ప్రతిపాదించుటలో పర్యవసితము లగుచున్నవా, లేక యన్య పదార్థముల యునికిని నిషేధించుచున్నవా, అను సందేహము చదువరులను వెన్నాడకపోదు. బ్రహ్మము నందు సజాతీయ విజాతీయ స్వగత భేదశూన్యమును ప్రకటించి బ్రహ్మతత్త్వ యథార్థతను వర్ణించుటయే యీ వాక్యముల ముఖ్య తాత్పర్యము. అన్యతత్త్వముల యునికిని నిషేధించుట కానేకాదు. బ్రహ్మము ఏకమాత్ర

తత్త్వము. దాని జాతికి చెందిన మరియొక బ్రహ్మముకాని, విజాతీయ బ్రహ్మముకాని, బ్రహ్మమునందు అవయవ భేదముకాని లేదని భావము. బ్రహ్మద్వైతమున కీ భావము సంభవము కావచ్చును. అన్యతత్త్వములను నిషేధించుట మాత్రముకాదు. అందువలననే కాబోలు శంకర సంప్రదాయమునకు జెందిన ఆచార్యులు బ్రహ్మము, ఈశ్వరుడు, జీవుడు, జీవేశ్వరుల భేదము, అవిద్య, దానికి- చేతనమునకు గల సంబంధము అను ఆరు పదార్థములు అనాదులు అని యంగీకరించుచున్నారు. దీనింబట్టి బ్రహ్మాతిరిక్త పదార్థములు లేవనుట యెట్లు పొసగును ?

'ఇదం సర్వం యదయ మాత్మా'. బృ. ౨-౪-౬.

ఆత్మై వేదం సర్వమ్'. ఛాం. ౭. ౭-౨౫-౨.

'బ్రహ్మై వేద మమృతం పురస్తాత్' 'బ్రహ్మై వేదం సర్వమ్.'
ముం. ౨-౨-౧౧.

'సర్వం ఖల్విదం బ్రహ్మ' ఛాం. ౩-౧౪-౧.

'నేహ నానాస్తి కించన'. బృ. ౪-౪-౧౯.

ఇట్టి యుపనిషద్వాక్యములకు 'ఈ దృశ్యమానప్రపంచ మంతయు బ్రహ్మము. అంతకు మించి యేమియు లేదు.' అని యర్థము చెప్పుదురు. కాని యీ వాక్యములకు బ్రహ్మముతక్క యన్యమొండును లేదని యెంచుటయు, నమ్ముటయు, ప్రచార మొనర్చుటయు మిక్కిలి యాశ్చర్యకరము; వంచన; గారడి యనుట యసత్యము కాదు. ఈ వాక్యముల పూర్వాపరములను పరిశీలించినవారికి సత్యము గోచరింపక పోదు. పై వాక్యము లన్నియు బ్రహ్మము వర్ణన ప్రసంగములకు జెందినవి. బ్రహ్మము మహిమను ప్రకటించుటయే వాని తాత్పర్యము. బ్రహ్మము మనకు ముందు, వెనుక, క్రింద, పైన అంతట వ్యాపించియున్నది. విశ్వమున నెల్లయెడల నుండుటయేగాక విశ్వమును మించి యున్నది. ఎల్ల ప్రాణులందును, వస్తువులందును

వ్యాపించి నిరంతరముగా నున్నది. విశ్వోత్పత్తి, స్థితి, లయములకు కర్త, ధర్త, నియంతయునై యున్నది. అట్టి బ్రహ్మమునందు నానాత్వమును కల్పించుట తగదు. ఇదియే పై వాక్యముల భావము.

ఈ వాక్యముల నన్నింటిని ప్రకరణానుసారముగ నిట వివరించుట ముఖ్యముకాదు. అవసరమును లేదు. ఆ యా సూత్రభాష్యమునం దీ వాక్యముల వివరణము పాఠకులు చదువవచ్చును. అయినను 'బ్రహ్మైవేద మమృతం పురస్తాత్' (౨-౨-౧౧) అను నీ ముండకోపనిషద్వాక్యార్థమును గూర్చి యొకింత విచారించి చూతము. ఈ వాక్యము బ్రహ్మవర్ణన ప్రకరణమున పఠింపబడియున్నది. దీనికి పూర్వము

'న తత్ర సూర్యో భాతి న చంద్రతారకమ్....'

'సూర్యచంద్రాదులు బ్రహ్మమును ప్రకాశింపజేయనేరవు. బ్రహ్మము చేతనే యీ సూర్యచంద్రాదు లన్నియు ప్రకాశింపజేయబడుచున్నవి' అని వర్ణించి అనంతరము

'బ్రహ్మైవేద మమృతం పురస్తాత్' అని ప్రారంభింపబడినది. ప్రసంగము ననుసరించి యీ వాక్యమునందలి పదముల కన్వయ మిట్లగును. 'ఇదం ఏవ అమృతం బ్రహ్మ పురస్తాత్....' ఈ యమృత బ్రహ్మమే మనకు ముందు, వెనుక, ప్రక్కల, నన్నిదిక్కులందును వ్యాపించియున్న దని వాక్యార్థమగును. అంతేకాని, యీ వాక్యమునందలి (ఇదం) 'ఇది' యను పదము (పురస్తాత్) 'ముందున్న' అను పదముతో చేర్చి 'యీ జగత్తే' అమృతబ్రహ్మము అని జగత్తును బ్రహ్మాత్మకముగా బోధించు ననుట యుక్తము కాదు. వాక్యమునందలి (ఇదమ్) 'ఇది' యను పదము పూర్వవాక్యవర్ణిత బ్రహ్మమును పరామర్శించును. అప్రస్తుతమైన జగత్తును బోధింపదు. కాబట్టి యీ వాక్యము జగత్తు బ్రహ్మాత్మకము (జగత్తే బ్రహ్మము) అని బోధింపనేరదు. ఇట్లే యితరవాక్యములుకూడ ప్రకరణ

బద్ధములై యన్యార్థమును బోధించుచుండ వానికి భిన్నార్థములను గల్పించి బ్రహ్మద్వైతభావమును బోధించుననుట యుక్తముకాదు. బ్రహ్మమువద్వైత మనుటలో బ్రహ్మముతక్క మరియొండు పదార్థమే లేదని యెంచక బ్రహ్మ ముతో సమానమైనట్టిది కాని, అంతకంటె నధికమైనది కాని వస్తువు లేదనియే గ్రహింపనగును. ఇదియే శాస్త్రీయవాక్యతాత్పర్యముగా నెంచ వలెను.

మహా వాక్యములు :

అద్వైతసంప్రదాయకులు బహుళముగా వ్యవహరించు 'అహం బ్రహ్మాస్మి' మున్నగు మహావాక్యములకల్పన శ్రీ శంకరాచార్యులు చేసి యుందురని తోచుచున్నది. అంతకు పూర్వపుసాహిత్యమున నీ వాక్యములు మహావాక్యములని వర్ణించి వ్యవహరించినట్లు కానము. ఈ వాక్యములు కూడ అభేదబోధకము లనుటకు తగిన ఆధారము లేవియు కానిపింపవు. ఈ వాక్యములు నాలుగు. ౧. అహం బ్రహ్మాస్మి. ౨. అయ మాత్మా బ్రహ్మ. ౩. తత్త్వ మసి. ౪. సోఽహమ్. లేక, ప్రజ్ఞానం బ్రహ్మ. ఉపనిషత్తులలో నీ వాక్యములస్థానము లిట్లు క్రమముగా జూడనగును.

౧. 'బ్రహ్మ వా ఇదమగ్ర ఆసీ త్తదాత్మాన మేవావేత్ అహం బ్రహ్మాస్మి ఇతి తస్మా త్తత్ సర్వ మభవత్'. బృ. ౧-౪-౧౦.

౨. 'తదేతద్ బ్రహ్మ పూర్వ మనపర మనంతర మబాహ్యమ్. అయ మాత్మా బ్రహ్మ సర్వానుభూ రిత్యనుశాసనమ్'. బృ. ౨-౫-౧౯.

౩. 'స య ఏషోఽణి మైత దాత్మ్య మిదం సర్వం తత్ సత్యం స ఆత్మా తత్త్వ మసి శ్వేతకేతో। ఇతి'. ఛాం. ౬-౮-౧౬.

౪. 'ఆత్మైవేద మగ్ర ఆసీత్ పురుషవిధః సోఽనువీక్ష్య నాన్యదాత్మనో ఽపశ్యత్ సోఽహమ్ అస్మీ త్యగ్రే వ్యాహరత్. తతోఽహం నామాభవత్'. బృ. ౧-౪-౧.

ఈ వాక్యము లితరోపనిషత్తులందును లభింపవచ్చును. ఇట నొక స్థలమునుండి యెత్తి చూపుచున్నాము. ఇందు మొదటివాక్యమునుగూర్చి ఆలోచింపుడు. ఉపనిషత్కర్త సృష్టి యేర్పడుటకు ముందున్నస్థితిని వర్ణించుచున్నాడు.

౧. 'బ్రహ్మమే యీ సృష్టికి పూర్వమున నున్నది. అది తన్ను తాను తెలిసికొనినది; 'నేను బ్రహ్మను' అని. దానివలన ఇది యంతయు నయ్యెను.'

ఈ యర్థమునుబట్టి ఉపనిషత్కర్త (అహం బ్రహ్మాస్మి) 'నేను బ్రహ్మను' అను నీ వాక్యమును బ్రహ్మచేతనే చెప్పించినట్లు మనకు తెలియుచున్నది. బ్రహ్మము తన్ను తాను 'నేను బ్రహ్మమును' అని చెప్పకొనుచున్నాడు. ఇదియే బ్రహ్మముయొక్క యుపాస్యస్వరూపము. ఇందు బ్రహ్మ మొకేతత్త్వము అను భావము నిహితమై యున్నది. సృష్టి జరిగిన తదుపరి ఉపాసకుడు బ్రహ్మము నుపాసించునపుడు ప్రాకృతతత్త్వములతో కూడినవాడై యా తత్త్వములద్వారమున బ్రహ్మమును జిజ్ఞాసించును. బ్రహ్మమునకు సంబంధించిన యా యుపాస్యస్వరూపమునందు ప్రకృతికి గాని, జగత్తునకుగాని యెట్టి సంబంధము నుండరాదు. ఈ యాథార్థ్యమును- సృష్టికి పూర్వపుస్థితియందుగల విశుద్ధబ్రహ్మస్వరూపమును అభివ్యక్తము చేయుటకే 'అహం బ్రహ్మాస్మి' 'నేను బ్రహ్మను' అను వాక్యము ప్రయోగింపబడినది. ఈ ప్రసంగమున తరువాతకూడ బ్రహ్మముయొక్క యీ స్వరూపమును ఉపాస్యముగా చేయుభావనతో మరల చెప్పబడినది. ఋషులలో, విద్వాంసులలో, మానవులలోను ఎవ దీ బ్రహ్మముయొక్క యుపాస్యస్వరూపము నెరింగెనో యాతడే బ్రహ్మమును బొందెను. ఇప్పుడు కూడ ఎల్లపుడు నట్లు చేయనగును.

'తదిద మప్యేతర్హి య ఏవం వేద - అహం బ్రహ్మాస్మి - ఇతి స

ఇదం సర్వం భవతి'. అను వాక్యార్థ మియ్యదియే. సృష్టికి పూర్వము 'అహం బ్రహ్మాస్మి' 'నేను బ్రహ్మను' అని యభివ్యక్తము చేయబడిన ప్రకృత్యాది పదార్థములతో సంపృక్తముకాని బ్రహ్మస్వరూపమును,ఇప్పుడు కాని మరియొకప్పుడుకాని తెలిసికొనినవాడు ఇది యంతయు నగును - ఈ దృశ్యమానప్రపంచమున కంతటికి నాధారమగు బ్రహ్మమును ప్రాప్తించును. ఈ యవస్థయందు జీవాత్మ మిక్కిలి భక్తిభావనోద్రేకమున తన్ను బ్రహ్మముతో నేకమై యున్నట్లు అనుభవించును. బ్రహ్మము నిట్లు పొందినపు డతని కామము లన్నియు పూర్ణములగును. అప్పుడే యతనినుండి యట్టిభావనలు వెలువడును. అవియే వామదేవునినామముతో ప్రసంగమున సుల్లేఖింపబడినవి. జీవుడు స్వభావముతో స్వతఃబ్రహ్మమే యగునెడల నీ భావనలన్నియు నిరాధార మగును. బ్రహ్మముచే ఉపనిషత్కర్త చెప్పించిన 'అహం బ్రహ్మాస్మి' అను వాక్యమున నిమిడియున్న స్వారస్యమిదియే.

ఉపనిషత్తులశైలిలో నొకవిలక్షణత చూడనగును. దానివాస్తవికతను దృష్టిపథమున నుంచనిపక్షమున ఆ శైలిలో నిహితమైయున్న గూఢార్థమును గ్రహింపజాలము. ఉపనిషత్తులలో జీవబ్రహ్మైక్యమును సూచించు వాక్యములు బొత్తిగా లేవనుట నా యభిప్రాయము కాదు. కాని, 'అహం బ్రహ్మాస్మి' అను నీ వాక్యము మాత్రము బ్రహ్మముయొక్క యతిశయ మహత్తును ప్రకటించుచున్న దనియే చెప్పనగును. ఇట్టి సందర్భములలో ఆపాతతః ప్రతీయమానములగు నర్థములను గ్రహించి శ్రీ శంకరాచార్యులు వానిని పోషించుటకు కోటగోడలను నిర్మించి యవి యభేద్యములని యెంచి యున్నారు. కాని ఆ దుర్గములందు వాస్తవముగ నెన్నో గుప్తద్వారములు తెరవబడియేయున్నవి. ఆలోచించుస్వభావముగల విద్వాంసు లాద్వారముల మూలమున నంతఃప్రవేశ మొనర్చి యథార్థతను గుర్తింపయత్నింతురుగాక!

'అయ మాత్మా బ్రహ్మ' అను నీ రెండవ వాక్యముకూడ బ్రహ్మ వర్ణన ప్రకరణమునుండి గ్రహింపబడినదియే. కావుననే 'ఈ యాత్మ బ్రహ్మము' అని చెప్పబడినది. జీవాత్మ బ్రహ్మమనుట కట నెట్టి యాధారము కనిపింపదు. ఇతరములగు తత్త్వమస్యాది వాక్యముల స్థితియు నిట్టిదియే.

సూత్రకర్త :

భారతీయ పరంపర ననుసరించి బ్రహ్మసూత్రములను రచియించిన మహర్షి వేదవ్యాసుడు. ఇతడు ద్వాపరాంతమువాడు. ఇతని సాంస్కృతిక నామము కృష్ణద్వైపాయనుడు. బాదరాయణు డనియు నితడు పిలువబడును. కాని ఆధునికులు కొంద తీపరంపర నంగీకరింపకుండుటయు కలదు. ఇందులకు కారణము ఈ బ్రహ్మసూత్రములకు శ్రీ శంకరాచార్యులు వ్రాసిన భాష్య మనదగును. శ్రీ శంకరాచార్యు లీసూత్రముల నాధారముగ గ్రహించి తన భాష్యమునందు బౌద్ధ జైన దర్శనములను ప్రత్యాఖ్యానము చేసి యున్నారు. బౌద్ధ జైన దర్శనములు వేదవ్యాసునకు తదుపరి వేలకొలది సంవత్సరములు గడచిన తరువాత వెలసినవి. కావున వేదవ్యాసుడు తన కాలమందు బౌద్ధజైన దర్శనముల ప్రత్యాఖ్యానము చేయుట సంభవ మెట్లు కాగలదు ? కావున ఈ బ్రహ్మసూత్రములను రచియించినవాడు వేదవ్యాసుడు కా డనవలయును. బౌద్ధ జైన దర్శన రచనానంతరమున బాదరాయణు డను నామము గల మరియొక వ్యక్తి యీ సూత్రములను రచించినా డనవలసివచ్చును. లేదా శ్రీ శంకరా చార్యులు సూత్రకారుని భావనల ననుసరింపక ఆ యా సూత్రముల భాష్యమునందు స్వయముగా నేదోయొక విధముగ ప్రసక్తిని కల్పించి బౌద్ధ జైనదర్శనముల ప్రత్యాఖ్యానము చేసియుండు ననవలయును. ఇంతకుమించి మరియొక విధము సంగతము కాదు. ఆధునికులు శ్రీ శంకరాచార్యుల భాష్యము అసంగత

మనుటకు వెఱచి ప్రాచీన పరంపరనే యసత్య మనుచున్నారు. ద్వాపరాంత కాలపు వ్యాసుడు బ్రహ్మసూత్రములకు కర్తకాదని వారి యభిప్రాయము. కాని వారి యీ వాద మంత సముచితము కాదు. కారణ మేమన శంకరాచార్యులు తమ శారీరక భాష్యమునందు రెండుతావులలో ఉపవర్షుని నామమును స్మరించియున్నారు. ఉపవర్షుడు జైమిని సూత్రములకును, బ్రహ్మసూత్రములకును భాష్యము వ్రాసినట్లు సూచిత మగుచున్నది. ఆధునికులు ఉపవర్షుని అష్టాధ్యాయ సూత్రకర్తయగు పాణిని మహర్షికి సమకాలికుడని యోచించుచున్నారు. పాణినికి గురువు వర్షుడనియు, నతని తమ్ముడు ఉపవర్షుడనియు చెప్పుదురు. వ్యాకరణశాస్త్రనిష్ణాతలు పాణిని మహర్షిని భారతయుద్ధానంతరము మూడుపందల సంవత్సరములనాటివాడుగా నిర్ణయించుచున్నారు. ఇట్లు 'ఉపవర్షునిచే భాష్యము వ్రాయబడిన బ్రహ్మసూత్రములు బౌద్ధజైన దర్శనముల యనంతరము వ్రాయబడినవనియు, వాని రచయిత బాదరాయణుడు భారతయుద్ధమునాటి వ్యాసుడు కాక మరియొకడై యుండుననియు నూహించుట సంగతము కాదు. ఇంతేకాక బోధాయన వృత్తి ననుసరించి ఉపవర్షుడు బ్రహ్మసూత్రములకు భాష్యము వ్రాసియున్నాడు. ఈ విషయము 'ప్రపంచహృదయ' నామక గ్రంథము చూచిన బోధపడును. ప్రపంచహృదయనామక గ్రంథముయొక్క ఉపాంగప్రకరణమున "…. తస్య వింశత్యధ్యాయ నిబద్ధస్య మీమాంసా శాస్త్రస్య కృతకోటి నామధేయం భాష్యం బోధాయనేన కృతమ్, తద్గ్రంథ బాహుల్యాత్ ఉపేక్ష్య కించిత్ సంక్షిప్తమ్ ఉపవర్షేణ కృతమ్" ఇరువది యధ్యాయములతో కూడిన మీమాంసాశాస్త్రమునకు (పూర్వోత్తర మీమాంసలకు) 'శతకోటి' యను పేరుగల భాష్యమును బోధాయనుడు రచించియున్నాడు. అయ్యది విస్తారముగ నుండుటచే దాని నుపేక్షించి సంక్షిప్తమైన భాష్యమును ఉపవర్షుడు రచించినాడు, అని యున్నది. ఇట్లు ఉపవర్షుడు బోధాయనునకు తదుపరి కొలదికాలమువాడనుట నిస్సందిగ్ధము. కావున

ఉపవర్షగ్రథితభాష్యోపేతములగు బ్రహ్మసూత్రములను రచియించిన వ్యాస మహర్షి – బాదరాయణుడు బౌద్ధదర్శనములు రచించినకాలమునకు తరువాతివాడని యూహించు నాధునికుల యభిప్రాయము ఆదరణీయము కాదు.

నా యీ తెలుగు వ్యాఖ్యానము :

బ్రహ్మసూత్రములకు శంకరాద్యాచార్యుల భాష్యములు సంస్కృతమున నెన్నియో యుపలబ్ధము లగుచునే యున్నవి. శంకరాచార్యులకు తరువాతివారైన రామానుజులు, మధ్వాచార్యులు మున్నగు వైష్ణవ మతానువర్తులు కొలది భేదములతో శంకరభాష్యమునే యనుసరించి బ్రహ్మసూత్రములకు భాష్యములు వ్రాసియున్నారు. ఆ భాష్యములకు వ్యాఖ్యలు నెన్నియో యున్నవి. శంకరాచార్యులు వ్రాసిన భాష్యములకు సాంప్రదాయికులు కొందఱు తెలుగున అనువాదములు చేసియున్నారు. ఇట్లు బ్రహ్మసూత్రములకు భాష్యములు, అనువాదములు నెన్నియో యుండగా తెలుగున నేనొక వ్యాఖ్యానము వ్రాయుటలో ప్రయోజన మేముండగలదు? అను ప్రశ్నము పాఠకులకు కలుగకపోదు. పైన చెప్పిన భాష్యములు, వాని యనుకరణములు నన్నియు అద్వైత విశిష్టాద్వైతాది సంప్రదాయములకు సంబంధించియున్నవి. వానిలో సంప్రదాయవాదమే కనిపించును. అయ్యవి సర్వథా సూత్రకారునివాదమును ప్రతిపాదించునని చెప్పనలవి కాదు. సూత్రకర్త వ్యాసమహర్షి వేదవిదుడు. వేదసిద్ధాంతములను ప్రతిపాదించుటకే సూత్రములను రచియించి యుండుననుట యసత్యముకాదు. ఉపనిషద్వాక్యముల నన్వయించుట కీ సూత్రములను రచియించియుండునని యెంచినను స్వతఃప్రమాణములకు అనుకూలముగానే యుపనిషదర్థములను ప్రతిపాదించుచు వానిని మహర్షి సమన్వయించి యుండుననుట నిస్సంశయము. కావున సంప్రదాయ వాదములకు సూత్రము లాధారముగా నుండనేరవు. ఇట్టి యాశయమును మనస్సున నిడుకొని నే నీ వ్యాఖ్యానమును తెలుగున వ్రాయ సమకట్టితిని.

వేదసిద్ధాంతముల ననుసరించు నా యీ వివరణమునకు 'అంబా' వైదిక వ్యాఖ్యానమని నామకరణము చేసియున్నాను. నా యీ రచనకు స్వ. హరిప్రసాదస్వామి (వైదికముని) వారిచే బ్రహ్మసూత్రములకు సంస్కృతమున వ్రాయబడిన వైదికవృత్తి,- వేదరత్న, విద్యాభాస్కర, విద్యా వాచస్పతి ప్రభృత్యుపాధ్యలంకతులగు ఉదయవీరశాస్త్రిగారిచే హిందీభాషలో వ్రాయబడిన 'విద్యోదయ' భాష్యము ఎంతగానో తోడ్పడి నవి. ఉపర్యుక్త భాష్యకర్తలకు కృతజ్ఞతాపూర్వక వందన సహస్రములు. నా యీ వ్యాఖ్యానము ఏదోయొక భాష్యమునకు అనువాదము కాదు. పూర్ణ ముగ స్వతంత్ర భాష్యమును కాదు. పై గ్రంథముల సహాయముతో తెలుగు చదువువారికి బ్రహ్మసూత్రములు ప్రతిపాదించు వైదిక సిద్ధాంత ములు సులభముగా బోధపడుటకు వీలుగా సూత్రపదముల కర్థము, వానికి వివరణము వ్రాసియున్నాను.

ఇట్లే నేను న్యాయ వైశేషికములకు, సాంఖ్య యోగములకును వ్యాఖ్యానము వ్రాసియున్నాను. తెలుగు పాఠకులు, సంస్కృతమున విశే షముగా పరిశ్రమచేయనివారు నాయీ వ్యాఖ్యానములను చదివి దార్శనిక విషయములను కొంతవరకు తెలిసికొనగలరని విశ్వసించుచున్నాడ.

సూత్రప్రతిపాద్య విషయములు :

ఈదర్శనమునందు నాలుగు అధ్యాయములు, ప్రతి అధ్యాయమునకు నాలుగు పాదములును ఉన్నవి. సూత్రములసంఖ్య ౫౫౫. ప్రథమాధ్యాయ మునందు బ్రహ్మము జగదుత్పత్తి స్థితి లయములకు కర్తయనియు, సచ్చిదానంద స్వరూపము కలది యనియు సర్వాంతర్యామి, సర్వా ధారము, సర్వనియంత, అపరిణామియునై యున్నదనియు నిరూపింప బడినది,

ద్వితీయాధ్యాయమునందు పై విషయము స్మృతి విరుద్ధము కాక పోవుటయే కాక తర్కసిద్ధమని వివరింపబడినది. ఈ యధ్యాయమునందలి చివరి రెండుపాదములందు భూతములయు, ఇంద్రియములయు ఉత్పత్తి, వానిని బోధించు వాక్యములలలోని పరస్పర విరోధ పరిహారము వర్ణింప బడినవి.

ఆ తృతీయాధ్యాయమునందలి ప్రథమ ద్వితీయ పాదములలో జీవుని గతి, స్వప్నాద్యవస్థలు కర్మానుగుణముగ నీశ్వరునిచే ఫలప్రాప్తి కలిగింప జేయుటను చూడవచ్చును. మూడు నాలుగు పాదములలో వివిధములగు ఉపాసనలు, బ్రహ్మజ్ఞానమున మోక్షప్రాప్తి వర్ణింపబడినవి. సంసారమున జీవునకు కలుగు గమనాగమనములు (ఆవాగమనము), అంతమున బ్రహ్మ జ్ఞానప్రాప్తి, దాని కవసరములగు సాధన సంపత్తియు నీ యధ్యాయమున చర్చింపబడినవి.

నాల్గవ యధ్యాయమునందు బ్రహ్మజ్ఞానమునకు వలయు సాధన ముల నభ్యసించుట, దేవ - పితృయానములు, మోక్షప్రాప్తి, దాని స్వరూప నిరూపణము వివరింపబడినవి. ఇట్లు బ్రహ్మస్వరూపము నెరిగి శాస్త్రవిహిత సాధనముల ననుష్ఠించి బ్రహ్మమును సాక్షాత్కరింపజేసికొనుటయే యీ శాస్త్రమునకు ముఖ్యలక్ష్యము.

కృతజ్ఞత :

నేను బ్రహ్మసూత్రములకు వైదికముగా వ్యాఖ్యానము వ్రాయ నారంభించి దాదాపు ఒక దశాబ్దకాలము గతించినది. రెండు అధ్యాయము లకు వ్యాఖ్యానము వ్రాసినతదుపరి, ఉపనిషత్తులకు వ్యాఖ్యానము వ్రాసిన తరువాత సూత్రవ్యాఖ్యానము వ్రాయుట మంచిదని తోచినది. అంతట నావ్యాఖ్యానము నట్లే విడిచి, ఉపనిషత్తులకు వ్యాఖ్యానమువ్రాయ నారంభించి తిని. ఈశ, కేన, కఠ, ముండక, మాండూక్య, ప్రశ్న, ఐతరేయ, తైత్తి

రీయ, శ్వేతాశ్వతరోపనిషత్తులకు తొమ్మిదింటికి తెలుగున టీకాతాత్పర్యము లనువ్రాసి వానిని ప్రకటింపగలిగితిని. వీనితోపాటు భగవద్గీతకును వైదిక వ్యాఖ్యాన మొకటి తెలుగున వ్రాసి ముద్రింపజేసితిని. అటుపైన మరల బ్రహ్మసూత్రములకు-పూర్వము వ్రాయగా మిగిలిన వానికి వ్యాఖ్యానము వ్రాసి ముగించి యొక సంవత్సర కాలము గడచుచున్నది. ఇట్లెన్నదో పది సంవత్సరములకు పూర్వము ఉదయించిన సంకల్పమున కొకరూపము నిచ్చి పాఠకుల కందజేయుభాగ్యము నేటికి కల్గినది. నా సంకల్పముతెలియుటయే తడవుగా శిష్యకల్పులు, నా స్నేహమునకు మిక్కిలి పాత్రులు శ్రీమంతులు నైన శ్రీయుత గ్రంధి కామరాజుగ్గారు (పూర్ణా పిక్చర్సు మేనేజింగ్ డైరెక్టరు) ఈ గ్రంథమును ముద్రించి, పాఠకలోకమున కందించుట కనువగు ద్రవ్యసహాయమొనర్చి, ఆంధ్ర పాఠకలోకమునకు చేసిన యుపకృతి నేమని కొనియాడ వలయునో తోచకున్నది. శ్రీయుత కామరాజు గారికి, వారి కుటుంబమునకు నే నెంతయు కృతజ్ఞుడను. శ్రీ కామరాజు తండ్రిగారు - స్వ. మంగరాజుగారు నన్నెంతగానో ఆదరించుచుండెడివారు. గురుతుల్యులుగా నెంచుచుండెడివారు. వైదిక ధర్మప్రచారమున వారికి గల శ్రద్ధాసక్తులు వర్ణనాతీతములు. విశాఖపట్టణమున వేదధర్మప్రచారార్థము మిక్కిలి తోడ్పడుచుండెడివారు. వారు నాయెడ చూపు ఆదరభావమును పురస్కరించుకొనియే వారి కుమారులు శ్రీయుత కామరాజు, శ్రీయుత బ్రహ్మజీ, స్వ. మంగరాజుగారి పెద్ద మనుమడు బాప్జీ ప్రభృతు లెల్లరు నన్ను గౌరవించుచు నాచేయు కార్యములకు చేయూత నిచ్చుట కెప్పుడు సన్నద్ధులుగా నుందురు. కావున నేను వీరియుపకృతి నెన్నడును మరువజాలను.

ఇక నా రచనల నన్నింటిని ముఖ్యముగా రెండు మూడు సంవత్సరములనుండి చక్కగా ముద్రింపజేసి చదువరుల కందజేయు మిత్రుడు శ్రీ శాస్త్రి వేంకట నరసింహారావు (ఉభయభాషాప్రవీణ) గారిని గురించి

నే నేమి వ్రాయగలను. వారు నా వ్రాతలో గల ప్రమాదములను సరిచేయు టకును, ముద్రణదోషములను దిద్దుటకును, గ్రంథములు చూడముచ్చటగా నుండునట్లు రూపొందించుటకును జేయు శ్రమ యింతయని చెప్పజాలను. నరసింహారావుగారిని చూచిన, వారెంతో బలహీనులుగా కన్పింతురు.ఇంత కష్టము చేయగలరా? యనియు సందేహము కలుగకపోదు. వారికి కుటుంబ భారమును పంచుకొను సహధర్మచారిణి గతించి కొన్నిసంవత్సరము లైనది. అప్పటినుండి సంతానమును పోషించుకొనుచు, గృహనిర్వహణకార్యము స్వయముగా నిర్వర్తించుకొనుచు, ఆర్థికవ్యవహారములను చక్కదిద్దు కొనుచు నాగ్రంథముద్రణాదుల కిన్నివిధములైన తోడ్పాటు నొసంగు చున్నారు. వారిబహుముఖప్రజ్ఞనే కాక ఓపికను, ధర్మాసక్తిని మెచ్చుకొనక తప్పదు. నాకు వీరుచేయు సహకారము నిర్వ్యాజము; ఫలాపేక్షారహితము. ఇట్టి మిత్రులకు సదా శ్రేయస్సు నభిలషించుటయే కాక హార్దికధన్యవాద ముల నందజేయుచున్నాను.

పాఠకలోకము మా గ్రంథములను చదివి గుణములను గ్రహించిన నా పరిశ్రమ సఫలమగును.

గుంటూరు<br>
23-12-'70.

బుధ విధేయుడు<br>
గోపదేవ్

# విషయ విభాగము

## తృతీయాధ్యాయము

ప్రథమ పాదము :



ద్వితీయ పాదము :

తృతీయ పాదము :



చతుర్థ పాదము :

## చతుర్థాధ్యాయము

ప్రథమ పాదము :

ఓమ్

# వేదాంతదర్శనము

## ప్రథమాధ్యాయము

### ప్రథమ పాదము

### ప్రథమాధికరణము

సాంఖ్య, యోగ, న్యాయ, వైశేషిక దర్శనములందు ప్రకృతి, దాని కార్యజాతమైన మహత్తత్త్వాదులు వర్ణింపబడినవి. మరియు జీవులు, జీవులకు (ప్రాకృతికములయిన) మహత్తత్త్వాదిపదార్థములకు గల భేదము లును వివరింపబడినవి. ఇంకను ప్రకృతి పురుష వివేకమువలన కలుగు ఫలము, దానికి వలయు సాధనములును వానియందే వర్ణింపబడియుండుట చూడనగును. ఈ శాస్త్రమునందు మోక్షమునకు ముఖ్యసాధనమైన బ్రహ్మజ్ఞానము విపులముగ వర్ణింపదలచి వ్యాసమహర్షి ప్రథమసూత్రమును రచియించుచున్నాడు.

**అథాతో బ్రహ్మజిజ్ఞాసా ౧-౧-౧**

అథ = (వివేకము, వైరాగ్యము, శమదమాది షట్కసంపత్తి, ముముక్ష - అను సాధనచతుష్టయము సంపాదించిన) తదుపరి, అతః = బ్రహ్మజ్ఞానము మోక్షమునకు ముఖ్యసాధనమైనందువలన, బ్రహ్మజిజ్ఞాసా = బ్రహ్మను సాక్షాత్కరింపజేసికొనవలయుననెడి కోరిక కలుగును.

సంస్కృతభాషయందు 'అథ' శబ్దమునకు (అనంతరము) తరువాత, అధికారము (విషయము), మంగళము, ప్రశ్నము, వికల్పము నను ననేకార్థములు కలవు. కాని, ఈ సూత్రమునందలి 'అథ' శబ్దమునకు మాత్ర మనంతర మనియే యర్థము. అధికారా ద్యర్థములు కావు.

బ్రహ్మజిజ్ఞాస యన బ్రహ్మను సాక్షాత్కరింపజేసికొనవలయు నను కోరిక. అట్టి కోరిక ఈ శాస్త్రమున కధికారము కాజాలదు. అధికార మన శాస్త్రప్రతిపాద్యవిషయము (Subject Matter). అనగా శాస్త్రముద్వారా గ్రంథకర్త బోధింపదలచిన విషయము. 'అథ' శబ్దమున కీసూత్రమునందు బ్రహ్మజిజ్ఞాసతో సంబంధ మున్నది. కావున నయ్యదే విషయ (అధికార) మని చెప్ప వీలుకాదు. బ్రహ్మజిజ్ఞాస శాస్త్రమున కధికారము (విషయము) గా నున్న పక్షమున నథశబ్దము అధికారార్థక మయ్యెడిదని భావము. ఈ సూత్రమునందలి బ్రహ్మశబ్దము తరువాతి సూత్రములం దన్వయింప బడును. అందువలన బ్రహ్మ మీ శాస్త్రమునకు విషయమని నుడువ వీలగును; కాని బ్రహ్మశబ్దమునకు 'అథ' శబ్దముతో సంబంధము కల్పింప వలనుపడదు. కారణ మేమన '(బ్రహ్మ'శబ్దము 'జిజ్ఞాస'శబ్దమునకు విశేషణముగా బ్రయోగింపబడినది. బ్రహ్మజిజ్ఞాస సమస్తపదము. అందు బ్రహ్మ విశేషణము, జిజ్ఞాస విశేష్యము. విశేషణము అప్రధానము, విశేష్యము ప్రధానము నగును. సమాసమున నప్రధానముగ బ్రయోగింపబడినందున బ్రహ్మపదము విషయపరమైనను అథ శబ్దముతో సంబంధింప వలనుపడదు. కావున నథ శబ్దమున కీ సూత్రమునందు అధికారము (విషయము) అర్థము కానేరదని భావము.

అథ శబ్దమున కిట మంగళార్థము కల్పించుటకును వీలులేదు. అథ శబ్దమునకు మంగళము వాచ్య మని యెక్కడను ప్రసిద్ధి లేకుండుటయే యిందులకు కారణము. అప్రసిద్ధమైన యర్థమును కల్పించుట న్యాయమును కాదు. అథ శబ్దమును వినుట మంగళకరము కావచ్చును; కాని, మంగళము శబ్దార్థము కాదు. శబ్దార్థము కాని మంగళము వాక్యార్థమున నన్వయింప జనదు. మంగళము అథ శబ్దమున కర్థముగా నెంచి వాక్యార్థమున సమన్వయింప యత్నించినచో బ్రహ్మజిజ్ఞాస మంగళము (శుభము) అనికదా!

యర్థమగును? అట్లయిన నీ సూత్రము ప్రశంసాబోధకమై కేవల మర్థ వాద మగును. కాబట్టి యిదియును పొసగదు.

అథ శబ్దము ప్రశ్నార్థక మనుటకును వలనుపడదు. ప్రశ్నార్థకమగు నెడల సమాధానవచన ముండవలసియుండును. బ్రహ్మజిజ్ఞాస కర్తవ్యమా? అని ప్రశ్నించిన 'అవును-కర్తవ్యమే' అని సమాధాన ముండవలయును. అట్టి సమాధానవచన మీ శాస్త్రమున కానరాదు. కావున నథ శబ్దము ప్రశ్నార్థక మనుటయు తగదు.

వికల్ప మనగా ముం దొక పక్షమునుచెప్పి యనంతరము మరియొక పక్షమును చెప్పుట. అట్టియెడ 'అథ'శబ్దము ప్రయోగింపబడును. (కి మయ మథ శబ్ద ఆనంతర్యవచనోఽథాధికారవచనః) 'ఈ యథశబ్ద మానంతర్య వచనమా, లేక యధికారవచనమా? అని యిట్లు ముందొక విషయమును. చెప్పి తరువాత మరియొక విషయము నారంభించుటయు నిట కానరాదు. కాబట్టి వికల్పార్థమునందును 'అథ'శబ్దము ప్రయోగింపబడలేదు. కాగా అనంతరమే యథ శబ్దమున కర్థము.

అనంతరము (తరువాత) బ్రహ్మ జిజ్ఞాస కలుగునందుమేని దేని యనంతర మని ప్రశ్న ముదయించును. వేదాధ్యయమున కనంతరమని చెప్పుదుమేని, అది సరికాదు. వేదాధ్యయనము బ్రహ్మజిజ్ఞాసకు సాధారణ కారణమే కాని, అసాధారణకారణము కాదు. వేదాధ్యయనానంతరమున నియమముగా వేదవిహితధర్మము లేవో తెలిసికొనవలయు నను కోరిక కలుగును. బ్రహ్మను తెలిసికొనవలయునను కోరిక కలుగదు. కావున నథ శబ్దమునకు వేదాధ్యయనానంతర మని యర్థము చెప్ప వలనుపడదు.

కర్మావబోధనానంతర మనుటయు పొసగదు. కర్మావబోధము(కర్మ జ్ఞానము) కర్మానుష్ఠానమునకు పురికొల్పును, కాని బ్రహ్మజిజ్ఞాసకు కాదు. కొందొకకార్య మిట్టిదని తెలిసినవాడు దాని నాచరింపబూనును. కాని బ్రహ్మనేల తెలిసికొనగోరును? కోరదని భావము.

కాబట్టి అథ శబ్దమునకు వివేక, వైరాగ్యాది సాధన చతుష్టయ సంపత్త్యనంతరమనియే యర్థము చెప్పుదుము. వైరాగ్యాది సాధనసంపత్తి బ్రహ్మసాక్షాత్కారమునకు (బ్రహ్మజిజ్ఞాసకు) సాధన మగుటయే యిందులకు కారణము.

"శాంతో దాన్త ఉపరత స్తితిక్షుః సమాహితో
భూత్వాఽఽత్మన్యే వాత్మానం పశ్యతి" బృ. ౪-౪-౨౩

'శాంతుడు, దాంతుడు, ఉపరతుడు, తితిక్షుడు, సమాహితుడు నైన వాడే తనయందు (ప్రత్యగాత్మయందు) పరమాత్మసాక్షాత్కారమును బొందును.' అను నిట్టి యుపనిషద్వాక్యములవలనను, వివేక, వైరాగ్యాది సాధనసంపత్త్యనంతరమే బ్రహ్మజిజ్ఞాస కలుగునని బోధపడుచున్నది.

(౧) వివేకము (౨) వైరాగ్యము (౩) శమదమాది సంపత్తి (౪) ముముక్ష (మోక్షేచ్ఛ) అను నీ నాలుగును సాధన చతుష్టయ మనబడును. ఇందు (౧) శరీరము మొదలు ప్రకృతివరకు గల పదార్థముల నుండి జీవాత్మను వేరుగా నెఱుగుట వివేకము. (౨) వివేకమువలన ఐహికాముష్మికవిషయములందు తృష్ణ విడనాడుట (శరీరము మొదలు ప్రకృతివరకు గల పదార్థములం దనాసక్తి) వైరాగ్యము. (౩) వైరాగ్య పరిపాకమువలన కలుగు *శమము, దమము, ఉపరతి, తితిక్ష, శ్రద్ధ, సమాధానము నను నారును శమదమాది సంపత్తి. (౪) మోక్షముకావలయు నను కోరిక ముముక్ష (మోక్షేచ్ఛ) యనబడును.

---

* మైత్ర్యాది భావనలవలన రాగద్వేషాది చిత్తదోషములను నివర్తింప జేయుట శమము. బాహ్యేంద్రియములను బహిర్విషయవ్యాపారములనుండి మరల్చుట దమము. నిషిద్ధములు, అవిహితములు, కామ్యములునైన కర్మల త్యాగము ఉపరతి. శీతోష్ణాదిద్వంద్వసహనము తితిక్ష. గురువుచే చెప్పబడిన వాక్యములు, వేదవాక్యములు యథార్థములే యను బుద్ధి శ్రద్ధ యనబడును. నిర్విచార సంప్రజ్ఞాత సమాధి సమాధానము.

మైత్ర్యాదిభావనలు, నిర్విచారసంప్రజ్ఞాతసమాధి యన నేమో పాతంజలి యోగదర్శనమునకు నాచే రచింపబడిన అంబా వ్యాఖ్యానమున చూడనగును.

సూత్రమునందలి 'అతః' శబ్దమునకు-'బ్రహ్మజ్ఞానము మోక్షమునకు ముఖ్యసాధన మైనందువలన' - అని యర్థము చెప్పబడినది. కాబట్టి మోక్షమునకు బ్రహ్మజ్ఞానమే ముఖ్యకారణ మని తెలియనగును. అమృతత్వఫల ప్రాప్తికి బ్రహ్మజ్ఞానము-బ్రహ్మసాక్షాత్కారము తక్క వేరొందు సాధన మవసరము లేదని భావము. ఇందులకు వేదవాక్యములు ఉపనిషద్వాక్యములును ప్రమాణములు.

౧. "య ఇత్త ద్విదు స్తే ఽమృతత్వ మానశుః"

ఋ. ౨–౩–౧౮–౨౩

'బ్రహ్మము నెరిగినవారు అమృతత్వము నందుదురు.'

౨. "అనా ద్యనంతం మహతః పరం ధ్రువం
నిచాయ్య తం మృత్యుముఖా త్ప్రముచ్యతే" కఠ. ౩–౧౫

'అనాది, అనంతము, జగత్కారణమైన ప్రకృతికంటె సూక్ష్మము, ధ్రువమునైన బ్రహ్మము నెరిగి - సాక్షాత్కరింపజేసికొని మృత్యుముఖమునుండి ముక్తుడగును.'

ఇట్లు వేదవాక్యములవలనను, ఉపనిషద్వాక్యములవలనను బ్రహ్మజ్ఞానమే మోక్షమునకు ముఖ్యసాధన మని స్పష్టము చేయబడినది.

కాని, వేదమునందు -

"కుర్వ న్నేవేహ కర్మాణి జిజీవిషే చ్ఛతగ్ం సమాః
ఏవం త్వయి నాన్య థేతో ఽస్తి న కర్మ లిప్యతే నరే" య. ౪౦–౨

'విహితములైన సత్కర్మల నాచరించుచునే జీవితమంతయు గడపవలయును. వేదవిహితకర్మల నచరించుచు జీవితము గడిపినందువలననే నీకు సంసారబంధన ముండదు. బంధనమునుండి తప్పుకొనుటకు మఱియొక యుపాయమును లేదు.'

అని యుపదేశింపబడియున్నందున బ్రహ్మజ్ఞానమువలెనే కర్మానుష్ఠానముసైతము మోక్షమునకు సాధన మని తెలియుచున్నది. మరియు

"విద్యాం చావిద్యాం చ య స్తద్వేదోభయగ్ం సహ
అవిద్యయా మృత్యుం తీర్త్వా విద్యయా ఽమృత మశ్నుతే"
య: ౪౦–౧౪

(విద్యా = జ్ఞానము, అవిద్యా = కర్మ. అమృతం = మోక్షము) 'జ్ఞానకర్మలను తోడ్తో నెరిగినవాడు కర్మద్వారమున మృత్యువును దాటి, జ్ఞానముద్వారమున మోక్షమును బొందును' అని, ముముక్షువులకు జ్ఞానకర్మములసముచ్చయ మావశ్యకమని యిందు స్పష్టముగా బోధింపబడుచున్నది. కాబట్టి మోక్షమునకు బ్రహ్మజ్ఞాన మొక్కటియే ముఖ్యసాధన మనుట యెట్లు సంగత మగును ? - అని శంకింపరాదు.

వేదమునందుకాని, ఉపనిషత్తులందు కాని బ్రహ్మజ్ఞానము మోక్షమునకు ముఖ్యసాధన మని యుపదేశించినట్లు,యెక్కడను మోక్షమునకు కర్మ ముఖ్యసాధన మని యుపదేశింపబడలేదు. పైన చూపబడిన వేదవాక్యములందును, ఉపనిషద్వాక్యములందును కర్మచే మోక్షము కలుగునని చెప్పబడలేదు. "కుర్వన్నే వేహ........" అను యజుర్వేదమంత్రమునందు జీవించినంతవరకు కర్మలను ఫలాపేక్ష లేక యనుష్ఠించినందువలన సంసారముచే లిప్తుడుకా దని యుపదేశింపబడినది. ఇట్లే "విద్యాంచా విద్యాంచ" అను మంత్రమునందును కర్మఫలము మృత్యుతరణ మనియు, జ్ఞానఫలము మోక్ష మనియు వేరువేరుగ చెప్పుటచే జ్ఞానమే మోక్షమునకు ముఖ్యసాధన మని చెప్పబడుట స్పష్టము. కాబట్టి జ్ఞానకర్మలసముచ్చయము (కూడిక) మోక్షమునకు ముఖ్యసాధన మనుట యుక్తము కాదు. 'అవిద్యయా మృత్యుం తీర్త్వా' అను వాక్యమునకు కర్మచే చిత్తమాలిన్యమును తొలగించుకొని యని యర్థము. కావున కర్మ చిత్తమాలిన్యమును దూరమొనర్చి యాత్మజ్ఞానమునకు కారణ మగును. ఆత్మజ్ఞానము మోక్షమునకు ముఖ్యకారణ మగును. ఇట్లు బ్రహ్మజ్ఞానమే మోక్షమునకు ముఖ్యసాధనమని చెప్పుటలో నెట్టిదోషము నుండ దని భావము.

బ్రహ్మజిజ్ఞాస - (బ్రహ్మను తెలిసికొనవలయు నను కోరిక-బ్రహ్మ సాక్షాత్కారేచ్ఛ) 'బ్రహ్మయొక్క జిజ్ఞాసయని' యిట సమాసమునకు విగ్రహము చెప్పుకొందుము. ఇందు(యొక్క) షష్ఠీవిభక్తి కర్మార్థమున ప్రయోగింపబడినది. కాబట్టి జిజ్ఞాసింపదగిన వస్తు విట బ్రహ్మ మని తేలు చున్నది. శ్రుతి, ఉపనిషత్ వాక్యములను విచారించుటకై మహర్షి సూత్రములను రచించియున్నాడు. అట్టి యుపనిషద్వాక్యములందును బ్రహ్మమే జిజ్ఞాసకుకర్మగా నుపదేశింపబడినది('త ద్విజిజ్ఞాసస్వ తద్ బ్రహ్మ' తై. ౩.౧).

జిజ్ఞాస యన జ్ఞానేచ్ఛ - తెలిసికోవలె నను కోరిక. ఇందు జ్ఞానము మనోవృత్తి యని యెంచరాదు. మనోవృత్తిరూపజ్ఞానమునకు బ్రహ్మము విషయము కాదు. అందువలననే 'యం మనో న వేద' బృ.౩.౭.౨౦. అను నిట్టి ఉపనిషద్వాక్యములందు బ్రహ్మము మనస్సునకు విషయము కాదు - మనస్సుచే బ్రహ్మముతెలియబడదు - అని స్పష్టముగా చెప్పబడినది. కాని,

'మనసై వేద మాప్తవ్యమ్.' కఠ. ४.౧౧.,
'మనసై వానుద్రష్టవ్యమ్.' బృ. ४.४.౧౯.

'మనస్సుతోనే బ్రహ్మ పొందదగినది. మనస్సుతోనే చూడతగినది'. అను నీవాక్యములందు బ్రహ్మము మనోవిషయముగ చెప్పబడినదికదా। అని యందురేని -

అట్లు కాదు. ఈవాక్యములందు మనస్సు సాధనముగ వర్ణింపబడినదే కాని మనస్సునకు బ్రహ్మము విషయ మని కాదు.

"ఇంద్రియేభ్యః పరం మనో। మనసః సత్త్వ ముత్తమమ్।
సత్త్వా దధి మహానాత్మా। మహతోఽవ్యక్త ముత్తమమ్."
"అవ్యక్తాత్తు పరః పురుషో। వ్యాపకోఽలింగ ఏవ చ।
యద్ జ్ఞాత్వా ముచ్యతే జంతు। రమృతత్వం చ గచ్ఛతి." కఠ. ౬-౭-౮.

'ఇంద్రియములకంటె మనస్సు సూక్ష్మము. మనస్సుకంటె బుద్ధి, దానికంటె ప్రకృతి, అంతకంటె ఆత్మ సూక్ష్మము' అని యిట్లు, ఉపనిషత్ వాక్యములందు మనస్సు, బుద్ధి మున్నగు ప్రాకృతికపదార్థములకంటె ఆత్మ (బ్రహ్మ) యెంతో సూక్ష్మ మని చెప్పబడియున్నది. అట్టియెడ బ్రహ్మము మనోవిషయము కాజాల దనుట నిక్కువము. ఇంద్రియములు తమతో సన్నికృష్టము (సంబద్ధము)లయిన వస్తువులనే బోధించును. అంతరింద్రియమైన మనస్సుకూడ తనతో సంబద్ధమగు జీవాత్మ నెఱుగ గలుగును కాని బ్రహ్మము నెఱుగజాలదు. అటులయిన,

"దృశ్యతే త్వగ్ర్యా బుద్ధ్యా సూక్ష్మయా సూక్ష్మదర్శిభిః" కఠ. ౩-౧౨.
'సూక్ష్మదర్శులు సూక్ష్మమైన అగ్రిమబుద్ధిచే చూతురు.'

అను నీయుపనిషద్వాక్యమునందు అగ్రిమబుద్ధిగా చెప్పబడిన విశిష్టమైన మనస్సుతోనే సూక్ష్మదర్శులు బ్రహ్మమును చూతు రని యెట్లుచెప్పబడినది? - అని ప్రశ్నింతురేని —

బ్రహ్మసాక్షాత్కారము మనోనిబంధన మని నుడువుదుము. శాస్త్రమున చెప్పబడినకర్మములు, నిష్కామబుద్ధితో చేయనంతవరకు నిశ్శ్రేయసము ప్రాపింపనట్లు, మనస్సును చక్కగా శుద్ధమొనర్చి - రాజసతామస మాలిన్యములను దూరమొనర్చి - ప్రత్యగాత్మను దర్శింప యోగ్యమగునట్లు చేయనంతవరకు- బ్రహ్మదర్శన మసంభవము. కావున యగ్రిమబుద్ధి యనెడి విశుద్ధమనస్సు ప్రత్యగాత్మదర్శనమునకు సాక్షాత్కారణమై బ్రహ్మదర్శనమునకు పరంపరగా (తద్ద్వారా) కారణ మగుచున్నది. ఇట్లు బ్రహ్మదర్శనమునకు పరంపరగా సాధనమైన విశుద్ధమనస్సు ఉపనిషత్తులం దటనట సాక్షాత్ సాధనముగ వర్ణింపబడుట దోషావహము కాజాల దని భావము. ఇంతియ కాక,

"ఏషోఽణు రాత్మా చేతసా వేదితవ్యో...." ముం. ౩-౧-౮.

'అణుపరిమాణముగల ప్రత్యగాత్మ మనస్సుతో తెలియనగు' నని జీవాత్మ (ప్రత్యగాత్మ) దర్శనమునకు మనస్సు సాక్షాత్సాధనముగ వర్ణింప బడుట మనము చూడవచ్చును.

కాబట్టి బ్రహ్మజ్ఞానము (బ్రహ్మసాక్షాత్కారము) మానసికవృత్తి కాదనుట సుస్పష్టము.

బ్రహ్మజ్ఞాన మిట మానసికవృత్తివిషయము కాకున్న మరి యెట్టి దన అనుభవాత్మక మని నుడువుదుము. ప్రత్యగాత్మ సాక్షాత్కారము కానిది బ్రహ్మానుభవము కాదని నిశ్చయముగా నెఱుగవలయును.

"హిరణ్మయే పరే కోశే విరజం బ్రహ్మ నిష్కలమ్,
తచ్ఛుభ్రం జ్యోతిషాంజ్యోతి స్తద్య దాత్మవిదో విదుః."

ముం. ౨–౨–౯

'జ్యోతిస్సులకు జ్యోతిస్సు, శుభ్రము, నిష్కలము, నిర్మలమునైన బ్రహ్మను ఆత్మజ్ఞానులే యనుభవింతురు.' - ఇట్లు ప్రత్యగాత్మను తెలిసిన వారే బ్రహ్మ నెఱుగగల రని యుపనిషత్తులందు స్పష్టముగ చెప్పబడినది. ప్రత్యగాత్మను దర్శించుటకై వైదికకర్మములను నిష్కామముతో నను ష్ఠింపవలయును. అందువలన చిత్తము విశుద్ధ మగును. అనగా రాజస తామస మలినవృత్తులనుండి చిత్తము విడివడును. శుద్ధమగుసాత్త్వికవృత్తులు గలదగును.. అనంతరము వైరాగ్యాదుల మూలమున సంప్రజ్ఞాతము, అసంప్రజ్ఞాతము నను సమాధులను సంపాదించి మానవుడు ప్రత్యగాత్మ నెఱుగును. అటుపై బ్రహ్మసాక్షాత్కారము - బ్రహ్మానుభవ మేర్పడును. నాడు –

"భిద్యతే హృదయగ్రంథి శ్ఛిద్యంతే సర్వసంశయాః
క్షీయంతే చాస్య కర్మాణి, తస్మిన్ దృష్టే పరావరే" ముం. ౨.౨.౮.

'బ్రహ్మసాక్షాత్కారము కలుగగా హృదయగ్రంథి విడివడును. సంశయములు దూరమగును. కర్మములు క్షయించును.'

కాబట్టి బ్రహ్మము నెఱుగగోరుట (బ్రహ్మసాక్షాత్కారేచ్ఛ - బ్రహ్మ జిజ్ఞాస) యుక్తమే యని తెలియుచున్నది.

'ఇట్టి బ్రహ్మము ప్రసిద్ధమా ! లేక యప్రసిద్ధమా ? ప్రసిద్ధమందు మేని అందు క్రొత్తగా తెలియదగిన దే ముండును ? అప్రసిద్ధ మందుమేని అప్రసిద్ధమును తెలిసికొనవలయు నను కోరిక యెట్లు కలుగును ? కాబట్టి బ్రహ్మజిజ్ఞాసయే యుక్తము కాదు' - అనరాదు.

బ్రహ్మము సామాన్యముగ ప్రసిద్ధమై విశేషరూపమున ప్రసిద్ధము కానందున జిజ్ఞాస యుక్తమే యగును. లోకమున దేనివిషయమున సందేహము కలుగునో యది జిజ్ఞాస్యము (తెలిసికొనదగినది) అగును. ఏ విషయము సామాన్యముగ తెలిసి విశేషముగ తెలియదో దానియందే సందేహము కలుగును. బ్రహ్మము నట్టిదే. బ్రహ్మమునుగూర్చి సామాన్య ముగ తెలిసినను విశేషముగ తెలియదు. బ్రహ్మవిషయము ననేకు లనేక విధముల చెప్పుదురు. అందువలన సందేహము కలుగును. కొందఱు ప్రత్యగాత్మయే బ్రహ్మ మందురు. మఱికొందఱు ప్రత్యగాత్మకంటె బ్రహ్మము భిన్న మందురు. వేఱొకకొందఱు బ్రహ్మము సర్వజ్ఞము, సర్వ శక్తిమంతము నై ప్రకృతిని, ప్రకృతికార్యములను, జీవాత్మలను పుట్టించు టకు కారణ మపేక్షింప దని యందురు. ఇంకను సూక్ష్మబుద్ధులు కొందఱు బ్రహ్మము ప్రకృతిపురుషుల కధిష్ఠానము, సర్వజ్ఞము, సర్వశక్తి మంతము, పూర్ణము, సర్వము నియమించునది, సర్వాంతర్యామియు నై జీవాత్మల కర్మల కనుకూలముగ జగజ్జన్మాదులకు నిమిత్త మగు నని యందురు. ఇన్ని విధముల చెప్పబడుటచే బ్రహ్మమువిషయమున సందేహము కలుగును. ఆ సంశయము బ్రహ్మమును విశేషముగ నెఱిగిననాడు పోవును. బ్రహ్మ జ్ఞానమునకు మోక్షము ప్రయోజనము. కాబట్టి బ్రహ్మజిజ్ఞాస అయుక్తము కాదు. (౧)

బ్రహ్మ జిజ్ఞాస్యముగ చెప్పబడినది. అట్టి బ్రహ్మకు లక్షణ (స్వరూప) మెట్టి దన :

జన్మాద్యస్య యతః                    ౧-౧-౨

(జన్మ + ఆది + అస్య, యతః - మొదటి సూత్రమునందలి బ్రహ్మపదము ఈ సూత్రమునందును అన్వయింపబడును.)

అస్య = ప్రత్యక్షాది ప్రమాణములచే తెలియబడు నీ జగత్తునకు, జన్మ = ఉత్పత్తి, ఆది = స్థితి ప్రలయములు, యతః = దేనివలన (ఏకారణమువలన) కలుగునో, అది, బ్రహ్మ = బ్రహ్మము.

దేనివలన నీ జగత్తునకు జన్మస్థితిలయములు కలుగుచున్నవో అది బ్రహ్మ మని భావము.

"యతో వా ఇమాని భూతాని జాయన్తే
యేన జాతాని జీవన్తి
యత్ప్రయ న్త్యభిసంవిశంతి
త ద్విజిజ్ఞాసస్వ తద్బ్రహ్మ" తై. ౩.౧.

'దేనివలన నీ భూతజాతము లుత్పన్నము లగుచున్నవో, దేనివలన నుత్పన్నము లయినవి జీవించుచున్నవో, దేనియందు ప్రవేశించుచున్నవో అది బ్రహ్మ మని తెలిసికొనుము.'

అను నీ యుపనిషద్వాక్యమునందును బ్రహ్మము జగజ్జన్మాదులకు కారణముగ వర్ణింపబడుట సుస్పష్టము.

సూత్రమునందలి 'అస్య' అనునది యొక సర్వనామము. దానిచే లోకత్రయాత్మక మగు నీ జగత్తు ధర్మిగా నిర్దేశింపబడినది. అట్టి జగత్తునకు జన్మము, స్థితి, లయము నను మూడును ధర్మములు. ఈ జగత్తు ప్రవాహ రూపమున ననాది యైనను స్వరూపమున ననాది యన వలనుపడదు. జగత్తు సావయవి — అవయవము లనేకములు కలిసి యేర్పడునది. అవయవము లతో నేర్పడునది యనాది యనుటకు వీలులేదు. కాబట్టి జగత్తు జన్మ, స్థితి, లయములు కలది యనుట సుసంగతము.

'యతః' అను పదముచే జగజ్జన్మాదులకు కారణముగ బ్రహ్మము నిర్దేశింపబడినది. అదియును నిమిత్తకారణమే కాని ఉపాదానకారణము కాదు. చేతనపదార్థము నిమిత్తకారణమే యగును. ఉపాదానము కాదు. చేతనము నుపాదానముగ నంగీకరించిన నయ్యది పరిణామి కావలసి యుండును. కార్యరూపమున పరిణమించునదియే యుపాదానకారణము. కార్యరూపమున పరిణమించు నుపాదానకారణమునకు అధిష్ఠాన మగునది నిమిత్తకారణము. బ్రహ్మము జగత్తుగా పరిణమింపదు. అది కూటస్థ నిత్యము. పరిణామము లేనిది. దానియందు పరిణామము నంగీకరించినచో దానిస్వరూపమునకే హాని కలుగును. కాబట్టి బ్రహ్మము నిమిత్తకారణము

జగత్తునందు బ్రహ్మసారూప్యము కానరానందున బ్రహ్మము జగత్తున కుపాదానము కాదు. కుండలో మట్టిసారూప్య ముండును. ఆభరణములలో సువర్ణసారూప్య ముండును. కాబట్టి కుండకు మట్టి, నగలకు బంగారము ఉపాదానకారణములు. అట్లే జగత్తునకు బ్రహ్మ ముపాదాన మైనచో జగత్తునందు బ్రహ్మసారూప్యము - సమానత - యుండవలయును. అట్టిది కానరాదు. కారణ మేమన: బ్రహ్మము విశుద్ధచేతనము; జగత్తు జగడము- అచేతనము. ఇట్లు సారూప్యము లేనందున బ్రహ్మము జగత్తున కుపాదానము కాదు. నిమిత్తకారణమే. నిమిత్తకారణమునకు కార్య సారూప్య ముండదు. కుంభకారుడు కుండకు నిమిత్తకారణము. కుంభకార సారూప్యము కుండలో నుండదు. అట్లే బ్రహ్మము నిమిత్తకారణము. కావున జగత్తునందు బ్రహ్మసారూప్యము లేదు. మరియు లోకమున చేతనము నిమిత్తకారణముగానే చూడబడుచున్నది. కాబట్టి ప్రత్యక్షమునకు విరుద్ధముగ చేతనబ్రహ్మమును జగత్తున కుపాదానకారణ మనుటయు న్యాయసంగతము కాదు: ప్రమాణోచితమును కాదు.

"జనికర్తుః ప్రకృతిః" అష్టా. ౧-౪-౩౦ అను పాణినీయసూత్రము ననుసరించి జన్మవంత మగు పదార్థమునకు ప్రకృతియయినదానిని బోధించు

పదమున కుపాదానసంజ్ఞ కలుగును. "అపాదానే పంచమీ" ౨-౩-౨౮. అను సూత్రము ననుసరించి అపాదానసంజ్ఞ గల పదమునకు పంచమీ విభక్తి వచ్చుననియు వ్యాకరణశాస్త్రమున చెప్పబడియున్నది. అందుచేత 'యతః' అను పదమునందలి పంచమీవిభక్తి (ప్రకృతి యన్న నుపాదాన కారణ మని ప్రసిద్ధ మయినందున) ఉపాదానకారణమును బోధించుచుండ, బ్రహ్మము నిమిత్తకారణ మని చెప్పుట తగదు, అనరాదు.

పై సూత్రమునందలి 'ప్రకృతి' పదము కారణమాత్రమునే బోధించును. కాని ఉపాదానకారణమును కాదు.

"ఆదిత్యా జ్జాయతే వృష్టిః, వృష్టే రన్నం...." మ. ౩.౬

'సూర్యునివలన వృష్టి కలుగును. వృష్టివలన అన్నముకలుగును'అనునిట్టి ప్రయోగములందుగలపంచమీవిభక్తియుపాదానమునుబోధింపక కారణమును మాత్రముబోధించుటమాడనగును.అందువలననేకాశికావృత్తియందు'పుత్రాత్ ప్రమోదో జాయతే, ఇత్యాదౌ అనుపాదానేఽపి పంచమీదర్శనాత్ ప్రకృతి గ్రహణం హేతుమాత్రపరమ్.' 'పుత్రునివలన ప్రమోదము కలుగును' అను నిట్టి తావులందు పుత్రుడు ప్రమోదమునకు ఉపాదానకారణము కాకున్నను పుత్రపదము పంచమీవిభక్తిలో ప్రయోగించుటంబట్టి 'జని కర్తుః ప్రకృతిః' అను పాణినీయసూత్రమునందలి ప్రకృతిపదము కేవలకారణమును తెలుపును. కాని ఉపాదానకారణమును తెలుపదని వివరింపబడినది.

మఱియు 'న్యాసము' (వృత్తిభాష్యము) నందును 'అసతి ప్రకృతి గ్రహణ ఉపాదాన స్యైవాపాదాన సంజ్ఞా స్యాత్ ప్రత్యాసత్తే ర్నేతరస్య. ప్రకృతిగ్రహణాత్ కారణమాత్రస్య భవతీతి ప్రకృతిపద మనుపాదానేఽపి అపాదాన సంజ్ఞా సిద్ధ్యర్థమ్'. అను సూత్రమున 'ప్రకృతిపదము గ్రహింపకున్న ఉపాదానకారణమునకే అపాదానసంజ్ఞ కలుగును. సామీప్యమువలన. ఇతరమునకు కలుగదు. కాని, ప్రకృతిపదము గ్రహించుట వలన కారణమాత్రమునకు అపాదానసంజ్ఞ కలుగును. కావున ఉపాదానము

కానిదానికిని, అపాదానసంజ్ఞ సిద్ధించుటకు 'ప్రకృతిపదము' అని స్పష్ట పరుపబడినది.

కాబట్టి 'యతః' అను పదములోని పంచమీవిభక్తి యుపాదాన కారణమునే' బోధించును. కాని నిమిత్తకారణమును బోధింపదనుట యుక్తము కాదు.

మహర్షి యీ సూత్రము నెందులకు రచించియున్నాడు ? జగజ్జన్మాదులమూలమున బ్రహ్మము ననుమానించుటకా ? లేక యుపనిషద్వాక్యము నన్వయించుటకా? అనుమానార్థ మందుమేని, అది యుక్తము కాదు. అనుమానము వస్తుసామాన్యమును తెలుపును. కాని యేదో యొక వస్తువిశేషమును తెలుపదు. కార్యకారణములసంబంధము గ్రహింపబడిననే కాని యనుమాన ముదయింపదు. ప్రస్తుత మిట జగత్తు ప్రత్యక్షమైనను బ్రహ్మము ప్రత్యక్షము కాదు. కాబట్టి వానిసంబంధము ప్రత్యక్షము కానేరదు. సంబంధగ్రహణము లేనందున జగత్తునకు కారణముగ బ్రహ్మము ననుమానించుట పొసగదు. కాగా అనుమానార్థము సూత్ర మన రాదు. ఉపనిషద్వాక్యసమన్వయార్థ మందుమేని ఆ వాక్య మెయ్యది ? "యతోవా ఇమాని భూతాని జాయన్తే...." అను వాక్య మందుమేని సరికాదు. ఇందు "యత్ప్రయ న్త్యభిసంవిశంతి" అని జగత్తుయొక్క జన్మ స్థితి లయములకు బ్రహ్మ మాశ్రయముగ నిర్దేశింపబడినది. ఇంతకు పూర్వము జగజ్జన్మాదులకు బ్రహ్మము నిమిత్తకారణముగ చెప్పియుంటిమి. నిమిత్తకారణమైన బ్రహ్మము జగజ్జన్మాదులకు ఆశ్రయ మెట్లు కాగలదు ? లోకమున ఘటాదులకు నిమిత్తకారణమైన కుంభకార ప్రభృతులు ఘటాదుల విలయమున కాశ్రయ మగుట చూడము. ఉపాదానకారణమున కార్యముత్పన్నమై కొంతకాల ముండి, యందే విలయమగుట చూచుచున్నాము. కాబట్టి "యతః" అను పదమునందలి పంచమీవిభక్తివలన బ్రహ్మము

నిమి త్తమేకాని, ఉపాదానకారణము కాదనుట ఎట్లు చెల్లునన ?- సమాధాన మిట్లు చెప్పుదుము.

కుమ్మరి కుండకు నిమి త్తకారణమైనట్లు బ్రహ్మము జగత్తునకు నిమి త్తకారణ మని చెప్పిన పై దోషము వాటిల్లును. బ్రహ్మము నిమి త్త కారణమే; కాని, కుమ్మరివలె కాక యది విలక్షణము. కుమ్మరి తనకంటె భిన్నమై మరియొక వస్తు వాధారముగాగలిగిన దైన మట్టిని గ్రహించి కరచరణాదుల వ్యాపారముతో కుండను నిర్మించును. బ్రహ్మ మట్లుకాక తననుండి విభ క్తము కానిదియు, తానే యాధారముగాగలదియు నగు ప్రకృతినుండి సంకల్పమాత్రమున జగత్తును రచించుచున్నది. కాబట్టి జగత్తు తనకు నిమి త్తకారణమైన బ్రహ్మముచే రచింపబడినను, బ్రహ్మమే యాధారముగా గలదయి, బ్రహ్మమునుండి విభ క్తముకాని ప్రకృతినుండి యాయా సమయములందు నానావిధము లగు నామరూపములతో కూడి సృజింపబడి, స్థితమై, ప్రకృతి కధిష్ఠానము, నాధారము నైన బ్రహ్మము నందే ప్రవేశించుచున్న దనుచు - ఉపనిషద్వాక్యము విరుద్ధము కాదందుము. ప్రకృత్యాశ్రయములయిన జగజ్జన్మ స్థితి లయములు బ్రహ్మాశ్రయము లనుటకు వీలున్నదని భావము. ప్రపంచమునకు బీజములవంటి సత్వ రజ స్తమస్సులయొక్క సామ్యావస్థ ప్రకృతి యనబడును. అందు సత్వము ప్రకాశశ క్తి, రజస్సు క్రియాశ క్తి, తమస్సు స్తంభనశ క్తి. ఈ మూడు శ క్తులు నెందు సమానముగ నుండునో యట్టి పరమసూక్ష్మ మగు మహా శ క్తియే ప్రకృతి యనబడు నని తాత్పర్యము. ఆ ప్రకృతి సృష్టికి పూర్వము ప్రలయసమయమున క్రియారహితమై విజ్ఞానాత్మల (జీవాత్మల) తో బాటు స్థూల, సూక్ష్మ జగత్తును తనలో నిముడ్చుకొని బిడ్డలతో తల్లివలె స్వామి యగు బ్రహ్మమునందు అవిభ క్తమై యుండును. ఇట్టియెడ బ్రహ్మము ప్రధానముగను, ప్రకృతి గుణము (అప్రధానము) గను వ ర్తించును. ఈ క్రింది మంత్రమువలన నీ స్థితియే బోధపడును.

"న మృత్యు రాసీ దమృతం న తర్హి న రాత్ర్యా అహ్న ఆసీత్ ప్రకేతః।
అనీద వాతం స్వధయా తదేకం తస్మా ద్ధాన్య న్నపరః కించ నాస"

ఋ. ౮.౭.౧౭.౨.

'ప్రలయవేళయందు చేతనాచేతనాత్మక మగు జగత్తునంతటిని తనలో ధరించుటచే ప్రకృతి స్వధ యనబడును. అట్టి స్వధతోగూడిన బ్రహ్మమొక్కటియే యపుడు ప్రాణించుచుండు'నని పై మంత్రవర్ణాభిప్రాయము. ఇందు బ్రహ్మము ప్రధాన మగుటచే 'ఏకమ్' ఒక్కటి యని ప్రథమావిభక్తితోను, ప్రకృతి యప్రధాన (గుణ) మగుటచే 'స్వధయా' స్వధతో నని తృతీయావిభక్తితోను చెప్పబడినది. అందువలననే యుపనిషత్తులందును, వేదములందును, బ్రహ్మమొక్కటియే యవస్థితమై యుండునట్లు చెప్పి దానివలననే జగత్తుయొక్క జన్మస్థితి లయములు కలుగుననియు, జగత్తంతయు తదాత్మకమే (బ్రహ్మాత్మకమే) యనియు విస్తారముగ వర్ణింపబడుట చూచుచున్నాము.

"ఆత్మావా ఇద మేక ఏవాగ్ర ఆసీ న్నాన్యత్ కించన మిషత్" ఐ. ౧.౧.
"ఆత్మైవేద మగ్ర ఆసీత్ పురుషవిధః" బృ. ౧-౪.
"యతోవా ఇమాని....సంవిశంతి." తై. ౩-౧.
"బ్రహ్మైవేదం విశ్వమ్." ముం. ౨-౨-౧౧.
"సర్వం ఖల్విదం బ్రహ్మ" ఛాం. ౩-౧౪-౧.
"పురుష ఏవేదం సర్వమ్." ఋ. ౮-౪-౧౭-౧.

ఈ వాక్యములందు 'ఆత్మ యొక్కటియే యున్నది. ఆత్మవలననే పుట్టి పెరిగి యందే భూతములన్నియు ప్రవేశించును. విశ్వమంతయు బ్రహ్మమే' యని వర్ణింపబడినది. ఇందు ఆత్మయే, బ్రహ్మమే, ఒక్కటే, అని యీ పదములలో గల 'ఏ' కారము బ్రహ్మముతక్క ప్రకృత్యాదులు వేరుగా లేవని చెప్పుటకై ప్రయోగింపబడలేదు. అనగా అవధారణార్థక మగు (ఏవ) ఏ కారము బ్రహ్మమున కన్యయోగమును వ్యవచ్ఛేదించుటకు

(ఇతరపదార్థసంబంధము లేదని చెప్పుటకు) ప్రయోగింపబడలేదని భావము. ప్రకృతి జీవాత్మలు ఉపనిషద్వాక్యములచేతనే ప్రతిపాదింపబడుచుండగా వానిని నిషేధించుటకై 'న' కారము ప్రయోగింపబడిన దనుట యుక్తము కాదు. మరియు బ్రహ్మము నిత్యము.

"నిత్యో నిత్యానామ్" కఠ. ౫-౧౩.

"నిత్యం సర్వగతం సుసూక్ష్మమ్" ముం. ౧-౧-౬.

"సత్యం హ్యేవ బ్రహ్మ" బృ. ౫-౪-౧.

అను నీ వాక్యము లన్నియు బ్రహ్మము సత్యము - నిత్య మనియే చెప్పుచున్నవి. అట్టి బ్రహ్మకు గల యైశ్వర్యమును నిత్యము కాకతప్పదు. ఐశ్వర్య మనిత్య మయిన బ్రహ్మమున కున్న ఈశ్వరత్వ మొకప్పు డుండి మఱియొకప్పుడు లేని దగును. చేతనాచేతనాత్మక మగు నీ జగత్తు తక్క బ్రహ్మమునకు గల వేరొక యైశ్వర్య మేది? వేదవాక్యములందును, ఉపనిషత్తులందును జగత్తే బ్రహ్మమున కైశ్వర్య మని వర్ణింపబడినది.

"యో విశ్వస్య జగతః ప్రాణతస్పతిః" ఋ. ౧—౭—౧౨—౫.

"యః ప్రాణతో నిమిషతో మహిత్వైక ఇ ద్రాజా జగతో బభూవ"

ఋ. ౮—౭—౩—౩

"సర్వ స్యేశానః సర్వ స్యాధిపతిః సర్వ మిదం ప్రశాస్తి యదిదం కించ"

బృ. ౫—౬—౧

ఈ వాక్యములందు జడచేతనాత్మక మగు జగత్తున కంతటికి బ్రహ్మమే రాజు, పతి, శాసకు డని వర్ణింపబడినది. కాబట్టి జీవాత్మల (విజ్ఞానాత్మల)తో కూడిన ప్రకృతియే బ్రహ్మమునకు గల యైశ్వర్యము. ఇతర మేమియు కాదు. ఇట్లు బ్రహ్మము, తదైశ్వర్యమైన ప్రకృతియు రెండును నిత్యములు కాబట్టి వాని యోగము (సంబంధము)ను నిత్య మగును. లేకున్న బ్రహ్మప్రకృతులకు ఈశ, ఈశితవ్య భావము (ఈశ్వర, ఐశ్వర్య భావము) ఉపపన్నము కానేరదు. జీవాత్మలతో కూడిన ప్రకృతికి

బ్రహ్మముతో నిత్యయోగ (నిత్యసంబంధ) మున్నందువలన దానిని (వ్యవచ్ఛేదముచేయ) విడదీయ వీలుండదు.

"సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ" తై. ౨-౧.
"ప్రజ్ఞానం బ్రహ్మ" ఐ. ౩-౧
"విజ్ఞాన మానందం బ్రహ్మ" బృ. ౩-౯-౧౮.

అను నీ యుపనిద్వాక్యములవలన బ్రహ్మము నిత్యజ్ఞానస్వరూప మని తెలియుచున్నది. అట్టి నిత్యజ్ఞానమునకు కర్మ (విషయము)గా నుండునదియు నిత్యమే కావలయును. విషయము (కర్మ) లేని జ్ఞాన మొండు లోకమున సిద్ధింపనేరదు. బ్రహ్మస్వరూప మగు నిత్యజ్ఞానమునకు కర్మ - విషయము ప్రకృతి జీవాత్మలు కాక మఱియొకటి యేదియు చెప్ప శక్యము కాదు.

"యః సర్వజ్ఞః సర్వవిద్ యస్య జ్ఞానమయం తపః" ముం. ౧-౧-౯.

'ఎవడు సర్వజ్ఞుడో, యెవడు సర్వవిదుడో, యెవని తపస్సు జ్ఞానమయమో' అను నిట్టి యుపనిషద్వాక్యములందు సర్వశబ్దముచే ప్రకృతి జీవాత్మలే బ్రహ్మజ్ఞానమునకు కర్మగా వర్ణింపబడినవి.

ఇట జ్ఞానస్వరూప మగు బ్రహ్మము సర్వజ్ఞ (సర్వజ్ఞానమున కాశ్రయ) మెట్లు కాగలదు ? జ్ఞానమే జ్ఞానాశ్రయమగుట యసంభవము కదా ? - అని శంకింప బనిలేదు.

జ్ఞానము జ్ఞానాశ్రయమగుటలో విరోధ మొండును లేదు. ప్రకాశ స్వరూపముగల ప్రకాశము తనచే ప్రకాశింపజేయదగు వస్తువుల సంయోగముచే ప్రకాశక మగుచున్నట్లు జ్ఞానస్వరూప మగు బ్రహ్మముకూడ జ్ఞేయములయిన సర్వ (ప్రకృతి పురుషుల) సంయోగమువలన సర్వజ్ఞమని వ్యవహరింపబడుట యుచితమే యగును. బ్రహ్మముస్వరూప మేమన-

సర్వజ్ఞ మనియు చెప్పవచ్చును. విరోధ మావంతయు నుండదు: కాబట్టి బ్రహ్మమే (బ్రహ్మైవ) ఒక్కటే (ఏకఏవ)-అని పూర్వవాక్యములందు చూపబడిన అవధారణార్థకమగు ఏ (ఏవ) కారము బ్రహ్మకు మఱియొక పదార్థముతో యోగము (సంబంధము) లేదని (అన్యయోగవ్యవచ్ఛేదము కొఱకు) చెప్పుటకు ప్రయోగింపబడలేదని స్పష్టమయినది. అటులయిన నీ ఏ (ఏవ) కార మెందుల కని ప్రశ్న ముదయించును. అయోగవ్యవచ్ఛేదార్థ మని సమాధానము చెప్పుదుము.

"సర్వం ఖ ల్విదం బ్రహ్మ"— ఇదియంతయు బ్రహ్మమే యను నిట్టి తావులందు, ఇదియంతయు (ఇదం సర్వం) నను పదములతో చెప్పబడు ప్రకృతి, జీవాత్మలు - జగత్సృష్టికి పూర్వము (ప్రలయవేళయందు) బ్రహ్మమే యైయుండెనని భావము. ఇందు జగత్తు నుద్దేశించి బ్రహ్మాత్మకత్వము విధింపబడుచున్నది. కా బట్టి జగత్తు ఉద్దేశ్యము, బ్రహ్మము విధేయము. విధేయపదము (బ్రహ్మము) తో కూడియుండు ఏ (ఏవ) కారము (అవధారణార్థకము) ఉద్దేశ్యమయిన జగత్తుయొక్క అయోగమును వ్యవచ్ఛేదించుటకే తగును కాని, జగత్తుయొక్క యోగమును కాదు. ప్రలయమున జగద్యోగమే బ్రహ్మకు లేకున్న బ్రహ్మాత్మకత్వవిధానమే వ్యర్థమగును (అయోగవ్యవచ్ఛేద మన న యో గా భా వ ము; అనగా యోగము). కాబట్టి ఏ కారము అయోగవ్యవచ్ఛేదార్థమే యనుట నిక్కము. అయోగ మన విభాగము. అయోగవ్యవచ్ఛేద మన విభాగ విచ్ఛేదము-అవిభాగము - అని భావము. సుషుప్తియందును, మోక్షమునందును- జీవాత్మలు, స్వవికారములతోకూడిన ప్రకృతియు బ్రహ్మమునం దవిభక్తముగా నుండునట్లు ప్రలయవేళయందును జీవాత్మప్రకృతులు బ్రహ్మము నుండి యవిభాజ్యములై యుండుట యుపనిషద్వాక్యములందు ప్రస్ఫుటమై యున్నది.

"స యథా సోమ్య। వయాంసి వాసో వృక్షం సంప్రతిష్ఠంతే,
ఏవం హ వై తత్సర్వం పర ఆత్మని సంప్రతిష్ఠతే...." ౭

"పృథివీ చ పృథివీమాత్రా చ, తేజశ్చ తేజోమాత్రా చ,
వాయుశ్చ వాయుమాత్రా చాకాశ శ్చాకాశమాత్రా చ,
చక్షుశ్చ ద్రష్టవ్యం చ, శ్రోత్రం చ శ్రోతవ్యం చ,
ఘ్రాణం చ ఘ్రాతవ్యం చ, వాక్చ వక్తవ్యం చ,
హస్తౌ చాదాతవ్యం చోపస్థ శ్చానందయితవ్యం చ,
పాయుశ్చ విసర్జయితవ్యం చ, పాదౌ చ గంతవ్యం చ,
మనశ్చ మంతవ్యం చ,
బుద్ధిశ్చ బోద్ధవ్యం చాహంకార శ్చాహంకర్తవ్యం చ,
చిత్తం చ చేతయితవ్యం చ, తేజశ్చ విద్యోతయితవ్యం చ,
ప్రాణశ్చ విధారయితవ్యం చ." ౮

"ఏష హి ద్రష్టా శ్రోతా స్ప్రష్టా ఘ్రాతా రసయితా,
మంతా, బోద్ధా కర్తా విజ్ఞానాత్మా పురుషః,
స పరే అక్షరే ఆత్మని సంప్రతిష్ఠతే" ప్ర. ౪—౭, ౮, ౯ ౯

'పక్షులు తమ వాసవృక్షము నాశ్రయించియుండునట్లు సర్వము పరమాత్మ నాశ్రయించి యుండును.' ౭

'పృథివ్యాది పంచభూతములు, వానికి సూక్ష్మకారణములైన పంచ తన్మాత్రలు, పదునొకం డింద్రియములు వానిచే తెలియనగు— అనుభవింప దగు విషయములును,' ౮

'ద్రష్ట – దర్శించువాడు, శ్రోత—వినువాడు, స్ప్రష్ట—స్పృశించు వాడును, ఆఘ్రాత, రసయిత, మననకర్త, బోధకర్తయు నైన (విజ్ఞానాత్మ) జీవుడు నాశరహిత మగు నా పరమాత్మయం దుండును.' ౯

ఇట్లు బ్రహ్మమునందు ప్రకృతి, విజ్ఞానాత్మలు అవిభాగరూపమున నుండు ననుట సుస్పష్టము.

సృష్టికిపూర్వము ప్రలయకాలమున బ్రహ్మమునందు ప్రకృతి విజ్ఞానాత్మ లవిభక్తములుగా నున్నను, ప్రస్తుతమున నట్టి యవిభాగము లేనందున "సర్వం ఖ ల్విదం బ్రహ్మ," "ఆత్మై వేదం సర్వమ్" ఇది యంతయు బ్రహ్మమే, ఇదియంతయు నాత్మయే - అను నిట్టి వాక్యార్థము లుపపన్నములు కా వనరాదు. ఇప్పుడును నామరూపాత్మకజగత్తునకు బ్రహ్మ మాధార మగుటచే నుపన్నమే యగును. వైదికులు జగత్తునకు మూలకారణమైన ప్రకృతి, జీవాత్మలు, బ్రహ్మము నను మూడు (ముప్విధములగు) పదార్థములు నిత్యము లని యెంచుదురు. ప్రకృతి జీవాత్మలు రెండును బ్రహ్మమువలెనే యెల్లప్పుడు (కాలత్రయమునందును) నుండునవి యగుటచే తమ యునికికొఱకు బ్రహ్మము నపేక్షింపవు; కాని, తమ స్థితికొఱకు గుణము ద్రవ్యమునువలె ఆధారముగా బ్రహ్మము నపేక్షించును. ప్రకృతిపురుషులు బ్రహ్మమున నవస్థితములై యుండును. ఈ జగత్తును ప్రకృతిపురుషాత్మకమే కాని వేరేమియు కాదు. కాబట్టి యీ జగత్తునకు బ్రహ్మమే యాధారము. ఇట్లే మంత్రములందును, ఉపనిషత్తులందును వర్ణింపబడినది.

"స్కంభో దాధార ద్యావా పృథివీ ఉభే ఇమే,
స్కంభో దాధా రోర్వంతరిక్షమ్,
స్కంభో దాధార ప్రదిశః షడూర్వీః,
స్కంభ ఇదం విశ్వం భువన మావివేశ" అథ. ౧౦–౮–౭–౩౫.
"సన్మూలాః సో మ్యేమాః సర్వాః ప్రజాః
సదాయతనాః సత్ప్రతిష్ఠాః" ఛాం. ౬–౮–౪.

(స్కంభః=స్తంభము, సత్ప్రతిష్ఠాం=బ్రహ్మ ఆధారముగా గలది.)
'స్తంభము గృహమున కాధారమైనట్లు భూనభోంతరాళాత్మక మగు జగత్తునకు బ్రహ్మ మాధార మని భావము,'

జగజ్జీవాత్మలకు బ్రహ్మ మాధారమైనంతమాత్రమున జగజ్జీవాత్మలు బ్రహ్మమే యనరాదు. గుణమునకు ద్రవ్య మాధార మైనందున గుణము ద్రవ్య మగునా ? కానేరదు. అందునను బ్రహ్మము విలక్షణమైన ఆధారము. సర్వపదార్థములందు నది లోపల వెలుపల యను భేదములేక ఓతప్రోతమై యంతర్యామి యన నొప్పును. మఱి యొక పదార్థ మిట్టిది కానము.

"స ఓతః ప్రోతశ్చ విభూః ప్రజాసు." యజు. ౩౨-౮.

"ఈశావాస్య మిదం సర్వం యత్కిం చ జగత్యాం జగత్."

యజు. ౪౦-౧.

అను నిట్టి మంత్రవర్ణములందును బ్రహ్మము ఓతప్రోతమై జగదాధార మని వర్ణింపబడుట సుస్పష్టము. ఆధారాధేయభావమువలన బ్రహ్మము, విశ్వము నను నీ రెంటియందును గల యభేదము కల్పితమేకాని సత్యము కాదని కొంద ఱందురు. వారిదృష్టియందు సత్యమైన యచేతన మొండు లేదు. కాబట్టి చేతనబ్రహ్మముతో నభేదభావమున వ్యవహరింపబడు నచేతనము కల్పితమే యగును. సత్యమైన యచేతనము నొక చేతనముతో నభేదము నొందుట లోకమున జూడము. కల్పితమైనది యధిష్ఠానము కంటె భిన్నముకాదని యంగీకరింపవచ్చును. కాబట్టి బ్రహ్మాధిష్ఠానమున విశ్వము కల్పితమే యని వారిదృష్టి. కాని యిది సరికాదు. విశ్వ మెల్లపుడు నుండునదికాబట్టి యది కల్పిత మనుట సిద్ధముకాదు. కాలము ముద్విధముల విభజింప నగును. (౧) సృష్టికి పూర్వకాలము (౨) సృష్టి కాలము (౩) భవిష్యత్కాలము. సృష్టికిపూర్వ మీ విశ్వములేకున్న (సదాత్మకము కాకున్న) సృష్టికాలమున నె ట్లుత్పన్నము కాగలదు ? అసదాత్మక మగు కుందేటి కొ మ్మెన్నడైన నుత్పన్నము కాగలదా ? విశ్వ ముత్పన్న మగుచుండుట ప్రత్యక్షసిద్ధము. కాబట్టి సృష్టికిపూర్వ మియ్యది సదాత్మకము (ఉనికిగలది) కాక తప్పదు.

"అసద్వా ఇదమగ్ర ఆసీత్." తై. ౨—౭.

'పూర్వ మియ్యది యసత్తుగా నుండెను.' అను నీ వాక్యమున నసత్తని యున్నందున జగత్తుయొక్క సత్‌భావము కల్పిత మందురేని, వాక్యమునగల 'అసద్' శబ్దార్థము సరిగా గ్రహింపలేదని చెప్పుదుము. ఈ వాక్యము సృష్టికిపూర్వము జగత్తు బొత్తిగాలేదు (అత్యంతాభావము) అని బోధింపక సృష్టికాలమున నెట్లున్నదో, అట్లు - ఆ రూపమున సృష్టికి పూర్వము లేదని మాత్రము తెలుపును. 'సత్' పదమునకు విపర్యయమైన 'అ స త్' పదమున కిట్లే యర్థము చెప్పుకొనవలయును. అందు వలననే ముందు 'అసత్' అని చెప్పి, యట్లు చెప్పుటచే నెవరేని . పొర పాటున 'అసత్' అనగా నత్యంతాభావము (బొత్తిగా లేకుండుట) గ నెంచెదరని యూహించియే వెంటనే మరియొక వాక్యమునందు సత్తని చెప్పబడినది.

"అసద్ వా ఇద మగ్ర ఆసీత్, త త్స దాసీత్" ఛాం. ౩—౧౯—౧.

'ఇది పూర్వ మవ్యక్తముగా నుండెను. ఇపుడు వ్యక్త మయ్యెను.' అని వాక్యార్థము.

"తద్ధేదం త ర్హ్యవ్యాకృత మాసీత్
త త్సదాసీత్ త న్నామరూపాభ్యా మేవ వ్యాక్రియత"

ఛాం. ౧—౪—౭.

'ముందు నామరూపములు లేక అవ్యాకృతమైయున్న జగత్తు తదు పరి నామరూపములతో వ్యాకృతము చేయబడినది' అని స్పష్టముగ వర్ణింపబడినది. కాబట్టి సృష్టికి పూర్వము విశ్వము సదాత్మకము కాదనుట తగదు. సృష్టికి పూర్వము సదాత్మకమైనది సృష్టికాలమున నసదాత్మకము- కల్పితము అనుట యుక్తము కాదు.

జగత్తు సృష్టికిపూర్వమేయున్న సృష్టికాలమున పుట్టున దేది? పుట్టు చున్నది కావున జగత్తు పూర్వము లేదందుమేని - అదియును పొసగదు,

పుట్టుక వస్తువుయొక్క యనిత్యతను తెలుపును. కాని దాని యత్యంతాభావ మును (బొత్తిగాలేకునికిని) దెలుపదు. జగత్తు నిత్యము కాదనుటలో నేరికిని విరోధములేదు. కాబట్టి పుట్టుకమూలమున జగత్తు కల్పితము (అసత్) అనుట హేతుబద్ధము కాదు. మఱియు సత్త్వ మన నర్థక్రియాకారిత్వము. జగత్తు అర్థక్రియాకారి (ప్రయోజనకారి) యనుట సర్వసమ్మతమే. కాబట్టి విశ్వము సృష్టికాలమునందును సత్యమే యనుట నిర్వివాదవిషయము.

సృష్టికిపూర్వము సదాత్మకమై యిప్పుడును సదాత్మక మగు నీ జగత్తు భవిష్యత్తున నుండ దని యెట్లు చెప్పనగును? సద్వస్తు వెన్నడు నభావమునొందదు. కాలత్రయమునందు నిట్లు సహేతుకముగ సద్భావము గల యీ విశ్వమునకు ఆధారాధేయభావమున బ్రహ్మైకత్వకల్పము సర్వవిధ ముల నుపపన్నమే యగుచున్నది.

లక్షణప్రయోజనము లక్ష్యమును సమానాసమానజాతీయము లగు పదార్థములనుండి వేరుచేయుటయే ప్రథమసూత్రమున బ్రహ్మము జిజ్ఞాస్య ముగ (తెలియదగినదిగ) జెప్పబడినది. అయ్యది దానికి సమానజాతీ యములయిన పదార్థములనుండియు, అసమానజాతీయము లగు పదార్థముల నుండియు వేరుసేయబడకున్న నది జిజ్ఞాస్య మగుట దుర్ఘటము. బ్రహ్మము చేతనము. విజ్ఞానాత్మలు (జీవులు)ను చేతనములే. కావున నవి బ్రహ్మకు సమానజాతీయములు. ప్రకృతి, దాని కార్యము లగు మహదాది పదార్థములు జడము లగుటచే నవి బ్రహ్మ కసమానజాతీయములు. బ్రహ్మశబ్దము ఉపనిషత్తులందు ప్రకృతి, జీవులు, బ్రహ్మము నను మూటిని దెలుపుట కట నట ప్రయోగింపబడినది.

"సత్యం జ్ఞాన మనన్తం బ్రహ్మ" తై. ౨-౧
ఈ వాక్యమునందు బ్రహ్మపదము బ్రహ్మమును దెలుపును.
"స వా అయ మాత్మా బ్రహ్మ విజ్ఞానమయః" బృ. ౪-౪-౫.

ఇందలి బ్రహ్మపదము జీవవాచకము.

"తపసా చీయతే బ్రహ్మ" ముం. ౧-౧-౮.

ఇందు బ్రహ్మపదము ప్రకృతివాచకము. ఇంతియకాక యీ బ్రహ్మ పదము వేదము మున్నగు ననేకార్థములందును ప్రయోగింపబడుటయు కలదు.

"యస్య బ్రహ్మ ముఖ మాహుః" అథ. ౧౦-౪-౭-౧౯.

ఇట బ్రహ్మపదము వేదవాచకము. ఇట్లే

"యో బ్రహ్మణే ప్రథమం గా అవిందత్" ఋ. ౧-౭-౧౨

"యస్య బ్రహ్మచ క్షత్రంచ ఉభే భవత ఓదనమ్" కఠ. ౧-౨-౨౫.

ఈ రెండువాక్యములందుగల బ్రహ్మపదము బ్రాహ్మణబోధకము. ఇట్లనేకార్థములను బోధించు బ్రహ్మపదముచే తెలియదగు వస్తు వెయ్యదియో లక్షణములేక తెలిసికొనుట యశక్య మగును. లక్షణముద్వారా లక్ష్య మగు బ్రహ్మము సమానాసమానజాతీయము లగు వస్తువులనుండి వేరు చేయబడి స్పష్టముగ తెలియనగును. నాడు మనము తెలిసికొనదగిన బ్రహ్మ మిదియా? అదియా? లేక యేది? యని సంశయము గలుగదు. జగజ్జన్మాదులకు బ్రహ్మము నిమిత్తకారణ మని లక్షణమొనరించిన తదుపరి బ్రహ్మపదముచే చెప్పబడినను - జగత్తున కుపాదానకారణమైన ప్రకృతికాని, విజ్ఞానాత్మయైన పురుషుడు (జీవుడు) కాని, బ్రాహ్మణుడుకాని, వేదము కాని జగత్తుయొక్క జన్మస్థితిలయములకు నిమిత్తకారణము కానందున నిం దేది బ్రహ్మమా యని సంశయము కలుగనేరదు. బ్రహ్మము సర్వాధారము, సర్వనియామకము నై యన్నిటికి నొప్పును. అందువలన బ్రహ్మము జగజ్జన్మాదులకు నిమిత్తకారణము. జన్మాద్యస్య యతః- అను లక్షణము సూపపన్నము. (౨)

జగజ్జన్మాదులకు కారణమును చెప్పుచు బ్రహ్మము సర్వశక్తిమంతము, సర్వజ్ఞము నని చెప్పబడినది. ప్రస్తుత మా విషయమును దృఢపఱచుచు నందులకు హేతువును చూపుచున్నాడు.

## శాస్త్ర యోనిత్వాత్ ౧-౧-౩

(బ్రహ్మపద మీ సూత్రమునగూడ నన్వయించును.)

బ్రహ్మ=బ్రహ్మము, శాస్త్రయోనిత్వాత్=వేదమునకు కారణమగుట వలన, బ్రహ్మము సర్వశక్తిమంతము, సర్వజ్ఞము నని సూత్రార్థము.

శాస్త్ర మన నిట వేద మని యర్థము. అయ్యది భువనమునందలి మానవులకందరికి హితమును సంపాదించుటకు, అహితమును విడుచుట కును వలయు సాధనముల ననుశాసించును - తెలుపును. వేదమునం దెట్టి పక్షపాతమును లేదు. అయ్యది భారతీయులను ప్రేమించి అన్యదేశీయులను ద్వేషింపదు. దానికి హిందూ మహమ్మదీయాది మతభేదము కాని, కృష్ణ గౌరాది వర్ణభేదముకాని లేదు. సర్వజ్ఞునివలె సర్వులకు సర్వము నను శాసించును. ప్రదీపము పగిది సర్వజనులకు సర్వమును ప్రకాశింపజేయుచు వెలుగొందుచున్నది. సర్వోపాయములకు, సర్వవిద్యలకును వేదము నిల యము. వేదమునం దుపపాదింపబడని విద్య లోకమున నొండును కానము. కాబట్టి వేదము మహచ్ఛాస్త్ర మనక తప్పదు. యోని పద మీ సూత్రమున కారణవాచకము. మహచ్ఛాస్త్రమైన వేదమునకు కారణ మగు బ్రహ్మము సర్వజ్ఞము, సర్వశక్తిమంతము కాకుండుట పొసగదు. ఏయే శాస్త్రములు మానవనిర్మితములో యందలి జ్ఞానముకంటె తత్కర్తలయం దధికజ్ఞాన ముండుట లోకవిదితము. యాజ్ఞ్యవల్క్యుడు శతపథమును, కణాదుడు కాణాదము (వైశేషికము)ను, పాణిని పాణినీయమును (అష్టాధ్యాయిని) రచించియున్నారు. వా రాయా శాస్త్రములందు గల జ్ఞానముకంటె నధిక జ్ఞాను లనుటలో నేరికిని సంశయ ముండదు. అల్పవిజ్ఞాని యధికవిజ్ఞాన వంత మగు గ్రంథము రచింపజాలడు. ఋగ్వేదాదిలక్షణముగల శాస్త్రము సర్వజ్ఞగుణాన్వితమై యుండుటవలన దానికి కారణమయిన బ్రహ్మము కూడ సర్వజ్ఞము, సర్వశక్తిమంతము ననుట యుక్తమే. (౩)

శాస్త్రమునకు నిమిత్త మగుటవలన బ్రహ్మము సర్వజ్ఞము, సర్వ శక్తిమంతము నని చెప్పబడినది. అది యెట్లు తెలియు నన :

తత్తు సమన్వయాత్ ౧-౧-౪

(తత్ + తు. సమన్వయాత్. ఈ సూత్రమున బ్రహ్మపదము షష్ఠీ విభక్తితోకూడి యన్వయించును.)

తత్=ఆశాస్త్ర కారణత్వము, బ్రహ్మణః తు = బ్రహ్మకే, సమన్వయాత్=సంబంధించుటవలన, తెలియు నని సూత్రార్థము.

యుక్తులమూలమునను, ఉపనిషద్వాక్యములచేతను బ్రహ్మమే వేదమునకు నిమిత్త మని తెలియుచున్న దని భావము.

మానవులలో ననుదినము ప్రవర్ధమాన మగు జ్ఞానము స్వాభావిక మన జెల్లదు. స్వాభావిక మగుచో నయ్యది యభివృద్ధినొందుటకు పర సాహాయ్య మపేక్షింప కుండెడిది. పరసాహాయ్యము నపేక్షించి వర్ధిల్లునది స్వాభావికము కానేరదు. కాబట్టి మనుష్యులలోగల జ్ఞానాభివృద్ధి స్వాభావికముకాక నైమిత్తిక మనక తప్పదు. అందువలననే మానవులు తమ జ్ఞాన మనెడి యైశ్వర్యమును వృద్ధిబొందించుకొనుటకై విద్యాసంస్థల నేర్ప అచుకొందురు. అందు యోగ్యులయిన విద్వాంసుల నేరి కోరి తెచ్చి, తమ సంతానమునకు శిక్షణము నొసంగి వారిజ్ఞానము నభివృద్ధి నొందించుటకై నియమింతురు. వారికి వలయు నితరగ్రంథాది సాధనసామగ్రిని చేకూర్చుదురు. దీనింబట్టి జ్ఞానము నైమిత్తిక మనుట సిద్ధము. నైమిత్తికమన నిమిత్తముద్వారా సంపాదింపబడునది. నేటిమానవుల జ్ఞానప్రాప్తి నిమిత్త సాధ్య మైనపుడు సృష్టికి నారంభమున మానవులకు లభించిన జ్ఞానమును నిమిత్తము లేక సంభవింప దనుట నిక్కువము. సృష్టికి నారంభమున నుద్భవించిన మానవులందఱును చదువరులుకామి నర్థపరిభాషల నెఱుగనివారై యొండొరుల జ్ఞానాభివృద్ధికి నిమిత్తము కాజాలరు, కాబట్టి సర్వజ్ఞును సర్వ

శక్తిమంతము నగు బ్రహ్మమే వారికి వేదమనెడి శాస్త్రముద్వారమున జ్ఞానైశ్వర్యము నొసంగియుండు నని తెలియనగును.

పరమర్షి పతంజలియు తన యోగతంత్రమున నిట్లే వాకొని యున్నాడు.

"పూర్వేషా మపి గురుః కాలే నానవచ్ఛేదాత్" యో. ౧-౨౬.

చతుర్వేదాధ్యయనసంపన్నుడైన గురువు నేడు వేదముద్వారా మనకు జ్ఞానము నొసంగుచున్నాడు. అట్లే సర్గాదియం దుద్భవించిన పూర్వులకును వేదముద్వారా గురువు జ్ఞానప్రాప్తి గలిగించియుండు ననుట నిశ్చితము. మనవంటి మానవులెల్లరు శరీరధారు లయినందున కొండొక కాలముచే బద్ధులుకాక తప్పదు. బ్రహ్మము శరీరి కాదు. కావున నది కాల బద్ధము కాదు. అందువలన మనపూర్వులకు పూర్వులయిన గురువులకును బ్రహ్మము గురు వనుట సంగతమే. ఆ బ్రహ్మమే వేదాదిశాస్త్రమునకు నిమిత్త మగుట యుక్తము. బ్రహ్మమునకు మించినది మఱియొకటి లేదు. దానికి సమానమును గానము. సామ్యముకాని, యాధిక్యముకాని లేని పదార్థమే బ్రహ్మ మనబడును. బ్రహ్మ మిట్టిదే యని వేదము చెప్పుచున్నది.

"నకిరింద్ర! త్వదుత్తరో న జ్యాయా అస్తి,
వృత్రహన్! నకిరేవా యథాత్వమ్." ఋ. ౩-౬-౧౯-౧.

ఉపనిషత్తునందు నిట్లే వర్ణింపబడినది.

"న తత్సమ శ్చాభ్యధికశ్చ దృశ్యతే" శ్వే. ౬-౮

మఱియు బ్రహ్మము పితృకల్పమగుటచే నదియే శాస్త్రమునకు నిమిత్తము. తండ్రి బిడ్డలను గని, వారు విద్యాభ్యాసము చేయకున్న నర్థములను, వానికిగల సంజ్ఞలను సరిగ నెఱుగనివారై లోకమున వ్యవహరింప నసమర్థులు కాఁజాల రని యెంచును. సంసారయాత్రను బాగుగ నిర్వర్తింపవేర రని గుర్తించి కరుణార్ద్రచిత్తుడై హితాహితప్రాప్తి, పరిహార - యోగ్య

మగు జ్ఞానము నుదయింపజేయు శబ్దసముదాయము వారికి దెలియునట్లు తగిన వ్యవస్థ చేయును. అట్లే పరమకారుణిక మగు బ్రహ్మము సైతము ప్రజల నుద్భవింపజేసి వారి సంసారయాత్రానిర్వహణార్థము కొండొక శబ్దరాశిమూలమున వారికి జ్ఞానము నుపదేశింపవలసియుండెను. బ్రహ్మము మానవులకు పితృకల్పమనుట వేదసిద్ధము.

"స నః పితేవ సూనవేఽగ్నే! సూపాయ నో భవ" ఋ. ౧-౧-౨-౯.

"త్వం హి నః పితా వసో!..............." ఋ. ౬-౭-౨-౧౧.

ఈ మంత్రములందు బ్రహ్మము మానవులకు పితృకల్పమని స్పష్టముగా వర్ణింపబడినది. కాబట్టి బ్రహ్మమే శాస్త్రమునకు నిమిత్తము.

బ్రహ్మము సర్వప్రాణుల కధిపతి యగుటచేతను శాస్త్రమునకు నిమిత్తము కావలసియున్నది. జనులను పాలింపనెంచు జనాధిపతి 'ఇది మీకు హితము చేకూర్చును. ఇది యహిత మొనర్చును. కావున హితసాధనము మీ కనుష్ఠింపదగినది. అహితము, తత్సాధనము పరిహరింపదగినవి.' అని స్వజనులకు బోధ గఱపును. అట్టియెడ సర్వాధిపుల కధిపము, సర్వజ్ఞము నగు బ్రహ్మము మానవుల నుదయింపజేసి వారికి హితాహితప్రాప్తి, పరిహార, జ్ఞానము నొదవజేయకుండు టెట్లు పొసగును? అట్టి జ్ఞానోదయకర మగు శబ్దరాశియే ఋగ్వేదాదిలక్షణముగల శాస్త్రము. కాబట్టి బ్రహ్మము శాస్త్రనిమిత్త మనుట సంగతమే. ఇయ్యది శాస్త్రమునందును ప్రతిపాదింపబడినది.

"తస్మాద్ యజ్ఞాత్ సర్వహుత ఋచః సామాని జజ్ఞిరే,
ఛందాంసి జజ్ఞిరే తస్మాద్ యజు స్తస్మా దజాయత."

ఋ. ౮-౪-౧౮-౯.

'వర్ణాశ్రమ వాసులచే తర్ప్యమాణమును, యజనీయమును నగు బ్రహ్మమువలన ఋక్కులు, సామములు, ఛందస్సులు (అథర్వము) యజుస్సు నుద్భవించినవి.

పాద (చరణ) వ్యవస్థ గల మంత్రములు ఋక్కు లనబడును. యజ్ఞమునందు గాయత్ర్యాది సామములచే గానము సేయబడు ఋక్కులు సామము లనబడును. ఋక్కులు, సామములు కాక గద్యరూపమున నుండు మంత్రములు యజు స్సనబడును. మంత్రములు గాయత్రి మున్నగు ఛందస్సులతో గూడియున్నను నయ్యవి సర్వవిద్యా బోధకము లని సూచించునిమిత్తము యజుస్సుకు పూర్వము ఛందస్సులు జనించిన వని చెప్పబడినది. లేక (ఛందః) ఛంద స్సన వేదము. 'ఛందాంసి' యన నథర్వ వేద మనియు చెప్పవచ్చును. వాస్తవమున మంత్రములన్నియు గద్యాత్మకములు, పద్యాత్మకములు నని రెండు విధములు. అందు పద్యాత్మకములలో యజ్ఞమునందు గాయత్రము మున్నగు సామగానములతో పాడబడు మంత్రములు సామము లనియు, మిగిలినవి ఋక్కు లనియు ననబడును. గద్యాత్మకములన్నియు యజుస్సు లనబడును. కాని వీనిలో వర్ణాశ్రమవాసులచే ననుష్ఠింపబడు యజ్ఞములం దుపయోగింపబడని మంత్రములుమాత్రము అథర్వము (అథర్వాంగిరసః) లనియు వ్యవహరింపబడును. ఇట్లు మంత్రము లన్నియు రెండువిధములయినను నవాంతరభేదముచే నొకట త్రిధములుగను, మఱియొకట చతుర్విధములుగను చెప్పబడుచున్న వని భావము. ఈ మంత్రములన్నియు కలిసి వేద మనబడును.

"వాగ్ వివృతాశ్చ వేదాః" ముం. ౨-౧-౪

మంత్రములు పైనజెప్పినట్లు నాలుగువిధములై నందున వేదములును నాలుగుగ వ్యవహరింపబడుచున్నవి. ౧. ఋగ్వేదము ౨. యజుర్వేదము ౩. సామవేదము ౪. అథర్వవేదము. వేదనామాంకిత మగు నీ శాస్త్రమునకు బ్రహ్మమే నిమిత్త మని యిట్లు వేదములే చెప్పుచుండ కాదన నెవరికి శక్యము? వేదము పరమప్రమాణము. అంతకుమించిన శబ్దప్రమాణ మొండు లేదు. వేదోక్తము యుక్తితోను ప్రమాణితమగునవ్వ దద్దానిని

గురించి చెప్పవలసిన దేముందును? కాబట్టి బ్రహ్మము శాస్త్రనిమిత్తమనుట సుసంగత మని భావము. (౪)

శాస్త్రనిమిత్త మగు బ్రహ్మము సర్వజ్ఞము, సర్వశక్తిమంతము నై జగత్తునకు జన్మాదికారణమైన నగుగాక. అంతమాత్రమున నయ్యది జగత్తునకు నిమిత్తకారణ మని యంగీకరింప శక్యముకాదు.

"జన్మాద్యస్య యతః" అను సూత్రమునందలి 'యతః' పదమునకు చెందిన పంచమీవిభక్తి హేతుమాత్రమును బోధించుచు నిమిత్తోపాదాన కారణములను రెండింటిని సూచించు నవకాశ ముండుటవలనను, శబ్దముచే జెప్పబడకపోవుటచేతను బ్రహ్మము జగన్నిమిత్తకారణ మెట్లగు నన:

## ఈక్షతే ర్నాశబ్దమ్                    ౧-౧-౫

ఈక్షతేః = ఈక్షణ శ్రుతివలన, 'అశబ్దం = జగజ్జన్మాదులకు బ్రహ్మము నిమిత్తకారణ' మని శబ్దముచే జెప్పబడలేదు (అశ్రౌతము) అనుట, న=తగదు.

ఋగ్వేదాదిలక్షణముగల శాస్త్ర మిట శబ్ద మనబడును. ముందు రాబోవు సూత్రములం దుపనిషద్వాక్యవిచారణ లభించుటవలన ఉపనిషత్తులను నీ శబ్దముచే లక్షితము లగును.

'శక్యసంబంధే లక్షణం' అనుటంజేసి వేదోపనిషత్తులకు వ్యాఖ్యాన వ్యాఖ్యేయభావము శక్యసంబంధ మగును. ఋగ్వేదాదిశాస్త్రము వ్యాఖ్యేయము, ఉపనిషత్తులు, బ్రాహ్మణములు, వ్యాఖ్యానము. బ్రహ్మము జగజ్జన్మాదులకు నిమిత్తకారణ మని ప్రతిపాదించు శబ్ద మొందును లేదని 'అశబ్దము'న కర్థము. 'ఈక్షతేః' అనునది హేతుసూచకము. ఈక్షతి ధాతువున కర్థము ఈక్షణము. ఈక్షణ మనగా సంకల్పము - గర్భమునందు గల పర్యాలోచన మనెడి జ్ఞానము. దీనినే యుపనిషత్కర్తలు తప స్సందురు. కావున 'ఈక్షతేః' అను పదమునకు 'తపఃశ్రవణమువలన' నని

యర్థము. కాబట్టి "ఈక్షతేః = తపశ్శబ్ద శ్రవణమువలన, అశబ్దం న = బ్రహ్మము జగజ్జన్మాదులకు నిమిత్తమని శబ్దముతో జెప్పలేదనుట యుక్తముకాదని సూత్రార్థము.

ఛాందోగ్య ప్రపాఠకమునందు

"స దేవ సౌమ్యేద మగ్ర ఆసీ దేక మేవాద్వితీయమ్" ఛాం. ౬-౨-౧.

అని ప్రారంభించి,

"తదైక్షత బహుస్యాం ప్రజాయే యేతి, త త్తేజో ఽసృజత"

ఛాం. ౬-౨-౩.

అని చెప్పబడినది. ఇందు పూర్వవాక్యమున సృష్టికిపూర్వము చేతనాచేతనాత్మక మగు (ఇదం పదవాచ్యం) నిఖిలజగత్తును ప్రకృతితో బాటు బ్రహ్మమునందు అవిభాజ్యమైయున్నట్లు చెప్పి, రెండవ వాక్యమునందా సచ్ఛబ్దవాచ్యమగు బ్రహ్మమే ఈక్షణపూర్వకముగ అగ్ని (తేజః) మున్నగు జగత్తును సృజించినట్లు వర్ణింపబడినది. (ఇట తేజస్సునకు పూర్వము - 'ఆకాశవాయువులను సృష్టించినతదుపరి -అని కలుపుకొనవలయును.) జగజ్జన్మాదులకు బ్రహ్మము నిమిత్తకారణముగా శ్రుతి యంగీకరింపదేని పై వాక్యములందు బ్రహ్మ మీక్షణపూర్వకమైన తేజః ప్రభృతి సృష్టి చేసిన ట్లెందుకు వర్ణింపబడును ? కుండకు నుపాదానకారణమైన మృత్తికయందు ఈక్షణపూర్వక స్రష్టృత్వ మెటనైన చూడగలమా? చూడలేము. నిమిత్తకారణమైన కుమ్మరియం దీక్షణాదులు ప్రత్యక్షసిద్ధములు. అట్లే జగజ్జన్మాదులకు నిమిత్తమయిన (కర్తయయిన) బ్రహ్మమునందును ఈక్షణపూర్వక స్రష్టృత్వము శ్రుతివర్ణించినది. కాబట్టి జగత్తునకు బ్రహ్మము నిమిత్తకారణ మనుట శాస్త్ర ప్రతిపాదితమే - శబ్ద ప్రతిపాదితమే యగును కాని యశబ్దముకాదని భావము.

కొందఱు ఈ సూత్రమునకు మరియొకవిధముగ వ్యాఖ్యానము చేయుదురు.

ఈక్షతేః=ఈక్షితృత్వశ్రవణమువలన, న=సాంఖ్యపరికల్పితమగు నచేతన ప్రధానము(ప్రకృతి) జగత్తునకు కారణమని వేదాంతమునందుజెప్పుటకు శక్యముకాదు. కారణమేమన, అశబ్దం=అది శబ్దప్రతిపాదితముకాదు.

కారణమునకు నీక్షితృత్వము శ్రుతియందు చెప్పబడుటవలన జగత్కారణము అచేతన ప్రధానమని యంగీకరింపవలనుపడదు. అచేతన ప్రధానము జగత్కారణమని శ్రుతియందు చెప్పబడకుండుటయే యిందులకు కారణము.

ఈ వ్యాఖ్యానము సరియైనది కాదు. ఇట్టి యర్థ మంగీకరించిన ప్రకృతహాని, అప్రకృత ప్రక్రియాప్రసక్తియు కలుగును. ప్రకృత విషయమును విడిచి యప్రకృతమయిన విషయమును గ్రహింపవలసివచ్చునని భావము. ఏ విషయ మీ ప్రకరణమున పూర్వసూత్రములందు విచారింపబడుచున్నదో యది ప్రకృతము. ఇతర మప్రకృతము. కాబట్టి బ్రహ్మము ప్రకృతవిషయము. అచేతనమైన ప్రధానము (ప్రకృతి) అప్రకృతము. పూర్వసూత్రములందుగాని, ఈ సూత్రమునగాని, ప్రధానమును తెలుపు శబ్దమొండును గానరాదు. అధ్యాహారము చేయుదమన్నను ప్రకరణము ననుసరించి అధ్యాహారముచేయవలయునుగాని స్వతంత్రించి చేయజనదు. సూత్రముల శైలియు నందుల కంగీకరింపదు. ఈక్షణహేతువు (ఈక్షతేః) ప్రకృతవిషయమునకు ప్రాప్తించిన యశబ్దతను దొలగించుచున్నదికాని, ప్రధానమునకు గల కారణత్వమును నిషేధించుటలేదనిస్పష్టముగా దెలియుచున్నది. కాబట్టి అకస్మాత్తుగ నిట జడ మగు ప్రధానమును గ్రహించుట ప్రకృతమును విడిచి, అప్రకృతమును గ్రహించుటయే యగును. వ్యాఖ్యానముకూడ దూషిత మగును. కారణమున కీక్షితృత్వశ్రవణమువలన కారణము శబ్దప్రతిపాదిత మగునుకాని, ప్రధాన మశబ్ద మని యెట్లు సిద్ధింపగలదు? కాగా ఈక్షణ శబ్దశ్రవణమువలన బ్రహ్మము జగన్నిమిత్తకారణమని పూర్వము చెప్పిన యర్థమే సంగతమగును.

మఱియు ప్రధాన మశబ్దమనుటయు యుక్తము కాదు.

"మహతః పర మవ్యక్తమ్" కఠ. ౩-౧౧.

"సత్వా దధి మహా నాత్మా మహతో௨వ్యక్త ముత్తమమ్" కఠ. ౬-౭

"తపసా చీయతే బ్రహ్మ" ముం. ౧-౧-౮.

"అజా మేకాం లోహితశుక్లకృష్ణాం" శ్వే. ౪-౫.

ఇట్టివి యెన్నో ఉపనిషద్వాక్యములు ప్రధానము (ప్రకృతి) యొక్క శ్రౌతత్వము (శబ్దప్రతిపాద్యము)ను బోధించుచుండ నయ్యది యశబ్ద మనుట యుక్త మెట్లగును? ఎన్నటికిని కాజాలదు. కాబట్టి యీ వ్యాఖ్యాన మనాదరణీయ మని భావము. (౫)

జగజ్జన్మాదులకు నిమిత్తకారణమైన బ్రహ్మము శ్రౌతమేకాని అశ్రౌతము కాదని పూర్వసూత్రమున చెప్పబడినది. ఈ సూత్రమున మహర్షి యీ విషయమునే దృఢపరచుచున్నాడు.

## గౌణశ్చే న్నాత్మశబ్దాత్ ౧-౧-౬

గౌణఃచేత్=పూర్వసూత్రమున జెప్పబడిన ఈక్షణము గౌణము-గుణసంబద్ధము-ప్రాకృతిక మని యందురేని, న=కాదు. కారణ మేమన, ఆత్మశబ్దాత్=ఆత్మశబ్దముచే చెప్పబడుటవలన *

"స దేవ సోమ్యేద మగ్ర ఆసీ దేక మే వాద్వితీయమ్"ఛాం. ౬-౨-౧.

'ఓ సౌమ్య! పూర్వమున నియ్యది సత్తే, ఒక్కటే, అద్వితీయము నై యుండెను' అను నీవాక్యమునందలి "సత్" పదము సర్వజ్ఞ

---

* ఈ శాస్త్రమునందు గుణశబ్దముచే ప్రకృతినే గ్రహింపవలయును. ప్రధానశబ్దముచే బ్రహ్మమును గ్రహింపనగును. కారణమేమున:

"ఆనందాదయః ప్రధానస్య" వే. 3-3-౧౧.

అను నీ సూత్రమునందు ప్రధానశబ్దము బ్రహ్మార్థమునందే ప్రయోగింపబడినది.

మైన బ్రహ్మమును బోధించు నన వీలులేదు. ఈ వాక్యములోని (ఇదమ్) 'ఇయ్యది' యను పదము జడచేతనాత్మకమగు జగత్తును బోధించుచున్నది కదా। అవును, అట్లే బోధించుచున్న దని యందురేని (సత్) బ్రహ్మము, (ఇదమ్) ఇయ్యది—ప్రకృతి—అను నీ రెండుపదములు నొకే విభక్తియందు ప్రయోగింపబడినవి. ప్రథమాంతములు. కాబట్టి యివి సమానాధికరణములు. వీనిలో. సామానాధికరణ్య మున్నది. ఈ సామానాధికరణ్యము బ్రహ్మము, ప్రకృతి యను నీ రెంటియందుగల యాధారాధేయభావమునే తెలుపునని కదా మీ మతము। ఇది యెట్లు పొసగును? లోకమునందు చేతనము జడమున కాధారమై యుండుట చూడజాలము. అట్టి యుదాహరణము లభించినచో చేతనమైన బ్రహ్మము జడప్రకృతి కాధార మని యంగీకరింప వచ్చును. ఉదాహరణము లభింపనపుడు కల్పించుట యుక్తము కాదు. కల్పన యుపలబ్ధిపూర్వకముగనుండవలయును. కాబట్టి బ్రహ్మము, జగత్తు నను నీ రెంటిలోగల యాధారాధేయ భావమును 'సత్', 'ఇదమ్' అను నీ రెండుపదములలో సామానాధికరణ్యము నిర్దేశించుచున్న దని చెప్పవలను పడదు. చేతనములకు, నచేతనములకు నీ భూమి యాధారముగనుండుట మనము ప్రత్యక్షముగ జూచుచున్నాము. భూమి యచేతనము. ఈ సామ్యము ననుసరించి చేతనాచేతనాత్మకములగు సర్వభూతములకు నాధారముగ 'సత్' పదముచే జెప్పబడునది యచేతనమే యైయుండవలయును. అదియు మూల కారణమైన ప్రకృతి యనుటయే యుక్తమగును. దానినే యౌపనిషదులు - ఉపనిషత్కర్తలు ప్రధానము—అవ్యక్తము—అవ్యాకృతము—అని యందురు.

ప్రకృతి సత్పదవాచ్యమైనయెడల నది జడము కాబట్టి 'తదైక్షత బహుస్యాం ప్రజాయే యేతి, తత్తేజో ఽసృజత' అను నీ వాక్యమునందు జెప్పబడిన ఈక్షణ మెట్లు సిద్ధించును? అని శంకింపరాదు. "తత్తేజ ఐక్షత" ఛాం. ౬-౨-౩. "తా ఆప ఐక్షన్త" ఛాం. ౬-౨-౪ అను వాక్యములందు జెప్పబడిన అగ్ని, జలముల ఈక్షణము సిద్ధించినట్లు సిద్ధింపగలదు. ఇట

జడము లయిన అగ్ని జలములకు గల రీక్షణము మీ కెట్లు సిద్ధింపగలదో మాకును ప్రకృతియం దీక్షణ మట్లే సిద్ధింపగలదు. అగ్నిజలముల యీ క్షణము గౌణము-ఔపచారికము-అముఖ్యము-అందురేని ప్రకృతికి చెందిన యీక్షణముకూడ నట్లే యముఖ్య మగును. కాగా జగజ్జన్మాదులకు నిమిత్త కారణమయిన బ్రహ్మము అశబ్దము కాదు. శాబ్దమే - శబ్దప్రతిపాదితమే - శ్రౌతమే-శాస్త్రప్రతిపాదితమే-యనుట తగదు అని పూర్వపక్షము.

ఆత్మశబ్దముచే బ్రహ్మము చెప్పబడుటవలన నీ పూర్వపక్షము - ఆక్షేపము - యుక్తము కాదని సమాధానము.

సత్ పదముచే జెప్పబడిన బ్రహ్మము "సదేవ సోమ్యేద మగ్ర ఆసీ దేకమే వాద్వితీయమ్" అని యారంభింపబడి 'తదైక్షత బహుస్యామ్' అని దానియం దీక్షణమును వర్ణించి, తుదకు "త త్సత్యం స ఆత్మా" ౬-౮-౭ అని చేతనవాచక మగు ఆత్మశబ్దముచే చెప్పబడినది. ఇట్టియెడ "సత్" పదముచే జెప్పబడిన మూలకారణము నచేతనమగు ప్రధానము (ప్రకృతి)గ నెంచెదమేని అదియే ప్రకృతమగును. కావున నాప్రధానమే తుదకు చేతనవాచక మగు నాత్మపదముచే జెప్పబడిన దెంచవలసియుండును. కాని, జడ మగు ప్రధాన మెక్కడ నెన్నడు నాత్మపదముచే వర్ణింపబడుట జూడము. ఆత్మశబ్దమునకు ప్రధానము (ప్రకృతి) అర్థమందుమేని శబ్ద శక్తి కది విరుద్ధ మగును. గోశబ్దమునకు గుఱ్ఱ మని యర్థము చెప్పిన ట్లగును. సచ్ఛబ్దమునకు బ్రహ్మ మర్థమనిన నట్టిదోష ముండదు. ఆత్మ శబ్దము బ్రహ్మమునందు వర్తించు ననుటలో శబ్దశక్తి యనుకూలించు నని భావము.

"తమేవ విద్వాన్ నబిభాయ మృత్యో రాత్మానం
ధీర మజరం యువానమ్" అథ. ౧౦-౮-౪-౪౪.
"నాయ మాత్మా ప్రవచనేన లభ్యః" కఠ. ౨-౨౩.

"అగ్ని ర్మూర్ధా చక్షుషీ చంద్రసూర్యౌ,
దిశః శ్రోత్రే వాగ్ వివృతాశ్చ వేదాః
వాయుః ప్రాణో హృదయం విశ్వ మస్య
పద్భ్యాం పృథివీ హ్యేష సర్వభూతాంతరాత్మా" ము. ౨-౧-౪.

"ఏకో దేవః సర్వభూతేషు గూఢః
సర్వవ్యాపీ సర్వభూతాంతరాత్మా" శ్వే. ౬-౧౧.

'బ్రహ్మము నెఱిగియే మృత్యువునకు భయపడడు'
'ప్రవచనముచే బ్రహ్మము లభ్యముకాదు'

'బ్రహ్మమునకు మూర్ధ మగ్ని, నేత్రములు చంద్రసూర్యులు, శ్రోత్రములు దిక్కులు, వాక్కు వేదములు, ప్రాణము వాయువు, హృదయము విశ్వము, పాదములు పృథివి-ఈ బ్రహ్మము సర్వభూతముల కంతరాత్మ.

'ఒకేదేవుడు సర్వభూతములందును గుప్తముగా నున్నాడు. అతడు సర్వవ్యాపి. సర్వభూతముల కంతరాత్మ' అని యిట్లు బ్రహ్మమే యాత్మ శబ్దముచే తెలుపబడినట్లు స్పష్టమగుచున్నది. కాబట్టి సర్వజ్ఞమైన బ్రహ్మమే సచ్ఛబ్దవాచ్య మగును. కాని అచేతన మగు ప్రకృతి కాదు.

ఈక్షణము గౌణము - ఔపచారికము అనుటయు గౌరవమగును. 'సత్' పదము ప్రకృతివాచక మనుటలో శబ్దశక్తివిరోధము వాటిల్లినట్లు, ఈక్షణము ప్రకృతియం దౌపచారిక మని కల్పించుటలోను గౌరవదోషము వాటిల్లును. ఈక్షణము చేతనధర్మ మగునుకాని జడధర్మము కానేరదు. చేతనధర్మమయిన యీక్షణము జడ మగు ప్రకృతియందు కల్పించుటకై ముందుగా చేతనసంబంధము ప్రకృతికి కల్పింపవలయును. అటుపై నీక్షణము ప్రకృతికి చెప్పవలసియుండును. ఇట్లు ప్రకృతియందు చేతన సామ్యము కల్పించి, అటుపై నీక్షణసామ్యము కల్పించుటయే గౌరవ దోషము. 'తత్తేజ ఐక్షత' తా అప ఐక్షన్త - 'తేజస్సు ఈక్షించెను'-'జల

మీక్షించెను' అను నిట్టిచోట్ల గత్యంతరము లేనందున ఈక్షణము గౌణ మనక తప్పదు. ఒకయెడ నుపాయాంతరములేమి నౌపచారికమైన యర్థము కల్పింపబడినది కావున నెల్లయెడల నట్లే కల్పింపవలయు నను నియమము లేదు. కాబట్టి నీ దృష్టాంత మయుక్తము.

అచేతన మగుభూమిని దృష్టాంతముగా చెప్పి యచేతనమైన, ప్రకృతియే జడచేతనాత్మక మగు జగత్తునకు నాధార మని చెప్పుటయు సంగతము కాదు. బ్రహ్మము అధిష్ఠానకారణము. కాబట్టి అది చేతనమయ్యు జడ చేతనాత్మక మగు జగత్తున కాధారమగుటలో దోషములేదని పూర్వమే చెప్పియుంటిమి. కాబట్టి ఈక్షణము గౌణము - ప్రకృతికి సంబంధించి నది - కాదనుట సుసంగతమే యని భావము. (౬)

జ్యోతిః శబ్దమునకు అగ్ని - జ్వలనము (మంట), బ్రహ్మము నను రెండర్థములు కలవు. అందువలన నయ్యది రెండర్థములందును ప్రయోగింపబడును. అట్లే యాత్మ శబ్దమునకు ననేకార్థము లుండుటచేత ప్రకృతియందును, బ్రహ్మమునందును ప్రయోగింపవీలగును. ఆత్మశబ్దము బ్రహ్మమునందువలెనే ఇంద్రియాత్మయందును, భూతాత్మయందును నచేతనము లయిన ఇంద్రియాదులందును ప్రయోగింపబడుట లోకమున జూచుచున్నాము. కాబట్టి 'తత్సత్యం, స ఆత్మా' - 'అది సత్యము', 'అది యాత్మ' యను స్థలమున ప్రయోగింపబడిన ఆత్మశబ్దము అచేతన మగు ప్రకృతివాచకము కాదనుట యుక్తముకాదన - సమాధానముచెప్పుచున్నాడు:

**తన్నిష్ఠస్య మోక్షోపదేశాత్        ౧-౧-౭**

తన్నిష్ఠస్య=తద్వాచ్యమునందు నిష్ఠ గలవానికి, మోక్షోపదేశాత్= మోక్షము కలుగు నని శాసించుటవలన, 'త త్సత్యం, స ఆత్మా' అను నీ వాక్యమునందలి ఆత్మశబ్దము ప్రకృతివాచకము కాదు. బ్రహ్మబోధకమే.

'సదేవ సోమ్యేద మగ్ర ఆసీత్ ఏకమే వాద్వితీయమ్' అని సత్

పదముచే బ్రహ్మము నుపదేశింప ప్రారంభించి, 'త త్సత్యం స ఆత్మా' యని యాత్మశబ్దముచే దానిని గ్రహించి "త త్త్వ మసి శ్వేతకేతో" ఛాం. ౬-౮-౭ 'ఓ శ్వేతకేతూ! నీ వా బ్రహ్మమునందు నిష్ఠ గలవాడ వగుము' అని ముక్తుని జేయ నుద్దేశింపబడిన చేతను డగు శ్వేతకేతునకు బ్రహ్మనిష్ఠ నుపదేశించి, యనంతరమున 'తస్య తావదేవ చిరం యావ న్న విమోక్ష్యే అథ సంపత్స్యే' ఛాం. ౬-౧౪-౨

'బ్రహ్మనిష్ఠగలవాడు శరీరపాతముకాగానే బ్రహ్మము నందగలడు - ముక్తుడగును' అని యుపదేశింపబడినది. ఇట్టి స్థితియందు 'త త్సత్యం స ఆత్మా' అను నీ వాక్యమునందలి యాత్మశబ్దము ప్రకృతివాచక మగు నెడల మోక్షోపదేశ మెట్లు సంగతము కాగలదు? ప్రకృతి నిష్ఠగలవానికి మోక్షము సిద్ధింపదుగదా! ప్రకృతినిష్ఠ మోక్షహేతువు కాదు. నిష్ఠయన ప్రతిష్ఠ-అనగా సర్వవ్యాపారములను విడచి యనన్యచిత్తముతో నుండుట. ఆ నిష్ఠ కేది విషయమో యదియే ప్రత్యక్ష మగును. ప్రకృతినిష్ఠవలన ప్రకృతిసాక్షాత్కారము కలుగును. కాని బ్రహ్మసాక్షాత్కారము గలుగదు. ప్రకృతిసాక్షాత్కారము మోక్షహేతువు కాజాలదు. కాబట్టి శాస్త్రము మోక్ష హేతువుకాని ప్రకృతినేల యుపదేశించును? అ ట్లుపదేశించినచో శాస్త్రము వంచక మగును. తండ్రి యగు నుద్దాలకమహర్షి, పుత్రుడైన శ్వేతకేతువు నేల వంచింప దలపెట్టును?

"శ్వేతకేతో వస బ్రహ్మచర్యం, న వై సోమ్యాస్మత్కులీనో உననూచ్య బ్రహ్మబంధు రివ భవతి" ఛాం. ౬-౧-౧.

'సౌమ్యుడ వగు నో శ్వేతకేతూ! బ్రహ్మచర్యము ననుష్ఠింపుము. వేదాధ్యయనముచేయనివాడు మూర్ఖు'డగును. అట్టివాడు మన కులమున నెవ్వడు నింతవరకు జనింపలేదు.' అని వేదధర్మము నుపదేశించు ఋషి వంచకు డెట్లు కాగలడు? కాబట్టి, పుత్రవత్సలు డగు నుద్దాలకమహర్షి మోక్షకాముడయిన శ్వేతకేతువునకు 'త త్సత్యం స ఆత్మా' అని సదాత్మక

మగు బ్రహ్మము నుపదేశించి, 'తత్త్వ మసి శ్వేతకేతో!' 'శ్వేతకేతూ! నీవు తత్త్వ మసి=తన్నిష్ఠుడవు–బ్రహ్మనిష్ఠుడవు కమ్ము' అని మోక్షసాధన మైన బ్రహ్మనిష్ఠ నుపదేశించినా డనియే తలంపవలయును. ఆత్మశబ్దము ప్రకృతివాచక మగు నెడల నియ్యది సంభవము కాదు. కాబట్టి 'తత్సత్యం స ఆత్మా' అను నీవాక్యమునందలి యాత్మశబ్దము ప్రకృతివాచకము కాదు; ఆత్మవాచకమే యని భావము.

జ్యోతిః శబ్దమువలె నాత్మశబ్దము నానార్థకమగుటచే నాత్మశబ్దమిట ప్రకృతి పరమే యని చెప్పుటయు సంగతముకాదు. శబ్దమున కనేకార్థము లంగీకరించుట యన్యాయము. శబ్దశాస్త్రవిదులు శబ్దమున కనేకార్థము లంగీకరించిన వృత్త్యంతరములు లోపింపగలవను భయముచేత నొక యర్థమునే యంగీకరించుట న్యాయమందురు. ముఖ్యవృత్తితో శబ్ద మొక యర్థమునందే ప్రయోగింపబడును. ముఖ్యవృత్తితో నేయర్థమున శబ్దము ప్రయోగింపబడునో యదియే దానికర్థము. ఇతరార్థములు గౌణములో, పారి భాషికములో యగును. ఏది గౌణమో, యేది ముఖ్యమో శబ్దవ్యుత్పత్తి చేతను ప్రయోగాదులవలనను దెలియనగును. ఆత్మశబ్దము చేతనార్థమున వ్యుత్పన్నమగుటవలన నయ్యది ప్రకతివాచకము కాదు. ఉపపదములేని యాత్మపదము బ్రహ్మపరముగానే ప్రయోగింపబడుటవలనను నయ్యది ప్రకృతివాచకమనుట సంగతము కాదు. ఉపపదముతోగూడిన యాత్మ పదము గౌణవృత్తితో నన్యార్థములందు బ్రయోగింపబడుట కలదు. కావున 'భూతాత్మ' 'ఇంద్రియాత్మ' అను ప్రయోగములున్నను దోషము వాటిల్లదు. 'తత్సత్యం స ఆత్మా' అను వాక్యమునందలి యాత్మపదము నిరుపపదము కాబట్టి యది బ్రహ్మకాచకమే కాని ప్రకృతివాచకము కాదు.

మఱియు, జ్యోతిః శబ్దమున కనేకార్థము లున్నవనుటయు సరి కాదు. "తచ్ఛుభ్రం జ్యోతిషాం జ్యోతి స్త ద్యదాత్మవిదో విదుః" ముం. ౨-౨-౯, 'జ్యోతిస్సులకు జ్యోతిస్సు, శుభ్రము నగు బ్రహ్మమును ఆత్మ

విదు లెరుగుదురు.' అని యిట్టి యుపనిషద్వాక్యములందు జ్యోతిః శబ్దము ముఖ్యవృత్తితో బ్రహ్మమునందే ప్రయోగింపబడినది. కాబట్టి 'త త్సత్యం స ఆత్మా' అను నీ వాక్యమునందలి ఆత్మశబ్దము ప్రకృతివాచక మెన్నటికిని కానేరదు.

ఈ సూత్రమునందలి 'తన్నిష్ఠస్య' అను పదముద్వారా 'త త్త్వమసి' యను వాక్యమునందలి యర్థమే సూత్రింపబడినందున 'త త్త్వమసి' అను వాక్యముకూడ నిట వ్యాఖ్యానము చేయబడినట్లే యెంచవలెను.

తత్ + త్వమ్ + అసి అని మూడుపదము లీ వాక్యమున నున్నవి. ఇందు 'త్వమ్' పదము తక్క మిగిలిన రెండుపదములు (తత్ + అసి) సందిగ్ధార్థకములే. ఈ 'తత్' పదము ప్రకరణమున జెప్పబడిన సద్రూపము, ఈక్షణ ధర్మముగల బ్రహ్మపరమా? లేక బ్రహ్మనిష్ఠపరమా? యని సందేహము వొడమును. ఇట్లే 'అసి' పదముకూడ వర్తమాన 'సత్తా' బోధకమా? లేక విధివచనమా? అనగా 'లట్' లకారముయొక్క రూపమా? లేక 'లేట్' లకారముయొక్క రూపమా? యని సందేహము వొడమును. ఇట్లు రెండు విధములగు నర్థములందును నీ శబ్దములు ప్రయోగింప వీలున్నందున నిట్టిసందేహము గలుగును. ఈ సందేహమును శ్రుతి వాక్యార్థ నిర్ణయముకొరకు నుపక్రమించిన పదవాక్య ప్రమాణములను బాగుగా నెఱిగిన యాచార్యుడే దొలగింపవలయును. అందువలననే యాచార్యుడు (వ్యాసుడు) 'తన్నిష్ఠస్య' అని సూత్రించి తత్పదార్థమును సూచించియున్నాడు. కాబట్టి 'తత్' పదము తన్నిష్ఠపరముగా చెప్పుట యాచార్యున కభిప్రేతమని స్పష్టమగుచున్నది. లేకున్న 'తన్నిష్ఠస్య' యని సూత్రింపడని భావము. నిష్ఠయన సర్వవ్యాపారములను వర్జించి యనన్య చిత్తముతో ప్రణిధాన మొనర్చుట యని యిదివరకే వివరించియుంటిమి. కాబట్టి నిష్ఠ క్రియాత్మకము. అదియును భావిక్రియయే కాని, భూతవస్తువుకాదు. "సుఖ (స్వర్గ) మభిలషింతువేని యాగమొనరింపుము" (స్వర్గకామో యజేత) అను తావులందు

విధి యపేక్షితమైనట్లు నిష్ఠ యను భావిక్రియయును విధి నపేక్షించును. కాబట్టి 'అసి' యను క్రియాపదము విధ్యర్థకమనియే యెంచవలయును. 'త్వమ్' పద మిట శ్వేతకేతువును నిస్సందిగ్ధముగా తెలుపును. కాగా,

'తన్నిష్ఠ స్త్వం భవ శ్వేతకేతో!' "ఓ శ్వేతకేతూ! నీవు తన్నిష్ఠుడ వగుము" అని 'త త్త్వ మసి' వాక్యమున కర్థమగుచున్నది. ఇట్టి యర్థమే యాచార్యున కభిమతమనియు, నదియే సంగతమనియు దెలియుచున్నది.

ఉద్దాలక మహర్షి స్వయముగా తనపుత్రుడైన శ్వేతకేతువునకు గల సంసారబంధన హేతువైన ప్రకృతినిష్ఠను తొలగించి మోక్షసాధన మైన బ్రహ్మనిష్ఠను సంపాదింప నుద్దేశించెను. అందులకై యత డనేక విధములయిన భూమికలను రచించుచు తొమ్మిదిమారులు 'త త్త్వమసి శ్వేతకేతో' యని యుపదేశించి యున్నాడు. తుదకు తొమ్మిదవసారి దొంగ నుదాహరణముగా దీసికొని తన్మూలమున ప్రకృతియందు నిష్ఠగలవానికి సంసారబంధమేర్పడునని చెప్పి బ్రహ్మయందు నిష్ఠగలవానికి మోక్షము ప్రాప్తించునని ప్రదర్శించును. అట్టియెడ 'త త్త్వమసి' యను వాక్యమునకు 'బ్రహ్మనిష్ఠుడవగుము' అని యర్థముకాక మరియొక యర్థమెట్లు కాగలదు? ఉపనిషద్వాక్యముల యర్థమును నిర్ధారణచేయ ప్రవర్తించువ్యక్తి తప్పక వక్తృతాత్పర్యమును గమనింపవలసియుండును. వక్తయగు నుద్దాలకుడు తుదకు తొమ్మిదవసారి చెప్పిన విధము చూడ 'తత్' పదము తన్నిష్ఠపర ముగా జెప్పినట్లు స్పష్టము గాకపోదు.

"పురుషం సోమ్యోత హస్తగృహీత మానయం త్యపహార్షీత్ స్తేయ మకార్షీత్, పరశు మస్మై తపతేతి, స యది తస్య కర్తా భవతి, తత ఏవా నృత మాత్మానం కురుతే సోఽనృతాభిసంధోఽ నృతే నాత్మాన మంత ర్ధాయ పరశుం తప్తం ప్రతిగృహ్ణాతి స దహ్యతేఽథ హన్యతే" ౧.

"అథ యది తస్యాకర్తాభవతి తతఏవ సత్య మాత్మానంకురుతే స

సత్యాభిసంధః సత్యే నాత్మాన మంతర్ధాయ పరశుం తప్తం ప్రతిగృహ్ణాతి స నదహ్యతేఽథ ముచ్యతే" ౨.

"స యథా తత్ర నదాహ్యేతైతదాత్మ్య మిదం సర్వం త త్సత్యం స ఆత్మా త త్త్వమసి శ్వేతకేతో!" ౩. – ఛాం. ౬-౧౬-౧-౨-౩.

"సోమ్య!=సౌమ్యుడా! దొంగతనముచేసినాదని సందేహించి యొకనిని రాజభటులు రాజునొద్దకు చేతులుగట్టి తెత్తురు. అతనిని పరీక్షించి చంపుటకై పరశువును (గొడ్డలిని) బాగుగ కాల్చుదని భటులకు రా జాజ్ఞాపించును. అపుడా దొంగ తాను దొంగతనము చేసినవాడగునేని అసత్యమాడి తనను అనృతునిగ - అనృతపరాయణునిగ - అనృతమున నిష్ఠగలవానిగ జేసికొనును. అత దనృతాభిసంధుడగును. అనగా ననృత నిష్ఠుడగునని భావము. అతడ ట్లనృతమయుడై కాలినగొడ్డలిని (తప్తంపరశుం) గ్రహించి కాలి చచ్చును. అతడు దొంగతనము చేయనివాడగుచో తన్ను సత్యపరాయణునిగ - సత్యనిష్ఠునిగ - జేసికొనును. అనగా సత్యమునందు అభిసంధి (ప్రణిధానము) కలవాడై సత్యనిష్ఠుడగును. సత్యనిష్ఠగలవాడై తప్తపరశువును గ్రహించి యతడు దహింపబడడు - చావడు. అంతట విడువబడును.

అట్లే సత్యమగు బ్రహ్మమునందు నిష్ఠ గలవాడు సాంసారిక వ్యాపారమునందు తప్తపరశువుతో సమానమగు సంసారముచే దహింపబడక, ప్రారబ్ధము ననుభవించిన తదుపరి ముక్తుడగును - బ్రహ్మను ప్రాపించును. కాబట్టి (ఐతదాత్మ్యమ్.........స ఆత్మా) పరదేవతానామము గల సత్తు, ఈక్షణకర్తయు నగు బ్రహ్మముతోకూడి సర్వజగత్తుకూడ నాత్మవంత మగుచున్నది. ఆ బ్రహ్మము సత్యము. అదియే, ఆత్మ - బ్రహ్మము, త త్త్వమసి - తన్నిష్ఠ - స్త్వ మసి. తన్నిష్ఠుడవు - బ్రహ్మనిష్ఠుడవు - అగుము. అనగా "శ్వేతకేతూ! నీవు సత్యాభిసంధుడవు - సత్యనిష్ఠుడవు - కమ్ము, అని యుద్దాలకుడు తన పుత్రున కుపదేశించె నని

యభిప్రాయము. ఇట్టి యభిప్రాయ ముద్దాలకునకు లేకున్న నతడు 'సత్యాభిసంధుడు' - దగ్ధుడు కాడు; ముక్తు దగును. అని తన యుపదేశ మున నుదాహరింపకుండెడివాడు. ఉదాహరణమున సారూప్య ముండ వలెను. మోక్షకారణమున నిట సారూప్యము స్పష్టము. 'దొంగ సత్యాభి సంధుడై ముక్తు దగునట్లు సంసారి బ్రహ్మాభిసంధుడై ముక్తు దగును.' అని సారూప్యము చెప్పనగును. కాబట్టి యాచార్యుడు (వ్యాసమహర్షి) 'తత్త్వమసి' వాక్యమునకు బ్రహ్మ నిష్ఠుడవగు మని యర్థమును బోధించు టకే యీ సూత్రమున "తన్నిష్ఠస్య" అని ప్రయోగించియున్నా డనుట నిక్కువము.

మఱియు ప్రతిజ్ఞాసామర్థ్యమువలన గూడ 'తత్త్వమసి' వాక్యమునకు తన్నిష్ఠుడ-బ్రహ్మనిష్ఠుడవగు మనియే యర్థము చెప్పుట యుక్తము.

"ఉత తమాదేశ మప్రాక్ష్యో యేనాశ్రుతం
శ్రుతం భవత్యమతం మత మవిజ్ఞాతం విజ్ఞాతమ్" ఛాం. ౬—౧—౩

'తత్త్వమసి' వాక్యమునకు సంబంధించిన ప్రకరణమునం దీ ప్రతిజ్ఞ చేయబడినది. "శ్వేతకేతూ, (యేన అశ్రుతం.........విజ్ఞాతమ్) దేనిని వినుటచే నితరము విననిదియంతయు విన్నట్లుండునో, దేనిని మననము చేయుటచే నితరము మననము చేయనిదంతయు మననము చేసినట్లగునో, దేనిని తెలిసికొనుటచే నితరము తెలియనిదంతయు తెలియునో (తమాదేశమ్) ఆ యాదేశమును - ఉపదేశగమ్యమైన పరమాత్మను (ఆదిశ్యతే ఉపదిశ్యతే ఇత్యాదేశః) (అప్రాక్ష్యః)-ఉపాధ్యాయుల నడిగి తెలిసికొంటివా ?" యను నీ ప్రతిజ్ఞ 'తత్త్వమసి' వాక్యమునకు సంబంధించిన ప్రకరణమున జేయ బడినది. ఈ ప్రతిజ్ఞయందు బ్రహ్మముకాక మిగిలిన అశ్రుతము, అమతము, అవిజ్ఞాతము నంతయు శ్రుతము, మతము, విజ్ఞాతము కావలయు ననినచో బ్రహ్మము దెలియబడవలయునని భావము. బ్రహ్మము సర్వజగత్తునకు నధిష్ఠానము. కాబట్టి యధిష్ఠాన జ్ఞానమువలన నధిష్ఠేయమంతయు దెలియ

నగు నని వివేకము. అట్లుకాక, 'తత్త్వమసి' యను వాక్యముతో 'ఆ బ్రహ్మము నీవు' అని శ్వేతకేతువునకు బోధించిన కలుగు లాభ మేమి? ఆ బ్రహ్మము నీవే యని చెప్పినందున శ్వేతకేతువునకు బ్రహ్మ సాక్షాత్కారము కలిగి మోక్షము సిద్ధించునా? సిద్ధింపదు. బ్రహ్మమునందు నిష్ఠ (ప్రణిధానము) గల వానికే బ్రహ్మసాక్షాత్కారము గలుగును. అందు వలన మోక్షము ప్రాప్తించును. కాబట్టి 'తత్త్వమసి' వాక్యమునకు 'తన్నిష్ఠుడ వగు' మను నుపదేశార్థమే యుక్త మని తేలుచున్నది.

ఇంతేకాక అన్య - ఉపనిషత్ వాక్యములందును నిష్ఠే యుపదేశింప బడి యుండుటవలనను 'తత్త్వమసి' వాక్యమునకు తన్నిష్ఠోపదేశమే యుక్త మగును. తైత్తిరీయోపనిషత్తునందు,

"బ్రహ్మ విదాప్నోతి పరమ్" తై. ౨-౧

'బ్రహ్మము నెఱిగినవాడు పరబ్రహ్మమును బొందును.' అని పరమ బ్రహ్మమును గూర్చి చెప్ప నారంభించి యటుపై సమస్త జగత్తుయొక్క యుత్పత్తిని వర్ణించి, తుదకు

"యదా హ్యేవైష ఏతస్మి న్నదృశ్యే ఽనాత్మ్యే ఽనిరుక్తే ఽనిలయనే ఽభయం ప్రతిష్ఠాం విందతే, అథ సో ఽభయం గతో భవతి"

తై. ౨-౭

'ఇంద్రియములకు గోచరము కానిదియు, శరీరము లేనిదియు నిట్టిది యని విశేషించి నిర్వచింప వీలులేనిదియు, అన్యము నాధారముచేసి కొనక స్వమహిమయందే యుండునదియు, నానందమయము నగు బ్రహ్మమునందు ముముక్షు వెన్నడు నిశ్చలమైన ప్రతిష్ఠ (నిష్ఠ)ను బొందునో, నాడే యా ముముక్షువు భయరహితమగు బ్రహ్మమును బొందును.' అని యుపదేశింపబడినది.

ఛాందోగ్యమున శ్వేతకేతువునకు బ్రహ్మ నిష్ఠోపదేశము 'తత్త్వ

మసి' వాక్యము ద్వారమున నుపదేశింపబడినట్లే యిట తైత్తిరీయము నందును ముముక్షువునకు బ్రహ్మనిష్ఠ యుపదేశింపబడినది. ఇట్టి యుపదేశ సామ్యమువలనను 'తత్త్వ మసి' వాక్యమునకు 'బ్రహ్మనిష్ఠుడ వగు' మని యర్థము చెప్పుటయే యుక్త మగును. అట్లుకాక మోక్ష మపేక్షించువానికి తైత్తిరీయమున బ్రహ్మనిష్ఠ సాధనముగా నుపదేశించి, ఛాందోగ్యమున శ్వేతకేతువునకు బ్రహ్మము నీవే యని చెప్పినచో ఉపనిషద్వాక్యము లందు పరస్పరవైరుద్ధ్య మేర్పడి అప్రామాణ్యప్రసక్తి కలుగును. కాబట్టి 'తత్త్వ మసి' యన 'తన్నిష్ఠుడ వగు' మనుటయే సుసంగతము.

యుక్తిచేతను నుపర్యుక్తమగు నర్థమే యుచితమని తేలుచున్నది. తండ్రియగు నుద్దాలకమహర్షి తన కడకు శిష్యభావముతో చేరిన శ్వేతకేతువునకు గురువై (తత్సత్యం, స ఆత్మా, తత్త్వ మసి) 'ఆ బ్రహ్మము సత్యము. అది యాత్మ - బ్రహ్మము. దానియందు నిష్ఠగలవాడ వగుము' అని యుపదేశించెను.

ఇట గురువు శ్రోత్రియుడు, బ్రహ్మనిష్ఠుడును తప్పక కావలయును. ముండకోపనిషత్తునందు —

'తద్విజ్ఞానార్థం స గురు మే వాభిగచ్ఛేత్,
సమిత్పాణిః శ్రోత్రియం బ్రహ్మనిష్ఠమ్' ముం. ౧-౨-౧౨

"బ్రహ్మజ్ఞానము సంపాదించుటకై చేతియందొక సమిధ నుంచుకొని శ్రోత్రియుడు, బ్రహ్మనిష్ఠుడు నగు గురువును సమీపింపవలయును." అని గురువు బ్రహ్మనిష్ఠుడు గావలెనని ఉపదేశింపబడినది. దీనింబట్టి గురుత్వము వహించిన యుద్దాలకమహర్షియు బ్రహ్మనిష్ఠుడై యుండవలయును. ఉద్దాలకమహర్షి బ్రహ్మనిష్ఠు డనుటకు "త మాదేశ మప్రాక్ష్యః, యేనాశ్రుతం శ్రుతం భవ, త్యమతం మత, మవిజ్ఞాతం విజ్ఞాతమ్" ఛాం. ౬-౧-౧. దేని నెఱిగిన నశ్రుతము శ్రుతము, అమతము మతము, అవిజ్ఞాతము విజ్ఞాతము నగునో యా బ్రహ్మము నుపాధ్యాయునివలన

తెలిసికొంటివా ? యను నుద్దాలకుని ప్రశ్నమే ప్రమాణము. స్వయముగా బ్రహ్మసాక్షాత్కారము నందనివా డిట్లు ప్రశ్నింపగలడా ? కాబట్టి యుద్దాలకుడు బ్రహ్మనిష్ఠుడై బ్రహ్మానందము ననుభవించినవా డనుట నిస్సంశయము. అందువలన శిష్యభావముతో సమీపించిన పుత్రునకు - శ్వేతకేతువునకు - బ్రహ్మనిష్ఠుడ వగు మని మోక్షార్థము నుపదేశించుటయే యుక్తి సంగత మనకతప్పదు.

'బ్రహ్మసంస్థోఽ మృతత్వమేతి' ఛాం. ౧-౨-౩.

'బ్రహ్మమునందు స్థితిగలవాడు మోక్షమునందు' నను నీ యుపనిషద్వాక్యము ననుసరించి బ్రహ్మనిష్ఠను మోక్షసాధనముగా నెఱిగిన శ్రోత్రియుడు - వైదికుడు - మహర్షియు నగు నుద్దాలకుడు పుత్రునకు 'తత్త్వమసి' యను వాక్యముతో 'నీవు బ్రహ్మమని' యెందుల కుపదేశించును? అట్లుపదేశించిన వంచకుడగును. వైదికుడు వంచకు డెన్నడును కాడు. వంచకత పాపహేతువని వైదికునకు తెలియదా? అందునను పుత్రవత్సలుడగు నుద్దాలక మహర్షి య ట్లేలచేయును? కాబట్టి 'తత్త్వమసి' యను వాక్యముతో 'బ్రహ్మనిష్ఠుడవగు' మని యుపదేశించుటయే సర్వథా యుక్తియుక్తమగునని భావము. (౭)

బ్రహ్మనిష్ఠ మోక్షమునకు హేతువైనంత మాత్రమున నాత్మశబ్దము ప్రకృతివాచక మేల కాదు? ప్రకృతినిష్ఠయును మోక్షప్రాప్తికి కారణమే కదా! ప్రత్యగాత్మ (జీవాత్మ) సాక్షాత్కారము కాని నాడు బ్రహ్మసాక్షాత్కారము కాజాలదు. ప్రత్యగాత్మను సాక్షాత్కారము చేసికొనుటకు ప్రకృతినిష్ఠ యెంతయు నవసరము. ఇట్లు ప్రకృతినిష్ఠ ప్రత్యగాత్మ సాక్షాత్కారమునకు కారణమగుచు బ్రహ్మసాక్షాత్కారమునకు హేతువగుచున్నది. బ్రహ్మసాక్షాత్కారమే మోక్షము. కాబట్టి ప్రకృతి నిష్ఠయును మోక్షోపదేశమునకు సంభవమే యగుచున్నది. అందువలన ఆత్మశబ్దము ప్రకృతివాచక మెట్లు కాదన. - సమాధానము:

మసి' వాక్యము ద్వారమున నుపదేశింపబడినట్లే యిట తైత్తిరీయము నందును భృగుమునివునకు బ్రహ్మనిష్ఠ యుపదేశింపబడినది. ఇట్టి యుపదేశ సామ్యమువలనను 'తత్త్వ మసి' వాక్యమునకు 'బ్రహ్మనిష్ఠుడ వగు' మని యర్థము చెప్పుటయే యుక్త మగును. అట్లుకాక మోక్ష మపేక్షించువానికి తైత్తిరీయమున బ్రహ్మనిష్ఠ సాధనముగా నుపదేశించి, ఛాందోగ్యమున శ్వేతకేతువునకు బ్రహ్మము నీవే యని చెప్పినచో ఉపనిషద్వాక్యము లందు పరస్పరవైరుధ్య మేర్పడి అప్రామాణ్యప్రసక్తి కలుగును. కాబట్టి 'తత్త్వ మసి' యన 'తన్నిష్ఠుడ వగు' మనుటయే సుసంగతము.

యుక్తిచేతను నుపర్యుక్తమగు నర్థమే యుచితమని తేలుచున్నది. తండ్రియగు నుద్దాలకమహర్షి తన కడకు శిష్యభావముతో చేరిన శ్వేతకేతువునకు గురువై (తత్సత్యం, స ఆత్మా, తత్త్వ మసి) 'ఆ బ్రహ్మము సత్యము. అది యాత్మ - బ్రహ్మము. దానియందు నిష్ఠగలవాడ వగుము' అని యుపదేశించెను.

ఇట గురువు శ్రోత్రియుడు, బ్రహ్మనిష్ఠుడును తప్పక కావలయును. ముండకోపనిషత్తునందు —

'తద్విజ్ఞానార్థం స గురు మే వాభిగచ్ఛేత్,
సమిత్పాణిః శ్రోత్రియం బ్రహ్మనిష్ఠమ్' ముం. ౧-౨-౧౨

"బ్రహ్మజ్ఞానము సంపాదించుటకై చేతియం దొక సమిధ నుంచుకొని శ్రోత్రియుడు, బ్రహ్మనిష్ఠుడు నగు గురువును సమీపింపవలయును." అని గురువు బ్రహ్మనిష్ఠుడు గావలెనని ఉపదేశింపబడినది. దీనింబట్టి గురుత్వము వహించిన యుద్దాలకమహర్షియు బ్రహ్మనిష్ఠుడై యుండవలయును. ఉద్దాలకమహర్షి బ్రహ్మనిష్ఠు డనుటకు "త మాదేశ మప్రాక్ష్యః, యేనాశ్రుతం శ్రుతం భవ, త్యమతం మత, మవిజ్ఞాతం విజ్ఞాతమ్" ఛాం. ౬-౧-౧. దేని నెఱిగిన నశ్రుతము శ్రుతము, అమతము మతము, అవిజ్ఞాతము విజ్ఞాతము నగునో యా బ్రహ్మము నుపాధ్యాయునివలన

తెలిసికొంటివా ? యను నుద్దాలకుని ప్రశ్నమే ప్రమాణము. స్వయముగా బ్రహ్మసాక్షాత్కారము నందనివా డిట్లు ప్రశ్నింపగలడా ? కాబట్టి యుద్దాలకుడు బ్రహ్మనిష్ఠుడై బ్రహ్మానందము ననుభవించినవా డనుట నిస్సంశయము. అందువలన శిష్యభావముతో సమీపించిన పుత్రునకు - శ్వేతకేతువునకు - బ్రహ్మనిష్ఠుడ వగు మని మోక్షార్థము నుపదేశించుటయే యుక్తిసంగత మనకతప్పదు.

'బ్రహ్మసంస్థోఽమృతత్వమేతి' ఛాం. ౧-౨-౩.

'బ్రహ్మమునందు స్థితిగలవాడు మోక్షమునందు' నను నీ యుపనిషద్వాక్యము ననుసరించి బ్రహ్మనిష్ఠను మోక్షసాధనముగా నెఱిగిన శ్రోత్రియుడు - వైదికుడు - మహర్షియు నగు నుద్దాలకుడు పుత్రునకు 'తత్త్వమసి' యను వాక్యముతో 'నీవు బ్రహ్మమని' యెందుల కుపదేశించును? అట్లుపదేశించిన వంచకుడగును. వైదికుడు వంచకు డెన్నడును కాడు. వంచకత పాపహేతువని వైదికునకు తెలియదా? అందునను పుత్రవత్సలుడగు నుద్దాలక మహర్షి య ట్లేలచేయును? కాబట్టి 'తత్త్వమసి' యను వాక్యముతో 'బ్రహ్మనిష్ఠుడవగు' మని యుపదేశించుటయే సర్వథా యుక్తియుక్తమగునని భావము. (౭)

బ్రహ్మనిష్ఠ మోక్షమునకు హేతువైనంత మాత్రమున నాత్మశబ్దము ప్రకృతివాచక మేల కాదు? ప్రకృతినిష్ఠయును మోక్షప్రాప్తికి కారణమే కదా। ప్రత్యగాత్మ (జీవాత్మ) సాక్షాత్కారము కాని నాడు బ్రహ్మసాక్షాత్కారము కాజాలదు. ప్రత్యగాత్మను సాక్షాత్కారము చేసికొనుటకు ప్రకృతినిష్ఠ యెంతయు నవసరము. ఇట్లు ప్రకృతినిష్ఠ ప్రత్యగాత్మ సాక్షాత్కారమునకు కారణమగుచు బ్రహ్మసాక్షాత్కారమునకు హేతువగుచున్నది. బ్రహ్మసాక్షాత్కారమే మోక్షము. కాబట్టి ప్రకృతి నిష్ఠయును మోక్షోపదేశమునకు సంభవమే యగుచున్నది. అందువలన ఆత్మశబ్దము ప్రకృతివాచక మెట్లు కాదన - సమాధానము:

## హేయత్వావచనాచ్చ ౧-౧-౮

హేయత్వావచనాత్ + చ=ప్రకృతినిష్ఠ హేయ (అగ్రాహ్య) మని చెప్పనందువలనను, ఆత్మశబ్దము ప్రకృతివచనము కాదు.

బ్రహ్మనిష్ఠ మోక్షమునకు ముఖ్యహేతు వని చెప్పియుంటిమేకాని, ప్రకృతినిష్ఠ ప్రత్యగాత్మసాక్షాత్కారమునకు కారణము కాదని చెప్పియుంటిమా? ప్రకృతినిష్ఠ యభ్యుదయమునకు, నిఃశ్రేయసమునకును సాధనమనియే యంగీకరింతుము. మోక్షప్రాప్తికి ముందు ఐహికాముష్మిక సుఖసమృద్ధి (అభ్యుదయము) నొందక తప్పదు. అందులకై మానవుడు ప్రకృతియందు నిష్ఠగలవాడై ప్రకృతియొక్క స్థూల సూక్ష్మరూపములను బాగుగ నెఱుంగవలసియున్నాడు. మానవుడు ప్రకృతియందు నిష్ఠగలవాడై దాని తత్త్వమును పూర్ణముగ నెరింగినంత నతనికి నానావిధమగు నైశ్వర్యము (ప్రకృతి సంపద) సిద్ధించును. అట్టి సంపదను బొంది యతడందు రమింపక నశ్వరసుఖసంపదలను గుర్తించి మోక్షము నభిలషించును. తదనంతరమే బ్రహ్మసాక్షాత్కారమునకు పూనుకొని నిరంతరము శ్రద్ధాశక్తులతో బ్రహ్మనిష్ఠుడై యత్నించును. మోక్షము నందును. కాని, లౌకికములయిన నానావిధములగు నైశ్వర్యములను సంపాదించినవాడు సాధారణముగా వానియందు రక్తుడగుచుండును. కోట్లకొలది మనుజులలో కొండొకడు పుణ్యాత్ముడు, ధీరుడు నైనవాడే తనకు లభించిన ప్రాకృతికసంపదలందు అనురక్తి నొందనివాడుండును. రూపరసాదివిషయములు తృష్ణాజనకములై అనేక పురుషాయుషపర్యంత మనుభవించియు త్యజింప శక్యముకానివై బంధనహేతువు లగుచున్నవని గుర్తించిన మహానుభావు డెవడో యొకరుడు వానినుండి విరక్తుడగును. రాగము మోక్షమునకు ప్రతిబంధకము. సంసారమున కది సాధనము. సాంసారికములయిన విషయములందు అనురక్తుడైన వ్యక్తి నిఃశ్రేయసమార్గమున

నదువజాలదు. మోక్షమునం దపేక్షగలవాడే సాంసారికభోగములనుండి విరక్తుడై బ్రహ్మసాక్షాత్కారమునకై యత్నించును.

ప్రస్తుతమున నుద్దాలక మహర్షి తనకడకు శిష్యభావముతో సమీపించిన శ్వేతకేతువునకు ముందు ప్రకృతినిష్ఠను అభ్యుదయప్రాప్తికి సాధనముగా నుపదేశించి, సాంసారికభోగములందు విరక్తుడై సంసార దావానలమున దగ్ధుడు కాకుండుటకై యతనికి ప్రకృతినిష్ఠ హేయము (విడువ దగినది) యని చెప్పి, యనంతరము బ్రహ్మనిష్ఠ మోక్షసాధనముగ చెప్పి యున్నట్లు కానరాదు. ప్రకృతినిష్ఠ హేయమని యెందునను జెప్పియుండ లేదు. కేవలము మోక్షసాధనమైన బ్రహ్మనిష్ఠనే యుపదేశించియున్నాడు. ఇంతియగాక "తస్య తావదేవ చిరం యావన్న విమోక్ష్యే, అథ సంపత్స్యే" 'శరీరపాతము కాగానే (మరణించిన మరుక్షణముననే) బ్రహ్మప్రాప్తి - మోక్షప్రాప్తి - కలుగు నని ఫలమును వర్ణించియున్నాడు. కాబట్టి "స ఆత్మా తత్త్వమసి, శ్వేతకేతో" అను నీ వాక్యమునందలి యాత్మశబ్దము బ్రహ్మవాచకమే యగును కాని ప్రకృతివాచకము కాదు. అందువలననే 'సదేవ సోమ్యేద మగ్ర ఆసీత్ ఏక మే వాద్వితీయం' ఛాం. ౬-౧-౧. అను వాక్యమునందలి సత్ శబ్దముకూడ బ్రహ్మవచన మనుటలో నెట్టి సందేహము లేదు. ఇట్లు ఈక్షణము ప్రకృతి ధర్మము (గౌణము) కాదనుట అన్నివిధములను సిద్ధమగుచున్న దని భావము. (౮)

ఈక్షణము ప్రకృతికి సంబంధించినది (ప్రాకృతికము) కాదను టకు మరియొక హేతు వెయ్యది యన :

## స్వాప్యయాత్ ౧-౧-౯

**స్వాప్యయాత్=(స్వస్మిన్=సతి. అప్యయః=లయః) సుషుప్తిలో జీవుడు బ్రహ్మమునందు లయ మగుటవలన, ఈక్షణము గౌణము (ప్రాకృతికము – ప్రకృతికి చెందినది) కాదు.**

సూత్రమునందలి 'స్వ' శబ్దము ప్రకరణమున వచ్చుచున్న 'సత్' శబ్దబోధకము. అప్యయ మనగా లయము "యత్రైతత్ పురుషః స్వపితి నామ, సతా సోమ్య! తదా సంపన్నో భవతి, స్వ మపీతో భవతి, తస్మా దేనం స్వపితీ త్యాచక్షతే స్వం హ్యపీతో భవతి" ఛాం. ౬-౮-౧.

స్వపితి=నిద్రించును. నిద్రించునపుడు జీవుడు 'సత్'తో సంపన్ను డగును - బ్రహ్మముతో లీను డగును. స్వమ్=బ్రహ్మతో, అపీతో భవతి= లీను డగును. అందువలననే (స్వపితి) నిద్రించుచున్నా డని చెప్పబడును. ఇట 'స్వ' శబ్దమునకు 'సత్' అర్థము. అపి పూర్వక 'ఇణ్' ధాతువునకు ప్రలయ మర్థము. స్వపితి=స్వమపీతోభవతి – బ్రహ్మమునందు లయ మగుచున్నా డని భావము. 'సతా సోమ్య! తదా సంపన్నో భవతి' సత్తుతో సంపన్నుడగు నని చెప్పి యనంతరమున మరల 'స్వమపీతో భవతి' సత్తుతో (బ్రహ్మముతో) లయు డగుననిచెప్పియున్నందున నిట లయము సంపత్తిరూపమున గ్రహింపవలెను. సంపత్తి యనగా నవిభాగ మని భావము.

జాగ్రదవస్థయందు విజ్ఞానాత్మ (జీవుడు) జడచేతనాత్మకమగు బాహ్యవిషయములందు యథేష్టముగ రమించుచుండును. పగలంతయు తిరిగి తిరిగి యలసి సొలసి రాత్రియందు చెట్టుకొమ్మ నాశ్రయించు పక్షి వలె జాగ్రత్స్వప్నములందు విషయాసక్తుడై యలసిన జీవుడు సుషుప్తి యందు విషయములనుండి విరతుడై బ్రహ్మమున (సత్తునందు) లీనుడైన ట్లుండును. అందువలననే సాంఖ్యదర్శనమునందును -

"సమాధి సుషుప్తి మోక్షేషు బ్రహ్మరూపతా" సాం. ద. ౫-౧౧౬.

సమాధియందును, సుషుప్తియందును, మోక్షమునందును జీవుడు బ్రహ్మసారూప్యమునందు నని వర్ణింపబడియున్నది. ఈ సాంఖ్యసూత్రము నందు జెప్పబడిన బ్రహ్మరూపతయు బ్రహ్మసంపత్తియే. బ్రహ్మమునం దవిభక్తముగా నుండుటవలన బ్రహ్మసారూప్యము నొందు నని భావము.

జీవు డిట్లు సుషుప్తియందుబ్రహ్మ (సత్తు)లో లయము నందుటయే 'స్వపితి' యను నామ మేర్పడుటకు నిమిత్త మని యెంచవలయును. అందువలన నిట 'సత్' శబ్దము ప్రకృతివాచకము కానేరదు. 'సత్' శబ్దమునకు ప్రకృతియని యర్థము చెప్పుదుమేని 'స్వపితి' యనగా ప్రకృతిలో జీవుడు లయము నొందుచున్నా డని చెప్పవలసివచ్చును. జీవునివలె ప్రకృతికూడ బ్రహ్మ నాశ్రయించియుండును. కాబట్టి జీవుడు ప్రకృతియందు లయించుట సంభవముకాదు. జీవప్రకృతులు రెండును బ్రహ్మము నాశ్రయించి యుండునవియే కాబట్టి రెండిటి యునికియందును పారతంత్ర్యము సమానమే. తన యునికికొఱకు నియమముగా నితరము నాశ్రయించు నొక వస్తువు తనలో మరియొకదానిని విలయమొనర్చుకొనజాలదు. కాబట్టి ప్రకృతియందు జీవుడు లయమొందు ననుట యుక్తముకాదు. జీవునకు ప్రకృతి భోగస్థానమేకాని, లయస్థానముకాదు. అందువలననే శ్వేతాశ్వతరమునందు-

"జహా త్యేనాం భుక్తభోగా మజో ఽన్యః" ౪-౫.

భోగ మున్నంతవఱకు ననుభవించి ప్రకృతిని జీవుడు విడుచునని వర్ణింపబడినది. కావున 'సత్' శబ్దము బ్రహ్మవాచకమే కాని, ప్రకృతి వాచకము కానేరదు. జీవునకు బ్రహ్మలయస్థాన మనుటలో నెట్టి విప్రతిపత్తియు నుండదు. ప్రశ్నోపనిషత్తునందుకూడ–

"స పరే ఽక్షర ఆత్మని సంప్రతిష్ఠతే" ౪-౫.

'జీవుడు అక్షర మగు–నాశరహిత మగు పరమాత్మయందుండు' నని స్పష్టముగానే చెప్పబడినది. ఈ విధముగ 'సత్' శబ్దము బ్రహ్మమునే బోధించును. ఆ బ్రహ్మమే యీక్షణకర్త. అందువలననే 'స దేవ సోమ్య' యని 'సత్' పదముతో బ్రహ్మము నారంభించి 'త దైక్షత' యని 'తత్' పదముతో నా బ్రహ్మమునే పరామర్శించి యీక్షణము చెప్పబడినది. కాబట్టి యీక్షణము బ్రహ్మధర్మమే యగును. కాని [illegible]

కాదను విషయము సుషుప్తి (గాఢనిద్ర)యందు జీవుడు బ్రహ్మమునందు లయమగుచున్నాడని (స్వాప్యయాత్) చెప్పుటవలనను సిద్ధమగుచున్నదని భావము. (౯)

ఈక్షణము ప్రకృతిధర్మము (గౌణము) కాదనుటకు మఱియొక హేతువు:

## గతి సామాన్యాత్ ౧-౧-౧౦

గతి సామాన్యాత్=జ్ఞానత్వమువలనను, ఈక్షణము ప్రకృతిధర్మము కాదు. గతి యన నిట జ్ఞానము. గతిసామాన్య మనగా జ్ఞానత్వము. ఈక్షణ మనగా సంకల్పము - గర్భమునందు గల పర్యాలోచన మనెడి జ్ఞాన మని పూర్వమే (ఈక్షతే ర్నాశబ్దమ్ ౧-౧-౫) వ్రాసియున్నాము. జ్ఞానము చేతనధర్మమగును గాని జడధర్మము కాదు. ప్రకృతి జడము. కాబట్టి ఈక్షణ మనెడి జ్ఞానము బ్రహ్మధర్మమే యగును. ప్రకృతి ధర్మము కాదని భావము. (౧౦)

మఱియొక హేతువు:

## శ్రుతత్వాచ్చ ౧-౧-౧౧

శ్రుతత్వాత్ చ = ఈక్షణము బ్రహ్మమునకు సంబంధించినదని ఉపనిషత్తుచే చెప్పబడినందువలనగూడ, నది (ఈక్షణము) బ్రహ్మ ధర్మమే యగునుగాని ప్రకృతిధర్మము కాదని సూత్రార్థము.

"స ఈక్షాం చక్రే" ప్రశ్న. ౬-౩.
"ఆత్మా వా ఇదమేక ఏవాగ్ర ఆసీత్,
నాన్యత్ కించన మిషత్, స ఈక్షత." ఐ. ౧-౧

అను నీ ఉపనిషద్వాక్యములందు 'బ్రహ్మ మీక్షించెను' 'సృష్టికి పూర్వము బ్రహ్మ మొక్కటియే యుండెను. అది యీక్షించెను' ని

స్పష్టముగా బ్రహ్మయం దీక్షణ ధర్మము వర్ణింపబడినది. కావున నీక్షణ ధర్మము ప్రకృతికి జెందినది కాదని తెలియుచున్నది. ఇట్లు జగజ్జన్మాదులకు సర్వజ్ఞమగు బ్రహ్మమే నిమిత్తకారణ మని సిద్ధ మగుచున్నది. (౧౧)

## ద్వితీయాధికరణము

బ్రహ్మము సాక్షాత్కారము చేసికొనదగినదని చెప్పి యనంతరము దాని లక్షణము చెప్పబడినది. పిదప లక్షణము స్పష్టముచేయుటకై జగజ్జన్మాదులకు బ్రహ్మము నిమిత్తమనియు బాగుగ వివరించి యిపుడు బ్రహ్మ జిజ్ఞాస్యత్వమును నిరూపించుటకై మరియొక యధికరణము నారంభించుచున్నాడు.

### ఆనందమయో ఽభ్యాసాత్ ౧-౧-౧౨

(బ్రహ్మపద మీ సూత్రమునందు నన్వయించును.)

అభ్యాసాత్ = (ఒక శబ్దము పలుమారు చెప్పుట యభ్యాసము) అభ్యాసమువలన, ఆనందమయమగు నాత్మ, బ్రహ్మ=బ్రహ్మమే యని యంగీకరింపవలెను.

తైత్తిరీయోపనిషత్తునందు అన్నరసమయము, ప్రాణమయము, మనోమయము, విజ్ఞానమయము నని క్రమముగా జెప్పి,

"తస్మాద్వా ఏతస్మాద్ విజ్ఞానమయా
దన్యో ఽన్తర ఆత్మా ఽఽనందమయః" తై. ౨-౫

ఈవిజ్ఞానమయమునకంటె భిన్నమైన అంతరాత్మ యానందమయమని చెప్పబడినది. ఇందు చెప్పబడిన ఆనందమయ శబ్దముచే

"బ్రహ్మవి దాప్నోతి పరమ్" తై. ౨-౧. 'బ్రహ్మవిదుడు పరము నొందును' అని ప్రకరణ ప్రారంభమున చెప్పబడిన బ్రహ్మమును

గ్రహింపవలయునా ? లేక జీవాత్మను గ్రహింపవలయునా ? యని సందే హము. జీవాత్మ యని పూర్వపక్షము.- కాదు, బ్రహ్మము అని సిద్ధాంతము.

తైత్తిరీయమునందు 'బ్రహ్మవి దాప్నోతి పరమ్' ౨-౧.

బ్రహ్మవిదుడు పరమును బొందునని ప్రారంభింపబడిన బ్రహ్మము నుండి

"తస్మాద్వా ఏతస్మాదాత్మన ఆకాశః సంభూతః,
ఆకాశా ద్వాయుః, వాయో రగ్నిః, అగ్నే రాపః,
అద్భ్యః పృథివీ, పృథివ్యా ఓషధయః, ఓషధిభ్యో అన్నమ్,
అన్నా ద్రేతః, రేతసః పురుషః" ౨-౧.

ఆకాశము, దానినుండి వాయువు, అందుండి యగ్ని, అగ్నివలన జలము, దానినుండి పృథివి, పృథివినుండి యోషధులు (మూలికలు - సస్యాదులు) వానినుండి అన్నము (భక్షణీయ పదార్థములు), అన్నము వలన రేతస్సు (శుక్లశోణితములు), దానినుండి శరీరము (పురుషుడు - జీవు డుండునది) పుట్టు నని చెప్పి,

"స వా ఏష పురుషో ఽన్నరసమయః" ౨-౧.

ఆ శరీరము అన్నరసమయ నామముతో చెప్పబడినది. ఇట్లు అన్న రసమయ నామముతో స్థూలశరీరమును చెప్పి క్రమముగా దానియం దుండు ప్రాణమయము, మనోమయము, విజ్ఞానమయము నను కోశము లను వర్ణించి యనంతరమున

"తస్మాద్వా ఏతస్మా ద్విజ్ఞానమయా దన్యో ఽన్తర ఆత్మా ఽఽనందమయః"

'విజ్ఞానమయకోశమునం దుండు ఆత్మ యానందమయ మని యుపదేశింపబడినది. ఇట్లు శరీరమునం దుండు ఆత్మ వర్ణింపబడినందున నానందమయ శబ్దముచే జీవాత్మయే గ్రహింపబడవలయును, ఇట నానంద

మయమగు నాత్మ బ్రహ్మమగునెడల శరీరమున కంతరాత్మగా నేల చెప్ప బడును ? విశ్వమున కంతరాత్మ యగు బ్రహ్మమును శరీరాంతరాత్మగ నుపదేశించుట యుక్తము కాదు. శరీరాంతరమున నుండునది జీవాత్మ యని ప్రసిద్ధమే. కాబట్టి జీవాత్మయే యిట గ్రహింప నగును.

మఱియును శరీరసంబంధమును దెలుపు శారీరపదముచే వ్యవహ రింపబడుటచేతను జీవాత్మనే ఆనందమయ శబ్దముచే గ్రహింపవలయును.

'తస్యైష ఏవ శారీర ఆత్మా యః పూర్వస్య' తై. ౨–౬.

అను నీ తైత్తిరీయ-వచనమునందు ఆత్మ శారీరము-శరీరసంబంధి-యని వర్ణింపబడినది. శరీరసంబంధము బ్రహ్మమునకు లేదు. యజు ర్వేదమునందు "స పర్యగా చ్ఛుక్ర మకాయ మవ్రణమ్" ४०–౮. బ్రహ్మము అకాయము, అవ్రణము నని శరీరసంబంధము లేనిదిగ వర్ణింప బడినది. ఇట్లు వేదమునందు బ్రహ్మమునకు శరీరసంబంధము నిషేధింపబడి నందున శారీరాత్మ బ్రహ్మ మనుటకు శక్యము కాదు. బ్రహ్మమునకు శరీరసంబంధ మంగీకరింతుమేని, ప్రియాప్రియములతో బ్రహ్మమునకు సంబంధ మంగీకరింపవలసి వచ్చును.

'అత్తో వై స శరీరః ప్రియాప్రియాభ్యాం న హ వై స శరీరస్య సతః ప్రియాప్రియయో రపహతి రస్తి' ఛాం. ౮-౧౨-౧.

శరీరముతో సంబంధముగల శారీరునకు (జీవునకు) ప్రియాప్రియ ములు గలుగును. వానినుండి తొలగ వీలులేదు.' అని ఛాందోగ్యమున స్పష్టముగ వర్ణింపబడినది. బ్రహ్మమునకు ప్రియాప్రియములు-సుఖదుఃఖ ములు-ధర్మాధర్మము లంటవనుట సర్వతంత్ర (శాస్త్ర) సిద్ధము. జీవాత్మ నకు సుఖదుఃఖము లుండుట నిర్వివాదవిషయము. కాబట్టి యానందమయ శబ్దముచే నిట జీవాత్మనే గ్రహింపవలయునని తాత్పర్యము,

ఇంకను నిట నానందమయాత్మకు శిరస్సు మున్నగు నవయవము లున్నట్లు వర్ణింపబడినందునను జీవాత్మనే గ్రహింప నగును.

"తస్య ప్రియమేవ శిరః, మోదో దక్షిణః పక్షః, ప్రమోదః ఉత్తరః పక్షః, ఆనందః ఆత్మా, బ్రహ్మ పుచ్ఛం ప్రతిష్ఠా" తై. ౨-౫

అను నీ వాక్యమునందు 'ఆ యాత్మకు ప్రియమే శిరస్సు, మోదము దక్షిణపక్షము, ప్రమోద ముత్తరపక్షము, ఆనందము ఆత్మ, బ్రహ్మము ప్రతిష్ఠ - ఆధారము - పుచ్ఛము నని వర్ణింపబడినది. ఇట నానందమయ శబ్దముచే బ్రహ్మము గ్రహింతుమేని శిరస్సు మున్నగు నవయవములు బ్రహ్మమున కంగీకరింపవలయును. అది శ్రుతివిరుద్ధము.

"దివ్యో హ్యమూర్తః పురుషః" ముం. ౨-౧-౨

"తతస్తుతం పశ్యతే నిష్కలంధ్యాయమానః" ముం. ౩-౧౮

"అస్థూల మనణు" బృ. ౩-౮-౮

"నిష్కలం నిష్క్రియం శాంతమ్" శ్వే. ౬-౧౮

ఈ వాక్యములందు బ్రహ్మ మమూర్తము, నిష్కలము, అస్థూలము, అనణువు నని యవయవరహితముగా వర్ణింపబడుటచేత బ్రహ్మము నం దవయవకల్పన యెంతమాత్రము నుచితము కాదు. ఇంతియగాక ఆనందమయమగు నాత్మకు "బ్రహ్మ పుచ్ఛం ప్రతిష్ఠా" తై. ౨-౫ బ్రహ్మము పుచ్ఛముగా జెప్పబడినది. పుచ్ఛ మనగా ప్రతిష్ఠ - ఆధారమని యర్థము. ఆనందమయ శబ్దముచే బ్రహ్మమును గ్రహింతుమేని బ్రహ్మకు బ్రహ్మమే యాధారమని యంగీకరింపవలసివచ్చును. అయ్యది సంభవము కానేరదు. బ్రహ్మము తనకు తానే యాధారము నాధేయము నెట్లు కాగలదు ? కావున నానందమయశబ్దము జీవాత్మవాచక మనుట యుక్తము. బ్రహ్మవాచకము కాదు - అని పూర్వపక్షము.

సమాధానము : ఆనందమయము బ్రహ్మమేకాని జీవాత్మ

కాజాలదు. జీవాత్మ యను నర్థమునందు ఆనందమయశబ్దము ప్రయోగింప బడుట కానము. వేదములందును, ఉపనిషత్తులందును ననేక స్థలములలో నానందమయశబ్దము బ్రహ్మమును తెలుపుటకే పలుమారు ప్రయోగింప బడినది. ఈ తైత్తిరీయమునందే యానందమయమును బ్రస్తుతించి యద్దానిని 'రసో వై సః' తై. ౨-౭ రసముగా జెప్పి 'రసం హ్యే వాయం లబ్ధ్వా ఽఽనందీభవతి' తై. ౨-౭ రసమును పొందియే జీవాత్మ యానందు డగునని వర్ణింపబడినది. ఇంతియగాక,

"ఆనందం బ్రహ్మణో విద్వాన్నబిభేతి కుతశ్చన" తై. ౨-౯.

"ఆనందో బ్రహ్మేతి వ్యజానాత్" తై. ౩-౬

"తద్విజ్ఞానేన పరిపశ్యన్తి ధీరాః ఆనందరూప మమృతం య ద్విభాతి" ముం. ౨-౨-౭.

"విజ్ఞాన మానందం బ్రహ్మ" బృ. ౩-౯-౨౮.

"రసేన తృప్తో న కుతశ్చనోనః" అథర్వ. ౧౦-౪-౮.

'బ్రహ్మానందము ననుభవించి భయమును విడుచును.'

'ఆనందము బ్రహ్మ మని తెలిసికొనవలెను.'

'అమృతమై యానందరూపమున వెలుగొందు బ్రహ్మమును ధీరులు విజ్ఞానముచే నెరుగుదురు.'

'బ్రహ్మము విజ్ఞానము నానందమునై యున్నది.'

'రసముచే తృప్తుడైనవానికి కొఱంత యుండదు.'

అను నిట్టి శ్రుత్యుపనిషద్వాక్యములందు స్పష్టముగా బ్రహ్మ మానందమయ మని వర్ణించుట చూడనగును. ఏ శబ్ద మే యర్థమునందు పలుమారులు ప్రయోగింపబడునో, యా శబ్దమున కదియే యర్థముగా

గ్రహించుట యుక్తము. అన్యార్థము గ్రహించుట తగదు. కాబట్టి యభ్యాస బలమున నానందమయ శబ్దము బ్రహ్మమునే తెలుపును కాని జీవాత్మను తెలుపదని గ్రహింపవలయును.

పై వాక్యములందు 'ఆనందమయ' శబ్దము ప్రయోగింపబడి యున్నచో నయ్యది బ్రహ్మమును దెలుపగలిగి యుండెడిదేమో: కాని కేవల మానందపదము బ్రహ్మము నెట్లు తెలుపగలదందురేని, అది దోషము కాదు. ఇట నానందపద మానందమయమునే తెలుపును. బ్రహ్మ మానందరూప మగుటచే నానందమనియు, సార్వభౌమాది సకల సుఖము లతో పోల్చిచూచిన నిరతిశయమైన దగుటచే నానందమయ మనియు జెప్పబడును. విశేషభేదము లేనందున నానందాభ్యాసము ఆనందమయాభ్యాసమే యని యెంచబడును. కొన్ని తావులందు ఆనందమయపదమే పఠింపబడుటయు జూడనగును.

"ఏత మానందమయ మాత్మాన ముపసంక్రామతి" తై. ౨-౮

'ఈ యానందమయమగు నాత్మను (బ్రహ్మమును) బొందును.'

ఆనందమయశబ్దము బ్రహ్మబోధకమైనను నయ్యది శరీరాంతరాత్మ (శరీరమున నుండునట్టి యాత్మ)గా వర్ణింపబడుట దోషావహము కాదు. విశ్వాంతరాత్మయగు బ్రహ్మము శరీరాంతరాత్మ యగుటలో దోష మిసుమంతయూ నుండదు. విశ్వమున నంతట నుండునది శరీరమున నుండ కుండునా ?

విశ్వమున నంతట నుండునది శరీరమున నుండినను, ఆనందమయము శరీరాంతరాత్మగా నుపదేశింపబడుటచేత శరీరసంబంధము విశేషముగ నానందమయమునకు జెప్పబడినట్లు కనబడుచున్నది.

శరీరము, ప్రాణము, మనస్సు, విజ్ఞానము నను నాలుగును జీవాత్మకు సంబంధించినవే కాని బ్రహ్మకు కాదు. కాబట్టి యానందమయ

శబ్దము జీవాత్మనే తెలుపును. కాని బ్రహ్మము నెట్లు తెలుపగలదు ? అందురేని, విజ్ఞానమయ శబ్దము జీవాత్మను దెలుపున దగుటచేత నానంద మయ శబ్దము బ్రహ్మమునే తెలుపునని యందుము. అందుచేతనే విజ్ఞాన మయ శబ్దము జీవాత్మను దెలుపునదగుటచేత ఆనందమయ శబ్దము బ్రహ్మ మునే తెలుపునని యంటిమి.

ఆత్మ శారీరము - శరీరసంబంధి - యని వర్ణించుటచే నానందమయ శబ్దము బ్రహ్మమును దెలుపజాలదనుటయు యుక్తము కాదు. బ్రహ్మ మంతరాత్మయగుటచే శారీరము - శరీరసంబంధి - యని చెప్ప ననువగును. విజ్ఞానమయమగు జీవాత్మ పంచభూతములతో నేర్పడు శరీరమునం దంత రాత్మగా యావజ్జీవ ముండునట్లు జగజ్జన్మాదులకు కారణమగు బ్రహ్మము కూడ చేతనాచేతనాత్మకమగు నీ జగత్తున కంతరాత్మయై యుండును.

"యో భూతం చ భవ్యం చ సర్వం య శ్చాధితిష్ఠతి,
స్వర్యస్య చ కేవలం తస్మై జ్యేష్ఠాయ బ్రహ్మణే నమః"

అథ. ౧౦-౪-౮-౧

'భూతభవిష్యద్వర్తమానముల నన్నిట నధివసించియుండు కేవల సుఖస్వరూపము, జ్యేష్ఠము నగు బ్రహ్మమునకు నమస్కారము' అని బ్రహ్మము సర్వము నధివసించియుండుట మంత్రమునందు స్పష్టముగ వర్ణింపబడియున్నది. అంతరాత్మతాసామ్యమువలన పాంచభౌతికపిండము జీవాత్మకు శరీరమైనట్లు విశ్వమంతయు బ్రహ్మకు శరీరముగ నెంచ బడును. బృహదారణ్యకమున నియ్యది స్పష్టపరుపబడినది.

"యః పృథివ్యాం తిష్ఠన్ పృథివ్యా అన్తరః,
యః పృథివీ నవేద, యస్య పృథివీ శరీరమ్" 3-2-8

"యోఽప్సు తిష్ఠన్ అద్భ్యోఽంతరః,
యమాపో న విదుర్యస్యాపః శరీరమ్" 3-8-4

"యోఽగ్నౌతిష్ఠ న్నగ్నే రంతరః,
యమగ్ని ర్నవేద యస్యాగ్నిః శరీరమ్" ౩-౭-౫

"యోవా యౌ తిష్ఠన్ వాయో రంతరః,
యం వాయు ర్నవేద, యస్యవాయుః శరీరమ్" ౩-౭-౭

"య ఆదిత్యే తిష్ఠన్ ఆతిద్యాదంతరః,
య మాదిత్యో న వేద, యస్యాదిత్యః శరీరమ్" ౩-౭-౯

"యో దిక్షు తిష్ఠన్ దిగ్భ్యోంతరః,
యం దిశో న విదుర్యస్య దిశః శరీరమ్" ౩-౭-౧౦

"య ఆకాశే తిష్ఠన్ ఆకాశాదంతరః,
య మాకాశో న వేద యస్యాకాశః శరీరమ్" ౩-౭-౧౨

"యః ప్రాణే తిష్ఠన్ ప్రాణాదంతరః
యం ప్రాణో నవేద, యస్యప్రాణః శరీరమ్" ౩-౭-౧౬.

"యో మనసి తిష్ఠన్ మనసోంతరః
యం మనో నవేద, యస్యమనః శరీరమ్" ౩-౭-౨౦.

"యో విజ్ఞానే తిష్ఠన్ విజ్ఞానాదంతరః
యం విజ్ఞానం నవేద, యస్య విజ్ఞానం శరీరమ్.
"యోవిజ్ఞానమంతరో యమయతి, ఏషత ఆత్మా
అంతర్యా మ్యమృతః" బృ. ౩-౭-౨౨.

"పృథివి, జలము, అగ్ని, వాయువు, ఆదిత్యుడు, దిక్కులు, ఆకాశము, ప్రాణము, మనస్సు, విజ్ఞానము నను వీనియందు బ్రహ్మముండును. కాని వానికంటె నయ్యది భిన్నము. పృథివ్యాదులు బ్రహ్మము నెఱుగవు: కాని యవి యన్నియు బ్రహ్మమునకు శరీరము. అట్టి బ్రహ్మము వాని కంతరాత్మ" అని యీ వాక్యములభావము. ఇట్లు జగత్తంతయు బ్రహ్మమునకు శరీరముగా వర్ణింపబడుటచే బ్రహ్మము శారీరము-

శరీరసంబంధి - యనుటలో దోషమావంతయులేదు. అటులయిన శరీర సంబంధముచే బ్రహ్మమునకు ప్రియా ప్రియముల - సుఖదుఃఖముల-తో సంబంధము కలుగగలదని యూహింపబనిలేదు. బ్రహ్మమునకు పృథివ్యా దులతో సామాన్యసంబంధమే కలదు; కాని జీవాత్మునకు పాంచ భౌతిక శరీరముతోవలె విశేషసంబంధ మొుండదు. సామాన్యసంబంధము సుఖ దుఃఖజనకముకాదు. 'బాలకుడు నిప్పువంటివాడ'నినంత మాత్రమున నతడు కాష్ఠములను దహించునని కాదుగదా! కాబట్టి పృథివ్యాదిరూప శరీరములం దుండుటచే బ్రహ్మము శారీరమని చెప్పబడుట దోషావహము కాదు.

అవయవశ్రవణమువలన బ్రహ్మ మానందమయము కాదనుటయు నుచితముకాదు. ఆత్మసామ్యముచే నట్లు చెప్పవలసివచ్చినందున దోషము లేదని భావము. (అన్నమయాదులకంటె ప్రాణమయాదులైన యంత రాత్మలు భిన్నములుగా నుపదేశింపబడినట్లు విజ్ఞానమయమగు నాత్మకంటె నానందమయాత్మ మఱియొక యంతరాత్మగ నుపదేశింపబడినది.)

"తస్య ప్రాణ ఏవ శిరః, వ్యానోదక్షిణః పక్షః,
అపాన ఉత్తరః పక్షః, ఆకాశ ఆత్మా, పృథివీ పుచ్ఛంప్రతిష్ఠా" తై. ౨-౨.

"దానికి శిరస్సు ప్రాణము; దక్షిణపక్షము వ్యానము; ఉత్తరపక్ష మపానము; ఆత్మ ఆకాశము; ఆధారము పృథివి." అని విజ్ఞానమయమగు నంతరాత్మకు నవయవములు వర్ణించి,

"తస్మా ద్వా ఏతస్మాచ్ విజ్ఞామయా దన్యో
అన్తర ఆత్మాఽఽనందమయః"

ఆ విజ్ఞానమయమగు నాత్మకంటె భిన్నముగ నానంద మయాంత రాత్మ వర్ణింపబడినది. కాబట్టి విజ్ఞానమయమగు నంతరాత్మకు శిరః ప్రభృ త్యవయవములు వర్ణించినట్లు నానందమయాంతరాత్మకును శిరః ప్రభృత్య వయవములు సామ్యముగ వర్ణింపబడినవి. అట్లు వర్ణింపకున్నచో నుప

దేశమునందు వైరూప్యము - విలక్షణత - యేర్పడును. ఉపదేశమున సారూప్యముండుట యవసరము. అదిలేకున్న ప్రాజ్ఞుల కందు శ్రద్ధ కలుగదు. ఆనందమయమగు బ్రహ్మమునకు శిరః ప్రభృత్యవయవములు పారమార్థికములు కావు. అవి కల్పితములే. బ్రహ్మము నిరవయవము కావున పారమార్థికావయవములకు ప్రసక్తియే లేదు.

కల్పింపబడు నవయవములు కూడ సమానలక్షణములు కలవిగా నుండవలయును. దేహమునందు హస్తపాదాద్యవయవములు కల్పించిన నయ్యవి సమానలక్షణము కలవియే యగును. అయ్యవి దేహమునకు విలక్షణములు కానేరవు. అట్లే యానందమయమగు బ్రహ్మమునందు కల్పింపబడు శిరఃప్రభృత్యవయవములును సలక్షణములు కావలయును. కావుననే మోదము, ప్రమోదము మున్నగు నానందవిశేషములే యానందమయమగు బ్రహ్మమున కవయవములుగా నిట కల్పింపబడినవి. మోదప్రమోదానందములు సాంసారిక వస్తూపభోగములవలన జనించు సుఖములవలెగాక విలక్షణములై బ్రహ్మనిష్ఠ నభ్యసించు ముముక్షువులచే ననుభవింపబడును. ప్రియము, మోదము, ప్రమోదము, ఆనందము నన్నియు బ్రహ్మశబ్దముచే చెప్పబడు దివ్యార్థమునే బోధించును. కాబట్టి యానందమయమగు బ్రహ్మము నిరవయవమైనను పక్షిరూపమున రూపకాలంకారముతో బ్రహ్మమును నిరూపించుచు ఉపనిషత్తిట్లవయవకల్పన చేయుట దోషావహము కాదని భావము.

'బ్రహ్మపుచ్ఛం ప్రతిష్ఠా' అని బ్రహ్మము ప్రతిష్ఠ - ఆధారము - పుచ్ఛము - గా వర్ణింపబడినందున నానందమయ శబ్దము బ్రహ్మమును బోధింపదని నుడువుటయు సముచితము కాదు. అదియును కల్పనామాత్రమే. ఆనందమయమునకు శిరఃప్రభృత్యవయవములు సాదృశ్యముచే కల్పింపబడినట్లు పుచ్ఛత్వము (ఆధారత) సైతము కల్పితమనియే యెంచవలయును. రూపకమునం దెల్లయెడల సర్వాంగముల నుపన్యసిం

చుట రూపకాలంకార విదులు ప్రశస్తముగా నెంచుదురు. పుచ్ఛమనగా తోక. కాని, యిట ప్రతిష్ఠయనెడి పదముతో నొకే విభక్తియందు ప్రయోగింపబడినందున నాధారమని యర్థము చెప్పియుంటిమి. బ్రహ్మము చేతనాచేతనాత్మకమగు నీ సమస్త జగత్తున కాధారము. ఆనందమయమగు బ్రహ్మము పక్షిరూపమున వర్ణింపబడుటచే సాదృశ్యమును కల్పించి పుచ్ఛరూపమున చెప్పబడినది. ఇయ్యది కల్పనా మాత్రమే. ఛాందోగ్యమునందు కూడ బ్రహ్మమునకు బ్రహ్మమే యాధారమని వర్ణింపబడినది.

"స భగవః కస్మిన్ ప్రతిష్ఠిత ఇతి? స్వమహిమ్ని" ఛాం. ౭-౨౪-౧.

'స్వామీ! ఆ బ్రహ్మమెందు ప్రతిష్ఠితమై యున్నది?' యని ప్రశ్నింపగా 'తన మహిమయందు' అని సమాధానము చెప్పబడినది. కాబట్టి యానందమయము బ్రహ్మమే యనుట యన్నివిధములను సిద్ధమగుచున్నదని భావము. (౧౨)

ఆనందమయ శబ్దమునందు 'మయట్' ప్రత్యయము కానవచ్చుచున్నది. 'నిత్యం వృద్ధ శరాదిభ్యః' అష్టా. ౪-౩-౧౪౪. అను పాణినీయ సూత్రము ననుసరించి వికారార్థమునందు ఆనందశబ్దమునకు 'మయట్' ప్రత్యయము విధింపబడినది. కాబట్టి యానందమయ మనగా నానందవికారమని యర్థము. ఆనందమయ శబ్దముచే బ్రహ్మము గ్రహింపబడు నెడల నయ్యది యానందవికారము కావలసి వచ్చును. బ్రహ్మమానంద స్వరూపమే కాని యానందవికారముకాదు. జీవాత్మ మాత్రము ప్రలయవేళయందు బ్రహ్మమున నవిభక్తముగనుండి సర్గారంభమున మరల పృథివినుండి యోషధులు వెలువడునట్లు బ్రహ్మమునుండి వెలువడునదై యానందమయమునుండి వెలువడుటచే నానందవికారమని యొక విధముగ చెప్పనగును. కాబట్టి యానందమయ శబ్దము జీవాత్మనే బోధించుట యుక్తమని శంకింపగా - నయ్యది కాదని చెప్పుచున్నారు.

## వికారశబ్దా న్నేతిచే న్న ప్రాచుర్యాత్ ౧-౧-౧౩

(ఈ సూత్రమున బ్రహ్మపదము, ఆనందమయపదము రెండును అనువర్తించును.)

వికారశబ్దాత్ = ఆనందవికార వాచకశబ్దము వలన, న = ఆనంద మయము బ్రహ్మముకాదు, ఇతి = అని, చేత్=అందువేని, న = కాదు, ప్రాచుర్యాత్ = ప్రాచుర్యశబ్దమువలన - ఆనందాధిక్యమును తెలుపు శబ్ద మగుటవలన.

ఆనందమయ శబ్దమునందలి 'మయట్' ప్రత్యయము ప్రాచుర్య మును (ఆధిక్యమును) బోధించును. కాని వికారమును బోధింపదు. 'మయట్' ప్రత్యయము వికారార్థమునందు విధింపబడునట్లు ప్రాచుర్యము నందును విధింపబడును. 'తత్ప్రకృత వచనే మయట్' అష్టా. ౫-౪-౨౧ అను పాణినీయసూత్రము ననుసరించి 'మయట్' ప్రాచుర్యార్థమున విధింప బడుచున్నది. కాబట్టి యానందమయ పదమునందలి 'మయట్' ప్రత్య యము వికారార్థమున విధింపబడిన ట్లెంచక ప్రాచుర్యార్థమున విధింపబడి నట్లు గ్రహింపనగును.

"నిత్యం వృద్ధ శరాదిభ్యః" అష్టా. ౪-౩-౧౪౪ అను నీసూత్రము ననుసరించి 'మయట్' ప్రత్యయము వికారార్థమునందును విధింపబడు చున్నదిగదా ! 'ఆనందమయము' అను నీ తావున వికారార్థమే యేల గ్రహింపగూడదు ? అందురేని 'మయట్' ప్రత్యయము, వికారము, ప్రాచు ర్యము (ఆధిక్యము) నను రెండర్థములందును ప్రయోగింపబడ నవకాశ మున్నప్పటికిని నెక్కడ నే యర్థము గ్రహించుట యుక్తమో యయ్యదియే గ్రహింపవలయును.

'శరీరము అన్నరస మయము' అను తావున అన్నరసమయము లోని 'మయట్' ప్రత్యయము వికారార్థమునే తెలుపుచున్నది; కాబట్టి

అన్నరసమయాది శబ్దసముదాయమున నున్న 'ఆనందమయము' అను శబ్దము లోని మయట్ ప్రత్యయము సైతము వికారార్థమునే బోధించునందురేని - అదియును సరికాదు. కారణమేమన: 'అన్నరసమయము' అను పదము లోని మయట్ ప్రత్యయముకూడ ఆధిక్యార్థము (ప్రాచుర్యము) నే బోధించుచున్నది. శరీరము అన్నరసమయము. అనగా అన్నరస మెక్కుడుగా గలది యనియే యర్థ మగును. కాని అన్నరసవికార మని కాదు. కావున ఆనందమయ మను పదమునందలి 'మయట్' ప్రత్యయముకూడ ఆనందాధిక్యమునే తెలుపుచున్న దని గుర్తింపవలయును. శరీరము పాంచ భౌతికము. పంచభూతముల మేళన మందుండును. కాని అన్నరసము (పృథివీభాగము) ప్రచురముగా - నెక్కుడుగా నుండును. అందువలన నయ్యది అన్నరసమయము అని చెప్పబడుచున్నది. అట్లే విజ్ఞానమయము మనోమయము, ప్రాణమయము నను శబ్దములును విజ్ఞానాదుల యాధి క్యము - ప్రాచుర్యమునే తెలుపుచున్నవి. కాగా ఆనందమయము ఆనందా ధిక్యము - ప్రాచుర్యమును బోధించుట కెట్టి యాటంకము నుండదని భావము. (౧౩)

బ్రహ్మ మానందమయ మనుటకు మరియొక హేతువు:

తద్ధేతు వ్యపదేశాచ్చ ౧-౧-౧౪

(ఆనందమయపద మీ సూత్రమునందును నన్వయించును.)

చ=మరియు, తద్ధేతు వ్యపదేశాత్=ఆనందహేతువుగా (బ్రహ్మము) చెప్పబడుటవలన, బ్రహ్మ మానందమయమే యని యర్థము.

తైత్తిరీయమున బ్రహ్మ మానందమయ మని ప్రారంభించి, "ఏష హ్యేవానంద యాతి" తై. ౨-౭. 'అదియే జీవుల నానందింప జేయును' అని వ్యపదేశింపబడినది - చెప్పబడినది. బ్రహ్మమానంద మయము కాని పక్షమున ఉపనిషత్తద్దానిని ఆనందహేతువుగా నేలచెప్పును?

బ్రహ్మముకంటె జీవుల నానందింపజేయగలది మఱియొం డెద్ది యున్నది ? బృహదారణ్యకమునందును, "ఏత స్యైవానంద స్యాన్యాని భూతాని మాత్రా ముపజీవ న్తి" బృ. ౪-౩-౩౨. 'అన్యాని భూతాని=జీవు లన్నియు, ఏతస్యైవ ఆనందస్య మాత్రాం = ఈ బ్రహ్మానందమాత్రనే, ఉపజీవ న్తి = పొంది యానందించుచున్నవి' అని వర్ణింపబడినది. (౧౪)

అందువలన బ్రహ్మ మానందమయ మనియు జీవాత్మ కాదనియు సిద్ధ మగుచున్నది.

మరియొక హేతువు :

మాంత్ర వర్ణిక మేవ చ గీయతే ౧-౧-౧౫

మాంత్రవర్ణిక మేవ చ =(బ్రహ్మము) మంత్రాత్మక వర్ణములచే ప్రతిపాదింపబడినందువలనను, గీయతే = ఆనందమయ మని చెప్పబడు చున్నది.

మరియు తైత్తిరీయమునందు, "బ్రహ్మవి దాప్నోతి పరమ్" తై. ౨-౧. 'బ్రహ్మవిదుడు పరము (బ్రహ్మము) ను బొందును' అని ప్రారంభించి, బ్రహ్మవిదునిచే పొందదగు బ్రహ్మముయొక్క లక్షణము, స్థానము, ఆప్తిని గురించి చెప్పు మంత్ర మొకటి యుదాహరింపబడినది.

"సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ యోవేద నిహితం గుహాయాం పరమే వ్యోమన్, సోఽశ్నుతే సర్వాన్ కామాన్ సహ బ్రహ్మణా విపశ్చితా" తై. ౨-౧.

'సత్యము, జ్ఞానము, అనంతము నని బ్రహ్మలక్షణము. జీవుని బుద్ధిస్థాన మగు హృదయము ఆ బ్రహ్మప్రాప్తికి స్థానము. జీవుడా బ్రహ్మముతోగూడి సర్వకామముల (ఆనందముల) ననుభవించును.' అను నవి బ్రహ్మజ్ఞానమునకు ఫలావాప్తి. హృదయమున జీవాత్మయం దంత రాత్మగా వ్యాపించియున్న బ్రహ్మము నెఱిగి, ప్రకృతిబంధమునుండి

విడివడి శుద్ధుడైనవాడు సర్వజ్ఞమగు బ్రహ్మముతోగూడి సర్వానందముల ననుభవించు నని భావము. ఇట్లు బ్రహ్మ లక్షణాదులను వర్ణించి యనంతరమున, 'ఆనందం బ్రహ్మణో విద్వాన్ న బిభేతి కుతశ్చన' తై. ౨-౯. 'బ్రహ్మానందమును బొంది నిర్భయుడగు ననియు జెప్పబడినది. అందువలన బ్రహ్మవిదులకు హృదయమున జీవాత్మయం దంతరాత్మగా వ్యాపించియున్న ఆనందమయ బ్రహ్మమే పొందదగినది, యని స్పష్ట మగుచున్నది. అట్టి బ్రహ్మప్రాప్తియే అభయపదప్రాప్తి యని మోక్షవిదు లందురు. కాబట్టి 'సత్యం జ్ఞాన మనంత' మ్మను వాక్యమున వర్ణింపబడిన బ్రహ్మమే యనంతరమున 'ఆనందం బ్రహ్మణో' అను శ్లోకమున నానంద మని చెప్పబడినందున బ్రహ్మమే యానందమయ పదవాచ్యమని సిద్ధమగు చున్నది. (౧౫)

ఇట్లు సిద్ధాంతపక్షమును జెప్పి యికముందు పూర్వపక్షమును నిరాక రింపదలచి మహర్షి సూత్రము నారంభించుచున్నాడు.

నేతరోఽనుపపత్తేః ౧-౧-౧౬

ఇతరః=(బ్రహ్మముకంటె నితరమగు) జీవాత్మ, న = ఆనంద మయము కాదు, అనుపత్తేః=యుక్తి యుక్తము కానందువలన,

జీవాత్మ సర్వమును సృష్టింపజాలదు. కావున నయ్యది యానంద మయము కానేరదని సూత్రాభిప్రాయము.

తైత్తిరీయమునందు ఆనందమయ మని ప్రారంభించి,
"స తప స్తప్త్వా సర్వ మసృజత్ యదిదం కించ" తై. ౨-౬

'అతడు తపించి బ్రహ్మాండమున గల సర్వమును సృజియించెను' అని చెప్పబడినది. ఇట సర్వమును సృజియించు సామర్థ్యము బ్రహ్మము నకే యున్నదని యూహింప నగును. కాని జీవాత్మకు గలదని చెప్ప వలనుపడదు. కావున ఆనందమయము బ్రహ్మమే యగును; జీవాత్మ కానేరదు. (౧౬)

భేద వ్యపదేశాచ్చ ౧-౧-౧౭

చ=మఱియు, భేదవ్యపదేశాత్ = భిన్నముగా జెప్పబడుటవలన, జీవాత్మ ఆనందమయము కాదు.

"రసోవై సః రసం హ్యేవాయం లబ్ధ్వాఽఽనందీ భవతి" తై. ౨-౭.

'ఆనందమయము రసమనియు, ఆ రసమును బొందియే జీవాత్మ యానందు డగుననియు' వర్ణింపబడినది. ఇక్కడ రస శబ్దముచే జెప్పదగు నానందమయము పొందదగిన పదార్థముగాను, పొందువాడు జీవుడుగాను వేరువేరుగా వర్ణింపబడుట స్పష్టము. కాబట్టి జీవాత్మ యానందమయము కాదని భావము. (౧౭)

ఉపర్యుక్తహేతువుల (సర్వస్రష్టృత్వానుపపత్తి, భేదవ్యపదేశము) వలన జీవాత్మ ఆనందమయము కాకపోవచ్చును; కాని ప్రకృతి యేల యానందమయము కానేరదు ? ప్రకృతి సర్వప్రపంచమునకు కారణమగు టచే నద్దానియందు -సర్వస్రష్టృత్వ ముపపన్నము కాగలదు. మఱియు, ఆనందమయముకంటె నయ్యది భిన్నముగా నెక్కడను వర్ణింపబడలేదు కదా ! - అన :

కామాచ్చ నానుమానాపేక్షా ౧-౧-౧౮

కామాత్ = కోరిక కలిగియున్నందువలన, అనుమానాపేక్షా చ = ప్రకృతియును, న = ఆనందమయము కాదు.

ఈ యానందమయ ప్రకరణమునందే 'సోఽకామయత బహు స్యాం ప్రజాయేయ' తై. ౨-౬. 'అతడు కామించెను........' అని పఠింపబడియున్నది. ఇట్టి కామము - కోరిక - ప్రకృతి ధర్మము కానేరదు. ప్రకృతి యచేతనము - జడము. కామమో చేతనధర్మము. ఆనందమయము ప్రకృతి యగునెడల దానియందు చేతనధర్మమగు కామముకూడ

పఠింపవలసియుండును. అయ్యది సంభవముకాదు. కాబట్టి ఆనందమయము ప్రకృతి కానేరదని భావము.

అటులయిన బృహదారణ్యకమునందు, 'కామః సంకల్పో విచికిత్సా శ్రద్ధాఽశ్రద్ధాధృతి రధృతిర్ హ్రీర్ధీర్ భీ రిత్యేతత్ సర్వం మన ఏవ' బృ. ౧-౫-౩. కామము, సంకల్పము మున్నగు ధర్మములన్నియు మానసికములని చెప్పబడుటచే, కామము ప్రాకృతికమే కదా! యందురేని అది సరికాదు. ఇట కామాదులు మనోమాత్ర ధర్మములని చెప్పబడిన దెంచుట తాత్పర్యానుకూలముకాదు. కారణమేమన : కామాదులు వాస్తవమున మనస్సుతోకూడిన జీవాత్మని ధర్మములు. జీవాత్మకు కామించుటలో మనస్సు ప్రయోజకమగునని భావము. మనస్సులేనినాడు జీవాత్మ కామింపనేరదు. కేవల మనస్సు జడమగుటచే నయ్యదియు కామింపజాలదు. కాబట్టి కామాదులు మనోవిశిష్ట జీవాత్మ ధర్మము లనుట నిశ్చితము. ఇట్లే ప్రకృతమున — 'సోఽకామయత' అను తావున పఠింపబడిన కామము సైతము ప్రకృతి విశిష్ట బ్రహ్మ ధర్మమగును. కాబట్టి ఆనందమయశబ్దము బ్రహ్మవాచకమే కాని ప్రకృతివాచక మెన్నటికిని కానేరదని భావము.(౧౮)

ఇందులకు మరియొక హేతువు :

## అస్మిన్నస్య చ తద్యోగం శాస్తి ౧-౧-౧౯

అస్మిన్=ఆనందమయ బ్రహ్మమునందు, అస్య=ముముక్షువగు నీ జీవునకు, తద్యోగం = ఆ మోక్షప్రాప్తిని, శాస్తిచ = ఉపనిషత్తు శాసించుచున్నందువలనను, ప్రకృతి ఆనందమయము కాదని సూత్రార్థము.

'యదాహ్యేవైష ఏతస్మిన్నదృశ్యేఽనాత్మ్యేఽనిరుక్తేఽనిలయనేఽభయం ప్రతిష్ఠాం విందతే, అథ సోఽభయం గతో భవతి.' తై. ౨-౭.

ఆనందమయమగు బ్రహ్మమునందు ప్రతిష్ఠితచిత్తుడైన — సమాహిత చిత్తుడైన — ముముక్షువునకు అభయప్రాప్తి — మోక్షము—గలుగు

నని ఉపనిషదభిప్రాయము. ప్రకృతి ఆనందమయమగుచో ఉపనిషత్తు ఎన్న టికిని నానందమయమున ప్రతిష్ఠితచిత్తునకు అభయప్రాప్తి కలుగుననిచెప్పి యుండదు. ప్రకృతియందు ప్రతిష్ఠితచిత్తునకు మోక్షప్రాప్తి కలుగనేరదు. ప్రకృతియందు చిత్తమును ప్రతిష్ఠించువానికి భయమే కలుగును. కాని యభయప్రాప్తి కలుగనేరదు. ప్రకృతి సదాపరిణామము నొందుచుండును. అయ్యది యొక క్షణమున నున్నట్లు మరియొక క్షణమున నుండదు. ఒకప్పు డది సుఖమయమగు సాత్త్వికావస్థ నవలంబించిన మరియొక సమయమున ఘోరము, దుఃఖమయము నగు రాజసదశ నందును. ఇంకొకనా డది విషాదమయమగు తామసిక స్థితిని ధరించును. ఇట్టి ప్రకృతియందు చిత్త మును ప్రతిష్ఠించినవానికి నభయప్రాప్తి కలుగు టెట్లు? అందువలననే కఠోపనిషత్తునందును —

'అన్య చ్ఛ్రేయోఽన్య దుతేవ ప్రేయ స్తే ఉభే నానార్థే పురుషం సినీతః, తయోః శ్రేయ ఆదదానస్య సాధు భవతి హీయతేఽర్థాత్య ఉ ప్రేయో వృణీతే' కఠ. ౨-౧.

'విభిన్నఫలములుగల శ్రేయస్సు, ప్రేయస్సు నను రెంటియందును శ్రేయస్సును గ్రహించినవానికి (సాధుభవతి) మోక్షమబ్బును.' అని బోధింపబడినది. మఱియు నీ బ్రహ్మనిష్ఠయే యభయప్రాప్తికి హేతువని యీ క్రింది వాక్యము స్పష్టము చేయుచున్నది.

'యదాహ్యేవైష ఏతస్మి న్నుదర మంతరం కురుతే, అథ తస్య భయం భవతి తత్త్వేవ భయం విదుషోఽమన్వానస్య.' తై. ౨-౭.

'ఎన్నడీ ముముక్షు వానందమయమగు బ్రహ్మనిష్ఠ నభ్యసించుటలో మధ్య విఘ్నములు కలిగించుకొనునో — అనగా బ్రహ్మమును విడిచి ప్రకృతినిష్ఠగలవాడగునో - నాడు అతనికి భయము కలుగును. అభయ ప్రాప్తి - మోక్షము - లభింపదు. అట్టి భయము ప్రకృతియందే సార మున్నదని భావించు విద్వాంసునకే కలుగును, కాని బ్రహ్మనిష్ఠగలవానికి

గలుగదు. బ్రహ్మనిష్ఠయే యభయప్రాప్తికి హేతువని భావము. కాబట్టి ఆనందమయము బ్రహ్మమే కాని ప్రకృతి కాజాలదు.

## తృతీయాధికరణము

బ్రహ్మము జిజ్ఞాస్యము - సాక్షాత్కారయోగ్యము - అనుట యుక్తి సంగతమని రూపించుటకుగాను బ్రహ్మ మానందమయమని చెప్పబడినది. ఇక బ్రహ్మముయొక్క వ్యాపకత్వమును చెప్పదలచి ముందుగా సర్వ భూతాంతస్థ మా బ్రహ్మమని చెప్పుచున్నాడు.

### అంత స్తద్ధర్మోపదేశాత్ ౧-౧-౨౦

తద్ధర్మోపదేశాత్=బ్రహ్మము నుద్దేశించి (బ్రహ్మధర్మములయిన సర్వపాప్మోదిత్యాది) ధర్మముల నుపదేశించుటవలన, అంతః = (ఛాందోగ్యోపనిషత్తునందలి) అంతః శబ్దముచే బ్రహ్మమే గ్రహింపనగును. ఛాందోగ్యోపనిషత్తునందొక ప్రకరణమున –

"అథ య ఏషోఽన్త రాదిత్యే హిరణ్మయః పురుషో దృశ్యతే హిరణ్యశ్మశ్రుర్ హిరణ్యకేశ ఆ ప్రణఖాత్ సర్వఏవ సువర్ణః" ౧-౬-౬.

'తస్య యథా కప్యాసం పుండరీకమేవ మక్షిణీ, తస్యోదితినామ, స ఏష సర్వేభ్యః పాప్మభ్య ఉదితః, ఉదేతి హవై సర్వేభ్యః పాప్మభ్యో య ఏవం వేద' ౧-౬-౭.

'తస్యర్క్ చ సామ చ గేష్ణౌ, స ఏష యే చాముష్మాత్ పరాఞ్చో లోకా స్తేషాం చేష్టే దేవకామానాంచ, ఇ త్యధిదైవతమ్' ఛా. ౧-౬-౮.

'అథాధ్యాత్మమ్—అథ య ఏషోఽన్త రక్షిణి పురుషో దృశ్యతే, తస్యైవ తస్య తదేవరూపం యదముష్యరూపం, యావముష్యగేష్ణౌ తౌగేష్ణౌ, యన్నామ తన్నామ' ౧-౭-౫.

'స ఏషయే చైతస్మా దర్వాంచో లోకాస్తేషాం చేష్టే మనుష్య

మానాం చేతి, తద్యే ఇమే వీణాయాం గాయన్త్యేతం తే గాయంతి, ప్మాత్తే ధన సనయః' ఛాం. ౧-౭-౬.

అని ఆదిత్యునందును అక్షియందును గల అంతఃపురుషుడు ఉపాస్యుడుగా వర్ణింపబడియున్నాడు. ఇట్లు ఆదిత్య (సూర్య) నందును, అక్షి (కంటి) యందును ఉపాస్యుడుగా జెప్పబడిన పురుషుడు జీవాత్మయా లేక బ్రహ్మమా యని సందేహము కలుగును. జీవాత్మయే యనుట పూర్వపక్షము. - కాదు బ్రహ్మమే యనుట సిద్ధాంతము.

పూర్వపక్షము : ఆదిత్య - అక్షులలో నుపాస్యుడుగా వర్ణింపబడిన పురుషుడు జీవాత్మయే. కారణ మేమన : ఇందు వర్ణింపబడిన అంతః పురుషుడు ఆధేయముగాను, ఆదిత్యుడు, అక్షి యతని కాధారములుగాను వర్ణింపబడినవి. జీవాత్మలకు పృథివ్యాది లోకము లాధారములైనట్లు నిట సూర్యుడు, నేత్రము నాధారములుగా వర్ణింపబడుచున్నవి. కాబట్టి జీవాత్మయే గ్రహింపనగునని భావము. బ్రహ్మము సర్వవ్యాపి కావున నయ్యది యాధేయముగా వర్ణింపబడనేరదు. బ్రహ్మము సర్వవ్యాపి యనియు, స్వమహిమయందే యది యుండుననియు నుపనిషత్తులలో వర్ణింపబడియున్నది.

"సర్వ వ్యాపీ సర్వ భూతాంతరాత్మా" శ్వే. ౬-౧౧

"స భగవః కస్మిన్ ప్రతిష్ఠితః ఇతి ? స్వే మహిమ్ని"

ఛాం. ౭-౨౪-౧

కావున నిట్టి బ్రహ్మమునకు సూర్యుడుకాని, నేత్రముకాని ఆధారమెట్లగును ? ఆదిత్యుడు, అక్షియు నాధారముగా ఉపనిషత్తు వర్ణించుచున్నందున వానియందలి యంతఃపురుషుడు బ్రహ్మము కాదు.

మఱియు నీ యంతఃపురుషునకు రూపమును నీ ఉపనిషత్తునందు కానవగుచున్నది.

'హిరణ్య శ్మశ్రు ర్హిరణ్య కేశః'

'బంగారు వర్ణముగల మీసములు వెండ్రుకలు గలిగియున్న' ట్లీవాక్యములు స్పష్టముగా చెప్పుచున్నవి. ఇట్టి రూపము మనవంటి జీవుల కుండుట సంభవము. కాని బ్రహ్మమున కుండనేరదు. బ్రహ్మమునకు రూపము లేకుండుట ఉపనిషత్ విదితము.

'అశరీరం శరీరేషు' కఠ. ౨-౨౧.

'బ్రహ్మము శరీరములలో శరీరము లేనిది.'

'అశబ్ద మస్పర్శ మరూప మవ్యయమ్.' కఠ. ౩-౧౫.

'బ్రహ్మమునందు శబ్ద స్పర్శ రూపములు లేవు.' ఇట్లనేక ఉపనిషద్వాక్యములు బ్రహ్మమునకు రూపము లేకుండుటను తెలుపుచున్నవి. కాబట్టి ఉపర్యుక్తప్రకరణమున వర్ణింపబడిన యంతఃపురుషుడు జీవాత్మయే యగును. కాని బ్రహ్మము కాదు; అని పూర్వపక్షము.

సిద్ధాంతపక్షము : పై ప్రకరణమున ఆదిత్యాంతఃపురుషుడుగా వర్ణింపబడి యుపాస్యుడుగా జెప్పబడిన పురుషుడు బ్రహ్మమే యగును. కాని, జీవాత్మ యెన్నటికిని కానేరదు. కారణమేమన : ఆ ప్రకరణమున వర్ణింపబడిన ధర్మములు బ్రహ్మమునకే చెందును. జీవాత్మకు చెందవు. ఆదిత్య-అక్షులలో వర్ణింపబడిన పురుషునకు ('తస్యో దితి నామ') ఉదితి యని నామము చెప్పి (స ఏష సర్వేభ్యః పాపేభ్యః ఉదితః) అతడు సర్వ పాపములనుండి యుద్గమించిన ట్లుపనిద్వాక్యములు నిర్వచించుచున్నవి. కావున నా పురుషుడు సర్వపాపరహితుడు - నిర్మలుడు అని భావము. ఇట్టి సర్వపాపవిరహితత్వ మనెడి ధర్మము బ్రహ్మమునకే యొప్పును. అందు వలననే యజుర్వేదమున బ్రహ్మము 'శుద్ధ మపాప విద్ధమ్' యజు. ౪౦-౮. 'శుద్ధము, పాపరహితము నని వర్ణింపబడినది. ఛాందోగ్యమునందును, 'ఏష ఆత్మాఽపహత పాప్మా' ఛాం. ౮-౧౫. 'ఈ పరమాత్మ (బ్రహ్మము) పాపరహిత మని వర్ణింపబడినది

ఇట్లే యోగదర్శనమునందు, "క్లేశకర్మ విపాకాశయై రపరామృష్టః పురుష విశేష ఈశ్వరః" యో. ౧-౨౪. 'ఈశ్వరుడు క్లేశాదుల సంబంధము లేనివాడ'ని స్పష్టముగా జెప్పబడినది. కాబట్టి బ్రహ్మమే అక్ష్యాదిత్యాంతః పురుషుడని తెలియ నగును.

అక్ష్యాదిత్యాంతఃపురుషుడు బ్రహ్మమగునెడల హిరణ్యశ్మశ్రువు మున్నగు రూపవర్ణన మెట్లు సంగతము కాగలదందురేని అది యాలంకారిక వర్ణన మని చెప్పుదుము. ఉపదేశకులగు మహర్షులు శిష్యుల కుపదేశించినప్పు డిట్టి శైలినే గ్రహింతురు. ఆలంకారికభాషతో జెప్పిన విషయమును శిష్యులు సులభముగా గ్రహింపగలుగుదురు. అలంకారము భాషకొక భూషణము కాదా! అందువలన నీ ప్రకరణమున బ్రహ్మమే పురుషరూపముతో వర్ణింపబడినదని చెప్పిన దోష మానంతయు నుండదు. సర్వ వ్యాపకమగు బ్రహ్మమునకు అక్షి, ఆదిత్యులు ఆధారముగ వర్ణింపబడుటకు కారణమేమి? అందురేని అదియును దోషము కాదు. బ్రహ్మమునకు అక్షి, ఆదిత్యులు అవధిగా జెప్పుట ఆధ్యాత్మికము, ఆధిదైవికము నను విభాగాపేక్షతో జెప్పుటయేకాని వేరొండు కాదు. కాబట్టి యీ ప్రకరణమున వర్ణింపబడిన అక్ష్యాదిత్యాంతః పురుషుడు బ్రహ్మమే కాని జీవాత్మ కాదు. (౨౦)

ఉపర్యుక్త ఉపనిషద్వాక్యములందు రూపకాలంకారము ప్రయోగింపబడిన పక్షమున నట వర్ణింపబడిన అక్ష్యాదిత్యాంతః పురుషుడుకూడ నక్ష్యాదిత్యులకంటె భిన్నుడుకాక అక్షి-ఆదిత్యులే యట్లు వర్ణింపబడినా రనిన దోష మేమి? మఱియు :

'య ఏషోఽన్త రాదిత్యే హిరణ్మయః పురుషో దృశ్యతే, అను నీ వాక్యమునందు ప్రయోగింపబడిన (కంటితో జూచుట యను నర్థము గల) దృశిధాతువుకూడ బ్రహ్మమును గ్రహించుట కుపయుక్తముగా కనిపింపదు. ఆదిత్యమండలమువలె బ్రహ్మము కంటికి గోచరమగు దృశ్య

రూపముగలది కాదుగదా! కావున నక్ష్యాదిత్యాంతఃపురుష దిట వేరుగా బ్రహ్మ మని నుడువుటకంటె అక్షి, ఆదిత్యులే యట్లు వర్ణింపబడిన వనుట యుక్తముగా నుండునన :

## భేద వ్యపదేశాచ్చాన్యః ౧-౧-౨౧

భేదవ్యపదేశాత్ = (ఆధారాధేయరూపమున) భిన్నముగా జెప్పుట వలన, అన్యః=అంతఃపురుషుడు అక్షి, ఆదిత్యులకంటె భిన్నుడే యగును కాని అక్షి, ఆదిత్యులు కావు.

ఉపనిషద్ వాక్యమునందు ఆదిత్యుడు, అక్షియు పురుషున కాధారము గాను, పురుషుడట నాధేయముగాను వర్ణింపబడియుండుట స్పష్టము. అట్టి యెడ పురుషుడు అక్షి, ఆదిత్యులకంటె వేరుగాక యవియే యగునెడల నాధారాధేయ భావ మెట్లు పొసగును? పొసగదు. కాబట్టి యంతఃపురుష దిట అక్ష్యాదిత్యులకంటె భిన్నమైన బ్రహ్మమే యగును. అక్ష్యాదిత్యులు కావు. చూచుట యను నర్థముగల దృశిధాతు ప్రయోగమెట్లు పొసగునందు రేని అది జ్ఞాన సామాన్యార్థమున ప్రయోగింపబడినదే కాని బహిరింద్రియ మగు చక్షురింద్రియముచే తెలియనగు జ్ఞాన విశేషమున బ్రయోగింపబడ లేదని చెప్పుదుము. అందువలన నెట్టిదోషము నుండదని భావము. (౨౧)

## చతుర్థాధికరణము

బ్రహ్మము సర్వభూతాంతస్థమని చెప్పి ప్రస్తుత మా బ్రహ్మము యొక్క వ్యాపకత్వమును వర్ణించుట కుపక్రమించుచున్నాడు.

## ఆకాశ స్తల్లింగాత్ ౧-౧-౨౨

తల్లింగాత్ = బ్రహ్మమును బోధించుట కనువగు లింగము (సామగ్రి) ఉండుటవలన, ఆకాశః = (ఛాందోగ్యమున వినబడు) ఆకాశము, బ్రహ్మబోధకమే.

'అస్య లోకస్య కా గతి రస్తి? ఆకాశ ఇతి హోవాచ, సర్వాణి హవా ఇమాని భూతా న్యాకాశా దేవ సముత్పద్యన్తే, ఆకాశం ప్ర త్యస్తం యన్తి, ఆకాశో హ్యేవై భ్యో జ్యాయాన్, ఆకాశః పరాయణమ్'

ఛాం. ౧-౯-౧.

'ఈ లోకమునకు గతి యేది? ఆకాశము. ఈ భూతములన్నియు ఆకాశమువలననే యుత్పన్నము లగుచున్నవి. ఆకాశముననే యస్తమించు చున్నవి. ఆకాశము వీనికంటె గొప్పది. ఆకాశమే పరమగతి' ఈ ఛాందోగ్యమునందలి ఆకాశపదము బ్రహ్మబోధకమా? లేక పంచభూతములలో నొకటియగు ఆకాశమును తెలుపునా? అని సందేహము వొడమును. కారణమేమన :

"పృథి వ్యాప స్తేజో వాయు రాకాశ మితి భూతాని" న్యా.౧-౧-౧౩.

'పృథివ్యాది పంచభూతములలోను ఆకాశపదము వాడబడుచున్నది. ఇట్లే, 'యదేష ఆకాశ ఆనందో న స్యాత్' తై. ౨-౭ 'ఆనందమయ మగు నాకాశము' అని యాకాశపదము బ్రహ్మమునకును వాడబడుచున్నది. కాబట్టి యాకాశపదము బ్రహ్మబోధకమా? లేక భూతవాచకమా? యని సందేహము కలుగుట వింతకాదు. ఇందు భూతాకాశమే యనుట పూర్వపక్షము. - కాదు, బ్రహ్మవాచకమే యనుట సిద్ధాంతము.

పూర్వపక్షము : ఆకాశపదము పంచభూతములలో నొకటియగు నాకాశమునే బోధించును. ఏ శబ్ద మే యర్థమున ప్రయోగింపబడునో యా శబ్దము వినినంత నా యర్థమే స్ఫురించుట లోకసిద్ధము. గోపదము విని నంతనే సాస్నాద్యవయవములతోగూడిన గోవు స్ఫురించునట్లు ఆకాశ పదము వినినతోడనే భూతాకాశ మెల్లరికిని స్ఫురించును. ఏ యర్థము ప్రథమమున స్ఫురించునో యయ్యది గ్రహించుటయే యుక్తమగును. అదియే ప్రసిద్ధార్థము. ఆకాశశబ్దము బ్రహ్మమునుకూడ బోధించునందురేని ఒక్క శబ్దమున కనేకార్థము లంగీకరింపవలసి వచ్చును. ముఖ్యవృత్తితో నొక శబ్ద

ముస కొకే యర్థమంగీకరింపనగునుగాని యనేకార్థము లంగీకరింపజనదు. లక్షణాదివృత్తులతో నొకశబ్దమున కనేకార్థముల నంగీకరింతురు. కాబట్టి ముఖ్యవృత్తితో నాకాశ శబ్దమున కర్థము భూతాకాశమే గ్రహింపనగును. అటులయిన 'సర్వభూతములు నాకాశమున నుద్భవించి, యాకాశముననే యస్తమించుచున్నవి. ఆకాశమే వానికి పరాయణము' అని చెప్పుట సమంజసము కాదందురేని, అదియును దోషముకాదు. భూతాకాశము మిగిలిన వాయ్వాది భూతోత్పత్తికి కారణమై వానికంటె గొప్పది యగుచు వాని యస్తమయమున కాశ్రయ మగుటలో దోషమెట్లు వాటిల్లగలదు? అందు వలననే తైత్తిరీయమునందు—

'తస్మాద్వా ఏతస్మాదాత్మన ఆకాశః సంభూతః, ఆకాశా ద్వాయుః, వాయో రగ్నిః, అగ్నే రాపః, అద్భ్యః పృథివీ, పృథివ్యాం ఓషధయః, ఓషధిభ్యోఽన్నమ్, అన్నాద్రేతః, రేతసః పురుషః' తై. ౨-౧.

ఆకాశము వాయువు మున్నగు భూతముల కన్నిటికి కారణముగా వర్ణింపబడినది. కాబట్టి భూతాకాశమే యిట గ్రహింపవలయునని పూర్వపక్షము.

సిద్ధాంతపక్షము : ఈ ప్రకరణమున నాకాశ శబ్దము బ్రహ్మవాచకమే కాని భూతాకాశపరము కాదు. కారణమేమన నిట బ్రహ్మబోధక లింగము లెన్నియో కలవు.

'సర్వాణి హవా ఇమాని భూతాని ఆకాశా దేవ సముత్పద్యన్తే'

'ఈ భూతములన్నియు నాకాశమువలననే యుత్పన్నములగుచున్నవి' అను నీవాక్య శేషమునందు ఆకాశము సర్వ భూతోత్పత్తికి కారణముగా నుపన్యసింపబడినది. ఈ యుపన్యాసము బ్రహ్మమునకు లింగమగును కాని భూతాకాశమునకు కానేరదు. భూతాకాశము వాయువు మున్నగు నితర భూతోత్పత్తికి కారణమగును. కాని తన యుత్పత్తికి తాను కారణము కాజాలదు కదా? కావున భూతాకాశము సర్వభూతోత్ప

త్తికి కారణమనుట యుక్తముకాదు. ఆకాశపదవాచ్యమగు బ్రహ్మమే భూతాకాశముతోబాటు సర్వభూతోత్పత్తికి కారణము కాజాలును. బ్రహ్మము సర్వభూతముల యుత్పత్తికి, స్థితికి, లయమునకును కారణమనుట సర్వ తంత్ర సిద్ధాంతము. ఇందులకు తైత్తిరీయమున నిట్లు వర్ణింపబడియున్నది.

"యతోవా ఇమాని భూతాని జాయన్తే, యేన జాతాని జీవన్తి, యత్ ప్రయం త్యభిసంవిశంతి, తద్విజిజ్ఞాసస్వ తద్బ్రహ్మ." తై. ౩-౧.

'దేనివలన నీ భూతములన్నియు నుత్పన్నము లగుచున్నవో, దేని మూలమున నుత్పన్నభూతములు జీవించుచున్నవో, దేనిని ప్రవేశించి విల యము నందుచున్నవో యది బ్రహ్మమని తెలిసికొనుము' ఇట్లు సర్వ భూతోత్పత్తికి కారణము బ్రహ్మమేకాని భూతాకాశము కానేరదు. ఇట్లే, (ఆకాశంప్ర త్యస్తం యన్తి) ఆకాశమున సర్వభూతలయముకూడ ఆకాశపదము బ్రహ్మబోధకమనుటకు లింగమే. సర్వభూతలయ మాకాశ వాచ్య బ్రహ్మమునందే యుక్తమగును కాని భూతాకాశమున కాదు. భూతా కాశము వాయ్వాదులకంటె గొప్పది కావచ్చును; కాని బ్రహ్మమో భూతా కాశముకంటెను గొప్పదై సర్వభూత జ్యాయస్త్వము (గొప్పతనము) నకు ఆశ్రయ మగుచున్నది. అందువలననే యయ్యది సర్వభూతపరాయణము ననుట యుక్తము. ఉపనిషద్వాక్యములు నిట్లే వర్ణించుచున్నవి.

'జ్యాయాన్ పృథివ్యా జ్యాయా నంతరిక్షాత్
జ్యాయాన్ దివో జ్యాయా నేభ్యో లోకేభ్యః' ఛాం. ౩-౧౪-౩

'పృథివికంటెను, అంతరిక్షముకంటెను, ద్యులోకముకంటెను, ఇంత యేల సర్వలోకములకంటెను బ్రహ్మము జ్యేష్ఠము' అని జ్యాయస్త్వ మిందు జెప్పబడినది.

'విజ్ఞాన మానందం బ్రహ్మరాతేర్దాతుః పరాయణమ్' బృ. ౩-౯-౨౮.

'విజ్ఞానమయము, నానందమయము నగు నా బ్రహ్మమే సర్వము

నఃపరాయణము.' అని సర్వపరాయణత్వమును వర్ణింపబడియున్నది. ఇట్లు సర్వ భూతోత్పత్తికారణత్వము, అస్తమయకారణత్వము, సర్వ భూత జ్యాయస్త్వము, సర్వభూత పరాయణత్వము మున్నగు లింగము లన్నియు నీ ప్రకరణమున నాకాశపదము బ్రహ్మవాచక మనుటకు లింగ ములు. కాబట్టి యాకాశపదముచే నిట బ్రహ్మమే గ్రాహ్య మని తేలు చున్నది.

ఆకాశపదమునకు భూతాకాశ మను నర్థము ప్రసిద్ధమగుటచే నయ్యది ప్రథమమున నుపస్థిత మగును. కావున నయ్యదియే గ్రహింప వలసి యుండునని చెప్పుట సమంజసము కాదు. కారణమేమన: ఆకాశ పదము భూతాకాశ మను నర్థమున ప్రసిద్ధమైనట్లు బ్రహ్మవిద్యయందు, బ్రహ్మ మను నర్థమునందును ప్రసిద్ధమే. అందువలన భూతాకాశమే ప్రథమమున నుపస్థిత మగు నను నియమ మొండును లేదు. మఱియు నాకాశపదము ముఖ్యవృత్తితో భూతాకాశమును దెలుపును. లక్షణాది వృత్తి భేదముతో నితరార్థములను దెలుపును. కావున బ్రహ్మము ఆకాశవాచ్యము కాదనుటయు తగదు. ఆకాశపదము బ్రహ్మమునందే ముఖ్యవృత్తితో ప్రవర్తించును. భూతాకాశమునందు నిరూఢలక్షణావృత్తితో వర్తించును. ముఖ్య, నిరూఢలక్షణావృత్తులలో నెక్కుడు భేద ముండదు. అందువలన నిట ననేకవృత్తుల నాశ్రయించి యర్థభేదము కల్పించుటయు నా యర్థము లలో గౌణ ముఖ్యభేదములను నంగీకరించుటయు నవాంఛితములే యగును. కాగా ఆకాశపద మీ ప్రకరణమున బ్రహ్మవాచకమే యగును కాని భూతా కాశబోధక మెన్నడును కానేరదని భావము. (౨౨)

## అత ఏవ ప్రాణః ౧-౧-౨౩

అత ఏవ=బ్రహ్మబోధక లింగ ముండుటవలననే, ప్రాణః=ప్రాణ శబ్దముకూడ బ్రహ్మవాచకమే.

ఛాందోగ్యముననే మఱియొక వాక్యమి ట్లున్నది.

'కతమా సా దేవతా ? ఇతి, ప్రాణ ఇతి హోవాచ, సర్వాణి హ వా ఇమాని భూతాని ప్రాణ మేవాభి సంవిశంతి, ప్రాణ ముజ్జిహతే, సైషా దేవాతా ప్రస్తావ మన్వాయత్తా' ఛాం, ౧-౧౧-౫

ఇందు 'ప్రస్తావ మను భక్తివిశేషముగలవారు ప్రలయవేళయందు ప్రాణ మను దేవతయందు ప్రవేశించి సర్గసమయమున మరల వెలువడు దురు.' అని వర్ణింపబడియున్నది. ఇందలి ప్రాణశబ్దముసైతము ఆకాశ పదమువలెనే బ్రహ్మవాచకమే యగును కాని ప్రాణవాచకము కాదని సూత్రాభిప్రాయము. (౨౩)

(ఈ సూత్రవిషయమునను పూర్వపక్షసిద్ధాంతములు పూర్వసూత్ర మున వర్ణించిన ట్లూహింప నగును.)

## పంచమాధికరణము

బ్రహ్మము వ్యాపక మని నిర్ణయింపబడినది. అది స్వయంజ్యోతి యని చెప్పదలచి మహర్షి సూత్రము నారంభించుచున్నాడు.

### జ్యోతి శ్చరణాభిధానాత్ ౧-౧-౨౪

చరణాభిధానాత్=చరణ మనగా పాదము. అయ్యది బ్రహ్మను దెలుపుటవలన, జ్యోతిః=జ్యోతిపదము బ్రహ్మవాచకమే.

'య దతః పరో దివో జ్యోతి ర్దీప్యతే విశ్వతః పృష్ఠేషు సర్వతః పృష్ఠే ష్వనుత్తమే ష్వుత్తమేషు లోకే ష్విదం వావ తద్ యదిద మస్మి న్నంతః పురుషే జ్యోతిః' ఛాం. ౩-౧౩

'ద్యులోకమునకు పరముననే జ్యోతి ప్రకాశించుచున్నదో యదియే యన్నిటికంటెను పైనను, ఉత్తమానుత్తమ లోకములందును ప్రకాశించు చున్నది. ఈ మనుష్యశరీరమునందు నదియే యున్నది.'

ఇందలి జ్యోతిశ్శబ్దము బ్రహ్మవాచకమా లేక యాదిత్యాదుల ప్రకాశ బోధకమా ? యని సంశయము నొదవఁజేయును. 'జ్యోతిః' శబ్దము బ్రహ్మమునందును, ఆదిత్యాదుల తేజస్సునందును ప్రయోగింపబడుట చూచుచున్నాము. కావున సంశయము కలుగుట సంభవము.

'ఖం వాయు ర్జ్యోతి రాపః పృథివీ విశ్వస్య ధారిణీ' ముం. ౨-౧-౩

'ఆకాశము, వాయువు, జ్యోతి, జలము, పృథివి అను నీ పదములలో 'జ్యోతిః' శబ్దము అగ్నివాచకము.'

'ఏష సంప్రసాదోఽస్మాత్ శరీరాత్ సముత్థాయ పరంజ్యోతి రుపసంపద్య స్వేన రూపే ణాభినిష్పద్యతే' ఛాం. ౮-౧౨-౩

'ఈ సంప్రసాదము (జీవుడు) ఈ శరీరమును విడిచి పరమజ్యోతినిజేరి స్వస్వరూపమున నుండును.' అను నీ వాక్యమునందలి 'జ్యోతిః' శబ్దము బ్రహ్మవాచకము. ఇట్లీ జ్యోతిపదము రెండర్థములందును బ్రయోగింపబడుట చూచినపు డియ్యది బ్రహ్మవాచకమా లేక యాదిత్యాది తేజోవాచకమా? యని సంశయము వొడమును. ఇందు ఆదిత్యాదుల తేజస్సే యనుట పూర్వపక్షము. - కాదు, బ్రహ్మబోధకమే యనుట సిద్ధాంతము.

ప్రస్తుత మీ ప్రకరణమునఁగల జ్యోతిః పదము ఆదిత్యాదుల తేజోవిశేషమువే తెలుపును. పూర్వము వర్ణించిన ఆకాశాదులకువలె నీ ప్రకరణమునగల లింగములు ఆదిత్యాదుల తేజస్సునే తెలుపుచున్నవి.

'య దతః పరో దివో జ్యోతి ర్దీప్యతే' అను నీ వాక్యమునందలి 'దీప్యతే' యను క్రియ జ్వలనమును దెలుపును. జ్వలనము రూపవంతమగు అగ్ని, ఆదిత్యుల ధర్మము. కాబట్టి యిట జ్యోతిః శబ్దము ఆదిత్యాదుల తేజోవిశేషమును బోధించుననుటయే యుక్తము.

మఱియు పై వాక్యమునందు 'దివముకంటె పరమున జ్యోతి దీప్తించుచున్నదనుటలో నాక సీమ - అవధి తెలియుచున్నది. కాబట్టి

యొకానొక అవధిలోనుండు పదార్థమును బోధించు జ్యోతిః పదము సర్వ వ్యాపకమగు బ్రహ్మబోధక మెట్లు కాగలదు? కాజాలదు. కావున నాదిత్యాది తేజోబోధక మనుటయే సంగతము.

ఇంకను (విశ్వతః పృష్ఠేషు, సర్వతః పృష్ఠేషు, ఉత్తమే ష్వనుత్తమేషు లోకేషు) 'అంతటను పృష్ఠభాగములందును, ఉత్తమానుత్తమ లోకములందును.' అను నీ పదములలో జ్యోతికి లోకాదులు అధారముగా వర్ణింపబడుట చూచుచున్నాము. జ్యోతిః పదము బ్రహ్మవాచకమగునెడల బ్రహ్మకు లోకాదు లాధార మనవలసివచ్చును. అది యుక్తము కాదు. సర్వాధారమగు బ్రహ్మకు లోకము లెట్లాధారములగును? కావున జ్యోతిః శబ్దము ఆదిత్యాదుల తేజోవిశేషమనియే చెప్పవలయును. బ్రహ్మము మాత్రము కాదని పూర్వపక్షము.

సిద్ధాంతము: 'య దతః పరో' అను నీ ఉపనిషద్ వాక్యమునకు పూర్వమునగల వాక్యమునందు,

'తావా నస్య మహిమా తతో జ్యాయాంశ్చ పూరుషః,
పాదోఽస్య సర్వా భూతాని, త్రిపా దస్యామృతం దివి.' ఛాం. ౩-౧౨-౬

బ్రహ్మము చతుష్పాత్తు (నాలుగుపాదములుగలది)గ వర్ణింపబడి యున్నది. ఇందు సర్వభూతములు బ్రహ్మమున నొక పాదమనియు, మిగిలిన మూడుపాదములు (అమృతం దివి) భూతసంస్పర్శములేక యమృతమయమై యున్నవనియు వర్ణింపబడియున్నందున నట్టి బ్రహ్మమే యిట 'జ్యోతిః' శబ్దముచే గ్రహింపనగును. కాని, తేజో విశేషము కాదు.

మఱియు ద్యు శబ్ద సంబంధ ముండుటవలనను జ్యోతిః శబ్దమిట బ్రహ్మవాచకమనియే నుడువవలయును. 'త్రిపా దస్యామృతం దివి' అను నీవాక్యమునందు ద్యు శబ్దము త్రిపాదబ్రహ్మముతోను, 'య దతః పరో దివో జ్యోతిః' అను నీ వాక్యమునందు ద్యు శబ్దము జ్యోతిః పదముతోను

సంబద్ధమై యుండుట మనము చూచుచున్నాము. అందువలన జ్యోతిః పదము బ్రహ్మవాచకమనియే తెలియనగును.

ఇంతియేకాక యీ ప్రకరణమున బ్రహ్మము ప్రకృతముగుటవలనను 'జ్యోతిః' శబ్దము బ్రహ్మవాచకమే యగు నొప్పును. కాని, యాదిత్యాది తేజో విశేషము కానేరదని భావము.

'దీప్యతే' యను క్రియాపదము ఈ శ్రుతియందు గ్రహింపబడిన దనియు, నది జ్వలనార్థకము కాబట్టి యాదిత్యాది తేజోవిశేషమునే 'జ్యోతిః' శబ్దము బోధించుననియు చెప్పుట యుక్తము కాదు. 'దీప్యతే' యను క్రియాపదము ప్రకాశార్థమునను వాడబడును. బ్రహ్మము రూపవంతము కానందున నగ్న్యాది జ్వలనధర్మము గలది కాకున్నను, 'బ్రహ్మము (దీప్యతే) ప్రకాశించుచున్నది' అని యర్థము చెప్పిన నెట్టి దోషమును వాటిల్లదు. కావున 'దీప్యతే' యను క్రియాపదప్రయోగమువలన 'జ్యోతిః' శబ్దము బ్రహ్మవాచకము కాదనుట యుక్తియుక్తము కాదు.

ద్యులోక పర్యంతము జ్యోతి దీప్తమగుచున్నదనుటవలన నొక అవధి - సీమ - గోచరమగుచున్నందున జ్యోతిః పదము ఆదిత్యాదుల తేజస్సునే బోధించును కాని నిరవధిక బ్రహ్మమును బోధింపనేరదనుటయు సమంజసము కాదు. అంతర్బహిర్భేదములేక సర్వత్రయందు బ్రహ్మము న ట్లుపదేశించుట యయుక్తము కాదు. బ్రహ్మము వ్యాపకము. అద్యది సర్వాంతర్యామి యైనట్లు సర్వమునకు వెలుపలగూడ నున్నది. 'తదంత రస్య సర్వస్య తదు సర్వస్యాస్య బాహ్యతః' యజు. ౪౦-౫. అను నీ యజుర్వేదవాక్యమునందు బ్రహ్మము సర్వమున కంతర్భాగమునను, బాహ్యమునను నున్నట్లు స్పష్టముగా వర్ణింపబడినది. సర్వపదముచే గ్రహింపబడు బ్రహ్మాండములో దివముకూడ నొక భాగమే కాబట్టి బ్రహ్మాండమునకు పరమున దీప్తించు బ్రహ్మము దివమునకు పరమున దీప్తించుచున్నదనుటలో దోషమాపంతయు నుండదు. ఇట్లే యూహాం శ్రవ

ణమునందును. జ్యోతిః శబ్దము బ్రహ్మవాచక మగుటలో నెట్టిదోషమ నుండదు. సర్వగతమగు బ్రహ్మము ఉత్తమానుత్తమ లోకములం దున్న దనుటలో దోషమేముండును? అందువలన నీ ఉపనిషద్వాక్యములందు ప్రయోగింపబడిన జ్యోతిః శబ్దము బ్రహ్మవాచకమే కాని సూర్యాది తేజో వాచకము కాదని సిద్ధమగుచున్నది. (౨౪)

ఈ విషయమునం దొక సందేహము నుద్భావించి సమాధానము చెప్పుచున్నారు.

ఛందోఽభిధానా న్నేతి చేత్ న, తథా చేతోర్పణ
నిగదాత్, తథాహి దర్శనమ్ ౧-౧-౨౫

(పూర్వసూత్రమునుండి జ్యోతిఃపద మిందు అనువర్తించును.)

ఛందోఽభిధానాత్ = పూర్వవాక్యమునందు గాయత్రీ ఛందస్సును గురించి చెప్పుటవలన, న = తరువాతి వాక్యమునందలి జ్యోతిః పదము బ్రహ్మను బోధింపదు, ఇతి చేత్=అని యనినచో, న=అట్లనరాదు, తథా= ఆ విధముగా (ఓమ్‌తో నెట్లో గాయత్రితోను నట్లే), చేతోఽర్పణ నిగదాత్=(దానిచే ప్రతిపాదింపబడు బ్రహ్మమునందు) మనస్సును ప్రవేశింప జేయుటను జెప్పినందువలన, జ్యోతిః పదముచే బ్రహ్మమే గ్రహింప నగును. తథాహి=ఆ విధముగానే, దర్శనమ్ = మరియొకచో జూడబడు చున్నది.

'జ్యోతిః' శబ్దము గ్రహింపబడిన ఉపనిషద్ వాక్యమునకు పూర్వ మునను న్న వాక్యమున చతుష్పాత్ బ్రహ్మము వర్ణింపబడియున్నందున తరువాతివాక్యమునందలి జ్యోతిః పదము బ్రహ్మబోధకమే కాగలదని పూర్వసూత్రమున నిశ్చయింపబడినది. అయ్యది సరికాదు. కారణ మేమనః

పూర్వవాక్యమునందు వర్ణింపబడినది చతుష్పాత్ బ్రహ్మము కాదు. ఈ ప్రకరణ ప్రారంభమునందు,

'గాయత్రీ వా ఇదం సర్వం భూతం యదిదం కించ' ఛాం. ౩-౧౨-౧

'ఈ భూతప్రపంచమంతయు గాయత్రియే' యని గాయత్రిని ప్రారంభించి,

'సైషా చతుష్పదా షడ్విధా గాయత్రీ.' ఛాం. ౩-౧౨-౫

'ఆ గాయత్రినే వాక్కు, భూతము, పృథివి, శరీరము, ప్రాణము, హృదయము నను నారుభేదములుగలది యని వివరణపూర్వకముగ నుపసంహరించి,

'త దేతత్ ఋచాభ్యనూక్తమ్, తావానస్య మహిమా తతో జ్యాయాగంశ్చ పూరుషః, పాదోఽస్య సర్వాభూతాని త్రిపాదస్యామృతం దివి'
ఛాం. ౩-౧౨-౫-౬.

'ఇయ్యది ఋక్కుచేతను చెప్పబడినది. దాని మహిమ మంతయే. ఆంతకంటె పురుష దెక్కువ. సర్వభూతము లతని కొక పాదము. అతని పాదత్రయము దివమునందు అమృతము.' అని పూర్వము వివరణపూర్వకముగ నుపసంహరింపబడిన గాయత్రి విషయముననే యీ ఋక్కుకూడ నుదాహరింపబడినది. ఇట్లుదాహరింపబడిన యీ మంత్రమునం దకస్మాత్తుగ బ్రహ్మ మెట్లు చెప్పబడును? ప్రకరణగత చతుష్పాదాత్మక గాయత్రిని ఉదాహరించుటకు గ్రహింపబడిన ఋఙ్మంత్రము అకస్మాత్తుగ బ్రహ్మమును బోధించు ననుట యుక్తము కాదు.

'యద్వై తద్ బ్రహ్మ' ఛాం. ౩-౧౩-౩. అను నీ వాక్యమునందలి బ్రహ్మశబ్దముకూడ గాయత్రినే బోధించుచున్నది. గాయత్రియే ప్రకృతము - బ్రహ్మము నేల బోధింపదన నయ్యది యప్రకృతము. కాబట్టి యీ ప్రకరణమునందలి 'జ్యోతిః' శబ్దము బ్రహ్మబోధక మనుట యుక్తము కా దన,

సమాధానము: జ్యోతిఃపద మిట చతుష్పాదాత్మక గాయత్రి ఛందస్సును బోధించు ననుట యుక్తము కాదు.

'గాయత్రీ వా ఇదం సర్వం భూతం యదిదం కించ.'

ఛాం. ౩-౧౨-౧

అను నీ ఉపనిషద్వాక్యమునందు గాయత్రి సర్వభూతాత్మక మని నుడువబడినది. కాబట్టి యిందలి గాయత్రిపదము ఛందస్సును బోధించు ననుట సంభవముకాదు. ఛందస్సు వర్ణాత్మకము. అయ్యది సర్వభూతాత్మక మెట్లు కాగలదు ? కాబట్టి యిట గాయత్రిపదము బ్రహ్మవాచకమే కావలసి యున్నది. బ్రహ్మమే సర్వభూతాత్మకము. గాయత్రిపదము బ్రహ్మాభిప్రాయముతో ప్రయోగించినపుడు బ్రహ్మము సర్వాధిష్ఠానకారణ మగుటచే నయ్యది సర్వభూతాత్మక మనుటలో దోష ముండనేరదు.

(గాయతి చ త్రాయతే చ ఇతి గాయత్రీ) గానము ద్వారమున రక్షణకర్తృత్వము బ్రహ్మమునందే యుక్త మగును. గాయత్రి వర్ణాత్మకము కావున నయ్యది జడము. బ్రహ్మము చేతనము. రక్షణకర్తృత్వము చేతనపదార్థమున కొప్పును. కాని జడమునకు కాదు. కాబట్టి జ్యోతిః పదము బ్రహ్మవాచకమే యగును. అటులయిన,

'గాయత్రీ వా ఇదం సర్వం భూతం యదిదం కించ' ఛాం. ౩-౧౨-౧

అని యిట గాయత్రిపదముచే బ్రహ్మ మేల చెప్పబడవలయును ? అన - గాయత్రిపదముచే ప్రతిపాదింపబడు బ్రహ్మమునందు మనస్సును ప్రవేశింపజేయు నిమిత్త మని సమాధానము చెప్ప నగును.

మహర్షు లిట్లే యటనట నుపదేశింతురు. ఇయ్యది వారి రీతి. గాయత్రి బ్రహ్మ ప్రతిపాదకము (బోధించునది). బ్రహ్మము బోధ్యము - ప్రతిపాద్యము. పై ఉపనిషత్‌వాక్యమున ప్రతిపాద్యబ్రహ్మము ప్రతిపాదక శబ్దముద్వారా బోధింపబడినది. బ్రహ్మము సూక్ష్మతమము. అందు మనస్సు

ప్రవేశింపవలయు ననిన నయ్యది పలుమారు భావింపవలసియున్నది. బ్రహ్మమును పలుమారు భావింప ననువగు సాధనము దానిని ప్రతిపాదించు పదమునకు మించి మరి యొండేది యగును ? లక్ష్యమున బాణమును ప్రవేశింపజేయుటకు ధనువు తోడ్పడునట్లు బ్రహ్మమున మనస్సు నివేశింప జేయుటకు బ్రహ్మప్రతిపాదక శబ్దము మిక్కిలిగ దోడ్పడును. ప్రతిపాదక శబ్దము నభ్యసింపనివాడు ప్రతివాద్యవిషయమున మనస్సును సమాహితము-స్థిరము చేయజాలడు. అందువలననే దర్శనాంతరమున, 'తజ్జప స్తదర్థ భావనమ్' యో. ౧-౨౮. ప్రతిపాదకశబ్ద జపము, ప్రతిపాద్యమగు నర్థమును భావించుటయు, మనోనిగ్రహమునకు సాధనముగ జెప్పబడినవి. బ్రహ్మప్రతిపాదక శబ్దములలో ముఖ్యము ప్రణవము (ఓమ్).

'ఓం క్రతో ! స్మర' యజు. ౪౦-౧౫.

'ఓ జీవా ! 'ఓమ్' అని స్మరింపుము' అని యజుర్వేదమున నుపదేశింపబడినది. ఇట్లే యోగమునందును, 'తస్య వాచకః ప్రణవః' యోగ. ద. ౧-౨౭. 'బ్రహ్మమునకు వాచకము ప్రణవము - ఓమ్ - అని వర్ణింప బడినది.

మనస్సు బ్రహ్మమునందు ప్రవేశింపజేయుటకు ప్రణవము - ఓమ్ - ధనువువంటి దని ముండకోపనిషత్తునందు వర్ణింపబడియుండుటను జూడ గలము.

'ప్రణవో ధనుః శరో హ్యాత్మా బ్రహ్మ తల్లక్ష్య ముచ్యతే,
అప్రమత్తేన వేద్ధవ్యం శరవత్ తన్మయో భవేత్' ముం. ౨-౨-౪

'ప్రణము - ఓమ్ - ధనువు, మనస్సు శరము - బాణము, బ్రహ్మము లక్ష్యము. అప్రమత్తుడై (జాగరూకుడై) లక్ష్యమును భేదింపవలెను. బాణము లక్ష్యమున లగ్న మగునట్లు జీవుడు బ్రహ్మమునందు లగ్నుడు కావలెను.

'ఓమ్' అను శబ్ద మెట్లు బ్రహ్మవాచకమో యట్లే గాయత్రీ ఛందస్సుకూడ నిట బ్రహ్మవాచకముగ గ్రహింపనగును. ఇట్లే యితర - ఉపనిషత్తులందును జూడనగును.

'ఓమితి బ్రహ్మ; ఓమి తీదం సర్వమ్' తై. ౧-౮

కాబట్టి గాయత్రీ ఛందస్సు బ్రహ్మవాచకమే. కాని, వర్ణాత్మక ఛందస్సును బోధింపదు. అందువలననే 'జ్యోతిఃపదము బ్రహ్మబోధక' మని చెప్పబడినది. (౨౫)

ఈ విషయముననే మరియొక హేతువు :

## భూతాది పాద వ్యపదేశోపపత్తే శ్చైవమ్ ౧-౧-౨౬

భూతాది పాదవ్యపదేశోపపత్తేః చ = బ్రహ్మమునందే భూతము, పృథివి, శరీరము, హృదయము నను పాదచతుష్టయ కథనము సంగత మగుటవలనను, ఏవమ్=ఇట్లే, గాయత్రి పదముచే బ్రహ్మమే యుపదేశింప బడునని యంగీకరింపవలయును.

'గాయత్రీ వా ఇదం సర్వం యదిదం కించ' ఛాం. ౩-౧౨-౧

'ఈ భూతజాత మంతయు గాయత్రియే' అని ప్రారంభించి భూతము, పృథివి, శరీరము, హృదయము ననువానిని వివరించి, యనంతరమున, (సైషా చతుష్పదా షడ్విధా గాయత్రీ ఛాం. ౩-౧౨-౫.) ఇయ్యది యారువిధము లయిన నాలుగుపాదములు గల గాయత్రి యని యుపసంహారము చేయబడియున్నది. ఇయ్యది గాయత్రీఛందస్సే యయిన, దానికి భూతపృథివ్యాదులు పాదములుగా వర్ణింపబడియుండెడివి కావు. ఛందస్సు వర్ణాత్మకమగుటచేత దానికి భూతాదులు పాదములుగ వర్ణించుట పొసగదు. గాయత్రీఛందస్సు అక్షరముల సన్నివేశము తక్క వేరొండు కాదుగదా। ఛందస్సే శ్రుతి కభిప్రేతమయి యుండుపక్షమున 'తావా నస్య

మహిమా........' అను ఋజ్మంత్రమును ఇట ఉపనిషత్తు ఉదాహరించి యుండెడిది కాదు.

'తావా నస్య మహిమా....' ఋ. ౧-౪-౧౭-౩ అను నీ మంత్రము ఋగ్వేదమునందు బ్రహ్మమహిమను వర్ణించుచు బ్రహ్మబోధకమైయుం డుట ఉపనిషత్తుకు తెలియనివిషయము కాదు. ఉపనిషద్రచయిత యగు మహర్షి బ్రహ్మపరమగు నీ మంత్రమును గాయత్రి ఛందస్సు పరముగ నెట్లు వర్ణించును ? ఈ మంత్రమునందలి (తతో జ్యాయాంశ్చ పూరుషః) పురుషపదము బ్రహ్మపరమై యర్థవంత మగును. కాని ఛందస్సును బోధింపనేరదు. మఱియును నీప్రకరణమునందే,

'త దేతత్ పూర్ణ మపరివర్తి, పూర్ణా మపరివ ర్తినీం
శ్రియం లభతే య ఏవం వేద' ఛాం. ౩-౧౨-౯.

'ఇయ్యది పూర్ణము, పరివ ర్తనములేనిది, దీని నిట్లు తెలిసినవాడు పరివ ర్తింపని - మార్పుచెందని సంపదను బొందును.' అని ఫలశ్రుతియు జెప్పబడియున్నది. ఇట్టి పూర్ణము, నపరివ ర్తియు నగు సిరిని బొందింప జేయుశక్తి వర్ణాత్మకమగు ఛందస్సునకు గలదనుట యసంగత మగును. బ్రహ్మమే యట్టి శ్రీకరము కాగలదు. అదియే పూర్ణము, నపరివ ర్తియును. అందువలననే ఉపనిషత్తు మరియొకచో నిట్లు వర్ణించినది.

'పూర్ణ మదః పూర్ణ మిదం, పూర్ణాత్ పూర్ణ ముదచ్యతే
పూర్ణస్య పూర్ణ మాదాయ, పూర్ణమే వావ శిష్యతే' బృ. ౩-౧-౧.

కాబట్టి పూర్వఉపనిషద్వాక్యము (గాయత్రీ వా ఇదం సర్వం భూతం యదిదం కించ) నందలి గాయత్రిపదము గాయత్రి యనుపేరు గల బ్రహ్మమునే దెలుపును. అందువలననే తరువాతివాక్యమునందలి 'జ్యోతిః' పదముగూడ బ్రహ్మవాచకమే యనుట నిస్సందిగ్ధము. (౨౬)

ఈవిషయముననే మరియొక శంకకు సమాధానము:

## ఉపదేశభేదా న్నేతిచే న్నోభయస్మిన్న ప్యవిరోధాత్

౧-౧-౨౭

(జ్యోతిఃపద మిం దనువర్తించును.)

ఉపదేశభేదాత్=ఉపదేశములలో భేద ముండుటవలన, న ఇతి చేత్= జ్యోతిఃపదము బ్రహ్మవాచకము కాదందుమేని, న=అట్లనుట యుక్తము కాదు. ఉభయస్మి న్నపి=రెండువాక్యములందును (ఉపదేశములందును), అవిరోధాత్=అర్థవిరోధము లేదు.

(గాయత్రీ వా ఇదం సర్వం....) 'ఇదియంతయు గాయత్రియే' యని ప్రారంభించి యందుల కుదాహరణముగా గ్రహించిన మంత్రము నందు (త్రిపాద స్యామృతం దివి) 'ఈ బ్రహ్మముయొక్క అమృతపాద త్రయము (త్రిపాత్) దివియందు' అని ద్యులోకము బ్రహ్మమున కాధార ముగ నిట నుపదేశింపబడినది. రెండవ జ్యోతిర్వాక్యమునందు (య దతః పరో దివః) 'ఈ ద్యులోకముకంటె బరమున' అని ద్యులోకము జ్యోతికి ఒక సీమ - మర్యాద - అవధిగ జెప్పబడినది. ఇట్లు ద్యులోక మొకచో నాధా రముగాను, మరియొకచో నవధిగాను, వర్ణింపబడుటచే నుపదేశములలో వైరుధ్యము కనబడుచున్నది. అందువలననే పూర్వవాక్యమునకు ద్యులోకమునందు త్రిపాద్ బ్రహ్మ మున్నదనియు, తరువాతి వాక్యము నకు ద్యులోకమునకు పరమున నున్నదనియు పరస్పర విరుద్ధార్థము లేర్పడుచున్నవి. ఇట్టి యర్థభేద ముండుటవలన పూర్వవాక్యమునందు బోధింపబడిన బ్రహ్మమే తరువాతి జ్యోతివాక్యమునందును గ్రహింపబడ వలయు ననుట యుక్తముకాదు. అనగా -

సమాధానము : ఉపర్యుక్త రెండువాక్యముల యర్థమునందు విరోధ మొందును లేదు. బ్రహ్మము వ్యాపకము. అయ్యది భూమిమొదలు

ద్యులోకమువరకు నంతటను లోపల, వెలుపల అను భేదములేక వ్యాపించి యున్నది. అందువలననే వేదమునందు —

'తదంతరస్య సర్వస్య తదు సర్వస్యాస్య బాహ్యతః' యజు. ౪౦-౫.

'ఆ బ్రహ్మము సర్వమున కంతర్బహిర్భాగములలో నున్నది.' యని వర్ణింపబడినది. కాబట్టి సర్వాంతర్బహిర్ వ్యాపకమగు నాబ్రహ్మకు ద్యులోకమునందును, ద్యులోకమునకు పరమునను గలదని వర్ణింపబడుట మిక్కిలి యుక్తమగును. ఉపదేశద్వయమునం దెట్టి పైరుద్ధ్యమును లేదు. కాబట్టి 'జ్యోతిః చరణాభిధానాత్' అను తావునగల 'జ్యోతిః'పదము బ్రహ్మవాచకమే యనుట తథ్యము. (౨౭)

## షష్ఠాధికరణము

బ్రహ్మము స్వయంజ్యోతి యని నిరూపించి, అయ్యది యంతటను దృశ్యమానమగు ప్రాణనక్రియ (జీవనము)కు హేతువగుటచే ప్రాణాత్మకమనియు నిరూపింప మహర్షి సూత్రము నారంభించుచున్నాడు.

### ప్రాణ స్తథానుగమాత్ ౧-౧-౨౮

అనుగమాత్ = బ్రహ్మధర్మ సంబంధ ముండుటవలన, తథా = (జ్యోతిపదము బ్రహ్మవాచక మెట్లో) అట్లే, ప్రాణః=(కౌషీతకీబ్రాహ్మణమునందలి) ప్రాణశబ్దము, బ్రహ్మవాచక మనియే యంగీకరింపవలయును.

కౌషీతకీ బ్రాహ్మణమునందు, 'ప్రతర్దనో హవై దైవోదాసిరింద్రస్య ప్రియం ధామోపజగామ యుద్ధేన చ పౌరుషేణచ' కౌ. ౩-౧.

'దివోదాసుని పుత్రుడు ప్రతర్దనుడు యుద్ధము, పౌరుషము ననువెంటిమూలమున నింద్రునిధామమును చేరెను' అని యారంభించిన యింద్ర

ప్రతర్దనులకు సంబంధించిన యాఖ్యాయిక యొకటి చూదనగును. అందులో నింద్రుడు ప్రతర్దనున కుపదేశించినవిధము గలదు.

'స హోవాచ ప్రాణోఽస్మి ప్రజ్ఞాత్మా తం మా మాయు రమృత మి త్యుపాస్వ.' కౌ. ౩-౩.

'అతడు పలికెను; ప్రాణము ప్రజ్ఞాత్మనై తిని; అట్టి నన్ను ఆయుపు, అమృతము నని యుపాసింపుము' అను నీ వాక్యమునందలి ప్రాణము ముఖ్యప్రాణమా లేక బ్రహ్మమా యని సందేహము కలుగును. ప్రాణ శబ్దము ముఖ్యప్రాణము, బ్రహ్మము నను రెం దర్థములలోను ప్రయోగింప బడుటయే యీ సందేహమునకు కారణము.

'తాన్ వరిష్ఠః ప్రాణ ఉవాచ' — 'య ఏవాయం ముఖ్యః ప్రాణః'
ఛాం. ౧-౫-౩.

అను నీ వాక్యమునందు ప్రాణశబ్దము ముఖ్యప్రాణమునందును
'ప్రాణాయ నమో యస్య సర్వ మిదం వశే.' అథర్వ. ౧౧-౨-౪-౧.

'ఎవని వశమునం దీ సర్వము నున్నదో యట్టి ప్రాణము (బ్రహ్మము) నకు నమస్కారము.' అను నీ వేదమంత్రమున ప్రాణశబ్దము బ్రహ్మ వాచకముగాను ప్రయోగింపబడినది. కాబట్టి సందేహము కలుగుట వింత కాదు. ఇందు ముఖ్య ప్రాణవాచక మనుట పూర్వపక్షము. కాదు, బ్రహ్మ వాచకమే యనుట సిద్ధాంతము.

లోకమున నెల్లరు ప్రాణశబ్దమును తఱచుగా శరీరమునందలి ముఖ్య ప్రాణమును తెలుపుటకై ప్రయోగించుచున్నారు. కావున నా యర్థమే గ్రహింపనగును. కాబట్టి ప్రాణశబ్దము ప్రసిద్ధార్థమైన ముఖ్యప్రాణమునే బోధించునని ప్రాప్తింపగా, సమాధానము:

ప్రాణశబ్దము లోకమునందు ముఖ్యప్రాణమను నర్థమున ప్రసిద్ధమై యుండుట సత్యమేయైనను ప్రస్తుత మిట బ్రహ్మవాచకమే యని యంగీక

తింపవలయును. శాస్త్రమున పలుచోట్ల ప్రాణశబ్దము బ్రహ్మమునే బోధించుట చూచినను. ఉభయార్థమును బోధించు నీ ప్రాణశబ్ద మెక్కడనే యర్థమును బోధించునట యుక్తమో యాలోచించి నిర్ణయింపవలయును. ఇంద్రప్రతర్దనులకు సంబంధించిన యాఖ్యాయికలో నింద్రుడు ప్రతర్దనుని నీ యిష్టమువచ్చిన వర మడుగు మని పలికెను. అంతట ప్రతర్దనుడు

'త్వమేవ మే వృణీష్వ యం త్వం మనుష్యాయ హితతమం మన్యసే' కౌ. ౩-౧.

'నీవే మనుష్యులకు హితతమగు వరమును కోరుమ'ని యింద్రునితో ననును. ఇంద్రు డపుడు, 'ప్రాణో ౽స్మి ప్రజ్ఞాత్మా తం మా మాయు రమృత మిత్యుపాస్స్వ.' కౌ. ౩-౨.

'నేను ప్రజ్ఞాత్మ, ప్రాణమును. అట్టి నన్ను ఆయువు, నమృతము నని యుపాసింపుము.' అని ప్రాణమును హితతమముగు నుపాస్యముని యుపదేశించియున్నాడు. ఇంద్రునిచే నిట్లుపాస్యముగా నుపదేశింపబడిన ప్రాణము బ్రహ్మముగాక ముఖ్యప్రాణ మెట్లు కాగలదు ? మానవునకు బ్రహ్మముకంటె హితతమము మరియొకటి యేమియున్నది ? బ్రహ్మము నుపాసించి సాక్షాత్కారము ఒనర్చుకొనిననాడు దుఃఖములన్నియు నిర్మూలములై నిరతిశయసుఖము లభించును. కాబట్టి బ్రహ్మమే ప్రాణశబ్దముచే నిట గ్రహింపదగినది. ముఖ్యప్రాణము కాదు. ముఖ్యప్రాణము నుపాసించిన మానవునకు దుఃఖములు పోయి సుఖ మెట్లు లభింపగలదు ? కాబట్టి బ్రహ్మమే యిట ప్రాణశబ్దగ్రాహ్య మని సిద్ధాంతము. (౨౮)

ఉపర్యుక్త విషయమునందలి యొక శంకకు సమాధానము :

న వక్తు రాత్మోపదేశా దితి చేదధ్యాత్మ సంబంధ భూమా హ్యస్మిన్ ౧-౧-౨౯

(పూర్వసూత్రమునుండి ప్రాణశబ్దమిం దనువర్తించును.)

వక్తుః = వక్తయగు నింద్రుడు, ఆత్మోపదేశాత్ = తననుగూర్చి యుపదేశించుటవలన, న=ప్రాణశబ్దము బ్రహ్మవాచకముకాదు, ఇతిచేత్= అనియందురేని, అదియును తగదు. హి=కారణమేమన, అస్మిన్ = ఈః ప్రకరణమునందు, అధ్యాత్మసంబంధభూమా = బ్రహ్మము (ఆత్మ)నకు సంబంధించిన ధర్మములు విరివిగా (భూమా) నున్నవి.

'హితతమమగు వరమును నీవే నిర్ణయింపు'మని ప్రతర్దను డింద్రుని కోరగా నతడు (మామేవ విజానీహి) 'నన్నే తెలిసికొనుము' అని ప్రారంభించి (ప్రాణోఽస్మి ప్రజ్ఞాత్మా తం మా మాయు రమృత మిత్యు పాస్వ) 'ప్రాణమును; ప్రజ్ఞాత్మను: అట్టి నన్ను ఆయువు, అమృతము నని యుపాసింపుము.' అని యహంకారవాదము (నేను అనెడి యహంభావము)తో నుపదేశించియున్నాడు. అందువలన నింద్రుడు తన యాత్మనే ప్రజ్ఞాత్మ యనియు, ప్రాణమనియు, ఆయువు, అమృతము ననియు నుపదేశించినట్లు బోధయగుచున్నది. కాగా ప్రాణశబ్దము బ్రహ్మబోధకమనుట యుక్తియుక్తము కాదనియందురేని - అది సరికాదు.

ఈః ప్రకరణమునందు బ్రహ్మధర్మములే యనేకము లుపలబ్ధము లగుచున్నవి. కాబట్టి ప్రాణశబ్దము బ్రహ్మబోధకమనియే యెంచవలయును.

'న వాచం విజిజ్ఞాసీత వక్తారమ్' 'వాక్కునుకాదు; వక్తను తెలిసికొనవలయును.' అని యీ ప్రకరణమున బ్రారంభించి,

'తద్యథా రథస్యారేషు నేమి రర్పితా నాభావరాః అర్పితాః, ఏవమేవైతాః భూతమాత్రాః ప్రజ్ఞామాత్రా స్వర్పితాః, ప్రజ్ఞామాత్రాః ప్రాణేఽర్పితాః, స ఏష ప్రాణ ఏవ ప్రజ్ఞాత్మాఽఽనందోఽజరోఽమృతః' కౌ. ౩-౮.

'బండిచక్రముయొక్క ఆకులలో (అరలలో) నెట్లు నేమి (పట్ట) యర్పింపబడియున్నదో, నాభి (చక్రపు మధ్యభాగము)యందు ఆకులెట్లు

అర్పింపబడియున్నవో, అట్లే భూతమాత్రలు, ప్రజ్ఞామాత్రలందును, ఆ ప్రజ్ఞామాత్రలు ప్రాణమునందును నర్పింపబడియున్నవి. ఆ ప్రాణమే ప్రజ్ఞాత్మ, ఆనందము, అజరము, అమృతమును.

(భూతమాత్రలు = పృథివ్యాది పంచభూతములు, శబ్దాది తన్మాత్ర రూపములగు సూక్ష్మభూతములు; ప్రజ్ఞామాత్రలు = ఇంద్రియజన్యములగు పంచజ్ఞానములు ప్రజ్ఞలు, పంచేంద్రియములు మాత్రలు అని తెలియవల యును. అర్పితములు=విషయరూపమున నర్పింపబడినట్లెంచవలయును.) కాబట్టి పంచసూక్ష్మభూతములు, పంచస్థూలభూతములు నేమి (చక్రము యొక్క పైభాగము)వలెను, పంచేంద్రియములు, వానివలన కలిగెడి చాక్షుషాది పంచజ్ఞానములును అరల (చక్రపుటాకులు)వలెను, ప్రాణము - బ్రహ్మము - నాభి (చక్రపుకుండ మధ్యభాగము)వలెను నిట వర్ణింపబడి నట్లు తెలిసికొనదగును.

అనగా సూక్ష్మస్థూలభూతములు, వానిని గ్రహించు సాధనము లయిన యింద్రియములు, వానివిషయములు, ఇంద్రియములను కరణములు - సాధనములుగా నుపయోగించు సమస్తజీవులును ప్రాణము (బ్రహ్మము)నం దిమిడియున్నవని భావము. ఇట్లు సర్వాధారమగు ప్రాణము బ్రహ్మయే యగును, కాని యింద్రుని యాత్మ యెన్నటికిని కాజాలదు. ఇంద్రాత్మ జీవుడేయగును. అతడు సర్వాధారుడు కాజాలడనుట సర్వవిదితము. సర్వాధారము బ్రహ్మమే.

'స దాధార పృథివీం ద్యా ముతేమామ్' ఋ. ౧-౩-౭-౧.

'ఆ బ్రహ్మమే పృథివీ ద్యులోకములను ధరించియున్నది.'

'స్కంభో దాధార ద్యావా పృథివీ ఉభే ఇమే'

అథర్వ. ౧౦-౪-౭-౩-౫.

'ఆ బ్రహ్మమే (స్కంభము) పృథివి, ద్యులోకము నను నీ రెండిటిని ధరించియున్నాడు.

'కర్మాధ్యక్షః సర్వభూతాధివాసః' శ్వే. ౬-౧౧.

'అతడే - ఆ బ్రహ్మమే సర్వభూతముల కాధారము, కర్మల కధ్యక్షుడు.' నని వేదములందును, ఉపనిషత్తులందును వర్ణింపబడుట చూడ నగును. ఇట్టి సర్వాధారత్వము బ్రహ్మధర్మమే యగునుగాని, యింద్రుని ధర్మమెన్నటికిని కాదు. ఇట్లే ముఖ్యప్రాణత్వముకూడ బ్రహ్మధర్మమే యగును. ఇంద్రధర్మము కానేరదు. ప్రాణమన జీవనము. జీవనక్రియకు జీవు డాధారమైనను నది యతని యధీనమున నుండదు. జీవనము బ్రహ్మాధీనము. జీవనము జీవాత్మాధీనమే యగుచో లోకమున మరణ మసంభవ మగును. అందువలననే కఠోపనిషత్తు

'న ప్రాణేన నాపానేన మర్త్యో జీవతి కశ్చన,
ఇతరేణ తు జీవంతి యస్మిన్ ఏతా వుపాశ్రితౌ.' కఠ. ౫-౫.

'ప్రాణముమూలమునగాని, అపానము మూలమునగాని మర్త్యుడు జీవింపడు. ప్రాణాపానములెవని నాశ్రయించియున్నవో యతని (బ్రహ్మ) మూలమున జీవించుచున్నారు' అని చెప్పుచున్నది. మఱియును ఆయుష్ట్వముకూడ బ్రహ్మధర్మమే.

'తద్ దేవాః జ్యోతిషాం జ్యోతిరాయుర్ హోపాసతేఽమృతమ్'
బృ. ౪-౪-౧౬.

'అందువలన విద్వాంసులు జ్యోతులకు జ్యోతియు, నమృతమునగు నాయువు నుపాసించుచున్నారు' అని ఉపనిషత్తు బ్రహ్మము నాయువుగా జెప్పినది. ఇంకను నిట్లే వాగ్వ్యాపారమునకును బ్రహ్మమే హేతువని ఉపనిషత్తు వేరొకచో నుపదేశించుచున్నది.

'యద్వాచాఽనభ్యుదితం యేన వా గభ్యుద్యతే
తదేవ బ్రహ్మ త్వం విద్ధి, నేదం యదిద ముపాసతే' కేన. ౧-౪.

'ఏది వాక్కుచే చెప్పబడ నలవికాదో, దేనిచే వాక్కు ప్రవర్తించుచున్నదో యదియే బ్రహ్మమని యెరుగుము; నీ వుపాసించునది కాదు.'

ఇట్లీ వక్తృత్వము, ఆయుష్ట్వము, ముఖ్యప్రాణత్వము, సర్వాధారత్వము మున్నగు ధర్మములన్నియు బ్రహ్మమునకు సంబంధించినవే కాని యింద్రునివి కావు. కాబట్టి యీ ప్రకరణమందలి ప్రాణశబ్ద మన్నివిధముల బ్రహ్మమునే బోధించును కాని జీవప్రాణమును బోధింపదు. ఇంద్రునికూడ బోధింపదని సిద్ధాంతము. (౨౯)

ప్రాణశబ్దమిట బ్రహ్మవాచకమే యై, వక్తయగు నింద్రుని తెలుపని పక్షమున నింద్రుడు (మామేవ విజానీహి) నన్నే తెలిసికొనుము; (తం మా మాయు రమృత మితి ఉపాస్వ) 'అట్టి నన్ను ఆయువు, అమృతము నని యుపాసింపుము' అని చెప్పనేల యనిన:

## శాస్త్రదృష్ట్యా తూపదేశో వామదేవవత్ ౧-౧-౩౦

వామదేవవత్=(ఋషియగు వామదేవుడు శాస్త్రదృష్టితో నాత్మోపదేశము చేసినట్లు) వామదేవునివలె, శాస్త్రదృష్ట్యా = శాస్త్రబుద్ధితో (వేదప్రతిపాద్యమగు నంతరాత్మయైన బ్రహ్మబుద్ధితో), ఉపదేశః=(ఇంద్రుని) ఉపదేశము.

శిష్యబుద్ధితో నడిగిన ప్రతర్దనునకు నింద్రుడు చేసిన ఆత్మోపదేశము శాస్త్రదృష్టితో జేసిన దెంచవలయును. జడ చేతనాత్మకమగు నీ జగత్తునకు బ్రహ్మమే యంతరాత్మ యని శాస్త్ర (వేదము) ముపదేశించుచున్నది.

'త దంతరస్య సర్వస్య,' యజు. ౪౦-౫

'సూర్య ఆత్మా జగత స్తస్థుషశ్చ' ఋ. ౧-౮-౭-౧.

ఉపనిషత్తును నిట్లే బోధించుచున్నది.

'సర్వస్మా దంతరం య దయ మాత్మా' బృ. ౧-౪-౮.

ఇట్లు చరాచరాత్మకమగు నీ జగత్తున కంతరాత్మగా శాస్త్రము (వేదాదుల)చే నుపదేశింపబడు బ్రహ్మమును వక్తయగు నింద్రుడు ఆత్మత్వ బుద్ధితో నుపదేశించుట దోషయుక్తము కాదు. దేహవిశిష్టుడగు జీవునకు తనయందు ఆత్మబుద్ధి గలుగునట్లు అనగా తనను తాను ఆత్మగా నెంచునట్లు - తనకు అంతరాత్మయగు బ్రహ్మమునందు ఆత్మబుద్ధి గలుగుట దోషావహము కాదని భావము. వేదాంతవిజ్ఞానము ద్వారమున నద్వితీయమగు బ్రహ్మతత్త్వమును బాగుగ నిశ్చయించిన మహాభాగుడు, దృష్టములు, ఆనుశ్రవిక (ఐహికాముష్మిక)ములు నగు విషయములందు విరక్తుడై, అనుక్షణము బ్రహ్మైకచిత్తుడై బ్రహ్మమునే యుపాసించుచు, నభ్యాస పాటవముమూలమున దురత్యయమగు ప్రకృతిప్రాకారమును దాటి సత్వరముగా బ్రహ్మధామము ప్రవేశించును. అతనికి నంతట బ్రహ్మము తక్క వేరొండు తత్త్వమే గోచరింపదు. బ్రహ్మధామమును ప్రవేశించిన మహానుభావుడు —

'బ్రహ్మైవేద మమృతం పురస్తాద్ బ్రహ్మపశ్చాద్ బ్రహ్మ దక్షిణతశ్చోత్తరేణ । అధ శ్చోర్ధ్వం చ ప్రసృతం బ్రహ్మైవేదం విశ్వ మిదం వరిష్ఠమ్.' ముం. ౨-౨-౧౧.

'ముందువెనుకలందును, కుడియెడమలందును, క్రిందను, మీదను, నీ విశ్వమం తంతటను వరిష్ఠము, నమృతము నగు బ్రహ్మమే వ్యాపించి యున్నది' అనును. అతడు తనను బ్రహ్మాభిన్నముగా జూచును. బ్రహ్మమును సర్వజగదాధారముగ నిరీక్షించును. కావున బ్రహ్మమువలె తనను కూడ నంతరాత్మగ భావించి సర్వము తానే యని యెంచును. ఇట్టి యవస్థ యం దతనికి సర్వమును బ్రహ్మమునుండియే యుత్పన్నమగుచున్నదను దృష్టి యేర్పడును. ఈ దృష్టినే మనీషులు శాస్త్రదృష్టి యందురు. ఈ దృష్టికి (బుద్ధికి - జ్ఞానమునకు) విషయమంతయు బ్రహ్మభావమువలెనే గౌణమేకాని, ముఖ్య మని యెంచరాదు. ఈ దృష్టితోనే యింద్రుడును

ప్రతర్దనునకు 'తననే తెలిసికొను'మని ప్రారంభించి యాత్మోపదేశమును జేసియున్నాడు. వామదేవమహర్షియు ప్రకృష్టమగు నుపాసనాబలము మూలమున లభించిన బ్రహ్మాభిన్నభావముతో బ్రహ్మ మాధారముగాగల సర్వము నాత్మాధార మని యెంచి, సర్వము తానే యని యనుకొని యుండెను. అందువలన నతడు బ్రహ్మవచనమును ఆత్మవచనముగా నుడివి యున్నాడు.

'తద్ధైతద్ ఋషి ర్వామదేవః ప్రతిపేదే అహం మను రభవం సూర్య శ్చేతి.' బృ. ౧-౪-౧౦. 'నేను మనువైతిని, సూర్యుడ నైతిని.' అని వామదేవర్షి నుడివియున్నాడు. అట్లే యింద్రప్రతర్దనుల విషయము నను నెఱుగవలయును. కాబట్టి యింద్రవాక్య మిట బ్రహ్మవాక్య మని యంగీకరింపనగునని భావము. (౩౦)

ప్రాణము బ్రహ్మమే యని వివరింపబడినది. మఱియు నెక్కుడుగా నయ్యది దృఢపరుపదలచి మరల శంకించి సమాధానము చెప్పుచున్నాడు.

## జీవ ముఖ్యప్రాణ లింగా న్నేతి చేత్ నోపాసా త్రైవిధ్యా దాశ్రితత్వాత్ ఇహ తద్యోగాత్ ౧-౧-౩౧

జీవ ముఖ్యప్రాణలింగాత్ = జీవునియొక్కయు, ముఖ్యప్రాణము యొక్కయు లింగ ముండుటవలన, న = ప్రాణశబ్దము బ్రహ్మవాచకము కాదు, ఇతిచేత్ = అని యందురేని, న = అట్లనరాదు. కారణమేమన: ఉపాసాత్రైవిధ్యాత్=ఉపాసనాత్రైవిధ్యప్రసక్తి కలుగును. ఆశ్రితత్వాత్ = ప్రాణశబ్దము బ్రహ్మమునందు వర్తించునని యంగీకరింపబడినది. ఇంతియే కాక, ఇహ=ఈ ప్రకరణమునందు, తద్యోగాత్ = బ్రహ్మలింగసంబంధము నున్నది.

ఈ ప్రకరణమునందు కేవలము బ్రహ్మలింగము (ధర్మము)

లభించి యన్యధర్మములు లభింపకున్న పక్షమున ప్రాణశబ్దము బ్రహ్మ వాచకమే యని యంగీకరించుట కెట్టి యాటంకము నుండెడిది కాదు. ఇట బ్రహ్మలింగములతో బాటు జీవాత్మలింగములు, ముఖ్యప్రాణలింగములును కానవచ్చుచున్నవి. అట్టియెడ ప్రాణశబ్దము బ్రహ్మవాచక మని యెట్లు చెప్పగలము?

'న వాచం విజిజ్ఞాసీత వక్తారం విద్యాత్' "కౌ. ౩-౩. వాక్కును కాదు. వక్తను తెలిసికొనవలయును' అను నీ వాక్యమున జీవాత్మలింగము స్పష్టముగా తెలియుచున్నది. వక్తృత్వము - వాగింద్రియవ్యాపారము జీవాత్మకుచెందినదేకాని యన్యులకు సంబంధించినది కాదు. మఱియు

'అథ ఖలు ప్రాణ ఏవ ప్రజ్ఞాత్మేదం శరీరం పరిగృహ్యోత్థాపయతి' కౌ. ౩-౩. 'ప్రజ్ఞాత్మయగు ప్రాణమే శరీరమును ధరించి యుత్థాపన మొన రించుచున్నది.' అను నీ వాక్యమున శరీరధారణ మనెడి ధర్మము వర్ణింప బడినది. అయ్యది ముఖ్యప్రాణమునకు లింగ మగును. ప్రాణమే శరీర ధారణ మొనర్చుచున్నట్లు మరియొక ఉపనిషద్వాక్యమునందు స్పష్టముగా వర్ణింపబడియుండుట మనము చూడగలము. ప్రాణసంవాదమున:

'తాన్ వరిష్ఠః ప్రాణఉవాచ మా మోహ మాపద్యథాఽహమే వైతత్ పంచధాఽఽత్మానం ప్రవిభ జ్యైతద్ బాణ మవష్టభ్య విధారయామి.'
ప్రశ్న. ౨-౩.

'వాగాదుల నుద్దేశించి వరిష్ఠమగు ప్రాణ మనెను. మోహము నందకుడు. నేను నన్నైదువిధములుగా విభజించి యీ శరీరమును ధరించు చున్నాను.' అని పలికియున్నట్లు చూడ శరీరధారణము ప్రాణలింగ మనుట విస్పష్టము. కాబట్టి యీ ప్రకరణమున జీవలింగమైన వక్తృత్వము, ప్రాణ లింగమైన శరీరధారణమును లభించుచుండ ప్రాణశబ్దము బ్రహ్మవాచక మనుట యుక్తము కా దందురేని —

అది సరికాదు. ప్రాణశబ్దముచే జీవాత్మ, ముఖ్యప్రాణము, బ్రహ్మము నను మూడును గ్రహింపబడినచో జీవాత్మోపాసనము, ముఖ్య ప్రాణోపాసనము, బ్రహ్మోపాసనము నని మువ్విధములగు నుపాసనము లంగీకరింపవలసివచ్చును. ఉపదేశవాక్య సందర్భమును పరికించినచో త్రివిధోపాసనమును విధించుట యభిప్రేతమనుట యుక్తము కాదు. కారణమేమన :

(మామేవ విజానీహి) 'నన్నే తెలిసికొనుము' అని ప్రారంభించి, (ప్రాణోఽస్మి ప్రజ్ఞాత్మా తం మా మాయు రమృత మిత్యుపాస్వ) 'నేను ప్రజ్ఞానాత్మకమగు ప్రాణమును. నన్ను ఆయువు, నమృతము నని యుపాసింపుము' అని నుడివి, చివరకు

'స ఏష ప్రాణ ఏవ ప్రజ్ఞాత్మాఽఽనందోఽజరోఽమృతః'

'ఈ ప్రాణమే ప్రజ్ఞాత్మ, ఆనందము, అజరము, అమృతము' అని యుపదేశించియున్నాడు.

'ప్రజ్ఞాత్మ, ఆనందస్వరూపము, అజరము - అనగా నెన్నడు జీర్ణము కాని, మరియు మరణములేని ఆ ప్రాణమును నేనే. అట్టి నన్ను నీ వుపాసింపుము' అని యుపదేశించినట్లు స్పష్టముగా బోధపడుచున్నది. ఇట్టియెడ జీవాత్మకాని, ముఖ్యప్రాణముకాని యెట్లు గ్రహింపనగును? జీవాత్మ యానందస్వరూపుడు కాడు. అందువలన జీవాత్మ యిట గ్రహింపబడదు. ముఖ్యప్రాణము జీర్ణము నొందును. కావున నదియు గ్రహింపదగినది కాదు. జీవాత్మకాని, ముఖ్యప్రాణముకాని యుపాసింపదగిన పదార్థములుగా నింద్రుడు ప్రతర్దనున కుపదేశింపదలచిన ఆనందము, నజరము నను విశేషణము లిట ప్రాణశబ్దమునకు గ్రహించియుండడు.

ఏదో యొకవిధమున నీ విశేషణములు గ్రహింపబడినను నవి లింగములుగా గ్రహించి జీవ, ముఖ్యప్రాణము లిట యుపాస్యము లనుటయు

సమంజసము కాదు. ఆ విశేషణములు బ్రహ్మమును ముఖ్యముగా బోధించును. సర్వవ్యాపారములకును హేతువగు బ్రహ్మము ప్రాణవ్యాపారము - జీవనమునకు హేతువు కాకపోదు. అందువలననే ఉపనిషత్తులందు,

'న ప్రాణేన నాపానేన మర్త్యో జీవతి కశ్చన,
ఇతరేణతు జీవన్తి యస్మి న్నేతా వుపాశ్రితౌ" కఠ. ౫-౫

'మర్త్యుడు ప్రాణముచేగాని, అపానముచేగాని, జీవింపడు. ప్రాణాపానము లెద్దాని నాశ్రయించియున్నవో యట్టి బ్రహ్మముచే జీవించుచున్నారు.'

'య ద్వాచానభ్యుదితం యేన వా గభ్యుద్యతే
తదేవ బ్రహ్మత్వం విద్ధి నేదం యదిద ముపాసతే' కేన. ౧-౪.

'వాక్కుచే నేది చెప్పబడ నలవికాదో, యెయ్యది వాక్కునకు కారణమో .యయ్యదియే బ్రహ్మము; నీ వుపాసించునది కాదని తెలియుము' అని వర్ణింపబడినది.

మఱియు నిట జీవోపాసనముకాని, ప్రాణోపాసనముకాని హితతమ మనుట యుక్తముకాదు. బ్రహ్మోపాసనమే హితతమ మగును. ఈ యుపదేశము హితతమము నుద్దేశించియే ప్రారంభింపబడినది. కాబట్టి హితతమత్వాది లింగములు బ్రహ్మమునందే సంగతములయి ప్రాణశబ్దముచే బ్రహ్మమునే గ్రహింపజేయ నుపయుక్తములగును. కాని జీవ, ముఖ్య ప్రాణములను గ్రహింపజేయనేర వనియు సుస్పష్టము. (౩౧)

వేదాంత దర్శన - అంబా వ్యాఖ్యానమున
ప్రథమాధ్యాయమునందు ప్రథమపాదము
సమాప్తము

# ప్రథమాధ్యాయము

## ద్వితీయపాదము

### ప్రథమాధికరణము

ప్రథమపాదమున బ్రహ్మపదార్థము తెలియదగినదని నుడివి, దాని లక్షణము వివరింపబడినది. బ్రహ్మము సర్వజ్ఞము, సర్వశక్తిమంతము నని చెప్పి, యది జగత్తునకు నిమిత్తకారణముగ వర్ణింపబడినది. ఆనందమయత్వము, అజరత్వము, అమరత్వము మున్నగు ధర్మములద్వారా బ్రహ్మమే జిజ్ఞాస్యమనియు నిశ్చయింపబడినది. ఇకముందు - ద్వితీయ తృతీయ పాదములందు - కొన్ని సందిగ్ధ ఉపనిషద్ వాక్యముల నెట్లు సమన్వయింపవలయునో మహర్షి వ్రాయుచున్నాడు.

**సర్వత్ర ప్రసిద్ధోపదేశాత్ ౧-౨-౧**

(ఈ ప్రకరణమునందును బ్రహ్మ మధికృతమే యని యెంచవలయును. అధికృతము=ప్రతిపాద్యవిషయము)

సర్వత్ర=(ఉపాసనా ప్రకరణమున) అంతటను, ప్రసిద్ధోపదేశాత్= ప్రసిద్ధమగు పరమబ్రహ్మమే యుపాస్యదైవముగా నుపదేశింపబడుటవలన, ఛాందోగ్యమునగల శాండిల్యవిద్యయందు వర్ణింపబడిన బ్రహ్మము - పరమబ్రహ్మము - పరమేశ్వరుడే యని యెంచవలయును. ఛాందోగ్యమున శాండిల్యవిద్య చెప్పబడినది. అందు,

'సర్వం ఖల్విదం బ్రహ్మ తజ్జలానితి శాన్త ఉపాసీత,
అథ ఖలు క్రతుమయః పురుషః యథా క్రతు రస్మిన్ లోకే
పురుషో భవతి తథేతః ప్రేత్య భవతి, స క్రతుం కుర్వీత
మనోమయః ప్రాణశరీరో భారూపః' ఛాం. ౩-౧౪-౧-౨.

'ఇది యంతయు బ్రహ్మము. శాంతుడైనవా డిది యంతయు బ్రహ్మ జన్యమనియు, బ్రహ్మ లయమనియు, బ్రహ్మ స్థితమనియు నుపా

సింపదగును. పురుషుడు క్రతుమయుడు కదా ! ఈ లోకమున పురుషుడెట్లు క్రతువో, యిటనుండి గతించియు నట్లే యగును. క్రతువు నుపాసింపవలయును. మనోమయుడు, ప్రాణశరీరుడు, భారూపుడు నగు నతడు క్రతువొనర్పవలెను.

'ఈ ప్రపంచమంతయు బ్రహ్మమువలన నుత్పన్నమగుచున్నది. బ్రహ్మమునందే లీనమగుచున్నది. బ్రహ్మముద్వారా జీవించుచున్నది. మైత్ర్యాదిభావనలద్వారా (శాంతుడైన యుపాసకుడు) రాగద్వేషాది మలరహితుడైన భక్తుడు ప్రపంచ జన్మ, స్థితి, లయములకు కారణభూతమగు బ్రహ్మము నుపాసింపవలయును.' అని యీ వాక్యము బోధించుచున్నది. ఇట గ్రహింపబడిన బ్రహ్మశబ్దము పరబ్రహ్మబోధకమా ? లేక జీవాత్మబోధకమా ? యని సంశయము కలుగును. అది రెండర్థములందును బ్రయోగింపబడుట చూచుచున్నాము.

'తస్మై జ్యేష్ఠాయ బ్రహ్మణే నమః' అథ. ౧౦-౮-౪-౧.
'తదేవ బ్రహ్మ త్వం విద్ధి' కేన. ౧-౫.
'విరజం బ్రహ్మ నిష్కలమ్' ముం. ౨-౨-౯.
'సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ' తై. ౨-౧.

ఈ వాక్యములందలి బ్రహ్మపదము పరబ్రహ్మవాచకమే. కాని,

'స వా అయమాత్మా బ్రహ్మవిజ్ఞానమయః' బృ. ౪-౪-౫.

ఈ వాక్యమునందలి బ్రహ్మపదము జీవాత్మపరము. కాబట్టి శాండిల్య విద్యయందు గ్రహింపబడిన బ్రహ్మపదము జీవాత్మపరమా ? బ్రహ్మపరమా ? యని సందేహమొదవుట సహజము. ఇందు జీవాత్మ పరమనుట పూర్వపక్షము. బ్రహ్మపరమనుట సిద్ధాంతము.

ఈ శాండిల్య విద్యయందు గ్రహింపబడిన మనోమయము, ప్రాణశరీరము నను విశేషణములనుబట్టి బ్రహ్మపదము జీవాత్మబోధకమే యన

నొప్పును. మనస్సుయొక్క – ప్రాచుర్యము - ఆధిక్యము మనోమయ మన బడును. అట్టి మనః ప్రాచుర్య సంబంధము జీవాత్మకు సంభవమగునుగాని బ్రహ్మమునకు కాదు. ఇట్లే ప్రాణము శరీరమున గలవాడు – ప్రాణశరీరుడు – జీవాత్మయే యగునని భావము. కాబట్టి బ్రహ్మపదమిట జీవాత్మపరమే యని ప్రాప్తింపగా –

ఉపాస్యస్థలముల నంతటను ప్రసిద్ధమగు పరబ్రహ్మమే యుపదేశింపబడుటవలన నిట శాండిల్య విద్యయందును బ్రహ్మపదముచే బ్రహ్మమే యుపదేశింపబడినట్లు గ్రహింపవలయునని సమాధానము.

ఉపాసనాప్రకరణములం దెల్లయెడలను శ్రుతి స్మృతుల ద్వారా యుపాస్యదైవము బ్రహ్మమే యని యుపదేశింపబడుచున్నది. శాండిల్య విద్యయు నుపాసనాప్రకరణమే కావున నిందును బ్రహ్మపదముచే పరబ్రహ్మమే గ్రహింపనగును. జీవాత్మ కాదు.

ఋగాది వేదశాస్త్రములందు అగ్ని, ఇంద్రుడు, వరుణుడు, సుపర్ణుడు, బృహస్పతి, ప్రజాపతి, వాయువు, సవితృడు, చంద్రుడు, ఆకాశము, ప్రాణము మున్నగు ననేకదేవత లుపాస్యులుగా వర్ణింపబడియుండ బ్రహ్మమే యుపాస్యదైవముగా శాస్త్రములు చెప్పుచున్నవనుట యుక్తము కాదందురేని, అట్లుకాదు. అగ్నీంద్రాదులు స్తుతింపదగినవిగాను, నుపాసింపదగినవిగాను వర్ణింపబడియుండుట సత్యమే. కాని, ఆ శబ్దములు వేరు వేరుగా నున్నను వాని యర్థములలో నెట్టిభేదము లేదు. ఆ పదములన్నియు నుపాస్యప్రకరణములందు బ్రహ్మమునే బోధించును. లోకవ్యవహారము నందు అగ్నిశబ్ద మింద్రుని బోధింపదు. కాని, వేదము ఉపాసనా స్థలము లందు అగ్నిశబ్దముచే నే యర్థము (బ్రహ్మము)ను బోధించునో, ఇంద్రశబ్దముచేతను నట నాయర్థమునే తెలుపునని శాస్త్రతత్వము నెఱిగిన వారెల్లరు నంగీకరింతురు. ఒక యర్థము నొకే పదముచే బోధింపవలయుననునియమ మొందును వేదమున గానము. వైదికశబ్దములు నానా.. బోధించు

నర్థములలో రూఢములుకాక యౌగికములో లేక యోగరూఢములో యగును. ఈ నియమ మెరుగనివారికి వైదికపదార్థములలో గల సౌంద ర్యము గోచరము కాదు. కొండొక యర్థమున రూఢమగు నొక శబ్దము తా తెలుపు నర్థము నున్నదున్నట్లు తెలుప సమర్థము కానేరదు. వాస్తవ మున నొక యర్థ మున్నదున్నట్లు దెలుపుట కనేక పదములు వాడవలసి వచ్చును. యాథాతథ్యముగ పదార్థములను బోధించుట కవతరించిన వేద శాస్త్రము లోక యర్థమును, అందునను విశేషించి బ్రహ్మమును దెలుపుట కనేక పదములను గ్రహించుటలో వింత యేమి? సర్వపదార్థములలోను నగ్రణి యగుటచే బ్రహ్మము అగ్ని యనబడును. భౌతికపదార్థములలో అగ్ని యన్నిటికంటె నగ్రణి. ఆధిదైవికపదార్థములలో సూర్యుడు అగ్రణి. అట్లే ఆధ్యాత్మిక పదార్థములలో బ్రహ్మ మన్నిటికంటె నగ్రణి. ఇట్లగ్ని శబ్ద మనేకార్థములను బోధించునదియై యున్నది. కాని ప్రకరణము ననుసరించి యెక్కడ నే యర్థమును గ్రహింపవలయునో యయ్యది గ్రహించుట సూరి జనులకు కర్తవ్యము. అగ్రణి - ప్రధాన - మగుటచే బ్రహ్మము అగ్నిపదముచే పేర్కొనబడినది. అట్లే నిరతిశయ మగు నైశ్వర్యము గలదగుటచే బ్రహ్మ మింద్రపదముచే బేర్కొనబడును. ఇట్లు ఒక్కొక్క పదముచే బ్రహ్మమునందుగల యొక్కొక్క గుణము - ధర్మము - బోధింపనగును. కావుననే వేద మనేక పదములచే బ్రహ్మము యొక్క యాథార్థ్యమును దెలుపుచున్నది. అందువలన నగ్న్యాది నానాపద ములచే నానార్థములను గ్రహింపక స్తుత్యుపాసనా ప్రకరణములందు బ్రహ్మమునే గ్రహించుట యుక్తియుక్త మగును.

బ్రహ్మ మొక్కటియేయైనను నందు కల్యాణకరములగు గుణము లనేకము లుండుటవలన వానిని దెలుప ననువగు పదము లనేకములు శాస్త్రమున వాడబడినవి. వేదమే యిందులకు సాక్ష్యము.

'ఇంద్రం మిత్రం వరుణ మగ్ని మాహు రథో దివ్యః స సుపర్ణో

గరుత్మాన్, ఏకం సద్ విప్రాబహూధా వద న్త్యగ్నిం యమం మాతరిశ్వాన మాహుః' ఋ. ౨-౩-౨౨-౪౬.

'సద్రూపమగు నొకే పదార్థము (పరమాత్మ)ను విద్వాంసులు బహు విధముల - ఇంద్రుడు, మిత్రుడు, వరుణుడు, అగ్ని, దివ్యుడు, సుపర్ణుడు, గరుత్మంతుడు, యముడు మాతరిశ్వానుడు' అని చెప్పుదురు. మరియు,

'తదేవాగ్ని స్తదాదిత్య స్త ద్వాయు స్తదు చంద్రమాః ।
తదేవ శుక్రం తద్ బ్రహ్మ, తా ఆపః స ప్రజాపతిః'

యజు. ౩౨-౧

'అదియే యగ్ని, ఆదిత్యుడు, వాయువు, చంద్రుడు, శుక్రుడు, బ్రహ్మము, ఆపస్సు, ప్రజాపతి' అని యజుర్వేదమున చెప్పబడినది. ఇంకను,

'స ధాతా, స విధర్తా, స వాయు ర్నభ ఉచ్ఛ్రితం'

అథర్వ. ౧౩-౪-౪-౩

'సోఽర్యమా, స వరుణః స రుద్రః స మహా దేవః'
'సోఽగ్నిః స ఉ సూర్యః స ఏవ మహాయమః'

అథర్వ. ౧౩-౪-౪-౪,౫

'అతదే ధాత; విధాత; ఉన్నతాకాశము; అతదే అర్యముడు; అతదే వరుణుడు; అతదే రుద్రుడు; అతదే మహాదేవుడు; అత దగ్ని; అతదే సూర్యుడు; అతదే మహాయముడు.' అని యథర్వవేదమునను వర్ణింప బడినది.

కాబట్టి యుపాసనా ప్రకరణములందు వాచబడు నగ్న్యాదిశబ్దము లుపాస్యముగ పరబ్రహ్మమునే బోధించు ననుట నిశ్చయము. అటులయిన మనోమయత్వము, ప్రాణశరీరత్వము నను ధర్మములు బ్రహ్మమున నెట్లు సంగతము లగును? అని సందేహింప బనిలేదు. అవియును బ్రహ్మము

నందు సంగతములు కాగలవు. సర్వవ్యాపారములను విడిచి మనస్సును బ్రహ్మమునందు లగ్నమొనర్చుటయేకదా ఉపాసన యనబడును ! దీర్ఘ కాలము తెంపులేకుండ 'నభ్యాస వైరాగ్య ములను శ్రద్ధాసక్తులతో నభ్య సించినపుడు మనస్సు రాజస, తామస మాలిన్యములనుండి విముక్తమై శుద్ధమగును. అట్టి శుద్ధమనస్సే బ్రహ్మమునందు లగ్నమై బ్రహ్మవ్యాప్త మగును. అట్టి స్థితిని లక్ష్యమునం దుంచుకొనియే ఋషులు మనోమయ మని బ్రహ్మమును వ్యవహరించుచున్నారు. మనోమయ మన బ్రహ్మము మనస్సుతో నుపాసింపదగినదని భావము. ఇట్లే ప్రాణశరీరమును బ్రహ్మ మున నుపపన్న మగుచున్నది. ప్రాణశరీర మనగా ప్రాణము శరీరముగా గలది యని యర్థము.

'స ఉ ప్రాణస్య ప్రాణః' కేన. ౧-౨. 'ఆ బ్రహ్మము ప్రాణము నకు బ్రాణ'మని బ్రహ్మమునకు ప్రాణము శరీరముగ వర్ణింపబడుట యుపనిషత్తులందు జూడనగును. సర్వాంతర్యామి యగు బ్రహ్మము ప్రాణాంతర్గతమయి ప్రాణము శరీరముగా గలిగియున్నదనుటలో నాశ్చర్య మేల ? కాబట్టి శాండిల్యవిద్యయందు వర్ణింపబడిన బ్రహ్మము పర బ్రహ్మమే కాని జీవాత్మ యెన్నటికిని కాదని స్పష్టమగుచున్నది. (౧)

## వివక్షిత గుణోపపత్తేశ్చ ౧-౨-౨

వివక్షిత....పత్తేః = శాండిల్యమహర్షి చెప్పదలచిన గుణములు బ్రహ్మమునం దుపపన్నము లగుటవలనను, అన్యవాచకము కాదు అని సూత్రార్థము.

పూర్వము చెప్పిన శాండిల్య విద్యయందు బ్రహ్మము ఉపాసింప దగినదని చెప్పి యనంతరమున నందలి యుపాస్యగుణములు కొన్ని యిట్లు వర్ణించియున్నాడు.

'మనోమయః ప్రాణశరీరో భారూపః సత్య సంకల్పః, ఆకాశాత్మా సర్వకర్మా సర్వకామః సర్వగంధః సర్వరసః సర్వమిద మభ్యాత్తోఽవాక్య నాదరః' ఛాం. ౩-౧౪-౨.

'మనోమయము, ప్రాణశరీరము, భారూపము, సత్యసంకల్పము, ఆకాశాత్మము, సర్వకర్మము, సర్వకామము, సర్వగంధము, సర్వరసము, సర్వవ్యాప్తము, అవాక్కు, అనాదరము' అని వర్ణించి మఱియు నిట్లే,

'ఏష మ ఆత్మాఽంతర్హృదయే, జ్యాయాన్ పృథివ్యా, జ్యాయాన్ అంతరిక్షాత్, జ్యాయాన్ దివో, జ్యాయాన్ ఏభ్యో లోకేభ్యః' ఛాం. ౩-౧౪-౩.

'ఈ నా హృదయాంతరముననున్న ఆత్మ పృథివికంటె గొప్పది, అంతరిక్షముకంటె గొప్పది, ద్యులోకముకంటె గొప్పది, ఈ లోకముల కన్నిటికంటె గొప్పది' అని వర్ణించియున్నాడు. ఈ చెప్పబడిన గుణము లన్నియు పరబ్రహ్మ - పరమేశ్వరునందే సంపూర్ణముగ వర్తించును. జీవాత్మయందు వర్తింపనేరవు. మనోమయత్వము, ప్రాణశరీరత్వము, భారూపత్వము జీవునియందున్నను సత్యసంకల్పత్వాది ధర్మము లతని యందు సంభవములు కావు. జీవుని సంకల్పములన్నియు సత్యములు కాగల వని యెవరు చెప్పగలరు? జీవాత్మని స్వరూప మాకాశము వంటిది - అనగా వ్యాపకమనుట యెట్లు సంగతము కాగలదు? బ్రహ్మమునందు పై గుణములన్నియు నున్నవనుటలో సందియ మావంతయు నుండదు. జగత్తును సృష్టించుటలో నేమి, దానిని ధరించుటలో నేమి, అటుపై లయింపజేయుటలో నేమి బ్రహ్మసంకల్పమున కెట్టి విఘాతమును కలు గదు. కావున బ్రహ్మము సత్యసంకల్పము, వ్యాపకము, అత్యంత సూక్ష్మము, రూపాదిగుణహీనము నగుటచే బ్రహ్మము ఆకాశమువంటి స్వరూపముకలదై యాకాశాత్మమగుచున్నది. సర్వమన ప్రపంచము. అది

కార్యము (కర్మ)గా గలది బ్రహ్మము. అనగా బ్రహ్మమే యీ జగద్రూప కార్యమునకు కర్త. అందువలననే ఋగ్వేదమునందుకూడ,

'య ఇమా జజాన' 'ఎవడు వీనిని జనింపజేసెనో' యని వర్ణింపబడినది.

ఇట్లే ముండకమునందును, 'కర్తార మీశమ్' •'ఈశుడు కర్త' యనియు,

శ్వేతాశ్వతరమున 'స విశ్వకృత్' 'అతడు విశ్వకర్త' యనియు వర్ణింపబడినది. కామములన నిట పదార్థములు. కామింపబడును కావున నవి కామశబ్దముచే జెప్పబడును. పదార్థము (కామము) లన్నియు బ్రహ్మాయత్తములు - బ్రహ్మాధీనములు. కావున బ్రహ్మము సర్వకామము. ఇట్లే సర్వగంధములకు నధిష్ఠానమగుటవలన సర్వగంధమనియు, సర్వరసాధిష్ఠానమయి సర్వరసమనియు, వ్యాపకమగుటచే సర్వవ్యాపకమనియును గ్రహింపనగును. మిగిలిన ధర్మములును బ్రహ్మమునం దెట్లు సంగతములగునో సులభముగా నూహింపథగును. నిత్యతృప్తమగుటచే బ్రహ్మమునకు దేనియందును ఆదరభావ ముండదు. అందుచే నయ్యది యనాదరము. ఇట్లే జ్యాయస్త్వము - పరమమహత్త్వము బ్రహ్మమునందే సుసంగతమగును. శాండిల్య మహర్షిచే నిట్లు వర్ణింపబడిన ధర్మములన్నియు బ్రహ్మమునందే సంభవమగుటవలన నిట బ్రహ్మపదము పరబ్రహ్మవాచకమే కాని జీవాత్మ బోధక మెన్నటికిని కాదని సిద్ధాంతము. (౨)

ఇట్లు సిద్ధాంతపక్షమును నిరూపించి యటుపై పూర్వపక్షమును మహర్షి నిరాకరించుచున్నాడు.

### అనుపపత్తేస్తు న శారీరః ౧-౨-3

అనుపపత్తేః = వివక్షితగుణము లుపపన్నములు (సంగతములు) కానందున, శారీరః తు=జీవాత్మమాత్రము, న=బ్రహ్మపదవాచ్యముకాదు.

మనోమయత్వాది పూర్వోక్తగుణములు సంపూర్ణముగ జీవాత్మ యందు ఘటింపవు. మనోమయత్వము, ప్రాణశరీరత్వము, భారూపత్వ మేదో యొక విధమున జీవాత్మయందు సంభవమైనను, సత్యసంకల్పత్వాది గుణములు జీవాత్మయం దేవిధముగను సంగతములు కానందున నీ ప్రకరణమునగల బ్రహ్మపదము పరబ్రహ్మవాచకమే కాని శారీరము - జీవాత్మ వాచకము - కానేరదని యీ సూత్రభావము. (౩)

## కర్మ కర్తృ వ్యపదేశాచ్చ          ౧-౨-౪

ఈ ప్రకరణమునందు మనోమయత్వాది గుణములుగల బ్రహ్మము కర్మ=ప్రాప్యము - కర్మగాను, ఉపాసకుడైన పురుషుడు (జీవాత్మ) కర్త గాను జెప్పబడినందునను, జీవాత్మ (శారీరుడు) బ్రహ్మపదబోధ్యము కానేరదని మహర్షి యీ సూత్రమున మఱియొక హేతువు ప్రదర్శించి యున్నాడు.

కాబట్టి శాండిల్య విద్యయందలి బ్రహ్మపదము పరబ్రహ్మ - పరమాత్మనే బోధించును, కాని జీవాత్మను కాదనుట నిశ్చితము. (౪)

## శబ్దవిశేషాత్          ౧-౨-౫

శబ్దవిశేషాత్=కర్మ, కర్త, అను నీ శబ్దములందు భేదమున్నందున, పూర్వసూత్రమునందు జెప్పబడిన కర్మ, కర్తృవ్యపదేశము గౌణము - అప్రధాన - మనుటకును వలనుపడదు.

'ఏష మ ఆత్మాఽన్తర్ హృదయే' 'ఈ నా హృదయాంతరమున నున్న యాత్మ' అను నీ వాక్యమునందు ఉపాసింపదగిన పరబ్రహ్మ పరమాత్మ 'ఆత్మా' అని ప్రథమా విభక్తితోగూడిన పదముతోను, ఉపాసకుడైన జీవాత్మ 'మే=నాయొక్క' అని షష్ఠీవిభక్తితోగూడిన పదముతోను వ్యవహరింపబడియున్నవి. ప్రథమావిభక్తి, షష్ఠీవిభక్తికంటె విశిష్టమనుట

నిర్వివాద విషయము. కర్మపదముకంటె కర్తృపదము భిన్నముగా నిర్దేశింప బడినందున నీ వ్యవహారము గౌణము - అప్రధాన - మని యుపేక్షింపదగి నది కాదు. మఱియు నుపాసింపదగిన కర్మ 'బ్రహ్మ' 'ఆత్మ' యను శబ్ద ములచేతను ఉపాసకుడైన కర్త 'పురుష' శబ్దముచేతను నుల్లేఖింపబడి యుండుట మనము చూడవచ్చును. కర్మ, కర్త అను నీ శబ్దములలోగల విశేషము కర్మకర్తృ వ్యపదేశము ముఖ్యముగానెంచినప్పుడే యుపన్న మగును. గౌణముగా నెంచిన నయ్యది (కర్మ కర్తృవ్యపదేశమునగల) భేదము సిద్ధింపదు. 'రాజుయొక్క పురుషుడు' అను నీ పదములలోగల భేదమును గౌణముగా నెంచెదమేని రాజు స్వామి యనియు, పురుషు డతని భృత్యుడనియు నెన్నడు సిద్ధింపదు. కాబట్టి యుపాసక, ఉపాస్యపదము లలోగల భేదము గౌణమని యుపేక్షింపదగదని భావము (౫)

ఈ విషయమునందే మరియొక హేతువు:

స్మృతేశ్చ ౧-౨-౬

స్మృతేశ్చ=స్మృతివలనను, కర్మ కర్తృవ్యపదేశము గౌణమన వలనుపడదు.

> 'ఏవం యః సర్వభూతేషు పశ్య త్యాత్మాన మాత్మనా,
> సర్వసమతా మేత్య బ్రహ్మాభ్యేతి పరంపదమ్' మను. ౧౨-౧౨౫.

'ఎవడిట్లు సర్వప్రాణులందును పరమాత్మను దర్శించునో వాడు సమత్వముపొంది పరమపదమగు బ్రహ్మమును చేరును.' అను నీ మను స్మృతియందును కర్మ కర్తృభేదము స్పష్టముగా తెలియనగును.

అభ్యేతి = ప్రాప్తించును - చేరును. ఇట ప్రాప్తిక్రియకు కర్మ - ప్రాప్య - మగు బ్రహ్మ - పరమాత్మ, ప్రాప్తిక్రియకు కర్తయగు జీవాత్మ కంటె భిన్నముగా వర్ణింపబడుట సుస్పష్టము. ఈ భేదము నిట గౌణము

(అప్రధానము)గా నెంచకుండుటకై పరమపదమని బ్రహ్మకు విశేషణము కూడ జెప్పబడినది.

పదమనగా ప్రాప్తవ్యము - పొందదగినది - సాక్షాత్కారము చేసి కొనదగినది. అట్టిపదములు మూడు. 1. ప్రకృతి, 2. జీవాత్మ, 3. పరమాత్మ. అందు ప్రకృతి మొదటిపదము. సంసారదుఃఖములనుండి తన్నుదా విడిపింపదలచినవాడు ప్రకృతిని ముందుగా నెఱుగును - దాని యథార్థ స్వరూపమును గుర్తించును - పొందునని యభిప్రాయము. ప్రకృతిచే ప్రత్యగాత్మ (జీవుడు) ఆవరింపబడియున్నది. కావున ప్రకృతి సాక్షాత్కారము కానినాడు ప్రత్యగాత్మ సాక్షాత్కారము కాదు. అందువలననే సాంఖ్య దర్శనకారులు ప్రకృతి పురుష వివేకమును మోక్షమున కనివార్య సాధనముగా వర్ణింతురు. అట్టి జీవాత్మని కంతరాత్మయే పరమాత్మ. కావున పరమాత్మ సాక్షాత్కారమునకు ప్రకృతి సాక్షాత్కారముకూడ హేతువగును. ఇట్లు ప్రకృతి [illegible] పదము. అది యితర స్థూలపదార్థములన్నిటికంటె సూక్ష్మము. రెండవపదము జీవాత్మ. జీవాత్మ నెరుగకున్న పరమాత్మ నెఱుగజాలము. జీవాత్మ ప్రకృతికంటె సూక్ష్మము. కాబట్టి ప్రకృతి సూక్ష్మమయిన జీవాత్మ సూక్ష్మతరము. పరమాత్మ సూక్ష్మతమము. అందువలన సూక్ష్మమగు ప్రకృతిని ప్రథమమున బొంది, యనంతరము సూక్ష్మతరమగు జీవాత్మను సాక్షాత్కరింపజేసికొని, తుద కత్యంతసూక్ష్మము - సూక్ష్మతమమగు పరమాత్మను ప్రాప్తింపనగును. ఇయ్యదియే పరమపదమగు పరమబ్రహ్మమును బొందదగిన క్రమము.

'తద్విష్ణోః పరమం పదం, సదా పశ్యంతి సూరయః' 'విద్వాంసులా పరమపదము నెల్లపుడు గనుచుందురు' ఇట్లు బ్రహ్మమును పరమపదముగా వర్ణించి జీవబ్రహ్మలకు గల భేదమును స్మృతి స్పష్టపరుచుచుండగా ఉపాస్య, ఉపాసకభేదము గౌణము - అప్రధాన - మని యెంచుట యుక్తము కాదు. (౬)

ప్రస్తుతము జీవునికి అణీయస్త్వమును లింగముగా నాశంకించి దానిని నిరాకరించుచున్నాడు :

అర్భకౌకస్త్వాత్ తద్వ్యపదేశాచ్చ నేతిచేన్న
నిచాయ్యత్వా దేవం వ్యోమవచ్చ ౧-౨-౭

అర్భకౌకస్త్వాత్ = (అర్భకము=అల్పము, ఓకః = నివాసస్థానము) అల్పమగు హృదయకమలము నివాసస్థాన మగుటవలన, తద్వ్యపదేశాచ్చ= అల్పమని చెప్పుటవలనను, నేతిచేత్ = బ్రహ్మశబ్దము ఈ ప్రకరణమున పరమాత్మవాచకము కాదందురేని, న = అట్లనరాదు. నిచాయ్యత్వాత్ = హృదయపుండరీకమున నుపాసింపదగినందువలనను, ఏవమ్ = ఇట్లే, వ్యోమవచ్చ = ఆకాశమువలె నన్నిటికంటె 'పెద్దదిగా' నుపదేశింపబడుట వలనను, బ్రహ్మపదము పరమాత్మవాచకమే.

'ఏష మ ఆత్మాఽన్తర్హృదయే' 'ఈ నా హృదయాంతరమున నున్న యాత్మ' అని బ్రహ్మము హృదయమున నున్నట్లు చెప్పబడి యున్నందున, హృదయ మల్పము కాబట్టి యందున్న యాత్మయు నల్ప మనవలసివచ్చును. ఇంతియేకాక,

'అణీయాన్ వ్రీహేర్వా యవాద్వా సర్షపాద్వా, శ్యామాకాద్వా, శ్యామాకతండులాద్వా' 'వ్రీహి (వడ్లగింజ) కంటెను, యవకంటెను, ఆవగింజకంటెను, శ్యామాకధాన్యపుగింజకంటెను, దాని బియ్యపుగింజ కంటెను నల్పము.' అను నీ వాక్యమునందు అల్పత్వము వర్ణించుటచూడ, నీ ప్రకరణమునందు బ్రహ్మము వర్ణింపబడిన దెంచుట యుక్తము కాదు. హృదయ మనెడి యల్పస్థానమున నుండుటచే నది పరిచ్ఛిన్నము-సీమితము, అల్పము నగుట నిశ్చయము. ఈ యల్పత్వము, పరిచ్ఛిన్న త్వము నను ధర్మములు జీవాత్మకు వర్తించును కాని బ్రహ్మమున కెట్లు

వర్తింపగలవు? కాబట్టి యిట బ్రహ్మశబ్దము జీవాత్మ బోధకమే యందురేని –

అది యుక్తము కాదు. పరమాత్మను గూర్చియు నిట్లు చెప్పుట యసంగతము కాదు. బ్రహ్మము సర్వభూతాంతరాత్మ యగుటంబట్టి సర్వ స్థానగతమై విభుత్వధర్మము గలది యనుట నిక్కువమే. అయినను నయ్యది హృదయాంతర్వర్తి యనుటలో దోష మొండునులేదు. సర్వగత మగు బ్రహ్మము హృదయమున నుండదా! అట్లే యది ప్రత్యగాత్మ - జీవాత్మ - యందును నుండదా? ఉండును. అయ్యది సర్వాంతఃపాతి - సర్వాంతర్గతము. అల్పమగు హృదయమున నుండును. అంతకంటెను సూక్ష్మమగు జీవాత్మయందును నుండును. సర్వగతమగు బ్రహ్మము హృదయపుండరీకమున సుఖముగ నుపాసింపదగినందున నయ్యది హృదయ స్థానికమనియు, నల్పమనియు వ్యపదేశింపబడినది - చెప్పబడినది. అట్లు వర్ణింపబడినంతమాత్రమున నయ్యది యట్టిదే యని యనరాదు. ఆ బ్రహ్మము ఆకాశమువలె నన్నిలోకములకంటె గొప్పది యనియు వర్ణింపబడుట నిందు మనము చూడవచ్చును.

'జ్యాయాన్ పృథివ్యా, జ్యాయా నంతరిక్షాత్, జ్యాయాన్ దివో, జ్యాయా నేభ్యో లోకేభ్యః' ఛాం. ౩-౧౪-౩.

'పృథివి, అంతరిక్షము, ద్యులోకము నను నీ లోకము లన్నిటికంటె గొప్పది (జ్యాయాన్). కాబట్టి బ్రహ్మపదవాచ్యమగు పరమాత్మ సర్వ గతమై- సర్వజ్యేష్ఠమైనను హృదయపుండరీకమున నుపాస్యముగా నల్ప మని వర్ణించుట యనుచితము కాదు. కాబట్టి జగత్పతి యగు పరమాత్మయే యిట బ్రహ్మపదవాచ్య మని గ్రహింపవలయును. జీవాత్మ యెన్నటికిని కాదు. (౭)

పరమాత్మ హృదయస్థమగునెడల. హృదయమున నున్న జీవునకు

భోగము (సుఖదుఃఖానుభవము) కలుగునట్లు పరమాత్మ కేల కలుగదన. సమాధానము.

## సంభోగప్రాప్తి రితి చేన్న వైశేష్యాత్ ౧-౨-౮

సంభోగప్రాప్తి రితిచేత్=సుఖదుఃఖానుభవము గలుగునందురేని, వైశేష్యాత్=విశేష ముండుటవలన, న=అట్లు కలుగదు.

జగత్కారణమగు పరబ్రహ్మము హృదయమున నున్నదని యంగీకరించినచో, హృదయమున నుండు జీవునకు సుఖదుఃఖములు కలుగునట్లు పరమాత్మకును సుఖదుఃఖప్రాప్తి కలుగునని యంగీకరింపవలసివచ్చును. అగ్నిజ్వాలలచే నావరింపబడిన గృహమున నుండు నిరువురువ్యక్తులలో నొకరు దహింపబడుటయు మరియొకరు దహింపబడకుండుటయు సంభవము కాదుగదా। కాబట్టి హృదయస్థమగు పరమాత్మయు జీవునివలెనే సుఖదుఃఖము లనుభవింపవలసివచ్చు నందురేని - అట్లు కాదు. జీవ పరమాత్మ లొకే స్థానమున నుండువారైనను వారిలో భేద మున్నది. జీవాత్మకు కర్మసంబంధ మున్నది. పరమాత్మకు కర్మసంబంధము లేదు. భోగప్రసక్తి కర్మనిబంధనము - కర్మనిమిత్తకము - కర్మానుబంధము. అది కర్మప్రయుక్తము, స్థానప్రయుక్తము కాదు. శరీరసంబంధముగల జీవాత్మకే కర్మసంబంధ ముండును. పరమాత్మకు శరీరముతో సంబంధము లేనందున నతని కీ కర్మానుబంధ ముండదు. శరీరముతోనే జీవుడు శుక్లాశుక్ల - పుణ్యాపుణ్య - సుకృత దుష్కృత కర్మము లాచరించును. ధర్మాధర్మము లనెడి వాసనలను సంచయ మొనర్చును. అందుమూలమున నా యా సమయములందును సుఖదుఃఖము లనెడి ఫలముల ననుభవించును. జీవునకు శరీరముతో సంబంధము కలుగుటకు మూల మవిద్యయే యనుట సర్వతంత్ర సిద్ధాంతము. పరమాత్మ కవిద్యాసంబంధము లేదు. కావుననే శరీరసంబంధమును లేదు. కాబట్టి తన్మూలకమగు కర్మానుబంధముకాని,

తత్ఫలరూప సుఖదుఃఖానుభూతి కాని పరమాత్మను సంభవింపవనుట నిశ్చయము. విద్యాస్వభావముగల పరమాత్మను అవిద్యాసంబంధ మేర్పడ దని వేరుగ చెప్పనేల? వాస్తవమున నిట్లు భిన్నరూపులగు జీవేశ్వరులలో నొకరి కర్మఫలము మరియొకరికి సుఖదుఃఖములను గలిగించుననుట యతి ప్రసంగ మగును.

పరమాత్మ ఆనందస్వరూపుడు, సర్వజ్ఞుడు, సర్వశక్తిమంతుడు, జగత్కారణము. జీవు డట్లు కాదు. ఈశ్వరుడు క్లేశకర్మ విపాకాశయము లచే పరామృష్టుడు కాడు. జీవుడు తత్పరామృష్టుడు. పరమాత్మ పరమ మహత్పరిమాణము గలవాడు. జీవు డణుపరిమాణము గలవాడు. ఇంతటి భేదము (విశేషము) జీవపరమాత్మలలో నుండగా నొకే స్థానమున నున్నంతమాత్రమున జీవునకువలె పరమాత్మునకును సుఖదుఃఖములు గలుగు ననుట యుక్తము కాదు. ఋగ్వేదమునందలి యొక మంత్ర మీ విషయము నిట్లు స్పష్టము చేయుచున్నది.

"ద్వా సుపర్ణా సయుజా సఖాయా సమానం వృక్షం పరిషస్వజాతే,
తయో రన్యః పిప్పలం స్వా ద్వత్త్యనశ్న న్నన్యో అభిచాకశీతి"

ఋ. ౨-౩-౧౮-౨౦.

"రెండు పక్షులొక వృక్షము నాశ్రయించియున్నవి. అయ్యవి, సయుజౌ=సంబంధము గలిగియున్నవి. సఖాయా = సమాన స్వరూపము గలవి. ఆ రెంటిలో నొకటి, స్వాదు పిప్పలమత్తి=రుచిగల ఫలమును దిను చున్నది. మరియొకటి, సాక్షిగా నెల్లయెడల ప్రకాశించుచున్నది."

ఈ మంత్రమున జీవేశ్వరులు రెండు పక్షులుగాను, ప్రకృతి వృక్షముగాను వర్ణింపబడినవి. సుపర్ణః = మంచిరెక్క, జీవేశ్వరులకు క్రియాశక్తి యొకరెక్కగాను, జ్ఞానశక్తి మరియొక రెక్కగాను, వర్ణింప బడినవి. క్రియాశక్తి, జ్ఞానశక్తియు నను నీ రెండుపక్షములు లేకున్న

పక్షవిహీనపక్షి యాకాశమున నెగురజాలనట్లు జీవేశ్వరులు జగన్నిర్మాణాది కార్యములు నిర్వహింపజాలరని సూచింపబడినది. ద్వా=ద్వౌ=రెండు, అని సంఖ్యాబోధకశబ్దము మంత్రమున ప్రయోగింపబడుటవలన జీవేశ్వరులొక్కటే యను నద్వైత (ఏకాత్మ) వాదము వేదవిరుద్ధ మనియు దెలియుచున్నది. సయుజా=సయుజౌ=స్వసత్తా సమాన సత్తాక సంబంధౌ=పరస్పర మొకరియునికికి సమానమగు మరియొకరియునికి గలిగియుండుట యను సంబంధముగలవారు. అనగా నీశ్వరుని యునికి యెట్టిదియో, జీవుని యునికియు నట్టిదియే యని యర్థము. జీవేశ్వరులు సదాతనులు - సనాతనులు. వారికిగల సంబంధమును సనాతనమే. అయ్యది యాగంతుకము కాదు - మధ్యలో వచ్చినది కాదు. పరమాత్మ నియామకుడు. జీవుడు నియమ్యుడు. కావున జీవేశ్వరులకు నియమ్య నియామకభావ సంబంధము గలదనియు గుర్తింపవలయును. జీవేశ్వరులు, సఖాయా=సఖాయౌ=సమానఖ్యానము (లక్షణము) గలవి. జీవేశ్వరులకు చైతన్యము - జ్ఞానము - లక్షణము. పరమాత్మ చేతనమైనట్లు జీవాత్మయు చేతనమే యని భావము. కావున జీవేశ్వరులలో సామ్యము బొత్తిగా లేదనుట తగదు. ఇట్లు జీవేశ్వరులకు కొన్ని విషయములందు సామ్య మున్నను నానందమున సామ్యము లేదు.

సమానం వృక్షం = ఒకేవృక్షమును, (వృశ్చ్యతే ఇతివృక్షః) వ్రయ్యలు చేయనగును, కావున వృక్షమనబడుచున్నది. వ్యష్టివిషయమున దేహమే వృక్షరూపమున నిట జెప్పబడిన ట్లెంచవలయును. అందునను హృదయము మాత్రమే గ్రహించుట యుక్తము. సమష్టి విషయమున ప్రకృతియే వృక్షముగా గ్రహింపనగును. వృక్షము ఛేదింపబడును. అట్లే హృదయ ప్రకృతులను ఛేదింపనగును. కావున నవి వృక్షపదముచే జెప్పబడినవని భావము.

పరిషస్వజాతే=పరిష్వజతః=ఆశ్రయించియున్నవి. భోక్తగా జీవ

డును, నియంతగా పరమేశ్వరుడును హృదయమును, ప్రకృతిని నాశ్ర యించి యున్నట్లు గుర్తింపవలయును.

స్వాదు పిప్పలం అత్తి = జీవుడు శుభాశుభ కర్మఫలముల ననుభ వించుచున్నాడు. అన్యః=ఈశ్వరుడు, అనశ్నన్ అభిచాకశీతి = సుఖదుఃఖ ముల ననుభవింపక యంతటను నిరీక్షించుచున్నాడు. అని స్పష్టముగా మంత్రమున నర్ణింపబడినది. కాబట్టి జగత్పతియగు పరమేశ్వరుడు హృదయమున నున్నంతమాత్రమున జీవునివలె సుఖదుఃఖములకు లోనగు చున్నాడనుట సిద్ధింపదు. కాగా ఛాందోగ్యోపనిషత్తునందుగల శాండిల్య విద్యయందు (సర్వం ఖల్విదం బ్రహ్మ తజ్జలానితి శాంత ముపాసీత) గ్రహింపబడిన బ్రహ్మపదము పరమేశ్వరవాచకమేకాని జీవవాచకము కాదు. (౮)

బ్రహ్మమునందు భోక్తృత్వ ధర్మములేదని నిరూపించి నియం తృత్వ ధర్మముకలదని చెప్ప మహర్షి యధికరణాంతరమును బ్రారంభించు చున్నాడు.

## అత్తా చరాచర గ్రహణాత్        ౧-౨-౯

బ్రహ్మము, చరాచర గ్రహణాత్ = స్థావరజంగమాత్మకమగు నీ జగత్తునంతటిని భక్షణయోగ్యముగ గ్రహించుటవలన, అత్తా=భక్షకుడు.

కఠోపనిషత్తు నందు, 'యస్య బ్రహ్మ చ క్షత్రం చోభే భవత ఓదనం, మృత్యుర్యస్యోపసేచనం క ఇత్థావేద యత్ర సః' ౨-౨౫.

'ఎవనికి బ్రహ్మ క్షత్రాది సర్వప్రపంచము నోదన స్థానీయమో (అన్నమో), సర్వభంజకమగు మృత్యు వెవ్వనికి ఘృతస్థానీయమో (వ్యంజనమో) అట్టి పరమాత్మను దుశ్చరితుడెవడు తెలిసికొనగలడు?' ఆ పరమాత్మ యెటనున్నదియు నెవ్వడును తెలిసికొనజాలడని భావము,

ఉపర్యుక్తవాక్యమున జెప్పబడిన భక్షకుడు (అత్తా) జీవాత్మయా? లేక పరమాత్మయా? యని సందేహము. వాక్యమునందు జీవాత్మనుకాని, పరమాత్మనుకాని దెలుపుటకుదగు విశేషపదమేదియు గనబడదు. కావున సందేహము జనించుట సహజము. ఈ యధికరణమున జీవాత్మయే భక్షకుడనుట పూర్వపక్షము. కాదు, పరమాత్మయే యనుట సిద్ధాంతము.

అత్తృత్వమన భోక్తృత్వము. కాబట్టి అత్తా = భోక్తయనిభావము. భోక్తృత్వము జీవునియందే గలదు.

'తయో రన్యః పిప్పలం స్వాద్వత్తి' 'జీవేశ్వరులలో నొకడగు జీవుడు కర్మఫలమును భుజించుచున్నాడు' అని ఋగ్వేదమున వర్ణింపబడి నట్లు పూర్వాధికరణమున ప్రతిపాదింపబడినది. కావున నీ యధికరణమునందును జీవాత్మనే భోక్తగా గ్రహింపనగునని ప్రాప్తింపగా, నయ్యది యుక్తము కాదు. పరమాత్మయే యిట భోక్తయని సమాధానము.

జీవాత్మయం దత్తృత్వము (భోక్తృత్వము) సంభవమే కాని సర్వాత్తృత్వము సంభవముకాదు. మరియు, అత్తృత్వ మిట భోక్తృత్వ మగునెడల జీవాత్మయే గ్రహింపనగును. కాని యత్తృత్వమిట భోక్తృత్వముకాక భక్షితృత్వముగా దోచుచున్నది. 'అద భక్షణే' అను ధాత్వర్థమును బట్టి, అత్తా=భక్షించువాడు, అని యర్థము సెప్పుట యుక్తము. బ్రహ్మక్షత్రాది సమస్తప్రపంచమును భక్షించుయోగ్యత జీవాత్మ కెట్లును సంభవింపదు. సర్వప్రపంచ భక్షణమన సర్వసంహారమని భావము. అది పరమాత్మయందే వర్తించును. పరమాత్మయే ప్రళయవేళలందు సర్వప్రపంచమును దనయందు లీనము చేసికొని యుపసంహరింపగలదు. సృష్టి స్థితి లయములకు కారణము బ్రహ్మమే యనుట శ్రుతిస్మృతులందు ప్రసిద్ధమే. కావున కఠోపనిషత్తునందు వర్ణింపబడిన 'అత్తా' పదము బ్రహ్మబోధకమే కాని, జీవబోధకము కాదు. (౯)

## ప్రకరణాచ్చ  ౧-౨-౧౦

చ=మరియు, ప్రకరణాత్ = ప్రకరణమువలనను, 'అత్తా' పదము బ్రహ్మవాచకమే యని యంగీకరింపవలెను.

ప్రకరణమును బట్టియు పదమున కర్థము గ్రహింపనగును. కఠోపనిషత్తునం దీప్రకరణము బ్రహ్మకు సంబంధించినదే కాని, జీవాత్మకు చెందినది కాదు. అధ్యాత్మయోగము ద్వారమున నాత్మ సాక్షాత్కారము చేసికొనిన యోగికి సాంసారికములగు హర్షశోకములు దొలగునని చెప్పి, యముడు నాచికేతునకు బ్రహ్మప్రాప్తివలన శాశ్వతానందము లభింపగలదనియు, నయ్యది నీయట్టి బుద్ధిమంతునకు - విశిష్టాధికారికి సులభసాధ్యమనియు నుపదేశించియున్నాడు. అనంతరము 'ఆ బ్రహ్మ మెట్టిది?' 'దానిని ప్రాప్తించుటకు సాధనము లెయ్యవి?' యని తెలిసికొనగోరి నచికేతుడు యమాచార్యుని బ్రశ్నించును.

"అన్యత్ర ధర్మా దన్య త్రాధర్మాత్
అన్య త్రాస్మాత్ కృతాకృతాత్
అన్యత్ర భూతాచ్చ భవ్యాచ్చ
య త్తత్ పశ్యసి త ద్వద" కఠ. ౨-౧౪

'ధర్మా ధర్మములకు, కృతాకృతములకు, భూతభవిష్యత్తులకు పరమునసుండు దానిని దెలుపు' మను నీ ప్రశ్నమునకు దగిన సమాధానము చెప్పుచు యముడు బ్రహ్మము నిట్లు కీర్తించును.

'సర్వే వేదా యత్పద మామనన్తి' కఠ. ౨-౧౫. 'వేదములన్నియు నేపదమును జెప్పునో యదియే బ్రహ్మమని ప్రారంభించి యధ్యాయాంతమువరకు బ్రహ్మమునే యుపదేశించును. ఈ ప్రకరణమునందే 'అత్తా' పద వ్యవహారయోగ్యమగు నత్తృత్వధర్మము గ్రహింపబడుటచే నయ్యది బ్రహ్మపరమనుటయే సుసంగతమగును. (౧౦)

## తృతీయాధికరణము

### గుహాం ప్రవిష్టా వాత్మానౌహి తద్దర్శదాత్ ౧-౨-౧౧

తద్దర్శనాత్=జీవేశ్వరులు (హృదయగుహ నాశ్రయించియున్న ట్లుపనిషత్తులందు) చూడబడుటవలన, గుహాం ప్రవిష్టౌ = గుహయందు ప్రవేశించియున్నట్లు వర్ణింపబడిన యిరువురును, ఆత్మానౌ హి=జీవాత్మ పరమాత్మలే.

'ఋతం పిబంతౌ సుకృతస్య లోకే
గుహాం ప్రవిష్టౌ పరమే పరార్ధే
ఛాయాతపౌ బ్రహ్మవిదో,వదంతి
పంచాగ్నయో యే చ త్రిణాచికేతాః' కఠ. ౩-౧

'సుకృతస్యలోకే = కర్మలోకమున శరీరమునందు, గుహాం = హృదయగుహలో, పరమే=ప్రకృష్టమైన, పరార్ధే = హృదయాకాశము నందు, ప్రవిష్టౌ=ప్రవేశించి, ఋతం పిబంతౌ = కర్మఫలము ననుభవించు చున్నట్టి, తౌ = వారిరువురు, ఛాయాతపౌ = నీడ, ఎండ యను రెంటికి సమానులు అని, బ్రహ్మవిదః=సంన్యాసులు, వానప్రస్థులు, త్రిణాచికేతాః= గార్హపత్యము, దక్షిణాగ్ని, ఆహవనీయము నను మూడగ్నులుగల గృహ స్థులును, వదంతి=చెప్పుచున్నారు.'

కఠోపనిషత్తులోని యీ వాక్యమునందు శరీరములో హృదయా కాశమునందుండి కర్మఫలమును బొందుచున్నట్లు వర్ణింపబడిన రెండు పదార్థములు నెయ్యవి? బుద్ధియు, జీవుడునా? లేక జీవాత్మ పరమాత్మలా? యని సందేహము. ఈ ప్రకరణమునందు జీవాత్మ పరమాత్మలకు సంబం ధించిన ప్రశ్నోత్తరము లుండుటవలన నట్టి సందేహ ముదయించుట కవ కాశమున్నది. ప్రథమమున,

'యేయం ప్రేతే విచికిత్సా మనుష్యే అస్తీత్యేకే నాయమస్తీతి చైకే,
ఏతద్విద్యా మనుశిష్ట స్త్వయాహం వరాణా మేష వర స్తృతీయః'
కఠ. ౧-౨౦

'మనుష్యుడు మరణించిన తదుపరి యుండునని కొందఱు, ఉండ దని మరికొందఱు చెప్పుదురు. అందువలన నాకీ విషయమును దెలుపుడు. వరములలో నియ్యది మూడవది' అని నాచికేతుడు జీవాత్మనుగురించి ప్రశ్నించుచు, అనంతరమున,

'అన్యత్రధర్మా దన్యత్రాధర్మాత్....' 'ధర్మాధర్మములకు పర మునసుండు పరమాత్మను దెలుపు'మని మరల ప్రశ్నించును. కాబట్టి హృదయాకాశమునసుండు రెండాత్మలు బుద్ధి జీవులా? లేక జీవాత్మ పర మాత్మలా? యని సందేహమొదవుట యుక్తమే. ఇట బుద్ధియు, జీవుడు ననుట పూర్వపక్షము. కాదు, జీవాత్మ పర మాత్మలే యనుట సిద్ధాంతము.

ఉపనిషద్వాక్యమునందలి సుకృతస్య లోకమను పదమునకు శరీర మని యర్థము గ్రహించుటచేత నియ్యది కర్మాధికారము - కర్మవిషయకము, అని బోధపడుచున్నది. సుకృత దుష్కృత కర్మల నాచరించునది జీవుడే కాని పరమాత్మకాదు.

'యథాకారీ, యథాచారీ, తథా భవతి;
సాధుకారీ సాధుర్భవతి, పాపకారీ పాపోభవతి' బృ. ౪-౪-౫

'ఎట్లు చేయునో యెట్లాచరించునో యట్లగును. సాధుకారి సాధు వగును. పాపకారి పాపియగును.' అని మరియొక ఉపనిషద్వాక్యమునందు జెప్పబడినది. ఇట్టి కర్మాచరణము జీవునకే తగును. కాని, బ్రహ్మమునకు తగదు.

మరియును హృదయగుహా ప్రవేశము విశేషణముగా నుపనిషత్తు నందు వర్ణింపబడియున్నందున నిట జీవాత్మయు, బుద్ధియును గ్రహించు

టమే యుక్తమని తోచుచున్నది. సర్వగతమగు బ్రహ్మము పరిచ్ఛిన్నమగు హృదయమున ప్రవేశించుననుటయు యుక్తము కానేరదు. ఇంతేకాక ఛాయాతపములను బోల్చిచెప్పుటవలనను, బుద్ధిని, జీవాత్మను గ్రహించుట యుక్తమగును. బుద్ధి జడమగుటచే ఛాయతోను, జీవాత్మ చేతనమగుటచే నాతపముతోను బోల్చి చెప్పబడినవి. జీవాత్మ పరమాత్మలు రెండును చేతనములగుటవలన వానిలో నొకదానిని ఛాయతోను, మరియొకదానిని నాతపముతోను బోల్చుట యుక్తముకాదు. కాబట్టి బుద్ధి జీవాత్మలనే యిట గ్రహింపనగునని ప్రాప్తింపగా - సమాధానము :

ఉపనిషత్తులలో పలుతావులందు జీవాత్మ పరమాత్మలే హృదయాకాశమున బ్రవిష్టములై యున్నట్లు వర్ణింపబడినందున నిక్కడను జీవాత్మ పరమాత్మలే గ్రహింపనగును. కాని, బుద్ధియు, జీవాత్మయు ననుట యుక్తము కాదు. సుకృతలోకమని చెప్పినందున కర్మాధికారము జీవునకే కలదనియు, నందువలన జీవాత్మమే హృదయమున ప్రవేశించుననుట యుక్తమనియు, పరమాత్మ సర్వగతము కాబట్టి పరిమిత హృదయమున ప్రవేశించుట అయుక్తమనియు నుడువుట యుక్తము కాదు. పరమాత్మ సర్వగత మగుటంబట్టియే హృదయగతమగుట కెట్టి యాటంకము నుండదు. జీవాత్మ పరమాత్మలు రెండును హృదయమున నుండునట్లు స్వయముగా నుపనిషద్వాక్యమే చెప్పుచున్నది.

'తం దుర్దర్శం గూఢ మనుప్రవిష్టం గుహాహితం గహ్వరేష్ఠం పురాణమ్' కఠ. ౨-౧౨. ఇందు జీవాత్మ, గుహాహితం = హృదయస్థిత మని చెప్పబడినది. ఇట్లే వాక్యాంతరమున,

'స వా ఏష ఆత్మా హృది' ఛాం. ౮-౩-౩ 'ఆ పరమాత్మ హృదయమున నున్నది' అనియు స్పష్టముగా వర్ణింపబడినది.

జీవాత్మ చేతనమైనను నవిద్యతో గూడియుండును. కాబట్టి ఛాయ

తోను, పరమాత్మ యవిద్యాయుక్తము కానందున ఆతపముతోను పోల్చి చెప్పుట సంగతమే. కాబట్టి యీ ప్రకరణమునందు జీవాత్మ పరమాత్మలు గ్రహింపబడుటయే యుక్తియుక్తమని భావము. (౧౧)

## విశేషణాచ్చ ౧-౨-౧౨

ఆః ప్రకరణమునందే తరువాతి వాక్యములలో జీవాత్మ పరమాత్మలు విభజించి నిరూపింపబడినందువలనను, నయ్యవియే గ్రహింపవగియున్నవని యీ సూత్ర తాత్పర్యము.

ఉపర్యుక్త ప్రకరణమునందు ప్రథమమున జీవేశ్వరులను కలిపి వర్ణించి యనంతరమున జ్ఞానసౌకర్యముకొఱకు నా జీవేశ్వరులనే విశేషముగ వర్ణించుట చూడనగును.

యః సేతు రీజానానా మక్షరం బ్రహ్మ యత్పరమ్
అభయం,తితీర్షతాం పారం నాచికేతగ్ం శకేమహి' కఠ. ౩-౨.

'యజ్ఞశీలురకు సేతువువంటివాడు, నాశరహితుడు, భవసాగరము దాటదలచువారికి నభయుడు, జ్ఞానస్వరూపుడు నగు నా పరమాత్మను దెలియ సమర్థుల మగుదుముగాక' అని పరమాత్మయు,

'ఆత్మేంద్రియ మనోయుక్తం భో క్తే త్యాహు ర్మనీషిణః'
కఠ. ౩-౪.

'ఇంద్రియములతోను, మనస్సుతోను గూడినది యాత్మ యని మనీషు లందురు.' అని జీవాత్మయు వర్ణింపబడినది. అందువలన (గుహాం ప్రవిష్టౌ) 'హృదయాకాశమున ప్రవిష్టులు' అను వాక్యము ద్వారమున బుద్ధియు జీవుడు నను పదార్థములు ముందు వర్ణింపబడియున్న పక్షమున ననంతరవాక్యములందు జీవాత్మ పరమాత్మ లెట్లు విశేషించి నిరూపింపబడును ? ఇంతేకాక ప్రకరణాంతరమున,

'ఉత్తిష్ఠత జాగ్రత ప్రాప్య వరా న్నిబోధత, క్షురస్య ధారా నిశితా దురత్యయా, దుర్గం పథ స్తత్ కవయో వదంతి' కఠ. ౩ ౧౪.

'లెమ్ము; జాగ్రతపడుము; శ్రేష్ఠులనుజేరి తెలిసికొనుము. కవులు - విద్వాంసులు ఖడ్గధారవలె నది నిశితము, దుర్లంఘ్యము, దుర్గమపథము నని చెప్పుదురు.'

'అశబ్ద మస్పర్శ మరూప మవ్యయం
తథారసం నిత్య మగంధవచ్చ యత్
అనా ద్యనంతం మహతః పరం ధ్రువమ్
నిచాయ్య తం మృత్యుముఖా త్ప్రముచ్యతే' కఠ. ౩-౧౫

'శబ్దస్పర్శరూపరస గంధములు లేక యవ్యయమై, నిత్యమై, యనా ద్యనంతమునై, మహత్తుకంటె పరమై, ధ్రువమై యుండు పరమాత్మను సాక్షాత్కారము చేసికొని, మృత్యుముఖమునుండి తప్పుకొనును' అని చేసిన విషయోపసంహారము (ప్రకరణ పూర్తి) కూడ హృదయప్రవిష్టులు జీవాత్మ పరమాత్మలని యంగీకరించిననాడే సంగత మగును.

మరియు నీ యుపసంహారమున సాంసారికదుఃఖములనుండి మోక్ష మపేక్షించువారికి తెలిసికొనదగినది పరమాత్మయే యనియు, నా పర మాత్మను దెలిసికొనవలసినవాడు జీవాత్మ యనియు స్పష్టముగా వర్ణింప బడినది. ఉపక్రమము (ప్రారంభము), ఉపసంహారము (సమాప్తి) అను నీ రెంటికిని నేకవాక్యత యుండవలయు ననుట వాక్యవిదులకు న్యాయ్యము. ప్రారంభమున నొకటి నుడివి యంతమున మరియొకటి నాలపించి ముగిం చుట యుక్తియుక్తము కాదుగదా। కాబట్టి యుపక్రమోపసంహారముల నవలోకించినమీదట నీ ప్రకరణమునందు వర్ణింపబడిన గుహాప్రవిష్టులు జీవాత్మ పరమాత్మలే కాని, యన్యులు కారని నిర్ణీతమగుచున్నది. (౧-౨)

## చతుర్థాధికరణము

హృదయాంతరమున పరమాత్మ యున్నదని నిర్ణయింపబడినది. ప్రస్తుతమున నక్ష్యంతరమున నున్నదియు పరబ్రహ్మమే యని నిర్ణయించుటకుగాను మహర్షి మరియొక యధికరణము నారంభించుచున్నాడు.

### అంతర ఉపపత్తేః                    ౧-౨-౧౩

ఉపపత్తేః=(ప్రకరణమునందు వర్ణింపబడిన అమృతత్వము మున్నగు గుణములు) బ్రహ్మమునందే యుపపన్నము లగును, కావున, అంతరః=(ఛాందోగ్యమున పఠింపబడిన) అక్ష్యంతరపురుషుడు, పరబ్రహ్మ - పరమాత్మ యనియే గ్రహింపవలయును.

> 'య ఏషో౽క్షిణి పురుషో దృశ్యతే ఏష
> త ఆత్మేతి హోవాచ, ఏత దమృత మభయ
> మేతత్ బ్రహ్మేతి, తద్ య ద్యప్యస్మిన్ సర్పిర్
> వోదకం వా సించతి వర్త్మనీ ఏవ గచ్ఛతి'    ఛాం. ౪-౧౫-౧.

ఈ యుపనిషద్వాక్యమునందు 'అక్షియందు కనబడు పురుషుని ఆత్మ' యని వర్ణింపబడినది. అక్షి (కన్ను)లో గనబడు నీ పురుషుడు జీవాత్మయా ? లేక పరమాత్మయా ? అని సందేహము. పురుషశబ్దము జీవాత్మకును, పరమాత్మకును రెంటికిని వాడబడును. కాబట్టి సంశయము గలుగుట యుచితమే. పురుషశబ్దము జీవాత్మవాచక మనుట కుదాహరణము :

> 'ఏష హి ద్రష్టా స్ప్రష్టా శ్రోతా ఘ్రాతా
> రసయితా మన్తా బోద్ధా కర్తా విజ్ఞానాత్మా పురుషః'
>                                    ప్రశ్న. ౪-౯.

'చూచువాడు, స్పృశించువాడు, వినువాడు, ఆఘ్రాణించువాడు, రుచిచూచువాడు, మననము చేయువాడు, తెలిసికొనువాడు, చేయువాడు,

విజ్ఞానాత్మయు నగు నితడు పురుషుడు' అని ప్రశ్నోపనిషత్తునందు పురుష శబ్దముచే జీవాత్మయే పేర్కొనబడినది.

'సహస్ర శీర్షా పురుషః' ఋ. ౮-౪-౧౭-౧.

'దివ్యో హ్యమూర్తః పురుషః' ముం. ౨-౧-౨.

ఈ వాక్యములందుగల పురుషపదము పరమాత్మవాచకమై యున్నది. అందువలన ఛాందోగ్యమున వర్ణింపబడిన నక్ష్యంతఃపురుషుడు జీవాత్మయా? లేక పరమాత్మయా? యని సందేహము గలుగుట యుక్తమే. ఇట పురుషశబ్దము జీవాత్మవాచకమే యనుట పూర్వపక్షము. కాదు, పరమాత్మవాచకమే యనుట సిద్ధాంతము.

జీవాత్మ ప్రసిద్ధమగుటచేత పురుషపదము జీవవాచక మనుట యుక్తమగును. మఱియు నుపనిషద్ వాక్యమునందు (పురుషో అక్షిణి దృశ్యతే) దర్శనార్థకమగు 'దృశ్యతే' అను క్రియాపదము ప్రయోగింపబడుటవలనను జీవాత్మను గ్రహించుటయే సమంజస మగును. దర్శనమన నింద్రియముచే గ్రహింపబడుట యగును. పరమాత్మ యింద్రియగ్రాహ్యము కాదు. కావున నిట జీవాత్మయే గ్రహింపనగునన - సమాధానము :

అక్ష్యంతరపురుషుడు పరమాత్మయే యగును. కాని, జీవాత్మ కాదు. ఉపనిషద్వాక్యమునందు వర్ణింపబడిన యమృతత్వము, నభయత్వము నను ధర్మములు పరమాత్మయందే వర్తించును. జీవాత్మలో నాధర్మము లుండ నేరవు. అనంతర - ఉపనిషద్వాక్యములందును,

'ఏతం సంయద్వామ ఇత్యాచక్షతే,
ఏతం హి సర్వాణి వామా న్యభిసంయంతి' ఛాం. ౪-౧౫-౨

'ఏష ఉ ఏవ వామనీః,
ఏష హి సర్వాణి వామాని నయతి' ఛాం. ౪-౧౫-౩

'ఏష ఉ ఏవ భామనీః,

ఏష హి సర్వేషు లోకేషు భాతి' ఛాం. ४-౧౫-४

'ఇతనినే సంయద్వామ మందురు. కర్మఫలము లన్నియు నుదయించుట కితడే కారణము.'

'ఇతడే వామని. కర్మఫలముల నన్నింటిని ఆ యా జీవులకు చేర్చును.'

'ఇతడే భామని - ప్రకాశించువాడు. ఇతడే సర్వలోకములందును బ్రకాశించును.'

అని సంయద్వామత్వము, వామనీత్వము, భామనీత్వము మున్నగు ధర్మములు పురుషునం దున్నట్లు వర్ణింపబడినవి. అమృతము నభయత్వము జీవాత్మయం దేదో యొకవిధమున వర్తించునని యంగీకరించుట కవకాశమున్నను, సంయద్వామత్వాదులు మాత్రము జీవాత్మయం దెట్లును సంభవింపనేరవు. అయ్యవి పరమాత్ముని ధర్మములే. సంయద్వామత్వ మన సర్వకర్మఫలము లుదయించుటకు హేతువని వ్రాసియుంటిమి. కర్మఫలోదయమునకు హేతువు పరమాత్మ యగును, కాని జీవాత్మ కాదు. ఇట్లే వామనీత్వ మన ప్రాణు లొనర్చు కర్మలకు తగినఫలములు వాని కందజేయుట. ఇయ్యదియును పరమాత్ముని కార్యమే కాని, జీవాత్మునిది కాదు. మఱియును భామనీత్వ మన స్వయముగ భాసించుటయేకాక యితరములను భాసింపజేయుట యని యర్థము. ఈ ధర్మమును పరమాత్ముని యందే వర్తించును. ముండకోపనిషత్తునందు నిట్లే చెప్పబడినది.

"త మేవ భాంత మనుభాతి సర్వం తస్య భాసా సర్వ మిదం విభాతి" ముం. ౨-౨-౧౦

'ప్రకాశించు నా పరమాత్మ ననుసరించి సర్వమును బ్రకాశించును. అతని ప్రకాశముచేతనే యీ సర్వము ప్రకాశించుచున్నది.'

కాబట్టి యిట పురుష శబ్దముచే పరమాత్మ గ్రహింపబడుటయే యుక్తమగును. లేకున్న సంయద్వామత్వాది ధర్మముల వర్ణన మసంగత మగును.

ప్రసిద్ధమగుటచే పురుషపదము జీవవాచకమని పూర్వపక్షమునజెప్పిన హేతువు సరియైనది కాదు. సర్వభూతాంతరాత్మయై, జగజ్జన్మాదులకు కారణమైన పరమాత్మకంటె జీవాత్మ కెక్కుడు ప్రసిద్ధి యెక్కడిది? కావున ప్రసిద్ధిచేతను పరమాత్మయే గ్రాహ్యమనుట యుక్తము.

దర్శన శబ్దప్రయోగము జీవాత్మ గ్రాహక మనుటయు యుక్తము కాదు. పరమాత్మ యింద్రియ గ్రాహ్యము కానిమాట వాస్తవమే, కాని, యీ స్థలమున దర్శనమన ప్రత్యేకముగ నొక యింద్రియముచే గ్రహింప బడుట కాదు. సామాన్యజ్ఞానమే దర్శన పదమున కర్థమని గ్రహింపవలెను. పరమాత్మ జ్ఞానగమ్యము - జ్ఞానవిషయము - అనుటలో నెట్టి దోషమును లేదు. అందువలననే,

"యద్భూతయోనిం పరిపశ్యంతి ధీరాః" ముం. ౧-౧-౬

'భూతకారణమైన బ్రహ్మమును ధీరులు చూచుచున్నారు. (పరి పశ్యంతి) దర్శించుచున్నా' రని వర్ణింపబడినది. కాబట్టి అత్యంతఃపురుష పదము పరమాత్మ బోధకమే కాని జీవాత్మబోధక మెన్నడును కాదు. (౧౩)

ఇందులకు మరియొక హేతువు:

## స్థానాది వ్యపదేశాచ్చ ౧-౨-౧౪

స్థానాది వ్యపదేశాత్ + చ=ఉపాసింపదగిన స్థానము, దాని ఫలము మున్నగువాని యుపదేశమువలనను పురుషపద మీ ప్రకరణమున బ్రహ్మ వాచకమే యని సూత్రాభిప్రాయము.

గార్హపత్యాద్యగ్నులు ప్రత్యేకముగ నుపదేశముకొఱకు ప్రవర్తిం

చుచు ప్రాణరూప మగు పరబ్రహ్మ నుపదేశింప మొదలిడి యా పరబ్రహ్మ కాదిత్యుడు, చంద్రుడు, విద్యుత్తు నను నవి మూడుస్థానములుగా చెప్పి యున్నవి. అనంతరమున 'నే బ్రహ్మపదార్థము తమయంతఃస్థానమున నుండుటచే సూర్యాదులు చంద్రాద్యుపగ్రహములు భాసించుచున్నవో, ఎవని ప్రకాశముచే సూర్యాదులును తామును (గార్హపత్యాగ్నులు) భాసించు చున్నవో యా బ్రహ్మమే నీచే నుపాసింపబడదగినది' అని యుపాసన మును, దాని ఫలమును నుపదేశించుచున్నవి.

'య ఏష ఆదిత్యే పురుషో దృశ్యతే సోఽహ మస్మి' ఛాం. ౪—౧౧—౧

'స య ఏత మేవం విద్వా నుపాస్తే అపహతే పాపకృత్యాం, లోకీ భవతి, సర్వ మాయు రేతి, జ్యోగ్ జీవతి నా స్యావరపురుషాః క్షీయంతే.'

ఛాం. ౪—౧౧—౨

'ఈ యాదిత్యునందు దృశ్యమాన మగు పురుషుడను నేనే.'

'ఏ విద్వాంసు డితని నిట్లు తెలిసికొని యుపాసించునో వాడు పాప కర్మను నశింపజేసికొనును. బ్రహ్మలోకాధికారి యగును. పూర్ణాయువును బొందును. (జ్యోక్) వ్యాధిగ్రస్తుడుకాక ప్రసిద్ధుడయి జీవించును. అట్టి యుపాసకుని (అవరపురుషాః) శిష్యప్రశిష్యులును, పుత్రపౌత్రాదులును క్షయమును బొందరు.' అను నిట్టి యుపదేశము పరబ్రహ్మ పరమాత్మకు జెందినదికాక జీవాత్మకు జెందిన దెట్లు కాగలదు? అణురూపు డగు జీవుడు ఒకే సమయమున చంద్ర సూర్య విద్యుత్తులలో నె ట్లుండగలడు? చంద్ర సూర్యాదుల నెట్లు ప్రకాశింపజేయగలడు? ఇంతేకాక జీవాత్మ నుపాసించు వారికి పైన వర్ణించిన ఫలము కూడ లభింపనేరదు. ఉపనిషత్తు స్వయ ముగ బ్రహ్మోపాసనకు ఫల మిట్లు వర్ణించుచున్నది:

'యథా పుష్కరపలాశ ఆపో న శ్లిష్యన్తే
ఏవ మేవంవిది పాపం కర్మ న శ్లిష్యతే' ఛాం. ౪—౧౪—౩

'కమలపత్రములు జలము నంటనియట్లు పాపకర్మ బ్రహ్మవిదు నంటదు.'

'నాస్యా బ్రహ్మవిత్ కులే భవతి' ముం. ౩-౨-౯. 'ఇతని కులమునందు బ్రహ్మము నెరుగనివాడు జనింపడు.'

బ్రహ్మము వ్యాపక మగుటచే నొకే సమయమున నాదిత్యునందు, చంద్రునందు, విద్యుత్తునందును నుండుట విరుద్ధమును కాదు. కాబట్టి గార్హపత్యాద్యగ్ను లీ యుపదేశమునందు బ్రహ్మమునే యుపాస్యముగ నాదేశించుచున్నవి. అట్టి బ్రహ్మమే సూర్యునందును, నక్షియందునుగల యంతఃపురుషుడుగా నాచార్యు డుపదేశించుచున్నాడు. అక్ష్యాదులం దుపాస్యముగా జెప్పబడిన పురుషపదార్థము జీవాత్మ కాదు. జీవాత్మ నుపాసించి సర్వపాపములనుండి విముక్తుడగుట కాని, జీవాత్మ యొకేసమయమున నక్షిసూర్యవిద్యుదా ద్యనేకస్థలములం దుండుట కాని సంభవము కాదు. కాబట్టి బ్రహ్మమే యంతఃపురుషుడని గ్రహించుట యెల్లవిధముల సముచిత మగును. (౧౪)

## సుఖ విశిష్టాభిధానాదేవ చ ౧-౨-౧౫

(సుఖము = ఆనందము, విశిష్టము = అభేదము)

ఈ ప్రకరణమున ప్రారంభమునందు జెప్పబడిన ఆనంద స్వరూపము బ్రహ్మమే, యక్షియందు జెప్పబడుటవలనను నక్ష్యంతర పురుషుడు బ్రహ్మమనుటయే యుక్త మని సూత్రాభిప్రాయము.

వాక్యారంభమున గార్హపత్యాద్యగ్నులన్నియు నేకముగ నుపకోసలునకు -

'ప్రాణో బ్రహ్మ, కం బ్రహ్మ, ఖం బ్రహ్మ.' ఛాం. ౪-౧౦-౫ 'ప్రాణము బ్రహ్మము, క బ్రహ్మము, ఖ బ్రహ్మము.' అని యుపదేశింపగా

నుపకోసలుడు దాని యర్థమును దెలియగోరి- ( విజానా మ్యహం ప్రాణో బ్రహ్మ కం చ తు, ఖం స విజానామి. ఛాం. ౪-౧౦-౫.) 'ప్రాణము బ్రహ్మ మని యెరుగుదును; కాని, క, ఖ లు బ్రహ్మమని యెరుగను' అని బదులుచెప్పుటయు జూడనగును. ఇట 'క' శబ్దముచే విషయ సుఖముకాని, 'ఖ' శబ్దముచే భూతాకాశముకాని చెప్పబడినట్లు గ్రహించుట యుక్తము కాదు. ప్రాణశబ్దముచే ప్రాణనక్రియాహేతువగు బ్రహ్మ మెట్లు గ్రహింపబడుచున్నదో యట్లే 'క' శబ్దముచే సుఖ స్వరూపమగు బ్రహ్మము, 'ఖ' శబ్దముచే వ్యాపకమగు బ్రహ్మము గ్రహింపబడుటయే యుక్తమగును. అందువలననే, (యద్వావ కం తదేవ ఖం,య దేవ ఖం తదేవ కం.) 'ఏది సుఖ స్వరూపమో యదియే వ్యాపకమగు నాకాశము. ఏది వ్యాపకాకాశమో యదియే సుఖస్వరూపము' అని క, ఖశబ్దవాచ్యము లలో నభేదమును దెలిపి యుపదేశారంభమున ప్రాణ, క, ఖ శబ్దములచే బ్రహ్మమే యుపదేశింపబడినది. ఇట్లు ప్రథమమున బ్రహ్మము నుపదేశించి మధ్యలో నన్యపదార్థము నుపదేశించుట యుక్తము కాదు. అంతమునగూడ నాచార్యుడు బ్రహ్మమునే యుపదేశించుట యుక్త మగును. అందువలననే యాచార్యుడు :

'లోకాన్ వావ కిల సౌమ్య ! తే ఽవోచన్ అహంతు తే తద్వ క్ష్యామి యథా పుష్కర పలాశ ఆపో న శ్లిష్యన్త ఏవ మేవం విది పాపం కర్మ న శ్లిష్యతే' ఛాం. ౪—౧౪—౩.

'ఓ సౌమ్య ! లోకములను నీకు వారు చెప్పిరి. కమల పత్రమున జల మంటని విధమున దేని నిట్లు తెలిసికొనినవానికి పాపమంటదో నీకది నేను చెప్పుదును' అని లోకములం దధికృతు డగు పురుషు నుపదేశించి తనచే నుపదేశింపబడు నక్ష్యంతఃపురుషు నుపాసించినందున పాప మంట దని చెప్పి, గార్హపత్యా ద్యగ్నులచే నుపదేశింపబడిన పురుషుడును, తనచే నుపదేశింపబడిన పురుషుడు నొక్కడే, వేరు కాదు అని ప్రదర్శించి

యున్నాడు. గార్హపత్యాద్యగ్ను లాదిత్యునం దున్న పురుషుని ధ్యానించుటచే నే ఫలము గలుగు నని యుపదేశించియున్నవో యా ఫలమే యాచార్యు డక్ష్యంతరపురుషధ్యానమువలన కలుగు నని చెప్పుచున్నాడు. కావున నక్షి యందు నాదిత్యునందును ధ్యానింపబడు పురుష డొక్కడే యనుట స్పష్టము. కాబట్టి ప్రకరణాదియం దే సుఖస్వరూప మగు బ్రహ్మ ముపదేశింపబడినదో యదియే మధ్యమునను, నంతమునందు నుపదేశింపబడినట్లు సంభావింప దగును. అందువలన నక్ష్యంతఃపురుషుడు బ్రహ్మమే యని భావము. (౧౫)

## శ్రుతోపనిషత్క గత్యభిధానా చ్చ ౧-౨-౧౬

శ్రవణము=అనుష్ఠానము, ఉపనిషత్=బ్రహ్మవిద్య, శ్రుతోపనిషత్కః = బ్రహ్మవిద్య ననుష్ఠించినవాడు).

శ్రుతోప....ధానాత్ + చ = బ్రహ్మవిద్య ననుష్ఠించినవాని కేగతి గలుగునో యక్ష్యంతఃపురుష నుపాసించినవానికి నదియే గలుగునని చెప్పి నందునను, అక్ష్యంతఃపురుషుడు పర బ్రహ్మ పరమాత్మయే యని సూత్రార్థము.

బ్రహ్మవిద్యానుష్ఠాన పరున కే ఫలము (దేవయానగతి) లభించునో, యాఫలమే యక్ష్యంతః పురుష నుపాసించినవానికిని లభించు నని చెప్పి నందున నక్ష్యంతఃపురుషపదముచే బ్రహ్మమే గ్రహింప నగు నని భావము. (౧౬)

ఇట్లు సిద్ధాంత పక్షమును నిరూపించి పూర్వపక్షమును నిరాకరింప బూని మహర్షి యిపుడు సూత్రమును రచించుచున్నాడు:

## అనవస్థితే రసంభవా చ్చ నేతరః ౧-౨-౧౭

అనవస్థితేః = ఎల్లప్పుడు నక్షియం దుండక పోవుటవలనను,

అసంభవాత్ + చ = అమృతత్వాది గుణములు సంభవము కానందువల్ల నను, ఇతరః = జీవాత్మ, న = అక్ష్యంతఃపురుషుడు కాడు.

జీవాత్మకు జాగరితము, స్వప్నము, సుషుప్తియు నని మూడవస్థలు గలవు. సుషుప్తియందు జీవాత్మ హృదయమున నుండును. స్వప్నావస్థ యందు హృదయమునుండి మూర్ధ్నకు పోవు కంఠస్థ నాడియం దుండును. జాగరితావస్థయందు మూర్ధ్నయం దుండును. భ్రూమధ్యస్థానమునకు మూర్ధ్న యని పేరు. అటనుండు జీవాత్మయే యక్షియం దున్నట్లు చెప్పబడును.

సుషుప్తియందు హృదయాకాశమున నుండు బ్రహ్మమునం దుండియు జీవాత్మ హృదయమున నున్నట్లు చెప్పబడును. ఈ విధముగ జీవుడా యా యవస్థలం దాయా స్థలములందుండును. మూర్ధ్నలో నున్నపుడు హృదయమున నుండడు. అట్లే హృదయమున నున్నపుడు మూర్ధ్న యందు కాని, కంఠగతనాడియందు కాని యుండడు.

అందువలన జీవాత్మ యెల్లపుడు నొకేస్థలమున నుండ దని తెలియు చున్నది. ఇంతేకాక, జీవాత్మయం దమృతత్వాదిగుణములు నుండవు. పరమాత్మయం దీ గుణము లుండుటయేకాక, యా పరమాత్మ యెల్లపుడు నెల్లస్థానములం దవస్థితమై యుండును. అందువలన నీ ప్రకరణమున గల నక్ష్యంతః పురుషపదము పరమాత్మబోధకమే యగును. కాని జీవాత్మ బోధకము కాదు. (౧౭)

## పంచమాధికరణము

పూర్వాధికరణమున వర్ణించిన శ్రుతికి సమానార్థకమైన మరియొక శ్రుత్యర్థమును వర్ణించుటకు మహర్షి అధికరణాంతరము నారంభించు చున్నాడు:

## అంతర్యా మ్యధిదైవాదిషు తద్ధర్మ వ్యపదేశాత్ ౧-౨-౧౮

తద్ధర్మ వ్యపదేశాత్ = బ్రహ్మ ధర్మములను జెప్పుటవలన, అధి దైవాదిషు = పృథివ్యాదులందు, అంతర్యామీ = అంతర్యామిగా వర్ణింపబడి నదియు బ్రహ్మమే.

'అగ్ని ర్దేవతా, వాతో దేవతా' యజు. ౧౪-౨౦.

'అగ్ని, వాయువు, పృథివి మున్నగునవి దేవత' అని వేదమున స్పష్టముగ వర్ణింపబడియున్నది. ఈ సూత్రమునందలి యధిదైవ శబ్దముచే పృథివ్యాపస్తేజోవాయురాకాశములు, సూర్యచంద్రులు మున్నగు పదార్థములు గ్రాహ్యములు. వానియందు దివ్యగుణము లున్నవి. బృహదారణ్యకమున బ్రహ్మ మీ యధిదైవములం దంతర్యామిగా వర్ణింపబడినది. అందు వలన నంతర్యామి పదము బ్రహ్మబోధక మనియే తెలియనగు నని సూత్రాభిప్రాయము.

'య ఇమం చ లోకం పరం చ లోకం సర్వాణి చ భూతా న్యంతరో యమయతి.' బృ. ౩-౭-౧. 'ఎవ డీ లోకమును, పరలోకమును, సర్వభూతములను లోన నున్నవాడై నియమించుచున్నాడో' యని బృహదారణ్యకమున బ్రారంభించి, యిట్లు వర్ణింపబడినది:

'యః పృథివ్యాం తిష్ఠన్ పృథివ్యా అంతరో, యం పృథివీ న వేద, యస్య పృథివీ శరీరం, యః పృథివీ మంతరో యమయ త్యేష త అంతర్యా మ్యమృతః' బృ. ౩-౭-౧. 'ఎవడు పృథివియం దుండియు, పృథివికంటె భిన్నుడో, యెవనిని పృథివి యెరుగదో, యెవనికి పృథివి శరీరమో, యెవడు పృథివిని అంతఃస్థితుడై నియమించుచున్నాడో వాడు నీ కాత్మ, అంతర్యామి, అమృతుడు,'

ఇట నంతర్యామి శబ్దముచే జెప్పబడిన పదార్థ మెయ్యది? ప్రకృతియా? జీవాత్మయా? లేక పరమాత్మయా? యని సందేహము. యమయితృత్వ ధర్మము (నియామకధర్మము) ప్రకృతియందు, జీవాత్మయందు, పరమాత్మయందును నుండు నవకాశమున్నది. ప్రకృతి తన కార్యజాతమైన ప్రాపంచికపదార్థములందు కారణరూపమున నుండి యంతర్యామి యన నొప్పును. జీవాత్మయు శరీరాంతర్యామియై దేహేంద్రియాదులను నియమించుచున్నది. పరమాత్మ జగదంతర్యామియై జగత్తును నియమించుచున్నది. కాబట్టి యమయితృత్వధర్మము మూడింటియందును నుండుటచే సందేహము గలుగుట సహజము. ఇట ప్రకృతిజీవాత్మలు అంతర్యామి శబ్దగ్రాహ్యము లనుట పూర్వపక్షము. కాదు పరమాత్మయే గ్రాహ్య మనుట సిద్ధాంతము.

ప్రకృతి భావ పదార్థములకు - కార్యజాతమునకు - కారణము. లోకములోని పదార్థములన్నియు ప్రకృతినుండి యేర్పడి క్రియాకలాపముల కనువగుచున్నవి. అందువలన ప్రకృతియే పృథివ్యాద్యధిదైవములందు కారణరూపమున నుండి యంతర్యామియై, వానిని యమయించుచున్నది. కాబట్టి ప్రకృతియే అంతర్యామి పదవాచ్య మగుచున్నది. అట్లు కాకున్న జీవాత్మ యని యైనను జెప్పనగును.

జీవాత్మ యోగము నభ్యసించి, బ్రహ్మదర్శనసంపత్తి గలదై యఖిలైశ్వర్యములను సంపాదించును. అందువలన విశ్వనియంతృత్వము జీవాత్మకును గలుగును. కావుననే యోగశాస్త్రమున,

> 'సత్త్వ పురుషాన్యతా ఖ్యాతి మాత్రస్య
> సర్వభావాధిష్ఠాతృత్వం సర్వజ్ఞాతృత్వం చ' యోగ ౩-౪౯.

'ప్రకృతి పురుష వివేక జ్ఞానముగలయోగికి సర్వపదార్థముల యధిష్ఠాతృత్వము, సర్వజ్ఞాతృత్వమును గలుగు' నని వర్ణింపబడినది.

కాబట్టి యంతర్యామి శబ్దముచే జీవాత్మయు గ్రహింపనగునని ప్రాప్తింపగా - నది కాదు, పరమాత్మయే గ్రాహ్యమని సిద్ధాంతము. అది యెట్లన:

అంతర్యామి శబ్దము పరబ్రహ్మ పరమాత్మకే గ్రాహకము కాని ప్రకృతికి గాని, జీవాత్మకు గాని గ్రాహకము కాదు. కారణ మేమన: (తద్ధర్మ వ్యపదేశాత్) ఈ ప్రకరణమునందు బ్రహ్మధర్మములే చెప్పబడినవి. పృథివ్యాదులను నియమించు శక్తి యమయితృత్వ మనబడును. ఆ ధర్మము బ్రహ్మమునందే కలదు. జీవాత్మయందుకాని, ప్రకృతియందు కాని యట్టి ధర్మము లేదు. ప్రకృతి తననుండి యేర్పడు మహదాది, కార్య జాతమునందు కారణరూపమున నుండిన నుండవచ్చును. కాని జీవాత్మలం దది యుండదు - అంతర్యామి కానేరదు. నియంతృత్వముకూడ ప్రకృతి యందు సంగతము కానేరదు. కారణ మైనంతమాత్రమున నది నియంత యన నొప్పదు.

'యో విజ్ఞానే తిష్ఠన్ విజ్ఞానా దంతరో
యం విజ్ఞానం న వేద యస్య విజ్ఞానం శరీరం
యో విజ్ఞాన మంతరో యమయతి.' బృ. ౩-౭-౨౨.

'విజ్ఞానమునందుండి, విజ్ఞానముకంటె భిన్నమై యున్నది. విజ్ఞానము దాని నెరుగదు. విజ్ఞానము దానికి శరీరము. అట్టి విజ్ఞానము నంతరమున నుండి యమయించుచున్నది' అను నీ యుపనిషద్వాక్యమునందు విజ్ఞానాత్మయైన జీవాత్మకూడ నియమింపబడుచున్నట్లు చెప్పబడినది. ఈ ధర్మము బ్రహ్మమునందే కలదు. కాని, ప్రకృతియందు లేదు.

జీవాత్మయందును నిట్లే పృథివ్యాదులందును నియమించు ధర్మము లేదు. జీవాత్మ అణుస్వరూపము గలదగుటచే పృథివ్యాదులందంతట నొకే క్షణమున నుండజాలదు. అయ్యది యోగాభ్యాసాదులవలన నైశ్వర్యాదులను సంపాదించినను, జగన్నియంతృత్వధర్మము జీవాత్మకు చెందినది కాదు.

యోగైశ్వర్యమునకు ప్రసక్తి జగద్వ్యాపారమునం దెంతమాత్రము నుండదు. పరమాత్మకే యట్టి యైశ్వర్య మున్నది. అతడే సర్వభూతాంత రాత్మ. సమస్త జగదంత ర్యమయితృత్వ మతనియందే యున్నది. కాబట్టి పరమాత్మయే యంతర్యామి శబ్దముచే నిట గ్రాహ్య మని స్పష్టమగు చున్నది. (౧౮)

ఇట్లు సిద్ధాంతము నుపపాదించి మహర్షి పూర్వపక్షమును నిరాక రించుచున్నాడు:

## న చ స్మార్త మతద్ధర్మాభిలాపాత్ ౧-౨-౧౯

అతద్ధర్మాభిలాపాత్=ప్రకృతిధర్మములు చెప్పనందున, స్మార్తం= (స్మృతులందు వర్ణింపబడిన) ప్రకృతి, న చ=అంతర్యామి కాదు.

అంతర్యామి ప్రకరణమునందు ప్రకృతి ధర్మములు వర్ణింపబడి యున్న పక్షమున నాధర్మములద్వారమున ధర్మియైన ప్రకృతియే యిట నంతర్యామి యని చెప్పనొప్పెడిది. కాని, యిట నట్టి ధర్మము లేవియు వర్ణింపబడకపోగా యమయితృత్వము మున్నగు బ్రహ్మధర్మము లిట గ్రహింపబడుటచేత నంతర్యామిపదము బ్రహ్మబోధకమే యగునని సూత్ర తాత్పర్యము. (౧౯)

ప్రకృతి యంతర్యామి కాకున్నను జీవాత్మ యేల యంతర్యామి కాదన:

## శారీర శ్చోభయేఽపిహిభేదే నైన మధీయతే ౧-౨-౨౦

(అంతర్యామ్యధిదైవాదిషు, న అను నీ రెండుపదములు నిందు పూర్వసూత్రములనుండి గ్రహింపనగును.)

శారీరశ్చ=శరీరమున భోక్తగానుండు జీవాత్మయు, న=అధిదైవ తములందు వినబడు నంతర్యామి కాదు, హి=కారణమేమన, ఉభయేఽపి=

'కాణ్వము, మాధ్యందినము' నను రెండు శాఖలలోను, భేదన = జీవాత్మ కంటె భిన్నముగా, ఏనమ్=అంతర్యామిని, అధీయతే=చదువుచున్నాడు.

'యః పృథివ్యాం తిష్ఠన్ పృథివ్యా అన్తరః' బృ. ౩-౭-౧. 'ఎవడు పృథివియందుండి పృథివికంటె భిన్నుడో' అని కాణ్వులు,మాధ్యందినులును చదువుదురు. అట్లే,

'యో విజ్ఞానే తిష్ఠన్ విజ్ఞానా దంతరః' 'విజ్ఞానాత్మయగు జీవాత్మ యందుండియు నతనికంటె నెవడు భిన్నుడో, అని కాణ్వులును,

'య ఆత్మని తిష్ఠన్ ఆత్మనోఽన్తరః' బృ. ౩-౭-౩౦ 'ఆత్మ యందుండియు నెవ డాత్మకంటె భిన్నుడో' యని మాధ్యందినులును చదువుదురు.

జీవాత్మయే యంతర్యామి యగునెడల నీ వాక్యములందు నంతర్యామిని జీవాత్మునికంటె భిన్నుడుగా నేల చదువుదురు? జీవాత్మ తనకంటె దానే భిన్నుడు కాదుకదా! మాధ్యందినుల పాఠములోని విజ్ఞానపదముకూడ విజ్ఞానాత్మకమగు జీవాత్మయే యగును. ఇంతేకాక తైత్తిరీయమునందును,

'విజ్ఞానం యజ్ఞం తనుతే' తై. ౨-౫. అని విజ్ఞానశబ్దముచే జీవాత్మ చెప్పబడుట సుస్పష్టము. కాబట్టి యీ ప్రకరణమున జదువబడు నంతర్యామి పదము పరబ్రహ్మపరమాత్మనే తెలుపును; కాని, ప్రకృతిని గాని, జీవాత్మనుగాని తెలుపదనుట నిశ్చితము.

ఈ సూత్రమునందు పూర్వసూత్రమునుండి అతద్ధర్మాభిలాపాత్ అను హేతువు ననువర్తింప - నన్వయింప - వీలున్నను సూత్రకారుడు ప్రత్యేకముగా నీ సూత్రమున మరియొక 'భేదేన ఏన మధీయతే' అను హేతువును జెప్పుటచేత జీవాత్మ పరమాత్మలకు గల భేదము పారమార్థికమే యగును; కాని యౌపాధికము కాని, వ్యావహారికము కాని, కాదని దృఢపడుచున్నది. (౨౦)

## షష్ఠాధికరణము

అధిదైవాదులలోని యంతర్యామిపదము బ్రహ్మవాచకమే యని నిర్ణయమైనది. ప్రస్తుత మా బ్రహ్మమున గల నదృశ్యత్వాది గుణములను బోధింప మరియొక యధికరణము నారంభించుచున్నాడు:

### అదృశ్యత్వాదిగుణకో ధర్మోక్తేః ౧-౨-౨౧

ధర్మోక్తేః = బ్రహ్మధర్మములు చెప్పబడినందున, అదృశ్యత్వాది గుణకః=బ్రహ్మ మదృశ్యత్వాదిగుణములు కలది.

ముండకోపనిషత్తునందు

'అథ పరా యయా తదక్షర మధిగమ్యతే'

'య త్తదద్రేశ్య మగ్రాహ్య మగోత్ర మవర్ణ

మచక్షుఃశ్రోత్రం త దపాణిపాదం నిత్యం

విభుం సర్వగతం సుసూక్ష్మం తదవ్యయం

యద్భూతయోనిం పరిపశ్యంతి ధీరాః' ము. ౧-౧-౬.

'దేనిద్వారమున నా యక్షరబ్రహ్మము తెలియబడునో యది పరవిద్య.'

'ఆ పరబ్రహ్మము, అద్రేశ్యం = జ్ఞానేంద్రియములకు గోచరము కానిది, అగ్రాహ్యం=కర్మేంద్రియములకు పట్టువడనిది. అగోత్రం = కారణములేనిది, అవర్ణం = బ్రాహ్మణత్వాది వర్ణధర్మములకు సంబంధించనిది, అచక్షుఃశ్రోత్రం=కన్నులు చెవులు లేనిది, అపాణిపాదం=చేతులు కాళ్ళు లేనిది, నిత్యం=శాశ్వతమైనది, విభుం=వ్యాపకమైనది, సర్వగతం=అంతట నుండునది, సుసూక్ష్మం=మిక్కిలి సూక్ష్మమైనది, అవ్యయం=వృద్ధి క్షయములు లేనిది, భూతయోనిం=జగత్కారణము. 'అట్టిదానిని ధీరులు చూచుచున్నారు' అని యున్నది. ఇట నీ యదృశ్యత్వాది గుణములుగల పదార్థము ప్రకృతియా? లేక జీవాత్మయా? లేక పరమాత్మయా? యని సందే

హము. ప్రకృతియు, జీవాత్మయు ననుట పూర్వపక్షము: కాదు, పరమాత్మయే యనుట సిద్ధాంతము.

అదృశ్యత్వాది గుణములుగల యక్షరపదార్థ మిట భూతయోని-భూతములకు కారణముగ జెప్పబడినది. అట్టిది ప్రకృతియే కాగలదు. భూతములు పృథివ్యాదులు. అవి ప్రకృతి వికారములు. వానికి ప్రకృతి యుపాదానకారణము. ఇట్లు భూత ప్రకృతులకు కార్యకారణభావము జగత్ప్రసిద్ధము. ఇంతేకాక పృథివ్యాది పంచభూతములు. ప్రకృతియు రెండును జడములు. కావున వానిలో సారూప్యమును గలదు. ప్రకృతి సూక్ష్మ మగుటవలన నయ్యది యింద్రియగ్రాహ్యమును గాదు. అందువలన నద్రేశ్యత్వాదిగుణములు గల యక్షరపదార్థము ప్రకృతియే యనదగును. అప్పుడే యీ ప్రకరణమున వర్ణింపబడిన దృష్టాంతములును సార్థకములు కాగలవు. ఆ దృష్టాంతము లేవి యని ప్రశ్నింతురేని :

'యథోర్ణనాభిః సృజతే గృహ్ణతే చ
యథా పృథివ్యా మోషధయః సంభవంతి,
యథా సతః పురుషాత్ కేశలోమాని,
తథా ఽక్షరాత్ సంభవ తీహ విశ్వమ్.' ముం. ౧-౧-౭.

'ఊర్ణనాభి (సాలీడు) యెట్లు సృష్టించి సంహరించునో, పృథివి యం దోషధు లెట్లు జనించుచున్నవో, జీవించియున్న పురుషునినుండి కేశములు, రోమములు నెట్లు కలుగుచున్నవో యట్లే యక్షరమునుండి విశ్వ ముదయించుచున్నది.'

ఊర్ణనాభి శరీరమునుండి తంతువు లేర్పడి మరల దానియం దిమిడి పోవును. భూమినుండి యోషధు లేర్పడి మరల దానియందే లీనము లగును. ఇట్లే మానవశరీరమునుండి కేశములు-రోమములు నుత్పన్నము లగును. ము వ్విధములగు నీ దృష్టాంతములను వర్ణించి యట్లే యక్షరము

నుండి విశ్వ మేర్పడుచున్నదని యుపనిషద్వాక్యము వర్ణించుచున్నది. అందువలన నక్షరశబ్దము ప్రకృతిని బోధించుచున్న దనుట సుస్పష్టము. దృష్టాంతములందు జడపదార్థములయిన శరీరము, పృథివియు గ్రహింప బడినందున వాని సారూప్యమువలన జడ మగు ప్రకృతిని గ్రహించుటయే యుక్త మని భావము. కాని,

'యః సర్వజ్ఞః సర్వవిత్' ముం. ౧-౧-౯. 'ఎవడు సర్వజ్ఞుడు, సర్వవిదుడు నగునో' యని వాక్యశేషమున వర్ణించిన సర్వజ్ఞత్వము జడ మగు ప్రకృతియందు వర్తింపనేరదు. కావున నక్షరశబ్దము ప్రకృతివాచకము కాదందురేని, జీవాత్మవాచక మని యైనను జెప్పనగును. జీవాత్మయు నక్షరమే. నాశము లేనిదే. అయ్యది తా జేయు ధర్మాధర్మముల మూలమున భూతయోని - భూతోత్పత్తికి మూలము - అనదగును. సర్వజ్ఞత్వము చేతనధర్మము కావున జీవాత్మయం దది సంగత మగును. కాబట్టి జీవాత్మయే యక్షరపదవాచ్య మని ప్రాప్తింపగా సమాధానము :

పరమాత్మయే యీ ప్రకరణమున నదృశ్యత్వాది గుణములు గలిగి భూతయోనియై యక్షరశబ్దముచే జెప్పబడుచున్నదని యెంచవలయును. ప్రకృతి కాని జీవాత్మ కాని, యెన్నటికిని నక్షరపదవాచ్యము కానేరవు. ఈ ప్రకరణమున వర్ణింపబడిన ధర్మములన్నియు పరమాత్మయందే వర్తించును. అదృశ్యత్వాదిగుణములు గలిగి, భూతయోని యగు నక్షరమును దెలుప బ్రారంభించి, చివరకు

'యః సర్వజ్ఞః సర్వవిద్ యస్య జ్ఞానమయం తపః,
తస్మా దేతద్ బ్రహ్మ నామరూప మన్నం చ జాయతే.'
ముం. ౧-౧-౯.

అని చెప్పిన సర్వజ్ఞత్వాది ధర్మములు పరమాత్మయందే సంగతము లగును. ప్రకృతి చేతనము కానందునను, జీవాత్మ యల్పజ్ఞ మగుటవలనను

వానియందు సర్వజ్ఞత్వాదిధర్మములు సంగతము లెన్నడును గావు. అదృశ్య త్వాది గుణములు గలిగి భూతయోని యగు నక్షరము వేరనియు, సర్వజ్ఞ త్వాదిగుణములు గల పరమాత్మ వేరనియు నిట నెంచరాదు. ముందుగా నదృశ్యత్వాదిగుణములుగల యే యక్షరపదార్థము వర్ణింపబడినదో, చివరకు వాక్యశేషమునందును నదియే సర్వజ్ఞ మనియు, దానివలననే యీ నామ రూపాత్మక మగు ప్రపంచ ముత్పన్నమైనదనియు వర్ణింపబడినది. అందు వలన నక్షరము, సర్వజ్ఞము రెండును నొకటి కాదనరాదు.

మఱియును 'భూతయోని' యను నీ పదములోని 'యోని' పదము నిమిత్తకారణమునే తెలుపును; కాని, యుపాదానమును దెలుపదు. చేతనము పృథివ్యాది భూతముల కుపాదానకారణము కాజాలదు. జీవాత్మ చేతనమైనను నయ్యది ధర్మాధర్మముల ద్వారమున భూతములకు నిమిత్తకారణము కాగలదని కల్పించుటయు హేతుబద్ధము కాదు. జీవాత్మ యల్పజ్ఞ మగుట వలన నందు సర్వజ్ఞత్వ మసంభవము. ప్రకృతి భూతముల కుపాదానకారణ మగుటచే నయ్యదియు నిట గ్రహింప ననువుకాదు. కాబట్టి యదృశ్యత్వాది గుణములు గలిగి, భూతయోని యగు నక్షరపదార్థము పరమాత్మయే యగును. కాని, యన్యము కాదు.

ఊర్ణనాభి శరీరము మున్నగు జడపదార్థముల నుదాహరించినందున దార్ష్టాంతమునందును జడమునే గ్రహించుట యుక్తము. కాబట్టి యక్షర శబ్దము ప్రకృతివాచకమే యగుననుటయు దగదు. ఉపాదానము, ఉపాదే యము నను రెంటింటియందును సారూప్య ముండవచ్చును. కాని నిమిత్త నైమిత్తికములందు సారూప్య ముండనవసరము లేదు. ఊర్ణనాభి దృష్టాం తమునందు పరమాత్మ భూతయోని - భూతనిమిత్తకారణము - భూతాధి ష్ఠానము - అని విశదము సేయబడినది. అట ఊర్ణనాభిదేహము దృష్టాంత ముగా జెప్పబడినదనుటయు సరిగాదు. ఊర్ణనాభియే దృష్టాంతమున గ్రహింపబడినది, అనగా ఊర్ణనాభియందలి చేతనవస్తువు - అధిష్ఠానము -

అని భావము. ఊర్ణనాభియందలి చేతనమగు నాత్మ శరీరము నధిష్ఠించి తన గూటిని వలవలె నల్లుటకు దగిన తంతువులను సృజించును; మరల తనలో నిముడ్చుకొనును. ఇట్లు తంతువులను నిర్మించుటలోను, వానిని మరల నుపసంహరించుటలోను, స్వయముగ దా నెట్టి వికారమును బొందదు. అట్లే పరమాత్మయు ప్రకృతి యనెడి శరీరమును నధిష్ఠించి యీ జగత్తును సృజించును; లయము చేయును. కాని, తన స్వరూపమునం దెట్టి వికారమును బొందదు. ఈ విధముగ దృష్టాంత (ఊర్ణనాభి) దార్ష్టాంత (పరమాత్మ) ములలో సామ్య మున్నది. తంతువులను నిర్మించుటలో నూర్ణనాభి నిమిత్తకారణము. దాని శరీర ముపాదానకారణము. ఇట్లే జగత్తున కుపాదానకారణము ప్రకృతి. నిమిత్తకారణము పరమాత్మ. ఇట్లు పరమాత్మని భూతయోనిత్వమును వివరించుటకై యూర్ణనాభిదృష్టాంతము గ్రహింపబడినది. భూతయోని యగు నీ పరమాత్మునివలన జగత్తు కలుగు విధము దెలుపుటకు పృథివీదృష్టాంతము చెప్పబడినది. పృథివి యాధారము కాగా వ్రీహి యవాద్యోషధులు తమ బీజములనుండి మొలకలెత్తువిధమున, పరమాత్మ నాధారమున ప్రకృతినుండి జగత్తు జనించునని యీ దృష్టాంతము తెలుపును. వ్రీహ్యాది భిన్నభిన్న సస్యములు తమతమ బీజముల నుండి యుత్పన్నములగుచు తమ కాధారము (నిమిత్తకారణము) గా నుండు పృథివినుండి యుత్పన్నము లగుచున్నవి. అట్లే పృథివ్యాదిభూతములుకూడ తమ కుపాదానకారణమైన ప్రకృతినుండి జనించుచున్నను విశ్వమునకంతటికి నధిష్ఠానము - ఆధారము - నగు పరమాత్మ నిమిత్తముగా నేర్పడుచున్న వనుట యసంగతము కాదు. ఇంకను భూతయోనియు, నక్షరము నగు పరమాత్మకు జగదుత్పత్తి నొనర్చుటలో నెట్టి యాయాసము కలుగదని విశదము చేయుటకుగాను, పురుషదృష్టాంతముకూడ గ్రహింపబడినది. జీవాత్మ (పురుషున) కు శరీరముతో సంబంధ మున్నంతవరకు నా శరీరమునందు కేశములు, నఖములు వాని యంతట నవి పుట్టి పెరుగు

చుండును. అందులకై పురుషుడు ఎట్టి ప్రయత్నమును ప్రత్యేకించి చేయడు. అట్లే పరమాత్మని యునికితో సంబంధ మున్నంతమాత్రమున ప్రకృతినుండి భూతసృష్టి జరుగును. తగిన సమయమున మరల నా భూత జాతమంతయు ప్రకృతియందు లీనమగును. ఇందులకై పరమాత్మ చేయ వలసిన దిసుమంతయు నుండదు. ఇట్లు ప్రయాస మొకింతయు లేకయే భూతయోనియు, నక్షరము నగు పరమాత్మవలన విశ్వ మేర్పడుచున్నది. అట్లే విలయము నందుచున్నది. ఈ విషయమును దెలుపుటకే యీ దృష్టాంత ముపనిషత్తునందు గ్రహింపబడినది. కాబట్టి దృష్టాంతసామ్యము చేతను, నక్షరపదము పరమాత్మబోధకమేకాని, యన్యబోధకము కాదనుట స్పష్టము.

మరియు ప్రకరణారంభమున —

'బ్రహ్మా దేవానాం ప్రథమః సంబభూవ
విశ్వస్య కర్తా భువనస్య గోప్తా,
స బ్రహ్మవిద్యాం సర్వవిద్యాప్రతిష్ఠా
మథర్వాయ జ్యేష్ఠపుత్రాయ ప్రాహ' ముం. ౧-౧-౧.

'అథర్వణే యాం ప్రవదేత బ్రహ్మా
అథర్వా తాం ప్రోవా చాంగిరే బ్రహ్మవిద్యాం
స భారద్వాజాయ సత్యవాహాయ ప్రాహ
భారద్వాజో ఽఙ్గిరసే పరావరామ్' ముం. ౧-౧-౨.

'బ్రహ్మా = పరమేశ్వరుడు, విద్వాంసులకు ప్రథముడు - అగ్రణి - మొదటి యుపదేశకుడు. సర్గారంభమున నాది ఋషులకు విద్యాదానము సేయుట కతడు పూర్వమే యుండెను. అతడు విశ్వకర్త, భువనరక్షకుడు, సర్వవిద్యలకు పరమఫలరూపమగు బ్రహ్మవిద్య నతడు జ్యేష్ఠపుత్రుడైన యథర్వునకు జెప్పెను. ఆ యథర్వుడు భరద్వాజగోత్రజుడైన సత్యవాహు

నకు దానిని జెప్పెను. ఆ భారద్వాజు డంగిరసున కుపదేశించెను' అని పఠింపబడియున్నది.

ఇట్లు ప్రకరణప్రారంభమున జెప్పబడిన సర్వవిద్యాప్రతిష్ఠమగు (సర్వవిద్యలు నే బ్రహ్మమునందు పర్యవసితము లగుచున్నవో యట్టి బ్రహ్మమే, ఫలముగాగల) బ్రహ్మవిద్య (బ్రహ్మవిషయిక విద్య) పరమాత్మవిద్యకు మించి మరియొందేమియును కాదు. సర్వవిద్యలకు ప్రతిష్ఠ పరమాత్మయే యనుట యుపపన్న మగును. బ్రహ్మవిద్య పరమాత్మవిద్యయైననాదే,

'కస్మిన్ను భగవో ! విజ్ఞాతే సర్వ మిదం విజ్ఞాతం భవతి ?'

ముం. ౧-౧.

'భగవన్ ! ఏది తెలిసిన నిదియంతయును దెలియును ?' అను నిట్టి జిజ్ఞాసాత్మక ప్రశ్నపూర్వకముగ పరాపరవిద్యలు బోధించి, యందునను అక్షరమును దెలుపునది పరవిద్య యని చెప్పుటయు సంగత మగును. ప్రకరణారంభమున నెయ్యది ప్రారంభింపబడినదో యదియే తరువాత వివరించుట యుక్తము. ఇట బ్రహ్మవిద్య యారంభింపబడినది; కావున నయ్యదియే తరువాతను వివరింపబడినది. విద్యావిభాగ మొనర్చి పరమాత్మను దెలుపునది పరవిద్య యని తెలుపబడినదని భావము. పరవిద్యామూలమున సర్వాధిష్ఠానమగు పరమాత్మను దెలిసినవానిక సర్వమును దెలియును. ఆశ్రయము నెరిగినవానికి నాశ్రిత మెట్లు తెలియకుండును ? కావున నీ ప్రకరణమున నక్షరపదము పరమాత్మవాచక మగుటలో సంశయమేమియును లేదని భావము. (౨౧)

**ఇట్లు సిద్ధాంతపక్షమును వివరించి, పూర్వపక్షమును మహర్షి నిరాకరించుచున్నాడు :**

## విశేషణ భేదవ్యపదేశాభ్యాం చ నేతరౌ ౧-౨-౨౨

విశేషణ....చ = విశేషణమువలనను, వేరుగా చెప్పుటవలనను, ఇతరౌ=ప్రకృతి జీవాత్మలు రెండును, న=అదృశ్యత్వాదిగుణములు కలవి కావు.

'తదేతత్ సత్యం యథా సుదీప్తాత్ పావకాత్
విస్ఫులింగాః సహస్రశః ప్రభవన్తే సరూపాః
తథా ఉక్షరాత్ వివిధాః సోమ్య ! భావాః
ప్రజాయన్తే తత్ర చైవాపి యన్తి.' ముం. ౨-౧౧

'ప్రజ్వలించు నగ్నినుండి యా యగ్నికి సమానరూపముగల యగ్ని కణములు వేలకొలది యుద్భవించునట్లు, అక్షరమగు ప్రకృతినుండి వివిధములయిన భావములు (కార్యవస్తువులు - పృథివ్యాదులు) పుట్టుచున్నవి. ఇయ్యది సత్యము' అని ప్రకృతినుండి సృష్టి కలుగు విధము చెప్పి, దానికంటె వేరుగా నక్షరము, భూతయోనియు నగు పరమాత్మ యిట్లు వర్ణింపబడినది :

'దివ్యో హ్యమూర్తః పురుషః స బాహ్యాభ్యంతరో హ్యజః
అప్రాణో హ్యమనాః శుభ్రో హ్యక్షరాత్ పరతః పరః.'
ముం. ౨-౧-౨

'పరమాత్ముడు దివ్యుడు, స్వయంప్రకాశరూపుడు, అమూర్తుడు, బాహ్యాభ్యంతరుడు - సృష్టికి లోపల వెలుపల నుండువాడు, అజుడు = జన్మరహితుడు, ప్రాణరహితుడు, మనస్సులేనివాడు, శుభ్రుడు = క్లేశకర్మ విపాకాశయము లంటనివాడు, అక్షరముకంటె - సూక్ష్మమగుదానికంటె సూక్ష్ముడు, (అక్షర మన నిట ప్రకృతి. దానికంటె సూక్ష్మము జీవాత్మ. ఆ జీవాత్మకంటెను సూక్ష్ముడు పరమాత్మ యని తెలియవలెను.)'

ఇందు దివ్యుడు నమూర్తుడు మున్నగు విశేషణములు పరమాత్మ నకు జెందినవి. అంతేకాక యా పరమాత్ముడు (అక్షరాత్ పరతః పరః) ప్రకృతికంటె, సూక్ష్మమైన జీవాత్మునికంటెను సూక్ష్ముడని స్పష్టముగా వర్ణింపబడియున్నది.

జీవాత్మయే యదృశ్యత్వాదిగుణములు గలిగి, భూతయోనియగు నక్షరమగుచో నుపనిషత్తు ఇట్టి విశేషణముల నేల చెప్పును ? దివ్యత్వాది గుణములు కలిగి యక్షరపదవాచ్యమగు పదార్థము జీవాత్మకాదని తెలుపుటకే దివ్యత్వాదివిశేషణము లిందు చెప్పబడినవి. అట్లే ప్రకృతియు నదృశ్యత్వాదిగుణములు కలది కాదని బోధించుటకే (అక్షరాత్ పరతః పరః) యక్షరముకంటె పరమైనదానికంటె పరమని పరమాత్మను భిన్నముగా నిట నుపనిషద్వాక్యము స్పష్టము చేసినది. ఈ వాక్యమునందలి యక్షర శబ్దము ప్రకృతివాచకమే: కాని, యా ప్రకృతి తనకంటె దాను సూక్ష్మము - పరము - కానేరదుగదా ! కాబట్టి యీ భేదవ్యపదేశము పరమాత్మని గ్రహించినపుడే సంగతము కాగలదు. పరమాత్మ సర్వాంతర్యామియై ప్రకృతియందును నుండుటచే నయ్యది సూక్ష్మతరము, సూక్ష్మతమము కానొప్పును. అందువలన నదృశ్యత్వాదిగుణములు గలిగి, భూతయోని యగు నక్షరము పరమాత్మయేకాని జీవప్రకృతులు కానేరవని సుస్పష్టము. (౨౨)

ఉపర్యుక్తసిద్ధాంతమును బలపరచుటకు మరియొక హేతువును ప్రదర్శించుచున్నాడు :

రూపోపన్యాసాచ్చ          ౧-౨-౨౩

చ=మరియు, రూపోపన్యాసాత్ = పరమాత్మని రూపకథనమువలనను, జీవప్రకృతులు అక్షరపదవాచ్యములు కానేరవని సూత్రార్థము.

'ఏతస్మాజ్జాయతే ప్రాణో మనః సర్వేంద్రియాణి చ
ఖం వాయుర్జ్యోతి రాపః పృథివీ విశ్వస్య ధారిణీ' ముం. ౨-౧౩

'ఈ ప్రకృతినుండి ప్రాణము, మనస్సు, ఇంద్రియములు, ఆకాశము, వాయువు, అగ్ని, జలము, విశ్వధారిణి పృథివియు నుత్పన్నము లగుచున్నవి' యని ప్రకృతినుండి ప్రాణాదులసృష్టి వర్ణింపబడి, యనంతరమున పరమాత్మనిరూప మిట్లు వర్ణింపబడియున్నది :

'అగ్నిర్ మూర్ధా చక్షుషీ చంద్రసూర్యౌ
దిశః శ్రోత్రే వాగ్ వివృతాశ్చ వేదాః
వాయుః ప్రాణో హృదయం విశ్వ మస్య
పద్భ్యాం పృథివీ హ్యేష సర్వభూతాంతరాత్మా' ముం. ౨-౧౪.

'అగ్ని మూర్ధ, చంద్రసూర్యులు నేత్రములు, దిక్కులు చెవులు, వివృతవేదములు వాక్కు, వాయువు ప్రాణము, విశ్వమంతయు హృదయము, పృథివి పాదములు. అట్టివాడు సర్వభూతముల కంతరాత్మ' యని వర్ణింపబడిన యీ రూపము (లక్షణము) జీవప్రకృతులకు చెల్లనేరదు. ప్రకృతి స్వవికారజాత మగు భూతముల కంతరాత్మయైన నగును. కాని, సర్వభూతముల కంతరాత్మ కానేరదు. మరియు నది జీవులకంటె సూక్ష్మము కాదు. అందువలన ప్రకృతి జీవుల కంతరాత్మ కాజాలదు. ఇట్లే జీవుడును నణురూపుడగుటచే నొకయెడనున్న, మరియొకయెడ నదేసమయమున నుండజాలడు. కాబట్టి యతడును సర్వభూతాంతరాత్మ కాజాలడు. కాగా, పరమాత్మయే సర్వభూతముల కంతరాత్మ యని తేలుచున్నది. అయ్యది (భూతములకేకాక) సర్వభూతములకును - పృథివ్యాది జడపదార్థములకు, చేతనము లగు జీవులకు నంతరాత్మయై యున్నది. ఇంతకు పూర్వపు సూత్రములలో (యో విజ్ఞానే తిష్ఠన్) పరమాత్మ, జీవాత్మల లోను నుండునని యుపనిషద్వాక్య మూలమున వివరింపబడినది. వేదము లందును పరమాత్మని సర్వాంతర్యామిత్వ మిట్లు వర్ణింపబడియున్నది :

'విశ్వత శ్చక్షు రుత విశ్వతో ముఖః
విశ్వతో బాహు రుత విశ్వత స్పాత్' ఋ, ౧౦-౮-౧౬-౩౪

'సహస్రశీర్షా పురుషః సహస్రాక్షః సహస్రపాత్' ఋ. ౮-౪-౧౭-౧.
'పరమపురుష దగు పరమాత్మని నేత్రములు, ముఖము, బాహువులు విశ్వమునంతటను గలవు. అత దంతటను వ్యాపించియున్నా దని భావము.'

కాబట్టి 'పరబ్రహ్మ పరమాత్మయే యదృశ్యత్వాదిగుణములు గలిగి, భూతయోనియై యక్షరపదముచే జెప్పబడుచున్నది. జీవప్రకృగు లట్టివి కావు' అని సర్వవిధముల సిద్ధమగుచున్నది. (౨౩)

## సప్తమాధికరణము

పరమాత్మడు సర్వభూతాధిపతియని నిరూపించుటకు మహర్షి యధికరణాంతరము నారంభించుచున్నాడు:

### వైశ్వానరః సాధారణశబ్దవిశేషాత్ ౧-౨-౨౪

సాధారణ శబ్దవిశేషాత్ = ఆత్మశబ్దవిశేషమువలన, వైశ్వానరః= ఛాందోగ్యమునందు పఠించిన వైశ్వానరుడు, పరబ్రహ్మ పరమాత్మయనియే తెలియనగును.

ఛాందోగ్యోపనిషత్తునందలి పంచమ ప్రపాఠకములో నొక ప్రసంగమిట్లు చూడనగును: ప్రాచీనశాల ప్రభృతి మహాశ్రోత్రియు లైదుగురొకచో జేరి మీమాంసింప బ్రారంభించిరి.

'కో న ఆత్మా? కిం బ్రహ్మేతి?' ఛాం. ౫-౧౧-౧. 'ఆత్మ యననేమి? బ్రహ్మ మేమి?' అని మీమాంసింపదొడగి యొకనిశ్చయము చేయజాలక, వైశ్వానరాత్మ నెరిగినవాడు ఉద్దాలక మహర్షి యని యెంచి వారతనిని సమీపించిరి. ఉద్దాలకమహర్షియు వైశ్వానరాత్మను దెలిపగోరి తనకడ కరుదెంచిన ప్రాచీనశాల ప్రభృతులతో నిట్లనెను:

'అశ్వపతిర్వై భగవంతోఽయం కైకేయః
సంప్రతీమమాత్మానం వైశ్వానర మధ్యేతి,
తం హంతా భ్యాగచ్ఛామ.' ఛాం. ౫-౧౧-౪.

'మహాశయులారా! కేకియదేశాధిపతి యగు నశ్వపతి ప్రస్తుత మీ వైశ్వానరాత్మను బాగుగనెరిగినవాడు. అతనికడకు మనమందరము వెళ్లుద' మని స్పష్టముగాచెప్పి, వారిని వెంటనిడుకొని యశ్వపతినిజేరి వైశ్వానరాత్మ నెఱిగింపుమని యతనిని ప్రార్థించెను. అంతట నా యశ్వపతి వారితో నిట్లనెను: 'వైశ్వానరునకు ద్యులోకము మూర్ధ, సూర్యుడు చక్షువు, వాయువు ప్రాణము, ఆకాశము దేహము, భూమి పాదము' నని ద్యులోకము మున్నగునవి యవయవములుగా చెప్పి, యొక్కొక్క యవయవమును వైశ్వానరబుద్ధితో నుపాసించువారికి క్రమముగ మూర్ధాపతనము, చక్షువిహీనత, ప్రాణోత్క్రమణము, దేహశీర్ణత, బస్తిభేదము, పాదశైథిల్యము కలుగునని నిందించియున్నాడు. అనంతర మా వైశ్వానరునిగూర్చి యిట్లుపదేశించెను:

'య స్త్వేత మేవం ప్రాదేశమాత్ర మభివిమాన
మాత్మానం వైశ్వానర ముపాస్తే స సర్వేషు లోకేషు,
సర్వేషు భూతేషు, సర్వే ష్వాత్మ స్వన్న మత్తి.'
'తస్య హ వా ఏత స్యాత్మనో వైశ్వానరస్య
మూర్ధైవ సుతేజా శ్చక్షు ర్విశ్వరూపః
ప్రాణః పృథగ్ వర్త్మాత్మా సందేహో బహులః,
వ స్తి రేవ రయిః, పృథివ్యేవ పాదౌ, ఉర ఏవ వేదిః,
లోమాని బర్హిః, హృదయం గార్హపత్యః,
మనో ఽన్వాహార్య పచనః, ఆస్య మాహవనీయః'

ఛాం. ౫-౧౮-౧-౨.

'ఈ వైశ్వానరాత్మకు మూర్ధ ద్యులోకము: చక్షువు సూర్యుడు: ప్రాణము వాయువు: దేహమధ్య మాకాశము: మూత్రస్థాన ముదకము: పాదములు పృథివి: ఉరస్సు వేది: రోమములు దర్భలు: హృదయము గార్హపత్యాగ్ని: మన స్సన్వాహార్యము: ఆస్య మాహవనీయము.'

ఈ యుపనిషద్వాక్యమున గల వైశ్వానర పదముచే జాఠరాగ్ని యుపదేశింపబడినదా? లేక భూతాగ్నియా? లేక సూర్యదేవతయా? లేక జీవాత్మయా? లేక పరబ్రహ్మపరమాత్మయా? యని సందేహము. వైశ్వానరశబ్దము పైయర్థములం దన్నిటియందును ప్రయోగింపబడుట జూచుచున్నందున నిట్లు సందేహము గలుగుట సహజము. ఇందు జాఠరాగ్ని ప్రభృత్యర్థములు గ్రహింపదగు ననుట పూర్వపక్షము. కాదు, పరమాత్మయే గ్రహింపదగు ననుట సిద్ధాంతము.

'అయ మగ్ని ర్వైశ్వానరో యో ఽయ మన్తః
పురుషే యే నేద మన్నం పచ్యతే యదిద మద్యతే. బృ. ౫-౯-౧.

'పురుషుడు తినునట్టి యన్నమును పచనముచేయు అగ్ని వైశ్వానరము' అని యిట వైశ్వానరశబ్దము జాఠరాగ్నిని బోధించుచున్నది.

'స ఏషో ఽగ్ని ర్వైశ్వానరః' శతప. ౧౦-౬-౧.

'ఈ యగ్ని వైశ్వానరము' అని శతపథమున వైశ్వానరపదము భూతాగ్నిని దెలుపుచున్నది.

'విశ్వ స్మా అగ్నిం భువనాయ దేవా వైశ్వానరం
కేతు మహ్నా మకృణ్వన్' ఋ. ౮-౪-౧౨-౧౨.

'దేవతలు సమస్తభువనమునకు వైశ్వానరాగ్నిని దినములకు కేతువుగా నొనర్చిరి' ఇట సూర్యదేవతార్థమున వైశ్వానరశబ్దము ప్రయోగింపబడినది.

'వైశ్వానరః ప్రవిశత్యతిథిర్ బ్రాహ్మణో గృహాన్' కఠ. ౧-౭.

'వైశ్వానరుడు - బ్రాహ్మణాతిథి - గృహమునకు వచ్చియున్నాడు.' ఇట వైశ్వానరపదము జీవాత్మకై యుపయోగింపబడినది.

ఇట్లు ఉపర్యుక్తవాక్యములలోని వైశ్వానరపదము జాఠరాగ్న్యాద్యర్థములను దెల్పుచున్నది. కాబట్టి యీ ప్రసిద్ధార్థములలో నేదో యొక యర్థమే వైశ్వానరపదముచే గ్రహింపబడుట యుక్తమని ప్రాప్తింపగా: నా యర్థములిట గ్రాహ్యములుకావు. పరమాత్మయే గ్రాహ్యమని సిద్ధాంతము.

ఉపనిషద్వాక్యమునందు కేవల వైశ్వానరశబ్దము ప్రయోగింపబడియున్న పక్షమున దానికి నుపర్యుక్తార్థములలో నేదో యొక యర్థము చెప్పవచ్చును. కాని, వైశ్వానరశబ్ద మిట యాత్మశబ్దముతో విశిష్టమై యున్నది. (ఆత్మానం వైశ్వానర ముపాస్తే). అందువలన పరమాత్మ యను నర్థమే యిట వైశ్వానర శబ్దముచే గ్రహింపనగును. అటనట నుండు ప్రయోగములంబట్టి ఆత్మశబ్దము పరమాత్మవాచక మగుట సుప్రసిద్ధమే.

'ఆత్మానం ధీర మజరం యువానమ్' అథ. ౧౦-౮-౮-౪౪.

'ఆత్మ ధీరము, అజరము, యౌవనవంతమును.'

'తస్మాద్వా ఏతస్మా దాత్మన ఆకాశః సంభూతః' తై. ౨-౧.

'అట్టి యాత్మవలన నాకాశము జనించినది.'

అను నీ ప్రయోగములం దాత్మశబ్దము పరమాత్మవాచక మని స్పష్టముగా దెలియుచున్నది. కావున నాత్మశబ్దముతోగూడిన వైశ్వానరశబ్దము కూడ పరమాత్మబోధకమే కావలయును. జాఠరాగ్ని మున్నగు నర్థముల నది బోధింపదు.

మరియు ప్రారంభమున (కో న ఆత్మా, కిం బ్రహ్మ) మన యాత్మ యేమి? బ్రహ్మ మేమి? అని యాత్మశబ్దానంతరమున బ్రహ్మశబ్దము గ్రహింపబడినది. ఎందుల కట్లు గ్రహింపబడినది? కేవల మాత్మశబ్దము

ప్రయోగించి యూరకున్నపక్షమున నా యాత్మ శబ్దముచే జీవాత్మను గ్రహింపగలరని యెంచి యట్టి భ్రమను దూర మొనర్చుటకు గాను 'కిం బ్రహ్మ' అని బ్రహ్మపద మిట గ్రహింపబడినది. కావున నీ ప్రకరణ మున పరమాత్మవిషయమే ప్రారంభింపబడిన దనుట యుక్తము. ఇ ట్లుపక్రమింపబడిన పరమాత్మను వ్యక్త మొనర్చుటకే తరువాత వైశ్వానర శబ్ద మాత్మశబ్దముతో జోడించి చెప్పబడిన దని చెప్పుట యెంతయు నుప యుక్త మగును. అప్పుడే ఉపక్రమోపసంహారములలో నేక వాక్యతయు నేర్పడును. ఇంతేకాక, వైశ్వానరశబ్దముచే జాఠరాగ్ని ప్రభృత్యర్థములలో నే యర్థమును గ్రహించినను,

> 'తస్యహ వా ఏత స్యాత్మనో వైశ్వానరస్య
> మూర్ధైవ సుతేజా శ్చక్షు ర్విశ్వరూపః ఛాం. ౫–౧౮–౨.

'అట్టి వైశ్వానరాత్మకు ద్యులోకము మూర్ధ' యను నీ కల్పన సుసం గతము కానేరదు. వైశ్వానరశబ్దముచే జీవాత్మ గ్రహింపబడినపక్షమున జీవాత్మ యణువు కావున ద్యులోకము జీవాత్మకు మూర్ధ యెట్లగును ? ఎన్నటికిని కాజాలదు. పరమాత్మ సర్వభూతాంతరాత్మయై సర్వాధారమగు టచే ద్యులోకము మూర్ధయని కల్పించుటలో నెట్టివైరుధ్యము నుండదు. కాబట్టి వైశ్వానరపద మీ ప్రకరణమున పరమాత్మబోధకమే యనుట నిస్సం దిగ్ధ మని తెలియుచున్నది. (౨౪)

## స్మర్యమాన మనుమానం స్యాదితి ౧-౨-౨౫

స్మర్యమాణం = స్మరింపజేయబడుచున్న పరమేశ్వరునిరూపము అనుమానం స్యాత్ = లింగము కాగలదు. ఇతి = అందువలన, వైశ్వానర శబ్దము పరమాత్మవాచకమే యని సూత్రార్థము.

'యస్య భూమిః ప్రమా౽ న్తరిక్ష ముతోదరం
దివం య శ్చక్రే మూర్ధానం తస్మై జ్యేష్ఠాయ బ్రహ్మణే నమః'
అథ. ౧౦-౭-౩౨.

'యస్య సూర్య శ్చక్షు శ్చంద్రమాశ్చ పున ర్ణవః
అగ్నిం య శ్చక్ర ఆస్యం తస్మై జ్యేష్ఠాయ బ్రహ్మణే నమః'
అథ. ౧౦-౭-౩౩.

'ఎవనికి భూమి పాదపీఠమో, అంతరిక్ష ముదరమో, ద్యులోకము మూర్ధమో,

'ఎవనికి సూర్యచంద్రులు నేత్రములో, అగ్ని యాస్యమో యట్టి జ్యేష్ఠ బ్రహ్మకు నమస్కారము' అని వేదమంత్రములలో పరమాత్మరూపము వర్ణింపబడినది. ఇట్లే

'అగ్నిర్మూర్ధా చక్షుషీ చంద్రసూర్యౌ
దిశః శ్రోత్రే వాగ్ వివృతాశ్చ వేదాః
వాయుః ప్రాణో హృదయం విశ్వ మస్య
పద్భ్యాం పృథివీ హ్యేష సర్వభూతాంతరాత్మా' ముం. ౨-౧-౪.

ముండకమునందును వర్ణింపబడినది. వేదమునందును, ఉపనిషత్తు వందును వర్ణింపబడిన యీ పరమాత్మనిరూపమే యిట ఛాందోగ్యము నందును స్మరింపబడినది - జ్ఞప్తికి తేబడినది. అందువలన నియ్యది పరమాత్మను బోధించుటకు లింగముగా వర్తించును.

'తస్య హవా ఏత స్యాత్మనో వైశ్వానరస్య
మూర్ధైవ సుతేజాః, చక్షు ర్విశ్వరూపః
ప్రాణః పృథగ్ వర్త్మాత్మా, సందేహో బహులః
వస్తి రేవ రయిః, పృథివ్యేవ పాదౌ, ఉర ఏవ వేదిః

లోమాని బర్హిః, హృదయం గార్హపత్యః
మనో ఽన్వాహార్యపచనః, ఆస్య మాహవనీయః'

ఛాం. ౫-౧౮-౧-౨.

'ఈ వైశ్వానరాత్మకు ద్యులోకము మూర్ధ, సూర్యుడు చక్షువు, వాయువు ప్రాణము, బహులము - సర్వగతమగు నాకాశము దేహమధ్యము, జలము (రయి) మూత్రము, పృథివి పాదములు, వేది యురస్సు, ఆస్తీర్ణ దర్భలు రోమములు, గార్హపత్యాగ్ని హృదయము, అన్వాహార్యాగ్ని మనస్సు, ఆహవనీయ మాస్యము.' ఇది వైశ్వానరరూపము. ఇయ్యది పూర్వము వేదమంత్రములందు వర్ణింపబడిన పరమబ్రహ్మ పరమాత్మ రూపమును స్మరింపజేయుచు నిందలి వైశ్వానరపదము పరమాత్మకే బోధక మని తెలుపుచున్నది. (౨౫)

ఉపర్యుక్త విషయమునే శంకించి మహర్షి సమాధాన మిట్లు చెప్పుచున్నాడు:

శబ్దాదిభ్యో ఽన్తః ప్రతిష్ఠానాచ్చ నేతిచేత్
న, తథా దృష్ట్యుపదేశా దసంభవాత్
పురుష మపి చైన మధీయతే ౧-౨-౨౬

శబ్దాదిభ్యః = (వైశ్వానరశబ్దము) మూర్ధాద్యవయవకథనము మున్నగువానివలన, అంతఃప్రతిష్ఠానాత్ చ = శరీరములోనున్నందునను, న = వైశ్వానరశబ్దము పరమాత్మగ్రాహకముకాదు. ఇతిచేత్ = అని యందురేని, న = అట్లనరాదు. కారణమేమన : తథాదృష్ట్యుపదేశాత్ = వైశ్వానరశబ్దము పరమాత్మార్థమునందును ప్రసిద్ధమైనందువలన, అసంభవాత్ = అన్యజీవాత్మాద్యర్థములందు మూర్ధాద్యవయవదృష్టి యసంభవ మగుటవలనను, పురుష మపి చ = శరీరాంతఃస్థిత చైతన్యముగ కూడ,

ఏనమ్ = వైశ్వానరుని, అధీయతే = చదువుచున్నారు. అందువలన వైశ్వానరశబ్దము పరమాత్మవాచకమే.

వైశ్వానరశబ్దము జాఠరాగ్ని మున్నగు నర్థముల బోధించుటలో ప్రసిద్ధమైయున్నందున, నయ్యది పరమాత్మవాచకమనుట యుక్తముకాదు. మరియు వైశ్వానరపదముచే పరమాత్మ గ్రహింపదగునేని పరమాత్మకు దేహములేనందున మూర్ధాద్యవయవ వర్ణనము సమంజసము కాదు. ఇంతే కాక వాజసనేయులు వైశ్వానర విద్యయందు వైశ్వానరుని, (పురుషే౽న్తః ప్రతిష్ఠితం వేద) పురుషుని యందంతఃస్థితుడని చెప్పుదురు. పరమాత్మ పరమ - మహత్ పరిమాణము కలదగుటవలన నయ్యది పురుషాన్తఃస్థిత మనుటయు నొప్పదు. కాబట్టి వైశ్వానరశబ్దమిట జాఠరాగ్నినో లేక జీవాత్మనో బోధించుననుట యుక్తమగును; కాని పరమాత్మను బోధించుననుట యుక్తముకాదని ప్రాప్తింపగా - సమాధానము :

వైశ్వానరశబ్దము జాఠరాగ్ని యను నర్థమున ప్రసిద్ధమై పరమాత్మార్థమున ప్రసిద్ధము కాదనరాదు. ఉపనిషద్ వాక్యమున వైశ్వానరశబ్ద మొక్కటియే ప్రయోగింపబడి, ఆత్మశబ్దముచే నయ్యది విశిష్టము కానిపక్షమున జాఠరాగ్ని నది బోధించుననుట యుక్తమగును; కాని, ఆత్మశబ్దముతో గూడియున్నందున నిట వైశ్వానరశబ్దము పరమాత్మనే బోధించును. జాఠరాగ్నిని బోధింపదు. అట్లు తెలుపు నందుమేని విశేషణపదము వ్యర్థము కాగలదు. కావున పరమాత్మయే యిట గ్రాహ్యము.

ఉపనిషద్వాక్యములందు వర్ణింపబడిన మూర్ధాద్యవయవములు పరమాత్మయం దెట్లు సంగతములు కాగలవందురేని - అదియును దోషము కాదు. ఇట్లు వర్ణింపబడిన యవయవములచే పరమాత్మ యవయవి యగునేమో యని భయపడవలసిన యవసర మొందును లేదు. మూర్ధాదు లట్టి యభిప్రాయముతో వర్ణింపబడినవి కావు. ప్రాచీనశాల ప్రభృతి మహర్షులు

పృథివి మొదలు ద్యులోకమువరకుగల ప్రదేశములలో నొక్కొక్కటి వైశ్వానరాత్మగా నెంచి, యుపాసించి మూర్ధపతనాద్యనర్థముల నందకుండుటకై పరమాత్మని సమగ్రమగు విరాట్‌రూపమును దెలుప నెంచి కరుణార్ద్రహృదయు డగు నశ్వపతి మూర్ధాద్యవయవములను ద్రష్టవ్యత్వాభిప్రాయముతో వర్ణించియున్నాడు. పరబ్రహ్మ పరమాత్మ నిరాకారమై సర్వగతమగుటచే నందు మూర్ధాద్యవయవములు వాస్తవముగ నెన్నడు సంభవములుకావు. అయినను నాత్మసంతోషార్థము పరమాత్మన కేదేని రూపము కల్పింప సమకట్టుదుమేని ద్యులోకాదు లతనికి మూర్ధాద్యవయవములుగా కల్పింపనగును. మరి యొండేమియు కాదని భావము. భగవాన్ వైశ్వానరుడు సర్వాంతరాత్మయే. సర్వాధారుడగుటచే శరీరమునందు జీవాత్మ యుండునట్లు ద్యులోకాదులలో నెల్లయెడల నున్న ట్లెంచవలయును.

(తదంతరస్య సర్వస్య) 'పరమాత్మ సర్వప్రపంచాంతర్వర్తి' యని వేదము, (ఏకోవశీ సర్వభూతాంతరాత్మా) 'పరమాత్మయొక్కడే సర్వభూతాంతరాత్మ' యని కఠోపనిషత్తును చెప్పుచున్నవి. కావున పరమాత్మ పురుషాంతఃస్థిత మనుటలో రాగల దోష మొండును లేదు. శరీరాంతఃస్థితులమయిన అస్మదాదులకు (జీవులకు)వలె బ్రహ్మాండమునం దంతట నుండు పరమాత్మకు ద్యులోకాదుల నవయవములుగా వర్ణించుట విరుద్ధము కాదు.

> 'వయా ఇదగ్నే। అగ్నయ స్తే అన్యే త్వే విశ్వే అమృతా మాదయంతే,
> వైశ్వానర। నాభిరసి క్షితీనాం స్థూణేవ జనాన్ ఉపమిద్ యయన్థ'
> ఋ. ౧-౪-౨౫-౧.

'అగ్నే=ప్రకాశస్వరూపుడవగు నో పరమాత్మన్। అన్యే అగ్నయః = ఇతరాగ్నులు, తే=నీకు, వయాఇత్=అవయవములే, త్వే=విశ్వాత్మకమగు నీయందు, విశ్వే=ఎల్లరు, అమృతాః = ముక్తులై, మాదయన్తే=

ఆనందము ననుభవించుచున్నారు. వైశ్వానరః = విశ్వాధిపుడవగు స్వామీ! క్షితీనాం=సర్వపదార్థములకు, నాభిరసి = అంతరాత్మరూపమున మధ్యలోనుందువు, జనాన్=సర్వప్రాణులను, స్థూణేవ = గృహాంతర్భాగముననుండు స్తంభమువలె, ఉపమిద్ యయన్థ = ధారకుడవై ధరించుచున్నావు.

అని యిట్లు వేదమంత్రమునందు కల్పింపబడిన యవయవకల్పన వైశ్వానర పరమాత్మయం దసంగతము కాదు. సర్వాంతర్యామియై, సర్వాధారు డగు పరమాత్ముని వర్ణించుట కిట్టి శైలి యటనట గ్రహింపబడుట చూడనగును. అంతమాత్రమున నవయవకల్పన సత్యముగానెంచి, భయమంద నవసరము లేదు.

వాజసనేయులు వైశ్వానరుని పురుషాంతర్వర్తి యని చెప్పినట్లు పురుషుడనియు చెప్పుదురు.

'స ఏషోఽగ్ని ర్వైశ్వానరో యత్ పురుషః
స యో హైత మేవ మగ్నిం వైశ్వానరం,
పురుషవిధం పురుషేఽన్తః ప్రతిష్ఠితం వేద.' శత. ౧౦-౬-౧-౧౧.

కాబట్టి వైశ్వానర శబ్దము పరబ్రహ్మ పరమేశ్వర వాచకమే యగును. కాని, జాఠరాగ్న్యాది వాచకము కాదు. (౨౬)

## అత ఏవ న దేవతా భూతం చ ౧-౨-౨౭

అతఏవ = పూర్వప్రదర్శిత కారణములవలననే, దేవతాభూతం చ న=సూర్యదేవతయు కాదు, భూతాగ్నియును గాదు.

ఈ సూత్రమునందు భూతపద మగ్నికిని, దేవతాపదము సూర్యునకును వాడబడినవి. సూర్యు డగ్నిమయుడు. ద్యులోకమున ప్రకాశించును. ద్యోతనము (ప్రకాశము) వలనను, ద్యుస్థానమునం దుండుటవలనను

సూర్యుడు దేవత యనబడుచున్నాడు. ఇట్లే దేవతాశబ్దము నైరుక్తులు నిర్వచించిరి.

'దేవో దానాద్వా దీపనాద్వా ద్యోతనాద్వా,

ద్యుస్థానో భవతీతి వా' నిరు. ౭-౫.

'దానము, దీపము, ద్యోతనము, ద్యుస్థానము ననుగుణములద్వార ఘున దేవత యనబడును.'

అగ్నికాని, సూర్యుడుకాని యిట వైశ్వానరపదవాచ్యములు కావు. భూతాగ్నికిగాని సూర్యునకుగాని ద్యులోకాదులు మూర్ధాద్యవయవములుగా కల్పించుటయు సంగతము కాదు. మరియు నయ్యవి సర్వాంతర్యాములై సర్వాధారము అనుటకును దగవు. అందువలన పురుషాంతఃస్థితములై పురుషపదవాచ్యములును గావు. కావున వైశ్వానరపదము పరమాత్మవాచకమే యగును. కాని సూర్యాదులకు వాచకము కాదు. (౨౭)

వైశ్వానరపదము యౌగికవృత్తితో పరమాత్మయందే వర్తించు ననుటకు మహర్షి మతాంతరమును ప్రదర్శించుచున్నాడు:

సాక్షాదప్యవిరోధం జైమినిః ౧-౨-౨౮

జైమినిః=జైమినిమహర్షి, సాక్షదపి=యౌగికవృత్తితోను, అవిరోధం=వైశ్వానరశబ్దము పరమాత్మబోధక మనుటలో విరోధము లేదని యంగీకరించుచున్నాడు.

ఆత్మశబ్దవిశిష్ట వైశ్వానరశబ్దము పరమాత్మవాచకమైనట్లు, కేవల వైశ్వానరపదము కూడ యౌగికవృత్తితో పరమాత్మనే తెలుపును. (విశ్వేషాం = సమస్తచేతనములకు, నేతా = కర్మఫలముల నందజేయువాడు: స్వామి – అధిష్ఠాత. కావున పరమాత్మ విశ్వానరు డనబడుచున్నాడు.)

'నరే సంజ్ఞాయాం' అష్టా. ౬-౩-౧౨౯. అను పాణిని సూత్రము ననుసరించి విశ్వశబ్దమునకు దీర్ఘమేర్పడుచున్నది. విశ్వానరుడే వైశ్వా

నరుడు.(విశ్వేచ ఇమే నరాః విశ్వానరాః, తేషాం అయ మితి వైశ్వానరః)
వైరుక్తులు వైశ్వానరశబ్దము నిట్లు నిర్వచించుచున్నారు:

'వైశ్వానరః కస్మాత్? విశ్వాన్ నరాన్ నయతి,
విశ్వ ఏనం నరా యన్తీతి వా.' నిరు. ౭-౬-౧.

'ఎందువలన వైశ్వానరు డనబడుచున్నాడు? సమస్తజీవులకు కర్మ ఫలముల నందజేయును. లేక యెల్లరు స్వస్వకర్మఫలముల నర్థించుచు నితనిని జేరుదురు.'

ఇట్లు విశ్వస్వామిత్వము పరమాత్మకు జెల్లును; కాని, యన్యుం కియ్యది యొప్పదు. పరబ్రహ్మ పరమాత్మయే జడచేతనాత్మకములగు నెల్ల పదార్థములకు స్వామి - రాజు.

'యః ప్రాణతో నిమిషతో మహిత్వైక ఇద్రాజా జగతో బభూవ.'
ఋ. ౧౦-౭౧-౨౧-౩.

'అతడే భూతభవిష్యద్వర్తమానాత్మకమగు ప్రపంచమున కధిష్ఠాత.'

'యో భూతంచ భవ్యంచ సర్వం య శ్చాధితిష్ఠతి.' అథ. ౧౦-౮-౧.

'పరమేశ్వరుడు భూతభవిష్యద్వర్తమానకాలముల నతిక్రమించి విరాజిల్లుచున్నాడు.'

'ప్రాణాయ నమో యస్య సర్వ మిదం వశే యోభూతః సర్వస్యే శ్వరో యస్మిన్ సర్వం ప్రతిష్ఠితమ్' అథ. ౧౧-౨౪-౧.

'ఎవనియందు సర్వము ప్రతిష్ఠితమై యున్నదో, యెవడు సర్వేశ్వరుడో, సర్వము నెవని వశమున నున్నదో, యట్టి ప్రాణరూప పరమేశ్వరునకు నమస్కారము.

అని యిట్లు వేదములు పరమేశ్వరుని సర్వాధిపత్యము నుద్ఘోషించుచున్నవి. సర్వలోకాంతర్యామిత్వము సర్వకర్మఫలదాతృత్వము, సర్వనాయకత్వమును పరమాత్మయందే కలవు. కావున వైశ్వానరపదము పరమాత్మ వాచకమే యగునని భావము. (౨౮)

పరమాత్మయందు కొండొక ప్రాదేశవృత్తిత్వము గలదని చెప్పుటయు నసంగతము కాదని తెలుపదలచి ముందుగా మహర్షి యితరుల మతము నుల్లేఖించుచున్నాడు.

అభివ్యక్తే రి త్యాశ్మరథ్యః ౧-౨-౨౯

అభివ్యక్తేః=(ఉపాసకులకు హృదయమున నాత్మోపలబ్ధి కలుగుట యభివ్యక్తి యనబడును.) అట్టి యభివ్యక్తి కారణముగ, పరమాత్మ ప్రాదేశమాత్ర మని చెప్పబడుచున్నది. ఇతి ఆశ్మరథ్యః = అని యాశ్మరథ్యాచార్యుని మతము.

మోక్షము నపేక్షించువారు అనన్యభక్తితో పరమాత్మను శాస్త్రీయ విధానముల ననుసరించి యుపాసింతురు. ప్రకృతిని, దాని కార్యజాతమును విడిచి, వారు క్రమముగా నాత్మస్థితు లగుదురు. నాడు వారికి కరుణాళుడు, భక్తవత్సలుడు నగు భగవానుడు హృదయమునందే సాక్షాత్కరించును - అభివ్యక్త మగును. హృదయపుండరీకము భౌతిక మగుటచే నయ్యది ప్రాదేశమాత్ర మని శరీర విజ్ఞానవేత్తలు వ్యవహరింతురు. ప్రాదేశమాత్రమున పరమాత్మ ప్రత్యక్ష మగుటచే నతడు ప్రాదేశమాత్రు డనియు వ్యవహరింపబడుచున్నాడు. ప్రాదేశమాత్రు డనినను, నంగుష్ఠమాత్రు డనినను భేద మావంతయును లేదు. ఈ రెండుపదములును పరమేశ్వరవాచకములుగా నుపనిషత్తులందు జూడ నగును.

'అంగుష్ఠమాత్రః పురుషో ఽన్తరాత్మా
సదా జనానాం హృదయే సన్నివిష్టః' కఠ. ౬-౧౭.

'అంగుష్ఠమాత్రుడు, నంతరాత్ముడు నగు పురుషుడు జనుల హృదయమున నెల్లపుడు సన్నివిష్టుడై యున్నాడు.'

కాబట్టి వైశ్వానరపదముచే గ్రహింపబడు నా పరమేశ్వరుడు ప్రాదేశమాత్రుడని వ్యవహరింపబడుటలోను దోషములేదని భావము. (౨౯)

### అనుస్మృతేర్ బాదరిః ౧-౨-౩౦

(ముందుగా విని తరువాత స్మరించుట - చింతనచేయుట = అను స్మృతి యనబడును.)

అనుస్మృతేః = అనుస్మరణము కారణముగ పరమాత్మ ప్రాదేశ మాత్రుడని వ్యవహరింపబడుచున్నట్లు బాదరి ముని యభిప్రాయపడు చున్నాడు.

పరమాత్మనిగూర్చి శాస్త్రముఖమున విని, యనంతరము తత్సాక్షాత్కారముకొఱకు ముముక్షువులు హృదయమున నెల్లపుడు నతనిని స్మరించుచుందురు. ఇయ్యదియే యుపాసన మనబడును. శాస్త్రవిదులయిన యోగులు హృదయపుండరీకమును ప్రాదేశమాత్ర మని వ్యవహరింతురు. కావున నం దుపాసింపబడు పరమాత్ముడును ప్రాదేశమాత్రు దని వ్యవహరింప బడుట దోషావహము కాదని బాదరి ముని పలుకుచున్నాడు. (౩౦)

### సంపత్తే రితి జైమినిః, తథా హి దర్శయతి ౧-౨-౩౧

జైమిని, సంపత్తేః=సంపాదన నిమిత్తముగా (ప్రాదేశమాత్ర వ్యపదేశ మని చెప్పుచున్నాడు.) తథా హి=అట్లే, దర్శయతి = వాజసనేయ బ్రాహ్మణము నుదాహరించుచున్నాడు.

వైశ్వానరున కంగములుగా వర్ణింపబడిన ద్యులోకాదిప్రదేశములు, ప్రాదేశమాత్రమున - మూర్ధ మొదలు చుబుకమువరకు నుండు ముఖ ప్రదేశమున, సంపాదించుట - అనగా మూర్ధ, చక్షువులు, నాసిక ముఖము నందలి జలము, గడ్డము నను నవయవములతో వైశ్వానరుడు పోల్చి చెప్పబడుట సంపత్తి యని సూత్రమున వ్యవహరింపబడినది.

వైశ్వానరుడు వాజసనేయ బ్రాహ్మణమున నిట్లు సంపాదింపబడుటచే - వర్ణింపబడుటచే - ప్రాదేశమాత్ర శబ్దముచే వ్యవహరింపబడుచున్నాడని జైమినిముని యభిప్రాయపడుచున్నాడు.

ద్యుప్రభృతి పృథివివరకు గల ప్రదేశములు వైశ్వానరునకు మూర్ధాద్యవయవములుగా వర్ణింపబడుట శతపథమున నిట్లు చూడనగును :

'ప్రాదేశమాత్ర మివ హవై దేవాః సువిదితా అభిసంపన్నాః,
తథా ను వః ఏతాన్ వక్ష్యామి, యథా ప్రాదేశమాత్ర మేవాభి
సంపాదయిష్యా మీతి, స హో వాచ,
మూర్ధాన ముపదిశన్ ఉవాచైషవా అతిష్ఠా వైశ్వానర ఇతి
చక్షుషీ ఉపదిశన్ ఉవాచ ఏష వై సుతేజా వైశ్వానర ఇతి,
నాసికే ఉపదిశన్ ఉవాచ ఏష వై పృథగ్ వర్త్మాత్మా వైశ్వానర ఇతి,
ముఖ్యమాకాశ ముపదిశన్ ఉవాచైషవై బహులో వైశ్వానర ఇతి,
ముఖ్యా ఆప ఉపదిశన్ ఉవాచైష వై రయిః వైశ్వానర ఇతి,
చుబుక ముపదిశన్ ఉవాచ ఏష వై ప్రతిష్ఠా వైశ్వానర ఇతి'
శత. ౧౦-౬-౧-౧౦-౧౧.

'ప్రాదేశమాత్రముగ దేవతలు సంపాదింపబడి - వర్ణింపబడి - బాగుగ దెలియబడుచున్నారు. అట్లే యా దేవతలను మీకు జెప్పి ప్రాదేశమాత్రమున సంపాదింతును.' అత డిట్లనెను : మూర్ధ నుపదేశించుచు నీ ద్యులోకము (అతిష్ఠా) వైశ్వానరునకు మూర్ధ యనెను. చక్షువుల నుపదేశించుచు నీ సూర్యుడు (సుతేజాః) వైశ్వానరునకు చక్షువు లనెను. నాసిక నుపదేశించుచు వాయువు (పృథగ్ వర్త్మాత్మా) వైశ్వానరుని ప్రాణమనెను. ముఖమునందలి యాకాశము నుపదేశించుచు ఆకాశము (బహులః) వైశ్వానరుని దేహమధ్య మనెను. ముఖమునందలి జలమును నిర్దేశించి యిది వైశ్వానరుని (రయిః) మూత్ర మనెను. చుబుకము (గడ్డము) నుపదేశించుచు నియ్యది వైశ్వానరుని పాదములు (ప్రతిష్ఠా) అనెను.

ఇట్లు మూర్ధ, చక్షువులు, ముఖమునగల యాకాశము, జలము మున్నగునవన్నియు ద్యులోకాదులతో బోల్చి వైశ్వానరుడు ప్రాదేశమాత్రమున వర్ణింపబడినాడు. ప్రాదేశ మిట నొక కొలతను - పరిమాణమును -

తెలుపును. వైశ్వానరుని యంగము లన్నియు ప్రాదేశమాత్రమున వర్ణింప బడుటయే యిట నీసూత్రమున సంపత్తి యనబడినది. అందువలన వైశ్వానరుడు ప్రాదేశమాత్రముగ వ్యవహరింపబడుట సంపత్తినిమిత్తక మని జైమినిమహర్షి యాశయము. (౩౧)

ఇఁకను వ్యాసమహర్షి స్వమతమును నిట్లు తెలుపుచున్నాడు :

ఆమనన్తి చైన మస్మిన్ ౧-౨-౩౨

ఏనమ్=వైశ్వానరుని, అస్మిన్=ప్రదేశమున, (దివము మొదలు పృథివివరకు గల ప్రదేశమునందు) ఆమనన్తి=అవయవిగా జూడదగు నని ఛాందోగులు చెప్పుచున్నారు. కావున వైశ్వానరుడు ప్రాదేశమాత్రు డని వ్యవహరింపబడుచున్నాడు.

ప్రాదేశమాత్రమున నభివ్యక్తి, యనుస్మృతి, సంపత్తియు కారణముగ వైశ్వానరుడు ప్రాదేశమాత్ర మని వ్యపదేశింపబడడు: కాని ద్యులోకాది ప్రదేశములు నిమిత్తముగా నట్లు వ్యవహరింపబడుచున్నాడని వ్యాసమహర్షి యాశయము. జగత్తును వివరించి తెలుపుటకుగాను, ద్యులోకము, ఆకాశము, వాయువు, జలము, పృథివి మున్నగు విభాగములు చేయబడి శాస్త్రమునం దుపదేశింపబడుచున్నవి.

ఆ ద్యులోకాదులు పరమాత్మకు మూర్ధాద్యవయవములుగా కల్పించి చెప్పిన పరమాత్మని సర్వాంతర్యామిత్వము, సర్వవ్యాపకత్వము, సర్వాధిష్ఠాతృత్వము బాగుగ బోధపడగలవు. అందువలన ఛాందోగు లా యా ప్రదేశములను పరమాత్మ కవయవములుగా కల్పించి యుపదేశించియున్నారు. అందువలననే వైశ్వానరుడు ప్రాదేశమాత్ర పదముచే వ్యపదేశింపబడుచున్నాడు; కాని మరియొక నిమిత్తమున కాదని వ్యాసమహర్షి యభిమతము. (౩౨)

వేదాంత దర్శన - అంబా వ్యాఖ్యానమున

ప్రథమాధ్యాయమునందు ద్వితీయపాదము

సమాప్తము

# ప్రథమాధ్యాయము

## తృతీయపాదము

### ప్రథమాధికరణము

సర్వజ్ఞము, సర్వశక్తిమంతమునగు పరమాత్మ జగజ్జన్మాదులకు హేతువనియు, విశ్వమునకు స్వామియనియు నిరూపింపబడినది. అతని విశ్వస్వామిత్వము కూడ నతడు విశ్వమున కంతరాత్మయై, విశ్వాధారమైనందుననే కాని తాటస్థ్యమువలన కాదని మహర్షి సూత్రమును రచించుచున్నాడు.

**ద్యుభ్వాద్యాయతనం స్వశబ్దాత్ ౧-౩-౧**

(ద్యు + భూ + ఆది + ఆయతనం)

ద్యుభ్వాద్యాయతనం = ద్యులోకము, భూలోకము మున్నగు లోకముల కాధారము, బ్రహ్మమని యెరుగవలెను. కారణమేమన: స్వశబ్దాత్ = (స్వశబ్దమున నాత్మ శబ్దము) ఆత్మశబ్దముచే జెప్పబడుటవలన.

"యస్మిన్ద్యౌః పృథివీ చాంతరిక్ష
మోతం మనః సహ ప్రాణైశ్చ సర్వైః,
తమేవైకం జానథ ఆత్మాన
మన్యా వాచో విముంచథామృతస్యైష సేతుః"

ముం. ౨-౨-౫

'ఎవనియందు ద్యులోకము, పృథివి, అంతరిక్షము మనః సహిత జీవులతోగూడినవై యాశ్రయించియున్నవో, యతని నొక్కనినే యాత్మగా - పరమాత్మగా నెరుగుడు. ఇతర వాక్యములు విడువుడు. తరణమున కతడే సేతువు.' అని ముండకోపనిషత్తునందు పఠింపబడియున్నది.

ఇట త్రిలోకముల కాధారముగ వర్ణింపబడిన యాత్మ జగదుపాదాన కారణమగు ప్రకృతియా లేక జీవాత్మయా ? లేక పరమాత్మయా ? యని సందేహము. ప్రకృతి జీవాత్మలు ననుట పూర్వపక్షము. కాదు, పరమాత్మయే యనుట సిద్ధాంతము.

పూ. ప : ప్రకృతియే యిట యాత్మపదవాచ్య మనుట యుక్తము. కారణము నాశ్రయించి కార్యజాతముండును. తంతువులలో పటము, కపాలములలో ఘటము, సువర్ణమున కుండలములు నుండుట లోకవిదితము. ద్యులోకాదులతో గూడిన విశ్వమంతయు ప్రకృతి జనితము, ప్రకృతి విశ్వమున కుపాదానకారణము. కావున విశ్వమంతయు ప్రకృతి నాశ్రయించి యుండును. కార్యము ఉపాదానకారణమును విడిచి మరియొకట నుండదు కదా! కాబట్టి విశ్వమునకు - ద్యుభ్వాదులకు ప్రకృతియే యాశ్రయము - ఆయతనము - ఆధారము. అందువలననదియే యమృతత్వప్రాప్తికి సేతువని యుపనిషత్తునందు వర్ణింపబడినది. అమృతమనగా బ్రహ్మము. అట్టి బ్రహ్మము తనకుదానే సేతువెట్లగును ? కాబట్టి యమృతరూప బ్రహ్మమునకు ద్యులోకాదుల కాయతనమగు ప్రకృతియే సేతువనుట యుక్తియుక్తము. మరియు బ్రహ్మమపారము; సేతువు పారముగలది. కావునను బ్రహ్మ మమృతమునకు సేతువనుట సంగతము కాదు. కాబట్టి ప్రకృతియే యిట నాత్మపదవాచ్యమని చెప్పవలసియున్నది.

లేక, ద్యుభ్వాద్యాయతనము జీవాత్మయైనను కావచ్చును. జీవాత్మ భోక్త. లోకములన్నియు నతనికి భోగ్యములు. భోక్తలేని భోగ్యపదార్థములు వ్యర్థము లగును. అందువలన భోక్తయగు జీవాత్మ భోగ్యముల కాశ్రయుడగుచు ద్యుభ్వాది లోకముల కాయతనముగ జెప్పనొప్పుచున్నాడు. ఉపనిషత్తునందు వర్ణింపబడిన ప్రాణసహిత మనః సంబంధము కూడ జీవాత్మకున్నది. కాబట్టి జీవాత్మయే ద్యుభ్వాద్యాయతనమై యాత్మశబ్దముచే గ్రాహ్యమగుచున్నదని ప్రాప్తింపగా - సమాధానము :

ఉపనిషద్వాక్యమునందు ద్యులోకాదుల కాయతనముగా నేది చెప్ప బడినదో యదియే యాత్మయని యెరుగుమని యంతమునజెప్పబడినది. జగదుపాదాన కారణమగు ప్రకృతియే ద్యుభ్వాదిలోకముల కాయతనమని చెప్పుట యుపనిషత్తునకు వివక్షితమగు నెడల నంతమున నయ్యది యాత్మ (తమే వైకం జానథ ఆత్మానమ్) యని యాత్మ శబ్దముచే చెప్పియుండె దిదికాదు. ప్రకృతి యాత్మశబ్దముచే వ్యవహరింపబడుటయు నపూర్వము. ప్రకృతి తన నుండి జనించిన మహదాదికార్యజాతమునకు కారణరూప మున నాశ్రయమైనను, ద్యుభ్వాదిలోకాత్మక జగత్తున కది యాయతనము కాదు. జగత్తునందు ప్రకృతికార్యములైన ద్యుభ్వాదిలోకములేకాక మనః సహితచేతన జీవాత్మలు నెన్నియో యున్నవి. వానితోగూడిన జగత్తునకు ప్రకృతి యాయతనముకాదు. జడచేతనాత్మకమగు జగత్తునకాయతన మీ వాక్యమునందు వివక్షింపబడుట స్పష్టము. కాబట్టి ప్రకృతి ద్యుభ్వాద్యాయ తనమై యాత్మశబ్దముచే గ్రహింపబడుననుట యుక్తము కాదు.

ఇక జీవాత్మ ఆత్మశబ్దముచే వ్యవహరింపబడుచున్నను, నయ్యది ద్యుభ్వాద్యాయతనము కానేరదు. ఉపనిషత్తునందు వర్ణింపబడిన యాయ తనము - ఆధారము - అధిష్ఠానభావముతో జెప్పబడినది. ద్యుభ్వాదిలోకము లాధేయములు. ఆత్మ యధిష్ఠానము. ఇట్టి యాధారాధేయభావమును బోధించు నాయతనము పరమాత్మయే యగును; జీవాత్మకాదు. జీవాత్మయందు కల్పింప బడు నాయతనత్వము భోక్తృభోగ్యభావ సంబంధమును దెలుపును, కాని యధిష్ఠానమును దెలుపదు. పరమాత్మతక్క మరియొందేదియు చేతనాచేత నాత్మకమగు సమస్తజగత్తున కధిష్ఠానము కాజాల దనుట నిక్కువము. కావున నీ యుపనిషద్వాక్యమునందలి యాత్మపదము పరమాత్మబోధకమే యగును. ఋగ్వేదమునందును పరమేశ్వరుడే లోకాధారుడని యిట్లు వర్ణింప బడినది.

'స దాధార పృథివీం ద్యా ముతేమామ్' ఋ. ౧౦-౮-౨-౧.

'అతడే పృథివీద్యులోకములను ధరించియున్నాడు.'

యేన ద్యౌ రుగ్రా పృథివీ చ దృఢా

'యేన స్వః స్తభితం యేన నాకః' ౮-౮-౩-౫.

'ఎవనిచే నుజ్జ్వలమగు ద్యులోకము, దృఢమగు పృథివియు, స్వర్గము, నాకము ధరింపబడియున్నవో.' యతడు పరమాత్మ యని భావము.

'స్కంభో దాధార ద్యావా పృథివీ ఉభే ఇమే
స్కంభో దాధా రోర్వంతరిక్షమ్
స్కంభో దాధార ప్రదిశః షడుర్వీః
స్కంభ ఇదం విశ్వం భువన మావివేశ' అథ. ౧౦-౪-౮-౩౫.

'పృథివీద్యులోకములు, అంతరిక్షము, దిక్కులనన్నిటిని పరమాత్మ (స్కంభః) ధరించియున్నాడు. అతనియందే సమస్తభువనములు నిమిడి యున్నవి.' అని యథర్వవేదము వర్ణించుచున్నది. ఇట్టి వేదమంత్రార్థము లన్నియు పరమాత్మయే విశ్వాయతనము, విశ్వాధిష్ఠానమునని చెప్పుచున్నవి. కావున నాత్మపద మిట పరమాత్మ వాచకమే యగును.

మరియు 'నమృతమున కితడే సేతువు' (అమృత స్యైష సేతుః) అను నీ సేతుపదముకూడ పరమాత్మకే వర్తించును; ప్రకృతికి వర్తింపదు. లోకమున మనము చూచు సేతువు (వంతెన) వంటి సేతువుగా పరమాత్మ యిట వర్ణింపబడలేదని గ్రహింపవలయును. లోకమున మనుజులు నదీ ప్రవాహమును దాటుటకు వంతెన నెట్లుపయోగించుచున్నారో యట్లే ముముక్షువులు పరమాత్మ నాశ్రయించి సంసారసాగరమును తరించి తాప త్రయనివృత్తిపూర్వక మగు నానందావాప్తిరూప మోక్షము - అమృతము నందుచున్నారు. సేతువు నది యావలియొడ్డును జేరుటకు సాధనమైనట్లు, పరమాత్మ మోక్షప్రాప్తికి సాధనము - అమృతత్వ సాధకము - అని యాస

దేశింపబడినది. కాబట్టి యాత్మశబ్దము పరమాత్మబోధకమనియే గ్రహింప వలయు నని సిద్ధాంతము. (౧)

ఉపర్యుక్తవిషయమును సాధించుటకు మఱియొక హేతువు :

## ముక్తోపసృప్య వ్యపదేశాచ్చ ౧-౩-౨

ముక్తో...దేశాత్ చ — జీవన్ముక్తులగు బ్రహ్మవిదులచే ప్రాప్యమని చెప్పబడినందునను, ద్యుభ్వాద్యాయతనము బ్రహ్మమే - పరమాత్మయే యని యంగీకరింపవలయునని సూత్రార్థము.

'యస్మిన్ ద్యౌః పృథివీ చాంతరిక్ష మోతం
మనః సహ ప్రాణైశ్చ సర్వైః' ముం. ౨-౨-౫.

'ఏవనియం దీ జడచేతనాత్మకమగు ప్రపంచమంతయు నోత ప్రోతమై యున్నదో' యని ప్రారంభించి,

'భిద్యతే హృదయ గ్రంథిః ఛిద్యంతే సర్వసంశయాః
క్షియంతే చాస్య కర్మాణి తస్మిన్ దృష్టే పరావరే' ముం. ౨-౨-౮.

'విశ్వాధిష్ఠానమగు నా యాత్మసాక్షాత్కారము కలిగిననాడు రాగ ద్వేషపూరితమగు హృదయగ్రంథి విడిపడు' నని చెప్పి,

హిరణ్మయే పరే కోశే విరజం బ్రహ్మ నిష్కలమ్
తచ్ఛుభ్రం జ్యోతిషాం జ్యోతి స్తద్యదాత్మవిదో విదుః
ముం. ౨-౨-౯.

(౯) జ్యోతిస్సులకు జ్యోతిస్సును, శుద్ధమును, నిష్కలమును నగు బ్రహ్మమును ఆత్మవిదులెరుగుదురు అని బ్రహ్మమును నెరుగు విధమును చెప్పి యీ సందర్భమున ముక్తులగు బ్రహ్మవిదులచే - జీవన్ముక్తులచే పొంద దగు (ఉపసృప్యమగు - ప్రాప్యమగు) బ్రహ్మము నిట్లుపదేశించుచున్నది.

'యదా పశ్యః పశ్యతే రుక్మవర్ణం
కర్తార మీశం పురుషం బ్రహ్మయోనిమ్
తదా విద్వాన్ పుణ్యపాపే విధూయ
నిరంజనః పరమం సామ్య ముపైతి.' ముం. ౩-౧-౩.

'విశ్వకర్తయు, విశ్వనియంతయు, భూతయోనియు, రుక్మవర్ణుడు నగు పరమపురుషుని గని, విద్వాంసుడు పుణ్యపాపములనుండి ముక్తుడై, నిరంజనుడై (పరమం సామ్యం) అత్యంత సామ్యము నందును, పరమాత్మతో నత్యంత మవిభాగియై జీవాత్ము డుండునని భావము.

'యథా నద్యః స్యందమానాః సముద్రే
అస్తం గచ్ఛంతి నామరూపే విహాయ,
తథా విద్వాన్ నామరూపాద్ విముక్తః
పరాత్పరం పురుష ముపైతి దివ్యమ్.' ముం. ౩-౨-౮.

'ప్రవహించు నదులు సముద్రమును జేరి నామరూపముల విడిచి, యందు దవిభక్తములై యుండునట్లు జీవాత్మయు నామరూపములనుండి ముక్తుడై పరాత్పరు నుపసర్పించును - చేరును.'

ఇట్టి యుపసర్పణము పరమాత్మవిషయమున సంగతమగును; కాని యన్యవిషయమున గాదు. బ్రహ్మవిదులు - జీవన్ముక్తులు - పరమపురుషుం జేరుదురు. కాని, జీవాత్మ నెన్నడుం జేరరు. ప్రకృతి యుపగమ్య మసలే కాదు. ఉపనిషత్తులం దిట్లు పరమాత్మయే బ్రహ్మవిదులకు గమ్యముగా జెప్పబడినది. అందువలన నిట ద్యుభ్వాద్యాయతనముగా జెప్పబడిన యాత్మయు పరమాత్మ యనియే గ్రహింపవలయునని సూత్రార్థము. (౨)

సిద్ధాంతమును జెప్పి, ప్రస్తుతము పూర్వపక్షమును నిరాకరింపదలచి సూత్రకారుడు ముందుగా ప్రకృతి ద్యుభ్వాద్యాయతనము కాదని సూత్రించు చున్నాడు.

## నానుమాన మతచ్ఛబ్దాత్ ౧-౩-౩

అనుమానం=ప్రకృతి, న = ద్యుభ్వాద్యాయతనము కాదు. కారణ మేమన : అతచ్ఛబ్దాత్=ప్రకృతిబోధక శబ్ద ప్రయోగము లేదు.

'త మేవైకం జానథ ఆత్మానమ్' అని బ్రహ్మమును ప్రతిపాదించు నాత్మ శబ్ద మీ వాక్యమునందు ప్రయోగింపబడినది; కాని, ప్రకృతిని బోధింపగలశబ్ద మొండును నిందు గనబడదు. ప్రకృతివాచక శబ్దప్రయోగము లేనందున ద్యులోకాధిష్ఠానము ప్రకృతియే యని కల్పించుటయూ, పరమేశ్వరవాచకమగు నాత్మ శబ్దార్థము నుపేక్షించుటయు యుక్తము కాదు. కాబట్టి ప్రకృతి ద్యుభ్వాద్యాయతనము కాదని భావము. (౩)

## ప్రాణభృచ్చ ౧-౩-౪

ప్రాణభృత్ + చ=జీవాత్మయు ద్యుభ్వాద్యాయతనము కాదు.

ఉపనిషద్వాక్యమునందు ప్రయోగింపబడిన యాత్మశబ్దము పరమాత్మకు వర్తించునట్లు జీవాత్మకుకూడ వర్తించుచున్నను నిట జీవాత్మకొఱకు ప్రయోగింపబడలే దనియే చెప్పవలెను.

ముండకోపనిషత్తునందలి యనంతరవాక్యమున

'యః సర్వజ్ఞః సర్వవిద్' ముం. ౨-౨-౭. 'సర్వజ్ఞుడు, సర్వవిదుడు నైనవాడు.' అని సర్వజ్ఞత్వము, సర్వవేతృత్వము నను విశేషణములు గ్రహింపబడినవి. ఈ విశేషణములు జీవాత్మయందు వర్తింపవు. జీవాత్మ దల్పజ్ఞు డనుట నెల్ల రెరుగుదురు. కాబట్టి ప్రాణధారి జీవాత్మయు ద్యుభ్వాద్యాయతనము కాదని సూత్రభావము. (౪)

'తదక్షరం వేదయతే యస్తు సోమ్య
స సర్వజ్ఞః సర్వమే వావివేశ.' ప్ర. ౪-౧౧.

'ఓ సౌమ్య ! అక్షరము నెరిగినవాడు బ్రహ్మము (సర్వము)ను

తేరును.' అను నీ యుపనిషద్వాక్యము బ్రహ్మవిదులు సర్వజ్ఞు లగుదురని చెప్పుచున్నందున సర్వజ్ఞత్వ విశేషణము జీవాత్మకును సంగతమే యగును కదా। అట్టియెడ జీవాత్మయే ద్యుభ్వాద్యాయతన మని యేల చెప్పరా దన :

## భేద వ్యపదేశాత్ ౧-౩-౫.

ద్యుభ్వాద్యాయతనముకంటె జీవాత్మ భిన్నముగా జెప్పబడినందున జీవాత్మ ద్యుభ్వాద్యాయతనము కానేరదని సూత్రార్థము.

జీవన్ముక్తావస్థయందు జీవుడు సర్వజ్ఞుడు కావచ్చును; కాని, (త మే వై కం జానథ ఆత్మానమ్) 'ఆత్మశబ్దవాచ్య మగు నా ద్యుభ్వాద్యాయతనము నెరుంగుడు' అని ద్యుభ్వాద్యాయతనము జ్ఞేయముగా నిట వర్ణించి యుపనిషత్తు జీవాత్మను జ్ఞాతగా నిర్దేశించుచున్నది. ద్యుభ్వాద్యాయతనము జీవాత్మయే యగుపక్షమున జ్ఞేయజ్ఞాతృభావము సంగతము కాదు. జీవాత్మ జ్ఞాత - తెలిసికొనువాడు, ద్యుభ్వాద్యాయతన మగు నాత్మ (పరమాత్మ) జ్ఞేయము. ఇట్లు భిన్నముగా జెప్పబడినందున ద్యుభ్వాద్యాయతనము జీవాత్మ కానేరదు. పరమాత్మయే యని భావము. (౫)

జీవాత్మ, ద్యుభ్వాద్యాయతనము నను నీ రెండును నభిన్నములే, భిన్నములు కావు. ద్యుభ్వాద్యాయతనమే జీవాత్మ యని యంగీకరించి యందే జ్ఞాతృజ్ఞేయ భావమును గల్పించినచో గలుగు హాని యేమి? యన :

## ప్రకరణాత్ ౧-౩-౬.

ప్రకరణమునుబట్టి జీవాత్మ ద్యుభ్వాద్యాయతన మని చెప్పుట యుక్తము కాదని సూత్రార్థము.

'ఆత్మా వాఽరే ద్రష్టవ్యః శ్రోతవ్యో
మంతవ్యో నిదిధ్యాసితవ్యః' బృ. ౪-౫-౬.

'ఆత్మయే చూడదగినది; వినదగినది; మననము చేయదగినది; నిదిధ్యాసితవ్యము.' నని యాజ్ఞ్యవల్క్యుడు మైత్రేయికి జీవాత్మయే తెలియదగినది (జ్ఞాతవ్యము)గ నుపదేశించియున్నాడు. అట గత్యంతరములేక జ్ఞాతృ జ్ఞేయ భావము జీవాత్మయందే కల్పింపనగును. కాని, ప్రకృత ప్రకరణమునం దట్లుపదేశింపక బ్రహ్మపదార్థమే జ్ఞేయమునుగా వర్ణింపబడినది. కావున నిట కల్పన కవకాశమే లేదు. జీవాత్మ పరమాత్మలలో పారమార్థిక భేదము స్పష్టమగుచుండ కల్పన చేయనేల? ప్రస్తుతప్రకరణము పరమాత్మకు సంబంధించిన దనుటకు ప్రమాణ మే మందురేని,

'కస్మిన్ను భగవో! విజ్ఞాతే సర్వ మిదం విజ్ఞాతం భవతి?' ముం. ౧-౧-౩.

'భగవన్! ఏది తెలిసిన నిది యంతయు దెలియును?' ఏ యొకటి దెలిసిన ద్యుభ్వాదిసర్వము దెలియును? అని ప్రశ్నింపబడినది. ఈ ప్రశ్నము జీవాత్మవిషయక మన నొప్పదు. జీవాత్మవిజ్ఞానము సర్వవిజ్ఞానమునకు కారణ మెన్నడును గాదు. పరమేశ్వరుడు ద్యుభ్వాదిసర్వలోకముల కధిష్ఠాత యైనందున నతనిం దెలిసిన సర్వమును దెలియనగును. ఆధారము తెలిసిన నాధేయము తెలియబడకపోదు. ఇట్లీ ప్రకరణము పరమేశ్వర విషయక మైనందున ద్యుభ్వాద్యాయతనము పరమేశ్వరుడే యగును. కాని ప్రాణభృజ్జీవాత్మ యెన్నడును కాదు. (౬)

ఏ యొకటి తెలిసిన నిది యంతయు దెలియును? అని ప్రశ్నించినందున నీ ప్రకరణము పరబ్రహ్మ పరమాత్మకు సంబంధించిన దనుట యుక్తము కాదు. కారణ మేమన: బృహదారణ్యకమునందు జీవాత్మ విజ్ఞానమువలనను సర్వవిజ్ఞానము గలుగునని వర్ణింపబడియున్నది.

> 'ఆత్మని ఖ ల్వరే దృష్టే శ్రుతే మతే విజ్ఞాతే
> ఇదం సర్వం విదితమ్. బృ. ౪-౫-౬.

'ఓ మైత్రేయీ! ఆత్మ దృష్టము, శ్రుతము, మతము, విజ్ఞాతము

నైనపుడు సర్వమును విదితమగును' అను నీ వాక్యమున జీవాత్మజ్ఞానము సర్వజ్ఞానమునకు కారణమగునని స్పష్టముగా జెప్పబడినది. కావున ప్రకరణమునుబట్టి ద్యుభ్వాద్యాయతనము పరమాత్మయే యని నిశ్చయించు చెట్లన :

స్థిత్యదనాభ్యాం చ ౧-౩-౭

స్థితి, అదనము నను వానివలనను ద్యుభ్వాద్యాయతనము పరమాత్మయే యని సూత్రార్థము.

ఈ సూత్రమునందలి స్థితిపదము సాక్షిరూపమున నుండుటను దెలుపును. అదన మనగా అశనము - కర్మఫలము ననుభవించుట. సాక్షిగా నుండుట పరమేశ్వరుని ధర్మము. కర్మఫలము ననుభవించుట జీవుని ధర్మము. ఇట్లు స్థిత్యదనరూప ధర్మముల ద్వారమున జీవాత్మ పరమాత్మలను నిర్దేశించి, జీవాత్మ జ్ఞాత యనియు, పరమాత్మ జ్ఞేయ మనియును జెప్పబడినందున ద్యుభ్వాద్యాయతనము ప్రాణధారియగు జీవాత్మ కానేరదని భావము.

ద్యుభ్వాద్యాయతనమునకు సంబంధించిన ప్రకరణమునందే,

'ద్వా సుపర్ణా సయుజా సఖాయా
సమానం వృక్షం పరిషస్వజాతే
తయో రన్యః పిప్పలం స్వాద్వ
త్త్యనశ్న న్ననన్యో అభిచాకశీతి.' ముం. ౩-౧-౧.

అని పఠింపబడినది. ఈ వాక్యమునందు (తయో రన్యః పిప్పలం స్వా ద్వ_త్తి) 'ఆ రెంటిలో నొకటి స్వాదు, అస్వాదు రూప కర్మఫలమును - సుఖదుఃఖములను అనుభవించుచున్న'దని జీవాత్మను, (అనశ్న న్ననన్యో ఽభిచాకశీతి) 'మరియొకటి తినక సాక్షిగానున్నది' యని పరమాత్మను

వేరువేరుగ జెప్పి యనంతరవాక్యమున జీవాత్మ జ్ఞాత యనియు, పరమాత్మ జ్ఞేయ మనియు స్పష్టము సేయబడినది.

'సమానే వృక్షే పురుషో నిమగ్నో
అనీశయా శోచతి ముహ్యమానః
జుష్టం యదా పశ్య త్యన్య మీశం
అస్య మహిమాన మితి వీతశోకః.' ముం. ౩-౧-౨.

'పురుషుడు - జీవాత్మ ఒకేవృక్షమునందు - శరీరమునందు ఉండి, సుఖదుఃఖముల నిమగ్నుడై యస్వాధీనతవలన మోహమును బొందును. తనతో గూడియున్న మరియొకని - నీశ్వరుని మహిమగలవానినిగ జూచిన నాడు శోకరహితు డగును.' ఈ వాక్యమునందలి (పశ్యతి) చూచును - ఎరుగును అను క్రియకు కర్తయై జీవాత్మ జ్ఞాత యగుచున్నాడు. ఈశ్వరుడు జ్ఞానమునకు విషయమై జ్ఞేయ మగుచున్నాడు. ఇట్లు జ్ఞాతృ జ్ఞేయ భావము జీవేశ్వరులలో నిట క్రమముగా స్పష్టపరుపబడినది.

ద్యుభ్వాద్యాయతన వాక్యమునందును జీవాత్మయే జ్ఞాతయని చెప్పబడినది. అందువలన నట జ్ఞేయముగ వర్ణింపబడిన ద్యుభ్వాద్యాయతనమగు నాత్మయు పరమాత్మయే కావలయును. జీవాత్మవిజ్ఞానమువలన సర్వము విజ్ఞాత మగునని వాక్యాంతరమున జెప్పుటలో గల తాత్పర్యము నిదియే. జీవాత్మ తెలియబడిననాడు జీవాత్మతో నవిభక్తమై యుండు పరమాత్మయు దెలియబడును, అందువలననే సర్వము దెలియును. అంతే కాని, కేవల జీవాత్మవిజ్ఞానము సర్వవిజ్ఞానమునకు కారణ మగునని యా వాక్యాభిప్రాయము కాదు. కాబట్టి ద్యుభ్వాద్యాయతనము బ్రహ్మమే యగును; కాని, జీవాత్మ యెన్నటికిని కాదని సర్వవిధముల సిద్ధమగుచున్నది. (౭)

## ద్వితీయాధికరణము

పరబ్రహ్మ పరమాత్మ ద్యుభ్వాద్యాయతన మని నిరూపించి, అయ్యది ద్యుభ్వాదిలోకములకంటె నధికమని వర్ణింపదలచి మహర్షి ద్వితీయాధికరణము నారంభించుచున్నాడు.

భూమా సంప్రసాదా దధ్యుపదేశాత్ ౧-౩-౮

(ఈ సూత్రమునందలి సంప్రసాద శబ్దము జీవవాచకము.)

సంప్రసాదాత్=జీవాత్మకంటెను, అధ్యుపదేశాత్=గొప్పది యని యనుశాసించుటవలన, భూమా = ఛాందోగ్యమున వర్ణింపబడిన భూమ పరమాత్మయే.

'ఏష సంప్రసాదో ఽస్మా చ్ఛరీరాత్
సముత్థాయ పరంజ్యోతి రుపసంపద్య
స్వేన రూపే ణాభినిష్పద్యతే
స ఉత్తమః పురుషః.' ఛాం. ౮-౧౨-౩.

'ఈ సంప్రసాదము - జీవాత్మ ఈ శరీరమును విడిచి పరమాత్మను బొంది స్వస్వరూపమున నిష్పన్నమగువా డుత్తమ పురుషుడు' అను నీ యుపనిషద్వాక్యమే యిందులకు ప్రమాణము.

'యోవై భూమా తత్సుఖం నాల్పే సుఖ మస్తి
భూమైవ సుఖమ్, భూమాత్వేవ విజిజ్ఞాసితవ్య
ఇతి భూమానం భగవో విజిజ్ఞాస ఇతి.' ఛాం. ౭-౨౩-౧.

'యత్ర నాన్య త్పశ్యతి నాన్య చ్ఛృణోతి
నాన్య ద్విజానాతి స భూమా
అథ య త్రాన్య త్పశ్య త్యన్య చ్ఛృణో

త్యన్య ద్విజానాతి త దల్పమ్,
యోవై భూమా త దమృతమ్, అథ యదల్పం తన్మర్త్యమ్'
ఛాం. ౭-౨౪-౧.

'భూమయే సుఖము. అల్పములో సుఖములేదు. భూమయే తెలియ దగినది. భగవన్ ! భూమ తెలియగోరుచున్నాను.'

'ఎందు మరియొకటి చూడదో, వినదో, తెలియదో యది భూమ. ఎం దన్యము చూచునో, వినునో, తెలియునో యది యల్పము. భూమ అమృతము. అల్పము మర్త్యము' అను నీ ఛాందోగ్యవాక్యములందు పఠింప బడిన భూమ జీవాత్మయా? లేక పరమాత్మయా? యని సంశయము. జీవా త్మయే భూమ యనుట పూర్వపక్షము. కాదు, పరమాత్మయే యనుట సిద్ధాంతము.

ఉపర్యుక్త వాక్యగత భూమా శబ్దము జీవాత్మబోధకమే: కాని పర మాత్మ వాచకము కాదు. కారణ మేమనః నారదుడు తన కాత్మజ్ఞానము కలుగనందుకు శోకించుచు నాజన్మసిద్ధుడును, మహాయోగియు, నాత్మ విదుడు నగు సనత్కుమారునికడ కేగి, 'ఆత్మజ్ఞానములేక శోకసాగరమున మునిగియున్న నన్ను దరిజేర్తురుగాక!' యని ప్రార్థించెను. సనత్కుమారు డును నారదుని నమ్రవచనములను విని యిట్లనెను: 'నీవు పరిగణించిన విద్యలన్నియు నామసమూహములే. అంతకంటె మిన్నకావు. నామము వర్ణము. అయ్యది బ్రహ్మోద్భవము. బ్రహ్మప్రాప్తి కది సాధనము. అందు వలన నామమే బ్రహ్మ మని యుపాసింపుము - తెలిసికొనుము—'

ఆ పలుకుల నాలకించి నారదుడు 'భగవన్! నామముకంటె నధి కము లేదా?' యని ప్రశ్నించెను. 'నామము నుత్పన్నముచేయు వాక్కు నామముకంటె నధిక మని సనత్కుమారుడు బదులు సెప్పెను. పిమ్మట నారదుడు 'వాక్కుకంటెను నధిక మొకటి లేదా?' యని మరల ప్రశ్నించెను.

సనత్కుమారు డందులకు 'వాక్కుకంటె మనస్సు, దానికంటె సంకల్పము, అంతకంటెను చిత్తము, చిత్తముకంటెను ధ్యానము, ఇట్లు క్రమముగా విజ్ఞానము, బలము, అన్నము, జలము, అగ్ని, వాయువు, ఆకాశము, స్మరణము, ఆశ, ప్రాణము నను నివియన్నియు నొకదానికంటె మరియొకటి యధికము' అని తెలిపెను.

ఉపర్యుక్తక్రమమున - 'చేయుదును' అను నిశ్చయము మన స్సన బడును. ఆ నిశ్చయము వాక్కును ప్రేరేపించును. కావున నది వాక్కునకు కారణము. కర్తవ్యాకర్తవ్యవివేకము నిశ్చయమునకు హేతువై సంకల్పమనబడును. అట్టిసంకల్పమునకు కారణము చిత్తము. శాస్త్రీయవిషయమునం దేకాగ్రత ధ్యానము. దానికి కారణము విజ్ఞానము. ఈ విజ్ఞానమునకు శాస్త్రప్రతిపాదిత విషయమే విషయము. అందువలన మనస్సులో నేర్పడు సామర్థ్యము బల మనబడును. దాని కన్నము, అన్నమునకు జలము, దానికి నగ్ని, ఆ యగ్నికి వాయువు, దాని కాకాశమును కారణము లని తెలియ వలెను. ఆకాశము భోగ్యముగా స్మరింపబడును. దానికై యాశ జనించును. ఆశగల ప్రాణి తన కిష్టమైనదానిని స్మరించును. ఆ యాశకు హేతువు ప్రాణము - జీవాత్మ. ఇట్లు పూర్వోక్తములగు గుణములన్నియు గుణియైన జీవాత్మయందే కలుగును. అందువలన ప్రాణశబ్దముచే నిట జీవాత్మయే గ్రహింపనగును. ఆ జీవాత్మ భోక్త యగుటచే నన్నిటికి హేతువై నామము మొదలు ఆశవరకు చెప్పబడినవాని కన్నిటికంటె నధికు డగుచున్నాడు. ఈ ప్రసంగమున జరుపబడిన ప్రశ్నోత్తరముల క్రమము ప్రాణమువరకు వచ్చి యట సమాప్తమగును. అటుపైన ప్రాణముకంటె నధిక మున్నదా? అని ప్రశ్నముకాని, ప్రాణముకంటెను నధిక మొండు కలదను సమాధానముకాని కనబడదు. అందువలన ప్రాణమే - జీవాత్మయే - యన్నిటికంటె నధికము - భూమ. మరి యొండేదియు లేదని చెప్పనొప్పును.

మరియు సనత్కుమారుడు స్వయముగ నామము మొదలు ఆశ వరకుగల పదార్థములన్నిటికంటెను ప్రాణ మధిక మని చెప్పి,

'ప్రాణో హ్యే వైతాని సర్వాణి భవతి
సవా ఏష ఏవం పశ్యన్, ఏవం మన్వాన
ఏవం విజానన్ అతివాదీ భవతి
తం చేద్ బ్రూయు రతివా ద్యసీతి
అతివా ద్యస్మీతి బ్రూయా న్నాపహ్నువీత.' ఛాం. ౭-౧౫-౪.

'ప్రాణమే యివి యన్నియు నగును. ఇది యిట్లు చూచి చింతన చేసి, యెరుగువా డతివాది యగును. అతని నతివాది వై తి వని యందురేని, 'అతివాది నై తి నని చెప్పవలెను. దాచరాదు' అని యిట్లు ప్రాణము నధిక మని యెరిగినవా డతివాది యగు నని యంగీకరించి,

'ఏష తు వా అతివదతి యః సత్యే నాతివదతి' ఛాం. ౭-౧౬-౧.

'ఎవడు సత్యము నతిగా చెప్పునో వాడే యతివాది.' యని వచించి యున్నాడు. ఇట్లు సత్యము చెప్పుటమూలమున సనత్కుమారుడు తత్త్వము నుపదేశించుచు, ప్రాణవిజ్ఞానము, దాని సాధనముల శ్రవణ మననాది పరం పరగా భూమను నిర్దేశించియున్నాడు. ఇందు ప్రాణమునే సత్య మని చెప్పుట సుస్పష్టము. ప్రాణము (జీవాత్మ)కూడ పరమాత్మవలెనే సత్య మగుటవలన సత్య శబ్దముతో వ్యవహరింపబడుటలోను దోష మావంతయు నుండదు. సత్యము త్రికాలాబాధ్యము. అందువలన ప్రాణమును సత్య మని చెప్పువాడే యతివాది వాస్తవమున కాగల డని భావము.

'యథా వా అరా నాభౌ సమర్పితా ఏవ
మస్మిన్ ప్రాణే సర్వం సమర్పితమ్' ఛాం. ౭-౧౫-౧.

'చక్రపుటాకులు చక్రపుకుండయం దర్పింపబడినట్లు ప్రాణమునందు సర్వము సమర్పింపబడినది' అను నీ దృష్టాంతముకూడ ప్రాణము

(జీవాత్మ) భోక్తయగుటవలన భోగ్యమగు జగత్తంతయు జీవాత్మ కాయత్తమై యున్న దని చెప్పుటచే సంగత మగును. కావున జీవాత్మయే భూమ యగును. బ్రహ్మము కాదని ప్రాప్తింపగా - సమాధానము :

నామాదులలో నొకదానికంటె మరియొకటి యధిక మని యుపదేశించుటవలన నామాదులకంటె వాగాదు లధికము లున్నట్లే జీవాత్మ (ప్రాణము) కంటెను భూమ నధికముగ నుపదేశించుటవలన పరమాత్మయే భూమ యగును; కాని, జీవాత్మ యెన్నటికిని 'భూమా' శబ్దవాచ్యము కానేరదు. భూమ ప్రాణముకంటెను నధిక మని యుపదేశింపబడినది. కావున భూమ ప్రాణము (జీవాత్మ) కాదు. మరియొకటియై యుండవలెను. అదియే పరమాత్మ. పూర్వోక్త ప్రశ్న ప్రతివచనములలో 'ప్రాణముకంటె నధికమేదైన కలదా?' యను ప్రశ్నకాని, 'కల'దని సమాధానముకాని లేనందున ప్రాణముకంటె భూమ భిన్న మనికాని, యధిక మనికాని చెప్పవలను కాదనుట యుక్తము కాదు. 'ప్రాణముకంటె నధికము కలదా?' యని ప్రశ్నముకాని, 'కల'దని ప్రతివచనముకాని లేనిమాట వాస్తవమే. అయినను జీవాత్మకంటె భూమ యధిక మనియు, నయ్యది పరమాత్మయే యనియు నుపదేశించినట్లు తెలిసికొన నవకాశ మీ ప్రకరణమున లేకపోలేదు. కొండొకవస్తువు కల దని చెప్పుట కెల్లయెడల ప్రశ్న ప్రతివచన రూప సంవాద ముండవలె నను నియమ మొండును లేదు. పవిత్రములయిన వేదములం దట్టి ప్రశ్న ప్రతివచనములు లేకున్నను నుపదేశద్వారమున కొండొకవస్తువు కల దని చెప్పుట పలుతావుల జూడనగును.

సనత్కుమారుడు నారదునకు ప్రాణ మధికమని చెప్పి, యట్లు చెప్పువాడు తన్ను నతివాది యని యంగీకరించుటకు భయపడవల దని యుపదేశించియున్నాడు. నారదు డది విని యాత్మోపదేశ మంతటితో బర్యవసిత (సమాప్త) మయిన ట్లెంచి తరువాత ప్రశ్నింప డయ్యె. కాని,

పరమకృపాళువగు సనత్కుమారుడు 'పరమార్థస్వరూపమగు నంతరాత్మను దెలిసికొనకయే నారదుడు వెళ్ళునేమో' యని యాలోచించి, స్వయముగానే ప్రాణవిజ్ఞానముద్వారమున పూర్వ ముపదేశించిన యతివాదిత్వముకంటె వేరుగా సత్యవిజ్ఞానముమూలమున నతివాదిత్వము నిట్లుపదేశించియున్నాడు :

'ఏష తు వా అతివదతి యః సత్యే నాతివదతి.'

'ఎవడు సత్యము నతిగా జెప్పునో వాడే యతివాది యగును' అను నీవాక్యతాత్పర్య మేమి? పై వాక్యమునందలి 'తు' ప్రయోగముచే ప్రాణవిజ్ఞాని యతివాది కాదని పూర్వోక్తమును నిరాకరించి, యటుపై సత్యము నతివదించువాడే యతివాది యని తెలుపుచున్నాడు. అందువలననే నారదుడును —

'సో௨హం భగవః సత్యే నాతివదాని.' ఛాం. ౭-౧౬-౧.

అటులయిన నేను సత్యము నతిగా వచింతును' అని ప్రార్థింపగా,

'సత్యం త్వేవ విజిజ్ఞాసితవ్యమ్' ఛాం. ౭-౧౬-౧.

'అవును, సత్యమే తెలియదగినది' యని సనత్కుమారుడు బదులు సెప్పుటయు సంగత మగుచున్నది. ప్రాణముకంటె నధికమైనది సత్యమనున దొకటి లేనిపక్షమున నారదు డట్లు ప్రార్థించుటకాని, సనత్కుమారుడు 'సత్యమే జిజ్ఞాస్య' మని మరల చెప్పుటకాని యుక్తము కాదు. ఈ ప్రకరణమునందు ప్రాణ మన జీవాత్మ యనియు, సత్య మన పరమాత్మ యనియు గుర్తింపవలెను.

'హిరణ్మయేన పాత్రేణ సత్య స్యాపి హితం ముఖమ్' యజు. ४०-౧౧.
'సువర్ణమయపాత్రముతో సత్యముఖము కప్పబడియున్నది.'

'సత్యం హ్యేవ బ్రహ్మ.' బృ. ౫-४-౧. 'సత్యమే బ్రహ్మము' అను నీ వాక్యములందు ప్రయోగింపబడిన సత్యశబ్దము బ్రహ్మబోధకమే,

ప్రాణముకంటె సత్య మధికమనియు, నయ్యదియే తెలియదగిన దనియు జెప్పి, అది తెలిసినవాడే యతివాది యని నిశ్చయించుటకై సత్య విజ్ఞానమునకు మతి, శ్రద్ధ, నిష్ఠ, కృతి యని నాలుగు సాధనము లున్నట్లు వివరించి,

'యోవై భూమా తత్సుఖం, నాల్పే సుఖ మస్తి' ఛాం. ౭-౨౩-౧.

'భూమయే సుఖము, అల్పమున సుఖము లేదు' అని యుపదేశించి యున్నాడు.

మతి : మననము, శ్రవణానంతరము వేదమునకు విరుద్ధముకాని యుక్తులతో వినినదానిని చిత్తమున బ్రవేశింపజేసికొనుట.

శ్రద్ధ : వినుటకై చిత్తమునం దేర్పడునట్టి యభిరుచి శ్రద్ధ యన బడును. ఈ శ్రద్ధయే యుపనిషత్తులందు వివిదిష యనియు జెప్పబడును.

'త మేతం వేదానువచనేన బ్రాహ్మణా వివిదిషన్తి' బృ. ౪-౪-౨౨.

నిష్ఠ : వేదవిహితకర్మలయందు నియతస్థితి. నియమముతో వేద విహితకర్మల నాచరించుట నిష్ఠ యనబడునని భావము.

కృతి : నిష్ఠకొఱకై చేయు ప్రయత్నము.

ఇట్లు ప్రాణముకంటెను సత్యమును వేరుగా 'భూమ' యని యుప దేశించుటవలన భూమయన పరమేశ్వరు డగును కాని జీవాత్మ కా దని భావము.

'యత్ర నాన్యత్ పశ్యతి, నాన్య చ్ఛృణోతి
నాన్య ద్విజానాతి, స భూమా.' ఛాం. ౭-౨౪-౧.

'ఎందు నన్యము జూడదో, అన్యము వినదో, అన్యము దెలియదో యది భూమ' యను నీ భూమయొక్క లక్షణము జీవాత్మయందును వర్తించు నని కొందఱు సెప్పుదురు.

జీవాత్మ సుషుప్తియందు మరియొండు చూడడు, వినడు, తెలియడు: కాబట్టి జీవాత్మయే భూమ యని వారియభిప్రాయము. కాని, యదియును సరికాదు. కారణ మేమన :

> ఛాందోగ్యమున భూమాలక్షణ మిట్లు వర్ణించి, యనంతరమున—
> 'య త్రాన్య త్పశ్య త్యన్య చ్ఛృణో
> త్యన్య ద్విజానాతి త'దల్పమ్.' ఛాం. ౭-౨౪-౧.

'ఎం దన్యము చూచునో, వినునో, యెరుగునో యది యల్ప'మని జీవాత్మలక్షణము వర్ణింపబడినది. కాబట్టి యల్పమే జీవాత్మ; భూమ కాదనుట నిశ్చయము. ముందుచెప్పిన లక్షణమే జీవాత్మలక్షణ మను నెడల మరల నీ యల్పలక్షణ మేల చెప్పబడును? పూర్వలక్షణము సుషుప్తియం దున్న జీవలక్షణ మనియు, ననంతరలక్షణము జాగ్రదవస్థలో నున్న జీవునిలక్షణ మనియు సమాధానము జెప్ప నెంచెదరేని, అదియును యుక్తము కాదు. కారణ మేమన : అ ట్లెంచెదమేని సనత్కుమారుని యుపదేశప్రవృత్తియే నిష్ఫల మగును. శోకమోహాదిలక్షణయుక్త మగు సంసారమును సమూలముగ నశింపజేయుటకుగాను సనత్కుమారుడు పరమాత్మతత్త్వము నుపదేశింప నెంచి దానిని లక్షణపూర్వకముగ ప్రతిపాదింప నుద్యుక్తుడైన ట్లిందు స్పష్టమగుచున్నది. సనత్కుమారుని ప్రవృత్తి జీవాత్మని యవస్థాభేదములను జెప్పుటకే యందుమేని, అది నిష్ఫల మనవలసిన దగును. జీవాత్మని సుషుప్త్యాద్యవస్థలను దెలిసికొనినంతమాత్రమున శోకమోహాత్మకసంసారము సమూలముగ నశింపనేరదు గదా! మహాయోగియు పరమకారుణికుడు నగు సనత్కుమారుడు ప్రయోజనములేని యుపదేశార్థ మేల ప్రవర్తించును? కాబట్టి 'ఎం దన్యము చూడదో' (యత్ర నాన్య త్పశ్యతి) అను నీ లక్షణము భూమా శబ్దవాచ్య మగు పరమేశ్వరునందే సంగత మగును; కాని జీవాత్మ యం దెన్నడును కానేరదు.

జీవాత్మ శరీరబద్ధమై ప్రాకృతములయిన ప్రియా ప్రియముల ననుభవించును. మధురామధురములయిన శబ్దములను వినును. రమ్యములు నరమ్యములు నగు నర్థముల నెరుగును. అభ్యాసవైరాగ్యద్వారమున చిత్తవృత్తుల నన్నింటిని నిరోధించి ప్రాకృతికబంధములనుండి విడివడి కేవలుడై బ్రహ్మమునందు వర్తించిననాడు జీవు డన్యము చూడడు; అన్యము వినడు: అన్యము నెరుగడు. కాబట్టి యుపద్యుక్తలక్షణములలో మొదటి లక్షణము (యత్ర నాన్య త్పశ్యతి....) పరమాత్మకును, ద్వితీయలక్షణము (అథ య త్రాన్య త్పశ్యతి....) జీవాత్మకును సంగతమగును. నాడే 'భూమ సుఖము, అల్పమున సుఖము లేదు' అనుటయు సుసంగత మగును. కాగా, భూమాపదము పరమాత్మవాచకమే కాని, జీవాత్మవాచకము కాదని స్పష్టమగుచున్నది.

అ ట్లంగీకరించుటవలన ప్రకరణమునందలి యుపక్రమోపసంహారములు నేకవాక్యతను బొందును. ప్రకరణారంభమున,

'శ్రుతం హ్యేవ మే భగవద్దృశేభ్య
స్తరతి శోక మాత్మవి దితి,
సో ఽహం భగవః! శోచామి తం మా
భగవాన్ శోకస్య పారం తారయతు.' ఛాం. ౭-౧-౩.

'ఆత్మవిదుడు శోకమును తరించు నని మీ యట్టి పెద్దలనుండి విని యున్నాను. భగవన్! శోకించుచున్నాడ. న న్నీ శోకమునుండి తరింపజేయుదురు గాక!' యని ప్రారంభింపబడినది.

'తస్మై మృదిత కషాయాయ పారం
దర్శయతి భగవాన్ సనత్కుమారః' ఛాం. ౭-౨౬-౨.

'రాగద్వేషాదిచిత్తమలములులేని యతనికి పూజ్యుడైన సనత్కు

మారుడు తమస్సు (అజ్ఞానము) యొక్క పారమును జూపెను - బ్రహ్మ ప్రాప్తి గలిగించెను' అని యుపసంహార మొనర్పబడినది.

ఉపక్రమమునం దాత్మవిదుడు శోకమును తరించు ననుటలో నాత్మ పదము పరమాత్మవాచకము. ఉపసంహారమునందును 'తమసః పార' మను పదములతో బ్రహ్మమే చెప్పబడినది. ఈ విధమున నుపక్రమోపసంహారములందు విషయసామ్య ముండుటవలన నీ ప్రకరణమునందలి 'భూమా' పదము పరమాత్మబోధక మనుట నిర్వివాదసిద్ధాంత మని భావము. (౮)

ఉపర్యుక్త విషయమును నిరూపించుటకే మహర్షి మరియొక హేతువును ప్రదర్శించుచున్నాడు.

ధర్మోపపత్తేశ్చ　　　　　౧-౩-౯

ధర్మోపపత్తేః చ=మరియు భూమకు చెప్పిన ధర్మములు బ్రహ్మము నందే వర్తించుటవలన భూమ పరమాత్మవాచకమే యని సూత్రార్థము.

భూమను వర్ణించి యనంతరమున నయ్యది స్వమహిమయందే ప్రతిష్ఠితమై యుండు నని వర్ణింపబడినది. ఈ స్వమహిమప్రతిష్ఠితత్వ మనెడి ధర్మము భూమకు సంబంధించినది.

'స భగవన్ ! కస్మిన్ ప్రతిష్ఠిత ఇతి? స్వే మహిమ్ని.' ఛాం. ౭-౨౪-౧.

'భగవన్ ! ఆ భూమ యెందు ప్రతిష్ఠితమై యున్నది? అని ప్రశ్నింపగా స్వమహిమయందే' యని సమాధానము చెప్పబడినది. ఈ వాక్యమున స్వమహిమప్రతిష్ఠిత ధర్మము ప్రదర్శింపబడినది. ఇట్లే సర్వగతత్వము కూడ నీ క్రింది వాక్యమున జూడనగును:

'స ఏ వాధస్తాత్ స ఉపరిష్టాత్
స పశ్చాత్ స పురస్తాత్' ఛాం. ౭-౨౫-౧.

'క్రింద, పైన, వెనుక, ముందు నన్నిదిక్కులలోను నా భూమయే. మరియొకవాక్యమునందు —

'ఆత్మతః ప్రాణ ఆత్మత ఆశా
ఆత్మతః స్మర ఆత్మత ఆకాశః' ఛాం. ౮-౨౬-౧.

'ఆత్మవలన ప్రాణము, దిక్కులు, ఆకాశము నన్నియు నాత్మచే ధరింపబడియున్నవి' అని యుండుటవలన సర్వగతత్వ ధర్మ మాత్మ యందు గల దని తెలియుచున్నది. ఇట్లు స్వ మహిమప్రతిష్ఠితత్వము, సర్వాధారత్వము, సర్వగతత్వము నను నీ ధర్మములు పరమాత్మకు జెందినవే కాని జీవాత్మకు జెందినవి కావు. కాబట్టి భూమా శబ్దము పరమాత్మ వాచకమే యగునని భావము. (౯)

## తృతీయాధికరణము

పరమాత్మ దక్షరు దని నిరూపించుటకు మహర్షి యధికరణాంతరము నారంభించుచున్నాడు:

### అక్షర మంబరాంతధృతేః ౧-౩-౧౦

అంబరాంతధృతేః=ఆకాశాంత సమస్త ప్రపంచమును, తత్కారణమగు ప్రకృతిని ధరించుటవలన, అక్షరం = అక్షరపదము పరమాత్మ వాచకమే యగును.

బృహదారణ్యకమునందలి గార్గి యాజ్ఞవల్క్యుల సంవాదమునందు -

'కస్మిన్ను ఖ ల్వాకాశ ఓతశ్చ ప్రోత శ్చేతి?
స హోవా చైతద్వై తదక్షరం గార్గి!
బ్రాహ్మణా అభివద న్త్యస్థూల మన ణ్వహ్రస్వమ్.' బృ. ౩-౮-౭.౮.

'దేనియందు ఆకాశ మోతప్రోతమై యున్నది?' అని ప్రశ్నింపగా, 'గార్గి! అది యక్షరము. బ్రాహ్మణు - లది స్థూలము కాదు, అణువు కాదు, హ్రస్వమును కాదు - అని యందురు' అని యాజ్ఞవల్క్యుని సమాధానము.

ఓతప్రోత మన విధృతము, సమాశ్రితము నని యర్థము. ఇట నాకాశ మున కాశ్రయముగా వర్ణింపబడిన యక్షరము జీవాత్మయా? లేక పరమాత్మయా? యని సంశయము. అక్షర మన నాశములేనిది. జీవాత్మపరమాత్మలు రెండును నాశములేనివి కావున నక్షరము లనబడును. అందువలన సంశయము కలుగుటయును యుక్తమే. ప్రకృతియు నాశము లేనిదై యక్షరపదవాచ్య మగుటచే నది యేల గ్రహింపబడ దన : ఈ ప్రకరణము ననే పూర్వవాక్యములందు గ్రహింపబడిన యాకాశపదము ప్రకృతివాచక మగుటంజేసి యట్టి యాకాశ మెద్దాని నాశ్రయించియున్నదని గార్గి ప్రశ్నించినది. కాబట్టి ప్రకృతి కాశ్రయ మగు నక్షరము జీవాత్మయో లేక పరమాత్మయో యగును. కాని ప్రకృతిమాత్రము కాజాలదు. అందువలన నక్షరము జీవాత్మయా? లేక పరమాత్మయా? యనియే సంశయము కలుగుట యుక్తమగును. అందు జీవాత్మయే యక్షరపదవాచ్యమనుట పూర్వపక్షము. కాదు పరమాత్మయే యనుట సిద్ధాంతము.

పూ. ప. : జీవులకు సుఖదుఃఖముల నందజేయుట కనుకూలముగ ప్రకృతి పరిణమించుచుండును. అందువలననే ప్రకృతివికారములన్నియు పరార్థములు - జీవులకొఱకు - అని శాస్త్రాంతరమున వర్ణింపబడినది. కాబట్టి యాకాశాది పృథివి పర్యంత మగు వికారజాతమంతయు జీవుల కొఱకై యేర్పడి జీవాశ్రిత మనుట యుక్తమే యగును. కాగా అక్షరపద మిట్లు జీవాత్మబోధక మని ప్రాప్తింపగా - సమాధానము :

జీవులకు భోగము, నపవర్గమును కలిగించుటకే ప్రకృతి, యాకాశాదిరూపమున బరిణమించుట సత్యమే; కాని, యంతమాత్రమున ప్రకృతికి జీవు డాశ్రయ మన నొప్పదు. ప్రకృతిపరిణామమునకు జీవు డొక హేతువు కావచ్చును. అందువలన ప్రకృత్యాశ్రయత్వము జీవాత్మునకు సిద్ధింపదు. పృథివ్యాది వికారజాతమున కాశ్రయ మగు ప్రకృతి కాధార మెయ్యది? యని గార్గి ప్రశ్నించినది. అందులకు సమాధానముగ 'గార్గి! -

అక్షర మాశ్రయ మని - బ్రహ్మవిదులు చెప్పుదురు' అని యాజ్ఞవల్క్యుడు మదివియున్నాడు. ఈ యక్షరము పరబ్రహ్మ పరమాత్మయే యగును; కాని మఱియొండు కాదు.

'యస్మిన్ భూమి రంతరిక్షం ద్యౌ
ర్యస్మిన్ అధ్యాహితా' అథర్వ. ౧౦-౪-౭-౧౨.

'పృథివి, అంతరిక్షము, ద్యులోకము నంతయు పరమాత్మయందే యున్నది' అని యథర్వమున జెప్పబడినది. కాబట్టి వికారజాతముతో గూడిన ప్రకృతి కాశ్రయము పరమాత్మయేకాని, జీవాత్మ కాదు. (౧౦)

పృథివ్యాది భూతవికారములు ప్రకృతికంటె భిన్నములు కావు. ప్రకృతి వేరుగను, పంచభూతాత్మక మగు ప్రపంచము వేరుగను నుండవు. ప్రకృతియే పృథివ్యాది పంచభూతాత్మకప్రపంచముగ బరిణమించుచున్నది. అందువలన వికారరూప మగు ప్రపంచమునకు జీవులు హేతువుగ నంగీకరింపబడుటచేత, వికారాత్మక మగు ప్రపంచముకంటె ప్రకృతి భిన్నము కానందున నా ప్రకృతికికూడ జీవుడే హేతు వనదగును. కాబట్టి పూర్వ సూత్రమునందలి యాకాశపదవాచ్యప్రకృతి కాశ్రయ మగు నక్షరము పరమాత్మ యన నేల ? జీవాత్మ యనుటయే యుక్తమగు నన - సమాధానముగా మహర్షి: సూత్రమును రచియించుచున్నాడు :

## సా చ ప్రశాసనాత్ ౧-౩-౧౧

సాచ=ఆ యాకాశాంతప్రపంచధారణయు, ప్రశాసనాత్=ప్రశాసననియమ - పూర్వకమగుటచే పరబ్రహ్మ - పరమాత్మకే యుక్త మగును.

ప్రశాసని మన ప్రకృష్టశాసనము - నియోగము - నియమించుట - ఆజ్ఞ - యని భావము. ఉపర్యుక్త ప్రకరణమునందలి యక్షరపదమున కర్థము పరమాత్మ యనుటకు కారణము ప్రకృతిధారణమాత్రము కాదు. ఆ ధారణ ప్రశాసనపూర్వక మగుటయు నిందులకు కారణ మని చెప్పవలెను.

ప్రపంచమునందలి సూర్యాది దివ్యపదార్థములను శాసనపూర్వకముగ ధరించు సామర్థ్యము జీవునకు లేదు. అట్టి యనంత సామర్థ్యము పరమాత్మ యందే యున్నది. అందువలన, ప్రపంచాత్మకప్రకృతి స్వవికారముల కంటె భిన్నముకానిమాత్రమున నయ్యది జీవాత్మచే ధరింపబడుచున్న దని యెంచి యక్షరపదము జీవాత్మవాచక మనుట యుక్తముకాదు. గార్గి యాజ్ఞవల్క్యుల సంవాదమున ప్రశాసనపూర్వక మగు విధారణ విధింపబడి యుండుట చూచుచున్నాము.

ఏతస్య వా అక్షరస్య ప్రశాసనే గార్గి ।
సూర్యాచంద్రమసౌ విధృతౌ తిష్ఠతః,
ఏతస్య వా అక్షరస్య ప్రశాసనే గార్గి ।
ద్యావా పృథివ్యౌ విధృతే తిష్ఠతః' బృ. ౨-౮-౯.

'ఓ గార్గి ! యీ యక్షరశాసనమునందే సూర్యచంద్రులు, పృథివీ ద్యులోకములు ధరింపబడియున్నవి.' అని యిట్టి శాసనపూర్వకమగు ధారణ యీ సంవాదమునందు పేర్కొనబడినది. ఈ ధారణజీవాత్మశక్తికి మించినది. కావున నిట నక్షరపదము పరబ్రహ్మవాచకమేయనవలయును. ఉపనిషత్తులు, స్మృతులును పరబ్రహ్మమునే శాసకముగ వర్ణించుచున్నవి.

'సర్వ స్యేశానః సర్వ స్యాధిపతిః
సర్వ మిదం ప్రశాస్తి య దిదం కించ.' బృ. ౫-౬-౧.

'పరబ్రహ్మ పరమాత్మయే సర్వశాసకుడు, సర్వాధిపతి; సర్వమును ప్రశాసించుచున్నాడు.'

'ప్రశాసితారం సర్వేషా మణీయాంస మణోరపి
రుక్మాభం స్వప్నధీగమ్యం విద్యాత్తం పురుషం పరమ్'
మను. ౧౨-౧౨౨

'అన్నిటిని శాసించువాడును, సూక్ష్మముకంటె సూక్ష్మడును, రుక్మాభుడు, స్వప్నధీగమ్యుడునగువానిని పరమపురుషుగా నెరుంగవలెను.

అందువలన నాకాశాంత ప్రపంచమునంతటిని ప్రశాసనపూర్వకముగ ధరించు నక్షరము పరమాత్మయె యనుట నిస్సంశయము. (౧౧)

అక్షరశబ్ద మీ ప్రకరణమున పరమాత్మవాచకమే యనుటకు మరి యొక హేతువు :

అన్యభావవ్యావృత్తేశ్చ ౧-౩-౧౨

అన్యభావ వ్యావృత్తేశ్చ = పరమాత్మకంటె భిన్నములగు ప్రకృతి, జీవాత్మలు వ్యావర్తనము చేయబడినందువలనను, నక్షరపదము పరమాత్మ వాచకమే యని సూత్రార్థము.

'ఏతద్వై తదక్షరంగార్గి ! బ్రాహ్మణా అభివద న్త్యస్థూల మన ణ్వహ్రస్వ మదీర్ఘ మలోహిత మస్నేహ మచ్ఛాయ మతమోఽ వా య్వనాకాశ మసఙ్గ మరస మగంధ మచక్షుష్క మశ్రోత్ర మవా గమనో ఽతేజస్క మప్రాణ మముఖ మమాత్ర మనంతర మబాహ్యం న త దశ్నాతి కించన న తదశ్నాతి కశ్చన. బృ. ౩-౮-౮.

'ఓ గార్గి! బ్రహ్మజ్ఞు లక్షరము నిట్లు వర్ణింతురు. అక్షరము స్థూలము కాదు; సూక్ష్మమును కాదు. హ్రస్వదీర్ఘములునుకాదు - అక్షరము పృథివి కాదని భావము. ఇట్లే యక్షరము లోహితముకాదు - అగ్నికాదని భావము. స్నేహము - జలము - కాదు. అయ్యది వాయ్వాకాశములునుకాదు. దానికి చక్షువులు, శ్రోత్రములు, వాక్కు, మనస్సునేవియులేవు. అనగా జీవాత్మ కాదని భావము. ఇట్లే యది యంతర్బాహ్యవిభాగములు లేనిది. అనగా ప్రకృతి కాదని భావము.'

ఇట్లే యక్షరవర్ణనమునందు ప్రకృతి, జీవాత్మ, స్థూలభూతములు

నన్నియు నక్షరముకాదని స్పష్టముగా వర్ణింపబడియున్నది. అందువలన నక్షరపదము పరమాత్మ వాచకమే యగుననివేరుగ జెప్పనక్కరలేదు. మరియు నీప్రకరణమునందే యిట్లు వర్ణింపబడినది :

'తద్వా ఏతదక్షరంగార్గి ! అదృష్టం ద్రష్ట్రశ్రుతం,
శ్రోత్రమతం మంత్రవిజ్ఞాతం విజ్ఞాతృ'　　బృ. ౩-౮-౧౧.

'ఓ గార్గి ! ఆ యక్షరము స్వయముగా ద్రష్టయై యన్యులచే జూడబడదు. శ్రోతయై శ్రుతముకాదు. తాను మంతయై మననవిషయముకాదు. విజ్ఞాతయయ్యు జ్ఞానమునకు విషయము కాదు.'

చక్షువు, శ్రోత్రము, మనస్సు, బుద్ధియు నను సాధనములులేనిదై అక్షరము సాధనసాధ్యములగు కార్యములన్నియు జేయగలదని భావము. ఈ వర్ణనము జీవాత్మకెన్నడును వర్తింపదు. అందువలనను నక్షరపదము పరమాత్మవాచకమే యనుట సుస్పష్టము. (౧౨)

## చతుర్థాధికరణము

అక్షరపదము బ్రహ్మబోధక మని వర్ణింపబడినది. ఆ బ్రహ్మమే పురుష డనబడుననియు జెప్పుటకు మరియొక యధికరణము ప్రారంభింపబడుచున్నది.

### ఈక్షతి కర్మవ్యపదేశాత్ సః　౧-౩-౧౩

ఈక్షతికర్మవ్యపదేశాత్ = ఈక్షణ మనెడి కర్మవర్ణింపబడుటవలన, సః = ప్రశ్నోపనిషత్తునందు వర్ణింపబడిన పురుషుడును, బ్రహ్మమే యని సూత్రార్థము.

'షోడశకలం భారద్వాజ ! పురుషం వేత్థ.' ప్ర. ౬-౧

'ఓ భారద్వాజ ! షోడశకళలతోగూడిన పురుష నెరుగుదువా?' యని ప్రశ్నోపనిషత్తునందు ప్రారంభించి,

ఇహైవాంతఃశరీరే సోమ్య! స పురుషో
యస్మిన్నేతాః షోడశకలాః ప్రభవంతి.' ప్ర. ౬-౨.

'ఓ సౌమ్య! ఈ శరీరమునందే యా పురుషుడున్నాడు. అతనియందే షోడశకళలు నుద్భవించుచున్నవి.' అని యనంతరవాక్యమున జెప్పబడినది.

ఈ వాక్యములందు ప్రయోగింపబడిన పురుషపదము జీవబోధకమా? లేక బ్రహ్మబోధకమా? యని సంశయమును గలిగించును. శాస్త్రములందు పురుషపదము జీవేశ్వరుల కిరుపురకును వాడబడుట జూడనగును. అందు వలన సంశయమొదవుట సహజమే.

'వేదాహ మేతం పురుషం మహాంత
మాదిత్యవర్ణం తమసః పరస్తాత్' యజు. ౩౧-౧౮
ఈ మంత్రమునందలి పురుషపదము పరమాత్మవాచకము.
'ఏష హి ద్రష్టా స్పృష్టా శ్రోతా ఘ్రాతా రసయితా
మన్తా బోద్ధా కర్తా విజ్ఞానాత్మా పురుషః ప్ర. ౪-౯.

'దర్శనస్పర్శనాది గుణములుగల విజ్ఞానాత్మ పురుషుడు' అను నీ యుపనిషద్వాక్యములోని పురుషపదము జీవాత్మవాచకము. ఇట్లు పురుష పదము జీవేశ్వరుల కుభయులకు ప్రయోగింపబడుటవలన ప్రస్తుతప్రక రణమునగల పురుషపదము జీవాత్మవాచకమా? లేక పరమాత్మవాచకమా? యని సంశయముగలుగుట అసంగతము కాదు. అందు జీవాత్మ యనుట పూర్వపక్షము. కాదు, పరమాత్మయనుట సిద్ధాంతము.

పూ.ప: ఈ ప్రకరణమునగల పురుషపదము జీవాత్మవాచకమను టకు హేతువుగలదు. జీవుడు కర్మార్జితశరీరమునందుండి, అందనుభవింప వలసిన కర్మఫలముల ననుభవించి, అనంతర మా శరీరమును విడిచి మరి యొకశరీరమున ప్రవేశించుటకై యటనుండి యుత్క్రమించును - వెడలి పోవును. ఈ యుత్క్రమణము జీవాత్మ యనుటకు హేతువు - లింగము.

'స యదాస్మాచ్ఛరీరా దుత్క్రామతి
స హైవైతైః సర్వైరుత్క్రామతి' కౌ. ౩-౪.

'అత డీ శరీరమునుండి యుత్క్రమించునపు డీ యన్నింటితోను నుత్క్రమించును.' ఇట్టి యుత్క్రమణము - ఒక శరీరమును విడిచి మరి యొక శరీరమునఁబ్రవేశించుట - జీవాత్మయందే వర్తించును. పరమాత్మయం దీ ధర్మమువర్తింపదు. పరమాత్మ వ్యాపకము, వ్యాపకవస్తువునం దుత్క్రమణము ఘటింపదు. కాబట్టి ఈ ప్రకరణమునందలి పురుషపదము జీవాత్మ వాచక మగునని ప్రాప్తింపగా - సమాధానము :

పురుషపద మిట పరమాత్మబోధకమే యగును. కాని జీవవాచకము కాదు. ఈ ప్రకరణమున నీక్షణము పురుషధర్మముగా జెప్పబడినది.

'స ఈక్షాం చక్రే' ప్ర. ౬-౩. 'అత డీక్షించెను.'

ప్రాణము, శ్రద్ధ, ఆకాశము, వాయువు మున్నగు పదునారుకళల నుత్పన్నము చేయుట కనుకూల మగు సంకల్పపూర్వక పర్యాలోచనము ఈక్షణ మనబడును. ఇయ్యదియే యుపనిషత్తులందు తప స్సనియు జెప్ప బడును.

'స తపో ఽతప్యత' ప్ర. ౧-౪. 'అతడు తప మొనర్చెను'

ఈ ప్రకరణమున వర్ణింపబడిన ఈక్షణధర్మము పరమాత్మయందే వర్తించును. అతడే యీక్షణమాత్రమున ప్రాణాదికళలను సృష్టింపగలడు. జీవాత్మ కట్టిసామర్థ్యము లేదు. కాబట్టి యిందలి పురుషపదము పరమాత్మ వాచక మనియే నిశ్చితమగుచున్నది. (౧౩)

## పంచమాధికరణము

పరమాత్మ పురుషపదవాచ్య మని నిర్ణయించి పిమ్మట నా పరమాత్మ వ్యాపక మని చెప్పుటకై అధికరణాంతరమును బ్రారంభించుచున్నాడు.

దహర ఉత్తరేభ్యః ౧-౩-౧౪

ఉత్తరేభ్యః=తరువాతి వాక్యములవలన, దహరః=ఛాందోగ్యమున వర్ణింపబడిన దహరాకాశము పరమాత్మయే యని సూత్రార్థము.

'అథ య దిద మస్మిన్ బ్రహ్మపురే
దహరం పుండరీకం వేశ్మ దహరోఽస్మి న్నంతరాకాశః,
తస్మిన్ యదంత స్త దన్వేష్టవ్యం
తద్వావ విజిజ్ఞాసితవ్యమ్.' ఛాం. ౮-౧-౧.

'ఈ బ్రహ్మపుర మనెడి మనుష్యశరీరమునందున్న చిన్నహృదయ కమల మనెడి గృహమునందు సూక్ష్మ మగు నాకాశము (దహర ఆకాశః) గలదు. ఆ యంతరాకాశ మన్వేషింపదగినది; ఎఱుగదగినదియును' అను నీ వాక్యమున గల దహరాకాశము పరమాత్మవాచకమా? లేక జీవాత్మవాచకమా? యని సంశయము.

పూ. ప : ఇట దహరాకాశము శరీరమునందలి హృదయపుండరీకమున నున్నట్లు వర్ణింపబడుటచేతను, హృదయము జీవు డుండు స్థానమగుటచేతను జీవాత్మవాచక మనుటయే యుక్తము. దహరశబ్దమున కర్థము పరిచ్ఛిన్నము - సూక్ష్మము. జీవాత్మ యణుపరిమాణముకల దగుటవలన పరిచ్ఛిన్న మనుటలో సందేహము లేదు. ఆకాశ మన నంతట ప్రకాశించునది. పరిచ్ఛిన్న మగు జీవాత్మ హృదయమునం దుండి శరీరమునం దంతటను ప్రకాశించుచున్నాడు. కాబట్టి దహరాకాశము జీవాత్మబోధకమే యని ప్రాప్తింపగా - సమాధానము :

ఛాందోగ్యమునందలి యీ ప్రకరణమునందలి తరువాతి వాక్యములను బట్టి దహరాకాశము పరమాత్మబోధకమే యగును; కాని జీవవాచకము కాదు.

'యావాన్ వా అయ మాకాశ స్తావా నేషో
అ న్తర్ హృదయ ఆకాశః ఉభే అస్మిన్
ద్యావా పృథివీ అంతరేవ సమాహితే,
ఉభా వగ్నిశ్చ వాయుశ్చ, సూర్యాచంద్రమసా వుభౌ
విద్యు న్నక్షత్రాణి యచ్చాస్యే హా స్తి యచ్చ నా స్తి
సర్వం తదస్మిన్ సమాహితమ్' ఛాం. ౮-౧-౩.

'ఈ వెలుపలియాకాశ మెంతటిదో, హృదయమునందలి (దహర) యాకాశము నంతటిదే. ఈ యంతరాకాశమునందు పృథివీద్యులోకములు, అగ్నివాయువులు, సూర్యచంద్రులు, విద్యున్నక్షత్రములు, ఇహమున నున్నదియు లేనిదియు నన్నియు నిమిడియున్నవి.' ఈ యుత్తరవాక్యము నందలి యర్థమును పరికించినచో హృదయకమలమునందలి దహరాకాశము జీవబోధకము కాక పరమాత్మవాచక మనియే స్పష్టమగును. భూమ్యాకాశాదులు పరమేశ్వరునం దిమిడియున్నవికాని యణుపరిమాణము గల జీవునిలో లే వనుట నిక్కువము.

మరియు నీ ప్రకరణమునందే యొక యెడ —
'ఏష ఆత్మాఽపహతపాప్మా విజరో విమృత్యు
ర్విశోకో ఽవిజిఘత్సో ఽపిపాసః సత్యకామః సత్యసంకల్పః'
ఛాం. ౮-౧-౫.

అను నీ వాక్య ౦ందు 'ఆత్మ పాపరహితము, జరామృత్యుశోకాదులు లేనిది, ఆకలిదప్పులు లేనిది, సత్యకామము, సత్యసంకల్పము' నని వర్ణింపబడినది. పాపరాహిత్యాది సత్యసంకల్పాంతధర్మములు పరమాత్మయందే కలవనియు, జీవాత్మయందు లేవనియు సులభముగ దెలియును. కావున దహరాకాశము పరమాత్మయే కాని వేరొండు కాదు.

ఇంతేకాక యీ దహరాకాశము నెరింగిన యోగులు సర్వలోకము

లందును కామచారు లగుదు రనియు ననంతరవాక్యమున వర్ణింపబడుట చూడ నగును.

'అథ య ఇహాత్మాన మనువిద్య వ్రజన్తి ఏతాంశ్చ సత్యాన్
కామాన్ తేషాం సర్వేషు లోకేషు కామచారో భవతి.'

ఛాం. ౮-౧-౬.

అను నీ వాక్యార్థము పరమాత్మయందే సంగత మగును. కాబట్టి దహరాకాశము పరమాత్మవాచకమే యనుట సునిశ్చితము. (౧౪)

## గతిశబ్దాభ్యాం తథా హి దృష్టం లింగం చ ౧-౩-౧౫

(బ్రహ్మ, దహరపదము లీ సూత్రమున నన్వయించును.)

గతి శబ్దాభ్యాం = గతి, శబ్దము నను రెండింటివలనను, దహరాకాశము బ్రహ్మవాచక మని యెరుంగునది. తథా హి = దహరాకాశమునందువలెనే బ్రహ్మమునందును, దృష్టం=మరియొక వాక్యమునందు గతి, శబ్దము రెండును బ్రయోగింపబడియుండుట చూడనగును. లింగం చ=లక్షణముకూడ చూడనగును.

(గతి=గమనము - ప్రాప్తి, శబ్దము=బ్రహ్మలోక మనెడి పదము.)

'తద్ యథాఽపి హిరణ్యనిధిం నిహిత మక్షేత్రజ్ఞా
ఉపర్యుపరి సంచరంతో న విందేయుః
ఏవమే వేమాః సర్వాః ప్రజా అహరహ ర్గచ్ఛంత్య
ఏతం బ్రహ్మలోకం న విందంతి అనృతే నహి ప్రత్యూఢాః'

ఛాం. ౮-౩-౨.

'దాచిపెట్టిన ధనము నదియున్న స్థలము నెరుగనివా రా స్థలముపై దిరుగాడుచును దానిని పొందజాలనట్లు, జీవులు నిత్యము బ్రహ్మలోకమును బొందియు దాని నెరుగజాలకున్నారు' అను నీ వాక్యమునందలి ప్రజా

శబ్దము జీవాత్మవాచకము. ఏతం బ్రహ్మలోకమ్ అనుటచే ప్రకరణమున పూర్వము వర్ణింపబడిన దహరాకాశము గ్రహింప నగును. ఇట్లు జీవులు బ్రహ్మలోకమును నిత్యము గమించుచు-ప్రాప్తించుచునే యున్నారు. జీవులు నిత్యము సుషుప్తిలో బ్రహ్మమును బొందుచున్నా రని భావము. ఈ వాక్యమునందలి 'జీవుల గతి, బ్రహ్మలోక శబ్దము' నను నీ రెంటి ప్రయోగమువలనను దహరాకాశము బ్రహ్మవాచక మనుట నిశ్చితమే యని సూత్రాభిప్రాయము.

ఇట్లే మరియొక యుపనిషద్వాక్యమునందును జీవులు నిత్యము బ్రహ్మను బొందుచున్నట్లు - బ్రహ్మనుగూర్చిన జీవగతి - చూడనగును.

'స ఏనం యజమాన మహరహర్ బ్రహ్మ గమయతి' ప్ర. ౪-౪.

'య త్రైతత్ పురుషః స్వపితి నామ
సతా సోమ్య తదా సంపన్నో భవతి' ఛాం. ౬-౮-౧.

'పురుషుడు నిద్రించునపుడు సద్రూప బ్రహ్మమును బొందును' అని యీ వాక్యమున వర్ణింపబడుట స్పష్టము.

ఈ ఛాందోగ్యముననే మరియొక స్థలమునందు –

'బ్రహ్మలోక మభిసంపద్యతే' ఛాం. ౮-౧౩-౧.

'బ్రహ్మలోకమును బొందుచున్నాడు' అని బ్రహ్మలోక శబ్దముకూడ బ్రయోగింపబడుట చూడనగును. కాబట్టి 'గతి, శబ్దము' నను నీ రెండును దహరాకాశము బ్రహ్మబోధకమని బోధించునని భావము. ఇట్టి పద ప్రయోగరూపలింగమే దహరశబ్దము పరమాత్మవాచక మనుటకును ప్రమాణమని తెలియవలెను. (౧౫)

ఉపర్యుక్త విషయమును సాధించుట కింకొక హేతువు :

**ధృతేశ్చ మహిమ్నోఽస్యాస్మి న్నుపలబ్ధేః ౧-౩-౧౬**

ధృతేః చ=జగద్ధారణవలనను దహరశబ్దము పరబ్రహ్మవాచకమని

నిశ్చయింపవలెను. కారణ మేమనః అస్మిన్ = బ్రహ్మమునందే, అస్య మహిమ్నః=జగద్ధారణరూప మహిమ, ఉపలబ్ధేః = మరియొక యుపనిష ద్వాక్యమువలన దెలియబడుచున్నది.

ఛాందోగ్యమున ప్రస్తుతప్రకరణమునందే హృదయకమలమున దహరాకాశ మున్నట్లు ముందుగాజెప్పి, దానియందే పృథివ్యాదిలోకములు సమాహితములై యున్నట్లును వర్ణింపబడినది. అనంతర మా దహరాకాశ మునకై యాత్మశబ్దము ప్రయోగించి, యందు పాపరాహిత్యాది ధర్మము లను వర్ణింపబడినవి. అట్టి యాత్మ నుద్దేశించియే వాక్యాంతరమున –

'అథ య ఆత్మా స సేతు ర్విధృతి
రేషాం లోకానా మసంభేదాయ' ఛాం. ౮-౪-౧.

'ఆత్మ, లోకములు మర్యాద నతిక్రమింపకుండునట్లు ధరించుబంధన' మని చెప్పబడినది. ఇట్లు సర్వలోకములను ధరించునట్టి యాత్మ పరబ్రహ్మ పరమాత్మయే యగును. వేదమునందును పరబ్రహ్మయే జగద్ధారకుడని వర్ణించుట చూడనగును.

'స దాధార పృథివీం ద్యా ముతేమాం' ఋ. ౮-౭-౩-౧.

కాబట్టి దహరాకాశము పరబ్రహ్మవాచక మనియే స్పష్టమగు చున్నది. (౧౬)

దహరాకాశము బ్రహ్మవాచక మనుటకు హేత్వంతరము

## ప్రసిద్ధేశ్చ ౧-౩-౧౭

ఆకాశ శబ్దము పరమాత్మయందు ప్రసిద్ధమగుటవలనను దహరాకా శము బ్రహ్మవాచకమే యని సూత్రార్థము.

'ఋచో అక్షరే పరమే వ్యోమన్' ఋ. ౧-౧౬౪-౩౯.

'ఆకాశోవైనామ నామరూపయోర్ నిర్వహితా.' ఛాం. ౮-౧౪-౧.

ఇందు మొదటివాక్యములోని వ్యోమపదము, రెండవవాక్యమునందలి ఆకాశపదము రెండు పరమాత్మ వాచకములే. ఇట్లాకాశపదము పరమాత్మ వాచకముగా పలుతావులందు ప్రయోగింపబడుట ప్రసిద్ధము. అందువలన దహరాకాశముకూడ పరమాత్మవాచకమేయని సూత్రాభిప్రాయము. (౧౭)

దహరాకాశము పరమాత్మవాచకమని నిరూపించి మహర్షి మరల శంకించి సమాధానము చెప్పుచున్నాడు.

### ఇతరపరామర్శాత్ స ఇతి చేన్నాసంభవాత్ ౧-౩-౧౮

ఇతర పరామర్శాత్ = పరమాత్మునికంటె భిన్నుడగు జీవున కీ వాక్యమునందు సంబంధ ముండుటవలన, స ఇతిచేత్=జీవాత్మయే దహరాకాశ శబ్దమున కర్థమందురేని, అసంభవాత్ = అపహతపాప్మత్వాది ధర్మములు జీవునియందు అసంభవములగుటవలన, న=జీవాత్మ దహరాకాశము కాదు.

ఛాందోగ్యములోని యీ దహర ప్రకరణమునందే,

'అథ య ఏష సంప్రసాదో ఽస్మాత్ శరీరాత్
సముత్థాయ పరంజ్యోతి రుపసంపద్య స్వేన
రూపే ణాభిసంపద్యతే, ఏష ఆత్మేతి హోవాచ' ఛాం. ౮-౩-౪.

'ఈ జీవాత్మ (సంప్రసాదః) యీ శరీరమును విడిచి, పరంజ్యోతిని బొంది స్వరూపముతో నుండును. ఇది యాత్మ' యని చెప్పబడినది. ఈ వాక్యమునందు జీవాత్మ గ్రహింపబడుటచే దహరాకాశము జీవాత్మవాచకమందురేని - అది యుక్తము కాదు. కారణ మేమన, ఈ వాక్యమునందలి సంప్రసాద శబ్దము జీవవాచక మనుట కెట్టి సంశయమును లేదు. అణుపరిమాణము గలదగుటవలన జీవాత్మ శరీరమును విడువగలదు. కాని; యంతటితోనే దహరాకాశపదము జీవవాచక మనదగదు. తదుపరి వాక్య

శేషమునందు వర్ణింపబడిన పాపరాహిత్యము, సత్యసంకల్పాది గుణములు జీవాత్మయందు సంభవములు కావు. అయ్యవి పరమాత్మగుణములే. కావున దహరాకాశపదము బ్రహ్మవాచక మనుట నిశ్చితము. (౧౮)

మరియొక శంకకు మహర్షి సమాధానము :

## ఉత్తరాచ్చే దావిర్భూత స్వరూప స్తు ౧-౩-౧౯

ఉత్తరాత్‌చేత్ = ప్రజాపతి నుడివిన యుత్తరవాక్యమువలన నప హతపాప్మత్వాది గుణములు జీవాత్మయందు సంభవమగు నందురేని, తు=కాదు. కారణ మేమన: జీవాత్మ, ఆవిర్భూత స్వరూపః=అభినిష్పన్న స్వరూపము గలదిగా జెప్పబడినది.

ఇంద్రు డొకనా డాత్మ నెరుగగోరి విరోచనునితోగూడి ప్రజాపతిని సమీపించెను. ప్రజాపతి యింద్రున కాత్మనుగురించి యుపదేశించెను. అతడు ముందుగా జాగ్రదవస్థకు సంబంధించిన యాత్మ నుపదేశించి, యనంతర మున క్రమముగా స్వప్న, సుషుప్తి, తురీయావస్థలకు సంబంధించిన యాత్మ నుపదేశించియుండెను. ఇట్లనేక పర్యాయము లాత్మజిజ్ఞాసాభావ ముతో తన చెంతజేరిన యింద్రునకు క్రమముగా నా యా యవస్థలందు ఆత్మ యెట్లుండునో గుర్తింపజేసి తుదకు ముక్తావస్థయందు పరమాత్మను బొంది జీవుడు స్వస్వరూపమున నుండునని చెప్పుటచే నీ దహర ప్రకరణ మున వర్ణింపబడిన యపహతపాప్మత్వాది ధర్మములు శుద్ధుడైన ముక్త జీవునియందును సంభవములు కావచ్చును. కాబట్టి దహర శబ్దము జీవాత్మ వాచక మేల కాదందురేని - అది యుక్తము కాదు.

అపహతపాప్మత్వము, సత్యసంకల్పము మున్నగు గుణములు జీవునకు స్వాభావికములు కాదు. పరబ్రహ్మ సంబంధముచే నతని కొకట గలిగిన గలుగవచ్చును. దహరప్రకరణమున వర్ణింపబడిన ధర్మములు

స్వాభావికము లగుటచే నయ్యవి పరమాత్మయందే వర్తించును. అందు వలన దహరశబ్ద మిట పరమాత్మవాచక మనియే యెంచవలెను. (౧౯)

అటులయిన దహరప్రకరణమున ప్రజాపతివాక్యములందు జీవాత్మ యేల పరామర్శింపబడిన దందురేని –

## అన్యార్థ శ్చ పరామర్శః ౧-౩-౨౦

(సూత్రమునందలి 'చ'కారము జీవాత్మ దహరపదముచే జెప్పదగ దని బోధించుటకే.)

పరామర్శః చ=ఈ ప్రకరణమున సంప్రసాద శబ్దముచే జీవాత్మ గ్రహింపబడుట, అన్యార్థః = జీవాత్మకంటె భిన్నమగు పరమాత్మను బోధించుటకే యని సూత్రార్థము.

సుషుప్తియందును, ముక్తియందును జీవాత్మ యే పరమాత్మను బొంది స్వస్వరూపమున నుండునో యా పరంజ్యోతి పరమాత్మ జీవాత్మ కాదు. అది జీవాత్మకంటె భిన్నము. అయ్యదియే దహరశబ్దవాచ్యము. అని యిట్లు బోధించుటకే దహరవాక్యములందు జీవాత్మ పరామర్శింపబడినదని భావము. (౨౦)

మహర్షి మరియొక శంక కిట్లు సమాధానమును సూత్రించుచున్నాడు :

## అల్పశ్రుతే రితి చే త్తదుక్తమ్ ౧-౩-౨౧

అల్పశ్రుతేః = వాక్యమునం దల్పత్వము వర్ణింపబడుటవలన, దహరశబ్దము జీవవాచకమే। ఇతిచేత్=అందురేని, తదుక్తమ్ = ఇందుకు సమాధానము పూర్వమే చెప్పబడినది.

'దహరోఽస్మి న్నంతరాకాశః' ఛాం. ౮-౧-౧.

'హృదయకమలమునందలి యాకాశ మల్పము (దహరము) అని యనుటచేత దహరాకాశము బ్రహ్మవాచక మెట్లగునందురేని,

'అర్భకౌక స్తావత్....వ్యోమవచ్చ'*(౧-౨-౭.) అను సూత్రమున నిందులకు సమాధానము చెప్పబడినది.

పరబ్రహ్మ పరమాత్మ సర్వవ్యాపకమై యనంతమైనను హృదయ కమలము నుపాధిగా నెంచి దహర (అల్ప) మని వర్ణింపబడినది. ఉపాస కునకు నుపాస్యమగు బ్రహ్మము సులభముగా బోధపడునిమిత్త మట్లు వర్ణింపబడినదని భావము. కాబట్టి దహరాకాశము బ్రహ్మవాచకమే యగును. కాని, జీవవాచకము కాదని సూత్రార్థము. (౨౧)

## అనుకృతే స్తస్య చ ౧-౩-౨౨

తస్య = పరబ్రహ్మముయొక్క, అనుకృతేశ్చ = హృదయోపాధి ంకరించుటవలనను, అల్పశ్రుతి సంగతము కాగలదు.

ఘటాదులం దుండు నాకాశము ఘటాద్యాకారముల ననుకరించు చున్నదో యన, లోకమునందు 'ఘటాకాశము, మఠాకాశము' నను వ్యవ హారము చూచుచున్నాము. అట్లే వ్యాపకమగు పరమాత్మయు హృదయ పుండరీకోపాధి ననుకరించుచున్నట్లు కల్పించి పరిచ్ఛిన్నమని వ్యవహరింప బడినదని భావము. అందువలన బ్రహ్మస్వరూపమే యల్ప మని యెంచ రాదు. (౨౨)

## అపి చ స్మర్యతే ౧-౩-౨౩

ఉపనిషద్వాక్యములందేకాక స్మృతులందును అట నట పరమేశ్వరు డల్పు డైనట్లు వర్ణింపబడుటయు జూడనగునని సూత్రార్థము.

'ప్రశాసితారం సర్వేషా మణీయాంస మణో రపి
రుక్మాభం స్వప్నధీగమ్యం విద్యా త్తం పురుషం పరమ్'
మను. ౧౨-౧౨౨.

'పరమపురుషుడు స్వప్నధీగమ్యుడు, రుక్మాభుడు, అల్పముకంటె నల్పుడు, సర్వప్రకాశకుడు నని యెరుంగవలెను.' ఇట్లు స్మృతులయందును, నుపనిషత్తులందును బ్రహ్మము అల్పము - సూక్ష్మము - గా వర్ణింపబడుటచేత దహరాకాశము పరబ్రహ్మవాచక మనియే గ్రహింపవలయును. (౨౩)

## షష్ఠాధికరణము

పరమాత్మ యుపనిషత్తులం దంగుష్ఠమాత్రు డనియు జెప్పబడియుండుటను నిరూపించుటకు నధికరణాంతర మారంభించుచున్నాడు.

### శబ్దాదేవ ప్రమితః ౧-౩-౨౪

శబ్దాదేవ = ఉపనిషద్వాక్యముపలననే, ప్రమితః = పరిమితముగా జెప్పబడిన పురుషుడును, పరబ్రహ్మమే యగు నని సూత్రార్థము.

'అంగుష్ఠమాత్రః పురుషో మధ్య ఆత్మని తిష్ఠతి'
ఈశానో భూతభవ్యస్య న తతో విజుగుప్సతే ఏతద్ వైతత్'
కఠ. ४-౧౨.

'భూతభవిష్యద్వర్తమానముల కీశుడైన పురుషుడు అంగుష్ఠమాత్రుడు, శరీరమధ్యమున నున్నాడు.'

ఇందు వర్ణింపబడిన పురుషుడు శరీరమునం దున్నాడనియు, నంగుష్ఠపరిమితు డనియు వర్ణింపబడుటచే నంగుష్ఠమాత్రుడు జీవుడు కావచ్చు నని శంకింప ననువగును; కాని యిట పరమాత్మయే గ్రహింప నగును. జీవుడు భూతభవిష్యద్వర్తమానముల కీశుడు కాడు. భూతభవ్యములను వశమునం దుంచుకొని నియమించు శక్తి పరబ్రహ్మ పరమాత్మకే గలదు. కాబట్టి యంగుష్ఠమాత్ర పదము పరబ్రహ్మమునే సూచించును.

మనుజుల హృదయ మించుమించుగా నంగుష్ఠ (బొటనవ్రేలు) ప్రమాణ మని యభిజ్ఞుల మతము. అట్టి హృదయమునం దంతర్వర్తియై యున్న బ్రహ్మ మంగుష్ఠమాత్ర మని చెప్పబడినది. సర్వేశ్వరత్వము పర బ్రహ్మ పరమాత్మకే కలదని వేదముకూడ నంగీకరించును. 'యో భూతంచ భవ్యంచ సర్వం య శ్చాధితిష్ఠతి' అథర్వ. ౧౦-౮-౪-౧. (౨౪)

వ్యాపకమగు బ్రహ్మము దేనిపోలికచే నంగుష్ఠమాత్ర మని చెప్ప బడిన దన :

## హృద్యపేక్షయా తు మనుష్యాధికారత్వాత్ ౧-౩-౨౫

మనుష్యాధికారత్వాత్=శాస్త్రము మనుజుల నుద్దేశించి రచియింప బడుటవలన, బ్రహ్మము, హృద్యపేక్షయాతు=హృదయమునం దుండుటం బట్టి యంగుష్ఠమాత్ర మని వర్ణింపబడినదని సూత్రార్థము.

శాస్త్రము మనుష్యులకొఱకై వ్రాయబడినది. మనుజుల హృదయ మించుమించుగా నంగుష్ఠపరిమాణము గలదిగా నెంచబడును. పరబ్రహ్మ హృదయమున నున్న ట్లనేక పర్యాయములు చెప్పబడినది. యోగులు, నుపాసకులు హృదయమునందే బ్రహ్మము నుపాసింతురు - సాక్షాత్కారము జేసికొందురు. అందువలననే వ్యాపకమయినను బ్రహ్మ మంగుష్ఠమాత్ర మని వర్ణింపబడినది. (౨౫)

బ్రహ్మము హృదయగత మగుటచే హృదయమాత్ర మనబడిన యెడల, నది హృదయమునకు వెలుపల నుండదా? అయ్యది వ్యాపకము కదా! యన :

## తదుపర్యపి బాదరాయణః సంభవాత్ ౧-౩-౨౬

సంభవాత్ = వ్యాపకమై బ్రహ్మము హృదయమునందు తన్మాత్ర

ముగ నుండుట సంభవమే కావున, తదుపర్యపి=హృదయమునకు వెలుప లను అది యుండు నని, బాదరాయణః=బాదరాయణుని మతము.

పరబ్రహ్మము హృదయమునం దుండి హృదయమాత్ర పరిమాణముగలది యగుచో నయ్యది వ్యాపకము కాజాలదు. అది పరిచ్ఛిన్న మగును. అట్టి బ్రహ్మము జగజ్జన్మస్థితిలయములకు కారణము కాజాలదు. అందువలన బ్రహ్మము వ్యాపక మని యంగీకరించుట సర్వతంత్ర సిద్ధాంతము. బ్రహ్మము హృదయమునకు వెలుపలను గలదు. అయినను వ్యాపక బ్రహ్మము హృదయమాత్ర మని గౌణముగా జెప్పబడుటయు సంభవమే యని బాదరాయణుని మతము. (౨౬)

(శ్రీ శంకరాచార్య ప్రభృతులు కొంద రీసూత్రమున గల 'తదుపర్యపి' అను పదమునకు 'మనుజులకు పై నుండు దేవతలకుగూడ బ్రహ్మవిద్యలో నధికార మున్న'దని యర్థము చెప్పి యింద్రాదిదేవతలకు కర్మాధికారము కూడ సంభవమే యని యేమేమో సాధించియున్నారు; కాని యీ సూత్రమునందలి తచ్ఛబ్దముతో పూర్వసూత్రమునందలి 'హృద్యపేక్షయా' యను పదమును గ్రహింపక, 'మనుష్యాధికారత్వాత్' అను సమస్తపదములోని యేకదేశమైన మనుష్యశబ్దమును గ్రహించుట న్యాయ విరుద్ధము.)

## కర్మణి విరోధ ఇతిచేన్నానేక ప్రతిపత్తేర్దర్శనాత్ ౧-౩-౨౭

పరబ్రహ్మము వ్యాపకమైనచో, కర్మణి = జగద్రచనాత్మకకర్మము నందు, విరోధః = విరోధము కలుగును. ఇతిచేత్ = అనియందురేని, అనేక ప్రతిపత్తేః = బ్రహ్మమునం దనేకశక్తు లున్న ట్లంగీకరించినందున, దర్శనాత్ = శ్రుతి స్మృతులలో నట్లే చూడబడుటవలనను, న = కర్మ విరోధ మనుట తగదు.

పరబ్రహ్మ పరమాత్మ వ్యాపకమగుటచే నందు క్రియ గలుగనేరదు. అందువలన నయ్యది ప్రకృతియందు క్రియాహేతుకమగు పరిణామమును కలిగింపనేరదు. ప్రకృతిలో పరిణామము కలుగని పక్షమున సృష్టియేర్పడ జాలదు. వ్యాపకమగు బ్రహ్మము నిష్క్రియ మగుటవలన నది సృష్టిస్థితి లయములకు కారణము కాజాలదని సిద్ధమగుచున్నది. కాబట్టి వ్యాపక బ్రహ్మము హృదయాంతరముననుండి హృదయమాత్ర మనబడుచున్న దనుట జగదుత్పత్తిక్రియకు విరుద్ధము కాగలదందురేని, అది యుక్తము కాదు. కారణమేమన:

వ్యాపకబ్రహ్మమునం దనేకశక్తు లున్నవి. ఆ శక్తులమూలమున నయ్యది జగదుత్పత్తిస్థితిలయములకు హేతువు కాగలదు. - 'పరబ్రహ్మము వ్యాపకమగుటచే నది నిష్క్రియమగును. ప్రకృతియందు క్రియ గలిగింప జాలదు. కాబట్టి ప్రకృతి మహదహంకారాదిరూపమున బరిణమింపదు. కాగా సృష్టి యేర్పడదు.' - అని శంకింప బనిలేదు. అనేక శక్తియుక్త దగు జీవుడు శరీరమున నొకచో హృదయముననుండి కదలక మెదల కయే శరీరమునం దంతటను క్రియలు గలిగించునట్లు పరబ్రహ్మ పర మాత్మయు తన దివ్యశక్తులద్వారమున ప్రకృతియందు క్రియామూలకపరి ణామము నుద్భవింపజేసి జగద్రచనకు కారణమగుచున్నది. అందుకై తాను స్వయముగ క్రియావంతము గా నవసరముండదు. పరమాత్మయం దట్టి శక్తియుక్తులు గలవనుటకు మంత్రమే ప్రమాణము:

"విష్ణోర్నుకం వీర్యాణి ప్రవోచమ్' ఋ. ౧-౨-౨౪-౧.

'య స్యామితాని వీర్యాణి' ఋ. ౬-౨-౧౮-౨౧.

ఇంతేకాక క్రియారహిత మగు నొకవస్తువు మరియొకవస్తువునందు క్రియను గలిగింపజాలదను నియమ మెుం దెందునులేదు. అయస్కాంతము తాను స్వయముగ కదలకయే సమీపమున నుండు సూదులలో చలనక్రియను

గలిగించుట ప్రత్యక్షసిద్ధము. అందువలననే సాంఖ్యశాస్త్రమున నిట్లు సూత్రింపబడినది,

'తత్సన్నిధానాత్ అధిష్ఠాతృత్వం మణివత్'  ౧-౯-౬

పరమేశ్వరు డయస్కాంతమణివలె నిష్క్రియుడైనను తనకు సన్నిహితమైయున్న ప్రకృతియందు క్రియనుగలిగించి దానిని మహదహం కారాది రూపమున బరిణమింపజేసి జగత్తును నిర్మించుచున్నాడు. ఈ విష యమునే

'య ఇమం చ లోకం చ పరం చ లోకం
సర్వాణి చ భూతా న్యంతరో యమయతి.' బృ. ౩-౭-౧.

'ఈ లోకమును, పరలోకమును, సమస్తభూతరాశిని గూడ అంత ర్యామియై నియమించుచున్నాడు' అని బ్రహదారణ్యకము స్పష్టముసేయు చున్నది. కాబట్టి వ్యాపకమైన పరబ్రహ్మము హృదయాంతరముననుండు టచే నంగుష్ఠమాత్రమని గౌణముగా వర్ణింపబడుట యుక్తమే. (౨౬)

## సప్తమాధికరణము

వేరొక శంకకు సమాధానము :

### శబ్ద ఇతి చేన్నాతఃప్రభవాత్ ప్రత్యక్షానుమానాభ్యామ్  ౧-౩-౨౮

ప్రత్యక్షానుమానాభ్యాం = శ్రుతి స్మృతులవలన, వేదములు, అతః ప్రభవాత్ = పరమేశ్వరునివలననే యుత్పన్నములయినట్లు తెలియు చున్నందున, శబ్దే = వేదవిషయమున, ఇతిచేత్ = విరోధము గలుగునందు రేని, న = అదియును సరికాదు.

నిష్క్రియము వ్యాపకము నగు పరబ్రహ్మమువలన ప్రకృతిపరి

నామరూపమగు జగదుత్పత్తి సంభవమైనను వేదము లెట్లు సంభవింప గలవు ? అని యీ సూత్రమున గల శంకాభిప్రాయము.

అర్థయుక్తమగు కొందొకశబ్దరాశి వేదమనబడును. అయ్యది సర్గాది యందు సర్వజనులకు నుపకారము జేయ నెంచిన పరమేశ్వరు నుండి ప్రాదుర్భూతమైనదని సిద్ధాంతము. పరమేశ్వరుడు వ్యాపకుడు. అందువలన నతనికి శరీరముండదు. దంతతాల్వాద్యవయవము లసలేయుండవు. కాబట్టి శబ్దరాశిరూపమగు వేదము వ్యాపకపరబ్రహ్మమునుండి యెట్లు ప్రాదుర్భ వింపగలదు ? అను శంకకు సమాధాన మిట్లు నుడువుదురు.

వ్యాపకుడగు పరమేశ్వరు డెట్లు సన్నిహితప్రకృతియందు పరి ణామకారకమగు క్రియ నుద్భవింపజేసి, మహదహంకారాది రూపమగు వివిధ ప్రపంచమును ప్రపంచింపజేయుచున్నాడో, అట్లే సర్గాదియం దభ్యుదయ నిఃశ్రేయసకారకములగు కర్మలందు మానవులకు ప్రవృత్తి కలుగుటకును. విరుద్ధకర్మలందు నివృత్తిగలుగుటకును ఆదిమహర్షుల హృదయకమలములందు పూర్వపూర్వకల్పములందువలె సార్థకములు, సస్వరములు నయిన వేదమంత్రములను స్ఫురింపజేయును. అట్లు స్ఫురిం చిన మంత్రములను క్రమముగా నామహర్షు లుచ్చరించి పఠింతురు. అందు వలననే మహర్షులు మంత్రద్రష్టలని చెప్పబడుచున్నారు. వారు మంత్ర కర్తలు కారు. రచయిత పరమేశ్వరుదే. ఇందుకు ప్రమాణములు వేదములు, వేదపాఠకులయిన మహర్షులు చెప్పిన వాక్యములును. సూత్రమునందలి ప్రత్యక్షపదమునకు వేదము (శ్రుతి), అనుమానపదమునకు స్మృతియనియు నర్థము.

వేదము లీశ్వరీయము లనుటకు ప్రమాణములు :

'తస్మాద్యజ్ఞాత్ సర్వహుత ఋచః సామాని జజ్ఞిరే
ఛందాంసి జజ్ఞిరే తస్మాద్ యజుస్తస్మా దజాయత'

ఋ. ౮-౪-౧౭-౫.

'ప్రజాపతి రిదంశాస్త్రం తప సైవాసృజత్ ప్రభుః
తథైవ వేదాన్ ఋషయః తపసా ప్రతిపేదిరే'

మ. ౧౧-౨౪౩.

ఇట్లు శ్రుతి స్మృతులురెండును, వేదములు పరమేశ్వరునుండి లభించినట్లు, ఋషులు వానిని బొంది ప్రకటించినట్లును స్పష్టముగజెప్పుచున్నవి. కాబట్టి వ్యాపకపరబ్రహ్మమునుండి వేదము లుత్పన్నములయిన వనుటలో నెట్టి వైరుధ్యమును లేదని భావము. (౨౮)

## అత ఏవ చ నిత్యత్వమ్         ౧-౩-౨౯

అత ఏవచ = మరియు నందువలననే, నిత్యత్వమ్ = వేదములు నిత్యములు.

పరబ్రహ్మ పరమేశ్వరుడు స్వామి. అతడు నిత్యుడు. అందువలన నతని సొమ్ము (స్వమ్ - ధనము)కూడ నిత్యమే కావలసియున్నది. లేకున్న నత డెట్లు స్వామి? పరమేశ్వర్యుడు స్వామి. జీవులు, ప్రకృతియు నతని స్వమ్ము - సొమ్ము. అందు జీవులు భోక్తలు. ప్రకృతి వారికి భోగ్యము. జీవులు, ప్రకృతియు నిత్యములే కావున, భోక్తలయిన జీవులకు హితాహితముల నుపదేశించు శాసన మొందు నిత్యము కావలసియున్నది. ఆ యను శాసనమే వేదములు. అయ్యవి స్వరూప (తః) నిత్యములు కాకున్నను జగత్తువలెనే ప్రవాహ (తః) నిత్యములని తెలియవలెను. (౨౯)

వేదము లుత్పన్నము లయినందున నవి నిత్యము లెట్లగును? ప్రతి సర్గాదియందును ప్రళయమున నశించిన వేదములే మరల జనించును, కావున నిత్యము లందుమేని, నశించిన వేదములు భేద మిసుమంతయులేక మరల జనింపనేరవు. కావున నవి నిత్యములు కావన :

## సమాన నామరూపత్వా చ్చావృత్తా వ
## ప్యవిరోధో దర్శనాత్ స్మృతే శ్చ ౧-౩-౩౦

వేదములు, ఆవృత్తావపి=ప్రతిసర్గాదియందును పునరుత్పన్నమైనప్పటికి, అవిరోధః=నిత్యములనుటలో నెట్టిదోషమును లేదు. కారణమేమన: సమాన నామరూపత్వాత్=వాని నామరూపములలో నెట్టి భేదము నుండదు. దర్శనాత్=మంత్రవర్ణములవలనను, స్మృతేశ్చ = మహర్షుల స్మరణరూపమగు ధర్మశాస్త్రమువలనను, పూర్వోత్తర సర్గలలో వేదములు సమానములే కాని, భిన్నములు కావని ప్రమాణితము లగుచున్నవి.

పరమేశ్వరు డీ సర్గాదియందు మహర్షులద్వారమున నే యే నామములు గల వేదముల నే యే క్రమముగలవిగా ప్రకటిత మొనర్చెనో, ఆ వేదములనే, ఆ నామములు గలవానినే, అట్టి క్రమము గలవానినే రాబోవు సర్గాదులందును ప్రకటింపజేయును. వానిలో నెట్టి భేదము నుండదు. ఋగ్వేదము, యజుర్వేదము, సామవేదము, అథర్వవేదము - ఇవి వేద నామములు.

'అగ్నిమీళే పురోహితమ్' ఇత్యాది వానిక్రమము. ఈ నామము లందుకాని, మంత్రములలోని వర్ణక్రమమునందుకాని యెట్టి భేదము నుండదని భావము.

భగవంతుడు సర్వజ్ఞుడు, సర్వశక్తిమంతుడును. కావున నతని సృష్టియందుకాని అనుశాసనరూప మగు వేదమునందుకాని యెట్టిభేదము నుండదు. అనుశాసనమున నిసుమంతభేదము కలిగినను నతని త్రికాలజ్ఞతకు భంగము వాటిల్లును. భగవంతుడు త్రికాలాబాధ్యుడు కాబట్టి యతని యం దుండు జ్ఞానముకూడ త్రికాలములం దేకరూపముగానే యుండును. ప్రతి సృష్టియందును పదార్థములనుగూడ పూర్వ పూర్వ సృష్టులందువలెనే నిర్మించును. వేదములం దిట్లే చెప్పబడియున్నది :

'సూర్యాచంద్రమసౌ ధాతా యథాపూర్వ మకల్పయత్
దివంచ పృథివీం చాంతరిక్ష మథో స్వః' ఋ. ౧౦-౧౯౦-౩.

'సూర్యచంద్రులు, దినము, పృథివి, అంతరిక్షము నన్నియు పూర్వమువలెనే విధాత రచియించెను.'

ఈ జగద్విజ్ఞానమే వేదము. కావున నందునను నామరూప భేద మిసుమంతయు లేకయే పూర్వసర్గమునందువలె నీ సర్గమునందును ప్రకటింపబడు ననుట సత్యము. నామరూపభేదము లేని విధమున వేదములు ప్రకటింపబడుటచే నవి నిత్యము లనబడుచున్నవి. సృష్టి ఉత్పత్తి, వినాశములు గలదయ్యు నెట్లు ప్రవాహనిత్యమో, యట్లే వేదములును ప్రవాహనిత్యము లని భావము. శ్రుతి స్మృతులే యిందుకు ప్రమాణములు.

'తస్మై నూన మభిద్యవే వాచా విరూప ! నిత్యయా
వృష్ణే చోదస్వ సుష్టుతిమ్' ఋ. ౬-౫-౭౫-౬.

'విరూప !=విశిష్టరూపవిద్వన్! నీవు, నూనం = నిశ్చయముగా, అభిద్యవే=వ్యాపకుడును, వృష్ణే=కర్మఫలప్రదాతయు నగు, తస్మై=ఆ పరమేశ్వరునకు, నిత్యయా వాచా = నిత్యమగు వేదవాణితో, సుష్టుతిం=శుభమగు స్తుతిని, చోదస్వ=చేయుము.'

ఈ మంత్రమున వేదవాణి నిత్యమని స్పష్టముగ జెప్పబడినది. ఇట్లే స్మృతులందును గననగును.

'అగ్నివాయు రవిభ్యస్తు త్రయం బ్రహ్మ సనాతనమ్
దుదోహ యజ్ఞసిద్ధ్యర్థం, ఋగ్యజుస్సామ లక్షణమ్'మను. ౧-౨౩.

'ఋగ్యజుస్సామలక్షణములుగల నిత్యవేదమును, అగ్ని, వాయువు, రవి యను ఋషులద్వారమున యజ్ఞసిద్ధికొఱకు పరమేశ్వరుడు ప్రకటించియున్నాడు.

'అనాది నిధనా నిత్యా వాగుత్సృష్టా స్వయంభువా
ఆదౌ వేదమయీ దివ్యా యతః సర్వాః ప్రవృత్తయః'

మ. భా. ౧౨-౨౩౩-౨౪.

ఇట్లు వేదములు ప్రతి సర్గాదియందు నుత్పన్నములైనను నవి నిత్యములే యని సూత్రాభిప్రాయము. (౩౦)

## అష్టమాధికరణము

శాస్త్రమును జదువ నధికారులు మనుజులే యని యింతకుపూర్వమే వర్ణింపబడినది. అందు మనుష్యపదము మానవుల కెల్లరకును వర్తించును. అయ్యది బ్రహ్మ క్షత్రియ వైశ్యులకు మాత్రమే యన్వయించు ననుట యుక్తము కాదని నిర్ణయించుటకుగాను ముందుగ జైమిని చెప్పునట్టి 'శూద్రునకు శాస్త్రమున నధికారము లేదు' అను పూర్వపక్షసూత్రమును మహర్షి వర్ణించుచున్నాడు:

**మధ్వాదిష్వసంభవా దనధికారం జైమినిః ౧-౩-౩౧**

మధ్వాదిషు=వేదప్రచారకులగు మధుచ్ఛందాది ఋషులలో, అసంభవాత్=శూద్రయోని సంజాతు డుండుట సంభవము కాదు. కావున, అనధికారం=శాస్త్రపఠనమున శూద్రున కధికారము లేదు - అని, జైమినిః = జైమినిముని మతము.

భూతలముననుండు మానవులెల్లరు నార్యులు, దస్యులు (విజానీహ్యార్యాన్ యేచ దస్యవః) నని రెండుతెగలలో గణింపనగుదురు. శబ్దప్రమాణము (వేదము) నంగీకరించువా రార్యులు, శబ్దము నంగీకరింపక అవ్రతులై యుండువారు దస్యులు ననబడుదురు. ఆర్యులు మరల చతుర్విధములుగ వ్యవహరింప నగుదురు. బ్రాహ్మణులు, క్షత్రియులు, వైశ్యులు, శూద్రులు. ఈ చతుర్విధవ్యవస్థయే వైదికవర్గవ్యవస్థ యనబడును.

'బ్రాహ్మణో ఽస్య ముఖ మాసీత్, బాహూ రాజన్యః కృతః
ఊరూ తదస్య యద్వైశ్యః, పద్భ్యాం శూద్రో ఽజాయత'
యజు. ౩౧-౧౧, ఋ. ౧౦-౯౦-౧౨.

'మానవులెల్లరు నొక పురుషరూపమున దోల్పబడుదురేని ముఖముం బోలినవారు బ్రాహ్మణులు, బాహువులకు సదృశులు క్షత్రియులు, ఊరువులకు సములు వైశ్యులు, పాదసమానులు శూద్రులుగ వ్యవహరింపబడ దగుదు'రని మంత్రార్థము. ఇట్లు వ్యవహరింపబడదగువారిలో మొదటి మూడు వర్గములకు జెందినవారే శాస్త్రాధ్యయనమున కర్హులనియు, శూద్రులర్హులు కారనియు జైమినిముని యభిప్రాయపడుచున్నాడు. వేదమంత్రములను ప్రచారముచేసిన మధుచ్ఛందాది మహర్షులలో శూద్రులు లేనందున శూద్రులు వేదాధ్యయనమున కర్హులు కారని జైమినివాదము. (౩౧)

ఈ వాదమును బలపఱచుట కింకొక హేతువు:

జ్యోతిషి భావా చ్చ ౧-౩-౩౨

జ్యోతిషి = 'జ్యోతిః' అను పదముతోఁగూడిన మంత్రమునంగు, భావాచ్చ = త్రివర్ణులైన బ్రాహ్మణ క్షత్రియ వైశ్యుల పేర్కొనబడినందునను, వారికే శాస్త్రముం జదువ నధికారముస్న దని సూత్రార్థము.

'యస్మా న్న జాతః పరో ఽన్యో అస్తి
య ఆవివేశ భువనాని విశ్వా
ప్రజాపతిః ప్రజయా సంరరాణ
స్త్రీణి జ్యోతీంషి స చ తే స షోడశీ' యజు. ౮-౩౬.

'జగద్రచయితయు,వ్యాపకుడును, అద్వితీయుడు నగు నా పరమాత్మ, త్రీణి=మూడు వర్ణములవారి నుద్దేశించి, జ్యోతీంషి=వేదములను, నిర్మించి యున్నాడు' అని మంత్రాభిప్రాయము. మరియును –

'స్తుతా మయా వరదా వేదమాతా
ప్రచోదయన్తాం పావమానీ ద్విజానామ్' అథ. ౧౯-౭౧-౧.

'ద్విజులను పవిత్రమొనర్చు వేదమాత' యని యీ మంత్రమున వర్ణింపబడుట చూచినను శూద్రులకు వేదాధ్యయనాధికారము లేదని తెలియుచున్నట్లు జైమిని యభిప్రాయమును మహర్షి - వ్యాసుడు పూర్వపక్షముగా సూత్రములందు ప్రదర్శించి, యిపుడు తన యభిప్రాయమును చెప్పుచున్నాడు. (౩౨)

## భావంతు బాదరాయణోఽస్తి హి ౧-౩-౩౩

తు=జైమిని వాదము సరికాదు, భావం = శూద్రులకును వేదాధ్యయనాధికార మున్నది. అని, బాదరాయణః = వ్యాసునిమతము - స్వసిద్ధాంతము. హి = కారణమేమన, అస్తి = మధుచ్ఛందాదులలో శూద్రుడును గలడు.

వేదమంత్రార్థములను ప్రచారమొనర్చిన మధుచ్ఛందాది మహర్షులలో శూద్రు డెవడేని ఉన్నపక్షమున శూద్రులకును వేదాధ్యయనాధికార మున్నదనియే నుడువవలెను. వేదప్రచారకులగు ఋషులలో శూద్రులును గలరు. కొబట్టి శూద్రులకును శాస్త్రాధ్యయనాధికార మున్నది.

ఇలూషాపుత్రు డైలూషుడు కవషుదని ప్రసిద్ధి బొందినవాడు - శూద్రయోనిసంజాతు డొకడు 'అపోనప్త్రీయ' మను పేరుగల సూక్తమును ప్రచారముచేసియున్నాడు. ఈ సూక్తము ఋగ్వేదమునందలి దశమ మండలమున (౩౦ సూ) జూడనగును. ఈ సూక్తము కవషున కెట్లు లభించినదో యైతరేయబ్రాహ్మణమున జూడనగును.

'ఋషయో వై సరస్వత్యాం సత్రమాసత
తే కవష మైలూషం సోమాదనయన్

దాస్యాః పుత్రః కితవో ఽబ్రాహ్మణః కథం
నో మధ్యే దీక్షిష్టేతి తం బహిర్ధన్వో దహన్
అత్రైనం పిపాసా హన్తు, సరస్వత్యా ఉదకం
మాపాదితి, స బహిర్ధన్వో దూఢః
పిపాసయా వి త్తః ఏతదపోన ప్త్రీయ మపశ్యత్' ఐ.బ్రా. ౨-౩-౧.

'ఋషులు సరస్వతీ నదీతీరమున సత్ర మాచరింపబూనిరి. వారిలో విలూషాపుత్రు డై లూషుడు - కవషుడనువాడుండుట జూచి వానిని సోమమునకు దూరమొనర్చిరి. 'దాసీపుత్రుడు, కితవుడు, అబ్రాహ్మణుడు. వీ డెక్కడ మనమధ్య దీక్షితుడై నాడురా?' అనుచు బహిర్ధన్వదా కవషుని దూరము గొంపోయి యట వదలి 'ఇత డిట పిపాసతో జచ్చుగాక, సరస్వతీజల మితనికి లభింపకుండుగాక!' అని మరలి వచ్చెను. అంతట నా కవషు డట పిపాసావిద్ధుడై 'అపోన ప్త్రీయమును దర్శించెను.'

ఈ యైతరేయ బ్రాహ్మణ వర్ణిత వృత్తమును జూచినపుడు శూద్రర్షియు మంత్రార్థజ్ఞాత యైనట్లు స్పష్టమగుచున్నది. కాబట్టి వేదమును జదువ నధికారము శూద్రసంజాతులకు లేదనుట తగదని వ్యాసమహర్షి సిద్ధాంతము.

ఇంతేకాక వేదములు మనుజులకెల్లరకు శ్రేయస్సునుగూర్ప నవతీర్ణములై, బ్రాహ్మణ శూద్రాది భేదమును పాటింపక యెల్లరకు సమానముగ నుపకరించునవగునట్లు మంత్రవర్ణములే చెప్పుచున్నవి. చూడుడు :

'రుచం నో ధేహి బ్రాహ్మణేషు
రుచం రాజసు నస్కృధి
రుచం విశ్యేషు శూద్రేషు
మయి ధేహి రుచా రుచం' యజు. ౧౮-౪౮.

'ప్రియం మాకృణు దేవేషు, ప్రియం మాకృణు రాజసు,
ప్రియం సర్వస్య పశ్యత, ఉత శూద్ర ఉతార్యే'

అథ. ౧౯-౭-౬౨-౧.

ఈ మంత్రములందు బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్ర శబ్దములు సమముగా గ్రహింపబడి యెల్లరకు సమానశ్రేయస్సును కామించుచున్నట్లు స్పష్టమగుచున్నది. ఇట్టి ప్రమాణములు వేదములం దెల్లయెడల నుండ శూద్రునకు వేదాధ్యయనముసేయు నధికారము లేదనుట తగదు.

మనుష్యమాత్రునకు వేదాధికార మున్న దని స్పష్టముగ జెప్పు మంత్రమును గలదు.

'య థేమాం వాచం కల్యాణీ మావదాని జనేభ్యః
బ్రహ్మ రాజన్యాభ్యాం, శూద్రాయ చార్యాయ చ,
స్వాయ చారణాయ చ, ప్రియో దేవానాం
దక్షిణాయై దాతు రిహ భూయాసమ్,
అయం మే కామః సమృధ్యతామ్, ఉపమా ఉదో నమతు'

యజు. ౨౬-౨.

ఈ మంత్రము ద్వారమున వేదవిదు లి ట్లుపదేశింపబడుచున్నారు:

'యథా=ఏ విధముగ, ఇమాం = ఈ, కల్యాణీం = శుభకరమైన, వాచం=వేదవాణిని, జనేభ్యః=జనులకొఱకు, ఆవదాని = అంతట నుపదేశించుచున్నానో, యట్లే మీరు నుపదేశింపుడు. సర్వజను లన నెవరో మంత్రమున నిట్లు వివరింపబడినది. బ్రహ్మరాజన్యాభ్యాం=బ్రాహ్మణులకు, క్షత్రియులకు, శూద్రాయ=శూద్రులకు, అర్యాయ=వైశ్యులకు, స్వాయ=తనకు జెందినవానికి (స్వకీయుడైన ఆర్యునకు), అరణాయ చ=దస్యునకును-అని సామాన్య విశేష భేద పురస్సరముగా నెల్లజనులకు నుపదేశింపుడని యాజ్ఞాపించుచున్నట్లు స్పష్టమగుచున్నది. ఇంతేకాక, దేవానాం = విద్వాంసులకు,

దక్షిణాయై దాతుః=దానముల నొసంగు కర్మయోగులకు, ఇహ=ఈ లోక మున, ప్రియో భూయాసమ్=ప్రియుడ నగునట్లు ప్రయత్నింతురు గాక। అదః=ఈ వేదవాణి, మా ఉపనమతు = వ్యర్థముకాకుండు గాక। అయం మమ కామః=ఈ నా యభిలాష, సమృధ్యతాం=బాగుగ వర్ధిల్లుగాక।'

పరమకృపాళువగు పరమేశ్వరుడు కల్యాణకరమగు వేదవాక్కు లెల్లరకు నుపదేశింపవలసినదిగ వేదవిదుల నాదేశించుచున్నట్లీ మంత్రమున స్పష్టమగుచున్నది. దీనింబట్టి మానవమాత్రులు వేదాధ్యయనమున కర్హులని సిద్ధమగుచుండ శూద్రులకు శాస్త్రమున నధికారము లేదనుట శాస్త్ర విరుద్ధము.

జ్యోతిష్మంత్రమున 'త్రీణి జ్యోతీంషి' అను పదప్రయోగ ముండుటచే బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులకే శాస్త్రాధికార మున్నదనుటయు దగదు. మంత్రమునందలి జ్యోతిష్ట్వము శాస్త్రనిబంధనము కాదు. అయ్యది రమణీయచరణనిబంధన మనదగును. రమణీయచరణులు బ్రాహ్మణ క్షత్రియ వైశ్య పదవాచ్యు లగుదురు. అట్లే ఛాందోగ్యమున వర్ణింపబడినది.

'తద్ య ఇహ రమణీయచరణా అభ్యాశోహ
యత్తే రమణీయాం యోని మాపద్యేరన్
బ్రాహ్మణయోనిం వా క్షత్రియయోనిం వా
వైశ్యయోనిం వా' ఛాం. ౫-౧౦-౭.

(యోని రమణీయత్వ మిట నుపనయనాది సంస్కారములవలన నేర్పడు శోభనత్వముకాక వే రేమియులేదని తెలియవలెను.)

ఇట్లే 'స్తుతా మయా వరదా వేదమాతా' అను మంత్రవిషయమునను సమాధానము చెప్పుకొనవలెను. కాబట్టి బాదరాయణుని మతమున మానవ మాత్రులకు శాస్త్రమున నధికార మున్నదని స్పష్టమగుచున్నది.

వాస్తవమున పూర్వకాలమునందు సర్వజనులకు శాస్త్రాధ్యయనమున

కధికార ముండియే యుండెను. కాని, కాలాంతరమున, కొందఱు స్త్రీ, శూద్రులకు వేదశాస్త్రములం జదువు నధికారము లే దను మతభేదమును గల్పించి లోకమున నవిద్యను వ్యాపింపజేసిరి. బుద్ధిమంతు లీ మతము నెల్లపుడు నిరాకరించుచున్నట్లు శాస్త్రపరిశోధనమువలన స్పష్టము కాగలదు. వేదమంత్రములను బ్రచారమొనరించిన వ్యక్తులలో నెందరో స్త్రీలుకూడ నున్నట్లు వేదాధ్యయనము సేయువారికి తెలియనివిషయము కాదు. స్త్రీలు, శూద్రులు మంత్రద్రష్టలై యుండ వారికి శాస్త్రమున నధికారము లేదనుట న్యాయసంగత మెట్లగును? కావున మానవులెల్లరు శాస్త్రమున కధికారు లనియే సిద్ధాంతము. (౩౩)

ఇట్లు శాస్త్రాధ్యయనమున కధికార మెల్లరకు గలదని సిద్ధాంత మొనర్చి, మరియొక యుదాహరణము మూలమున బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శబ్దములవలెనే శూద్రపదముకూడ జాతివాచకము కాదు; గుణవాచకమే యని మహర్షి ప్రతిపాదించుచున్నారు.

శుగస్య తదనాదరశ్రవణాత్ తదా
ద్రవణాత్ సూచ్యతే హి ౧-౩-౩౪

తదనాదరశ్రవణాత్=దానివలన (హంసవలన) గల్గిన యనాదరణమును వినుటవలన, అస్య=ఇతనికి (జానశ్రుతికి) శుక్=శోకము కలిగినది. తదాద్రవణాత్=ఆ శోకముచే బరువిడినందున, హి=రైక్వ దతనిని 'శూద్ర!' యని సంబోధించి బ్రహ్మవిద్య నుపదేశించియున్నారు. అందువలన, సూచ్యతే=శూద్రపదము గుణవాచకమని సూచింపబడుచున్నది.

'ప్రాచీనకాలమున జానశ్రుతియని ప్రసిద్ధివడసిన వ్యక్తి యొకడుండెను. అతడు గొప్పదాత. అన్నదానము నధికముగా జేసినవాడు. సత్రములను నిర్మించినవాడు. ఒకనాటిరాత్రి యతడు విశ్రమించియున్న

యెదుకు కొన్ని హంస లరుదెంచెను. పరస్పరసంవాదమున నా హంస లలో నొకటి రెండవదానితో 'ఓ భల్లాక్షి! జానశ్రుతి కీర్తి ద్యులోకమువలె సంతత వ్యాపించుచున్నది. దాని నుల్లంఘింపకు సుమీ! లేకున్న నతడు తన తేజస్సుచే నిన్ను భస్మము చేయును' అనెను. అంతట నా భల్లాక్షుడు 'అరే! నీవీ సాధారణ మనుష్యుని బండివాడైన రైక్వమహర్షి యంతటి గొప్పవానిగా పొగడుచున్నా వేల?' యని జానశ్రుతి ననాదరించెను....'

జానశ్రుతి యీ సంవాదమును విని, యారువందల గోవులను, నొక రత్నమాలను, కంచరగాడిదలం బూన్చిన యొక రథమును తనవెంట దీసి కొని, రైక్వర్షిని జేరి, 'మహాత్మన్! వీనిని గొని బ్రహ్మవిద్య నా కుపదే శింపుము' అని యర్థించెను. అంతట నా రైక్వుడు –

'తము హ పరః ప్రత్యువాచ
అహహ రే! త్వా శూద్ర! తవైవ సహ గోభి ర స్త్వితి,
తదుహ పునరేవ జానశ్రుతిః పౌత్రాయణః
సహస్రం గవాం, నిష్కమశ్వతరీరథం, దుహితరం
తదాదాయ ప్రతిచక్రమే' ఛాం. ౪-౨-౩.

'అరే! శూద్ర! ఈ గోవులు, ఈ మాల, ఈ రథము నీవే గొని పొమ్ము' అనెను. అందుల కా జానశ్రుతి మరల వేయి గోవులను, రత్న మాలను, అశ్వతరీ రథమును, తన కన్యను గొనివచ్చి రైక్వున కర్పిం చెను. అంతట నా రైక్వుడును –

'తస్యాహ ముఖ ముపోద్గృహన్ ఉవాచ
ఆజహా రేమాః శూద్ర! అనే నైవ ముఖే
నాలాపయిష్యథా ఇతి' ఛాం. ౪-౨-౫.

'ఆ కన్యాముఖమును పైకెత్తి చూచుచు ఓ శూద్ర! ఈ గోవులను నీవు దెచ్చితివి; కాని, ఈ కన్యామర్యాదను గాపాడుటకై నీతో మాటాడ

వలసివచ్చినది' అని యతనికి సంవర్గవిద్య మపదేశించినట్లు ఛాందోగ్య మున జూరదనగును.

హంసముఖమున తన యనాదరణను విని వదాన్యుడగు జానశ్రుతి బ్రహ్మవిద్యోపదేశము నందగోరి రైక్వుని సమీపింపగా నతడు జానశ్రుతిని 'శూద్ర!' యని పిలిచి బ్రహ్మవిద్య నుపదేశించియున్నాడు. శూద్రుడైన జానశ్రుతికి బ్రహ్మవిద్యను మహర్షి యుపదేశించినాడు. కావున శూద్రునకు శాస్త్రమున నధికారమున్నదని సిద్ధమగుచున్నది. మరియును, శూద్రశబ్దము గుణవాచకమే కాని, జాతివాచకము కాదనియు నీ ప్రసంగమువలననే ఋజువగుచున్నది. 'తనకుగాని, పరులకుగాని, కలిగిన శోకమును బాపుటకు దయనించువాడు శూద్రు' డని శూద్ర శబ్ద వ్యుత్పత్తి. పాణినీయ వ్యాకరణము ననుసరించి —

'శుచే ర్దశ్చ' ఉ. ౧౮౬. 'శుచ' ధాతువునకు 'ర' ప్రత్యయము, శుచ'కు దీర్ఘము, 'చ' కారమునకు 'ద' కారము చేర్చిన శూద్రపద మగుచున్నది. పరులదుఃఖములను సహింపనేరక సేవాశుశ్రూషాదులద్వారమున దాని నపనయించుట కెవడు నిరంతరము శోకించునో - చింతించునో - వాడు శూద్రుడు.

'శుచాద్రవతి - శోక మపనయితుం వా ద్రవతీతి శూద్రః'

కావున వ్యాకరణశాస్త్రము ననుసరించి చూచినను శూద్రపదము జాతివాచకము కాక గుణవాచకమే యని తెలియుచున్నది. అందువలననే —

'తేన తుల్యం క్రియాచేద్వతిః' అ. సూ. ౫-౧-౧౧౫.

అను సూత్రమునకు భాష్యము వ్రాయుచు, పతంజలి మహర్షి బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్ర శబ్దముల నిట్లు నిర్వచించియున్నాడు :

'సర్వ ఏతే శబ్దా గుణ సముదాయేషు వర్తన్తే
బ్రాహ్మణః క్షత్రియో వైశ్యః శూద్ర ఇతి.'

'బ్రాహ్మణాది శబ్దములు గుణసముదాయముననే వర్తించును కాబట్టి యీ శబ్దములు జాతివాచకములు కావనుట సుస్పష్టము. (౩౪)

శోకశ్రవణమువలన శూద్రశబ్దము గుణవాచక మనియు, శూద్రునకు శాస్త్రమున నధికార మున్నదనియు నిరూపించి, శూద్రుడైన జానశ్రుతి యైశ్వర్యాదులవలన రాజన్యుడయ్యెనని యీ సూత్రమున వర్ణించుచున్నాడు.

## క్షత్రియ త్వావగతే శ్చోత్తరత్ర
## చైత్రరథేన లింగాత్ ౧-౩-౩౫

ఉత్తరత్ర=రాజ్యాదిప్రాప్తికి తదుపరి, క్షత్రియత్వావగతేః=క్షత్రియత్వము లభించినందున, (జానశ్రుతికై ప్రయోగించిన శూద్రపదము గుణవాచకమే) చైత్రరథేన లింగాత్ = చైత్రరథము (కంచరగాడిదలం బూన్చిన రథము)తో వచ్చుటయే యిందులకు హేతువు.

జానశ్రుతి శూద్రుడై జనించి యనంతరమున రాజ్యాభిషిక్తుడై క్షాత్రధర్మముతో వదాన్యుడై రాజ్యమును బాలించెను. అందువలననే (తరువాత క్షత్రియత్వప్రాప్తివలన) అని సూత్రింపబడినది. కర్మలమూలమున వర్ణ మేర్పడు ననుట స్మృతిసిద్ధము. కావుననే మహాభారతమున –

'న విశేషోఽస్తి వర్ణానాం సర్వం బ్రాహ్మ మిదం జగత్
బ్రహ్మణా పూర్వ సృష్టం హి కర్మభి ర్వర్ణతాం గతమ్'
మ. భా. శాం. ౧౮౮-౧౦.

'వర్ణములలో విశేష మొందును లేదు. జగత్తంతయు బ్రహ్మనిర్మితమే. బ్రహ్మచే సృష్టింపబడి, యనంతరము కర్మలద్వారమున వర్ణత్వము నందినది' యని చెప్పబడినది.

జానశ్రుతికి తరువాత క్షత్రియత్వము ప్రాప్తించిన దనుట కతడు చైత్రరథముతో రైక్వుని సమీపించుటయే కారణముగ జెప్పబడినది. అది

యెట్లన : అశ్వతరీరథము (కంచరగాడిదలచే నీడ్వబడు రథము) చిత్ర రథ మనబడును.

'రథ స్త్వశ్వతరీ యుక్తః చిత్ర ఇ త్యభిధీయతే'

'అశ్వతరీయుక్తరథము చిత్రరథ మనబడు' నని యభియుక్తుల వచ వము. చిత్రరథమే చైత్రరథము. మహాభారతమున వనపర్వమునందు క్షత్రియులకు అశ్వతరీరథముతో సంబంధ మున్నట్లు చూడనగును.

కావున శూద్రుడైన జానశ్రుతి రాజ్యప్రాప్త్యనంతరమున క్షత్రియు డైనట్లు చైత్రరథమూలమున స్పష్టమగుచున్నది. ఇట్లు క్షత్రియు డైవను శోకగుణసంబంధమువలన నతనిని రైక్వుడు శూద్రపదముతో సంబోధించియున్నాడు. కాబట్టి శూద్రపదము గుణవాచక మనుట నిస్సంది గ్ధము. ఇట్లు శూద్రునకును శాస్త్రమున నధికార మున్న దనియే రాద్ధాంతము. (౩౫)

రైక్వుడు జానశ్రుతికి సంవర్గ విద్య నుపదేశించుటకు పూర్వము ఉపనయనసంస్కార మేల కావింప డన :

## సంస్కారపరామర్శాత్ తదభావాభిలాపా చ్చ ౧-౩-౩౬

సంస్కారపరామర్శాత్=అధ్యయనమునకై యుపనయనము విధింప బడినందున, తదభావాభిలాపాచ్చ = బ్రహ్మవిద్యాప్రాప్తికి సంస్కారము చేయ నవసరములేనందువలనను, జానశ్రుతికి రైక్వుడు ఉపనయన మొన రింపలేదని సూత్రార్థము.

ఉపనయనము వేదాధ్యయనమునకు నియతమైన యంగము. విద్యోప దేశమున కనియతాంగము. విద్యోపదేశమునకు ముందు నియమముగ నుప నయన సంస్కారము జరుప నవసరములేనందుననే పిప్పలాదమహర్షి

'తాన్ హోమపనీయైత దువాచ' ఛాం. ౫-౧౧-౭.

తన చెంతజేరినవారికి నుపనయనసంస్కారము సేయకయే బ్రహ్మ విద్య నుపదేశించినట్లు ఛాందోగ్యమున జూడగలము.

శాస్త్రాధ్యయనమునకు నియమపూర్వకముగ ముందుపనయన మొనరింపబడును. కాని విద్యోపదేశమునకు శ్రద్ధాదిగుణములు నియతములు. జానశ్రుతియందు శ్రద్ధ, వినయము, సత్యభాషణాది గుణములు ఉన్నందున రైక్వు డతనికి నుపనయనసంస్కార మొనర్పకయే బ్రహ్మ విద్య నుపదేశించియున్నాడు. జానశ్రుతికి నుపనయనముచేయనంత మాత్రమున శూద్రునకు శాస్త్రమున నధికారము లేదనుట యుక్తిసంగతము కాదు. కాబట్టి మానవమాత్రునకు వేదాధ్యయనము చేయుట కధికార ముండనే యున్నదని సూత్రాభిప్రాయము. (౩౮)

తదభావ నిర్ధారణే చ ప్రవృత్తేః        ౧-౩-౩౯

చ=మరియు, తదభావనిర్ధారణే=శాస్త్రాధ్యాసమున కభ్యంతరకరము లగు నసృతభాషణాది గుణములు లేవను నిశ్చయము కాగానే, ప్రవృత్తేః = అధ్యయనము చేయించుటకు బ్రవృత్తి కలిగినందున, శాస్త్రాధ్యయనమున శూద్రున కధికారమున్నదని సూత్రార్థము.

ఛాందోగ్యమున చతుర్థ ప్రపాఠకమునం దొక యితివృత్త మిట్లున్నది:

'జాబాలి సత్యకాముడు తల్లియైన జబాలచెంత జేరి 'అమ్మా! బ్రహ్మ చర్యమును బాలించి శాస్త్రాధ్యయన మొనరింపబోవుచున్నాడ, నా గోత్ర మేమి?' యని యడిగెను. అందుల కా జబాల 'తాత! యౌవనమున బహూచరించుచు నిన్ను గంటిని. నీ గోత్ర మేమో నాకును దెలియదు. నీ పేరు సత్యకాముడు, నా పేరు జబాల' అని చెప్పెను. సత్యకాము డంతట గోతమవంశజుడైన హారిద్రుమతుని జేరి, 'స్వామీ! మీ చెంత బ్రహ్మచర్య వ్రత మాచరించెద. దరిజేర్చుకొందురుగాక!' యని ప్రార్థించెను. మహరి

యుండులకు 'సౌమ్య! నీ గోత్ర మేమి?' యని ప్రశ్నింపగా, స్వామీ! నా కది దెలియక తల్లి నడుగగా నామె, 'పరిచారిణినై బహుచరించుచు యౌవనమున నిన్ను గంటిని; నీ గోత్రము నాకును దెలియ' దని నుడివినది. నా తల్లి జబాల - 'నేను సత్యకాముడను' అని బదులు చెప్పెను. గౌతముడు సత్యకాముని ప్రత్యుత్తరమును విని, సౌమ్య! అబ్రాహ్మణు డిట్లు వివచింప జాలడు. సమిధలు తెమ్ము. నీ కుపనయన మొనర్చెద. సత్యమును వదల వైతివి' అని యతనిచే వేదాధ్యయనము చేయించెను.

ఈ యితివృత్తముయొక్క సార మిట్లు గ్రహింపనగును. బ్రాహ్మణుడు - వేదపఠనమున కధికారి యైనవాడే యిట్లు సత్యమును జెప్పును. అన్యుడు చెప్పజాలడు. సత్యమాడుట దేవతలకు వ్రతము.

'ఏతద్ధ వై దేవా వ్రతం చరంతి యత్ సత్యమ్' శత.౧-౧-౧-౫.

సత్యము చెప్పువాడు వేదాధ్యయనమున కనర్హు డెన్నడును కాడు. అందువలననే హారిద్రుమతుడు అజ్ఞాతకుల గోత్రుడైన సత్యకాముని సత్యవచనము కారణముగ నతని నుపనయించి శాస్త్రము నభ్యసింపజేసి యున్నాడు.

సత్యము, ఆర్జవము మున్నగు దివ్యగుణము లెవనియం దుండునో వాడే శాస్త్రాధ్యయనమున కధికారి. బ్రాహ్మణత్వాది వర్ణము లెట్లు గుణనిబంధనములో - గుణప్రయుక్తములో - యట్లే యధ్యయనాధికారము కూడ గుణనిబంధనమే యని గుర్తింపవలెను. ఇందు విచిత్రమేమియును లేదు. మంత్రద్రష్టయైన కవషు డెవడు? శూద్రుడు కాడా? ఐతరేయబ్రాహ్మణ రచయిత యగు మహీదాసుడు - ఇతరాపుత్రుడు శూద్రసంజాతుడు కాడా? కాబట్టి మానవులలో జేరినవారే కావున శూద్రజన్ములకును వేదాధ్యయనాధికార మున్నదనియే వ్యాసమహర్షి సిద్ధాంతము. (౩౭)

ఇందులకు మరియొక హేతువును ప్రదర్శించుచున్నాడు:

శ్రవణాధ్యయనార్థప్రతిషేధాత్ స్మృతేశ్చ ౧-౩-౩౮

(ఒకరు చదువుచుండగ మరియొకరు వినుట శ్రవణము. గురుముఖమున విని స్వయముగ పఠించుట యధ్యయనము. వేదవిహిత కర్మల ననుష్ఠించుట యర్థము.)

శ్రవణా........ప్రతిషేధాత్=సత్యభాషణాదులు లేనివారికి శ్రవణాధ్యయనాదులు నిషేధింపబడుటవలన, స్మృతేశ్చ = స్మృతి - ఋషుల స్మరణ - వలనను, మానవులలో సత్యభాషణాది గుణములు గలవారికే యధ్యయనాధికార మున్నదని సూత్రార్థము.

'నాప్రశాంతాయ దాతవ్యమ్' శ్వేత. ౬-౨౨.

'ప్రశాంతచిత్తుడు కానివాని కీయరాదు.'

'నైత దచీర్ణ వ్రతో ఽధీతే' ముం. ౩-౨-౧౧.

'వ్రతాచరణసంపన్నుడు కానివా డధ్యయనము చేయడు.'

'విద్యాహవై బ్రాహ్మణ మాజగామ
గోపాయ మా శేవధిష్టే ఽహ మస్మి
అసూయకా యానృజవే ఽయతాయ
నమా బ్రూయా వీర్యవతీ తథాస్యామ్' నిరు. ౨-౧-౪.

'....అసూయగలవానికి, ఋజుత్వములేనివానికి, యతికానివానికి నన్ను చెప్పకుము. ఇట్టి దోషములు లేక సత్యభాషణాది గుణములు గలవానికి చెప్పిన నేను బలవతి నగుదు నని విద్యాదేవత చెప్పుకొనినది.'

ఇట్టి విధినిషేధములనుబట్టి చాతుర్వర్ణ్యమున నెవరైనను గుణవంతులైనవారు శాస్త్రాధ్యయనమునకు నధికారులే యని స్పష్ట మగుచున్నది. **వర్ణములు గుణనిబంధములుకాక** జాతిప్రయుక్తములయి త్రివర్ణులకే శాస్త్ర**మున నధికార మందు**రేని ఉపయుక్తగుణానువర్ణన మేల? విధినిషేధము**లెందులకు?** పరమేశ్వరుడు మానవులకెల్లరకు సమానుడు. వేదము లీశ్వ

ర్ణీయములు. అందువలన నెల్లరకు సమానముగ నధికార మున్నది. కాబట్టి బ్రాహ్మణులవలెనే శూద్రులకును శాస్త్రాధికార మున్నదని భావము. (౩౮)

ఇట శ్రీ శంకర, రామానుజ ప్రభృత్యాచార్యులు,

'శుగస్య....సూచ్యతే హి' (౧-౩-౩౪.) అను సూత్రము మొదలు 'శ్రవణా....ప్రతిషేధాత్' (౧-౩-౩౮.) అను సూత్రమువరకుగల యైదు సూత్రముల నొక యధికరణముగా విభజించి, దానికి 'అపశూద్రాధికరణ' మని నామకరణ మొనర్చి అందు శూద్రులకు శాస్త్రాధ్యయనాధికారము లేదని నిర్ణయించియున్నారు. ఈ నిశ్చయ మనాక్ష మనియే మానిశ్చయము. శ్రీరామానుజప్రభృతు లీ విషయమున శంకరభగవత్పాదుల ననుసరించి నట్లు తోచుచున్నది. శ్రీశంకరు లిట్టి నిర్ణయమును జేయుట కెంతో పరిశ్రమ మొనర్చినట్లు భాష్యపంక్తులను జూచినవారికి స్పష్టమగును. ఆచార్యులకు శూద్రపదవాచ్యులయెడ నింత వైరభావ మేల యుదయించినదో తెలియకున్నది.

'హృద్యపేక్షయా తు మనుష్యాధికారత్వాత్' (౧-౩-౨౫.) అను సూత్రమునకు భాష్యమొనరించుచు శాస్త్రము మనుష్యాధికారిక మని యంగీకరించి శ్రీ శంకరులు పదిసూత్రములకుతరువాత శూద్రులకు శాస్త్రమున నధికారము లేదనుట యెట్లు విచారసహము కాగలదు? శూద్రులు మనుష్యులలో చేరరా?

శూద్రుల కుపనయనాధికారము లేనందున శాస్త్రాధికారము లేదని చెప్పినారని యూహింతుమేని - అదియును కాదు.

'తదుపర్యపి....సంభవాత్' అను సూత్రమునగల 'తదుపర్యపి' యను పదమునకు మనుజులకంటె పైనున్న దేవతలని యర్థము చెప్పి, ఆ దేవతలకును బ్రహ్మవిద్యయం దధికార మున్నదని సాధించియున్నారు.

దేవతల కుపనయన ముండదు. అట్టివారికిని శాస్త్రాధికార మున్నదని సాధించిన శ్రీ శంకరులు, ఉపనయనాధికారము లేనందున శూద్రులు శాస్త్రమున కధికారులు కారని యెట్లు నిర్ణయించిరో దురూహ్యము.

'శ్రవణాధ్యయనార్థ ప్రతిషేధాత్' అను సూత్రమునకు భాష్య మొనర్చుచు శ్రీ శంకరులు తన భాష్యమున,

'అథాస్య వేద ముపశృణ్వతః త్రపు జతుభ్యాం శ్రోత్రప్రతిపూరణమ్.'

'వేదమును విను శూద్రుని చెవులు సీసముతోను, లక్కతోను నింపవలెను.'

'పద్యుహ వా ఏతచ్ఛ్మశానం యచ్ఛూద్ర స్తస్మాచ్ఛూద్ర సమీపే నాధ్యేతవ్యమ్.'

'శూద్రుడు శ్మశానమువంటివాడు. అందువలన నతనిచెంత వేదము చదువరాదు.'

'భవతి చ వేదోచ్చారణే జిహ్వాచ్ఛేదో, ధారణే శరీరభేదః.'

'శూద్రుడు వేదము నుచ్చరించిన జిహ్వ భిన్నమగును. వేదమును ధరించిన - స్పృశించిన - శరీరము భిన్నమగును.'

'శూద్రాయ మతిం న దద్యాత్:'

'శూద్రునకు జ్ఞానము కలిగింపరాదు'

అను వాక్యముల నుల్లేఖించియున్నారు.

'సర్వం ఖల్విదం బ్రహ్మ నేహ నానాస్తి కించన' అని యంతయు బ్రహ్మమే యనియు, జీవేశ్వరులు భిన్నులు కారనియు నద్వైతమును లోకమున చాటిన శ్రీ శంకరులకు శూద్రులయెడ నింతటి భేదబుద్ధి యేల కలిగినదో చెప్పజాలము. శాస్త్రాధ్యయనమునకై యత్నించు శూద్రుల కిట్టి యమానుషదండనల నేల యంగీకరించిరో యూహింపజాలకున్నాము.

మరియును శూద్రునకు శాస్త్రాధికారము లేదని సాధించుటకు ఛాందోగ్యమున వర్ణింపబడిన జానశ్రుతి క్షత్రియుడనియు, జాబాలి - సత్య కాముడు బ్రాహ్మణుడనియు సాధించుటకు శ్రీ శంకరులు తగు పాండిత్య మును ధారవోసిరి. కాని ఫలము శూన్యమనక తప్పదు.

జానశ్రుతి యితివృత్తమును దెలుపు ప్రకరణమునం దెక్కడను క్షత్రియపదము కాని, రాజన్యపదముకాని యతని నుద్దేశించి ప్రయోగింప బడినట్లు కానము. జానశ్రుతి క్షత్రియుడని చెప్పు స్పష్టోక్తి యుపనిషత్తునందు జూడజాలము. పైపెచ్చు, చెంతజేరి యుపదేశింపుడని యాచించిన జాన శ్రుతిని రైక్వ మహర్షి. 'శూద్ర!' యని అనేక పర్యాయములు సంబో ధించియుండుట స్పష్టముగ నుపనిషత్తులో జూడనగును. అట్టి పదప్రయో గమువలన జానశ్రుతి శూద్రుడని స్పష్టమగుచుండ నది కాదని, యతనిని జాతిక్షత్రియుడని సాధించుటకు శ్రీ శంకరు లెంతో ప్రయాసపడియున్నారు.

ఉపనిషత్తునందు జానశ్రుతి క్షత్రియుడని వచించు స్పష్టవచనము కానరానందున నతని జాతిక్షత్రియత్వమునుగూర్చి యాచార్యులు స్వయ ముగా శంకించి, 'జానశ్రుతికి తరువాత అభిప్రతారి యను నొక క్షత్రియుడు రైక్వునిచెంత జేరి సంవర్గవిద్య నభ్యసించియుండెను. అతడు క్షత్రియుడు కాబట్టి జానశ్రుతియు క్షత్రియుడై యుండవలెను' అని సమాధానమును జెప్పియున్నారు. ఆ యభిప్రతారి క్షత్రియు డనుటకు స్పష్టోక్తి లేమింజేసి యతని క్షత్రియత్వమునుగూడ స్వయముగనే శంకించి, 'నాటి యాజకు లలో ప్రసిద్ధివడసిన కాపేయునితో నభిప్రతారి యొకచో నేకపంక్తియందు భోజనార్థమై కూర్చుండియుండె ననియు, నా సమయమునందే యొక బ్రహ్మచారి యటకు వచ్చి వారిని భోజన మిమ్మని యాచించియుండెననియు, సందువలన నభిప్రతారి క్షత్రియుడై యుండె' నని సమాధానము చెప్పి యున్నారు. అభిప్రతారి క్షత్రియుడు కానిపక్షమున యాజకునితో భోజనా

ర్థమై సహస్థితియు, బ్రహ్మణాదులే యుపనయింపబడుదురనియు జరుగదని యాచార్య అభిప్రాయపడుచున్నారని భావము.

జానశ్రుతి క్షత్రియుడని సాధించుటకై శ్రీ శంకరులు ఇంత ప్రయాసపడవలసివచ్చినదో పాఠకులు గమనింతురుగాక. ఇంతగా ప్రయ త్నించినను నాచార్యులకు అభిప్రతారి జాతిక్షత్రియుడని చెప్పగల స్పష్ట వచనము లభింపదయ్యె. కొందొక యాజకునివెంట భోజనమునకు గూర్చుండుట జాతిక్షత్రియత్వమునకు ప్రమాణ మెట్లగును? ఇట్లు సందిగ్ధ క్షత్రియత్వముగల యభిప్రతారి రైక్వునిదగ్గర సంవర్గవిద్య నేర్చినాడు కావున, నా రైక్వునిదగ్గరనే యంతకుపూర్వ మెప్పుడో జానశ్రుతి విద్య నేర్చినందునే జానశ్రుతి జాతిక్షత్రియుడై యుండుననుట యెంత సమంజ సమో యూహింతురు గాక! శ్రీ శంకరుల తర్కప్రాశస్త్యము నీ ప్రకరణ మెట్లు సాధింపగలదు? జానశ్రుతి శూద్రపదసంబోధితు డగుటచే నతడు శూద్రుడే యనియు, నతడు నేర్చిన విద్యనే రైక్వునిదగ్గర అభిప్రతారి నేర్చినాడు, కావున నభిప్రతారియు శూద్రుడేయై యుండుననియు నొక ప్రతి పక్షి సాధింపనెంచినచో శ్రీ శంకరు లేమని సమాధానము చెప్పుదురో!

ఇట్లే శంకరులు సత్యకాముని కథ నుదాహరించి శూద్రులకు శాస్త్రాధ్యయనాధికారము లేదని సాధించుచున్నారు. అదియును విచార సహము కాకుండుట దుఃఖకరము.

ఛాందోగ్యమున వర్ణింపబడిన సత్యకాముడు అజ్ఞాతకులగోత్రు డనుట నిస్సందిగ్ధము. అతడు తన తల్లిని 'గోత్ర మే'మని ప్రశ్నింపగా నామె

'బహ్వాహం చరన్తీ పరిచారిణీ యౌవనే త్వా మలభే
సాహ మేతద్ న వేద యద్గోత్ర స్త్వమసి.'

'వత్స! నీగోత్రము నాకు దెలియదు. పరిచారికనై బహుచరించుచు

యౌవనమున నిన్ను గంటిని.' అని బదులుచెప్పెను. తన గోత్రమునడిగిన ఋషికి తు-చ, తప్పకుండ తల్లిచెప్పిన మాటలనే చెప్పినందున సత్య కాముని సత్యనిష్ఠకు సంతసించి గౌతముడతని కుపనయన మొనర్చి యధ్య యనము చేయించెను. ఈ ప్రసంగమునే యుదాహరించి శ్రీ శంకరులు

'య త్సత్యవచనేన శూద్రత్వాభావే నిర్ధారితే
జాబాలం గౌతమ ఉపనేతు మనుశాసితుం చ ప్రవవృతే.'

'సత్యము చెప్పినందున నతనిలో శూద్రత్వము లేదని నిర్ణయము కాగా, గౌతముడు సత్యకాముని ఉపనయించి శిక్షణ నొసంగుటకు ప్రవృత్తు డయ్యెను' అని వ్రాసియున్నారు. ఇందు శూద్రత్వాభావము సత్యవచన ప్రయుక్తమని చెప్పియు శ్రీ శంకరులు సత్యకాముడు జాతిబ్రాహ్మణుడని యెట్లు సాధించియున్నారో దురూహ్యము.

సత్యకాముని సత్యవచన మతని తల్లిదండ్రులు బ్రాహ్మణులని సాధింపగలదా ? సత్యకాముని తండ్రి యెవరో జబాలకే తెలియనపుడు, జబాల పరిచారిణి యని స్పష్టముగా దెలియుచున్నపుడు సత్యకాముని సత్య వచనము వారి బ్రాహ్మణత్వ మెట్లు సాధింపగలదు ? సత్యకాముడు బ్రాహ్మణజన్ము డెట్లు కాగలడు? 'యత్ సత్యవచనేన శూద్రత్వాభావే నిర్ధారితే' 'సత్యమాడుటచే శూద్రుడుకాడు అని నిర్ధారణము కాగా' అను శ్రీ శంకరుల వచనముకూడ సత్యవచనాదులే బ్రాహ్మణత్వాదు లకు సాధనములు కాని, జాతికాదని స్పష్టముచేయుచునేయున్నది. ఇన్ని విరుద్ధహేతువులు స్పష్టముగా నెదుట నుంచుకొనియు శ్రీ శంకరులు సత్య కాముడు జాతిబ్రాహ్మణుడనియు నందువలననే యతనికి శాస్త్రాధ్యయన మున కధికారము కలిగినదనియు, కాబట్టి శూద్రునకు శాస్త్రాధికారము లేదనియు నిట సాధించుట యెంతయు చిత్రముగా నున్నది.

సంస్కారజన్ములు, జగద్విఖ్యాత ప్రతిభావంతులు, జగద్ధితార్థమై యావజ్జీవ మఖండ బ్రహ్మచర్యమును పాలించి, అవైదిక మతములను తుత్తునియ లొనర్చి వైదికధర్మము నుద్ధరింపబూనిన జగద్గురువులు శ్రీ శంకరభగవత్పాదు లీ యధికరణమున నీ యనార్షసిద్ధాంతమును సాధించుటకై యెట్టి కొంకతిరుగుడు మార్గము నేల యవలంబించిరో పాఠకులే యూహింతురుగాక! *

వాస్తవమున నీయపశూద్రసూత్రము లీప్రకరణమున నేల సూత్రింపబడినవో దురూహ్యములు. వీనికి పూర్వసూత్రములందును, తరువాత సూత్రములందును బ్రహ్మప్రతిపాదక శబ్దములనుగూర్చి విచారింపబడి యున్నది. మధ్యలో శూద్రులకు శాస్త్రాధికార మున్నదా! లేదా? యను ప్రసంగమే యప్రస్తుతముగా దోచుచున్నది. వాస్తవమున నిట నీ సూత్రము లేల వ్రాయబడినవో బోధపడకున్నది.

## నవమాధికరణము

పూర్వసూత్రములందును, తరువాతి సూత్రములందును బ్రహ్మప్రతిపాదక శబ్దములను గూర్చి విచారించుచు మధ్యలో ప్రాసంగికముగ శాస్త్రాధికారమును విచారించి నిర్ణయించి, మరల ప్రకృతమయిన బ్రహ్మప్రతిపాదక శబ్దములనుగూర్చి విచారింప ప్రారంభించుచున్నాడు.

### (ప్రాణః) కంపనాత్ ౧.౩.౩౯

(కొన్ని గ్రంథములలో నీసూత్రమున 'ప్రాణః' అను శబ్దము కనిపింపదు. కొన్నింటగూడనగును. అందువలన నాశబ్దము కోష్ఠములలోనుంచబడినది.)

---

* ఈ యపశూద్రాధికరణమును గూర్చి విశేషములు తెలిసికొనగోరువారు నాచే రచయింపబడిన 'అపశూద్రాధికరణము - శ్రీ శంకరాచార్యులు.' అను పుస్తకమును చూతురుగాక!

కంపనాత్ =(కంపనమనగా - ప్రాణనము - జీవనము) ప్రాణన క్రియకు హేతువై నందువలన, బ్రహ్మము, ప్రాణః=ప్రాణ శబ్దముచే వ్యవహరింపబడును. లేక, కంపనాత్=కంపనమువలన, బ్రహ్మము వ్యాపకమై యెల్ల భువనములను కంపింపజేయుచున్నదని సూత్రార్థము. కంపన హేతువు వ్యాపకమగు బ్రహ్మమును ప్రతిపాదించుచున్నదని భావము.

"రేజన్తే భువనాని విశ్వా" అథర్వ. ౨౦-౩౪-౧౭.

'సమస్తభువనములు కంపించుచున్నవి' భువనములన్నియు బ్రహ్మాశ్రయమున కంపించుచున్నవని మంత్రభావము. ఇట్లే

'ద్యావా చిదస్మై పృథివీ నమేతే,
శుష్మా చ్చిదస్య పర్వతా భయన్తే' అథ. ౨౦-౩౪-౧౪

'పృథివీ ద్యులోకములు పరమాత్మకు నమ్రములగుచున్నవి. అతని బలమునకే పర్వతములు భయపడుచున్నవి' అను నీమంత్రవర్ణములవలన సమస్త ప్రపంచము చలించుటకు హేతువు వ్యాపకమగు పరమాత్మయే యని తెలియుచున్నది. (౩౯)

## దశమాధికరణము

### జ్యోతి ర్దర్శనాత్ ౧-౩-౪౦

దర్శనాత్=ప్రకాశనమువలన, జ్యోతిః=జ్యోతిశ్శబ్దము, బ్రహ్మప్రతిపాదకమే యని సూత్రార్థము.

దర్శనమనగా నిట ప్రకాశనము - ఇతర పదార్థములను బ్రకాశింపజేయుట. సూర్యాదిపదార్థము లితర పదార్థములను బ్రకాశింపజేయుటవలన జ్యోతిస్సు లనబడుచున్నవి. అట్లే పరబ్రహ్మ పరమేశ్వరుడును సూర్యాది పదార్థములకును ప్రకాశమిచ్చి ప్రకాశింపజేయుచున్నందున ముఖ్యముగా జ్యోతిశ్శబ్దము పరమాత్మవాచకమగుచున్నది. గౌణముగా సూర్యాదిపదార్థములను బోధించునని భావము.

'హిరణ్మయే పరే కోశే విరజం బ్రహ్మ నిష్కలం
తచ్ఛుభ్రం జ్యోతిషాం జ్యోతి స్తద్యదాత్మవిదో విదుః'
'తమేవ భాంత మనుభాతి సర్వం
తస్య భాసా సర్వ మిదం విభాతి' ముం. ౨-౨-౯,౧౦

ఇందలి 'జ్యోతి'పదము బ్రహ్మవాచకమే. అది సమస్త జ్యోతిస్సులకు జ్యోతిస్సు. దానివలననే సర్వమును ప్రకాశించుచున్నది.

ఇట్లే యథర్వమంత్రములం దొకచో-

'శుక్రో ఽసి భ్రాజో ఽసి స్వరసి జ్యోతి రసి' ౨-౧౧-౫.

శుక్రము, భ్రాజము, ప్రకాశము, జ్యోతి యనియు బ్రహ్మమే వర్ణింపబడినది. ఋగ్వేదమునందును

'దేవం దేవత్రా సూర్య మగన్మ జ్యోతి రుత్తమమ్'

ఉత్తమజ్యోతియనియు బ్రహ్మమే వర్ణింపబడినది. కాగా, జ్యోతిశ్శబ్దము ముఖ్యార్థమున బ్రహ్మబోధక మనియే సూత్రనిశ్చితాభిప్రాయము. (౪౦)

## ఏకాదశాధికరణము

ఇట్లే యాకాశశబ్దము కూడ బ్రహ్మవాచకమే యని తెల్పుటకు సూత్రము.

### ఆకాశో ఽర్థాంతరత్వాది వ్యపదేశాత్ ౧-౩-౪౧

అర్థాంతరత్వాది వ్యపదేశాత్=పదార్థములం దంతర్భాగమున నున్నదని చెప్పుటవలన, ఆకాశః=ఆకాశపదము, బ్రహ్మవాచకమే యని సూత్రా[illegible]. సూత్రమునందలి ఆదిపదమునకు అసంగత్వము, సూక్ష్మత్వము [illegible] విశేషగుణము లర్థము.

అర్థాంతరత్వాదు లన సర్వపదార్థాంతఃస్థితి, అసంగత్వము, సూక్ష్మ

త్వము మున్నగునవి యని యర్థము. ఈ గుణములు బ్రహ్మమునందే వర్తించును. పంచభూతములలో నొకటి యగు నాకాశము తదితర ప్రాకృత పదార్థములం దంతర్భాగమున వ్యాప్తమై, యలిప్తమై యున్నట్లు బ్రహ్మము ప్రాకృతికపదార్థములందేకాక జీవులందును ఉండి అలిప్తమై, సూక్ష్మమై యున్నందున నాకాశపదముచే వ్యవహరింపబడు నని భావము.

శ్రుతి స్మృతు లిట్లే బ్రహ్మమును వర్ణించుచున్నవి :

'స ఓతశ్చ ప్రోతశ్చ విభూః ప్రజాసు' యజు. ౩౨-౮. 'పరమేశ్వరు డన్నిటియందు నోతప్రోతమై యున్నాడు'

'సర్వాత్మానం సర్వగతం విభుత్వాత్' శ్వే. ౩-౨౧. 'బ్రహ్మము విభువు. కావున నది సర్వాత్మము, సర్వగతము.'

'అసంగో నహి సజ్జతే' బృ. ౪-౪-౨౨. 'బ్రహ్మ మసంగము. అది దేనియందును సక్తము కాదు.'

'సూక్ష్మాచ్చ సూక్ష్మతరం విభాతి' ముం. ౩-౧-౭. 'బ్రహ్మము సూక్ష్మముకంటె సూక్ష్మమై ప్రకాశించుచున్నది.(౪౧)

## ద్వాదశాధికరణము

ఇంతవరకును ప్రాణాదిశబ్దములు బ్రహ్మము నెట్లు ప్రతిపాదించునో వర్ణింపబడినది. ఇక జీవబ్రహ్మలకు గల భేదమును నిరూపింపదలచి మహర్షి సూత్రము నారంభించుచున్నాడు.

### సుషుప్త్యుత్క్రాంత్యోర్ భేదేన ౧-౩-౪౨

(పూర్వసూత్రమునుండి 'వ్యపదేశాత్' అను పద మీ సూత్రమున ననువర్తించును.)

**సుషుప్త్యుత్క్రాంత్యోః** = సుషుప్తియందును, ఉత్క్రమణము

వందును, భేదేన=జీవాత్మను పరమాత్మకంటె భిన్నముగా, వ్యపదేశాత్= ఉపదేశించుటవలన, బ్రహ్మము జీవాత్మకంటె భిన్న మని సూత్రార్థము.

(సుషుప్తి=గాఢనిద్ర, ఉత్క్రాంతి=జీవుడు తానున్న శరీరమును విడచివెళ్ళుట.)

బృహదారణ్యకమునం దొకచో సుషుప్తిని గూర్చి యిట్లు వర్ణింపబడినది.

'తద్యథా ప్రియయా స్త్రియా సంపరిష్వక్తో
న బాహ్యం కించన వేద నాంతరమ్,
ఏవమే వాయం పురుషః ప్రాజ్ఞే నాత్మనా
సంపరిష్వక్తో న బాహ్యం కించన వేద నాంతరమ్' బృ. ౪-౩-౨౧.

(పురుషః=జీవాత్మ, ప్రాజ్ఞః=పరమాత్మ)

'ప్రియురాలైన స్త్రీని గాఢాలింగనముచేసి పురుషుడు బాహ్యము, నాభ్యంతరము నెరుగక తన్మయు డగునట్లు జీవుడును ప్రాజ్ఞు డగు పరమేశ్వరుని బొంది బాహ్యాభ్యంతరముల విస్మరించును - బ్రహ్మానందము ననుభవించును.'

ఉత్క్రాంతిని వర్ణించుచు నా బృహదారణ్యకమునందే యిట్లు వ్రాయబడినది.

'తద్యథా ఽనః సుసమాహిత ముత్సర్జద్
యాయాద్, ఏవమే వాయం శారీర ఆత్మా
ప్రాజ్ఞే నాత్మనా అన్వారూఢ ఉత్సర్జన్ యాతి' బృ. ౪-౩-౩౫.

అనః=బండి, సుసమాహితంసత్=బరువుతో గూడినదై, ఉత్సర్జత్= ధ్వనిచేయుచు, తత్=లోకమున, యథా=ఎట్లు, యాయాత్=వెళ్ళునో, ఏవమేవ=అట్లే, 'శారీర ఆత్మా=జీవాత్మ, ప్రాజ్ఞేన ఆత్మనా=పరమాత్మచే నధిష్ఠితుడై, ఉత్సర్జన్=శబ్ద మొనరించుచు, యాతి=వెళ్ళును.'

జీవుడు జీవనయాత్రను ముగించుకొని, తుదకు శరీరమును విడిచి వెళ్ళునపుడు వేదనవలన ఆర్తనాద మొనర్చుచు పరమాత్మచే నధిష్ఠితుడై పోవునని వాక్యాభిప్రాయము.

పైన వర్ణించిన సుషుప్తికి, ఉత్క్రాంతికి సంబంధించిన స్థలము లందు జీవాత్మ పరమాత్మలు వేరువేరుగ వర్ణింపబడినందున నవి రెండును వేరనియే యెరుంగనగును. జీవేశ్వరులు వేరుకాక యభిన్నులయిన పక్షమున నట్లు వేరుగ వర్ణింపబడ రని భావము. ఉపనిషద్వాక్యములందు జీవుడు (పురుషః, శారీర ఆత్మా) పురుషుడనియు శారీరాత్మ యనియు ప్రథమా విభక్తి యుక్తముగాను, (ప్రాజ్ఞే నాత్మనా) ప్రాజ్ఞు డగు నాత్మతోనని పర మాత్మ తృతీయావిభక్తియుక్తముగాను పేర్కొనబడియున్నందున జీవాత్మ పరమాత్మలు వేరనుటలో నెట్టి సందియమును లేదు.

జీవాత్మ పరమాత్మలలో గల యీ స్పష్టమైన పృథగ్భావము - భిన్నత - సుషుప్తియందును, ఉత్క్రమణమునందును నుండును కాని, ప్రళయమునందును, ముక్తియందును నుండ దని చెప్ప వలనుపడదు. వానిలోగల భేద మెల్లపుడు నుండును. జీవేశ్వరులలోగల భిన్నత తాత్త్వి కమే కాని కల్పితము కాదు. అందువలననే యెల్లరును బ్రహ్మ భిన్నముగా దమ యస్తిత్వమును గుర్తించుచునే యున్నారు. 'నే నున్నాను' (అహ మస్మి) అను నీ యనుభవ మెల్లరకు నున్నట్లు ప్రత్యక్షసిద్ధముమే కదా।

'నే నున్నా' నను నీ యాత్మసద్భావానుభూతిద్వారమున దెలియు జీవునియునికి జీవుని తాత్త్వికరూపము కాదందురేని, అతని తాత్త్వికరూప మేమై యుండును? బ్రహ్మరూపమే యందురేని, తాత్త్వికమైన బ్రహ్మము నం దీ యతాత్త్వికభావ మేల కలుగుచున్నది? అవిద్యవలన కలుగుచున్న దందురేని, అది యుక్తము కాదు. విద్యాస్వభావముగల బ్రహ్మమునం దవిద్య యెట్లు కలిగినది?

'బ్రహ్మవా ఇద మగ్ర ఆసీత్, తదాత్మానమేవ
వావైత్ అహం బ్రహ్మాస్మీతి తస్మాత్ తత్సర్వ మభవత్
తద్ యో యో దేవానాం ప్రత్యబుధ్యత స ఏవ తదభవత్
తథర్షీణాం తథా మనుష్యాణామ్' బృ. ౧-౪-౧౦.

'మొదట బ్రహ్మ మొదెను. అది తననే 'నేను బ్రహ్మమును' అని యెరిగెను. అందువలన నది సర్వ మయ్యెను. అందుండి దేవతలలో, ఋషులలో, మనుష్యులలో నెవరెవరు ప్రతిబుద్ధులైరో - తెలిసికొనిరో - వా రది యైరి' అను బృహదారణ్యకవాక్యము బ్రహ్మాత్మైక్యభావమును సాక్షాత్తుగ బోధించుచున్నందున జీవబ్రహ్మములలో వాస్తవికభేదము లేదందురేని- అదియును యుక్తము కాదు.

జీవ బ్రహ్మములకు 'అహం బ్రహ్మాస్మి' యను పదములను గ్రహించి అద్వైతు లి ట్లందురు :

'జీవునకు 'నేను బ్రహ్మనైతిని' అను బ్రహ్మభావజ్ఞానము కలిగినపు డీజగత్తంతయు నవిద్యాకార్య మగుటవలన నది కారణసహితముగ - అవిద్యతోబాటు - తొలగిపోవును. జీవునకు బ్రహ్మభావము కలుగగానే యవిద్యవలన నేర్పడిన ద్వైతప్రపంచమంతయు మాయ మగునని భావము. అవగతి యనగా సాక్షాత్కారము - విద్య. అయ్యది యవిద్యకు విరోధి. అందువలన పరస్పరవిరుద్ధములగు నా విద్యావిద్యలు రెండు నొకేస్థలమున నొకేకాలమున నుండనేరవు. జీవునకు బ్రహ్మభావావగతి కలుగగానే ద్వైతము పోయి, బ్రహ్మాత్మైక్యభావ - మద్వైతము సిద్ధించును.'

పై వాక్యమునం దద్వైతు లగు మీరు చెప్పుపద్ధతి యెందునను కనిపించదు. బ్రహ్మభావావగతి బ్రహ్మసాక్షాత్కారము కలిగిన తదుపరి, ద్వైతప్రపంచము నివృత్త మగునని యావాక్యము చెప్పకపోగా 'నేను బ్రహ్మనైతిని' అని తెలిసికొనిన వ్యక్తియొక్క సర్వభావమునుమాత్రము

చెప్పుచున్నది. అందువలన నద్వైతమిట యెట్లు సిద్ధించును ? ఈ వాక్యము నందు రెండుపదార్థము లున్నట్లు స్పష్టమగుచున్నది. ఒకటిసర్వము, రెండవది సర్వము తానే యని తెలియువ్యక్తి. ఇట్లు రెండుపదార్థములను బోధించు వాక్యము ద్వైతభావమును బోధించును; కాని యద్వైతము నెట్లు సాధించును ? అద్వైతము నంగీకరించువారిదృష్టిలో 'బ్రహ్మవ్యతిరిక్త మంతయు నావిద్యకము - అవిద్యాజన్యము - వాస్తవము కాదు - అనియు, నా యవిద్య, (అహం బ్రహ్మాస్మి) 'నేను బ్రహ్మనైతి'నను విద్య (జ్ఞానోదయము) కలుగగానే క్షణమాత్రము నుండజాలదు' అనియు నుడువుదురు. ఉపనిషద్వాక్యము సర్వపద వాచ్య మంతయు నుండు ననుచున్నది. కాగా బ్రహ్మాత్మైక్య వాద మెట్లు సిద్ధించును ?

మరియును 'అహం బ్రహ్మాస్మి' అను నీ వాక్యమునందలి బ్రహ్మపదము బ్రహ్మవాచకమగుటకును వీలుకాదు. ఇందు అహ మన నెవరు ? బ్రహ్మమేకదా ! అందువలన 'అహం బ్రహ్మాస్మి' అను వాక్యమునకు బ్రహ్మము తాను బ్రహ్మమైనట్లు తెలిసికొనెనని యర్థము చెప్పవలెను. అనగా బ్రహ్మ కొకప్పుడు తనబ్రహ్మభవనజ్ఞానములేదని తెలియుచున్నది. ఇంతేకాక బ్రహ్మభవనజ్ఞానానంతరమున బ్రహ్మమునకు కూడ (తత్సర్వమభవత్) సర్వభావము కలిగినట్లు చెప్పవలసివచ్చును. అట్లు చెప్పవలసి వచ్చిన నష్ట మేమందురేని, బ్రహ్మమున కొకప్పుడు సర్వభావజ్ఞానము - సర్వము తానే యను జ్ఞానము - లేనట్లును, తరువాత నది కలిగినట్లును నంగీకరింపవలసివచ్చును. నిత్యము సర్వశక్తిమంతము, సర్వజ్ఞము, సర్వాధారము నైన బ్రహ్మమున కొకప్పుడు సర్వభావజ్ఞానము లేదను టెట్లు పొసగును ?

'యో విశ్వా అభివిపశ్యతి భువనాసంచ పశ్యతి' ఋ. ౩-౪-౧౦-౯.

'పరమేశ్వరుడు సర్వభువనములను బాగుగ నెరుగును.'

'యః సర్వజ్ఞః సర్వవిత్' ముం. ౧-౧-౯.
'బ్రహ్మై వేదం విశ్వమ్' ముం. ౨-౨-౧౧.
'సర్వం ఖల్విదం బ్రహ్మ' బృ. ౩-౧౪-౧.

అని యిట్లు శ్రుత్యుపనిషద్వాక్యములలో పరమేశ్వరుని సర్వజ్ఞత్వము నిత్యముగా కొనియాడబడుచుండ నతని కొకప్పుడొక జ్ఞానములేదనిచెప్పుట శ్రుతిసంగతముకాదు. కావున 'అహంబ్రహ్మాస్మి' అను నీ వాక్యమునందలి బ్రహ్మశబ్దము పరమేశ్వరవాచకము కాదనియే చెప్పవలసియున్నది. అటు లయిన బ్రహ్మశబ్దమున కిట నర్థమేమి ? యని యడుగుదురేని 'సర్వ'మని చెప్పుదుము.

స్వశబ్దము 'తాను' అను నర్థమున బ్రయోగింపబడునట్లు తననుండి విభక్తముకాక, తనతో గలిసియుండు మరియొక పదార్థమునకును వాడ బడుట లోకసిద్ధము. క్షీరశబ్దము దుగ్ధమునకే కాక యందు కలిసియుండు నీరమునకును వాడబడును. అట్లే జగజ్జన్మాదులకు హేతువగుబ్రహ్మమునం దవిభక్తముగా నిరంతరము కలిసియుండు నీ జగత్తంతయు - సర్వము 'బ్రహ్మ వా ఇద మగ్ర ఆసీత్' అను వాక్యమునగల బ్రహ్మపద ముచే ప్రస్ఫుట మొనరింపబడినది. ఇందు విప్రతిపత్తికి తావే లేదు. అందు వలననే (ఆత్మాన మేవ) 'తన్నే' బ్రహ్మమని యెరిగినట్లు చెప్పబడినది. లేకున్న నిందలి నిశ్చయార్థబోధకమగు 'ఏ' కారమునకు బ్రయోజన మేమి ? ఈ సర్వము - జగత్తంతయు - బ్రహ్మమం దవిభాగరూపమున నున్నపుడే యవధారణార్థకమగు 'ఏవ' కారము చరితార్థమగుననిభావము. జగత్తు లేనేలేదు (అత్యంత మసత్) అనువాదము (కథమసతః సజ్జాయేత) 'అసత్తు నుండి సత్తెట్లుగలుగును ? అను వాక్యమూలమున ఖండితమగు టచే నంగీకరింపజాలము. కాబట్టి పూర్వోక్తవాక్యమునందలి బ్రహ్మపదము సర్వవాచకమని సిద్ధమగుచున్నది. అందువలన 'సర్వ మాప్నోతి సర్వశః'

ఛాం. ౭-౨౬-౨. 'సర్వము సర్వవిధముల వ్యాపించియున్నది' అను ఉపనిషదంతరోక్తియు సంపన్నమగుచున్నది.

ఇట్లు బ్రహ్మశబ్దమునకు సర్వమని యర్థము కాగా,

తద్ యో యో దేవానాం ప్రత్యబుధ్యత స తదభవత్

తథర్షీణాం తథా మనుష్యాణామ్'

అని, దేవ, ఋషి, మనుష్యులకుపదేశింపబడిన ('అహం బ్రహ్మాస్మి) 'నేను సర్వమైతి' నను సర్వభావోపదేశముకూడ గౌణమనియే యంగీకరింపవలెను. వ్యస్తమెన్నడును సర్వమను ముఖ్యార్థమున గ్రహింపననువు కాదు గదా ।

చైత్రుడుకాని, మైత్రుడుకాని, యజ్ఞదత్తుడుకాని యొక్కడెన్నడును నెట్టిజ్ఞానమువలనను సర్వమెట్లు కాగలడు ? కావున 'నేను సర్వమైతిని' అను స్థలమున సర్వభవనము గౌణమనియే యెంచవలెను. లోకమున నిట్టి ప్రతిపత్తి చూడనగును. ఉదారచిత్తు డొకడు సర్వము నాత్మౌపమ్యముతో జూచుచు నందఱు నావారే; సర్వము నాయాత్మయే యనును. లోకులును నట్టి మహాత్ముని 'సర్వము నామహాత్ముడే' యనియు నందురు.

'తద్ధైతత్ పశ్యన్ ఋషి ర్వామదేవః ప్రతిపేదే,

అహం మను రభవం సూర్యశ్చ' బృ. ౧-౪-౧౦.

'నేను మనువునైతిని; సూర్యుడనైతిని' అనిన వామదేవునివాక్యము కూడ నీ భావమునే ప్రదర్శించుచున్నది. కాబట్టి ('అహంబ్రహ్మాస్మి)' అను వాక్యమును పురస్కరించుకొని, జీవబ్రహ్మలయైక్యమును గొందరు సాధించుట శ్రుతిసమ్మతము కాదని మాయభిప్రాయము. ఇట్లే - 'అయమాత్మా బ్రహ్మ' మాం. ౨. 'ప్రజ్ఞానంబ్రహ్మ' ఐ. ౩-౫-౩. వాక్యములును బ్రహ్మమునకు 'ఆత్మ' 'ప్రజ్ఞానము' అను నామాంతరము లున్నవని తెలుపునేకాని, జీవబ్రహ్మల యభేదము నెంతమాత్రమును దెలుపజాలవు. ఈ

వాక్యములు ప్రయోగింపబడిన ప్రకరణములలో జీవబ్రహ్మల యభేదమును దెలుపుటకుగల ప్రసక్తియు గనబడదు.

'స యో హ వై తత్ పరమం బ్రహ్మవేద బ్రహ్మైవ భవతి' ముం. ౩-౨-౯. 'ఎవడా బ్రహ్మము నెరుగునో వాడు బ్రహ్మమే యగుచున్నాడు' అను నీ ముండకవచనము ననుసరించి బ్రహ్మవిదు డగుజీవునకు, బ్రహ్మమునకు మధ్య తాత్త్వికభేదములేదని బోధపడుచున్నదని అభేదవాదు లందురేని - అదియును సమంజసము కాదు.

'బ్రహ్మైవ భవతి' అను పదము బ్రహ్మభవనమును దెలుపుచున్నది. ఇక్కడను జీవునికి గలుగుబ్రహ్మభవనము 'జీవుడు బ్రహ్మమునకు దూరముగ నుండక బ్రహ్మముసం దవిభక్తమైయుండు'ననియే తెలుపును.

జీవు దభ్యాస వైరాగ్యముల మూలమున చిత్తవృత్తులనన్నింటిని నిరోధించి సంప్రజ్ఞాతసమాధిని బొంది, క్రమముగ చిత్తవైశారద్యమును సంపాదించినవాడై స్వస్వరూపమును దెలిసికొనును. అంతట పరబ్రహ్మమగు పరమేశ్వరుని సాక్షాత్కారము గలుగును. అనంతరమున ప్రారబ్ధకర్మఫలము లుపక్షయింప ప్రకృతి, తత్కార్యములగు బుద్ధ్యాదిదేహసంఘాతము వీనినుండి విడివడి, కేవలుడై, శుద్ధుడైజీవుడు బ్రహ్మమును బొంది యందే యవిభక్తుడైయుండును. ఈ స్థితియే ముండకమున నిట్లు వర్ణింపబడినది:

'తదా విద్వాన్ పుణ్యపాపే విధూయ
నిరంజనః పరమం సామ్య ముపైతి' ముం. ౩-౧-౩

'విద్వాంసుడైన జీవు డా సమయమున పుణ్యపాపములను వీడి నిరంజనుడై - శుద్ధుడై - పరమసామ్యమును బొందును.' ఇట పరమసామ్యమన నవిభాగ మని యర్థము. ఈయవిభాగస్థితియే —

'పరే ఽవ్యయే సర్వ ఏకీ భవంతి' ముం. ౩-౨-౭.

'అవ్యయము, పరము నగు నా పరమేశ్వరునం దెల్లరు నేకమవు దురు - అవిభక్తస్థితిలో నుందురు' అని వ్యక్తముచేసి, ఏకీభావమును స్పష్టపరుపవెంచి యుదాహరణ మొకటి ప్రదర్శింపబడినది :

'యథా నద్యః స్యందమానాః సముద్రే
అస్తం గచ్ఛంతి నామరూపే విహాయ,
తథా విద్వాన్ నామరూపా ద్విముక్తః
పరాత్పరం పురుష ముపైతి దివ్యమ్' ముం. ౩-౨-౮.

'నదులు ప్రవహించుచు సముద్రమున జేరి నామరూపములను విడిచి యస్తమించునట్లు విద్వాంసుడును నామరూపములనుండి విడివడి, పరాత్పరుడైన యవ్యయపురుషుం జేరును. ఈ యుపనిషద్వాక్యమునుబట్టి జీవుడు ప్రకృతినుండియు, తత్కార్యములైన మహదాదిప్రపంచమునుండియు - నామరూపాత్మకశరీరమునుండియు - విడివడి పరమపురుషునం దవిభక్తుడై యుండు నని స్పష్టముగ దెలియుచున్నది.

గంగా యమునాది నదులు సముద్రముంజేరి స్వస్వనామరూపములను విడనాడునే కాని యవి స్వయముగ నుచ్ఛిన్నములు కావు. అట్లే జీవుడు శరీరమును విడిచి బ్రహ్మమున జేరి, యా బ్రహ్మము వ్యాపక మగుటచే దానినుండి వేరుగా నుండక, యవిభక్తముగ నందేయుండును. 'నిజ స్వరూపము, నుచ్ఛిన్నము జేసికొనడ'ని భావము.

ఇట్లే బృహదారణ్యకమునందును –

'యో ఽకామో నిష్కామ ఆప్తకామ ఆత్మకామో
న తస్య ప్రాణా ఉత్క్రామంతి బ్రహ్మైవ సన్ బ్రహ్మాప్యేతి'
బృ. ౪-౪-౬.

'అకాముడు, నిష్కాముడు, ఆప్తకాముడు, ఆత్మకాముడు నైన వాని ప్రాణము లుత్క్రమింపవు. బ్రహ్మమై బ్రహ్మమునం దప్యయ

మగును.' అని చెప్పబడినది. ఇట నప్యయ మనగా లయ మని యర్థము. ఉచ్ఛేదము కాదు. అవిభాగస్థితి యని భావము. బ్రహ్మవిదుడు బ్రహ్మమై బ్రహ్మమున లయించుచున్నా దనిన, నభేద మెట్లగును ? ఒక వస్తువు మరియొక వస్తువునం దప్యయము - లయము -నొందుట లోకసిద్ధమే. ఒకే పదార్థము తనలో దాను లయమొందు ననుట యుక్తియుక్తము కాదు. సముద్రము సముద్రమున లయమొందునా ? నదులు సముద్రమున లయము నొందును. మఱియును,

'అభయం వై బ్రహ్మ అభయం హ
వై బ్రహ్మ భవతి, య ఏవం వేద.' బృ. ౪-౪-౨౫.

'అభయబ్రహ్మము నెరిగినవాడు బ్రహ్మమే యగును' అను నీ వాక్యమునందలి 'భవతి' శబ్దమునకుగూడ ప్రాప్తి యనియే యర్థము చెప్పవలయును. 'బ్రహ్మమును అభయ మని తెలిసికొని యభయబ్రహ్మ మును ప్రాపించును' అనియే వాక్యతాత్పర్యము. జీవునకు స్వరూపనాశ మెన్నడును గలుగదు. ఉపనిషత్తులందును, ముఖ్యముగా మంత్రవర్ణము లందును జీవేశ్వరులభేదమే ప్రతిపాదింపబడియున్నది. అందువలన జీవేశ్వరుల యభేదవాదము శాస్త్రీయము కాదనియే నిశ్చితార్థము. కాగా జీవబ్రహ్మలభేదమే తాత్త్విక మని సిద్ధాంతము. (౪౨)

ఉక్తవిషయమును ధృవపఱచుటకు మహర్షి హేత్వంతరమును సూత్రించుచున్నాడు.

## పత్యాది శబ్దేభ్య శ్చ                    ౧-౩-౪౩

పత్యాది శబ్దేభ్య శ్చ =.వేదశాస్త్రములందు ప్రయోగింపబడిన పతి మున్నగు శబ్దములవలనను బ్రహ్మము జీవాత్మకంటె వేరనియే తెలియు చున్నది.

జీవబ్రహ్మములలో భేదమే లేనిపక్షమున బ్రహ్మవాచకములుగా బ్రయోగింపబడిన సర్వాధిపతి, ప్రాణస్పతి, ప్రజాపతి, జగత్పతి యను నీ పతియుక్తపదములు జీవునకుకూడ వాడబడి యుండెడివి. అట్లు వాడక పతిశబ్దము బ్రహ్మకే వాడబడినందున జీవబ్రహ్మములు రెండును భిన్నము లనియే స్పష్టమగుచున్నది.

'యో విశ్వస్య జగతః ప్రాణతస్పతిః' ఋ. ౧-౭-౧౫-౫.

'స వా అయమాత్మా సర్వేషాం భూతానా
మధిపతిః సర్వేషాం భూతానాం రాజా' బృ. ౨-౫-౧౫.

'ఏష సర్వేశ్వరః ఏష భూతాధిపతి
రేష భూతపాలః' బృ. ౪-౪-౨౨.

'సర్వ స్యేశానః సర్వ స్యాధిపతిః
సర్వ మిదం ప్రశాస్తి యదిదం కించ' బృ. ౫-౬-౧.

ఈ వాక్యములందలి 'భూతాధిపతి, సర్వేశ్వరుడు, భూతరాజు, భూతపాలుడు, ఈశానుడు, సర్వాధిపతి మున్నగు శబ్దములన్నియు బ్రహ్మమునే బోధించుచున్నవి. ఇయ్యవి జీవునకై వాడిన స్థలెక్కడను జూడము. జీవపరబ్రహ్మములలో భేదమేలేక రెండును నేకమై యున్న పక్షమున నీ పదము లటనట జీవబోధకములుగాను బ్రయోగింపబడియుండవలసినది. అట్లు ప్రయోగింపబడనందున జీవబ్రహ్మములు సర్వథా భిన్నము లనియు, వాని యభేద మశాస్త్రీయ మతాత్త్వికమనియు నిశ్చితమగుచున్నది. (౪౩)

వేదాంత దర్శన - అంబా వ్యాఖ్యానమున
ప్రథమాధ్యాయమునందు తృతీయపాదము
సమాప్తము.

# ప్రథమాధ్యాయము

## చతుర్థపాదము

### ప్రథమాధికరణము

మొదటిపాదమునందు 'జన్మాద్యస్య యతః' అను సూత్ర వ్యాఖ్యానమున బ్రహ్మము జగత్కారణముగ వర్ణింపబడినది. జగత్కారణమును వర్ణించు వాక్యము లుపనిషత్తులలో నింకను కొన్ని గలవు. వానినిగూర్చి విచారించుటకై యీ పాద మారంభింపబడుచున్నది.

ఆనుమానిక మప్యేకేషా మితిచే న్న శరీరరూపక
విన్యస్తగృహీతే ర్దర్శయతి చ        ౧-౪-౧

ఏకేషామ్ = కొందరిదృష్టిలో, ఆనుమానిక మపి = ప్రకృతికూడ, జగజ్జన్మాదులకు కారణము, ఇతి చేత్=అని యనినచో, న=కాదు, కారణ మేమన, శరీరరూపకవిన్యస్తగృహీతేః = శరీరదృష్టాంతరూపమున ప్రకృతి గ్రహింపబడుటవలన, ప్రకృతి జగత్కారణము కాదు. చ = మరియు, దర్శయతి=ఉపనిద్వాక్యము నట్లే ప్రతిపాదించుచున్నది.

అథర్వవేదీయ ముండకోపనిషత్తునందు—

'యథా సుదీప్తాత్ పావకాత్ విస్ఫులింగాః
ప్రభవంతే సహస్రశః సరూపాః
తథాక్షరాత్ వివిధాః సౌమ్య! భావాః
ప్రజాయంతే తత్రచైవాపియంతి'    ముం. ౨-౧-౧.

'ప్రజ్వలించు నగ్నినుండి యనేకవిస్ఫులింగములు (నిప్పురవ్వలు) అగ్నిసరూపము లుద్భవించునట్లు, అక్షరము (ప్రకృతి)నుండి అనేకభావపదార్థము లుద్భవించుచున్నవి. అందే లీనము లగుచున్నవి' అని

యున్నది. ఈ వాక్యమునుబట్టి యాథర్వణికులు 'అక్షర మగు ప్రకృతియే యీ జగ దుత్పత్తి స్థితి లయములకు స్వతంత్రకారణ మగును;కాని బ్రహ్మ మెన్నడును కా'దందురు. కారణ మేమన : భావము లన జడపదార్థములు. అయ్యవి సూక్ష్మప్రకృతినుండి జనించును. ప్రకృతింబోలి జడములై యుండును. ప్రళయసమయమున మరల ప్రకృతియందే లీనము లగును. కాబట్టి ప్రకృతియే జగజ్జన్మాదులకు కారణమగును. బ్రహ్మము కాదని యందురు. దానికి సమాధానము:

ప్రకృతి జగజ్జన్మాదులకు స్వతంత్రకారణము కాదు. ఉపర్యుక్త వాక్యమునందలి యక్షరశబ్దముచే గ్రహింపబడిన ప్రకృతి యనేక స్థలము లందు శరీరముతో బోల్పబడినది.

'యథోర్ణనాభిః సృజతే గృహ్ణతే చ
యథా పృథివ్యా మోషధయః సంభవంతి
యథా సతః పురుషాత్ కేశలోమాని
తథాక్షరాత్ సంభవ తీహ విశ్వమ్' ముం. ౧-౧-౮.

'సాలీడు తంతువును సృజియించును. మరల తనలో నిముడ్చుకొనును. పృథివినుండి యోషధులు జనించును. శరీరములో నాత్మ యుండగా శరీరమునుండి కేశము లుద్భవించును. అట్లే యక్షరమునుండి విశ్వ ముదయించును.'

ఈ వాక్యమునం దక్షరప్రకృతి శరీరస్థానమున నుదాహరింపబడినది. దీనింబట్టి యాత్మాధిష్ఠితశరీరమునుండి కేశనఖాదు లుత్పన్నము లగునట్లు బ్రహ్మాధిష్ఠితప్రకృతినుండి సమస్తపదార్థము లుద్భవించుచున్న వని స్పష్టమగుచున్నది. కావున ప్రకృతి జగదుత్పత్తికి కారణమే కాని, స్వతంత్రకారణము కాదు.జగ దుత్పత్తి స్థితి లయములకు ముఖ్యకారణము బ్రహ్మమే. ప్రకృతి జడపదార్థ మగుటంబట్టి ముఖ్యకారణము - స్వతంత్ర

కారణము - కాదు. అది జగత్తున కుపాదానకారణము. అందువలన 'జన్మాద్యస్య యతః' అను సూత్రమున ప్రతిపాదింపబడినట్లు జగజ్జన్మాదుల కు బ్రహ్మము కారణమనుటలో దోషములేదని సూత్రతాత్పర్యము. (౧)

ప్రకృతి శరీరస్థానమున నుదాహరింపబడిన పక్షమున మన శరీరములవలె నదియు స్థూలము కావలసివచ్చును. స్థూలము కార్య మగును. కాని కారణ మెట్లగు ననః

## సూక్ష్మం తు తదర్హత్వాత్ ౧-౪-౨

అర్హత్వాత్=కార్యమాత్రమునందు కారణము కాదగినందున, తత్తు =ఆ ప్రకృతిమాత్రము, సూక్ష్మమ్ = సూక్ష్మమే, కాని, స్థూలము కాదని యర్థము.

ప్రకృతి శరీరముతో బోల్పబడినంతమాత్రమున నది శరీరమువలె స్థూలము కావలయు నను నియమ మొందును లేదు. దృష్టాంత, దార్ష్టాంతములు సర్వాంశములందును సమానము లని యెంచరాదు. ప్రకృతి ప్రపంచమునందలి సమస్తపదార్థములకును మూలకారణము. కావున నయ్యది మిక్కిలి సూక్ష్మమే యగును. అందువలననే స్మృతులలో నయ్యది యత్యంతసూక్ష్మ మనియే వర్ణింపబడినది.

'సూక్ష్మాచ్చ సూక్ష్మతరం విభాతి' ముం. ౩-౧-౭.

'త ద్ధేదం తర్హి అవ్యాకృత మాసీత్' బృ. ౧-౪-౭.

'సౌక్ష్మ్యాత్ తదనుపలబ్ధిః' సాం. ౧-౧౦౯.

ఈ పంక్తులలో ప్రకృతి సూక్ష్మ మనియే నిరూపింపబడినది. కావున నయ్యది కారణ మగుటలో నెట్టి యాపత్తియు నుండదు. (౨)

శరీరమువలె ప్రకృతియు పరాధీనమా? లేక స్వాధీనమా? యనః

తదధీనత్వా దర్థవత్ ౧-౪-౩

తదధీనత్వాత్=బ్రహ్మాధీన మగుటవలన ప్రకృతి, అర్థవత్=సార్థక మగుచున్నది.

ఈ జగత్తంతయు ప్రాణుల భోగసాధనమై యున్నది. ప్రపంచమున నివసించుచు ప్రాణులకు వానివాని కర్మఫలముల ననుభవింపజేయుటకు తగిన ట్లీ జగత్తు రచియింపబడినది. ప్రకృతి స్వాధీనమే - స్వతంత్రమే - యగు నెడల నయ్యది జడమయినందున విచిత్రసృష్టికి సమర్థము కానేరదు. విచిత్రరచనకు వలయు జ్ఞానము జడప్రకృతి కెటనుండి లభించును? మట్టి జడమయ్యు కుమ్మరియధీనమున ఘట శరావాది విచిత్రపాత్ర రచనకు యోగ్యమగు కారణ మైనట్లు ప్రకృతికూడ బ్రహ్మాధీనమై విచిత్ర పదార్థోత్పత్తికి తగినట్లు కారణమగుచున్నది. కాబట్టి ప్రకృతి బ్రహ్మాధీనమై జగత్కారణ మగుచున్నదే కాని, స్వాధీనమై కాదని భావము.(౩)

ఇందులకు మరియొక హేతువు :

జ్ఞేయ త్వావచనా చ్చ ౧-౪-౪

ప్రకృతి జ్ఞేయపదార్థముగా వర్ణింపబడనందునను, నది బ్రహ్మాధీనమై జగత్కారణ మగుచున్నదని చెప్పుటయే యుక్తమని సూత్రార్థము.

ప్రకృతి జగజ్జన్మాదులకు స్వతంత్రకారణమై యున్న నయ్యది జ్ఞేయము (తెలియదగినది)గ వర్ణింపబడియుండెడిది. స్వతంత్రకారణ మగు బ్రహ్మము నెరుగుట యెట్లు పరమపురుషార్థమో, యట్లే ప్రకృతి జగజ్జన్మాదులకు స్వతంత్రకారణమై యున్న నయ్యదియు జ్ఞేయముగ వర్ణింపబడియుండెడిది. ప్రకృతి నట్లు వర్ణింపక బ్రహ్మమునే జ్ఞేయముగ వర్ణించుట యుపనిషత్తులందు జూడనగును.

'యతో వా ఇమాని భూతాని జాయంతే
యేన జాతాని జీవంతి యత్ప్రయం త్యభిసంవిశంతి,
తద్ విజిజ్ఞాసస్వ తద్ బ్రహ్మేతి' తై. ౩-౧.

ఈ వాక్యమున బ్రహ్మమే తెలియదగినదిగ వర్ణింపబడుట సుస్ప ష్టము. కావున ప్రకృతి బ్రహ్మాధీనమై జగజ్జన్మాదులకు కారణమగును; కాని స్వతంత్రముగ కాదని సూత్రాభిప్రాయము. (౪)

## వదతీతి చే న్న ప్రాజ్ఞో హి ప్రకరణాత్ ౧-౪-౫

వదతీతిచేత్=ప్రకృతి జ్ఞేయమని శబ్దప్రమాణము చెప్పుచున్న దందు రేని, న=అట్లు లేదు. హి=కారణమేమన, ప్రకరణాత్=ప్రకరణమువలన, ప్రాజ్ఞః=పరమేశ్వరుడే, అట జ్ఞేయమని గ్రహింపవలయును.

'అశబ్ద మస్పర్శ మరూప మవ్యయం
తథారసం నిత్య మగంధవచ్చ యత్
అనా ద్యనంతం మహతః పరం ధ్రువం
నిచాయ్య తం మృత్యుముఖాత్ ప్రముచ్యతే' కఠ. ౧-౩-౧౫.

అను నీ వాక్యమునందు మహత్తుకంటె పరమగు ప్రకృతిని దెలిసి కొని మృత్యుముఖమునుండి విడివడునని చెప్పబడినది. ఈ వాక్యమునందు ప్రకృతి జ్ఞేయమని చెప్పబడినందున ప్రకృతియే స్వతంత్రముగ జగజ్జన్మా దులకు కారణముగ నేల చెప్పరాదని శంకించి, సమాధాన మీ సూత్రమున నిట్లు చెప్పబడినది.

పై కఠోపనిషద్వాక్యమునందు మహత్తుకంటె పరమై - సూక్ష్మమై - శబ్దస్పర్శరూపరసాది గుణరహితమై ధ్రువముగా నుండునది పరబ్రహ్మమే కాని ప్రకృతి కాజాలదు. మహత్తుకంటె సూక్ష్మమైనదాని నెరిగి ముక్తు డగుచున్నా డనినందువలన నా తెలియదగినది బ్రహ్మమేకాని ప్రకృతి కాదని భావము.

ప్రకృతి తెలియబడినంత మాత్రమున ముక్తి చేకూరదు. ప్రకృతి జ్ఞానము ముక్తిసాధనము కాదు. పరబ్రహ్మజ్ఞానమే మోక్షదాయకము. కావున నీ వాక్యమునందలి మహత్పదమున కర్థము ప్రకృతి యని చెప్ప కొని యంతకంటెను పరము - సూక్ష్మమైన ధ్రువపదార్థమగు బ్రహ్మము నెరిగినవాడే ముక్తు డగు నని ప్రకరణమునుబట్టి గ్రహింపదగును. కావున ప్రకృతి స్వతంత్రమై జగజ్జన్మాదులకు కారణ మనుటకంటె బ్రహ్మతం త్రమై కారణ మగునసుటయే యుక్తము. (౫)

ఈ విషయమును బలపఱచుట కింకొక హేతువు :

త్రయాణా మేవ చైవ ముపన్యాసః ప్రశ్నశ్చ ౧-౪-౬

ఏవం=ఇట్లు, త్రయాణామేవ = అగ్ని, జీవుడు, బ్రహ్మము నను మూడే, ఉపన్యాసః = ప్రశ్నోత్తరరూపమున వర్ణింపబడినవి. ప్రశ్నః = ప్రశ్నకూడ మూటిని గూర్చియే చేయబడినది.

కఠోపనిషత్తునందు వర్ణింపబడిన విషయము సంతతిని పరిశీలించి చూచిన, నచికేతుడు యముని ప్రశ్నించిన విషయములు మూడే యనియు, అవియు నగ్ని జీవ పరబ్రహ్మములే యనియు స్పష్టముగ బోధపడును.

(౧) 'సత్వ మగ్నిం స్వర్గ్య మధ్యేషి మృత్యోః
ప్రబ్రూహి తం శ్రద్దధానాయ మహ్యమ్'

(౨) యే యం ప్రేతే విచికిత్సా అస్తీ త్యేకే
నాయ మస్తీతి చైకే ఏతద్విద్యా మనుశిష్టస్త్వ యాహమ్'

(౩) 'అన్యత్ర ధర్మా దన్య త్రాధర్మాత్
అన్య త్రాస్మాత్ కృతాకృతాత్
అన్యత్ర భూతాచ్చ భవ్యాచ్చ
యత్త త్పశ్యసి త ద్వద'

అను నీ కఠవాక్యములందు మొదట నగ్ని విద్యను గూర్చియు, రెండవవాక్యమున జీవాత్మం గూర్చియు, మూడవవాక్యమున పరమాత్మం గూర్చియు ప్రశ్నింపబడుట స్పష్టమగుచున్నది.

ధర్మాధర్మములకు, కృతాకృతములకు, భూతభవిష్యత్తులకు నంటని నిత్య శుద్ధ బుద్ధ ముక్త స్వభావ మగు బ్రహ్మమునుగురించి నాచికేతుడు మూడవసారి యముని ప్రశ్నించియున్నాడు. యముడు నా ప్రశ్నలకే సమాధానము చెప్పియున్నాడు. అందువలన నీ ప్రకరణమందు మోక్షఫలము నొసంగదగు పదార్థము పరబ్రహ్మమనియే స్పష్టమగుచున్నది. అయ్యదియే పరమార్థమున జ్ఞేయము. కావున ప్రకృతి జ్ఞేయ మని యుపనిషత్తు చెప్పు ననుట యుక్తము కాదు. కాగా బ్రహ్మాధీనమైన ప్రకృతియే జగత్కారణ మగును. కాని, స్వతంత్రప్రకృతి కాదని సిద్ధమగుచున్నది. (౬)

మహర్షి యిందులకు నిదర్శనము చూపుచున్నారు.

## మహద్వచ్చ                    ౧-౪-౭

మహద్వచ్చ=మహత్తత్వము వలెను.

మహత్తత్వము ప్రకృతి వికారములలో మొదటిది. ఈ సూత్రము నందలి మహత్పదముచే మహత్తత్వవికారమగు మనస్సు గ్రహింపదగును. సూత్రగత 'చ' కారమువలన జ్ఞానేంద్రియములు, కర్మేంద్రియములు గ్రహింపవలెను.

శరీరమునందుగల మనస్సు, ఇంద్రియములు నన్నియు జీవునకు లోబడి తమతమ కార్యములందు ప్రవర్తిల్లును. స్వతంత్రములై యవి వర్తింపనేరవు. అట్లే మూలప్రకృతియు పరబ్రహ్మ పరమాత్మకు లోబడి జగజ్జన్మాదులకు కారణమగునే కాని, స్వతంత్రముగ కాదు. కాబట్టి జగజ్జన్మాదులకు మూలప్రకృతి స్వతంత్ర కారణము కాదని సూత్రాభిప్రాయము. (౭)

ఉపర్యుక్త విషయమును దృఢపరుచుటకుగాను మరియొక వాక్యమును విచారించుచు పూర్వపక్షము చేయుచున్నాడు.

చమసవ దవిశేషాత్ ౧-౪-౮

చమసవత్ = సోమపాత్రమువలె, అవిశేషాత్ = విశేషించి చెప్పనందున, మూలప్రకృతియే జగజ్జన్మాదులకు స్వతంత్రకారణ మగును.

శ్వేతాశ్వతరోపనిషత్తునం దిట్లు వర్ణింపబడినది:

'అజా మేకాం లోహితశుక్లకృష్ణాం
బహ్వీః ప్రజాః సృజమానాం సరూపాః
అజో హ్యేకో జుషమాణో ఽనుశేతే
జహాత్యేనాం భుక్తభోగా మజో ఽన్యః' ౪-౫.

ఇందు సత్త్వరజస్తమో గుణాత్మకమగు మూలప్రకృతి (ప్రజాః సృజమానాం) మహత్తత్త్వాది పదార్థములను ప్రాదుర్భవింపజేయుచున్నట్లు, అనగా మూలప్రకృతి స్వయముగా మహత్తత్త్వాది రూపకార్య పదార్థములుగా మారుచున్నట్లు వర్ణింపబడినది. విశేషించి బ్రహ్మాధీనమై మహత్తత్త్వాదులను సృజించుచున్నట్లు చెప్పబడలేదు.

'అర్వాగ్ బిల శ్చమస ఊర్ధ్వ బుధ్న
స్తస్మిన్ యశో నిహితం విశ్వరూపమ్' బృ. ౨-౨-౩.

అను నీ స్థలమున విశేషించి కొంచొక పాత్ర ముద్దేశింపబడనందున చమస శబ్దముచే సోమపాత్రము సామాన్యముగ గ్రహింపబడునట్లు మూలప్రకృతియే మహత్తత్త్వాది పదార్థముల నుత్పన్నముచేయుచు జగజ్జన్మాదులకు కారణ మగుచున్నది. కాబట్టి 'జన్మా ద్యస్య యతః' సూత్రమున బ్రహ్మము జగజ్జన్మాదికారణమని చెప్పిన లక్షణము సరికాదని పూర్వపక్షము. (౮)

ఇందులకు సమాధానము మహర్షి సూత్రించుచున్నాడు:

జ్యోతిరుపక్రమాతు తథా హ్యధీయత ఏకే ౧-౪-౯

జ్యోతిరుపక్రమాతు=సత్త్వగుణమాదిగాగల ప్రకృతి యనెడి బ్రహ్మశక్తి జగత్తునకు కారణము, హి=కారణము చేతను, ఏకే=కొందరు, తథా=అట్లే, అధీయతే=చదువుచుందురు.

శ్వేతాశ్వతరోపనిషత్తునందు, 'అజా మేకాం....౪-౫' అను నీ వాక్యమునకు ముందు -

'ద్వా సుపర్ణా సయుజా సఖాయా
సమానం వృక్షం పరిషస్వజాతే
తయో రన్యః పిప్పలం స్వాద్వత్తి
అనశ్నన్ అన్యో అభిచాకశీతి' ౪-౬.

'సమానే వృక్షే పురుషో నిమగ్నో
అనీశయా శోచతి ముహ్యమానః
జుష్టం యదా పశ్య త్యన్య మీశం
అస్య మహిమాన మితి వీతశోకః' ౪-౭.

అను నీ రెండు వాక్యములు పఠింపబడియున్నవి. ఇందు - (అనీశయా) ప్రకృతిచేత మోహింపజేయబడి జీవుడు (శోచతి) దుఃఖితుడగుచున్నాడు. యమ నియమాది సాధనములద్వారమున మోహమును వీడి, మహిమావంతుడగు ఈశుని జూచి - తెలిసికొని - (వీతశోకః) దుఃఖరహితుడై ముక్తిని బొందుచున్నాడు - బ్రహ్మానందము నందుచున్నాడు - అని యున్నది.

ఈ రెండువాక్యములను బాగుగ పరిశీలించినయెడల ప్రకృతి అనీశము-పరతంత్రము అనియు, నన్యునిచే నియమింపబడుచున్నదనియు, జీవుడా ప్రకృతినియంత యగు ఈశుని - పరమేశ్వరుని - గని మోక్షము నందు

చున్నదనియు స్పష్టమగుచున్నది. అందువలననే మూలప్రకృతి మాయ - పరాశక్తి - యనియు, నయ్యది పరమేశ్వరునిదే యనియు ననేక పర్యాయ ములు శ్వేతాశ్వరమునందే వర్ణింపబడినది.

'మాయాం తు ప్రకృతిం విద్యాత్
మాయినం తు మహేశ్వరమ్' ४-౧౦.
'పరా ఽస్యశక్తి ర్వివిధైవ శ్రూయతే
స్వాభావికీ జ్ఞానబలక్రియా చ' ౬-౮.

పూర్వపక్షమున నిర్దేశింపబడిన 'అజా మేకాం లోహితశుక్ల కృష్ణాం' అను వాక్యముచే మూలప్రకృతి స్వతంత్రముగా మహత్తత్త్వాది రూపమున పరిణతినొందుచున్నదని చెప్పబడినను, అయ్యది పరమేశ్వరుని శక్తి - అతని మాయ - అనీశము - అస్వతంత్రము నని తరువాతి వాక్యము లందు వర్ణింపబడుటచేత జగజ్జన్మాదులకు మూలప్రకృతి స్వతంత్రకార ణము కాదనియు, పరమేశ్వరుని ప్రేరణచే నది జగజ్జన్మాదులకు కారణ మగుచున్నదనియు సిద్ధమగుచున్నది. కాపున పరబ్రహ్మ పరమాత్మయే జగజ్జన్మాదులకు స్వతంత్రకారణము - కర్త - అని నిశ్చితమగుచున్నది. కాగా 'జన్మాద్యస్య యతః' అను సూత్ర ప్రతిపాదితలక్షణమును సరియే యగుచున్నదని సూత్రాభిప్రాయము. (౯)

అవ్యక్తమగు మూలప్రకృతి యెరుపు, తెలుపు, నలుపు రంగులు కల యజతో పోల్చి యెట్లు చెప్పబడిన దన:

## కల్పనోపదేశా చ్చ మధ్వాదివ దవిరోధః ౧-४-౧౦

మధ్వాదివత్=మధ్వాదులవలె, కల్పనోపదేశాచ్చ=సాదృశ్యకల్పన ద్వారమున నుపదేశించుటవలనను, అవిరోధః=మూలప్రకృతిని వ్యక్తరూప ములగు లోహితాదులుగల యజతో బోల్చిచెప్పుట విరుద్ధము కాదు.

'అసౌ వా ఆదిత్యో దేవమధు' ఛాం. ౩-౧-౧.
'వాచం ధేను ముపాసీత' బృ. ౫-౮-౧.

'ఈ యాదిత్యుడు దేవమధువు.' 'వాగ్ధేనువు నుపాసింతువుగాక!' అను నీ వాక్యములందు సూర్యుడు మధువుకాకున్నను మధువువలె మోదము నొసంగువాడు కావున మధువుతో పోల్చి చెప్పబడినాడు. వాక్కు ధేనువు కాకపోయినను ధేనువువలె నానావిధభోగ్యపదార్థములను జేకూర్చి యుపకరించునది కావున ధేనువుతో పోల్చి యుపదేశింపబడినది.

అట్లే జగత్తున కుపాదానకారణమైన మూలప్రకృతి కారణరూపమున నవ్యక్తమైనను శుక్లకృష్ణాదిరూపములు గల యజ (మేక)తో పోల్చి వర్ణింపబడినది. వ్యక్తవస్తువుతో పోల్చినంతమాత్రమున నవ్యక్తమగు ప్రకృతి తన యవ్యక్తరూపమును విడువజాలదు. 'ఆ బాలుడు నిప్పువంటివాడు' 'అతడు సింహకిశోరుడు,' అనినంతమాత్రమున బాలుని యందుగల బాల్యమతనిని విడువదుగదా! కాబట్టి ప్రకృతియందలి యవ్యక్తత్వము తాత్త్వికమే యగును, కాని కల్పితము కాదు. కావుననే ప్రకృతియొక్క వ్యక్తరూపము నజతో పోల్చి చెప్పినందున గలుగు దోషమొందును లేదని భావము. (౧౦)

అయినను 'అజా మేకామ్' అను నీ వాక్యమునందు గల యేకత్వసంఖ్య ప్రకృతి యొక్కటియే జగత్తునకు కారణ మని తెలుపుచున్నందున ప్రకృతియే స్వతంత్రకారణ మగును. బ్రహ్మము స్వతంత్రకారణము కాదందురేని - సమాధానము :

న సంఖ్యోపసంగ్రహా దపి నానాభావా
దతిరేకాచ్చ ౧-౪-౧౧

('ఆనుమానికమ్' అను పద మీ సూత్రమున ననువర్తించును.)

సంఖ్యోపసంగ్రహాదపి = ఏకత్వసంఖ్య గ్రహింపబడినప్పటికిని, నానా

భావాత్ = అనేక కారణములు ప్రతిపాదింపబడినందున, అతిరేకాచ్ఛ = అధికముగ జెప్పబడినందునను, న=అనుమానిక మగు ప్రకృతి జగత్తునకు స్వతంత్రకారణము కాదు.

ప్రకృతి యొక్కటియే జగత్తునకు కారణ మని చెప్పబడినచో నదియే స్వతంత్రకారణ మనదగును కాని, అట్లు చెప్పక జగత్తున కనేక కారణము లున్నట్లు ముందు చెప్పబడినది. కావున నది స్వతంత్రకారణము కాదు.

'మాయాం తు ప్రకృతిం విద్యాత్
మాయినం తు మహేశ్వరమ్' శ్వే. ౪-౧౦.

మోహింపజేయునది కావున ప్రకృతి మాయ యనబడును. ప్రకృతి జగద్రూపమున పరిణమించి పురుషులను మోహింపజేయును. అట్టి మాయ గలవాడు మాయి - మాయకు స్వామి. పరమేశ్వరుడు అంతట మహేశ్వర పదముచే పేర్కొనబడియున్నాడు. అత డీ జగత్తునకు నిమిత్త కారణము.

(ప్రక్రియతే నిర్మీయతే మహదాదికం సర్వం జగ దనయా ఇతి ప్రకృతిః) మహదహంకారాది సర్వజగత్తు ప్రకృతిమూలమున నిర్మింపబడును. కావున, ప్రకృతి యుపాదానకారణ మని దాని వ్యుత్పత్త్యర్థము వలననే తెలియుచున్నది. మహేశ్వరుడు మాయకు స్వామి యని వాక్యము చెప్పుచున్నందున మాయ స్వతంత్రము కాదని స్పష్టమగుచునే యున్నది.

మరియు వాజసనేయులు బృహదారణ్యకమున 'కార్యజగత్తుతో గూడిన ప్రకృతికి పరమాత్మ యధిష్ఠాన మగుటచే నతడు ప్రకృతికంటె నతిరేకుడు - అధికుడు' - అని చెప్పి ప్రకృతి జగత్తునకు స్వతంత్రకారణము కాదని నుడువుచున్నారు.

'యస్మిన్ పంచ పంచజనా ఆకాశశ్చ ప్రతిష్ఠితః
తమేవ మన్య ఆత్మానం విద్వాన్ బ్రహ్మామృతో ఉమృతమ్'
బృ. ౪-౪-౧౭.

'ఎవనియందు పంచ పంచ జనులు, ఆకాశము ప్రతిష్ఠితమై యున్నదో ఆ యాత్మను బ్రహ్మముగా నెరుగుచు మృత్యువును తరించును.' ఇం దాకాశ పదము ప్రకృత్యర్థమున వాడబడినది. కావున బ్రహ్మ మాకాశమునకు - ప్రకృతికి - నాధారముగ వర్ణింపబడుట సుస్పష్టము. ప్రాణాదులు పంచజను లని రాబోవు సూత్రమున నివరింపబడును. ప్రకృతి పరబ్రహ్మము ఆధార ముగ గలదై జగత్తునకు కారణ మగుచున్నందున పరబ్రహ్మము కూడ జగత్తునకు కారణమగుచున్నది. నిమిత్తకారణము ఆధారకారణ మనియు, నధిష్ఠానకారణ మనియు ననబడును. అందువలననే ప్రకృతి కాధారమైన బ్రహ్మము దానికంటెను నధికమగుచున్నది. కాగా, ప్రకృతి జగత్తునకు పరతంత్రకారణమే యగును. కాని, స్వతంత్రకారణము కాదు. అందు వలన 'జన్మా ద్యస్య యతః' సూత్రమున వర్ణించిన బ్రహ్మలక్షణముకూడ నిర్దుష్టమే యగును. (౧౧)

పూర్వసూత్రవ్యాఖ్యానమున నిర్దేశింపబడిన పంచ పంచజను లెవ రన :

## ప్రాణాదయో వాక్యశేషాత్ ౧-౪-౧౨

వాక్యశేషాత్ = వాక్యశేషమువలన, ప్రాణాదయః = ప్రాణాదు లైదును, పంచజను లని సూత్రార్థము.

పంచజన శబ్దము మనుష్యవాచకమైనను వాక్యశేషబలమున నిట ప్రాణాదివాచక మనియే యంగీకరింపవలెను. 'గంగలో గొల్లపల్లె' (గంగాయాం ఘోషః) అనుతావున గంగాపదము ప్రవాహార్థమున నిరూఢ మైనను గొల్లపల్లె (ఘోష) పద సామీప్య బలమున తీరమనునర్థమును

లక్షణావృత్తితో బోధించునట్లు పంచజన శబ్దముకూడ. వాక్యశేషసాన్ని ధ్యమువలన పంచప్రాణాదులను దెలుపునని భావము.

'ప్రాణస్య ప్రాణ ముత చక్షుష శ్చక్షు రుత శ్రోత్రస్య శ్రోత్ర మన్న స్యాన్నం మనసో మనో యే విదు స్తే నిచిక్యుర్ బ్రహ్మ పురాణ మగ్ర్యమ్' బృ. ౪-౪-౧౮ అని వాక్యశేషము.

'ప్రాణమునకు ప్రాణము, నేత్రమునకు నేత్రము, శ్రోత్రమునకు శ్రోత్రము, అన్నమునకు నన్నము, మనస్సునకు మనస్సు నెవరెరుగుదురో వారు పురాణము, నగ్రిమము నగు బ్రహ్మము నెరుగుదురు.' అని వాక్య శేషాభిప్రాయము. ఇందు షష్ఠీవిభక్త్యంతములయిన ప్రాణాదులు పంచజన శబ్దముచే జెప్పబడినవని యభిప్రాయము. ద్వితీయాంతములైన ప్రాణాది పదములు పరమేశ్వరవాచకములనియు గ్రహింపనగును.

'ప్రాణాయ నమో యస్య సర్వమిదం వశే' యను మంత్రవర్ణము నందలి ప్రాణశబ్దము పరమేశ్వరవాచక మగుట ప్రసిద్ధమే.

ప్రాణశబ్దముచే త్వగింద్రియము, అన్నశబ్దముచే నాసికారసనలు, చక్షుః శ్రోత్రములుకలసి యైదింద్రియములును పై వాక్యమున వర్ణింపబడి నవి. కాబట్టి పంచజనశబ్దముచే నీ పంచేంద్రియములు వాక్యశేషబలమున గ్రహింపనగునని సూత్రాభిప్రాయము. (౧౨)

మాధ్యందినుల పాఠము ననుసరించి పంచజన శబ్దము ప్రాణాదు లను బోధించినను, కాణ్వులపాఠమున 'అన్నస్య అన్నమ్' అను శబ్దము లేనందున ప్రాణాదుల నెట్లు గ్రహింపనగును ? అన :

జ్యోతి షైకేషా మస త్యన్నే ౧-౪-౧౩

ఏకేషామ్ = కాణ్వులపాఠమున; అన్నే అసతి = అన్న శబ్దము పఠింపబడనందున, జ్యోతిషా = జ్యోతిపదముతో, పంచసంఖ్య పూరింప వలెనని సూత్రార్థము.

మాధ్యందినులవలె కాణ్వులువాక్యశేషమునందు 'అన్నస్య అన్నమ్' అను పదమును పఠింపరు. అందువలన వారిదృష్టి ననుసరించి ప్రాణాదులైదన వలనుపడదు. కాని, కాణ్వుల పాఠము ననుసరించినపుడు 'యస్మిన్ పంచజనాః' బృ. ౪-౪-౧౭. అను వాక్యమునకు బూర్వమున -

'తద్దేవా జ్యోతిషాం జ్యోతిరాయుర్ హోపాసతే అమృతమ్' బృ. ౪-౪-౧౬. అను వాక్యముండుట జూడ్డనగును. అందలి (జ్యోతిషాం = ఇంద్రియములకు) జ్యోతిపదము ఇంద్రియవాచకము కాబట్టి, మాధ్యందినుల పాఠమున నన్నశబ్దముచే నే యింద్రియములు గ్రహింపబడినవో, ఆ యింద్రియము లీజ్యోతి పదముచే గ్రహింపనగును. ఇట్లు కాణ్వుల పాఠమునందును పంచజనశబ్దముచే పంచప్రాణాదులు - పంచేంద్రియములుగ్రహింపనగును. దోష మావంతయు నుండదు. (౧౩)

ఉపర్యుక్త విషయమును బలపరచుటకే మరియొక వాక్యమును విచారించుచున్నాడు.

## కారణత్వేన చాకాశాదిషు యథా
## వ్యపదిష్టోక్తేః ౧-౪-౧౪

ఆకాశాదిషు = మహత్తత్త్వాది నామరూపాత్మక సమస్తకార్యపదార్థములందు, కారణత్వేన = ఉపాదాన కారణరూపమున, యథా వ్యపదిష్టోక్తేః = పూర్వమెట్లు ప్రకృతి చెప్పబడినదో యట్లే చెప్పబడినందున, నయ్యది జగత్తునకు స్వతంత్రకారణము కాదు.

బృహదారణ్యకోపనిషత్తునందు, 'తద్ధేదం తర్హి అవ్యాకృత మాసీత్ తన్నామరూపాభ్యాం వ్యాక్రియత' ౧-౪-౭.

ఈ జగత్తు, తర్హి = సృష్టికిపూర్వమున, అవ్యాకృతం = మూలప్రకృతిరూపమున వికారమును బొందక, హ = ఉండెనుగదా। తత్ =

ఆ యవ్యాకృతముగానున్న ప్రకృతి, నామరూపాభ్యాం=నామరూపములతో, వ్యాక్రియత = పరిణమించినది, అని వర్ణింపబడినది.

ఇట ప్రకృతి స్వయముగ జగద్రూపమున బరిణమించినదా ? లేక బ్రహ్మపరతంత్రమై జగత్తునకు కారణమైనదా ? అని సంశయముకలుగును. స్వతంత్రకారణమని పూర్వపక్షము. కాదు, బ్రహ్మతంత్రమై కారణమని సిద్ధాంతము.

పూ.ప: 'వ్యాక్రియత = పరిణమించినది' అను నీ ప్రయోగమును బట్టి ప్రకృతి స్వతంత్రకారణమని తెలియుచున్నది. ప్రకృతి స్వయము గనే మహత్తత్త్వాదిరూపమున బరిణమించినదని బోధపడుచున్నది. అన్యునిచే పరిణమింప జేయబడలే దని ప్రయోగమునుబట్టి తెలియుచున్నదని భావము. (తండులాః పచ్యన్తే) 'బియ్య ముడుకుచున్నవి.' అను నీకర్మ కర్తరి ప్రయోగమున 'బియ్యము స్వయముగనే పక్వమగుచున్నవి' మరి యొకడు వానిని పక్వము చేయుటలేదు. అనునట్లు ప్రకృతి స్వయముగనే పరిణమించుచున్నదనుటచే జగత్తునకు ప్రకృతి స్వతంత్రకారణ మనియే తెలియనగు ననగా - సమాధానము :

ప్రధానము (ప్రకృతి) జగత్తునకు స్వతంత్రకారణ మగునెడల నిరధ్యక్షమగు ప్రధానము జగత్తునకు కారణమని చెప్పవలసియుండెను. అట్లు చెప్పకపోగా పైపెచ్చు సాధ్యక్షప్రకృతి జగత్కారణముగ వర్ణింప బడినందున నయ్యది స్వతంత్రకారణము కాజాలదు. బ్రహ్మమే స్వతంత్ర కారణమగును. ప్రధానము సాధ్యక్షమనుటకు ప్రమాణ మేమన, 'తద్ధేదం తర్హి' అను నీవాక్యమునకు తరువాత శేషవాక్యమున 'స ఏష ఇహ ప్రవిష్టః' 'అతడిందు ప్రవిష్టుడైయుండెను' అని వర్ణింపబడినది. కావున బ్రహ్మాధిష్ఠితమైన ప్రధానమే జగత్కారణమని యెంచవలెను. స్వతంత్రకారణము కాదని భావము.

'వ్యాక్రియత' అను ప్రయోగము కర్మణిప్రయోగమే కాని కర్మ కర్తరి ప్రయోగముకాదు. అర్థమునుబట్టి పరబ్రహ్మము నట కర్తగా నధ్యాహారము చేయవలెను. (గమ్యతే గ్రామః) 'గ్రామము గమింపబడుచున్నది' అను తావున దేవదత్తుడో లేక యజ్ఞదత్తుడో కర్తగా నూహింపబడునట్లు పై వాక్యమునందు బ్రహ్మమును కర్తగా నూహింపవలెను. కర్మ కర్తరి ప్రయోగము నంగీకరించినను పాకకర్త - పాచకు డున్నపుడే తండు లములు పక్వమగునుకాని, యతడు లేక స్వయముగ పక్వము కావుగదా ? తండులము లతిసులభముగ పక్వ మగుచున్నవనుట కట్టి ప్రయోగము చేయబడునేకాని పాచకుడు లేకయే పక్వమగునని చెప్పుటకుకాదు. కావున ప్రస్తుతమున బ్రహ్మాధిష్ఠితమైన ప్రధానమే జగత్కర్త యగును కాని, స్వతంత్రముగ కాజాలదని సూత్రాభిప్రాయము. అందువలన 'జన్మాద్యస్య యతః' అను సూత్రమున వర్ణింపబడిన బ్రహ్మలక్షణము నిర్దుష్టమనియే యెంచవలెను. (౧౪)

'అసద్ వా ఇదమగ్ర ఆసీ త్తతో వై స దజాయత' తై. ౨-౭. 'సృష్టికి పూర్వము, ఇది యసత్తుగా నుండెను. తదుపరి సత్తుగా నుద్భ వించెను' అని యొక యెడ వర్ణింపబడినది. మరియొక యెడ

'అస దేవేద మగ్ర ఆసీత్ తత్స దాసీత్ త త్సమభవత్' ఛాం. ౩-౧౯-౧. 'ఇది ముందు అసత్తైయుండెను. తదుపరి సత్తయ్యెను' అని చెప్పబడినది. అందువలన సృష్టివర్ణన మొకేవిధముగ లేదు. కాగా బ్రహ్మమే సృష్టికి కారణమని యెట్లు చెప్పనగును ? కాబట్టి 'జన్మా ద్యస్య యతః' అను సూత్ర వర్ణిత బ్రహ్మలక్షణ మయుక్తమన - సమాధానము :

## సమాకర్షాత్ ౧-౪-౧౫

**తైత్తిరీయమునందును, ఛాందోగ్యమునందును 'అసత్' శబ్దము చేత నంతకుపూర్వవాక్యములందు నిర్దిష్టమైన బ్రహ్మసమాకరణమువలన,**

బ్రహ్మమే గ్రహింపబడినందున, సృష్టి బ్రహ్మకర్తృకమనియే చెప్పబడి నట్లు గ్రహింపవలయునని సూత్రార్థము.

'అసద్ వా ఇదమగ్ర ఆసీత్' తై. ౨-౭. అను నీ వాక్యమున గల 'అసత్' పదముచే నాత్మరహితమైన దేదేని సృష్టికి కారణముగా వర్ణింపబడియున్న పక్షమున 'జన్మాద్యస్య యతః' అను సూత్రవర్ణిత బ్రహ్మలక్షణ మయుక్తము కావచ్చును. అట్టి దేమియు నిట వర్ణింపబడ దయ్యె. పైపెచ్చు బ్రహ్మమే యిట కారణముగ వర్ణింపక తప్పదు. కారణమేమన:

'బ్రహ్మవి దాప్నోతి పరమ్' తై. ౨-౧. 'బ్రహ్మవిదుడు పరమును బొందును' అని ప్రారంభించి యందు బ్రహ్మ నిర్దేశింపబడినది. ఆ బ్రహ్మమే, 'విజ్ఞానమయా దన్యో ఽన్తర ఆత్మా ఽఽనందమయః' తై. ౨-౫. 'ఆనందమయమగు నాత్మ జీవాత్మున కంతరాత్మగా చెప్పబడి నది. అటుపైన నాయంతరాత్మయగు పరబ్రహ్మమే

'అసద్వా ఇద మగ్ర ఆసీత్ తతో స దజాయత' తై. ౨-౭. అను నీ వాక్యమున 'అసత్' పదముచే చెప్పబడినది. అందువలన నీయసత్ పదముచే పూర్వవాక్యములందు జెప్పబడిన బ్రహ్మమే యాకర్షింపబడును- గ్రహింపబడును. ఈ సద్రూపమగు జగత్తు తన్మూలకమే - బ్రహ్మమూల కమే - బ్రహ్మకారణముగా గలదియే — యగుచున్నది. కాగా 'జన్మా ద్యస్య యతః' సూత్రవర్ణిత బ్రహ్మలక్షణమున నెట్టిదోషమును లేదని సూత్ర తాత్పర్యము. (౧౫)

## ద్వితీయాధికరణము

బ్రహ్మము జగత్కారణమని చెప్పు మరియొకవాక్యమిట నాలోచింప మహర్షి సూత్రము నారంభించుచున్నాడు.

జగద్వాచిత్వాత్	౧-౪-౧౬

కౌషీతకీ బ్రాహ్మణమున బాలాకి, అజాతశత్రువు ననువారి సంవాదమునందు ప్రయోగింపబడిన కర్మపదము జగత్తును బోధించుచున్నందు వలన బ్రహ్మమే జగత్తునకు కర్తయని సూత్రాభిప్రాయము.

'యోవై బాలాకే। ఏతేషాం పురుషాణాం కర్తా
యస్య వై తత్ కర్మ సవై వేదితవ్యః' కౌ. ४-౧౯.

'ఓ బాలాకీ। ఎవడీ పురుషులకు కర్తయో, ఈకర్మ యెవనిదో వాడే తెలియదగినవాడు' ఈ వాక్యమున తెలియదగినవాడుగా జెప్పబడిన కర్త యెవడు? జీవుడా? బ్రహ్మమా? లేక ప్రాణమా? యని సంశయము. జీవుడుకాని, ప్రాణముకాని యగునని పూర్వపక్షము. కాదు, బ్రహ్మమేయని సిద్ధాంతము.

కర్మమన వ్యాపారము. అయ్యది ప్రాణము నాశ్రయించి యేర్పడును. ప్రాణమున్నంతవరకే శరీరమున వ్యాపారము చూడనగును. కావున ప్రాణమే పైవాక్యమున దెలియదగినదిగ వర్ణింపబడినది. లేక కర్మశబ్దము పుణ్యాపాపములందును ప్రసిద్ధమైయున్నది. పుణ్యాపాపరూపకర్మముల నొనర్చు వాడిట జీవుడనియు నుడువవచ్చును, కావున పైవాక్యమున తెలియదగినవాడుగ వర్ణింపబడినవాడు జీవు డనుటయును యుక్తమేయని ప్రాప్తింపగా - సమాధానము :

ఉపర్యుక్త సంవాదవాక్యమును సందర్భోచితముగా పరిశీలించినపుడందు తెలియదగినవాడని వర్ణింపబడిన పదార్థము బ్రహ్మమనియే నిశ్చితమగును. అందలి కర్మపదము జగత్తును తెలుపును. కాగా బ్రహ్మమే యిట తెలియదగినదని సిద్ధాంతము.

బాలాకి యొకనాడు గర్వితుడై తత్కాలమున రాజుగానున్న యజాతశత్రుం జేరి 'బ్రహ్మ తే బ్రవాణి' కౌ. ४-౧. 'నీకు బ్రహ్మమును జెప్ప

దుసు' అని నుడివెను. అంతట నారాజు సంతసించి 'నీవు బ్రహ్మముం జెప్పుదువేని నీకు సహస్రము నిచ్చెద'ననెను. బాలాకి 'ఈ యాదిత్యాదు లందు గల పురుషుడే బ్రహ్మమ'ని చెప్పెను. అది విని యజాతశత్రుడు 'ఆదిత్యునందు గల పురుషుడు పరిచ్ఛిన్నుడు, కావున నతడు బ్రహ్మము కాజాలడు' అని, బాలాకి చెప్పినదానిని నిరసించి, 'నీవు నాకు బ్రహ్మ మును దెలుపుదునని యబద్ధము లాడితివి. నీవు బ్రహ్మవాదివి కావు' అనుచు నతని కి ట్లుపదేశించియున్నాడు.

'యోవై బాలాకే ! ఏతేషాం పురుషాణాం కర్తా
యస్య వై తత్కర్మ సవై వేదితవ్యః'

'ఓ బాలాకీ ! ఎవడీ యాదిత్యాది పురుషులకు కర్తయో, ఎవనికర్మ మీ జగత్తో, యతడే తెలియదగినవాడు.'

ఈ సంవాదారంభమున 'బ్రహ్మముం జెప్పుదు'నని బ్రహ్మ ముపక్ర మింపబడినది - ప్రారంభింపబడినది. కాబట్టి యజాతశత్రునిచే నంతమున జెప్పబడిన వాక్యమునందలి పురుషపదవాచ్యకర్తయు బ్రహ్మమేయగుట యుచితము. మరియు నిట 'ఈ కర్మ యెవనిదో యతడు తెలియదగిన వాడు' అనుటలో కర్మ జగద్వాచకమనుట స్పష్టము. ప్రకరణమునుబట్టి (క్రియత ఇతి కర్మ - నిర్మింపబడినది) కర్మపదము నిర్మింపబడు జగ త్తునే బోధించును. ప్రసిద్ధములైన పుణ్యాపుణ్యకర్మలుకాని, ప్రాణవ్యాపార మని కాని గ్రహించుట ప్రకరణ విరుద్ధ మగును. జగత్తు బ్రహ్మ కర్మ మగుటచే నిట కర్మపదము వ్యుత్పత్త్యర్థమును పురస్కరించుకొని జగ ద్వాచక మనక తప్పదు. కాబట్టి జీవుడుకాని, ప్రాణముకాని, జగత్కర్తలు కాజాలరు. అందువలననే పై వాక్యమునందు చెప్పబడిన పురుషుడు బ్రహ్మమేకాని, జీవ, ప్రాణములు కావని సిద్ధాంతము. (౧౬)

ఉపర్యుక్త విషయముననే శంకించి మరల సమాధానము చెప్పు చున్నాడు.

# జీవ ముఖ్యప్రాణ లింగా న్నేతి చేత్ తద్ వ్యాఖ్యాతమ్ ౧-౪-౧౭

జీవ ముఖ్యప్రాణ లింగాత్=జీవాత్మలింగము, ముఖ్యప్రాణలింగము నుండుటవలన. నేతి చేత్ = పరమాత్మ గ్రహింపదగ దండురేని, తద్ వ్యాఖ్యాతమ్ = జీవప్రాణలింగములు రెండును పూర్వము వ్యాఖ్యానము చేయబడినట్లు ఇక్కడను నెంచవలెను.

'తద్యథా శ్రేష్ఠీ స్వైర్భుంక్తే యథా వా
స్వాః శ్రేష్ఠినం భుంజం త్యేవ మే వైష
ప్రజ్ఞాత్మా ఏతై రాత్మభిః భుంక్తే
ఏవమే వైత ఆత్మాన ఏత మాత్మానం భుంజంతి' కౌ. ౪-౨౦

'యజమానుడు తన భృత్యులద్వారమున విషయముల ననుభవించును. భృత్యులు యజమానునిచే నీయబడు నన్నవస్త్రాదుల ద్వారమున యజమానుని ననుభవింతురు. అట్లే ప్రజ్ఞాత్మ (జీవుడు) యాదిత్యాది పురుషులచే నొసంగబడు ప్రకాశాదుల ద్వారమున విషయముల ననుభవించుచున్నాడు. ఆదిత్యాదులును జీవులచే నొసంగబడు హవ్యాదుల మూలమున యజమానుని (జీవునే) అనుభవించుచున్నారు.' అను నీ వాక్యము నందు జీవాత్మలింగము (చిహ్నము) కనిపించుచున్నది. ఇట్లే—

'యదా సుప్తః స్వప్నం న కంచనపశ్య త్యథాఽ
స్మిన్ ప్రాణ ఏ వైకధా భవతి' కౌ. ౪-౧౯.

'సుషుప్తియందు ప్రాణమునందే యేకీభవించు' నను నీ వాక్యము నందును ప్రాణలింగము స్పష్టముగా కనబడుచున్నది. కాబట్టి యీ ప్రకరణమున వేదితవ్యుడు (తెలియదగినవాడు) గ చెప్పబడిన పురుషుడు జీవాత్మయో? లేక ముఖ్యప్రాణమో యగును. బ్రహ్మము కాజాలదని శంకాభిప్రాయము.

సమాధానము : 'జీవముఖ్య.........తద్యోగాత్' (౧-౧-౩౧.) అను సూత్రమునందు జీవ ముఖ్యప్రాణములను వివరించినట్లు ప్రస్తుతమున వివరించిన సరియగును. కాబట్టి తెలియదగినవాడు పరబ్రహ్మమేకాని జీవ ముఖ్యప్రాణములు కావని సూత్రాభిప్రాయము. (౧౭)

పూర్వోక్త విషయమునందే మతాంతర ప్రదర్శనము :

అన్యార్థం తు జైమినిః ప్రశ్నవ్యాఖ్యానాభ్యా
మపి చైవ మేకే ౧-౪-౧౮

(సూత్రమునందలి 'తు' పదము మరియొక మతమును తెలుపుటకుగాను ప్రయోగింపబడినది.)

జైమినిః=జైమిని, అన్యార్థం=అన్యమగు బ్రహ్మ ప్రతిపత్తికొఱకే జీవలింగమని యంగీకరించుచున్నాడు. ప్రశ్నవ్యాఖ్యానాభ్యామ్ = ప్రశ్నోత్తరములవలనను, అపి చ=మరియు, ఏకే=కొందఱు (వాజసనేయులు) ఏవమ్=ఇట్లే, ప్రతిపాదించుచున్నారు.

కౌషీతకీ బ్రాహ్మణమునందు గల పూర్వోక్తప్రకరణగత ప్రశ్నోత్తరములను జూచినపుడు మధ్యలో జీవాత్మను కీర్తించుటకు కారణము బ్రహ్మజ్ఞానమే యని తెలియనగునని సూత్రాభిప్రాయము.

'తౌహ సుప్తం పురుష మాజగ్మతుః' కౌ. ౪-౧౯.

బాలాకి, అజాతశత్రువు యిరువురును నిద్రించుచున్న పురుషుని సమీపించిరి.' అట్లు సమీపించి ప్రాణనామములతో సంబోధించి యతనిని మేల్కొల్ప యత్నించిరి. కాని యతడు మేల్కొనడు. అంతట వారు

'తత ఉ హైనం యష్ట్యా ఽఽవిచిక్షేప, స తత ఏవ సముత్తస్థౌ'
కౌ. ౪-౧౯.

'అతనిని కఱ్ఱతో పొడిచి లేపగా లేచి కూర్చుండెను.' ఇట్లు కఱ్ఱ

పోటుకు లేచిన భోక్త - జీవుడు - ప్రాణముకంటె భిన్నుడని చెప్పి, యజాతశత్రుడు బాలాకి నిట్లు ప్రశ్నించెను.

'క్వైష ఏతద్ బాలాకే। పురుషో ఽశయిష్ట?
క్వ వా ఏత దభూత్? కుత ఏత దగాత్?' కౌ. ౪-౧౯.

'ఓ బాలాకీ। ఈ పురుషు డెక్కడ నిద్రించెను? ఎక్కడనుండెను? ఎక్కడికి పోయెను?' అను నీ ప్రశ్నములకు బ్రాహ్మణ మిట్లు సమాధానము చెప్పియున్నది.

'యదా సుప్తః స్వప్నం న కంచన పశ్య
త్యథా ఽస్మిన్ ప్రాణ ఏవైకధా భవతి,
తథైనం వాక్ సర్వై ర్నామభిః సహాప్యేతి,
చక్షుః సర్వైః రూపైః సహాప్యేతి,
శ్రోత్రం సర్వైః శబ్దైః సహాప్యేతి
మనః సర్వై ర్ధ్యానైః సహాప్యేతి
సయదా ప్రబుధ్యతే యథా ఽగ్నేః ప్రజ్వలతః
సర్వాదిశో విస్ఫులింగా విప్రతిష్ఠేరన్,
ఏవమే వైత దస్మా దాత్మనః యథాయతనం విప్రతిష్ఠంతే
ప్రాణేభ్యో దేవాః దేవేభ్యో లోకాః' కౌ. ౪-౧౯.

'జీవుడు సుషుప్తియందు ప్రాణము (బ్రహ్మము) న జేరును. అప్పుడు చక్షః శ్రోత్రాదీంద్రియములు తమతమ విషయములతోబాటు వానితో నేకీభవించును. పురుషుడు మరల మేల్కొనినపుడు మరల నా యా యింద్రియములు ప్రజ్వలించు నగ్నినుండి వెలువడు విస్ఫులింగము (నిప్పుకణము) ల వలె వేరై తమకార్యముల నారంభించును.' అని సమాధానము చెప్పబడినది.

ఈ ప్రశ్నోత్తరములనుబట్టి జీవుడు సుషుప్తియందు అవిభక్తరూప

మున నెట నుండునో జాగ్రదవస్థయందు విస్ఫులింగములవలె నెవనినుండి వేరగునో యతడే కర్తయనియు, తెలియదగినవాడనియు స్పష్టమగు చున్నది. సుషుప్తియందు జీవాత్మ పరమాత్మలో నవిభక్తరూపమున నుండునని యుపనిషత్తులు స్పష్టముగా చెప్పుచున్నవి.

'స పరే ఽక్షర ఆత్మని సంప్రతిష్ఠతే' ప్ర. ४-౯.

'అతడు పరమాత్మయం దుండును.'

'సతా సోమ్య । తదా సంపన్నో భవతి' ఛాం. ౬-౮-౧.

'అప్పుడు సద్రూపమగు బ్రహ్మను బొందును.'

కాబట్టి పైనచూపిన ప్రశ్నోత్తరములనుబట్టి బ్రహ్మజ్ఞానము కలిగించుటకే జీవాదుల గ్రహణ మా ప్రకరణమున జేయబడినదని భావము.

వాజసనేయులుకూడ బృహదారణ్యకమునందలి బాలాక్యజాతశత్రు సంవాదగత ప్రశ్న ప్రతివచనముల ద్వారమున నీ యంశమే స్పష్టపరచి యున్నారు. (బృ. ౨-౧-౧౬.)

కాబట్టి యీ ప్రకరణమునందు వేదితవ్యుడుగ వర్ణింపబడినవాడు పరమేశ్వరుడేకాని జీవుడుకాదని స్పష్టముగ తెలియుచున్నది. (౧౮)

## తృతీయాధికరణము

మరియొక వాక్యవిచారణ :

వాక్య సమన్వయాత్ ౧-४-౧౯

ఐతరేయోపనిషత్తునందు జగత్స్రష్టగా వర్ణింపబడిన యాత్మయు బ్రహ్మమే యని పూర్వాపరవాక్య సమన్వయమువలన తెలియ నగునని యీ సూత్రాభిప్రాయము.

'ఆత్మా వా ఇదమేక ఏవాగ్ర ఆసీత్, నాన్యత్ కించన మిషత్,
స ఈక్షత, లోకాన్ను సృజా ఇతి, స ఇమాన్ లోకా నసృజత'

'సృష్టికి పూర్వము ఆత్మయు, జగత్తును నేకముగా నుండెను. నిమేషాది క్రియాయుక్తమగున 'దన్యమేమియు లేదు. లోకములను సృజింతునని ఆత్మ (ఈక్షిత) పర్యాలోచించెను. ఆ యాత్మ లోకములను సృజించెను.' అను నీ ఐతరేయ వాక్యమునందు లోకస్రష్టగా వర్ణింపబడిన యాత్మ జీవాత్మయా ? లేక బ్రహ్మమా ? యని సంశయము. ఆత్మశబ్దము జీవబ్రహ్మముల కుపయోగింపబడును. కావున సంశయము కలుగుట యుక్తమే. జీవాత్మయే యాత్మపదవాచ్యమని పూర్వపక్షము. కాదు, పరబ్రహ్మమే యని సమాధానము.

'స ఏతమేవ సీమానం విదా
ర్యైతయా ద్వారా ప్రాపద్యత' ఐ. ౧-౩-౧౨

'లోకస్రష్టగా పై వాక్యమునజెప్పిన ఆత్మయే మూర్ధాంతర్గత రంధ్రముద్వారమున శరీరమున బ్రవేశించెను' అను నీవాక్యమునుబట్టి శరీరాంతః ప్రవేశము జీవునకే తగును. కావున నీప్రకరణమునందలి యాత్మశబ్దము జీవాత్మపరమేయని పూర్వపక్షము.

సిద్ధాంతము : ఐతరేయమునందలి ప్రథమవాక్యమున 'జగత్తంతయు నిమేషాది క్రియావంతములగు పదార్థములు లేనిదై యాత్మతో నేకమై - ననువిభక్తమై - యుండెను. ఆ యాత్మ లోకములను సృజించెను' అని యున్నందున నిట యాత్మశబ్దము పరమాత్మవాచకమే కావలయును. జీవాత్మకు లోకములను సృజించుసామర్థ్యములేదు. చిదచిదాత్మకమగు నీజగత్తును సృష్టించు సామర్థ్యము పరబ్రహ్మపరమాత్మకేయున్నది. ఈ ప్రకరణము నందలి యనంతరవాక్యములను బరిశీలించినను నిందలి యాత్మశబ్దము బ్రహ్మపరమే యగునని స్పష్టమగును.

'కతరః స ఆత్మా ? 'యేన వా రూపం పశ్యతి
యేన వా శబ్దం శృణోతి ? ఐ. ౩-౧.

'ఏపవిద్వారమున రూపమును జూచుచున్నాడు ? శబ్దమును వినుచున్నాడు ? రెండింటిలో నాయాత్మ యెయ్యది ?' అను వాక్యార్థములను పరిశీలించి వాని నన్వయింపవలసివచ్చినపుడు ఆత్మశబ్దము పరమాత్మపరము గవే చెప్పవలయును. జీవాత్మపరముగ జెప్పిన నది యుపపన్నము కాదు. లోకములను సృష్టించుటకును, జీవాత్మకు దర్శనశ్రవణాది శక్తులను సంపన్న మొనర్చుటకును పరబ్రహ్మపరమాత్మయే సమర్థమగును. కావున వాక్యసమన్వయమువలన లోకస్రష్టగా వర్ణింపబడిన వాక్యాంతర్గతమగు నాత్మశబ్దము బ్రహ్మబోధకమే యగునని సిద్ధాంతము.

మూర్ధాంతర్గత ఛిద్రము ద్వారమున నాత్మ ప్రవేశించిన దనుటచే జీవాత్మయేగ్రహింపనగు నను పూర్వపక్షము సరికాదు. శరీరాంతః ప్రవేశమిట గౌణముగ బ్రహ్మకే చెప్పబడినది. ఇందలి ప్రవేశము సంకల్పపూర్వక ప్రవేశమును దెలుపును. జీవుడు సంకల్పపూర్వకముగ నే శరీరమునందును బ్రవేశింపడు. కర్మబద్ధుడై, కర్మఫలము ననుభవించుటకుగాను, పరమాత్మచే నియతమగు శరీరమునందు పరమాత్మ పరతంత్రుడై ప్రవేశించును. కాబట్టి పైవాక్యమునందలి ప్రవేశము జీవాత్మకు సంబంధించినదికాదు. పరమాత్మ సర్వవ్యాపకమగుటచే శరీరమునందు నుండును. అందువలన శరీరమున ప్రవేశించినదో యన్నట్లు ప్రవేశించెనని గౌణముగ ప్రవేశ మిట వర్ణింపబడినది. కాబట్టి లోకస్రష్టయైన యాత్మ పరబ్రహ్మమేకాని జీవాత్మకాదని నిశ్చిత సిద్ధాంతము. (౧౯)

ఉపర్యుక్త విషయమున మతాంతరములను బ్రదర్శింపదలచి మహర్షి ముందుగా నాశ్మరథ్యుని మతమును సూత్రించుచున్నాడు.

### ప్రతిజ్ఞాసిద్ధే ర్లింగ మాశ్మరథ్యః ౧-౪-౨౦

ప్రతిజ్ఞాసిద్ధేః = ఏకాత్మయనెడి ప్రతిజ్ఞ సిద్ధించుటకు, లింగమ్ = (తనతో నవిభక్తముగ నుండు జీవాత్మతోగలిసి శరీరమునందు ప్రవే

శించుట) లింగము - జ్ఞాపకము - అని ఆశ్మరథ్యః = ఆశ్మరథ్యుని మతము.

ఐతరేయోపనిషత్తునందు ప్రారంభమున

'ఆత్మా వా ఇదమేక ఏవాగ్ర ఆసీత్'

'ముందు చిదచిదాత్మకమగు నాత్మయొక్కటియే యుండెను' అను ప్రతిజ్ఞ చూడనగును. ఆ ప్రతిజ్ఞ సిద్ధము కావలయుననిన, తరువాత ప్రకరణమున జెప్పబడిన శరీరప్రవేశమునందుకూడ జీవాత్మతో గూడిన పరమాత్మయే శరీరమునందు ప్రవేశించినట్లు వర్ణింపవలసియున్నది. అప్పుడయ్యది ప్రతిజ్ఞాసిద్ధికి జ్ఞాపకము - లింగము - కాగలదు. అట్లు వర్ణింపక, బ్రహ్మమును విడిచి జీవాత్మలువేరుగ శరీరమున బ్రవేశించినవని వర్ణించినచో ప్రథమ ప్రతిజ్ఞలోని యేకాత్మత సిద్ధింపదు. కాబట్టి జీవాత్మతో గూడిన పరబ్రహ్మమే శరీరమున బ్రవేశించినట్లు వర్ణింపబడినది. అందువలన జగత్ స్రష్టయగు నాత్మ బ్రహ్మమేయని యాశ్మరథ్యాచార్యుని మతము. (౨౦)

## ఉత్క్రమిష్యత ఏవంభావా దౌడులోమిః ౧-౪-౨౧

ఉత్క్రమిష్యతః = శరీరమును విడిచి మోక్షపదమునందు జీవుడు, ఏవంభావాత్ = పరబ్రహ్మమునం దవిభక్తముగా నుండును. కావున, జీవునితోగూడిన బ్రహ్మ శరీరమున బ్రవేశించినట్లు వర్ణింపబడిన దని, ఔడులోమిః = ఔడులోమి మతము.

ప్రళయమున జీవులెట్లు పరమాత్మయం దవిభక్తరూపముననుండునో యట్లే మోక్షావస్థయందును జీవుడు పరమాత్మలో నవిభక్తుడై యుండును.

'యథా నద్యః స్యందమానాః సముద్రే
అస్తం గచ్ఛంతి నామరూపే విహాయ,
తథా విద్వాన్ నామరూపా ద్విముక్తః
పరాత్పరం పురుష ముపైతి దివ్యమ్' ముం. ౩-౨-౮

'నదులు ప్రవహించి సముద్రముంజేరి స్వనామరూపములను వీడి యందుండునట్లు బ్రహ్మవిదుడు స్వనామమువిడిచి బ్రహ్మమును బొందును' అని ఉపనిషద్వాక్యమున జెప్పబడినది. కాబట్టి మోక్షమున జీవుడు పరమాత్మయం దవిభక్తుడై యుండుననుటను లక్ష్యమున నుంచుకొనియే మైత్రేయమునందు బ్రహ్మ శరీరాంతఃప్రవేశము వర్ణింపబడిన దని యౌడులోమి యంగీకరించుచున్నాడు. (౨౧)

## అవస్థితే రితి కాశకృత్స్నః ౧-౪-౨౨

అవస్థితేః = బ్రహ్మము శరీరమునం దుండుటవలన, శరీరమున బ్రవేశించు జీవాత్మతోగూడ బ్రహ్మము శరీరమున బ్రవేశించునట్లు వర్ణింపబడినదని, కాశకృత్స్నః=కాశకృత్స్ను దభిప్రాయపడుచున్నాడు.

చిదచిదాత్మకమగు నీ జగత్తంతయు పరబ్రహ్మకు శరీరమువంటి దని వర్ణింపబడుచున్నది. మంత్రవర్ణములం దట్టి వర్ణనము చూడనగును.

'యస్య భూమిః ప్రమా అంతరిక్ష ముతోదరమ్
దివం యశ్చక్రే మూర్ధానం తస్మై జ్యేష్ఠాయ బ్రహ్మణే నమః'
అథ. ౧౦-౪-౭-౩౨.

'ఎవనికి భూమి, అంతరిక్షము, దివము పాదోదరశిరస్సులో, నా జ్యేష్ఠబ్రహ్మకు నమస్కారము'.

'యస్య సర్వాణి భూతాని శరీరమ్' బృ. ౩-౭-౧౫.
'యస్య విజ్ఞానం శరీరమ్' బృ. ౩-౭-౨౨.

ఇట్లు శ్రుతిస్మృతులలో జీవప్రకృతులు రెండును బ్రహ్మమునకు శరీరసములుగ వర్ణించుటజూడనగును. వాస్తవమున శరీరము, జీవుడు రెండును వేరైనను, అగ్నిలోహపిండములవలె నవిభాజ్యములై యుండును శరీరాంతర్భాగముననుండు జీవుడు గృహమునబ్రవేశించునపుడు శరీరముతో

బాటు ప్రవేశించుచున్నట్లు, జీవరూపశరీర సహితముగు బ్రహ్మము ప్రాకృతిక శరీరమున బ్రవేశించునపుడు జీవునితో కూడి ప్రవేశించుచున్నట్లుపదేశించుట యుక్తమే యని కాశకృత్స్నుని మతము. కాబట్టి జగత్స్రష్టగా వర్ణింపబడిన యాత్మ పరబ్రహ్మనే బోధించును. కాగా 'జన్మాద్యస్య యతః' సూత్రగత బ్రహ్మలక్షణ వర్ణనము నిర్దుష్టమే యని సూత్రాభిప్రాయము.

శ్రీ శంకరాచార్యులు పై సూత్రములను వ్యాఖ్యానించుచు, బృహదారణ్యకములోని

> 'ఆత్మా వా అరే ద్రష్టవ్యః శ్రోతవ్యో
> మంతవ్యో నిదిధ్యాసితవ్యః'  బృ. ౪-౫-౬.

'ఆత్మ ద్రష్టవ్యము, శ్రోతవ్యము, మంతవ్యము, నిదిధ్యాసితవ్యము' నను వాక్యమును ఉదాహరించియున్నారు. అయ్యది ప్రసంగోచితము కాదు. సూత్రకారు డీ పాదమునందు సృష్టికారణమును ప్రదర్శించు వాక్యములను విచారింపబూని యున్నాడు. అందువలన నట్టి వాక్యములనే యుదాహరించుట యుచితము, ప్రసంగానుగుణమును.

'ఆత్మా వా అరే ద్రష్టవ్యః....' అను నీ వాక్యమునందలి యాత్మ పదము జీవాత్మ పరమగుట సుస్పష్టము. అందువలన సంశయమునకు తావులేదు. కావున నైతరేయమునందు జగత్స్రష్టగా వర్ణింపబడిన యాత్మను గ్రహించి పూర్వోత్తరపక్షములను సాధించుట సముచితమగును. (౨౨)

## చతుర్థాధికరణము

'జగజ్జన్మాదులకు కారణము బ్రహ్మము' అను లక్షణ విషయమున సందేహము నుత్పన్నము చేయు వాక్యములను గొన్నింటిని విచారించిన

మీదట బ్రహ్మము ప్రకృతిసహాయముతో జగజ్జన్మాదులకు కారణ మగు చున్నదా ? యని విచారింప సూత్రకారు డుపక్రమించుచున్నాడు. ప్రకృతి సహాయము లేకయే కేవల బ్రహ్మము జగజ్జన్మాదుల కారణ మగునెడల పరిణామి కావలసివచ్చును. కాబట్టి ప్రకృతిసహాయముతోనే బ్రహ్మము కారణ మగుచున్నదని వర్ణించుచున్నాడు.

### ప్రకృతిశ్చ ప్రతిజ్ఞా దృష్టాంతానుపరోధాత్ ౧-౪-౨౩

ప్రతిజ్ఞాదృష్టాంతానుపరోధాత్ = ప్రతిజ్ఞ, దృష్టాంతము ననువాని వలన, ప్రకృతిశ్చ=ప్రకృతియు జగజ్జన్మాదులకు కారణముగ నంగీకరింప బడుచున్నది.

'య ఏష సుప్తేషు జాగర్తి, కామంకామం పురుషో నిర్మిమాణః,
తదేవ శుక్రం తద్ బ్రహ్మ, తదేవామృత ముచ్యతే,
తస్మిన్ లోకాః శ్రితాః సర్వే, తదునాత్యేతి కశ్చన' కఠ. ౫-౮.

'చేతనాచేతనాత్మకమగు పదార్థములన్నియు నిద్రించియున్నపు డే పురుషుడు నిద్రింపడో, యెవడు కోరికోరి జగత్తును నిర్మించునో, యెవడు నిర్మితపదార్థముల కాశ్రయమో, యతడే శుక్రుడు, బ్రహ్మము, అమృతము. అని కాఠకమున జెప్పబడినది. ఇదియే ప్రతిజ్ఞ.

బ్రహ్మముమాత్రమే జగత్తున కంతటికిని కారణమని యంగీకరించి యన్యకారణము నంగీకరింపనిపక్షమున నీ ప్రతిజ్ఞ భంగమగును. బ్రహ్మము సంకల్పపూర్వకముగ సృష్టి నొనరించు ననుటయు యుక్తము కాదు. సంకల్ప మన నభిలాష - కామము - కోరిక. కామము నిర్విషయకము కాదు. జ్ఞాన మెట్లు సవిషయకమో యట్లే కామమును సవిషయకమే. సంకల్పకర్తృత్వము, సంకల్పవిషయత్వము నను నీ రెండు ధర్మములు నొకనియందే యుండ వీలులేదు. కావున సంకల్పమునకు విషయమగు ప్రకృతి యొందు బ్రహ్మకు భిన్నముగా నున్నదనియు, నదియే యీ జగ

ప్రపంచకార్యమున కుపాదానకారణమనియు నంగీకరింపవలసియున్నది. అట్లు కాక బ్రహ్మముతక్క వేరు ప్రకృతి లేదందుమేని సంకల్పపూర్వకముగ జగద్రచనను ప్రతిజ్ఞసేయు కాఠకవాక్యము సంగతము కాదు. సంకల్పమునకు విషయముగ ప్రకృతిని వేరుగ నంగీకరించినపు డయ్యది భగవత్సంకల్పమున వివిధరూపముల నొప్పు నీ జగత్తును బ్రసవించును. జీవాత్మలు కూడ నగ్నినుండి విస్ఫులింగములు వెడలునట్లు బ్రహ్మమునుండి విభక్తములై స్వస్వకర్మానుగుణముగ బ్రాకృతికపదార్థముల ననుభవించు ననుటయు నుపపన్న మగును. బ్రహ్మము భోగ్యములగు ప్రాకృతికపదార్థములకు, భోక్తలయిన జీవులకు నధిష్ఠానమై, శుక్రమై, యమృతమై యధిష్ఠేయముల కనతిక్రమమై యొప్పును. అందువలన కాఠకమున పఠింపబడిన నీ క్రింది దృష్టాంతమును సూపపన్న మగును.

> 'అగ్నిర్ యథైకో భువనం ప్రవిష్టో
> రూపం రూపం ప్రతిరూపో బభూవ
> ఏక స్తథా సర్వ భూతాంతరాత్మా
> రూపం రూపం ప్రతిరూపో బహిశ్చ' క. ౫-౯.

'అగ్ని యొక్కటి భువనమున ప్రవిష్టమై యా యా పదార్థముల యాకృతిని బొందునట్లు బ్రహ్మ మొక్కటియే సర్వభూతముల కంతరాత్మయై వానిరూపముల నందుటయేకాక వానికి వెలుపలకూడ నుండును.' ఇయ్యది దృష్టాంతము. ఇందు అగ్ని దృష్టాంతము. బ్రహ్మము దార్ష్టాంతికము. జీవనహేతువగు నగ్ని సమస్తపదార్థములంజేరి వాని యాకృతులను బొందునట్లు బ్రహ్మము జగజ్జన్మాదులకు కారణమగుటవలన నంతర్యామిరూపమున ప్రతిపదార్థమునందును ప్రవేశించి వాని యాకారములను బొందును. అంతేకాక పదార్థములకు వెలుపలను నుండును.

బ్రహ్మముతక్క వేరొండు ప్రకృతి యనునది లేదందుమేని పై కాఠకవాక్యమున జూపబడిన దృష్టాంతముకూడ నసంగత మగును.

ఉపర్యుక్త దృష్టాంతమునందు బ్రహ్మము ప్రపంచమునకు బాహ్యమునను ఉన్నట్లు వర్ణింపబడినందున నయ్యది నిమిత్తకారణ మగునేకాని యుపాదానము కాదు. ఉపాదానకారణము కార్యమునకు వెలుపల నుండదు. కార్యముపాదానకారణముననే యుండును. కాబట్టి యీ దృశ్యమాన జగత్తున కుపాదానకారణము ప్రకృతి యొకటి బ్రహ్మ భిన్నముగ నున్న ట్లంగీకరింపక తప్పదని సూత్రాభిప్రాయము.

నిమిత్తకారణమునకు మించి ప్రకృతి నంగీకరింపమేని జగత్తునకు స్థితి యుంటనేరదు. బ్రహ్మమే జగదుపాదానకారణ మందుమేని బ్రహ్మము పరిణామి కావలసివచ్చును. బ్రహ్మము కూటస్థనిత్యమే కాని పరిణామి నిత్యము కాదు. మరియు కారణకార్యములలో వైరూప్యము నంగీకరింప వలసివచ్చును. బ్రహ్మము నిర్మలము; చేతనము. జగత్తు మలినము; జడమును. కార్యకారణములలో నిట్టి వైరూప్య ముండుట తగదు. సారూప్యమే యుంటవలెను. కాగా బ్రహ్మము జగత్తున కుపాదానకారణ మన జనదు. అందువలననే జగత్తున కుపాదానకారణముగ ప్రకృతి నంగీకరింపక తప్పదని భావము. అంగీకరించిననాడే యుపనిషద్వాక్యములందు జెప్పబడిన ప్రతిజ్ఞాదృష్టాంతములు రెండును సార్థకము లగును. (౨౩)

ఇట్లు ప్రతిజ్ఞాదృష్టాంతముల ననుసరించి బ్రహ్మము జగన్నిర్మాణమునకు కారణమైనట్లు ప్రకృతి జగత్తున కుపాదానమని చెప్పి యీ విషయమునే స్థిరపరుచుటకై మరియొక హేతువును జూపుచున్నాడు.

## అభి ధ్యోపదేశా చ్చ ౧-౪-౨౪

చ=మరియును, అభిధ్యోపదేశాత్=సంకల్పోపదేశమువలన ప్రకృతి యుపాదానకారణ మని యంగీకరింపవలెను.

**అభిధ్య = సంకల్పము, తైత్తిరీయమునందును, ఛాందోగ్యమునందును నభిధ్య యుపదేశింపబడినది,**

'సో౽కామయత బహుస్యాం ప్రజాయేయ' తై. ౨-౬.

'తదైక్షత బహుస్యాం ప్రజాయేయ' ఛాం. ౬-౨-౩.

ఈ రెండువాక్యములందును 'అకామయత' 'ఐక్షత' అను నీ రెండు పదములును నొకవిధమగు నిచ్ఛను - అభిధ్యను - తెలుపును. ఈ యభిధ్య యభిధ్యాత (కర్త)ను, అభిధ్యాతవ్యము (కర్మ)ను నపేక్షించును. కర్తృత్వమును, కర్మత్వమును దెలుపునని భావము. ఈ రెండు ధర్మములు నొకే వస్తువునం దుండవు. కావున నభిధ్యాత (కర్త) బ్రహ్మమనియు, ప్రకృతి యభిధ్యాతవ్యమనియు దెలియనగును. లోకమున పురుషుడు తనకు స్త్రీ యున్నపుడే సంతానరూపమున దా ననేక మగుటకు సంకల్పించును. అట్లే బ్రహ్మముకూడ ప్రకృతి యనునది యొకటి యున్నపుడే ప్రజారూపమున బహుభవన సంకల్ప ముచితమగును. అందువలన బ్రహ్మముతోబాటు ప్రకృతియు నీ జగత్తునకు కారణమగునని యంగీకరింపవలెను. (౨౪)

మరియొక హేతువు :

## సాక్షాచ్చోభయామ్నానాత్ ౧-౪-౨౫

మరియును బ్రహ్మము, ప్రకృతియు నను నీరెండును ప్రత్యక్షముగ నుపనిషద్వాక్యమునందు జెప్పబడినందున రెండును కారణము లనియే యంగీకరింపవలెనని సూత్రాభిప్రాయము.

'మాయాం తు ప్రకృతిం విద్యా
న్మాయినం తు మహేశ్వరమ్' శ్వేతా. ౪-౧౦.

ఇందు మాయ యన ప్రకృతియనియు, మాయి యన మహేశ్వరుడు - పరమాత్మ - పరబ్రహ్మమనియు వర్ణింపబడినది. ప్రకృతి జగత్తున కుపాదాన కారణము. పరమాత్మ నిమిత్త కారణము. (౨౫)

బ్రహ్మము నిమిత్తకారణమని మహర్షి యీక్రింది సూత్రమున జెప్పుచున్నాడు.

## ఆత్మకృతేః పరిణామాత్ ౧-౪-౨౬

ఆత్మకృతేః = బ్రహ్మముయొక్క సంకల్పరూపక్రియవలన, పరిణామాత్ = ప్రకృతి జగద్రూపమున పరిణమించుచున్నందున, బ్రహ్మము నిమిత్తకారణము.

తైత్తిరీయమునందొకచో

'సో౽కామయత బహుస్యాం ప్రజాయేయేతి, స తపో౽తప్యత, స తప స్తప్త్వా ఇదం సర్వ మసృజత' తై. ౨-౬.

అతడు బహుభవనమునకై సంకల్పించి, తపించెను. తపించి యీ సర్వము సృజించెను' అనియున్నది. సంకల్ప గర్భితప్రకృతి పర్యాలోచనమే యిట తప స్సనబడును. అట్టి జ్ఞానపూర్వకమగుసృష్టికి కర్తగా బ్రహ్మము చెప్పబడినందున నయ్యది నిమిత్తకారణమే యగునని సూత్రాభిప్రాయము.

అందువలననే మంత్రవర్ణములందును

'సూర్యా చంద్రమసౌ ధాతా యథాపూర్వ మ క ల్ప య త్'

ఋ. ౧౦-౧౯౦-౩.

'పూర్వమువలెనే బ్రహ్మము సూర్యచంద్రులను రచియించెను' అని చెప్పబడినది. అందువలన సూర్యచంద్రుల రచనకు నిమిత్తకారణము బ్రహ్మమేయని స్పష్టమగుచున్నది. (౨౬)

ఇంకొక హేతువు :

## యోనిశ్చ హి గీయతే ౧-౪-౨౭

చ=మరియు, హి = ఎందువలన, బ్రహ్మము, యోనిః = యోనిగా,

గీయతే = చెప్పబడుచున్నదో. అందువలనను నిమిత్తకారణముగ నెరుగ వలెనని సూత్రార్థము.

'యద్భూతయోనిం పరిపశ్యంతి ధీరాః'  ముం. ౧-౧-౬.

'కర్తార మీశం పురుషం బ్రహ్మయోనిమ్'  ముం. ౩-౧-౩.

ఈ వేదాంతవాక్యములందు బ్రహ్మము యోనిగా వర్ణింపబడినది. ప్రళయసమయమున జీవులు, ప్రకృతియు నన్నియు బ్రహ్మమునందే యిమిడియుండి సర్గవేళలందు మరల ప్రకటమగుచుండును. అందువలన జడ చేతనాత్మకమగు నీజగత్తున కధిష్ఠానము బ్రహ్మమగుచున్నది. అందువలన నయ్యది యోనియని కీర్తింపబడినది. యోనియన స్థానవిశేషమనిభావము. ఏ స్థానవిశేషమునుండి శిశువు బయటపడునో యాస్థానవిశేషమునే లోకమున యోని యందురు. జడ చేతనాత్మక మగు జగత్తున కాధారముగ నుండు బ్రహ్మము దానికధిష్ఠానమై, యోనిపదముచే జెప్పబడుచు నిమిత్త కారణమగుచున్నది లోకమునను నిమిత్తకారణములలో నొకటి యధిష్ఠాన మగుటయు ప్రసిద్ధమే. కాబట్టి బ్రహ్మము జగత్తున కుపాదానకారణము కాదు. ఉపాదానకారణమగు పక్షమున నది పరిణామి కావలసియుండును. బ్రహ్మము పరిణామికాదు. అందువలన నుపాదానకారణము ప్రకృతియే యని సూత్రాభిప్రాయము. (౨౭)

## ఏతేన సర్వే వ్యాఖ్యాతా వ్యాఖ్యాతాః ౧-౪-౨౮

ఏతేన = ఈ చతుర్థపాదమున జేయబడిన వ్యాఖ్యానముద్వారమున, సర్వే = మిగిలిన వేదాంతవాక్యములన్నియు, వ్యాఖ్యాతాః = వ్యాఖ్యానము చేయబడినట్లే యెంచవలెను.

ఈ సూత్రమునందలి రెండవ వ్యాఖ్యాతపదము పాదసమాప్తిని బోధించును. ఈ ప్రథమాధ్యాయమునందలి మొదటి మూడు పాదముల

లోను బ్రహ్మము తెలియదగినదని చెప్పువాక్యములు వివరింపబడినవి. నాలుగవ పాదమున జగజ్జన్మాదులకు బ్రహ్మముకారణముగ జెప్పినవాక్యము లను గూర్చి యాలోచింపబడినది. ఇంకను మిగిలిన వాక్యములుకూడ నిట్లే తెలియదగు నని చెప్పి యీ ప్రథమాధ్యాయమునందలి చతుర్థపాదము సమాప్తము చేయబడినది. (౨౮)

శ్రీ మత్పరమహంస పరివ్రాజకాచార్యవర్య - ఆత్మానంద సరస్వతీ
స్వామి భగవత్పాద శిష్య, పండిత గోపదేవ విరచిత
వేదాంత దర్శన - అంబా వ్యాఖ్యానమునందు
ప్రథమాధ్యాయము సమాప్తము.

# వేదాంత దర్శనము

## ద్వితీయాధ్యాయము

### ప్రథమ పాదము

### ప్రథమాధికరణము

ప్రథమాధ్యాయమునందు బ్రహ్మము తెలియదగిన దని చెప్పి యందుల కుపయుక్తములగుశ్రుతి స్మృతు లుదాహరింపబడినవి. బ్రహ్మము జగజ్జన్మస్థితిలయములకు కారణమనియు నిరూపింపబడినది. తత్ప్రతిపాదకములగు వేదాంతవాక్యముల సమన్వయమును జేయబడినది. ఈ యధ్యాయమునందు బ్రహ్మము జగత్కారణమనుట స్మృతివిరుద్ధము కాదనియు, పైగా తర్కయుక్తమనియు నిరూపించుటకు మహర్షి సూత్రమును రచియించుచున్నాడు.

**స్మృత్యనవకాశ దోషప్రసంగ ఇతి చేన్న అన్యస్మృత్యనవకాశదోషప్రసంగాత్ ౨-౧-౧**

స్మృత్యనవకాశ దోష ప్రసంగః = బ్రహ్మము జగజ్జన్మాదులకు కారణమగునెడల, ప్రకృతి జగజ్జన్మాదులకు కారణమని చెప్పుస్మృతి కవకాశము లభియింప దనెడి దోషము వాటిల్లును, ఇతిచేత్ = అని యందురేని, న = అది తగదు. కారణ మేమన: అన్యస్మృత్యనవకాశ దోషప్రసంగాత్ = బ్రహ్మము జగత్కారణమని చెప్పుస్మృతుల కవకాశము లేకుండు నను దోషము కలుగగలదు.

వేదాంత వాక్యముల సమన్వయముద్వారమున బ్రహ్మము జగజ్జన్మాదులకు కారణమని నిర్ణయించినచో సాంఖ్యస్మృతి కది విరుద్ధము కాగలదు. సాంఖ్యదర్శనమున ప్రకృతి జగత్కారణమని చెప్పబడియున్నది. సాంఖ్యదర్శనము కపిలముని ప్రణీతము. ఆరు అధ్యాయములు గలది. సూత్రబద్ధము. అందు మోక్షసాధనముగా పదార్థ తత్వ జ్ఞానము నుపదేశించుచు జగజ్జన్మాదులకు ప్రకృతి కారణమని యిట్లు చెప్పబడినది.

'సత్వరజ స్తమసాం సామ్యావస్థా ప్రకృతిః,
ప్రకృతే ర్మహాన్ మహతోఽహంకారః,
అహంకారాత్ పంచతన్మాత్రా ణ్యుభయ మింద్రియం,
తన్మాత్రేభ్యః స్థూలభూతాని పురుష ఇతి పంచవింశతి ర్గణః'
సాం. ౧-౬౧.

'సత్వరజ స్తమస్సుల సామ్యావస్థ ప్రకృతి యనబడును. దానినుండి మహ త్తత్వము, అందుండి యహంకారము, దానినుండి పంచతన్మాత్రములు, జ్ఞానేంద్రియములు, కర్మేంద్రియములు జనించినవి. తన్మాత్రముల నుండి స్థూలభూతము లైదు - పృథివ్యాదులును జనించినవి. ఇవి యన్నియును పురుష (జీవు)నితోఁ గూడి యిరువదియై దగును'. అని సూత్రార్థము. దీనింబట్టి కపిలమహర్షి జగత్కారణము ప్రకృతియని స్పష్టముగా జెప్పినట్లు తెలియుచున్నది. బ్రహ్మము జగజ్జన్మాదులకు కారణ మను నిర్ణయమున కిది విరుద్ధ మగుచున్నది. సాంఖ్యస్మృతి యప్రమాణ మన జనదు. కపిలమహర్షి యాప్తుడు. ఆప్తోపదిష్టము ప్రమాణము కాదనరాదు. కాబట్టి పూర్వాధ్యాయమున బ్రహ్మము జగజ్జన్మాదులకు కారణ మని చెప్పిన సిద్ధాంతము సాంఖ్యస్మృతి నిర్ణయమునకు విరుద్ధమగు నందురేని అది యు క్తము కాదు. కారణ మేమన : మన్వాదిస్మృత్యంతరముల కవకాశము లేని దోషము వాటిల్లును.

**వేదాంతవాక్య నిర్ణయము సాంఖ్యమునకు విరుద్ధ మగునని సాంఖ్య**

స్మృతి సిద్ధాంత మంగీకరించెదమేని మనుస్మృతిసిద్ధాంతమున కవకాశము లేకపోవును. మను స్మృతి ప్రథమాధ్యాయమునందు జగజ్జన్మాదులకు బ్రహ్మమే కారణమని స్పష్టముగా జెప్పబడియున్నది.

'ఆసీ దిదం తమోభూత మప్రజ్ఞాత మలక్షణమ్
అప్రతర్క్య మవిజ్ఞేయం ప్రసుప్త మివ సర్వతః'. ౫

'తతః స్వయంభూ ర్భగవాన్ అవ్యక్తో వ్యంజయ న్నిదమ్
మహాభూతాదివృత్తౌజాః ప్రాదురాసీ త్తమోనుదః. ౬

'యోసావతీంద్రియగ్రాహ్యః సూక్ష్మో వ్యక్తః సనాతనః
సర్వభూతమయోఽచింత్యః స ఏవ స్వయ ముద్బభౌ'. ౭

'సోఽభిధ్యాయ శరీరాత్ స్వాత్ సిసృక్షు ర్వివిధాః ప్రజాః
అప ఏవ ససర్జాదౌ తాసు బీజ మవాసృజత్'. ౮

(ఇదం=ఈ జగత్తు, తమః=ప్రకృతి, అప్రజ్ఞాతం=ప్రత్యక్షమునకు విషయముకానిది, అలక్షణమ్ = అనుమేయముకానిది, అప్రతర్క్యం = తర్కించుటకు వీలుకానిది, స్వయంభూః = పరబ్రహ్మ పరమేశ్వరుడు, అవ్యక్తః=కరణగోచరముకానివాడు, వృత్తౌజాః = నిరతిశయ జ్ఞానక్రియా శక్తిగలవాడు, తమోనుదః=ప్రకృతిప్రేరకుడు, వ్యంజయన్=ప్రాదుర్భవింపజేయుటకు, ప్రాదురాసీత్=సంకల్పించెను, అపః=మహదహంకార పూర్వకములగు సూక్ష్మభూతములు - ఇవి పదములకు విశేషార్థములు.)

'ప్రళయసమయమున నీ ప్రకృతి ప్రత్యక్షానుమానజ్ఞానములకు విషయముకాక, తర్కించుటకు ననువుగాక, బ్రహ్మముకంటె వేరుగ నున్నదని చెప్పుటకువీలుగాక యుండెను. సర్గాదియందు పరబ్రహ్మ పరమేశ్వరుడు జగత్తు నుత్పన్నము చేయుటకై యా ప్రకృతియందు ప్రేరణ - క్రియ - ను గలిగించెను. ఇంద్రియములకందక, యవ్యక్తుడై, సూక్ష్ముడైన పరమేశ్వరుడు స్వశరీరభూతమగు ప్రకృతినుండి ముందుగా మహదహంకారాది

పూర్వక సూక్ష్మభూతములను సృష్టించెను.' అను నీ మనుస్మృతి ననుస రించి పరబ్రహ్మమే జగదుత్పత్త్యాదులకు కారణమని స్పష్టముగా బోధ పడుచున్నది. కాబట్టి సాంఖ్యస్మృతితో విరోధమును దొలగించుటకు యత్నింతుమేని, మనుస్మృతి సిద్ధాంతమునకు విరుద్ధమగును. మనుస్మృతి వర్ణాశ్రమధర్మవిషయములను ప్రతిపాదించును. కావున నయ్యది యట చరితార్థము కావచ్చునందురేని - సృష్టిప్రతిపాదన విషయమున నేర్పడు వైరుధ్యమును దొలగింపకున్న స్మృత్యనవకాశదోష మేర్పడు నని వ్యాసుడు సూత్రమున గ్రహించియున్నాడు. కాబట్టి స్మృతివిరోధము నెటులైనను బోనాడుట కర్తవ్య మగుచున్నది. అది యెట్లందురేని –

వాస్తవమున మనువుకాని, సాంఖ్య స్మృతికర్త కపిలమహర్షికాని, వేదవేదాంతవిదులు కావున నప్రమాణికు లన జనదు. ఇరువురును లోక కల్యాణము నభీప్సించి స్మృతులను రచియించినవారు. వారి సిద్ధాంతము లందును వైరుద్ధ్య ముండజనదు. మనువు సిద్ధాంతము వేదాంతవాక్య సమన్వయానుసారముగ నున్నపుడు కపిలుని సిద్ధాంతము మాత్ర మట్లేల యుండదు ? తప్పక వేదాంతవాక్య సమన్వయమున కనుగుణముగానే యుండును. వైరుధ్య మేల కనిపించుచున్న దందురేని, ఆ వైరుధ్యము పైచూపులకు కనిపించుచున్నదేగాని వాస్తవమున నందు విరుద్ధ మొందును లేదు.

విరోధమే లేనపుడు మహర్షి సూత్రమునందు విరోధమున్న ట్లేల శంకించి సమాధానము చెప్పియున్నా డందురేని, (ఆపాతతః) పైకి స్థూల దృష్టులకు కనిపించు విరోధాభాసమును దొలగింపకున్న శాస్త్రశైలికి భంగము వాటిల్లు నని యట్లు శంకించి సమాధానము చెప్పియున్నాడని యెరుంగవలెను.

వేదాంతవాక్యములవలెనే మనుస్మృతియందును ప్రకృతి బ్రహ్మ ప్రేరితమై - బ్రహ్మాధీనమై - మహదాదిక్రమేణ జగద్రూపమున పరిణ

మించుచున్నదని వర్ణింపబడినది. అట్లే సాంఖ్యస్మృతియందును జూడ నగును. కాబట్టి విరోధ మొండును లేదని భావము. సాంఖ్యమునం దెచ్చటను ప్రకృతి జగజ్జన్మాదులకు స్వతంత్రకారణ మని నుడివియుండలేదు. పరమపురుషునికి లోబడి మహదాద్యుత్పత్తికి ప్రకృతి కారణమైనట్లు చెప్పు సూత్రములును సాంఖ్యమున గలవు. పూర్వ ముదాహరించిన సూత్రము ప్రకృతినుండి మహదాదు లుత్పన్నములైన ట్లున్నను ప్రకృతి స్వతంత్రకారణమని యందు జెప్పబడలేదు. సాంఖ్యుల కభిమతములగు తత్త్వములను లెక్కించుట కా సూత్ర ముద్దేశింపబడినది. అందువలననే యా సూత్రమున పురుషపదముకూడ పఠింపబడినది. పురుషుడు ప్రకృతి సంభవుడు కాడుగదా! ప్రకృతి పరతంత్ర యనుటకు సాంఖ్యసూత్రమును జూడుడు:

'అకార్యత్వేపి తద్యోగః పారవశ్యాత్' సాం. ౩-౫౫.

'ప్రకృతి కార్యము కాకున్నను పరవశవర్తియై ప్రపంచము నారంభించును. పురుషుడు ప్రాతఃకాలమున నిద్రనుండి లేచువానివలె సృష్టిసమయమున ప్రపంచముతో సంబద్ధు డగును.' ఇందు ప్రకృతి పరవశవర్తి యని చెప్పబడినది. ఆ పరు డెవరన:

'స హి సర్వవిద్ సర్వకర్తా' ౩-౫౬.

'సామాన్య విశేషరూపమున నీ జగత్తు నెరిగి దానిని నిర్మించు సర్వజ్ఞుడగు పరమేశ్వరుడే యతడు.' అని సాంఖ్యమున ప్రకృతి పరమేశ్వరాధీనమై యుండి మహదాది ప్రపంచమునకు కారణ మగుచున్నట్లు స్పష్టముగా దెలియుచున్నది. కాబట్టి సాంఖ్యస్మృతియు వేదాంతవాక్య సమన్వయమునకు విరుద్ధము కాదని తెలియనగును. (౧)

సాంఖ్యస్మృతిలోగల విరోధమును తొలగించి, యోగశాస్త్ర సిద్ధాంతముకూడ వేదాంతవాక్యసమన్వయమున కవిరుద్ధమే యని చెప్పదలచి మధ్యలో గౌతమాది స్మృతిసిద్ధాంతము నవిరుద్ధమేయని వర్ణించుచున్నాడు.

## ఇతరేషాం చానుపలబ్ధేః ౨-౧-౨

ఇతరేషాం చ = గౌతమ కణాద ప్రభృతులు, అనుపలబ్ధేః = స్వతంత్ర ప్రకృతి జగజ్జన్మాదులకు కారణ మనినట్లు లభింపనందున, వారిచే రచింపబడిన శాస్త్రములకు వేదాంతవాక్య సమన్వయము విరుద్ధము కాదని సూత్రార్థము. (౨)

గౌతమ ముని ప్రణీత న్యాయదర్శనమునందును, కణాద ముని ప్రణీత వైశేషికమునందును ఈశ్వరుడే జగత్కర్తగా వర్ణింపబడి యుండుట చూడనగును. ఈ రెండు దర్శనములును వైదిక స్మృతులుగానే శిష్టులు వ్యవహరింతురు. వీనిలో ప్రకృతి పరమాణురూపమున వర్ణింపబడి యున్నది. ఆ పరమాణువుల నుపాదానకారణముగ గ్రహించి పరమేశ్వరుడు జగత్తును సృష్టించినట్లు చూతుము. కావున నీ స్మృతులకును, వేదాంతవాక్య సమన్వయమునకును వైరుధ్యములేదని స్పష్టమగుచున్నది. ఇట్లు గౌతమ కాణాద స్మృతులు అవిరుద్ధములని తెలిపి మహర్షి యోగ దర్శన సిద్ధాంతముకూడ నవిరుద్ధ మనుచున్నాడు.

## ఏతేన యోగః ప్రత్యుక్తః ౨-౧-౩

ఏతేన = సాంఖ్యాది స్మృత్యవిరోధ వర్ణనద్వారమున, యోగః= యోగశాస్త్ర విరోధముకూడ, ప్రత్యుక్తః=నిరాకరింపబడిన ట్లెంచవలయు నని సూత్రార్థము.

పతంజలి మహర్షి ప్రణీత యోగశాస్త్రమునందును, జగత్తునకు ప్రకృతి స్వతంత్రకారణముగ నెక్కడను వర్ణింపబడియున్నట్లు కానము. జీవుడు ప్రాకృతిక పదార్థములతో తనకు గల సంబంధమును త్రోసిపుచ్చి కొని కైవల్యమును సంపాదించి పరమాత్మయం దుండి యానందము ననుభవించు మార్గమునే యోగము ప్రధానముగ వర్ణించును. ఈశ్వరుని జగత్కా-

రణత్వము లెక్కడను శంకింపఁఘు. కాఇట్టి యోగస్మృతియు వేదాంతవాక్య సమన్వయమున కవిరుద్ధమనియే యెంచవలయునని సూత్రాభిప్రాయము. (౩)

ఇట్లు స్మృతి వైరుధ్యమును దొలఁగించి ప్రస్తుతమున వేదాంత వాక్యసమన్వయ నిర్ణయము తర్కమునకు సమకాలమేయని నిర్ణయించుటకు మహర్షి సూత్రము నారంభించుచున్నాఁడు.

## ద్వితీయాధికరణము

న విలక్షణత్వా దస్య తథాత్వం చ శబ్దాత్ ౨-౧-౪

అస్య=దృశ్యమాన ప్రపంచమునకు, విలక్షణత్వాత్=విరుద్ధధర్మము (లక్షణము) గల దగుటవలన, ప్రకృతి, న = జగదుపాదానకారణము కాదు, శబ్దాత్=శబ్దప్రమాణమువలన, తథాత్వంచ=పంచభూతాత్మక జగత్తు ప్రకృతి లక్షణమని తెలియుచున్నది.

ప్రథమాధ్యాయమున వేదాంత వాక్యములను సమన్వయించుచు జగత్తున కుపాదానకారణము ప్రకృతి యనియు, నిమిత్తకారణము - కర్త - పరమేశ్వరుఁడనియు జెప్పబడినది. అందు నుపాదానకారణ మయిన ప్రకృతి జగత్తున కుపాదానకారణము కాజాలదని యీ సూత్రమున తర్కించుచున్నాఁడు.

ప్రకృతి జగత్తున కుపాదానకారణము కానేరదు. కారణ మేమన : లోకమున కార్యము కారణమునకు సమానలక్షణములు గలిగియుండుట చూచుచున్నాము. ఘటరూపకార్యము మృత్తికాలక్షణములు గలిగియుండును. ఆభూషణములు ఉపాదానకారణమైన సువర్ణలక్షణములు గలిగియుండును. అట్లే జగత్తుకూడ ప్రకృత్యుపాదానకమైన ప్రకృతిలో నుండు లక్షణములే జగత్తునందును నుండవలెను. కాని,

'మృదబ్రవీత్' శత. ౬-౧-౩-౪. 'మృత్తిక పలికెను'

'ఆపో౽బ్రువన్' శత. ౬-౧-౩-౨. 'జలము మాటలాడెను'

'తత్తేజ ఐక్షత' ఛాం. ౬-౨-౩. 'అగ్ని చూచెను'

'తా ఆప ఐక్షంత' ఛాం. ౬-౨-౪. 'ఆ నీరు చూచెను'

అను నీ శబ్దప్రమాణముల ననుసరించి పృథివ్యాద్యాత్మకమగు నీ జగత్తు చేతనధర్మములతో గూడియున్నట్లు తెలియుచున్నది. ప్రకృతి యచేతనము - జడము. కార్యకారణములలో నిట్లు వైలక్షణ్య మున్నందున బ్రహ్మాశ్రితమగు ప్రకృతి జగదుపాదానకారణ మను వైదికవాక్య సిద్ధాంతము తర్కవిరుద్ధ మగుచున్నదని సూత్రాభిప్రాయము. (౪)

మహర్షి యీ పూర్వపక్షమున కిట్లు సమాధానము చెప్పుచున్నాడు.

**అభిమాని వ్యపదేశ స్తు విశేషానుగతిభ్యామ్ ౨-౧-౫**

(సూత్రమునందలి 'తు' పదము పూర్వపక్షము సరికాదని తెలుపును.)

విశేషానుగతిభ్యాం = శరీరవిశేషము, అనుప్రవేశము ననువాని వలన, అభిమాని వ్యపదేశః = 'మృదబ్రవీత్' అను నిట్టి వాక్యములలోని మృత్తిక, అగ్ని, జలము మున్నగునవి పలికెను - చూచెను - అను నిట్టి తావులలో పరమేశ్వరునే యీ క్రియలకు కర్తగా గ్రహింపవలెనని సూత్రార్థము.

'మృత్తిక పలికెను' (మృదబ్రవీత్) అను నిట్టి తావులలో మృత్తికా జలాదులు పలికెను, చూచెను, అను క్రియలకు కర్తలగు పక్షమున ప్రకృతి జగద్విలక్షణమగు ననుట సత్యమే యగును. కాని, పై వాక్యములలో పృథివ్యాదులు కర్తలు కాదు. పృథివ్యాదులలో వ్యాపకముగా నున్న చేతన పరబ్రహ్మమునే యట పలుకుట మున్నగు క్రియలకు కర్తగా గ్రహింపవలెను. 'దేవదత్తుడు పరునెత్తుచున్నాడు - ఏడ్చుచున్నాడు' అను

రాపులలో 'ఏడ్చుట, పరువెత్తుట' మున్నగు క్రియలు శారీరకము లయి నను, శరీరగత చేతనకర్తృకములుగా వ్యవహరింపబడుచున్నట్లు 'మృదబ్రవీత్' 'మృత్తిక పలికెను' అను నిట్టి రావులందును మృత్తికాదులలో గల పరమాత్మ పలికె ననుటకు బదులు మృత్తికాదులు పలికినట్లు ప్రయోగింపబడినదని గ్రహింపవలెను. పృథివ్యాదులు పరమేశ్వరునకు శరీరముగా వర్ణింపబడుట యుపనిషత్తులందును జూడనగును.

'యః పృథివ్యాం తిష్ఠన్ పృథివ్యా అన్తరో,
యం పృథివీ నవేద యస్య పృథివీ శరీరమ్' బృ. ౫-౭-౩.

'ఎవడు పృథివియందుండి, పృథివి కంతరుడో, ఎవనికి పృథివి శరీరమో అతనిని పృథివి యెరుగదు' అని పృథివ్యాదులు పరమేశ్వరునకు శరీరముగా వర్ణింపబడియున్నవి. ఇట పృథివీరూప శరీరము, పృథివిలో అనుగతి - అను ప్రవేశము - కనబడుచున్నది. అందువలన శరీరమునకు, అందుండు వ్యక్తికి తాదాత్మ్యము కల్పించి 'మృత్తికాదులు పలికెను' అని వర్ణింపబడినది. కాబట్టి వాస్తవమున మృత్తికాదులు చేతనములు కావు. పృథివ్యాది ప్రపంచము జడధర్మము గలదే. ప్రకృతియు జడమే. అందు వలన పృథివ్యాది జగత్తునకు ప్రకృతి యుపాదానకారణ మనుటలో నెట్టి దోషమును లేదని సిద్ధాంతము. (౫)

పృథివ్యాదులు జడములైన కావచ్చును. అయినను నవి ప్రకృతి వికారములన నొప్పదు. ప్రకృతి సూక్ష్మము, పృథివ్యాదులు స్థూలములు. ఇట్టి విలక్షణత యుండగా ప్రకృతివికారములు పృథివ్యాదులు కాజాలవు. కాబట్టి బ్రహ్మాశ్రితమగు ప్రకృతి జగత్కారణ మనుట యుక్తము కాదు. సమాధానము చెప్పుచున్నాడు.

## దృశ్యతే తు          ౨-౧-౬

(సూత్రమునందలి 'తు' పదము శంకానివారణార్థము.)

దృశ్యతే=సూక్ష్మకారణములవలన స్థూలకార్యము లేర్పడుట లోక మున గనబడుచున్నది. కావున దోషము లేదని సూత్రార్థము.

శాస్త్రము ననుసరించికాని, లోకము ననుసరించికాని, ప్రకృతి వికార భావము - కార్యకారణభావము - ను కల్పింపవలెనేకాని తన యిచ్చవచ్చినట్లు కాదు. దృశ్యమానప్రపంచమునకు బ్రహ్మాశ్రితప్రకృతి కారణమని శాస్త్రము చెప్పుచున్నది. 'ఏకం బీజం బహుధా యః కరోతి' శ్వే. ౬-౧౨. పరమే శ్వరుడు బీజ - కారణ - రూపమున నున్న ప్రకృతిని ననేకవిధముల నిర్మించుచున్నాడు' అని యుపనిషత్తు చెప్పుచున్నది. లోకమునందును సూక్ష్మమగు వటబీజమునుండి పెద్ద వటవృక్ష మేర్పడుటను జూచు చున్నాము. కావున స్థూలమగు పృథివ్యాదిరూపజగత్తునకును సూక్ష్మకారణ మొకటి యంగీకరింపక తప్పదు. జగత్తునగల స్థూలపదార్థము లన్నియు కార్యము లగుట నిశ్చితము. ఇయ్యది తర్కవిరుద్ధమును కాదు. తర్కము లోకమునకు విరుద్ధ మెన్నటికిని కాదు. లోకము ననుసరించియే యది ప్రవర్తించును. ప్రకృతికి, తద్వికారమైన జగత్తునకు సాలక్ష్యము - సమాన లక్షణము - కావలయు నందురేని - అది యెట్టిది? కార్యకారణములలోనుండు సాధారణాసాధారణ ధర్మములన్నియు సమానముగనుండవలెనని పూర్వపక్ష-అభిప్రాయమగునెడల కార్యకారణభావమే యుచ్ఛిన్నమగును. మట్టినుండి యేర్పడు ఘటాదులలో నుపాదానకారణమైన మట్టిలోనుండు పిండీభావ ధర్మముకూడ ఘటాదులలో నుండునా ? ఘటాదులనున్న యాకృతి మట్టి కుండునా ? అట్లెన్నడు నుండదు. కార్యకారణములు సర్వవిధముల సమా నము లెన్నడును కావు. కార్యకారణములలో నసాధారణ ధర్మసామ్య ముండుట యనివార్య మగును. ప్రకృతిలో జడత్వ మున్నది. తద్వికారములయిన పృథివ్యాదులందును జడత్వమున్నది. అందువలన వానిలో కార్యకారణభావముండుటకు హాని యొకింతయునుండదు. కార్యము కారణరూపమునుబొందుచు క్రమముగా నత్యంతసూక్ష్మరూపమును ధరిం

మును. కార్య మత్యంతసూక్ష్మతను బొందనిచో ప్రత్యక్షాభావము దానికి కలుగనేరదని భావము. వికారభావము నందిన జగత్తునందలి కార్యజాత మున కంతటికి మూలకారణమగు ప్రకృతినిమించి మరియొకటి సూక్ష్మ కారణములేదని వైదికులమతము. పృథివ్యాదిపంచమహాభూతములకు కారణము వానికంటె సూక్ష్మములగు తన్మాత్రములు. వానికి కారణ మంతకంటె సూక్ష్మమగు నహంకారము. దానికి కారణమంతకంటె సూక్ష్మమయిన మహత్తు. దానిని సాంఖ్యులు, యోగులు లింగ మందురు. దానికిని కారణ మంతకంటె సూక్ష్మమగు ప్రకృతి. ఆ ప్రకృతినే యోగులు, సాంఖ్యులు అలింగ మందురు. అంతకంటె సూక్ష్మము మరియొకటిలేదు. అట్టి ప్రకృతియే బ్రహ్మాశ్రితమై యుండి పృథివ్యాదిజగత్తునకు కారణ మగుచున్నదని వైదికులు నుడువుదురు. ప్రకృతిసూక్ష్మమై పృథివ్యాదులకంటె విలక్షణ మైనను, జడత్వాది సమానలక్షణము లున్నందున నది పృథివ్యాది స్థూల జగత్తునకు నుపాదానకారణమగుటలో దోష మావంతయు లేదని సిద్ధాంతము. (౬)

## తృతీయాధికరణము

స్థూలజగత్తునకు సూక్ష్మప్రకృతి కారణమనుట సంగతమగునెడల, అసత్ప్రకృతి స్థూలజగత్తునకు కారణమనుటలో దోషమేమి ? యని సూత్రార్థమున శంకించి మహర్షి సమాధానము చెప్పుచున్నాడు.

### అసదితిచే న్న ప్రతిషేధమాత్రత్వాత్ ౨-౧-౭

అసత్ = జగత్తునకు కారణము 'అసత్', ఇతిచేత్ = అని చెప్పెద రేని, ప్రతిషేధమాత్రత్వాత్ = అభావమాత్ర మగుటవలన, న = అట్లు చెప్పవలనుపడదు.

కార్యకారణములలో స్థూలసూక్ష్మభేదమున్నను దోషము లేకున్న పక్షమున నసత్ప్రకృతి స్థూలజగత్తునకు కారణమేలకాదు ? అసత్తుకూడ

ప్రకృతివలె సూక్ష్మమేయగునుకదా ? యన నట్లు చెప్పవలనుకాదు. అసత్త నగా నభావ మగును. అయ్యది భావాత్మకమగు స్థూలజగత్తునకు కారణ మెట్లగును ? సచ్ఛబ్దము భావమును దెలుపును. అసత్‌శబ్దము దానికి విరుద్ధ మైన యభావమును దెలుపును. పృథివ్యాది జగత్తు భావాత్మకమగుట ప్రత్యక్షసిద్ధము. అందువలన భావప్రపంచమున కసత్ - అభావము - కారణము కాజాలదు. భావాభావములు పరస్పర విరుద్ధములు. అట్టివి కార్యకారణభావమును బొందనేరవు. విరోధము కార్యకారణభావసంబంధమును కలుగనీయదు. కారణము కార్యమున నన్వయించును. మట్టి కుండలో నుండుట ప్రత్యక్షసిద్ధము. అభావము భావరూపకార్యరూపమున నన్వయింపదు. అన్వయించుకారణమే యుపాదానకారణ మనబడును. లోకమున సూక్ష్మకారణమువలన స్థూలకార్యము జనించుట చూచుచున్నాము. కాని, అసత్కారణమువలన కార్యోత్పత్తి యగుటంజూడము.

'అసత్, ప్రకృతివలె సూక్ష్మ మనుటయు దగదు. సూక్ష్మత్వమొక ధర్మము - ఉపాఖ్య. అభావమున ధర్మ మెట నుండును ? ధర్మమెప్పుడు భావపదార్థము నాశ్రయించి యుండును. కాబట్టి యసత్ప్రకృతి సజ్జగత్తునకు కారణ మగుననుట యుక్తము కాదు. సత్ప్రకృతియే బ్రహ్మాశ్రితమై స్థూలజగత్తునకు కారణ మగునన్నుటయే యుక్తమనిభావము. (౭)

అసద్వాది మరల నిట్లు శంకించుచున్నాడు :

## అపీతౌ తద్వత్ ప్రసంగా దసమంజసమ్ ౨-౧-౮

అపీతౌ = ప్రళయమునందు, తద్వత్ప్రసంగాత్ = కారణమగు ప్రకృతి కార్యజగత్తువలె స్థూలత్వాదిధర్మములు గలది యగును. అందువలన, అసమంజసమ్ = వైదికమత మయుక్తము.

ప్రళయమునందు ప్రతికార్యవస్తువును కారణమున లీన మగునని యంగీకరింతురుకదా ! కార్యరూపమున నున్న యీ జగత్తు స్థూలము,

నశుద్ధము, దుఃఖాత్మకము నగుట జగత్ప్రసిద్ధము. అయ్యది విలయమై ప్రకృతిరూపము నందినపుడు స్థూలత్వాదిధర్మములను ప్రకృతి కాపాదించును. ప్రకృతి స్థూలత్వాదిధర్మములు కలదిగా నంగీకరింపబడదు. జగత్తు ప్రళయమున ప్రకృతిరూపము నంద దనుటకును వీలులేదు. అటులయిన నీజగత్తు ప్రాకృతికము కా దనవలసివచ్చును. కాబట్టి బ్రహ్మాశ్రితమగు ప్రకృతి జగదుపాదానమను వైదికమత మసమంజసమని శంకాభిప్రాయము. (౮)

ఉపర్యుక్త శంకకు సమాధానము :

న తు దృష్టాంతభావాత్ ౨-౧-౯

('అసమంజసమ్' అను పదమిం దనువర్తించును. 'తు' పదము శంకను నిరాకరించుటకు ప్రయోగింపబడినది.)

దృష్టాంతభావాత్ = దృష్టాంతము లనేకము లున్నందున, న అసమంజసమ్ = వైదికమత మసమంజసము కాదు.

ప్రళయమున కార్యజాతమంతయు కారణమున లీనమగుట సత్యమే. కాని కార్యధర్మములన్నియు కారణమున సంక్రమింపవు. అట్లనుట నిరాధారము కాదు. మట్టి నుండి యేర్పడు ఘటశరావాదులు విలయమై మట్టిలో లీనమగును. కాని, ఘటధర్మములన్నియు మట్టిలో సంక్రమింపవు. అట్లే సువర్ణవికారములు కుండలాదులు విలయములై సువర్ణరూపమునుబొందును. కాని, కుండలధర్మములు సువర్ణమున సంక్రమింపవు. ఇట్టి యుదాహరణములు లోకమున నెన్నియో మనము నిత్య మూహింపవచ్చును. కాబట్టి పృథివ్యాది వికృతజగత్తు ప్రళయమున ప్రకృతిరూపమును బొందినను వానిధర్మము లందు సంక్రమింపవనుట నిశ్చితము. ఇట్లే మంత్రవర్ణములును ప్రళయమున జగత్తంతయు స్వధా(ప్రకృతి) రూపమున పరమాత్మ నాశ్రయించి యుండునని స్పష్టముగా జెప్పుచున్నవి.

'న మృత్యురాసీ దమృతం న తర్హి, నరాత్ర్యాఅహ్నా ఆసీత్ ప్రకేతః
ఆనీదవాతం స్వధయా తదేకం తస్మాద్ధాన్య న్న పరః కించనాస'
ఋ. ౮-౭-౧౭-౨.

'ప్రళయమున మృత్యువు కాని, జీవనము కాని, రాత్రిందివములుకాని యేవియు నుండవు. ప్రకృతితో (స్వధతో) కూడిన పరమాత్మశక్తి యన్య మేమియు నుండదు.' తనయందుకార్యజాతము నంతటిని ధరించును. కాబట్టి ప్రకృతి స్వధ యనబడును. 'ధారయ త్యాత్మని కార్యజాతమ్ ఇతి స్వధా' అనివ్యుత్పత్తి. కాబట్టి లోకదృష్టాంతములవలనను మంత్ర కథనమువలనను వైదికమతము సంగతమే కాని, యసమంజసము కాదని భావము. (౯)

పూర్వపక్షము నుపాలంభన మొనర్చుచు హేత్వంతరమును జూపు చున్నాడు.

స్వ పక్ష దోషా చ్చ ౨-౧-౧౦

(న, అసమంజసమ్ - అను పదద్వయ మిట ననువర్తించును.)

చ=మరియు, స్వపక్షదోషాత్ = అసద్వాదిపక్షమునందును 'కార్య ధర్మములు కారణమున సంక్రమించు' ననుదోషము వాటిల్లును. కాబట్టి వైదికమత మసమంజసము కాదు.

వైదికమత మసమంజసమని చెప్పుటకై కార్యదోషములు కారణ మున సంక్రమింపగలవని దోషమును జూపించి యున్నారు అసద్వాది. అట్టిదోష మతనిపక్షమునను గలుగును గదా। జగత్తునకు అసత్ప్రకృతి కారణముగా నంగీకరించుచున్నా డసద్వాది. పృథివ్యాది కార్యజగత్తు ప్రళ యమున నసద్రూపమును బొందును గదా। అప్పుడు పృథివ్యాదులలోని స్థూలత్వాదిధర్మము అసత్తునను సంక్రమించును. కాబట్టి యసద్వాదిచే నుద్భావింపబడినదోష మతనినిగూడ వదలదు. పైగా కార్యధర్మము అభావ

మగు ననత్తున నెటు నుండును? అభావము ధర్మాశ్రయము కాదుగదా! కావున్ వ్యర్థవాదము నాశ్రయించి పరమతమును దూషించుట యుక్తము కాదు. మరియు వైదికమతమున నట్టి యసమంజసదోష మొందును లేదని భావము. (౧౦)

అయినను వైదికమతముకూడ తర్కసహము కాదుగదా! అసమంజస మేల కాదన :

తర్కాప్రతిష్ఠానా దప్యన్యథానుమేయ మితిచే
దేవమ ప్యవిమోక్షప్రసంగః ౨-౧-౧౧

(అసమంజసం, న - అను పదము లిందు ననువర్తించును.)

తర్కాప్రతిష్ఠానాత్ = తర్కమునకు ప్రతిష్ఠ - నిలకడ - పర్యవసానము లేనందున, అపి=తర్కబలమువలనను, వైదికమత మసమంజస మనరాదు. అన్యథా=మరియొకవిధమున, అనుమేయ మితిచేత్=తర్కమునకు ప్రతిష్ఠ యూహింపదగు నందురేని, ఏవమపి=అట్లూహించినను, అవిమోక్షప్రసంగః=తర్కమున కప్రతిష్ఠదోషమునుండి ముక్తి లేదు.

తర్కయుక్తము కానందున వైదికమతముకూడ సమంజసము కాదనరాదు. తర్కమునకు స్వయముగ ప్రతిష్ఠయే లేదు. అందువలన తర్కమెట్లు వైదికమతమును కాదన సమర్థమగును? వ్యక్తి తన మతితో నూహించిన యుక్తి తర్కమనబడును. లోకమున పురుషమతులు బహురూపములు గల వగుటవలన వాని కొకస్థితి నిర్ణయింప వలనుపడదు. ఒక డూహించినదానిని మరియొకడు వెంటనే దోషయుక్తమని నిరూపించుట లోకమున జూచుచున్నాము. ఒక డూహించినది మరియొకని యూహకు సరికాదు. ఇట్లు తర్కమున కొక ప్రతిష్ఠ - నిలకడ - లేదు. అట్టియెడ నిలకడలేని తర్కము వైదికమతము నెట్లు కాదనగలదు? వేదము పురుషమతి

కల్పితము కాదు. అందువలన నది యప్రతిష్ఠితమన వలనుపడదు. కావు నసే వైదికమత మసమంజస మనరాదు. వేదము సర్వజ్ఞుడగు పరమేశ్వ రుని జ్ఞానప్రభవము. అట్లే కణాదమహర్షి వచించియున్నాడు.

'బుద్ధిపూర్వా వాక్కృతి ర్వేదే' వై. ౬-౧-౧.

అందువలన నది స్వతఃప్రమాణమని శిష్టు లంగీకరించియున్నారు. సూర్యనిరూపమును గ్రహించుట కన్యప్రమాణావసర ముండదు కదా।

తర్కమునకు ప్రతిష్ఠలేదని తెలుపునదియు తర్కమే కావున తర్కములన్నియు నప్రతిష్ఠితము లెట్లగును? అందురేని, లోకమున తర్కము రెండువిధములుగా ప్రవృత్తి గలదగుచున్నది. ఒకటి శాస్త్రాశ్ర యము గలదై ప్రవర్తించుచున్నది. రెండవది స్వతంత్రముగా వర్తించును. శాస్త్రము నాశ్రయించి వర్తించు తర్కమును శ్రుతిస్మృతు లంగీకరించును. అన్యము నంగీకరింపవు. అందువలన శాస్త్రాశ్రయమున బ్రవర్తించు తర్క మున కాశ్రయబలముతో ప్రతిష్ఠ యేర్పడును. అట్లంగీకరించినను తర్క మునకు స్వయంప్రతిష్ఠితత్వము లేదనియే తెలుచున్నది. ఇక స్వతంత్ర ప్రవృత్తిగల తర్కము పురుషమతి బహుత్వమువలన ప్రతిష్ఠితము కాజా లదు. లోకమున పురుషు లనేకులు ఒకరినిమించి యొక రెక్కుడు మతి గలిగి యుందురు. పురుషు లందరొకచో జేరి యొకవిషయమును తర్కించి నిర్ణయించుట సంభవము కాదు. అట్టియెడ నసద్వాదమతి యెల్లరిమతుల కంటె నుత్కృష్టమని యెట్లు చెప్పనగును? కాబట్టి తర్కమున కప్రతిష్ఠి తత్వమునుండి ముక్తియే వేదసుట నిక్కువము. దోషయుక్తమగు తర్క బలముతో వైదికమతము కాదనుటయు సంగతముకాదు. అందువలన నసద్వాదిమతమును వదలి వైదికమతమే యుక్తమని యంగీకరించుట న్యాయయుక్త మగునని సూత్రాభిప్రాయము. (౧౧)

## ఏతేన శిష్టాపరిగ్రహా అపి వ్యాఖ్యాతాః ౨-౧-౧౨

ఏతేన = తర్కమునకు ప్రతిష్ఠితత్వము లేదను నిర్ణయముద్వారమున, శిష్టాపరిగ్రహాఽపి=శిష్టులచే నంగీకరింపబడని యవైదిక శూన్యవాదాది సిద్ధాంతములుగూడ, వ్యాఖ్యాతాః = అసద్వాదమువలెనే వైదికులచే గ్రహింపబడదగినవి కావని వ్యాఖ్యానము చేయబడిన ట్లెంచవలయునని సూత్రార్థము.

అసద్వాద మెట్లు వైదికు లంగీకరింపరో యట్లే శూన్యవాదాదులు కూడ వైదికులచే నంగీకరింపబడదగినవి కావని సూత్రాభిప్రాయము.

('కథ మసతః సజ్జాయేత' ఛాం. ౬-౨-౨) 'అసత్తునుండి సత్పదార్థ మెట్లు జనింపగలదు?' అని వైదికులు అసద్వాదము నాక్షేపించుటకైనను పరిగ్రహించియున్నారు. శూన్యవాదము నాక్షేపించుటకైనను శిష్టులెక్కడను గ్రహించినట్లు చూడము. కాబట్టి శిష్టులచే నాక్షేపార్థమైనను గ్రహింపబడని శూన్యవాద సదృశములగు వాదములు వైదికులచే గ్రహింపబడదగినవి కావనియే సూత్ర మభిప్రాయపడుచున్నది. (౧౨)

మరల నసద్వాదిపక్షమున శంకించి సమాధానము చెప్పుచున్నాడు.

## భోక్త్రాపత్తే రవిభాగ శ్చేత్ స్యా ల్లోకవత్ ౨-౧-౧౩

భోక్త్రాపత్తేః=భోగ్యమగు మూలకారణమైన ప్రకృతికి భోక్తృరూప ప్రసక్తి కలుగును కావున, అవిభాగశ్చేత్ = ప్రళయవేళయందు జీవులు ప్రకృతిలో నవిభక్తులై యుందురని యంగీకరించుట యుక్తముకా దందురేని, స్యాల్లోకవత్=లోకానుభవమువలన నయ్యది దోషముకాదని తెలిసికొనవలెను.

జీవులు ముక్తులు బద్ధులు నని రెండుతెగలుగ నుందురు. ముక్తజీవులు పరమేశ్వరునం దవిభక్తులై యుండి యానందము ననుభవించు

ముందురు. బద్ధజీవులు ప్రళయవేళయందు స్థూలశరీరములు లేనందున కర్మఫలములయిన సుఖదుఃఖముల ననుభవింపవీలులేక ప్రకృతియందు లీనమై యవిభక్తావస్థయం దుందురు. అపుడు ప్రకృతి ప్రధానముగాను, జీవులప్రధాన స్థితియందును నుందురు. ప్రకృతి సూక్ష్మము. అంతకంటెను నెక్కుడు సూక్ష్మలు జీవులు. అందువలన ప్రకృతిలో నవిభక్తస్థితిలోనుండు జీవులను వేరుపరచి తెలిసికొనుటకు శక్యము కాదు. అయ్యది శాస్త్రదృష్టితో నూహింపదగిన స్థితియే యని భావము. అట్టి స్థితిని మనసున నుంచుకొని యసద్వాది యిట్లు శంకించుచున్నాడు :

ప్రకృతి భోగ్యముకదా ! ప్రళయవేళయందు జీవులు ప్రకృతియం దవిభక్తస్థితిని బొందియుందు రని యంగీకరించుపక్షమున భోగ్యమగు ప్రకృతి భోక్త కావలసివచ్చును. క్షీరమునం దవిభక్తమైయుండు నీరము క్షీరమగు భాతి జీవులనుండి విభజింపవీలుకాని స్థితియందు భోగ్యప్రకృతి భోక్త యగునని యసద్వాది యభిప్రాయము. ప్రకృతి భోక్త యనుట దోషయుక్త మగును. కాబట్టి ప్రళయకాలమున నంగీకరింపబడు నవిభక్త స్థితి దోషయుక్త మని యసద్వాది శంకించినచో సమాధాన మిట్లు చెప్పబడును.

వర్షాకాలానంతరమున వేసవియం దనేకములగు నోషధులు పృథివియందు లీనములై యవిభక్తస్థితియం దుండును. మరల వర్షాగమనమునందు భూమి వారిసిక్తము కాగానే యోషధు లన్నియు పునరుద్భవించు చున్నవి. ఇయ్యది లోకసిద్ధవిషయము. ఇట భూమి భోగ్యము. ఓషధులు భోక్తలు. భోక్తలగు నోషధులు భూమియం దవిభక్తములై యున్నంత మాత్రమున భూమి భోక్త యగునా ? కాదు. అట్లే భోగ్యమగు ప్రకృతి భోక్తలగు జీవాత్మ లవిభక్తస్థితిలో తనయం దున్నమాత్రమున భోక్త యెన్నడు కాదని భావము. రెండు జడపదార్థము లొకదానియం దొకటి యవిభక్తస్థితిని బొందినపు డొకటి తన ధర్మము ద్వారమున రెండవదానిని

దూషితము చేయగలుగును. ఇట్టి జడపదార్థ స్వభావమును జడచేతనముల కలయికలో నాపాదించుట సాహస మగును. ప్రకృతి జడము. జీవులు చేతనములు. అట్టివి ప్రళయమున నవిభక్తస్థితిలో నున్నంతమాత్రమున వాని స్వభావములను విడువజాలవు. అవిభాగ మన భేదగర్భితమైన యభేదావభాసము. అంతేకాని యత్యంతాభేదము కాదు. కాబట్టి ప్రళయవేళ యందు ప్రకృతిలో జీవావిభాగము నంగీకరించుట దోషయుక్తము కాదని సమాధానము చెప్పబడును. (౧౩)

జగద్రూపమగు నీ కార్యము ఉత్పత్తికి పూర్వము కారణమగు ప్రకృతికంటె నన్యమా? లేక యనన్యమా? అన్యమగునేని ప్రకృతి నంగీకరింపవలసిన పనియుండదు. ప్రకృతికంటె భిన్నముకాబట్టి ప్రకృతి లేకున్నను నది యుత్పన్నము కాగలదు. అనన్యమగునెడల ప్రకృతి కార్యమే యగును కాబట్టి దానికి కారణ మొకటి యుండవలసివచ్చును. ఆ కారణముకూడ కార్యముకంటె ననన్య మగునెడల దానికింకొక కారణ ముండవలసివచ్చును. ఇట్లనవస్థాదోషము వాటిల్లును. లేక కార్యము తన యుత్పత్తికి పూర్వమే యున్నపక్షమున నది యెల్లప్పు డున్నట్లే యగును. కారణవ్యాపారమువలన క్రొత్తగా కలుగునదేమి? యన సమాధానము:

### తదనన్యత్వ మారంభణ శబ్దాదిభ్యః  ౨-౧-౧౪

తదనన్యత్వం=కార్యరూపజగత్తు ప్రకృతికంటె నన్యము కాదనియే యంగీకరింతుము. ఆరంభణశబ్దాదిభ్యః = 'వాచారంభణం వికారో నామధేయమ్' ఛాం. ౬-౧-౪. అను నిట్టి యుపనిషద్వాక్య ప్రమాణములవలన.

వైదికులు ఉత్పత్తికిపూర్వము కార్యము కారణముకంటె సర్వథా భిన్నమనికాని, సర్వథా భిన్నముకాదనికాని యంగీకరింపరు. అందువలన పైన నాశంకించిన దోషములకు వారి మతమున తావే లేదు. అటులయిన వారి యభిమత మేమందురేని, కార్యము కార్యరూపమున కారణముకంటె

సన్యమై కారణరూపమున ననన్యమగు నందురు. కార్యరూపమున సన్య మనుటచేత కారణవ్యాపారము సఫల మగును. కారణరూపమున ననన్య మనుటచే నసద్వాదమునకు తావుండదు. ఇందుల కుపనిషద్వాక్యములే ప్రమాణములు. కార్యరూపమున దృశ్యమానమగు నీజగత్తంతయు దన యుత్పత్తికిపూర్వము కార్యరూపమున కారణమగు ప్రకృతికంటె సన్య మయ్యు, కారణరూపమున ననన్యమే యని యుపనిషద్వాక్యములు స్పష్ట ముగ జెప్పుచున్నవి.

'వాచారంభణం వికారో నామధేయం మృత్తికేత్యేవ సత్యమ్'
ఛాం. ౬-౧-౪.

'అస దేవేద మగ్ర ఆసీత్ తత్ సదాసీత్' ఛాం. ౩-౧౯-౧.

'తద్ధేదం తర్హ్యవ్యాకృత మాసీత్ తన్నామరూపాభ్యా
మేవ వ్యాక్రియతే' బృ. ౧-౪-౭.

(మృత్తికేత్యేవ సత్యమ్) 'మృత్తికామాత్రమే సత్య' మని చెప్పు నీ వాక్యము కారణమునకు మించి కార్య మొండు వేరుగ లేదని చెప్పుట లేదు. అట్లు చెప్పదలచినచో (వాచారంభణం నామధేయం వికారం) 'నామ రూపములు కారణ వికారములు' అను నీ పదములను పేర్కొనియుండదు. నామరూపములను పేర్కొనుచున్నందున కారణరూపమగు మృత్తిక యందు గనబడు నామము, రూపము నను నంశములు రెండును కారణ వ్యాపారమువలన జనించును, కావున కార్య మనబడును. కార్య మనిత్య మగుటవలన నది సత్తు కాదు. దాని కారణముమాత్రమే సత్య మనబడు నని యభిప్రాయము. ఘటము, పటము నను శబ్దములు నామము; వస్తువుల యాకారములు రూపము ననబడును. ఇవి రెండు నుత్పత్తికి పూర్వము కారణరూపమున నున్నను కారణవ్యాపారమునకుపూర్వము వ్యవహారమున గోచరింపవు. కారణవ్యాపారానంతరమున వ్యవహారమున గోచరించుటయే

కార్యోత్పత్తి యనబడును. కారణవ్యాపారకృత్య మింతయే యని కార్య తత్త్వవిదులు వైదికులు చెప్పుదురు.

'అస దేవేద మగ్ర ఆసీత్, తత్ సదాసీత్' అను నీ వాక్యము కార్యము తన యుత్పత్తికి పూర్వము కార్యరూపమున (న సద్బై) లేనిదై, కారణరూపమున (స దేవ) నునికి గలదై యుండునని చెప్పుచున్నది. అట్లే 'తద్ధేదం తర్హి అవ్యాకృత మాసీత్, తన్నామరూపాభ్యా మేవ వ్యాక్రియత' అను నీ వాక్యము ఉత్పత్తికి పూర్వము నామరూపాత్మక కార్య మవ్యక్తమై యుండి కారణవ్యాపారములవలన వ్యక్త మగుచున్న దని స్పష్టము చేయుచున్నది.

(వైదికులదృష్టిలో కార్యము తన యుత్పత్తికిపూర్వ మత్యంత మసత్ - అగునెడల - కారణరూపమున లేనిపక్షమున - కారణవ్యాపారము వలనను జనింపనేరదు. బొత్తిగా నే రూపమునను లేని కుందేటికొమ్ము కారణవ్యాపారములవలన జనింపదుకదా। ఉత్పత్తికిపూర్వము స్వస్వరూప మున నుండు నెందుమేని ఇక కారణవ్యాపారము చేయునదేమి? ఉత్పత్తికి పూర్వము నేదో యొకరూపమున నుండు వస్తువే కారణవ్యాపారమున జనించును. ఇసుకలో తైల మే రూపమున నుండదు. కావున నెన్నివ్యాపా రము లొనర్చినను నది జనింపదు. కార్యము స్వరూపమున నుత్పత్తికి పూర్వముననుండి యనంతరమున నట్లే యుండుపక్షమున నది నశింప నేరదు. కావున నుత్పత్తికిపూర్వము కార్యము కారణరూపముననుండియు కార్యరూపమున లేనందున నసత్తనబడును. అందువలన నసద్వాదము నంగీకరించినట్లును కాదు. కారణవ్యాపారముకూడ చరితార్థ మగును. కారణవ్యాపార మపూర్వము నుత్పన్నము చేయనేరదు. క్రొత్తది కలిగించు సామర్థ్యము కారణమున కుండదు. కారణరూపముననుండి యెట్టి కార్య రూపమున లేదో, యట్టి కార్యరూపము నొందింపజేయుటయే కారణ వ్యాపారశక్తి. అట్లే లోకవ్యవహారమునను జూచుచున్నాము. (౧౪)

ఉత్పత్తికిపూర్వము కార్యము కారణముకంటె నన్యము కాదనుటకు హేత్వంతరమును జూపుచున్నాడు.

భావే చోపలబ్ధేః ౨-౧-౧౫

చ=మరియు, భావే = కారణమున, ఉపలబ్ధేః = కార్య మువలబ్ధ మగుటవలన కారణముకంటె నన్యము కాదు. ఘటరూపకార్యము మృత్తికా రూపకారణ మున్నపుడే జనించును. అట్లే వస్త్రము తంతువు లున్నపుడే కలుగును. లేకున్న కలుగనేరదు. నియతములగు కారణము లున్నపుడే యా యా కార్యములు జనించునని భావము. కార్యము జనించుటకు పూర్వము కారణముకంటె నన్యము కానియెడల నా కారణ మున్నపుడే యది జనించునను నియమ ముండెడిది కాదు. మృత్తికకంటె నన్యమగు పటము మృత్తిక యున్ననే జనించునా? తంతుభిన్నమగు ఘటము తన జన్మకు తంతువుల నపేక్షించునా? తంతువులకంటె పటము అన్యమయి తంతువులవలన నది యుత్పన్నమగునెడల ఘటముకూడ తంతువులకంటె నన్యమే కావున నదియు తంతువులనుండియే జనింపవలసివచ్చును. అట్లు జనింపనేరదు. తంతువు లున్నపుడే వస్త్రము జనించి, లేనపుడు జనింపదు. కావున వస్త్రము తంతువుల కనన్య మనక తప్పదు. కార్య ముత్పత్తికి పూర్వము కారణానన్య మగుటవలననే తంతువు లున్నవస్త్రము లభించు టయు, నవి లేకున్న నది లభింపకుండుటయు జరుగుచున్నది.

ఇట్లు అన్వయ వ్యతిరేకముల (ఒకటి యున్న రెండవది యుండుట యన్వయము. ఒకటి లేనపుడు రెండవదియు లేకుండుట వ్యతిరేకము) మూలమున ఉత్పత్తికి పూర్వము కార్యము కారణానన్య మను విషయమును కణాదుడును తనదర్శనమున నిట్లు సూత్రించియున్నాడు.

'కారణభావాత్ కార్యభావః' వై. ౪-౧-౩.

కారణమున్న కార్యముండును. కారణము లేకున్న కార్యముండదు' తంతువు లున్నపుడే వస్త్ర ముండును. అవి లేకున్న నదియుండదు. అందువలన కార్యము ఉత్పత్తికి పూర్వము కారణమునకంటె నన్యము కాదు. జగత్తు ఉత్పత్తికి పూర్వము ప్రకృతికంటె నన్యము కాదు. (౧౫)

మరియొక హేతువు :

## సత్త్వాచ్చావరస్య ౨-౧-౧౬

చ=మరియు, అవరస్య=కార్యము, సత్త్వాత్ = ఉత్పత్తికి పూర్వ మున కారణరూపమున నున్నదని చెప్పుటవలన, కార్యము కారణానన్యమే యని సూత్రార్థము.

ఉత్పత్తికి పూర్వ మీ జగత్తంతయు కారణరూపమున నున్న ట్లుప నిషత్తు చెప్పుచునే యున్నది.

'సదేవ సోమ్యేద మగ్ర ఆసీత్' ఛాం. ౬-౨-౧.

'ఓ సౌమ్య ! ఈ జగత్తు (ఉత్పత్తికి) పూర్వమున సత్తే యై యుండెను' ఈ జగత్తు కారణముకంటె ననన్యము కానిపక్షమున నయ్యది కారణరూపమున నది యున్నట్లు చెప్పబడియుండదు. కార్యము కారణముకంటె నన్య మగునెడల నదికారణరూపమున సత్తని చెప్పుటకు వలనుపడదు. కాబట్టి యుత్పత్తికి పూర్వము కార్యము కారణరూపమున నున్నదనియే సిద్ధాంతము. (౧౬)

ఈ విషయమున గలుగు నొకశంకకు సమాధాన మిట్లు చెప్పు చున్నాడు.

## అసద్వ్యపదేశాన్నేతిచేన్న ధర్మాంతరేణ వాక్యశేషాత్ ౨-౧-౧౭

అసద్వ్యపదేశాత్=కార్య ముత్పత్తికిపూర్వ మసత్తని చెప్పబడుట

వలన, న=కార్యము కారణానన్యము కాదు. ఇతిచేత్ = అనియందురేని, న = అట్లనరాదు, వాక్యశేషాత్ = ఉత్తర (తరువాతి) వాక్యమువలన, ధర్మాంతరేణ = వ్యక్తత్వధర్మముకంటె భిన్నమగు నవ్యక్తత్వరూపధర్మ మును పురస్కరించుకొని యసత్తని చెప్పబడినట్లు తెలియుచున్నది. కాబట్టి కార్య ముత్పత్తికి పూర్వము కారణానన్య మనుట దోషము లేదని సూత్రార్థము.

కొందొక వాక్యమునందు జగద్రూపకార్య ముత్పత్తికి పూర్వము కారణరూపమున నున్నదని (సదేవ సోమ్య ఇదమగ్ర ఆసీత్) చెప్పినంత మాత్రమున కార్యము కారణానన్యమని యె ట్లంగీకరింపనగును? మరియొక వాక్యమునందు —

'అసదే వేదమగ్ర ఆసీత్' ఛాం. ౩-౧౯-౧.

'ఈ జగత్తు ఉత్పత్తికి పూర్వమున నసత్తే యై యుండెను' అని చెప్పబడియున్నందున కార్యము కారణానన్య మనుట యుక్తము కాదని యందురేని - అట్లు చెప్ప వలనుపడదు.

ధర్మాంతరమును పురస్కరించుకొని యీ వాక్యమునందు జగత్తు ఉత్పత్తికి పూర్వ మసత్తని చెప్పబడినది. ఈ దృశ్యమానమగు కార్యజాత మైన జగత్తు ఉత్పత్తికి పూర్వము స్వరూపముతో నసత్తని చెప్పబడ లేదు. వ్యక్తమగు రూపమున లేదని వాక్యాభిప్రాయముగ నెంచవలెను. ఇప్పుడు (ఉత్పత్త్యనంతరమున) జగద్రూపము వ్యక్తము. ఉత్పత్తికి పూర్వమున జగత్తు కారణరూపమున - ప్రకృతిరూపమున - నవ్యక్తమై యుండును. తఱచు వ్యక్తరూపమునకు పర్యాయమై సత్పదము కొలఁ పదార్థవాచకముగ వ్యవహరింపబడును. అసత్పద మవ్యక్తమునకు వాడ బడును. కాబట్టి యుత్పత్తికి పూర్వము జగత్తవ్యక్తముగా నున్నందున నసచ్ఛబ్దముచే వ్యవహరింపబడినది కాని, స్వరూపముతోనే యది లేదని

కాదు. కాబట్టి యిట నసచ్ఛబ్దప్రయోగము ధర్మాంతర (అవ్యక్తత్వ) ప్రయుక్తమని యెంచవలెను. కాగా ఉత్పత్తికి పూర్వము జగత్తు కారణా నన్యమై ప్రకృతిరూపమున నున్నదనుటలో దోష మొకింతయును లేదు.

పై వాక్యమునందు జగత్తుయొక్క యవ్యక్తత్వరూపధర్మముమూల మున నసచ్ఛబ్దము ప్రయోగింపబడిన దనుటకు ప్రమాణము తరువాతి వాక్యమే - వాక్యశేషమే. ముందు 'అసదేవేదమగ్ర ఆసీత్' ఛాం. ౩-౧౯-౧. అని నుడివి, వెంటనే 'తత్సదాసీత్' ఛాం. ౩-౧౯-౧. 'అది సత్తయ్యెను' అని వాక్యశేషమున జెప్పబడినది. కార్యరూపమగు నీ జగత్తు ఉత్పత్తికి పూర్వము స్వరూపమున లేనందున నసత్తని చెప్పబడినపక్షమున నుత్తర వాక్యమున మరల నది సత్తని యెట్లు చెప్పబడును? పరస్పర విరుద్ధ మగును కదా! కాబట్టి పూర్వవాక్యమున బ్రయోగింపబడిన అసత్పదము జగత్తుయొక్క అవ్యక్తధర్మమును పురస్కరించుకొని వ్యవహరింపబడిన దనియే యెంచవలెను. అందువలననే పూర్వవాక్యమున నసత్పదముచే జెప్పబడిన యవ్యక్తప్రకృతియే తరువాత వాక్యశేషమునందు తత్పద ముచే గ్రహించి (తత్సత్) అది సత్తని చెప్పబడినది. అట్లు కానిపక్షమున వాక్యాంతరమున నుత్పత్తికి పూర్వము కార్యరూప పదార్థముల యత్యంతా భావమును శంకించి దానిని నిషేధించి సదాత్మకమునుండి సద్రూపజగత్తు కలుగునని యేల యాదేశింపబడును? చూడుడు :

> 'తద్ధైక ఆహు రసదేవేద మగ్ర ఆసీ దేక మేవాద్వితీయం
> తస్మా దసతః సజ్జాయతే' ఛాం. ౬-౨-౧.
>
> 'కుతస్తు ఖలు సోమ్య? ఏవం స్యాదితి హోవాచ,
> కథ మసతః సజ్జాయే తేతి? సత్త్వేవ సోమ్య!
> ఇద మగ్ర ఆసీ దేకమేవాద్వితీయమ్' ఛాం. ౬-౨-౨.

'కొందఱు మొదట (ఉత్పత్తికి పూర్వము) అసత్తేయుండెను, అది యొక్కటే, అద్వితీయము. ఆ యసత్తునుండియే సత్తు జనించినది.'

'సౌమ్య! ఇట్లెల జరుగును? అసత్తునుండి సత్తెట్లు కలుగును? (ఉత్పత్తికి) పూర్వము సత్తేయుండెను. అది యేక మద్వితీయము.'

ఉత్పత్తికి పూర్వము కార్యము కారణానన్యమని యంగీకరింపకున్న నీ వాక్య మెట్లు సంగతమగును? కాబట్టి కార్య ముత్పత్తికి పూర్వము కారణ రూపమున తదనన్యమై యుండు ననుట నిక్కువము. (౧౭)

హేత్వంతరమును ప్రదర్శించుచున్నాడు:

యుక్తేః శబ్దాంతరా చ్చ ౨-౧-౧౮

చ = మరియు, యుక్తేః = ప్రతి నియత కారణోపాదానాది రూపమగు యుక్తివలనను, శబ్దాంతరాత్ = స్మృతివలనను నుత్పత్తికి పూర్వము కార్యము కారణానన్యమని తెలియుచున్నదని సూత్రార్థము.

పెరుగుకావలసినవాడు క్షీరము నుపాదానముగ గ్రహించుట లోకమున జూచుచున్నాము. ఇట్లే ఘటమునకు మృత్తిక, కుండలాదులకు సువర్ణము నుపాదానముగ గ్రహింతురు. కార్య ముత్పత్తికి పూర్వము కారణానన్యము కానిపక్షమున నొక కార్యమున కొక నియతకారణము [illegible]ట సంభవము కాదు. దధి కావలయు ననువ్యక్తి మృత్తిక నుపాదానముగ గ్రహించుట నెక్కడను చూడము. ఇందులకు కారణ మేమై యుండును? కార్య ముత్పత్తికిపూర్వము కారణముకంటె నన్యముకాదని యెరిగియే యట్లు చేయును. ఉత్పత్తికి పూర్వము కార్య మసత్తనువాడు దధికొఱకు పాల నుపాదానముగా నేల తీసికొనవలెను? మృత్తిక నేల తీసికొనడు? ఆ యా కారణము లా యా కార్యముల నుత్పన్నము చేయు నతిశయ మేదైన నున్నదని ప్రతిపత్తర మిచ్చుపక్షమున నసద్వాదమును

విడిచినట్లే యగును. ఆ యతిశయ మెట్టిది? కార్యము కారణముకంటె నన్యము కాదనుటయు, నాకారణమున కార్యము నుత్పన్నము చేయు నతిశయ మున్నదనుటయు నొకటియే యగును. కారణమున కార్య మసలే లేకున్న నది యె ట్లుత్పన్న మగును? అభావమునుండి, భావోత్పత్తి కలుగదు. కలుగునెడల సికతమున తైల ముత్పన్నము కావలసివచ్చును. ఏ కార్య మేకారణమున నుత్పన్నమగునో యాకారణ మాకార్యమం దన్వితమై యుండును. అసత్తునుండి వ స్తుత్పన్న మగునెడల సత్తుతో నప త్తన్వితమై యుండవలెను. లోకమున కార్యజాత మంతయు సదన్వితమై యుత్పన్న మగుట చూడనగును. అసదన్వితమై యుత్పన్నకార్యమెందును జూడము. ఘటపటాదులన్నియు సత్కార్యములే. ఉత్పన్నవస్తు వేదియు నస త్తనబడదు. అందువలన నసత్తు సత్తునకు కారణము కాదు.

ఇట్లే స్మృతియు చెప్పుచున్నది. సాంఖ్యస్మృతిలో –

"నాస దుత్పాదో నృశృంగవత్" ౧-౧-౧౪. 'నరశృంగమువలె అసదుత్పత్తి లేదు' అని యారంభించి, "కారణభావా చ్చ" ౧-౧-౧౮ వరకుగల సూత్రములలో నసద్వాదము నాక్షేపించి సద్వాదమును ప్రతిపా దించుట చూడనగును. ఇట్లు యుక్తివలనను, స్మృతివలనను కార్యము తన యుత్పత్తికి పూర్వము కారణమున' కనన్యమై కారణరూపమున నుండునని సిద్ధమగుచున్నది. (౧౮)

కార్య ముత్పత్తికి పూర్వము కారణానన్యమై యుండునని నిర్ణ యించి యందుల కొక యుదాహరణము నిచ్చుచున్నాడు.

పటవచ్చ ౨-౧-౧౯

(తదనన్యత్వ మిందును ననువర్తించును. చకార ముదాహరణ సూచకము)

పటవత్ = వస్త్రము జనించుటకు పూర్వము తంతువులకంటె

భిన్నము కాదు. అట్లే కార్యజాత మంతయు నుత్పత్తికి పూర్వము కారణా నన్యమై యుండునని సూత్రార్థము.

వస్త్ర ముత్పత్తికి పూర్వము తనకారణరూపతంతువులకంటె నన్య మేమియు కాదు. అట్లే యీ పృథివ్యాది కార్యజగ త్తంతయు నుత్పత్తికి పూర్వము ప్రకృతికి మించి వేరేమియు కాదు. జగత్తు ప్రకృతియొక్క విశేషమే. తంతువుల యవస్థావిశేషమే పటము కాక మరియొం దేమి యున్నది. అవస్థకు, నాయవస్థ కలదానికి భేదము లేదనుట సర్వసమ్మ తమే. కాబట్టి యుత్పత్తికి పూర్వము కార్యము కారణానన్యమే యనుట యుక్తమే యగుచున్నది. (౧౯)

మరియొక యుదాహరణము :

యథా చ ప్రాణాది ౨-౧-౨౦

యథా = ఎట్లు, ప్రాణాది = ప్రాణము, అపానము మున్నగు పంచ ప్రాణములు, ఉత్పత్తికి పూర్వము ముఖ్యప్రాణముకంటె భిన్నములు కావో యట్లే పృథివ్యాది జగత్తుకూడ నుత్పత్తికి పూర్వము ప్రకృతికంటె భిన్నము కాదని సూత్రార్థము.

ప్రాణము, అపానము, ఉదానము, వ్యానము, సమానము నను ప్రాణము లయిదును నుత్పత్తికి పూర్వము ముఖ్యప్రాణమున కనన్యము లనియే ప్రశ్నోపనిషత్తునందు వర్ణింపబడియున్నది.

"తాన్ వరిష్ఠః ప్రాణ ఉవాచ, మా మోహ మాపద్యథ
అహ మేవైతత్ పంచధాఽఽత్మానం ప్రవిభ జ్యైతద్
బాణ మవష్టభ్య విధారయామి." ప్ర. ౨-౩.

ముఖ్యప్రాణ మిట్లు పలికెను. మోహమును బొందకుడు. నేనే యైదువిధములుగ నన్ను విభజించుకొని యీశరీరమును ధరించుచున్నాను.

ముఖ్యప్రాణ మెట్లు తనను పంచప్రాణములుగ విభజించి శరీర ధారణ కుపయోగించుచున్నదో యట్లే ప్రకృతి పృథివ్యాదిరూపమున పరిణమించి జీవులభోగాపవర్గములకొరకుపయుక్త మగుచున్నది. కాబట్టి యుత్పత్తికి పూర్వ మీజగద్రూపకార్యము ప్రకృతి కనన్యమై యున్నదనుటలో దోష మొందును లేదు. అందువలన కార్యము కారణానన్యమే యనుట సిద్ధమగుచున్నది. (౨౦)

## చతుర్థాధికరణము

ప్రకృతివిషయమున తర్కమువలన నేర్పడు దోషములను దూరమొనర్చి, బ్రహ్మవిషయమున గలుగు విరోధమును పరిహరింపనుద్దేశించి మహర్షి పూర్వపక్షసూత్రమును రచించుచున్నారు.

### ఇతర వ్యపదేశాత్ హితాకరణాది దోష ప్రసక్తిః ౨-౧-౨౧

ఇతరవ్యపదేశాత్=బ్రహ్మము జీవాత్మరూపమున చెప్పబడుటవలన, హితాకరణాది దోషప్రసక్తిః=(బ్రహ్మము జగజ్జన్మాదులకు స్వతంత్ర కారణముగా నంగీకరించినచో) హితాహితాది దోషముల నొనరించిన దోషము బ్రహ్మకు వాటిల్లునని సూత్రార్థము.

జగజ్జన్మాదులకు బ్రహ్మము స్వతంత్రకారణముగ వైదికు లంగీకరించుచున్నారు. జగత్తు బ్రహ్మనిర్మితము. బ్రహ్మము స్వతంత్రము. అట్టి బ్రహ్మము తనచే నిర్మింపబడు నీజగత్తును తన కహితమును గలిగించున ట్లేల నిర్మించుకొనును ? బ్రహ్మము స్వతంత్రకారణముగ వైదికులు చెప్పుచున్నారు. కాబట్టి బ్రహ్మమునందు తనకై యహిత మొనరించుకొనిన దోషము వాటిల్లుచున్నది. కారణ మేమన : బ్రహ్మమునకు జీవునకు నెట్టి భేదమును లేదు. బ్రహ్మమే జీవాత్మరూపమున నీజగత్తునందు వ్యవహ

రించుచున్నట్లు ఉపనిషత్తులు చెప్పుచున్నవి. జీవుడు లోకములో జన్మజరా మృత్యురూపములగు కష్టముల నెన్నిటినో యనుభవించుచుండుట ప్రత్యక్ష సిద్ధము.

"తత్ సృష్ట్వా తదే వానుప్రావిశత్" తై. ౨-౬. 'దానిని (జగత్తును) సృష్టించి యందే ప్రవేశించెను'.

"అనేన జీవే నాత్మ నానుప్రవిశ్య, నామరూపే వ్యాకరవాణి" ఛాం. ౬-౩-౨. 'ఈ జీవరూపమున ప్రవేశించి నామరూపముల నిర్మింతును'.

"త్వం స్త్రీ, త్వం పుమా నసి, త్వం కుమార ఉత వా కుమారీ
త్వం జీర్ణో దండేన వంచసి, త్వం జాతో భవసి విశ్వతోముఖః"
శ్వే. ౪-౩.

'నీవు స్త్రీవి. నీవు పురుషుడవు. నీవు కుమారుడవు. కుమారివి. నీవు జీర్ణుడవు. దండించి దుష్టులను దోషములకు దూరముగ నుంతువు. నీవు సర్వత్ర వ్యాపకుడవై ప్రసిద్ధుడ వగుచున్నావు.

అను నీయుపనిషద్వాక్యములు బ్రహ్మమే జీవరూపమున జగత్తున వర్తించుటను స్పష్టముగ జెప్పుచున్నవి. కాబట్టి జగత్తునకు బ్రహ్మము స్వతంత్రకర్త యని యంగీకరించుపక్షమున బ్రహ్మము తనకై జగత్తును దుఃఖమయముగా నిర్మించుకొనిన దోషమునకు గురికాక తప్పదు.

జగత్తు దుఃఖకర మనుటను దర్శనాంతరకర్తలును అంగీకరించుచున్నారు.

"వివిధ బాధనాయోగాత్ దుఃఖ మేవ జన్మోత్పత్తిః"
న్యా-ద. ౪-౧-౫౫.

"దుఃఖవికల్పే సుఖాభిమానా చ్చ" న్యా. ద. ౪-౧-౫౮.

"తదపి దుఃఖశబల మితి దుఃఖపక్షే నిఃక్షిపంతే వివేచకాః"
సాం-౬-౮.

జన్మమరణాదులతో కూడిన జగత్తు దుఃఖబహుళమనియు, సుఖానుభవ మున్నను నది దుఃఖమిశ్రితమై యుండుటచే నదియు దుఃఖమే యనియు నీ సూత్రాభిప్రాయము.

కాబట్టి సర్వజ్ఞము, సర్వశక్తిమంతము నగు బ్రహ్మము తనకై యిట్టి దుఃఖబహుళమై యహితమును గలిగించు జగత్తు నేల సృష్టించు కొనును ? అందువలన జగత్తు బ్రహ్మకర్తృక మనుటలో నహితకరణ దోష ప్రసక్తి కలుగునని పూర్వపక్షాభిప్రాయము. (౨౧)

సమాధాన సూత్రము :

అధికం తు భేదనిర్దేశాత్		౨-౧-౨౨

(సూత్రమునందలి 'తు' పదము పూర్వపక్షమును నివర్తించుటకు)

భేదనిర్దేశాత్=భిన్నముగా నిర్దేశింపబడుటవలన, అధికం=జగజ్జన్మాది కారణమగు బ్రహ్మము జీవునికంటె నధికము - భిన్నము - వేరని యర్థము.

జీవాత్మకే యుత్పద్యమానమగు జగత్తంతయు తఱచుగ ననిష్ట హేతు వగుటవలన హితము కలుగకుండుట సత్యమే కాని, జగజ్జన్మాదులకు కారణమగు బ్రహ్మమునం దహితకరణాది లక్షణదోషము వాటిల్లు ననుట యుక్తము కాదు. బ్రహ్మమే జీవాత్మ యగుపక్షమున నట్టి దోష ప్రసక్తి కలుగును. కాని బ్రహ్మము జీవాత్మ కాదు. బ్రహ్మము జీవాత్మ కంటె నెంతో యధికము. గుణకర్మస్వరూపములలో నన్నింటిచేతను బ్రహ్మము జీవాత్మకంటె బహ్వధికము. జీవాత్మ యల్పజ్ఞము. సర్వజ్ఞము కాదు. సర్వమును సర్వవిధముల నెరుగజాలదు. ఏవస్తువు నెరిగినను నది పూర్ణ మనజాలము. వస్తుతత్త్వము నెరుగుట జీవునకు నలవికాదు. జీవాత్మకు కాలవిజ్ఞాన ముండదు. భూతభవిష్యద్వర్తమానభేదములతో కాల

---

* విశేషార్థముల నెరుగదలచినవారు దర్శనములకు మాచే రచియింపబడిన భాష్యవ్యాఖ్యానములను మాతురుగాక.

మును మువ్విధములుగ కాలవిదులు విభజింతురు. జీవాత్మకు భూత జ్ఞానముకాని, భవిష్యత్ జ్ఞానముకాని పూర్ణముగ గలుగనేరదు. వర్తమానము కూడ యత్నించి తే తెలియును. కాని సర్వమును దెలియదు. జీవాత్మ యల్పజ్ఞ మైనట్లే యల్పశక్తిమంతము నగును. అందువలననే తా జేయ దలచిన దంతయు జేయ సమర్థము కాదు. బ్రహ్మ మట్లుకాదు. అది సర్వ జ్ఞము; సర్వశక్తిమంతము. సర్వము నెరుగును. సర్వము నొనర్చును. బ్రహ్మము యాథాతథ్యముగ సర్వము నెరుగును. బ్రహ్మాండమున బ్రహ్మకు తెలియనితత్వము త్రికాలములందు నుండదు. బ్రహ్మకు సమానముకాని, యధికముకాని మరియొండు లేదు. పరబ్రహ్మపరమేశ్వరుని గుణముల నన్నింటి నొక్కటొక్కటిగా వర్ణించుటకు సహస్రపురుషాయుషములును జాలవు.

జీవాత్మునిజ్ఞానము, క్రియాశక్తియు రెండును నపూర్ణములే. అందు వలన నతనిచే సాధింపబడు కర్మయు నపూర్ణమే యగును. బ్రహ్మకు గల జ్ఞానము, క్రియాశక్తియు రెండును పూర్ణము లగుటవలన బ్రహ్మ సంపాదితకర్మ అపూర్ణ మెన్నడును కానేరదు.

జీవాత్మ యణుస్వరూపుడు. అత దవిద్యవలన మోహితుడై బద్ధు డగుచుండును. క్లేశకర్మ విపాకాశయములచే పరామృష్టుడై, తృష్ణాదుల వలన నతృప్తుడై విషయములందు చిక్కుకొని భ్రమించుచుండును. కర్మ ఫలములను సుఖదుఃఖరూపమున ననుభవించుచుండును. అందువలన జీవున కీ జగత్తు హితాహితకర మగుచుండును. బ్రహ్మ మట్లు కాదు. అయ్యది జగత్కర్త. క్లేశకర్మవిపాకాశయములచే నపరామృష్టము. మాయావిమోహితమై సంసారపాశములచే బంధింపబడదు. అయ్యది నిత్య తృప్తము. రాగద్వేషముల కందు తావు లేదు. అది యేకము - అద్వి తీయము - జగత్పతి. అది జీవులు చేయు కర్మల కనుగుణముగ ఫల ముల ననుభవింపజేయును. జడచేతనాత్మకమగు నీ సమస్తజగత్తు నది

శాసించును. ఇట్లు గుణకర్మ స్వరూపములలో బ్రహ్మము జీవునికంటె నెంతో యధికము; భిన్నమును. అయ్యది జీవరూప మెన్నడును కాదు. బ్రహ్మాల్ప మెట్లు కాగలదు? అందువలన జీవు డల్పుడనియు, బ్రహ్మ మధికమనియు నిశ్చితముగా నెరుగవలెను.

గుణకర్మ స్వరూపములనుబట్టియే కాక శ్రుతిస్మృతులు కూడ బ్రహ్మ జీవునికంటె నధిక మనియే చెప్పుచున్నవి.

"తయో రన్యః పిప్పలం స్వాద్వత్తి
అనశ్న న్నన్యో అభిచాకశీతి." ఋ. ౨-౩-౧౭-౨౦.

'జీవుడు సుఖదుఃఖముల ననుభవించును. పరమాత్మ సుఖదుఃఖముల నంటక నంతటను ప్రకాశించును'

"జుష్టం యదా పశ్య త్యన్య మీశమ్" ముం. ౩-౧-౨.

'జీవు డనీశుడు పరమాత్మ యీశుడు'

"యో విజ్ఞానే తిష్ఠన్ విజ్ఞానా దంతరః" బృ. ౩-౭-౨౨.

'పరమాత్మ జీవునియందుండియు నతనికంటె భిన్నుడు'

కావున జీవునకంటె పరబ్రహ్మ పరమాత్మ భిన్నమని స్పష్టమగు చున్నది. ఇట్లుబ్రహ్మము జీవులకంటె భిన్నమై, జీవుల కర్మానుగుణముగ జగత్తును నిర్మించుచున్నది. కాబట్టి జగత్తును నిర్మించి తన కహిత మొన ర్చుకొన్న దనుదోషము బ్రహ్మకు కలుగుననుట యుక్తియుక్తము కాదు. శాస్త్రసమ్మతమును కాదు.

బ్రహ్మమునకు జీవాత్మరూపమును ప్రతిపాదించి శ్రుతిస్మృతులును లభింపవు. పూర్వపక్షసూత్రమున ప్రదర్శింపబడిన యుపనిషద్వాక్యములు బ్రహ్మకు జీవాత్మరూపము నెన్నడును ప్రతిపాదింపవు.

'తత్ సృష్ట్వా తదే వానుప్రావిశత్' తై. ౨-౬.

'అనేన జీవే నాత్మ నామప్రవిశ్య నామరూపే వ్యాకరవాణి'
ఛాం. ౬-౩-౨.

ఈ రెండువాక్యములలోను బ్రహ్మము జగత్తునందు జీవాత్మద్వార కముగ ప్రవేశించునట్లు వర్ణింపబడినదేకాని బ్రహ్మకు జీవాత్మరూపము ప్రతిపాదింపబడలేదని గుర్తింపవలెను. ఇట్లే 'త్వం స్త్రీ, త్వం పుమాన్.... శ్వే. ౪-౩. అను వాక్యమువందును బ్రహ్మముసర్వాంతరాత్మ యైనందున సర్వాధారమని తెలుపబడినదే కాని, బ్రహ్మ కిందు జీవాత్మరూపము చెప్ప బడలేదని యెరుగవలెను. కాబట్టి బ్రహ్మము జగత్కారణ మైనందున అహితకరణాదిదోషప్రసక్తి గలుగుననుట యుక్తము కాదు. (౨౨)

అధికమగుటవలన బ్రహ్మము జీవాత్మరూపమును బొందకపోవ చ్చును. కాని, జీవాత్మయు చేతనమే యగుటవలన నదిబ్రహ్మరూపమును బొందవచ్చునుగదా యన - సమాధానము :

అశ్మాదివ చ్చ తదనుపపత్తిః ౨-౧-౨౩

చ = మరియు, అశ్మాదివత్ = అశ్మాదులవలె (రాళ్ళు మున్నగు వానివలె) తదనుపపత్తిః = జీవాత్మయు బ్రహ్మరూపము నందనేరదు.

పాషాణాది జడపదార్థములు బ్రహ్మమువలెనే యునికి (సత్తా) గలిగి యున్నవి. అట్టి సత్తాసామ్యమును బురస్కరించుకొని, యవి బ్రహ్మ రూపము నందగలవా? అందజాలవు. అట్లే చేతనత్వసామ్యమును బురస్క రించుకొని జీవాత్మయు బ్రహ్మరూపమును బొందజాలదని సూత్రాభి ప్రాయము.

కొందొక సామాన్య ధర్మమూలమున నొకవస్తు వింకొక వస్తు వెన్నడును కాదు. మనుష్యత్వసామ్య మున్నంతమాత్రమున నిర్ధనుడు ధనికుడగునా? మూర్ఖుడు బుద్ధిమంతుడగునా? జీవునియందు చేతనత్వ మున్నను సర్వజ్ఞత్వాది ధర్మములు లేనందున నతడు బ్రహ్మత్వమును బొంద

రాలదు. కాబట్టి జగజ్జన్మాది కారణమగు బ్రహ్మమునందు హీనాహీన కరణత్వాది దోషములకు ప్రసక్తియే లేదని భావము. (౨౩)

మహర్షి బ్రహ్మజగత్కారణత్వమును మరియొక విధమున శంకించి సమాధానము చెప్పుచున్నాడు.

## ఉపసంహారదర్శనాన్నేతిచేన్న క్షీరవద్ధి ౨-౧-౨౪

ఉపసంహారదర్శనాత్ = లోకమున కుంభకారుడు ఘటమును నిర్మించు టకు చక్ర చీవరాద్యనేకసాధనములను సంగ్రహించుచున్నందువలన, న = బ్రహ్మకు ప్రకృతికి మించి వేరుసాధనసంగ్రహ మేమియు లేనందున కేవలంబ్రహ్మము జగత్కారణము కాజాలదు, ఇతిచేత్ న = అనిశంకించిన నదియును యుక్తము కాదు. హి = కారణమేమన, క్షీరవత్ = పాలు స్రవించునట్లు జగదుత్పత్తి కాగలదు.

కుంభకారాదులు ఘటపటాది కార్యములను నిర్మించుటకు నుపాదాన కారణాతిరిక్తముగ చక్రచీవరాది సాధనముల నెన్నింటినో సంగ్రహించి కార్యముల నుత్పన్నము చేయుదురు. జగద్రూపకార్యమును నిర్మించుటకు బ్రహ్మకు ప్రకృతికి మించి వేరు సాధనములే లేవు. కాబట్టి బ్రహ్మము జగత్తు నెట్లు సృష్టింపగలుగును? లోకదృష్టమునకు విరుద్ధముగ నంగీక రించుట యుచితముకాదు. కాబట్టి జగత్కారణమని చెప్పుట లోకవిరుద్ధము. కాగా బ్రహ్మము జగత్కారణమనుట సంగతము కాదన-సమాధానము:

ధేనువు ఇతర సాధనములను గ్రహింపకయే సంకల్ప మాత్రమున వత్సకు పాలను స్రవింపజేయును. లోకమున నిత్యము నియ్యది చూచు చున్నాము. అట్లే బ్రహ్మముకూడ జీవుల యుపభోగార్థమై సంకల్పమాత్ర మున ప్రకృతిని మహదాది జగద్రూపమున బరిణమింపజేయును. ప్రకృతి క్షీరస్థానమున గ్రహింపనగును. ధేనువు సంకల్పించినంత మాత్రమున వత్సోపభోగముకొఱకు క్షీరము స్రవించును. అట్లే బ్రహ్మసంకల్పము

వలన ప్రకృతి జగద్రూపమున జీవుల యుపభోగముకొఱకు పరిణమించును. అందువలన లోకవిరుద్ధ మొకింతయును లేదు. ఇట్లు బ్రహ్మము జగత్కారణ మనుటయు సంగతమే యగును. కుంభకారాదులు స్వల్పశక్తిమంతులు కావున పదార్థనిర్మాణమున కనేక సాధనములను సంగ్రహింతురు. లేకున్న కార్యసాధకులు కాజాలరు. బ్రహ్మ మనల్పశక్తి కలది.

"య స్యామితాని వీర్యా" ఋ. ౬-౨-౧౫-౨౧ 'పరమేశ్వరుని వీర్య మమితము' అని మంత్రవర్ణనము. కాబట్టి బ్రహ్మ జగత్కారణత్వమున దోషము లేదు. (౨౪)

బ్రహ్మము సంకల్ప మాత్రమున జగత్కారణ మనుటకు మరియొక దృష్టాంతము :

దేవాది వదపి లోకే ౨-౧-౨౫

లోకే = లోకమునందును, దేవాదివత్ అపి = దేవాదులవలెకూడ.

లోకమున దేవాదులు - విద్వాంసులు, యోగులు, ఋషులున్నగు వారు సంకల్పమాత్రమున స్వాశ్రితజనులచే ననేక కార్యములను సాధింప జేయునట్లు, బ్రహ్మముకూడ సంకల్పమాత్రమున జగత్తును నిర్మించు చున్నది. కాబట్టి దోష మావంతయు లేదని సూత్రాభిప్రాయము. (౨౫)

అటులయిన ననిష్టము కలుగునని మహర్షి శంకించుచున్నాడు.

కృత్స్నప్రసక్తి ర్నిరవయవత్వశబ్దకోపో వా ౨-౧-౨౬

బ్రహ్మ సంకల్పమువలన పరిణమించు మూలకారణమగు ప్రకృతి నిరవయవ మగునెడల, కృత్స్నప్రసక్తిః = సంపూర్ణపరిణామ ప్రసక్తి కలుగును. వా = లేక సావయవ మగునెడల, నిరవయవత్వ శబ్దకోపః = ప్రకృతి నిరవయవ మని నుడువు వాక్యములకు విరుద్ధమగును.

బ్రహ్మసంకల్పమూలమున బరిణమించు నీ ప్రకృతి సావయవమా? లేక నిరవయవమా? నిరవయవ మగుపక్షమున సంపూర్ణప్రకృతి వికృతిగా పరిణమింప వలసివచ్చును. అప్పుడు ప్రకృతియే యుండదు. అట్లు కాక సావయవ మగునేని, యందొక యవయవము - భాగము - పరిణమించి వికృతియైనను మరియొక యంశముతో - భాగముతో - ప్రకృతి మిగిలి యుండును. కాని, సావయవము ప్రకృతి యనబడదు. అట్టిది వికృతియే యన నగును. కాబట్టి రెండుపక్షములందు ప్రకృతియునికికి భంగము కలుగునని భావము. మరియు ప్రకృతి సావయవమని యంగీకరించుట నిరవయవ బోధకములగు నుపనిషద్వాక్యములకు విరుద్ధ మగును.

" తద్ధేదం తర్హి అవ్యాకృత మాసీత్ " బృ. ౧-౪-౭

" అజా మేకాం లోహిత శుక్ల కృష్ణాం " శ్వే. ౪-౫

ఈ యుపనిషద్వాక్యములందు ప్రకృతి అవ్యాకృతము, అజ యను పదములచే జెప్పబడుట సుస్పష్టము. అవ్యాకృతము, అజ యనుటచే ప్రకృతి నిరవయవమనియు, వికృతి కాదనియు తెలియుచున్నది. కాబట్టి శబ్దప్రమాణ విరోధ ప్రసక్తి కలుగుననుట నిశ్చితమని శంకాభిప్రాయము. (౨౬)

సమాధానము :

## శ్రుతే స్తు శబ్దమూలత్వాత్ ౨-౧-౨౭

('తు' శంకానివృత్తికొరకు ప్రయోగింపబడినది.)

శబ్దమూలత్వాత్=(మూలము = ఆశ్రయము) వైదికసిద్ధాంతములు శబ్దాశ్రితము లగుటవలన, శ్రుతేః = శ్రుతివలననే, బ్రహ్మసంకల్పమూలమున ప్రకృతి జగద్రూపమున బరిణమించుచున్నదని నిశ్చయింపవలెను.

వేదబాహ్యులవలె వైదికులు కేవల తర్కనిర్ణయముల నంగీకరించువారు కారు. వైదికులు సర్వము శ్రుతిమూలకమే యంగీకరింతురు.

బ్రహ్మసంకల్పమువలన ప్రకృతి జగద్రూపమున పరిణమించు చున్నదని యుపనిషత్తు స్పష్టముగా వర్ణించుచున్నది.

'తపసా చీయతే బ్రహ్మ తతోఽన్న మభిజాయతే
అన్నాత్ ప్రాణో మనః సత్యం లోకాః కర్మసు చామృతమ్'
ముం. ౧-౧-౮.

(తపః=సంకల్పగర్భితమగు పర్యాలోచనాత్మకమగు జ్ఞానమనియు, బ్రహ్మ=ప్రకృతి, యనియు నింతకు పూర్వమే వ్రాసియుంటిమి.)

'బ్రహ్మసంకల్పమువలన ప్రకృతి పరిణమించి మహదాదిరూపమును బొందున'ని వాక్యాభిప్రాయము. ఇట్టి శబ్దమూలక సిద్ధాంతము తర్కగమ్యము కాకపోవచ్చును. పురుషబుద్ధి యల్పము. తర్క మట్టిబుద్ధి కావున నొకప్పుడు సూక్ష్మవిషయములు తర్కగమ్యములు కాకపోవుట వింత కాదు. అందువలన వైదికులు కేవలతర్కనిర్ణయముల నంగీకరింపరు. శబ్దము బ్రహ్మసంకల్పపూర్వకముగ ప్రకృతి జగద్రూపమున పరిణమించుచున్నదనియు, నయ్యది మిగిలియుండు ననియు చెప్పుచున్నది.

కృత్స్నమనగా సంపూర్ణము - అనేకముయొక్క యశేషత - యని యర్థము. అనేకములో నొకటి యేకదేశము - భాగము - అంశము - అనబడును. ప్రకృతియందు కృత్స్నము నేకదేశము నను వ్యవహారమే యుక్తము కాదు. కాబట్టి పూర్వపక్షవికల్పమున కటతావే లేదని భావము.

'ఇంద్రియేభ్యః పరం మనః, మనసః సత్త్వ ముత్తమమ్
సత్త్వా దధి మహానాత్మా, మహతో అవ్యక్త ముత్తమమ్' కఠ. ౬-౭.

అను నీ కఠవాక్యము మహదాది జగద్రూపమున ప్రకృతి పరిణమించుననియు, ప్రకృతి మూలకారణరూపమున నవశిష్టమై యుండుననియు చెప్పుచున్నది. మరియు నక్షర (నాశరహిత)మగు నా ప్రకృతియందే

ప్రళయమున జగత్తంతయు నవ్యయము - లయము - నొందు ననియు శ్రుతి స్పష్టముగ చెప్పుచున్నది. ప్రకృతి యనునదియే లేనిపక్షమున (తత్ర చైవాపియన్ని) 'అందే విలయము నందును' అని చెప్పుట అసంగత మగును. కాబట్టి ప్రకృతి మహదాదిరూపమున బరిణమించుటయు, నయ్యది యవశిష్టమై యుండుటయు శ్రుతిసమ్మతమే యని వైదికులసిద్ధాంతము. సంకల్పమాత్రమున బ్రహ్మ జగత్తును నిర్మించుటయు నిర్దుష్టమే. (౨౭)

బ్రహ్మసంకల్పపూర్వక జగన్నిర్మాణము శ్రౌతసిద్ధాంతమైన కావిందు. అయినను నది బుద్ధిసమ్మతము కానిపక్షమున నంగీకరించుటెట్లన ?

## ఆత్మని చైవం విచిత్రాశ్చ హి ౨-౧-౨౮

(సూత్రమునందలి ప్రథమ చ కారము సంకల్పప్రభావ వైచిత్ర్యమున గల యసంభావనను దొలగించును. ద్వితీయ చకారము సంకల్పప్రభావవైచిత్ర్యమువలననే యిట్లు జరుగునని యెంచవలయునని తెలుపును.)

హి=కారణ మేమన, ఆత్మని=పరమాత్మయందు, ఏవం = ఇట్టి, విచిత్రాః=విచిత్రప్రభావములు, నానావిధశక్తులు నున్నవని సూత్రార్థము.

పరబ్రహ్మ పరమాత్మ సంకల్పప్రభావముచేతనే ప్రకృతి మహదాది జగద్రూపమున ప్రవర్తించుచున్నది. పరమాత్ముని సంకల్పప్రభావము నెంతని వర్ణింపగలము? కాబట్టి ప్రకృతి నిరవయవమయ్యు బ్రహ్మసంకల్పప్రభావమున జగద్రూపమున పరిణమించియు మిగిలి యుండునని భావము. (౨౮)

ఇట్లు సంకల్పప్రభావముద్వారమున స్వపక్షదోషమును పరిహరించి పరపక్షమున దోషము నుద్ఘాటించుచున్నాడు.

స్వపక్షదోషా చ్చ ౨-౧-౨౯

స్వపక్షదోషా చ్చ=స్వపక్షమునందును దోష ముండుటవలనను,

ఎవరు 'ప్రకృతి నిరవయవమా? సావయవమా?' అని వికల్పము నుద్భావించి రెండుపక్షములందును ప్రకృతి జగద్రూపమున బరిణమించు ననుటలో దోషప్రసక్తిని జూపియున్నారో వారిపక్ష మిట స్వపక్షముగా నిర్దేశింపబడినది. ఆ పక్షమునందును ప్రకృతి నిరవయవ మగునెడల కృత్స్నపరిణామప్రసక్తి కలుగును. సావయవమైన, ప్రకృతి వికృతి యగును. కాబట్టి సిద్ధాంతపక్షమున భగవంతుని సంకల్పప్రభావమువలన ప్రకృతి జగద్రూపమున పరిణమించుటలో నే దోషము నుండదనియు, పూర్వపక్షమతమునందే పూర్వోక్తదోషములను పరిహరించుట కుపాయము లేదనియు సూత్రాభిప్రాయము. (౨౯)

పరమాత్మయందు విచిత్రశక్తులు గలవని నిరూపించుటకే మహర్షి సూత్రమును రచించుచున్నాడు.

సర్వోపేతా చ తద్దర్శనాత్ ౨-౧-౩౦

(పూర్వోక్తము నుపపాదించుటకే యని చకారము సూచించును.)

తద్దర్శనాత్ = అనేకశక్తియుక్తమని చెప్పు మంత్రవర్ణమువలన, సర్వోపేతా = బ్రహ్మమనెడి పరదేవత యనేకశక్తులు గలదని తెలియు చున్నది.

'విశ్వా న్యస్మిన్ సంభృతా ఽధి వీర్యా' ఋ. ౨-౬-౧౭-౨.

'యుక్తా హ్యస్య హరయః శతాదశ' ఋ. ४-౭-౩౩-౧౮.

'య స్యామితాని వీర్యా' ఋ. ౬-౨-౧౯-౨౧.

అను నీ మంత్రవర్ణములందు పరదేవతయగు నా పరమాత్మ యనేకశక్తియుక్తులు గలదని స్పష్టముగ జెప్పబడినది. మంత్రములు

స్వతఃప్రమాణములు. కాబట్టి విచిత్రశక్తిమంతమగు పరమాత్మ కసాధ్య మెయ్యది యుండును? (౩౦)

ఈ విషయమున శంకించి సమాధానము చెప్పుచున్నాడు.

## వికరణత్వాన్నేతి చేత్తదుక్తమ్ ౨-౧-౩౧

వికరణత్వాత్ = ఇంద్రియాదులు లేనందున బ్రహ్మ మనేకశక్తి యుక్త మయినను, నేతి చేత్=జగత్కారణము కాదందురేని, తదుక్తమ్= దానికి సమాధానము పూర్వమే చెప్పబడినది.

లోకమున కర్త శక్త్యుపేతుడై యుండియు నింద్రియాదికరణము లతో కూడియుండుట చూచుచున్నాము. బ్రహ్మ మెంతటి శక్తితో కూడిన దైనను ఇంద్రియాదిరూపకరణములు లేనిదై యున్నది, అందువలన నది జగత్తునకు కర్తయని చెప్ప నసువు కాదందురేని, అందుకు సమాధానము పూర్వమే (శ్రుతేస్తు శబ్దమూలత్వాత్. ౨-౧-౨౭. సూత్రమున) చెప్ప బడినది. బ్రహ్మము కరణరహితమని శ్రుతి యెట్లు చెప్పుచున్నదో యట్లే జగత్కర్తయని చెప్పుచున్నది. బ్రహ్మము జగత్కర్త యనుట శ్రుతి మూలకసిద్ధాంత మగుట నందు దోషము నుద్ఘాటింపరాదు. పాణిపాదాది కరణములు లేకున్నను సర్వశక్తి మంతమగు బ్రహ్మము జగత్కర్త యగుటలో దోషము లేదని సూత్రాభిప్రాయము. (౩౧)

బ్రహ్మకారణవాదమును మరియొకవిధమున మరల నాక్షేపించు చున్నాడు.

## న ప్రయోజనవత్త్వాత్ ౨-౧-౩౨

ప్రయోజనవత్త్వాత్ = చేతన ప్రవృత్తి ప్రయోజనము గలదగుట వలన, న=బ్రహ్మము జగత్కారణము కాదు.

లోకమున ప్రాణులప్రవృత్తి ప్రయోజనవంతమై యుండుట చూడ నగును. మందబుద్ధి గలవాడుకూడ ప్రయోజనము లేని పనిలో ప్రవర్తింపడు. ఆలోచించి కార్య మొనర్చువాని ప్రవృత్తి నిష్ప్రయోజన మెన్నడు కాదు. ప్రాణిప్రవృత్తివలన కలుగుప్రయోజనము తనకైనను పరులకైనను నుపయుక్తించి యుండును. పరబ్రహ్మ పరమాత్మకు స్వప్రయోజన ముండు నన వలనుపడదు. పరబ్రహ్మము నిత్యతృప్తము; ఆనందస్వరూపము; పరిపూర్ణము. అందువలన బ్రహ్మమునకు వలసిన ప్రయోజన మేముండును? బ్రహ్మమునందు జగద్రచనాప్రవృత్తి పరప్రయోజనార్థము కలుగు ననుటయు సంగతముకాదు. పరుల ననుగ్రహించుటకై బ్రహ్మము ప్రవర్తించు నందు మేని సృష్టికి పూర్వము పరులెవరుందురు? ఉందురని యెంచినను వారి ననుగ్రహించుటకై నిర్మించుసృష్టి దుఃఖమయము కాక సుఖమయముగ నుండవలెను. జగత్తు దుఃఖమయ మనుట లోకసిద్ధము. కాబట్టి పరుల ననుగ్రహించుటకై దుఃఖమయమగు జగత్తును రచించుటకు బ్రహ్మమున ప్రవృత్తి కలుగుననుటయు పొసగదు. కాబట్టి జగజ్జన్మాది కారణము బ్రహ్మమనుట సమంజసము కాదని సూత్రాభిప్రాయము. (౩౨)

ప్రత్యాక్షేప సూత్రము :

**లోకవత్తు లీలాకైవల్యమ్ ౨-౧-౩౩**

('తు' సమాధానసూచకము.)

లోకవత్=లోకమునందువలె, లీలాకైవల్యమ్=లీలామాత్రమే.

లోకమున రాజులు, ధనికులు తమకు ప్రయోజనము లేకున్నను విలాసార్థమై నృత్యము, గానము మున్నగు కళలను ప్రదర్శింపజేయుదురు. అట్లే నిత్యతృప్తము నానందమయము నగు బ్రహ్మము స్వప్రయోజనము లేకున్నను విలాసార్థమై జగన్నిర్మాణమున నేల ప్రవర్తింపరాదు?

లోకమున కొందఱు సమృద్ధులు కేవలవిలాసార్థము కొంతొక కార్యమున ప్రవర్తించునట్లు బ్రహ్మముకూడ విలాసార్థము జగజ్జన్మాదులకు నిమిత్తమగుచున్నదని చెప్పవచ్చునని సూత్రాభిప్రాయము. (౩౩)

బ్రహ్మ మీ జగత్తును విలాసార్థము సృష్టించువనుటయు యుక్తము కాదు. జగత్తున కొందఱు మిక్కిలి సుఖము ననుభవించుటయు, కొందఱు మిక్కిలి దుఃఖము ననుభవించుటయు, మరికొందఱు సుఖదుఃఖములను రెండింటిని విశేషముగ ననుభవించుటయు జూచుచున్నాము. ఇంతటి విషమముగ సుఖదుఃఖము లనుభవించునట్లు జగత్తును రచించిన బ్రహ్మప్రవృత్తి విలాసార్థమనుట యుక్తము కాదు. లోకమున నొకని ప్రవృత్తివలన నితరులకు సుఖదుఃఖములు కలిగిన నట్టివానిప్రవృత్తి రాగద్వేష ప్రయుక్తమనబడును. అట్లే బ్రహ్మప్రవృత్తివలన ప్రాణులకు విషమరూపమున సుఖదుఃఖములు కలుగుచున్నందున నా ప్రవృత్తి వైషమ్య నైర్ఘృణ్య దోషయుక్త మనక తప్పదు. బ్రహ్మమునందు రాగద్వేషము లున్నవనుట అయుక్తము. కాబట్టి జగత్కారణమగు బ్రహ్మప్రవృత్తి విలాసార్థమనుట సమంజసము కాదందురేని - సమాధానము :

వైషమ్య నైర్ఘృణ్యేన సాపేక్షత్వాత్
తథా హి దర్శయతి ౨-౧-౩౪

వైషమ్య, నైర్ఘృణ్యే = అసమత, నిర్దయత అను నీరెండును, సాపేక్షత్వాత్ = కారణ సాపేక్షకము లగుటవలన, న = జగత్కర్తయగు బ్రహ్మమున కంటవు. తథా హి = అట్లే శబ్దము ప్రతిపాదించుచున్నది.

విషమము, విచిత్రము నగు నీజత్తును బ్రహ్మము తనయిచ్చవచ్చినట్లు నిర్మింపదు. జగన్నిర్మాణము సాపేక్షమే కాని నిరపేక్షము కాదు. బ్రహ్మము జగత్తును ప్రాణుల కర్మఫలముల కనుగుణముగ నిర్మించును. ప్రాణు లొనర్చు కర్మములు పుణ్యాపాపభేదమున రెండు విధములుగ వ్యవ

హరింపబడును. అధిక పుణ్యకర్మముల నొనర్చువా రధిక సుఖముల ననుభవించుటకును, అధికపాపముల నొనర్చువా రధికదుఃఖముల ననుభవించుటకును వీలగునట్లు బ్రహ్మ మీజగత్తును నిర్మించును. అందువలన బ్రహ్మమునకు వైషమ్య నైర్ఘృణ్యములు (అసమత, నిర్దయత) అంటవు. జీవులనుభవించు సుఖదుఃఖముల కసాధారణ కారణము వా రొనర్చు కర్మములే కాని బ్రహ్మము కాదు. బ్రహ్మకృత్యము ప్రాణుల కర్మలకు తగినట్లు సుఖదుఃఖములు లభించు విధమున జగత్తును నిర్మించుటయే. అందువలన బ్రహ్మమున కుపర్యుక్తదోషములతో సంబంధము లేదని భావము. ఉపనిషత్తులందును నిట్లే వర్ణింపబడియుండుట చూడనగును.

'పుణ్యేన పుణ్యం లోకం నయతి, పాపేన పాపం
ఉభాభ్యాం మనుష్యలోకమ్.' ప్ర. ౩-౭.

'పుణ్యో వై పుణ్యేన కర్మణా భవతి, పాపః పాపేన'
బృ. ౩-౨-౧౩

'జీవులు, తాము చేయు కర్మలకు తగినట్లు సుఖదుఃఖముల ననుభవింప, దగు శరీరములను బొందుదురని వాక్యాభిప్రాయము.

ఈశ్వరుడు జగన్నిర్మాణమునందు జీవులకర్మల నపేక్షించినచో నతని యైశ్వర్యమునకు లోటు సంభవించునని యెంచరాదు. జీవులు చేయు పుణ్యపాపములకు తగిన ఫలములను తగినట్లు తగినకాలములో ననుభవింప జేయుటవలన నతని స్వామిత్వమునకు భంగము వాటిల్లదు. రాజు రాజ్యమొనర్చుచు దోషులను దండించును. సుకృతుల ననుగ్రహించును. అట్లే బ్రహ్మము కర్మానుగుణముగ జగన్నిర్మాణ మొనర్చుటలో దోష మొకింతయు లేదని భావము. (౩౪)

**ఉపర్యుక్త విషయమున గలుగు శంకకు సమాధానము :**

## న కర్మావిభాగా దితి చేన్నానాదిత్వాత్ ౨-౧-౩౫

అవిభాగాత్ = బ్రహ్మమునందు జీవు లవిభాగ రూపమున నున్నందున, నేతి చేత్ = సృష్టికి పూర్వము ప్రాణికర్మ లుండవందురేని, అనాదిత్వాత్ = జగత్తువలెనే ప్రాణికర్మలకు నాది యుండనందున, న = దోష ముండదు.

'ఆత్మా వా ఇద మగ్ర ఆసీత్ నాన్య త్కించన మిషత్'

'ప్రళయ సమయమునందు బ్రహ్మముతక్క వేరొం డేమియు నుండదు. భోక్తృ భోగ్య రూపమగు జగత్తంతయు బ్రహ్మమునం దవిభక్తమై యుండుననియు నైతరేయోపనిషత్తునందు చెప్పబడియున్నది.' అందువలన ప్రాణులు ప్రాణికర్మలు నేవియు వేరుగనుండవు. కాబట్టి ప్రాణికర్మల నపేక్షించి జగన్నిర్మాణము చేయుననుట పొసగదందురేని, అట్లన రాదు. కారణ మేమన: చిదచిదాత్మకమగు నీ జగత్తు అనాది యైనట్లు ప్రాణికర్మములు ననాదులే. ప్రళయమున జగత్తంతయు బ్రహ్మమున నవిభక్తమై సూక్ష్మముగ నుండుననియే వాక్యము చెప్పుచున్నది. కాని జగదత్యంతాభావమును వర్ణించుట లేదు. ప్రాణులును చేష్టింపక యుండును. వాని నాశ్రయించుకొనియున్న కర్మములు నుండును. వాని కత్యంతా భావము కలుగదు. కాబట్టి సూక్ష్మరూపమున నున్న కర్మల కనుగుణముగనే బ్రహ్మ మీ జగత్తును సృష్టించును. కాబట్టి కర్మాపేక్షమగు జగన్నిర్మాణమున దోషము లేదని భావము. (౩౫)

ప్రకృతి, జీవులు, నీశ్వరుడు నాదిలేని (అనాది) పదార్థములైనను కర్మము జన్యము కాబట్టి దాని కాది యుండును. అది యనాది కాదు. కర్మ మనాది యని శాస్త్రకారులు చెప్పబడలేదు కదా! యన ;

## ఉపపద్యతే చాప్యుపలభ్యతే చ ౨-౧-౩౬

ఉపపద్యతే చ = కర్మ మనాది యనుట హేతుబద్ధమే. అప్యుపల భ్యతే చ = కర్మ మనాది యని శాస్త్రములందు చెప్పబడియుండుటయు లభించుచునే యున్నది.

కర్మ మనాది కానిపక్షమున ప్రపంచమున జూడబడు వైచిత్ర్యము నిర్హేతుకము - ఆకస్మికము - అగును. అది యాకస్మికమని యంగీకరింప వలను పడదు. జగత్తునందలి వైచిత్ర్యమునకు బ్రహ్మము కారణముగ, నంగీకరింతుమేని బ్రహ్మమున వైషమ్యనైర్ఘృణ్య దోషములువాటిల్లును. వైషమ్యాదులు నిర్హేతుకము లందుమేని అకృతాభ్యాగమదోషము కలుగును. నేరము చేయకయే దండన లభించిన ట్లగును. అందువలన జగద్వైచిత్ర్యము కర్మహేతుకమని యంగీకరింపక తప్పదు. కాగా కర్మ మనాదియని సిద్ధ మగును. ప్రకృతి, పురుషులు, ఈశ్వరుడు నను మూడు పదార్థములును స్వరూపముతో ననాదులు. కర్మము, జగత్తు నీరెండును ప్రవాహరూపమున ననాదులు. కర్మ మనాది కావున కర్మాపేక్షపూర్వక జగన్నిర్మాణమున దోషము లేదనుట యుపపన్నమే యగుచున్నది.

'కర్మ వైచిత్ర్యాత్ సృష్టి వైచిత్ర్యమ్' సాం. ౬-౪౧

'కర్మ వైచిత్ర్యము వలననే సృష్టిలో వైచిత్ర్య'మని సాంఖ్య స్మృతిలో చూడనగును. జీవులతో బాటు కర్మములు ననాదులే. అట్లే జగత్తుకూడ నని తెలియనగును. (౩౬)

ఈ విచిత్ర జగద్రచనకు ఒక్క కర్మమునే బ్రహ్మ మపేక్షించు నని యెట్లు చెప్పగలము? ధర్మాధర్మము లను వాసనలు మాత్రము జీవ ధర్మములు కావా? వాని యపేక్ష యుండదా? ఆ వాసనలు అనాదులని సిద్ధింపకున్న బ్రహ్మము జగజ్జన్మాదులకు కారణమని యె ట్లంగీకరింప గలము? అన:

## సర్వధర్మోపపత్తేశ్చ          २-१-३२

జీవాత్మకు సంబంధించిన ధర్మములం దన్నింటియందును, ననాదిత్వము సిద్ధించుటవలననే బ్రహ్మము జగజ్జన్మాదులకు కారణమనుట యుపపన్నమగునని సూత్రాభిప్రాయము.

ప్రవాహరూపమున కర్మ మనాదియని యంగీకరించినట్లు జగద్రచనకు కర్మమువలె వాసనలు నపేక్షితములే కావున నవియు ననాదులనియే తెలియవలెను. కర్మము జీవధర్మమైనట్లు వాసనలును జీవధర్మములే కదా। కర్మ మనాదియైన నవి యెందులకు కావు? వాసనాది జీవధర్మము లన్నియు జగద్రచనకు సహకారికారణము లగును. కార్యమగు నీ జగత్తును ప్రవాహరూపమున ననాదియని పూర్వమే నుడివియుంటిమి. కార్య మనాదియైన తద్రచన కపేక్షితములగు కారణములును ననాదులు కాకతప్పదు, కార్యకారణము లొకేకాలమున నుండవలయు ననుట నియమము. జగత్కర్తయగు పరబ్రహ్మము సర్వశక్తియుతమై యుండును. కాబట్టి జగద్రూపకార్యమును రచియించుటకు నపేక్షితములగు కర్మాదిసాధనము లన్నియు సాంసిద్ధికములై యెల్లపుడు నుండునని ప్రత్యేకముగ జెప్పనక్కరయేలేదు.

కాబట్టి వైషమ్య నైర్ఘృణ్య దోషనివారణార్థము కర్మ మెట్లవసరమో యట్లే జీవధర్మములు - వాసనాదులు నవపరములే కావున వాని సహకారముతో బ్రహ్మము జగజ్జన్మాదులకు కారణమని సిద్ధమగుచున్నది. (३२)

వేదాంత దర్శన - అంబా వ్యాఖ్యానమున

ద్వితీయాధ్యాయమునందు ప్రథమపాదము

సమాప్తము

# ద్వితీయాధ్యాయము

## ద్వితీయపాదము

### ప్రథమాధికరణము

ప్రథమపాదమునందు బ్రహ్మము జగత్కారణమనుటలో నేర్పడు స్మృతివిరోధమును, తర్కవిరోధమును దొలగింప మహర్షి యత్నించి యున్నాడు. ఈ పాదమునందు ప్రకృతియే జగజ్జన్మాదులకు స్వతంత్రకారణమని చెప్పువాదమును తర్కబలముతోనే నిరసించి వేదాంతవాక్య సమన్వయ నిర్ణయమగు బ్రహ్మకారణత్వమును బలపరచుటకై మహర్షి మొదట ప్రధానము - ప్రకృతి - స్వతంత్రకారణమను పక్షమును నిరసించుచున్నాడు.

రచనానుపపత్తేశ్చ నానుమానమ్ ౨-౨-౧

రచనానుపపత్తేః = జగద్రచన యుపపన్నము కానందువలన, అనుమానమ్=అనుమాన ప్రమాణముచే దెలియదగు ప్రధానము - ప్రకృతి, న= స్వతంత్రముగ జగత్తును రచియింప కారణము కాదు.

కొందఱు జగజ్జన్మాదులకు బ్రహ్మమువలెనే ప్రధానము - ప్రకృతి - స్వతంత్రకారణమని యెంచుచున్నారు. బ్రహ్మము స్వభావవిశేషబలమున జగత్తును నిర్మించుటకు స్వతంత్రకారణము కాగలదని వైదికులు చెప్పుదురు. అట్లే కొందఱు ప్రధానముకూడ స్వతంత్రముగ జగత్తును నిర్మించుటకు దగినస్వభావము గలదని యంగీకరింతురు. బ్రహ్మమునందే యట్టి స్వభావ మున్నదనియు, ప్రధానమున లేదనియు చెప్పుటకు విశేషకారణ మేదైన నుండవలయును. అట్టిది లేనిపక్షమున ప్రధానము జగన్నిర్మాణమునకు స్వతంత్రకారణము కాదనుట యుక్తము కాదని వారి యభిప్రాయము.

ప్రకృతికి ప్రధాన మను నామము శాస్త్రప్రయుక్తము. (ప్రధీయతే విధీయతే సర్గవేలాయాం జగ దనేన, ప్రధీయతే నిలీయతే ప్రళయవేలాయాం జగ దస్మి న్నితి ప్రధానమ్) సృష్టిసమయమున జగత్తును విధించును. ప్రళయసమయమున తనలో జగత్తును లీనము చేసికొనును. కాబట్టి ప్రకృతి ప్రధాన మనబడునని ప్రధానమునకు వ్యుత్పత్తి. అందువలన ప్రకృతికారణవాదులు, ప్రధానమే స్వభావము ననుసరించి జగత్తును నిర్మించుననియు, బ్రహ్మము జగత్తునకు కారణము కాదనియు నందురు. కాని యయ్యది యుక్తము కాదు. చేతనాధిష్ఠితముకాని ప్రధానము జగత్తును నిర్మించు ననుట యుపపన్నముకాదు - హేతుబద్ధముకాదు. కొందొక ప్రయోజనము నుద్దేశించి చేయుపదార్థములవిన్యాసమే రచన - నిర్మాణము - అనబడును. అట్టి యుద్దేశము జడపదార్థధర్మము కానేరదు. అయ్యది చేతనధర్మము. జడమగు ప్రధానము పదార్థములను ప్రయోజనవంతములుగ తీర్చిదిద్ది రచియింపలేదు. ఏ పదార్థముల నెట్లు కూర్చిన నే ప్రయోజనము సిద్ధించునో దాని కేమి తెలియును? అట్లు చేతనమే సంధింపగలదు. రచన జ్ఞానపూర్వకమగును. కాని, యజ్ఞానపూర్వక మెందును కానము.

స్వభావవిశేషమువలన ప్రధాన మట్లు నిర్మింపగలదని కల్పించుటయు నుచితముకాదు. కల్పన లోకదృష్టమునకు విరుద్ధముగ నుండరాదు. లోకమున చేతనసంబద్ధముకాని జడపదార్థ మేదియు ప్రయోజనవంతమగు వస్తువులను రచించుట కానము. లోకమున నెందును లభింపని కల్పన బుద్ధిమంతుల కంగీకారము కాదు. అందువలన ప్రధానము చేతనాధిష్ఠితమై జగద్రచనకు కారణ మగుచున్నదని యంగీకరింపక తప్పదు. బ్రహ్మము చేతనము. అందు నిరతిశయమైన జ్ఞానక్రియాశక్తి స్వాభావికమైనది యున్నది. కావున బ్రహ్మము జగద్రచనకు స్వతంత్రకారణ మగుచు తన యధీనమున నున్న ప్రకృతినామక ప్రధానముతో నీ విచిత్రజగత్తును రచియించుచున్న దనుట హేతుబద్ధ మగును. లోకమున చేతనుడగు కుంభ

కారుడు తన యధీనమున నుండు మట్టితో నానావిధములగు పాత్రలను నిర్మించుట నిత్యమును జూచుచున్నాము. ఇట్టి రచనాశక్తి స్వాభావికముగ గాని, నిమిత్తమువలన గాని ప్రధానమునం దున్నదనుటకు ప్రమాణ మొందును గానము. కావున ప్రధానము జగద్రచనకు స్వతంత్రకారణము కానేరదు. కాగా బ్రహ్మమువలె ప్రధానము జగజ్జన్మాదులకు స్వతంత్ర కారణ మనుట యుక్తముకాదు. (౧)

మరియొక హేతువు :

ప్రవృత్తేశ్చ ౨-౨-౨

చ=మరియును, ప్రవృత్తేః = ప్రధానము జగద్రచనకు ప్రవృత్త మగుననుటయు నుపపన్నము కానందున నది స్వతంత్రకారణము కాదు. స్వతంత్రమగు ప్రధానమునకు ప్రవృత్తియే కలుగనేరదు. అట్టియెడ నది జగత్తు నెట్లు రచియింపగలదు ? కొండొక కార్యవిశేషముకొఱకు గలుగు క్రియావిశేషము ప్రవృత్తి యనబడును. అట్టి ప్రవృత్తి జడపదార్థమునందు చేతనసంబంధమువలననే కలుగును. స్వతః కలుగదు. లోకమున చేతన ప్రాణి 'నాచే నీ కార్య మీ పదార్థముద్వారమున నిష్పన్నము చేయబడినది' యని తెలిసికొనును. అచేతనమున కట్టి తెలివి - వేదనము - కలుగదు. అచేతనమున వేదనశక్తి లేదుకదా! ప్రధాన మచేతనము. అది యెట్లు కార్యాకార్యములను విచారించి ప్రవర్తింపగలదు ? లోకములో చేతనాధి ష్ఠిత శరీరమునందు రథము నధిరోహించు ప్రవృత్తి గలుగుట చూచు చున్నాము; కాని శవమునం దట్టి ప్రవృత్తి చూడము. లోకదృష్టము కాని కల్పన ప్రధానమున జేయుట యుచితము కాదు. కాబట్టి స్వతంత్రముగ ప్రధానము జగజ్జన్మాదులకు కారణ మనుట సంగతము కాదు. (౨)

## పయోఽమ్బువచ్చేత్ తత్రాపి ౨. ౨. ౩

పయోంబువత్ = క్షీరనీరములవలె, చేత్=ప్రధానమునకు ప్రవృత్తి కలుగునందురేని, తత్రాపి=అందునను చేతనసంబంధమువలననే ప్రవృత్తి కలుగును.

పాలు వత్సాభివృద్ధికొఱకు స్రవించును. లోకోపకారార్థము నీరు స్వయముగ ప్రవహించును. నీరక్షీరములలో నిట్టి ప్రవృత్తి కనిపించు చున్నందున జడప్రధానము కూడ నట్లే జగద్రచనకు ప్రవృత్త మగుచున్న దందురేని, అది సరికాదు. ఆవు దూడయందున్న ప్రేమచే స్వయముగ పాలను స్తనములనుండి స్రవింపజేయును. అందువలన చేతనసంబంధము వలననే క్షీరమునందు స్రవణక్రియ కలుగుచున్నది; కాని స్వయముగ కలుగదు. అట్లు కలుగు నందురేని పాత్రయందున్న పాలు స్వయముగ ప్రవహించి దూడముఖమున జేరవలెను. అట్టి ప్రవృత్తి యెటనైనను జూడగలమా? ఇక నీరు స్వయముగ ప్రవహించుచున్న దందురేని అదియును సరికాదు.

'ఏతస్య వా అక్షరస్య ప్రశాసనే గార్గి। ప్రాచ్యోఽన్యా నద్యః స్యందంతే' బృ. ౩-౭-౯. 'అక్షరమగు నీ బ్రహ్మప్రశాసనమునసే నదులు ప్రవహించుచున్నవి' అని శబ్దప్రమాణము నుడువుచున్నది. అందువలన నీరము స్వయముగనే ప్రవహించు ననుటయు యుక్తము కాదు. పాత్రలో నుంచిన నీరు దప్పిక గొన్నవాని ముఖమున జేరి వానిదప్పిక నెటనైన తీర్చుట చూడగలమా? నీటిలో పల్లమునకు ప్రవహించు గుణ మున్నది కాని, యెరిగి యెరిగి నీరు స్వయముగ లోకులకు హిత మొసఁగవలెనని ప్రవహింప ప్రవర్తించు ననుట తర్కసంగతము కాదు. అందువలన నీ యుదాహరణములమూలమున జడమగు ప్రధానమున ప్రయోజనార్థక మగు ప్రవృత్తి కలదనుట హేతుబద్ధము కాదు. (౩)

ఇట్లు మహర్షి స్వతంత్ర ప్రధానకారణవాదమును నిరసించి, ప్రళయ వ్యవస్థయు నేర్పడదని మరియొక దోషమును జూపుచున్నాడు.

వ్యతిరే కానవస్థితే శ్చానపేక్షత్వాత్ ౨-౨-౪

చ=మరియును, అనపేక్షత్వాత్=ప్రళయవ్యవస్థ నొనర్చు చేతనము నపేక్షింపనందున - ప్రధానము స్వతంత్రకారణమని యంగీకరించుటవలన, వ్యతిరే కానవస్థితేః = ప్రళయవ్యవస్థ కలుగనేరదు. కాబట్టి ప్రధానము స్వతంత్రకారణము కాదు.

ప్రధానము జగద్రచనకు స్వతంత్రకారణ మెట్లు కానేరదో యట్లే ప్రళయమునకును కారణము కాజాలదు. ప్రకృతి సమానరూపమున బరిణమించుట సృష్టి యనబడును. విరూపమున బరిణమించుట ప్రళయ మన బడును. వ్యవస్థ యన మర్యాద - అవధినిర్ణయము - అననగును. విరూప పరిణామమున నింతకాల ముండి యనంతరమున సరూపపరిణామమున నింతకాల ముండవలయు ననుటయే మర్యాద - వ్యవస్థ - యని భావము. సృష్టికి తదుపరి ప్రళయము, ప్రళయమునకు తదుపరి సృష్టి యేర్పడు ననుట కేవల తార్కికులకు నిష్టమే; శాస్త్రవాదులకు నిష్టమే; ఉభయ పక్షములకు సమ్మతమే యని భావము. అట్టియెడ 'ఇంతకాలము సరూప పరిణామము - సృష్టి - కలుగవలెను. తదుపరి యింతకాలము విరూప పరిణామము - ప్రళయము - కలుగివలె నని వ్యవస్థ నేర్పరచుట చేతనధర్మ మగును కాని యచేతనధర్మము కాదు. అట్టి స్వభావము ప్రధానమున నంగీకరించుటకును వీలులేదు. రెండువిరుద్ధధర్మము లొక వస్తువునకు స్వభావ మనుట తగదు. సరూపపరిణామము ప్రధాన (ప్రకృతి) స్వభావ మగునెడల విరూపపరిణామము దాని స్వభావము కానేరదు. ఈ పరిణామ ములు పరస్పరవిరుద్ధములు. విరుద్ధధర్మములు స్వభావ మనుట తర్కసంగ తము కాదు. ప్రకృతి సమానరూపమున పరిణమించు స్వభావము గల దగు

లేని నిరంతరముగ సృష్టి జరుగుచుండును, ప్రళయ మేర్పడదు. విరూప పరిణామము దానిస్వభావ మందుమేని సృష్టియేర్పడదు. మూడవప్రకారము ప్రకృతిలో కల్పింప నసువుగాదు. కాబట్టి ప్రధానము జగజ్జన్మాదులకు స్వతంత్రకారణ మగుననుట పొసగదు. సరూప విరూప పరిణామములు కర్మాపేక్షము లందురేని, అదియును సంభవము కానేరదు. ప్రధాన మెట్లు జడమో, కర్మము నట్లే జడము. జడము వ్యవస్థాపకము కాదు. నపుంసకుడు వంధ్యంగూడి సంతానము గనగలుగునా? కాబట్టి ప్రధానము స్వతంత్ర కారణ మనుపక్షమున ప్రళయవ్యవస్థ యేర్పడనేరదు. కాగా బ్రహ్మమే జగజ్జన్మాదులకు స్వతంత్రకారణము. (౪)

### అన్యత్రాభావాచ్చ న తృణాదివత్ ౨-౨-౫

అన్యత్ర=బలీవర్దము (ఎద్దు) నందు, అభావాత్ చ=క్షీరరూపమున బరిణమింపనందునను, తృణాదివత్ = తృణాదులవలె, న = అనపేక్షిత ప్రధానము సృష్టి ప్రళయరూపమున బరిణమించు ననుట సరికాదు.

ఆవులు మేయుచున్న తృణాదులు స్వయముగానే క్షీరరూపమున బరిణమించుచున్నవి. అట్లే నిమిత్తాంతరము నపేక్షింపకయే ప్రధానము నియతకాలమునకు ప్రళయరూపమున బరిణమింపవచ్చునుగదా! అందురేని, అదియును సరికాదు. ఆవు తినుచున్న తృణాదులు నియతసమయమునకు స్వయముగనే - కారణము నపేక్షింపకయే - క్షీరముగ మారుస్వభావము గలిగియున్నపక్షమున బలీవర్దము (ఎద్దు) నందును తృణాదులు నియతకాలమున క్షీరముగ బరిణమింపవలసియుండును. అట్లు పరిణమించుట లోకమున జూడము. కాబట్టి కారణాంతరము నపేక్షింపకయే ప్రధానము నియతసమయమున ప్రళయరూపమున బరిణమించు ననుట యుక్తియుక్తము కాదు. (౫)

అభ్యుపగమేఽప్యర్థాభావాత్ ౨-౨-౬

అభ్యుపగమేఽపి = కొంతతడ వట్లగునని యంగీకరించినను, అర్థాభావాత్ = ప్రయోజనము లేనందున, ప్రధానము సృష్టిప్రళయరూపముల స్వయముగనే పరిణమించు ననుట యుక్తము కాదు.

జడమగు ప్రధానమునందు రచనానుకూలప్రవృత్తి కలుగుటకు వీలుకానందున నయ్యది సృష్టిప్రళయములకు స్వతంత్రకారణము కాజాలకున్నను 'తుష్యతు దుర్జనన్యాయము' ననుసరించి యేదో యొకవిధముగ కొంత తడ వట్లగునని యంగీకరించినను ప్రయోజనము కనిపింపదు. లోకమున నెల్లరు స్వప్రయోజనముకొఱకో, పరప్రయోజనముకొఱకో కొండొక వస్తువును సృజింతురు. లేక నాశము చేయుదురు. ప్రయోజనము మనసున నుంచుకొని యిట్లు చేయుట చేతనలక్షణము. జడమగు ప్రధానమునకు ప్రయోజనమన నేమో తెలియదు. అట్టియెడ ప్రయోజనార్థకములగు సృష్టిప్రళయప్రవృత్తులు ప్రధానమున స్వతంత్రముగ నెట్లు కలుగును ? కలుగనేరవని భావము. (౬)

పురుషాశ్మవ దితి చేత్ తథాఽపి ౨-౨-౭

పురుషాశ్మవత్ = పురుషప్రయోజనమును సాధించుటకై జడమగు నయస్కాంతమణి స్వయముగనే లోహపువస్తువుల నాకర్షించునట్లు ప్రధానము సృష్టిప్రళయముల నొనర్పగలదు. ఇతిచేత్ = అని యందురేని, తథాపి = అట్లును, ప్రధానము సృష్టిప్రళయముల నొనర్పజాలదు.

ఒకానొక వ్యక్తి తన కాలియందున్న కంటకము (ముల్లు) ను తొలగించుటకై దూరమున నున్న సూదిని సూదంటురాతితో గ్రహించును. ఇట నా వ్యక్తికి ప్రయోజనము కలిగించుటకై సూదంటురాయి యితర సాధనము నపేక్షింపకయే దూరమున నున్న సూది నాకర్షించుచున్నది.

అట్లే ప్రధానమునకు నిమిత్తాంతరము నపేక్షింపకయే కేవల భోగాపవర్గ రూప ప్రయోజనార్థమై సృష్టి ప్రళయరూపమున బరిణమించు నందుమేని. అదియును సరికాదు.

సూదంటురాతిలో సూదుల నాకర్షించుశక్తి యొకేరూపమున నెల్లప్పు డుండును. ఆ శక్తి యొకప్పు డుండుటి మఱియొకప్పు డుండుట లేక పోదు. ఒకేరూపమున నుండును. ప్రధానమున నట్లే సృష్టిరూపమున బరిణమించుశక్తి యున్న దందుమేని ప్రళయ ముపపన్నము కాదు. ప్రళయ రూపమున బరిణమించుశక్తి యున్న దందుమేని సృష్టి కలుగనేరదు. ఉభయశక్తు లొకేసమయమున నున్న వనుటకు దృష్టాంతము లేదు. కాబట్టి ప్రధానము స్వతంత్రముగ నన్యము నపేక్షింపకయే పురుషప్రయోజనార్థము జగజ్జన్మాదులకు కారణ మనుట పొసగదని సూత్రతాత్పర్యము. (౭)

అంగిత్వానుపపత్తేశ్చ　　　౨-౨-౮

చ = మరియు, అంగిత్వానుపపత్తేః = స్వామిత్వ ముపపన్నము కానందువలన ప్రధానము సృష్టిప్రళయరూపమున స్వయముగనే పరిణమించు ననుట యుక్తియుక్తము కాదు.

ప్రకృతి (ప్రధానము) యందు పరిణమించు శక్తి యున్నదికదా! ఆశక్తికి స్వామి- అంగి -ప్రధానమే యగును. అందువలన ప్రధానము తనశక్తికి తానే వ్యవస్థాపకమును నాగలదు. ఇతరము నపేక్షింపకయే ప్రధాన మేలి సృష్టిప్రళయానుకూలముగ పరిణమింపరా దందురేని, అదియును పొసగదు. కారణ మేమన ప్రధానము పరిణామశక్తికి స్వామి యన జెల్లదు. స్వామిత్వము జ్ఞానియందే యుండును. అజ్ఞాని స్వామి కాజాలదు. ప్రధానమువ జ్ఞాన ముండదు. అందువలన నది సృష్టిప్రళయముల నెట్లు వ్యవస్థాపింపగలదు. కాలవిజ్ఞానము లేని ప్రధానము సృష్టిప్రళయముల

వ్యవస్థ యెట్లు చేయగలదు? నియతసమయమున సృష్టిప్రళయములు జరుగుచుండుటవలన సమయజ్ఞుడైన వ్యవస్థాపకుడు లేకున్న నవి జరుగ నేరవు. కాబట్టి ప్రధాన మన్యము నపేక్షింపక సృష్టిప్రళయరూపమున పరిణమించు ననుట తర్కాసహము కాదు. (౮)

ప్రధానము స్వయముగ సృష్టిప్రళయరూపముల పరిణమింపక పోయిన పోనిండు. కాలమును వ్యవస్థాపకముగ నంగీకరించిన దోష మేమి? అందురేని - సమాధానము :

అన్యథాఽనుమితౌ చ జ్ఞశక్తివియోగాత్ ౨-౨-౯

జ్ఞశక్తివియోగాత్=కాలమునందు జ్ఞాతృత్వశక్తి లేనందున, అన్య థానుమితౌ చ = కాలమును వ్యవస్థాపకముగ ననుమానించినను, ప్రధాన మితరము నపేక్షింపక సృష్టిప్రళయరూపమున బరిణమించు ననుట సమం జసము కాదు.

లోకమున నాయా ఋతువులలో నియతముగ పుష్పఫలాదు లుత్ప న్నము లగుటయు, నియతకాలమున నవి నశించుటయు జూచుచున్నాము. కాబట్టి ప్రధానము సమయమునకు తగినట్లు సృష్టిరూపమునను, ప్రళయ రూపమునను బరిణమించుటకు తగినవ్యవస్థ కాలమువలననే యేర్పడ గలదు. బ్రహ్మమును వ్యవస్థాపకముగ నంగీకరింపనేల? అనరాదు. కాలము జడము; జ్ఞానశూన్యమును. జ్ఞానము లేక వ్యవస్థ జేయనొల్లదు. కాబట్టి జగజ్జన్మాదులకు ప్రధానము స్వయముగ స్వతంత్రకారణ మనుట యుక్తము కాదు. ఆ యా ఋతువులం దా యా ఫలపుష్పము లేర్పడుటకు తగినవ్యవస్థ కాలమే చేయు ననుటయు సరికాదు. పరమేశ్వరాధీనమై యా యా ఋతువులందు వృక్షలతాగుల్మాదులు పత్రపుష్పఫలసంపన్నము లగుచుండును. పరబ్రహ్మపరమాత్మ కాలమునకు కాలము. (కాలకాలో గుణీ సర్వవిద్ యః. శ్వే. ౬-౧౬)

'పరమేశ్వరుడు కాలమునకు కాలము. గుణవంతుడు, సర్వవిదుడు' అని శ్వేతాశ్వతరమున వర్ణింపబడుట చూడనగును. కావున స్వతంత్రముగ ప్రధానము జగజ్జన్మాదులకు కారణమని చెప్పుట యుక్తము కాదు. (౯)

## విప్రతిషేధా చ్చాసమంజసమ్ ౨-౨-౧౦

చ=మరియు, విప్రతిషేధాత్=శ్రుతి విశేషముగ నిందించి ప్రతిషేధించినందువలన, అసమంజసమ్ = స్వతంత్రప్రధానము జగజ్జన్మాదులకు కారణమనుట సమంజసము కాదు.

శ్రుతిస్మృతులలో నాస్తిక్యము విశేషించి నిందింపబడినది. జగన్నిర్మాతయగు పరబ్రహ్మపరమాత్మ నంగీకరింపకుండుట మిక్కిలి నిందితముగ నెంచి శ్రుతిస్మృతు లది తగదని ప్రతిషేధించి యున్నవి. అందువలనను స్వతంత్రప్రకృతి జగజ్జన్మాదులకు కారణ మనుట సమంజసము కాదని సూత్రాభిప్రాయము. (౧౦)

## ద్వితీయాధికరణము

స్వతంత్రప్రధానము జగజ్జన్మాదులకు కారణము కాజాలదని నిర్ణయించి, స్వతంత్ర పరమాణువులును జగజ్జన్మాదులకు కారణము కాజాలవని నిర్ణయించుటకు మహర్షి సూత్రము నారంభించుచున్నాడు.

## మహద్దీర్ఘవద్ వా హ్రస్వపరిమండలాభ్యామ్ ౨-౨-౧౧

హ్రస్వపరిమండలాభ్యామ్=ద్వ్యణుకమువలన, పరమాణువువలన, మహద్దీర్ఘవత్ వా = త్ర్యణుకము, ద్వ్యణుకము నుత్పన్నము కానియట్లు స్వతంత్రప్రధానమువలన జగదుత్పన్నము కానేర దని సూత్రార్థము.

స్వతంత్రప్రధానము జగజ్జన్మాదులకు కారణమని కొంద రెట్లు చెప్పుదురో యట్లే స్వతంత్రపరమాణువులు జగత్కారణమని చెప్పువారును

గలరు. ఈ రెండు పక్షములవారి సిద్ధాంతములో భేదము లేదు. వారు చెప్పు జగన్నిర్మాణవిధములో కొంతభేద మున్నది. అందువలననే ప్రత్యేకముగ నణుకారణవాదమునుకూడ నిరసింపవలసివచ్చినది.

కేవలపరమాణుకారణవాదులు సృష్టిప్రళయము లిట్లేర్పడు నందురు. పరమాణువులు నిరవయవములు. రెండుపరమాణువులు చేరి యొక ద్వ్యణుక మగును. అట్టి ద్వ్యణుకములు మూడు చేరి యొకత్ర్యణుక మగును. ఇట్లే చతురణుకము, పంచాణుకము, క్రమముగా పృథివ్యాది స్థూలమగు జగత్తు నేర్పడును. ఇందు పరమాణ్వాదులు కారణములు. వానివలన నేర్పడు ద్వ్యణుకాదులు కార్యములు. కారణపదార్థములవలన కార్యపదార్థము లేర్పడును. కారణద్రవ్యములలోని గుణములవలన కార్యద్రవ్యములలోని గుణము లుత్పన్నము లగును. ఘటపటాదికార్యద్రవ్యములలో రూపాది గుణము లున్నట్లు పరమాణువులందును గుణము లుండును. ప్రళయసమయములందు పరమాణువులు విడివిడిగా నభోమండలమున నుండును. సర్గవేళలందు పరస్పరము సంయుక్తములై ద్వ్యణుకాదిక్రమమున స్థూలజగత్తును సృష్టించును. జీవులు వ్యాపకులై యుందురు. శరీరమునందు మాత్రము మనస్సుతో గూడి పదార్థములకు చైతన్యము కలిగింతురు. శరీరమునకు వెలుపల జీవులు వ్యాపకముగా నున్నను వా రేట నేమియు జేయజాలరు. మిథ్యాజ్ఞాననిమిత్తముగ జీవులకు మనస్సంబంధ మేర్పడును. మిథ్యాజ్ఞాన మున్నంతవరకు శరీరములందు మనఃసంబంధముతో తామొనర్చుకర్మల కనుగుణముగ సుఖదుఃఖముల ననుభవించుచుందురు. తత్వజ్ఞానము కలిగినమీదట నామిథ్యాజ్ఞానము తొలగిపోవును. మనఃసంబంధము విడిపోవును. అంతట జీవులు ముక్తు లగుదురు. మరల వారికి శరీరసంబంధ ముండదు. మిథ్యాజ్ఞానమును దొలగింపగల తత్వజ్ఞానము ప్రయత్నసాధ్యము. అందులకై యితరసహకార మపేక్షింప నవసరము లేదు. కాబట్టి జీవులు, పరమాణువులు తక్క యీశ్వరపదార్థ మొండు లేదు.

అందువలన పరమాణువులు జగత్తునకు స్వతంత్రకారణము లని వారి మతము.

పరమాణువాదులకు సంబంధించిన యీ ప్రక్రియ శ్రుతిస్మృతులకు విరుద్ధము. తర్కసహమును కాదు. వైదికుల కీవాద మంగీకార్యము కాదు. కారణ మేమన: పరమాణువులు జడపదార్థములు. అందువలన నవి నియతకాలమున స్వయముగ సంయుక్తము లగుటయు నియతకాలమున వియుక్తము లగుటయు నసంభవము. కాలవ్యవస్థ చేతనపదార్థమే చేయగల దని పూర్వసూత్రములందు వివరించియున్నాము. కాబట్టి యచేతనములగు పరమాణువులు జగదుత్పాదనకు స్వతంత్రకారణములు కాజాలవు. అట్లే స్వతంత్రప్రధానమును జగత్కారణము కాజాలదని సూత్రాభిప్రాయము. (౧౧)

ముందుగా నుదాహరణ సామ్యముతో పరమాణువులు స్వతంత్రకారణములు కావని చెప్పి, యిప్పుడు వానివలన ద్వ్యణుకాద్యుత్పత్తి యెందువలన కలుగదో సూత్రించుచున్నాడు.

### ఉభయథాఽపి న కర్మాత స్తదభావః ౨-౨-౧౨

ఉభయథాఽపి=రెండువిధములను, కర్మ=పరస్పరము పరమాణువులను సంయుక్త మొనర్చు కర్మ, న=ఉపపన్నము కాదు. అతః=అందువలన, తదభావః=ద్వ్యణుకాదుల యుత్పత్తి కలుగనేరదు.

పరమాణువు లొకదానితో మరియొకటి కలిసి ద్వ్యణుకాదు లేర్పడవలసియున్నది, సంయోగము కార్యము - ఉత్పన్నమగునది. దాని నుత్పన్నము చేయునది కర్మ. ఆ కర్మ యభిఘాతమువలననో లేక ప్రయత్నమువలననో కలుగును. మరియొక విధమున గలుగనేరదు. అభిఘాతముకూడ కర్మజన్యమే యగును. అందువలన సంయోగకారణమగు కర్మ ప్రయత్నమువలననే జనించునని తాత్పర్యము. ప్రయత్నము చేతనధర్మము,

అయ్యది పరమాణువులం దుండదు. పరమాణువుల కధిష్ఠానముగ చేతన మొకటి కలదని స్వతంత్రపరమాణువాదు లంగీకరింపరు. కాబట్టి చేతన సంబంధమున పరమాణువులలో కర్మ యేర్పడు ననుటకును వలనుపడదు. చేతనములు జీవు లున్నవని యంగీకరించినను వానికి ప్రళయమున శరీర సంబంధ ముండదు. కావున మనఃసంబంధము నుండదు. అట్టియెడ వానిలో నుండు ప్రయత్నము పరమాణువులలో కర్మను జనింపజేయజాలదు. కాబట్టి ప్రళయమున సృష్ట్యుత్పత్తికిపూర్వము పరమాణువులను సంయుక్త మొన ర్చుటకు వలయు సంయోగమును జనింపజేయు కర్మ పరమాణువులం దేర్పడదు. అట్టి కర్మ యుపపన్నము కానందున ద్వ్యణుకాదిక్రమమున జగదుత్పత్తి కలుగు ననుట సంభవము కాదు. కాబట్టి స్వతంత్రపరమాణు కారణవాద మనుపపన్నము - హేతుబద్ధము కాదు. (౧౨)

జీవులయదృష్టమువలన పరమాణువులందు కర్మ యేర్పడు నందు రేని - అందులకు సమాధానము :

సమవా యాభ్యుపగమా చ్చ
సామ్యా దనవస్థితేః ౨-౨-౧౩

సమవాయాభ్యుపగమాత్ = అదృష్టము జీవులయందు సమవాయ సంబంధముతో నుండును. పరమాణువులతో దాని కెట్టి సంబంధము నుండదు. అందువలన వానిలో నదృష్టము కర్మ నెట్లు జనింపజేయును ? చ=మరియు, సామ్యాత్=అదృష్టముతో కూడిన జీవులతో సంబంధము పరమాణువులకు సృష్టిప్రళయములలో సమానముగ నుండును. కాబట్టి, అనవస్థితేః = అనవస్థ కలుగును. అందువలన పరమాణువులలో కర్మ యనుపపన్న మగును - సృష్టిప్రళయములు ఏర్పడవని సూత్రార్థము.

వైదికులు నవైదికులు నెల్లరు జీవులయదృష్టమును సృష్టికి కారణ ముగ నంగీకరింతురు. అదృష్టమును కారణముగ నంగీకరింపకున్నచో

సృష్టివైచిత్ర్య ముపపన్నము కాదు. అందువలననే సాంఖ్యాచార్యులును దాని నంగీకరించియున్నారు.

'కర్మవైచిత్ర్యాత్ సృష్టివైచిత్ర్యమ్' సాం. ౬-౪౬.

అయినను నదృష్టము పరమాణువులలో కర్మ నుత్పన్నము చేయు ననుట యుక్తము కాదు. అయ్యది జీవాత్మలందు సమవేతమై యుండును - సమవాయసంబంధముతో సంబద్ధమై యుండును. పరమాణువులలో నుండదు. కాబట్టి యదృష్టము కర్మజనకము కాదు. కార్యకారణము లొకే యధికరణమున నుండవలెను. అపుడే కారణము కార్యజనక మగును. అదృష్టముతో కూడిన జీవులతో పరమాణువులకు సంబంధ ముండును. కావున సామానాధికరణ్యము కలుగగల దందురేని, అదియును ప్రయోజన కారి కాదు. అట్టి సంబంధము జీవపరమాణువులకు నెల్లపుడు సమానముగ నుండును. ఆ సంబంధమువలన సంయోగమును కలిగించు కర్మ పరమాణువులందు జనించునెడల నెల్లపుడు సృష్టియే జరుగుచుండవలసివచ్చును. ప్రళయ మేర్పడజాలదు. ప్రళయమును జనింపజేయుట కనువగు వియోగమును కలిగించుకర్మ పరమాణువులం దేర్పడిన సృష్టి కలుగనేరదు. ఉభయాత్మకకర్మ కలుగు నందురేని, సృష్టిప్రళయములు రెండు నొకే సమయమున గలుగు ననవలసివచ్చును. అప్పుడు రెండును నుండవని భావము. కాబట్టి సృష్టిప్రళయవ్యవస్థ యేర్పడనేరదని సూత్రాభిప్రాయము. కాగా స్వతంత్ర పరమాణు కారణవాద మసమంజస మగుచున్నది. (౧౩)

'పరమాణువులు కర్మస్వభావము గలవిగా నంగీకరింతుము. అందువలన పరమాణువులలో సంయోగము కలుగగలదు. ద్వ్యణుకాది సృష్ట్యుత్పన్న మగుటలో నభ్యంతర ముండదు.' అని యందురేని - అదియు నుపపన్నము కాదని సమాధానము చెప్పుచున్నారు.

## నిత్య మేవ చ భావాత్ ౨-౨-౧౪

చ=మరియును, నిత్యమేవభావాత్=పరమాణువులందు కర్మ స్వాభావిక మందురేని ఎల్లపుడు కర్మ యుత్పన్న మగుచుండును. కర్మజన్య సంయోగమువలన ద్వ్యణుకాది సృష్టి యెల్లపుడు నేర్పడుచుండును. ప్రళయము గలుగనేరదు. కాబట్టి సృష్టిప్రళయవ్యవస్థ సంభవము కాదు.

పరమాణువులు నిత్యములు. అందు కర్మ స్వాభావిక మందుమేని అదియు నిత్యమగును. స్వభావ మెన్నడు ననిత్యము కాదు. కర్మ నిత్యమగునెడల సృష్టిప్రళయవ్యవస్థ కలుగనేరదు. సృష్టికి, ప్రళయమునకు రెంటింటికిని కర్మ హేతువైనందున, నొకకర్మచే ద్వ్యణుక మేర్పడిన వెంటనే వానివియోగమును కలుగును. ఇట్లు సంయోగవియోగములు కర్మజన్యములై వెనువెంట గలుగుచుండిన సృష్టికాని, ప్రళయముకాని యేదియు నేర్పడనేరదు. ఇట్లే ప్రళయహేతుకమగు నొకకర్మ ద్వ్యణుకములను వియుక్తము చేయునంతలోనే సంయోజకహేతువగు కర్మ స్వభావజన్య మగుటవలన నది జనించి, యా పరమాణువులను సంయుక్తము చేయును. అందువలన ప్రళయమును కలుగదు. ఇట్లు సృష్టిప్రళయముల వ్యవస్థ కలుగజాలదని సూత్రాభిప్రాయము.

సృష్టివేళయందు సృష్టికనుకూలమగు కర్మయు, ప్రళయవేళయందు తదనుకూలకర్మయు స్వభావముగ జనించునందురేని, అదియును సరికాదు. ఆ యా వేళలకు తగినకర్మ జనింపవలెనని నియమించువ డెవరు? నియామకము నంగీకరింపనందున నట్లు విభిన్నకర్మలు విభిన్న సమయములందు జనింపజాలవు. స్వభావము నిత్య మగుటవలన నది నియమింప నను వు కాదు. స్వభావము-ధర్మము. అయ్యది నియామకము కాదు. దానిని నియమించుట కింకొక స్వభావ మంగీకరింతురేని అనవస్థ యేర్పడును. కాబట్టి

పరమాణువులందు కర్మ స్వాభావికమైనందున సృష్టి ప్రళయవ్యవస్థయేర్పడు ననుట యుక్తము కాదు. (౧౪)

దోషాంతరమును నిరూపించుటకు మహర్షి సూత్రమును రచించు చున్నాడు.

## రూపాదిమత్త్వాచ్చ విపర్యయో దర్శనాత్ ౨-౨-౧౫

చ=మరియు, దర్శనాత్=లోకదర్శనమునుబట్టి, రూపాదిమత్త్వాత్= పరమాణువులు రూపరసాదిగుణములు గలవగుటవలన, విపర్యయః = నిత్యవిపర్యయములు - అనిత్యములు కావలసివచ్చును.

లోకమున జూడబడు వ్యక్తపదార్థము లన్నియు రూపరసాదిగుణ ములు గలిగియుండును. అవి యనిత్యములై యున్నవి. ఈవ్యక్తపదార్థము లకు కారణములగు పరమాణువులుకూడ రూపరసాదులు గలవై యున్న నవియును వ్యక్తములవలె ననిత్యములు కావలయును. ఇట్లే వ్యక్తవస్తు వులు సావయవము లయినందున వానికారణములయిన యవ్యక్తపరమాణు వులును సావయవము లగును. అందువలన నవియును ఘటపటములవలె ననిత్యము లగును. లోకదర్శనమునుబట్టి యిట్లే యూహింపనగును. భిన్నముగ నూహించుట తగదు. కాబట్టి పరమాణువు లనిత్యము లగును. నిత్యము లను వాదమునకు విరుద్ధమగునని భావము. కాగా స్వతంత్రపర మాణుకారణవాదము సమంజసము కాదు. (౧౫)

ఇంకొకదోషము నీవాదమున జూపుచున్నాడు.

## ఉభయథా చ దోషాత్ ౨-౨-౧౬

చ=మరియును, ఉభయథా దోషాత్=లోకదృష్టి నంగీకరించినను, అంగీకరింపకున్నను దోషము సంభవించినందువలన స్వతంత్రపరమాణు కారణవాద మయుక్తము.

లోకమున జూడబడు పృథివ్యాదితత్త్వము లొకదానికంటె నింకొకటి సూక్ష్మము, సూక్ష్మతరము, సూక్ష్మతమముగా గోచరించుచున్నవి. వాని కారణములగు పరమాణువులందును నట్టి వైషమ్యమే యున్న ట్లంగీక రింపవలసివచ్చును. గుణములలో గల న్యూనాధిక్యములవలన నిట్టి సూక్ష్మ స్థూలభేదములు గలుగుచుండును. లోకదృష్టి నంగీకరించినచో పరమాణు వులలో స్థూలసూక్ష్మభేదము నంగీకరింపవలసివచ్చును. లోకదర్శనము నంగీకరింపకున్న వ్యక్తపదార్థములలో గల స్థూలసూక్ష్మభేదమునకు కారణము చెప్పవలసియుండును. మూడవపద్ధతి యింకొకటి లేదుగదా। కారణమున లేనివైషమ్యము కార్యమున నెటనుండి వచ్చును? పరమా ణువులన్నియు సమానముగ సూక్ష్మములయ్యు, కార్యములందు వైష మ్యము గలిగింపగల స్వభావము వానియందు గలదనుట తర్కబద్ధము కాదు. కాబట్టి లోకదృష్టి నంగీకరించినను, నంగీకరింపకున్నను స్వతంత్ర పరమాణుకారణవాదము దోషయుక్త మనుట తేటతెల్లము. (౧౬)

వేరొండుదోషము నుద్భావించుచున్నాడు.

## అపరిగ్రహాచ్చాత్యంత మనపేక్షా ౨-౨-౧౭

చ=మరియు, అపరిగ్రహాత్=శిష్టులచే స్వతంత్రపరమాణుకారణ వాదము గ్రహింపబడనందున, అత్యంత మనపేక్షా=ఆ వాదము మిక్కిలిగ నుపేక్షింపదగినది.

స్వతంత్రప్రకృతికారణవాద మెట్లు శ్రుతిస్మృతివిరుద్ధ మగుటచే శిష్టులచే పరిగ్రహింపబడదో, యట్లే స్వతంత్రపరమాణుకారణవాదముకూడ శిష్టపరిగ్రహము కానందున నంగీకరింపదగినది కాదని సూత్రాభి ప్రాయము. (౧

## తృతీయాధికరణము

మరికొందరు పరమాణువులవలన ద్వ్యణుకాదికార్యపదార్థము లుత్పన్నములు కావనియు, పరమాణువులపుంజములే - సముదాయములే - జగత్తులోని పదార్థము లనియు నంగీకరింతురు. వీరి మతమున పరమాణువులు కూడ క్షణికములే. పృథివ్యాది పరమాణుసముదాయములును క్షణికములే. వాని ననుభవించు జీవులును క్షణికములే. జీవు డన విజ్ఞానమునకు మించి వేరొండు లేదు. విజ్ఞానము, బుద్ధి, చిత్తము నను పదము లన్నియు సమానార్థకములు. మహర్షి ప్రస్తుత మీ వాదమును నిరసించుటకు సూత్రము నారంభించుచున్నాడు.

### సముదాయ ఉభయహేతుకేఽపి తదప్రాప్తిః ౨-౨-౧౮

ఉభయహేతుకేఽపి సముదాయే=పరమాణుహేతుకము, స్కంధహేతుకము నను రెండువిధములగు సముదాయము నంగీకరించినను, తదప్రాప్తిః=సముదాయసిద్ధి కలుగదు.

సముదాయవాదులు జగత్తును భోక్తృ, భోగ్యరూపమున రెండు విధములుగ విభజింతురు. భూతభౌతికాత్మకమగు నీ బాహ్యజగత్తు భోగ్యమందురు. చిత్తచైత్తాత్మకమగు సముదాయము భోక్తృసముదాయ మన బడును. బాహ్యసముదాయమునకు గంధ, రస, రూప, స్పర్శపరమాణువులు హేతువులు. ఈ పరమాణువులు స్వయముగనే సముదాయములై పృథివ్యప్తేజోవాయువు లగునని భావము. ఆ పృథివ్యాదిసంఘాతములే యోషధ్యాదిరూపములయి భోగ్యము లగుననియు నెంచవలెను. పరమాణువులు క్షణికములు. కావున తద్ధేతుకములగు పృథివ్యాదులును క్షణికములే యగును. ఇట్లే రూపస్కంధము, విజ్ఞానస్కంధము, వేదనాస్కంధము, సంజ్ఞాస్కంధము, సంస్కారస్కంధము నను నైదు స్కంధములు

నధ్యాత్మసముదాయమునకు హేతువులు. శరీరయుక్తములగు నింద్రియ ములు రూపస్కంధము. ఇయ్యదియే భోగసాధనము. ఆ యా విషయము లను గ్రహించు (అహమ్) 'నేను' అను నభిమానారూఢమగు నాలయ విజ్ఞానము విజ్ఞానస్కంధము. ఇయ్యదియే భోక్త యనబడును. ప్రియము, అప్రియము, అనుభయము - ప్రియాప్రియములుకానిది - విషయముగా గల స్పర్శ లేర్పడినపుడు సుఖము, దుఃఖము, ఉపేక్ష యను రూపములు గల చిత్తావస్థావిశేషము వేదనాస్కంధము. 'గోవిందుడు, దేవదత్తుడు, నల్లని వాడు, ఎఱ్ఱనివాడు తిరుగుచున్నాడు, చదువుచున్నాడు.' అనుసంజ్ఞల సంబంధమువలన దెలియు ప్రవృత్తివిజ్ఞానము సంజ్ఞాస్కంధము. ఇయ్యది భోగ మనబడును. రాగాదిక్లేశములు, మదమోహా ద్యుపక్లేశములు, ధర్మా ధర్మములు సంస్కారస్కంధ మనబడును. ఇయ్యదియే భోగమునకు నిమిత్త మగును. ఈ యైదుస్కంధములలో విజ్ఞానస్కంధము చిత్త మన బడును. ఇతర నాలుగుస్కంధములు చైత్తము లనబడును. లోకవ్యవహార మంతయు నీ యుభయవిధములగు స్కంధముల నాశ్రయించి యుండును. అని సముదాయవాదు లంగీకరింతురు. ఈ వాదము యుక్తియుక్తము కాదు. కారణ మేమన:

సముదాయములుగ నేర్పడు పరమాణువులు క్షణికములు; కావున సముదాయము లేర్పడజాలవు. ఇట్లే స్కంధములును క్షణికములు, కావున సముదాయము లేర్పడుటకు ముందే నశించునని భావము. హేతుభూతము లగు పరమాణ్వాదు లేక్షణమున నుండునో, యాక్షణమున సముదాయము లుండవు. సముదాయము లేర్పడుట కుత్తరక్షణమున నుండని పరమాణువు లెట్లుత్పహింపగలవు? కాబట్టి క్షణికపరమాణువులు క్షణికసముదాయముల నేర్పరుచు ననుట వచనమాత్రమే యగును. పరమాణువులు కలిసి సముదా యము లగునా? కలియకయే యగునా? మిళితములై సముదాయమును సాధించు నందురేని అన్యోన్యాశ్రయదోషము వాటిల్లును. 'సముదాయ

మేర్పడిన మితము లగును.' 'మితములైన సముదాయ మేర్పడును' అని యన్యోన్యాశ్రయము స్పష్ట మగుచున్నది. మితములు కాకయే సముదాయ మేర్పడు ననుట యుక్తము కాదు. అమితము లెల్లపుడు నుండును. వానివలన నేర్పడు సముదాయమును నెల్లపు డుండవలసి వచ్చును. నాడు ప్రళయ మేర్పడదు. సముదాయవాదులును ప్రళయము నంగీకరింతురు. పరమాణువులు క్షణికములు కాబట్టి వానివలన నేర్పడు సంతానమును క్షణికమే యగును. సంతాన మక్షణికము లందుమేని సర్వము క్షణిక మనువాదము భగ్నమగును. క్షణికములే యగుపక్షమున సముదాయ మేర్పడదు. సముదాయాశ్రిత లోకవ్యవహారమును సిద్ధింపదు. కాబట్టి సముదాయవాద మయుక్తమని సూత్రాభిప్రాయము. (౧౮)

సముదాయసిద్ధి నాశంకించి నిరసించుచున్నాడు.

## ఇతరేతర ప్రత్యయత్వా దితి చేన్న ఉత్పత్తిమాత్ర నిమిత్తత్వాత్ ౨-౨-౧౯

ఇతరేతర ప్రత్యయత్వాత్ = ఉత్తరోత్తర పదార్థములకు పూర్వ పూర్వములు కారణము లైనందున, పూర్వములు క్షణికములైనను సముదాయములు సిద్ధింపగలవు, ఇతిచేత్ = అని యందురేని, ఉత్పత్తిమాత్ర నిమిత్తత్వాత్ = పూర్వక్షణిక ముత్తర క్షణికము నుత్పన్నము చేయుటకే నిమిత్త మగును. అందువలన, న = సముదాయసిద్ధి కలుగదు.

పరమాణువులు ప్రథమ క్షణమున నుండి యుత్తరక్షణమున నశించు పక్షమున సముదాయము సిద్ధింపదు. కాని, పరమాణువులు క్షణికములని, తా మున్న క్షణముననే తమవంటి క్షణికముల నన్యముల నుత్పన్నముచేసి యుత్తరక్షణమున నశించును. కాబట్టి సముదాయ మేల సిద్ధింపదందురేని, అదియును సరికాదు. పూర్వక్షణికము లుత్తరక్షణికముల నుత్పన్నము చేయుటకే హేతువు లగును. కాని సముదాయోత్పత్తికి హేతువులు కావు

గదా! ఉత్తరక్షణికములును తమకంటె నుత్తరక్షణికముల నుత్పన్నము చేసి యనియును ధ్వంసము లగును. ఇట్లు సముదాయోత్పత్తికి హేతువులు కానందున సముదాయము కలుగనేరదని భావము. ఉత్తర వ్యక్తుల నుత్ప న్నము చేయుటకు హేతువులైనంత మాత్రమున సముదాయహేతువులగు ననియు నెట్లు చెప్పగలము? అవి యచేతనములు కాబట్టి సముదాయోత్పా దక జ్ఞానము వాని కేవిధమున గలుగును? పూర్వక్షణికముల వలన నుత్ప న్నములైన యుత్తరక్షణికము లుత్తరక్షణమున నుండునుగద! సముదా యము లేల సిద్ధింపవందురేని, ఉత్తరక్షణయునికి మాత్రమున సముదా యము లెట్లు సిద్ధించును? అచేతనము లెన్నియున్నను నవి స్వయముగ సముదాయములు కానేరవు. కుంభకారుడు లేని పక్షమున మృత్తిక, దండము, చక్రము మున్నగు నచేతన సాధనము లన్నియు నున్నంత మాత్ర మున కుండ సిద్ధింపగలదా? కుమ్మరి కావలెనని సాధనముల మూలమున కుండ నుత్పన్నము చేసినపుడే యది సిద్ధించును. సముదాయవాదుల దృష్టిలో క్షణికములగు పరమాణువుల కధిష్ఠానమగు చేతన మొందు సర్వజ్ఞము సర్వశక్తి మంతము లేదుగదా! అందువలన పూర్వక్షణికము లుత్తరక్షణిక ముల యుత్పత్తికి హేతువు లయినంత మాత్రమున సముదాయరూప కార్య వస్తువులు సిద్ధింపనేరవు. సముదాయము లేనపుడు సముదాయాశ్రిత వ్యవ హారము నుపపన్నము కాదు. కాబట్టి క్షణిక పరమాణు కారణవాదము యుక్తియుక్తము కాదని సూత్రాభిప్రాయము. (౧౯)

పూర్వక్షణిక ముత్తరక్షణికోత్పత్తికి హేతువగు ననుటయు సరికా దని నిరూపించుచున్నాడు.

## ఉత్తరోత్పాదే చ పూర్వనిరోధాత్ ౨-౨-౨౦

చ = మరియు, ఉత్తరోత్పాదే = ఉత్తరక్షణోత్పత్తి సమయమున, పూర్వనిరోధాత్ = పూర్వక్షణము నశించినందున పూర్వక్షణ ముత్తరక్షణో త్పత్తికి హేతు వనుటయు తగదు.

ఏ క్షణమున పూర్వక్షణిక పరమాణు వుండునో యా క్షణముననే యుత్తరక్షణిక పరమాణు వుత్పన్నము కానేరదు. పూర్వోత్తర క్షణిక పరమాణువులు రెండు నొకే క్షణమున నుండునేని వానిలో పూర్వోత్తర భావమే యుండదు. అందువలన కార్యకారణ భావము నుండదు. కార్య కారణములలో పూర్వము కారణము, ఉత్తరము కార్యము నగును. కార్యము నకు పూర్వమున నేది నియమముగ నుండునో యది కారణమనియు, కారణమునకు తరువాత వ్యవధానములేక యేర్పడునది కార్యమనియు కార్య కారణవిదులు లక్షణము చెప్పియున్నారు. కాబట్టి పూర్వోత్తరక్షణికము లగు పరమాణువులు రెండు నొకేక్షణమున నుండునందురేని వానిలో కార్య కారణభావము నంగీకరింప వలనుపడదు. ఈ కాలభేదమునకుమించి కార్య కారణములను నియమించునదియు వేరొండు లేదు. అందువలన నుత్తర క్షణిక పరమాణువు పూర్వక్షణమునకు తరువాతిక్షణమున నుత్పన్న మగు నని యంగీకరింపక తప్పదు. ఆ క్షణమున పూర్వ క్షణిక పరమాణువు క్షణికము కాబట్టి నశించును. ఇట్లు పూర్వోత్తరక్షణిక పరమాణువులు ఏకక్షణమున నుండనేరవు - సమాన కాలీనములు కావు. కాబట్టి వానిలో కార్యకారణ భావ ముపపన్నము కాదు. పూర్వక్షణికమగు నణువు నశించి యభావాత్మక మగును. అభావము ఉత్తరక్షణ పరమాణూత్పత్తికి హేతు వెట్లు కాగలదు ? అభావాత్మకమగు మృత్తిక భావాత్మకమగు ఘటమునకు కారణమగుట లోకమున జూడము.

ఉత్తరక్షణమున - కార్యోత్పత్తి కాలమున - లేకున్నను పూర్వక్షణ మున నున్నదిగదా । కార్య నియత పూర్వవృత్తిత్వమే కారణ లక్షణము: కావున నెందులకు హేతువు కాదందురేని, అదియును సరికాదు. కారణము (ఉపాదాన కారణము) కార్యాన్వితమై యుండును. ఘటోత్పత్తి కాలమున ఘటమున కుపాదాన కారణమగు మృత్తిక నశింపదు. అది ఘటమునం దన్వితమై యుండును. కాబట్టి పూర్వక్షణపరమాణువే ఉత్తరక్షణోత్పన్న

పరమాణువున నన్వితము కానియెడల నది కారణము కానేరదు. ఘటమున నన్వితముకాని కుమ్మరివంటి కారణము కాదు గదా, యీ పూర్వక్షణవర్తి పరమాణురూపకారణము? కాబట్టి కుమ్మరి ఘటమునకు కారణమే (నిమిత్త కారణము) యైనను ఘటమున నన్వితము కాదుగదా! అట్లే పూర్వక్షణ వర్తి పరమాణువు నని చెప్పవలనుపడదు. కుమ్మరి నిమిత్తకారణము. పూర్వక్షణపరమాణువు ఉపాదాన కారణము. ఉపాదానకారణము కార్య మున నన్వితమై యుండును. నిమిత్త కారణము కార్యమున నన్వితము కాక వేరుగ నుండును. అదియును నశింపదు. కావున లోకదృష్టాంతము నను సరించి పూర్వక్షణపరమాణువు ఉత్తరక్షణ పరమాణువునకు కారణమనుట యుక్తివిరుద్ధము. ఇట్లే స్కంధములను కూడ తెలిసికొనవలెను. (౨౦)

ఉత్తరక్షణమున నుండకున్నను పూర్వక్షణమున నుండు కారణ బలమున నుత్తరక్షణకార్య ముత్పన్నమగు నందురేని - అదియును తగదను చున్నాడు మహర్షి.

## అసతి ప్రతిజ్ఞోపరోధో యౌగపద్య మన్యథా వా ౨-౨-౨౧

అసతి = పూర్వక్షణిక పరమాణువు లేకున్నను నుత్తరక్షణ కార్య మగునని యంగీకరించిన పక్షమున, ప్రతిజ్ఞోపరోధః = పూర్వక్షణికము వలన నుత్తరక్షణిక ముత్పన్న మగునని పూర్వ మొనర్చిన ప్రతిజ్ఞకు భంగము కలుగును, అన్యథా = పూర్వక్షణికము నశించునని యంగీకరింపని పక్షమున, యౌగపద్యమ్ = పూర్వోత్తర క్షణికములు రెండు నొక క్షణ మున నున్న ట్లంగీకరింపవలసివచ్చును. అప్పుడు క్షణికత్వమునకు హాని కలుగును.

పూర్వక్షణ పరమాణువు - కారణము - నశించినను దాని బలము వలననే యుత్తరక్షణ పరమాణు వుత్పన్నమగు నందురేని 'పూర్వక్షణ

ము త్తరక్షణోత్పత్తికి కారణ' మను ప్రతిజ్ఞ భంగమగును. మృత్తిక లే కున్నను ఘట ముత్పన్న మగు పక్షమున 'మృత్తికవలన ఘట ముత్ప న్నమగు'నను ప్రతిజ్ఞ చేయుట తగదు. ప్రతిజ్ఞాభంగదోషమునుండి తప్పు కొనుటకు పూర్వక్షణ పరమాణు వుత్తరక్షణమున నుండు నందురేని, పూర్వక్షణ పరమాణువు ద్విక్షణస్థాయి యగును. క్షణికవాదము భంగ మగును. అందువలన సముదాయవాదము అనుపపన్నమని సూత్రాభి ప్రాయము. (౨౧)

ఉత్తరక్షణ కార్యోత్పత్తి సిద్ధింపనందున సముదాయవాద మయుక్త మని నిరూపింపబడినది. ప్రస్తుతము పూర్వక్షణ వినాశముకూడ సిద్ధింపదు. కాబట్టి సముదాయవాద 'మయుక్త'మని మహర్షి చెప్పుచున్నాడు.

## ప్రతిసంఖ్యాఽప్రతిసంఖ్యా నిరోధాప్రాప్తి రవిచ్ఛేదాత్ ౨-౨-౨౨

అవిచ్ఛేదాత్ = భావపదార్థము నిరన్వయముగ నశింపనందువలన - భావవిచ్ఛేదము కానందున, ప్రతిసంఖ్యాఽప్రతిసంఖ్యా నిరోధాప్రాప్తిః = ప్రతిసంఖ్యానిరోధము, అప్రతిసంఖ్యానిరోధము సిద్ధింపవు.

నిరన్వయవినాశము విచ్ఛేద మనబడును. వస్తువు నశించినమీదట నే రూపముననను దాని యునికి తెలియకుండుట యని భావము. లోకమున భావపదార్థ మేది నశించినను నయ్యది రూపాంతరమున నుండును. ఘటము నశించి శకలరూపమున నుండును. లేక మృత్తికారూపమున నుండును కాబట్టి భావపదార్థములకు అన్వయవిచ్ఛేద ముండును కాని,నిరన్వయవిచ్ఛేద ముండదు - భావ మభావ మెన్నడును కాదని తాత్పర్యము.

ప్రతిసంఖ్యానిరోధము, అప్రతిసంఖ్యానిరోధము, ఆకాశము నను మూడుకాక మిగిలిన విజ్ఞానము, విజ్ఞాతవ్యము నంతయు నుత్పాద్యము,

క్షణికము నని సముదాయవాదు లంగీకరించుచున్నారు. ఈ మూడుకూడ అవస్తువులే - అభావములే - నిరుపాఖ్యములే యని చెప్పుదురు.

(ప్రతి = ప్రతికూలమయిన, సంఖ్యా = సద్రూపమగు నీ భావము నసద్రూపముగ జేయుదునను బుద్ధి), ప్రతిసంఖ్యా = సద్రూపభావము నసద్రూప మొనర్తునను ప్రతికూలబుద్ధి ప్రతిసంఖ్య యనబడును. అట్టి బుద్ధితో జేయబడు, నిరోధః=భావముల నిరన్వయవినాశము ప్రతిసంఖ్యా నిరోధ మనబడును. అయ్యది బుద్ధిపూర్వకము కావున బుద్ధిమంతులగు విద్వాంసులకే కలుగును. ఇతరుల కవిద్వాంసులకు కలుగదు. దీనికి విపరీత మైనది అప్రతిసంఖ్యానిరోధ మనబడును. అనగా భావపదార్థముల యొక్క స్వాభావికమగు నిరన్వయవినాశము. అయ్యది సాధారణమేకాని పూర్వము చెప్పినదానివలె నసాధారణవినాశము కాదు. ఈ సముదాయ వాదులదృష్టిలో ఆవరణాభావమే యాకాశ మనబడును. వైదికులవలె నభావవ్యంగ్యమై, శబ్దసమవాయికారణ మగునది యాకాశమని యంగీక రింపరు.

పై నవర్ణించిన సముదాయవాదుల ప్రతిసంఖ్యానిరోధము, అప్రతి సంఖ్యానిరోధము రెండును సిద్ధింపనేరవు. భావపదార్థములకు నిరన్వయ వినాశము కలిగిన నయ్యవి సిద్ధించును. నిరన్వయవినాశము కలుగదు కాబట్టి యవి సిద్ధింపవని భావము. భావపదార్థ మేది నశించినను సాన్వయ ముగ నశించును. ఘటము నశించి మృద్భావమును బొందును. మృత్తికా రూపము నే యవస్థయందును విడువదు. అట్లు విడుచుపక్షమున ఘటము మృత్తికనుండి యేర్పడు ననుట యుక్తము కాదు. అంతేకాక దేనినుండి యేదైనను నుత్పన్నము కావచ్చును. పెంకుల (ఘట శకలముల) రూప మున నున్న మట్టిని చూచి పామరుడును ఘటము నూహింపగలడు. ఘటము మృత్తికారూపమును విడుచు పక్షమున నట్లు ఘటము గుర్తింప బడదు. కాబట్టి భావపదార్థముల వినాశము సాన్వితమే కాని నిరన్వితము

కాదు. అందువలననే సముదాయవాదుల నిరన్వయవినాశాత్మకమగు ప్రతిసంఖ్యా, అప్రతిసంఖ్యానిరోధములు రెండు నుపపన్నములు కావు. (౨౨)

## ఉభయథా చ దోషాత్ ౨-౨-౨౩

చ=మరియు, ఉభయథా=రెండువిధముల, దోషాత్=అపసిద్ధాంతాది దోషప్రసక్తి కలుగుటవలన, పూర్వోక్త ప్రతిసంఖ్యాఽప్రతిసంఖ్యానిరోధములు సిద్ధింపవని సూత్రార్థము.

సముదాయవాదుల సిద్ధాంతము సహేతుకమో లేక నిర్హేతుకమో కావలయును. సహేతుక మనుటకు వీలులేదు. వారు తమ సిద్ధాంతమును నిర్హేతుకమని యంగీకరింతురు. కాబట్టి సహేతుక మనినచో నపసిద్ధాంత దోషప్రసక్తి కలుగును. నిర్హేతుక మందురేని 'సర్వము క్షణికము. సర్వము నాత్మరహితమే' యను భావనోపదేశము వ్యర్థమగును. హేతువు లేకయే సిద్ధించును. భావనారూపహేతూపదేశము వ్యర్థము కాక మరి యేమగును? కాబట్టి రెండువిధములను దోషప్రసక్తి తప్పదు. కాగా సముదాయవాదుల యుభయవిధ నిరోధముసిద్ధింపదని సూత్రాభిప్రాయము.(౨౩)

ఇట్లు నిరోధములు సిద్ధింపవని చెప్పి యావరణాభావమే యాకాశమను సిద్ధాంతమును నిరసించుచున్నాడు.

## ఆకాశే చావిశేషాత్ ౨-౨-౨౪

ఆకాశే చ = ఆకాశమునందును, అవిశేషాత్ = సమానముగ వస్తుప్రతిపత్తి కలుగుచున్నందున ఆవరణాభావ మాత్రమే యనుట సిద్ధము కాదు.

ఆకాశము పృథివ్యాదులవలె వస్తువే యని బోధపడుచున్నందున నది యావరణాభావమే యనుట సరికాదు. గంధాది గుణాశ్రయము లగుటవలన పృథివ్యాదులెట్లు భావపదార్థములో అట్లే యాకాశముకూడ శబ్దగుణమునకాశ్రయమగుటవలన భావపదార్థమే కాని అభావరూపము కాదు.

## అనుస్మృతేశ్చ ౨-౨-౨౫

చ = మరియు, అనుస్మృతేః = అనుస్మరణము - ప్రత్యభిజ్ఞ - అదే యిది యని గుర్తించుట - వలన భావములు క్షణికము లనుట యుక్తము కాదు.

భావపదార్థము లన్నియు సముదాయవాదుల దృష్టిలో క్షణికములని యెంచబడును. మహర్షి యీ సూత్రమున భావముల క్షణికత్వము సిద్ధింప దనుచున్నాడు. భావము లన సత్వపదార్థములు. సత్వము క్షణికమనియు, నయ్యది యర్థక్రియాకారి యనియు క్షణికవాదుల మతము. అది యుక్తము కాదు. భావము లన్నియు క్షణికములు :- ఒక్కక్షణకాల ముండి యన్యక్షణమున నుండనివి - యగునెడల పూర్వక్షణమున జూచిన వస్తువు ఉత్తర క్షణమున 'అదియే యిది' యని గుర్తింపబడక యుండవలెను. లోక వ్యవహార మందులకు విరుద్ధముగ కనిపించుచున్నది. భావ పదార్థము లన్నియు ప్రత్యభిజ్ఞకు విషయము లగుచున్నందున నవి క్షణికములు కావని ఋజు వగుచున్నది. పూర్వాపరకాలములతో సంబద్ధమై యొకే వస్తువు విషయము కాగల జ్ఞానము ప్రత్యభిజ్ఞాన మనబడును. 'నేను పూర్వము చూచినదాని నిప్పుడు చూచుచున్నాను, పూర్వము స్పృశించిన దాని నిప్పుడు స్పృశించుచున్నాను' అను నిట్టి ప్రత్యభిజ్ఞానమునకు విషయము లగుచున్నందున పదార్థము లన్నియు క్షణికము లనుట చెల్లదని సూత్రాభిప్రాయము. (౨౫)

వస్తువులు క్షణికములు కాక స్థాయిగ నుండినపుడే యర్థక్రియాకారిత్వము వానికి సిద్ధించును. ఘటము క్షణకాల ముండి నశించిన నది యుదకాహరణమున కెట్లు పనికి వచ్చును? వస్త్రము క్షణకాలముండి నశించిన నది దేహమును కప్పుట కెట్లుపయోగించును? కాబట్టి భావములు క్షణికము లనుట యుక్తియుక్తము కాదు.

సముదాయవాదులు చెప్పునట్టి 'అభావమునుండి భావోత్పత్తి కలుగు' ననువాదమును నిరసించుచున్నాడు.

నాసతో౽ దృష్టత్వాత్ ౨-౨-౨౬

అదృష్టత్వాత్ = లోకదృష్టము కానందున, అసతః = అభావము నుండి, న = భావోత్పత్తి కలుగదు.

లోకమున నెచ్చటను నభావమునుండి భావవస్తువు జనించుట చూడము. లోకదృష్టము కానిది కల్పించుట యుక్తము కాదు. భావ పదార్థము లన్నియు భావములనుండియే యుత్పన్నములగుచుండుట నిత్యము చూచుచున్నాము. కాబట్టి యభావమునుండి భావ మేర్పడునను సముదాయవాదుల మత మంగీకార్యము కాదని సూత్రాభిప్రాయము. (౨౬)

ఉదాసీనానా మపి చైవం సిద్ధిః. ౨-౨-౨౭

ఏవంచ = అభావమునుండి భావోత్పత్తికి కలుగునెడల, ఉదాసీనానామపి = ప్రయత్నపరులు కానివారికికూడ, సిద్ధిః = కార్యసిద్ధి కలుగవలెను.

అభావమునుండి భావోత్పత్తి కలుగు పక్షమున క్షేత్రమున కృషి, బీజావపనము మున్నగు ప్రయత్నముల నొనర్చువారికి సస్యాదులు సిద్ధించునట్లు కృష్యాది ప్రయత్నముల నొనర్పనివారికిని సస్యసిద్ధి కలుగవలెను. అట్లు కలుగుట నెన్నడును జూడము. కాబట్టి యభావమువలన భావోత్పత్తి కలుగు ననుట యుక్తము కాదు.

కారణనాశము - కారణాభావమువలన కార్యోత్పత్తి కలుగును. కాని కేవలాభావమువలన కార్యోత్పత్తి కలుగునని చెప్పము. కారణనాశము ప్రయత్న సాధ్యము. కృషికులు క్షేత్రమును దున్ని పదునుచేసి విత్తనములు నాటిననే కదా యవి నశించును. వాని నాశమువలన సస్యము జనిం

చును. అందువలన కారణాభావ సంపాదనమునకై యత్నింపవలసి వచ్చును. ఉదాసీనుల కయ్యది సిద్ధింపదు. కాబట్టి దోషములే దందురేని, అదియును తగదు.

కారణోపమర్దము - కారణనాశము - అన కారణాభావముగా నెంచి యభావమువలన కార్యోత్పత్తి కలుగు ననుచున్నారు. అది సరికాదు. కారణోపమర్దము అభావము కాదు. కారణ మభావమగునెడల కార్యము జనింపనేరదు. బీజము నశించి యంకురము జనించుచున్నందున నభావము వలన భావోత్పత్తి యని చెప్పుదురేని వేపవిత్తనము నశించి వేపమొలక, మామిడి విత్తనము నశించి మామిడిమొలక యుద్భవింపనేల? విత్తనము లలో భేద మున్నది కాని, వాని నాశములో భేదము లేదు కదా! నాశము అభావ మగునెడల అభావములో భేదముండదు. భావములకు విశేషణము లుండును. నీలోపలము, రక్తోపలము నని. నీల, రక్త విశేషణములు భావ పదార్థములగు నుపలము (రాళ్లు) లకు ప్రయోగింపబడును. కాని యభా వమున కట్టి విశేషణము లుండవు. బీజములు నశించిన మీదట - నభావ రూపమును బొందిన మీదట - నా యభావ రూపములలో భేద ముండదు. అందువలన మామిడి విత్తననాశము, వేపవిత్తన నాశము రెండు నొక టియే యగును. అందువలన మామిడి విత్తన నాశమునుండి మామిడి మొలకయే జనింపవలెనను నియమ ముండరాదు. నియమము కనిపించు చున్నది. కాబట్టి నాశము అభావము కాదు. బీజముయొక్క రూపాంతర మని చెప్పవలెను. భావముయొక్క రూపాంతరము భావమే యగును. కాని యభావము కాదు. కాబట్టి మామిడి విత్తనము వలననే మామిడి మొలక జనించుచున్నది; కాని దాని యభావమువలన కాదని సిద్ధమగు చున్నది. ఉపమర్దము - నాశము - రెండును సమానార్థకములే కాని యభావము కాదు. బీజముపమర్దమై - నశించి - రూపాంతరమును బొంది యుండును, దానినుండియే మొలక యేర్పడును. అట్లుకాక బీజము నశించి-

యభావమై - మొలక జనించుపక్షమున తల్లి దండ్రులు నశించిన తదుపరి సంతానము కలుగవలసి యుండును. లోకదర్శనమున తల్లిదండ్రులుండ గనే సంతానము కలుగుట ప్రత్యక్షసిద్ధము. కాబట్టి యుపమర్దమున కర్థ మభావమని యెంచి యభావమునుండి భావము జనించుననుట పొరపాటు - భ్రమ యనవలెను. కాగా అభావమునుండి భావము జనించునను సముదాయ వాదుల సిద్ధాంత మపసిద్ధాంతమని సూత్రాభిప్రాయము. (౨౭)

## చతుర్థాధికరణము

బాహ్యపదార్థముల యునికి నంగీకరింపని విజ్ఞానవాది మతమును నిరసించుటకు మహర్షి సూత్రమును రచియించుచున్నాడు.

**నాభావ ఉపలబ్ధేః.**          ౨-౨-౨౮

ఉపలబ్ధేః=ప్రమాణములచే నుపలబ్ధము లగుచున్నందున, అభావః= బాహ్యార్థములు లేవనుట, న=తగదు.

విజ్ఞానవాదులు క్షణికవిజ్ఞానమే పరమార్థమని యంగీకరింతురు. ఆ విజ్ఞానమే యనాదివాసనావశమున బాహ్యార్థాకారముల భాసించును. అంతకు మించి వెలుపలిపదార్థములు లేవని యందురు. వారి యీ వాదము సంగతము కాదు. ప్రత్యక్షాదిప్రమాణములవలన బాహ్యార్థములు లభించు చుండ విజ్ఞానవ్యతిరిక్త మొందు లేదనుట యుక్తము కాదు. బాహ్యార్థము లేనిపక్షమున ప్రమాణమువలన లభింపరాదు. వస్తువు వేరుప్రమాణము వలన లబ్ధమగుచున్న దనుట విరుద్ధ మగును. ప్రమాణమువలన లబ్ధమగు దాని నపలపించుటకుగాని, దాచుటకుగాని శక్యముకాదు. ప్రమాణములు కూడ విజ్ఞానమే కాబట్టి యనుపపత్తి లేదందురేని - అదియును తగదు. ప్రమాణ ములు విజ్ఞానమే యగునెడల విజ్ఞానాత్మ కుపలబ్ధములగు బాహ్యార్థములు కాదనుట మిక్కిలి యసంబద్ధ మగును. 'బాహ్యార్థముల యుపలబ్ధిని మేము

కాదనము; కాని, బాహ్యార్థములు విజ్ఞానాతిరిక్తములు కావందు'పని చెప్పుదురేని - అదియును సిద్ధము కాదు. విజ్ఞాన ముపలబ్ధి - విజ్ఞానమున కుపలబ్ధి కలుగుచున్న దనుటచేతనే దేని కుపలబ్ధి కలుగుచున్నదో యదియు, వేని యుపలబ్ధి కలుగుచున్నదో యవియు నొకటి కాదనియు, వేరనియు స్పష్ట మగుచున్నది. బాహ్యార్థము లెవని కుపలబ్ధము లగుచున్నవో వాని నడుగగా 'బాహ్యార్థముల యుపలబ్ధి నాకు గలుగుచున్నది' అని యతడనును: కాని 'విజ్ఞాన ముపలబ్ధ మగుచున్నది' అని యెవడును చెప్పడు. విజ్ఞానము నకు వ్యతిరిక్తములు బాహ్యార్థములు కాకున్న నట్లేల చెప్పును? అందు వలన బాహ్యార్థములు విజ్ఞానాతిరిక్తములని చెప్పుటకు వేరొందు ప్రమాణ మేల? స్వయముగానే సిద్ధించుచున్నవి. కాబట్టి బాహ్యార్థములు లేవు: విజ్ఞా నమే పరమార్థ మనుట యుక్తియుక్తము కాదని సిద్ధమగుచున్నది.(౨౮)

స్వప్నమున నర్థములు లేకున్నను నా యా వాసనావాసిత జ్ఞానమే యాయా పదార్థాకారములను బొంది యుపలబ్ధము లగునట్లు, జాగ్రదవస్థ యందును ఘటపటాదివస్తువులు బాహ్యమున లేకున్నను నా యా పదార్థ వాసనావాసితజ్ఞానమే యా యా వస్తురూపమున భాసించును. కాబట్టి విజ్ఞా నాతిరిక్తముగ భాహ్యపదార్థములు లేవందురేని - సమాధానము :

### వైధర్మ్యాచ్చ న స్వప్నాదివత్ ౨-౨-౨౯

వైధర్మ్యాత్ = విరుద్ధధర్మక మగుటవలన, స్వప్నాదివచ్చ = స్వప్నాదిపదార్థములవలె, బాహ్యపదార్థాభావము నుటకును, న = వీలుకాదు.

స్వప్నప్రభృతి పదార్థములవలె జాగరితపదార్థముల నంగీకరింప జనదు. ఈ రెండింటియందును మిక్కిలి భేద మున్నది. స్వప్నలబ్ధపదార్థ ములు, మాయాకల్పితపదార్థములును నవి భాసించుకాలమునందే యుండును. తరువాత నవి యుండవు. జాగ్రదవస్థయం దుపలబ్ధములగు పదార్థము లట్టివికాదు. ప్రతీతికాలమునకు తరువాతను నవి యట్లే యుండును. వాని

యుపలబ్ధి మునల నెయుగవిసంగతనానని యత్నించినను నది యుపలబ్ధము లగుచునే యుండును. ఆ పదార్థములు నశింపనంతవఱకు వాని జ్ఞానము పలచిన్నను గలుగుచునే యుండును. ఈ యనుభవము సర్వజనీనము. కాబట్టి స్వాప్నార్థముల యుపలబ్ధికి, జాగరితపదార్థోపలబ్ధి సమానమనుట పొసగదు. స్వప్నలబ్ధపదార్థములు జాగ్రదవస్థలో బాధితము లగును. జాగ్రదవస్థయం దుపలబ్ధములగు పదార్థము లట్లుకాక యవి నశించువఱకు ననుదిన ముపలబ్ధము లగుచునే యుండును. ఇట్టి వైరుధ్యము సర్వజనానుభవసిద్ధ మగుటవలన బాహ్యపదార్థములు స్వప్నపదార్థసదృశములై విజ్ఞానాతిరిక్తములు కావనుట యుక్తము కాదు. కాబట్టి విజ్ఞానమే బాహ్యార్థాకారమున భాసించు ననుట వచనమాత్రమే. (౨౯)

స్వప్నలబ్ధపదార్థములు బాధితము లగుననియు, జాగరితపదార్థములు బాధితములు కావనియు, నందువలన వానిలో వైధర్మ్య మున్నదనియు, కాబట్టి బాహ్యపదార్థములు స్వప్నగతపదార్థములవంటివి కావనియు చెప్పుట సరికాదు. వాసనాదౌర్బల్యమువలన స్వాప్నికపదార్థములు వెంటనే యదృశ్యము లగుటయు, వాసనాదార్ఢ్యమువలన జాగరితపదార్థములు కాలాంతరమున నదృశ్యము లగుటయు సంభవము కావచ్చును. కావున బాహ్యపదార్థములు విజ్ఞానాతిరిక్తములు కావందురేని—

న భావోఽనుపలబ్ధేః ౨-౨-౩౦

అనుపలబ్ధేః=అసిద్ధమగుటవలన, భావః=వాసన (భావన), న=అర్థప్రతీతికి హేతువనుట తగదు.

వాసన యనునది ముందు సిద్ధించిన నది పదార్థజ్ఞానమునకు హేతువనదగును. వాసనయే సిద్ధము కానినాడు అది యర్థప్రతిపత్తికి హేతువెట్లగును? బాహ్యార్థముల యస్తిత్వమే లేనివారి మతమున వాసన లెట్లు సిద్ధింపగలవు? పదార్థము లున్నపుడు వానిజ్ఞానము కలుగును. ఆ జ్ఞానము

వలన వాసనలు - సంస్కారము - లేర్పడును. అందువలన నర్థప్రతీతి వాసనవలన గలుగనేరదు. అట్లు కలుగునందురేని పరస్పరాశ్రయదోష ప్రసక్తి కలుగును. వాసనవలననే సర్వార్థప్రతీతి కలుగు ననుటయు సరి కాదు. వాసన ముందు సాధింపబడకపోయిన దానివలన నర్థప్రతీతి కలుగు ననుట యుక్తము కాదు. ఆ యా పదార్థముల జ్ఞానమునకు హేతువుగా జెప్పబడు నీ వాసన విజ్ఞానముకంటె భిన్నమా ? అభిన్నమా ? భిన్నమందు రేని 'విజ్ఞానమునకు మించి వేరొకటి లేదు, అంతయు విజ్ఞానమే.' అను వాదమునకు భంగము వాటిల్లును. భిన్నము కా దందురేని పదార్థవాసనల చేత వాసితమైన విజ్ఞాన మనుట పొసగదు. వాసన విజ్ఞానమే యైనపుడు విజ్ఞానము విజ్ఞానముచేత వాసిత మగుననుట వ్యర్థప్రయోగము కాదా ? వాసనావైచిత్ర్యమువలన జగద్వైచిత్ర్యమనికదా నుడువుదురు ? వాసన విజ్ఞానముకంటె భిన్నము కానినాడు వైచిత్ర్య మెట్లు సిద్ధించును ? మరియు నీ వాసన దేనికి సంబంధించినది ? సవిషయకమా ? నిర్విషయకమా ? నిర్విషయకము - అయ్యది దేనికి సంబంధించినది కా - దందురేని, నిర్విష యకమగు వాసన యెట్లు సిద్ధించును ? పదార్థములకు సంబంధించిన దందు రేని విజ్ఞానవ్యతిరిక్తమైన భావజాతము మీకు లేదుకదా ? కాబట్టి విజ్ఞాన వాదులమతమున వాసనయే సిద్ధింపదు. అందువలన వాసన యర్థజ్ఞానము నకు హేతువు కాదు. (౩౦)

## క్షణికత్వాచ్చ ౨-౨-౩౧

చ=మరియు, క్షణికత్వాత్ = విజ్ఞానము క్షణికము కాబట్టి వాసన సిద్ధింపదు.

ప్రవృత్తివిజ్ఞానము, ఆలయవిజ్ఞానము నని విజ్ఞానము ద్వివిధము. 'ఇది ఘటము, ఇది పటము' నను విశేషజ్ఞానము ప్రవృత్తివిజ్ఞాన మన బడును. (అహ మహమ్) 'నేను నేను' అను సామాన్యజ్ఞానము ఆలయ

విజ్ఞాన మనబడును. ఇందు ప్రవృత్తివిజ్ఞానము వాసనకు హేతువు, ఆలయ విజ్ఞానము వాసన కాశ్రయము నని నుడువుదురు. ఈ ద్వివిధవిజ్ఞానము క్షణికమే. ఇందు ప్రవృత్తివిజ్ఞానము వాసన కెట్లో హేతువగునని యంగీకరించినను ఆలయవిజ్ఞానము వాసన కాశ్రయ మగుననుట యుక్తము కాదు. ఆశ్రయ మగునది స్థిరముగ నుండుట లోకమున జూచుచున్నాము. ఒక్క క్షణమునకు మించి యుండని యాలయవిజ్ఞానము వాసనకు ఆశ్రయ మెట్లగును ? అందువలన నాలయవిజ్ఞానము స్థిరమనిన స్వమతభంగము; కాదనిన వాసన కాశ్రయము కలుగజాలదు. తత్సంతానము - పూర్వక్షణ వర్తి విజ్ఞానమువలన కలుగు నుత్తరక్షణవిజ్ఞానము - ఆశ్రయమగు నందు రేని, అయ్యది విజ్ఞానముకంటె భిన్నమా ? అభిన్నమా ? భిన్నమందు రేని అది వస్తువా ? అవస్తువా ? వస్తువగునేని విజ్ఞానమునకు వస్తు వెట్లుదయించును ? వస్తువు కానిపక్షమున వాసన కాశ్రయ మెట్లగును ? మరియు నది క్షణికమే యగుటవలన వాసనాశ్రయము కాజాలదు. ఇట్లు వాసనయే సిద్ధింప వీలులేదు. కాబట్టి యా యా వాసనలచే వాసితమగు విజ్ఞానమే పదార్థాకారమున భాసించుననియు, వేరుగ పదార్థములు లేవనియు జెప్పుట యుక్తియుక్తము కాదని సూత్రాభిప్రాయము. (౩౧)

## సర్వథాఽనుపపత్తేశ్చ  ౨-౨-౩౨

సర్వథా = సర్వవిధముల, అనుపపత్తేః = హేతుబద్ధము కానందు వలన, క్షణికవిజ్ఞానవాద మంగీకరింపదగినది కాదు.

ప్రత్యక్షముగ బాహ్యార్థములు లభించుచున్నందున బాహ్యార్థములు లేవనుట యుక్తము కాదు. అర్థజ్ఞానమునకు హేతువయిన వాసన కాశ్రయము సిద్ధింపనందున విజ్ఞానవ్యతిరిక్తముగ బాహ్యార్థములు లేవనుట ప్రమాణబద్ధము కాదు. అట్లే బాహ్యార్థముల యస్తిత్వము నంగీకరింప కున్న విజ్ఞానమును సిద్ధింపదు. జ్ఞానము సవిషయకమే కాని నిర్విషయ

కము కాదు. జ్ఞానమునకు విషయము లర్థములు. అవి లేనినాడు విజ్ఞాన మెట్లు కలుగును ? కలుగజాలదు. కాబట్టి యెవ్విధముల నాలోచించినను క్షణికవిజ్ఞానవాదము తర్కసహము కాదని సిద్ధమగుచున్నది. అందువలన వైదికుల కా వాదము సమ్మతము కాదు. (౩౨)

## పంచమాధికరణము

ఇట్లు క్షణికవాదమును నిరాకరించి యనేకాంతవాదమును మహర్షి తిరస్కరింప సూత్రము నారంభించుచున్నాడు.

### నైకస్మి న్నసంభవాత్ ౨-౨-౩౩

అసంభవాత్ = అసంభవమగుటవలన, ఏకస్మిన్ = ఒకే పదార్థము నందు, న = పరస్పరవిరుద్ధములగు నస్తిత్వ నాస్తిత్వలక్షణములు గల యనేకరూపత - అనైకాంత్యము - యుక్తము కాదు.

ఈశ్వరాపేక్షలేకయే క్రియాశక్తిమంతములగు పరమాణువులమూల మున పృథివ్యాదు లేర్పడునని సముదాయవాదు లంగీకరించునట్లు అనేకాంత వాదులును క్రియాశక్తిమంతములగు పరమాణువులవలననే జగదుత్పత్తి నంగీకరింతురు. ఉభయులమతమునందును సంఘాతమే యుత్పత్తి యన బడును. అనేకాంతవాదులు జగత్తునందలి పదార్థము లన్నియు రెండు విధములుగా విభజింతురు. జీవులు, అజీవులు. జీవుడు శుభాశుభకర్మల నాచరించి వాని ఫలములను సుఖదుఃఖరూపమున ననుభవించును. శరీరము ననుసరించి పరిణమించుస్వభావము గలవా డగుటచేత శరీరపరిమాణము గలవాడు. జ్ఞానాదిధర్మములకు భిన్నాభిన్నుడు. చేతనుడు. అట్టి జీవుల యుపభోగమునకు యోగ్యములగు నితరపదార్థము లన్నియు నజీవులు. ఇట్లు ద్వివిధములగు నీ పదార్థజాతమును కొందఱు ఐదువిధములుగ విభ జింతురు. జీవాస్తికాయము, పుద్గలాస్తికాయము, ధర్మాస్తికాయము,

అధర్మాస్తికాయము, ఆకాశాస్తికాయము. అస్తికాయమన భావపదార్థమని యర్థము. (అస్తీతి = ఉన్నదియని, కాయతే = చెప్పబడును. కాబట్టి అస్తికాయః) కొందఱు అనేకావయవములు గల ద్రవ్యము అస్తికాయ మనబడు నందురు.

అందు జీవాస్తికాయము త్రివిధములు. బద్ధుడు, ముక్తుడు, నిత్యసిద్ధుడు. ఒక జన్మమునుండి మరియొకజన్మమును బొందుచుండు సంసారి జీవుడు బద్ధుడు. తపశ్చర్యాది ముక్తి సాధనముల మూలమున ముక్తిని బొందినవాడు ముక్తుడు. నిత్య యోగసిద్ధుడు నిత్యసిద్ధు డనబడును. ఇతడే ఈశ్వరుడనియు జెప్పబడును.

రూపరసగంధ స్పర్శగుణములు గల పరమాణువుల సంఘాతము - సముదాయము - పుద్గలము. ఇట్టి స్వరూపము గలది పుద్గలాస్తికాయము. ఇయ్యది పృథివి, జలము, అగ్ని, వాయువు, స్థావరము (వృక్షాదులు), జంగమము (చేతన శరీరములు) నని యాఱు విధములు. ఈపుద్గలాస్తికాయము ద్రవ్యవిభాగ సమయమున స్కంధమని చెప్పబడును. ద్రవ్యపదార్థము స్కంధములు, పరమాణువులు నని రెండు విధములు. ద్వ్యణుకము మొదలు శరీరాంతమువరకు గల సంఘాతములు - స్కంధములు. జీవుల కుపభోగయోగ్యములు. మిగిలినవి పరమాణువులు. స్కంధభేదము వలన పరమాణువు లేర్పడును. ఆ పరమాణువుల సంఘములే స్కంధము లనబడును.

సమ్యక్ శాస్త్రీయ బాహ్యప్రవృత్త్యనుమేయము ధర్మాస్తికాయము. సమ్యక్ శాస్త్రీయప్రవృత్తి - శాస్త్రములందు వర్ణింపబడిన యుత్తమమైన బాహ్యప్రవృత్తి ద్వారమున నాంతరికమగు నపూర్వాఖ్యమగు ధర్మ మూహింప బడును.

ఊర్ధ్వ గమన శీలుడగు జీవు డీశరీరమున నుండుటనుబట్టి యూహింప

బడునది యధర్మాస్తికాయ మనబడును. ధర్మాధర్మములవలననే జీవునిగతి యడ్డగింపబడును. అందువలననే జీవుడు శరీరమున నుండును. లేకున్న నత డూర్ధ్వగతి గలవా డగును.

లోకాకాశము, అలోకాకాశము నని యాకాశాస్తి కాయము ద్వివిధము. పైపై నుండు లోకములలో నుండునది లోకాకాశము. ఆ లోకముల కన్నింటికి పైన నుండునది యలోకాకాశము. అందు లోకము లుండవు.

కొందఱీ పదార్థము లన్నియు మోక్షోపయోగకరము లగుటవలన నేడు విధములుగ వ్యవహరింతురు. జీవము, అజీవము, ఆస్రవము, సంవరము, నిర్జరము, బంధము, మోక్షము నని యావిభాగ నామములు. ధర్మము, అధర్మము కలిసి తొమ్మిది తత్వములుగా చెప్పబడును. షడ్దర్శన సముచ్చయమున హరిభద్రసూరి వాని నిట్లు సంగ్రహించియున్నాడు.

> 'జీవాజీవౌ, తథా పుణ్యం పాప మాస్రవ సంవరౌ,
> బంధశ్చ నిర్జరో మోక్షో, నవ తత్వాని తన్మతే.' ష. స. ౪౭.

వానిలో, జీవ, అజీవ (పుణ్య, పాప) ధర్మ, అధర్మములు వివరింపబడినవి. విషయములందు గలుగు నింద్రియప్రవృత్తి ఆస్రవ మనబడును. అది పురుషుని విషయములందు స్రవింపజేయును. పురుషుని జ్యోతి ఇంద్రియముల ద్వారమున విషయములను స్పృశించి రూపాదిజ్ఞాన రూపమున పరిణమించును. ఇయ్యదియే మిథ్యాప్రవృత్తి యనబడును.

ఆ మిథ్యా ప్రవృత్తిని నిరోధించు యమనియాదిరూప సమ్యక్ప్రవృత్తి సంవర మనబడును. పురుషజ్యోతి స్రవించుద్వారమును మూసియుంచును. కాబట్టి సంవర మనబడునని భావము.

అనాదికాలమునుండి ప్రవృత్తమగు కల్మషమును, పుణ్యపాపములను నశింపజేయు తప్తశిలారోహణాది తపశ్చరణము, జపము, ధ్యానము మున్నగునవి నిర్జర మనబడును. సుఖదుఃఖోపభోగము మూలమున పుణ్య

పాప కర్మలను నిఃశేషముగ శిథిల మొనర్చును (నిఃశేషేణ జరయతి) - నాశము చేయును. కాబట్టి నిర్జర మనబడును.

జ్ఞానావరణీయము, దర్శనావరణీయము, మోహనీయము, అంతర్యము నని నాలుగు ఘాతికర్మలు. వేదనీయము, నామికము, గోత్రికము, ఆయుష్కము నను నాలుగు అఘాతికర్మలు. ఈ యెనిమిది విధములగు కర్మలు బంధహేతువులు కావున బంధ మనబడును. పురుషుడు వీనిచే బంధింపబడును కావున బంధమని వ్యుత్పత్తి.

'సమ్యగ్దర్శనము మోక్షహేతువు కాదు. దానివలన వస్తువు సిద్ధింపదు'. అను విపరీత జ్ఞానము జ్ఞానావరణీయ మనబడును. 'నిత్య సిద్ధులచే వ్రాయబడిన శాస్త్రముల నభ్యసించుటవలన మోక్షము కలుగదు.' అను జ్ఞానము దర్శనావరణీయ మనబడును. తీర్థంకరులచే నుపదిష్టములగు మోక్షమార్గములందు విశేషనిశ్చయము లేకుండుట మోహనీయ మనబడును. మోక్షమార్గమున ప్రవర్తించువారికి విఘ్నములను గల్గించు జ్ఞానము అంతర్య మనబడును. ఇవి యన్నియు శ్రేయోమార్గమునకు విఘాతకములు కావున ఘాతికర్మ లనబడును.

'నా కిది తెలియదగినది యున్నది' అను నభిమానము వేదనీయము. 'నేనీ నామము గలవాడ' నను నభిమానము నామికము. 'ఇతని శిష్యవంశములో చేరితిని.' అను నభిమానము గోత్రికము. శరీరయాత్ర నిమిత్త మొనర్చు కర్మ ఆయుష్కము. ఈ నాలుగును సమ్యగ్ దర్శనమునకు విఘాతము కలిగింపవు కావున అఘాతికర్మ లనబడును.

మోక్షమునకు సాధారణ హేతువులయిన సమ్యగ్దర్శనము, జ్ఞానము, చరిత్రము ననువానివలన సమస్త క్లేశములు, తద్వాసనలు విగళితములు కాగా జ్ఞానావరణము తొలగి నిరంతర సుఖియగునాత్మ అలోకాకాశమున నుండుట మోక్ష మనబడునని కొందరు చెప్పుదురు. సతతోర్ధ్వ గమన

శీలుడు, ధర్మా ధర్మాస్తికాయముచే బద్ధుడునైన జీవాత్మునకు సమ్యగ్దర్శనాదుల ద్వారమున తదత్యంత విమోక్షము కలుగగా నలోకాకాశమున గలుగు నిరంతరోర్ధ్వగమనము మోక్షమని వేరొక కొందఱు చెప్పుదురు. అయ్యది యిట్లు వర్ణింపబడినది.

'గత్వా గత్వా నివర్తంతే చంద్ర సూర్యాదయో గ్రహాః,
అద్యాపి న నివర్తంతే త్వలోక మాకాశ మాగతాః'

'ఇతర లోకములకు వెళ్లినవారు తిరిగివత్తురు కాని, యలోకాకాశమును బొందినవారు తిరిగి రా' రని శ్లోకాభిప్రాయము. ఈ యనైకాంతవాదులు సమస్త పదార్థముల విషయమునను సప్తభంగీనయ మను నొక న్యాయమును ప్రవర్తింప జేయుదురు.

'(౧) స్యాదస్తి (౨) స్యాన్నాస్తి (౩) స్యాదస్తి చ నాస్తి చ (౪) స్యాదవక్తవ్యః (౫) స్యాదస్తి చావక్తవ్య శ్చ (౬) స్యాన్నాస్తి చావక్తవ్య శ్చ (౭) స్యాదస్తి చ నాస్తి చావక్తవ్య శ్చ.'

ఈ సప్తభంగీనయము ననుసరించి (౧) ఘటము యొక్కయునికి సంభవము కావచ్చును. (౨) లేకునికియు సంభవమే. (౩) ఉనికియు, లేకునికియు రెండును సంభవమే. కాని, (౪) అది యవక్తవ్యము కావచ్చును. (౫) ఘటము ఉండవచ్చును; అవక్తవ్యమును గానవచ్చును. (౬) అది లేకుండవచ్చును; అవక్తవ్యమును గావచ్చును. (౭) ఉండవచ్చును; లేకుండ వచ్చును; అవక్తవ్యమును గావచ్చును.

ఇందు మొదటి భంగము పదార్థముయొక్క యస్తిత్వము (ఉనికి) వివక్షించినపుడు ప్రవర్తించును. నాస్తిత్వమును (లేకునికిని) వివక్షించినపుడు రెండవ భంగము వర్తించును. అస్తిత్వము, నాస్తిత్వమురెండును వివక్షించినపుడు మూడవ భంగము, ఒకే సమయమున అస్తిత్వ నాస్తిత్వములు రెండును వివక్షించినపుడు చెప్పశక్యము కానందున నాలుగవ

భంగము: ప్రథమ చతుర్థములు వివక్షించినపుడు ఐదవభంగము: ద్వితీయ చతుర్థములు వివక్షించినపుడు ఆరవభంగము: తృతీయ చతుర్థ భంగములు వివక్షించినపుడు ఏడవ భంగమును ప్రవర్తించును.

పదార్థముయొక్క యునికిని (అస్తిత్వమును) మాత్రమే యంగీకరింతుమేని, అది యెల్లపుడు నెల్లవిధముల నెల్లతావులందును నుండియే యుండును. మనుజుడు దానిని పొందవలెనని యత్నించినపు డది యుండుటయు, దానిని విడువదలచినపు డది లేకుండుటయు సంభవింపదు. కాబట్టి పదార్థము కేవల మున్నదనియే కాని, కేవలము లేదనియే కాని యేకాంతముగ జెప్పవలనుపడదు. 'పదార్థ ముండవచ్చును, లేకుండ వచ్చును;' అను ననేకాంతవాదము సంగీకరింతుమేని, అది కావలయునని యత్నించి పొందవచ్చును. అక్కరలేదని యత్నించి దానిని విడువ వచ్చును. ఇట్లు ప్రవృత్తి నివృత్తులు లోకమున జూడబడునవియు సార్థకము లగును. కాబట్టి యనేకాంతవాదము నంగీకరింపవలెనని ప్రాప్తింపగా-
సమాధానము :

అనేకాంతవాదము యుక్తము కాదు. ఒకేపదార్థమునందు అస్తిత్వ నాస్తిత్వ ధర్మములు రెండును నుండనేరవు. ఉన్నపదార్థము లేదనుటయును, లేనిపదార్థమును లేదనుటకును నొకే సమయమున నెట్లు వీలగును? ఒక పదార్థమున నొకే సమయమున రెండురూపము లుండనేరవు. ఘటమున నస్తిత్వ మున్న నాస్తిత్వ మా సమయమున నుండదు. అట్లే ఘటమున ఘటత్వము ఉన్నచో అఘటత్వ ముండదు. ఘటమున ఘటత్వ ముండును: పటత్వ ముండదు; కాబట్టి ఘటత్వధర్మమును పురస్కరించుకొని ఘట మున్నను, పటత్వధర్మమును పురస్కరించుకొని ఘటము లేదందురేని, అదియును సరికాదు. ఘటమున్నంతవరకు నదిఘటముగనే భాసించును. అందు పటత్వము లేదు. కావున నదిఘటముగ భాసింపదన వలనుపడదు. కొందొక పదార్థమును గ్రహించుటకు ప్రవృత్తియును, విడుచుటకు నివృత్తియును

వస్తుస్వరూపమును బట్టి కలుగవు. ఉన్నవస్తువు విషయమున నది కావలెనని యపేక్షించినవానికి ప్రవృత్తియు, నక్కఱలేదనువానికి నివృత్తియు గలుగును. కొండొకవస్తు వెల్లపుడు నున్నంతమాత్రమున దానిని పొందవలెనను ప్రవృత్తి యెల్లపుడు నుండుటకాని, లేనివస్తువునందు నివృత్తి యెల్లపుడు నుండుటకాని నియమము కాదు. ఒకేవస్తువునం దొకనికి కావలెనను ప్రవృత్తియు, నా సమయముననే మరియొకనికి దానిని విడువవలెనని నివృత్తియు గలుగుట చూచుచునే యున్నాము. మనుజులలో కలుగు ప్రవృత్తి నివృత్తుల సాఫల్యముకొఱ కనేకాంతవాదము నంగీకరింపవలసిన యవసర మొందును కానరాదు. కొండొకవస్తు వొకని కొక సమయమున ప్రాప్తింప నంతమాత్రమున నయ్యది లే దనరాదు. ఆ సమయముననే యది యితరులకు ప్రాప్తించుటయు కలదు. అస్తిత్వమే లేని పదార్థ మెవనికిని నెప్పుడును ప్రాప్తింపదు. కుందేటికొమ్ము నెవడైన నెప్పుడైన పొందగలిగెనా?

ఒకేవస్తువునందు ఒకేసమయమున హ్రస్వత్వము, దీర్ఘత్వము నను రెండుధర్మము లుండునుకదా। అందురేని - ఆ ధర్మములు వస్తుస్వరూపమును దెలుపునవి కావు. అపేక్షాబుద్ధితో నేర్పడునవి. అస్తిత్వానాస్తిత్వములు, ఘటత్వములు నను ధర్మములు స్వరూపబోధకములు; పరస్పరవిరుద్ధములు. అవి యొకేక్షణమున నొకేవస్తువునం దుండనేరవు.

అట్లే భావపదార్థములు (ఉనికి గలవి) వక్తవ్యములు కావనుట చెల్లదు. చెప్పుటకు వీలేకాదనుట మిక్కిలి యసంగతము. ఔత్తిగా లేని వస్తువే (కుందేటికొమ్ము మొదలగునవి) శబ్దములద్వారమున దెలుప వీలున్నపుడు భావపదార్థములు (ఉనికి గలవి) అవక్తవ్యములు (చెప్ప వీలుకానివి) అనుట సంగత మెట్లగును?

కాబట్టి యనేకాంతవాదము విమర్శనసహము కాని, యుక్తియుక్తము కాని కాదని సిద్ధాంతము. (౩౩)

**అనేకాంతవాదమున దోషాంతరమును జూపుచున్నాడు :**

## ఏవం చాత్మాకార్త్స్న్యమ్ ౨-౨-౩౪

చ=మరియు, ఏవమ్=ఇట్లే, ఆత్మాకార్త్స్న్యమ్=జీవాత్మ శరీర పరిమాణము కల దగునెడల పూర్ణత్వ ముండదు.

అనేకాంతవాదులు ప్రాణులశరీరములందు గల జీవులు ఆయా శరీర పరిమాణము గలిగియున్న ట్లంగీకరింతురు. శరీరములు భిన్నపరిమాణము గలిగియుండుట లోకమున ప్రత్యక్షసిద్ధము. అందువలన జీవులుకూడ నా యా శరీరములందు ఆ యా శరీరపరిమాణము గలవారై యుందురని వారిమతమున నంగీకరింపవలసివచ్చును. మానవశరీరమున నున్న జీవు డా శరీరపరిమాణము గలవాడై యుండి యతడు కర్మవశమున హస్తిశరీర మును బొందినపుడు ఆ హస్తిశరీరమునం దంతటను వ్యాపింపజాలడు. ఇట్లే హస్తిశరీరమున నున్న జీవుడు కర్మవశమున పిపీలికాశరీరమును బొందునేని అత డా శరీరమున పూర్ణముగ నిముడుట కవకాశ ముండదు. అల్పశరీరమున మహత్పరిమాణము గల జీవు డెట్లు పూర్ణముగ ప్రవేశింప గలుగును? కాబట్టి జీవులు శరీరపరిమాణము గలిగియుందు రనుట సిద్ధము కాదు. (౩౪)

## న చ పర్యాయాద ప్యవిరోధో వికారాదిభ్యః ౨-౨-౩౫

వికారాదిభ్యః=కార్యత్వము, అనిత్యత్వము మున్నగు దోషములు కలుగగలవు; కావున, పర్యాయాత్=సంకోచవికాసశక్తులు జీవునికున్నందు వలన, అవిరోధః=దోషముండదు, అపి న చ = అని చెప్పుటకును వలను పడదు.

'జీవులు శరీరపరిమాణము గలవారే యని యంగీకరింతుము; కాని, యా యా శరీరములందు ప్రవేశించుటకు తగినట్లు వానిపరిమాణములలో సంకోచవికాసములు కలుగునని యంగీకరింతుము. దీపకాంతి పెద్దగదిలో నున్నపు డా గదియం దంతటను వ్యాపించును. ఆ దీపమే చిన్నగదిలో

నున్నపుడు దానికాంతి యంతటను వ్యాపించును. అట్లే హస్తిశరీర పరిమాణము గల జీవుడు చీమశరీరమున కర్మాధీనుడై ప్రవేశించునపు డా శరీరమునకు తగినట్లు తనపరిమాణమును సంకోచింపజేసికొనును.' అందు రేని - అదియును యుక్తియుక్తము కాదు. దీపపుకాంతి సావయవము. అందువలన నయ్యది సంకోచవికాసములను బొందును. అవయవములు నిరంతరముగ నొకచో కుదింపబడుట సంకోచ మనబడును. ఆ యవయవములే దూరదూరముగ నుండుట వికాసమనబడును. దీపమును పెద్దగదిలో నుంచినపుడు దానికాంతి సన్నగిల్లును. ఆ దీపమునే చిన్నగదిలో నుంచినపుడు కాంతి మిక్కుటమగును. దానింబట్టి కాంతిలో నవయవము లున్నట్లును, నవి సంకోచవికాసముల నందుచున్నట్లును నూహింపదగును. అట్లే జీవునిపరిమాణములో సంకోచవికాసము లంగీకరింతురేని జీవులు సావయవు లగుదురు. అవయవము లున్న వస్తువు కృతకము - కార్యము - అనిత్యమగును. అనేకాంతవాదులు జీవనిత్యత్వము నంగీకరింతురు. కాబట్టి సంకోచవికాసములను జీవులయం దంగీకరించుటకు వీలుకాదు. అంగీకరించినపక్షమున నవి యనిత్యము లగునని భావము. (౩౫)

## అన్త్యావస్థితేశ్చోభయనిత్యత్వా దవిశేషః ౨-౨-౩౬

అన్త్యావస్థితేః చ = మోక్షమునందుగల పరిమాణము నిత్యముగా నుండునని యంగీకరింతురేని, ఉభయనిత్యత్వాత్ = ఉభయమునందును నిత్యము కావలసివచ్చును. కాబట్టి, అవిశేషః = మోక్షమునందు విశిష్టత యంగీకారము కాదు.

సంసారావస్థలో జీవుడు కర్మఫలముల ననుభవించుటకై భిన్న భిన్న శరీరములను ధరింపవలసియున్నది. అందువలన నాయవస్థయందు జీవుడు శరీరపరిమాణము కలిగియుండును. అంత మన మోక్షము. అంత్యావస్థ యన మోక్షావస్థ. దానికి తరువాత మరియొక శరీరమున ప్రవేశింపవల

సిన యవసరము జీవున కుండదు. కాబట్టి మోక్షావస్థయందు ఏ పరిమా ణము జీవున కుండునో యది నిత్యముగా నుండునని యనేకాంతవాదు లందురేని - అదియును తగదు. మోక్షావస్థయం దుండు పరిమాణము నిత్య మగుననియు, నితరావస్థలో జీవపరిమాణ మనిత్య మనియు నంగీకరించు టకు హేతు వేమియు కానరాదు. శరీరపరిమాణము లన్నియు మధ్యమపరి మాణములే యగును. మధ్యమపరిమాణ మెన్నడును నిత్యము కాదు. నిరవ యవమగు సూక్ష్మపరిమాణము నిత్యమగును. లేక పరమమహత్పరిమాణ మైనను నిత్యమగును. మధ్యమపరిమాణ మెన్నడును నిత్యము కాదు. కాబట్టి యనైకాంతవాదులజీవుడు మధ్యమపరిమాణముగలవా డగుటచే నేయవస్థ యందును నిత్యు డన నొప్పదని భావము. (౩౬)

## షష్ఠాధికరణము

ఇట్లు నిరీశ్వరవాదమతములను నిరాకరించి మహర్షి సాకారేశ్వర వాదమును నిరాకరింపదలచి సూత్రములను రచియించుచున్నాడు.

### పత్యు రసామంజస్యాత్ ౨-౨-౩౭

పత్యుః=ప్రకృతిపురుషుల కీశ్వరు డయినవానికి శరీరము కలదని యంగీకరించిన, అసామంజస్యాత్=సమంజసము కానందువలన, న ట్లంగీ కరించుట యుక్తము కాదు.

వైదికు లంగీకరించునట్లు కొందఱు ప్రకృతి, జీవులు, ఈశ్వరుడు నున్న ట్లంగీకరింతురు. కాని యా యీశ్వరునకు నితరప్రాణుల కున్నట్లు శరీరమున్నదని యంగీకరింతురు. కాని యీశ్వరుడు శరీరధారి యనుట యసమంజసము. లోకమున ననేకములగు వస్తువులను రచియించు వ్యక్తు లకు శరీరము లుండుట చూచుచున్నాము. అట్లే ప్రపంచమును రచియించు నీశ్వరునకును శరీర ముండునని వారి యభిప్రాయము, శరీరధారులగు

ప్రాణులలో ముఖ్యముగ మానవులు ప్రపంచమునగల పదార్థముల సహాయముతో ననేకములగు చిత్ర విచిత్ర వస్తువులను రచియించుచుండుట సత్యమే. శరీరధారుల శక్తులు పరిమితము లగును. అందువలన వారు పరిమితములగు వస్తువులను పదార్థసంయోగ విభాగముల మూలమున రచియింప గలుగుదురేకాని యనల్పపదార్థములను రచియింపజాలరు. సృష్టి రచయితయగు నీశ్వరున కొక శరీర మున్నదందురేని అతనిశక్తియు పరిమితమే యగును. అప్పుడు పరిమితము కాని ప్రపంచమును రచియింప సమర్థుడు కాజాలడు. కాబట్టి యీశ్వరునకును శరీర మున్నదనుట సమంజసము కాదు. (౩౭)

## సంబంధానుపపత్తేశ్చ ౨-౨-౩౮

చ=మరియు, సంబంధానుపపత్తేః = ఆశ్రయాశ్రయిభావసంబంధముపపన్నము కానందునను, నీశ్వరునకు శరీర మున్నదనుట యుక్తము కాదు.

ప్రకృతియు, జీవులును నీశ్వరునం దున్నవి. ఈశ్వరుడు వానికాశ్రయము. అందువలన ప్రకృతిపురుషులకు నీశ్వరునకును గల సంబంధమాశ్రయాశ్రయిభావసంబంధ మనబడును. ఈశ్వరుడు జీవప్రకృతులకాధారము - ఆశ్రయమని పూర్వమున నిరూపించియే యుంటిమి. చిదచిదాత్మక మగు నీ బ్రహ్మాండమున కాశ్రయమగు నీశ్వరునకు శరీర మెట్లుండగలదు ? శరీరమున్న నీశ్వరుడు పరిచ్ఛిన్ను డగును. శరీరధారులమగు మనవలెనే యతని శక్తియుక్తులును నల్పము లగును. అనల్పమగు ప్రపంచమున కాశ్రయమగు నీశ్వరు డనల్పముకంటె నధికుడగునుకాని యల్పుడు కాడు. ఆశ్రయించువస్తువుకంటె నాశ్రయమగు వస్తు వెల్లపు డధికమగును కాని యల్పము కాదు. బ్రహ్మాండమున కాశ్రయమగు నీశ్వరుడు శరీరధారి యగునెడల ఆశ్రయాశ్రయిభావసంబంధము పొసగదని భావము. (౩౮)

## అధిష్ఠానానుపపత్తేశ్చ ౨-౨-౩౯

చ=మరియు, అధిష్ఠానానుపపత్తేః = శరీర ముపపన్నము కానందు వలన, నీశ్వరుడు శరీరధారి కాడు.

అధిష్ఠాన మన నిట శరీరము. ఈశ్వరునకు శరీర ముండుననుట యుక్తియుక్తము కాదు. ఈశ్వరునకు శరీర మెట్లుపపన్నము కాగలదు? సృష్టికి పూర్వము శరీర మేర్పడుటకు వీలులేదు. సృష్టిసమయముననను నేర్పడ ననువు కాదు. శరీరము నిరవయవమా? లేక సావయవమా? శరీరము నిరవయవ మన వలనుపడదు. సావయవమే యందురేని సృష్టికి పూర్వము సావయవ మెట నున్నది? కాబట్టి యీశ్వరునకు శరీర మున్నదనుట కారణబద్ధము - హేతుబద్ధము - కాదని సూత్రాభిప్రాయము. (౩౯)

## కరణవచ్చేన్న భోగాదిభ్యః ౨-౨-౪౦

కరణవత్ + చేత్ = ఈశ్వరునకు శరీరముగలదని యంగీకరింతుమేని, భోగాదిభ్యః = సుఖదుఃఖానుభవము, దానికి హేతువులగు వాసనాదులు నీశ్వరునకు గలవను దోషప్రసక్తి కలుగును. అందువలన, న=శరీర మున్నదని యంగీకరింప వీలులేదు.

కరణములన నింద్రియములు. అట్టి యింద్రియముల కాశ్రయము శరీరము. శరీర మింద్రియముల కాశ్రయ మగుట లోకసిద్ధము. ఈశ్వరునకు శరీర మున్నదని యంగీకరింతుమేని అదియును నింద్రియముల కాశ్రయ మనక తప్పదు. అట్టియెడ నీశ్వరుడును మనవలె భోగి యనవలసి వచ్చును. భోగము సుఖదుఃఖముల ననుభవించుటయే కదా! సుఖదుఃఖములు శుభాశుభకర్మలు చేయక లభింపవు. అట్టి కర్మలలో ప్రవృత్తి యవిద్యాదిక్లేశములవలన కలుగును. కాబట్టి ఈశ్వరుడు శరీరధారి యగునెడల నతడును సుఖదుఃఖానుభూతి గలవా డనవలసివచ్చును. అందువలన నత

నికి నవిద్యాదిక్లేశము లున్నట్లు అంగీకరింపక తప్పదు. ఉన్నవని యంగీక రింతుమేని ఈశ్వరుడు కానేరడు. కాబట్టి యీశ్వరునకు శరీరము లేదని భావము. (౪౦)

## అంతవత్త్వ మసర్వజ్ఞతా వా ౨-౨-౪౧

ఇంతేకాక, అంతవత్త్వమ్=వినాశము కలిగియుండుట, వా=మరియు, అసర్వజ్ఞత్వమ్ = సర్వజ్ఞత్వము లేకుండుట, అను నీ రెండుదోషములు వాటిల్లును.

ఈశ్వరునకు శరీర మున్న దందుమేని శరీరధారులమగు మనవలెనే యతడును వినాశము కలవా డగును. అందువలన నీశ్వరత్వమునకు భంగము కలుగును. అట్లే శరీరధారు లెల్లరును నల్పజ్ఞు లగుట లోకమున జూచుచున్నాము. ఈశ్వరుడు శరీరధారి యగునేని - అతడు నల్పజ్ఞుడు కావలసివచ్చును. కాబట్టి యీశ్వరునకు శరీర మున్నదనుట యుక్తి యుక్తము కాదు. (౪౧)

## సప్తమాధికరణము

ఈశ్వరుడు శరీరధారి కాదని నిర్ణయించి తదుపరి జీవోత్పత్తివాద మును నిరాకరింప మహర్షి సూత్రమును రచియించుచున్నాడు.

## ఉత్పత్త్యసంభవాత్ ౨-౨-౪౨

ఉత్పత్త్యసంభవాత్=ఉత్పత్తి సంభవముకానందున, నీశ్వరునినుండి జీవు డుత్పన్న మగుచున్నా డనుటయు తగదు.

జీవోత్పత్తి నంగీకరించువారు కొందఱు ఈశ్వరునినుండియే జీవు లుత్పన్ను లగుచున్నా రందురు. పరమేశ్వరునివలన జీవు లుత్పన్ను లగు దురు; కాని వారు నశింప రనియు చెప్పుదురు. ఈ మత మంగీకరింపదగి నది కాదు.

రీశ్వరునినుండి జీవు లుత్పన్ను లగుదు రన నేమి? మృత్తికనుండి ఘట ముత్పన్నమగునట్లు జీవు లుత్పన్ను లగుదు రందురేని, మృత్తిక ఘటముగ పరిణమించునట్లు పరమేశ్వరుడు జీవుడుగా పరిణమించుచున్నా డనవలసివచ్చును. అప్పుడు పరమేశ్వరుడు పరిణామియగును. అనిత్యుడును కావలసివచ్చును. పరమేశ్వరుడు సావయవియు నగును. లేక కుమ్మరి కుండ నుత్పన్నము చేసినట్లు పరమేశ్వరుడు జీవుల నుత్పన్నము చేయుచున్నా డందురేని - అదియును సంగతము కాదు. కుమ్మరి మృత్తిక నుపాదానముగ గ్రహించి కుండను రచియించుచున్నాడు. అట్లే యీశ్వరుడు జీవులను రచియించుటకు దేని నుపాదానముగ గ్రహించుచున్నాడు? ఈశ్వరునకు మించి మరియొక వస్తువు లేదుగదా!

కుమ్మరి యల్పశక్తి కలవాడు కావున మృత్తిక నుపాదానముగ గ్రహించి ఘటాదుల నుత్పన్నము చేయుచున్నాడు. పరమేశ్వరుడు సర్వశక్తిమంతుడు కావున సంకల్పమాత్రమున జీవుల నుత్పన్నముచేయగల డందురేని, అదియును నుపపన్నము కాదు. ఈశ్వరసంకల్పమున కీశ్వరు డాశ్రయము. సంకల్పమున కాశ్రయ మున్నట్లు విషయము నుండవలయును. నిర్విషయక సంకల్ప ముండదు. "జీవు డగుగాక" అను సంకల్పమునకు ఆశ్రయ మీశ్వరుడు. విషయ మెయ్యది? విషయము జీవు డందురేని, జీవుడు సంకల్పమునకు పూర్వమే యుండవలసివచ్చును. ఉత్పత్తికి పూర్వ మున్నవస్తువు నిత్యమే యగును. అందువలన నీశ్వరునివలన జీవు డుత్పన్నమగు ననుట యుక్తము కాదు. (౪౨)

జీవునకు జ్ఞానసాధనమగు నంతఃకరణ మొందు లేదనుమతమును నిరాకరించుచున్నాడు.

న చ కర్తుః కరణమ్ ౨-౨-౪౩

కర్తుః=శుభాశుభకర్మల నొనర్చు జీవునకు, కరణమ్ = అంతఃకరణము - మనస్సు, నచ న=లేదనుట యుక్తము కాదు.

శుభాశుభకర్మల నొనర్చుజీవునకు చక్షురాది బాహ్యేంద్రియము లున్నవని యంగీకరించుచు, నాంతరికసాధనమగు నంతఃకరణము-మనస్సు-నంగీకరింప మనుట ప్రతిజ్ఞామాత్ర మగును. మనస్సు నంగీకరింపకుండు టకు తగిన హేతువును ప్రదర్శింపనంతవరకు నయ్యది సిద్ధాంత మన నొప్పదు. (౪౩)

జీవునకు మన స్సను నొక ఆంతరికకరణము లేదనుట ప్రతిజ్ఞా మాత్రమే కాదు. అట్టికరణ మొకటి యపేక్షితము కానందున నయ్యది లేదనుచున్నా మందురేని - అదియును తగదని చెప్పుచున్నారు.

విజ్ఞానాదిభావే వా తదప్రతిషేధః ౨-౨-౪౪

వా=మరియును, విజ్ఞానాదిభావే = విజ్ఞానాదు లుండగా, తదప్రతిషేధః=మనస్సు నంగీకరింపకుండుట తగదు.

బాహ్యవిషయముల జ్ఞానము జ్ఞాన మనబడును. ఆంతరికవిషయముల జ్ఞానము విజ్ఞాన మనబడును. చక్షురాది బాహ్యేంద్రియములు లేకున్న బాహ్యవిషయములైన ఘటపటాదుల జ్ఞానము కలుగదు. బాహ్యపదార్థములు ఘటపటాదులు. సుఖదుఃఖాదు లాంతరికవిషయములు - ఆంతరికపదార్థములు. బాహ్యార్థజ్ఞానమునకు చక్షురాదులు బాహ్యకరణము లపేక్షితము లయినట్లు, సుఖదుఃఖాదివిషయముల జ్ఞానము కలుగుటకును నొకకరణము - ఇంద్రియము అపేక్షితము కాకతప్పదు. అయ్యదియే యంతఃకరణము - మనస్సు - అనబడును. కాబట్టి మనస్సు అనపేక్షిత మయినందున నయ్యది లేదనుట యుక్తియుక్తము కాదని సూత్రాభిప్రాయము. (౪౪)

విప్రతిషేధాచ్చ ౨-౨-౪౫.

చ=మరియు, విప్రతిషేధాత్=వివేకపూర్వక ప్రతిషేధమువలనను, జీవోత్పత్తివాద మసంగతమని సూత్రార్థము.

(వివేకపూర్వక ప్రతిషేధము విప్రతిషేధ మనబడును.)

'న జాయతే మ్రియతేవా విపశ్చిత్' కఠ. ౨-౧౮. 'జీవుడు పుట్టడు, నశింపడు' అను నీ యుపనిషద్వాక్యప్రమాణము ననుసరించి జీవు డుత్పన్నుడు కాడని స్పష్టపడుచున్నది. అట్లే 'అన్యత్రమనా అభూవం నాదర్శమ్, అన్యత్రమనా అభూవం నాశ్రౌషమ్' బృ. ౧-౫-౩. 'మన స్సెక్కడనో యున్నది: అందువలన చూడలేదు. మనస్సు మరియొకచో నున్నది: అందువలన విననైతి' నను నీ వాక్యమున జీవునకు భిన్నముగా సర్వజ్ఞానసాధన మగు మన స్సున్నట్లు ప్రతిపాదింపబడినది. ఇట్లు జీవోత్పత్తి నిషేధము, మనస్సుయొక్క సద్భావము వేరువేరుగ శాస్త్రములందు ప్రతిపాదింపబడినందున జీవు డుత్పన్ను డగుననుటయు, మనస్సు - అంతఃకరణము - లేదనుటయు రెండును వైదికులకు నంగీకరింపదగినవి కావని సిద్ధాంతము. (౪౫)

వేదాంత దర్శన - ఆంధ్ర వ్యాఖ్యానమున
ద్వితీయాధ్యాయమునందు ద్వితీయపాదము
సమాప్తము

# ద్వితీయాధ్యాయము

## తృతీయ పాదము

### ప్రథమాధికరణము

ప్రథమాధ్యాయమునందు వేదాంత వాక్య సమన్వయపూర్వకముగ జగజ్జన్మాదులకు బ్రహ్మము కారణమని నిరూపింపబడినది. ద్వితీయాధ్యాయమునందు ప్రకృతికాని, పరమాణువులుకాని జగజ్జన్మాదులకు స్వతంత్ర కారణములు కావని తెలుపుచు పూర్వోక్తవేదాంతవాక్య సమన్వయము స్మృతులకును, తర్కమునకును విరుద్ధము కాదని తెలుపబడినది. ఈ పాదమునందు వేదాంతవాక్యార్థములలో భాసించు పరస్పర విరోధమును తొలగించుటకు మహర్షి సూత్రముల నారంభించుచు ముందుగ నాకాశాది విషయములందు గోచరించు విరోధమును పరిహరించుటకై పూర్వపక్షసూత్రమును రచియించుచున్నాడు.

న వియ దశ్రుతేః                    ౨-౩-౧

అశ్రుతేః=వినబడనందున, వియత్=ఆకాశము, న=బ్రహ్మనకాశమునుండి యుత్పన్న మైనట్లు చెప్ప వలనుపడదు.

ఛాందోగ్యమునందు

'సదేవ సోమ్యేద మగ్ర ఆసీత్' ఛాం. ౬-౨-౧. 'ప్రథమమున - సృష్టికిపూర్వమున సత్తే కల' దని చెప్పి, యా సత్పదముచే జెప్పబడు బ్రహ్మమువలన

'తదైక్షత బహు స్యాం ప్ర జా యే యే తి, త త్తేజో ఽసృజత' ఛాం. ౬-౨-౩. ఈక్షణపూర్వకముగ నగ్న్యాదు - లుత్పన్నము లైనట్లు చెప్పబడినదే కాని ఆకాశముకాని, వాయువుకాని యుత్పన్న మైనట్లు చెప్ప

బడలేదు. కాబట్టి బ్రహ్మమునుండి యాకాశ ముత్పన్న మైనదని చెప్పుట వేదాంతవాక్యవిరుద్ధ మగును. కాగా బ్రహ్మము జగజ్జన్మాదులకు కారణ మనుట యుక్తము కాదని పూర్వపక్షము. (౧)

సిద్ధాంత సూత్రము :

## అస్తి తు ౨-౩-౨

(తు=పూర్వపక్ష నిషేధార్థకము) అస్తి=ఉన్నది.

ఆకాశముకూడ బ్రహ్మమువలన నుత్పన్న మైనట్లు వేదాంతవాక్య మున్నది. అందువలన పూర్వపక్షము సరికాదని సూత్రాభిప్రాయము.

తైత్తిరీయోపనిషత్తునందు

'సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ' తై. ౨-౧. 'బ్రహ్మము సత్యము, జ్ఞానము, అనంతము' నని ప్రారంభించి, 'తస్మా దాత్మన ఆకాశః సంభూతః, ఆకాశా ద్వాయుః' తై. ౨-౧. 'ఆ బ్రహ్మమునుండి యాకాశము, వాయువు జనించినవి' యని వర్ణింపబడినది. కాబట్టి బ్రహ్మమువలన నాకాశ ముత్పన్నమైనట్లు చెప్పబడనందున బ్రహ్మమునందు జగజ్జన్మాది కారణత్వ ముపపన్నము కాదనుట యుక్తము కాదు. (౨)

ఈ సమాధానమును సహింపక యొక రిట్లు శంకించుచున్నారు.

## గౌణ్యసంభవాత్ ౨-౩-౩

అసంభవాత్=ముఖ్యార్థము సంభవముకానందున, గౌణము - అముఖ్య - మని యేల యెంచరాదు?

ఆకాశము వ్యాపకము కదా! వైశేషికమున

'విభవాన్ మహా నాకాశః తథా చాత్మా' వై. ౭-౧-౨౨. 'ఆకాశము విభువు' అని వర్ణింపబడుటయు జూడనగును. విభువు, వ్యాపకము నగు వస్తువు నిరవయవ మగును. సావయవపదార్థము వ్యాపకము కానే

రదు. సావయవ ముత్పన్న మగును. నిరవయవ ముత్పన్నము కాదు. అయ్యది నిత్య మగును. కాబట్టి యాకాశ ముత్పన్నమైనదని యంగీకరింప వలనుపడదు. అందువలననే తైత్తిరీయమున వర్ణింపబడిన యాకాశోత్పత్తి ముఖ్యము కాదనియు చెప్పవచ్చునని శంకాభిప్రాయము. (౩)

శబ్దాచ్చ ౨-౩-౪

చ = మరియును, శబ్దాత్ = వేదాంతవాక్యమువలన, నాకాశోత్పత్తి గౌణ మనుటయే యుక్తము.

'వాయువు, అంతరిక్షము నను నీ యుభయము నమృతము' అని బృహదారణ్యకమున వర్ణింపబడినది. అమృతమని చెప్పబడు నాకాశమున కుత్పత్తి గౌణముకాక ముఖ్య మెట్లు కాగలదు? కాబట్టి, వేదాంతవాక్య సమన్వయమున విరోధము లేదనుట సమంజసము కాదని శంకాసూత్రాభి ప్రాయము. (౪)

'తస్మా ద్వా ఏతస్మా దాత్మన ఆకాశః సంభూతః, ఆకాశా ద్వాయుః' తై. ౨-౧. అను నీవాక్యమున గల సంభూతపదము ఉత్పత్తిని దెలుపు చున్నది. అయ్యది ముం దాకాశోత్పత్తిని దెలిపి యనంతరము వాయ్వా దుల యుత్పత్తిని దెలుపును. ఆకాశోత్పత్తి గౌణ మని చెప్పిన, వాయ్వా దుల యుత్పత్తియు గౌణ మనియే చెప్పవలసివచ్చును. ఆకాశోత్పత్తిని దెలి పిన సంభూతపదమే వాయ్వాదుల యుత్పత్తిని దెలుపుచున్నది. వేరొకపద మా వాక్యమునందు లేదు. వాయ్వాదుల యుత్పత్తి ముఖ్యమే కాని గౌణము కాదు. కాబట్టి యాకాశోత్పత్తిని గౌణమని చెప్పిన పదమే వాయువుయొక్క యుత్పత్తిని ముఖ్యమని యెట్లు చెప్పును? ఒకే వాక్యము నందు పఠింపబడిన యొకపద మొకేసమయమున గౌణము, ముఖ్యము నను రెండువృత్తుల నవలంబించి భిన్నార్థముల నొసంగు ననుట సముచితము కా దందురేని - అందులకు పూర్వపక్షి యిట్లు సమాధానము చెప్పుచున్నాడు.

## స్యాచ్చైకస్య బ్రహ్మశబ్దవత్ ౨-౩-౫

ఏకస్య చ = ఒక్క శబ్దమునకు కూడ, బ్రహ్మశబ్దవత్ = ఒకే బ్రహ్మశబ్దమునకు ముఖ్య, గౌణార్థము లున్నట్లు, స్యాత్ = రెండర్థము లుండవచ్చును.

తైత్తిరీయమునందు

'తపసా బ్రహ్మ విజిజ్ఞాసస్వ తపో బ్రహ్మేతి' ౩-౨. 'తపస్సుతో బ్రహ్మను దెలిసికొనగోరుము, బ్రహ్మము తపస్సు' అని యొకచో జెప్పబడినది. ఈ వాక్యమున బ్రహ్మశబ్దము మొదట ముఖ్యార్థమున పరబ్రహ్మమును బోధించి తరువాత గౌణార్థమున తపస్సును దెలుపుచున్నది. అట్లే సంభూతపద మొక్కటియే రెండర్థములను బోధింపగలదని సూత్రాభిప్రాయము. (౫)

'స తప స్తప్త్వా ఇదం సర్వ మసృజత యదిదం కించ' తై. ౨-౬. 'ఆ పరమాత్మ తప మొనర్చి సర్వమును సృజించెను' అను నీ వాక్యమున సర్వము నుత్పన్నము చేసినట్లు చెప్పబడినది. సర్వమునం దాకాశమును చేరును. అట్టియెడ నాకాశోత్పత్తియు ముఖ్య మనకతప్పదు. కాబట్టి 'సంభూత' పదముచే నాకాశోత్పత్తి గౌణమని చెప్పుట యుక్తముకా దందు రేని - పూర్వపక్షి సమాధానము :

## ప్రతిజ్ఞా ఽహాని రవ్యతిరేకా చ్ఛబ్దేభ్యః ౨-౩-౬

శబ్దేభ్యః = శబ్దప్రమాణములమూలమున, అవ్యతిరేకాత్ = వ్యతిరేకము కాదని తెలిసినందువలన, ప్రతిజ్ఞాహానిః = ఆకాశము నిత్యమై యుత్పత్తి లేనిదైనను సర్వోత్పత్తి ప్రతిజ్ఞకు హాని కలుగదు.

ఆకాశము వ్యాపకము. అందువలన నయ్యది యుత్పత్తిగలిగిన సర్వ పదార్థములతో నన్వయించియే యుండును. పరిచ్ఛిన్న (వ్యాపకము కాని) పదార్థములవలె కొన్నింటితో నన్వయించి, మరికొన్నింటితో నన్వయింపక

వ్యతిరేకించి యుండదు. ఉపనిషద్వాక్యము లాకాశ మన్నింటితో నన్వ యించియుండుటను స్పష్టముగా జెప్పుచున్నవి.

'ఆకాశః పరాయణమ్' ఛాం. ౧-౯-౧.

'ఆకాశ మాశ్రయము.'

'ఆకాశ ఏవ త దోతం చ ప్రోతం చ' బృ. ౩-౮-౭.

'ఆకాశ మన్నింటిలో నోతప్రోతమై యున్నది.'

పృథివ్యాది సమస్తపదార్థములు నాకాశముతో నోతప్రోతములై యున్నందున నాకాశము వానికి వ్యతిరేకము కాదు. అందువలన నయ్యది నిత్యమై యుత్పన్నము కానంతమాత్రమున సర్వ ముత్పన్న మగునని చెప్పిన వాక్యమునకు హాని యొకింతయును లేదు. కాబట్టి యాకాశోత్ప త్తిని సంభూతపదము గౌణముగా జెప్పినదని పూర్వపక్షి తనశంకను సమ ర్థింపగా - మహర్షి సిద్ధాంతపక్షమును సూత్రించుచున్నాడు. (౬)

## యావద్వికారం తు విభాగో లోకవత్ ౨-౩-౭

('తు' శంకానివృత్తికొఱకు)

లోకవత్=లోకమునజూడబడు ఘటపటాదులవలె, యావద్వికారం= కార్యపదార్థము లన్నియు, విభాగః=అవయవ విభాగములు కలవి యనియే యెంచవలెను.

అవయవ విభాగములు గల వస్తువు వికార మనబడును. వికారము విభజింపబడ దనుటకు వీలులేదు. వికారము సావయవ మని భావము. ఘటపటాదు లన్నియు సావయవములు - వికారములు. అట్లే యాకాశము కూడ వికారమే - సావయవమే. ఆకాశము పృథివ్యాది ద్రవ్యములలో నొకటి. కాని యది సూక్ష్మద్రవ్యము. ఘటపటాదులలో నవయవ విభా గము చూడబడినట్లందు జూడబడదు. అయినను సూక్ష్మదర్శుల కది బుద్ధి

గతము కాకపోదు: సూక్ష్మ మగుటచే నితరపదార్థముల కది వ్యతిరేకము కాక వానితో నన్వితమై యుండును. 'ఆకాశః పరాయణమ్' 'ఆకాశ ఏవ తదోతం చ ప్రోతం చ' అను నీ వాక్యములలోని యాకాశము పరబ్రహ్మ పరకము. పంచభూతములలో నొకటి యగు నాకాశము సర్వపదార్థములకు పరాయణము కాదు. అయ్యది వాయ్వాది స్థూలపదార్థములతో మాత్ర మన్వయించి యున్నది: కాని జీవేశ్వరులతో నన్వయింపదు. కాబట్టి భూతపద వాచ్యమగు నాకాశము వికారమే. సావయవమే. అందువలన నయ్యది యుత్పన్నమగును.

మరియు 'వాయు శ్చాంతరిక్షం చైత దమృతమ్' అను వాక్యమున నాకాశము అమృతము - నిత్యము - అని చెప్పబడుటకు కారణ మయ్యది యితరపదార్థములకంటె చిరస్థాయి యగుటయే. అంతేకాని యది నిరప యవములగు పదార్థములవలె నిత్యమని చెప్పుటకు కాదు. కాబట్టి యాకాశము కూడ బ్రహ్మమువలన నుత్పన్నమైన దనుటయే యుక్తము. కాగా 'తస్మా దాత్మన ఆకాశఃసంభూతః' అనువాక్యమునందలి సంభూతపద మాకాశోత్పత్తి ముఖ్యమనియే తెలుపును. కాని గౌణ మని తెలుపదు. అందువలన వేదాంత వాక్యసమన్వయములో దోష మొకింతయును లేదనియే సిద్ధమగు చున్నది. (౭)

## ఏతేన మాతరిశ్వా వ్యాఖ్యాతః                    ౨-౩-౮

ఏతేన = బ్రహ్మమువలన నాకాశ ముత్పన్నమైన దని చేసిన వ్యాఖ్యానము మూలమున, మాతరిశ్వా = వాయువు, వ్యాఖ్యాతః=బ్రహ్మము వలన నుత్పన్న మైనదని చెప్పినట్లే యెంచపలెను.

ఆకాశము బ్రహ్మమువలన నుత్పన్న మైనట్లు వేదాంతవాక్యము నందు వర్ణింపబడినది. అట్లే వాయువును నుత్పన్న మైనదని యెంచవలె నని సూత్రాభిప్రాయము. (౮)

వేదాంత వాక్యములందు ఆకాశము నిత్యమని చెప్పబడినను నయ్యది బ్రహ్మమువలన నుత్పన్న మైనదని యంగీకరింతురేని 'నిత్యో నిత్యానామ్' కఠ. ౫-౧౩. అను వాక్యమునందు బ్రహ్మముకూడ నిత్యమని వర్ణింప బడినది. అందువలన బ్రహ్మముకూడ మరియొకదానివలన నుత్పన్న మైనదని యెంచిన దోష మేమి ? అని శంకింపగా - సమాధానము :

**అసంభవస్తు సతోఽనుపపత్తేః** ౨-౩-౯

('తు' శంకా నివారణార్థము.)

అనుపపత్తేః=వికారియని సిద్ధముకానందున, సతః = సత్ పద వాచ్యమగు బ్రహ్మమున కుత్పత్తి, అసంభవః=సంభవము కాదు.

(సదేవ సౌ మ్యేద మగ్ర ఆసీత్) 'సృష్టికి పూర్వమున సత్తే యుండెను' అను నీ వాక్యమున బ్రహ్మము సత్పదార్థమని ఛాందోగ్యోపని షత్తు వర్ణించినది. ఆ బ్రహ్మ మాకాశాదులను సృష్టించినది. ఈ విషయ మున వేదాంతవాక్యసమన్వయవిరోధమును దొలగించుటకు ఆకాశవాయు వుల యుత్పత్తి ప్రదర్శింపబడినది. వాని సామ్యముతో బ్రహ్మముకూడ నుత్పన్న మైనట్లు శంకింపబడినది. కాని యది సరికాదు. వికారి వస్తు వుత్పన్న మగును. అది సావయవి యగును. ఆకాశము సావయవి కాబట్టి యుత్పన్నమైనదని నిరూపింపబడినది. ఉత్పత్తిని దెలుపు వేదాంత వాక్యము కూడ ప్రదర్శింపబడినది. సత్పదవాచ్యమగు బ్రహ్మము వికారిగా నెక్క డను వర్ణింపబడలేదు. పైపెచ్చు వేదాంతవాక్యములలో

'విరజం బ్రహ్మ నిష్కలమ్' ముం. ౨-౨-౯

'నిష్కలం నిష్క్రియం శాంతమ్' శ్వే. ౬-౧౯

(నిష్కలమ్) అవయవరహితమని స్పష్టముగా వర్ణింపబడినది. నిరవయవ ముత్పన్న మగుననుట యుక్తము కాదు. ఇంతే కాక శ్వేతాశ్వరమున

'స కారణం కరణాధిపాధిపో
న చాస్య కశ్చిత్ జనితా న చాధిపః' ౬-౯.

'బ్రహ్మము మూలకారణము. అది యన్నిటికి నధికము. దానికి కారణము లేదు' అని బ్రహ్మమున కుత్పత్తి నిషేధింపబడినది. కాబట్టి నిత్య శబ్దముచే చెప్పబడినంతమాత్రమున బ్రహ్మము ఆకాశమువలె నుత్పన్నమైన దనుట యుక్తము కాదు. (౯)

బ్రహ్మమువలన నాకాశవాయువుల యుత్పత్తిని వర్ణించి, యగ్ని యుత్పత్తిని ప్రతిపాదించుచున్నాడు.

## తేజోఽత స్తథా హ్యాహ  ౨-౩-౧౦

అతః=ఆ వాయువునుండి, తేజః=అగ్ని యుత్పన్నమగును. హి= ఎందువలన నన, తథాహ=వేదాంతవాక్య మట్లు వర్ణించినది.

('సదేవ సో మ్యేదమగ్ర ఆసీత్' ఛాం. ౬-౨-౧) ఛాందోగ్యమున 'బ్రహ్మము సృష్టికి పూర్వము కల'దని ప్రారంభించి, ('తత్ తేజో ఽసృజత ౬-౨-౩) 'ఆ బ్రహ్మము తేజస్సును - అగ్నిని - సృజించెను' అని తదుపరి వర్ణింపబడినది. ఇట బ్రహ్మము తేజస్సును సృజించిన ట్లున్నందున వాయువునుండి యగ్ని జనించిన దనుట సంగతము కాదందురేని-అట్లు కాదు. తైత్తిరీయమునందు

'తస్మా దాత్మన ఆకాశః సంభూతః ఆకాశా ద్వాయుః వాయో రగ్నిః' బ్రహ్మమువలన నాకాశము, నా యాకాశమునుండి వాయువు, నా వాయువు నుండి యగ్నియు' జనించినట్లు స్పష్టముగా వర్ణింపబడి యున్నది. కాబట్టి బ్రహ్మమునుండి సాక్షాత్తుగ నగ్ని పుట్టినదని యెంచరాదని భావము. మరియు నాకాశవాయువులు జనియింపకపూర్వము అగ్ని జనించుటయును యుక్తము కాదు. (౧౦)

## ఆ పః ౨-౩-౧౧

ఆ యగ్నినుండి జలము జనించినదని యీ సూత్రాభిప్రాయము. 'అగ్నే రాపః 'అగ్నినుండి జలము జనించిన' దని వేదాంతవాక్యమును చెప్పుచున్నది. (౧౧)

## పృథి వ్యధికార రూప శబ్దాంతరేభ్యః ౨-౩-౧౨

పృథివీ=జలమునుండి పృథివి యుత్పన్నమగును. అధికార, రూప, శబ్దాంతరేభ్యః=ప్రకరణము వలనను, రూపము - వర్ణ మువలనను, వాక్యాంతరమువలనను ఛాందోగ్యమున వర్ణింపబడిన యన్నము పృథివి యనియే గ్రహింపవలెను.

ఛాందోగ్యమునందు

'తా ఆప ఐక్షంత బహ్వ్యః స్యామ ప్రజాయేమహీతి తా అన్న మసృజంత' ఛాం. ౬-౨-౪. 'తా అన్న మసృజంత 'ఆ జల మన్నమును సృజించెను' అని యుండుటం బట్టి జలమునుండి పృథివి జనించిన దనుట యుక్తము కాదందురేని-అట్లుకాదు. ఇందలి యన్నపదము పృథివీవాచక మనియే తెలిసికొనవలెను. ఇందులకు కారణ మేమన : ప్రకరణము, రూపము, వాక్యాంతరము నని నుడువుదుము.

'త త్తేజో అసృజత,' 'త దపో ఽసృజత' ఛాం. ౬-౨-౩. అగ్ని, జలము నను భూతసృష్టిని వర్ణించిన ప్రకరణముననే 'తా ఆప అన్న మసృజంత' ఛాం. ౬-౨-౪ 'ఆ జలము అన్నమును సృజించెను.' అనియున్నది. కాబట్టి ప్రకరణబలమున నిట అన్నశబ్దము భూమి (పృథివి) వాచక మనియే యెంచుట యుక్తము. భూమియు పంచభూతములలో నొక్కటికదా!
[illegible]

'యత్ కృష్టం త దన్నస్య' ఛాం. ౬-౪-౧ 'అన్నమునకు

వర్ణము కృష్ణము - నలుపు' అని వర్ణింపబడినది. వ్రీహియవాదులు అన్న శబ్దమున కర్థమగునెడల నవి కృష్ణవర్ణము గలవి కావలసివచ్చును. అట్లు కావు. భూమివర్ణము నలు పనుట ప్రసిద్ధమే. కాబట్టి రూపము ననుసరించి చూచినను పై వాక్యమునందలి యన్నశబ్దము పృథివీవాచక మనియే యెంచుట యుక్తము. ఇంతేకాక

'అద్భ్యః పృథివీ' తై. ౨-౧. జలమునుండి పృథివి యుద్భవించిన దని తైత్తిరీయవాక్యమున వర్ణింపబడినది. ఇట్లనేకకారణము లున్నందున ఛాందోగ్యవాక్యమునందలి యన్న శబ్దము పృథివీవాచక మని చెప్పవలెను; కాగా జలమునుండి పృథివి యుత్పన్న మైనదని సిద్ధాంతము. (౧౨)

ఆకాశముమొదలు పృథివివరకు గల పంచభూతముల యుత్పత్తి నిరూపింపబడినది. కాని, బ్రహ్మమువలన నాకాశ ముత్పన్నమైనను వాయ్వాదిభూతములు వానికి కారణములగు నాకాశాదులనుండి యుత్పన్న మైనవికదా! కాబట్టి వాని యుత్పత్తికి బ్రహ్మము కారణ మెట్లగును? పరంపరగా కారణ మందురేని జీవులును పరంపరగా కారణములు కావచ్చునుగదా! కాబట్టి వేదాంతవాక్య సమన్వయ మెట్లు సంగత మగు నన, సమాధానము :

## తదభిధ్యానాదేవ తు తల్లింగాత్ సః ౨-౩-౧౩

('తు' శంకా నివారణార్థకము. సంకల్పము గర్భమున గల యీక్షణము అభిధ్యాన మనబడును.)

తదభిధ్యానాత్ = పృథివీపర్యంతభూతవిషయకాభిధ్యానరూపమగు, తల్లింగాత్ = బ్రహ్మమును దెలుపు లింగమువలన, స ఏవ=ఆ బ్రహ్మమే పృథివ్యాది భూతసృష్టికిని కారణము.

బ్రహ్మము వాయ్వాదిభూతజాతమునకు పరంపరాకారణము కాదు,

కుమ్మరి కుండలు నిర్మించుచు వానికి సాక్షాత్కారణము - కర్త యెట్లగు చున్నాడో యట్లే బ్రహ్మముకూడ పృథివ్యాదులకును స్రష్ట - కర్త - యని యెరుగనగును. కర్త - రచయిత - పరంపరాకారణము కాదు. సాక్షాత్కారణ మనియే తెలియనగును.

కుమ్మరి ముందు మట్టితో కపాలములను రచియించి వానిమూలమున స్వయముగ ఘటమును రచియించును. అట్లే బ్రహ్మము ముం దాకాశమును రచియించి, దానినుండి వాయువును, తన్మూలమున నగ్న్యాదులను స్వయముగ రచియించును. కాబట్టి పరంపరాకారణ మన నొప్పదు.

'తదైక్షత బహూస్యాం ప్రజాయేయ' ౬-౨-౩.

ఛాందోగ్యమున గల యీ వాక్యమునుబట్టి బ్రహ్మము సృష్టి నొనర్చుట కీక్షించినట్లు స్పష్టముగ తెలియుచున్నది. బ్రహ్మము సృష్టికర్త యని తెలుపు వాక్యము లుండ పృథివ్యాదులసృష్టికి బ్రహ్మము సాక్షాత్కారణము కాదనుట యుక్తము కాదని సూత్రాభిప్రాయము. కాబట్టి వేదాంత వాక్యసమన్వయమున దోష మొకింతయు లేగని భావము. (౧౩)

## ద్వితీయాధికరణము

భూతోత్పత్తిక్రమము చెప్పి ప్రస్తుతము ప్రళయక్రమము నాలోచించుచున్నాడు.

### విపర్యయేణ తు క్రమోఽత ఉపపద్యతే చ ౨-౩-౧౪

అతః = భూతోత్పత్తిక్రమమునకు, విపర్యయేణ = విపరీతముగ, క్రమః = ప్రళయక్రమ ముందునవి తెలియవలెను. ఉపపద్యతే చ = అట్లుండుటయు యుక్తమే.

పరబ్రహ్మమువలన సమస్తజగత్తు రచియింపబడును. ప్రళయ

పర్యంతము బ్రహ్మమునందే యుండి ప్రళయమున నందే లీన మగును. ఈ భావమునే యీ క్రిందివాక్యము తెలుపును.

'యతో వా ఇమాని భూతాని జాయంతే యేన జాతాని జీవంతి
యత్ప్రియం త్యభిసంవిశంతి తద్ విజిజ్ఞాసస్వ తద్ బ్రహ్మ'
తై. ౩-౧.

బ్రహ్మ మాకాశమును ముందు సృజించి తదుపరి వాయువు, అగ్ని, జలము, పృథివి మున్నగు భూతజాతమును సృష్టించినట్లు పూర్వము సృష్టి క్రమము తెలుపబడినది. ప్రళయక్రమ మిందుకు విపరీతముగా నుండును. పృథివి జలమునందును, జలము అగ్నియందును, అగ్ని వాయువునందును, వాయు వాకాశమునందును క్రమముగ లీనమగును. ఆ యాకాశము స్వకారణమున లీనమయి పరమేశ్వరునందు నిలుచునని భావము. లోకాను భవమునుబట్టి చూచిన నీ క్రమము యుక్తమే యనియు దెలియును. కార్యము కారణరూపము నొందుటయే దానిప్రళయ మనబడును. ఘటము ప్రళయమై మృత్తికయందు లీన మగును. కుండలాదిభూషణములు నశించి సువర్ణ మున లీనమగును. కాబట్టి యుత్పత్తిక్రమమునకు ప్రళయక్రమము విపరీత మనుట సుస్పష్టము. (౧౪)

ఆకాశాదిభూతముల యుత్పత్తి, ప్రళయ క్రమములను వివరించి మహత్తత్వాది సూక్ష్మభూతములవరకు గల కార్యపదార్థముల యుత్పత్తి ప్రళయముల నేల నిరూపింపలే దన:

అంతరా విజ్ఞానమనసీ క్రమేణ
తల్లింగాదితి చేన్నావిశేషాత్ . ౨-౩-౧౫

అంతరా=బ్రహ్మమునకు నాకాశమునకు మధ్య, విజ్ఞానమనసీ = విజ్ఞానము, మనస్సు రెంటిని, క్రమేణ=క్రమముగా, తల్లింగాదితి చేత్=

ఆకాశాదులవలె వాని యుత్పత్తిప్రళయము లేల వర్ణింపలేదన, అవిశేషాత్= విశేషములేనందున, న=వర్ణింపలేదు.

(సూత్రమునందలి విజ్ఞానపదము మహత్తత్వమునకు, అహంకారమునకు, సూక్ష్మభూతములకు నుపలక్షకము. అట్లే మనస్సు కర్మేంద్రియములకు జ్ఞానేంద్రియములకు నుపలక్షకము.)

ఆకాశాదిభూతపంచకముయొక్క యుత్పత్తిప్రళయములు పూర్వ సూత్రములందు వర్ణింపబడినవి. వానియుత్పత్తి ప్రళయవిషయమున గల యుపనిషద్వాక్యవైరుధ్యము తొలగింపబడినది. కాని, పరమేశ్వరుడు ప్రకృతినుండి యాకాశాదులను సృష్టించుటకు పూర్వము, మహత్తత్వమును, అహంకారమును, సూక్ష్మభూతములను, ఇంద్రియములను సృష్టించునుగదా ! వానియుత్పత్తి ప్రళయములను సూత్రకారు దేల ప్రతిపాదింపదయ్యె నన - సమాధానము :

మహత్తత్వాదుల యుత్పత్తి ప్రళయములను వర్ణించు ఉపనిషద్వాక్యములలో భేదము - విరోధము - కనిపింపదు. అందువలన వానియుత్పత్తి ప్రళయములను నిరూపించి వాని నుపపాదించు వాక్యములవిరోధమును దూరమొనర్పవలసిన యవసరము సూత్రకారునకు గలుగలేదు. కాబట్టి దోషమొందును లేదని భావము. (౧౫)

## తృతీయాధికరణము

భూతపంచకోత్పత్తి ప్రళయములను వివరించి తత్సాహచర్యము వలన నుపస్థితమగు జీవాత్మకు సంబంధించిన యుత్పత్తివినాశములుకూడ వివరింపదలచి, 'జీవుడు పుట్టుచున్నాడు. చచ్చుచున్నాడు' అను లోకవ్యవహారము జీవునియందు ముఖ్యముగ వర్తింపదని మహర్షి సూత్రించుచున్నాడు.

చరాచరవ్యపాశ్రయ స్తు తద్వ్యపదేశో
భాక్త స్తద్భావభావిత్వాత్ ౨-౩-౧౬

(తు=జన్మమరణములు ఆత్మాశ్రితములు కావు)

తద్వ్యపదేశః=జన్మమరణకథనము, చరాచరవ్యపాశ్రయః = చరాచరశరీరములకు సంబంధించినదై, తద్భావభావిత్వాత్ = శరీరము లున్నపుడు కలుగుచున్నందువలన, భాక్తః=జీవాత్మయందు గౌణముగ వ్యవహరింపబడును.

లోకమున 'దేవదత్తుడు జన్మించెను. యజ్ఞదత్తుడు మరణించెను' అను వ్యవహారము చూచుచున్నాము. అందువలన జీవునకు జన్మమరణము లున్నట్లు తెలియుచున్నది. కాని, యీ జన్మమరణములు జీవునకు సంబంధించినవి కావు. అవి శరీరమునకు సంబంధించినవని తెలియనగును. లోకవ్యవహారమునుబట్టి జీవునకే జన్మమరణము లున్నట్లు తెలియుచున్నను నమ్మించరాదు. జన్మమరణములు జీవునియందు ముఖ్యములు కాదు. అది గౌణము. జన్మమరణములు శరీరమునకే కాని యాత్మకు లేవు. ఆత్మ ప్రత్యక్షము కాదు. జన్మమరణములు ప్రత్యక్షధర్మములు. కాబట్టి యవి ప్రత్యక్షమగు శరీరమునకు సంబంధించినవే కాని యప్రత్యక్షమగు జీవునకు చెందవు. శరీరముద్వారమున జీవాత్మజ్ఞానము కలుగును. కాబట్టి శరీరమునకు చెందిన జన్మమరణధర్మములు శరీరాశ్రితము లయినను నాత్మాశ్రితములుగ వ్యవహరింపబడుచున్నవి. కాబట్టి జీవాత్మకు జన్మమరణములు గౌణములని సూత్రాభిప్రాయము. (౧౬)

నాత్మా ఽశ్రుతేః నిత్యత్వాచ్చ తాభ్యః ౨-౩-౧౭

ఆత్మా=జీవాత్మ, న = చావదు, జన్మింపదు. అశ్రుతేః = ఆత్మకు

జన్మమరణము లున్నట్లు ఉపనిషత్తులు చెప్పవు. తాభ్యః=శ్రుతులవలనను, నిత్యత్వా చ్చ=నిత్యమైనందునను, జీవునకు జన్మమరణములు లేవు.

'న జాయతే మ్రియతే వా విపశ్చిత్' కఠ. ౨-౧౮.

'అజో నిత్యః శాశ్వతో ఽయం పురాణః' కఠ. ౨-౧౮.

ఈ కఠోపనిషత్తువాక్యములు జీవుడు జన్మింపడనియు, నట్లే మరణింపడనియు చెప్పుచున్నవి.

'జీవాపేతం వావ కి లేదం మ్రియతే న జీవో మ్రియతే'

ఛాం. ౬-౧౧-౩.

ఛాందోగ్యమున, 'జీవుడు తొలగిపోయినందున నిది మరణించుచున్నది. జీవుడు మరణింపడు' అని యీ వాక్యము చెప్పుచున్నది. కాబట్టి జీవునకు జన్మమరణములు లేవు. ఉన్నట్లు చెప్పువాక్యములు లభింపవు.

'అవినాశీ వా అరే అయ మాత్మా ఽనుచ్ఛిత్తి ధర్మా'

బృ. ౪-౫-౧౪.

'ఈ యాత్మ నాశము లేనిది. నాశమగుట దీనిధర్మము కాదు' అని యాత్మనిత్యత్వము నీ వాక్యము స్పష్టముచేయుచున్నది. కాబట్టి జన్మమరణము లాత్మకు చెందిన ధర్మములు కావు. (౧౭)

ఆత్మ నిత్య మని చెప్పి దానిస్వరూపమును చెప్పుచున్నాడు.

జ్ఞో ఽత ఏవ ౨-౩-౧౮

అతఏవ = నిత్యమగుటవలననే, జీవాత్మ, జ్ఞః = జ్ఞానస్వరూపము గలది యని యెరుగనగును.

ఈ దేహాధ్యక్షుడైన జీవుడు నిత్యుడని యంగీకరింపబడుచున్నాడు. అతడు జ్ఞానాశ్రయుడా ? లేక జ్ఞానస్వరూపుడా ? యని సంశయము గలుగును. ఉపనిషత్తులలో కొన్నిట జీవాత్మజ్ఞానస్వరూపుడనియు, మరి

కొన్నిట జ్ఞానాశ్రయుడనియు వర్ణన చూడనగును. అందువలన సంశయము పొడముట సహజమే. ఇందు జ్ఞానాశ్రయు డనుట పూర్వపక్షము. జ్ఞానస్వరూపు డనుట సిద్ధాంతము.

'ఏష హి ద్రష్టా స్ప్రష్టా శ్రోతా ఘ్రాతా రసయితా
మంతా బోద్ధా కర్తా విజ్ఞానాత్మా పురుషః' ప్రశ్న. ౪-౯.
'యో వే దేదం జిఘ్రాణీతి స ఆత్మా' ఛాం. ౮-౧౨-౪.

ఈ వాక్యములందు జీవాత్మదర్శన, స్పర్శన, శ్రవణాది జ్ఞానకర్తగా జెప్పబడుట స్పష్టము. ఈ సూత్రమున జీవునకై ప్రయోగింపబడిన 'జ్ఞః' అను పదముకూడ కర్తృప్రత్యయముచే నిర్దేశింపబడినది. కావున జీవాత్మ జ్ఞానకర్తయై జ్ఞానాశ్రయుడే యగునని పూర్వపక్షము.

సిద్ధాంతము: జీవుడు జ్ఞానాశ్రయు డనుట యుక్తము కాదు. జ్ఞానమున కాశ్రయు డగునెడల నా జ్ఞానము నిత్యమా ? లేక యనిత్యమా ? చెప్పవలసియుండును. అనిత్య మందురేని, జ్ఞానము కొంతకాల మాత్మలో నుండుననియు, తరువాత నశించుననియు నెంచవలసివచ్చును. అట్టి జ్ఞానము లేనికాలమున 'నేను ఉన్నానా లేనా ?' యని సందేహము కలుగవలెను. లేదా 'నేను లేను' అను విపరీతజ్ఞానమయినను కలుగవలెను. ఇంతేకాక, జ్ఞానగుణము ఆత్మ నాశ్రయించియుండు ననుచున్నాము. కావున నది యనిత్య మగునెడల ధర్మి - ఆశ్రయి - వికారి కావలసివచ్చును. అప్పు డాత్మయు నుత్పత్తి వినాశములకు లోనై యనిత్య మగును. కాబట్టి జీవాత్మ జ్ఞానాశ్రయము కాదు. జ్ఞానము నిత్యమే యందురేని - అది గుణ మనజనదు. జ్ఞానము నిత్యమై యెల్లపుడు జీవాత్మ నాశ్రయించి యుండునా ? లేక యప్పుడప్పు డాశ్రయించునా ? కొంతకాల మది వేరుగ నుండు నందురేని - అపు డది గుణము కాదు. గుణము స్వతంత్రయునికి గలిగి యుండదు. గుణము గుణిని వదలియుండనేరదు. కాబట్టి నిత్యమై

యెల్లప్పుడు జ్ఞానము జీవాత్మ నంటియుండు నని వలసివచ్చును. అప్పుడు దానిని గుణ మనుటకంటె స్వరూపమో, స్వభావమో యనుట యుక్తము. కాబట్టి జ్ఞానము జీవునకు స్వరూపమే యననగును. ఇట్లు జ్ఞానము జీవునకు స్వరూప మందుమేని - అది గుణములలో చేరక వేరుపదార్థ మగు నందు రేని - అట్లు కాదు. స్వరూపము పారిభాషికపదము. ఉపర్యుక్తహేతువుల వలన గుణమని భాషింపవలనుకాదు, కావున స్వరూప మని చెప్పుచున్నాము. అంతమాత్రమున నది గుణపదార్థము కాకపోదు.

జీవాత్మ జ్ఞానాశ్రయమని యుపనిషత్తులు చెప్పుట యెట్లు పొసగు నందురేని, వృత్తి జ్ఞానమున కాశ్రయ మని చెప్పవచ్చుము. స్పర్శనము దర్శ నము మున్నగు నైంద్రియకజ్ఞానములకు జీవాత్మ యాశ్రయమని వాక్య ములు చెప్పుచున్నవి. జ్ఞానము ద్వివిధము: ఇంద్రియకజ్ఞానము, నిత్య జ్ఞానము నని. కావున జీవాత్మ యైంద్రియకజ్ఞానమున కాశ్రయ మగును. నిత్యజ్ఞానము జీవాత్మునకు స్వరూప మగునని భావము. జీవాత్మ జ్ఞాన స్వరూప మనుటకు వాక్యప్రమాణములు నున్నవి. అవి యెవ్వి యన:

'యో ఽయం విజ్ఞానమయః ప్రాణేషు హృద్యంత ర్జ్యోతిః పురుషః'
బృ. ४-३-२.

'అత్రాయం పురుషః స్వయంజ్యోతి ర్భవతి' బృ. ४-३-౯.

ఈ వాక్యములందు జీవాత్ముడు 'జ్యోతిః' అను పదముచే చెప్ప బడుట స్పష్టము. 'జ్యోతి' యన జ్ఞానము - అనగా జ్ఞానస్వరూపు డనియే కదా! యర్థ మగుచున్నది.

'జడవ్యావృత్తో జడం ప్రకాశయతి చిద్రూపః' సాం. ౬-౫౦.

ఈ సాంఖ్యసూత్రమున జీవాత్మ, చిద్రూపః=జ్ఞానస్వరూపుడు, అని స్పష్టముగా చెప్పబడినది. కాబట్టి జీవాత్ముడు జ్ఞానస్వరూపుడే కాని జ్ఞానా శ్రయుడు కాదనియే సిద్ధాంతము. (౧౮)

## చతుర్థాధికరణము

జీవాత్మ జ్ఞానస్వరూపమని చెప్పి యిపుడు అణువని చెప్పుటకు సూత్రము నారంభించుచున్నాడు.

### ఉత్క్రాంతి గత్యాగతీనామ్ ౨-౩-౧౯

శరీరమునుండి వెలువడుట యుత్క్రాంతి, లోకాంతరగమనము గతి, అటనుంచి వచ్చుట ఆగతి యనబడును. జీవునియం దీ మువ్విధము లగు గతు లున్నట్లుపనిషత్తులలో చూచుచున్నందున జీవు డణు వని సూత్రాభిప్రాయము.

సచ్చిత్స్వరూపుడగు జీవు డణువా లేక విభువా? అని సందేహము. విభు వని పూర్వపక్షము. కాదు, అణువే యని సిద్ధాంతము.

జగత్తునందు గల భోగ్యపదార్థములన్నియు జీవుల యదృష్ట సంబంధమువలన నుత్పన్నము లగుచున్నవి. అందువలననే ప్రతి కార్యమునకు గల కారణసముదాయములో నదృష్టముకూడ నొక కారణముగ లెక్కింపబడుచున్నది. అదృష్ట మాత్మయందు సమవేతమై యుండును. భోగ్య వస్తువులు దూరప్రదేశములం దుండును. ఆత్మ యణువు - సూక్ష్మము - అని పూర్వమే నిశ్చయించియుంటిమి. అందు సమవేతమై యున్న యదృష్టసంబంధము దూరస్థభోగ్యవస్తువులతో నెట్లు గలుగ గలదు? అదృష్టసంబంధము లేక భోగ్యవస్తు వేర్పడజాలదు. కాబట్టి యా సంబంధ మేర్పడవలె ననిన జీవాత్మ విభువే కావలసియుండును. అణు వనుట తగదు. అందువలన జీవాత్ముడు విభువే - వ్యాపకుడే - యని పూర్వపక్షము.

**జీవాత్మునకు ఉత్క్రాంత్యాదు లున్నట్లు ఉపనిషత్తులు చేప్పుచున్నవి. కాబట్టి విభువనుట తగదు.**

'తేన ప్రద్యోతే నైష ఆత్మా నిష్క్రామతి చక్షుష్టోవా
మూర్ధ్నోవా అన్యేభ్యోవా శరీరదోషేభ్యః.' బృ. ౪-౪-౨.

'చక్షువులనుండియో, మూర్ధ్ననుండియో, ఇతరాంగములనుండియో జీవాత్ముడు నిష్క్రమించును' అని యీ వాక్యమునందు జీవుని యుత్క్రాంతి స్పష్టముగా వర్ణింపడినది.

'తస్మాల్లోకాత్ పునరేత్యస్మై లోకాయ కర్మణే.' బృ. ౪-౪-౬

'ఆలోకమునుండి యీ లోకమునకు కర్మనిమిత్తమై మరల వచ్చును' అని యాగమన ముల్లేఖింపబడినది. ఈ గమనాగమనములు జీవుడు విభువగుచో సంభవింపవు. అణువని యంగీకరించిన నెట్టి దోషమును నుండదు. గమనాగమనములు సంభవములే కాక సమంజసము లగును. కాని, జీవాత్మ యణువైన దూరస్థభోగ్యవస్తువులతో నదృష్టమునకు సంబంధ మెట్లు కలుగగల దందురేని - అది ఫలప్రదాత యగు నీశ్వరేచ్ఛాధీన మగుట నెట్లో యుపపన్నము కాగలదు. ఈ కారణమున నాత్మ విభువని యన నవసరములేదు. అందువలననే ముండకోపనిషత్తుకూడ

'ఏషో ఽణు రాత్మా చేతసా వేదితవ్యో
యస్మిన్ ప్రాణః పంచధా సంవివేశ' ౩-౧-౯

అని జీవాత్మ యణువే యని స్పష్టముగ జెప్పుచున్నది.

'సవా ఏష మహా నజ ఆత్మా' బృ. ౪-౪-౨౨.

అను నిట్టి వాక్యములందు చెప్పబడిన మహానాత్మ పరమాత్మ యని యెంచవలెను. కాబట్టి జీవాత్మ యణువే యని సిద్ధాంతము. (౧౯)

## స్వాత్మనా చోత్తరయోః ౨-౩-౨౦

ఉత్తరయోః = గమనాగమనములకు, స్వాత్మనా = ఆ క్రియలకు కర్తయగు నాత్మతో సంబంధ ముండుటవలనను జీవాత్మ యణువేయగును.

పూర్వసూత్రమున జెప్పబడిన యుత్క్రాంతికి శరీరమునుండి వెలువడుట యని చెప్పక శరీరమపై నాత్మకుగల స్వామ్యమును విడుచుట యని యర్థము చెప్పి, యాత్మ విభువే యని యందురేని - గత్యాగతులకు- గమనాగమనములకు - అర్థ మే మందురు ? గమనాగమనములు రెండును గమనకర్తయం దుండు క్రియలే కదా! గమనాగమనములు చలనక్రియయందు నిరూఢములు. వాని నింకొక విధమున గల్పింప నవకాశమే లేదు. జీవాత్మ వ్యాపక మగుచో నందు చలనక్రియ కలుగనేరదు. కాబట్టి యాత్మ యణువే కాని విభువు కాదు. (౨౦)

నాణు రతచ్ఛ్రుతే రితి చే న్నేతరాధికారాత్. ౨-౩-౨౧

అతచ్ఛ్రుతేః=అణువు కాదని యుపనిషద్వాక్యము చెప్పుచున్నం దున, ఆత్మ, అణుః న=అణువుకాదు, ఇతిచేత్=అనియందురేని, న=అది సరికాదు. కారణమేమన : ఇతరాధికారాత్ = ఆ వాక్యములు పరమాత్మ ప్రకరణమునకు జెందినవిగా నెరుగవలెను.

'స వా ఏష మహా నజ ఆత్మా....' బృ. ౪-౪-౨౨.

'ఆ యాత్మ (మహాన్) విభువు, జన్మరహితమైనది' అను నీ వాక్యమునందు ఆత్మ విభువుగా వర్ణింపబడినందున నణువు కా దందురేని - అద్యుదియును సరికాదు. ఈ వాక్యమున నుల్లేఖింపబడిన ఆత్మ జీవాత్మ వాచకము కాదు. ఈ వాక్యము పరమాత్మను వర్ణించు ప్రకరణమునకు చెందియున్నది. కాబట్టి యందలి యాత్మపదము పరమాత్మబోధకము. పర మాత్మ విభు వనుటలో నెట్టిదోషము లేదు. అందువలన జీవాత్మ యణు వనుట కీ వాక్యము బాధకము కాదని భావము. (౨౧)

స్వశబ్దోన్మానాభ్యాం చ ౨-౩-౨౨

చ = మరియును, స్వశబ్దోన్మానాభ్యాం = అణుశబ్ద ప్రయోగము

వలనను, ఉన్మానము వలనను ఆత్మ యణువే కాని విభువు కాదని సూత్రార్థము.

(ఉన్మానము = ఉద్ధృతమైన మాన మున్మానము - మిక్కిలి యల్ప పరిమాణ మని యర్థము.)

'ఏషోఽణు రాత్మా చేతసా వేదితవ్యః' ముం. ౩-౧-౯.

ఈ వాక్యమునందు జీవాత్మ యణువని స్పష్టముగ స్వశబ్దముచే జెప్పబడినది.

'బాలాగ్ర శతభాగస్య శతధా కల్పితస్య చ,
భాగో జీవః స విజ్ఞేయః స చానంత్యాయ కల్పతే.' శ్వే. ౫-౯.

'ఒక కేశములోని నూరవభాగములోని నూరవభాగ మెంత సూక్ష్మమో, యంత సూక్ష్మము జీవాత్మ'యని యీ వాక్యమునందు జీవాత్మని కొలత, యింతయని చెప్పుటవలనను జీవాత్మ దణువే యనుట సిద్ధమని సూత్రాభిప్రాయము. (౨౨)

శీతల గంగా జలమున స్నాన మొనర్చినపుడు శరీరమునం దంతటను శైత్యము (చల్లదనము) జీవు డనుభవించుచున్నాడు. కాబట్టి జీవు డణు వగుట చెల్లదన - సమాధానము చెప్పుచున్నాడు సూత్రకారుడు.

## అవిరోధ శ్చందనవత్ ౨-౩-౨౩

చందన వత్=చందనపు బొట్టువలె, అవిరోధః = జీవాత్మ దణువైనను శరీరమునం దంతటను శైత్యము ననుభవించుటలో విరోధ మొందును లేదు.

వేసవియందు ఫాలభాగమున ధరించు చందన తిలకము వలన శరీరమునం దంతటను చల్లదన మేర్పడునటుల శరీరమునందు ఒకచో

నున్న జీవాత్మ యణువైనను, శరీరమున నంతటను గలుగు చైతన్యము ననుభవించును. ఇందు దోష మెందును లేదని సూత్రభావము. (౨౩)

### అవస్థితివైశేష్యా దితి చేన్నాభ్యుపగమాత్ హృది హి ౨-౩-౨౪

అవస్థితి వైశేష్యాత్=స్థితి భేద ముండుటవలన చందనశైత్యము శరీరమున నంతట నేర్పడవచ్చును. కాని జీవాత్మ కట్లు కాదు. ఇతిచేత్= అని యందురేని, న=అట్లనరాదు. హి=కారణమేమన, జీవాత్మ, హృది= హృదయమునందు,అభ్యుపగమాత్=ఉన్న ట్లంగీకరించుచున్నందున, దోషము లేదని భావము.

చందన తిలకము శరీరమున నొకభాగమున నుంచుటచే శరీరమున కంతటికి చల్లదనము చేకూర్చుచున్నది. అట్లే జీవాత్మ శరీరమున నొక భాగమున నున్నచో నా యుదాహరణము సరియగును. కాని, జీవాత్మశరీరైకదేశమున - శరీరములో నొకభాగమున నున్నట్లు నిశ్చయము లేనందున చందనోదాహరణము సరికా దందురేని - అది యయుక్తము. చందనతిలకము శరీరైకదేశమున నుండునట్లే జీవాత్మయును శరీరైకదేశ మగు హృదయమునందే యుండుటవలన నుదాహరణవైషమ్యము లేదు. ఉపనిషద్వాక్యము లట్లే చెప్పుచున్నవి.

'హృది హ్యేష ఆత్మా' ప్ర. ౩-౬.

'కతమ ఆత్మేతి? యోయం విజ్ఞానమయః
ప్రాణేషు హృద్యంతర్జ్యోతిః పురుషః' బృ. ౪-౩-౭.

ఈ రెండువాక్యములందును జీవాత్మ హృదయమునందే యుండునట్లు స్పష్టముగ జెప్పబడినవి. కావున జీవాత్మ యణువే. (౨౪)

## పంచమాధికరణము

చందనము సావయవము. అందువలన నది యితరావయవములలో వ్యాపించి యట చల్లదనము గలిగింపవచ్చును. జీవాత్మ నిరవయవము. అందువలన నది ఇతరశరీరావయవములలో వ్యాపింప ననువుకాదు. కాబట్టి హృదయమున నున్న జీవాత్మకు నితరావయవములలో జ్ఞానము కలుగ రాదు. అందువలన చందనోదాహరణము సరికాదన - సమాధానము చెప్పు చున్నాడు.

### గుణాద్ వా లోకవత్  ౨-౩-౨౫

వా=ఉదాహరణము సరికా దందురేని, లోకవత్ = లోకమున జూచుచున్నట్లు, గుణాత్ = తనకు సహకారియగు బుద్ధిసత్వమువలన నాత్మకు జ్ఞానము కలుగునని యెంచవలెను.

రాజు రాజధానియందుండి సహకారులగు మంత్రులు మున్నగువారి మూలమున రాజ్యవ్యవహారముల నన్నింటిని దెలిసికొనుట లోకమున నిత్యము చూచుచున్నాము. అట్లే జీవుడు అణువై హృదయమున నొకచో నున్నను సహకారియగు బుద్ధిసత్వముద్వారమున శరీరమునం దంతటను గల్గు శీతోష్ణాదులను దెలిసికొనగలుగుచున్నాడని సూత్రాభిప్రాయము. (౨౫)

జీవాత్మకు శరీరమునందు ఆ యా విషయముల జ్ఞానము కలిగించు టకు బుద్ధిసత్వము సాధనముగా నెంచెదమేని, ఆ బుద్ధిసత్వము ఆత్మకంటె భిన్నము కారాదు. ఆత్మ శరీరమునం దుండి చేయుకార్య మేమి? ఆ యా విషయములను తెలిసికొనుటయేకదా! బుద్ధిసత్వము చేయుపనియు నా యా విషయములజ్ఞానము కలిగించుటయే. అందువలన ఆత్మ, బుద్ధిసత్వము రెండును వేరు వేరనుట యెట్లు? వేరందుమేని, బుద్ధిసత్వము ఆత్మతాదా త్మ్యము మూలమున నాత్మచ్ఛాయను బొంది చేతనాయమానమై - చైతన్యము

గలదై - జ్ఞానముకలదై జ్ఞానాదికార్యమును నిర్వర్తించుచున్నదా? లేక యా బుద్ధిసత్వమునకు వస్తుజ్ఞానము కలిగింపగల సామర్థ్యము - జ్ఞానము ఉన్నదా? యని సంశయము కలుగును. ఆ బుద్ధికి గల చైతన్యము ఔపాధిక మనుటకంటె, దానికి చైతన్యము స్వరూపమనుట గౌరవమగును. కావున బుద్ధిసత్వము ఆత్మకు భిన్నము కాదు. అన - సమాధానము :

## వ్యతిరేకో గంధవత్ ౨-౩-౨౬

గంధవత్=పృథివికంటె గంధ మెట్లు భిన్నమో అట్లే బుద్ధిసత్వము, ఆత్మకంటె, వ్యతిరేకః=భిన్నము.

గంధస్పర్శరూపాదిగుణములు వాని కాశ్రయములైన పృథివ్యాది ద్రవ్యములకంటె భిన్నములే. అయినను తాదాత్మ్యదోషమువలన నవి పృథివ్యాదివస్తువులకంటె భిన్నములని సామాన్యబుద్ధికలవారికి బోధపడవు. విజ్ఞులకు మాత్రము బోధపడును. అట్లే బుద్ధిసత్వముకూడ ఆత్మకంటె భిన్నమే యైనను సామాన్యులు వేరుగ గుర్తింపరు: కాని, వాస్తవమున నాత్మకంటె బుద్ధిసత్వము భిన్నమే. స్థూలదృష్టులకు - మందబుద్ధులకు - వస్తువులలోగల తాదాత్మ్యము భ్రమ కలిగించును. బాగుగ కాలిన ఇనుప ముక్కను జూచిన సామాన్యమనుజుడు ఇనుమును, అగ్నిని రెండింటిని వేరువేరుగ గ్రహింపజాలడు. విజ్ఞాని సులభముగ గ్రహించును. ఆత్మయు బుద్ధిసత్వము రెండును అతిసూక్ష్మములు. అందువలన వానిభేదమును మంద బుద్ధులు గ్రహింపజాలరు. బుద్ధిసత్వము ఇంద్రియములద్వారమున నా యా విషయాకారములను బొందినపుడు జ్ఞానేచ్ఛాదు లేర్పడును. ఇయ్యవి బుద్ధి సత్వపరిణామములు. ఆత్మ పరి[illegible]మము చెందదు. అందువలన బుద్ధివృత్తులైన జ్ఞానాదులు ఆత్మగుణ[illegible] లనుట తగదు. బుద్ధితాదాత్మ్యమువలన దాని కాశ్రయమైన ఆత్మగుణములుగా జ్ఞానాదు[illegible] అవివేక లెంచెదరు. వివేకు లట్లుకాక బుద్ధిసత్వమును ఆత్మకు జ్ఞానసాధనముగ నెంచి, జ్ఞానాదిగుణము

లను ఆత్మకంటె వేరుగ గ్రహింపగలరు. మంత్రి రాజకార్యములను సాధించినమాత్రమున నతడు రాజగునా? బుద్ధిసత్త్వము జడము. అది పరిణామము చెందు స్వభావము కలది. ఆత్మ చేతనము. పరిణామము చెందదు. కావున ఆత్మకంటె బుద్ధిసత్త్వము భిన్నమే. (౨౬)

జీవాత్మకంటె బుద్ధిసత్త్వము భిన్నమనుటకు ప్రమాణమేమన :

తథా చ దర్శయతి ౨-౩-౨౭

తథా చ = పూర్వసూత్రవ్యాఖ్యానమున జూపినట్లు, దర్శయతి = గుణాత్మకమగు బుద్ధిసత్త్వము ఆత్మకంటె వేరని శ్రుతి తెలుపుచున్నది.

'ప్రజ్ఞయా శరీరం సమారుహ్య సుఖదుఃఖే ఆప్నోతి' కౌ. ౩-౬.

'జీవుడు శరీరమునం దుండి బుద్ధిమూలమున (ప్రజ్ఞయా) సుఖదుఃఖములను బొందుచున్నాడు' అని వాక్యాభిప్రాయము. జీవుడు శ్రవణాదీంద్రియములమూలమున బాహ్యపదార్థముల నెరుగుచున్నట్లు, బుద్ధిసత్త్వము మూలమున సుఖదుఃఖముల నెరుగుచు బోద్ధ యగుచున్నాడు. కావున నిట్టి ఉపనిషద్వాక్యములు జీవాత్మకంటె బుద్ధిసత్త్వము భిన్నమనుటకు ప్రమాణములని భావము. (౨౭)

మరియొక హేతువు :

పృథ గుపదేశాత్ ౨-౩-౨౮

పృథక్ ఉపదేశాత్ = 'బుద్ధి ఆత్మకంటె వేరు' అని ఉపదేశించుట వలనను.

'ఆత్మానం రథినం విద్ధి శరీరం రథ మేవ తు
బుద్ధిం తు సారథిం విద్ధి....' కఠ. ౩-౩.

'విజ్ఞానసారథి ర్యస్తు' కఠ. ౩-౯.

అను నీ యుపనిషద్వాక్యముల యుపదేశమువలనను బుద్ధిసత్వము జీవునికంటె భిన్నమే యని ప్రమాణిత మగుచున్నది. (౨౮)

పై సూత్రములందు చూపినట్లు బుద్ధిసత్వ మాత్మకంటె భిన్నమగు గాక ! అయినను, 'అంగుష్ఠమాత్రో రవితుల్యరూపః' ౫-౨. అను శ్వేతాశ్వతరోపనిషద్వాక్యము "జీవాత్ముడు అంగుష్ఠమాత్రుడు' అని చెప్పుచున్నది కదా ! కావున జీవాత్మ అణుపరిమాణము కలదనుట యెట్లు పొసగు నన :

## తద్గుణసారత్వాత్తు తద్వ్యపదేశః ప్రాజ్ఞవత్ ౨-౩-౨౯

తద్గుణసారత్వాత్ = బుద్ధిగుణమైన పరిమాణమును ప్రధానముగ గ్రహించినందున, ప్రాజ్ఞవత్=పరబ్రహ్మ హృదయపరిమాణమగు అంగుష్ఠ పరిమాణము గలదిగ చెప్పబడినట్లు, తద్వ్యపదేశః = జీవాత్మయు అంగుష్ఠ పరిమాణము గలదిగ చెప్పబడినదని యెరుంగవలెను.

ఉపనిషద్వాక్యము (అంగుష్ఠమాత్రో రవితుల్యః) నందు జీవాత్మ అంగుష్ఠపరిమాణము గలదియని చెప్పబడిన దెంచరాదు. అంగుష్ఠపరిమాణము వాస్తవమున బుద్ధికి సంబంధించినది. జీవాత్మయు, బుద్ధియు రెండును హృదయమున నుండును. బాగుగ కాల్చబడిన లోహఖండమున అగ్ని లోహఖండములు రెండును పరస్పరరూపమును బొంది - తాదాత్మ్యమును బొంది - సమానపరిమాణము గలవిగ లోకమున వ్యవహరింపబడుట చూచుచున్నాము. ఈ వ్యవహారమునకు కారణము వానితాదాత్మ్యమే. అట్లే బుద్ధి తాదాత్మ్యమును బొంది జీవుడును అంగుష్ఠపరిమాణము గలవాడుగ నుపనిషత్తులలో వర్ణింపబడెను. వాస్తవమున జీవుడు అణుపరిమాణము గలవాడే.

'....సంకల్పాహంకార సమన్వితో యః,
బుద్ధే ర్గుణే నాత్మగుణేన చైవ ఆరాగ్రమాత్రో
హ్యవరో ఽపి దృష్టః' శ్వే. ౫-౮.

అను నీ వాక్యమున, ఆరాగ్రమాత్రః = ముల్లుకఱ్ఱయొక్క మొంటి కొనవలె నతిసూక్ష్మడైన జీవాత్ముడు, సంకల్పము, అహంకారము మున్నగు బుద్ధిగుణములతో కూడినవాడై, అంగుష్ఠపరిమాణము గలవాడుగ జూడబడెనని స్పష్టముగా జెప్పబడినది.

ఇట్లే మరియొక వాక్యమందు

'బాలాగ్రశతభాగస్య శతధా కల్పితస్య చ
భాగో జీవః స విజ్ఞేయో సచానంత్యాయ కల్పతే' శ్వే. ౫-౯.

జీవుడు, ఒక వెండ్రుకయొక్క నూరవవంతులోని నూరవవంతు పరిమాణము గలవాడని స్పష్టముగా వర్ణింపబడినది. కావున నంగుష్ఠపరిమాణము గలవాడని చెప్పబడినచోట నా యంగుష్ఠపరిమాణము జీవునిస్వరూపమునకు చెందినది కాదని, బుద్ధి తాదాత్మ్యమువలన బుద్ధిపరిమాణసమన్వితుడై యట్లు వర్ణింపబడినాడని యెంచవలయును.

బుద్ధియు హృదయమునం దుండుటచే అంగుష్ఠపరిమాణము గలదిగా చెప్పబడినట్లు గుర్తింపవలెను. వాస్తవమున మానవహృదయపరిమాణము అంగుష్ఠపరిమాణముగ నెంచబడుచున్నది. అందువలననే సర్వవ్యాపకమై, మహత్పరిమాణము గల బ్రహ్మముకూడ నొక్కొకయెడ హృదయపరిమాణము గలదిగ వర్ణింపబడుట చూచుచున్నాము. అట్లే జీవుడుకాని, బుద్ధికాని అంగుష్ఠపరిమాణము కలదని చెప్పుట యౌపచారికము - అప్రధానము - అగునే కాని స్వరూపవర్ణనము కాదని సూత్రాభిప్రాయము. (౨౯)

బుద్ధిసత్వము ప్రకృతినుండి యుత్పన్నమైనది. అందువలన నది శరీరమువలె ననిత్య మగును - నశించును. అట్టి బుద్ధిసత్వము జీవునకు పదార్థజ్ఞానము కలిగించుటకు సాధనముగ నంగీకరింతుమేని - అది నశింపగానే జీవునకు శరీరబంధనాదులతో కూడిన సంసారమునుండి నివృత్తి యేర్పడును. అట్టియెడ మోక్షోపాయములను బోధించు శాస్త్రము లన్నియు వ్యర్థములు కావా? అన :

యావదాత్మభావిత్వాచ్చ న దోషః తద్దర్శనాత్ –2-3-30

('గుణస్య' అను పద మీ సూత్రమున ననువర్తించును. 'చ' కారము పూర్వశంకా నివారణార్థకము.)

పూర్వసూత్రములందు వర్ణింపబడిన గుణపదలక్షితమైన బుద్ధి సత్వము, యావదాత్మభావిత్వాత్=సంసారబంధనమున జీవాత్మ యున్నంత కాల ముండుటవలన, న దోషః=దోషము లేదు. తద్దర్శనాత్=అట్లే ఉపనిషద్వాక్యములందు వర్ణింపబడినది.

బుద్ధిసత్వము ప్రకృతిజన్య మగుటవలన నశించు ననుట సత్యమే. అయినను, ప్రకృతిజన్యపదార్థములు శరీరాదులు వానినాశనమునకు తగిన నిమిత్తములు ఉపస్థితములు కాకముందే నశింపవు. నాశమునకు తగిన కారణము - నిమిత్తము - ఏర్పడినపు డవి నశించును. అట్లే బుద్ధిసత్వము కూడ జన్యము కాబట్టి దానినాశమునకు హేతువు - కారణము - ఉపస్థితము కాకముందు అది నశింప దనుట నిశ్చితము.

జీవునకు బ్రహ్మసాక్షాత్కారము కలిగినపుడు బుద్ధిసత్వము నశించును. అంతవరకును నది జీవునకు లోకవ్యవహారసాధనముగ నుండునని భావము. బ్రహ్మసాక్షాత్కారము కలిగినపుడు జీవుడు బుద్ధినుండి వినిర్ముక్తుడై - శుద్ధుడై - మోక్షానందమును పరబ్రహ్మపరమాత్మలోనుండి యనుభవించును. అంతవరకు సంసారబంధన మతని కుండును. ఈ బంధనవిముక్తి వలయు సాధనసంపత్తి చేకూరువరకును బుద్ధిసత్వము జీవునకు సాధనముగ నుండును.

'యథా నద్యః స్యందమానాః సముద్రే
అస్తం గచ్ఛంతి నామరూపే విహాయ
తథా విద్వాన్ నామరూపాద్ విముక్తః
పరాత్పరం పురుష ముపైతి' ము౦. 3-2-8.

Scanned by CamScanner

'బ్రహ్మసాక్షాత్కారమును బొందిన జీవుడు (విద్వాన్), నామ రూపాద్విహాయ = ప్రకృతి, దానికార్యములైన బుద్ధితత్త్వాదులను విడిచి, సూక్ష్మాతిసూక్ష్మమగు పరమపురుషుని బొందును' అని చెప్పుటవలన బ్రహ్మసాక్షాత్కారము బుద్ధినాశమునకు హేతువని స్పష్టమగుచున్నది. కావున జీవుడు ముక్తి బొందువరకు బుద్ధిసత్త్వము నశింపదనియు, అంత వరకు జీవాత్మతో దానికి సంబంధ ముండుననియు తెలియుచున్నది. కావున జీవునకు మోక్షసాధనాదుల నుపదేశించుశాస్త్రములు వ్యర్థములు కావు. (౩౦)

బుద్ధిసత్త్వము జీవాత్మకు మోక్షము సిద్ధించువరకు నశింప దనుట యుక్తము కాదు. అది జన్య మగుటవలన ప్రళయమున నశింపకతప్పదు గదా యన - సమాధానము :

## పుంస్త్వాదివత్త్వస్య సతోఽభివ్యక్తియోగాత్ ౨-౩-౩౧

అస్య=ఈ బుద్ధిసత్త్వము, సతః = ప్రళయమునందును సూక్ష్మరూప మున నుండుటవలన, పుంస్త్వాదివత్ = పుంస్త్వము, గ్రహణసామర్థ్యము, ఊహాపోహలు మున్నగునవి యౌవన మంకురింపగా నావిర్భవించునట్లు, అభివ్యక్తియోగాత్=ప్రళయానంతరమున ప్రకట మగుటవలన, బుద్ధిసత్త్వము జీవాత్మకు మోక్షము సిద్ధించువరకు నుండునని సూత్రార్థము.

బుద్ధిసత్త్వము నశించుటకు బ్రహ్మసాక్షాత్కారము నిమిత్తముగా పూర్వసూత్రమున వర్ణింపబడినది. ప్రళయము బుద్ధినాశనమునకు నిమిత్తము కాదు. ప్రళయమున బుద్ధిసత్త్వము కార్యసాధనక్షమము కాదు. సూక్ష్మ రూపమున నట్లే యుండును. సుషుప్తిలో నున్నపుడు బుద్ధిసత్త్వము నశింపదు. కాని, అది యా సమయమున ఆత్మకు జ్ఞానసాధనముగా నుండదు. జాగ్రదవస్థలో కార్యసాధకమై వర్తించును. అట్లే ప్రళయమునందుకూడ బుద్ధిసత్త్వము పూర్ణముగ నశింపదు. ప్రళయమున ప్రాకృతికపదార్థము లన్నియు స్వరూపమును విడిచి, సూక్ష్మరూపమున నుండును. అవి తమ

యునికిని పోగొట్టుకొనవు. కావున సర్గారంభమున మరల స్వస్వరూపమును బొంది బుద్ధిసత్త్వము జీవాత్మకు జ్ఞానసాధనముగ వర్తించు ననుటలో దోషము లేదు.

బాల్యమున పుంస్త్వము (స్త్రీయందు వీర్యసేచనశక్తి), విషయ గ్రహణసామర్థ్యము మున్నగుగుణములన్నియు పురుషునం దుండియే యుండును. కాని యప్పు డవి కార్యరూపమున ప్రకటము కావు. యౌవన మున పుంస్త్వాదిగుణములు ప్రకట మగుట లోకవిదితము. పూర్వము లేనిది క్రొత్తగా నుద్భవింపదు కదా! (౩౧)

జీవాత్మకంటె భిన్నముగ మరియొక బుద్ధిసత్త్వ మున్నదనుటకు ప్రమాణ మేమి?

## నిత్యోపలబ్ధ్యనుపలబ్ధి ప్రసంగో౽న్యతరనియమో వా౽న్యథా ౨-౩-౩౨

అన్యథా = జీవాత్మకంటె వేరుగా బుద్ధిసత్త్వము నంగీకరింపనిపక్ష మున, నిత్యోపలబ్ధ్యనుపలబ్ధిప్రసంగః=బాహ్యవిషయము లెల్లపుడు నుపలబ్ధము లగుటయో, ఉపలబ్ధములు కాకుండుటయో జరుగును. వా=లేక, అన్యతర నియమః=ఆ రెండింటిలో నొకటి నియమముగా నైన నేర్పడును.

బుద్ధిసత్త్వము వేరుగ నంగీకరింపనిపక్షమున జీవాత్మ అణుపరిమా ణము కలది యని నిరూపింప నలవికాదు. జీవాత్మ శరీరమున నెక్కడో యొకప్రదేశమున గదా యుండును! అప్పుడు బాహ్యపదార్థముల జ్ఞానమును గలిగింప సాధనము లైన నేత్రాది - ఇంద్రియములతో సంబంధము కలుగ నేరదు. అందువలన బాహ్యవస్తుజ్ఞానము కలుగ వీలుండదు. జీవుడు అణువుకాక విభుపరిమాణము కలవాడుగ నంగీకరించినపక్షమున నతనికి బాహ్యేంద్రియములయిన నేత్రాదులతో నెల్లపుడు సంబంధ ముండును.

కావున నెల్లపుడు సర్వేంద్రియములతో సర్వవస్తుజ్ఞానము కలుగుచుండ వలెను. లేక జీవునకు నిత్యము సర్వేంద్రియములతో సంబంధ ముండుట వలన నొకే సమయమున సర్వేంద్రియజ్ఞానము కలుగ కుండుటకు గాను, జ్ఞానము కలుగుటకు, కలుగకుండుటకు వీలగు 'ఉపలబ్ధి, అనుపలబ్ధి' అను ఉభయవిధస్వభావము జీవునకు గలదనియైనను నంగీకరింపవలెను. కాని లోకమున నొకే సమయమున జ్ఞానము కల్గుటయు, కలుగకుండుటయు నెన్నడును జూడము. ఒకేసమయమున నెల్ల ఇంద్రియములతో శబ్దస్పర్శ రూపరసగంధములజ్ఞానము కలుగుటకాని, కలుగకుండుటకాని యెక్కడను జూడము. ఒక్కనిమిషమున నొకయింద్రియముతో నొకవస్తువును తెలిసి కొందుము. ఆ క్షణముననే యా వస్తువును తెలిసికొనకుండుట యనునది జరుగనేరదు. తెలిసికొనుట, తెలిసికొనకుండుట (ఉపలబ్ధి, అనుపలబ్ధి) యనునవి పరస్పరవిరుద్ధములు. కావున ఒకేక్షణమున నట్లు జరుగనేరదు. అట్లుకాక, ఉపలబ్ధి కలుగుట - జ్ఞానము కలుగుటయే స్వభావ మందుమేవి ఎల్లపుడు సర్వేంద్రియజ్ఞానము ఒకేక్షణమున కలుగవలసియుండును. లేక అనుపలబ్ధి - జ్ఞానము కలుగకుండుట యను నొకేవిధమగు స్వభావము జీవున కంగీకరింతుమేని, ఎల్లపుడు నే యింద్రియముతో నే వస్తుజ్ఞానమును కలుగకుండవలెను. కాని లోకమున వస్తువులజ్ఞానము క్రమముగ కలుగ టయు, క్రమముగ కలుగకుండుటయు జూచుచున్నాము. కావున నాత్మకు బాహ్యేంద్రియములకు మధ్య బుద్ధిసత్వము - మనస్సు - అనునది మరి యొకటి యా రెండింటికి సంబంధమును కల్పించునది యున్నదని యంగీక రింపకతప్పదు. బుద్ధిసత్వము నంగీకరించిన మీదట నిత్యోపలబ్ధి కాని, నిత్యానుపలబ్ధికాని కలుగునను దోషప్రసక్తి యుండదు. ఇంతేకాక యొకే క్షణమున సర్వేంద్రియజ్ఞానము కలుగవలసిన యగత్యము నుండదు. జీవా త్మతో సంబద్ధమైన బుద్ధిసత్వమే యింద్రియమూలమున ప్రవృత్తమై, యే విషయమున సక్తమగునో యా విషయజ్ఞానమే యా క్షణమున జీవునకు

కలుగును. జీవునకు మనస్సుతో సంబంధ మున్నట్లు ఉపనిషత్తులమూలము నను స్పష్టమగుచున్నది.

'అన్యత్రమనా అభూవం నాదర్శ మన్యత్రమనా అభూవం
నాశ్రౌష మితి, మనసా హ్యేవ పశ్యతి, మనసా శృణోతి'
బృ. ౧-౫-౩.

'నా మనస్సు మరియొకచోట నున్నది. అందువలన చూడలేదు. నా మనస్సు మరియొకయెడ నున్నది. అందువలన నేను వినలేదు.'

ఇట్లు ఆత్మకంటె భిన్నముగ మరియొక మనస్తత్వము - బుద్ధి సత్వము - ఉన్నదనుట నిశ్చిత మగుచున్నది. కావున ఆత్మ (జీవుడు) విభుపరిమాణము కలవాడు కాడు. అణుపరిమాణము కలవాడే. (౩౨)

## షష్ఠాధికరణము

జీవాత్మ అణుపరిమాణము కలది యని నిరూపించి, యనంతరము అతడు 'కర్త' యని నిరూపించుచున్నాడు.

### కర్తా శాస్త్రార్థవత్వాత్ ౨-౩-౩౩

శాస్త్రార్థవత్వాత్ = వేదాదిశాస్త్రములు ప్రామాణ్యము కలవగుట వలన, కర్తా=అణుపరిమాణము గల జీవాత్మ కర్త యని తెలియవలెను.

వేదాదిశాస్త్రములు జీవాత్మల నుద్దేశించి 'ఇది చేయుడు' 'ఇది చేయకుండుడు!' అని విధి నిషేధ పూర్వకముగ ధర్మముల నుపదేశించుచున్నవి.

'సుసమిద్ధాయ శోచిషే ఘృతం తీవ్రం జుహోతన,
అగ్నయే జాతవేదసే' ఋ. ౩-౮-౨౦.
'ఘృతముతో నగ్నిని వ్రేల్చుడు'
'కుర్వ న్నేవేహ కర్మాణి జిజీవిషే చ్ఛతగ్ం సమాః' యజు. ౪౦-౨.

'కర్మల నొనర్చుచునే నూరేండ్లు బ్రతుకగోరుము.'

'మంగలాచారయుక్తః స్యాత్ ప్రయతాత్మా జితేంద్రియః,
జపేచ్చ జుహుయాచ్చైవ నిత్య మగ్ని మతంద్రితః'

మను. ౪-౧౪౫.

'ఇంద్రియములను వశపరచుకొని, చిత్తమును స్వాధీనమునం దుంచుకొని సదాచారయుక్తుడు కావలెను. నిత్య మగ్నిహోత్రము చేయవలెను. అలసతను విడిచి పరమాత్ముని నామమును - ప్రణవమును జపింపవలెను' అను నిట్టివి శాస్త్రమునందు గల విధులు - విధానములు - చేయదగిన పనులు.

'గాం మా హిగ్ంసీః' యజు. ౧౩-౪౩.

'గోవును హింసింపకుము'

'అక్షైర్ మా దీవ్యః' ఋగ్. ౮-౭-౫-౧౬.

'పాచికలతో జూదమాడకు'

'స్వాధ్యాయా న్మా ప్రమదితవ్యః' తై. ౧.౧౧.

'స్వాధ్యాయమును విడువకు'. మున్నగునవి శాస్త్రనిషేధములు - చేయగూడని పనులు.

జీవులకు కర్తృత్వము - కర్మలనుజేయుటకు స్వాతంత్ర్యము - లేని పక్షమున పైన జూపిన విధినిషేధములు వ్యర్థములగును. అందువలన శాస్త్రములకు ప్రామాణ్యము లేకుండును. కర్త నపేక్షింపక శాస్త్ర ముపదేశింపదు. జీవుడు కర్తకానిపక్షమున నత డనుష్ఠించిన కర్మఫలము నెట్లు పొందగలడు? కావున శాస్త్రప్రామాణ్యమువలన జీవుడు కర్త యని స్పష్టమగుచున్నది. (౩౩)

ఈ విషయమున మరియొక హేతువు :

## విహారోపదేశాత్ ౨-౩-౩४

(విహారః=కామచారః - ఇచ్ఛానువర్తనము.)

విహారోపదేశాత్=తన యిచ్ఛానుసారము వర్తించునని శాస్త్రమున నుపదేశించుటవలనను, జీవుడు కర్త యని సూత్రార్థము.

'స్వశరీరే యథా కామం పరివర్తతే' బృ. ౨-౧-౧౮.

'జీవుడు తన శరీరమునందు ఇష్టము వచ్చినట్లు వర్తించును.' అను నిట్టి యుపదేశములు జీవుడు కర్తయైననాడే చరితార్థములగును. కర్తకాని వాడు స్వతంత్రుడుగా వర్తింపజాలడు. అందువలననే కర్తకు క్రియలో సాతంత్ర్య ముండునని పాణినిమహర్షి 'స్వతంత్రః కర్తా' అష్టా. ౧-४-౫४. అని సూత్రించియున్నాడు. (౩४)

జీవుని కర్తృత్వమును సాధించుట కింకొక హేతువు :

## ఉపాదానాత్ ౨-౩-౩౫

ఉపాదానాత్ = ఉపాదానము - గ్రహణము - వలన జీవుడు కర్త యగుచున్నాడని సూత్రార్థము.

'తదేషాం ప్రాణానాం విజ్ఞానేన విజ్ఞాన మాదాయ య ఏషో ఽన్తర్ హృదయ ఆకాశ స్తస్మిన్ శేతే' బృ. ౨-౧-౧౭.

'జీవుడు బుద్ధిమూలమున నింద్రియముల విషయగ్రహణశక్తిని గ్రహించి హృదయాకాశమున శయనించును.' అను నీ వాక్యార్థమునుబట్టి జీవుడు కర్త గానిపక్షమున ఇంద్రియములకు గల విషయగ్రహణశక్తిని తాను గ్రహింపజాలడని బోధపడుచున్నది. కాబట్టి జీవుడు కర్తయే. (౩౫)

మరియొక హేతువు :

## వ్యపదేశాచ్చ క్రియాయాం నచే న్నిర్దేశ విపర్యయః ౨-౩-౩౮

క్రియాయాం = లౌకికకర్మయందు కాని, వైదికకర్మయందు కాని, వ్యపదేశాత్=ఆత్మను కర్తగా నుపదేశించినందున, జీవాత్మ కర్తయే యగును. నచేత్ = అట్లుకానిపక్షమున - బుద్ధిని కర్తగా నుపదేశించుపక్షమున, నిర్దేశ విపర్యయః=విభక్తినిర్దేశమున వ్యతిక్రమము జరుగును.

'విజ్ఞానం యజ్ఞం తనుతే, కర్మాణి తనుతేఽపి చ' తై. ౨-౫.

'విజ్ఞానం=జీవాత్మ, యజ్ఞం=వైదికకర్మను, కర్మాణిచ=లౌకికకర్మలను, తనుతే = విధిననుసరించి చేయును' అను నీవాక్యమునందు జీవాత్మబోధకమగు విజ్ఞానపదము ప్రథమావిభక్తిలో ప్రయోగింపబడినది. అందువలన జీవాత్మ కర్మల నొనర్చుటలో కర్తయనియే బోధపడును. 'ఈ విజ్ఞానపదము జీవుని బోధింపదు; బుద్ధిని బోధించును'. అని యందురేని, బుద్ధి సాధనము కావున నది బుద్ధిబోధక మగునెడల 'విజ్ఞానేన = విజ్ఞానముతో' అని తృతీయావిభక్తితో బ్రయోగింపవలసియుండెడిది. పూర్వసూత్రమున బ్రదర్శింపబడిన వాక్యమున నట్లే ప్రయోగింపబడినది.

'తదేషాం ప్రాణానాం విజ్ఞానేన విజ్ఞాన మాదాయ' బృ. ౨-౧-౧౭.

ఇందు 'విజ్ఞానేన=విజ్ఞానముతో - బుద్ధితో' అని తృతీయావిభక్తితో బుద్ధివాచకవిజ్ఞానపదము ప్రయోగింపబడినది. కాబట్టి ప్రథమాంతవిజ్ఞాన (విజ్ఞానం) పదము జీవాత్మబోధకమే కాని బుద్ధిబోధకము కాదు. కాగా జీవాత్మ కర్తయని సూత్రాభిప్రాయము. (౩౮)

జీవాత్మ కర్తయని నిర్ణయమైనది. ఆత్మకు గల కర్తృత్వము నిత్యమా? అనిత్యమా యని సంశయము కలుగును. 'ఆత్మకు గల జ్ఞానమెట్లు నిత్యమో యట్లే కర్తృత్వమును నిత్యమగును.' అని ప్రాప్తింప - సమాధానము :

## ఉపలబ్ధివదనియమః ౨-౩-౩౭

ఉపలబ్ధివత్ = జ్ఞానమువలె, అనియమః = కర్తృత్వము నిత్యమే యను నియమము లేదు.

ఆత్మకు జ్ఞానము స్వరూపము. అందువలన నది నిత్యమే యగును. అగ్నికి ఉష్ణము నిత్యము. కారణ మేమన: ఉష్ణము అగ్నికి స్వరూపము. జీవాత్మకు కర్తృత్వము స్వరూపము కాదు. అది బుద్ధిసత్వసంబంధముచే నేర్పడుచున్నది. కర్తృత్వమన కృతికి ఆశ్రయ మగును. కృతి ఇచ్ఛా జన్యమగు ప్రయత్నము. కూటస్థనిత్యమగు జీవాత్మ అట్టిప్రయత్నమునకు ఆశ్రయము కాదు. బుద్ధిసత్వముద్వారమున ప్రయత్నమున కాశ్రయ మగును కాని, స్వయముగ కాదు. జీవాత్మకు బుద్ధిసత్వముతో సంబంధ మున్నంతవరకు కర్తృత్వ ముండును. స్వరూపమగు జ్ఞానము జీవాత్మకు నిత్యము. కావున జ్ఞానమువలె కర్తృత్వము జీవునకు నియమముగా నిత్యము కానేరదని సూత్రాభిప్రాయము. (౩౭)

కృత్యాశ్రయత్వము కర్తృత్వ మగునెడల నది యనిత్య మగును. కాని, కర్తృత్వము క్రియాశక్తి యని యంగీకరించుపక్షమున నది జీవాత్మ యందు నిత్యముగా నుండునుగదా! యన - సమాధానము :

## శక్తి విపర్యయాత్ ౨-౩-౩౮

శక్తివిపర్యయాత్ = క్రియాశక్తి వ్యతిక్రమమువలన, కర్తృత్వము ఉపలబ్ధివలె నిత్యమన వలనుపడదు.

క్రియాశక్తి యనినను, ప్రయత్న మనినను నొక్కటియే. ప్రయత్నింపక యెవరు నే కార్యమును జేయజాలరు. క్రియానిర్వహణము జరుగకున్నను ప్రయత్న ముండునుకదా! అందురేని అప్పుడును క్రియాశక్తి నిత్యమన వలనుపడదు. ముక్తిలో క్రియాశక్తి యుండదు. ఆత్మ

యుండును. క్రియాశక్తియు నుండు నందురేని - అట కార్య ముండవలెను. కార్యమే వస్తుశక్తికి గ్రాహకము - తెలియజేయునది. ముక్తదశలో జీవాత్మ యే కార్యముం జేయదు, కాపున నట క్రియాశక్తి యుండుననుటకు వీలు లేదు. ఆత్మకు స్వరూపమగు జ్ఞానము ముక్తియందు నుండును. కావున జీవాత్మకు గల స్వరూపజ్ఞానమువలె కర్తృత్వముకూడ నిత్య మనజనదని సూత్రాభిప్రాయము. (౩౮)

ఈ విషయమును నిరూపించుటకే మరియొక హేతువును సూత్ర కారు డిచ్చుచున్నాడు.

సమాధ్యభావాచ్చ ౨-౩-౩౯

సమాధ్యభావాత్ చ = సమాధియందును కర్తృత్వ ముండనందున నది జ్ఞానమువలె నిత్య మన నొప్పదని సూత్రార్థము.

ముక్తి శాస్త్రమున వర్ణింపబడును. అది లోకసిద్ధము కాదు. అందు వలన ముక్తియందు కర్తృత్వ ముండునో యుండదో తెలిసికొనుట దుర్ఘ టము. కావున లోకసిద్ధమగు ప్రమాణమును సూత్రకారుడు ప్రదర్శించు చున్నాడు.

సమాధి చిత్తముయొక్క యవస్థావిశేషము. పరమవైరాగ్యమువల నను, దానివలన జనించిన సంస్కారమువలనను చిత్తవృత్తులు, సంస్కా రములు నన్నియు నిరుద్ధము లగును - తొలగిపోవును. వృత్తులు నశించుట వలన స్వరూపమును గోలుపోయి చిత్తము ప్రకృతిలో లీనమగును. జీవు డప్పుడు స్వరూపస్థితుడై బ్రహ్మానందము ననుభవించును. ఇట్టిస్థితినే యోగులు సమాధి యందురు. ఈ సమాధియందు జీవునకు జ్ఞాన ముండు ననుటలో సందియ ముండదు. కాని, యపుడు కర్తృత్వ ముండదు. క్రియను గలిగించు క్రియాశక్తియు నుండదు. యోగుల కియ్యది ప్రత్య

షము. కావున కర్తృత్వము జ్ఞానమువలె నియమముగ నిత్యమునుట యొప్ప దని సూత్రాభిప్రాయము. (౩౯)

పై విషయమును లోకదృష్టాంతముతో నిరూపించుచున్నాడు.

యథా చ తక్షోభయథా ౨_౩-౪౦

యథాచ=ఏ విధముగ, తక్షా = తక్షకుడు - వడ్రంగి, ఉభయథా= ఉలి మున్నగు సాధనముల సంబంధముతో ఛేదనక్రియకు కర్తయు, వాని సంబంధము లేనపుడు అకర్తయు నగునో, అట్లే జీవాత్మయు బుద్ధిసంబంధ మున్నపుడు కర్తయు, బుద్ధిసంబంధము లేనపుడు అకర్తయు నగునని సూత్రార్థము.

వడ్రంగి తనయుపకరణములతో కొయ్యలను ఛేదించి. ఛేదన క్రియకు కర్త యగుటయు, నుపకరణములు లేనపుడు కర్త కాకుండుటయు లోకమున జూచుచున్నాము. జీవుడును బుద్ధిసత్వముతో సంబంధ మున్నంత వరకు లౌకికవైదికకర్మల నాచరించి కర్త యగుచున్నాడు. సమాధి, సుషుప్తి, మోక్షములందు బుద్ధిసంబంధము లేనందున అకర్తయు నగు చున్నాడు. వడ్రంగియు, జీవాత్మయు స్వరూపముతో కర్తలు కారనియు, సాధనసంపత్తితో సంబంధ మున్నపుడు కర్తలగుచున్నా రనియు, వాని సంబంధము లేనపుడు అకర్త లగుచున్నారనియు దృష్టాంత దార్ష్టాంతము లలో సామ్యము కనబడుచున్నది. కావున జీవాత్మకు కర్తృత్వము జ్ఞానము వలె నిత్యము కాదని స్పష్టమగుచున్నది. (౪౦)

## సప్తమాధికరణము

ప్రపంచముతో సంబంధ మున్నంతవరకు లౌకికవైదికకర్మలకు జీవుడు కర్తయని స్థిరమైనది. శ॥ జీవుడు పరబ్రహ్మముచే ప్రేరితుడై లౌకిక వైదికకర్మల నాచరించునా? లేక ప్రేరితుడు కాకయే యాచరించునా? యని

సంశయము కలుగును. అట్టియెడ స్వయముగానే యాచరించునని పూర్వ పక్షము. కాదు, పరమాత్మప్రేరితుడై యాచరించు నని సిద్ధాంతము.

కర్త స్వతంత్రుడని పూర్వమే చెప్పియుంటిమి. పరమేశ్వరప్రేరణచే జీవుడు కర్మల నాచరించుపక్షమున నతడు పరతంత్రు డగును. స్వతంత్రు డనజనదు. కావున జీవుడు కర్త యెట్లు కాగలడు? జీవుడు కర్తయేయని పూర్వసూత్రములందు ప్రతిపాదింపబడినది. మరియు జీవుని కర్మలలో ప్రవర్తింపజేయుటయే లక్షణముగా గల రాగద్వేషాదిదోషములు-ప్రేరకము లుండగా పరమేశ్వరప్రేరణ యేల? రాగాదులచే ప్రయుక్తుడై సాధనసంపన్నుడైన జీవుడు తన కిష్టమైన కర్మగాని యనిష్టమైన కర్మగాని యాచరించుటకు బూనుకొనును. అట్టియెడ పరమేశ్వరప్రేరణను కల్పించుటయు తగదు. కృషికర్మ నొనర్చుటకు కృషీవలునకు వృషభాదు లపేక్షమాణము లగునట్లు జీవునకు కర్మల నొనర్చుటలో పరమేశ్వరప్రేరణ యపేక్షింపబడుట లోకమున జూడము. అప్రసిద్ధమగు కల్పన న్యాయ్యము కాదు. కావున జీవుడు కర్మల నొనర్చుటలో పరమేశ్వరప్రేరణ నపేక్షింపడనియే సిద్ధమగుచున్న దన - సమాధానము చెప్పుచున్నాడు.

**పరాత్తు తచ్ఛ్రుతేః** ౨-౩-౪౧

(పూర్వపక్షమును నిరాకరించుటకు సూత్రమున 'తు' చేర్చబడినది.)

శ్రుతేః=వేదాదివాక్యములవలన, తత్=కర్తృత్వము, పరాత్=పరమేశ్వరుని ప్రేరణవలన కలుగుచున్నది.

'య ఈశే అస్య ద్విపద శ్చతుష్పదః' ఋక్. ౮-౭-౩-౩.

'చరాచరాత్మకమగు నీ జగత్తునకు పరమేశ్వరుడు ఈశుడు. అతని యధీనమున నీజగ త్తుండును' అను నీ ఋగ్వాక్యమునుబట్టి ఈశు డీ జగత్తునకు నియంతయని తెలియుచున్నది. అట్టియెడ జీవుడు నియమ్యు డనుట నిశ్చితము. కావున జీవుడు సర్వథా స్వతంత్రుడు కాడు. జీవునికర్తృత్వము

కూడ నియంతయొక్క ప్రేరణతోనే సిద్ధించును. కాని స్వతః కాదు. అచేతనములగు సూర్యాదిపదార్థములుకూడ నియంతయగు పరమేశ్వరుని ప్రేరణ వలననే లోకాదులను నియమముగ ప్రకాశింపజేయుచున్నవి. అట్టియెడ జీవుడు నియంతృప్రేరణచే ప్రేరితుడై కర్మల నాచరించు ననుటలో చిత్రమేముండును? నియమ్యపదార్థముల స్వభావమే యది.

జీవుడు కర్మల నాచరించుటలో స్వతంత్రుడు కానిపక్షమున నతనికి కర్తృత్వమే యుండ దను నాక్షేపణ యుక్తము కాదు. కర్త స్వతంత్రు డనుట సత్యమే. స్వాతంత్ర్య మన నేమి? క్రియాచరణమున ప్రాధాన్యము. జీవుడు కర్మ నాచరించుటలో నప్రధాను డందుమేని యత డప్రధానుడై - యస్వతంత్రుడై - అకర్త యగును. పరమేశ్వరనియమితుడై - ప్రేరితుడై - కర్మ నాచరించినమాత్రమున జీవు డస్వతంత్రుడు కాడు. కర్మ నాచరించుటలో నతనికిగల ప్రాధాన్యమునకు లోటు కలుగదు. కావున కర్మల నాచరించుటలో జీవుడు స్వతంత్రుడే యగును. అతనికర్తృత్వమునకు భంగము కలుగదని భావము.

రాగద్వేషాదిదోషములు జీవుని కర్మలలో ప్రవర్తింపజేయునవి యుండగా పరమేశ్వరుని ప్రేరణను కల్పించుట వ్యర్థ మనుటయు సమంజసము కాదు. రాగాదులు కల్పితములు కావు. అవి క్లృప్తములే - పూర్వసిద్ధములే. అట్లే జగన్నియంతగా నీశ్వరుడును క్లృప్తమే; కాని, క్రొత్తగా కల్పింపబడుట లేదు. కల్పన తగదు కాని, సిద్ధవస్తువును కాదను టెట్లు? కృషికర్మకు వృషభాదు లపేక్షింపబడుట లోకమున ప్రసిద్ధమైనట్లు పరమాత్మప్రేరణ జీవునికర్మాచరణమున అపేక్షమాణ మగుట ప్రసిద్ధము కాదు; కావున నది తగదనుటయు నుపయుక్తము కాదు. పరమేశ్వరప్రేరణ శాస్త్రములలో ప్రసిద్ధమై యున్నది. కాబట్టి పరమేశ్వరునిచే ప్రేరితుడై జీవుడు కర్మల నాచరించును. స్వయముగ నాచరింప డనుట యుక్తమే.

జీవుడు పరమేశ్వరుని ప్రేరణచే కర్మల నాచరించునెడల విధి నిషేధశాస్త్రము వ్యర్థమగును. పరప్రేరితుడై నడుపబడు జీవునకు విధి నిషేధము లెట్లుపయోగించును? విహితకర్మలో ప్రవర్తింపజేయుట విధి శాస్త్రమునకు, నిషిద్ధకర్మనుండి నివర్తింపజేయుట నిషిద్ధశాస్త్రమునకును ప్రయోజనము. పరబ్రహ్మప్రేరితుడై జీవుడు ప్రవర్తించునపుడు శాస్త్ర ప్రయోజనము సిద్ధింపజాలదు.

మరియును జగద్వైచిత్ర్యముకూడ అనుపపన్న మగును. రాగాది దోషములచే ప్రవర్తమానుడై జీవుడు పుణ్యాపుణ్యకర్మల నొనరించుచు పుణ్యాపాపముల సంచయ మొనర్చును. తన్మూలముగ సృష్టింపబడుటచే జగత్తునందు వైచిత్ర్య మేర్పడుట యుక్తియుక్తమగును. అట్లు కాక పరమేశ్వరప్రేరణచే జీవులు కర్మలలో ప్రవర్తించునెడల పుణ్యకర్మలయందే ప్రవర్తింతురు. పాపముల నాచరింపరు. నాడు నానావిధసుఖదుఃఖములతో గూడిన యీ జగద్వైచిత్ర్య మెట్లు కలుగును? రాగద్వేషాదులు లేని పరమేశ్వరుడు జీవులను పాపకర్మలలో ప్రవర్తింప నెట్లు ప్రేరేపించును? అట్లు ప్రేరణచేయు నందుమేని పరమేశ్వరునియందు రాగద్వేషపక్షపాతాది దోషము లున్నట్లు బోధపడును. అయ్యది సమ్మతము కాదు. కావున పరబ్రహ్మప్రేరణతో జీవుడు పుణ్యాపుణ్యకర్మల నొనరించుననుట పొసగదన- సమాధానము :

**కృతప్రయత్నాపేక్ష స్తు విహితప్రతిషిద్ధా వైయర్థ్యాదిభ్యః** ౨-౩-౪౨

విహితప్రతిషిద్ధావైయర్థ్యాదిభ్యః=విధినిషేధశాస్త్రప్రామాణ్యము, జగద్వైచిత్ర్యము మున్నగు హేతువులవలన, కృతప్రయత్నాపేక్షః=విహితకర్మలందును, నిషిద్ధకర్మలందును జీవు డొనర్చిన ప్రయత్నము నపేక్షించి పరమేశ్వరుడు ప్రేరణచేయును.

రాగాదిదోషప్రయుక్తుడై జీవుడు లౌకికకర్మను గాని, వైదికకర్మను గాని చేయనుద్యమించినపుడు - ప్రయత్నించినపుడు - హృదయమున నున్న పరమేశ్వరుడు 'నీవు చేయబోవు కార్యము చేయదగిన దనియో, లేక చేయదగని దనియో' కరుణతో పలుమారు బోధించును. ఇయ్యదియే భగవత్ప్రేరణ యనబడును. ఇది యెల్లరకు ననుభవసిద్ధము. ఎల్లరచే సామాన్యముగ ననుభవింపజేయబడు నీ యీశ్వరప్రేరణ బలవంతముగ నొకనిని సత్కార్యమునందు ప్రవర్తింపజేయదు. మరియొకనిని దుష్కార్యమునుండి నివర్తింపజేయదు. అట్లు చేసిన, కర్మల నొనర్ప ప్రయత్నించు జీవుని స్వాతంత్ర్యమునకు భంగము వాటిల్లును. భగవత్ప్రేరణ కేవలము తన యిష్టమును సూచించును.

ఈ యర్థమునే మనువు సూచించియున్నాడు.

'యమో వైవస్వతో దేవో య స్తవైష హృది స్థితః
తేన చే దవివాద స్తే, మా గంగాం మా కురూన్ గమః.'

మ. ౮-౯౨.

'నీవుచేయదలచినకార్యము నీ హృదయస్థిత దయామయుడు, నియంతయు నగు దేవునిచే నంగీకరింపబడినచో నది కర్తవ్యమనియు, అంగీకరింపబడనియెడల నకర్తవ్య మనియు నెంచుము.'

లోకమున రాజుచే నియమ్యమయిన ప్రజ స్వతంత్రముగ స్వస్వ కర్మలందు ప్రవర్తించి రాజనియమముల ననుసరించి సుఖదుఃఖముల నందుచుండును. అట్లే పరమాత్మనియమ్యు డయిన జీవుడును పరమాత్మ ప్రేరితుడయ్యు స్వతంత్రుడై లౌకికవైదికకర్మల ననుష్ఠించి యా యా కర్మఫలములను సుఖదుఃఖరూపమున ననుభవించును. భగవత్ప్రేరణ జీవుని స్వాతంత్ర్యము నడ్డగింపదు. జీవుడు కర్మానుష్ఠానమున స్వతంత్రుడై ఫలానుభవమున పరతంత్రు డగుచున్నాడు, అందువలన విధినిషేధశాస్త్రము

వ్యర్థము కాదు. జగద్వైచిత్ర్యమును ఉపపన్నమే యగును. మరియు భగవంతునియందు పక్షపాతాదిదోషములును వాటిల్లవు. ఈ దోషము లన్నియు కర్మానుష్ఠానములో జీవుడు పరతంత్రు డైనపుడు మాత్రమే సంభవించును.

'యో మారయతి, ప్రాణయతి యస్మాత్
ప్రాణంతి భువనాని విశ్వా' అథ. ౧౩-౩-౩-౩.

'చరాచరాత్మకమగు సమస్తజగత్తుయొక్క సృష్టిప్రళయములు పరమేశ్వరాధీనములు' అని మంత్రాభిప్రాయము.

'ఏష హ్యేవ సాధుకర్మ కారయతి, తం యమేభ్యో లోకేభ్య ఉన్నినీషతే, ఏష హ్యేవాసాధు కర్మ కారయతి తం య మధో నినీషతే' కౌ. ३-८.

'ఎవడు పరమేశ్వరునిప్రేరణానుకూలముగ కర్మల ననుష్ఠించునో వా డూర్ధ్వలోకములను బొందును. ఎవడు ప్రేరణకు విరుద్ధముగ నసాధు కర్మల ననుష్ఠించునో వా డధోలోకమును బొందును'. అను నిట్టి యుపనిషద్వాక్యములు భగవంతుని నిగ్రహానుగ్రహములు కర్మల ననుసరించి లభించునని తెలుపుచున్నవి. ఇందువలన జీవుడు కర్మల ననుసరించుటలో స్వతంత్రు డనియు, ఫలముల ననుభవించుటలో పరతంత్రు డనియు స్పష్టమగుచున్నది. అంతేకాని జీవునికర్మానుష్ఠాన స్వాతంత్ర్యమున కెట్టి హానియు కలుగదు.

జీవునిప్రయత్నము నపేక్షించి పరమేశ్వరుని ప్రేరణ యుండు ననియు, ఆ ప్రేరణ పరమాత్మనిమతప్రకాశకమే కాని మరియొండు కాదనియు నెట్లు తెలియు నందురేని, విధినిషేధశాస్త్రము ప్రమాణ మగుటయే ఇందులకు నిదర్శనము. పరమేశ్వరునిప్రేరణ స్వమతప్రకాశకము కాక జీవునికర్మానుష్ఠానములో నతనిస్వాతంత్ర్యమునకు భంగము కల్గించున దగునెడల విధినిషేధశాస్త్రము వ్యర్థము - అప్రమాణము - కావలసివచ్చును. ఇంతేకాక జగద్వైచిత్ర్యాదులును సిద్ధింపవు.

'తత్సవితుర్వరేణ్యం, భర్గో దేవస్య ధీమహి
ధియో యో నః ప్రచోదయాత్' ఋక్.

భక్తుడు నిత్యము ప్రాతఃసాయంసమయములందు గాయత్రీ మంత్రముతో భగవంతునియనుగ్రహమునే ప్రార్థించును; కాని, నిరంకుశముగ భగవంతుడు తనను సుకర్మలలో ప్రవర్తింపజేయునుగాక! యని ప్రార్థింపడు. జీవుడు శుద్ధహృదయుడై యార్తచిత్తవృత్తితో ప్రాతఃసాయంసమయములందు భగవంతుని ప్రార్థించిన నతడు అనుగ్రహించును. ఆ దయాలుని అనుగ్రహమువలన దురితములు దూరములగును.

"విశ్వాని దేవ! సవిత ర్దురితాని పరాసువ
యద్భద్రం త న్న ఆసువ." ఋ. ४-४-౨౫-౫.

'దేవ! దురితములను దూర మొనర్చి భద్రమును చేకూర్చుము.' అని ప్రార్థించి పాపకర్మల ననుష్ఠింపక పరమేశ్వరునిప్రేరణచే నిత్యము శుభకర్మలలో రుచిగలవాడై వాని నాచరించును. అందువలన బుద్ధి నిర్మల మగును. ప్రార్థన మానసికకర్మ. అందు జీవుడు పరమేశ్వరునిచే నియమింపదగిన వాడై నను నత డా ప్రార్థనను చేయవచ్చును - చేయక మిన్నకుండవచ్చును. పరమేశ్వరప్రేరణ అతనిని నిర్బంధింపదు. పరమేశ్వరుడు తనమతమునుమాత్రము ప్రకటించును. కర్మానుష్ఠానసమయమున నిట్టి ప్రేరణ తప్పక కలుగును. కావున జీవుడు కర్మానుష్ఠానమున స్వతంత్రు డయ్యు పరాయత్తుడే యనుట దోషము కాదు. (४-౨)

## అష్టమాధికరణము

అట్టియెడ పరమేశ్వరునకు జీవునకుగల సంబంధమేమో చెప్పవలసియున్నది. లేకున్న జీవుడు పరమేశ్వరాయత్తుడై కర్మల నాచరించు ననుట యుక్తము కాదు.

అంశో నానావ్యపదేశా దన్యథా చాపి
దాశకితవాదిత్వ మధీయత ఏకే ౨-౩-४३.

(ఈ సూత్రమున, దాశశబ్దము స్త్రీసామాన్యమును, కితవశబ్దము పురుషసామాన్యమును దెలుపును.)

నానావ్యపదేశాత్ = భిన్నముగ నుపదేశించినందువలన, అంశః = జీవాత్మ బ్రహ్మమునకు అంశము. అన్యథాపి చ = అన్యవిధముగను - అభిన్నముగ నుపదేశించినందువలనను, దాశ, కితవాదిత్వం = స్త్రీపురుషాది భావమును, ఏకే = శ్వేతాశ్వతరులు, బ్రహ్మమునకు, అధీయతే = చదువుదురు.

లోకమున పితాపుత్రులమధ్య అంశఅంశిభావము చూడబడుచున్నది. అంశము పుత్రుడు - అంశి పిత. అట్లే జీవబ్రహ్మములకు గల సంబంధము శాస్త్రమువలన దెలియనగును.

'త్వం హి నః పితా వసో ।' ఋ. ౬-౭-౨౧-౧౧.

'యో నః పితా జనితా యో విధాతా' ఋ. ౮-౩-౧౭-౩.

ఈ ఋగ్వాక్యములు జీవులకు పరమేశ్వరుడు పిత యని బోధించుచున్నవి. పరమేశ్వరుడు జీవులకు తండ్రివంటివా డని భావము. పితాపుత్రుల కెట్టి సంబంధము లోకమున జూచుచున్నామో యట్టిసంబంధమే జీవేశ్వరులకు గలదని సూత్రాభిప్రాయము. ఇట్లే నియమ్యనియామక భావము, ఈశితేశితవ్య భావము, స్వస్వామిభావసంబంధము తెలియనగును. ఈ సంబంధము లన్నియు సమానములే. పుత్రుడు తండ్రి సొత్తు - స్వత్వము. అట్లే తండ్రి పుత్రునకు స్వామి. తండ్రి పుత్రుని నియమించును. పుత్రుడు తండ్రిచే నియమింపబడును (నియమ్యుడు). పుత్రునకు తండ్రి ఈశిత (శాసకుడు). తండ్రికి పుత్రుడు ఈశితవ్యుడు (శాసింపదగినవాడు).

జీవేశ్వరులకు గల అంశాంశిభావసంబంధముకూడ నిట్టిదియే. అంశ మన భాగమని సామాన్యార్థము. భాగము, ఖండము, ఏకదేశము నను నీపదములన్నియు నొకేయర్థమును దెలుపును. అందువలన జీవుడు బ్రహ్మములో నొకభాగము - ఖండము - అని యెంచరాదు. బ్రహ్మము అఖండము. అందు ఖండములు - భాగములు లేవు. భాగములు చేయబడవు. అఖండము కావున బ్రహ్మము ఖండింప ననువుకాదు. అంశమన సముదాయములో నొకటి యనియు చెప్పవచ్చును. అనేకజీవసముదాయము ఈశ్వరుడు కాదు. అట్లగునెడల జీవగతసుఖదుఃఖాదు లన్నియు నీశ్వరునకు నున్నవని యెంచవలసివచ్చును. అంశ మన ఆరంభకము అనియు చెప్పుదురు. జీవుడు పరమేశ్వరునకు ఆరంభకము కాదు. ఆరంభకము - కారణము - ఆది యని యర్థము. పరమేశ్వరునకు ఆదిలేదు. ఇక అంశ మన నేమి? సజాతీయమై యొకప్పుడు అవిభక్తముగా నుండుట అంశ మనబడును. జీవుడు చైతన్యముకలవాడైనందున ఈశ్వరునకు సజాతీయుడు. జీవేశ్వరు లిరువురు చేతనములు. కావున జీవేశ్వరులు సజాతీయులు. ప్రళయకాలమున జీవుడు ఈశ్వరునియందు అవిభక్తముగ నుండును. ఈశ్వరుడు వ్యాపకుడు. జీవుడు వ్యాప్యము. వ్యాప్యమే వ్యాపకమును విడిచి దూరముగ నుండ ననువు కాదు. ఇట్టి స్థితినే అంశాంశిభావసంబంధము బోధించును. లోకమున పితాపుత్రులకు గల అంశాంశిసంబంధము కూడ నిట్టిదియే కదా! పుత్రుడు మాతృగర్భమున జేరుటకు పూర్వము తండ్రితో నవిభక్తుడై యుండును. తదుపరి మాతృగర్భమున జేరి వేరుగ వ్యవహరింపబడును.

పితాపుత్రులకు గల యీ యంశాంశిభావము జీవేశ్వరుల కున్నదని యెట్లు దెలియు నందురేని, ఉపనిషద్వాక్యప్రమాణములవలన దెలియునని చెప్పుదుము. వాక్యప్రమాణములవలన జీవుడు బ్రహ్మమునకంటె భిన్నుడనియు, అభిన్నుడనియు దెలియుచున్నది.

"ద్వా సుపర్ణా సయుజా సఖాయా
సమానం వృక్షం పరిషస్వజాతే
తయో రన్యః పిప్పలం స్వాద్వ
త్త్యనశ్నన్ అన్యో అభిచాకశీతి" ముం. ౩-౧-౧.

'యస్మిన్ సర్వాణి భూతా న్యాత్మై వాభూ ద్విజానతః'
ఈశా. ౭.

ఈవాక్యములలో జీవేశ్వరులు భిన్నులనియు, అభిన్నులనియు స్పష్టముగా తెలియుచున్నది. ఇంతేకాక శ్వేతాశ్వతరులు శ్వేతాశ్వతరశాఖను అధ్యయనము చేయువారు - ఈ భేదాభేదభావమును బలపరుచుచు నిట్లు చదువుదురు.

"త్వం స్త్రీ, త్వం పుమా నసి, త్వం కుమార ఉత వా కుమారీ,
త్వం జీర్ణో దండేన వంచసి, త్వం జాతో భవసి విశ్వతోముఖః"
శ్వే. ౪-౩.

ఇట్టి యుపదేశములవలన జీవబ్రహ్మలకు గల అంశాంశిభావ సంబంధము సువ్యక్తమగును. (౪౩)

ఈ విషయముననే మరియొక హేతువు :

మంత్రవర్ణా చ్చ ౨-౩-౪౪

చ = మరియు, మంత్రవర్ణాత్ = వేదమంత్రములవలనను, జీవుడు బ్రహ్మమున కంశ మని తెలియుచున్నది.

'ఏతావా నస్య మహిమా, ఽతో జ్యాయాం శ్చ పూరుషః,
పాదో ఽస్య విశ్వా భూతాని, త్రిపా దస్యామృతం దివి'
ఋ. ౮-౪-౧౭-౩

'చరాచరాత్మకమగు నీజగత్తంతయు పరమేశ్వరున కొకపాదము-అంశము. పాదము, భాగము ఏకార్థకములు.

నిరంశము - అంశరహితమైన బ్రహ్మమునందు అంశవ్యవహారము ముఖ్యార్థమును దెలుపదు. గౌణార్థమును మాత్రమే తెలుపును. బ్రహ్మమునకు జీవుడు అంశమువంటివాడే కాని, వాస్తవమున అంశము కాదు, అని భావము. (౪౪)

### అపి చ స్మర్యతే ౨-౩-౪౫

అట్లే 'స్మృతులలోను చెప్పబడినది' అని సూత్రాభిప్రాయము.

'మమైవాంశః జీవలోకే జీవభూతః సనాతనః' గీ. ౧౫-౭.

ఈ భగవద్గీతాశ్లోకమునందు 'జీవుడు పరమేశ్వరుని అంశము' అని స్పష్టముగ వర్ణింపబడినది. కావున జీవేశ్వరులకు మధ్య అంశాంశిభావ సంబంధ మున్నట్లు స్పష్టమగుచున్నది. (౪౫)

జీవేశ్వరులకు అంశాంశి సంబంధ మంగీకరింతుమేని అంశమగు జీవునకు గల క్లేశాదులు ఈశ్వరునకును సంభవించునుగదా ! యన - సమాధానము:

### ప్రకాశాదివ న్నైవం పరః ౨-౩-౪౬

ఏవం = జీవుడు క్లేశకర్మాదులతో కూడుకొనునట్లు, పరః = పరబ్రహ్మ పరమేశ్వరుడు, న = క్లేశాదులతో సంబద్ధుడు కాడు. ప్రకాశాదివత్ = సూర్యాదులవలె. ఆదిపదముచే అగ్ని, ఆకాశము, వాయువు గ్రహింపనగును.

సూర్యుడు అంశి, చక్షువు అంశము. ఆకాశము అంశి, శ్రోత్రము అంశము. వాయువు అంశి, త్వగింద్రియము అంశము. చక్షురాదులు గాయపడి చెడిపోయినను సూర్యాదులకు ఏమియు హానికలుగదు. చక్షురాదు

లకు వాటిల్లు దోషములు సూర్యాదుల నంటవని భావము. అట్లే అంశ మైన జీవునకుగల క్లేశాదులు అంశియైన పరమేశ్వరున కంటవని సూత్రాభి ప్రాయము. (౪౬)

ఇందులకు ప్రమాణ మేమన :

స్మరన్తి చ ౨-౩-౪౭

జీవగుణదోషములు పరమేశ్వరున కంటవని యోగులు చెప్పుదురు. ఇట్లే ఉపనిషత్తులలోను చెప్పబడియున్నది.

'క్లేశకర్మవిపాకాశయై రపరామృష్టః పురుషవిశేష ఈశ్వరః'
యో. ౧-౨౪.

'క్లేశకర్మవిపాకాశయములతో సంబద్ధము కాని విశేషపురుషుడు ఈశ్వరుడు' అని యోగులు ఈశ్వరునకు లక్షణము చెప్పియున్నారు.

ఇట్లే యుపనిషత్తులలోను

"సూర్యో యథా సర్వలోకస్య చక్షుర్
న లిప్యతే చాక్షుషై ర్బాహ్యదోషైః
ఏక స్తథా సర్వభూతాంతరాత్మా
న లిప్యతే లోకదుఃఖేన బాహ్యః" కఠ. ౫-౧౧.

'సర్వలోకమునకు నేత్రమగు సూర్యుడు లోకుల నేత్రదోషము లతో లిప్తుడు కాడు. అట్లే సర్వభూతాంతరాత్ముడగు పరమేశ్వరుడుకూడ ప్రాణులదుఃఖములతో లిప్తుడుకాక స్వస్వరూపముతోనే భాసిల్లుచుండును.

కావున జీవేశ్వరులకు అంశాంశిభావసంబంధ మున్నను జీవులసుఖ దుఃఖములతో పరమేశ్వరున కెట్టి సంబంధమును నుండదు. (౪౭)

జీవుడు పరమాత్మునియంశమని యంగీకరించితిమి. అంశమునకు

అంశసారూప్య ముండును. అట్టియెడ పరమేశ్వరునికి లేని విధినిషేధములు జీవుని కేల ? అన :

**అనుజ్ఞాపరిహారౌ దేహసంబంధాత్**
**జ్యోతిరాదివత్** ౨-౩-౪౮

అనుజ్ఞాపరిహారౌ = విధి నిషేధములు, దేహసంబంధాత్ = జీవునకు దేహముతో సంబంధ ముండుటవలన, శాస్త్రమున జెప్పబడినవి. జ్యోతిరాదివత్=అగ్ని, జలము మున్నగునవి యిందుల కుదాహరణములు.

'స్వాధ్యాయో అధ్యేతవ్యః' శత. ౨-౨-౨-౧౮.

'అగ్నిహోత్రం జుహుయాత్' శ. ౨-౨-౨-౧౮.

'గాం మా హిగ్ంసీః' య. ౧౩-౪౩.

'అవిం మా హిగ్ంసీః' య. ౧౩-౪౪

'వేదమును చదువుము' 'అగ్నిహోత్రము నొనర్చుము' అను నిట్టి విధులు, 'గోవును హింసింపకు.' 'గొఱ్ఱెను హింసింపకు' అను నిట్టి నిషేధములు జీవునకు దేహసంబంధ ముండుటవలన శాస్త్రమునందు జూచుచున్నాము. అగ్నిజలాదులవిషయమునను దేశసంబంధమునుబట్టి విధినిషేధములు గలుగుచున్నవి. సద్గృహస్థుని యింటినుండి నిప్పు తెచ్చుకొనుము; స్మశానమునుండి తెచ్చికొనవద్దు. అట్లే ప్రవహించుచున్న నదులనుండి నీటిని గ్రహింపుము. ప్రవహింపక కలుషితములై యుండు తటాకాదులనుండి నీటిని గ్రహింపకుము. అని అగ్నికి, నీటికి ప్రదేశ సంబంధమునుబట్టి లోకమున విధినిషేధములు చూచుచున్నాము. అట్లే జీవుడు పరమాత్మనుబోలి యానందవ్యతిరేక (- సత్తా, జ్ఞానాది), గుణములలో సమానతగలవాడై నను నతనికి దేహసంబంధ ముండుటవలన 'ఇది చేయుము, 'ఇది చేయకుము' అని విధినిషేధములు గలుగుచున్నవని సూత్రాభిప్రాయము. (౪౮)

దేహసంబంధముగల జీవుడు, దేహసంబంధ మెన్నడు (కాలత్రయమునందును) లేని బ్రహ్మకు అంశమని యెట్లు చెప్పనగు, నన :

### అసంతతే శ్చావ్యతికరః ౨-౩-౪౯

అసంతతేః = (సంతతి = వికారము) అవికారి యగుటవలన, అవ్యతికరః = వికారహేతు సంబంధము లేని జీవుడు బ్రహ్మకు అంశ మనుట దోషము కాదు.

జీవునకు దేహసంబంధ ముండుట సత్యమే. అయినను ఆ సంబంధము జీవునియందు వికారమును గలిగింపదు. అతడు అవికారి - కూటస్థ నిత్యుడు. జీవునకు దేహసంబంధము నైమిత్తికము. స్వాభావికము కాదు. అది మిథ్యాజ్ఞానమువలన కలుగును. జీవునకు ప్రకృతికార్యములైన బుద్ధి మున్నగు ప్రాకృతిక పదార్థములతో సంబంధము మిథ్యాజ్ఞానపూర్వకముగ కలుగును. పరమేశ్వరున కట్టి సంబంధ ముండదు. అందువలన జీవుడు మిథ్యాజ్ఞానమువలన శరీరముతో సంబద్ధుడై సుఖదుఃఖములకు లోనగు చున్నాడు. కాని, స్వరూపముతో నిర్వికారి యగుటవలన జీవేశ్వరులలో నంశాంశిభావము చెప్పబడినది. కావున దోషములేదని సూత్రాభిప్రాయము. (౪౯)

దేహసంబంధ మున్నను జీవుడు నిర్వికారి యను టెట్లు పొసగును? అతనికి సుఖదుఃఖాదులు గలుగుచున్నవికదా। అన :

### ఆభాస ఏవ చ ౨-౩-౫౦

'దేహసంబంధమువలన గలుగు సుఖదుఃఖాదిరూపమగు వికారము జీవునకు వికారాభాసమే కాని వికారము కాదు' అని సూత్రార్థము.

సుఖదుఃఖాదులన్నియు బుద్ధికి చెందినవై యున్నవి. ఇవి యన్నియు బుద్ధియందు భాసించును. బుద్ధితాదాత్మ్యమునుబొందిన జీవుని కివి యుపలబ్ధము లగును. ఈతాదాత్మ్యప్రభావమువలననే జీవునకు సుఖదుఃఖాదు లేర్పడుచున్నవని భావము. కావున నవి జీవునకు స్వాభావికములు కావు. అందువలన ఆభాసమాత్రముగ శాస్త్రమున జెప్పబడినవి. కాగా,జీవబ్రహ్మలకు గల అంశాంశిభావసంబంధము దూషితముకాదు.(౫౦)

## నవమాధికరణము

జీవుడు అణుస్వరూపము కలవాడని నిర్ణయించి యతనికి విభుత్వము లేదని చెప్ప సూత్రము నారంభించుచున్నాడు.

### అదృష్టానియమాత్ ౨-౩-౫౧

అదృష్టానియమాత్=అదృష్టములో నియమము లేనందున జీవుడు విభువు కాడు; అణువే.

జీవులు అనేకులు. కావున జీవులెల్లరు వ్యాపకులని యంగీకరింతుమేని, అదృష్టమున నియమ ముండనందున జీవులకు గలుగు సుఖదుఃఖములకు వ్యవస్థ యేర్పడదు. జీవులకుగలుగు సుఖదుఃఖములకు కారణము అదృష్టము. కారణములో నియమము లేకున్న కార్యములోను నియమ ముండదు. సుఖదుఃఖములు జీవులకు ఆకస్మికములు - కారణములేక యేర్పడునవి - కావు. జీవులు వ్యాపకులు అని యందుమేని సర్వజీవాదృష్టములతో సర్వజీవులకు సంబంధ ముండును. కావున సుఖదుఃఖములకు వ్యవస్థ యుండదు. ఎల్లరు ఒకేసమయమున దుఃఖితులు కావలసియుండును. కావున జీవులు అణువులే కాని విభువులు కారు. (౫౧)

### అభిసంధ్యాదిష్వపి చైవమ్ ౨-౩-౫౨

'అభిసంధిః = రాగద్వేషాదులతోకూడిన సంకల్పము'. సంకల్పము-ప్రయత్నము మున్నగువానివలన అదృష్టమున నియమ మేర్పరుప వీలగును. అందువలన సుఖదుఃఖములలో వ్యవస్థ యేర్పడు ననుటకును వలను పడదు.

ఆత్మలన్నియు వ్యాపకములని యంగీకరించుటవలన నదృష్టముతో నెల్లయాత్మలకు సాన్నిధ్య ముండును. అప్పుడు 'ఈ యదృష్ట మీ యాత్మకు చెందినది. దీనికి చెందినది కాదు' అని నిర్ణయింప వీలుండదు. అట్లే

యదృష్టమునకు కారణములయిన సంకల్పప్రయత్నాదులు కూడ నన్ని యాత్మలతోను సంబద్ధములై అదృష్టమును నియమింప సమర్థములు కానేరవు. కావున ఆత్మలు విభువులని యంగీకరించిన సుఖదుఃఖవ్యవస్థ యేర్పడనేరదని భావము. (౫౨)

## ప్రదేశా దితిచే న్నాంతర్భావాత్ ౨-౩-౫౩

ప్రదేశాత్ ఇతి చేత్=శరీరదేశ సంబంధమువలన సుఖదుఃఖనియమమేర్పడగల దందుమేని, అంతర్భావాత్ = జీవులెల్లరు నెల్లదేహములందు నుండుటచే, న=సుఖదుఃఖవ్యవస్థ ఏర్పడనేరదు.

'సంకల్పము (అభిసంధి), ప్రయత్నము మున్నగునవి మనఃసంయోగమువలన గలుగును. ఆ మనఃసంయోగము ఆత్మతో శరీరమునందే యుండును. ఆ శరీరముకూడ నొక్కొక్క జీవాత్మ కొక్కొక్కటి చొప్పున వేరువేరుగ నుండును. అందువలన సంకల్పాదులు, తన్మూలమున నేర్పడు నదృష్టములు శరీరభేదముచే నియతములగును. సుఖదుఃఖములలో వ్యవస్థ యేర్పడగలదు'. కావున జీవులు అణువులు కారు; విభువులే యందురేని - అదియును సమంజసము కాదు. కారణమేమన : జీవులు వ్యాపకములైనపుడు ఎల్లశరీరదేశములం దున్న యెల్లమనస్సులతో వానికి సంబంధముండుటలో నాటంక మేమి యుండును? ఎల్లజీవులతోను మనఃసంయోగముండుపక్షమున సంకల్పాదులలో నియమ మేర్పడ వలనుపడదు. 'ఒకానొక సంకల్ప మొకానొక యాత్మదే కాని, మరియొకయాత్మకు చెందినది కాదు'. అని నియమింప నేరితరము? కావున సుఖదుఃఖవ్యవస్థ యేర్పడజాలదు. అందువలన జీవులు విభువులు కారు. అణువులేయని నిశ్చితమగుచున్నది. (౫౩)

వేదాంత దర్శన - ఆంధ్ర వ్యాఖ్యానమున
ద్వితీయాధ్యాయమునందు తృతీయపాదము
సమాప్తము.

# ద్వితీయాధ్యాయము

## చతుర్థపాదము

### ప్రథమాధికరణము

తృతీయపాదమున నాకాశాదిపదార్థముల యుత్పత్తివిషయమున గల వాక్యప్రమాణములలోని విరోధము పరిష్కరింపబడినది. ఈ పాదమున నింద్రియముల విషయమున గల వాక్యప్రమాణములయందలి వైరుధ్యము పరిహరింపబడును. ఇంద్రియములు జీవునకు ఉపకరణములు. ఇంతకు పూర్వము జీవునిగూర్చి విచారించియుంటిమి. అతనియుపకరణము లయిన ఇంద్రియముల నిట విచారించుట యుక్తమే యగును.

తథా ప్రాణాః — ౨-౪-౧

(ఈ సూత్రమున గల ప్రాణశబ్దము ఇంద్రియ వాచకము.)

తథా=ఆకాశాది మహాభూతములు బ్రహ్మమువలన నుత్పన్నము లయినట్లు, ప్రాణాః=ఇంద్రియములుకూడ నుత్పన్నములైనవి.

ఆకాశాదిభూతపంచకమువలె ఇంద్రియములు పుట్టుచున్నవా? లేక జీవాత్మవలె పుట్టుక లేనివై యున్నవా? యని సంశయము కలుగుచున్నది. పుట్టుకలేనివి యని పూర్వపక్షము. పుట్టుకగలవియే యని సిద్ధాంతము.

తస్మాద్వా ఏతస్మా దాత్మన ఆకాశః సంభూతః' తై. ౨-౧.

అను నీ యుపనిషద్వాక్యమున నాకాశాదిభూతములు పుట్టినట్లు వర్ణింపబడినది. కాని, ఇంద్రియము లుత్పన్నము లైనట్లు చెప్పబడలేదు. కావున నింద్రియములు పుట్టుక గలవి యనుట యుక్తము కాదు; అని పూర్వపక్షము.

'తస్మాద్వా ఏతస్మా దాత్మన ఆకాశః సంభూతః' అను తైత్తిరీయ

వాక్యమున నింద్రియము లుత్పన్నములైనట్లు వర్ణింపకుండుట సత్యమే: కాని, యవి యుత్పత్తి గలవియే యని చెప్పువాక్యములు లేకపోలేదు. చూడుడు:

'సప్తప్రాణాః ప్రభవంతి తస్మాత్' ముం. ౨-౧-౮. 'ఆ పరమాత్మనివలన సప్తేంద్రియము లుత్పన్నము లగుచున్నవి.' ఇట్లే మరియొక వాక్యమునను జెప్పబడినది. 'ఏతస్మా జ్జాయతే ప్రాణో మనఃసర్వేంద్రియాణి చ' ముం. ౨-౧-౩.

ఇంతేకాక, 'ఏతస్మా దాత్మన ఆకాశః సంభూతః' అను తైత్తిరీయ వాక్యమునందును, ఆకాశాద్యుత్పత్తి చెప్పి,'పృథివ్యా ఓషధయ, ఓషధిభ్యో అన్నం, అన్నాద్ రేతో,రేతసః పురుషః' తై. ౨-౧.

'పృథివినుండి యోషధులు, వానినుండి యన్నము, ఆ యన్నము నుండి రేతస్సు,దానినుండి పురుషుడు-శరీరము-'ఉత్పన్నమైనట్లుచెప్పబడియే యున్నది. శరీరము పుట్టినట్లు ఈ వాక్యమునందు స్పష్టముగా జూడనగును. అందువలన నింద్రియములు పుట్టిన వనుటలో సంశయము జనింపదు. ఇంద్రియములు పుట్టినట్లు వాక్యమున లేదందురేని, ఇంద్రియములు లేక శరీర మెట్లు సిద్ధించును? శరీర మింద్రియముల కాశ్రయమే కదా! కావున ఇంద్రియములు జన్యములు - ఉత్పత్తికలవి యనుట నిశ్చితము. (౧)

ఇంద్రియము లుత్పన్నము లైనట్లు చెప్పువాక్యము ప్రధానము కాదు (గౌణము), అందురేని - అది సరికాదని సూత్రించుచున్నాడు,

## గౌణ్యసంభవాత్ ౨-౪-౨

ఇంద్రియముల యుత్పత్తిని చెప్పువాక్యము గౌణము - అప్రధానము - కాదు.

బాధకవాక్య మున్నపుడు శబ్దమునకుగల ప్రధానార్థము విడువబడును.

కాని, యది లేనపుడు శబ్దార్థము గౌణమనుట తగదు. ఇంద్రియముల నాశము ప్రత్యక్షముగ జూడబడుచున్నది. నాశముగల ఇంద్రియములకు జన్మ మున్నదనుటలో సంశయమునకు తావే లేదు. 'ఇంద్రియములు జన్మము కలవి కావు.' అను బాధకవాక్యము లేనందునను ఇంద్రియము లుత్పన్నము లనుట నిశ్చితమే. (౨)

ఇంద్రియములు ఆకాశాదిభూతపంచకమునకు పూర్వమే యుత్పన్నము లయినవా ? లేక తరువాతనా ?

తత్ ప్రాక్ శ్రుతేశ్చ ౨-४-३

శ్రుతేః = శ్రుతివలనను, చ = స్మృతివలనను, తత్ప్రాక్ = ఆకాశాదులకంటె పూర్వమే ఇంద్రియములు జనించినవని తెలియుచున్నది.

శ్రుతిస్మృతులవలన నింద్రియములు ఆకాశాదులకు పూర్వమే యుత్పన్నమైనవి యని తెలియుచున్నది.

"ఏతస్మా జ్జాయతే ప్రాణో మనఃసర్వేంద్రియాణి చ,
ఖం వాయుర్ జ్యోతి రాపః పృథివీ విశ్వస్య ధారిణీ"
ముం. ౨-౧-३.

'ప్రాణము, మనస్సు, ఇంద్రియములు, ఆకాశము, వాయువు, అగ్ని, జలము, పృథివి' అను నివియన్నియు పరమేశ్వరునివలన జనించినవి. ఇట నింద్రియములు ఆకాశాదులకంటె పూర్వమే జనించినట్లు స్పష్టముగ వర్ణింపబడినది. మరియు సాంఖ్యదర్శనమునను నిట్లే చూడనగును.

"సత్త్వరజస్తమసాం సామ్యావస్థా ప్రకృతిః, ప్రకృతే ర్మహాన్,
మహతో உహంకారో உహంకారాత్ పంచతన్మాత్రాణి,
ఉభయ మింద్రియం, తన్మాత్రేభ్యః స్థూలభూతాని,
పురుష ఇతి పంచవింశతి ర్గణః" సాం. ౧-౬౧.

ఈ సాంఖ్యసూత్రమునందు ఆకాశాదులకంటె పూర్వమే యహంకారమునుండి జ్ఞానేంద్రియములు, కర్మేంద్రియములు నుత్పన్నము లయినట్లు కపిలుడు చెప్పియున్నాడు. ఎటనైన నాకాశాదులు పూర్వమున చెప్పబడినట్లు లభించిన నట సూక్ష్మభూతములని గ్రహింపనగును. కావున నింద్రియములు స్థూలభూతములకంటె బూర్వమే యుత్పన్నము లయినట్లు శ్రుతిస్మృతులవలన సిద్ధమగుచున్నదని సూత్రాభిప్రాయము. (౩)

ఆకాశాదిభూతములకంటె పూర్వమే యింద్రియములు పుట్టియున్న పక్షమున 'తేజోమయీ వాక్' ఛాం. ౬-౫-౪. అని వాగింద్రియము తేజోమయమని యెట్లు చెప్పబడినది? తేజోమయమన నగ్నినుండి యుత్పన్నమైన దనికదా । యర్థమగు, నన :

తత్పూర్వకత్వాద్ వాచః ౨-౪-౪

ఈ సూత్రమున 'తత్' పదముచే బుద్ధిగతమగు తేజస్సు గ్రహింపనగును. పూర్వ మన కారణ మని యర్థము. కాగా, వాచః = వాగింద్రియము, తత్పూర్వకత్వాత్ = తేజస్సు కారణముగా గల దగుటవలన, వాగింద్రియము తేజోమయ మనినను దోషము లేదు.

ఏ కారణమున దేనికార్యజననశక్తి నియమముగ ప్రకటమగునో తన్మయత్వ మా వస్తువునకు జెప్పుట దోషము కాదు. తేజస్సు - అగ్ని - వాక్కుకంటె తరుపరి జన్మించినను, తేజస్సు నిమిత్తముగ వాగింద్రియ కార్యజననశక్తి ప్రకటమగును: కావున వాక్కు తేజోమయమని చెప్పబడినది.

"తేజోమయీ వాక్" ఛాం. ౬-౫-౪. అను వాక్కునందలి తేజోమయత్వమున కర్థము తేజోజన్యత్వము కాదు. తేజస్సు వాగింద్రియమునందలి శబ్దోచ్చారణశక్తిని అభివ్యక్తము (ప్రకటము) చేయును. ఆ యభిప్రాయముతోనే వాగింద్రియము తేజోమయమని ఉపనిషద్వాక్యమున

జెప్పబడినది. ఇట్లే 'అన్నమయము మనస్సనియు, ఆపోమయము ప్రాణమనియు' నుపనిషత్తులలో వర్ణింపబడుట చూడనగును. 'అన్నమయం హి సోమ్య ! మన ఆపోమయః ప్రాణః' ఛాం. ౬-౫-౪. (౪)

ఇంద్రియములు ఆకాశాదిభూతపంచకమువలె నుత్పన్నములైనవియే యని నిర్ణయించి, వాని సంఖ్యను నిర్ణయించుచున్నాడు.

పూర్వ పక్షము:

సప్త గతేర్ విశేషితత్వాచ్చ ౨-౪-౫

గతేః = ఉత్క్రాంతివలనను, విశేషితత్వాత్ చ = విశేషణము వలనను, సప్త = ఇంద్రియములు ఏడు.

ఇంద్రియములు సంఖ్యలో ఏడా ? లేక పదునొకండా ? యని సంశయము. శ్రుతివాక్యములలో సంఖ్యాభేదము కనబడుచున్నందున నిట్టిసంశయము కలుగును.

"సప్తప్రాణాః ప్రభవంతి తస్మాత్" ముం. ౨-౧-౮.

త్వక్కు, వాక్కు, చక్షువు, ఘ్రాణము, శ్రవణము, జిహ్వ, మనస్సు నను సప్తేంద్రియము లొకట వినవగును. మరియొకయెడ,

"అష్టౌ గ్రహా అష్టావతిగ్రహాః' బృ. ౩-౨-౧.

'నాసిక, జిహ్వ, వాక్కు, నేత్రము, శ్రోత్రము, మనస్సు, హస్తము, త్వక్కు' అని యెనిమిది ఇంద్రియములు వర్ణింపబడుచున్నవి. ఇంకొకవాక్యమునందు

"దశేమే పురుషే ప్రాణా ఆత్మైకాదశః" బృ. ౩-౯-౪.

'పంచజ్ఞానేంద్రియములు - నేత్రాదులు, పంచకర్మేంద్రియములు - హస్తపాదాదులు, పదునొకండవది మనస్సు' అని పదునొకండింద్రి

యములు వర్ణింపబడినవి. కావున సప్తేంద్రియములని పూర్వపక్షము; ఏకాదశేంద్రియములని సిద్ధాంతము.

'త ముత్క్రామంతం ప్రాణోఽనూత్క్రామతి, ప్రాణ మనూత్క్రామంతం సర్వే ప్రాణా అనూత్క్రామంతి' బృ. ౪-౪-౨.

'శరీరమునుండి ఆత్మ విడివడి వెళ్ళునపుడు సర్వప్రాణములు - ఇంద్రియములు - వెంటవెళ్ళును'. అను నీ వాక్యమునందు 'సర్వేంద్రియములు' అని సర్వశబ్దము ప్రయోగింపబడియున్నది. సర్వేంద్రియము లనగా నిట సప్తేంద్రియము లనియే యెంచవలెను. 'అందరికి భోజనము పెట్టుడు' అనిన ప్రస్తుతమున భోజనమునకు వచ్చినవారి కందరికి భోజనము పెట్టుడనియే యగును. అట్లే ప్రస్తుతమున జీవునిఉత్క్రాంతి (శరీరాంతరగమనము) వర్ణింపబడినకావున సప్తేంద్రియములే వానివెంట బోవును. వానినుద్దేశించియే సర్వప్రాణములని వాడబడినది.

'స యత్ర చాక్షుషః పురుషః పరాఙ్ పర్యావర్తతే తథాఽరూపజ్ఞో భవతి' 'ఏకీభవతి న పశ్య తీత్యాహుః' బృ. ౪-౪-౧-౨.

'జీవుడు శరీరమును విడిచి వెళ్ళునపుడు చక్షురాదిఇంద్రియములనుపసంహరించుకొనును. బుద్ధీంద్రియముతో నేకమగును. అందువలన మరణాత్పూర్వము రూపాదులను గ్రహింపజాలడు. కన్నులు చూడవు. చెవులు వినవు. వాసన తెలియదు. రుచులు తెలియవు. మాటలు రావు. స్పర్శను గ్రహింపజాలడు. ఆలోచింపజాలడు'. ఇట్లు సప్తేంద్రియములు పనిచేయవు. ఉత్క్రాంతిశ్రుతివలన సప్తేంద్రియములు అని బోధపడుచున్నది. విజ్ఞానముకూడ నొక యింద్రియముగ లెక్కించిన నెనిమిది ఇంద్రియము లగును. కాని బుద్ధి (విజ్ఞానము), మనస్సు నను నీ రెంటిని నొక్కటిగ జెప్పిన నేడే యింద్రియము లగును. ఇక హస్తపాదాదులు ఆత్మను వెంటనంటవు. కావున వానివలన నాత్మ కంతప్రయోజన ముండ

దని తెలియుచున్నది. కావున నింద్రియములు ఏడు (సప్త) అనియే బోధ పడుచున్న దని పూర్వపక్షాభిప్రాయము. (౫)

సమాధాన సూత్రము :

హస్తాదయ స్తు స్థితేఽతో నైవమ్ ౨-౪-౬

స్థితే=శరీరమునుండి జీవుడు వెళ్ళునపుడు ప్రాణసంఖ్యను నియమించునది యుండగా, హస్తాదయః=హస్తపాదాదీంద్రియము లున్నవనియే యెంచవలెను. అతః=అందువలన, ఏవం న=ఇంద్రియములు ఏడే యనుట తగదు.

ఉత్క్రమణము కారణముగ నింద్రియములు ఏడే యని నిర్ణయింతు రేని, అపు డింద్రియములు పదునొకం డనియే నిశ్చయింపక తప్పదు. ఉపనిషద్వాక్య మట్లే నుడువుచున్నది. చూడుడు :

'దశేమే పురుషే ప్రాణా ఆత్మైకాదశ స్తే యదా
అస్మా చ్ఛరీరా న్మర్త్యా దుత్క్రామ న్త్యథ రోదయంతి'
బృ. ౩-౯-४.

'ఈ శరీరమునుండి ఆత్మతోబాటు పంచజ్ఞానేంద్రియములు, పంచ కర్మేంద్రియములు, పదునొకండవదియైన మనస్సు వెళ్ళిపోవును. బంధువులను ఏడిపించును.' అను నీవాక్యమున పదునొకం డింద్రియములు ఉత్క్రమించునట్లు స్పష్టముగా చెప్పబడినది. ఈ వాక్యమున చెప్పబడిన ఏకాదశేంద్రియముల నపేక్షించియే పూర్వపక్షమున ప్రదర్శింపబడిన వాక్యమునందు సర్వప్రాణములు అనూత్క్రమించునని చెప్పబడినది.

'త ముత్క్రామంతం ప్రాణో ఽనూత్క్రామతి, ప్రాణ మనూత్క్రామంతం చ సర్వే ప్రాణా అనూత్క్రామంతి' బృ. ४-४-౨.

ఒకఉపనిషద్వాక్యమున ఏకాదశేంద్రియములు జీవునివెంట ఉత్క్ర-

మించునని చెప్పియుండుటంబట్టి రెండవఉపనిషద్వాక్యమునందలి సర్వశబ్దముచే నాపదునొకండింద్రియములు గ్రహించుటయే యుచితమగును. కాని సప్తేంద్రియము లనుట తగదు.

'అందరికి భోజనము పెట్టుడు' అను తావున అందరు ననుపదముచే భూమండలముననున్న మానవుల నెల్లరను గ్రహించుట యసంభవము. కావున ప్రస్తుతము భోజనమున కాహ్వానించినవారినందరిని అని చెప్పుట యుచితమే. ఉత్క్రాంతిప్రకరణమున సర్వశబ్దముచే నేకాదశేంద్రియములను గ్రహించుటలో బాధక మేమియు లేదు. కావున నొకట నేకాదశేంద్రియములు జీవునివెంట నుత్క్రమించునని చెప్పియుండుటంబట్టి రెండవ వాక్యమునందలి సర్వశబ్దముచే నెల్లయింద్రియములను గ్రహించుటయే యుక్తమగును: కాని, సప్తేంద్రియములే గ్రహించుట సమంజసము కాదు. (౬)

## ద్వితీయాధికరణము

ఇంద్రియములయుత్పత్తి బ్రహ్మమువలననే కలిగినదని చెప్పి, వానిసంఖ్యయు నిర్ణయింపబడినది.

సూక్ష్మభూతములయుత్పత్తి యిపుడు చెప్పబడుచున్నది.

### అణవశ్చ ౨-౪-౭

బ్రహ్మమువలన నాకాశాదిమహాభూతములకంటె బూర్వమున నెట్లింద్రియము లుత్పన్నములగునో యట్లే సూక్ష్మభూతము లయిన పంచతన్మాత్రలును ముందుగానే యుత్పన్నమగునని సూత్రార్థము.

ప్రశ్నోపనిషత్తునందు ఇంద్రియములు వర్ణింపబడినట్లే ఆకాశాది పంచమహాభూతములు, వానికి కారణములైన తన్మాత్రలును వర్ణింపబడినవి.

'పృథివీ చ పృథివీమాత్రా చ, ఆప శ్చాపోమాత్రా చ,
తేజ శ్చ తేజోమాత్రా చ, వాయుశ్చ వాయుమాత్రా చ,
ఆకాశ శ్చాకాశమాత్రా చ' ప్ర. ౪-౮.

కార్యముకంటె కారణము పూర్వమున నుండును. కావున నాకాశాది భూతములకంటె వానికి కారణములయిన శబ్దతన్మాత్ర, వాయుతన్మాత్ర, రూపతన్మాత్ర, రసతన్మాత్ర, గంధతన్మాత్ర యను నీ యైదు తన్మాత్రలును ముందుగానే సృష్టింపబడును.

## తృతీయాధికరణము

ముఖ్యప్రాణోత్పత్తిని నిర్ణయించుచున్నారు.

శ్రేష్ఠ శ్చ ౨-౪-౮

ఆకాశాదిమహాభూతములకు పూర్వము వానికి కారణములైన తన్మాత్రలు, ఇంద్రియములు నుత్పన్నము లగునట్లు ముఖ్యప్రాణమును ఉత్పన్నమగును.

'ప్రాణో వావ జ్యేష్ఠశ్చ శ్రేష్ఠశ్చ' ఛాం. ౫-౧-౧.

'ప్రాణము జ్యేష్ఠము శ్రేష్ఠము' నని ఛాందోగ్యమున చెప్పబడుట చేత నీ సూత్రమున పఠింపబడిన శ్రేష్ఠశబ్దము ముఖ్యప్రాణమును బోధించు నని తెలియునది.

ఋగ్వేదమునందు ప్రలయకాలస్థితిని బోధించుమంత్రమొండు గలదు.

"న మృత్యు రాసీ దమృతం న తర్హి
న రాత్ర్యా అహ్న ఆసీత్ ప్రకేతః,
ఆనీదవాతం స్వధయా తదేకం
తస్మాద్ధాన్య న్నపరః కించ నాస." ఋ. ౮-౭-౧౭-౨.

ఈ మంత్రమున 'మృత్యువు, జీవనము, రాత్రింబవళ్ళు నేమియు లేని ప్రళయసమయమున 'ఆసీత్' ప్రాణవ్యాపార ముండెను.' అని చెప్ప బడినది. కావున ప్రళయమునను గల ప్రాణము ఉత్పన్నమైన దనుట యుక్తము కాదు. 'అన ప్రాణనే' అను పాణినిధాతుపాఠము ననుసరించి 'ఆసీత్' ప్రాణన మనెడి ప్రాణవ్యాపార ముండెను; అని బోధపడుచున్నది. ప్రళయసమయమున ప్రాణమే లేకున్న దానివ్యాపార మెట్లుండును? ప్రాణ మప్పు డుండుపక్షమున నది సృష్టింపబడిన దనుట యుక్తము కాదు; కావున 'ప్రాణము బ్రహ్మమువలన నింద్రియాదులవలె నుత్పన్నము కాదు. అనుట సరికాదు. కారణమేమన : ఆకాశాదులు, ఇంద్రియములు, మనస్సు నుత్పన్నము లగుచున్న వని యెట్లు ఉపనిషద్వాక్యములు చెప్పుచున్నవో యట్లే ముఖ్యప్రాణముకూడ నుత్పన్న మగుచున్నదని చెప్పుచున్నవి.

'ఏతస్మా జ్జాయతే ప్రాణో మనః సర్వేంద్రియాణి చ'

ముం. ౨-౧-౩.

'పరమేశ్వరునివలన ప్రాణము, మనస్సు, ఇంద్రియములును జనించుచున్నవి.' అను నీ వాక్యమునందు ప్రాణముకూడ నుత్పన్న మైనట్లు చెప్పబడుట స్పష్టము.

అటులయిన ప్రళయవర్ణనమంత్రమునందు 'ఆసీత్' అను పదము ప్రాణవ్యాపారము నేల బోధించు నందురేని 'ఆసీత్' పదము జగజ్జన్మాదు లకు మూలకారణమైన పరబ్రహ్మముయొక్క సద్భావమును బోధించు చున్నదే కాని, ప్రాణవ్యాపారమును బోధింపదని సమాధానము చెప్పుదుము. "ప్రళయసమయమున 'స్వధయా' జగత్తు గర్భమునందుగల ప్రకృతితో బ్రహ్మము మాత్రము 'ఆసీత్' ప్రాణనక్రియ - చైతన్యము - కలిగియున్నది. మృత్యువు మున్నగున వేమియు నపుడు లేవు." అని మంత్రాభిప్రాయము. కావున (శ్రేష్ఠము) ముఖ్యప్రాణము ఆకాశాదులవలె బ్రహ్మముచే నుత్ప న్నము చేయబడినదనుట యుక్తమే. (౮)

ప్రాణముయొక్క స్వరూపమును నిరూపించుచు నది వాయువికారము కాదనుచున్నాడు.

న వాయుక్రియే పృథ గుపదేశాత్ ౨-౪-౯

పృథక్ ఉపదేశాత్ = ప్రాణమును వేరుగ నుపదేశించుటవలన, వాయుక్రియే న = వాయువుకాని, దాని వికారముకాని కాదు. (క్రియ యన నిట వికారము)

ప్రాణము వాయువుకాని, వాయువికారముకాని యైయున్నపక్షమున నయ్యది వానికంటె వేరుగ నుపదేశింపబడియుండదు. భిన్నముగ ఉపనిషద్వాక్యములలో నుపదేశింపబడియున్నందున ప్రాణము వాయువుకాని, వాయు వికారముకాని కాదని స్పష్టమగుచున్నది.

"ఏతస్మా జ్జాయతే ప్రాణో మనః సర్వేంద్రియాణి చ,
ఖం వాయు ర్జ్యోతి రాపః" ముం. ౨-౧-౩.

'పరమేశ్వరునివలన ప్రాణము, మనస్సు, సర్వేంద్రియములు, ఆకాశము, వాయువు, అగ్ని, జలము, పుట్టుచున్నవి.' ఇందు ప్రాణము వాయువుకంటె వేరుగ వర్ణింపబడినది. కావున నది వాయువు కాదు; వాయు వికారమును కాదు. (౯)

అటులయిన ప్రాణము ఆత్మవలె స్వతంత్రపదార్థమననగునా? యన :

చక్షురాదివత్తు తత్సహశిష్ట్యాదిభ్యః ౨-౪-౧౦

చక్షురాదివత్ = చక్షురాదీంద్రియములు ఆత్మకు ఉపకరణములుగా నెట్లుపదేశింపబడినవో యట్లే శ్రేష్ఠప్రాణముకూడ జీవాత్మకు సాధనముగానే చెప్పబడినది. అందువలన నది స్వతంత్రపదార్థము కాదు. కారణ మేమన : తత్సహశిష్ట్యాదిభ్యః=ఆ ప్రాణము చక్షురాదీంద్రియములతోబాటు ఉపదేశింపబడినది, అది యచేతనము, ఉత్పత్తి కలది.

అనేక ఉపనిషద్వాక్యములలో ప్రాణము నేత్రాదీంద్రియములతో బాటు ఉపదేశింపబడినది. సమానధర్మములు గలవియే సామాన్యముగ నొకచో తోడ్తో నుపదేశింపబడుట చూచుచున్నాము. ఇంద్రియములు, ప్రాణము రెండును జీవాత్మకు ఉపకరణములు. సాధనత వానికి సామాన్య ధర్మము. జీవునకు చక్షురాదీంద్రియములు సాధనములుగ నుపయోగించి యతని కర్తృత్వమును సాధించును. అట్లే ప్రాణముకూడ సర్వార్థసాధకమై జీవున కుపకరించును. కావున నది జీవునివలె స్వతంత్రపదార్థము కాదు. (౧౦)

చక్షురాదులు రూపాదులను గ్రహించుటకు తోడ్పడుచు జీవున కవి సాధనము లగుచున్నవి. చక్షురాదులకు రూపాదులు విషయములు. ప్రాణమున కట్టి విషయము ప్రత్యేకించి యేమియు లేదు. కావున నది చక్షురాదుల వలె జీవున కుపకరణ మనుట తగదన - సమాధానము :

## అకరణత్వాచ్చ న దోషః తథాహి దర్శయతి ౨-౪-౧౧

అకరణత్వాత్ = ఇంద్రియము కానందున, న దోషః = దోషము లేదు. తథాహ = ప్రాణము కరణము - ఇంద్రియము - కాదని, దర్శయతి= ఉపనిషద్వాక్యము ప్రదర్శించుచున్నది.

ప్రాణము ఇంద్రియములవలె కరణమగుపక్షమున నేదో యొక విషయమును గ్రహింపజేయునదై యున్నట్లు చెప్పవలసివచ్చెడిది. ప్రాణము కరణము కాదు. అందువలన నది యొకవిషయమును గ్రహింపజేయవలసిన యగత్యము లేదు. కావున దోషము లేదు. శరీరమును, ఇంద్రియాదులను ధరించుటయే ముఖ్యప్రాణకార్యము. అది విషయగ్రాహక సాధనము కాదు. ఈ విషయము నీక్రింది యుపనిషద్వాక్యము ప్రదర్శించుచున్నది.

'తాన్ వరిష్ఠః ప్రాణ ఉవాచ, మా మోహ మాప ద్యథాహ మేవైతత్ పంచధాఽఽత్మానం ప్రవిభజ్యైతద్ బాణ మువష్టభ్య విధారయామి' ప్ర. ౨-౩.

అత్యంతోత్తమమగు నా ప్రాణము ఇంద్రియముల నుద్దేశించి యిట్లెను. "మోహమును బొందకుడు. నేనే ప్రాణాపానవ్యానోదానసమానరూపమున నైదువిధముల విభాగమును బొంది యీ శరీరమును నిలబెట్టి ధరించుచున్నాను - కార్యకారి చేయుచున్నాను." దీనింబట్టి ప్రాణము శరీరేంద్రియాదిధారణకు సాధనముగ జీవాత్మకు దోడ్పడుచున్నదని బోధపడుచున్నది. కావున నింద్రియములవలె కొందొకవిషయమును గ్రహింపజేయుసాధనమైె కరణముగ జీవున కుపయోగింప కున్నను దోషము లేదని భావము. (౧౧)

ప్రాణముయొక్క స్వరూప మేమన:

## పంచవృత్తిర్ మనోవ ద్వ్యపదిశ్యతే ౨-౪-౧౨

మనోవత్ = అంతఃకరణమగుబుద్ధి, జ్ఞానశక్తితో మనస్సని చెప్పబడుచున్నట్లు, పంచవృత్తిః=క్రియాశక్తితో ఐదువృత్తులు గలదై ముఖ్యప్రాణము, వ్యపదిశ్యతే = వ్యవహరింపబడుచున్నది.

పరమేశ్వరుని సంకల్పమువలన ప్రకృతినుండి మహత్తత్వ ముదయించును. ఆ మహత్తత్వమునందు రెండుశక్తు లుండును. జ్ఞానశక్తి, క్రియాశక్తి. జ్ఞానశక్తియుతమగు మహత్తత్వము బుద్ధి, మనస్సు, చిత్తము ననిచెప్పబడును. అట్లే క్రియాశక్తియుతమై ముఖ్యప్రాణ మనబడును. అంతఃకరణము జ్ఞానవ్యాపారావిష్టమై మనోబుద్ధినామములచే చెప్పబడును; క్రియావ్యాపారముతో కూడి యా యంతఃకరణమే ముఖ్యప్రాణమనబడును. క్రియాశక్తిప్రధానముగాగల యంతఃకరణముయొక్క వ్యాపారవిశేషమే ముఖ్యప్రాణ మని భావము. దార్శనికు లిట్లే యంగీకరింతురు.

'న వై వాచో న చక్షూంషి న శ్రోత్రాణి న మనాంసీ
త్యాచక్షతే ప్రాణ ఇత్యే వాచక్షతే ప్రాణో హ్యేతా
సర్వాణి భవతి.' ఛాం. ౫-౧-౧౫.

ఈ వాక్యమునందు వాక్చక్షుశ్శ్రోత్రమనస్సులను గౌణము (అప్రధానము)గ జెప్పి యన్నియు ముఖ్యప్రాణమే యని వర్ణింపబడినది. ఈ ముఖ్యప్రాణమే జీవన మనెడి ప్రయత్నవిశేషము. ఇయ్యది శరీరమునందు గ్రహింపబడినవాయువులో క్రియాభేదములను గలిగించి, వాయువువలె సంచరించు స్వభావముగల దగుటచే వాయు వనియు చెప్పబడుచున్నది. దర్శనాంతరమున నిట్లే చెప్పబడినది.

'సామాన్యకరణవృత్తిః ప్రాణాద్యా వాయవః పంచ.'

సాం. ద. ౨-౩౧.

సామాన్యకరణవృత్తియన నిట సమస్తకరణవ్యాపారము - అంతఃకరణవ్యాపారమని తత్వము. ప్రాణాదిపంచవాయువులు అంతఃకరణవ్యాపారము లని సాధారణసూత్రాభిప్రాయము.

జ్ఞానశక్తిప్రధానమగు నంతఃకరణము కార్యభేదమువలన మనోబుద్ధిచిత్తాహంకారములని చెప్పబడునట్లు, క్రియాశక్తిప్రధానమగు నంతఃకరణము కార్యభేదమువలనను, హృదయాదిస్థానభేదమువలనను ప్రాణము, అపానము, సమానము, ఉదానము, వ్యానము నని యైదువిధముల విభజింపబడుచున్నది.

'ప్రాణో ఽపానో వ్యాన ఉదానః సమానో ఽ
న ఇత్యేతత్ సర్వం ప్రాణ ఏవ' బృ. ౧-౫-౩.

ప్రాణము : ఇయ్యది యుచ్ఛ్వాస నిఃశ్వాసరూప ప్రాణనక్రియకు హేతువై నాసికాగ్రము మొదలు హృదయమువరకు నుండును.

అపానము : మూత్రము, పురీషము (మలము), గర్భము మున్నగు వానిని బయటికి పంపుటకు హేతువై నాభిమొదలు పాదతలమువరకు వ్యాపించియుండును.

సమానము : హృదయముమొదలు నాభివరకుగల శరీరమున వ్యాపించియుండును. తినినపదార్థములును, త్రావినపదార్థములును పరిణమించి రసమైనతదుపరి యా రసమును శరీరములో నాయాస్థానములకు చేర్చుటకు తోడ్పడును.

ఉదానము : ఊర్ధ్వనయనమునకు హేతువై నాసికాగ్రము మొదలు శిరస్సువరకు నుండును.

వ్యానము : శరీరశోధ (వాపు)కు హేతువై శరీరమునందంతటను వ్యాపించియుండును. (౧౨)

## చతుర్థాధికరణము

సూక్ష్మభూతాదులచే నేర్పడు సూక్ష్మశరీరోత్పత్తి నుపదేశించుచున్నాడు.

**అణుశ్చ** ౨-౪-౧౩

బ్రహ్మమువలన ఆకాశాదిపంచభూతములకు పూర్వము శబ్దతన్మాత్రాది సూక్ష్మభూతములు, చక్షురాదీంద్రియములు నుత్పన్నము లయినట్లే, అణుః చ=సూక్ష్మదేహముకూడ నుత్పన్న మగునని సూత్రార్థము.

శబ్దతన్మాత్రప్రభృతి పంచసూక్ష్మభూతములు, చక్షురాది పంచ జ్ఞానేంద్రియములు, హస్తపాదాది పంచకర్మేంద్రియములు, మనస్సు, అహంకారముతో కూడిన బుద్ధి యను నీ పదునేడు తత్వములసముదాయము సూక్ష్మదేహ మనబడును. (౧౩)

(శ్రీ శంకరాచార్య ప్రభృతి భాష్యకారు లీ సూత్రమును కూడ ప్రాణమునకే యన్వయించి ప్రాణము సూక్ష్మ మని వ్యాఖ్యానము చేసియున్నారు.)

## పంచమాధికరణము

వాగాదీంద్రియములు వివరింపబడినవి. వానివిషయమున నొకసంశయము నుద్భావించి సమాధానము చెప్పుటకీ క్రిందిసూత్రమును రచించుచున్నాడు.

వాగాదీంద్రియములలో అగ్న్యాదిదేవతాధిష్ఠాన మున్నదా? లేదా? యని సంశయము. లేదని పూర్వపక్షము. ఉన్నది యని సమాధానము.

(అనుగ్రాహ్య - అనుగ్రాహక భావసంబంధము అధిష్ఠాన మన బడును. అగ్న్యాదిదేవతలవలన ననుగ్రహింపబడి వాగాదీంద్రియములు తమకార్యముల నొనర్చుచున్నవని భావము.)

వాగాదీంద్రియములు తమతమకార్యములు స్వస్థానములం దుండి చేయుచుండుట చూచుచున్నాము. ప్రమాణములద్వారమున తెలియనగును. కాని, వానిలో అగ్ని మున్నగు దేవతాధిష్ఠాన మున్నదనుటకు ప్రమాణము కనిపింపదు.

నేత్రమునందు సూర్యదేవతాధిష్ఠానము ప్రత్యక్షముగ కనిపించుచున్నదికదా! అందువలన మిగిలిన యింద్రియములందును ఆ యా దేవతాధిష్ఠానము నూహింపవచ్చునందురేని - అదియును సరికాదు. మానవచక్షువు సూర్యకాంతిసహకారముతో జూడగలుగుచున్నది-సూర్యాధిష్ఠానము గలదై పనిచేయుచున్నది, సత్యమే; కాని రాత్రిసమయమున దోమలు, మరి యితర జంతువులు సూర్యకాంతిసహాయములేకయే చూడగలుచున్నవి. అందువలన వానినేత్రములలో సూర్యాధిష్ఠానము లేదని బోధపడుచున్నది. అట్టి మానవచక్షువునుబట్టి యంతటను దేవతాధిష్ఠానము నూహించుట సరికాదు. కావున నింద్రియములలో నగ్న్యాదిదేవతాధిష్ఠానము లేదనియే నుడువవలెనని ప్రాప్తింపగా - సమాధానము.

## జ్యోతిరాద్యధిష్ఠానం తు తదామననాత్ ౨-౪-౧౪

తదామననాత్ = ఉపనిషద్వాక్యములందు జెప్పబడుటవలన, జ్యోతిరాద్యధిష్ఠానం=వాగాదీంద్రియములలో అగ్న్యాది దేవతాధిష్ఠాన ముద్నదని తెలియుచున్నది.

వాగాదీంద్రియములయందు దేవతాధిష్ఠాన మున్నట్లు ప్రత్యక్షముగ గోచరింపదు. సత్యమే. కాని, ప్రత్యక్షము కానందున వస్తువు లేదనరాదు. సూక్ష్మవస్తువులు ప్రత్యక్షములు కావు. వాని నితరప్రమాణములమూలమున తెలియనగును. ఇంద్రియములకు అగ్న్యాదిదేవతలకు అనుగ్రాహ్య - అనుగ్రాహకభావ సంబంధ మున్నట్లు వాక్యప్రమాణమువలన దెలియనగుచున్నది.

'అగ్నిర్ వాగ్ భూత్వా ముఖం ప్రావిశత్;
వాయుః ప్రాణోభూత్వా నాసికే ప్రావిశత్,
ఆదిత్యః చక్షుర్ భూత్వా అక్షిణీ ప్రావిశత్,
దిశః శ్రోత్రం భూత్వా కర్ణౌ ప్రావిశత్' ఐత. ౧-౨.

'అగ్ని వాగింద్రియమున కనుగ్రాహకమై ముఖచ్ఛిద్రమున ప్రవేశించెను. వాయువు ఘ్రాణేంద్రియమును, ఆదిత్యుడు నేత్రములను, దిక్కులు శ్రవణేంద్రియములను ప్రవేశించెను.' ఆ యా అగ్న్యాదిభూత సహకారముతో వాగాదీంద్రియములు స్వస్వకార్యములను నిర్వర్తించుచున్నవని భావము.

'సూర్యో మే చక్షుః వాతః ప్రాణః' అథ. ౫-౭-౯-౭.

'సూర్యుడు నాచక్షువు, వాయువు నాసిక' అను నీమంత్రవర్ణాభిప్రాయము నదియే.

మానవనేత్రములు సూర్యాలోకనసహకారము లేనిది వస్తువులను

గ్రహింపజేయ వనుట ప్రత్యక్షసిద్ధమే. ఇక దోమలు, వృషభాదిజంతువులు రాత్రులందు జూడగలుగుచుండుటచే వానినేత్రములకు సూర్యాలోకన సహకారము లేదనుట యుక్తము కాదు. మానవనేత్రమునకు జూడ నెక్కువ సూర్యకాంతి యవసరమగును. వాని కంతకాంతి యవసర ముండదు. రాత్రులందును నక్షత్రములకాంతి యల్పముగా నుండకపోదు. ఆ యల్ప కాంతితోనే దంశమశకాదులు చూడగలవు. కావున నెల్లనేత్రములందును సూర్యాధిష్ఠాన మున్నట్లే యెంచవలెను. ఇట్లే వాగాది - ఇతరేంద్రియము లందును అగ్న్యాది స్థూలభూతముల యధిష్ఠానము నంగీకరింప నగును. (౧౪)

## షష్ఠాధికరణము

అగ్న్యాది దేవతాధిష్ఠానము గల యింద్రియములు భోగసాధనములగ జీవాత్మతో సంబద్ధము లగునా? బ్రహ్మముతోనా? యన :

**ప్రాణవతా శబ్దాత్** ౨-౪-౧౫

శబ్దాత్ = శ్రుతివచనమువలన, ప్రాణవతా = ఇంద్రియములకు స్వామియైన జీవాత్మతోనే యింద్రియములు సంబద్ధములగును; కాని బ్రహ్మముతో కాదు, అని తెలియుచున్నది.

ఇంద్రియములు భోగసాధనములు. అందువలన వానితో భోక్తయగు జీవాత్మకే సంబంధ ముండును. బ్రహ్మము భోక్త కాదు. కావున నింద్రియములు బ్రహ్మమునకు భోగసాధనములు కావని భావము.

'తయో రన్యః పిప్పలం స్వాద్వ
త్త్యనశ్న న్నన్యో ౽భిచాకశీతి' ఋక్. ౨-3-౧౭-౨౦.

'జీవేశ్వరులలో జీవుడు సుఖదుఃఖముల ననుభవించును. ఈశ్వరుడు సుఖదుఃఖముల ననుభవింపక యంతట ప్రకాశించుచుండును.' అను నిట్టి

వాక్యప్రమాణమువలన జీవుడే భోక్త యనియు, పరమేశ్వరుడు భోక్త కాదనియు తెలియుచున్నది. అందువలన భోగసాధనములైన యింద్రియములతో బ్రహ్మకు సంబంధములేదు. (౧౫)

జీవాత్మ లేనపుడు ఇంద్రియములు బ్రహ్మముతో సంబద్ధములగునా? యన :

**తస్య చ నిత్యత్వాత్**            ౨-౪-౧౬

('చ' శంకానివారణార్థము)

తస్య = జీవాత్మ, నిత్యత్వాత్ = నిత్యమగుటవలన, నింద్రియములు సదా జీవాత్మతోనే సంబద్ధములగును. బ్రహ్మముతో కావు.

జీవాత్మ నిత్యము కాక యనిత్యమయిన పక్షమున భోక్త లేనపుడు భోగసాధనములైన యింద్రియముల కపుడు చేతనమగు బ్రహ్మముతో సంబంధ ముండునా! యను సంశయము కలుగవచ్చును. కాని, యట్టి సంశయమునకు తావే లేదు. జీవాత్మ నిత్యము. కర్మసంబంధనిమిత్తముగ నింద్రియములకు జీవునితో సంబంధ మేర్పడును. అట్టి సంబంధము బ్రహ్మమునకు లేదు. నిమిత్తములేక నైమిత్తిక మెన్నడు నేర్పడదు. బ్రహ్మము చేతన మైనంతమాత్రమున నింద్రియముల సంబంధము దానికి నూహించుట యుక్తము కాదు. (౧౬)

## సప్తమాధికరణము

**త ఇంద్రియాణి తద్వ్యపదేశా**
**దన్యత్ర శ్రేష్ఠాత్**            ౨-౪-౧౭

తే=జీవాత్మతో సంబద్ధములగు నాప్రాణములు, శ్రేష్ఠాత్ అన్యత్ర= శ్రేష్ఠప్రాణము తక్క మిగిలినప్రాణములు, ఇంద్రియాణి = ఇంద్రియము

లనబడును. తద్వ్యపదేశాత్ = ఇంద్రియపదముచే శ్రుత్యుపనిషత్తులలో వ్యవహరింపబడినవి.

ఈ సూత్రమున నింద్రియముల నామసార్థక్యము ప్రదర్శింపబడి నది. శరీరము నాశ్రయించి, ఇంద్రస్య = ఆత్మకు, భోగసాధనమగునది ఇంద్రియ మనబడును. ఉపనిషత్తులలో ఇంద్రియములు ప్రాణశబ్దముచే వ్యవహరింపబడినవి. అందువలననే ముఖ్యప్రాణముకాక మిగిలినవి ఇంద్రియములని యిట నిర్దేశింపబడినవి. అవి రూపరసగంధాదివిషయములను వేరువేరుగ గ్రహింపజేయుచు జీవాత్మకు సుఖదుఃఖములను గలుగజేయు చుండుట నెల్ల రెరిగినదియే.

'ఇంద్రియ మింద్రలింగమ్' అష్టా. ౫-౨-౯౩.

అను నీపాణినీయసూత్రమునందు ఇంద్రియము జీవాత్మకు సాధనము (ఇంద్రలింగమ్)గ వర్ణింపబడినది.

'ఇంద్రియాణి శతక్రతో । యాతే జనేషు
పంచసు ఇంద్ర । తాని త ఆవృణే.' ఋక్. ౩-౨-౨౨.

'ఇమాని యాని పంచేంద్రియాణి మనఃషష్ఠాని'
అథ. ౧౯-౧-౯-౫.

'ఏతస్మా జ్జాయతే ప్రాణః, మనః సర్వేంద్రియాణి చ.'
ముం. ౨-౧-౩.

అను నీ వాక్యములందు ఇంద్రియము లనుపేరుతో ముఖ్యప్రాణమును విడిచి మిగిలిన ప్రాణములు వ్యవహరింపబడుట స్పష్టము. (౧౭)

శ్రేష్ఠప్రాణము కాక యని చెప్పనేల ?

## భేదశ్రుతేః ౨-४-౧౮

'వాగాదీంద్రియములకంటె శ్రేష్ఠప్రాణము వేరుగ ఉపనిషద్వాక్యము లందు నిర్దేశింపబడుటవలన శ్రేష్ఠప్రాణమును వేరుగ చెప్పవలసివచ్చినది.

'వాఙ్మన శ్చక్షుః శ్రోత్రం చ తే ప్రీతాః
ప్రాణం స్తువంతి' ప్ర. ౨-౪.

'వాక్కు, మనస్సు, చక్షువు, శ్రోత్రము నను నీ యింద్రియములు ప్రసన్నములై ప్రాణమును (ముఖ్యప్రాణమును) స్తుతించినవి'. అను నిట్టి వాక్యములలో వాగాదీంద్రియములు ముఖ్యప్రాణముకంటె వేరుగ నిర్దేశింపబడియుండుట చూడనగును. (౧౮)

శ్రేష్ఠప్రాణమును వేరుచేయుట కింకొకకారణము చూపుచున్నారు.

## వైలక్షణ్యాచ్చ ౨-౪-౧౯

వైలక్షణ్యాత్ చ = వాగాదీంద్రియములకంటె శ్రేష్ఠప్రాణము విలక్షణధర్మము గలదగుటవలనను నట్లు వేరుచేయబడినదని యర్థము.

వాగాదీంద్రియములకు ముఖ్యప్రాణమునకు పరస్పరము ధర్మభేదమున్నది. సుషుప్తి (గాఢనిద్ర) యందు వాగాదీంద్రియములు మనస్సుతో నేకీభవించి సుఖముగ నిద్రించును. కాని, ముఖ్యప్రాణము మాత్రము జాగ్రదవస్థలో నుండును.

'యథా గార్గ్య । మరీచయో ఽర్కస్యాస్తం గచ్ఛతః సర్వా
ఏతస్మిన్ తేజోమండల ఏకీభవంతి, తాః పునః పున రుదయతః
ప్రచరంతి, ఏవంహ వై తత్సర్వం పరేదేవ మన స్యేకీభవతి,
తేన త ర్హ్యేష పురుషో న శృణోతి న పశ్యతి న జిఘ్రతి,
న రసయతే న స్పృశతే నాభివదతే నాదత్తే, నానందయతే
న విసృజతే నేయాయతే స్వపితీ త్యాచక్షతే.' ప్ర. ౪-౨.

'ప్రాణాగ్నయ ఏవైతస్మిన్ పురే జాగ్రతి.' ప్ర. ౪-౩.

'సూర్యు డస్తమించునపుడు కిరణములు తేజోమండలముతో నేకమై యుదయకాలమున మరల దిక్కులలో ప్రసరించునట్లు, వాగాదీంద్రి

యములు సుషుప్తిసమయమున సూక్ష్మమనస్సునం దేకమై యుండును. అందువలననే జీవాత్మ యపుడు వినడు, చూడడు, గంధము నాఘ్రాణింపడు, రసాస్వాదనము చేయడు, స్పృశింపడు, మాటాడడు, పట్టుకొనడు, ఆనందింపడు, విడువడు, నిద్రించుచున్నాడు' అని చెప్పబడును.'

'ప్రాణముమాత్ర మపుడు జాగ్రదవస్థయం దుండును.' అని వాగాదీంద్రియములకు, ముఖ్యప్రాణమునకు గల ధర్మభేదము స్పష్టపరుపబడినది. అందువలననే 'శ్రేష్ఠా దన్యత్ర' ౨-౪-౭ అను సూత్రమున 'ముఖ్య ప్రాణమును విడిచి' యని చెప్పబడినది. (౧౯)

## అష్టమాధికరణము

ప్రాణాదిసూక్ష్మతత్వములు, వానియుత్పత్తి, పరస్పరభేదములు, సూక్ష్మశరీరోత్పత్తి మున్నగువిషయములు నిరూపించి యిపుడు స్థూలశరీరమును నిరూపింప సూత్రము నారంభించుచున్నాడు.

### సంజ్ఞామూర్తిక్లుప్తి స్తు త్రివృత్-కుర్వత ఉపదేశాత్ ౨-౪-౨౦

సంజ్ఞామూర్తిక్లుప్తిః తు = నామము, ఆకృతి అను నీ రెంటిని నేర్పరుచుట - నిర్మించుట, త్రివృత్కుర్వతః = త్రివృత్తు నొనర్చిన పరబ్రహ్మమువలన జరుగుచున్నది. ఉపదేశాత్ = ఉపనిషత్తులందు నిట్లే యుపదేశింపబడినది.

సృష్టి ప్రకరణమున అగ్ని, నీరు, భూమి యను నీమూడుదేవతలను సృష్టించినట్లు చెప్పి, తదుపరి యి ట్లుపదేశింపబడినది.

'సేయం దేవ తైక్షత హంతాహ మిమా స్తిస్రో
దేవతా: అనేన జీవే నాత్మనా ఽనుప్రవిశ్య
నామరూపే. వ్యాకరవాణి, తాసాం త్రివృతం
త్రివృత మేకైకాం కరవాణి,' ఛాందో, ౬-౩-౨.

'ఆ యీదేవత ఈక్షించెను'. 'నేనీ మూడు దేవతలందును నీ జీవాత్మతో బ్రవేశించి నామరూపముల నొనర్తును. వానిలో నొక్కొక్కదానిని త్రివృత్కము చేయుదును.' అను నీవాక్యమునందలి మొదటి దేవతాపద మంతకుపూర్వమే ప్రారంభింపబడిన చేతనాచేతనాత్మకము లగు సర్వ పదార్థములం దంతర్యామిగ వ్యాపించియున్న పరదేవతను - పరమేశ్వరుని గ్రహించును. ఆ పరదేవత తన యీక్షణప్రయోజన మింకను పూర్తికాకుండుటను గుర్తించి మరల యీక్షించినది. 'నేను నాచే పూర్వము పుట్టింపబడిన యీ యగ్నిజలపృథివీదేవతలలో శుభాశుభకర్మల నొనర్చుచు తత్ఫలము లయిన సుఖదుఃఖముల ననుభవించు జీవునితోబాటు ప్రవేశించి (ఈ దేవతలతో నేర్పడు వస్తువులకు) నామమును, రూపమును - ఆకృతిని- నిర్మించెదను - స్పష్టపరచెదను. అందులకై యీ మూడుదేవతలలో నొక్కొక్కదానిని త్రివృత్కముగ జేయుదును.'

ఇట లోకమునందలి పదార్థముల నామ రూప నిర్మాణము జీవాత్మకు చెందినదియా ? లేక పరమాత్మకు చెందినదియా యని సంశయము. జీవాత్మయే నామ రూపములకు కర్త యని పూర్వపక్షము. కాదు, పరమేశ్వరుదే యని సిద్ధాంతము.

లోకమున జీవులు ఘట, పట, మఠాదులను సృష్టించుటయు, వానికి నామకరణము చేయుటయు జూచుచున్నాము. కావున జీవాత్మయే నామరూపముల నిర్మాత యని సిద్ధమగుచున్న, దన : నామరూపనిర్మాణము జీవకర్తృకము కాదు. పరమేశ్వరుదే జగత్తునందలి వస్తువులను నిర్మించి వానికి నామములను, ఆకృతులను కల్పించుచున్నాడు. (నామరూపే వ్యాకరవాణి) 'నామాకృతులను స్పష్టము చేయుదును.' అని పరదేవత చెప్పుచుండగా జీవు డెట్లు కర్త కాగలడు ? ఒక్కొక్క దేవతను త్రివృత్కముగ (ప్రతి పదార్థమునందును అగ్ని, జల, పృథివ్యంశము లేకమై

యుండునట్లుగ) చేయుదు నని చెప్పిన పరదేవతయే నామరూపముల నొన ర్చినట్లు వాక్యము తెలుపుచున్నది. కావున పరబ్రహ్మయే సూర్య, చంద్ర, నక్షత్ర, గిరి, సముద్రాదుల కాకృతుల నిచ్చి, వాని నామములను గూడ నిర్ణయించియున్నా డని తెలియుచున్నది.

జీవాత్మలు పరమాత్మచే నిర్మింపబడిన పంచభూతాత్మకవస్తువులతో తమ కనుకూలములగు ఘట పటాదులను నిర్మించుకొనగలరే కాని, సూర్యాదులను నిర్మింపజాల రనుట నిశ్చితము. పరమేశ్వరుడే నామరూపములకు కర్త యని ఉపనిషద్వాక్యములు చెప్పుచున్నవి. (ఆకాశో వై నామ నామరూపయో ర్నిర్వహితా. ఛాం. ౮-౧౪-౧) కావున జీవుడు నామరూపములకు కర్తయనుట తగదు. పరమేశ్వరుడే జీవులకు వలయు శరీరాది పదార్థములు నిర్మించి వానికి నామములను గూడ నేర్పరచినా డనుట సిద్ధము. (౨౦)

స్థూలశరీరాదుల నిర్మాణము పరమేశ్వరునిది యని నిరూపించి, ప్రస్తుతమున నా శరీరములు పాంచభౌతికములని నిర్ణయించుటకై యే భూత కార్య మేదియో తెలుపుచున్నాడు.

## మాంసాది భౌమం యథాశబ్ద మితరయో శ్చ ౨-౪-౨౧

మాంసాది=మాంసము మున్నగునది, భౌమం = పృథివికార్యము, యథాశబ్దం = ఉపనిషద్ వాక్యముల ననుసరించి, ఇతరయోశ్చ = అప్తేజస్సుల - జలాగ్నుల కార్యముల నెరుంగవలెను.

అస్మదాదుల శరీరములందలి మాంసాదికము భూమికార్యమనియు, రక్తము మున్నగునవి జలకార్యమనియు, నిట్లే యెముకలు మున్నగునవి తేజస్సునకు - అగ్నికి - చెందిన కార్యములుగాను నెంచవలెను.

'అన్న మశితం త్రేధా విధీయతే, తస్య
యః స్థవిష్ఠో ధాతుః తత్ పురీషం భవతి,
యో మధ్యమః తన్మాంసం, యో ఽణిష్ఠ స్తన్మనః' ఛాం. ౬-౫-౧.

'తినిన అన్నము ముప్విధము లగును. అందు స్థూలము మల ముగా నగును. మధ్యమము మాంసాదిక మగును. సూక్ష్మసారము మన స్సగును.' అను నిట్టి వాక్యములవలన నేయే భూత మే యే భాగముల నిర్మాణ మునకు శరీరమున హేతువగుచున్నదో గ్రహింపనగును. త్రివృత్మకముగ నిర్మింపబడిన భూమియే ధాన్యాదులరూపమున జంతువులచే భక్షింపబడు చున్నదని యభిప్రాయము. ఆహారమును గ్రహించుటవలననే మనస్సులో పటుత్వ మేర్పడుచున్నది. లంఘనములు చేయువాని మనస్సు బలహీన మగుట నెల్ల రెరిగిన విషయమే. పటుత్వమన కార్యజననశక్తి ప్రకట మగుటయే. ఇట్లే పాలు మున్నగు పదార్థగ్రహణమున ప్రాణమునకు పటుత్వము కలుగును. ఘృతాది తేజోద్రవ్యమువలన వాక్పటుత్వ మేర్ప డును. ఇట్లే యితరములనుకూడ శాస్త్రాధారమున నూహించి తెలియనగును. కావున శరీరములు పృథివ్యాది భూతపంచక కార్యము లని యభిప్రాయము. (౨౧)

శరీర మందు రేల ? యన:

## వైశేష్యా త్తు తద్వాద స్తద్వాదః ౨-౪-౨౨

వైశేష్యాత్ తు = పార్థివభాగ మెక్కుడుగా నుండుటవలన, తద్వాదః=పార్థివము - మట్టి శరీరము - అని వ్యవహరింపబడుచున్నది.

అస్మదాది శరీరములందు మట్టికి సంబంధించిన భాగమెక్కుడుగా

నున్నందున నీ శరీరము పాంచభౌతికమైనను పార్థివ మని వ్యవహరింప బడుచున్నదని భావము.

తద్వాదపదము రెండుమారులు ప్రయోగించుట అధ్యాయసమాప్తి సూచనార్థము. (౨౨)

శ్రీ మత్పరమహంస పరివ్రాజకాచార్యవర్య - ఆత్మానందసరస్వతీ
స్వామి భగవత్పాద శిష్య, పండిత గోపదేవవిరచిత
వేదాంత దర్శన - ఆంబా వ్యాఖ్యానమునందు
ద్వితీయాధ్యాయము సమాప్తము.

# వేదాంత దర్శనము

## తృతీయాధ్యాయము

### ప్రథమ పాదము

### ప్రథమాధికరణము

ప్రథమాధ్యాయమున జగజ్జన్మాదులకు కారణమైన బ్రహ్మము తెలియదగినదిగ శ్రుతి ఉపనిషద్ సమన్వయపూర్వకముగ నిరూపింపబడి నది. రెండవయధ్యాయమున శ్రుతిఉపనిషద్ వాక్యములలో సాధారణబుద్ధికి దోచు విరోధములు పరిహరింపబడినవి. ఇప్పు డీ మూడవ యధ్యాయమున బ్రహ్మజ్ఞానమునకు వలయు సాధనములు శ్రుతిస్మృతులలో లభించునవి చెప్పబడును. వివేకవైరాగ్యాదులు సాధనములు పెక్కు శాస్త్రములలో లభించును. అందు ముఖ్యముగ నీ శాస్త్రమునందు వైరాగ్యము నిరూపింప దగియున్నది. వివేకాదులు వైశేషికాదిదర్శనములలో వివరముగ చెప్పబడి నవి. కావున వైరాగ్యాదిసాధనములను నిరూపింపదలచి ముందుగా దానికి ప్రయోజకమైన జీవుని లోకపరలోకగమనాగమనమును సూత్రకారుడు ప్రదర్శించుచున్నాడు.

**తదంతరప్రతిపత్తౌ రంహతి సంపరిష్వక్తః ప్రశ్ననిరూపణాభ్యామ్** 3-1-1

ప్రశ్న నిరూపణాభ్యాం = ప్రశ్న ప్రతివచనములవలన, తదంతర ప్రతిపత్తౌ = దేహాంతరమును బొందుటలో, సంపరిష్వక్తః = సూక్ష్మదేహముతో యుక్తుడై, జీవుడు, రంహతి = వెళ్ళును.

జీవుడు (పురుషుడు) కర్మఫలము ననుభవించుటకు ఒకదేహము నుండి మరియొకదేహమునకు బోవును. ఇది వైదికసిద్ధాంతము. జీవుడు దేహాంతరమున కేగునపుడు సూక్ష్మదేహముతో కూడి వెళ్ళునా? లేక స్థూలదేహమునువలె సూక్ష్మదేహమునుగూడ విడిచి వెళ్ళునా! అని సంశయము. విడిచి వెళ్ళునని పూర్వపక్షము. కాదు, సంపరిష్వక్తుడై వెళ్లునని సిద్ధాంతము.

పూ. ప: జగత్తునందు జీవునకు స్థూలదేహము లభించునట్లు ఏ లోకమున కేగినను సూక్ష్మదేహ మట లభించుట కాటంక ముండదు. కావున జీవుడు దేహాంతరమును బొందుటకు వెళ్ళునపు డీ స్థూలము నిట విడిచి వెళ్ళునట్లే సూక్ష్మదేహమునుగూడ విడిచివెళ్లును. సూక్ష్మదేహముతో కూడి వెళ్ళవలసిన అవసర మేమియు కనిపింపదు. జీవునకు దేహాంతరము లభించుతావున స్థూలదేహమునకు వలయుసాధనము లట లభించునట్లు సూక్ష్మదేహమునకు కావలసిన సాధనములు మాత్రమేల లభింపవు? కావున సూక్ష్మదేహముతోకూడ జీవుడు వెళ్ళుననుట సమంజసము కాదు.

సమాధానము: ఛాందోగ్యోపనిషత్తున లభించు ప్రశ్నోత్తరములను బట్టి చూచిన జీవుడు సూక్ష్మదేహముతో కూడియే దేహాంతరమునకు వెళ్ళునని స్పష్టము కాగలదు. పంచాగ్నివిద్యాప్రకరణమున ప్రశ్నోత్తరము లిట్లున్నవి:

'వేత్థ యథా పంచమ్యా మాహుతా వాపః
పురుషవచసో భవంతి' ఛాం. ౫-౩-౩.

'ఐదవయాహుతియందు జల మెట్లు పురుషుడై పలుకునో యెరుగుదువా?' అని జైబలిప్రవాహణు డనురాజు శ్వేతకేతువును ప్రశ్నించెను. తదుపరి యా ప్రకరణమునం దా రాజు, ద్యులోకము, పర్జన్యము, పృథివి, పురుషుడు, యోషిత్తు-స్త్రీ అను పంచాగ్నులతో శ్రద్ధ, సోమము, వృష్టి, అన్నము, రేతస్సు నను నైదాహుతులను ప్రదర్శించి-

'ఇతి తు పంచమ్యా మాహుతా వాపః
పురుషవచసో భవంతి' ఛాం. ౫-౯-౧.

'ఇట్లు ఐదవయాహుతిలో జలము పురుషునివలె మాటాడనారంభించును'. అని యతడే శ్వేతకేతువుతండ్రికి ప్రతివచనము - ఉత్తరము చెప్పెను.

పై వాక్యములలో (అపః = జలము) 'అప' అను పదము జీవాత్మతోకూడిన సూక్ష్మదేహమును దెలుపును. అయ్యది స్థూలదేహమును బొంది పురుషపదముతో వ్యవహరింపబడును. ఈ ప్రకరణమునందలి ప్రవాహణుని ప్రశ్నోత్తరములు రెండును జీవుడు దేహాంతరమునకు వెళ్ళునపుడు సూక్ష్మదేహముతోగూడి వెళ్లినప్పుడే సంగతము అగును. లేకున్న నిరర్థకము అగునని సూత్రాభిప్రాయము.

స్థూలదేహమువలె సూక్ష్మదేహము - లింగదేహము - సర్వత్ర లభింపగలదు; కావున సూక్ష్మదేహముతో గూడి జీవుడు పరలోకగమనము చేయ నవసరము లేదనుట యుక్తముకాదు. జీవుడు కూటస్థనిత్యుడు. అతనిలో క్రియ కలుగ వీలులేదు. కావున నతడు క్రియ కాశ్రయమగు సూక్ష్మదేహముతో కూడియే లోకాంతరమున నేర్పడు దేహాంతరమును బొందును.

'తదేవ సక్తః సహ కర్మణైతి, లింగం మనో
యత్ర నిషక్త మస్య' బృ. ౪-౪-౬.

ఈ జీవుని లింగదేహము - మనస్సు - ఎక్కడ సక్తమై యున్నదో యక్కడికే కర్మసహితుడై - వాసనలతోగూడిన సూక్ష్మశరీరముతో పోవును.' అని బృహదారణ్యకమునను వర్ణింపబడినది. మంత్రవర్ణము కూడ జీవుడు సూక్ష్మదేహముతో కూడియే దేహాంతరమున కేగునని స్పష్టముగ జెప్పుచున్నది.

'అపాఙ్ ప్రాఙేతి స్వధయా గృభీతో ఒమర్త్యో
మర్త్యే నాసయోనిః' ఋ. ౨-౩-౨౧-౩౮.

'మర్త్యేన స్వధయా= నాశనశీలమగు లింగదేహముతో, గృభీతః= కూడినవాడై, సయోనిః=దేహాంతర మేర్పడుటకు కారణమైన క్లేశకర్మాదులతో కూడినవాడై, అమర్త్యః = నాశనములేని జీవుడు, అపాఙ్, ప్రాఙ్ + ఏతి=ఒకప్పుడధోలోకమును, మరొకప్పుడు ఊర్ధ్వలోకమును బొందును.'

'కర్మఫల మనుభవింప సూక్ష్మదేహముతోగూడి ఉచ్చనీచలోకములను జీవుడు పొందునని మంత్రాభిప్రాయము. ఇట్లు స్వతఃప్రమాణమగు మంత్రముచే నుపదిష్ట మగుచున్నందున జీవుడు సూక్ష్మదేహముతో సంపరిష్వక్తుడై - కూడినవాడై -లోకలోకాంతరముల కేగుననుట స్పష్టము. (౧)

ప్రశ్నప్రతివచనకారణముగ జీవుడు దేహాంతరమునకు, లోకాంతరమున కేగుననుట యుక్తము కాదు. కారణ మేమన: ప్రశ్న ప్రతివచనములలో పంచమాహుతియందు (అపాం పురుషవచస్త్వం) జలమునకు పురుషవచనము నిర్దేశింపబడినది. కాని, సూక్ష్మదేహముతో పరిష్వంగము చెప్పబడలేదు కదా! యన - సమాధానము :

## త్ర్యాత్మకత్వాత్తు భూయస్త్వాత్ ౩-౧-౨

త్ర్యాత్మకత్వాత్ - సూక్ష్మభూతములు, బాహ్యాభ్యంతరకరణములు రెండు కలిసి సూక్ష్మశరీర మేర్పడుచున్నందున, భూయస్త్వాత్ = వానిలో సూక్ష్మభూతములు ఆశ్రయము లగుటవలనను, ముఖ్యముగా జలభాగ మెక్కుడుగా నుండుటవలనను, (ఆపః) జలశబ్దముచే సూక్ష్మదేహము నిర్దేశింపబడినది.

స్థూలదేహము అస్థి, స్నాయువులు, మజ్జ, త్వక్కు, మాంసము, శోణితము (రక్తము) నను నారుపదార్థములతోకూడి షడాత్మక మన

బడును. అట్లే లింగదేహము - సూక్ష్మదేహముకూడ సప్తదశ తత్వము లతో కూడినదైనను, ముఖ్యముగ అంతఃకరణమైన మనోబుద్ధు లొకటి గను, జ్ఞానేంద్రియములు కర్మేంద్రియులుకలిసి యొకటిగను, సూక్ష్మ భూతము లొకటిగను భావించి త్ర్యాత్మకముగ నిర్దేశింపబడినది. అందునను సూక్ష్మభూతము లాశ్రయము లగుటవలన ప్రధానములుగ నెంచి, జలబహు ళముగ నుండుటచే సూక్ష్మదేహము (ఆప) జలశబ్దముచే నుపనిషత్తున నిర్దే శింపబడినది. కావున సూక్ష్మదేహసంపరిష్వక్తుడై జీవుడు దేహాంతరమునకు వెళ్ళుననుట యుక్తమే యని సూత్రాభిప్రాయము. (౨)

## ప్రాణగతేశ్చ ౩-౧-౩

ప్రాణోత్క్రమణమువలనను జీవుడు లింగదేహముతో గూడి దేహాంతరమున కేగునని తెలియుచున్నది.

> 'త ముత్క్రామంతం ప్రాణో ఽనూత్క్రామతి ప్రాణ
> మనూత్క్రామంతం సర్వే ప్రాణా ఽనూత్క్రామంతి. బృ. ౪-౪-౨

'జీవుడీదేహమును విడిచి వెళ్ళునపుడు వాగాదీంద్రియములు (ప్రాణ ములు) అన్నియు నతని ననుగమించి వెళ్ళును'. అను నీవాక్యమునందు ప్రాణోత్క్రమణము చెప్పబడినది. జీవుడు సూక్ష్మదేహముతో కూడి వెళ్ళు చున్న నట్లు చెప్పబడదు. కావున లింగదేహసంసక్తుడై యుత్క్రమించు ననుటయే యుక్తము. (౩)

## అగ్న్యాదిగతిశ్రుతే రితి చేన్న భాక్తత్వాత్ ౩-౧-౪

అగ్న్యాదిగతిశ్రుతేః = అగ్నివాయ్వాదులలో నింద్రియాదుల గతి శ్రవణమువలన, జీవునితో నింద్రియాదులు వెళ్ళవు, ఇతిచేత్ = అనియందు రేని, న = అట్లనుట తగదు, భాక్తత్వాత్ = అగ్న్యాదులలో గతిశ్రవణము గౌణ మగుటవలన.

'యత్రాస్య పురుషస్య మృ॰ స్యాగ్నిం వాగప్యేతి
వాతం ప్రాణః బృ. ౩-౨-౧౩.

'పురుషుడు మరిణింపగా, వా॰ంద్రియము అగ్నిలోను, ఘ్రాణేంద్రియము వాయువులోను లీనమగును.' అనునిట్టి వాక్యశ్రవణమువలన వాగాదీంద్రియములతో గూడిన లింగదేహముతో జీవుడు దేహాంతరమున కేగు ననుట సరికా దందురేని ; అట్లు కాదు. జీవనకాలమున అగ్న్యాదిదేవతలా యా యింద్రియములందుగల స్వస్వవిషయములను - రూపాదులను - గ్రహింపజేయగల శక్తిని ప్రకటించుట కుపకరించుచుండును. మరణించిన తదుపరి ఇంద్రియమ॰లు జీవునితో ననుగమించుటవలన నగ్న్యాదులయుపకృతి నివృత్తమగును. ఇంద్రియములే లేనపుడు వానిశక్తిని ప్రకటింప జేయ నలవికాదు గదా ! ఈయనుగ్రాహక గుణ మపుడు ప్రవర్తింప దని తెలుపుటయే ఉపనిషద్వాక్యతాత్పర్యము. కావున అగ్న్యాదులలో నింద్రియముల విలీనీకరణ మిట గౌణమే – అప్రధానమే, కాని ముఖ్యము కాదు. కావున నింద్రియములు జీవు ననుగమించు ననుటలో దోషము లేదు. (౪)

ప్రథమే ఽశ్రవణాదితి చేన్న తా
ఏవ హ్యుపపత్తేః ౩-౧-౫

ప్రథమే = ద్యులోకమనెడి ప్రథమాగ్నిలో, అశ్రవణాత్ = లింగదేహమును దెలుపు ఆప - జలము హోమద్రవ్యముగా చెప్పబడనందున జీవుడు లింగదెహముతో గూడ వెళ్లననుట తగదు, ఇతిచేత్ = అని యందురేని, న = సరికాదు, హి = కారణమేమన, ఉపపత్తేః = ప్రశ్న ప్రతివచనములలో నేకవాక్యత యున్నందువలన, తాఏవ = ఆప - జలమే, అటహోమద్రవ్యరూపమున శ్రద్ధాపదముతో చెప్పబడిన దెలంచవలెను.

ప్రస్తుతప్రకరణమున - పంచాగ్నివిద్యయందు శ్రద్ధ ప్రథమాహుతిగ వర్ణింపబడినది. పంచమాహుతిగ చెప్పబడిన ఆప - జలము లింగ

దేహసూచకమగునెడల నది ప్రథమాహుతిగనే చెప్పబడియుండెడిది. అట్లు పఠింపబడనందున జీవుడు లింగదేహసంపరిష్వక్తుడై దేహాంతరమున కేగు ననుట యెట్లు పొసగును? అని సూత్రమున శంకాభిప్రాయము. ఇందులకు సమాధానము: ద్యులోకాగ్నియందు హోమద్రవ్యముగ నుపయోగించినట్లు చెప్పబడిన శ్రద్ధాపదము కూడ ఆప-జలాభిప్రాయముతో చెప్పబడిన ట్లెంచవలెను. ఎక్కడ నే శబ్ద మే యర్థమును దెలుప నుద్దేశించి ప్రయోగింపబడునో, అక్కడ నా పద మా యర్థమునే తెలుపును. ప్రస్తుతమున ద్యులోకాగ్నియందు ప్రథమాహుతిగ చెప్పబడిన శ్రద్ధాశబ్దము 'ఆపః' అనెడి పురుషవాచకపదాభిప్రాయముతోనే ప్రయోగింపబడినది. కారణ మేమన: అట్లు ప్రయోగింపబడకున్న పంచాగ్నివిద్యాప్రకరణమున గల ప్రశ్నప్రతివచనములలో నేకవాక్యత యేర్పడదు. అడిగిన ప్రశ్న మొకటియైన సమాధానము మరియొకటి యగునని భావము.

'వేత్థ యథా పంచమ్యా మాహుతా వాపః
పురుషవచసో భవంతి' ఛాం. ౫-౩-౩.

'పంచమాహుతిలో అపః - జలము పురుషునివలె నెట్లు పలికెనో తెలియునా?' యని ప్రశ్నము. దానికి సమాధానము అపః - జలము (పురుషవాచకము) హవ్యద్రవ్యముగా చెప్పక శ్రద్ధ - ఆస్తిక్యము - హవ్యద్రవ్యముగా చెప్పిన ప్రశ్నయొకటి సమాధానము మరియొకటి యగునుకదా! కావున ప్రథమహవ్యద్రవ్యముగా చెప్పబడిన శ్రద్ధాపదాభిప్రాయము ఆప - జలమే యైయుండవలె ననుట నిశ్చితము. తైత్తిరీయబ్రాహ్మణమునకూడ

'శ్రద్ధా వా ఆపః' తై. బ్రా. ౩-౨-౪.

'శ్రద్ధయే ఆపః - జలము' అనియు చెప్ప జూడనగును. కాబట్టి జీవుడు దేహాంతరగమనము లింగదేహముతో కూడి చేయు ననుటలో దోషము లేదు. (౫)

మరల శంకించి సమాధానము చెప్పుచున్నాడు.

**అశ్రుతత్వా దితిచే న్నేష్టాదికారిణాం ప్రతీతేః ౩-౧-౬**

అశ్రుతత్వాత్=అప్శబ్దప్రయోగము మూలమున లింగదేహమునకు గతియున్నదని చెప్పబడినను, దానితోకూడి జీవాత్మవెళ్ళునని జీవాత్మ పద శ్రవణము లేనందున జీవుడు లింగదేహయుక్తుడై వెళ్ళునను యుచితము కాదు. ఇతిచేత్=అనియందురేని, న=అట్లనుట తగదు. ఇష్టాదికారిణాం= ముందుచెప్పబోవు ఇష్టాదికర్మల ననుష్ఠించువారి, ప్రతీతేః=ఇక్కడ ప్రత్య భిజ్ఞ కల్గుచున్నందున, జీవుడు లింగదేహయుక్తుడై దేహాంతరమునకు బోవుననుట యుచితమే.

ఉత్క్రాంతిప్రకరణమున అపాం=జలమునకు గతిచెప్పబడినదేకాని, తద్యుక్తజీవగతి చెప్పబడనందున జీవుడు లింగదేహముతోగూడి దేహాంత రమున కేగుననుట యుక్తము కాదని శంకించి సమాధానము చెప్పు చున్నాడు.

'అథ య ఇమే గ్రామ ఇష్టాపూర్తే దత్త మి త్యుపాసతే
తే ధూమ మభిసంభవంతి, ధూమా ద్రాత్రిం' ఛాం. ౫-౧౦-౩.
'పితృలోకా దాకాశ, మాకాశా చ్చాంద్రమసం
ఏష సోమో రాజా' ఛాం. ౫-౧౦-౪.

'ఎవరు గృహస్థాశ్రమమున ఇష్టాపూర్తములు, దానము మున్నగు కర్మల నొనర్తురో వారు ధూమాదిమార్గమున చంద్రుని జేరి యట దివ్య దేహధారులై సోమునివలె ప్రకాశింతురు'. అనునిట్టి వాక్యములందు జీవో త్క్రమణము స్పష్టముగా జెప్పబడియున్నందున, పంచాగ్నివిద్యాప్రకర ణమునందు జెప్పబడిన లింగదేహగతి కేవలము లింగదేహగమనము కాద నియు జీవునితోకూడిన లింగదేహగమనమే యనియు తెలియదగును. కేవలలింగదేహమునకు పరలోకగమనమున ప్రయోజన మేముండును? కావున నట్టిగతి వ్యర్థమగును. ఉపనిషత్తులు వ్యర్థగతి నెట్లు చెప్పును?

పూర్వోత్తర ఉపనిషద్వాక్యములలో పరస్పరవైరుధ్యమును నుండరాదు. కావున జీవుడే లింగదేహముతో కూడి కర్మఫలముల ననుభవించుటకు పర లోకమున కేగుననుటయే యుక్తము. (౬)

'ఏష సోమో రాజా, తద్దేవానా మన్నం తం దేవా భక్షయంతి' ఛాం. ५-౧౦-४. 'చంద్రలోకమున జేరి దివ్యదేహధారియై సోముడని పిలువ బడు నతడు దేవతల కన్న మగును. అతనిని దేవతలు భక్షింతురు'. అని చెప్పుటచేత జీవుడు లింగదేహయుక్తుడై పరలోకమున కర్మఫలము ననుభ వింప నేగుననుట, సరి కా దన :

## భాక్తం వాఽనాత్మవిత్త్వా త్తథాహి దర్శయతి ३-౧-౭

అనాత్మవిత్త్వాత్=ఆత్మవిదులు కానందున - ఇష్టాపూర్తాది సకామ కర్మల నాచరించినందున, భాక్తం = వారు దేవతల కన్న మగుదు రనుట గౌణమే కాని ముఖ్యము కాదు. తథా హి దర్శయతి = ఉపనిషద్వాక్య మట్లే చెప్పుచున్నది.

అగ్నిహోత్రాదికర్మల నొనర్చుట ఇష్ట మనబడును. దాపులు, చెరు వులు త్రవ్వించుట, విద్యాశాలలు నెలకొల్పుట మున్నగునవి ఆపూర్తము లనబడును. ఇట్లే బీదలకు అన్నవస్త్రము లిచ్చుట మున్నగునవి దత్తములు. ఇట్టికర్మల నాసక్తబుద్ధితో నొనర్చినవారు వానికి తగినఫలముల నా యా లోకముల ననుభవింపవలసినవా రగుదురు. వారు మోక్షమున కర్హులు కారు. ఆత్మవిదులకే మోక్షార్హత. కావున సకామకర్ములు సోమాదిలోకములం జేరి యట పుణ్యఫల మనుభవించి, మరల మర్త్యలోకమున జనింతురు (స సోమలోకే విభూతి మనుభూయ పున రావర్తతే' ఛాం. ౮-౧-౬). అందు వలన వారు దేవతల కన్న మగుదురు. దేవతలు వారిని భక్షింతురు, అనుట ముఖ్యము కాదు. అది గౌణము. అందువలననే మరియొకతావున ( న హ వై దేవా అశ్నంతి, న పిబంతి' ఛాం. ३-౬-౧.) 'దేవతలు భుజింపరు,

ప్రాగరు'. అని స్పష్టముగా జెప్పబడినది. కావున జీవులు సూక్ష్మదేహముతో గూడి కర్మఫలముల ననుభవించుటకు పరలోకమునకు - దేహాంతరమునకు నేగుదు రనుట యుక్తమే. (౭)

## ద్వితీయాధికరణము

జీవుడు కర్మఫలభోగముకొఱకు 'లింగశరీరముతోగూడి పరలోకముల కేగి యట కర్మఫల మనుభవించి మరల మర్త్యలోకమునకు సంచిత కర్మాశయములతో గూడి తిరిగి వచ్చునని నిరూపించుచున్నాడు.

కృతాత్యయే ఽనుశయవాన్ దృష్టస్మృతిభ్యాం
యథేత మనేవం చ ౩-౧-౮

కృతాత్యయే = పరలోకప్రాప్తికి సాధనములైన యిష్టాదికర్మలు భోగమువలన క్షయము నొందగా, అనుశయవాన్=సంచితకర్మానుశయము లతో కూడినవాడై పృథివి కేతెంచును, దృష్టస్మృతిభ్యాం=శ్రుతిస్మృతుల వలన, యథేతం=ఎట్లువెళ్ళెనో, యట్లును, అనేవంచ = అన్యవిధమునను, మరలివచ్చునని తెలియుచున్నది.

(అనుభవింపగా మిగిలిన కర్మాశయములు - కర్మవాసనలు - ఇట అనుశయము లనబడును. కర్మల నాచరించు కర్తను ముక్తుడు కానంత వరకు అనుసరించి వెంటాడును; కావున అనుశయము లనబడు నని భావము.)

'తస్మిన్ యావత్సంపాత ముషిత్వా ఽథైతమే
వాధ్వానం పునర్నివర్తంతే, యథేతమ్' ఛాం. ౫-౧౦-౫.

'తస్మిన్ = చంద్రాదిలోకములందు, యావత్సంపాతం ఉషిత్వా = కర్మఫలము ననుభవింపవలసినంతకాల ముండి, అథ = భోగానంతరము, ఏత మే వాధ్వానం పునఃనివర్తంతే=ముందుచెప్పుమార్గముననే మరల తిరిగి

వత్తురు'. అను నిట్టివాక్యములందు కర్మఫలభోగముకొఱకు చంద్రాదిలోకములకేగి యట కర్మఫల మనుభవించి తిరిగివత్తు రని స్పష్టమగుచున్నది. అట్లు తిరిగివచ్చునప్పుడు సంచితకర్మవాసనలతో కూడి జీవులు తిరిగి వత్తురు. ఈ విషయము ఉపనిషత్ - స్మృతులచే ప్రతిపాదింపబడుచున్నది.

'తద్య ఇహ రమణీయచరణా అభ్యాశోహ
యత్తే రమణీయాం యోని మాపద్యేరన్
అథ య ఇహ కపూయచరణా అభ్యాశోహ
యత్తే కపూయాం యోని మాపద్యేరన్' ఛాం. ౫-౧౦-౭.

(చరణశబ్దము కర్మాశయమును దెలుపును.)

'చంద్రాదిలోకములనుండి తిరిగి వచ్చు జీవులు పుణ్యకర్మవాసనలతో కూడినవారైన పక్షమున వెంటనే యిట శోభనశరీరములను బొందుదురు. లేక పాపకర్మాశయములతో కూడినవా రగుదురేని పాపయోనులను-శరీరములను - బొందుదురు.'

'చంద్రాదిలోకే ఉప్యావృత్తి ర్నిమిత్తసద్భావాత్' సాం. ౬-౫౬.

'సంచితకర్మాశయము లనెడి నిమిత్త ముండుటవలన చంద్రాదిలోకములం దుండియు తిరిగివచ్చుట కలదు'. అను నిట్టి ఉపనిషత్ స్మృతుల వలన జీవు డీ లోకమునకు కర్మాశయములతో గూడి తిరిగివచ్చునని స్పష్టమగుచున్నది. (౮)

ఉపర్యుక్తవిషయమున నొక శంకచేసి, దానికి సమాధానము చెప్పుచున్నాడు.

## చరణాదితి చేన్నోపలక్షణార్థేతి కార్ష్ణాజినిః ౩-౧-౯

చరణాత్=ఆచరణవలన, ఇతిచేత్ =జీవుడు తిరిగివచ్చునని ఉపనిషత్తు చెప్పినదం'గురేని. న=అట్లు కాదు. ఉపలక్షణార్థా ఇతి కార్ష్ణాజినిః =

చరణశబ్దము కర్మవాసన కుపలక్షకము, అందువలన కర్మాశయములతో కూడియే తిరిగి వచ్చునని కార్ష్ణాజిని చెప్పియున్నాడు.

చరణశబ్దము ఆచారార్థమున లోకములో ప్రసిద్ధమైనందున, చంద్రాది లోకములలో ననుభవింపగా మిగిలిన సంచితకర్మాశయముల నెట్లు బోధింప గలదు? కావున కర్మాశయములతో తిరిగి వచ్చుననుట యుక్తము కాదని యొకరు శంకింపగా, కార్ష్ణాజిని ఆచార్యుడు దానిని నిరాకరించియున్నాడు. ఆచార్యుని యభిప్రాయములో చరణశబ్దము అనుశయము - కర్మాశయము-నే బోధించుచున్నది. చరణశబ్దము కర్మాశయమున కుపలక్షకము - లక్షణా వృత్తితో కర్మాశయమునే బోధించునని భావము. (౯)

చరణశబ్దసార్థక్యమును నిరూపించుచున్నాడు.

## ఆనర్థక్య మితి చేన్న తదపేక్షత్వాత్ ౩-౧-౧౦

ఆనర్థక్యం = చరణశబ్దముచే లక్షితమైన కర్మాశయమువలన జీవునకు శోభనాశోభనశరీరములు లభించుపక్షమున చరణము వ్యర్థమగును. ఇతిచేత్=అనియందురేని, న=అట్లనరాదు. తదపేక్షత్వాత్=కర్మాశయమునకు - అనుశయమునకు చరణము - ఆచరణ మపేక్షింపబడును.

అనుశయము - పుణ్యాపుణ్యకర్మాశయమువలననే శోభనాశోభన శరీరములు లభించునపుడు చరణము - ఆచారము వ్యర్థ మగునందురేని, అట్లుకాదు. కర్మాశయము ఆచరణము నపేక్షింపనిచో నది వ్యర్థమగును. అనుశయము ఆచారము నపేక్షించును. 'ఆచారా ద్విచ్యుతో విప్రః న వేద ఫల మశ్నుతే' మ. ౧-౧౦౯. అను నిట్టి స్మార్తవాక్యములవలన నాచారావశ్యకత స్పష్ట మగుచున్నది. ఆచారయుక్త కర్మాశయమే శోభనాశోభన శరీరప్రాప్తికి హేతు వనుటవలన నాచారము వ్యర్థము కాదు. (౧౦)

ఆచార వాచకమగు చరణశబ్దముచే శుభాశుభ కర్మాశయము లక్షిత మగు నను కార్ష్ణాజినిమతమును చెప్పి, యిప్పుడు చరణశబ్దము గౌణము కాదు; ముఖ్యమే యని చెప్పు బాదరిమతమును నిరూపించుచున్నాడు.

సుకృతదుష్కృతే ఏవేతి తు బాదరిః ౩-౧-౧౧

సుకృతదుష్కృతే ఏవ = చరణశబ్దముచే ముఖ్యముగ పుణ్యపాపములే చెప్పబడును. ఇతి తు బాదరిః=అనియే బాదరియాచార్యునిమతము.

లోకమున చరణశబ్దమువలన ముఖ్యవృత్తితోనే పుణ్యపాపరూప కర్మములు బోధింపబడును. చరణశబ్దము ఆచారార్థమున ప్రసిద్ధమైనట్లు పుణ్యపాపకర్మములందును ప్రసిద్ధమే. కావున చరణశబ్దము ముఖ్యవృత్తితోనే పుణ్యపాపకర్మలను బోధించునని బాదరి అభిప్రాయపడుచున్నాడు. అందువలన సంచితకర్మాశయములతో కూడియే జీవుడు తిరిగి యీలోకమునకు వచ్చు ననుటలో దోషము లేదు. (౧౧)

## తృతీయాధికరణము

ఇష్టాది విహితకర్మలొనర్చువారు చంద్రలోకమునకు వెళ్ళుదురని చెప్పబడినది. అనిష్టాద్యవిహితకర్మలొనర్చువారుకూడ చంద్రలోకమునకు వెళ్ళుదురా? లేదా? అని విచారింపబడుచున్నది.

అనిష్టాదికారిణా మపి చ శ్రుతమ్ ౩-౧-౧౨

అనిష్టాదికారిణామ్ అపి చ=ఇష్టాపూర్తాది విహితకర్మల నొనర్పక సురాపానా ద్యవిహితకర్మల నొనర్చువారుకూడ, శ్రుతమ్=చంద్రలోకమునకు వెళ్ళుదురని ఉపనిషద్వాక్యములందు జూడబడుచున్నది.

'యే వై కే చాస్మా ల్లోకాత్ ప్రయంతి
చంద్రమసమేవ తే సర్వే గచ్ఛంతి' కౌ. ౧-౨.

'ఈ లోకమునుండి మరణించువారందరును చంద్రలోకమునకే వెళ్లుదురు'. అను నిట్టి వాక్యములనుబట్టి ఇష్టాపూర్తాది పుణ్యకర్మల నొనర్చువారే కాక మాంసభక్షణా ద్యవిహితకర్మల నొనర్చువారుకూడ చంద్రలోకమునకు బోవుదురని తెలియుచున్నది. (౧౨)

అందువలన నిష్టాదికార్యముల నొనర్చువారికిని, అనిష్టాది కార్యముల నొనర్చువారికిని పరలోకగమనములో భేదము కనిపింపదు, అన :

సంయమనే త్వనుభూ యేతరేషా
మారోహావరోహౌ తద్గతిదర్శనాత్ ౩-౧-౧౩

సంయమనే=విశ్వనియంత యగు భగవంతునిసదనము - యమసదనము - సంయమన మనబడును. అందు, అనుభూయ = వివిధములయిన యమయాతనల ననుభవించి, ఇతరేషాం=ఇష్టాపూర్తాదిపుణ్యకర్మల నొనర్పనివారికి, ఆరోహావరోహౌ = ఆరోహణము - ఎక్కుట, అవరోహణము - దిగుటయు కలుగును, తద్గతిదర్శనాత్=అట్లే చూపబడినది.

ఇష్టాదికారులకు, ఇతరులకు చంద్రలోకగమనము సమానమైనను వారిలో విశేషము లేకపోలేదు. అనిష్టాదికారులు సంయమనమునందు - యమసదనమునందు అనేకయాతనల ననుభవించి చంద్రాది - ఊర్ధ్వలోకములకు బోవుదురు. అట పుణ్యఫలముల ననుభవించి మరల తిరిగివత్తురు. ఇష్టాదికర్మకరులు చంద్రలోకమున కేగుటకు పూర్వము యమయాతనల ననుభవింపరు. ఇదియే వా రిరువురికి గల భేదము. (౧౩)

స్మరన్తి చ ౩-౧-౧౪

ఇష్టాదిపుణ్యకర్మల నొనర్పక యనిష్టకర్మల - మాంసాహారాదుల నొనర్చువారికి నానావిధయమయాతనలు కలుగునట్లు చెప్పబడుచున్నది.

'న సాంపరాయః ప్రతిభాతి బాలం
ప్రమాద్యంతం విత్తమోహేన మూఢం,

అయం లోకో నాస్తి పర ఇతి మానీ
పునఃపున ర్వశ మాపద్యతే మె'. కఠ. ౨-౬.

'సంపరాయః=పరలోకము, దాని ప్రాప్తికి సాధన మగునది సాంప రాయ మనబడును. ధనమోహముచే మూఢుడై తెలియక సురాపానాది అనిష్టకర్మల నొనర్చుచు ప్రమత్తుడైనవానికి సాంపరాయము - పరలోక సాధనము లభింపదు. అంతేకాక యత డీ కనిపించు స్త్రీలు మద్యమాంసా దులు - వీనికి మించి మరియొకలోకము లే దనును. ప్రమాదముల నొనరిం చును. పెక్కుమారులు యమయాతనలకు లోనగును'. అని యనిష్టాదికర్మల నొనర్చువారికి యమబాధలు స్మరింపబడినవి. (౧౪)

విశ్వనియంత యైన భగవంతుని యమసదన మెట నున్నది, అనిష్టముల నొనర్చువారికి బాధల ననుభవింపజేయుటకు? అన - సమా ధానము :

అపి చ సప్త ౩-౧-౧౫

యమసదన మెక్కడనో పరలోకమున లేదు. సప్తర్షు లెక్కడ నుందురో అక్కడనే యున్నది.

సప్తర్షులు సప్తప్రాణములు - చక్షురాదీంద్రియములే కాని వేరొండు కారు. అందువలననే,

'ప్రాణా వా ఋషయః' శత. ౬-౧-౧-౧.

శతపథమున ప్రాణములే ఋషు లనబడినవి. ఆ ప్రాణములు - ఇంద్రియము - లీ శరీరమునందే యుంచబడుచున్నవి.

'సప్త ఋషయః ప్రతిహితాః శరీరే
సప్త రక్షంతి సద మప్రమాదం
సప్తాపః స్వపతో లోక మీయుః
తత్ర జాగృతో అస్వప్నజౌ సత్ర సదౌచ దేవౌ'. యజు. ౩౪-౫౫.

'చక్షురాదీంద్రియములు శరీరమునందా యా స్థానములందుండి యెల్లపుడీ శరీరమును రక్షించుచున్నవి. జీవాత్మ నిద్రించునపుడు, ఇంద్రియములు వానితోబాటు హృదయాకాశమున నుండగా, ప్రాణాపానములు రెండును పనిచేయుచుండును.'

జీవాత్మునకు స్థానమగు నీ హృత్ప్రదేశమే యమసదనము. అందే విశ్వనియంత యగు భగవంతుడుండి జీవులకు హితాహితముల జ్ఞానము కలిగించుచుండును. ఆ భగవత్ప్రేరణను - శిక్షణను - గ్రహింపని మూఢులు నిషిద్ధములగు సురాపాన వ్యభిచారాది - అవిహితకర్మల నాచరించి యీ లోకముననే యమయాతనలకు గురియగుదురు. అట్టికష్టముల ననుభవింపజాలక మరణింప యత్నించియు మరణమును బొందరు. మరణించునపుడును సుఖముగ మరణింపరు. అట్లు యమయాతనల నీ శరీరమునందే యనుభవించి తదుపరి పరలోకమున కేగుదురు. కావున యమసదనము పరమున నెక్కడనో లేదు. ఈ శరీరము భగవంతుని యమసదనము. (౧౫)

అటులయిన భగవంతుడీ శరీరమునందుండి విశ్వము నెట్లు నియమింపగలడు? ఒకచోట నుండు వ్యక్తి మరియొకయెడ నియమింప సమర్థుడు కాడు గదా! యన, సమాధానము :

తత్రాపి చ తద్వ్యాపారా దవిరోధః ౩-౧-౧౬

తత్రాపి చ=చంద్రాదిపరలోకములందును, తద్వ్యాపారాత్ = విశ్వనియంత యగు యమునివ్యాపార ముండుటవలన, అవిరోధః = విరోధమేమియు లేదు.

విశ్వనియంత యగు భగవంతుడు జీవాత్మునివలె పరిచ్ఛిన్నుడు - అణుపరిమాణముకలవాడు - కాడు. అతడంతటను వ్యాపించియున్నాడు.

అందువలన నెల్లలోకములందును నత డుండి జీవులకు వలయు కర్మఫలముల నందజేయును.

'ఈశావాస్య మిదం సర్వం
యత్కించ జగత్యాం జగత్' యజు. ౪౦-౧

'తదంతరస్య సర్వస్య,
తదు సర్వ స్యాస్య బాహ్యతః' యజు. ౪౦-౫.

ఇట్టి మంత్రవర్ణములందు భగవంతుడు సర్వవ్యాపకుడనియు, జగత్తునం దంతర్బాహ్యముల నిండియున్నాడనియు తెలుపబడినది. కావున భగవంతుని జగన్నియంతృత్వమున కెట్టి హానియు నుండదు.

కావున ఇష్టాదికారులు, అనిష్టాదికారులు నెల్లరు చంద్రలోకమున కేగుదురని సిద్ధమగుచున్నదని పూర్వపక్షము. (౧౬)

## చతుర్థాధికరణము

ఇక సిద్ధాంతపక్షమును జెప్పబూని సూత్రమును రచించుచున్నాడు.

### విద్యాకర్మణో రితి తు ప్రకృతత్వాత్ ౩-౧-౧౭

విద్యాకర్మణోః=(విద్యా=ఉపాసన, కర్మ = ఇష్టాపూర్తాదికర్మ) ఉపాసన, కర్మ అను నీ రెంటివలన, ఇతి=పూర్వము చెప్పబడిన ఫలము - దేవయానమున బ్రహ్మలోక గమనము, పితృయానమున చంద్రలోక గమనము కలుగును. ప్రకృతత్వాత్=ప్రకరణమున నట్లే చెప్పబడినది.

కర్మోపాసనలనుగూర్చి చెప్పనారంభించి, ఉపాసనాదుల నాచరించువారు దేవయానమార్గమున కార్యబ్రహ్మలోకమున జేరుదురనియు. ఇష్టాపూర్తాది కర్మల నానర్చువారు పితృయానమార్గమున చంద్రలోకమున కేగుదురనియు నుపదేశింబడినది.

'తద్ య ఇత్థం విదుర్ యే చేమే ఽరణ్యే
శ్రద్ధాతప ఇత్యుపాసతే తే ఽర్చిష మభిసంభవంతి'. ఛాం. ౫-౧౦-౧.
'అథ య ఇమే గ్రామ ఇష్టాపూర్తే దత్త మిత్యుపాసతే

తే ధూమ మభిసంభవంతి.' ఛాం. ౫-౧౦-౩ అను నీ వాక్యములవలన విద్యావంతులయిన యుపాసకులు దేవయానమున క్రమక్రముగా బ్రహ్మమును బొందుదురనియు, ఇష్టాపూర్తాది కర్మల నాచరించువారు పితృయానమున చంద్రాదిలోకముల జేరి యట కర్మఫలము ననుభవింతు రనియు స్పష్టపడుచున్నది. ఇక నీ రెండు మార్గములను విడిచి క్షుద్రకర్మల నాచరించు అనిష్టాదికారులు మాటి మాటికి నిటనే పుట్టి చచ్చుచుందు రనియు, చంద్రలోకగమనము వారి కుండదనియు స్పష్టముగ నీ క్రింది వాక్యమువలన తెలియుచున్నది.

'అ థైతయోః పథో ర్న కతరేణ చన,
తా నీమాని క్షుద్రా ణ్యసకృ దావృత్తీని భూతాని భవంతి
జాయస్వ మ్రియ స్వేత్యేతత్ తృతీయం స్థానం
తే నాసౌ లోకో న సంపూర్యతే'. ఛాం. ౫-౧౦-౮.

'అరణ్యమున శ్రద్ధాతపః పూర్వకముగ నుపాసన చేయక, గ్రామమున నిష్టాపూర్తముల నొనరింపక, అవిహిత సురాపానాదుల నొనర్చుచుండువారు దేవయాన పితృయానములలో నొకదానినికూడ ననుసరింపనివారై మూడవ మార్గము ననుసరింతురు. (జాయస్వ మ్రియస్వ) పుట్టుచు, చచ్చుచు నుండుటయే యా మూడవమార్గము. అట్టివారితో చంద్రలోకము నిండదు'. అని యీ వాక్యము స్పష్టముగ జెప్పుచున్నది. కావున అనిష్టాది కార్యముల నొనర్చువారు చంద్రలోకమున కేగుదు రనుట ఉపనిషద్విరుద్ధ మగును.

'యేవై కేచా స్మా ల్లోకాత్ ప్రయంతి చంద్రమస మేవ తే,

సర్వే గచ్ఛంతి' కౌ. ౧-౨. అను నీ కౌశీతకి ఉపనిషత్తులో నెల్లరు చంద్రలోకమున కేగుదురని చెప్పిన వాక్యములోని సర్వపదమునకు ఇష్టాపూర్తముల నొనర్చినవా రెల్లరు నని యర్థము చెప్పికొనిన దోష మేముండును? ఉండదు. కావున నిష్టాపూర్తముల నొనర్చినవారే చంద్రలోకమున కేగి యట కర్మఫల మనుభవించి తిరిగి వత్తురనుట సిద్ధాంతము. (౧౭)

## న తృతీయే తథోపలబ్ధేః ౩-౧-౧౮

తృతీయే=మూడవ పథమున నడచువారికి, న=దేహాంతరారంభము కొఱకు ఆహుతి సంఖ్యానియమము లేదు, తథోపలబ్ధేః=అట్లే తెలియనగుచున్నది.

దేవపితృయాన మార్గములను విడిచి జనన మరణ రూపమగు మూడవమార్గము ననుసరించువారి శరీరారంభముకొఱకు పంచాహుతి నియమము లేదు. చంద్రలోకగమనము లేదని భావము. (౧౮)

## స్మర్యతే ఽపి చ లోకే ౩-౧-౧౯

లోకే=వేదాతిరిక్త శాస్త్రాదులలో, స్మర్యతేఽపిచ=ఆహుతి సంఖ్యా నియమము లేకయే శరీరోత్పత్తి కలుగునని స్మరింపబడినది.

దర్శన శాస్త్రములందు సర్గారంభమున నయోనిజ సృష్టి వర్ణింపబడుట చూచుచున్నాము. (సం త్యయోనిజాః - వై. ౪-౨-౧౧) 'అయోనిజశరీరములు గలవు. అయోనిజ శరీరారంభముకొఱకు స్త్రీ పురుష రూపములగు రెండాహుతులయినను లేనపుడు పంచాహుతి నియమమెట్లుండగలదు? (౧౯)

## దర్శనాచ్చ ౩-౧-౨౦

స్త్రీ పురుష సంబంధము లేకయే స్వేదమువలననే యనేకజీవులకు

శరీర మేర్పడుట చూచుచున్నాము. ఉపనిషత్తునం దట్లే వర్ణింపబడినది కూడ.

'బీజా నీతరాణి చేతరాణి చాండజాని చ,
జారుజాని చ స్వేదజాని చోద్భిజ్జాని చ' ఐ. ౩-౧.

కావున నెల్లరి శరీరారంభముకొఱకు పంచమాహుతినియమము లేనం దున నెల్లరు చంద్రలోకమున కేగుదు రనుట వైదికసిద్ధాంతము కాదు. (౨౦)

జరాయుజములు, అండజములు, స్వేదజములు, ఉద్భిజ్జములు నని లోకమున నలువిధములైన ప్రాణులు ప్రసిద్ధములై యుండ ఉపనిషత్తు నందు మువ్విధములే యేల చెప్పబడియున్నవి ? ఛాందోగ్యమున, 'తేషాం ఖ ల్వేషాం భూతానాం త్రీణ్యేవ బీజాని భవ న్త్యాండజం జీవజ ముద్భిజ్జ మితి.' ౬-౩-౧. 'అండజం = అండమునుండి పుట్టినది, జీవజం = జరా యువునుండి వెలువడునది, ఉద్భిజ్జం = భూమిని పెకలించుకొని బయట పడునది' అని మువ్విధములే వర్ణించుటవలన లోకప్రసిద్ధికి ఉపనిషత్తు నకు విరోధ మేర్పడుచున్నది గదా ! యన - సమాధానము:

## తృతీయశబ్దావరోధః సంశోకజస్య ౩-౧-౨౧

సంశోకజస్య = సంశోకము-చెమట-స్వేదము. దానివలన జనించు ప్రాణివర్గము, తృతీయశబ్దావరోధః = మూడవదైన ఉద్భిజ్జశబ్దముచే గ్రహింపనగును. స్వేదజములు ఉద్భిజ్జములలో నంతర్భాగముగ నెంచ బడినవనిభావము. (భూమ్యుదకోద్భేదప్రభవత్వము రెంటికితుల్యము) (౨౧)

## పంచమాధికరణము

**కర్మఫలభోగముకొఱకు చంద్రాదిలోకముల కేగిన జీవులు భోగానంత రము సానుశయులై తిరిగి భూమి కరుదెంచు విధమును జెప్పుచున్నాడు.**

## సాభావ్యాపత్తి రుపపత్తేః 3-౧-౨౨

ఉపపత్తేః = ఉపపన్నమగుటవలన, సాభావ్యాపత్తిః = ఆకాశాది సాదృశ్యము ప్రతిపాదింపబడునని తెలియవలెను.

'అథై తమే వాధ్వానం పున ర్నివర్తంతే యథేత మాకాశం, ఆకాశాద్ వాయుం, వాయు ర్భూత్వా ధూమో భవతి, ధూమో భూత్వా ఽభ్రం భవ త్యభ్రం భూత్వా మేఘో భవతి మేఘో భూత్వా ప్రవర్షతి' ఛాం. ౫-౧౦-౫.

'ఇష్టాదికర్మల నొనర్చినవారు చంద్రాదిలోకములకు వెళ్ళినమార్గము ననుసరించియే మరల తిరిగివత్తురు. ఆకాశమునుండి వాయువు, మేఘము, వర్షము మున్నగువాని సాదృశ్యమును బొందుచు భూమింజేరి వ్రీహ్యాదుల మూలమున ముందు పురుషునిశరీరమున జేరి, తదుపరి వీర్యముద్వారమున స్త్రీగర్భమునం జేరి జనింతురు. (౨౨)

ఇట్లు మరల భూమిం జేరి జన్మించుటలో నెంతకాలము పట్టు, నవః

## నాతిచిరేణ విశేషాత్ 3-౧-౨౩

విశేషాత్ = తరువాతివాక్యమువలన, ఆకాశాదుల సాదృశ్యము జీవులకు, నాతిచిరేణ = ఎంతోకాల ముండదు.

అంతరిక్షమునుండి పృథివి కరుదెంచు జీవులకు ఆకాశాదులతో సామ్యము కలుగుటకును, వానినుండి విడివడుటకును నెంతో కాలము పట్టదు. స్వల్పకాలముననే భూమికి జేరుదురు. భూమింజేరి వ్రీహ్యాది సమభావమును బొందిన పిదప జరుగువిషయము ఈ వాక్యశేషమువలన దెలియుచున్నది.

'అతో వై ఖలు దుర్నిష్ప్రపతరమ్' ఛాం. ౫-౧౦-౬. వ్రీహ్యాది సమరూపమును బొంది రేతస్సుద్వారమున స్త్రీగర్భమునంజేరి జనించుట

(దుర్నిష్ప్రపతరం)కష్టతర మగును - కొంతకాలము పట్టును - అని వాక్యాభిప్రాయము. అందువలన నాకాశాదిసామ్యమున భూమింజేరుటలో విలంబము కలుగదనియే తెలియుచున్నది. (౨౩)

'త ఇహవ్రీహి యవా ఓషధి వనస్పతయ
స్తిలమాషా ఇతి జాయంతే' ఛాం. ౫-౧౦-౬.

'ఆ జీవు లిట వడ్లు, యవలు, ఓషధులు, వనస్పతులు, నువ్వులు, మినుములుగా జనింతురు'. అను నీ వాక్యమునుబట్టి చంద్రలోకమునుండి వచ్చిన జీవులు భూమింజేరి వ్రీహ్యాదిరూపములలో జనింతురా ? లేక ఆకాశాదులసారూప్యమును బొందినట్లు వ్రీహ్యాదులసాధర్మ్యమును బొందుదురా ? అన :

## అన్యాధిష్ఠితేషు పూర్వవ దభిలాపాత్ ౩-౧-౨౪

అన్యాధిష్ఠితేషు = భోజ్యభోక్తృభావసంబంధ మిట అధిష్ఠాన మనబడును. వ్రీహ్యాదులు భోజ్యములు, అన్యపురుషులు భోక్తలు. అన్యజీవులకు వ్రీహ్యాదులకు భోజ్యభోక్తృభావసంబంధమున, చంద్రలోకమునుండి వచ్చుజీవులు, పూర్వవదభిలాపాత్ = ఆకాశాదులవలె చెప్పబడుటవలన, వ్రీహ్యాదిసాధర్మ్యమును బొందుదు రని చెప్పబడిన ట్లెంచవలెను.

'తే ఇహ వ్రీహి యవా ఓషధి వనస్పతయ స్తిల మాషా ఇతి జాయంతే' అను నీవాక్యమున వ్రీహ్యాదులుగ జనింతు రనుట ఆకాశాదులవలె వ్రీహ్యాదులసామ్యమును బొందుదురనుభావమునే తెలుపును. (౨౪)

## అశుద్ధ మితి చే న్న శబ్దాత్ ౩-౧-౨౫

అశుద్ధం=జీవులు వ్రీహ్యాదిసాధర్మ్యమును బొందుదు రనుటవలన, వ్రీహ్యాదులను దంచి బియ్యముగ చేసినపుడు, వంటచేసినపుడు వ్రీహ్యాదులతోబాటు జీవులు హింసింపబడుదురు. కావున అశుద్ధమై భోజ్యముకాక

దోషము, ఇతిచేత్ = అనియందురేని, న = అట్లు కాదు. శబ్దాత్ = వేదమువలన, వ్రీహ్యాదులు భోజ్యముగానే వర్ణింపబడినవి; కావున దోషము లేదు.

'అహం దాశుషే విభజామి భోజనం' ఋ. ౧౦-౧౨౫-౮.

'త్యక్తేన భుంజీథాః' యజు. ౪౦-౧.

'శస మోషధీనామ్' అథ. ౪-౨-౭. ౩.

అను వాక్యములవలన వ్రీహ్యాదులు మానవులకు భోజ్యములుగా దెలియబడుచున్నవి. వేదవిహితభోజనము హింసాయుతమై దుష్టమగు ననుట యుక్తము కాదు. కాబట్టి వ్రీహ్యాదుల సమభావము జీవులకు స్త్రీగర్భమున జేరుటకు నిమిత్తముగా నుపయోగించుటయే కాని మరియొండు కాదు. దంచుట, వండుట మున్నగుక్రియలవలన వ్రీహ్యాదిసామ్యమును బొందిన జీవులకు దుఃఖరూపభోగము లభించుననుట యుక్తముకాదు.కారణ మేమన: చేష్ట, ఇంద్రియములు మున్నగువాని కాశ్రయ మగు శరీరముననే జీవులకు భోగము లభించును. వ్రీహ్యాదు లట్టి శరీరములు కావు. అవి జీవులను స్త్రీగర్భమున జేర్చుటకు ద్వారములు మాత్ర మగువని భావము. వ్రీహ్యాదులను దంచినందున కాని, వండినందున కాని జీవులకు హింస కలుగ జాలదు. జీవు లతిసూక్ష్మపదార్థములు; కావున తండులభోజనము దుష్ట మనుట యుక్తము కాదని భావము.

ఈ సూత్రభాష్యమునందు శ్రీశంకరాచార్యులు ప్రకరణమును విడిచి యజ్ఞప్రసక్తి కల్పించి సమాధానము చెప్పియున్నారు.

('శాస్త్రాచ్చ హింసానుగ్రహాద్యాత్మకో జ్యోతిష్టోమో ధర్మ ఇత్యవధారితః కథ మశుద్ధ ఇతి శక్యతే వక్తుం....' అగ్నీషోమీయం పశు మాలభేత' ఇతి.) 'అగ్నిష్టోమాదులందు శాస్త్రము హింస నంగీకరించినట్లు చెప్పి, శాస్త్రీయహింస దోషము కాదని యేమో సమర్థింపయత్నించియున్నారు. కాని

వాస్తవమున నిట యజ్ఞమునకు ప్రసక్తియే లేదు. పూర్వసూత్రమున ('అన్యాధిష్ఠితేషు పూర్వవ దభిలాపాత్') వ్రీహి యవాదులు ప్రకరణమున గ్రహింపబడి, వాని విషయమున హింసాదోషము నుద్ధరించుట కీ సూత్రము రచియింపబడినది. కావున శ్రీశంకరస్వామివారిభాష్యము ప్రకరణబద్ధము కా దనవలసివచ్చుచున్నది. (౨౫)

రేతః సిగ్యోగో ౽ థ   ౩-౧-౨౬

అథ = వ్రీహ్యాదిసాభావ్య మేర్పడిన తదుపరి, రేతఃసిగ్యోగః = వీర్యసించన ఘొనర్చుకర్తతో సంబంధము కలుగును.

చంద్రలోకాదులనుండి తిరిగి వచ్చిన, కర్మాశయములతో గూడిన జీవులు, వ్రీహి యవాదులద్వారమున పురుషునిశరీరమున జేరుదురని సూత్రాభిప్రాయము. (౨౬)

యోనేః శరీరమ్   ౩-౧-౨౭

ఇట్లు వ్రీహియవాదులమూలమున పురుషశరీరమున జేరిన జీవులు, ఆ పురుషునిద్వారమున ఋతుకాలమున రేతస్సుతోబాటు స్త్రీయోనింజేరి క్రమముగ శరీరమును బొందుదురు. (౨౭)

వేదాంత దర్శన - అంబా వ్యాఖ్యానమున

తృతీయాధ్యాయమునందు ప్రథమపాదము

సమాప్తము

# తృతీయాధ్యాయము

## ద్వితీయ పాదము

### ప్రథమాధికరణము

ప్రథమపాదమున జీవునిపరలోకగమనాగమనమునుగూర్చి వివరింపబడినది. ఈ పాదమునందు విరక్తుడైన పురుషునకు పరమేశ్వర విషయమున గలుగు భక్తిని నిరూపింపవలసియున్నది. భక్తి యుపాసనకంగము. చిత్తమునందలి విక్షేపమనెడి మాలిన్యమును దొలగించి యుపాసన బ్రహ్మసాక్షాత్కారమునకు సాధన మగును. జీవాత్మకంటె విలక్షణమగు నపూర్వము,నచింత్యమునైన మహిమముగల భగవంతు నంగీకరింపనివా డెంతవిరక్తుడైనను భక్తియుక్తుడు కాజాలడు. ఆ భగవంతునిజ్ఞానము జీవునికి కలుగుటకై జీవునికి గలుగు సంసారగమనాగమనముల నిరూపించినట్లు, అతనికి గల యవస్థాభేదములను నిరూపింపవలసియున్నది. పరమేశ్వరున కట్టి యవస్థాదులు లేవని యనంతరము నిరూపింపనలయును. అందువలన నిట జీవునికి గల స్వప్నావస్థను వివరింపబూనుకొని సూత్రకారుడు ప్రథమసూత్రమును రచియించుచున్నాడు. జాగ్రదవస్థ యెల్ల రెరిగినదే. కావున దానిని విడిచి ముందు స్వప్నావస్థను నిరూపించుచున్నాడు.

పూర్వ పక్షము :

**సంధ్యే సృష్టి రాహ హి** ౩-౨-౧

సంధ్యః = స్వప్నము, జాగ్రత్సుషుప్తులమధ్య నేర్పడును. కావున సంధ్య అనబడును. (సంధ్యం తృతీయం స్వప్నస్థానమ్. బృ. ౪-౩-౯.) కావున, సంధ్యే = స్వప్నమున, సృష్టిః = సృష్టి కలుగును. హి = కారణమేమన, ఆహ = ఉపనిషద్వాక్య మట్లు పలికినది.

బృహదారణ్యకమున స్వప్నప్రకరణమునందు (స యత్ర స్వపితి, బృ. ౪-౩-౯.) 'అతఁ డెక్కడ నిద్రించునో' అని ప్రారంభించి,

(న తత్ర రథా న రథయోగా న పంథానో, భవంత్యథ రథాన్, రథ యోగాన్ పథశ్చ సృజతే, బృ. ౪-౩-౧౦.) 'స్వప్నమున రథములుగాని, గుఱ్ఱములుగాని, మార్గములుగాని యుండవు. కాని వానిని సృష్టించును' అని వర్ణింపబడినది. అందువలన, జీవుడు జాగ్రదవస్థయందు రథాదులను సృష్టించునట్లు స్వప్నమున - కలలో - రథాదులను సృష్టించునా? లేక రథాదులకు సంబంధించిన విపరీతజ్ఞానము కలుగునా? యని సందేహము కలుగును. సృష్టించును, అని పూర్వపక్షము. కాదు - విపర్యయ జ్ఞానము కలుగును, అని సిద్ధాంతము.

స్వప్నములో జీవుడు రథాదులను (సృజతే) సృష్టించును. అని యారణ్యకవాక్యము చెప్పుచున్నది. కాబట్టి సృష్టించుననియే యంగీకరింప వలెను. ఆరణ్యకవాక్యము ఆర్ష వాక్యము కావున నది యసత్యము నెట్లు చెప్పును? (స హి కర్తా, బృ. ౪-౩-౧) 'అతడే కర్త' యనియు ప్రకరణము ముగింపబడినది. కాబట్టి జీవుడు స్వప్నమున రథాదులను సృష్టించుననియే యంగీకరింపవలెను. (౧)

## నిర్మాతారం చైకే పుత్రాదయశ్చ ౩-౨-౨

చ=మరియు, ఏకే=కొందఱు - కఠశాఖ నధ్యయనము చేయువారు, నిర్మాతారం=స్వప్నమున పదార్థములను నిర్మించువానినిగా పురుషుని పఠించి యున్నారు. పుత్రాదయః=నిర్మించదగిన పదార్థములనుకూడ పుత్రాదులుగ నెంచవలెను.

'య ఏష సుప్తేషు జాగర్తి కామం కామం పురుషో నిర్మిమాణః' కఠ. ౫-౮. 'ఇంద్రియాదులు నిద్రించియుండ పురుషుడు కామములను నిర్మించును'. అను నీ కాఠకవాక్యముకూడ జీవుడు స్వప్నావస్థయందు

పదార్థములను నిర్మించునని తెలుపుచున్నది. కాపున జీవుడు స్వప్నమున పదార్థములను నిర్మించు ననుట యుక్తమే.

ఇక్కడ కామపదము కోరికను దెలుపును. కావున పదార్థరచన మెట్లు కాగల దందురేని - అట్లు కాదు. 'కామానాం త్వా కామభాజం కరోమి' ౧-౧౪. 'కామింపదగు పుత్రాది పదార్థములకు నిన్ను కామింప దగువానినిగ జేయుదును' అను వాక్యమున కామపదము పుత్రాది కామ్య పదార్థములకు వాచకముగ నంతకుముందే వర్ణింపబడియున్నందున జీవుడు స్వప్నమున రథాదిపదార్థములను సృజించు ననుటయే యుక్తమని పూర్వ పక్షాభిప్రాయము. (౨)

ఇట్లు జీవుడు స్వప్నమున పదార్థములను సృష్టించు నను పూర్వ పక్షాభిప్రాయమును నిరాకరింప సమాధాన సూత్రమును రచించుచున్నాడు.

మాయామాత్రం తు కార్త్స్న్యే
నానభివ్యక్తస్వరూపత్వాత్ ౩-౨-౩

('తు' పూర్వపక్షనివారకము.)

మాయా=ప్రజ్ఞానము - (కేతుః, కేతః, చేతః, చిత్తం, క్రతుః, అసుః, ధీః, శచీః, మాయా, వయునం, అభిఖ్యా, ఇ త్యేకాదశ ప్రజ్ఞా నామాని, ని, ౩-౯.) మాయామాత్రం=జ్ఞాన విశేషము- విపర్యయజ్ఞానము - మిథ్యాజ్ఞానము అని యభిప్రాయము. కార్త్స్న్యేన అనభివ్యక్తస్వరూప త్వాత్=పదార్థ నిర్మాణమునకు వలయు దేశకాలనిమిత్తాదులు సర్వము కార్త్స్న్య మనబడును. దేశకాలాది సమస్త కారణ పదార్థములు లేక కార్య ముత్పన్నము కానందున, స్వప్నమున కలుగునది పదార్థముల విప ర్యయజ్ఞానమే కాని మరియొండు కాదు, అని సూత్రార్థము.

స్వప్నమున రథాది పదార్థములు భాసించునే కాని యవి యేర్పడవు.

రథాది పదార్థములు నిర్మింపబడుట కనేక సాధనములు, దేశకాలాది నిమిత్తములు నుండవలెను. కారణ సామగ్రి లేకున్న కార్యము లేర్పడవు. శరీరమునందే స్వప్నములు - కలలు - చూతుము. అక్కడ రథాదులను నిర్మించుటకు వలయు ప్రదేశ కాలాదు లెక్కడనుండి వచ్చును? స్వప్న మున పదార్థములు భాసించుట - అనేకములైన నగరములను చూచినట్లు, ఆయా నగరములకు క్షణమాత్రమున వెళ్లివచ్చినట్లును చూతుము. - ఇవి యన్నియు యథార్థము లన వలనుపడదు. అందువలన స్వప్నమున కలుగు జ్ఞానముకూడ విపరీతజ్ఞానమే కాని యన్యము కాదు. పదార్థములట నుండవు. ఉన్నట్లు జ్ఞానము కలుగునని భావము. జీవుడు స్వప్నసమయమున శరీరము నుండి బయటికి వెళ్లి యాయాపదార్థము లున్నస్థానమున వానిని జూచునని కాని, వాని నట నిర్మించునని కాని యనుటయు సరికాదు. జీవుడు శరీర మును విడిచి బయటికి వెళ్లినచో శరీరము నిశ్చేతనమై పడిపోవును. అది శవము కావలసివచ్చును. స్వప్నసమయమున శరీరము నిశ్చేతనము కాదు. సచేతనమే యైయుండును. కావున జీవుడు శరీరమును విడిచివెళ్ల ననుటయు సరికాదు. మరియు,

'స యత్రైతత్ స్వప్న్యయా చరతి' అని యారంభించి 'స్వశరీరే యథాకామం పరివర్తతే' బృ.౨-౧-౧౮. అని ఆరణ్యకమున జీవుడు స్వప్న సమయమున స్వశరీరమునందే యుండుననియు చెప్పబడినది.

అటులయిన స్వప్నమున పదార్థములు లేకయే వాని జ్ఞాన మెట్లు కల్గునందు రేని, సంస్కారబలమున గలుగునని చెప్పుదుము. లోకము నందు పదార్థములను జూచునపుడు వానికి సంబంధించిన సంస్కారము లేర్పడును. ఆ సంస్కారములవలన జీవులకు పదార్థముల స్మరణయు కలుగుచుండును. అందువలననే స్మృతియు నొకవిధ మగు జ్ఞానమనియే దార్శనికు లెంచుచున్నారు. స్వప్నసమయమున పదార్థము లట లేకున్నను

మనబడదు. అది విపరీతజ్ఞానము - అయథార్థజ్ఞాన మనబడును ఇంద్రియ ములసంయోగముచె నేర్పడు జ్ఞానము - అనుభవము - యథార్థ మన బడును. స్వప్నమున నింద్రియము లర్థములతో సంబద్ధములు కావు. అందువలన నపు దేర్పడు జ్ఞానము జ్ఞానము కాదు. పూర్వానుభవజన్య సంస్కారముల బలముచే కలుగు జ్ఞానము-స్మృతిమాత్ర మగును.స్వప్నము స్మృతివంటిదే కాని యథార్థజ్ఞానము కాదు. అందువలననే స్వప్నమున పూర్వానుభూతపదార్థములే భాసించును. కాని, క్రొత్తపదార్థములు తెలియ బడవు. అందువలననే బృహదారణ్యకమున, 'యాని హ్యేవ జాగ్రత్ పశ్యతి తాని సుప్తః' బృ. ४-३-౧४. 'యదేవ జాగ్రత్ భయం పశ్యతి తదత్రావిద్యయా మన్యతే' ४-३-౨౦. 'జాగ్రదవస్థలో చూచినవియే స్వప్నమున జూచును. అవిద్యతో జూచును' అనియు వర్ణింపబడినది.

అందువలననే జన్మాంధునకు స్వప్నమున రూపము-వర్ణము-రంగు భాసింపదు. కావున స్వప్నమున జీవుడు రథాదులను సృష్టించుననుట యుక్తము కాదు. 'సృజతే' అను పదము వాక్యమున నున్నదికదా। దాని యర్థ మేమగునందురేని, నిద్రించువాడు సృజియించు ననుట సంగతము కాదు, కావున సృజించునట్లు భాసించునే కాని, సృజింప దని యర్థము చెప్పుకొనవలెను. 'స హి కర్తా' యను పదమునకు దర్శనకర్త యని యర్థము చెప్పవచ్చును. (య ఏష సుప్తేషు జాగర్తి కామం కామం పురుషో నిర్మిమాణః. కఠ. ౫-౮)'జీవులు నిద్రామగ్నులయియుండపదారము లను పురుషుడు నిర్మించుచున్నాడు' అను నీ వాక్యమున పురుషపదము బ్రహ్మవాచకము. జీవవాచకము కాదు. అందువలననే వాక్యశేషము నందు (తదేవ శుక్రం తద్ బ్రహ్మ. కఠ. ౫-౮) బ్రహ్మము స్పష్టముగ వర్ణింపబడినది. కాబట్టి స్వప్నమున జీవుడు రథాదులను సృష్టించుననుట సరికాదు. అతని కపుడు వస్తువులు లేకున్నను ఉన్నట్లు భాసించును. కావున స్వప్నజ్ఞానము యథార్థమును కాదు. (३)

సూచకశ్చ హి శ్రుతే రాచక్షతే చ తద్విదః ౩-౨-౪

స్వప్నము విపర్యయజ్ఞానమే. హి = కారణమేమన, సూచకః = రానున్న శుభాశుభములను దెలుపునది. తద్విదః=స్వప్నవిదులు, శ్రుతేః= ఉపనిషద్ వాక్యశ్రవణమునుబట్టి, అచక్షతే=చెప్పుదురు.

'యదా కర్మసు కామ్యేషు స్త్రియం స్వప్నేషు పశ్యతి
సమృద్ధిం తత్ర విజానీయాత్ తస్మిన్ స్వప్ననిదర్శనే.'
ఛాం. ౫-౨-౯

'పురుషం కృష్ణం కృష్ణదంతం పశ్యతి
స ఏనం హంతి.' ఐ త. ఆ. ౩-౨-౪-౧౭.

ఈ వాక్యములలో 'కలలో స్త్రీని జూచిన సమృద్ధి కలుగు' ననియు 'కృష్ణదంతములుగల నల్లని మనుజుని జూచిన నత డతనిని జంపు' ననియు స్వప్ననిదర్శనమున నున్నట్లు తెలియుచున్నది. ఇట్లే స్వప్నవిదులు కలలో గజారోహణాదులం జూచిన శుభసూచక మనియు, ఖరోష్ట్రారోహణాదులు అశుభసూచక మనియు జెప్పుదురు. ఇట్లు రానున్న శుభాశుభములకు స్వప్నము సూచక మనుటచే స్వప్నమున పదార్థము లాభాసించునే కాని వాస్తవమున పదార్థము లట నేర్పడ వని స్పష్టమగుచున్నది. మరియు స్వప్నమునందు ధాతుస్ఖలనము జరుగుటకు కారణము స్త్రీ దర్శనాభాసమే కాని, స్త్రీ యట నుండదు. జాగ్రదవస్థకు రాగానే యట స్త్రీ యుండదని యెల్ల రెరిగిన విషయమే. కావున స్వప్నమున కలుగు నా జ్ఞానమును యథార్థము కాదని స్పష్టమగుచున్నది. (౪)

జాగ్రదవస్థయందువలె కొండొకవేళ పురుషుడు బంధమోక్షముల ననుభవించును. అందులకు కారణ మేమి? అన :

పరాభిధ్యానాత్తు తిరోహితం తతో
హ్యస్య బంధవిపర్యయౌ  ౩-౨-౫

పరాభిధ్యానాత్=రథాదీతర పదార్థముల ధ్యానమువలన, తిరోహితం =బుద్ధిసత్వ మాచ్ఛాదిత మగును. తతః=అందువలన, అస్య = నిద్రలో నున్న జీవాత్మునకు, బంధవిపర్యయౌ=బంధ మోక్షములు ప్రతిభాసించును.

జాగ్రదవస్థయందు ప్రత్యక్షాది ప్రమాణములవలన పదార్థములజ్ఞానము కలుగును. ఆ జ్ఞానసంబంధమగు సంస్కారములు బుద్ధిసత్వమున నేర్పడును. పలుమారు పదార్థములను గూర్చి చింతన చేయుటవలన నాసంస్కారములు దృఢపడి బుద్ధిసత్వమును కప్పివేయును. బుద్ధిసత్వముయొక్క వివేకజ్ఞానమును నష్టపరుచునని భావము. నిద్రించువేళ బుద్ధిసత్వమునం దలముకొనియున్న సంస్కారబలముచే దేశకాలవిపర్యాస పూర్వకముగ రథగజాది పదార్థములు భాసించునట్లే, బంధమోక్షములుకూడ భాసించును. వాస్తవమున నట జీవునకు బంధమోక్షములు కలుగవు. శాస్త్రము మూలమున బోధింపబడిన బంధమోక్షహేతువుల నెరింగి జాగ్రదవస్థలో వాని ననుష్ఠించినపుడే వాస్తవికబంధమోక్షములు కలుగును. (౫)

స్వప్నము కలుగుటకు గల నిమిత్తమేమి ? అన :

దేహయోగాద్వా సోఽపి  ౩-౨-౬

సః అపి=ఆ స్వప్నముకూడ, దేహయోగాత్ వా=ఒకప్పుడు దేహవిశేషసంబంధము వలనను, మరియొకప్పుడు ధర్మమువలనను, ఇంకొకప్పుడు అధర్మము వలనను కలుగును.

ఆ యా పదార్థములకు సంబంధించిన సంస్కారములు స్వప్నమునకు సాధారణకారణమనియు, దేహాది సంబంధములు విశేషకారణము లనియు తెలిసికొనవలెను. అప్పుడప్పుడు వాతాది ధాతువైషమ్య మేర్ప

దుట వలన దేహమునందు వైశిష్ట్య మేర్పడును. అట్టి దేహసంబంధము వలన కలుగు స్వప్నములు ఆకాశగమనాదులతో కూడియుండును. ధర్మా ధర్మ సంస్కారసంబంధము వలన నేర్పడు స్వప్నములు శుభాశుభసూచక ములై యుండునని తాత్పర్యము. మొత్తముమీద స్వప్నము పూర్వాను భవమువలన నేర్పడిన సంస్కారములవలన కలుగునదియే కాని వేరొండు కాదు. అదియును యథార్థము కాదు. విపర్యయజ్ఞాన మనియే వైదికసిద్ధాంతము. (౬)

## ద్వితీయాధికరణము

ఇట్లు స్వప్నావస్థను నిరూపించి, సుషుప్త్యవస్థను నిరూపింపదలచి సూత్రమును రచించుచున్నాడు.

**తదభావో నాడీషు తచ్ఛ్రుతే రాత్మని చ ౩-౨-౭**

తదభావః=స్వప్నాభావము - సుషుప్తి-గాఢనిద్ర, నాడీషు=హితాఖ్య నాడులలోను, పురీతతినాడిలోను, ఆత్మని చ = పరమాత్మయందును, జీవు డున్నప్పుడు కలుగును. తచ్ఛ్రుతేః=సుషుప్తియందు జీవు డానాడులలోను, ఆత్మయందును ఉండునట్లు ఉపనిషద్ వాక్యములవలన దెలియుచున్నది.

'తద్ య త్రైతత్ సుప్తః సమస్తః సంప్రసన్నః స్వప్నం
న విజానా త్యాసు తదా నాడీషు సృప్తో భవతి.' ఛాం. ౮-౬-౩

'జీవుడు నిద్రించునపుడు కలలు గనడు. సుషుప్తి సమయమున ప్రసన్నుడై యుండును. అప్పుడు హృదయ నాడులలో చేరియుండును.'

'అథ యదా సృప్తో భవతి, తదా న కస్యచన వేద హితానామ
నాడ్యో ద్వాసప్తతిః సహస్రాణి హృదయాత్ పురీతత
మభిప్రతిష్ఠంతే, తాభిః ప్రత్యవసృప్య పురీతతి శేతే.' బృ. ౨-౧-౧౯

'జీవుడు నిద్రించునపుడు ఏమియు నెరుగడు. హృదయమునుండి

డెబ్బది రెండువేల (౭౨౦౦౦) నాడులు వెలువడును. అవి హితానాడు లనబడును. అవి యన్నియు పురీతతనాడి కభిముఖము లగును. జీవు డా నాడులలో జరిగిపోయి పురీతతనాడి (capillary) యందు నిద్రించును.

'యత్రైతత్ పురుషః స్వపితి నామ సతా సోమ్య
తదా సంపన్నో భవతి' ఛాం. ౬-౮-౧౧

'జీవుడు 'స్వపితి' నిద్రించును - అప్పు డతడు బ్రహ్మతో కలిసి యుండును'.

'ప్రాజ్ఞేనాత్మనా సంపరిష్వక్తో న బాహ్యం
కించన వేద నాంతరమ్' బృ. ౪-౩-౨౧

'పరమాత్మ నాలింగనముచేసి బాహ్యాభ్యంతరములలో నొకింతయు నెరుగక యుండును.'

అను నీ యుపనిషద్వాక్యార్థములంబట్టి జీవుడు సుషుప్తిం జెందినపుడు - గాఢనిద్రలోనున్నపుడు హృదయమునందలి పురీతతనాడులద్వారమున పరమాత్మయందు జేరి సుఖించునని తెలియుచున్నది. అపుడు జీవాత్మ పరమాత్మతో జేరి యవిభక్తరూపమున నుండును. ఆ సమయమున మనస్సుకూడ పనిచేయదు. (౭)

**అతః ప్రబోధోఽస్మాత్ ౩-౨-౮**

అతః=సుషుప్తికి పరమాత్మయే స్థానమగుటవలన, అస్మాత్=పరమాత్మని వలన - అతనినుండియే, ప్రబోధః = జీవునకు ప్రబోధము కలుగును.

బృహదారణ్యకమునందలి సుషుప్త్యధికరణమున (కుత ఏత దాగాత్? బృ. ౨-౧-౧౬.) 'జీవుడు మేలుకొనినపు డతడు ఎక్కడినుండి వచ్చెను?' అని ప్రశ్నించి దానికి సమాధానముగ నిట్లు చెప్పబడినది.

('యథా ఽగ్నేః క్షుద్రా విస్ఫులింగా వ్యుచ్చరంత్యేవమేవైతస్మాదాత్మనః సర్వే ప్రాణాః, సర్వే లోకాః, సర్వే దేవాః. సర్వాణి భూతాన్యుచ్చరంతి.' బృ. ౨-౧-౨౦) 'అగ్నినుండి నిప్పుకణములు బయలు వెడలునట్లు, పరమేశ్వరునినుండియే సర్వప్రాణములు, లోకములు, దేవతలు, ప్రాణులు నన్నియు వెడలును'. అని పరమేశ్వరుని సకాశము నుండియే ప్రబోధింపబడినట్లు చెప్పబడినందున జీవుడు పరమాత్మయందే నిద్రించి, యతని నుండియే మేల్కొను నని సిద్ధమగుచున్నది. (౮)

జీవుడు నిద్రించినపుడు పరమాత్మతో నేకమగునని చెప్పబడినది గదా! అటులయిన మేల్కొను జీవు డతడేనా ? లేక మరియొకడా ? యని సంశయము కలుగగా సమాధానము చెప్పుచున్నాడు.

స ఏవ తు కర్మానుస్మృతి శబ్ద విధిభ్యః ౩-౨-౯

కర్మానుస్మృతిశబ్దవిధిభ్యః = మిగిలినకర్మల ననుష్ఠించుటవలనను, స్మృతివలనను, శ్రుతివాక్యమువలనను, కర్మవిద్యావిధులవలనను, స ఏవ తు =నిద్రించినజీవుడే మేల్కొనును. అన్యుడు కాడు, అని తెలియనగును.

నిద్రించినజీవుడే మరల మేల్కొనును. నిద్రించున దొకడు, మేల్కొనునది మరియొకడు నగుటకు వీలులేదు. నిద్రించినజీవుడే మరల మేల్కొనుచున్నాడు. కావుననే నిద్రించుటకు పూర్వము ప్రారంభించి విడిచినకార్యమును మేల్కొని మరల ప్రారంభించి చేయుచున్నాడు. నిద్రించిన వాడు మేల్కొనక యన్యుడు మేల్కొనుపక్షమున నిద్రించినవాడు సగముచేసి విడిచిన కార్యమును మరల ప్రారంభించి పూర్తి చేయజాలడు. అన్యుడు విడిచిన కార్యము నన్యు డెట్లు పూర్తి చేయును? ఇట్లే నిద్రించిన జీవుడు మరల మేల్కొననిపక్షమున "ఆ నిద్రించిన నేనే మరల మేల్కొను చున్నాను" అని స్మరియింపజాలడు. తన్ను తాను గుర్తింపను నేరడు. కావున నిద్రించిన జీవుడే మరల మేల్కొనును.

'పునః ప్రతిన్యాయం ప్రతియోన్యా ద్రవతి బుద్ధాంతాయైవ'

బృ. ౪-౩-౧౬.

'జీవుడు ఎట్లు నిద్రించినాడో యట్లే మరల మేల్కొనును - జాగ్రదవస్థను బొందును'. అని ఉపనిషద్ వాక్యము చెప్పుచున్నందునను నిద్రించినజీవుడే మేల్కొనును. కాని, యన్యుడు కాదని తెలియుచున్నది.

ఇంతేకాక శాస్త్రము పురుషుల నుద్దేశించి కర్మోపాసనలు విధించుచున్నది. ఆకర్మోపాసనలను పురుషు డొనర్చి తగుఫలములను బొందును. పురుషుడు కర్మోపాసనల నొనర్చి వాని ఫలములను బొందనినాడు శాస్త్రము వ్యర్థమగును. కావున శాస్త్రప్రవృత్తి ననుసరించి చూచినను నిద్రించినజీవుడే మరల మేల్కొని, తాను ప్రారంభించిన కర్మోపాసనలు పూర్తిచేసి వానిఫలము లయిన స్వర్గాపవర్గములను బొందును. దానింబట్టి చూచినను నిద్రించినజీవుడే మేల్కొనును; కాని యన్యుడు కాదు, అని స్పష్టపడుచున్నది. (౯)

## తృతీయాధికరణము

జీవాత్మని మూర్ఛావస్థావిచారణ :

### ముగ్ధేఽర్ధసంపత్తిః పరిశేషాత్ ౩-౨-౧౦

ముగ్ధే = మూర్ఛితుడైనపుడు, పరిశేషాత్ = పరిశేషమువలన, అర్ధసంపత్తిః = సగము సుషుప్తి, కలుగునని యెంచవలెను.

లోకమునందును - ఆయుర్వేదశాస్త్రమునందు మూర్ఛావస్థ యొకటి ప్రసిద్ధమై యున్నది. స్వప్నజాగ్రత్సుషుప్త్యవస్థలే కాక జీవునకు మూర్ఛావస్థ యొకటి యున్నదని యెల్ల రెరుగుదురు. ఈ యవస్థ జాగ్రదాద్యవస్థలలో చేరినదియేనా? లేక యవస్థాంతరమా? అని సందేహ ముదయించును. మూర్ఛావస్థ జాగ్రదాది - అవస్థాత్రయములో చేరదు. ఇయ్యది-

యవస్థాంతరమే యగును. పై మూడవస్థలకంటె నిందు విశేషత యుం డును. స్వప్నము(కల)లోను, జాగ్రదవస్థయందును విషయ జ్ఞాన ముండును. మూర్ఛయందట్టి జ్ఞాన ముండదు. అందువలన నా రెంటిలో మూర్ఛావస్థ చేరదు. మూర్ఛను మరణ మనుటకును వీలులేదు. శరీర మున నుష్ణము, శ్వాసప్రశ్వాసము లుండును. మరణమున నవి యుండవు. మూర్ఛ సుషుప్తియందును జేరదు. మూర్ఛావస్థయందు శరీరమున ననేక విధము లగు వికారములు కలుగును. ముఖమున వికాస ముండదు. కాళ్లు చేతులు కొట్టుకొనును. ఒకప్పుడు కొన్ని నిమేషములు ఉచ్ఛ్వాసనిఃశ్వాసము లాగిపోవును. సుషుప్తియందిట్టి వికారము లుండవు. కావున సుషుప్తి కంటె మూర్ఛ విలక్షణ మనక తప్పదు. జీవునకు కలుగు ప్రసిద్ధమయిన జాగ్రదాది - అవస్థాత్రయములోను నీ మూర్ఛావస్థ చేరదు - అంతర్భావము కాదు. వేరొకయవస్థయు జీవునకు మూర్ఛ నంతర్భావము చేయదగినది లేదు. కావున మూర్ఛావస్థ ప్రత్యేకముగ అర్ధసుషుప్తియని చివర కంగీక రింపకతప్ప దని వైదిక సిద్ధాంతము. (౧౦)

## చతుర్థాధికరణము

జీవునకుగల స్వప్నాద్యవస్థలు నిరూపించి యిప్పుడు పరమాత్మ కట్టి యవస్థాభేదములు లేవని నిరూపించుచున్నాడు. అది యెరిగిన వారికి భగవంతునియందు విశేషభక్తి యేర్పడుటయే యీ యధికరణమునకు ఫలము.

### న స్థానతోఽపి పరస్యోభయలింగం సర్వత్ర ౩-౨-౧౧

పరస్య = జీవులు, ప్రకృతి, తత్కార్యములకంటెను సూక్ష్మమైన పరమాత్మకు, స్థానతః అపి = స్వతఃగాని, స్థానవిమిత్తమువలనగాని, నః=

స్వప్నాద్యవస్థ లుండవు. పరమేశ్వరుడు జీవులకంటెను, ప్రకృతి, తత్కార్యములైన మహత్తత్త్వాదిపదార్థములకంటెను మిక్కిలి సూక్ష్ముడు; వ్యాపకుడును. అందువలన నతడు జీవప్రకృతులలో బాహ్యాభ్యంతరభేదము లేక యంతట నుండును. కావుననే బృహదారణ్యకమున ('య ఆత్మని తిష్ఠన్ ఆత్మనో ఽంతరః') పరమేశ్వరుడు జీవునిలోనుండి-అంతర్యామియై-జీవులకు శుభాశుభకర్మల నొనర్చునపుడు ప్రేరణ నొసంగుచుండునని వర్ణింపబడినది.

పరమేశ్వరుడు జగజ్జన్మాదులకు కారణము. జీవునకువలె పరమేశ్వరునకుకూడ స్వప్నాద్యవస్థలతో సంబంధ మున్నదా, లేదా ? యని సంశయము కలుగును. ఉండునని పూర్వపక్షము; ఉండదని సిద్ధాంతము:

జీవులు చేతనములు, పరమేశ్వరుడును చేతనమే. చేతనుడైన జీవునకు స్వప్నాద్యవస్థ లున్నపుడు చేతనుడైన పరమేశ్వరునకు మాత్ర మాయవస్థ లేల యుండవు? కావున స్వప్నాద్యవస్థలతో సంబంధము బ్రహ్మమునకు నుండును.

అయిన, చేతన మైనంతమాత్రమున స్వప్నాద్యవస్థ లుండవలయు నని నియమ మే మున్నది ? ముక్తావస్థలో నున్న జీవులకు స్వప్నాద్యవస్థ లుండవుగదా ! అప్పుడును జీవులలో చేతనత్వ ముండును. కాని, యవస్థ లుండవు. కాబట్టి చేతన మైనంతమాత్రమున బ్రహ్మమునకు స్వప్నాద్యవస్థ లుండవలయు ననుట యుక్తముకా దందురేని,అట్లు కాదు. బ్రహ్మమునకు స్వతః స్వప్నాద్యవస్థ లుండకున్నను స్థాననిమిత్తమువలన నేర్పడవచ్చును. జీవాత్మకు స్థానము శరీరము. తత్సంబంధమువలన నతని కవస్థలు బద్ధదశలో నుండును. అట్లే బ్రహ్మము - పరమేశ్వరునకు స్థానము శరీరము - జీవుడు. జీవునిలో పరమేశ్వరు డుండునుగదా ! స్థానమైన జీవునకు గల యవస్థలు బ్రహ్మమునకును గ గవచ్చును. పరమేశ్వరునకు విజ్ఞానము - జీవుడు శరీర మని ఉపనిషద్వాక్యములును చెప్పుచున్నవి.

'యో విజ్ఞానే తిష్ఠన్, విజ్ఞానా దంతరో, యం విజ్ఞానం న వేద యస్య విజ్ఞానం శరీరం, యో విజ్ఞాన మంతరో యమయతి, ఏష త ఆత్మా అంతర్యా మ్యమృతః' బృ. ౩-౭-౨౨.

'పరమేశ్వరుడు విజ్ఞానమున - జీవునిలో - ఉండి యతనికంటె భిన్నుడై యున్నాడు. జీవు డతని నెరుగడు. జీవు డతనికి శరీరము. జీవున కతడు నియామకుడు - ప్రేరకుడు. అత డంతర్యామి'. కావున శరీర నిమిత్తముగ బద్ధజీవునకు స్వప్నాద్యవస్థలు గలుగునట్లు పరమేశ్వరునకు గూడ శరీరస్థానమున నుండు జీవుని నిమిత్తముగ స్వప్నాద్యవస్థలు గలుగ నచ్చు నని పూర్వపక్షము.

సమాధానము : జీవుడు అణుపరిమాణము గలవాడు - పరిచ్ఛిన్నుడు. కావున నతడు శరీరమునందే యుండును. శరీరమునకు వెలుపల నుండడు. అందువలన నతనికి శరీరోపాధివలన స్వప్నాద్యవస్థలు గలుగుచున్నవి. కాని, బ్రహ్మమునకు జీవుడు శరీరమైనను, నా జీవరూపశరీరమున బ్రహ్మము బంధింపబడదు. అది వ్యాపకము - శరీరమునకు వెలుపలను ఉండును. కాబట్టి జీవరూపస్థానోపాధివలన గూడ బ్రహ్మమునకు స్వప్నాద్యవస్థలు గలుగనేరవు. ఉపాధివలన నియతమై తనలో బంధింపబడిన వస్తువునకే యుపాధిధర్మములతో సంబంధము గలుగుట కవకాశ ముండును. బ్రహ్మము నకు జీవరూపశరీర ముపాధియై బ్రహ్మమును తనలో బంధింపజాలదు. బ్రహ్మమును పరిచ్ఛిన్నము చేయజాలదు. కావున నుపాధిగతధర్మములు ఉపధేయమునందు - బ్రహ్మమునందు - సంక్రమింపవని భావము. అద్దము నందు ముఖము ప్రతిబింబించును. ఆ ప్రతిబింబము అద్దముచే పరిచ్ఛిన్నమై దానియందే కనిపించును. దానికి వెలుపల కనిపింపదు. అందువలన అద్దములోని మాలిన్యాదిదోషములు ప్రతిబింబమున సంక్రమింపవచ్చును. ఇది లోకమున జూచుచున్నాము. బ్రహ్మ మట్లు ఉపాధిచే బంధింపబడదు. అది యుపాధిగా నెంచబడు జీవపృథివ్యాదు లన్నింటిలో లోపల నుండునుఫ

వెలుపల నుండును. దాని నా యుపాధులు బంధింపనేరవు. కావున నుపాధి సంబంధముచే బ్రహ్మమున కవస్థ లుండుననుట యుక్తము కాదు. బ్రహ్మ మంతర్బహిర్భేదములు లేక యంతట నుండునని వేదము చెప్పుచున్నది. చూడుడు :

'స భూమిం విశ్వతో వృత్వా అత్యతిష్ఠ ద్దశాంగులమ్'

ఋక్. ౮-౪-౧౭-౧.

'బ్రహ్మముభూమిని చుట్టి దానికి మించియున్నది'.

'తదంతరస్య సర్వస్య తదు సర్వ స్యాస్య బాహ్యతః' య.౪౦-౫

'ఈ ప్రపంచమునకు లోపల వెలుపల నంతట నున్నది.'

జీవున కవిద్యాసంబంధ ముండును. అది నిమిత్తముగా స్వప్నాద్య వస్థ లతనికి గలుగును. బ్రహ్మమున కవిద్యతో సంసర్గ ముండదు. అయ్యది నిత్య శుద్ధ బుద్ధ ముక్తస్వభావము. కావున నట్టిబ్రహ్మమునకు స్వప్నాద్యవస్థలు ఉపాధిసంసర్గమువలన నేర్పడుననుట యుక్తివిరుద్ధము, శాస్త్రవిరుద్ధము నని భావము. (౧౧)

ఈ విషయమున శంకించి సమాధానము చెప్పుచున్నాడు.

## న భేదా దితి చే న్న ప్రత్యేక మతద్వచనాత్ ౩-౨-౧౨

భేదాత్ = స్థానమువలన-పరమేశ్వరుడు భిన్నమగుటవలన, న = స్వప్నాద్యవస్థలు కలుగవని పూర్వము చెప్పినసమాధానము సరికాదు. ఇతి చేత్ = అనియందురేని, న = అట్లనుట తగదు. కారణమేమన = ప్రత్యేకం = ప్రతిస్థానమునను అతద్వచనాత్ = అభేదము - అభిన్నముగ చెప్పబడినది. స్థానసంబంధమువలనను బ్రహ్మమున కవస్థ లుండవని చెప్పుట యుక్తముకాదు. స్థానభేదమువలన బ్రహ్మము భిన్నముగ చెప్పబడును. ఆకాశము వ్యాపకము- అంతట నుండును. అయినను ఘటమునందలి యాకా

శము ఘటాకాశమనియు, మఠమునందలి యాకాశము మఠాకాశమనియు వ్యవహరింపబడును. అట్లే బ్రహ్మము వ్యాపక మయినను, ఆయా స్థాన ములం దుండి స్థానభేదముచేత బ్రహ్మముకూడ భిన్ననామరూపములచే వ్యవహరింపబడును. కావున స్థానభేదసంబంధమువలన భిన్నభిన్ననామ రూపములు కలుగునట్లు స్వప్నాద్యవస్థలును బ్రహ్మమునకు కలుగు ననుటయే యుక్తమగును; అని శంకింతురేని - అదియును సరికాదు. స్థాన భేదమునుబట్టి బ్రహ్మము భిన్నము కానేరదు. అది వ్యాపకము.

'స ఓతశ్చ ప్రోతశ్చ విభూః ప్రజాసు' యజు. ౩౨-౮.

'ఆ పరమేశ్వరుడు ఓతప్రోతుడై యున్నాడు. ప్రజలలో విభువై యున్నాడు' అని వేదమంత్రము.

'సర్వవ్యాపీ సర్వభూతాంతరాత్మా' శ్వే. ౬-౧౧.

'అతడు సర్వవాపకుడు. సర్వభూతములలోపల నున్నాడు', అని యుపనిషత్తు. కావున బ్రహ్మము ఆదిత్యాదిస్థానములలో నంతట నుండును. కాని, స్థానభేదమువలన నదిభిన్నము(ఖండితము)కాదు. స్వయముగబ్రహ్మము భిన్నముకాని వస్తువు. అది ఖండితము కాదు. అందువలన నది యుండు స్థానములు పరిమితములై భిన్నములై నంతమాత్రమున నది భిన్నము కానే రదు. ఘట, పట, మఠాదులలో ఆకాశము భిన్న మగునని యెంచుట బుద్ధి మంతులపని కాదు. సూక్ష్మవస్తుపరిజ్ఞానము లేనివారే య ట్లెంచుచున్నారు. ఘటపటాదులు తమలోనున్న యాకాశమును బాహ్యాకాశమునుండి వేరు చేయనేరవు - ఖండితము చేయనేరవు. ఘటము తనలోనున్న నీటిని వెలుపల సముద్రములోనుండు నీటినుండి వేరుచేయగలదు; కాని ఆకాశము నట్లు వేరుచేయలేదు. కావున ఘటాకాశము మఠాకాశము నను వ్యవహారము బుద్ధి మంతులకు చెందినది కాదు. మందమతుల వ్యవహారము వస్తుయాథార్థ్య మును బోధింపదని చెప్పనక్కరలేదు. కాబట్టి బుద్ధిమంతు లెన్నడును

స్థానసంసర్గముచేత వ్యాపకము, నఖండమునగు బ్రహ్మము ఖండితమగునని యెంచరు. సామాన్యముగ తమకు దోచినట్లెల్ల ఎంచి ఉపాసకులు సంసార గర్భపాతమున గలుగు నానావిధదుఃఖములపాలు గాకుండుటకుగానుకరుణా మయులగు మహర్షులు ('స యశ్చాయం పురుషే, యశ్చాసా వాదిత్యే స ఏకః' తై. ౩-౧౦.) 'ఈ జీవునం దున్నవాడు, ఆదిత్యునియం దున్న వాడు నొక్కడే యనియు, నిట్లే, ('స యశ్చాయ మస్యాం పృథివ్యాం తేజో మయో అమృతమయః పురుషః అయమేవ,స యో౽య మాత్మేదం బ్రహ్మ' బృ.౨-౫-౧.) 'ఈ పృథివియందున్న జ్ఞానస్వరూపుడు, నిత్యుడు నైన పురు షుడే బ్రహ్మము' అనియు బహువిధముల బోధించియున్నారు. శ్రుతిస్మృతులలో నిట్లు పరబ్రహ్మ - పరమేశ్వరు డభిన్నుడని చెప్పబడియుండ భిన్నముగా నెంచి స్థానభేదమువలన నతని కపస్థాదు లేర్పడుననుట ప్రమాణబద్ధము కాదు. అక్కడక్కడ నుపనిషత్తులలో పరమేశ్వరుడు హిరణ్యశ్మశ్రువు, హిరణ్యకేశుడు నని వర్ణింపబడియుండుటను జూచి భ్రమపడవలసిన యవ సరము లేదు. అది పరమేశ్వరుని ఆలంకారికవర్ణనమే కాని మరియేమియు కాదు. మానవబుద్ధికి ప్రియము కలుగునట్లు వర్ణించుట యుపదేష్టలకు రీతి. అందువలన హస్తపాదాద్యవయవములతో గూడియున్నట్లు వర్ణించుటయు నధికముగా జూచుచుందుము.

> 'అగ్నిర్ మూర్ధా చక్షుషీ చంద్రసూర్యౌ
> దిశః శ్రోత్రే వాగ్ వివృతాశ్చ వేదాః,
> వాయుః ప్రాణో హృదయం విశ్వ మస్య,
> పద్భ్యాం పృథివీ హ్యేష సర్వభూతాంతరాత్మా'. ముం. ౨-౧-౪

'పరమేశ్వరునకు అగ్ని మూర్ధము, చంద్రసూర్యులు నేత్రములు, దిక్కులు చెవులు, వేదములు వాక్కు, వాయువు ప్రాణము, విశ్వము హృదయము. భూమి పాదములు. ఇట్లు పరమేశ్వరుడు సర్వభూతాంతరాత్మ' అని పరమేశ్వరుడు అవయవసహితు డైనట్లు ఆలంకారికముగ వర్ణించుట

యుపాసకులప్రీతికొఱకే కాని మరి యొండు ప్రయోజనము లేదు. ఇట్టి యాలంకారికవర్ణనవలన వస్తుస్వభావము భిన్నము కానేరదు. కావున స్థాన భేదమువలన పరమేశ్వరునకు స్వప్నాద్యవస్థలతో సంబంధము గలుగు ననుట సంగతము కాదు. (౧౨)

పై విషయమునే మరియొకప్రమాణముచే బలపరుచుచున్నాడు.

అపి చైవ మేకే 3-2-13

అపి చ = హేతుబలముతో స్వప్నాద్యవస్థలు పరేశునికి కలుగవని చెప్పుటయేకాక, ఏవమ్ ఏకే = అథర్వవేదులు కొందఱు ఆలంకారికముగ పరమేశ్వరునకు సంబంధమును కల్పించి నిరాకరించుచున్నారు.

మాండూక్యోపనిషత్తునందు పరమేశ్వరునకు ఆలంకారికముగ 'స్వప్నస్థానో ఽంతఃప్రజ్ఞః' మాం. ౪. అని జీవునకువలె స్వప్నాద్యవస్థా సంబంధమును వర్ణించి, అనంతరము వాక్యశేషమున ప్రకరణసమాప్తిలో 'నాంతఃప్రజ్ఞం న బహిఃప్రజ్ఞం, నోభయతః ప్రజ్ఞం, న ప్రజ్ఞానఘనమ్' మాం. ౭. అని వర్ణించుట చూడనగును. ఇట -

'నాంతఃప్రజ్ఞం' అను పదముతో స్వప్నావస్థాసంబంధమును; 'న బహిఃప్రజ్ఞం' అను పదముతో జాగ్రదవస్థాసంబంధమును, 'నోభయతః ప్రజ్ఞం' అను పదముతో మూర్ఛావస్థాసంబంధమును, 'న ప్రజ్ఞానఘనం' అను పదముతో సుషుప్త్యవస్థాసంబంధమును స్పష్టముగా నిరాకరించి యున్నారు. పరమాత్మునకు స్వప్నాద్యవస్థాసంబంధము నంగీకరింతురేని యాథర్వణికు లిట్లు ఉపనిషద్వాక్యమున ప్రత్యక్షముగ నా సంబంధము నేల నిరాకరింతురు? ఆలంకారికవర్ణనము స్వభావమును బోధింపదు. కావున పర మేశ్వరునకు స్థానభేదమువలన స్వప్నాద్యవస్థాసంబంధ ముండుననుట యే విధముగను పొసగదు. (౧౩)

ఈ విషయముననే మరియొక హేతువును జూపుచున్నాడు.

## అరూపవదేవ హి తత్ ప్రధానత్వాత్ ౩-౨-౧౪

స్థానభేదమువలన బ్రహ్మమునకు స్వప్నాద్యవస్థలతో సంబంధ ముండుననుట యీ చెప్పబోవుకారణమువలనను యుక్తము కాదు. హి= కారణమేమన, తత్=ఆ బ్రహ్మము, ప్రధానత్వాత్=ప్రధానమగుటవలన-స్వామియగుటవలన, అరూపవదేవ = ఒకప్పుడును హస్తపాదాదులతో గూడిన రూపముగలది కానే కాదు.

ఈ సూత్రమున ప్రధానశబ్దము పరమేశ్వరవాచకముగ ప్రయోగింపబడినది. అతడు ప్రకృతిపురుషులకు స్వామి. ఈ శాస్త్రమునందే మూడవ యధ్యాయపు మూడవపాదమునకు చెందిన పదునొకండవ సూత్రమునందును ప్రధానపదము బ్రహ్మపరముగ వాడబడినది. ('ఆనందాదయః ప్రధానస్య' ౩-౩-౧౧.) రూపపదముకూడ నిట ఆకారము దెలుపునదిగ ప్రయోగింపబడినది. ఆకారము, శరీరము రెండును సమానార్థకములే. పరమేశ్వరునకు రూపము - శరీర మున్నపక్షమున నత డీశ్వరుడు కాజాలడు. లోకమున శరీరముగలవా డెవడును పరాపేక్షలేక స్వామి - ఈశ్వరుడు కాజాలకుండుట మన మెరుగుదుము. మరియు శరీరము శుభాశుభకర్మఫలముల ననుభవించుటకై లభించును. అందువలననే శాస్త్రాంతరములందు (భోగాయతనం శరీరమ్) 'భోగము - సుఖదుఃఖానుభవమునకు శరీరము ఇల్లు' అని చెప్పబడినది. సుఖదుఃఖములు కర్మఫలము లనుటలో సంశయము లేదు. పరబ్రహ్మపరమేశ్వరుడు సుఖదుఃఖముల నొసంగునట్టి శుభాశుభకర్మల నాచరింపడు. అట్టి కర్మల నాచరించువాడు జీవుడు. అతడే వాని కధికారి. (కర్మ ణ్యేవాధికారః తే) 'కర్మలోనే నీ కధికార మున్న'దని కృష్ణు డర్జునునకు గీతలో నుపదేశించియుండుట మన మెరుగుదుము. జగత్పతి పరమేశ్వరు డట్టి కర్మల నాచరింపడు. కావున పరమేశ్వరునకు శరీరసంబంధము లేదు, ఈ విషయమును వేదములు, ఉపనిషత్తులు స్పష్టముగ జెప్పుచున్నవి.

'అకాయ మవ్రణ మస్నావిరగ్ం శుద్ధమ్' య. ౪౦-౮.

'అశరీరమ్ శరీరేషు' కఠ. ౨-౨౨.

'అశబ్ద మస్పర్శ మరూప మవ్యయమ్' కఠ. ౩-౧౫.

'దివ్యో హ్యమూర్తః పురుషః' ముం. ౨-౧-౨.

'అపాణిపాదో జవనో గ్రహీతా' శ్వే. ౩-౧౯.

'కాయము - దేహము-తోను శబ్దస్పర్శాదిగుణములతోను, పాణిపాదాదీంద్రియములతోను సంబంధము లేక, మూర్తిమంతుడును కానివాడు పరమేశ్వరు' డని పై వాక్యముల యభిప్రాయము. కావున స్థానసంబంధము వలనను పరబ్రహ్మపరమేశ్వరునకు స్వప్నాద్యవస్థ లుండు ననుట యుక్తము కాదు. (౧౪)

పరమేశ్వరు డరూపు డందుమేని; రూపవంతునిగా వర్ణించిన వాక్యములు వ్యర్థము లగును గదా। అన :

### ప్రకాశవ చ్చావైయర్థ్యాత్ ౩-౨-౧౫

అవైయర్థ్యాత్='రూపవంతుడు' అని వర్ణించువాక్యములు వ్యర్థము కానందువలన, పరమేశ్వరుడు, ప్రకాశవత్ = ప్రకాశతుల్యు డని యెంచవలెను.

వేదాదిశాస్త్రములందు పరమేశ్వరుని రూపవంతునిగ వర్ణించు వాక్యములు కొన్ని యున్నవి :

'విశ్వత శ్చక్షు రుత విశ్వతో ముఖో
విశ్వతో బాహు రుత విశ్వతస్పాత్
సంబాహుభ్యాం ధమతి సంపతత్రైర్
ద్యావాపృథివీ జనయన్ దేవ ఏకః' ఋక్, ౮-౩-౧౬-౩.

'సహస్రశీర్షా పురుషః సహస్రాక్షః సహస్రపాత్
స భూమిం విశ్వతో వృత్వా ౽త్యతిష్ఠ ద్దశాంగులమ్'
ఋక్. ౮-౪-౧౭-౧.

'సర్వతః పాణిపాదం తత్సర్వతో ౽క్షిశిరోముఖం,
సర్వతః శ్రుతిమల్లోకే, సర్వ మావృత్య తిష్ఠతి' శ్వే. ౩-౧౬.

ఈ వాక్యములందు పరమేశ్వరునకు అనేకములగు హస్తపాదా ద్యవయవము లున్నట్లు చెప్పబడినది. ఈ వాక్యములు వ్యర్థములు కావల సినదేనా యని యందురేని: కాదు. పరమేశ్వరుడు చంద్రసూర్యాదుల ప్రకాశమువలె జగత్తునందలి పదార్థములలో నన్నింటిలోను వ్యాపించి యున్నా డని మాత్రమే యీ వాక్యములు బోధించును. పరమేశ్వరుని వ్యాపకత్వమును దెలుపుటకు లౌకికులు వ్యవహరించురీతి ననుసరించిన నీ వాక్యములు పరమేశ్వరుడు ప్రకాశమువలె నని ప్రకాశతుల్యుడుగా చెప్ప బడినాడు. ఈ తుల్యత యత డంతట నుండువాడని మాత్రమే బోధించును. వాస్తవమున ప్రకాశ మంతట నుండునేకాని ప్రతిపదార్థములోను లోపల వెలుపల నది యుండజాలదు. పరమేశ్వరు డట్లు కాక ప్రతివస్తువులోను (అంతర్ బహిశ్చ) లోపల వెలుపల నోతప్రోతమై యున్నట్లు వాక్య ములు వర్ణించినవి. అందువలన బ్రహ్మము వాస్తవమున రూపవంతము - శరీరముకలది - కాదు. బ్రహ్మముయొక్క వ్యాపకతను దెలుపుచు నీ వాక్య ములు సార్థకము లగునని సూత్రాభిప్రాయము. (౧౫)

ప్రకాశము కాని బ్రహ్మమును ప్రకాశతుల్యముగ జెప్పుట యుక్త మెట్లగు నన :

## ఆహ చ తన్మాత్రమ్ ౩-౨-౧౬

మంత్రములద్వారమున పరబ్రహ్మము ప్రకాశమాత్రముగ వర్ణింప బడినది. 'ధ్రువం జ్యోతి ర్నిహితం, ఋ. ౪-౫-౧౧-౫,' బ్రహ్మము

ప్రకాశమయినందున ప్రకాశతుల్యత చెప్పబడినది. అందువలన రూపవంత మని చెప్పువాక్యములు వ్యర్థములు కావు. సామ్యమును బోధించి యవి సార్థకము లగునని భావము. (౧౮)

### దర్శయతి చాథో అపి స్మర్యతే ౩-౨-౧౯

ఉపనిషత్తులు, స్మృతులు కూడ బ్రహ్మమును ప్రకాశ మనియే వర్ణించినవి. మంత్రమున చెప్పినదానినే ఉపనిషత్తులు మన్వాదిస్మృతులు కూడ చెప్పును. చూడుడు:

'తచ్ఛుభ్రం జ్యోతిషాం జ్యోతిః' ముం. ౨-౨-౯.

'పరం జ్యోతి రుపసంపద్య' ఛాం. ౮-౧౨-౩.

'జ్యోతిషా మపి తజ్జ్యోతిః' గీత ౧౨-౧౭.

ఈ వాక్యములందు పరమేశ్వరుడు జ్యోతి - ప్రకాశ - పదముతో వర్ణింపబడినాడు. కావున బ్రహ్మము ప్రకాశము - జ్యోతి - కాదనరాదు. (౧౯)

### అత ఏవ చోపమా సూర్యకాదివత్ ౩-౨-౧౮

అత ఏవచ = బ్రహ్మము ప్రకాశస్వరూప మగుటవలననే, సూర్యకాదివత్ = సూర్యుడు, అగ్ని మున్నగువానివలె, అని, ఉపమా = బ్రహ్మమున కుపమానము శ్రుతిస్మృతులలో చెప్పబడుచున్నది.

'వేదాహ మేతం పురుషం మహాంత మాదిత్యవర్ణం'
య. ౩౧-౧౮.

'జ్యోతి రివాధూమకః' కఠ. ౪-౧౩.

ఈ వాక్యములలో ఆదిత్యవర్ణుడు, జ్యోతిరివ - అగ్నివలె నని పరమేశ్వరుడు సూర్యునితోను, ధూమరహితమగు నగ్నితోను ఉపమింపబడినాడు, భగవంతుడు ప్రకాశస్వరూపుడు - జ్ఞానస్వరూపుడు కానియెడల

సూర్యాదులతో నుపమింపబడడు. వ్యాపకత్వగుణసాదృశ్యము ఉపమానము నకు ప్రయోజకము. కావున బ్రహ్మము ప్రకాశస్వరూప మనుట దోషము కాదు. (౧౮)

సూర్యాదుల నుపమానముగ గ్రహించినందున బ్రహ్మము ప్రకాశ స్వరూపమని యంగీకరింతుమేని, బ్రహ్మము సూర్యాదులవలె పరిచ్ఛిన్నము - ఏకదేశమున నుండునది - అని యంగీకరింపవలసివచ్చును. సూర్యు డాకాశదేశమున నొకచో నుండి లోకమున గల వస్తువులను ప్రకాశింపజేయుచున్నాడు. ప్రతిబింబరూపమున జలాదివస్తువులలో నుండి అంతర్యామి కూడ నగుచున్నాడు. అట్లే బ్రహ్మముకూడ నెక్కడనో యొకచోట నుండి సమస్తజగత్తును ప్రకాశింపజేయుచు, తదంతర్యామికూడ నగునని యెంచవలసివచ్చును. అందువలన బ్రహ్మము వ్యాపకము కాక పరిచ్ఛిన్నమగునుకదా ! యన - సమాధానము :

### అంబువ దగ్రహణాత్తు న తథాత్వమ్ ౩-౨-౧౯

అంబువత్ = జలములోవలె, అగ్రహణాత్ = బ్రహ్మప్రతిబింబము కనబడనందున, న తథాత్వమ్ = సూర్యాదులవలె బ్రహ్మము పరిచ్ఛిన్నము కాదు.

జలము, అద్దము మున్నగువానియందు సూర్యాది పరిచ్ఛిన్నపదార్థముల ప్రతిబింబములు కనిపించును. కాని, బ్రహ్మముయొక్క ప్రతిబింబమ న్లైందును కనిపింపదు. వేదాదిశాస్త్రములందును బ్రహ్మకు ప్రతిబింబ ముండునని యెక్కడను వర్ణింపబడదు. బ్రహ్మమునకు ప్రతిబింబ మేర్పడకుండుటకు, నది కనబడకుండుటకును కారణము బ్రహ్మము వ్యాపకము, వస్తువులలో నంతర్యామియు నై యుండుటయే కాని, మరియొండు కాదు.

ప్రతిబింబించువస్తువు దేనియం దది ప్రతిబింబించునో దానియందుండదు. సూర్యుడు జలములోకాని, అద్దమునందుకాని వ్యాపకుడు కాడు.

అంతర్యామియు కాదు. అందువలన సూర్యప్రతిబింబము జలాదులలో గ్రహింపబడుచున్నది. అట్లు గ్రహింపబడదు, కావున బ్రహ్మము సూర్యాదులవలె పరిచ్ఛిన్న మనజనదు. (౧౯)

బ్రహ్మము పరిచ్ఛిన్నముకాక వ్యాపకమై యన్నిటియందు నంతర్యామి యయి యున్నదని యంగీకరింతుమేని, వేనియం దది యంతర్యామియై యున్నదో యావస్తువులలో వృద్ధిక్షయములు జరుగుచుండును. వానితోబాటు అంతర్యామియగు బ్రహ్మమునందును వృద్ధిక్షయము లంగీకరింపవలసివచ్చును. వృద్ధిక్షయములు వికారములు. నిర్వికారియైన బ్రహ్మమునందు వృద్ధిక్షయము లంగీకరించుట యుక్తము కాదు. కావున బ్రహ్మము అపరిచ్ఛిన్నము - వ్యాపకము - అనుటయు సమంజసము కాదన - సమాధానము :

## వృద్ధిహ్రాసభాక్త్వ మంతర్భావా దుభయ- సామంజస్యా దేవమ్ ౩-౨-౨౦

(పూర్వసూత్రమునుండి 'న' అనువర్తించును.)

అంతర్భావాత్ = బ్రహ్మము సర్వభూతములయందు వర్తించుచున్నందున, వృద్ధిహ్రాసభాక్త్వం = వృద్ధిక్షయములు గలదియగుననుట, న = సరికాదు. కారణ మేమన : ఉభయ సామంజస్యాత్ ఏవమ్ = పదార్థములగుణదోషములు ఆ పదార్థములయం దాసంగము కలవానికే ప్రాప్తించుట యుచిత మగును.

కొండొకవస్తువునందు మరియొకవస్తు వున్నంతమాత్రమున దాని గుణదోషములను నది బొందనేరదు. సంగము కలిగియున్న పదార్థమునందే గుణదోషము లంటును. గుణదోషములు సంక్రమించుటకు సంగమే కారణము. ఆకాశము సర్వపదార్థములలో నుండును, కాని, యాపదార్థములకు

కలుగు వృద్ధిక్షయములు ఆకాశమునందు కలుగవు - దాని నంటవు. ఆకాశము సర్వపదార్థములం దుండునేకాని వానిసంగము - వానియం దాసక్తి - దాని కేమియు నుండదు. అందువలన పదార్థములు పెరిగినను, తరిగినను ఆకాశ మెప్పటియట్ల యుండును. అట్లే బ్రహ్మ వ్యాపక మగుటచే నెల్ల వస్తువులలో నంతర్బాహ్యముల నొకటిగ నుండును. వస్తువికారములు దాని నంటవు. అంటకుండుటయే యౌచిత్యము. కావున బ్రహ్మము అపరిచ్ఛిన్నము - వ్యాపకము - అనుటలో నెట్టిదోషమును నుండదు. బ్రహ్మము నిర్వికారమే, అపరిచ్ఛిన్నమే యని సూత్రాభిప్రాయము. (౨౦)

ఈ విషయమును నిరూపించుట కింకొకహేతువు :

దర్శనాచ్చ                    ౩-౨-౨౧

ఉపనిషద్వాక్యములనుబట్టి చూచినను బ్రహ్మ మంతర్యామి యైనందున పదార్థవృద్ధిక్షయములతో గూడి వికారవంత మగుననుట యుక్తము కాదు.

'సూర్యో యథా సర్వలోకస్య చక్షు
ర్న లిప్యతే చాక్షుషై ర్బాహ్యదోషైః.
ఏక స్తథా సర్వభూతాంతరాత్మా
న లిప్యతే లోకదుఃఖేన బాహ్యః.' కఠ. ౫-౧౧.

'సూర్యుడు సర్వలోకమునకు నేత్రమయ్యు, నేత్రదోషములతో లిప్తుడు కానట్లు, బ్రహ్మము సర్వభూతములకు నంతరాత్మ యైనను ప్రాణుల దుఃఖముతో లిప్తము కాదు. దుఃఖములకు దూరమై యుండును.

'సర్వస్య వశీ సర్వ స్యేశానః సర్వ స్యాధిపతిః, స నసాధునా కర్మణా భూయాన్ నో ఏవాసాధునా కనీయాన్' బృ. ౪-౪-౨౨.

'సర్వమును వశమునం దుంచుకొని, సర్వమున కీశుడై సర్వాధిపతి

యైన పరమేశ్వరుడు ప్రాణుల శుభకర్మమువలన గొప్పవాడు కాని, అశుభ కర్మమువలన చిన్నవాడు కాని కాడు. అతనికి కర్మదోషము లంటవు.'

ఇట్టి ఉపనిషద్వాక్యోపదేశములవలనను బ్రహ్మము వ్యాపకము - అపరిచ్ఛిన్నమే యనియు, అందువలన వికారములకు లోను కా దనియు స్పష్టమగుచున్నది. (౨౧)

## పంచమాధికరణము

స్థానముకంటె - జీవునికంటె - సూక్ష్మమగు బ్రహ్మమునకు స్వప్నాద్యవస్థ లుండవని నిరూపింపబడినది. స్వప్నాద్యవస్థలు లేని పరబ్రహ్మము మాత్ర మొకటియున్న దని యెట్లు చెప్పనగు నన - బ్రహ్మమును ప్రతిపాదించుచున్నాడు.

ప్రకృతైతావత్త్వం హి ప్రతిషేధతి తతో
బ్రవీతి చ భూయః ౩-౨-౨౨

'నేతి నేతి' యనెడి ఉపనిషద్వాక్యము, ప్రకృతైతావత్త్వం హి = ప్రాసంగికముగ చెప్పబడిన మూర్తామూర్తలక్షణాత్మకమగు రూపమును - బ్రహ్మముయొక్క తదాత్మకతను మాత్రమే, ప్రతిషేధతి = నిషేధించుచున్నది: కాని, బ్రహ్మముయొక్క యునికిని నిషేధింపదు. కారణ మేమన: తతః=తరువాత, భూయః బ్రవీతి చ = మరల మూర్తామూర్తములకంటె వేరుగ బ్రహ్మమును ప్రతిపాదించుచున్నది.

బృహదారణ్యకములో మూర్తామూర్తబ్రాహ్మణమునందు, (ద్వే వావ బ్రహ్మణో రూపే మూర్తం చామూర్తం చ. బృ. ౨-౩-౧) 'మూర్తము, అమూర్తము నని బ్రహ్మకు రెండురూపము లున్నవి' యని ప్రారంభించి, (అథాత ఆదేశో నేతి నేతి. బృ. ౨-౩-౬) 'ఇంతకు మించి యన్యము లేదు, అన్యము లేదు' అని ఆదేశింపబడినది, ఇట 'లేదు, లేదు'

అను నీ యాదేశము దేనిని లే దనుచున్నది? బ్రహ్మమే లేదనియా? లేక బ్రహ్మమునకు మూర్తామూర్తరూపము లేదనియా? యని సంశయము కలుగును. 'బ్రహ్మమే లేదు - బ్రహ్మమున కునికియే లేదు' అని పూర్వ పక్షము. కాదు, ప్రాసంగికముగ చెప్పబడిన మూర్తామూర్తరూపద్వయాత్మ కత్వము బ్రహ్మమునకు లేదు' అని సిద్ధాంతము.

పూ. ప. : ఈ ప్రకరణమున బ్రహ్మమునుగూర్చియే చెప్పబడుట వలన 'నేతి, నేతి' యను నీ యాదేశము బ్రహ్మముయొక్క 'సత్తా=ఉని కియే లేదు - బ్రహ్మమే లేదు' అని చెప్పును, కాని యన్యమును చెప్పదు. నిషేధము - లేదనుట - ఏది లేదో చెప్పవలసియున్నది. నిషేధము నిషే ధ్యము నపేక్షించును. 'నేతి నేతి' యను వాక్యము లేదు - లేదు. (లేక) కాదు - కాదు - అని మాత్రమే చెప్పుచున్నది కాని, 'ఇది లేదు, అది లేదు' ఇది, అది యని యొకపదార్థమును ప్రత్యేకించి ప్రతిషేధించుచున్నట్లు - (లేదని చెప్పుచున్నట్లు) వాక్యమున గానము. కాని ప్రకరణమునుబట్టి బ్రహ్మము, 'మూర్తము, అమూర్తము' అను రూపద్వయము అను నీ రెండుపదార్థములు 'నేతి నేతి' లేదు; లేదు అని చెప్పువాక్యమునకు విషయ ములుగ గ్రహింపనగును; కాని, యీ నిషేధము బ్రహ్మకు సంబంధించిన దనియే చెప్పవలెను - బ్రహ్మమే లేదు - బ్రహ్మమునకు ఉనికియే లేదు - అని యభిప్రాయము. మూర్తామూర్తరూపములు లేవని చెప్పుట యీ 'నేతి - నేతి' వాక్యమునకు ప్రయోజనము కాదు. కారణ మేమన : 'అథాత ఆదేశః' బృ. ౨-౩-౬. అను నీవాక్యముతో బ్రహ్మనిరూపణమే నిర్దేశింప బడినది; కాని, మూర్తామూర్తస్వరూపము కాదు. 'అథాత ఆదేశః' అను వాక్యముతో బ్రహ్మనిరూపణము ప్రారంభించి 'నేతి నేతి' 'లేదు - లేదు' అని ఆదేశించుచున్నది. కాబట్టి బ్రహ్మమే - బ్రహ్మకు సత్తా - ఉనికి - యే లేదని తేలుచున్నది. అని ప్రాప్తింపగా -

సమాధానము : 'నేతి నేతి' అను నీ ప్రతిషేధము ప్రకరణ ప్రారం

భమున చెప్పబడిన 'మూర్తామూర్త రూపద్వయాత్మకము బ్రహ్మము' అను విషయమునకు చెందినదే కాని బ్రహ్మ సత్తా - ఉనికికి-చెందినది కాదు. 'ప్రకరణప్రారంభమున బ్రహ్మమునకు మూర్తము, అమూర్తము అనెడి రెండురూపము లున్నవి' యని ప్రారంభింపబడినది. 'నేతి నేతి' అను వాక్యము బ్రహ్మమును నిషేధించుపక్షమున నీరూపద్వయమును గూర్చి యారంభించుటయే వ్యర్థమగును. రూపద్వయమును గూర్చి చెప్ప మొద లిడి చివరకు 'బ్రహ్మసత్త'ను నిషేధించునెడల ఉపక్రమోపసంహారము లలో నేకత యుండదు. ఆరంభ మొకటి యంత మింకొకటి యగునని భావము. ఈ ప్రకరణము బ్రహ్మమును దెలుప నుద్దేశింపబడినదియే. కాని, బ్రహ్మమే లేదని చెప్పుటకు కాదు. బ్రహ్మమును తెలిసికొనుట కుపాయ ముగా లింగశరీరముతో నంతమగు సూక్ష్మప్రకృతిని నద్యాత్మముగను, మహత్తత్వముతో నంతమగు పృథివ్యాదినిఖిలజగత్తును నధిదైవముగను మూర్తామూర్తభేదముతో రెండుగ విభజించి, దానిని బ్రహ్మకు రూపముగ వివరముగ చెప్పబడినది. ఇంద్రియగోచరమగు నీ ప్రపంచము తన జన్మ స్థితిలయములకు కారణముగ బ్రహ్మమును నిరూపించును - తెలియ జేయును. ప్రపంచము బ్రహ్మమును రూపించును - నిరూపించును - తెలియ జేయును. కాబట్టి యది బ్రహ్మరూపమని (మూర్తం చామూర్తంచ బ్రహ్మణో ద్వే రూపే) చెప్పబడినది. అందువలన ప్రపంచము రూపము, బ్రహ్మము రూపి - రూపము గలది యని తెలియనగును. అందు రూపి - బ్రహ్మము - 'నేతి - నేతి' అను వాక్యముచే నిషేధింపబడిన - లేదని చెప్ప బడిన - యెడల నీ ప్రకరణము బ్రహ్మముయొక్క రూపముగ ప్రపంచ మును ప్రదర్శించుటకు ప్రారంభించుటయే వ్యర్థమగునని భావము. ఇక మూర్తామూర్తరూపద్వయాత్మకమగు నీ ప్రపంచమును నిషేధించుటయు నీవాక్యమునకు (నేతి - నేతి) విషయము కాదని పూర్వపక్షమున స్వయ ముగ పూర్వపక్షి చెప్పియే యున్నాడు. కాబట్టి 'నేతి, నేతి వాక్యము బ్రహ్మ

మును, ప్రపంచమును రెంటిని ప్రతిషేధించుచున్నది' అని చెప్పుదుమేని - అపుడు శూన్యవాదమును ప్రతిపాదించు నని చెప్పవలసివచ్చును. ఉపనిషత్తు శూన్యమును ప్రతిపాదించు ననుట యుక్తము కాదు.

ఇంతేకాక, (బ్రహ్మ తే బ్రవాణి. బృ. ౨-౧-౧) 'నీకు బ్రహ్మమును గూర్చి చెప్పెదను'. అని ప్రారంభింపబడినందున - ఉపక్రమింపబడినందున 'నేతి' వాక్యము బ్రహ్మమును నిషేధించు ననుట తగదు. అట్లు నిషేధించినచో ఉపక్రమమును విరోధించిన ట్లగును. మరియును, (అసన్నేవ స భవతి అసద్ బ్రహ్మేతి వేద చేత్. తై. ౨-౬) 'బ్రహ్మము లేదనువాడు తానే లేనివా డగును' అని బ్రహ్మమును నిషేధించువానిని ఉపనిషత్తు నిందించుచున్నది. కావున ఉపనిషద్వాక్యము బ్రహ్మము నిషేధించు ననుట యుక్తము కాదు.

బ్రహ్మము వాఙ్మనసాతీత మని యట నట జెప్పబడినను, అయ్యది యలౌకిక మని చెప్పుట యా వాక్యాభిప్రాయమగును; కాని బ్రహ్మము లేద నుట దానియభిప్రాయము కాదు. అందువలననే, (అస్తీత్యే వోపలబ్ధవ్యః. కఠ. ౬-౧౩) 'బ్రహ్మ మున్నదనియే దానిని పొందవలెను' అని యుపదేశింపబడినది.

'ప్రకరణారంభమున ముందుగా బ్రహ్మమునకు గల మూర్తము, అమూర్తము నను రూపద్వయమును నిరూపించి చివరకు 'నేతి - నేతి' యని యా రూపద్వయము వాస్తమున లేనిది - మిథ్య యని నిషేధింపబడినది. అందువలన మూర్తామూర్తరూపద్వయము కల్పితమే కాని వాస్తవము కాదు. ఆ కల్పన కాధారముగ బ్రహ్మము మాత్రము మిగిలి యుండును'. అని కొందఱు వ్యాఖ్యానము చేయుదురు: కాని, యది ఉపనిషద్వాక్యార్థము కాదనియే యెంచవలెను.

బ్రహ్మమును దెలుపుటకు ఉపాయముగా - సాధనముగా - మూర్తా

మూర్తలక్షణమగు ప్రపంచము వర్ణింపబడినది. అది తెలియక యెవరేని బుద్ధిదోషమువలన మూర్తము - అమూర్తము నగు ప్రపంచమే బ్రహ్మమని యెంచవచ్చును. అట్లు తలంపకుండుటకుగాను బ్రహ్మమును వేరుగ నిరూపించుటకే 'అథాత ఆదేశో నేతి నేతి' బృ. ౨-౩-౬. అనువాక్యము చెప్పబడినది. ఈ వాక్యమునందలి 'అథ' - తరువాత అనుపదము, - 'ఇంతకు పూర్వము బ్రహ్మజ్ఞానమునకు ఉపాయముగ ప్రపంచముయొక్క మూర్తామూర్తరూపములు నిరూపింపబడినవి. ఇకముందు బ్రహ్మము నిరూపింపబడును' - అని తెలుపుటకే ప్రయోగింపబడినది. లేకున్న నది వ్యర్థమగును. ఈ వాక్యమునందలి 'ఇతి'పదము పూర్వము చెప్పబడిన 'మూర్తామూర్త రూపము'ను బోధించును. 'న' పదము నిషేధమును తెలుపును. కార్యకారణ భేదముచే భిన్నమగు మూర్తామూర్తలక్షణ మగు రూపము పూర్వము నిరూపింపబడినందున, ప్రకృతినిషేధమునకు విషయము బ్రహ్మముకాదు. దానికంటె భిన్నమే కావలెను. 'నేతి' ఉపనిషద్వాక్యమువలన బ్రహ్మప్రతిషేధముకాని, రూపప్రతిషేధముకాని కాదు. మరి యేమగు ననః బ్రహ్మము మూర్తామూర్తలక్షణము గల రూపద్వయాత్మకము కాదని చెప్పుటయే. ఈ యభిప్రాయమునే స్పష్టము చేయుచు, వాక్యశేషమున ఉపనిషత్తు మూర్తామూర్తరూపద్వయముకంటె బ్రహ్మము భిన్నమే యని చెప్పుచున్నది. చూడుడు :

> 'న హ్యేతస్మా దితి నేతి, అన్యత్ పరమస్తి,
> అథ నామధేయం సత్యస్య సత్య మితి' బృ. ౨-౩-౬.

'ఇంతకంటె మించిన దింకొకటి లేదని యెంచవలదు. అది సత్యమునకు సత్యము. దాని నామధేయము సత్యము' - అను నీ వాక్యమున, 'ఇంతకు పూర్వము వర్ణించిన మూర్తామూర్తములకు మించిన దింకొకటి లేద'ని యెంచవలదు. బ్రహ్మ మున్నది. దానిపేరు సత్యము' అని బ్రహ్మసత్త - బ్రహ్మముయొక్క యునికి స్పష్టముగ చెప్పబడినది. బ్రహ్మమే

లేకున్న 'అది సత్యమునకు సత్యము' అని యెట్లు వర్ణింపబడును ? లేనిది సత్యపదముతో నెట్లు వర్ణింపనగును ? కాని, 'బ్రహ్మము మూర్తామూర్త రూపమగు ప్రపంచమే - ప్రపంచాత్మకమై బ్రహ్మము, వేరు కాదు' అనుట 'నేతి నేతి' వాక్యము నిషేధించుచున్న దనుట సమంజసమే. కాబట్టి కార్య కారణరూపమున దృశ్యమానప్రపంచముకంటె వేరుగ బ్రహ్మము కలదను టలో దోష మావంతయు లేదు. (౨౨)

మూర్తామూర్తరూపప్రపంచముకంటె వేరుగ బ్రహ్మము కలదేని మన కేల కనిపింపదు ? అన :

తదవ్యక్త మాహ హి	౩-౨-౨౩

తత్=ఆ బ్రహ్మము, అవ్యక్తం = ఇంద్రియములకు గోచరము కాదు - తెలియదు. హి = కారణమేమన, ఆహ = ఉపనిషత్తు అట్లే చెప్పినది.

వాక్కు, మనస్సు మున్నగు నింద్రియములకు బ్రహ్మము తెలియదు. అది అత్యంతసూక్ష్మము. కావున బ్రహ్మము లేనందున నింద్రియములకు తెలియదనుట సరికాదు. అందువలననే ఉపనిషత్తును నట్లే చెప్పుచున్నది.

'నైవ వాచా, న మనసా, ప్రాప్తుం శక్యో న చక్షుషా'
కఠ. ౬-౧౨.

'వాక్కు, చక్షువు, మనస్సు' అను నింద్రియముల కది తెలియదు.'

'న చక్షుషా, గృహ్యతే నాపి వాచా
నాన్యై ర్దేవైః తపసా కర్మణా వా' ముం. ౩-౧-౮.

కన్ను, వాక్కు, మున్నగు ఇంద్రియములకుగాని, తపస్సుకుగాని, కర్మకుగాని అందదు.'

'అవ్యక్తో౽క్షర ఇత్యుక్తః' గీత. ౮-౨౧.

'అవ్యక్తుడు - ఇంద్రియములకందనివాడు, నాశము లేనివాడు' నని గీతయందు చెప్పబడినది. (౨౩)

బ్రహ్మ మవ్యక్తమైనచో, 'తమేవ విదిత్వా౽తిమృత్యు మేతి' యజు. ౩౧-౧౮. 'అతనిని సాక్షాత్కారము చేసికొనియే మృత్యువును తరించును' అని వేదము చెప్పనేల ? ఇంద్రియములకు తెలియనిదానిని సాక్షాత్కారము చేసికొను టెట్లు ? అన :

అపి సంరాధనే ప్రత్యక్షానుమానాభ్యామ్ ౩-౨-౨౪

అపి = ఆయవ్యక్తబ్రహ్మముకూడ, సంరాధనే = శ్రవణమననాది సాధనసంపత్తి బాగుగ నేర్పడినపుడు ప్రత్యక్షము కాగలదు. అని, ప్రత్యక్షానుమానాభ్యామ్=శ్రుతిస్మృతులవలన తెలియుచున్నది.

కొందఱు ముముక్షువులైన యోగులు శ్రవణ మననాది సాధనసంపదలతోకూడ దీర్ఘకాలము ప్రయత్నించి నిర్వికల్పసమాధియందు స్వయముగ నా యవ్యక్త - సూక్ష్మ - బ్రహ్మమును సాక్షాత్కారము చేసికొందురు. భగవత్కృపాపాత్రులయిన వారికి లభ్యము కాని దేముండును ? ఈవిషయమును ఉపనిషత్స్మృతులు స్పష్టముగా నంగీకరించుచునే యున్నవి.

'య మేవైష వృణుతే తేన లభ్య స్తస్యైష
ఆత్మా వివృణుతే తనూం స్వామ్' కఠ. ౨-౨౩.

'పరమాత్మను వరించినవా డతని బొందును. అతనికి పరమేశ్వరుడు తన స్వరూపము నవగతము చేయును.'

'సూక్ష్మతాం చాన్వవేక్షేత యోగేన పరమాత్మనః' మ. ౫-౬౫.
'యోగముద్వారమున పరమాత్మని సూక్ష్మతను జూచును.' (౨౪)

ముముక్షువులకు బ్రహ్మసాక్షాత్కారము కావలెననిన సంరాధనము మాత్రము చాలునా ? మరి యొం దవసర మున్నదా ?

**ప్రకాశాదివ చ్చావై శేష్యం ప్రకాశశ్చ**
**కర్మ ణ్యభ్యాసాత్** ౩-౨-౨౫

ప్రకాశాదివత్=ప్రకాశము,జలము మున్నగువానివలె, అవై శేష్యం= అవిభాగ మపేక్షింపబడును. ప్రకాశః చ=ప్రకాశాదులవలె నవిభాగాపేక్ష కూడ, కర్మణి=సంరాధనవిషయమున, అభ్యాసాత్ = పలుమారు అనుష్ఠించుటవలన గలుగును.

జలముతో జలమునకు, అగ్నితో నగ్నికి భేద ముండనట్లు, శుద్ధ మగు జీవాత్మకు పరమాత్మసామ్య మేర్పడును. బ్రహ్మసాక్షాత్కారము నభిలషించు ముముక్షువులు బ్రహ్మచర్యాదివ్రతములను సాధించుచు, నిత్య మభ్యాసపరులై యత్నించుచుండ నిర్వికల్పసమాధి యేర్పడును. వారికి చిత్తము విలయము కాగా, స్వయముగ శుద్ధస్వరూపులు కావున పరమేశ్వరునికి సములగుదురు. ('సమాధి సుషుప్తి మోక్షేషు బ్రహ్మరూపతా' ౫-౧-౧౬.) 'సమాధిలోను, సుషుప్తియందును, మోక్షమునందును జీవులకు బ్రహ్మరూపత కలుగు'నని సాంఖ్యులు చెప్పుచున్నారు. కాబట్టి బ్రహ్మదర్శనార్థము సంరాధనమె ట్లవసరమో యట్లే బ్రహ్మవిశిష్టత - బ్రహ్మసామ్యము - అవసరమగునని సూత్రాభిప్రాయము. (౨౫)

అప్పుడు ముముక్షువులకు బ్రహ్మదర్శన మెట్లు కలుగు ననః

**అతోఽనంతేన తథా హి లింగమ్** ౩-౨-౨౬

అతః=ఆయవైశిష్ట్యమువలన, అనంతేన=అపరిచ్ఛిన్నరూపముతో - వ్యాపకరూపముతో బ్రహ్మదర్శనము కల్గును. తథా హి=అట్లే, లింగమ్= మంత్రము లింగమును దర్శింపజేయుచున్నది.

శ్రవణమననాదులను నిరంతర మభ్యసించుటవలన శుద్ధుడైన జీవు నకు సమాధియందు వ్యాపకుడైన పరమేశ్వరుని సాక్షాత్కారము లభిం చును. పరిచ్ఛిన్నముగా - అవ్యాపకముగ దెలియునది బ్రహ్మము కాదు.

'తద్విష్ణోః పరమం పదం సదా పశ్యంతి సూరయః
దివీవ చక్షు రాతతమ్' ఋ. ౧-౨-౭-౨౦.

అను నీ మంత్రమున ఆత్మవిదులు పరమేశ్వరు నంతటజూతురు. ఆకసమున సూర్యుడు తన ప్రకాశముతో వ్యాపకుడై యున్నట్లు వ్యాపక పరమేశ్వరుని గాంతురని భావము. (౨౬)

మూర్తామూర్తరూపమగు జగత్తుకంటె భిన్నముగ దానికి కారణ మగు బ్రహ్మము కలదని నిరూపింపబడినది; కాని, దానిస్వరూప మెట్టిది? అది జ్ఞానమున కాశ్రయమా? లేక జ్ఞానస్వరూపమా? జ్ఞానమున కాశ్రయ మందురేని, ('ప్రజ్ఞానం బ్రహ్మ' ఐ. ౩-౧) 'ప్రజ్ఞానమే బ్రహ్మము. ('సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ' బృ. ౩-౪-౨౮). 'సత్యము, జ్ఞానము, అనంతము బ్రహ్మము' అని జ్ఞానము స్వరూపముగ వర్ణింపబడుట విరుద్ధ మగును. జ్ఞానము బ్రహ్మకు స్వరూపమే యని రెండవపక్షము నంగీక రింతు రేని, ('యః సర్వజ్ఞః సర్వవిత్' ముం. ౧-౧-౯) 'అతడు సర్వజ్ఞుడు, సర్వవిదుడు' నని చెప్పిన ఉపనిషద్వాక్యములు విరుద్ధము లగును. ఇందు బ్రహ్మము జ్ఞానమున కాశ్రయముగ జెప్పబడినది. ఇట్లు రెండుపక్షములు నంగీకరింప శక్యము కానందున బ్రహ్మ మిట్టిదని చెప్ప నలవికాదు. అట్టియెడ బ్రహ్మము నంగీకరింపనేల? యన సమాధానము:

ఉభయవ్యపదేశాత్త్వహికుండలవత్ ౩-౨-౨౭

ఉభయవ్యపదేశాత్=రెండువిధములుగ నుపదేశించుటవలన, అహి కుండలవత్=కుండలాకారమున నున్న సర్పమువలె, బ్రహ్మము నంగీక రింపవలెను.

సర్పము చుట్టచుట్టుకొని పండుకొనును. అప్పుడు సర్పకుండలము, కుండలిసర్పము నని రెండువిధములుగ వ్యవహరింతుము. అట్లే బ్రహ్మము కూడ జ్ఞానస్వరూపము, జ్ఞానాశ్రయము నని రెండువిధముల వ్యవహరింప బడుట దోషావహము కాదు. (౨౭)

మరియొక దృష్టాంతముతో నీ విషయమునే స్పష్టపరుచుచున్నాడు.

ప్రకాశాశ్రయవద్ వా తేజస్త్వాత్ ౩-౨-౨౮

తేజస్త్వాత్ = తేజ స్త్వసామాన్యమువలన, ప్రకాశాశ్రయవత్ = ప్రకాశమున కాశ్రయమగు తేజస్సువలె, బ్రహ్మము జ్ఞానాశ్రయమని యెరుగునది.

('తేజోఽసి శుక్ర మమృతమ్' య. ౨౨-౧.) 'బ్రహ్మము తేజస్సు, శుక్రము, అమృతము' నని వర్ణింపబడినది. అగ్ని, విద్యుత్తు మున్నగు పదార్థములు ప్రకాశస్వరూపముగలవై, తమచే ప్రకాశింపజేయబడు వస్తు సంబంధమువలన ప్రకాశకములు - ప్రకాశమున కాశ్రయము లగుచున్నవి. అట్లే బ్రహ్మము జ్ఞానస్వరూపమై జ్ఞేయ - తెలియదగిన పదార్థసంబంధము వలన జ్ఞానమున కాశ్రయ మగుచున్నది. కాబట్టి బ్రహ్మము జ్ఞానాశ్రయము, జ్ఞానస్వరూపము నని వేదాదులందు వర్ణింపబడుట దోషము కాదు. (౨౮)

పూర్వవద్ వా ౩-౨-౨౯

జీవాత్మవలె బ్రహ్మమునుకూడ నిశ్చయింపనగును. పూర్వశబ్దముచే నీ సూత్రమున జీవాత్మ గ్రహింపదగును. పూర్వాధ్యాయమున జీవాత్మను గురించి వర్ణింపబడుటచేతను, ప్రకృతి, పురుషేశ్వరులలో నీశ్వరునికంటె పూర్వమున గ్రహింపబడుటచేతను పూర్వశబ్ద మిట జీవబోధక మగునని భావము.

'ఏష హి ద్రష్టా, స్ప్రష్టా, శ్రోతా, ఘ్రాతా, రసయితా మంతా,

బోద్ధా, కర్తా, విజ్ఞానాత్మా, పురుషః' ప్ర. ४-౯. 'జీవుడు జ్ఞాన స్వరూపము గలవాడయ్యు, దర్శన, స్పర్శన, శ్రవణాది జ్ఞానముల కాశ్రయమయినట్లు పరబ్రహ్మ పరమాత్మకూడ జ్ఞానము స్వరూపముగా గలిగినదైనను జ్ఞానాశ్రయమని చెప్పనగునని సూత్రాభిప్రాయము. (౨౯)

మరియొక హేతువు :

ప్రతిషేధాచ్చ 3-౨-30

గుణగుణిభావ ప్రతిషేధము వలనను బ్రహ్మము జ్ఞానస్వరూప మసదగి యున్నదని సూత్రార్థము. (౩౦)

## షష్ఠాధికరణము

ఇట్లు దృశ్యమాన ప్రపంచముకంటె పరము - సూక్ష్మమైన బ్రహ్మము కలదని నిర్ణయించి, ప్రస్తుతము బ్రహ్మముకంటె పర మింకొకటి లేదని నిరూపింప పూర్వపక్షము నారంభించుచున్నాడు.

పరమతః సేతూన్మాన సంబంధ
భేద వ్యపదేశేభ్యః 3-౨-3౧

సేతూన్మాన.........వ్యపదేశేభ్యః=సేతూన్మాన సంబంధాదుల వ్యపదేశమువలన, అతః=బ్రహ్మముకంటె, పరమ్ = సూక్ష్మమైనది, కలదని యంగీకరింపవలెను.

'అథ య ఆత్మా ససేతు ర్విధృతిః.' ఛాం. ౮-४-౧. అను నీ వాక్యమునందు బ్రహ్మము సేతువుగా వర్ణింపబడినది. సేతువు - ఆనకట్టతో బ్రహ్మము పోల్చిచెప్పబడినది. సేతువునకు పరమున - అవతల - నేమియు లేదన రాదు. సేతువున కవతల ప్రదేశముండుట లోకసిద్ధము. అట్లే బ్రహ్మమునకు సేతువు సామ్యము చెప్పబడినందున బ్రహ్మమునకు పరమున నేదో యుండునని తెలియుచున్నది.

ఉన్మానవ్యపదేశమువలన కూడ బ్రహ్మమునకు పరమున నేదో యుండునని యెంచనగును. 'పాదోఽస్య విశ్వా భూతాని.' ఋ.౮-౪-౧౭-౩ 'సమస్తభూతములు బ్రహ్మమున కొక పాదము'అని చెప్పినందున బ్రహ్మమునకు కొలత యేర్పడుచున్నది. బ్రహ్మము నాలుగు పాదములు కలది యనుటచే నది పరిమితమై యంతకంటె పరమయిన దింకొకటి యున్నదని తెలియనగుచున్నది.

ఇట్లే, సంబంధవ్యపదేశమువలనను బ్రహ్మమునకు పరతత్త్వమింకొకటి కలదనవలెను. ('పరం జ్యోతి రుపసంపద్య స్వేన రూపేణాభినిష్పద్యతే' ఛాం. ౮-౧౨-౩.) 'జీవుడు పరంజ్యోతియైన పరబ్రహ్మము బొంది స్వస్వరూపమున నుండును.' అని చెప్పబడినందున జీవునకు బ్రహ్మము పొందదగినదని తెలియుచున్నది. జీవుడు పొందువాడు. బ్రహ్మము పొందదగినది. అని జీవ బ్రహ్మలలో ప్రాప్తృప్రాప్యభావసంబంధము తెలియుచున్నది. సంబంధమువలన జీవునకు బ్రహ్మము ప్రాప్తవ్యమైనట్లు మరియొక ప్రాప్తవ్యము బ్రహ్మమునకు పరమున నేల యుండరాదు? కావున బ్రహ్మమునకు పరతత్త్వ ముండనగునని బోధపడుచున్నది.

భేదవ్యపదేశమువలనను బ్రహ్మమునకు పరతత్త్వ ముండవచ్చునని తెలియుచున్నది. బ్రహ్మసాక్షాత్కారము కలిగినమీదట ముముక్షువులు పొందు తావు బ్రహ్మముకంటె భిన్నముగ జెప్పబడుచున్నది. ('స తు తత్పదమాప్నోతి యస్మాద్ భూయో న జాయతే.' కఠ. ౩-౮.) 'ముక్తజీవుడు మరల జన్మింపని బ్రహ్మపదమును బొందును' అని చెప్పబడుటవలన బ్రహ్మముయొక్క పదము బ్రహ్మముకంటె భిన్నముగ తెలియుచున్నది. ఇట్టి భేదవ్యపదేశమువలన బ్రహ్మముకంటె పరతత్త్వ మున్నదని తెలియుచున్నది. (౩౧)

ఇట్లు, సేతువు, ఉన్మానము, సంబంధము, భేదమునను హేతువులు ఉపనిషద్ వాక్యములందు జెప్పబడుటవలన బ్రహ్మమునకు మించి యేదో తత్వ మున్నట్లు బోధపడుచున్నదని ప్రాప్తింప - సమాధానము చెప్పు చున్నాడు.

## సామాన్యాత్తు 3_2_32

విధారకత్వ సామ్యమువలన బ్రహ్మము సేతువని చెప్పబడినది. సేతువు జలము నడ్డగించి ప్రవాహము నాపును. అట్లే బ్రహ్మము జగత్తును ధరించియున్నది. ఇట్టి ధారణసామ్యమును గ్రహించి బ్రహ్మము సేతు వనబడినదే కాని, మరియొండు కాదు. సేతువుతో నితరవిషయము లందు సామ్యము లేదని భావము. అట్లు కాని పక్షమున, సేతువు పాషాణ మయమో, దారుమయమో యగును. అట్లే బ్రహ్మముకూడ దారుపాషాణాది మయముకూడ కావలసివచ్చును. కావున సేతువుతో పోల్చినంత మాత్రమున బ్రహ్మమునకు పరతత్వ మున్నట్లు భావింపజనదు. (౩౨)

ఉన్మాన వ్యపదేశమునకు సమాధానము:

## బుద్ధ్యర్థః పాదవత్ 3_2_33

పాదవత్=లోకసిద్ధమగు పాదవ్యవహారమువలె, బుద్ధ్యర్థః=ఉన్మాన వ్యసదేశము బ్రహ్మమున బుద్ధి ప్రవేశము కొఱకు చేయబడినదని గ్రహింపవలెను. వస్తువుయొక్క పరిమాణాదులు తెలియుటకు కొలత యుపయోగించును. కాని, కొలత కొలవబడువస్తువుకంటె భిన్నమైన వస్తువు మరియొకటి యున్నదని తెలుపదు. అట్లే పరమాత్మకు ప్రపంచమంతయు నొక పాద మనుటవలన పరమాత్మయొక్క యాధిక్యము బోధపడి ముముక్షువునకు బ్రహ్మ మెట్టిదో స్పష్టమగును. అందులకే పాదవ్యపదేశము. కాని, బ్రహ్మమునకు పరతత్వ మున్నదని తెలుపుటకు గాదని సూత్రాభిప్రాయము (౩౩)

అనంతమై, కొలత కలదని బ్రహ్మమున కున్నాన వ్యపదేశ మెట్లు సంగతమగునన - సమాధానము :

స్థాన విశేషాత్ ప్రకాశాదివత్   3-2-34

ప్రకాశాదివత్=ప్రకాశము, అకాశము మున్నగువానివలె, స్థానవిశేషాత్=స్థాన విశేషసంబంధమువలన, కొలతలేని బ్రహ్మము కొలతను దెలుపు పదముతో బోధింపబడుట దోషము కాదు.

సూర్యప్రకాశమునకు మానము - కొలత యుండదు. కాని, యది వాతాయనము (కిటికీ) నుండి గృహమున ప్రవేశించి వాతాయన ప్రకాశమనబడును. ఇట్లే ఘటాకాశము మఠాకాశము నని ఆకాశము వ్యవహరింపబడును. స్థానసంబంధముచే నీ వ్యవహారము లోకమున జూచుచున్నాము. ఇట్లే బ్రహ్మము మానము-కొలతకు లోబడకున్నను భూమ్యాది స్థాన సంబంధమువలన పాదాది వ్యపదేశము బ్రహ్మమునందు చేయబడుట దోషము కాదు. (34)

సంబంధవ్యపదేశము, భేదవ్యపదేశమువలన బ్రహ్మమునకు పరతత్వ ముండునని చెప్పనగునని పూర్వపక్షమున చెప్పినదానికి సమాధానము:

ఉపపత్తేశ్చ   3-2-35

జీవబ్రహ్మములకు ప్రాప్తృ ప్రాప్తవ్య భావసంబంధము ఉపపన్నమగుటవలన, బ్రహ్మమునకు పరతత్వమున్నదనుట యనుపపన్న మగుటవలనను, సంబంధవ్యపదేశము, భేదవ్యపదేశము సముచితమే యగును. బ్రహ్మము ప్రాప్తవ్యము - పొందదగినది. జీవుడు ప్రాప్త - పొందువాడు- చేరువాడు. కావున జీవునకు బ్రహ్మమునకుగల సంబంధము ప్రాప్తృప్రాప్తవ్యభావ సంబంధ మనబడును. ఇయ్యది యుపపన్నమే - తగినదే. ఇందు దోషము లేశమాత్రమును లేదు. ఈ సంబంధము ప్రాప్తవ్యమగు బ్రహ్మము

కంటె మించి పరతత్త్వ మున్నదని యెట్లు బోధించును ? రెండు పదార్థముల మధ్యనుండు సంబంధ మారెండు పదార్థములనే బోధించును. కాని మూడవ పదార్థమును బోధింపదని భావము. ఇక భేదవ్యపదేశము : అదియును బ్రహ్మమునకు పరవస్తు వున్నదని చెప్పజాలదు. 'విష్ణుపదము, బ్రహ్మపదము' అను ప్రయోగములందు గల షష్ఠీవిభక్తి భేదమును బోధించునది కాదు. ఇట పదశబ్దము స్వరూపవాచకము. విష్ణుపదమన విష్ణుస్వరూప మని భావము. పదము విష్ణువుకంటె భిన్నమైన దేదియు కాదు. ('ఆత్మనః చైతన్యమ్') 'ఆత్మయొక్క చైతన్యము' అను తావున గల షష్ఠీవిభక్తి భేదమును తెలుపునా ? చైతన్యము ఆత్మకు స్వరూపమే కదా ! వస్తుస్వరూపము వస్తువుకంటె భిన్నమై యన్యముగా వ్యవహరింపబడదు. అందువలన భేదవ్యపదేశము వలన బ్రహ్మమునకు పరతత్త్వ మున్నదనుట యుక్తము కాదు. (౩౫)

## తథాఽన్యప్రతిషేధాత్ ౩-౨-౩౬

అన్యప్రతిషేధాత్ = బ్రహ్మమునకంటె వేరొక పదార్థము లేదని నిషేధించుట వలనను, బ్రహ్మముకంటె పరతత్త్వము వేరుగ లేదని తెలియుచున్నది.

'తస్మా ద్ధాన్యన్న పరః కించనాస.' ఋక్. ౮-౭-౧౭-౨ 'యస్మాత్ పరం నాపర మస్తి కించిత్.' శ్వే. ౩.౧౧. అను నిట్టి వాక్యములందు బ్రహ్మకంటె పరతత్త్వ మింకొకటి లేదని స్పష్టముగ నిందింపబడినందున బ్రహ్మమునకు పరతత్త్వ మున్నదనుట సంగతము కాదు. (౩౬)

## అనేన సర్వగతత్వ మాయామాది శబ్దేభ్యః ౩-౨-౩౭

అనేన=బ్రహ్మముకంటె పరవస్తు వొండు లేదనుటవలన, ఆయా

మాది శబ్దేభ్యః=ఆయామము, విభుత్వము, వ్యాప్తి మున్నగు శబ్దములవల నను, సర్వగతత్వం = బ్రహ్మము సర్వపదార్థములందును నంతర్బహిః పూర్ణమై యున్నదని తెలియుచున్నది.

శ్రుత్యుపనిషత్ వాక్యములందు బ్రహ్మము విభువు, వ్యాపకము, గొప్పది యని యనేక స్థలములలో స్పష్టముగ వర్ణింపబడినది. 'ఏతావా నస్య మహిమాఽ తో జ్యాయాంశ్చ పూరుషః' ఋ. ౮-౪-౧౭-౩. 'పురుషుడు - బ్రహ్మము జ్యాయాన్ = గొప్పది.'

'జ్యాయాన్ పృథివ్యా, జ్యాయా నంతరిక్షాత్, జ్యాయాన్ దివో, జ్యాయా నేభ్యో లోకేభ్యః' ఛాం. ౩-౧౪-౩.

'పృథివి, అంతరిక్షము, దివము, లోకములు అన్నింటికంటెను బ్రహ్మము గొప్పది.'

'స ఓతశ్చ ప్రోతశ్చ విభూః ప్రజాసు' యజు. ౩౨-౮.

'ఆ బ్రహ్మము ఓతప్రోతము. ప్రాణులలో విభువు.'

'తదంతరస్య సర్వస్య తదు సర్వస్యాస్య బాహ్యతః' యజు. ౪౦-౫.

'బ్రహ్మ మీ ప్రపంచమున లోపల వెలుపల నున్నది.'

బ్రహ్మమున నీ సర్వగతత్వాది ధర్మములు లేకున్న నది యీ ప్రపంచమును సృష్టించుటకు గాని, పోషించుటకుగాని, లయమొనర్చుటకు గాని సమర్థము కానేరదు. కావున బ్రహ్మమునకు మించి పరతత్వ మింకొకటి లేదు. బ్రహ్మమే యన్నింటికంటె మించిన పరతత్వమని సూత్ర తాత్పర్యము. (౩౭)

## సప్తమాధికరణము

భక్తులకు భగవంతునియందు భక్తి మిక్కిలిగ గలుగు నిమిత్తమై భగవంతుని ఫలదాతృత్వధర్మమును ప్రదర్శించుచున్నాడు.

ఫల మత ఉపపత్తేః ౩-౨-౩౮

అతః = అన్నింటికంటె నతిసూక్ష్మమని బ్రహ్మము వర్ణింప బడుటవలన, ఫలం = ఆ బ్రహ్మమువలననే జీవు లొనర్చు శుభాశుభకర్మ లకు ఫలము లభించును. ఉపపత్తేః = యుక్తియుక్త మగుటవలన.

జగజ్జన్మాదికారణమగు బ్రహ్మమువలననే జీవు లొనర్చుశుభాశుభ కర్మలకు సుఖదుఃఖరూపమగు ఫలములు లభించును. జీవు లొనర్చుకర్మలు నానావిధములు. నానాప్రదేశములలో, విభిన్నకాలములందు, విభిన్నలోకము లందు జేయబడును. వానినన్నింటిని యథారూపమున నెరిగినవాడే వానికి తగినఫలముల నీయగలడు. అట్టి శక్తిసామర్థ్యములు గలవాడు పరమేశ్వ రుడు కాక మరియెవడు ? అతడే సర్వజ్ఞుడు. సర్వశక్తిమంతుడు. సర్వాంత ర్యామి. కర్మ క్షణికము. అది వెంటనే నశించును. కావున కర్మ ఫలము నొసంగజాలదు. కావున బ్రహ్మమే ఫలదాత యనుట యుక్తిసిద్ధ మగు చున్నది. (౩౮)

ఈ సూక్ష్మవిషయము కేవలము యుక్తితో నిరూపించుటకంటె శ్రుతిప్రమాణము చూపుట మంచిదని యెంచి సూత్రమును రచించు చున్నాడు.

శ్రుతత్వాచ్చ ౩-౨-౩౯

శ్రుతులయందు వినబడుటవలనను బ్రహ్మమే కర్మఫలదాత యని నుడవవలెను.

'యదఙ్గ దాశుషే త్వమగ్నే ! భద్రం కరిష్యసి' ఋ. ౧-౨-౨-౬.
'ఓ ప్రకాశస్వరూప ! నీవు దాతకు మేలు కలిగింతువు'.

'అహం దాశుషే విభజామి భోజనమ్' ఋ. ౮-౧-౫-౧.
'నేను దాతకు భోజనము నొసంగుదును',

Scanned by CamScanner

ఇట్టి వేదవాక్యములను బట్టి చూచినను పరమేశ్వరుడే కర్మఫలదాత యని బోధపడుచున్నది. (౩౯)

పూర్వపక్షము :

ధర్మం జైమిని రత ఏవ          ౩-౨-౪౦

జైమినిః = జైమినిమహర్షి, అతఏవ = యుక్తియుక్తమగుటవలననే, ధర్మం = ధర్మాధర్మశబ్దములచే పేర్కొనబడు శుభాశుభకర్మజన్య సంస్కారములు ఫలముల నొసంగునని చెప్పుచున్నాడు.

బ్రహ్మము ఫలప్రదాత యని యంగీకరింతురేని, ఆ బ్రహ్మము కర్మ నపేక్షించి ఫలమొసంగునా ? అపేక్షింపకయే యొసంగునా? అపేక్షింపకయే ఫల మొసంగునందురేని బ్రహ్మమున వైషమ్యనైర్ఘృణ్య దోషము లేర్పడును. అనగా-కర్మల నపేక్షింపక ఫలమొసంగుచో బ్రహ్మము స్వయముగ తనయిష్టమువచ్చిన ట్లొకనికి సుఖము, మరియొకనికి దుఃఖము, ఒకని కెక్కువ, మరియొకనికి తక్కువ ఇచ్చిన ట్లగును. అట్లు చేయుట వలన బ్రహ్మమునందు విషమత, పక్షపాతము, రాగద్వేషములు మున్నగు దోషములు సంభవించునని భావము. ఇక కర్మల నపేక్షించియే ఫలముల నొసంగునందురేని కర్మలవలననే ఫలములు లభించిన ట్లగును. ఇక బ్రహ్మము చేసిన దేమున్నది ? అందువలన బ్రహ్మము కర్మఫలప్రదాత యెట్లగును ? కాజాలదు. సూర్యుడు స్వయముగ నాకాశమున బ్రకాశించుచు పృథివి నాకర్షించి ధరించుచున్నాడు. భూమియు సూర్యునిచుట్టి తిరుగు చుండును. ఓషధులు క్రమముగ పక్వమయి ప్రాణిభోగయోగ్య మగు చున్నవి. కృష్యాదికర్మలు యథాసమయము ఫలముల నొసంగుట చూచు చున్నాము. కావున. కర్మఫలదాతృత్వము బ్రహ్మధర్మ మనుటేల ? మరియు కర్మ క్షణిక మగుటవలన నది ఫలము నొసంగజాల దనుటయు సరి కాదు. కర్మ ఫలసమయమున నుండకున్నను, ఆకర్మవలన జనించిన

సంస్కారము-ధర్మము, అధర్మము ననుపదములచే జెప్పబడునది - ఫలము లభించుకాలమువరకు నుండును. కావున ధర్మాధర్మరూపసంస్కారములే ఫలము నొసంగునని చెప్పుట యుక్తియుక్తము. కాబట్టి బ్రహ్మవలన కర్మ ఫలములు లభించు ననుట సరికాదు. (౪౦)

ఈ పూర్వపక్షమును నిరాకరించుచు సమాధానసూత్రమును వ్యాస మహర్షి రచించుచున్నాడు.

పూర్వం తు బాదరాయణో
హేతు వ్యపదేశాత్ ౩-౨-౪౧

బాదరాయణః = వ్యాసమహర్షి - గ్రంథకర్త, హేతువ్యపదేశాత్= కార్యమాత్రం ప్రతి బ్రహ్మము కారణమని చెప్పుటవలన, పూర్వం తు = పూర్వము చెప్పబడినట్లు బ్రహ్మమే కర్మఫలదాత, ఇతరము కాదు. అని నిశ్చయించుచున్నాడు. ఉపనిషత్స్మృతులలో బ్రహ్మము సర్వమునకు కారణముగ చెప్పబడినది.

'ఏష యోనిః సర్వస్య' మాం. ౬.
'స కారణం కరణాధిపాధిపః' శ్వే. ౬-౯.
'స హి సర్వవిత్ సర్వకర్తా' సాం. ౩-౫౬.

ఇట్టి ఉపనిషత్స్మృతివాక్యములు బ్రహ్మమును సర్వమునకు కారణముగ - కర్తగ - నిర్దేశించుచున్నవి. అట్టియెడ కర్మఫలరూపకార్యమునకు మాత్రము బ్రహ్మము కారణ మెట్లు కాదు? బ్రహ్మము లోకములను శాసించునది. అతనిశాసనము నుల్లంఘింప చేతనములకు గాని, అచేతనములకుగాని శక్యము కాదు.

'సర్వస్యేశానః సర్వస్యాధిపతిః, సర్వ మిదం ప్రశాస్తి, యదిదం కించ' బృ. ౫-౬-౧. 'పరమేశ్వరుడు - బ్రహ్మము - సర్వమును శాసించును. సర్వాధిపతి'

'సూర్యచంద్రాదులు అతనిశాసనమునకు లోబడియే ప్రకాశించును. గ్రహోపగ్రహముల నాకర్షించును. అతని ప్రశాసనమునకు విరుద్ధముగా నేదియు నేమి చేయుటకును సమర్థము కాదు. పరమేశ్వరుని శాసనమునకు విరుద్ధముగా ఓషధులు జనింపవు. సస్యములు ఫలింపవు. బ్రహ్మము స్వయముగ నిష్టానిష్టఫలముల నొసంగసమర్థమయ్యు, వైషమ్య, పక్షపాతాది దోషము లొదవకుండుటకునుగాను జీవులొనర్చుకర్మల నపేక్షించియే ఫలముల నొసంగును.

'స వా అయమాత్మా సర్వేషాం భూతానా మధిపతిః
సర్వేషాం భూతానాం రాజా' బృ. ౨-౫-౧౫.

కావున సర్వభూతాధిపతియు, సర్వభూతములకు రాజును నగు నాపరబ్రహ్మ పరమేశ్వరుడే కర్మఫలప్రదాత యగును. మరియొండు కాదని వైదికసిద్ధాంతము. (౪౧)

వేదాంత దర్శన - అంబా వ్యాఖ్యానమున
తృతీయాధ్యాయమునందు ద్వితీయపాదము
సమాప్తము

# తృతీయాధ్యాయము

## తృతీయపాదము

### ప్రథమాధికరణము

ఇంతకు పూర్వము బ్రహ్మమునకు సంబంధించిన విషయము వర్ణింపబడినది. ఇకముందు బ్రహ్మోపాసన వర్ణింపబడును. కర్మవలె ఉపాసనకూడ జ్ఞానసాధనము. కర్మనిష్ఠులగు వారికి జ్ఞానోత్పత్తికి పూర్వము ఉపాసనలో ప్రవృత్తి కలుగును. వేదాంతమునందు దహరోపాసన, శాండిల్యోపాసన, వైశ్వానరోపాసన యను ననేకోపాసనలు వర్ణింపబడినవి. అవి పరస్పర మొకదానికంటె మరియొకటి శ్రేష్ఠమా ? లేక యన్నియు సమానములేనా ? అని యిట విచారింపనగును. వానిలో విశేష మొందును లేదను సిద్ధాంతపక్షము నవలంబించి సూత్రము నారంభించుచున్నాడు.

**సర్వవేదాంతప్రత్యయం చోదనా**
**ద్యవిశేషాత్** 3-3-1

చోదనాద్యవిశేషాత్ = విధి మున్నగువానియందు భేదము లేనందున, సర్వవేదాంతప్రత్యయం = ఉపనిషత్తు లన్నింటియందు గల బ్రహ్మోపాసనమునందును భేదము (వైశిష్ట్యము) లేదని యెంచవలయును.

వేదాంతము లన నుపనిషత్తులు. ఈశ కేన కఠాది నామములతో పది, పదునొకండు ఉపనిషత్తులు వేదానుకూలముగ నున్నంతవరకు ప్రమాణములుగ శిష్టు లంగీకరించుచున్నారు.

ఆ యుపనిషత్తులలో నన్నింటిలోను దహరాదినామభేదములతో బ్రహ్మోపాసనము విధింపబడినది. ఈయుపాసనలలో నొకటి యింకొకటి కంటె విశిష్టమైయున్నదా? లేక యన్నియు సమానములేనా? అనునది యిట

విచారణీయవిషయము. పరస్పరము విశిష్టము లనుట పూర్వపక్షము. కాదు. ఒకదానికంటె మరియొకటి విశిష్టము కాదనుట సిద్ధాంతము. చోదన యన విధి యని యర్థము. 'ఉపాసీత, ధ్యాయీత, వేద' అను నిట్టి విధిని తెలుపు పదములతో ఉపనిషత్తులలో బ్రహ్మోపాసనము విధింపబడి యున్నది. 'బ్రహ్మము నుపాసింపవలెను. ధ్యానింపవలెను. తెలిసికొనవలెను' అను నిట్టి విధి - ఆజ్ఞ - ను తెలుపుపదముల మూలమున బ్రహ్మ ముపాసింపదగిన దని తెలియును. పై విధులతో విధింపబడు విధేయమగు బ్రహ్మోపాసనములో నెట్టి విశేషము కనిపింపదు. దహరోపాసనాదివిధులలో విశేషము లేనందున విధేయమునందును - బ్రహ్మోపాసనమునందును - విశేషము లేదని యభిప్రాయము. అందువలననే యుపాసనమువలన లభించు ఫలము నందును విశేషము కనిపింపదు. ఛందోగులు . దహరోపాసనకు గాని, శాండిల్యవిద్యోపాసనకుగాని, వైశ్వానరోపాసనకుగాని యేఫలము కలుగు నని చెప్పుచున్నారో యదే ఫలము కలుగునని వాజసనేయశాఖీయులును చెప్పుచున్నారు. బ్రహ్మోపాసనకు ఫలము బ్రహ్మసాక్షాత్కారమే. కావున సర్వవేదాంతములందును విధింపబడిన దహర, శాండిల్య, వైశ్వానర ప్రభృతి బ్రహ్మోపాసనములలో పరస్పరవిశేష మేమియు లేదని సూత్రాభిప్రాయము. (౧)

ఈ విషయమున విశేషహేతువు నాశంకించి, దానిని నిరాకరించు చున్నాడు.

భేదా న్నేతిచే న్నైకస్యా మపి        ౩-౩-౨

భేదాత్ = వేదాంతభేదమువలన, న ఇతి చేత్ = సర్వవేదాంతము లందు విధింపబడిన బ్రహ్మోపాసనలలో విశేషము లేదనుట సరికాదు, అని యందురేని; న = అది సరికాదు. కారణమేమన, ఏకస్యా మపి = ప్రతివేదాంతమునందును - ప్రత్యుపనిషత్తునందును - విశేషము లేని బ్రహ్మో

పాసన మున్నను, ప్రతిపాదక ప్రతిపాదయితవ్య విశేషాపేక్షతో విశేషము కలుగును.

'వేద = తెలిసికొనుము. ధ్యాయీత = ధ్యానముచేయవలెను. అనునిట్టి విధివాక్యములందు భేదము లేనందున నుపనిషత్తులలో నన్నింటియందును ప్రతిపాదింపబడు బ్రహ్మోపాసనయందును భేద ముండదు'. అనుటకు వీలులేదు. - 'వేదాంతములలో భేద మున్నందున వానిచే నుపపాదింపబడిన బ్రహ్మోపాసనయందును విశేష ముండునని తెలియనగును. ఉపనిషత్తులే వేదాంతము లనబడును. ఆయుపనిషత్తు లనేకవిధముల భిన్నములై యుండుట యెల్లరకు ప్రత్యక్షము. అందువలన వేదాంతములు భిన్నము లనుట సిద్ధము. భిన్నములగు నా యుపనిషత్తులలో నొకేవిధమగు విధివాక్యము చూదనగును. అదియే పునరుక్తి యనబడును. అయ్యది పునరుక్తియైనను, ఉపాసనభేదమునకు ప్రయోజకమగును. అట్లు కానిపక్షమున ప్రతి వేదాంతమునందును వినబడు విధివాక్యము సంగతము కానేరదు. కావున ప్రత్యుపనిషత్తునందును విధింపబడు బ్రహ్మోపాసనలోను భేద ముండునని తెలియుచున్నది'. - అన, నది సరికాదు. ప్రతిపాదక ప్రతిపాదయితవ్య భేదమునుబట్టి వేదాంతములలో భేద ముపపన్న మగును; కాని, బ్రహ్మోపాసనలో భేదము లేదు. ప్రతిపాదించువ్యక్తులలో (ప్రతిపాదకులలో) భేద ముండుటవలన ప్రతిపాదయితవ్య వ్యక్తులలో భేద ముండుట సత్యమే. ఇట్లు ప్రతిపాదక ప్రతిపాదయితవ్య భేదము సిద్ధించిన మీదట ప్రత్యుపనిషత్తునందును బ్రహ్మోపాసనను విధించువాక్యములలో సామ్య ముండుటలో దోష మేమియు నుండదు. ఒకే యర్థము ననేకులు సమానముగ చెప్పుట దోషావహ మెట్లగును ? పాటలీపుత్రమున గోవిందుడు గోపాలున కే విషయమును జెప్పునో యావిషయమునే యజ్ఞదత్తుడు మరియొక తావున దేవదత్తునకు జెప్పుట యసంగత మెట్లగును? కావున ననేక వేదాంతములందు జూదబడు సమానశ్రుతి - విధివాక్యము - వలన విధింప

బడు బ్రహ్మోపాసన యవిశిష్టమే యగును. భిన్నము కానేరదని భావము. (౨)

వేదాంతభేదమువలన బ్రహ్మోపాసన భిన్నము కాకపోయినను, ఉపనిషత్తులలో పఠింపబడిన ధర్మభేదమువలన భిన్నము కావచ్చునుగదా! ఆథర్వణికులు ముండకోపనిషత్తునందు బ్రహ్మవిద్యకు శిరోవ్రతము ధర్మముగ చెప్పియున్నారు.

'తేషా మేవైతాం బ్రహ్మవిద్యాం వదేత శిరోవ్రతం విధివద్ యైస్తు చీర్ణమ్' ముం. ౩-౨-౧౦. 'ఎవరు విధిపూర్వకముగ శిరోవ్రతమును పూర్తి చేయుదురో వారికే యీ బ్రహ్మవిద్య బోధింపవలెను'.

ఆథర్వణికు లీవ్రతమును జెప్పియున్నారు; కాని వాజసనేయులు, ఛందోగులును ఇట్టి వ్రతమును - ధర్మమును జెప్పరు. ప్రతివేదాంతమునందును బోధింపబడు బ్రహ్మోపాసనలో భేదమే లేనిపక్షమున నావిద్య నభ్యసించువారి కిట్లొకచో వ్రతమును ఆచరణీయముగ జెప్పి మరియొకచో నేల యట్లు విధింపబడదు? ఒకేవిద్య యొకట వ్రతధారి చదువుటయు, మరియొకచోట నవ్రతి చదువుటయు యుక్తము కాదుకదా! కావున ప్రతి వేదాంతమున జెప్పబడిన బ్రహ్మోపాసన యొక్కటియే యనుట యుక్తము కాదు.' అన, సమాధానము చెప్పుచున్నాడు.

## స్వాధ్యాయస్య తథాత్వేన హి సమాచారే
## ఽధికారాచ్చ సవవచ్చ తన్నియమః    ౩-౩-౩

స్వాధ్యాయస్య=(ఇట స్వశబ్దముచేత ముండకోపనిషత్తు గ్రహింపనగును) ముండకోపనిషదధ్యయనమునకు శిరోవ్రతధారణముచేయవలెను. హి = కారణమేమన, సమాచారే, తథాత్వేన = శాస్త్రాధ్యయనానుష్ఠానమునకు శిరోవ్రతము ధర్మమగుట ప్రసిద్ధము. అధికారాత్ చ = శిరోవ్రతము స్వాధ్యాయమునకు సంబంధించిన దగుటవలనను, చ = మరియు, సవ

వత్ = యజ్ఞమున మంత్రమువలె, తన్నియమః = స్వాధ్యాయమున శిరో వ్రతము నియత మగుటవలనను.

ఇట శిరోవ్రతము బ్రహ్మచర్యాద్యనుష్ఠాన మని గ్రహింపవలెను. అయ్యది ముండకోపనిషత్తునందు అధ్యయన ధర్మముగా చెప్పబడినది - (నైతదచీర్ణవ్రతో ఽధీతే. ముం. ౩-౨-౧౧) 'శిరోవ్రతము నాచరింపని వాడు ముండకోపనిషత్తు నధ్యయనము చేయడు'. అను నీవాక్యశేషమువలన శిరోవ్రతము అధ్యయన ధర్మమని బోధపడుచున్నది. కావున నీ వ్రతము బ్రహ్మవిద్యాధర్మము కాదు.

ఆ యా శాస్త్రమున ప్రవర్తించు అధ్యయనాధ్యాపనల లక్షణమైన అధ్యేత్రధ్యాపయితృ వ్యవహార మిట సమాచార మనబడును. అందు శిరోవ్రతము స్వాధ్యాయమునకు ధర్మ మనుట యెల్లరెరిగిన విషయమే. ఈసూత్రమునగల అధికారపదము సంబంధమును తెలుపును. కావున శిరో వ్రత ధర్మము స్వాధ్యాయమునకు సంబంధించినదే కాని, బ్రహ్మవిద్యకు చెందినది కాదు.

ఇట్లే, యజ్ఞమున మంత్రములతో దైవతాస్మరణము నియమముగ జేయవలసియున్నట్లు ముండకోపనిష దధ్యయనమునకు శిరోవ్రతము ధర్మముగ నియమింపబడినది. ఇతరోపనిషత్తులు చదువుట కట్టి ధర్మము నియతము కాదు. కావున శిరోవ్రతధర్మము అధ్యయనధర్మమే కాని, బ్రహ్మవిద్యాధర్మము కాదు. అధ్యయనధర్మభేదమువలన ప్రత్యుపనిషత్తు నందు చెప్పబడు బ్రహ్మోపాసనవిద్యయు భిన్నమగునని కల్పించుట యుక్తము కాదని సూత్రాభిప్రాయము. (౩)

ఈ విషయమునే శ్రుతిమూలమున బలపరుచుచున్నాడు.

## దర్శయతి చ ౩-౩-౪

చ=మరియును, దర్శయతి=ప్రతివేదాంతమునందును నొకే బ్రహ్మ ముపాస్యమని యుపదేశించుశ్రుతియు బ్రహ్మోపాసనమున భేదము లేదని తెలుపుచున్నది.

వేదములు, ఉపనిషత్తులు నన్నియు నొకే బ్రహ్మోపాసన నుపదేశించు చున్నవి, కావునను బ్రహ్మోపాసన అభిన్నమనియే యెంచవలెనని సూత్రాభిప్రాయము.

'యుంజతే మన ఉత యుంజతే ధియో
విప్రా విప్రస్య బృహతో విపశ్చితః
విహోత్రా దధే వయునా విదేక
ఇన్మహీ దేవస్య సవితుః పరిష్టుతిః' ఋ. ౪-౪-౨౪-౧.

'మహామహిమ గలిగినట్టియు, లోకలోకాంతరములను ధరించు నట్టియు, సమస్తజ్ఞానమును ప్రకాశింపజేయునట్టియు, అన్నింటికంటె గొప్ప దియు నగు నా పరమాత్మయందే జ్ఞానులు తమమనస్సును జోడింతురు. బుద్ధిని వికసింపజేయుదురు.'

'ఏకో వశీ సర్వభూతాంతరాత్మా' కఠ. ౫-౧౨.

'సర్వప్రాణులకు నంతరాత్మయై యన్నింటిని వశమున నుంచువా డొక్కడే.'

'ఏకో దేవః సర్వభూతేషు గూఢః' శ్వే. ౬-౧౧.

'సమస్తభూతములందును గూఢముగ నుండుదేవు డొక్కడే'.

అని వేదములందును, ఉపనిషత్తులందును నొకే బ్రహ్మ ముపాస్య ముగ నుపదేశింపబడినది. అందువలన ఉపనిషత్తులలో నన్నింటియందును బోధింపబడిన యుపాసనవిద్యయు భిన్నము కాక యభిన్నమే - అవిశిష్టమే- యని సిద్ధమగుచున్నది. (౪)

## ద్వితీయాధికరణము

ఇట్లు ఉపనిషత్తులలో నెల్లయెడల బోధింపబడిన యుపాసనలో భేదములేదని నిర్ణయించి, యటుపై దాని ప్రయోజనమును దెలుపుచున్నారు.

**ఉపసంహారో ఽ ర్థాభేదాద్ విధిశేషవత్**
**సమానే చ** ౩-౩-౫

సమానే చ=వేదాంతములం దెల్లయెడల నుపదేశింపబడిన బ్రహ్మోపాసన యొక్కటియే యైనందున, అర్థాభేదాత్ = ప్రయోజనమునందును భేదములేనందువలన, విధిశేషవత్ = విధిశేషములయిన అగ్నిహోత్రాది కర్మలు భిన్నస్థలములలో నుపదేశింపబడినవి యొకచో నన్వయింపబడు నట్లు, ఉపసంహారః = అన్యత్ర చెప్పబడినగుణముల కన్యత్ర సంబంధ మున్నట్లు తెలిసికొనవలెను.

సర్వవేదాంతములందును - ఉ ప ని ష త్తు లం దన్నింటియందును - వర్ణింపబడిన బ్రహ్మోపాసన యొక్కటియే. అందు భేదము లేదు. కాని, భిన్నభిన్నములయిన యుపనిషత్తులలో వర్ణింపబడిన గుణములలో పరస్పరము సంబంధము కలదా? యన, కలదు. ఒకశాఖయందు చెప్పబడిన గుణములు మరియొకశాఖయందు ఉపసంహారము - సంగ్రహము - చేయనగును. కారణ మేమన : భిన్నభిన్నశాఖలలో - ఉపనిషత్తులలో జెప్పబడిన గుణములకు - బ్రహ్మోపాసనయందు జెప్పబడిన గుణములకు - ప్రయోజనములో భేదము లేదు. ఆ గుణములకు బ్రయోజనము ఉపాసన కుపకరించుటయే. కావున నుపాసనలో భేదము లేనందున ఉపాసనవిద్యయందు భిన్నస్థలములలో జెప్పబడినగుణములను భిన్నస్థలములలో గ్రహింపనగును. అగ్నిహోత్రాది కర్మములలో వానిశేషములందు చెప్పబడిన గుణములు గ్రహింపబడుట శాస్త్రసిద్ధము. బ్రహ్మోపాసన ప్రతివేదాంతమునందు సమానమై

నట్లు, భిన్నభిన్న బ్రాహ్మణాదిశాఖలందు వర్ణింపబడిన అగ్నిహోత్రాదికర్మ ములును సమానములే. (౫)

ఈ విషయమున గలుగు నొకశంకకు సమాధానము :

## అన్యథాత్వం శబ్దాదితి చేన్నావిశేషాత్ ౩-౩-౬

శబ్దాత్=ఉపాసనను విధించు శ్రుతివాక్యమువలన, అన్యథాత్వమ్= అనుపసంహారము - ఒకశాఖలో జెప్పబడినగుణములు మరియొకశాఖయందు గ్రహింపరాదు, ఇతిచేత్=అనియందురేని, న=అట్లనరాదు, అవిశేషాత్= (విశేష మన భేదము. అవిశేషమన నభేదము.) బ్రహ్మమునకు, తద్గుణము లకు భేదము లేదు. కావున, ఒకయెడ వర్ణింపబడిన గుణములు మరియొక యెడ గ్రహింపవచ్చును.

ఉపనిషత్తులలో బ్రహ్మోపాసన సమానముగ జెప్పబడినను గుణ సంగ్రహముచేయుట యుక్తము కాదు. కారణ మేమన : 'ఆత్మే త్యేవో పాసీత' బృ. ౧-౪-౭. - 'త మే వైకం జానథ ఆత్మానమ్' ముం. ౨-౨-౫. అను నీ వాక్యములందు ఆత్మాఏవ=బ్రహ్మమే, తమ్ ఏకమ్ ఆత్మానమ్ ఏవ='ఆయొక్క బ్రహ్మమునే' అని బ్రహ్మమునే ఉపాసింపవలెను. ఇతర మును ఉపాసింపరాదు. అని వాక్యములందు 'ఏవ' కారమును ప్రయోగించి బ్రహ్మము కానిదాని నుపాసింపవలదని యున్నది కదా। కావున భిన్నస్థల వాక్యములందు వర్ణింపబడిన గుణములను గ్రహించుట యుక్తము కాదు. అట్లు కానిపక్షమున పై వాక్యములలోని 'ఏవ=ఏ' కారము వ్యర్థమగును. 'ఏవ' పదము ఇతరమును విడదీయుటకే ప్రయోగింపబడుననుట యెల్ల రెరిగినవిషయమే. బ్రహ్మగుణములను విడిచి కేవలబ్రహ్మమును ఉపా సింపవలెనని వాక్యములవలన తెలియుచున్నది. కావున గుణగ్రహణము పనికిరాదని పూర్వపక్షాభిప్రాయము.

కాని, యది సరికాదు. కారణ మేమన : బ్రహ్మమునకు దానిగుణము లకు (అవిశేషాత్) భేదములేదు. బ్రహ్మగుణములు బ్రహ్మముకంటె భిన్న ములు - ఇతరములు కావు. కాబట్టి పైవాక్యములందు (ఆత్మేత్యేవ, త మేవైక మాత్మానమ్) ప్రయోగింపబడిన (ఏవ) 'ఏ' పదము బ్రహ్మము నుండి తద్గుణములను వేరుచేయుటకు గాక బ్రహ్మముకంటె భిన్నములగు ప్రకృత్యాదులను వేరుచేయుటకు ప్రయోగింపబడినట్లు గ్రహింపవలెను. బ్రహ్మమునందలి జ్ఞానానందాదిగుణములను వేరుచేయుదుమేని బ్రహ్మ మన నేమగును? జ్ఞానము, ఆనందము మున్నగు గుణములు బ్రహ్మస్వరూ పమే కదా! దానికంటె నవి భిన్నము లెట్లగును ? ఎన్నడు కాజాలవు. కాబట్టి బ్రహ్మోపాసనను విధించువాక్యములు బ్రహ్మముకంటె భిన్నములగు ప్రకృత్యాదిపదార్థమును ఉపాసింపరాదని బోధించుచున్న వని గ్రహింపవలెను. అందువలననే 'సాక్షీ చేతా కేవలో నిర్గుణశ్చ' శ్వే. ఉ. ౬-౧౧. అను నీవాక్యమునందు గల నిర్గుణపదముచే సత్వరజస్తమో రూప ప్రాకృతికగుణ రహిత బ్రహ్మము మాత్రము గ్రహింపవలెననియు తెలియనగును. శ్రీ శంకరపాదు లీ సూత్రమునకు భాష్యము వ్రాయుచు 'బృ. ఉ. ౧-౩-౧ — ౧-౩-౭' 'ఛాం. ఉ. ౧-౨-౧ — ౧-౨-౭' వాక్యముల నుదాహరించి ఉద్గీథ ఉపాసనవిషయమున శంకించి యేమో సమాధానము చెప్పయత్నించిరి. కాని యీ సూత్రమున నా యుదాహరణములకుప్రసక్తి కనిపింపదు. బృహ దారణ్యక ఛాందోగ్యములలో వర్ణింపబడినట్టి యీ యుపాసనలందు ప్రాణ రూపబ్రహ్మము ఉపాస్యముగా జెప్పబడుటచే వానియందును భేదము లేదు. (౬)

మరియొకశంకకు సమాధానము : బ్రహ్మముకంటె తద్గుణములు - జ్ఞానానందాదులు భిన్నములు కానందున శబ్దమువలన గుణగ్రహణము చేయవచ్చు ననుకొందము. కాని, ఉపక్రమభేదమువలన ఉపాసనలలో భేద మేల యంగీకరింపజనదు? ఛాందోగ్యమున ('సర్వం ఖల్విదం బ్రహ్మ'

ఛాం. ఉ. ౩-౧౪-౧.) 'ఇది యంతయు బ్రహ్మముకదా।'. అని ప్రారంభించి శాండిల్యోపాసన చెప్పబడినది. వాజసనేయులు ('సత్యం బ్రహ్మే త్యుపాసీత' శత. ౧౦-౬-౩-౧.) 'సత్యము బ్రహ్మ మని యుపాసింపవలెను' అని చెప్పుచున్నారు. ఇట ఉపాసనలయుపక్రమమున - ప్రారంభమున భేదము స్పష్టమగుచున్నది. కావున ఉపాసనలో భేదము నంగీకరింపక తప్పదు. ఉపాసనలో భేద మున్నందున నొకయుపాసనలో జెప్పబడిన గుణములు మరియొక యుపాసనయందు గ్రహించుటయు సరికాదు. కావున గుణ గ్రహణము తగదు. అని శంకింపగా, సూత్రకారుడు దానిని నిరాకరించు చున్నాడు.

### న వా ప్రకరణభేదాత్ పరోవరీయస్త్వాదివత్ ౩-౩-౭

('అన్యథాత్వం, అవిశేషాత్' అను నీ రెండుపదములు పూర్వసూత్రమునుండి యీ సూత్రమున గ్రహింపబడును.)

ప్రకరణభేదాత్=ఉపక్రమభేదమువలన, న అన్యథాత్వం=గుణోప సంహారము - గుణగ్రహణము చేయరాదనుట తగదు. అవిశేషాత్ = ఉపా స్యమున భేదము లేనందువలన, పరోవరీయస్త్వాదివత్=పరోవరీయస్త్వాది వలె. పరోవరీయ స్త్వము - బ్రహ్మ మన్నింటికంటె గొప్పది. అను నిట్టి గుణములతోగూడిన ఉద్గీథ బ్రహ్మోపాసనలలో భేదమున్నను గుణగ్రహ ణము చేయబడినట్లు అనగా ఉపాసనప్రారంభములలో భేదమున్నను ఉపాస్యవస్తువునందు భేదము లేనందున గుణగ్రహణము చేయవచ్చునని సూత్రాభిప్రాయము.

ఛాందోగ్యమున ఉద్ గీథ ఉపాసన రెండువిధములుగ వర్ణింపబడి నది. మొదట : 'అథ య ఏషో ఽ న్తరాదిత్యే హిరణ్మయః పురుషో దృశ్యతే హిరణ్యశ్మశ్రుః హిరణ్యకేశ ఆప్రణఖాత్ సర్వ ఏవ సువర్ణః' ఛాం. ౧-౬-౬. హిరణ్యశ్మశ్రుత్వాది గుణములతో గూడిన బ్రహ్మము

నుపాసించుట ఉద్గీథ మని చెప్పబడినది. ఆ తరువాత, 'ఆకాశో హ్యేవైభ్యో జ్యాయా నాకాశః పరాయణమ్, స ఏష పరోవరీయా నుద్గీథః స ఏషో ఽనన్తః' ౧-౯-౧-౨. పరోవరీయస్త్వము (అన్నింటికంటె గొప్పది) మున్నగుగుణములతో గూడిన ఉద్గీథ ఉపాసన చెప్పబడినది. ఇట్లీ యుపాసన మొకేశాఖకు చెందినదయ్యు ప్రకరణభేదమునుబట్టి పైచూపు లకు కొంతభేదము కలదిగ కనిపించును. హిరణ్యశ్మశ్రుత్వాది గుణవిశిష్ట ఉపాసన మొకటి; పరోవరీయస్త్వాది గుణవిశిష్ట ఉపాసన మరియొకటి. కావున ప్రకరణభేదమువలనను గుణభేదమువలనను ఉపాసనలలో భేద మున్నట్లు తోచును. కాని సూత్రకారుడు పై ఉపాసనలందు ఉపాస్యముగ వర్ణింపబడిన బ్రహ్మముమాత్ర మొక్కటియే ఉద్గీథరూపమున చెప్ప బడిన దనుచున్నాడు. కావున నిరూపణప్రకార (ప్రకరణ) భేదమువలన నిరూపింపదగిన - ఉపాస్యవస్తువునందు భేదము కలుగునని యెంచరా దనుట సూత్రకారుని అభిప్రాయము. మొదటి ప్రకరణమున బ్రహ్మము చేతన - ప్రకాశ స్వరూపమని భావించుచు నుపాసింపదగిన దని విధింపబడి నది. రెండవప్రకరణమున ఆ బ్రహ్మమే సర్వవ్యాపకమని భావింప నగునని విధింపబడినది. రెండుతావులందును బ్రహ్మ మొక్కటియే యుపాస్యము. ఇట్లే 'సర్వం ఖల్విదం బ్రహ్మ' ఛాం. ౩-౧౪-౧. 'సత్యం బ్రహ్మే త్యుపాసీత' శత. ౧౦-౬-౩-౧. అను ప్రకరణములందు వర్ణింపబడిన ఉపాసన లలో ప్రకరణభేదమువలన, నిరూపణప్రకారభేదమువలనను పైకి కొంత భేద మున్నట్లు కనిపించినను ఉపాస్యబ్రహ్మ మొక్కటియే యైనందున పరస్పరగుణగ్రహణము చేయుటలో నెట్టి దోషము లేదని గ్రహింపవలెను.

'సర్వం ఖల్విదం బ్రహ్మ' అని ఛందోగులు సృష్టిస్థితిలయములకు కర్తగా బ్రహ్మము నుపాసింపవలయు ననిరి. 'సత్యం బ్రహ్మే త్యుపాసీత' అని శతపథమునందు వాజసనేయులు సత్యరూపమున బ్రహ్మ ముపాస్య మనిరి. ఇట్లే ఛాందోగ్యమున మరియొకయెడ 'ప్రాణ ముద్గీథ ముపాసాం

చక్రిరే' ఛాం. ౧-౨-౨. అని చెప్పబడినది. ఇట ప్రాణపదము బ్రహ్మము నకు ప్రయోగింపబడినది. ఈ యుపాసన 'ఓమ్' నామముతో చేయబడును. కావుననే యీ యుపాసన ఉద్గీథ మనబడినది. 'ఓమి త్యేత దక్షర ముద్గీథ ముపాసీత' ఛాం. ౧-౧-౧. అను వాక్యముతో నీ యుపాసన ప్రారంభ మగును. బృహదారణ్యకమున '౧-౩-౧ నుండి ౨౪' వరకు గల ప్రసంగ మున గల ప్రాణపదము బ్రహ్మకు బోధకము. ఆ ప్రాణమే ఉద్గీథము. ఉద్గీథపదమును నిర్వచించుచు నిట్లు చెప్పబడినది: 'ప్రాణో వా ఉత్ ప్రాణేన హి ఇదం సర్వం ఉత్తబ్ధమ్. వాగేవ గీథా; ఉత్ చ గీథాచ ఇతి= ఉద్గీథః' బృ. ౧-౩-౨౩. ఉద్గీథపదమునందలి ఉత్ పదమునకు ప్రాణము బోధ్యము. ఆ ప్రాణము మూలముననే యీ జగత్తంతయు స్థిరమైయున్నది - నిలబడియున్నది. ఉత్‌పదము ఉత్తబ్ధఅర్థమును నిర్దేశించు చున్నది. వాక్‌పదము గీథకు బోధకము. ఇట్లు ఉద్గీథ పదము సిద్ధించును. ఈ విశ్వమును ధారణ (ఉత్తబ్ధము) చేయునట్టి ప్రాణమే బ్రహ్మము. దానిని గానము చేయు గీథాపదము - 'వాక్' (ఓమ్) రూపమున నెరుంగు నది. ఈ విషయమునే బృహదారణ్యమునగల 'వాచా చ హ్యేవ స ప్రాణేన చోదగాయత్' బృ. ౧-౩-౨౪. అను వాక్యముతో వాక్, ప్రాణము నను వానిమూలమున ఉద్గీథ మైనట్లు ఉపనిషత్తు తెలుపుచున్నది. ఓమ్ పద ముతో ఉపాసించి బ్రహ్మమును బొందుటయే ఉద్గీథవిద్య. ఛాందోగ్య బృహదారణ్యకములలో నీ విద్యయే సమానముగ వర్ణింపబడినది. పైన వర్ణించిన ప్రసంగములలోని ఉద్గీథఉపాసనలలో నెట్టి భేదమును లేదు. కావున ఉపనిషత్తులలో వర్ణింపబడిన బ్రహ్మోపాసనలలో భేదము లేదు. అందువలననే యొకచో వర్ణింపబడినగుణములను మరియొకచోట సంగ్ర హించుటలో నెట్టి దోషము లేదని తెలియుచున్నది. (౮)

ఈ యుపాసన విషయమునందే మరియొక శంకకు సూత్రకారుడు సమాధానము చెప్పుచున్నాడు.

### సంజ్ఞాతశ్చే త్తదుక్తమస్తి తు తదపి 3-3-౮

(అన్యథాత్వం, న - అను పదములు ఈ సూత్రమున అనువర్తించును)

సంజ్ఞాతః=అనేకసంజ్ఞలవలన, గుణోపసంహారాన్యథాత్వం ఇతిచేత్= గుణోపసంహారము చేయరాదని అందురేని, న = అట్లనరాదు. తదుక్తమ్=పూర్వము సమన్వయలక్షణమున చెప్పబడినది. అస్తి తు తదపి= సంజ్ఞైక్యము ప్రతివేదాంతమునను ఉండనే యున్నది.

ఉద్గీథఉపాసన యొక్కటియే యైనను విభిన్ననామములతో ననేక-ఉపాసనలు చెప్పబడినవికదా! ఆ యుపాసనలు భిన్నములు కావా? కానిచో భిన్ననామము లేల? భిన్నము లగుచో సంజ్ఞాభేదమునుబట్టి సంజ్ఞియు భిన్నమగుట నిశ్చితముకదా! అని శంకాభిప్రాయము. ఉపాస్యముకూడ ఉపాసనల ననుసరించి భిన్నభిన్ననామములతో జూడనగుచున్నది. ఒకయెడ బ్రహ్మము, ఇంకొకట వైశ్వానరుడు, వేఱొకట అక్షరము, ఇట్లే దహరము, జ్యోతి, ప్రాణము, భూమ, ఆకాశము నని యనేకనామములతో ఉపాస్య మా యా ఉపాసనలందు జూడనగును. నామభేదము ననుసరించి ఆ యా నామములు గల - సంజ్ఞి - ఉపాస్యము కూడ భిన్నమనక తప్పదు. అందువలన ఉపాసనానైక్యము (అనేకోపాసనలు) సిద్ధించును. కావున నొక యుపాసనలో జెప్పబడినగుణముల గ్రహణము అన్యోపాసనయందు తగదు; అని శంకాభిప్రాయము. ఈ శంకను తొలగించుటకు సూత్రకారుడు ఇట్లు సమాధానము చెప్పుచున్నాడు.

సంజ్ఞానైక్యమువలన సంజ్ఞియగు ఉపాస్యము అనేకము కాదు. సంజ్ఞాభేదమునుబట్టి సంజ్ఞి భిన్నము కావలెనను నియమ మొందును లేదు. లోకమున నొకవస్తువున కనేకనామములు చూచుచున్నాము. దేవదత్తు డొక్కడే యైనను నతడు మనుష్యుడు, బ్రాహ్మణుడు, వదాన్యుడు, శ్రోత్రియుడు నను అనేకనామములచే వ్యవహరింపబడుట నెవ్వ రెరుగరు?

అట్లే జగజ్జన్మాదులకు కర్తయైన పరమేశ్వరునకు వైశ్వానరాది అనేక నామము లున్నట్లు పూర్వము 'సర్వత్ర ప్రసిద్ధోపదేశాత్' (వే. ౧-౨-౧) అను సూత్రవ్యాఖ్యానమున వివరించియున్నాము. వస్తువుయొక్క గుణ కర్మ స్వరూప సంబంధములను పురస్కరించుకొని నామవిశేషములు పెట్ట బడును. పరమేశ్వరునికి స్వరూప మొక్కటియే యైనను గుణకర్మసంబంధ భేదములనుబట్టి యనేక సంజ్ఞ లుండుట దోషము కాదు. ఇట్లు ఉపాస్య మున భేదము లేనందున ఉపాసనలోను భేదము లేదనుట నిశ్చితము. కావున గుణోపసంహారమున దోషము లేదు. (౮)

సంజ్ఞాభేదమువలన బ్రహ్మోపాసనలో భేదము లేకున్న పోనిందు. కాని యా బ్రహ్మోపాసన ఒకట హృదయమున, మరియొకట ఆదిత్యు నందు, ఇంకొకయెడ అక్షియందును, వేరొకచో అంతటను విధింపబడు చున్నది. ఇట్లు స్థానభేదమువలన స్థానిభేదము కలుగు నను నియమమునుబట్టి ఉపాస్యమున భేదము కలుగును. దానింబట్టి ఉపాసన భిన్నమగును. కావున గుణోపసంహార మనుచితము; అనుశంకను నిరాకరించుటకు సూత్రము రచించుచున్నాడు.

## వ్యాప్తేశ్చ సమంజసమ్ ౩-౩-౯

(సూత్రమున గల చకారము శంకానిరాకరణార్థము.)

వ్యాప్తేః=బ్రహ్మము వ్యాపక మగుటవలన, సమంజసమ్ = సర్వ స్థానములందును బ్రహ్మోపాసనము ఉచితమే.

మోక్షము నపేక్షించు వ్యక్తులు భిన్నరుచులు, భిన్నభిన్న శక్తి యుక్తులు కలవారై యుందురు. కొందఱికి హృదయమున, మరికొంద ఱికి ఆదిత్యునియందు, ఇతరులకు అక్షియందు, అన్యులకు సర్వత్ర బ్రహ్మము నుపాసించుట రుచికరము కావచ్చును. యోగ్యత ననుసరించి

వా రెట నుపాసించినను దోషము లేదు. బ్రహ్మము వ్యాపకము కావున నెట నైన నుపాసింపవచ్చు నని భావము.

'అవ్యక్తాత్తు పరః పురుషో వ్యాపకో ౽లింగ ఏవ చ' కఠ. ౬-౮. ప్రకృతికంటె మిక్కిలి సూక్ష్మ దగు నా పరమేశ్వరుడు వ్యాపకుడు, లింగరహితుడు' అని వేదాంతములందు బ్రహ్మవ్యాపకత్వము ప్రసిద్ధమే. కావున హృదయాదిస్థానములలో నెట ఉపాసన వేదాంతములందు విధింప బడినదో నా స్థానముల బ్రహ్మము నుపాసించుట యుక్తమే. స్థానభేద ముచే పరిచ్ఛిన్నవస్తువు భిన్నమగును. కాని వ్యాపకము భిన్నము కాదు. తదుపాసనయు భిన్నముకాదు. అందువలన గుణోపసంహారముకూడ ఉచితమే. (౯)

ఇట్లు సర్వవేదాంతములందును బ్రహ్మోపాసనము సమానమే యనియు, అందు గుణోపసంహారముకూడ యుక్తమే యనియు చెప్పి యా విషయమునే క్రిందిసూత్రమున నుపసంహరించుచున్నారు.

### సర్వాభేదా దన్యత్రేమే 3-3-౧౦

సర్వాభేదాత్=సర్వవేదాంతములందును బ్రహ్మోపాసన భిన్నము కానందున, ఇమే=ఇకముందు వర్ణింపబోవు బ్రహ్మగుణములు, అన్యత్ర= (ఇతరస్థలముల వర్ణింపబడినను) అన్యత్ర వర్ణింపబడిన బ్రహ్మోపాసన యందు సంగ్రహింపబడును.

కర్మవలె గుణములు ఉపాసనయం దుపకరించును. కావున నుపక రించువానికి ఉపాసనతో సంబంధము కలుగవలెను. లేకున్న ఉపకరింపవు. అందువలన సర్వవేదాంతములందును బ్రహ్మోపాసనయం దొకచో నిర్దే శింపబడని గుణములు అన్యత్ర నిర్దేశించియున్నపుడు వానిని బ్రహ్మోపా సన కుపకరించునట్లు గ్రహించుట యుక్తమే యగుచున్నది. (౧౦)

## తృతీయాధికరణము

ఒకచో వర్ణింపబడి యన్యత్ర గ్రహింపబడు నా బ్రహ్మగుణము లెయ్యవి యన :

### ఆనందాదయః ప్రధానస్య 3-3-౧౧

ప్రధానస్య = చిదచిదాత్మకమగు జగత్తున కంతటికి ముఖ్యుడైన స్వామికి - బ్రహ్మమునకు, ఆనందాదయః=ఆనందము, జ్ఞానము మున్నగు గుణములు కలవు. అయ్యవి యెట వర్ణింపబడినను సర్వ - ఉపాసనలందును గ్రహింపబడునని సూత్రాభిప్రాయము.

ఈ సూత్రమున ప్రధానపదము బ్రహ్మవాచకము. 'ఆనందాదయః' అను పదమునందలి ఆదిపదముచే జ్ఞానము, వ్యాపకత, సత్యము గ్రహింపనగును. ఈ గుణములన్నియు బ్రహ్మస్వరూపబోధకములు. తైత్తిరీయమునం దియ్యవి బాగుగ వివరింపబడినవి. వేదాంతములందు బ్రహ్మోపాసన విధింపబడినతావులం దీ గుణములను సర్వత్ర గ్రహించుటవలన ఉపాసన సర్వాంగసుందరమై ఫలోపజనక మగును. (౧౧)

తైత్తిరీయమున ఆనందాదిగుణములు వర్ణింపబడినచోట ప్రియశిరస్త్వాదులు వర్ణింపబడినవి కదా! వానినికూడ బ్రహ్మోపాసనయందు గ్రహింపనగునా? అన, సూత్రకారుడు సమాధానము చెప్పుచున్నాడు.

### ప్రియశిరస్త్వాద్యప్రాప్తి రుపచయాపచయౌ హి భేదే 3-3-౧౨

ప్రియశిరస్త్వాద్యప్రాప్తిః = ప్రియము, శిరస్సు మున్నగునవి బ్రహ్మోపాసనలో ప్రాప్తింపవు - గ్రహింపబడవు, హి = కారణ మేమన, ఉపచయాపచయౌ=వృద్ధిక్షయములు, భేదే = నానాత్మకభిన్నవస్తువులందు సంభవించును. ఏకాత్మకబ్రహ్మమునం దవి సంభవింప వని భావము.

తైత్తిరీయోపనిషత్తునందు జ్ఞానానందాదిగుణములు గల బ్రహ్మ మును వర్ణింప ప్రారంభించి, 'తస్య ప్రియ మేవ శిరో, మోదో దక్షిణః పక్షః, ప్రమోద ఉత్తరః పక్ష, ఆనంద ఆత్మా, బ్రహ్మపుచ్ఛం ప్రతిష్ఠా' తై. ౨-౫. 'అతనికి ప్రియము శిరస్సు, మోదము దక్షిణపక్షము, ప్రమోదము ఉత్తరపక్షము, ఆనందము ఆత్మ'. అని వర్ణింపబడినది. బ్రహ్మోపాసనయందు ఆనందాదిగుణములు గ్రహింపబడునట్లు పైవాక్యమున వర్ణింపబడిన ప్రియము, మోదము మున్నగుగుణములు కూడ గ్రహింపబడునా? లేదా? అని సందేహము. కొన్నిగుణములు గ్రహించి మరికొన్నిటిని గ్రహింపకుండుట యుచితము కాదు కదా! యని శంకాభిప్రాయము. అందులకు సమాధానము సూత్రకారు డిట్లు చెప్పుచున్నాడు.

బ్రహ్మమునకు శిరస్సు, పక్షము నను భేదముతో వికల్పింపబడిన ప్రియము మోదము మున్నగు గుణములు భోక్త - (ఆనందము ననుభవించువాడు)లలో గల భేదమునుబట్టి ఉపచయాపచయములు - వృద్ధిక్షయములతోగూడినవై భిన్నము లగుచున్నవి. ప్రియముకంటె మోదప్రమోదము లెక్కుడు. ప్రమోదముకంటె ప్రియమోదములు తక్కువయగును. కావున నవి - ప్రియమోదాదులు జ్ఞానానందాదులవలె బ్రహ్మగుణములు కానేరవు. శిరఃపక్షాదులు బ్రహ్మమునకు కల్పితములే కాని స్వాభావికములు కావు. బ్రహ్మగుణములగు నానందాదులను బ్రహ్మనిష్ఠ లనుభవించునపుడు ప్రియమోదాదులు వారి బ్రహ్మనిష్ఠతలో గల తరతమభేదమును పురస్కరించుకొని వర్ణింపబడిన అనుభవభేదములనే తెలుపును. కావున ప్రియమోదాదులు ఆనందాదులవలె బ్రహ్మమునకు స్వాభావికగుణములు కావని భావము. కాబట్టి బ్రహ్మోపాసనయందు ప్రియమోదాదులు ఆనందాదిగుణములవలె సంగ్రహింపబడవు. ఇదియే సిద్ధాంతము. (౧౨)

**ఆనందాదిగుణములు ఇతరోపాసనలం దేల గ్రహింపబడుచున్నవి? అన - సమాధానము :**

## ఇతరే త్వర్థసామాన్యాత్ 3-3-౧3

ఇతరేతు = ప్రియశిరస్త్వాదులు కాని యితర ఆనందాదిగుణములు, అర్థసామాన్యాత్ = బ్రహ్మసామాన్య మగుటవలన, బ్రహ్మోపాసనలలో నెల్లయెడల గ్రహింపబడుచున్నవి.

ప్రియశిరస్త్వాది గుణములు బ్రహ్మస్వరూపబోధకములు కావు. ఆనందాదులు స్వరూపబోధకములై బ్రహ్మానుబంధములై బ్రహ్మముతో బాటు గ్రహింపబడును. బ్రహ్మము సాక్షాత్కార మైనపుడు తత్స్వరూపము లగు ఆనందాదిగుణములు సాక్షాత్కారము కాకపోవు. కావున వానిని బ్రహ్మోపాసనలం దెల్లయెడల గ్రహించుట యుక్తమే. ఇతరనైమిత్తిక ములు కల్పితములు నైన గుణములు గ్రహింపబడవని భావము. సాక్షాత్ కృతధర్మలగు మహర్షుల యనుభూతియు నట్టిదియే. (౧3)

## చతుర్థాధికరణము

ఆనందాదిగుణములు బ్రహ్మోపాసనలం దెల్లయెడల గ్రహింప బడుట యుక్తమే యని నిర్ణయింపబడినది. బ్రహ్మము ఇంద్రియాదిప్రకృతి పర్యంతపదార్థముల కన్నింటికంటె పరము (ఉత్కృష్టము - సూక్ష్మము) అని చెప్పబడినది. ఆనందాదులవలెనే సకలపదార్థపరత్వముకూడ ఉపాస నలో సంగ్రహింపవగినదా? కాదా? యని నిర్ణయించుటకు అధికరణము ప్రారంభింపబడుచున్నది.

## ఆధ్యానాయ ప్రయోజనాభావాత్ 3-3-౧౪

ఆధ్యానాయ=చింతనకొఱకు, బ్రహ్మము సకలపదార్థపర మని చెప్ప బడినది. ఇంద్రియార్థాదులందలి ప్రత్యేకపరత్వము అట చెప్పబడలేదు. కారణ మేమన : ప్రయోజనాభావాత్=ప్రయోజనము లేనందువలన.

బ్రహ్మము ప్రాకృతికపదార్థము లన్నింటికంటె పరము - ఉత్కృష్ట మని చింతనచేయుటకు చెప్పబడినది. మిగిలిన పదార్థములు-ఇంద్రియాదులు-వానిలోగల పరస్పరపరత్వము ఉపాసనకు లక్ష్యము కాదు. కావున వాని పరత్వము ఆనందాదులవలె ఉపాసనలో గ్రహించినందువలన ప్రయోజనము లేదని సూత్రార్థము.

కఠోపనిషత్తునందు -

'ఇంద్రియేభ్యః పరా హ్యర్థా అర్థేభ్యశ్చ పరం మనః
మనసస్తు పరా బుద్ధిః బుద్ధే రాత్మా మహాన్ పరః
మహతః పర మవ్యక్త మవ్యక్తాత్ పురుషః పరః
పురుషా న్నపరం కించిత్ సా కాష్ఠా సా పరాగతిః' ౧-౩-౧౦,౧౧.

(బుద్ధిః = అహంకారము. ఆత్మా మహాన్ = మహత్తత్త్వము. అవ్యక్తం=ప్రకృతి)

ఇంద్రియగోళములకంటె అర్థములు-శబ్దస్పర్శాదులు సూక్ష్మములు. వానికంటె మనస్సు, దానికంటె అహంకారము, అంతకంటెను మహత్తత్త్వము, దానికంటె ప్రకృతి పరము - సూక్ష్మము. ఆ ప్రకృతికంటెను పురుషుడు-పరబ్రహ్మము మిక్కిలి సూక్ష్మము. దానికి మించి వేరియొండు లేదని వర్ణింపబడినది. బ్రహ్మసూక్ష్మతను చింతించుట కనువుగా నీ క్రమము చెప్పబడినది. బ్రహ్మోపాసనయందు బ్రహ్మమునకు గల సకల పదార్థపరత్వము ఆనందాదిగుణములవలె గ్రహింపదగినదే. కాని ఇంద్రియాది ప్రకృతిపర్యంత పదార్థముల పరత్వము బ్రహ్మోపాసనయందు ప్రయోజనకారి కాదు. కావున ఆ యా పదార్థపరత్వము - సూక్ష్మత బ్రహ్మోపాసనస్థలమున గ్రహింపవలసిన యవసరము లేదు. పదార్థపరత్వచింతన వలన కలుగు ప్రయోజనము వేరు. బ్రహ్మోపాసనప్రయోజనము వేరు. బ్రహ్మోపాసనప్రయోజనము ముక్తి. అయ్యది పదార్థపరత్వచింతనవలన

కలుగజాలదు. కావున ప్రయోజనాభావమువలన వానిని బ్రహ్మోపాసన యందు సంగ్రహింప నవసరము లేదనియు, బ్రహ్మపరత్వము మాత్రము సంగ్రహింపదగిన దనియు సూత్రకారుడు చెప్పుచున్నాడు. (౧౪)

పైన వర్ణించిన విషయమును దృఢపరుచుటకు మరియొకహేతువు చెప్పుచున్నాడు.

## ఆత్మశబ్దాచ్చ 3-3-౧౫

చ=మరియు, ఆత్మశబ్దాత్ = ఆత్మశబ్దప్రయోగమువలన పరమేశ్వ రుని గూఢతను ప్రతిపాదించు వాక్యశేషమువలనను ఉపాసనస్థలములందు బ్రహ్మపరత్వమే గ్రాహ్యము కాని యింద్రియాద్యర్థపరత్వము గ్రాహ్యము కాదని స్పష్ట మగుచున్నదని సూత్రాభిప్రాయము.

కఠోపనిషత్తునందు 'ఏష సర్వేషు భూతేషు గూఢో ఽఽత్మా న ప్రకాశతే'౧-౩-౧౨.అను నిది వాక్యశేషము. ప్రస్తుతప్రకరణమున వర్ణింప బడు పురుషుని ఉద్దేశించి యీ వాక్యమున ఆత్మశబ్దము ప్రయోగింపబడినది. ఆత్మశబ్దముచే చెప్పబడు నా పరమేశ్వరుడు సర్వపదార్థములందు గూఢ ముగా నుండి తెలియబడడు. అని యతనిసూక్ష్మత బోధింపబడినది. ఇట్లు బ్రహ్మముయొక్క పరత్వము చెప్పుటయే ప్రకరణమునుబట్టి సంగతమని తెలియుచున్నది. ఇతరపదార్థములపరత్వము కాదు. కావున బ్రహ్మపర త్వమే ఆనందాదులవలె ఉపాసనలో గ్రాహ్యము కాని ప్రకృత్యాదులపర త్వము కాదని ఆత్మశబ్దప్రయోగమువలనను సిద్ధమగుచున్న దని సూత్ర కారుని సిద్ధాంతము. (౧౫)

## పంచమాధికరణము

'గూఢో ఽఽత్మా న ప్రకాశతే' అను నీ వాక్యమునందలి ఆత్మపద ముచే పరబ్రహ్మపరమాత్మ నేల గ్రహింపవలెను? జీవాత్మ నేల

గ్రహింపరాదు? కఠోపనిషత్తునందు తరువాత గల 'యచ్ఛేద్ వాఙ్మనసి ప్రాజ్ఞః' ౧-౩-౧౩. అను వాక్యమునందు జీవాత్మప్రసంగ మున్నట్లు తెలియుచున్నది కదా ! దానింబట్టి పైవాక్యమునందలి ఆత్మపదముకూడ జీవాత్మవాచక మేల కాదన - సమాధానము :

## ఆత్మగృహీతి రితరవ దుత్తరాత్ ౩-౩-౧౬

ఆత్మగృహీతిః=ఆత్మగ్రహణము, ఇతరవత్=అన్యత్ర గ్రహించినట్లు, ఉత్తరాత్=ఉత్తర - తరువాతివాక్యముపలన గ్రహింపవలెను.

'గూఢో ఽఽత్మా న ప్రకాశతే' అను వాక్యమునందలి ఆత్మపదము పరమాత్మవాచకమే యగును. జీవాత్మవాచకము కాదు. కారణ మేమన : తరువాత నున్న యే వాక్యమునందు జీవాత్మప్రసంగము కలదని చెప్పబడుచున్నదో యా వాక్యమునుబట్టి చూచినను ఆత్మపదము పరమాత్మవాచకమనియే తెలుచున్నది. చూడుడు :

'యచ్ఛేద్ వాఙ్మనసీ ప్రాజ్ఞః, తద్యచ్ఛేద్ జ్ఞాన ఆత్మని,
జ్ఞాన మాత్మని మహతి ప్రయచ్ఛేత్, తద్యచ్ఛే చ్ఛాంత ఆత్మని'
కఠ. ౧-౩-౧౩.

'ప్రాజ్ఞుడు (బ్రహ్మజిజ్ఞాసువు) వాక్కును మనస్సునందు నియంత్రితము చేయవలెను. ఆ మనస్సును, జ్ఞానఆత్మయందు నిరోధింపవలెను. జ్ఞానఆత్మను మహత్ఆత్మయందు నియమింపవలెను. ఆ మహదాత్మను శాంతఆత్మయందు నియమింపవలెను'. అని వాక్యార్థము.. ఇట వాక్కు మిగిలిన జ్ఞానేంద్రియముల కన్నింటికి ఉపలక్షణము - గ్రాహకము. ఇంద్రియము లన్నియు తమచే గ్రహింపబడు విషయములను మనస్సున కర్పించును. అందువలన జిజ్ఞాసువు - సాధకుడు ఇంద్రియములను మనస్సుతో నియమింపవలెను. ఆ మనస్సును అహంకారము (జ్ఞానఆత్మ)చే నియం

త్రింపవలెను. తదుపరి అహంకారమును బుద్ధితత్వము (మహదాత్మ)నందు నియమింపనగును. ఇది చిత్తవృత్తులు కలుగకుండునట్లు చేయుప్రయత్నము. ఇట్లు వృత్తులను నిరోధించి శుద్ధమగుబుద్ధిని శాంతఆత్మ (బ్రహ్మము - పరమాత్మ) యందు సంలగ్నము చేసి ప్రాజ్ఞుడు బ్రహ్మసాక్షాత్కారము చేసికొనును. ఈ సందర్భమున ఉత్తరవాక్యార్థము (తద్యచ్ఛేత్ శాంతఆత్మని)న గల ఆత్మపదము పరమాత్మకు బోధకమై జీవుడు అంతర్యామియగు పరమేశ్వరుని తెలిసికొనునట్టి స్థితిని బోధించుచున్న దనుట నిర్వివాదసిద్ధము. అట్టివాడే ఆత్మదర్శి యనబడును. ఈ ప్రకరణమున గల 'గూఢోఽఽత్మా న ప్రకాశతే'(౧-౩-౧౨) అను వాక్యము అన్నింటియందు వ్యాపించి గూఢముగా అప్రకటితమై యున్న పరమాత్మను తెలుపుచున్నది. తరువాత నున్న వాక్యము 'యచ్ఛేద్వాఙ్మనసీ ప్రాజ్ఞః....'(౧-౩-౧౩) జిజ్ఞాసువు పరమాత్మను తెలిసికొనువిధమును బోధించుచున్నది. కావున ఉత్తరవాక్యమునందలి ('శాంత ఆత్మని') ఆత్మపదము బ్రహ్మబోధకమే కాని జీవాత్మబోధకము కాదనుట సిద్ధము.

ఇట్లే ఇతరత్ర వేదవేదాంతములందు ఆత్మశబ్దము పరమాత్మ బోధకమైనట్లు చూడనగును.

'తమేవ విద్వా న్నబిభాయ మృత్యో రాత్మానం ధీర మజిరం యువానమ్' అథర్వ. ౧౦-౮-౪౪. ధీరుడు, అజిరుడు, సర్వశక్తిమంతుడు, సర్వజ్ఞుడు సర్వాంతర్యామియు నగు పరమేశ్వరు నెరిగి మృత్యురూపసంసారభయమునుండి తరించును'.

'తస్మాద్ వా ఏతస్మా దాత్మన ఆకాశః సంభూతః' తై. ౨-౧. 'ఆ పరమేశ్వరునివలననే ఆకాశాదిభూతజాత మేర్పడినది'.అను నిట్టి తావులందు ఆత్మశబ్దము పరమాత్మవాచక మగుట సుప్రసిద్ధము. (౧౬)

ఏపద మే యర్థమున ప్రయోగింపబడినదో పద పదార్థముల

సంబంధమువలన గదా బోధపడును। దానింబట్టి ఆత్మపదము జీవాత్మ వాచక మేల కాదు? బ్రహ్మవాచక మెట్లగును? అను శంకను దూరమొన ర్చుటకు సూత్రకారుడు శంకానిర్దేశపూర్వకసమాధాన సూత్రమును రచించు చున్నాడు.

## అన్వయా దితిచేత్ స్యా దవధారణాత్ 3-3-౧౭

అన్వయాత్ = అన్వయమువలన, జీవాత్మగ్రహణము, ఇతిచేత్ = అనియందురేని, అవధారణాత్ = అవధారణమువలన, స్యాత్ = పర మాత్మగ్రహణ మగును.

సూత్రమునగల అన్వయపదముచే పద-పదార్థసంబంధము గ్రహింప నగును. శబ్దతత్త్వము నెరిగిన ఆచార్యులు ఆత్మపదమును, 'అత్'ధాతువుతో నిర్వచించియున్నారు. అత్ధాతువున కర్థము సాతత్యగమనము. వ్యాఖ్యాన కారులు 'అతతి నిరంతరం కర్మఫలాని ప్రాప్నోతి వ్యాప్నోతి వా యో న్యంతరాణి స ఆత్మా' నిరంతరము కర్మఫలముల ననుభవించుచు నొక దేహమునుండి మరియొకదేహమును బొందునది ఆత్మ(జీవాత్మ) యని వ్రాసియున్నారు. ఈ యర్థమునుబట్టి జీవాత్మను గ్రహించుట యుక్తమగును.

సూత్రమున గల అవధారణపదమునకు తాత్పర్యము పూర్వాపర ప్రసంగమునుబట్టి అర్థనిర్ణయముచేయుట యని గ్రహింపవలెను. ఆత్మ పదము కేవలము 'అత్'ధాతువువలననే కాదు. 'ఆప్' ఆ+'దా' 'అద్' అను ధాతువులతోను సిద్ధమగును. 'ఆప్ ధాతువునకు సర్వత్ర వ్యాప్తమగుట, 'ఆ+దా' ధాతువునకు అర్థము అన్నింటిని గ్రహించుట - అన్నింటిని నియంత్రణలో నుంచుట, 'అద్' ధాతువునకు కారణప్రకృతిలో స్థూల ప్రపంచమును లయముచేయుట అనునర్థములు గ్రహింపనగును. ఈ ధాత్వ ర్థములనుబట్ట ఆత్మపదమునకు పరమాత్మయే యర్థమగును. 'అత్'ధాతువు

నకు సాతత్యగమనము అను నర్థము గ్రహించినను నిరంతరముగ నంతట ప్రాప్తమగునది పరమాత్మయే యనియు నర్థము చెప్పవచ్చును. ఇట్లు ఆత్మ పదము జీవాత్మకు పరమాత్మకు రెంటికిని ప్రయోగింపబడుట అసంగతము కాదు. కాని యీపద మెక్కడ జీవాత్మార్థమున ప్రయోగింపబడినదో, యెక్కడ పరమాత్మార్థమున ప్రయోగింపబడినదో నిర్ణయింపవలసివచ్చి నపుడు పూర్వాపరప్రసంగము (అవధారణము)ను బట్టి నిర్ణయింపవలెను. పూర్వసూత్రమున నుదాహరింపబడినకఠోపనిషత్తు ప్రకరణమున (౧-౩-౧౩) ఆత్మపదము అంతటను పరమాత్మార్థమున ప్రయోగింపబడని మాట నిజమే. కాని అంతిమ 'శాంత ఆత్మని' అను తావున ఆత్మపదము పరమాత్మార్థమున బ్రయోగింపబడిన దనుటలో నెట్టి సందేహము లేదు. అంతమున 'అశబ్ద మస్పర్శ మరూపమ్' (౧-౩-౧౫) అను నీ కఠవాక్యము నందు పరమాత్మబోధకగుణములతో నీ సందర్భమును ముగించుటయు కన బడును.

ఇట్లు బ్రహ్మముస్వరూపమును దెలుపు గుణములు విభిన్నములైన ఉపాసనలందు వర్ణింపబడి యున్నపుడు వానిని గ్రహింపవలయు నని తెలియనగును. అందువలన ఉపాసనలలో ఏకత బోధపడును. ఉపాస్య తత్త్వముకూడ ఒక్కబ్రహ్మమే యనియు నిర్ణయమగును. అధ్యాత్మ శాస్త్రములందు ప్రయోగింపబడిన 'ఆత్మ'శబ్దమును వ్యాఖ్యానించుటలో వ్యాఖ్య నొనరించువారు కొందఱు అనేకస్థలములందు అనుచిత మొనర్చి యున్నారు. ఆత్మపదము జీవపరమాత్మలకు గల వ్యాపకార్థమును పురస్కరించుకొని ప్రయోగింపబడినది. ఎక్కడ నే యర్థమును గ్రహింపవలయునో ప్రసంగముయొక్క పూర్వాపరములు విచారించి గ్రహింపవలెను. (౧౭)

ఉపాసనలలో నెల్లయెడల అపూర్వత్వమను గుణమును గ్రహింప వలయునని చెప్పుచు సూత్రమును రచించుచున్నాడు.

## కార్యాఖ్యానా దపూర్వమ్  ౩-౩-౧౮

కార్యాఖ్యానాత్ = జగత్తంతయు బ్రహ్మకార్యముగ వ్యాఖ్యానము చేసినందువలన - చెప్పబడుటవలన, అపూర్వమ్=(పూర్వమన కారణము, తద్రహితము అపూర్వము) కారణరహితము బ్రహ్మము అని సూత్రార్థము.

ఈ దృశ్యమానజగత్తంతయు బ్రహ్మనిర్మిత - కార్యముగ జెప్ప బడినది. 'ఏష యోనిః సర్వస్య' మాం. ౬. బ్రహ్మము సర్వమునకు కార ణము. 'అక్షరాత్ సంభవతీహ విశ్వమ్' ముం. ౧-౧-౭. 'అక్షరబ్రహ్మము వలన సృష్టికాలమున నీవిశ్వము ప్రాదుర్భూత మగును. 'స విశ్వకృత్' శ్వే. ౬-౧౬. ఆ పరమేశ్వరు డన్నింటి నుత్పన్నము చేయువాడు. అను నీ వేదాంతవాక్యము లన్నియు ప్రపంచము బ్రహ్మకార్యముగా వర్ణించు చున్నవి. బ్రహ్మముమాత్రము కార్యముగా నెక్కడను వర్ణింపబడుట కానము. కావున నది కార్యము కాదు - కారణమువలన నేర్పడినది కాదు. అందువలన నది అపూర్వము - కారణరహితము. కావున ఉపాసనస్థలమున బ్రహ్మస్వరూపబోధకములగు జ్ఞానానందాదిగుణములను గ్రహించునపుడు అపూర్వత్వగుణము కూడ గ్రహింపవలెనని సూత్రాభిప్రాయము. బృహ దారణ్యకమున బ్రహ్మము ('తదేతద్ బ్రహ్మ అపూర్వ మనపరమ్....' ౨-౫-౧౯.) అపూర్వ మని స్పష్టముగా చెప్పబడినది. కావున అపూర్వత్వ గుణముకూడ స్వరూపబోధకగుణమే. (౧౮)

అటులయిన బ్రహ్మము అపూర్వము 'త దేతద్ బ్రహ్మ అపూర్వ మనపర మనంతరమ్....' ౨-౫-౧౯. అని చెప్పిన వాక్యమున అనపరము, అనంతరము ననియు చెప్పబడినదికదా। అనపరత్వాది గుణములను గ్రహింపవలెనా ? లేదా ? యన, సూత్రకారుడు వానిని గ్రహింపవలె నను చున్నాడు.

## సమాన ఏవం చాభేదాత్ ౩-౩-౧౯

చ=మరియు, ఏవమ్=ఇట్లే - అపూర్వత్వగుణము గ్రహించినట్లు, సమానః = అపూర్వతకు సమమైన అనపరత్వాదులుకూడ సంగ్రహింపవలెను. అభేదాత్=ఉపాస్యమున భేదము లేనందువలన.

బ్రహ్మము స్వరూపబోధకమైన అపూర్వత్వగుణము సర్వత్ర ఉపాసనయందు గ్రహించునట్లు, ఆ గుణమునకు సమకక్ష్యలో నున్న అనపరత్వము, అనంతరత్వాది గుణములుకూడ గ్రహింపనగును. ఉపాస్యము సమానమైనపుడు ఉపాస్యగుణములలో కొన్నింటిని గ్రహించి మరి కొన్నింటిని గ్రహింపకుండుటకు కారణము కానము. అపూర్వత్వమువలె అనపరత్వాదులుకూడ బ్రహ్మగుణములే. కావుననే 'త దేతద్ బ్రహ్మ అపూర్వ మనపర మనంతర మబాహ్య మయ మాత్మా బ్రహ్మ సర్వానుభూః' బృ. ౨-౫-౧౯. అపరం=కార్యము. అదిలేనిది అనపరము. మృత్తికకు ఘటాదులు కార్యము లగునట్లు బ్రహ్మము కార్యముగా మారదు. అంతర్=అంతరాళమున, విభక్త మివ వస్తు న విద్యతే యస్య=మధ్యలో విభజించిన వస్తువు దేని కుండదో యది యనంతరము. బ్రహ్మము మధ్యలో అవకాశ ముండదని భావము. న విద్యతే బాహ్యం బహిర్భూతం వస్తు కించిత్ యస్య తదబాహ్యమ్ = బ్రహ్మమునకు వెలుపలనుండు వస్తు వొండును లేదు. బ్రహ్మము పూర్ణమగుటవలన దానియందు బాహ్యము అభ్యంతరము నను వ్యవహార ముండదు. సర్వానుభూః = సర్వజ్ఞము - సర్వము నెరుంగునది. కావున అపూర్వత్వమువలె అనపరత్వాదులు గూడ బ్రహ్మోపాసనవిద్యయందు సర్వత్ర గ్రహింపదగినవియే యని సిద్ధాంతము. (౧౯)

ఈ విషయమున సూత్రకారుడు అనిష్టమును శంకించుచున్నాడు.

## సంబంధా దేవ మన్యత్రాపి 3-3-౨౦

సంబంధాత్=గుణగుణిసంబంధమువలన, ఏవమ్ = వేదాంతవాక్య ములం దట నట వర్ణింపబడిన గుణములను బ్రహ్మోపాసనయందు గ్రహించునట్లు, అన్యత్ర అపి = వేదాంతములకంటె భిన్నమైన స్మృత్యాది గ్రంథములందు వర్ణింపబడిన గుణములు, సాకారత – ఏకదేశిత్వము మున్నగునవికూడ సంగ్రహింపనగునా? బ్రహ్మోపాసనయందు సర్వత్ర బ్రహ్మమే ఉపాస్యము కావున తద్గుణములు వేదాంతముల నెచ్చట వర్ణింప బడినను సంగ్రహించునట్లు వేదాంతములుకాని యితరస్మృత్యాదిగ్రంథము లలో జూడబడు బ్రహ్మముయొక్క సాకారతాదిగుణములుకూడ ఏల గ్రహింపరాదు? అని శంకాభిప్రాయము. (౨౦)

ఈ యనిష్టశంకను నిరాకరించుచున్నాడు.

## న వా విశేషాత్ 3-3-౨౧

(సూత్రమునందు 'వా' పదము శంకానిరాకరణసూచకము.)

విశేషాత్=వేదాంతవాక్యములు విశిష్టము లైనందున, న=వేదాంత భిన్నములయిన ఆధునికగ్రంథములలో బ్రహ్మమునకు వర్ణింపబడిన సాకార త్వాదిగుణములు ఉపాసనవిద్యయందు సంగ్రహించుట తగదని సూత్రార్థము.

వేద వేదాంతములు బ్రహ్మమును, తద్గుణములను యథాతథముగ వర్ణింప సమర్థములు. వేదము ఈశ్వరీయము. వేదాంతములు - దశ ఏకా దశోపనిషత్తులుమాత్రము ఋషినిర్మితములు - వేదానుకూలములు. కావున వానియం దెక్కడ బ్రహ్మగుణములు వర్ణింపబడినను ప్రామాణికములు. కావున నవి యుపాసనయందు సర్వత్ర గ్రాహ్యములుగా జెప్పబడినవి. ఇతరగ్రంథము లట్లుకాక యల్పబుద్ధిరచితము లగుటవలన వానియం దెట నైనను బ్రహ్మ మేకదేశవర్తియనియు, సాకారమనియు, జన్మజరాది

వికారగ్రస్తమనియు వర్ణింపబడినపక్షమున గుణగుణిసంబంధనెపమున సాకారతాది గుణములుకూడ ఉపాసనయందు గ్రహింపవలయు నన్నుట తగదు. కొండొకవిషయమున వేదవేదాంతములకు ఇతరస్మృతులకు విరోధము సంభవించినపుడు వేదవేదాంతములు చెప్పినదియే గ్రహింపవలెను. అవి విశిష్టములు అందువలననే శిష్టులు 'శ్రుతిస్మృత్యో ర్విరోధేతు శ్రుతి రేవ గరీయసీ' అన్నారు. (౨౧)

ఈ విషయమున ఆర్షదర్శనమును జూపుచున్నారు.

## దర్శయతి చ ౩-౩-౨౨

దర్శయతి చ=బ్రహ్మము, దానిగుణములు యథాతథముగా వర్ణించుటలో వేదవేదాంతవాక్యములకు గల విశేషతను చూపుచున్నాడు.

తిత్తిరిఋషి 'నావేదవిత్ మనుతే తం బృహంతమ్' తై. బ్రా. ౩-౧౨-౯. 'వేదము నెరుగనివాడు స్వరూపముతోను గుణములతోను గొప్పది యగు నా పరబ్రహ్మను తెలిసికొనజాలడు' అని నుడివియున్నాడు. దీనింబట్టి వేదమే బ్రహ్మమును తద్గుణములను బాగుగ బోధింపగలదని తెలియుచున్నది. మరియును 'తం త్వౌపనిషదం పురుషం పృచ్ఛామి' బృ. ౩-౯-౨౬. 'వేదాంత విజ్ఞాన సునిశ్చితార్థాః' ముం. ౩-౩-౬. ఆ యుపనిషత్తులందు వర్ణింపబడిన పురుషునిగూర్చి యడుగుచున్నాను. 'ఉపనిషత్తులవిజ్ఞానముమూలమున బ్రహ్మస్వరూపమును బాగుగ నెరిగినవారు' అని యాజ్ఞవల్క్యాది మహర్షులు చెప్పుటవలనను వేదవేదాంతములే బ్రహ్మస్వరూపమును నిశ్చితముగ ప్రతిపాదింపసమర్థములగును. కాని అన్యములు కావని స్పష్టమగుచున్నది. కావున వానియందు వర్ణింపబడిన గుణములే బ్రహ్మోపాసనలో పరస్పరము గ్రహింపనగును కాని, యన్యములు కావు.

శ్రీ శంకరాచార్యులు ఈ (౨౦-౨౧-౨౨) మూడు సూత్రములను వ్యాఖ్యానించుచు బృహదారణ్యకమున (౫-౫-౧,౨) వర్ణితములగు ఆదిత్య పురుష, అక్షిపురుష విద్యలను లక్ష్యములుగా గ్రహించియున్నారు. అట ఆదిత్యపురుషునకు రహస్యనామము 'అహస్సు' అనియు, అక్షిపురుషునకు 'అహమ్' అనియు చెప్పి యా నామములను ఆదిత్య, అక్షిపురుషుల ఉపాసనయందు గ్రహింపవచ్చునా? లేదా? యని ఇరువదియవసూత్రమున శంకించి, ఇరువదియొకటవ సూత్రమున నిషేధించియున్నారు. వాస్తవమున నీ ప్రకరణము గుణోపసంహారమునకు చెందినది. ఇట నామ సంగ్రహప్రశ్నయే యసంగతము. నామములు బ్రహ్మస్వరూపమును బోధింపనేరవు. అవి వాచకములు మాత్రమే: కావున వాని యుపసంహారమున కిట ప్రసక్తియే లేదు. ఈ రెండువిద్యలయందును ఉపాస్యము బ్రహ్మమే కావున గుణోపసంహార ముచిత మగును. కాని నామోపసంహారము కాదు. ఉపాసనలలోని యేకతకు గుణోపసంహారమునకు గీటురాయి ఉపాసనలలో నంతటను ఉపాస్యము బ్రహ్మ మొక్కటి యగుటయే. అందువలన ఒకచో వర్ణింపబడని గుణములు వర్ణింపబడిన తావులనుండి సంగ్రహింపవలెను. అట్లు చేసిన గుణభేదమువలన ఉపాసనలలో భిన్నత కలుగకుండును. కావున పై మూడుసూత్రములకును శ్రీ శంకరాచార్యులు గ్రహించిన లక్ష్యప్రదేశములు చింత్యములని యనక తప్పదు. (౨౨)

మహర్షి యింకను ఇతరగుణోపసంహారమును గూర్చి చెప్పదలచి సూత్రమును రచించుచున్నాడు.

సంభృతి ద్యువ్యాప్త్యపి చాతః 3-3-౨3

అతః = అందువలన (ఉపాస్యభేదము లేనందువలన) సంభృతి ద్యువ్యాప్తి అపిచ = సంభృతి ద్యువ్యాప్తి అనుగుణములు కూడ బ్రహ్మోపాసనలో గ్రహింపనగును.

పూర్వము (౩-౩-౧౯) చెప్పబడిన ఉపాస్యాభేదమనెడి హేతువు వలననే సంభృతి ద్యువ్యాప్తి అను గుణాంతరములు కూడ బ్రహ్మోపాసన ప్రకరణములందు గ్రహింపవలె నని సూత్రాభిప్రాయము.

సంభృతి = జగన్నిర్మాణము, రక్షణము, ఉపసంహారము ననెడి సమస్తశక్తులు కలిగియుండుట, ద్యువ్యాప్తిః = దివమువరకు గల లోకముల నన్నిట వ్యాపించుట, అను నీ రెండుగుణములుగూడ అపూర్వత్వాది గుణములవలె బ్రహ్మోపాసనస్థలముల నెల్లయెడల గ్రహింపనగునని భావము.

'బ్రహ్మ జ్యేష్ఠా సంభృతా వీర్యాణి
బ్రహ్మాగ్రే జ్యేష్ఠం దివ మాతతాన....' అథర్వ. ౧౯-౩-౨౨-౨౧.

'బ్రహ్మము జగదుత్పత్తిస్థితిలయము లొనర్చుశక్తులు కలిగి యున్నది. పృథివి మొదలు దివమువరకు గల సమస్తలోకములందును వ్యాపించియున్నది.

ఇట్లు వేదములందు జగత్తును పుట్టించి పోషించి లయము చేయగల సర్వశక్తులను గలిగియుండుట, అన్నిలోకములందును వ్యాపించియుండుట అను (సంభృతి ద్యువ్యాప్తి) గుణములు బ్రహ్మమునకు ఉన్నట్లు చూచు చున్నాము. ఈ గుణములుకూడ ఉపాసనలందు గ్రహింపనగునా ? లేదా ? అను సందేహమును తొలగించుటకుగాను మహర్షి సూత్రమును రచించి యున్నాడు. ఉపాసనలో భేదము లేనందున అపూర్వత్వాది గుణములవలెనే సంభృతి, ద్యువ్యాప్తి అను గుణములనుగూడ ఉపాసనలలో గ్రహింప వలయునని యీ సూత్రము మూలమున స్పష్టముచేసినా దని గ్రహింప వలెను. (౨౩)

ఆనందాదులు మొదలు ద్యువ్యాప్తివరకు గల గుణము లన్నియు బ్రహ్మోపాసనస్థలమున గ్రహింపవలయునని నిర్ణయింపబడినది. కాని, యీ గుణములన్నియు ప్రతిబ్రహ్మోపాసనమునందును గ్రహింపవల

యునా? లేక వానిలో నేపి యట చెప్పబడలేదో వానినే గ్రహింపవలయునా? అను సంశయమునకు సూత్రకారుడు ఉదాహరణపూర్వకముగ సమాధానము చెప్పుచున్నాడు.

## పురుషవిద్యాయా మివ చేతరేషా మనామ్నానాత్ ౩-౩-౨౪

పురుషవిద్యాయామ్ ఇవ = పరమపురుషుని యుపాసనయందు వలె, ఇతరేషామ్ = వర్ణింపబడినగుణములకంటె ఇతరములైన గుణములను, అనామ్నానాత్ = అక్కడ వర్ణింపనందున, ప్రతిబ్రహ్మోపాసనయందును గ్రహింపవలెను.

పురుషవిద్య యన పురుషోపాసన. ఇట విద్యాశబ్దము ఉపాసనను తెలుపును. పురుషుడన పరమేశ్వరుడు - పరమపురుషుడు - పరబ్రహ్మ మని యర్థము. ఋగ్యజుర్వేదాదులందు 'సహస్రశీర్షా పురుషః సహస్రాక్షః' (ఋక్. మం. ౧౦ సూ. ౯౦, యజు. అ. ౩౧, సామ. ౬౧౭. అథర్వ. ౧౯-౬) మంత్రములందు పురుషోపాసన వర్ణింపబడినది. అట పరమేశ్వరుని వ్యాపకత్వాదిగుణములు బహుధా వర్ణింపబడినవి. కాని ఆనందాదిగుణములు వర్ణింపబడలేదు. అవి యితరస్థలమున వర్ణింపబడినవి. కావున వానినట పురుషోపాసనయందు గ్రహింపవలెను. అట్లే, ప్రతిబ్రహ్మోపాసనయందును నట వర్ణింపబడక యితరత్ర వర్ణింపబడిన గుణములను మాత్రము గ్రహింపవలెను. అక్కడ వర్ణించినగుణములు ఇతరత్ర మరల వర్ణింపబడినను వానిని గ్రహింపవలసిన పని లేదు. అవి ప్రకృతోపాసనయందు వర్ణింపబడియే యున్నవికదా! ప్రకృతబ్రహ్మోపాసనయందు వర్ణింపబడని గుణములు ఇతరస్థలమునుండి గ్రహించుటవలన బ్రహ్మము స్వరూపము పూర్ణముగ బోధింపబడును. అందులకే యవి గ్రహింపబడునని సూత్రకారుని యభిప్రాయము. (౨౪)

## షష్ఠాధికరణము

ఉపసంహరింప-గ్రహింప-దగిన గుణములు చెప్పి, గ్రహింపకూడని గుణములనుగూర్చి సూత్రకారుడు చెప్పుచున్నాడు.

### వేధా ద్యర్థభేదాత్    3-3-౨౫

అర్థభేదాత్ = ఫలభేదమువలన, వేధాది = వేధ - వేధకత్వము మున్నగు గుణములు బ్రహ్మోపాసనయందు గ్రహింపబడవు.

ఇట అర్థపదము ఫల - ప్రయోజన బోధకము. ఈ సూత్రమున నిషేధమును బోధించు 'న కారము ౨౧ సూత్రమునుండి గ్రహింపనగును. మండూకప్లుతి (కప్పగంతు) న్యాయము ననుసరించి కాని, అర్థబలమును బట్టి కాని 'న' కారము గ్రహింపవలయు నని భావము.

'వేధ - ఆది' అను నీ ఆదిపదముచే భేదకత్వము, వినాశనము మున్నగు గుణములు గ్రహింపనగును.

వేదములందు 'అగ్ని'పదముతో తేజస్వరూపమగు పరబ్రహ్మమును సంబోధించి యుపాసించు ప్రార్థన కలదు.

'యజ్ఞై రిషూః సన్నమమానో అగ్నే
వాచాశల్యాం అశనిభి ర్దిహానః
తాభిర్ విధ్య హృదయే యాతుధానా
ప్రతీచో బాహూన్ ప్రతిభంఙ్ఘ్యేషామ్' ఋ. ౧౦-౮౭-౪.

ఓ అగ్నీ ! తేజఃస్వరూపబ్రహ్మమా ! మా యజ్ఞోపాసనాదులచే ప్రసన్నమగు నీవు బాణములను నమింపజేయుచు వానిని వజ్రయుక్తములు చేయుచు వానితో రాక్షసులహృదయములను భేదించుము. విరోధుల బాహువులను ఖండించుము.

'అగ్నే! త్వం యాతుధానస్య భింధి,
హింస్రాశని ర్హరసా హంత్వేనమ్,
ప్రపర్వాణి జాతవేదః శృణీహి
క్రవ్యాత్ క్రవిష్ణుర్ విచినోతు వృక్ణమ్' ఋ. ౧౦-౮౭-౫

'అగ్నీ! రాక్షసులచర్మము ఒలిచివేయుము. హింసాశీలమగు వజ్రము వారిని శీఘ్రముగ జంపునుగాక! వారిపర్వములను విరుచుము. మాంసాహారులయిన తోడేళ్ళు మున్నగునవి వారిదేహఖండములను ఎత్తుకొనిపోవు గాక!

ఇట్టిమంత్రములందు దుష్టులను బ్రహ్మము దండించుసూచనలు కాననగును. బ్రహ్మోపాసనయందు ఆనంద వ్యాపకత్వాది గుణములను గ్రహించునట్లు పై మంత్రములందు వర్ణింపబడిన దుష్టహృదయభేదనము, దుష్టనాశనము మున్నగు గుణములుకూడ గ్రహింపవలయునా? లేదా? యను సందేహము కలుగును. అట్టి సంశయమును పోగొట్టదలచి సూత్రకారుడు వేధ, భేదకాదిగుణములు బ్రహ్మోపాసనయందు గ్రహింపరాదని సూత్రించుచున్నాడు. కారణ మేమన: బ్రహ్మోపాసనకు ఫలము ముక్తి. శత్రుసంహారము, దుష్టనాశనము కాదు. ముక్తి నభిలషించు వ్యక్తి సౌమ్యభావముతో గూడి యుండును. అతడు ఆనందాదిగుణములతో గూడిన బ్రహ్మము నుపాసించుచు ధ్యానించును. ఇతరసామాన్యజనులు తమ విరోధుల నాశము గోరి పరమేశ్వరుని ప్రార్థింతురు. వారు మోక్షము నభిలషింపరు. కావున వారిప్రార్థనకు ఫలము మోక్షప్రాప్తి కాక దుష్టదలనమగును. అందువలన మోక్షము నొసంగు బ్రహ్మోపాసనలందు వేధత ఆదిగుణములను గ్రహింపరాదు. ప్రయోజనభేదమే యిందులకు కారణము. (౨౫)

## సప్తమాధికరణము

అర్థ - ప్రయోజన - భేదమువలన వేధత మున్నగుగుణములు సంగ్రహింపరాదని చెప్పబడినది. అర్థభేద మన నేమి? బ్రహ్మోపాసనకు అర్థము- ఫలము - ముక్తి యగు నెడల తద్విషయమును విచారింపదలచి సూత్రమును రచించుచున్నాడు.

### హానౌ తూపాయనశబ్దశేషత్వాత్
### కుశాచ్ఛందస్తుత్యుపగానవత్ తదుక్తమ్ 3-3-26

హానౌ = (ఛాందోగ్యమున గల విధూననశబ్దము) హానియందు వర్తించును. హాని - ప్రహాణము - త్యాగము - విడుచుట అర్థము. కారణ మేమన : ఉపాయనశబ్ద శేషత్వాత్ = ఉపాయనశబ్దసాన్నిధ్యమువలన, ఉపాయనము=ఉపాదానము, శేషత్వము=సాన్నిధ్యము, కుశా-చ్ఛందస్తుతి-ఉపగానవత్ = కుశ, ఛందస్తుతి, ఉపగానశబ్దములకు ఔదుంబర్యాది శబ్ద శేషమువలన అర్థవిశేష మున్నట్లు, తదుక్తమ్ = పూర్వమీమాంసయందా విషయము చెప్పబడినది.

ఛాందోగ్యోపనిషత్తునందు

'అశ్వ ఇవ రోమాణి విధూయ పాపం చంద్రఇవ రాహోర్ముఖాత్ ప్రముచ్య, ధూత్వా శరీర మకృతం కృతాత్మా బ్రహ్మలోక మభిసంభవామి' ఛాం. ౮-౧౩-౧. అను వాక్య మున్నది.

'అశ్వము జీర్ణలోమములను విడచునట్లు, పాపమును విడిచి, చంద్రుడు రాహుముఖమునుండి విడివడి ప్రకాశవంతు డగునట్లు, శరీరమును విడిచి పరమాత్మసాక్షాత్కారమువలన కృతకృత్యుడనై (అకృతం బ్రహ్మలోకం) కార్యము కాని బ్రహ్మమును ప్రాపింతును - పొందుదును.

ఈ వాక్యమునందలి (పాపం విధూయ) విధూననశబ్దమునకు త్యాగము అర్థమా? లేక కంపనమా? అని సంశయము. కంపనము - చల నము అని పూర్వపక్షము. కాదు, త్యాగమని సిద్ధాంతము.

ధాత్వర్థము (ధూఞ్ కంపనే)ను బట్టి విధూయ = కంపింపజేసి - చలింపజేసి యని యర్థము చెప్పవచ్చును. గుఱ్ఱము తనదేహమును వెండ్రు కలను కదిలించి ధూళిని పోగొట్టుకొని శరీరమును శుద్ధము చేసికొనును. అట్టి మెడ రోమములత్యాగము - విడుపు జరుగదు. అట్లే ఆత్మజ్ఞాని బ్రహ్మో పాసనతో పాపములను - (సుకృతదుష్కృతములు) శుద్ధముచేసికొనును. పాపములను త్యజింపడు. కావున విధూననశబ్దమునకు కంపనమే యర్థమని పూర్వపక్షాభిప్రాయము.

సూత్రకారు డిట విధూననశబ్దమునకు కంపన మర్థము కాదు; త్యాగమే యర్థమని సమాధానము చెప్పుచున్నాడు. కారణ మేమన: బ్రహ్మోపాసనకు ఫలము - ప్రయోజనము - పాపపుణ్యములకు జెందిన సమస్తవాసనలను పరిత్యజించి - నశింపజేసి - మోక్షమును బొందుట యగును. వాసన లుండగా మోక్షము ప్రాప్తింపదు. కావున ఉపాసన కర్థము - ఫలము - పాపనాశము - త్యాగము. ఛాందోగ్యమున గల విధూయ శబ్ద మీ యర్థముననే ప్రయోగింపబడినది. పైవాక్యమునందు (చంద్రముఖాత్ ప్రముచ్య) చంద్రునిముఖమునుండి విడివడి అని ముచ్ల్ధాతువు ప్రయోగము కూడ కలదు. దానింబట్టియు విధూననపదమునకు విడుపు అర్థము చెప్పు టయే యుచిత మగును. ఇంతేకాక సూత్రకారుడు చూపిన హేతువును బట్టియు విధూననశబ్దమునకు హాని - త్యాగమే యర్థము చెప్పుట సమంజ సము.

కౌషీతకీఉపనిషత్తునందు విధూననశబ్దముతోబాటు ఉపాయనశబ్దము ప్రయోగింపబడినది. ఉపాయన మన ఉపాదానము - గ్రహణమని యర్థము.

'తత్ సుకృతదుష్కృతే ధూనుతే తస్య ప్రియా జ్ఞాతయః సుకృత ముపయ న్త్యప్రియా దుష్కృతమ్' కౌ. ౧-౪.

'ఆత్మజ్ఞాని సుకృతదుష్కృతములను త్యజించును (ధూనుతే). అతనిప్రియులు సుకృతమును, అప్రియులు దుష్కృతమును గ్రహింతురు (ఉపయ న్తి).'

ఇందు 'ఉపయంతి' పదమునకు గ్రహణ మర్థము. ప్రియులు సుకృతమును, అప్రియులు దుష్కృతమును గ్రహింతు రనుటనుబట్టి బ్రహ్మజ్ఞాని సుకృతదుష్కృతములను (విధూనుతే) విడుచును, అనుటయే తగును. అతడు విడిచిననేకదా! ఇతరులు గ్రహింతు రనుట సంభవమగును. 'ఉపయ న్తి' అను శబ్దసామీప్యమువలన విధూననశబ్దమునకు త్యాగము - విడుపు అర్థము చెప్పుట సమంజసమగును. కావున ఛాందోగ్యమునందును విధూననశబ్దమునకు త్యాగమే యర్థమని సూత్రకారుడు (ఉపాయన శబ్ద సాన్నిధ్యమువలన) హేతువుమూలమున చెప్పియున్నాడు.

ఒకరి సుకృత దుష్కృతములను మరియొకరు గ్రహింపజాలరు. పై వాక్యమునందు బ్రహ్మజ్ఞానియొక్క పుణ్యపాపములు అతని ప్రియా ప్రియులు గ్రహింతురు అనుట యౌపచారికము - గౌణార్థము. బ్రహ్మజ్ఞాని తన పుణ్యపాపములను విడిచిపెట్టు ననుటయే ముఖ్యార్థము. బ్రహ్మజ్ఞానిని ప్రేమించువారు పుణ్యము లొనర్తురు. అతనిని ద్వేషించువారు పాపము లొనర్తురని భావము.

ఛాందోగ్యమున ప్రయోగింపబడిన విధూననశబ్దమునకు త్యాగార్థము చెప్పుటకు కౌషీతకీబ్రాహ్మణమున ప్రయోగింపబడిన వాక్యమును వాక్య శేషముగా గ్రహించుట ఎట్లు సంగతమగును? అని శంకింపవచ్చును. కౌషీతకియందు ప్రయోగించిన వాక్యమునందు విధూననశబ్దమునకు ఉపాయనశబ్దము సమీపమున నుండుటచే నచట ఉపాయనశబ్దసాన్నిధ్యమువలన

విధూననశబ్దమునకు త్యాగార్థము చెప్పుట యుచితమగును; కాని, బృహదా రణ్యకమునందు ప్రయుక్తవిధూననశబ్దమునకు కౌషీతకీప్రయుక్త ఉపాయన శబ్దము సమీప మెట్లు కాగలదని శంకాభిప్రాయము.

ఈ శంకకు సమాధానము చెప్పుటకే సూత్రకారుడు (తదుక్తమ్) మీమాంసయం దీ నిర్ణయము చేయబడిన దని నుడివియున్నాడు. జైమిని తన పూర్వమీమాంసయందు 'అపి తు వాక్యశేషః స్యాత్' పూ. మీ. ౧౦-౮-౩. అను సూత్రమున 'ఒకచో జెప్పబడిన అర్థము అన్యత్ర చెప్ప బడిన యా విషయమునకు సంబంధించిన అర్థమునకు శేషము - అంగము అగును' అని నుడివియున్నాడు. ఛాందోగ్యమునందును కౌషీతకియందును విధూననశబ్దప్రయోగము సమానము. కావున ఒకచో పఠింపబడిన ఉపా యనశబ్దమునకు మరియొకచో నట్టి ప్రసంగమునందు. సంబంధము కలు గుట ప్రామాణికమే యగును. అందువలన కౌషీతకియందువలెనే ఛాందో గ్యమున విధూననమున కర్థము పరిత్యాగ మనుట నిశ్చితము.

ఇట్లే ఒకచో పఠితార్థము మరియొకయెడ అంగ మగుననుటకు సూత్రకారుడు 'కుశా, ఛందస్తుతి, ఉపగానము' అను పదములను దృష్టాంత ములుగా నొసంగియున్నాడు.

కుశా : భాల్లవి - శాఖయందు 'కుశా వానస్పత్యాః స్థ తా మాపాత' 'వనస్పతినిర్మితకుశలు నన్ను రక్షించుగాక।' అని పఠింపబడినది. యజ్ఞము నందు ఉద్గాత స్తోత్రములను లెక్కించుటకు పుల్లలను ఉపయోగించును. వానిని 'కుశా' అందురు. ఇట వనస్పతినిర్మితకుశలు అని సామాన్యముగ చెప్పబడినదేకాని యా వనస్పతి యెద్దియో విశేషముగ నిర్దేశింపబడలేదు. కాని మరియొకచో శాట్యాయనులశాఖయందు 'ఔదుంబరాః కుశాః' 'కుశలు ఉదుంబరనిర్మితములు' అని యున్నది. (ఉదుంబరము - బూరుగుచెట్టు.) ఈ వచనమును బట్టి యజ్ఞమున నెల్లయెడల ఉదుంబరశలాకలు (బూరుగు

పుల్లలు) ఉపయోగింతురు. ఇట్లు సమానవిషయములందు ఒకచో పఠింప బడిన వాక్యమునకు అన్యశాఖయందు పఠింపబడినవాక్యము శేషమగును. కావున కాట్యాయనశాఖాపఠిత కుశాసంబంధివాక్యము భాల్లవి శాఖాపఠిత కుశాసంబంధివాక్యమునకు శేషము - అంగమైనట్లు, కౌషీతకి బ్రాహ్మణ పఠితవాక్యము ఛాందోగ్యపఠితవాక్యశేషమగుట ప్రామాణికమే యని సూత్రకారుని అభిప్రాయము.

ఛందస్తుతి : కొండౌకశాఖయందు 'ఛందోభిః స్తువతే' ఛందస్సు లతోస్తుతియొనర్తురు. ఇక్కడ ఛందస్సులతో స్తుతియొనర్తురని సామాన్య ముగ జెప్పబడినది. ఛందస్సులలో దేవ అసుర భేదముతో రెండువిధము లయిన ఛందస్సులు కలవు. ఆ రెండింటిలో వేనితో ముందు స్తుతిచేయ వలెనో వేనితో తదుపరి చేయవలయునో విశేషించి చెప్పలేదు. కాని పైంగికశాఖయందు 'దేవచ్ఛందాంసి పూర్వాణి' దేవఛందస్సులు పూర్వ ములు అని ప్రథమ ప్రయోక్తవ్యములుగా జెప్పబడినవి. దీనింబట్టి అసుర ఛందస్సులతో తరువాత స్తుతి యొనర్పవలెనని యంతటను నిర్ణయింప బడినది.

ఒక్కొక్కచరణమున తొమ్మిదివర్ణము లుండు ఛందస్సులు అసు రములు. పది వర్ణములు గలవి దేవఛందస్సులు అనబడునని వివేకము.

ఉపగానము : ఒక శాఖయందు 'ఋత్విజా ఉపగాయంతి' ఋత్వి క్కులు ఉపగానము చేయుదురు. బ్రహ్మాదులు ఋత్విక్కు లనేకు లుం దురు. వారిలో నెవరు ఉపగానము చేయవలయునో విశేషించి చెప్పక సామాన్యముగ ఋత్విక్కు లనుటచే నిది సామాన్యవచనము. కావున ఎవరు ఉపగానము చేయవలయునో నిర్ణయింప వీలులేదు. తైత్తిరీయశాఖయందు 'నాధ్వర్యు రుపగాయేత్' ౬-౩-౧. 'అధ్వర్యుడు ఉపగానము చేయరాదు' అని యుండుటవలన ఉపగానమునందు అధ్వర్యుని కలుపుకొనరాదు. మి॥

లిన ఋత్విక్కులు ఉపగానము చేయవలయునని నిర్ణయింపబడుచున్నది. పై ఉదాహరణములను బట్టి కౌషీతకీపఠితవాక్యము ఛాందోగ్యపఠితవాక్యమునకు వాక్యశేషము - అంగము అగుటలో దోషములేదని సిద్ధాంతము.

(౨౬)

విధూనన మనగా హానము - త్యాగము అగుగాక ! ఉపాసనమహత్తువలన ఉపాసకునకు బ్రహ్మసాక్షాత్కారము కలిగినపుడు పాపముమాత్రము విడిపోవునా ? లేక పాపపుణ్యము లుభయములా ? యన - సమాధానము :

సాంపరాయే తర్తవ్యాభావాత్
తథా హ్యన్యే 3-3-౨౭

సాంపరాయే=పరలోకమున, తర్తవ్యాభావాత్=భోగించి తరించుటకు తగినదేమియు లేనందున, పుణ్యపాపములు రెండును విడిపోవును. తథాహి అన్యే = ఇతర శాఖలవారును అట్లే నుడువుదురు.

ఉపాసనవలన బ్రహ్మసాక్షాత్కారము కలుగగా ఉపాసకునకు మోక్షప్రాప్తికంటె మించి యనుభవించి తరింపవలసిన దేమియు నుండదు. కావున బ్రహ్మసాక్షాత్కారమువలన పాపమువలె పుణ్యముకూడ భోగింపదగిన దుండదు. పుణ్యపాపములు రెండును నశించునని భావము. శ్వేతాశ్వతరమున నిట్లే వర్ణింపబడినది.

'తస్యాభిధ్యానాత్ యోజనాత్ తత్త్వభావాత్
భూయ శ్చాంతే విశ్వమాయా నివృత్తిః' ౧-౧౦.

'బ్రహ్మోపాసనవలన సమాహితుడై తత్త్వజ్ఞానము - ఆత్మసాక్షాత్కారము - పొంది సమస్తసాంసారికభావనలనుండి విముక్తు డగును'.

'జహా త్యేనాం భుక్తభోగా మజోఽన్యః' శ్వే. ౪-౫.

'జీవుడుపుణ్యపాపముల నన్నింటి ననుభవించి విశ్వమును విడుచును'

'తథా విద్వాన్ పుణ్యపాపే విధూయ నిరంజనః పరమం సామ్య ముపైతి' ముం. ౩-౧-౩.

'బ్రహ్మజ్ఞాని పుణ్యపాపములను విడిచి నిర్దోషియై పరమసామ్య మును బొందును'.

'తత్ సుకృతదుష్కృతే ధూనుతే' కౌ. బ్రా. ౧-౪.

'అప్పుడు పుణ్యపాపములను త్యజించును' అని యిట్లు పలుతావులలో సుకృతదుష్కృతములను రెండింటిని త్యజించునని స్పష్టముగా జెప్పబడి నది. – )

అటులయిన ఛాందోగ్యమున 'అశ్వ ఇవ రోమాణి విధూయ పాపమ్' అని పాపముమాత్ర మేల పఠింపబడిన దన - సమాధానము :

## ఛందత ఉభయావిరోధాత్ ౩-౩-౨౮

ఉభయావిరోధాత్ = రెండువిధములగు నుపనిషద్ వాక్యములందు విరోధము లేనందున, ఛందతః = వక్తయొక్క యిచ్ఛనుబట్టి పాపశబ్దము నకు పుణ్యపాపములు రెండును అభిప్రేతములే.

లోకమున 'కాకేభ్యో దధి రక్షతామ్' 'కాకులనుండి పెరుగు కాపా డుడు' అనినపుడు పెరుగును తినునట్టి ప్రతిప్రాణినుండియు దానిని రక్షింపు డని యర్థమగును. కాని, కేవలము కాకులనుండియనియే కాదు. అట్లే ఛాందోగ్యవాక్యమున గల పాపశబ్దము బ్రహ్మప్రాప్తి కభ్యంతరకరమగు కేవలపాపమునే కాక పుణ్యమునుగూడ బోధించును. అప్పుడే ముండక వాక్య(తథా విద్వాన్ పుణ్యపాపే విధూయ) పఠితపుణ్యపాపశబ్దములకు విరోధ మేర్పడదు. వాక్యవిరోధము పరిహరింప నవకాశ మున్నపుడు విరో ధము నాశంకింపరాదు. కావున ఛాందోగ్యవాక్యపఠిత పాపశబ్దము పుణ్య పాపములకు బోధక మగుట నిశ్చితము. (౨౮)

## అష్టమాధికరణము

బ్రహ్మజ్ఞాని పుణ్యపాపములను త్యజించి యిటనే బ్రహ్మమును బొందును. అట్టియెడ నతడు దేవయానపథమున గమించి బ్రహ్మమును బొందునను వాక్యమునకు సార్థకత యేమి ? యన - సమాధానము :

### గతే రర్థవత్త్వ ముభయథా ఽన్యథాహి విరోధః 3-3-౨౯

ఉభయథా = రెండు విధముల నంగీకరించుటవలన, గతేః = బ్రహ్మోపాసకునకు దేవయానగతి కలుగు ననుగతికి, అర్థవత్వం = సార్థకత కలదు. హి = కారణ మేమన, అన్యథా = అట్లుకానిపక్షమున, విరోధః = వాక్యవిరోధ మేర్పడును.

బ్రహ్మోపాసనము రెండువిధములు. గతికలది; గతిలేనిది. బ్రహ్మోపాసకునకు బ్రహ్మప్రాప్తి కలుగుటకు ముందుగా నేదేని ప్రతిబంధకము కలిగినపుడు ఈ శరీరమును విడిచి యన్యలోకము (శరీరము) బొందుటకు గతి కలుగును. అదియే దేవయానగతి. సతతము బ్రహ్మము నుపాసించి పుణ్యపాపముల నన్నింటిని త్యజించి యెట్టియభ్యంతరము లేని బ్రహ్మజ్ఞాని యీ శరీరమును విడిచి యిటనే బ్రహ్మమును బొందును. వానికి గతి యుండదు. గతి యుపాసనకు ఫలము. పుణ్యపాపములకు కాదు. ఏబ్రహ్మోపాసనకు గతి (దేవయానగతి) చెప్పబడినదో యదియు సార్థకమే. నిరర్థకము కాదు. ఇట్లు బ్రహ్మోపాసనము గతికలదిగను, గతిలేనిదిగను అంగీకరించుటవలన వాక్యవిరోధ మొండును నుండదు.

కౌషీతకీబ్రాహ్మణమున 'స ఏతం దేవయానం పంథాన మాసాద్య' ౧-౩. అని దేవయానమార్గమున గతి చెప్పబడినది. బృహదారణ్యకమున 'అథ మర్త్యో ఽమృతో భవ త్యత్ర బ్రహ్మ సమశ్నుతే' ౪-౭-౭. ఈ

వాక్యమున 'అత్ర = ఇక్కడనే బ్రహ్మమును బొందును; అని చెప్పుట వలన నిట గతి చెప్పబడలేదు. అయినను ఈ వాక్యములందు విరోధ మున్నదనరాదు. గతియున్నదని చెప్పినచోట గతి నిరర్థకము కాదు. అది సార్థకమే. కారణ మేమన : బ్రహ్మోపాసకున కట శరీరపాతము కాగానే బ్రహ్మప్రాప్తి కలుగుట కేదో యాటంక ముండుటచే నతడు దేవయాన మార్గమున లోకాంతరమును - శరీరాంతరమును బొంది యభ్యంతర ముడుగ గానే బ్రహ్మను ప్రాప్తించును. కావున నట గతి సార్థకమే కాని నిరర్థకము కాదు. పూర్ణబ్రహ్మజ్ఞానికి గతియుండదు. అపూర్ణబ్రహ్మజ్ఞానికి గతియుండు నని సారాంశము. (౨౯)

బ్రహ్మసాక్షాత్కారము కాని బ్రహ్మోపాసకునకుగూడ గతి నంగీ కరించుట యుక్తము కాదు. ఆ గతికి ఫలప్రాప్తి లేదుకదా! యన - సమా ధానము :

### ఉపపన్నః తల్లక్షణార్థోపలబ్ధేర్ లోకవత్ 3-3-30

లోకవత్=లోకమునవలె, తల్లక్షణార్థోపలబ్ధేః = గతిహేతుకార్థోప లబ్ధివలన, ఉపపన్నః=గతియుక్తమే. (తత్=గతి, లక్షణమ్ = హేతుః, ఉపలబ్ధిః=ప్రాప్తి. గతిహేతుకఫలప్రాప్తివలన అని యర్థము.)

లోకమున నొకడు విశేషార్థసాధనకొఱకు దేశాంతరమునకు బోవును. అట్లే బ్రహ్మోపాసకుడుకూడ లోకాంతరమున కేగుట యుచి తమే యగునని సూత్రాభిప్రాయము. దేశాంతరగమనము అర్థవిశేష ప్రాప్తికి హేతువైనట్లు విశేషఫలప్రాప్తికి లోకాంతరగతి బ్రహ్మోపాసకు నకు హేతువగునని భావము. బ్రహ్మోపాసనకు ఫలము - అర్థవిశేషము - బ్రహ్మసాక్షాత్కారము. అయ్యది యీ శరీరమున లభింపవచ్చును. అన్య లోకమున లభింపవచ్చును. ఇక్కడనే లభింపవలయు నను నిర్బంధ మొందును లేదు. ప్రశ్నోపనిషత్తునందు 'స సామభి రున్నీయతే బ్రహ్మ

లోకం స ఏతస్మా జ్జీవఘనాత్ పరాత్పరం పురిశయం పురుష మీక్షతే' ప్రశ్న. ౫-౫. 'ఓంకారముతో చేయబడిన యుపాసన యుపాసకుని బ్రహ్మలోకమునకు తీసికొనిపోవును. జీవాత్మలభోగముకొఱకు పృథివి మున్నగు లోకలోకాంతరములు సృజింపబడినవి. వానికంటె పరము జీవాత్మతత్త్వములు. వానికంటెను పరము బ్రహ్మతత్త్వము. అట్టి పరతత్త్వమును ఉపాసకుడు పొందును. 'పాప్మనా వినిర్ముక్తః' ప్రశ్న. ౫-౫. పాప పుణ్యములనుండి ముక్తుడై యీ దేహమునందు కాని అన్యదేహమునందు కాని బ్రహ్మమును బొందును'. కావున బ్రహ్మోపాసకునకు గతి యున్న దనుటలో దోషము లేదు. (౩౦)

దేవయానమార్గమువలన ఉపాసనల ననుసరించి బ్రహ్మలోకమును బొందు బ్రహ్మోపాసకుల కందఱకు బ్రహ్మోపాసనఫలము బ్రహ్మసాక్షాత్కారము కలుగునా? లేక యెవనికైన కలుగకుండుటయు కలదా? యన-సమాధానము :

అనియమః సర్వేషా మవిరోధః
శబ్దానుమానాభ్యామ్ ౩-౩-౩౧

సర్వేషాం = దేవయానమార్గమున బ్రహ్మలోకమును బొందిన బ్రహ్మోపాసకుల కెల్లరకు, అనియమః=గతిహేతుకఫలప్రాప్తినియమము లేదు. అవిరోధః=అందువలన వాక్యవిరోధము లేదు. శబ్దానుమానాభ్యాం= శ్రుతిస్మృతులవలన నిది తెలియుచున్నందున.

వివిధములగు నుపాసనల నొనర్చుచు దేవయానగతితో ఉపాసకులు బ్రహ్మలోకమును బొందుదురు. అట నెల్లరకు బ్రహ్మసాక్షాత్కార మగు నను నియమము లేదు. పూర్ణసాధనసంపత్తికలవారికే బ్రహ్మసాక్షాత్కారము లభించును. ఉపాసనలో నేదేని అనివార్య మగు బాధ కలిగినపుడు బ్రహ్మసాక్షాత్కారము కలుగదు. అట్టివారికి వా రొనర్చిన యుపాసనలకు

ఐశ్వర్యాదిఫలముల ననుభవించుట కను వగు విశిష్టదేహసంబంధ మీ లోక మున గలుగును. 'ఆ బ్రహ్మభువనా ల్లోకాః పున రావర్తినో ఽర్జున!' గీత. ౮-౧౬. 'బ్రహ్మలోకమువరకుపోయిన ఉపాసకులు ఈ లోకము నకు మరల తిరిగివత్తురు'. అని గీత - స్మృతి - లో చెప్పబడినది. బ్రహ్మ సాక్షాత్కారము కలిగినవారు ముక్తు లగుదురు. సతత మావర్తించు జన్మ మరణచక్రమునుండి ముక్తు లగుదురు. అట్టివారి నుద్దేశించియే 'ఏతేన ప్రతి పద్యమానా ఇమం మానవ మావర్తం నావర్తంతే' ఛాం. ४-౧५-६. 'దేవ యానమార్గమున బ్రహ్మలోకమును బొందినవారు బ్రహ్మసాక్షాత్కారము కలిగిన మీదట నీ మానవావర్తమున తిరిగిరారు'. అని చెప్పబడినది. ఇట్టి (శ్రుతిస్మృతి) వాక్యములందు విరోధ మొందును లేదు. బ్రహ్మసాక్షాత్కా రము కలుగుట, కలుగకుండుట అనువాని నాధారముచేసికొని యిట్లు చెప్ప బడునని భావము. కాబట్టి బ్రహ్మలోకప్రాప్తి కలిగినవారికి ఎల్లరకు బ్రహ్మ సాక్షాత్కారము కలుగునను నియమము లేదు. బ్రహ్మసాక్షాత్కారము అనుష్ఠానసాధనసంపత్తి సమగ్రతమీద నాధారపడియుండును. కావున బ్రహ్మసాక్షాత్కారము కలుగుటయు కలుగకుండుటయు రెండును సంభ వమే.

ఉపనిషత్తులలో వర్ణింపబడిన యుపాసనలందు కొన్నింట దేవయా నము వర్ణింపబడినది. మరికొన్నింట లేదు. ఛాందోగ్యమున పంచాగ్నివిద్య (५-౧౦-౧) ఉపకోసలవిద్య (४-౧५-५) అను నీ రెండింటియందును దేవయానము చూడనగును. మధువిద్య, శాండిల్యవిద్య, వైశ్వానరవిద్య లలో నియ్యది కనబడదు. కావున నే విద్యలలో దేవయానము పఠింపబడి నదో వాని కా దేవయానగతి ఫలమగును. ఇతరములకు కాదు. దేవయాన గతి యొకచో పఠింపబడినది యన్యత్ర గ్రహింపనుకూడదు. అట్లు గ్రహిం చుట ఉపనిషత్కారుల కిష్టమగుపక్షమున రెండువిద్యలలో నేల పఠింప బడును? ఒకచో పఠింపబడిన నది అన్నివిద్యలలోను గ్రహింపబడెడిది.

కనుక గతికి నియమము కలదని పూర్వపక్షము ప్రాప్తింపగా - దేవయానగతి యే విద్యయందు పఠింపబడినదో యా విద్యకే యది ఫలమను నియమము లేదు: అది యన్నియుపాసనలకును ఫలమగునని సూత్రకారుడు చెప్పుచున్నాడు. కావున విరోధమొందును ఉండదు. ఇయ్యది శ్రుతిస్మృతుల ననుసరించి ప్రమాణిత మగును. కర్మమార్గము ననుసరించువారికి పితృయానము, జ్ఞానమార్గులకు దేవయానము నని రెండుగతులు చూడనగును. ('ద్వే స్రుతీ అశృణవం పితౄణా మహం దేవానా ముత' ఋ. ౧౦-౮౮-౧౫) ఇట్లే బృహదారణ్యకము (౬-౨-౧౫,౧౬) న దేవపితృయానముల విశదవర్ణన చూదనగును. కర్మానుష్ఠానఫలము పితృయానము, బ్రహ్మోపాసనలఫలము దేవయానము నగును. కొన్నియుపాసనలందు దేవయానగతి వర్ణితము కాకున్నను, అన్నియుపాసనలఫలస్వరూపత సమానమైనను ప్రత్యేకఉపాసనము బ్రహ్మసాక్షాత్కారమునకు ప్రయోజకమను నియమము లేదు. ఆ యుపాసనలకు ఐశ్వర్యాది ప్రాప్తి ఫలము తప్పక యుండును. (౩౧)

## నవమాధికరణము

బ్రహ్మసాక్షాత్కారము కలిగినమీదట జీవునకు మోక్షాధికారము లభించును. ముక్తావస్థయం దత డెంతకాల ముండు నన సూత్రకారుడు చెప్పుచున్నాడు.

### యావదధికార మవస్థితి రాధికారికాణామ్ ౩-౩-౩౨

ఆధికారికాణామ్=అధికారము గలవారికి, యావదధికారం=అధికారమున్నంతవరకు, అవస్థితిః=ఉనికి కలుగును. బ్రహ్మసాక్షాత్కారమువలన మోక్షాధికారము లభించినవారు అధికార మున్నంతవరకు బ్రహ్మలోకమున-బ్రహ్మమునందు - స్వస్వరూపముతో నుందురు.

అధ్యాత్మశాస్త్రములందు - ఉపనిషదాదులలో - జీవుని మోక్షదశను వర్ణించినతావులందు వాస్తవికతను దెలుపు కొన్ని సంకేతములు లభించును. వానింబట్టి మోక్షదశయందు ముక్తు లెంతకాలముందురో తెలియ నగును. ఛాందోగ్యమున 'ఏతేన ప్రతిపద్యమానా ఇమం మానవ మావర్తం నావర్తంతే' ౪-౧౫-౬. 'దేవయానమార్గమున బ్రహ్మమును బొందిన జ్ఞానులు ఈ మానవ ఆవర్తమున తిరిగిరారు'. అని యున్నది. ఇందు 'ఈ మానవ ఆవర్తము' అనుటచే ఏ మానవావర్తమున వారు ముక్తులైనారో ఆ మానవావర్తమున తిరిగిరారని స్పష్టమగుచున్నది. మరియొక మానవావర్తమున వత్తురని యభిప్రాయము. ఇట ఆవర్తము కల్పవాచకము. మరియొకచో, ఛాందోగ్యమున 'స ఖల్వేవం వర్తయన్ యావ దాయుషం బ్రహ్మలోక మభిసంపద్యతే న చ పునరావర్తతే' (౮-౧౫-౧) 'ఇట్లు బ్రహ్మజ్ఞానము పొంది (యావదాయుషం) ముక్తదశయం దెంతకాల ముండవలెనో యంతకాలము బ్రహ్మలోకమున - బ్రహ్మమునందు నివసించును. మధ్యలో తిరిగిరారు . అని యున్నది.

మరియు బృహదారణ్యకమున 'తేషు బ్రహ్మలోకేషు పరాః పరావతో వసంతి' బృ. ౮-౧౫-౧. ఇందు ముక్తులు (పరాః పరావతః) పరకాలము - బహుకాలము బ్రహ్మమున నుందురని వర్ణింపబడినది. దీనింబట్టి ముక్తులు అనంతకాలము బ్రహ్మమున నుందురనుట పొసగదు. ముక్తులకు పునరావృత్తి లేదని చెప్పువాక్యమున కర్థము వారు మోక్షానందము ననుభవింపదగిన నియతకాలములో తిరిగిరారని చెప్పిన సమంజసము కాగలదు. కావున ముక్తాత్మలు తమ కధికార మున్నంతవఱకు బ్రహ్మానందము ననుభవింతురనియు తదుపరి మరల జన్మింతురనియు తెలియు చున్నది. ఈ విషయము శాస్త్రాంతరమున వివరింపబడును. (౩౨) .

## దశమాధికరణము

మధ్యలో వచ్చిన ప్రాసంగికచర్చను ముగించి సూత్రకారుడు మరల గుణోపసంహార ప్రకరణమును ప్రారంభించుచున్నాడు.

**అక్షరధియాం త్వవరోధః సామాన్యతద్భావాభ్యా మౌపసదవత్ తదుక్తమ్ 3-3-33**

సామాన్యతద్భావాభ్యామ్ = ఉపాస్యసమానతవలనను, అస్థూలత్వాదులు బ్రహ్మధర్మము లగుటవలనను, అక్షరధియామ్ = అక్షరబుద్ధుల- అక్షర విద్యయందు పఠింపబడిన అస్థూలత్వాదుల, అవరోధః = గ్రహణము ఉపాసనలందు చేయవలెను. ఔపసదవత్ = ఔపసదమునందువలె, తదుక్తమ్ = మీమాంసయం దట్లు చెప్పబడినది.

అక్షరవిద్యోపాసనలందు వర్ణింపబడిన అస్థూలత్వాది బ్రహ్మధర్మములు సర్వత్ర బ్రహ్మోపాసనలందు గ్రహింపనగును. మీమాంసయందు వర్ణింపబడిన ఔపసదమునకువలె.

బృహదారణ్యకోపనిషత్తునందు 'ఏతద్వై తదక్షరం గార్గి! బ్రాహ్మణా అభివదంతి అస్థూల మన ణ్వహ్రస్వ మదీర్ఘమ్' ౩-౮-౮. అనియు, ఇట్లే ముండకోపనిషత్తునందు 'అథ పరా యయా తదక్షర మధిగమ్యతే, యత్త దద్రేశ్య మగ్రాహ్య మగోత్ర మవర్ణ మచక్షుఃశ్రోత్రమ్' అనియు నున్నది. ఈ వాక్యములందు బ్రహ్మమున స్థూలత్వాది కొన్నిధర్మములు లేనట్లు చెప్పి బ్రహ్మస్వరూపమును బోధింప యత్నించినట్లు స్పష్టమగుచున్నది. ఈ అస్థూలత, అనణుత్వము, అహ్రస్వత్వము మున్నగు గుణములు సర్వత్ర బ్రహ్మోపాసనలందు సంగ్రహింపవలయునా? అక్కరలేదా? యని సంశయము కలుగును. ఎక్కడ నే యుపాసనయం దే గుణములు పఠింపబడినవో యక్కడనే వానిని గ్రహింపవలయును. ఇతరత్ర

వర్ణించిన వానిని గ్రహింపరాదని పూర్వపక్షము. ఇందులకు సమాధానముగ అన్నింటిని అన్నిట గ్రహింపవలయునని సూత్రకారుడు చెప్పుచున్నాడు.

అక్షరబ్రహ్మవిషయకములగు నుపాసనలందు వర్ణింపబడిన బ్రహ్మధర్మములు సర్వత్రగ్రహింపవలసినదే. కారణ మేమన: సర్వోపాసనలందును ఉపాస్యము బ్రహ్మ మొక్కటియే. గుణములుకూడ సర్వత్ర ప్రచురముగ నవియే చెప్పబడినవి. కావున నొకచో పఠింపబడిన గుణములు అన్యత్ర బ్రహ్మస్వరూపమును బోధించుటకును తోడ్పడును. అందువలన అక్షరబ్రహ్మవిద్యోపాసనలో వర్ణింపబడిన అస్థూలతాది గుణములకు సర్వోపాసనలందును సంబంధము కలదని సూత్రకారు డనుచున్నాడు.

ఇందుల కొకదృష్టాంతమునుకూడ నిచ్చియున్నాడు. (ఔపసదవత్). నాలుగు దినములలో పూర్తియగు 'చతూరాత్ర' మను పేరుగల అహీన యజ్ఞ మొకటి కలదు. దానిలో అధ్వర్యుడు పురోడాశముతో కొన్ని ఆహుతు లిచ్చును. ఆయాహుతులే 'ఉపసద్' నామముచే చెప్పబడును. ఈ యాహుతులు తాండ్యబ్రాహ్మణమునందలి 'అగ్నేర్ వేహోత్రం వేరధ్వరమ్' ౨౧-౧౦-౧౧. అను నిట్టి మంత్రములతో నీయబడును. ఈ బ్రాహ్మణము సామవేదమునకు జెందినది. కావున నీమంత్రములను ఉద్గాత యుచ్చరింపవలెను. అధ్వర్యుడు చదువరాదు. కాని పైయజ్ఞమునందు పురోడాశము నాహుతిగా నొసంగుట ముఖ్యకార్యము. నియమముగా నా కార్యము నధ్వర్యుడే చేయవలయును. కాబట్టి మంత్రోచ్చారణము పురోడాశమున కంగమై యధ్వర్యునిచే చేయబడును. ఇక్కడ పురోడాశప్రదాన మొనర్చు అధ్వర్యునకు ఉద్గాతచే ఉచ్చరింపబడు మంత్రోచ్చారణమునకు సంబంధము కలుగునట్లు విభిన్నశాఖలందు పఠింపబడిన అస్థూలతాదిగుణములకుగూడ సర్వత్ర ఉపాస్యబ్రహ్మముతో సంబంధము కలుగునని గుర్తింపవలెనని సూత్రకారుని అభిప్రాయము.

ఈ విషయము పూర్వమీమాంసయందు చెప్పబడినది. 'గుణముఖ్య వ్యతిక్రమే తదర్థత్వా న్ముఖ్యేన వేదసంయోగః' పూ. మీ. ౩-౩-౮.

'గుణముఖ్యములలో వ్యతిక్రమము కలిగినపుడు ముఖ్యముతో మంత్రసంబంధము కలుగును. గుణము ముఖ్యమును సంపన్నము చేయుటకే కావున నట్లు జరుగును. దానింబట్టి ముఖ్యమగు ఉపాస్యబ్రహ్మముతో గుణములకు సర్వత్ర ఉపాసనలందు సంబంధము కలుగుట ఇష్టమని తెలియుచున్నది. (౩౩)

అటులయిన ఉపాసనలం దంతట నెన్నిగుణములను గ్రహింపవలయును ? అన, సూత్రకారుడు సమాధానము చెప్పుచున్నాడు.

ఇయ దామననాత్ ౩-౩-౩౪

ఆమననాత్=శాస్త్రమునందు చెప్పినందువలన, ఇయత్ = ఇన్నియే గ్రహింపవలయును.

శాస్త్రమునందు ఎన్నిగుణములు పఠింపబడినవో అన్ని గుణములే గ్రహింపవలెనని యభిప్రాయము. జగజ్జన్మాదులకు కారణము, అచింత్యశక్తియుక్తము నగు బ్రహ్మముగుణములకు అవధి యుండదు. అయినను ముముక్షువుల యుపాసన కుపయుక్తములగు అధ్యాత్మశాస్త్రములందు వర్ణింపబడిన గుణములు ఒక యుపాసనవిద్యనుండి మరియొకదాని యందు సంగ్రహించుట కాచార్యులు నిర్ణయించియున్నారు. అల్పజ్ఞుడగు జీవుడు సర్వగుణసంపన్నమగు బ్రహ్మముస్వరూపము నుపాసించుటకు సమర్థుడు కాడు. కావున శాస్త్రములందు సచ్చిదానందాదులు జగత్కర్తృత్వము మున్నగునవి విధిరూపమునను, అస్థూలతాదులు నిషేధరూపమునను గ్రాహ్యగుణములుగా వర్ణింపబడినవి. వానిని గ్రహించి యుపాసింపనగును. కావుననే యీపాదమునందే 'ఆనందాదయః ప్రధానస్య' వే. ౩-౩-౧౧. మొదలు 'అక్షరధియాం త్వవరోధః' వే. ౩-౩-౩౩ వరకు

గల సూత్రములమూలమున బ్రహ్మస్వరూపగ్రాహకగుణములు నిర్దేశింప బడినవి. అవియే గ్రహింపనగునవి భావము. (౩౪)

## ఏకాదశాధికరణము

పరమేశ్వరుని యుపాసనలందు గ్రహింపదగిన గుణముల నిర్ణయము జరిగినది. ప్రస్తుతము ముముక్షువు బ్రహ్మము నెక్కడ నుపాసింపవలయు, నన - సమాధానము :

### అంతరా భూతగ్రామవత్ స్వాత్మనః ౩-౩-౩౫

('ఆమననాత్' అను పదము పూర్వసూత్రమునుండి అనువృత్తమగును.)

ఆమననాత్ = శాస్త్రమునందు చెప్పుటవలన, భూతగ్రామవత్ = దేహమునందు స్వాత్మనువలె, స్వాత్మనః=తనయాత్మయొక్క, అంతరా= మధ్యలో, ఉపాసింపవలెను.

ఉపాసకుడు తన్ను తాను తనదేహమధ్యమున నెరుంగునట్లు పరమేశ్వరుని స్వాత్మమధ్య నుపాసింపవలయును. పరమేశ్వరుడు భూతసముదాయమున నంతటను వ్యాపించియున్నట్లు తనయందును వ్యాపించి యున్నాడు. కావున తనయందే యుపాసించి సాక్షాత్కారము చేసికొనవలె నని శాస్త్రములు చెప్పుచున్నవి.

'తం దుర్దర్శం గూఢ మనుప్రవిష్టం గుహాహితం
గహ్వరేష్ఠం పురాణం........' కఠ. ౧-౨-౧౨.

'అయ మంతరాత్మన్ పురుషః' శతపథ. ౧౦-౬-౩-౨.

'అంగుష్ఠమాత్రః పురుషః మధ్య ఆత్మని తిష్ఠతి' కఠ. ౨-౧-౧౨.

'త మాత్మస్థం యే ఽనుపశ్యంతి ధీరాః' కఠ. ౨-౨-౧౨.

'యః ఆత్మని తిష్ఠ న్నాత్మనో ఽ న్తరః' శత. ౬-౭-౩౦.

'ఏవ మాత్మా ఽత్మని గృహ్యతే ఽసౌ' శ్వే. ౨-౧౫.

ఈ వాక్యములందు పరబ్రహ్మపరమాత్మ స్వాత్మయందు వ్యాపించి యున్నట్లును, అటనే యది గ్రహింపబడునట్లును స్పష్టవర్ణన ముండుటవలన హృదయస్థితమగు నాత్మయందే బ్రహ్మము నుపాసింపవలయునని సిద్ధాంతము. (౩౫)

శాస్త్రము ననుసరించి పరబ్రహ్మోపాసన స్వాత్మయందు చేయవలయునని చెప్పబడినది. ఆ శాస్త్రములందే యట నట అన్యత్ర ఉపాసింప నుపదేశింపబడినట్లు చూడనగును. అది యెట్లు సంగతము కాగలదని శంకించి సూత్రకారుడు సమాధానము చెప్పుచున్నాడు.

అన్యథా భేదానుపపత్తి రితి చే
న్నోపదేశాంతరవత్ ౩-౩-౩౬

('అంతరా, స్వాత్మనః' అనుపదము లీ సూత్రమున
అనువర్తించును.)

అన్యథా భేదానుపపత్తిః = వేరొకవిధమున చెప్పబడిన ఉపాసనోపదేశవిశేషములు అసిద్ధము లగును. ఇతిచేత్=అనియందురేని, న = అట్లు కావు. ఉపదేశాంతరవత్ = కర్మోపదేశమువలె నది యుపపన్నమగును. (ఉపాసనోపదేశముకంటె అన్యము - అంతరము - కర్మోపదేశము ఉపదేశాంతర మనబడును.) కావున ప్రరబ్రహ్మోపాసనము స్వాత్మయం దొనర్చుటయే యుక్తము.

ఛాందోగ్యమున 'తాన్ హోవా చైతే వై ఖలు యూయం పృథ గివేమ మాత్మానం వైశ్వానరం విద్వాంసోఽన్నమత్థ' ౫-౧౮-౧. అను నిట్టి

వాక్యములమూలమున ఆదిత్యాదులలో బ్రహ్మోపాసనచేయుటను నిందించి ద్యులోకము మొదలు పృథివివరకు గల సమస్తవిశ్వమునందు వ్యాపించి యున్న విరాట్‌బ్రహ్మస్వరూప - ఉపాసన విధింపబడియున్నది. బ్రహ్మము యొక్క విశ్వరూపము ఛాందోగ్యములోని తరువాతివాక్యమున 'తస్యహ వా ఏత స్యాత్మనో వైశ్వానరస్య మూర్ధైవ సుతేజాః....' ౫-౧౮-౨. అని వర్ణింపబడియున్నది. బ్రహ్మముయొక్క యట్టి విరాట్‌స్వరూపమే ముండకమున 'అగ్నిర్ మూర్ధా చక్షుషీ చంద్రసూర్యే, దిశః శ్రోత్రే వాగ్ వివృతాశ్చ వేదాః, వాయుః ప్రాణో హృదయం విశ్వ మస్య, పద్భ్యాం పృథివీ హ్యేష సర్వభూతాంతరాత్మా' ౨-౧-౪. అనియు, అథర్వమున 'యస్య భూమిః ప్రమా అంతరిక్ష ముతోదరం, దివం యశ్చక్రే మూర్ధానం తస్మై జ్యేష్ఠాయ బ్రహ్మణే నమః' ౧౦-౭-౩౨. అనియు వర్ణింపబడినది. హృదయమునం దున్న స్వాత్మయందే బ్రహ్మోపాసనవిధానమును స్వీకరించు పక్షమున పైన వర్ణించిన త్రిలోకీశరీరమున నుపదేశింపబడిన సమస్త విశ్వ వ్యాప్తమగు విరాట్‌స్వరూపోపాసనము ఎట్లు సిద్ధింపగలదు? సిద్ధింపజాలదు. అనుపపన్న మగునని భావము. స్వాత్మకంటె విశ్వము భిన్న ప్రదేశముకదా! అని శంకించి సూత్రకారుడు సమాధానము చెప్పుచున్నాడు.

ఇట్లు శంకించుట సరికాదు. కారణ మేమన : అధికారిభేదమువలన కర్మోపదేశమున భేదము సిద్ధించునట్లు ఉపాసనలలో ఉపదేశభేదము సిద్ధింపగలదు. అధికారిభేదమువలన ఉపాసనవిషయక ఉపదేశములందు భేదమున్నను సమస్తబ్రహ్మోపాసన ఆత్మయందే సంభవమగునని భావము.

బ్రహ్మచారులు, గృహస్థులు, వానప్రస్థులు అగ్నిహోత్రమును వెలుపల ద్రవ్యాహుతుల నిచ్చి చేయుదురు. విరక్తుడైన బ్రహ్మజిజ్ఞాసువగు వైశ్వానరోపాసకునకు అధ్యాత్మ అగ్నిహోత్రము విధింపబడినది. 'ఉర ఏవ వేదిర్ లోమాని బర్హిః హృదయం గార్హపత్యో మనో' ఉన్వాహార్య

పచన ఆస్య మాహవనీయః' ఛాం. ౫-౧౮-౨. 'వక్షస్థలము వేది, లోమములు బర్హి, హృదయము గార్హపత్యాగ్ని, మనస్సు అన్వాహార్యపచనము, ఆస్యము ఆవహనీయము' అని వర్ణించి, తదుపరి '........య ఏత దేవం విదిత్వాఽగ్నిహోత్రం జుహోతి' ఛాం. ౫-౨౪-౨,౩. అను వాక్యములందియ్యది యగ్నిహోత్రనామముతో పేర్కొనబడినది. విరక్తు లిట్లు అగ్నిహోత్రమును తమశరీరమునందే చేయుదురు. వెలుపల చేయరని చెప్పబడినది. ఈ యుపదేశములందు అధికారిభేదమువలన కర్మభేద ముపదేశింపబడినది. ఇట్లు కర్మభేదము సిద్ధింపగా ఉపాసనభేద మేల సిద్ధింపదు? ఇతర ఐశ్వర్యప్రాప్తి మున్నగు ఫలభేదముల నాసింపక ఆనందానుభవము నపేక్షించు బ్రహ్మజిజ్ఞాసువు స్వాత్మయందే బ్రహ్మము నుపాసింపవలయును. అందువలన ఇతరోపాసనోపదేశములు అనుపపన్నము లెన్నడును కాజాలవు. (౨౬)

బ్రహ్మోపాసకునకు తనయుపాసన సంపన్నమైనదని తెలియు టెట్లు? ఉపాసన సంపన్నమైన దనుట కవధి యేమి? అన :

### వ్యతిహారో విశింషంతి హీతరవత్ 3-3-37

వ్యతిహారః=వ్యతిహారము - ఉపాస్యఉపాసకులలో పరస్పరము ఏకరూపత బోధపడుట, అవధి యని తెలియవలెను. హి = కారణమేమన, ఇతరవత్=ఇతరునివలె, విశింషంతి=విశేషముగా వర్ణింతురు.

ఉపాస్యోపాసకులలో పరస్పరము ఏకరూపత తెలియుట వ్యతిహారమనబడును. ఉపాసకుడు ఉపాసన చేయుచు క్రమముగా ఉపాస్యబ్రహ్మముతో తనకు ఏకరూపత-సారూప్యము ఏర్పడినట్లు అనుభవింపదొడగును. ఇట్టి యవస్థయే యుపాసనకు పరమావధి యనదగును. ఇదియే బ్రహ్మసాక్షాత్కారము. ఉపాసకుడు బ్రహ్మానందము ననుభవించుటయే ఉపాస్యముతో అతనికి కలిగిన ఏకరూపత యని భావము. ఇదియే యుపాసనకు

లక్ష్యము. జీవునకు 'పరమేశ్వరునితో నేను సమానుడను' అని కలుగు ప్రతీతిని ఆచార్యులిట్లు వర్ణించియున్నారు. ఐతరేయారణ్యకమున 'యోఽహం సోఽసౌ, యోఽసౌ సోఽహమ్' (౨-౨-౪-౬) 'నేను వాడు, వాడు నేను' అని వర్ణించుట చూతుము. ఉపాసన పరాకాష్ఠను బొందినపుడు ఉపాసకుడు బ్రహ్మముతో తన కేకరూపత కలిగినట్లు భావించును. ఏకరూపత కలిగినంతమాత్రమున జీవేశ్వరు లొక్కటియే యని యెంచజనదు. ఉపాసకుడు బ్రహ్మానందమును అనుభవించుస్థితిని మాత్ర మది బోధించునని భావము. బ్రహ్మము ఆనందస్వరూపము. ఉపాసన పరమావధికి చేరినపుడు బ్రహ్మము తనస్వరూపము నుపాసకునకు వివృత మొనర్చును. 'తస్యైష ఆత్మా వివృణుతే తనుం స్వామ్' ముండ. ౩-౨-౩. 'తస్యైష ఆత్మా విశతే బ్రహ్మధామ' ముండ ౩-౨-౪. కావున ఉపాసనకు పరమావధి వ్యతిహారము - ఉపాస్యోపాసకుల ఏకరూపత - యగును. (౩౭)

## ద్వాదశాధికరణము

బ్రహ్మోపాసనలందు గ్రహింపదగిన గుణములనుగూర్చి సామాన్యముగ విచారించినమీదట ఇప్పుడు కొన్ని బ్రహ్మోపాసనలందు విశేషముగ గ్రహింపదగిన గుణములను గూర్చి విచారింపబడుచున్నది. మధ్యలో ప్రాసంగికవిషయములుగూడ విచారింపబడును.

### సైవ హి సత్యాదయః ౩-౩-౩[illegible]

హి = ఏ కారణమువలన, సైవ = ఛాందోగ్యమున పఠిం[illegible] శాండిల్యవిద్యయే బృహదారణ్యకమున పఠింపబడినదో యా కారణము[illegible] ననే, సత్యాదయః = ఛాందోగ్యమున వర్ణింపబడిన సత్యసంకల్పత్వాదు[illegible] బృహదారణ్యకమున వర్ణింపబడిన సర్వేశానత్వాది గుణములును ప[illegible] స్పరము - ఒకయుపాసననుండి మరియొకదానియందు గ్రహింపబడును.

ఛాందోగ్యమున 'సర్వం ఖల్విదం బ్రహ్మ... జ్యాయా నేభ్యో లోకేభ్యః' ఛాం. ౩-౧౪-౧,౨,౩. అని శాండిల్యవిద్య వర్ణింపబడినది. అట్లే, బృహదారణ్యకమునను, 'మనోమయోఽయం పురుషో....య దిదం కించ' బృ. ౫-౬-౧. అని వర్ణింపబడినది. ఈ యుపాసనలు రెండును ఒక్కటియేనా ? లేక భిన్నభిన్న ఉపనిషత్తులందు వర్ణింపబడుటవలన భిన్నములా ? అని సంశయము కలుగగా సూత్రకారు డొక్కటియే యనుచున్నాడు. కావున రెండుతావులందు వర్ణింపబడిన సత్యాదిగుణములు ఒక యుపాసననుండి మరియొకదానియందు సంగ్రహింపవలెను. ఇట్లే శతపథ బ్రాహ్మణమునందును, 'స ఆత్మాన ముపాసీత మనోమయం ప్రాణశరీరం భారూపమ్' శత. ౧౦-౬-౩-౨ అను నీశాండిల్యఉపాసన కూడ ఛాందోగ్యాదులలో వర్ణింపబడినదియే. పైఉపాసనలన్నియు నొక్కటియే. శాండిల్యు డీ విద్యకు ప్రారంభకుడు. మిగిలిన ఆచార్యులు దానినే వర్ణించియుందురు. అందువలన ఒకచో పఠింపబడినగుణము లీ విద్యయందు సర్వత్ర గ్రహింపనగునని సూత్రాభిప్రాయము. (౩౮)

శాండిల్యవిద్యయందు గుణోపసంహారమును చెప్పి దహర విద్యను గూర్చి చెప్పుచున్నాడు.

### కామా దీతరత్ర తత్ర చాయతనాదిభ్యః ౩-౩-౩౯

('సైవ, హి' అనుపదము లీ సూత్రమున అనువర్తించును.)

కామాది = సత్యకామ ప్రభృతి గుణములు, ఇతరత్ర = బృహదారణ్యకమునందు వర్ణింపబడినవి, తత్రచ=ఛాందోగ్యమున వర్ణింపబడిన దహరవిద్యయందును గ్రహింపవలెను. హి = కారణ మేమన, ఆయతనాదిభ్యః=హృదయాయతనాది సమానధర్మములవలన, రెండుస్థలములందు వర్ణింపబడిన విద్య యొక్కటియే.

ఛాందోగ్యమున 'అథ యదిద మస్మిన్ బ్రహ్మపురే దహరం పుండరీకం వేశ్మ దహరోఽస్మి న్నంతరాకాశః' ౮-౧-౧. అని హృదయమున దహరాకాశ మున్నట్లు దహరోపాసనను ప్రారంభించి, 'ఏష ఆత్మా అపహతపాప్మా.... సత్యకామః, సత్యసంకల్పః' ఛాం. ౮-౧-౫ అని సత్యకామత్వాదిగుణములు వర్ణింపబడినవి. అట్లే బృహదారణ్యకమునందును, 'సవా ఏష మహా నజ ఆత్మా.........య ఏషోఽన్తర్హృదయ ఆకాశ స్తస్మిన్ శేతే' బృ ౪-౪-౨౨ 'ఆపరమాత్మ యీ హృదయమున గల ఆకాశమున నున్నాడు' అని చెప్పి హృదయాకాశమున నున్న బ్రహ్మమునకు వశిత్వము మున్నగుగుణములు వర్ణింపబడినవి. ఇట్లు రెండుతావులందును వర్ణింపబడిన యీరెండు విద్యలు భిన్నములా ! లేక యొక్కటియేనా ? అని సంశయము కలుగును. ఛాందోగ్యమున దహరాకాశమును ఉపాస్యముగా చెప్పి, బృహదారణ్యకములో హృదయాకాశమున నున్న ఆత్మ యుపాస్యమనినందువలన స్వరూపభేదము కారణముగా ఉపాసనలు భిన్నములని పూర్వపక్షాభిప్రాయము.

కాని సూత్రకారుడు ఉభయత్ర పఠితవిద్యలు ఒక్కటియే యనుచున్నాడు. కారణమేమన: రెండుతావులందును హృదయరూపమగు ఆశ్రయ మొక్కటియే చెప్పబడినది. ఉపాసనకు ఆశ్రయము రెండుతావులందును హృదయ మొక్కటియే. ఛాందోగ్యమున చెప్పబడిన ఆకాశపదము బ్రహ్మవాచకమే. ఆకాశము పరబ్రహ్మకు వాచకమని (౧-౩-౧౪) యీశాస్త్రము నందే పూర్వము వివరింపబడినది. రెండుతావులందును చెప్పబడిన దహరోపాసన యొక్కటియే యైనందున ఛాందోగ్యవర్ణితగుణములు బృహదారణ్యకోపాసనయందును, బృహదారణ్యకగుణములు ఛాందోగ్యమునను గ్రహింపవలెననుట నిర్వివాదసిద్ధము. తద్గుణయుక్త బ్రహ్మమే యుభయత్ర ఉపాస్యము - (౩౯)

శాండిల్యాద్యుపాసనము సమానమనియు, అందువలన పరస్పర పఠిత సత్యసంకల్పాది గుణములు గ్రహణయోగ్యము లనియు చెప్పబడి నది. ప్రస్తుతము ఆ విషయముననే మరియొక విశేషవిషయమును చెప్పు చున్నాడు.

ఆదరా దలోపః 3-3-౪౦.

ఆదరాత్ = బ్రహ్మోపాసన ఆదరముతో చేయవలయును. అలో = అందువలన నయ్యది లోపింపకుండును.

బ్రహ్మోపాసన శాస్త్రమున జెప్పినట్లు దీర్ఘ కాలము నిరంతరము సత్కారబుద్ధితో శ్రద్ధతో నొనరించినపుడే ఫల మొసంగును. ముముక్షువు సాంసారికవిషయసుఖముల నన్నింటిని విడిచి కరతలనిహితజీవనుడై బ్రహ్మోపాసనకు గడంగును. కావుననే యుపనిషత్తు లిట్లు చెప్పుచున్నవి.

'ఉత్తిష్ఠత జాగ్రత ప్రాప్య వరాన్నిబోధత
క్షురస్య ధారా నిశితా దురత్యయా
దుర్గం పథ స్తత్ కవయో వదంతి' కఠ. 3-౧౪.

'సదా సచేతుడై యనవరత మభ్యాసశీలుడై యుండువాడే యీ దుర్గమమార్గమును తరింపగలడు'. ఇట్లే

'యే చేమేఽరణ్యే శ్రద్ధా తప ఇత్యుపాసతే' ఛాం. ౫-౧౦-౧.
'యే చామీ అరణ్యే శ్రద్ధాం సత్య ముపాసతే' బృ. ఆ. ౬-౨-౧౫

ఉపాసకులు శ్రద్ధతోను, తపస్సుతోను ఏకాంతమున నుపాసనారతు లగుదురనియు, ఏకాంతమున సత్యబ్రహ్మమును వానప్రస్థులు, పరివ్రాజ కులు శ్రద్ధతో నుపాసింతురనియు, అప్పుడే బ్రహ్మప్రాప్తి కలుగు ననియు ఛాందోగ్యబృహదారణ్యములందును వర్ణింపబడినది. ఇట్లు ఉపాసనయందు

ఆదరాతిశయము ప్రకటింపబడినది. ఇట్లొనరించిననాడే యుపాసన లోపింపకుండును. (౪౦)

ముముక్షువులకు బ్రహ్మోపాసనయం దాదరాతిశయ ముండవలయు నని యేల చెప్పబడిన, దన :

## ఉపస్థితే ऽ త స్తద్వచనాత్ ౩-౩-౪౧

తద్వచనాత్=తత్ప్రతిపాదక వాక్యమువలన, అతః=ఈ బ్రహ్మో పాసనవలన, ఉపస్థితే=సాక్షాత్కారరూపమగు బ్రహ్మజ్ఞానము లభింపగా, మోక్షము లభించును.

దీర్ఘకాలము నిరంతరసత్కారబుద్ధితో బ్రహ్మము నుపాసించి నపుడే బ్రహ్మసాక్షాత్కారము కలుగును. అదియే మోక్షము. ఆదరాతిశయ ముతో నుపాసింపనినాడు మోక్షము లభింపదని భావము. శాస్త్ర మట్లే చెప్పుచున్నది.

'ఏష మ ఆత్మాऽన్తర్హృదయే, ఏతద్ బ్రహ్మ ఏత మితః ప్రేత్యాత్యాభిసంభవితాస్మీతి. యస్యస్యాదద్ధాన విచికిత్సా అస్తీతి హస్మాహ శాండిల్యః' ఛాం. ౩-౧౪-౪.

'పూర్వము వర్ణింపబడిన సర్వవ్యాపకబ్రహ్మము నాహృదయమున నున్నది. ఇది బ్రహ్మము. ఇటనుండి దేహమును విడిచి బ్రహ్మమును పొందుచున్నాను'. అని శాండిల్యుడు నుడివెను. బ్రహ్మసాక్షాత్కారము వలన నిస్సంశయముగ మోక్షమును బొందును. ఉపాసనయందు శ్రద్ధా సక్తులు లేనినాడు మోక్షలాభము కలుగదు. బ్రహ్మమునందుండు శ్రద్ధా దులు ఉపాసనాఫలమును శీఘ్రముగ లభింపజేయునని సూత్రాభిప్రాయము. (౪౧)

## త్రయోదశాధికరణము

ఉపాసనవలన బ్రహ్మజ్ఞానము కలుగునని చెప్పబడినది. అటులయిన ఉపాసన సాక్షాత్ బ్రహ్మజ్ఞానము కలిగించునా? లేక యది ప్రతిబంధకము (ఆటంకము) తొలగించినందున బ్రహ్మజ్ఞానము తనకు తాను ప్రకటమగునా? యన, సూత్రకారుడు నిర్ణయించుచున్నాడు.

**తన్నిర్ధారణానియమ స్తద్దృష్టేః పృథగ్**
**హ్యప్రతిబంధః ఫలమ్ 3-3-४२**

తన్నిర్ధారణానియమః=వానినిర్ణయనియమము లేదు. తద్దృష్టేః=బ్రహ్మదర్శనముకంటె, పృథక్=వేరు, హి=కారణమేమన, అప్రతిబంధః ఫలమ్=ప్రతిబంధము లేకుండుట ఫలము.

బ్రహ్మదర్శనముకంటె ప్రతిబంధకములేకుండుట యనెడు ఫలము వేరు. కావున బ్రహ్మోపాసనవలన కేవలము ప్రతిబంధకనాశము కలుగునని కాని, కేవలము బ్రహ్మజ్ఞానము కలుగునని కాని నిర్ణయింపవలను పడదని సూత్రాభిప్రాయము.

దీర్ఘకాలము నిరంతరము శ్రద్ధతో నొనర్చిన బ్రహ్మోపాసనవలన బ్రహ్మజ్ఞానము కలుగుటకు ప్రతిబంధకములైన చిత్తవిక్షేపాదులు సమూలము నశించును. అంతఃకరణము శుద్ధమైన మీదట చేసిన యుపాసనవలన బ్రహ్మజ్ఞానము ప్రాదుర్భూతమగును. కావున ప్రతిబంధకనాశము, బ్రహ్మదర్శనము రెండును బ్రహ్మోపాసనకు ఫలములే. ఉపాసనకు ప్రతిబంధకములు నశించుట ఫలమనియు, ఆ స్థితియే బ్రహ్మజ్ఞానమనియు, అందువలన దానికి మించి బ్రహ్మజ్ఞాన మొందు లేదనియు నెంచరాదు. ఉపాసనవలన ప్రతిబంధకములు నశింపకయే బ్రహ్మజ్ఞానము కలుగుననియు నెంచ

రాదు. ఉపాసనవలన ప్రతిబంధకములు నశించును; బ్రహ్మజ్ఞానముకూడ ప్రాదుర్భవించును; అని యాచార్యుని ఆశయము. ఇవి రెండును వేరువేరు ఫలములు.

ఉపాసనమూలమున అంతఃకరణము శుద్ధమగుటవలన బ్రహ్మజ్ఞానము కలుగునని ముండకము.

'ఏషో ఽణురాత్మా చేతసా వేదితవ్యః' ముం. ౩-౧-౯. 'పూర్వ వర్ణిత సూక్ష్మవ్యాపకతత్వమగు ఆత్మ శుద్ధచిత్తముతో నెరుంగవలెను.'

'తతః ప్రత్యక్ చేతనాధిగమో ప్యంతరాయాభావశ్చ' యోగ. ౧-౨౯. 'అప్పుడు ఆత్మ - చేతనజ్ఞానము, అంతరాయములయభావమును కలుగును'. అని యోగదర్శనము. ఆత్మజ్ఞానమునకు బ్రహ్మజ్ఞానమునకు భేదము లేదు. చేతనాచేతనముల వివేకసాక్షాత్కారమే ఆత్మజ్ఞానము లేక బ్రహ్మజ్ఞానము అనబడును. బ్రహ్మజ్ఞానము కలిగిన దనుటకు తాత్పర్యము ఆత్మ (జీవుని) స్వరూపమును సాక్షాత్కారము చేసికొనినా దనుటయే యగును. ఆత్మ సాక్షాత్కారము కలిగిన బ్రహ్మసాక్షాత్కార మనాయాసముగ కలుగునని భావము. ఉపాసనవలన ప్రతిబంధనివారణపూర్వకముగ బ్రహ్మసాక్షాత్కారము కలుగునని యాశయము. కావున ఉపాసనకు రెండును ఫలములే.

[తన్నిర్ధారణానియమః=జీవప్రకృతులకు భిన్నముగా బ్రహ్మసాక్షాత్కారజ్ఞానము ఉపాసనవలన కలుగునను నియమము లేదు. కారణ మేమన : తద్దృష్టేః=ఉపాసన లేనపుడు బ్రహ్మజ్ఞానము కలుగుటవలన పృథక్ హి = జ్ఞానముకంటె వేరు, అప్రతిబంధః = ప్రతిబంధాభావము, ఫలమ్=ఉపాసనకుఫలమని యంగీకరింపబడును.] అనియు సూత్రార్థము.

ఉపాసనవలన చిత్తవిక్షేపాది ప్రతిబంధకములు నశించును. చిత్త వ్యాపారము లంతట ఉడుగును. చిత్తము ప్రసన్నమగును. ఋతంభరా ప్రజ్ఞ యేర్పడును. అంతట స్వరూపస్థితుడైన ప్రత్యగాత్మకు బ్రహ్మసాక్ష

త్కారాత్మకజ్ఞానము స్వయముగా నుపస్థితమగును. కావున ఉపాసనవలన బ్రహ్మజ్ఞానము సాక్షాత్తుగ కలుగునను నియమము లేదు. వైదికులలో నిట్లు కొందఱందురు. ఇందు ఉపాసనమువలన చిత్తవిక్షేపాది ప్రతిబంధకములు నశించును. అదియే యుపాసనఫలము. అటుపైన జీవాత్మకు స్వస్వరూపజ్ఞానము కలుగును. అట్టివానికి బ్రహ్మసాక్షాత్కారము ఉపాసనలేకయే కలుగునని వారి యభిప్రాయము. (౪౨)

ప్రతిబంధకవినాశము ఉపాసనకు బ్రహ్మజ్ఞానముకంటె భిన్నమగు ఫలమగు నెడల ఉపాసన బ్రహ్మజ్ఞానమునకు సాధనముగా నేల చెప్పబడు చున్న, దన:

## ప్రదానవ దేవ తదుక్తమ్ 3-3-43

ప్రదానవదేవ=ప్రదానమువలెనే, తత్=అది, ఉక్తమ్ = చెప్పబడినది. ప్రదానము యజ్ఞవైగుణ్యమును దొలగించుచు యజ్ఞమునకు సాధనమగునట్లు ఉపాసన జ్ఞానమునకు సాధనమగును. ప్రతిబంధకములను తొలగించుచు అని భావము. ఇయ్యది మీమాంసయందు చెప్పబడినది.

విద్వాంసులగు బ్రాహ్మణులకు ఇచ్చు వస్త్ర సువర్ణాదులు దానమనబడును. యజ్ఞవేదియందు కూర్చుండి యజ్ఞము నను్ష్ఠించు ఋత్విక్కులకు యజ్ఞాంతమున నొసంగు వస్త్రధనాదులు యజ్ఞదక్షిణ యనబడును. ఇయ్యది ప్రకృష్టదాన మగుటచే ప్రదానమనబడును. యజ్ఞాంతమున ఋత్విక్కులకు దక్షిణ నీయనంతవరకు యజ్ఞ మసంపూర్ణముగ నెంచబడును. అపుడా యజ్ఞము వికృతము - విగుణమగును. యజ్ఞాంతదక్షిణ - ప్రదానము యజ్ఞవైగుణ్యమును దొలగించుచు యజ్ఞసాధన మగునట్లే, బ్రహ్మోపాసనయు చిత్తవిక్షేపాది ప్రతిబంధకములను దొలగించుచు బ్రహ్మజ్ఞానమునకు సాధన మగును.

యజ్ఞాంతమున దక్షిణవిషయమున మీమాంసయం దిట్లు చెప్ప బడినది.

'దీక్షాదక్షిణం తు వచనాత్ ప్రధానస్య' ౩-౭-౧౧. దీక్ష, దక్షిణ అను నీరెండును అంగయజ్ఞమునకు, ప్రధానయజ్ఞమునకు రెంటికిని విధింప బడినవియా? లేక ప్రధానయజ్ఞమునకేనా? అను సంశయము కలుగగా, సూత్రకారుడు దీక్ష, దక్షిణ యనునివి ప్రధానకర్మకే అంగములని చెప్పి యున్నాడు. అట్లే యుపాసనకూడ ప్రతిబంధకములను నశింపజేయుచు బ్రహ్మ జ్ఞానసాధక మగునని సూత్రాభిప్రాయము. (౪౩)

బ్రహ్మోపాసనవలన బ్రహ్మజ్ఞానము కలిగిన కలుగుగాక। అందు వలన మోక్షము ప్రాప్తించుననుటకు ప్రమాణమేమి? బ్రహ్మజ్ఞానము మోక్షమునకు నిర్బాధసాధనమా? యన:

## లింగభూయస్త్వా త్తద్ధి బలీయ స్తదపి ౩-౩-౪౪

(పూర్వసూత్రమునుండి 'ఉక్తమ్' అను పదము అనువృత్తి చేయబడినది.)

లింగభూయస్త్వాత్ = ప్రమాణబాహుళ్యమువలన, తత్ హి = ఆ బ్రహ్మజ్ఞానమే. బలీయః = ఎక్కువబలముగల సాధనము - నిర్బాధసాధనము. తత్ అపి (ఉక్తమ్) = అదియును శాస్త్రాంతరములందు చెప్ప బడినది.

అధ్యాత్మశాస్త్రములందు బ్రహ్మజ్ఞానము మోక్షమునకు బలీయ నిర్బాధసాధనమని పలుతావులందు వర్ణింపబడినది.

'స యోహ వై తత్ పరమం బ్రహ్మ వేద బ్రహ్మైవ భవతి' ముం. ౩-౨-౯.

'బ్రహ్మవి దాప్నోతి పరమ్' తై. ౨-౧.

'తరతి శోక మాత్మవిత్' ఛాం. ౭-౧-౩. ఇట్టియుపనిషద్వాక్యము లందు 'బ్రహ్మము నెరిగినవాడు బ్రహ్మమే యగును - బ్రహ్మరూపమోక్ష పదమును బొందును'. 'బ్రహ్మజ్ఞాని మోక్షమును బొందును'. 'వ్యాపకపర మాత్మ నెరిగినవాడు దుఃఖమును తరించును - ఆనందరూపమోక్షమును బొందును'. అని బ్రహ్మజ్ఞానమే మోక్షసాధనముగా వర్ణింపబడినది.

దర్శనాంతరములందును. 'జ్ఞానా న్ముక్తిః' సాం. ౩-౨౩. (బ్రహ్మ) జ్ఞానమే ముక్తికి సాధనముగా జెప్పబడినది. ఇక వేదమునందు 'తమేవ విదిత్వాఽ తిమృత్యు మేతి' యజు. ౩౧-౧౮. పరమేశ్వరు నెరిగియే మృత్యువును తరించునని యున్నది. ఇట్లు బ్రహ్మజ్ఞానమే ముక్తిసాధన మనుట నిర్బాధము. (౪౪)

పైనచెప్పినవిషయమున నొకశంకారూప పూర్వపక్షము:

**పూర్వవికల్పః ప్రకరణాత్ స్యాత్**
**క్రియామానసవత్** ౩-౩-౪౫

ప్రకరణాత్ = మోక్షమునకు కర్మ, జ్ఞానము రెండును చెప్పబడుట వలన, పూర్వవికల్పః స్యాత్=జ్ఞానముకంటె పూర్వమైన కర్మతో జ్ఞానము నకు వికల్ప మేర్పడును. జ్ఞానమువలెనే కర్మకూడ సాధనమగును. కావున జ్ఞానమే సాధనమనుట ఎట్లు పొసగును? అని పూర్వపక్షము. దృష్టాం తము: క్రియామానసవత్ = బాహ్యక్రియాత్మకమగు నగ్నిహోత్రముతో మానసికక్రియకు అభ్యుదయము ప్రతివికల్పమైనట్లు.

ఈశావాస్యమునందు 'కుర్వ న్నేవేహ కర్మాణి జిజీవిషేత్' అని యావజ్జీవము కర్మ లొనర్ప విధింపబడినది తదుపరి 'యస్తు సర్వాణి భూతా న్యాత్మ న్నేవానుపశ్యతి' అని ఆత్మజ్ఞానము నుపదేశించి జ్ఞానముతో అమృతప్రాప్తి యుల్లేఖింపబడినది. ఇట్లొకే ప్రకరణమున కర్మ, జ్ఞానము

రెండును చెప్పబడుటచే, ఒకప్పుడు కర్మవలనను, మరియొకప్పుడు జ్ఞానము వలనను మోక్షము కలుగుననుట స్పష్ట .మగుచున్నది. కావున కర్మ, జ్ఞానము రెండును వైకల్పికసాధనము లగుచున్నవి. అప్పుడు జ్ఞానమే సాధనమనుట పొసగదని పూర్వపక్షాభిప్రాయము.

బాహ్యకర్మకు మానసికకర్మకు గల వికల్పము కౌషీతకీ బ్రాహ్మణమున నిట్లు చూడనగును. ప్రథమమున 'ఏతా ఆజ్యాహుతీ ర్జుహోతి - వాచం తే మయి జుహో మ్యసౌ స్వాహా' (౨-౪-౫.) అను నీసందర్భమున వాక్కు ప్రాణము మున్నగువాని బాహ్యకర్మల నుల్లేఖించి తరువాత దానినే మానసకర్మరూపమున వర్ణించి యుండుట చూడనగును.

'అథాతః సాంయమనం ప్రాతర్దన మాంతర మగ్నిహోత్ర మితి చాచక్షతే. యావద్ వై పురుషో భాషతే న తావత్ ప్రాణితుం శక్నోతి, ప్రాణం తదా వాచి జుహోతి. యావద్ వై పురుషః ప్రాణితి న తావద్ భాషితుం శక్నోతి, వాచం తదా ప్రాణే జుహోతి. ఏతే అనంతే అమృతాహుతీ జాగ్రచ్చ స్వపంశ్చ సతత మవ్యవచ్ఛిన్నం జుహోతి. అథ యా అన్యా ఆహుతయోఽంతవత్య స్తాః కర్మమయ్యో హి భవంతి. ఏతద్ హ వై పూర్వే విద్వాంసో ఽగ్నిహోత్రం న జుహవాంచక్రుః' కౌ. ౨-౪.

'ఇకముందు ఆంతర - మానసికాగ్నిహోత్రమును వర్ణించుచున్నాము. మనుజుడు మాటలాడినంతసమయము ప్రాణమును గ్రహింపజాలడు - శ్వసింపజాలడు. అప్పుడు వాణియందు ప్రాణము నాహుతిజేయును. అట్లే శ్వాసతీసికొనునపుడు మాటలాడజాలడు. అప్పుడు శ్వాసయందు వాక్కు నాహుతిజేయును. ఇవి యమృతాహుతులు. వీని కంత ముండదు - అనంతములు. జాగ్రదవస్థయందు, నిద్రలోను ఎప్పుడు నీయగ్నిహోత్రము జరుగుచుండును. ఇతర బాహ్య - ఆహుతులు అల్పములు - సాంతములు. పూర్వపు విద్వాంసు లీహోమము చేసెడివారు కారు.'

ఈ ప్రసంగమునందు బాహ్యక్రియతో నాంతరికక్రియకు వికల్పము స్పష్టము. ఇట్లే ఈశోపనిషత్తునందు మోక్షమునకు కర్మ, జ్ఞానము నను వానిలో వికల్పము కనబడుచున్నది. అనగా మోక్షము కర్మమూలమునను బొందవచ్చును. జ్ఞానము మూలమునను బొందవచ్చునని యభిప్రాయము. కర్మ, జ్ఞానము రెండును మోక్షమునకు స్వతంత్రసాధనములని భావము. జ్ఞానమువలన మోక్షము కలుగుననుట నిర్వివాదసిద్ధాంతము. ఆ ప్రకరణము నందే కర్మవిధాన ముండుటవలన నదియు మోక్షసాధన మనవలసివచ్చును. అట్లుకానిపక్షమున నా ప్రకరణమున విధించుట వ్యర్థమగును. రెండును సాధనము లందుమేని మోక్షమునకు జ్ఞాన మొక్కటియే సాధన మనుట తగదు. కర్మజ్ఞానముల సముచ్చయము సాధనమనరాదు. అట్టియెడ నొకటి వ్యర్థమగును. కావున కర్మ, జ్ఞానము రెండును వైకల్పికసాధనము లనుట ఉపయుక్తమని భావము. (౪౫)

ఇదియే స్పష్టముచేయుచున్నాడు.

## అతిదేశాచ్చ 3-3-౪౬

అతిదేశమువలనను వికల్పమే పుష్టమగుచున్నది. ఒకదానిధర్మము మరియొకదానియందు ప్రాప్తించుట అతిదేశ మనబడును. ధర్మమన నిట కార్యాదులు. జ్ఞానఫలము కర్మయం దతిదేశ మగుటవలన జ్ఞానమునకు కర్మతో వికల్పమగునని తెలియనగును.

ఈశావాస్యమున కర్మవలన దుఃఖతరణము, లేక జ్ఞానమువలన అమృతప్రాప్తి చెప్పబడినవి.

'అవిద్యయా మృత్యుం తీర్త్వా విద్యయా ఒమృత మశ్నుతే' ౧౧.
'వినాశేన మృత్యుం తీర్త్వా సంభూత్యా ఒమృత మశ్నుతే' ౧౪.

మృత్యువును తరించుట, అమృతము పొందుటయు రెండును సమానములే. మొదటిది కర్మఫలము, రెండవది జ్ఞానఫలము - కార్యము. ఇట్లొక సాధనకార్యము మరియొక సాధనకార్యముగా చెప్పబడినది. కావున మోక్షమునకు జ్ఞానకర్మలు వైకల్పికసాధనములని యంగీకరింపవలయును. (౪౬)

ఇట్లు పూర్వపక్షమును ప్రదర్శించి సూత్రకారుడు సమాధానము చెప్పుచున్నాడు.

### విద్యైవ తు నిర్ధారణాత్ ౩-౩-౪౭

('తు' పూర్వపక్షనిరాకరణార్థము)

నిర్ధారణాత్ = నిర్ధారణమువలన - వేరుచేసి ప్రతిపాదించుటవలన, విద్యైవ = జ్ఞానమే మోక్షసాధనము.

'య ఇత్తద్విదు స్తేఽమృతత్వ మానశుః' బు. ౨-౩-౧౮.

'తమేవ విదిత్వాఽ తిమృత్యు మేతి' యజు. ౩౧-౧౮.

'తమేవ విద్వాన్ నబిభాయ మృత్యోః' అథర్వ. ౧౦-౪-౮.

'తమే వైకం జానథ ఆత్మానమ్, అన్యా వాచో విముంచథ అమృత స్యైష సేతుః' ముండక. ౨-౨-౫.

ఇట్లు వేద - ఉపనిషద్వాక్యములలో బ్రహ్మ - ఆత్మ జ్ఞానమే మోక్షసాధనముగా చెప్పబడినది. 'ఇత్' 'ఏవ' పదములను ప్రయోగించి ఆత్మ - బ్రహ్మ సాక్షాత్కారముతక్క మరియొకటి సాధనమే కాదు మోక్షమునకని నిర్ధారణము చేయబడినది. కావున మోక్షమునకు జ్ఞానమే సాధనము. కర్మ కానేరదు. కర్మ జ్ఞానమునకు సాధనము. ఆ జ్ఞానము మోక్షమునకు సాధనము. ఇట్లు జ్ఞానకర్మలు క్రమసముచ్చయసాధనము లనవచ్చును. పూర్వసూత్రములందు వర్ణింపబడిన ప్రకరణాతిదేశములందును కర్మ జ్ఞానసాధన

మనియు, అజ్ఞానము మోక్షసాధనమనియు తెలిసికొనవలయును. నిష్కామ కర్మ చిత్తవిక్షేపాదిప్రతిబంధకములను దొలగించి జ్ఞానోదయమునకు సాధనమగునని ఈశోపనిషత్తున నెంచవలెను. కావున వికల్పమునకు తావు లేదని భావము. (౪౭)

ఈ విషయమున మరియొకహేతువు :

**దర్శనాచ్చ** 3-3-౪౮

దర్శనాత్ చ = లింగ - ప్రమాణ - దర్శనముపలనను, జ్ఞానమే (విద్యా ఏవ) మోక్షసాధనమని యర్థము. 'లింగభూయస్త్వాత్ ....' వే. ౩-౩-౪౪. అను నీ సూత్రవివరణముననే వేదోపనిషత్తులవాక్యములు ఉదాహరింపబడినవి. వాని నిట చేర్చుకొనవలెను. తన్మూలమున జ్ఞానమే మోక్షసాధనమని తెలియును. (౪౮)

శ్రుతిలింగములకు ప్రకరణము బాధకము కాదా? అందువలన జ్ఞాన కర్మలు వికల్పములేల కా, దన :

**శ్రుత్యాదిబలీయస్త్వాచ్చ న బాధః** 3-3-౪౯

శ్రుత్యాదిబలీయస్త్వాత్ చ=శ్రుతివాక్యములు అధికబలము కలవగు టచేతను, ప్రకరణబాధ వానికి కలుగదు.

ప్రకరణముకంటె వేదవాక్యములకు బలమెక్కుడు. కావున ప్రకరణము వానిని బాధింపజాలదు. కావున జ్ఞానమే మోక్షసాధనము.

మీమాంసాశాస్త్రమున నట్లే నిర్ణయింపబడినది.

'శ్రుతి లింగ వాక్య ప్రకరణ స్థానసమాఖ్యానామ్ సమవాయే పారదౌర్బల్య మర్థవిప్రకర్షాత్' ౩-౩-౧౪.

శ్రుతి, లింగము, వాక్యము, ప్రకరణము, స్థానము, సమాఖ్య అను నీ యారింటియం దేరెంటికైన నొకయర్థమునందు ప్రాప్తి కలిగిన పరము కంటె పూర్వము బలీయమగును. పూర్వము పరమును బాధించునని యర్థము. శ్రుతి యన్నింటికంటెను బలమైనది. కావున ప్రకరణము శ్రుతిని బాధింపజాలదు. జ్ఞానమే మోక్షసాధనము. (౪౯)

ఈ విషయము నింకను దృఢ మొనర్చుటకు మరియొక హేతువు :

## అనుబంధాదిభ్యః ప్రజ్ఞాంతరపృథక్త్వవద్ దృష్టవచ్చ తదుక్తమ్ 3-3-౫౦

('న' అనువర్తించును. 'చ' హేత్వంతరసూచకము. అనుబంధః= ఫలము, ప్రజ్ఞాంతరమ్ = ఉపాసన.)

అనుబంధాదిభ్యః=ఫలాదులవలన, ప్రజ్ఞాంతరపృథక్త్వవత్=ఉపాసనలు ఫలమునుబట్టి వేరైనట్లు, దృష్టః = కర్మకు వేరుఫలము చూడబడినది, చ=అందువలనను, న = కర్మకు జ్ఞానముతో వికల్పము లేదు. తదుక్తమ్=దర్శనాంతరమున నది చెప్పబడినది.

ఉపాసన, లేక కర్మానుష్ఠానములు కొండొకవిశేషఫలముకొఱకు చేయబడును. వానిచేతనే యది సిద్ధించును. ఇతరములవలన సిద్ధింపదు. కావున ఫలభేదమువలన ఉపాసనలలో భేద మంగీకరింపబడును. కొండొక ఫలప్రాప్తికొఱకు ఉపాసనలలో వికల్పము కల్పింపరాదు. ఇట్లే జ్ఞాన కర్మలఫలములుకూడ భిన్నములు. జ్ఞానఫలము మోక్షము. కర్మఫలము మృత్యుతరణము - ప్రతిబంధకము తొలగుట. ఇంతేకాక వీనిసాధనముల లోను అనుష్ఠానములలోను ఎంతో భేదముండును. ఉపాసనా సాధనానుష్ఠానములు వేరు. కర్మసాధనానుష్ఠానములు వేరు. కావున వీనిలో వికల్పము పొసగదు. ఒకదానిఫలము మరియొకటి సాధింపనేరదు.

పూర్వము ఈశోపనిషత్తు మంత్రముల నుదాహరించి జ్ఞానకర్మల ఫలభేదము చూపబడినది. ఇట్లే మనువు,

'తపో విద్యా చ విప్రస్య నిఃశ్రేయసకరం పరమ్
తపసా కిల్బిషం హంతి, విద్యయాఽ మృత మశ్నుతే' ౧౨-౧౦౪.

'విప్రునకు తపస్సు, కర్మ, విద్య - జ్ఞానము మోక్షప్రదాయకములు. అందు తపస్సుతో పాపములను తొలగించును. జ్ఞానముతో అమృతమును బొందును' అని చెప్పియున్నాడు. ఇట్లు కర్మకు ఫలము భిన్నముగా నిశ్చితమైనపుడు జ్ఞానవికల్పము ఎన్నడును తగదు. ఉపాసనలలో వికల్పమును విచారించునపుడు సూత్రకారుడు ముందు (౩-౩-౫౯) సూత్రమున వికల్పముకొఱకు ఫలైక్యము నిర్ణయించును. కావున మోక్షముకొఱకు జ్ఞానముతో కర్మవికల్పము ఎన్నడును తగదు. (౫౦)

మోక్షమునుగూర్చి జ్ఞానమునకు కర్మతో వికల్పము లేకున్నను ఉపాసనతో వికల్పము కలుగవచ్చునుగదా! యన, సూత్రకారుని సమాధానము :

న సామాన్యాద ప్యుపలబ్ధేర్ మృత్యువ
న్నహి లోకాపత్తిః ౩-౩-౫౧

సామాన్యాదపి=జ్ఞానసామాన్యమువలనను, న=జ్ఞానమునకు ఉపాసనతో వికల్పము కలుగదు. కారణ మేమన : ఉపలబ్ధేః=ఫలపృథక్త్వము లభించుటవలన, మృత్యువత్=మృత్యుపదమువలె. నహి లోకాపత్తిః = లోకసంహారప్రాప్తి లేదు.

వేరుగ ఫల ముపలబ్ధ మగుటవలన జ్ఞాననామసామ్యమున్నను జ్ఞానమునకు ఉపాసనతో వికల్పము కలుగదు. మృత్యుపదమువలన లోకసంహారము ప్రాప్తింపనట్లు.

జ్ఞానము విద్య లేక ప్రజ్ఞ యనబడును. ఉపాసనయు విద్య యన బడును. అదియు నొకవిధముగ జ్ఞానరూపమే. ఇట్లు జ్ఞానము, ఉపాసన సమానములయినందున మోక్షమునుగూర్చి యివి వైకల్పికసాధనములు కావచ్చును. కాని యిందులకు విపరీతముగ సూత్రకారు డట్లు కా దనుచు న్నారు. కారణ మేమన : జ్ఞానము, ఉపాసన యనువానికి ఫలములు భిన్న ములుగా నున్నవి. కావున నామమాత్రసామ్యమువలన నివి రెండును మోక్షమునకు వైకల్పికముగా సాధనము లనుట తగదు. రెండింటికి మోక్ష మనునదియే ఫలమగునెడల నవి యొండొంటికి వికల్పము కావచ్చును. అట్లు కాదు. ఉదాహరణము : అగ్నికి, పరమేశ్వరునకు రెంటికి మృత్యు వను పదము నామము. 'అగ్నిర్వై మృత్యుః' (బృ. ౩-౨-౧౦) ఇట అగ్ని మృత్యువనబడినది. అది వస్తువులను కొన్నింటిని నశింపజేయును - సంహరించును. 'స ఏష ఏవ మృత్యుర్ య ఏష ఏతస్మిన్ మండలే పురుషః' (శత. ౧౦-౫-౨౩) ఇట సమస్తవిశ్వ (లోక) సంహారకుడైన పర మేశ్వరునకు మృత్యువని నామము. నాశము నిమిత్తముగా అగ్నికి, పరమే శ్వరునికి మృత్యువను నామసామ్య మున్నను అగ్ని పరమేశ్వరునివలె సర్వసంహారము చేయజాలదు గదా! ఇట్లు ఫలభేద ముండుటవలన మృత్యు వను నామసామ్య మున్నను అగ్ని సర్వలోకసంహారమున పరమేశ్వరునకు వికల్పసాధనము కాజాలనట్లు ప్రజ్ఞ లేక విద్య యను సామ్య మున్నంత మాత్రమున మోక్షరూపఫలమున జ్ఞానమునకు ఉపాసనవిద్య వికల్పసాధ నము కాజాలదని సూత్రాకారుని ఆశయము. కారణము వానికి వేరువేరు ఫలము లుండుటయే. జ్ఞానమునకు ఫలము మోక్షము; ఉపాసనకు చిత్త శుద్ధి ఫలము. (౫౧)

ఇట్లు విచారణచేసిన మీదట చేయు నిశ్చయమేమన :

## పరేణ చ శబ్దస్య తాద్విధ్యం భూయస్త్వా త్త్వనుబంధః 3-3-౫౨

('చ' హేత్వర్థకము)

పరేణ=జ్ఞానముచే, మోక్షము కలుగుననుట నిశ్చయము, చ=ఎందు వలన, శబ్దస్య = శ్రుతిశబ్దమునకు, తాద్విధ్యం = తద్విధాయకత్వము ఎక్కువగా జూచుచున్నాము, భూయస్త్వాత్ = తదుపలబ్ధ భూయ స్త్వము వలన, అనుబంధః=(జ్ఞానమునకు మోక్షముతో) సంబంధము నిశ్చయింప బడుచున్నది.

ఉపాసనకు పూర్వము కర్మ, పరము జ్ఞానము. కావున పరశబ్ద మిట జ్ఞానార్థకము. పరేణ = జ్ఞానముచే మోక్షము కలుగుననుట నిశ్చయము. అధ్యాత్మశాస్త్రములందు పలువాక్యములతో జ్ఞానమువలననే మోక్ష ము లభించునని విధింపబడినది. అట్టి విధాయకవాక్యము లింతకుపూర్వ మీ ప్రసంగమునందే యెన్నో ఉదాహరింపబడినవి. వానింబట్టి జ్ఞానమువలననే మోక్షము లభించుననియు, జ్ఞానమునకే మోక్షముతో సాక్షాత్తు సంబంధ మున్నదనియు స్పష్టపడును. కాబట్టి జ్ఞానమువలననే మోక్షము లభించు ననుటయే నిశ్చయము. (౫౨)

ఉపాసకునకు జ్ఞానమువలన మోక్షప్రాప్తి కలుగునని నిశ్చయింప బడినది. కాని యుపాసకు డెవరు? ఉపాసనాదులు దేహముతో నొనర్ప బడును. దేహ ముపాసకమగుచో అది నశించును. మోక్ష మెవరికి? దేహాతిరిక్తముగా నుపాసకము ఉన్నదా? యని సూత్రకారుడు జిజ్ఞాసన సూచించుచున్నాడు.

## ఏక ఆత్మనః శరీరే భావాత్ 3-3-౫౩

ఆత్మనః=జీవాత్మ, శరీరే = శరీరమునందు, భావాత్ = ఉన్నందు

వలన, (శరీరము లేకున్న లేనందువలనను) ఏకే = కొందఱు, జ్ఞానము వలన మోక్షము లభించుననుట అయుక్త మందురని సూత్రాభిప్రాయము.

ఉపాసనా ద్యనుష్ఠానములు దేహముతో అనుష్ఠింపబడును. దేహాతిరిక్తముగా ఆత్మ యనున దొండు కానరాదు. కాలాంతరమున అసమర్థమై శరీరము నశించును. పంచతత్త్వముల సమ్మేళనమున దేహమేర్పడి యందు చేతనత యుత్పన్నమగును. అది జడపదార్థముల ధర్మమే యగును. ఘటము సిద్ధము కాకముందు తత్కారణము - మట్టి జలము తెచ్చుటకు సమర్థము కాదు. ఘటముగా నేర్పడినపుడు ఆ మట్టియే జలముతెచ్చుటకుపయుక్త మగుచున్నది. అట్లే పంచతత్త్వములు విడిగా నున్నపుడు వానిలో చేతనత కనబడకున్నను దేహముతోబాటు అది యేర్పడును. కావున దేహమునకు మించి జీవాత్మ యనునది వేరుగాలేదు. అందువలన ఉపాసన మూలమున జ్ఞానమువలన జీవాత్మ మోక్షము పొందుననుట యుక్తము కాదు. (౫౩)

సూత్రకారుడు సమాధానము చెప్పుచున్నాడు.

## వ్యతిరేక స్తద్భావాభావిత్వా న్నతూపలబ్ధివత్  ౩-౩-౫౪

వ్యతిరేకః= (శరీరముకంటె) ఆత్మ వ్యతిరేకము- భిన్నము, నతు= అవ్యతిరేకము కాదు - శరీరముకంటె అభిన్నము కాదు. కారణమేమన, తద్భావాభావిత్వాత్ = శరీరమున్నను (ఆత్మ) అభావశీల మగుటవలన, ఉపలబ్ధివత్ = ఉపలబ్ధి యన జ్ఞానము, అది విషయ మున్నను ఉండదు. కావున జ్ఞానము విషయముకంటె భిన్నమైనట్లు, అని యుదాహరణము.

చైతన్యమాత్ర మాత్మ యని అంగీకరింపబడుచున్నది. చైతన్యము శరీరధర్మ మగునెడల నది దానికంటె భిన్నము కాదు, అది శరీరధర్మ

మెన్నడును కాదు. శరీరమున్నను చైతన్య ముండదు. వస్తుధర్మము వస్తువుండగా లేకపోదు. మరణానంతరము శరీర మున్నను చైతన్యము - జ్ఞాన ముండదు. రూపాదులు శరీరధర్మములు. అవి శరీర మున్నంతవరకు నుండును. చైతన్య మట్లు కాదు. కావున చైతన్యము శరీరధర్మ మెన్న డును కాదు. అందువలన శరీరముకంటె నది భిన్నము - వ్యతిరేకము. అదియే ఆత్మ. ఉపాసనాదికార్యములన్నియు నదియే చేయును. వాని నొనర్చుటకు దేహ మాత్మకు సాధనము మాత్రమే. కార్యసాధనకు సాధన మవసరము. ఉపాసనానుష్ఠానాదికార్యములను సంపన్నమొనర్చుటకు సాధన రూపమున దేహముతో ఆత్మకు సంబంధముండును. దానితో ఆత్మ బ్రహ్మ సాక్షాత్కారము కలుగువరకు కార్యముల నొనర్చును. తదుపరి జ్ఞానముతో మోక్షమును బొందును. కాబట్టి దేహముకంటె భిన్నమైన ఉపాసకాత్మ జ్ఞానముతో మోక్షమును సంపాదించును. ఇందు అయుక్త మొందును లేదు. (౫౪)

## చతుర్దశాధికరణము

ఇంతవరకు ప్రాసంగికవిషయచర్చ ముగిసినది. మరల ప్రకృతము ననుసరించుచు కర్మాంగసంబద్ధమగు ఉపాసనావిషయకచర్చ నారంభించు చున్నాడు.

### అంగావబద్ధాస్తు న శాఖాసు హి ప్రతివేదమ్ ౩-౩-౫౫

('తు' అంగబద్ధముకాని యుపాసనను తొలగించుటకు, 'హి' అవధారణార్థకము.)

అంగావబద్ధాః=జ్యోతిష్టోమాదికర్మాంగములయిన ఉద్గీథాదులందు సంబద్ధములయిన ఉపాసనవిధులు, ప్రతివేదమ్=ప్రతిశాఖయందును గ్రహింప బడును. శాఖాసు హి=విహితశాఖలందే, న=వ్యవస్థితములు కావు.

అంగసంబద్ధ - ఉపాసనవిధులు, ఏ శాఖయం దవి పఠింపబడినవో యందే కాక ప్రతిశాఖయందును గ్రహింపబడునని భావము.

సూత్రమునందలి వేదపదము వేదశాఖలకు ప్రయుక్తము. జ్యోతిష్టోమము మున్నగుకర్మలకు అంగములగు ఉద్ గీథా ద్యుపాసనావిధులకు సంబంధించిన వర్ణనలు విభిన్నశాఖలందు చూడనగును. విభిన్నశాఖలందు జ్యోతిష్టోమాది కర్మలు వర్ణింపబడినవి. అట్టితావులలో కొన్నిచోట్ల ఉద్ గీథోపాసన యుల్లేఖింపబడినది. కొన్నిశాఖలందు లేదు. కావున నొకచో వర్ణింపబడిన ఉద్ గీథ-ఉపాసన ఇతరశాఖలందు గ్రహింపవలెనా? లేదా? యని శంక కలుగును. ఏ శాఖయందు ఉద్గీథోపాసన పఠింపబడలేదో యటకు పఠింపబడినశాఖనుంచి అనువర్తింపజేసికొనవలెనని సూత్రకారుడు చెప్పుచున్నాడు.

"ఓ మిత్యేత దక్షర ముద్ గీథ ముపాసీత" (ఛాం. ౧-౧-౧.) ఇయ్యది ఉద్ గీథ ఉపాసన. సామాన్యవిధి. ఇయ్యది యేదో యొక విశేష శాఖకు చెందిన కర్మాంగమునందే యనుష్ఠింపవలె నను వ్యవస్థ యెక్కడను కానరాదు. కావున నెల్లశాఖలందును జ్యోతిష్టోమప్రసంగ మున్నచోట దీనిని గ్రహింపవచ్చును. ఇట్లే యితరోపాసనలవిషయమునను తెలియ నగును. (౫౫)

అన్యశాఖావిహితోపాసనలను అన్యశాఖలందు గ్రహించుటలో వ్యవధాన ముండుటవలన శ్రుతి విరోధించునా? యన:

### మంత్రాదివద్ వా ఽవిరోధః ౩-౩-౫౬

వా=లేక, మంత్రాదివత్=మంత్రములు ద్రవ్యములు మున్నగువాని వలె, అవిరోధః=విరోధము లేదు.

కొందొకవేదమునందు పఠితమంత్రములు అన్యవేదప్రతిపాదిత కర్మలందు వినియుక్తము లగునట్లు ఒకశాఖయందు పఠింపబడిన ఉపాసన కూడ ఇతరశాఖలందు అనువర్తింపబడుట విరోధముకాదు. దోషము లేదని సూత్రార్థము.

తైత్తిరీయసంహితలో, "అధ్వర్యవే సజనీయం శస్యమ్" (౭-౫-౫-౨) 'అధ్వర్యుడుచేయు కర్మయందు సజనీయసూక్తమును పఠింపవలెను' అని యున్నది. యజుర్వేదము అధ్వర్యునకు సంబంధించిన వేదము కావున నతడు చేయు కర్మలో యజుర్వేదమంత్రములు ప్రయోగింపబడుట ఇష్టము. కాని సంహిత సజనీయసూక్తము నుచ్చరింప విధించుచున్నది. 'స జనాస ఇంద్రః' అను నిట్టి పదయుక్తసూక్తము 'సజనీయము'. ఇది ఋగ్వేదసూక్తము (౨-౬-౭-౧). యజుర్వేదమునకు ఋగ్వేదమునకు మధ్య వ్యవధానము కలదు. అందువలన ఋగ్వేదపఠితమంత్రములు యజుర్వేదమంత్రాభీష్టకర్మయందు పఠించుట కా వ్యవధానము విరోధింపదు. అట్లే శాఖాంతరపఠితోపాసన శాఖాంతరమున గ్రహించుట కెట్టి విరోధము నుండదని సూత్రాభిప్రాయము.

సూత్రమునందలి ఆది పదముచే కర్మ, గుణములు గ్రహింపనగును. కావున నొకశాఖయందు చెప్పబడిన కర్మలు మరియొకచోట గ్రహింపవచ్చును. అట్లే గుణములు కూడ. (౫౬)

ప్రతికర్మయందును అంగములగు ఉపాసనల ననువర్తింపవలెనని చెప్పబడినది. వైశ్వానరోపాసన విషయమున నేమి చేయవలెను? అట వ్యష్టి, సమష్టి యని రెండువిధములగు నుపాసనలు వర్ణింపబడినవి. వానిలో వ్యష్టి-ఉపాసనలు గ్రాహ్యమా? సమష్టిగ్రాహ్యమా? దేని ననువర్తింపజేయవలె, నన :

## భూమ్నః క్రతువ జ్జాయ స్త్వం తథా హి దర్శయతి 3-3-౫౭

క్రతువత్=యజ్ఞమునకువలె, భూమ్నః=సమష్టినే గ్రహింపవలెను. జాయ స్త్వం=ప్రధానత. తథా హి దర్శయతి=అట్లే చూపించును.

దర్శపూర్ణమాస ప్రభృతి యాగమువలె, సమష్టి యుపాసన గ్రహింప వలెను. శాస్త్రములం దట్లే చూడనగును.

ఛాందోగ్యమున (౫-౧౧-౧) వైశ్వానరోపాసన వర్ణింపబడినది. అట దివము మున్నగు నొక్కొక్క యంగమున వైశ్వానరోపాసన వ్యష్టి రూపమునను గలదు. అట్లే తదుపరి "సర్వేషు లోకేషు సర్వేషు భూతేషు" (ఛాం. ౫-౧౮-౧) అని సమష్టి ఉపాసన నిర్దేశింపబడినది. కాబట్టి యీ రెండుపాసనలు గ్రహింపవలెనా? ఒక్క సమష్టిఉపాసనయేనా యని జిజ్ఞాస కలుగును. భూమ - అంగియైన వైశ్వానరసమష్టి ఉపాసనయే ప్రధాన మగు టచే ప్రామాణికమని సూత్రకారుని యభిప్రాయము. శాస్త్ర మా సమష్టి యుపాసననే చూపుచున్నది. ఎట్లన: దర్శపూర్ణమాసాది యాగములందు ప్రయాజాదిఅంగములతో గూడిన ప్రధానప్రయోగమే అనుష్ఠేయ మగు చున్నది. ప్రయాజాది అంగములు వేరువేరుగ అనుష్ఠింపబడవు. అందు వలననే వ్యష్టిఉపాసన నిర్దేశింపబడిన తావున దాని నిందయు జూడనగును. ఛాందోగ్యమునందలి వర్ణనంబట్టి ప్రాచీనశీలుడు మున్నగు కొందఱు జిజ్ఞాసువులు కేకయదేశపురాజగు అశ్వపతికడకు వైశ్వానరవిద్య నెఱుంగుటకు పోవుదురు. అశ్వపతి వ్యష్టిఉపాసనను నిందించి, దానినుండి వారిని తొలగించి సమష్టిఉపాసనను వర్ణించి యందు ప్రవృత్తులగునట్లు చేయును. (ఛాం. ౫-౧౮-౧,౨) కావున వైశ్వానరసమష్టిఉపాసనకు ప్రధానతయు, అనుష్ఠేయతయు కలవని నిశ్చితమగుచున్నది. వ్యష్టిఉపాసనకు అనుష్ఠేయత లేదని భావము. (౫౭)

శాస్త్రములం దనేకోపాసనలు గలవు. వాని కన్నింటికి ఉపాస్య మొక్కబ్రహ్మము మాత్రమే. అట్టియెడ వాని నన్నింటి నొక్కటిగా నేల యంగీకరింపరా, దన:

నానా శబ్దాదిభేదాత్ 3-3-౫౮

శబ్దాదిభేదాత్=శబ్దాదులలో భేదముండుటవలన, నానా=అనేకములు. విధానము, ప్రకారము ననువానిలో భేదమున్నందున ఉపాసనలు అనేకములే. ఒక్కటి కావు అని సూత్రార్థము.

దహర, శాండిల్య, వైశ్వానరాది ఉపాసనలు విభిన్నోపనిషత్తులలో విధింపబడియున్నవి. వానికి ఉపాస్యవస్తువు బ్రహ్మ మొక్కటియైనను ఉపాసన లన్నియు ఒక్కటి కావు. కారణ మేమన: వేద, ఉపాసీత, ధ్యాయీత, క్రతుం కుర్వీత అను నిట్టి విధాయకశబ్దములు భిన్నము లగుటచే ఉపాసనలు భిన్నము లనక తప్పదు. ఆదిపదముచే గుణప్రకారభేదములు గ్రహింపనగును. ఉపాస్యబ్రహ్మ మొక్కటియైనను అది యొకచో కొన్నిగుణములతో గూడి యుపాసింపబడును. మరియొకయెడ మరికొన్ని గుణములతో. ఇట్లే అనుష్ఠానప్రకారములందును భేదము చూడనగును. కావున దహరాదివిద్యలు భిన్నము లనియే యెంచవలెను.

ఈ పాఠమున మొదట పరస్పరగుణగ్రహణము చేయవలయునని చెప్పి యే యుపాసనలలో ఏకత ప్రతిపాదింపబడినదో అది వానికే యని యెంచవలెను. ఒకే యుపాసన భిన్నస్థానములలో వర్ణింపబడిన దని భావము. పంచాగ్నివిద్య, ప్రాణవిద్య మున్నగునవి యిట్టివే యగును. (౫౮)

ఉపాసనలు అనేకమగుచో వాని అనుష్ఠానమున వికల్ప మంగీకరింపనగునా? సముచ్చయమా? అన:

## వికల్పో అవిశిష్టఫలత్వాత్ 3-3-౫౯

అవిశిష్టఫలత్వాత్ = సమానఫలకము లగుటవలన, వికల్పః=ఉపాసనల ననుష్ఠించుటలో వికల్ప మంగీకరింపవలెను.

ఉపాసనల కన్నింటికి ఫలము సమాన మగుటవలన వాని అనుష్ఠానమున వికల్ప మంగీకరించుట యుక్తము.

ఒక లక్ష్యమును జేరుట కనేకమార్గము లున్నపుడు లక్ష్యమును జేరగోరు వ్యక్తి ప్రతిమార్గము నత దనుసరింపవలసిన యవసర ముండదు. వానిలో నే మార్గము ననుసరించినను నతడు లక్ష్యము చేరును. అట్లే ఉపాసనల కన్నింటికి లక్ష్యము బ్రహ్మప్రాప్తి. కావున నేదో యొక యుపాసన ననుష్ఠించి ముముక్షువు లక్ష్యమును బొందవచ్చును. అందువలన ఉపాసనల యనుష్ఠానమున వికల్పమే యభిమతము. సముచ్చయము కాదు.

యజ్ఞఫలములు భిన్నములు. అందువలన విభిన్నఫలములనుగోరు వ్యక్తి విభిన్నయజ్ఞకర్మల ననుష్ఠింపవలెను. కాబట్టి అక్కడ సముచ్చయమే కాని వికల్పము పనికిరాదు. (౫౯)

## పంచదశాధికరణము

కామ్యోపాసనలందు వ్యవస్థ యేమి? యన :

## కామ్యాస్తు యథాకామం సముచ్చీయేరన్ నవా పూర్వహేత్వభావాత్ 3-3-౬౦

కామ్యాస్తు=బ్రహ్మప్రాప్తి కాక యితరఫలముల నభిలషించి యనుష్ఠించు ఉపాసనలు, యథాకామం=ఇష్టమువచ్చినవానిని, సముచ్చీయేరన్=కలిపి యనుష్ఠింపవలెను. వా=లేక, న=అట్లు చేయకుండవచ్చును. కారణ మేమన : పూర్వహేత్వభావాత్=పూర్వహేతువు లేనందువలన.

బ్రహ్మసాక్షాత్కారము కాక యితరైశ్వర్యాది ఫలములను గోరి చేయు ఉపాసనలు కామ్య - ఉపాసనలు. అట్టివాని ననుష్ఠించువారి కోరికల ననుసరించి అనుష్ఠాన ముండును. ఏదో యొక చిన్నఫలము కోరువారు తత్ప్రాప్తి కనుగుణమగు నొక్కయుపాసన అనుష్ఠింతురు. అనేక ఫలములను గోరువారు అనేకోపాసనల ననుష్ఠింపవలసియుందురు. కావున కామ్యోపాసనలందు వికల్ప సముచ్చయ వ్యవస్థ - నియమము ఉండనేరదు. ఫలాభిలాషులు స్వతంత్రు లని సూత్రకారుని అభిప్రాయము.

పూర్వసూత్రమునందు గ్రహింపబడిన 'అవిశిష్టఫలత్వాత్' అను హేతు వీ సూత్రమున గ్రహింపనందున వికల్పసముచ్చయములలో నియమము లేదని గ్రహింపనగును. (౬౦)

కామ్యోపాసనలందు అనుష్ఠానానియమము చెప్పబడినది. అంగోపాసనలందు వికల్పసముచ్చయముల వ్యవస్థ యెట్టిదో చెప్పవలసియున్నది. అందుల కనువగు వివేచనార్థము పూర్వపక్షమును సూత్రించుచున్నాడు.

అంగేషు యథాశ్రయభావః ౩-౩-౬౧

అంగేషు=కర్మాంగోపాసనలందు, యథాశ్రయభావః=ఆశ్రయానుసారము జరుగును. అంగోపాసనలందు ఆశ్రయము ననుసరించి విధానము జరుగును.

కామ్యోపాసనలందువలె కర్మలకు అంగభూతములైన ఉద్గీథాది అంగోపాసనలందును అనుష్ఠానమున అనియమ ముండునా? లేక నియమ ముండునా? అని సంశయము. నియమ ముండునని పూర్వపక్షము. ఉండదని సిద్ధాంతము.

సూత్రకారు డిట సముచ్చయ మంగీకరించుట యుక్త మనుచున్నాడు. కారణము ఆశ్రయము ననుసరించి అంగానుష్ఠానము జరుగ

వలెను. అంగోపాసన కాశ్రయము కర్మ. సమస్త అంగములు కలిసి ప్రధాన కర్మను సంపన్న మొనర్చును. ఇదియే కర్మానుష్ఠానప్రకారము. ప్రయాజ, అనుయాజాదినామక అంగములన్నియు కలిసి దర్శపూర్ణమాసాది యజ్ఞకర్మలను నిర్వర్తించును. అట్లే అంగోపాసనలన్నియు కలిసి తమ ప్రధానాంగోపాసనము సంపన్నము చేయవలెను. ఇట్లు అంగోపాసనానుష్ఠానమున సముచ్చయ మంగీకరించుట సంగతమని పూర్వపక్షాభిప్రాయము. (౬౧)

ఈ విషయమునందే మరియొక హేతువు :

శిష్టేశ్చ 3-3-౬౨

శిష్టేః చ = శాసనవిధానమువలనను, అంగోపాసనల ననుష్ఠించుటలో సముచ్చయ మంగీకరించుట యుక్తమని సూత్రార్థము.

కర్మాంగములైన ఉద్గీథాద్యుపాసనలను శాస్త్ర మెట్లు విధించినదో యట్లే అంగాశ్రితములగు ఉపాసనలవిధానము కలదు.

"ఓ మిత్యేత దక్షర ముద్గీథ ముపాసీత" ఛాం. ౧-౧-౧.

"'ఓమ్' అను నక్షర ఉద్గీథము నుపాసింపవలెను" అని విధానము. ఆశ్రయముతో సమానవిధాన మున్నపుడు అనుష్ఠానముకూడ దానితో సమానముగ నుండవలెను. కావున అంగోపాసనలందు సముచ్చయము- అంగోపాసనలన్నియు ననుష్ఠింపవలయునను నియమ ముండుట యుక్తము. (౬౨)

మరియొక హేతువు :

సమాహారాత్ 3-3-౬3

సమాహారాత్=కొఱతను పూర్తిచేయుటవలనను, అంగోపాసనలందు యథాశ్రయభావ మున్నదని తెలియుచున్నది.

ఛాందోగ్యమున "య ఉద్గీథః స ప్రణవః, యః ప్రణవః స ఉద్గీథః" ఛాం. ౧-౫-౫.

'ఉద్గీథమే ప్రణవము; ప్రణవమే ఉద్గీథము' అని యిట్లు ప్రణవ - ఉద్గీథముల యేకత్వోపాసనము విధించి, తదుపరి దానిఫలము కూడ చెప్పబడినది. "హోతృషదనా ద్ధైవాపి తదుద్గీథ మనుసమాహరతి" ఛాం. ౧-౫-౫. "ఋగ్వేదుల ప్రణవము, సామవేదుల ఉద్గీథము ననువాని యేకత నెరుంగు ఉద్గాత సామగానమునందలి యశుద్ధిని హోతకూర్చుండు స్థానము(హోతృషదనము) నుండి సరిచేయును. కర్మలోపమును-కొఅతను పూర్తిచేయుట - సమాహార మనబడును. ఇట ఉద్గాతకు ప్రతిఅంగోపాసన తోను సంబంధములేని పక్షమున ఉద్గాతచేసిన అశుద్ధిని హోతృస్థానము నుండి సరిచేయుట చెప్పబడియుండనేరదు. అందువలన అంగోపాసనలందు ఆశ్రయము ననుసరించి సముచ్చయము నంగీకరించుట యుక్తమే. (౬౩)

ఉపర్యుక్తవిషయమును బలపరుచుట కింకొక హేతువు :

గుణసాధారణ్యశ్రుతేశ్చ ౩-౩-౬౪

గుణసా....శ్రుతేశ్చ=గుణము సాధారణమని చెప్పు శ్రుతివలనను, అంగోపాసనానుష్ఠానములందు సముచ్చయ మంగీకరింపవలెను.

గుణ - కర్మాంగమగు ఉపాసనాసహితమైన 'ఓమ్' సర్వకర్మలందును సమానరూపమున నుండుట శ్రుతి చెప్పుచున్నది.

ఛాందోగ్యమున "తేనేయం త్రయీ విద్యా వర్తతే, ఓ మి త్యాశ్రావయతి, ఓ మితి శంసతి, ఓ మి త్యుద్గాయతి" (ఛాం. ౧-౧-౯.)

'ఓమ్'తో ఈ త్రయీవిద్య - ఋగ్యజుస్సామములు - ప్రవృత్తమగును. అధ్వర్యుడు 'ఓమ్' నుచ్చరించి మంత్రములను పఠించును. హోత 'ఓమ్' నుచ్చరించి స్తుతియొనర్చును. ఉద్గాత 'ఓమ్' నుచ్చరించి గానము

చేయును. ఇట త్రయీవిద్యతో 'ఓమ్'కు సమానసంబంధ మున్నది. అది కర్మకు అంగభూతమగు ఉద్గీథము మున్నగు ఉపాసనలయనుష్ఠానమందు సముచ్చయసూచకము. ఇట గుణము అనగా కర్మకు అంగములగు ఉపాసనలకు నాశ్రయమైన 'ఓమ్'కు సర్వవేదములతో సంబంధము చెప్పబడినది. దీనిం బట్టి 'ఓమ్' నాశ్రయించియుండు ఉపాసనలయనుష్ఠానమున సముచ్చయ నియమ ముండవలెనని తెలియుచున్నది.

ఉద్గీథ మొక గానము. అదియొక కర్మ కంగము. ఉద్గీథము ప్రణవము రెండును ఒక్కటియే. ఉద్గీథ మే కర్మ కంగమో యా కర్మ ఉద్గీథమును ప్రయోగింపక పూర్తికాదు. కర్మయందు ఉద్గీథము ప్రయోగింపక తప్పదు. ఇదియే ఉద్గీథమునకు కర్మతో సముచ్చయము. ఉద్గీథమునకు కర్మ ఆశ్రయమైనట్లు ఉద్గీథోపాసనకు ఉద్గీథ మాశ్రయము. ఇట్లు కర్మతో ఉద్గీథమునకు సముచ్చయ మున్నపుడు ఉద్గీథముతో ఉపాసనకు సముచ్చయ ముండితీరవలెను. కర్మతో ఉద్గీథగానము, దానితో ఉపాసన ఆవసరము. ఇట్లు కర్మతో ఉపాసనకు నియతసముచ్చయ మేర్పడుచున్నది. పైనాలుగుసూత్రములందును ఈ భావమే పూర్వపక్షరూపమున ప్రకటింపబడినది. (౬౪)

ఉపర్యుక్తపూర్వపక్షమునకు సమాధానము :

## న వా తత్సహభావాశ్రుతేః 3-3-౬౫

తత్సహభావాశ్రుతేః=కర్మలతో అంగోపాసనలసహభావశ్రవణము లేనందున, న = అంగోపాసనలందు ఆశ్రయభావము ననుసరించి నియమము విధించుటకు వీలులేదు.

కర్మకు ఉపాసనకు సహభావమును బోధించు శ్రుతి లేనందున వానిలో సముచ్చయము లేదని సూత్రార్థము.

కర్మతో దానియంగకర్మలకు సహభావము శాస్త్రమున స్పష్టముగా చెప్పబడినట్లు, ఉపాసనలకు సహభావము చెప్పబడలేదు. ఇంతకు పూర్వ మీపాదముననే (౩-౩-౪౨) కర్మఫలము వేరు, ఉపాసనాఫలము వేరు అని నిర్ణయింపబడినది. కర్మఫలమును పొందుటకు దానియంగకర్మల ననుష్ఠించిన చాలును. ఉపాసనలయనుష్ఠానముతో పని యుండదు. కావుననే కర్మతో ఉపాసనకు నియతముగా సహభావ మవసరము లేదని తెలియును.

ఛాందోగ్యమున "తే నోభౌ కురుతో యశ్చైతదేవం వేద యశ్చ నవేద, నానాతు విద్యా చావిద్యాచ, యదేవ విద్యయా కరోతి శ్రద్ధయోపనిషదా తదేవ వీర్యవత్తరం భవతి" (ఛాం. ౧-౧-౧౦.)

'కర్మ, ఉపాసన అను నీ రెండును భిన్నములనియు, ఉపాసనలేకయు కర్మానుష్ఠానము చేయవచ్చుననియు, ఉపాసనతోబాటు చేసిన శీఘ్రముగా నధికఫలము లభించుననియు చెప్పబడినది. కావున కర్మతో ఉపాసనకు సముచ్చయనియమము లేదనియే స్పష్టమగుచున్నది.

కర్మ, ఉపాసనలసముచ్చయమును దెలుపుచు పైనజూపిన హేతువుల నిరాకరణము దీని వలన కలుగును. కర్మాంగములగు ఉద్గీథాదులకు తదాశ్రితములగు నుపాసనలకు సమానవిధాన మున్నను, శాస్త్రమునందు వానికి ఫలభేదము చెప్పబడినందున కర్మ - ఉపాసనలకు సముచ్చయము తగదు. సమాహారము, గుణసాధారణ్యము నను రెండుహేతువులుకూడ అర్థవాదము మాత్రమే కాని స్వయముగా అర్థసాధకములు కావు.

కావున నే యుపాసన యెవరికి రుచించునో యతడు దాని ననుష్ఠింపవచ్చును. అంతేకాని, కర్మాంగములతో నే యుపాసనలకు సంబంధము కలదో లేక యా యంగములతో వేనికి ఆశ్రయాశ్రయిభావ మున్నదో వానిని

అంగములతోబాటు అనుష్ఠింపవలయు నను నియమములేదు. ముఖ్యకర్మ లతో ఉపాసనలకు సముచ్చయ మంగీకరింపవలసిన యవసరమును లేదు. క్రతువు పూర్తియగుటకు అంగానుష్ఠాన మొనర్పవలెను. కావున అంగానుష్ఠానము క్రతువుతో సంబద్ధము. ఉపాసనానుష్ఠానము పురుషునకు సంబంధించినది. అది పురుషార్థమును సిద్ధింపజేయును. ఇట్లు భిన్నప్రయోజనకరము లగుటవలన కర్మ, ఉపాసనలకు సముచ్చయము అపేక్షితము కాదని సిద్ధాంతము. (౬౫)

ఉక్తవిషయమును సూత్రకారుడు బలపరుచుచున్నాడు.

## దర్శనాచ్చ 3-3-౬౬

దర్శనమువలనను ఉక్తవిషయము బలపడుచున్నది.

చతుర్వేదవిదుడగు బ్రహ్మ మిగిలినఋత్విక్కులనందఱను రక్షించు నని యుల్లేఖము చూడబడుటవలనను కర్మఉపాసనలలో సముచ్చయ మభిమతము కాదని సూత్రాభిప్రాయము.

ఛాందోగ్యమున "ఏవంవిద్ హ వై బ్రహ్మా యజ్ఞం, యజమానం, సర్వాం శ్చర్త్విజో ఽభిరక్షతి" ఛాం. ४-౧౭-౧౦. 'ఇట్లు ఎరిగినవ్యక్తి-బ్రహ్మ యజ్ఞమును, యజమానుని, ఎల్ల ఋత్విక్కులను రక్షించును అని యున్నది. ఇట బ్రహ్మ తనజ్ఞానముతో ఋత్విజుల నెల్లరను రక్షించు నని నిర్దేశింపబడినది. అంగాశ్రిత మగు నుపాసన కర్మలలో నంతట అంగములతోపాటు సమానముగ అనుష్ఠింపబడునెడల ఋత్విజు లెల్లరు వాని నెరింగియుండవలసినవా రగుదురు. అప్పుడు తెలిసినబ్రహ్మచే వారు రక్షింపబడుదురని చెప్పనవసర ముండదు. కర్మానుష్ఠానమునందు ఋత్విజులందరు

కర్మలను, వానియంగములను బాగుగ నెరిగియుందురు. ఉపాసనలకుకూడ కర్మతో అంగములకువలె నియతసముచ్చయ మున్నపక్షమున ఋత్విజు లలో ప్రతివానికి వానిజ్ఞానముండుట తప్పనిసరియగును. అప్పుడు బ్రహ్మ తనజ్ఞానముతో నితరులను రక్షించునని యుల్లేఖించుట వ్యర్థమగును. కావున కర్మలతో ఉపాసనలకు నియతసముచ్చయము లేదని స్పష్టమగుచున్నది. అందువలన ఇష్టము వచ్చినట్లు అవసరమునుబట్టి వికల్ప, సముచ్చయా నుష్ఠానము చేయవచ్చునని సూత్రకారుని అభిప్రాయము. (౬౬)

వేదాంత దర్శన - అంబా వ్యాఖ్యానమున
తృతీయాధ్యాయమునందు తృతీయపాదము
సమాప్తము

# తృతీయాధ్యాయము

## చతుర్థపాదము

### ప్రథమాధికరణము

జ్ఞానసాధనములయిన యుపాసనలనుగూర్చి గతపాదమున వివరింపబడినది. ఇందు బ్రహ్మజ్ఞానము స్వతంత్రముగా పురుషార్థమునకు సాధనమని వివరింపబడును. మోక్షమే పరమపురుషార్థము. తత్ప్రాప్తికి బ్రహ్మజ్ఞానమే సాధనము. అది ఇతరసాధనసహకార మపేక్షింపదు. సూత్రకారుడు వ్యాసమహర్షి స్వనామనిర్దేశపూర్వముగా నీ విషయమున సిద్ధాంతరూపమును ప్రతిపాదించుచున్నాడు.

**పురుషార్థోఽతః శబ్దాదితి బాదరాయణః 3-4-1**

అతః=పూర్వోక్తజ్ఞానమువలన, పురుషార్థః=మోక్షముసిద్ధించును, శబ్దాత్=వేద, ఉపనిషద్వాక్యములవలన, అని, బాదరాయణః=బాదరాయణు డంగీకరించుచున్నాడు.

పూర్వపాదమున వర్ణించిన ఉపాసనాజనితజ్ఞానము దుఃఖత్రయాత్యంత నివృత్తిపూర్వకముగ బ్రహ్మానందప్రాప్తి లక్షణమగు మోక్షము - పరమపురుషార్థమునకు స్వతంత్రసాధనమని శాస్త్రములు చెప్పుచున్నట్లు ఆచార్యుడు బాదరాయణు డంగీకరించుచున్నాడు.

జ్ఞానము మోక్షమునకు సాధనము. ఇయ్యది కర్మకుఅంగమై మోక్షసాధనమగుచున్నదా? లేక స్వతంత్రముగానా? అని సంశయ మొదవును. జ్ఞానము మోక్షమునకు సాక్షాత్సాధనము. అది యన్యసాధనసహయోగము నపేక్షింపదు. పురుషార్థమునకు స్వతంత్రకారణము మరియొకదాని కంగమై కాదు. ఇందులకు వేద, ఉపనిషద్వాక్యములే ప్రమాణములని సూత్రకారుడు

చెప్పుచున్నాడు. సూత్రమున తననామమును నిర్దేశించుట తనమంతవ్యమును దృఢపరుచుటకని తెలియవలెను. ఆ వాక్యము లెయ్యవి యన :

"య ఇత్తద్విదు స్తే అమృతత్వ మానశుః" ఋ. ౧-౧౬౪-౨౩.

"తమేవ విదిత్వాఽ తిమృత్యు మేతి" యజు. ౩౧-౧౮.

"తమేవ విద్వా న్నబిభాయ మృత్యోః" అథర్వ. ౧౦-౮-౪౪.

"త మాత్మస్థం .... నేతరేషామ్" కఠ. ౨-౨-౧౨.

"తం వేద్యం పురుషం వేద యథా మావోమృత్యుః పరివ్యథాః" ప్ర. ౬-౬.

"త మేవైకం జానథ ...." ముండక. ౨-౨-౫.

"య ఏత ద్విదు రమృతా స్తే భవంతి" శ్వే. ౩-౧.

"జ్ఞానా న్ముక్తిః" సాం. ౩-౨౩.

"త త్త్వజ్ఞానా న్నిఃశ్రేయసమ్" వైశేషికము. ౧-౧-౪.

"త త్త్వజ్ఞానా న్నిఃశ్రేయసాధిగమః" న్యాయ. ౧-౧-౧.

ఈ శాస్త్ర వచనములనుబట్టి బ్రహ్మజ్ఞానము స్వతంత్రముగా మోక్షసాధన మని సిద్ధమగుచున్నది. (౧)

సూత్రకారుడు తన మంతవ్యమును నిర్బాధమొనర్చుటకు జైమిని ముని యభిప్రాయమును పూర్వపక్షరూపమున ప్రస్తుతించుచున్నాడు.

శేషత్వాత్ పురుషార్థవాదో యథాన్యేష్వితి
జైమినిః ౩-౪-౨

(ఉపాసనాజనిత జ్ఞానము వలన) పురుషార్థవాదః = పరమ పురుషార్థము - మోక్షము సిద్ధించుననుట, అర్థవాదః = అర్థవాదము మాత్రమే. కారణ మేమన, శేషత్వాత్ = కర్మాఙ్గమగుటవలన, యథాఅన్యేషు = ద్రవ్యసంస్కారకర్మలగు కర్మాంగములందువలె.

పారలౌకికకర్మలందు ప్రవృత్తి కలుగుటకు దేహముకంటె జీవాత్మ అతిరిక్తమని తెలిసికొనుట యవసరము. ఆ కర్మలకు ఫలము దేహము విడిచినమీదట పరలోకమున లభించును. ఆత్మ దేహముకంటె భిన్నమని యెరిగినవానికే యిట్టి యాస్థ కలుగును. యజ్ఞకర్మలందు కర్తగా అంగభూతుడై యుపస్థితుడై యుండు ఆత్మకు దేహాదులకంటె ఆత్మతత్వ మతిరిక్తమని జ్ఞానము కలిగించుటయే అధ్యాత్మశాస్త్రము-విద్యకు ప్రయోజనము. అనుష్ఠానమువలన ఫలము లభించును. కర్తయగు ఆత్మ కర్మకు అంగము. ఆత్మజ్ఞానమువలన నే ఫలము లభించునని నిర్దేశింపబడినదో యది యర్థవాదము మాత్రమే. కర్మయొక్క యితరాంగముల ఫలనిర్దేశ మర్థవాదమైనట్లు ఆత్మజ్ఞానఫలముకూడ అర్థవాదమే.

'యస్య పర్ణమయీ జుహూ ర్భవతి న స
పాపం శ్లోకం శృణోతి.' (తై. సం. ౩-౫-౭-౨)

'యజ్ఞమున నుపయోగించు పాత్రలలో 'జుహూ' అనున దొకటి యుండును. అది 'పలాశ' మోదుగ-కఱ్ఱతో చేయబడినచో యజ్ఞకర్త అపకీర్తిని బొందదు' అను నీ స్థలమున నిర్దేశింపబడిన ఫలము అర్థవాదము మాత్రమే. జుహూ పలాశముతో చేయబడవలెననుటయే దాని తాత్పర్యము. యజ్ఞ మొనర్చునపుడు యజమానుని కంటికి అంజనము పెట్టబడును. దానికి ఫలము 'శత్రువు కంటిని ఉచ్ఛిన్నము చేయుట'యని చెప్పబడినది. "యదంక్తే చక్షురేవ భ్రాతృవ్యస్య వృంక్తే" (తై. సం. ౬-౧-౧-౫) ఈ ఫలనిర్దేశముకూడ అర్థవాదమే. సంస్కారముకొఱకు యజమానుని కంటికి అంజనము అవశ్యముగా పెట్టవలెననుటయే దానితాత్పర్యము. మరి యొండుకాదు. ఇట్లే 'తరతి శోక మాత్మవిత్' ఆత్మజ్ఞాని తరించునని చేయబడిన ఫలనిర్దేశము అర్థవాదము మాత్రమే. కర్మయందు కర్తృరూపమున అంగభూతుడై యుపస్థితు డగువానికి అనుష్ఠానమునకు పూర్వము ఆత్మ దేహాతిరిక్తమని తెలిసికొనుట యావశ్యకమనియే దాని భావము. కాబట్టి మోక్షము

నకు జ్ఞానము స్వతంత్రకారణ మనుట ప్రామాణికము కాదని జైమిని పూర్వపక్షము. (౨)

ఈ విషయమునే శిష్టాచారముతో బలపరుచుచున్నాడు.

ఆచార దర్శనాత్ ౩-౪-౩

జ్ఞానులు కర్మల ననుష్ఠించుచుండిరి. ఇట్టి యాచరణము శాస్త్రము నం దుల్లేఖింపబడినదని సూత్రార్థము.

ఛాందోగ్యమున 'యక్ష్యమాణో వై భగవంతోఽహ మస్మి' (ఛా. ౫-౧౧-౫) 'మహానుభావులార! నేను యజ్ఞము చేయువాడను' అని యశ్వపతి తనకడకు బ్రహ్మజ్ఞానము నర్థించి వచ్చిన మహాశాలుడు మున్నగు శ్రోత్రియులైన విద్వాంసుల నుద్దేశించి చెప్పినట్లు కలదు. ఇట్లే. బృహదారణ్యకమున "జనకో హ వైదేహో బహుదక్షిణేన యజ్ఞే నేజే" (బృ. ౩-౧-౧.) విదేహదేశరాజు, బ్రహ్మవేత్త, జనకుడు బహుదక్షిణతో గూడిన యజ్ఞము నొనర్చినట్లు వర్ణింపబడినది. జ్ఞానులైన శిష్టజనులు యజ్ఞము చేయుటంబట్టి జ్ఞానమునకు స్వతంత్రఫలము లేదనియు, నది కర్మకు అంగమనియు, కర్మానుష్ఠానమువలన ఫలము లభించుననియు స్పష్టమగు చున్నది. (౩)

మరియొక హేతువు :

తచ్ఛ్రుతేః ౩-౪-౪

జ్ఞానము కర్మకు అంగమని శ్రుతి-శబ్దప్రమాణమువలన సిద్ధమగు చున్నదని సూత్రార్థము.

'యదేవ విద్యయా కరోతి....తదేవ వీర్యవత్తరం భవతి' (ఛాం. ౧-౧-౧౦.) 'ఏ కర్మ విద్య-జ్ఞానముతో చేయునో యది బలవంత మగును.' ఇట విద్యయా-'విద్యతో' అని కరణార్థకమగు తృతీయావిభక్తి

ప్రయోగమువలన విద్య కర్మకు అంగము-సాధనమని స్పష్టమగుచున్నది. కర్మ సంపన్నమగుటకు అన్యసాధనములు దాని కంగములగునట్లు విద్య-జ్ఞానముకూడ కర్మ కంగమని తాత్పర్యము. (౪)

ఇందుల కింకొక హేతువు:

## సమన్వారంభణాత్ 3-4-5

సమన్వారంభణమువలన - సమాన ఆరంభణము - అనుగమనము వలన, అనిసూత్రార్థము. ఫలోత్పాదనమున జ్ఞానము, కర్మ రెండు సహకరించుటవలన జ్ఞానము కర్మకు అంగమగును. లేక కర్మతో జ్ఞాన మనుగమించుటవలన కర్మ కంగమగును, అని సూత్రాభిప్రాయము.

'తం విద్యాకర్మణీ సమన్వారభేతే' బృ. ఉ. ౪-౪-౨

'పరలోకమున కేగు జీవాత్మకు జ్ఞానకర్మలు సహకారులగును - అనుగమించును' అనుటవలన జ్ఞానము ఫలోత్పాదనలో స్వతంత్ర కారణము కాదనియు, కర్మకు అంగమై యుపకరించుననియు తెలియుచున్నది. (౫)

ఈ విషయమునందే హేత్వంతరము :

## తద్వతో విధానాత్ 3-4-6

తద్వతః=జ్ఞానము కలవానికి, విధానాత్ = కర్మ విధించుటవలన. జ్ఞానము కర్మాంగమే యగుచున్నది.

'ఆచార్యకులాత్ వేద మధీత్య యథావిధానం గురోః కర్మాతిశేషే ణాభిసమావృత్య కుటుంబే శుచౌ దేశే స్వాధ్యాయ మధీయానః' (ఛాం. ౮-౧౫-౧) 'గురువుల సేవచేసి మిగిలిన సమయమున విధిపూర్వకముగ వేదాధ్యయన మొనర్చి ఆచార్యకులమునుండి సమావర్తనానంతరము స్నాత

కుడు కుటుంబముతో నుండి స్వాధ్యాయము చేయుచుండవలెను' అను నిట్టి సందర్భములందు వేదార్థజ్ఞానము కలవానికి కర్మాధికారము చెప్పబడి నది. ఇట్లు జ్ఞానికి కర్మవిధాన ముండుటవలన జ్ఞానము కర్మకు అంగమని స్పష్టమగుచున్నది.

వేరొక హేతువు :

నియమాచ్చ 3-౪-౭

నియమము వలనను జ్ఞానము కర్మాంగమని తెలియును.

'కుర్వ న్నే వేహ కర్మాణి జిజీవిషే చ్ఛతగ్ం సమాః' యజు.౪౦-౨. 'కర్మలుచేయుచునే యిట నూరేండ్లు బ్రతుకగోరుము' అని జ్ఞానికి యావజ్జీవము కర్మానుష్ఠాననియమము గోచరమగుచున్నది. అందువలన పురుషునకు ఫలము కర్మవలన లభించునని స్పష్టమగును. మరియు 'ఏతద్ వై జరామర్యం సత్రం యదగ్నిహోత్రం జరయా వా హ్యేవాస్మాన్ ముచ్యతే మృత్యునా వా" శత. ౧౨-౪-౧-౧.

'అగ్నిహోత్రము జరామరణపర్యంతము చేయదగినసత్రము. ముసలి తనమో మృత్యువో వచ్చినపు డిది మనలను విడుచును' అని చెప్పుటవలన ఆయుపర్యంతకర్మానుష్ఠాననియమము జ్ఞానమును కర్మకంగముగా స్పష్టము చేయుచున్నది. కావున మోక్షాదిఫలము కర్మవలననే కలుగును. జ్ఞానము దానికంగమగునని పూర్వపక్షనిర్ణయము. (౭)

ఇట్లు సుదీర్ఘమగు పూర్వపక్షమును ప్రదర్శించి సూత్రకారుడు తన నిశ్చితసిద్ధాంతమును సూత్రించుచున్నాడు.

అధికోపదేశాత్తు బాదరాయణస్యైవం తద్దర్శనాత్ 3-౪-౮

('తు' పూర్వపక్షనిషేధార్థము)

బాదరాయణస్య=బాదరాయణునకు, అధికోపదేశాత్ = కర్మ కుప యుక్తమగు ఆత్మజ్ఞానముకంటె నెక్కుడు అనుశాసనమువలన, ఏవమ్= ప్రథమసూత్రమున చెప్పినట్లు నిశ్చయింపవలెనని అభిప్రాయము. ఎందు వలన ? తద్దర్శనాత్ = వేద, ఉపనిషత్తులలో అధికోపదేశము చూడబడి నందున, జ్ఞానము మోక్షమునకు స్వతంత్రకారణమే యగును. కర్మాం గము కాదు.

కర్మ కెంత జ్ఞాన ముపయుక్తమో యంతయే జైమినిఆచార్యు డుపదేశించియున్నాడు. కర్మ లొనర్చుటకు దేహముకంటె ఆత్మ భిన్న మని తెలిసిన చాలును. అయ్యది శబ్దానుమానప్రమాణములవలన గలుగును. ఆ జ్ఞానము కర్మకు అంగ మనవచ్చును. కాని, వేదాంతశాస్త్రరూపమున జేసిన ఉపదేశ మంతకంటె నధికము. అయ్యది ఆత్మపరమాత్మల సాక్షా త్కారముకొఱ కగునది. శరీరాది ప్రకృతివరకు గల సమస్తజడతత్త్వ ములకంటె చేతన మాత్మతత్త్వము అత్యంతము భిన్నము. అది చేతనా చేతనముల కన్నింటికి అధిష్ఠాత. జగజ్జన్మాదులకు మూలకారణము. సర్వ జ్ఞము సర్వశక్తిమంతము సచ్చిదానందస్వరూపబ్రహ్మము. ఇట్టి యాత్మ పరమాత్మలదర్శన మిట జ్ఞానము. అయ్యది మోక్షమునకు స్వతంత్ర సాధనము. ఈ యుపదేశము బాదరాయణుని వేదాంతమున గలదు. ఇట్టి జ్ఞానము కర్మకు అంగ మెన్నడును కాదు. ఇట్టి జ్ఞానమువలన కర్మ సమూ లము నశించును. సూత్రకారుడు ముందు (౩-౪-౧౬) ఈ విషయము నుల్లేఖించును.

ఆత్మజ్ఞానవిషయకములగు నుపదేశములు శాస్త్రములందు పెక్కు గలవు.

'తద్యదాత్మవిదో విదుః' (ముం. ౨-౨-౯). 'ఆత్మ జ్ఞానులు బ్రహ్మము నెరుంగుదురు.' 'తద్విజ్ఞానేన పరిపశ్యంతి ధీరా ఆనందరూపం

అమృతం యద్విభాతి' (ముం. ౩-౨-౭). 'నిరంతర మభ్యాస మొనర్చు ఉపాసకుడు ఆత్మజ్ఞానముతో ఆనందరూపబ్రహ్మసాక్షాత్కారము చేసి కొనును.

దేహాతిరిక్త మాత్మ యని శబ్దానుమానములమూలమున దెలిసి కొనుట యపరవిద్యాంతర్గతము. ఆత్మపరమాత్మల నెరుంగుట పరవిద్య యగును. ఈజ్ఞానము కర్మసమూహమును నాశమొనర్చునది కావున నది కర్మాంగ మెన్నడును కాదు.

దీనింబట్టి యాచార్యులలో మతభేదము నెంచరాదు. అధికారభేద మునుబట్టి వారి యుపదేశములలో భేదము కలదని యెంచవలెను. బాద రాయణుని యుపదేశము అధికమే కాని విరుద్ధము కాదని భావము. అపరా విద్యాంతర్గతమగు నాత్మజ్ఞానము కర్మ కంగము కావచ్చును. పరవిద్యా బోధిత బ్రహ్మజ్ఞానము మోక్షసాధనము. అది కర్మాంగము కాదని తాత్పర్యము. (౮)

జ్ఞానము కర్మకు అంగమని చెప్పుట కిచ్చిన హేతువులవిషయమున సూత్రకారుడు తన అభిప్రాయము నిచ్చుచున్నాడు.

తుల్యం తు దర్శనమ్ ౩-౪-౯

('తు' పూర్వపక్షవ్యావర్తకము.)

దర్శనం=శిష్టాచారదర్శనము, తుల్యమ్=కర్మకువలె దాని త్యాగము నకు సమానము.

సూత్రమునందలి 'తు' పదము ఆచారదర్శన మను హేతువు 'జ్ఞానము కర్మ కంగ' మని సిద్ధపరుచుటలో నసమర్థ మని తెలుపుటకు ప్రయోగింప బడినది. శాస్త్రమున కర్మానుష్ఠానము శిష్టాచారమైనట్లు, కర్మత్యాగముకూడ శిష్టాచారముగ చూడనగును.

"ఏతమేవ ప్రవ్రాజినో లోక మిచ్ఛంతః ప్రవ్రజంతి
ఏతద్ధ స్మ వై తత్ పూర్వే విద్వాంసః ప్రజాం. న
కామయంతే కిం ప్రజయా కరిష్యామో యేషాం నోఽయ
మాత్మాఽయం లోక ఇతి తే హ స్మ పుత్రైషణాయా
శ్చ విత్తైషణాయాశ్చ లోకైషణాయాశ్చ వ్యుత్థాయ
అథ భిక్షాచర్యం చరంతి" బృ. ఉ. ౪-౪-౨౨.

'బ్రహ్మప్రాప్తిని గోరు సన్న్యాసులు సర్వము త్యజింతురు. శ్రేష్ఠ విద్వాంసులు సంతతి మున్నగువానినిగూడ కోరరు. ఈ లోకము, ఆత్మ మన దైనపుడు ఈ సంతానముతో మన మేమి చేయుదుము ? ఈ కారణము చేతనే ఆత్మజిజ్ఞాసువులు పుత్రులు, ధనము, యశస్సు అన్నిటిని బొత్తిగా వదలి జీవనయాత్రకొఱకు భిక్షాచర్య మొనర్తురు.' కర్మానుష్ఠానము గృహస్థాద్యాశ్రమములందు చేయబడును. ఆత్మజిజ్ఞాసువులు కర్మలను త్యజించుట పై వాక్యమునందు సుస్పష్టము. మరి యొకటి

"ఏతావ దరే ఖల్వమృతత్వ మితి హోక్త్వా
యాజ్ఞవల్క్యో విజహార" బృ. ౪-౫-౧౫.

యాజ్ఞవల్క్యుడు సంన్యసించుచు తన ప్రియభార్యయైన మైత్రేయికి బ్రహ్మజ్ఞానము అమృతత్వమునకు సాధనమని చెప్పి 'ఇంతే అమృతత్వ'మని సర్వమును త్యజించెను. ఇట్లు కర్మానుష్ఠానమునకు, కర్మ త్యాగమునకు శాస్త్రనిర్దేశములు తుల్యముగా నుండుటచేత జ్ఞానము కర్మాంగ మనుట ప్రామాణికము కాదు. శాస్త్రము కర్మానుష్ఠానమును నిర్దేశించుట చిత్తశుద్ధికని యెంచవలెనని భావము. (౯)

'తచ్ఛ్రుతేః' అను హేతువిషయమున :

### అసార్వత్రికీ   ౩-౪-౧౦

'యదేవ విద్యయా....' ఛాం. ౧-౧-౧౦. అను నీ వాక్యము సర్వ విద్యావిషయకము కాదని సూత్రార్థము.

ఛాందోగ్య-ఉపనిషత్ ప్రసంగము ననుసరించి 'యదేవ విద్యయా' అను కథనము ప్రకరణగత ఉద్గీథ - ఉపసనావిద్యకు సంబంధించినదే కాని సర్వోపాసనలకు చెందినది కాదని నిశ్చితముగ తెలియుచున్నది. కావున 'త చ్ఛ్రుతేః' అను హేతువు జ్ఞానము కర్మ కంగ మని సాధింప జాలదు. (౧౦)

ఇక్లే 'సమన్వారంభణ' హేతువునకు సమాధానము :

### విభాగః శతవత్   ౩-౪-౧౧

శతవత్=శతమువలె, విభాగః = విద్యావిభాగము నెరుంగవలెనని యర్థము.

భిన్న స్థానములం దుపయోగించుటకు నాణెములు విభజింపబడునట్లు విద్యావిభాజనము నెరుంగవలెను. పర - అపర భేదముతో విద్య రెండు విధముల విభజింపబడినది. 'తం విద్యా కర్మణీ సమన్వారభేతే' (బృ. ౪-౪-౨.) అను నీ వాక్యమునందలి విద్యాపదము అపరవిద్యాబోధకము. పరవిద్యాబోధకము కాదు. కారణ మేమన : ఈప్రకరణము కామించు వానికి సంబంధించినది. అందువలననే 'ఇతి ను కామయమానః' (బృ.౪-౪-౬.)అని తదుపరి చెప్పబడినది. తరువాత కామింపని వానినిగూర్చి "అ థాకామయమానః" బృ. ౪-౪-౬ అని ప్రకరణ మారంభింప బడినది. ఇట్లు బ్రహ్మజిజ్ఞాసువుప్రకరణము వేరుచేయబడినది. పరావిద్యవలన బ్రహ్మ జ్ఞానము సిద్ధించును. అది కామనకు క్షేత్రముకాదు. కామనకు చెందిన ప్రకరణ మున చెప్పిన కథనము పరావిద్యాంతర్గతము కాదు. "తం విద్యాకర్మణీ సమ

న్వారభేతే" బృ. ४-४-౨. అను నిది అపరావిద్యకు చెందినప్రసంగము. ఇట విద్య, కర్మ అను వీని విభాగము శతముద్రాసంబంధి విభాగమువలె తెలియనగును. ఒకనినుండి భూమిని, మరియొకనినుండి ఎద్దులను కొని వారి కిరువురికి వందరూప్యముల నిమ్మనిన ఏబదిరూప్యములు భూమి నిచ్చిన వానికి, మిగిలిన ఏబది ఎద్దునిచ్చినవానికి విభజించి యియ్యబడును. అట్లే పరలోకయాత్రికునకు విద్య, కర్మలు సహాయకములగును. లేక అనుగమించును. అనినపుడు విద్యావంతునకు విద్యయు, కర్మఠునకు కర్మయు సహాయకము లగునని యెంచవలెను. ఇట్లు విభజించినపుడు, విద్య, కర్మలు పరలోకయాత్రకు సహాయకము లగుననుటవలన విద్య కర్మ కంగమని యెన్నడును సిద్ధముకాదు. (౧౧)

'తద్వతో విధాన' మనెడి హేతువునకు సమాధానము :

అధ్యయనమాత్రవతః ३-४-౧౨

కేవలము వేదాధ్యయనము చేయువానికి కర్మానుష్ఠానవిధానము చెప్పబడినది కాని బ్రహ్మజ్ఞానికి కాదని సూత్రార్థము.

"ఆచార్యకులాద్ వేద మధీత్య" ఛాం. ८-౧౫-౧. అను నీవాక్యము బ్రహ్మజ్ఞానికి స్వాధ్యాయాది కర్మానుష్ఠానము విధించు పక్షమున జ్ఞానము కర్మకు అంగమనవచ్చును. కాని యీ వాక్యము బ్రహ్మజ్ఞానికి కర్మానుష్ఠానమని విధింపకపోగా వేదార్థజ్ఞాతకు కర్మానుష్ఠానము విధించుచుండుట కానవగును. 'వేద మధీత్య' అనుటచే వేదము నధ్యయనము చేసి అని యర్థము. అధ్యయనపదమున కర్థము ఆచార్యునివలన వేదపదముల కర్థము నెరుగుట యగును. అట్టివానికి కర్మానుష్ఠానము ఇష్టమే. బ్రహ్మజ్ఞానికి కాదు. కావున జ్ఞానము కర్మ కంగము కానేరదు. (౧౨)

క్రమప్రాప్తనియమహేతువునకు సమాధానము :

## నావిశేషాత్ 3-౪-౧3

అవిశేషాత్=విశేషించి చెప్పనందున, న=బ్రహ్మజ్ఞానమునకు కర్మ శేషత్వము - అంగత్వము సిద్ధింపదు.

'కుర్వ న్నేవేహ కర్మాణి' (యజు. ౪౦-౨) అను నీ వాక్యసందర్భమున విశేషకథనము లేదు. ఆయుపర్యంతము కర్మలు చేయవలసినవాడు జ్ఞానియా? అజ్ఞానియా? ఇం దెవరు చేయవలయునో విశేషించి చెప్పబడ లేదు. కావున నిది సామాన్యవచనము. బ్రహ్మజ్ఞానసంప త్తికొఱకు నిష్కామకర్మానుష్ఠానము చేయబడును. అయ్యది బ్రహ్మజ్ఞాని కానివాని కపేక్షితము. అట్టివాడే ఆయుపర్యంతము కర్మల నాచరింపవలెను. జ్ఞానియైనవాడు కర్మచేయకుండుటకు, చేయుటకును స్వతంత్రుడు. అజ్ఞానికి కర్మానుష్ఠానము నియతమగును. కావున నిట్టినియమమువలన జ్ఞానము కర్మకు అంగ మెన్నడును సిద్ధింపనేరదని సూత్రాభిప్రాయము. (౧3)

మరియొక సమాధానము :

## స్తుతయేఽనుమతి ర్వా 3-౪-౧౪

వా=లేక, స్తుతయే=కర్మను స్తుతించుటకొఱకు, అనుమతిః=ఆయుపర్యంతకర్మానుష్ఠానవిధానము, అనుమతింపవచ్చును - అనుమతియగును.

జ్ఞానమునకు ఫలము మోక్షమనుట నిశ్చితము. అట్టిజ్ఞానమును కలిగించుటకు కర్మలు మిక్కిలి సహాయకములు. కావున నవి స్తుతియోగ్యములు. కావున నట్టికర్మలను త్యజించుట జ్ఞాని కుచితము కాదు. శిష్టాచారమును పాలించుటకో, లోకసంగ్రహార్థమో జ్ఞానికూడ జీవనపర్యంతము కర్మల ననుష్ఠింపవచ్చును: అని యనుమతించుటకు 'కుర్వ న్నేవేహాది' శాస్త్రవచనము లనవచ్చును. కావున నియ్యది కర్మను స్తుతించుటకే కాని జ్ఞానము కర్మాంగ మనుటకు కాదు.

లేక, 'ఈశావాస్య మిదమ్' అను ప్రకరణము బ్రహ్మజ్ఞానమునకు సంబంధించిన దనవచ్చును. అప్పుడు జ్ఞానితో కర్మానుష్ఠానమునకు సంబంధ మేర్పడును. అట్టియెడ జ్ఞానస్తుతికొఱకు కర్మానుష్ఠానానుమతి యని యెంచవలెను. జ్ఞానమున కెంతో మాహాత్మ్య మున్నది. జ్ఞాని కర్మలు చేయుచుకూడ వానిచేత అభిభూతుడు కాడు. అవి వానిని లోబరచుకొనజాలవు. ఈ విషయమునే 'న కర్మ లిప్యతే నరే' అను వాక్యశేషము 'జ్ఞాని యందు కర్మ లిప్తము కాదు' అని చెప్పుచున్నది. ఇట్లు కర్మానుష్ఠానకథనము జ్ఞానమును ప్రశంసించుటకని చెప్పనగును. (౧౪)

## కామకారేణ చైకే ౩-౪-౧౫

చ=మరియు, ఏకే=కొందఱు, కామకారేణ=జ్ఞానులు కోరి అగ్నిహోత్రాదులు చేయవచ్చు ననుచున్నారు, లేక విడువవచ్చు ననుచున్నారు.

కౌషీతకి, వాజసనేయశాఖలకు సంబంధించినవారు 'జ్ఞానియైనవాడు తనయిచ్ఛవచ్చినట్లు కర్మలు పరిత్యజింపవచ్చును' అనుచున్నారు.

"అథ యా అన్యా ఆహుతయోఽంతవత్య స్తాః కర్మమయ్యో భవంతి. ఏతద్ధ వై పూర్వే విద్వాంసోఽగ్నిహోత్రం న జుహవాంచక్రుః" (కౌషీ.౨-౫.) 'అంతముగలిగినయితరాహుతులుకర్మమయము లగుచున్నవి. అందువలన పూర్వవిద్వాంసులు అట్టి యాహుతులతో హోమము చేయరు.' "ఏతద్ధ స్మ వై తత్ పూర్వే విద్వాంసః ప్రజాం న కామయంతే కిం ప్రజయా కరిష్యామో యేషాం నోఽయ మాత్మాఽయం లోక ఇతి తే హ స్మ పుత్రైషణాయాశ్చ విత్తైషణాయాశ్చ లోకైషణాయాశ్చ వ్యుత్థాయాథ భిక్షాచర్యం చరంతి" బృ. ఉ. ౪-౪-౨౨. 'ఉత్తమజ్ఞానులు సంతతిని కోరరు. కర్మబహుత్వముతో గూడిన గృహస్థాద్యాశ్రమములందును ప్రవేశింపగోరరు. సంతతివలన తమ కేమి ప్రయోజనమని వారందురు. ధనము, సంతతి, ప్రతిష్ఠలతోగూడ వారికి ప్రయోజనము లేదు. వారికి పరబ్రహ్మమే

యంతయు. అందువలన వా రన్నియు విడిచి భిక్షాచర్యతోనే తమజీవిత మంతము చేయుదురు. ఇట్టి ప్రసంగములనుబట్టి జ్ఞానులు కర్మలను కోరి త్యజింతురని స్పష్టమగుచున్నందువలన జ్ఞానము కర్మాంగము కాదని శాస్త్ర మంగీకరించుచున్నది. (౧౫)

ఇందులకు మరియొక హేతువు :

## ఉపమర్దం చ 3-4-౧౬

కొన్నిశాఖలకు చెందినవారు జ్ఞానమువలన కర్మలఉపమర్దము - నాశము కలుగునని యెంచుచున్నారు. కావున జ్ఞానము కర్మకంగము కాదు. 'ఏకే' అనుపద మీసూత్రమున పూర్వసూత్రమునుండి గ్రహింపబడును.

"క్షీయంతే చాస్య కర్మాణి తస్మిన్ దృష్టే పరావరే" (ముం. ౨-౨-౮). 'ఆ పరావరపరబ్రహ్మసాక్షాత్కారము కలిగినమీదట అతని కర్మలు క్షీణించును.' అత డొనర్చినకర్మలు ఫలోత్పాదకశక్తిని కోలుపోవు నని భావము. దీనింబట్టి జ్ఞానము కర్మకు అంగమగునెడల జ్ఞానమువలన కర్మలు నశించుననుటయే పొసగదు. కావున జ్ఞానము కర్మ కంగము కాదు. (౧౬)

మరియొక హేతువు :

## ఊర్ధ్వరేతస్సు చ శబ్దే హి 3-4-౧౭

ఊర్ధ్వరేతస్సులయందు కర్మానుష్ఠాన ముండనందువలనను, జ్ఞానము కర్మకంగము కాదు. శాస్త్రమునందును ఊర్ధ్వరేతస్సు లున్నట్లు నిర్దేశము కలదు.

నైష్ఠికబ్రహ్మచర్యవ్రతము పాలించుచు బ్రహ్మజ్ఞానముకొఱకు ప్రయత్నశీలురయిన త్యాగులు ఊర్ధ్వరేతస్సు లనబడుదురు. మొదట నైష్ఠిక

బ్రహ్మచర్యము, ఆపైన సంన్యాసము అను రెండాశ్రమములతోనే యిట్టి వారికి సంబంధ ముండును. ఈ యూర్ధ్వరేతస్కుల యాశ్రమములందు బ్రహ్మజ్ఞానమున నిష్ఠ శాస్త్రవిహితము. వారు అగ్నిహోత్రాదికర్మల నాచరింపవలె నను నియతవిధానము కానము. "యే చేమేఽరణ్యే శ్రద్ధాతప ఇత్యుపాసతే" (ఛాం. ౫-౧౦-౧). 'అరణ్యమున శ్రద్ధతో తపమొనర్చుచు నుపాసింతురు'. "తపఃశ్రద్ధే యేహ్యుపవసం త్యరణ్యే శాంతా విద్వాంసో భైక్షచర్యాం చరంతః" (ముం. ౧-౨-౧౧.) "శాంతులు బ్రహ్మజిజ్ఞాసువులు భిక్షాచరణ మొనర్తురు. శ్రద్ధతో తపమొనర్చుచు నుపాసింతురు." "ఏతమేవ ప్రవ్రాజినో లోక మిచ్ఛంతః ప్రవ్రజన్తి" (బృ. ४-४-౨౨.) 'బ్రహ్మప్రాప్తిని గోరి విరక్తులైనవారు సంన్యాసు లగుదురు.' "త్రయో ధర్మస్కంధాః యజ్ఞో అధ్యయనం దాన మితి ప్రథమః" ౧. "తప ఏవ ద్వితీయః, బ్రహ్మచార్యాచార్యకులవాసీ తృతీయో ఽత్యంత మాత్మాన మాచార్యకులే ఽవసాదయన్. సర్వ ఏతే పుణ్యలోకా భవంతి. బ్రహ్మసంస్థో ఽమృతత్వ మేతి" (ఛాం. ౨-౨౩-౧,౨). 'ధర్మస్కంధములు మూడు. వాని నాచరించువారు పుణ్యఫలములగు సుఖములను బొందుదురు. అట్టివారు మోక్షము - అమృతత్వమును బొందుదురు. అదియే బ్రహ్మసంస్థ. యజ్ఞదానాధ్యయనములు మొదటిసంస్థ. తపస్సు రెండవది. గురుకుల వాసము బ్రహ్మచర్యము మూడవది.'

ఇట్లు బ్రహ్మచర్యాదితపస్సు శ్రద్ధాపూర్వకముగ నొనర్చి బ్రహ్మజ్ఞానము కలిగినవారు మోక్షమున కర్హు లగుదురు. ఇట్టి యూర్ధ్వరేతస్కులకు శాస్త్రములందు జ్ఞాననిష్ఠ విధింపబడియుండుట పైవాక్యములవలన తెలియుచున్నది. కావున మోక్షప్రాప్తికి జ్ఞానము స్వతంత్రకారణ మనుట సుస్పష్టము. జ్ఞానము కర్మ కంగము ఎన్నడును కాదని వివరముగా నిందు తెలుపబడినది. (౧౭)

## ద్వితీయాధికరణము

పైసూత్రవ్యాఖ్యానమున ఊర్ధ్వరేతస్కులకు జెప్పబడిన సంన్యాసాశ్రమమును జైమిని అంగీకరింపడుకదా। ఈ విషయమున నిర్ణయ మొనర్చుటకు ముందు జైమిని అభిప్రాయమును తెలుపుచున్నాడు.

### పరామర్శం జైమిని రచోదనా చాపవదతి హి ౩-౪-౧౮

('శబ్దే' అను పదము పూర్వసూత్రమునుండి అనువృత్తమగును.)

జైమినిః=జైమిని, శబ్దే=పూర్వసూత్రమున నిర్దిష్టమైన ఛాందోగ్య వాక్యమునందు, పరామర్శం=అనువాదమును అంగీకరించుచున్నాడు. హి= ఎందువలన అనగా, అచోదనా=విధిలేదు. అపవదతిచ = నిందించుచున్నది కూడ.

జైమినిఆచార్యునిదృష్టిలో ఆశ్రమము గృహస్థముమాత్రమే. అందే, కర్మానుష్ఠానమునకు విధాన మున్నది. పూర్వసూత్రమున నిర్దేశింపబడిన 'యే చే మే ఽరణ్యే' మున్నగు వాక్యములందు కర్మత్యాగదృష్టితో నే యాశ్రమములు నిర్దేశింపబడినవో యవి యనువాదమాత్రములుగా జైమిని అంగీకరించుచున్నాడు. అన్యనిమిత్తముతో నా యాశ్రమములు చెప్పబడిన వియే. కాని, ఆ వాక్యములు ఆశ్రమవిధాయకములు కావు. శాస్త్రవిహిత ములు కావు. కాబట్టి వానిని అంగీకరింపబనిలేదు.

మరియు శాస్త్రములు కర్మత్యాగమును నిందించుచున్నవి. "వీరహా వా ఏష దేవానాం యో ఽగ్ని ముద్వాసతే" తై. సం. ౧-౫-౨-౧. 'దేవ సంబంధమగు నగ్నిని త్యజించువాడు వీరఘాతకుడగును.' ఇందు అగ్ని హోత్రాది కర్మలను విడుచువానిగూర్చి నింద ప్రకటమగుచున్నది. ఇట్లే శాస్త్రము గృహస్థాశ్రమమును ప్రశంసాపూర్వకముగ నిర్దేశించుట చూడ నగును. "ఆచార్యాయ ప్రియం ధన మాహృత్య ప్రజాతంతుం మా వ్యవ

చ్ఛేత్సీః" తై. ఉ. ౧-౧౧. 'స్నాతకుడైన శిష్యుని ఆచార్యు డాదేశించు చున్నాడు. 'ఆచార్యునకు ప్రియధనమును దెచ్చియిచ్చి సంతతిక్రమము నుచ్ఛేదింపకుము.'-'స్నాతకుడవై గృహస్థాశ్రమమును గ్రహించి సంతాన వంతుడవు కమ్ము' అని యభిప్రాయము. సంతానహీనవ్యక్తి లోకమున సుఖపడడు. "నాపుత్రస్య లోకోఽస్తి" (ఐ. బ్రా. ౭-౧౩-౧౨) ఈ శాస్త్ర వచనములు గృహాశ్రమత్యాగమును నిషేధించుచున్నవి. కర్మత్యాగము నొనర్చు ఆశ్రమములను శాస్త్ర మంగీకరింపనపుడు ఆయువునం దేదో యొక భాగమున సంపాదింపబడు జ్ఞానము కర్మ కేల యంగము కాదు? అని జైమిని అభిప్రాయము. (౧౮)

సూత్రకారుడు తననామనిర్దేశపూర్వకముగ పైవిషయమున తన సిద్ధాంతమును దెలుపుచున్నాడు.

### అనుష్ఠేయం బాదరాయణః సామ్యశ్రుతేః ౩-౪-౧౯

సామ్యశ్రుతేః=ఆశ్రమత్రయసామ్యమును బోధించు శ్రుతి యున్నం దున, అనుష్ఠేయమ్=పారివ్రజ్యాశ్రమము అనుష్ఠింపదగినదే యని, బాద రాయణః=బాదరాయణాచార్యునిమతము.

పూర్వనిర్దిష్టఛాందోగ్యవాక్యమునందు "త్రయో ధర్మస్కంధాః......... బ్రహ్మసంస్థోఽమృతత్వ మేతి" ఛాం. ౨-౨౩-౧. ఆశ్రమముల నన్నిం టిని సమానరూపమున వర్ణించుట చూడనగును. 'ధర్మమునకు మూడు ఆధారములు. యజ్ఞము, అధ్యయనము, దానము నను నివి యన్నియు ధర్మమునకు ఆధారము. మొదటిస్కంధము. ఇదియే గృహస్థాశ్రమము. తపస్సు ప్రధానముగా గల ద్వితీయస్కంధము వానప్రస్థము. ఆచార్యకుల మున బ్రహ్మచర్యమును పాలించుచు నివసించు బ్రహ్మచారి మూడవ స్కంధము. బ్రహ్మచర్యాశ్రమము. ఈ మూడు ఆశ్రమములందును కర్మా నుష్ఠానము సమానము. అందువలననే యీ మూటిని వర్ణించి సమానముగ

ఫలనిర్దేశముకూడ చేయబడినది. "సర్వ ఏతే పుణ్యలోకా భవంతి" శాస్త్ర విధి ననుసరించి యీ యాశ్రమధర్మములను పాలించిన పుణ్యలోకప్రాప్తి కలుగును. అటుపైన చతుర్థాశ్రమము సంన్యాసము నిర్దేశింపబడినది. "బ్రహ్మసంస్థో అమృతత్వ మేతి" కామ్యకర్మలను పరిత్యజించి నిరంతర శ్రద్ధాసమన్వితమగు నుపాసనవలన బ్రహ్మసాక్షాత్కారము చేసికొనువాడు బ్రహ్మసంస్థ యనబడును. దీనివలన కర్మత్యాగ పూర్వకము, జ్ఞానప్రధానమునగు సంన్యాసాశ్రమము నిర్దేశింపబడినది.

ఛాందోగ్యములోని యీ ప్రసంగమున ఆశ్రమము లన్నియు సమానముగ నిర్దేశింపబడినవి. ఒకటి చెప్పి మరియొండు చెప్పకుండుట గానము. కాబట్టి కర్మప్రధానమగు నాశ్రమమే వేదవిహిత మనుట సంగతము కాదు. మరియు జాబాలోపనిషత్తునందు విధివాక్యముతోనే సంన్యాసాశ్రమము నిర్దేశింపబడుట చూతుము.

"బ్రహ్మచర్యం సమాప్య గృహీ భవేత్:
గృహీ భూత్వా వనీ భవేత్: వనీ భూత్వా ప్రవ్రజేత్,
యది వేతరథా బ్రహ్మచర్యాదేవ ప్రవ్రజేత్........
యదహరేవ విరజేత్ తదహరేవ ప్రవ్రజేత్"

'బ్రహ్మచర్యమును పూర్తిచేసి గృహస్థుడు కావలెను. గృహస్థుడై వానప్రస్థుడు, తదుపరి సంన్యాసి కావలెను. లేక బ్రహ్మచర్యము నుండియే సంన్యసింపవలెను. ఎప్పుడు విరక్తి కలిగిన అప్పుడే సంన్యసింపవలెను" ఇక్కడ అన్య, ఆశ్రమములతో బాటు సంన్యాసాశ్రమమునకు కూడ విధి స్పష్టముగా నున్నది.

కావున గృహస్థాద్యాశ్రమములవలె సంన్యాసాశ్రమముకూడ వేద శాస్త్రవిహితముగా నెంచి, అనుష్ఠింపదగినదే యని బాదరాయణుని సిద్ధాంతము. (౧౯)

'ప్రవ్రజంతి' అను పదము ప్రకారాంతరమువలన విధిరూపమే యని సూత్రకారుడు వివరించుచున్నాడు.

## విధిర్ వా ధారణవత్ ౩-౪-౨౦

వా = లేక, ధారణవత్ = ధారణవిధివలె, విధిః = 'ప్రవ్రజంతి' కూడ విధియే యగును.

తైత్తిరీయసంహితయందు మహాపితృ - యజ్ఞాంతర్గతమగు ప్రేతాగ్నిహోత్రప్రసంగ మొందు కలదు. అట, "అధస్తాత్ సమిధం ధారయన్ననుద్రవేత్. ఉపరి హి దేవేభ్యో ధారయతి" "దేవతలకొఱకు స్రుగ్దండమునకు పైభాగమున సమిధను (పట్టుకొని) ధరింపవలెను. కాబట్టి స్రుగ్దండమునకు క్రిందిభాగమున సమిధను ధరించుచు వెళ్ళవలెను." ఇక్కడ దైవహోమమందు స్రుగ్దండమునకు పైన సమిధ ధరింపవలెను, అనుటకు 'ధారయతి' అని విధివాక్యముగా ప్రయోగింపబడినది. ఇట్లే "ఏత మేవ ప్రవ్రాజినో లోక మిచ్ఛంతః ప్రవ్రజంతి" అని 'ప్రవ్రజంతి' పదము విధిగా ప్రయోగింపబడిన ట్లెంచవలెనని సూత్రకారుని అభిప్రాయము. 'ధారయతి' అనుస్థలమున ధారణ విధి యనుటకు కారణము అది అపూర్వము. అనగా నీధారణ అన్యవిధిమూలమున ప్రాప్తము కాదు. అందువలననే మీమాంసయందు "విధిస్తు ధారణేఽపూర్వత్వాత్" ౩-౪-౧౫. అపూర్వమైనందున - అన్యవిధివాక్యముద్వారా ప్రాప్తము కానందున నిట ధారణ విధియనియే యెంచవలెనని సూత్రార్థము. ఈ న్యాయమే 'ప్రవ్రజంతి' అను తావునగూడ వర్తించును. కావున సంన్యాసాశ్రమము శాస్త్రవిహితమే. (౨౦)

'ప్రవ్రజంతి' అనునిది సంన్యాసవిధి యనుటకంటె బ్రహ్మలోకప్రశంసాపరక మని యేల చెప్పరా దన :

స్తుతిమాత్ర ముపాదానా దితి చే న్నా
పూర్వత్వాత్ ౩-౪-౨౧

('విధి, ధారణవత్' రెండు పదము లిందనువర్తించును.)

ఉపాదానాత్ = 'లోక మిచ్ఛంతః' అని గ్రహించుటవలన, స్తుతి మాత్రం = 'ప్రవ్రజంతి' అను పదము బ్రహ్మలోకమును ప్రశంసించుటకు మాత్రమే యగును. ఇతిచేత్ = అని యందురేని, న = అది సరికాదు- కారణమేమన, అపూర్వత్వాత్ = ప్రమాణాంతరముచే విధి ప్రాప్తము కానందున ధారణివలె 'ప్రవ్రజంతి' అనునదియు విధియే యగును.

బృహదారణ్యకమున ప్రయుక్త "ప్రవ్రజన్తి" (౪-౪-౨౨) అను పదము సంన్యాసమును విధింపదు. బ్రహ్మలోకమునుమాత్రము స్తుతించును. "లోక మిచ్ఛంతః" బ్రహ్మలోకమును గోరువారు అనుపద మట గ్రహింపబడినది. దానింబట్టి బ్రహ్మలోకము నభిలషించువారు అన్నింటిని త్యజింతురు, అనుటవలన బ్రహ్మలోకప్రశస్తి ప్రధానముగ బోధపడును. లోకమాహాత్మ్యము త్యాగమునకు కారణ మగుచున్నది. కావున నిందు సంన్యాసము గౌణము, బ్రహ్మలోకప్రశస్తి ముఖ్య మనుట స్పష్టము. అందువలన 'ప్రవ్రజన్తి' విధివాచకము కాదని శంకాభిప్రాయము.

సూత్రకారు డట్లనుట సరికా దనుచున్నాడు. విధికి ప్రయోజక హేతువు అపూర్వము - అనగా సంన్యాసమును విధించు మరియొకవాక్యము లేకుండుటయే. ఈహేతువుతోనే మీమాంసయందు 'ధారయతి' అను తావున ధారణము విధియని నిర్ణయింపబడినది. అట్లే సంన్యాసవిధి యన్య వాక్యముచే ప్రాప్తముకానందున - అపూర్వమగుటవలన-'ప్రవ్రజంతి' విధాయక పద మనుటయే ప్రామాణికము. అందువలన స్తుతిమాత్రపరము కాదు. (౨౧)

సూత్రకారుడు తననిర్ణయమును బలపరుచుటకు మరియొకహేతువు నిచ్చుచున్నాడు.

## భావశబ్దాచ్చ 3-౪-౨౨

భావశబ్దాత్=భావము క్రియ - ప్రవ్రజ్య - క్రియను చెప్పుశబ్దమగుట వలనను 'ప్రవ్రజంతి' విధివాచకమే యగును. స్తుతివాచకము కాదు.

బృహదారణ్యకమున (౪-౫-౧) యాజ్ఞవల్క్యుని సంన్యాసప్రకరణమును ప్రారంభించి యంతమున "ఏతావ దరే ఖల్వమృతత్వ మితి హోక్త్వా యాజ్ఞవల్క్యః ప్రవవ్రాజ" బృ. ౪-౫-౨౫.

'అరే మైత్రేయీ ! ఇంతే అమృతత్వప్రాప్తికి మార్గమని చెప్పి యాజ్ఞవల్క్యుడు సంన్యసించెను' 'ప్రవ్రజంతి'బృ. ౪-౪-౨౨ అను తావున ప్రవ్రజ్యావిధిగ్రహింపబడని పక్షమున నిట యాజ్ఞవల్క్యుని సంన్యాసగ్రహణము' 'ప్రవవ్రాజ' అను పదముచే నిర్దేశింపబడెడిది కాదు. కావున 'ప్రవవ్రాజ' పదము 'ప్రవ్రజన్తి' పదమునందలి విధిని స్పష్టముచేయుచున్నది. అందువలన నది విధివాచకమే.' (౨౨)

యాజ్ఞవల్క్యుని కథ మనోరంజకము. దానింబట్టి శాస్త్రార్థము నిర్ణయించుట తగదని శంకించి సమాధానము చెప్పుచున్నాడు.

## పారిప్లవార్థా ఇతిచేన్న విశేషితత్వాత్ 3-౪-౨౩

పారిప్లవార్థాః = ఆఖ్యాయికలు పారిప్లవార్థములు. ఇతిచేత్ = అనిన చో, న = కాదు. విశేషితత్వాత్ = విశేషించి ప్రతిపాదించినందువలన.

అశ్వమేధమువంటి దీర్ఘకాలిక యాగములందు యజమానునికి తగిన సమయమున వినిపింపజేయు ఆఖ్యాయికలు పారిప్లవము లనబడును. ఆశ్వలాయన శ్రౌతసూత్రమునందు "పారిప్లవ మాచక్షీత" (౧౦-౬-౧౦) 'పారిప్లవమును చెప్పవలెను' అను విధి యొందు కలదు. యజ్ఞసమయ

మున నిట్టి కథలు మనోరంజనముకొఱకు చెప్పబడుసు. ఆ కథలకు స్వరూప ప్రామాణ్య ముండదు. 'మైత్రేయీ, యాజ్ఞవల్క్య' (బృ. ౪-౫-౧.) 'ప్రతర్దన, దైవోదాసి' (కౌషీ. ౩-౧.), 'భృగు, వరుణ' (తై. ౩-౧ ), 'శ్వేతకేతు, వరుణ' (ఛాం. ౬. ౧-౧) కథలు కూడ మనోరంజ నార్థము చెప్పబడవచ్చును. విషయము ఇంపుగా తెలియనగును. ఇందలి ఘటనలు తమరూపమునందు వాస్తవికత నంతగా కలిగియుండవు. కావున యాజ్ఞవల్క్యని సంన్యాసగ్రహణము విధిపూర్వక మనుట సిద్ధము కాదని శంకాభిప్రాయము.

అందులకు సూత్రకారు దది సరికాదని సమాధానము చెప్పు చున్నాడు. కారణ మేమన: పారిప్లవమున చెప్పబడుకథలు ఏవో ఇష్టము వచ్చినట్లు కల్పించి కాని, ఎటనుండియో గ్రహించికాని చెప్పవలను పడదు. ఆ యాఖ్యాయికలు విశిష్టరూపమున నిర్దేశింపబడియున్నవి.

శతపథబ్రాహ్మణములోని అశ్వమేధ ప్రకరణము (౧౩-౪. ౩-౧-౧౫)న పారిప్లవాఖ్యాయికలు నిర్దేశింపబడినవి. అశ్వమేధయాగము సంవత్సరకాలము పట్టును. ముప్పదియారు దశాహములలో నిది పూర్ణ మగును. ఈ దశాహములందు దినమున కొక్కటిచొప్పున నొక విశిష్ట-ఆఖ్యాయిక చెప్పవలెనని బ్రాహ్మణమున నుల్లేఖింపబడినది. వానిలో మొదటిదినమున చెప్పవలసిన కథ "మనుర్ వైవస్వతో రాజా ఇత్యాహ" (శత. ౧౩-౪-౩-౩) అని యున్నది. ఇట్లు పదిదినములకు పది విశిష్ట కథలు నిర్దేశింపబడినవి. ఈక్రమము ముప్పదియారు దశాహములు నడు చును. ప్రతిదశాహమునందును మొదటిదశాహమున చెప్పబడిన ఆఖ్యాయి కలు అదేక్రమమున చెప్పబడును. అందువలననే యివి పారిప్లవము లన బడును. పారిప్లవపదమున కర్థము ప్రవాహము (శత. ౧౩-౪-౩-౧౫) ఇట్లు పారిప్లవకథలు విశేషరూపమున నిర్దేశింపబడుటవలన యాజ్ఞవల్క్య

నను యజమానుని మనోరంజనార్థము కావచ్చును. కాని యివి యట్టివి కావు. వీనిప్రయోజనము బ్రహ్మవిద్యాప్రతిపాదనము. వీనివలన జిజ్ఞాసువు కఠినవిషయమును సరలతాపూర్వకముగ తెలిసికొనగలడు. అందువలననే మహర్షులజీవనఘటనలను గ్రహించి వానినాధారముగా తీసికొని తత్త్వబోధ కలిగింపబడినది. ఈ ఘటనలు తమరూపమున ప్రామాణికములు. యాజ్ఞవల్క్యుడు ప్రవ్రజించెను. ఈ నిర్దేశము పైనవివరించిన దానింబట్టి 'ప్రవ్రజంతి' పదమునందలి ప్రవ్రజ్యావిధానమును బలపరుచుచున్నది. సంన్యాసాశ్రమమున కామ్యకర్మానుష్ఠాన ముండకున్నను, జ్ఞానప్రాప్తి యుండును. కావున జ్ఞానము కర్మాంగము కాదు. (౨౩)

మైత్రేయీకథలు పారిప్లవములో చేరవు. ఇవి వానికి భిన్నములు. వారిట్ల

ఉపర్యుక్త నిర్ణయఫల మేమన :

**తథా చైకవాక్యతోపబంధాత్ ౩-౪-౨౪**

తథాచ = జ్ఞానము కర్మాంగము కాదని సిద్ధించినందున ఏకవాక్యతోపబంధాత్ = మోక్షప్రాప్తిసాధనవిషయకములగు వాక్యములలో నేకవాక్యతాలక్షణసంబంధమువలన జ్ఞానము మోక్షమునకు ప్రధానస్వతంత్రసాధనమని సిద్ధమగును.

ఉపనిషత్కథలు పారిప్లవములు కావు. బ్రహ్మవిద్యాబోధకములనుట యుక్తమే. "య ఇత్ త ద్విదు స్తే అమృతత్వ మానశుః" (ఋ. ౧-౧౬౪-౨౩). 'బ్రహ్మము నెరిగినవారు అమృతత్వము బొందురు.' "బ్రహ్మవి దాప్నోతి పరమ్" (తై. ఉ. ౨-౧) 'బ్రహ్మవిదుడు పరమశ్రేయస్సును బొందును' అనునిట్టి శ్రుత్యుపనిషద్వాక్యముల కన్నింటికి ఏకవాక్యతాసంబంధ మేర్పడుటవలన పరమపురుషార్థము - మోక్షమునకు జ్ఞానము స్వతంత్రప్రధానసాధనమని సిద్ధమగుచున్నది. (౨౪)

సిద్ధవిషయమునే స్ఫుటమొనర్చుచు సూత్రకారు డింకను చెప్పుచున్నాడు.

అత ఏవచాగ్నీంధనా ద్యనపేక్షా ౩-౪-౨౫

అతఏవచ = అందువలననే, అగ్నీంధనా ద్యనపేక్షా = అగ్న్యాధానము, అగ్నిహోత్రదర్శపూర్ణమాసాది కర్మలు అపేక్షితములు కావు.

మోక్షప్రాప్తియందు జ్ఞానమునకు కర్మాపేక్ష యున్నచో నది స్వతంత్రసాధనము కాజాలదు. కాబట్టి అగ్నిహోత్రాది కర్మల నపేక్షింపదు కావున బ్రహ్మజ్ఞానము మోక్షప్రాప్తికి స్వతంత్రసాధనమని సిద్ధమగుచున్నది. (౨౫)

## తృతీయాధికరణము

జ్ఞానమునకు పరమపురుషార్థసిద్ధిని కలిగించుటలో కర్మాపేక్ష యుండనట్లు స్వోత్పత్తియందును కర్మాపేక్ష యుండదా? యన :

సర్వాపేక్షా చ యజ్ఞాదిశ్రుతే రశ్వవత్ ౩-౪-౨౬

అశ్వవత్=అశ్వమువలె, యజ్ఞాదిశ్రుతేః = యజ్ఞాదులు జ్ఞానప్రతిపాదకము లను శ్రుతివలన, సర్వాపేక్షాచ=జ్ఞానమునకు స్వోత్పత్తియందు సర్వకర్మాపేక్ష యుండును. అనపేక్షములు కావు.

మోక్షప్రాప్తిని కలిగించుటలో జ్ఞానము అగ్నిహోత్రాదికర్మల నపేక్షింపకుండుట యుక్తమే. కాని యది తనయుత్పత్తికి కర్మల నపేక్షించునా? లేదా? అన : జ్ఞానము స్వోత్పత్తికి కర్మల నపేక్షించును. కర్మలను విధించు శాస్త్రములు నిరర్థకములు కావు. ప్రతిబంధకము లున్నపుడు ఇంద్రియజ్ఞానము కలుగదు. ఆటంకములు తొలగినపుడు ఇంద్రియముల వలన జ్ఞానము కలుగును. అంతఃకరణమువలన ఉపాసనాసహయోగముతో

కలుగు ఆత్మజ్ఞానము ప్రతిబంధకము లున్నంతవరకు కలుగదు. అంతః కరణమున నుండు విక్షేపాదిమాలిన్యములు ప్రతిబంధకములు. రాగద్వేష విక్షేపాదు లున్నంతవరకు ఆత్మజ్ఞానము కలుగదు. వానిని తొలగించుటకు నిష్కామకర్మానుష్ఠానమే మిక్కిలి యుపయుక్తసాధనము. శుద్ధాంతఃకరణము ఆత్మజ్ఞానము కలిగించుటకు సమర్థ మగును. కాబట్టి అగ్నిహోత్రాది నిష్కామవైదికకర్మలు అంతఃకరణమును శుద్ధమొనర్చి జ్ఞానోత్పత్తికి సహాయకము లగునని తెలియుచున్నది. ఈ విషయము "త మేతం వేదానువచనేన బ్రాహ్మణా వివిదిషంతి, యజ్ఞేన దానేన తపసాఽ నాశకేన" బృ. ౪-౪-౨౨. 'బ్రహ్మజిజ్ఞాసువులు ఈ పరమాత్మను వేదాధ్యయనము, యజ్ఞదానతపములతో తెలియగోరుచున్నారు' అను వాక్యమువలన స్పష్ట పరుపబడినది. ఇట వివిదిష బ్రహ్మజిజ్ఞాసయే. అది యజ్ఞాద్యనుష్ఠానమున కలుగును. ఇందు జ్ఞానోత్పత్తికి యజ్ఞానుష్ఠానాపేక్ష యున్నట్లు తెలియుచున్నది. ఇది శాస్త్రవిధానము. మోక్షప్రాప్తికి జ్ఞానము స్వతంత్రకారణమే. కాని స్వోత్పత్తికి కర్మానుష్ఠానము నపేక్షించుననుట నిశ్చితము. ఇందుల కశ్వము ఉదాహరణము. అశ్వము తనవలన సిద్ధించుప్రయోజనమునకు అన్యము నపేక్షింపకున్నను, తనయుత్పత్తికి మాతాపితృరజవీర్యములను శుద్ధములయినవాని నపేక్షించును. లేక, శత్రువును జంపుటకు అశ్వాపేక్ష లేకున్నను శత్రువును జంపదలచు సైనికునకు తనను శత్రుసమీపమున జేర్చుటకు అశ్వాపేక్ష యుండును. అట్లే జ్ఞానము మోక్షమును గలిగించుటకు కర్మల నపేక్షింపకున్నను తనయుత్పత్తి కాటంకములగు రాగద్వేషాదులను తొలగించుటకు కర్మల నపేక్షించునని భావము. (౨౬)

జ్ఞానోత్పత్తికి కర్మలపేక్షితము లైనట్లు ఇంకేమైన నపేక్షిత మగునా, యన :

శమదమాద్యుపేతః స్యాత్ తథాపి తు తద్విధేః
తదంగతయా తేషా మవశ్యానుష్ఠేయత్వాత్ ౩-౪-౨౭

తథాపితు=సర్వకర్మాపేక్ష యున్నప్పటికిని, శమదమాద్యుపేతః స్యాత్=శమదమాదులతో (ముముక్షువు) కూడుకొనవలెను. తద్విధేః = వానిని విధించుటవలన, తదంగతయా=జ్ఞానసాధనరూపముతో, తేషాం= శమదమాదులు, అవశ్యానుష్ఠేయత్వాత్=తప్పక యనుష్ఠేయము లగుట వలన.

అగ్నిహోత్రాదికర్మానుష్ఠానము అంతఃకరణమును శుద్ధము చేసినను జ్ఞానోత్పత్తి కవి పూర్ణసాధనములు కావు. కావున జిజ్ఞాసువు శమదమాదులతో యుక్తుడు కావలెను. ఆదిపదముచే నిట ఉపరతి, తితిక్ష, శ్రద్ధ, సమాధానము గ్రహింపనగును. ఇవి షట్కసంపత్తి యనబడును. వీనిని అలవరుచుకొనవలెను. "తస్మా దేవం విచ్ఛాంతో దాంత ఉపరత స్తితిక్షః సమాహితో భూత్వా஽త్మన్యేవాత్మానం పశ్యతి" బృ. ఉ. ౪-౪-౨౩. 'ఉపరివర్ణితషట్కసంపద గలవాడై తనలో పరమాత్మ నెరుంగును' అని చెప్పబడినది. ఇట శమదమాదులు జ్ఞానసహాయకము లనుట స్పష్టము.

అధ్యాత్మశాస్త్రములందు బ్రహ్మజ్ఞానికి సాధనచతుష్టయ మవసర మని చెప్పబడును. ఆత్మానాత్మవివేకము, వైరాగ్యము, షట్కసంపత్తి, ముముక్షత్వము అను నాలుగు సాధనచతుష్టయము. వీనితోబాటు ప్రణవ ధ్యానము నిరంతర మొనర్చుటవలన బ్రహ్మజ్ఞానము కలుగును. ఆనందానుభూతి యేర్పడును. బ్రహ్మసాక్షాత్కారమున కిదియే లింగము. ఆ స్థితిలో నుండుట జీవన్ముక్తావస్థ యనబడును. శరీరము విడిపోయిన తదుపరి ముక్తు డగును. ఇట్లు యజ్ఞానుష్ఠానమున నంతఃకరణశుద్ధి యేర్పడి శమదమాది గుణసంపత్తితో ప్రణవధ్యాన మొనర్చిన బ్రహ్మజ్ఞానము కలుగునని నిశ్చితము. (౨౭)

## చతుర్థాధికరణము

జ్ఞానమున కంతరంగసాధనములను విచారించి, ఆహారముకూడ జ్ఞానసాధనము కావున తద్విషయమును విచారించుచున్నారు.

### సర్వాన్నానుమతిశ్చ ప్రాణాత్యయే తద్దర్శనాత్ ౩-౪-౨౮

చ = మరియు, సర్వాన్నానుమతిః = ఛాందోగ్యబృహదారణ్యకము లందు భక్ష్యాభక్ష్యములయిన వాని నన్నింటిని తినుటకు గల యంగీకారము, ప్రాణాత్యయే = జీవితవినాశము సంభవించునపుడని గ్రహింపనగును. కారణ మేమన : తద్దర్శనాత్ = ప్రాణనాశము సంభవించినపుడు ఉషస్తి - చక్రునికుమారుడు - చాక్రాయణుడు, అభక్ష్యభక్షణ చేసినందువలన ఛాందోగ్యమున "నహ వా ఏవంవిది కించనానన్నం భవతి" ౫-౨-౧ 'జీవించుటకొఱకు అన్నమని యెరిగినవానికి అన్నముకాని దేదియు నుండదు - అనగా నన్నియు తినవచ్చును' అని యున్నది. ఇట్లే బృహదారణ్యకమునను (౬-౧-౧౪) కలదు. మనువుకూడ "ప్రాణస్యాన్న మిదం సర్వం ప్రజాపతి రకల్పయత్, స్థావరం జంగమం చైవ సర్వం ప్రాణస్య భోజనమ్" ౫-౨౮. జీవించుటకు సర్వము భోజ్యమని యన్నాడు. ఈ విధానము లన్నియు ఉపాసకునకు కూడ అంగీకరింప దగినవియేనా? ప్రతి-అవస్థయందు నతడన్నియు తినవచ్చునా ! అని సందేహము కలుగగా, ఆచార్యుడు ప్రాణసంకట ముపస్థితమైనపుడు - జీవనత్యాగము సంభవించినపుడు అనన్న మొందును లేదు. అన్నియు తినదగినవే. అని చెప్పుచున్నాడు. శాస్త్రలిఖితమగు కొండొకఘటననుబట్టి యానిశ్చయము చేయుచున్నాడని యెరుగునది.

ఛాందోగ్యమున (౧-౧౦-౧) నిట్లున్నది. ఒకసమయమున కురు

దేశమున మిడతలదండు పైరును తినివేసినది. చక్రునిపుత్రుడు ఉషస్తి యను నొక ఋషి ఆకలిదప్పులతో పత్నిని వెంట నిడుకొని తిరుగాడుచు ఇభ్యగ్రామమును జేరెను. అది మావటీంద్రగ్రామము. ఉషస్తి యట నొక మావటివాడు కుల్మాషములు (అలసందలు) తినుచుండుట జూచి యాకలిచే వ్యాకులుడై యతనిని కొంచెముపెట్టుమని యడిగెను. మావటివాడు తనదగ్గర యెంగిలిచేసినవి తప్ప వేరు లేవనియెను. అవియే యిమ్మనెను. మిగిలిన వాని నతడిచ్చెను. ఉషస్తి వానిని దీసికొని, పత్నికి కొన్నిపెట్టి తానును భుజించెను. ఇంకను మిగిలిన వానిని మరునాటి కుంచుకొనెను. మావటివాడు జలము కావలెనా? యని ఉషస్తి నడుగగా నతడు మావటివాని యింటిజలమును గ్రహింప నంగీకరింపడయ్యె. ఎంగిలి కుల్మాషములు తిని జలము నేల నిరాకరించుచున్నారని యడుగగా ఉషస్తి యిట్లనెను "నవా అజీవిష్య మిమా నఖాదన్ కామో మమ ఉదపానమ్" ఛాం. ౧-౧౦-౪. వీనిని తినకున్న ప్రాణములు పోవును. అందువలన తింటిని. జలము నాకు యథేష్టము లభించును".

దీనింబట్టి ప్రాణరక్షణకొఱకు దొరకిన ఆహారము నుపయోగింపవచ్చునని స్పష్ట మగుచున్నది. జలమును నిషేధించుటవలన స్వస్థస్థితిలో నిషిద్ధాహారమును గ్రహింపరాదనియు బోధపడుచున్నది. కావున ఉపాసకుడైనవాడు శుద్ధసాత్త్వికాహారమునే గ్రహింపవలయునని నిశ్చితమగుచున్నది. పైనవర్ణించిన ఉపనిషదాదుల వాక్యములు ఆహారవిషయమున సాధారణకథనములని యెంచవలెను. విశేషవిధులు కావు. ఆహారవిషయమున ఇష్టము వచ్చినట్లు భక్ష్యాభక్ష్యవిచారణ విడిచి సర్వభక్షి కమ్మని యెన్నడు శాస్త్రము లాదేశింపవు. ఈ విషయమున ఉపాసకుడు మిక్కిలి సావధానముగ వర్తింపవలెను. విషయాకర్షణ రాగాదులను పెంచి యుపాసకుని పదభ్రష్టుని చేయును. (౨౮)

ఉక్తార్థము నింకను బలపరుచుచున్నాడు.

## అబాధాచ్చ ౩-౪-౨౯

శ్రుతిబాధలేనందున ప్రాణాత్యయసమయమున నన్నియు తినవచ్చు నని సూత్రాభిప్రాయము.

జ్ఞానము నర్థించువానికి ఆహారశుద్ధి యుండవలెను. "ఆహార శుద్ధౌ సత్వశుద్ధిః, సత్వశుద్ధౌ ధ్రువా స్మృతిః" ఛాం. ౭-౨౬-౨ 'ఆహార శుద్ధివలన అంతఃకరణము శుద్ధమగును. అందువలన జ్ఞానము సిద్ధించును'. ప్రాణహాని కలుగుసమయమున నన్నియు తినవచ్చునని అంగీకార మున్నప్పుడే యీ శాస్త్రకథనము సార్థకము, అబాధితము నగును. అట్లుకాక యన్నిదశలందు నన్నియు తినవచ్చునందుమేని యాహారశుద్ధిని బోధించు వాక్యము వ్యర్థము, బాధితము నగును. ఆహారవిషయక శాస్త్రము బాధింపబడుచుండుటచే ప్రాణాత్యయసమయమున నన్నింటిని భక్షించుట కనుమతి యని గ్రహింపవలెను. (౨౯)

ఈ విషయమునే స్మృతిమూలమున ప్రమాణీకరించుచున్నాడు.

## అపి చ స్మర్యతే ౩-౪-౩౦

మరియు శాస్త్రవిధి బాధింపబడకుండుటకే కాక స్మృతియు ప్రాణాత్యయమున నిషిద్ధభోజనమున కనుమతి యిచ్చుచున్నది.

"జీవితాత్యయ మాపన్నో యోఽన్న మత్తి యత స్తతః ఆకాశ మివ పంకేన న స పాపేన లిప్యతే" (మ. ౧౦-౧౦౪.) 'ప్రాణసంకట మేర్పడినపుడు ఏది తినినను పాపలిప్తుడు కాడు. ఆకాశము పంకలిప్తము కానట్లు'. అభక్ష్యాహారగ్రహణము ప్రాణసంకటముననే కాని యితర సమయముల తగదని భావము. (౩౦)

ఉపర్యుక్త విషయమున మంత్రప్రమాణము :

**శబ్దశ్చాతోఽకామకారే** 3-4-31

శబ్దశ్చ = మంత్రవర్ణముకూడ, అతః = అందువలన అకామకారే = కామకారః - ఇచ్ఛ, ఇచ్ఛవచ్చినట్లు ప్రవర్తింపకుండుటలో ప్రమాణము.

ప్రాణసంకటసమయమున తక్క యితరసమయములందు ఎన్నడును ఉపాసకుడు కామకారియై భోజనవిషయమున ప్రవర్తింపరాదని మంత్రవర్ణములుకూడ చెప్పుచున్నవి. "సప్తమర్యాదాః కవయః తతక్షుః తాసామేకామిదభ్యంహురోఽగాత్" ఋ. ౧౦-౫-౩౩.౬. 'క్రాంతదర్శులగు ఋషులు సప్తమర్యాదలను స్థాపించిరి. (చౌర్యము, పరస్త్రీగమనము (గురుతల్పారోహణము), బ్రహ్మహత్య, భ్రూణహత్య, సురాపానము, పాపాచరణము, పాతకమునుదాచుట కనృతమాడుట; ఇవి సప్తమర్యాదలు) వీనిలో నొక్కదాని నాచరించినను పాపి (అంహురః) యగును'. అన్నపానములలో నిచ్ఛవచ్చినట్లు ప్రవర్తించువాడు సురాపానాదులలో ప్రవృత్తుడగుట సహజము. ఉపర్యుక్తమర్యాదల నుల్లంఘించి పాపియగును. ఈ దురాచారములు ఛాందోగ్యమునను, మనుస్మృతియందును ఉల్లేఖింపబడినవి. అట్టిదురాచారులతో సాంగత్యముకూడ పాపమే. కావున ఉపాసకుడు ఆహారవిహారములందు కామచారి కారాదు. "యక్షరక్షఃపిశాచాన్నం మద్యం మాంసం సురాసవం తద్బ్రాహ్మణేన నాత్తవ్యం దేవానామశ్నతా హవిః" మను. ౧౧-౯౫. 'దివ్యాహారమును తిను బ్రాహ్మణుడు శిష్టుడగు యక్షరక్షఃపిశాచులు తిను అన్నము తినరాదు. మద్యమాంసములను సేవనము చేయరాదు' అని యిట్లు చెప్పుటవలన బ్రహ్మజిజ్ఞాసువు ఆహారవిషయమున కామచారి కారాదు. (31)

## పంచమాధికరణము

ఉపాసకుడు అనాశ్రమి కావచ్చునా? లేక ఆశ్రమకర్తవ్యకర్మల ననుష్ఠింపవలెనా? లేదా? యన:

## విహితత్వాచ్చాశ్రమకర్మాపి        ౩-౪-౩౨

చ = మరియు, విహితత్వాత్ = శాస్త్రవిహితము లగుటవలన, ఆశ్రమకర్మాపి = ఆశ్రమ కర్మకూడ చేయవలెను. బ్రహ్మజ్ఞానముకొఱకు యత్నించుచుమానపుడు శుద్ధాహారమును గ్రహింపవలసియున్నట్లు స్వాశ్రమ కర్మలుకూడ అనుష్ఠింపవలెను. అవి శాస్త్రములచే విధింపబడినవియే.

'తపసా బ్రహ్మచర్యేణ శ్రద్ధయా విద్యయా
ఆత్మాన మన్విష్యాదిత్య మభిజయంతే' ప్రశ్న ౧-౧౦.

'తపస్సు, బ్రహ్మచర్యము, శ్రద్ధ, ఉపాసన వీని ద్వారా ఆత్మ నెరింగి ఆదిత్యమార్గమును జయింతురు'.

ఇట్లే, త మేతం వేదానువచనేన బ్రాహ్మణా వివిదిషంతి

'యజ్ఞేన, దానేన తపసా ఽనాశకేన' బృ. ౪-౪-౨౨.

'వేదోదితం స్వకం కర్మ నిత్యం కుర్యా దతంద్రితః' మ. ౪-౧౪.

ఈ శాస్త్రవచనములనుబట్టి ఉపాసకుడుకూడ ఆశ్రమధర్మముల ననుష్ఠింపవలసినదే యని నిర్ణయము. (౩౨)

మరియొక హేతువు :

## సహకారిత్వేన చ        ౩-౪-౩౩

జ్ఞానోత్పత్తికి సహకారములగును, కాపునను ఉపాసకుడు ఆశ్రమ కర్మల నాచరింపవలసినదే. (౩౩)

జ్ఞానప్రాదుర్భావమునకు సహకరించుకర్మలు ఆశ్రమకర్మలకంటె భిన్నములా ? అవియేనా ? యన:

## సర్వథాఽపి త ఏవోభయలింగాత్ ౩-౪-౩౪

ఉభయలింగాత్ = శ్రుతిస్మృతి ప్రమాణములవలన, సర్వథాపి త ఏవ=అన్నివిధములను నవియే. ఉపాసనతో నే కర్మలు అను ష్ఠే యములని పూర్వము (౩-౪-౨౬) చెప్పబడినవో యవియే ఆశ్రమకర్మలరూపమున విహితములై యున్నవి. అవియే జ్ఞానప్రాదుర్భావమున సహకరించును. విద్యాసహకారికర్మలు, ఆశ్రమకర్మలు వేరు కావు.

"యజ్ఞేన యజ్ఞ మయజంత దేవా స్తాని ధర్మాణి ప్రథమా న్యాసన్" (ఋ. ౧౦-౯౦-౧౬. యజు. ౩౧-౧౬) 'విద్వాంసులు యజ్ఞముతో యజనీయపరమాత్మ నుపాసింతురు. ఆ ధర్మములు శ్రేష్ఠములు.'

"స్వాధ్యాయేన వ్రతై ర్హోమైః త్రైవిద్యే నేజ్యయా సుతైః
మహాయజ్ఞైశ్చ యజ్ఞైశ్చ బ్రాహ్మీయం క్రియతే తనుః"

మను. ౨-౨౮.

'వేదాధ్యయనము, వ్రతనియమములు, హోమములు, నను వేదప్రతిపాదిత కర్మలు, జ్ఞానము, ఉపాసన దర్శపూర్ణమాసాదిపక్షేష్టి, సుసంతానము, పంచ మహాయజ్ఞములు, అగ్నిష్టోమాదియజ్ఞములు నన్నియు దేహాధిష్ఠితాత్మను బ్రహ్మప్రాప్తికి యోగ్యుని చేయును. విద్యకు సహకరించు కర్మలే ఆశ్రమ విహితములుకూడ. కావున బ్రహ్మోపాసనతోబాటు ఆశ్రమకర్మలవశ్యము అనుష్ఠేయములే. (౩౪)

ఉపర్యుక్త విషయమును బలపరుచుచున్నాడు.

## అనభిభవం చ దర్శయతి ౩-౪-౩౫

అనభిభవం చ = ఆదరమును గూడ, దర్శయతి = ఉపనిషత్తు చూపుచున్నది. (అభిభవము = తిరస్కారము. అనభిభవము=సత్కారము-ఆదరము.)

ఉపనిషద్ వాక్యము ఆశ్రమకర్మవిషయమున ఆదరమును చూపు చున్నది. కావున ఆశ్రమకర్మ అనుష్ఠేయమే. "ఏష హ్యాత్మా న నశ్యతి యం బ్రహ్మచర్యే ణానువిందతి" ఛాం. ౮-౫-౩. 'బ్రహ్మచర్యముతో పొందిన ఆత్మ నశింపదు' అని యీ వాక్యము బ్రహ్మచర్యముచే నుపలక్షిత మగు ఆశ్రమకర్మమహత్తును ప్రకటించుచు ఆదరమును దెలుపుచున్నది. కావున నిరాటంకముగ జ్ఞానోత్పత్తి కలుగుటకు ఆశ్రమకర్మలు యథా శాస్త్ర మనుష్ఠింపవలసినవే యగును. (౩౫)

యజ్ఞాద్యాశ్రమకర్మలు, శమదమాదులు ననుష్ఠేయములని చెప్ప బడినది. జ్ఞానోత్పత్తి కిది యావశ్యకమా ? లేక యనుష్ఠింపకయే కలు గునా ? యని విచారించుచున్నాడు.

అంతరాచాపి తద్దృష్టేః ౩-౪-౩౬

అంతరాఽపిచ = ఆశ్రమకర్మానుష్ఠానము లేకకూడ జ్ఞాన ముత్పన్న మగును. తద్దృష్టేః = అది చూడబడినందున.

యజ్ఞాది - ఆశ్రమకర్మలు ప్రకృతములు. అయ్యవి జ్ఞానోత్పత్తి కొఱకు శమదమాదులవలె తప్పక యనుష్ఠేయములా ? కావా ? అని సంశయము. శాస్త్రవిహితములు, సహకారులు కావున శమదమాదులవలె ననుష్ఠేయములే యని ప్రాప్తింప - సూత్రకారుడు సమాధానము చెప్పు చున్నాడు. వేదాంతవాక్యములవలన యజ్ఞాది - ఆశ్రమకర్మానుష్ఠానము లేకున్నను విధురుడు మున్నగు అనాశ్రములకు జ్ఞానము కలుగునట్లు తెలియు చున్నది. కావున జ్ఞానోత్పత్తికొఱకు శమదమాదికము లవశ్యానుష్ఠేయము లైనట్లు యజ్ఞాదులు కానేరవు.

యజ్ఞాదులు శమదమాదులవలె అవశ్య మనుష్ఠేయము లగునెడల శమదమాదులు లేనివారికి జ్ఞానోత్పత్తి కానట్లు కర్మానుష్ఠానము లేనివారికి జ్ఞానము కలుగకుండవలెను. కాని అట్లుచూడము. రైక్వుడు అనాశ్రమి,

అందువలన ఆశ్రమకర్మ లతనికి విహితములు కావు. అతడు కర్మల నను ష్ఠింపనివాడయ్యు జ్ఞానిగా జూడబడుచున్నాడు. వాచక్నవీ, గార్గి, అను వారు కూడ అట్లే జ్ఞానులగుట ఉపనిషత్తులందు జూచుచున్నాము. విద్వాంసు లలో వీరి నెరుగనివా రెవ రుందురు ? రైక్వుడు జ్ఞానశ్రుతికి జ్ఞానోప దేశము చేసినవాడు. గార్గి జనకునిసభయందు విద్వాంసులయెదుట యాజ్ఞ వల్క్యునితో వివదించిన విదుషీమణి. ఉపనిషద్వాక్యములు అప్రమాణములు కావుకదా ! కావున శమదమాదికములు ముముక్షువులకు అవశ్యానుష్ఠేయము లయినట్లు యజ్ఞాదికర్మలు కావని తెలిసికొనవలెను. (౩౬)

ఈ విషయమును నిరూపించు స్మృతిప్రమాణము :

అపి చ స్మర్యతే ౩-౪-౩౭

మరియు ఆశ్రమకర్మానుష్ఠానము లేకయే జ్ఞానము కలుగునని స్మృతివలనను తెలియుచున్న దని సూత్రార్థము.

గృహస్థాద్యాశ్రమవాసులు కాని రైక్వ, వాచక్నవీ ప్రభృతులకు ఆశ్రమకర్మానుష్ఠానము లేకయే జ్ఞానము కలిగినట్లు కొందరికి ఆశ్రమ కర్మాపేక్ష లేకయే జ్ఞానము కలుగునట్లు స్మృతులలో చెప్పబడినది.

"జప్యేనైవ తు సంసిద్ధ్యేద్ బ్రాహ్మణో నాత్ర సంశయః
కుర్యా దన్యన్న వా కుర్యాన్ మైత్రో బ్రాహ్మణ ఉచ్యతే"
మను ౨-౮౭.

'జపముచేతనే బ్రాహ్మణుడు సిద్ధిని బొందును. ఇందు సంశయము లేదు. ఇతర యాగాదికర్మలు చేసినను చేయకున్నను నతడు ప్రణవ జపముచేతనే పరమాత్మకు ప్రియుడు, బ్రాహ్మణుడు ననబడును.' జ్ఞానో త్పత్తికి యజ్ఞాదు లవశ్య మనుష్ఠేయము లగునెడల వాని ననుష్ఠింపకయే జ్ఞాని యగునని స్మృతి చెప్పజాలదు. స్మృతి శ్రుతిమూలమై ప్రమాణము

కావున బ్రహ్మజ్ఞానమునకు శమదమాదులవలె ఆశ్రమకర్మలు యజ్ఞాదులు అవశ్య మనుష్ఠేయములు కావని నిశ్చితమగుచున్నది. (౩౭)

ఇందు మరియొక హేతువు :

విశేషానుగ్రహ శ్చ   3-4-38

ఆశ్రమకర్మలేనివారిపై పరమేశ్వరునివిశేషానుగ్రహము స్మరింప బడుచున్నందునను శమదమాదులవలె కర్మానుష్ఠానము జ్ఞానోత్పత్తి కవసరము కాదని తెలియుచున్నది.

ఆశ్రమకర్మలు యజ్ఞాదు లనుష్ఠింపకపోయినను ఉపాసనవలన బ్రహ్మజ్ఞానము ప్రాప్తించును. అట్టివానియెడ పరమేశ్వరునికి కలుగు విశేషానుగ్రహమును ఉపేక్షింపజాలము. కఠోపనిషత్తున

"నాయ మాత్మా ప్రవచనేన లభ్యో
న మేధయా న బహునా శ్రుతేన
య మేవైష వృణుతే తేన లభ్య
స్తస్యైష ఆత్మా వివృణుతే తనూం స్వామ్" ౧-౨-౨౩.

అన్యసాధనములు సఫలములైనను కాకున్నను పరమేశ్వరు డేయుపాసకునికి ప్రసన్నుడగునో యతనికి బ్రహ్మసాక్షాత్కారము కలుగుటలో నెట్టి సందియము లేదు. పరమేశ్వరుని అనుగ్రహప్రాప్తివలన జ్ఞానప్రాప్తి కలుగగా కర్మానుష్ఠాన మవశ్యము కాదనుట నిశ్చితము. (౩౮)

జ్ఞానోత్పత్తికి శమదమాదు లవశ్యానుష్ఠేయము లనియు ఆశ్రమకర్మాదులు కావనియు చెప్పుటకు హేతు వేమి ?

అత స్త్వితరజ్జ్యాయో లింగా చ్చ   3-4-39

అతః = ఆశ్రమకర్మకంటె, ఇతరత్ తు = శమదమాదికము మాత్రము, జ్యాయః = గొప్పది - అంతరంగసాధనము, అందువలన నది

యనుష్ఠేయమని చెప్పబడును. కారణము : లింగాచ్చ = శ్రుతిస్మృతిలింగ ములే.

జ్ఞానమునకు యజ్ఞాదికర్మలు బహిరంగసాధనములు. శమదమా ద్యనుష్ఠాన మంతరంగ - ముఖ్యసాధనము. అంతరంగ మవశ్యానుష్ఠేయ మగును. బహిరంగము ననుష్ఠింపకున్నను కార్యము సిద్ధించును. అంత రంగ మనుష్ఠింపకున్న కార్యము సిద్ధింపదు. ఆశ్రమకర్మలకు బదులు ఉపాసనాదులు సహకారు లగును.

"యస్మా దేవంవి చ్ఛాంతో దాంత....పశ్యతి" బృ. ౪-౪-౨౩

"అమానిత్వ మదంభిత్వ మహింసా క్షాంతి రార్జవమ్
...............ఏతద్ జ్ఞాన మితి ప్రోక్తమ్"

గీత ౧౩.౭-౧౧.

ఇట్టిస్మృతులు శమదమాధులు జ్ఞానోత్పత్తికి అంతరంగ - ముఖ్య సాధనము లనుటకు ప్రమాణములు. కావున ముముక్షువులు శమదమాదు లను తప్పక యనుష్ఠింపవలెననియు, యజ్ఞాదికములు ఆశ్రమకర్మలు యథా కామము అవకాశమున్న ననుష్ఠింపవచ్చు ననియు అవకాశము లేకున్న ననుష్ఠింపకున్నను దోషములేదనియు. అధికార మున్నపుడు అనుష్ఠింప కుండుటకంటె అనుష్ఠించుటయే వరమనియు సిద్ధాంతము. (౩౯)

## షష్ఠాధికరణము

నైష్ఠికబ్రహ్మచారులు, వానప్రస్థులు, సంన్యాసులు ఊర్ధ్వరేతస్కు లని పూర్వము చెప్పబడినది. ఈ యాశ్రమములలో బ్రహ్మచర్యమునుండి వానప్రస్థమునకో సంన్యాసమునకో పోవుట, లేక గృహస్థమునుండి వాన ప్రస్థ సంన్యాసాశ్రమములను క్రమముగా గ్రహించుట ఆరోహక్రము మగును. అట్లే పూర్వకృతకర్మలను మరల చేయవలయునను బుద్ధితో కాని,

రాగాదులు కారణముగగాని ఉత్తరాశ్రమములనుండి పూర్వాశ్రమమునకు వచ్చుట అను అవరోహము సంభవమా ? అసంభవమా ? నైష్ఠికబ్రహ్మచర్యమునుండి వానప్రస్థమునో లేక సంన్యాసమునో గ్రహించి మరల గృహస్థుడు కాగలడా ? లేదా ? ఈ విషయమున నిశ్చయ మేమన :

తద్భూతస్య తు నాతద్భావో జైమినే రపి
నియమాతద్రూపాభావేభ్యః ౩-౪-౪౦.

తద్భూతస్య = అట్లయినవానికి - నైష్ఠికబ్రహ్మచారి, వానప్రస్థ, సంన్యాసి అయినవానికి, న అతద్భావః = ప్రాప్తాశ్రమమునుండి అవరోహము జరుగదు. అని, జైమినేఃఅపి = జైమినిబాదరాయణులమతము, నియమాత్ అతద్రూపాభావేభ్యః=శాస్త్రనియమమువలన, అవరోహాభావము వలన - అవరోహప్రతిపాదకవచనము, ఆచారము లేనందువలనను జైమిని బాదరాయణు లిరువురు న ట్లంగీకరించుచున్నా రని భావము.

ఊర్ధ్వరేతస్కులు ఉన్నతాశ్రమమును చేరి మరల నేదోయొకకారణమున పూర్వాశ్రమమునకు మరలుట యుక్తముకాదు. శాస్త్రమున నట్టి నియమము గానము.

'అత్యంత మాత్మాన మాచార్యకులేఽవసాదయన్' ఛాం. ౨-౨౩-౧. అనుతావున ధర్మమునకు మూడవస్కంధము వర్ణింపబడినది. జీవనపర్యంతము ఆచార్యకులమున నియమములతోను తపస్సుతోను జీవనసమాప్తి నొనరించుట నైష్ఠికబ్రహ్మచారికి శాస్త్రనియమము. అతడు గృహస్థాశ్రమమును స్వీకరించినచో నైష్ఠికతనుండి పతితుడగును.

"ఆశ్రమా దాశ్రమం గత్వా హుతహోమో జితేంద్రియః
భిక్షాబలిశ్రాంతః ప్రవ్రజన్ ప్రేత్య వర్ధతే". మను. ౬-౬౪.

'పూర్వాశ్రమమునుండి ఉత్తరాశ్రమము గ్రహించి - బ్రహ్మచర్యము

నుండి గృహస్థాద్యాశ్రమములను బొంది అగ్నిహోత్రాదు లొనర్చి, జితేం ద్రియుడై భిక్ష, బలిదానము చిరకాలపుసేవలనుండి శ్రాంతుడై సంన్యా సమును గ్రహింపవలెను. ఇట్లు ఆశ్రమధర్మపాలన మొనర్చి మరణించి పరలోకమున ఉన్నతిని పొందును. ఇట ఆశ్రమముల యారోహమేకాని అవరోహములేదు. ఇట్లే జాబాలోపనిషత్తునందును బ్రహ్మచర్యం సమా ప్య గృహీ భవేత్ గృహీ భూత్వా వనీ భవేత్, వనీ భూత్వా ప్రవ్ర జేత్....బ్రహ్మచర్యా దేవవా ప్రవ్రజేత్" ఆశ్రమారోహము వర్ణింపబడినది. ఉత్తరాశ్రమమునుండి పూర్వాశ్రమమునకు మరలుట - అవరోహము ఎక్క డను లభింపదు. అట్టి శిష్టాచారముకూడ చూడము. కాబట్టి అవరోహ మను చితమని ఆచార్యు లిరువురు నంగీకరించుచున్నారు. (४०)

## సప్తమాధికరణము

ఊర్ధ్వరేతస్కుడు తనయాశ్రమమునుండి యేకారణముచేతనైనను ఎన్నడైనను పతితు డగుచో నట్టివాని కేదైన ప్రాయశ్చిత్త మున్నదా ? యన :

**నాధికారిక మపి పతనానుమానాత్**
**తదయోగాత్** ౩-४-४౧

ఆధికారిక మపి న = ఆధికారికప్రాయశ్చిత్తము లేదు. పతనాను మానాత్ = పతితుడని శిష్టు లనుమానించుటవలన. తదయోగాత్ = ప్రాయ శ్చిత్తయోగాసంభవమువలన.

పతితుడగు నూర్ధ్వరేతస్కునకు, మీమాంసాశాస్త్రాంతర్గత ప్రాయ శ్చిత్తాధికారమున (మీ. ౬-८-౨౧) ప్రాయశ్చిత్తము లేదు. కారణ మేమన : పతనము నిశ్చితమైన మీదట నతనితో ప్రాయశ్చిత్తమునకు సంబంధము లేదు.

మీమాంస (౬-౮-౨౨) యందు అవకీర్ణి బ్రహ్మచారి కున్నగు వారికి ప్రాయశ్చిత్తము చెప్పబడినది. అది ఉపకుర్వాణబ్రహ్మచారికి సంబంధించినది. ఊర్ధ్వరేతస్కులగు నైష్ఠికులకు సంబంధించినది కాదు. నైష్ఠికుడు పతితుడైన, వానికి ప్రాయశ్చిత్తము లేదు. అట్టివారు పతితులైనచో మరల వారు పూర్వమార్గమున నడువగలరని యాసింపజాల మని భావము.

"ఆరూఢో నైష్ఠికం ధర్మం యస్తు ప్రచ్యవతే పునః ప్రాయశ్చిత్తం న పశ్యామి యేన శుద్ధ్యేత్ స ఆత్మహా" (అత్రిస్మృతి. ౭-౧౬) "నైష్ఠిక ధర్మమున ఆరూఢుడై పతితుడగు ఆత్మఘాతిని శుద్ధముచేయు ప్రాయశ్చిత్తము కానను" అని స్మృతి.

కాబట్టి ఊర్ధ్వరేతస్కుడగువ్యక్తి తనస్థితినుండి పతితుడయిన నాడు బ్రహ్మచర్యాదివ్రతముల నతడు పాలింపజాలడు. అధ్యాత్మమార్గమున నడుచుట కధికారి కాడు. అందులకై ప్రయత్నించుట వ్యర్థమని భావము. (౪౧)

సూత్రకారు డీవిషయమున నితరాచార్యులమతమును ప్రస్తుతించుచున్నాడు.

## ఉపపూర్వ మపి త్వేకే భావ మశనవ త్తదుక్తమ్ ౩-౪-౪౨

ఉపపూర్వం అపి = ఉపపాతకమునకు, ఏకేతు = కొందఱు ఆచార్యులు, భావం=ప్రాయశ్చిత్తము నంగీకరింతురు. అశనవత్=అభక్ష్యభక్షణమువలె, తదుక్తమ్=అది చెప్పబడినది.

కొందఱు ఆచార్యులు ఊర్ధ్వరేతస్కుని అధఃపతనమును ఉపపాతకమని యెంచుచున్నారు. అది మహాపాతకము కాదని వారియభిప్రాయము. కావున అభక్ష్యమును భక్షించినవానికి ప్రాయశ్చిత్త మున్నట్లు ఉపపాతకమునకు ప్రాయశ్చిత్తము కలదని భావించుచున్నారు.

"అభోజ్య మన్నం నా_త్తవ్య మాత్మనః శుద్ధి మిచ్ఛతా
అజ్ఞానభు_క్తం తూ_త్తార్యం శోధ్యం వాప్యాశు శోధనైః." మ. ౧౧-౧౬౦.

'ఆత్మశుద్ధిని కోరువాడు నిషిద్ధభోజనము చేయరాదు. ప్రమాదవశమున నెన్నడైన తినుట సంభవించిన వెంటనే వమనాదులతో శుద్ధి చేసికొనవలెను.' అని అభక్ష్యభక్షణమునకు ప్రాయశ్చి_త్తము స్మృతులలో కలదు. ప్రమాదవశమున కాక బుద్ధిపూర్వకముగ అభక్ష్యమును తినినను ప్రాయశ్చి_త్తము కలదు.

"అకామతః కృతే పాపే ప్రాయశ్చి_త్తం విదుర్బుధాః
కామకారకృతేఽప్యాహు రేకే శ్రుతినిదర్శనాత్" మ. ౧౧-౪౫.

అభక్ష్యభోజనమునకు ప్రాయశ్చి_త్త మున్నట్లు ఊర్ధ్వరేతస్కుడు పతితుడైనపుడు ఆ పతనమును ఉపపాతకముగా - చిన్నపాపముగా నెంచి ప్రాయశ్చి_త్తమును కొంద ఱంగీకరించుచున్నారు. తై_త్తిరీయారణ్యకములో వాతరశనప్రభృతి మునుల సంవాదమున,

"తాన్ ఋషయోఽబ్రువన్ పవిత్రం నో బ్రూత
యేనారేపసః స్యామేతి త ఏతాని సూ_క్తా న్యపశ్యన్" ౨-౮.

'మాకొఱకు పవిత్రమును చెప్పుడు. దానివలన మేము (అరేపసః) దోషరహితుల మగుదుముగాక' అని ఋషులనిరి. వారు ఈ సూ_క్తములకు ద్రష్టలయిరి. (ఋ. ౧౦-౧౨౬....). అని యీ ప్రసంగము నారంభించి, "యదర్వాచీన మేనో భ్రూణహత్యాయా_స్తస్మాన్ముచ్యతే" (తై.ఆ.౨-౮) 'భ్రూణహత్య (మహాపాతకము) కంటె అర్వాచీనము - స్వల్పమగు పాతకము ఉపపాతకము, దానినుండి ము_క్తుడగును. నైష్ఠికబ్రహ్మచారి ఊర్ధ్వరేతస్కుడు అవకీర్ణుడగుట ఉపపాతక మగును. అతడు గురుతల్పగమనాదుల నొనర్చిన మహాపాతకు డగును. కావున ఉపకుర్వాణకుడగు బ్రహ్మచారికి ప్రాయశ్చి_త్త మున్నట్లు నైష్ఠికుడు ఉపపాతకు డైనచో నత

వికిని ప్రాయశ్చిత్తము నంగీకరింపవలెను, అని కొందఱు ఆచార్యు లంగీక రింతురు. (४२)

ఉక్తవిషయమునందు సూత్రకారుడు తనయభిప్రాయమును దెలుపు చున్నాడు.

బహిస్తూభయథాఽపి స్మృతే రాచారా చ్చ ३-४-४३

(నైష్ఠికుడు పతితుడైనపుడు) ఉభయథాపి తు = ప్రాయశ్చిత్త మున్నను లేకున్నను రెండువిధములను, బహిః = అతడు బహిష్కరింప దగినవాడే, కారణ మేమన: స్మృతేః=మానవస్మృతివలన, ఆచారా చ్చ= శిష్టాచారమువలనను, బహిష్కరింపవలసినవాడే యని సూత్రార్థము.

ఊర్ధ్వరేతస్కుడు పతితుడైనపుడు అది యుపపాతకము కాని, మహాపాతకముకాని, యట్లే ప్రాయశ్చిత్త మున్నను లేకున్నను ఎట్టిస్థితి లోను నతడు శిష్టులతో వ్యవహరింపదగినవాడు కాడు. అతడు ఎల్లరిచే బహిష్కరింపదగినవాడే. ప్రాయశ్చిత్తము చేసినను వారిమనస్సు దుర్వృత్తులనుండి మరలుట సంభవము కాదని యాచార్యునిమతము.

"బాలఘ్నాంశ్చ కృతఘ్నాంశ్చ విశుద్ధానపి ధర్మతః
శరణాగతహంతౄంశ్చ స్త్రీహంతౄంశ్చ న సంవసేత్" మ. ౧౧-౧౯౦.

'బాలఘాతకులు, చేసిన యుపకారమును అపకారముచే చంపువారు (కృతఘ్నులు), శరణాగతఘాతకులు, స్త్రీఘాతకులు అయిన వారు ప్రాయశ్చిత్తములమూలమున తమ్ము శుద్ధమొనర్చుకొనినను వారితో సహవాసము కూడదు. సంఘమున వారి నుంచరాదు.' అని స్మృతి, ఆచారముకూడ కాబట్టి పతితులైన ఊర్ధ్వరేతస్కులను సంఘమునుండి బహిష్కరింపవల యునని వ్యాసునిమతము. (४३)

Scanned by CamScanner

## అష్టమాధికరణము

ఆశ్రమవిచారము ముగిసినది. ఇక ఉపాసనల కంగములగు కర్మలను ఉపాసకుడగు యజమానుడు అనుష్ఠింపవలెనా? లేక ఋత్విజుడా? అనువిషయమున సూత్రకారుడు పూర్వాచార్యుడైన ఆత్రేయముని యభిప్రాయమును పూర్వపక్షరూపమున నుంచుచున్నాడు.

స్వామినః ఫలశ్రుతే రిత్యాత్రేయః ౩-౪-౪౪

ఫలశ్రుతేః=ఉపాసకునకు ఫలశ్రుతి యున్నందువలన, స్వామినః= యజమానుడే ఉపాసనాంగకర్మల ననుష్ఠింపవలెనని, ఆత్రేయః=ఆత్రేయ ముని మతము.

ఉపాసన కంగములగు కర్మల ననుష్ఠించినందువలన కలుగు ఫలము యజమానుడైన యుపాసకునకు లభించును. ఇందులకు శబ్దమే ప్రమాణము.

"వర్షతి హాస్మై వర్షయతి హ య ఏతదేవం విద్వాన్
వృష్టౌ పంచవిధం సామోపాస్తే" బృ. ౨-౩-౨.

'ఇతనికొఱకే వర్షించును. నిశ్చయముగా నతడు వర్షింపజేసికొనును. అతడిది తెలిసికొని వృష్టియందు పంచవిధసామము నుపాసించును.'

యజమానున కిట ఫలప్రాప్తి నిర్దేశింపబడినది. ఉపాసనాఫలమున కతడే యధికారి. అది యుచితముకూడ. అతడే దాని ననుష్ఠించినవాడు కదా! కావున యజమానుడే అంగానుష్ఠానము చేయవలయును. ఋత్విక్కు కాదు. ఇది యాత్రేయాచార్యుని మతము.

మరియొక యాచార్యునిమతము సిద్ధాంతరూపమున సూత్రకారుడు ప్రదర్శించుచున్నాడు.

ఆర్త్విజ్యమిత్యౌడులోమి స్తస్మై హి పరిక్రీయతే ౩-౪-౪౫

ఆర్త్విజ్యమ్=అంగోపాసన ఋత్విజునిది, ఇతి=అని, ఔడులోమిః=ఔడులోమిమతము, హి=కారణ మేమన, తస్మై=అంగానుష్ఠానార్థము, పరిక్రీయతే=ఋత్విక్కు కొనబడును.

అంగములగు ఉపాసనల ననుష్ఠించుటకే యజమానుడు ఋత్విజులను కొనును. అందువలన ఋత్విజులే అంగోపాసనల ననుష్ఠింపవలెనని ఔడులోమి - అచార్యుని మతము. యజమానుడు ఋత్విజులను అంగోపాసనార్థము వరణచేసి అనుష్ఠానానంతరము వారికి పరిశ్రమఫలము నిచ్చును. కావున పరిక్రీతు లగుదురు. కావున అంగానుష్ఠానము సంపన్నము చేయుట ఋత్విజులకర్తవ్యము. యజమానునిది కాదు. ఈవిషయమును ప్రమాణీకరించుటకు ఛాందోగ్యము (౧-౧౦-౧౧) లో చాక్రాయణుడు - ఉషస్తి ఆఖ్యానము చూడవచ్చును. అట యజమానుడు శుల్కము నిచ్చి యజ్ఞానుష్ఠానముకొఱ కతనిని ఋత్విజునిగా వరణముచేసి యుండుట స్పష్టముగా జూడవచ్చును. కావున అంగానుష్ఠానము ఋత్విజులే చేయవలయునని ఔడులోమిమతము. (౪౫)

శ్రుతిప్రమాణము :

శ్రుతేశ్చ                ౩-౪-౪౬

శ్రుతివాక్యమువలనను యజ్ఞకర్మ ఋత్విజులదేయని సూత్రాభిప్రాయము. ఫలము యజమానునికి. 'యాం వై కాంచన యజ్ఞ ఋత్విజ ఆశిష మాశాసతే యజమానస్యైవ సా.' శత. బ్రా. ౧-౩-౧-౨౬. 'యజ్ఞమునందు ఋత్విజులు కోరు ఆశీర్వాదము యజమానునికే యగును.' దీనింబట్టి ఋత్విజులు కోరు అశీర్వాదము యజమానున కగునట్లు, ఋత్విజులనుష్ఠించు ఉపాసనాంగముల ఫలముకూడ యజమానునకే లభించును. ఋత్విజు లతనికి సాధనభూతు లగుదురని యభిప్రాయము. (౪౬)

## నవమాధికరణము

ప్రాసంగికచర్చ ముగిసినది. పూర్వము యజ్ఞాదికర్మలు జ్ఞానమునకు బహిరంగసాధనములు, శమదమాదు లంతరంగసాధనములు నని చెప్పబడినది. ఇప్పుడు మరియొక సాధనాంతరమును చెప్పదలచి సూత్రించుచున్నారు.

**సహకార్యంతరవిధిః పక్షేణ తృతీయం తద్వతో విధ్యాదివత్** ౩-౪-౪౭

సహకార్యంతరవిధిః=బృహదారణ్యకమున సాధనాంతరవిధి చూడనగును. తృతీయం=ఈ సాధనము మూడవది. తద్వతః=బ్రహ్మజ్ఞానము కలవానికి, పక్షేణ=వైకల్పికముగా అనుష్ఠింపదగినది. విధ్యాదివత్=విధినిషేధములవలె నని సూత్రార్థము.

బృహదారణ్యకపు కహోల బ్రాహ్మణమున నిట్లున్నది. 'తస్మాద్ బ్రాహ్మణః పాండిత్యం నిర్విద్య బాల్యేన తిష్ఠాసేత్. బాల్యం చ పాండిత్యం చ నిర్విద్యాథ మునిః, అమౌనం చ మౌనం చ నిర్విద్యాథ బ్రాహ్మణః.' (౩-౫-౧) 'బ్రహ్మజ్ఞాని కాదలచిన వ్యక్తి పాండిత్యము-శాస్త్రాధ్యయనము-శాస్త్రశ్రవణము-ను బాగుగ నిర్వర్తించి బలపూర్వకముగ నుండగోరవలెను. శ్రవణమునకు బలము మననము. అది చేయకున్న దృఢపడదు. బ్రహ్మజ్ఞాన విషయక శ్రవణమైన తదుపరి గంభీరముగ మననము చేయవలెను. ఇట్లు శ్రవణమననము లొనర్చి ముని కావలెను. అనగా మౌనశీలుడై యితరవ్యవహారములకు దూరముగ నుండి నిదిధ్యాసనమున మగ్నుడు కావలెను. ఇట్లు శ్రవణ మనన నిదిధ్యాసనములు బాగుగ సంపన్న మొనర్చి బ్రహ్మజ్ఞాని-బ్రాహ్మణు డగును.

పై వాక్యమున 'అథ బ్రాహ్మణః' అనియున్నందున, అథశబ్దమునకు

అనంతర మర్థము. తరువాత బ్రాహ్మణుడగువనుటవలన పూర్వము బ్రాహ్మణు డగుటకు సాధనములు చెప్పబడినట్లు తెలియుచున్నది. వాని ననుష్ఠించుట వలన బ్రహ్మజ్ఞాని యగును. కావున నిట బ్రాహ్మణు డగుటకు పూర్వము చెప్పబడినవి యన్నియు సాధనములని, సాధనజ్ఞానము కలుగును.

ఇట్లు బ్రహ్మజ్ఞానమునకు ప్రథమసాధనము యజ్ఞాదులు. రెండవ సాధనము శమదమాదులు. మూడవసాధనము శ్రవణమననిదిధ్యాసన ములు. మొదటిది బహిరంగము; రెండవది అంతరంగము; మూడవదియగు శ్రవణమననాది సాధనముకూడ అంతరంగముననే చేరును. బ్రహ్మజ్ఞానము కలుగువరకు వీనిని తప్పక యనుష్ఠింపవలెనని యభిప్రాయము. జ్ఞానియైన పిదప శ్రవణమననాదులను ఇచ్చవచ్చినట్లు-యథాకామ మనుష్ఠించును. అట్టి స్థితిలో విధినిషేధము లతనికి వర్తింపవు.

'ఏష నిత్యో మహిమా బ్రాహ్మణస్య న కర్మణా వర్ధతే నో కనీ యాన్, తస్యైవ స్యాత్ పదవిత్ తం విదిత్వా న లిప్యతే కర్మణా పాపకేన.' (బృ. ४-४-२३) 'ఇది బ్రహ్మజ్ఞాని నిత్యమహిమ. కర్మవలన నది వృద్ధి క్షయముల నందదు. ఆ మహిమాస్వరూపము నెరుగువాడు కావలెను. దాని నెరిగిన బ్రహ్మజ్ఞాని పాపకర్మతో లిప్తుడు కాడు.' అట్టి దశలో బ్రహ్మజ్ఞాని శ్రవణమననాదుల నాచరించినను ఆచరింపకున్నను నతనికి కలుగు హాని లాభము లుండవు. అతడు చేయవచ్చును. చేయకుండవచ్చును. అదియే వికల్పము. కావున విధినిషేధములు బ్రహ్మజ్ఞాని కంటవు. అనగా నతడు విహితములను నిషిద్ధములను ఆచరించుటలో స్వతంత్రుడని సూత్రకారుని మతము. ఐనను శాస్త్రమున బ్రహ్మజ్ఞానికికూడ విహితాచరణమే శ్రేష్ఠ మనుట వాస్తవము. నిషిద్ధాచరణ మతడు చేయడు. చేయరాదు. అన్యుల కతడు అనుకరణీయుడు కదా। 'ఆత్మక్రీడ ఆత్మరతిః క్రియావా నేష బ్రహ్మవిదాం వరిష్ఠః.' (ముం. ३-१-४) 'ఆత్మయందు విహరించువాడు,

బాహ్యవ్యాపారములను విడిచి ఆత్మజ్ఞానమున తత్పరుడు, జ్ఞానధ్యానాది పుణ్య కర్మలందు నిష్ఠుడునై యుండువాడే బ్రహ్మవిదులలో వరిష్ఠుడు.' అని ముండకము చెప్పుచున్నది. బ్రహ్మజ్ఞాని స్వతంత్రుడైనను లోకసంగ్రహార్థము విహితములనే యాచరించును. నిషిద్ధములను వరిహరించును. అదియే యతని కుచితము. (౪౯)

బ్రహ్మజ్ఞానులకు విధినిషేధములలో స్వాతంత్ర్యముండనిందు. గృహస్థుల కయ్యది సంభవము కాదుకదా! అట్టియెడ గృహాశ్రమికి విద్యోపసంహారము - గ్రహణము ఏల చెప్పబడిన, దన :

కృత్స్నభావాత్తు గృహిణోపసంహారః ౩-౪-౪౮

కృత్స్నభావాత్=సంపూర్ణజ్ఞాన సాధనములు గృహాశ్రమమున సంభవములగుటవలన, గృహిణా=గృహస్థునిచే, ఉపసంహారః=గ్రహణము, (క్రియతే) చేయబడును.

గృహస్థాశ్రమమున జ్ఞానసాధనము లన్నియు లభించును. కాబట్టి గృహస్థునిచే విద్యోపసంహారము చేయబడుచున్నది. ఛాందోగ్యోపనిషత్తునందు. 'అభిసమావృత్య కుటుంబే శుచౌ దేశే స్వాధ్యాయ మధీయానః.... ఆత్మని ఇంద్రియాణి సంప్రతిష్ఠాప్య అహింసన్ సర్వభూతాని ........ఏవం వర్తయన్ యావదాయుషం బ్రహ్మలోక మభిసంపద్యతే.' (౮-౧౫-౧) 'గురుసేవకు పోగా మిగిలిన సమయమున అధ్యయనము పూర్తిచేసి, స్నాతకుడై, గృహస్థుడై కుటుంబముననుండి పవిత్రస్థానమున ఆత్మచింతన చేయుచు ఇంద్రియములను వశపరచుకొని యేప్రాణిని హింసింపక యావజ్జీవము నడుచుకొనువాడు బ్రహ్మలోకమును పొందును.' ఇట్లు గృహస్థాశ్రమమునుండియే బ్రహ్మలోకప్రాప్తిరూపవిద్య గ్రహింపబడినది. ఇక సంన్యాసమునకు విధినిషేధములందు స్వాతంత్ర్యమునకు ప్రసక్తి యెక్కడ ? కావున పూర్వసూత్రమున 'విధ్యాదివత్' అని నిర్దేశించుట

యుక్తము కాదు. అని శంకింప, సూత్రకారుడు సమాధానము చెప్పు చున్నాడు. ఉపాసకునకు శమదమాదులతోబాటు యజ్ఞాదికర్మలు అనుష్ఠించుట మిక్కిలి పరిశ్రమ సాధ్యము. వివిధసాధనములు కావలసియుండును. వానివ్యవస్థ గృహస్థాశ్రమమున సులభమగును. అందువలన ఉపనిషత్కారుడు గృహస్థులకు బ్రహ్మవిద్యాగ్రహణ ముపదేశించియున్నాడు. బ్రహ్మ జిజ్ఞాసువు విషయాసక్తినుండియు ఇతర వ్యాపారములనుండియు విరతుడు కావలెను. ఇది యంతయు గృహస్థాశ్రమమున సంభవమగు నెడల హాని యొండును లేదు. ప్రశస్తమే యగును. అందువలననే పై వాక్యమునం దట్టియాచరణ నిర్దేశింపబడినది. అట్టిగృహస్థునకు విద్యాగ్రహణము - విద్యోపసంహారము యుక్తమే. దానివలన ఊర్ధ్వరేతస్కుల యాశ్రమ విధులకు విరోధ మేమియు లేదు. (౪౮)

జ్ఞానసాధనము లన్నింటిలోను నిదిధ్యాసనము ఒక్కటియే అవశ్యాచరణీయము. ఇతరములు కావు. అవి జ్ఞానమునకు సాక్షాత్సాధనములు కావున :

## మౌనవ దితరేషా మప్యుపదేశాత్ ౩-౪-౪౯

మౌనవత్=నిదిధ్యాసనమువలె, ఇతరేషాం అపి=ఇతరసాధనాంతరములనుగూడ, ఉపదేశాత్ = శాస్త్ర మనుశాసించుచున్నందున, అనుష్ఠేయములే యని యర్థము.

శాస్త్రము నిదిధ్యాసనమును జ్ఞానసాధనముగా ఉపదేశించినట్లు శమదమవివేకాదులనుకూడ జ్ఞానసాధనములనుగా నుపదేశించినది. కావున జ్ఞానప్రాప్తికొఱకు అవసరమునుబట్టి శాస్త్రోపదిష్టసాధనము లన్నియు ననుష్ఠింపదగినవే యగుచున్నవి. ఏదో యొకసాధనమువలననే జ్ఞానప్రాప్తి సంభవము కాదు. జ్ఞానసాధనానుష్ఠానమునకు ఊర్ధ్వరేతస్కుల యాశ్రమము ఉపయుక్తమైనను అన్యగృహాశ్రమసహకారము లేక యది సిద్ధిం

పదు. బ్రహ్మచర్యాద్యాశ్రమపాలనము అత్యావశ్యకము. జ్ఞానసాధనములన్నియు శాస్త్రమున సమానముగ నుపదేశింపబడినట్లు ఆశ్రమములు నుపదేశింపబడినవి. సాధనములన్నియు యథావసర మనుష్ఠేయము లయినట్లు ఆశ్రమములుకూడ ఉపేక్షింపదగినవి కావు. అందువలన 'నిదిధ్యాసన మొక్కటియే ముఖ్యసాధనము. తక్కినవి కావు.' అనుట సరికాదని సూత్రకారుని అభిప్రాయము. (౪౯)

## చళమాధికరణము

జ్ఞానసాధనములు నిరూపింపబడినవి. కాని వాని యాచరణ మెట్లుండవలె ననః

### అనావిష్కుర్వ న్నన్వయాత్ ౩-౪-౫౦

అన్వయాత్ = సాధనసంపదతో సంబంధ ముండుటవలన, అనావిష్కుర్వన్ = గురూపదిష్టసాధనములను ప్రకటపరుపక యాచరణతత్పరుడు కావలెను.

వివేకవైరాగ్యాదులు, యమనియమాదులు, శమదమతితిక్షాదులు, శ్రవణమననాదులు నన్నియు జ్ఞానసాధనములు. బ్రహ్మజ్ఞానియైన గురువు వీని నెట్లాచరింపుమని బోధించిన అట్లు నిరంతర మభ్యసించుటవలన జ్ఞానప్రాప్తి కలుగును. ఫలప్రాప్తి కలుగనంతవరకు ఉపాసకుడు తన ప్రవృత్తులను ప్రకటపరచకుండుట యుక్తము. వానిని ముందుగా ప్రకటించుటవలన సాధకునకు నానావిధములగు విఘ్నము లుత్పన్నములు కావచ్చును. సాధకునిలో అభిమానాదు లేర్పడవచ్చును. ఇవి యన్నియు సాధన కంతరాయములు. అందువలననే మనువు "జానన్నపి మేధావీ జడవ ల్లోక ఆచరేత్"(౨-౧౧౦.)జ్ఞానియైకూడ లోకమున తెలియనివానివలె మెలగుటయే బుద్ధిమత్త యని యన్నాడు. (౫౦)

అనుష్ఠితసాధనము లీ జన్మముననే జ్ఞానోత్పత్తిని కలిగించునా? జన్మాంతరముననా? యన :

ఐహికమ ప్యప్రస్తుతప్రతిబంధే తద్దర్శనాత్ ౩-౪-౫౧

అప్రస్తుతప్రతిబంధే = ప్రతిబంధము ఉపస్థితము కాకున్న, ఐహికమ్ = ఈ జన్మముననే జ్ఞానము కలుగును, తద్దర్శనాత్=కొందఱ కట్టి జ్ఞానప్రాప్తి చూడబడుటవలన, నది సంభవమే యని సూత్రార్థము.

జ్ఞానసాధనము లన్నియు సమకూరి యాచరింపబడినపుడు బలీయమగు పూర్వకర్మవిపాకము పరిపక్వమై యడ్డుపడకుండునెడల నీ జన్మముననే నియమముగ జ్ఞానప్రాప్తి కలుగును. ప్రతిబంధక మేర్పడినచో పరజన్మమున లభించునని భావము. వామదేవుడు, కపిలుడు, శుకుడు మున్నగువారు బాల్యముననే జ్ఞానులగుట శబ్దప్రమాణప్రసిద్ధము. జనకాదు లీ జన్మముననే జ్ఞాను లగుటయు సుప్రసిద్ధము. (౫౧)

సాధనఫలము జ్ఞానము ఐహికాముష్మికభేదముతో లభించునట్లు, జ్ఞానఫలమగు ముక్తియు నట్టిదియేనా? యన :

ఏవం ముక్తిఫలానియమ స్తదవస్థాధృతేః
తదవస్థాధృతేః ౩-౪-౫౨

ఏవం=జ్ఞానమువలె, ముక్తిఫలానియమః = జ్ఞానఫలమగు ముక్తి యందు ఐహికాముష్మికనియమము లేదు. తదవస్థాధృతేః = జ్ఞానావస్థ యందు ముక్తి లభించుట నిశ్చయమగుటవలన.

అంతిమపదము సూత్రమున రెండుమారులు ప్రయోగించుట పాద సమాప్తిని సూచించును.

జ్ఞానప్రాప్తియందు ఐకాముష్మికభేదనియమ ముండునట్లు జ్ఞాన ఫలమైన ముక్తియందు నియమ ముండదు. బ్రహ్మసాక్షాత్కారరూపజ్ఞాన ప్రాప్తి కలుగుటయే తడవుగ మోక్షము లభించును. జ్ఞానము కలుగుట, ముక్తి లభింపకుండుట యనునది యుండదు.

"యదా పశ్యః పశ్యతే రుక్మవర్ణం
కర్తార మీశం పురుషం బ్రహ్మయోనిమ్
తదా విద్వాన్ పుణ్యపాపే విధూయ
నిరంజనః పరమం సామ్య ముపైతి" ముం. ౩-౧-౩.

'జగత్కర్తయగు పరమేశ్వరుని సాక్షాత్కారము చేసికొనగానే జ్ఞాని పుణ్యపాపకామనలన్నియు విడిచి పరబ్రహ్మను ప్రాప్తించును'. బ్రహ్మప్రాప్తియే ముక్తి. కావున నిట ఐహికాముష్మికనియమము లేదని భావము. (౫౨)

శ్రీ మత్పరమహంస పరివ్రాజకాచార్యవర్య - ఆత్మానందసరస్వతీ
స్వామి భగవత్పాద శిష్య, పండిత గోపదేవ విరచిత
వేదాంత దర్శన - అంబా వ్యాఖ్యానమునందు
తృతీయాధ్యాయము సమాప్తము.

# వేదాంతదర్శనము

## చతుర్థాధ్యాయము

### ప్రథమపాదము

### ప్రథమాధికరణము

తృతీయాధ్యాయమున బ్రహ్మసాక్షాత్కారమునకు వలయు వైరాగ్యము, నిదిధ్యాసనము మున్నగు సాధనములు చెప్పి, ఉపాసనావిధియందు ఉపాస్యమగు బ్రహ్మముస్వరూపము విపులముగ వర్ణింపబడినది. బ్రహ్మజ్ఞానరూపసాక్షాత్కారమునకు వైరాగ్యాదులు సాధనములైనను నిదిధ్యాసనము మిక్కిలి యుపయుక్తసాధనముగ వర్ణింపబడినది. ప్రస్తుతమీయధ్యాయమున బ్రహ్మజ్ఞానఫలమును బాగుగ వివరింపదలచి, దాని కత్యంతమంతరంగసాధనమైన నిదిధ్యాసనముయొక్క అభ్యాసము నుపదేశించుచున్నాడు సూత్రకారుడు.

**ఆవృత్తిరసకృదుపదేశాత్** ౪-౧-౧

**అసకృత్ ఉపదేశాత్**=పలుమారు ఉపదేశించుటవలన, **ఆవృత్తిః**= నిరంతరాభ్యాసము.

శాస్త్రమునం దనేకపర్యాయము లుపదేశింపబడుటవలన సాధనములలో ముఖ్యమైన నిదిధ్యాసనమును నిరంతరము జ్ఞానప్రాప్తి కలుగువరకు అభ్యసింపవలెనని సూత్రార్థము.

సమాధిస్థితి యేర్పడువరకు ధ్యానించుట నిదిధ్యాసన మనబడును. ధ్యానమును నిరంతరము నభ్యసింపక - ఆవృత్తిచేయక బ్రహ్మసాక్షాత్కారరూపమగు సమాధి యేర్పడనేరదు. ధ్యానావృత్తికి ఫలమే బ్రహ్మజ్ఞానము.

కావుననే ఛాందోగ్యమున నారవయధ్యాయమునందు శ్వేతకేతునకీ విషయ మును బోధించుటకే పలుపర్యాయములు "స ఆత్మా తత్త్వమసి శ్వేతకేతో।" ఛాం. ౬-౮-౭. 'అది యాత్మ, దానియందు నిష్ఠగలవాడవు కమ్ము' అని పలుమారు ఉపదేశింపబడినది. బ్రహ్మసాక్షాత్కారము గోరు వారు నిరంతరము మాటిమాటికి ధ్యానము చేయుచుండవలయునని సూత్రాభిప్రాయము. (౧)

పలుమారు నిదిధ్యాసనము చేయవలయు ననువిషయమును బలపరు చుటకు హేత్వంతరము :

లింగాచ్చ ౪-౧-౨

లింగాత్ చ = శాస్త్రవచనములవలనను, నిదిధ్యాసనముయొక్క ఆవృత్తి సిద్ధమగుచున్నది.

బృహదారణ్యకమున "ఆత్మా వా అరే ద్రష్టవ్యః శ్రోతవ్యో మంతవ్యో నిదిధ్యాసితవ్యః" ౪-౫-౬.

'బ్రహ్మసాక్షాత్కారము మానవజీవనలక్ష్యము. కావున శ్రవణమనన నిదిధ్యాసనము లనెడి సాధనములవలన నయ్యది పొందదగినది.' అని చెప్పబడినది.

తైత్తిరీయమున "యదా హ్యేవైష ఏతస్మిన్నదృశ్యే.... .... సో ఽభయం గతో భవతి" ౨-౭. 'ఉపాసకుడైన జీవుడు అదృశ్యమగు బ్రహ్మమున నిర్బాధప్రతిష్ఠను బొందిననాడు అతడు నిర్భయస్థితిని బొందును.' అని చెప్పబడినది. ఇట్టి యభయస్థితిని సంపాదించుటకు నిదిధ్యాసనము - ధ్యానము మాటికిమాటికి చేయవలయునని భావము. (౨)

నిరంతరము నిదిధ్యాసనము నావృత్తిచేయుటకు తగిన విషయ మెద్ది? అన :

## ఆత్మేతి తూపగచ్ఛంతి గ్రాహయంతి చ ౪-౧-౩

ఆత్మ ఇతి తు=సర్వవ్యాపకబ్రహ్మమనియే. ఉపగచ్ఛంతి=(వైదికులు) అంగీకరింతురు. గ్రాహయంతి చ=తెలుపుదురు కూడ.

నిదిధ్యాసనమునకు విషయము పరమేశ్వరు డనియే వైదికు లంగీకరింతురు. అట్లే యుపనిషత్తులు వేదములు తెలుపుచున్నవి.

"ఓ మిత్యేవం ధ్యాయథ ఆత్మానమ్" ముం. ౨-౨-౬. 'సర్వవ్యాపకపరమాత్మను 'ఓమ్' అని ధ్యానింపుము' అని ముండకోపనిషత్తు.

"పరీత్య భూతాని పరీత్య లోకాన్ పరీత్య సర్వాః ప్రదిశో దిశశ్చ
ఉపస్థాయ ప్రథమజా మృత స్యాత్మ నాత్మాన మభిసంవివేశ"
యజు. ౩౨-౧౧.

'వేదాభ్యాసము, ధర్మాచరణము, యోగానుష్ఠానము మూలమున చేతనాచేతనపదార్థముల స్వరూప మెరింగి యుపాసకుడు బ్రహ్మమునందు ప్రవిష్టు డగును. ఆనందము ననుభవించును' అని యజుర్వేదము.

కావున పరమపురుషప్రాప్తికి నిరంతరధ్యానము నావృత్తి చేయవలయునని వైదికు లంగీకరింతురు; శాస్త్రములు తెలుపుచున్నవి. అని సూత్రాభిప్రాయము. (౩)

పై విషయమును బలపరుచుటకు మరియొక హేతువు. వ్యాపకబ్రహ్మమే ధ్యానవిషయ మన నేల? యన:

## న ప్రతీకే న హి సః ౪-౧-౪

ప్రతీకే = సూర్యాదిప్రాకృతికపదార్థములందు. న = ధ్యానము చేయరాదు. హి = కారణ మేమన, సః = ఆ ప్రతీకము, న = (ఆత్మ) కాదు - ధ్యానవిషయము కాదు.

కొండొక భౌతికపదార్థము ధ్యానవిషయము కానేరదు. కారణ మేమన: ప్రాకృతికపదార్థము - సూర్యాదులు బ్రహ్మపదార్థము కానేరవు.

సూర్యాదిభౌతికపదార్థముల నాధారము చేసికొని వానియందు బ్రహ్మభావన చేయుటకాని, వానిని బ్రహ్మమని యుపాసించుట కాని నిరర్థకమగును. ధ్యానమునకు విషయము ఆనందరూపబ్రహ్మమే యగునని భావము. (४)

అటులయిన ఉపనిషత్తులలో నట నట "మనో బ్రహ్మే త్యుపాసీత...." ఛాం. ౩-౧౮-౧. మనస్సు మున్నగుజడపదార్థములను బ్రహ్మమని యెంచి యుపాసింపవలెనని యున్నదికదా! యన, సూత్రకారుడు సమాధానము చెప్పుచున్నాడు.

బ్రహ్మదృష్టి రుత్కర్షాత్ ४-౧-౫

ఉత్కర్షాత్ = ఉత్కృష్టమగుటవలన, బ్రహ్మదృష్టిః = మనస్సు మున్నగువానియందు బ్రహ్మదర్శనము ఉపదేశింపబడినది.

ఛాందోగ్యమున మనస్సు, ఆకాశము, ఆదిత్యుడు ననువానియందు బ్రహ్మభావనతో నుపాసింపుమని చెప్పబడియుండుట చూడనగును. కారణ మేమన: బ్రహ్మము సర్వవ్యాపకము. బ్రహ్మవ్యాపకతవలననే సమస్త విశ్వము ప్రకట మగుచున్నది. ఈ విశ్వగత ప్రాకృతిక పదార్థములలో మనస్సు, ఆకాశము, ఆదిత్యుడు మున్నగుపదార్థములు తక్కినవానికంటె ఉత్కృష్టములు. బ్రహ్మదర్శనమునకు శుద్ధమైన మనస్సు ధ్యానమున సహకరించును. అట్లే ఆకాశము బ్రహ్మముయొక్క వ్యాపకతను స్మరియింపజేయును. ఆదిత్యుడు బ్రహ్మము జ్యోతిర్మయము - జ్ఞానాత్మకము అని స్ఫురియింపజేయును. ఇట్లే వస్తువులన్నియు బ్రహ్మస్థిత్వమువలన ప్రకటమగుచు తమయందున్న బ్రహ్మమును స్ఫురియింపజేయునవై యుత్కృ

ష్టము లగుచున్నవి. వానియుత్కృష్టమంత బ్రహ్మోత్కృష్టము ధ్యానింప వలయునని సూచించుట కీవాక్యములను మహర్షులు ప్రయోగించియున్నారు. కాని అవియే బ్రహ్మమని యుపాసించుటకు కాదు. అని సూత్రకారాభి ప్రాయము. (౫)

ఉత్కృష్టమగు మనస్సు ముఖ్యగుణావిశయందు బ్రహ్మోపాసన చెప్పబడినది. సరియే: కాని, కర్మాంగములైన ఉద్గీథప్రభృతులందు ఆదిత్యాదు లేల యుపదేశింపబడినవి ? అన, సూత్రకారుడు చెప్పుచున్నాడు.

ఆదిత్యాదిమతయశ్చాంగ ఉపపత్తేః ౪-౧-౬

ఉపపత్తేః = ఉపపన్న మగుటవలన - సంభవమగుటచే, అంగే = కర్మాంగమైన ఉద్గీథమున, ఆదిత్యాదిమతయశ్చ = ఆదిత్యాదిబుద్ధులుకూడ చెప్పబడినవి.

"య ఏవాసౌ తపతి తముద్గీథ ముపాసీత" ఛాం. ౧-౩-౧.

"ఈ తపించువానిని ఉద్గీథబుద్ధితో నుపాసింపవలెను'- ఉద్గీథభావనతో నుపాసింపవలెనని భావము. కర్మకు - యజ్ఞమునకు - అంగములగు ఉపాసనలవిషయమున 'కర్మాంగములైన ఉద్గీథాదులను ఆదిత్యాదులుగా నెంచవలెనా ? లేక ఆదిత్యాదులను ఉద్గీథాదులుగా నెంచవలెనా ?' అను సందేహము వొడమును. అట్టియెడ 'కర్మాంగము లయిన ఉద్గీథాదులందు ఆదిత్యభావనతో నుపాసించుటవలన నాకర్మలు మిక్కిలి బలము కలవి యగును. అందువలన నట్లు చేయదగు' నని సూత్రకారు డనుచున్నాడు. అది యెట్లన: ఉద్గీథము - ఓంకారోచ్చారణము - జపము చేయుటవలన హృదయమున గల అజ్ఞానము, భయము దూరమగును. అట్లే ఆదిత్యోదయమువలన అంధకారము, భయము లోకమున దూరమగును. అందువలననే ఉద్గీథాది కర్మాంగములందు ఆదిత్యాదిభావనతో నుపాసింపవలెనని చెప్పబడినది. (౬)

## ద్వితీయాధికరణము

నిదిధ్యాసనమునకు విషయము బ్రహ్మమే యని నుడివి, ఆ నిదిధ్యాసనము నభ్యసించు విధము చెప్పుచున్నాడు.

**ఆసీనః సంభవాత్** ౪-౧-౭

సంభవాత్ = సంభవమగుటవలన, ఆసీనః = కూర్చుండి ధ్యానమొనరింపవలెను.

ఉపాసకుడు ఆసనబద్ధుడై బ్రహ్మసాక్షాత్కారమునకు నిత్యము ధ్యానమొనరింపవలెను. నిలబడియో నడుచుచునో చేయరాదు. అట్లొనర్చిన విక్షేపాదులు కలుగును. పడిపోవుటయు సంభవించును. పరుండి ధ్యానము చేయువాడు నిద్రావశు డగును. కావున సిద్ధ పద్మాసనము లందే నిదిధ్యాసనము చేయనగును. (౭)

మరియొక హేతువు :

**ధ్యానాచ్చ** ౪-౧-౮

నిదిధ్యాసనము ధ్యాన మగుటవలనను కూర్చుండి - ఆసనబద్ధుడై చేయవలయునని సూత్రార్థము.

యోగాంగములలో నేడవది ధ్యానము. అది చిత్తైకాగ్రతవలననే కలుగును. ఏకాగ్రతకు ఆసనబద్ధత ముఖ్యము. స్థిరచిత్తమున ప్రత్యయైకతానత యనబడుధ్యానము నిలబడియో, పరుండియో, నడుచుచునో చేయ దగినది కాదని అభిప్రాయము. (౮)

**అచలత్వం చాపేక్ష్య** ౪-౧-౯

అచలత్వం చ=సర్వాంగనిశ్చలతకూడ, అపేక్ష్య = కోరి, కూర్చుండియే ధ్యానము చేయవలెను.

నిదిధ్యాసనము చేయు ముముక్షువు అంగచాంచల్యమును ముందు పోనాడగోరును. అవయవములు చలించువా డెంత యత్నించియు చిత్తై కాగ్రతను సాధింపనేరడు. కావున ఆసీనుడై ధ్యాన మాచరింపనగును. (౯)

స్మరంతి చ ౪-౧-౧౦

ఆచార్యులు కూర్చుండియే ధ్యానింపవలెననియు చెప్పుదురు.

సమాధిపర్యంతము చేయు ధ్యానమే నిదిధ్యాసనమని చెప్పియుంటిమి. కావుననే, పతంజలిమహర్షి యోగాంగములను లెక్కించుచు నందు ఆసనమును గూడ గణించియున్నారు. "యమ, నియమ, ఆసన, ప్రాణాయామ, ప్రత్యాహార, ధారణా, ధ్యాన, సమాధయో ఉష్టా వంగాని" (యో. ౨-౨౯)

"శుచౌ దేశే ప్రతిష్ఠాప్య స్థిర మాసన మాత్మనః" (గీ. ౬-౧౧) అని గీతయందు వ్యాసుడును ఆసనవర్ణన చేసియున్నాడు (౧౦)

ఎక్కడ ఆసీనుడై ధ్యానింపవలె, నన:

యత్రైకాగ్రతా తత్రావిశేషాత్ ౪-౧-౧౧

యత్ర = ఎక్కడ, ఏకాగ్రతా = చిత్తైకాగ్రత కలుగునో, తత్ర = అక్కడ, ధ్యానము చేయనగును. అవిశేషాత్ = సమాన ముగుటవలన.

నిదిధ్యాసనమునకు చిత్తైకాగ్రత ప్రయోజకము. నిదిధ్యాసనము - ధ్యానమునకు చిత్తైకాగ్రతకు విశేషలంతరము - భేదము లేదు. అట్టి చిత్తైకాగ్రత యెక్కడ కలుగునో యక్కడే ధ్యాన మొనరింపనగును. దేశకాలాదిభేదము లంతగా పాటింప నవసరముండదు. అయినను, శ్వేతాశ్వతర ఉపనిషత్తునందు -

"సమే శుచౌ శర్కరా వహ్ని వాలుకా
వివర్జితే, శబ్దజలాశ్రయాదిభిః,
మనో౽నుకూలే, న తు చక్షుపీడనే,
గుహానివాతాశ్రయణే ప్రయోజయేత్" శ్వే. ౨-౧౦.

సమము, శుద్ధము, కంకర, అగ్ని, ఇసుక లేని - శబ్దము, జలము, నివాసస్థానము ననువానిచే మనస్సున కనుకూలముగా నుండు - కంటి కింపైన గుహయందో, నిర్వాతప్రదేశముననో ధ్యానాదుల నొనర్పవలెనని చెప్పబడినది. అదియు చిత్తైకాగ్రత కనుకూలముగ నుండుట కుద్దేశించి చెప్పబడినదని గ్రహింపనగును. (౧౧)

ఎంతకాలము ధ్యాన మొనరింపవలె, నన :

ఆప్రాయణాత్ తత్రాపి హి దృష్టమ్ ౪-౧-౧౨

ఆప్రాయణాత్ = మరణపర్యంతము, ధ్యాన మొనర్పవలెను. హి= కారణ మేమన, తత్ర అపి దృష్టమ్ = ఆ విషయమునందును శాస్త్రవిధి చూడబడినది.

ప్రాయణము - మరణము చేకూరువరకు ఉపాసకుడు నిత్యము ధ్యాన మొనర్చుచునే యుండవలెను.

"స యో హ వై తద్భగవన్ మనుష్యేషు
ప్రాయణాంత మోంకార మభిధ్యాయీత" ప్రశ్న. ౫-౧.

'మనుష్యులలో మరణపర్యంతము ఓంకారమును ధ్యానించువాడు' అనుటవలన నిరంతరము, సత్కారబుద్ధితో బ్రహ్మసాక్షాత్కారము కలుగు వరకు ధ్యాన మొనర్పవలెనని తెలియుచున్నది. సమాధిలో బ్రహ్మసాక్షాత్కారము ఒకట కలిగినను దేహపాతము జరుగువరకు స్థిరతకొఱకు యత్న మాచరింపవలెనని భావము. (౧౨)

## తృతీయాధికరణము

నిరంతరము నిదిధ్యాసన మభ్యసించుటవలన జ్ఞానము కలుగును. ఆపైని ఏమగు, నన :

తదధిగమ ఉత్తరపూర్వాఘయో
రశ్లేషవినాశౌ తద్వ్యపదేశాత్ ౪-౧-౧౩

తదధిగమే = పరమాత్మసాక్షాత్కారము కలిగినమీదట, ఉత్తర పూర్వాఘయోః=ఉత్తరపూర్వపాపములకు, అశ్లేషవినాశౌ=అసంబంధవినాశ ములు కలుగును. తద్వ్యపదేశాత్=అయ్యది యుపదేశింపబడినందువలన.

నిదిధ్యాసనము నిరంతర మభ్యసించినందువలన పరబ్రహ్మము సాక్షాత్కరించును. అప్పుడు ముందు చేయబోవు పాపములతో సంబంధ ముండదు. బ్రహ్మజ్ఞానము కలుగుటయే మోక్ష మనబడును. అట్టితరి అతడు-జ్ఞాని పాపముల నాచరింపడని భావము. కావున పాపసంబంధ ముండదు. ఇక పూర్వకృతపాపములు జ్ఞానాగ్నిచే దగ్ధములగును.

ఈ విషయము శాస్త్రములం దట నట వర్ణింపబడినది.

"యథా పుష్కరపలాశ ఆపో న శ్లిష్యంత ఏవ
మేవంవిది పాపం కర్మ న లిప్యతే" ఛాం. ౪-౧౪-౩.

'కమలపత్రమునకు జల మంటనట్లు బ్రహ్మజ్ఞానికి పాపము లంటవు.' రాబోవుపాపములతో బ్రహ్మజ్ఞానికి సంబంధ ముండదని భావము.

"తద్యథేషీకాతూల మగ్నౌ ప్రోతం ప్రదూయే తైవం
హాస్య సర్వే పాప్మానః ప్రదూయంతే" ఛాం. ౫-౨౪-౩.

'ఫన్నని పుల్లచివరనున్న దూదివంటి కోమలపుష్పము అగ్నియం

దుంచబడి వెంటనే దగ్ధమగునట్లు బ్రహ్మజ్ఞాని పూర్వపుపాపము లన్నియు నష్టమగును.' కావున బ్రహ్మజ్ఞాని ఆ జ్ఞానము కలుగుటకు పూర్వసంచిత పాపములు జ్ఞానాగ్నితో నశింపజేసికొనును. క్రొత్తపాపముల నాచరింపడు. కావున నట్టివానితో నతనికి సంబంధ ముండనేరదని సూత్రాభిప్రాయము. (౧౩)

బ్రహ్మజ్ఞానికి పాపసంబంధ ముండనట్లు పుణ్యసంబంధముకూడ నుండదా? యన :

ఇతరస్యా ప్యేవ మసంశ్లేషః పాతే తు ౪-౧-౧౪

ఇతరస్య అపి=పాపేతరమగు పుణ్యమునకుగూడ, ఏవమ్ = పైన జెప్పినట్లే, అసంశ్లేషః=సంబంధ ముండదు. పాతే తు = శరీరపాతానంత రముమాత్రము బ్రహ్మప్రాప్తి.

బ్రహ్మజ్ఞానము కలిగినమీదట నతనికి పూర్వోత్తరపుణ్యములతోను సంబంధ ముండదు. ప్రారబ్ధకర్మఫలముల ననుభవించినమీదట ముక్త దగును. బ్రహ్మసాక్షాత్కారము పొందిన యుపాసకుడు పూర్వోత్తర పాపపుణ్యములతో సంబద్ధుడు కాక ప్రారబ్ధకర్మఫలభోగానంతరమున దేహమునుండి విడివడి బ్రహ్మయందు నిరాతంకముగా నానందము ననుభ వించును.

"ఉభే ఉ హ్యైవైష ఏతే తరతి" బృ. ౪-౪-౨౨. 'బ్రహ్మజ్ఞాని పాపపుణ్యములను రెండింటిని తరించును.' "క్షీయంతే చాస్య కర్మాణి తస్మిన్ దృష్టే పరావరే" ముం. ౨-౨-౮. 'సర్వాంతర్యామి యగు పర బ్రహ్మను సాక్షాత్కారము చేసికొనిననాడు ఉపాసకునికర్మ లన్నియు క్షీణించును' అని యుపనిషద్వచనములు.

పై వాక్యములనుబట్టి ఉపాసకున కే దేహమున బ్రహ్మసాక్షాత్కారము - జ్ఞానము కలుగునో ఆ దేహముమాత్రము ప్రారబ్ధకర్మఫలభోగము పూర్తికానంతవరకు నతనిని విడువదనియు, ఇతరసంచితక్రియమాణ కర్మలుమాత్ర మతని నంటవనియు తెలియుచున్నది. ప్రారబ్ధకర్మఫలభోగానంతర మా దేహపాతము జరుగునని 'పాతే తు' అను పదముతో సూత్రకారుదు వివరించియున్నాడు. (౧౪)

పై విషయమునే స్పష్టము చేయుచున్నాడు.

అనారబ్ధకార్యే ఏవ తు పూర్వే తదవధేః ౪-౧-౧౫

అనారబ్ధకార్యే=ఏ పుణ్యపాపములు తమఫలము ననుభవింపజేయుటకు శరీరరూపకార్యము నారంభింపలేదో యా పుణ్యపాపములు, ఏవ తు=మాత్రమే, పూర్వే=ఈ జన్మమునందు పూర్వజన్మమునందు చేయబడినవి-సంచితకర్మలు, బ్రహ్మజ్ఞానము కలుగగానే నశించును. కారణ మేమన : తదవధేః=(తమఫలము ననుభవింపజేయదగిన శరీరరూపకార్యము నారంభింపని సంచితకర్మలు) బ్రహ్మజ్ఞానప్రాప్తియే యవధికలవి యగుటవలన, నవి యంతటితో నశించునని సూత్రార్థము.

ప్రారబ్ధములు, క్రియమాణములు, సంచితములు నని కర్మలు ముష్విధములు. వేనిఫలముల ననుభవించుటకు కొందొకదేహము లభించునో యవి ప్రారబ్ధములు. ఇప్పు డున్నదేహముతో జేయబడుకర్మలు క్రియమాణములు. వానిలో కొన్ని ప్రారబ్ధకర్మఫలముల ననుభవించుటకు తోడ్పడును. వాని (క్రియమాణకర్మల) ఫలము ప్రారబ్ధకర్మఫలములతో బాటు అనుభవింపజేయబడును. మిగిలిన క్రియామాణములు - వేనిఫలము లీ దేహమున ననుభవింప వీలుకాదో యవి - సంచితకర్మలరాశిలో చేర్చబడును. ఈ జన్మమునందును పూర్వజన్మములందును చేయబడి యీ జన్మమున ఫలముల ననుభవింపవీలుకాని కర్మలన్నియు సంచితము లనబడును.

అట్టి పాపపుణ్యకర్మలే సూత్రమున 'అనారబ్ధకార్యము' లనబడినవి. బ్రహ్మ జ్ఞానము కలిగినమీదట నా జ్ఞానాగ్నివలన సంచితకర్మలన్నియు నశించును. ప్రారబ్ధములు నశింపవు. బ్రహ్మజ్ఞానము సంచితకర్మలకే యవధి - సీమ. జ్ఞానము కలుగనంతవరకవి యుండి కలిగినమీదట నశించునని భావము. ప్రారబ్ధకర్మలు మాత్రము భోగమువలనగాని నశింపవు. వాని ననుభవించుటకు దేహ ముండును. అపుడు చేయుకర్మ (క్రియమాణకర్మ) లా ప్రారబ్ధ కర్మల ఫలము ననుభవింపజేయుటకు తోడ్పడును. వానిఫలములు ప్రత్యేకముగా ననుభవింపదగినవిగా నుండవు. అవి దగ్ధబీజములవలె ఫలోత్పాదకములు కావని భావము. భోగమువలన ప్రారబ్ధకర్మలనాశము కలుగగానే దేహపాతము జరుగును. ఉపాసకజీవుడు ముక్తు డగును. ఈ విషయమునే ఛాందోగ్యమున "తస్య తావదేవ చిరం యావ న్నవిమోక్ష్యే ఽథ సంపత్స్యే" ఛాం. ౬-౧౪-౧. "బ్రహ్మజ్ఞానికి దేహపాతము జరుగువరకే ముక్తి కలుగుటలో విలంబమగును' అని చెప్పబడినది. (౧౫)

సంచితపాపపుణ్యములు రెండును జ్ఞానాగ్నివలన నశించునెడల అగ్నిహోత్రాదిశుభకర్మల నెవ డాచరించును? వానివిధాన మేల? అన :

**అగ్నిహోత్రాది తు తత్కార్యాయైవ తద్దర్శనాత్** ౪-౧-౧౬

అగ్నిహోత్రాది తు = అగ్నిహోత్రము, అధ్యయనము మున్నగు ఆశ్రమవిహితశుభకర్మలు మాత్రము, తత్కార్యాయ ఏవ = బ్రహ్మజ్ఞానప్రాప్తిరూపకార్యముకొఱకే, తద్దర్శనాత్ = శాస్త్రమునం దట్లే చూడబడినందువలన.

అగ్నిహోత్రము, వేదాధ్యయన సంధ్యోపాసనాది కర్మలు ఆ యా ఆశ్రమములందు కర్తవ్యములుగా విధింపబడినవి. వానిఫలము నశింపదు. అగ్నిహోత్రాది నిత్యకర్మలు జ్ఞానోత్పత్తికొఱకే చేయబడును. వాని నను

ష్ఠించుటవలన చిత్తశుద్ధి కలిగి జ్ఞానోదయ మగును. అదియే వానిఫలము. కావున వానికి నాశము లేదు. అట్టికర్మలను శాస్త్రము విధించుటలో దోష మును లేదు. ఈ తథ్యమునే శాస్త్రము బోధించుచున్నది. చూడుడు :

"త మేతం వేదానువచనేన బ్రాహ్మణా వివిదిషంతి
యజ్ఞేన దానేన తపసా ఽనాశకేన" బృ. ౪-౪-౨౨.

'బ్రాహ్మణులు వేదాధ్యయనము, యజ్ఞము, దానము, అనాశక తపస్సుచేతను పరబ్రహ్మ పరమాత్మ నెరుంగగోరుదురు. ఇట్టి శాస్త్రవాక్య ములవలన అగ్నిహోత్రాది - ఆశ్రమవిహితకర్మలు బ్రహ్మజ్ఞానసాధకము లగునని తెలియుచున్నది. కావున నట్టి కర్మలకు ఫలము లభించినట్లే. వాని నాశమునకు ప్రసక్తియే కలుగదు. (౧౬)

అగ్నిహోత్రాదులకు జ్ఞానరూపఫలము లభించుటవలన నవి నశింప కున్న నిక బ్రహ్మజ్ఞానరూపాగ్నివలన నశించుకర్మ లెయ్యవి? యన :

అతో ఽన్యాఽపి హ్యేకేషా ముభయోః ౪-౧-౧౭

అతః = అగ్నిహోత్రాదులకంటె, అన్యా అపి = ఇతరములుకూడ ఉన్నవి. హి=కారణ మేమన, ఏకేషాం=కొందరిదృష్టిలో, ఉభయోః= శుభాశుభకర్మలపాఠము కలదు.

శాస్త్రములందు విధింపబడిన ఆశ్రమకర్మలు నిత్యములు, కామ్య ములు నని రెండువిధములు. అగ్నిహోత్రాదులు నిత్యములు, వాజపేయ, రాజసూయాదులు కామ్యములు. ఫలాపేక్షతో నియ్యవి యాచరింపబడును. పూర్వము సూచించిన యజ్ఞదానాదులు నిష్కామకర్మలు. వానికి బ్రహ్మ జ్ఞానమే ఫలము. వాజపేయాదులు విశేషఫలాపేక్షతో చేయబడును. ఆ ఫల ముల ననుభవించుటకు మున్నే యొకవ్యక్తి సాధనసంపత్తివలన బ్రహ్మ జ్ఞానము పొందునేని అట్టివాని యా వాజపేయాదికర్మలు నశించును. అట్టి

కర్మల నుద్దేశించియే ముండకమున ("తదా విద్వాన్ పుణ్యపాపే విధూయ" ౩-౧-౩.) 'జ్ఞాని పుణ్యపాపముల నశింపజేసికొని' అని వర్ణింపబడినది. ఇట్లే కౌశీతకీబ్రాహ్మణమున (తత్ సుకృతదుష్కృతే ధునుతే" ౧-౪.) 'అప్పుడు పుణ్యపాపములను రెండింటిని నాశనముచేయును' అనియు చెప్ప బడినది. కాబట్టి శాస్త్రమున జ్ఞానముచే పుణ్యకర్మలు నశింపజేయబడునని చెప్పినచోట కామ్యకర్మజనిత పుణ్యముగా నెంచవలయునని భావము.(౧౭)

అగ్నిహోత్రాదినిత్యకర్మల ననుష్ఠించుటవలననే జ్ఞానము కలుగునా? లేక యుపాసనకూడ అందుల కపేక్షితమా? యన :

యదేవ విద్య యేతి హి ౪-౧-౧౮

హి = ఎందువలన. 'యదేవ విద్యయా ఇతి' = 'ఏది విద్యతో అని' ఛందోగులు పఠింతురో, అందువలన ఉపాసనతోకూడిన కర్మయే జ్ఞాన రూపఫలము నొసంగునని సూత్రార్థము.

"యదేవ విద్యయా కరోతి శ్రద్ధ యోపనిషదా
తదేవ వీర్యవత్తరం భవతి" ఛాం. ౧-౧-౧౦.

'శ్రద్ధాపూర్వకముగ విధి ననుసరించి యుపాసనాసహితముగ జేసిన కర్మ యెక్కువ వీర్యవంత మగును' అని ఛందోగులు పఠింతురు. ఉపాసన వేరు, కర్మ వేరు.

ఉపాసనతోకూడినకర్మ చిత్తశుద్ధిని కలిగించి జ్ఞానము నొసంగునా? లేక ఉపాసనారహితకర్మ జ్ఞానము నొసంగునా? యన, కామ్యములు, నిష్కామకర్మలు రెండును చిత్తశుద్ధికారకములే. కాని శ్రద్ధాదులతో చేసిన కర్మ మిక్కిలిఫలదాయక మగును. కోరినఫలము నొసంగుటలో శీఘ్రము సమర్థమగును. ఇట్లనుటవలన ఉపాసనా రహితకర్మకూడ చిత్తశుద్ధికి సాధారణకారణ మగునని బోధపడును. అదియును శుభకర్మ కావున కల్యాణకరమగు మార్గమునకు కర్త నభిముఖుని జేయును. నిష్కామకర్మ

యీ దిశలో నెక్కుడు ఫలదాయక మగును. కాని కేవలకర్మవలన జ్ఞాన ప్రాదుర్భావము కాదు. ఉపాసనాసహితకర్మ మిక్కిలి సమర్థమగును. ఇందు 'ఓమ్' కారోపాసనకు మాహాత్మ్య మెక్కుడుగా నుండును. అందు వలన శీఘ్రముగ జ్ఞానము కావలయు ననువాడు శాస్త్రవిధి ననుసరించి యుపాసనాసహితకర్మల ననుష్ఠించుట ఆవశ్యక మగుచున్నదని భావము. (౧౮)

## చతుర్థాధికరణము

అనారబ్ధ - సంచితకర్మల నాశమును జెప్పి ప్రారబ్ధకర్మఫలము భోగమువలన నశించు ననుచున్నాడు.

**భోగేన త్వితరే క్షపయిత్వా సంపద్యతే ౪-౧-౧౯**

**భోగేన తు** = అనుభవముతోనే, **ఇతరే** = ఫలము నారంభించిన సుకృతదుష్కృతములు రెండును, **క్షపయిత్వా**=నశింపజేసి, **సంపద్యతే**= బ్రహ్మను పొందును.

సంచితపుణ్యపాపములు బ్రహ్మజ్ఞానముచే నశించును. ప్రారబ్ధకర్మ ఫలము భోగముతో నశించును. అనంతరము దేహపాతము జరుగును - మరణము సంభవించును. అయ్యదియే మోక్షము. "త స్య తా వ దే వ చిరం........" అను నీ ఛాందోగ్యవాక్యమువలన బ్రహ్మజ్ఞానము కలుగ గానే ముక్తి కలుగదనియు, ప్రారబ్ధకర్మఫలభోగము పూర్తియైన మీదట శరీరపాతము జరిగి ముక్తుడగుననియు స్పష్టపడుచున్నది. ప్రారబ్ధభోగము పూర్తి కానంతవరకు జీవుడు దేహమునుండి ముక్తుడు కాడని భావము. (౧౯)

వేదాంత దర్శన - ఆంధ్ర వ్యాఖ్యానమున
చతుర్థాధ్యాయమునందు ప్రథమపాదము
సమాప్తము

# చతుర్థాధ్యాయము

## ద్వితీయపాదము

### ప్రథమాధికరణము

కర్మ, ఉపాసన, జ్ఞానము నను మూడును ప్రకృతములు. వానిలో కర్మోపాసనలు రెండును జ్ఞానసాధనములు. జ్ఞానము సాధ్యము. జ్ఞాన ఫలము ముక్తి - పరబ్రహ్మప్రాప్తి. ప్రథమపాదమున బ్రహ్మజ్ఞానమువలన సంచితకర్మనాశము, భోగమువలన ప్రారబ్ధకర్మనాశము వివరింపబడినవి.

మరణానంతరమున జీవాత్మకు లోకాంతరగతి కలుగును. అది ఉత్క్రాంతి యనబడును. ఈ ద్వితీయపాదమునందు ఉత్క్రాంతినిగూర్చి వివేచింపబడును. మృత్యుసమయమున ఇంద్రియములు తమకార్యములు చేయమానును. జీవు డా యింద్రియముల వెంటగొని దేహమును విడిచి పోవును. ఈ విషయమును వివరింపబూని సూత్రకారుడు ప్రథమమున వాగింద్రియలయమును వర్ణించుచున్నాడు.

**వాఙ్ మనసి దర్శనా చ్ఛబ్దా చ్చ ౪-౨-౧**

వాక్ = వాగింద్రియము, మనసి = అంతరింద్రియమగు మనస్సునందు(లయమగును). దర్శనాత్ = వాగ్వ్యాపార ముడుగుటచూచుచున్నందు వలన, శబ్దాత్ చ = శబ్దప్రమాణమువలనను, వాక్కు మనస్సున లయమయినట్లు తెలియుచున్నది.

మరణ మాసన్నమైనపుడు - జీవుడు శరీరమును విడువ నున్నపుడు మనుష్యుడు మాటలాడనేరడు. యత్నించియు అసఫలు డగుచుండును. ఇది లోకసిద్ధవిషయమే. అందువలననే వాక్కు మనస్సున లీనమైన ట్లెంచబడును. ఈ విషయము ఉపనిషద్వాక్యములును చెప్పుచున్నవి.

"అస్య సోమ్య । పురుషస్య ప్రయతో వాఙ్ మనసి సంపద్యతే" ఛాం. ౬-౮-౬. 'మరణించు పురుషుని వాక్కు మనస్సున చేరును'. అని ఉద్దాలకుడు శ్వేతకేతునకు చెప్పియున్నాడు. (౧)

వాక్కు మనస్సున లీనమైన మిగిలిన ఇంద్రియములగతి యేమగు, నన :

## అత ఏవ సర్వాణ్యను ౪-౨-౨

అత ఏవ = పై హేతువులవలననే, సర్వాణి = మిగిలిన నేత్రాదీంద్రియములన్నియు, అను = వాక్కు ననుసరించి, మనస్సునందే చేరునని సూత్రార్థము.

మరణసమయమున వాక్కు పనిచేయదు. దానితోబాటు ఇతరేంద్రియములు - చక్షురాదు లన్నియు వాక్కునే యనుసరించును. బాహ్యేంద్రియవ్యాపారము లన్నియు ఉడుగుట నెల్లరు చూతురు. ఇతరేంద్రియములు కూడ మనసున చేరుననుటకు లోకదర్శనము, శబ్దము ననునవియే హేతువులు.

> "తస్మా దుపశాంతతేజాః పునర్భవ మింద్రియైః
> మనసి సంపద్యమానైః" ప్ర. ఉ. ౩-౯.

'శాంతతేజస్కుడైన జీవుడు మనస్సునందు లీనమైన యింద్రియములతోబాటు పునర్జన్మను బొందును'. అను నీ యుపనిషద్వాక్యమువలనను, లోకదర్శనమువలనను మృత్యుసమయమున చక్షురాదీంద్రియములు కూడ వాక్కుతోబాటు మనస్సునందే చేరునని తెలియుచున్నది. (౨)

ఇంద్రియములతో గూడిన మన స్సెక్కడ లయమగు, నన :

## తన్మనః ప్రాణ ఉత్తరాత్ ౪-౨-౩

ఉత్తరాత్ = తరువాతివాక్యమువలన, తన్మనః = ఇంద్రియము లతోగూడిన ఆ మనస్సు, ప్రాణే = ప్రాణమునందు చేరును.

ఛాందోగ్యమున (వాఙ్ మనసి సంపద్యతే) వాక్కు మనస్సులో చేరునని చెప్పి, (మనః ప్రాణే. ౬-౬) 'మనస్సు ప్రాణమున చేరు నని చెప్పబడియున్నది. ఈ ప్రాణపదము ముఖ్యప్రాణము - బుద్ధితత్త్వమునకు బోధకము. ఇట్లు ఇంద్రియములతో గూడిన మనస్సు ప్రాణమున లీనమగు నని భావము. (౩)

ప్రాణ మెక్కడ సంపన్న మగు, నన :

## సోఽధ్యక్షే తదుపగమాదిభ్యః ౪-౨-౪

తదుపగమాదిభ్యః = ఇంద్రియాధ్యక్షుడైన జీవుని సమీపగమన, అనుగమనాదులవలన, సః = ఆ ప్రాణము, అధ్యక్షే = ఇంద్రియాధ్యక్షుడైన జీవునియందు చేరును.

(సూత్రమునందలి తత్పదము అధ్యక్షబోధకము. ఉపగమః = ప్రాప్తి, ఆది = అనుగమనము, అవస్థానము = స్థితి.)

ప్రాణము ఆత్మయందు లీనమగును. దేహమును విడిచి జీవునితో చేరునని భావము. ఇంద్రియములతోబాటు మనస్సు, ప్రాణాపానాది వృత్తులు నేవియు దేహమున నుండక అవి యన్నియు జీవునిచేరి యతనితో దేహాంతరమున కేగును.

"ఏవ మే వేయ మాత్మాన మంతకాలే సర్వే ప్రాణా అభిసమాయంతి యత్రైతదూర్ధ్వోచ్ఛ్వాసీ భవతి" బృ. ౪-౩-౩౮. 'అంతరాలమున ప్రాణము లన్నియు ఆత్మను చేరును'. ఇదియే ఉపగమము.

"ఏష ఆత్మా నిష్క్రామతి .... శరీరదేశేభ్యః తముత్క్రాంతం

ప్రాణే = [illegible] ప్రాణ [illegible] ప్రాణ [illegible] [illegible]. 'సాయుజ్య [illegible]' [illegible] [illegible]. [illegible].

తరువాత 'స విజ్ఞానో భవతి' 'ఆత్మయందు సర్వప్రాణములతో [illegible] కూడి యుండును.' [illegible] [illegible] [illegible].

ఇట్లు ప్రాణాదులు ఆత్మతో చేరుదురని రూపము (౪)

## ద్వితీయాధికరణము

ప్రాణములతో కూడిన ఆత్మ యెట చేరును? అన :

భూతేషు తచ్ఛ్రుతేః ॥ ౪-౨-౫

తచ్ఛ్రుతేః = శ్రుతివాక్యములవలన, భూతేషు = ఆయాత్మ భూతములందు చేరును.

జీవు డీస్థూలదేహమును విడిచి వెళ్ళునపుడు లింగాయుతుడుగా ఉత్క్రమించును - బయటికి (పైకి) పోవును. మఱియొక అతివాహికశరీరమునకు కారణరూపములైన సూక్ష్మభూతములలో నున్నవాడై - వానితో సంశ్లిష్టుడై స్థూలదేహమును విడిచి పోవును. స్థూలశరీరము పోయినను జీవునకు సూక్ష్మశరీర ముండును. ప్రళయకాలమునను, బ్రహ్మజ్ఞానము కలిగి ముక్తి పొందినపుడును జీవునకు ఈ శరీరసంబంధ ముండదు. కాని స్థూలశరీరమున నున్నపుడును జీవునకు సూక్ష్మశరీరసంబంధ ముండును. మృత్యుకాలమున స్థూలదేహము విడిపోవును. సూక్ష్మదేహముతో నతడు పయనించును. దీనిని కారణశరీరమనియు చెప్పవచ్చును. అనంతరమున వచ్చే స్థూలశరీరమునకు కారణమగును. అందు 'పదుమూడు కరణము

నుండును. పది బాహ్యకరణములు. మూడుఅంతఃకరణములు. (ఐదు కర్మేంద్రియములు. ఐదు జ్ఞానేంద్రియములు. మనస్సు. అహంకారము. బుద్ధి. ఈకరణము లన్నియు ప్రాణపదముతో చెప్పబడును. వీనిలో బుద్ధి ముఖ్యప్రాణము - శ్రేష్ఠప్రాణము - అనబడును.) ఐదు సూక్ష్మభూతములు అన్నియు కలిసి పదునెనిమిది తత్త్వములు. ఇదియే సూక్ష్మదేహము - జీవునకు వాహకశరీరము. స్థూలదేహము కర్మానుష్ఠానమునకు, భోగమునకు ఆశ్రయము. ఇందే ఆత్మజ్ఞానము సంపాదింప ననువగును.

"ప్రాణ స్తేజసి" ఛాం. ౬-౮-౬. అనువాక్యమునుబట్టి ప్రాణ సంపన్నుడగు జీవుడు తేజఃసహచరిత సూక్ష్మభూతములం దుండును. సూక్ష్మభూతములతో కూడి జీవుడు ఉత్క్రమణము చేయునని భావము. (౫)

'ప్రాణ స్తేజసి' అను వాక్యము ననుసరించి జీవాత్మ - తేజస్సునందే చేరుననక యితరభూతములందును చేరు నన నేల ? యన :

నైకస్మిన్ దర్శయతో హి ౪-౨-౬

ఏకస్మిన్=ఒక్క తేజస్సునందే, న=ప్రాణములతో కూడిన జీవాత్మ సంపన్నుడు కాదు - చేరడు, హి = కారణ మేమన, దర్శయతః=ఉపనిషత్తులు, స్మృతులు అట్లే చెప్పుచున్నవి.

ఉపనిషత్తులు, స్మృతులు రెండును మరణసమయమున వాగాది ప్రాణాంతపరివారముతో కూడిన జీవాత్మ పృథివ్యాదిస్థూలభూతములకు కారణములైన సూక్ష్మభూతములతో సమావిష్టు డగునని చెప్పుచున్నవి.

"పృథివీమయ ఆపోమయో వాయుమయ
ఆకాశమయ స్తేజోమయః" బృ. ౪-౪-౫.

'ప్రాతదేహమును విడిచి నూతనదేహమును బొందుటకు సిద్ధమగు

నపుడు జీవాత్మ పృథివీమయము. జలమయము, వాయుమయము, ఆకాశ మయము, తేజోమయము నగును'.

"అణ్వ్యోమాత్రాఽవినాశిన్యో దశార్ధానాం తు యాః స్మృతాః,
తాభిః సార్ధమిదం సర్వం సంభవ త్యనుపూర్వశః" మ. ౧-౨౭.

'సూక్ష్మములగు పంచతన్మాత్రలతో నిది యంతయు క్రమముగా జనించును.' అనునిట్టిశబ్దప్రమాణముల ననుసరించి జీవాత్మ కేవల మొక్క తేజస్సునందే చేరక సమస్తసూక్ష్మభూతములందు చేరి - పంచతన్మాత్ర లతో సంవేష్టితుడై దేహాంతరమున బ్రవేశించునని తెలియుచున్నది. 'ప్రాణ స్తేజసి' అనువాక్యమున గల తేజఃపదము ప్రాధాన్యముగ చెప్పబడి మిగిలిన సూక్ష్మభూతములకు గ్రాహకముగ - ఉపలక్షకముగ చెప్పబడిన ట్లెంచవలెను.

బృహదారణ్యకమున గల యాజ్ఞ్యవల్క్య - ఆర్తభాగ సంవాదము నందు, మరణసమయమున వాగాదికరణము లన్నియు తమవ్యాపారములను మానుకొనినపుడు. ("క్వాయం తదా పురుషో భవతి" బృ. ౩-౨-౧౩) 'అప్పుడు జీవాత్మ యెక్కడ ఉండును?' అని ప్రశ్నించి సమాధానము చెప్పబడినది. ("తౌహ యదూచతుః కర్మ హైవ తదూచతుః అథహయత్ ప్రశశంసతుః కర్మ హైవ తత్ ప్రశశంసతుః." బృ. ౩-౨-౧౩) 'యాజ్ఞ వల్క్యుడు ఆర్తభాగుడును అది కర్మయే యని చెప్పబడినది. కర్మయే ప్రశంసింపబడినది' అనిరి.

మృత్యువుతదుపరి జీవున కాశ్రయము కర్మయే. వాస్తవమున జీవున కాశ్రయము సూక్ష్మదేహమైనను, కర్మయే జీవునిఁచ్చనీచజన్మము లకు గొంపోవును. కావున నిట జీవునకు కర్మ ఆశ్రయ మనబడినది. మరి యొక తావున ("పుణ్యో వై పుణ్యేన కర్మణా భవతి పాపః పాపేన" బృ. ౩-౨-౧౩) 'పుణ్యకర్మవలన పుణ్యయోని, పాపమువలన పాపయో

నియు లభించును . అని వర్ణింపబడినది. కావున మరణసమయమున జీవుడు వాగాదికరణములతోబాటు సూక్ష్మభూతములచే సంవేష్టితుడై దేహాంతర మున కేగునని సిద్ధమగుచున్నది. (౬)

## తృతీయాధికరణము

మృత్యుసమయమున నిట్టిగతి యుపాసకునకే కలుగునా? ఇతరు లకు కూడ కల్గునా? అన :

సమానా చాసృత్యుపక్రమా దమృతత్వం
చానుపోష్య ౪-౨-౭

ఆ సృత్యుపక్రమాత్=లోకాంతరగత్యారంభమువరకు, సమానా చ= ఉపాసకులకు ఇతరులకు మరణకాలగతి సమానమే, చ=ఎందువలన నన, అనుపోష్య=శరీరమును విడిచి, అమృతత్వం = ఉపాసకులు అమరతను పొందుదురు.

దేహమునుండి వెలువడి కర్మానుసారము గతి ప్రారంభము కానంత వరకు జ్ఞానులయు, అజ్ఞానులయు మరణకాలస్థితి సమానముగనే యుండును. కారణ మేమన : జ్ఞాని మరణించిన తదుపరి శరీరమును విడిచి ముక్తు డగును. అమరత్వమును బొందును.

(సూత్రమున గల మొదటి 'చ' కారము అవధారణార్థకము. రెండ వది హేత్వర్థకము. ఉపోష్యపదము సమీప నివాసార్థకము. అనుపోష్య= సమీపమున నుండక, యని యర్థము.)

ఆత్మ సూక్ష్మదేహమునకు సమీపమున నుండి యెల్లపుడు గతి నొనరించును - అన్యదేహమున కేగును. కాని బ్రహ్మసాక్షాత్కారము పొందిన జీవునకు స్థూలదేహము విడువవలసివచ్చినపుడు సూక్ష్మదేహము

కూడ విడిపోవును. ఈ విషయమే సూత్రమునందలి అనుపోష్యపదము తెలుపుచున్నది. జ్ఞాని స్థూలదేహమును విడిచి, సూక్ష్మదేహసామీప్యమును గూడ పొందక అమరత్వమును బొందును. మృత్యుకాలమున ఇంద్రియాదులన్నియు తమవ్యాపారములను విడిచి ఆత్మతో పూర్తిగ చేరిపోవువరకు జ్ఞానులయు, అజ్ఞానులయు గతిలో భేదముండదు. స్థూలదేహమునుండి ఆత్మకు ఉత్క్రాంతి కలిగినపుడు అజ్ఞాని సూక్ష్మదేహముతోగూడి దేహాంతరమున కేగును. జ్ఞాని యట్లుకాక బ్రహ్మమును బొంది అమరత్వమును సంపాదించుకొనును. ఇదియే భేదము. ఈ విషయమే కఠోపనిషత్తున నిట్లు వర్ణింపబడినది.

'శతం చైకా హృదయస్యేహ నాడ్య
స్తాసాం మూర్ధాన మభినిఃస్సృతైకా,
తయోర్ధ్వ మాయ న్నమృతత్వ మేతి
విష్వఙ్ఙన్యా ఉత్క్రమణే భవంతి' కఠ. ౨-౩-౧౬.

'హృదయనాడులు ౧౦౧. వానిలో నొకటి బ్రహ్మరంధ్రమువైపునకు పోవును. అదియే సుషుమ్న. ఆనాడిలో ప్రవేశించి దేహమునుండి వెలువడు జీవుడు అమృతత్వమును బొందును. జ్ఞానికి కలుగు ఉత్క్రాంతి విధ మిది. ఇతర - అజ్ఞానులకు ఇతరనాడులద్వారా ఉత్క్రాంతి కలుగును. వారు దేహాంతరములను బొందుదురు.'

ఇట్లు కరణముల యుపసంహారమువరకు గతి సమానమే యగును. జ్ఞాని దేహమును విడిచి ముక్తుడగును. అజ్ఞానులు సూక్ష్మదేహము నాశ్రయించి యన్యయోనులను చేరుదురు. ఇదియే యంతరము. (౭)

## చతుర్థాధికరణము

ఇంద్రియములు, మనస్సు, బుద్ధి, సూక్ష్మభూతాదుల సముదాయము - వీనితో నేర్పడిన సూక్ష్మశరీరసంబంధము ఆత్మ కెప్పటివరకు నుండు? నన:

తదాఽపీతేః సంసారవ్యపదేశాత్ ౪-౨-౮

తత్=ఆ సూక్ష్మశరీరము, ఆ అపీతేః=ముక్తిపర్యంతము ఉండును. సంసారవ్యపదేశాత్=శరీర మున్నంతవరకు సంసారము (ప్రపంచము) చెప్పబడినందువలన.

అజ్ఞానులకు ప్రళయమువరకు సూక్ష్మశరీర ముండును. జ్ఞానులకు మోక్షపర్యంత ముండును. జన్మమరణములతోబాటు స్థూలదేహము మారు చుండును. సృష్టికాలమున జీవులకు సూక్ష్మశరీరముతో సంపర్క మేర్ప డును. అయ్యది ప్రళయమువరకు నుండును. సృష్టికాలమున నే జీవునకు బ్రహ్మజ్ఞానము కలుగునో అతని కా స్థూలదేహపాతము జరుగువరకు సూక్ష్మదేహముతో సంబంధ ముండును. జ్ఞానమువలన సంచితకర్మలు, భోగమువలన ప్రారబ్ధములు నశించిన తదుపరి స్థూలదేహముతోబాటు సూక్ష్మదేహసంబంధముకూడ జ్ఞానికి విడిపోవును. అజ్ఞానుల సూక్ష్మశరీర మునకు కారణములైన తత్వములు ప్రళయకాలమున తమకారణములలో లీనము లగును. ప్రళయమున నాత్మలకు ఎట్టిశరీరములతోను సంబంధ ముండదు. బ్రహ్మజ్ఞానికి సృష్టికాలముననే యిట్టిస్థితి యేర్పడును. జీవులు విషయసుఖముల ననుభవించుచున్నంతవరకే సంసార మనబడును.ఆత్మకు శరీరముతో సంబంధ మున్నపుడే వైషయికసుఖానుభూతి యుండును. కావున దేహసంబంధమే సంసారము. ప్రళయమోక్షములందు దేహసంబంధ ముండదు. ఇతరసమయమందు సూక్ష్మశరీరసంబంధ ముండును. (౮)

జీవుడు సూక్ష్మశరీరముతో పోవునపుడు కనబడ దేల ? అన :

సూక్ష్మం ప్రమాణత శ్చ తథోపలబ్ధేః ౪-౨-౯

ప్రమాణతః చ = ప్రమాణమువలనను, తథోపలబ్ధేః = సూక్ష్మమని **తెలియుటవలన, సూక్ష్మమ్ = ఆశరీరము సూక్ష్మము - ఇంద్రియగోచరము కాదు.**

సూక్ష్మదేహము సూక్ష్మము కావున నది యింద్రియములచే తెలియబడదు. అనుమానాదిప్రమాణములవలనను నది సూక్ష్మమనియే తెలియబడుచున్నది. సూక్ష్మశరీరము వేనితో ప్రారంభింపబడినదో యవి యతీంద్రియములు. కావున నది తెలియబడదు.

"చక్షుష్టోవా మూర్ధ్నోవా అన్యేభ్యోవా శరీరదేశేభ్యః" బృ. ౪-౪-౨ సూక్ష్మశరీరముతో కూడి జీవుడు చక్షురాదీంద్రియములనుండియు, ఇతర సూక్ష్మనాడులనుండియు వెడలిపోవునని చెప్పుటవలన సూక్ష్మశరీరము ఇంద్రియగోచరము కాదని భావము. (౯)

సూక్ష్మశరీరము కావున,

## నోపమర్దే నాతః ౪-౨-౧౦

అతః = సూక్ష్మమగుటవలన, ఉపమర్దేన = స్థూలశరీరనాశము వలన, న = నశింపదు.

అగ్నిదాహాదినిమిత్తమున నశించుట ఉపమర్ద మనబడును. స్థూల శరీరము దాహాదులవలన నశించినను; సూక్ష్మశరీరము నశింపదని భావము. (౧౦)

సూక్ష్మశరీర మున్నదనుటకు లోకసిద్ధప్రమాణమును చూపుచున్నాడు.

## అస్యైవ చోపపత్తే రేష ఊష్మా ౪-౨-౧౧

ఉపపత్తేః = యుక్తివలన, ఏషః ఊష్మా = ఈస్థూలశరీరమున దెలియబడు వేడిమి, అస్యైవ = ఈసూక్ష్మశరీరమునకు సంబంధించినదే.

మన యీ స్థూలశరీరములందు నెల్లరిచే ననుభవింపబడు ఉష్ణత స్థూలదేహములకు సంబంధించినది కాదు. అది స్థూలశరీరమునకు చెందిన చగునెడల మృతదేహమునందును ఉష్ణత యుండవలెను. దేహధర్మములు

దేహము ఉన్నంతవరకు నుండును. దేహధర్మములైన రంగు మున్నగు గుణములు మృతదేహమునందు నుండును. కాని యుష్ణ ముండదుకదా। కాబట్టి యది స్థూలదేహమునకు చెందినది కాదు. ఉష్ణత జీవాత్మధర్మమును కాదు. ప్రాకృతధర్మము చేతనమున నెట్లుండును? కావున నీయుష్ణత సూక్ష్మశరీరమునకు చెందిన దనక తప్పదు. సూక్ష్మశరీరముతో ఆవేష్టితుడై జీవుడు ఉత్క్రమణము చేయును. కావున అప్పు డాయుష్ణత స్థూలదేహమున నుండదు. ఇట్లు ఎల్లదేహములందు నెల్లరచే తెలియబడు ఉష్ణతకాధారముగ నొకసూక్ష్మశరీర మున్నదని యుక్తిమూలమున తెలియుచున్నదని భావము. (౧౧)

## పంచమాధికరణము

సూక్ష్మశరీర మనునదొకటి యున్నను నది ముక్తిపర్యంతము జీవునితో సంవేష్టితమై యుండు ననుట తగదు. అయ్యది జీవునితో ఉత్క్రమణము చేయదని బృహదారణ్యకమున వర్ణింపబడినదికదా? యన, సమాధానము చెప్పుచున్నాడు.

ప్రతిషేధా దితిచేన్న శారీరాత్ ౪-౨-౧౨

ప్రతిషేధాత్ ఇతి చేత్ = నిరాకరింపబడుటవలన ముక్తివరకు సూక్ష్మశరీర ముండుననుట తగ దందురేని, న = అది సరికాదు. శారీరాత్ = (శారీరః = జీవుడు) జీవునినుండి ఉత్క్రమణము నిషేధింపబడినది, కాని శరీరమునుండి కాదు.

"యత్రాయం పురుషో మ్రియత ఉదస్మాత్
ప్రాణాః క్రామంతి ఆహో నేతి? నేతి హోవాచ
యాజ్ఞవల్క్యః, అత్రైవ సమవనీయంతే. స
ఉచ్ఛ్వయ త్యాధ్మాయ త్యాధ్మాతో మృతః శేతే" బృ. ౩-౨-౧౧.

'ఈ పురుషుడు మరణించునపుడు ప్రాణములు ఉత్క్రమించునా ? లేక యుత్క్రమింపవా ?' యని ఆర్తభాగుడు యాజ్ఞవల్క్యుని అడిగెను. 'అవి యిక్కడనే లీనములగును. అతడు లావెక్కును. ఉబ్బిపోవును. ఉబ్బి చచ్చి శయనించును.' అని యాజ్ఞవల్క్యుడు చెప్పెను. దీనింబట్టి ప్రాణములు జీవునితో నుత్క్రమింపవని స్పష్టమగుచున్నది. అందువలన ముక్తిపర్యంతము సూక్ష్మశరీరము జీవునితో సంబద్ధమై యుండు ననుట పొసగదని శంకాభిప్రాయము.

సమాధానము : ఈ ప్రసంగమునందు చెప్పబడిన ప్రాణోత్క్రమణనిషేధము శరీరమునుండి యుత్క్రమింపవని చెప్పుట కాదు. శారీర-జీవాత్మనుండి యవి యుత్క్రమింపవని చెప్పబడినట్లెంచవలెను. ప్రాణపదముచే చెప్పబడిన సూక్ష్మ-లింగశరీరము స్థూలదేహమునుండి యుత్క్రమించును - వెడలిపోవును. కాని, జీవాత్మనుండి వేరుకాదని యభిప్రాయము. కారణ మేమన : ప్రశ్నకర్త పురుషుడు మరణించునపుడు అని ప్రశ్నించి యున్నాడు. పురుషుడన జీవుడు, శరీరము కాదు. (అస్మాత్) ఆపురుషుని నుండి ప్రాణము లుత్క్రమించునా ? అని ప్రశ్నించుటవలన సమాధానము చెప్పుచు యాజ్ఞవల్క్యుడు పురుషునినుండి యుత్క్రమింపవు - వేరుకావు, అని చెప్పినాడు. కావున సూక్ష్మశరీరము ముక్తిపర్యంతము జీవునితో నుండు ననుట సంగతమే.

బృహదారణ్యకములోని పై ప్రసంగము (౩-౨-౧౧) బ్రహ్మజ్ఞానికి సంబంధించినదిగా నెంచెదమేని అప్పుడు ప్రశ్నమునకు ప్రసక్తియే యుండదు. జ్ఞాని ముక్తుడగును. కావున నతని సూక్ష్మదేహము స్థూలదేహముతో పాటు స్వకారణములందు లీనమై నశించును. అది యుచితమే. (౧౨)

పై విషయమునే శాఖాంతరసంవాదముతో బలపరుచుచున్నారు.

స్పష్టో హ్యేకేషామ్ ౪-౨-౧౩

ఏకేషామ్ = కొందఱిమతమున, స్పష్టః హి = సూక్ష్మశరీరముతో ఉత్క్రమణము స్పష్టమే.

కౌషీతకీశాఖకు సంబంధించినవారు జీవాత్మ ప్రాణములతోబాటు శరీరమునుండి యుత్క్రమించునని స్పష్టముగా జెప్పుచున్నారు.

"స యదస్మా చ్ఛరీరా దుత్క్రామతి.... సహ
హ్యేతా వస్మిన్ శరీరే వసతః సహ ఉత్క్రామతః"
(కౌ. బ్రా. ఉ. ౩-౪)

'జీవు డీశరీరమునుండి యుత్క్రమించునపుడు (జీవుడు, ప్రాణములు రెండును శరీరమున కలిసియుండును; కావున) ప్రాణములతో కలిసియే యుత్క్రమించును.'

"స యదాఽస్మా చ్ఛరీరా దుత్క్రామతి సహైవైతైః
సర్వై రుత్క్రామతి" కౌ- ౩-౪.

"ఆ జీవు డీశరీరమునుండి యుత్క్రమించునపుడు ఈః ప్రాణములతో నన్నింటితో నుత్క్రమించును.' అని స్పష్టముగా కౌషీతకులు చెప్పుచున్నందున జీవునితోబాటు లింగశరీర ముత్క్రమించుననియు ముక్తిపర్యంత మతనిని విడువ దనియు చెప్పుట యుచితమే యగును. (౧౩)

ఈః విషయముననే స్మృతిప్రమాణము నిచ్చుచున్నాడు.

స్మర్యతే ౪-౨-౧౪

సూక్ష్మశరీరముతో జీవు డుత్క్రమించునని స్మృతియందును చెప్పబడినదని సూత్రార్థము.

"తమోఽయం తు సమాశ్రిత్య చిరం తిష్ఠతి సేంద్రియః
న చ స్వం కురుతే కర్మ తదోత్క్రామతి మూర్తితః" మ. ౧-౫౫.

ఇది మృత్యుసమయవర్ణనము. 'ఈ జీవుడు ఇంద్రియములతో కూడి బహుకాలముండును. ఇంద్రియములు తమవ్యాపారములను (బ్రహ్మజ్ఞానమును బడిసి జీవుడు తమస్సు నాశ్రయించి యున్నపుడు) విడిచిపెట్టును. అప్పు డా జీవుడు ఏ కార్యమును చేయడు. మూర్తితః=స్థూలశరీరమునుండి యుత్క్రమించును.'

అత దేస్థితిలో యుత్క్రమించునో క్రిందిశ్లోకము చెప్పను.

"యదాణుమాత్రికో భూత్వా బీజం స్థాస్ను చరిష్ణు చ,
సమావిశతి సంసృష్ట స్తదా మూర్తిం విముంచతి" మ. ౧-౫౬.

"అణుమాత్రికుడు - తన్మాత్రల - సూక్ష్మభూతములతో గూడిన జీవుడు, స్థావరజంగమయోనులందు కర్మల ననుసరించి ప్రవేశించి స్థూలశరీరమును గ్రహించుచు విడుచుచు నుండును". ఇట్లు జీవుడు ముక్తి లభించువరకు సూక్ష్మ - లింగ శరీరముతో నాయా యోనులం జేర ఉత్క్రమించునని భావము. (౧౪)

## షష్ఠాధికరణము

ఇట్లు ప్రాసంగికవిషయమును ముగించి సూత్రకారుడు ప్రకృతము ననుసరించుచు వాగాదుల లయక్రమమును జెప్పుచున్నాడు.

తాని పరే తథా హ్యాహ ౪-౨-౧౫

తాని=వాగాదీంద్రియములు లీనములైన సూక్ష్మభూతములు, పరే=బ్రహ్మమునందు లీనమగును. హి = కారణ మేమన, తథా ఆహ = శబ్దప్రమాణ మట్లే చెప్పుచున్నది.

జీవాత్మతో గూడిన వాగాది భూతసూక్ష్మపర్యంతమగు లింగశరీరము హృదయాకాశావచ్ఛిన్నమగు పరబ్రహ్మమున జేరును - లీన మగును. "తేజః పరస్యాం దేవతాయామ్" (ఛాం. ౬-౮-౬) తేజః=వాగాదీంద్రియ[illegible]

ములు తమలో లీనమైనదర్చుకొనియున్న భూతసూక్ష్మము - లింగశరీరము - దానితో సంవేష్టితుడై యున్న జీవుడు. పరదేవత - పరబ్రహ్మమునందు లీనమగునని వ్యాఖ్యార్థము. ఆ దశలో జీవున కెట్టి సుఖదుఃఖములు నుండవు. అట్లే, సుషుప్తిప్రళయదశలలోను జీవునకు సుఖదుఃఖము లుండవని తెలియనగును. సమాధి, ముక్తావస్థలలో జీవుడు ఆనందము ననుభవించును. (౧౫)

వాగాదీంద్రియములకు మనస్సు మున్నగువానియందు సంపత్తి (వాక్ మనసి సంపద్యతే) చెప్పబడినది కదా! ఈ సంపత్తిపదమున కర్థ మేమి? యన :

## అవిభాగో వచనాత్ ౪-౨-౧౬

వచనాత్=దృష్టాంతవచనమువలన, అవిభాగః=అవిభాగము - విభజింపవీలుకాని సంయోగవిశేషము. అదియే సంపత్తిపదమున కర్థము. అంతే కాని సంపత్తి - లయము - అనగా ఒక్కటియైపోవుట కాదు.

"యథా సోమ్య మధు మధుకృతో నిస్తిష్ఠంతి నానాత్యయానాం వృక్షాణాం రసాన్ సమవహార మేకతాం రసం గమయంతి" ఛాం ౬-౯-౧.

"తే యథా తత్ర న వివేకం లభంతే అముష్యాహం వృక్షస్య రసోఽస్మ్యముష్యాహం వృక్షస్య రసోఽస్మీతి. ఏవ మేవ ఖలు సోమ్యేమాః సర్వాః ప్రజాః సతి సంపద్య న విదుః సతి సంపద్యామహే" ఛాం.౬-౯-౨.

"సోమ్యా! తేనెటీగలు తేనెను చేకూర్చును. భిన్నస్థలములందున్న వివిధవృక్షములనుండి పుష్పరసమును నొకచో చేర్చి మధువును - మధురసమును సిద్ధముచేయును. ఆ మధురసములు వేరువేరు వృక్షములకు సంబంధించినవిగా తమ్ము గుర్తింపనేరవు. అట్లే సమస్తప్రజలు ప్రతిదినము సతిసంపద్యమానములై - సత్తునజేరి - లీనమై భిన్నవ్యవహారమునకు విషయములు కానేరవు".

ఇట్టిస్థితినే లయము, సంపత్తి యందురు. తేనెలో చేరిన వివిధ్య రసములను వేరుగ వ్యవహరింప వీలు గలుగనట్లు బ్రహ్మమున జీవులు లీనమై వేరుగ వ్యవహరింప వీలుగానిస్థితియం దుందురనుటయే లయశబ్దార్థము. అంతేకాని జీవులు బ్రహ్మ మగుదురని కాదు. జీవులస్వరూపమునకు హాని కలుగదని భావము. (౧౬)

## సప్తమాధికరణము

గతి ప్రారంభమగుటకు పూర్వము ఉపాసకులకు ఇతరులకు ఉత్క్రమణము సమానమని చెప్పబడినది. తదుపరి యుత్క్రాంతిలోగల విశేషము చెప్పుచున్నాడు.

తదోకోఽగ్రజ్వలనం తత్ప్రకాశితద్వారో
విద్యాసామర్థ్యాత్ తచ్ఛేషగత్యనుస్మృతియోగాచ్చ
హార్దానుగృహీతః శతాధికయా ౪-౨-౧౭

విద్యాసామర్థ్యాత్=ఉపాసనవిద్యామాహాత్మ్యమువలన, తచ్ఛేషగత్యనుస్మృతియోగాత్ చ=ఆ విద్యాశేషమగు గతిస్మరణవలనను, తదోకోఽగ్రజ్వలనం = బ్రహ్మమందు లీనమైన లింగశరీరసహితజీవాత్మునికి స్థానమైన హృదయాగ్రభాగము ప్రకాశించును. తత్ప్రకాశితద్వారః = హృదయాగ్రప్రకాశముచే ప్రకాశింపజేయబడిన నిష్క్రమణద్వారము గల, హార్దానుగృహీతః = హృదయస్థబ్రహ్మముచే ననుగృహీతుడైన యుపాసకుడు, శతాధికయా=శతమునకు మించి సుషుమ్నానామము గలిగియున్న బ్రహ్మనాడితో శరీరమునుండి నిష్క్రమించును.

మరణకాలమున సమస్తకరణములు సంకుచితములై జీవునకు నిలయమగు హృదయమందు లీనమగును. ఇంతవరకు దేహమున జరుగు జీవవ్యాపారము లన్నియు ఉడిగిపోవును. హృదయమున సున్న తమ

కధ్యక్షుడైన జీవాత్మతో చేరును. ఉపనిషత్తున నిట్లే చెప్పబడినది. "స ఏతా స్తేజోమాత్రాః సమభ్యాదదానో హృదయమేవాన్వవక్రామతి" (బృ. ౪-౪-౧) 'ఆ జీవుడు వ్యాపారరతములైన తేజోమయకరణములను మృత్యు సమయమున తనతో చేర్చుకొని హృదయమునకు గొంపోవును'. అప్పుడు లింగశరీరముతోబాటు జీవుడు హృదయమున నుండును. దేహమున నపుడు ఇంద్రియకార్యము లేవియు జరుగవు. అదియే జీవుడు శరీరమునుండి వెలు వడుసమయము. అప్పుడు హృదయాగ్రభాగము ప్రకాశితమగును. ఆ భాగమునుండియే 'హితా' యను పేరుగల హృదయనాడులు పైకి వచ్చును. నూటొక్కనాడు లవియే. ఈ నాడులనుండియే జీవులకు వానికర్మల ననుస రించి వివిధగతులు కలుగును. వీనిలో సుషుమ్నానాడి యొకటి. దానికి మూర్ధబ్రహ్మరంధ్రముతో సంబంధ ముండును. ఇతరనాడులకు చక్షురా దీంద్రియాది ప్రదేశములతో సంబంధ ముండును. దేహమునుండి బయటికి వెళ్ళుట కనువగు నీ హృదయము తెరువబడనంతవరకు జ్ఞానులు, అజ్ఞా నులు ఎల్లరు సమానముగా - వాగాదీంద్రియసంయుక్తమగు సూక్ష్మశరీర ముతోబాటు సమానముగా నుత్క్రమణము చేయుదురు. ద్వారము తెరువ బడిన తదుపరి వారివారికర్మల ననుసరించి భిన్నభిన్నగతులు కలుగును. మార్గములు వేరగును. పూర్ణజ్ఞానికి శరీరాంతరమునకు వెళ్ళవలసిన మార్గ మేదియు నుండదు. కావున నతని స్థూలసూక్ష్మదేహములు రెండును అక్కడే సమాప్తమగును. అతడు బ్రహ్మసంస్థుడై అమృతత్వమును బొందును.

"న తస్య ప్రాణా ఉత్క్రామంతి" (బృ. ౪-౪-౬) 'అతనిప్రాణము లుత్క్రమింపవు.' "బ్రహ్మసంస్థో అమృతత్వ మేతి" (ఛాం. ౨-౨౩-౧) 'బ్రహ్మమునం దున్నవాడై మృత్యురహితు డగును.'

లింగశరీరముతో వేష్టితులయి యున్నంతవరకు ఉపాసకులకు ఇతరు లకు ఉత్క్రాంతి కలుగును. హృదయద్వారము తెరువబడినపుడు ఉపాస

కుడు హృదయమున నున్న బ్రహ్మముచే ననుగృహీతుడై, సుషుమ్న ద్వారా తనగతి ననుస్మరించుచు, బ్రహ్మరంధ్రమునుండి బయటపడుసు - మోక్షమును బొందును. ఈ సుషుమ్ననాడి నూటయొకటవది. "తస్య హైతస్య హృదయాగ్రం ప్రద్యోతతే తేన ప్రద్యోతే నైష ఆత్మా నిష్క్రామతి." (బృ. ౪-౪-౨) 'ఆ యాత్మయొక్క హృదయాగ్రము ప్రకాశిత మగును. ప్రకాశితమైన దానినుండి జీవుడు బయటికేగును.' అని యుపనిషత్తులు వర్ణించుచున్నవి. హృదయమునుండి నూటొక్కనాడులు బయలు దేరుననియు అందు సుషుమ్న మూర్ధవైపుకు పోవుననియు కఠోపనిషత్తు వర్ణించుచున్నట్లు పూర్వము వ్రాసియున్నాము. "శతం చైకా హృదయస్య నాడ్యః...." (కఠ. ౨-౩-౧౬)

ఈశ్వరవ్యవస్థ వలన కర్మల ననుసరించి దేహమును విడుచునపుడు ప్రతివ్యక్తికి రానున్న యోనినిగురించి తెలియును. అందలి యుత్సుకత మృత్యుకాలపు కష్టముగూడ తగ్గించును. దానిని స్మరించుచు నీ దేహమును విడిచి వెళ్లును. కర్మల నొనర్చువ్యక్తిని పరమేశ్వరు డిట్లనుగ్రహించును. సూత్రమున నున్న 'శేషగత్యనుస్మృతి సామర్థ్యాత్' అను హేతు వీవిషయమునే బోధించును. ఉపాసకుడు తన యుపాసన కంగమగు సుషుమ్నా నాడీద్వారమును స్మరించుచు దేహమునుండి నిష్క్రమించునట్లు, ఇతర కర్మానుష్ఠానపరులు తమకర్మల కనుగుణమగు నితరనాడుల ద్వారములను స్మరించుచు వానిద్వారా దేహమును విడుతురు. ఇదియే ఉత్క్రమణగతి విశేషము. (౧౭)

## అష్టమాధికరణము

బ్రహ్మజ్ఞాని సుషుమ్నద్వారమున బ్రహ్మను ప్రాప్తించుటకు దేని ననుసరించును ?

## రశ్మ్యనుసారీ ౪-౨-౧౮

బ్రహ్మనాడి ద్వారమున నుత్క్రమించు బ్రహ్మజ్ఞాని సూర్యరశ్మి ననుసరించి బ్రహ్మను పొందునని సూత్రార్థము.

"అథ యత్రైతదస్మాచ్ఛరీరాదుత్క్రామ
త్యథై తైరేవ రశ్మిభి రూర్ధ్వ మాక్రమతే." ఛాం. ౮-౬-౫

'జ్ఞాని యీ శరీరమునుండి వెడలిపోవునపుడు ఈ రశ్ములతో పైకి వెళ్లును.' దీనినిబట్టి సుషుమ్నానాడికి రశ్ములతో సంబంధ మున్నట్లు తెలియ నగును. మరియొకచో "సూర్యద్వారేణ తే విరజాః ప్రయాంతి. (ముం. ౧-౨-౧౧) 'బ్రహ్మోపాసకులు క్షీణకర్ములు కలవారై సూర్యునిద్వారమున పయనింతురు.' అనుటవలనను సూర్యరశ్మిలే బ్రహ్మలోకయాత్ర కుపక రించునని బోధపడుచున్నది. (౧౮)

రాత్రియందు జ్ఞానికి మృత్యువు సంభవించినపుడు సూర్యరశ్మి యెటనుండి లభించు, నన :

నిశి నేతి చేన్న సంబంధస్య యావ
ద్దేహభావిత్వాత్ దర్శయతి చ ౪-౨-౧౯

నిశి న ఇతి చేత్ = రాత్రియందు రశ్మిసంబంధము కలుగదనినచో, న=అట్లనరాదు, సంబంధస్య=నాడీరశ్మి సంబంధము, యావద్దేహభావిత్వాత్ =దేహ మున్నంతవరకు నుండు స్వభావము కలదగుటవలన, దర్శయతి చ=ఉపనిషత్తు నట్లే తెలుపుచున్నదికూడ.

సాధారణముగ సూర్యరశ్మితో దేహమునకు సంబంధము పగలు మాత్ర ముండునని యెంచుచుందురు. అట్లయెడ జ్ఞానికి మృత్యువు రాత్రి వేళ సంభవించినచో సుషుమ్నానాడికి సూర్యరశ్మితో సంబంధ ముండదు, కావున నత డెట్లు బ్రహ్మను ప్రాపించునని సంశయము వొడమును. కాని

అయ్యది సరికా దనుచున్నాడు సూత్రకారుడు. కారణ మేమనః సూర్య
రశ్మితో దేహమునకు సంబంధ మెల్లపుడు నుండును. సూర్యరశ్మి రాత్రి
యందు నుండును. అందువలననే కొన్నిరాత్రులలో ఉష్ణత ననుభవింతుము.
చంద్రకిరణములుకూడ సూర్యరశ్మియేకదా। కావున దోషమొందును లేదు.

'అథా ప్యస్యైకో రశ్మి శ్చంద్రమసం ప్రతిదీప్యతే....
....ఆదిత్యతోఽస్య దీప్తి ర్భవతి'.   నిరుక్త. ౨-౨-౨

'సూర్యుని యొకరశ్మి చంద్రునిప్రకాశింప జేయుచున్నది...ఆదిత్యుని
వలన చంద్రునకు కాంతి కలుగుచున్నది.' అని నిరుక్తముకూడ చెప్పు
చున్నది. కావున దివారాత్రము లను భేదము లేక యెల్లపుడు దేహముతో
సూర్యరశ్మికి సంబంధ ముండునని తెలియుచున్నది. ఉపాసకు డెప్పుడు
మరణించినను నతనిగతికి హాని యెన్నడు కలుగదు. (౧౯)

ఆచార్యు డీ విషయమునే దక్షిణాయనమున మరణించు జ్ఞానికికూడ
అతిదేశించుచున్నాడు.

## అత శ్చాయనేఽపి దక్షిణే        ౪-౨-౨౦

అతః చ=అందువలననే, దక్షిణే అయనేఽపి = దక్షిణాయనమున,
కృష్ణపక్షమునను దేహమునకు సూర్యరశ్మి సంబంధముండునని సూత్రార్థము.

రాత్రియందు మరణించిన జ్ఞాని సూర్యరశ్మి సంబంధముతో బ్రహ్మ
లోకమును చేరునట్లు కృష్ణపక్షమునందును, దక్షిణాయనమునందును,
ఎప్పుడు మరణము సంభవించినను జ్ఞాని దేహముతో సూర్యరశ్మికి సంబంధ
ముండుననుట నిశ్చితము. దేహముతో సూర్యరశ్మికి ఎల్లప్పుడు సంబంధ
ముండు నననదియే యిందులకు హేతువు.

భీష్ముడు ఉత్తరాయణము వచ్చువరకు వేచియున్నట్లు వర్ణించుట
రశ్మి 'యధికముగా నుండు దినములను ప్రశంసించుటకే యని యెంచవలెను.

బ్రహ్మజ్ఞాని యెప్పుడు మరణించినను అతని బ్రహ్మలోకగతి కెట్టి యాటంకము నుండదని గుర్తింపవలెను. (౨౦)

'యత్రకాలే త్వనావృత్తి మావృత్తిం చైవయోగినః
ప్రయాతా యాంతి తం కాలం వక్ష్యామి భరతర్షభ। (౮-౨౩)
అగ్నిర్జ్యోతిరహః శుక్లః షణ్మాసా ఉత్తరాయణం,
తత్ర ప్రయాతా గచ్ఛంతి బ్రహ్మ బ్రహ్మవిదోజనాః. (౮-౨౪)
ధూమో రాత్రిస్తథాకృష్ణః షణ్మాసాః దక్షిణాయనం,
తత్ర చాంద్రమసం జ్యోతిః యోగీప్రాప్యనివర్తతే.' (౮-౨౫)

అను భగవద్గీత శ్లోకములలో కాలవిశేషమున మరణించిన ఆవృత్తి అనావృత్తి కలుగునని చెప్పబడినదికదా। అది యెట్లు సమంజసమగును?

## యోగినః ప్రతిచ స్మర్యతే స్మార్తే చైతే ४-२-२१

యోగినఃప్రతి చ = యోగివిషయమునసనే, స్మర్యతే = అట్లు చెప్పబడినది. ఏతేచ స్మార్తే = ఇయ్యవి రెండును స్మార్తములే.

కర్మత్యాగులైన జ్ఞానయోగులు కొందఱు అనావృత్తిని, కర్మానుష్ఠానపరులైన కర్మయోగులు ఆవృత్తిని పొందు మరణకాలమునుగూర్చి కృష్ణుడు వర్ణించినట్లు గీతయందు చూతుము. లోకమున నట్లు చెప్పుట కలదు. అట కృష్ణునియభిప్రాయ మేమన:"లోకమున అనావృత్తి, ఆవృత్తులతో జ్ఞానాజ్ఞానములకు సంబంధము కల్పింపక భ్రాంతితో మరణకాలమునకు సంబంధము కల్పించుచున్నారు. నేను నీకు చెప్పున దేమన : 'అగ్ని, జ్యోతి, దినము, శుక్లపక్షము, ఉత్తరాయణమున చనిపోవు జ్ఞానయోగి యని యెంచబడు మనుష్యుడు బ్రహ్మమును బొందును' అని లోకమున చెప్పబడును. ఇట్లే 'ధూమము, రాత్రి, కృష్ణపక్షము' దక్షిణాయనమున శరీరము విడుచువ్యక్తి చంద్రరశ్మిని పొంది కర్మయోగి యనిపించుకొనును.

అతడు మరల మరల జన్మించును.' అనియు లోకు లెంతురు. ఇట్లు కాల విశేషమున మరణించుటచే సుపర్యుక్తగతులు కలుగుననుట లోకవాదము. వాస్తవ మదికాదు. అది కల్పనమాత్ర మనవలెను. ఇట్టి మార్గముల వాస్తవికతను గుర్తించిన యోగి మోహితు డెన్నడును కాడు. కాలవిశేషమున మరణించుటవలన ముక్తి కలుగుననుట వాస్తవికము కాదు. కావున ఓయర్జున! నీవు నీజీవనమున నెల్లపుడు యోగయుక్తుడవై యుండుము. కాలవిశేషమున మరణించిన మోక్ష మొదవునని భ్రమియింపకు. జీవనమును యోగమయము, జ్ఞానసంపన్నము చేయుము. పూర్ణజ్ఞాని యైనవాని కెన్నడు మృత్యువు కలిగినను అతనినద్గతికి ప్రతిబంధక ముండనేరదు" అని. కావున ఉపాసకునికి చెప్పబడిన సూర్యరశ్మ్యనుసరణము సుసంగతమే యని భావము. (౨౧)

వేదాంత దర్శన - ఆంధ్ర వ్యాఖ్యానమున
చతుర్థాధ్యాయమునందు ద్వితీయపాదము
సమాప్తము

# చతుర్థాధ్యాయము

## తృతీయపాదము

### ప్రథమాధికరణము

ద్వితీయపాదమున జీవుని యుత్క్రమణము విచారింపబడినది. ఉపాసకుని యుత్క్రాంతికి ఫలము బ్రహ్మలోకావాప్తి. అయ్యది యీ తృతీయపాదమున విచారింపదలచి సూత్రకారుడు తన్మార్గనిర్ధారణపరక సూత్రమును రచించుచున్నాడు.

**అర్చిరాదినా తత్ ప్రథితేః** ౪-౩-౧

అర్చిరాదినా = శరీరమునుండి మూర్ధన్యనాడిద్వారమున బయటపడి యుపాసకుడు దేవయానమగు అర్చిరాదిమార్గమున బ్రహ్మలోకమును బొందును. అది యెట్లు తెలియు ననః తత్ప్రథితేః = అతని కది మార్గమని ప్రసిద్ధి యున్నందున.

బ్రహ్మము నుపాసించువా డుత్క్రమించుటకు శాస్త్రములం దొక మార్గము ప్రసిద్ధమై యున్నది. అదియే దేవయానము.

"తద్య ఇత్థం విదుర్యే చేమేఽరణ్యే శ్రద్ధా తప ఇత్యుపాసతే తేఽర్చిష మభిసంభవం త్యర్చిషోఽహరహ్న ఆపూర్యమాణపక్ష మాపూర్య మాణపక్షాద్ యాన్ షడుదఙ్ఙేతి మాసాంస్తాన్" ఛాం. ౫-౧౦-౧.

"మాసేభ్యః సంవత్సరం సంవత్సరా దాదిత్యం ఆదిత్యా చ్చంద్ర మసం చంద్రమసో విద్యుతం తత్ అమానవః, స ఏనాన్ బ్రహ్మ గమయ త్యేష దేవయానః పన్థా" ఛాం. ౫-౧౦-౨.

అర్చిపదము కిరణవాచకము. అనగా రశ్మి. దానినుండి విద్యుత్తు వరకు మార్గము పై వాక్యములలో సూచింపబడినది. ఇదియే అర్చిరాది

మార్గము-దేవయానము. ఇందు వర్ణింపబడినవాని ననువరించి యుపాసకుడు బ్రహ్మలోకమును బొందును.

"రశ్మ్యనుసారీ" (౪-౨-౧౮). సూత్రమున నిదియే సూచింపబడి నది. ఇట్లే బృహదారణ్యకమున (౬-౨-౧౫) ఛాందోగ్యమున (౪-౧౫-౪,౫) కౌషీతకి (౧-౩) ప్రసంగములందుకూడ నీమార్గము వర్ణింపబడినది. అందువలన శాస్త్రములం దీమార్గము ప్రసిద్ధమై యున్నది. (౧)

బృహదారణ్యకము (౫-౧౦-౧)న ప్రయాణకాలమున పురుషుడు వాయువునందు వచ్చునట్లు వ్రాయబడినది. ఛాందోగ్యమున నయ్యది కని పింపదు. కావున సామంజస్య మెట్లన :

## వాయు మబ్దా దవిశేషవిశేషాభ్యామ్   ౪-౩-౨

అబ్దాత్ = సంవత్సరమునుండి, వాయుమ్ = వాయువును చేరుదురని అంగీకరింపవలెను. అవిశేషవిశేషాభ్యామ్ = సామాన్యవిశేషవాక్యముల వలన, నట్లు గ్రహింపనగునని సూత్రార్థము.

ఛాందోగ్యమున(౫-౧౦-౧,౨), బృహదారణ్యకమున(౫-౨-౧౫) గల వాక్యములలో అర్చినుండి మాసములవరకు సమానముగ మార్గము వర్ణింపబడినది. బృహదారణ్యకమున మరియొక తావున "యదా వై పురుషోఽస్మాల్లోకాత్ ప్రైతి స వాయు మాగచ్ఛతి" (బృ. ౫-౧౦-౧) 'పురుష డీలోకమునుండి పయనించునపుడు వాయువున ప్రవేశించును,' అని యున్నది. రథచక్రపుఛిద్రమువలె వాయు వతనికి పైకిపోవ తోడ్పడును. అట్లు ఆదిత్యుని చేరును. ఇది వాయువునుగూర్చి విశేషముగ చెప్పబడినది. ఛాందోగ్యమున (౫-౧౦-౧,౨) దీనిప్రసక్తి కనిపింపదు. బృహదారణ్యకమున (౬-౨-౧౫) మాసమునుండి దేవలోకము, అటనుండి ఆదిత్యుని చేరున ట్లున్నది. ఛాందోగ్యమున (౫-౧౦-౧,౨) మాసమునుండి సంవ

త్సరము, దానినుండి ఆదిత్యుని చేరున ట్లున్నది. బృహదారణ్యకమునందలి (౫-౧౦-౧) వాయువునుండి ఆదిత్యుని అనియు, (౬-౨-౧౫) దేవలోకమునుండి ఆదిత్యుని అనియుచెప్పు రెండువాక్యములవలన ఛాందోగ్యమునందలి సంవత్సరస్థలమున బృహదారణ్యకమునందు (౬-౨-౧౫) దేవలోకము పఠింపబడిన దని బోధపడుచున్నది. కావున నీరెండింటిని సమాసముగ నెంచి బృహదారణ్యకమునందు (౫-౧౦-౧) వాయుపదము విశేషముగ నిర్దేశింపబడుటవలన ఛాందోగ్యమునందలి గతిక్రమములో సంవత్సరమునకు పరమున ఆదిత్యపదమునకు పూర్వమున వాయుపదమును సమావేశము చేసికొనవలయును.

ఛాందోగ్యపు (౫-౧౦-౧,౨) సంవత్సరమును, బృహదారణ్యకపు (౬-౨-౧౫) దేవలోకమును రెండింటిని ఒకటిగా నంగీకరించనిపక్షమున మాసముతో సంవత్సరమునకు సంబంధ మేర్పడుటవలన దేవలోకమును సంవత్సరమునకు పరమందుంచి, దేవలోకమునకు పరమందు వాయువును సమావేశపరచవలెను. అప్పుడు, మాసమునుండి సంవత్సరము, దాని నుండి దేవలోకమును, అటనుండి వాయువును దానినుండి ఆదిత్యుని పొందునట్లు క్రమ మేర్పడును. సూత్రకారుడు చెప్పిన సంవత్సరమునుండి వాయువును చేరుననుక్రమమున కభిప్రాయము - సంవత్సరమునుండి దేవలోకమును చేరి యటనుండి వాయువును చేరుట యగును. అందువలన సామంజస్య మేర్పడును. వాయువును సంవత్సరమునకు తరువాతను దేవలోకమునకు పూర్వమందును పెట్టరాదు. కారణ మేమన : బృహదారణ్యకమున (౫-౧౦-౧) వాయువునుండి ఆదిత్యుని చేరునని విశేషముగ నిర్దేశింపబడినది. ఛాందోగ్యమున దేవలోకము లేదు. బృహదారణ్యకమున సంవత్సరములేదు. రెండుతావులందును రెంటిని ఉపసంహరించిన పక్షమున గతిక్రమములో సామంజస్య మేర్పడును - భేద ముండదు. (౨)

కౌషీతకీ బ్రాహ్మణోపనిషత్తునందు వర్ణింపబడిన దేవయాన మార్గమునందు అన్యలోకములు కొన్ని నిర్దేశింపబడియున్నవి. వాని నెట సమావేశము చేసిన సామంజస్య మేర్పడు, నన :

తడితోఽధి వరుణః సంబంధాత్ ౪-౩-౩

తడితః=విద్యుత్తునకు, అధి = పైన-తరువాత, వరుణః = వరుణ లోకము నుంచవలెను. కారణమేమన, సంబంధాత్ = సంబంధ ముండుట వలన.

వరుణపదము వరింపదగినగుణము లుండుటవలన పరమేశ్వర వాచక మైనను అదృశ్యమైయుండుజలమున కీ పదము పలుచోట్ల ప్రయోగింపబడును. కౌషీతకీబ్రాహ్మణమున "స ఏతం దేవయానం పంథాన మాపద్యాగ్నిలోక మాగచ్ఛతి స వాయులోకం స ఆదిత్యలోకం స వరుణలోకం స ఇంద్రలోకం స ప్రజాపతిలోకం స బ్రహ్మలోకమ్" (కౌ. ౧-౩) ఇందలి వరుణపదము జలమునకు వాడబడినది ఉపాసకుడు దేవయాన మార్గమున ముందు (అగ్ని) అర్చిలోకమును తదుపరి క్రమముగా వాయువు, ఆదిత్యుడు, వరుణుడు, ఇంద్రుడు, ప్రజాపతి అనులోకములం జేరును. ఛాందోగ్యక్రమము ననుసరించి పైవాక్యమున పఠింపబడిన వరుణ పదము విద్యుత్తునకు తరువాత నుండవలెను. విద్యుత్తునకు జలముతో సంబంధ మున్నది. కావుననే "విద్యోతతే స్తనయతి వర్షయతివై" (ఛాం. ౭-౧౧-౧) 'మెఱపు మెరయును, ఉరుమును, వర్షించును. అని వర్ణింపబడినది. ఇట్లు విద్యుత్తుతో జలమునకు సంబంధమున్నందున ఛాందోగ్యము ననుసరించి విద్యుత్తునకు తరువాత వరుణపదము సమావేశము చేయదగియున్నది. అప్పుడు వరుణునినుండి ఇంద్రుడు, ప్రజాపతి, బ్రహ్మ లోకము లనుక్రమము చేరునట్టి క్రమ మేర్పడును. సంపూర్ణక్రమము ఆరవ సూత్రమున నిర్దేశింపబడును. (౩)

ఇంతవరకు దేవయానమార్గక్రమము నిర్దేశింపబడినది. అందు అర్చి, దినము, పక్షము మున్నగు పదములు మార్గసంకేతకములా ? ఆత్మ విశ్ర మించుస్థానములా ? భోగభూములా ? లేక యింకేమైన నగునా ? అను విషయ మింతవరకు వివరింపబడలేదు. అవి యేమి తెలుపు, నన :

## ఆతివాహికా స్తల్లింగాత్ ౪-౩-౪

తల్లింగాత్ = శాస్త్రవచనములవలన, అర్చిరాదులు, ఆతివాహికాః= ఆతివాహకములు - ఒకచోటునుండి మరియొకచోటునకు చేర్చుట వహన మనబడును. అతిశయవహనము అతివాహము. అందుప్రసిద్ధములు అతి వాహికములు. ఆయాకాశప్రదేశమునందు లగ్నమై యుండు సూర్య రశ్మలు - అర్చిరాదులని భావము. ముందుకు చేర్చునవి యని యర్థము.

దేవయానమార్గపఠిత అర్చిమున్నగు పదములు మార్గచిహ్నములు కాని, ఆత్మ విశ్రమించు స్థానములు కాని, భోగాభూములు కాని కావు. అవి ఆ యా ఆకాశప్రదేశప్రతీకలు మాత్రమే. ఆ స్థలములందు సూర్య రశ్మలు విస్తరింపబడి యుండును. సూక్ష్మశరీరముతో కూడిన జీవాత్మ స్థూలశరీరమును విడిచి యీశ్వరీయవ్యవస్థ ననుసరించి దేశాంతరము చేరును. అప్పు డాత్మ రశ్మల నాశ్రయించి గంతవ్యప్రదేశమును చేరునని శాస్త్రములు చెప్పుచున్నవి. సూక్ష్మశరీరము జీవునకు నిరంతరవాహకము. సూర్యరశ్మి తాత్కాలికవాహన మనవచ్చును. అర్చి ప్రకాశార్థకము. కావున నది వహనమును నిర్దేశించును. ఉపాసకునకు చెప్పబడిన యీమార్గము గమ్యము ప్రకాశమయమని తెలుపుచున్నది. ఇతరులకు చెప్పబడిన పితృ యానమార్గము అంధకారమయము. అది గమ్యము నంధకారమయముగా ప్రకటించును. ఇట్లు దినాదులు ఆ యా ప్రదేశముల ప్రతీకలుమాత్ర మన వగును. అట కాంతి వ్యాపించి యుండును. జీవు డీ ప్రదేశములను క్షణ మాత్రమున దాటి గంతవ్యమును చేరును. కావున నివి భోగభూములు కావు.

"అస్మా చ్ఛరీరా దుత్క్రామతి అథైతై రేవ రశ్మిభి రూర్ధ్వ మాక్ర మతే....స యావత్ క్షిప్యే న్మనస స్తావ దాదిత్యం గచ్ఛతి" (ఛాం. ౮-౬-౫) 'ఆత్మ యీ శరీరమునుండి ఉత్క్రమించును. రశ్ముల ద్వారమున పైకి పోవును. అతడు మనోవేగముతో నాదిత్యుని చేరును'.

అని చెప్పబడుటవలన అర్చిరాదులు ఆత్మకు భోగభూములు కాని, విశ్రామస్థలములు కాని, మార్గచిహ్నములు కాని కావని స్పష్టముగా తెలియు చున్నది. అవి యట్లగుచో నాత్మ క్షణమాత్రమున మనోవేగముతో ఆదిత్యు నెట్లు చేరును? కావున నా పదము లన్నియు స్వప్రదేశములం దున్న రశ్మికి ద్యోతకములని తెలియనగును. ఆ రశ్మలే ఆతివాహకములు. ముండకోపని షత్తునందును (౧-౨-౫,౬) మరణానంతరమున యజమానునకు సూర్య రశ్ములు వాహకములని వర్ణింపబడినది. రశ్ములు వాహకము లనుట విజ్ఞాన సిద్ధము. అవి రశ్మిరూపమున గాని, విద్యుత్తరంగరూపమున గాని యుంద వచ్చును. అందువలననే విద్యుత్తు అంతిమప్రతీకగా నిర్దేశింపబడుట సంభవ మనవచ్చును. ఇయ్యది యీశ్వరీయవ్యవస్థ.

"తత్పురుషోఽమానవః స ఏనాన్ బ్రహ్మ గమయతి" (ఛాం. ౪-౧౫-౫,౬ – ౫-౧౦-౨). 'వీరిని బ్రహ్మమువరకు చేర్చువాడు అమా నవపురుషుడు' అని చెప్పబడినది.

ఈ యమానవపురుష డెవడు? కొందఱు చేతనదేవుడనియో దివ్యశక్తియనియో చెప్పుదురు. అది యొక యజ్ఞాతస్వరూప మనవచ్చును. వాస్తవమున నీ యమానవపురుషుడు లింగశరీర మనవచ్చును. అదియే ఆత్మను బ్రహ్మమువరకు చేర్చును. సర్గారంభమునుండి యిది యెల్లపుడు నాత్మతో నుండును. విద్యుత్ప్రతీకతరువాత దీనిప్రసక్తి కనిపింపదు. జీవు నకు ముఖ్యాశ్రయము ఈ లింగశరీరమే. అర్చిరాదులు గౌణములు - మార్గ ద్యోతకములు కావచ్చును. ఈ సూక్ష్మశరీరసహకారముతోనే జీవుడు బ్రహ్మ సాక్షాత్కారము చేసికొనును - బ్రహ్మమును చేరును. ఇయ్యది ప్రాకృతము

కావున అమానవపురుషు డనబడినది. ఈ దేహమున నెవడు బ్రహ్మసాక్షాత్కారము చేసికొనునో యతనికి గతి - ఉత్క్రమణ ముండదని పలుమారులు చెప్పబడినది. స్థూలదేహముతోబాటు సూక్ష్మదేహము కూడ నతనిని విడిచి పోవును. బ్రహ్మమును తత్కాలముననే పొందును.

"అస్మా చ్ఛరీరాత్ సముత్థాయ పరంజ్యోతి రుపసంపద్య స్వేన రూపేణాభినిష్పద్యతే" (ఛాం. ౮-౧౨-౩) "ధూత్వా శరీర మకృతం కృతాత్మా బ్రహ్మలోక మభిసంభవామి" (ఛాం. ౮-౧౩-౧) స్థూలదేహమును విడుచుటయే తడవుగ బ్రహ్మజ్ఞాని బ్రహ్మమును బొందును. అతనికి ఉత్క్రమణగతి లేదనుట కిట్టివి యెన్నో ప్రమాణము లున్నవి.

"యో ఽకామో నిష్కామ ఆప్తకామ ఆత్మకామో న తస్య ప్రాణా ఉత్క్రామంతి ఇహైవ సమవలీయంతే" (బృ. ౪.౪-౬.) 'ఆత్మజ్ఞాని ప్రాణము లుత్క్రమింపవు. దేహపాతానంతర మవి వానికారణభూత తత్త్వములలో లీనములగును.' బ్రహ్మజ్ఞుడు బ్రహ్మను ప్రాపించును.

ఉపాసకులకు, ఇతర కర్మాసక్తులకును మాత్రము గతియుండునని వర్ణింపబడును. ఉపాసకునకు దేవయానగతి. ఇయ్యది పూర్ణబ్రహ్మజ్ఞానము కలుగక పూర్ణతకు సమీపమున నుండువారి కని తెలియనగును. పూర్ణజ్ఞానికి సూక్ష్మదేహరూపవేష్టన ముండదు. ఆ స్థితి కలుగువరకు ఉపాసకుడు సూక్ష్మశరీరవేష్టితుడై యుత్తమశరీరములకు గమించును. కావున జీవుని బ్రహ్మమున జేర్చు అమానవపురుషుడు లింగశరీరమే యనుట మిక్కిలి సంగతము.

ఆత్మకు ముఖ్య - ఆతివాహకము లింగశరీరమే. రశ్మి మున్నగు వానిని ఔపచారికముగ ఆతివాహకములని సూత్రకారు డీ సూత్రమున నిర్దేశించినాడు. (౪)

ఈ విషయమును స్పష్టము చేయుటకే యాచార్యుడు సూత్రాంతరమును రచించుచున్నాడు.

## ఉభయవ్యామోహాత్ తత్సిద్ధేః　　　౪-౩-౫

ఉభయవ్యామోహాత్ = రెండువిధములైన జ్ఞానము లేనందువలన, తత్సిద్ధేః = అర్చిరాదులు ఆతివాహకములనియే సిదించుచున్నదని సూత్రార్థము.

మరణసమయమున స్థూలశరీరమును విడిచి జీవుడు లోకాంతరమున కేగుట యీశ్వరకృతవ్యవస్థయై యున్నది. వెళ్ళు జీవునకు మార్గముల (దేవ, పితృ) జ్ఞాన ముండదు. అట్టియెడ నతనికి మార్గచిహ్నాములతో బనియేమి ? ఈశ్వరునివ్యవస్థకు లోబడి గమించు ఆత్మకు మార్గము నెరుగవలసిన యవసరమే యుండదు. కావున అర్చిరాదులు మార్గచిహ్నాములు కాని, భోగస్థానములు కాని, విశ్రామస్థలములు కాని కావని స్పష్టమగుచున్నది. కాగా ఆతివాహకము లనుట సిద్ధము. జీవునకు (వ్యామోహపదముతో) మార్గజ్ఞానము లేదని సూత్రకారుడు స్పష్టము చేసియుండుట వలన జీవుడు స్వయముగ నేమిచేయుటకు సమర్థుడు కాడనియు, ఈశ్వర వ్యవస్థకు లోబడి లోకాంతరగతు డగుననియు స్పష్టమగుచున్నది. (౫)

ఉపాసకుని విద్యుదనంతరగతిని గూర్చి ఆచార్యు డుపదేశించుచున్నాడు.

## వైద్యుతే నైవ తత స్తచ్ఛ్రుతేః　　　౪-౩-౬

తచ్ఛ్రుతేః = ఆ విషయము చెప్పు శ్రుతివలన, తతః = విద్యుత్తునకు తదుపరి, వైద్యుతేన ఏవ = విద్యుదావిర్భూతముచేతనే ఉపాసకుని యాత్మ కొనిపోబడును.

ఉపాసకుడు స్థూలశరీరమును విడిచి యుత్క్రమించి విద్యుల్లోకము వరకు అర్చిరాదులమూలమున చేరును. ఉపాసనలవలన నట విశేషధర్మము ఆవిర్భూతమగును. దాని సహకారముతో సూక్ష్మశరీరము అర్చిరాదుల ననుసరించు నుపాసకుని బ్రహ్మమువరకు జేర్చును. ఈ యవస్థయే బ్రహ్మలోకప్రాప్తి యనబడును. ఈ విషయమునే "చంద్రమసో విద్యుతం తత్పు

రుషో ఽమానవః స ఏతాన్ బ్రహ్మ గమయతి" (ఛాం. ౫-౧౦-౨) 'ఉపాసకుడు చంద్రునినుండి విద్యుత్తును చేరినపుడు అక్కడ ఆవిర్భవించిన యమానవుడు అతనిని బ్రహ్మమువరకు గొంపోవును - చేర్చును.' మానవునివలె రజోవీర్యసంమిశ్రణమువలన నేర్పడువాడు కాడు, కావున నితని నమానవు డనిరి.

"తాన్ వైద్యుతాన్ పురుషో మానస ఏవ బ్రహ్మలోకాన్ గమయతి". (బృ. ౬-౨-౧౫) ఆ యుపాసకులను - విద్యుత్తున జేరినవారిని - మానసపురుషుడు - అట నావిర్భవించిన పురుషుడు, బ్రహ్మలోకములను జేర్చును'. అని యందువలననే చెప్పబడినది.

శ్రీ శంకరాచార్యులు ఈ సూత్రమునకు భాష్యము వ్రాయుచు శ్రుతి ప్రమాణరూపమున నుల్లేఖించిన ఉపనిషద్పాఠక్రమము ఉపనిషత్తులలో నెక్కడను లభింపదు. ఆచార్యులు ఉల్లేఖించిన పాఠమి ట్లున్నది :

> "తాన్ వైద్యుతాన్ పురుషో ఽమానవః స ఏత్య బ్రహ్మలోకం గమయతి". (బృ. ౬-౨-౧౫)

ఇపుడు లభించుపాఠము- "తాన్ వైద్యుతాన్ పురుషో మానస ఏత్య బ్రహ్మలోకాన్ గమయతి". (బృ. ౬-౨-౧౫)

ఇందు 'మానసః పురుషః' అనియు, ఆచార్యునిపాఠమున 'పురుషో ఽమానవః' అనియు నున్నది. తన యభిమతసిద్ధికొఱకు ఆచార్యుడు పాఠము నిట్లు మార్చినా డేమో యనిపించుచున్నది. మానసపదము లింగ శరీరమునకు వ్యంజకము - ద్యోతకము - తెలుపునది.

ఉపనిషత్తుల ననుసరించి సమన్వయపూర్వ దేవయానమార్గము :

అర్చి
అహస్సు
శుక్లపక్షము
ఉత్తరాయణము
} ఛాం. ౫-౧౦-౧. బృ. ఆ. ౬-౨-౧౫.

సంవత్సరము, బృ. ఆ. ౬-౨-౧౫ న లేదు.

దేవకలోము, ఛాం. ౫-౧౦-౨ న లేదు. బృ. ౬-౨-౧౫. న ఉన్నది.

వాయులోకము, ఛాం. ౫-౧౦-౨ న లేదు. బృ. ౫-౧-౧౦. న ఉన్నది.
ఆదిత్యలోకము, ఛాం. ౫-౧౦-౨. బృ. ౫-౧౦-౧, ౬-౨-౧౫.
చంద్రలోకము ,, ,,
విద్యుల్లోకము ,, బృ. ౬-౨-౧౫.
వరుణలోకము
ఇంద్రలోకము } కౌషీతకీ బ్రా. ౧-౩.
ప్రజాపతిలోకము
బ్రహ్మలోకము, ఛాం. ౫-౧౦-౨. బృ. ౬-౨-౧౫. కౌ. ౧-౪.

ఇట్లీమార్గము నిర్ణయింపనగును. (౬)

## ద్వితీయాధికరణము

అమానవపురుష దుపాసకుని ఒకయెడ బ్రహ్మము చేర్చుననియు, మరియొకట బ్రహ్మలోకము ననియు, ఇంకొకట మరియొకవిధమునను చెప్పబడినది. వాస్తవమున నతనిగంతవ్య మెయ్యది? అది ముఖ్యబ్రహ్మమా? మరియొకటియా? అన, సూత్రకారుడు బాదరియభిప్రాయమును చెప్పు చున్నాడు.

### కార్యం బాదరి రస్య గత్యుపపత్తేః ౪-౩-౭

అస్య గత్యుపపత్తేః = ఉపాసకునకు గతి సంభవమగుటవలన, కార్యం=కార్యబ్రహ్మను (చేర్చునని), బాదరిః=బాదరి ఆచార్యునిమతము.

ఉపాసకునకు గంతవ్యము బ్రహ్మమని (ఛాం. ౫-౧౦-౨)యును, బ్రహ్మలోకమని (ఛాం. ౮-౧౫-౧) యును, బ్రహ్మలోకములందు (బృ. ౩-౨-౬) అనియు, బ్రహ్మలోకములను (బృ. ౬-౨-౧౫) అనియు నిట్లనేకవిధముల చెప్పబడినది. కావున నీ పదము లన్నియు బ్రహ్మమును బోధించునా లేక యన్యమును బోధించునా? అని సందేహము కలుగును. పై ప్రసంగములందుగల పదములు ముఖ్యబ్రహ్మ - అకార్యబ్రహ్మను

బోధింపవు. కారణ మేమన: పరబ్రహ్మము సర్వత్ర నుండు వ్యాపకతత్త్వము. దానిని పొందుటకు ఉపాసకునకు గతి యవసరము కాదు. కావున నీ ప్రసంగములందు ఉపాసకునకు గంతవ్యముగా వర్ణింపబడినది ముఖ్య బ్రహ్మము కాక కార్యబ్రహ్మమై యుండవలెనని సూత్రకారుని ఆశయము.

ఈ కార్యబ్రహ్మ మన నేమి? బ్రహ్మపదముతో కార్యపదప్రయోగము అశాస్త్రీయముగా తోచును. ఉపర్యుక్తప్రసంగములలో బ్రహ్మలోక పదము బ్రహ్మమే లోకమని కాని, బ్రహ్మరూపలోకమని కాని కాక, అది యొక విశేషప్రదేశమని బోధపడును. ఉపాసకునియాత్మ యట జేరి నిర్బాధముగా బ్రహ్మమును బొందును. అనివార్యముగ బ్రహ్మప్రాప్తి కలుగు ప్రదేశమని భావము. కావుననే యది బ్రహ్మలోక మనబడుచున్నది. కార్యబ్రహ్మపదము దీనినే బోధించును. దేవయానపథమున అర్చిరాదిపదములచే లక్షితమగునదియు ప్రదేశవిశేషమే యని యెంచవలెను. అట్టిప్రదేశము లన్నియు దాటి 'ఉపాసకునియాత్మ సాక్షాత్‌బ్రహ్మప్రాప్తి యవశ్యము లభించుప్రదేశమును చేరు'నని యభిప్రాయము. ఇది యంతయు శాస్త్రదృష్టి ననుసరించియే వ్రాయబడినది.

ఇట్టి లోకవిశేషమునే "యత్ర దేవా అమృతత్వ మానశుః" (యజు. ౩౨-౧౦) అను మంత్రము సూచించును. ఇట్లు అవశ్యము బ్రహ్మమును ప్రాపించు బ్రహ్మలోకము భూలోకముకంటె భిన్నముగా నన్యత్ర ఉండును. కావున ఉపాసకునియాత్మకు గతి సంభవ మగును.

ఏ యుపాసకున కిటనే - యీ దేహమునందే బ్రహ్మ సాక్షాత్కరించునో యతనియాత్మ మరణసమయమున స్థూలసూక్ష్మదేహములు నశించి విడివడుటయే తడవుగ బ్రహ్మమును బొందును. అందువలననే "న తస్య ప్రాణా ఉత్‌క్రామంతి" (బృ. ౪-౪-౬) యని చెప్పబడినది. ఏ యుపాసకుని కిట బ్రహ్మప్రాప్తి కలుగదో యతఁ డుత్క్రమించి పొందు బ్రహ్మము కార్యబ్రహ్మమని బాదరిఆచార్యునిమతము. (౭)

ఈ విషయమున మరియొక హేతువును సూత్రకారుడు ప్రస్తుతించు చున్నాడు.

**విశేషితత్వాచ్చ  ౪-౩-౮**

విశేషితత్వాత్ చ = బహుత్వము మున్నగువానిచే విశేషితము చేసి నందునను కార్యబ్రహ్మమునే ఉపాసకుడు చేరునని సూత్రార్థము.

"బ్రహ్మలోకాన్ గమయతి, తే తేషు బ్రహ్మలోకేషు పరాః పరావతో వసంతి." (బృ. ౬-౨-౧౫) 'ఉపాసక - ఆత్మలు బహుకాల మక్కడ వసింతురు'. ఇట బ్రహ్మలోకమునకు బహుత్వము, నివాసము ననువిశేషములతో సంబంధము కల్పించుటచే బ్రహ్మలోకము లున్నట్లు నట నుపాసకు లుండునట్లు బోధపడును. దీనింబట్టి యాలోకములు సీమిత ములై యుండవలెను. లేకున్న వానిలో బహుత్వ మెట్లు సిద్ధించును? బ్రహ్మప్రాప్తి యిట్టిది కాదు. బ్రహ్మను బొందిన ఆత్మ యొకసీమిత ప్రదేశమున నుండదు. బ్రహ్మానందము ననుభవించుచు సర్వత్ర విహ రించును. ఉపాసకుడు పొందు బ్రహ్మలోకము లనేకములై సీమితము లగుటచే నాలోకములు బ్రహ్మముకాక బ్రహ్మ సృష్టియం దుండు వేరు లోకములు కావలెను. అట కొంతతడ వుండి యటుపై నిర్బాధముగ బ్రహ్మ మును పొందును. కావున బ్రహ్మలోకములన కార్యబ్రహ్మమని బాదరి యభిప్రాయపడుట సముచితమే. (౮)

'బ్రహ్మలోకాన్' అనుటచే కార్యబ్రహ్మగ్రహణము చేసిన 'స ఏనాన్ బ్రహ్మ గమయతి' (ఛాం. ౫-౧౦-౨). అను నీవాక్యమునందలి బ్రహ్మపదమున కర్థ మేమగు, నన :

**సామీప్యాత్తు తద్వ్యపదేశః  ౪-౩-౯**

సామీప్యాత్ తు=సామీప్యమువలన, తద్వ్యపదేశః = బ్రహ్మకథ నము. ఇట బ్రహ్మపదము బ్రహ్మసామీప్యమును బోధించు నని సూత్రార్థము.

బ్రహ్మము సర్వవ్యాపక మగుటచే నది యెల్లరకు సమీపమున

మందును. ఎల్లరు దానికి సమీపమున నుందురు. కాని, అజ్ఞానము కారణముగ జీవుడు బ్రహ్మమునకు దూరమగును. వస్తువు సమీపమున నున్నదని తెలియనపు డది దూరమున నున్నట్లగును. ఉపాసకుడు బ్రహ్మము నుపాసించి బ్రహ్మమును సమీపమున తెలిసికొనును. ఉపాసకుడు పూర్ణవిరక్తుడైన స్థితియందే బ్రహ్మమును సామీప్యమున గుర్తింపసాగును. అప్పుడే బ్రహ్మమును బొందును. కావున నిట బ్రహ్మపదము బ్రహ్మసామీప్యమును-కార్యబ్రహ్మమును బోధించునని భావము. (౯)

కార్యబ్రహ్మమును పొందిన ఉపాసకు డెన్నడు బ్రహ్మమును బొందు ననన :

కార్యాత్యయే తదధ్యక్షేణ సహాతఃపర
మభిధానాత్ ౪-౩-౧౦

అతఃపరమ్ = కార్యబ్రహ్మానంతరము, అభిధానాత్ = బ్రహ్మమ ప్రాప్తించునని చెప్పుటవలన, కార్యాత్యయే = కార్యబ్రహ్మలోకమును దాటిన మీదట, తదధ్యక్షేణ సహ = ఆలోకముల కధ్యక్షుడైన బ్రహ్మముతో, చేరునని యర్థము.

బ్రహ్మోపాసకుడు కార్యబ్రహ్మలోకమును జేరి నిరంతరము బ్రహ్మనిష్ఠుడై బ్రహ్మమునే యుపాసించుచు కార్యబ్రహ్మలోకసుఖానుభవము పూర్తియగుటయే తడవుగ సర్వలోకాధ్యక్షుడగు బ్రహ్మమును జేరును. "తేన ధీరా అపియంతి బ్రహ్మవిదః స్వర్గలోక మిత ఊర్ధ్వా విముక్తాః" (బృ. ౪-౪-౮) ధ్యానశీలురగు బ్రహ్మజ్ఞానులు స్వర్గలోకము (కార్య బ్రహ్మలోకము)ను పొంది తదుపరి విముక్తు లగుదురు - బ్రహ్మమును బొందుదురు.' "స సామభి రున్నీయతే బ్రహ్మలోకం స ఏతస్మాత్ జీవఘనాత్ పరాత్ పరం పురిశయం పురుష మీక్షతే" (ప్ర. ఉ. ౫-౫) 'అతడు సామములచే బ్రహ్మలోకమున జేర్చబడును. అప్పు డతడు ప్రకృతికంటె సూక్ష్మమైన జీవఘనమగు తనస్వరూపముకంటెను సూక్ష్ముడు సర్వలోక

వ్యాప్తుడు నగు పురుషుని - పరమేశ్వరుని సాక్షాత్కారము పొందును - అదియే బ్రహ్మసాక్షాత్కారము.'

"బ్రహ్మవి దాప్నోతి పరమ్" (తై. ౨-౧) 'బ్రహ్మజ్ఞాని పరమును బొందును.' బ్రహ్మదర్శనమును బొందును. ఇదియే మోక్షము. ఇట్లు ఉపాసకుడు దేవయానమార్గమున మోక్షమును బొందును.

(సామమన త్రిమాత్ర - ఓంకారరూపబ్రహ్మమును ధ్యానించుట యగును. 'ఓమ్' పరమేశ్వరునిసర్వోత్తమనామము. ఉపాసనకు 'ఓమ్' సర్వశ్రేష్ఠసాధనము. అట్టి యుపాసనకు ఫలమే బ్రహ్మలోకప్రాప్తి.) (౧౦)

ఉపర్యుక్తవిషయమున స్మృతిప్రమాణము :

స్మృతేశ్చ ౪-౩-౧౧

స్మృతిప్రమాణమువలనను ఉపాసకుడు కార్యబ్రహ్మలోకమును దాటి బ్రహ్మమును చేరును - ముక్తిని బొందునని సూత్రార్థము.

"బ్రహ్మణాసహ తే సర్వే సంప్రాప్తే ప్రతిసంచరే పరస్యాంతే కృతాత్మానః ప్రవిశంతి పరంపదమ్" 'కార్యబ్రహ్మలోకావసానమున బ్రహ్మదర్శనమువలన కృతకృత్యులై యుపాసకులు బ్రహ్మతో చేరి పరమపదమును బొందుదురు.' అని స్మృతివచనము. (దీనికి మూలము తెలియదు.) (౧౧)

ఇంతవరకు చెప్పబడిన బాదరిమతము ఏ యాచార్యునిమతమునకు ప్రతియోగిగా చెప్పబడిన, దన :

పరం జైమినిర్ ముఖ్యత్వాత్ ౪-౩-౧౨

ముఖ్యత్వాత్ = ముఖ్యమగుటవలన, పరం = పరబ్రహ్మపరమేశ్వరుని (అర్చిరాదిమార్గమున ఉపాసకుని చేర్చునని) జైమినిః = జైమిని ఆచార్యుడు చెప్పును. "స ఏనాన్ బ్రహ్మ గమయతి" (ఛాం. ౪-౧౫-౬) 'అతడు వీరిని బ్రహ్మమువరకు జేర్చును'. ఇట బ్రహ్మపదము ముఖ్యార్థ

మున - అభిధావృత్తితో - పరబ్రహ్మపరమేశ్వరునే తెలుపును. కావున ఉపాసకుడు దేవయానపథమున బ్రహ్మమును చేరును. కార్యబ్రహ్మమును కాదు; అని జైమిని అభిప్రాయపడుచున్నాడు. (౧౨)

ఈ విషయమునే బలపరుచుచు మరియొక సూత్రమును జెప్పుచున్నాడు.

### దర్శనాచ్చ ౪-౩-౧౩

పరబ్రహ్మ - పరమేశ్వరునియందే బ్రహ్మపదప్రయోగము చూచుట వలనను ఉపాసకుని కార్యబ్రహ్మమున గాక బ్రహ్మముననే చేర్చునని సూత్రార్థము.

"సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ" తై. ౨-౧

"తే యదంతరా తద్ బ్రహ్మ" ఛాం. ౮-౧౪-౧

"విజ్ఞాన మానందం బ్రహ్మ" బృ. ౩-౯-౨౮ అను నీవాక్యములం దంతటను బ్రహ్మపదము పరబ్రహ్మ - పరమేశ్వరుని తెలుపుటకే ప్రయోగింపబడుట చూచుచున్నాము. అట్లే 'స ఏనాన్ బ్రహ్మ గమయతి" (ఛాం. ౪-౧౫-౬) అను తావునను బ్రహ్మపదము ముఖ్యార్థమున బ్రహ్మమునే బోధించును. కార్యబ్రహ్మమును బోధింపదని జైమినియభిప్రాయము.

మరియు

### న చ కార్యే ప్రతిపత్త్యభిసంధిః ౪-౩-౧౪

కార్యే = కార్యబ్రహ్మమున, ప్రతిపత్త్యభిసంధిః = ప్రాప్తించునను అభిప్రాయము. న చ = లేను లేదు.

ఉపాసకుడు కార్యబ్రహ్మమున చేర్చబడునను తాత్పర్యము శాస్త్రమున నెక్కడను కనిపింపదు. కావున ముఖ్యార్థమున బ్రహ్మపదము పరబ్రహ్మమునే తెలుపునని జైమిని.

"అకృతం కృతాత్మా బ్రహ్మలోక మభిసంభవా మీతి" (ఛాం. ౮-౧౩-౧) "నేను కృతకృత్యుడనై అకృతబ్రహ్మలోకమున చేరుచున్నాను'. అని యుపాసకు డనుచున్నాడు. ఇట బ్రహ్మలోకమునకు

'అకృత' అను విశేషణ ముండుటవలన బ్రహ్మలోకపదమునకు బ్రహ్మ దర్శనము అని కాని, బ్రహ్మమే లోకము అనికాని అర్థము చెప్పుట యుక్తమగును. అప్పుడు కార్యబ్రహ్మమని చెప్పవలసిన యవసర ముండదు. ఇది జైమిని ఆచార్యునిమతము. (౧౪)

అమానవపురుష దెవరిని బ్రహ్మలోకమువరకు చేర్చు, నన :

## అప్రతీకాలంబనా న్నయతీతి బాదరాయణ ఉభయథాఽదోషా త్తత్క్రతుశ్చ ౪-౩-౧౫

అప్రతీకాలంబనాన్ = సూర్యాదిప్రాకృతిక పదార్థముల నాలంబన ముగా తీసికొనని యుపాసకులను, నయతి = తీసికొనిపోవును, ఇతి = అని, బాదరాయణః = సూత్రకారునిమతము. ఉభయథా = రెండువిధము లను, అదోషాత్ = దోషము లేనందున, తత్క్రతుః చ = బ్రహ్మప్రాప్తికే సంకల్పము కలవాడును.

'ప్రతీకముల నాలంబనముగా తీసికొనక సాక్షా దానందస్వరూప బ్రహ్మము నుపాసించు ఉపాసకులను సూక్ష్మశరీరరూపుడగు నమానవపురు షుడు దేవయానముతో బ్రహ్మమువరకు చేర్చును.' అని బాదరాయణుని (సూత్రకారుని) మతము. అట్లంగీకరించినందున కార్యబ్రహ్మమునో లేక ముఖ్యబ్రహ్మమునో చేర్చు ననుటలో రెండువిధములలో నెట్లు చెప్పి నను దోషముండదు. కారణ మేమన: ఉపాసకునిధృఢసంకల్పము బ్రహ్మ ప్రాప్తియేకదా ।

కొందఱు సూత్రమునగల ' అదోషాత్ ' పదస్థానమున 'దోషాత్' అను పాఠము నంగీకరించి యిట్లు వ్యాఖ్యానము చేయుదురు: ప్రతీకముల నాలంబనముగా తీసికొనక సాక్షాత్ బ్రహ్మము నుపాసించు వారిని బ్రహ్మము వరకు చేర్చును. కారణ మేమన : ఉభయథా దోషాత్ = ప్రతీకోపాసకు లను గొంపోవునని చెప్పినను, బ్రహ్మోపాసకులను గొంపోవునని చెప్పినను దోషము వాటిల్లును - ఉపనిషత్‌వాక్యములకు విరుద్ధ మగును. కావున

'యథా క్రతు రస్మిన్ లోకే పురుషో భవతి తథేతః ప్రేత్య భవతి. (ఛాం. ౩-౧౪-౧) 'ఈ లోకమున పురుష డెట్టి కర్మలు చేయువా డగునో యీదేహమును వీడి యట్టి ఫలము కలవా డగును.' అనువాక్యము ననుస రించి గతి, ఫలము మున్నగువానిని పొందునని యంగీకరింపవలయును.' అని యిట్లు వ్యాఖ్య నొనరించినందున బాదరిజైమినుల మతములకు సామాం జస్యము కుదురదు. అంతిమపరిణామములో భేదముండదు. పాఠభేద మున్నందున నిట్లు చూపవలసి వచ్చినది. (౧౫)

అప్రతీకాలంబ నోపాసకులకు దేవయానమున బ్రహ్మ ప్రాప్తి కలుగు ననుటకు మరియొక హేతువు :

విశేషం చ దర్శయతి ౪-౩-౧౬

(శాస్త్రప్రమాణము) విశేషం చ = బ్రహ్మోపాసకులకు విశేషము కూడ, దర్శయతి=చూపుచున్నది.

ప్రతీకములను ఆలంబముగా గొని యుపాసించువారికంటె విశిష్ట ఫలము అప్రతీకోపాసకులకు కలుగునని సూత్రార్థము.

ప్రాకృతిక పదార్థములు ఉపాసనకు ప్రతీకలుగా తీసికొనరాదని పూర్వము (వే.ద. ౪-౧-౪) చెప్పబడినది. అట్టి యుపాసనలకు ఫలములు బ్రహ్మప్రాప్తి కాక యితరములుగా ఉపనిషత్తులలో చెప్పబడినవి. కావున అప్రతీకోపాసకులకు సాక్షాత్ బ్రహ్మప్రాప్తి రూపవిశేషఫలము కలుగునని (ఛాం. ౫-౧౦-౨ బృ. ౬-౨-౧౫) ఉపనిషత్ వాక్యములవలన తెలుప బడినది. కావున ప్రతీకోపాసకులను విడిచి, అర్చిరాది దేవయాన మార్గ మున ఉపాసకులను బ్రహ్మమును చేర్చునని నిశ్చితమగుచున్నది. (౧౬)

వేదాంత దర్శన — ఆంధ్ర వ్యాఖ్యానమున
చతుర్థాధ్యాయమునందు తృతీయపాదము
సమాప్తము

## చతుర్థాధ్యాయము

### చతుర్థపాదము

### ప్రథమాధికరణము

తృతీయ పాదమునందు ఉపాసకుడు దేవయాన మార్గమున అర్చి రాదుల ననుసరించి కార్యబ్రహ్మమును బొందు విధము వర్ణింపబడినది. ఇట నీ చతుర్థపాదమునందు బ్రహ్మసాక్షాత్కారరూపముగు బ్రహ్మప్రాప్తి యనెడి ముక్తి వర్ణింపబడును. ముక్తియందు జీవుడు సమస్త దుఃఖము లకు దూరుడై బ్రహ్మానందము ననుభవించును. జీవాత్మ యపు డెట్లుండునో సూత్రకారుడు వర్ణించుచున్నాడు.

సంపద్యావిర్భావః స్వేన శబ్దాత్ ౪-౪-౧

స్వేనశబ్దాత్=స్వేన పదయుక్త శబ్దప్రమాణమువలన, సంపద్య= బ్రహ్మమును పొంది, ఆవిర్భావః=స్వస్వరూపమున నుండును - ఆనందము ననుభవించును. 'ఏవ మేవైష సంప్రసాదో ఽస్మా చ్ఛరీరాత్ సముత్థాయ పరంజ్యోతి రుపసంపద్య స్వేన రూపే ణాభినిష్పద్యతే.' (ఛాం. ౮-౧౨-౩) 'ఇట్లే బ్రహ్మసాక్షాత్కారమును బొందిన జీవుడు ఈ శరీరమునుండి వెలు వడి పరంజ్యోతి-బ్రహ్మమును ప్రాపించి తన రూపముతో నుండును. కైవల్యరూపమున ప్రకటమగును.' ఇట ' స్వేన రూపేణ ' అనుటవలన జీవాత్మ సంసారదశయందున్నపుడు స్థూలసూక్ష్మశరీరములచే నావరింపబడి రాగద్వేషాదులకు వశుడై యుండుననియు, బ్రహ్మసాక్షాత్కారానంతర మా శరీరబంధనములనుండి విడివడి తన స్వరూపమున తా నుండుననియు స్పష్టమగుచున్నది. శరీరబంధనమునుండి విముక్తు డగుటవలన జీవుడు కేవలుడై స్వస్వరూపమున బ్రహ్మమునం దుండును. ఇదియే ముక్తి. (౧)

ముక్తుడైన జీవుని స్వరూప మదియే యని యెట్లు తెలియు, నన :

ముక్తః ప్రతిజ్ఞానాత్ ౪-౪-౨

ప్రతిజ్ఞానాత్=ప్రతిజ్ఞావచనమువలన, ముక్తః = ముక్తిని బొందిన వాడని తెలియును.

ముక్తావస్థయం దుండు రూపమే జీవుని వాస్తవికరూపమని ప్రతిజ్ఞా వచనమువలన తెలియును.

ఛాందోగ్యమున (౮-౭-౧) నిట్లు వర్ణన లభించును. ఈ శుద్ధాత్మ జరామృత్యువులు, ఆకలిదప్పికలు నను దుఃఖములనుండి దూరుడై సత్య కాముడు, సత్యసంకల్పుడునై యుండును. అట్టి యాత్మ నన్వేషింపవలెను- ఎరుగవలెను. ఇయ్యది యాత్మకు సాంసారికావస్థారహిత రూపము. సాం సారికావస్థయందు జీవాత్మ స్థూలసూక్ష్మశరీరయుక్తుడై ప్రియాప్రియముల తోను, ఆకలిదప్పికలతోను, రాగద్వేషాదులతోను వికృతుడగుచుండును. వానికి వశీభూతుడై యుండును. ఇయ్యది జీవాత్మకు స్వస్వరూపము కాదు. ముక్తియందు జీవాత్మ స్వస్వరూపమున నుండును. ఆ విషయమును దెలుపు ప్రజాపతి వాక్య మొకటి కలదు.

ఆ యాత్మ తెలియదగినది. దాని నాధారముగ గొని తరువాత 'ఏష సంప్రసాదోఽస్మాచ్ఛరీరాత్ సముత్థాయ పరంజ్యోతి రుపసంపద్య స్వేన రూపేణ అభినిష్పద్యతే (ఛాం. ౮-౧౨-౩) 'బ్రహ్మమును సాక్షా త్కారము చేసికొని యాత్మ యీ శరీరమునుండి వెలువడి పరంజ్యోతిని బొంది తన కైవల్యరూపమున ప్రకటమగును.' అని చెప్పబడినది. దీనితో బాటు 'స ఉత్తమః పురుషః స తత్ర పర్యేతి.' (ఛాం. ౮-౧౨-౩) 'ఏది పరంజ్యోతియో యదియే యుత్తమ పురుషుడు. అతనియందు జీవాత్మ తన స్వరూపముతో ప్రవేశించును.' అనియు నున్నది. ఇట్లు ఆత్మ పరమపురు షుని పొందుటయే మోక్షము. ఈ భావమునే ముండకముకూడ తెలుపు చున్నది.

'తథా విద్వాన్ నామరూపాద్ విముక్తః పరాత్ పరం పురుష ముపైతి దివ్యమ్.' (ముం. ౩-౨-౮) ఆత్మ-బ్రహ్మమును సాక్షాత్కారము చేసికొనినపుడు నామరూపములను (గోవిందాది శరీరము) విడిచి పరాత్పరు డగు పరమేశ్వరుని బొందును.' ప్రకృతికంటె జీవాత్మ పరము. అంత కంటెను పరమాత్మ పరము. అట్టి పరమాత్మను బొందుటయే ఆత్మకు ముక్తావస్థ - కైవల్యరూపమున నుండుట యగును. (౨)

ఛాందోగ్యమున (౮-౧౨-౩) తనరూపమున ప్రకటమగుట యన సంప్రసాద మనబడినది. అదియొక యవస్థావిశేష మగును. దానిచే నాత్మ యెట్లు గ్రహింపబడు, నన :

### ఆత్మా ప్రకరణాత్ ౪-౪-౩

ప్రకరణాత్ = ప్రకరణమునుబట్టి, సంప్రసాదపదమువలన, ఆత్మా= ఆత్మయే గ్రహింపనగును.

"య ఆత్మా అపహతపాప్మా...." (ఛాం. ౮-౭-౨) అను నీవాక్య ముతో ఆత్మప్రకరణము ప్రారంభమగును. తదుపరి "ఇదం శరీరం.... ఆత్మనోఽధిష్ఠానం" (ఛాం. ౮-౧౨-౧) ఈశరీరము నాశరహితమగు ఆత్మకు అధిష్ఠానము' అని నుడివి యీశరీరముతో నుండగా నతనికి ప్రియాప్రియములు కలుగును. శరీరముతో సంబంధము విడిపోయినపుడు సుఖదుఃఖము లుండవు. అట్టి యవస్థను లక్ష్యమునం దుంచుకొని "ఏష సంప్రసాదో అస్మాత్ శరీరాత్" (ఛాం. ౮-౧౨-౩) అని చెప్పబడినందున ప్రకరణమునుబట్టి సంప్రసాదశబ్దము ఆత్మవాచకమని స్పష్టమగుచున్నది. (౩)

జీవుడు పరబ్రహ్మను పొందుటయన దేవదత్తుడు గ్రామమును పొంది వేరుగ నుండున ట్లుండుటయా? లేక నది సముద్రమున జేరి యవిభక్తముగ నుండున ట్లుండుటయా? యన :

## అవిభాగేన దృష్టత్వాత్ ౪-౪-౪

దృష్టత్వాత్=శాస్త్రదర్శనమువలన, అవిభాగేన=ఆత్మ పరంజ్యోతిని చేరి యవిభక్తముగా నుండునని యంగీకరింపబడును.

బ్రహ్మజ్ఞానము కలిగినమీదట జీవాత్మ పరమాత్మను (బ్రహ్మ) చేరి, నది సముద్రమున ఁజేరి తన నామరూపములను విడిచి యం దవిభక్త ముగా నుండున ట్లుండును.

"యథా నద్యః స్యందమానాః సముద్రే
అస్తం గచ్ఛంతి నామరూపే విహాయ
తథా నామరూపాద్ విముక్తః
పరాత్ పరం పురుష ముపైతి దివ్యమ్". (ముం. ౩-౨-౮)

నదీజలములు సముద్రమున జేరును. కాని యవి స్వరూపముతో తమయస్తిత్వమును కోలుపోవు. ఈశ్వరునివ్యవస్థ ననుసరించి సముద్రము నుండి యావిరియై సముద్రమును విడిచి మరల నదీరూపమున ప్రవహించును. ఈ స్థితియే ఆత్మపరమాత్మలవిషయమునను గుర్తింపనగును. అవి రెండును చేతనములు. జీవాత్మ సంసారరూపనదీరూపమున జీవనయాత్ర నిర్వహించి బ్రహ్మరూపసముద్రమున జేరును. బ్రహ్మము ఆనందస్వరూపము. జీవాత్మ ఆ యానందము ననుభవింప నారంభించును. ఇదియే జీవ పరమాత్మల యవిభాగస్థితి. జీవాత్మ తనయస్తిత్వమును కోలుపోదు. అందువలననే ముండకమున (౩-౨-౩) బ్రహ్మజ్ఞాని యపుడు పుణ్యపాపములను విడిచి నిర్మలుడై పరమసామ్యమును బొందునని చెప్పబడినది. ఆ యవస్థయందు ఆనందానుభూతి తక్క మరియొండు జీవున కుండదు. అంతేకాని జీవుడు బ్రహ్మమై పోడు. అట్లు కాక బ్రహ్మమే యై తన యస్తిత్వమునే కోలుపోవునెడల 'బ్రహ్మైవైతి' బ్రహ్మమును పొందు ననుట వ్యర్థమగును. బ్రహ్మను సాక్షాత్కారము చేసికొనినందున నపుడు జీవుడు బ్రహ్మమున నవిభక్తముగా నుండునని చెప్పబడుచున్నది. (౪)

మోక్షమున జీవాత్మ స్వస్వరూపమున నావిర్భవించునని చెప్పబడి నదికదా। ఆ రూపమేమి? యన, ముందు జైమినిమతమును సూత్రించు చున్నాడు.

బ్రాహ్మేణ జైమిని రుపన్యాసాదిభ్యః ౪-౪-౫

ఉపన్యాసాదిభ్యః=ఉపక్రమాదులవలన, బ్రాహ్మేణ = బ్రహ్మసం బంధిరూపముతో నుండునని, జైమినిః=జైమిని మతము.

అట నట ఉపనిషదాదులందు గల వర్ణనలవలన జీవాత్మ ముక్తావస్థ యందు బ్రహ్మరూపమున నుండునని జైమిని అంగీకరించును. ఉపనిషత్తు లలో (ముం. ౨-౨-౭. తై. ౨-౬. ఛాం. ౮-౭-౧) 'బ్రహ్మము ఆనంద రూపము. సత్యసంకల్పుడు. సత్యకాముడు' ననియు తెలియును. జీవుడు బ్రహ్మమును బొంది ఆనందమును అనుభవించునపుడు ('స్వేన రూపేణ' ఛాం. ౮-౧౨-౩) స్వస్వరూపమున ఆవిర్భవించు ననుమాటకు జైమిని ముని 'బ్రహ్మరూపమున నుండును' అని యభిప్రాయపడుచున్నాడు.

కాని, ఛాందోగ్యమున నొకచో, 'తస్య సర్వేషు లోకేషు కామచారో భవతి' (ఛాం. ౭-౨౫-౨). 'ముక్తాత్మ సర్వలోకములందును స్వేచ్ఛగా సంచరించును.' అని యున్నది. బ్రహ్మము సర్వత్ర వ్యాప్తమై యుండును. దానియందు గతి - సంచార ముండదు. కాని ముక్త ఆత్మ సర్వలోకము లందును సంచారము చేయగలుగు ననుటచేత ముక్తియందు జీవాత్మ బ్రహ్మముకంటె భిన్నమని స్పష్టమగుచున్నది. బ్రహ్మ మంతట నుండును. కాని సంచరింపదు. వ్యాపకవస్తువునందు గతి కలుగదుకదా। జీవుడు సంచ రించును కావున 'స్వేన రూపేణ' అనుదానికి 'బ్రాహ్మేణ రూపేణ' అను టలో తాత్పర్యము జీవుడు మోక్షమున తన యస్తిత్వము నెన్నడును పోగొట్టుకొన డనియే యెంచుట యుచితము. కావున బ్రహ్మరూపము నందుననియు, అందు లీనుడగుననియు ననుటలో యథార్థము లేదు. జీవుడు

సదా బ్రహ్మమే యనుటలోను సారము లేదు. బ్రహ్మ మగునెడల మోక్ష సాధనము, స్వస్వరూపనిష్పత్తియు నన్నియు వ్యర్థములగును. (౫)

పై విషయమున మరియొకని యభిప్రాయము:

## చితితన్మాత్రేణ తదాత్మకత్వా దిత్యౌడులోమిః ౪-౪-౬

తదాత్మకత్వాత్=చేతనస్వరూపమువలన, చితితన్మాత్రేణ = చేతన రూపముతో నిష్పత్తి, ఇతి=అని, ఔడులోమిః=ఔడులోమి యాచార్యుని మతము.

చేతనమాత్రరూపముతో మోక్షమున జీవు డుండునని యౌడులోమి యభిప్రాయము.

జీవుడు చేతనస్వరూపు డనుట శాస్త్రసమ్మతసిద్ధాంతము. మోక్షము నకు పూర్వము దేహేంద్రియాది ప్రాకృతపదార్థములతో నావేష్టితుడై యుండును. ఆ పదార్థములు చేతనములు కావు. మోక్షమున వానిసంబంధ ముండదు. అపుడు కేవలచేతనస్వరూపముతో నుండును. శాస్త్రము నట్లే చెప్పుచున్నది. "కృత్స్నః ప్రజ్ఞానఘన ఏవ" (బృ. ౪-౫-౧౩) "ద్రష్టా దృశిమాత్రః" (యో. ద. ౨-౨౦) కావున మోక్షమున జీవాత్మ స్వేన రూపేణ - చేతనరూపమున నుండుననుట సిద్ధము. ఇదియే యౌడులోమి మతము. (౬)

సూత్రకారుని (స్వ) మతము:

## ఏవ మప్యుపన్యాసాత్ పూర్వభావా దవిరోధం బాదరాయణః ౪-౪-౭

ఉపన్యాసాత్=శాస్త్రప్రమాణమువలన, ఏవమపి=చితితన్మాత్రరూప మున ప్రకటమగునని చెప్పినను, పూర్వభావాత్ = బ్రాహ్మరూపమున నిష్పన్ను డగునని చెప్పినందువలన, అవిరోధం=విరోధములేదని, బాద రాయణః=సూత్రకారు డంగీకరించుచున్నా డని యర్థము.

మోక్షమున జీవుడు ప్రకృతిసంసర్గమును విడిచి కేవలచేతనరూప మున నుండునని యొకలోని చెప్పుట శాస్త్రమున ననుకూలమే. అట్లే యంతకు పూర్వము బ్రహ్మానందము ననుభవించుచు జీవుడు మోక్షమున బ్రాహ్మమగు నానందరూపమున నుండు ననుటయు శాస్త్రవిరుద్ధము కాదు. కావున సూత్రకారుడైన బాదరాయణునిదృష్టిలో పై రెండువిధములగు మతములలోను విరోధము లేదని తెలియుచున్నది. ఒకసత్యము నొకరు, ఇంకొక సత్యమును మరియొకరు చెప్పినందున, ఉభయరూపములు శాస్త్రానుకూలములు కావునను బాదరాయణుడు రెంటింటిని అంగీకరించు చున్నాడు. (౭)

## ద్వితీయాధికరణము

మోక్షమున జీవునకు కామచారరూపమున ననుభవము చెప్పబడి నది. (ఛాం. ౬-౨౫-౨). అయ్యది సంకల్పవిశేషమువలన కలుగునా? మరియొకవిధముననా? యన:

### సంకల్పాదేవ తు తచ్ఛ్రుతేః ౪-౪-౮

తచ్ఛ్రుతేః = శ్రుతికథనమువలన, జీవునకు కామచారము, సంక ల్పాత్ ఏవ తు=సంకల్పమువలననే కలుగును. మరియొకవిధమున కాదు.

లోకమున నెవరేని యొకకార్య మొనర్చుటకు సంకల్పముతోబాటు ప్రయత్నము చేయవలెను. సాధనసంపత్తిని చేకూర్చవలయును. అది యపుడు నెరవేరును. మోక్షమున నట్లుకాక సంకల్పమాత్రమున జీవుడు ఐశ్వర్యము ననుభవించును - సంచరణము కలుగును. ఇతరయత్నములు సాధనసంపత్తులు నట చేకూర్చవలసిన యవసర ముండదు. ఈ సంకల్ప మనునది యంతఃకరణవృత్తి కాదు. అది కేవలాత్మానుభూతియే.

"యం యమన్త మభికామో భవతి యం కామం కామయతే సోఽస్య సంకల్పాదేవ సముత్తిష్ఠతి తేన సంపన్నో మహీయతే." (ఛాం. ౮-౨-౧౦)

'ఏ ప్రదేశమును, ఏ కామమును అభిలషించునో అది యతనికి చేకూరును. దానితో నతడు సంపన్నుడై యానందితుడగును.' మోక్షమున జీవున కట్టి స్వాభావిక సామర్థ్యము కలుగును. అదియే సంకల్పరూపము. దానితో నతని కనుభూతి కలుగును.

"వదన్ వాక్ పశ్యన్ చక్షుః శృణ్వన్ శ్రోత్రం మన్వానో మనః" (శత. బ్రా. ౧౪-౪-౨-౧౭) ముక్తాత్మ తనశక్తిరూప సంకల్పముతో నన్నియు ననుభవించును. పై వాక్యమువలన మోక్షమున వాగాదీంద్రియ ములు కలుగునని యెంచరాదు. ప్రాకృతికము లగుటవలన నవి యెట నుండి కలుగును? కావున మోక్షమున జీవుడు సంకల్పమాత్రమున నన్నియు ననుభవించునని సూత్రతాత్పర్యము. (౮)

అత ఏవ చానన్యాధిపతిః ౪-౪-౯

అత ఏవ = సత్యసంకల్పము వలననే, అనన్యాధిపతిః = అన్యుడు అధిపతిగా లేనివా డగును. స్వతంత్రు డగును. అట్టియెడ జీవునకు బ్రహ్మముతక్క మరియొక యధిపతి యెవ్వడు నుండడని సూత్రార్థము.

మోక్షమున జీవుడు ప్రకృతివశుడు కాక స్వతంత్రుడై యుండును. కావుననే ఛాందోగ్యమున "స వా ఏష ఏవం పశ్యన్.........ఆత్మానందః స స్వరాడ్భవతి. తస్య సర్వేషు లోకేషు కామచారో భవతి." (ఛాం. ౭-౨౫-౨) 'సర్వశక్తిమంతుడు, సర్వవ్యాపకుడునగు పరమాత్మను తెలిసి కొనుచు, ఆత్మయం దానందము ననుభవించుచు స్వరాట్టు - స్వయంరాజు - అగును. అన్నిలోకములందును నతనికి యథేచ్ఛాసంచారము కలుగును. ఎక్కడను ప్రాకృతిక ప్రతిబంధక ముండదు. పరబ్రహ్మము తక్క యన్యాధిపతి యతని కుండడు. (౯)

మోక్షమున ననుభవించుటకు శరీరేంద్రియాదు లపేక్షితములగునా? అను విషయమును విచారించుటకు సూత్రము నారంభించుచున్నాడు.

అభావం బాదరి రాహ హ్యేవమ్	౪-౪-౧౦

అభావం=అభావమును, బాదరిః = బాదరి, ఆహ=పలికెను, హి = కారణమేమన, ఏవమ్=ఇట్లే శాస్త్రమున చెప్పబడినది.

మోక్షానందము ననుభవించుటకు జీవున కట శరీరాదు లుండవని శాస్త్రము చెప్పుచున్నది. కావున బాదరిముని అట్లు చెప్పుచున్నాడు. ప్రాకృతిక సుఖదుఃఖములు ననుభవించుటకు శరీరేంద్రి యాదు లవసరము లగు ననియు, మోక్షానంద మట్టిదికాదు కావున, నట శరీరాదుల యవసరముండ దనియు పూర్వము నిరూపింప బడినది. ఆ శాస్త్ర ప్రమాణముల ననుసరించియే మోక్షమున శరీరాదు లుండవని బాదరి యభిమతము. (౧౦)

భావం జైమినిర్ వికల్పామననాత్	౪-౪-౧౧

వికల్పామననాత్=వికల్పముగా జెప్పుటవలన, భావం=మోక్షమున శరీరాదు లుండునని, జైమినిః=జైమిని మతము.

"స ఏకధా భవతి, త్రిధా భవతి, పంచధా సప్తధా నవధా చైవ పున శ్చైకాదశ స్మృతాః, శతం చ దశ చైకశ్చ సహస్రాణి చ వింశతిః." (ఛాం. ౭-౨౬-౨) ముక్తాత్మనుగురించి వర్ణించుచు 'ఒకటి, మూడు, ఐదు ఏడు, తొమ్మిది, పదునొకండు, పది, యిరువది, వంద, సహస్ర సంఖ్యచే జెప్పదగు విధముల నతడగునని చెప్పబడినది. ఈయనేక విధములు జీవునకు శరీరములు లేకున్న కలుగనేరవు. ఇట్టి వికల్పవచనమువలన మోక్షమున జీవునకు శరీరాదు లుండునని జైమిని మతము. (౧౧)

ఈ శాస్త్రీయ సమస్యను పరిష్కరించుటకు సూత్రకారుడు శాస్త్ర ప్రమాణము నుదాహరించుచున్నాడు.

ద్వాదశాహవ దుభయవిధః బాదరాయణో అతః	౪-౪-౧౨

అతః=శాస్త్రవచనము వలన, ద్వాదశాహవత్=ద్వాదశాహమువలె,

ఉభయ విధం=ఉభయవిధమును, బాదరాయణః=సూత్రకారు డంగీకరించు చున్నాడు.

రెండు దినములు మొదలు పంద్రెండు దినములవరకు జరుపబడు యజ్ఞములకు 'అహీన' యజ్ఞము లని పేరు.

"ద్విరాత్ర ప్రభృతయోఽహీనాః ద్వాదశాహపర్యంతః" (బౌ. శ్రౌ. ౧౧-౩) పంద్రెండు దినములలోకాని, అంత కెక్కుడు దినములలో కాని పూర్తియగు యజ్ఞములు 'సత్రము' లనబడును. "ద్వాదశాహః ప్రభృతీని సత్రాణి." (బౌ. శ్రౌ. ౧౧-౪)

కాత్యాయనశ్రౌత సూత్రమున "ద్వాదశాహః సత్రమహీనశ్చ." (కా. శ్రౌ. ౧౨-౧-౪) ద్వాదశాహఇష్టి సత్రము, అహీనము నని రెండు విధములు చెప్పబడును. పూర్వము చెప్పబడిన (బౌ. శ్రౌ. ౧౧-౩,౪) బౌధాయన శ్రౌత సూత్రముల ననుసరించి చూచిన ద్వాదశాహాది యాగములు రెండు నామములతోను చెప్పబడ వీలున్నది. అట్లే 'ముక్తాత్మకు మోక్షమున శరీరముండదు' అనుట శాస్త్రసమ్మతమే. 'నానావిధ-ఐశ్వర్యముల నట జీవు డనుభవించు ననుటయు' శాస్త్రవిహితమే. కాని యిది యంతయు ముక్తజీవునకు సంకల్పమాత్రముననే లభించు ననుట మరువరాదు. ఆ సంకల్పము ఆత్మకు మోక్షదశయందు కలుగు సామర్థ్యము తక్క వేరొండుకాదు. శాస్త్రమునందు మోక్షమున జీవు డశరీరు డగునని స్పష్టముగా చెప్పినట్లు శరీర ముండునని యెక్కడను చెప్పబడలేదు. జీవున కనేక ప్రకారములు వర్ణింపబడిన (ఛాం. ౭-౨౬-౨) తావునను శరీరేంద్రియాదుల శబ్దముతో నిర్దేశింపబడ కుండుట గమనీయాంశము. కావున జీవుడు మోక్షమున స్వసామర్థ్యరూప సంకల్పము వలననే యన్నియు ననుభవించు ననుట నిక్కువము. ఉభయ విధ వచనములు సంకల్పానుభవము నందే చరితార్థము లగునట్లు గుర్తింపనగును. మోక్షమున జీవునకు శరీ

రేంద్రియాదుల కెన్నడును ప్రసక్తియే యుండదని బాదరాయణుని యభిప్రాయము. (౧౨)

శరీరము లేనియెడల మోక్షమున జీవున కనుభూతి యెట్లు కలుగునో, యన :

## తన్వభావే సంధ్యవ దుపపత్తేః ౪-౪-౧౩

తన్వభావే=శరీరము లేకున్నను, సంధ్యవత్ = స్వప్నమువలె, ఉపపత్తేః=ముక్తాత్మకు అనుభూతి సిద్ధింప వీలున్నది.

(సంధ్యః = స్వప్నము లేక స్వప్నావస్థయందున్న పురుషుడు) జీవునకు స్వప్నసమయమున శరీరేంద్రియములతో సంబంధము లేకయే యనుభూతి కలుగును. అట్లే ముక్తాత్మకు శరీరేంద్రియాదులతో నెట్టి సంబంధము లేకున్నను అనుభూతి కలుగునని సూత్రాభిప్రాయము. స్వప్నమునకు మోక్షముతో సామ్యము నిట గుర్తింపవగును. స్వప్నమున నంతఃకరణము మాత్రము పనిచేయును. ఇతరేంద్రియములు పనిచేయవు. మోక్షమున శరీరము, ఇంద్రియములు, అంతఃకరణము నేదియు నుండదు. కాని బ్రహ్మసాక్షాత్కారము వలన ఆత్మయందు విలక్షణసామర్థ్య మేర్పడును. దాని మూలమున దేహాదులు లేకయే జీవున కనుభూతి కలుగును. కావుననే స్వరూపసామర్థ్యముతోనే అనందము ననుభవించునని పూర్వము చెప్పబడినది. (౧౩)

## తృతీయాధికరణము

జీవన్ముక్తునకును బ్రహ్మసాక్షాత్కారము కలుగునుకదా ! అతని యనుభూతి యెట్లుండు, నన :

## భావే జాగ్రద్వత్ ౪-౪-౧౪

భావే = శరీరమున్నపుడు, జాగ్రత్వత్ = జాగ్రత్పురుషునకు కలిగినట్లు జీవన్ముక్తున కనుభూతి కలుగునని సూత్రార్థము.

జీవన్ముక్తదశయందు ఆనందము ననుభవించుటలో జీవునకు శరీరేంద్రియములతో సంబంధముండదు. అయినను బ్రహ్మజ్ఞాని జీవన్ముక్తదశయందు శరీరాదులతో నిత్యవ్యవహారములను నిర్వహించుచు ఆనందానుభూతిలో మగ్నుడై యుండును. (౧౪)

ఆనందానుభూతితోబాటు దేహవ్యాపారముల నెట్లు చేయగల, డన :

ప్రదీపవ దావేశ స్తథా హి దర్శయతి ౪-౪-౧౫

ప్రదీపవత్ = ప్రదీపమువలె, ఆవేశః = జీవన్ముక్తునకు సర్వవ్యవహారములందును ప్రవేశము కలుగును. తథా హి దర్శయతి = శాస్త్రవాక్యము లట్లే తెలుపుచున్నవి.

"తదక్షరం వేదయతే యస్తు సోమ్య । స సర్వజ్ఞః సర్వమే వావివేశ" (ముం. ౪-౧౧) 'సోమ్య । విశ్వాధారుడై పరమేశ్వరుడైన' యక్షరు నెరిగిన జ్ఞాని యంతయు నెరిగినవాడై యన్నింటియందు నావిష్టు డగును'. "న పశ్యో మృత్యుం పశ్యతి న రోగం నోతదుఃఖతామ్ సర్వంహ పశ్యః పశ్యతి సర్వమాప్నోతి సర్వశః" (ఛాం. ౭-౨౬-౨) 'బ్రహ్మజ్ఞానియైన జీవన్ముక్తాత్మ మృత్యువు, రోగము, దుఃఖములు ననువానినుండి దూరు డగును. సర్వము నెరుగును. అన్నివిధముల నన్నింటిని పొందును.' అని యిట్లు ఉపనిషత్తులు జీవన్ముక్తాత్మప్రభావమును వర్ణించుచున్నవి. ప్రదీప మొకచో నుండియు తనను దూరమున చుట్టునున్న వస్తువుల నన్నింటిని తన ప్రకాశముతో నావేశించి వానిని ప్రకాశింపజేయును. లోకమున నియ్యది చూచుచున్నాము. అట్లే జీవన్ముక్తునియందును జ్ఞానవిషయకమగు నైశ్వర్య మొండు ఉద్భవించును. దానిమూలమున దైహికవ్యాపారముల నొనర్చు నపుడును ఆనందానుభూతిలో నిమగ్నుడై యుండునని సూత్రాభిప్రాయము. (౧౫)

ముక్తాత్మ సర్వజ్ఞసమాన మనుచున్నారు. కాని శాస్త్రమున ఆత్మరు

బ్రహ్మసంపర్కము కలిగినపుడు బాహ్యాభ్యంతరము నెరుగక యని యున్నదికదా ! సామంజస్య మెట్లు కుదురు, నన :

స్వాప్యయసంపత్త్యో రన్యతరాపేక్ష
మావిష్కృతం హి  ౪-౪-౧౬

స్వాప్యయసంపత్త్యోః = స్వాప్యయః = సుషుప్తి, సంపత్తిః = మోక్షము, ఈ రెండు దశలలోను, అన్యతరాపేక్షం = కొండొకదాని నపేక్షించి, బాహ్యాభ్యంతరజ్ఞానము కలుగునని శాస్త్రము చెప్పుచున్నది. హి = కారణమేమన, ఆవిష్కృతం = ప్రకటింపబడినది, శాస్త్రమున.

"అయం పురుషః ప్రాజ్ఞేన ఆత్మనా సంపరిష్వక్తో న బాహ్యం కించన వేద, నాంతరమ్" (బృ. అ. ౪-౩-౨౧) 'ఈ పురుషుడు బ్రహ్మ సంపర్కము కలవాడై బాహ్యాభ్యంతరముల నెరుగడు.' అని యిట్లు చెప్పి మరియొకతావున, "తత్ కేన కిం విజానీయాత్" (బృ. ౪-౫-౧౫) 'ఎక్కడ నంతయు నాత్మయే యగునో యట దేనితో దేని నెరుగును ?' అని చెప్పబడినది. ఇట జ్ఞానసాధనములు, విషయము రెండును లేనందున జ్ఞానాభావమని తెలియుచున్నది. ఇట్లు శాస్త్రము జ్ఞానాభావమును తెలుపుచుండ ముక్తాత్మ సర్వజ్ఞసమాన మనుటెట్లు పొసగు? - నన సూత్రకారుడు సమాధానము చెప్పుచున్నాడు.

పైన ఉదాహరించిన ప్రసంగములు సుషుప్తికో లేక, సంపత్తి - మోక్షమునకో సంబంధించినవై యుండును. ప్రథమవాక్యమున జీవునకు బ్రహ్మముతో సంబంధము కలిగినపుడు - సుషుప్తిదశయందు, అతడు బాహ్యాభ్యంతరముల నెరుగడని సుషుప్తిదశ నుద్దేశించి చెప్పబడినది. అంతకు పూర్వము సుషుప్తినిగూర్చియే వర్ణింపబడుట చూడనగును. ఇక రెండవ ప్రసంగము (బృ. ౪-౫-౧౫) మోక్షమునకు సంబంధించినది. అట జీవుడు ఆనందమున మునిగి- ఆనందానుభూతియందే యుండును - ఇతరము నెరుగడు.

"యత్ర త్వస్య సర్వ మాత్మైవాభూత్
తత్ కేన కిం విజానీయాత్" బృ. ४-౫-౧౫.

'అంతయు నాత్మగా నెట అనుభవమగునో యట దేనితో నేది యెరుగును ?' అనుటచే ఆత్మానందమున మునిగి తేలు ముక్తాత్మ యన్యము నెట్లెరుగగలుగును ? అట నన్యద్రష్టవ్య ముండదని భావము. మోక్షమున ప్రాకృతికపదార్థజ్ఞాన ముండదు. బ్రహ్మానందము ననుభవించుచుండును. కావున సర్వజ్ఞసమానత చెప్పబడినది. స్వసామర్థ్యముచే నంతయు నెరుగ గల క్షమత యుండునని భావము. (౧౬)

సత్యసంకల్పుడు, సత్యకాముడు నగునెడల ముక్తపురుషుడు జగ ద్రచన చేయగలడా ? యన :

జగద్వ్యాపారవర్జం ప్రకరణా
దసంనిహితత్వాచ్చ ४-४-౧౭

ప్రకరణాత్ = ప్రకరణమువలన, అసంనిహితత్వాత్ చ = ముక్తా త్మల సాంనిధ్యము లేనందువలనను, జగద్వ్యాపారవర్జమ్ = జగద్రచనా వ్యాపారమును విడిచి మిగిలిన యైశ్వర్యప్రాప్తి ముక్తాత్మలకు కలుగును.

జగదుత్పత్తి స్థితి లయములు కాక మిగిలిన యైశ్వర్యప్రాప్తి ముక్తాత్మకు కలుగును. జగద్వ్యాపారము, కర్మఫలములను జీవుల కంద జేయుట మున్నగుకార్యములు ఈశ్వరసామర్థ్యమునకు జెందినవి. జగ దుత్పత్త్యాదులను వర్ణించుప్రకరణమునందు బ్రహ్మకు సాక్షాత్సంబంధ ముండుట చూడనగును. ముక్తాత్మల కట ప్రసక్తియే యుండదు. (౧౭)

అటులయిన 'ఆప్నోతి స్వారాజ్యమ్" (తై. ౧-౬-౨) "సర్వేషు లోకేషు కామచారో భవతి" (ఛాం. ౭-౨౫-౨) అని యేల చెప్పబడిన, దన :

## ప్రత్యక్షోపదేశా దితిచే న్నాధికారిక మండలస్థోక్తేః ౪-౪-౧౮

ప్రత్యక్షోపదేశాత్ ఇతి చేత్ = ప్రత్యక్షోపదేశమువలన అని యని నచో, న = సరికాదు. ఆధికారిక మండలస్థోక్తేః = అధికారక్షేత్రమును మించి యుండనందువలన.

ముక్తాత్మవిషయమున జెప్పబడిన ప్రత్యక్షోపదేశము లన్నియు నత నివి బ్రహ్మముచే నిర్వర్తింపదగిన జగదుత్పత్త్యాది కార్యములందు బ్రహ్మ స్థానాపన్నుని చేయజాలవు. ముక్తాత్మవిషయమున జెప్పబడిన ప్రసంగము లన్నియు నతని యధికారమునకు మించినవి కావు.

'స్వారాజ్యమును బొందును' (తై. ౧-౬-౨)
'దేవత లన్నియు నతనిని పూజించును' (తై. ౧-౫-౩)
'అతనికి సర్వలోకములందు నబాధగతి కల్గును' (ఛాం. ౭-౨౫-౨)
అను వివియన్నియు ముక్తాత్మకు సాధ్యములే. అతనియధికారమునకు మించినవి కావు. తనసామర్థ్యముచే నన్నియు ననుభవింపగలుగును. కాని యింతమాత్రమున నతడు బ్రహ్మస్థానమును గ్రహింపగల డని యెంచ రాదు. జగదుత్పత్త్యాది వ్యాపారముల నత డెన్నడు చేయజాలడు. (౧౮)

అయినచో ముక్తాత్మల యైశ్వర్యము సీమితమగుచున్నదికదా। ఆసీమ యెంతవరకు ? అన :

## వికారావర్తి చ తథా హి స్థితి మాహ ౪-౪-౧౯

వికారావర్తి = జన్యవస్తువులవిషయకవ్యాప్తి కలది, చ=మరియు, తథా హి స్థితిమ్ ఆహ = అట్టిస్థితినే శాస్త్రము వర్ణించుచున్నది.

జ్ఞానరూపము, క్రియారూపము నని (జీవుని) యైశ్వర్యము రెండు విధముల చెప్పనగును. జ్ఞానరూపమగు ముక్తాత్మ యైశ్వర్యము భావపథార

ముల నన్నింటిని తనకు విషయముగా జేసికొనును. ముక్తజీవుడు బ్రహ్మ మొదలు ప్రకృతివరకు గల సమస్తపదార్థముల నెరుగును. కావున సర్వజ్ఞునితో సమానత చెప్పబడును. ఇక క్రియారూపమగు నైశ్వర్యము వికృతజన్యపదార్థముల నుపయోగించుటవరకు సీమితమై యుండును. ఈశ్వరీయ వ్యవస్థ ననుసరించి ప్రకృతి పరిణమించి వికృతమగును. ఈ విషయమున ముక్తాత్మకు సంబంధ ముండదు. ఇయ్యది జగద్వ్యాపారక్రియ. ముక్తాత్మ స్వరాట్టగుట, సర్వలోకముల సంచరించుట మున్నగువర్ణనలు శాస్త్రమున జూచునవి వికృతికి సంబంధించినవే యగును. బ్రహ్మమునకు సంబంధించిన యైశ్వర్యము అంతకంటె మించినది. కావుననే

"ఏతావా నస్య మహిమా అతో జ్యాయాంశ్చ పూరుషః,
పాదోఽస్య విశ్వా భూతాని త్రిపా దస్యా మృతం దివి"

యజు. ౩౧-౩.

'పరమేశ్వరుని యైశ్వర్యము అసీమిత'మని చెప్పబడినది. ముక్తాత్మ వర్ణితమగు నైశ్వర్యము వికృతవస్తువులవరకు పరిమితమై యుండునని పైవర్ణనలనుబట్టి తెలియనగును. (౧౯)

బ్రహ్మమునకు గల యైశ్వర్యము అసీమిత మెందువలన ? అన:

## దర్శయతశ్చైవం ప్రత్యక్షానుమానే ౪-౪-౨౦

ప్రత్యక్షానుమానే=ప్రత్యక్షానుమానములు రెండును, దర్శయతః చ= చూపుచున్నవి- తెలుపుచున్నవికూడ.

ఇట ప్రత్యక్షమన శ్రుతి, అనుమానమన స్మృతియు గ్రహింపనగును.

"తదంతరస్య సర్వస్య తదు సర్వస్యాస్య బాహ్యతః" (యజు. ౪౦-౫). 'ఆ పరమేశ్వరుడు అన్నింటి లోపల వెలుపల నుండును',

"త్వమస్య పారే రజసో వ్యోమ్నః" (ఋ. ౧-౫౨-౧౨). 'పరమేశ్వరః నీ వీ విస్తృతలోక లోకాంతరములకు పరమున కూడ నున్నావు'. అని శ్రుతులు.

"న తత్ర సూర్యో భాతి న చంద్రతారకమ్ .... త-మేవ భాంత మనుభాతి సర్వమ్, తస్య భాసా సర్వ మిదం విభాతి" (కఠ. ౨-౨-౧౫. శ్వే. ౬-౧౪. ముం. ౨-౨-౧౦). 'సూర్యుడు, చంద్రుడు, నక్షత్రములు నేవియు పరమేశ్వరుని ప్రకాశింపజేయవు. అతని యునికివలననే నివి యన్నియు ప్రకాశించుచున్నవి'. అని యుపనిషత్తులు - స్మృతులు. పరమేశ్వరుడు - విశ్వకర్త లేకున్న నివి యన్నియు స్వయముగా ప్రకాశింప నేరవు. కావున బ్రహ్మముయొక్క యైశ్వర్యము వికృతప్రపంచముననే కాక, సమస్తకార్యకారణాత్మక ప్రపంచమును మించియున్నది. అది సీమితము కాదు. అందువలననే శాస్త్రములు బ్రహ్మముయొక్క యైశ్వర్యము అసీమిత మనుచున్నవి. (౨౦)

అటులయిన ముక్తాత్మ నెట్లు శాస్త్రకారులు బ్రహ్మసమమనినా, రన:

### భోగమాత్రసామ్యలింగాచ్చ ౪-౪-౨౧

"భోగమాత్రసామ్యలింగాత్ చ = భోగమాత్రమున సామ్యలింగ ముండుటవలన ముక్తాత్మకు బ్రహ్మసామ్యము చెప్పబడినది.

ముక్తదశయందు జీవుడు బ్రహ్మమునందుండి బ్రహ్మానందము ననుభవించును. అట్టి భోగముతో బ్రహ్మసామ్యము ముక్తాత్మకు చెప్పబడినది.

"సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ.........సోఽశ్నుతే సర్వాన్ కామాన్ సహ బ్రహ్మణా విపశ్చితా" (తై. ౨-౧). 'సత్యము, చేతనము నగు అనంతబ్రహ్మము నెరిగినవాడు అనంతరూపబ్రహ్మముతో బాటు సర్వ

కామముల ననుభవించును.' అనగా, బ్రహ్మమును బొందినవానికి కామన యుండదు. నిష్కాముడై యానందము ననుభవించునని భావము. ఈ సత్య కామత, ఆప్తకామతయే ముక్తాత్మకు బ్రహ్మసామ్యమును దెలుపును.(౨౧)

ముక్తాత్మ యిచ్ఛవచ్చినపుడు తాను మోక్షమునుండి తిరిగి రాగల్గునా? యన :

అనావృత్తిః శబ్దా దనావృత్తిః శబ్దాత్ ౪-౪-౨౨

శబ్దాత్ = శబ్దప్రమాణమువలన, అనావృత్తిః = అత డట్లు తిరిగి రాడని తెలియుచున్నది.

పితృయానమార్గమున గతించువాడు కర్మఫలముల ననుభవించి యథావసరము జన్మమీసర్గకాలముననే పొందును. ఈ శరీరమును విడుచుటయే తడవుగా మోక్షమును బొందినవాడు, దేవయానమార్గమున బ్రహ్మమును బొంది ముక్తుడైన వాడును ఈ సృష్టియందు మరల జన్మింపరు. స్వస్వరూపసామర్థ్యమువలన బ్రహ్మానందము ననుభవించుచు సర్వత్ర విహరింతురు. ఇయ్యది వారిస్వాతంత్ర్యమునకు ద్యోతకము. వారికి ప్రాకృతిక ప్రతిబంధక మేదియు నుండదని భావము. అయినను వారు కోరినపుడెల్ల యిచ్చానుసార మీ యవస్థను దాటజాలరు. ఇది యొకవిధమగు బ్రాహ్మీ వ్యవస్థ యనదగును. ఈ వ్యవస్థ బ్రహ్మాధీనము. ముక్తాత్మ స్వతంత్రించి యీ వ్యవస్థ నుల్లంఘింపనేరడు. శాస్త్రము లీ విషయమున నిర్దేశించినదానికి తాత్పర్యము 'ముక్తాత్మ లీ సర్గమున తిరిగి జన్మమరణబంధమున బడనేరరు' అనుటయే. లేకున్న బద్ధజీవులకు ముక్తులకు భేదముండనేరదు. ఆనందభోగకాల మత్యంత మధికమగుటచే 'అమృత' మని చెప్పబడినది. కావున నీ సర్గమున జన్మమరణపరంపర ముక్తుల కుండదని భావము.

శాస్త్రములం దియనావృత్తి యిట్లు నిర్దేశింపబడినది. "తే తేషు బ్రహ్మలోకేషు పరాః పరావతో వసంతి తేషాం న పునరావృత్తిః"

(బృ. ౬-౨-౧౫) వా రాబ్రహ్మలోకములందు బహువర్షపర్యంతము నివసింతురు. వారికి మరల ఆవృత్తి కలుగదు.

శ్రీ శంకరాచార్యు లీ పంక్తులకు భాష్య మిట్లు వ్రాసిరి.

"పరాః పరావతః ప్రకృష్టాః సమాః సంవత్సరా ననేకాన్ వసంతి. బ్రహ్మణోఽనేకాన్ కల్పాన్ వసంతీత్యర్థః, తేషాం బ్రహ్మలోకం గతానాం నాస్తి పునరావృత్తిః అస్మిన్ సంసారే న పునరాగమనం 'ఇహ' ఇతి శాఖాంతరపాఠాత్" 'అనేకసంవత్సరములవరకు నట నివసింతురు. అనేక బ్రహ్మకల్పములవరకు నట వసింతురని యర్థము. బ్రహ్మలోకమును బొందినవారికి పునరావృత్తి - వారి కీ సంసారమున వచ్చుట ఉండదు. 'ఇహ' అను నీ శాఖాంతరపాఠమువలన నిది స్పష్టమగుచున్నది'.(శాం.భా)

పైన ఉదాహరించిన (బృ. ౬-౨-౧౫) బృహదారణ్యకపాఠమున 'తేషాం ఇహ' అనిలేదు. ఈ యుపనిషత్తు యజుర్వేదీయకాణ్వశాఖకు చెందిన శతపథబ్రాహ్మణముయొక్క భాగము. కాని, వాజసనేయశాఖకు జెందిన శతపథబ్రాహ్మణమున (౧౪-౯-౧-౧౮) 'తేషా మిహ న పునరావృత్తిః" అను పాఠ మున్నది. దాని నిట అతిదేశము చేసి శ్రీ శంకరాచార్యులు భాష్యము వ్రాసియున్నారు. తరువాత శంకరాచార్యు లిట్లు వ్రాసినారు. "యది హి నావర్తంత ఏవ ఇహ గ్రహణ మనర్థక మేవ స్యాత్" 'బ్రహ్మలోకగత ముక్తాత్మలు తిరిగి రాకున్న ఇట 'ఇహ' అను పదము వ్యర్థమగును.' ఈ ప్రసంగమును ముగించుచు, అంతమున.

"తస్మా దస్మాత్ కల్పాత్ ఊర్ధ్వం ఆవృత్తిర్ గమ్యతే" 'కావున నీకల్పమునకు తదుపరి తిరిగి వచ్చు ననుట తెలియుచున్నది'.

ఈ విషయమును గూర్చి ఛాందోగ్యమున మరిరెండు తావులం దిట్లు న్నది.

"ఏతేన ప్రతిపద్యమానా ఇమం మానవ మావర్తం నావర్తంతే" (ఛాం. ౪-౧౫-౫) 'దేవయానమార్గమున బ్రహ్మలోకమును ప్రాపించు జ్ఞానులు ఈ మానవావర్తమున తిరిగి రారు.'

"బ్రహ్మలోక మభిసంపద్యతే న చ పునరావర్తతే" (ఛాం. ౮-౧౫-౧) 'బ్రహ్మమును బొందినవారు మనువునకు సంబంధించిన జగత్సర్గరూప మానవావర్తమున మరల తిరిగి జన్మింపరు'. ఈ వాక్యములను వివరించుచు శంకరాచార్యు లిట్టి యభిప్రాయమునే వెల్లడించి యున్నారు.

"ఏతేన ప్రతిపద్యమానా గచ్ఛంతో బ్రహ్మమం మానవం మనుసంబంధినం మనోః సృష్టి లక్షణ మావర్తం నావర్తంతే. ఆవర్తంతే అస్మిన్ జననమరణప్రబంధచక్రారూఢా ఘటీయంత్రవత్ పునః పున రిత్యావర్తః తం న ప్రతిపద్యంతే" (ఛాం. ౪-౧౫-౫. శాం. భా.) రెండవవాక్యమును వివరించుచు శంకరాచార్యు లిట్లు వ్రాసియున్నారు.

"యావద్ బ్రహ్మలోకస్థితిః, తావత్ తత్రైవ తిష్ఠతి, ప్రాక్ తతో నావర్తత ఇత్యర్థః" (ఛాం. ౮-౧౫-౧. శాం. భా.)

ఈ యంతిమవాక్యమునుబట్టి బ్రహ్మలోకమున స్థితి యున్నంతవరకు తిరిగి జన్మింపరనియు, బ్రహ్మలోకమున స్థితికాలము పూర్తియైన మీదట తిరిగి జన్మింతురనియు స్పష్టమగుచున్నది.

బ్రహ్మలోకమున నుండు కాలపరిమాణ మెంతయో నిర్ణయించుట ప్రస్తుతసూత్రమునకు చెందినవిషయము కాదు.

సూత్రమున గల శబ్దములు రెండుమారులు ప్రయోగించుటవలన అధ్యాయము, శాస్త్రము సంపూర్ణ మైన ట్లెంచవలయును. (౨౨)

శ్రీ మత్పరమహంస పరివ్రాజకాచార్యవర్య - ఆత్మానంద సరస్వతీ
స్వామి భగవత్పాద శిష్య, పండిత గోపదేవ విరచిత
వేదాంతదర్శన - ఆంధ్రవ్యాఖ్యానమునందు
చతుర్థాధ్యాయము సమాప్తము.
ఓమ్ తత్ సత్.

# వైశేషిక దర్శనము

(కణాద మహర్షి ప్రణీతము)



కళాప్రపూర్ణ పండిత గోపదేవ్

ఓ౩మ్

# వైశేషిక దర్శనము

( కణాద మహర్షి ప్రణీతము)

"కళాప్రపూర్ణ"
పండిత గోపదేవ్
విరచిత అంబా వ్యాఖ్యానము

ప్రకాశకులు :
ఆర్య సమాజము - కూచిపూడి
గుంటూరు జిల్లా - 522 313

అంబాదర్శన గ్రంథమాల - ౧

చతుర్థ ముద్రణము - ౨౦౦౦

సర్వస్వామ్యములు :

ఆర్య సమాజము - కూచిపూడి -522 313

యుగాది 1995

మూల్యము 30/-

అశ్విని ప్రెస్, సికింద్రాబాదు

# సంపాదకీయము

ప్రజలకు సృష్టిరహస్యాలు తెలియజేయుటకు మహర్షులచే దయాదృష్టితో వ్రాయబడినవే దర్శనములు. 'దృశ్యతే అనేనేతి దర్శనమ్' - అనగా సృష్టిరహస్యములను 'దర్శనము' అను వానిద్వారా చూడవచ్చును (తెలిసికొనవచ్చును) అని యర్థము. ఇవి యారు. గౌతముడు న్యాయదర్శనము, కణాదుడు వైశేషికము, కపిలుడు సాంఖ్యము, పతంజలి యోగము, జైమిని పూర్వ మీమాంస, వ్యాసుడు ఉత్తర మీమాంస (వేదాంతము) అనువానిని రచించిరి. ఈ యారింటిని ఆస్తికదర్శనము లందురు.

ద్విత్వాది సంఖ్యలు, భూపరమాణువుల గంధాదులు, విభాగజ విభాగోత్పత్తి ప్రక్రియ మున్నగు విశేషముల దెలుపు గ్రంథము కావున దీనిని వైశేషిక మందురు. ఇందు పరమాణువు మొదలు పరమేశ్వరుని వరకు గల తత్త్వములు విశదీకరింపబడి యున్నవి. ఇందలి కఠిన విషయములను, పారిభాషిక పదములను గురువుల ద్వారా తెలిసికొని మిగిలిన దానిని స్వయముగా విమర్శనాదృష్టితో పఠించినచో పాఠకునకు తన్మయత్వము కలుగును. ఇట్టి యుద్గ్రంథమును ప్రతి మానవుడు పఠించి జ్ఞానాభివృద్ధిని పొందగోరుదును. ఇందలి విశేషములు మున్నుడి, వైశేషిక దర్శన విశేషము లను విభాగముల ద్వారా తెలిసికొందురుగాక !

ఈ వైశేషిక గ్రంథమును సంస్కృతములో కణాదుడు అను మహర్షి రచించెను. తెలుగులో దీనికి 'అంబావ్యాఖ్యానము' అను నామమున వారి తల్లిగారి పేరుతో శ్రీ పండిత గోపదేవ్ గారు వ్యాఖ్యానమును 1945లో అంబాద్మన గ్రంథమాలకు తొలి పుష్పముగా రచించి ముద్రణము కావింపజేసిరి. 1974లో కూచిపూడి గ్రామవాసులైన శ్రీ చదలవాడ అచ్చేశ్వరరావు, శ్రీమతి రాజ్యలక్ష్మిగారలు స్వ. చదలవాడ రామశేషయ్య, శ్రీమతి లక్ష్మమ్మ దంపతుల స్మృతి చిహ్నముగా ద్వితీయ ముద్రణము చేయించిరి. ఇది తృతీయ

ముద్రణము. ఈ ముద్రణమునకు సాహాయ్యముగా సికిందరాబాదు వాసులైన బాలకృష్ణ, సుధాకరరావులు తమ తండ్రిగారైన స్వ. సర్వోజీరావు మహేంద్రకర్ గారి స్మృత్యర్థము ముద్రించిరి.

తెలుగు వ్యాఖ్యాన కర్తయైన శ్రీ పండిత గోపదేవ్ గారి తెలుగులోని వైదిక సాహిత్య రచనా విశేషముల నేటికి గుర్తించి ఆంధ్రయూనివర్సిటీవారు "కళాప్రపూర్ణ" అను సుత్తమమగు బిరుదము నిచ్చి సత్కరించుట యెంతయు ముదావహము. ఈ సత్కారము మున్నెన్నడో జరుగవలసియుండగా కారణములేవో తెలియవు గాని మఱుగునపడి నేటికైనను వెలుగు చూచినందుకు కారకులగు ఆంధ్రయూనివర్సిటీవారు కొనియాడదగి యున్నారు. 1898 ప్రాంతమున నొక పల్లెటూరిలో (కూచిపూడిలో) జన్మించి, పలుప్రాంతముల సంచరించి, విద్యను గడించి, యోగవిద్య నభ్యసించి బ్రహ్మచర్యముతో నేటికిని బ్రాహ్మీముహూర్తమున మేల్కాంచి, ఆసన, ప్రాణాయామాదుల ద్వారా శరీరపటుత్వము, బుద్ధినిశితత్వము కలిగియున్న "కళాప్రపూర్ణ" శ్రీ పండిక గోపదేవ్ గారికి ఇంకను సుద్గ్రంథములు వ్రాయుటకును, వేద ధర్మ ప్రచారము చేయుటకును శతాధికాయు రారోగ్యాదుల నొసంగుగాత మని పరమేశ్వరుని మనసార ప్రార్థింతును.

తె నా లి
17-3-95

ఆరమండ్ల వెంకయ్యార్య
ఉభయభాషా ప్రవీణ

ద్విత్వే చ పాకజోత్పత్తౌ
విభాగే చ విభాగజే
యస్య న స్ఖలితా బుద్ధిః
తం వైశేషికం విదుః.

# మున్నుడి

మానవులు లోకమున జన్మించి కొంతకాలము జీవించి మరణించు చున్నారు. సరియే కాని, మనమెవరము? ఎచట నుండి వచ్చితిమి? ఎచటికి పోవుదుము ? ఈ సృష్టికి కారణమేది ? ఇందు మన ధర్మమేమి ? మున్నగు ప్రశ్నలు సందేహములు — మనకు తట్టుచుండుట వింతకాదు. కాని కలుగకపోవుటయే వింత.

ఈ సందేహము లిప్పుడే — మనకే — కలుగుచున్నవా? మన పూర్వులకు గూడ కలిగినవా? వారి సమస్యల నెప్పుడైన పరిష్కరించినారా? అయినచో నెట్టి నిర్ణయములకు వచ్చిరి ? అని యెఱుగగోరుట సహజము.

పై రీతి సందేహములకు తత్త్వజ్ఞులగు మన పూర్వులాలోచించి నిర్ణయించిన సమాధాన సంపుటులే దర్శనములు.

దర్శనము అను పదమునకు కన్ను, చూపు మొదలగు నానార్థములున్నను (దృశ్యతే అనేన ఇతి) యథార్థమగు తత్త్వమును ప్రమాణ పూర్వకముగ దెలుపు శాస్త్రమనియు నర్థము.

ఈ దర్శనములలో ఆత్మసత్తాను, వేదసామ్రాజ్యమును అంగీకరించువానిని ఆస్తికములనియు, లేనివానిని నాస్తికము లనియు నందురు.

ఆస్తిక దర్శనము లారు. అవి ౧ గౌతముని న్యాయదర్శనము, ౨ కణాదుని వైశేషికము, ౩ కపిలుని సాంఖ్యము, ౪ పతంజలి యోగము, ౫ జైమిని పూర్వమీమాంస, ౬ వ్యాసుని వేదాంతము (ఉత్తర మీమాంస).

మఱియు నాస్తికదర్శనము లాఱు గలవు. ౧ చార్వాకము ౨ జైనము ౩ సౌత్రాంతికము ౪ యోగాచారము ౫ మాధ్యమికము. ఇందలి కడపటి నాలుగును బౌద్ధములు.

కొందఱు ౧ నైయాయికము (న్యాయవైశేషికములు) ౨ సాంఖ్యము (సాంఖ్య, యోగములు) ౩ మీమాంసకము (పూర్వోత్తర మీమాంసలు) అను మూడును నాస్తికములనియు మొత్తమాఱు దర్శనము లనియు నందురు.

జైనము ఆత్మయస్తిత్వము నంగీకరించునది గావున దానిని నాస్తికములలో గాక యాస్తికములలో లెక్కింప వలయునని కొందఱి యభిప్రాయము.

ఆస్తికములలో న్యాయమునందు ప్రమాణ వివేచనమును, వైశేషికమునందు పదార్థస్వరూప నిర్ణయమును, కాలప్రాముఖ్యమును, సాంఖ్యము నందు మూలతత్త్వవిచారణయు, యోగమునందు జ్ఞానసాధనమును, పూర్వ మీమాంసయందు ధర్మ–కర్మ వివరణమును, ఉత్తరమీమాంసయందు కర్మ విషయమును ప్రధానముగ చర్చింపఁబడినవి. ఇవి పరస్పర సమన్వయ భావములేక తలకొక త్రోవగ నున్నవని తలంచుట ప్రమాదము. ఆస్తిక దర్శన సిద్ధాంతము – ఆదర్శము – ఒక్కటియే. దృష్టులు మాత్రము భిన్నములు.

ఇందు వైశేషికమునకు ప్రత్యేక ప్రాముఖ్యము గలదు. 'కాణాదం పాణినీయం చ సర్వశాస్త్రోపకారకమ్' అని యభియుక్తోక్తి. అనగా శబ్దముల సాధురూప నిర్ణయమున పాణినీయము వలె పదార్థస్వరూప నిర్ణయమున నీ వైశేషికము నుండుననుట. తక్కిన శాస్త్రపఠనమున కీ రెండుశాస్త్రములు లెస్సగ తోడుపడుననుట.

ఇది తక్కిన దర్శనముల కంటె ప్రధానముగ న్యాయదర్శనము కంటె విశిష్టముగ – అధిక యుక్తియుక్తముగ నుండుటచే వైశేషికమని పేరు పొందినదని కొందఱు, తక్కిన వానికంటె విశేషముగ విశేషము అను పదార్థమును ప్రతిపాదించుటచే వైశేషికమైనదని కొందఱు నందురు. దీనికి ఔలూక్యదర్శనమనియు నామాంతరము గలదు.

దీని కర్త కణాదమహర్షి. ఇతడు కశ్యపగోత్రుడగుటచే కాశ్యపుడనియు, ఉలూకముని పుత్రుడగుటచే ఔలూకుడనియు పిలువబడుచుండును. ఇతడు ప్రభాస నివాసియట ! సోమశర్ముడను నాచార్యునొద్ద విద్య నభ్యసించెనట ।

ఈ దర్శనకాలము స్పష్టముగ నిర్ణయించుట కష్టము. ఈ నామము మిలిందప్రశ్నము, లంకావతారసూత్రము, లలిత విస్తరము మున్నగు బౌద్ధ గ్రంథములం దగపడుచుండుట చేత నిది బుద్ధునికి పూర్వము రచింపబడిన దందురు.

దీనియందు పది యధ్యాయములును, ప్రతి యధ్యాయమున రెండేసి యాహ్నికములును మొత్తము మున్నూట డెబ్బది సూత్రములును గలవు.

ఇందు మొదటి యధ్యాయమున జాతి, తద్విశిష్టముల నిరూపణము.

౨, ౩ లలో నవద్రవ్యముల నిరూపణము

౪ లో పరమాణువులు, అనిత్య ద్రవ్యముల విషయము

౫ లో కర్మసిద్ధాంతము

౬ లో వేదప్రామాణ్యము, ధర్మాధర్మములు.

౭, ౮ లలో కొన్ని గుణముల వర్ణనము ;

౯ లో జ్ఞానము, అభావముల వివరణము.

౧౦ లో సుఖదుఃఖములు, కారణములు అను విషయములను గూర్చి చక్కగ జర్చింపబడినది.

బ్రహ్మసూత్రములలో ౨.౨.౧౧ సూత్రమున, శంకర భాష్యమునకు రత్నప్రభాటీకయందును, మఱికొన్ని యితర స్థలములందును వైశేషిక దర్శనమునకు రావణభాష్యమున్నట్లు ఉల్లేఖింపబడియున్నది. కాని యది యిప్పుడు గానరాదు.

వైశేషికతత్త్వనిరూపణమునకు ప్రశస్తపాదుని 'పదార్థధర్మసంగ్రహ' మను భాష్యము గలదు. ఇది పై సూత్రములకు భాష్యమనుట కంటె వైశేషిక సిద్ధాంతములను సమర్థించు స్వతంత్ర గ్రంథమనుట లెస్స. దీని యాధారమున చంద్రుడను పండితు డొకడు దశపదార్థములను గ్రహించి యొక శాస్త్ర గ్రంథము వ్రాసెను.

ఈభాష్యమునకు వ్యాఖ్యలుగూడ పెక్కులు గలవు. వ్యోమవతి (వ్యోమశివాచార్యుడు), కిరణావలి (ఉదయనుడు), న్యాయకందలి (శ్రీధరుడు) మున్నగునవి.

వల్లభాచార్యుడు న్యాయ లీలావతియను మఱియొక భాష్యమును వ్రాసెను. దీనికి నేడెనిమిది టీకా గ్రంథములు గలవు. ఇట్లు ఈ దర్శనము నందలి విషయములను వివరించుటకు మఱికొన్ని గ్రంథములును వెలసినవి అందు కొన్ని హిందీ, బంగాలీ మొదలగు దేశభాషలలోనికి వచ్చి ప్రచారమందినవి. కాని ఆంధ్రభాషమాత్రము వానికి నోచుకొనలేదు.

కీర్తిశేషులగు కె.వి. లక్ష్మణరావుగారు కొంత ప్రయత్నము చేసినారు కాని దైవ వైపరీత్యము వలన నది యఱగొఱగనే నిలిచిపోయినది.

ఈ నడుమ చిట్టిగూడూరు నారసింహ సంస్కృత కళాశాలో పాధ్యాయులు ప్రయత్నించి వెలువఱిచినారు గాని, తన కర్హమగు సమ్మానము నేకారణము వలననో అయ్యది పొందలేకపోయినది. ఇట్టి గ్రంథముల యెడల నాంధ్రమునకు గల సహజాభిమానమున కిది చక్కని నిదర్శన మనుకొనవచ్చును.

అయినను ఈ వాఙ్మయమున కింతటితో స్వస్తి చెప్పుట భావ్యముగాదు. కనుక మేమును ఆంధ్రమున కపురూపముగనున్న దర్శనములను తెలుగున వ్రాసి, సామాన్యుల కందుబాటగునట్లు ప్రకటింపవలయునని యువ్విళ్ళూరుచున్నాము. వీనితోబాటుగ నుత్తమములగు నార్యధర్మ గ్రంథములను గూడ వెలువరించి పవిత్రమగు నార్యధర్మ స్వరూపమును ఆంధ్రమానవముల నంకితము చేయునాసించు చున్నారము. ఆంధ్రమహాజనులు మా యీ సేవలను ఆదరముతో గైకొందురని విశ్వాసము.

ఇట్లు

సంపాదక మండలి

అంబా దర్శన గ్రంథమాల

# వైశేషిక దర్శన విశేషములు

"ద్విత్వే చ పాకజోత్పత్తౌ విభాగే చ విభాగజే
యస్య న స్ఖలితా బుద్ధి స్తం వై శేషికం విదుః"

'ద్విత్వ సంఖ్యాజనన విషయములోను, భూపరమాణువుల గంధము మున్నగు గుణముల పాకజోత్పత్తి విషయము నందును, విభాగజ విభాగోత్పత్తి ప్రక్రియా విషయము నందును, ఎవని బుద్ధి స్ఖలితము - విచలితము - కాదో యతనినే వై శేషికుడని యెంచవలయును. దార్శనికులలో నిట్టి సామెత యొకటి విననగును. వై శేషిక దర్శనమున పాండిత్య మున్నదియు లేనిదియు తెలిసికొనుట కిదియొక యొరపిడిరాయి యనవచ్చును.

వై శేషిక దర్శనమున పై శ్లోకమున వర్ణించిన విషయములు [(1) ద్విత్వసంఖ్య, (2) పాకజగుణోత్పత్తి, (3) విభాగజ విభాగము, ] కఠినములుగా - దుర్బోధ్యములుగా నెంచబడును. కావున ఈ అనుబంధములో యీ విషయములు వివరింపయత్నింతుము.

## (1) ద్విత్వసంఖ్య - దాని పుట్టుక

ఈ దర్శనమున గుణములను లెక్కించుచు సంఖ్య యొక గుణముగా వర్ణింపబడినది. ఈ సంఖ్యాగుణము అన్ని ద్రవ్యములలోను ఉండును. పృథివి మున్నగు ద్రవ్యములు తొమ్మిది. వానిలో కొన్ని నిత్యములు. కొన్ని యనిత్యములు. ఆకాశము, కాలము, ఆత్మ, మనస్సు అను ద్రవ్యములు నిత్యములు. మిగిలిన పృథివి మున్నగు ద్రవ్యముల పరమాణువులు కూడ నిత్యములే. కాని ఆ పరమాణువులచే నేర్పడు ద్వ్యణుక, త్ర్యణుకాది కార్యద్రవ్యము లన్నియు అనిత్యములు.

నిత్యద్రవ్యములలో నుండు ఏకత్వ - సంఖ్యాగుణము నిత్యమగును. అనిత్యద్రవ్యము లలో నుండు ఏకత్వసంఖ్య అనిత్యమగును. అనిత్య ద్రవ్యము లన్నియు కారణద్రవ్యముల వలన నేర్పడును - పుట్టును. ఘటపటాదు లన్నియు నిట్టివే. ద్రవ్యము పుట్టిన తదుపరి దానిలో గుణములు పుట్టును. కావున అనిత్యవస్తువులందేర్పడు ఏకత్వసంఖ్యయు అనిత్యమే యనుట స్పష్టమే. ఏది పుట్టునో యది నశించును. కావున అనిత్యమగును.

ద్రవ్యములలోనుండు గుణములకు ద్రవ్యము సమవాయికారణము. కావున అనిత్యద్రవ్యములలో నుత్పన్నమయిన - పుట్టిన - ఏకత్వసంఖ్య యనెడి గుణమునకు సమవాయి కారణము ఆ సంఖ్య యే ద్రవ్యములో పుట్టినదో యా ద్రవ్యమే యగును. ఆ యేకత్వసంఖ్యకు అసమవాయి కారణము ఆ ద్రవ్యకారణములలో నుండు ఏకత్వసంఖ్య యగును. కారణగత గుణముల వలననే కదా, కార్యగుణము లేర్పడును ! కావున కార్యద్రవ్యగత - ఏకత్వసంఖ్యకు, కారణద్రవ్యగత - ఏకత్వసంఖ్య అసమవాయి కారణమను యుక్తి సంగతమే యగును.

ఈ విషయమున నొక సందేహము కలుగుట కవకాశమున్నది. అది యెద్దియన :- కార్యద్రవ్యము అనేక కారణద్రవ్యములచే నేర్పడును. ఒక వస్త్ర మేర్పడుటకు అనేక తంతువులు కారణము లగును. అనేక తంతువులతో నొక వస్త్రము పుట్టును. అట్టియెడ వస్త్రమున గల ఏకత్వసంఖ్యకు, ఆ వస్త్రమునకు కారణములైన అనేక తంతువులలో ప్రతి తంతువులోనున్న ఏకత్వసంఖ్య-అనేక ఏకత్వసంఖ్యలు అసమవాయిలగుచున్నవి. ఇట్లు కారణద్రవ్యములలో నుండు అనేక - బహుఏకత్వసంఖ్యల వలన వస్త్రమున అనేక - ఏకత్వసంఖ్య లేర్పడక ఒక్క యేకత్వసంఖ్య ఎట్లేర్పడును ? ఇదియే సందేహస్వరూపము. కావున దీనికి సమాధానము తెలిసికొనదగియున్నది.

కార్యద్రవ్యము అనేక కారణద్రవ్యములవలన నేర్పడును. అనగా అనేక - అవయవద్రవ్యముల వలన ఒక అవయవి - కార్య - ద్రవ్య మేర్పడును. ఈ విషయము మఱవరాదు. అనేక కారణముల - అవయవముల వలన నేర్పడు కార్య - అవయవి - ద్రవ్యము తన స్వరూపముతో నొక్కటి యగుచున్నది. అవయవములు అవయవిగా నేర్పడునపుడు వానిలోనున్న అనేకత్వమును పోగొట్టుకొనును. అట్లుకాకున్న అవయవి యొక్కటి కానేరదు. అందువలన అవయవములు తమలోగల పృథగ్స్థిత్వము । వేఱుగానుండు ఉనికిని పోగొట్టుకొనుట వలన ద్విత్వసంఖ్య నేర్పఱచు అపేక్షాబుద్ధి యట నేర్పడదు. అపేక్షాబుద్ధి లేనితావున ద్విత్వ, త్రిత్వసంఖ్యలు కలుగనేరవు. కావున కారణద్రవ్యములలో నుండు ఏకత్వసంఖ్య కార్యద్రవ్యములో ఏకత్వసంఖ్యనే ఉత్పన్నము చేయును. అనేకత్వసంఖ్యను కలిగింప నేరదని గుర్తింపవలయును. ద్విత్వ, త్రిత్వాది సంఖ్య లుత్పన్నములగు తావున ఒకటి కంటె నెక్కుడు ద్రవ్యములు స్వతంత్రములై యుండుట తప్పనిసరి యగును.

ద్విత్వాది సంఖ్యలు అంతట అనిత్యములే యగును. ఒక ద్రవ్యములో ఏకత్వజ్ఞానము - ఆ ద్రవ్య మొక్కటియను జ్ఞానము - కలుగుటకు అన్య ద్రవ్యము నపేక్షించవలసిన యావశ్యక ముండదు. ఏకత్వజ్ఞానము అన్యద్రవ్యము నపేక్షింపదు. కావున నిరపేక్షమగును. ద్విత్వజ్ఞానము అన్యద్రవ్యము నపేక్షింపక కలుగనేరదు. ద్వి-రెండు, అను జ్ఞానము ఒక వస్తువుతో మఱియొక వస్తువును చేర్చి లెక్కించునపుడే కలుగును. 'ఇది ఒకటి', 'ఇది యొకటి' అని చెప్పి వానిని కలిపి ఇవి రెండు అని చెప్పుదుము. ఇట్లు అన్యవస్తువు నపేక్షింపక రెండు - ద్విత్వసంఖ్య - జ్ఞానము కలుగదు. కావున ద్విత్వ ముత్పన్నమగుటకు అపేక్షాబుద్ధి యావశ్యకమగుచున్నది.

అపేక్షాబుద్ధి యననేమి ? అనేక వస్తువులలో వాని సమూహమును ఆధారము చేసికొని కలుగు జ్ఞానము అపేక్షాబుద్ధి యనబడును. సజాతీయ వస్తువులు కాని, విజాతీయ వస్తువులు కాని, అనేకము సన్నికృష్టములైనపుడు-సంయుక్తములైనపుడు జ్ఞానము-అపేక్షాబుద్ధి కలుగును. రెండు వస్త్రములను చూచి ఇవి రెండు వస్త్రములందుము. రెండు కుండలను చూచి ఇవి రెండు కుండలందుము. ఇట వస్త్రములు రెండు సజాతీయములు. అట్లే కుండలు రెండు సజాతీయములే. ఒక వస్త్రమును ఒక కుండను చూచినపుడు కూడ ఇవి రెండు అని జ్ఞానము కలుగును. కాని, రెండు వస్త్రములని కాని, రెండు కుండలని కాని అనము. రెండు వస్తువులందుము. ఆ రెండింటిలోను వస్తురూప సజాతీయత యున్నది. అట్టి సజాతీయత నాధారము చేసికొని అపేక్షాబుద్ధి కలుగును. దాని మూలమున ద్విత్వసంఖ్య - జ్ఞానము - ఇవి రెండు వస్తువులు అని జ్ఞానమేర్పడునని తెలియవలయును. విజాతీయవస్తువులలో ద్విత్వాది సంఖ్యాజ్ఞానము కలిగిన తావున సాజాత్యము ప్రకట మైనను కాకున్నను ఏదోయొక సజాతీయతను ఆధారము చేసికొనియే యాజ్ఞానము కలిగి నట్లెంచవలయును.

ద్విత్వము, త్రిత్వము - రెండు, మూడు, నాలుగు అను సంఖ్యాజ్ఞానము వస్తువులు నియమిత సంఖ్యలో నున్నతావున కలుగును, వస్తువుల సంఖ్య నియతము కానితావున వానిలో అనేకత్వ - బహుత్వ సంఖ్యాజ్ఞానము కలుగును. సంఖ్యలో ఏకత్వము, అనేకత్వము నను రెండు భేదము లుండును. అనేకత్వములో ద్విత్వ, త్రిత్వాది సంఖ్యలన్నియు సమావిష్టము లగును.

## (2) పాకజ గుణములు

పృథివిలో గంధము, రసము, రంగు, స్పర్శ అను గుణము లుండును. ఈ నాలుగు గుణములు పాకజగుణము లనబడును. జలమునందు రసము, రూపము, స్పర్శ గుణములు పాకజములు. అట్లే అగ్నియందుండు రూప స్పర్శలు, వాయువునందుండు స్పర్శగుణము పాకజములుగా సంగీకరించబడును. ఈ గుణములు నిత్యద్రవ్యములందు నిత్యములు, అనిత్యద్రవ్యములందు అనిత్యములు నగును. పృథివ్యాది ద్రవ్యములకు సంబంధించిన పరమాణువులు నిత్యములు. వానివలన నేర్పడు కార్యద్రవ్యములు అనిత్యములు. కావున పరమాణువులలో నుండు పై గుణములు నిత్యములు, ద్వ్యణుకాది కార్యద్రవ్యము లందలి గుణములు అనిత్యములు నగును. కాని, పృథివీ పరమాణువులలో నుండు గంధాదిగుణములు అగ్నిసంయోగమువలన నశించి వానిస్థానమున క్రొత్త గంధాది గుణము లేర్పడును. కావున పృథివీ పరమాణువులు నిత్యములైనను వానిలో నుండు గుణములు మాత్రము అనిత్యములే యగుచున్నవి. అవి పాకజములు – అగ్నిసంయోగజన్యములు. పాకమనగా అగ్నివిశేషసంయోగము.

అగ్నిసంయోగము (పాకము) వలన వస్తువులలో నున్న గుణములు మాఱిపోవు పద్ధతుల – క్రమముల – లో న్యాయవైశేషిక దర్శనకర్తలు భేదమున్నట్లు అంగీకరింతురు. పాకము అవయవి – కార్యద్రవ్యము – లో జరుగునని నైయాయికుల మతము. వారి యీ వాదము పిఠరపాకసిద్ధాంత మనబడును. దానికి విపరీతముగా వైశేషికులు పాకము అవయవిలో కాక స్వతంత్రపరమాణువు (పీలు)లలో జరుగునందురు. కావున వైశేషిక సిద్ధాంతము పీలుపాకవాద మనబడును. పిఠరపదము అవయవి – కార్యద్రవ్యమును, పీలుపదము పరమాణువును తెలుపును.

## పిఠరపాక ప్రక్రియ - క్రమము

మట్టితో జేయబడిన కడవ మున్నగు పాత్రలు ఆవములో పెట్టి కాల్చినపుడు వానిలో మొదటనున్న రంగు మున్నగు గుణములు నశించి వాని స్థానమున క్రొత్త గుణము లేర్పడును. అట్లేర్పడుటకు కారణము పాకము - అగ్నిసంయోగము. ఆ మృత్పాత్రలలో పరమాణువుల సంయోగము శిథిలముగా నుండుననియు, అనగా పరమాణువుల మధ్య ఛిద్రములు - బెజ్జము లండుననియు, ఆ ఛిద్రములలో అగ్నికణములు ప్రవేశించి ఆ పాత్రలో నున్న రంగు మొదలగు మొదటి గుణములను నశింపజేసి వాని స్థానమున క్రొత్తవియైన రంగు మున్నగు గుణములను పుట్టించుననియు నైయాయికులందురు. ఇట్లు ఆ పాత్ర లోపల వెలుపల పక్వమగును. అట్టియెడ ఆ పాత్రలో అగ్నిసంయోగము వలన గుణములు మార్పు చెందువనియు, పాత్ర నశింపక అట్లే యుండుననియు, నైయాయికులు చెప్పుదురు. ఇదియే పిఠరపాకవాద ప్రక్రియ. ఈ వాదమునందు అవయవిలోనే పాకమేర్పడును. అనగా అగ్నిసంయోగ సమయమున అవయవిలో అవయవ సంయోగము నశింపక యట్లే యుండుననియు, అందువలన అవయవిలోనే పాకమేర్పడునని వారి యభిప్రాయము. ఇదియే పిఠరపాకవాదము.

## పీలుపాక ప్రక్రియ

ఈ సిద్ధాంతము వైశేషికాచార్యు లంగీకరింతురు. వీరు అవయవిలో సాక్షాత్తుగా పాకము జరుగనేర దందురు. కారణమేమన : కార్యద్రవ్యములో గుణోత్పత్తి కారణగుణపూర్వకముగా జరుగును. అట్లే కార్యద్రవ్యమున ద్రవ్యనాశము వలన గుణములు నశించును. ఇట్టి వ్యవస్థ సూత్రకారు డంగీకరించును. కావున అవయవిలో సూటిగా పాకము - అగ్ని సంయోగము

వలన పూర్వగుణములు నశించి క్రొత్తగుణములు వాని స్థానములో నేర్పడ పీలుకాదని వైశేషికులందురు.

కుండ కాలిన పిదప ఆవమునుండి బయటికి తీసినపుడు దానిలో పూర్వమున్న నలుపు మున్నగు గుణములు పోయి ఎఱుపురంగుతో కూడి కనిపించును. అందువలన కుండలో పచ్చిదిగా నున్నప్పుడున్న గుణములు నశించి కాలిన మీదట వానిస్థానమున క్రొత్తగుణములు కలిగిన వనుటలో సందేహము లేదు. కుండలోని నలుపు రంగు నశింపవలయుననిన కుండ నశింపవలయును. ద్రవ్యనాశము వలన దాని గుణములు నశించుననుట సిద్ధాంతము. అందువలన పచ్చి కుండ నశించి పక్వమైన కుండ యేర్పడినదని యంగీకరింపక తప్పదు. పూర్వమున్న గుణములు నశించుట వలన వాని కాశ్రయమైన అవయవి ద్రవ్యము నశించినదని యంగీకరించినపుడు ఆ నాశము ద్వ్యణుకము వఱకు నశింపక తప్పదు. ఇట్లు ద్వ్యణుకముల వఱకు అవయవి నశించుట వలన పరమాణువులు మిగులును. అవి నిత్యములు; నశింపవు. కాని వానిలో నున్న శ్యామవర్ణము మున్నగు గుణములు, పాకము - అగ్ని సంయోగము వలన నశించును. అన్య (అగ్నిసంయోగమువలన) రక్తవర్ణాదులు క్రొత్తవి యేర్పడును. తదుపరి ద్వ్యణుకాదిక్రమమున క్రొత్త అవయవిద్రవ్య మేర్పడును. దాని యందు కారణగుణపూర్వకములైన కార్యగుణములు ఏర్పడును. ఇట్లు తిన్నగా అవయవిలో పాకమేర్పడక అవయవములలో - పరమాణువులలోనే పాకమేర్పడుటచే పీలుపాక సిద్ధాంతమే యంగీకరింప దగినదని వైశేషికాచార్యు లభిప్రాయపడుదురు.

## (3) విభాగజ - విభాగము

సంయోగము, విభాగము అను - నీ రెండును పరస్పరము విరుద్ధములైన గుణములు. విభాగము సంయోగమును నశింపజేయును. ఉత్తర దేశసంయోగము విభాగమును నశింపజేయును. కావున నివి పరస్పరము విరుద్ధము లగుట స్పష్టము. సంయోగము వలెనే విభాగము కూడ మువ్విధముల నేర్పడును. (1) అన్యతరకర్మజము (2) ఉభయకర్మజము (3) విభాగజము

(1) అన్యతరకర్మజ-విభాగము :- కలిసియున్న (సంయుక్తములైయున్న) రెండువస్తువులలో నొకదానియందు క్రియ కలిగినపుడు ఆ రెండు వస్తువులు విడిపోవును - విభాగమేర్పడును. ఇయ్యది అన్యతరకర్మజ విభాగము. ప్రతి సంయోగమునకును సమవాయికారణము రెండు ద్రవ్యము లగును. వానిలో నొకదానియందు క్రియ కలిగి యా రెండు ద్రవ్యములలో విభాగము కలిగించును.

ఉదాహరణము :- ఒక యింటిపైన నొక పక్షి వాలినదనుకొన్నుడు. అప్పుడా ఇంటికి పక్షికి మధ్య సంయోగమేర్పడును. ఆ పక్షికి గృహమునకు గలిగిన సంయోగమునకు సమవాయి కారణము పక్షి, గృహము రెండునగును. ఆ పక్షి యటనుండి యెగిరి పోయినపుడు పక్షిలో క్రియ కలుగును. ఆ పక్షియందు కలిగిన క్రియ పక్షికి ఇంటికి మధ్య విభాగము కలిగించును. ఈ విభాగము అన్యతరకర్మజ విభాగమనబడును.

(2) ఉభయకర్మజ విభాగము :- సంయోగమునకు సమవాయి కారణములైన రెండు వస్తువులలోను క్రియ కలిగి విభాగమేర్పడును. ఆ విభాగము ఉభయకర్మజ విభాగమనబడును. ఉదా :- ఇద్దఱు మల్లులు పోరాడునపుడు ఒకరితో నొకరు కలిసినపుడు వారిలో సంయోగము కలుగును.

వారు విడిపోయినపుడు ఇరువురిలోను క్రియ గలుగును. అప్పుడు వారిలో విభాగమేర్పడును. ఆ విభాగము ఉభయకర్మజ విభాగము.

(3) విభాగజ విభాగము :- అనగా విభాగమువలన నేర్పడు విభాగము. విభాగము గుణము. ఆ విభాగగుణమునకు సమవాయి కారణము ద్రవ్యములగును. పూర్వము వర్ణించిన విభాగములు రెండును కర్మ-క్రియ-వలన నేర్పడినవి. వానికి అసమవాయికారణము క్రియయగును. ఈ మూడవది యైన విభాగజ విభాగమునకు అసమవాయికారణము కర్మ కాక విభాగమే యగును. ఇట రెండు విభాగము లుండును. విభాగము వలన కలిగిన రెండవ విభాగమునకు మొదటి విభాగము అసమవాయికారణము అగును. కర్మ కాదు. మొదటి విభాగమునకు మాత్రము అసమవాయికారణము కర్మ-క్రియయే-యగును. ఉదా :- హస్తపుస్తక విభాగము వలన దేహపుస్తక విభాగము కలుగును. ఈ దేహపుస్తక విభాగము హస్తపుస్తక విభాగము వలన కలిగినది. కావున విభాగజవిభాగ మనబడును.

ఈ విభాగజ విభాగమునకు అసమవాయి కారణమైన ప్రథమ విభాగము రెండు విధములు. (1) విభాగమునకు సమవాయికారణములైన రెండు ద్రవ్యములలో నేర్పడు విభాగము. ఉదాహరణము :- హస్త-పుస్తక విభాగము. (2) ఒకప్పుడు సమవాయి కారణమైన ద్రవ్యమునకు సమవాయి కారణము కాని ద్రవ్యమునకు మధ్యనేర్పడు విభాగము. ఉదా :- దేహపుస్తక విభాగము. ఇట్లు విభాగజ విభాగమునకు అసమవాయి కారణమైన మొదటి విభాగము రెండు విధము లగుట వలన దానివలన నేర్పడు కార్య-భూత విభాగము రెండవ విభాగముకూడ ద్వివిధము లగును. ఈ ద్వివిధ కార్య-భూత విభాగము క్రమముగా కారణద్వయ విభాగజ (1) కారణాకారణ విభాగము, కారణాకారణ విభాగజ (2) కార్యాఽకార్య విభాగము అనబడును.

(1) కారణాద్వయ విభాగజ కారణాకారణ విభాగము :-

ఈ విభాగము నంగీకరింపవలసిన యావశ్యక మాచార్యుల కేల కలిగినదో ముందుగా తెలిసికొనుట యెంతయు మంచిది. ఏ ద్రవ్యములలో విభాగము కలుగునో యది యా ద్రవ్యములలో గల సంయోగమును నాశము చేయుననుట నిశ్చితము. తంతువులు పటమునకు సమవాయి కారణము. పటమునకు తంతువులు అవయవములు. పటావయవములైన తంతువులలో కలుగు విభాగము పటోత్పత్తి నారంభించు తంతువుల సంయోగమును నశింపజేయును. ఇట్లు ఈ విభాగము ద్రవ్యారంభకమగు సంయోగమును నశింపజేయును.

ఈ పటముత్పన్నమగు స్థలమున పటావయవ సంయోగమే కాక అవయవములతో ఆకాశమునకును సంయోగముండును. అనగా ద్రవ్యారంభక సంయోగము ఒకటి. ద్రవ్యము నారంభింపని సంయోగము మఱియొకటి. పటావయవము అయిన తంతువులతో ఆకాశమునకు సంయోగమున్నను ఆ తంతువులు పరస్పరము సంయుక్తములు కాని పక్షమున పటము ఉత్పన్నము కానేరదు. కావున పటావయవముల సంయోగము ద్రవ్యారంభక సంయోగము, పటావయవ-ఆకాశ సంయోగము ద్రవ్యానారంభక సంయోగము అని రెండు సంయోగములు. తంతువులలో క్రియ కలుగుట వలన విభాగము కలుగును. ఆ విభాగము వలన ద్రవ్యారంభక సంయోగము నశించును. కాని యా విభాగమువలన ద్రవ్యానారంభక (తంతు-ఆకాశ) సంయోగము నశింపదు. కారణమేమన ఒకే విభాగము వలన విరుద్ధధర్మద్వయము (ద్రవ్యారంభక సంయోగనాశకత్వము, ద్రవ్యానారంభక సంయోగ నాశకత్వము) కలుగుటకు వీలు లేదు. అందువలన తంతు - ఆకాశసంయోగమును నశింప జేయుటకు మఱియొక విభాగము అంగీకరింపక తప్పనిసరి యగుచున్నది.

ద్రవ్యారంభక సంయోగమును నశింపజేయు విభాగము, ద్రవ్యానారంభక సంయోగవినాశక విభాగము అను నీ రెండును పరస్పర విరుద్ధ స్వభావము కలవి. కావున వానిని రెంటిని ఒకే క్రియారూపకారణము కలిగింపనేరదు. కావున నిట రెండవకారణము సంభవము కానందున, క్రియ వలన నేర్పడిన (ద్రవ్యారంభక తంతువుల పరస్పర) సంయోగనాశక విభాగమువలననే రెండవ విభాగ (ద్రవ్యానారంభక తంతు - ఆకాశ సంయోగనాశక) ఉత్పత్తి అంగీకరింప బడుచున్నది. దీని తాత్పర్య మేమనః-

ప్రతికార్యమునకు మూడు కారణము లుండును. సమవాయి కారణము , అసమవాయి కారణము, నిమిత్త కారణము. పైన వివరించిన ఉదాహరణములో ప్రథమ విభాగరూపకార్యమునకు సమవాయికారణము తంతువులు, అసమవాయి కారణము తంతువులలో నేర్పడు క్రియ, నిమిత్తకారణము అదృష్టము - కాలము మున్నగునవి. (అదృష్టాదులు అన్ని కార్యములకు నిమిత్తకారణములే) ఇక రెండవ విభాగమునకు (ద్రవ్యారంభక తంతు - ఆకాశసంయోగనాశక విభాగము) సమవాయికారణము తంతువులు, ఆకాశదేశము రెండు నగును. అదృష్టాదులు నిమిత్తకారణము. ఇక అసమవాయికారణమెయ్యది యగును? ఈ రెండవ విభాగమున కగు అసమవాయికారణము గుణమో, కర్మమో కావలయును. అదియును (అసమవాయి కారణము కూడ) సాక్షాత్తుగా కాని, పరంపరగా కాని సమవాయికారణముతో సంబద్ధమై యుండవలయును. (అసమవాయి కారణ మెల్లయెడల నేదోయొక సంబంధముతో సమవాయికారణముతో సంబద్ధమై యుండవలయును అనునది నియమము. అంతే కాక ప్రకృతకార్యము నుత్పన్నము చేయు సామర్థ్యము కలిగి యుండవలయును).

ఉపర్యుక్త ప్రస్తుతోదాహరణమున ద్రవ్యానారంభక సంయోగ వినాశక విభాగమునకు రెండవ విభాగమునకు – సమవాయికారణములైన ఆకాశదేశము, తంతువులలో నుండు శబ్దము కాని, రూపాదిగుణములు కాని, అసమవాయి కారణములు కాజాలవు. అవి విభాగము నుత్పన్నము చేయజాలవు. ఇక పటసమవాయి కారణములయిన తంతువులలో నేర్పడిన క్రియ తంతుసమవేతమై మొదటి విభాగము నుత్పన్నము చేసినది. కాపున నది రెండవ విభాగమునకు అసమవాయి కాజాలదు. ఇట్టి స్థితిలో నీ రెండవ విభాగమునకు మొదట నుత్పన్నమైన తంతువిభాగమే అసమవాయి కారణమనక తప్పదు. అందువలననే రెండవవిభాగము విభాగజ – విభాగమనబడును.

ఇట్లు రెండవ విభాగమునకుఅసమవాయి కారణమైన ప్రథమ విభాగము గుణము. అది రెండవ విభాగరూపకార్యము నుత్పన్నము చేయుటకు అన్యద్రవ్యతత్త్వము నపేక్షించును. ఆ తత్త్వము అవయవి నాశవిశిష్టకాలము కాని, స్వతంత్రావయవము కాని కావచ్చునని ఆచార్యుల యభిప్రాయము.

ఇట్టి ప్రసంగములలో ద్రవ్యారంభక సంయోగము, ద్రవ్యానారంభక సంయోగము అని రెండు విధములైన సంయోగము లుండునని పై వివరణము వలన తెలియుచున్నది.

కొండొక కార్యద్రవ్యము యొక్క యవయవముల సంయోగము మొదటిది. అది యాకార్యద్రవ్యము నుత్పన్నము చేయుటకు అసమవాయి కారణమగును. ఆ సంయోగము నశించిన కార్యద్రవ్యము నశించును.

పటావయవము లయిన తంతువులలో నేర్పడిన విభాగమువలన తంతువుల సంయోగము నశించును. అప్పుడు పటము నశించవలయును.

కాని పటావయవములైన తంతువులతో ఆకాశమునకు గల రెండవ సంయోగ మట్లే యున్నందున పటము నశింపదు. ఈ సంయోగ మున్నంతవఱకు తంతువు లా యాకాశదేశమును విడువజాలవు. అప్పుడు పటనాశము కలుగజాలదు. కాని పటము నశించుట చూచుచున్నాము. కావున ఆకాశ - తంతుసంయోగ నాశక ద్వితీయ విభాగము నంగీకరింపక తప్పదు.

ప్రస్తుతోదాహరణమున పటమునకు కారణములైన తంతువుల పరస్పర విభాగము (ప్రథమ విభాగము) వలన పటకారణములైన తంతువులయు పటము కారణము కాని ఆకాశముయొక్కయు విభాగము (ద్వితీయ విభాగము) జనించును. ఇట్లు ఈ విభాగము కారణద్వయ విభాగజ-కారణా కారణ విభాగము అని చెప్పబడుచున్నది.

(2) కారణాకారణ విభాగజ-కార్యాకార్య విభాగము :-

సంయోగములందు సంయోగజ సంయోగ మొకటి యుండునని పూర్వము వ్రాయబడినది. ఒకడు తన వ్రేలిని వృక్షము యొక్క మొదలు మీద నుంచె ననుకొనుడు. అప్పుడు వృక్షమునకు వ్రేలికి సంయోగమేర్పడును. ఇట్లు వ్రేలితో వృక్షమునకు సంయోగ మేర్పడినపుడు చేతికి వృక్షమునకుసంయోగము కలుగును. అట్లే దేహమునకు వృక్షమునకు సంయోగము కూడ కలుగును. వ్రేలు చేతికి అవయవము. అందువలన వ్రేలు చేతికి సమవాయి కారణము. వృక్షము చేతికి (ఏవిధమైన) కారణము కాదు - అకారణము. ఈ వ్రేలుకు చెట్టునకు కలిగిన సంయోగము అనగా కారణ, అకారణ సంయోగము వ్రేలి కార్యమైన చేతికి వ్రేలికి కార్యముకాని - అకార్యమైన-వృక్షమునకు మధ్య సంయోగము కలిగించును. ఇట్లు కలిగిన యీ హస్తవృక్ష సంయోగమునకు వ్రేలివృక్షముల సంయోగము అసమవాయి

కారణమగును. వ్రేలితో వృక్షమునకు సంయోగ మేర్పడుటకు వ్రేలియందు (సమవాయ సంబంధముతో) ఏర్పడిన క్రియ అసమవాయికారణము. ఆ క్రియయే హస్తవృక్ష సంయోగమును కలిగించుటకు కారణము కాజాలదు. కారణమేమున : క్రియ యేయధికరణమున (దేనియందు) ఉత్పన్నమగునో – కలుగునో – దానికంటే భిన్నమైన దానియందు సంయోగము కలిగింపనేరదు. కారణమేమన : కార్యమునకు సమవాయికారణ మైన దానియందు (కార్యసమవాయికారణమున) ప్రత్యాసన్నమైన (సమవేతమైన) ధర్మమే ఆ కార్యమునకు అసమవాయికారణము అగును, అనునది నియమము. ప్రకృతమున వృక్షముతో వ్రేలికి (అంగుళికి) ఏర్పడిన సంయోగరూప కార్యమునకు అంగుళిలో (సమవాయసంబంధముతో) నేర్పడిన క్రియ అసమవాయి కారణము. ఆ క్రియ తనకు అధికరణమైన వ్రేలికంటె భిన్నాధికరణమైన చేతితో – హస్తముతో – వృక్షమునకు సంబంధము – సంయోగము – కలిగింపనేరదని భావము.

హస్త వృక్షసంయోగమునకు సమవాయి కారణమైన హస్తమున హస్తావయవమైన అంగుళిలో సమవేతమైన క్రియకు కారణైకార్థప్రత్యాసత్తి (స్వసమవాయి సమవాయ సంబంధము) ఉన్నప్పటికి, క్రియలో అసమవాయికారణత అంతట కార్యైకార్థప్రత్యాసత్తితో నంగీకరింపబడును. అనగా – కార్యాధికరణమున సాక్షాత్తుగా సమవేతక్రియయే యా కార్యమునకు అసమవాయికారణమగును. వ్రేలిలో నేర్పడిన క్రియకు చేతితో సాక్షాత్తు సంబంధము కలుగక పరంపరగా కలుగుచున్నది. అంగుళిద్వారమున దానిలో కలిగిన క్రియకు చేతితో సంబంధము కల్పింపబడును. సాక్షాత్తుగా క్రియకు సంబంధము లేదని భావము. కావున అంగుళి – వృక్షములకు అన్యతరకర్మ-జ సంయోగమేర్పడినపుడు ఆ సంయోగమే – అంగుళి, వృక్షసంయోగమే-

హస్తవృక్షసంయోగమునకు అసమవాయికారణ మగుచున్నది. అట్లే వృక్షహస్త సంయోగము దేహవృక్షసంయోగమునకు అసమవాయి కారణమగును. మొదటి సంయోగము క్రియాజన్యమగును. తదుపరి కలుగు సంయోగము సంయోగజ-సంయోగ మగును.

ఇంతవఱకు వర్ణింపబడిన సంయోగ-జ సంయోగ మెట్లేర్పడు చున్నదో అట్లే కారణాకారణ విభాగ-జ - కార్యాకార్య విభాగ మేర్పడును. రెంటి ప్రక్రియ యొక్కటిగా నుండునని భావము. విభాగము సంయోగ పూర్వకముగా నేర్పడును. కావున ముందుగా సంయోగ-జ - సంయోగ ప్రక్రియ వివరింపబడినది.

ఒక వ్యక్తి యొక్క అంగుళి వృక్షముతో సంయుక్తమైన దనుకొనుడు. అతని యిచ్ఛ, ప్రయత్నముల వలన అంగుళిలో క్రియ యేర్పడును. ఆ క్రియ వలన అంగుళి - వృక్షముల మధ్య విభాగ మేర్పడును. అనగా అంగుళి సమవేతక్రియ (అన్యతర - కార్య) అంగుళి వృక్షముల విభాగము నేర్పఱచినదని భావము. అంగుళి - వృక్షవిభాగము వలన హస్తవృక్ష విభాగము ననుభవింపనగును. ఇట హస్త వృక్ష విభాగమునకు హస్తము వృక్షము రెండును సమవాయి కారణము. అంగుళి-వృక్షవిభాగము అసమవాయి కారణము. ఇందు మొదటి విభాగము క్రియాజన్యము. రెండవది విభాగ - జ - విభాగము. ఇదియే కారణాకారణ- జ - కార్యాకార్యవిభాగ మనబడును.

## అసత్ కార్యవాదము

న్యాయ-వైశేషిక దర్శనముల పరంపరలో అసత్ కార్యవాదమును బలపఱచు ప్రయత్నము చూడనగును. దీనికి ప్రతియోగిత - విపరీతముగా

సాంఖ్య వేదాంతదర్శనకారుల పరంపరలో సత్ కార్యవాదము ప్రతిపాదింపబడుట చూతుము. ఈ దర్శనములపై వ్యాఖ్యలను వ్రాసినవారు ఆయా వాదములను యుక్తి ప్రయుక్తులతో బలపఱచుట కెంతగానో ప్రయత్నించి యున్నారు.

అసత్ కార్య స్వరూపము :- ప్రతికార్యవస్తువు - పదార్థము - తనయుత్పత్తికి పూర్వము 'అసత్' ఉనికి లేనిదై యుండును. కార్య ముత్పన్నము కాక పూర్వము దాని యునికి ఏవిధముగ నెన్నడు ఉండదు. నూతనముగ నారంభింపబడునని భావము. కార్యము ఏర్పడుటకు ముందు దాని ప్రాగభావ ముండును. ఉత్పత్తికి పూర్వము కార్యము యొక్క యభావము 'అసత్' (లేకుండుట) అనబడును. ప్రాగభావము నశించి కావ్యము క్రొత్తగా నేర్పడును. అందువలన 'ఆరంభవాదము' అనికూడ అందురు. కార్యమునునది యెప్పుడో యొకకాలమున నుద్భవించును. అది భవిష్యత్తున నెల్లకాలము నుండదు. కొండొక కాలమున నశించును. కాబట్టి కార్యము 'సాది-సాంతము' అనబడును. ఉత్పత్తికి పూర్వము అన్ని విధముల 'అసత్' అగును. ఇదియే 'అసత్ కార్యవాదము'.

సాంఖ్యదర్శనము ననుసరించి ఉత్పత్తికి పూర్వమే కార్యమునకు ఉనికి యుండునని యంగీకరించు పక్షమున కార్యము నుత్పన్నము చేయుటకు కర్తృవ్యాపారమున కావశ్యక మేమియు నుండదు.

అందులకు సత్కార్యవాదు లిట్లందురు. కార్యోత్పత్తికి పూర్వము ఆ కార్య మేవిధముగను నే రూపమునను తన కారణ (సమవాయి - ఉపాదానకారణ) ములలో నుండని పక్షమున మృత్తికలో ఘటము లేనట్లు, తంతువులలోను ఘటముండదు. అట్లే పటము తంతువులలో నుండునట్లు మృత్తికలోను ఉండదు. అట్టియెడ మృత్తిక (నుండియే) తోనే ఘటము,

తంతువులతోనే పటము ఉత్పన్నమగునట్టి వ్యవస్థ యేల యుండును ? ఘటము తంతువులనుండియు పటము మృత్తిక నుండియు కర్తృవ్యాపారము వలన నేల జనింపవు ? కర్తృవ్యాపారము వలన నేకార్యమైనను ప్రతికారణ ద్రవ్యమునుండి కలుగవచ్చును కదా ! అందురు.

కాండాక విశేషకార్యోత్పత్తి విశేషకారణముల నేల గ్రహింపవలయును ? కార్యము సర్వత్ర సర్వాత్మనా అసత్తే కదా యని వారి యభిప్రాయము. కావున ఆ కార్యము నుత్పన్నము చేయుటకు ఉపాదానము చేయబడు విశిష్ట కారణములలో నేదో యొక రూపమున నా కార్య ముండునని యంగీకరింపక తప్పదందురు.

అసత్ కార్యవాదులందులకు సమాధానముగా నిట్లందురు. ఏ వస్తువువలన నే వస్తువు ఉత్పన్నమగునో ఆ వస్తువు నందా వస్తువు నుత్పన్నము చేయు సామర్థ్యముండును. ప్రతి పదార్థము ప్రతి వస్తువు నుత్పన్నము చేయగల సామర్థ్యము కలిగియుండదు. కర్త యగు వ్యక్తి ఏ వస్తువు దేని నుత్పన్నము చేయ సమర్థమో తెలిసికొని దానినే కార్యోత్పత్తికి గారణముగా గ్రహించును. కావునకార్యోత్పత్తికి పూర్వ మది (కార్యము) యేరూపమున నున్నదని యంగీకరించినను వ్యవహార్యము కాజాలదు. అట్టి యునికి వలన ఏ వ్యవహారము సిద్ధింపదు. ఉత్పత్తికి పూర్వము మట్టి రూపములో నున్న ఘటము జలము తెచ్చుట కుపయోగించునా ? తంతురూపమున పటము - వస్త్రము - దేహమును కప్పగలదా ? ఈ వ్యవహారములన్నియు ఘటపటాది కార్యము లుత్పన్నములైన మీదటనే సంభవించును.

కార్యము యొక్క వ్యవహారయోగ్యమగు నీ స్థితినే బౌద్ధదర్శనకారులు 'అర్థక్రియాకారిత' అందురు. ప్రతికార్యము ఏదోయొక విశేష ప్రయోజనము

సిద్ధించుటకు ఉత్పన్నము చేయబడును. విశిష్టప్రయోజ నానుకూల వ్యాపారమును సంపన్న మొనర్చుటయే కార్యవస్తువు యొక్క ఉనికికి నియామకము. ఘటకార్యమునకు జలాహరణము-జలము తెచ్చుట-మున్నగునవి ప్రయోజనములు. ఇయ్యవి ఘటోత్పత్తికి పూర్వము సంభవింపవు. కావున ఘటోత్పత్తికి పూర్వము ఘట మున్నదనుట ప్రామాణికము కాదు.

సత్కార్యవాదులు :- 'ఘటాది కార్యవస్తువులు తమ వ్యవహార్య రూపమునకు రాకముందు జలాహరణాది కార్యములు సంభవించుననుటను మేము కూడ అంగీకరింపము' అందురు. ఘటాదులు తమ యుత్పత్తికి పూర్వము వ్యవహార్యరూపమున నుండక కారణరూపమున అనభివ్యక్త-వ్యక్తముకాని-స్థితిలో నుండును. అవి విశేషనిమిత్తకారణముల సహయోగము వలన వ్యక్తదశకు వచ్చును. అప్పుడే యవి జలాహరణాది కార్యముల వ్యవహారమునకు ఉపయుక్తము లగును. కావున అభివ్యక్తదశకు రాకముందు ఘటాది కార్యద్రవ్యములకు ఏ రూపమునను ఉనికి లేదనుట యుక్తము కాదు. సర్వాత్మనా అవి అసత్తు లనరాదు. అందువలన కార్యకారణముల యీ స్థితిని కారణములలో కార్యోత్పాదక సామర్థ్యము మాత్రముండునని చెప్పుట చాలదు. విభిన్నపదార్థములలో నేకార్యముల సద్భావము కలదో యాకార్యములనే యా పదార్థములనుండి వ్యక్తము చేయవీలగును. కావుననే సర్వకార్యములు సర్వపదార్థములనుండి యుత్పన్నముచేయజాలము.

ఇట్లు ఉత్పత్తి, అభివ్యక్తి అనుపదముల నాధారము చేసికొని దీర్ఘచర్చలు జరుప నవకాశమున్నది. కాని ప్రయోజనము శూన్యము. వాస్తవమున కొండొక వస్తువు రూపాంతరమును బొందుటయే ఉత్పత్తి పదమున కర్థము.

అందువలన కార్యరూపమున పరిణమించుటకు పూర్వమా వస్తువు ఏదోయొక రూపమున నున్నదనియే యంగీకరింపవలయును. ప్రతికార్యమును వ్యవహార్యస్థితికి-తెచ్చుటకు కర్తృవ్యాపారమావశ్యక మగును. ఈ స్థితిలో కార్యోత్పత్తికి-అభివ్యక్తికి పూర్వము కారణమున కార్యసద్ భావ మంగీకరించిన కర్తృవ్యాపార మనావశ్యక మనుట నిరర్థకము.

అసత్ కార్యవాదులు కార్యమును అసత్తనుటలో నభిప్రాయమేమి? కార్యము వ్యవహారరూపములో వచ్చుటకు పూర్వము అసత్తని వారి యభిప్రాయము. ఇక్కడ విచారింపవలసిన విషయమొకటి యున్నది. అది యెద్ది యనః అసద్ భావ మిట కార్యము యొక్క ఉపాదానమా ? కాదు. వైశేషికుల దృష్టిలో ఉపాదానమన సమవాయి కారణము. సమవాయి కారణము అసద్ భావ మెన్నడు కాదు. ఆ స్థితిని ప్రాగభావము రూపమున వైశేషికులు కేవలము నిమిత్తకారణశ్రేణిలో నంగీకరింతురు. అది సాధారణ కారణము. ఘటమునకు అసాధారణ కారణము మృత్తిక. అది సద్ భావము - సత్ పదార్థము. కావున దాని నాధారము చేసికొని కార్యము సత్ కార్యమని చెప్పిన దోషమొండును కానరాదు. కార్యము కారణరూపములో నున్నపుడు దాని వ్యవహార్యరూపమును కాని అర్థక్రియాకారిత్వమును కాని సత్కార్యవాదులు కూడ నంగీకరింపరు. కావున కార్యరూపమున పరిణమించుటకు పూర్వము కార్య మేరూపముననను లేదనుట అంతగా సంగతము కాదేమో ! లేకున్న కారణవ్యవస్థ నుపపాదించుట శక్యము కాజాలదు.

ఈ విషయమున గౌతమముని న్యాయశాస్త్రమునందు తన స్వతంత్రాభిప్రాయమును ప్రకటించి యున్నాడు.

గౌతమముని అభిప్రాయము :-

కర్మఫలము జీవుల కెట్లు ప్రాప్తించునో ఆలోచించుచు, సత్కార్య అసత్ కార్యవాదమును గూర్చిన ప్రసక్తిని తెచ్చి గౌతమముని ఇట్లు నుడివియున్నాడు. ("బుద్ధిసిద్ధం తు తదసత్" న్యా. ౪.౧.౫౦) అను సూత్రమున ఉత్పత్తికి పూర్వము కార్యము అసత్ అనబడును. కాని, ఆ దశలో కార్యము యొక్క సద్భావము-ఉనికిని బుద్ధిసిద్ధమనుట సంగతమగును. ఆయాధారము మీదనే ఉపాదాన నియమవ్యవస్థయు సంభవమగును.

బుద్ధిసిద్ధ మననేమి ? వస్తువు ఉత్పన్నమగుటకు పూర్వము 'అసత్' గా నుండును - ఉపలబ్ధము కాదు. ఉత్పన్నమైన పిదప సద్భావమునకు వచ్చి యుపలబ్ధమగును. కాలాంతరమున నావస్తువు విరోధికారణముల వలన నశించి మరల అనుపలబ్ధ స్థితిని పొందును. లోకసిద్ధమైన వస్తువు యొక్క యుత్పత్తి వినాశములు కార్యవస్తువు పుట్టుటకు ముందు అసద్ రూపమున నుండుననుటను దెలుపును. వస్తువు ఉత్పత్తికి పూర్వము కూడ నుండుననుటచే-సద్రూపమున నున్నదనుటచే నిది నిత్యమని చెప్పవలసి వచ్చును.

వస్తుస్థితిని బాగుగ గుర్తించినచో నీ విషయమున నింతగా వివరింపవలసిన యావశ్యక మేమియు కనిపింపదు. కారణమేమన ; జలాహరణాది (నీరుతెచ్చుట) వ్యాపారమును నెఱవేర్చుటకు తగిన ఘటాకారావస్థ ఘటోత్పత్తికి పూర్వము మృత్తికయందుండునని ఘటాకారమునకు వచ్చుటకు పూర్వము కూడ ఆయాకారము కర్తయొక్క బుద్ధి ననుసరించి మృత్పిండమున (మట్టిలో) నుండునందురు. అట్లు లేకున్న ఘటము నుత్పన్నము చేయుటకు - ఘటాకారమును ప్రకటించుటకు మృత్తికనే ఉపాదానముగా గ్రహింప నావశ్యక ముండదని వారి యభిప్రాయము.

ఉత్పత్తి - వినాశములు, ఆవిర్భావ - తిరోభావములు, అభివ్యక్తి। నిలయములు అనునీపదము లన్నియు సమానార్థకములే. ఉత్పత్తి యననేమి? ఇయ్యది తెలియదగిన విషయము. వాస్తవమున మట్టియే ఘటాకారమున సిద్ధపఱుపబడును. ఆ మట్టితో నొక్క ఘటాకారమే కాదు. ఇంకను ఎన్నియో ఆకారములు (కుండలు, పిడతలు, కడవలు, మూకుళ్ళు, కూజాలు) రూపొందింపబడును. మట్టిసుద్దలో నీయాకారము లన్నియు నున్నవి. కర్త కేవలము తన బుద్ధి చమత్కారముతోనే వీనిని కలిగించు ననుట సరికాదు. కారణమైన మట్టిసుద్దలో నాయాకారముల యునికి లేకున్న కర్త-కుమ్మరి తన బుద్ధికౌశలముతో వానిని రూపొందింపగలడా ? అట్లు చేయగలిగినచో ఘటాద్యాకారముల యునికి లేని తంతువులతో ఘటాద్యాకారములను రూపొందింప గలిగి యుండవలయును. అది సాధ్యము కాదని నైయాయికులు కూడ అంగీకరింపక తప్పదు. కారణము (ఉపాదాన-సమవాయి) లో వస్తు ఆకారము నంగీకరింపనిచో బౌద్ధులు చెప్పునట్లు (బుద్ధి సిద్ధమని యంగీకరించిన) వస్తువుల యునికియే యంగీకరింప వలసిన యావశ్యక ముండును. బుద్ధియే వివిధాకారములను భాసింపజేయు ననవలసివచ్చును.

కొండొక వస్తువు యొక్క యాకారము దాని సమవాయి కారణమునందంగీకరించుట, ఆ వస్తువును రూపొందించుట కాకారణద్రవ్యమును గ్రహించుట అత్యావశ్యక మగును. బౌద్ధులు తమదర్శనములలో వస్తువు కంటె బుద్ధికి విశేష మహత్త్వము కల్పించుట చూడనగును. అందువలన వస్తుసత్త-ఉనికి యుపేక్షింపబడినది.

- గ్రంథకర్త

# విషయసూచిక

ఓ3మ్

# వైశేషిక దర్శనము

## ప్రథమాధ్యాయము

### ప్రథమాహ్నికము



పురుషార్థములు నాలుగు : ధర్మము, అర్థము, కామము, మోక్షము. అందు మోక్షమునకు అసాధారణ కారణము - ముఖ్యకారణము తత్త్వజ్ఞానము - పదార్థజ్ఞానము (తత్త్వము అనగా పృథివి మొదలు పరమేశ్వరుని వఱకుగల పదార్థములు. వానికి సంబంధించిన యథార్థజ్ఞానము) అదియే ముఖ్య ప్రయోజనముగా గలది శాస్త్రము - వైశేషిక దర్శనము, అట్టి దర్శనము నారంభించుచు కణాద మహర్షి తత్త్వ జ్ఞానమునకు కారణ మగు ధర్మమును (1. ధర్మమనగా పదార్థములలో నుండు గుణవిశేషము; 2. వేదవిధియు-వేదముచే బోధింప బడిన కర్మలు ధర్మమనబడును. 'చోదనా లక్షణోఽర్థో ధర్మః." మీ. సూ. = చోదన అనగా వేదవిధి-వేదాజ్ఞయే లక్షణముగా గల కర్మధర్మము, అర్థము - విషయము - కర్మ) నిరూపింప దలంచి ప్రతిజ్ఞ చేయుచున్నాడు.

సూ. అథాతో ధర్మం వ్యాఖ్యాస్యామః ౧.౧.౧

అథ = శిష్యులు తెలిసికొనగోరిన పిమ్మట, అతః=మోక్షమును కోరుచు దానికి సాధనమైన జ్ఞానమును అభిలషించి శిష్యులు సమీపించుట వలన, ధర్మం=ధర్మమును, వ్యాఖ్యాస్యామః = లక్షణ ప్రమాణములతో నిరూపింతుము.

సంస్కృత సాహిత్యములో అథశబ్దము అనంతర్యము - తరువాత, మంగళము మున్నగు నర్థములలో ప్రయోగింపబడు చుండును.

"అథో అథ ఇతి మంగలానంతర.......సముచ్చయేషు"

(కౌముది)

ప్రస్తుత మిట అథ శబ్దము తరువాత-శిష్యులు తెలిసికొన గోరిన పిమ్మట అను నర్థమున ప్రయోగింప బడినది.

మోక్షమనగా ఆత్మదర్శనము. దానికి వేదాధ్యయనము వలనగాని, ఆచార్యుల ఉపదేశము వలనగాని ఆత్మనుగూర్చి వినుట శ్రవణము, ఆ వినిన విషయమును హేతుబద్ధముగా విచారించుట మననము. ఆదిపదముచే నిదిధ్యాస గ్రహింపవలయును. నిదిధ్యాస యనగా ధ్యానము. వీనివలన ఆత్మసాక్షాత్కారము కలుగును. ఆయాత్మ సాక్షాత్కారమే మోక్షము. శ్రవణ మననాదులు ముఖ్యసాధనములు. అట్టి శ్రవణాదులలో సమర్థులును, అసూయాది దోషములు లేని వారును, శ్రద్ధావంతులును, సేవా శుశ్రూషా పరాయణులును అగు శిష్యులు కణాద మహర్షిని సమీపించి మోక్షసాధనమును తెలిసికొనగోరిరి. అనంతరము ఆచార్యులు - కణాదమహర్షి ధర్మపదార్థ నిరూపణమును చేయసాగిరి. కావున సూత్రమున గల అథ పదము అనంతర్యార్థమును బోధించునని భావము.

అవతారిక : పదార్థమును నిరూపించుటకు లక్షణ ప్రమాణములు ఆవశ్యకములు. కేవలము ప్రతిజ్ఞామాత్రమున-పదార్థమును నిర్దేశించుటవలన అనగా ఒకానొక పదార్థము యొక్క పేరుచెప్పిన మాత్రమున ఆ పదార్థముయొక్క ఉనికి సిద్ధముకాదు. కావుననే తత్త్వవిదులు 'లక్షణ ప్రమాణాభ్యాం వస్తుసిద్ధిః, న తు ప్రతిజ్ఞామాత్రేణ' అని నుడివిరి. (అనగా లక్షణము, ప్రమాణము అను రెంటివలన వస్తువు సిద్ధించును కాని పేరుచెప్పిన మాత్రముచేత సిద్ధింపదు) కాబట్టి పై సూత్రమున నిర్దేశించిన ధర్మపదార్థమునకు లక్షణమును మహర్షి ఉల్లేఖించుచున్నాడు.

సూ. :- యతోఽభ్యుదయ నిశ్శ్రేయస సిద్ధిః స ధర్మః ౧.౧.౨

అభ్యుదయ నిశ్శ్రేయస సిద్ధిః=అభ్యుదయము, నిశ్శ్రేయసము నను నీరెంటియొక్క సిద్ధి = ప్రాప్తి, యతః = దేనివలన నగునో, సః ధర్మః =అదియే ధర్మము, లేక, అభ్యుదయః = తత్త్వజ్ఞానము, దానిమూలమున, నిశ్శ్రేయస సిద్ధిః = మోక్ష ప్రాప్తి, యతః = దేనివలన కలుగునో, సః ధర్మః = అది ధర్మము.

అభ్యుదయ మనగా ఇహ, పర, లోకములకు సంబంధించిన కార్యముల సఫలత. ఇదియే ఐహి కాముష్మిక - అభివృద్ధి యనియు చెప్పబడును.

త్రివిధములగు దుఃఖములు పూర్తిగ నశించుటయే నిశ్శ్రేయసము-ముక్తి అనబడును. (-త్రివిధ దుఃఖాత్యంతాభావః నిశ్శ్రేయసమ్-)

త్రివిధ దుఃఖములు : ౧. ఆధ్యాత్మికము ౨. అధి భౌతికము 3. అధి దైవికము.

ఇందు ౧. ఆధ్యాత్మిక దుఃఖము శరీర మనస్సులకు సంబంధించి రెండు విధములుగా నుండును. 'వాత పిత్త శ్లేష్మములు' - అను ధాతువుల వైషమ్యమువలన కలుగు దుఃఖము శారీరికము. కామము, క్రోధము, లోభము, మోహము, భయము, ఈర్ష్య, విషాదము మున్నగు వానిచే నేర్పడు దుఃఖము మానసికము, ఇట నాత్మపదము శరీర బోధకము, ఆత్మయందు-శరీరమునందు కలుగు దుఃఖము కావున ఆధ్యాత్మిక మనబడినది.

౨. మనుష్య పశుపక్షి మృగాదులచే నేర్పడు దుఃఖము అధి భౌతికము. ఇందు భూతపదము ప్రాణివాచకము. భూత ములవలన - ప్రాణులవలన కలుగు దుఃఖము అధిభౌతిక మనబడును.

3 అగ్ని జల వాయు ప్రకోపాదులచే కలుగు దుఃఖము అధిదైవికము. అగ్ని, వాయువు మున్నగు పదార్థములు దేవత లని వ్యవహరింపబడును. కావున వానివలన కలుగు దుఃఖము అధిదైవిక మనబడినది.

తా॥ దేనివలన అభ్యుదయము, నిశ్శ్రేయసము - ఈ రెండు ప్రాప్తించునో అది ధర్మము. లేక, దేనివలన అభ్యుదయము, దాని మూలమున నిశ్శ్రేయసము సిద్ధించునో - ప్రాప్తించునో అది ధర్మము.

ఈ లక్షణమును బట్టి ధర్మము అభ్యుదయమునకు సాక్షాత్సాధనము - కారణము. మోక్షమునకు పరంపరగా

సాధనము. ధర్మము తత్త్వజ్ఞానమును కలిగించి మోక్షకారణ-సాధన-పరంపరలో చేరునని భావము.

అవ : ధర్మమునకు లక్షణమును చెప్పి ప్రమాణమును మహర్షి నిరూపించుచున్నాడు.

సూ :- తద్వచనా దామ్నాయస్య ప్రామాణ్యమ్ ౧.౧.౩

తద్వచనాత్ = ధర్మమును యథాస్వరూపముగా - లక్షణ యుక్తముగా, నిర్వచించుటవలన, ఆమ్నాయస్య=వేదమునకు, ప్రామాణ్యమ్ = ధర్మమునందు ప్రామాణ్య మున్నది.

ఆమ్నాయ పదముచే నిట సర్వవిద్యలను, సర్వ పదార్థము లను ప్రకాశింపజేయు ఋగ్యజు స్సామాథర్వనామములతో వ్యవహరింపబడు వేదములు గ్రహింపనగును. వేదములే ధర్మమును ప్రతిపాదించుచున్నవి.

ఇట్లే శాస్త్రాంతర కర్తలును చెప్పియున్నారు.

'చోదనాలక్షణోఽర్థో ధర్మః' (మీ, అ ౧, పా ౧, సూ. ౨.)

వేదవిహిత పదార్థమే ధర్మమని దీని భావము.

మనుధర్మ శాస్త్రమున నిట్లేయుండుట చూడగలము.

'ధర్మం జిజ్ఞాసమానానాం ప్రమాణం పరమం శ్రుతిః'

(మను. ౨-౧౩)

'వేదోదితం స్వకం కర్మ నిత్యం కుర్యా దతంద్రితః
తద్ధి కుర్వన్ యథాశక్త్యా ప్రాప్నోతి పరమాం గతిమ్॥'

(మను. ౪-౧౪)

మోక్షాపేక్షులై ధర్మము నెఱుంగగోరువారికి వేదమే పరమ ప్రమాణము. అందువలన యథాశక్తిని వేదములం దుపదేశింప

బడిన కర్మములనే ఆచరించుట అనగా నవైదిక కర్మలను పరిహరించి వైదికములను మాత్ర మనుష్ఠించుట మోక్షకాముల కనివార్యమని భావము.

అవ : ఇట్లు లక్షణ ప్రమాణములతో ధర్మమును నిరూపించి ధర్మమూలక మగు తత్త్వజ్ఞానమువలన మోక్షము సిద్ధించునని యీ సూత్రమున నిర్దేశించుచున్నాడు.

సూ. :- ధర్మవిశేష ప్రసూతాత్, ద్రవ్యగుణకర్మ సామాన్య
విశేష సమవాయానాం పదార్థానాం సాధర్మ్య
వైధర్మ్యాభ్యాం తత్త్వజ్ఞానా న్నిశ్శ్రేయసమ్. ౧.౧.౪

ధర్మవిశేషప్రసూతాత్ = వేదవిహిత నిష్కామ కర్మానుష్ఠానము వలన కలిగిన పుణ్యమిట ధర్మ విశేషము-దానివలన పుట్టిన, ద్రవ్యగుణ కర్మ సామాన్య విశేష సమవాయానాం = ద్రవ్యములు, గుణములు, కర్మములు, సామాన్యము, విశేషములు, సమవాయము నను, పదార్థానాం = షడ్విధములగు పదార్థముల యొక్క, సాధర్మ్య వైధర్మ్యాభ్యాం=సాధారణ విశేషధర్మముల ద్వారా, తత్త్వజ్ఞానాత్ = పైన చెప్పిన ద్రవ్యాదుల సత్యస్వరూప సాక్షాత్కారమువలన, నిశ్శ్రేయసమ్=మోక్షము సిద్ధించును.

అనాత్మ పదార్థములనుండి వేఱుపఱచి ఆత్మతత్త్వమును బాగుగా నెఱుంగుటవలన మిథ్యాజ్ఞానము పోయి నిశ్శ్రేయసము సిద్ధించు ననునది సిద్ధాంతము. ఆ యాత్మతత్త్వజ్ఞానము ప్రత్యేకముగా నొక్కొక్క పదార్థమును (స్వరూపతః) యథార్థముగ నెఱుంగక కలుగనేరదు. పదార్థములును వాని సాధారణ విశేషధర్మములను వివేచించుటచే యథార్థముగ బోధపడును.

ఉదాహరణార్థము-స్థాణువు (కొమ్మలు మొదలగునవి లేక మనుష్య ప్రమాణమున నెత్తుగానున్న చెట్టుమొదలు), పురుషుడు (నిలబడియున్న మనుష్యుడు) - అను రెండు పదార్థములను తీసికొనుడు. ఆ రెంటియందు ఎత్తు, లావు మున్నగు గుణములు సమానధర్మములు. వంకర, తొఱ్ఱ మొదలగునవి స్థాణువునకును, చేతులు, కాళ్ళు మొదలగునవి పురుషునకును విశేషధర్మములు. ఇందు స్థాణుపురుషులకు గల సమాన ధర్మముల జ్ఞానమువలన, కనబడు పదార్థము స్థాణువా ? పురుషుడా ? అను సందేహము కలుగునేకాని యథార్థజ్ఞానము కలుగనేరదు. సాధారణ విశేష ధర్మములను వివేచించి విశేష ధర్మజ్ఞానము కలిగినప్పుడు ఇది స్థాణువు కాదు; పురుషుడనియో, లేక పురుషుడు కాదు; స్థాణువనియో నిర్ణయింపనగును. ఇట్లు సాధారణ విశేష ధర్మజ్ఞానమువలన వస్తువు యథార్థముగ తెలియబడును.

ఈ శాస్త్రమున పదార్థములు సంగ్రహముగా 'ఆఱు' అని చెప్పబడినవి. ద్రవ్యము, గుణము, కర్మము, సామాన్యము, విశేషము, సమవాయము. శాస్త్రాంతరములలో పదార్థములు అనేకములుగ (ఎక్కువ సంఖ్యలో) వర్ణింపబడినను అవి యన్నియు ముఖ్యములయిన ఈ యాఱు విధములలోనే యిముడగలవు. ఈ ఆఱింటిలోను ద్రవ్యము, గుణము, కర్మము - అను మూడు పదార్థములే ముఖ్యములు. ఈ విషయము ఈ శాస్త్రముననే ముందు ('అర్థ ఇతి ద్రవ్యగుణ. కర్మసు' ౮-౨-3). పదార్థమను శబ్దము ద్రవ్యగుణ కర్మములందే వర్తించు'నని చెప్పబడును. తక్కిన సామాన్య విశేష సమవాయములు - అను మూడును ఉపపదార్థములు.

ఇట్లు వర్ణింపబడిన ఈ యాఱు పదార్థముల తత్త్వజ్ఞానము మూలమున ఆత్మను ఇతర ద్రవ్యములనుండి వేఱుపఱచి యథార్థముగ నెఱుగుటయే నిశ్శ్రేయసమునకు ముఖ్య సాధనమని యీ సూత్రాభిప్రాయము.

'తమేవ విదిత్వాఽతిమృత్యుమేతి
నాన్యః పన్థా విద్యతేఽయనాయ.' (యజు. ౩౧-౧౮)
'తమేవ విద్వాన్ న బిభాయ మృత్యో
రాత్మానం ధీర మజరం యువానమ్.' (అథ. ౧౦-౮-౪౪)
'బ్రహ్మ విదాప్నోతి పరమ్' (తై. ఉప. ౨-౧)

అని మంత్ర సంహితలలోను, ఉపనిషత్తులలోను పరమాత్మని యపరోక్ష జ్ఞానమే మోక్షసాధనమని వర్ణింపబడి యున్నను, కేవలాత్మ జ్ఞానము కలుగక పరమాత్మ సాక్షాత్కారమసంభవ మగుటచేతను, ఆత్మజ్ఞానము తరువాత పరమాత్మని జ్ఞాన మవశ్యము కలుగుటచేతను ఆత్మ తత్త్వజ్ఞానమే నిశ్శ్రేయసమునకు ముఖ్యకారణ మని రాద్ధాంతము. అందువలననే న్యాయ వైశేషిక సాంఖ్య యోగ దర్శనములందు కేవలాత్మ తత్త్వమును బాగుగా నుపదేశించి ఉత్తరమీమాంస (వేదాంత దర్శనమున) యందు 'అథాతో బ్రహ్మజిజ్ఞాసా' యని పరమాత్మ నిరూపణము చేయబడి యుండెను.

వివిక్త - ఇతర పదార్థముల నుండి వేఱుచేయబడిన ఆత్మతత్త్వ జ్ఞానమే బ్రహ్మజ్ఞాన ప్రతిబంధకమగు మిథ్యాజ్ఞానమును దూరమొనర్చి మోక్షప్రాప్తి కలుగజేయును. అనగా పరమాత్మ సాక్షాత్కారమువలన శాశ్వత సుఖము ననుభవింపజేయును. ఉపనిషత్తులలో నిట్లేకదా వర్ణింపబడి యుండెను,

"యదా పశ్యః పశ్యతే రుక్మవర్ణం
కర్తార మీశం పురుషం బ్రహ్మయోనిమ్।
తదా విద్వాన్ పుణ్యపాపే విధూయ
నిరంజనః పరమం సామ్య ముపైతి॥'' (ముం.3-౧-3)

'యోగాభ్యాసాదుల వలన చిత్తమాలిన్యములను దొల గించుకొని సమాధియందు సమస్తజగత్తునకు కర్తయు, వేదాదులకు మూలము నగు పరమేశ్వరుని గుర్తించిన విద్వాంసుడు సర్వ దుఃఖములనుండి ముక్తుడై పరమేశ్వరుని వలె నవిద్యాదులు తొలగినందున నిర్మలు డగును.'

"ఏకో వశీ సర్వభూతాంత రాత్మా
ఏకం రూపం బహుధా యః కరోతి।
తమాత్మస్థం యేఽనుపశ్యంతి ధీరా
స్తేషాం సుఖం శాశ్వతం నేతరేషామ్॥"(కఠ.౨.౫-౧౨)

పరమేశ్వరు డొక్కడు. అతడు సమస్త చరాచర వస్తువు లను సృష్టించి వానియందు నిరంతరముగ వ్యాపకుడై యుండి, బ్రహ్మాండము నంతటిని తనవశమునం దుంచుకొనును. ఈ ప్రపంచము ప్రళయమునందు సూక్ష్మమై ప్రకృతి రూపమున నుండును. సృష్టియందు నేడు కనిపించు వివిధ రూపములు నా డుండవు. ఒకేరూపమున నది భాసించును. అట్టి సూక్ష్మ రూపమున నుండు ప్రకృతిని వివిధరూపములలో పరిణమింప జేయువాడు పరమేశ్వరుడే. వివిధ స్థూల పదార్థములను సృష్టించి వానియందును, జీవులయందును నంతరాత్మయై

పరమేశ్వరుడు వ్యాపించియుండును. వాని యమనియమాది యోగాంగముల ననుష్ఠించు ధీరులే సాక్షాత్కారము చేసి కొనగలరు. ఆ ధీరులును ముందు తమ్ము తాము తెలిసికొని యనంతరముననే పరమాత్మను సాక్షాత్కారము చేసికొందురు. అట్టివారికే శాశ్వత సుఖము-మోక్షసంపదము లభించును. ఇతరుల కయ్యది లభింపదు.

ఈ యాఱు పదార్థములే గాక అభావ మను నేడవపదార్థ మొకటి చేర్పవలయు నని ఉదయనాచార్యుని మతము. దీనిని కణాదు డుల్లేఖింప లేదు. దీనికి కారణము అభావము భావ ప్రతియోగికమై భావపదార్థాధీన మగుటచే స్వయముగా నిందు గణింపడయ్యెను. అనగా-

(అభావము ఘటాభావము, పటాభావము--అని లోకమున వ్యవహరింపబడును. ఘటాభావమునకు ఘటము ప్రతియోగి. పటాభావమునకు పటము ప్రతియోగి. ఇట్లే ప్రతి వస్తువు యొక్క అభావమునకును ఆ వస్తువే ప్రతియోగి యగును. కావున అభావము భావప్రతియోగికమై యుండును. అనగా అభావము భావపదార్థము ప్రతియోగిగ కలదియై ఘటాభావము, పటాభావము అని ప్రయోగింపబడు చుండును. అందువలననే అభావము భావపదార్థాధీనమని యెంచి కణాదుడు దానిని స్వతంత్ర పదార్థముగ నిర్దేశింపలేదు)

శాస్త్రాంతరములలో ఈ అభావము 1. ప్రాగభావము, 2. ప్రధ్వంసాభావము 3. అన్యోన్యాభావము 4. అత్యంతాభావము — అని నాలుగు విధములుగ వర్ణింపబడును. 1. కొండొక వస్తువు ఏర్పడుటకు ముందు ఉండు అభావమును ప్రాగభావమందురు.

ఘటోత్పత్తికి పూర్వముండు ఘటాభావము ఘటప్రాగభావ మనబడును. అట్టి ఘటప్రాగభావమునకు ఆది యుండదు. కావున నది అనాది. అయినను అది ఘట ముత్పన్న మగుటయే తడవుగా నశించును. అందువలన సాంతము (అంతము గలది) అనగా ప్రాగభావము అనాది, సాంతము నని చెప్ప బడును.

౨. ఉత్పన్నమయిన వస్తువు నశించినప్పు డేర్పడు అభావము ప్రధ్వంసాభావము. ఈ అభావము నశించినప్పు డేర్పడును. గనుక ఆది కలది-(సాది-జన్యము) అగును. కాని దీనికి నాశముండదు. కారణ మేమనగా నశించినవస్తువు మరల జనింపదు. కావున అనంతము అనగా ప్రధ్వంసా భావము సాది, అనంతము నగుచున్నది. ఉదా :- ఘటధ్వంసము, పటధ్వంసము మొ॥

౩. ఒక వస్తువునందు కల మఱొక వస్తువుయొక్క అభావము అన్యోన్యాభావము. ఘటము పటము కాదు. పటము (వస్త్రము) ఘటము కాదు.

౪. ఒకచోట నున్న పదార్థము మఱొకచోట మూడు కాలము లందును లేకుండుట అత్యంతాభావము. ఉదా :- శశవిషాణము (కుందేటికొమ్ము), ఆకాశ పుష్పము, వంధ్యాపుత్రుడు (గొడ్రాలిబిడ్డ) మొ॥

వాస్తవమున ఈ వైశేషిక దర్శన కారుని మతములో అభావమను నది వేఱు పదార్థము కాదు. పైన వర్ణించిన వివిధాభావములు 'పృథక్త్వము' అను గుణములో నంతర్భాగము లగుచున్నవి. పృథక్త్వమనగా అయోగము-విడిపోవుట-

నశించుట. సంయోగము వలననే కదా లోకమున గల భూత పదార్థము లన్నియు నేర్పడుచున్నవి. అందువలన అయోగమే అభావము.

5 శాస్త్రముల ప్రవృత్తి (వర్ణన విధానము) ౧. ఉద్దేశము ౨. విభాగము 3. లక్షణము ४. పరీక్ష - అని నాలుగు విధములుగా నుండును. నామముతో పదార్థములను నిర్దేశించుట ఉద్దేశము. ఉద్దేశించిన పదార్థములను విభజించుట విభాగము. అసాధారణ ధర్మనిర్దేశముతో విభక్త పదార్థమును సమానా సమాన జాతీయములగు పదార్థములనుండి వేఱుచేయుట లక్షణము. లక్షణానుసారము హేతు పురస్సరముగా ప్రతిపక్ష సిద్ధాంతమును ఖండించి స్వపక్షమును సాధించి నిర్ణయించుట పరీక్ష.

అవ : ఇట్లు శాస్త్రరీతి ననుసరించి పూర్వసూత్రమున నుద్దిష్టము లగు ద్రవ్యాది పదార్థములలో క్రమప్రాప్త
6. ద్రవ్యమును విభాగించుచున్నాడు.

సూ. :- పృథివ్యాపస్తేజో వాయు రాకాశం
కాలో దిగాత్మా మన ఇతి ద్రవ్యాణి ౧.౧.౫

పృథివీ = భూమి. అపః = జలము. తేజః = జ్యోతి - అగ్ని. వాయుః=వాయువు. ఆకాశం=ఆకాశము. కాలః=సమయము. దిక్ = దిశ-దిక్కు. ఆత్మా = క్షేత్రజ్ఞుడు. మనః = అంతఃకరణము-చిత్తము. ఇతి = అను సీతొప్పుది. ద్రవ్యాణి = ద్రవ్యపదవాచ్యములు, అనగా ద్రవ్యపదార్థములు.

వీనిలో మొదటి మూడుపదార్థములు అనిత్యములు. వాయువు మొదలు మిగిలినపదార్థము లాఱును నిత్యములు. ఇందాత్మ పదార్థము జీవాత్మ, పరమాత్మయని రెండువిధములు. ఈ రెండు, పృథివ్యాదులకు మూలకారణమగు ప్రకృతియు మొత్తమీ మూడును పరమార్థ నిత్యములు-ఉత్పత్తి వినాశములు లేనివి. అనగా ప్రాగభావ, ప్రధ్వంసాభావ రహితము లైన పదార్థములు. వాయువు, ఆకాశము, కాలము, దిక్కు, మనస్సు-నీ యైదు పదార్థములు చిరకాలముండుటచే నిత్యము లని వ్యవహరింపబడును. అందువలన నివి వ్యావహారిక నిత్యములు. ఇందు వాయ్వాది నాలుగు పదార్థములు మహా ప్రలయ పర్యంతముండును. మనస్సు మాత్రము మోక్షపర్యంతము నశింపదు.

పృథివ్యాదులకు మూలకారణమగు పదార్థమును సాంఖ్య, యోగ, వేదాంత దర్శనకారులు ప్రకృతి నామముతో వ్యవహరింతురు. న్యాయ వైశేషిక మీమాంసకులు పరమాణు నామముతో వ్యవహరింతురు. సత్త్వరజస్తమోగుణ రూపము నెల్లరు సమానముగా స్వీకరింతురు.

7.
అవ : ద్రవ్యములను విభజించి గుణములను విభాగించుచున్నాడు.

సూ :- రూప రస గంధ స్పర్శాః, సంఖ్యాః, పరిమాణాని,
పృథక్త్వం, సంయోగవిభాగౌ, పరత్వాపరత్వే.
బుద్ధయః, సుఖదుఃఖే, ఇచ్ఛాద్వేషౌ, ప్రయత్నాశ్చ
గుణాః ౧.౧.౬

రూపరసగంధస్పర్శలు, సంఖ్యలు, పరిమాణములు, పృథక్త్వము, సంయోగ విభాగములు, పరత్వము, అపరత్వము, బుద్ధులు, సుఖదుఃఖములు, ఇచ్ఛాద్వేషములు, ప్రయత్నములు, సూత్రములోని "చ" కారబలమున గురుత్వము, ద్రవత్వము, స్నేహము, సంస్కారము, ధర్మము, అధర్మము, శబ్దము నను నేడు గుణములు చేరి యిరువదినాల్గు, గుణాః= గుణములని చెప్పబడును.

ఈ గుణములలో ద్రవత్వము రెండువిధములు. సాంసిద్ధిక ద్రవత్వము, నైమిత్తిక ద్రవత్వము. సంస్కారము త్రివిధము. వేగాఖ్య సంస్కారము, స్థితిస్థాపక నామక సంస్కారము, భావనాఖ్యసంస్కారము.

రూపము, రసము, గంధము, స్పర్శము, స్నేహము సాంసిద్ధిక ద్రవత్వము, శబ్దము, సుఖము, దుఃఖము, ఇచ్ఛ, ద్వేషము, ప్రయత్నము, ధర్మము, అధర్మము, భావనాఖ్య సంస్కారము - అను నీ పదునాఱువిశేష గుణములు. ఈ గుణములన్నియు (౧౬) సామాన్య విశేషయుతములై తమ కాశ్రయమగు ద్రవ్యము నితర ద్రవ్యములనుండి వేఱు పఱచును.

'జాతి మత్త్వే సతి బాహ్యైకేంద్రియమాత్ర గ్రాహ్యత్వం విశేష గుణత్వమ్' అని విశేషగుణ లక్షణము. రూపరసాది విశేషగుణములు, రూపత్వాది జాతి మంతములు, త్వక్చక్షుః శ్రోత్రాది బాహ్యేంద్రియములలో నొక్క యింద్రియము చేతనే గ్రహింపబడునవియు నైయున్నవి.

రూపాది విశేషగుణములకంటె భిన్నములైన - సంఖ్య, పరిమాణము, పృథక్త్వము, సంయోగ విభాగములు, పరత్వా పరత్వములు, నైమిత్తికద్రవత్వము, గురుత్వము వేగ, స్థితి స్థాపకాఖ్య సంస్కారములును సామాన్య గుణములు. ఇవి విశేషగుణములవలె స్వాశ్రయ ద్రవ్యములను తదితర ద్రవ్య ములనుండి వేఱుచేయలేవు. సర్వ ద్రవ్యములలోను సమానముగా నుండును.

ఈ దిగువకారికలలో నే యే ద్రవ్యమున నే యే గుణములు గలవో వివరింపబడినవి.

స్పర్శాదయోఽష్టౌ వేగాఖ్యః సంస్కారో మరుతో గుణాః।
స్పర్శాద్యష్టౌ, రూపవేగౌ, ద్రవత్వం తేజసో గుణాః॥ ౧

స్పర్శాదయోఽష్టౌ వేగశ్చ ద్రవత్వం చ గురుత్వకమ్।
రూపం రసస్తథా స్నేహో వారిణ్యేతే చతుర్దశ॥ ౨

స్నేహహీనా గంధయుతాః క్షితా వేతే చతుర్దశ।
బుద్ధ్యాదిషట్కం సంఖ్యాది పంచకం భావనా తథా॥ 3

ధర్మాధర్మౌ గుణా ఏతే ఆత్మనః స్యు శ్చతుర్దశ।
సంఖ్యాది పంచకం కాలదిశోః శబ్దశ్చ తే చ ఖే॥ ౪

సంఖ్యాది పంచకం బుద్ధి రిచ్ఛా యత్నోఽపి చేశ్వరే।
పరత్వాపరత్వే సంఖ్యాది పంచ వేగశ్చ మానసే॥ ౫

వాయువునందు స్పర్శ మొదలెనిమిది. వేగనామక సంస్కారము కలిసి తొమ్మిదిగుణములున్నవి. అగ్నియందు స్పర్శాదులెనిమిది, రూపము, వేగము, ద్రవత్వము నను మూడు కలిసి పదునొకండు గుణములు; జలమునందు

స్పర్శాదులైనెనిమిది, వేగము, ద్రవత్వము (సాంసిద్ధికము), గురుత్వము, రూపము, రసము, స్నేహమునను నాలు కలిసి చతుర్దశ గుణములు; స్నేహము విడిచి గంధము చేర్చి నీటి యందుగల పదునాలుగు గుణములే పృథివియందు గలవు. ఆత్మలో బుద్ధ్యాదు లాలు, సంఖ్యాదు లైదు, భావనాసంస్కారము, ధర్మము, అధర్మము నను మూడు కలిసి చతుర్దశ గుణములు; కాలము దిక్కు రెంటిలో సంఖ్యాదులైదు గుణము లున్నవి. ఆకాశమున సంఖ్యాదులైదు. శబ్దము గలవు. ఈశ్వరునిలో సంఖ్యమొదలైదు, బుద్ధి, ఇచ్ఛ, యత్నము నను మూడు కలిసి యెనిమిది గుణము లుండును. పరత్వాపరత్వములు, సంఖ్యాదులైదు, వేగము నను నెనిమిది గుణములు మనస్సునం దున్నవి.

పైన చెప్పిన యిరువదినాల్గు గుణములుగాక, గురుత్వము నకు వ్యతిరేకమగు లఘుత్వము నొక గుణముగా కొందఱు వర్ణింతురు. దీనితో కలిసి యిరువదైదు గుణములగును.

శౌర్యము, ఔదార్యము, మున్నగు గుణములు ప్రయత్నాంతర్గతములే యగును. బలవంతుడైన శత్రువును జయింప నుత్సహించుట శౌర్యము. ఎల్లప్పుడు సన్మార్గమున ప్రవర్తించు బుద్ధి యౌదార్యము. ఇతరుల దుఃఖమును పోగొట్టనెంచుట కారుణ్యము. ఇట్లూహింతురుగాక.

అవ : క్రమముగ కర్మమును విభజించుచున్నాడు.

సూ :- ఉత్ క్షేపణ మపక్షేపణ మాకుంచనం
ప్రసారణం గమన మితి కర్మాణి  ౧.౧.౭

ఉత్క్షేపణం = వస్తువును పైకివంప నుపయోగించు క్రియ, అపక్షేపణం = క్రిందికి త్రోయు నుపకరించు క్రియ, ఆకుంచనం = సంకోచాత్మక సంయోగవిశేషము, (అనగా ముడుచుకొనుట) ప్రసారణం=సంకోచ ప్రతిద్వంద్వి యగు-వ్యతిరేకమగు-విభాగము, విస్తరిల్లుట, గమనం = గమనము నని కర్మము లైదు విధములు.

భ్రమణాదిక్రియలన్నియు గమనాంతర్గతము లగుటచేత వేఱుగ వర్ణింప బడలేదు.

అవ : ద్రవ్యగుణకర్మలను విభజించి తత్త్వజ్ఞానానుకూల మగుటం జేసి వాని సాధర్మ్య వైధర్మ్యములను జెప్పనెంచి ప్రథమమున ద్రవ్యగుణ కర్మముల సాధర్మ్యమును వర్ణించు చున్నాడు.

సూ :- స దనిత్యం ద్రవ్యవత్ కార్యం కారణం సామాన్య విశేషవ దితి ద్రవ్యగుణకర్మణా మవిశేషః ౧.౧.౮

ఈ ప్రకరణములో ప్రకృతి, జీవాత్మ, పరమాత్మలను వదలి, మిగిలిన ద్రవ్యగుణ కర్మముల సమాన, విశేష ధర్మములు వర్ణింపబడును, సత్ = సత్తావత్వము, అనిత్యం= వినాశిత్వము, ద్రవ్యవత్ = ద్రవ్యసమవాయ కారణకత్వము, కార్యం = ఉత్పత్తిమత్వము, కారణం = కార్యజనకత్వము, సామాన్యవిశేషవత్ = ద్రవ్యత్వాది సామాన్యము ఘటత్వాది విశేషములు గలిగియుండుట, ఇవన్నియు, ద్రవ్యగుణ కర్మణాం అవిశేషః = ద్రవ్యగుణకర్మములలోగల సమాన ధర్మములు.

సత్పదార్థములు అసత్పదార్థములు నని పదార్థములు రెండు విధములు. ద్రవ్యగుణ కర్మములు సత్పదార్థములు. అనగా వీనిలో సత్-సత్తా-అస్తిత్వము-ఉనికి ఉన్నదని అభిప్రాయము. దీనినే సత్తావత్వమందురు. అనిత్యం-వినాశిత్వము-అనగా (భూత్వాఽభావిత్వమ్) ఉత్పన్నమై నశించుట. ద్రవ్యవత్ - ద్రవ్యసమవాయకారణకత్వము-అనగా ద్రవ్యము సమవాయ కారణముగా గలిగియుండుట. కార్యద్రవ్యములగు ఘటపటాదులు తమకు కారణభూతములైన కపాలతంతువులలో సమవాయ సంబంధముతో (విడదీయుటకు వీలులేని సంబంధముతో) నుండును. ఇట్లే గుణకర్మములును స్వాశ్రయభూతములగు ఘటపటాది ద్రవ్యములలోనే సమవాయ సంబంధముతో నుండును. అందువలన ద్రవ్య గుణకర్మములు మూడును ద్రవ్యమే సమవాయ కారణముగా గలవి యని భావము.

కారణము మూడు విధములు. సమవాయి కారణము, అసమవాయి కారణము, నిమిత్త కారణము.

ఉదా :- వస్త్రమను కార్యమునకు తంతువులు సమవాయి కారణము. తంతుసంయోగము అసమవాయికారణము. ఇవి గాక మిగిలిన తురీవేమాదులు (మగ్గపు సామానులు) మున్నగున వన్నియు నిమిత్త కారణము.

అవ : ద్రవ్యగుణముల రెంటి సాధర్మ్యము.

సూ :- ద్రవ్యగుణయోః సజాతీయారంభకత్వం సాధర్మ్యం ౧.౧.౯

ద్రవ్యగుణయోః=ద్రవ్యగుణములకు, సజాతీయారంభకత్వం= తమకు సమాన జాతీయములగు ద్రవ్యగుణముల నుత్పాదింప జేయుట, సాధర్మ్యం = సమానధర్మము.

సూ. :- ద్రవ్యాణి ద్రవ్యాంతర మారభన్తే,
గుణాశ్చ గుణాంతరమ్ ౧.౧.౧౦

సూత్రమందు ద్రవ్యపదముచే పృథివి, జలము, అగ్నిని మాత్రమే గ్రహింపవలయును. ద్రవ్యాణి=పృథివి,జలము,అగ్ని. ద్రవ్యాంతరమ్ = తనకు సజాతీయమగు నన్య ద్రవ్యమును; పృథివి పృథివ్యంతరమును, జలము జలాంతరమును, అగ్ని అగ్న్యంతరమును, ఇట్లే-గుణాః=గుణములు-రూపరసాదులు, గుణాంతరం = సజాతీయ మగు నన్యగుణమును, అనగా, రూపము అన్యరూపమును, రసము రసాంతరమును, గంధము గంధాంతరమును, ఆరభన్తే=ప్రారంభించుచున్నవి. విజాతీయ మును కలిగింప నేరవని పూర్వసూత్రార్థము నిట స్పష్ట పఱచెను.

సూక్ష్మవాయ్వాకాశములు స్థూల వాయ్వాకాశములను కలిగించినను స్థూలవాయ్వాకాశములు సజాతీయ ద్రవ్యాంతర ముల నారంభింపవు. ఇట్లే దిక్కు, కాలము, మనస్సు, అంతిమ కార్యద్రవ్యములగు ఘటపటాదులు, అన్యద్రవ్యముల నారంభింప నేరవు. గుణములలో ద్విత్వము, పృథక్త్వము, పరత్వము, అపరత్వము మున్నగు గుణములు గాక మిగిలిన గుణములే గుణాంతరములను-సమాన జాతీయములను ఆరంభింపగలవని యెఱుగవలయును.

అవ : ద్రవ్యగుణములు నిజసజాతీయ ద్రవ్యగుణాంతరముల నారంభించునట్లు కర్మము లేల స్వసజాతీయ కర్మాంతరమును గలుగ జేయవు ?

సూ. :- కర్మ కర్మసాధ్యం న విద్యతే ౧.౧.౧౧

కర్మ = ఉపర్యుక్త పంచవిధములైన కర్మము - క్రియ, కర్మ సాధ్యం = క్రియచే నేర్పడునది, న విద్యతే = కాదు.

ఒకవస్తువునందు క్రియయేర్పడగానే విభాగమేర్పడును గాని క్రియాంతరము గలుగనేరదు. అవయవములందు కలుగు చలనక్రియవలన నవయవిలోకల్గు చలనక్రియ జన్యముకాదు. అవయవములందు కలిగిన క్రియవలన వేగ ముద్భవించును. ఆవేగమువలన నవయవి చలించును. అందువలన కర్మము కర్మాంతరము నుద్భవింపజేయదని సూత్రతాత్పర్యము.

అవ : ద్రవ్యగుణకర్మముల సాధర్మ్యమును (సమాన ధర్మమును) నిరూపించి గుణ కర్మములకంటె ద్రవ్యమునగల వైధర్మ్యము-విశేషధర్మమును నిరూపించుచున్నాడు.

సూ. :- న ద్రవ్యం కార్యం కారణం చ వధతి ౧.౧.౧౨

ద్రవ్యం = కార్య కారణద్రవ్యములను, కార్యం కారణం చ= కార్య కారణద్రవ్యములు, న వధతి = నశింపజేయవు. కారణమును కారణముగాని, కార్యమును కార్యముగాని నశింపజేయదు.

కార్య కారణద్రవ్యములు వాని నారంభింపజేయు సంయోగనాశము వలననే నశించునని తాత్పర్యము.

అవ : గుణము లెట్టి వన ?

**సూ. :- ఉభయథా గుణాః** ౧.౧.౧౩

**గుణాః** = గుణములు, **ఉభయథా** = రెండువిధము లైనవి.

**అనగా** కారణ కార్యరూపములగు గుణములు కార్య కారణ రూపములగు గుణములను నశింపజేయుచున్నవి.

ఉదాహరణముగా నిట శబ్దమును గ్రహింపుడు. నాభి దేశమునుండి వాయువు పైకివచ్చి కంఠజిహ్వ దంతాది స్థానములలో నాహతిని (తాకిడిని) బొంది శబ్దము నుద్భవింప జేయును. ప్రథమశబ్దము కుసుమ వికాసముంబోలి అన్ని వైపుల సదృశ శబ్దాంతరముల నుద్భవింపజేయును. మఱియు నాశబ్దములు శబ్దాంతరములను గల్గించుచు శ్రవణేంద్రియమున జేరును. ఇం దుత్తరోత్తర కార్యభూతములగు శబ్దములు పూర్వ పూర్వకారణ భూతశబ్దములను నశింపజేయును. తుదికి అంతిమకార్యభూతమగు శబ్దము, తదుత్పాదక పూర్వకారణ భూతమగు శబ్దమును నశింపజేయును. ఇట్లు కార్యకారణము లగు గుణములు కారణకార్యములగు గుణములను నశింప జేయు నని తాత్పర్యము.

అవ : కర్మ యెట్టి దన ?

**సూ. :- కార్యవిరోధి కర్మ** ౧.౧.౧౪

కార్యవిరోధి-కార్యం = తనవలనబుట్టు నుత్తరసంయోగము మొదలుగునది. విరోధి = నశింపజేయునదై, యస్య = దేనికి కలదో, తత్ = అదియే, కర్మ.

అనగా కర్మ, విభాగమును పుట్టించినపిమ్మట, ఉత్తర సంయోగమును కలిగించి నశించుచున్నది. కాబట్టి కార్య విరోధి కర్మయని భావము.

అవ : ద్రవ్యగుణకర్మముల సాధర్మ్య వైధర్మ్యములను వర్ణించి ద్రవ్యలక్షణమును జెప్పుచున్నాడు.

సూ. :- క్రియాగుణవత్ సమవాయి కారణమితి
ద్రవ్యలక్షణమ్ ౧.౧.౧౫

క్రియాగుణవత్ = క్రియావత్త్వము, గుణవత్త్వము, సమవాయి కారణమ్ = సమవాయికారణత్వము ననుమూడును, ద్రవ్య లక్షణమ్ = పృథ్వీ జలాదినామములతో నిర్దేశించిన ద్రవ్యము యొక్క లక్షణము. అనగా సమానాఽసమాన జాతీయ ద్రవ్యములనుండి వేఱుచేయునది.

ద్రవ్యమనునది క్రియావంతమో, గుణవంతమో లేక సమవాయి కారణమో అగునని తాత్పర్యము. ఇదియే ద్రవ్య లక్షణము. లక్షణమనగా (అసాధారణధర్మో లక్షణమ్) అసాధారణధర్మమని యర్థము. దేనివలన నొకవస్తువు ఇతర సమస్త ప్రపంచమునుండి వేఱుచేయబడి గుర్తింపవీలగునో అదియే లక్షణము.

ఉదాహరణము :- ఆవునకు లక్షణమేమని విచారింతము. "గోః సాస్నాదిమత్త్వం లక్షణమ్" సాస్నా = గంగడోలు, ఆది పదమునకు-గిట్టలు కొమ్ములు మున్నగునవన్నియు అర్థము. అనగా ఆవునకు గంగడోలు (మెడక్రింద వ్రేలుచుండు చర్మము) గిట్టలు కొమ్ములు నుండుట లక్షణమని చెప్పుదుము. ఈ గంగడోలు అనులక్షణము ప్రపంచమున గల యితర జంతువులనుండియు మఱియు నితర సమస్త ప్రాణివస్తు జాతమునుండియు ఆవును వేఱుపఱచి గుర్తింప జేయును.

(ప్రస్తుతమిట ఆవు అనగా ఎద్దు మున్నగు నావులజాతులయినట్టి) ఇట్లు లక్షితవస్తువును తదితర పదార్థములనుండి వేఱు చేయుటనే సంస్కృతమున "సమానాసమానజాతీయ వ్యావర్తక త్వ" మందురు. ఉదాహరణమున సాన్నాదిమత్త్వము లక్షణము సమానజాతీయములగు నితరపశువుల నుండియు, అసమాన జాతీయములగు వృక్షాదిపదార్థముల నుండియు ఆవును వేఱుపఱచుచున్నది. కావున సాన్నాదిమత్త్వము ఆవునకు లక్షణము.

ఇట్టి లక్షణములు దోషరహితములుగా నుండవలయును.
లక్షణములో అవ్యాప్తి, అతివ్యాప్తి, అసంభవము నని మూడు విధములగు దోషములుండును. (లక్ష్యైక దేశవృత్తిత్వ మవ్యాప్తిః - యథా గోః కపిలత్వమ్) దేనికి లక్షణము చెప్ప బడునో అది లక్ష్యమనబడును. లక్షణము సంపూర్ణ లక్ష్యములో వర్తింపక లక్ష్యములో ఒకభాగములోమాత్ర ముండుట అవ్యాప్తి దోషము. ఉదాహరణము :- గోవునకు కపిలత్వము లక్షణ మనుకొనిన ఆ కపిలత్వము లక్ష్యములగు గోవులన్నిటిలో నుండక గోవులలో నొకటియగు కపిలగోవులోనే ఉండును. అందువలన కపిలత్వమను లక్షణము అవ్యాప్తియను దోష ముతో కూడి దుష్టలక్షణ మగును.

(లక్ష్యవృత్తిత్వే సత్యలక్ష్య వృత్తిత్వమతివ్యాప్తిః-యథా గోః శృంగిత్వమ్) లక్షణము లక్ష్యమంతటనుండియు లక్ష్యము కాని యితర పదార్థములో కూడ నుండుట అతివ్యాప్తి యన బడును. ఎట్లన, గోవునకు శృంగిత్వము = కొమ్ములుండుట లక్షణమందుమేని, లక్ష్యమగు గోవు మాత్రమున నుండుటయే

గాక అలక్ష్యమగు లేడి, దున్న, మేక మున్నగు వానిలో గూడ వర్తించును. అందువలన శృంగిత్వలక్షణము అతివ్యాప్తమై దుష్ట మగును.

(లక్ష్యమాత్రావృత్తిత్వ మసంభవః - యథా గో రేకశఫ వత్వమ్) లక్షణము లక్ష్యమాత్రములో నెక్కడ నుండకుండుట అసంభవ మనబడును. గోవునకు, ఏకశఫవత్వమ్ = ఒకగిట్ట కలిగియుండుట లక్షణమందు మేని, ఈ లక్షణము లక్ష్యమగు నే గోవునందును వర్తింపదు. ఎందువలన నన నేగోవునకును ఒంటిగిట్ట యుండనేరదుకదా! అందుచే నీ లక్షణము అసంభవమను దోషముతో గూడిన దగును. సాస్నాదిమత్త్వము గోవు లక్షణమందుమేని, ఇందు పై జెప్పిన అవ్యాప్తి, అతి వ్యాప్తి, అసంభవము నను దోషము లొక్కటియు నుండక నిర్దుష్టలక్షణమగును. కారణమేమన :

సాస్నాది మత్త్వ మను లక్షణము లక్ష్యములగు గోవులలో నేదో యొక గోవునందే ఉండక, లక్ష్యములగు గోవు లన్నింటి యందును ఉండును. కావున 'లక్ష్యములో నేక దేశమున నుండుట' - అను అవ్యాప్తి దోషమునకు గురికాదు. అట్లే యీ సాస్నాదిమత్త్వ మను లక్షణము లక్ష్యములగు గోవు లన్నింటియందు నుండి అలక్ష్యములగు నితరపదార్థము లందు ఎక్కడను ఉండదు. కావున 'లక్ష్యమునం దంతటను ఉండి అలక్ష్యమున గూడ నుండుట' - అను అతివ్యాప్తిదోషమునకు గురికాదు. మరియు నీ లక్షణము (సాస్నాదిమత్త్వము) లక్ష్యములగు గోవులన్నింటి యందును ఉండుటచేత 'లక్ష్య మాత్రమున నెక్కడను ఉండకుండుట' అను అసంభవ

దోషమునకును గురికాదు. కాబట్టి గోవునకు సాస్నాదిమత్త్వ మను లక్షణము దోషరహిత లక్షణము - నిర్దుష్ట లక్షణము అగుచున్నది.

ప్రకృతమున ద్రవ్యమునకు లక్షణ మేమన 'క్రియావత్త్వము, గుణవత్త్వము, సమవాయి కారణము' అని ముత్త్విధములుగ పై సూత్రమున చెప్పబడినది. ఇందు మొదటి లక్షణము క్రియావత్త్వము - క్రియ కలిగియుండుట. దీనికి లక్ష్యములు పృథివ్యాది మనః పర్యంతములయిన తొమ్మిది ద్రవ్యములు. క్రియావత్త్వమే ద్రవ్యలక్షణ మనినచో అది అవ్యాప్తమై దుష్టలక్షణ మగును. ఎందువల్ల నన-క్రియావత్త్వ మను లక్షణము లక్ష్యములగు ద్రవ్యములలో నొకటియగు నాకాశమునందు వర్తింపదు. కారణమేమన, నాకాశము వ్యాపక మగుటచే నందు క్రియయుండదు. వ్యాపకవస్తువు అంతట నుండును; కనుక నది కదలనేరదని భావము. కాబట్టి క్రియావత్త్వ మను లక్షణము అవ్యాప్తదోషమునకు గురియగును. ఆ దోషమును తొలగించుటకై గుణవత్త్వమును కూడ లక్షణములో చేర్పవలసి వచ్చెను. ఇప్పుడు ఈ గుణవత్త్వము-గుణము కలిగియుండుట-అను లక్షణము లక్ష్యములగు పృథివ్యాదీతర ద్రవ్యములతోపాటు ఆకాశ ద్రవ్యమునందును వర్తించును. ఆకాశమున క్రియలేకున్నను శబ్దమను గుణ ముండును. కాబట్టి గుణవత్త్వ మను లక్షణమున అవ్యాప్తి-అనుదోష ముండనేరదు. కాని,

ఈ శాస్త్రకారుల యుద్దేశములో ఉత్పన్నమగు ప్రతి పదార్థమును ఉత్పన్న క్షణములో క్రియగాని, గుణముగాని

లేనిదిగా నుండును. అందువలన ఘటపటాదులగు కార్య ద్రవ్యములు (వృత్తి సమయమున) ఎన్నియో పుట్టిన ప్రథమ క్షణములో గుణక్రియా రహితములుగా నుండును. అయినప్పటికిని ద్రవ్యములే. అందువలన నిదియు లక్ష్యములే యగును. ఉత్పత్తి స్థితిలో క్రియావత్త్వము లక్షణముగాని గుణవత్త్వము లక్షణముగాని ఉత్పన్నక్షణములో ఘటపటాది ద్రవ్యములందుండదు వర్తింపక అవ్యాప్తమగుచున్నది. అందువలన ద్రవ్యమునకు సమవాయి కారణము లక్షణముగా చెప్పబడెను. ఈ లక్షణము ద్రవ్యమాత్రమున వర్తించును. ఎందువలనన క్రియగాని, గుణముగాని ద్రవ్యమున సమవాయి సంబంధముతో నుండును. అందువలన ద్రవ్య మెప్పుడును సమవాయి కారణమే యగును. ఉత్పన్నక్షణములో పటాది ద్రవ్యములలో క్రియాగుణములు లేకున్నను సమవాయి కారణత్వము ద్రవ్యములలో లేకపోదు. కాబట్టి సమవాయి కారణము ద్రవ్యమునకు నిర్దుష్టలక్షణ మగుచున్నది. కాని,

ఈ లక్షణము కూడ పరమాత్మనియందు అవ్యాప్తమే యగుచున్నది. అందువలన ద్రవ్యత్వజాతిమత్త్వము-ద్రవ్యత్వజాతిని కలిగియుండుట-అను లక్షణము సర్వథా నిర్దుష్టమగును. ప్రతి ద్రవ్యములోను ద్రవ్యత్వ ముండితీరును. పరమాత్మయును ద్రవ్య మగుటచే ద్రవ్యత్వ లక్షణము పరమాత్మనిలో కూడ వర్తించును. అందువలన ద్రవ్యత్వజాతి మత్త్వమే ద్రవ్య లక్షణము.

అవ : ద్రవ్యానంతరమున గుణలక్షణము.

సూ. :- ద్రవ్యాశ్రయ్యగుణవాన్ సంయోగవిభాగే
ష్వకారణ మనపేక్ష ఇతి గుణలక్షణమ్ ౧.౧.౧౬

గుణము, ద్రవ్యాశ్రయీ = పృథివ్యాదిద్రవ్యముల నాశ్రయించు స్వభావము కలది. అగుణవాన్ = గుణవంతము కానిది. సంయోగ విభాగేషు = సంయోగ విభాగములు కలిగించుట యందు, అనపేక్షః = స్వతంత్రమగు, అకారణం=కారణము కానిది, (అనగా సంయోగ విభాగములను కలిగించుటలో కర్మము స్వతంత్రకారణ మగును. కాని గుణము స్వతంత్ర ముగ సంయోగ విభాగములను కలిగింపలేదని యర్థము. అందువలన అకారణము, అనపేక్షము అని చెప్పబడినది.) ఇతి గుణలక్షణమ్ = అని గుణపదార్థ లక్షణము.

ద్రవ్యము నాశ్రయించి గుణముల కనాశ్రయమై స్వతంత్రముగా సంయోగ విభాగములను కలిగింపలేనిది గుణమని భావము.

ద్రవ్యమును ఆశ్రయించియుండుట గుణమునకు లక్షణ మందు మేని అలక్ష్యమగు ద్రవ్యమున నతివ్యాప్తమగును. ద్రవ్యము గూడ ద్రవ్యము నాశ్రయించి యుండును. పటరూప కార్య ద్రవ్యము తంతురూప కారణ ద్రవ్యమున సమవాయ సంబంధమున నుండును. అందువలన ద్రవ్యాశ్రయత్వమను లక్షణములో గుణానాశ్రయత్వము (గుణ + అనాశ్రయత్వము) - సమవాయసంబంధమున గుణమునకు గుణము ఆశ్రయము కాకుండుట - అని విశేషణము చేర్చబడినది. ఇప్పుడు ద్రవ్యములో నతివ్యాప్తి లేదు. ఎందువల్లనన ద్రవ్యము ద్రవ్యమున కాశ్రయమైనను, గుణమున కనాశ్రయముకాదు.

ద్రవ్యములో గుణములు సమవాయ సంబంధముతో ఉండును. ఇప్పుడు కర్మములో నతివ్యాప్తిదోషము పోలేదు. కర్మము ద్రవ్యాశ్రయమై, గుణమున కనాశ్రయమై యుండును. అందు వలన నా (కర్మములో నతివ్యాప్తి) దోషమును వారించుటకు లక్షణములో సంయోగవిభాగములకు స్వతంత్ర కారణము కానిది అను విశేషణము చేర్పవలసి వచ్చెను. ఇప్పుడు కర్మములో నతివ్యాప్తి కలుగదు. కర్మము ద్రవ్యాశ్రయమై గుణమున కనాశ్రయమైనను సంయోగ విభాగములకు స్వతంత్రకారణ మగును. అనగా సంయోగ విభాగములను పుట్టింప జేయుటలో నన్యసాహాయ్య మపేక్షింపదు. గుణము ఇతరసాహాయ్యములేక సంయోగవిభాగములు కలిగింపనేరదు. కావున ద్రవ్యాశ్రయమై, గుణానాశ్రయమై, సంయోగ విభాగోత్పత్తికి స్వతంత్ర కారణము కానిది గుణమని నిష్కృష్టముగా తేలిన సిద్ధాంతము.

లేక గుణత్వజాతిమత్వము – గుణత్వజాతిగలది అని లక్షణము. గుణత్వజాతి ద్రవ్య కర్మాదులగు నన్యపదార్థముల నెక్కడ నుండక గుణములలోనే యుండును. కనుక నేదోషమును లేదు.

అవ : <u>కర్మ లక్షణము.</u>

సూ. :- ఏక ద్రవ్య మగుణం సంయోగ విభాగే

ష్వనపేక్షకారణ మితి కర్మలక్షణమ్ ౧.౧.౧౭

ఏకద్రవ్యమ్ = ఒక్క ద్రవ్యమే ఆశ్రయముగా గలది. అగుణమ్=గుణమున కాశ్రయము కానిది, సంయోగ విభాగేష్వనపేక్షకారణమ్ = సంయోగ విభాగములను పుట్టింప

జేయుటలో తనకంటె వెనుకబుట్టిన ఇతర పదార్థము నపేక్షింపక స్వయముగా కారణ మగునది. ఇతి కర్మలక్షణమ్ = అని కర్మపదార్థ లక్షణము.

సంయోగ విభాగముల నుద్భవింప జేయుటలో ననపేక్ష కారణమై-స్వతంత్రకారణమై – గుణవంతము కాక యేక ద్రవ్యము నాశ్రయించి యుండునది కర్మమని భావము.

అవ : పై లక్షణములుగల ద్రవ్య గుణ కర్మముల సాధర్మ్యమేమి ?

సూ. :- ద్రవ్యగుణకర్మణాం ద్రవ్యం కారణం సామాన్యమ్

౧.౧.౧౮

ద్రవ్యగుణకర్మణాం = పై జెప్పిన లక్షణములుగల ద్రవ్యగుణ కర్మలకు, ద్రవ్యం = ఒక్క ద్రవ్యమే, కారణమ్=సమవాయ కారణమై యుండుట, సామాన్యమ్ = సమాన ధర్మము.

ద్రవ్య గుణ కర్మముల యుత్పత్తిలో ద్రవ్యమొక్కటే సమవాయి కారణమైయుండుట వీని సామాన్య ధర్మమని భావము.

అవ : వీనిలో గల మఱియొక సామ్యము.

సూ. :- తథా గుణః ౧.౧.౧౯

పై సూత్రమునుండి 'ద్రవ్యగుణకర్మణాం కారణం సామాన్యం' అను పదముల నీ సూత్రములో చేర్పవలయును. ద్రవ్యగుణ కర్మములకెట్లు ద్రవ్యము సమవాయ కారణమో అట్లే గుణము కారణమగుట సమాన ధర్మము.

**ఉదాహరణము :-** తంతువుల సంయోగము పటద్రవ్యమున కసాధారణ కారణము. తంతువుల రూపము పటరూపమునకు సమవాయ కారణము. పటమునగల గురుత్వాది గుణములు ఆ పటమును పైకివేయుట మున్నగు ఉత్క్షేపణాది కర్మములకు కారణము. అందువలన నిట సంయోగము, రూపము, గురుత్వము అను నీగుణములు పటము, దాని రూపము, ఉత్క్షేపణము మున్నగువానికి కారణముగుట సామాన్యము.

సూ :- సంయోగ విభాగ వేగానాం కర్మ సమానమ్
౧.౧.౨౦

సంయోగము, విభాగము, వేగాఖ్య సంస్కారము, వీని కన్నిటికి కర్మము సమాన కారణము.

ఒక వస్తువును మనము పైకి విసరుదుమేని పైకి విసరుట ఉత్క్షేపణ కర్మము. ఈ కర్మమువలన ఆ వస్తువు పూర్వమున్నచోటినుండి విడిపోవును. ఇది విభాగము. క్రొత్తచోట దానికి సంయోగము ఏర్పడును. ఉత్క్షేపణ కర్మము వలన నా వస్తువునందు వేగాఖ్య సంస్కారము ఏర్పడును. ఇట్లు ఒక్క కర్మమువలన పూర్వదేశ విభాగము, ఉత్తరదేశ సంయోగము, వేగము నేర్పడుచున్నవి. అందువలన నీ మూటికి కర్మము సమాన కారణము.

సూ. :- న ద్రవ్యాణాం కర్మ
౧ ౧.౨౧

కారణపదము పూర్వసూత్రమునుండి యనువర్తించును. ద్రవ్యాణాం = ద్రవ్యములకు, కర్మ = ఉత్క్షేపణాది కర్మము, న కారణమ్ = కారణముకాదు.

సంయోగ విభాగవేగములకు కర్మము కారణమైనట్లు ద్రవ్యమునకు కాదు.

అవ : కర్మజన్య సంయోగమువలననే ద్రవ్యము లేర్పడు చుండగా ద్రవ్యమునకు సైతము కర్మము కారణమేల కాదు ? అనగా చెప్పుచున్నాడు.

సూ. :- వ్య తి రే కా త్ ౧.౧.౨౨

ద్రవ్యముత్పవించుకాలమున కర్మము, వ్యతిరేకాత్ = అభావ మగుటవలన - లేకుండుటవలన - నశించుటవలన కర్మము ద్రవ్యమునకు కారణము కాదు.

కర్మమువలన కారణ సంయోగము ఏర్పడును. ఇట్లు సంయోగము నుద్భవింపజేసి యాకర్మము నశించును. తద నంతరము కార్యద్రవ్య మేర్పడును. ద్రవ్యోత్పత్తి సమయములో కర్మముండదు. కనుక నది కారణము కానేరదు. పరంపరగా కారణమైనను సాక్షాత్కారణము కాదని భావము. ఇక్కడ సాక్షాత్ కారణమే చెప్పదలచినది.

సూ. :- ద్రవ్యాణాం ద్రవ్యం కార్యం సామాన్యమ్ ౧.౧.౨౩

ద్రవ్యాణామ్ = ద్రవ్యములకు, ద్రవ్యంకార్యమ్ =ద్రవ్యకార్య కత్వము-ద్రవ్యరూపకార్యము కలిగియుండుట, సామాన్యమ్= సమానధర్మము.

కపాలములవలన ఘటమేర్పడుట, తంతువులవలన పట మేర్పడుట చూచుచున్నాము కదా ! అందువలన ద్రవ్యమువలన ద్రవ్యమేర్పడుట సమానధర్మము.

సూ. :- గుణవైధర్మ్యాత్ న కర్మణాం కర్మ ౧.౧.౨౪

పూర్వ సూత్రము నుండి కార్య శబ్ద మనువర్తించును.

గుణవైధర్మ్యాత్ = సజాతీయ గుణాంతరములను కలిగించుట గుణముల సాధర్మ్యము, దానికి విరుద్ధము వైధర్మ్యము, అనగా కర్మములు తమకు సమాన జాతీయములగు కర్మాంతరములను కలిగింపవు. అందువలన, కర్మణాం = కర్మములకు, కార్యం కర్మ = కార్యరూపమగు కర్మము, న సామాన్యమ్=సామాన్య ధర్మము - సాధర్మ్యము కాదు.

అవ : ద్రవ్యములకు కార్యద్రవ్య సాధర్మ్యమును జెప్పి గుణరూపకార్య సామ్యమును జెప్పుచున్నాడు.

సూ. :- ద్విత్వప్రభృతయః సంఖ్యాః, పృథక్త్వ
సంయోగ విభాగాశ్చ ౧.౧.౨౫

కార్యపదమిక్కడ ననువర్తించును. ద్విత్వ ప్రభృతయః సంఖ్యాః=రెండు మొదలు పరార్థమువఱకు నుండు సంఖ్యలు, పృథక్త్వము, సంయోగము, విభాగము నను నీగుణములు, ద్రవ్యములకు-కార్యమ్=కార్యసామాన్యము.

అనగా ననేక ద్రవ్యములలో నుపర్యుక్త గుణము లుండును.

అవ : ద్విత్వాది గుణములవలె కర్మమేల ద్రవ్యములకు సామాన్య కార్యము కాదు.

సూ. :- అసమవాయాత్ సామాన్య కార్యం కర్మ న విద్యతే ౧.౧.౨౬

అసమవాయాత్ = ద్విత్వాది గుణము లనేక ద్రవ్యములలో నెట్లు సమవాయ సంబంధముతో నుండునో, అట్లు కర్మము అనేక ద్రవ్యములలో నుండక పోవుటవలన, కర్మ=కర్మము, సామాన్య కార్యం న విద్యతే = సామాన్య కార్యము కాదు.

ద్విత్వ పృథక్త్వ సంయోగ విభాగములు రెండుగాని రెంటి కెక్కువగాని ద్రవ్యములలో నెట్లుండునో కర్మమ ట్లనేక ద్రవ్యములలో నుండదని తాత్పర్యము.

సూ. :- సంయోగానాం ద్రవ్యమ్ ౧.౧.౨౭

సామాన్యకార్యమ్-అను పదమిందనువర్తించును. సంయోగానామ్ = తంతు ప్రభృతి అవయవద్రవ్యముల సంయోగము (కలయిక)లకు, ద్రవ్యమ్ = పటప్రభృతి అవయవి ద్రవ్యము సామాన్య కార్యము.

సూ. :- రూపాణాం రూపమ్ ౧.౧.౨౮

రూపాణామ్ = కారణ ద్రవ్యములలోనుండు రూపములకు-తంతు కపాలాదులలో నుండు రూపములకు, రూపమ్ = పటాది అవయవిలో నేర్పడు రూపము సామాన్య కార్యము.

సూ. :- గురుత్వ ప్రయత్న సంయోగానాం ఉత్ క్షేపణమ్ ౧.౧.౨౯

గురుత్వ ప్రయత్న సంయోగానామ్=ఈ మూడు గుణములకు, ఉత్క్షేపణము సామాన్య కార్యము.

బరువైన పదార్థములలోనుండు గురుత్వము, ఆత్మగత ప్రయత్నము, హస్తసంయోగము - వీనివలన నుత్క్షేపణ రూప

కర్మ యేర్పడుచున్నదని భావము. ఇట్లే వీనివలన నపక్షేప ణము నేర్పడునని తెలిసికొన వలయును.

సూ. :- సంయోగ విభాగ వేగాశ్చ కర్మణామ్ ౧.౧.౩౦

కర్మణామ్ = ఉత్క్షేపణాదికర్మములకు, సంయోగ విభాగ వేగాశ్చ = సంయోగ విభాగ వేగములు అనుగుణములు సామాన్య కార్యము

కర్మమువలన ప్రతివస్తువులోను పూర్వదేశ విభాగము, ఉత్తరదేశ సంయోగము, వేగము నేర్పడునని భావము.

అవ : సంయోగ విభాగాదులే కర్మమునకు సామాన్య కార్యమైనపుడు('సంయోగ విభాగాశ్చ కర్మణాం న ద్రవ్య కర్మణి') కర్మమునకు సంయోగ విభాగాదులే సామాన్య కార్యము, ద్రవ్యకర్మములు కాదని యేల సూత్రింప లేదనిన:

సూ. :- కారణసామాన్యే ద్రవ్యకర్మణాం
కర్మాకారణ ముక్తమ్ ౧.౧ ౩౧

కారణ సామాన్యప్రకరణములో ("న ద్రవ్యాణాం కర్మ" ౨౯) ("కర్మ కర్మసాధ్యం న విద్యతే" ౧౧) కర్మము ద్రవ్య కర్మములకు కారణము కానేరదని చెప్పబడినది. అందువలన పునరుక్తి యగునను భయముతో నిట చెప్పలేదు. అనగా ద్రవ్యకర్మములు కర్మములకు సామాన్య కార్యములు కావని చెప్ప నావశ్యకత లేదు.

# ప్రథమాధ్యాయము

## ద్వితీయాహ్నికము

ప్రథమాహ్నికమున ద్రవ్యగుణకర్మములకు గల కార్య సామాన్యము, కారణ సామాన్యము చెప్పబడినది. ఇట కార్యకారణముల స్వరూపము తెలిసికొనుట చాల ఆవశ్యకము. అందులకీ సూత్రము మహర్షి రచించుచున్నాడు.

సూ. :- కారణాభావాత్ కార్యాభావః ౧.౨.౧

కారణాభావాత్ = కారణాభావమువలన, కార్యాభావః = కార్యమున కభావము కలుగును.

ఇతర వస్తువులన్నియు నుండినను, ఏవస్తువు లేకున్న నేకార్యము నెఱవేఱదో ఆ వస్తువు దానికి కారణము. ఏ కారణము వలన నేకార్యము నెఱవేఱుచున్నదో ఆ కారణమున కది కార్యము. ఉదాహరణమునకు వస్త్రమను కార్యము తీసికొనుడు. సాలెవాడు, మగ్గపుసామానులు, అన్నియు నుండినను, తంతువులు లేకున్న వస్త్రము తయారు కానేరదు. సాలెవాడు, మగ్గపు సామానులు అన్నియునుండి తంతువులుకూడ నుండిన వస్త్రము తయారగును. అందువలన తంతు వస్త్రములకు కారణ కార్యభావమున్నది. తంతువులు కారణము; వస్త్రము కార్యము. కారణము వ్యాపకము. కార్యము వ్యాప్యము.

వ్యాపకమనగా అధిక దేశమున నుండునది. వ్యాప్యమనగా తక్కువ ప్రదేశమున నుండునది. కావున కారణ సత్త్వము (ఉండుట) వలన కార్యముండును. దీనినే అన్వయ వ్యాప్తి అందురు. కారణాభావము (కారణము లేకుండుట) వలన కార్యాభావము కలుగును. దీనిని వ్యతిరేకవ్యాప్తి అందురు. వ్యతిరేకము అనగా అభావము.

అవ :- కారణాభావమువలన కార్యాభావ మెట్లు నియతమో అట్లే కార్యాభావమున కారణాభావమేల కలుగదు? అన,

సూ. :- న తు కార్యాభావాత్ కారణాభావః ౧.౨.౨

వ్యాపకాభావమువలన వ్యాప్యాభావ ముండునుగాని. వ్యాప్యాభావము వలన వ్యాపకాభావ ముండదు. మృత్తిక వ్యాపకము (అధికము). ఘటము వ్యాప్యము, అందువలన మృత్తిక లేకున్న ఘటముండనేరదు. కాని ఘటము లేకున్న మృత్తికకూడ నుండగూడ దను నియమము లేదు. ఇట్లే తంతుపటము లూహింపవలయును.

ఉపర్యుక్త కారణ కార్యభావ స్థితిగతులను తెలిసికొని తదనుసారముగా, మిథ్యాజ్ఞాన (భ్రాంతి) నివృత్తివలన రాగ ద్వేషాది దోషములు నివర్తించును. రాగాదిదోషములు లేకున్న జన్మాది దుఃఖములు నశించును-అని తెలిసికొనవలయును. అనగా మిథ్యాజ్ఞానము (అతస్మిన్ తద్బుద్ధిః=భ్రాంతిః, అజల మును జలము, అనగ్నిని అగ్ని, అనాత్మను ఆత్మగా తలచుట) వలన రాగద్వేషాదులును వానివలన దుఃఖములు గలుగునని తాత్పర్యము.

మిథ్యాజ్ఞానము కారణము, దుఃఖములు కార్యము. మిథ్యాజ్ఞానము లేకున్న దుఃఖములు కలుగవని సిద్ధాంతము. కాబట్టి మోక్షకాములు దుఃఖములనుండి నివృత్తులు కావలయు నన్న మిథ్యాజ్ఞానము పోగొట్టుకొనుటకై యత్నింపవలయును. ఆత్మ తత్త్వజ్ఞానమువలన మిథ్యాజ్ఞానము తొలగును, పదార్థము లను చక్కగా వివేచించినగాని ఆత్మజ్ఞానము కలుగనేరదు. అందువలన పదార్థ తత్త్వజ్ఞానము ద్వారా మోక్షసాధన మగుట వలన నీ వైశేషిక శాస్త్రము సర్వథా ఉపాదేయము.

అవ : ఉద్దేశక్రమము ననుసరించి ద్రవ్యగుణకర్మము లకు లక్షణము, సాధర్మ్య వైధర్మ్యములు చెప్పబడినవి. కార్యకారణముల స్వరూపము పూర్వసూత్రమున వివేచింప బడినది. ఇకముందు సామాన్య పదార్థమునకు లక్షణాదులు చెప్పనెంచి, సామాన్యమను నొక పదార్థ మున్నదా యని సందేహమును తొలగించుటకు ప్రమాణమును నిరూపించు చున్నాడు.

సూ. :- సామాన్యం విశేష ఇతి బుద్ధ్యపేక్షమ్ ౧.౨.3

సామాన్యం విశేష ఇతి = సామాన్యము, విశేషము-అను నివి రెండును, బుద్ధ్యపేక్షమ్ =అను వృత్త వ్యావృత్తముగల బుద్ధి (లక్షణము) ప్రమాణముగాగలవి. ద్రవ్యగుణ కర్మములలో నుండు నొకే సమానధర్మము సామాన్యము, ద్రవ్యంసత్ = ద్రవ్యమున్నది, గుణఃసన్ = గుణమున్నది, కర్మసత్ = కర్మమున్నది, అని సత్తాత్మకతను (ఉండుటను) బోధించు బుద్ధియే అనువృత్త బుద్ధి యందురు.

అనగా ద్రవ్యవిషయమున నెట్టి బుద్ధికలుగుచున్నదో గుణకర్మము లందును నట్టి బుద్ధికలుగుచున్నది. అనగా సమానాకారముగల ఒక జ్ఞానమేర్పడుచున్నది. మనకు కలుగు ప్రతిజ్ఞానమునకు నేదోయొక పదార్థ మాధారము (విషయము) గా నుండును. కావున ద్రవ్యగుణ కర్మములలో గలుగు సమానాకారముగల సత్తాత్మక జ్ఞానమున కొక ఆధారముండి తీఱవలయును. అదియే సామాన్య (సత్తా) పదార్థ మనబడు చున్నది.

ఇట్లే ఏ కారణమువలన ద్రవ్యము, గుణము, కర్మము-అని వేఱువేఱు బుద్ధి, (విశేషబుద్ధి) కలుగుచున్నదో అదియే విశేషమనబడుచున్నది. ద్రవ్యమునుబట్టి చూచిన గుణము వేఱు. గుణమునుబట్టి చూచిన కర్మము వేఱు. కర్మదృష్టితో జూచిన ద్రవ్యగుణములు వేఱు. అను బుద్ధియే వ్యావృత్తబుద్ధి యనబడును. ఇట్టి బుద్ధికి (జ్ఞానమునకు) ఆధారభూతమైనదియే విశేష మనబడును.

వ్యావహారిక ప్రపంచమున నేది నిత్యమై (ఉత్పత్తి వినాశరహితమై) అనేకవ్యక్తులలో (పదార్థములలో) సమవాయ సంబంధముతో నుంచునో అది వైశేషికదర్శనమున సామాన్య మనబడును. "నిత్యత్వే సతి అనేక సమవేతత్వమ్ సామాన్యత్వమ్" ఆ సామాన్యముకూడ సామాన్యమని, విశేషమని రెండు విధములు. భిన్న భిన్న అధికరణములలో-ఆధారములలో-పదార్థములలో సమాన జ్ఞానమును కలిగించునదియై, దేనివలన బహుపదార్థము లొకదానినుండి మఱియొకటి వేఱుచేయ వీలుగలుగదో అదియే సామాన్యము. ఇది ద్రవ్యగుణ

కర్మముల మూటిలో నుండు, సత్తా (ఉనికి) అను పదార్థము. అందువలన నిది పర (పెద్ద) సామాన్యమనబడును. అనగా నధికస్థానమున నుండునది. కొన్నిటిలో నభేదమును బోధించుచు వాని నితర పదార్థములనుండి భేదింపజేయునది సామాన్య విశేషము : లేక విశేష సామాన్యమనబడును. దీని నపర సామాన్యమనియు నందురు. ఇవి ద్రవ్యగుణ కర్మములలో నొక్కొక్క దానియందుండు ద్రవ్యత్వము, గుణత్వము, కర్మత్వము మాత్రమే. ఈ రెండు విధములయిన సామాన్యములు జాతిశబ్దముతో నీ శాస్త్రమున వ్యవహరింపబడును. పర జాతి, అపరజాతి యని చెప్పుచుందురు. పరజాతి వ్యాపకజాతి. అపరజాతి = వ్యాప్యజాతి. ద్రవ్యగుణ కర్మములలో నుండు సత్తా (ఉనికి) ద్రవ్యత్వాది సామాన్యముల కన్నిటికంటె వ్యాపక మగుటచే అదియెప్పుడు పరసామాన్యము - పరజాతియని చెప్పబడును. పదార్థములలో వేఱు వేఱుగా నుండు ద్రవ్యత్వ గుణత్వాది జాతులు సత్తా జాతికంటె వ్యాప్యములై (న్యూన దేశవర్తులై) వ్యాప్యజాతులు, అపరజాతులు, అపరసామాన్యము లనబడును. కాని యీ ద్రవ్యత్వాది జాతులు పృథివీత్వ జలత్వాది ప్రత్యేక ద్రవ్యములలోనుండు జాతులకంటె నధిక దేశమున నుండుటచే వ్యాపకజాతులనియు చెప్పబడును. అనగా నపేక్షయా పరాపర సామాన్యశబ్దములతో వ్యవహరింప బడును పరసామాన్యమెట్లు ద్రవ్యగుణ కర్మములలో మాత్ర ముండునో అట్లు అపర సామాన్యమును ద్రవ్యగుణ కర్మము లలోనే ఉండును. ఇతర సామాన్య, విశేష, సమవాయ, పదార్థములందుండదు. ద్రవ్యములలోగూడ ఆకాశము, కాలము, దిక్కు - వీనిలో సామాన్యము (జాతి) ఉండదు.

అనగా ఆకాశ కాలదిక్కులు, జాత్యాశ్రయములు కావు. ఉదయనాచార్యులు జాతిలేని ద్రవ్యాదుల నిట్లు సంగ్రహించెను. కిరణావలి గ్రంథములో—

వ్యక్తే రభేద స్తుల్యత్వం సఙ్కరోఽథానవస్థితిః
రూపహాని రసంబన్ధో జాతి బాధక సంగ్రహః

వ్యక్త్యభేదము, తుల్యత్వము, సంకరము, అనవస్థితి, రూపహాని, అసంబంధము నను నీయాఱును జాతిబాధకములు. జాతికాశ్రయభూతమగు పదార్థములయొక్క ఏకత్వమే వ్యక్త్యభేదమనబడును. అందువలన ఆకాశత్వము, కాలత్వము, దిక్త్వము జాతులు కావు. వీని కాశ్రయములగు నాకాశ కాలదిక్కు లను వ్యక్తులు (పదార్థములు) అనేకములు కావు.

అన్యూనానతిరిక్త వ్యక్తిత్వము తుల్యత్వ మనబడును. అనగా న్యూనాధికము (హెచ్చుతగ్గు) కాక సమానమైన వ్యక్తులుగల రెండు సామాన్యములు వేఱువేఱు జాతులు కావని భావము. ఘటత్వము, కలశత్వము ననునవి రెండును జాతులుకావు. ఒకటిమాత్రమే జాతికాగలదు. ఎందువల్లనన ఘటత్వమున కాశ్రయమగు ఘటము, కలశత్వమున కాశ్రయమగు కలశముకంటె వేఱుగాదు. రెండును సమానములే. కాబట్టి ఘటత్వమొక్కటే జాతి కాగలదు.

(పరస్పరాత్యం తాభావ సమానాధికరణయోర్ధర్మయో రేకత్ర సమావేశః సంకరః) సంకరమనగా, ఒక అధికరణములో నుండు రెండుధర్మములు జాతులు కావు. ఆ రెండు ధర్మములెట్టివన, ఒకదాని యభావమున కాశ్రయమగు పదార్థములో

రెండవది యుండునదిగా నుండవలయును. ఉదాహరణము : భూతత్వము, మూర్తత్వము, ఇవి రెండుజాతులు కావు. పృథివ్యప్తేజోవాయ్వాకాశములు భూతములు. పృథివ్యప్తేజోవాయు మనస్సులు మూర్తములు. బాహ్యేంద్రియములచే గ్రహింపదగు గంధరసాది విశేషగుణములుకలవి భూతములనబడును. క్రియాశ్రయములు మూర్తములనబడును. భూతములలో భూతత్వముండును. మూర్తములలో మూర్తత్వముండును. కాని మూర్తత్వముయొక్క అభావమున కధికరణమగు ఆకాశమున భూతత్వ ముండును. భూతత్వముయొక్క అభావమున కాశ్రయమగు మనస్సులో మూర్తత్వముండును. అందువలన నీభూతత్వ మూర్తత్వములు పరస్పరము ఒకదాని యభావమున కాశ్రయమగు ద్రవ్యములో మఱియొకటియుండును. ఇట్టి రెండు, పరస్పరాత్యంతాభావ సమానాధికరణ ధర్మములు. అయినప్పటికి పృథివ్యాదులలో రెండును ఒక్క చోటనే ఉండును. కాబట్టి సంకరములయి భూతత్వము, మూర్తత్వము, జాతు లనబడవు. ఉపాధు లనబడును.

అనవస్థితి = అనవస్థా, అనగా అంతములేకుండుట. ద్రవ్యత్వాది సామాన్యములలో మఱియొక సామాన్యము, దానిలో నింకొకటి, యిట్లంగీకరించిన నంతులేకపోవును. కనుక అనవస్థకు హేతువులగు ద్రవ్యత్వత్వము మున్నగునవి జాతులు కావు.

రూపహాని = స్వతోవ్యావర్తకత్వమను రూపముయొక్క హాని, ద్రవ్యత్వ గుణత్వములు ద్రవ్యగుణముల నితర పదార్థములనుండి యెట్లు వేఱుపఱచి వ్యావర్తకములగునో అట్లు

విశేషత్వము విశేషమను పదార్థమును వేఱుపఱచునది కాదు. విశేషమను పదార్థము, విశేషరూపముతోనే యితర పదార్థముల నుండి వ్యావర్తము (వేఱు) అగుచున్నది. అందువలన విశే షత్వమును జాతిగా నొప్పుకొని విశేషత్వరూపమున విశేషము నితర పదార్థములనుండి వేఱుచేయుదుమేని స్వరూపహాని కలుగును. కాబట్టి విశేషత్వము జాతికాదు.

అసంబంధః = సంబంధము లేకుండుట. సమవాయ మున నుండు సమవాయత్వము జాతికాదు. అందువలన సమవాయములో మఱియొక సమవాయ సంబంధముండ నేరదు. జాతులన్నియు సమవాయ సంబంధముతోనే పదార్థ ములందు ఉండును.

సామాన్యత్వము, విశేషత్వము, సమవాయత్వము - ఇవి యఖండోపాధులు కావు. సఖండోపాధులు. జాతివలె నిర్వ చించుటకు వీలగునది అఖండోపాధి, అట్లు నిర్వచింప శక్యముకానిది సఖండోపాధి యనబడును.

(నిత్యత్వేసత్యనేక సమవేతత్వం సామాన్యత్వమ్) నిత్యమై యనేక వ్యక్తులలో సమవాయ సంబంధమున నుండు నది సామాన్యము-జాతి-అనబడును.

(స్వపరవ్యావర్తక స్వభావత్వమ్ విశేషత్వమ్) ఇతర పదార్థముల నుండి తన్ను వేఱుపఱచు స్వభావమే విశేషత్వము.

(నిత్యసంబంధత్వమ్ సమవాయత్వమ్) ఉపాధి నిర్వచనము సమవాయత్వమనగా నిత్యసంబంధత్వము, (శబ్ద

సమవాయికారణత్వ మాకాశత్వమ్) ఆకాశత్వమనగా శబ్ద సమవాయి కారణత్వము. ఆకాశము శబ్దసమవాయికారణము గనుక ఆకాశత్వమనగా శబ్ద సమవాయికారణత్వము. (అతీతాది వ్యవహారహేతుత్వమ్ కాలత్వమ్) అతీతము, భవిష్యత్తు, వర్తమానము నను వ్యవహారములకు హేతువు కాలము. (ప్రాచ్యాదివ్యవహార హేతుత్వమ్ దిక్త్వమ్) దీనికంటె నిది పూర్వము, ఇది పశ్చిమము ననువ్యవహారములకు హేతువు దిక్కు. ఇవన్నియు నుపర్యుక్తజాతి. ఉపాధుల కు లక్షణములు.

అవ : ద్రవ్యగుణ కర్మములందుగల సామాన్యజాతిని వివరించుచున్నాడు.

సూ. :- భావోఽనువృత్తేరేవ హేతుత్వాత్ సామాన్యమేవ ౧.౨.౪

భావః=సత్తానామక సామాన్యము, అనువృత్తేరేవహేతుత్వాత్= అనువృత్తబుద్ధియే కారణముగా గలదగుటవలన, సామాన్య మేవ = సామాన్యమే అగును. విశేషము కానేరదు.

ద్రవ్యంసత్, గుణఃసన్, కర్మసత్, ద్రవ్యగుణకర్మముల మూటిలోను సత్ అనుజ్ఞానము అనువర్తించుటచేత సత్=సత్తా (ఉనికి) పరసామాన్య మనబడును. విశేషము కానేరదు. వ్యావృత్తబుద్ధి హేతువుగా గలది విశేష మనబడును.

అవ : సామాన్యములయి విశేషములని పేర్కొనబడున వేవి ?

సూ. :- ద్రవ్యత్వం గుణత్వం కర్మత్వం చ
సామాన్యాని విశేషాశ్చ ౧.౨.౫

ద్రవ్యత్వం=ద్రవ్యత్వము, గుణత్వం=గుణత్వము, కర్మత్వం= కర్మత్వము, చకారబలమున పృథివీత్వ, జలత్వ, రూపత్వ, ఉత్క్షేపణత్వాదులును, సామాన్యాని విశేషాశ్చ = సామాన్యము లగుచు తారతమ్యమునుబట్టి (అపేక్షయా) విశేషములనియు ననబడును.

నాలుగవ సూత్రమున వివరింపబడిన సత్తానామక సామాన్యముకంటె ద్రవ్యత్వాది సామాన్యములు (వ్యాప్యములు) న్యూనదేశవృత్తులగుటవలన విశేషములు-అపరసామాన్యము లనబడును: ఈ ద్రవ్యత్వాదులే తమకంటె వ్యాప్యములగు పృథివీత్వాదులకంటె వ్యాపకములు (అధిక దేశవృత్తులు) అగుటచేత పరసామాన్యములనియు చెప్పబడును. ఇట్లే పృథివీత్వాదులు ఘటత్వాదులకంటె వ్యాపకములు, ద్రవ్య త్వాదులకంటె వ్యాప్యములై పరాపర సామాన్య శబ్దములచే వ్యవహరింపబడును.

అవ : ద్రవ్యాదులలోనుండు ద్రవ్యత్వాది ధర్మము లన్నియు సామాన్యవిశేషనామములు గలిగియుండునా ?

సూ. :- అన్యత్రాన్త్యేభ్యో విశేషేభ్యః ౧.౨.౬

సామాన్యాని విశేషాశ్చ, అనుపదమిం దనువర్తించును. అన్త్యేభ్యః విశేషేభ్యః = అన్తిమావయవి పదార్థములగు ఘట పటాదులలో నుండు ఘటత్వపటత్వాదులకంటె, అన్యత్ర =

భిన్నములగు ద్రవ్యత్వాదులలో. సామాన్యాని విశేషాశ్చ = సామాన్యవిశేషనామములు వర్తించుననని తాత్పర్యము.

ఘటత్వపటత్వాదులగు నంత్యధర్మములు విశేషములే. అనగా అపరసామాన్యములే అగును. ఏమన అంతకంటె వ్యాప్యధర్మములు లేవు గనుక. ఇట్లే సత్తా సామాన్యము సామాన్యమే అగును. కాని విశేషపదముచే చెప్పబడదు.

అవ : సత్తా సామాన్యముయొక్క లక్షణమేమి ?

సూ. :- సదితి యతో ద్రవ్యగుణకర్మను సా సత్తా ౧.౨.౭

యతః = ఏ హేతువువలన. ద్రవ్యగుణకర్మను = ద్రవ్యములలోను. గుణములలోను. కర్మములలోను. సదితి = సత్ ద్రవ్యమ్. సన్ గుణః. సత్ కర్మ అని సత్ సత్ అను జ్ఞానము గాని. లేక శబ్దప్రయోగముగాని ఏది కలుగుచున్నదో అదియే సత్తా అనబడును.

సూ. :- ద్రవ్యగుణ కర్మభ్యోఽర్థాన్తరం సత్తా ౧.౨.౮

ద్రవ్యగుణ కర్మభ్యః = ద్రవ్యగుణ కర్మములకంటె. సత్తా = పరసామాన్యము అర్థాన్తరమ్ = అన్యపదార్థము:

సత్తా సామాన్యము ద్రవ్యగుణ కర్మములస్వరూపము గాక వేఱగు నొకపదార్థము అట్లు కాకున్న సత్సత్ అను సమానాకారక జ్ఞానముకాని. వ్యవహారము కాని సిద్ధింపనేరదని తాత్పర్యము.

సూ. :- గుణకర్మను చ భావా న్న కర్మ న గుణః ౧.౨.౯

పూర్వసూత్రమంతయు నిందనువర్తించును. సత్తాసామాన్యము, గుణకర్మను చ = గుణములందు కర్మములందును నుండుట

వలన ద్రవ్యగుణ కర్మములకంటె వేఱైన పదార్థము. ద్రవ్యము కాదు. గుణముకాదు. కర్మముకాదు.

సత్తా అనునది ద్రవ్యముకాని గుణముకాని కర్మముకాని కాదు. అది ద్రవ్యగుణ కర్మములలో నేదేని యొకదాని స్వరూపమగుచో సయ్యది గుణకర్మములం దుండజాలదు. కారణమేమన గుణకర్మములలో ద్రవ్యముకాని గుణముకాని కర్మముకాని ఏదియు నుండదు. ద్రవ్యమునందు ద్రవ్య గుణ కర్మము లుండును. కాని గుణకర్మములలో ద్రవ్యముకాని గుణముకాని కర్మముకాని ఉండజాలదని భావము. కాని సత్తా అనునది గుణకర్మములందుండును. అందువలన నియ్యది ద్రవ్యముకాని గుణముకాని కర్మముకాని కాక వానికంటె భిన్నమైన పదార్థమని తెలియుచున్నది.

అవ : మఱియొక హేతువును జూపుచున్నాడు.

సూ. :- సామాన్య విశేషాభావేన చ ౧.౨.౧౦

పూర్వముచెప్పిన, ద్రవ్యత్వగుణత్వాది సామాన్య విశేషములు సత్తాలో లేకుండుటవలన సత్తా అన్యపదార్థమే.

సత్తా ద్రవ్య గుణ కర్మములలో నొకటియై యుండిన పక్షమున నందు, ద్రవ్యత్వాదిసామాన్యము, (తదపేక్షయా) దానితో బోల్చినపుడు వ్యాప్యములగు పృథివీత్వాది విశేషము లుండియుండును. సత్తాలో ద్రవ్యత్వాది సామాన్య విశేషములు లేవు. అందువలన పదార్థాంతరమే.

అవ : సత్తా సామాన్యము, ద్రవ్యగుణ కర్మములకంటె వేఱైన పదార్థమని ప్రమాణపూర్వకముగ నిర్ణయించి యిప్పుడు

ద్రవ్యత్వమను నపర సామాన్యముగూడ ద్రవ్యాదులకంటె భిన్నమైనదని నిరూపించుచున్నాడు.

సూ. :- అనేక ద్రవ్యవత్త్వేన ద్రవ్యత్వ ముక్తమ్ ౧.౨.౧౧

అనేక ద్రవ్యవత్త్వేన = పృథివ్యాది సమస్తద్రవ్యములు, ద్రవ్యత్వమునకు సమవాయికారణము. అందువలన ద్రవ్యములన్నిటిలో సమవాయసంబంధముతో ద్రవ్యత్వముండును. కాబట్టి, ద్రవ్యత్వమ్ = ద్రవ్యత్వమను నపరసామాన్యము - సత్తా సామాన్యమువలె ద్రవ్యగుణ కర్మములకంటె భిన్నమైనది అని, ఉక్తమ్=చెప్పబడినది, సత్తావలె నిదియు వ్యాఖ్యానము చేయబడినట్లెంచుడని తాత్పర్యము.

సూ. :- సామాన్య విశేషాభావేన చ ౧.౨.౧౨

ద్రవ్యత్వమునందు ద్రవ్యత్వాది సామాన్య విశేషములు లేకుండుటచేత ద్రవ్యత్వమను నపరసామాన్యముకూడ ద్రవ్యగుణ కర్మములకంటె భిన్నపదార్థమని నిశ్చయము.

ద్రవ్యత్వమును చెప్పి గుణత్వమును వర్ణించుచున్నాడు.

సూ. :- గుణేషు భావాత్ గుణత్వ ముక్తమ్ ౧.౨.౧౩

గుణేషు = రూప రసాది గుణములలో, భావాత్ = సమవాయ సంబంధముతో నుండుటవలన, గుణత్వమ్ = సత్తాకంటె వ్యాప్యమగు గుణత్వమను నపరసామాన్యము. ఉక్తమ్ = సత్తావలె గుణత్వముకూడ ద్రవ్యగుణ కర్మములకంటె భిన్న పదార్థమని వ్యాఖ్యానము చేయబడినట్లు తెలిసికొన వలయును.

సూ. :- సామాన్య విశేషాభావేన చ ౧.౨.౧౪

పూర్వసూత్రమువలె నిదియు గుణత్వము పదార్థాంతరమనుటలో హేత్వంతరముగా తెలిసికొనుడు.

అవ : కర్మత్వముగూడ పదార్థాంతరమని నిరూపించుచున్నాడు.

సూ. :- కర్మసు భావాత్ కర్మత్వ ముక్తమ్     ౧.౨.౧౫

సూ. :- సామాన్య విశేషాభావేన చ     ౧.౨.౧౬

కర్మసు = ఉత్ క్షేపణాది కర్మములలో, భావాత్=సమవాయ సంబంధముతో నుండుటవలన, కర్మత్వమ్ = కర్మత్వమను నపరజాతి ఉక్తమ్ = వ్యాఖ్యానము చేయబడిన దైంచుడు.

కర్మత్వమున ఇతర సామాన్య విశేషములు లేకుండుట వలన నది ద్రవ్యగుణ కర్మములకంటె భిన్నమని తాత్పర్యము.

అవ : సత్తా-పరసామాన్యమును అర్థాంతరముగా (ద్రవ్యగుణ కర్మలకంటె వేఱుపదార్థముగా) సాధించి, ప్రస్తుతము సత్తాలో భేదములేదు, అది ఒక్కటేయని చెప్పుచున్నాడు.

సూ. :- సదితి లింగావిశేషాత్ విశేషలింగాభావా
చ్చైకో భావః     ౧.౨.౧౭

సదితి లింగావిశేషాత్ = సత్ ద్రవ్యం, సన్గుణః, సత్కర్మ అను వ్యవహారమున సత్ సత్ అను సమానహేతువుండుట వలనను, విశేషలింగాభావాచ్చ = విశేషమనగా సత్తా భేదము, అందు-లింగాభావాత్ అనగా సత్తా భేదమును తెలుపు హేతువు లేకుండుటవలనను, ఏకో భావః=సత్తా సామాన్యము ద్రవ్యగుణ కర్మములలో సమవాయసంబంధముతో నుండునది యొకటియే యని యర్థము.

సత్తా సామాన్య మనేకవిధములని తెలుపు హేతువులు లేకుండుట చేతను, ఒక్కటేయని తెలుపునట్టి సత్సత్ అను వ్యవహారాత్మక హేతువుండుటవలనను, సత్తా సామాన్య మొక్కటేయని తాత్పర్యము.

# ద్వితీయాధ్యాయము

## ప్రథమాహ్నికము

అవ : ఉద్దేశక్రమము ననుసరించి ద్రవ్యలక్షణములు నిర్దేశింపనెంచి ప్రథమమున <u>పృథివీలక్షణము</u> వర్ణించుచున్నాడు.

సూ. :- రూప రస గంధ స్పర్శవతీ పృథివీ     ౨.౧.౧

'రూప రస గంధ స్పర్శములు కలది పృథివి' యని సూత్రార్థము. రూప రస గంధ స్పర్శగుణములు సమవాయసంబంధముతో కలిగియుండుట పృథివికి లక్షణము.

రూపము : నీలము, శుక్లము, లోహితము (ఎఱుపు), పీతము, కపిశము (పింగళ వర్ణము), చిత్రము-అను భేదములతో నొప్పును.

రసము :- మధురము, ఆమ్లము, లవణము, కారము, వగరు, చేదు - (అని ఆఱు విధములు.)

గంధము :- సురభి, అసురభి (సుగంధము, దుర్గంధము) అని రెండు విధములు.

స్పర్శము :- పాకజమగు అనుష్ణాశీత స్పర్శము పృథివిలో నుండును.

ఈగుణములన్నియు సమవాయసంబంధముతో పృథివి యందుండు నని భావము.

సూత్రమునగల మతుప్ (వత్) ప్రత్యయము ద్వంద్వ సమాసాంతమున నుండుటవలన రూపరసాది ప్రత్యేక పదము నకు సంబంధించినదై రూపవతి పృథివి, రసవతి పృథివి, గంధవతి పృథివి, స్పర్శవతి పృథివి - అని పృథివికి నాలుగు లక్షణములున్నట్లు తెలుపునని కొందఱు చెప్పెదురు. పైజెప్పిన రూపములన్నిటిలో కృష్ణరూపము పృథివికి స్వాభావిక గుణము. ఛాందోగ్యోపనిషత్తునందు – "యత్కృష్ణం తదన్నస్య" అన్న రూపము కృష్ణమని వర్ణించుటచే ఉపనిషత్ మతానుసారముగ పృథివిలో స్వాభావిక రూపము కృష్ణమనియు తోచుచున్నది. ఇతరరూపములు నైమిత్తికములు. ఇట్లు గంధము కూడ భూమిలో నైజగుణము. (అత ఏవ గంధవతీ పృథివీ) అందు వలననే సమవాయసంబంధమున గంధవత్త్వమే పృథివి లక్షణ మని నవీన నైయాయికు లందురు.

లక్షణవాక్యమునందు 'సమవాయసంబంధముతో' అను మాట చేర్చనిచో సంయోగాది సంబంధములతో రూపాదిగుణ ములు కలిగిన అన్యపదార్థమునందు లక్షణము అతివ్యాప్తి మగును. ఆ దోషనివారణార్థము సమవాయసంబంధముతో రూపాదిగుణములు కలిగియుండుట పృథివికి లక్షణమని చెప్పబడినది.

అవ : జల లక్షణము

సూ. :- రూప రస స్పర్శవత్య ఆపో ద్రవాః స్నిగ్ధాః ౨.౧.౨

ద్రవాః=సాంసిద్ధిక ద్రవత్వము గలిగి, స్నిగ్ధాః=స్నేహగుణము కలిగి, రూప రస స్పర్శవత్యః = శుక్ల రూపము, మధుర రసము, శీతస్పర్శమునను గుణములు గలది, అపః=జలము.

సాంసిద్ధిక ద్రవత్వము, స్నేహము, (జిగురు) శుక్ల రూపము, మధుర రసము, శీతస్పర్శము - అను గుణములు సమవాయసంబంధముతో కలిగియుండుట జలమునకు లక్షణము.

ఇందు శుక్ల రూపము జలమునగల స్వాభావికగుణము. (యచ్ఛుక్లం తదపామ్ ४.౧.) జలమునందు శుక్లరూపమున్నది. అని ఛాందోగులు చెప్పుచున్నారు. జలమునం దితరరూపములు కనబడిన నవి అన్యద్రవ్య సంయోగజనితములని యెఱుంగునది. మధురరసము, సాంసిద్ధిక ద్రవత్వము, స్నేహము - ఈ గుణములు జలమున నైజములు. (శీతస్పర్శవత్యః అపః) సమవాయసంబంధమున శీతస్పర్శవంతమైనది జలమని నవీనులు.

అవ : అగ్ని లక్షణము

సూ. :- తేజో రూపస్పర్శవత్ ౨.౧.3

రూపస్పర్శవత్త్వము అగ్నిలక్షణము. (భాస్వరశుక్లం తేజని) భాస్వరశుక్లరూపము అగ్నిలో నుండునని నవీనులు. వైదికులు మాత్రము అగ్నిరూపము లోహితము; అనగా నెఱుపని చెప్పియుండిరి. (యదగ్నేర్ లోహితం రూపం తేజసస్తద్రూపమ్, ఛాం. ౬.४.౧.) అగ్నిలో కనబడు నెఱుపురంగే తేజముయొక్క రూపమని తాత్పర్యము, (ఉష్ణస్పర్శవత్తేజః)

నమీనులు తేజమునకు అగ్ని-లక్షణము ఉష్ణస్పర్శవత్వమని చెప్పుదురు. అనగా వేడిమి కలిగియుండుట.

అవ : వాయు లక్షణము.

సూ. :- స్పర్శవాన్ వాయుః ౨.౧.౪

అపాకజము, అనుష్ణాశీతస్పర్శవత్వము వాయులక్షణము వాయువునందు ఉష్ణ శీత గుణ రహితమగు కేవలస్పర్శ ముండును. అదియు పాకజము కాదు. పాకజమనగా పాకజన్య మైనది. పాకమనగా విలక్షణమగు ఒకానొక విధమగు తేజస్సంయోగము. పృథివియందుండు స్పర్శము పాకజము. (అనగా ఒకానొక విలక్షణమైన అగ్నివలన కలుగునది అని భావము.) వాయువునందు అప్పుడప్పుడు మన మనుభవించు శీతోష్ణములు కారణాంతరములవలన ఇతర పదార్థ సంబంధము వలన నుత్పన్నమైనవి కాని స్వాభావికములు కావు.

పాకజము కాని అనుష్ణాశీత స్పర్శగుణము సమవాయ సంబంధముతో కలిగియుండుట వాయువునకు లక్షణము.

అవ : ఆకాశ లక్షణము

సూ. :- త ఆకాశే న విద్యన్తే ౨.౧.౫

తే = రూప రస గంధస్పర్శములు, ఆకాశే = ఆకాశమునందు, న విద్యంతే = ఉండవు.

రూపము, రసము, గంధము, స్పర్శము - అనుగుణ ములు సమవాయసంబంధముతో లేకుండుట ఆకాశమునకు

లక్షణము. అనగా సమవాయసంబంధముతో శబ్దగుణము కలిగియుండుట ఆకాశలక్షణము-అని తెలియునది. కావుననే నవీనులు ('శబ్దగుణక మాకాశమ్') సమవాయసంబంధముతో శబ్దగుణము కలది ఆకాశమని చెప్పుదురు, రూపరసాది గుణములు అగ్న్యాదిద్రవ్యముల నైజగుణములు, ఆకాశమునం దివి యుండనేరవు. శబ్దగుణము ఆకాశమున నుండును.

అవ : జలలక్షణమున ద్రవత్వము జలలక్షణముగా చెప్పుట సరికాదు, ఘృతాదులలోను ద్రవత్వ ముండుటచే ద్రవత్వలక్షణము నతివ్యాప్త మగుచున్నది. అను దోషము నాశంకించి నిరాకరించుచున్నాడు

సూ. :- సర్పిర్జతు మధూచ్ఛిష్టానా మగ్నిసంయోగాత్
ద్రవత్వ మద్భిః సామాన్యమ్ ౨.౧.౬

సర్పిర్జతు మధూచ్ఛిష్టానామ్ = ఘృతము, లక్క, మైనము వీనిలో, అగ్ని సంయోగాత్ = అగ్ని సంయోగము వలన, ద్రవత్వం = కలుగునట్టి ద్రవత్వము, అద్భిః సామాన్యమ్ = జలముతో సమానధర్మము.

ఘృతాదులలో సాంసిద్ధిక ద్రవత్వములేదు. ఉష్ణతా సంయోగము వలన నేర్పడు (నైమిత్తిక) ద్రవత్వముకలదు. అందువలన వీనియందుగల ద్రవత్వము పాకజము - అనగా విలక్షణ తేజసంయోగమువలన కలిగి నదేకాని సాంసిద్ధికమైనది కాదు. జలమునగల ద్రవత్వము సాంసిద్ధికము-స్వతః సిద్ధమైనది అదియే జలమునకు లక్షణము. అందువలన నతివ్యాప్తిదోషములేదు-అని అభిప్రాయము.

అవ : ఘృతాదులలో నతివ్యాప్తి లేకున్నను, త్రపు సీసాది ధాతువులలో నతివ్యాప్తి నాశంకించి సమాధానము చెప్పుచున్నాడు.

సూ. :- త్రపుసీసలోహరజత సువర్ణానామగ్ని సంయోగాత్
ద్రవత్వ మద్భిః సామాన్యమ్ ౨.౧.౭

త్రపు........సువర్ణానామ్ = రాగి, సీసము, ఇనుము, వెండి, బంగారము, మున్నగు ధాతువులలో, అగ్నిసంయోగాత్ = అధికోష్ణముగల వహ్నిసంబంధమువలన, ద్రవత్వమ్=కలుగుచున్న ద్రవత్వము, అద్భిః = జలముతో, సామాన్యమ్ = సమానధర్మము.

తామ్రాదులలో గలుగు ద్రవత్వము జల సామాన్య ధర్మమైనను జల లక్షణ మతివ్యాప్తము కాదు. కారణ మేమన నీధాతువులలో గలుగు ద్రవత్వము ఘృతాదులలో వలెనే అసాంసిద్ధికమే. జల ద్రవత్వము సాంసిద్ధికము.

త్రపుసీసాదులనుగూడ పూర్వ (సర్పిరాది) సూత్రముననే చేర్చి దోషము నిరాకరింపక వేఱుగా సూత్రము రచించుటలో మహర్షి యభిప్రాయ మేమన, సర్పిరాదులు పార్థివములు, త్రపుసీసాదులు తైజసములు - అనగా అగ్నిద్రవ్యాంతర్గతములు - అని తెలుపుటయే.

అత్యంత నవీనపదార్థ విజ్ఞానులు ఘృతాదులు, త్రపుసీసాదులు నన్నియు పార్థివము లనియే అభిప్రాయపడుచున్నారు.

అవ : స్పర్శవత్త్వము వాయువునకు లక్షణముగా చెప్ప బడినది. కాని వాయువను ద్రవ్య మొకటికలదని సాధింపకయే వాయు లక్షణము చెప్పుట సముచితము కాదు. అందువలన వాయు ద్రవ్యమును (సామాన్యముగా నెఱిగిన అదృష్టహేతువుతో సాధింపనెంచి, పూర్వము (ముందు) దృష్టహేతుకమను గోరూపద్రవ్య సిద్ధిని ఉదాహరించుచున్నారు. దృష్టహేతువుతో గోవును సాధించుచున్నారని భావము.

సూ. :- విషాణీ కకుద్మాన్ ప్రాంతే బాలధిః సాస్నావాన్
ఇతి గోత్వే దృష్టం లింగమ్ ౨.౧.౮

విషాణీ = శృంగములు కలది, (విషాణమనగా నిట మహిష మేషాదుల కొమ్ములకంటె విలక్షణమైన కొమ్ములు కలది అని అర్థము.) కకుద్మాన్ = మూపురము గలది. ప్రాంతే బాలధిః= తోకచివరలో వెంట్రుకలు గలది. సాస్నావాన్ = గంగడోలు కలది. ఇతి = అనునివి. గోత్వే = గోత్వసాధ్యకమగు నను మితిలో, దృష్టం లిఙ్గమ్ = చూడబడిన విశేషవ్యాప్తిగల హేతువు.

గోవునందు సాస్నాదిమత్త్వ లక్షణాత్మకమగు లింగము (హేతువు) ప్రత్యక్షముగా చూడబడుచున్నది. అందువలన దృష్టలింగ మనబడును. అనగా కొమ్ములు, మూపురము, చివర వెంట్రుకలు గల తోక, గంగడోలు అను లక్షణములు గోవునందు ప్రత్యక్షముగ చూడబడుచుండును. కావున నయ్యవి దృష్టలింగము లనబడును. దృష్టలింగములతో ప్రత్యక్ష ప్రమాణమున కలుగు జ్ఞానము సామాన్యవిశేష విషయక

ముగా నుండును. సాస్నాదిమత్వ లక్షణము వలన కలుగు గోజ్ఞానము, గోవు మాత్రమున నుండు గోత్వవిశిష్టమై ఉండుటయే గాక, ఆ యా గోవుయొక్క విశేష జ్ఞానముతో "ఎఱ్ఱనిది, తెల్లనిది, నల్లనిది" ఇత్యాది విశేషజ్ఞానముతో-ఒప్పుచుండును. అనుమాన ప్రమాణమున నేర్పడు జ్ఞానము మాత్రము సామాన్య విషయకముగానే యుండును. దూర పర్వతాదులందు ధూమము వలన కలుగు జ్ఞానము వహ్నిత్వ సామాన్య విశిష్ట వహ్ని బోధకముగానే యుండును. కాని యావహ్ని "తృణాగ్ని, లేక కాష్ఠాగ్ని" అనునిట్టి విశేష జ్ఞానమును కలిగింపనేరదు.

అవ : ఇట్లు ఉదాహరణమును చెప్పి వాయుసాధక హేతువును నిరూపించుచున్నాడు.

సూ. :- స్పర్శశ్చ వాయోః ౨.౧.౯

పూర్వోక్త సాస్నాది మత్వాదులవలె; ప్రాణిమాత్రముచే ననుభవింపబడుచున్న, స్పర్శః = విలక్షణమైన స్పర్శము (అనుష్ణాశీతము), వాయోః = తన కాశ్రయభూతమగు వాయునామకద్రవ్య సిద్ధికి, లిఙ్గమ్ (అధ్యాహార్యము) = హేతువని భావము.

ప్రాణులచే అనుభవింపబడు విలక్షణ స్పర్శ (అనుష్ణాశీతము) గుణము వలన దాని కాశ్రయమగు వాయునామక ద్రవ్య మొకటి ఉన్నదని యీ సూత్రమువలన సాధింపబడినది.

పూర్వసూత్రమున గనబఱచిన విషాణాదులు దృష్ట లింగములు. అనగా సాస్నాదిమత్వమను లింగము, ఆలింగము

కలిగిన లింగిగోవు, వాని రెంటికి గల సంబంధము ఈ మూడును ప్రత్యక్షములు. అందువలన సాస్నాదిమత్త్వము దృష్టలింగము అనబడును. ఈ సూత్రమున నుల్లేఖించిన స్పర్శము అదృష్ట లింగము. ఈ విషయము ముందు పదునైదవ సూత్రములో స్పష్టపఱపబడును.

అవ : స్పర్శగుణము పృథివి - జలము-అగ్నిద్రవ్యములకు సంబంధించిన దేల కాదు ?

సూ. :- న చ దృష్టానాం స్పర్శః ఇత్యదృష్టలింగో వాయుః
౨.౧.౧౦

స్పర్శః=ప్రాణులచే ననుభవింపబడు అనుష్ణా శీత స్పర్శము, దృష్టానాం = గుణగుణులు ప్రత్యక్షముగా గోచరించు పృథివ్యప్తేజములకు సంబంధించినది, న = కాదు, ఇతి=అందువలన, అదృష్టలింగః = తనకు సాధ్యముతోగల సంబంధము ప్రత్యక్షముగా గ్రహింపబడనట్టి స్పర్శాత్మకలింగముగా గలది, వాయుః = వాయువే.

పృథివ్యాదులలోనుండు స్పర్శ అనుష్ణాశీతము కాదు. ఉష్ణశీత కఠినాది స్పర్శలే వానియందుండును. ఇది ప్రత్యక్ష ప్రమాణగమ్యమే. వీనికంటె విలక్షణమైన అనుష్ణా శీత స్పర్శము త్వగింద్రియముచే గ్రహింపబడుచున్నది. అది గుణమగుటచే దాని కాశ్రయ మేదో ఒక ద్రవ్య ముండియుండవలయును. అదియే వాయువు - అని తాత్పర్యము.

అవ : స్పర్శ హేతుకవాయువు సిద్ధించినప్పటికి అది ద్రవ్యమని యెట్లు నిర్ణయింపనగును ?

సూ. :- అద్రవ్యవత్త్వేన ద్రవ్యమ్ ౨.౧.౧౧

అద్రవ్యవత్త్వేన = గుణకర్మ సామాన్యాదులు అద్రవ్య-అనగా ద్రవ్యభిన్నము లనబడును. ప్రకృతమున స్పర్శగుణము అద్రవ్యము. తద్వత్త్వేన=దానికాశ్రయ మగుటచేత - అద్రవ్య మగు స్పర్శగుణమున కాశ్రయ మగుటచేత - వాయువు, ద్రవ్యమ్ = ద్రవ్యమని అర్థము.

గుణాశ్రయము ద్రవ్య మగును. వేఱొండు కాదని భావము

అవ : ద్రవ్యత్వాది సామాన్యములు అద్రవ్య శబ్దముచే గ్రహింపనగును. కాబట్టి గుణత్వాది రూప అద్రవ్యవత్వము గుణకర్మములందును. వర్తించును. కాగా వాయువు ద్రవ్యమే అని యెట్లు చెప్పగలము ?

సూ. :- క్రియావత్త్వాత్ గుణవత్త్వా చ్చ ౨.౧.౧౨

క్రియావత్త్వాత్=క్రియకలిగి యుండుటవలన, గుణవత్త్వాచ్చ= గుణము కలిగియుండుట వలనను, వాయువు ద్రవ్యమే.

క్రియాగుణముల కాశ్రయ మగుటచే వాయువు ద్రవ్యమే యని సూత్ర తాత్పర్యము.

అవ : క్రియాగుణములు గల పృథివ్యప్తేజస్సులు వ్యవహార నిత్యములు కావు. అట్లే వాయువు వ్యవహారమున ననిత్యము ఎందులకు కాదు ? అనగా వ్యవహారమున నిత్య మని యేల చెప్పబడుచున్నదన ?

# ద్వితీయాధ్యాయము

## ప్రథమాహ్నికము

అవ : ఉద్దేశక్రమము ననుసరించి ద్రవ్యలక్షణములు నిర్దేశింపనెంచి ప్రథమమున పృథివీలక్షణము వర్ణించు చున్నాడు.

సూ. :- రూప రస గంధ స్పర్శవతీ పృథివీ    ౨.౧.౧

'రూప రస గంధస్పర్శములు కలది పృథివి' యని సూత్రార్థము. రూప రస గంధ స్పర్శగుణములు సమవాయసంబంధముతో కలిగియుండుట పృథివికి లక్షణము.

రూపము : నీలము, శుక్లము, లోహితము (ఎఱుపు), పీతము, కపిశము (పింగళ వర్ణము), చిత్రము–అను భేదములతో నొప్పును.

రసము :- మధురము, ఆమ్లము, లవణము, కారము, వగరు, చేదు – (అని ఆఱు విధములు.)

గంధము :- సురభి, అసురభి (సుగంధము, దుర్గంధము) అని రెండు విధములు.

స్పర్శము :- పాకజమగు అనుష్ణాశీత స్పర్శము పృథివిలో నుండును.

ఈగుణములన్నియు సమవాయసంబంధముతో పృథివి యందుండు నని భావము.

సూత్రమునగల మతుప్ (వత్) ప్రత్యయము ద్వంద్వ సమాసాంతమున నుండుటవలన రూపరసాది ప్రత్యేక పదము నకు సంబంధించినదై రూపవతి పృథివి, రసవతి పృథివి, గంధవతి పృథివి, స్పర్శవతి పృథివి - అని పృథివికి నాలుగు లక్షణములున్నట్లు తెలుపునని కొందఱు చెప్పుదురు. పైజెప్పిన రూపములన్నిటిలో కృష్ణరూపము పృథివికి స్వాభావిక గుణము. ఛాందోగ్యోపనిషత్తునందు - "యత్కృష్ణం తదన్నస్య" అన్న రూపము కృష్ణమని వర్ణించుటచే ఉపనిషత్ మతానుసారముగ పృథివిలో స్వాభావిక రూపము కృష్ణమనియు తోచుచున్నది. ఇతరరూపములు నైమిత్తికములు. ఇట్లు గంధముకూడ భూమిలో నైజగుణము. (అత ఏవ గంధవతీ పృథివీ) అందు వలననే సమవాయసంబంధమున గంధవత్త్వమే పృథివి లక్షణ మని నవీన నైయాయికు లందురు.

లక్షణవాక్యమునందు 'సమవాయసంబంధముతో' అను మాట చేర్చనిచో సంయోగాది సంబంధములతో రూపాదిగుణ ములు కలిగిన అన్యపదార్థమునందు లక్షణము అతివ్యాప్తి మగును. ఆ దోషనివారణార్థము సమవాయసంబంధముతో రూపాదిగుణములు కలిగియుండుట పృథివికి లక్షణమని చెప్పబడినది.

అవ : జల లక్షణము

సూ. :- రూప రస స్పర్శవత్య ఆపో ద్రవాః స్నిగ్ధాః ౨.౧.౨

ద్రవాః=సాంసిద్ధిక ద్రవత్వము గలిగి, స్నిగ్ధాః=స్నేహగుణము కలిగి, రూప రస స్పర్శవత్యః = శుక్ల రూపము, మధుర రసము, శీతస్పర్శమునను గుణములు గలది, అపః=జలము.

సాంసిద్ధిక ద్రవత్వము, స్నేహము, (జిగురు) శుక్ల రూపము, మధుర రసము, శీతస్పర్శము - అను గుణములు సమవాయసంబంధముతో కలిగియుండుట జలమునకు లక్షణము.

ఇందు శుక్ల రూపము జలమునగల స్వాభావికగుణము. (యచ్ఛుక్లం తదపామ్ ౪.౧.) జలమునందు శుక్లరూపమున్నది. అని ఛాందోగులు చెప్పుచున్నారు. జలమునం దితరరూపములు కనబడిన నవి అన్యద్రవ్య సంయోగజనితములని యెఱుంగునది. మధురరసము, సాంసిద్ధిక ద్రవత్వము, స్నేహము - ఈ గుణములు జలమున నైజములు. (శీతస్పర్శవత్యః అపః) సమవాయసంబంధమున శీతస్పర్శవంతమైనది జలమని నవీనులు.

అవ : <u>అగ్ని లక్షణము</u>

సూ. :- తేజో రూపస్పర్శవత్ ౨.౧.3

రూపస్పర్శవత్వము అగ్నిలక్షణము. (భాస్వరశుక్లం తేజసి) భాస్వరశుక్లరూపము అగ్నిలో నుండునని నవీనులు, వైదికులు మాత్రము అగ్నిరూపము లోహితము; అనగా నెఱుపని చెప్పియుండిరి. (యదగ్నేర్ లోహితం రూపం తేజసస్తద్రూపమ్, ఛాం. ౬.౪.౧.) అగ్నిలో కనబడు నెఱుపురంగే తేజముయొక్క రూపమని తాత్పర్యము, (ఉష్ణస్పర్శవత్తేజః)

నవీనులు తేజసమునకు అగ్నికి-లక్షణము ఉష్ణస్పర్శవత్త్వమని చెప్పారు. అనగా వేడిమి కలిగియుండుట.

అవ : వాయు లక్షణము.

సూ. :- స్పర్శవాన్ వాయుః ౨.౧.౪

అపాకజము, అనుష్ణాశీతస్పర్శవత్త్వము వాయులక్షణము వాయువునందు ఉష్ణ శీత గుణ రహితమగు కేవలస్పర్శ ముండును. అదియు పాకజము కాదు. పాకజమనగా పాకజన్య మైనది. పాకమనగా విలక్షణమగు ఒకానొక విధమగు తేజస్సంయోగము. పృథివియందుండు స్పర్శము పాకజము. (అనగా ఒకానొక విలక్షణమైన అగ్నివలన కలుగునది అని భావము.) వాయువునందు అప్పుడప్పుడు మన మనుభవించు శీతోష్ణములు కారణాంతరములవలన ఇతర పదార్థ సంబంధము వలన నుత్పన్నమైనవి కాని స్వాభావికములు కావు.

పాకజముకాని అనుష్ణాశీత స్పర్శగుణము సమవాయ సంబంధముతో కలిగియుండుట వాయువునకు లక్షణము.

అవ : ఆకాశ లక్షణము

సూ. :- త ఆకాశే న విద్యన్తే ౨.౧.౫

తే = రూప రస గంధస్పర్శములు, ఆకాశే = ఆకాశమునందు, న విద్యంతే = ఉండవు.

రూపము, రసము, గంధము, స్పర్శము - అనుగుణములు సమవాయసంబంధముతో లేకుండుట ఆకాశమునకు

లక్షణము. అనగా సమవాయసంబంధముతో శబ్దగుణము కలిగియుండుట ఆకాశలక్షణము-అని తెలియునది. కావుననే నవీనులు ('శబ్దగుణక మాకాశమ్') సమవాయసంబంధముతో శబ్దగుణము కలది ఆకాశమని చెప్పుదురు, రూ ప ర సా ది గుణములు అగ్న్యాదిద్రవ్యముల నైజగుణములు, ఆకాశమునం దివి యుండనేరవు. శబ్దగుణము ఆకాశమున నుండును.

అవ : జలలక్షణమున ద్రవత్వము జలలక్షణముగా చెప్పుట సరికాదు, ఘృతాదులలోను ద్రవత్వ ముండుటచే ద్రవత్వలక్షణము నతివ్యాప్త మగుచున్నది. అను దోషము నాశంకించి నిరాకరించుచున్నాడు

సూ. :- సర్పిర్జతు మధూచ్ఛిష్టానా మగ్నిసంయోగాత్
ద్రవత్వ మద్భిః సామాన్యమ్ ౨.౧.౬

సర్పిర్జతు మధూచ్ఛిష్టానామ్ = ఘృతము, లక్క, మైనము వీనిలో, అగ్ని సంయోగాత్ = అగ్ని సంయోగము వలన, ద్రవత్వం = కలుగునట్టి ద్రవత్వము, అద్భిః సామాన్యమ్ = జలముతో సమానధర్మము.

ఘృతాదులలో సాంసిద్ధిక ద్రవత్వములేదు. ఉష్ణతా సంయోగము వలన నేర్పడు (నైమిత్తిక) ద్రవత్వముకలదు. అందువలన వీనియందుగల ద్రవత్వము పాకజము - అనగా విలక్షణ తేజసంయోగమువలన కలిగి నదేకాని సాంసిద్ధికమై నది కాదు. జలమునగల ద్రవత్వము సాంసిద్ధికము-స్వతః సిద్ధమైనది అదియే జలమునకు లక్షణము. అందువలన నతి వ్యాప్తిదోషములేదు-అని అభిప్రాయము.

అవ : ఘృతాదులలో నతివ్యాప్తి లేకున్నను, త్రపు సీసాది ధాతువులలో నతివ్యాప్తి నాశంకించి సమాధానము చెప్పుచున్నాడు.

సూ. :- త్రపుసీసలోహరజత సువర్ణానామగ్ని సంయోగాత్ ద్రవత్వ మద్భిః సామాన్యమ్ ౨.౧.౭

త్రపు........సువర్ణానామ్ = రాగి, సీసము, ఇనుము, వెండి, బంగారము, మున్నగు ధాతువులలో, అగ్నిసంయోగాత్ = అధికోష్ణముగల వహ్నిసంబంధమువలన, ద్రవత్వమ్=కలుగు చున్న ద్రవత్వము, అద్భిః = జలముతో, సామాన్యమ్ = సమానధర్మము.

తామ్రాదులలో గలుగు ద్రవత్వము జల సామాన్య ధర్మమైనను జల లక్షణ మతివ్యాప్తము కాదు. కారణ మేమన నీధాతువులలో గలుగు ద్రవత్వము ఘృతాదులలో వలెనే అసాంసిద్ధికమే. జల ద్రవత్వము సాంసిద్ధికము.

త్రపుసీసాదులనుగూడ పూర్వ (సర్పిరాది) సూత్రముననే చేర్చి దోషము నిరాకరింపక వేఱుగా సూత్రము రచించుటలో మహర్షి యభిప్రాయ మేమన, సర్పిరాదులు పార్థివములు, త్రపుసీసాదులు తైజసములు - అనగా అగ్నిద్రవ్యాంతర్గత ములు - అని తెలుపుటయే.

అత్యంత నవీనపదార్థ విజ్ఞానులు ఘృతాదులు, త్రపు సీసాదులు నన్నియు పార్థివము లనియే అభిప్రాయపడు చున్నారు.

అని । దృగ్దృష్టమను వాయువునకు లక్షణముగా చెప్పబడినది. కాని వాయువునకు ప్రత్యక్ష మెటులకలదని సాధింపకయే వాయువు లక్షణము చెప్పుట సమంజసము కాదు. అందువలన వాయు ప్రత్యక్షమును (సామాన్యముగా తెలిసిన అదృష్ట హేతువుతో) సాధింపవలెను, పూర్వపక్షము (మూఁడు) దృష్ట లింగకమగు గోవు ప్రత్యక్ష సిద్ధిని ఉదాహరించుచున్నారు. దృష్ట హేతువుతో గోవును సాధించుచున్నారని భావము.

సూ. :- విషాణీ కకుద్మాన్ ప్రాంతే బాలధిః సాస్నావాన్
ఇతి గోత్వే దృష్టం లింగమ్ ౨.౧.౮

విషాణీ = శృంగములు కలది, (విషాణమునగా నిట మహిష మేషాదుల కొమ్ములకంటె విలక్షణమైన కొమ్ములు కలది అని అర్థము.) కకుద్మాన్ = మూపురము గలది, ప్రాంతే బాలధిః= తోకచివరలో వెండ్రుకలు గలది. సాస్నావాన్ = గంగడోలు కలది, ఇతి = అనునవి, గోత్వే = గోత్వసాధకములగు నను మితిలో, దృష్టం లింగమ్ = చూడబడిన విశేషవ్యాప్తిగల హేతువు.

గోవునందు సాస్నాదిమత్త్వ లక్షణాత్మకమగు లింగము (హేతువు) ప్రత్యక్షముగా చూడబడుచున్నది. అందువలన దృష్టలింగ మనబడును. అనగా కొమ్ములు, మూపురము, చివర వెండ్రుకలు గల తోక, గంగడోలు అను లక్షణములు గోవునందు ప్రత్యక్షముగ చూడబడుచుండును. కావున నయ్యవి దృష్టలింగము లనబడును. దృష్టలింగములతో ప్రత్యక్ష ప్రమాణమున కలుగు జ్ఞానము సామాన్యవిశేష విషయక

ముగా నుండును. సాస్నాదిమత్వ లక్షణము వలన కలుగు గోజ్ఞానము, గోవు మాత్రమున నుండు గోత్వవిశిష్టమై ఉండుటయే గాక, ఆ యా గోవుయొక్క విశేష జ్ఞానముతో "ఎఱ్ఱనిది, తెల్లనిది, నల్లనిది" ఇత్యాది విశేషజ్ఞానముతో-ఒప్పుచుండును. అనుమాన ప్రమాణమున నేర్పడు జ్ఞానము మాత్రము సామాన్య విషయకముగానే యుండును. దూర పర్వతాదులందు ధూమము వలన కలుగు జ్ఞానము వహ్నిత్వ సామాన్య విశిష్ట వహ్ని బోధకముగానే యుండును. కాని యావహ్ని "తృణాగ్ని, లేక కాష్ఠాగ్ని" అనునిట్టి విశేష జ్ఞానమును కలిగింపనేరదు.

అవ : ఇట్లు ఉదాహరణమును చెప్పి వాయుసాధక హేతువును నిరూపించుచున్నాడు.

సూ. :- స్పర్శశ్చ వాయోః ౨.౧.౯

పూర్వోక్త సాస్నాది మత్వాదులవలె; ప్రాణిమాత్రముచే ననుభవింపబడుచున్న, స్పర్శః = విలక్షణమైన స్పర్శము (అనుష్ణాశీతము), వాయోః = తన కాశ్రయభూతమగు వాయు నామకద్రవ్య సిద్ధికి, లిఙ్గమ్ (అధ్యాహార్యము) = హేతువని భావము.

ప్రాణులచే అనుభవింపబడు విలక్షణ స్పర్శ (అనుష్ణాశీతము) గుణము వలన దాని కాశ్రయమగు వాయునామక ద్రవ్యమొకటి ఉన్నదని యీ సూత్రమువలన సాధింపబడినది.

పూర్వసూత్రమున గనబఱచిన విషాణాదులు దృష్ట లింగములు. అనగా సాస్నాదిమత్వమను లింగము, ఆలింగము

కలిగిన లింగిగోవు, వాని రెంటికి గల సంబంధము ఈ మూడును ప్రత్యక్షములు. అందువలన సాస్నాదిమత్త్వము దృష్టలింగము అనబడును. ఈ సూత్రమున నుల్లేఖించిన స్పర్శము అదృష్ట లింగము. ఈ విషయము ముందు పదునైదవ సూత్రములో స్పష్టపఱపబడును.

అవ : స్పర్శగుణము పృథివి - జలము-అగ్నిద్రవ్యములకు సంబంధించిన దేల కాదు ?

సూ. :- న చ దృష్టానాం స్పర్శః ఇత్యదృష్టలింగో వాయుః ౨.౧.౧౦

స్పర్శః=ప్రాణులచే ననుభవింపబడు అనుష్ణా శీత స్పర్శము, దృష్టానాం = గుణగుణులు ప్రత్యక్షముగా గోచరించు పృథివ్యప్తేజములకు సంబంధించినది, న = కాదు, ఇతి=అందువలన, అదృష్టలింగః = తనకు సాధ్యముతోగల సంబంధము ప్రత్యక్షముగా గ్రహింపబడనట్టి స్పర్శాత్మకలింగముగా గలది, వాయుః = వాయువే.

పృథివ్యాదులలోనుండు స్పర్శ అనుష్ణాశీతము కాదు. ఉష్ణశీత కఠినాది స్పర్శలే వానియందుండును. ఇది ప్రత్యక్ష ప్రమాణగమ్యమే. వీనికంటె విలక్షణమైన అనుష్ణాశీత స్పర్శము త్వగింద్రియముచే గ్రహింపబడుచున్నది. అది గుణమగుటచే దాని కాశ్రయ మేదో ఒక ద్రవ్య ముండియుండవలయును. అదియే వాయువు - అని తాత్పర్యము.

అవ : స్పర్శ హేతుకవాయువు సిద్ధించినప్పటికి అది ద్రవ్యమని యెట్లు నిర్ణయింపనగును ?

సూ. :- అద్రవ్యవత్త్వేన ద్రవ్యమ్ ౨.౧.౧౧

అద్రవ్యవత్త్వేన = గుణకర్మ సామాన్యాదులు అద్రవ్య-అనగా ద్రవ్యభిన్నము లనబడును. ప్రకృతమున స్పర్శగుణము అద్రవ్యము. తద్వత్త్వేన=దానికాశ్రయ మగుటచేత - అద్రవ్య మగు స్పర్శగుణమున కాశ్రయ మగుటచేత - వాయువు, ద్రవ్యమ్ = ద్రవ్యమని అర్థము.

గుణాశ్రయము ద్రవ్య మగును. వేఱొండు కాదని భావము

అవ : ద్రవ్యత్వాది సామాన్యములు అద్రవ్య శబ్దముచే గ్రహింపనగును. కాబట్టి గుణత్వాది రూప అద్రవ్యవత్వము గుణకర్మములందును. వర్తించును. కాగా వాయువు ద్రవ్యమే అని యెట్లు చెప్పగలము ?

సూ. :- క్రియావత్త్వాత్ గుణవత్త్వాచ్చ ౨.౧.౧౨

క్రియావత్త్వాత్=క్రియకలిగి యుండుటవలన, గుణవత్త్వాచ్చ= గుణము కలిగియుండుట వలనను, వాయువు ద్రవ్యమే.

క్రియాగుణముల కాశ్రయ మగుటచే వాయువు ద్రవ్యమే యని సూత్ర తాత్పర్యము.

అవ : క్రియాగుణములు గల పృథివ్యప్తేజస్సులు వ్యవహార నిత్యములు కావు. అట్లే వాయువు వ్యవహారమున ననిత్యము ఎందులకు కాదు ? అనగా వ్యవహారమున 'నిత్య' మని యేల చెప్పబడుచున్నదన ?

సూ. :- అద్రవ్యవత్త్వేన నిత్యత్వ ముక్తమ్ ౨.౧.౧౩

అద్రవ్యవత్త్వేన = అవాంతర సృష్టియందు వాయూత్పత్తికి హేతుభూతమగు ద్రవ్యము లేకుండుట వలన - మహాప్రలయముపఱకు వాయువు నశింప నందున-వాయువు. నిత్యత్వ ముక్తమ్ = వ్యవహారమున నిత్య మని చెప్పబడినది.

వాయువు అవాంతర ప్రలయములందు నశింపదు. అందువలననే అవాంతర సర్గములందు జన్మించుటయు లేదు. మహా ప్రలయము వఱకిట్లే యుండును. కాబట్టి యీవాయువు వ్యవహారమున నిత్యమని చెప్పబడును. యథార్థముగ అనిత్యమే యని తాత్పర్యము.

అవ : వాయువు వ్యవహారమున నిత్యమేని ఆకాశాదుల వలె ఒక్కటిగానే ఉండును. నానావాయువు లుండనేరవు. అట్లు గాక వాయువునందు నానాత్వమున్న ప్రమాణ మేమి ?

సూ. :- వాయో ర్వాయుసమ్మూర్ఛనం నానాత్వే లింగమ్ ౨.౧.౧౪

వాయుసమ్మూర్ఛనమ్ = సమానవేగము గలిగి విరుద్ధ దిక్కుల నుండి ప్రవహించు వాయువుల మేళనము (కలయిక) తృణాదుల ఊర్ధ్వ గమనము వలన నూహింప దగినదై. వాయోః = వాయువుయొక్క. నానాత్వే = అనేకత్వములో, లింగమ్ = హేతువు.

వాయుప్రేరిత తృణాదుల యూర్ధ్వగమనము అనేక వాయువుల సన్నిపాతమువలనగాని కలుగనేరదు. పరస్పరము

విరుద్ధ దిక్కులనుండి (ఎదురుగా) ప్రవహించు నదీప్రవాహాదుల తాకిడివలన నటనుండు తృణాదులు పై కెగురుచుండుట లోకమున మనము చూచుచున్నాము. అందువలన వాయువుల సంఘర్షణ, సన్నిపాతమే వాయువు అనేకము లనుటలో ప్రమాణమని భావము.

అవ : స్పర్శగుణము త్వగింద్రియ గ్రాహ్యమై దృష్ట (ఇంద్రియ గ్రాహ్య) మగుటవలన వాయువు అదృష్టలింగము కలదని యెట్లు చెప్పబడినది ? అను శంకకు సమాధానము :

సూ. :- వాయుసన్నికర్షే ప్రత్యక్షాభావాత్
దృష్టం లింగం న విద్యతే ౨.౧.౧౫

వాయుసన్నికర్షే = వాయు త్వగింద్రియముల సంయోగమున, ప్రత్యక్షా భావాత్ = (స్పర్శము ప్రత్యక్షమైనను) వాయువప్రత్యక్ష మగుటవలన, లిఙ్గమ్=స్పర్శాఖ్యలింగము, దృష్టం న విద్యతే = దృష్టము-ఇంద్రియ గ్రాహ్య వాయు సంబంధము కలది-కాదు.

లిఙ్గీ, లిఙ్గము (గుణిగుణములు) గోవు-దాని కొమ్ముల వలె ప్రత్యక్షమైనచో లింగము దృష్ట మనబడును. లింగి కనబడక లింగము మాత్రము గ్రహింపబడినను అది అదృష్టమే అనబడును. లింగలింగుల అవినాభావ సంబంధము విశేష రూపమున గ్రహింపబడకుండుటయే యిందు-అదృష్ట మనుట యందు - ప్రయోజక మని - సాధక హేతువు-విశేష హేతువు-అని భావము.

అవ : వాయుస్పర్శముల సంబంధము దృష్టము కానప్పుడు స్పర్శాది లింగముల ద్వారా వాయు వెట్లు సిద్ధించును ?

సూ. :- సామాన్యతో దృష్టా చ్చావిశేషః ౨.౧.౧౬

సాస్నాదిమత్త్వ గోత్వములకు, ధూమాగ్నులకు అవినాభావ సంబంధమున్నట్లు ఎట్లు స్పష్టమో అట్లు స్పర్శ - వాయువుల సంబంధము గ్రాహ్యము కాకున్నను క్రియ ఉన్నచోట కరణ మవశ్య ముండునని గ్రహింపబడినట్లు గుణము ద్రవ్యాశ్రితమే యని సామాన్యముగా తెలియు నగును. ఇట్లు తెలిసికొనుటయే సామాన్యతోదృష్ట మనబడును. ఇప్పుడు సూత్రార్థము పరికింపుడు. సామాన్యతోదృష్టా చ్చ = సామాన్యతోదృష్ట స్పర్శాది లింగము వలన, అవిశేషః = వాయుత్వ విశేష రహితమైన, అందుచే ననుభవింపబడు అనుష్ణాశీత స్పర్శమున కాశ్రయ భూతమైన యొక ద్రవ్యము సిద్ధించుచున్నది. అదియే వాయు వనబడును.

రూపాది గుణములు ద్రవ్యము నాశ్రయించి యుండుట ప్రత్యక్షముగా చూచుచున్నాము. స్పర్శముగూడ ఒకగుణమే. అందువలన నదియు నేదోయొక ద్రవ్యము నాశ్రయించి యుండుట న్యాయసిద్ధము. ఈ విలక్షణ స్పర్శమునకేది ఆశ్రయమో అదియే వాయువు.

భేరీమృదంగాదులందు జనించు శబ్దము దండ హస్తాది ద్రవ్యసంఘర్షణమువలననే జనించుచున్నది. ఇట్లు పర్ణము లందు - ఎండుటాకులయందు - జనించు, చటచట, మర్

మఱ్ - ఆదిశబ్దములును శబ్దములే యగుటవలన రూపవంత మగు ద్రవ్యాభిఘాతము (తాకుడు) కనబడకుండుటచేత, స్పర్శవంతమును వేగవంతమును నగు నొక విలక్షణ ద్రవ్యము యొక్క అభిఘాత ముండి యుండుట అవశ్యము. ఆ స్పర్శ వద్వేగవ ద్ద్రవ్యమే వాయు వనబడును.

మనుష్యుల యాధారము లేక, జలాదులందు నౌకాదుల ధారణము స్పర్శ-వేగము గల ద్రవ్య సంయోగము వలన నేర్పడుచుండుట ప్రత్యక్షమే. ఇట్లే ఆకాశమున తృణములు, మేఘములు, విమానములు తేలుచు ధరింపబడుచున్నవి. వీని ధారణయు నౌకాదుల ధారణవంటిదే యగుట వలన స్పర్శ వేగాది గుణములు గల ద్రవ్యసంయోగము లేని దట్లు ,జరుగ నేరదు. అట్టి ద్రవ్యమే వాయువు.

నదీతీరములందుండు జెల్లు మున్నగునవి నదీప్రవాహపు తాకిడి వలన కంపించుచుండును. అట్లే వృక్షములందును కంపము చూచుచున్నాము. కాని రూపవద్ద్రవ్య సంయోగము లేకయే అది కలుగుచున్నది. అందువలన స్పర్శవద్వేగవ ద్ద్రవ్య సంయోగ మవశ్య ముండి తీఱవలయును. ఆ ద్రవ్యమే వాయువనబడుచున్నది. ఇట్టితరవాయు సాధకానుమానము లూహ్యములు.

అవ : సామాన్యముతో దృష్టలింగము వలన ఆప్త ద్రవ్యాతిరిక్త మగుద్రవ్యము స్పర్శ గుణాశ్రయముగా సిద్ధిం చును. కాని వాయునామ మెట్లు సిద్ధమగును ?

సూ. :- తస్మా దాగమికమ్ ౨.౧.౧౮

**తస్మాత్** = స్పర్శగుణమున కాశ్రయముగా నొక ద్రవ్యము సిద్ధించుట వలన, దానికి వాయువు అను నామము, అగమికమ్= వేదమువలన సిద్ధించి నదని తెలిసికొన వలయును.

("ప్రాణాద్వాయు రజాయత" య. అ. ౩౧. మం. ౧౩)

విరాట్ పురుషునకు వాయువు ప్రాణమయ్యెను.

అవ : వేదము లీశ్వర ప్రణీతము లనుట కెట్టి లింగము సిద్ధింపకపూర్వము వైదిక నామ మెట్లు ప్రమాణమగును ?

సూ. :- సంజ్ఞాకర్మ త్వస్మద్విశిష్టానామ్ లింగమ్ ౨.౧.౧౮

సంజ్ఞాకర్మ = నామ క్రియలు.

'దీని కిది నామము : ఈ నామమున నిది వ్యవహరింప బడును. ఇది యిష్టమైన కర్మము: వర్ణాశ్రమములచే ననుష్ఠింపదగినది: ఇది అనిష్టమగుటచే పరిహరింపదగినది.' అను వేదోక్త నామకర్మములని భావము.

అస్మద్విశిష్టానామ్ = మనుష్యమాత్ర శిరోధార్యములయిన ఋగ్యజుస్సామాథర్వ వేదములు సర్వజ్ఞ తుల్యము లగుటచే విశిష్టగుణవంతులకు, లింగమ్=ఈశ్వర ప్రణీతము లనుటలో హేతువు.

అవ : ఎందువలన ?

సూ. :- ప్రత్యక్ష ప్రవృత్తత్వాత్ సంజ్ఞాకర్మణః ౨.౧.౧౯

సంజ్ఞాకర్మణః = నామము, క్రియ, ఈ రెండును, ప్రత్యక్ష ప్రవృత్తత్వాత్ = ప్రత్యక్షగమ్య విషయములందే వర్తించును.

భూత భవిష్యద్వర్తమానములు,. దూరస్థ సమీపస్థములు, ఇష్టానిష్టములు నన్నియు నెవనికి ప్రత్యక్షములో వాడే ఆ యా విషయములకు నామకరణము చేయగలడు. అట్టివాడే సంధ్యా వందనము, అగ్నిహోత్రాది కర్మములు–ఇష్టమును సాధించు నవిగా విధించుటకును, హింసా మాంసాశన సురాపానాదు లనిష్టసాధకములుగా నిషేధించుటకును సమర్థుడగుచున్నాడు. ఈ నామకరణమునందును, క్రియల విధి నిషేధములందును అస్మాదృశులగు జీవులు సమర్థులు కారు. జీవుల జ్ఞానము సీమితమై, ఉపదేశాధీనమై యుండు టెల్లరు నెఱిగిన విషయమే. కావున పరమేశ్వరుడే ప్రథమమున నీ నాలుగు వేదములద్వారా సంజ్ఞా కర్మములను ప్రవర్తింప జేసెనని యొప్పుకొనవలసి యుండును. ఇట్లాగమము లీశ్వర ప్రణీతము లగుట, వాని ప్రామాణ్యము నిస్సందిగ్ధమని యెఱుంగ వలయును. వానివలన నేర్పడిన సంజ్ఞయు ప్రమాణమే యని వేఱే చెప్పనక్కఱలేదని భావము.

ఆదియందు వేదములవలననే నామకర్మములు ప్రవర్తించునట్లు మను మహారాజుకూడ తన ధర్మశాస్త్రమున నుల్లేఖించి యుండుట చూడనగును.

శ్లో॥ సర్వేషాం తు సనామాని కర్మాణి చ పృథక్ పృథక్
వేదశబ్దేభ్య ఏవాదౌ పృథక్సంస్థాశ్చ నిర్మమే....” ౧. ౨౧

ప్రజాపతి లోకమున వ్యక్తుల నుద్దేశించి నామక్రియల వ్యవస్థలు, వేదశబ్దములద్వారా యేర్పఱచె నని భావార్థము.

అవ ; ఇట్లు వాయులక్షణ నిరూపణముచేసి ఆకాశ మెట్లు సిద్ధించుచున్నదో సూత్రకారుడు నిరూపించుచున్నాడు.

**సూ.** : నిష్క్రమణం ప్రవేశన మిత్యాకాశలింగమ్ ౨.౧.౨౦

నిష్క్రమణమ్ = స్పర్శవంతమగు ద్రవ్యముయొక్క బహిర్గమనము, ప్రవేశనమ్ = అంతర్గమనము, ఇతి = ఈ రెండు విధములగు క్రియలు, అకాశలింగమ్ = ఆకాశమును సిద్ధింపజేయు లింగములు.

అంతర్బహిర్గమనములు అవకాశ మున్నపుడే కలుగగలవు. అవకాశ మీయకున్న నివి కలుగనేరవు. అందువలన నీ రెండు విధములయిన కర్మములను హేతువులుగా తీసికొని ఆకాశము-అవకాశమిచ్చు ద్రవ్యము ఒకటి యున్నదని యూహింపనగును.

అవ : ఉపర్యుక్త హేతువునందు దోషము ప్రకటించుచున్నాడు.

**సూ.** :- తదలిఙ్గ మేకద్రవ్యత్వా త్కర్మణః ౨.౧.౨౧

పూర్వసూత్రమునుండి 'ఆకాశస్య' అను పదమిందు గ్రహింపవలయును, ఆకాశస్య = ఆకాశమునకు, తత్ = నిష్క్రమణ ప్రవేశాత్మకమగు కర్మము, అలిఙ్గమ్ = లిఙ్గము కానేరదు, ఎందువల్లనన, కర్మణః = పై జెప్పిన నిష్క్రమణాద్యాత్మకమగు కర్మము, ఏక ద్రవ్యత్వాత్ = ఒక్క ద్రవ్యమునందే సమవేతమయి యుండుటవలన.

ఏ పదార్థము నిష్క్రమించుచున్నదో లేక ప్రవేశించుచున్నదో ఆ పదార్థమందే నిష్క్రమణ ప్రవేశన రూపమగు కర్మము సమవాయసంబంధమున నుండుటచే నా కర్మము

మఱియొక (నిష్క్రమణ ప్రవేశనాత్మక క్రియలుగల పదార్థము కంటె భిన్నమైన) పదార్థము నెట్లు సిద్ధింప జేయగలదు? ఒక ద్రవ్యమునకు సంబంధించిన క్రియ మఱియొక ద్రవ్యమును సాధించుటకు హేతువు కానేరదు అని భావము.

సూ. :- కారణాంతరానుక్లుప్తి వైధర్మ్యాచ్చ ౨.౧.౨౨

సమవాయ కారణముకంటె భిన్నమైన కారణమిట కారణాంతర పదముచే గ్రహింపవలయును. అనగా అసమవాయి నిమిత్త కారణములు, అనుక్లుప్తి = లక్షణము, కారణాంతరానుక్లుప్తి వైధర్మ్యాచ్చ=సమవాయి నిమిత్త కారణముల లక్షణము కూడ ఆకాశమునందు లేకుండుటవలన ఆకాశము నిష్క్రమణాది కర్మ కారణమను హేతువువలన సిద్ధింపనేరదు.

ఆకాశము సర్వగతమై సర్వకాలమందుండును గనుక, కార్య నియత పూర్వ వృత్తిత్వాదిరూప కారణలక్షణముఅందు వర్తింపనేరదు. ఆకాశమునందు కారణత్వమే సిద్ధింపనపుడు నిష్క్రమణ ప్రవేశన క్రియలకు కారణ మగుటచే నాకాశమను ద్రవ్యమొకటి కలదనుట యుక్తి విరుద్ధమని భావము.

అవ : సమాధానము.

సూ. :- సంయోగాదభావః కర్మణః ౨.౧.౨౩

సంయోగాత్ = క్రియాజన్య సంయోగము ఆకాశమునందు సమవాయ సంబంధమున నుండుటవలన, కర్మణః = నిష్క్రమణ ప్రవేశన క్రియలయొక్క, అభావః=సమవాయము లేదు.

కర్మమనగా క్రియ. ఆ క్రియ ధాత్వర్థమే యగుటవలన ఫలము, వ్యాపారమునని రెండు విధములు. ప్రస్తుతము నిష్క్రమణ ప్రవేశములు వ్యాపారాత్మకములు. ఈ వ్యాపారము వలన ప్రవేశించునట్టియు నిష్క్రమించునట్టియు ద్రవ్యము యొక్క సంయోగము ఫలరూప మగును. ఈ ఫలాత్మక సంయోగము ఆకాశమునందు సమవాయసంబంధమున నుండును. సంయోగ గుణము రెండు ద్రవ్యములందు సమవాయ సంబంధమున నుండును కాబట్టి ప్రత్యక్షముగా చూడబడు నిష్క్రమణాది వ్యాపారమున కాశ్రయ భూతమగు ద్రవ్యమెట్లు సంయోగమునకు సమవాయికారణమో అట్లే ఆకాశమును సమవాయికారణమగును. కాబట్టి ఆకాశమున కారణత్వము సిద్ధింపదనుట అసంగతము. 'నియత పూర్వ వృత్తిత్వమ్ కారణత్వం'-నియమముగా కార్యమునకు పూర్వ ముండుటయే కారణలక్షణము. అట్టి లక్షణము ఆకాశమందు వర్తించుట కెట్టి యాటంకము లేదు. ఇట్లు కారణత్వము సిద్ధించుటచే నిష్క్రమణాది క్రియాహేతుకమగు నాకాశ సిద్ధిలో దోషము లేదని తాత్పర్యము.

వస్తు నిష్క్రమణ ప్రవేశములు ఆకాశ సిద్ధియందు హేతువులుగా నుపపాదింపబడినవి. మఱియు శబ్దము పృథివ్యాది అష్టద్రవ్యముల గుణము కాకపోవుటచే ఆకాశగుణమే అగును. కనుక <u>శబ్ద గుణకమాకాశమని</u> నిరూపింపదలచి పూర్వము పృథివ్యాది భూతచతుష్టయము శబ్దమున కాశ్రయము కాదని ప్రతిషేధించుచు తదనుగుణముగా భూమికను రచించు చున్నారు.

సూ. :- కారణ గుణపూర్వకః కార్యగుణో దృష్టః ౨.౧.౨౪

కార్యగుణః = ఘటపటాది కార్యములందుగల రూపాది విశేష గుణము, కారణ గుణపూర్వకః=ఘటకారణ కపాలములయు, పటావయవ తంతువులయు రూపాదివిశేషగుణమే కారణముగా గలదని, దృష్టః = చూడబడినది.

కారణమునందు సమవాయ సంబంధమున నుండు గుణములే కార్యమునం దుండును. కారణమునందు లేని గుణము కార్యమునందు రానేరదు. కారణమునందుండు గుణములు కార్యమునందు రాకుండుటకు నవకాశము లేదు. కారణ గుణమునకు సర్వదా విలక్షణమైన గుణములు కార్యమునందు జూడనేరము. అందువలన కార్యమునందుండు గుణములను జూచి కారణమునం దా జాతిగుణము లుండిన ట్లూహించుట కెట్టి సందియము నుండజాలదు. ఇట్లే కార్యమునలేని గుణములు కారణమున నుండవని యూహింపవచ్చునని తాత్పర్యము.

అవ : కార్య గుణములు కారణ గుణ పూర్వకము లయినందున నేమి ప్రయోజనము ?

సూ. :- కార్యాంతరాఽప్రాదుర్భావా చ్ఛబ్దః
స్పర్శవతా మగుణః ౨.౧.౨౫

కార్యాంతరాఽప్రాదుర్భావాత్ = భేరీమృదంగాదులందు దండాద్యభిఘాతము వలన జనించు శబ్దము భేర్యాదులను విడిచి ఘటపటములందు జనింపకుండుటవలన, శబ్దః = శబ్దము

స్పర్శవతామ్=పృథివీ జలతేజో వాయువుల యొక్క, అగుణః=
విశేషగుణము కాదు.

స్పర్శగుణముగల పృథివీ జలతేజో వాయువులందు శబ్దముండి యుండిన భేర్యాదులలో నెట్లభివ్యక్త మగుచున్నదో అట్లే యితర ఘటపటాదులలో నది వ్యక్తము కావలసి యుండును. కాని అట్లభివ్యక్త మగుటలేదు. అందువలన శబ్దము స్పర్శవంతములగు ద్రవ్యముల గుణము కాదని భావము. స్పర్శవద్ద్రవ్య కార్యములగు ఘటపటములందొక దానియందు ప్రాదుర్భూతములగు రూపాది గుణములు తత్స జాతీయ కార్యాంతరములందన్నిటిలోను జూడబడుచున్నవి. అట్లు శబ్దము చూడబడుటలేదు. రూపాది గుణములు భేరీ ఘటపటములందు ఆ పదార్థము లున్నంత వఱకుండును. శబ్ద మట్లుగాక భేరీలో నభివ్యక్తమయిన కొన్ని క్షణముల కది నశించుచున్నది. భేర్యాదుల జూడబడు రూపాది విశేష గుణములు వస్తువును విడిచి యన్యత్ర చూడబడవు. శబ్ద మందుకు విపరీతముగా భేరీలో నభివ్యక్తమయి దానికి దూరములోనున్న వ్యక్తులచే గ్రహింపబడుచున్నది. అందు వలన రూపాదులవలె శబ్దము స్పర్శవంతములగు పృథివ్యాది ద్రవ్యముల గుణము కానేరదని భావము.

అవ : శబ్దము పృథివీ జలతేజోవాయువృత్తి-వాయువు లందుండు గుణము - కాకున్నను కాల దిగాత్మ మనస్సులలో నొకదాని గుణమేల కాదు ?

సూ. :- పరత్ర సమవాయాత్ ప్రత్యక్షత్వాచ్చ
నాత్మగుణో న మనోగుణః ౨.౧.౨౬

శబ్దము, పరత్ర=ఆత్మాతిరిక్త పదార్థములలో. సమవాయాత్= సమవాయ సంబంధమున నుండుటవలన, ప్రత్యక్షత్వాచ్చ = శ్రవణేంద్రియముచే గ్రహింపబడుటచేతను, నాత్మగుణః = ఆత్మగుణము కాదు, న మనోగుణః=(మనస్సు దిక్కాలములకు గూడ బోధకము) దిక్కు, కాలము, మనస్సు - వీని గుణము కానేరదు.

శబ్దము ఆత్మగుణమే యగుచో బహిరింద్రియమగు శ్రోత్రముచే గ్రహింపబడదు. శ్రోత్రగ్రాహ్య విశేష గుణమగుటచే శబ్దము దిక్కాల మనస్సుల గుణమును కానేరదని భావము.

అవ : శబ్దము పైన చెప్పిన యెనిమిది ద్రవ్యములకు సంబంధించిన గుణము కానందువలన ఆకాశమెట్లు సిద్ధించును ? అనగా,

సూ. :- పరిశేషాల్లింగ మాకాశస్య ౨.౧.౨౭

శబ్దము గుణము. అందువలన నేదోయొక ద్రవ్యము నాశ్రయించి యుండుటావశ్యకము. పృథివ్యాదులయిన యెనిమిది ద్రవ్యములు శబ్దమున కాశ్రయములు కావు. దాని కాశ్రయభూతమగు గుణి యేదిగలదో అదియే ఆకాశమని పరిశేష న్యాయమున, ఆకాశస్య = ఆకాశ సిద్ధికి, లింగమ్=హేతువు అని అర్థము.

అవ : పరిశేషన్యాయమున నాకాశము సిద్ధించినను అది ద్రవ్యమనియు,వ్యవహారమున నిత్యమనియు నెట్లు సిద్ధించును?

సూ. :- ద్రవ్యత్వనిత్యత్వే వాయునా వ్యాఖ్యాతే ౨;౧.౨౮

ఆకాశము యొక్క. ద్రవ్యత్వ నిత్యత్వే = ద్రవ్యత్వము, నిత్యత్వమును. వాయునా = వాయువుద్వారా, వ్యాఖ్యాతే = వ్యాఖ్యానము చేయబడినవి.

ఆకాశము శబ్దాది గుణములు కలిగి యుండుటవలన ద్రవ్యమనియు, అవాంతర సృష్టి సమయములందు కారణభూత ద్రవ్యాంతరము వలన నుద్భవింపకుండుటచే నిత్యమనియు నెఱుంగవలయునని భావము.

అవ : ఆకాశమున నేకత్వ మెట్లు సిద్ధించును ?

సూ. :- తత్త్వం భావేన ౨.౧.౨౯

తత్త్వమ్ = ఏకత్వము, భావేన=సత్తా అను పదార్థము ద్వారా సిద్ధించుచున్నదని అర్థము.

సత్తా అను పదార్థ మెట్లు ఏకమో అట్లే ఆకాశమునని భావము. 'సత్' అను హేతువుగలదగుటచేతను భేదబోధకమగు విశేషలింగము లేకుండుట చేతను 'సత్తా' ఒక్కటే అని సిద్ధించుచున్నది.

అవ : ఆకాశమొక్కటే అని యెట్లు సిద్ధింపగలదు ?

సూ. :- శబ్దలింగాఽవిశేషాద్విశేష లింగాభావా చ్చ ౨.౧.౩౦

శబ్దలింగాఽవిశేషాత్ = ధ్వనిరూప లింగమున భేదము లేకుండుట వలన, విశేషలింగా భావాచ్చ = భేదమును బోధించు

మఱియొక హేతువు లేకుండుటవలనను ఆకాశమున నానా త్వము లేదని యర్థము.

ఆకాశ మొకే ద్రవ్య మనుటకు కారణము శబ్దము. ఆ శబ్దము సర్వత్ర విశిష్టమై యుపలబ్ధమగుచున్నది. భేదమున కాకాశ మాశ్రయ మైనట్లు బోధింపగల లింగాంతర మేమియు కానరాదు. అందువలన ఆకాశమున నానాత్వము లేదని భావము.

సూ. :- తదనువిధానా దేక పృథక్త్వం చేతి ౨.౧.౩౧

తదనువిధానాత్ = ఏకత్వము ననువిధించుటవలన (ఏకత్వా నువిధిః = యత్ర యత్రైకత్వం తత్రతత్ర పృథక్త్వమ్, ఏకత్వ మున్నచోట ఏక పృథక్త్వ ముండునని యర్థము.) ఏకపృథక్త్వమ్ = ఏకపృథక్త్వము.

ఆకాశమునం దేకపృథక్త్వము సైత ముండునని భావము. ఈ సూత్రమున ఇతి శబ్దము ఆహ్నిక సమాప్తిని బోధించుచున్నది.



# ద్వితీయాధ్యాయము

## ద్వితీయాహ్నికము

అవ : శాస్త్రరీతి ననుసరించి పూర్వాహ్నికమున పృథివ్యాదులకు చెప్పబడిన లక్షణము నిందు పరీక్షింపదలచి పృథివీ లక్షణమగు గంధము జలాదులందు జూడబడుచున్నను అది యౌపాధికమని నిరూపించుచున్నాడు.

ఔపాధికము = అన్యపదార్థజన్యము.

సూ. :- పుష్పవస్త్రయోః సతి సన్నికర్షే గుణాంతరాప్రాదు
ర్భావో వస్త్రే గంధాభావలింగమ్ ౨.౨.౧

పుష్పవస్త్రయోః = పుష్పవస్త్రములకు, సతి సన్నికర్షే=సంయోగము ఏర్పడినపుడు, గుణాంతరాప్రాదుర్భావః=పుష్పపు వాసన వస్త్రములో వచ్చినప్పటికి వస్త్రకారణములగు తంతువుల కది యేర్పడకుండుటయే, వస్త్రే గంధాభావలింగమ్ = వస్త్రమున పుష్పగంధము లేదనుటకు హేతువు.

వస్త్రమునందు జూడబడు పుష్పగంధము వస్త్రముయొక్క స్వాభావికగుణము కానేరదు. ఔపాధికముమాత్రమే అగును. పుష్ప సంయోగముచే గలిగినది. అట్లే జలాదుల గనబడు గంధము వాని స్వాభావికము కాదు. పృథివీ సంయోగముచే

నందు జూడబడుచున్నది. అందువలన గంధము జలాదు లందు ఔపాధికమని యెఱుంగవలయునని తాత్పర్యము.

అవ : జలాదులందు గంధములేకున్న మఱియెట నున్నదన ?

సూ. :- వ్యవస్థితః పృథివ్యాం గంధః ౨.౨.౨

గంధః = మంచి, చెడు అనుభేదములతోకూడిన వాసన, పృథివ్యాం = భూమిలో, వ్యవస్థితః = స్వాభావికగుణమై యున్నది.

జలాదులందు గంధము స్వాభావికముకాక, పుష్పవస్త్ర సంయోగముచే వస్త్రమున పుష్పగంధము సంక్రమించినట్లు సాంక్రామిక మగుటచేత, పృథివిలో – అస్వాభావికమగుటకు హేతువు కానరామి, గంధము పృథివికి స్వాభావికగుణమై అసాధారణ ధర్మమగుచున్నది. అందువలన జలాదులం దతివ్యాప్తి లేదు, పృథివి గంధవతియను లక్షణము నిర్దుష్టమే యని భావము.

అవ : పృథివీలక్షణ పరీక్షానంతరము జలాదుల లక్షణ ములను పరీక్షించుచు తత్ప్రకారము నిందతిదేశించుచున్నాడు.

సూ. :- ఏతేనోష్ణతా శీతతా చ వ్యాఖ్యాతా ౨.౨.3

ఏతేన = పూర్వసూత్రమున నుదాహరించిన గంధముయొక్క స్వాభావికత, అస్వాభావికతల వ్యవస్థద్వారా, ఉష్ణతా శీతతా చ = ఉష్ణత్వము, శీతత్వము అనుగుణములు కూడ,

వ్యాఖ్యాతా = ఒకద్రవ్యమున స్వాభావికములనియు నన్యత్ర అస్వాభావికములనియు చెప్పినట్లు ఎంచవలయునని యర్థము.

అవ : ఇట్టి వ్యాఖ్యానమునకు ఫలమేమన ?

సూ. :- తేజస ఉష్ణతా ౨.౨.౪

ఈ సూత్రమున పై సూత్రమునుండి 'వ్యాఖ్యాతా' అను పద మనువర్తించును.

తేజసః = తేజోద్రవ్యమునకు, ఉష్ణతా = ఉష్ణగుణము; వ్యాఖ్యాతా = స్వాభావిక మగుటచేత లక్షణమని వ్యవస్థాపించి నట్లు తెలిసికొనవలయునని యర్థము.

స్వాభావిక-ఉష్ణగుణము తేజమునకు లక్షణమని భావము. జలములందగపడు ఉష్ణ మస్వాభావిక మగుటచే ననగా నౌపాధికమగుటచే లక్షణమున నతివ్యాప్తి లేదని తాత్పర్యము.

సూ. :- అప్సు శీతతా ౨.౨.౫

అప్సు = జలమున. శీతతా = స్వాభావికమైన శీతము లక్షణముగా వ్యాఖ్యానము చేయబడినదని యర్థము.

చలువరాయి మున్నగు జలేతర ద్రవ్యములందు జూడబడు శీతలత ఔపాధిక మగుటచే నతివ్యాప్తి లేదని భావము.

ఇక్కడ ఉద్దేశ క్రమమును విడిచి జలలక్షణమునకు పూర్వము అగ్నిద్రవ్యలక్షణమును గుఱించి వ్రాయుటవలన,

నింతకు పూర్వమే ప్రథమాహ్నికముననే వాయులక్షణము పరీక్షింపబడి యుండుటను సూత్రకర్త సూచించుచున్నాడు- అని యెఱుంగదగును.

అవ : ఇట్లు పృథివి - జల - వాయు తేజోద్రవ్యముల లక్షణములు పరీక్షింపబడినవి. ఆకాశలక్షణమగు శబ్దము ముందు పరీక్షింపబడును. ప్రస్తుతము కాలలక్షణము పరీక్షింప దలచి దానియునికిని తెలుపు లింగములను ప్రదర్శించు చున్నాడు.

సూ. :- అపరస్మి న్నపరం యుగప చ్చిరం
క్షిప్రమితి కాలలింగాని ౨.౨.౬

ఈసూత్రమున 'అపరస్మి న్నపరం' అను పదము 'పరస్మిన్ పరమ్' అను పదమును గూడ బోధించును.

అపరస్మిన్ = కొలది సూర్య పరిస్పందములతో సంబద్ధుడగు యువకునిలో, అపరమ్ ఇతి = ఒకానొక వృద్ధునికంటె చిన్నవాడు అనుజ్ఞానము, పరస్మిన్ = అధిక సూర్యస్పందము లతో సంబద్ధుడగు వృద్ధునిలో, పరమ్ ఇతి = ఒకానొక యువకునికంటె వృద్ధుడు అనుజ్ఞానము. యుగపత్ = ఒకే మాటు పుట్టుచున్నారు; ఒకేమాటు చేయుచున్నారు; ఒకేమాటు చదువుచున్నారు; అను వాక్యప్రయోగములలో నుండు ఒకే మాటు అనుజ్ఞానము. చిరమ్ = 'చిరము" జీవించుచున్నాడు. నేను వచ్చి 'చిర'మయినది. అను నిట్టి ప్రయోగముల వలన నేర్పడు చిరము అనుజ్ఞానము, క్షిప్రమ్ = త్వరగా వచ్చు చున్నాడు; త్వరగా చేయుచున్నాడు అను నిట్టిప్రయోగము

యుండుగల ద్విత్వజ్ఞానము అపన్నము, కాలలింగాని = కాల మునకు నొక ద్రవ్యమున్నదనుటకు హేతువులు.

ఏవని శరీరముకంటె నెవని శరీరమునకు అధిక సూర్య స్పందములతో (స్పందన క్రియావిశేషములతో) సంబంధ ముండునో వాడు స్థవిరుడనియు-వృద్ధుడనియు - పరుడనియు చెప్పబడును. అతనికంటె తక్కువ సూర్యస్పందములతో సంబంధము కలవాడు యువకుడు, అపరుడు ననియు చెప్ప బడును.

పరత్వము = జ్యేష్ఠత్వము - అపరత్వము=కనిష్ఠత్వము అని భావము. వృద్ధ యువక శరీర (పిండ)ములతో సూర్య పరిస్పందములకు సాక్షాత్సంబంధము లేదు. ఎందువల్లనన నీ పిండములు సూర్యుని కతిదూరముననుండునవి. అంతియు గాక సూర్య పరిస్పందములు సూర్యునిలోనే సమవాయ సంబంధమున నుండును. వీని సంబంధము లేక వృద్ధ యువక పరాపర శబ్దముల ద్వారా యేర్పడు జ్ఞానము కలుగ నేరదు. పృథివ్యాదులు వ్యాపకములు కాకపోవుటచేత పిండ సూర్య పరిస్పందములకు సంబంధము కలిగింపనేరవు. అందు వలన భూమ్యాదుల కంటె భిన్నముగు నొక యచేతన ద్రవ్యము సమవాయ సంబంధమున పరిస్పందముల కాధారమగు సూర్యునితో సంయుక్తమై యిటు వృద్ధయువక పిండములతోను సంబద్ధమై యుండు టావశ్యకము. అప్పుడే స్వ స మ వా యి సంయుక్త సంయోగమను సంబంధముతో సూర్య పరిస్పంద ములు పరాపర (స్థవిర యువా) శబ్దములచే వ్యవహరింపబడు పిండములతో సంబద్ధములై పరాపర జ్ఞానమునకు హేతువు

లగును. ఇట్లు సూర్యపరిస్పందములకును పిండములకును సంబంధము కల్పించుద్రవ్యమే కాలమనబడుచున్నది. స్వసమవాయిసంయుక్త సంయోగసంబంధమును లక్ష్యమున వినియోగించు టెట్లన: స్వమ్=పరిస్పందము, స్వసమవాయి= పరిస్పందసమవాయి - సూర్యుడు, తత్సంయుక్తః = సూర్యునితో సంయోగము కలది కాలము, తత్సంయోగః = అకాల సంయోగము పిండములతో, ఇట్టి సంబంధముతో సూర్యునియందున్న పరిస్పందములు పిండములతో సంబద్ధములై పరాపర శబ్ద ప్రయోగములకు హేతుభూతము లగుచున్నవి. ఇట్లే యుగపత్. చిరాది జ్ఞానముల నూహింపవలయును.

ఒక్క సూర్య పరిస్పందముతో కూడిన కాల సంబంధి క్రియలు యుగపత్ జ్ఞానమునకు విషయము. మహత్తరమగు అనేక సూర్య పరిస్పందములతో కూడిన కాల సంబద్ధమగు క్రియ చిరజ్ఞానమునకు విషయము. అల్పతరమగు ననేక సూర్య పరిస్పందములతో కూడిన కాల సంబద్ధక్రియ క్షిప్రజ్ఞాన విషయము - అని తెలిసికొనవలయును.

అవ: ఇట్లు కాలమను నొక పదార్థము సిద్ధించినను అది ద్రవ్యమనియు వ్యవహారమున నిత్యమనియు నెట్లు తెలియుదగునన.

సూ. :- ద్రవ్యత్వ నిత్యత్వే. వాయునా వ్యాఖ్యాతే ౨.౨.౭

కాలముయొక్క, ద్రవ్యత్వ నిత్యత్వే=ద్రవ్యత్వనిత్యత్వములు' వాయునా = వాయువు ద్రవ్యము నిత్యమునని సాధించు హేతువుద్వారా, వ్యాఖ్యాతే = సాధింపదగినవని వ్యాఖ్యానము చేసినట్లు తెలియదగునని యర్థము.

అవ : ఏకత్వమెట్లు సిద్ధించుననన :

సూ. :- తత్త్వం భావేన ౨.౨.౮

తత్త్వం = కాలముయొక్క ఏకత్వము, భావేన = సత్తా అను పదార్థముద్వారా వ్యాఖ్యానము చేయబడినట్లు తెలియదగునని అర్థము.

పరమార్థమున కాల మనేకము కాకున్నను ఉపాధి భేదమువలన క్షణము, లవము, కాష్ఠ, కల, ముహూర్తము, యామము, అహోరాత్రములు, పక్షము, మాసము, ఋతువు, అయనము, సంవత్సరము, యుగము, కల్పము మున్నగు పేరులతో నొప్పుచున్నది. సూర్యాది పరిస్పందమే ఉపాధి యనబడును.

అవ : పరాపర వ్యవహారమునకు నిమిత్తమై యొక ద్రవ్యము సిద్ధించినను దానికి కాలమను పేరెట్లు గలిగెను ? అది కార్యమాత్రమునకు కారణ మెట్లగునన ? నిరూపించుచున్నాడు.

సూ. :- నిత్యేష్వభావా దనిత్యేషు భావాత్
కారణే కాలాఖ్యేతి ౨.౨.౯

నిత్యేషు = నిత్యపదార్థములలో, అభావాత్=ఒకేసమయమున జరిగినది, జరిగి చిరమైనది, త్వరగా వచ్చెను, ఇప్పుడే పుట్టెను, రాత్రి వెళ్ళెను. ఇట్లు నానావిధ యుగపత్ చిర క్షిప్రాది జ్ఞానములు కలుగకుండుట వలన, అనిత్యేషు = అనిత్య పదార్థములలో, భావాత్ = పైజెప్పిన జ్ఞానములు

కలుగుటవలనను, కార్యమాత్రమునకు అనగా ప్రతి యనిత్య వస్తువునకు కాలము సాధారణ కారణము, కారణే = అట్టి కారణమునకు, కాలాఖ్యా = కాలము అనుపేరు, ఆగమము లందు పేర్కొనబడినది.

ఆకాశము, ఆత్మ మున్నగు నిత్యపదార్థముల విషయమున 'ఇప్పుడు పుట్టెను, అప్పుడు పుట్టెను. త్వరగావచ్చినది' ఇత్యాది పదప్రయోగము లుండవు. అనిత్యపదార్థములయిన ఘటపటాదుల విషయమున 'ఇప్పుడు ఈ ఘటము పుట్టెను. వస్త్రమేర్పడి చిరమైనది. క్షిప్రముగానే వస్త్రమేర్పడినది.' అనునిత్యాది పదప్రయోగములుండును. కావున కాలము అనిత్య పదార్థములన్నిటికి సాధారణ కారణము. దానికి కాలమను పేరు ఆగమముల వలన నేర్పడినది.

"కాలోఽమూం దివ మజనయత్ కాల
ఇమాః పృథివీరుత" (అథర్వ. కాం. ౧౯.౫౪.౫)

కాలము ఈ దివమును, ఈ భూమ్యాది గ్రహములను అథవా పార్థివపదార్థములను సృష్టించెను. అనగా ఈ పదార్థములకు కాలము సాధారణ కారణమని భావము.

అవ : కాలమును పరీక్షించి దిశను పరీక్షించుచున్నాడు.

సూ. :- ఇత ఇదమితి యతస్తద్దిశ్యం లింగమ్ ౨.౨.౧౦

ఇందు పూర్వ సూత్రములనుండి పరాపర శబ్దములు అనువర్తించును.

ఇతః ఇదమ్ పరమ్=దీనికంటె ఇది పరము-దూరము, ఇతః ఇదమ్ అపరమ్ = ఈ ద్రవ్యముకంటె ఇది అపరము -

సమీపవర్తి. ఇతి = అని, యతః = దేనివలన (పరాపర శబ్దములకు విషయము) కలుగుచున్నదో, తత్=అది, దిశ్యం లిఙ్గమ్ = దిక్కును సాధించు హేతువు

క్రియాగుణములు కలిగిన ద్రవ్యము మూర్తద్రవ్య మనబడును. ఒకానొక మూర్తద్రవ్యమును అవధిగా నెంచి మఱియొక మూర్తద్రవ్యము పరమనియో (దూరము) అపరమనియో (సమీపము) వ్యవహరింపబడును. కాశియందున్న పురుషునకు ప్రయాగకంటె కురుక్షేత్రము పరము - దూరము. కురుక్షేత్రముకంటె ప్రయాగ అపరము - సమీపము. ఇట (పరత్వమ్ సంయుక్త సంయోగ భూయస్త్వాశ్రయత్వమ్) పరత్వమనగా సంయుక్త సంయోగ భూయస్త్వాశ్రయత్వమే. అపరత్వమనగా సంయుక్త సంయోగాల్పత్వాశ్రయత్వము కాశిలోనున్న పురుషునితో సంయుక్తమైనది కాశి భూప్రదేశము. దాని సంయోగము తత్పరవర్తి భూప్రదేశమున నుండును. ఇట్లనేక సంయోగములు కలిగినగాని కురుక్షేత్రాదులను సమీపించుటకు వీలులేదు. ఇట్టి సంయోగములు భూమియందు సమవాయ సంబంధమున నుండును. కావున ప్రయాగ కురుక్షేత్రములను బోధింపనేరవు. అందువలన కాశిలోగల పురుషునకు ప్రయాగాదులకు మధ్య సంబంధముల నందజేయుటకొక పదార్థముండి యుండవలయును. అదియే దిశ యనబడును.

అవ : దిశయను పదార్థము సిద్ధించినను ద్రవ్యత్వాదులెట్లు సిద్ధించును ?

సూ. :- ద్రవ్యత్వ నిత్యత్వే వాయునా వ్యాఖ్యాతే

సూ. :- తత్త్వం భావేన 2.2.12

వాయువువలె దిశయు ద్రవ్యమనియు, వ్యావహారిక నిత్యమనియు నెఱుంగునది. సత్తాయను పదార్థము ఒక్కటే యైనట్లు దిశయు నొక్కటే యనియు తెలిసికొన వలయునని భావము.

అవ : దిక్కు ఒక్కటేయైన పూర్వ పశ్చిమాది భేదముల నెట్లు పేర్కొనబడుచున్నదన :

సూ. :- కార్యవిశేషేణ నానాత్వమ్ 2.2.13

కార్యవిశేషేణ = సూర్య సంయోగ రూపమగు నుపాధియను కార్య విశేషముద్వారా, నానాత్వమ్ = పూర్వపశ్చిమాది భేదములతో దిక్కు వ్యవహరింపబడును.

అవ : ఉపర్యుక్తమునే వివరించుచున్నాడు.

సూ. :- ఆదిత్య సంయోగాత్ భూతపూర్వాత్
భవిష్యతో భూతాచ్చ ప్రాచీ 2.2.14

భూతపూర్వాత్=సర్గారంభ కాలపు-భూత కాలపు, భవిష్యతః= భావికాలపు, భూతాత్ = వర్తమానకాలపు, ఆదిత్య సంయోగాత్ = సూర్య సంయోగమువలన, ప్రాచీ = (ప్రాగస్యోమంచతీతి) పూర్వదిశ యని వ్యవహరింపబడుచున్నది.

సర్గారంభమున సూర్య భగవాను డే దిశయందు ప్రథమమున నుదయించెనో ముందు (భావి) కాలమున నెట నుద

యించునో. ప్రస్తుతమున (వర్తమానమున) నెట నుదయించు చున్నాడో అదియే పూర్వదిశ యని భావము.

సూ. :- తథా దక్షిణా ప్రతీ చ్యుదీచీ చ ౨.౨.౧౫

అట్లే దక్షిణ పశ్చిమోత్తర దిశలను తెలియునది.

సూ. :- ఏతేన దిగంతరాలాని వ్యాఖ్యాతాని ౨.౨.౧౬

పూర్వాది దిశల నిరూపించిన ప్రకారమున నాగ్నేయాది దిగంతరాలమును (మూలలు) వ్యాఖ్యానము చేసినట్లు తెలిసి కొన వలయునని భావము.

దిక్కు వస్తుతః ఒక్కటే యైనను పూర్వ పశ్చిమాది నామములతో దశవిధముల నొప్పుచున్నది. (తత్ర సూర్యోదయ సన్నిహితా దిక్ ప్రాచీ) సూర్యోదయమునకు సమీపముగా నుండునది పూర్వము. (తద్వ్యవహితా దిక్ ప్రతీచీ) దూర ముగా నుండునది పశ్చిమము. (ప్రాచ్యభిముఖ స్థిత పురుష వామదేశావచ్ఛిన్నా ది గుదీచీ) తూర్పున కెదురుగానున్న పురు షుని యెడమభాగము ఉత్తరము. (తావృక్ పురుష దక్షిణ దేశావచ్ఛిన్నాది గవాచీ) అతని కుడిభాగము దక్షిణము. ఇట్లితరములగు మూలలు ఊర్ధ్వాధో భాగము లూహింపదగినవి.

అవ : దిక్కును పరీక్షించి ప్రస్తుతము ఆకాశలక్షణ మగు శబ్దమును పరీక్షింపనెంచి ముందు సంశయమును ప్రదర్శించుచున్నాడు.

సూ. :- సామాన్య ప్రత్యక్షాత్ విశేషాప్రత్యక్షాత్
విశేష స్మృతేశ్చ సంశయః ౨.౨.౧౭

సామాన్య ప్రత్యక్షాత్=ఉభయకోటి సహచరితమగు సాధారణ ధర్మమైన ఉన్నతత్వము మున్నగువాని ప్రత్యక్షప్రాప్తివలన. విశేషాప్రత్యక్షాత్ = ఒకేపదార్థమున వర్తించు నసాధారణ ధర్మములైన వక్రతా కోటరముల లేక హస్తపాదాదుల యనుప లబ్ధివలన, విశేష స్మృతేశ్చ = విశేషము-సామాన్య విశేష మగు స్థాణుత్వ పురుషత్వముల ఉపస్థితివలన, సంశయః = ఇదియేమి ? స్థాణువా లేక పురుషుడా ? యను సంశయము కలుగును, అని యర్థము.

దూరము, అల్పప్రకాశము నను దోషముల వలన నెదుట నున్న యొక పదార్థమును జూచి యందు స్థాణుపురుషులందు సమానముగా వర్తించు నున్నతత్వాది గుణముల జ్ఞానము కలుగుటవలనను, వస్తునిర్ధారణ కనుకూలించు విశేష ధర్మము లగు వక్రతా కోటరాదులుగాని, శిరఃపాణ్యాదులుగాని లభింప కుండుటచేతను, పూర్వానుభూతములగు స్థాణుత్వ పురుషత్వ ము లను సామాన్య విశేషములు - అపరజాతులు స్మృతి రూపమున నుపస్థితములగుటచేతను, చూచుచున్న పురుషున కిది స్థాణువా, పురుషుడా యను సందియము కలుగును.

(ప్రతిపత్తుః సామాన్యాశ్రయత్వేనావధారితే ధర్మిణి విశేషానవధారణాత్మకో యః ప్రత్యయో జాయతే స ఏవ సంశయ ఇతి భావః)

ప్రతిపత్తుః = జ్ఞాతకు (ఎదుటి వస్తువును తెలిసికొను వానికి) రెండు వస్తువులలోని సమాన ధర్మజ్ఞానము కలిగిన ధర్మి (వస్తువు) యందు వాని విశేష ధర్మజ్ఞానము కలుగ

కుండుటవలన ఏర్పడు-ఆవస్తువు ఇదియా, అదియా, యను-జ్ఞానము సంశయ మనబడును.

ఒక పదార్థమునందు పరస్పర విరుద్ధ ధర్మములతో గూడిన జ్ఞానము సంశయమని వివేకము. సంశయజ్ఞానమునకు ముఖ్యకారణము ఉభయ సాధారణ ధర్మజ్ఞానమని యెఱుంగవలయును.

అవ :-సంశయమునకు ముఖ్య కారణమయిన సామాన్య ధర్మ మెట్లుండ వలయునన :

సూ. :- దృష్టం చ దృష్టవత్ ౨.౨.౧౮

దృష్టం చ= సంశయమునకు ఆధారభూత వస్తువునందు జూడబడిన ఉన్నతత్వము మున్నగు సామాన్యధర్మము, దృష్టవత్= పూర్వము స్థాణు పురుషులందు జూడబడిన ఉన్నతత్వాదులకు తుల్యమై యుండవలయును.

స్థాణుపురుషులందు సమానముగానుండు ఉన్నతత్వాది గుణములు కాలాంతరమున భిన్నస్థానమున, నెదుటనున్న యొక వస్తువునందు జూచినపుడు పూర్వము తాను తెలిసికొని యున్న స్థాణుత్వ పురుషత్వములు స్మరింపబడి స్థాణుపురుషుల విశేష గుణములగు వక్రతా కోటర శిరః పాణ్యాదుల జ్ఞానము కలుగకుండుటవలన స్థాణువా, పురుషుడా అను సంశయము గలుగును. అందువలన ప్రస్తుతము ఎదుట జూచుచున్న ఉన్నతత్వము మున్నగు సామాన్యగుణము, పూర్వము తాను స్థలాంతరమున జూచిన ఉన్నతత్వము

మున్నగు గుణములు సమానమై యుండుట సంశయమునకు ఆవశ్యకము.

అవ : సంశయ లక్షణమేమో చెప్పబడినది. దానికి ముఖ్య కారణమును వర్ణింపబడినది. ఆ సంశయము విషయ భేదమువలన రెండువిధములు. మొదటిది బాహ్య విషయిక సంశయము, రెండవది అభ్యంతర విషయిక సంశయము. బాహ్య విషయిక సంశయమును వివరించుచున్నాడు.

సూ. ;- యథాదృష్ట మయథా దృష్టత్వా చ్చ ౨.౨.౧౯

యథాదృష్టం = ఒకప్పు డొకవ్యక్తి యే విధముగా జూడ బడెనో, అయథా దృష్టత్వాత్ చ = ఆ వ్యక్తియే తద్విపరీత ముగా జూడబడినందు వలన - కాలాంతరమున విశేష ప్రత్య క్షము కానందున నావ్యక్తియందు సంశయము కలుగును.

చైత్రుడను నొక మనుష్యుడు ముందు జటారహితుడుగా జూడబడెను. అతడే మఱియొకప్పుడు జటాసహిత శిరస్కుడై చూడబడెను. కాలాంతరమున నావ్యక్తి యుపగుంఠిత శిరస్కు డై (ముసుగు వేసికొని) కనబడెను. అప్పుడతడు చైత్రుడని సామాన్యముగా తెలియబడినను ముసుగుండుట వలన జటిలుడా ? ముండిత శిరస్కుడా ? అను సంశయము కలు గును. ఇది యెదుట నున్న వస్తువునందు విశేషగుణాను స్మరణ పూర్వకముగా నేర్పడు బాహ్య విషయిక సంశయ మనబడును.

అవ : అంతర విషయిక సంశయము నుపపాదించు చున్నాడు.

సూ. :- విద్యాఽవిద్యాతశ్చ సంశయః ౨.౨.౨౦

విద్యాతః = యథార్థ జ్ఞానముపలన, అవిద్యాతః చ = భ్రమ జ్ఞానము వలన కలుగు, సంశయః = సంశయము ఆంతర విషయిక సంశయమనబడును.

ఒకప్పుడు జలమును జూడ నిది జలము అను యథార్థ జ్ఞానము కలిగినది. మఱియొకప్పుడు ఎండమావులను జూచి యిది జలము అను భ్రమజ్ఞానము కలిగినది. ఇట్లు జలవిషయికమైన యథార్థజ్ఞానము భ్రమజ్ఞానము కలిగిన తరువాత నా పురుషునకే వృక్షసంఘమునం దొకచో జలసూచక నిమిత్తమును జూడ నిది జలము అను జ్ఞానము కలిగినది. అప్పుడా పురుషుని మనసున పూర్వమతనికి కలిగిన యథార్థ భ్రమ జ్ఞానముల స్మరణవలన తనకిప్పుడు కలిగిన జలజ్ఞానము యథార్థమా, లేక భ్రమ జ్ఞానమా అను సందియము కలుగును. ఇట్టి సంశయమే ఆంతర విషయిక సంశయ మనబడును.

అవ : శబ్ద పరీక్షకు సాధనమైన సంశయమును సభేద (భేదములతోకూడ) ముపపాదించి శబ్ద లక్షణ మొనరించుచున్నాడు.

సూ. శ్రోత్రగ్రహణో యోఽర్థః స శబ్దః ౨.౨.౨౧

శ్రోత్రగ్రహణః = కర్ణేంద్రియము గ్రహించునట్టి సాధనముగా గలది, యోఽర్థః = ఏపదార్థము కలదో, సః=అదియే, శబ్దః= శబ్దము.

కర్ణేంద్రియములచే గ్రహింపబడు పదార్థము శబ్దమని భావము.

అవ : లక్షిత శబ్దమును ఆకాశగుణముగా నిర్ణయింప దలచి పూర్వమందు సంశయమును ప్రదర్శించుచున్నాడు.

సూ. :- తుల్యజాతీయే ష్వర్థాంతరభూతేషు విశేషస్య
ఉభయథా దృష్టత్వాత్ ౨.౨.౨౨

'సంశయః శబ్దే' అను పదమిందనుపర్తింప దగినది. తుల్య జాతీయేషు = రూపాది గుణములలో, అర్థాంతర భూతేషు = భిన్నజాతీయములగు పృథివ్యాది ద్రవ్యములలోను, కర్మములలోను. విశేషస్య = ప్రత్యేక పదార్థమున నుండు రూపత్వము, రసత్వము, పృథివీత్వము, జలత్వము, ఉత్క్షేపణత్వము మున్నగు విశేషజాతి, ఉభయథా దృష్టత్వాత్=సమాన జాతీయ మగు గుణత్వముతోను, విజాతీయమగు ద్రవ్యత్వ కర్మత్వ ములతోను, ఒకచో నుండుట జూడబడుటవలన, శబ్దమున నుండు శ్రావణత్వము (శ్రవణేంద్రియ గ్రాహ్యత్వము) అను విశేషధర్మముయొక్క జ్ఞానము కలుగుటవలనను, ఈశబ్దము ద్రవ్యము నాశ్రయించి యున్నదను విశేష జ్ఞానము కలుగ కుండుట వల్లను, శబ్దే=శబ్దమునందు, సంశయః = గుణమా, ద్రవ్యమా, కర్మమా అను సందేహము కలుగుచున్నదని యర్థము.

రూపాది గుణములందుండు రూపత్వ ప్రభృతి విశేషము గుణత్వ సమానాధికరణమై యున్నది. (గుణత్వ సమానాధి కరణమనగానేమి ? రూపమునందు గుణత్వము, రూపత్వము నివి రెండును గలవు. అందువలన రూపత్వము గుణత్వము సమానాధికరణములు - అనగా ఒకే అధికరణముగా (ఆధారము) గలవి. కావున రూపత్వమను విశేషము (జాతి)

గుణత్వ సమానాధికరణమని భావము. ఇట్లే మూలము సమానాధికరణ మెట్లుగునట) పృథక్త్వాది ద్రవ్యములలో ప్రత్యేక ద్రవ్యమునందు పృథక్త్వాదివిశేషము ద్రవ్యత్వ సమానాధికరణము. ఇట్లే ఉత్క్షేపణత్వ ప్రభృతి విశేషము కర్మత్వ సమానాధికరణము. దీనినిబట్టి తెలియవలెను ; విశేష జాతి ద్రవ్యత్వ-గుణత్వ-కర్మత్వ-సమానాధికరణమై యున్న దని తెలియుచున్నది. ప్రస్తుతము శబ్దమునందుగల శ్రావణ త్వముకూడ నొక విశేషమే. అందువలన నదియు ద్రవ్యత్వ గుణత్వ-కర్మత్వ - సమానాధికరణముగుట కెట్టి యాటంక ముండనేరదు. శబ్దమునగల శ్రావణత్వము ద్రవ్యత్వాది సమానాధికరణమగుచో శబ్దము ద్రవ్యత్వము, గుణత్వము, కర్మత్వమునకు నధికరణమైనందున. ద్రవ్యమా ! గుణమా ! కర్మమా ! అని సంశయము కలుగుచున్నదని పై సూత్రాభిప్రాయము.

అవ : ద్రవ్యగుణ కర్మములలో శబ్ద మెందు చేరునో ! అని సంశయించి పరిశేష న్యాయమున గుణమే అగునని నిర్ణయింపగోరి ముందు ద్రవ్యము కానేరదని నిరూపించు చున్నాడు.

సూ. :- ఏకద్రవ్యత్వా న్న ద్రవ్యమ్ ౨.౨.౨౩

(శబ్దః) ద్రవ్యమ్ న = శబ్దము ద్రవ్యము (ద్రవ్యత్వజాతిగలది) కాదు. ఏక ద్రవ్యత్వాత్ = ఒకే ద్రవ్యము సమవాయి కారణ ముగా గలదగుటవలన.

ప్రపంచమున కార్యద్రవ్యములన్నియు ననేక ద్రవ్య సంయోగము వలన నేర్పడును. ఒకే ద్రవ్యము సమవాయి కారణముగా గలిగియుండవు. ఉదాహరణమునకు ఘట పటములను తీసికొనుడు. ఘటము కార్యద్రవ్యము. దానికి సమవాయి కారణము కపాలములు (ఘటావయవములు). అవి రెండుగాని ఒకటికాదు. పటము కార్యము. దానికి సమవాయి కారణము తంతుజాలము. అవియు ననేకములు. ఇట్లు ప్రతి కార్యమునకు సమవాయి కారణముగా నుండు ద్రవ్యము లనేకములై యుండును. శబ్ద సమవాయికారణ మాకాశ మొక్కటియే. అందువలన శబ్దము ద్రవ్యము కాదు.

అవ : ఏకద్రవ్యము సమవాయి కారణముగా గలిగి యుండుటవలన శబ్దము ద్రవ్యము కాకున్న కర్మ మేల కానేరదనిన-

సూ. :- నాపి కర్మాఽచాక్షుషత్వాత్ ౨.౨.౨౪

నాపి కర్మ = శబ్దము కర్మముకాదు. ఎందువలన ? అచాక్షుష త్వాత్ = చక్షురింద్రియముచే గ్రహింపబడకుండుటవలన.

గంధాదిగుణములు చక్షురింద్రయముచే గ్రహింపబడ కుండుటవలన నవి కర్మములు కానట్లు శబ్దముకూడ చక్షు రింద్రియముచే గ్రహింపబడకుండుటవలన నదియు కర్మము కానేరదని భావము.

నవీనులు - శబ్దత్వము కర్మవృత్తికాదు, అచాక్షుష ప్రవృత్తి జాతియగుట వలన-రసత్వ గంధత్వాదులవలె, అని న్యాయమును ప్రయోగింతురు.

కర్మము తనవంటి మఱియొక కర్మమును కలిగింప నేరదు. శబ్దము తనవంటి మఱియొక శబ్దమును కలిగించును. అందువలన శబ్దము కర్మము కాదు. ద్రవ్యము కాదు. సామాన్య విశేష సమవాయములందు సామాన్యము (జాతి) ఉండదు. శబ్దమున శబ్దత్వమను జాతి యుండును. అందు వలన శబ్దము సామాన్యాదులలోను చేరదు. ఇట్లు గుణభిన్నము లగు ఇతర ద్రవ్యములందు జేరకుండుటచె మిగిలిన గుణము లలోనే చేరును. అందువలన శబ్దము గుణమని నిర్ణయము.

ఆవ : కర్మము శీఘ్రముగా నశించినట్లు శబ్దముకూడ ఉత్పన్నమై వెంటనే నశించుటవలన కర్మములలో చేరదా? యనిన -

సూ. :- గుణస్య సతోఽపవర్గః కర్మభిః సామాన్యమ్

౨.౨.౨౬

గుణస్య సతః = పరిశేష న్యాయమున గుణముగా సిద్ధించిన శబ్దముయొక్క, అపవర్గః = నాశము, కర్మభిః = కర్మములతో, సామాన్యమ్ = సమానధర్మము.

ఉత్పన్నమై నశించిన మాత్రమున శబ్దము కర్మము కానేరదు. ద్విత్వాదిసంఖ్య - జ్ఞానము-సుఖదుఃఖములుకూడ ఉత్పన్నమై నశించును. అయినను నివి గుణములైనట్లు ఎల్లరు ఒప్పుకొందురు. అట్లే శబ్దము గుణమే. ఉత్పన్న వినాశిత్వము కర్మములోగల సమానధర్మము మాత్రమే అని భావము.

ప్రతికర్మము (క్రియయు) నాలుగు క్షణములుండి యైదవ క్షణమున నశించును. మొదటి క్షణమున గురుత్వ

ప్రయత్న సంయోగముల వలన ద్రవ్యమున క్రియ యిర్పడును. రెండవ క్షణమున విభాగ మేర్పడును. మూడవ క్షణమున పూర్వసంయోగము నశించును. నాలుగవ క్షణమున ఉత్తర సంయోగము కలుగును. అయిదవ క్షణమున క్రియ నశించును. ఇది క్షణప్రక్రియ. ఇట్లు ద్విత్వప్రభృతి సంఖ్యలు నిమిత్తముగాగల యపేక్షాబుద్ధి మూడు క్షణములుండి నాలుగవ క్షణమున నశించును. జ్ఞానము శబ్దము ఇవి రెండు రెండు క్షణములుండి మూడవ క్షణమున నశించును.

అవ : శబ్దము గుణమైనను, ఆకాశలింగము కానేరదు. శబ్దము నిత్యము. కార్యము కాదు. ఒకప్పుడు కనిపించకుండుటకు కారణము వ్యంజకాభావమే. అందువలన ఆకాశకార్యమై ఆకాశ లింగము కానేరదని శంకించి నిషేధించుచున్నాడు. (వ్యంజకము = ప్రకటించునది)

సూ. :- సతో లింగాభావాత్ ౧.౧.౧౬

సతః = శబ్దము నిత్యమగుటలో, లింగా భావాత్ = సాధించు హేతువు లేకుండుటవలన, నిత్యత్వమును సాధించు హేతువు లేకుండుటవలన శబ్దము నిత్యము కానేరదని యర్థము.

అవ : హేతువు లేకున్నను నిత్యమేల కానేరదు ?

సూ. :- నిత్యవైధర్మ్యాత్ ౧.౧.౧౭

శబ్దము నిత్యము కాదు. ఎందువల్ల నన, నిత్యవైధర్మ్యాత్ = నిత్యమునకు విరుద్ధములగు ఉత్పత్తి వినాశ ధర్మములు కలిగియుండుటవలన.

శబ్దము ఉత్పత్తి వినాశధర్మవంత మగుటచే నిత్యము కానేరదని భావము.

అవ : శబ్దము నిత్యము కాకున్నను అనిత్యమనుటెట్లు పొసగునన :

సూ. :- అనిత్య శ్చాయం కారణతః ౨.౨.౨౮

కారణతః = కారణము కలిగి యుండుటవలన, అనిత్యః = శబ్ద మనిత్యమని సిద్ధించుచున్నది.

ఘటపటాదులు కారణము గలవగుటవలన నెట్లనిత్య ములో అట్లే శబ్దమును అనిత్యమని భావము.

అవ : శబ్దము కారణము కలదని రూపింపబడకపోవు టచే స్వరూపాసిద్ధ హేత్వాభాసము - సాధన సమ హేత్వా భాసము-ఏల కాదనిన-

సూ. :- న చాసిద్ధం వికారాత్ ౨.౨.౨౯

అసిద్ధం=శబ్దము నిత్యము కాదని సాధించు కారణవత్వమను హేతువు స్వరూపాసిద్ధము, న చ = కాదు. ఎందువల్లనన, వికారాత్ = వికారి యగుట వలన-కార్యమగుటవలన.

శబ్దము కార్యమగుట వలన నది కారణము కలది యని సిద్ధించుచునే యున్నది. అందువల్ల హేతుదోష ముల్లేఖింప వీలులేదని సూత్రార్థము.

అవ : శబ్దము కారణమువలన బుట్టిన నది కారణ వంతము (అనిత్యము) అగును. కాని అది యభివ్యక్త మగు చున్న దనిన నేమి ?

సూ. :- అభివ్యక్తౌ దోషాత్ ౨.౨.౩౦

శబ్దము అభివ్యఙ్గ్యము కాదు. ఎందువల్లనన, అభివ్యక్తౌ దోషాత్ = అభివ్యక్తి యందు దోషము కలుగుటవలన.

శబ్దము కారణములవలన పుట్టక అభివ్యక్త మగుచున్న దనిన దోషప్రసక్తి కలుగునని భావము.

దోషస్వరూప మేమన, ఒక్కవర్ణ మభివ్యక్త మయినప్పు డితర వర్ణములు నాక్షణముననే వ్యక్తములు కావలసి యుండును. అట్లగుటలేదు. క్రమముగా నొక్కొక్క వర్ణమే గృహీత మగుచున్నది. ఏకసమయమున నన్నివర్ణములు అభి వ్యక్తములు కావలయు ననుటలో నియమేమి ? (సమా నేంద్రియ గ్రాహ్యాణాం సమనియతానా మేకవ్యంజకాభి వ్యంగ్యత్వ నియమః) ఒకే యింద్రియముచే గ్రహింపనగు సమనియతములగు పదార్థములు ఒకేవ్యంజకము వలన వ్యక్తములగుట నియమము. ఉదాహరణమునకై యొకవస్త్ర మునగల రూపము పరిమాణము, సంఖ్య మున్నగు గుణము లను తీసికొనుడు. ఇవన్నియు నొకచక్షురింద్రియముతోనే గ్రహింపదగినవి. ఒకే పదార్థమున నున్నవి. అందుచే నివి సమానేంద్రియ గ్రాహ్యములు, సమనియతములును. ఆలోక సంయోగమను నొక వ్యంజకము వల్లననే అభివ్యక్తము లగు చున్నవి. ఇట్లే అక్షరములు (వర్ణములు) కూడ సమానేంద్రి యము (శ్రోత్రేంద్రియము) చే గ్రహింపదగినవి, సమనియత ములు. ఒకేశబ్దమున నిమిడి యున్నవి. అందువలన నొక్క శబ్దమునగల యక్షరము లన్నియు నొకే సమయమున నభి వ్యక్తము కావలసి యుండును, అనిభావము.

అవ : ఏ కారణములవలన శబ్ద మాకాశమున నుద్భ వించు చున్నది ?

సూ. :- సంయోగాత్ విభాగాచ్ఛబ్దాచ్ఛబ్దనిష్పత్తిః ౨.౨.౩౧

సంయోగాత్ = భేరిదండ సంయోగమువలన, విభాగాత్ = వేణుపర్వ విభాగమువలన (బొంగుల కణుపులు పగులగొట్టునపుడు), శబ్దాత్ = శబ్దమువలన, శబ్దనిష్పత్తిః = ఆకాశమున శబ్ద ముద్భవించుచున్నది.

శబ్దము రెండు విధములు, వర్ణాత్మకము, ధ్వన్యాత్మకము నని. అకారాది వర్ణములతో కూడినది వర్ణాత్మకము. భేర్యాదుల వలన కలుగునది ధ్వన్యాత్మకముగా నుండును. వర్ణాత్మక శబ్దము సంయోగము వలనను శబ్దమువలనను పుట్టును. ఇట్టి శబ్దమునకు, కంఠతాల్వాది స్థానములలో వాయువునకు కలుగు సంయోగము నిమిత్త కారణము. వాయువుచే తాడింపబడిన తాల్వాదిస్థానములతో నాకాశమునకుగల సంయోగము అసమవాయి కారణము. పూర్వము తాను తెలిసికొనియున్న వర్ణములను స్మరింప నపేక్షించినపుడు ఆత్మ మనస్సులకు సంయోగము కలుగును. ఆ సంయోగము వలన మొదట వర్ణముల నుచ్చరింప వలయునని (ఇచ్ఛ) కోరిక కలుగును. తరువాత తదనుకూల యత్నము. ఇట్టి ప్రయత్నము నపేక్షించు ఆత్మ వాయు సంయోగము వలన కోష్ఠ గతవాయువునందు క్రియ కలుగును. దానివలన వాయువు పైకివచ్చి కంఠతాలు జిహ్వాది స్థానములందు తాకును. ఈ తాకిడివలన నాయా స్థానములకు నాకాశమునకు సంయోగ మేర్పడును. తరువాత వర్ణము లుద్భవించును, ఇది వర్ణోత్పత్తి క్రమమని యెఱుంగునది. (కోష్ఠము = నాభి)

అవ : ఇట్లు సంయోగాదుల వలన శబ్ద ముద్భవించినను శబ్ద మనిత్య మెట్లగునన ?

సూ. :- లింగా చ్చానిత్య శ్శబ్దః ౨.౨.౩౨

లింగాత్ = ఉత్పత్తిగలదను హేతువువలన, శబ్దః = శబ్దము. అనిత్యః = అనిత్యమని యర్థము.

అవ : శబ్ద మనిత్యము కాదు. ఎందువల్లనన ?

సూ. :- ద్వయోస్తు ప్రవృత్త్యో రభావాత్ ౨.౨.౩౩

ద్వయోః = గురుశిష్యులయొక్క, ప్రవృత్త్యో రభావాత్=అధ్యాపన అధ్యయన ప్రవృత్తులు కలుగకుండుట వలన. శబ్దమనిత్యమయిన గురువు అధ్యాపనము చేయుటకుగాని, శిష్యు డధ్యయనము చేయుటకుగాని ప్రవర్తింపరని భావము.

గురువు శిష్యునకు శబ్దమును చెప్పును. ఆ శబ్దమునే శిష్యు డనును. ఈరెండును ఒకేమాటు జరుగనేరవు. క్రమముగా నేర్పడును. శబ్ద మనిత్యమైన అధ్యాపన కాలముననున్న శబ్ద మధ్యయనమువఱ కెట్లుండును ? ఉన్నచో అనిత్యమెట్లగును ? శబ్దమనిత్యమైన గురుశిష్యులు చదువు చెప్పుటకుగాని చదువు కొనుటకుగాని ప్రవర్తింప వీలులేదని భావము,

అవ : మఱియు-

సూ. :- ప్రథమాశబ్దాత్ ౨.౨.౩౪

(తాసాం త్రిః ప్రథమా మన్వాహ త్రిరుత్తమామ్. ఐతరేయ బ్రాహ్మణమ్) ఈ బ్రాహ్మణ వాక్యమున ప్రథమ శబ్దమును, ఉత్తమ శబ్దమును మూడు పర్యాయము లుచ్చరించుట

కుపదేశము గాననగుచున్నది. శబ్ద మనిత్యమగునేని యొక శబ్దము ముమ్మాఱుచ్చరింప వీలగును. అందు వలన శబ్ద మనిత్యము కానేరదని సూత్రభావము.

అవ: శబ్దనిత్యత్వమును బోధించుటకే హేత్వంతరమును ప్రదర్శించుచున్నాడు.

సూ. :- సంప్రతిపత్తి భావా చ్చ ౨.౨.౩౫

సంప్రతిపత్తిభావాత్ చ = సంప్రతిపత్తి :-అభేదజ్ఞప్తి-ప్రత్యభిజ్ఞ- అనగా అదే యిది యను జ్ఞానము కలుగుట వలన, శబ్దము నిత్యమని యర్థము.

లోక వ్యవహారమున 'ఏ యనువాకమును, సూక్తమును గోవిందు డభ్యసించెనో దానినే గోపాలు డభ్యసించుచున్నాడు. నిన్న మొన్న రాము డే వాక్యమును నీకు చెప్పెనో అదియే ని విపుడు చెప్పుచున్నావు.' అని యనేక ప్రయోగములు చూచు చున్నాము. ఇందు పూర్వాపర వాక్యములలో అభిన్న జ్ఞానము కలుగుచుండుట విదితమే. శబ్ద మనిత్య మగునేని ఈ వ్యవ హారముగాని జ్ఞానముకాని పొసగనేరదు. అందువలన శబ్దము నిత్యమనియే భావము.

అవ : పై నిరూపించిన పూర్వ పక్ష సూత్రములను మూటిని ఖండించుచున్నాడు.

సూ. :- సందిగ్ధా: ౨.౨.౩౬

సందిగ్ధాః = పై జెప్పిన హేతువులన్నియు సందిగ్ధములు, సాధ్యాభావమును సాధించునవి-అనగా శబ్దము నిత్యమనుటకు బదులు అనిత్యమును సాధించునవి, అని యర్థము.

నృత్యాది క్రియలు అనిత్యమనుట సర్వసమ్మతము. అట్టి నృత్య విషయములో గూడ 'గోపాలుడు దేవదత్తునకు నృత్యమును నేర్పుచున్నాడు, దేవదత్తుడు గోపాలుడు నేర్పిన నృత్యమునే చేయుచున్నాడు. మూడుసారులు నృత్యము చేసెను. నాలుగుమాట్లు నృత్యము చేసెను. నిన్న మొన్నటి నృత్యమునే నేడు చేయుచున్నాడు.' అని యనేక ప్రయోగములు చూచుచున్నాము. నృత్యక్రియ క్షణికమనుటలో సందేహము లేదు. అందుచే పై జెప్పిన హేతువులు అనిత్యక్రియాసాధకములై శబ్దము నిత్యమని యెట్లు సాధింపగలవు ? నిశ్చిత హేతువులే సాధ్యమును సాధింపగలవు. సందిగ్ధములు సాధింపనేరవని భావము.

అవ : శబ్దమనిత్య మగుచో ప్రతివర్ణము భిన్నమై యనేకములు కావలసి యుండగా, నేబది వర్ణములని (వ్యంజనములు ౩౬, స్వరములు ౧౪, అని) నిశ్చితసంఖ్య వ్యాకరణశిక్షాది గ్రంథముల నెట్లు పేర్కొన బడుచున్న దన:

సూ. :- సతి బహుత్వే సంఖ్యాభావః సామాన్యతః ౨.౨.౩౭

బహుత్వే సతి = శబ్ద మనిత్యమగుట వలన ప్రతివర్ణ మనేకమైనప్పటికి, సంఖ్యాభావః = అనేకముగాక పాణినీయ శిక్షా ప్రభృతి వ్యాకరణ గ్రంథములందుగల నియత సంఖ్య

సామాన్యతః = వర్ణములందుగల సామాన్య ధర్మమువలన ఉపపన్న మగుచున్నది.

వర్ణము లనిత్యము లగుటవలన ననేకములయ్యు అత్వ, కత్వ, చత్వ, ఆది సామాన్య ధర్మమువలన నియత సంఖ్య గలవిగా పేర్కొనబడుట అసంగతము కానేరదని భావము.



# తృతీయాధ్యాయము

## ప్రథమాహ్నికము

అవ : పూర్వపు రెండధ్యాయములందు పృథివ్యాది సప్త ద్రవ్యములు లక్షణాదులద్వారా పరీక్షింపబడినవి. ఇవన్నియు బాహ్యద్రవ్యములే. ఆత్మ మనస్సు లను నాభ్యంతరిక ద్రవ్యములు పరీక్షింప దగినవి మిగిలియున్నవి. ఉద్దేశ్యక్రమము ననుసరించి ముందుగా నాత్మను పరీక్షింపదలచి మహర్షి ఆత్మ సిద్ధియందు హేతుప్రదర్శనార్థమై భూమికను రచించు చున్నాడు.

సూ. :- ప్రసిద్ధాః ఇంద్రియార్థాః ౩.౧.౧

ఇంద్రియార్థాః = ఇంద్రియములు, అర్థములు- (ఘ్రాణరసన చక్షు స్త్వక్శ్రోత్రములు పంచేంద్రియములు, గంధ రస రూప

స్పర్శ శబ్దములు అర్థములు - విషయములు) ఇవన్నియు, ప్రసిద్ధాః=సమ్యగ్విదితములు-అనగా నందఱు బాగుగా నెఱింగినవే యని భావము.

ఘ్రాణాదు లింద్రియము లనియు, వానిచే క్రమముగా గ్రహింపబడు గంధాదులు విషయము లనియు నందఱెఱిగిన వగుటచే వీనిని ప్రత్యేకించి సాధింప నావశ్యకము లేదని సూత్రాభిప్రాయము.

౭వ. ఇంద్రియార్థములు ప్రసిద్ధములైన నేమి ?

సూ. :- ఇంద్రియార్థ ప్రసిద్ధి రింద్రియార్థేభ్యో౽
ర్థాన్తరస్య హేతుః 3.౧.౨

ఇంద్రియార్థ ప్రసిద్ధిః= ఇంద్రియములలోను తదర్థములలోను, ఇది ఘ్రాణేంద్రియము. ఇది గంధము. అను నిట్టి ప్రసిద్ధి, ఇంద్రియార్థేభ్యః = ఇంద్రియార్థములకంటె, అర్థాంతరస్య = భిన్న పదార్థమైన సాధకునకు- ఆత్మకు. హేతుః=సాధకము- లింగమని యర్థము.

ఇది నాసికేంద్రియము ఇది గంధము. ఈ యింద్రియముద్వారా నేను గంధావ్యర్థమును గ్రహించుచున్నాను. అను నీ జ్ఞానమున కాశ్రయమేదో యొకటి యుండవలయును అ యాశ్రయభూతమగు పదార్థమే ఆత్మ యని భావము.

కావున ఇంద్రియములకంటను అర్థములకంటెను భిన్నముగ ఆత్మ యనునొక పదార్థము కలదని సూత్రాభిప్రాయము

అవ : ఇంద్రియార్థముల సిద్ధికి శరీరమే ఆశ్రయ మగుటచే శరీరమేల సిద్ధింపరాదన ?

సూ. :- సోఽనపదేశః 3.౧.3

సః = ఇంద్రియముల ద్వారా కలుగు విషయ జ్ఞానమున కాశ్రయము శరీరమే. జ్ఞానము శరీర కార్యమగు[illegible] -- అను హేతువు. అనపదేశః = అపదేశమనగా హేతువు, అనప దేశమనగా అహేతువు - హేత్వాభాసము - దుష్టహేతువని యర్థము.

సూ. :- కారణాజ్ఞానాత్ 3.౧.౪

జ్ఞానము శరీర కార్యము కానేరదు, ఎందువల్లనన, కారణాజ్ఞానాత్ = శరీర కారణములగు సూక్ష్మ భూతము లందు జ్ఞానము లేకుండుటవలన.

శరీరము జన్యము. అనగా నుత్పన్నమైన పదార్థము. అందుగల గుణములు కారణగుణపూర్వకములే. శరీర మే భూతములవలన నేర్పడు చున్నచో వానిలో జ్ఞాన మున్నట్లు కానరాదు. కారణములందు లేని జ్ఞానము కార్యమగు శరీర మున నెట్లు వచ్చును ? అందువలన శరీరము జ్ఞానమున కాశ్రయముకాదు. కాబట్టి ఇంద్రియార్థ ప్రసిద్ధివలన సిద్ధమగు పదార్థాంతరము శరీర మనుటకు వీలులేదని భావము.

అవ : శరీర కారణములగు సూక్ష్మభూతములందును జ్ఞాన మున్నదన్న దోషమేమన ?

సూ. :- కార్యేషుజ్ఞానాత్ 3.౧.౫

కార్యేషు = సర్వకార్యములందును, జ్ఞానాత్ = జ్ఞాన ముండ వలసివచ్చును.

సూక్ష్మభూతములవలన నెట్లు శరీర మేర్పడుచున్నద అట్లే ఘటపటాది ద్రవ్యములు నేర్పడుచున్నవి. సూక్ష్మ భూతములందు జ్ఞానమున్న శరీరములో వలె ఘటపటాది కార్యము లన్నిటిలో జ్ఞానముండి యుండవలయును కదా! అట్లు కానరాకున్నది. అందువలన భూతములందు జ్ఞానమంగీ కరింప వీలులేదని భావము.

సూ :- అజ్ఞానాత్ చ 3.౧.౬

ఘటపటాదులందును జ్ఞానమున్నదందుమేని, అజ్ఞానాత్ = ప్రత్యక్షాది ప్రమాణములవలన తెలియబడుటలేదు, అందు వలన లేదని భావము.

అవ : జ్ఞానము శరీరాశ్రయము కాకున్నను ఆత్మాశ్రయ మెట్లు కాగలదు ? ఆత్మకంటె జ్ఞానము భిన్నమై కార్యకార ణములలో తాదాత్మ్యము లేకుండుటవలన ఆత్మాశ్రయము కానేరదనగా, దానిని నిరాకరించు చున్నాడు.

సూ. :- అన్యదేవ హేతు రిత్యనపదేశః 3.౧.౭

హేతుః = హేతువు - కారణము, అన్యదేవ = సాధ్యప్రతి యోగిక భేదాశ్రయమే అగును. అనగా సాధ్యముకంటె భిన్నమే అగునుకాని తత్స్వరూపము కానేరదు, ఇతి = అందువలన, అనపదేశః = కారణము కార్య తాదాత్మ్యమై యుండవలయు నను హేతువు అహేతువు.

ఏది దేనికి తాదాత్మ్యమో, లేక ఏది దేనివలన కలుగు చున్నదో దాని కదియే కారణమని బౌద్ధుల నియమము. వైశేషికులు ఏది దేనివలన కలుగుచున్నదో దానికి అది కారణ మనిమాత్ర మొప్పుకొందురు. తాదాత్మ్య ఘటిత హేతువు వ్యభి చరించును. కనుక దానిని స్వీకరింపరు. అందువలనజ్ఞానము ఆత్మతాదాత్మ్యము కావలయునన్న నియమము లేదు.

అవ : భిన్నపదార్థమే హేతువగు నెడల ధూమహేతువు గార్దభము నేల సాధింపదన ?

సూ. :- అర్థాన్తరం హ్యర్థాన్తర స్యానపదేశః 3.౧.౮

అర్థాన్తరం హి=సర్వథా సాధ్యముకంటె భిన్నమగు పదార్థము, అర్థాన్తరస్య = తనకంటె భిన్నమగు సాధ్యమునకు, అనప దేశః = అపదేశము కాదు, హేతువు కానేరదని యర్థము.

ఏ వస్తువునకు దేనితో తాదాత్మ్యమో ఆ వస్తువు దానికి హేతువను నియమము లేదు. ఈ వృక్షము ఆమ్రము. ఆమ్రమీ వృక్షము- అను స్థలమున వృక్షత్వము ఆమ్రత్వము అను నివి రెండును పరస్పరము తాదాత్మ్యము కలిగి యున్నను ఒక దాని కొకటి హేతువు కానేరదు కదా! దేనికి ఏవస్తువు కార్యమో, అది యావస్తువునకు లింగము అను నియమమును సరిగాదు. ధూమముననుండు పార్థివత్వము వహ్ని కార్యమైనను, పార్థి వత్వము వహ్నిసాధక లింగమనుటకు వీలులేదు. అర్థాన్తరము అర్థాన్తరమునకు ( ఒక వస్తువు మఱియొక వస్తువునకు ) హేతువని నియమింప వీలుండదు. వహ్నికి ధూమమను హేతువు అర్థాన్తరమైనను, రాసభాదులు హేతువులు కావు.

కాని, ఏవస్తువు స్వభావముగా నేవస్తువుతో సంబద్ధమై యుండి తన భావము (సత్తా-ఉనికి) వలన వస్తువుండి, తన యభావము వలన వస్తువుండదో, అది దానికి హేతువు కాగలదు. ఇదియె సార్వత్రిక నియమము. (వస్తుస్వభావాత్ యో హి యేన ప్రతిబద్ధః సన్, తద్భావే భవతి తదభావే చ న భవతి స ఏవ తస్య హేతు రితి సార్వత్రికో నియమః)

ప్రశస్తపాదులు నిట్లే వర్ణించియున్నారు.

"య దనుమేయేన సంబద్ధం ప్రసిద్ధం చ తదన్వితే,

తదభావే చ నాస్త్యేవ తల్లింగ మనుమాపకమ్"

అనుమేయముతో సంబద్ధమై దానితో కూడియుండుటలో నేది ప్రసిద్ధమో, దేని యభావమువలన ననుమేయ ముండదో ఆ వస్తువే యనుమాపకము - లింగము- హేతువని యర్థము.

అవ : ఇట్లు వస్తువు స్వభావమువలన సాధ్యముతో ప్రతిబద్ధమై సాధ్యముకంటె భిన్నమగు పదార్థమే హేతువగు నెడల, నేది దేనికి హేతువు కాగలదో పరిగణింపకున్న తెలిసికొను టెట్లన ?

సూ. :- సంయోగి సమవా య్యేకార్థసమవాయి విరోధి చ 3.౧.౯

సంయోగి, సమవాయి, ఏకార్థ సమవాయి, విరోధి, మున్నగునవి, లింగమ్ = హేతువులగును.

కరణము ద్వారా కర్తను సాధించు నెడల సంయోగి హేతువగును. ఉదాహరణము- ఈ ప్రదేశము సారథివంతము.

గతియుక్త లక్షణము గలుగుటవలన, మిగిలినవి సూత్రకారుడు స్వయముగా నుదాహరించును.

యథార్థముగ లింగము లిన్నియని నిర్ణయించి పరిగణింప శక్యము గానన్ని శిష్యులకు బోధించు నిమిత్తము కొన్నిటినిమాత్ర మీసూత్రమున గణించియున్నాడు.

అవ : ఏకార్థ సమవాయిలింగము నుదాహరించు చున్నాడు.

సూ. :- కార్యం కార్యాంతరస్య 3.౧.౧౦

కార్యమ్ = రూపము, కార్యాన్తరస్య = స్పర్శకు లింగము.

రూపముగల ప్రతి పదార్థమునకు స్పర్శగుణముండి తీఱును.

రూపము స్పర్శము నివిరెండును ఒకే పదార్థమున సమవాయ సంబంధమున నుండును. అందువలన నివి పరస్పర మొకదాని కొకటి యనుమాపక (హేతువు) మగును. (ఏకార్థ సమవాయిత్వం చైకస్మిన్ అర్థే సమవాయేన వృత్తిమత్త్వమ్) ఏకార్థ సమవాయిత్వ మనగా నొక వస్తువున రెండుగాని యంత కెక్కువగాని పదార్థములు సమవాయ సంబంధముతో నుండుటయని యర్థము.

అవ : విరోధి లింగము నుదాహరించుచున్నాడు.

సూ :- విరోధ్యభూతం భూతస్య 3.౧.౧౧

అభూతమ్ = అవిద్యమానమగు వర్షము, భూతస్య = విద్య
మాన వాయు మేఘ మరుదభ్ర సంయోగమునకు, విరోధి =
విరోధి లింగము.

వర్షము లేకుండుట, మేఘములతో నొకవిధమగు
వాయువునకు సంయోగము కలిగినదని బోధించునని తాత్ప
ర్యము.

అవ : మఱియొక విరోధి లింగమును ప్రదర్శించు
చున్నాడు.

సూ :- భూత మభూతస్య 3.౧.౧౨

భూతమ్ = విద్యమాన వర్షము అనగా వర్షము కురియుట,
అభూతస్య = అవిద్యమానవాయుమేఘ మరుదభ్ర సంయో
గమునకు అనగా నొక విధమగు వాయువులతో మేఘములకు
గల సంయోగమునకు, విరోధి లింగమని యర్థము.

సూ. :- భూతో భూతస్య 3.౧.౧౩

భూతః = విద్యమానమై ఫూత్కారము చేయుచున్నపాము,
భూతస్య = విద్యమానమై పొదలో నంతర్హితమైయున్న నకుల
మునకు విరోధిలింగము.

ఇందు హేతుసాధ్యములు రెండును విద్యమానములని
సూచించుటకై పృథక్ సూత్రము రచించెను.

అవ : ఇట్లు హేతువులను కొన్నిటిని ప్రదర్శించినను,
యథార్థమున నన్ని లింగములు తెలిసికొనుటకై తగిన నియమ

మును బోధించు టత్యావశ్యక మగుటచే తదర్థమై సూత్రము నారంభించుచున్నాడు.

సూ. :- ప్రసిద్ధి పూర్వకత్వా దపదేశస్య 3.౧.౧౬

అపదేశస్య = లింగము. ప్రసిద్ధి పూర్వకత్వాత్ ప్రసిద్ధిః = వ్యాప్తిజ్ఞానము వ్యాప్తి జ్ఞానపూర్వకముగ సిద్ధించుటవలన. దేనితో దేనికి వ్యాప్తి జ్ఞానము గ్రహింపబడునో అది దానికి లింగమని సర్వత్ర యెఱుంగవలయును.

వస్తుస్వభావ సిద్ధమగు. సాధ్యసాధనముల అవ్యభిచరిత సంబంధము వ్యాప్తి యనబడును. దీనినే కొందఱు అవినాభావ సంబంధమనియు, సాహచర్యనియమ మనియు వాదుదురు. ఉదాహరణమునకై ధూమాగ్నులు గ్రాహ్యములు. ధూమమున్నచోట అగ్ని తప్పక ఉండుటచే వీని సంబంధ మవ్యభిచరిత మనబడును. అందుచేత ధూమ మగ్నికి లింగము- హేతువు- అపదేశము.

నవీన నైయాయికులు (హేతుసమానాధికరణాత్యంతాభావాప్రతియోగి సాధ్య సామానాధి కరణ్యం వ్యాప్తిః) అని నిర్వచింతురు. హేతు సమానాధికరణాత్యంతాభావః = హేత్వధికరణ వృత్త్యత్యంతాభావము. హేతువు ధూమము. హేత్వధికరణము పర్వతము. హేత్వధికరణ వృత్త్యత్యంతాభావము పర్వతములో 'ఘటోనాస్తి' 'పటోనాస్తి'-అను ఘటపటాత్యంతాభావము. తత్ప్రతియోగి ఘటము పటము. అప్రతియోగి సాధ్యము వహ్ని. ఆ వహ్ని సామానాధికరణ్యము ధూమములో

నుండును. అందువలన ధూమము వ్యాప్తిమంతమై హేతు వనబడుచున్నది.

అవ : హేతువును నిరూపించి యహేతువును అనగా హేత్వాభాసమును (దుష్టహేతువును) నిరూపించుచున్నాడు.

సూ. :- అప్రసిద్ధోఽనపదేశః 3.౧.౧౫

అప్రసిద్ధః = ఏహేతువు దృష్టాంతమున నుండక సాధ్యాభావ స్థలమున నుండునో అది, అనపదేశః = హేత్వాభాసము, విరుద్ధ మను పేరుగల దుష్టహేతు వనబడును.

అవ : హేత్వాభాసాంతరములను నిర్దేశించుచున్నాడు.

సూ :- అసన్ సందిగ్ధశ్చ అనపదేశః 3.౧.౧౬

అసన్ = పక్షమున అనగా సాధ్యస్థలమున (సాధ్యాధికరణ మున) నుండనిది అసిద్ధ హేత్వాభాస మనబడును. సందిగ్ధః= సందిగ్ధ వ్యాప్తిగల హేతువు అనైకాంతిక మనబడును.

అవ : విరుద్ధాసిద్ధ హేత్వాభాసముల కుదాహరణము.

సూ. :- యస్మా ద్విషాణీ తస్మా దశ్వః 3.౧.౧౭

కొమ్ములుండుటవలన నిది యశ్వమని యర్థము.

గార్దభాకృతిని దూరములో జూచి యిట్టి ప్రయోగము చేయబడును. (పిండోఽయమశ్వః విషాణిత్వాత్) ఆ కనబడు పిండ విశేషము అశ్వము, కొమ్ములుండుట వలన. ఇక్కడ కొమ్ములుండుటచే అనునది హేతువు. అశ్వము సాధ్యము.

అశ్వాభావస్థలమున హేతువుండుటవలన నిది విరుద్ధహేతువు. అశ్వస్థలమున హేతువు లేకుండుటవలన అసిద్ధ హేతువునని తాత్పర్యము.

సూ :- యస్మా ద్విషాణీ తస్మా ద్గౌరితి చానై కాంతిక స్యోదాహరణమ్ 3.౧.౧౮

కొమ్ములుండుటవలన ముందు కనబడు పదార్థము గోవు అని దీనియర్థము.

ఇందు గోవు సాధ్యము. విషాణిత్వము హేతువు. విషాణిత్వమను హేతువు గోభిన్నమగు మహిషాదులలో నుండుట వలన నిది యనైకాంతిక మనబడును.

అవ : వైదికుల మతము ననుసరించి ఆత్మ సచ్చిత్ స్వరూపమయి యున్నది. అనగా నాత్మ జ్ఞాన స్వరూపమని యర్థము. అట్టిచో "ఇంద్రియార్థ ప్రసిద్ధి రింద్రియార్థేభ్యోఽర్థాన్తరస్య హేతుః" అను నీసూత్రార్థము ననుసరించి జ్ఞాన గుణము ద్వారా ఆత్మయెట్లు సిద్ధింపగలదు ?

సూ :- ఆత్మేంద్రియార్థ సన్నికర్షాత్ యన్నిష్పద్యతే త దన్యత్ 3.౧.౧౯

ఆత్మేంద్రియార్థ సన్నికర్షాత్ = ఆత్మాధిష్ఠిత ఘ్రాణాదింద్రియములకు గంధాద్యర్థములతో నేర్పడు సంబంధ విశేషము వలన, యత్ = వస్తువులను తెలియజేయు నే జ్ఞానము, నిష్ప

ద్యతే = కలుగుచున్నదో, తత్ = అజ్ఞానము, అన్యత్=ఆత్మ స్వరూప భూతమగు జ్ఞానముకంటె భిన్నమైనది.

ఆత్మ మనస్సుతోను, మనస్సు ఇంద్రియములతోను, ఇంద్రియములు గంధాది వస్తు విశేషములతోను సంబంధించి నపు డేర్పడు పదార్థ జ్ఞానము ఆత్మకు స్వరూపము గాదు. అది యాత్మాశ్రిత గుణమే. ఆత్మ స్వరూపమగు చిదాత్మజ్ఞానము దానికంటె విలక్షణమైనదని భావము.

వైదికుల మతమున ఆత్మ జ్ఞానస్వరూప మనుట నిజమే. జ్ఞాన గుణకము కాదు. కాని, సంసారమున నున్నంత కాలము మనః సంయోగము వలన నేర్పడు "ఇది గంధము. ఇది రసము. గంధము ననుభవించు చున్నాను, రసము ననుభ వించుచున్నాను." అను నాయా పదార్థ జ్ఞానము వ్యవహార ప్రయోజకమై యిచ్ఛాదులవలె ననిత్యమై యుండు జ్ఞానము ఆత్మాశ్రిత గుణముగా నంగీకరింపబడుచున్నది. జ్ఞాన స్వరూప మగు నాత్మకు జ్ఞానము గుణమెట్లగునని సందేహింప నావశ్యక ముండదు. ప్రకాశ స్వరూపుడగు సూర్యుడు ప్రభా గుణము కలవాడైన ట్లదియు నుపపన్నము (హేతుబద్ధము) కాగలదు.

దార్శనికులలో సాంఖ్య, యోగ, వేదాంత కారులు ఆత్మను ప్రకాశాత్మకముగా నంగీకరించుచు, వ్యవహార సిద్ధి కొఱకు వృత్తిజ్ఞాన మంగీకరించుచున్నారు. అట్లే వైశేషికులు, గౌతములు, మీమాంసకులును ఆత్మలో జ్ఞానగుణము నంగీ కరించుచున్నారు. కాని వీరిలో నొకింత భేదమున్నది. సాంఖ్య కారాదులు ఆత్మసన్నిధానముచే మనస్సు చేతనాయమాన

మయి యందు జ్ఞానము కలుగుననియు అజ్ఞాన మాత్మయం దుపచరించుననియు నొప్పుకొందురు. వైశేషిక కారాదులు ఆత్మ సన్నిధాన మున్నప్పటికి మనస్సున చేతనత యేర్పడ వీలులేదనియు, ఇంద్రియాది విశిష్ట మనస్సంయోగమువలన నాత్మయందే జ్ఞాన ముద్భవించుననియు నభిప్రాయ పడు చున్నారు. ముక్తావస్థయం దెల్లర మతమున మన స్సంయోగా భావము నిర్విశేషముగా నంగీకరింపబడుటవలన తత్సం యోగమువలన నేర్పడు జ్ఞానాది సమస్త గుణములు కలుగ నేరవు. కాబట్టి త్రివిధదుఃఖ నివృత్తిచే శుద్ధమగు నాత్మ తన చిత్స్వరూపముతో బ్రహ్మనందము ననుభవించుచు శాశ్వత శాంతితో విలసిల్లగలదు.

అవ : జ్ఞానగుణ హేతువుచే నాత్మ సిద్ధించినను, ఇత రాత్మ యెట్లు సిద్ధింపగలదు ? అన్యాత్మజ్ఞాన మన్యులచే నెఱుగబడదుగదా ?

సూ :- ప్రవృత్తినివృత్తీ చ ప్రత్యగాత్మని దృష్టే పరత్ర లింగమ్ ౩.౧.౨౦

ప్రవృత్తి నివృత్తీచ = రాగమువలన నేర్పడు ప్రయత్నము ప్రవృత్తి, ద్వేషమువలన నేర్పడు ప్రయత్నము నివృత్తి. ఇవి రెండును, ప్రత్యగాత్మని = తనయాత్మలో, దృష్టే = హితాహిత ప్రాప్తి పరిహారముల కనుకూలమగు క్రియలను కలిగించునవిగా తెలిసికొనబడినందువలన, పరత్ర = ఇతరాత్మయందు, లింగమ్ = హేతుసంపాదకములగుటచే లింగము.

తనలో నెట్లు చేష్టలు కలుగుచున్నవో అట్లే యితరుఁ లోను జూచు చున్నాడు. ఇట్టి సమాన చేష్టలవలన పరునిలో గలుగు చేష్టయు తన చేష్టవలెనే ప్రయత్న విశేషమువలన గలుగుచున్నదనియు, ఆ ప్రయత్నము ఆత్మ సమవేతమనియు నూహింప వీలుకలుగుచున్నది. అందువలన పరాత్మయు సిద్ధించునని భావము.

---

# తృతీయాధ్యాయము

## ద్వితీయాహ్నికము

అవ : ఇంద్రియార్థ ప్రసిద్ధివలె మనోగతియు నాత్మ లింగమని ముందు వర్ణింపనున్నాడు. మనః పరీక్షణ నొనర్ప కున్న నది యుక్తము కాదు. కాబట్టి యుద్దేశక్రమము నుల్లంఘించి మనఃపరీక్షణ నొనర్ప నారంభించుచున్నాడు.

సూ :- ఆత్మేంద్రియార్థ సన్నికర్షే జ్ఞానస్య
భావోఽభావశ్చ మనసో లిఙ్గమ్ 3.౨.౧

ఆత్మేంద్రియార్థ సన్నికర్షే = ఆత్మాధిష్ఠితములగు నింద్రియములకు స్వార్థములయిన శబ్దాది విషయములతో సన్నికర్ష ముండినను, ఒకే విషయమున కలుగు, జ్ఞానస్య = సాక్షాత్కారాత్మకమగు జ్ఞానముయొక్క, భావః = ఉత్పాదః - ఉత్పత్తి, అభావః=అన్యవిషయమున అనుత్పత్తియు, మనసోలింగమ్= మనస్సను నింద్రియ సిద్ధికి ప్రమాణము.

సూత్రములోని చకారము వలన స్మృతి, అనుమానము, ఆగమము సంశయము, సుఖదుఃఖోపలబ్ధియు మనస్సిద్ధికి ప్రమాణములుగా గ్రహింప వలయును.

ఆత్మాధిష్ఠితములయిన ఘ్రాణాదీంద్రియము లన్నియు నొకే సమయమున స్వస్వవిషయములయిన గంధాదులతో సన్నికర్షములై యుండ సర్వేంద్రియములతో సర్వవిషయిక జ్ఞానమొకే క్షణమున గలుగవలయును కాని, అట్లు కలుగక యొక్క క్షణమున గంధజ్ఞానమో లేక రసజ్ఞానమో, లేక స్పర్శజ్ఞానమో ఏదోయొక జ్ఞానమే కలుగుట లోకసిద్ధ విషయము. దీనినిబట్టి ఆత్మేంద్రియములకు మధ్య మఱియొక నిమిత్తముండి యుండ వలయునని యనుమానింప నగుచున్నది. దాని సాన్నిధ్య మే యింద్రియార్థ సన్నికర్షమున కుండునో తద్విషయక జ్ఞానమేర్పడును. ఇతరేంద్రియార్థములకు ఆ నిమిత్తాంతర సాన్నిధ్యము లేకుండుటచే నాక్షణమున నితర విషయకమగు జ్ఞాన మేర్పడదు. ఆ నిమిత్త మే మనస్సనబడును.

౧) ఆత్మేంద్రియార్థ సన్నికర్షము కార్యోత్పత్తియందు కరణాంతరము నపేక్షించును. సన్నికర్షముండినను కార్యముద్భవింపకుండుట వలన ఇందపేక్షింపబడు కరణాంతరమే మనస్సనబడును.

౨) సుఖాది జ్ఞానము కరణజన్యము; జ్ఞానమగుటవలన. గంధాది జ్ఞానమువలె సుఖాదిజ్ఞానమునకు ఘ్రాణాదీంద్రియములు కరణములు కానేరవు. కాబట్టి యేది యిట్టిచో కరణమగునో అదే మనస్సు. స్మృత్యాదులకు నిట్లే ఘ్రాణాదీంద్రియ

ములు కరణములు కానేరవు. ఘ్రాణాదీంద్రియములు చెడి నను స్మృతి కలుగును. నిమిత్తము లేకున్న కలుగనేరదు గనుక ఏది నిమిత్తమగునో అదే మనస్సు. వైశేషికులు వైదికు లగుటవలన మనస్సును మధ్యమ పరిమాణము కలదిగా నంగీ కరింతురు. అణుపరిమాణ మవైదికము. మనస్సు మధ్యమ పరిమాణము కలదగుటచేత నెల్లప్పుడు నన్ని యింద్రియముల తోను దానికి సన్నికర్షముండును. ఉండినప్పటికి కేవల మనః సన్నిధానము జ్ఞాన ప్రయోజనము కాకపోవుటచే సర్వేంద్రియ జ్ఞాన మొకేమాఱు కలుగదు. ఆత్మకృతివలన, నాయా యింద్రియములందు లబ్ధవృత్తికమైన మనఃసన్నిధానమే జ్ఞాన సాధనము కాబట్టి పర్యాయ (ఒకజ్ఞానము తరువాత మఱొక జ్ఞానము) జ్ఞానమే యేర్పడును. దోషమావంతయు నుండదు.

అవ : ఇట్లు మనస్సు సిద్ధించినను, దాని ద్రవ్యత్వ నిత్యత్వము లెట్లు సిద్ధించును ?

సూ :- తస్య ద్రవ్యత్వనిత్యత్వే వాయునా వ్యాఖ్యాతే
3.2.2

తస్య = ఆమనస్సుయొక్క, ద్రవ్యత్వనిత్యత్వే = ద్రవ్యత్వ నిత్యత్వములు, వాయునా = వాయు ద్రవ్యత్వనిత్యత్వములను సాధించిన హేతువుద్వారా, వ్యాఖ్యాతే = సాధింపబడినవని తెలిసికొన వలయును.

ఇంద్రియలక్షణము - యద్ధి శరీరాశ్రయం సత్ స్వసంయుక్తేఽర్థే జ్ఞాతు రపరోక్షప్రతీతిసాధనం ద్రవ్యం తదింద్రియ మిత్యుచ్యతే" శరీరము నాశ్రయించి తనతో సం యుక్తమైన పదార్థమునందు ఆత్మకు ప్రత్యక్ష జ్ఞానసాధనమగ

ప్రత్యక్షమే ఇంద్రియ మనబడును. ఈలక్షణము ఘ్రాణాది బాహ్యేంద్రియములకును మనస్సునకును వర్తించును.

అవ: ప్రతిశరీరమునందును మనస్సు ఒకటి యుండునా? లేక అనేకములా?

సూ :- ప్రయత్నాయౌగపద్యాత్ జ్ఞానాయౌగపద్యా
చ్చైకమ్ 3.౨.3

ప్రయత్నాయౌగపద్యాత్ = అన్ని యవయవములందును ఒకే మాటు క్రియా హేతుక ప్రయత్న ముదయింపకుండుటచేతను, జ్ఞానాయౌగపద్యాచ్చ = ప్రతిపదార్థ విషయక జ్ఞానము నొకమారుదయింపక పోవుటచేతను, ఏకమ్ = ఒక శరీరమున నొక్క మనస్సే యుండును.

మనస్సే యంగముతో సంయుక్తమైన నాయంగమునందు క్రియను జనింపజేయు ప్రయత్నము కలుగును. ఇట్లే మనస్సే యింద్రియముతో సంయుక్తమైన నా యింద్రియముతో తద్విషయకమైన జ్ఞానమాత్మకు కలుగును. ఇది వైశేషికుల పద్ధతి. ప్రతి శరీరము నందు ననేక మనస్సు లున్న పక్షమున అనేక ప్రయత్నములు ననేక జ్ఞానములు నొకే సమయమున ఆత్మయందు కలుగవలసియుండును, క్రమముగా కలుగరాదు. లోకమున జ్ఞానప్రయత్నములు క్రమముగా కలుగుచుండుట చూచుచున్నాము. ఒకచో ప్రయత్నించువాడు పూర్వ ప్రయత్నమును సమాప్తి నొనర్పక అన్యత్ర ప్రయత్నింపనేరడు. ఇట్లే యొక విషయమును గూర్చి తెలిసికొను సమయమున నన్య విషయములను గూర్చిన జ్ఞాన మేర్పడదు. కాబట్టి ప్రతి శరీరమునందును ఒక్కటే మనస్సుండునని భావము.

అవ : మనస్సును పరీక్షించి మరల నాత్మను పరీక్షింప దలచి తత్సాధకములయిన లింగములను ప్రదర్శించు చున్నాడు.

సూ. :- ప్రాణాపాన నిమేషోన్మేష జీవన మనోగ
తీంద్రి యాంతరవికారాః, సుఖదుఃఖేచ్ఛాద్వేష
ప్రయత్నా శ్చాత్మనో లిఙ్గాని 3.౨.౪

ముఖనాసికలద్వారా వెలుపలికివచ్చు స్వభావముకలదై, ఊర్ధ్వ గతికలిగి శరీరమునందు సంచరించువాయువు ప్రాణమన బడును. మూత్ర పురీషములను క్రిందికి నడపుటలో హేతువై, అధోగతి కలిగి దేహమున సంచరించువాయువు అపానమన బడును. కనుఱెప్పలను సంయోగింపజేయు క్రియ నిమేషమన బడును. దాని విభాగ నిమిత్తమగు కర్మము ఉన్మేష మన బడును. శరీరపు వృద్ధిక్షయ సంరోహణాదికములు జీవన కార్య మగుటచే జీవనమనబడును. ఇదే ప్రాణధారణము. అభిమత విషయములను గ్రహించు నింద్రియములతో సంబం ధమునకై ఆయాపదార్థములం దేర్పడు మనోవృత్తి మనోగతి యనబడును, కమలాఫలాదుల రూపమును కంటితో చూచుట తోడనే రసానుస్మృతి పూర్వకముగా లాలాజల సంప్లవాత్మక మైన రసనేంద్రియ వికారము ఇంద్రియాంతర వికారమన బడును. ధర్మమువలన జనించి యనుకూల వేదనీయమైన (అనుభవించుటకు తగిన) గుణము సుఖము. అధర్మజన్యమై ప్రతికూల వేదనీయమైన (అనుభవించుటకు తగని) గుణము దుఃఖము. తనకొఱకో లేక పరులకొఱకో అప్రాప్తార్థప్రార్థనము(లేని దానినికోరుట) ఇచ్ఛ యనబడును. ద్విష్ట-ద్వేషింపబడు సాధనతో

జ్ఞానజన్యమగు (ద్వేషించుటకు తగిన సాధనజ్ఞానమువలన గలుగు) గుణము ద్వేషమనబడును. కృతికి పర్యాయమైచేష్టా జనకమగు గుణము ప్రయత్నమనబడును. సూత్రమునందలి చకారము "జ్ఞానము ఆత్మలింగముగా పూర్వము వర్ణింపబడి నద"ని సూచించును. కాబట్టి, ప్రాణాపానములు [illegible] న్మేషములు, జీవనము, మనోగతి, ఇంద్రియాం[illegible] [illegible] దుఃఖములు, ఇచ్ఛాద్వేష ప్రయత్నములు నన్నియు జ్ఞానము వలె, ఆత్మనః = జీవాత్మయొక్క, లిఙ్గాని = సాధక ప్రమాణ ములు, అని సూత్రార్థము.

(౧) శరీరము నందలి ప్రాణాపానాది నామములతో పిలువబడు వాయువు ఊర్ధ్వాధో భాగములకు నడచుచుండును. వాయు స్వభావమునకు విపరీతమగు నీ యూర్ధ్వాధోగమనము ప్రయత్నవంతుడగు శరీరాధిష్ఠాత యొకడు లేకున్న జరుగ నేరదు. కాబట్టి తిర్యగ్గమన స్వభావమగు వాయువును తన యిచ్ఛవచ్చినట్లు ఊర్ధ్వాధో భాగముల నడపునదే యాత్మ యన బడును.

(తిర్యక్ = అడ్డముగా)

(౨) నోదనాభిఘాతాదులయిన దృష్ట కారణము లు లేకయే యేర్పడుచుండు నిమేషోన్మేషము లను కర్మములు, కొండొకని ప్రయత్నములేకున్న కలుగనేరవు. దారుయంత్ర మును నడపువానివలె నిమేషోన్మేషములను కలిగించువాడే ఆ యాత్మ యనబడును.

(నోదన = నెట్టుట.)

(3) జీవనమని చెప్పబడు ప్రతిక్షణ శరీర వర్ధనము, క్షత సంరోహణాదులును అధిష్ఠాత లేకున్న జరుగనేరవు. గృహము వర్ధనాదుల నొనర్చు గృహపతివలె ఆహారాదుల ద్వారా శరీర వర్ధనాదుల నొనరించు వాడే యాత్మ యనబడును.

(క్షత సంరోహణము = గాయము పూడుట.)

(४) అభిమత విషయ గ్రాహకములగు నింద్రియముల సంబంధముకొఱకు, శరీరాభ్యంతర ప్రదేశములం దేర్పడు మనోగతి ప్రేరకుడు లేకున్న గలుగనేరదు. కందుక ప్రేరక బాలకునివలె నాయా యింద్రియములతో సంబంధింప జేయుటకై మనస్సును ప్రేరించువాడే ఆత్మ.

ఇట్లే యింద్రియాంతర వికారము, సుఖదుఃఖములు మున్నగు వాని ద్వారా ఆత్మను సిద్ధపఱచు ననుమానములను పాఠకు లూహింతురుగాత !

ఇక్కడ జ్ఞానాద్యనిత్యగుణములు నిత్యమైన యాత్మ లింగములుగా సూత్రింపబడినవి. కాని యివి మనో విశిష్ట - ఆత్మకు చెందును. కాని కేవలాత్మకు చెందవు. కేవలాత్మ కూటస్థ నిత్యము. ధర్మముల యుపచయాపచయముల (హెచ్చు తగ్గులు) వలన ధర్మియందు వికార మేర్పడుట సర్వతంత్ర సిద్ధాంతము. ముక్తావస్థయందు మనోయోగము లేకుండుటచే కేవలాత్మ నిర్వికారమై విలసిల్లును.

అవ : జ్ఞానాది సాధకముల ద్వారా ఆత్మ సిద్ధించినప్పటికి దాని ద్రవ్యత్వ నిత్యత్వము లెట్లు సిద్ధింపగలవు ?

సూ :- తస్య ద్రవ్యత్వనిత్యత్వే వాయునా వ్యాఖ్యాతే

3.2.5

వాయువును నిత్య ద్రవ్యమని నిర్ణయించిన సాధనములే ఆత్మ నిత్యత్వ ద్రవ్యత్వముల సాధించునని సూత్రార్థము. కాని, ఆత్మ పరమార్థ (ఉత్పత్తి వినాశములేని) నిత్యము. వాయువువలె ఆప్రలయ (ప్రలయము వఱకునుండు) నిత్యము కాదని తెలిసికొనవలయును.

అవ : దృష్టలింగముద్వారా ఆత్మను సాధింపవలయును గాని, జ్ఞానాది లింగములవలన నేమి ప్రయోజనము ?

సూ :- యజ్ఞదత్త ఇతి సన్నికర్షే ప్రత్యక్షాభావాత్
దృష్టం లింగం న విద్యతే 3.౨.౬

సన్నికర్షే = యజ్ఞదత్తునితో, తచ్చక్షుః సంయోగమనెడి సన్నికర్ష మేర్పడిన, యజ్ఞదత్తుడు అను, ప్రత్యక్షాభావాత్ = శరీరము ప్రత్యక్షమైనను, యజ్ఞదత్తుడని శరీరాధిష్ఠాతయైన ఆత్మ జ్ఞానము కలుగదు. కాబట్టి, దృష్టం లిఙ్గమ్ = దృష్టవ్యాప్తిగల సాధక ప్రమాణము, న విద్యతే = లేదు.

మన మెవరినైన కన్నులతో చూచిన నతని శరీరము ప్రత్యక్ష మగును, కాని, అతడు గోవిందుడో, యజ్ఞదత్తుడో, మఱియెవరో తెలియదు. ఆయా శరీరములందుండు ఆత్మలను గుర్తింపదగు ప్రత్యక్షసాధన మొకటియు లేదని సూత్ర భావము.

అవ : అట్లగుచో జ్ఞానాది లింగముల వలన నెట్టి యాత్మ సిద్ధించును ?

సూ :- సామాన్యతో దృష్టా చ్చావిశేషః 3.౨.౭

సామాన్యతో దృష్టాత్ చ = సామాన్యతో దృష్టమను సంజ్ఞగల జ్ఞానాదుల వలన, అవిశేషః = ఆత్మత్వాది సామాన్య విశేష రహితమగు నొకద్రవ్యము మాత్రము సిద్ధించును.

అవ : ఇది ఆత్మ అను విశేషజ్ఞాన మెట్లు కలుగును ?

సూ. :- తస్మా దాగమికః 3.౨.౮

తస్మాత్ = సామాన్యతో దృష్టానుమానమువలన సామాన్యముగా ద్రవ్యమొకటి సిద్ధించును కాబట్టి, 'ఆత్మ' అను విశేషజ్ఞానము ఆగమికః = వేదసిద్ధము.

"యస్మిన్ సర్వాణి భూతాన్యాత్మైవాభూద్విజానతః" యజు. ౪౦.౭

"ఆత్మానం చే ద్విజానీయాత్" బృ. ఉ. ౪.౪.౧౨

ఈ వేదోపనిషద్వాక్యములలో ఆత్మశబ్దము ప్రయోగింప బడి యున్నది.

అవ : ఆత్మయనుదానిని పృథివ్యాదులలో నొకటిగా నంగీకరింపక అతిరిక్తముగా నాగమిక ద్రవ్యముగ నంగీకరింప నేల ?

సూ :- అహమితి శబ్దస్య వ్యతిరేకా న్నాగమికమ్ 3.౨.౯

అహమితి శబ్దస్య = ఆత్మయందు నిరూఢమైన (అహమ్) నేను అను పదము, వ్యతిరేకాత్ = పృథివ్యాది వాచకములకంటె భిన్నమగుటవలన, వానిలో నొకటి కానేరదు. కాబట్టి, నాగమికమ్ = ఆగమ సిద్ధమైన ఆత్మను కాదన వీలులేదు.

ఏశబ్ద మే యర్థమునకు వాచకమో అది దానితో నన్వయిం చుట లోకమునజూచుచున్నాము. సామానాధికరణ్యమే అన్వయ మనబడును. తదభావము వ్యతిరేకమనబడును. ఆత్మ పృథి వ్యాదులలో నన్యతమమగునేని ఆత్మ నిరూఢమగు (ఆత్మ యందు వాడబడు) శబ్దము పృథివ్యాదులకు వ్యతిరేకము కాజనదు. (ద్రవ్యం భూః ఇతివత్ అహం భూః అహముదకమ్ ఇతి దృశ్యేత) 'భూమి ద్రవ్యము' అని ప్రయోగింప బడునట్లు 'నేను భూమి'- 'నేను జలము'- అని ప్రయోగింప బడవల సినది. కాని, అట్లు ప్రయోగింపబడుట మనమెన్నడును జూచి యుండము. కాబట్టి 'నేను' (అహమ్) అను శబ్దముచే వ్యవ హరింపబడు నాత్మ పృథివ్యాదులలో చేరక తద్భిన్నమే యని స్పష్టపడుచున్నది.

అవ : ఈ విషయమున ప్రత్యక్షాత్మవాది యిట్లాక్షేపించు చున్నాడు.

సూ. :- యది దృష్టమన్వక్ష మహం దేవదత్తోఽహం
యజ్ఞదత్త ఇతి 3.౨.౧౦

అహం దేవదత్తః, అహం యజ్ఞదత్తః ఇతి = 'నేను దేవదత్తు డను, నేను యజ్ఞదత్తుడను' అని, అన్వక్షం యది దృష్టం= ప్రత్యక్షజ్ఞానముండగా అనుమానాదులతో నేమిపని ? అని సూత్రార్థము.

ప్రత్యక్ష సిద్ధవస్తువును అనుమానము ద్వారా సాధించుట నిష్ప్రయోజనము. కావుననే, న్యాయవార్తిక తాత్పర్యటీకా గ్రంథకారులయిన శ్రీ వాచస్పతి మిశ్రులు "న హి కరిణి దృష్టే

చీత్కారేణ త మనుమిమతేఽనుమాతారః" ఏనుగును కంటిచే చూచిన తరువాత నైయాయికులు చీత్కారము ద్వారా ఏనుగు ననుమానింపరని వ్రాసియున్నారు. 'నేను దేవదత్తుడను' యజ్ఞదత్తుడను అని ప్రత్యక్షసిద్ధ మగుచుండ ప్రత్యగాత్మ ననుమానము ద్వారా సాధింపనేల ? అని సూత్రభావము.

అవ : సమాధానము.

సూ. :- దృష్ట ఆత్మని లిఙ్గే ఏక ఏవ దృఢత్వాత్
ప్రత్యక్ష వత్ప్రత్యయః 3.2.11

ఆత్మని = ఆత్మకు సంబంధించిన, లిఙ్గే = జ్ఞానేచ్ఛాది లింగము, దృష్టే=ఘటమును తెలిసికొనుచున్నాను, పటమును కోరుచున్నాను అను నిట్టి జ్ఞానము లభింపగా, ఏక ఏవ=ఒకే అనుమానిక జ్ఞానము కలుగుచున్నది, ఆ జ్ఞానము, దృఢత్వాత్ = తొలగింప శక్యము గానందున, ప్రత్యక్షవత్ప్రత్యయః = ప్రత్యక్షమువలె తోచును; కాని ప్రత్యక్షము గాదు

నేను తెలిసికొనుచున్నాను, కోరుచున్నాను, చేయుచున్నాను. అని కలుగు జ్ఞానేచ్ఛాకృతులనుబట్టి "ద్రష్టవ్యాతిరిక్తమై ప్రత్యగాత్మయను నొక వస్తువు కలదు. అందు జ్ఞానాదులాశ్రయించి యున్నవి" యని యొక జ్ఞానముదయించును. అది దృఢముగా నుండుటచే ప్రత్యక్షమువలె తోచునుగాని ప్రత్యగాత్మ యెన్నడును ప్రత్యక్షవిషయము గాదు. కావుననే ముందు సూత్రకారుడు తత్రాత్మా మనశ్చాప్రత్యక్షే (౮.౧.౨) (ఆత్మ మనస్సు ప్రత్యక్షము కావు) అని వర్ణించి యున్నారు.

అవ : లైంగిక ప్రత్యక్ష గోచరమగుటచే మే మాత్మను ప్రత్యక్ష మనుట లేదు. నేను దేవదత్తుడను. నేను యజ్ఞదత్తుడను అని కలుగు మానసప్రత్యక్ష విషయ మగుటచే ప్రత్యక్ష మనుచున్నామందురేని దానికి సమాధానము.

సూ. :- దేవదత్తో గచ్ఛతి యజ్ఞదత్తో గచ్ఛతీ
త్యుపచారా చ్ఛరీరే ప్రత్యయః 3.౨.౧౨

దేవదత్తో గచ్ఛతి యజ్ఞదత్తో గచ్ఛతి ఇతి = దేవదత్తుడు వెళ్ళుచున్నాడు, యజ్ఞదత్తుడు వెళ్ళుచున్నాడు అని, ఉపచారాత్ = లక్షణద్వారా. శరీరే ప్రత్యయః = శరీర విషయక జ్ఞానము.

(అన్వయానుపపత్తిర్వా తాత్పర్యానుపపత్తిర్వా లక్షణా బీజమ్) లక్షణార్థమునకు కారణము అన్వయానుపపత్తియో తాత్పర్యానుపపత్తియో యగును. కాబట్టి శరీర విశిష్టప్రత్యగాత్మయందు శక్తములయిన దేవదత్తాది పదములు అన్వయానుపపత్తిచేత, లక్షణావృత్తిచే శరీరమునందు వర్తించును, అని భావము.

అవ : లక్షణార్థమున శంక-

సూ. :- సందిగ్ధ స్తూపచారః 3.౨.౧3

ఉపచారః=పై సూత్రమున జెప్పబడిన లక్షణార్థము, సందిగ్ధః= సంశయ గ్రస్తము.

దేవదత్తుడు వెళ్ళుచున్నాడనిన దేవదత్తుని శరీరము వెళ్ళుచున్నదని లక్షణార్థ మొనర్చుటకు తగిన హేతువు నిర్దేశింపబడకుండుటచే నయ్యది సందిగ్ధమని భావము

అవ : దేవదత్తాది పదములు లక్షణావృత్తిచేత శరీరము నందు వర్తింపకున్న నెందు వర్తించును ?

సూ. :- అహమితి ప్రత్యగాత్మని భావాత్
పరత్రాభావా దర్థాంతర ప్రత్యక్షః 3.2.౧౪

అహమితి = నేను దేవదత్తుడను అను ప్రత్యయము, ప్రత్యగాత్మని భావాత్ = తనలో (జీవాత్మ లో) గలుగుటవల్లను, పరత్రాభావాత్ = ఇతరత్ర గలుగక పోవుటవల్లను, అర్థాంతర ప్రత్యక్షః = శరీరముకంటె భిన్నమైన ప్రత్యగాత్మ విషయమే గాని శరీరవిషయము గాదు.

నేను అను జ్ఞానము ప్రత్యగాత్మయందు గలుగును. అన్యత్ర గలుగదు. ఈ జ్ఞానము శరీరవిషయికమైనచో అన్య శరీరములందును గలుగవలయును. అట్లు గలుగకుండుటచే ఆత్మ ప్రత్యక్షమనియే యెఱుంగవలయు నని పూర్వపక్షాభి ప్రాయము.

అవ : సమాధానము-

సూ. :- దేవదత్తో గచ్ఛతీ త్యుపచారా దభిమానా
త్తావ చ్ఛరీర ప్రత్యక్షోఽహంకారః 3.2.౧౫

దేవదత్తో గచ్ఛతీతి=దేవదత్తుడు వెళ్ళుచున్నాడు, యజ్ఞదత్తుడు వెళ్ళుచున్నాడు అను ప్రత్యయము (జ్ఞానము)వలె, ఉపచారాత్=లక్షణావృత్తితో, అభిమానాత్ శరీరప్రత్యక్షః=శరీరమే ఆత్మయనెడి యాత్మాభిమానమున-శరీరమున - ప్రత్యక్షము, అహంకారః = నేను దేవదత్తుడను, నేను యజ్ఞదత్తుడను అను అహం ప్రత్యయము.

దేవదత్తుడు వెళ్లుచున్నాడను జ్ఞానము శరీర విషయుకమయినట్లు అభిమానమువలన 'నేను దేవదత్తుడను యజ్ఞదత్తుడను' అను అహం ప్రత్యయము స్తైతము లక్షణచేత శరీర విషయమేగాని యన్యము కాదని భావము.

అవ : మరల శంకించుచున్నాడు.

సూ. :- సందిగ్ధ స్తూపచారః 3-౨-౧౭

అహంకారము శరీర ప్రత్యక్షమేకాని అర్థాంతర ప్రత్యక్షము కాదనుటకు తగిన హేతువు నిర్దేశింప బడలేదనియే యీ సూత్రాభిప్రాయము.

అవ : మరల శంకను పరిహరించుచున్నాడు.

సూ. :- న తు శరీర విశేషాత్ యజ్ఞదత్త విష్ణుమిత్రయోర్ జ్ఞానం విషయః 3.౨.౧౮

యజ్ఞదత్త విష్ణు మిత్రయోర్ జ్ఞానమ్ = నేను యజ్ఞదత్తుడను. నేను విష్ణు మిత్రుడను అను జ్ఞానము. శరీర విశేషాత్ = శరీరవిషయిక మగుటవలన. విషయః = ఆత్మ విషయము. న తు = కాదు.

ఆత్మ కూటస్థ మగుటచే కేవలాత్మయందు ముఖ్య గౌణ గుణము లేవియు కలుగనేరవు. శరీరమున గమనము ప్రత్యక్షముగా కనబడుచున్నది. కాబట్టి దేవదత్తాది శబ్దములు లక్షణ చేత శరీరమున వర్తించుట కెట్టి హానియు నగపడదు. అట్టి యెడ సందేహమేలయని సూత్రాభిప్రాయము.

'దేవదత్తోఽహం-నేను దేవదత్తుడను' అను ప్రత్యయాదులు శరీర విషయికములగు నెడల సామాన్యతోదృష్ట మగుటచే ఆత్మ యాగమికమే కాని అనుమానికము కానేరదందురేని,

సూ. :- అహమితి ముఖ్యయోగ్యాభ్యాం శబ్దవద్వ్యతిరేకా
వ్యభిచారా ద్విశేషసిద్ధే ర్నాగమికః 3.౨.౧౮

ముఖ్యయోగ్యాభ్యాం=ముఖ్యయోగ్యములద్వారా, అహమితి = నేను దేవదత్తుడను, యజ్ఞదత్తుడను అను జ్ఞానముచేత, శబ్దవద్వ్యతిరేకావ్యభిచారా ద్విశేష సిద్ధేః = శబ్దగుణము ద్వారా ఆకాశము సిద్ధించునట్లు ఆత్మ అను విశేషపదార్థము సిద్ధించుట వలన, నాగమికః = ఆగమమాత్ర సిద్ధ మన నొప్పదు.

శబ్దగుణము పృథివ్యాద్యష్ట ద్రవ్యములందు లభింపనిదై తనకాశ్రయ భూతమగు నాకాశ ద్రవ్యమును పృథివ్యాదులకు భిన్నముగా నెట్లు సిద్ధింపజేయుచున్నదో అట్లే 'నేను దేవదత్తుడను నేను యజ్ఞదత్తుడను' అను నిట్టి ప్రత్యయము పృథివ్యాద్యష్ట ద్రవ్యములం దనుపలబ్ధమై తన కాశ్రయభూతమగు ఆత్మను సిద్ధింపజేయు చున్నది. కాబట్టి పరిశేషాదనుమాన ప్రమాణగమ్యమగుటచే ఆత్మపదార్థము కేవల మాగమిక మన రాదు. అనుమానాగమము లను ప్రమాణద్వయ సిద్ధమని యొఱుంగ వలయును.

అవ : ఆత్మ ద్రవ్య మింతవఱకు పరీక్షింపబడినది ఇకముందు ఆత్మ నానాత్వమును పరీక్షింపదలచి పూర్వపక్షమును సూత్రించుచున్నాడు.

సూ. :- సుఖదుఃఖజ్ఞాన నిష్పత్త్యవిశేషా దైకాత్మ్యమ్
3.౨.౧౯

ఐకాత్మ్యమ్ = చైత్ర మైత్రాదుల శరీరములు భిన్నము లైనను వానిలోని ఆత్మ మాత్రమొక్కటే. కారణ మేమన? సుఖదుఃఖజ్ఞాన నిష్పత్త్యవిశేషాత్=ప్రతిశరీరమునందును సుఖము దుఃఖము జ్ఞానమువున్నగు గుణము లుత్పన్నము లగుటయే కారణము.

శబ్ద గుణాశ్రయభూతమగు నాకాశ మొక్కటియై నట్లు సుఖదుఃఖ జ్ఞానాదిలింగములచే నిష్పన్నమగు నాత్మయు నొక్కటియే యని సూత్రాభిప్రాయము.

ఆవ :- సమాధాన సూత్రము.

సూ. :- వ్యవస్థాతో నానా 3.౨.౨౦

వ్యవస్థాతః = నానాభేదములచే భిన్నములయిన సుఖదుఃఖములు ఒక యాత్మకు సంబంధించినవి మఱియొక యాత్మకు సంబంధించిన వానితో కలియకుండుటంబట్టి, నానా = ఆత్మ యొకటికాదు అనేకములని యెఱుంగవలయును.

బాల్యావస్థయం దనుభవించిన సుఖదుఃఖాదులు వృద్ధావస్థ యం దనుసంధింపబడును. నేను బాల్యమున సుఖ మనుభవించితిని, నేను దుఃఖము ననుభవించితిని అని స్మరింపబడును. అట్లే యెల్ల శరీరములందు నొకే యాత్మ యున్న యెడల ఒక శరీరమున నేర్పడు సుఖదుఃఖములు మఱియొక శరీరమున తెలియవలసి యుండును. ఒకరు సుఖులైన

నెల్లరు సుఖులును, ఒకడు దుఃఖియైన నెల్లరు దుఃఖులును కావలసి యుందురు. లోకమున నట్లు చూడఁజాలకున్నాము. కాబట్టి యాత్మ యొక్కటి యన వీలుకాదు. ప్రతిశరీరమున కొక యాత్మ భిన్నముగా నుండవలయును.

అవ : యుక్తితో ననేకాత్మలు సిద్ధించినను శాస్త్ర మంగీకరించు నా యన,

సూ. :- శాస్త్రసామర్థ్యా చ్చ 3.2.21

శాస్త్రమువల్లను అనేకాత్మలు సూచింపబడుచున్నవి.

"యే సమానాః సమనసో జీవా జీవేషు మామకాః
తేషాం శ్రీర్మయి కల్పతా మస్మిన్ లోకే శతం సమాః"
(యజు. ౧౯.౪౬)

ఈ లోకమున జీవించువారిలో నెవరు సమాన గుణకర్మ స్వభావములు కలవారు, సమాన ధర్మమందు మనస్సుకలవారు, నాకు సంబంధించినవారు నగు జీవులు (పితరులు) కలరో వారి సంపద నూఱేండ్లు నా కుండును గాక!

పితరులు బ్రదికియున్నంతకాలము బిడ్డలు సేవింపవలయును. అట్టి బిడ్డలు సజ్జను లగుదురు. వారికి పితరుల సంపద లభింపదగును. బిడ్డల సంపద పితరు లనుభవింపదగుదురు.

"చేతన శ్చేతనానామ్" (కఠ. ౫.౧౩)

చేతనములయిన జీవులలో పరమాత్మ సదా చేతనుడు.



# చతుర్థాధ్యాయము

## ప్రథమాహ్నికము

పూర్వాధ్యాయములందు పృథివ్యాది నవద్రవ్యములు పరీక్షింపబడినవి. జీవేశ్వర భేదములచే భిన్నమగు నాత్మ ద్రవ్యమును విడిచి మిగిలిన ద్రవ్యములకు మూలకారణమైన ప్రకృతి పదార్థమును పరీక్షింపగోరి యీ యధ్యాయమున ముందు ప్రకృతిరూపమును మహర్షి చూపుచున్నాడు.

సూ. :- స దకారణవ న్నిత్యమ్ ४.౧.౧

సత్ = ఉనికి గలదై, అకారణవత్ = కారణము లేనిదగుచు, నిత్యం = పరిణామి నిత్యమగునది, పృథివ్యాదులకు మూల కారణము, అదే ప్రకృతి యనబడును.

ప్రకృతి (సత్) ఉనికిగల దనుటచే అసత్తనిగాని అభావ మని గాని యనవొప్పదు. కారణములేని దనుటచే ఇచ్ఛా రూప గుణమనంజనదు. నిత్యమనుటచే క్షణికమగు విజ్ఞానము కంటెను కూటస్థ నిత్యమగు (పరిణామముచెందని) బ్రహ్మ కంటెను భిన్నమనియే సూత్రాభిప్రాయము. ప్రకృతి పరిణామి నిత్యము. అనగా మార్పుచెందుచు నిత్యముగా నుండును.

అవ : ప్రకృతి సత్పదార్థమనుటకు హేతువేమి ?

సూ. :- తస్య కార్యం లిఙ్గమ్ ४.౧.౨

తస్య = నిత్యమూలకారణమగు ప్రకృతియొక్క సద్భావము నకు, కార్యం = ఇంద్రియ గోచరమగు కార్యము, లిఙ్గమ్ = ప్రమాణము-హేతువు.

ప్రతి కార్యము సోపాదానకము - ఉపాదానకారణము గలది-ఘటాదులవలె. ఈ జగత్తుకూడ సావయవ మగుట వలన సోపాదానకమే కావలయును. కాబట్టి యీ జగత్తునకు ఉపాదానకారణము (సమవాయి కారణము) అయిన వస్తువే నిత్యమైన మూలకారణము. అది ప్రకృతి యన బడును.

అవ : కారణమునకు కార్యమెట్లు లిఙ్గము - హేతువు-ప్రమాణమగును ?

సూ. :- కారణభావాత్కార్యభావః ౪.౧౩

కారణభావాత్ = కారణ సత్త్వమువలన, (ఉనికివలన) కార్యభావః=కార్యసత్త్వమనునది (ఉనికి) నియమము.

ఏ పదార్థముయొక్క సత్త్వాసత్త్వముల వలన దేని సత్త్వాసత్త్వము లుండునో ఆ (కార్య) పదార్థము దానికి లింగమని ధ్రువమైన నియమము. కార్య భావాభావములు (ఉనికి లేములు) కారణ భావాభావములవలన నియమముగా నేర్పడు చున్నవి. ఈ నియమ మెక్కడను తప్పదు. కాబట్టి కారణమునకు కార్యము లింగమగును.

మన మీలోకమునగల కొండొక స్థూల ఘటాది కార్యమును అవయువములుగా విభజించుచు పోయిన చివరకొక యల్పతమావయువ విభాగావస్థను పొందుదుము. ఆ యల్పత

మావయవము విద్యుత్సాహాయ్యమునను విభజింప వీలుగాని పరిస్థితిలో నుండియుండును. అట్టిదానినే పరమాణువందురు. ఆ పరమాణువు లనంతములు. ఈ పృథివ్యాది పరమాణువులు వేయి తరములలోను లెక్కింప నలవిగావు. అవి యవాంతర భేదములచే ననేక విధములయ్యు సత్వరజస్తమో భేదములచే ముప్విధముల విభజింపబడుచున్నవి. సాంఖ్య యోగ వేదాంతులు వానిని గుణములని వ్యవహరింతురు. వైశేషికులు, గౌతములు, నైయాయికులు, మీమాంసకులు పరమాణువులందురు. శ్వేతాశ్వతర శాఖీయులు లోహిత శుక్ల కృష్ణ నామములతో పిలుతురు. ఈ పరమాణువు లన్నింటియొక్క యొకానొక దివ్యశక్తి స్వరూపమే ప్రమాణ కుశలుల కనధిగమ్యమై, (అప్రాప్యమై) యోగులకు దుర్లక్ష్యమై, (కష్టముతో సాక్షాత్కారము చేసికొనబడునదై) ముముక్షువులకు దురతిక్రమమై, మూలకారణము ప్రకృతి యనబడుచున్నది. దానినే సాంఖ్య యోగ వేదాంతులు తదితర వైదికులు సామ్యావస్థ యందురు. దైవీశక్తి-పరాశక్తి-మాయ-మహామాయ-ప్రకృతి-అవ్యక్తము-అవ్యాకృతము నని యామూలకారణమగు ప్రకృతికి నామాంతరములు. ఈ మూల ప్రకృతియందే ప్రలయ కాలమున సమస్త ప్రపంచము సుషుప్తి ననుభవించుచున్న ప్రాణిజాతమువోలె తమస్సుచే నిగూఢమై పిండీభూతమై యుండును. అప్పుడు ప్రకృతి 'స్వధ' యనబడును. పవిత్ర వేదములందిది యిట్లే వర్ణింపబడి యున్నది.

"న మృత్యురాసీ దమృతం న తర్హి న రాత్ర్యా అహ్న
ఆసీ త్ప్రకేతః, అనీదవాతం స్వధయా తదేకం
తస్మాద్ధాన్యద్ న పరః కించనాస."

(ఋ. మం. ౧౦ సూ. ౧౨౯)

'జగత్సృష్టికి పూర్వము మృత్యువు లేదు. జీవనము లేదు. రాత్రిజ్ఞానము పగటిజ్ఞానమును లేదు. ప్రాణశక్తి రూప ముండెను. కాని అది స్థూల వాయువు కాదు. అది ఒక్కటియే. దానికంటె వేఱుగ మఱొకటి యేదియు న్యూనా ధికమైనది లేదు :

ప్రాణుల భోగోపలబ్ధి కొఱకు (సుఖదుఃఖానుభవము కొఱకు) భగవత్సిసృక్షవల్ల-సంకల్పమువల్ల-ఆ మూల ప్రకృతి యందు క్షోభ-సంచలనము-ఏర్పడును. ఆ క్షుబ్ధప్రకృతియందు సత్వగుణ బహుళమగు నొకభాగ మేర్పడుచున్నది. అది మహత్తనబడును. ఆ మహత్తుయొక్క అవస్థా విశేషమే అహంకార మనబడును. ఆ యహంకారమునకు సంబం ధించిన సత్వగుణ బహుళమగు భాగమునుండి యీశ్వర నియమము ననుసరించి ప్రతిజీవి కొక్కొక మనస్సు మధ్యమ పరిమాణము గలది యుత్పన్న మగును. తమోగుణ బహుల మగు భాగమునుండి దిక్కాలములు జనించును. అవి వ్యాపక ములు. మఱియు, వ్యాపకమగు శబ్దతన్మాత్ర, అణు పరిమాణ ములు గల స్పర్శతన్మాత్ర-రూపతన్మాత్ర-రసతన్మాత్ర - గంధ తన్మాత్రలు జనించును. ఇందు తుదినాలుగు తన్మాత్రలు వైశేషిక గౌతమ మీమాంసకులచే ద్వ్యణుకము లనబడును. శబ్దతన్మాత్రవలన ఆకాశము పుట్టును. స్పర్శతన్మాత్రవలన

త్ర్యణుకాది (మూడు ద్వ్యణుకములు) క్రమము ననుసరించి మహావాయువు జనించును. ఇట్లే రూప రస గంధ తన్మాత్రముల వలన అగ్ని-జల-పృథివీ భూతములు పుట్టుచున్నవి. ఇది సంక్షిప్త సృష్టి క్రమము.

అవ : కార్యరూప హేతువువల[illegible] [illegible] [illegible]ల కారణము సిద్ధించును గాని యది నిత్య మనుటల [illegible] మేమి ? యున :

సూ. :- అనిత్య ఇతి విశేషతః ప్రతిషేధభావః ౪.౧.౪

అనిత్య ఇతి=నిత్యపదార్థమొందు లేదని చెప్పువారి, విశేషతః= విశేషము యొక్క-నిత్యముయొక్క, ప్రతిషేధభావః = నిషేధమే ప్రమాణము.

నిత్య భావపదార్థమొందు బ్రహ్మాండమున లేని పక్షమున అనిత్యమని మనము నిషేధించు పదార్థ మెయ్యది ? నిషేధమునకు ప్రతియోగిగానుండు నదియే నిత్యమని తాత్పర్యము.

అవ : భావ పదార్థము లన్నియు నుత్పత్తి వినాశవంతము లగుటచే నా తారతమ్యము. కావున తదపేక్షయా మా ప్రతిషేధ మందురేని,

సూ. :- అ వి ద్యా ౪.౧.౫

భావ పదార్థము (ఉనికిగల పదార్థములు) లన్నియు నుత్పత్తి వినాశవంతములని మీరెంచుట (అవిద్యా) భ్రాంతి యగును. నిరవయువ భావ పదార్థములు ఉత్పత్తి వినాశవంతములుగావు. ఆ నియమము సావయువ పదార్థములకే చెల్లును.

వైదికులు జీవేశ్వర ప్రకృతులనెడి భావత్రయమును నిరవయవ మనియు మిగిలిన ప్రపంచము సావయవమనియు నెంతురు. అందు జీవేశ్వరులు కూటస్థ నిత్యములు. ప్రకృతి పరిణామి నిత్యము.

అవ : పృథివ్యాదులకు మూల కారణము ప్రకృతి యనునది యొకటియున్న నది కన్నులకేల కనబడదు ?

**సూ. :- మహత్యనేక ద్రవ్యవత్వాత్ రూపాచ్చోపలబ్ధిః**

౪.౧.౬

మహతి = మహత్పరిమాణముగల ద్రవ్యమునందుండు, అనేక ద్రవ్య వత్వాత్=అనేక ద్రవ్యసమవేతత్వమువల్లను, రూపాచ్చ= రూపసమవాయమువల్లను, ఉపలబ్ధిః = అది చక్షుర్గోచర మగును.

మహత్వ పరిమాణముగల యే ద్రవ్యమున ననేక ద్రవ్య వత్వము (అనేక ద్రవ్యములు సమవాయ సంబంధముతో నుండుట) రూపము (ఉద్భూతము) నుండునో అదియే కన్నుల కగపడును. మూలకారణమగు ప్రకృతి యందనేక ద్రవ్య ములు సమవేతము గాకుండుటచే నది కంటి కగపడకున్నది.

అవ : మహాభూతమగు వాయువునందు అనేక ద్రవ్య సమవేతత్వమున్నది కదా ! అది యేల కంటికగపడదు ?

**సూ. :- సత్యపి ద్రవ్యత్వే మహత్వే రూపసంస్కారా భావాత్ వాయో రనుపలబ్ధిః**

౪.౧.౭

ద్రవ్యత్వే = అనేక ద్రవ్యవత్త్వము, మహత్వే=మహత్పరిమాణ వత్త్వము, సత్యపి = ఉన్నప్పటికి, రూపసంస్కారాభావాత్ = రూపసంబంధము లేకపోవుటవల్ల, వాయో రనుపలబ్ధిః = వాయువు కంటికి కనబడదు.

అవ : దేని సంబంధమువల్ల ద్రవ్యము ప్రత్యక్ష మగునో, ఆరూప మెట్లు కంటికి కనబడును ?

సూ. :- అనేక ద్రవ్యసమవాయాత్ రూపవిశేషాచ్చ రూపోపలబ్ధిః ౪.౧.౮

అనేక ద్రవ్యసమవాయాత్=అనేక ద్రవ్యములు సమవేతములై యుండు నట్టియు మహత్పరిమాణము గలిగినట్టియు ద్రవ్యము నందు సమవేతమై యుండుటవల్లను, రూపవిశేషాత్ = ఉద్భూతత్వానభిభూతత్వముల కాశ్రయ మగుటవల్లను, రూపోపలబ్ధిః = రూపము కంటికి కనబడును.

అనేకావయవ ద్రవ్యములచే నేర్పడి మహత్పరిమాణ వంతమైన ద్రవ్యమునందు ఏరూపము సమవాయ సంబంధ ముతో నుండి యుద్భూతత్వాది విశేషముల కాశ్రయమగునో ఆరూపమే చక్షుర్గోచర మగును. ఇతర రూపము కనబడదు.

ప్రత్యక్ష గ్రహణయోగ్యత్వ ముద్భూతత్వ మనబడును. బలవత్సజాతీయగ్రహణకృతమగు నగ్రహణత్వము అభిభవ మనబడును.

(పెద్దదీపముండగా చిన్నదీపము కనబడదు. సూర్యు డుండగా నక్షత్రములు కనబడవు. చిన్నదీపమునకు పెద్ద

దీపము, నక్షత్రములకు సూర్యుడు బలవత్సజాతీయములు. అవి గ్రహింపబడునప్పుడు చిన్నవి గ్రహింపబడవు. బలవత్స జాతీయ గ్రహణకృతమగు నగ్రహణత్వమనగా నిట్టిదియే.)

సూ. :- తేన రస గంధ స్పర్శేషు జ్ఞానం వ్యాఖ్యాతమ్

౪.౧.౯

తేన=రూపోపలబ్ధికి నిర్దేశింపబడిన ప్రయోజకత్వముచేత, రస గంధస్పర్శేషు = రస గంధ స్పర్శములయిన విశేషగుణము లందు, జ్ఞానం = వాసన, నాసికాది జ్ఞానముకూడ, వ్యాఖ్యాతమ్ = నిరూపింపబడినదని యెఱుగవలయును.

అవ : పాషాణాది గంధము నాసికకు గోచరము గాకుం డుటచే పై లక్షణమట వ్యభిచరించు నను సందేహమును దూరమొనర్చుచున్నాడు.

సూ. :- తస్యాఽభావా దవ్యభిచారః ౪.౧.౧౦

తస్య = గంధ విశేషము, అభావాత్ = లేకుండుటవలన, అవ్యభిచారః = పై నియమమున నెట్టి దోషమును లేదు.

పాషాణాదులలో గంధముండును. కాని అనుద్భూత రూపమున నుండును. కాబట్టి నాసిక కుపలబ్ధము కాదు. అందువల్లనే లక్షణమున అనేక ద్రవ్య సమవేతత్వముతో బాటు గంధ విశేషత్వము నుండుట యావశ్యకమని సూచింపబడి నది. విశేషత్వ మనగా ఉద్భూతత్వము అనభిభూతత్వము నని పైన వర్ణించియున్నాము.

అవ : రూప రస గంధ స్పర్శాదులు బాహ్యేంద్రియములలో నొక్కొకక్క దానిచే నుపలబ్ధము లగునని చెప్పినట్లు సంఖ్యాది గుణాంతరముల యుపలబ్ధికిగల ప్రయోజకత్వము-విశేష హేతుత్వము-ను నిరూపించుచున్నాడు.

సూ. :- సంఖ్యాః, పరిమాణాని, పృథక్త్వం, సంయోగ విభాగౌ, పరత్వా పరత్వే, కర్మ చ, రూపద్రవ్య సమవాయా చ్చాక్షుషాణి ౪.౧.౧౧

సూత్రమునందలి చకారము వలన స్నేహద్రవత్వవేగ గుణములను గ్రహింపవలయును. సూత్రమున వర్ణింపబడిన సంఖ్యా పరిమాణము, పృథక్త్వము, సంయోగ విభాగములు, పరత్వా పరత్వములు, స్నేహము, ద్రవత్వము, వేగము, కర్మము ఇవియన్నియు, రూపద్రవ్య సమవాయాత్ = రూపముగల ద్రవ్యములందు సమవాయ సంబంధముతో నుండుటవల్ల, చాక్షుషాణి = చక్షుర్గోచరములు, త్వగింద్రియ గోచరములు నగునని సూత్రార్థము.

సూ. :- అరూపి ష్వచాక్షుషాణి ౪.౧.౧౨

పూర్వసూత్రమంతయు నిందు జోడింపవలయును. అనగా పై జెప్పిన సంఖ్యాదులన్నియు, అరూపిషు = రూపములేని ద్రవ్యములందు సమవాయ సంబంధముతో నుండియు, అచాక్షుషాణి = చక్షుర్గోచరములు, త్వగింద్రియ గోచరములు కావు, అని యీ సూత్రాభిప్రాయము.

సూ. :- ఏతేన గుణత్వే భావే చ సర్వేంద్రియజ్ఞానం వ్యాఖ్యాతమ్    ౮.౧.౧౩

ఏతేన = రూపాది గుణము లా యా యింద్రియ గోచరము లగునని చెప్పుటచే. గుణత్వే = గుణములందుండు గుణత్వ మను జాతియు, భావే చ = 'సత్తా' యను పరజాతియు, సర్వేంద్రియ జ్ఞానం=చక్షురాదీంద్రియము లన్నిటికి విషయము లగునని, వ్యాఖ్యాతమ్ = వ్యాఖ్యానము చేయబడిన ట్లెంచ వలయునని సూత్రకారుని యభిప్రాయము.

('యేనేంద్రియేణ యా వ్యక్తి ర్గృహ్యతే తేనైవ తద్గతా జాతి' రపి) 'ఏవ్యక్తి యే యింద్రియముచే గ్రహింపబడునో అవ్యక్తియందలి జాతియు నా యింద్రియముచేతనే గ్రహింప బడు'నను నియమము నిట స్మరింపవలయును.

# చతుర్థాధ్యాయము

## ద్వితీయాహ్నికము

అవ : మూలకారణమగు ప్రకృతి సద్భావమును నిరూపించుటకు పృథివ్యాది కార్యద్రవ్యము హేతువుగా నుదాహరింపబడినది కదా! ఆ హేతుద్రవ్య మెన్నివిధముల నుండునన ? (సద్భావము ఉనికి)

సూ. :- తత్పునః పృథివ్యాది కార్య ద్రవ్యం త్రివిధం
శరీరేంద్రియ విషయ సంజ్ఞకమ్ ౪.౨.౧

తత్పునః=మూలప్రకృతి సద్భావమునకు లింగముగా నుదాహరింపబడిన, పృథివ్యాది కార్యద్రవ్యం = భూమి మున్నగు జన్యద్రవ్యము, శరీరేంద్రియ విషయ సంజ్ఞకమ్ = శరీరము, ఇంద్రియము, విషయము నను పేరులతో, త్రివిధమ్=మూడు విధములుగా నున్నది.

(భోక్తుర్భోగాయతనం, చేష్టేంద్రియార్థాశ్రయో వా శరీరమ్) ఆత్మ సుఖదుఃఖముల ననుభవింప ననువగు నాయతనము శరీర మనబడును. లేక చేష్టలకు, ఇంద్రియములకు ఇంద్రియార్థము లయిన శబ్దస్పర్శాదులకు నాశ్రయమైనది శరీరమనబడును.

(శరీరేంద్రియ సంయుక్తేఽర్థే జ్ఞాతు రపరోక్ష ప్రతీతి సాధనం ద్రవ్య మింద్రియమ్) శరీరేంద్రియములతో సంయుక్తములయిన పదార్థముల ప్రత్యక్ష జ్ఞానమును ఆత్మకు కలిగించు సాధనము ఇంద్రియ మనబడును.

(శరీరేంద్రియ వ్యతిరిక్తత్వే సతి ఆత్మోపభోగసాధనం ద్రవ్యం విషయః) శరీరేంద్రియములకు భిన్నమై ఆత్మకు సుఖదుఃఖముల ననుభవించుటలో సాధనమగు ద్రవ్యము విషయమనబడును. ఇట్లు భూజల తేజోవాయువులు ప్రతిదియు మువ్విధములుగా నుండును. శరీరము లేకుండుటచే నాకాశము రెండు విధములు. శరీరేంద్రియములు రెండును లేకుండుటచే కాలము-దిక్కు నొక్కొక్క విధమై యున్నవి.

ఇందు అస్మదాదుల దేహము శరీరము; నాసాగ్రవర్తి ఘ్రాణ మింద్రియము, మృత్పాషాణాదులు విషయము నని పృథివి మూడువిధములు. (౧) జలచరముల దేహము శరీరము, రసనాగ్రవర్తి జిహ్వ ఇంద్రియము, సరిత్సముద్ర హిమకర కాదులు-నదులు, సముద్రములు, మంచు, వడగండ్లు విషయమునని జలము మూడువిధములు. (౨) తేజోమండలస్థ సత్త్వముల దేహము శరీరము. కృష్ణ తారాగ్రవర్తి చక్షువు ఇంద్రియము. (నల్లని కనుపాపలో నుండునది) భౌమ-దివ్య-ఉదర్య-ఆకరజ (భౌమ = భూమిలో వాడుకొను నిప్పు, దివ్యము = ద్యులోకమునందలి సూర్యాదులలోని అగ్ని, ఉదర్యము=ఉదరములోని జఠరాగ్ని, ఆకరజము=గనులలో నుండు అగ్ని.) భేదముల నొప్పునది విషయమునని అగ్ని మూడువిధములు. (౩) వాయుమండలస్థ జీవుల దేహము శరీరము, శరీరమంతటను వ్యాపించి యుండు త్వక్కు ఇంద్రియము. వృక్షాదులను కంపింప జేయుటలో హేతువును, శరీరాంతర్భాగముల సంచరించు ప్రాణమును విషయము. ఇట్లు వాయువు మూడువిధములు. (౪) కర్ణ శష్కుల్యవచ్ఛిన్నాకాశము శ్రోత్రేంద్రియము. మిగిలిన ఆకాశము విషయము నని ఆకాశము రెండు విధములు.

అవ : పై జెప్పబడిన మూడువిధములగు పృథివ్యాది కార్యద్రవ్యములు పంచభూతముల కలయికచే నేర్పడునా లేక యొకొక్కటి యొకొక్క భూతముచే నేర్పడునా ?

సూ. :- ప్రత్యక్షాప్రత్యక్షాణాం సంయోగస్యాప్రత్యక్షత్వాత్ పంచాత్మకం న విద్యతే ౪.౨.౨

శరీరేంద్రియ విషయము లనబడు పృథివ్యాది కార్యద్రవ్యము. పంచాత్మకం = పంచభూత సంయోగము సమవాయి కారణముగా గలది. న విద్యతే = కాదు. ఎందువల్లనన. ప్రత్యక్షా ప్రత్యక్షాణాం = ప్రత్యక్షము లగు నట్టియు ప్రత్యక్షములు కానట్టియు ద్రవ్యములయొక్క. సంయోగస్య = పరస్పర సంయోగ మను సంబంధము. అప్రత్యక్షత్వాత్ = ప్రత్యక్షము కాదు. అను నియమమువలన.

శరీరేంద్రియ విషయము లనబడు పృథివ్యాది కార్య ద్రవ్యము పంచభూతముల కలయికచే నేర్పడునది కాదు. ఎందువల్లననగా - ప్రత్యక్షములగు పృథివీ జలాగ్నులయు, అప్రత్యక్షములగు వాయ్వాకాశములయు పరస్పర సంయోగ సంబంధము ప్రత్యక్షముకాదు కనుక. సంయుక్తములగు ద్రవ్యములు రెండు ప్రత్యక్షములగుచో వాని సంయోగముకూడ ప్రత్యక్షమగును. ఒక ద్రవ్యము ప్రత్యక్షమై మఱొకటి అప్రత్యక్ష మగుచో వాని సంయోగము అప్రత్యక్షమే యగునని నియమము.

సూ. :- గుణాంత రాప్రాదుర్ భావా చ్చ ౪. ౨. 3

ఈ సూత్రమునందలి చకారము పంచాత్మకము (పంచభూత ములతో నిర్మింపబడినది) కాదనుటలో నిది మఱియొక హేతువని తెలుపుటకు ప్రయోగింపబడినది. శరీరేంద్రియాది కార్యములు పంచాత్మకములుగావు. ఎందువల్లనన, గుణాంతరాప్రాదుర్భావాత్ = కారణ గుణములకంటె భిన్నగుణము గుణాంతర మనబడును. అట్టి గుణాంతరమిట కనబడ కున్నది. కాబట్టి పంచాత్మకము గాదని తెలియుచున్నది.

అవ : పంచాత్మకము గాకున్న త్ర్యాత్మక మగునా? యన-

సూ. :- న త్ర్యాత్మకం ४.౨.४

పూర్వసూత్రమిట ననువర్తించును. కాబట్టి గుణాంతర ప్రాదుర్భావము వలననే శరీరేంద్రియాదికార్యము త్ర్యాత్మక మును కానేరదు.

అవ : శరీరేంద్రియాదులు పంచాత్మకముగాని, త్ర్యాత్మ కముగాని కాని పక్షమున గంధమువలె క్లేద పాకాది గుణములు జలజ్యోతి రనిలాదులకు సంబంధించినవి వానియం దేల కనబడుచున్నవి?

సూ. :- అణుసంయోగ స్త్వప్రతిషిద్ధః ४.౨.౫

శరీరాది కార్యములందు, అణుసంయోగస్తు = జలాదుల యణువుల సంయోగము మాత్రము మాచే, అప్రతిషిద్ధః = నిషేధింపబడలేదు.

శరీరాది కార్యములు ఒక్కొక్క ద్రవ్యముచే నేర్పడినవి. ద్రవ్యాంతరములు వాని కారంభకములుకావు. అనుటచే ద్రవ్యారంభక మగు నసమవాయి కారణరూప సంయోగము నిషేధింపబడినది. కాని నిమిత్త కారణ భూతమగు సంయో గము ప్రతిషిద్ధము కానేరదు. అందువలన పృథివ్యారబ్ధ ద్రవ్యమునందు జలాదుల అణుసంయోగము ఉపష్టంభక ముగా (పోషకముగా) నుండునని భావము. కాబట్టి ఆ యా ద్రవ్యగుణములు ప్రతికార్యమునందు కనబడుట దోషము కానేరదు.

సూ. :- తత్ర శరీరం ద్వివిధం యోనిజ మయోనిజం చ

౪.౨.౬

తత్ర = శరీరేంద్రియ విషయములందు, శరీరం=శరీరనామక ద్రవ్యము, యోనిజం = శుక్రశోణితముల సన్నిపాతము యోని యనబడును. దానివలన జనించినది యోనిజ మనబడును, అయోనిజం చ = యోనివలన జనింపనిది అని, ద్వివిధం= రెండు విధములని సూత్రార్థము.

యోనిజ శరీరము మరల రెండువిధములుగా విభజింప నగును. జరాయుజము, అండజము. గర్భవేష్టన చర్మపుట కము-మావి-జరాయువనబడును. దానినుండి పుట్టుటవలన మనుష్య పశుమృగముల శరీరములు జరాయుజములు. పక్షులయు సరీసృపములయు శరీరము అండజము.

అయోనిజము సాంకల్పికము, సాంసిద్ధికము, స్వేద జము, ఉద్భిజ్జము నని నాలుగు విధములు. ప్రజాపతి సంకల్పమువలన సృష్ట్యాదియందు బుట్టిన మహర్షి - పశు - పక్షుల శరీరములు సాంకల్పికములు. యోగసిద్ధివలన నేర్పడిన యోగుల శరీరములు సాంసిద్ధికములు. దంశ మశ కాదుల శరీరములు స్వేదజములు. తరు గుల్మ లతాదుల శరీరము లుద్భిజ్జములు, అని తెలియనగును.

అవ : సర్గాదియందు జనించిన జీవాత్మల శరీరములు అయోనిజము లనుటకు హేతువేమి ?

సూ. :- అనియత దిగ్దేశ పూర్వకత్వాత్ ౪.౨.౭

అనియత దిగ్దేశ పూర్వకత్వాత్ = నిశ్చిత దిగ్దేశ కారణకములు గాకుండుట వలన సర్గాదియందలి శరీరములు అయోనిజము లని సూత్రార్థము.

సూ. :- ధర్మవిశేషా చ్చ ౪.౨.౮

ఇందలి చకారమువలన అధర్మ విశేషము గ్రాహ్యము. ధర్మ విశేషాచ్చ = ధర్మాధర్మ విశేషముల వలన (ధర్మాధర్మ విశేషములన ప్రకృష్ట (బలపడిన) ధర్మాధర్మములని అభిప్రాయము).

సర్గాదియందలి శరీరములు భూత సూక్ష్మ కారణముల వలననే యేర్పడునని యెంచిన నవి ఘటపటాదులకంటె విలక్షణములు కానేరవు. కాబట్టి ధర్మాధర్మ సహకృత భూత సూక్ష్మ కారణములచే నేర్పడునని యీ సూత్రభావము.

అందు ధర్మవిశేష సహితమువలన సృష్ట్యాదియందలి మహర్షుల శరీరములును, అధర్మ సహితము వలన దంశమశ కాది క్షుద్రజంతువుల శరీరములును, ధర్మాధర్మ సహితము వలన పశ్వాదుల శరీరములును, జనించునని వివేకము.

సూ. సమాఖ్యాభావా చ్చ ౪.౨.౯

(సమాఖ్యా = యౌగికసంజ్ఞ) సమాఖ్యాభావాచ్చ = మనువు, అగ్ని, వాయువు, నను వేదోక్తసంజ్ఞల వలన, సర్గాదియందు అయోనిజ శరీరభేదములు గలవని తెలియుచున్నది.

అవ : మహర్షుల సంజ్ఞలు ఇతర నామములవలెనే వారి మాతాపితలచే సంకేతింపబడినవని యేల చెప్పరాదు ?

సూ. :- సంజ్ఞాయా ఆదిత్వాత్ ౪.౨.౧౦

సంజ్ఞాయాః = మహర్షుల సంజ్ఞలు, ఆదిత్వాత్ = మొదటి వగుటవలన.

మహర్షులు సర్గాదియందు బుట్టినవారు, అంతకుపూర్వము మఱియెవరి యుత్పత్తియు నయియుండలేదు. అందుచే మహర్షుల సంజ్ఞలు వారికి పూర్వ ముద్భవించిన వ్యక్తులచే నేర్పఱుపబడినవని యెంచుట కవకాశము కానము.

సూ. :- స న్త్యయోనిజాః ౪.౨.౧౧

కాబట్టి సర్గాదియందు జనించిన మహర్షి ప్రభృతుల శరీరములు, అయోనిజాః సన్తి = యోని లేకయే యేర్పడినవి.

అవ : ఇందు వైదిక ప్రమాణ మేమన ?

సూ. :- వేదలింగా చ్చ ౪.౨.౧౨

వేదప్రమాణము వలనను అయోనిజ శరీరములు కలవని సూత్రాభిప్రాయము.

వైదిక ఉదాహరణములు :
''విద్వాన్ దేవాన్ జగత్యావివేశ
తేన చాక్షుషే ఋషయో మనుష్యాః"
(ఋ.అ.౮.౪.వ.౧౮.౫.)

"తస్మాదశ్వా అజాయన్త, యే కే చోభయాదతః
గావో హ జజ్ఞిరే తస్మాత్ తస్మా జ్జాతా అజావయః"
(ఋ అష్ట ౮.అ౪.వ.౧౮.౧౦)

# పంచమాధ్యాయము

## ప్రథమాహ్నికము

పూర్వాధ్యాయములందు ద్రవ్యములు పరీక్షింపబడినవి. తరువాత క్రమాగత గుణములు పరీక్షింప బడవలసియుండగా శిష్యుల జిజ్ఞాస ననుసరించి ముందుగా కర్మమును పరీక్షింప నెంచి ఉత్క్షేపణమను కర్మమును గుఱించి మహర్షి సూత్రమును రచించుచున్నాడు.

సూ. :- ఆత్మసంయోగ ప్రయత్నాభ్యాం హస్తే కర్మ

౫.౧.౧

ఆత్మ సంయోగప్రయత్నాభ్యాం = మనోవిశిష్టమగు ప్రత్యగాత్మ యొక్క సంయోగ ప్రయత్నములవలన, హస్తే =శరీరావయవమయిన చేతియందు, కర్మ = ఉత్క్షేపణాత్మకమగు క్రియ యేర్పడుచున్నది.

జీవాత్మ తాను చేయదలచిన యజ్ఞాధ్యయనాదులందు శరీరావయవ మగు చేతిని పైకెత్త నిచ్ఛగించినపుడు ఆత్మ యందు తదనుకూల ప్రయత్నమేర్పడును. ఇట్టి ప్రయత్నముతో గూడిన ఆత్మ హస్త సంయోగమువలన ఉత్క్షేపణ మను కర్మ మేర్పడును.

ఆత్మ యణుస్వరూపముగలదై హృదయమున నుండుటచే హస్తముతో సాక్షాత్ సంబంధము కలుగజాల నప్పటికి

మనస్సు మధ్యమ పరిమాణముగల దగుటవలన దానిద్వారా ఆత్మకు హస్తసంయోగ మేర్పడుట కెట్టి యాటంకము నుండ దని గ్రహింపవలయును.

ఈ ఉత్క్షేపణకార్యమునకు సమవాయి కారణము హస్తము. అసమవాయి కారణము ప్రయత్నము [illegible] అత్మ సంయోగము. నిమిత్త కారణము ప్రయత్నము.

అవ : హస్తోత్క్షేపణమును చెప్పి తదధీన ముసలోత్క్షేపణ మును వర్ణించుచున్నాడు.

సూ. :- తథా హస్తసంయోగాచ్చ ముసలే కర్మ ౫.౧.౨

ఇందలి చకారమువలన గురుత్వము గ్రహింపబడుచున్నది. తథా హస్తసంయోగా చ్చ = ఉత్క్షేపణముతో కూడిన హస్త సంయోగమువలనను గురుత్వము వలనను, ముసలే=యజ్ఞాదు లందు ధాన్యాదులను దంచుట కుపయోగించు రోకటియందు, కర్మ = ఉత్క్షేపణ కర్మము జనించును.

మానవుడు చేతితో రోకటిని పట్టుకొని 'దీనిని ఎత్తుదును, అని కోరును. అప్పుడు ఆత్మయందు ప్రయత్నము జనించును. దానివలన ఆత్మకు హస్తముతో సంయోగ మేర్పడును. ఆ సంయోగమువలన హస్తమున ఉత్క్షేపణ కర్మము జనించును. ఆ క్షణముననే ఆత్మప్రయత్నము నపేక్షించునట్టి ఉత్క్షేపణ కర్మముతో కూడిన హస్తముతో ముసలమునకు (రోకలికి) సంయోగ ముండుటవలన ముసలమునందును ఉత్క్షేపణ కర్మము జనించును. అప్పుడు రోకలి పైకి (కొంతదూరము) ఎత్తబడును. ఆకోరికకు నివృత్తి కలిగినపుడు మరల జనించు అపక్షేపణేచ్ఛ నపేక్షించు ఆత్మహస్త సంయోగమువలన

హస్తమునందును, అట్టి హస్తముసల సంయోగము వల్ల ముసలమునందును, ఒకే సమయమున అపక్షేపణ కర్మము జనించును.

అవ : రోకలి జోటితో కొట్టుకొని పైకి ఎగురునుకదా! ముసలోత్పతనమునందు హస్తసంయోగము కారణముగువా

సూ. :- అభిఘాతజే ముసలాదౌ కర్మణి వ్యతిరేకా

దకారణం హస్తసంయోగః ౫.౧.౩

అభిఘాతజే = ముసలాదులతో జోటికేర్పడు, అభిఘాతాఖ్యగ సంయోగ విశేషమువల్ల నేర్పడు, ముసలాదౌ కర్మణి = ముసలాదులం దేర్పడు ఉత్పతన కర్మమందు, హస్తసంయోగః = పూర్వపు హస్త సంయోగము, అకారణం = కారణముకాదు ఎందువల్లనన, వ్యతిరేకాత్ = ఆ హస్త సంయోగము లేకున్నను రోకలి జోటితో కొట్టుకొని పైకెగురును.

అభిఘాతము = రోకటితో దంచునప్పుడు రోకటికిజోటి కలుగు సంయోగము. అట్టి అభిఘాతమువలన రోకటియందు ఉత్పతన-పైకెగురు-కర్మ కలుగును. అట్లు రోకలి పైకెగురు టలో హస్త సంయోగము కారణము కాదు. కారణమేమన హస్త సంయోగము లేకున్నను రోకలి జోటితో కొట్టుకొనినపుడు పైకెగురును.

సూ. :- తథా ఆత్మ సంయోగో హస్తకర్మణి ౫.౧.౪

'వ్యతిరేకాదకారణమ్' అను శబ్దము ఇందును అను వర్తించును, తథా = జోటితోకొట్టుకొని రోకలి పైకెగురుటలో

హస్త సంయోగమెట్లు కారణముకాదో అట్లు, హస్తకర్మణి = రోకలి పైకెగురునపుడు రోకటితో కూడ హస్తము పైకెగురును. ఆ హస్తోత్పతనమునందు, ఆత్మ సంయోగః = ప్రయత్నవంత మగు నాత్మ సంయోగము, అకారణం = కారణము కాదు. ఎందువల్లనన, వ్యతిరేకాత్ = అదిలేకున్నను జరుగును.

అవ : అప్పుడు దేనివలన హస్తమునందు [illegible] కర్మ మేర్పడు చున్నది ?

సూ. :- అభిఘాతాన్ముసల సంయోగాద్ధస్తే కర్మ ౫.౧.౫

అభిఘాతాత్ = రోటి తాకిడివలన, ముసలసంయోగాత్=పుట్టిన వేగయుక్త ముసల సంయోగమువలన, హస్తే కర్మ = హస్తమునం దుత్పతన కర్మ మేర్పడుచున్నది.

రోటి తాకిడివలన జనించిన వేగముతోకూడిన రోకటితో సంయోగముండుటచే హస్తమునందు కర్మమేర్పడుచున్నది.

అవ : కాని ఆసమయమున శరీరమునందును చలనాత్మక కర్మము చూడనగును. అది యెట్లేర్పడుచున్నది ?

సూ. :- ఆత్మకర్మ హస్త సంయోగాచ్చ ౫.౧.౬

హస్తసంయోగాచ్చ = శరీరావయవమగు హస్తమునకు వేగముతో కూడిన రోకటితో సంయోగముండుటవలనను, వేగము వలనను, ఆత్మకర్మ = శరీరమునందు సంచలనాత్మక కర్మ మేర్పడుచున్నది.

సూ. :- సంయోగాభావే గురుత్వా త్పతనమ్ ౫.౧.౭

సంయోగాభావే = పతనమునకు ప్రతిబంధకమగు సంయోగ విశేషము లేకుండుటంబట్టి, గురుత్వాత్ = అడ్డు పెట్టబడని అసమవాయి కారణమగు గురుత్వము వలన, పతనమ్ = ఉపరిస్థిత వస్తువునందు అపక్షేపణ రూపకర్మ మేర్పడును.

అందు మొదటి పతనము గురుత్వమువలనను అనంతర పతనములు గురుత్వ వేగమువలనను అగునని యెఱుగునది.

**అవ :** గురుత్వమువలన నూర్ధ్వతిర్యగ్గమనములు కలుగక పతనమే యేల కలుగవలయును ?

**సూ. :-** నోదన విశేషాభావాన్నోర్ధ్వం న తిర్యగ్గమనమ్

౫.౧.౮

నోదన విశేషాభావాత్ = ఒకానొక సంయోగ సంబంధము నోదన మనబడును. దానిలోని తర తమ భేదములు నోదన విశేషము లనబడును. అట్టిది లేకుండుటవలన, నోర్ధ్వం న తిర్యగ్గమనమ్ = ఊర్ధ్వముగాగాని అడ్డముగాగాని గమన మేర్పడదని సూత్రార్థము.

**అవ :** నోదన విశేష మెట్లేర్పడుచున్నది ?

**సూ. :-** ప్రయత్న విశేషా న్నోదన విశేషః		౫.౧.౯

ప్రయత్నవిశేషాత్ = పైకిగాని, క్రిందికిగాని, అడ్డముగాగాని, దూరమునకుగాని యొకానొక వస్తువును (పాఱ) వేయుదునను కోరికతో జనించు ప్రయత్న విశేషము వలన, నోదన విశేషః = నోదకములగు హస్త, జ్యాదులతో న్నోదములయిన

లోష్ఠ బాణాదులకు గల సంబంధ విశేష స్వరూపమగు నోదన విశేషము జనించును.

సూ. :- నోదనవిశేషా దుదసన విశేషః ౫.౧.౧౦

నోదన విశేషాత్=పైన జెప్పిన నోదన విశేషమువలన, ఉదసన విశేషః = గురుత్వముగల వస్తువునందు దూరోత్క్షేపణాదులు కలుగును.

సూ. :- హస్తకర్మణా దారక కర్మ వ్యాఖ్యాతమ్ ౫.౧.౧౧

లోష్ఠాదుల (ఱాయి మొదలగువానిని) నుత్క్షేపించుటకు హస్తమునం దెట్లు కర్మము జనించునో అట్లే క్రీడించుబాలకుల హస్త పాదాదులందు చలన మేర్పడునని సూత్రాభిప్రాయము.

సూ. :- తథా దగ్ధస్య విస్ఫోటనే ౫.౧.౧౨

దగ్ధస్య = వహ్ని సంయోగమువలన దహింపబడిన ఱాళ్లు బొంగులు మున్నగునవి, విస్ఫోటనే=పగిలినపుడు వాని యవయవములందు కలుగు తిర్యగ్గమనాది రూపమగుకర్మ, తథా= బాలకులందు కలుగు కర్మములవలె నేర్పడు నని సూత్రార్థము.

అవ : ప్రసుప్త్యా ద్యవస్థలందు చలనము కొండొక సమయముల కనబడును. చైతన్యము లేకుండుటచే ప్రయత్న ముండదుగనుక ఆ చలన మెట్లేర్పడును ?

సూ. :- యత్నాభావే ప్రసుప్తస్య చలనమ్ ౫.౧.౧౩

'వాయుసంయోగాత్' అను హేతువు ముందు సూత్రమునుండి గ్రహింపసగును. యత్నాభావే = ప్రయత్నము లేనప్పుడు,

ప్రసుప్తస్య = (ప్రసుప్తి యచేతనావస్థను తెలుపును కాబట్టి) నిద్రామూర్ఛా మరణాద్యవస్థలను పొందిన వానియొక్క, చలనం = అకస్మాత్తుగా నప్పుడప్పుడు కలుగు కదలిక, వాయు సంయోగాత్ = వాయు విశేష (ప్రాణవాయు) సంయోగము వల్లనని యెఱుంగ వలయును.

అవ : మఱొక యుదాహరణము :

సూ. :- తృణే కర్మ వాయు సంయోగాత్ ౫.౧.౧౪

తృణే = తృణాదులందు, కర్మ=ఊర్ధ్వ తిర్యగ్గమనాది లక్షణ క్రియ, వాయు సంయోగాత్ = అధిభౌతిక వాయు సంయోగమువల్ల నగునని సూత్రార్థము.

అవ : కొన్ని మణులు మున్నగునవి కదలుచుండుట చూడనగును. వానిలో ప్రయత్నాది దృష్టకారణ మేమియు గానరాదు. కాబట్టి యట నేర్పడు కర్మమునకు కారణ మేమగు నన ?

సూ. :- మణిగమనం సూచ్యభిసర్పణ మదృష్టకారణమ్ ౫.౧.౧౫

మణిగమనం = తృణకాంతమణినిగూర్చి తృణవిశేషమున గలుగు గమన రూప మగుకర్మము, సూచ్యభిసర్పణం= అయస్కాంతమణి వైపునకు సూచీగమనము అదృష్టకారణమ్ = దృష్టిగోచరము కాని వస్తు స్వభావాత్మకమగు అదృష్ట కారణమువల్ల నేర్పడుచున్నది.

అవ.: ప్రతిక్రియయు నాలుగు క్షణములుండి యైదవ క్షణమున నశించును. కాబట్టి వింటినారినుండి విడివడిన బాణమునందు ఆ బాణము క్రిందపడు లోపల ననేక కర్మము లేర్పడుచున్నవని యంగీకరింపవలసి వచ్చుచున్నది. ఆ యనేకత్వమునకు లింగమేమన ?

సూ. :- ఇషా వయుగపత్సంయోగవిశేషాః
కర్మాన్యత్వే హేతుః ౫.౧.౧౬

ఇషా = జ్యావిముక్త-నారినుండి వదలిన-బాణమునందు, కర్మాన్యత్వే = పతనకాలమునకు మధ్య నేర్పడు అనేక కర్మములందు, అయుగపత్సంయోగ విశేషాః = భిన్నభిన్న సమయములం దుత్పన్నములగు స్వజన్యోత్తరోత్తర సంయోగ విశేషములు, హేతుః = కారణము.

ధనుర్విముక్త బాణము దూరమున భూమిపై పడుటకు పూర్వము అంతరాలమున ననేక ప్రదేశములతో సంయుక్త మగుచుండుట చూచుచున్నాము. ఆ యా దేశములతోనగు సంయోగములక్రమ మిట్లుండును. ''మొదటి క్షణమున కర్మోత్పత్తి, అనంతరము విభాగము, అటుపై పూర్వసంయోగ నాశము, తరువాత ఉత్తరసంయోగము" ఇట్లు నాలుగు క్షణములగును. అయిదవ క్షణమున స్వజనక కర్మము నశింప జేయబడును. ఇట్టి సంయోగము లన్నియు నొక్క క్షణమున నేర్పడు నన వీలుండదు. అనేక క్షణములలో నేర్పడు నీ సంయోగము లన్నియు నొక్క కర్మముచే నగుటకు వీలుండదు. కాబట్టి యనేక కర్మము లనాయాసముగ సిద్ధించునను

భావముతో పై సూత్రమున ''అయుగపత్సంయోగవిశేషాః హేతుః'' అని యుదాహరించి యున్నాడు.

అవ: బాణ పతనమునకు పూర్వము దానియం దనేక కర్మములే కారణమున జనించుననన ?

సూ. :- నోదనాదాద్యమిషోః కర్మ, తత్కర్మకారితాచ్చ సంస్కారాదుత్తరం, తథోత్తర ముత్తరంచ ౫.౧.౧౭

నోదనాత్ = నోదనమను పేరుగల ఇషుజ్యా సంయోగవిశేషము వలన, ఇషోః = బాణమునందు, అద్యం కర్మ = మొదటి కర్మ మేర్పడును. తత్కర్మ కారితాచ్చ = అద్యకర్మము వలన జనించిన, సంస్కారాత్ = వేగాఖ్య సంస్కారమువలన ఉత్తరం = రెండవకర్మము, తథోత్తర ముత్తరంచ = అద్య కర్మము వలన నేర్పడిన వేగాఖ్య సంస్కారము వలన ద్వితీయ కర్మమెట్లు జనించినదో అట్లే తృతీయ చతుర్థ పంచ మాది కర్మములును జనించు నని సూత్రార్థము.

అవ: వేగాఖ్య సంస్కారమే యనేక కర్మములను పుట్టించునెడల బాణ మెన్నడును క్రింద బడరా దనిన —

సూ. :- సంస్కారాభావే గురుత్వా త్పతనమ్ ౫.౧.౧౮

సంస్కారాభావే = కర్మసంతానమను బహుకార్య కారణము వలన శక్తి క్షీణించి వేగాఖ్య సంస్కారము ప్రతిబంధకము కాకపోగా, గురుత్వాత్ = ప్రతిబంధక రహితమైన బాణము

నందలి గురుత్వమువలన, పతనమ్ =బాణమును క్రింది ప్రదేశముతో సంయుక్త మొనర్పగల కర్మము (పతనము) ఏర్పడును.

ఇట్లే దూరక్షిప్త లోష్ఠాదుల విషయమున నెఱుంగునది.

# పంచమాధ్యాయము

## ద్వితీయాహ్నికము

ఈ యాహ్నికమున పృథివ్యాది ద్రవ్యములందు నోద నాదులవలన జనించు కంపనాది కర్మములను పరీక్షింపగోరి మొదట పృథివి యందలి కర్మమును సూత్రించుచున్నాడు.

సూ. :- నోదనాభిఘాతాత్ సంయుక్త సంయోగాచ్చ
పృథివ్యాం కర్మ ౫.౨.౧

నోదనాభి ఘాతాత్ = అభ్యంతర వస్తువుల నోదనాభిఘాతాఖ్య సంయోగమువలన, సంయుక్త సంయోగాచ్చ=వస్తుసంయుక్త పృథివీ సంయోగము వలన, పృథివ్యాం=భూపర్వతాదులందు, కర్మ = భూకంపాది కర్మమేర్పడును.

ఏ సంయోగముచేత సంయోగి పదార్థములు పరస్పరము విభక్తములు కావో అట్టి సంయోగము నోదన మనబడును. లేక (యః సంయోగ విశేషః శబ్దనిమిత్తకారణం న భవతి స్పర్శ

వద్ద్రవ్య సంయోగ ఇతి యావత్ స నోదనాఖ్యః సంయోగః) శబ్దమునకు నిమిత్త కారణముగాని స్పర్శ వద్ద్రవ్యసంయోగము నోదన మనబడును.

(స్పర్శవేగోభయవద్ద్రవ్య సంయోగోఽభి ఘా తా ఖ్యః సంయోగః) ఏ సంయోగ విశేషమువలన పుట్టిన కర్మము సంయోగి పదార్థములను వేఱుపఱచి శబ్దమును జనింప జేయునో ఆ సంయోగ విశేషము అభిఘాత మనబడును.

భూమి తనలోనున్న వస్తువులచే నుద్యమానమో లేక అభిహన్యమానమో అగుచు తనపైనున్న పర్వతాదులతో సంయోగము పొందును. అట్టి సంయోగమే సంయుక్త సంయోగ మనబడును.

అవ : భూమి తన యక్షముమీదను, సూర్యుని చుట్టును తిరుగుచున్నది గదా! ఇట్లు తిరుగాడు భూమిలో నేర్పడు నీ గమనాత్మకమగు కర్మమెట్లు కలుగుచున్నది ?

సూ. — తద్విశేషేణాదృష్ట కారితమ్ ౫.౨.౨

విశేషేణ = పృథివిలో నేర్పడు నీ గమనాత్మక విశేషకర్మము, తత్ = అది, అదృష్టకారితమ్ = జీవుల యదృష్టము వలన నేర్పడిన వస్తుగత శక్తివల్ల నేర్పడుచున్నది.

కర్మవైచిత్ర్యమువలన సృష్టివైచిత్ర్య మని వైదికుల సిద్ధాంతము. సూర్యమండలముచే నాకృష్టమై భూమి యిట్లు నిత్యము పరిభ్రమించుటకు కారణము జీవుల యదృష్టకారిత వస్తు శక్తియని వైదికుల ఆశయము.

సూ. :- అపాం సంయోగాభావే గురుత్వా త్పతనమ్
౫.౨.౩

అపాం = సంయోగ వశమున మేఘమండలమునను నీటికి, సంయోగాభావే = వాయుసంయోగమువలన కర్మ మేర్పడుటచే గురుత్వమున కాధారముగా పతన ప్రతిబంధకమైయున్న మేఘ సంయోగము నశించుటబట్టి, గురుత్వాత్=స్వగత గురుత్వము వలన, పతనమ్ = అధఃప్రదేశ సంయోగ ఫలకమగు వర్షణా త్మక కర్మ మేర్పడును.

అవ : భూమియందు పడిన జలము ప్రవాహరూపమున నెట్లు ప్రవహించును ?

సూ. :- ద్రవత్వా త్స్యందనమ్  ౫.౨.౪

భూపతితజలము ప్రవాహ రూపమున, స్యందనమ్=ఒక స్థలము నుండి నిమ్న ప్రదేశమునకు జరుగుట, ద్రవత్వాత్ = తన యందుగల ద్రవత్వ గుణమువలన.

జలము తనయందలి ద్రవత్వ గుణమువలన నొక స్థలమునుండి నిమ్న ప్రదేశమునకు జరుగునని భావము.

అవ: యంత్రములు లేకయే భూగతజల మెట్లంత రిక్షమునకు బోయి మేఘ రూపమును బొంది వర్షాకాలమున తిరిగి భూమిపైకి వచ్చుచున్నదన ?

సూ. :- నాడ్యవాయుసంయోగా దారోహణమ్  ౫.౨.౫

నాద్యవాయుసంయోగాత్ = సూర్యరశ్మి వాయుసంయోగము వలన, ఆరోహణమ్ = భూమిస్థజలము అంతరిక్షమున కెగురుచున్నది.

వాయుసంయుక్త సూర్యకిరణములు జలమును అంతరిక్షమున జేర్చుచున్నవని భావము.

అవ: అది యెట్లన ?

సూ. :- నోదనా పీడనా త్సంయుక్త సంయోగాచ్చ

౫.౨.౬

నోదనా పీడనాత్ = బలవద్వాయు నోదనముచే నేర్పడిన ఆ పీడనమువలన, సంయుక్త సంయోగాత్ చ = వాయు సంయుక్త సూర్యరశ్మి సంయోగము వలనను జల మాకాశమున చేరును.

పాత్రయందు కాగుచున్న జలము బలమైన వాయువుచే ప్రేరింపబడు అగ్ని సంయోగమువలన పైకెగురునట్లు బల వద్వాయు నోదనముచే పీడింపబడు సూర్యకిరణముల సంయోగమువలన భూగత జల మంతరిక్షము నధిరోహించు చున్నదని యభిప్రాయము.

అవ: వృక్షమూలమున పోసిన జలము వృక్షాభ్యంత రమున నూర్ధ్వగమన మొనర్చుచున్నదిగదా ? అట సూర్య కిరణములు లేకుండుటచే నెట్లూర్ధ్వ గమన మేర్పడు చున్న దవ ?

సూ. :- వృక్షాభిసర్పణ మిత్యదృష్టకారితమ్ ౫.౨.౭

వృక్షమూలమందుంచబడిన జలము జీవముల యదృష్ట రూపమయిన వృక్షాంతర్గత శక్తి ద్వారా వృక్షమున నూర్ధ్వ గమన మొనర్చుచున్నదని సూత్ర తాత్పర్యము.

అవ: అంతరిక్షగత జలమేల గట్టిపడి వడగండ్లరూపము నొందుచున్నది. భూమియందు బడినపుడేల కఱగి స్యందించు చున్నది.

సూ, :- అపాం సంఘాతో విలయనం చ తేజః సంయోగాత్

౫.౨.౮

అపాం = మేఘమండలమునగల నీటియొక్క. సంఘాతః = హిమ, కరకాది రూపమగు దృఢమయిన సంయోగ విశేషము, విలయనం చ = ఆ సంయోగ వినాశము, తేజఃసంయోగాత్ = దివ్యాదివ్యతేజః సంబంధ విశేషము వలన నగునని యర్థము.

అవ : అంతరిక్షస్థలమున దివ్యతేజః సంయోగ మున్నదనుటకు ప్రమాణమేమి ?

సూ. :- తత్ర విస్ఫూర్జథు ర్లింగమ్ ౫.౨.౯

తత్ర = మేఘమండలమునగల జలమున, దివ్యతేజఃసంయోగ మున్నదనుటకు, విస్ఫూర్జథుః = వజ్ర నిర్ఘోషము - ఉఱుము లిఙ్గమ్ = ప్రమాణమని యర్థము.

మేఘమండల గతజలమున దివ్యతేజః సంయోగము. లేకున్న ముందు మెఱపులు, తరువాత ఉఱుములు, అటుపై

కరకాది పాతమును సంభవించవు. కాబట్టి తేజః సంయోగ మట నున్నదని యూహింపనగును.

అవ : ఇందు వైదిక ప్రమాణ మేమైన కలదా ! యన-

సూ. :- వై ది క ం చ ౫.౨.౧౦

వైదిక ప్రమాణమును గలదని సూత్రాభిప్రాయము.

"గర్భో యో అపామ్" (ఋ.అష్ట.౧ అ ౫వ౧౪.మం.౨)

"అగ్నే గర్భో అపామసి" (యజు. ౧౨.38)

అవ : శబ్దము సంయోగ విభాగపూర్వకముగా జనించునని నియమము. ఉఱుము కూడ నొకశబ్దము. కాబట్టి యది దేనిసంయోగ విభాగముల వలన జనించుచున్న దన ?

సూ. :- అపాం సంయోగాద్ విభాగాచ్చ స్తనయిత్నోః ౫.౨.౧౧

అపాం సంయోగాత్=అప్తేజః సంయోగమువలన, విభాగాచ్చ= విభాగము వలనను, స్తనయిత్నోః = ఉఱుము జనించుచున్నదని సూత్రార్థము.

సూ. :- పృథివీ కర్మణా తేజః కర్మ వాయు కర్మ చ వ్యాఖ్యాతమ్ ౫.౨.౧౨

భూమియందలి కర్మమువలెనే అగ్ని వాయువులందు గలుగు కర్మములు నట్లే యేర్పడుచున్నవని యెఱుగవలయునని సూత్రాభిప్రాయము.

అవ : అగ్ని వాయువులం దేర్పడు కర్మము లేవన ?

సూ. :- అగ్నేరూర్ధ్వ జ్వలనం, వాయో స్తిర్యక్పవనమ్
అణూనాం మనసశ్చాద్యం కర్మాదృష్టకారితమ్

౫.౨.౧౩

అగ్నేరూర్ధ్వజ్వలనం = అగ్ని పైకిజ్వలించుట, వాయోస్తిర్య క్పవనమ్ = వాయు వడ్డముగా వీచుట, అణూనాం మనస శ్చాద్యం కర్మ=అణువులయు, మనస్సుయొక్కయు మొదటి చలనాత్మక కర్మములు, అదృష్టకారితమ్=అదృష్టజనితములు.

అవ : మనస్సునకా యా యింద్రియాదులతో సంబంధ మును కలుగజేయు వృత్తి స్వరూపమగు కర్మ మెట్లేర్పడు నన?

సూ. :- హస్తకర్మణా మనసః కర్మవ్యాఖ్యాతమ్ ౫.౨.౧౪

మనసః = సర్గాది యందభివ్యక్తమయిన మనస్సు యొక్క, కర్మ = ఆయా యింద్రియములతో సంబంధింప జేయు వృత్తిరూపమగు కర్మము, హస్తకర్మణా = ఆత్మ సంయోగ ప్రయత్నముల వలన నేర్పడు హస్తకర్మముద్వారా, వ్యాఖ్యాతమ్ = ఆత్మ ప్రయత్న సంయోగముల వలన బుట్టు నని వర్ణించినట్లు భావింపవలయునని సూత్రార్థము.

అవ : ఇట్టి మానసిక కర్మమునకు లింగ మేమన ?

సూ. :- ఆత్మేంద్రియ మనోఽర్థ సన్నికర్షాత్ సుఖదుఃఖే

౫.౨.౧౫

ఆత్మేంద్రియ మనోఽర్థ సన్నికర్షాత్ = ఆత్మ ఘ్రాణాదీంద్రియములతో మనస్సునకును, గంధాద్యర్థములతో ఇంద్రియము

లకును, సన్నికర్షాత్ = సంయోగ, సంయుక్త-సమవాయాది లక్షణ సంబంధము వలన, కలుగు నాయా పదార్థ జ్ఞానము వలన బుట్టునట్టి, సుఖదుఃఖే = సుఖదుఃఖములు, మానసిక కర్మలు కలవనుటకు ప్రమాణమని సూత్రార్థము.

అవ : మనస్సునందు కర్మ మెప్పుడుండదు? యోగ దశయందనినచో, యోగ మననేమి?

సూ. :- తదనారంభ ఆత్మస్థే మనసి, శరీరస్య
దుఃఖాభావః స యోగః ౫.౨.౧౬

మనసి ఆత్మస్థే = మనస్సు అభ్యాస వైరాగ్యములద్వారా ఆత్మయందే యుండగల్గినపుడు, తదనారంభః = కర్మానుగుణ ప్రయత్నము లేకుండుటచే మానసిక కర్మ మేర్పడదు, శరీరస్య = అట్టిచో శరీర-ఆత్మకు సంబంధించిన, దుఃఖాభావః = ప్రమాణాదివృత్తులు లేకుండుటయే, స యోగః = యోగమనబడును.

చిత్తము దృష్టానుశ్రవిక విషయములందు తృష్ణను విడిచి స్థితి కొఱకు యత్నించినపుడు నిరంతరప్రయత్నమున నన్యత్ర స్థితిని బొందనేరక ఆత్మయందే నిలచును. అట్టిచో కర్మానుగుణ ప్రయత్న మొండు లేకపోవుటచే బహిరింద్రియములతో సంబంధమును కలిగించు కర్మములు కలుగనేరవు. ఇట్లు కర్మారంభ విరహితమై మనస్సు ఆత్మయందు స్థిర మగుట వలన గలుగు ప్రమాణ విపర్యయాది వృత్త్యభావమే యోగమనబడును.

సూ. :- అపసర్పణ ముపసర్పణ మశిత పీతసంయోగాః
కార్యాంతర సంయోగాశ్చేత్యదృష్టకారితాని
౫.౨.౧౭

అపసర్పణం = భోగించుట వలన ప్రారబ్ధ కర్మము క్షయించుటంబట్టి నశించుదేహమునుండి ఆత్మతోకూడి మనస్సు బయటికి వెడలుట, ఉపసర్పణం = దేహాంతరమున ఆత్మయుక్త మనః ప్రవేశము, అశితపీతసంయోగాః = తిని త్రాగిన అన్నోదకములు పక్వములయి దేహమున నాడులద్వారా భిన్న భిన్న - అవయవములతో సంబంధించుట, కార్యాంతర సంయోగాశ్చ = ఒకదేహమునుండి మఱియొక దేహమునకు బోవు మనస్సుతోబాటు ప్రాణాదులు నటకుచేరు కర్మములు - ఇవన్నియు, అదృష్టకారితాని = పుణ్యాపుణ్య రూపమగు నదృష్ట జన్యములని యర్థము.

అవ : అదృష్టాధీనమగు మనస్సు హేతువుగాగల సంసారము నిరూపింపబడినట్లు మోక్షము సైతము నిరూపింపదగియున్నది.

సూ. :- త దభావే సంయోగాభావోఽ
ప్రాదుర్భావశ్చ మోక్షః
౫.౨.౧౮

తదభావే = తత్త్వ విమర్శవలన నేర్పడిన వివేకము వలన సంచితములు, భోగమువలన ప్రారబ్ధములు, మిథ్యాజ్ఞానాపాయమువలన రాగద్వేషాది దోషములు నివృత్తి నొందుటచే ఆగామి - అదృష్టములును నశించుటవలన, సంయోగభావః = ఆత్మకు మనస్సుతో గల సంబంధాభావము అనగా జన్మా

భావము కలుగును, అప్రాదుర్భావశ్చ = జన్మరూప నిమి త్తములేమి దుఃఖానుత్పత్తి యేర్పడును. మోక్షః = ఈ స్థితియే మోక్షమనబడును.

పలుమాఱు జన్మములు లభించుటయే జీవులకు దుఃఖ ఫలకమగు సంసారమనబడును. అట్లు మాటిమాటికి జన్మము నకు లోనగుట యదృష్టమున్నంతవఱకు తప్పదు. అదృష్టము దోషములవలన నేర్పడును. దోషములనగా రాగద్వేషాదులు. అవి యజ్ఞానమువలన కలుగును. ఆ యజ్ఞానము తత్త్వ జ్ఞానము వలనగాని నివృత్తికాదు. ఇట్లు తత్త్వజ్ఞానమువలన మిథ్యాజ్ఞానము తొలగి దోషములనుండి విడివడి యదృష్టము లేమి జన్మము నశించును. నాడు జన్మములవలన కల్గు ఆధ్యాత్మికాది త్రివిధ దుఃఖములు నశించును. త్రివిధ దుఃఖాత్యంతాభావమే మోక్షమనబడును.

తత్త్వజ్ఞానము ద్వారా దుఃఖాత్యంత నివృత్తి కలిగి బ్రహ్మానందము నుపభోగించుటయే మోక్షమని వైదికుల రాద్ధాంత మైనను దుఃఖాత్యంత నివృత్తివలన నట్టి యానందా నుభవము తప్పక కలుగుననియు నందువలన దుఃఖ నివృత్తియే యత్ననిష్పాద్యమని యెంచి దుఃఖాత్యంత నివృత్తియే యపవర్గమనియు శాస్త్రప్రవాదము కలిగినది.

అవ : పృథివ్యాదులవలెనే యంధకారమునకు సంబంధించినకర్మముల నేల పరీక్షింపరు ? (నీలం తమ శ్చలతి) నల్లని చీకటి నడచుచున్నది. అను ప్రయోగ సిద్ధ మగు కర్మము బోధపడుచున్నదిగదా ! అనగా ఋషి యిట్లు చెప్పుచున్నాడు.

సూ. :- ద్రవ్యగుణకర్మ నిష్పత్తి వైధర్మ్యాత్
భాఽభావస్తమః [illegible]

ద్రవ్య గుణకర్మ నిష్పత్తి వైధర్మ్యాత్ = ద్రవ్యగుణకర్మల నిష్పత్తి కంటె విలక్షణనిష్పత్తి గలదగుటచే [illegible] తేజోఽభావమే, తమః = తమః పదార్థము [illegible]

అంధకారము (తమః) [illegible] చున్నట్లు తెలియుచున్నది. కాబట్టి అద్దానిని ద్రవ్యగుణ కర్మములలో నొకటి కావలెనని యందురు. గుణకర్మములలో నది చేరుటకు వీలులేదు. (నీలం తమః) నల్లని చీకటి యనుటచే నలుపురంగు గలదని తెలియుచున్నది. నలుపురంగు గుణము. గుణకర్మములు గుణములను కలిగి యుండవు. ఇక మిగిలిన ద్రవ్యములలో భూజలాగ్నులలో నది చేరదు. కారణ మేమన, ఈ మూడు ద్రవ్యములు స్పర్శవంతములు. అంధ కారమునకు స్పర్శములేదు. వాయ్వాదులలో చేరుననుకొనగా ? నీలరూపము కలదిగా భాసించుటచే రూపరహిత వాయ్వాదు లందును చేర్చుటకు వీలులేదు. కాబట్టి గుణకర్మవంతమగు ద్రవ్యమన వీలులేదు.

ఉద్భూత రూపవద్యావత్తేజః సంసర్గాభావమే తమ స్సనబడును. అనగా అభావ పదార్థమని తాత్పర్యము. కాబట్టి తత్కర్మము పరీక్షింప నావశ్యకము గాదు. (నీలం తమ శ్చలతి) అను వాక్యప్రతీత కర్మము భ్రమమాత్రమే. [illegible] సర్పణము తమస్సున నారోపింపబడి యట్లు వ్యవహరింప బడుచున్నది.

సూ. తేజసో ద్రవ్యాంత రేణావరణా చ్చ ౫.౨.౨౦

పూర్వసూత్రమునగల 'భాఽభావః' అను పదమిందనువర్తించును. ఇందలి చకారమువలన అంధకారమున గల కర్మ ప్రతీతి, రూపప్రతీతియు ఔపాధికములని తెలియనగును. ద్రవ్యాంతరేణ = తేజస్సుకంటె భిన్నమైన అవరక ద్రవ్యము చేత, తేజసః = ఉద్భూత రూపవంతమగు తేజోమాత్రమునకు, ఆవరణాత్ = ఆచ్ఛాదనము కలుగుట వలన నియమముగా అంధకార మేర్పడుచున్నది. కాబట్టి తేజోఽభావమే అంధకారమని సూత్రార్థము.

ద్రవ్యాంతరముచే తేజః పదార్థ మావరింప బడినపుడే అంధకార మేర్పడుచున్నది. ద్రవ్యాంతరమగు నెడల నటులెన్నడు కానేరదు. కాబట్టి భాఽభావమే (తేజోఽభావమే) అంధకారమని యనుమానింపబడుచున్నదని తాత్పర్యము.

అవ : అంధకార మభావ పదార్థ మగుటం బట్టి తత్కర్మ మపరీక్ష్యమయినను, దిగాదుల కర్మ మేల పరీక్షింప బడదన ?

సూ. :- దిక్కాలావకాశం చ క్రియావద్వైధర్మ్యా న్నిష్క్రియాణి ౫.౨.౨౧

దిక్కాలావకాశం = దిక్కాలాకాశములు, క్రియావద్వైధర్మ్యాత్ = క్రియావంతములగు పదార్థములు మూర్తములను నియమముండుటచే క్రియావంతములలో మూర్తత్వము సాధర్మ్యము, అమూర్తత్వము వైధర్మ్యము నగుటవలన, నిష్క్రియాణి = క్రియారహితములని సూత్రార్థము.

దిక్కు, కాలము, ఆకాశము మూడును మూర్త పదార్థములు కామి కర్మరహితము లనియు నందువలన వాని కర్మము పరీక్ష్యము కాదనియు సూత్రాభిప్రాయము.

ఈ సూత్రమునందలి చకారమువలన ఆత్మపదార్థము సంగ్రాహ్యమని శంకర మిశ్రుల అభిప్రాయము. [illegible]నగా పరమాత్మ. జీవాత్మ యుభయమైనను కూటస్థ నిత్యము. పరిణామ మసంభవము. అందువలన నిష్క్రియత్వమని వివేకము.

సూ. :- ఏతేన కర్మాణి గుణాశ్చ వ్యాఖ్యాతాః ౫.౨.౨౨

ఇందు పైసూత్రమునుండి 'నిష్క్రియాణి' అను పద మను వర్తించును. ఏతేన = క్రియావద్ద్రవ్యధర్మ్యరూప హేతువు వలననే, కర్మాణి = ఉత్క్షేపణాది కర్మములు, గుణాశ్చ = రూపాది గుణములును, వ్యాఖ్యాతాః = క్రియారహితము లని వ్యాఖ్యానము చేయబడినట్లే యెఱుగవలయును.

అవ : గుణ కర్మములు క్రియారహితములగు నెడల వానికి ద్రవ్యముతో నెట్లు సంబంధ మేర్పడును ? సంబంధము కర్మ జన్యమే కదా ? యన -

సూ. :- నిష్క్రియాణాం సమవాయః కర్మభ్యో నిషిద్ధః ౫.౨.౨3

నిష్క్రియాణాం = గుణకర్మములకు, సమవాయః = ద్రవ్యముతో సమవాయ సంబంధ మంగీకరింపబడినది, కాని సంయోగ సంబంధము కాదు. సమవాయ సంబంధము నిత్యమగుటచే, కర్మభ్యః = కర్మములవలన దానియుత్పత్తి నిషిద్ధః = మాచే నిషేధింపబడిన దని సూత్రార్థము.

కర్మ జన్యత్వ నియమము సంయోగ సంబంధమునకే గాని సమవాయ సంబంధమునకు లేదు. సమవాయ సంబంధ మనగా నిత్యసంబంధము. ద్రవ్యములతో గుణకర్మలకుగల సంబంధము సమవాయము. అందువలన దోషము లేదని సూత్రకారుని యభిప్రాయము.

అవ : గుణములు నిష్క్రియములగు నెడల కర్మారంభకము లెట్లగును ? కర్మారంభకములని యింతకుపూర్వ గ్రంథమున చెప్పియున్నారు. కావున క్రియారహిత గుణములు కర్మముల నెట్లు కలిగించుననన ?

సూ. :- కారణం త్వసమవాయినో గుణాః ౫.౨.౨౪

గుణాః = సంయోగాది గుణములు, కారణం త్వసమవాయినః = కర్మోత్పత్తి విషయమున అసమవాయి కారణము లని చెప్పియుంటిమి. సమవాయి కారణము కాదు.

కర్మకు సమవాయి కారణము క్రియారహిత మగునది కాజాలదు. అసమవాయి కారణమున కట్టి నియమము లేదు. ఇంతకు పూర్వము గుణములు కర్మవిషయమున అసమవాయి కారణములుగా చెప్పబడినవి. సమవాయి కారణములని చెప్పబడలేదు. కాబట్టి దోషమొందును లేదని సూత్రకారుని యభిప్రాయము.

సూ. :- గుణైర్దిగ్ వ్యాఖ్యాతా ౫.౨.౨౫

గుణైః = అమూర్తములను హేతువు వలననే కర్మసమవాయి కారణములు కాని గుణములద్వారా, దిక్ వ్యాఖ్యాతా =

పూర్వాదిదిశలును కర్మ సమవాయి కారణములు కావని వ్యాఖ్యానము చేయబడిన ట్లెంచవలయునని సూత్రార్థము.

అమూర్తము లను హేతువువలన గుణములు కర్మసమవాయి కారణము కానట్లు దిక్కు కూడ అమూర్తమే యగుట వలన నదియు కర్మ సమవాయి కాదు. (ఇహ కర్మోత్పన్నం, ఇదానీం కర్మోత్పన్నమ్) 'ఇక్కడ కర్మమేర్పడినది. ఇప్పుడు కర్మము జనించినది' అను ప్రతీతియందు బోధపడు కర్మాధారత్వము (వనే సింహనాదః) 'వనమునందు సింహనాద' మను తావులందువలె నౌపచారికమని (అప్రధానము-గౌణము) యెంచవలయును. ముఖ్యప్రతీతి (జ్ఞానము) కాదు.

సూ. :- కారణేన కాలః ౫.౨.౨౬

కారణేన = నిమిత్త కారణము గాన, కాలః = కాలపదార్థము కర్మసమవాయి కారణము కాదని వ్యాఖ్యానము చేయబడినట్లు భావింపవలయునని సూత్రాభిప్రాయము.

# షష్ఠాధ్యాయము

## ప్రథమాహ్నికము

'అథాతో ధర్మం వ్యాఖ్యాస్యామః' అని ప్రతిజ్ఞనొనర్చి యందులకు వేదమును ప్రమాణముగా మహర్షి నుడివి

యున్నాడు. ధర్మమున ప్రమాణముగా చెప్పబడిన వేద ప్రామాణ్యమును నిరూపింపదలచి యది యీశ్వర బుద్ధిపూర్వకముగా రచియింపబడినదని యనుమానముచే సాధింపనెంచి సూత్రమును రచించుచున్నాడు.

సూ. :- బుద్ధిపూర్వా వాక్కృతి ర్వేదే ౬.౧.౧

వేదే = ఋగ్యజుస్సామాథర్వము లను పేర్లుగల వేదమునందు యా వాక్కృతిః = కల వాక్యరచన, సా బుద్ధిపూర్వా = స్వార్థ విషయ (స్వార్థము విషయముగాగల) వక్తృ యథార్థ జ్ఞానము పూర్వముగా గలది.

అనేక విద్యల కాటపట్టయి ప్రదీపముంబోలి సర్వార్థములను ప్రకాశింపజేయు సర్వజ్ఞకల్పితమగు వేదమునందుగల వాక్యరచనయు రచనయే యగుటంబట్టి బుద్ధిపూర్వకమయ్యు అస్మదాదుల బుద్ధిపూర్వక మనుట యసంభవము గాన నీశ్వర బుద్ధిపూర్వక మగుటచే నెంతయు ప్రమాణ మనుట నిర్వివాదము.

సూ. :- బ్రాహ్మణే సంజ్ఞాకర్మ సిద్ధిలింగమ్ ౬.౧.౨

బ్రాహ్మణే = బ్రాహ్మణ ప్రభృతి సమస్త ప్రాణులందును, సంజ్ఞాకర్మ = సర్గారంభమున వేదమువలన ప్రవృత్తమైన నామకర్మములు, సిద్ధిలింగమ్ = వేద మీశ్వరోక్తమనుటలో ప్రమాణాంతరమని యెఱుంగునది.

సర్గారంభమున భగవంతుడే సకల ప్రాణులకును సంజ్ఞాకర్మములను విధింపవలసి యుండెను. వేదముద్వారా

సంజ్ఞాకర్మములు ప్రథమమున ప్రవృత్తములయ్యెను. వేద మేర్పడుటకు మార్గాంతరము లేమి నీశ్వరోక్తమనుట నిర్బాధ మని తాత్పర్యము.

సూ. :- బుద్ధిపూర్వో దదాతిః ౬.౧.3

దదాతిః = దానజ్ఞానము, బుద్ధిపూర్వః = సర్వజ్ఞ బుద్ధిపూర్వక మని సూత్రతాత్పర్యము.

''ఉచ్చాదివి దక్షిణావంతో అస్థుః'' (ఋ.౮.౬.3.౨) ఇత్యాది మంత్రములందు, సద్బ్రాహ్మణులకు గృహస్థులు హిరణ్యాదుల నొసంగి సుఖముల నందుదురని బోధింప బడినది. ఇందుభావిఫలమును బోధించుశక్తి సర్వజ్ఞుడగు ఈశ్వరునకు గాక యన్యులకెట్లు సంభవించును ? కాబట్టి వేద మీశ్వరీయమని సూత్రతాత్పర్యము.

సూ. :- తథా ప్రతిగ్రహః ౬.౧.౪

తథా = అట్లే, ప్రతిగ్రహః = ప్రతిగ్రహము.

శ్రద్ధాభక్తులతో గృహస్థులచే నీయబడిన హిరణ్యాదులను గ్రహించి వానిని సదుపయోగమొనర్చి సుఖింపజేయవలయు నను జ్ఞానబోధక వాక్యములు వేదములందుండుటచే నవి బుద్ధిపూర్వకములనియు వానింబట్టి వేదము లీశ్వరీయము లనియు నెంచవలయునని సూత్రాభిప్రాయము.

**అవ :** ఇట్లు వేదము భగవద్బుద్ధి పూర్వక మగుటచే ప్రమాణమని సాధించి యికముందు వేద బోధిత ధర్మ

కర్మములు బోధించుచు మొదట అనుష్ఠిత కర్మము కర్తకే ఫల మొసంగునని చెప్పుచున్నారు.

సూ. :- ఆత్మాంతర గుణానా మాత్మాంతరే౽

కారణత్వాత్ ౬.౧.౫

ఆత్మాంతరగుణానామ్ = మఱియొక యాత్మచే నాచరింపబడిన కర్మములకు, ఆత్మాంతరే=మఱియొక ఆత్మయందు, అకారణత్వాత్ = ఫలము నొసంగకుండుటవలన.

వేదవిహిత కర్మము లెవనిచే నాచరింపబడినవో వానికే ఫలమొసంగును. కాని యన్యుల కీయనేరవు.

మీమాంసాశాస్త్రమునందును 'శాస్త్రఫలం ప్రయోక్తరి' (3. ౭. ౧౫) యని సూత్రించి కర్మానుష్ఠాన ఫలము ప్రయోక్త (కర్త) కేయని చెప్పబడినది.

అవ : వైదిక కర్మము లన్నియెడలను ఫలదాయకము లేనా ?

సూ. :- త ద్దుష్ట భోజనే న విద్యతే ౬.౧.౬

తత్ = ఆ వైదికకర్మము, దుష్టభోజనే = దుష్ట భోజనము చేయువాని యెడల, న విద్యతే = ఫలజనకము కాదు.

దుష్టభోజనమొనర్చువాని కనకు వైదికకర్మము ఫలింపదని సూత్రతాత్పర్యము.

సూ. :- దుష్ట హింసాయామ్ ౬.౧.౭

హింసాయామ్ = హింసచేసినమీదట లభించు భోజనము, దుష్టమ్ = దుష్టమని యర్థము.

హింస శాస్త్రనిషిద్ధము.

'పశూన్ పాహి" (య. ౧.౧౧)

"గాం మా హిగ్ంసీః" (య. ౧౩. ౪౩)

"అవిం మాహిగ్ంసీః" (య. ౧౩. ౪౪)

"ఇమం మాహిగ్ంసీ ర్ద్విపాదం పశుమ్" (య. ౧౩.౪౭)

"మా హిగ్ం సీ రేకశఫం పశుమ్" (య. ౧౩. ౪౮)

"నాకృత్వా ప్రాణినాం హింసా, మాంస ముత్పద్యతే క్వచిత్,

న చ ప్రాణివధః స్వర్గ్య స్తస్మాన్మాంసం వివర్జయేత్"
(మ. ౫. ౪౮)

శ్రుతి స్మృతులలో నిట్లు నిషేధింపబడిన ప్రాణి వధ నొనర్చువారు సుఖము పడయనేరరు.

అవ : అన్యునిచే చంపబడిన జంతుమాంసము నన్యుడు భుజించిన దోషమా ?

సూ. :- తస్య సమభివ్యాహారతో దోషః ౬.౧.౮

తస్య = దుష్టభోజనము చేయువానియొక్క, సమభి వ్యాహారతః = సంబంధమువలన, దోషః = కర్మ ఫలమును ప్రతిబంధించునట్టి దోషము కలుగును.

హింసాజన్యభోజనము చేయువాని కెట్లు అనుష్ఠిత కర్మ ఫలము లభింపదో యట్లే మాంసభక్షకునకును విహిత కర్మ ఫలము కలుగనేరదు.

సూ. త దదుష్టే న విద్యతే ౬.౧.౯

తదదుష్టే=దుష్టభోజనము విడిచినచో, న విద్యతే = పూర్వోక్త దోషముండదు.

అవ : దుష్టభోజనము విడిచి చేయవలసిన దేమి ?

సూ. :- పున ర్విశిష్టే ప్రవృత్తిః ౬.౧.౧౦

పునః = దుష్టభోజనము విడిచిన తరువాత, విశిష్టే = శాస్త్ర సమ్మత సాత్విక భోజనమునందు, ప్రవృత్తిః=ప్రవృత్తికలుగ జేసికొనవలయును. అట్లొనర్చిన విహితకర్మముల నొనరించి ఫలము నొందవచ్చును.

అవ : విశిష్టప్రవృత్తియం దసమర్థులగువా రేమిచేయ వలసియుందురు ?

సూ. :- సమే హీనే వా ప్రవృత్తిః ౬.౧.౧౧

సమే = సత్వగుణము, రజోగుణము సమానముగాగల భోజనమునందో, వా = లేక, హీనే = సత్వహీనమై కేవలరాజసిక భోజనమునందో ప్రవృత్తి కలిగించు కొనవలయును. కాని తామసికమైన మాంసయుక్త భోజనము చేయరాదు.

సూ. :- ఏతేన హీన సమవిశిష్ట ధార్మికేభ్యః
పరస్వాదానం వ్యాఖ్యాతమ్ ౬.౧.౧౨

ఏతేన = పైవ్యాఖ్యానముచే, హీన సమ విశిష్ట ధార్మికేభ్యః = ధార్మికులయిన మంద మధ్యమోత్తమ గృహస్థులనుండియే

పరస్వాదానమ్ = దేశాద్యుపకారార్థము ధనగ్రహణము చేయ వచ్చునని, వ్యాఖ్యాతమ్ = చెప్పబడినదని సూత్రార్థము. (పరస్వ = పరధనము)

ఆత్మోపకారార్థము గాని, దేశోపకారార్థము గాని ధన గ్రహణము చేయదలచు వారు ప్రథమమున ఉత్తముల నుండియు, అట్టివారు లభింపకున్న మధ్యముల నుండియు, వారును లభింపనిపక్షమున హీనులయిన ధార్మికగృహస్థుల నుండియే గ్రహింపనగును గాని హీనతరులు, హీనతములు నయిన వారినుండి గైకొనరాదు.

సూ. :- తథా విరుద్ధానాం పరిత్యాగః ౬.౧.౧౩

తథా = అట్లే, విరుద్ధానాం = శ్రుతిస్మృతి విరుద్ధములయిన కర్మముల, పరిత్యాగః = పరిత్యాగము చెప్పబడినదని యెంచ వలయును.

శ్రుతి స్మృతి విరుద్ధకర్మముల నెన్నడు చేయరాదు. (యాన్యనవద్యాని కర్మాణి తాని సేవితవ్యాని నో ఇతరాణి)

(తై. శి. అ. వ. ౧. అను ౧౧)

అవ : ధర్మవిరోధి యెవడేని ధార్మికునిపై నెత్తి వచ్చి నపు డేమి చేయవలయును ?

సూ. :- హీనే పరే త్యాగః ౬.౧.౧౪

పరే = శత్రువు, హీనే = బలహీనుడైన పక్షమున, త్యాగః = అతనిని వధింపవలయును.

స్వధర్మాభిరక్షణము ప్రాణముల కంటె ప్రియమని యెంచు ధీమంతులు శత్రువు నెదుర్కొని యతనిని వధింతురు. అట్టి యెడ కలుగు హింస వారి నెన్నడును బాధింపనేరదు. అత డొనర్చిన యుద్ధకర్మము ధర్మరక్షణ కొఱకు చేయబడినది కాబట్టి హింసతో నతని కెట్టి సంబంధము నుండదు. రక్షణలేని ధర్మానుష్ఠాన మసంభవ మగును. కాబట్టి ధర్మరక్షణార్థ మారంభింపబడిన యుద్ధమునందు వెనుకాడక శత్రువు నెదుర్కొని యస్త్రశస్త్రాదుల నతని జయించుటయే శ్రేయస్కరము. అట్టి వానికి ప్రాయశ్చిత్తాదులు నుండవు.

అవ : శత్రువు సమబలుడగుచో నేమి చేయవలయును?

సూ. :- సమ ఆత్మత్యాగః పరత్యాగో వా ౬.౧.౧౫

శత్రువు, సమే = స్వసమాన బలుడని తెలిసినపుడు, ఆత్మత్యాగః = యుద్ధమునందు స్వదేహత్యాగమో, వా = లేక, పరత్యాగః = శత్రువధయో చేయవలయును.

ధర్మ రక్షణను బహుశ్రేయస్కరము. అట్టి దానిని సాధించుటలో క్షణభంగురమగు శరీరత్యాగమునకు చింతిల్ల జనదు. కాబట్టి ధర్మరక్షణకై స్వదేహమును, పాము-కుబుసముంబోలి త్యజించి కీర్తి గడించినవారే ధన్యులు. ధర్మార్థము యుద్ధమొనర్చు వారు ప్రాణాంతము వఱకు ధర్మ రక్షణ మొనర్చినవా రగుదురు.

అవ : శత్రువు తనకంటె విశిష్టుడగు నెడల నేమి చేయవలయును ?

సూ. :- విశిష్ట ఆత్మత్యాగః ౬.౧.౧౬

శత్రువు, విశిష్టే = తనకంటె నెక్కువ బలవంతుడైన, ఆత్మత్యాగః = యుద్ధమునందు విముఖుడుగాక స్వదేహత్యాగ మొనర్పవలయును.

"యే యుధ్యన్తే ప్రధనేషు శూరాసో, యే తనూత్యజః
యే వా సహస్రదక్షిణాస్తాం శ్చిదేవాపి గచ్ఛతాత్''
(ఋ. అ. ౮. అ. ౮. ౧౩. ౩)

"ఆహవేషు మిథోఽన్యోన్యం జిఘాంసంతో మహీక్షితః
యుధ్యమానాః పరం శక్త్యా స్వర్గం యాన్త్యపరాఙ్ముఖాః''
(మ. ౭.౮౯)

ఇట్లు శ్రుతిస్మృతులు ధర్మరక్షార్థమై యుద్ధమొనర్చుట యుభయథా శ్రేయస్కరమని వచించియున్నవి.



# షష్ఠాధ్యాయము

## ద్వితీయాహ్నికము



వైదికకర్మమును విశేషముగా పరీక్షింపదలచి మొదటి సూత్రమును రచించుచున్నాడు.

సూ. :- దృష్టాదృష్ట ప్రయోజనానాం దృష్టాభావే
ప్రయోజన మభ్యుదయాయ ౬.౨.౧

దృష్టాదృష్ట ప్రయోజనానాం = ఐహికాముష్మిక ఫలయుక్త కర్మములకు, దృష్టాభావే =దృష్ట ప్రయోజనము లభింపనపుడు, ప్రయోజనమ్ = అనుష్ఠానము (ఆచరణ), అభ్యుదయాయ = ఆముష్మికార్థమని తెలియనగును.

కర్మములు శాస్త్రవిధి ననుసరించి జరుపబడినవై, దృష్టాదృష్ట ఫలములను సాధించును. ఒకానొక కర్మము శాస్త్రవిధి ననుసరించి యనుష్ఠింపబడి దృష్టఫలము నొసంగనపుడు అదృష్టఫలము కలుగునని నిశ్చయింపవలయును.
అవ : ఆ వైదిక కర్మము లెట్టివన ?

సూ. :- అభిషేచ నోపవాస బ్రహ్మచర్య గురుకులవాస
వానప్రస్థ యజ్ఞ దాన ప్రోక్షణ దిజ్ నక్షత్ర మంత్ర
కాల నియమా శ్చాదృష్టాయ ౬.౨.౨

అభిషేచనమ్ = శుద్ధ జలస్నానము, ఉపవాసః = పాపకర్మము నుండి చిత్తము నుపరమింపజేసి విహిత కర్మమందు లగ్న మొనర్చుట, లేక ధర్మ కార్య సంలగ్నతచే అన్న జలాదులను గ్రహింపకుండుట, బ్రహ్మచర్యః = ఉపస్థేంద్రియ నిగ్రహము, గురుకులవాసః = సాంగోపాంగ వేదాధ్యయనము కొఱకు గురుకులముననుండుట, వానప్రస్థమ్ = వార్ధకమున వనము నందుండి శ్రుతిస్మృతి విహితకర్మముల నాచరించుట, యజ్ఞః = అగ్నిహోత్రము మొదలు అశ్వమేధము వఱకుగల

కర్మము, దానమ్ = దశాత్మోపకారముకొఱకై యథాశక్తి హిరణ్యవస్త్ర భోజనాదుల నొసంగుట, ప్రోక్షణం = వ్రీహ్యాదులను జలాదులతో సంస్కరించుట, దిశః = దిక్కులు, మంత్రః = 'ఆపోహిష్ఠా మయోభువః' ఇత్యాది మంత్రములు, కాలః = ప్రాతఃసాయంకాలాది కాలము, నియమాః = అంతఃశౌచ, సంతోష, తపః, స్వాధ్యాయ, ఈశ్వర ప్రణిధానములు.

ఇవన్నియు యథావిధిగా ననుష్ఠింపబడి దృష్టాదృష్ట ఫలముల నొసంగును.

అవ : ఈ చెప్పబడిన చతురాశ్రమ కర్మములు ఇతర సాహాయ్యము నపేక్షించి ఫలముల నొసంగునా ? అపేక్షింపకయే యొసంగునా ? అన

సూ. :- చాతురాశ్రమ్య ముపధాః అనుపధాశ్చ ౬.౨.3

చాతురాశ్రమ్యమ్ = పైచెప్పబడిన అభిషేచనాది చతురాశ్రమ సంబంధి కర్మము, ఉపధాః అనుపధాశ్చ = ముందు చెప్పబోవు ఉపధానుపధాత్మక సాహాయ్యము నపేక్షించియే ఫలదాయకమగును.

సూ. :- భావదోష ఉపధా, అదోషోఽనుపధా ౬.౨.౪

భావదోషః = జీవాత్మని యవిద్యాఽశ్రద్ధాదిదోషము, ఉపధా= ఉపధయనబడును, అదోషః = అవిద్యాదులకు విపరీతమైన విద్యాశ్రద్ధాదులు, అనుపధా = అనుపధ యనబడును.

అభిషేచనాది కర్మములు ఇతర విద్యాదుల సాహాయ్యమునసే ఫలవంతము లగును. "యదేవ విద్యయా కరోతి

శ్రద్ధయోపనిషదా, తదేవ వీర్యవత్తరం భవతి" (ఛాం. 3.౧.౧౦) విద్యాశ్రద్ధాదులతో చేయు కర్మమే ఫలవంతమగునని పై వాక్యాభిప్రాయము.

సూ. :- యదిష్టరూప రసగంధస్పర్శం ప్రోక్షిత
మభ్యుక్షితం చ తచ్ఛుచి ౬.౨.౫

ప్రోక్షితం అభ్యుక్షితంచ = శుద్ధజలముచే సంస్కరింపబడినదై, ఇష్టరూప రసగంధస్పర్శం = శ్రుతిస్మృతులకు, శిష్టులకు నిష్టములయిన రూపరసగంధ స్పర్శయుక్తమగు, యత్ = ఏవస్తువుగలదో, తచ్ఛుచి = అదియే భోజన యోగ్యమని సూత్రార్థము.

సూ. :- అశుచీతి శుచిప్రతిషేధః ౬.౨.౬

అశుద్ధజలాదులచే సంస్కరింపబడి, అప్రశస్త రూప రస గంధయుతమై న్యాయార్జితము కాని ద్రవ్యము భక్ష్యయోగ్యము కాదని సూత్రతాత్పర్యము.

సూ. :- అర్థాంతరం చ ౬.౨.౭

అవిహిత పదార్థము సైత మశుచియని సూత్రార్థము.

సూ. :- అయతస్య శుచిభోజనా దభ్యుదయో
న విద్యతే, నియమాభావాత్ ౬.౨.౮

అయతస్య=అహింసాది నియమరహితునకు, శుచిభోజనాత్= శుద్ధభోజన మాచరించిన మాత్రమున, అభ్యుదయః = ఐహికా

ముష్మికఫలము. న విద్యతే = కలుగదు, నియమాభావాత్= యమనియమములను పాటించకుండుటయే యిందులకు కారణము,

"అహింసా సత్యమస్తేయ బ్రహ్మచర్యాపరిగ్రహాః యమాః"
"శౌచసంతోష తపః స్వాధ్యాయేశ్వర ప్రణిధానాని

నియమాః"

అను యమనియమములు పాటింపని వానికి కేవల శుద్ధ భోజనము చేసినంత మాత్రమున కర్మఫలము లభించుననుటకు వీలులేదు.

అవ: అట్లయిన, హింసాజనక యుద్ధ కర్మమందు ప్రవృత్తుడైన వానికి శుద్ధ భోజనము వలన అభ్యుదయము కలుగదా ?

సూ, :- విద్యతే వాఽర్థాంతరత్వాత్ యమస్య ౬.౨.౯

విద్యతేవా = కలుగును. కారణమేమన, అర్థాంతరత్వాత్ యమస్య = యమనియమములు అర్థాంతర విషయములు కనుక.

అనగా యమ నియమములు యుద్ధ కాలమునగాక మిగిలిన సమయములందాచరింప దగినవని భావము.

దేశము నుద్ధరించుటకుగాని, ఆత్మ నుద్ధరించుటకుగాని న్యాయానుకూలముగా యుద్ధముచేయువారికి భోజనమునందు నియమములు పాటించుటలో బంధన ముండజాలదని సూత్ర తాత్పర్యము.

అవ : యుద్ధసమయముగాక మిగిలిన వేళలందు శుద్ధ భోజనము వలననే యభ్యుదయము సిద్ధించుచుండ యమ నియమముల పాటింపనేల ? యన:

సూ. :- అసతి చాభావాత్ ౬.౨.౧౦

అసతి చ = యమనియమముల పాటింపకున్న, అభావాత్ = శుద్ధభోజనము లభించుట యసంభవము.

యమ నియమములు పాటింపని వానికి శుద్ధమైన భోజనము లభింపనేరదు. శుద్ధభోజనము యమనియమముల కధీనమై యుండును. అదిలేనివారికి అభ్యుదయము చాల దూరము. కాబట్టి యభ్యుదయమును గోరువారు తప్పక యమనియమములు పాటింపవలసి యుందురు.

అవ: కర్మమును బాగుగా పరీక్షించి యటుపై దానికి కారణభూతమైన దోషమును పరీక్షింప దలచి దాని దోష జన్మ ప్రకారమును తెలుపుచున్నాడు.

సూ. :- సుఖాద్ రాగః ౬.౨.౧౧

సుఖాత్ = సుఖానుభవమువలన, అట్టిసుఖమునందును, ఆ సుఖము దేనివలన కలిగినదో ఆ సాధనమునందును, రాగః = అనురాగము కలుగును. అట్లే దుఃఖము ననుభవించుటవలన దుఃఖమునందును దాని సాధనమునందును ద్వేషము కలుగు ననియు నెంచవలయును.

ఏ సాధనములవలన సుఖము కలుగునో ఆ సాధనము లనే సుఖము ననుభవింపగోరి మరల మరల సంపాదించుట

యందు అనురక్తుడగును. ఏ సాధనముల వలన దుఃఖము కలుగునో ఆ సాధనములను, దుఃఖములను విడువ నెంచి ద్వేషించును. కాన రాగద్వేషములే దోషములు. అవి కలుగు విధమును ఇదియే.

సూ. :- తన్మయత్వా చ్చ ... ౧౨

సుఖదుఃఖ సాధనములను పెక్కుమాఱు లుపయోగించుటచే కలుగు గట్టి సంస్కారమే తన్మయత్వ మనబడును. తన్మయ త్వాచ్చ = అట్టి తన్మయత్వము — సంస్కారము - వలన, సుఖదుఃఖములందును వాని సాధనములందును రాగద్వేష ములు కలుగును.

సూ. :- అదృష్టా చ్చ ౬.౨.౧౩

అదృష్టాచ్చ = పూర్వజన్మమున సంపాదించిన యదృష్టము వలనను రాగద్వేషములు కలుగును.

ఏ పురుష డీజన్మమున స్త్రీ సంగమమున కలుగు సుఖమునుగాని, పాము కఱచినందువలన కలుగు దుఃఖముమ గాని యనుభవింపడో అట్టి పురుషుడు యౌవనావస్థను పొందుటతోడనే స్త్రీలయం దనురక్తుడగుటకును, పాములను ద్వేషించుటకును గల కారణము పూర్వార్జితమగు నదృష్టమే.

సూ. :- జాతి విశేషా చ్చ ౬.౨.౧౪

జాతియనగా జన్మము, జన్మ విశేషమువలనను రాగద్వేష ములు కలుగునని సూత్రార్థము.

మానవుల కన్నాదులందును, ఉష్ట్రాదులకు ముండ్ల యందును, రాగము కలుగుటకును, ముంగిస జాతికి పాము లందు ద్వేషము కలుగుటకును కారణము జన్మవిశేషమే కాని యొండు కానేరదు.

అవ : సుఖదుఃఖములవలన రాగద్వేషములు కలిగిన కలుగనిమ్ము. ఇందు కర్మమునకు గల సంబంధ మెద్దియున?

సూ. :- ఇచ్ఛాద్వేష పూర్వికా ధర్మాధర్మ ప్రవృత్తిః

౬.౨.౧౪

ధర్మాధర్మ ప్రవృత్తిః = సుఖదుఃఖములకు కారణమైన పుణ్య పాపములను కలిగించు మానవుల మనోవాక్కాయ ప్రవృత్తు లన్నియు, ఇచ్ఛాద్వేష పూర్వికా = రాగద్వేషములే నిమిత్త ములుగా గలవి.

మిథ్యాజ్ఞానముచే ప్రేరితులై మానవులు అనుకూల వస్తువులందు రాగమును, ప్రతికూలములందు ద్వేషమును గలిగి యుందురు. ఇట్లు అనుకూలమును పొందగోరి మనస్సుతో దయా అస్పృహాదులను, వాక్కుతో సత్యస్వాధ్యా యములను, శరీరముతో స్నాన దానాదులను చేయును. ప్రతి కూలమును విడువగోరి మనస్సుతో పరులకు ద్రోహము చేయుట. ఇతర ధనాపహరణమును, వాణితో అసత్యాదులను, శరీరముతో హింసాదులందును ప్రవృత్తులగుదురు. కాబట్టి పుణ్యపాపములు చేయుటకు కారణము రాగద్వేషములే యని తెలుచున్నది.

అవ : పుణ్య పాపములందు ప్రవృత్తి కలుగుటచే నేమగును?

సూ. :- తత్ సంయోగో విభాగః ౬.౨.౧౬

తత్ = అందువలన, సంయోగః = అనేక యోనుల సంయోగము, విభాగః = యోని విభాగమును కలుగును.

పుణ్యాపాప ప్రవృత్తివలన నానావిధములయిన నీచోచ్చ యోనులందు పెక్కుమాఱులు పుట్టి చచ్చుటలు కలుగునని సూత్రాభిప్రాయము.

అవ : దుఃఖమూలములగు నీ జన్మ మరణ చక్రము నుండి యీజీవులకు మోక్ష మెన్నడు కలుగునన ?

సూ. :- ఆత్మకర్మసు మోక్షో వ్యాఖ్యాతః ౬.౨.౧౭

ఆత్మకర్మసు = జీవేశ్వరుల దెలిసికొన సాధనములైన యమ నియమాది కర్మములు నిర్వర్తింపగా, మోక్ష=పరమపురుషార్థమైన మోక్షము సిద్ధించునని, వ్యాఖ్యాతః = ఉపనిషదాది శాస్త్రములచే జెప్పబడినది.

మానవుడు నిష్కాముడై తత్త్వజ్ఞానమునకు సాధనమైన వేదోక్త కర్మమును బాగుగా నాచరించి యమనియమములను పూర్ణముగా సంపాదించి మోక్షమనుభవించును. ఇందులకు మఱియొక మార్గము లేదు, అని సూత్రాభిప్రాయము.



# సప్తమాధ్యాయము

## ప్రథమాహ్నికము

ఇంతవఱకు ద్రవ్యములు, కర్మములు పరీక్షింపబడినవి. మధ్యలో వైదికధర్మముకూడ పరీక్షింపబడినది. ప్రస్తుత మీ యధ్యాయమున గుణములను పరీక్షింపదలచి వెనుక చెప్పిన వానిని స్మరింప జేయుచున్నాడు.

సూ. :- ఉక్తాః గుణాః 7.1.1

రూపము, రసము, గంధము, స్పర్శము, సంఖ్య, పరిమాణము, పృథక్త్వము, సంయోగ విభాగములు, పరత్వాపరత్వములు, బుద్ధి, సుఖదుఃఖములు, ఇచ్ఛాద్వేషములు, ప్రయత్నము-ననుగుణములు ప్రథమాధ్యాయమున ప్రథమాహ్నికమున ఆఱవ సూత్రమున (1.1.6) చెప్పబడినవి. వాని నిట పరీక్షింపగోరి, గుణాః = రూపాది గుణములు, ఉక్తాః=పూర్వము చెప్పబడినవి.

(1) వానిలో రూపలక్షణము :- (చక్షుర్మాత్ర గ్రాహ్యో గుణః రూపమ్) గుణత్వము కలిగి, నేత్రముగాక మిగిలిన ఇంద్రియములచే గ్రహింపబడనిదై నేత్రములచేతనే గ్రహింపబడునది రూపము. అది నీలము, శుక్లము, లోహితము, హరితము, కపిశము, చిత్రము నని యేడు విధములు. ఈ యేడు విధములయిన రూపము భూమి యందుండును.

శుక్లము = తెలుపు జలమునందుండును. లోహితము =ఎఱుపు అగ్నియందుండును.

(2) (రసనగ్రాహ్యో గుణో రసః) జిహ్వేంద్రియము వలన గ్రహింపబడు గుణము రసము. అది యాఱువిధములు. తీపి, పులుపు, ఉప్పన, కారము, ఒగరు, చేదు. భూమియందీ యాఱువిధము లయిన రసముండును. జలమునందు మధుర ముండును.

(3) (ఘ్రాణగ్రాహ్యో గుణో గంధః) నాసికచే గ్రహింపదగిన గుణము గంధమనబడును. ఇది సుగంధము, దుర్గంధము నని రెండు విధములు. భూమియందే యుండును.

(4) (త్వగింద్రియగ్రాహ్యో గుణః స్పర్శః) త్వగింద్రియముచే గ్రహింపదగిన గుణము స్పర్శ మనబడును. అది శీతము, ఉష్ణము, అనుష్ణాశీతము నని మూడువిధములు. భూజలాగ్ని వాయువులలోనుండును. అనుష్ణాశీతస్పర్శము భూమియందును, వాయువునందు నుండును.

(5) (ఏకత్వాది వ్యవహార హేతుః సంఖ్యా) ఒకటి రెండు అను లెక్కకు సంబంధించిన వ్యవహారమునకు కారణ మగునది సంఖ్య యనబడును. నిత్య పదార్థమున నుండు ఏకత్వము నిత్య మగును. అనిత్యగత మనిత్య మగును. ద్విత్వము మొదలు పరార్థము వఱకు నుండు సంఖ్య అపేక్షా బుద్ధి జన్యమగుటవలన అనిత్యమే యగును.

''ఏకం దశ శతం చైవ, సహస్ర మయుతం తథా,
లక్షం చ నియుతంచైవ, కోటి రర్బుదమేవ చ''

''వృందం ఖర్వో నిఖర్వశ్చ, శంఖః పద్మశ్చ సాగరః
అన్త్యం మధ్యం పరార్ధంచ, దశవృద్ధ్యా యథాక్రమమ్''

(౧౦౦౦౦౦౦౦౦౦౦౦౦౦౦౦౦౦౦) ఒకటి, పది, వంద, వేయి, పదివేలు (అయుతము), లక్ష, (నియుతము) పదిలక్షలు, కోటి,(అర్బుదము)పదికోట్లు, వృందము, ఖర్వము, నిఖర్వము, శంఖము, పద్మము, సాగరము, అంత్యము, మధ్యము-పరార్ధము, అను నివి సంఖ్యావాచకములు. ఒకదానికంటె నొకటి కుడినుండి యెడమకు పదిరెట్లుగా పెంచుచు బోవలయును.

(6) (మానవ్యవహారాసాధారణ కారణం పరిమాణమ్) పరిమాణము ద్రవ్యము లన్నిటియందు నుండును. అది అణువు - మహత్తు — హ్రస్వము - దీర్ఘము నని నాలుగు విధములు.

(7) (పృథగ్వ్యవహారాసాధారణ కారణం పృథక్త్వమ్)

(8) (సంయుక్త వ్యవహార హేతుః సంయోగః)

(9) (సంయోగనాశనో గుణో విభాగః)

(10,11) (పరాపర వ్యవహారా సాధారణ కారణే పరత్వాపరత్వే)

పృథక్త్వాది లోకవ్యవహారములకు హేతువు లగుటయే ఆయా గుణలక్షణములని యెఱుంగునది.

(12) (సర్వ వ్యవహార హేతుః జ్ఞానమ్ బుద్ధిః) అన్ని లోక వ్యవహారములకు హేతువగు జ్ఞానమే బుద్ధి యనబడును. జ్ఞానము, ఉపలబ్ధి, ప్రత్యయము, బుద్ధి, యను పదము

లన్నియు నొకే యర్థము నొసంగును. ఆ బుద్ధి అనుభూతి-స్మృతి యని రెండు విధములు. అందనుభూతి మరల రెండు విధములు. విద్య, అవిద్య. యథార్థము విద్య. అయథార్థము అవిద్య. యనబడును.

(తద్వతి తత్ప్రకారికాఽనుభూతిర్విద్యా) ఘటమున ఘటత్వముండును. ఘటము విశేష్యము. ఘటత్వము విశేషణము లేక ప్రకారమనబడును. తద్వతి (ఘటత్వవతి) = ఘటత్వము గలిగిన ఘటమునందు. తత్ప్రకారికానుభూతిః = ఘటత్వప్రకారిక అనగా ఘటత్వము విశేషణముగా భాసించు (అనుభూతి) ఇది ఘటమను జ్ఞానము-విద్య యనబడును. దీనినే ప్రమయనియు వాడుదురు. ఈ విద్యయే మూడు విధములు. ప్రత్యక్షము - అనుమానికము (లైంగికము), శాబ్దికము నని. చక్షురాది ఇంద్రియములు ప్రత్యక్ష ప్రమాణములు. వాని వలన కలుగు జ్ఞానము ప్రత్యక్షమనబడును. లింగదర్శనము అనుమాన ప్రమాణము. అందువలన కలుగు జ్ఞానము లైంగికము లేక యానుమానిక మనబడును. ఇది యనుమితి యనియు చెప్పబడును.

అప్తుని (అప్తస్తు యథార్థవక్తా) యుపదేశము శబ్దప్రమాణమనబడును. దానివలన కలుగు జ్ఞానము శాబ్దిక మనబడును.

పైన జెప్పినదానికి విపరీతముగా నుండునది యవిద్య యనబడును. దానికి లక్షణము : (తదభావవతి (రజతత్వాభావవతి=రజతత్వములేని) తత్ప్రకారికాఽనుభూతి రవిద్యా-యథా శుక్తౌ రజతజ్ఞానం) శుక్తియందు కలుగు రజతజ్ఞానము అవిద్య యనబడును. శుక్తియందు రజతత్వము లేదు. శుక్తి

యందు శుక్తిత్వ ముండును. కాని రజతత్వ ముండదు. కావున రజతత్వాభావము గల శుక్తియందు తత్ప్రకారికా అను భూతిః-రజతత్వముతో కూడిన - ఇది రజతమను - జ్ఞానము అవిద్య యనబడును. ఇది భ్రమ-మిథ్యాజ్ఞాన-మనబడును.

ఈ యవిద్య సంశయము, విపర్యయము నని రెండు విధములు.

(ఏకస్మిన్ ధర్మిణి విరుద్ధ నానాధర్మ ప్రకారకం జ్ఞానం సంశయః) ఏకస్మిన్ ధర్మిణి-ఒక స్థాణువునందు, విరుద్ధ నానాధర్మ ప్రకారకం జ్ఞానమ్ = స్థాణుత్వము-పురుషత్వము నను విరుద్ధములైన ధర్మములు ప్రకారకముగా (విశేషణముగా) గల, ఒక స్థాణువును జూచి యిది స్థాణువా లేక పురుషుడాయని కలుగు జ్ఞానము సంశయ మనబడును.

(అతస్మిన్ తద్బుద్ధిః విపర్యయః) ఒక వస్తువును జూచి మఱియొక వస్తువుగా దాని నెఱుగుట విపర్యయ మనబడును. త్రాటిని చూచి పామనుకొనుట విపర్యయము - భ్రాంతి యనబడును.

(సంస్కారమాత్రజన్యా స్మృతిః) మనమొక వస్తువును ప్రథమమున తెలిసికొనినపుడు మనయంతఃకరణమున నొక సంస్కారము-చిహ్నము-ఏర్పడును. ఆ సంస్కార సాహాయ్యమున కలుగు జ్ఞానము స్మృతియనబడును. ఇంతవఱకు బుద్ధిని గుఱించి కొంత వివరణ మిట చేయబడినది.

(13) (ధర్మజన్య మనుకూల వేదనీయం గుణః సుఖమ్) ధర్మము (మంచికార్యము) వలన కలిగి తన యనుభవమున ననుకూలమగు గుణము సుఖ మనబడును.

(14) (అధర్మజన్యం ప్రతికూలవేదనీయం గుణః దుఃఖమ్) అధర్మమువలన కలిగి తనకు ప్రతికూలముగా దోచు గుణము దుఃఖమనబడును.

(15) స్వార్థంవా పరార్థంవా అప్రాప్తార్థ ప్రార్థన మిచ్ఛా) తన కొఱకుగాని పరుల కొఱకుగాని, లభింపని వస్తువు నర్థించుట (ఇచ్ఛ) కోరిక యనబడును.

(16) క్రోధము ద్వేష మనబడును.

(17) కృతి ప్రయత్న మనబడును.

ఇవిగాక సూత్రమున నుల్లేఖింపని గుణము లొకయేడు గలవు.

(1) (ఆద్యపతనాసమవాయికారణం గురుత్వమ్) భూమికి దూరమున పైభాగమున నున్న వస్తువు భూమిని చేరుటకు ముందు దానియం దనేక పతనక్రియలు కలుగును. అందు మొదటి పతనమున కసమవాయి కారణమైనది గురుత్వ మనబడును. ఈ గుణము భూమి - జలములందే యుండును. ఇట్లే-

(2) (ఆద్య స్యందనాసమవాయికారణం ద్రవత్వమ్) స్యందన మనగా ప్రవాహము. మొదటి స్యందనమున కసమవాయి కారణము ద్రవత్వ మనబడును.

ఈ ద్రవత్వము సాంసిద్ధికము, నైమిత్తికమునని రెండు విధములు. జలమునందు సాంసిద్ధికమును, పృథివీ తేజస్సులందు నైమిత్తికము నని వైశేషికుల మతము. నైమిత్తిక ద్రవత్వము భూమియందు మాత్రముండు నని నవీనసై

యాయికు లందురు. వీరు సువర్ణాది ధాతువులును పార్థివము లని యెంచెదరు.

(3) (సంగ్రహ మృదాది హేతుర్గుణః స్నేహః) మట్టి రేణువులను ఒకదానితో నొకటి చేర్చుటకు కారణమయిన గుణము స్నేహమనబడును.

(4) సంస్కారము ముప్విధములు. 1. వేగము, 2. భావన, (భావించుట) 3. స్థితిస్థాపకము. (రబ్బరును లాగివదలిన పూర్వస్థితిని బొందును. అట్టి గుణము)

(5) ధర్మము. (విహితకర్మ జన్యము, సత్యం వద)

(6) అధర్మము. (నిషిద్ధకర్మ జన్యము)

(7) శ్రోత్రమువలన గ్రహింపదగిన గుణము శబ్ద మనబడును.

ఇట్లు మొత్తము ఇరువదినాలుగు గుణములు, వాని సామాన్య లక్షణములు నిట ప్రాసంగికముగా జెప్పబడినవి.

అవ : గుణములను స్మరింపజేసి వానిని పరీక్షించు చున్నాడు.

సూ. :- పృథివ్యాది రూప రస గంధ స్పర్శాః
ద్రవ్యానిత్యత్వా దనిత్యాశ్చ ౭.౧.౨

సూత్రమునందలి చకారమువలన పరిమాణము, ఏకత్వము, ఏక పృథక్త్వము, సాంసిద్ధిక ద్రవత్వము, గురుత్వము, స్నేహము నను గుణములు గ్రహింపవలయును. పృథివ్యాది

రూపరస గంధస్పర్శాః=భూమి-జలము-తేజస్సు వీని రూపాది గుణములు, ద్రవ్యానిత్యత్వాత్ = ఆశ్రయమైన ద్రవ్య మనిత్య మగుటచే, అనిత్యాః = అనిత్యములు.

సూ. :- ఏతేన నిత్యేషు నిత్యత్వ ముక్తమ్ ౭.౧.3

ఏతేన = పైసూత్రార్థము ననుసరించి, నిత్యేషు = నిత్యపదార్థములందలి రూపాది గుణములకు, నిత్యత్వముక్తమ్ = నిత్యత్వము చెప్పబడినదని గ్రహింపనగును.

సూ. :- అప్సు తేజసి వాయౌ చ నిత్యాః ద్రవ్యనిత్యత్వాత్ ౭.౧.౪

అప్సు తేజసి వాయౌచ = జల, అగ్ని, వాయు పరమాణువులందలి గుణములు, ద్రవ్యనిత్యత్వాత్ = ఆశ్రయ భూత ద్రవ్యము నిత్యమగుటవలన, నిత్యాః = వినాశము లేనివని సూత్రార్థము.

సూ. :- అనిత్యే ష్వనిత్యాః ద్రవ్యానిత్యత్వాత్ ౭.౧.౫

ద్రవ్యానిత్యత్వాత్ = ఆశ్రయద్రవ్య మనిత్యమగుటవలన, అనిత్యేషు = అనిత్య పదార్థములందలి గుణములు, అనిత్యాః= వినాశము గలవి.

అవ : జలాదుల పరమాణువులవలె భూపరమాణువులును నిత్యములే కాబట్టి వానియందలి గుణములు నిత్యము లేలగావన ?

సూ. :- కారణ గుణపూర్వకాః పృథివ్యాం పాకజాః ౭.౧.౬

పృథివ్యాం = అవయవియైన భూమి యందు, పాకజాః = పాకమువలన గలిగిన రూపాది గుణములు, కారణ గుణ పూర్వకాః = అవయవికి కారణము అవయవములు - వాని గుణములు కారణముగాగలవని సూత్రార్థము.

రూపాది గుణముల పరివర్తనమునకు హేతువగు అగ్ని సంయోగ విశేషము పాకమనబడును. ( రూపాది పరావృత్తి హేతు తేజః సంయోగః పాకః)

ఒక మట్టిపాత్ర ఆవములో పెట్టి కాల్చిన తరువాత దాని యందున్న పూర్వపు రూప - రస - గంధ-స్పర్శ గుణములు మాఱిపోవును. ఈమార్పునకు కారణము అగ్ని సంయోగమే. ఈరూపాదుల పరివర్తనము పాత్ర వెలుపలి భాగముననేగాక పాత్రావయవములైన ప్రతియణువునందును జూడనగును. అవయవములైన యణువులందు రూపాదులు మాఱుటచేతనే అవయవియైన పాత్రయందు రూపాదులు మాఱినవని నిర్ణయింపబడుచున్నది. ఈమార్పు జరుగుటకు పరమాణువుల నుండి కపాలములవఱకు గల ప్రతి యవయవమునందును బలమగు తేజఃసంయోగము కలిగి యవయవ విభాగ మేర్పడును. అందువలన అవయవ సంయోగము నశించును. అటుపై పాత్ర నశించును. అప్పుడు పరమాణువు లన్నియు సంయోగ శూన్యములై స్వతంత్రము లగును. ఆ సమయమున వాని యందలి రూపాది గుణములు మాఱును. అటుపై జీవుల యదృష్టమున నాయణువులయందు క్రియ గలిగి పరస్పర సంయోగ మేర్పడి ద్వ్యణుక త్ర్యణుక చతురణు కాద్యవయవము లుత్పన్నమై యవయవి పూర్తియగును. ఇట్లు మృత్పా

దార్థములలోని గుణపరివర్తనము కారణ గుణపూర్వక మగు టచే పృథివీ పరమాణువుల నాశ్రయించి యుండు గుణములు నిత్యములు కానేరవని సూత్రాభిప్రాయము.

అవ : కారణ గుణములు కార్యమునందు లేవుకాబట్టి భూమిలోని పాకజగుణములు కారణ గుణపూర్వకములనుట చెల్ల దన :

సూ. :- ఏక ద్రవ్యత్వాత్ ౭.౧.౭

ఏకద్రవ్యత్వాత్ = ఘటపటాది రూపములైన కార్యము స్వసమ వాయి సంబంధముద్వారా ఆశ్రయముగాగలవగుటచే పార్థివ పాకజ గుణములు కారణగుణ పూర్వకములే యని సమాధానము.

వేఱు తావులలోనుండు కారణములు కార్య జనకములు గావు. కార్య మెక్కడ ఏర్పడునో కారణము నటనే యుండ వలయును. కారణమున నుండు గుణములు కార్యమున గుణముల నెట్లు గలిగించునని యాక్షేపాభిప్రాయము. స్వసమ వాయి సమవాయమను పరంపరా సంబంధము ద్వారా కార్య మున నుండి గుణములను కలిగింపగలవని సమాధానము.

స్వమ్ = కారణ గుణములు, స్వసమవాయి = ఘట పటాది కార్యము. అట సమవాయి సంబంధముతో కారణ గుణము లుండును.

సూ. :- అణోర్మహతశ్చోపలబ్ధ్యనుపలబ్ధీ నిత్యే వ్యాఖ్యాతే ౭.౧.౮

నిత్యే=(సదకారణవన్నిత్యమ్) అను చతుర్థాధ్యాయపు సూత్రమున, అణోః = అణుపరిమాణముగల, మహతశ్చ = మహత్పరిమాణముగల ద్రవ్యముల యొక్క, అనుపలబ్ధిః=కనబడకుండుట. ఉపలబ్ధిః = కనబడుటలు, వ్యాఖ్యాతే = చెప్పబడినవి.

ద్రవ్యము ప్రత్యక్షమగుటకు కారణభూతమైన పరిమాణమను గుణము ప్రత్యక్షము కాగలది యొకటి యున్నదని సూత్రతాత్పర్యము.

పరమాణుత్వము, పరమ హ్రస్వత్వము జీవాత్మయందును, పరమాణువులందును కలవు. పరమ మహత్త్వ పరమదీర్ఘత్వములు ఆకాశ కాల పరమాత్మలందుండును. ద్వ్యణుకము మొదలు మిగిలిన పదార్థములందు మధ్యమ పరిమాణ ముండునని యెఱుంగునది.

**అవ :** త్ర్యణుకాదులందు మహత్త్వము దేనివలన కలుగునన ?

**సూ. :- కారణ బహుత్వాచ్చ** ౭.౧.౯

**కారణ బహుత్వాచ్చ** = స్వాశ్రయ సమవాయి కారణగత బహుత్వసంఖ్య వలనను, స్వాశ్రయ సమవాయికారణగత మహత్త్వమువలనను త్ర్యణుకమునందు మహత్పరిమాణ మేర్పడును.

రెండు పరమాణువు లొక ద్వ్యణుకమగును. మూడు ద్వ్యణుకము లొక త్ర్యణుకమగును. ఈ త్ర్యణుకమునందు మహత్పరిమాణ మేర్పడును. అపుడది ప్రత్యక్షమగును. ఈ

త్ర్యణుకము లోని మహత్పరిమాణమునకు కారణము ద్వ్యణుకమునందలి పరిమాణము కాదు. అందలి సంఖ్యయు మహత్త్వము నని సూత్రతాత్పర్యము. ద్వ్యణుక పరిమాణము కారణమేల కాదనిన ? ద్వ్యణుక పరిమాణము వలన కలుగు పరిమాణము అంతకంటె నుత్కృష్టముగా నుండు నను నియమముండుటంబట్టి సంఖ్యామహత్త్వములే [illegible]ము లగును కాని పరిమాణము కానేరదు.

అవ : ద్వ్యణుకమునందుగల అణు పరిమాణమునకు కారణమేమన ?

**సూ. :- అతో విపరీత మణు** ౭.౧.౧౦

**అతః** = పరిమాణమున కాశ్రయమగు సమవాయి కారణము నందుగల బహుత్వసంఖ్యకంటె, విపరీతమ్=విపరీత కారణముగాగలది, అణు = ద్వ్యణుకమునందలి పరిమాణమని యర్థము.

రెండు పరమాణువులు కలిసి యొక ద్వ్యణుకమగును. ఆ ద్వ్యణుకము నందలి పరిమాణమునకు అసమవాయి కారణము పరమాణువులందలి పరిమాణముకాదు. ద్విత్వ సంఖ్యయే కారణమని సూత్రాభిప్రాయము.

**సూ. :- అణు మహదితి తస్మిన్ విశేషభావాత్ విశేషాభావాచ్చ** ౭.౧.౧౧

**తస్మిన్** =ఉసిరికాయ మున్నగు వానియందు, విశేషభావాత్= మహత్త్వమను విశేష ముండుటవలన, మహత్తను వ్యవహారము ముఖ్యము, విశేషాభావాత్ = అణుత్వమను విశేషము లేకుండుటవలన, అణువు అను వ్యవహారము గౌణము.

ద్వ్యణుకమునందే గాక యితర ఆమలకాది పదార్థము లందును ఆపేక్షికముగా అణువనియు మహత్తనియు లోక మున వ్యవహారము చూచుచున్నాముగదా! అందు మహత్త నుట ముఖ్యము, అణువనుటగౌణము నని యెఱుగవలయును.

అవ : ఆమలకాదు లందలి అణుత్వ వ్యవహారము గౌణమై మహత్త్వ వ్యవహారము ముఖ్య మగుటకు కారణ మేమన ?

సూ. :- ఏక కాలత్వాత్ ౭.౧.౧౨

ఏక కాలత్వాత్ = అణు మహద్వ్యవహారములు రెండు నొకే కాలమున నుండుటవలన.

ఒకే వస్తువునందలి పరస్పర విరుద్ధములైన అణుమహ ద్వ్యవహారములు రెండును ఒకే కాలమున ముఖ్యములు కాజాలవు. కాబట్టి అందొకటి ముఖ్యము, మఱి యొకటి గౌణమునగును. మహత్తు (పెద్దది) అను వ్యవహారము అను భవసిద్ధమగుటచే గౌణము కానేరదు. అణు వ్యవహారమే గౌణమగును.

అవ : హేత్వంతరమును జూపుచున్నాడు.

సూ. :- దృష్టాంతాచ్చ ౭.౧.౧౩

దృష్టాంతాచ్చ = పైవ్యవహారము దృష్టాంతము వలనను సిద్ధ మగుచున్నది.

ఒక పొడవైనకఱ్ఱ పొట్టిదాని కంటె దీర్ఘమనియు, ఎక్కువ పొడవు గలదాని కంటె నది హ్రస్వమనియు చెప్ప

బడును. ఇందు దీర్ఘవ్యవహారము ముఖ్యము. హ్రస్వ వ్యవహారము గౌణము. ఇట్లే యితరము లూహించునది.

అవ : త్ర్యణుకాది పదార్థములందు మహత్త్వముండి అణుత్వము లేకుండుటవలన మహద్వ్యవహారము ముఖ్యము. అణు వ్యవహారము గౌణము. ఐనను, ద్రవ్యములో నున్నట్లు అణుత్వ మహత్త్వములలో అణుత్వమహత్త్వము లుండునా యన ?

సూ. :- అణుత్వ మహత్త్వయో రణుత్వ మహత్త్వాభావః కర్మగుణై ర్వ్యాఖ్యాతః ౭.౧.౧౪

అణుత్వ మహత్త్వయోః = అణుత్వ మహత్త్వము లందు, అణుత్వ మహత్త్వాభావః = అణుత్వాభావము, మహత్త్వాభావమును, కర్మగుణైః = కర్మగుణములద్వారా, వ్యాఖ్యాతః = నిరూపింపబడినది.

కర్మమందు మఱియొక కర్మముగాని, గుణమునందు మఱియొక గుణముగాని యుండనేరదని పూర్వము నిరూపింపబడినది. అట్లే అణుత్వమునందు అణుత్వమును, మహత్త్వమునందు మహత్త్వమును ఉండదని సూత్రాభిప్రాయము.

అవ : కర్మమందు కర్మాభావముగాని, గుణమునందు గుణాభావము గాని పూర్వము వర్ణింపబడ నందున నిది యొప్పదనిన :

సూ. :- కర్మభిః కర్మాణి గుణైశ్చ గుణాః వ్యాఖ్యాతాః ౭.౧.౧౫

కర్మభిః = ఉత్క్షేపణాది క్రియలద్వారా, కర్మాణి = కర్మములు కర్మాభావవంతము లనియు. గుణైః = రూపాదిగుణములద్వారా, గుణాః = రూపాదిగుణములు గుణరహితము లనియు. వ్యాఖ్యాతాః =నిరూపింపబడినట్లే యెంచవలయును.

ద్రవ్యములందు గుణకర్మములుండునుగాని కర్మములందుగాని, గుణములందు గాని క్రియాగుణము లుండవు. ద్రవ్యము విశేష్యము, గుణ కర్మములు విశేషణములగును. గుణమే గుణమునకును, క్రియయే క్రియకును విశేష్యము కాజాలదు. తనకు తానే విశేష్య మెట్లగును ? (స్వవిశేషకత్వానుపపత్తేః) అట్లు గానిపక్షమున 'దేవదత్తుడు వెళ్ళుచున్నాడు, నల్లని వస్త్రము' అనునట్లు 'గమనము వెళ్ళుచున్నది, నల్ల రంగు నలుపు తెలుపు రంగులు కలది' అను ప్రయోగము లుండవలసి వచ్చును. అట్టిప్రయోగములు లోకమున నెన్నడు విని కని యుండము. కాబట్టి గుణకర్మములు గుణకర్మరహితములని యెఱుంగునది.

సూ. :- అణుత్వమహత్త్వాభ్యాం కర్మగుణాశ్చ ౭.౧.౧౯

అణుత్వ మహత్త్వాభ్యాం = అణుత్వ మహత్త్వములద్వారా, కర్మగుణాశ్చ = గుణకర్మములు కూడ అణుత్వ మహత్త్వరహితములు అని, వ్యాఖ్యాతాః = నిరూపింపబడిన ట్లెంచునది.

అణుత్వ మహత్త్వములు పరిణామ బోధకములు కాబట్టి పరిణామము గుణమగుటచే నవియు గుణములగును. అందువలన గుణకర్మములందు అణుత్వ మహత్త్వము లుండనేరవని సూత్రాభిప్రాయము.

సూ. :- ఏతేన దీర్ఘత్వ హ్రస్వత్వే వ్యాఖ్యాతే ౭.౧.౧౭

అణుత్వ మహత్త్వముల వలెనే దీర్ఘత్వ హ్రస్వత్వములును తెలియునది.

ఎక్కడ అణుత్వ మహత్త్వము లుండునో వానియందే హ్రస్వత్వ దీర్ఘత్వములుండును. అవి లేనిచోట నివి యుండవని సూత్రాభిప్రాయము.

అవ : ఈ నాలుగు విధములైన పరిమాణము నిత్యమా అనిత్యమా ? అన,

సూ. :- అనిత్యేఽనిత్యమ్ ౭.౧.౧౮

సూ :- నిత్యే నిత్యమ్ ౭.౧.౧౯

అనిత్య పదార్థములందు పరిమాణము అనిత్యమని, నిత్యపదార్థములందుండునది నిత్యమనియు సూత్రాభిప్రాయము. కారణమేమన : ఆశ్రయనాశనము వలన ఆశ్రితము నశించుననుట నిర్వివాదముకదా !

అవ : నిత్య పరిమాణ మెద్దియన ?

సూ. :- నిత్యం పరిమండలమ్ ౭.౧.౨౦

పరమాణు పరిమాణమునకు పరిమండలమని పారిభాషిక నామము. కాబట్టి పరమాణువు నందలి పరిమాణము, నిత్యం = నిత్యము. అనగా నాశరహితమైనదని సూత్రార్థము.

అవ : పరిమండల మున్నదనుటకు ప్రమాణ మేమన ?

సూ. :- అవిద్యా చ విద్యాలింగమ్ ౭.౧.౨౧

అవిద్యా = అయథార్థజ్ఞానము, విద్యాలింగమ్ = యథార్థ జ్ఞానమునకు హేతువు.

బిల్వామలకాదు లందు గౌణమైన (అయథార్థమైన) అణుత్వ (వ్యవహారము) జ్ఞానము కలుగుచున్నదని పూర్వము వర్ణించి యున్నాము. యథార్థమైన యణుత్వమునకు ఒక యాధారముండి తీఱవలయును. యథార్థజ్ఞానము లేని అయథార్థజ్ఞానము లోకమున కలుగనేరదు. కాబట్టి యథార్థమైన అణుత్వజ్ఞానమునకు విషయమైన అణుపరిమాణము (పరమండలము) కొండొకతావున నుండి యుండవలయును. దీనికి లోకమున గల యవిద్యయే ప్రమాణమని భావము.

అవ : అణు పరిమాణము నిరూపించి యాకాశ పరమాత్మల యందలి మహత్పరిమాణమును జెప్పుచున్నాడు.

సూ. :- విభవాన్మహా నాకాశ స్తథా చాత్మా ౭.౧.౨౨

విభవాత్ = విభు భావము వలన, ఆకాశః = ఆకాశము, మహాన్ = మహత్పరిమాణము గలది. తథా చాత్మా = పరమాత్మకూడ మహత్పరిమాణము గలదియే.

అందాకాశమున గల విభుత్వము [మహత్పరిమాణము) సాపేక్షికము. పరమాత్మయందలి విభుత్వము నిరపేక్షమని యెఱుంగునది. [సర్వమూర్త ద్రవ్యసంయోగిత్వం విభుత్వం] అథవా [ సర్వవస్తు బహిరంతర్వర్తమానత్వం విభుత్వం] అన్ని వస్తువులందును లోపల వెలుపల నుండుట విభుత్వ మన బడును.

క్రియాగుణములు గల ద్రవ్యము మూర్తద్రవ్య మన బడును. మూర్తద్రవ్యము లన్నిటితో సంబంధించి యుండు టయు విభుత్వ మనబడును.

అవ : జీవాత్మ పరిమాణ మెట్టిదన ?

సూ. :- తదభావాత్ అణు మనః ౭.౧.౨౩

తదభావాత్ = విభుత్వాభావము వలన, మనః = మనస్సుతో కూడిన యాత్మ అనగా జీవాత్మ, అణు = అణుపరిమాణము కలది.

వైశేషికులు జీవాత్మను సచ్చిత్స్వరూపు డందురు. ఆ జీవాత్మ మిథ్యాజ్ఞాన పూర్వకమైన మనస్సుతో కూడి బద్ధుడగును. వివేక జ్ఞానము వలన మిథ్యాజ్ఞానము పోగొట్టుకొని బంధనమునుండి విడిపడి ముక్తుడగును. బంధమోక్షములు స్వరూపసిద్ధములు కావు.

అవ: దిక్కు, కాలము-వీనియందలి పరిమాణ మేమన?

సూ. :- గుణైర్దిగ్ వ్యాఖ్యాతా ౭.౧.౨౪

గుణైః = పరత్వాపరత్వ గుణములద్వారా, దిక్ = ప్రాక్పశ్చిమాది శబ్దములచే వ్యవహరింపబడిన దిక్కు, వ్యాఖ్యాతా = వ్యాఖ్యానము చేయబడినట్లెఱుంగునది.

పర అపర వ్యవహారము లోకమున నన్నియెడల చూడ నగును. ఈ వ్యవహారమునకు పరత్వము - అపరత్వము నను గుణములే అసాధారణ కారణములు. దిక్కు పిండము

[వస్తువు] వీని సంయోగము అసమవాయ కారణము. ఈ దిక్కు విభువుగా నెంచబడును. దీనికి కారణము పరాపర వ్యవహార మన్నియెడల నొకే విధముగ జూడబడుటయే.

సూ. :- కారణేన కాలః ౭.౧.౨౫

ఉత్పన్నమగు ప్రతి పదార్థమునకును కాలము నిమిత్త కారణము. కాబట్టి, కారణేన = నిమిత్త కారణ మగుటచే, కాలః = కాలము. మహత్పదార్థముగా నెంచనగునని సూత్రాభిప్రాయము.

కాలము విభుపదార్థము కానిపక్షమున ఉత్పన్నమగు ప్రతిపదార్థమునకును నిమిత్త కారణము కాజాలదని సూత్ర తాత్పర్యము.



# సప్తమాధ్యాయము

## ద్వితీయాహ్నికము



అవ : సంఖ్యాగుణమును పరీక్షింపగోరి సూత్రమును రచించుచున్నాడు.

సూ. :- రూపరసగంధ స్పర్శ వ్యతిరేకా దర్థాంతరమేకత్వమ్ ౭.౨.౧

ఏకత్వం = (ఏకో ఘటః ఏకో మఠః) ఒక కడవ, ఒక మఠము నను వ్యవహారమునకు కారణమైన ఏకత్వము, అర్థాంతరమ్= రూపాదులకంటె భిన్నము, రూపరస గంధ స్పర్శవ్యతిరేకాత్= రూపాదులులేని పదార్థములందును ఏకత్వ వ్యవహారము గోచరమగుటవలన.

రూపాది గుణరహితమైన ఆకాశమునందును (ఏక మాకాశమ్) ఒక యాకాశమను వ్యవహారము లోకసిద్ధ మగు టచే ఏకత్వ మొక గుణముగా నెంచ బడుచున్నదని తాత్పర్యము.

సూ. :- తథా పృథక్త్వమ్ ౭.౨.౨

అట్లే పృథక్త్వ మనున దొక గుణాంతరమని యెఱుంగునది.

సూ. :- ఏకత్వైకపృథక్త్వయోరేకత్వైకపృథక్త్వాభావోఽ
ణుత్వ మహత్త్వాభ్యాం వ్యాఖ్యాతః ౭.౨.౩

ఏకత్వ-ఏకపృథక్త్వములందు ఏకత్వముగాని ఏకపృథక్త్వము గాని ఉండనేరదని సూత్రాభిప్రాయము.

సూ. :- నిఃసంఖ్యత్వా త్కర్మగుణానాం
సర్వైకత్వం న విద్యతే ౭.౨.౪

కర్మగుణానాం = కర్మములు, గుణములు, నిఃసంఖ్యత్వాత్= సంఖ్యారహితములగుటంబట్టి సర్వైకత్వం = ద్రవ్యగుణకర్మ సామాన్యమగు నేకత్వము, న విద్యతే = ఉండదు.

గుణకర్మములు ద్రవ్యాశ్రితము లగుటచే సంఖ్యయు ద్రవ్యాశ్రితమే కాని గుణకర్మముల నుండనేరదు.

అప : 'ఏకం కర్మ—ఏకం రూపమ్' అను వ్యవహారము లోకమున జూడబడుటకు కారణమేమన ?

సూ. :- భ్రాంతం తత్                    ౭.౨.౫

తత్ = వ్యవహారమువలన నెటనేని గుణకర్మముల సంఖ్య చూడబడిన సది, భ్రాంతమ్=భ్రమమూలకమని యెఱుంగునది.

'ఏకంకర్మ' ఇత్యాదిస్థలములందు ప్రయోగింపబడు ఏకత్వ శబ్ద ప్రయోగము గౌణ ప్రయోగమని సూత్రాభిప్రాయము.

అప : అట్లయిన ద్రవ్యవిషయమున ప్రయోగింపబడు శబ్దము మాత్రమేల గౌణము కానేరదన ?

సూ. :- ఏకత్వాభావా ద్భక్తిస్తు న విద్యతే          ౭.౨.౬

ఏకత్వాభావాత్ = ద్రవ్యమునందు నేకత్వములేని పక్షమున, ఏకత్వమున కెక్కడను తావే లేకపోవుటవలన, భక్తిస్తు (భక్తి) = గౌణప్రయోగమునకు హేతువైన గౌణతయే న. విద్యతే = ఉండనేరదు.

ఏకత్వమునకు స్వరూపహానియే కలుగునని సూత్రాభిప్రాయము.

సూ. :- కార్యకారణయో రేక త్వైకపృథక్త్వాభావా
దేకత్వైక పృథక్త్వం న విద్యతే          ౭.౨.౭

కార్యకారణయోః = కార్యకారణములందు, ఏకత్వైక పృథక్త్వాభావాత్ = అభేదము-అవిలక్షణత అను నీరెండును లేక

పోవుటవలన, ఏకత్వైక పృథక్త్వం నవిద్యతే = కార్యకారణ ములు ఏకము గావని సూత్రార్థము.

కార్యమునందలి ఏకత్వాది గుణములు కారణగుణ పూర్వకములే గాని ఆకస్మికములు కావని సూత్రాభిప్రాయము.

సూ. :- ఏత దనిత్యయో ర్వ్యాఖ్యాతమ్ ౭.౨.౮

ఏతత్ = ఈ కారణ గుణపూర్వకత్వము, అనిత్యయోః = అని త్యములందలి ఏకత్వైక పృథక్త్వములను గూర్చియే, వ్యాఖ్యా తమ్ = వ్యాఖ్యానముచేయబడినదెంచునది.

అవ : సంయోగమును పరీక్షించుచున్నాడు.

సూ. :- అన్యతరకర్మజ ఉభయ కర్మజః సంయోగజశ్చ
సంయోగః ౭.౨.౯

అన్యతరకర్మజః = ఏ రెంటియొక్క సంయోగము కలుగునో వానిలో నొకదాని కర్మముచేత సంయోగమేర్పడును, ఉభయ కర్మజః = సంయోగమున కాశ్రయమైన రెండు ద్రవ్యముల కర్మము చేతను సంయోగ మేర్పడును. సంయోగజశ్చ సంయోగః = సంయోగజ సంయోగము నని సంయోగము త్రివిధములు.

1) క్రియా రహితమైన దానితో క్రియాయుక్తమునకు కలుగు సంయోగము — వృక్షమునకు పక్షితో నేర్పడు సంయోగము.

2] క్రియావంతములగు రెండు పదార్థములకు గల సంయోగము - ఇద్దఱు మల్లుల మధ్య కలుగు సంయోగము.

3] సంయోగజ సంయోగము - హస్తతరు సంయోగము వలన కలుగు శరీర తరుసంయోగము.

సూ. :- ఏతేన విభాగో వ్యాఖ్యాతః ౭.౨.౧౦

ఏతేన = సంయోగ వ్యాఖ్యానము ద్వారా, విభాగో వ్యాఖ్యాతః= దానికి విరుద్ధమైన విభాగము ముప్విధములు వ్యాఖ్యానము చేయబడినట్లెంచునది.

సూ. :- సంయోగ విభాగయోః సంయోగవిభాగాభావః
అణుత్వమహత్త్వాభ్యాం వ్యాఖ్యాతః ౭.౨.౧౧

అణుత్వ మహత్త్వములందు అణుత్వ మహత్త్వములు లేనట్లు సంయోగ విభాగములందు సంయోగ విభాగములు నుండవని సూత్రాభిప్రాయము.

సూ. :- కర్మభిః కర్మాణి, గుణైశ్చ గుణా, అణుత్వ
మహత్త్వాభ్యామితి ౭.౨.౧౨

[౭.౧.౧౪.౭.౧.౧౬.] సంఖ్యలుగల సూత్రములద్వారా పై విషయము విస్తారముగా వ్యాఖ్యానము చేయబడినదని యీ సూత్రాభిప్రాయము.

ఆవ : కార్యకారణముల సంయోగ విభాగము లేల పట్టింపబడవన ?

సూ. :- యుతసిద్ధ్యభావా త్కార్య కారణయోః
సంయోగ విభాగౌ న విద్యేతే ౭.౨.౧3

కార్యకారణయోః =కార్యకారణ భూతములగు ద్రవ్యములకు, సంయోగ విభాగౌ = సంయోగ విభాగములు, న విద్యేతే = ఉండవు. ఎందువల్ల నన, యుతసిద్ధ్యభావాత్ = కార్యకారణములు వేఱుగా నుండనేరవు కనుక.

యుతసిద్ధికల పదార్థములందే సంయోగ విభాగము లేర్పడగలవు. కార్యసిద్ధికి పూర్వము కారణము వేఱుగా సిద్ధింపగలిగినను కార్యోత్పత్తి యైన వెనుక కార్యము కంటె భిన్నముగా కారణస్థితి యుండనేరదు. కాబట్టి కార్యకారణములకు సంయోగ విభాగము లుండనేరవు.

అవ : శబ్దార్థములకు గల సంబంధము సాంకేతికమని నిర్ణయింపదలచి సంయోగాదులను నిషేధించు చున్నాడు.

సూ. :- గుణత్వాత్ ౭.౨.౧౪

శబ్దార్థములకు గల సంబంధము సంయోగము కాదు. కారణ మేమన, గుణత్వాత్ = శబ్దము గుణపదార్థమగుట వలన.

ఘటము, పటము ననుపదములు శబ్దములు. అందువలన గుణములలో చేరును. ఘటపటాద్యర్థమే ద్రవ్యము. ద్రవ్య గుణము లయుత సిద్ధము లగుటచే సంయోగ సంబంధము వాని కుండజాలదు.

అవ : మఱియు

సూ. :- గుణోఽపి విభావ్యతే ౭.౨.౧౫

శబ్దమువలన అర్థమేకాక, గుణోఽపి = గుణపదార్థముకూడ, విభావ్యతే = ప్రతిపాదింపబడును-బోధింపబడును.

అప్పుడు శబ్దార్థములు రెండును గుణములే యగును. గుణిగుణములకు సంయోగ సంబంధ మసంభవము.

సూ. :- నిష్క్రియత్వాత్ ౭.౨.౧౬

నిష్క్రియత్వాత్ = శబ్దము క్రియాశూన్యమగుటవలన, అర్థముతో సంయోగము కలుగనేరదు.

సంయోగము క్రియాజన్యమగుటచే క్రియారహితము లయిన శబ్దార్థములకు సంయోగమేర్పడ జాలదని తాత్పర్యము.

సూ. :- అసతి నాస్తీతి చ ప్రయోగాత్ ౭.౨.౧౭

అసతి = ఘటపటాద్యర్థములు లేనపుడు, నాస్తీతిప్రయోగాత్= ఘటాదులు లేవు - లేక పటాదు లుత్పన్నములు కాగలవని ప్రయోగములు కనబడు చున్నవి. ఈ ప్రయోగములను బట్టియు శబ్దార్థములకు సంయోగ సంబంధము లేదని తెలియుచున్నది.

ఏపదార్థము ప్రస్తుతమునలేదో ముందేది యుత్పన్నము కాగలదో యవి రెండును అసత్ శబ్దముచే వ్యవహరింప బడును. సదసత్తులకు సంబంధము కలుగనేరదు. సత్పదార్థములలోనే సంబంధమేర్పడును. కాబట్టి శబ్దార్థములకు సంయోగ సంబంధము కలుగనేరదని తాత్పర్యము.

అవ : సంయోగ సంబంధము కాకున్న, మఱియొక సంబంధ మెద్ది యన ?

సూ. :- శబ్దార్థా వసంబంధౌ ౭.౨.౧౮

శబ్దార్థౌ = శబ్దార్థములు, అసంబంధౌ=సంబంధరహితములని సూత్రార్థము.

అవ : సంయోగ సమవాయములలో నేదేని యొకటి యేల కాదు ?

సూ. :- సంయోగినో దండాత్ సమవాయినో విశేషాచ్చ ౭.౨.౧౯

దండాత్=దండ దర్శనమువలన' సంయోగినః = ఎట్లు దండిజ్ఞానము కలుగునో, విశేషాత్ చ = అవయవ విశేష దర్శనమువలన, సమవాయినః = ఎట్లు అవయవ సమవాయి యగు అవయవి జ్ఞానము కలుగునో, అట్లు శబ్దము వినుట వలన అర్థజ్ఞానము కలుగక పోవుటచేత శబ్దార్థములమధ్య సంయోగ సంబంధము కాని, సమవాయ సంబంధము కాని కలుగనేరదని సూత్రతాత్పర్యము.

శబ్దార్థములకు సంయోగ సంబంధ మున్న యెడల మోదకశబ్ద ముచ్చరించుటతోడనే ముఖమునందు మోదకము [లడ్డు] ఉండి తీఅవలయును. అట్లే ఖడ్గశబ్దము నుచ్చరింప గానే ముఖము ఛేదింపబడవలయును. అట్లెన్నడును జూడ మైతిమి. దీనిం బట్టి శబ్దార్థములలో సంయోగము లేదని తెలియుచున్నది.

అవ : అట్లయిన శబ్దమువలన నర్థజ్ఞాన మెట్లు కలుగు చున్నదన ?

సూ. :- సామయికః శబ్దా దర్థప్రత్యయః ౭.౨.౨౦.

శబ్దాత్ ఘటపటాది శబ్దమువలన, అర్థప్రత్యయః = ఘటపటాది పదార్థజ్ఞానము, (కడవ, వస్త్రము) సామయికః =[అస్మాచ్ఛబ్దా

దయ మర్థో బోద్ధవ్యః] ఈ శబ్దము వలన నీ యర్థము తెలిసికొనన వలయునను నీశ్వర నియోగాత్మక సంకేతమువలన కలుగు చున్నదని సూత్రార్థము.

ఈ సంకేతమే పదపదార్థములకు గల సంబంధమునకు హేతువు. ఇదియే వృత్తి యనబడును.

ఏశబ్దమున కేయర్థమున వృత్తికలదో యది యాప్తోప దేశాదులద్వారా తెలిసికొనిన యనంతరమే యాశబ్దము వలన నర్థజ్ఞానము కలుగును. కాబట్టి శబ్దార్థముల సంబంధము సామయికమని-సాంకేతికమని తెలియుచున్నది.

పైన జెప్పిన వృత్తిరెండువిధములు. శక్తివృత్తి, లక్షణా వృత్తి. (పదపదార్థయోః సాక్షాత్సంబంధః శక్తిః) పదపదార్థము లకుగల సాక్షాత్సంబంధము శక్తి (అభిధా) యనబడును. ఆ శక్తి వృత్తికాశ్రయ మగుటచే శబ్దము (పదము) శక్తమన బడును. దానివలన బోధపడు (వస్తువు) అర్థము శక్యమన బడును. ఘటపటాది శబ్దార్థము, విశేషణ రూపమున మొదట నుపస్థిత మగుటచే జాతియని మీమాంసకు లందురు. (ఘట మానయ) ఘటమును తీసికొనిరమ్ము. అనినపుడు (ఆనయ నమ్) తెచ్చుట మున్నగు క్రియలు వ్యక్తియందు సంభవమగు నుగాని జాతియందు కానేరవు. కాబట్టి జాతి విశిష్టమగు వ్యక్తియే శబ్దార్థమని వైశేషికులందురు.

(పదపదార్థయోః పరంపరా సంబంధో లక్షణా) పదపదా ర్థముల పరంపరా సంబంధము లక్షణావృత్తి యనబడును.

లక్షణావృత్తి కాశ్రయమగు పదము లాక్షణిక మనబడును. అర్థము లక్ష్య మనబడును.

ఆ లక్షణ రెండు విధములు. కేవల లక్షణ, లక్షిత లక్షణ. కేవలలక్షణ మరల రెండువిధములు. [illegible]లక్షణ, అజహల్లక్షణయని. 'గంగలో గొల్లపల్లె.' 'మంచె[illegible]ము చున్నవి' అనునవి ఉదాహరణములు.

లక్షిత లక్షణకు ఉదాహరణము :- ద్విరేఫము ధ్వని చేయుచున్నది. 'ద్విరేఫమునకు శక్యార్థము భ్రమరపదము. తద్వాచ్యము మధుపము. అది ధ్వని చేయుచున్నదని యర్థ మగును.

అవ : పరత్వాపరత్వములు.

సూ. :- ఏకదిక్కాభ్యా మేకకాలాభ్యాం సన్నికృష్ట
విప్రకృష్టాభ్యాం పర మపరం చ ౭.౨.౨౧

సంయుక్త సంయోగాల్పీయస్త్వము సన్నికర్ష మనబడును. సంయుక్త సంయోగ భూయస్త్వము విప్రకర్షమనబడును. ఇట్లే అల్పతర తపనపరిస్పందాంతరిత జన్మత్వము సన్నికర్షము, బహుతర తపన పరిస్పందాంతరిత జన్మత్వము విప్రకర్ష మన బడును. ఏకదిక్కాభ్యామ్ = ప్రాచ్యాది దిక్కులలో నొకటి యాశ్రయముగాగల, సన్నికృష్ట విప్రకృష్టాభ్యాం = సన్నికర్ష విప్రకర్షములు గల, మూర్తద్రవ్యములద్వారా, ఏకకాలాభ్యాం= వర్తమానకాల మాశ్రయముగాగల రెండవ విధమైన సన్నికర్ష విప్రకర్షములు గల జన్యద్రవ్యములద్వారా, పర మపరం చ = దైశిక, కాలిక పరత్వాపరత్వములు ఏర్పడును.

ఇది దీనికంటె పరము ఇది దీనికంటె అపరము నని వ్యవహరించుటలో నేది యసాధారణ కారణమో యదియే పరత్వము, అపరత్వము నని చెప్పబడును. ఈ పరత్వాపరత్వము దిక్కృతము, కాలకృతము నని రెండు విధములు. దిక్కును విశేషించి బోధించినది దిక్కృత మగును. వయోభేదమును బోధించినది కాలకృత మగును.

సూ. :- కారణ పరత్వాత్ కారణాపరత్వాచ్చ ౭.౨.౨౨

కారణగత పరత్వాపరత్వములవలన లోకమున పరాపరత్వ వ్యవహార ముపపన్న మగుచున్నదని యీ సూత్రతాత్పర్యము.

సూ. :- పరత్వాపరత్వయోః పరత్వాపరత్వాభావోఽణుత్వమహత్త్వాభ్యాం వ్యాఖ్యాతః ౭.౨.౨౩

పరత్వాపరత్వములందు మఱియొక పరత్వాపరత్వము (పరత్వత్వము, అపరత్వత్వము) లుండవని సూత్రతాత్పర్యము

సూ. :- కర్మభిః కర్మాణి గుణైశ్చ గుణాః ౭.౨.౨౪

(౭.౧.౧౫,౭.౧.౧౬.) సూత్రములద్వారా యీ విషయము వివరింపబడినదని యీ సూత్రాభిప్రాయము.

అవ : సమవాయ మన నేమి ?

సూ. :- ఇహేదమితి యతః కార్యకారణయోః సమవాయః ౭.౨.౨౫

అయుతసిద్ధములైన, కార్యకారణములు, అవయవావయవులు, గుణగుణులు, క్రియా క్రియావంతములు మున్నగు పదార్థముల విషయమున, ఇహ = తంత్వాదులందు, ఇదమ్ =

పటాదిజ్ఞానము, యతః = దేనివలన కలుగుచున్నదో, సః = అదియే, సమవాయః = సమవాయ మనబడును.

సమవాయము నొక విధమగు సంబంధము. తంత్వాది కారణములందు పటాది కార్యములు. ఆ యా ద్రవ్యములందు రూపాది గుణములు, ఘటత్వ పటత్వాది జాతులు నున్నట్లు జ్ఞానము కలుగుచున్నది. ఒక పదార్థమునందు మఱి యొక పదార్థమేదో యొకసంబంధముతోగాని యుండనేరదు. పైని వర్ణింపబడిన పదార్థములకు గల పరస్పరసంబంధమే సమవాయ మనబడును.

సూ. :- ద్రవ్యత్వ గుణత్వ ప్రతిషేధో భావేన వ్యాఖ్యాతః ౭.౨.౨౮

ద్రవ్యత్వ గుణత్వ ప్రతిషేధః = సమవాయమున ద్రవ్యత్వ గుణత్వముల యభావము, భావేన = సత్తాద్వారా, వ్యాఖ్యాతః = వర్ణింపబడినది

(సత్తా) పదార్థముల యునికి యెట్లు ద్రవ్యాదులకంటె భిన్నపదార్థమో యట్లే సమవాయముకూడ ద్రవ్యాదులకంటె భిన్నపదార్థమని సూత్రతాత్పర్యము.

సూ. :- తత్త్వం భావేన ౭.౨.౨౭

సమవాయము నిత్యము-ఏకము ననియు భావముద్వారా వర్ణింపబడినట్లెంచునది యని యీ సూత్ర తాత్పర్యము.

సమవాయము వైశేషికుల మతమున బుద్ధిద్వారాది యూహింపదగి యతీంద్రియముగా నెంచబడును. నైయాయికులు మాత్రము ప్రత్యక్షమందురు.



# అష్టమాధ్యాయము

## ప్రథమాహ్నికము

సూ. :- ద్రవ్యేషు జ్ఞానం వ్యాఖ్యాతమ్ ౮.౧.౧

ద్రవ్యేషు = పృథివ్యాది ద్రవ్యములందు, జ్ఞానం = ప్రత్యక్ష జ్ఞానము, వ్యాఖ్యాతమ్ = (మహత్యనేక ద్రవ్యవత్త్వా ద్రూపా చ్చోపలబ్ధిః) అనుసూత్రము ద్వారా వ్యాఖ్యానము చేయ బడినది.

ద్రవ్యగుణకర్మ సామాన్యములందు ప్రత్యక్ష జ్ఞానము కలుగును. విశేషసమవాయము లను పదార్థములు కాణాదమత మున నతీంద్రియములని యంగీకరించుటంజేసి యవి ప్రత్యక్ష విషయములు కానేరవు. ద్రవ్య గుణకర్మ సామాన్యములలో ద్రవ్యము ప్రత్యక్షము. గుణకర్మ సామాన్యములు ద్రవ్యాశ్రితము లగుటంబట్టి ద్రవ్యప్రత్యక్షాధీన ప్రత్యక్షములని యెఱుంగవల యును. అందువలననే 'ద్రవ్యగుణకర్మ సామాన్యేషు' అని సూత్రింపక, 'ద్రవ్యేషు' అని మహర్షి సూత్రించి యున్నాడు.

అవ : ద్రవ్యములలో నేవైన ప్రత్యక్షము కానివి గలవా యన ?

సూ. :- తత్రాత్మా మనశ్చాప్రత్యక్షే. ౮.౧.౨

తత్ర = పృథివ్యాది ద్రవ్యములలో, ఆత్మా మనశ్చ = ఆత్మ మనస్సులు, అప్రత్యక్షే చ = ప్రత్యక్షములు కావు.

సూత్రమునగల చకారమువలన, వాయువు, ఆకాశము, కాలము, దిక్కు, మూలప్రకృతియు గ్రహింపదగును. ఆత్మ శబ్దము పరమాత్మ జీవాత్మలను బోధించును. కాబట్టి వాయువు, ఆకాశము, కాలము, దిక్కులు, మూలప్రకృతి, జీవాత్మ, పరమాత్మ, మనస్సు నను ద్రవ్యములు ప్రత్యక్షములు- ఇంద్రియగమ్యములు- కావని సూత్రతాత్పర్యము.

అవ : ఈ ప్రత్యక్షజ్ఞాన మెట్లు కలుగునన ?

**సూ. :- జ్ఞాననిర్దేశే జ్ఞాననిష్పత్తి విధి రుక్తః** ౮.౧.3

జ్ఞాననిర్దేశే = జ్ఞాన మాత్మలింగమని నిర్దేశింపబడిన తృతీయాధ్యాయమున, జ్ఞాననిష్పత్తివిధిః=ప్రత్యక్షజ్ఞాన మేర్పడు విధి, ఉక్తః =చెప్పబడినది.

తృతీయాధ్యాయమున (ఆత్మేంద్రియార్థ సన్నికర్షాత్....) ఇత్యాది సూత్రములద్వారా ప్రత్యక్షజ్ఞానము కలుగు విధానము బోధింపబడినదని సూత్రతాత్పర్యము.

**సూ. :- గుణకర్మసు సన్నికృష్టేషు జ్ఞాననిష్పత్తేః ద్రవ్యం కారణమ్** ౮.౧.౪

సన్నికృష్టేషు = ఇంద్రియ సన్నికర్షమును పొందిన, గుణకర్మసు =గుణములందు, కర్మములందు, జ్ఞాననిష్పత్తేః=ఇది రూపము, ఇది కర్మమని యే జ్ఞానము కలుగుచున్నదో దానికి, కారణం=కారణము, ద్రవ్యమని యెఱుంగవలయును.

ఇంద్రియార్థ సన్నికర్షమువలన కలుగు జ్ఞానము ప్రత్యక్ష జ్ఞానమనబడును. ఇంద్రియముల కర్థములతో (పదార్థములతో) సంబంధము కలుగనిది జ్ఞానము కలుగనేరదు. ద్రవ్యములేక గుణకర్మములతో నింద్రియముల కెన్నడును సంబంధ (సన్నికర్ష) మేర్పడజాలదు. అనగా ద్రవ్యాశ్రితములగు గుణకర్మములతో నింద్రియములకు సాక్షాత్సంబంధము కలుగనేరదు. అందువలన గుణకర్మముల ప్రత్యక్షములో సంయుక్త సమవాయ సన్నికర్షము (సంబంధము) నంగీకరింపవలయును.

ఇంద్రియముతో ద్రవ్యము సంయుక్తమగును. గుణకర్మములు దానియందు సమవాయ సంబంధమున నుండును. ఇట్లే ద్రవ్యత్వాది జాతుల ప్రత్యక్షము నెఱుంగవలయును.

అవ : సత్తా మున్నగు సామాన్య విశేషముల జ్ఞానము సప్రకారకమా, నిష్ప్రకారకమా ?

సూ. :- సామాన్య విశేషేషు సామాన్య విశేషాభావాత్
తత ఏవ జ్ఞానమ్ ౮.౧.౫

ద్రవ్యగుణకర్మములలో సత్తా అను నొక వ్యాపక సామాన్యముండును. ద్రవ్యత్వ గుణత్వకర్మత్వము లను వ్యాప్యసామాన్యము లేక విశేషము లుండును. సామాన్యవిశేషేషు = సత్తా సామాన్యము, గుణత్వ కర్మత్వాది విశేషము వీనియందు, సామాన్య విశేషాభావాత్ = మఱియొక సామాన్యవిశేషముల

నంగీకరింపక పోవుటచే, జ్ఞానమ్ = విజ్ఞానము కలుగు చున్నదో యది, తతఏవ = సామాన్య విశేషముల వలననే, స్వరూపతఏవ-అనగా నిష్ప్రకారముగానే కలుగును. (సత్తా జ్ఞానమే కలుగును కాని సత్తాత్వవిశిష్ట సత్తా జ్ఞానము కలుగదు)

సూ. :- సామాన్యవిశేషాపేక్షం ద్రవ్యగుణకర్మసు ౮.౧.౬

ద్రవ్యగుణకర్మసు = ద్రవ్యగుణకర్మములలో, సామాన్య విశేషాపేక్షం = ద్రవ్యత్వ, గుణత్వ, కర్మత్వముల నపేక్షించి, జ్ఞానమ్ = ఇది ద్రవ్యము, ఇది గుణము, ఇది కర్మమని విశిష్టజ్ఞానము అనగా సప్రకారకజ్ఞానము కలుగును.

ప్రకారము, విశేషణము నను శబ్దములు పర్యాయ పదములు. 'ఇది ద్రవ్యము' అను జ్ఞానమున ద్రవ్యత్వము ప్రకారము. అనగా విశేషణముగా భాసించును. అట్లే గుణత్వ కర్మత్వములు గుణము కర్మము నను జ్ఞానములందు విశేష ణములుగా భాసించును. ఇది ద్రవ్యము అనగా, ద్రవ్యత్వ ప్రకారక ద్రవ్య విశేష్యక జ్ఞానమని యర్థము.

అవ : 'ఇది శుక్లవస్త్రము' అన్నచోట శుక్లత్వ ప్రకారక వస్త్రవిశేష్యక జ్ఞానము కలుగుచున్నది కదా యన ?

సూ. :- ద్రవ్యే ద్రవ్య గుణకర్మాపేక్షమ్ ౮.౧.౭

ద్రవ్యే = పృథివ్యాది ద్రవ్య విషయిక జ్ఞానమునందు, ద్రవ్య గుణకర్మాపేక్షమ్ = ద్రవ్యాపేక్షముగను, గుణాపేక్షముగను, కర్మాపేక్షముగను కలుగవచ్చును.

అవ : గుణకర్మములలో నట్లు కలుగదా యన ?

సూ. :- గుణ కర్మసు గుణకర్మాభావాత్
గుణకర్మాపేక్షం న విద్యతే ౮.౧.౮

గుణకర్మసు = గుణములలోను, కర్మములలోను, గుణకర్మాభావాత్ = గుణాభావమువలన కర్మాభావము వలన, గుణకర్మాపేక్షం న విద్యతే = గుణ ప్రకారక జ్ఞానముగాని, కర్మ ప్రకారక జ్ఞానముగాని కలుగనేరదు.

అవ : విశేషణ జ్ఞానము కారణముగాగల విశేష్య జ్ఞానము నుదాహరించుచున్నాడు.

సూ. :- సమవాయినః శ్వైత్యాచ్ఛ్వైత్యబుద్ధేశ్చ శ్వేతే
బుద్ధిః తే ఏతే కార్యకారణభూతే ౮.౧.౯

సమవాయినః శ్వైత్యాత్ = శ్వేతగుణములుగల ద్రవ్యము యొక్క శ్వేతగుణము వలనను, శ్వైత్యబుద్ధేశ్చ = దానివలన కలిగిన 'ఇది శ్వేతము' అను జ్ఞానము వలనను, శ్వేతే= శ్వేత గుణముగల శంఖాది ద్రవ్యమునందు, బుద్ధిః='ఇది శ్వేతము' అను విశిష్టజ్ఞానము కలుగును. అందు, తే = పూర్వము చెప్ప బడిన, ఏతే = శ్వైత్యబుద్ధి, శ్వేతబుద్ధియు రెండును, కార్య కారణ భూతే=మొదటిది విశేషణబుద్ధి కారణము, రెండవది విశిష్టబుద్ధి కార్యమునని తెలియవలయును.

శ్వైత్యము శ్వేతద్రవ్యమున విశేషణము - ప్రకారమని తాత్పర్యము. శ్వైత్య ప్రకారక శ్వేత విశేష్యక జ్ఞానము 'ఇది శ్వేతము' అను జ్ఞానమని యెఱుంగునది.

అవ : శ్వైత్యశ్వైత బుద్ధులు క్రమముగా గలిగి యొక దానికొకటి కార్యకారణ భావమును బొందిన, క్రమముగా కలుగు ఘటపట జ్ఞానములును పరస్పరము కార్య కారణములగునా యన్న, కాదని నిరాకరించుచున్నాడు.

సూ. :- ద్రవ్యే ష్వనిత రేతర కారణాః ౮.౧.౧౦

ద్రవ్యేషు = ఘటపటాది ద్రవ్యములలో, బుద్ధయః = ఇది ఘటము, ఇది పటము నను బుద్ధులు-జ్ఞానములు, అనితరేతరకారణాః = పరస్పరము కార్యకారణములు కాజాలవు.

ఒక ద్రవ్యము మఱియొక ద్రవ్యమునకు విశేషణమైనపుడే అది దానికి విశేషణముగా భాసించునుగాని ఇట్టిచోట్ల కాదు. ఇచ్చట ఘటపటములకెట్టి విశేషణ విశేష్య భావములు లేవు.

అవ : ఇది ఘటము, ఇది పటము నను బుద్ధులు ఒకదానికొకటి కార్యకారణములు కాకున్న నివి క్రమముగా నేల కలుగవలయునన్న ?

సూ. :- కారణాయౌగపద్యా త్కారణక్రమాచ్చ, ఘట
పటాది బుద్ధీనాం క్రమో న హేతుఫలభావాత్
౮.౧.౧౧

కారణాయౌగపద్యాత్ = జ్ఞానకారణములై ఇంద్రియార్థ సన్నికర్షాది కారణములు ఒకే పర్యాయము కలుగక పోవుటవలనను, కారణక్రమాత్ = అవి క్రమముగా కలుగుటవలనను, ఘటపటాది బుద్ధీనామ్= ఇది ఘటము, ఇది పటమునను బుద్ధుల,

క్రమః = పూర్వాపరభావము, నహేతు ఫలభావాత్ = కార్య కారణభావము వలన కాదు.

ఘటపటాది జ్ఞానములు క్రమముగా కలుగుటకు కారణము కార్యకారణ భావము కాదు. జ్ఞానకారణములైన సన్నికర్షాదు లొకదాని తరువాత నొకటి క్రమముగా నేర్పడుటయే ఇందులకు ముఖ్యకారణమని సూత్రతాత్పర్యము.



# అష్టమాధ్యాయము

## ద్వితీయాహ్నికము



అవ : బుద్ధ్యపేక్షమగు జ్ఞానము నిపు డుదాహరించుచున్నాడు.

సూ. :- అయ మేష త్వయాకృతం భోజ యైన మితి
బు ద్ధ్యపేక్షమ్ ౮.౨.౧

అయమ్ = ఇతడార్యముని. ఏషః =ఇతడు గురుకులాధిపతి, త్వయాకృతం = ఆర్యకుల దీపకా ! దేశాత్మోద్ధారార్థము నీచే స్వాత్మార్పణమను శుభకర్మము చేయబడినది. భోజయైనం= చాలకాలమునకు వచ్చిన యీ వైదిక ధర్మోపదేష్టయు నతిథి దేవుడు నగు దేవదత్తశర్మను భుజింపజేయుము. ఇతి=ఇత్యాది జ్ఞానము, బుద్ధ్యపేక్షం=ప్రత్యక్షజ్ఞానప్రకారకమని సూత్రార్థము

అవ : ఎందువల్ల నన ?

సూ. :- దృష్టేషు భావా దదృష్టే ష్వభావాత్ ౮.౧.౨

దృష్టేషు = జ్ఞాత (పూర్వము తెలిసిన) విషయములందు, భావాత్ = ఇట్లు కలుగుట వలనను, అదృష్టేషు = అజ్ఞాత విషయములందు, అభావాత్ = కలుగకుండుట వలనను.

సంస్కృతమున ఇదమ్, ఏతద్‌శబ్దములకు ప్రత్యక్ష విషయములందే శక్తి యంగీకరింపబడినది. అందువలన, అయమ్ = ఇతడు, ఏషః = వీడు అను నీశబ్దముల వలన కలుగు జ్ఞానము ప్రత్యక్షముగా తెలియబడిన విషయములందే కలుగును. అజ్ఞాత విషయములను గూర్చి యిట్లు ప్రయోగింపబడదు. కాబట్టి ప్రత్యక్షజ్ఞాన ప్రకారక జ్ఞానమని యెఱుంగునది.

అవ : (ఆత్మేంద్రియార్థ సన్నికర్షాత్....) అను తృతీయాధ్యాయపు సూత్రమునగల అర్థశబ్దముచే నీ శాస్త్రకారులు దేనిని గ్రహింతు రన ?

సూ. :- అర్థ ఇతి ద్రవ్యగుణకర్మసు ౮.౧.3

అర్థః = అర్థము అను నీశబ్దము వైశేషికులకు, ద్రవ్యగుణకర్మసు = ద్రవ్యము, గుణము, కర్మము అను నీమూటికిని గ్రాహ్యము.

ఈ శాస్త్రకారుల దృష్టియందు ద్రవ్య గుణ కర్మములు అర్థము లనియు, సామాన్యవిశేష సమవాయములు ఉపపదార్థములనియు నెంచబడునని సూత్రతాత్పర్యము.

అవ : ఘ్రాణాదీంద్రియములు అర్థ సన్నికర్షము కలవై, అర్థముతో సంబద్ధములై జ్ఞానము కలుగజేయుచున్నవికదా! వాని ప్రకృతియేమి ?

సూ. :- ద్రవ్యేషు పంచాత్మకత్వమ్ ౮.౨.౪

ద్రవ్యేషు = శరీరాది కార్యద్రవ్యములందు, పంచాత్మకత్వమ్= పంచభూతాత్మకత్వము కలదని తెలియవలయును.

ఒక్కొక్క భూతముచే నేర్పడు కార్యద్రవ్యములందితర భూతము లుపాదానకారణములు కాకున్నను నిమిత్తకారణముగా నితరభూతముల యణు సంయోగము వారింపబడదు. అందువలన సూక్ష్మభూతములచే నేర్పడు ప్రతి కార్యద్రవ్యమును పంచభూతాత్మకమే యని భావము. ఏ భూతమువలన నేకార్యమేర్పడునో అందాభూతమధికముగానుండును. ఇతర భూతములు నిమిత్త మాత్రముగా నుండుటంబట్టి యత్యల్పములుగా నుండునని వివేకము.

అవ : అయిన నింద్రియ విషయమేమన ?

సూ. :- భూయస్త్వాత్ గంధవత్వాచ్చ పృథివీ
గంధజ్ఞానే ప్రకృతిః ౮.౨.౫

భూయస్త్వాత్ = జలాదులకంటె పార్థివభాగ మధికముగా నుండుటవలన, గంధవత్వాచ్చ = గంధగుణమున కాశ్రయమగుట వలనను, పృథివీ = భూమి, గంధజ్ఞానే=గంధజ్ఞానము నియతముగా కలుగుటంబట్టి గంధగ్రాహకమగు ఘ్రాణేంద్రి

యమునకు, ప్రకృతిః = ఉపాదాన కారణము - సమవాయి కారణమని యర్థము.

ఏ యింద్రియము మే విశేషగుణమును నియమముగా గ్రహింపచేయునో ఆ యింద్రియము, ఆ గుణమునకు సమవాయసంబంధముతో నాశ్రయమగు ద్రవ్యము ప్రకృతిగా కలదని యెఱుంగవలయును. కారణ మేమన, ఇంద్రియములు తమకు ప్రకృతి భూతమగు ద్రవ్యముయొక్క గుణమునే గ్రహించు నియమము గలవి.

ఘ్రాణేంద్రియము పృథివియందలి విశేషగుణమగు గంధమును గ్రహించును. అందువలన నది పృథివీ ప్రకృతికము. పృథివి గంధోపలబ్ధికి ఎట్లు నియమముగా హేతువో ఘ్రాణేంద్రియమును గంధజ్ఞానమున కట్లు నియమముగా హేతువే. కాబట్టి పృథివి గంధజ్ఞానమున ప్రకృతి యనుట నిస్సంశయము.

ద్రవ్యము లన్నియు పంచాత్మకము లయినపుడు పృథివి మాత్రమే గంధజ్ఞానమున కెట్లు ప్రకృతి కాకలిగిన దను సంచేహమును దూరమొనర్చుటకే సూత్రమున 'భూయస్త్వాత్' అను పదమును ప్రయోగించినాడు సూత్రకారుడు.

సూ. :- తథాఽప స్తేజో వాయుశ్చ రసరూప
స్పర్శజ్ఞానే అవిశేషాత్ ౮.౨.౬

తథా = పృథివి గంధ జ్ఞానమునకు ప్రకృతియైనట్లు, ఆపస్తేజో వాయుశ్చ = జలము, అగ్ని, వాయువును క్రమముగా, రస

రూప స్పర్శజ్ఞానే = రస-రూప-స్పర్శజ్ఞానములందు ప్రకృతు లని తెలియవలయును. అవిశేషాత్ = ఆయా భూతములం దధికముగా నుండుటలో సమానమగుటవలన.

జిహ్వ, చక్షువులు, త్వక్కు నను ఇంద్రియములకు క్రమముగా జలము, అగ్ని, వాయువు ప్రకృతి ద్రవ్యములని సూత్ర తాత్పర్యము.

శ్రోత్రేంద్రియము ఆకాశమేగాని ధానివలన నేర్పడిన కార్యద్రవ్యము కాదు. కర్ణ శష్కులీ ప్రదేశావచ్ఛిన్నాకాశమే శ్రోత్రము. అందువలన నది ప్రత్యేకముగా సూత్రములందు చెప్పబడలేదు. (శష్కులి = జిలేబివలె మెలికదిరిగియుండు చెవి)

# నవమాధ్యాయము

## ప్రథమాహ్నికము

అవ : పృథివ్యాది కార్యద్రవ్యము లుత్పత్తికి పూర్వ ముండునా ? ఉండవా ?

సూ. - క్రియాగుణవ్యపదేశాభావాత్ ప్రాగసత్ ౯.౧.౧

ప్రాక్ = ఉత్పత్తికిపూర్వము, అసత్ = పృథివ్యాది కార్య ద్రవ్యము ఉండదు. కారణమేమన, క్రియాగుణవ్యపదేశా

భావాత్ = క్రియచేతగాని, గుణముచేతగాని వ్యవహరింపబడక పోవుటవలన.

కార్యోత్పత్తియైన తరువాతనే క్రియాగుణములచే నది వ్యవహరింపబడును. ఘటము ఉన్నది. నడచుచున్నది. నల్లనిది, ఎఱ్ఱనిది అని వ్యవహారము, ఉత్పత్తికి పూర్వము ఘటాది పదార్థమున్నచో నిట్టివ్యవహారముండి యుండవల యునుగదా ! లేదు గనుక కార్యద్రవ్య ముత్పత్తికి పూర్వము అసత్-లేదని-భావము.

ఈ సూత్రము ననుసరించియే వైశేషికులు <u>అసత్కార్య</u> వాదులుగా పిలువబడుదురని కొందఱిమతము.

అవ : ఉత్పత్తికి పూర్వము కార్యము లేకున్న కారణ వ్యాపారమువలన నెట్లు కలుగుచున్నదన ?

సూ. :- స ద స త్ ౯.౧.౨

పూర్వము కారణరూపమున నుండియు కార్యరూపమున కార్యముండ నేరదని సూత్రార్థము.

ఉత్పత్తికి పూర్వ మేరూపముననుఉండకున్న నది కారణ వ్యాపారము వలనను ఉత్పన్నము కాజాలదు. ఇసుక నుండి తైలమెంత యత్నించినను కలుగనేరదుకదా ! కారణ రూపమున నుండు కార్యము లన్నియు కారణ వ్యాపారమున నిజరూపమును బొందగలవు.

అవ : కార్య ముత్పత్తికి పూర్వమేయున్న కారణ వ్యాపారమేమి చేయును ?

సూ. :- అసతః క్రియాగుణవ్యపదేశాభావా దర్థాంతరమ్

౯.౧.౩

క్రియాగుణ వ్యపదేశాభావాత్ = ఉత్పత్తికి పూర్వము క్రియా గుణములచే వ్యపదేశము లేకుండుట వలన, అసతః = కార్య రూపమున నసత్తైన-లేనట్టి-దానికంటె, అర్థాంతరం=విలక్షణ మైన, సత్ = కార్యరూపమున నకార్యము కారణ వ్యాపార ముచే చేయబడుచున్నది.

కారణ వ్యాపారము అపూర్వము - క్రొత్తవస్తువు-ను కలిగింపజాలదు. దానికట్టి సామర్థ్యములేదు. అట్లు కానిపక్ష మున ఆకాశకుసుమమును గూడ నుత్పన్నము చేయవలసి యుండును. కాబట్టి యొకానొక రూపమున నున్నదానిని అనగా కారణరూపముననున్న కార్యమును కార్యరూపమునకు తెచ్చుటయే కారణ వ్యాపార సామర్థ్యమని సూత్ర తాత్పర్యము.

అవ : కారణ వ్యాపారమువలన కార్యరూపము నొందిన ద్రవ్య మెల్లపుడు నట్లే యుండునా ?

సూ. :- స చ్చాసత్

౯.౧.౪

సచ్చ=సత్‌చ=కార్యరూపము నొందియు, అసత్=కార్యము మరల, అసత్-నష్టమగును.

జన్యములన్నియు ననిత్యము లనుట యవ్యభిచరిత న్యాయము. (అనగా తప్పక నశించునని భావము) కార్య రూపమునకు వచ్చిన ద్రవ్యము జన్యమే. కారణ వ్యాపారమే దానిని సాధించును. కాబట్టి యది నశించుట ధ్రువము.

అవ : అసత్తునకు భావముగాని, సత్తునకు అభావము గాని కలుగదని నియమముగదా! అట్టిచో కారణ వ్యాపారము వలన అసత్తు సత్తగు ననియు, సత్తు అసత్తగుననియు చెప్పుట ఎట్లు పొసగును ?

సూ. :- యచ్చాన్య దస దత స్తదసత్ ౯.౧.౫

యదతః = పూర్వము చెప్పబడిన అసద్రూప కార్యముకంటె, అన్యత్ = భిన్నము-విలక్షణమగు, అసత్=గగనారవిందము, శశశృంగము మున్నగు నసత్పదార్థములు ఏవి గలవో, తచ్చ= ఆయసత్తులే కారణ వ్యాపారము వలన సత్తు కానేరవు.

ఆకాశ కుసుమాదులు వేలకొలది కారణ వ్యాపారముల వలనను సద్రూపమును బొందజాలవు. అట్టి యెడ నే సత్తునకు అభావముగాని, అసత్తునకు భావముకాని కాదను నియమము వర్తించును. కారణాది రూపమున నుండి (సత్తయి) కార్య రూపమున నుండని కార్యద్రవ్యములయెడ కారణ వ్యాపారము శక్తి మంతమగుటలో నెట్టియనుపపత్తియును లేదు.

అవ : కార్యము నశించినపు డే యాకారమున నది ప్రత్యక్షమగును ?

సూ. :- అసదితి భూతప్రత్యక్షాభావాత్ భూత స్మృతేః విరోధి ప్రత్యక్షవత్ ౯.౧.౬

భూత ప్రత్యక్షాభావాత్ = కార్యరూపమున నున్న కార్యము కనబడక పోవుటవలనను, భూతస్మృతేశ్చ = కార్య విషయిక జ్ఞానముండుట వలనను, అసదితి = ఇప్పు డా కార్యమసత్తు-

లేదని-ప్రత్యక్షజ్ఞానము కలుగును, విరోధిప్రత్యక్షవత్ = అస త్తుకు విరోధియగు సద్రూప కార్యజ్ఞానము కలిగినట్లు.

భూతము, అస్తి-ఉన్నది-అను రెండు పదములు పర్యాయములు. అభూతము, నాస్తి-లేదు-అను రెండును పర్యాయ పదములు.

కార్యద్రవ్య మున్నప్పుడెట్లు ప్రత్యక్షజ్ఞానముకలుగునో నశించినపు డా కార్యద్రవ్య మసత్తు-లేదు-అని ప్రత్యక్ష జ్ఞానమే కలుగునని సూత్రతాత్పర్యము.

**సూ. :- తథాఽభావే భావప్రత్యక్షత్వాచ్చ** ౯.౧.౭

**తథా** = కార్యద్రవ్యము కనబడక దాని జ్ఞానముండుటంబట్టి యది నశించినపుడును 'కార్యమసత్' కార్యద్రవ్యములేదని ప్రత్యక్షజ్ఞానము కలిగినట్లు, భావప్రత్యక్షత్వాచ్చ=కార్యద్రవ్య మున కాశ్రయములగు మట్టి మొదలగు కారణ ద్రవ్యముల ప్రత్యక్షమువలన, అభావే = కార్యోత్పత్తికి పూర్వమందును అది యసత్తని తెలియనగును.

కారణ ద్రవ్య ప్రత్యక్షత వలన కార్యోత్పత్తికి పూర్వమా కార్య మసత్తనియు ప్రత్యక్షమగును.

**సూ. :- ఏతేనాఘటోఽగౌరధర్మశ్చ వ్యాఖ్యాతః** ౯.౧.౮

పై సూత్రములంబట్టి పటమునందు అఘటజ్ఞానమును, అశ్వమునందు గోవు కాదను జ్ఞానమును, వేదవిహితముకాని కర్మమందు అధర్మమను జ్ఞానమును కలుగుచున్నట్లు తెలిసి కొనవలయునని యీ సూత్రాభిప్రాయము.

సూ. :- అభూతం నాస్తీ త్యనర్థాన్తరమ్ ౯.౧.౯

అభూతం=లేనిది, నాస్తి = లేనిది, ఇ ట్లీ రెండుపదము లొక యర్థమునే బోధించును.

అవ : ఇంట ఘటము లేదు. ఇట వస్త్రములేదు. అను నిట్టి ప్రత్యక్షమునకు విషయమెద్ది యన ?

సూ. :- నాస్తి ఘటో గేహ ఇతి సతో ఘటస్య
గేహసంసర్గ ప్రతిషేధః ౯.౧.౧౦

నాస్తిఘటో గేహే = ఇంట కడవలేదు, నాస్త్యత్రపటః = ఇట వస్త్రములేదను నిట్టి ప్రత్యక్షముచేత, సతః = స్వరూపముతో నున్న, ఘటస్య = ఘటమునకు, గేహసంసర్గప్రతిషేధః = ఇంటిలోని స్థలముతో సంబంధములేదు? అనునది విషయము.

ఇంట కడవలేదు, వస్త్రములేదు. అనగా కడవగాని వస్త్రముగాని స్వరూపముతో నితర స్థలమున నున్నదనియు తన యింటితో దానికి సంబంధము లేదనియు నెఱుంగ వలయును.

అవ : ఇట్లు లౌకిక ప్రత్యక్షమును వివరించి యలౌకిక ప్రత్యక్షమును వ్రాయ దొడంగెను.

సూ. :- ఆత్మన్యాత్మ మనసోః సంయోగ విశేషా
దాత్మ ప్రత్యక్షమ్ ౯.౧.౧౧

ఆత్మని = ప్రత్యగాత్మయందు కలుగు, ఆత్మమనసోః=ఆత్మ మనస్సులు, సంయోగ విశేషాత్=యోగజ ధర్మమను సంయోగ

విశేషము వలన, ఆత్మప్రత్యక్షమ్ = ప్రత్యగాత్మ సాక్షాత్కార జ్ఞానము కలుగును.

యోగి యోగము ద్వారా రజస్తమో రూప మలావరణ మును క్షీణింపజేసి చిత్తమును ప్రత్యగాత్మయందు సంయోగింపజేయును. అప్పుడతని కాత్మ సాక్షాత్కారము కలుగును.

"యన్మనసా నమనుతే" ఇత్యాది వాక్యవిరోధములం బట్టి పరమాత్మ మానస సాక్షాత్కారమునకు విషయము కాదు, కనుక జీవాత్మయే యిట గ్రాహ్యము. జీవాత్మ సంయుక్తమగు మనస్సుతో, జీవాత్మాంతర్గతమగు పరమాత్మయు గ్రహింపబడదాయని శంకించుటకు తావులేదు. ప్రకృతికి గాని తద్వికారమగు మనస్సునకుగాని యిట్టి సామర్థ్యము లేదు. యోగమువలన సాక్షాత్కారము చేసికొనబడిన ప్రత్యగాత్మచే ఆ జగత్పతియగు పరమాత్మ స్వయముగా నెఱుగబడును. కాబట్టి పరమాత్మ సాక్షాత్కారము నభిలషించు ముముక్షువులు యోగముద్వారా పూర్వ మాత్మ (జీవాత్మ) సాక్షాత్కారము చేసికొనవలసి యుందురు.

సూ. :- తథా ద్రవ్యాన్తరేషు ప్రత్యక్షమ్ ౯.౧.౧౨

తథా = ప్రత్యగాత్మ సాక్షాత్కారము వలెనే, ద్రవ్యాన్తరేషు = సూక్ష్మములగు నితర పదార్థములందును, ప్రత్యక్షమ్ = ప్రత్యక్షజ్ఞానము కలుగును,

అవ : యోగులు సదా సమాహితాంతఃకరణులు, కాదాచిత్క (అప్పుడప్పుడు) సమాహితాంతఃకరణులు నని ఇరు

తెగలుకలవారు కదా! వారిలో నెవ్వరికి ప్రత్యక్షము కలుగు నన?

సూ. :- అసమాహితాంతఃకరణా ఉపసంహృత
సమాధయ స్తేషాం చ ౯.౧.౧3

అసమాహితాంతఃకరణాః = ఎల్లప్పుడు సమాహితము కాని మనస్సు కలవారు అనగా నొకప్పుడు సమాహితమగు చిత్తము కలవారు, ఉపసంహృత సమాధయః = పరిపూర్ణత నొందిన సమాధిగలవారు, అనగా సర్వదా సమాహితాంతకరణులు, తేషామ్ = వీరికిరువురకు ఆత్మ ప్రత్యక్షము కలుగునని సూత్రార్థము.

అవ : యోగులకు ద్రవ్యమువలె ద్రవ్యసమవేత విషయిక ప్రత్యక్షము కలుగునా?

సూ. :- తత్సమవాయాత్ కర్మగుణేషు ౯.౧.౧౪

పైనజెప్పిన యోగులకు, తత్సమవాయాత్ = ఇంద్రియ సంయుక్త సమవాయ సన్నికర్షమువలన, కర్మగుణేషు = ద్రవ్యమునందుగల కర్మగుణ సామాన్యాదులందును ప్రత్యక్ష జ్ఞానము కలుగును. కర్మత్వ గుణత్వాదులందు సంయుక్త సమవేత సమవాయ సన్నికర్షము వలన ప్రత్యక్ష జ్ఞానము కలుగును.

ద్రవ్యప్రత్యక్షమున సంయోగసన్నికర్షము; ద్రవ్యాశ్రితములగు గుణకర్మాదుల ప్రత్యక్షమున సంయుక్త సమవాయ సన్నికర్షము, తదాశ్రిత గుణత్వ కర్మత్వాదుల ప్రత్యక్షమున

సంయుక్త సమవేత సమవాయ సన్నికర్షము సంబంధము లగును.

అవ : ఆత్మయందు కలుగు సుఖదుఃఖాది జ్ఞానము యోగులకెట్లు కలుగును ?

**సూ. :- ఆత్మసమవాయా దాత్మగుణేషు** ౯.౧.౧౫

ఆత్మసమవాయాత్ = మనస్సంయుక్త ఆత్మసమవాయ రూప సన్నికర్షము వలన, ఆత్మగుణేషు = ద్రవ్యములలోని గుణకర్మ ముల వలెనే ఆత్మయందలి సుఖదుఃఖాదులును యోగులకు ప్రత్యక్షములగును.

# నవమాధ్యాయము

## ద్వితీయాహ్నికము

అవ : ప్రత్యక్షమును వివరించి యీ యాహ్నికమున (లైంగిక) అనుమానిక జ్ఞానమును పరీక్షించుచున్నాడు.

**సూ. :- అస్యేదం కార్యం, కారణం, సంయోగి,**
**విరోధి, సమవాయి చేతి లైంగికమ్** ౯.౨.౧

అస్య = వహ్న్యాదికారణమునకు, ఇదం కార్యం = ధూమాది కార్యమనియు, అస్య = వర్షాదికార్యమునకు, కారణం = మేఘాది కారణమనియు, అస్య = త్వక్కు మున్నగువానికి,

సంయోగి = శరీరాదులు సంయోగమనియు, అస్య = వాయు మేఘ సంయోగమునకు, ఇదం విరోధి = వర్షింపకుండుట విరోధియనియు, అస్య = సమవాయ ద్రవ్యమునకు, ఇదం సమవాయి = గుణాదులు సమవాయియనియు, అస్య చ = స్పర్శాది ఏకార్థసమవాయికి, ఇదం కార్యం = రూపాదులు ఏకార్థ సమవాయియనియు, ఇతి = ఇట్టి సంబంధులయిన లింగలింగుల సంబంధ గ్రహణము, తత్పూర్వక లింగజ్ఞానము వలన నొక సంబంధి విషయిక జ్ఞానము కలుగు చున్నది. దానినే లైంగిక జ్ఞానము లేక యానుమానిక జ్ఞానమని పిలువ దగును.

అనుమానిక జ్ఞానమునందు, కార్యమువలన కారణ మును, కారణమువలన కార్యమును, ఒక సంయోగివలన మఱియొక సంయోగిని, విరోధి వలన విరోధిని, సమవాయివలన సమవాయిని, ఏకార్థ సమవాయివలన నేకార్థ సమవాయిని తెలిసికొన గలుగుచున్నారము. తృతీయాధ్యాయమున దీనిని గుఱించి కొంత వివరించియుంటిమి. అట చూడనగును.

అవ : కార్యకారణ భావాది సంబంధమెట్లు తెలియు నన ?

**సూ. :- అస్యేదం కార్యకారణసంబంధశ్చావయవా ద్భవతి**

**౯.౨.౨**

**అస్య=ఈవస్తువునకు సంబంధించినది, ఇదమ్=ఇదియనియు, కార్యకారణ సంబంధశ్చ = పరస్పరము వీనికి కార్యకారణ**

భావ సంబంధము కలదనియు, అవయవాత్=ఉదాహరణము వలన, భవతి = తెలియబడును.

దేనికి దేనితో సంబంధమున్నదో, ఆ సంబంధమేమో, ఇవి యన్నియు ఉదాహరణముల ననుసరించియే తెలిసికొన వలయును. అనుమానిక జ్ఞానమున ఉదాహరణమున కెంతయు ప్రాధాన్యము కలదని గుర్తింపవలయును.

అవ : శాబ్దజ్ఞానము

సూ. :- ఏతేన శాబ్దం వ్యాఖ్యాతమ్ ౯.౨.౩

ఏతేన = అనుమానిక జ్ఞాన వ్యాఖ్యానము చేతనే, శాబ్దం = శబ్దార్థముల సంబంధ జ్ఞానపూర్వకమైన శబ్దజ్ఞానమువలన కలుగు శాబ్దజ్ఞానము, వ్యాఖ్యాతం = వ్యాఖ్యానము చేయబడిన దనియే సూత్రార్థము.

ఆప్తులచే నుపదేశింపబడు శబ్దము శబ్దప్రమాణ మన బడును. దాని వలన కలుగు జ్ఞానము శాబ్దజ్ఞాన మనబడును. అర్థ సాక్షాత్కరణము ఆప్తి యనబడును. దానితో-ఆప్తితో-వర్తించువాడు ఆప్తుడు. అతని యుపదేశము వాక్యరూపమున నుండును. లేక, అర్థమును వ్యభిచరింపని వాక్యము శబ్ద ప్రమాణ మనబడును. (అర్థావ్యభిచారిత్వమ్ ఆప్తిః, తయా వర్తతే ఇతి ఆప్తః, తస్య వాక్యమ్.) ఈ ప్రమాణము లౌకికము వైదికమునని రెండు విధములు, వైదిక మీశ్వరోక్తమగుటచే నంతయు ప్రమాణమే. లౌకిక మాప్త వాక్యమే ప్రమాణము.

వాక్యమనగా పదసమూహము. శక్తము పదము. ఈ పదమువలన నీపదార్థ మెఱుంగదగునను భగవన్నియోగాత్మక

సంకేతమే శక్తియనబడును. ఈ సంకేతజ్ఞానము ఆప్తుల యుపదేశము, వృద్ధవ్యవహారము, ప్రసిద్ధపద సాన్నిధ్యముచే తెలియనగును. ఇట్లు శక్తిజ్ఞానము కలవానికి, (గామానయ) 'ఆవును తీసికొనిరమ్ము' (ఘటమానయ) 'కడవతెమ్ము' మున్నగు వాక్యములను విన్నపుడు, వాక్యమునందుగల ప్రతి పదము దానియర్థము క్రమముగా స్ఫురించును. అటుపై ఆసత్తి యోగ్యతాకాంక్షా తాత్పర్యజ్ఞానసాహాయ్యముచే ఉపస్థిత పదార్థములందు క్రియాకర్మాది భావముతో అన్వయరూపమగు (గోవృత్తి కర్మతా నిరూపకానయనానుకూల కృత్యాశ్రయః ప్రేరణాశ్రయః త్వం పదార్థః) గోవునందుగల కర్మత్వమునకు నిరూపకమగు ఆనయనమున కనుకూలించు కృతికి ప్రయత్నమునకు ఆశ్రయభూతమగు ప్రేరణకు నీవు ఆశ్రయుడవు. అనగా 'నీవు ఆవును తెమ్ము' అను జ్ఞానము కలుగును. ఇదియే శాబ్దజ్ఞాన మనబడును.

యౌగికములు, రూఢములు, యోగరూఢములు, యౌగిక రూఢములు నని పదములు నాలుగు విధములు.

యౌగికము :- యోగమనగా నవయవశక్తి. దానివలన నర్థప్రతిపాదకము. ఉదా : పాచకుడు.

రూఢము :- సముదాయశక్తి రూఢియనబడును. దాని వలన నర్థమును బోధించునది. ఉదా : గోవు మున్నగునవి.

యోగరూఢము :- పంకజాదులు.

యౌగికరూఢము :- యోగముతోను, రూఢితోను ఒక దానికొకటి సాహాయ్యపడకయే అర్థబోధకమగు పదము. ఉదా :

ఉద్భిదాదులు, ఉద్భిదమునకు యోగమువలన నర్థము వృక్షము. రూఢివలన నర్థము ఉద్భిద్ యాగము.

శక్తిగ్రహణము:- యాస్క పాణిన్యాది ఆచార్యులు, మాతాపితరులు, గురువులు మున్నగువారి యుపదేశము వలన ఈ పదమున కీ యర్థమున శక్తియని తెలియనగును.

ప్రయోజక వృద్ధునిచే 'ఆవును తెమ్ము' అని యాజ్ఞాపింపబడిన ప్రయోజ్య పురుషుడు ఆవును తెచ్చును. ఆ సమయమున సమీపముననుండు బాలుడు ఆవును తీసికొని వచ్చు కార్యము 'ఆవును తెమ్ము' అను శబ్దప్రయోజ్యమని తెలిసికొని యనంతరము 'ఆవును కట్టివేయుము' గుఱ్ఱమును తెమ్ము' 'ఆవును తీసికొనిపొమ్ము' మున్నగు వాక్యములచే ప్రయోగింప బడిన పురుషుడు చేయు కార్యములను నిరీక్షించుచు క్రమముగా ఆవు అనుపదము (గోత్వవిశిష్టమగు) ఆవునందు, గుఱ్ఱము అను పదము గుఱ్ఱము అను పదార్థము నందును శక్తి కలవి, అనగా వానిని బోధించునవి యనియు గ్రహించును.

ప్రసిద్ధపద సాన్నిధ్యమువలన శక్తి గ్రహణము :-వికసిత పద్మమున మధుపము మధువు గ్రోలుచున్నది. ఇందు పద్మ సాన్నిధ్యమువలన మధుప శబ్దమునకు తుమ్మెదయని యర్థము.

శాబ్దబోధమునకు ఆసత్తి - యోగ్యత - ఆకాంక్ష, తాత్పర్యజ్ఞానములు కూడ కారణములు.

ఆసత్తి:- (సామీప్యము) ఏపదార్థముతో నే పదార్థమున కన్వయ మపేక్షింపబడినదో ఆ రెండు పదముల నొకచో ననగా

వ్యవధానము లేకుండ ప్రయోగింప వలయును. కాబట్టి "పర్వతము భుజించెను. వహ్నిగలది దేవదత్తుడు" అనుచోట శాబ్దబోధ కలుగదు. ఆసత్తికొఱకై, 'పర్వతము వహ్నికలది, దేవదత్తుడు భుజించెను' అనియే ప్రయోగింపవలయును.

యోగ్యత :- ఒక పదార్థమున మఱియొక పదార్థమునకు గల సంబంధము యోగ్యత యనబడును. అది లేనిచోట శాబ్ద బోధ కలుగదు. ఉ॥ వహ్నిచే తడుపుచున్నాడు. ఇట వహ్ని యందు సేచనమునకు సంబంధము లేదు.

ఆకాంక్ష:- ఒక పదమునకు, మఱియొక పదమును ప్రయోగింపకుండుటచే కలిగిన అన్వయాననుభావకత్వము. అనగా నే పదము లేకపోవుటచే నే పదము అన్వయమును కలిగింపజాలక పోవునో ఆ పదము నాపద మాకాంక్షించును. ఇదియే యాకాంక్ష యనబడును. (యేన పదేన వినా యస్య పదస్యాన్వయాననుభావకత్వం తేన పదేన సహ తస్యాకాంక్షా) క్రియా పదము లేకున్న కారకపదము అన్వయ బోధను కలిగింపదు. అందువలన కారకము క్రియ నాకాంక్షించును. తలుపు అను పదము మూయుము, తెఱువుము. అను క్రియా పదములు లేక యెట్టి జ్ఞానము కలిగింపజాలదు. కాబట్టి యది యాపదములలో నొకదాని నపేక్షించును.

ఇట్లు ప్రత్యక్షానుమాన శబ్దప్రమాణములు మూడును పరీక్షింపబడినవి.

**సూ. :- హేతురపదేశో లిఙ్గం ప్రమాణం కరణ**
**మి త్యనర్థాంతరమ్** ౯.౨.౪

హేతువు, అపదేశము, లిఙ్గము, ప్రమాణము, కరణము నను నీ యైదు పదములు సమానార్థకములని సూత్రార్థము.

అవ : ప్రత్యక్షాదులవలె నుపమితిజ్ఞాన మేల చెప్ప లేదన ?

సూ. :- అస్యేద మితి బుద్ధ్యపేక్షితత్వాత్ ౯.౨.౫

అస్యేదమితి = దీనికిదియని, బుద్ధ్యపేక్షితత్వాత్ = సంబంధ బుద్ధి నపేక్షించుట వలన, ఉపమితి మున్నగు జ్ఞానములు లైంగిక జ్ఞానముల కంటె భిన్నములు కావని సూత్రాభి ప్రాయము.

వైదికులు ఎనిమిది ప్రమాణముల నంగీకరింతురు. (౧) ప్రత్యక్షము (౨) అనుమానము (3) శబ్దము (౪) ఉప మానము (౫) అర్థాపత్తి (౬) అభావము (౭) సంభవము (౮) ఐతిహ్యము. అర్థాపత్తి మొదలు నాలుగు ప్రమాణములు అనుమానాదులలో నంతర్భూతము లనియే గౌతముడు తన శాస్త్రమున వర్ణించియున్నాడు. ఆవర్ణన మాచే వ్రాయబడిన న్యాయశాస్త్రవృత్తియందు జూడనగును.

వైశేషికులు ప్రత్యక్షానుమాన శబ్దము లను మూడు ప్రమాణములే యంగీకరించుచున్నారు.

అవ : జ్ఞానమును పరీక్షించి స్మృతిని పరీక్షించుచున్నాడు.

సూ. :- ఆత్మమనసోః సంయోగ విశేషా
త్సంస్కారా చ్చ స్మృతిః ౯.౨.౬

ఆత్మమనసోః = ఆత్మమనస్సుల, సంయోగ విశేషాత్ = ఒకా నొక విశేష సంయోగమువలన (లింగదర్శనము, ఇచ్ఛాను స్మరణము ప్రణిధాన నిబంధము, అభ్యాసాదిసహకృతత్వము గల సంయోగము) సంస్కారాచ్చ = పూర్వానుభవమువలన కలిగిన భావనాఖ్య సంస్కారమువలనను, స్మృతిః=ఆత్మ యందు స్మరణాత్మకమగు జ్ఞానము కలుగుచున్నది.

ఆత్మమనస్సంయోగమువలనను సంస్కారమువలనను కలుగు జ్ఞానము స్మృతి యనబడును. ఇది యభావితస్మర్తవ్య స్మృతి యనబడును.

అవ : భావితస్మర్తవ్యస్మృతి యెట్టి దన ?

సూ. :- తథా స్వప్నః ౯.౨.౭

తథా = ఆత్మమనః సంయోగము, సంస్కారము వలనను స్మృతి కలుగునట్లు, స్వప్నః = భావనామయమగు స్వప్న పదార్థ విషయిక జ్ఞానము కలుగును.

బాహ్యేంద్రియములు స్వవిషయములను గ్రహించుట మానియుండు స్థితియందు మనస్సు వానితో సంబంధము వీడి హృదయాంతరమున నిశ్చలముగా నుండును, ఈ స్థితినే స్వప్నమందురు. అట్టి స్థితిలో ప్రాణాపానము లను ఉచ్ఛ్వాస నిశ్శ్వాసములు విశేషముగా ప్రవర్తించును. అట్టిచో అల్ప నిద్రతో కూడిన స్వాపమను పేరుగల ఆత్మ మనస్సంయోగ విశేషము వలన పూర్వ మనుభవమునకు వచ్చిన యనేక విషయములకు సంబంధించిన సంస్కార పాటవము వలనను భావనామయములగు నాయా విషయములందు ప్రత్యక్షమువలె

కలుగు మానసిక జ్ఞానము కలుగును. దానినే స్వప్నమందురు. అదియు స్మృతియే. (అనుభవము కాదు). సంస్కారముల వలననే కలుగును. వృత్తికారులు నిట్లే వర్ణించి యున్నారు. (అనుభూతవస్తుస్ఫురణార్థతయా న స్మరణాదర్థాన్తరం స్వప్న జ్ఞానమ్) పూర్వానుభూత విషయముల స్ఫురణయే స్వప్న ఫలమనుటంబట్టి స్వప్నము స్మృతికంటె భిన్నము కానేరదు. బ్రహ్మసూత్రములందును స్మృతిరేషా యత్ స్వప్నదర్శనమ్ ౨.౨.౨౯) అని స్వప్న జ్ఞానము స్మృతికి మిన్నకాదని వర్ణింపబడియున్నది.

సూ. :- స్వప్నాంతికమ్ ౯.౨.౮

ఒక్కొక్కప్పుడు స్వప్నమునందు జూడబడిన విషయమా స్వప్నసమయముననే "ఒకప్పుడిది నాచే చూడబడినది" అను జ్ఞానము కలుగును. ఈ జ్ఞానము స్వప్నాంతిక మనబడును. ఇదియు స్వప్నమువలె స్మృతియేగాని వేఱు కాదు.

అవ : స్వప్న జ్ఞానము స్మృతి జ్ఞానముకంటె విలక్ష ణముగా నుండునేయనిన,

సూ. :- ధర్మాచ్చ ౯.౨.౯

ధర్మాదికారణమువలనను స్వప్నము కలుగును. స్వప్నము కేవలము ఆత్మమనస్సంయోగ విశేషము, సంస్కారము వలననే కలుగదు. ధర్మాధర్మాది కారణముల వలనను

కలుగును. అందువలన స్మృతికంటె కొంత విలక్షణతయు నందు గాననగును.

కాముకుడు కాని, క్రుద్ధుడుకాని యొక విషయమును గూర్చి చింతించుచు నిద్రించినపు డతనికి కలుగు ప్రత్యక్ష జ్ఞానమువంటి స్వప్న జ్ఞానము సంస్కార పటుత్వము వలన కలుగును.

ఆకాశ గమనము, సరిత్సముద్రాదుల తరణము మున్నగు స్వప్నజ్ఞానములు వాత పిత్త కఫరూప ధాతు దోషము వలన కలుగును.

గజారోహణము, ఛత్ర సంవరణాదులు, తత్సంస్కారము వలనను, ధర్మము వలనను, కలుగును.

ఖరారోహణాదులు, తత్సంస్కారము వలన అధర్మము వలనను కలుగునని యూహింపవలయును.

అవ : అవిద్యను పరీక్షించుచున్నాడు.

సూ. :- ఇంద్రియదోషాత్ సంస్కార దోషాచ్చ అవిద్యా

౯.౨.౧౦

ఇంద్రియదోషాత్ =మనఃప్రభృతీంద్రియ దోషముల వలనను, సంస్కార దోషాత్చ = సంస్కార రూప దోషము వలనను, అధర్మము వలనను సంశయాత్మకమో విపర్యయాత్మకమో అగు నవిద్య కలుగును.

ప్రసిద్ధమైన యనేక విశేష గుణములు కల వస్తువుల
నొక వస్తువు నందు ఇంద్రియ దోషముల వలన సరి
నాలోచింపక పోవుట చేతను, సంస్కార దోషము వల
దూరముననున్న మఱియొక వస్తువును స్మరించుటవలన
కలుగు విపరీత జ్ఞానము అవిద్య యనబడును.

రజస్తమోగుణము లతిశయించుట మానసిక దోషమ
కామెరలు మొదలగు దోషములు నేత్రాదీంద్రియ దోషముల

అవ : అవిద్యయన నెట్టిది ?

సూ. :- తద్ దుష్టజ్ఞానమ్ ౯.౨.౧

తత్=ఆ యవిద్య, దుష్టజ్ఞానమ్=బాధాయుక్తమగు జ్ఞానమ

ముందొక విధముగా జ్ఞానమేర్పడి యనంతర మది
గాదని కొట్టి వేయబడుట బాధ యనబడును. అట్టి బాధ
కూడిన జ్ఞానము, దుష్టజ్ఞానము, అవిద్య-భ్రమ-విపర్యయ
సంశయము ననబడును.

అవ : విద్యయన నేమి ?

సూ. :- అదుష్టం విద్యా ౯.౨.౧

అదుష్టం = పై జెప్పిన బాధా రూప దోషరహితమగు జ్ఞానమ
విద్యా = విద్య, యథార్థ జ్ఞానమనబడును.

అవ : ఆచార్యులచే నిది యెట్లు తెలియబడినదన ?

సూ. :- ఆర్షం సిద్ధదర్శనం చ ధర్మేభ్యః ౯.౨.౧

ఆర్షం = ఋషులకు సంబంధించిన యీ, సిద్ధదర్శనం చ = వేద సిద్ధ పదార్థముల యథార్థ జ్ఞానము. ధర్మేభ్యః = ఇహపర లోకములందు వారిచే నొనరింపబడిన వైదిక కర్మానుష్ఠాన రూప ధర్మములవలన కలుగునని సూత్రార్థము.

త్రికరణములతో వైదిక కర్మానుష్ఠానమే యున్న ముభ్యు దయములకు, నిశ్శ్రేయసమునకు పరమ సాధనమని యీ సూత్రమువలన నుపదేశింపబడినదని యెఱుంగునది.



# దశమాధ్యాయము

## ప్రథమాహ్నికము



అవ : క్రమ ప్రాప్తములగు సుఖదుఃఖములను పరీక్షింప దలచి యవి రెండును భిన్నార్థములని సూత్రించుచున్నాడు.

సూ. :- ఇష్టానిష్ట కారణ విశేషాద్ విరోధా చ్చ
మిథః సుఖదుఃఖయో రర్థా న్తరభావః ౧౦.౧.౧

సుఖదుఃఖయోః = సుఖదుఃఖములు, మిథః = పరస్పరము, అర్థాన్తరభావః = భిన్నములు, ఇష్టానిష్టకారణవిశేషాత్ = సామ్రాజ్యము, రాజ్యస్వాతంత్ర్యము, స్రక్చందనవనితాదు లిష్టము; దారిద్ర్యము, పారతంత్ర్యము, అహికంటకాదుల

అవ : మఱియొక కారణము.

సూ. :- ఏకార్థ సమవాయి కారణాంతరేషు దృష్టత్వాత్
౧౦.౧.౬

ఏకార్థ సమవాయి కారణాన్తరేషు = ఏ యాత్మయందు సుఖ దుఃఖములు సమవేతములై యుండునో ఆ యాత్మయందే ధర్మము, సుఖానురాగము, సుఖకారణేచ్ఛ, సుఖసాధనో పాదాన యత్నము, అధర్మము, ద్వేషము మున్నగు కారణాంతరము లున్నపుడు, దృష్టత్వాత్ = సుఖదుఃఖములు కనబడుట చేత సుఖ దుఃఖములు వాని జ్ఞానము కంటె భిన్నములని సూత్రార్థము.

అవ : కారణ భేదము కార్య భేదము కలిగెనేని ఒకే శరీరమునందు తల-వీపు మున్నగు నవయవ భేదమెట్లు కలుగు చున్నదన !

సూ. :- ఏక దేశ ఇత్యేకస్మిన్ శిరః పృష్ఠ ముదరం
మర్మాణి తద్విశేష స్తద్విశేషేభ్యః ౧౦.౧.౭

ఏకస్మిన్ = ఒకే శరీర మందు, శిరః, పృష్ఠం, ఉదరం, మర్మాణి ఇతి = శిరస్సు, పృష్ఠము, ఉదరము, స్నాయువులు నను వ్యవహారము, ఏకదేశే = శరీరావయవమునందు కలుగు నని యెఱుంగవలయును. తద్విశేషః = ఆయవయవములలో గల భేదమునకు కారణము, తద్విశేషేభ్యః = వాని కారణము లలోగల భేదమేయని సూత్రార్థము.

ఇట్లు సర్వత్ర కారణ వైజాత్యము వలననే కార్య వైజాత్యమనుట నిశ్చితమే.

# దశమాధ్యాయము

## ద్వితీయాహ్నికము

అవ : కారణ పరీక్ష.

సూ. :- కారణమితిద్రవ్యే కార్యసమవాయాత్ ౧౦.౨.౧

కారణమితి = సమవాయి కారణమనెడి జ్ఞానము గాని వ్యవహారముగాని, ద్రవ్యే = ద్రవ్యమునందేకాని గుణకర్మలందు కలుగదు. కార్య సమవాయాత్ = ద్రవ్యగుణ కర్మ రూపములగు కార్యములన్నియు ద్రవ్యమునందే సమవాయ సంబంధముతో నేర్పడును.

దేనియందు సమవేతమై కార్యముత్పన్నమగునో అదియే సమవాయి కారణము. వస్త్రమునకు తంతువులు, వస్త్రమునందలి రూపాదులకు వస్త్రము. ఇట్లు ద్రవ్యమే సమవాయి కారణమగును. కాని గుణకర్మములు కానేరవు. గుణకర్మములు ఏకార్యమునకును సమవాయ సంబంధముతో నాశ్రయములుకావు. కాబట్టి సమవాయికారణ వ్యవహారము ద్రవ్యమునందే వర్తించునని సూత్రతాత్పర్యము.

(అనన్యథాసిద్ధకార్యనియతపూర్వవృత్తి కారణమ్, ఇతి కారణ లక్షణమ్) అన్యథాసిద్ధముకాక నియమముగా కార్యమునకు పూర్వముండునది కారణ మనబడును. అన్యథా సిద్ధతయైదురకములు. ఉదాహరణమునకు : ఘట రూపకార్య

విషయమున, (౧) దండత్వము, (౨) దండరూపము, (3) ఆకాశము, (౪) కుమ్మరితండ్రి (౫) గార్దభాదులు - అన్యథా సిద్ధములు. (యేనావశ్యక్లృప్తనియత పూర్వవర్తినా కార్యం సంభవతి, తద్భిన్నం సర్వ మన్యథాసిద్ధమ్.) కార్యోత్పత్తికి పూర్వ మేది లేకున్న కార్యముత్పన్నము కాదో యదికాక మిగిలిన వన్నియు నన్యథా సిద్ధములని యెఱుంగవలయును.

కారణము ముప్విధములు : సమవాయి కారణము, అసమవాయికారణము, నిమిత్తకారణము. దేనియందు సమవాయసంబంధముతో కార్యముత్పన్నమగునో అది సమవాయి కారణము (యత్సమవేతం కార్యముత్పద్యతే తత్సమవాయి కారణమ్).

(సమవాయి కారణే ప్రత్యాసన్నం యత్కారణం తద సమవాయి కారణమ్) సమవాయి కారణమున ప్రత్యాసన్నమై కారణమగునది యసమవాయికారణ మనబడును. ఇందు ప్రత్యాసత్తి - సన్నికర్షము - అనగా సమీపత రెండువిధములు. కార్యైకార్థము, కారణైకార్థము నని, ఉదాహరణము : కపాల సంయోగము ఘటమున కసమవాయి కారణము. ఈ సంయోగము ఘటమనెడి కార్యముతోబాటు కపాలములందు సమవాయ సంబంధముతో నుండును. రెండవది కపాలముల రంగు ఘటములోని రంగున కసమవాయి కారణము. ఘటము లోనిరంగునకు సమవాయి కారణమగు ఘటమునందు కపాలములరంగు స్వసమవాయి సమవాయ సంబంధమున నుండును. స్వమ్ = కపాలము రంగు, స్వసమవాయి = కపాలములు - వానిలో ఘటము సమవాయ సంబంధమున

నుత్పన్నమగును కాబట్టి కపాలములరంగు ఘటములోనిరంగు రెండును ప్రత్యాసన్నములు.

(తదుభయభిన్నం కారణం నిమిత్త కారణమ్) సమవాయి, అసమవాయి కారణములుకాక మిగిలిన కారణము నిమిత్తకారణ మనబడును. ఉ॥ ఘటమునకు దండాదులు.

సూ. :- సంయోగాద్వా ౧౦.౨.౨

అసమవాయి కారణమగు కపాల సంయోగాదులకు ఆశ్రయమగుటవలనను, సమవాయి కారణము ద్రవ్యమేకాని యన్యము కానేరదు.

కపాల సంయోగము ఘటమునకు, తంతు సంయోగము వస్త్రమునకు అసమవాయి కారణము. సంయోగ రూపమగు నీ యసమవాయి కారణమున కాశ్రయము (సమవాయి సంబంధమున) ద్రవ్యమే, గుణకర్మములు కానేరవు. సంయోగము గుణము కాబట్టి యది సమవాయ సంబంధముతో ద్రవ్యమునందే యుండును. గుణ గుణులకు సమవాయమని పూర్వమే వ్రాసియున్నాము.

సూ. :- కారణే సమవాయాత్ కర్మాణి ౧౦.౨.౩

కారణే = సంయోగ విభాగ వేగముల కాశ్రయమగు సమవాయి కారణమగు ద్రవ్యమునందు. సమవాయాత్ = సమవేతమగుట వలన, కర్మాణి = కర్మములు అసమవాయి కారణములు.

అసమవాయి కారణము కర్మ మందు వ్యవహరింప దగినదని తాత్పర్యము.

సూ. :- తథా రూపే కారణై కార్థసమవాయా చ్చ ౧౦.౨.౪

తథా = కార్యైకార్థ ప్రత్యాసత్తితో సమవాయి కారణమను ద్రవ్యాశ్రితమగు కర్మమందు అసమవాయి కారణ వ్యవహర ముచితమైనట్లు, కారణైకార్థ సమవాయాచ్చ = కారణైకార్థ ప్రత్యాసత్తితో, రూపే = అవయవాదులందు, అసమవాయి కారణ వ్యవహారము యోగ్యము.

కపాలముల రూపము ఘటరూపమున కసమవాయి కారణము. దీనికి గల ప్రత్యాసత్తి పూర్వసూత్రమున వివరింప బడినది.

సూ. :- కారణసమవాయా త్సంయోగః పటస్య ౧౦.౨.౫

కారణ సమవాయాత్ = సమవాయి కారణము నందు సమ వాయ సంబంధముతో నుండుటవలన, సంయోగః = తంతు కపాలాదుల సంయోగము, పటస్య = పట-ఘటాది కార్యము లకు, అసమవాయి కారణమని సూత్రార్థము.

సూ. :- కారణా కారణ సమవాయా చ్చ ౧౦.౨.౬

మహా పరిమాణమునకు సమవాయి కారణము తూల పిండము. దానికి సమవాయి కారణము తూలపిండావయవ ములు. కాబట్టి తూల పిండావయవముల సంయోగము, కారణములైన యవయవములందు సమవాయ సంబంధముతో

నుండి తూలపిండములో మహత్త్వమునకు అసమవాయి కారణ మగునని సూత్ర తాత్పర్యము.

అవ : నిమిత్త కారణము

సూ. :- సంయుక్త సమవాయా దగ్నే ర్వైశేషికమ్

౧౦.౨.౭

అగ్నేః = అగ్నికి, వైశేషికమ్=విశేషగుణమగు నుష్ణస్పర్శము సంయుక్త సమవాయాత్=స్వాశ్రయ సంయోగ సంబంధముతో, (కారణమ్)=పాకజ రూపాదులకు నిమిత్త కారణమగు సని సూత్రార్థము.

స్వమ్ = ఉష్ణస్పర్శము, స్వాశ్రయః = దానికాశ్రయము అగ్ని, తత్సంయుక్తాః = ఆ యగ్ని సంయుక్తములు ఫలాదులు, వానియందు సమవాయ సంబంధముతో పాకజ గుణములు రూపాదు లుత్పన్నములగును. ఫలము సమవాయి కారణము. తేజస్సంయోగము అసమవాయి కారణము. ఉష్ణ స్పర్శము, అదృష్టాదికములు నిమిత్తకారణములని వివేకము.

సూ. :- దృష్టానాం దృష్ట ప్రయోజనానాం దృష్టాభావే ప్రయోగోఽభ్యుదయాయ. ౧౦.౨.౮

దృష్టానాం = వేదోప లబ్ధములు, దృష్ట ప్రయోజనానాం = దృష్ట ప్రయోజనములుగల కర్మములకు, దృష్టాభావే = దృష్ట ఫలప్రాప్తి కలుగనప్పుడు, ప్రయోగః = అనుష్ఠానము, అభ్యుదయాయ = పరమున నభీష్ట కార్యసిద్ధి కొఱకని యెఱుంగునది.

యథావిధి ననుష్ఠించిన వైదిక కర్మము దృష్టఫలమో యదృష్టఫలమో కలిగించును. ప్రతిబంధక విశేషమువలన దృష్టఫలము లభింప కున్నను కర్మము నుండి విరతులు కాగూడదు.

సూ. :- అస్మ ద్బుద్ధిభ్యః లింగమృషేః ౧౦.౨.౯

అస్మద్బుద్ధిభ్యః = ప్రాణుల బుద్ధులకంటె విశిష్టమగుబుద్ధి, ఋషేః = నిఖిలజగత్తును సాక్షాత్తుగా జూచు పరమేశ్వరుని సద్భావమునకు, లింగమ్ = ప్రమాణమని సూత్రార్థము.

ప్రపంచమున హెచ్చుతగ్గులుగా చూడబడు ప్రతిపదార్థ మొకానొక చోట పూర్ణత్వము వహించియుండు టావశ్యకము. ఘటాదులలో హెచ్చుతగ్గులుగా కనబడు పరిమాణము ఆకాశ మున పూర్ణత్వము వహించియుండు టెల్లరెఱిగినదే. మన వంటి ప్రాణిజాతమున, జ్ఞానమొకచో కొంచెము. మఱియొకచో నంతకంటె నెక్కువ. ఇంకొకచో నంతకంటె నెక్కువగా కనబడుచున్నది. ఇట్లందఱికంటె నుత్కృష్టము, సంపూర్ణ మైన జ్ఞానమున కాశ్రయభూతమగు పదార్థమే యీశ్వరుడు, జగత్పతి యనబడునని సూత్రతాత్పర్యము.

సూ. :- తద్వచనా దామ్నాయస్య ప్రామాణ్యమ్ ౧౦.౨.౧౦

తద్వచనాత్ = ఆపరమర్షి పరమేశ్వరుని కథనమగుటవలన ఆమ్నాయస్య = వేదమునకు, ప్రామాణ్యం = స్వతః ప్రమా ణత్వము కలదని యర్థము.

ఆ పరమేశ్వరుని యుపదేశమే వేదము. కాబట్టి యాత్మాభ్యుదయము నభిలషించువారు వేదోపదిష్ట మార్గమున వర్తిల్లి మిగిలిన బుద్ధి విరుద్ధకార్యముల విడుచుట శ్రేయస్కర మని యెంతురుగాత!

నిఖిల శాస్త్ర నిష్ణాత శ్రీమత్పండిత ముక్తిరామోపాధ్యాయ శిష్య గోపదేవ విరచిత నిజమాతృ నా మాంకిత - అంబా వ్యాఖ్యానమునందు దశమాధ్యాయ ద్వితీయాహ్నికముతో

వైశేషిక దర్శనము సర్వము సమాప్తము.

ఓమ్ తత్ సత్



# సాంఖ్య దర్శనము

(కపిల మహర్షి ప్రణీతము)




అనుకర్త :

దార్శనిక్, "కళాప్రపూర్ణ", దర్శన తత్త్వవేత్త, వేదవేదాంగ పారంగత్

పండిత గోపదేవ్



# సాంఖ్యదర్శనము

(కపిల మహర్షి ప్రణీతము)


అనుకర్త :

"దార్శనిక్, కళాప్రపూర్ణ, వేదవేదాంగ పారంగత్, దర్శనతత్త్వవేత్త"

పండిత గోపదేవ్



ప్రకాశకులు :

**ఆర్యసమాజము, కూచిపూడి**

తెనాలి తాలూకా, గుంటూరు జిల్లా, ఆంధ్రప్రదేశ్

అంబా దర్శన గ్రంథమాల - 7

చతుర్థ సంస్కరణము : 500 ప్రతులు

సర్వస్వామ్యములు : సురక్షితము

మన్మథనామ సం॥ పుష్యం (జనవరి 2016)

**మూల్యము : రూ. 80/-**

(తపాలా ఖర్చులు అదనము)

ప్రతులకు :

(తపాళ ద్వారా ప్రతులకు)

ఆర్యసమాజము, కూచిపూడి - 522 313 (తెనాలి తాలూకా).

గుంటూరు జిల్లా. (ఆంధ్రప్రదేశ్). ఫోన్ : 08644-252789.

శ్రీ మాశెట్టి శ్రీనివాస్ ఆర్య, # 5, మాశెట్టి బిల్డింగ్,

3-3-736 to 740, కంచరిబజార్, సికింద్రాబాద్-3. (తెలంగాణ)

ఫోన్ : 040-66320200.

వైదిక సాహిత్య భండార్, ఆర్యసమాజము,

సుల్తాన్‌బజార్, హైదరాబాద్ - 500 095. (తెలంగాణ)

ఫోన్ : 040-24751656

ఆర్యసమాజము, సీతాఫలమండి, సికింద్రాబాద్ - 61. (తెలంగాణ)

ఫోన్ : 040-27071816.

విద్యా బుక్ డిపో, ఆర్యసమాజము ఎదురుగా,

సుల్తాన్ బజార్, హైదరాబాద్, (తెలంగాణ)

*Printed at :* PRINTSHOP, Ph : 040-6632 0300

## తొలిపలుకులు

కె. సచ్చిదానందమూర్తి
ఆంధ్ర విశ్వవిద్యాలయము

క్రీస్తు పూర్వము ఆరు, ఏడు శతాబ్దములలో భారతదేశములో తాత్త్విక సమాలోచన ఉత్కటముగా నుండెను. ఈ ఆలోచనా ఫలితములలో ఒకింత ఉపనిషత్తులలో ఉపలబ్ధము. ఉపనిషత్తుల కాలములోనే వాటితోపాటును, వాటి పిదప స్వతంత్రముగను, కాని బహుశః వాటి నాధారముగ నుంచుకొనియు అపారమైన తత్త్వమీమాంసయు, అనేకములగు దర్శన ప్రస్థానములును బయల్వెడలెను. లోకాయతిక, జైన బౌద్ధములు ఇంచుమించట్టివే. తరువాత అనేక ఏండ్లకు, అనగా క్రీస్తుపూర్వము ఒకటవ శతాబ్దమునుండి క్రీస్తు తర్వాత 2వ శతాబ్దము లోపల వేదోపనిషత్తులు శృతి ప్రమాణముగా అంగీకరింపబడి ప్రత్యక్షానుమానములతో సమాన సత్తాకములుగాను అదృష్ట విషయము లందు బలవత్తరముగాను గౌరవింపబడగా, అనేకులు తమతమ సిద్ధాంతములను వానిలో వెదుకసాగిరి. వాటిపై ఆధారపడి యున్నటుల నిదర్శనముల పొందుపరచ ప్రయత్నించిరి సూత్రప్రాయముగా తమ దార్శనిక సిద్ధాంతముల ప్రవచించిరి. ఫలితముగ షడ్దర్శనములు బయల్వెడలెను లోకాయతికాది కొన్ని దర్శనములు వేదమును ప్రమాణముగా నంగీకరించుట యటుంచి, అవి పురోహితుల కుతంత్రములని కూడ అనెను. వైదికమత పునరుద్ధరణ కాలమున (రివైలిస్టిక్ పీరియడ్) లోకాయతికము వైపుకు ప్రజలు పెడముఖముపెట్టి జైన బౌద్ధులను వలెనె పలుబాధలు పెట్టిరి. కొలదిమందే లోకాయతికులమని చెప్పుకొన సాహసించిరి : క్రమముగా చార్వాక సాహిత్యము ఖిలమయ్యెను. కాక ఆ ప్రాతకాలమున కేవలము తర్కముపైనను మానవబుద్ధిపైనను ఆధారపడి భావోద్రేకములకు (ఎమోషన్స్) ఏమాత్రము తావొసగని చార్వాక దర్శనము ఎవరికిని విచారము కల్గించకుండనే మృతి నందెను. జైన బౌద్ధములు ధర్మములుగా మారెను. వాటి స్థాపకులు దేవతలైరి వారి బోధనలను సంగ్రహించిన గ్రంథజాలము వేదముల స్థాన మాక్రమించెను.

కపిలుడు వ్రాసినవనబడు 'సాంఖ్యసూత్రములు' లభించుచున్నవి. 1500 క్రీ.శ. మందుండిన అనిరుద్ధునికంటె ప్రాచీనుడెవరును వీనిపై భాష్యాదులు వ్రాయకపోవుట చేతను, ఈ సూత్రములను శంకరాదులెవ్వరును ఉదాహరింపకపోవుట చేతను, బ్రహ్మసూత్ర, యోగ సూత్రములందలి కొన్ని సూత్రములు యథాతథముగ సాంఖ్యసూత్రము లందుండుటచేతను, 'తత్త్వసమాస' మను పేర లభించు మరికొన్ని సూత్రములు మాత్రమే కపిల ప్రోక్తము లని కొందరనుటచేతను, సాంఖ్య సూత్రములకర్త కపిలుడు కాడు, అర్వాచీను డెవడో ఈశ్వర కృష్ణాదుల గ్రంథముః

జదివి ఈ సూత్రములు వ్రాసెను - అని పాశ్చాత్యుల యొక్కయు, పెక్కుమంది భారతీయ విద్వాంసుల యొక్కయు అభిప్రాయము, (ఎ) అనిరుద్ధుడికంటే పూర్వులు భాష్యాదులు వ్రాసి యుండవచ్చును. అవి నష్టములై యుండవచ్చును. బ్రహ్మసూత్రములపై శంకరునికంటే పూర్వులగు బౌద్ధాయనాదులు వ్రాసిన భాష్యములు నశించినవికదా. భాగురిముని సాంఖ్యసూత్రములపై భాష్యరచనము చేసెనని దయానంద సరస్వతి కృతసత్యార్థ ప్రకాశము (ఆంధ్రానువాదము)న గలదు. ఈ భాగురిముని ఎవరో, ఈయన భాష్యమిప్పుడు దొఱకునో లేదో, ప్రకాశితమో కాదో, అలభ్యమైన ఆయన వ్రాసెననుట కాధారము లేవియో నే నెఱుగను. దయానందునివంటి మహా పండితుడు, సత్యాన్వేషి అప్రమాణికమనుమాట ననజాలడు గాన, అది విశ్వసనీయమే. శంకరాదులు సాంఖ్యసూత్రముల నుదాహరింపక పోవుటకు కారణము వారికి ఆ క్షణమున కా సూత్రములు జ్ఞప్తిలో లేక పోవచ్చును. దగ్గరలో వానిని కల్గిన తాళపత్రగ్రంథము లేకుండ వచ్చును. శంకరాదులు నేటివలె దగ్గర టైపుమిషనును, రిఫెరెన్సు లైబ్రరీని పెట్టుకొని వ్రాయలేదుకదా. బ్రహ్మసూత్రములందు భగవద్గీతను గూర్చియు, భగవద్గీతయందు బ్రహ్మసూత్రములను గూర్చియు ప్రశంసగలదు కదా. వీనిలో ఏది పూర్వము, ఏది అపరము ? అట్లే వ్యాసుని శిష్యుడగు జైమిని మతము బ్రహ్మసూత్రమందనేకచోట్ల ఉద్ధృతము. అందుచే జైమిని తరువాతివాడు బాదరాయణుడా ? సూత్రకర్తలందరు ఇంచుమించు సమకాలికులై యుండవచ్చును, లేదా చాలాకాలము నుండి సూత్రరూపముగ ప్రతినోటివెంట మెలగు నభిప్రాయమే ఒకచో బాదరాయణ కపిలాదులు సంగ్రహించి యుండవచ్చును. జైమిని పేరెట్లు బ్రహ్మసూత్రము లందు కన్పడినను తత్సూత్రకారుడు తర్వాతివాడు అని అనలేమో, పంచశిఖుని పేరు సాంఖ్య సూత్రములందు కన్పడిన మాత్రమున అది కపిల కృతము కాకుండపోదు గురువు దీర్ఘజీవియై వార్ధక్యమున గ్రంథరచనము చేసిన అందు ప్రశిష్యుల పేర్లు వారి శిష్యుల పేర్లుకూడ వ్రాసియుండుటలో అసంభవము లేదు సారాంశమేమన : సాంఖ్యసూత్రకారుడు కపిలుడు కాదని చెప్పువారు చూపు కారణము లన్నియు బలహీనములేగాని, ఆ సూత్రములను కపిలుడు వ్రాయుచుండగా చూచినవారునూ లేరు : వేద పురాణాదులందు పేర్కొనబడిన అతిప్రాచీనుడగు కపిలుడే : సాంఖ్యసూత్ర కర్తమరొకరు కాదు అనుటకు బలమైన అనుమాన ప్రమాణమును లేదు. అనిరుద్ధ విజ్ఞానభిక్షువులు మాత్రము అవి కపిల కృతములని అభిప్రాయపడిరి. అట్టి మేధావుల అభిప్రాయము లాదరణీయములు కాకుండునా ? అయితే నేడు దొఱకు సాంఖ్యసూత్రములలో తర్వాతివారు చేర్చినవి చాలా గలవని, తక్కినవి కపిల కృతము లని కొందరి అభిప్రాయము. కౌముదీప్రభలో స్వప్నేశ్వరుడు సాంఖ్యసూత్రములు పంచశిఖ కృతములనియు, కపిలమతము ననువదించునవి గాన అవి కపిలుని పేరనే బరగినవని చెప్పినాడు.

ఆరధ్యాయములు కలిగి, అనేకములగు కథలో నొప్పుచు చక్కగా సాంఖ్య సిద్ధాంతముల తేటపరచుచు, ఇతర దర్శనముల ఖండించు సాంఖ్యసూత్రములు కపిలుడు వ్రాసినవైనచో బుద్ధునికి పూర్వమే అది రచింపబడి యుండవలెను. మరెవరో వ్రాసి కపిలుని పేరు పెట్టియుండిన, లేక కపిలుడను పేరుగల మరియొక్కడు వ్రాసియుండినను అది 14వ శతాబ్దమునకు ముందే వ్రాయబడి యుండవలెను. ఎందుకన 15వ శతాబ్దపు అనిరుద్ధుడు వానిపై వృత్తియు, దాదాపు 1600 క్రీ.శ. ప్రాంతమున నుండిన మహాదేవుడు ఆ వృత్తికి సారమును వ్రాసెను. 16వ శతాబ్దములో విజ్ఞానభిక్షువు వానిపై భాష్యము వ్రాసెను. ఇదియే సూత్రములపై వ్రాయబడియున్న వానిలోకెల్ల మేటిదగు వివరణము. విజ్ఞానభిక్షువు సాంఖ్యదర్శనము నిరీశ్వరము కాదని, బ్రహ్మము ఆనందరూపుడను వాదముతో పొసగుననియు చూపగల్గినాడు. సాంఖ్య సూత్రములు కపిలుడే వ్రాసియున్న, కపిలుని అభిప్రాయములను విజ్ఞాన భిక్షువు సరిగానే వివరించగల్గియుండిన, సాంఖ్యదర్శనము నంత ఎక్కువగా తక్కిన దర్శన శాస్త్ర వాఙ్మయ మెందుకు చెండాడినదో ఊహించుట కష్టము. సాంఖ్యము నిరీశ్వరము అని చెప్పుమహాభారతములోని కొన్నిశ్లోకములు (ముఖ్యముగా 12 - 11039) జనకునికి పంచశిఖుడు చేసిన బోధ సాంఖ్యసూత్రములలో చెప్పబడినవని విజ్ఞానభిక్షువు తలచు సిద్ధాంతములతో సమన్వయించుట కష్టము. సాంఖ్యము నిరీశ్వరమే అనెదమన్న, భాగవతములో కపిలుడు బోధించినాడన్న సేశ్వర సాంఖ్యమునకు వైరుధ్యము వచ్చును. అందుచేత హరిభద్రుడన్నట్లు "సాంఖ్యా నిరీశ్వరాః కేచిత్ కేచిదీశ్వర దేవతాః", కొందరు సాంఖ్యులు సేశ్వరులు కొందరు నిరీశ్వరులు అని వొప్పుకొనవలసి వచ్చును. ఇరుతెగలవారును తమతమ సిద్ధాంతములే కపిలప్రోక్తములని ఘోషించుచుండిరి. సాంఖ్య సూత్రములు కపిల కృతములైనను, "ఈశ్వరా సిద్ధేః" ఇత్యాది సూత్రములు పూర్వపక్షమా ? సిద్ధాంతమా? అను మీమాంస వచ్చును నిరీశ్వరసాంఖ్యుల కవి సిద్ధాంతము లగును. సేశ్వరు లవి అన్యమతములను (జైనాదులను) అనువదించునవని అందురు. కపిలుని హృదయమేమో ఆయనకే వేద్యము !

'22 సూత్రములలో సాంఖ్యదర్శనమును విపులీకరించుచు తత్త్వ సమాస మనుపేర వర్తిల్లు గ్రంథమే కపిలకృతము. ఇతరములు కావు' అని కొందరి వాదము. మేక్స్‌ముల్లర్ ఇటుల తలచెను. ఇప్పు డెవ్వరును ఇటులనుటలేదూ. ఈ తత్త్వసమాసమనునది కేవలము విషయసూచిక వలె ఉండుటచేతను, దీనిపై అత్యంత ప్రముఖు లెవ్వరు వ్యాఖ్యానాదులు చేయకుండుటచేతను, ఇంత చిన్న సూత్ర గ్రంథము మరే దర్శనమునకు లేకుండుట చేతను, ఇది ప్రాచీనుడగు కపిలుడు వ్రాసినది కాకపోవచ్చును.

కపిలుడు వ్రాసినది ఈ రెండును కాదు, 'షష్టి తంత్ర' మనువేరొండు గ్రంథము. అని భాస్కరాచార్యులు ఇత్యాదుల అభిప్రాయము. (చూడు -

భాస్కరుల (బ్రహ్మసూత్ర భా. 2. 1 1.) సాంఖ్యకారికలపై (వ్రాయబడిన జయమంగళ వ్యాఖ్యానములో 'షష్టి తంత్ర' కర్త పంచశిఖుడని కలదు; భామతిలో వాచస్పతి షష్టి తంత్ర మందొక శ్లోకము నుదాహరించి అది వార్షగణ్యుడు చెప్పినదని అనినందున షష్టితంత్రకర్త వార్షగణ్యుడని కొందరందురు. షష్టితంత్ర మనునది (ప్రత్యేక గ్రంథము కాదు, షష్టిపదార్థములు ప్రపంచింపబడిన శాస్త్రము కాన షష్టి తంత్రము అన్నట్లు మాఠరాచార్యులు సూచించినాడు. వాచస్పతియు తత్త్వకౌముదియందు 'సేయం షష్టిపదార్థీకథితేతి.... శాస్త్రమే వేదమితి సిద్ధం' అనుచు షష్టిపదార్థములను వివరించు శాస్త్రము షష్టితంత్రము అని చెప్పి, 'షష్టి తంత్రము అను గ్రంథ విశేషము లేదని సూచించినాడు. మాఠరవాచస్పత్యాది మహామహులు ఇట్లనుటచేతను, షష్టితంత్రమను ప్రత్యేక గ్రంథము ఉపలబ్ధము కానందునను, సాంఖ్యదర్శనమే షష్టితంత్ర మనబడుచుండెడిది అని నిర్ణయించవచ్చుగాని, తత్త్వవైశారదిలో వాచస్పతియే ఒక శ్లోకమును షష్టితంత్రములోనిదని చెప్పి, దానినే భామతిలో వార్షగణ్యుడు చెప్పినది అనుటవలన, ఒకవేళ షష్టితంత్ర మను గ్రంథ ముండెనేమో, అది వార్షగణ్య అథవా పంచశిఖ కృతమేమో అను దుర్వారమగు శంకపొడమును

బృహత్సంహిత పైని తన వ్యాఖ్యానములో ఈశ్వరకృష్ణుని సాంఖ్య కారిక లుదహరించి, "తథాహ కపిలాచార్య" అని భట్ట ఉత్పలుడు అనుట చూడ, మన వ్యాఖాత్యలకు ఎవరేది వ్రాసినారు అను పెద్ద విచక్షణ, ఉదాహరించుటలో తగుజాగ్రత్త లేదని తేలును. అందుచేతనే ఒకవేళ స్వప్నేశ్వరు డన్నట్లు, సాంఖ్యసూత్రములు కపిల కృతములు కాదేమో అనియు శంక కలుగును. అది కిపలుడు వ్రాయకుండిన అతను వ్రాసిన దేమి ? షష్టితంత్ర మను గ్రంథవిశేషమా అని చెప్పెదమన్న, దానిని గూర్చియు వివాదమాయెను. - అసలా షష్టితంత్రమను నొక ప్రత్యేక గ్రంథము లభించదాయెను.

నిర్వివాదముగ 'సాంఖ్యకారిక' యను పేర ఇప్పు డుపలభ్యమగు గ్రంథము పరమార్థునిచే చైనీస్ భాషలోనికి ఆరవ శతాబ్దమున అనువాదితము గాన, నాల్గవ శతాబ్దమందలి వసుబంధువుచే అది ఖండింపబడినది. గావున దాని రచన తృతీయ శతాబ్దమందు జరిగెనని సర్వసమ్మతము. సాంఖ్యకారికలు 70 అనియు, వాటికి హిరణ్యసప్తతి యను పేరనియు, వాటి కర్తవింధ్యవాసి యనియు అతడు వార్షగణ్యుడి శిష్యుడనియు బౌద్ధ సాంప్రదాయము. వింధ్యవాసి యనునది వింధ్యపర్వతముల దుండుటచే ఈశ్వర కృష్ణునికి కల్గెనని టకాకుసూ ఇత్యాదుల అభిప్రాయము. ఈశ్వరకృష్ణుడు వేరు, వింధ్యవాసి వేరు అని, గుణరత్నుని అభిప్రాయము. మాఠర, వాచస్పత్యాదులు వ్యాఖ్యానము గావించిన సాంఖ్యకారికలు 72. అందు 71వ దానిలో సాంఖకారికా కర్త ఈశ్వరకృష్ణుడు అని కలదు. అందుచే టకాకుసూ అభిప్రాయము సమంజసము కావచ్చును. కాని గౌడపాదుడనువాడు (ఇతడు మాండూక్య కారికాకారుడు కానట్లున్నాడు) ఈ

కారికలపై వ్యాఖ్యానము వ్రాయుచు 69 దానివరకే వ్రాసినాడే, తక్కిన వాతడు ప్రక్షిప్తము లని తలచెనా లేక సులభముగ అర్థమగునవని తలచి వ్యాఖ్యానించుట మానెనా? కాని చైనీస్ అనువాదమందు 71 కారికల వరకు ఉండుటవలన, 71వ దానిలోనే ఈశ్వరకృష్ణుడు వాటికర్త అని యుండుట చేత టకాకునూ అభిప్రాయము బలపడుచున్నది. గుణరత్నుడు పొరబాటుబడి యుండవచ్చునేమో.

ఎవరు వ్రాసిన నేమి, "సాంఖ్య సూత్రములు", తత్త్వసమానము", "సాంఖ్యకారికా' అనునవి సాంఖ్య దర్శనముపై లభించు ప్రామాణిక గ్రంథములు. ఇందు మూడవ దానిపై నేను, సోమసేఖర శాస్త్రిగార్లు తెలుగులో వ్రాసి యున్నారు. మొదటిదానిపై ఇప్పుడీ గ్రంథోదయమైనది. షడ్దర్శనములలో ఒకటి సాంఖ్యము. సాంఖ్యదర్శన సిద్ధాంతములు ప్రతి పురాణమందు, మహాభారతాదులందు, మనుస్మృతి యందు, శ్వేతాశ్వేతరాద్యు+పనిషత్తులలోను, భగవద్గీత యందును కొంచెము మార్పులతో స్వీకరింపబడినవి. "తేత్కారణం సాంఖ్య యోగాధి గమ్యం" అనగా జగత్కారణము = భగవంతుడు సాంఖ్య యోగములచే తెలియదగినది, అది తెలిసిన బంధ విముక్తి అని ఉపనిషద్వచనము, "సిద్ధానాం కపిలో మునిః" అని గీతయు, "కపిల స్తత్వ సంఖ్యాతా భగవాన్" అని భాగవతమును, "పంచమః కపిలోనామ" అని గరుడ పురాణమును, "ఋషిం ప్రసూతం కపిలం యస్త మగ్రే" అని శ్వేతాశ్వతరోపనిషత్తు "కపిలః పరమర్షిః పురాతనః" అని భారతమును కపిలుని భగవదవతారత్వమును, సాంఖ్య శాస్త్ర కర్తృత్వమును కీర్తించినవి. గార్బె మున్నగు పాశ్చాత్య విద్వాంసులు "In Kapila's doctrine, for the first time in the history of the world, the complete independence and freedom of the human mind, its full confidence in its own powers, were exhibited" అని ప్రశంసించిరినారు. గ్రీకు తత్త్వవేత్తయగు పైథా గొరస్ సాంఖ్యమునుండి ఎంతో నేర్చికొనెనని వింటర్ నిట్జు అభిప్రాయము. అట్టి సాంఖ్యదర్శనమును అవగతము చేసికొనుటకు సాంఖ్యసూత్రముల కంటే మించిన దేముండును? ఆ సూత్రములు స్వయముగా కపిల కృతములు కాకపోయినను - కావని నేననలేదు - కపిలముని హృదయమునే చాలవరకు ప్రకాశపరచుచున్నవనుటలో సంశయము లేదు. వాటిపై ఆంధ్రమందు చక్కని భాష్యము బయల్వెడలుట ఆంధ్రుల భాగ్యము.

పండిత గోపదేవ్‌గారు చిన్నతనాననే ఏకాంత జీవితము, యోగము, ఆధ్యాత్మికానుభూతులపై చాల ప్రీతిని గల్గియుండిరి. అనేకాశ్రమములను చూచియు తృప్తినొందక, చివరకు పోఠోహర్ గురుకులమున శ్రీ ముక్తిరామోపాధ్యాయులను పండిత ప్రవరునివద్ద తక్కిన దర్శణములతో పాటు యోగదర్శనమును కూడ అధ్యయమనము చేసిరి నాటినుండి ఐహిక గురువులందరికి తిలోదకము లిచ్చి గురోర్గురువగు పరమేశ్వరుని గురువుగా నిశ్చయించుకొని, పతంజలి ఋషి

ప్రోక్తవిధముగ కాశ్మీరాంతర్గత మగు అమరనాథ క్షేత్రమున తీవ్రయోగ సాధనచేసి అంతర్ముఖిత్వము నందిరి. యోగాగ్నిచే ధూత కల్మషులై స్వస్థల మగు గుంటూరు మండలాంతర్గత కూచిపూడికి వచ్చి, దయానంద సరస్వతి ప్రదర్శిత మార్గమున అగ్రగాములగుచు, నిరంతరము వైదిక ధర్మ ప్రచారమందున్నవారు శ్రీగోపదేవ్‌గారు, ఈ వరకే వీరు వైశేషిక, న్యాయ, యోగదర్శనములపై వ్యాఖ్యానములు వ్రాసియున్నారు ఇప్పుడు సాంఖ్యదర్శన వ్యాఖ్యానము పూర్తిచేసినారు. శ్రీ గోపదేవ్ గారి ఈ నాల్గు గ్రంథములను ఇటీవలనే పరికించినాను. నిజము చెప్పుచున్నాను. వారి గ్రంథ పఠనము నా కాశ్చర్య అసూయలను గల్గించినది. షడ్దర్శనములలోను ఇంత పరిశ్రమచేసి, తత్ఫలితముశ్రమకు వ్యయమును ఓర్చి ఆంధ్ర లోకమునకు అందించుచున్న ఈయన వైదుష్యము చూచి, ఇట్టి పండిత దిగ్దంతి ఆంధ్రలోకమున నున్నందున ఆశ్చర్యము కల్గెను. సంస్కృతమందును, దర్శన శాస్త్రమందును ఇంతటి విద్వత్తు నా కసూయ కల్గించెను. ఆంధ్రదేశమున తర్కమందో, వేదాంతమందో పరిశ్రమ చేసిన పెద్ద పండితులు కొందరు లేకపోలేదు. కాని వారిలో ఎంతమంది తమ పాండిత్యము సర్వజనుల కుపకరించునట్లు చేయుచున్నారు? ఇంటికి వచ్చిన ఏ నల్గురైదుగురికో అధ్యాపన కార్యము చేయుటవలన గాని, ఏ సంస్కృత కాలేజీ యందో చక్కగా తినుటకు కూడ చాలని జీతముపై పనిచేయుట వలన గాని బహుజన సేవ అగుట లేదు జీవితమంతకు గలసి ఏ పంచదశిపైననో, హఠయోగ ప్రదీపిక పైననో ఎవరికి అర్థముకాని విధమున సంస్కృత వ్యాఖ్యలో ఉన్నదున్నట్లు దుముపులు' మాత్రమే చేర్చి తెలుగున వ్రాయుటవలన అచ్చు ఖర్చేగాని లాభమే ప్రాణికిని లేదు. శ్రీ గోపదేవ్ గారి వ్యాఖ్యలట్లు గాక అతీవ స్పష్టముగ, తేట తెనుగున నున్నవి. విశాలమగు భారతీయ దర్శన ప్రపంచమందాయన చిరాభ్యస్తుడగు ప్రయాణికుడు. ఆయన చూపిన మార్గమున పోయేదమేని కష్టరహితముగా ఆ ప్రపంచయాత్ర కొనసాగించగలము. సుష్టుగా అధ్యయనము చేసినందంతయు జీర్ణమైన దప్ప ఇట్టి వ్యాఖ్యలు వ్రాయలేరు ఆంధ్రదేశమందు ప్రస్తుతము మరెవరునుచేయలేని అత్యవసరమగు కార్యమును సాధించిన శ్రీ గోపదేవ్ గారికి నా హృదయపూర్వక ధన్యవాదములు.

శ్రీ గోపదేవ్ గారు తమ పనిని చేసినారు : ఇక ఆంధ్రులు, అనగా విశ్వవిద్యాలయములు, సంస్కృత కళాశాలలు, పండితులు, జనసామాన్యము వారి కృతులను సమాదరించి లాభము నొందెదరు గాక, లేనిచో మనకే నష్టము.

అచిరకాలములోనే పూర్వోత్తర మీమాంసలపై కూడ ఆంధ్ర వ్యాఖ్యానములు ప్రకటించిన, వారు వాచస్పతి అపరావతార మనునది ధృవపడును.





# పరిచయము

"ఏకమేవ దర్శనమ్ ఖ్యాతిరేవ దర్శనమ్ "

సాంఖ్యదర్శనము భారతీయ దర్శనములలో నొకటి, ముఖ్యముగా షడ్ దర్శనములని పిలువబడు ఆస్తిక దర్శనములలో నన్యతమము, భారతీయ జనశ్రుతి ననుసరించి యీ దర్శనము ఇతర దర్శనముల కంటే ప్రాచీనముగ నెంచబడుచున్నది. ఈ గ్రంథమును రచియించిన మహనీయుడు పరమర్షి కపిల భగవానుడు.

కపిల మహర్షి

కపిల మహర్షి కణాదాదుల కంటె నతిప్రాచీనుడు. కావున నీ మహర్షి యెప్పటివాడో మఱియు నెక్కడివాడో నిర్ణయించి చెప్పుట దుస్తర మగుచున్నది. సంస్కృత వాఙ్మయములో కపిల నామము గల యాచార్యుల వర్ణన లనేక విధముల ననేక స్థలములందు జూడనగును. అందువలన వీరిలో సాంఖ్యదర్శన రచయిత యే కపిలుడో విద్వాంసులు నిశ్చతముగ నిర్ణయింప జాలకపోవుట వింతకాదు విదేశీయాక్రమణముల మూలమున భారతీయ సాహిత్యము, ఆవాస నిలయములు నెన్నియో విధములయిన మార్పులకు గురియైనవి. ఆయా సమయములందు గలిగిన భౌగోళిక పరివర్తనములు కారణములుగ భారతీయ చరిత్రమును బోధించు సాధనములు భూగర్భమున విలీనములై పోయినవి. కావున వేలకొలది సంవత్సరములకు పూర్వము గతించిన వ్యక్తులను గురించి నేడు ఇదమిత్థమని నిర్ణయింపగలుగుట దుస్తరమే.

భారతభూమియందు కపిల నామముతో వ్యవహరింపబడినవారు నలువురు ఋషిపుంగవు లుద్భవించినట్లు కొందఱు విద్వాంసులు భావించుచున్నారు. వారిలో నొకరు కలియుగమున గోతమ వంశమందు జన్మించినవారు. వారి నామముతోనే కపిలవస్తు నగర మొకప్పుడు నిర్మింపబడినట్లు బౌద్ధ వాఙ్మయమున చూడనగును. విదేశీయ విద్వాంసులలో పలువురీ గోతమ వంశజుడైన కపిలుడే సాంఖ్యదర్శన కర్తయని భావించుచున్నారు. కాని యియ్యది సత్యము కాదు. సాంఖ్యదర్శన మతి ప్రాచీనము మిగిలిన ముపృరు కపిలులలో నొకరు బ్రహ్మమానస పుత్రుడు మూలజ్ఞాని. రెండవ ఋషి యొక్క యవతారము. మూడవ కపిలమహర్షి కర్దమ ప్రజాపతికి దేవహూతియందు జన్మించిన వాడు.

ఉపర్యుక్త వ్యక్తులలో నాల్గవవాడైన కపిల మహర్షియే సాంఖ్యదర్శన రచయిత యని పరిశోధకుల నిర్ణయము. ఈ కపిలదేవుని గురించి

శ్రీమద్భాగవతమున తృతీయస్కంధమునందు ఇరువది మూడవ యధ్యాయము మొదలు ముప్పదిమూడవ యధ్యాయము వరకు విస్తారముగ వర్ణింపబడియున్నది.

**"ఏతన్మే జన్మలోకేऽస్మిన్ ముముక్షూణాం దురాశయాత్**

**ప్రసంఖ్యానాయ తత్త్వానాం సంమతా యాత్మదర్శనే"।** భా. 3-24-36

విష్ణుభగవానుడు కర్దమ ప్రజాపతి భార్యయైన దేవహూతియు దవతరించినట్లును, సరస్వతీ నదీతరమున నున్న కర్దమ ప్రజాపతి యాశ్రమమునకు మరీచ్యాది మహర్షులతోబాటు బ్రహ్మ వచ్చినట్లును మఱియు నా బ్రహ్మకర్తమునితో ఆదిపురుషుడైన భగవాన్ విష్ణువు తన మాయ ద్వారా ప్రాణులకు శుభము చేకూర్చుటకై కపిల దేహమును ధరించినాడు" అని చెప్పినట్లు భాగవతమున జూడనగును. ఇంతియేకాక యా బ్రహ్మ, దేవహూతితో "మనుపుత్రీ ! నీ కడుపున విష్ణువు జన్మించినాడు. అతడు నీకు అవిద్యాజన్య సంశయముల నన్నిటిని బోగొట్టి పృథివియందు చరించును. అతడు సిద్ధులలో నందఱ కంటె శ్రేష్ఠుడై సాంఖ్యాచార్యులలో సుప్రతిష్ఠితు డగును. ప్రపంచమున కపిలు డని ప్రసిద్ధివడయును" అని చెప్పినాడు.

ఇట్లు భాగవతమున వర్ణింపబడిన కర్దమ ప్రజాపతికి దేవహూతి యందు జనించిన కపిల మహర్షియే సాంఖ్య దర్శనకర్త యని పరిశోధకుల మతము. ఈ కపిలుడే బ్రహ్మ మానసపుత్రుడనియు, అగ్నియొక్క యవతార మనియు నూహింప వీలగును.

గరుడ పురాణమునం దొకచో నిట్లు వర్ణింపబడినది.

**"పంచమః కపిలోనామ సిద్ధః కాలవిప్లుతమ్**

**ప్రోవాచాసురయే సాంఖ్యం తత్త్వగ్రామవినిర్ణయమ్"**

ఈ శ్లోకమున కపిలుడు విష్ణువు యొక్క పంచమావతారముగా చెప్పి యతడే సాంఖ్య ప్రవక్తయని చెప్పియుండుట స్పష్టమగుచున్నది.

ఈ విషయమున సాంఖ్యదర్శన వ్యాఖ్యాత యగు విజ్ఞానభిక్షువు కూడ తన యభిప్రాయము నిట్లే వివరించియున్నాడు.

**"తదిదం సాంఖ్యశాస్త్రం కపిలమూర్తిః భగవాన్ విష్ణు**

**రఖిలలోకహితాయ ప్రకాశితవాన్ .........**

"భగవాన్ విష్ణుస్వరూపుడగుకపిలమూర్తి యీ సాంఖ్య శాస్త్రమును లోకహితము కొఱకు ప్రకాశింపజేసినాడు.

ఈ సందర్భముననే విజ్ఞాన భిక్షువు, అగ్న్యవతారమయిన కపిలుడు సాంఖ్యమును రచించినాడు' అను పరుల వాదమును సైతము ఖండించి అగ్న్యవతారముగ నెంచబడు కపిలుడు విష్ణువు యొక్క యవతారమని చెప్పబడు కపిల మహర్షి కంటె భిన్నుడు కాడనియు నొక్కి చెప్పి యున్నాడు.

షడ్ దర్శనములకు వ్యాఖ్యాన మొనర్చిన వాచస్పతి మిశ్రులును 'ఈ

కపిలమహర్షియే సాంఖ్యదర్శన కర్తయని వ్రాసియున్నాడు. ఇతడు తనచే రచియింపబడిన సాంఖ్యతత్వ కౌముదియందు అరువది తొమ్మిదవ కారికకు వ్యాఖ్య నొనరించుచు, 'పరమర్షి' పదమునకు 'కపిలుడు' అని యర్థము వ్రాసియున్నాడు మఱియు నలువది మూడవ కారికను వివరించు తావున

"యథా సర్గాదా వాది విద్యాన్ బగవాన్ కపిలో మునిర్ధర్మజ్ఞాన వైరాగ్యైశ్వర్య సంపన్నః ప్రాదు+ర్బభూవేతి స్మరంతి".

"సృష్టి ప్రారంభమునందు ధర్మ జ్ఞానాది సంపన్నుడును, ఆది విద్వాంసుడును, భగవానుడు నగుకపిలు డుద్భవించినాడు' అని వ్రాసి యున్నాడు. ఈ ప్రసంగములను జూచినపుడు వాచస్పతి మిశ్రులును కర్ధమ దేవహూతులకు జనించిన కపిలమహర్షియే సాంఖ్య దర్శన రచయితయని యంగీకరించుచున్నట్లు స్పష్టమగుచున్నది.

ఇంతటి విద్వాంసు లిట్లు సాక్ష్యము బలుకుచుండగా, కొందఱు ఆధునికులు పాశ్చాత్య విద్వాంసులు, వారి ననుగమించు భారతీయ విపశ్చితులును కపిల మహర్షి చారిత్రిక పురుషుడే కాదని వాదించుచున్నారు. వారి దృష్టిలో కపిలుడు మనవలె పాంచభౌతిక శరీరధారియే కాడు. పలువురు భారతీయ విద్వాంసులు సైతము పాశ్చాత్యుల యభిప్రాయము నూది పలుకుటయే తమకు గౌరవప్రదమని యెంచుచున్నారు. అందువలన పాశ్చాత్యులతో నేకీభవించి భారతదేశమునకు గౌరవము నాపాదించు వాస్తవిక ఘట్టముల ననేకములను అసత్యము లనియు, కల్పితము లనియు చెప్పుటకు వెనుకాడకున్నారు భారతీయ విద్వాంసుల యీ మనోవృత్తి సత్యపక్షపాతుల హృదయములకు కష్టము కలిగింపక పోదు.

ఇట్లనుటచే మిథ్యా భూతమగు నాత్మశ్లాఘకు లోనయి పరులు నిరూపించు సత్యము నంగీకరింపరాదని నా యభిప్రాయము కాదు. వాస్తవమును కల్పితమని చెప్పుటలో పరానుగామిత్వము మాత్రము ప్రశసంనీయము కాదనియే చెప్పవలసి వచ్చును.

కోల్‌బ్రుక్ జైకోబీ మోక్షమూలర్ ప్రభృతి పాశ్చాత్య విద్వాంసుల దృష్టిలో కపిలు డొక కాల్పనిక వ్యక్తి. ఈ విషయమును చూడదలచినవారు డా. రిచర్డ్ గార్వే రచించిన (సాంఖ్య అండ్ యోగ) అను రచన చూడవచ్చును. కీథ్ తనచే రచయింపబడిన (సాంఖ్య సిస్టమ్) లో కపిల పదమునకు 'హిరణ్యగర్భుడు' పర్యాయ పదమనియు, కపిలునకు శివ, విష్ణు, అగ్ని ఆదులతో నేకాత్మత సంస్కృత సాహిత్యమున జూడనగుచున్నదనియు, కాబట్టి కపిలుడను నొక చారిత్రిక పురుషుడు వాస్తవమున లేడనియు వ్రాయుచున్నాడు.

కొన్ని విశేష గుణములు నిమిత్తముగా గైకొని యొక వ్యక్తిని నామాంతరములచే వ్యవహరించిన మాత్రాన ఆ యా నామ పదములు పార్యయములు కాజాలవని విద్వాంసుల యభిప్రాయము. శౌర్యధైర్యాది గుణములను పురస్కరించుకొని యొక బాలకుని సింహమని వ్యవహరిచుట బాలక, సింహ పదములలో పర్యాయతను

సాధించునా ? మఱియు నందువలన బాలకుడు కల్పితుడన నొప్పునా ? ఇట్లే కపిలుడును తన లోకాతిశయ గుణములు నిమిత్తము కాగా, అగ్ని, విష్ణువు ఆదినామములచే కీర్తింపబడియుండుట సంస్కృత సాహిత్యమున జూడనగును. అంతమాత్రమున నతడు కల్పితవ్యక్తి యని నిర్ణయించుట విచార సహము. తర్క సహము కానేరదు. ఒక వస్తువుయొక్క యస్తిత్వమును నిరూపించుటకు దానిని సాధించు ప్రమాణములుండి, బాధక ప్రమాణములు లేకుండ వలయును. కాబట్టి కపిలుని యస్తిత్వమును సాధించు ప్రమాణము లనేకము లుండుటయే కాక బాధక ప్రమాణ మెందును లేకునికికపిలుడు కాల్పనిక వ్యక్తియని యూహించుట నిరాధారమని తేట తెల్లము.

పాశ్చాత్య విద్వన్మతి ననుగమించిన భారతీయ విద్వాంసులలో పం. గోపీనాథ కవిరాజుగా రొకరు వీరును కపిలుడు కాల్పనికవ్యక్తి యని వ్రాసియున్నారు.

కపిల సాంఖ్య నిర్వాణ, కపిల సిద్ధదేహ ఆసురి సాంఖ్యవిద్యా."

'మొదటి సాంఖ్యప్రవక్త లేక యీ కల్పమునందు మనుష్య జాతికి సంబంధించిన సర్వ ప్రథమ విజ్ఞప్రాణియగు కపిలుడు చారిత్రిక పురుషుడు కాడని నిస్సందిగ్ధముగా చెప్పవచ్చును.........." అని వ్రాయుచు నీ సందర్భమున కవిరాజు గారు చివరకు "కపిలుడు నిర్యాణమును బొందుటకు పూర్వము తన కొక సిద్ధ దేహమును కల్పించుకొని శిష్యుడైన ఆసురికి సాంఖ్య విద్య నుపదేశించుటకు అతని ముం దగపడెను." అని నిబంధించి యున్నారు. కవిరాజు గారి యీ చివరి వాక్యము వారి పూర్వ వాక్యమున కెంత విరుద్ధముగా నున్నదో వారు గమనింపకుండుట విచారణీయము. కపిలుడు వాస్తవికముగ దేహధారియైన వ్యక్తి కాదనుచు నిర్యాణమును బొందుటకు పూర్వము సిద్ధదేహమును ధరించి ఆసురికి సాంఖ్య విద్యను బోధించినా డని యంగీకరించుటలో గల సామంజస్యమేమి ? కపిలుడు వాస్తవమున చారిత్రిక పురుషుడు కాకున్న నిర్వాణమును బొందిన దెవరు ? నిర్వాణమును బొందుటకు పూర్వము కపిలుడు ధరించిన సిద్ధదేహ మెట్టిది ? అది భౌతికమా ? అభౌతికమా ? అభౌతిక మగుచో ఆసురి యెదుట ప్రత్యక్ష మెట్లు కాగలదు ? భౌతికమే యగునెడల ఆ దేహ మెంత తడవు అటు లున్నది : అయ్యది కొంత కాలము మనుజుడైన ఆసురికి సాంఖ్యమును బోధింప ననువుగా భూమిపై వ్యవహరించియున్న పక్షమున కపిలుడు కాల్పనికు డెట్లగును? కావున కవిరాజు గారి లేఖయే వారి మతమున కడ్డువచ్చుచున్నది ఇంతియే కాక వారి లేఖను చక్కగా పరిశీలించినచో నయ్యది కపిల మహర్షి యైతిహాసిక పురుషు డనియు నాది విద్వాంసు డనియు నా కాలపు సిద్ధులలో నతడు శ్రేష్ఠుడనియు బోధపడగలదు.

ఇట్లు ఆదికామలున కర్దమ ప్రజాపతికి మనుపుత్రియైన దేవహూతి యందు జన్మించిన కపిలమహర్షియే జన్మాంతర సంస్కారబలముచే సిద్ధుడై

సాంఖ్యదర్శనమును రయించినాడని తేలుచున్నది.

కాలము : కపిలమహర్షి కాలమును నిర్ణయించుటకును తగిన సాధనసామగ్రి లభించుట దుష్కరమే యగుచున్నది. ప్రస్తుతమున యుగముల కాలనిర్ణయము చేయుటకు ననువులేకున్నది. కాగా ఆది విద్వాంసుడైన కపిలమహర్షి సత్యయుగమునకు చివరనో, త్రేతాయుగమునకు ప్రారంభమునోయున్నట్లు పాంచరాత్ర సాంప్రదాయమునకు సంబంధించిన అహిర్బుధ్న్య సంహితలో వర్ణింపబడియున్నను కాలనిర్ణయము చేయజాలము. మహాభారతమునందు శాంతిపర్వములో వర్ణింపబడియున్న కపిల - ఆసురి సంవాదమును బట్టి చూచినను కపిలుడు మిక్కిలి ప్రాచీనుడనియే చెప్పనగును. మఱియు నుపనిషత్తులలో నొకటి యగు శ్వేతాశ్వతరోపనిషత్తు నందును కపిలుని నామము స్పష్టముగా నుల్లేఖింపబడినది. కపిలనామమే కాక సాంఖ్య సిద్ధాంతములు నీ యుపనిషత్తునందే కాక యితర ఛాందోగ్యా ద్యుపనిషత్తులందు ప్రతిపాదింపబడి యుండుట చూచుచున్నాము. కఠోపనిషత్తునందు (1. 3.10.11.) ఇంద్రియములు, తన్మాత్రలు, మనస్సు, అహంకారము, మహత్తు, అవ్యక్తము, పురుషుడు నను నీ సాంఖ్యదర్శన ప్రతిపాద్య విషయములు చక్కగా వివరింపబడియున్నవి. వేదమునందును సాంఖ్య మూల సిద్ధాంతముల నిరూపింపబడి యున్నవి. కాని, వేదనిరూపిత సాంఖ్యపదార్థములకు దార్శనిక స్వరూపము నొసంగినవాడు పరమర్షి కపిలుడు. అట్టి దార్శనిక స్వరూప ప్రతిబింబములే యుపనిషత్తులందు మనకు గోచరించుచున్నవి. కాబట్టి కపిలుడు ఉపనిషత్తుల కాలమునకు పూర్వుడనియు చెప్పుట సాహసము కానేరదు.

పై పంక్తులజినుబట్టి కపిలమహర్షి సత్యత్రేతల సంధిసమయమున నుండియుండునని సామాన్యముగ జెప్పగలిగినను యుగప్రమాణ మనిశ్చిత మగుటచే నన్ని వత్సరములని చెప్పజాలము. కర్దమ ప్రజాపతి యాశ్రమము సరస్వతీ నదీతీరమున నున్నట్లు సంస్కృత సాహిత్యమున జదువుచున్నాము. కపిలుని జన్మస్థానము నయ్యదియే యై యుండును. ఆశ్రమ నిర్మాణ సమయమున సరస్వతీనది ప్రవాహ పూర్ణమై ప్రాంత భూమిని సత్యశ్యామల మొనర్చి యలరారుచుండి యుండును. నేడు సరస్వతీనది ప్రవాహ రహితమై నామావశిష్టముగా నున్నది. ఐతిహాసికుల దృష్టిలో నా నది యెండిపోయి కనీసము ఇరువదియైదువేల సంవత్సరములు గతించియుండునని యూహింపబడుచున్నది. ఇట్లిరువది యైదువేల సంవత్సరములకు పూర్వ మీ సరస్వతి సలిలపూర్ణమై సంపదలీనుచున్న రోజులలో నెన్నడు కర్దము డా నదీతీరమున తన యాశ్రమము నిర్మించియుండెనో యెట్లూహింపనగును ? కాని యీ నదీ చరిత్రము కపిలు డెంతటి పూర్వుడో యూహింప నొకింత తోడ్పడక పోదు.

కాలీపద భట్టాచార్యులు 1932 లో తాము రచియించిన నొక లేఖయందు కపిలమహర్షి క్రీస్తు జన్మమునకు ఏడువందల సంవత్సరములకు పూర్వమే యుండి

యుండునని నిర్ణయించినారు. వారు తమ నిర్ణయమునకు ఆధారముగా నీశ్వరకృష్ణునిచే రచియింపబడిన డెబ్బది యొకటవ కారికలో వర్ణింపబడిన సాంఖ్యాచార్యుల శిష్యపరంపరను గ్రహించియున్నారు. వారు కపిలుడు మొదలు ఈశ్వరకృష్ణుని వరకు గల పరంపరాగత శిష్యులు ఇరువదియైదుగురని గణించి, యొక్కొక్కరి జీవితకాలము సగటున ముప్పది వర్షము లని యెంచి యుపర్యుక్త కాలమును నిర్ణయించి యున్నారు. కాని, యిట్టి యూహ పరిపూర్ణ మనుటకు వలనుపడదు. కారణమేమన :- భట్టాచార్యులే వ్యాఖ్యానముల యాధారమున నీ శిష్య సంఖ్యను నిర్ణయించియున్నారో యా వ్యాఖ్యానములే కాక తదితర వ్యాఖ్యానములలో నొకటి యగు యుక్తి దీపకయందు నుపర్యుక్త శిష్యులేకాక మఱికొందఱు సాంఖ్యాచార్యుల పరంపరకు చెందినవారు వర్ణింపబడి యున్నారు. వారి సంఖ్యయు నందు చేర్పబడినచో కాలపరిమితి యింకను పెరుగ గలదు. కాబట్టి భట్టాచార్యుల పద్ధతి ననుసరించియు నిశ్చితముగ కపిలుడు క్రీస్తుకు పూర్వ మెనిమిదవ శతాబ్దము వాడని కానీ, లేక యంతకు పూర్వము వాడని కానీ చెప్ప నలవికాదు.

క్రీస్తుశకము పదునాలుగవ శతాబ్దమునకు తరువాతనే యొకానొక కపిలనామక పురుషునిచే సాంఖ్యదర్శనము నిర్మింపబడినదని చెప్పు విద్వాంసులు కొందఱు గలరు. ఇందుకు రెండు కారణములు ముఖ్యముగా జెప్పుదురు ఒకటి: - శంకరాచార్యుడు, సాయణుడు మున్నగు దార్శనిక ఆచార్యులు సాంఖ్య సూత్రములను తమ రచనలలో నెక్కడను నుల్లేఖించి యుండకపోవుట. రెండు : సాంఖ్యదర్శనము నందలి సూత్రములలో న్యాయము, వైశేషికము మున్నగు నామములు వాడబడియుండుట.

ఒకానొక గ్రంథము ఆధునికము అని చెప్పుటకు ఆ గ్రంథములోని పదములో వాక్యములో సూత్రములో మరియొక గ్రంథములో గ్రహింపకుండుట ప్రమాణముగ కానీ, కారణముగ కానీ చెప్పుట యుక్తి యుక్తము కాదు. ఇట్టి యుల్లేఖనమే యొక పుస్తకము యొక్క ప్రాచీన తార్వాచీనతలను సాధింపసాధకముగ నంగీకరింతుమేని యది కార్యసాధకము కానేరదు. సాయణుడు తనచే రచయింపబడిన ఋగ్వేద భాష్యమునందు వేంకట మాధవుని నామము తక్క తన కంటె నెంతో పూర్వకాలమునందు వేద భాష్యమునురచియించి గతించిన వారి నామముల నెక్కడను పేర్కొని యుండలేదు. అందు చేత, స్కందస్వామి, నారాయణుడు, ఉద్గీథుడు, భట్టభాస్కరుడు మున్నగు ప్రాచీన వేదభాష్య కర్తలందఱు సాయణుని కంటె తరువాతి వారని చెప్ప సాహిసింపనగునా ? ఎన్నిటికి కాదు - స్కందస్వామి ప్రభృతులు సాయణాచార్యులకంటె పూర్వులనుట నిర్వివాద విషయము. కాబట్టి సాంఖ్య సూత్రములను శంకరాచార్యాదులు తమ గ్రంథములలో నుల్లేఖింపనంతమాత్రమున కపిలుడు శంకరాదులకంటె నర్వాచీనుడు (తరువాతి

వాడు) అనుట సరికాదు.

సాంఖ్యదర్శనము అర్వాచీనమని చెప్పువారి రెండవ యుక్తి యొకింత బలవత్తరముగ కనిపింపకపోదు కాని సూత్ర రచనను బాగుగ పరిశీలించిన తదుపరి పరిశీలకులు సాంఖ్యదర్శనము ప్రాచీనముకాదని చెప్పుటకు తోడ్పడు సూత్రము లన్నియు ప్రక్షిప్తములుగా నిర్ణయించుచున్నారు.

"నవయం షట్ పదార్థ వాదినో వైశేషికాదివత్ " 1-25
న షట్పదార్థ నియమస్తద్ బోధాన్ముక్తిః" 5. 65.
"షోడశకాది ష్వప్యేవమ్" 5. 86.

ఈ సూత్రములందు వైశేషిక పదము కణాదుని, సోడశపదము గౌతముని బోధించును. కపిలుడు పూర్వము వర్ణించినట్లు ఉపనిషత్కాలముకంటె పూర్వు డగునెడల తనచే రచియింపబడిన సూత్రములందు తనకు తరువాతి వారైన కణాదాదుల నెట్లు పేర్కొనగలడు? కావున కణాదాదులకు తరువాతివాడై యుండవలయునని యెంచుట యుక్తి సంగతముగా తోచును కాని ప్రస్తుతము సాంఖ్యదర్శనమున నున్న సూత్రములన్నియు నున్నవి యున్నట్లు కపిలమహర్షి రచితములని పరిశోధకులు అంగీకరింపరు. సూత్ర రచనాశైలిని పరీక్షించి యిట్టివి యనేక సూత్రములు ప్రతి యధ్యాయమునందును ఆధునికు లెవరో చేర్చియున్నారని పరిశీలకుల నిశ్చయము. అందువలననే బౌద్ధాదుల మతఖండనములు సైతము ఈ దర్శన సూత్రములందు నామోల్లేఖ పూర్వకముగ కానవచ్చుచున్నవి.. ఈ వాదము నంగీకరించియు మేము ప్రక్షిప్త సూత్రములను పుస్తకమునుండి తొలగింపక ఉన్నవి యున్నట్లు వ్యాఖ్యానము చేసియున్నాము. విజ్ఞాన భిక్షువు మున్నగు వ్యాఖ్యాకారులును ఇట్లే వ్యాఖ్యానము చేసియున్నారు.

పై వివాదగ్రస్త విషయములన్నియు "సాంఖ్యదర్శన్ కా ఇతిహాస్" అను నొక గ్రంథము ననుసరించి యొకింత యిట చర్చించియున్నాను. ఈ గ్రంథమును విద్యాభాస్కర, వేదరత్న, శ్రీ పండిత ఉదయవీరశాస్త్రి (న్యాయతీర్థ సాంఖ్య యోగతీర్థ, వేదాంతాచార్య) గారు రచియించి యున్నారు. వీరే సాంఖ్యదర్శన - ఇతిహాసము పాఠకుల కందజేయుటకై సుమారు ఇరువదియైదు సంవత్సరము లన్వేషణ చేసినట్లు తెలియుచున్నది. పీఠికయందు చర్చించిన విషయములే కాక యితరానేక విషయములు సాంఖ్యదర్శనమునకు సంబంధించినవి పాఠకుల పై గ్రంథమునందు వివరముగాను, సప్రమాణముగాను జూడగలుగుదురు.

స్థానము :-

కపిల మహర్షి జన్మస్థానము సరస్వతీ నదీతీరము నందలి కర్దము ప్రజాపతి యాశ్రమ మని సామాన్యముగ నింతకు పూర్వము నిర్దేశించియున్నాను. ఉత్తర భారతమున అంబాలా జిల్లాకు - ఉత్తర పూర్వము - ఈశాన్యమున సిర్మార్‌రాజ్యము (నాహన్‌స్టేట్) నందు సరస్వతీ నదీచిహ్నము లక్కడక్కడ నేటికిని

కనిపింపకపోవు. 'శివాలక' పర్వతమున 'ఆదిబద్రీ' నామము గల కనుమనుండి సరస్వతీ నది బయటబడి సమతలమున ప్రవహించి యుండెను. ఐదారు మైళ్ళు పైగా హరిపుర కనుమనుండి బయటబడిన శాఖ యొకటి యీ సరస్వతి యందు కలియు చుండెడెది. 'శివాలక' ప్రదేశమునకు ముప్పదిమైళ్ళ దూరములో నీశాన్యముగా రేణుక యనెడి యొక సరస్సున్నది దాని యిప్పటి సంకుచిత నీరసస్థితిని జూచి యొకప్పు డట నొక పెద్ద నదీప్రవాహ ముండి యుండనోపు నని యూహంపనగును. దానికి నైదాఱుమైళ్ళ దూరమున నీశాన్యముగ నొక పెద్ద పర్వత మున్నది. దానిపై రెండు చిన్న చిన్న శిఖరములున్నవి. అందొకదాని పేరు నేటికిని 'కపిలటిబ్బ' యనియు మఱియొకదాని పేరు 'జమదగ్ని' యనియు చెప్పబడుచున్నది. ఆ స్థానిక చరిత్రము కూడ జమదగ్ని, రేణుక పరశురాముల చరిత్రమునకు సంబంధించియే యున్నది.

సరస్వతీ నది యుపర్యుక్త స్థలములకు ఈశాన్యముగ కొంత దూరములో 'బిందుసరమ'ను సరస్సున నుద్భవించి పై స్థలములకు సమీపమున ప్రవహించుచుండి యుండును. ఈ నదీతీరమునకు సమీపమున నేటికిని కపిల నామముతోనే పిలువబడు నా శిఖరమే కపిల జన్మస్థానము - కర్దమ ప్రజాపతి యాశ్రమమై యుండనోపును.

భాగవతము ననుసరించి స్వాయంభువ మనువు తన కన్యను దేవహూతినిచ్చి వివాహ మొనర్చుటకై కర్ధముని ఆశ్రమమునకు వచ్చి యున్నాడు. ఆ స్థానము బ్రహ్మావర్తముననో దానికి సమీపమునో ఉన్నట్లు చెప్పబడుచున్నది. ఇట్లు సంస్కృతమున లభించు బిందుసరము, సరస్వతీ, బ్రహ్మావర్తనము మున్నగు శబ్దముల యాధారముతో కపిలుని జన్మస్థానము నాహన్‌స్టేటులో నున్న రేణుకా సరస్సునకు సమీపమని యూహింపనగుచున్నది.

ఈ గ్రంథము సాంఖ్యదర్శనము లేక సాంఖ్య ప్రవచనము, అనియు, షష్ఠితంత్రమనియు సంస్కృత వాఙ్మయమున పేర్కొనబడినది. ఇందలి ప్రతిపాద్య విషయము ఆధ్యాత్మిక దృష్టితో నరువది విధముల విభాగింపబడుటచే నియ్యది షష్ఠితంత్రమని పిలువబడును. ఆధిభౌతిక దృష్టితో విషయవిభాగ మొనర్చి తత్త్వవ్యాఖ్యాన మొనర్చి నందున సాంఖ్య ప్రవచన మనియు లేక సాంఖ్యదర్శనమనియు చెప్పబడినది.

ఆదిబౌతిక వివేచన దృష్టితో నీ శాస్త్రమున నిరువది నాలుగు జడతత్త్వము లొక వర్గముగాను, చేతన తత్త్వములు మఱియొక వర్గముగాను విభజించి, మొత్తము ఇరువదియైదు తత్త్వము లిందు వివరింపబడును. జడవర్గమునకు ప్రకృతి మూలకారణము. మిగిలిన నిరువది మూడు తత్త్వములు దాని కార్య పదార్థములు. ప్రకృతి పురుషుల వివేకజ్ఞానము కలుగుటయే సాంఖ్య మనబడును. ఇదియే మోక్షము లేక యపవర్గ మనబడును. ఇట్టి వివేక జ్ఞాన మిందు ప్రవచించుటయే నీ శాస్త్రము సాంఖ్య ప్రవచన మనియు చెప్పబడును.

కపిలమహర్షి షష్ఠితంత్రము, లేక సాంఖ్యదర్శనమును రచియించి తన శిశ్యుడైన ఆసురికి బోధించి యున్నాడు. ఆసురి యా తంత్రమునే పంచశిఖాచార్యునకు బోధించియున్నాడు. అత డీ శాస్త్రమును అధ్యాపనము, వ్యాఖ్యానము, లేఖనము మున్నగు రీతులలో దేశమున నలుగడల వ్యాపింపజేసియున్నాడు. ఇట్లు శిష్యపరంపరగా నీ గ్రంథము ఈశ్వరకృష్ణునకు లభించినది. ఈ శిష్య పరంపరలో భార్గవుడు, ఉలూకుడు, వాల్మీకి, హారీతుడు, దేవులుడు, జనకుడు, వశిష్ఠుడు, పతంజలి, వార్ష గణ్యుడు, గర్గుడు, గౌతముడు మున్నగు పలువు రాచార్యులు లెక్కింపబడుచున్నారు.

ఈశ్వరకృష్ణుడీ దర్శన సిద్ధాంతములను బాగుగ నాకళించుకొని, సాంఖ్య సప్తతి - సాంఖ్యకారిక యను పేరుతో నొక గ్రంథమును ఛందో బద్ధముగ రచియించి యున్నాడు. అందువలన సాంఖ్యదర్శనము ఆర్వాచీనమనియు, ఈశ్వరకృష్ణ రచిత కారికలు ప్రాచీనములనియు నెంచువారి మత మనాదరణీయమే యని తేలుచున్నది. కావుననే ఈశ్వరకృష్ణుడు తన డెబ్బదిరెండవ కారిక నిట్లు రచించియున్నాడు.

**"సప్త త్యాంకిల యేఽ ర్థాస్తేఽ ర్థాః కృత్స్నస్య షష్ఠితంత్రస్య**
**ఆఖ్యాయికా విరహితాః పరవాదవవర్జి తాశ్చ'**

"కారికా సప్తతిలో నున్న సమస్త పదార్థములు షష్టి తంత్రములోనివే. షష్టితంత్రములోని అఖ్యాయికలు, పరవాద ఖండనలు మాత్రమిందు వర్ణించలేదు" అని తన గ్రంథము నుపసంహరించి యున్నాడు.

ఆధ్యాత్మిక దృష్టితో సాంఖ్యదర్శనమున వర్ణింపబడిన అరువది పదార్థములు.

1. పంచ విపర్యయములు :
   1. తమస్సు = అవిద్య
   2. మోహము = అస్మిత
   3. మహామోహము =రాగము
   4. తామిస్రము = ద్వేషము
   5. అంధతా మిస్రము అభినివేశము

2. నవ తుష్టులు :
   1. ప్రకృతి
   2. ఉపాదానము
   3. కాలము
   4. భాగ్యము
   5. అర్జనోపరమము
   6. రక్షణోపరమము
   7. క్షయోపరమము
   8. అతృప్త్యుపరమము
   9. హింసోపరమము

3. అష్టసిద్ధులు

1. ఊహ
2. శబ్దము
3. అధ్యయనము
4. ఆత్మిక దుఃఖవిఘాతము
5. భౌతిక దుఃఖవిఘాతము
6. దైవిక దుఃఖవిఘాతము
7. సుహృత్ప్రాప్తి
8. దానము

అష్టావింశత్యశక్తులు :

1. చక్షుర్వధ
2. రసనవధ
3. ఘ్రాణవధ
4. త్వగ్వధ
5. శ్రోత్రవధ

(జ్ఞానేంద్రియా శక్తులు)

6. వాగ్ వధ
7. పాణివధ
8. పాదవధ
9. పాయువధ
10. ఉపస్థవధ

(కర్మేంద్రియా శక్తులు)

11. మనోవధ
12. ప్రకృతి వధ
13. ఉపాదానవధ
14. కాలవధ
15. భాగ్యవధ
16. అర్జనోపరమవధ
17. రక్షనోపరమవధ
18. క్షయోపరమవధ
19. అతృప్త్యుపరమవధ
20. హింసోపరమవధ
21. ఊహవధ
22. శబ్దవధ
23. అధ్యయనవధ
24. ఆత్మికదుఃఖ విఘాతవధ

(బుద్ధికి సంబంధించిన అశక్తులు)

25. భౌతిక దుఃఖ విఘాత వధ
26. దైవికదుఃఖ విఘాతవధ
27. సుహృత్ ప్రాప్తివధ
28. దానవధ

5. దశమౌళికార్థములు :

1. ఏకత్వము
2. అర్థవత్త్వము
3. పారార్థ్యము
4. అన్యత్వము
5. అకర్తృత్వము
6. బహుత్వము
7. అస్తిత్వము
8. వియోగము
9. యోగము
10. స్థితి

(ఈ యరువది పదార్థములు సాంఖ్యకారికలు రచించిన ఈశ్వర కృష్ణుని యభిమతము ననుసరించి యిట నుల్లేఖింపబడినవి. ఈ దర్శన వ్యాఖ్యానమున నియ్యవి వివరముగా తెలుపయత్నింపనైతి.)

ఆధిభౌతిక దృష్టితో నీ దర్శనమునందు ప్రతిపాదింపబడిన పదార్థము లిరువదియైదు 1. పురుషుడు, 2. ప్రకృతి, 3. బుద్ధి, 4. అహంకారము, 5. పంచతన్మాత్రలు, 6. ఏకాదశేంద్రియములు, 7. పంచ మహాభూతములు

ఇట్లీ యిరువదియైదు తత్త్వముల జ్ఞానప్రాప్తిచే నరులు ముక్తి నందగలుగుదురని యీ గ్రంథము ప్రతిపాదించును. ఈ తత్త్వములను బాగుగ పరిశీలించి చూచినపుడు ఆధ్యాత్మమార్గమున వీని యుపయోగము సాక్షాత్తుగ గలదని తెలిసికొనుట కష్టము కానేరదు.

అతి స్వల్పముగాను, అత్యంత సంక్షిప్తముగాను నేనీ పరిచయమున చర్చించిన విషయములన్నియు నుపర్యుక్త గ్రంథసహాయము మూలముననే పాఠకులకు సమర్పింపగలిగినాను. ఈగ్రంథకర్త తన గ్రంథము ద్వారా నాకుచేసిన మహోపకారమునకు గ్రంథకర్తకు సదా కృతజ్ఞుడనై యుందును.

నా యందలి ప్రేమచో నా కోర్కెను త్రోసిపుచ్చక యతిస్వల్ప కాలములో నా యీ సాంఖ్యదర్శనమునకు, శ్రీ కె. సచ్చిదానందమూర్తి (దర్శనాధ్యాపకులు - ఆంధ్ర విశ్వవిద్యాలయము - వాల్తేరు) గారు మహత్వపూర్ణమును, గంభీరాధ్యయన బోధకమును నగు భూమిక నొకదానిని వ్రాసి యిచ్చినారు. ఇందులకు నేను వారికి సర్వదా కృతజ్ఞుడను. వీరు ఆంధ్ర, ఆంగ్ల, సంస్కృత విద్వల్లోకమున

కతిపరిచితులు. తరుణ వయస్సుననే విపశ్చిత్ ప్రశంసకు పాత్రులై యనేక గ్రంథములను రచియించిన సఫల ప్రయత్నులు. ఇట్టి యోగ్యవిద్వాంసులు నా యీ కృతికి తొలిపలుకులు వ్రాయు నవకాశము లభించుట నా భాగ్యము.

ఇంతకు పూర్వము తెలుగు పాఠకులకు న్యాయ వైశేషికములు, యోగము నను మూడు ప్రాచీన దర్శనములను 'అంబా వ్యాఖ్యానము' అను వ్యాఖ్యాముతో సమకూర్చియున్నాను. వానిని చదివిన సహృదయులు కొందఱు మిగిలిన దర్శనములుకూడ ఇట్లే తెలుగువ్యాఖ్యానముతో పొందుపఱచి తెలుగు భాషామతల్లికి కానుకగా నర్పింప లేఖల మూలమున ప్రోత్సహించి యున్నారు. వారి ప్రోత్సహామూతగా గొని నా నేర్చినయట్ల సంస్కృతములో గల యనేక వ్యాఖ్యానముల సహాయముతో నీ సాంఖ్యదర్శనమునకు కూడ అంబావ్యాఖ్యానమను పేర వ్యాఖ్యానము రచియించి సోదర పాఠకుల కందజేయుచున్నాడ. విజ్ఞు లిందలి గుణ దోషములను వివేకించి దోషములను ప్రేమ పురస్కరంగా నాకు తెలిపిన మరియొక సంస్కరణమున నయ్యవి సరిచేసికొనగలనని వినమ్రుడనై విన్నవించుచున్నాడ.

కూచిపూడి
4-1-54
జయచైత్ర శు 1.

బుధవిధేయుడు
గోపదేవ్

## విషయసూచిక



## ప్రథమాధ్యాయము

మానవుడు తన జీవితమున సాధింపదగినది పరమ పురుషార్థము- మోక్షము. దానికి ముఖ్యమైన సాధనము ప్రకృతి పురుష వివేకజ్ఞానము - 'ప్రకృతి వేరు; పురుషుడు వేరు'; అను జ్ఞానము. ప్రకృతి యన నేమో, పురుషుడననేమో, వానిని వేరు వేరుగా తెలిసికొనిన గాని పరమపురుషార్థము సిద్ధింపదు. కాబట్టి కరుణానిలయుడైన కపిల మహర్షి ప్రకృతి పురుష వివేకజ్ఞానమును విపులముగా నుపదేశింప దలచి యీ శాస్త్రమును రచించియున్నాడు. ముందుగా పరమపురుషార్థము యొక్క స్వరూపము - లక్షణమును వర్ణించుచున్నాడు.

**"అథ త్రివిధ దుఃఖాత్యంత నివృత్తి రత్యంత పురుషార్థః"** 1.1

*త్రివిధ......నివృత్తిః* = *ఆధ్యాత్మికము, ఆధిభౌతికము, ఆధి దైవికముననను ముప్విధములైన దుఃఖముల (బాధల) యత్యంత నివారణము.*
*అత్యంత పురుషార్థః = పరమపురుషార్థము.*

ప్రతి పురుషుడును అనగా ప్రతి జీవుడు కోరదగినది పురుషార్థ మనబడును. పురుషునిచే నర్థింపబడునది కాబట్టి పురుషార్థము. పురుషుడు తా గోరుదానికంతము - నాశము లేకుండవలయునని యెంచును. అట్టి యంతము నతిక్రమించి- అంతము లేక - యుండునట్టి యర్థము అత్యంత పురుషార్థమనబడును. పురుషార్థములు రెండు. ఒకటి భోగము. రెండవది యపవర్గము. ఈ రెండువిధములైన పురుషార్థములను నిర్వర్తించుటకే ప్రకృతి ప్రవర్తించునని సాంఖ్యులు చెప్పుదురు. సుఖముల ననుభవించుటయే భోగమని లోకులు సామాన్యముగ వ్యవహరింతురు. కాని, శిష్టులు - శాస్త్ర సంప్రదాయము నెఱిగినవారు - మాత్రము సుఖదుఃఖముల యనుభవము భోగమందురు. సుఖదుఃఖములు పురుషుని కోరిక - అర్థన-చే నేర్పడునవియే కాబట్టి భోగము పురుషార్థమనబడును. ఇయ్యది జనించును; అనగా పుట్టును. అంతకు పూర్వము లేక క్రొత్తగా కలుగునని భావము. జనించునది కాబట్టి దీనికొక యంతము - నాశము ఉండును. అంతము నతిక్రమింపదు. పుట్టినది గిట్టక తప్పదుకదా!

కాగా భోగమనెడి పురుషార్థము అత్యంత పురుషార్థము కాదు. నాశవంత మైన (అంతము గల) పురుషార్థమును సాధించు విధము - ఉపాయము - ను తెలుప శాస్త్రము నారంభించుట విశేష ప్రయోజనదాయకము కాదు. అందువలన నంతము లేని - అత్యంతమైన - పురుషార్థము (అపవర్గము) సాధించుట కనువైన సాధనము నుపదేశించుటకే యీ శాస్త్ర మారంభింపబడిన దనుట నిక్కువము. త్రివిధ దుఃఖాత్యంత నివృత్తియే యత్యంత పురుషార్థము. ప్రతి పురుషుడును తనకు దుః ఖము లత్యంతముగా నివృత్తి చెందవలయుననియే యభిలషించును. అదియే పరమపురుషార్థము. దానికి సాధనము ప్రకృతీపురుష వివేక జ్ఞానము. ప్రకృతి యన నేమో, పురుషుడన నేమో, వాని వివేక జ్ఞాన మెట్టిదియో వివరించుటయే యీ శాస్త్రమున విషయము. ఈ శాస్త్రమున మొదటి పదము 'అథ'; చివరి పదము 'పురుషార్థః'; అథ మొదలు పురుషార్థము వరకు గలది శాస్త్రవిషయము. దాని ప్రతిపాదనము ప్రారంభింపడినట్టి సూత్రములోని 'అథ' శబ్దము శాస్త్ర ప్రారంభమును తెలుపును.

**త్రివిధ దుఃఖములు** :- జ్వరాది వ్యాధులవలన శరీరమున నేర్పడు బాధలు, కామ క్రోధాదులవలన మనస్సునందు కలుగు బాధలు అధ్యాత్మికములు (1) ; భూతములన ప్రాణులు. వ్యాఘ్రాది క్రూర మృగములు చోరులు హంతకులు మున్నగు మానవులు. మఱియు నీఘాతుక ప్రాణులు వానివలన కలుగు బాధలు ఆధిభౌతికములు (2); విద్యుత్తు, సూర్యుడు, పృథివ్యాది భూతములు నిట దేవతలనబడును. వీనివలన కలుగు - భూకంపము, అశనిపాతము, అతివృష్టి మున్నగు వానిచే నేర్పడు - బాధలు ఆధిదైవికములు (3) ; దుఃఖములన్నియు మానసికములే యైనను త్రివిధములుగా విభజించి చెప్పుట వివరణార్థము.

సాంఖ్యుల మతమున పురుషుడు - ఆత్మ - కూటస్థ నిత్యుడు - పరిణామము నొందనివాడు. అట్టివానిలో దుఃఖాది పరిణామములు కలుగనేరవు. కాబట్టి దుఃఖాదు లన్నియు ప్రాకృతికమైన బుద్ధి తత్త్వమునకు చెందినవే యందురు. అయినను, దుఃఖాది పరిణామములు గల బుద్ధి పురుషునకు సమీపమున నుండుట చేత పురుషునందు బుద్ధియో, లేక బుద్ధియందు పురుషుడో ప్రతిఫలించుట - ప్రతిబింబించుట సంభవము.

అట్టియెడ పురుషుడు తనయందు ప్రతిబింబించిన బుద్ధి పరిణామములను – దుఃఖాదులను – వివేకింపక – వేరని తెలిసికొనక – తనవి కావని యెంచక – తనవే యని యెంచి భోగము కలవాడగుచున్నాడు. కాబట్టి దుఃఖాదులు పురుషున కున్నట్లే యనవలసి వచ్చుచున్నది. అట్టి దుఃఖముల నత్యంతముగా నివర్తించుటకు కేవలము వివేకజ్ఞాన మవసరము. అందువలన ప్రకృతి పురుష వివేకజ్ఞానము ద్వారమున దుఃఖాత్యంత నివృత్తి పరమ పురుషార్థ మగుచున్నది. దుఃఖనివృత్తి యనగా దుఃఖ ధ్వంసము (నాశము) కాదు. సాంఖ్యులు సత్కార్యవాదులు. అనగా నదివరకు లేని వస్తువెన్నడును క్రొత్తగా నేర్పడదనియు, ఉన్న వస్తు వెన్నడు నాశము (ధ్వంసము – అభావము – ఉనికి లేకుండుట) నందదనియు చెప్పుదురు. కాబట్టి వా రభావము నంగీకరింపరు. ఈ యభిప్రాయమే గీతలో **"నాసతో విద్యతే భావః, నాభావో విద్యతేసతః"** అని వివరింపబడినది. అందువలన నిట నివృత్తిపదమున కర్థము ధ్వంసము (అభావము – నాశము) కాదనియు, అతీతావస్థ యనియు తెలిసికొనవలయును. దుఃఖములు మన మనుభవించు క్షణములో నవి వర్తమానావస్థలో నుండును. అనుభవించిన మరుక్షణమున నవి అతీతావస్థను బొందును. ముందు అనుభవింపవలసినవి అనాగతావస్థలో నుండును. అతీతావస్థనందిన దుఃఖములను గురించి పురుషుడు చేయవలసినదేమియు నుండదు. వర్తమాన దుఃఖములును మరుక్షణమున నతీతావస్థను బొంది యవియు నుపేక్షింపదగినవియే యగును. కాగా మిగిలిన అనాగత దుఃఖమే యతీతావస్థను బొందింపదగిన దగుచున్నది. ఈ యనాగత దుఃఖభోగము పురుషునకు ప్రకృతిపురుష వివేక జ్ఞానము లేమిచే కలుగుచున్నది. కాబట్టి యట్టి వివేక జ్ఞానమే దానిని తొలగింపగలదు. మఱియొక యుపాయ మేమియు లేదు. అందువలన కపిల మహర్షి ప్రకృతిపురుష వివేక జ్ఞానమును కలిగింప నీ శాస్త్రము నారంభించియున్నాడని భావము.

ఈ పరమ పురుషార్థమైన త్రివిధ దుఃఖాత్యంత నివృత్తి దృష్టోపాయములై లోకసిద్ధములగు నౌషధ పానాద్యుపాయముల ద్వారమున సిద్ధింపదా? కష్టసాధ్యమైన శాస్త్రీయ వివేకజ్ఞాన మెందులకన :–

**"న దృష్టా త్తత్సిద్ధి ర్ని వృత్తేఽ ప్యనువృత్తి దర్శనాత్"** 1.2

దృష్టాత్ = లోక సిద్ధమగు నౌషధ పానాదుల వలన, తత్సిద్ధిః = త్రివిధ దుఃఖాత్యంత నివృత్తి రూపఫలము, న = కలగదు. కారణ మేమన, నివృత్తేఽపి = లోకసిద్ధమగు నుపాయమువలన నొక విధముగ నెట్లో దుఃఖము తొలగినను, అనువృత్తి దర్శనాత్ = కాలాంతరమున మరల నట్టి దుఃఖము వాటిల్లుచుండుటవలన.

ప్రాణులకు కలుగు నాధ్యాత్మికాది దుఃఖములను తొలగించుటకు నౌషధ పానాద్యుపాయములు లోకమున నెన్నో యున్నవి. వాని నుపయోగించుకొని జీవులు తమకు కలుగు నాకలి బాధ మున్నగు నెన్నో బాధలను తొలగించుకొనుట నిత్యము మనము చూచుచునే యున్నాము. ఆకలిగొన్నవాడు అన్నము తిని యాకలి బాధను తొలగించుకొనును. జ్వరము వచ్చినవాడు ఔషధమును తిని జ్వర దుఃఖమును తొలగించుకొనును. ఇట్లే యితర బాధ లితరోపాయములవలన పోగొట్టు కొనును. కాని యా బాధలు మరల కలుగకపోవు. కలుగుచునే యుండును. కాబట్టి లోకసిద్ధమగు దృష్టములగు - నుపాయముల వలన దుఃఖాత్యంత నివృత్తి కలుగనేరదు.

లోక ప్రసిద్ధములైన యుపాయముల వలన దుఃఖములను తొలగించుకొనుట పురుషార్థము కాగలదా యన :-

**"ప్రాత్యహిక క్షుత్ప్రతీ కారవత్ తత్ప్రతీకార**
**చేష్టనాత్ పురుషార్థత్వమ్"** 1.3

ప్రాత్యహికక్షుత్ ప్రతీకారవత్ = ప్రతిదినము కలుగు నాకలి బాధను తొలగించుకొనుట పురుషార్థమైనట్లు, తత్ప్రతీకారచేష్టనాత్ = లోక ప్రసిద్ధోపాయముల మూలమున నాధ్యాత్మికాది దుఃఖములను తాత్కాలికముగ తొలగించుకొనుటయు, పురుషార్థత్వమ్ = పురుషార్థమే యగును.

దుఃఖము వాటిల్లినపుడు దానికి ప్రతీకార మొనర్చుకొనుట లోకన్యాయము. శాస్త్రీయమయిన యుపాయము తెలియదని లోకప్రసిద్ధమగు నుపాయము ద్వారమున నపుడా దుఃఖమును తొలగించుకొనకుండుట యుచితము కాదు. కాబట్టి దృష్టోపాయము మూలమున తాత్కాలికముగనైనను దుఃఖమును నివర్తింపజేసికొనుట పురుషార్థమే యగును. కాని పరమపురుషార్థము కానేరదని భావము.

లోకప్రసిద్ధోపాయమువలన సాధించెడి తాత్కాలిక దుఃఖనివారణము సైతము పురుషార్థమైనను,

**"సర్వాసంభవాత్ సంభవేఽపి సత్తాసంభవాత్**
**హేయః ప్రమాణకుశలైః"** 1.4

*సర్వాసంభవాత్ = సర్వవిధములైన దుఃఖముల నివారణ మసంభవ మగుటవలన, సంభవేఽపి = ఎట్లో సంభవమైనను, సత్తాసంభవాత్ = సూక్ష్మరూపమున నా దుఃఖముల యునికి సంభవమగుటవలన, ప్రమాణ కుశలైః = నిపుణులచేత, హేయః = (దృష్టోపాయము వలన కలిగెడి దుఃఖముల తాత్కాలిక నివృత్తి) త్యజింపబడదగినదే.*

దృష్టమైన లోకసిద్ధోపాయము మూలమున లభించెడి దుఃఖముల తాత్కాలిక నివృత్తి పురుషార్థమైనను నయ్యది యాత్యంతిక నివృత్తి కాదు కాబట్టి నిపుణులు దానిని హేయముగా నెంచుదురు.

**"ఉత్కర్షాదపి మోక్షస్య సర్వోత్కర్ష శ్రుతేః"** 1.5

*మోక్షస్య = దుఃఖాత్యంతనివృత్తి, ఉత్కర్షాదపి = దృష్టోపాయము వలన కలిగెడి దుఃఖనివృత్తికంటెను శ్రేష్ఠ మైనందువలనను, సర్వోత్కర్షశ్రుతేః = దృష్టోపాయమువలన నేర్పడెడి దుఃఖనివృత్తికంటె మోక్షము నెక్కుడుగా శ్రుతి వర్ణించియుండుటవలన, దృష్టోపాయము నిపుణులకు హేయమే.*

మఱియు త్రివిధ దుఃఖాత్యంత నివృత్తియనెడి మోక్షము దృష్టోపాయమువలన సంపాదించెడి దుఃఖముల తాత్కాలిక నివారణముకంటె నెంతో యుత్తమము. ఇట్లే శ్రుతులందును వర్ణింపబడి యున్నది.

**"అశరీరం వా వసంతం నప్రియాప్రియే స్పృశతః"**
*(ఛాందోగ్య-1.12.10)*

'శరీర రహితులైనవారికి సుఖదుఃఖములుండవు' అని శ్రుతులు మోక్షము నుత్కర్షగా వర్ణించియున్నవి. కాబట్టి నిపుణులు శాస్త్రీయోపాయ సాధ్యమైన పరమపురుషార్థమునే కామింతురు. పురుషార్థమును మాత్రము హేయముగానే చూతురని భావము.

దృష్టోపాయము వలన దుఃఖాత్యంత నివృత్తి కలుగ కుండినను శాస్త్రమున చెప్పబడిన ఉపాయ సాధ్యములయిన వైదిక యజ్ఞ యాగాదులవలన కలుగదా? యన :-

**"అవిశేషశ్చోభయోః"** 1.6

ఉభయోః చ = దృష్టము, శాస్త్రీయము నయిన రెండుపాయములును, అవిశేషః = సమానములే.

దృష్టోపాయములైన ఔషధ సేవనాదులవలన నెట్లు దుఃఖాత్యంత నివృత్తి కలుగదో యట్లే శాస్త్రీయోపాయములచే సాధింపదగు యజ్ఞయాగాదులవలనను దుఃఖ్యాత్యంత నివృత్తి కలుగదు.

ఈ సూత్రమునందలి యుభయ శబ్దము దృష్టము, అదృష్టము ననెడి రెండుపాయములకు బోధకముగా వ్యాఖ్యాతలు గ్రహించి అదృష్టోపాయ మనగా వేదమునందు హింసాయుక్త యజ్ఞ యాగాదులను సాధించుటకుగా నుపదేశింపబడిన యుపాయ మని వ్యాఖ్యానము చేసియున్నారు. కాని యది చింత్యము. వేదములం దనేక తావులలో హింస సర్వథా నిషేధింపబడినది. హింసాయుత కార్యములు యజ్ఞయాగాదులనుట వేదము లంగీకరింపవు. ఈ విషయమును బాగుగ నెఱుగవలయుననిన సత్యార్థ ప్రకాశము (శ్రీమద్దయా నంద మహర్షి ప్రణీతము)ను, 'ఋగ్వేదాది భాష్యభూమిక'ను పాఠకులు చదువుదురుగాక.

వ్యాఖ్యాతలవంటి దృష్టిగల సాంఖ్య కారికా కర్తయు నొక కారికమయందిట్లు వర్ణించియున్నాడు.

"దృష్టవదానుశ్రవికః సహ్యవిశుద్ధిక్ష యాతిశయయుక్తః"

దృష్టోపాయమువలన సాధింపబడెడి దుఃఖ నివృత్తి వలెనే ఆనుశ్రవికమయిన - వైదిక - ఉపాయసాధ్యమగు దుఃఖనివృత్తియు అశుద్ధమైన హింసాది పాపముతోను, న్యూనాతిశయములతోను కూడుకొని యుండును. కాబట్టి రెండును సమానములే యని కారికాకారుని యభిప్రాయము.

గురువులనుండి యనుశ్రవణము చేయబడును కావున అనుశ్రవమనగా వేదము. అనుశ్రవముచే విధింపబడు యాగాదులు - కామ్యకర్మములు - అనుశ్రవికములు. అయ్యవి హింసాయుక్తములు. వాని ఫలమును వినాశి - నశించునదియే. మఱియు నొక యజ్ఞమున కొకింత ఫలము; మఱియొక యజ్ఞమున కంతకంటే నెక్కువ ఫలము; నని హెచ్చుతగ్గులతో కూడియుండుటయు శాస్త్రసిద్ధము. కాబట్టి యాత్యంతిక దుఃఖనివృత్తి యన నొప్పదు. శాస్త్రవిధులు పెద్దపెద్ద యనిష్టములతో సంబద్ధముకాని యభీష్టమును సాధించునవి కాబట్టి విధిపూర్వకముగా

చేయు హింస పాపజనకము కాదనచెల్లదు. విధిపూర్వకముగా చేయు హింసాకృత్యము హింసాయుత కర్మమువలన కలిగెడి యభీష్టమగు స్వర్గాది ఫలముకంటె నెక్కు డనిష్టమును కలిగింపకున్నను ఆ హింసకు తగిన పాపము కలిగింపదని చెప్పుట కేరికిని శక్యముకాదు. శాస్త్రవిధి దాని నడ్డగింపజాలదని భావము. విధిపూర్వకముగా చేయు హింసకు పాపముండదనియు నితర హింసలకు పాపము కలుగుననియు చెప్పుట సత్యదూరము. ఇట్లు విభజించుటకు ప్రమాణ మొందును కానము.

**"అహింసన్ సర్వభూతాన్యన్యత్ర తీర్థేభ్యః"**

(తీర్థములలోదప్ప మిగిలిన స్థలములలో నేభూతమును హింసింపజనదు) అను నిట్టి వాక్యములు తీర్థేతర స్థలములలో హింస చేయనందువలన అభీష్టము సిద్ధింపగలదని బోధించునే కాని తీర్థములలో హింసించిన పాపము కలుగదని చెప్పనేరవని యభియుక్తుల మతము.

**"న కర్మణా నప్రజయా ధనేన**
**త్యాగేనైకే నామృతత్వ మానశుః"**

(కామ్యకర్మముచే కాని, సంతతిచే కాని, ధనముచే కానీ, మోక్షము లభింపదు. త్యాగముచేతనే లభించును.)

**'తమేవ విదిత్వాఽతి మృత్యుమేతి**
**నాన్యః పంథా విద్యతేఽయనాయ".**

'ఆత్మను తెలిసికొని మోక్షము నందును. ఆత్మజ్ఞానము కంటె మఱియొక మార్గము తరణమునకు లేదు' అను నిట్టి శ్రుతి వాక్యములను తిలకించినను అదృష్టోపాయ జనితము లయిన కేవల కామ్యకర్మముల మూలమున నత్యంత దుఃఖ నివృత్తి కలుగనేరదని స్పష్టమగుచున్నది.

దుఃఖాత్యంతనివృత్తి మోక్షము కాబట్టి దుఃఖములతో సంబంధ మేర్పడుటయే బంధ మనవలసివచ్చును. అట్టి బంధము స్వాభావిక మగునెడల దృష్టాదృష్టములనెడి యుభయ విధములయిన యుపాయములును దానిని తొలగింపనేరవు. అట్లే శాస్త్రీయమైన ప్రకృతి పురుష వివేకజ్ఞాన మనెడి సాధనము సైతము స్వాభావిక బంధము నెట్లు తొలగింపగలదు? అని శంకించి యది స్వాభావికము కాదనియు, నైమిత్తిక మనియు మహర్షి నిరూపించదలచినాడు. అందువలన బంధము స్వాభావిక మగునెడల కలుగు దోషమును ముందు జూపుచున్నాడు.

"న స్వభావతో బద్ధస్య మోక్షసాధనోపదేశ విధిః 1.7

స్వభావతో బద్ధస్య = స్వభావముగానే - స్వరూపముతోనే - దుఃఖ సంబంధముండిన పురుషునకు, మోక్షసాధనో పదేశవిధిః = దుఃఖనివృత్తి రూప మోక్షమును సాధించుటకు తగిన యుపాయమును బోధించుట, న = సంగతము కాదు.

పురుషుడు స్వాభావికమగు దుఃఖసంబంధముచే బద్ధుడగు పక్షమున నతనికి మోక్షమును సాధించుసాధనము నుపదేశించుట యుక్తముకాదు. కాబట్టి పురుషుడు స్వభావముచే బద్ధుడు కాడని భావము.

ఈశ్వరకృష్ణసూరియు తన కారికలం దిట్లే వర్ణించి యున్నాడు.

"యద్యాత్మా మలినోఽస్వచ్ఛోవికారీస్యాత్ స్వభావతః
న హి తస్య భవేన్ముక్తిర్ జన్మాంతర శతైరపి"

'స్వభావముచేతనే యాత్మ మలినము, అస్వచ్ఛము, వికారము గలదియు నగునెడల వందలకొలది జన్మముల నెత్తిన మీదటను దానికి ముక్తి కలుగనేరదు'.

ఉష్ణత యగ్నికి స్వాభావికము. 'దేనియం దేది యత్పన్న మగుటలో కారణ విలంబము వలన విలంబము కలుగదో దాని కది స్వాభావికము" అని స్వభావ లక్షణము. అగ్ని యున్నపుడు దానియందుష్ణత యుత్పన్నమగుటలో మరి యొక కారణ విలంబమువలన విలంబము కలుగదు. కాబట్టి యగ్నికి ఉష్ణత స్వాభావికము. ఉష్ణత అగ్నితోనే యుండి యగ్నితోనే నివృత్తి చెందును. దుఃఖము పురుషునకు స్వాభావికము కాదు. అని భాష్యకారులు - విజ్ఞాన భిక్షువు.

మోక్షసాధనోపదేశవిధి యేల సంగతము కాదు? ఒక వేళ సంగతము కాకున్నను దాని వలన కలుగునదేమన :-

"స్వభావస్యానపాయిత్వాత్
అననుష్ఠాన లక్షణ మప్రామాణ్యమ్" 1.8

స్వభావస్య = స్వరూపము, అనపాయిత్వాత్ = వస్తు వున్నంత వరకు నుండునది కావున, శాస్త్రమునకు, అననుష్ఠానలక్షణమ్ = 'శాస్త్రోపదేశము ననువర్తింపలేకుండుట' యనెడి లక్షణముగల, అప్రామాణ్యమ్ = అప్రామాణికత కలుగును.

స్వభావము పదార్థమున్నంతవరకు నుండునది కాబట్టి పురుషునకు

బంధము స్వభావ మగునెడల నయ్యది విడుచుట శక్యము కాదు. అశక్యము నుపదేశించు శాస్త్రము ననువర్తించువా రుండరు. అట్టియెడ శాస్త్రమునకు అననుష్ఠాన మనెడి దోషము వాటిల్లునని భావము.

శాస్త్రబలమువలననే యనుష్ఠాన మేల సంభవము కాదన :-

**"నాశక్యోపదేశవిధి రుపదిష్టేఽప్యనుపదేశః"** 1.9

*అశక్యోపదేశవిధిః = సాధించుటకు శక్యముగాని ఫలముకొఱకు జేయు ఉపదేశవిధానము, న = సంభవముకాదు –. కారణమేమన, ఉపదిష్టేఽపి = ఉపదేశింపబడినప్పటికి, అనుపదేశః = అదివ్యర్థమే.*

సాధింప ననువుగాని ఫలము నుద్దేశించి శాస్త్రముపదేశించినను వ్యర్థమే యగును. అట్టి యర్థమును శాస్త్రము బోధింపదని భావము.

స్వాభావికము సైతము తొలగగలదను వాని శంక :-

**"శుక్లపటవత్ బీజవచ్చేత్"** 1.10

*శుక్లపటవత్ = తెల్లనివస్త్రమునందలి తెలుపు ఎఱుపు రంగుచేతను, బీజవత్ = విత్తనమునందలి యంకురించు శక్తి వేయించుట చేతను, చేత్ = స్వాభావకములయ్యు తొలగింప బడుచున్నవిగదా! యనిన,*

తెల్లని వస్త్రమునకు స్వాభావికమయిన తెలుపురంగు ఎఱుపురంగుచే తొలగింపబడుచున్నది. విత్తనమునందలి యంకురించుశక్తి స్వాభావకమయ్యు విత్తనమును వేయించి నపుడు తొలగిపోవుచున్నది. కాబట్టి స్వభావముకూడా తొలగింప నవకాశమున్నదని తెలియుచున్నది. అందువలన పురుషునకు బంధము స్వభావమైనను దానిని తొలగింప ననువగు సాధనమును శాస్త్రమేల బోధింపరాదు? అనిశంకాభిప్రాయము.

సమాధానము :-

**"శక్త్యుద్భవానుద్భవాభ్యాం నాశక్యోపదేశః"** 1.11

*శక్త్యుద్భవానుద్భవాభ్యాం = ఉత్తేజక ప్రతిబంధకముల ద్వారమున శక్తియొక్క యావిర్భావ తిరోభావములు జరిగినందువలన, అశక్యోపదేశః = అసాధ్య ఫలసాధనము నుపదేశించుట, న = సంభవముకాదు.*

తెల్లని వస్త్రమునందలి తెలుపురంగు - దానికి ప్రతి బంధకమైన ఎఱుపురంగుచే కనబడదేకాని బొత్తిగా నశింపదు. కావుననే ప్రయత్నపూర్వకముగా చాకలి యెఱుపురంగును తొలగించినపుడు తెలుపు

మరల ప్రకటమగును. అట్లే బీజము నందలి యంకురించు శక్తి వహ్నిచే నడ్డగింపబడునే కాని నశింపదు. అందువలననే యోగి తన సంకల్ప బలముచే ప్రతిబంధకముగా నున్న వహ్నిని తొలగించినపుడు వేయించిన విత్తనము సైతము మొలకెత్తగలదు. కాబట్టి స్వభావము నివర్తించుననుట చెల్లదు. పైన చెప్పిన ఉదాహరణములు స్వభావము నివర్తించు ననుటను సాధింపజాలవు. కాగా పురుషునకు బంధము స్వాభావిక మగునెడల మోక్ష మశక్యమగును. కావున స్వభావము కాదని తేలుచున్నది.

పురుషునకు బంధము (దుఃఖయోగము) స్వాభావికము కానిపక్షమున కాలసంబంధము వలన నేర్పడునని యేల చెప్పరాదన :-

**"న కాలయోగతో వ్యాపినో నిత్యస్య సర్వసంబంధాత్"** 1.12

*వ్యాపిన ః = సర్వపదార్థములతోను సంయోగముగల, నిత్యస్య= సతతమునుండు, కాలమునకు, సర్విసంబంధాత్ = ముక్తులు, అముక్తులు నెల్లరితోను సంబంధముండుటవలన, కాలయోగతః = కాలసంబంధమనెడి నిమిత్తమువలన పురుషునకు బంధము కలుగుననుటయు, న = తగదు.*

పురుషునకు బంధము కాలసంబంధముచే నైమిత్తిక మనుటయు నుచితము కాదు. కాలము సర్వవ్యాపకమై నిత్యమైయుండి ముక్తులతోను, అముక్తులతోను, నెల్లరితో సంబంధము కలదగును. అట్టియెడ ముక్తి జెందనివారు కాల సంబంధముచే బద్ధులయినచో ముక్తులు కూడా కాలసంబంధముచే బద్ధులు కావలసివత్తురు. కాబట్టి పురుష సంబంధమునకు నిమిత్తము కాలసంబంధము కానేరదని భావము. సాంఖ్యుల మతమున క్షణాత్మకకాలమే నిత్యమనియు మిగిలిన కాలమనిత్య మనియు ముందు వివరింపబడును.

కాలము, దేశము, కర్మము ననునవి ప్రతికార్యమునకును సాధారణ కారణములు - సామాన్య నిమిత్తములు - *(Common cause)* అని యెల్లరు నంగీకరింతురు. అందువలన కాలమునకు బంధవిషయమున సామాన్యనిమితత్త్వము లేదని చెప్పుట యీసూత్రాభిప్రాయము కాదు. కాలము పురుష బంధమునకు విశేషనిమిత్తము కాదనుటయే యుద్దేశము. పురుష బంధము ఉపాధివలన కలిగినదని యీ శాస్త్రము

నందంగీకరించుటయే యిందులకు కారణము. మఱియు దేశ సంబంధముకూడా బంధమునకు హేతువు కాదనుచున్నాడు.

"న దేశయోగతో౽ప్యస్మాత్" 1.13

*అస్మాత్ = పూర్వోక్తహేతువువలననే, దేశయోగతః అపి = దేశ సంబంధముచేతను, న = బంధము నైమిత్తికము కాదు.*

కాలమువలెనే దిక్కు (దేశము) కూడా ముక్తులు, బద్ధులు అని భేదములేక యెల్లరితోను సంబంధము కలదగుట వలన నెల్లరు బద్ధులే యగుదురు. నాడు ముక్తి యసంభవ మగునని భావము.

అటులయిన బంధము బాల్యాద్యవస్థా మూలక మేల కాదన :-

"నావస్థాతో దేహధర్మత్వాత్తస్యాః" 1.14

*తస్యాః = బాల్య కౌమారాద్యవస్థలు, దేహధర్మత్వాత్ = శరీర ధర్మము లగుటవలన, అవస్థాతః = అవస్థవలన, న = బంధము నైమిత్తికము కాదు.*

బాల్య యౌవనాద్యవస్థలన్నియు దేహధర్మములేకాని పురుషధర్మములు కావు. అన్యధర్మము లన్యుని బంధమునకు నిమిత్తములని యంగీకరింతుమేని బద్ధుని ధర్మములు ముక్తులను సయితము బద్ధులను చేయగలవని చెప్పవలసివచ్చును. కాబట్టి బాల్యాద్యవస్థలు బంధ హేతువులు కావు.

బాల్యాదులు దేహధర్మము లయినంత మాత్రమున నవి పురుషధర్మము లేలకావన :-

"అసంగో౽యం పురుష ఇతి" 1.15

*అయంపురుషః = ఈ ప్రత్యగాత్మ - జీవుడు, అసంగః = సంగరహితుడు - వికార సంబంధము లేనివాడు. ఇతి = కాబట్టి బాల్యాద్యవస్థలు దేహధర్మములే కాని పురుష ధర్మములు కావు.*

బాల్యాద్యవస్థలు దేహధర్మములు. కాబట్టి దేహము పరిణామము నొందుచుండును. ఈ యవస్థలు పురుషునందంగీకరించిన నతడును పరిణామియై యనిత్యు డగునని భావము. కాబట్టి పురుషు డసంగుడు.

కర్మముచే పురుషబంధ మేల నైమిత్తికము కాదన :-

"న కర్మణా౽న్యధర్మత్వా దతిప్రసక్తేశ్చ" 1.16

*కర్మణా = విహితమో లేక నిషిద్ధమో యైన కర్మచేతను, న =*

బంధము నైమిత్తికము కాదు. కారణ మేమన, అన్యధర్మత్వాత్ = కర్మము ఆత్మకంటె భిన్నమైన దేహమునకు జెందిన ధర్మము, చ = మఱియు, అతిప్రసక్తేః = ముక్తుడును బద్ధుడే కావలసివచ్చును.

శాస్త్రముచే విధింపబడిన కర్మము విహితము. కూడదని నిషేధింపబడిన కర్మము నిషిద్ధము. ఈయుభయవిధకర్మములును దేహాదులచే నిర్వర్తింపబడును. కాబట్టి యవి దేహధర్మములే కాని పురుషధర్మములు కావు. దేహధర్మము పురుషబంధమునకు నిమిత్తమగునెడల బద్ధుని ధర్మముచే ముక్తుడును బద్ధుడు కావలసివచ్చును. ఇది యతిప్రసక్తి. న్యాయ విరుద్ధమని భావము. కాబట్టి కర్మము బంధహేతువు కాదు. మఱియొక దోషము :-

"విచిత్ర భోగా నుపపత్తి రస్యధర్మత్వే" 1.17

*అన్యధర్మత్వే = దేహధర్మమైన కర్మము పురుషబంధమునకు హేతువుగా నంగీకరింతుమేని, విచిత్ర భోగానుపపత్తిః = లోకమున జూడబడుచున్న ఒకరికంటె నొకరు విలక్షణముగా ననుభవించు సుఖ దుఃఖముల వ్యవస్థ సంగతము కానేరదు.*

అనాదిగా నడుచుచున్న యీ ప్రపంచమున సుఖమును కలిగించు కర్మముగానీ, దుఃఖమును కలిగించు కర్మముగానీ చేయనివారుండరు. అందఱు నుభయవిధ కర్మములను చేయుచునే యుందురు. అన్యధర్మము అన్యబంధమునకు హేతువుగా నంగీకరింతుమేని లోకమున నెల్లరు సుఖులో లేక యెల్లరు దుఃఖులో కావలసి యుందురు. కొందఱు సుఖులు కొందఱు దుఃఖులు కావలయునను నియమములేనందున విలక్షణ భోగము కలుగ వీలులేదని భావము. లోకమున విచిత్ర భోగము చూచుచున్నాము కాబట్టి యన్య ధర్మము అన్య బంధమునకు హేతువని యంగీకరించుట బుద్ధివిరుద్ధమని తాత్పర్యము.

అటులయిన ప్రకృతి నిమిత్తమువలన పురుషబంధము కలుగు నందుమేని యదియు కాదని చెప్పుచున్నాడు.

"ప్రకృతి నిబంధనాచ్చేన్న, తస్యా అపి పారతంత్ర్యమ్" 1.18

*చేత్ ప్రకృతి నిబంధనాత్ = సాక్షాత్తుగా ప్రకృతి నిమిత్తమున పురుషబంధము కలుగునందుమేని, న = కాదు, తస్యా అపి = ఆ ప్రకృతియు, పారతంత్ర్యమ్ = పరతంత్రమే.*

అవివేకముచే ప్రకృతి పురుషులకు సంబంధము కలుగును కాని సాక్షాత్సంబంధము కలుగనేరదని ముందు వివరింపబడును. అవివేక పూర్వకముగా గాక సాక్షాత్తుగా పురుషునితో ప్రకృతికి గల సామాన్య సంబంధముచే పురుషునకు బంధమేర్పడునని యంగీకరింతుమేని బద్ధముక్త భేదము లేక యెల్లరును బద్ధులు కావలసివత్తురు అతి ప్రసక్తి తప్పదని భావము. కాబట్టి ప్రకృతి సైతము సాక్షాత్ బంధన హేతువు కాదని సూత్ర తాత్పర్యము.

పురుషునకు గల బంధము స్వాభావికమో లేక నైమిత్తికమో కానిపక్షమున మరి దేనివలన బంధమేర్పడుచున్నదన :-

**"న నిత్యశుద్ధ బుద్ధ ముక్తస్వభావస్య తద్యోగ స్తద్యోగాదృతే"** 1.19

*నిత్యశుద్ధ ...స్వభావస్య = నిత్యుడు, శుద్ధుడు, బుద్ధుడు, ముక్త శీలుడు నయిన పురుషునకు, తద్యోగః = బంధయోగము - బంధము, తద్యోగాదృతే = అవివేకముచే నేర్పడిన ప్రకృతి సంయోగ విశేషము లేక, న = కలుగనేరదు.*

పురుషునిలో నిత్యత్వము కూటస్థ నిత్యత; అనగా పరిణామ రాహిత్యము. శుద్ధత్వము సత్వ రజస్తమో గుణములతో సంగము లేకుండుట. బుద్ధత్వము. ఎన్నడులోపించని చిద్రూపత; ముక్తస్వభావము ముక్తశీలము; అని తెలిసికొనవలయును.

అవివేకమువలన నేర్పడిన ప్రకృతి పురుషసంయోగమే బంధహేతువని పరమార్థము. బంధమునకు హేతువైన ప్రకృతి పురుషసంయోగము అవివేకకృతమని ముందు ఏబది యైదవ సూత్రమున సూత్రకారుడు స్వయముగా చెప్పును. కాబట్టి బంధము అవివేకముచేత బుద్ధిసత్వమనెడి యుపాధివలన జనించును. కావున నది యౌపాధికమే కాని స్వాభావికము కాదు. నైమిత్తికమును కాదు.

ప్రస్తుతము నాస్తికులు చెప్పు బంధహేతువులను సయితము నిరాకరింపదలచి బౌద్ధులలో నొకరగు యోగాచారుని మతమునకు సంబంధించిన హేతువును కాదనుచున్నాడు - యోగాచారుడు క్షణిక విజ్ఞానసంతితియే యాత్మగా నంగీకరించును. అతడు క్షణిక విజ్ఞానాత్మకుమించి మఱియొక ప్రకృతి నంగీకరింపడు. కాబట్టి వారి దృష్టిలో ప్రకృతి యనెడు వస్తువే లేనందున దాని సంయోగము

బంధమునకు నిమిత్తమనుటకు వీలులేదు. క్షణికవిజ్ఞాన సంతానమే వాస్తవికతత్త్వము - మిగిలినదంతయు సాంవృత్తికము. సంవృత్తి యనగా నవిద్య. అదియే మిథ్యాజ్ఞాన మనియు చెప్పబడును. దానివలననే బంధమేర్పడును; అని చెప్పు యోగాచారుని యవిద్యా నిమిత్తమును నిరాకరించుచున్నాడు.

"నా విద్యాతోఽ పృవస్తునా బంధా యోగాత్" 1.20

*అవిద్యాతః అపి = యోగాచారుని సంవృత్తి యనెడు యవిద్య వలనను, న = బంధయోగము కలుగనేరదు, అవస్తునా = వస్తువుకానట్టి మిథ్యా జ్ఞానముతో పురుషునకు, బంధాయోగాత్ = బంధమేర్పడ జాలదు.*

యోగాచారుని యవిద్య వస్తువుకాదు. స్వప్నమున జూచు త్రాడువంటిది. అట్టిదానిచే పరుషునకు బంధము కలుగ నేరదని భావము.

కణాద గౌతమ జైమిని వ్యాస ప్రభృతులు తమ దర్శనము లం దవిద్య నంగీకరించియున్నారు. కాని వారు చెప్పు అవిద్యకు యోగాచారుని సంవృత్తికి మిక్కిలి భేదమున్నది. కణాదాదులచే నంగీకరింపబడు నవిద్య చిత్తధర్మమైనను వాసనారూపమున ననాదియై మిథ్యాజ్ఞానమే లక్షణముగా గలదై యుండును. సాంఖ్యుల యవివేకమున కది యపర పర్యాయమే.

యోగాచారుని అవిద్య సర్వథా ఆవస్తువు కాదు. వస్తువే యనిన :-

"వస్తుత్వే సిద్ధాంత హానిః" 1.21

*వస్తుత్వే = అవిద్య వస్తువని యంగీకరించినచో, సిద్ధాంతహానిః = తా. నంగీకరించిన సిద్ధాంతమునకే భంగము వాటిల్లును.*

సంవృత్తి యవస్తువు కాదు. వస్తువే యగునందురేని విజ్ఞానాత్మ తక్క వస్త్వంతరము లేదని యంగీకరించు యోగా చారుని సిద్ధాంతమునకే భంగము కలుగును. కాబట్టి యవిద్య వస్తువని యంగీకరించి బంధ హేతువనుటకును వీలులేదని భావము.

"విజాతీయ ద్వైతాపత్తిశ్చ" 1.22

మఱియు నవిద్య వస్తువని యంగీకరించిన విజ్ఞానాత్మకంటె భిన్న జాతీయమగు మఱియొక వస్తు వంగీకరింపవలసి వచ్చును.

క్షణిక విజ్ఞానసంతతిలో ననేక వ్యక్తులున్నట్లంగీకరించినను నయ్యవి సజాతీయములే కాబట్టి, ద్వైతాపత్తి కలిగినను దోషము లేదు. కాని, యవిద్య వస్తువుగా నంగీకరించినపుడు విజాతీయమైన ద్వైతము నంగీకరింపవలసి వచ్చును. కాబట్టి యవిద్య వారి కనిష్టమైన విజాతీయ ద్వైతమును కలిగించి దోషాకర మగునని భావము.

**"విరుద్ధోభయ రూపాచేత్"** 1.23

అవిద్య వస్తువును కాదు. అవస్తువును కాదు. కాని, వస్త్వవస్తూభయ రూపమని యంగీకరింతు మందురేని,

**'న తాదృక్ పదార్థా ప్రతీతేః"** 1.24

న = అదియును నొప్ప వలనుపడదు. కారణ మేమన? తాదృక్ పదార్థా ప్రతీతేః = లోకమున వస్తువుకానీ, అ వస్తువుకానీ కాక వాని కంటె విలక్షణమైన పదార్థ మొందు లేదు.

లోకమున నొక పదార్థమున్న నది వస్తువో లేక యవస్తువో యగును. అట్లు కాక వస్త్వవస్తూభయ రూపమైన పదార్థ మొందును కానము. కాబట్టి యదియు నంగీకరింప జనదని భావము.

**"న వయం షట్ పదార్థవాది నో వైశేషికాది వత్"** 1.15

*వయమ్ = బౌద్ధులమైన మేము, వైశేషి కాది వత్ = వైశేషిక నైయాయికుల వలె, (కణాద గౌతములవలె) షట్ పదార్థవాదినః = పదార్థములు ఆరో లేక పదహారో యని నియమముగా నంగీకరించువారము, న = కాము.*

కణాదుడు తన వైశేషిక దర్శనమునందు 'ద్రవ్యగుణ' కర్మ, సామాన్య, విశేష, సమవాయము' లని షట్ పదార్థముల నంగీకరించి యున్నాడు. ఇట్లే గౌతముడు న్యాయదర్శనమునందు ప్రమాణ ప్రమేయాది భేదములతో పదునారు పదార్థముల నంగీకరించి యున్నాడు. (ఈ పదార్థ వివరములను తెలిసికొన గోరువారు నాచే తెలుగున రచింపబడిన వైశేషిక న్యాయ దర్శనములను చూడ వచ్చును.) కణాద గౌతముల వలె బౌద్ధులమైన మేము నియతసంఖ్య గల పదార్థముల నంగీకరించువారము కాము. కాబట్టి లోకమున మేము చెప్పినట్టి వస్త్వవస్తూభయరూప విలక్షణ పదార్థ మొకటి మిథ్యాభూతమై, యవిద్యా లక్షణము కలిగినదై యుండునని యంగీకరింప వలయు నందురేని,

"అనియతత్వేఽపి నా యౌక్తిక సంగ్రహో
ఽన్యథా బాలోన్మత్తాది సమత్వమ్" 1.16

అనియతత్వేఽపి = వైశేషికాదుల వలె పదార్థ నియమము లేకున్నను, అయౌక్తికస్య = యుక్తి సిద్ధముకాని పదార్థము యొక్క సంగ్రహః = స్వీకారము, న = చేయ వలనుపడదు, అన్యథా = యుక్తి సిద్ధముకాని వస్తువు నంగీకరింతుమేని, బాలోన్మత్తాది సమత్వమ్ =బాలకులతోను, పిచ్చి వారితోను సములమగుదుము.

కణాదాదులవలె పదార్థములను సంఖ్యతో నియమింప జాలకపోయినను, లోకమున నేదేని యొక పదార్థ మున్నదని నిరూపింప దలచినపుడు అది భావ పదార్థమో యభావ పదార్థమో చెప్పవలసి యుండును. భావాభావములకు చెందని పదార్థ మొక్కటి యనిర్వాచ్యమై యున్నదనుట యుక్తి విరుద్ధము. అట్టిదాని నంగీకరింపజనదు. అంగీకరించువారు వ్యుత్పన్నమతులుకాని బాలకులతోను, భ్రాంతులగు పిచ్చివారితోను సమానులగుదురు. కాబట్టి యోగాచారులు చెప్పు వస్త్వవస్తూభయ రూపమగు నవిద్య యుక్తివిరుద్ధ మగుటచే నంగీకరింప యోగ్యము కాదు. పదార్థమేకాని యవిద్యచేత నిత్యము కాని క్షణిక మగు విజ్ఞానసంతతి రూపమగు నాత్మకు బంధమేర్పడుట సర్వథా బుద్ధి విరుద్ధమని భావము.

యోగాచారుల వలెనే శంకర మతానుయాయులును అనిర్వచనీయమైన యవిద్య నంగీకరింతురు. దానిచే పురుషుడు బద్ధు డగుననియు విద్యచే ముక్తుడగుననియు చెప్పుదురు. శాంకరుల యవిద్యయు బౌద్ధుల సంవృత్తివలెనే యుక్తివిరుద్ధమని తెలిసికొనవలయును.

విజ్ఞానవాదమును నిరాకరించు సూత్రములను వ్యాఖ్యానించుచు ప్రవచన భాష్యకారులు విజ్ఞానభిక్షు వొకచో (1.22 సూత్రముపై నిట్లు వ్రాసిరి. "వేదాంతి బ్రువుల" మని చెప్పుకొనువారి మాయావాదము సైతము విజ్ఞానవాదములోని యంతర్భాగమే కాబట్టి యదియు నిరాకరణీయమే.

"మాయావాద మసచ్ఛాస్త్రం ప్రచ్ఛన్నం బౌద్ధమేవచ
మయైవకథితం దేవి కలౌ బ్రాహ్మణరూపిణా"

(మాయావాదము సచ్ఛాస్త్రముకాదు. అది ప్రచ్ఛన్న బౌద్ధము.

కలికాలమున బ్రాహ్మణరూపమును దాల్చి నేనే దానిని చెప్పియున్నాను.) అను పద్మపురాణములోని శివుని వాక్యములు నీమాయావాదము ప్రచ్ఛన్న బౌద్ధముగా నంగీకరించుచున్నవి.

మఱియు ప్రచ్ఛన్న బౌద్ధులైన నవీన మాయావాదులు 'తుచ్ఛము' అను పదార్థము బంధ హేతువనుట పొసగదు."

యోగాచారులు బాహ్య జగత్తు సత్యముగా నంగీకరింపరు. కాని బౌద్ధులలో సౌత్రాంతికులు వైభాషికులు ననువారు బాహ్యముగ మనకు తెలియు పదార్థములన్నియు పరమాణువుల పుంజములుగా నంగీకరింతురు. 'కుండ, గుడ్డ, మఠము మున్నగు వస్తువులన్నియు పరమాణువుల సముదాయములే. వేరే వ్యక్త్యాత్మక పదార్థమొండులేదు' అని వారి సిద్ధాంతము. అనగా వారి దృష్టిలో విజ్ఞానాత్మయేకాక పరమాణు పుంజరూప బాహ్య విషయములు కలవని యెఱుగ వలయును. అట్టి బాహ్య విషయములకు సంబంధించిన అనాది వాసన వలన బంధమేర్పడగలదన, నదియు కాదనుచున్నాడు.

"న అనాది విషయోపరాగాతోఽప్యస్య" 1.27

*అస్య = క్షణిక విజ్ఞాన స్వరూపియగు పురుషునకు, అనాది విషయోపరగామిమిత్తతః అపి = అనాదిగా కలుగు విషయోపరాగమనెడి నిమిత్తమువలనను, న = బంధము కలుగజాలదు.*

ప్రవాహరూపమున ననాదియైన, ఉపరంజకమగు బాహ్య విషయమునకు సంబంధించిన వాసన యనెడి సంబంధ విశేషము ఈ సూత్రమున విషయోపరాగ మనబడినది.

అనాది విషయోపరాగ మనెడి నిమిత్తము వలనను బౌద్ధుల కభిమతమగు విజ్ఞానాత్మకు బంధము కలుగనేరదని భావము. కారణ మేమన :-

"న బాహ్యాభ్యంతరయో రుపరంజ్యోపరంజక భావోఽపి
దేశవ్యవధానాత్, స్రుఘ్నస్థ పాటలీపుత్రస్థయోరివ" 1.28

*బాహ్యాభ్యంతరయోః = వెలుపలనుండు విషయమునకు, లోపల నుండు విజ్ఞానాత్మకు, ఉపరంజ్యోపరంజక భావోఽపి = పరస్పరము ఉపరంజ్యత్వోపరంజకత్వ భావము సైతము, న = సంభవముకాదు. స్రుఘ్నస్థపాటలీపుత్ర స్థయోరివ = స్రుఘ్నము, పాటలీపుత్రము నను*

ఒక దాని కొకటి దూరముగానుండు పట్టణములలో నుండువారివలె.

స్ఫటికమణి, రంగులున్న పుష్పము నను నీ రెండును సమీపముగా నున్నపుడు - వాని మధ్యలో నెట్టి యాటంకము లేనపుడు - పుష్పములోని రంగులు స్ఫటికమునందు ప్రతి ఫలించి యది రంగులు కలదిగా నగపడును. అట్టియెడ పుష్ప ముపరంజకము, స్ఫటికమణి ఉపరంజ్యము నగును. అయ్యవి దూరమున ననగా నొకటి స్రుఘ్న నామక పట్టణమందును, మఱియొకటి పాటలీపుత్రము నందును ఉన్న పక్షమున నవియుపరంజకోపరంజ్యభావము నందజాలవు. అట్లే ఉపరంజ్య మగు విజ్ఞానాత్మ దేహమునం దంతార్భాగమున నుండును. ఘటపటాది ఉపరంజక విషయములు దేహమునకు బాహ్యమున నుండును. విజ్ఞానాత్మకు విషయములకు మధ్య దేహము వ్యవధానముగా నుండును. అట్టియెడ ఉపరంజకములయిన బాహ్యములగు విషయములయొక్క వాసనచే నాంతరిక విజ్ఞానాత్మ యెట్లు ఉపరక్తము కాగలదు? కాజాలదు. ఇట్లు విషయ విజ్ఞానాత్మలకు ఉపరంజకోపరంజ్యభావమే కుదరనపుడు విషయోపరాగమనెడి వాసన పురుష బంధమునకు నిమిత్తమనుట యసంగతమని భావము.

బౌద్ధుల విజ్ఞానాత్మ శరీరమునందలి చిత్తసత్వమే కాని వేరొండేమియు కాదు. ఆ చిత్తసత్వము ప్రతిక్షణము వృత్తి రూపమున మారుచుండును. అదియే జ్ఞానము. ఆ జ్ఞానము నెల్లప్పుడు నుండక ప్రతిక్షణము మారుచుండును. పూర్వ జ్ఞానము నశించి యుత్తర జ్ఞాన ముదయించు చుండును. ఇట్లు క్షణక్షణము నుదయించి నాశమందుచుండు విజ్ఞాన సంతానమే వారి విజ్ఞానాత్మ. ఇతర దేహేంద్రియాది విషయ జాతమంతయు పరమాణుపుంజములే. అందువలన వారిమతమున నింద్రియగోలకములకు మించి యింద్రియములు వేరుగా నుండవు. బాహ్యవిషయములను విజ్ఞానాత్మతో చేర్చు పదార్థమొండును కానరాదు. అట్టియెడ విజ్ఞానాత్మ విషయవాసనచే వాసితుడై బద్ధుడెట్లు కాగలుగును? కాజాలడు. కాబట్టి బంధము వాసనా నిమిత్తము కాదని భావము.

వైదికులయిన కణాదాది మహర్షుల దృష్టిలో పురుషుడు శరీరమునకంటె భిన్నుడై శరీరమునందుండును. విషయములు బాహ్యములే కాని యవి కేవల పరమాణుపుంజములు కాక వేరు వేరు పదార్థములు. విషయములను పురుషునితో చేర్చుటకు తగినట్లు జ్ఞానేంద్రియములు

చిత్తము వేరుగా నంగీకరింతురు. కాబట్టి వారిమతమున విషయములు ఇంద్రియములద్వారమున పురుషుని జేరి యతని నుపరక్తుని జేయగలుగుచున్నవని భావము.

క్షణికమయ్యు విజ్ఞానాత్మ యగు చిత్తము కేవలము దేహమునందే యుండదు. అది దేహమునకు లోపల వెలుపల నెల్లయెడల పూర్ణమై యుండును. అందువలన విషయోపరాగము కలుగగలదన :-

**"ద్వయోరేక దేశలబ్ధోపరాగా న్నవ్యవస్థా"** 1.29.

*ద్వయోః = బద్ధముక్తాత్మలకు, ఏక దేశలబ్ధోపరాగాత్ = ఒకే విషయ దేశమున నుపరాగము లభించినందున, వ్యవస్థా = బంధమోక్షముల వ్యవస్థ, న = ఉండనేరదు.*

బద్ధపురుషుడు ముక్తపురుషుడు నిరువురు బహిరంతః పూర్ణులయినచో బాహ్య విషయ దేశమునందుచేరి యుపరక్తులగుట సంభవమే యగును. కాని బద్ధు డే విషయమున నుపరక్తుడగునో యా విషయమునందే ముక్తుడు నుపరక్తుడగును. అట్టియెడ నొకడు బద్ధుడు, మఱియొకడు ముక్తుడు నేల కావలయును? ఇరువురు బద్ధులో లేక ముక్తులో కావలసియుందురు. అందువలన బద్ధ ముక్త వ్యవస్థ యుండ నేరదని భావము.

శంక :-

**"అదృష్ట వశాచ్చేత్"** 1.30

*చేత్ అదృష్టవశాత్ = బద్ధముక్తుల కుభయులకు విషయ సంయోగము సమానమైనను, అదృష్టవశమున బద్ధునకే విషయోపరాగ ముండుననియు, ముక్తున కుండదనియు, నందువలన వ్యవస్థ యేర్పడగల దనియు నంగీకరించిన దోషముండనేరదని సూత్రార్థము.*

సమాధానము :-

**"న ద్వయో రేకకాలా యోగాత్ ఉపకార్యోపకారకభావః"** 1.31

*ద్వయోః = కర్త, భోక్త, అను నీ రెండాత్మలకు, ఏకకాలా యోగాత్ = సమానకాలికత్వము లేకపోవుటవలన, ఉపకార్యోపకారక భావః = కర్తయైన యాత్మయొక్క యదృష్టము భోక్తయైన యాత్మకు విషయోపరాగ మనెడి యుపకారము చేయగలుగుట, న = సంభవింపదు.*

బౌద్ధులచే నంగీకరింపబడు నాత్మ క్షణిక మయినందున కర్తయైన

ఆత్మభోక్తయైన యాత్మ యున్నపుడుండదు. అట్టి యెడ కర్తయొక్క యదృష్టము భోక్త కెట్లుపకరింపగలదు? ఉపకరింపజాలదు. కాబట్టి యదృష్టము ద్వారమున బంధమోక్ష వ్యవస్థ యేర్పడుననుట దోషయుక్తమే యని భావము.

శంక :-

**"పుత్రకర్మ వదితిచేత్"** 1.32

*పుత్రకర్మవదితిచేత్ = తండ్రియందుగల గర్భాధాన రూపకర్మము కాలాంతరమున జనించు పుత్రునియందు సంస్కార రూపమైన ఉపకారమును కలిగించునట్లు, కర్తయందలి యదృష్టము భిన్నకాలిక భోక్త కుపకారము కలిగింపగలదని చెప్పుదురేని,*

**సమాధానము :-**

**"న, అస్తి హితత్ర స్థిర ఏకాత్మా, యోగర్భాధానాది నా సంస్క్రియతే"** 1.33

*న = మీ దృష్టాంతము సరికాదు, హి = కారణమేమన, తత్ర = వైదికుల సిద్ధాంతమున, యః = ఏ జీవాత్మ, గర్భాధానాదినా = గర్భాదానాది సంస్కారము ద్వారమున, సంస్క్రియతే = సంస్కరింపబడు చున్నదో, ఆ యాత్మ, అస్తి = ఉన్నది. ఆ యాత్మ, స్థిరః = స్థితి శీలము, ఏకాత్మా = ఒకే జీవాత్మ - పురుషుడు.*

తండ్రిచే చేయబడిన గర్భాధానాదికర్మ భిన్న కాలిక పుత్రున కుపకరించు చున్నట్లని చెప్పిన ఉదాహరణము బౌద్ధుల సిద్ధాంతమును సాధింపనేరదు. పితృనిష్ఠకర్మము భిన్న కాలీనపుత్రున కుపకరించుటను వైదికు లంగీకరింతురు. వారి సిద్ధాంతమున నాత్మస్థిరము. క్షణికము కాదు. కాబట్టి తండ్రి యెవని నుద్దేశించి గర్భాధాన రూపసంస్కారము ద్వారా ఉపకారము చేయుచున్నాడో ఆయాత్మ లేకపోలేదు. సంస్కారమనగా ఉన్న వస్తువునందు మఱియొక గుణమును కలిగించుటయే. కాబట్టి వైదికుల మతమున పితృకర్మ పుత్రున కుపకరించు ననుటలో దోష మావంతయు లేదు. కాని బౌద్ధులకు స్థిరమైన యాత్మ యొండు లేదు. కాగాపై యుదాహరణముతో కాలాంతరమున నుండు ఆత్మగత యదృష్టము కాలాంతరమున నుండు ఆత్మ కుపకరింప గలదని చెప్పనెంచుట సాహసము. కాగా విషయోపరాగము వలన బంధ మేర్పడగలదను

బౌద్ధుల వాద మసంగతమని భావము.

బంధ విషయమున బౌద్ధమతమును నిరాకరించి ప్రసంగ వశమున వైభాషికులమతమే దోషయుక్తమని చెప్పదలచి యా మతమును మరల నుట్టంకించుచున్నాడు.

శంక :-

**"స్థిర కార్యాసిద్ధేః క్షణికత్వమ్"** 1.34

*స్థిరకార్యాసిద్ధేః = స్థిరముగానుండు కార్యము (భావపదార్థము) ఒందును లభింపనందున, క్షణికత్వమ్ = అన్నియు క్షణికములే.*

లోకమున నొక్క వస్తువును స్థిరముగా నుండుటమనము చూడలేకున్నాము. ఉదాహరణమునకైన నొక పదార్థము స్థిరముగా నుండునది లభింపదు. కాబట్టి భావపదార్థము లన్నియు క్షణికములే. క్షణికమనగా పుట్టిన క్షణముననుండి మరుక్షణమున లేకుండునది.

**సమాధానము :-**

**"న ప్రత్యభిజ్ఞాబాధాత్"** 1.35

*ప్రత్యభిజ్ఞాబాధాత్ = 'అదేయిది' యని గుర్తించుటచేత క్షణికత్వము బాధింపబడుచుండుటవలన, న = ఏవస్తువును క్షణికముకాదు.*

ఒక క్షణమున నొక వస్తువును కంటితో చూచి మఱియొక క్షణమున నా వస్తువును చేతితో స్పృశించి పూర్వ క్షణమున నేను కింటితో చూచిన వస్తువే యిది యని మరుక్షణమున గుర్తించుచున్నాను. ఇట్లు గుర్తించుటయే సంస్కృతమున ప్రత్యభిజ్ఞ యనబడును. వస్తువులన్నియు క్షణికములయినచో నిట్టి ప్రత్యభిజ్ఞ కలుగజాలదు. ప్రత్యభిజ్ఞ కలుగు చున్నది. కాబట్టి వస్తువులు క్షణికములు గావు.

**"శ్రుతి న్యాయవిరోధాచ్చ"** 1.36

*శ్రుతి న్యాయవిరోధాచ్చ = "సదేవసోమ్య..." అను శ్రుతి "కథమసతః....." అను న్యాయము, ఈ రెండును వస్తుసత్త్వమును బోధించుచు క్షణికత్వమును విరోధించుట వలనను క్షణిక వాదమసంగతము.*

**"సదేవసోమ్యేదమగ్ర ఆసీత్" ఛాం.** 6.2.1

(ఈ ప్రపంచము ప్రథమమున సత్తుగానే యుండెను.)

**"కథమసతః సజ్జాయేత" ఛాం.** 6.21

(అసత్తునుండి సత్తెట్లు కలుగగలదు?) అను నీ వాక్యములు జగత్తుయొక్క సత్త్వమును - ఉనికిని - బోధించుచున్నవి. కాబట్టి వైభాషికులు చెప్పు జగత్తు యొక్క క్షణికత్వము శ్రుతికి, న్యాయమునకును విరుద్ధమగుచున్నదని భావము.

శంక :-

పైన ఉదాహరించిన శ్రుతిన్యాయములు భావపదార్థములన్నియు (జగత్తు) సత్త్వము గలవి యనియే బోధించు చున్నవి గాని క్షణికత్వమును నిషేధించుట లేదుగదా? యన :-

సమాధానము :-

"దృష్టాంతాసిద్ధేశ్చ" 1.37

దృష్టాంతాసిద్ధేశ్చ = దృష్టాంతము సిద్ధింపనందువలన.

బౌద్ధులు జగత్తులోని భావపదార్థములన్నియు క్షణికములనుటకు దీపశిఖను ఉదాహరణముగ జెప్పుదురు. (యత్ సత్ తత్ క్షణికమ్ యథా దీపశిఖా) (ఏది సత్త్వమో యది క్షణికము - దీపశిఖవలె) భావపదార్థము క్షణికమనుట కుదాహరించు దీపశిఖ క్షణికమనుట సిద్ధముకాదు. దీపశిఖయందలి యనేక క్షణములను మనము సరిగా గుర్తింపజాలకపోవుటచే క్షణిక మనుచున్నాము. కాని వాస్తవమున నది క్షణికమే కాదు. కాబట్టి దృష్టాంతము సిద్ధింపనిది బౌద్ధవాదము సిద్ధము కాదని భావము.

మఱియు క్షణిక వాదుల మతము నంగీకరించినచో కార్యకారణ భావమును సంభవింపదనుచున్నాడు.

"యుగ పజ్జాయమానయో ర్నకార్య కారణ భావః" 1.38

యుగ పజ్జాయమానయోః = ఒకే సమయముననుత్పన్నమగు రెండు వస్తువులలో, కార్యకారణ భావః = కార్యకారణ భావము, న = ఉండనేరదు.

ఏక క్షణమున నుత్పన్నమగు రెండు వస్తువులు పరస్పరము కార్యకారణ భావము కలిగియుండనేరవు. కొమ్ములుండు జంతువులకు రెండు కొమ్ములొకే సమయమున నుత్పన్నమగుట చూచుచున్నాము. ఆ రెంటిలో నేది దేనికి కారణము? ఏదియును కాదు. కాబట్టి యొకే క్షణమున నుత్పన్నములగు వానిలో పరస్పరము కార్యకారణము

నంగీకరింపజాల మనుట నిక్కువము. కారణము కార్యమునకు పూర్వక్షణమున తప్పక యుండవలయు ననునది నియమము.

క్రమముగా నేర్పడువానిలోనే కార్యకారణ భావ మేర్పడ గలదని యంగీకరింతురేని నయ్యదియు క్షణిక వాదమున సంభవము కాదు.

"పూర్వాపాయే ఉత్తరాయోగాత్" 1.39

పూర్వాపాయే = కారణము నశించినపుడు, ఉత్తరాయోగాత్ = కార్యోత్పత్తి కలుగజాలనందున, కార్య కారణ భావ మేర్పడజాలదు.

మట్టి లేనపుడు కుండ యెట్లు కలుగును? కలుగదు. కార్యము ఉపాదాన కారణమందే యుండును. కాబట్టి యుపాదాన కారణము క్షణమున కార్యము కలుగ నేరదు. మట్టి, కుండ రెండు నొకే క్షణమున నంగీకరింతురేని కార్య కారణ భావము కలుగ నేరదు. పూర్వోత్తర క్షణములలో నంగీకరింతురేని కుండ యేర్పడు క్షణమున కారణమైన మట్టి యుండదు. క్షణికము కాబట్టి. అందువలన కారణములేని క్షణమున కార్యమెట్లు కలుగ గలదు? అసంభవము. కాగా క్షణికవాదుల సిద్ధాంత మంగీకరించినచో కార్య కారణ భావము కలుగనేరదని భావము.

మఱియు

"తద్భావే తదయోగా దుభయ వ్యభిచారా దపిన" 1.40

తద్భావే = కార్య- కారణములున్నపుడు, తదయోగాత్ = కారణ కార్యము లుండనందున, ఉభయ వ్యభిచారాదపి = అన్వయ వ్యతిరేకములు వ్యభిచరించుచున్నందున, న కార్య కారణభావము సంభవింపదు.

క్షణికవాదుల సిద్ధాంతమున ప్రతి భావపదార్థమును క్షణికము కాబట్టి, కారణమున్నపుడు కార్యముండదు; కార్యమున్నపుడు కారణ ముండనేరదు. అట్టియెడ కార్య కారణ భావమే సంభవము కానేరదు. కార్య కారణ భావము అన్వయ వ్యతిరేకములకు వ్యభిచారము లేని తావుననే యుండగలదు. అన్వయ వ్యతిరేకములు కార్యకారణ భావఘటకములని భావము. కార్యోత్పత్తి కలుగు క్షణమున నుపాదాన కారణ ముండుట అన్వయము. ఉపాదానకారణములేని క్షణమున కార్యోత్పత్తి కలుగకుండుట వ్యతిరేకము. క్షణికా వాద మంగీకరింతుమేని ఉపాదానకారణమైన మట్టియున్న క్షణమున కుండ యేర్పడదు. మట్టిలేని క్షణమున కుండ యేర్పడును. ఈస్థితి పైన వర్ణించిన యన్వయ వ్యతిరేక

నియమమును వ్యభిచరించు చున్నది. అందువలన కార్యకారణ భావ మేర్పడజాలదు. కాబట్టి క్షణికవాద మసంగతము.

కార్యోత్పత్తిక్షణమున నిమిత్తకారణముండదు. అట్లే యుపాదానకారణము సయితము కార్యోత్పత్తిక్షణమున నుండకున్న నేమి యన :-

"పూర్వభావమాత్రే ననియమః" 1.41

పూర్వభావమాత్రే = ఉపాదానకారణము కార్యముకంటె పూర్వమున్న చాలునని యంగీకరించినచో, ననియమః = ఈ కార్యమున కిదియే యుపాదానకారణమని నియమము కలుగనేరదు.

కారణము కార్యముకంటె పూర్వభావియైన చాలునని మాత్ర మంగీకరించిన నయ్యది నిమిత్త కారణమున కన్వయింప వీలగును. నిమిత్త కారణము కార్యోత్పత్తి క్షణమున నుండవలయునను నియమము లేదు. కాని యది యుపాదానకారణ విషయమున నంగీకరింప వలనుపడదు. అంగీకరింతుమేని మట్టి కుండ కుపాదానకారణమైనట్లు కుండ యేర్పడు క్షణమునకు పూర్వముండు ప్రతి పదార్థము దాని కుపాదాన కారణమని యంగీకరింప వలసి వచ్చును. అప్పుడు నిమిత్త కారణమునకును నుపాదానకారణమునకును గల భేదమును నియమించున దేమి యున్నది? ఏమియు నుండదు. కాబట్టి యుపాదానకారణము కార్యోత్పత్తి క్షణమునలేకున్న నేమి యనుట పొసగదు. కార్య ముత్పన్నమగు క్షణముననుండు కారణమే యుపాదాన కారణమగును.

**యోగాచార మత నిరాకరణము :-**

"న విజ్ఞాన మాత్రం బాహ్యప్రతీతేః" 1.42

బాహ్యప్రతీతేః = బాహ్యమున వస్తుజ్ఞానము కలుగుచున్నందున, విజ్ఞానమాత్రం = జగత్తంతయు విజ్ఞానమే యనుట, న = తగదు.

బాహ్యమున ఘట పటాది వస్తు జాతమున్నట్లు ప్రతీతి (జ్ఞానము) కలుగుచున్నందున జగత్తంతయు విజ్ఞానమే కాని వేరొండు బాహ్యవస్తువులేదనుట సరికాదని భావము.

స్వప్న జ్ఞానమువలెనే బాహ్యజ్ఞానము కలుగుచున్న దందురేని :-

"తదభావే తదభావా చ్ఛూన్యం తర్హి" 1.43

తర్హి = బాహ్యార్థమే లేకున్న, శూన్యం = జగత్తే శూన్యమగును.

*తదభావే = బాహ్యవస్తువే లేకున్నచో, తదభావాత్ = విజ్ఞానమును కలుగ జాలనందున.*

బాహ్య వస్తులుండుట వలననే విజ్ఞానము కలుగుచున్నది. ఘట పట విజ్ఞానసంతతి యవి యున్నచోటనే కలుగుచున్నది. అవి లేనియెడ నట్టి జ్ఞానమే కలగదు. కాబట్టి బాహ్యవస్తువు నంగీకరింపని పక్షమున విజ్ఞానమే కలుగదు. కావున జగత్తు శూన్యమగునని భావము.

నిర్విషయమైన విజ్ఞానమొందు లోకమున కలుగదు. కాబట్టి స్వప్న విషయిక జ్ఞానమునకును బాహ్యవస్తువులే మూలమని యంగీకరింతురు.

శూన్య వాది మతము :-

"శూన్యంతత్వం, భావోవినశ్యతి, వస్తు ధర్మత్వా ద్వినాశస్య" 1.44

*వినాశస్య = నాశము, వస్తు ధర్మత్వాత్ = వస్తు స్వభావమగుట వలన, భావః = భావపదార్థ మంతయు, వినశ్యతి = నశించును. కావున, తత్వం = తత్వము. శూన్యం = శూన్యమే.*

లోకమున ప్రతివస్తువు నశించుట చూచు చున్నాము. కాబట్టి నాశము వస్తు స్వభావమని తేలుచున్నది. కాగా శూన్యమే తత్వమని యభిప్రాయము.

సమాధానము :-

"అపవాద మాత్ర మబుద్ధానామ్" 1.45

*భావ పదార్థములన్నియు నశించు నవియే యనుట, అబుద్ధానాం = శాస్త్రతత్వము నెఱుగనివారి, అపవాదమాత్రమ్ = మిథ్యాప్రవాదము మాత్రమే.*

(యో యే భావః స సర్వో వినశ్యత్యేవ) ప్రతిభావ పదార్థమును నశించునదియే యని బుద్ధిమంతులంగీకరింపరు. ఇయ్యది శాస్త్రతత్వము నెఱుగని వారి యపవాదము. కారణ మేమన :- కారణవంతములైన పదార్థములే నశించును. నిరవయవ పదార్థములు నశింపవు. మఱియు 'ఘటము జీర్ణించినది' అనునట్లు 'ఘట మతీతము' అనియు నందుము. అందువలన ఘటమునందలి యతీతావస్థయే సిద్ధించును కాని దాని నాశము కాదు. కాబట్టి వినాశిత్వమును పురస్కరించుకొని శూన్య వాదము సిద్ధింపదని భావము.

కాబట్టి చేయవలసిన దేమన :-

"ఉభయ పక్ష సమాన క్షేమత్వాదయ మపి" 1.46

ఉభయ..... క్షేమత్వాత్ = పూర్వ నిరాకృత రెండు పక్షములతో సమాన క్షేమము కలదగుటవలన, అయమపి = శూన్యవాదము సైతము త్యాజ్యమే యని సూత్రార్థము.

సౌత్రాంతిక వైభాషికు లిరువురును క్షణిక బాహ్య వస్తువుల నంగీకరింతురు. అదియొక పక్షము. యోగాచారుడు క్షణిక విజ్ఞానమును మాత్ర మంగీకరించును. ఇది రెండవ పక్షము. శూన్యవాదము మూడవపక్షము. ఇయ్యది పై రెండు పక్షములతో సమాన మగుటచే నియ్యదియు వానివలె నిరాకరణీయమే యని భావము.

దుఃఖనివృత్తి రూప పరమ పురుషార్థము, దానికి సాధనము, రెండును శూన్యములే యగుటచే సమానరూపత యేర్పడుచున్నది. కాబట్టి యీ పక్షమేల త్యాజ్యమన :-

"అపురుషార్థత్వ ముభయథా" 1.47

శూన్యవాదమునకు, ఉభయథాఽపి = రెండు విధములను, అపురుషార్థత్వం = పురుషార్థత సిద్ధింపదు.

దుఃఖనివృత్తి రూపమున గాని, తత్సాధన రూపమున గాని, ఆత్మకు శూన్యభావము సంపాదించుట పురుషార్థత్వ మెట్లుకాగలదు? కాజాలదు. కాబట్టి శూన్యవాదము సైతము త్యాజ్యమే కాని గ్రాహ్యము కాదని భావము.

ఇట్లు నాస్తికుల వాదములను నిరాకరించి, వారు చెప్పు విషయోపరాగాదులవలన పురుషునకు బంధమేర్పడజాలదని నిరూపించిన మీదట పురుషబంధము గతివిశేషము వలన కలుగగల దనగా దానిని నిరాకరించుచున్నాడు.

"నగతి విశేషాత్" 1.48

న గతి విశేషాత్ = దివ్యాదివ్య శరీరములందు ప్రవేశించుట వలన నాత్మకు బంధమేర్పడ జాలదు.

పురుషుడొక శరీరమునుండి మరియొక శరీరమున ప్రవేశించును. శరీర ప్రవేశ రూపగతివలన బంధమేర్పడ గలదన నదియు సంభవము కాదని సూత్రాభిప్రాయము.

కారణ మేమన :-

**"నిష్క్రియస్య తద సంభవాత్"** 1.49

*నిష్క్రియస్య = క్రియాపరిణామ రహితుడైన పురుషునకు, తదసంభావత్ = గతి సంభవము కానందువలన.*

నిష్క్రియుడైన పురుషునకు గతి కలుగనేరదు. కాబట్టి గతీ బంధహేతువు కాదని భావము. పురుషుడు మధ్యమ పరిమాణము కలవాడని యంగీకరించిన గతి సంభవమే కదాయన :-

**"మూర్తత్వాద్ ఘటాదివత్సమాన దర్మాపత్తావపసిద్ధాంత"** 1.50

*ఘటాదివత్ = ఘటాదులవలె, మూర్తత్వాత్ = ఆత్మమధ్యమ పరిమాణము కలదగుటవలన, సమాన ధర్మాపత్తౌ = ఘటము మూర్తమగుటచే సావయవమైనట్లు ఆత్మయు మధ్యమపరిమాణము కలదగుటచే సావయవము కావలసివచ్చును. కాగా, అపసిద్ధాంతః = ఆత్మ నిత్యమని యంగీకరించిన స్వసిద్ధాంతమునకు హాని కలుగును.*

ఆత్మపదార్థము ఘటమువలె మూర్తము (మధ్యమ పరిమాణము కలది) అని యంగీకరించినచో ఘటమువలె నదియు సాయవ పదార్థమగును. ఘట మనిత్యమైనట్లు - అతీతాద్యవస్థల బొందునట్లు - ఆత్మయు ననిత్యమగును. ఆత్మ నిత్యమను స్వసిద్ధాంతమునకే హాని కలుగును. కాబట్టి ఆత్మ మధ్యమ పరిమాణము కలది కాదని భావము.

పురుషుడు నిష్క్రియుడైన నతనియందు గతిని తెలుపు శ్రుతు లెట్లు సంగతము లగునన :-

**"గతి శ్రుతి రప్యుపాధి యోగా దాకాశవత్"** 1.51

*గతి శ్రుతి రపి = గతిని తెలుపు శ్రుతికూడ, ఆకాశవత్ = ఆకాశమువలె, ఉపాధియోగాత్ = ఉపాధి సంబంధమువలన నుపపన్నమగును.*

**"పుణ్యేన పుణ్యం లోకం, నయతి పాపేన పాపమ్"** ప్రశ్న 2.7

(పుణ్యముచే పుణ్యలోకమును, పాపముచే పాపలోకమును పొందును.) అను నిట్టి గతిని తెలుపు ఉపనిషద్వాక్యములు ఉపాధిసంబంధముచే నాత్మయందు గతిని బోధించుచున్నట్లు చెప్పిన సంగతములు కావచ్చు. ఆకాశము క్రియారహితము. అయినను ఘటాద్యుపాధుల సంబంధమున ఘటా కాశమునందు గమనా గమనములు వ్యవహరింపబడుచున్నవి. అట్లే యాత్మయందును బుద్ధిసత్త్వమనెడి యుపాధి సంబంధముచే గతి

నంగీకరించిన దోషముండనేరదు - వాస్తవమున నందెట్టి క్రియాపరిణామము నుండనేరదని భావము.

'ఆత్మ అణుపరిమాణము కలది. ఆకాశము విభుపరిమాణము కలది. ఉపాధియుక్త పురుషునందు శ్రుతిబోధిత గతిని సమన్వయించుటకు ఉపాధియుక్త అకాశము ఉదహరింపబడినది. కాబట్టి ఉపాధిగమనముచే నుపధేయమునందు గమన మున్నట్లెంచబడునని చెప్పుటయే, యీ యుదాహరణమున ప్రకృతము' అని వైదికుల మతము.

అటులయిన కర్మవలన నేర్పడు నదృష్టము పురుష బంధమునకు హేతువేల కాదన :-

"న కర్మణాప్యతద్ధర్మత్వాత్" 1.52

కర్మణాపి = కర్మమువలన కలిగెడి యదృష్టముచేతను, న = బంధమేర్పడదు - అతద్ధర్మత్వాత్ = అదృష్టము పురుషధర్మము కానందున.

ఈ సూత్రమున కార్యమునకు బదులు కారణశబ్దము ప్రయోగింపబడినది. కాబట్టి 'కర్మణా అను పదమునకు కర్మజన్యమైన యదృష్టముచే' అని యర్థము వ్రాయబడినది. అదృష్టము పురుషధర్మము కాదు కావున నది పురుషబంధమునకు హేతువు కాదని భావము.

**అన్యధర్మ మన్యునేల బంధింపదన :-**

"అతి ప్రసక్తి రన్యధర్మత్వే" 1.53

అన్యధర్మత్వే = బంధము దాని కారణములు భిన్నపదార్థము లయినచో, అతిప్రసక్తిః = ముక్తులును బద్ధులు కావలసిన ప్రసంగమేర్పడును.

అన్యధర్మ మన్యుని బంధమునకు హేతువగునెడల ముక్తులును బద్ధులు కావలసి వత్తురు. కాబట్టి యిది పొసగదని భావము.

అదృష్టము పురుషధర్మమే యనిన కలుగు విరోధ మేమన :-

"నిర్గుణాది శ్రుతి విరోధశ్చేతి" 1.54

(ఇందలి 'ఇతి' శబ్దము బంధకారణములను పరిశీలించుట సమాప్తమైనట్లు సూచించుటకు) అదృష్టము పురుషధర్మముగా నంగీకరించినచో-

("అసంగోహ్యయం పురుషః" బృ. అ **6.3.15.**)

(పురుషు డసంగుడు) అని గుణసంగము పురుషునకు లేదని

చెప్పు నిర్గుణ శ్రుతితో విరోధము కలుగునని భావము -

కాలాదులవలె ప్రకృతి పురుష సంయోగము సైతము బద్ధముక్త పురుషులకు సమానముగానే యుండును. కాబట్టి ప్రకృతి సంబంధమువలన పురుషుడు బద్ధుడెట్లు కాగలడన :-

**"తద్యోగో౽ప్యవివేకా న్నసమానత్వమ్"** 1.55

పురుషునకు, తద్యోగో౽పి = ప్రకృతి సంబంధము కూడ, అవివేకాత్ = అవివేకమువలననే కలుగును. కావున, నసమానత్వమ్ = కాలాదులవలె ప్రకృతి సంబంధము బద్ధముక్తులకు సమానము కాదు.

ఈ యధ్యాయమున పందొమ్మిదవ సూత్రమునందు ప్రకృతి పురుషసంబంధమువలననే బంధమేర్పడగలదని చెప్పి యుంటిమి. ప్రకృతి సంబంధము కాలాదుల సంబంధమువలెనే బద్ధముక్తభేదము లేక యెల్లరికిని కలుగునుగదా! అందువలన ప్రకృతి సంబంధము పురుష సంబంధమునకు హేతువని యంగీకరించినచో ముక్తులును, బద్ధులుకావలసి వత్తురని శంకించి దానికి సమాధానముగా నీ సూత్రము రచియింపబడినది. ప్రకృతి పురుషులకు గల సామాన్యసంబంధ మిట వివక్షితము కాదనియు అవివేకమువలన కలిగెడి ప్రకృతి పురుష సంబంధమే బంధమునకు హేతువనియు నిందు వివరింపబడినది. ముక్త పురుషులతో ప్రకృతికి సామాన్యసంబంధ మున్నప్పటికిని, అవివేకకృతసంబంధ ముండదు. ముక్తులలో నవివేకముండ నేరదు కదా! కాబట్టి దోషము లేదని భావము.

అవివేకము బంధమునకు హేతువైనచో ముక్తి గలుగ వలయుననిన అవివేకము తొలగ వలయునుగదా! అదియెట్లు సంభవ మన :-

**"నియత కారణా త్తదుచ్ఛిత్తి ర్ధ్వాంతవత్"** 1.56

నియత కారణాత్ = వివేకమనెడి నియత కారణము వలన, తదుచ్ఛిత్తి = అవివేకము తొలగును. ధ్వాంతవత్ = ఆలోకమువలన చీకటి తొలగునట్లు.

ప్రకాశమువలన చీకటి నశించునట్లు వివేకమువలన నవివేకము నశించును. అటుపైన వివేకమువలన నేర్పడు ప్రకృతి పురుషులకు గల విశేష సంబంధము తొలగును. నాడు దుఃఖాత్యంత నివృత్తి యనెడు మోక్షము కలుగగలదని భావము. యోగ శాస్త్రము నందును సమాధి

పాదమున (వివేకఖ్యాతి రవిప్లవా హానోపాయః ఇతి) వివేకఖ్యాతి మోక్షము నెట్లు కలిగించునో వివరింపబడినది. వివరములు నాచే రచింపబడిన యోగదర్శనమున చూడగలరు.

ప్రకృతి పురుష వివేకమువలన ప్రకృతి పురుషులకు సంబంధించిన అవివేకము నశించినను ఇతరావివేకము లెట్లు నాశము నందగలవన :-

"ప్రధానా వివేకా దన్యావివేకస్య తద్హానే హానమ్" 1.57

ప్రధానా వివేకాత్ = ముఖ్యమైన యవివేకము వలన, అన్యా వివేకస్య = ఇతరావివేకము కలుగు చుండును. కాబట్టి తద్హానే = మూలా వివేకము నశించిన, హానమ్ = మిగిలిన యవివేకము నశించును.

ఇందు ప్రధానా వివేకమనగా మూలప్రకృతికి సంబంధించిన యవివేకమనియు, అన్యావివేకమనగా ప్రకృతి కార్యము లయిన మహత్తత్త్వాదికి సంబంధించిన యవివేకమనియు గ్రహింప వలయును. ప్రధాన యవివేకము వలననే యన్యావివేకములు కలుగును. కాబట్టి కారణ నాశమున కార్యనాశ మగునను నియమము ననుసరించి ప్రకృతి పురుషుల యవివేకము నశించిన మీదట యితరావివేకము లన్నియు నశించునని భావము.

వివేకమువలన మోక్షము నంగీకరించినచో పురుషుడు బద్ధుడని చెప్పక తప్పదు. కాబట్టి, పురుషుడు నిత్యశుద్ధ బుద్ధ ముక్తుడెట్లగు నన :-

"వాఙ్ మాత్రం నతు తత్త్వం చిత్తస్థితేః" 1.58

పురుషునకు చెప్పు బంధమంతయు, వాఙ్ మాత్రం = మాట మాత్రమే, నతు తత్త్వం = వాస్తవము కాదు. చిత్తస్థితేః = బంధము చిత్తమునం దుండుట వలన.

మోక్షమునకు పూర్వముందు బంధమంతము పురుషునిదే యనుట వాస్తవము కాదు. స్ఫటికమునందు కనబడురంగులు స్ఫటికమునకు చెందనట్లు బంధము పురుషునికి చెందదు. అయ్యది చిత్తధర్మము - బంధము, మోక్షము, వివేకము, అవివేకము, సుఖము, దుఃఖము నను నవి యన్నియు చిత్తమునందే యుండును. చిత్త సామీప్యమువలన

నవిపురుషునందు ప్రతిభాసించును. కాబట్టి స్వతః బంధమోక్షములు పురుషునివి కావు. అందువలన నతని నిత్య శుద్ధ బుద్ధ ముక్తత్వమునకు లోటు వాటిల్లదు.

పురుషునకు బంధాదులు వాఙ్మాత్రములే యైనచో శ్రవణమననము వలననే యవితొలగిపోగలవు. శ్రుతిస్మృతులు మోక్షహేతువైన వివేక ప్రత్యయమును సాక్షాత్కారము చేసికొనవలయునని సాక్షాత్కార పర్యంత ముపదేశింపనేల?

**"యుక్తితో పిన బాధ్యతే దిఙ్ మూఢవ దపరోక్షాదృతే"** 1.59

*బంధాదులు, వాఙ్ మాత్రమైనను, దిఙ్ మూఢవత్ = దిగ్భ్రమ కలిగినవానివలె, అపరోక్షాదృతే = ప్రత్యక్షము కలుగనంతవరకు, యుక్తితోఽపి = శ్రవణమననముల (వినికిడి, యుక్తి) వలనను, నబాధ్యతే = తొలగింపబడవు.*

భ్రమ కలిగినవానికి యథార్థము సాక్షాత్కారము కానంతవరకు నా భ్రమ తొలగదు. అట్లే పురుషునకు విన్నంత మాత్రమున గానీ యుక్తులతో నాలోచించిన మాత్రమున గానీ బంధము తొలగనేరదు. దిగ్ భ్రమజెందిన పురుషునకు సరియైన దిశకు సంబంధించిన సాక్షాత్కారము కలిగినపుడే యది తొలగును. అట్లే బంధాదులును వివేకజ్ఞాన సాక్షాత్కారమువలననే తొలగగలవు - కేవల శ్రవణాదులవలన తొలగవని భావము.

మోక్ష సాధనమైన వివేకప్రత్యయ మేప్రకృత్యాదుల వలన కలుగవలయుననుచున్నారో యాప్రకృత్యాదు లెట్లు సిద్ధించు నన :-

**"అచాక్షుషాణా మనుమానేన బోధో ధూమాదిభిరివ వహ్నేః"** 1.60

*అచాక్షుషాణామ్ = ప్రత్యక్షముకాని ప్రకృత్యాది సూక్ష్మపదార్థములు, అనుమానేనబోధః = అనుమాన ప్రమాణముచే సిద్ధించును. వహ్నేః = అగ్ని, ధూమాదిభిరివ = ధూమాది హేతువులచే సిద్ధించు నట్లు పంచభూతము, లువాని కార్యములైన దేహాదులు, మనకు ప్రత్యక్షములగుచున్నవి, కాని వానికి కారణభూతములగు సూక్ష్మము లయిన ప్రకృతి మహత్తత్వాదులు అనుమానముచే సిద్ధించునని భావము.*

సూత్రమునందు ప్రత్యక్షానుమాన ప్రమాణములు స్పష్టముగా గ్రహింపబడినవి. ఈ సూత్రములను వ్యాఖ్యానించుచు విజ్ఞాన భిక్షువు

అనుమాన ప్రమాణమునకు గమ్యము కానివి యామగము ద్వారా తెలియనగునని వర్ణించియున్నారు. తన యీ వాక్యమును బలపరచుకొనుటకై కారిక యొకటి యుదాహరించిరి.

"సామాన్యతస్తు దృష్టాదతీంద్రియాణాం ప్రతీతి రనుమానాత్,
తస్మాదపి చాసిద్ధం పరోక్ష మాప్తాగమాత్సిద్ధమ్"

'ఇంద్రియగోచరములు కాని పదార్థములు సామాన్యతో దృష్ట్యానుమానము ద్వారమున తెలియనగును. అనుమానముతోను సిద్ధపడని పదార్థము లాప్తవచనముద్వారా సిద్ధించును."

అప్రత్యక్ష ప్రకృత్యాది పదార్థముల నూహించుట కనువగు సామాన్యతో దృష్ట కార్యలింగక అనుమానమును ప్రదర్శించుటకు పూర్వము ప్రకృతి తత్కార్యములలో గల కార్య కారణభావమును ప్రదర్శించుచున్నాడు.

**"సత్వరజస్త మసాం సామ్యావస్థా ప్రకృతిః 1.**
**ప్రకృతేర్మహాన్; 1. మహతోఽహంకారః 1.**
**అహంకారాత్ పంచ తన్మాత్రాణి ఉభయమింద్రియం 16.**
**తన్మాత్రేభ్యః స్థూల భూతాని 5.**
**పురుషః1. ఇతి వంచవింశతిర్గణః"** 1.61

సత్వము, రజస్సు, తమస్సు నను మూటి సామ్యావస్థ ప్రధానము –ప్రకృతి; ప్రకృతి నుండి మహత్తత్వము - బుద్ధి తత్వము; మహత్తత్వమునుండి అహంకారము; శబ్దస్పర్శరూప రసగంధ తన్మాత్రములు, త్వక్కు, చక్షువు, శ్రోత్రము, జిహ్వా, ఘ్రాణము నను జ్ఞానేంద్రియములు, వాక్కు, పాణి, పాదము, పాయువు, ఉపస్థ యను కర్మేంద్రియములు; మనస్సు, తన్మాత్రములనుండి ఆకాశము, వాయువు, అగ్ని, జలము, భూమి యను నైదుభూతములు నుత్పన్నములగును. పురుషుడు దేనినుండియు నుత్పన్నము కాడు. పురుషునినుండి యేదియు పుట్టదు. ఇట్లు ప్రకృతి మొదలు పురుషునివరకు గల తత్వములు ఇరువది యైదు.

ఇందు సత్వరజస్తమస్సులు మూడును ద్రవ్యములే కాని గుణములు కావు. ఇవి స్వయముగా సంయోగ విభాగ చలత్వాది గుణములు కలిగియున్నవి. సత్వగుణము, రజోగుణము, తమోగుణము నని గుణపదముచే వీనిని వ్యవహరించుటకు కారణము పురుషబంధమునకు

ఇవి గుణములు- త్రాళ్ళు- గా నుపయోగించుటయే.

సత్త్వరజస్తమస్సుల సామ్యావస్థ యన నిట నా మూడు పదార్థములు నొక దానితో నొకటి న్యూనాధిక పరిమాణములో కలియకుండుటయే యని తెలియవలయును. ఆ యవస్థయు కార్యము కాదు - కారణరూపమే. ప్రకృతి కార్యము మహత్తత్త్వము. తత్కార్యము అహంకారము - అహంకార కార్యములు పంచతన్మాత్రాదులని తెలియునది. వీని స్వరూపనిర్ణయము ముందుసూత్రములందు చేయబడును.

ప్రకృతి మహత్తత్త్వాదులు కార్య కారణములయిన నగునుగాక. కాని యిందే కార్యమువలన నే కారణము అనుమానముచే తెలియదగు నన :-

**"స్థూలాత్ పంచతన్మాత్రస్య" 1.62**

*స్థూలాత్ = పృథివ్యాది స్థూల పంచభూతములనెడు కార్యము వలన, పంచతన్మాత్రస్య = గంధాది పంచ తన్మాత్రముల యొక్క బోధ సామాన్యముతో దృష్టానుమానముచే కలుగును.*

బాహ్యేంద్రియములచే గ్రహింప వీలయిన గుణములు కలిగియుండుట స్థూలత యనబడును. పృథివిలో గంధ గుణమున్నది. అది నాసికేంద్రియముచే గ్రహింపనగును. కాబట్టి పృథివి స్థూలము. ఇట్లే జలాదులు.

కార్యపదార్థము కారణవంతమై యుండవలయు నను నది సామాన్య న్యాయము. స్థూలములయిన భూమ్యాదులు కార్య పదార్థములు, వానికి కారణములైన సూక్ష్మపదార్థము లుండవలయును. అవియే గంధాది పంచతన్మాత్రములు.

**"బాహ్యా భ్యంత రాభ్యాం తైశ్చాహంకారస్య" 1.63**

*బాహ్యాభ్యంతరాభ్యాం = మనస్సు, జ్ఞానేంద్రియములు, కర్మేంద్రియములు నను కార్యముల వలనను, తైశ్చ = గంధాది తన్మాత్రముల వలనను, అహంకారస్య = అహంకారము యొక్క ప్రతీతి కలుగును.*

బాహ్యములు నాభ్యంతరమునను నేకా దశేంద్రియములనెడు కార్యద్రవ్యములకును, ఇట్లే గంధాది తన్మాత్రములకును కారణముగా నహంకారము అనుమానము ద్వారమున నూహింప బడునని భావము.

"తేనాంతఃకరణస్య" 1.64

తేన = అహంకారరూప కార్యమువలన అంతఃకరణస్య = బుద్ధితత్త్వ మూహింపబడును.

మనుస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము నని యంతఃకరణము నలువిధముల చెప్పబడును. ఈ నాలుగు దశలు బుద్ధిసత్వమునకు సంబంధించినవే - బుద్ధిసత్వము సంకల్పించినపుడు మనస్సుగాను, నిశ్చయించినపుడు బుద్ధిగాను, ఆలోచించునపుడు చిత్తముగాను, అహంభావము కలిగినపుడు అహంకారముగాను, వ్యవహరింపబడును.

"తతః ప్రకృతేః" 1.65

తతః = అంతఃకరణమైన బుద్ధిసత్వమువలన, ప్రకృతేః = సర్వమునకు మూలమైన ప్రకృతియొక్క జ్ఞానము అనుమానము వలన కలుగును.

కార్య కారణభావమును పురస్కరించుకొని యనుమానము ద్వారా ప్రకృత్యాది పదార్థములు సిద్ధించినను పురుషుడెట్లు తెలియనగు నన :-

"సహంత పరార్థత్వాత్ పురుషస్య" 1.66

సంహత పరార్థత్వాత్ = అనేక వస్తువులు కలియుట యితర భోగాపవర్గముల కొఱకే కాబట్టి, పురుషస్య = పురుషుని ప్రతీతి యను మానమువలన కలుగును.

పరస్పరము కలిసియుండు పదార్థములు సంహతము లనబడును. ప్రకృతి మహత్తత్త్వాదులు సంహతములు, శయ్య, ఆసనము, భోజనము మున్నగునవి భోక్త కొఱకైనట్లు పరస్పర మిళితములయిన ప్రకృతి తత్కార్యములు పురుషునకు భోగము, నపవర్గమును కలిగించుటకేయని యూహింపనగును. ఇట పరార్థత్వము పరునకు భోగమును అపవర్గమును కలిగించుటయే. ప్రకృతి తత్కార్యముల సంహననము (కలయిక) పురుష బోధకమని భావము.

మహత్తత్త్వాదులకు వలె మూల ప్రకృతికిని కారణ మూహింప నగును కదాయన :-

"మూలే మూలాభావ దమూలం మూలమ్" 1.67

మూలే = మూలకారణమైన ప్రకృతియందు, మూలాభావాత్ = మఱియొక కారణము లేనందున, మూలం = మహదాది యిరువదిమూడు

తత్త్వములకు మూలకారణమైన ప్రధానము, అమూలమ్ = కారణ రహితమే.

అన్నిటికి మూలకారణమైన ప్రకృతికి వేరు కారణము లేదని భావము.

మూలకారణమునకు కారణముండదని యేల యంగీకరింప వలయునిన :-

**"పారంపర్యేఽ ప్యేకత్ర పరినిష్ఠేతి సంజ్ఞామాత్రమ్"** 1.68

*పారంపర్యే = మూల ప్రకృతికి మఱియొక ప్రకృతి కలదనియు, దానికి మఱియొకటి యనియు నిట్లు పరంపర నంగీకరించినను, ఏకత్ర చివరకొక తావున, పరినిష్ఠా = పర్యవసానము నంగీకరింపక తప్పదు. కాబట్టి యా చివరి కారణమే మూల ప్రకృతి యని యంగీకరింతుము. అందువలన, సంజ్ఞామాత్రం సంజ్ఞలోనే వివాదమగును కాని భేదము లేదని యర్థము.*

కారణ మేమన :-

**"సమానః ప్రకృతేర్ద్వయోః"** 1.69

*ద్వయోః = వాది ప్రతివాదులకు, ప్రకృతేః = ప్రకృతి నంగీకరించుట, సమానః = సమానమే.*

మూలకారణ మొకటి యంగీకరింపక తప్పదు కాబట్టి వివాదమునకు తావులేదు.

ప్రకృతి పురుషులిట్లు అనుమానము వలన సిద్ధించుచుండ శాస్త్ర శ్రవణమువలననే సులభమగు నీ వివేక ప్రత్యయ మేల కలుగదన :-

**"అధికారి త్రైవిధ్యాన్న నియమః"** 1.70

*అధికారి త్రైవిధ్యాత్ = అధికారులు ముప్విధములుగా నుండుట వలన, ననియమః = శ్రవణమాత్రమువలన నెల్లరికి వివేకజ్ఞానము దృఢముగా కలుగునను నియమములేదు.*

మందులు, మధ్యములు, ఉత్తములునని యధికారులలో భేదములుండును. వినగానే యెల్లరికి వివేకముకలుగునని చెప్పవీలులేదు.

ప్రకృతి మహత్త్వాదులలో మొదట కార్యమెయ్యది యన :-

**"మహదాఖ్య మాద్యం కార్యం తన్మనః"** 1.71

*మహదాఖ్యం = మహత్తత్వమనెడి నామముగల, కార్యం =*

కార్యము. ఆద్యం = ప్రకృతినుండి యేర్పడు కార్యములలో మొదటిది, తన్మనః = ఆదియే మనస్సు.

ప్రకృతినుండి యేర్పడు మొదటి కార్యము మనస్సు. మనస్సు మననమును తెలుపును. మనన మనగా నిశ్చయ జ్ఞానము. అదియే బుద్ధి యనబడును.

**"చరమోఽహంకారః"** 1.72

అహంకారః = అహంకారము, చరమః = బుద్ధితత్వమునకు తరువాత నేర్పడును.

**"తత్కార్యత్వ ముత్తరేషామ్"** 1.73

ఉత్తరేషామ్ = పంచతన్మాత్రాదులు, తత్కార్యత్వమ్ = ఆ యహంకారమునుండి జనించును.

ఇట్లే పంచతన్మాత్రములనుండి పంచభూతములని తెలిసి కొనవలయును.

అటులయిన నన్నియు ప్రకృతివలననే జనించినవి యని యెట్లు చెప్పగలమన :-

**"ఆద్యహేతుతా తద్ద్వారా పారంపర్యే ప్యణువత్"** 1.74

పారంపర్యేఽపి = పరంపరగానైనను, తద్ద్వారా = మహత్తత్వాదుల మూలమున, ఆద్యహేతుతా = మూలకారణ మైన ప్రకృతియే కారణమన వచ్చును. అణువత్ = అణువులవలె.

వైశేషికాదులు అణువులవలననే కార్యము లన్నియు నేర్పడునట్లంగీకరింతురు. అణువులచే ద్వ్యణుకములు, త్ర్యణుకములు ననుక్రమముతో కార్యజాత మేర్పడును. అట్లే ప్రకృతి వలన మహత్తత్వాదు లేర్పడును. అహంకారము మొదలు మిగిలిన కార్యజాతమునకు ప్రకృతి సాక్షాత్తుగా కారణముగాకున్నను పరంపరగా కారణ మనుటలో నెట్టి దోషము లేదని భావము.

పురుషుడు ప్రకృతియు రెండును నిత్యములే కాబట్టి కార్య జగత్తేర్పడుటకు ముందు రెండు నుండును. అట్టియెడ జగత్తునకు ప్రకృతియే కారణము. పురుషుడు కాదనుటెట్లన :-

**"పూర్వ భావిత్వేద్వయో రేకతరస్య హానేఽ న్యతరయోగః** 1.75

ద్వయోః = ప్రకృతి పురుషులు, పూర్వభావిత్వే = జగత్తునకు

పూర్వమున్నప్పటికిని, ఏకతరస్య = పురుషుడు పరిణామి కానందున, హానే = జరత్కారణమగుట సంభవము కాకపోవటచేత, అన్యతర యోగః = ప్రకృతియే కారణముగా నంగీకరింపబడినది.

ప్రకృతి పురుషులలో ప్రకృతి పరిణామము నొందగలదు. పరుషుడు అపరిణామి. కాబట్టి ప్రకృతియే జగత్తునకు కారణము కాగలదని భావము.

ప్రకృతికంటె భిన్నముగా నొక పరిచ్ఛిన్నమైన పదార్థము నేల జగత్కారణముగా కల్పింపరాదన :-

"పరిచ్ఛిన్నం న సర్వోపాదనమ్" 1.76

పరిచ్ఛిన్నం = ఏకదేశి పదార్థము, సర్వోపాదానం = అన్నిటికి నుపాదాన కారణము, న = కాదు.

పరిచ్ఛిన్న మనగా పృథివ్యాదులవలె కొంతప్రదేశము నాక్రమింపగల పదార్థము. అట్టిది జగత్తులోని సర్వకార్య జాతమునకు నుపాదాన కారణము కాజాలదు. కాబట్టి ప్రకృతి వంటి మహత్కారణమే యంగీకరింపక తప్పదని భావము.

"తదుత్పత్తి శ్రుతేశ్చ" 1.77

మఱియు శ్రుతి యందును ప్రకృతి నుండియే జగత్తంతయు నుత్పన్న మైనట్లు వర్ణింపబడినది.

"తద్ధేదం తర్హ్య వ్యాకృతమాసీత్త
న్నామరూపాభ్యామేవ వ్యాక్రియత" బృ.ఆ. 1.4.7

(అవ్యాకృత ప్రకృతియే నామరూపములతో వ్యాకృత మయ్యెను.) అనుశ్రుతి వాక్యములు సైతము ప్రకృతి మూలకమే జగత్తని చెప్పుచున్నందువలన నంతకుమించి మఱియొక పరిచ్ఛిన్న కారణ మంగీకరింపదని భావము.

"నావస్తునో వస్తుసిద్ధిః" 1.78

అవస్తునః = అభావమువలన, వస్తుసిద్ధిః = భావోత్పత్తి, న = కలుగదు.

కార్యకారణములు రెండు సమానరూపము కలవిగా నుండవలయును. కాబట్టి యభావము వలన భావ జగత్తేర్పడ జాలదు.

ముత్యపు చిప్పలోకలుగు రజతజ్ఞానమువలె నీ జగత్తును అవస్తు

వేల కాదన :-

"అబాధా దదుష్ట కారణ జన్యత్వాచ్చనావస్తుత్వమ్" 1.79

ఆబాధాద్ = బాధితము కానందువలన, అదుష్ట కారణజన్యత్వాచ్చ = దుష్టకారణమువలన జనింపనందునను, అవస్తుత్వం న = జగత్తు అభావము కాదు.

చీకటిలో తళ తళ లాడు ముత్యపు చిప్పను జూచి వెండియని భ్రమ కలుగును దీనినే దార్శనికులు శుక్తి రజతజ్ఞానమందురు. అనగా రజతము (వెండి) లేకున్నను రజతజ్ఞానము కలుగునన్నమాట. అట్లే జగత్తు వస్తువు (భావపదార్థము) కాకున్నను వస్తువుగా నేల కనబడరాదు? అని శంకాభిప్రాయము. కాని ఇట్టి జ్ఞానము చీకటి తొలగగానే శుక్తి శుక్తిగానే కనబడును. రజత జ్ఞానము (బాధితమగును) తొలగిపోవును. అందువలన నది బాధితజ్ఞాన మనబడును. శుక్తి రజతజ్ఞానము బాధితమైనట్లు జగత్తు కొంతసేపు వస్తువుగా కనిపించి యటుపై అవస్తువుగా కనిపింపకపోవుటవలన నిది బాధితము కాదు. అందువలన జగత్తభావము - అవస్తుననుట సంగతము కాదని భావము.

మఱియు కంటిలో దోషమేర్పడినపుడు - పీతిమరోగము (కామెరలు) - కలిగినపుడు తెల్లని శంఖము పచ్చగా కనబడును - తెలుపు పచ్చగా కనబడుటకు - అనగా పచ్చదనము లేనిది పచ్చదనము కనిపించుటకు కంటిదోషము కారణము. కాబట్టి యది దుష్టకారణమువలన కలిగిన జ్ఞానము. కంటిలో పీతిమరోగము పోయినపుడు శంఖము తెల్లగానే కనిపించును. మనకు కలుగు జగత్తు యొక్క జ్ఞానము దుష్టకారణజన్యమును కాదు. కాబట్టి జగత్తు వస్తువే- భావమే-కాని యవస్తువు కాదు.

అభావము నుండి భావరూప జగత్తు కలుగకుండుటకు హేతు వేమన :-

"భావే తద్యోగేన తత్సిద్ధి రభావే తదభావాత్
కుతస్తరాం తత్సిద్ధిః" 1.80

భావే = కారణము భావమైనపుడు (వస్తువైనపుడు) తద్యోగే = దాని సంబంధమువలన, తత్సిద్ధి ః = భావమైన కార్యసిద్ధి కలుగును. అభావే = కారణ మభావమయిననాడు, తదభావాత్ = కారణసంబంధము లేకపోవుటవలన, కుతస్తరాం తత్సిద్ధిః = భావరూప కార్యమెట్లు

*సిద్ధింపగలదు?*

కారణము వస్తువైనపుడు దాని సంబంధము వలన నుత్పన్నమగు కార్యమును వస్తువగును. కారణమే యభావమైన దానితో సంబంధము కలుగుట కవకాశములేదు. కాబట్టి యభావమువలన భావ (వస్తు) రూపజగత్తు కలుగుననుట సంభవముకాదని భావము.

కర్మజగత్కారణ మేల కాదన :-

"న కర్మణ ఉపాదానత్వాయోగాత్" 1.81

*ఉపాదానత్వాయోగాత్ = ఉపాదానకారణము కాజాలనందున, కర్మణః = కర్మవలన న = జగదుత్పత్తి కలుగదు.*

కర్మ జగదుత్పత్తికి నిమిత్త కారణమగును కాని ఉపాదాన కారణము కాజాలదని భావము.

కర్మ జగదుత్పత్తికి నిమిత్త కారణ మగు నెడల దాని వలననే మోక్షము కలుగవచ్చును కదా! వివేకజ్ఞానమేల? యన :-

"నానుశ్ర వికాదపి తత్సిద్ధిః, సాధ్యత్వే
నా వృత్తి యోగా దపురుషార్థత్వమ్" 1.82

*అనుశ్రవికాదపి = వైదికకర్మ వలనను, న తత్సిద్ధిః = మోక్షసిద్ధి కలుగదు. సాధ్యత్వేన = మోక్షము కర్మ సాధ్యమైనచో, ఆవృత్తి యోగాత్ = పునరావృత్తి సంబంధమువలన, నయ్యది, అపురుషార్థత్వమ్ = పరమ పురుషార్థము - మోక్షము - కాదు.*

వైదిక కర్మలకును మోక్షము సాధ్యము కాదు. మోక్షము పునరావృత్తితో కూడియుండరాదు. కర్మసాధ్యము పునరావృత్తితో కూడియుండును. (తద్యథేహ కర్మచితో లోకః క్షీయతే ఏవమేవా ముత్రపుణ్యచితో లోకః క్షీయతే) (క్షీణే పుణ్యే మర్త్యలోకం విశంతి) (కర్మ ఫలము నశించును. పుణ్యము క్షీణించిన తదుపరి మర్త్యలోకమున మరల ప్రవేశింతురు.) అనునిట్టి శ్రుతిస్మృతులు కర్మసాధ్యము మోక్షము కాదనియే చెప్పుచున్నవి. వైదిక కర్మలే మోక్షమును సంపాదింప నేరనపుడు లౌకికకర్మల వలన మోక్ష మెట్లు సిద్ధింప గలదు! కాబట్టి కర్మ మోక్షమునకు నిమిత్తము కానేరదని భావము.

ఉపాసానాదులద్వారా మోక్షసుఖము ననుభవింప బ్రహ్మలోకమును పొందిన వారికి పునరావృత్తి యేల కలుగదన -

"తత్ర ప్రాప్త వివేకస్యానావృత్తి శ్రుతిః" 1.83

తత్ర = బ్రాహ్మలోక గతులలో, ప్రాప్తవివేకస్య = వివేకము కలిగినవారికే, అనావృత్తి శ్రుతిః = పునరావృత్తి కలుగదని శ్రుతిచెప్పును.

"తేషు బ్రహ్మలోకేషు పరాః పరావతో వసంతి.
తేషాం న పునరావృత్తిః" బృ. ఆ. 8.2.45

(బ్రహ్మలోకమున పరులు, పరావతులు నుందురు. వారికి పునరావృత్తి యుండదు.) అను నీ వాక్యములు వివేకము కలవారికి మోక్షప్రాప్తి కలుగునని చెప్పుచున్నవి. కాబట్టి వివేకమే మోక్షమునకు హేతువు; కర్మలు కావు.

అటులయిన కర్మకు ఫలమేమన :-

"దుఃఖాద్దుఃఖం జలాభిషేకవన్న జాడ్య విమోకః 1.84

జలాభిషేకవత్ = రోగికి జలాభిషేకమువలె, కర్మలవలన, దుఃఖాద్దుఃఖం = దుఃఖపరంపరయే కలుగును. నజాడ్య విమోకః = అవివేకము తొలగదు.

రోగికి స్నానము రోగమును పెంచునట్లు దృష్టాదృష్ట కర్మములన్నియు హింసాది పాపములతో కూడి దుఃఖ పరంపరనే కలిగించును కాని, దుఃఖములకు మూలమైన యవివేకమును తొలగించి మోక్షమును కలిగింపజాలవని భావము.

కామ్యకర్మలు దుఃఖ ఫలకములు కావచ్చును కాని నిష్కామ కర్మలకు దుఃఖఫల మేల కలుగునన :-

"కామ్యేఽకామ్యేఽపి సాధ్యత్వా విశేషాత్" 1.85

కామ్యేఽకామ్యేఽపి = కామ్యము నందును అకామ్యమునందును, సాధ్యత్వా విశేషాత్ = సాధ్యములో భేదము లేనందున, దుఃఖమే కలుగును.

నిష్కామ కర్మ ఫలముసైతము సాక్షాత్తుగా మోక్షము కాదు. వివేకజ్ఞానమే మోక్షమునకు కారణము. నిష్కామ కర్మము ద్వారా అంతః కరణము శుద్ధమగును. అటుపై వివేక జ్ఞానము కలుగును. తదనంతరమే మోక్షము. అందువలననే (తమేతం బ్రాహ్మణా వివిదిష న్తి యజ్ఞేనదానేన కర్మణాఽనాశకేన. బృ. ఆ. 6. 4. 22) (యజ్ఞ దానాదులద్వారా ఆత్మ నెఱుగ గోరుదురు- బ్రాహ్మణులు) యుపనిషత్తులలోను అంతః కరణశుద్ధి

ద్వారా మోక్ష హేతువునైన సత్త్వ పురుషాన్యతా ఖ్యాతి కలుగునని వర్ణింపబడినది. ఇయ్యదియు దుఃఖమే కాని సుఖముకాదు.

అటులయిన మోక్షము మాత్రము దుఃఖ మేల కాదు? అదియు సాధ్యమేకదా యన :-

"నిజముక్తస్య బంధధ్వంసమాత్రం పరం నసమానత్వమ్" 1.86

నిజముక్తస్య = ఆత్మీయ వివేకమువలన ముక్తుడైనవానికి, పరం = అత్యంతమైన, బంధధ్వంసమాత్రం = బంధనివృత్తి కలుగును, నసమానత్వమ్ = కాబట్టి కర్మఫల సమానత యుండదు.

వివేకమువలన అవివేక జనిత దుఃఖముల సంబంధము తొలగును. అనగా దుఃఖము లతీతావస్థను బొందును. మరల బంధ మేర్పడదు. కాబట్టి కర్మసాధ్యములగు ఫలసమానత మోక్షమున కుండ నేరదని భావము.

ప్రకృతి పురుషవివేకము మోక్షోపాయమైన కానిమ్ము. ప్రమాణము లన నేమో చెప్పనంతవరకు నది యెట్లు సిద్ధంప గలదన :-

**"ద్వయో రేకతరస్యవాఽప్యసన్నికృష్టార్థ పరిచ్ఛితిః ప్రమా,**
**తత్సాధక తమం యత్ తత్ త్రివిధం ప్రమాణమ్"** 1.87

ద్వయోః = బుద్ధి, పురుషుడు నను నీ రెంటిలో, ఏకతరస్యవాఽపి = బుద్ధియొక్క గానీ, లేక పురుషునియొక్క గానీ, అసన్ని కృష్టార్థ పరిచ్ఛితిః = పూర్వము తెలియని వస్తువు తనయందున్నట్లు తెలిసికొనుట, ప్రమా = ప్రమ యనబడును. యత్ = ఏది, తత్సాధకతమం = ఆ ప్రమకు అతిశయ సాధకమో, తత్ = అది, ప్రమాణమ్ = ప్రమాణము, త్రివిధం = ప్రమాణము మూడు విధములు.

సాంఖ్యుల జ్ఞాన ప్రక్రియయందు బాహ్య వస్తువులైన ఘట పటాదులు బుద్ధియందో లేక పురుషునందో ఆరోహించును. బుద్ధి సత్త్వము వస్త్వాకారమును బొందుటచే బుద్ధి యందారోహించును. సాన్నిధ్యము వలన బుద్ధి పురుషునందు ప్రతిబింబించుటచేత బుద్ధిగత వస్తువులును పురుషునం దారో హించి నట్లగును. పురుషుడును, బుద్ధియు ప్రమాత పదముచే వ్యవహరింబడును. కాబట్టి ప్రమాతయందు బాహ్య వస్తువుల యారోహణ మిట సన్నికర్షముగా నెంచబడును. సన్ని కృష్ట మనగా అధిగతము. అసన్నికృష్టమనగా అనధిగతము. పరిచ్ఛిత్తి

యన తనయం దున్నట్లు తెలిసికొనుట. ఇట్లు బాహ్యమున నున్న వస్తువు అదివరకు తెలియబడక, పురుషునందో లేక బుద్ధియందో యారోపించును. అనగా స్వరూపముతో ప్రాప్తించును. ఇట్లు ప్రాప్తించుటయే ప్రమ యనబడును. ఆ ప్రమకు సాధనమైనది ప్రమాణ మనబడును. సాంఖ్యులు ప్రత్యక్షము, అనుమానము, శబ్దము నను మూడు ప్రమాణముల నంగీకరింతురు.

ఈప్రమ బుద్ధి నిష్ఠమైనపుడు బుద్ధి ప్రమాత్రియగును. పురుషుడు సాక్షియగును. 'ఇది ఘటము' 'ఇది పటము' అను నిట్టి జ్ఞానము ప్రమ యగును. నేత్రములు మున్నగు నింద్రియములు ప్రమాణము లగును. ప్రమ పురుషనిష్టమయినపుడు బుద్ధియందు ప్రతిబింబించు పురుషుడు ప్రమాత యగును, బుద్ధిలో ప్రతిబింబించు పురుషునియందుండు ప్రమయే పురుష నిష్ట ప్రమ యని శాస్త్రమున వ్యవహరింతురు. ఆ ప్రతిబింబిత పురుషుడే సాక్షియు నగును. ఇది ఘటము, ఇది పటము, అను వస్త్వాకారమును బొందిన బుద్ధి వృత్తి ప్రమాణమగును. నేత్రాదులు గౌణప్రమాణముగా నెంచబడును. ముఖ్య ప్రమాణము బుద్ధి వృత్తియే యని భావము.

ప్రమాణము లనేకములుండ మూడే యననేల యన :-

**"తత్సిద్ధౌ సర్వసిద్ధేః నాధిక్య సిద్ధిః"** 1.88

*తత్సిద్ధౌ = మూడు ప్రమాణములవలననే, సర్వసిద్ధౌ = అంతయు సిద్ధించుచుండ, అధిక్యసిద్ధిఃన = ఉపమానాది ఇతర ప్రమాణములు సిద్ధింపనేరవు.*

ప్రత్యక్షానుమాన శబ్ద ప్రమాణములతోనే సర్వ పదార్థజ్ఞానము కలుగును. కాబట్టి యితర ప్రమాణము లన్నియు నీ మూడు ప్రమాణములందే యంతర్భూతము లగు నని భావము.

**ప్రత్యక్ష ప్రమాణ లక్షణము :-**

**"యత్సంబద్ధం సత్ తదాకారోల్లేఖి విజ్ఞానం తత్ప్రత్యక్షమ్"** 1.89

*సంబద్ధం సత్ = ఇంద్రియ సన్నికర్షముద్వారా వస్తువుతో సంబద్ధమై, తదాకారోల్లేఖి = వస్తువు అకారమును ధరించు, యత్ = ఘటమిది, పటమిది యనెడు, విజ్ఞానం = బుద్ధివృత్తి రూపజ్ఞాన మేది కలదో, తత్ ప్రత్యక్షమ్ = అది ప్రత్యక్ష ప్రమాణము.*

ఇంద్రియ సన్నికర్షము ద్వారా వస్తువును చేరి వస్తువు యొక్క యాకారమును ధరించి యా వస్తు వెయ్యదియో తెలుపునట్టి బుద్ధివృత్తి యనెడు జ్ఞానము ప్రత్యక్ష ప్రమాణమని భావము.

యోగులు గతించి నట్టియు, భవిష్యత్కాలమున నేర్పడునట్టియు, దూరమున నుండు నట్టియు వస్తువులను తెలిసి కొందురుగదా! అట్టియెడ ఇంద్రియ సన్నికర్ష ముండదు. కాబట్టి యోగి ప్రత్యక్షమునందు ప్రత్యక్ష లక్షణ మెట్లు వర్తింపగలదన :-

**"యోగినా మబాహ్యప్రత్యక్షత్వా న్నదోషః"** 1.90

యోగినామ్ = యోగుల ప్రత్యక్షము, అబాహ్య ప్రత్యక్షత్వాత్ = బాహ్యేంద్రియ సన్నికర్షము ద్వారమున నేర్పడునది కాదు, కాబట్టి నదోషః = దోషములేదు.

ప్రత్యక్ష లక్షణము ఇంద్రియ సన్నికర్షముద్వారా కలుగునని చెప్పుటవలన యోగి ప్రతక్ష మిట లక్ష్యము కాదని తెలిసికొనవలయునని భావము.

లేక యోగి ప్రత్యక్షము సైతము లక్ష్యమైనచో

**"లీన వస్తు లబ్ధాతిశయ సంబంధాద్ వాఽదోషః"** 1.91

*లీన...... సంబంధాత్ వా = అతీతా నాగతాది వస్తువులందును యోగశక్తి వలనవిశేష సంబంధమును సంపాదించుటవలన, అదోషః = దోషముండదు.*

యోగి తన శక్తిచే గతించినట్టియు, రానున్నట్టియు, దూర వ్యవహితములయినట్టియు వస్తువులతో తన యింద్రియములను సంబద్ధమొనర్చి వాని నెఱుగగలడు. కాబట్టి ఇంద్రియ సన్నికర్షము యోగి ప్రత్యక్షమున నున్నదనియే తెలియును. అందువలన ప్రత్యక్ష లక్షణమున నెట్టి దోషమును లేదు.

ఈశ్వరునకును ప్రత్యక్షజ్ఞానము కలుగును గదా! అయ్యది జన్యమైనప్పటికిని ఇంద్రియ సన్నికర్షముద్వారా నేర్పడునది కాదు. కాబట్టి యీశ్వర ప్రత్యక్షమున లక్షణ మవ్యాప్తమగును గదా యన :-

**"ఈశ్వరా సిద్ధేః** 1.92

ఈశ్వరుడే సిద్ధింపనందున ఈశ్వర ప్రత్యక్షమున లక్షణ మవ్యాప్తమనుట యుక్తము కాదని భావము.

ఈశ్వరసిద్ధి యేల కలుగదన :-

"ముక్తబద్ధయో రన్యత రాభావాత్ న తత్సిద్ధిః" 1.93

ముక్త...... భావాత్ = ముక్తబద్ధ పురుషులలో నొకడును కానందున తత్సిద్ధిః = ఈశ్వరసిద్ధి, న = కలుగజాలదు.

ఈశ్వరుడెట్లో సాధింపబడినను నతడు పురుషుడే కావలసి యుండును. పురుషుడయిన పక్షమున నతడు బద్ధుడో, ముక్తుడో కావలసి యుండును. బద్ధులు ముక్తులు నైన పురుషులలో నెవరును నీశ్వరుడు కానందువలన నీశ్వరుడు సిద్ధింప జాలడని భావము.

ఈశ్వరసిద్ధి కలుగకుండుటకు హేతు వేమన :-

"ఉభయథాప్య సత్కర్తృత్వమ్" 1.94

ఉభయథాఽపి = బద్ధుడైనను, ముక్తుడైనను, అసత్కర్తృత్వమ్ = జగత్తు నుత్పన్నము చేయుట సంభవము కాదు.

బద్ధ పురుషుడు జగత్తునుత్పన్నము చేయగలడందుమా? అతడసమర్థు డగుటచే చేయజాలడు. ముక్త పురుషుడు జగత్తు నుత్పన్నము చేయునందుమా? అతనికి ప్రయోజనము లేదు కాబట్టి జగత్తు నుత్పన్నము చేయడు. కాబట్టి యీశ్వర సిద్ధి యెట్లు కాగలదని భావము.

జగదుత్పత్తి యసంభవ మగుటచే నీశ్వరుడు సిద్ధింపకున్న పోనిండు. కాని యాగమములందు విధింపబడిన యీశ్వరుని ప్రశంస, ఉపాసన మున్నగువాని వలన నీశ్వరుని సిద్ధి సంభవమేకదా? యన :-

"ముక్తాత్మనః ప్రశంసోపాసా సిద్ధస్యవా" 1.95

ముక్తాత్మనః = ముక్తినిబొందిన జీవుని, ప్రశంసా = దుఃఖ రాహిత్యమువలన నీశ్వరునివలె ప్రశంసయు, వా = మఱియు, సిద్ధస్య = తపఃప్రభావమువలన సిద్ధిబొందిన జీవుని, ఉపాసా = ఉపాసనయు ఆగమములందు వర్ణింపబడుటవలన నీశ్వరసిద్ధి కలుగదు.

'ఈశ్వరాసిద్ధేః' అను సూత్రమునుండి యీ సూత్రము వరకు గల సందేహములన్నియు జైనులవిగా భావించి సమాధానములు చెప్పబడెను. ఆగమములును జైనులవిగానే గ్రహింపవలెను. జైనుల యాగమములందు గల ప్రశంపోపాసనలు జీవులలో ముక్తులను సిద్ధులు నయిన వారికి సంబంధించినవియే; ముక్తులు అసంగులు. వారికి జ్ఞాన మసంభవము. సిద్ధులు సశరీరులే కాబట్టి వారిజ్ఞాన మింద్రియజన్యమే యగును

అందువలన ప్రత్యక్షలక్షణమున దోషము లేదని భావము.

సాంఖ్యుల మతమునను ఈశ్వరుడు నిత్యశుద్ధ బుద్ధ ముక్త స్వభావుడే కాబట్టి యతడు ప్రకృతి పురుషాధిష్ఠాన మెట్లు కాగలడన:-

**"తత్సన్నిధానా దధిష్ఠాతృత్వం మణివత్"** 1.19

మణివత్ = అయస్కాంతమణి సామీప్య మాత్రముచే లోహమును ప్రేరేపించునట్లు, తత్సన్నిధానాత్ = ప్రకృతి పురుషుల సామీప్యము వలన, అధిష్ఠాతృత్వం = పరమేశ్వరునందు ప్రకృతి పురుష నియంతృత్వము సిద్ధించును.

సాంఖ్యుల మతమున పరమేశ్వరుడు క్లేశకర్మ విపాకాశయముల సంస్పర్శము లేనివాడు కాబట్టి నిత్యశుద్ధ బుద్ధ ముక్త స్వభావుడనుట నిస్సంశయము. అయినను నతడు జ్ఞాన క్రియాశక్తులు గలవాడుగా నంగీకరింతురు. అతనితో సమానుడుగాని అధికుడుగాని లేడని భావము. కాబట్టి సంనిధి మాత్రముననే యతనియందు ప్రకృతి పురుషుల యధిష్ఠానము సిద్ధించును. ప్రకృతి పురుషులతో నతనికిగల సాక్షాత్సంబంధమే సన్నిధి యనబడును. ఆ సంబంధము సంయోగము కానీ, సమవాయము కానీ కాదు. స్వస్వామిభావ సంబంధము. ఈశ్వరుడు స్వామి; ప్రకృతి పురుషులు స్వత్వము (స్వమ్)-

ఈ స్వస్వామిభావ సంబంధము నిత్యము. అందువలననే యతడు సర్వదా ముక్తుడు, సర్వదా ఈశ్వరుడు నని వైదికులందురు. నిత్యశుద్ధ ముక్త స్వభావుడయ్యు నిఖిల శక్తి సంపన్నుడు కాబట్టి ప్రకృతి పురుషుల కాధారుడగుటలో నెట్టి దోషము లేదని భావము.

చైతన్యమునందు జీవులు నీశ్వరసమానులే కాబట్టి జీవులవలె నీశ్వరుడు సంకల్పముద్వారా ప్రకృతి పురుషుల కధిష్టాత యేల కాగూడదు? సన్నిధి మాత్రముననే యననేల యన :-

**"విశేష కార్యేష్వపి జీవానామ్"** 1.97

జీవానామపి = జీవులకును, విశేషకార్యేషు = ఆహారవిహారాది కార్యములందు, *(తత్సన్నిధానాదధిష్ఠాతృత్వమ్)* బుద్ధిసాన్నిధ్యమువలన బుద్ధ్యధిష్ఠాతృత్వమే కాని సంకల్పాదులవలన కాదు.

బుద్ధియందు ప్రతిబింబితములైన యహంకారముతో కూడిన చేతనములు జీవులు. కాబట్టి జీవులకును బుద్ధిసాన్నిధ్యము కలదు. ఆ

సాన్నిధ్యమువలననే జీవులు బుద్ధికధిష్ఠాతలు. ఆ యధిష్ఠాతృత్వముపలననే బుద్ధియందు సంకల్పాదులు కలుగును. ఆహార విహారాదులు సంపన్నము లగును. కాబట్టి జీవులున్న సంకల్పాదులచే కార్యసంపాదకులనుట యుక్తము కాదు. బుద్ధికిసమీపమున నుండుటచే బుద్ధియందు సంకల్పాదులు కలుగును. అటుపై కార్యములు. కాబట్టి జీవ సాదృశ్యముచే నీశ్వరునందు సంకల్పాదు లంగీకరింప నవసరము లేదని భావము.

అటులయిన సర్గారంభమున జీవులకు వేదవాక్యార్థోపదేశమెట్లు కలిగిన దన :-

**"సిద్ధరూప బోద్ధృత్వాద్వాక్యార్థోపదేశః"** 1.98

సిద్ధరూప బోద్ధృత్వాత్ = నిఖిలశక్తి సంపన్న రూపుడైన పరమాత్ముడు సన్నిధి మాత్రము చేతనే జ్ఞానదానము చేయగలడు కాబట్టి, వాక్యార్థోపదేశః = అగ్ని మున్నగు మహర్షులద్వారా వేద వాక్యార్థము లను బోధించుట యుక్తమే.

సమస్త శక్తి సంపన్నుడగు పరమాత్ముడు సామీప్యమున నుండి జ్ఞానము నొసంగ గలడు. ఈశ్వర సాన్నిధ్యము వలననే శుద్ధాంతః కరణులయిన ఋషులకు వేద వాక్యముల యర్థము బోధపడినదని భావము.

పురుషుడు సామీప్యము వలననే యధిష్ఠాన మగుచో పురుషునియందు గల యధిష్ఠాతృత్వము గౌణమగును. ముఖ్యమగు నధిష్ఠాతృత్వ మెట నుండు నన :-

**"అంతఃకరణస్య తదుజ్జ్వలితత్వాత్ లోహ వదధిష్ఠాతృత్వమ్"** 1.99

లోహవత్ = ఇనుమువలె. తదుజ్జ్వలితత్వాత్ = చితిశక్తి యనబడు పురుషునిచే చేతనవంతముగా చేయబడినందున, అంతఃకరణస్య = బుద్ధి సత్వమునకు, అధిష్ఠాతృత్వం = ముఖ్యమైన యధిష్ఠాతృత్వము.

దహనశక్తిగల వహ్ని సమీపమున నున్న ఇనుము జ్వలించును. అగ్ని సంయోగముచే ఇనుము కాలి యితర పదార్థములను కాల్చును. అట్లే చేతనశక్తి గలిగిన పురుషుని సామీప్యమున నున్న బుద్ధిసత్వము (అంతఃకరణము) చేతనము గలదై సంకల్పాదులకు ఆశ్రయమగును. కాబట్టి సంకల్పాదులకు అధిష్ఠానము (ఆశ్రయము) బుద్ధిసత్వ మగుచున్నది. అందువలన ముఖ్యాధిష్ఠాతృత్వము బుద్ధి సత్వమునందే కలదని

యంగీకరింపవలయును. పురుషుడు సంకల్పాదులకు వాస్తవమున నాశ్రయము కాకపోవుటచే నతనియం దెట్టి పరిణామము నుండదని భావము.

ప్రత్యక్షమును వర్ణించి తదుపరి అనుమాన ప్రమాణలక్షణము చెప్పుచున్నాడు.

"ప్రతిబంధదృశః ప్రతిబద్ధజ్ఞాన మనుమానమ్" 1.100

ప్రతిబంధదృశః = వ్యాప్తిదర్శనము వలన, ప్రతిబద్ధజ్ఞానమ్ = వ్యాపకజ్ఞానము, అనుమానమ్ = అనుమాన ప్రమాణమగును.

ప్రతిబంధ మనగా వ్యాప్తి. ఈ సూత్రమునందలి ప్రతిబంధ శబ్దము వ్యాప్తితో కూడిన హేతువును తెలుపును. (ప్రతిబంధదృక్) వ్యాప్తి విశిష్ట హేతువును పక్షధర్మముగా చూచునట్టి పురుషునకు కలుగు (ప్రతిబద్ధజ్ఞానమ్) సాధ్యమునకు సంబంధించిన జ్ఞానము అనుమాన మనబడునని భావము.

ఈ జ్ఞానము బుద్ధివృత్త్యాత్మక మగును. ఇయ్యది ప్రమాణము. దానికి ఫలము పౌరుషేయబోధ. అయ్యది ప్రమితి – అనుమితి యనబడునని వివేకము.

వ్యాప్తి, పక్షము, పక్ష ధర్మతాజ్ఞానము మున్నగు విషయములు స్పష్టముగా తెలిసికొన గోరువారు నాచే రచియింపబడిన న్యాయదర్శనము – (అంబావ్యాఖ్యాన సహితము) ను అనుమానలక్షణము జదువ గోరుచున్నాడ.

శబ్దప్రమాణ లక్షణము :-

"అప్తోపదేశః శబ్దః" 1.101

అప్తోపదేశః = ఆప్తవాక్యము, శబ్దః = శబ్దప్రమాణము.

ఉన్నది యున్నట్లు తెలుపుట ఆప్తి. అట్లు తెలుపు వాడు అప్తుడు. ఉపదేశమనగా వాక్యము. ఈ సూత్రము నందలి 'ఆప్తోపదేశము' అను పదము కర్మధారయ సమాసముగా నెంచబడిన పక్షమున (ఆప్తశ్చాసౌ ఉపదేశః = అప్తోపదేశః) ఆ ప్తవాక్యము వేదవాక్యమని బోధ పడును.

వేదవాక్యమువలన కలుగు బుద్ధివృత్తి రూప జ్ఞానము శబ్ద ప్రమాణ మనబడుని భావము. అటుపై కలుగు పౌరుషేయ బోధ శాబ్దప్రమ యనబడునని వివేకము.

ఈ ప్రమాణము లేల వర్ణింపబడిన వన :-

"ఉభయసిద్ధిః ప్రమాణాత్తదుపదేశః" 1.102

ప్రమాణాత్ = ప్రమాణము వలననే, ఉభయసిద్ధిః ప్రకృతి పురుషులు సిద్ధింతురు; కాబట్టి, త దుపదేశః = ప్రమాణము లుపదేశింపబడినవి.

ప్రమాణము మూలముననే లోకమునగల వస్తువుల యునికి తెలియనగును. ప్రమాణమే యంగీకరింపని పక్షమున 'ఇది యున్నది; ఇది లేదు' అని నిరూపింప వలను పడదు. కాబట్టి ప్రమాణము లిట వర్ణింపబడినవని సూత్రకారుడు వివరించి యున్నాడు.

ప్రకృతి పురుషుల యునికి యిం దేప్రమాణమున తెలియనగు నన :-

"సామాన్యతో దృష్టా దుభయ సిద్ధిః" 1.103

సామాన్యతోదృష్టాత్ = సామాన్యతో దృష్టానుమానము వలన, ఉభయ సిద్ధిః = ప్రకృతి పురుషులసిద్ధి కలుగును.

అనుమానప్రమాణము పూర్వవత్తు, శేషవత్తు, సామాన్యతో దృష్టము నని ముివ్విధములు. అందు అన్వయమాత్ర వ్యాప్తిగల యనుమానము పూర్వవత్తనియు, వ్యతిరేక మాత్ర వ్యాప్తిగలది శేషవత్తనియు, సమాన్యతో దృష్టాన్వయ వ్యతిరేక మాత్ర వ్యాప్తిగలది సామాన్యతో దృష్టానుమాన మనియు తెలిసికొనవలయును. ("ఇయ్యది వివరముగా తెలియగోరు వారు న్యాయ దర్శనము చూతురుగాత.)

ప్రమాణము వలన కలుగు విషయజ్ఞానము బుద్ధి వృత్త్యాత్మక మగుట వలన నయ్యది పౌరుషేయ మెట్లు కాగలదన :-

"చిదవసానో భోగః" 1.104

భోగః = ఇష్ట విషయముగానీ, అనిష్ట విషయమునుగానీ యనుభవించుట భోగమనబడును - అయ్యది, చిదవసానః = పురుషుని యందు పర్యవసానము నొందును.

బుద్ధిసత్వము ఘట పటాది వస్తువుల యాకారమును బొందుట వృత్తి యనబడును. బుద్ధివృత్తియే విషయాను భవము - భోగ - మన బడును. బుద్ధి విషయాకారతను సంపాదించి, యనగా వృత్తి రూపమునొంది యంతట విరమింపదు - పర్యవసానము నొందదు. సమీపమున నున్న పురుషునం దా విషయాకృతిని చేర్చును. అనగా బుద్ధి తనలో

ప్రతిబింబించు పురుషునియం దాయా విషయాకారములను జేర్చునని భావము. ఇట్లు చేతన స్వరూపుడగు పురుషుడు బుద్ధి వృత్తి రూప భోగమును పొంది భోక్త యగును. బుద్ధి చేతనము గానందున వృత్తులకు కర్త్రియయ్యు భోక్త్రి కానేరదు. పురుషుడు వృత్తులకు కర్తకాక పోయినను చేతను డగుటచే భోక్త యనబడును.

లోకమున క్రియాఫలమును కర్త యనుభవించుట చూచుచున్నాము. అట్టియెడ బుద్ధి కర్తృక విషయంభోగము పురుషున కెట్లు చెందునన :-

"అకర్తురపి ఫలోపభోగోఽ న్నాద్యవత్" 1.105

అకర్తురపి = కర్మచేయని పురుషునకు, ఫలోపభోగము = బుద్ధి క్రియకు ఫలమైన విషయ భోగము, అన్నాద్యవత్ = అన్నాదులవలె యుక్తమే యగును.

పాచకుడు మున్నగు భృత్యులచే సంపాదింపబడిన అన్నాది పదార్థములు యజమానునకు భోగమగుట లోకమున జూచుచున్నాము. అట్లే పురుషుడు కర్త కాక పోయినను బుద్ధిక్రియలకు ఫలరూపమైన విషయోపభోగమునకు భోక్త కాగలడని భావము.

ఫలము కర్తకు లభింపవలయుననెడి శాస్త్రవాక్యముల కియ్యది విరుద్ధము కాదా యన :-

"అవివేకాద్ వా తత్సిద్ధేః కర్తు ఫలావగమః" 1.106

వా = లేక, అవివేకాత్ = ప్రకృతి పురుషవివేకము లేనందున, తత్సిద్ధేః = కర్తృత్వము సిద్ధించుటవలన, కర్తుః = కర్తకే, ఫలావగమః = క్రియాఫల భోగము కలుగును.

విషయావగమమునకు బుద్ధియే కర్త్రి యగును. కాని యట్టి విషయబోధ బుద్ధియందు ప్రతిబింబిత పురుషునకుపలబ్ధమగును. బుద్ధిచే నుపరక్తుడయిన పురుషునకు వివేకము లేకపోవుటచేత విషయావబోధను పురుషుడు తనదిగా నెంచును. కాబట్టి పురుషున కీవిధముగ కర్తృత్వము లభింపగలదని భావము.

అటులయిన పురుషునకు లభించు భోగము వాస్తవమే కావలసివచ్చును గదా? భోగము వాస్తవమైనచో మోక్షమెట్లు లభింపగల దన :-

"నో భయం చతత్త్వాఖ్యానే" 1.107

తత్త్వాఖ్యానే = ప్రకృతి పురుషవివేకము సాక్షాత్కారమయిననాడు, ఉభయంచన = కర్తృత్వము భోక్తృత్వము నను రెండును నుండవు.

పురుషునకు కర్తృత్వము బుద్ధిద్వారా సంక్రమించు చున్నది. కాబట్టి యది యౌపాధికము. అట్లే భోక్తృత్వమును నౌపాధికమే. కాబట్టి వివేకము కలుగగానే కర్తృత్వ భోక్తృత్వములు రెండును తొలగిపోవును. మోక్షము సిద్ధించుటలో దోషముండనేరదు.

లోకమునగల పదార్థములు ప్రత్యక్షముగా తెలియబడును. ప్రత్యక్షప్రమాణముచే తెలియబడనివి లేనట్లే యెంచబడును. అట్టియెడ సామాన్యతోదృష్టమువలన ప్రకృతి పురుషు లెట్లు సిద్ధింప గలరన :-

"విషయోఽ విషయోఽ ప్యతి దూరాదేర్
హానో పాదానాభ్యా మింద్రియస్య" 1.108

అతి దురాదేః = అతి దూరత్వము, అతి సామీప్యము, మున్నగు దోషముల వలనను, హానో పాదా నాభ్యాం = ఘూతానవ స్థానములచేతను, ఇంద్రియస్య = ఇంద్రియమునకు, విషయోఽపి = విషయమయ్యు, అ విషయః = విషయముకాదు.

ఇంద్రియముల ద్వారా తెలిసికొనదగిన పదార్థము కూడ కొన్ని యాటంకములవలన తెలియరాని దగుచున్నది. ఆ యాటంకములు, అతి దూరము, అతిసామీప్యము, ఇంద్రియమునకు దెబ్బతగిలి చెడిపోవుట, మనస్సున నిలుకడ లేకుండుట, సూక్ష్మత, మున్నగునవి. ఇట్టి యాటంకములున్నపుడు పదార్థముండియు తెలియబడదు. కాబట్టి పదార్థమే లేదనరాదు.

ఈ యాటంకములే సాంఖ్యకారికయం దిట్లు సంగ్రహింప బడినవి.

**"అతిదూరాత్ సామీప్యా దింద్రియఘూతాత్ మనోఽనవస్థానాత్,**
**సౌక్ష్మ్యాద్ వ్యవధానా దభి భవాత్ సమానాభిహారాచ్చ"**

అతి దూరత, అతి సామీప్యము, ఇంద్రియఘూతము (దెబ్బతగిలి ఇంద్రియము చెడుట), మనశ్చాంచల్యము. సూక్ష్మత, వ్యవధానము (మఱియొక వస్తువు ద్వారా అడ్డగింపబడుట) అభిభవము (ఒకదానిచే మఱియొకటి తిరస్కరింపబడుట), సమానాభిహారము (సమాన జాతీయములగు వస్తువు లలో కలిసిపోవుట). ఇట్టి దోషములున్నచోట

వస్తువున్నప్పటికి తెలిసికొన వీలుపడదు.

సూర్యకాంతిచే దీపపు కాంతి యభిభూతమై - తిరస్కృతమై - తెలియరాదు. గేదెపాలలో ఆవుపాలు కలిసినపుడు ఆవుపాలు వేరుగా తెలియజాలము. ఈ రెండును అభిభవము, సమానాభిరాహమునకు నుదాహరణములు. మిగిలినవి సులభములగుటచే స్వయముగా నూహింపదగును.

ప్రకృతి పురుషుల యునికి తెలియరామి కీ దోషములలో నెయ్యది కారణ మన :-

**"సాక్ష్మ్యాత్తదనుపలబ్ధిః"** 1.109

*సాక్ష్మ్యాత్ = సూక్ష్మతవలన, తదనుపలబ్ధిః = ప్రకృతి పురుషుల జ్ఞానము ప్రత్యక్షము కాదు.*

ఇట సూక్ష్మత యనగా నిరవయవత్వము - అవయవ రాహిత్యమని గ్రహింపవలయును. ప్రకృతి పురుషు లత్యంత సూక్ష్మములగుట వలన నింద్రియగోచరములు కానేరవని భావము.

అతి సూక్ష్మము లగుటచే ప్రకృతి పురుషులు ఇంద్రియ గోచరములు కావనుటకంటె నా పదార్థములే లేవనిన నేమన :-

**"కార్యదర్శనా త్తదుపలబ్ధేః"** 1.110

*కార్యదర్శనాత్ = మహత్తత్త్వము మొదలు పంచమహాభూతముల వరకు గల స్థూల పదార్థములను చూచుచున్నాము కాబట్టి, తదుపలబ్ధేః = ప్రకృతి పురుషుల యుపలబ్ధి (జ్ఞానము) కలుగుచున్నది.*

కార్యమును చూచినపుడు కారణము తెలియనగును. కారణములేని కార్యముండనేరదు. కాబట్టి స్థూలములయిన పంచమహాభూతాదులకు కారణముగా సూక్ష్మ ప్రకృతి యొకటి కలదనియు, భోక్తగా పురుషు డొండు కలడనియు తెలియనగును. అందువలన ప్రకృతి పురుషులను వస్తువులు లేవనజెల్లదు. కార్యదర్శనము వలన కారణ మూహింప నగును కాని ప్రకృతి యెట్లు సిద్ధింపగలదని శంకించుచున్నాడు.

**"వాది విప్రతిపత్తే స్తదసిద్ధిరితి చేత్"** 1.111

*వాది విప్రతిపత్తేః = వాదులలో విరోధముండుటవలన, తదసిద్ధిరితిచేత్ = ప్రకృతి సిద్ధింపదనినచో.*

బౌద్ధులు, అద్వైతులు, చార్వాకులు మున్నగువారు జగత్కారణము,

భిన్న భిన్నముగా నంగీకరింతురు. ఒకరు శూన్యమందురు. మఱియొకరు బ్రహ్మమందురు. ఇంక కొందఱు పరమాణవు లందురు. కాబట్టి జగత్కారణము ప్రకృతి యని చెప్పుటెట్లు? అని శంకాభిప్రాయము.

వాదముకొఱకు తాత్కాలికముగ శంకాగత యభిప్రాయము సరియే యని యంగీకరించి సమాధానము చెప్పు చున్నాడు.

**"తథాప్యేకతర దృష్ట్యాన్యతర సిద్ధేర్నాపలపః"** 1.112

తథాపి = వాదులకు ప్రకృతి విషయమున విప్రతిపత్తి యున్న ప్పటికిని, ఏకతర దృష్ట్యా = కార్య కారణములలో నొకటియైన కార్య దర్శనము వలన, అన్యతరసిద్ధేః = కారణవస్తువు సిద్ధించు చున్నందున, నాపలాపః = ప్రకృతిని కారణముగా నూహించుట యుచితమే.

**"త్రివిధ విరోధా పత్తేశ్చ"** 1.113

కారణభూతమైన ప్రకృతి నంగీకరింపని పక్షమున ముప్విధములైన విరోధములును కలుగును. విరోధము లెయ్యవియన:- ఒకటి శ్రుతి విరోధము. (అజామేకాం.....) ఇత్యాది శ్రుతి వాక్యములు ప్రకృతిని బోధించుచున్నవి. రెండవది స్మృతి విరోధము. (ప్రకృతేః క్రియామాణాని...) ఇత్యాది గీతావాక్యములు ప్రకృతి బోధకములు. మూడవది న్యాయవిరోధము. 'కార్యమెట్టిదో కారణమునట్టిదై యుండును.' అను న్యాయము ప్రకృతిబోధకమే. ఇట్లు శ్రుతి స్మృతిన్యాయములు ప్రకృతి నంగీకరించుచుండగా ప్రకృతి లేదనుట వానిని విరోధించి నట్లగునని సూత్రాభిప్రాయము.

**సత్కార్యవాదము :-**

ఉత్పత్తికి పూర్వమే కార్యమున్నదని యంగీకరించిన పక్షమున జగత్తునకు ఆధారముగా ప్రకృతి యంగీకరింపనగును. కాని, కార్యోత్పత్తికి పూర్వ మది యున్నదనుట పొసగదు. కారణ వ్యాపారమువలన నదివరకు లేని (అసత్) కార్య ముత్పన్న మగునన :-

**"నా సదుత్పాదో నృశృంగవత్"** 1.114

నృశృంగవత్ = మనుజునకు కొమ్ములుండవు. అదువలననే కారణ వ్యాపారమువలన నవి జనింపవు. అట్లే. న అసదుత్పాదః = అది వరకు లేని (అసత్) కార్యము కారణ వ్యాపారము వలన కలుగనేరదని తాత్పర్యము.

ఎందువలన కలుగ దన :-

"ఉపాదాన నియమాత్" 1.115

కుండకు మట్టియుపాదానకారణము. జ్ఞానమునకు చేతన ముపాదానకారణము. ఇట్లొక కార్యమున కొక యుపాదాన కారణము నియమముగా నుండును. లేని (అసత్) కార్యము ఉత్పన్నమగు పక్షమున నీ కార్యమున కియ్యది యుపాదాన కారణమను నియమము సంభవింపదు. కాబట్టి కార్యోత్పత్తికి పూర్వమది యున్నది (సత్) అని యంగీకరింపక తప్పదని భావము.

"సర్వత్ర సర్వదా సర్వాసంభవాత్" 1.116

*మఱియు, సర్వత్ర ప్రతి కారణమునందును, సర్వదా = యెల్లప్పుడు సర్వాసంభవాత్ = నర్వకార్యములు నుద్భవింపనందున, కార్యము ఉత్పత్తికి పూర్వము లేకున్ననది జనింపదు.*

అసత్కార్యము నంగీకరింతుమేని యొకే కారణము నుండి కార్యములన్నియు నుద్భవింపవలసివచ్చును. మట్టిలో కుండ పూర్వమట లేకయే నుత్పన్నమగునెడల, సువర్ణాదుల వలన జనించెడి భూషణాదులును మట్టినుండియే జనింపవలసి వచ్చును. మట్టిలో కుండలేనట్లు భూషణాదులును లేవు గదా! కాబట్టి యేల జనింపవు?

"శక్తస్య శక్యకరణాత్" 1.117

*శక్తస్య = కారణము, శక్యకరణాత్ = కార్యమును జనింప జేయును. కాబట్టి అసత్ (లేని) కార్యముత్పన్నము కానేరదు.*

కారణములోనుండు కార్యముయొక్క యనాగతావస్థ యీ సూత్రమున శక్తి యని చెప్పబడినది. అట్టి శక్తి కాశ్రయము కారణము - శక్తము.

"కారణభావాచ్చ" 1.118

మఱియు, కార్యము కారణాత్మకమగుట వలనను కార్యోత్పత్తికి పూర్వ మది యున్నట్లే యెంచవలయును.

ఉపాదాన కారణమే కార్యరూపమును ధరించును. కాబట్టి కారణము కార్యము యొక్క పూర్వావస్థయగుచున్నది. అందువలన లేని (అసత్) కార్యము కారణ వ్యాపారము వలన కలుగుననుట యయుక్తము.

"న భావే భావయోగశ్చేత్" 1.119

భావే = కారణవ్యాపారమునకు పూర్వమును కార్యము భావ

రూపముననుండు పక్షమున, భావయోగశ్చేత్ = కారణ వ్యాపారము వలన ఉత్పత్తి సంబంధము మాత్రము కార్యమున కేర్పడును. అట్టియెడ, కార్యోత్పత్తికి పూర్వముననను పరముననను కార్యమునందు భేదముండ నేరదు. అందువలన, న = 'కార్య ముత్పన్నమైనది', 'కార్యము లేదు' అను వ్యవహారములు పొసగవు.

ఉత్పత్తికి పూర్వమే కార్యముండు పక్షమున నయ్యది నిత్యమనవలసి వచ్చును. నిత్యమగు భావ కార్యమునందు ఉత్పత్తి సంబంధ మేర్పడజాలదు. పూర్వము లేక యిప్పుడేర్పడుటయే భావము – కార్యము – అనబడును. కాబట్టి సత్కార్యవాదము సరికాదన సమాధానము చెప్పుచున్నాడు :-

**"నాఽభివ్యక్తి నిబంధనౌ వ్యవహారావ్యవహారౌ"** 1.120

వ్యవహారావ్యవహారౌ = 'కార్యముత్పన్నమైనది. కార్యముత్పన్నము కాలేదు', అను వ్యవహారములు, అభివ్యక్తి నిబంధనౌ అభివ్యక్తి నిమిత్తములు, న = ఉత్పత్తి నిమిత్తములు కావు.

సాంఖ్యులు కారణ వ్యాపారము వలన కార్య మభివ్యక్తమగు నందురు. ఉత్పన్నమైనదని చెప్పరు. కాబట్టి 'కార్యముత్పన్నమైనది. కాలేదు' అను వ్యవహారములు అభివ్యక్తిని, అనభివ్యక్తిని మాత్రమే తెలుపును. అందువలన దోషము లేదని భావము.

కార్యము యొక్క వర్తమానానవస్థయే యిట అభివ్యక్తి యనబడును. కాబట్టి కారణవ్యాపారమునకు పూర్వ మా కార్యము మరియొక యవస్థయందుండునని చెప్పిన దోషమావంతయు నుండదు.

అటులయిన కార్యము అనాది భావముగలది యగును గదా? అది యెట్లు నశింపగలదన :-

**"నాశః కారణలయః"** 1.121

కారణలయః = కార్యము కారణమునం దవిభక్తమై యుండుటయే, నాశః = నాశ మనబడును.

సాంఖ్యుల మతమున కార్యనాశము కార్యధ్వంసము కాదు. కార్యమతీతావస్థను బొంది కారణమునందు విభజించుటకు వీలుగాని స్థితిలో కలిసియుండునని భావము.

కారణ వ్యాపారమువలన కార్యము జనింపదు. కాని

యభివ్యక్తమగునని గదా! సత్కార్యవాదులయిన సాంఖ్యుల మతము అటులయినచో నా యభివ్యక్తికి పూర్వము మఱియొక యభివ్యక్తి నంగీకరింపవలసి యుండును. లేకున్న నది యసదభివ్యక్తి కాగలదు. సత్కార్యవాదమునకు భంగము వాటిల్లును. అంగీకరింతుమేని ఆ యభివ్యక్తికి పూర్వము మఱియొకటి, యంతకుపూర్వ మింకొకటి యని యనేక అభివ్యక్తుల నంగీకరింపవలసి వచ్చును. కాగా యనవస్థ యగువన:-

"పారంపర్యతఽన్వేషణా బీజాంకురవత్" 1.122

*పారంపర్యతః = పరంపరగా నొక దానికి పూర్వ మింకొకటియని అన్వేషణా = అభివ్యక్తిని వెదకుట, బీజాంకురవత్ = విత్తనము నుండి మొలక, మొలకనుండి విత్తనము, మరల విత్తనము నుండి మొలక యని యిట్లు బీజాంకురములలో నేది దేనికంటె ముందు? అని వెదకి నట్లగును.*

అభివ్యక్తుల పరంపర నంగీకరించుట బీజాంకుర న్యాయము వంటిదగును – కాబట్టి యట్టి పరంపర నూహింపరాదని భావము.

"ఉత్పత్తివద్ వాఽ దోషః" 1.123

*ఉత్పత్తివద్ వా = కార్యోత్పత్తివలెనే. అదోషః = దోషము లేదు.*

సూత్రమునందలి 'వా' మఱియొక సమాధానమును సూచించును.

అసత్కార్య వాదులు కార్యము కారణ వ్యాపారము వలన జనించును – ఉత్పన్నమగును; ఆ ఉత్పత్తికి పూర్వమది 'సత్' కాదు. అనికదా యంగీకరింతురు. ఆ కార్యోత్పత్తికి మఱియొక యుత్పత్తి; యందుల కింకొకటి యని యంగీకరించినచో అనవస్థ యేర్పడగలదను భయముతో కార్యోత్పత్తి యుత్పత్తి రూపమే యందురు. అట్లే సత్కార్య వాదులును కార్యాభివ్యక్తి అభివ్యక్తి రూపమే కాని, యాయభివ్యక్తి కింకొకయభివ్యక్తి యుండునని యంగీకరింపరు. అందువలన నుత్పత్తి వాదుల కనవస్థా దోషము లేనట్లు తమకును దోషము లేదని సత్కార్యవాదులందురని భావము.

సత్కార్యవాద మిట్లు దోషరహితము కాగా కార్య జాతము నంతటికి నాధారముగా మూలభూతమయిన ప్రకృతి యొకటి సిద్ధించును. కాని, కార్యము అభివ్యక్తికి పూర్వము సత్తే కాబట్టి యనగా కారణరూపమున నుండును కాబట్టి కార్య కారణములలో భేదము లేదనవలసివచ్చును.

అందువలన కారణమేదో కార్యమేదో తెలిసికొన - వివేకింప - ననువగు నట్లు వానిలోగల సాధర్మ్య వైధర్మ్యములను తెలుపు చున్నాడు. ముందుగా మహత్తత్త్వము మొదలు పంచమహాభూతములవరకుగల వ్యక్తకార్యముల సాధర్మ్యమును వర్ణించుచున్నాడు :-

"హేతుమద నిత్యమవ్యాపి సక్రియ
మనేక మాశ్రితం లిఙ్గమ్" 1.124

*లింగం* = మహత్తత్త్వ ప్రభృతికార్యము, *హేతుమత్* = కారణము కలిగియుండును, *అనిత్యం* = నాశస్వభావము కలదై యుండును అధ్రువము, *అవ్యాపి* = వ్యాపించు స్వభావములేనిది, *సక్రియం* = క్రియతో కూడి యుండును, *అనేకం* = అనేకము - నానా - *ఆశ్రితం* = అధారము గలదై యుండును.

ప్రతికార్యమునందును సూత్రార్థమున జెప్పిన హేతు మత్వాది ధర్మము లుండునని భావము.

మహత్తత్వాదులకంటె ప్రకృతి భిన్నము కానందున, మహత్తత్త్వాది కార్య జాతమునకుగల హేతుమత్వాది ధర్మములు ప్రకృతియందును నంగీకరింపవలసి వచ్చును. అది సంగతము కాదు - కాబట్టి హేతుమత్వాది సాధర్మ్య మెట్లంగీకరింప నగునన :-

"ఆంజస్యాదభేదతోవా గుణ సామాన్యా దేస్తత్సిద్ధిః
ప్రధానవ్యపదేశాద్ వా" 1.125

*ఆంజస్యాత్* = *అన్వయవ్యతిరేక శాలియైన, గుణసామాన్యా దేరభేదతోవా* = *సుఖము దుఃఖము మున్నగు సాధారణ గుణముల యన్వయ మనెడి లింగము వలనగానీ ప్రధానవ్యపదేశాద్ వా* = *శాస్త్రమున ప్రధాన శబ్దముచే వ్యవహరింప బడుట వలనగానీ, తత్సిద్ధిః* - *కార్యాతి రిక్తమైన ప్రకృతి యొందుగలదని సిద్ధమగుచున్నది.*

ప్రపంచమునందలి ప్రతి కార్యపదార్థమును సుఖదుఃఖాది సామాన్యగుణములతో కూడియున్నది. కాబట్టి యా కార్య పదార్థములన్నియు సుఖ దుఃఖాది సామాన్య గుణములతో యుక్తమైన పదార్థము కారణముగలవియై యుండవలయును. ఇదియును గాక, శాస్త్రమున ప్రధాన శబ్దము ప్రయోగింపబడియున్నది. కార్యపదార్థము లెందు లీనమగునో యది ప్రధానమని, ప్రధానశబ్దవ్యుత్పత్తి. (ప్రధీయతే లీయతే

కార్య జాతమస్మిన్ ఇతి (ప్రధానమ్) ఇట్లు ప్రకృతి సిద్ధించునని భావము.

వ్యక్త కార్యములకుగల సాధర్మ్యమును జెప్పి, వ్యక్తములు అవ్యక్తములు నయిన కార్యకారణములకు గల సాధర్మ్యము నిందు వర్ణించుచున్నాడు.

**"త్రిగుణ చేతనత్వాది ద్వయోః"** 1.126

*త్రిగుణ చేతనత్వాది = సత్వ రజస్తమము లనెడి మూడు గుణములు కారణముగా గలిగియుండుట, చేతనములు గాకుండుట, అవివేకిత, విషయత్వము, సమానత్వము, పరిణామిత్వము, మున్నగునవి, ద్వయోః = కార్యకారణములకు సాధర్మ్యములు. సూత్రమునందలి ఆది పదముచే అవివేకము, విషయత్వము మున్నగునవి గ్రహింపబడినట్లు గ్రహింపనగును.*

సత్వ రజస్తమస్సు లనెడు మూడు గుణములందును గల పరస్పరసాధర్మ్య వైధర్మ్యము లేమన :-

**"ప్రీత్య ప్రీతి విషా దాద్యై ర్గుణానా**
**మన్యోఽ న్యం వైధర్మ్యమ్"** 1.128

*ప్రీతిః = సుఖము, అప్రీతిః = దుఃఖము, విషాదః = మోహము అద్యైః = మున్నగు ధర్మములచే, గుణానామ్ = సత్వాది గుణములలో, వైధర్మ్యమ్ = పరస్పర వైరుధ్యమున్నది.*

ప్రసన్నత, లాఘవము, ప్రీతి, తితిక్ష, సంతోషము, ఆర్జవము, మృదుత, లజ్జ, శ్రద్ధ, క్షమ, దయ, జ్ఞానము, మున్నగునవి సత్త్వధర్మములు. దుఃఖము, ద్వేషము, ద్రోహము, మత్సరము, నింద, పరాభవము, మున్నగునవి రజోధర్మములు. మోహము, భయము, వంచకత, నాస్తిక్యము, కౌటిల్యము, కృపణత, అజ్ఞానాదులు తమోధర్మములు.

త్రిగుణముల సాధర్మ్యము :-

**"లఘ్వాది ధర్మై సాధర్మ్యం వైధర్మ్యంచ గుణానామ్"** 1.128

*గుణానామ్ = సత్త్వాది = గుణములలో, లఘ్వాది ధర్మైః = లఘుత్వాది ధర్మములచే, సాధర్మ్యం = సమాన ధర్మత, వైధర్మ్యంచ = విధర్మతయు నేర్పడుచున్నది.*

పురుషార్థత, పరస్పర మొకదాని నొకటి యభిభవము చేయుట మున్నగునవి సమాన ధర్మములు. లఘుత్వము, చలత్వము మున్నగునవి విరుద్ధ ధర్మములు.

మహత్తత్త్వాహంకారాదులలో కార్యత్వ మెట్లు సిద్ధించునన :-

"ఉభయాన్యత్వాత్ కార్యత్వం మహదాదే ర్ఘటాదివత్" 1.129

మహదాదేః = మహత్తత్త్వాదులు, ఘటాదివత్ = ఘటపటములవలె, ఉభయాన్యత్వాత్ = ప్రకృతి పురుషులకంటె భిన్నములగుట వలన, కార్యత్వం = కార్యములు - జన్యములు.

మహత్తత్త్వము మొదలు స్థూల భూతములవరకు గల పదార్థములన్నియు వినాశము నొందుచుండును; మఱియు భోగ్యములు; కాబట్టి యవి కార్యములు. అనగా పుట్టి నశించునవి యని భావము.

"పరిమాణాత్" 1.130

మఱియు మహత్తత్త్వాది పదార్థములన్నియు పరిమితములు. ఘటపటాదులవలె పరిచ్ఛిన్నములు - సీమితములు. కాబట్టి యవి కార్యములే.

"సమన్వయాత్" 1.131

కారణగుణములు కార్యమునందు సమానరూపమున నన్వయించుట సమన్వయ మనబడును మహదాదులం దట్టి సమన్వయ మున్నందున నవి జన్యములే యని భావము.

ఉపవాసాదులవలన క్షీణించిన బుద్ధ్యాదులు అన్న గ్రహణమున మరల వృద్ధినొందును. వృద్ధినిబొందు వస్తువులు కార్యములే యని విజ్ఞానబిక్షువు.

"శక్తితశ్చేతి" 1.132

శక్తితశ్చ = న్యూనాధిక్యములతో కూడిన శక్తి కలిగి యున్నందున బుద్ధ్యాదులు జన్యవస్తువులే. సూత్రములోని 'ఇతి' పదము మహత్తత్త్వాదులు కార్యవస్తువులే యని చెప్పుటకు వాడిన హేతువులు సమాప్తము లైనవని బోధించును.

భాష్యకారు లీ సూత్రమునందలి శక్తి శబ్దమునకు కరణము అని యర్థము చెప్పి, పురుషునకు బుద్ధి (మహత్తత్త్వము) మున్నగునవి కరణములు కాబట్టి యవి జన్యవస్తువులని వర్ణించియున్నారు. చక్షురాదులు పురుషునకు కరణములు. అవి జన్యవస్తువులే. అట్లేబుద్ధ్యాదులు నని భావము.

మహత్తత్త్వాదులు కార్యములుగా నంగీకరింపకున్న దోషమేమన :-

"తద్వా నేప్రకృతి పురుషోవా" 1.133

తద్వానే = మహత్తత్వాదులు కార్యపదార్థములు కావనిన, నవి, ప్రకృతిః పురుషోవా = ప్రకృతియో పురుషుడో కావలసివచ్చును.

మహదాది పదార్థములన్నియు భోగయోగ్యములై నశించునవి కాబట్టి యవి కార్యవస్తువులే. ప్రకృతి పురుషుడు నను రెండే కార్యములు కావు. అవి నిత్యములు.

ప్రకృతి పురుషులుకాక కార్యము కాని వస్తువొండు లేదా యన :-

"తయోరన్యత్వే తుచ్ఛత్వమ్" 1.134

తయోః = ప్రకృతి పురుషులకంటె, అన్యత్వే = భిన్నమైకార్యము కాకుండునది, తుచ్ఛత్వమ్ = కుందేటి కొమ్మువలె తుచ్ఛమే.

ప్రకృతి పురుషులకు మించి వేరొండు కార్యముకాని వస్తువు లేదని భావము.

ఇట్లు మహదాదులలో కార్యత్వమును సాధించి యటుపైవానికిగల కారణము నూహించుచు నందలి విశేషమును బోధించుచున్నాడు.

"కార్యాత్ కారణానుమానం తత్సాహిత్యాత్" 1.135

కార్యాత్ = మహదాదులవలన, కారణానుమానం = ప్రకృతి యూహింపబడును. తత్సాహిత్యాత్ = కార్యము కారణమున నిమిడియుండుట వలన.

కార్యకారణములు భిన్నముగా నంగీకరింపనందున కారణమున కార్య మిమిడి యుండునని భావము.

కారణ ప్రకృతి యెట్టిదన :-

"అవ్యక్తం త్రిగుణా ల్లింగాత్" 1.136

త్రిగుణాత్ = త్రిగుణాత్మకమైన, లింగాత్ = మహదాది వ్యక్తపదార్థములకంటె, కారణమగు ప్రకృతి, అవ్యక్తం = సూక్ష్మతరము మహదాదులకంటె ప్రకృతి సూక్ష్మమని భావము.

ప్రకృతి వ్యక్తము కానియెడల నది యున్నదను టెట్లన :-

"తత్కార్య తస్తత్సిద్ధే ర్నాపలాపః" 1.137

తత్కార్యతః = ప్రకృతి కార్యములయిన మహత్తత్వాదులవలన, తత్సిద్ధేః = కారణమైనప్రకృతి, సిద్ధించుచుండ, నాపలాపః = అదిలేదుట

తగదు.

జగ(ద్రూపకార్యము లభించుచున్నది కాబట్టి దానికి కారణముగా ప్రకృతి యొకటి యంగీకరింపనను వగుచున్నది. కాని, పురుషుడెట్లు సాధింపనగునన :-

"సామాన్యేన వివాదాభావాద్ధర్మవత్ నసాధనమ్" 1.138

సామాన్యేన = సమాన్యముగ, వివాద భావాత్ = వివాదము లేనందున, ధర్మవత్ = ధర్మమువలె, నసాధనమ్ = సాధింపవలసిన యవసరము లేదు.

లోకమున నెల్లరు చేతన ము (పురుషుడు) న్నట్లే యంగీకరింతురు. ఈ విషయమున నెవ్వరును వివరింపరు కాబట్టి సాధింపవలసిన పని లేదని భావము.

సామాన్యముగ చేతనమున్నట్లంగీకరించినను, శరీరము మొదలు ప్రకృతి వరకుగల పదార్థములలో నా (చేతనము) పురుషుడెవడు? అతడెట్టి స్వరూపముగలవాడు? అని తెలియుట యవసరము. కాబట్టి, ముందుగా పురుషుడు శరీరము కంటె భిన్నుడని చెప్పుచున్నాడు.

"శరీరాది వ్యతిరిక్తః పుమాన్" 1.139

పుమాన్ = పురుషుడు, శరీరాదివ్యతిరిక్తః = శరీరము మొదలు ప్రకృతి వరకుగల పదార్థములకంటె భిన్నుడు.

కారణ మేమన :-

"సంహత పరార్థత్వాత్" 1.140

శరీరాది ప్రకృత్యంత పదార్థములు సంహత మన బడును. దానిచే సాధింపబడు భోగము అపవర్గము నను రెండును పరార్థములు. శరీరాది పదార్థము లన్నియు నితరులకు భోగము కలిగింప నేర్పడును. కాబట్టి పురుషుడు శరీరము కాదని భావము.

"త్రిగుణాది విపర్యయాత్" 1.141

ప్రకృతి మున్నగునవి త్రిగుణములు, అచేతనములు, వివేకము లేనివి. కాని, పురుషుడు త్రిగుణములు లేనివాడు. చేతనము,వివేకి, కాబట్టి శరీరాదులు పురుషుడు కావు.

"అధిష్ఠానాచ్చేతి" 1.142

రథమునకు రథికు దధిష్ఠాతయైనట్లు, శరీరాదులకు పురుష

దధిష్ఠాత. శరీరాదులు జడములు. చేతనములు కావు. అందువలననవి యధిష్టేయములే యగును. అధిష్టాత కాజాలవు.

"భోక్తృ భావాత్" 1.143

భోక్త యగుటవలన పురుషుడు శరీరాదులకంటె భిన్నుడే. అట్లు కాక శరీరాదులలో నంతర్భూతుడగు పక్షమున నయ్యవి యచేతనము లగుటవలన భోక్తృత్వమే సిద్ధింపదని భావము.

"కైవల్యార్థం ప్రవృత్తేశ్చ" 1.144

అధిష్టానాభావము - కైవల్యము -మోక్షము - అనబడును. అందులకై ప్రవృత్తి కనబడుచున్నందున, పురుషుడు శరీరాదులకంటె భిన్నుడు.

పురుషుడు శరీరాదులకంటె భిన్నుడు కాని పక్షమున మోక్షమునకై ప్రవృత్తి కలుగనేరదు.

పురుషుని స్వరూపము :-

"జడప్రకాశా యోగాత్ ప్రకాశః" 1.145

*జడప్రకాశాయోగాత్* = *ప్రకృతికి సంబంధించిన ప్రకాశము ఆత్మ కాజాలనందున,* పురుషుడు, *ప్రకాశః = ప్రకాశ స్వరూపుడు-* జ్ఞానస్వరూపుడు,

ఈ సూత్రమునందు జడప్రకాశము ఆత్మకాదని చెప్పినందువలన బుద్ధిసత్వమాత్మ (పురుషుడు) అనుట తగదని భావము.

పురుషుడు ప్రకాశ స్వరూపుడగుచో నతనియందు జ్ఞానము ధర్మముగా నుండునా? యన :-

"నిర్గుణత్వాన్న చిద్ధర్మా" 1.146

*నిర్గుణత్వాత్ = గుణముల* కాశ్రయము *కానందున,* పురుషుడు, *నచిద్ధర్మా* = జ్ఞానము *ధర్మముగా గలవాడు*కాదు.

'నా కుపలబ్ధి కలుగుచున్నది. నేను తెలిసికొను చున్నాను.' అను నిట్టి ప్రతీతివలన జ్ఞానము పురుషుని ధర్మముగా తెలియుటలేదా? యన :-

"శ్రుత్యా సిద్ధస్య నాపలాపః తత్ ప్రత్యక్షబాధాత్" 1.147

(అసంగోహ్యయం పురుషః...బృ. 6.3.15.)

'పురుషుడు సంగరహితుడు' అను నిట్టి శ్రుతులమూలమున

పురుషుడు నిర్గుణుడు అనుట సిద్ధము. కాబట్టి దానిని కాదన రాదు. 'నే నెరుగుచున్నాను' అను నిట్టి ప్రతీతి' నే నెట్టినివాడను' అను ప్రతీతివలె శ్రుతిచే బాధింపబడుచున్నందున జ్ఞానము స్వరూపమేకాని పురుషునకు జ్ఞానము ధర్మము కాదని భావము.

శాస్త్రమున యుక్తికి ప్రాధాన్య ముండవలయును. అట్టి యెడ శ్రుతికి ప్రాధాన్యమిచ్చి పురుషునకు జ్ఞానము ధర్మము కాదను టెట్లు యుక్తమన :-

"సుషుప్త్యా ద్యసాక్షిత్వమ్" 1.148

పురుషుడు ప్రకాశ స్వరూపుడు - జ్ఞానస్వరూపుడు - కాని పక్షమున, అనగా జ్ఞానమతనికి గుణమగునెడల, సుషుప్తి, స్వప్నము జాగృతి యనెడి యవస్థలకతడు సాక్షి కాజాలడు.

**"జాగ్రత్ స్వప్నః సుషుప్తంచ గుణతో బుద్ధి వృత్తయః**
**తాసాం విలక్షణోజీవః సాక్షి త్వేన వ్యవస్థితః"**

జాగ్రత్ స్వప్నాద్యవస్థలు బుద్ధి వృత్తులు. జీవుడు వానికంటె భిన్నుడై సాక్షి యనబడునని యితరగ్రంథము లందును వర్ణింపబడి యున్నది.

ఇంద్రియములద్వారా బుద్ధి విషయాకారమున పరిణమించుట జాగ్రదవస్థ యనబడును. సంస్కార మాత్రమువలన కలిగెడి బుద్ధియొక్క విషయాకార పరిణామము స్వప్నావస్థ. సుషుప్తవస్థ అర్థలయము, సమగ్రలయమునని రెండు విధములు. అర్థలయమున విషయాకారవృత్తి యుండదు. బుద్ధియందే సుఖాకార వృత్తియో, లేక దుఃఖాకారవృత్తియో, లేక మోహాకారవృత్తియో యుండును. అందువలననే నిద్రనుండి లేచిన తదుపరి 'నేను సుఖముగ నిద్రించితిని' 'నేను తెలియకుండ నిద్రించితిని' అను నిట్టి ప్రత్యయములు కలుగును. సమగ్రలయమునందు బుద్ధి వృత్తియే యుండదు.

ఈ యవస్థలలో గల బుద్ధి వృత్తులకన్నిటికిని పురుషుడు సాక్షి. కాబట్టి జ్ఞానము పురుషునకు స్వరూపమే కాని యతని కది గుణము కాదని భావము.

పురుష స్వరూపానంతర మతని యందుగల బహుత్వమును చెప్పుచున్నాడు.

**"జన్మాదివ్యవస్థాతః పురుషబహుత్వమ్"** 1.149

జన్మాదివ్యవస్థాతః = ఒకడు జన్మించినాడు, మరియొకడు మరణించినాడు, ఇంకొకడు బద్ధుడు; వేరొకడు ముక్తుడు నను నిట్టి వ్యవస్థ లోకమున నుండుటవలన, పురుషబహుత్వమ్ = పురుషులనేకులని యంగీకరింప వలయును.

పురుషు డొక్కడైనను నుపాధి భేదమువలన జన్మమరణాది వ్యవస్థ యేర్పడగలదు గదా? యన :-

**"ఉపాధి భేదోఽ ప్యేకస్య నానా యోగ**
**ఆకాశస్యేవ ఘటాదిభిః"** 1.150

ఆకాశస్యేవఘటాదిభిః = ఘటాదులతో నాకాశమునకువలె, ఏకస్య = ఒకే పురుషునకు, నానాయోగః = నానాభూతములనెడి యుపాధులతో సంబంధము చెప్పవలయును. ఉపాధిభేదేఽపి = ఉపాధులు భిన్నములైనను ఉపధేయ మొక్కటియే కాబట్టి జన్మాది వ్యవస్థ యేర్పడ నేరదని భావము.

చేతనుడగు పురుషు డొక్కడైనను, ఉపాధితో కూడినపుడతడు భిన్నుడయినందున వ్యవస్థ యేర్పడగలదన :-

**"ఉపాధి ర్భిద్యతే నతు తద్వాన్"** 1.151

ఉపాధి వైశిష్ట్యము వలన భేదమేర్పడి వ్యవస్థ మేర్పడ గలదందుమేని, ఉపాధియేభిన్నమగును కాని, ఉపాధికలిగిన పురుషుడు భిన్నుడెట్లు కాగలడు? కాజాలడు; కాబట్టి పురుషబహుత్వ మంగీకరింపక జన్మాదివ్యవస్థ యేర్పడజాలదని భావము.

**"ఏవ మేకత్వేన పరివర్తమానస్య నవిరుద్ధ దర్మాధ్యాసః"** 1.152

ఏవమ్ = జన్మాది వ్యవస్థ యేర్పడజాలనట్లు, ఏకత్వేన = సర్వోపాధులం దొకే రూపమున, పరివర్తమానస్య = అంతటను నుండు పురుషునందు, విరుద్ధ ధర్మాధ్యాసః = పరస్పరము విరుద్ధములయిన సుఖదుఃఖాది ధర్మములలో 'నేను సుఖిని' 'నేను దుఃఖిని', అను విరుద్ధ ధర్మ సంబంధము, న = కలుగనేరదు.

నానా భేదములుగల 'యుపాధులలో నొకే పురుషు డంగీకరింపబడినవుడు జన్మాది వ్యవస్థ లేర్పడనట్లు, ఒకే సమయమున సుఖ దుఃఖాది విరుద్ధ ధర్మసంబంధము నతనికి కలుగనేరదు. కాబట్టి

పురుషబహుత్వ మంగీకరింపక తప్పదని భావము.

సుఖదుఃఖాదులు నుపాధి ధర్మములే కాబట్టి యవి యేక కాలమున నొకే పురుషునం దారోపింపబడును, దోషమేమి? యన :-

**"అన్యధర్మత్వేఽపి నారోపాత్ తత్సిద్ధి రేకత్వాత్"** 1.153

*అన్యధర్మత్వేఽపి* = సుఖదుఃఖాదు లుపాధుల ధర్మములైనను, *ఆరోపాత్* = పురుషునం దారోపించినందు వలన, *తత్సిద్ధిః* = సుఖదుఃఖాది వ్యవస్థ, *న* = సిద్ధింపదు. కారణమేమన, *ఏకత్వాత్* = ఆరోపమున కధిష్ఠానమైన పురుషు డొక్కడే యగుటవలన, సుఖదుఃఖవ్యవస్థ కలుగనేరదని భావము.

ఇట్లు పురుషు లనేకులని యంగీకరించినచో అద్వైత బోధక శ్రుతులకు విరుద్ధమగునుకదా యన :-

**"నాద్వైత శ్రుతివిరోధో జాతిపరత్వాత్"** 1.154

*జాతిపరత్వాత్* = చైతన్యసామ్యముచే పురుషజాతిని బోధించునవి కాబట్టి, *అద్వైత శ్రుతివిరోధః న* = అద్వైత శ్రుతవిరోధము వాటిల్లదు.

ప్రత్యక్షానుభవము ననుసరించి పురుష బహుత్వమంగీకరించినట్లు, పురుషుడు నానారూపు డేల కాడన :-

**"విదితబంధ కారణస్య దృష్ట్యాఽ తద్రూపమ్"** 1.155

*విదితబంధకారణస్య* = బంధకారణ మవివేకమని తెలిసిన పురుషుని, *దృష్ట్యా* = దృష్టితో, *అతద్రూపమ్* = ప్రత్యక్షముగా కనబడు భేదరూపము పురుషునిది కాదు.

బంధకారణము నెఱిగిన వివేకికి, పురుషుని రూపము శ్రుతి బోధితమగు జ్ఞానరూప మొక్కటియే యని తెలియును. అందువలన అద్వైతశ్రుతులు జాతి పరములనుట దోషము లేదని భావము.

పురుషుల స్వరూపమొక్కటే యగునెడల నట్లు కనబడ వలయును గదా! కనబడనందున నది యట్లు కాదన:-

**"నాంధదృష్ట్యా చక్షుష్మతా మనుపలంభః"** 1.156

*అంధదృష్ట్యా* = వివేకదృష్టి లేనివారికట్లు కనబడకున్నను. *చక్షుష్మతాం* = వివేకులకు, *నఅనుపలంభః* = ఉపలంభము కాకపోదు.

వివేకులకు పురుషుల స్వరూపమొక్కటేయని తెలియ గలదని భావము.

"వామదేవాదిర్ముక్తో నాద్వైతమ్" 1.157

వామదేవాదిః = వామదేవుడు, భరతుడు మున్నగువారు, ముక్తః = ముక్తులయిరి. కాబట్టి, అద్వైతమ్ న = ఆత్మయొక్కటి కాదు.

ఆత్మయొక్కటియే యగు పక్షమున వామదేవాదులు ముక్తులయిన పిమ్మట లోకమున బద్ధజీవు లుండరాదు. బద్ధ జీవులు నేటికి నెందరో గలరు. కాబట్టి యద్వైత మంగీకరింప జనదు.

వామ దేవాదులు ముక్తులు కాలేదనిన :-

"అనాదా పద్యయావ దభావాత్ భవిష్య దప్యేవమ్" 1.158

అనాదౌ = అనాదియగు నీ ప్రపంచమున, అద్యయావత్ = నేటి వరకు, అభావాత్ = ముక్తి కలుగనందున, భవిష్యదపి = భవిష్యత్ప్రపంచము నందును. ఏవమ్ = ఇట్లే ముక్తిగలుగదని యంగీకరింప వలసి వచ్చును.

అనాదిగా ప్రవర్తించు నీ ప్రపంచమున నేటి వరకును వామదేవాదు లెవరును ముక్తులే కాలేదని యందుమేని యికముందును నేరికిని ముక్తికలుగుట సంభవము కాదన వలసివచ్చునని సూత్రాభిప్రాయము.

అనేకాత్మల నంగీకరించినను క్రమముగా నొక్క రొక్కరు ముక్తులయి యెల్లరు ముక్తులయిననాడు ప్రపంచమే లేకపోవలసి వచ్చును గదా యన :-

"ఇదా నీమివ సర్వత్ర నాత్యంతోచ్ఛేదః" 1.159

ఇదానీమివ = ఇప్పటివలెనే, సర్వత్ర = ఎల్లకాలములందును, నాత్యంతోచ్ఛేదః = ప్రపంచము బొత్తుగా నశింపదు.

వర్తమాన కాలమున నెట్లు కొందఱు బద్ధులు కొందఱు ముక్తులు నుండుటచే ప్రపంచము వర్తించుచున్నదో యట్లే భూత భవిష్యత్కాలములందు నుండును. ప్రపంచాత్యంత నాశమెన్నడు కలుగదని భావము.

ఈ సూత్రమునకు వ్యాఖ్యానము భాష్యకారుడు విజ్ఞాన భిక్షు విట్లు వ్రాసియున్నాడు.

"సర్వత్రకాలే బంధస్యాత్యంతోచ్ఛేదః కస్యాపి పుంసో నాస్తి వర్తమానకాలవత్"

ఏ పురుషునకును నెన్నడును బంధము పూర్ణముగా తొలగనేరదు. వర్తమానస్థితిని బట్టి యట్లూహింపనగును. అనగా పురుషునకు బంధము

సంపూర్ణముగా తొలగక కొంత కాలము తొలగి అటుపై మరల నా పురుషునకు బంధ మేర్పడుచుండునని భావమేమో!.

ఈ ప్రసంగమున శ్రీమద్దయానంద స్వామివారు తమ ప్రసిద్ధ 'సత్యార్థ ప్రకాశము' నందు నిట్లే వర్ణించియున్నారు.

**"జైసే ఇస్‌సమయమే బంధముక్తజీవహై వైసేహీ సర్వదా రహతేహై.**
**అత్యంత విచ్ఛేద బంధముక్తికాకభీనహీ హూతా;**
**కింతుబంధ్ ఔర్ ముక్తి సదా నహీ రహతీ"**

(నవమ సముల్లాసము)

"ఇప్పుడు బద్ధజీవులు, ముక్తజీవులు నున్నట్లు ఎల్లప్పుడు నుందురు. బంధమున కత్యంత విచ్ఛేద మెన్నడును కాదు. అనగా సదాముక్తిగానీ, సదాబంధముగానీ జీవులకు కలుగదని భావము."

వర్తమానయుగమున దయానందమహర్షి యొక్కడే 'ముక్తి యాత్యంతికము కాదనియు, ముక్తజీవులు సర్గా రంభమున మరల జన్మవంతు లగుదురనియు' స్పష్టపరచియున్నాడు. ఈ విషయమును వివరముగా తెలిసికొన గోరువారు సత్యార్థప్రకాశమున నవమసముల్లాసము చదువుదురు గాత.

జీవుల ప్రయత్నానుగుణముగ నీ బంధ మోక్ష వ్యవస్థ నొనర్చుచు ప్రపంచమును నడుపు పదార్థ స్వరూప మేమన :-

**"వ్యావృత్తోభయరూపః"** 1.160

ప్రకృతి, పురుషుడు నను నీ యుభయుల రూపముకంటె విలక్షణమైన రూపము కలిగియుండును.

ఈశ్వరుని రూపము ప్రకృతి పురుషుల రూపముకంటె విలక్షణమైన దని భావము.

(క్లేశకర్మ విపాకాశయైరపరామృష్టః పురుష విశేష ఈశ్వరః) క్లేశాదులతో సంసర్గములేని విశిష్ట పురుష డీశ్వరుడని యోగులు.

ఈశ్వర స్వరూపము ప్రకృతి స్వరూప విలక్షణమైన కావచ్చును. కాదని, జీవ (పురుష) విలక్షణమెట్లు కాగలదన :-

**"సాక్షాత్సంబంధాత్ సాక్షిత్వమ్"** 1.161

*సాక్షాత్ సంబంధాత్* = స్వస్వామిభావాది లక్షణ సంబంధము వలన, నీశ్వరునకు, *సాక్షిత్వం* = విశ్వ సాక్షిత్వ మంగీకరింపవలయును.

జీవునకు జగత్ సాక్షిత్వములేదు, ఈశ్వరుడు జగత్సాక్షి. వేదమున నిట్లే వర్ణింపబడినది.

"ద్వాసుపర్ణా సయుజా సఖాయా సమానం వృక్షం
పరిషస్వజాతే తయోరన్యః పిప్పలం స్వాద్వ
త్త్వనశ్నన్నన్యోఽ భిచాకశీతి" ఋ. 2.3.17.20

రెండు పక్షులొకే వృక్షమునంటియున్నవి. అందొకటి దాని ఫలములను రుచిచూచును. రెండవది తినక సర్వత్ర ప్రకాశించుచుండును. ఇట వృక్షము ప్రకృతి; ఫలములరుచి నెఱుగు పక్షి జీవుడు; తినక చూచుచుండు వా డీశ్వరుడని వివేకము. ఈ మంత్రమున నీశ్వరుని జగత్ + సాక్షిత్వము సుస్పష్టము.

"నిత్య ముక్తత్వమ్" 1.162

మఱియు నీశ్వరుడు సదా ముక్తుడు. జీవులకు సదా ముక్తి యుండనేరదని పూర్వసూత్రములందు జెప్పియుంటిమి. ఇట్లు విశ్వ సాక్షిత్వము, నిత్యముక్తత్వము నీశ్వరుని విలక్షణ రూపమని తెలియవలయును.

ఈశ్వరునకు నిత్యముక్తత్వ మెట్లంగీకరింపనగు నన :-

"ఔదాసీన్యం చేతి" 1.163

ఈశ్వరుడు జగత్తున కధిపతియయ్యు పక్షపాతము వహింపక యౌదాసీన్యము - మాధ్యస్థ్యము-ను వహించును. కాబట్టి నిత్యముక్తుడు.

అటులయిన నీశ్వరునకు జగత్కర్తృత్వ మెట్లు పొసగు నన :-

"ఉపరాగాత్ కర్తృత్వం చిత్సాన్నిధ్యాత్ చిత్సాన్నిధ్యాత్"

1.164

ఉపరాగాత్ = ప్రకృతి సన్నిధానమువలన నీశ్వరునకు, కర్తృత్వమ్ = ప్రయోజక కర్తృత్వ మేర్పడుచున్నది. ప్రకృతికి, చిత్సాన్నిధ్యాత్ = ఈశ్వర సాన్నిధ్యమువలన ముఖ్య కర్తృత్వ మేర్పడుచున్నది.

ఈశ్వరుడు ప్రకృతికి సమీపమున నుండుటచేత ప్రకృతియందు ప్రేరణ కలుగును. అనగా చేతన సామీప్యము వలన ప్రకృతి ప్రవర్తించును. సృష్టి కనుకూలించు క్రియ కలుగునని భావము. అందువలన కర్తృత్వము ప్రకృతియందే యుండును. కాని ఈశ్వరుడందులకు ప్రేరకుడు - ప్రయోజకుడు - కాబట్టి యతనియందు ప్రయోజక కర్తృత్వము -

నిమితత్త్వము - మాత్ర ముండును. ముఖ్యకర్తృత్వము - ఉపాదానకారణత్వము - ప్రకృతియందే యుండునని భావము.

ఈ సూత్రమున 'చిత్ సాన్నిధ్యాత్' అని రెండు సారులు వాడబడినది. ఇందొకటి యధ్యాయ సమాప్తిని బోధించును.

నిఖిల శాస్త్రనిష్ణాత శ్రీమత్పండితముక్తి రామోపాధ్యాయశిష్య గోపదేవ విరచితాంబా వ్యాఖ్యానమున ప్రథమాధ్యాయము.

# ద్వితీయాధ్యాయము

ప్రథమాధ్యాయమునందు శాస్త్ర విషయము చెప్పబడినది. ఇందు ప్రకృతి వలన నేర్పడు సృష్టి ప్రక్రియ విస్తారముగ వర్ణింపబడును.

సృష్టి రచనలో ప్రకృతికి ప్రయోజనము లేనందున దాని యందు ముఖ్య కర్తృత్వమెట్లు పొసగునన:-

"విముక్త మోక్షార్థం స్వార్థం వా ప్రధానస్య" 2.1

విముక్త మోక్షార్థం = వివేకముచే ముక్తుడైన పురుషుని మోక్షము కొఱకో, వా = లేక, స్వార్థం = తన కొఱకో, ప్రధానస్య = ప్రకృతియందు ముఖ్య కర్తృత్వ మంగీకరింపబడును.

పురుషునకు భోగాపవర్గములను కలిగించుటకు ప్రకృతి ప్రవర్తించును. అదియే దానికి ప్రయోజనము. కాబట్టి ప్రకృతియందు ముఖ్య కర్తృత్వము సిద్ధింపగలదని భావము.

వివేకము మూలమున ముక్తుడగు పురుషునికి మోక్షము కల్పించుటకు ప్రకృతివలన సృష్టి యేర్పడునేని యొకసారి సృష్టి కలిగిన చాలదా?

"విరక్తస్య తత్సిద్ధే" 2.2

విరక్తస్య = వివేకము వలన నేర్పడిన పర వైరాగ్యము గల వానికే, తత్సిద్ధేః = మోక్షము సిద్ధించును. ఇతరులకు కలుగదు. కాబట్టి యొకమాటు సృష్టి కలిగిన చాలదు.

ఒక్క సృష్టియందే శ్రవణమువలన పరవైరాగ్యము కలుగునుగదా? పునఃసృష్టి యేల యన :-

"నశ్రవణమాత్రాత్ తిత్సిద్ధి రనాది వాసనాయా బలవత్వాత్" 2.3

అనాది వాసనాయాః = వైరాగ్యమును కలుగ నీయనట్టి యనాది సంసార వాసన, బలవత్వాత్ = ప్రబలముగా నుండును కాబట్టి, శ్రవణ మాత్రాత్ = బహుజన్మలలో చేసిన పుణ్యఫలముచే లభింపదగు సత్వపురుషాన్యతా శ్రవణమాత్రమున, తత్సిద్ధిః = వైరాగ్యసిద్ధి, న = కలుగదు.

"బహుభృత్య వద్వా ప్రత్యేకమ్" 2.4

వా = లేక , ప్రత్యేకం బహుభృత్యవత్ = ప్రతి గృహస్థుడు

ననేకులను పోషింప వలసియున్నట్లు ప్రకృతియు ననేక జీవులకు మోక్షము కల్పింపవలసి యున్నది. కాబట్టి యొక్క మాట సృష్టికై ప్రవర్తించిన నిర్వాహము కాదని భావము.

('తస్మాద్వా ఏతస్మాదాత్మన ఆకాశః సంభూతః) అను నిట్టి శ్రుతులందు పరమాత్మవలన సృష్టి యేర్పడినట్లు కనబడుచుండ ప్రకృతియే సృష్టించుచున్నదను టెట్లన :-

**"ప్రకృతివాస్తవేచ పురుషస్యాధ్యాససిద్ధిః"** 2.5

ప్రకృతివాస్తవే = వాస్తవమున ప్రకృతియే కర్తయైనప్పటికి, పురుషస్యచ = పరమేశ్వరునకు గూడ, అధ్యాససిద్ధిః = అధ్యాసము వలన సృష్టి కర్తృత్వము కలుగుచున్నది.

అధ్యాసమనగా ప్రకృత్యుపరాగము. ప్రకృతిలో నున్న కర్తృత్వమే ప్రకృతితోకూడిన పరమేశ్వరునందు వ్యవహరింపబడుచున్నదని భావము.

ప్రకృతి సృష్టికి ముఖ్యకర్త యను టెట్లన :-

**"కార్యతస్తత్సిద్ధేః"** 2.6

కార్యతః = మహదాది పంచభూతమువలవరకు గల కార్యపదార్థముల వలన, తత్సిద్ధేః = ప్రకృతి ముఖ్యకర్త యని సిద్ధించుచున్నది.

ప్రకృతి ముఖ్యకర్తయగునెడల దాని ప్రవృత్తి నివృత్తు లకు నియమాక మెయ్యది యన :-

**"చేతనోద్దేశాన్ని యమః కంటక మోక్షవత్"** 2.7

చేతనోద్దేశాత్ = పరమేశ్వరుని యభిలాషవలన, నియమః = ప్రకృతి తనకొఱకో లేక పరులకొఱకో ప్రవర్తించును. మఱియు నివర్తించును. కంటకమోక్షవత్ = రాజు కోరికననుసరించి నిరపరాధులకు కంటకము (శూలము) నుండి మోక్షము, సాపరాధులకు శూలప్రయోగము జరుగునట్లు.

ఏ జగదీశ్వరుని యభిలాష మాత్రమున ప్రకృతిలో ప్రవృత్తి నివృత్తులు కలుగుచున్నవో యతడే కర్తయని యంగీకరింపక ప్రకృతి కర్త యననేల యన :-

**"అన్యయోగేఽపి తత్సిద్ధిః నాంజస్యే నాయోదాహవత్"** 2.8

అన్యయోగేఽపి = ప్రకృతి యోగమున్నందు వలననే, తత్సిద్ధిః

= పరమేశ్వరునందు స్రష్టృత్వము సిద్ధించును. నాంజస్యేన = సాక్షాత్తుగా సిద్ధింపదు, అయోదాహవత్ = లోహమునందలి దాహకత్వమువలె.

అగ్ని సంయోగమువలన లోహమున దాహకశక్తి కలుగునట్లు ప్రకృతి సంయోగమున్నందుననే పరమేశ్వరుడు సృష్టి కర్త యనిపించుకొనగలడని భావము.

సృష్టి యన నేమి?

"రాగ విరాగ యోర్యోగః సృష్టిః" 2.9

రాగ విరాగయోః = ప్రకృతి పరమేశ్వరుల, యోగః = సంబంధము, సృష్టికి = సృష్టికి హేతువు. కాబట్టి యిదియే సృష్టియని యర్థము.

రంజింపజేయునది కావున ప్రకృతి రాగ మనబడును. ఎల్లపుడు నుదాసీనుడై రాగరహితుడై యుండును కాబట్టి పరమేశ్వరుడు విరాగి. ప్రకృతి పరమేశ్వర సంబంధము సనాతనము. కాబట్టి సృష్టియు సనాతనమే.

సంసారిక విషయములందు స్నేహము రాగ మనియు, అట్టి స్నేహము లేకుండుట విరాగ మనియు చెప్పుదురు. అందు రాగమువలన సృష్టియు, విరాగమువలన మోక్షమును కలుగునని భాష్యకారులు వ్రాసియున్నారు.

సృష్టిక్రమ మెట్టిదన :-

"మహదాది క్రమేణ పంచభూతానామ్" 2.10

మహదాది క్రమేణ = ప్రకృతినుండి మహత్తత్త్వము, దానినుండి యహంకారము, అందుండి పంచతన్మాత్రములు, వానినుండి, పంచభూతానామ్ = భూమి, జలము, అగ్ని, వాయువు, అకాశము నను వానియొక్క సృష్టి క్రమముగా కలుగును.

ప్రకృతి సృష్టికంటే మహదాది సృష్టిగల విశేషమేమి?

"ఆత్మార్థత్వాత్ సృష్టేర్నైషా మాత్మార్థ ఆరంభః" 2.11

సృష్టేః = మహదాది సృష్టి, ఆత్మార్థత్వాత్ = పురుషుని కొఱకగుటవలన, ఏషాం = మహదాదుల, అరంభః = సృష్టి, న ఆత్మార్థః = ప్రకృతి సృష్టివలె తనకొఱకు గాదు.

ప్రకృతి వలన నేర్పడు సృష్టి స్వార్థము, పరార్థము నని రెండు విధములు. మహదాదువవలన కలిగెడి సృష్టి పరార్థమే కాని స్వార్థముకాదు.

ఇదియే భేదము.

వ్యవహార సిద్ధములైన దిక్కు, కాలము నేల గణింప లేదు?-

**"దిక్కాలా వాకాశాదిభ్యః"** 2.12

దిక్కాలౌ = పూర్వము, పశ్చిమము, ఉత్తరము, దక్షిణము దిక్కులు, దినము మాసము మున్నగునవి కాలము. ఇయ్యవి ఆకాశాదిభ్యః = ఆయా యుపాధులతో కూడిన అకాశమునందే యంతర్భూతములు.

దిక్కు, కాలము ఆకాశముకంటె భిన్నములు కానందున వేరుగ లెక్కింపలేదని భావము.

మహదాదుల లక్షణము, కార్యములు చెప్పుచున్నాడు.

**"అధ్యవసాయో బుద్ధిః"** 2.13

అధ్యవసాయః = 'ఇది యిట్లే' అను నిశ్చయాత్మక వ్యాపారము (క్రియ) బుద్ధిః = మహత్తత్వమునకు లక్షణము.

**"తత్కార్యం ధర్మాది"** 2.14

తత్కార్యం = ఆమహత్తత్వము యొక్క కార్యములు ధర్మాది = ధర్మము, జ్ఞానము, వైరాగ్యము మున్నగునవి.

**"మహ దుపరాగా ద్విపరీతమ్"** 2.15

మహత్ = ఆమహత్తత్వమే, ఉపరాగాత్ = రజస్తమస్సుల సంబంధము వలన, విపరీతమ్ = విపరీత కార్యములు గలది -అధర్మము, అజ్ఞానము, అవైరాగ్యము, అనైశ్వర్యము, మున్నగు కార్యములు గలది యగును.

అహంకార లక్షణము :-

**"అభిమానోఽహంకారః"** 2.16

అహం (నేను) అనెడి యభిమానము అహంకారమనబడును.

**"ఏకాదశ పంచతన్మాత్రం తత్కార్యమ్"** 2.17

పదునొకండింద్రియములు, ఐదు తన్మాత్రములు మొత్తము పదునారును అహంకారము వలన జనించును.

**"సాత్త్విక మేకాదశకంప్రవర్తతే వైకృతా దహంకారాత్"** 2.18

వైకృతాత్ అహంకారాత్ = సాత్త్వి కాహంకారమువలన, సాత్త్వికం ఏకాదశకం = సాత్వికము లయిన పదకొండింద్రియములు ప్రవర్తతే = జనించును -- మిగిలిన పంచతన్మాత్రములు తామసాహంకారమువలన

జనించు నని భావము.

**"కర్మేంద్రియ బుద్ధీంద్రి యైరాంతర మేకాదశకమ్"** 2.19

వాక్కు, పాణి, పాదములు, పాయువు, ఉపస్థము అనునైదు కర్మేంద్రియములు, నేత్రములు, శ్రోత్రములు, త్వక్కు, జిహ్వ, నాసిక యనెడి పంచజ్ఞానేంద్రియములు, అంతరింద్రియము మనస్సు కలిసి పదునొకం డింద్రియములు.

ఇంద్రుని (జీవుని) కర్మమునకు, జ్ఞానమునకు సాధన మగునది ఇంద్రియ మని వ్యుత్పత్తి. అహంకారమునుండి జనించి కరణమగునది ఇంద్రియ మని దాని లక్షణము. ఇంద్రియములు భూతములలోని గంధాది విశేషగుణములను గ్రహించును. కాబట్టి యవి భూతములనుండి జనించినవి యని యేల చెప్పరాదు?

**"అహంకారికత్వ శ్రుతే ర్నభౌతికాని"** 2.20

*అహంకారికత్వ శ్రుతేః* = ఇంద్రియములు అహంకారజన్యములని శ్రుతి చెప్పుచున్నందున, నభౌతికాని - భౌతికములు కావు.

ఇంద్రియములు, అహంకారజన్యములని చెప్పుశ్రుతి యొండును కానరాదు. అయినను ముండకోపనిషత్తునందు **"ఏతస్మాజ్జాయతే ప్రాణోమనః సర్వేంద్రియాణిచ ఖంవాయుర్జ్యోతిరాపః పృథివీ విశ్వస్యధారిణీ"** 2.1.3

భూతములకంటే ముందుగా మనస్సు, ఇంద్రియములు పుట్టినట్లు వర్ణింపబడియున్నది. ఇట్టి శ్రుతుల యాధారమున నింద్రియములు అహంకారికములని సూత్రకారుడు చెప్పి నట్లూహింపనగును.

(అగ్నిం వాగప్యేతి. వాతం ప్రాణః, చక్షురాదిత్యమ్...బృ. 5. 2) వాక్కు అగ్నిలో లీనమగుచున్నది. చక్షువు ఆదిత్యునిలో లీనమగుచున్నది. అను నిట్టి శ్రుతివాక్యముల వలన నింద్రియములు భూతములందు లీనము లగుచున్నట్లు తెలియుచున్నది. అందువలన నవిభౌతికములే యగును.కాని అహంకారికము లెట్లగును?

**"దేవతాలయ శ్రుతి ర్నారంభకస్య"** 2.21

*దేవతాలయశ్రుతిః* = 'అగ్నిం వాగప్యేతి' యను నిట్టి శ్రుతి ఇంద్రియములు దివ్యగుణములు గలిగిన భూతములందు లీనమగుటను తెలుపు శ్రుతియే కాని, *నారంభకస్య* = ఇంద్రియ కారణములను

తెలుపునదికాదు.

'భూతలమున జలబిందువులు లయమగుచున్నవి.' అనిన జలమునకు భూతలము కారణమగునా? కాదు. అట్లే ఇంద్రియములు భూతములందు లీనము లగునని చెప్పినంత మాత్రమున నింద్రియములకు భూతములు కారణము లని చెప్పరాదు.

అటులయిన నింద్రియములు నిత్యములా? యన :-

**"తదుత్పత్తి శ్రుతేర్వినాశ దర్శనాచ్చ"** 2.22

(పూర్వ సూత్రమునుండి నకార మీ సూత్రమునకు తెచ్చుకొనవలయును.)

తదుత్పత్తిశ్రుతేః = ఇంద్రియము లుత్పన్నములయినట్లు శ్రుతి చెప్పుచున్నందునను, వినాశదర్శనాచ్చ = ఉత్పన్నములైనవి నశించునను న్యాయ ముండుట వలనను, న = ఇంద్రియములు నిత్యములు కావు.

అనిత్యములగు నెడల నింద్రియ గోలకములే యింద్రియములా?

**"అతీంద్రియ మింద్రియం భ్రాంతానా మధిష్ఠానమ్"** 2.23

ఇంద్రియం = ఇంద్రియము, అతీంద్రియమ్ = ఇంద్రియములకు గోచరము కాదు. భ్రాంతానామ్ = భ్రాంతులయిన వారికి, అధిష్ఠానమ్ = గోలకమే యింద్రియము.

ప్రత్యక్షముగా గనబడు నేత్ర తారకాదులు ఇంద్రియములు కావు. ఇవి ఇంద్రియముల కధిష్టానములు - ఇంద్రియముల కాధారములు. తెలియనివారు వానినే ఇంద్రియములందురు.

గోలకము లింద్రియములు కానిపక్షమున ననేకేంద్రియముల నంగీకరింప నేల? ఒకే యింద్రియము శక్తిభేదముతో నా యా గోలకములందు పనిచేయుచున్నదని యందుమేని దోషమేమి?

**"శక్తిభేదేఽపి భేదసిద్ధౌ నైకత్వమ్"** 2.24

శక్తిభేదేఽ పి = భిన్నశక్తుల నంగీకరించినపుడు, భేదసిద్ధౌ = ఇంద్రియములు భిన్నములని సిద్ధించును. కాబట్టి, నైకత్వమ్ = ఇంద్రియమొక్కటి కాదు.

శక్తి భేదము నంగీకరించినపుడు శక్తికి ఆశ్రయము భిన్నమగును. కాబట్టి యేకత్వ ముండనేరదని భావము.

శక్తిభేదము ననుసరించి భేధము కల్పించుట విరుద్ధము కాదా?

"న కల్పనా విరోధః ప్రమాణదృష్టస్య" 2.25

ప్రమాణదృష్టస్య = ప్రమాణాముద్వారా తెలియబడిన భేదమునకు, కల్పనావిరోధః = కల్పనావిరోధము, న = కలుగదు.

ప్రత్యక్షాది ప్రమాణములద్వారా ఇంద్రియములు భిన్నములని తెలిసికొనబడినపుడు, భేదకల్పన విరుద్ధము కాదని భావము.

"ఉభయాత్మకం మనః" 2.26

మనః = మనస్సు, ఉభయాత్మకం = జ్ఞాన కర్మేంద్రియాత్మకము.

ఒకే యహంకారమునుండి యింద్రియములు భూతములు నను భిన్న కార్యము లెట్లు కలిగినవి? :-

"గుణపరిణామ భేదాన్నానాత్వ మవస్థావత్" 2.27

అవస్థావత్ = ఒకే దేహమున బాల్యయౌవనాద్యవస్థలవలె, గుణ పరిణామభేదాత్ = సత్త్వ రజ స్తమోగుణముల పరిణామభేదము వలన, నానాత్వం = ఒకే యహంకారమునుండి నానా కార్యము లేర్పడినవి.

ఇంద్రియముల యసాధారణవృత్తిని తెలుపుచున్నాడు.

"రూపాదిరసమలాంత ఉభయోః" 2.28

ఉభయోః = జ్ఞానేంద్రియములకు, కర్మేంద్రియములకు, రూపాది రసమలాంతః = రూపము ఆదియందు కలవి, (రసమలము) పురీషము అంతమందు కలవి విషయము లని యెఱుగవలయును.

రూపము, రసము, గంధము స్పర్శము, శబ్దము నను నివి చక్షురాది జ్ఞానేంద్రియములకు విషయములు. మాటలు తీసికొనుట, తిరుగుట, మలము, అనందము నను నివి వాగాదికర్మేంద్రియములకు విషయములు.

దర్శనము, శ్రవణము మున్నగునవి జ్ఞానేంద్రియముల వ్యాపారము. ఇట్లే వచించుట మున్నగునవి కర్మేంద్రియముల వ్యాపారము.

ఇంద్రియములు ప్రకాశకములు. కాబట్టి యవియే దర్శనాదులకు కర్తలేల కావు? :-

"ద్రష్టృత్వాదిరాత్మనః కరణత్వ మింద్రియాణామ్" 2.29

ద్రష్టృత్వాదిః = ద్రష్టృత్వ వ్యక్తృత్వాదులు, అత్మనః = పురుషునివే. ఇంద్రియాణామ్ = ఇంద్రియములు, కరణత్వం = కరణములు మాత్రమే.

చక్షురాదీంద్రియములు సాధనములేకాని దర్శనాదులకు కర్తలుకావు.

అంతఃకరణత్రయముయొక్క యసాధారణవృత్తి –

"త్రయాణాం స్వాలక్షణ్యమ్" 2.30

త్రయాణామ్ = బుద్ధి, అహంకారము, మనస్సు నను మూటికి, స్వాలక్షణ్యమ్ = స్వస్వలక్షణమే యసాధారణవృత్తి.

బుద్ధి లక్షణము అధ్యవసాయము (నిశ్చయాత్మకక్రియ) కాబట్టి యదియే దాని యసాధారణవృత్తి. అహంకారమున కభిమానము లక్షణము. కావున నదియే దానికి వృత్తి. మనస్సునకు సంకల్పము.

బాహ్యాభ్యంతరకరణముల సాధారణవృత్తి :-

"సామాన్యకరణవృత్తిః ప్రాణాద్యావాయవః పంచ" 2.31

ప్రాణాద్యాః = ప్రాణ మాదియందుగల, పంచవాయవః = పంచవాయువులు, సామాన్యకరణవృత్తిః = కరణముల సాధారణవృత్తి.

ప్రాణము, అపానము, సమానము, ఉదానము, వ్యానము ననునవి పంచవాయువులు. ఇయ్యవి వాయువువలె సంచరణశీలము కలవి కాబట్టి వాయువు లనబడినవి. వాస్తవమున నివి యింద్రియవృత్తి యని భావము.

వ్యాసమహర్షి యోగభాష్యమునం దొకచో ("ఉదాన... ఉత్క్రాంతిశ్చ" వి.పా. 39) 'సమస్తేంద్రియవృత్తిః ప్రాణాదిలక్షణాజీవనం ప్రాణాపానాది లక్షణముగల జీవనమనెడియొక సామాన్యవృత్తి సమస్తేంద్రియములకు సంబంధించినది కలదని వర్ణించియున్నాడు. సమస్తేంద్రియములనగా పదమూడింద్రియములని భావము (జ్ఞానేంద్రియము లైదు, కర్మేంద్రియము లైదు, మనస్సు, అహంకారము, బుద్ధి.)

ఇంద్రియముల వృత్తి బాహ్యము, అభ్యంతరము నని రెండు విధములు. రూపరసాదుల నెఱుగుట బాహ్యావృత్తి. రెండవదియగు అభ్యంతర వృత్తి జీవన మనబడును. ఇదియు నొక విధమగు ప్రయత్నమే. ఈ ప్రయత్నమువలన శరీరము నందలి వాయువులో భిన్న భిన్న క్రియలు కలుగును. అట్టి క్రియా సహాయముననే వమనాదులు కలుగుచున్నవి. ఈ జీవనమనెడి సర్వేంద్రియముల వృత్తియే శాస్త్రములందును, లోక వ్యవహారమునందును 'పంచప్రాణము' లని చెప్పబడుచున్నది. పంచప్రాణము లనగా శరీరములోని వాయువు మాత్రమని యెంచక యా వాయువునందు నానా విధములగు క్రియలను కలిగించుటకు హేతువయిన ఇంద్రియముల ప్రయత్న విశేష మని గుర్తింపవలయును.

ఇంద్రియముల యసాధారణ వృత్తిలోగల క్రమమును, అక్రమమును చెప్పుచున్నాడు.

**"క్రమశోఽ క్రమశశ్చేంద్రియవృత్తిః"** 2.32

ఇంద్రివృత్తిః = చక్షురాదీంద్రియముల వ్యాపారము. క్రమశోఽ క్రమశశ్చ = ఒకప్పుడు క్రమముగాను, మఱియొకప్పుడు అక్రమము గాను జరుగుచుండును.

దర్శనము, సంకల్పము, నిశ్చయవ్యాపారము మున్నగు నింద్రియ వ్యాపారము లొకప్పు డొకదాని తరువాత మరి యొకటి యని క్రమముగాను, అట్టి క్రమములేక యొకే క్షణమున ననేక వ్యాపారము లొకప్పుడును జరుగునని సూత్రాభిప్రాయము.

బుద్ధివృత్తు లెన్నివిధములు? :-

**"వృత్తయః పంచతయ్యః క్లిష్టాః క్లిష్టా"** 2.33

వృత్తయః = బుద్ధివృత్తులు, పంచతయ్యః = ఐదు విధములు. అవి మరల, క్లిష్టాక్లిష్టాః = క్లిష్టములు అక్లిష్టములు నని రెండు విధములు.

ప్రమాణము, విపర్యయము, వికల్పము, నిద్ర, స్మృతి యని వృత్తులైదు. వానిలో సాత్త్వికవృత్తులు అక్లిష్టములు- కష్టము కలిగింపనివి. రాజస తామసవృత్తులు క్లిష్టములు- క్లేశము కలిగించునవి.

వృత్తులు లేనపుడు పురుషుడెట్లుండును? :-

**"తన్నివృత్తా వుపశాంతోపరాగః స్వస్థః** 2.34

తన్నివృత్తౌ = ఆ వృత్తులు లేనపుడు, ఉపశాంతోపరాగః = వృత్తి సంబంధము లేనివాడై, స్వస్థః = పురుషుడు తన స్వరూపమునందు తా నుండును.

అందుల కుదాహరణము :-

**"కుసుమవచ్చమణిః"** 2.35

స్వచ్ఛమయిన స్ఫటికమణి యెఱ్ఱని పుష్పసంబంధముచే నెఱ్ఱనగును. పుష్పసంబంధము లేనపుడు మణిస్వచ్ఛముగా తన రూపమున తానుండును. అట్లే పురుషుడు వృత్తి సంబంధమున నస్వస్థుడగును. వానిసంబంధము లేనపుడు స్వస్థుడగునని భావము.

బుద్ధ్యాదులలో ప్రవృత్తి యేలకలుగుచున్నదన :-

**పురుషార్థం కరణోద్భవోఽప్యదృష్టోల్లాసాత్"** 2.36

అదృష్టోల్లాసాత్ = అభివ్యక్తమగు నదృష్టకారణమున, కరణోద్భవః = కరణము (బుద్ధ్యాదు)ల ప్రవృత్తి, పురుషార్థం = పురుషున కొఱకు కలుగుచున్నది.

ఇతరులకొఱకు స్వతః ప్రవృత్తి కలుగుటలో నిదర్శనమేమి?

**"ధేనువద్ వత్సాయ"** 2.37

వత్సాయ = దూడకొఱకు, ధేనువత్ = తల్లియైన ఆవునందు స్వయముగా క్షీరప్రవృత్తి కలుగుచున్నది. అట్లే పురుష ప్రయోజనార్థమై బుద్ధ్యాదీంద్రియములందు స్వతః ప్రవృత్తి కలుగుచున్నదని భావము.

ఈ కరణము లెన్ని విధములు? :-

**"కరణం త్రయోదశ విధ మవాంతర భేదాత్"** 2.38

అవాంతరభేదాత్ = బాహ్యము, అభ్యంతరము నను భేదము వలన, కరణం = ఇంద్రియములు, త్రయోదశవిధమ్ = పదమూడు విధములు.

చక్షురాది పంచజ్ఞానేంద్రియములు, వాగాది పంచకర్మేంద్రియములు కలిసి పది బాహ్యేంద్రియములు. మనస్సు, అహంకారము, బుద్ధి మూడు అంతరింద్రియములు. మొత్తము పదమూడింద్రియములు.

ఇంద్రియములలో కరణత్వ మెట్లు సిద్ధించును? :-

**"ఇంద్రియేషు సాధకతమత్వగుణ యోగాత్ కుఠారవత్"** 2.39

ఇంద్రియేషు = చక్షురాదీంద్రియములలో, సాధకతమత్వగుణ యోగాత్ = జ్ఞాన క్రియను మిక్కిలిగ సాధించునట్టి గుణసంబంధముండుట వలన, కుఠారవత్ = ఛేదించుటలో నెక్కుడుగా నుపయోగించుటచే గొడ్డలికరణమైనట్లు ఇంద్రియములును కరణము లనబడును.

'వ్యాపార వదసాధారణకారణం కరణమ్' వ్యాపారయుక్తమైన యసాధారణ కారణము కరణమనబడును. కరణ, కారణ లక్షణాదులను తెలియగోరువారు నాచే రచియింపబడిన వైశేషిక, న్యాయదర్శనముల యంబా వ్యాఖ్యానమును చూతురుగాక.

బాహ్యాభ్యంతర కరణములలో ప్రధాన మెయ్యది యన :-

**"ద్వయోః ప్రధానం మనో లోకవద్ భృత్యేషు"** 2.40

భృత్యేషు = సేవకుల విషయమున, లోకవత్ = లోకవ్యవహారము

నందువలెనే, ద్వయోః = బాహ్యాభ్యంతరరేంద్రియములలో, మనః = మనస్సు, ప్రధానమ్ = ప్రధానము.

బాహ్యములయిన దశేంద్రియములకు మనస్సు అధిపతి. భృత్యులకు స్వామివలె. అందువలన నయ్యది ప్రధానముగా నెంచబడును. మనస్సు కంటే అహంకారము, దానికంటె బుద్ధి ప్రధానమని వివేకము.

మనస్సు ప్రధాన మనుటలో హేతువేమి?

**"అవ్యభిచారాత్"** 2.41

ఏ యింద్రియముతో జ్ఞానముకలిగినను మనస్సంబంధము లేక కలుగజాలదు. కాబట్టి మనస్సు ప్రధానమగుచున్నది.

**"తథాఽ శేషసంస్కారా ధారత్వాత్"** 2.42

అట్లే సమస్త సంస్కారములకు మన స్సాధారమగుట వలనను నయ్యది ప్రధానమగుచున్నది.

**"స్మృత్యానుమానాచ్చ"** 2.43

స్మృత్యా = స్మరణముద్వారా, అనుమానాచ్చ = సంస్కారముల కాశ్రయమని యనుమానించుటవలనను.

పూర్వం తనకు తెలిసినదానిని మనుజుడు ఆ పదార్థము తన యెదుట లేనపుడు స్మరించును. ఈ స్మరణము పూర్వానుభవజన్య సంస్కారములకు లింగము - బోధకము. అనగా స్మృతి వలన సంస్కారములున్నట్లు తెలియును. ఆ సంస్కారములకు మనస్సాధారము. కాబట్టి మనస్సు ప్రధాన మని యెఱుగునది.

బుద్ధినే కరణముగా నంగీకరించిన చాలదా? యన :-

**"సంభవేన్న స్వతః"** 2.44

చక్షురాదీంద్రియముల ద్వారా బుద్ధికరణము కాగలదు. స్వతః = స్వయముగా, నసంభవేత్ = స్వయముగా కరణము కాజాలదు.

కాబట్టి చక్షురాదులు కరణములుగా నంగీకరింపబడుచున్నవి.

**"అపేక్షకో గుణప్రధానభావః క్రియావిశేషాత్"** 2.45

క్రియావిశేషాత్ = వ్యాపార విశేషమువలన, గుణ ప్రధాన భావః = ముఖ్యాముఖ్యభావము. ఆపేక్షికః = పరస్పరాపేక్షితమైయుండును.

అయా యింద్రియముల వ్యాపారమునుబట్టి వానిలో నొక దానికంటె మఱియొకటి ముఖ్యముగా నెంచబడును. ఇట్లు చక్షురాదులకంటె మనస్సు,

దానికంటె నహంకారము. అంతకంటె బుద్ధి ప్రధానమని భావము.

ఇయ్యవి పురుషార్థ మేల ప్రయత్నించు చున్నవన :-

**"తత్కర్మార్జితత్వాత్ తదర్థ మభిచేష్టా లోకవత్"** 2.46

తత్కర్మార్జితత్వాత్ = పురుషకర్మ సంపాదితమగుట వలన. తదర్థం = పురుషుని కొఱకు. అభిచేష్టా = కరణములు ప్రవర్తించును. లోకవత్ = లోకమునందువలె.

ఒకడు ప్రయత్నపడి కుఠారాది సాధనములను సంపాదించును అయ్యది వానికొఱకు పనిచేయును. అట్లే పురుష కర్మార్జితము లగుటచే నింద్రియములు పురుషుని కొఱకై ప్రవర్తించు నని భావము.

పురుషునికొఱకు కరణములన్నియు నా యా క్రియలను సమానముగా సంపాదించుచుండ బుద్ధికి ప్రాధాన్య మేల యన? :-

**"సమాన కర్మయోగే బుద్ధేః ప్రాధాన్యం లోకవల్లోకవత్"** 2.41

సమాన కర్మయోగే = బుద్ధిమున్నగు కరణములన్నియు పురుషుని కొఱకు సమానముగ క్రియలందు ప్రవర్తించినను, బుద్ధేః = బుద్ధికే, ప్రాధాన్యం = ప్రధానత, లోకవత్ = లోకమునందువలె నంగీకరింపబడును.

లోకమున రాజుకొఱకు భృత్యులు ప్రవర్తింతురు. సేనాపతి యాజ్ఞ ననువర్తింతురు. అందు సేనాపతికి ప్రాధాన్య ముండును. అట్లే కరణములలో బుద్ధికి ప్రాధాన్యమని భావము.

సూత్రమున రెండవ 'లోకవత్' పదము అధ్యాయ సమాప్తిని సూచించును.

నిఖిలశాస్త్రనిష్ణాత శ్రీమత్పండితముక్తి రామోపాధ్యాయశిష్య గోపదేవ విరచి తాంబా వ్యాఖ్యానమున

ద్వితీయాధ్యాయము.

# తృతీయాధ్యాయము

మహాభూతముల యుత్పత్తి :-

"అవిశేషాద్ విశేషారంభః" 3.1

అ వి శే షా త్ = విశేషములులేని పంచతన్మాత్రముల నుండి, విశేషారంభః = విశేషములుగల పంచభూతము లేర్పడినవి.

శాంతము, ఘోరము, మూఢత యనెడి విశేషములు లేనివి పంచతన్మాత్రములు. ఇవియే సూక్ష్మభూతము లనబడును. వీనినుండి శాంత ఘోర మూఢము లయిన పంచమహాభూతములు కలుగునని భావము.

"తస్మా చ్ఛరీరస్య" 3.2

తస్మాత్ = ఆ పంచమహాభూతములనుండి, శరీరస్య = స్థూల శరీరము కలుగుచున్నది.

ఈ స్థూలశరీరము నశించునది కాబట్టి పురుషుడు భోగాపవర్గములకొఱకై యొక దేహము నుండి మరియొక దేహము నెట్లు పొందునన :-

"తద్బీజాత్ సంసృతిః" 3.3

తద్బీజాత్ = ఆ స్థూలశరీరమునకు కారణమైన లింగశరీరము వలన, సంసృతిః = ఒక దేహమునుండి మఱియొక దేహమునకు గతి గలుగును.

అహంకారముతో కూడిన బుద్ధి, పంచతన్మాత్రములు ఏకాదశేంద్రియములు కలిసి లింగశరీరము లేక సూక్ష్మశరీర మనబడును. ఈ శరీరముతోనే పురుషుడొక శరీరమునుండి మఱియొక శరీరమునకు బోవుచుండును.

సూక్ష్మభూతముల వలన శరీర మెంతవరకు కలుగుచుండు నన :-

"ఆ వివేకాచ్చ ప్రవర్తన మవిశేషాణామ్" 3.4

ఆ వివేకాచ్చ = వివేకము కలుగనంతవరకే, అవిశేషాణామ్ = శాంతాది విశేషములు లేని సూక్ష్మభూతములు, ప్రవర్తనమ్ = స్థూల శరీరము కలిగించుటకై ప్రవర్తించుచుండును.

ప్రకృతి పురుషవివేకము కలిగిన తదుపరి సూక్ష్మ భూతము. (తన్మాత్రము) ల నుండి స్థూలశరీర మేర్పడజాలదు. అందువలన పురుషున కపవర్గమేర్పడు నని భావము.

ఇది యెట్లు తెలియు నన :-

**"ఉపభోగా దితరస్య"** 3.5

*ఇతరస్య = వివేకము కలుగని పురుషునకు, ఉపభోగాత్ = ప్రకృతి వలన నుపభోగము తప్పక కలుగుచుండుట వలన వివేక మేర్పడిన వాని కయ్యది యుండదని తెలియనగును.*

పురుషుడొక శరీరమునుండి మఱియొక శరీరమునకు బోవుసమయమున సుఖ దుఃఖముల ననుభవించునా? యన :-

**"సంప్రతి పరిముక్తో ద్వాభ్యామ్"** 3.6

*సంప్రతి = సంసరణ సమయమున, పురుషుడు, ద్వాభ్యామ్ = సుఖ దుఃఖములనుండి, పరిముక్తః = ముక్తుడగును.*

పురుషునకు సంసరణ సమయమున సుఖ దుఃఖము లుండవు. పురుషు డా సమయమున మూర్ఛితుడై యుండునని భావము.

స్థూల సూక్ష్మ శరీరములలో గల భేదము :-

**"మాతా పితృజం స్థూలం ప్రాయశ ఇతరన్నతథా"** 3.7

*స్థూలం = స్థూలశరీరము, మాతా పితృజం = మాతాపితరుల శరీరమునుండి కలుగును. ఇతరత్ = సూక్ష్మశరీరము, న తథా = అట్లు మాతాపితరుల వలన కలుగదు.*

సూత్రమునందు (ప్రాయశః) అను పదము కలదు. దాని కర్థము 'తఱచుగా' అని. కాబట్టి స్థూలశరీరము తఱచుగా మాతాపితరులనుండి కలుగునని తేలుచున్నది. దీనింబట్టి యొకప్పుడు అనగా సర్గారంభమున శరీరములు మాతా పితరుల వలన కలుగక అయోనిజము లగునని తెలియవలెను.

ఈ రెండు విధములగు దేహములందును భోగాయతన మెయ్యది యన?

**"పూర్వోత్పత్తేః తత్కార్యత్వం భోగా దేకస్య నేతరస్య"** 3.8

*పూర్వోత్పత్తేః = ప్రథమమున నుత్పన్నమయిన, ఏకస్య = ప్రతిపురుషున కొక్కటియైన సూక్ష్మశరీరము వలన, భోగాత్ = సుఖదుః*

ఖాను భూతి కలుగుటచేత, తత్కార్యత్వం = భోగాయతనత్వము, సూక్ష్మశరీరమునకే, నేతరస్య = స్థూలశరీరమునకు లేదు.

మృతశరీరమునందు సుఖదుఃఖముల యనుభూతి కలుగదు. కాబట్టి స్థూలశరీరము సుఖదుఃఖముల కాయతనము కాదు. అందువలన సూక్ష్మశరీరమే సుఖదుఃఖానుభూతి కాయతనమని చెప్పదగునని భావము.

సూక్ష్మశరీర మన నేమి?

**"సప్త దశైకం లింగమ్"** 3.9

*సప్తదశ = ఏకాదశేంద్రియములు, పంచతన్మాత్రములు,* అహంకారముతో కూడిన బుద్ధి యొకటి మొత్తము పదునేడు , *లింగమ్ = లింగశరీర మనబడును. ఏకం = అయ్యది ప్రతి పురుషున* కొక్కటిచొప్పున నుండును.

లింగశరీర స్వరూపములో భేదము లేనందున నది యనేకమగు టెట్లన? :-

**"వ్యక్తిభేదః కర్మవిశేషాత్"** 3.10

*వ్యక్తిభేదః = లింగశరీరమున భేదము, కర్మవిశేషాత్ = జీవుల యదృష్ట విశేషమువలన కలుగును.*

లింగశరీరము భోగాయతన మగునెడల లోకమున స్థూలశరీరము భోగాయతన మని యెట్లు వ్యవహరింపబడుచున్నదన :-

**"తదధిష్ఠానాశ్రయే దేహే తద్వాదా త్తద్వాదః** 3.11

*తదిధిష్ఠానాశ్రయే = కర్మ (అదృష్ట) మున కాధారమైన* బుద్ధితత్వమున కాశ్రయము సూక్ష్మశరీరము. కాబట్టి వానియందు, *తద్వాదాత్ = భోగాయతన వ్యవహార మేర్పడినది అట్లే, దేహే = స్థూలదేహమునందు తద్వాదః = భోగాయతన వ్యవహారము.*

జీవుల యదృష్టము బుద్ధియందుండును. అట్టి బుద్ధికాశ్రయము సూక్ష్మ(లింగ) శరీరము. అందువలన నయ్యది భోగాయతన మగుచున్నది. అట్లే యా సూక్ష్మశరీరమునకు అధారము స్థూలశరీరము. కాబట్టి స్థూల శరీరమే లోకమున భోగాయతన మని చెప్పబడు నని భావము.

అటులయిన బుద్ధివలననే పురుషునకు భోగముసిద్ధించు చున్నదనవలసివచ్చును. అట్టియెడ సూక్ష్మశరీర మెందులకు?

**"నస్వాతంత్రాత్ తదృతే, ఛాయావ చ్చిత్రవచ్చ"** 3.12

తద్భృతే = లింగశరీరము లేక, నస్వాతంత్ర్యాత్ = స్వతంత్రముగ బుద్ధిసత్త్వ ముండనేరదు. ఛాయావత్ చిత్రవచ్ఛ = ఛాయవలె, చిత్రమువలె- ఆధారములేని ఛాయగానీ, చిత్రముగానీ యుండనట్లు లింగశరీరము లేనిది కేవల బుద్ధిసత్త్వము భోగముల ననుభవింపజేయ నేరదని భావము.

అటులయిన లింగశరీరముతోనే కార్యము సిద్ధించునుగదా? స్థూలశరీరమేలయన :-

**"మూర్తత్వేఽపి న సంఘాత యోగాత్ తరణివత్"** 3.13

మూర్తత్వేఽపి = లింగశరీరము మూర్తము (క్రియకాశ్రయము) అయినప్పటికిని, తరణివత్ = సూర్యునివలె, న = స్వయముగా భోగము కలిగింపజాలదు, సంఘాతయోగాత్ = స్థూలశరీరయోగము వలననే కలిగించును.

సూర్యుని తాపము స్థూలశరీరముతోనే యనుభవింపనగును. లింగశరీరమున క్రియయేర్పడు అవకాశమున్నప్పటికిని స్థూలశరీరము లేనిది భోగము ననుభవింప జేయనేరదు. కాబట్టి స్థూల శరీరమును అవసరమే యని భావము.

సూక్ష్మశరీర పరిణామ మేమి? యన :-

**"అణుపరిమాణం తత్కృతిశ్రుతేః"** 3.14

అణుపరిమాణం = లింగశరీరము మధ్యమపరిమాణము కలది. తత్కృతిశ్రుతేః = దానినుండి నిర్మాణము శ్రుతి చెప్పుచున్నందున.

(ఏ తస్మాత్ జాయతేప్రాణో మనః సర్వేంద్రియాణిచ, ముం. 2.1.3) 'సూక్ష్మశరీరము నుండి ప్రాణాదులు కలుగుచున్నవి' అని శ్రుతి బోధించుచున్నది. కాబట్టి సూక్ష్మశరీరపరిమాణము మధ్యమమని తేలుచున్నది, వ్యాపకము కాదని భావము.

మఱియొక హేతువు :-

**"తదన్నమయత్వ శ్రుతేశ్చ"** 3.15

(అన్నమయం హిసోమ్య మన ఆపోమయః ప్రాణస్తేజో మయీవాగ్...చా. 6.5) మనస్సు అన్నమయము. ప్రాణము జలమయము. వాక్కు తేజోమయము..అని శ్రుతి చెప్పుచున్నందునను, లింగశరీరము మధ్యమ పరిమాణము కలది యనియే యంగీకరింప వలయునని భావము.

లింగశరీరము మధ్యమ పరిమాణమైన కానిమ్ము. అది యచేతనము. దానియందు సంసరణము (గతి) ఎట్లుకలుగుచున్నదన :-

**"పురుషార్థం సంసృతి ర్లింగానాం సూపకారవత్"** 3.16

సూపకారవత్ = యజమానుని నిమిత్తము పాకశాలయందు వంట వారిలో ప్రవృత్తికలుగునట్లు, *లింగానాం = లింగశరీరములందు, పురుషార్థం = పురుషునికొఱకు, సంసృతిః = గతికలుగును.*

వంటచేయువారు యజమాని నిమిత్తము వంటచేయుదురు. అట్లే లింగశరీరమునందు పురుషునికొఱకు ప్రవృత్తికలుగునని భావము.

స్థూల శరీర మెట్టిది? యన :-

**"పాంచభౌతికో దేహః"** 3.17

పాంచభౌతికః = పంచభూతముల పరిణామము, దేహః = స్థూలదేహ మనబడును.

**"చాతుర్భౌతిక మిత్యేకే"** 3.18

ఆకాశము తక్క మిగిలిన పృథివి, జలము, వాయువు, అగ్ని యనునాలుగు భూతముల పరిణామమే స్థూలశరీరమని కొందఱందురు.

**"ఏకభౌతిక మిత్యపరే"** 3.19

ఇంక కొందఱు కేవలము పృథివియొక్క పరిణామమనియే యందురు.

ప్రసంగ వశమున చైతన్యము శరీరమునకు చెందినది కాదని చెప్పుచున్నాడు.

**"న సాంసిద్ధికం చైతన్యం ప్రత్యేకాదృష్టేః"** 3.20

ప్రత్యేకాదృష్టేః = పృథివ్యాదిభూతములలో వేరు వేరుగ నొక్కొక్క దానియందు చైతన్యములేనందున. దేహమునకు, నసాంసిద్ధికంచైతన్యం. స్వాభావికమైన చైతన్యము లేదని తెలియచున్నది.

**"ప్రపంచ మరణాద్యభావాశ్చ"** 3.21

మఱియు దేహమునందు స్వాభావిక చైతన్య మంగీకరింతుమేని లోకమున మరణాదులు సంభవింపవు. దేహము సహజచైతన్యము కలదియినచో మరణముగానీ, సుషుప్తిగానీ సంభవింపదని భావము.

**"ముదశక్తివచ్చేత్ ప్రత్యేకపరిదృష్టే సాంహత్యే తదుద్భవః"** 3.22

ముదశక్తివచ్చేత్ = ప్రత్యేకవస్తువునందు లేని మదబలము అనేక

వస్తువులు కలిసినపుడేర్పడునట్లు ప్రత్యేకభూతమునందు చైతన్యము లేకున్నను కొన్ని భూతములు కలిసినపు దేర్పడునందుమేని. యదియును తగదు. కారణమేమన, ప్రత్యేకపరిదృష్టే = ప్రతివస్తువునందు నేవి సూక్ష్మముగనుండునో యవియే, సాంహత్యే = అనేకము కలిసినపుడు, తదుద్భవః = స్పష్టముగ ప్రకటమగును.

ఇసుక రేణువులందు ప్రత్యేకముగ తైలముండదు. అందు వలన నెంత యిసుక గానుగలోవేసి త్రిప్పినను తైలము తులమైనను రాదు. ఒక్కొక్క నువ్వు గింజలోను కొంచెముగ తైలముండును. అందువలన నెక్కుడు నువ్వులు గానుగలో వేసి త్రిప్పినపుడు తైల మెక్కువ లభించును. కాబట్టి ప్రత్యేకమునందు సూక్ష్మముగనైన నుండని వస్తువు అనేకముపరస్పరము కలిసినంతమాత్రమున నుద్భవింపనేరదని తెలియుచున్నది. అట్లే ఒక్కొక్క భూతమునందులేని చైతన్య మనేక భూతములు కలిసిన నేర్పడుననుట యుక్తము కాదని భావము.

పురుషునకు ముక్తి యెట్లు కలుగునన :-

**"జ్ఞానాన్ముక్తిః"** 3.23

*జ్ఞానాత్ = ప్రకృతి పురుషుల వివేకజ్ఞానమువలన, ముక్తిః = శరీర సంబంధమువలన కలిగెడి త్రివిధ దుఃఖములనుండి ముక్తి కలుగును.*

బంధమెట్లేర్పడునన :-

**"బంధో విపర్యయాత్"** 3.24

*విపర్యయాత్ = ప్రకృతి పురుషుల యవివేకజ్ఞానమువలన, బంధః = శరీరసంబంధమువలన కలిగెడి దుఃఖములు కలుగును.*

కర్మముకూడా ముక్తికి హేతువగుచుండ జ్ఞానమువలన ముక్తి కలుగునను టెట్లు చెల్లు నన :-

**"నియత కారణత్వాన్న సముచ్చయ వికల్పౌ"** 3.25

*నియతకారణత్వాత్ = జ్ఞానము ముక్తికి నియతకారణ మగుటవలనన, సముచ్చయ వికల్పౌ = ముక్తి కర్మయుక్త జ్ఞానముచే కలుగునని కానీ, ఒకప్పుడు జ్ఞానమువలనను, మఱియొకప్పుడు కర్మము వలనను కలుగునని కానీ, చెప్పుట యుక్తముకాదు.*

**"స్వప్నజాగరాభ్యా మివమాయి కామాయికాభ్యాం నోభయోర్ముక్తిః పురుషస్య"** 3.26

మఱియు, ఉభయోః = జ్ఞానము, కర్మము నను రెండిటివలన, ముక్తిః న = ముక్తి కలుగదు. ఒక్కజ్ఞానము వలననే కలుగునని భావము. మాయికామాయిభ్యాం స్వప్నజాగరాభ్యామ్ = కల్పితములయిన కలలోని పదార్థములు, అకల్పితములయిన జాగర పదార్థములు నను నీ రెండు విధములయిన పదార్థములవలన, పురషస్య ఇవ = మనుజుని, ఆకలితీరదు, కేవలము జాగ్రదవస్థలో తెలియబడు యథార్థము (అకల్పితము) లయిన పదార్థముల వలననే మనుజుని ఆకలి తీరునని యర్థము.

యథార్థములయిన వస్తువులను సేవించుటవలననే యాకలి తీరునట్లు కేవలము జ్ఞానమువలననే ముక్తి కలుగును. కర్మముతో గూడిన జ్ఞానమువలనను నొకప్పుడును, మఱియొకప్పుడు కేవల జ్ఞానము వలనను ముక్తికలుగనేరదు. అందువలననే వేదమునందును. "తమేవ విదిత్వాఽతి మృత్యుమేతి నాన్యః పంథావిద్యతేఽయనాయ" 'పరమాత్ముని జ్ఞానము వలననే ముక్తి కలుగును. మరియొక మార్గములేదు' అని చెప్పబడినది.

**"ఇతరస్యాపి నాత్యంతికమ్"** 3.27

ఇతరస్యాపి = నిత్యకర్మమువలె నైమిత్తిక కర్మము చేతను, నాత్యంతికమ్ = ముక్తి లభింపనేరదు.

**"సంకల్పితేఽప్యేవమ్"** 3.28

సంకల్పిత కర్మము అనగా కామ్యకర్మము. దానితో కూడిన జ్ఞానమును ముక్తికి సాధనముకాదు.

ఇట్లు కర్మ సముచ్చితము కాక ముక్తికి సాధనమైన జ్ఞానమెట్లు కలుగు నన :-

**"భావనోపచయా చ్ఛుద్ధస్య సర్వంప్రకృతివత్"** 3.29

భావనోపచయాత్ = ధ్యానాధిక్యమువలన, శుద్ధాస్య = శుద్ధుడైన పురుషునకు, ప్రకృతివత్ = ప్రకృతివలె. సర్వం = సమస్త జ్ఞానమును కలుగును.

భావన యన ధ్యానము ధ్యాన మెక్కుడుగా జేసి నందువలన ముక్తి సాధనమైన జ్ఞానముదయింపగలదని భావము.

ధ్యాన మన మేమి?

"రాగోపహ ర్ధ్యానమ్" 3.30

రాగోపహతిః = రాగము నశించుటయే, ధ్యానమ్ = ధ్యానము.

చిత్తమును చలింపజేయు విషయానురాగ మీ సూత్రమున రాగ మనబడినది. ఆ రాగము యొక్క యుపహతి - నాశము- ధ్యానమని భావము.

అది యెట్లు సిద్ధించు నన :-

"వృత్తి నిరోధాత్త త్సిద్ధిః" 3.31

ప్రమాణము, విపర్యయము, వికల్పము, నిద్ర, స్మృతియనెడి వృత్తులైదును విషయములం దనురాగము కల్గించును. అట్టి వృత్తులను నిరోధించుటవలన ధ్యానము సిద్ధింపగలదు.

వృత్తులను నిరోధించు టెట్లన :-

"ధారణాసన స్వకర్మణా తత్సిద్ధి" 3.32

ధారణ, ఆసనము. స్వకర్మలు ననువానిచే వృత్తులు నిరోధింపబడును.

ధారణ లక్షణము :-

"నిరోధ శ్ఛర్ది విధారణాభ్యామ్" 3.33

ఛర్దివిధారణాభ్యామ్ = రేచన విధారణములద్వారా, నిరోధః = ప్రాణనిరోధము ధారణ యనబడును.

ఛర్ది యన రేచనము. అనగా శ్వాసకోశములనుండి వాయువును వెడలగ్రక్కుట. ఇట్లే శ్వాసకోశములను వెలుపలి వాయువులతో నింపుట పూరకమనబడును. ఇదియు నిట గ్రాహ్యము. రేచించిన తరువాత వెలుపలను, పూరించిన తదుపరి లోపలను వాయువును కొంతతడవు నిలుపుట నిరోధము- కుంభకము- అనబడును. ఇయ్యదియే యిట ధారణ యనబడినదని భావము.

ఆసన లక్షణము :-

"స్థిరసుఖ మాసనమ్" 3.34

స్థిరమై సుఖమునిచ్చు కూర్చుండు విధానము ఆసన మనబడును ఈ యాసనము లనేకములు హఠయోగాదులందు వర్ణింపబడినవి

స్వకర్మ లక్షణము :-

"స్వకర్మ స్వాశ్రమవిహిత కర్మానుష్ఠానమ్" 3.35

బ్రహ్మచర్యాద్యాశ్రమములలో తన యాశ్రమమునకు విధించిన

కర్మముల ననుష్ఠించుటయే స్వకర్మ మనబడును.

వృత్తి నిరోధమునకు మఱియొక యుపాయము :-

"వైరాగ్యా దభ్యాసాచ్చ" 3.36

ఐహికాముష్మిక విషయములందు తృష్ణను విడుచుట వైరాగ్య మనబడును. చిత్తైకాగ్రతకై చేయు యత్నము అభ్యాస మనబడును. అభ్యాస వైరాగ్యముల ద్వారా వృత్తి నిరోధము కలుగును.

"విపర్యయభేదాః పంచ" 3.37

వివేకజ్ఞానమునకు విపరీతమైనది విపర్యయ మనబడును. అది యైదువిధములు. అవిద్య, అస్మిత, రాగము, ద్వేషము, అభినివేశము. ఈ యైదును విపర్యయ భేదములని భావము.

"ఆశక్తి రష్టా వింశతిధా" 3.38

అవిద్యాది విపర్యయములకు కారణమైన యశక్తి యిరువది యెనిమిది విధములు.

"తుష్టిర్నవధా" 3.39

తుష్టి తొమ్మిది విధములు.

"సిద్ధిరష్టధా" 3.40

సిద్ధి యెనిమిది విధములు.

ఈ తుష్టిసిద్ధుల విపర్యయము వలన బుద్ధియందు పదు నేడు విధములయిన యశక్తి కలుగును. ఇంద్రియములు పదునొకండు. వాని వైకల్యము వలన పదునొకండు విధముల యశక్తి బుద్ధియందు కలుగును. ఇట్లు మొత్తము ఇరువది యెనిమిది విధములయిన బుద్ధియందలి యశక్తి విపర్యయ జ్ఞానము (అవివేకము) నకు కారణమని భావము.

"అవాంతరభేదాః పూర్వవత్" 3.41

పూర్వవత్ = అవిద్యాదులు విపర్యయ భేదము లయినట్లు, ఆయ విద్యాదులలో గల యవాంతర భేదములు అరువది రెండని యెఱుగునది.

అవ్యక్త ప్రకృతి, మహత్తత్త్వము, అహంకారము, పంచతన్మాత్రములు నను నీ యెనిమిది తత్వములును ఆత్మ కావు. వీనిని ఆత్మగా నెంచుట యవిద్య - తమస్సు - అనబడును. ఇది యెనిమిది విధములు. అణిమాద్యష్టైశ్వర్యము లందును తాదాత్మ్య బుద్ధితో తాను అణ్వాది

రూపుడైనట్లభిమానించుట యస్మితామోహ మనబడును. ఇదియు నెనిమిది విధములు. శబ్ద స్పర్శ రూప రస గంధము లనెడు విషయములు దివ్యములు, అదివ్యములు నను భేదముతో పది విధములు. అందలి రాగము మహామోహ మనబడును. అదియు పది విధములు. అస్మితకు విషయములైన యష్టైశ్వర్యములకును, రాగవిషయములయిన దివ్యాదివ్యము లగు దశవిధ శబ్దాది విషయములకును విఘాతకములైన వానియందు క్రోధ మేర్పడును. ఆ క్రోధమే ద్వేషము - తామిస్ర మనబడును. అది పదునెనిమిది విధములు. ఇట్లు అవిద్య, అస్మిత, రాగము, ద్వేషము ననెడి విపర్యయము అవాంతర భేదములతో నరువది రెండు విధము లని భావము.

**"ఏవ మితరస్యాః"** 3.42

ఏవమ్ = ఇట్లే, ఇతరస్యాః = అశక్తి యొక్క భేదము లిరువది *యెనిమిది యని ఇంతకు పూర్వము (38 సూత్రములో) చెప్పబడినవి.*

**"ఆధ్యాత్మికాది భేదాన్నవధాతుష్టిః"** 3.43

*తుష్టిః = తుష్టి, ఆధ్యాత్మికాదిభేదాన్నవధా = ఆధ్యాత్మికాదిభేదమున తొమ్మిది విధములు.*

ప్రకృతి తుష్టి, ఉపాదాన తుష్టి, కాల తుష్టి, భాగ్య తుష్టియని యాధ్యాత్మిక తుష్టి నాలుగు విధములు. మఱియు, పారము, సూపారము, పారపారము, అనుత్తమాంభము, ఉత్తమాంభము నని బాహ్యతుష్టి యైదు విధములు. మొత్తము తొమ్మిది విధములు.

"వివేకము కలుగువరకును గల పరిణామమంతయు ప్రకృతిదే. ప్రకృతియే పరిణామము నొనర్చుచున్నది. నేను మాత్రము కూటస్థుడను" అని భావించుట వలన పురుషునకు కలిగెడి పరితోషము ప్రకృతి తుష్టి యనబడును. దీనినే 'అంభస్సు' అందురు. అటుపై ప్రవ్రజ్యనుగ్రహించుట వలన నేర్పడెడి తుష్టి ఉపాదాన తుష్టి యగును. అదియే సలిల మన బడును. ప్రవ్రజ్య (సన్యాసము) లో చాలాకాల ముండి యోగాభ్యాసము నొనరించుటచే నేర్పడెడి తృప్తి కాలతుష్టియందురు. ఇదియే ఓఘ మనబడును. అటుపై ప్రసంఖ్యానమను పేరుగల వివేక ఖ్యాతి రూపమగు ధర్మమేఘ సమాధి కలిగినందున నేర్పడెడి తుష్టి భాగ్య తుష్టి యనబడును. దీనినే వృష్టి యందురు. ఈ నాలుగును అధ్యాత్మిక తుష్టులు. మిగిలిన

యైదు తుష్టులు బాహ్య విషయములయిన శబ్దాదులకు సంబంధించినవి. అయ్యవి శబ్దాదుల విషయమున సంపాదించుట, రక్షించుట, నశించుట, అనుభవించుట, హింసించుటలో గల దోషముల వలన నుపరతి కలిగినపుడు కలుగును.

అష్టవిధ సిద్ధులు :-

"ఊహాదిభిః" సిద్ధిః 3.44

ఊహాది భేదములతో సిద్ధి యెనిమిది విధములు. ఈ సూత్రమునందలి ఆది పదముచే శబ్దము, అధ్యయనము, సుహృత్ప్రాప్తి, దానము, దుఃఖవిఘాతము గ్రహింపవలెను. ఇందు దుఃఖములు ముప్విధములు కాబట్టి దుఃఖ విఘాతము మూడు రకములని యెంచవలెను. ఇట్లు దుఃఖములకు సంబంధించిన సిద్ధులు మూడు ముఖ్యములు. మిగిలిన ఐదు సిద్ధులు అముఖ్యము లని వివేకము.

1. ఉపదేశాదుల నపేక్షింపకయే పూర్వజన్మమునకు సంబంధించిన యభ్యాస బలముతో కొండొక విషయము నూహించుట ఊహాసిద్ధి యగును.

2. ఇతరులు పఠించుటను వినినందుననో, లేక స్వయముగ శాస్త్రము నాకలనము చేసికొనుట వలననో కలుగు జ్ఞానము శబ్దసిద్ధి యనబడును.

3. అచార్యుని సమీపమున శిష్య భావముతో శాస్త్రము నభ్యసించుటచే కలుగు జ్ఞానము అధ్యయన సిద్ధియగును.

4. ఉపదేశించు బుద్ధితో స్వయముగ గృహమున కరుదెంచిన దయాలువు వలన జ్ఞానలాభము కలుగుట సుహృత్ప్రాప్తి యనబడును.

5. ధనాదుల నొసగి సంతోషపెట్టి సంపాదించిన జ్ఞానము దానసిద్ధి యగును. అధ్యాత్మిక, అధిదైవిక, అధిభౌతిక దుఃఖములను పోనాడు సిద్ధులు దుఃఖ విఘాతకము లన బడును. అయ్యవి మూడు.

తపస్సు మున్నగు వానిచే సిద్ధులు కలుగవా యన :

"నేతరా దితర హానేన వినా" 3.45

ఇతరహానేనవినా = విపర్యయ జ్ఞాన నాశము కలుగదు కాబట్టి, ఇతరాత్ = తపస్సు మున్నగు వానిచే, న = సిద్ధి కలుగదు.

తపస్సు మున్నగువానిచే విపర్యయ జ్ఞానము నశింపదు. కాబట్టి

వానివలన సిద్ధులు కలుగవు. ఊహాదులవలననే కలుగునని భావము.

ఇట్లు బుద్ధికి సంబంధించిన ఆంతరిక సృష్టిని గురించి చెప్పి యిప్పుడు బాహ్యసృష్టిని వర్ణించుచున్నాడు.

**"దైవాది ప్రభేదా"** 3.46

బాహ్యసృష్టి దైవాది భేదములు కలిగియుండును. దైవీసృష్టి. మానుషీసృష్టి, తిర్యక్ సృష్టి యని బాహ్యసృష్టి ముివ్విధములు. దైవీ సృష్టి యెనిమిది విధములు, తిర్యక్ సృష్టి యైదు విధములు, మానుషీ సృష్టియొక విధము నని భాష్యకారులు.

ఈ సృష్టి యెవరికొఱకు? ఎంతవరకుండునన :-

**"ఆబ్రహ్మస్తంబపర్యంతం తత్కృతే సృష్టి రావివేకాత్"** 3.47

*ఆబ్రహ్మస్తంబపర్యంతం = బ్రహ్మమొదలు స్తంబము వరకు గల, సృష్టిః = సృష్టి, తత్కృతే = పురుషునికొఱకు, అదియు, అవివేకాత్ = వివేకజ్ఞానము కలుగునంతవరకే యుండును.*

ఈ సూత్రమునందలి బ్రహ్మశబ్దము చతుర్వేదముల నెఱిగిన బ్రాహ్మణుని తెలుపును. అట్లే స్తంబ శబ్దమునకు స్థావర మని యర్థము.

**"ఊర్ధ్వం సత్త్వవిశాలా"** 3.48

*సత్త్వవిశాలా = సత్త్వప్రధానమైన సృష్టి, ఊర్ధ్వం = ఊర్ధ్వగతి కలిగియుండును.*

సత్త్వగుణ మెక్కుడుగాను, రజస్తమస్సులు తక్కువ గాను ఉండు సృష్టి దైవీసృష్టి యనబడును.

ద్యుస్థానము (ఆకాశము)న జ్యోతిష్మంతములై ప్రకాశించు పదార్థము లన్నియు నీ సృష్టియందు చేర్పవచ్చును.

**"తమోవిశాలా మూలతః"** 3.49

*తమోవిశాలా = తమోగుణము బహుళముగా నుండు సృష్టి, మూలతః = పశువులు మొదలు స్థావరాంత తిర్యక్కులుగా నెఱుగ వలెను.*

**"మధ్యే రజోవిశాలా"** 3.50

*మధ్యే = పై రెండువిధము లయిన సృష్టికి మధ్యగానుండు, రజోవిశాలా = రజోగుణ మెక్కుడుగానుండు సృష్టి మానవీయ మని యెఱుగునది.*

ప్రకృతి యెందుల కిట్టి విచిత్ర సృష్టి యొనరించు నన:-

**"కర్మ వైచిత్ర్యాత్ ప్రధానచేష్టా గర్భదాసవత్"** 3.51

*గర్భదాసవత్* = దాస్య వాసనలుగల వ్యక్తి పుట్టినప్పటినుండియు ఇతరుల దాస్యమునకై యత్నించునట్లు, కర్మ వైచిత్ర్యాత్ = పురుషుని యదృష్ట వైచిత్ర్యము వలన, ప్రధానచేష్టా = ప్రకృతి విచిత్ర సృష్టి కలిగింప యత్నించుచున్నది.

కర్మ వైచిత్ర్యము వలననే పురుషుడు ఊర్ధ్వాదిగతులు కలిగి కృతార్థుడు కాగలడు గదా? మోక్ష మెందుల కన :-

**"ఆ వృత్తిస్తత్రా ప్యుత్తరోత్తర యోనియోగాద్ధేయః"** 3.52

*తత్రాపి* = ఉర్ధ్వగతి కలిగినను, ఉత్తరోత్తరయోనియోగాత్ = శ్రేష్టజన్మల సంబంధ ముండుట వలన, ఆ వృత్తిః = పునరావృత్తి తప్పదు. కాబట్టి హేయః = ముముక్షువులకు ఊర్ధ్వగతియు త్యజింపదగినదే.

**"సమానం జరా మరణాదిజం దుఃఖమ్"** 3.53

మఱియు, ఊర్ధ్వాది గతులందును, అనగా శ్రేష్ఠ జన్మ సంపాదనమందును, జరామరణ శోక మోహాదులవలన కలిగెడి దుఃఖము సమానమే కాబట్టి ముముక్షువు లూర్ధ్వగతులను సైతము త్యజింతురు.

సృష్టికారణమైన ప్రకృతియందు లీనమైన కృతార్థత కలుగదా యన :-

**"న కారణలయాత్ కృతకృత్యతా మగ్నవదుత్థానాత్"** 3.54

*మగ్నవపదుత్థానాత్* = జలమున మునిగిన వ్యక్తి మరల పైకితేలును. అట్లే కారణలయాత్ = ప్రకృతియందు లీనమైనను పురుషునకు, కృతకృత్యతా = కృతార్థత, న = కలుగదు.

వైరాగ్యము కలిగిన వ్యక్తి ప్రకృతినే ఆత్మగాభావించి యుపాసించినచో నందు లీను డగును. అంతమాత్రమున నతనికి ముక్తి లభింపదు. ముక్తికి వివేకఖ్యాతి యవసరము. వైరాగ్యము కలిగిన తదుపరి వివేకఖ్యాతి కలిగినగాని పురుషుడు ముక్తుడు కాజాలడని భావము.

సమస్త జగత్తునకు మూలకారణమైన ప్రకృతి తన యందు లీనమయిన వ్యక్తికి మరల ఉత్థానము కలుగునట్లు చేయు నన :-

"అకార్యత్వేఽపి తద్యోగః పారవశ్యాత్" 3.55

అకార్యత్వేఽపి = సర్వమునకు ప్రకృతి మూలకారణమైనను, పారవస్యాత్ = పరవశముగుటవలన, తద్యోగః = పునరుత్థానయోగము పురుషునకు కలుగును.

ప్రకృతి యీశ్వరాధీనమై పరవశమగుట వలన నది తనయందు లీనమయిన పురుషునకు మరల ఉత్థానయోగము కలుగునట్లు ప్రవర్తించునని భావము.

ప్రకృతి పరవశవర్తిని యెట్లయిన దన :-

"స హి సర్వవిత్ సర్వకర్తా" 3.56

స హి = ఆ పరమేశ్వరుడు , సర్వవిత్ = సర్వజ్ఞుడు, సర్వకర్తా = సర్వ జగత్తునకు తండ్రి వంటివాడు.

ఈశ్వరుడు సర్వజ్ఞుడు, సర్వకర్తయు కాబట్టి ప్రకృతి యతని వశమున నుండి ప్రవర్తించునని భావము.

అట్టి యీశ్వరు డెట్లు సిద్ధింపగల దన :-

"ఈదృ శేశ్వరసిద్ధిః సిద్ధా" 3.57

సర్వజ్ఞాది గుణములు గల యీశ్వరుడు శ్రుతుల వలన సిద్ధించును.

**"స విశ్వకృ ద్విశ్వవిదాత్మయోనిః జ్ఞః కాలకాలో గుణీ సర్వవిద్యః ।**
**ప్రధాన క్షేత్రజ్ఞపతి ర్గుణేశః సంసార మోక్ష స్థితి బంధ హేతుః" ॥**

(శ్వేతాశ్వ 6.16)

'అతడు విశ్వకృత్తు, విశ్వవిదుడు, స్వయంభువు, కాలమునకు కాలుడు. గుణి, సర్వవిద్యలు కలవాడు. ప్రకృతికి, జీవులకు పతి. గుణముల కీశుడు. సంసారముయొక్క మోక్షస్థితి బంధములకు హేతువు.

ప్రకృతిసృష్టి తనకొఱకు గాక పురుషుని కొఱకెట్లగు? నన :-

"ప్రధానసృష్టి పరార్థం స్వతోఽప్య
భోక్తృత్వా దుష్ట్రకుంకుమ వహనవత్" 3.58

స్వతః అభోక్తృత్వాత్ = స్వయముగ భోక్త కానందున. ఉష్ట్ర కుంకుమవహనవత్ = ఒంటెయితరుల కొఱకు కుంకుమమును మోయునట్లు, పరార్థం అపి = ఇతరుల కొఱకే, ప్రధానసృష్టిః = ప్రకృతి సృష్టించుచున్నదని యర్థము.

అయినను చేతనము లేని ప్రకృతి, యీశ్వర వశమున నుండి

యెట్లు పరులకొఱకు ప్రవర్తించుచున్న దన :-

**"అచేతనత్వేఽపి క్షీరవచ్చేష్టితం ప్రధానస్య"** 3.59

ప్రధానస్య అచేతనత్వేఽపి = ప్రకృతి చేతనము లేనిదై నప్పటికిని, క్షీరవత్ = క్షీరమువలె, చేష్టితం = పురుషుల కొఱకు జగత్తును సృష్టించును.

పాలు చేతనరహితము లయ్యు దూడకొఱకు ప్రవర్తించునట్లు ప్రకృతి చేతనము లేనిదైనను పురుషుల కొఱకు జగత్తును రచించుచున్నదని భావము.

**"కర్మవద్ దృష్టేర్వా కాలాదేః"** 3.60

మఱియు, కాలాదేః కర్మవద్వా = వసంతాది ఋతువులు చేతన రహితము లయ్యు నొకదాని తరువాత మఱియొకటి ప్రవర్తించుచున్నట్లు , దృష్టేః = చూచు చున్నందున ప్రకృతి చైతన్య రహితమయ్యు పురుషునకై ప్రవర్తించు చున్నట్లు తెలిసికొనవలయునని భావము.

ప్రకృతిలో చైతన్యము లేనందున నయ్యది 'నాకిది కర్తవ్యము' అని యెఱుగజాలదు. కాబట్టి పురుషునికొఱకది యెట్లు ప్రవర్తించు నన :-

**"స్వభావాచ్చేష్టిత మనభి సంధానాత్ భృత్యవత్"** 3.61

భృత్యవత్ = సేవకునివలె, ప్రకృతి, స్వభావాచ్చేష్టితమ్ = సహజముగానే ప్రవర్తించును. అనభిసంధానాత్ = 'నాకిది కర్తవ్యము' అని యుద్దేశించి ప్రవర్తింపదు.

**"కర్మాకృష్టే ర్వానాదితః"** 3.62

సృష్టి యనాది. కర్మములు ననాదులు. వాని యాకర్షణము ననాది. కాబట్టి యనాది కర్మల యాకర్షణమున ప్రకృతి చేష్టించుచున్నదని భావము.

స్వభావముచేతనో లేక కర్మల యాకర్షణము చేతనో ప్రకృతి ప్రవర్తించునెడల యెల్లప్పుడును సృష్టి జరుగుచునే యుండవలయును. దానికి నివృత్తి యుండరాదుగదా? యన :-

**"వివిక్తబోధాత్ సృష్టినివృత్తిః ప్రధానస్య సూదవత్ పాకే"** 3.63

వివిక్తబోధాత్ = పురుషునకు సత్త్వ పురుషాన్యతాఖ్యాతి కలిగిన తదుపరి, ప్రధానస్య = ప్రకృతి యొక్క సృష్టినివృత్తిః = సృజించు

క్రియ నివృత్తిచెందును. సూదవత్పాకే = పాకము సిద్ధించినమీదట, పాచకుని పాకక్రియ ముగియునట్లు.

పాకము సిద్ధించిన తుదుపరి పాచకుడు తన వ్యాపారమును మానునట్లు, పురుషునకు వివేకఖ్యాతి కలిగిన మీదట ప్రకృతి యతని కొఱకు ప్రవర్తింపదు, సృష్టి నొనరింపదని భావము. ప్రకృతి యనునది యొక్కటియే కాబట్టి వివేకి పురుషునకై ప్రవర్తింపకున్నచో నవివేకికిని సృష్టి యుండనేరదు కాదా? యన :-

**"ఇతర ఇతరవత్ తద్దోషాత్"** 3.64

తద్దోషాత్ = ప్రకృతిదోషము వలన, ఇతర = వివేకము కలుగనివాడు, ఇతరవత్ = వివేకము లేనివానివలె నుండును. కాబట్టి యతని కొఱకు ప్రకృతి ప్రవర్తించుండునని భావము.

వివేకజ్ఞానము వలన సృష్టి నివృత్తి కలుగుచో, నయ్యదియే మోక్ష మగునుకదా? యన :-

**"ద్వయోః రేకతరస్య వౌదాసీన్య మపవర్గః"** 3.65

వివేకజ్ఞానము వలన, ద్వయోః = ప్రకృతి పురుషులలో, ఏక తరస్య = ఒకడయిన పురుషుని ఔదాసీన్యం = ఉదాసీనత = ఒంటరి తనము = పరస్పర సంగభావము లేకుండుట. అపవర్గః = మోక్షము.

వివేకజ్ఞానము కలిగిన మీదట ప్రకృతి పురుషులలో ఉదాసీనతను వహించుటయే మోక్షమని భావము.

వివేకియైన పురుషుని కొఱకు ప్రకృతి ఉదాసీనత వహించినపుడు అవివేకి యెడల మాత్ర మా యౌదాసీన్య ముండదా? యన:-

**"అన్యసృష్ట్యుపరాగేఽపిన విరజ్యతే**
**ప్రబుద్ధ రజ్జుతత్త్వస్యే వోరగః"** 3.66

ప్రబుద్ధరజ్జు తత్త్వస్య ఉరగ ఇవ = 'ఇది త్రాడే కాని సర్పము కాదు' అని తెలిసిన వానికి మాత్రము భయ కంపాదులు పోవును. అట్లు తెలియని వానికి భ్రమవలన కలుగు భయాదు లట్లే యుండును. అదే విధముగ, అపి = వివేకి విషయమున నుదాసీనత వహించినను, అన్యసృష్ట్యుపరాగే = అవివేకి విషయమున సృష్టించుటలో, న విరజ్యతే = ప్రకృతి విరక్తిని జెందదు.

"కర్మ నిమిత్త యోగాచ్చ" 3.67

మఱియు, ప్రకృతియందు కర్మయనెడి నిమిత్త ముండుట చేతను అవివేకి విషయమున ప్రవర్తించుచునే యుండును.

ప్రత్యుపకారము నపేక్షింపని ప్రకృతి పురుషుల కుపకరించుటకు గలకారణ మేమన :-

నైరపేక్ష్యేఽపి ప్రకృత్యుపకారేఽవివేకో నిమిత్తమ్" 3.68

నైరపేక్ష్యేఽపి = ప్రత్యుపకారాపేక్ష లేకున్నను, ప్రకృత్యుపకారే = పురుషులకు భోగాప వర్గము లనెడి యుపకారము కలిగించుటలో, నిమిత్తం = కారణము, అవివేకః = అవివేకమే.

ప్రవృత్తి స్వభావము గలిగిన ప్రకృతి వివేకము కలిగిన తదుపరి యేల ప్రవర్తింపదు? అన :-

"నర్తకీ వత్ ప్రవృత్తస్యాపి నివృత్తి శ్చారితార్థ్యాత్" 3.69

ప్రవృత్తస్యాఽపి = స్వభావముచే ప్రవృత్తి గలదైనను ప్రకృతి, నర్తకీవత్ = నర్తకివలె చారితార్థ్యాత్ = చేయవలసిన పని పూర్తి యైనందున, నివృత్తిః = మరల ప్రవర్తింపదు.

సభాసదులను రంజింపజేయ బూనిన నర్తకి తన కార్యము పూర్తియైన తదుపరి నాట్యమును ముగించును. అట్లే ప్రకృతియు పురుషునకు వివేకము కలిగినమీదట ప్రవర్తింపదని భావము.

"దోష బోధేఽపి నోపసర్పణం ప్రధానస్య కులవధూవత్" 3.70

అపి = మఱియు, దోషబోధే = పరిణామము నొందుట, దుః ఖము కలిగించుట మున్నగునవి ప్రకృతి దోషములు. అట్టి దోషములు. తెలిసిన మీదట, కులవధూవత్ = కులీనస్త్రీ వలె, ప్రధానస్య = ప్రకృతి, నోపసర్పణం = ప్రవర్తింపదు.

తన దోషముల నెరిగినందున లజ్జించు కులస్త్రీ భర్త సమీపమునకు జేరనట్లు ప్రకృతి దోషముల నెఱిగిన పురుషుని విషయమున నది ప్రవర్తింపదని భావము.

ప్రకృతియొక్క ప్రవృత్త్యప్రవృత్తుల వలన పురుషునకు బంధమోక్షములు కలుగు పక్షమున పరుషుడు పరిణామి కాడా? యన :-

"నైకాంతతో బంధ మోక్షౌ పురుష స్యావివేకాదృతే" 3.71

అవివేకాదృతే = అవివేకము లేక, ఏకాంతతః = యథార్థముగ, బంధమోక్షౌ = బంధమోక్షములు న = లేవు.

పురుషునకు బంధమోక్షములు అతని యవివేకము వలన కలుగును కాని ప్రకృతియొక్క ప్రవృత్త్యప్రవృత్తుల వలన కాదని భావము.

యథార్థ బంధమోక్షములు పురుషునకు లేకున్న మరి యెవరి కవి గలవన :-

**"ప్రకృతే రాంజస్యాత్ ససంగత్వా త్పశువత్"** 3.72

ప్రకృతే రాంజస్యాత్ = యదార్థబంధ మోక్షములు ప్రకృతికే, ససంగత్వాత్ = బంధమోక్షములకు కారణమైన ధర్మాధర్మములతో సంబంధము సంగమనబడును. అట్టి సంగము ప్రకృతి కున్నందున దానికే బంధమోక్షములు, పశువత్ = బంధించుట కనువగు త్రాటితో సంబంధము పశువున కున్నందున నది బంధింపబడును. అట్లే ప్రకృతియు నని భావము.

ప్రకృతియెన్ని గుణములచే తనకు బంధ మోక్షము లను కలిగించుకొను నన :-

**"రూపైః సప్తభి రాత్మానం బధ్నాతి ప్రధానం**
**కోశ కారవత్ విమోచయ త్యేకరూపేణ"** 3.73

కోశకారవత్ = తన గూడును తాను నిర్మించి యందు బంధింపబడు గొంగలిపురుగువలె, ప్రధానం = ప్రకృతి, సప్తభిః రూపైః = ధర్మము, వైరాగ్యము, ఐశ్వర్యము, అధర్మము, అజ్ఞానము, అవైరాగ్యము, అనైశ్వర్యము నను సప్త గుణములద్వారా, ఆత్మానం = తనను, బధ్నాతి = బంధించుకొనును, ఏకరూపేణ = వివేకమనెడి యొక్క గుణము ద్వారా, విమోచయతి = విడిపించుకొనును.

**"నిమిత్తత్వ మవివేకస్యేతి నదృష్టహానిః"** 3.74

పురుష బంధమునకు, అవివేకస్య = అవివేకము, నిమిత్తత్వమ్ = నిమిత్త కారణమే, ఇతి = అందువలన , నదృష్టహానిః = లోకమున గుణములు నిమిత్తములుగా చూచుట విరుద్ధము కాదు.

అవివేకమువలన బంధమేర్పడునని చెప్పుటవలన నవివేకము ఉపాదాన కారణమని బోధపడును. అవివేకము గుణమగుటచే నయ్యది యుపాదానము కాదు. అందువలన లోక విరోధము కలుగవచ్చును.

కాబట్టి యివివేకము బంధమునకు నిమిత్త కారణమని సూత్రకారుడు వివరించినాడు.

ఈ సూత్రము నందలి (ఇతి) పదము కొన్ని గ్రంథములలో కానరాదు. అవివేకమును తొలగించు వివేక మెట్లు సిద్ధించునన :-

**తత్త్వాభ్యాసాత్ నేతి నేతీతి త్యాగాత్ వివేకసిద్ధిః** 3.75

నేతి నేతీతి త్యాగాత్ = (పంచ మహా భూతములు మొదలు ప్రకృతివరకు గల తత్త్వములలో నొక్కొక్క దానిని) ఇది యాత్మ కాదు, ఇది యాత్మ కాదు, అని విడిచిపెట్టుట వలనను, తత్త్వాభ్యాసాత్ = ఆత్మతత్త్వమును నిరంతరము దీర్ఘకాలము శ్రద్ధతో చింతన జేయుట వలనను, వివేకసిద్ధిః = సమస్త సంశయములు పోయి యాత్మ సాక్షాత్కారమనెడి వివేకము సిద్ధించును.

తత్త్వాభ్యాసము వలన వివేకము కలుగుచో నొకే జన్మ యందభ్యాసకుల కెల్లరకు మోక్షము సిద్ధించునా? యన -

**"అధికారి భేదా న్ననియమః** 3.76

అధికారిభేదాత్ = అభ్యాసకులలో గల ఉత్తమ మధ్యమాది భేదములవలన , న నియమః = ఒకే జన్మయం దెల్లరు ముక్తులగుదురను నియమము సంభవింపదు.

వివేకము కలిగినపుడు అవివేకము పోయి దానితోబాటు దుఃఖము లన్నియు నశించును. అట్టియెడ వివేకికి భోగము(సుఖ దుఃఖానుభూతి) కలుగునా? యున :-

**"బాధితానువృత్త్యా మధ్యవివేకతోఽ ప్యుపభోగః"** 3.77

మధ్య వివేకతః = మధ్య వివేకము వలన, బాధితాను వృత్త్యా = తొలగిన దుఃఖములు ప్రారబ్ధ బలమున మరల కలుగు చుండును. కాబట్టి, ఉపభోగోఽ పి = ఉపభోగముకూడా సంభవించును.

మంద మధ్యమ ఉత్తమ భేదములతో వివేకము ముప్విధములు. అందు మధ్యవివేకము కలిగినవారికి దుఃఖోప భోగముండక పోదని భావము.

వివేకము కలిగిన తుదుపరి యుపభోగముండు పక్షమున వివేక ప్రయోజన మేమన :-

**"జీవన్ముక్తశ్చ"** 3.78

ప్రారబ్ధము నశింపకముందు, వివేకము వలన తొలగింపబడిన దుఃఖములు మరలమరల కలుగుచుండినను వివేక ప్రభావము వలన జీవించియుండగానే ముక్తునివలెనుండునని భావము. దుఃఖాదుల ననుభవించు వ్యక్తులలో కొండొకడు జీవన్ముక్తుడనుడెట్లు పొసగు నన :-

"ఉపదేశ్యోపదేష్టృత్వాత్ తత్సిద్ధిః" 3.79

ఉపదేశ్యోపదేష్టృభావము లోకమున జూచు చున్నాము. అందువలన జీవన్ముక్తు డుండుటలో నాశ్చర్యము లేదు. ఉత్తమ వివేకి ముక్తుడగును. మధ్య వివేకి యుపదేశింపనర్హుడగును. మందవివేకి యుపదేశమును గ్రహింప నర్హుడు. ఇట్లు మధ్య వివేకి జీవన్ముక్తు డనుటలో దోషముండదని భావము.

"శ్రుతిశ్చ" 3.80

("తస్యతావదేవచిరమ్...." ఛాం. 6.14.2 ) ఇట్టి శ్రుతి వాక్యములు జీవన్ముక్తులుందురనుటకు ప్రమాణము.

"ఇతరథాఽంధ పరంపరా" 3.81

జీవన్ముక్తులు లోకమున నుండని పక్షమన ఉపదేశమనునది లేక 'గురువు అంధుడు శిష్యుడు నంధుడే' అని యంధపరంపర యేర్పడు నని భావము.

వివేకము కలిగిన మీదట ప్రకృతి యతని నుండి విరమించును గాదా! అట్టియెడ జీవన్ముక్తుడెట్లుండగలడన :-

"చక్రభ్రమణ వద్ధృత శరీరః" 3.82

కుమ్మరి దండముతో చక్రమును ద్రిప్పి దండమును తొలగించును. దండము తొలగించినను చక్రము తిరుగు చుండును. అట్లే వివేకము కలిగినమీదట ప్రకృతి నివర్తించి ననుప్రారబ్ధ కర్మబలమున శరీరము కొంతకాలము నిలిచి యుండును. కాబట్టి జీవన్ముక్తి కలుగుటలో దోషమావంతయు లేదని భావము.

"సంస్కారలేశ తస్తత్సిద్ధిః" 3.83

శరీరధారణకు కారణములైన సంస్కారములు లేశములుగా నున్నంతవరకు శరీరధారణ యుండును. అంతవరకు జీవన్ముక్తుడనబడునని భావము.

వివేకాన్నిః శేష దుఃఖ నివృత్తౌ
కృతకృత్యో నేతరా న్నేతరాత్" 3.84

ఉత్తమ వివేకమువలన సమస్త దుఃఖములు తొలగగా కృతకృత్యుడు - ముక్తుడగును. ఇతరము లయిన కర్మాదుల వలన ముక్తుడు కాడని భావము.

నిఖిల శాస్త్ర నిష్ణాత శ్రీమత్పండితముక్తి రామోపాధ్యాయశిష్య గోపదేవ విరచి తాంబావ్యాఖ్యానము తృతీయాధ్యాయము.

# చతుర్ధాధ్యాయము

దుఃఖములు నిఃశేషముగా తొలగించు వివేక మెట్లు కలుగు నన:-

"రాజపుత్రవత్ తత్త్వోపదేశాత్" 4.1

తత్త్వోపదేశాత్ = ఆత్మ తత్త్వము నుపదేశించుట వలన, రాజపుత్రవత్ = రాజపుత్రునకు వలె, వివేకము కలుగును.

ఒకానొక రాజపుత్రుడు పరులచే బెంచబడి తాను రాజకుమారుడని యెఱుగజాలకుండును. కాలాంతరమున నతని బంధువులు 'నీవు రాజకుమారుడవు' అని చెప్పగా తన్నుదాను తెలిసికొని నాటినుండియు రాజపుత్రుడుగా వర్తింపగలుగును. అట్లే యవివేకము వలన ప్రకృతి కార్యములు తనవిగా భావించువానికి ఆత్మ తత్త్వమును గురువుపదేశించినపుడు వివేకము కలుగ గలదని భావము.

గురు వెవరి కుపదేశించునో వానికే వివేకము కలుగునా? సమీపమున నుండి వినువారికిని కలుగునా? యన :-

"పిశాచవత్ అన్యార్థోపదేశేఽపి" 4.2

అన్యార్థోపదేశేఽపి = గురువు శిష్యుని కొఱకై యుపదేశించి నను సమీపమున నుండి వినువారికిని వివేకము కలుగవచ్చును. పార్వతికి శివుడు తత్త్వోపదేశము చేయుచుండగ్గా సమీపముననుండి వినిన పిశాచమునకును వివేకము కలిగినట్లు పౌరాణిక గాథ నిందుల కుదాహరణముగ నుల్లేఖించినాడు. (శివ పార్వతులకు పిశాచము భృత్యుడు కానోపు)

ఒకసారి తత్త్వోపదేశము చేసినందున వివేకము కలుగునపు డేమి చేయవలయును?

"ఆవృత్తి రసకృ దుపదేశాత్" 4.3

అసకృదుపదేశాత్ = పలుమారు లుపదేశించుట వలన, ఆవృత్తిః = ఆవృత్తి చేయవలయును.

ఒకసారి యుపదేశించిన వివేకము కలుగనపుడు పలుమారు లుపదేశింపవలయును. పుత్రుడైన శ్వేత కేతువునకు ఆరుణిపలుమారులు తత్త్వోపదేశము చేసినట్లు ఛాందోగ్యోపనిషత్తులో చూడగలము.

తండ్రి పుత్రున కనేక పర్యాయము లుపదేశింపవచ్చును, కాని, గురువు శిష్యునకు పలుమారు లెట్లుపదేశింపగలడు?

**"పితాపుత్రవ దుభయోర్ దృష్టత్వాత్"** 4.4

దృష్టత్వాత్ = లోకమునందు జూచుచున్నాము; కావున ఉభయోః = *గురుశిష్యులకు*, *పిత్రాపుత్రవత్* = *తండ్రి కొడుకులకు వలె ఉపదేశము పలుమారులు కలుగుట సంభవమే.*

తండ్రి కొడుకున కనేక పర్యాయము లుపదేశించునట్లు గరువు శిష్యునకు పలుమారు లుపదేశించుట లోకమున జూచుచునే యున్నాము. ఇందు సంభవముకాని దేమియు లేదని భావము.

వివేకము కలిగినమీదట దానిని స్థిరపరచు కొనుట కేమి చేయవలయును?

**"శ్యేనవత్ సుఖదుఃఖీ త్యాగవియోగాభ్యామ్"** 4.5

*శ్యేనవత్ = దేగవలె, త్యాగవియోగాభ్యామ్ = త్యాగవియోగము లచే, సుఖదుఃఖీ = సుఖియు, దుఃఖియు నగును.*

విషయములను (శబ్దాదులను) త్యజించుట వలన పురుషుని వివేకము స్థిరమగును. అతడు సుఖి యగును. డేగ స్వయముగ మాంసమును విడిచినచో సుఖపడును. పరులు దాని నోటి నుండి మాంసమును విడిపింపజేసిన నయ్యది బాధపడును. అట్లే పురుషుడును స్వయముగ శబ్ద స్పర్శాది విషయములను పరత్యజించి సుఖియగును. ఇతరు లతనికి విషయముల నందకుండ జేసిన దుఃఖి యగును. కాబట్టి త్యాగము వివేకమును స్థిరపరచునని భావము.

స్వయముగ విషయములను త్యజించు టెట్లు?

**"అహినిర్ల్వయనివత్"** 4.6

పాము కుబుసమును విడుచునట్లు వివేకియైన పురుషుడు విషయ భోగములను విడిచి సుఖించును.

**"ఛిన్నహస్తవద్ వా"** 4.7

ఒకానొకడు హస్తమున వ్రణము లేర్పడినపుడు తన హస్తమే తనకు బాధకరమని తెలిసికొని దానిని ఖండింప జేసికొనును. అపుడా బాధనుండి విముక్తి నొంది సుఖించును. అట్లే వివేకి విషయములను స్వయముగ త్యజించునని భావము.

విషయములను పరిత్యజించి వానిని మనస్సుతో ధ్యానించుట వలన నేమి దోషము?

"అసాధనాను చింతనం బంధాయ భరతవత్" 4.8

భరతవత్ = భరతుడొక రాజర్షి, అతడొక లేడి పిల్లను పెంచెను. అదియతనికి బంధహేతువైనది. అట్లే, అసాధనాను చింతనం = వివేకమునకు సాధనములు కాని విషయములను ధ్యానించు చుండుట, బంధాయ = బంధమునకు కారణ మగును.

విషయ చింతనము చేయకున్నను, అనేకుల సాంగత్యము వలన దోష మేమైన కలదా?

"బహుభిర్యోగే విరోధో రాగాధిభిః కుమారీశంఖవత్" 4.9

బహుభిర్యోగే = భిన్న స్వభావులగు ననేకులతో సాంగత్యము చేసినందున, రాగాధిభిః = రాగద్వేషాదులద్వారా, విరోధః = విరోధము = కలహము కలుగును. కుమారీశంఖవత్ = బాలికలు తమ చేతులకు గజ్జెలు కట్టుకొందురు = అని పరస్పరము కొట్టుకొనినపుడు ధ్వని కలుగును.

బాలికలు చేతికి కట్టుకొను గజ్జెలు పరస్పరము కొట్టు కొని మ్రోయునట్లు, పరస్పరము విరుద్ధ స్వభావముగల వ్యక్తు లొకచో చేరినపుడు రాగద్వేషాదులు కలిగి కలహ మేర్పడును. కాబట్టి వివేకికి విరుద్ధ స్వభావము గలవారి సాంగత్యమును చేయుట తగదు.

"ద్వాభ్యామపి తథైవ" 4.10

అనేకుల సాంగత్యమెట్లు దోషజనకమో యట్లే యిరువురితోను సాంగత్యముచేయుట తగదని సూత్రాభిప్రాయము.

"నిరాశః సుఖీ పింగలావత్" 4.11

పింగల యను పేరుగల కొండొక వేశ్య కాంతుని కొఱకు ఆశ కలిగియున్నంత వరకు దుఃఖపడి యనంతర మా యాశను విడిచి సుఖపడినదట. అట్లే వివేకి యన్ని కోరికలను విడిచి సుఖియగును.

పరుల సంబంధమును విడిచి యేకాకిగా నుండి వ్యక్తి తన నివాసమున కవసరమగు గృహాదుల నైన నిర్మించుకొన జాలడు గదా? అతడు సుఖి యెట్లు కాగలడు?

"అనారంభేఽపి పరగృహే సుఖీ సర్పవత్" 4.12

సర్పము పిపీలికలు నిర్మించిన పుట్టలో నివసించి సుఖించును. తాను స్వయముగ నివాసము నేర్పరచుకొనదు. అట్లే యేకాకియైన వివేకి తన కొఱకు గృహాదుల నిర్మించుకొనలేకపోయినను, పరులచే నిర్మింపబడిన స్థానములలో వీలయిన తావున నుండి సుఖింపగలడని భావము.

"బహుశాస్త్ర గురూపాసనేఽపి సారాదానం షట్పదవత్" 4.13

మఱియు, తుమ్మెద పువ్వులలోని సారమును గ్రహించునట్లు వివేకి గురువుల ననేకుల నుపాసించి, బహుశాస్త్రముల నభ్యసించి వివేకమును గలిగించు సారవిషయములను గ్రహింపవలయును.

సారమును గ్రహించు వివేకికి జనాకులమగు సంసారమున సమాధి హాని కలుగదా?

"ఇషుకార వన్నైక చిత్తస్య సమాధి హానిః" 4.14

బాణము నెక్కువెట్టి లక్ష్యమును భేదింప నుంకించు వ్యక్తి కిరుపార్శ్వముల నేమి జరుగుచుండునదియు తెలియదు, అట్లే యేకాగ్రచిత్తుడైన వివేకికి సంసారమునం దున్నను సమాధి హాని కలుగదు.

ఏక చిత్తుడైన వివేకి ప్రమాదవశమున శాస్త్ర నియమముల నుల్లంఘించిన నేమగును?

"కృతనియమ లంఘునాదానర్థక్యం లోకవత్" 4.15

లోకవత్ = లోకమున రోగి శాస్త్రమున జెప్పబడిన పథ్యపానముల నుల్లంఘించి హానిని పొందునట్లు కృతనియమ లంఘనాత్ = శాస్త్ర నియమముల నుల్లంఘించినందున, చిత్తసమాధానము కొఱకు యత్నించు వివేకికి సైతము, అనర్థక్యం = హానియే కలుగును. కాబట్టి శాస్త్రనియములను దాటుట శ్రేయస్సుకాదు.

నియమముల నెఱిగి యుల్లంఘించిన హాని కలుగును. విస్మరించి నియమోల్లంఘనము చేసిన నేమగును?

"తద్విస్మరణేఽపి భేకీవత్" 4.16

భేకి యను నామము గల యొక రాజకన్య వివాహ సమయమున తన భర్తతో 'నీవు నన్ను విడిచి యెక్కడికిని వెళ్ళవద్దు. అట్లు వెళ్ళిన నీకు నా వియోగము కలుగును.' అని నియమ మొనర్చుకొనెను. ఒకనాడామెభర్త యా నియమమును విస్మరించి యొంటరిగ బయటికి వెళ్లెను. అందువలన నా భేకి యతనిని త్యజించినది. అట్లే

శాస్త్రనియమమును విస్మరించి దాని నుల్లంఘించినను వివేకికి హాని కలుగక తప్పదు.

వివేకము కలిగినవాడు పైనజెప్పినట్లు మెలగవలయును. కాని వివేకము కొఱకు గురూపదేశ శ్రవణ మొనర్చువాడు చేయవలసిన దేమి?

**"నోపదేశశ్రవణేఽపి కృతకృత్యతా,**
**పరామర్శాదృతే విరోచనవత్"** 4.17

*విరోచనవత్ = విరోచనునివలె, పరామార్శాదృతే = పరామర్శ లేక, ఉపదేశ శ్రవణేఽపి = గురుముఖమున నుపదేశమును వినినప్పటికిని, న కృతకృత్యతా = కృతార్థత కలుగదు.*

గురువు చెప్పిన వాక్య తాత్పర్యమును నిర్ణయించుట కొఱకు చేయు విచారము (ఆలోచన) పరామర్శ మనబడును. ఉపదేశ శ్రవణము తురువాత నట్టి పరామర్శము చేయవలయు నని భావము.

విరోచనుడు ఉపదేశ శ్రవణానంతరము పరామర్శ చేయనందున నతనికి కృతార్థత కలుగలేదు.

శ్రవణానంతరము పరామర్శ చేసినదెవరు?

**"దృష్టస్తయో రింద్రస్య"** 4.18

వివేకజ్ఞానము సంపాదించు నిమిత్త మింద్ర విరోచనులు గురువైన ప్రజాపతిని జేరి యుపదేశమును పొందిరి. కాని వారిలో ఇంద్రుడు మాత్రము పరామర్శము జేసి కృతార్థు డైనట్లు ఉపనిషత్తులో చూడబడుచున్నది.

శ్రవణానంతరము పరామర్శము చేయగానే వివేక ముదయించునా?

**"ప్రణతి బ్రహ్మచర్యోప సర్పణాని కృత్వా**
**సిద్ధిర్బహు కాలాత్ తద్వత్"** 4.19

*తద్వత్ = ఇంద్రునివలె ప్రణతి..సర్పణాని = ప్రణత్యాదులను కృత్వా = చేసి, బహు కాలాత్ = బహుకాలానంతరమున. సిద్ధిః = సిద్ధి.*

వినమ్ర భావము ప్రణతి యనబడును. ఇంద్రియముల నన్నింటిని నియమించుట బ్రహ్మచర్యము. శ్రద్ధాభక్తులతో గురువును సమీపించుట యుపసర్పణము. ఇవి యన్నియు నియమ పూర్వకముగ నాచరించి

దీర్ఘకాలానంతరమున శ్రవణ పరామర్శముల ద్వారా వివేకము సంపాదింపనగును. ఇంద్రు డిట్లే వివేకము సంపాదించినాడు.

ఎల్లరికి నిట్లే దీర్ఘ కాల నియమముండునా?:-

**"న కాలనియమో వామ దేవవత్"** 4.20

వామ దేవవత్ = వామదేవునికివలె, కాలనియమః = 'వివేకము సిద్ధించుట కింత కాలము కావలయును' అను నియమము, న = లేదు.

వామదేవుడు పూర్వజన్మ సంస్కార సహకారము వలన నీ జన్మమునందు విశేషసాధనము లభింపకున్నను త్వరలో వివేక సిద్ధిని పొందెను. కాబట్టి 'వివేకము కలుగుట కింత కాలము పట్టును' అని సమయ నియమము జేయుటకు వీలు లేదు. కొందఱకు శీఘ్రముగాను, మరికొందఱకు బహుకాలమునకు వివేకము లభింపవచ్చును.

ప్రణత్యాదుల నొనర్చు వారికి గురూపదేశము వలన తత్త్వోపదేశము కలుగునపుడు బహు కాలాపేక్ష యెందులకు?

**"అధ్యస్త రూపోపాసనాత్ పారంపర్యేణ**
**యజ్ఞోపాసనకానామివ"** 4.21

*యజ్ఞోపాసకా నామివ* = *యజ్ఞాదుల నాచరించువారికి వలె, అధ్యస్త రూపోపాసనాత్* = *గురువుచే నుపదేశింపబడిన దానిని శ్రద్ధా భక్తులతో ననుష్ఠించినందున, పారంపర్యేణ* = *సక్రమముగా వివేకము సిద్ధించునని యర్థము.*

ముందుగా నమ్రభావము సంపాదింపవలెను. దానితో పాటు బ్రహ్మచర్యాదుల నభ్యసింపవలయును అటుపై గురువుల సమీపమున జేరి తత్త్వోపదేశమును శ్రవణ మొనర్పవలయును. అనంతర మా శ్రవణముద్వారా తెలిసికొనిన దానిని చక్కగా మననము చేయవలయును. పిదప నిది ధ్యాసనము (ధ్యానము) చేయవలయును. ఆ ధ్యానము పక్వమయిన తదుపరి సంప్రజ్ఞాతసమాధి లభించును. అటు తరువాత చిత్సాక్షాత్కారము (ఋతంభరాప్రజ్ఞ) కలుగును. చిట్టచివరకు సత్త్వపురుషాన్యతాఖ్యాతి (వివేకము) కలుగును. ఇదియే పరంపర. ఇట్లు వివేకము సిద్ధించుటకు బహుకాలము కావలసియుండును. క్షణకాలమున సిద్ధింపదని భావము. ఇట్లే యజ్ఞఫలమును కాలాంతరమున లభించును.

కాబట్టి యది యీ సూత్రమున నుదాహరింపబడినది.

అటులయిన నింత పరంపరాయాస సాధ్యమగు వివేక ప్రత్యయము కొఱకు యత్నించుటకంటె యజ్ఞాదుల నొనర్చి యూర్ధ్వగతిని సంపాదించుకొనుట శ్రేయస్కరము కాదా?

**"ఇతరలాభేఽ ప్యావృత్తిః పంచాగ్ని యోగతో జన్మశ్రుతే"** 4.22

ఇతరలాభేఽ పి = యజ్ఞాదులచే ఊర్ధ్వగతి లభించినను, ఆవృత్తిః = పునరావృత్తి కలుగును. కారణ మేమన :- పంచాగ్ని యోగతః = పంచాగ్నుల సంబంధముద్వారా, జన్మశ్రుతేః = జన్మము కలుగునని శ్రుతి చెప్పుచున్నది.

ఆకాశము, మేఘము, భూమి, పురుషుడు, స్త్రీ, అను నీ యైదును పంచాగ్ను లనబడును. జీవుడు వీని సంబంధముతో జన్మము నందుచుండును. యజ్ఞాదులవలన జీవుడు క్రమముగా నుత్తమ జన్మముల నందగలుగునేకాని, జన్మము నుండి విముక్తుడు కాజాలడు. కాబట్టి కష్టసాధ్యమైనను వివేక ప్రత్యయము మోక్ష సాధనము కాబట్టి యదియే శ్రేయస్కరమని భావము.

ఎట్టివారికి వివేక ప్రత్యయముద్వారా సంసార హానియు, మోక్షప్రాప్తియు లభింపగలదు?

**"విరక్తస్య హేయహాన ముపాదేయోపాదానం హంసక్షీరవత్"** 4.23

హంసక్షీరవత్ = నీరమిశ్రితమైన జలమును వేరుచేసి హంస క్షీరమును గ్రహించునట్లు, విరక్తస్య = విరక్తుడైన వ్యక్తికి, హేయ హానం = విడువదగిన సంసారహానియు, ఉపాదేయోపాదానం = గ్రహింపదగిన మోక్షప్రాప్తియు కలుగును.

హంస నీటిని విడిచి పాలను గ్రహించునట్లు ఐహికా ముష్మిక విషయములందు విరక్తుడైన వ్యక్తియే సంసారమును త్యజించి మోక్షమును పొందునని భావము.

విరక్తునకు మోక్షప్రాప్తికలుగును. అట్టియెడ సత్సాంగత్యమువలన ప్రయోజన మేమైన నుండునా?

**"లబ్ధాతిశయయోగాద్ వా తద్వత్"** 4.24

తద్వత్ = ఒక హంస మరియొక హంస సాంగత్యమువలన నీరక్షీరములను వేరుచేయగలుగునట్లు, లబ్ధాతిశయయోగాత్ = వివేక

పరాకాష్ఠను సంపాదించిన సత్పురుషుని సాంగత్యమువలన సంసారమును త్యజించి మోక్షప్రాప్తిని పొందవచ్చును.

రక్తుడైనవానికి హానోపాదేయములు ప్రాప్తించునా?

**"న కామచారిత్వం రాగోపహతే శుకవత్"** 4.25

శుకవత్ = చిలుకకువలె, రాగోపహతే = అనురాగ గుణముతో కూడినవానికి, కామచారిత్వం న = ఇష్టము వచ్చినట్లు సంచరించుటయే సంభవింపదు. కాబట్టి, హానోపాదేయములు బొత్తిగా లభింపనేరవని భావము.

రాగికి ఇష్ట సంచారత్వ ముండనేరదన నేమి?

**"గుణయోగాద్ బద్ధః శుకవత్"** 4.26

శుకవత్ = చిలుక మాటలు నేర్వగలదు. అట్టి గుణము దానియందుండుటచే నయ్యది పంజరమున బంధింపబడుచున్నది. అందువలన చిలుక తన యిష్టము వచ్చినట్లు సంచరింపజాలక పోవును. అట్లే గుణయోగాత్ = రాగాది గుణములతో యుక్తుడైనందున, బద్ధః = జన్మమరణాది రూప సంసారమున బద్ధుడగును. కాబట్టి మోక్షప్రాప్తి దుర్లభ మగునని భావము.

భోగముద్వారా రాగముపోయి వైరాగ్యము అను రక్తునకును కలుగునుకదా?

**"న భోగాద్ రాగశాంతి ర్మునివత్"** 4.27

మునివత్ = సౌభరి యను మునికి రాగశాంతి కలుగనట్లు, భోగాత్ = భోగముద్వారా, న రాగశాంతిః = రాగము శాంతింప నేరదు.

సౌభరి తన విషయమున నిట్లు వర్ణించియున్నాడు.

(ఆ మృత్యుతో నైవ మనోరథానామ్
అంతోఽస్తి విజ్ఞాత మిదం మయాద్య
మనోరథాసక్తి పరస్య చిత్తం
న జాయతే వై పరమార్థ సంగి.)

'మృత్యుపర్యంతము భోగించినను మనోరథములు శాంతింపవు. నేనిది యిపుడు తెలిసికొంటిని మనోరథము (కోరిక) లం దాసక్త చిత్తము పరమార్థము నంటదు. కాబట్టి భోగమువలన రాగము

శాంతించిననుట భావ్యము కాదు.

అటులయిన రాగశాంతి యెట్లు కలుగును?

**"దోషదర్శనా దుభయోః"** 4.28

ఉభయోః = ప్రకృతి , దాని కార్యములు, నను నీ రెంటియందలి, దోషదర్శనాత్ = దోషముల నెఱుగుటవలన రాగము శాంతించును.

ప్రకృతి, దాని కార్యములయిన మహత్తత్వాదులు నన్నియు నిత్యము పరిణామమును చెందుచుండుననియు, అయ్యవి దుఃఖాత్మకములనియు వానిలోగల దోషములను గుర్తించి నందువలన రాగగుణము నశించును; కాని భోగము వలన నశింపదని భావము.

ఉపదేశమువలన వివేకము సిద్ధించుచుండ ప్రకృతి, దాని కార్యములలోని దోషముల నెఱుగు టేల?

**"న మలినచేత న్యుపదేశ బీజప్రరోహో-జవత్"** 4.29

అజవత్ = అజునకువలె, మలినచేతసి = మలిన చిత్తమునందు, న ఉపదేశ బీజప్రరోహః = ఉపదేశ మనెడి బీజము అంకురింపదు.

భార్యా వియోగము వలన శోకించు నజునకు వసిష్ఠుని యుపదేశము కార్యకారి కాకపోయినది. అట్లే మలిన చిత్తునకు ఉపదేశము ఫలజనకము కాదు. అందువలన ప్రకృతి యొక్కయు, దాని కార్యముల యొక్కయు దోషముల నెఱిగి యందుండి విరక్తుడగుటయు నవసరమని భావము.

ఉపదేశము మలినచిత్తున కొకింతయైన నుపయోగింపదా?

**"నా భాసమాత్రమపి మలిన దర్పణవత్"** 4.30

మలినదర్పణవత్ = మలిన దర్పణమునం దొకింతయు ముఖబింబము కనిపింపనట్లు, న ఆభాస మాత్రమపి = మలినచిత్తునకు గురూపదేశ మొకింతయు నుపకరింపదు.

అయినను గురూపదేశమువలన జ్ఞానము కలుగును కాబట్టి యది వ్యర్థము కాదుగాదా?

**"న తజ్జస్యాపి తద్రూపతా పంకజవత్"** 4.31

పంకజవత్ = కమలమువలె, తజ్జస్యాపి = గురూపదేశమువలన, జనించినను జ్ఞానమునకు న తద్రూపతా = ఉపదేశమునకు తగిన రూప ముండదు.

బీజమునుండి యుత్పన్నమైన కమలము బురదతోకూడి యున్నందున బీజరూపమున నుండనట్లు, చిత్తమాలిన్యము తొలగనంతవరకు గురూపదేశమువలన జనించిన జ్ఞానము సైతము ఉపదేశమునకు తగినట్లు ఉండజాలదని భావము.

"న భూతియోగేఽపి కృతకృత్యతా
ఉపాస్య సిద్ధివదుపాస్య సిద్ధివత్" 4.32

ఉపాస్య సిద్ధివత్ = ఉపాసింపదగిన వివేకము సిద్ధించినందువలన నెట్లు కృతార్థత కలుగునో అట్లు, భూతియోగేఽపి = అణిమాది విభూతులు లభించినను న కృతకృత్యతా = కృతార్థత కలుగదు.

వివేకము సిద్ధించినందువలననే కృతార్థత కలుగును కాని, అణిమాది సిద్ధులు లభించిన మాత్రమున కృతార్థత కలుగనేరదని భావము.

'ఉపాస్య సిద్ధివత్' అను నీ పదము సూత్రమున రెండుమాట్లు వాడబడినది. అందొక పదము అధ్యాయ సమాప్తిని తెలుపును.

నిఖిలశాస్త్రనిష్ణాత శ్రీమత్పండితముక్తి రామోపాధ్యాయశిష్య గోపదేవ విరచితాంబా వ్యాఖ్యానమున

చతుర్థాధ్యాయము.

# పంచమాధ్యాయము

పూర్వపు నాలుగధ్యాయములందును స్వసిద్ధాంతము లను వివరించి యికముందు పరుల సిద్ధాంతములను నిరాక రించుట కీ యధ్యాయమును మహర్షి ప్రారంభించుచున్నాడు. వివేక ప్రత్యయమువలన దుఃఖము లన్నియు పోయి మోక్షము సిద్ధించు పక్షమున లౌకికములు, వైదికములు నైన శుభకర్మములు (మంగలాచరణములు) చేయనేల? యను శంకను ముందుగా తీర్చుచున్నాడు :-

**"మంగలాచరణం శిష్టాచారాత్ ఫలదర్శనా చ్ఛ్రుతితేశ్చేతి"** 5.1

మంగలాచరణం = శుభకర్మముల నాచరించుట, శిష్టాచారాత్ = శిష్టులాచరించినందున, ఫలదర్శనాత్ = ఆచరించిన కర్మములకు శుభ ఫలము లభించుటవలన, శ్రుతితశ్చ = మఱియు శ్రుతులయం దట్లా చరింపవలయు నని చెప్పియుండుటవలన.

స్వస్వధర్మములందు నిష్ఠగల పెద్ద లందఱు శుభకర్మమున నాచరించిరి. అట్లాచరించినవారికి నభ్యుదయమును కలిగినది. శ్రుతులలో (కుర్వన్నేవేహ కర్మాణి జిజీవిషేచ్ఛ తగ్ం సమాః) శుభకర్మమున నాచరించుచునే జీవింపగోరుమని భోధించియుండుట చేతను శుభకర్మములు (మంగలా చరణము) చేయవలసియున్నదని భావము. ఇట్టి శుభకర్మా చరణము వివేకజ్ఞానము కలిగించుట కుపయోగించును. కాబట్టి దోషము లేదు.

కర్మల నాచరించుట వలన ఫలము లభించుచున్నది. అట్టియెడ కర్మ ఫలముల నొసంగుట కొక యీశ్వరు నంగీకరించుట వ్యర్థము కాదా? యన :-

**"న. ఈశ్వరాధిష్ఠితే ఫలనిష్పత్తిః కర్మణా తత్సిద్ధేః"** 5.2

న = వ్యర్థము కాదు, కర్మణా = కర్మము హేతువుగా, తత్సిద్ధేః = ఫలము లభించుచున్నందున, ఈశ్వరాధిష్ఠితే = కర్మము ఈశ్వరాధిష్ఠిత మైనపుడే, ఫలనిష్పత్తిః = ఫలము లభించుచున్నది.

లోకమున కర్మకరులు చేయు పనుల కొక దధిష్ఠాతయై యుండి వారు చేయు పనులకు ఫలముల నొసంగును. అట్లే యీశ్వరుడు జీవులొనర్చు కర్మల కధిష్ఠాతయై ఫలముల నొసంగును. కాబట్టి యీశ్వరు

నంగీకరించుట వ్యర్థము కాదని భావము.

పరు లొనర్చు కర్మల కీశ్వరు డేల యధిష్ఠాతయగును?

"స్వోపకారా దధిష్ఠానం లోకవత్" 5.3

లోకవత్ = లోకమున కారుణికుడైన రాజు ప్రజలు చేయు పనుల కధిష్ఠాతగా నుండి ఫలము లొసంగు విధమున, స్వోపకారాత్ = స్వకీయులైన జీవుల కుపకారమొనర్చుటకై, అధిష్ఠానం = ఈశ్వరుడధిష్ఠాత యగుచున్నాడు.

స్వోపకార మన స్వకీయుల కుపకార మని చెప్పినట్లు తన కుపకారమనియు చెప్పవచ్చును. తన యుపకారము కొఱకీశ్వరుడు కర్మాధిష్ఠాత యగునందుమేని దోషమేమి?

"లౌకికేశ్వరవ దితరథా" 5.4

ఇతరథా = తన యుపకారముకొఱ కధిష్ఠాతయగు నెడల, లౌకికేశ్వరవత్ = లోకమునందు రాజులకు వలె నీశ్వరుడును కొఱంతలు గలవాడగును.

"పారిభాషికో వా" 5.5

కొఱంత లుండువాడు నీశ్వరుడని యంగీకరించిన నతడు సర్వ సమ్మతమైన ఈశ్వరుడు కాక కొండొకనిచే నంగీకరింప బడినవాడే యగును.

ఈశ్వరుడు కొఱంతలు లేనివాడు; అనగా కోరికలు లేనివాడు ఆప్తకాముడని భావము కాబట్టి దేనియందును రాగము లేనివాడగును. అట్టియెడ జీవుడొనరించు కర్మల కధిష్ఠాత యెట్లగుచున్నాడు?

"న రాగదృతే తత్సిద్ధిః ప్రతినియత కారణత్వాత్" 5.6

ప్రతినియత కారణత్వాత్ = రాగము లేనిది ప్రవృత్తి కలుగనేరదు కావున, రాగాదృతే = రాగము లేక యనగా కరుణ యనెడి రాగము లేక, న తత్సిద్ధిః = అధిష్ఠాతృత్వము సిద్ధింపదు.

ఇతరుల కామములను దీర్చు బుద్ధితో ననగా దయా భావముతో నీశ్వరుడు కర్మాధిష్ఠాత యగుచున్నాడని భావము.

అటులయినను నిత్యముక్తు డీశ్వరు డెట్లగును?

"తద్యోగేఽ పిన నిత్యముక్తః" 5.7

(ఇందు పై సూత్రమునుండి నకారము తీసికొనబడును,) తద్యోగేఽ

పి = కరుణతో సంబంధమున్నందునను, న న నిత్యముక్తః = ఈశ్వరుడు నిత్యముక్తుడు కాదనజనదు నిత్యముక్తుడే.

ఈశ్వరునందు అవిద్యాది క్లేశములకు చెందిన రాగముండదు; కాని స్వాభావికమైన కరుణ యుండును. అందువలన నతడు కర్మాధిష్ఠాత కాగలడు. అయినను కరుణ క్లేశములలో చేరదు. కాబట్టి యతని నిత్యముక్తత్వమునకు లోటు కలుగదని భావము.

జీవుడే యీశ్వరుడు కాగలడు. జీవునకు ప్రకృతి సంబంధము వలన నీశ్వరత్వ మేర్పడును అదియును స్వాభావికము గాదు. కాబట్టి జీవుడే యీశ్వరుడగు నన:-

"ప్రధానశక్తి యోగాచ్చేత్ సంగాపత్తిః" 5.8

ప్రధాన............చేత్ = ప్రకృతి సంబంధమువలన జీవున కీశ్వరత్వమేర్పడు నందుమనిన, సంగాపత్తిః = అప్పుడతడు నిస్సంగి, సంగరహితుడు కాజాలడు.

ప్రకృతి సంబంధము వలన జీవుడే యీశ్వరుడగునందు మేని యీశ్వరునందు నిస్సంగిత్వముండనేరదని భావము.

ప్రకృతి సత్తామాత్రమున జీవు డీశ్వరుడగునందు మేని:-

"సత్తామాత్రాచ్చేత్ సర్వైశ్వర్యమ్" 5.9

ప్రకృతితటస్థముగా నుండుట యీ సూత్రమున 'సత్తా' యనబడినది, సత్తామాత్రాచ్చేత్ = ప్రకృతితో సంబంధము లేకయే దాని యునికి మాత్రముననే జీవుడీశ్వరు డగునందుమేని, సర్వైశ్వర్యమ్ = జీవులెల్లరు నీశ్వరులు కావలసియుందురు. కాబట్టి యదియు పొసగదని సూత్రార్థము.

ప్రకృతి యునికి జీవుల కందఱకు సమానమగుటచే నెల్లఱు నీశ్వరులయిన కానిండు దోషమేమన:-

ప్రమాణా భావాన్న తత్సిద్ధిః" 5.10

ప్రమాణాభావాత్ = జీవులెల్లఱు నీశ్వరులే యనుటకు ప్రత్యక్ష ప్రమాణములేదు; కాబట్టి, నతత్సిద్ధిః = అయ్యది సిద్ధింపదు.

లోకమునగల జీవులందఱు నీశ్వరులే యనుట ప్రత్యక్ష ప్రమాణ విరుద్ధమని భావము.

ప్రత్యక్ష ప్రమాణ సిద్ధము కాకున్నచో ననుమాన ప్రమాణముచే

సిద్ధింపగల దందు మనిన:-

"సంబంధా బావా న్నానుమానమ్" 5.11

సంబంధాభావాత్ = వ్యాప్తిగ్రహము లేనందున, న అనుమానమ్ = అనుమాన ప్రమాణమును జీవుడీశ్వరు డగునని సాధింపనేరదు.

అటులయిన జీవుడే యీశ్వరు డగునని శ్రుతియే బోధింపగల దందుమేని:-

"శ్రుతిరపి ప్రధానకార్యత్వస్య" 5.12

శ్రుతిరపి = "అజామేకాం' అను నిట్టి శ్రుతియును, ప్రధాన కార్యత్వస్య = ప్రకృతి కార్యరూపమున పరిణమించుననియే బోధించును, కాని జీవుడీశ్వరుడగునని బోధింపదు.

జీవుడీశ్వరుడు కాజాలకున్న పోనిండు. కాని, విజ్ఞానాత్మకమైన బ్రహ్మము అవిద్యాశక్తి సంబంధము వలన నీశ్వరుడు కాగల దందుమేని:-

"నా విద్యాశక్తియోగో నిఃసంగస్య" 5.13

నిఃసంగస్య = సంగరహితమైన బ్రహ్మమునకు, అవిద్యాశక్తి యోగః = మాయాశక్తితో సంబంధము - సంగము, న = కలుగనేరదు.

నిస్సంగబ్రహ్మమునకు మాయాశక్తితో సంగభావము కల్పించుటయును యుక్తముకాదు. కాబట్టి విజ్ఞాన బ్రహ్మము ఈశ్వరు డగుననుట తగదు.

ఆ యవిద్యా సంబంధము సైతము పారమార్థికము కాదు, ఆవిద్యకమే - అయథార్థమే యనిన:-

"తద్యోగేతత్సిద్ధా వన్యోన్యాశ్రయత్వమ్" 5.14

తద్యోగే = అవిద్యా సంబంధము సిద్ధించిన, తత్సిద్ధౌ = అవిద్య సిద్ధింపగలదు. అందువలన, అన్యోన్యాశ్రయత్వమ్ = అన్యోన్యాశ్రయ దోష మేర్పడును.

అవిద్య యనున దొక వస్తువున్ననాడు దాని సంబంధము పారమార్థికమో యపారమార్థికమో సిద్ధించుట యంగీకరింప వీలగును. అట్టి యవిద్యయే సిద్ధింపనపుడు దాని సంబంధమువలన నయ్యది సిద్ధించుననుట యుక్తము కాదు. అట్లందుమేని, అవిద్యా సంబంధము నంగీకరించిన నవిద్య సిద్ధించుటయు, అవిద్య సిద్ధించిన దాని సంబంధము నంగీకరించుటయు నను పరస్పరాశ్రయ దోష మేర్పడునని భావము.

బీజాంకురముల వలె నవిద్యయు దాని సంబంధమును ననాదు

లగుటచే పై దోషము వాటిల్ల దందుమేని:-

"న బీజాంకురవత్ సాదిసంసార శ్రుతేః" 5.15

సాదిసంసార శ్రుతేః = అవిద్య, దాని సంబంధము ననెడి లక్షణము గల యీ ప్రపంచము ఆదిగలది (సాది) యని శ్రుతి చెప్పుచున్నందున, బీజాంకురవత్ = బీజాంకురములవలె, న = అనాది యనుట తగదు.

అవిద్యయు, దాని సంబంధమును బీజాంకురములవలె ననాదియనుట శ్రుతి విరుద్ధమని భావము.

విద్యాభిన్నత్వమే యవిద్య యనుటవలన నయ్యది సిద్ధింప దనుట తగదనిన:-

"విద్యాతోఽన్యత్వే బ్రహ్మబాధప్రసంగః" 5.16

విద్యాతోఽన్యత్వే = విద్యాన్యత్వమే యవిద్య యగునెడల, బ్రహ్మబాధప్రసంగః = బ్రహ్మము బాధింపబడును.

అవిద్య యనగా విద్యాన్యత్వమే యందుమేని విద్యోదయము వలన నవిద్య నశించునట్లు, బ్రహ్మము సైతము విద్యాన్యత్వమే కాబట్టి యదియును నాశము నందవలసి వచ్చును. బ్రహ్మము నశించుననుట యనిష్ట ప్రసక్తి యగును. అందువలన విద్యాన్యత్వమే యవిద్య యని దానిని సిద్ధింపజేయ జనదు.

బ్రహ్మము బాధింపబడ దందుమేని:-

"అబాధే నైష్ఫల్యమ్" 5.17

అబాధే = విద్యాన్యత్వమయిన బ్రహ్మము విద్యవలన బాధింపబడ దందుమేని, నైష్ఫల్యమ్ = విద్య నిష్ఫలమగునని సూత్రార్థము.

విద్యాన్యత్వము అవిద్యకాదు. కాని విద్యాబాధ్యత్వము అవిద్యయందుమేని :-

"విద్యాబాధ్యత్వే జగతోఽప్యేవమ్" 5.18

విద్యాబాధ్యత్వే = అవిద్య యనగా విద్యచే బాధింపబడునది అందుమేని, జగతోఽప్యేవమ్ = జగత్తు కూడ విద్యచే బాధింపబడునదియే కాబట్టి యదియు నవిద్యయే యగును.

జగత్తు కూడ అవిద్యయైన కానిండు; అందుమేని:-

"తద్రూపత్వే సాదిత్వమ్" 5.19

తద్రూపత్వే = జగత్తు అవిద్యారూప మగునెడల, సాదిత్వమ్ = జగత్తువలె నవిద్యయు సాదియగును. కాబట్టి యవిద్య యనాది యనుట పొసగదని భావము.

సాంఖ్యవాది వైన నీకును జీవులకు సంబంధించిన ధర్మాధర్మము లనెడి యదృష్టము సిద్ధించిననే కదా యా యదృష్ట మునకు తగిన ఫలము నొసంగు నీశ్వరుడు సిద్ధించును?

ఆ యదృష్టమే లేనపుడీశ్వరుడెట్లు సిద్ధించును?

**"న ధర్మాపలాపః ప్రకృతి కార్య వైచిత్రాత్"** 5.20

ప్రకృతికార్య వైచిత్ర్యాత్ = సుఖాదులలో గల వైచిత్ర్యము వలన, ధర్మాపలాపః = అదృష్టము లేదనియనుట, న = తగదు.

లోకము నందలి ప్రాణులలో కొందఱు సుఖులుగాను' మఱికొంద ఱంతకంటె నెక్కుడు సుఖులుగాను, ఇంకను కొందఱు వారికంటె మిక్కిలి సుఖులుగాను నుండుట జూచుచున్నాము. ఇట్లే ప్రాణుల దుఃఖము లందును తరతమ భేదము గానవచ్చు చున్నది. ఈతరతమ భేదములతో గాననగు సుఖ దుఃఖములే ప్రకృతి కార్యములు. అదృష్ట శబ్దముచే శాస్త్రకారులు వీనిని జెప్పుదురు. అదృష్ట మనబడెడి యీ ప్రకృతి కార్యములయిన సుఖదుఃఖములలోని వైచిత్ర్యము ధర్మాధర్మములు లేక యేర్పడదు. కాబట్టి ధర్మాధర్మములు లేవనుట యొప్పదు.

స్వభావముగానే ప్రకృతి కార్యములందు వైచిత్ర్యముండును. ఇందుల కదృష్టమేల?

**"శ్రుతిలింగాదిభిః తత్సిద్ధిః"** 5.21

శ్రుతిలింగాదిభిః = శ్రుతి, లింగము, యోగజప్రత్యక్షము మున్నగు వానిచే, తత్సిద్ధిః = ధర్మసిద్ధి కలుగును.

('పుణ్యోవైపుణ్యేన కర్మణా భవతి పాపః పాపేన' బృ. 5.2.13.) ('పుణ్య కర్మచే సుఖియు పాపకర్మముచే పాపియు నగును' అని శ్రుతివాక్యము. లింగ మనగా హేతువు. సుఖదుఃఖములు హేతువు సహాయమున నదృష్ట జన్యములని యూహింప నగును. యోగికి అదృష్టము ప్రత్యక్ష మగును. కాబట్టి ధర్మము సిద్ధించుటలో నియ్యవి యుపకరించును. అట్టియెడల స్వభావమును కల్పించుట గౌరవ మగును.

మనకు ప్రత్యక్షము కానిది లేదని యేల చెప్పరాదు?

**"న నియమః ప్రమాణాంత రావకాశాత్"** 5.22

ప్రమాణాంతరావకాశాత్ = ప్రత్యక్షముకాని వస్తువు శబ్దాను మానములచే సిద్ధించును: కాబట్టి, న నియమః = ప్రత్యక్షముకాని వస్తువు లేదనియే చెప్పవలయునను నియమము లేదు.

**"ఉభయత్రా ప్యేపమ్"** 5.23

పై సూత్రములందు ధర్మము నూహించినట్లే యధర్మము సైతమూహింపదగునని యీసూత్రాభిప్రాయము.

ధర్మమువలె నధర్మము నూహింపనేల? అది యర్థాపత్తివలన సిద్ధింపదా?

**"అర్థాత్ సిద్ధిశ్చే త్సమాన ముభయోః"** 5.24

అర్థాత్ సిద్ధిశ్చేత్ = అధర్మమర్థాపత్తివలన సిద్ధించినచో, ఉభయోః సమానమ్ = ధర్మము, అధర్మము నను రెండిటి విషయమునను నిట్టి ప్రశ్నము సేయనగును.

సంబన్ధములైన రెండు పదార్థములలో నొకటి సిద్ధించినపుడు దానితో సంబంధము కలది యగుటచే రెండవదియు సిద్ధించుట అర్థాపత్తి – అర్థసిద్ధి– యనబడును. కాబట్టి యధర్మము అర్థాపత్తిచే నేల సిద్ధింపదని ప్రశ్నించినచో ధర్మము మాత్రమర్థాపత్తిచే నేల సిద్ధింపదు? అని ప్రశ్నింపవచ్చునని భావము.

ధర్మాధర్మము లంగీకరించినచో పురుషుడు నిర్గుణుడెట్లు కాగలడు?

**"అంతఃకరణ ధర్మత్వం ధర్మాదీనామ్"** 5.25

ధర్మాదీనామ్ = ధర్మాధర్మాదులు, అంతఃకరణ ధర్మత్వమ్ = అంతఃకరణ గుణములు. కాబట్టి పురుషగుణములు కావు.

ధర్మాధర్మములు అంతఃకరణ గుణము లగుపక్షమున నయ్యవి పురుషునియం దారోపింపబడు ననవలయును. ఆరోపితములు వివేకజ్ఞానము కలిగినపుడు నశించును. ఇట్లు ధర్మాదుల నాశ మంగీకరించిన సత్కార్యవాదమునకు హాని కలుగదా?

**"గుణాదీనాంచ నాత్యంత బాధః"** 5.26

గుణాదీనాంచ = సత్త్వము, రజస్సు మున్నగు గుణములు వాని ధర్మములైన సుఖాదులు నన్నియు, నాత్యంతబాధః =

స్వరూపనాశమునందవు.

అగ్ని సంయోగముచే లోహమునందు కలుగు నుష్ణము లోహమునుండి విడినడునట్లు సుఖదుఃఖాదులును పురుషుని నుండి వేరగును. లోహమునుండి యుష్ణము తొలగినంతమాత్రమున నది సత్తారహితము కాదుగదా? అట్లే సుఖాదులు నని భావము.

తనకు సుఖాదులు తెలిసినను పరులకును సుఖాదులున్నట్లు తెలియుటెట్లు?

**"పంచావయవ యోగాత్ సుఖసంవిత్తిః"** 5.27

*పంచావయవయోగాత్* = ప్రతిజ్ఞ, హేతువు మున్నగు నైదవ యవములు గల యనుమాన ప్రమాణము ద్వారమున, *సుఖసంవిత్తిః* = ఇతరుల సుఖమును గుర్తింపగలము.

అనుమానము వ్యాప్తిజ్ఞానము వలన కలుగునుగదా? అదియెట్లు కలుగును?

**"న సకృద్ గ్రహణాత్ సంబంధ సిద్ధిః"** 5.28

*న సకృద్ గ్రహణాత్* = సాధ్యసాధనముల సాహచర్యము (ఒకచో నుండుట) పలుమాఱు గ్రహించుటచేత, *సంబంధ సిద్ధిః* = వ్యాప్తి తెలియనగును.

వ్యాప్తియన నేమి?

**"నియత ధర్మ సాహిత్యముభయో రేకతరస్య వా వ్యాప్తిః** 5.29

*ఉభయోః* = సాధ్యసాధనములయొక్క గానీ, *ఏకతరస్య వా* = సాధనముయొక్క గానీ, *నియత ధర్మసాహిత్యం* = అవ్యభిచరిత సాహచర్యము, *వ్యాప్తిః* = వ్యాప్తి యనబడును.

సమము, విషమము నని వ్యాప్తి రెండు విధములు. సాధ్యసాధనములు రెండును నెల్ల తావులందును నియమముగా నొకచో నుండును – సాధ్యమున్నచోట సాధనముండును. సాధన మున్నతావున సాధనము నుండును. ఇట్లుండుట సమవ్యాప్తి. కృతకత్వము అనిత్యత్వము నిందుల కుదాహరణము. కొన్నియెడల సాధ్యసాధనములు రెండును సమముగానుండవు. అనగా సాధన మున్నతావున సాధ్యముండును. కాని సాధ్యమున్నను నొక తావున సాధనముండదు. ఇందులకుదాహరణము ధూమాగ్నులు. ధూమమున్న తావున నగ్ని తప్పక యుండును. కాని

అగ్ని యున్నను నొకచో ధూమముండదు. కాబట్టి ధూమాగ్నుల వ్యాప్తి విషమము.

నియతధర్మసాహిత్యమే వ్యాప్తియన నేల? అయ్యది తత్త్వాంతర మేల కాదు?

**"న తత్త్వాంతరం వస్తుకల్పనా ప్రసక్తేః"** 5.30

వస్తుకల్పనా ప్రసక్తేః = క్రొత్త పదార్థమును కల్పింపవలసి వచ్చును. కాబట్టి, న తత్త్వాంతరం = ధర్మ సాహిత్యమునకు మించి వేరు పదార్థము వ్యాప్తి యననొప్పదు.

ఈ నియతధర్మ సాహిత్య మెట్టిది?

**"నిజశక్త్యుద్భవ మిత్యాచార్యాః"** 5.31

ఆచార్యాః = సాంఖ్యాచార్యులు, నిజశక్త్యుద్భవం = వస్తువు యొక్క స్వాభావిక శక్తి వలన ప్రకటమగునట్టి సాహిత్యము, ఇతి = అని చెప్పుదురు.

స్వభావము చేతనే రెండు వస్తువు లొకదానితో నొకటి సంబద్ధములై యుండును. అందు ఏది ప్రతిబద్ధ (సంబద్ధ) మగునో యది వ్యాప్య మనబడును. దేనితో సంబద్ధమగునో యది వ్యాపక మనబడును. స్వభావముచే ప్రకటమగు (నా వస్తువుల) సంబంధము (ప్రతిబంధము) వ్యాప్తి యని వివేకము.

**"ఆధేయశక్తియోగః ఇతి పంచశిఖః"** 5.32

ఆధేయశక్తి యోగః ఇతి = సాంకేతిక శక్తి లక్షణ సంబంధమని, పంచశిఖః = పంచశిఖాచార్యుడు.

ఆధాన మనగా సంకేతము. అట్టిది విషయముగా గల శక్తి ఆధేయశక్తి యనబడును. అనగా 'ఇది వ్యాప్యము; ఇది వ్యాపకము' ననెడి శక్తి ఆధేయశక్తి యనబడును. ఇట్టి లక్షణము గల వస్తువుల నియత సంబంధము వ్యాప్తి యని పంచశిఖాచార్యుని మతము.

స్వరూపశక్తిని విడిచి యాధేయ (సాంకేతిక) శక్తి వ్యాప్తి యననేల?

**"న స్వరూపశక్తిర్నియమః పునర్వాదప్రసక్తేః"** 5.33

పునర్వాదప్రసక్తేః = పునరుక్తి ప్రసక్తి కలుగును కావున, స్వరూప శక్తిః = స్వరూపభూతశక్తి, న నియమః = వ్యాప్తికాదు.

స్వరూపశక్తియే వ్యాప్తియని చెప్పిన పునరుక్తిదోష ప్రసక్తి కలుగునని

భావము.

పునరుక్తి ప్రసంగ మెట్లు కలుగును ? అన:-

“విశేషణానర్థక్య ప్రసక్తేః” 5.34

విశేషణము వ్యర్థమగుటయే యగు పునరుక్తిదోష ప్రసంగమని సాంఖ్యశాస్త్రాభిప్రాయము.

‘ఘటము కలశము’ ‘శక్తుడు దేవదత్తుడు’ అను తావులందు విశేషణములుగా వాడబడు ఘట, శక్త శబ్దములు విశేషమును తెలుపక పునరుక్త మాత్రములయి వ్యర్థములగును. ఇట్లు నిరర్థకము లగుట పునరుక్తి ప్రసంగ దోషమగునని భావము. కావున స్వరూపశక్తి సంబంధము వ్యాప్తికానేరదు.

స్వరూపశక్తి వ్యాప్తి యనుటలో ననుపపత్తి కానరానందున పునరుక్తి ప్రసంగము దోష మెట్లగును?

“పల్లవాది ష్వనుపపత్తేః” 5. 35

పల్లవాదిషు = వృక్షములనుండి కోసి యొకచో ప్రోవుజేయబడిన ఆకులలో గల స్వరూపశక్తి విషయమునన, అనుపపత్తేః = వ్యాప్తిత్వ మనుపపన్న మగుచున్నందున దోషమే యగును.

స్వరూపశక్తియే వ్యాప్తి యని యంగీకరించినచో దూరమునుండి కొనిరాబడ పత్రసముదాయమును వృక్షముల సూచింపజేయునట్లు, స్వరూపశక్తిగల ఛిన్న పత్రములును వృక్షముల సూచింపజేయవలయును. కాని, అట్లు ఛిన్నపత్రములు వృక్షముల ననుమానింపజేయవు. కాబట్టి సాంకేతిక (ఆధేయ) శక్తి సంబంధమే వ్యాప్తియని చెప్పవలయునని సాంఖ్యాచార్యుల మతము.

స్వరూపశక్తి వ్యాప్తికానిచో పోనిండు. కాని, నిజశక్తిచే ప్రకటితమగు సంబంధము వ్యాప్తి కాల కాదా! ఆధేయ (సాంకేతిక) శక్తి యెందులకు?

“ఆధేయశక్తిసిద్ధౌ నిజశక్తియోగః సమానన్యాయాత్” 5. 36

సమాన న్యాయాత్ = యుక్తి సామ్యమువలన, ఆధేయ శక్తి సిద్ధౌ = సాంకేతిక శక్తిచే తెలుపబడు సంబంధము వ్యాప్తి యని సిద్ధించిన, నిజశక్తియోగః = స్వాభావిక శక్తిచే ప్రకటితమగు సంబంధము సైతము వ్యాప్తి యని సిద్ధించునట్లు.

ఆధేయశక్తి సంబంధము వ్యాప్తియైనట్లు, నిజశక్తి సంబంధమును

వ్యాప్తియే యగును. అందువలననే సాంఖ్యాచార్యులు నిజశక్తి సంబంధము వ్యాప్తి యనిరి. పంచశిఖా చార్యుడు ఆధేయశక్తి సంబంధము వ్యాప్తి యని చెప్పియున్నాడు.

అనుమానప్రమాణమును తెలుపుటకు సాధ్యసాధన సంబంధము నిరూపించినట్లు శబ్దప్రమాణమును ప్రమాణీకరించుటకు శబ్దార్థములకు గల సంబంధమును నిరూపింపవలయును గదా? అది యెట్టిదనిన:-

**"వాచ్యవాచకభావః సంబంధః శబ్దార్థయోః"** 5.37

*శబ్దార్థయో = శబ్దము, అర్థము నను నీ రెంటికిని మధ్య వాచ్య వాచక భావః = వాచ్యవాచకత్వమనెడు సంబంధః = సంబంధము కలదు.*

శబ్దము వాచకము. అర్థము వాచ్యము. వాచ్యవాచకత్వ సంబంధమే శబ్దార్థముల సంబంధము. ఇయ్యది వృత్తియనియు చెప్పబడును.

శబ్దార్థముల సంబంధము తెలియబడిన నయ్యది యర్థ బోధకము కాగలదు. తెలియకున్న కాదు.

కాబట్టి సంబంధజ్ఞాన మెట్లు కలుగును

**"త్రిభిః సంబంధసిద్ధిః"** 5.38

*త్రిభిః = మూటిచే, సంబంధసిద్ధిః = సంబంధము తెలియును.*

ఆప్తోపదేశము, వృద్ధవ్యవహారము, ప్రసిద్ధపద సాన్నిధ్యము నను మూడింటిచే సంబంధము తెలియునని భావము.

వృద్ధ వ్యవహారాదులచే తెలియు నా సంబంధ జ్ఞానము కార్యబోధక వాక్యమునందు నిశ్చయ మగునా? లేక సిద్ధ వస్తువునందా? లేక యుభయము నందా?

**"నకార్యేనియమ ఉభయథా దర్శనాత్"** 5.39

*ఉభయథా దర్శనాత్ = రెండు విధముల చూడబడుటచే, కార్యే = కార్యబోధక వాక్యమునందే సంబంధ నిశ్చయము కలుగును అను, నియమః = నియమము, న = లేదు.*

'కఱ్ఱతో తెల్లని యావును తోలుకొనిరమ్ము' (గామానయ శుక్లాం దండేన) అనునది కార్యబోధక వాక్యము. 'నీకు పుత్రుడు జన్మించినాడు' (పుత్రస్తే జాత) అనునది సిద్ధ వస్తుబోధక వాక్యము. ఇట్టి రెండువిధము లయిన ప్రయోగము లందును ఆప్తోపదేశాదుల ద్వారా సంబంధ నిశ్చయము కలుగుచున్నందున సాంఖ్యులమైన మా మతమున నొకే విధమగు వాక్య ప్రయోగముచే నిశ్చయము

కలుగునను నియమములేదు.

లౌకికభాషయం దిట్లు శబ్దార్థజ్ఞాన మేర్పడినను వైదిక శబ్దముల యర్థజ్ఞాన మెట్లు కలుగును?

**"లోకేవ్యుత్పన్నస్య వేదార్థప్రతీతిః"** 5.40

లోకే వ్యుత్పన్నస్య = ఆప్తోపదేశాదులద్వారా లౌకిక శబ్దముల యర్థమును గ్రహించిన వ్యక్తికి, వేదార్థప్రతీతిః = వైదిక శబ్దార్థ జ్ఞానము కలుగును.

లౌకిక శబ్దములవంటివే వైదికశబ్దములు కాబట్టి లౌకిక శబ్దముల యర్థము తెలిసినవానికి వైదిక శబ్దముల యర్థమును తెలియునని భావము.

**"న త్రిభి రపౌరుషేయత్వాద్ వేదస్య తదర్థ స్యాతీంద్రియత్వాత్"** 5.41

వేదస్య = వేదము, అపౌరుషేయత్వాత్ = పురుష ప్రణీతము కానందున, తదర్థస్య = వేదార్థము, అతీంద్రియత్వాత్ = ఇంద్రియ గోచరము కానందునను, న త్రిభిః = ఆప్తోపదేశాది త్రివిధోపాయముల ద్వారా వైదిక శబ్దార్థ సంబంధ జ్ఞానము కలుగజాలదు.

ఋగ్యజుస్సామాథర్వములను వేదములు మానవ ప్రణీతములు కానందున నందలి శబ్దముల నాప్తులుపదేశించుటకు వీలులేదు వేదార్థములు ఇంద్రియ గోచరములు కానందున వృద్ధవ్యవహారాదుల వలన తెలియ వీలుపడదు. కాబట్టి వైదిక శబ్దార్థ సంబంధ జ్ఞానమే కలుగజాలదు. అట్టియెడల నర్థజ్ఞానము కలుగుటకు సుతరాం వీలులేదని శంకాభిప్రాయము.

వేదార్థము లతీంద్రియములు కావని ముందుగా సమా ధానము చెప్పుచున్నాడు.

**"న యజ్ఞాదేః స్వరూపతో ధర్మత్వం వైశిష్ట్యాత్"** 5.42

యజ్ఞాదేః = యజ్ఞము, దానము, తపస్సు మున్నగు వైదిక కర్మములు, వైశిష్ట్యాత్ = విశిష్ట ఫలమును కలిగించును కావున, స్వరూపతః = సాక్షాత్తుగ, ధర్మత్వం = వేదార్థములని యంగీకరింపబడుచున్నవి. అందువలన, న = వేదార్థము లతీంద్రియము లనుట తగదు.

యజ్ఞము, దానము, తపస్సు మున్నగు వేదవిహిత కర్మములు ఇంద్రియగోచరములు కావనుట యుక్తముగాదని భావము. అందువలన వృద్ధవ్యవహారాదులచే శబ్దార్థ సంబంధ జ్ఞానము కలుగవచ్చును.

అపౌరుషేయము లగుటచే నాప్తోపదేశము సంభవము కాదనుటకు సమాధానము:–

**"నిజశక్తిర్ వ్యుత్పత్త్యా వ్యవచ్ఛిద్యతే"** 5.43

*నిజశక్తిః* = శబ్దార్థముల స్వాభావికసంబంధము, *వ్యుత్పత్త్యా* = 'ఈ శబ్దమున కిది యర్థము' అను శబ్దార్థములను తెలుపు శక్తిద్వారా, *వ్యవచ్ఛిద్యతే* = వేరుజేసి యుపదేశింపబడును.

అంతర్యాణి నెఱుగు ఆప్తులు వైదిక శబ్దార్థముల సంబంధము నెఱిగినవారై దాని నుపదేశింపగలరు. కాబట్టి వేదము లపౌరుషేయము లయినను నాప్తుల యుపదేశ మసంభవము కాదని భావము.

యజ్ఞాదులు క్రియాత్మకము లగుటచే నాప్తోపదేశ యోగ్యములు కావచ్చును. అందువలన సంబంధజ్ఞాన మేర్పడవచ్చును. కాని, యట్లు యోగ్యములుకాని వేదార్థములకు సంబంధించిన జ్ఞాన మెట్లు కలుగగల దన:-

**"యోగ్యా యోగ్యేషు ప్రతీతి జనకత్వాత్ తత్సిద్ధిః"** 5.44

*యోగ్యా యోగ్యేషు* = ఇంద్రియ గోచరములగు యజ్ఞాదుల వలె నింద్రియ యోగ్యములు కాని యర్థ విషయకములగు పదములును, *ప్రతీతి జనకత్వాత్* = జ్ఞాన జనకము లగుటవలన, *తత్ సిద్ధిః* = సంబంధసిద్ధి కలుగును.

శబ్దార్థముల సంబంధము స్వాభావికమగుచో శబ్దరాశి యైన వేదము సైతము స్వాభావిక మేల కాదు? అనగా నిత్యమేల కాదు?

**"న నిత్యత్వం వేదానాం కార్యత్వశ్రుతేః"** 5.45

*కార్యత్వశ్రుతేః* = కార్యములని బోధించు శ్రుతి యుండుట వలన, *వేదానాం* = ఋగాది వేదములు, *నిత్యత్వం న* = నిత్యములు కావు.

(తస్మాద్యజ్ఞాత్ సర్వహుత ఋచః సామాని జజ్ఞిరే, ఛందాంసి జజ్ఞిరే తస్మాద్ యజుస్తస్మా దజాయత. య. 3.31.9)

సర్వ పూజ్యుడగు పరమాత్ముని వలన ఋక్కులు, సామములు, ఛందములు (అథర్వ వేదము), యజుస్సు నను వేదము లుత్పన్నమైనట్లు శ్రుతులు చెప్పుచున్నందున నవి నిత్యములు (స్వాభావికములు) అనుటయుక్తము కాదని భావము.

వేదములు స్వాభావికములై నిత్యములు కాక కార్య రూపములే యగునెడల పౌరుషేయము (మానవ ప్రణీతము) లేల కావు?

**"న పౌరుషేయత్వం తత్కర్తుః పురుషస్యాభావాత్"** 5.46

*తత్కర్తుః* = వేదములను రచియించిన, *పురుషస్య* = మానవుడు,

*అభావాత్ = లేనందున, పౌరుషేయత్వం న = వేదములకు పౌరుషేయత్వము (మనుజ ప్రణీతత్వము) లేదు.*

వేద రచయిత లెవరో తెలియునంతమాత్రమున నయ్యవి యపౌరుషేయము లెట్లగును?

**"ముక్తాముక్తయో రయోగ్యత్వాత్"** 5.47

జీవులలో ముక్తులో లేక యముక్తులో వేదములను రచియింపవలసి యుందురు. కాని, ముక్తులయిన జీవులు నిస్సంగులగుటచే వారు వేదములను రచియింపరు. అముక్తులు సర్వజ్ఞులు కానందున వేదములను రచియింప యోగ్యులు కాజాలరు. కాబట్టి వేదములు మానవ (జీవ) రచితము లన నొప్పదు; ఈశ్వరీయములే యని భావము.

జీవులు వేదములను రచియింప యోగ్యులు కారు. మఱియు వేదరచయిత లెవరో తెలియుటలేదు. అట్టియెడ వేదములు నిత్యము లేల కారాదు?

**"నాపౌరుషేయత్వాత్ నిత్యత్వ మంకురాదివత్"** 5.48

*అంకురాదివత్ = మొలకలవలె, అపౌరుషేయత్వాత్ = పురుష (జీవ) నిర్మితములు కానంతమాత్రమున, వానికి, ననిత్యత్వం = నిత్యత్వము లేదు.*

భూమిపై నెన్నో యంకురము లుత్పన్నము లగుట జూచుచున్నాము. అవి జీవులచే నిర్మింపబడుటలేదు. కానియవి యనిత్యములే. అందువలన నపౌరుషేయము లయినంత మాత్రమున నిత్యములన వలనుపడదని భావము. అట్లే వేదములు జీవనిర్మితములు కానంతమాత్రమున నవి నిత్యము లనజాలము.

అంకురములు కార్యములు (ఉత్పన్న మగునవి) కాబట్టి జీవులే వాని నంకురింపజేసిన ట్లేల యనుమానింపరాదు?

**"తేషామపి తద్యోగే దృష్టబాధాది ప్రసక్తిః"** 5. 49

*తేషామపి = జీవులచే న కురింపజేయబడని మొలకలకును, తద్యోగే = జీవులే కర్తలని చెప్పుదుమేని, దృష్టబాధాదిప్రసక్తిః = ప్రత్యక్షము నంగీకరింపకపోవుటయేకాక యదృష్టమును కల్పింపవలసిన దోషము నేర్పడును.*

అటులయిన జీవకర్తృక మేదియో యీశ్వరకర్తృక మేదియో తెలిసికొనుటెట్లు?

**"యస్మిన్నదృష్టేఽపి కృతబుద్ధి రుపజాయతే తత్పౌరుషేయమ్"** 5.50

*అదృష్టేఽపి = కర్త ప్రత్యక్షముకాని, యస్మిన్ = ఏవస్తువునందు,*

కృతబుద్ధిః = ఈ వస్తువు జీవ నిర్మితము' అను బుద్ధి ఉపజాయతే = కలుగునో, తత్ = ఆ వస్తువు, పౌరుషేయమ్ = పురుష (జీవ) నిర్మితమని తెలియనగును.

కొండొక వస్తువునకు కర్త యెవరో గోచరింపక పోయినను ఆ వస్తువు విషయమున 'ఈ వస్తువు పురుష నిర్మితమే' యను బుద్ధి కలిగినచో నా వస్తువు పురుష నిర్మిత మనియు, మిగిలినవి కాదనియు తెలిసికొన వలయును. అంకుర వేదాదులు జీవ నిర్మితములని బుద్ధి వొడమనందున నయ్యవి పురుష నిర్మితములు కాక యీశ్వర నిర్మితములని యెఱుగవలయును.

వేదము లీశ్వరోక్తము లయినచో నవి పరతః ప్రమాణము లేల కావు?

**"నిజశ క్త్యభి వ్యక్తేః స్వతః ప్రామాణ్యమ్"** 5. 51

*నిజశక్త్యభి వ్యక్తేః = శబ్దార్థ మనెడి స్వాభావిక శక్తితో, అభివ్యక్తేః = సృష్టికి నాదియందు సృష్టికర్త వలన ప్రకటితము లగుట చేత, వేదములు, స్వతః ప్రామాణ్యమ్ = తమ యర్థమును తెలుపుటకు ప్రమాణాంతరము నపేక్షింపవు (స్వతః ప్రమాణములు).*

స్వతః ప్రామాణ్యము, పరతః ప్రామాణ్యము నని ప్రామాణ్యము రెండు విధములు. స్వతః ప్రామాణ్య మనగా స్వార్థసిద్ధియందు ప్రమాణాంతరము నపేక్షింపని ప్రమాత్వము. తన జ్ఞానమును కలిగించుట కితర ప్రమాణము నపేక్షించుట పరతః ప్రామాణ్య మనబడును.

వేదము లీశ్వరోక్తము లయినను నాది రహితము లయినందున నిజశక్తిచే ప్రమాణము లగుటచేత స్వతః ప్రమాణము లని భావము. ఇట సాంఖ్యులు 'రూపవిషయమున సూర్యుడు ప్రమాణమైనట్లు అని యుదాహరింతురు. సూర్యుడు లోకమునగల పదార్థముల రూపమును ప్రకాశింపజేయును. తన రూపమును ప్రకాశింపజేయుట కితర ప్రమాణము నపేక్షింపక స్వయముగా ప్రకాశించును. ఇట్లే వేదములని యెఱుగునది.

సూత్రకారుడు భ్రాంతిజ్ఞాన విషయమున స్వమతమును జెప్పదలచి ముందుగా పరమతమును నిరాకరించుచున్నాడు.

**"నాసతః ఖ్యానం నృశృంగవత్"** 5.52

*నృశృంగవత్ = నరశృంగము వలె, అసతః = సత్తా రహితమయిన (సర్వథా అలీకమగు) వస్తువుయొక్క, ఖ్యానం = జ్ఞానము, న = కలుగదు.*

కొండొక సమయమున ముత్యపు చిప్పను (శుక్తి) జూచి 'ఇది రజతము' అని భ్రమపడుట కలదు. ఇట్టి జ్ఞానము భ్రాంతి యనబడును. ఈ భ్రాంతి

జ్ఞాన విషయమున కొందఱు (నవీన వేదాంతులు) – ముత్యపు చిప్పయున్న స్థలమున రజతము లేకున్నను రజతజ్ఞానము కలుగుచున్నది. కాబట్టి వస్తువు బొత్తిగా లేకున్నను వస్తుజ్ఞానము కలుగునందురు. ఈ మతమును సాంఖ్యు లంగీకరింపరు. బొత్తిగాలేని వస్తువు (అసద్వస్తువు) యొక్క జ్ఞానము కలుగనేరదు. మనుష్యునకు కొమ్ములుండవు. అందువలన మనుజునకు కొమ్ములుండు ననుజ్ఞాన మెన్నడును కలుగనేరదు. కాబట్టి అసద్వస్తుఖ్యాతి (జ్ఞానము) అంగీకరింపబడదు. శుక్తి యందు రజతము లేకున్నను మఱియొకచో రజతము లేకపోదని భావము.

**"న సతోబాధ దర్శనాత్"** 5.53

*సతః = ముత్యపు చిప్పలో (విజ్ఞాన రూపమున) సద్రూపమున నున్న రజత జ్ఞానము కలుగునందురేని, న = అదియును సరికాదు. బాధ దర్శనాత్ = 'ఇది రజతము కాదు' అని బాధ. పూర్వము రజతమని కలిగిన జ్ఞానమునకు విరుద్ధజ్ఞానము కలుగుచున్నందున.*

విజ్ఞానవాదులు ప్రపంచమునందలి ప్రతి వస్తువును విజ్ఞానాత్మక మందురు. కాబట్టి 'శుక్తియందు కలుగు రజతజ్ఞానము విజ్ఞానరూపమున నున్న (సద్రూపమైన) రజతజ్ఞానమే కాని యసత్ ఖ్యాతి కాదు' అని యందురేని యదియును యుక్తము కాదు. శుక్తియందు కలుగు రజతజ్ఞానము విజ్ఞానరూపమున సత్ ఖ్యాతి యగునెడల నా జ్ఞానము 'ఇది రజతము కాదు. శుక్తియే.' అని బాధింపబడరాదు. కాని బాధింపబడుచున్నది. కాబట్టి విజ్ఞానవాదుల 'సద్‌ఖ్యాతి'యు సరికాదని భావము.

**"నానిర్వచనీయస్య తదభావాత్"** 5.54

అనిర్వచనీయువాదులు శుక్తియందు కలుగు రజతజ్ఞానము సదసద్విలక్షణమైన యనిర్వచనీయ భావమందురు. కాని, అనిర్వచనీయ మనెడి పదార్థ మొందు లేనందున నదియు సాంఖ్యులకు నంగీకృతము కాదని యీ సూత్రాభిప్రాయము.

**"నాన్యథాఖ్యాతిః స్వవచో వ్యాఘాతాత్"** 5.55

అన్యథాఖ్యాతివాదులు కొందఱు శుక్తియందు కలిగెడి రజతభావము ఎదుటనున్న శక్తికంటె నన్యమైన రజత రూపమున కలుగును. కాబట్టి యది 'యన్యథా ఖ్యాతి' యందురు. కాని యదియును సరికాదు. కారణ మేమన:– ఎదుట శుక్తి యుండగా నన్యథాఖ్యాతి కలుగుననుట స్వవచన వ్యాఘాత మగును.

కాబట్టి యన్యథా ఖ్యాతియు సరికాదు.

ఇక సాంఖ్యుల మత మేమి? యన:-

**"సదసత్ఖ్యాతిర్ బాధాబాధాత్"** 5.56

*సదసత్ ఖ్యాతిః = (సాంఖ్యుల మతమున,) ఇతరస్థలముననున్న రజతము ఎదుట లేకున్నప్పటికిని, ఎదుటనున్న శుక్తియందలి ధావళ్య సామ్యముచే శుక్తి రజతముల యసంబంధము గ్రహింపబడక 'ఇది రజతము' అను భ్రాంతిజ్ఞానము కలుగుచున్నది. దీనినే 'సదసత్ ఖ్యాతి' యందురు. కారణమేమన: బాధాబాధాత్ = ఎదుటనున్న శుక్తి యందు రజత సంసర్గము లేకపోవుటచే (ఇది రజతము కాదు) అని బాధింపబడినను, ఇతర స్థలమున రజత ముండుటచే రజత జ్ఞానమున కటబాధ కలుగదు.*

సాంఖ్యాచార్యులు అఖ్యాతివాదులు. వారు భ్రాంతి జ్ఞానమును అఖ్యాతి యందురు. శుక్తిని జూచి (ఇది రజతము) అని జ్ఞానము కలుగు స్థలమున అనగా భ్రాంతి కలుగుచోట సాంఖ్యదృష్టిలో రెండు జ్ఞానములు కలుగును. చీకటి వలన గానీ, కంటిదోషము వలనగానీ, యెదుటపడియున్న ముత్యపు చిప్పను జూచి 'ఇది వెండి' అందుము. ఇందు 'ఇది' యనున దొక జ్ఞానము. 'వెండి' యనున దింకొక జ్ఞానము. ఎదుటపడి యున్న ముత్యపుచిప్ప (శుక్తి) లోని విశేషత (శుక్తిత్వము) గ్రహింపబడకపోవుటచే సామాన్యముగ 'ఇది' యను జ్ఞాన మొకటి కలుగును. చూచువానిలో గల లోభాది దోషములతో బాటు ముత్యపుచిప్పలోని ధావళ్య (తళుకు) సామ్యము వలన నుద్బుద్ధమైన (ద్రష్టయొక్క) రజత సంస్కారము వలన నేర్పడు రజతస్మరణము – జ్ఞానము – కలుగును. ఇట్లు రెండు జ్ఞానములు కలుగుచున్నను ప్రమాణాది (కంటి) దోషముల వలన 'నా యందు రెండుజ్ఞానములు కలుగుచున్నవి' అని వివేకము కలుగక దానికి విరుద్ధమైన యవివేకము కలుగును. ఈ యవివేకమే భ్రమ – విపర్యయము – మిథ్యాజ్ఞానము – భ్రాంతి యనబడును. 'వెండి' యను జ్ఞానమునకు విషయమైన వెండి యన్యస్థలమునం దుండియున్నను ఆ జ్ఞానము కలిగినపుడది యెదుట లేదు. కాబట్టి 'ఇది వెండి కాదు' అని బాధ (జ్ఞానము) కలిగినపుడు దేశాంతరమున వెండి యున్నందున దానికి స్వరూప బాధ కలుగకున్నను, ఎదుట నున్న వస్తువు (శుక్తి)తో వెండికి సంబంధము లేనందున బాధ (సంసర్గత) కలుగుచున్నది. ఇట్లు 'బాధా బాధ' వలన సాంఖ్యులు సదసద్ ఖ్యాతి నంగీకరింతురు.

ఈ ప్రకరణమున జెప్పబడిన 'అసత్ ఖ్యాతి' 'సత్ ఖ్యాతి' 'అనిర్వచనీయ ఖ్యాతి' అను మూడు ఖ్యాతులు వైదికు లంగీకరింపరు. 'అన్యథా ఖ్యాతి' 'సదసద్ ఖ్యాతి' అను రెండును వైదికుల కిష్టము.

ఇట్లు భ్రాంతి విషయమున స్వమతమును ప్రదర్శించి యికముందు శబ్ద విషయమున స్వమతమును జెప్పదలచి ముందుగా స్ఫోట వాదమును నిరాకరించుచున్నాడు.

ప్రతీ త్యప్రతీతిభ్యాం న స్ఫోటాత్మకః శబ్దః" 5. 57

శబ్దః = గోవు, ఘటము నను శబ్దము, స్ఫోటాత్మకః = స్ఫోటాత్మకము, న = కాదు. కారణ మేమన:- ప్రతీత్యప్రతీతిభ్యాం = గకారాది వర్ణముల జ్ఞానమునకు మించి వేరు స్ఫోటమనునది యొకటి తెలియుటలేదు.

కొందఱు (వ్యాకరణ శాస్త్రకారులు) హస్త పాదాద్యవయవముల కతిరిక్తముగా నఖండమైన మూర్తివంతమగు నవయవి వలె గోవు, అనగా గకార, ఓకార, వకార, ఉకార వర్ణముల కతిరిక్తముగా నఖండమైన యొక మూర్తి యర్థజ్ఞాన మునకు హేతువై 'పదము' అనెడి పేరు గలిగిన 'గోవు' అనునొక శబ్దవిశేషము 'స్ఫోటము' అనబడు నని యందురు. సాంఖ్యు లియ్యది యంగీకరింపరు. కారణ మేమన :- 'గోవు' అను శబ్దమున గకారాది వర్ణములకు అతి రిక్తముగ వేరొండేమియు తెలియుట లేదు. కాబట్టి స్ఫోటమనున దొండేమియు లేదు.

శబ్దము స్ఫోటాత్మకము కాకున్న పోనిండు. అది నిత్యమేల కాదు?

"న శబ్ద నిత్యత్వం కార్యతా ప్రతీతేః" 5.58

కార్యతా ప్రతీతేః = 'గ కార ముత్పన్నమైనది. అది నశించినది' అని గకారాది శబ్దములలో కార్యత్వము తెలియుటవలన, శబ్ద నిత్యత్వం న = శబ్దము నిత్యము కాదు.

శంక:-

"పూర్వ సిద్ధసత్త్వ స్యాభివ్యక్తిర్ దీపేనేవ ఘటస్య" 5.59

దీపేన = దీపముద్వారా, ఘటస్య ఇవ = ఘటము వలె, పూర్వ సిద్ధసత్త్వస్య = కారణ వ్యాపారమునకు పూర్వమే ఉనికిగలిగిన శబ్దము, అభివ్యక్తిః = ప్రకట మగును.

దీపము తెచ్చుటకు ముందే యంధకారమునందు ఉన్న ఘటపటాది పదార్థములు దీప ప్రకాశము ద్వారా ప్రకటమగును. అప్పుడు క్రొత్తగా జనింపవు. అట్లే గోవు, ఘటము మున్నగు శబ్దములును క్రొత్తగా పుట్టక ఉచ్చారణాది కారణ వ్యాపారములకు పూర్వమే యునికి గలవై యుండి ప్రకటమగును. ఉచ్చారణాదుల వలన ధ్వని యుత్పన్న మగును కాని, గోవు మున్నగు శబ్దము లుత్పన్నములు కావన శబ్ద నిత్యత్వవాది అభిప్రాయము.

సమాధానము:-

**"సత్కార్యసిద్ధాన్తశ్చే త్సిద్ధసాధనమ్"** 5.60

*చేత్ సత్కార్యసిద్ధాన్తః = సత్కార్యసిద్ధాంత మగునెడల, సిద్ధ సాధనమ్ = సిద్ధించిన దానిని సాధించుటయే యగును.*

సాంఖ్యులు సత్కార్యవాదులు. కారణ వ్యాపారములకు పూర్వము కారణరూపమున నున్న కార్యములే వ్యాపారానంతరమున ప్రకటమగు నని వారి మతము. కాబట్టి శబ్ద నిత్యత్వవాదులు గోవు మున్నగు శబ్దములు కూడా సత్కార్యవాద సిద్ధాంతము ననుసరించి యభివ్యక్తములే యందురేని తమ కేమియు నందు భిన్నాభిప్రాయము లేదను సాంఖ్యుల యభిమతము నీ సూత్రము చెప్పుచున్నదని భావము.

ఆత్మలనేకములు కావను ఆత్మాద్వైతవాద నిరసనము:-

**"నాద్వైత మాత్మనో లింగాత్తద్భేదప్రతీతేః"** 5.61

*లింగాత్ = హేతువుద్వారా, తద్భేదప్రతీతేః = ఆత్మలలోని భేదము తెలియుచున్నందున, ఆత్మనః = ఆత్మయొక్క అద్వైతం న = అద్వైతము – ఏకత, యంగీకరింప తగదు.*

లోకమున ప్రాణులు సుఖము, దుఃఖము, వార్ధక్యము, మరణాదులు ననుభవించుట జూచుచున్నాము. ఈ సుఖాదులు ప్రతి ప్రాణికి వేరువేరుగా లభించును. ఒక క్షణమున నొకరు సుఖపడుచుండ మరి యొకరు దుః ఖము ననుభవింతురు. కాబట్టి యాత్మ యొక్కటియే మన వలనుపడదు. ప్రతి శరీరమునందును నొక్కొక్క యాత్మ భిన్నముగా నుండి యందు సుఖ దుఃఖముల ననుభవించునని యంగీకరింపవలయును.

సజాతీ యాత్మాద్వైతము నంగీకరింపకున్నను, విజాతీ యాద్వైత మేల యంగీకరింప జనదు?

"నానాత్మనాఽ పి, ప్రత్యక్షబాధాత్" 5.62

ప్రత్యక్ష్య బాధాత్ = భేదమును తెలుపు ప్రత్యక్షముచే బాధ కలుగుచున్నందున, న అనాత్మనాఽ పి = ఆత్మకాని జగత్తుతోను, అద్వైతత్వము – అభేదము సిద్ధింపదు.

ప్రత్యక్ష ప్రమాణము వలన జగత్తు వేరుగాను, ఆత్మలు వేరుగాను తెలియుచున్నందున ఆత్మ జగత్తులలో భేదము లేదనుట యుక్తము కాదని భావము.

ఆత్మ, జగత్తు రెండును సముచ్చితములై యద్వైత మన నొప్పదా?

"నోభాభ్యాం తేనైవ" 5. 63

తేనైవ = పై కారణము చేతనే, నోభాభ్యాం = ఆత్మ జగత్తులు సముచ్చితము లయ్యు నేకమన రాదు. ఆత్మజగత్తులు సముచ్చితములై యద్వైత మనుటయు ప్రత్యక్ష విరుద్ధమే యగునని సూత్రభావము.

అటులయిన నద్వైత ప్రతిపాదక శ్రుతితో విరోధము కలుగదా?

"అన్య పరత్వ మవివేకానాంతత్ర" 5.64

తత్ర = శ్రుతియందు, అవివేకానాం = శాస్త్రజ్ఞానము లేని వారికే అన్య పరత్వం = ద్వైతమునకంటె భిన్నత్వము బోధపడును.

శ్రుతి యద్వైతమును బోధించు ననుట యవివేకమే కాని వేరొండు కాదు. శాస్త్రజ్ఞానము లేనివారికి శ్రుతి యద్వైత బోధకముగా దోచునని భావము.

మట్టి యుపాదాన కారణముగా గల ఘటాదులు మట్టి కంటె వేరుగానట్లు, జగత్తున కాత్మ ఉపాదాన కారణము కావున జగత్తు ఆత్మకంటె భిన్న మెట్లగును?

"నాత్మాఽ విద్యా నోభయం జగ
దుపాదానకారణం నిః సంగత్వాత్" 5. 65

నిఃసంగత్వాత్ = సంగ (సంబంధ) రహితములగుటచే, జగ దుపాదాన కారణం = జగత్తున కుపాదాన కారణము, న ఆత్మా = ఆత్మకాదు, న అవిద్యా = అవిద్యయుకాదు, నోభయం = ఆత్మ, అవిద్య అను నీ రెండును కాదు.

జగత్తు ఆత్మోపాదానకము (జగత్తునకు ఆత్మ ఉపాదాన కారణము) అని మాయావాదు లందురు. ఆత్మోపాదానక మనగా నేమి? ఆత్మ మాత్రోపాదానకమా? లేక ఆత్మా శ్రిత మగు నవిద్యోపాదానకమా? లేక ఆత్మయు నవిద్యయునను రెండును జగత్తున కుపాదాన కారణమా? ఆత్మ కూటస్థమై

పరిణామరహితమైనది; కావున నయ్యది జగత్తున కుపాదానము కాజాలదు. అవిద్య కల్పితమగుటచే నయ్యదియు జగత్తున కుపాదానము కాదు. ఆత్మ అవిద్య అను నీ రెండును పరస్పరము సంగము (సంబంధము) లేని వగుటచే రెండును కలిసి జగత్తున కుపాదాన కారణమగుననుటయు పొసగదు. కాబట్టి జగత్తు ఆత్మోపాదానకము కావున నాత్మాభిన్నమగు ననుటయు యుక్తివిరుద్ధమని భావము.

జీవుని యానంద రూపత్వమును నిరాకరించుచున్నాడు.

"నైకస్యానంద చిద్రూపత్వే ద్వయోర్భేదాత్" 5.66

ఏకస్య = ప్రతి శరీరమునందు నొక్కడొక్కడుగ నుండు జీవాత్మునకు, న ఆనంద చిద్రూపత్వే = సుఖరూపత, జ్ఞానరూపత అను రెండు రూపములు లేవు. ద్వయోః = సుఖము, జ్ఞానము నను రెండింటిలో, భేదాత్ = భేదముండుట వలన

జీవుడు జ్ఞానరూపుడైనట్లు ఆనందరూపుడు నని కొందఱు (అద్వైతులు) చెప్పుదురు. కాని సాంఖ్యుల కది యభిమతము కాదు. జ్ఞానమునకు, ఆనందమునకు భేదముకలదు. మనుజుడు దుఃఖము ననుభవించునపుడు సుఖము ననుభవింపడు. జీవుడు సుఖ (ఆనంద) రూపుడగునెడల దుఃఖము ననుభవించుపుడును సుఖానుభూతి యుండవలయును. కాబట్టి జీవుడు జ్ఞానస్వరూపుడే కాని సుఖస్వరూపుడు కాడని భావము. కొండొకవేళ జీవుడు తనను సుఖరూపుడుగా నెంచునేల?

"దుఃఖనివృత్తేర్ గౌణః" 5. 67

దుఃఖనివృత్తేః = దుఃఖము తొలగినపుడు, గౌణః = కలుగు సుఖ జ్ఞానము గౌణము.

ఒకప్పుడొక తీవ్ర దుఃఖమునుండి ముక్తుడై జీవుడు 'దుఃఖముక్తుడ నైతి' నని చెప్పుటకు బదులు సుఖి నై తిని సుఖ స్వరూపుడ నైతిననును. (ఆనందోఽహమస్మి).

ముక్తావస్థయందు కొందఱు జీవున కానందరూపమును వర్ణింతురు కదా?

"విముక్తి ప్రశంసా మందానామ్" 5.68

మందానాం = వేదశాస్త్ర జ్ఞానహీనులు, విముక్తి ప్రశంసా = ముక్త్యవస్థయందు జీవున కానంద స్వరూపమును జెప్పుదురు.

శాస్త్రజ్ఞానము లేనివారు ముక్తినట్లు ప్రశంసింతురని భావము.

మనస్సు యొక్క విభుత్వమును నిరాకరించుచున్నాడు:-

**"న వ్యాపకత్వం మనసః కరణత్వా దింద్రియత్వాద్వా"** 5. 69

కరణత్వాత్ = గొడ్డలి మున్నగు వానివలె సాధన మగుట వలనను, ఇంద్రియత్వాద్వా = నేత్రాదులవలె నింద్రయ మగుట వలనను మనసః = మనస్సునకు, వ్యాపకత్వం = వ్యాపకత - విభుత్వము, న = లేదు.

**"సక్రియత్వాత్ గతిశ్రుతేః"** 5.70

మఱియు, గతిశ్రుతేః = మనస్సుతో కూడిన జీవుడు లోకాంతర మునకు వెళ్ళునట్లు శ్రుతి చెప్పుచున్నందున, సక్రియత్వాత్ = మనస్సు క్రియావంత మగుచున్నది. కాబట్టి యది వ్యాపకము కానేరదని భావము.

అటులయిన మనస్సు అణుపరిమాణము కలిగినదా?

**"న నిర్భాగత్వం తద్యోగాద్ ఘటవత్"** 5. 71

ఘటవత్ = ఘటమువలె, తద్యోగాత్ = భాగములు (అవయవములు) కలదగుటవలన, నిర్భాగత్వం = మనస్సు భాగములు లేని యణు పరిమాణము కలదనుట, న = తగదు.

మనస్సు సావయవియే కాని యణువు కాదని భావము. మనస్సు సావయవి యైన నది నిత్య మెట్లగును?

**"ప్రకృతి పురుషయోరన్యత్ సర్వ మనిత్యమ్"** 5. 72

ప్రకృతి, పురుషులు కాక మిగిలినదంతయు ననిత్యమే. కావున మనస్సు ననిత్యమే యని సూత్రార్థము.

**"స భాగలాభో భోగినో నిర్భాగత్వ శ్రుతేః"** 5.73

నిర్భాగత్వశ్రుతేః = శ్రుతి (అ జో నిత్యః శాశ్వతోఽ యం పురాణః ..... కఠ. 1.2.18.) వలన జీవుడు నిరవయవి - భాగరహితుడు అని తెలియుచున్నందున, భోగినః = జీవుడు, న భాగలాభః = సావయవి కాడు.

సంసారావస్థయందు వ్యక్తము కాని యానందము వ్యక్తమగుటచే ముక్తియని కొందఱు చెప్పుదురు. ఆ మతమును నిరాకరించుచున్నాడు:-

**"నానందాభివ్యక్తిర్ ముక్తిర్ నిర్ధర్మత్వాత్"** 5.74

నిర్ధర్మత్వాత్ = ఆత్మలో నానందమనెడి ధర్మమొకటి లేనందున, ఆనందాభివ్యక్తిః = ముక్తియందు ఆనందము అభివ్యక్తము (ప్రకటము) అగుటయే, న ముక్తిః = ముక్తి కాదు.

ఆత్మ జ్ఞానస్వరూపము. అందు జ్ఞానాది ధర్మము లుండవు. కాబట్టి ముక్తియందు ఆనందము అభివ్యక్తమగు ననుట పొసగదని భావము.

అటులయిన నెల్లగుణముల విచ్ఛేదము ముక్తియగునా?

**"న విశేషగుణోచ్ఛిత్తి స్తద్వత్"** 5.75

తద్వత్ = ఆనందాభివ్యక్తి ముక్తికానట్లు, న విశేషగుణోచ్ఛిత్తిః = విశేషగుణములు కలుగకుండుటయు ముక్తికానేరదు.

ఆత్మ మనః సంయోగము వలన జ్ఞానాది విశేషగుణములు కలుగుచుండును. అట్టి గుణములు కలుగుకుండుటయు ముక్తి కానేరదని భావము.

**"న విశేషగతిర్ నిష్క్రియస్య"** 5.76

నిష్క్రియస్య = క్రియారహితమైన ఆత్మయందు, న విశేష గతిః = నిరంతరము ఊర్ధ్వగతి కలుగుటయే ముక్తియనుటయు తగదు.

కొందఱు (జైనులు) జీవునకు నిరంతరము ఊర్ధ్వగతి కలుగుటయే ముక్తియందురు. అదియును యుక్తి సంగతము. కారణమేమన :-జీవుడు క్రియా రహితుడు. కాబట్టి యూర్ధ్వగతి ముక్తి యనుటయు తగదని భావము.

విజ్ఞాన వాదుల మత నిరాకరణము:-

**"నాకారోపరాగోచ్ఛిత్తిః క్షణికత్వాది దోషాత్"** 5.77

క్షణికత్వాది దోషాత్ = క్షణికత్వము మున్నగు దోషముల వలన, న ఆకారోపరాగోచ్ఛిత్తిః = విషయాకార వాసనా లక్షణ సంబంధము తొలగుటయు ముక్తికాదు.

కొందఱు (విజ్ఞాన వాదులు) క్షణిక విజ్ఞానమే ఆత్మ యందురు. అయ్యది ప్రతి క్షణమును విషయాకారమున నేర్పడుచుండును. అట్టి విషయాకారముల వాసన యనెడి సంబంధ విశేషము నశించుటయే ముక్తియందురు. కాని యదియును సాంఖ్యుల కభిమతము కాదు. కారణమేమన:- విజ్ఞానవాదుల మతమున పదార్థము లన్నియు క్షణికములే యగును. అట్టియెడ ముక్తి యననేమి? అది యెవ్వరికి? ఈ మతమును యుక్తి విరుద్ధమే యని భావము.

అటులయిన సర్వనాశమే ముక్తి యేలకాదు?

**"న సర్వోచ్ఛిత్తి రపురుషార్థత్వాది దోషాత్"** 5.78

అపురుషార్థత్వాది దోషాత్ = పురుషార్థము కానందువలనను, జీవనాశ మసంభవ మగుటవలనను సర్వోచ్ఛిత్తిః = విషయోపరాగము, జీవుడు నన్నియు

నశించుట, న = ముక్తికాదు.

విజ్ఞానాత్మ, విషయోపరాగము నన్నియు నశించుటయే ముక్తి యనుటయు తగదు సర్వనాశము పురుషార్థము కానేరదు. మఱియు జీవుడు నశించుననుట యసంగతమని భావము.

"ఏవం శూన్య మపి" 5.79

పై జెప్పిన దోషములవలననే సర్వము శూన్యమగుటయే ముక్తియను శూన్యవాదుల మతముకూడ నంగీకరింపదగనిదే యని భావము.

"సంయోగాశ్చ వియోగాంతా ఇతి న దేశాదిలాభోఽపి" 5. 80

సంయోగాశ్చ = సంయోగములు, వియోగాంతాః ఇతి = వియోగము చెందునవి కాబట్టి, దేశాదిలాభోఽ పి=కొండొక విశేష ప్రదేశమున జేరుటయు, న = ముక్తికాదు.

కొందఱు కొండొక విశేషస్థానమును పొందుట ముక్తి యందురు. కాని యొకా నొక స్థానమునజేరుట యననొక క్రొత్త ప్రదేశముతో సంబంధము కలుగుటయే కదా? అది యొక సంయోగవిశేష మనక తప్పదు. సంయోగ మనగా ప్రాప్తి. అట్టిది విడిపోవక తప్పదు. కాబట్టి సంయోగము లన్నియు వియోగాంతములు అందువలన గోలోక, వైకుంఠ కైలాస, ముక్తిపీఠములు మున్నగు స్థానములను బొందుట ముక్తి యనుటయు ప్రమాణ విరుద్ధమే.

"న భాగియోగో భాగస్యః" 5.81

భాగస్య = ఈశ్వరాంశమైన జీవునకు, భాగియోగః = అంశియైన ఈశ్వరునితో చేరుట, న = ముక్తికాదు.

కొందఱు జీవుడు ఈశ్వరుని యంశము (భాగము) కాబట్టి మరలనీశ్వరునియందు జేరిపోవుటయే ముక్తి యందురు. అదియును ముక్తి కాదు. ఈశ్వరుని జేరుట యన - నీశ్వరునితో జీవునకు సంయోగము గలుగుటయే కదా! సంయోగము వియోగాంతమే యగును కాబట్టి యీశ్వర సంయోగము ముక్తి కాదని భావము. వాస్తవమున జీవు డంశము (భాగము) కాదు. అంశ మగునెడల ననిత్య మగును.

అటులయిన నణిమాది ప్రాప్తియే ముక్తి యగునా?

"నాణిమాది యోగోఽప్యవశ్యంభావిత్వా
త్తదుచ్ఛిత్తి రితరయోగవత్ః" 5.82

ఇతరయోగవత్ = స్థానాది ఇతర సంయోగములవలె, తదుచ్ఛిత్తిః =

అణిమాదుల ప్రాప్తినాశమును, అవశ్యంభావిత్వాత్ = తప్పక కలుగును. కాబట్టి, అణిమాదియోగోఽపిన = అణిమ, మహిమ, మున్నగు విభూతుల ప్రాప్తియు ముక్తి కానేరదు.

యోగశాస్త్రమున వర్ణింపబడిన అణిమాది విభూతులను పొందుటయు ముక్తి కానేరదని భావము.

**"నేంద్రాది పదయోగోఽపి తద్వత్"** 5.83

*తద్వత్ = అణిమాదుఖ ప్రాప్తి నశించునట్లు నశించునదియే కాబట్టి, ఇంద్రాది పదయోగోఽపి న = ఇంద్రాదిపద ప్రాప్తియు ముక్తి కాదు.*

ఇంద్ర, బృహస్పతి, ప్రజాపత్యాది పదవుల ప్రాప్తియు ముక్తికాదని భావము.

నాసికాది ఇంద్రియములు పంచభూతముల నుండి యేర్పడినట్లు న్యాయ వైశేషికకారులు (గౌతమ కణాదులు) చెప్పుదురు. అహంకారము నుండి నాసికా దీంద్రియములేర్పడునని సాంఖ్యుల మతము. అది యిట నిరూపించుచున్నాడు.

**"న భూత ప్రకృతిత్వ మింద్రియాణామ్ అహంకారికత్వ శ్రుతేః"** 5. 84

*అహంకారికత్వశ్రుతేః = అహంకారమునుండి యింద్రియము లుత్పన్నములైనట్లు శ్రుతి చెప్పుచున్నందున, ఇంద్రియాణామ్ = నాసికాదీంద్రియములు, భూత ప్రకృతికత్వం న = భూతములనుండి యుత్పన్న మగుననుట సరికాదు.*

**"న షట్పదార్థ నియమస్త ద్బోధాన్ముక్తిః"** 5.85

మఱియు సాంఖ్యులమైన మాకు షట్పదార్థ నియమః = పదార్థము లారే యను నియమము కాని, తద్బోధాత్ ముక్తిః = వాని తత్త్వ జ్ఞానము వలన ముక్తి కలుగునని కానీ, న = అంగీకారము కాదు. ద్రవ్య గుణ కర్మాది షట్ పదార్థ జ్ఞానమువలన గాక, పంచవింశతి (ఇరువదియైదు) తత్వముల వివేకము వలన ముక్తి కలుగునని భావము.

**"షోడశాది ష్వప్యేవమ్"** 5.86

ఇట్లే నై యాయికులు పదార్థములు ప్రమాణ, ప్రమేయాది భేదములతో పదునాఱనియు వాని తత్త్వజ్ఞానము వలన నిఃశ్రేయసప్రాప్తి (ముక్తి) కలుగుననియు జెప్పుదురు. అదియు సాంఖ్యులకు సమ్మతము కాదని యా సూత్రాభిప్రాయము.

షట్ పదార్థములు, షోడశపదార్థములు నన నేమో వాని వివరణ

మేమో తెలియగోరువారు నాచే రచియింపబడిన న్యాయ వైశేషిక ధర్శనముల (అంబా వ్యాఖ్యానము) జదువగోరుచున్నాడ.

"నాణునిత్యతా తత్కార్యత్వ శ్రుతేః" 5.87

అణునిత్యతా = అణువు నిత్యత్వము, న = సంభవము కాదు. తత్కార్యత్వ శ్రుతేః = అణువులు ప్రకృతి కార్యము లగుటవలన.

ఇతర శాస్త్రములందు చెప్పబడు అణువుల నిత్యము లనుట యుక్తము కాదు. అవి కార్యములగుటచే ననిత్యము లే యని భావము. ఈ సూత్రమున జెప్పబడిన అణు పదము ద్వ్యణుకమో లేక త్రసరేణువగు త్ర్యణుకమో యై యుండవలయును. ద్వ్యణుకాదులే కార్యములనుట యుక్తము. వైశేషికాదులందు జెప్పబడిన అణుపదముపరమాణువు పరము. అయ్యది కార్యము కాదు – నిరవయవము – నిత్యము. కాబట్టి ద్వ్యణుకా ద్యణుపదార్థ మిట గ్రహించుట యుక్తమగును.

విజ్ఞానభిక్షువు మాత్రము అణుపదము పరమాణు పరమే యనియు, అణుపదము ద్వ్యణుకా ద్యణుపదార్థ పరముగా జెప్పుటకు ప్రమాణము గానమనియు వర్ణించియున్నాడు. అణువు కార్యమని చెప్పు శ్రుతిమాత్రము ప్రస్తుతము లోపించిన దనియు నతడు భాషించి యున్నాడు.

వాస్తవమున సాంఖ్య మతమున సత్త్వరజ స్తమోరూప ప్రకృతి కార్యము లయిన తన్మాత్రరూపములే యిట యణువులుగా జెప్పి, యవి కార్యములు కాబట్టి నిత్యములు కావనిన నెంతయు బాగుండును.

"న నిర్భాగత్వం కార్యత్వాత్" 5.88

కార్యత్వాత్ = కార్య మగుటవలన, న నిర్భాగత్వం = భాగహితము = అవయవరహితము అనరాదు.

అణువను పదార్థము కార్యపదార్థము కాబట్టి నిరవయవము – నిర్భాగము అనజనదని భావము.

"న రూపనిబంధనాత్ ప్రత్యక్ష నియమః" 5.89

రూప నిబంధనాత్ = కేవల రూప మున్నంత మాత్రమున, న ప్రత్యక్ష నియమః = వస్తువు ప్రత్యక్షము కావలయునను నియమము యుక్తముకాదు.

కేవల రూపము వస్తువు ప్రత్యక్షమునకు నిమిత్తము కాదు. అటులయిన ద్వ్యణుకము కూడ ప్రత్యక్షము కావలసివచ్చును.

"న పరిమాణచాతుర్విధ్యం ద్వాభ్యాం తద్యోగాత్" 5.90

*ద్వాభ్యాం = అణువు, మహత్తు, నను రెండు విధములగు, తద్యోగాత్ = పరిమాణ సంబంధమువలన, పరిమాణచాతుర్విధ్యం న = పరిమాణము నాలుగు విధము లనజనదు.*

కొందఱు అణువు, మహత్తు, హ్రస్వము, దీర్ఘము నని పరిమాణమును నలువిధముల వ్యవహరింతురు. ఈ వ్యవహారము సాంఖ్యావాదుల కనంగీకృతము. అణువు, మహత్తు నని రెండు విధముల వ్యవహరించుటయే యుక్తమని సాంఖ్యాభిప్రాయము.

'వాడే వీడు'. 'అదియే యిది' యని గుర్తించుట ప్రత్యభిజ్ఞ యనబడును. అయ్యది సామాన్యవిషయక మని వర్ణించుచున్నాడు:-

**"అనిత్యత్వేఽ పి స్థిరతాయోగాత్**
**ప్రత్యభిజానం సామాన్యస్య"** 5. 91

*అనిత్యత్వేఽ పి = అనిత్యమయినప్పటికి, స్థిరతాయోగాత్ = చిరకాలముండునదిగా నంగీకరింపబడుటవలన, ప్రత్యభిజ్ఞానమ్ = ప్రత్యభిజ్ఞానము (గుర్తించుట), సామాన్యస్య = సామాన్యము విషయము.*

సాంఖ్యమతమున ప్రకృతి పురుషులకు వ్యతిరిక్త మంతయు ననిత్యమగుటచే ప్రత్యభిజ్ఞానముకూడ ననిత్యమే. అయినను నయ్యది చిరకాల ముండును కాబట్టి సామాన్య విషయకమని యభిప్రాయము. సామాన్యమనగా నిట అనేక వస్తువులలో సమానబుద్ధిని గలిగించు ధర్మమని గ్రహింపవలయును, అట్టిది యొకటి లేకున్నచో 'అదియే యిది' 'వాడే వీడు' అను ప్రత్యభిజ్ఞ కలుగజాలదని భావము. ఇయ్యది బౌద్ధు లంగీకరింపరు.

ప్రత్యభిజ్ఞకు సామాన్యము విషయమైన నేమి?

**"న తదపలాపస్తస్మాత్"** 5. 92

*తస్మాత్ = సామాన్యము (అనుగత ధర్మము) ప్రత్యభిజ్ఞకు విషయము కాబట్టి, న తదపలాపః = సామాన్యము నంగీకరింప కుండుట యుక్తము కాదు.*

ఘటపటాదులలో ఘటత్వము, పటత్వము నను సామాన్యము (అనుగత ధర్మము) 'ఘటము పటము కాదు' అను పటత్వాభావరూపమే కాబట్టి దానిని వేరుగా నంగీకరింపనేల? అతద్వ్యావృత్తి రూపమే యన జనదా? యన:-

**"నా న్యనివృత్తి రూపత్వం భావప్రతీతేః"** 5. 93

*భావప్రతీతేః = భావ (ఉనికి) జ్ఞానము కలుగుటవలన, అన్య నివృత్తి*

*రూపత్వం న = (సామాన్యము) అభావ రూపము (ఘటత్వ మనగా పటాన్యత్వము) కాదు.*

'అదియే యిది', 'వాడే వీడు' అను ప్రత్యభిజ్ఞకు విషయము ఘటమో. లేక, దేవదత్తుడో యగును కాని, పటాన్యత్వమో, యజ్ఞదత్తాభావమో కాదు. కాబట్టి సామాన్యము భావరూపమే కాని యభావము కాదు.

అటులయిన ప్రత్యభిజ్ఞకు విషయము సాదృశ్యమేల కాదు?

**"న తత్త్వాంతరం సాదృశ్యం. ప్రత్యక్షోపలబ్ధేః** 5. 94

*సాదృశ్యం = సమానత, నతత్త్వాంతరం = అనే కావయవములలో గల సమానతకంటె వేరే వస్తువు కాదు. కారణ మేమన :- ప్రత్యక్షో పలబ్ధేః = ప్రత్యక్షప్రమాణము వలన తెలియబడుచున్నందున*

'గోవువంటిదే గవయము' అను తావున సాదృశ్యము ప్రత్యక్ష గోచరమైనట్లు 'అదే యిది' అను ప్రత్యభిజ్ఞా స్థలము నందును సాదృశ్యము ప్రత్యక్షమే యగును. కాబట్టి యది తత్త్వాంతరముకాదు అందువలననే సాదృశ్యము ప్రత్యక్షము నకు విషయమే యగును కాని ప్రత్యభిజ్ఞకు విషయము కానేరదని భావము.

సాదృశ్యము అన్యవస్తుజ్ఞానము నపేక్షించును. కాబట్టి యది వస్త్వంతర మేల కాదు?

**"నిజశక్త్య భివ్యక్తిర్వా వైశిష్ట్యాత్తదుపలబ్ధేః"** 5.95

*వా = లేక, వైశిష్ట్యాత్తదుపలబ్ధేః = వైశిష్ట్యమువలన సాదృశ్య జ్ఞానము కలుగుచున్నందున, నిజశక్త్యభివ్యక్తిః = మరియొక వస్తువు యొక్క దర్శనము నపేక్షించు వస్తువు యొక్క స్వాభావికశక్తియే సాదృశ్య మనబడును.*

సాదృశ్యమనగా మఱియొక వస్తువు యొక్క జ్ఞానము నపేక్షించు కొండొక వస్తువు యొక్క స్వాభావికశక్తియే కాని వేరొండు వస్తువు కాదు. కాబట్టి సాదృశ్యము వేరొండు వస్తువు కాదు.

సాదృశ్యము వలన సంజ్ఞాసంజ్ఞి సంబంధజ్ఞానము కలుగుచున్నది. కాబట్టి సాదృశ్యము స్వాభావిక శక్తి యనుట యుక్తి సంగత మెట్లగును?

**'న సంజ్ఞా సంజ్ఞి సంబంధోఽపి'** 5. 96

*సంజ్ఞా సంజ్ఞి సంబంధోఽపి = సంజ్ఞాసంజ్ఞి సంబంధము కూడ, న = సాదృశ్యమువలన తెలియదు.*

సంజ్ఞయనగా పేరు. సంజ్ఞియనగా పేరుగల వస్తువు. ఆ రెండింటికి

గల సంబంధము సాదృశ్యము వలన తెలియుననుట సరికాదు. ఆ సంబంధము వృద్ధుల యుపదేశాదుల వలననే కలుగును. కాబట్టి సంజ్ఞా సంజ్ఞి సంబంధ జ్ఞానమునకు సాదృశ్యము హేతువైనందున నయ్యది వస్త్వంతరమనుట యుక్తము కాదని భావము.

దిక్కాలాదుల సంబంధము నిత్యమనుట యుక్తము కాదని యీ సూత్రమున వర్ణించుచున్నాడు.

**"న సంబంధనిత్య తోభయా నిత్యత్వాత్"** 5. 97

*ఉభయానిత్యత్వాత్ = దిక్కాలములు, కాలాకాశములు ననునవి నిత్యములు కానందున, న సంబంధనిత్యతా = వాని సంబంధమును నిత్యము కాదు.*

సాంఖ్య మతమున కాలాకాశాదులన్నియు ననిత్యములు. అందువలన వాని సంబంధమును నిత్యము కానేరదు.

సంబంధము గల వస్తువు లనిత్యములయినను వాని సంబంధము నిత్య మేల కాదు?

**"నాజః సంబంధః ధర్మిగ్రాహకమాన బాధాత్"** 5. 98

*ధర్మిగ్రాహకమానబాధాత్ = సంబంధము గల వస్తువులను గ్రహింపజేయు ప్రమాణముచేతనే బాధింపబడుట వలన, న అజః సంబంధః = వాని సంబంధము నిత్యము కాదు.*

సంబంధము విభాగపూర్వకమే యగును. అనగా నొకప్పుడు విడివిడిగా నుండు వస్తువుల కలయికయే సంబంధ మనబడును. ఇట్టి జ్ఞానమే ప్రమాణము వలన కలుగునో యా ప్రమాణమే యా సంబంధము నిత్యము కానేరదని తెలుపునని భావము.

అటులయిన కార్యకారణములకు గల సమవాయ సంబంధము కూడ నిత్యము కాదా?

**"న సమవాయోఽస్తి ప్రమాణాభావాత్"** 5. 99

*ప్రమాణాభావాత్ = ప్రమాణమే లేనందున, సమవాయః న అస్తి = సమవాయము లేదు.*

కార్యకారణముల మధ్య సమవాయ మను పేరు గల సంబంధమే లేదు. అట్టి సంబంధమును సాధించు ప్రమాణమును లేదు. కాబట్టి యా సంబంధ మంగీకరింప తగినదికాదు. సంబంధమే లేనపుడు దాని నిత్యత్వము

సుతరాం. చెల్లదని భావము.

ప్రత్యక్షానుమాన ప్రమాణముల వలన నేల యది సిద్ధింపదు?

**"ఉభయత్రాప్యన్యథాసిద్ధేర్ న ప్రత్యక్షమనుమానం వా"** 5.100

ఉభయత్రాపి = ప్రత్యక్షానుమాన ప్రమాణద్వయము నందును, అన్యథాసిద్ధేః = స్వరూపసంబంధముచేతనే కార్యము సిద్ధించుచున్నందున, న ప్రత్యక్షమనుమానం వా = ప్రత్యక్షముకానీ, అనుమానము కానీ సమవాయ సంబంధమును తెలుపజాలవు.

నైయాయికులు వైశేషికులు దేనిని సమవాయ సంబంధమందురో యా సంబంధమునే యోగులు సాంఖ్యులు స్వరూపసంబంధ మందురు. కాబట్టి సాంఖ్య మతమున సమవాయ సంబంధ మొండు లేదనియు, నది నిత్యము కాదనియు పై సూత్రములందు వర్ణింపబడినది.

బౌద్ధులు 'క్రియ ప్రత్యక్షగమ్యము కాదు. కేవలము అనుమానగమ్యమే' యని యందురు. ఆ మతము సరికాదని యనుచున్నాడు.

**"నానుమేయత్వమేవ క్రియాయా నేదిష్ఠస్య**
**తత్తద్వతోరే వాపరోక్షప్రతీతేః"** 5. 101

నేదిష్ఠస్య = మిక్కిలి సమీపముననుండు వానికి, తత్తద్వతో రేవ = క్రియయొక్కయు, క్రియగల వస్తువు యొక్కయు, అపరోక్ష ప్రతీతేః = ప్రత్యక్ష జ్ఞానము కలుగుట వలన, క్రియాయాః = క్రియ యొక్క జ్ఞానము, నానుమేయత్వమేవ = అనుమాన ప్రమాణము వలన మాత్రమే కలుగుననుట యుక్తము కాదు.

'ఒక వస్తు వొక స్థానమున ముందు కనబడి మఱియొక క్షణమున నయ్యది మఱియొక స్థానమున కనబడుననుకొనుడు. అప్పుడా వస్తువు పూర్వప్రదేశమునువిడిచి క్రొత్తప్రదేశమును చేరినదని యెంచవలయును. ఇట్లు పూర్వదేశ విభాగము మఱి యొక ప్రదేశ సంయోగమును మన మావస్తువున జూతుము. అనగా ప్రత్యక్ష మగును. ఈ సంయోగ వియోగముల వలన నా వస్తువునందు ఒక చోటునుండి మఱియొకచోటుకు పోవుట యను క్రియ గలిగిన ట్లూహింతుము. అనగా అనుమానము వలన తెలసికొందుము. కాబట్టి క్రియ అనుమానమువలననే తెలియును కాని ప్రత్యక్ష ప్రమాణగమ్యము కాదు.' అని బౌద్ధుల మతము. సాంఖ్యు లట్లంగీకరింపరు దగ్గరగా నుండి చూచువానికి వస్తువు ప్రత్యక్షమైనట్లు వస్తువులో జరుగు క్రియయు ప్రత్యక్ష మగును.

ఆకాశమున దూరమున నెటనో యుండు సూర్యాది గోళములందు జరుగు క్రియ ప్రత్యక్షము కాకపోవచ్చును. అది యనుమాన గమ్యమైన కావచ్చు. కాబట్టి క్రియ కేవల మనుమానగమ్య మనుట యుక్తము కాదని సాంఖ్య మతము.

కొందఱు(ప్రాణుల స్థూలదేహము పాంచభౌతికమందురు. అనగా పృథివ్యాది పంచభూతముల న్యూనాధిక భాగములతో నీ శరీరమేర్పడు నందురు. అది యుక్తము కాదను చున్నాడు.

**"న పాంచభౌతికం శరీరం బహూనా ముపాదానాయోగాత్"** 5.102

*బహూనా ముపాదానాయోగాత్ = భిన్నజాతులకు సంబంధించిన అనేక పదార్థము లొక వస్తువునకు ఉపాదానకారణము కాజాలవు కాబట్టి, శరీరం = స్థూలశరీరము, పాంచభౌతికం న = పంచభూతాత్మకము కాదు - పంచభూతములచే నేర్పడినది కాదు.*

ఒక పదార్థ మేర్పడుట కనేక భిన్న జాతీయ పదార్థములు ఉపాదానకారణము కాజాలవు. కాబట్టి స్థూలదేహము పాంచభౌతికము కాదని సూత్రాభిప్రాయము.

కొందఱు స్థూల శరీరము తప్ప వేరొండు శరీరము లేదందురు. ఆ మత మయుక్త మనుచున్నాడు :-

**"న స్థూలమితినియమ అతివాహికస్యాపి విద్యమానత్వాత్"** 5.103

*అతివాహికస్యాపి విద్యమానత్వాత్ = జీవాత్మ నొక శరీరము నుండి మఱియొక శరీరమునకు గొంపోవు సూక్ష్మశరీర ముండుట వలన, స్థూల మితినియమః న = స్థూలశరీరము తక్క వేరొక శరీరము లేదను నియమము యుక్తము కాదు.*

స్థూలశరీరము కాక జీవుని శరీరాంతరమునకు గొంపోవు సూక్ష్మశరీర మెండు కలదని సూత్రాభిప్రాయము.

తమతో సంబద్ధముకాని వస్తువుల జ్ఞానము నింద్రియములు కలిగించునని బౌద్ధులందురు ఆ మతమును నిరాకరించు చున్నాడు.

**"నా ప్రాప్తప్రకాశకత్వ మింద్రియాణా**
**మప్రాప్తేః సర్వప్రాప్తేర్ వా"** 5.104

*ఇంద్రియాణాం = ఇంద్రియములు, అప్రాప్త ప్రకాశకత్వం న = తమతో అసంబద్ధ వస్తువులను ప్రకాశింప జేయవు. కారణ మేమన :- అప్రాప్తేః =*

అసంబద్ధ వస్తువుల జ్ఞానము కలుగకుండుట జూచుచున్నాము. అసంబద్ధ వస్తుజ్ఞానము కలుగునెడల, సర్వప్రాప్తేర్వా = ఎల్ల వస్తుజ్ఞానము కలుగవలయును.

వస్తువు లింద్రియములతో సంబద్ధమును కాకున్నను వాని జ్ఞానము కలుగునని యంగీకరింతుమేని, దూరము, దగ్గర, అడ్డంకుగలది, అడ్డంకు లేనిది యను భేదము లేక యెల్ల వస్తువుల జ్ఞానము కలుగవలసివచ్చును. అట్లు కలుగదు; కాబట్టి ఇంద్రియములు తమతో సంబద్ధవస్తువుల జ్ఞానమే కలిగింప గలవని భావము.

అటులయిన చక్షురింద్రియము తైజసమే యగును కాని, ఆ అహంకారజన్య మెట్లగును? తైజసమగునెడల కిరణరూపమున వస్తువున్న స్థలమునకేగి దానితో సంయుక్తమై దానిని ప్రకాశింప జేయగలుగును. కాబట్టి ఇంద్రియములు భూత ప్రకృతికములు కావు; ఆహంకారికములే యన నెట్లు చెల్లు ననః–

**"న తేజోపసర్పణాత్ తైజసం చక్షుర్ వృత్తితస్తత్సిద్ధేః"** 5.105

*తేజోఽ పసర్పణాత్ = దూరముననుండు వస్తువును ప్రకాశింప జేయుటకు కిరణరూపమున తేజస్సు (అగ్ని) ప్రసరించుచున్నందున, చక్షుః = నేత్రము, తైజసమ్ = తేజోజన్యము అనుట న = తగదు. వృత్తితః తత్సిద్ధేః = చక్షురింద్రియములో శరీరమును విడిచి వస్తుప్రదేశమునకు జేరు వృత్తియొకటి కలదు.*

గోలకములు ఇంద్రియములు కావు. ఇంద్రియము లాయా గోలకములందుండును. అయ్యవి వస్తువులను జేరివాని జ్ఞానమును కలిగించును. కాబట్టి చక్షురింద్రియము తైజసమే కాని ఆహంకారికము కాదనుట చెల్లదని భావము.

చక్షువునం దొకవృత్తి వస్తువును జేరునది యున్నట్లు సిద్ధము కానందున దానివలన నయ్యది వస్తువును జేరు ననుటెట్లు?

**"ప్రాప్తార్థప్రకాశ లింగాద్ వృత్తిసిద్ధిః"** 5. 106

*ప్రాప్తా..... లింగాత్ = తమతో సంబద్ధమగు నర్థము నింద్రియములు ప్రకాశింప జేయును. అట్టి హేతువు వలన, వృత్తి సిద్ధిః = ఇంద్రియములందు వస్తువులను జేరు వృత్తి యున్నట్లు సిద్ధించును.*

ఆ వృత్తి ఇంద్రియముల భాగమా? లేక ద్రవ్యములోని రూపాదులవలె నది గుణమా?

"భాగగుణాభ్యాం తత్త్వాంతరం వృత్తిః సంబంధార్థం సర్పతీతి" 5.107

*సంబంధార్థం సర్పతీతి = వస్తువులతో సంబంధ మేర్పరచుటకు ప్రసరించును కాబట్టి, వృత్తిః = ఇంద్రియ వృత్తి, భాగగుణాభ్యాం = భాగ గుణములకంటె, తత్త్వాంతరం = భిన్నపదార్థము.*

ఇంద్రియ వృత్తి యనునది అగ్నికి విస్ఫులింగము (నిప్పుకణము) భాగమైనట్లు భాగము కానీ, ద్రవ్యములోని రూప రసాదులవలె గుణము కానీ కాదు. అది యొక భిన్న పదార్థమని భావము.

చక్షురాదీంద్రియములు ద్రవ్యము లగు నెడల నవి, వృత్తులద్వారా వస్తువులను జేరి వానిని ప్రకాశింపజేయు ననుట యుక్తమగును. అవి యహంకార జన్యము లయినందున నది యెట్లు సంభవ మగును? అన:-

"న ద్రవ్య నియమ స్తద్యోగాత్" 5.108

*న = ద్రవ్యమగుటచే నది క్రియగలది యగునను నియమము లేదు. తద్యోగాత్ = క్రియాసంబంధము వలన, ద్రవ్య నియమః = ద్రవ్య మనబడును.*

సాంఖ్యమతమున ద్రవ్య మయినంత మాత్రమున నది క్రియ గలదగునను నియమము లేదు. కాని, క్రియా సంబంధము గల ప్రతి పదార్థమును ద్రవ్య మనబడును. కాబట్టి వృత్తిరూప క్రియా సంబంధ ముండుటచే నింద్రియములు ద్రవ్యము లనబడును. అందువలన నయ్యవి యహంకార జన్యములయినను దోషము లేదని భావము.

ఒకచో నింద్రియము లాహంకారికము (అహంకార జన్యము) లయినను మఱియొకచో నవి భౌతికములు (భూత జన్యములు) కాగలవా?

"న దేశభేదేఽ ప్యన్యోపాదానతా అస్మదాది వన్నియమః" 5.109

*దేశభేదేఽ పి = భిన్నదేశము నందును, అన్యోపాదానతా న = ఇంద్రియముల కుపాదాన కారణము అహంకారమే కాని భూతములు కావు. అస్మదాదివత్ నియమః = మన ఇంద్రియము లాహంకారికము లయినట్లు సర్వదేశములందును ఇంద్రియములు ఆహంకారికములే.*

ఒకచో నింద్రియములాహంకారికము లై మఱియొకచో నవి భూత ప్రకృతికము లగుననుట యుక్తముకాదని భావము.

"నిమిత్త వ్యపదేశాత్తద్వ్యపదేశః" 5. 110

*నిమిత్తవ్యపదేశాత్ = ఇంద్రియముల కాధారములై భూతము లొకింత నిమిత్తము లగుట వలన, తద్వ్యపదేశః = ఇంద్రియములు భౌతికము లనబడును.*

(అన్నమయం హి సౌమ్య మనః) 'మనస్సు అన్న మయము' అను నిట్టి వాక్యములందు మనస్సు మున్నగు నింద్రియములు భూత ప్రకృతికములు (పంచభూత జన్యములు) అయినట్లు వ్యవహరించుట జూచుచున్నాము. అట్టి వ్యవహారము అగ్న్యాదిభూతము లింద్రియముల కాధారములైనందున సంభవము కావచ్చును. అంతియే కాని అగ్ని ప్రభృతి భూతము లింద్రియముల కుపాదానకారణ మగుట వలన కాదు. కాబట్టి యింద్రియము లాహంకారికములే యని భావము.

శరీర భేదములు:-

"ఊష్మజాండజ జరాయుజోద్భిజ్జసాంకల్పిక
సాంసిద్ధికంచేతి ననియమః" 5. 111

ఊష్మజములు, అండజములు, జరాయుజములు, ఉద్భిజ్జములు, సాంకల్పికములు, సాంసిద్ధికములు నని శరీరము లారు విధములు. కాబట్టి కొందఱు జెప్పునట్లు (అండజ, స్వేదజ, జరాయుజ, ఉద్భిజ్జములు) నాలుగు విధముల శరీరములే యను నియమము లేదని సూత్రార్థము.

కృములు, దోమలు మున్నగునవి ఊష్మజములు అనగా వేడివలన వాని శరీరము లేర్పడును. పక్షులు, సరీ సృపాదులు అండములనుండి జనించును; కావున నండజములు జరాయువనగా గర్భవేష్టనము. దానినుండి పుట్టునవి జరాయుజములు. భూమిని భేదించి జనించున వియుద్భిజ్జములు. సృష్టికి నాదియందు ప్రజాపతి సంకల్పమున నుత్పన్నములగు ఋషుల శరీరములు సాంకల్పికములు. యోగసంసిద్ధిచే నేర్పఱచుకొనబడు శరీరములు సాంసిద్ధికము లనబడును.

లోకమున నీ శరీరములన్నియు పార్థివములని వ్యవహరింప బడుచున్నవి. అట్టియెడ నీ శాస్త్రమునందు (పాంచభౌతికో దేహః 3. 10) దేహము పాంచ భౌతికమని యేల చెప్పబడినది?

"సర్వేషు పృథివ్యుపాదాన మసాధారణ్యా
త్తద్వ్యపదేశః పూర్వవత్" 5.112

పూర్వవత్ = ఇంద్రియములు ఆహంకారికము లయినను భౌతికములని వ్యహరించినట్లు, సర్వేషు = అన్ని విధములయిన దేహము లందును, అసాధారణ్యాత్ = ప్రధానముగ పృధివ్యుపాదానమ్ = పృధివి ఉపాదానకారణము మిగిలిన భూతములు సాధారణ కారణము. కాబట్టి తద్వ్యపదేశః = పార్థివ

వ్యవహారము లోకమున నేర్పబడిన దని భావము.

శరీరము భౌతిక మయినచో నందలి ప్రాణముకూడ భౌతికమేల కాదు?

**"న దేహారంభకస్య ప్రాణత్వ మింద్రియ శక్తిత స్తత్సిద్ధేః"** 5.113

ఇంద్రియ శక్తితః = ఇంద్రియముల శక్తి విశేషము వలన, తత్సిద్ధేః = ప్రాణము సిద్ధించుటవలన, దేహారంభకస్య = శరీర ముత్పన్నమగుటకు హేతువులయిన భూతములు, ప్రాణత్వం = ప్రాణము నుత్పన్నము చేయునవి, న = కాదు.

ప్రాణము ఇంద్రియముల శక్తి విశేషము వలన నేర్పడు నది కావున నది భౌతికము కాదు.

భోక్తయగు జీవుడీ శరీరము నెన్న దధిష్ఠించును?

**'భోక్తు రధిష్ఠానాద్ భోగాయతన నిర్మాణ**
**మన్యథా పూతిభావ ప్రసంగాత్"** 5.114

భోక్తుః = జీవునియొక్క, అధిష్ఠానాత్ = సంబంధము వలన, భోగాయతన నిర్మాణమ్ = శరీర నిర్మాణ మేర్పడును, అన్యథా= సంబంధము లేనివాడు, పూతిభావ ప్రసంగాత్ = మృత శరీరము వలె శుక్ర శోణితములు చెడిపోవును.

అధిష్ఠాత, అదిష్ఠేయము నను రెండింటికి గల విశేష సంబంధము ఈ సూత్రమున అధిష్ఠాన మనబడినది. శరీరమునకు జీవుడే అధిష్ఠాత. కాబట్టి జీవసంబంధము కలుగని నాడు దేహారంభకము లయిన శుక్రశోణితములు వ్యర్థములై చెడిపోవునని భావము.

పరమాత్ముని అధిష్ఠానము (సంబంధము) వలన సృష్టి యందలి ప్రతికార్య మారంభమగునని కదా వినుచున్నాము. అట్టియెడ జీవాధిష్ఠానమున శరీరారంభ మెట్లు చెప్పదగు నన:-

**"భృత్యద్వారా స్వామ్యధిష్ఠితిర్ నైకాంతాత్"** 5.115

భృత్యద్వారా = భృత్యునివంటి జీవుని ద్వారా, స్వామ్యధిష్ఠితిః = పరమాత్మ సంబంధము, న ఏ కాంతాత్ = సాక్షాత్తుగ కాదు.

పరమాత్మునిచే సదా భరింపబడువాడు కావున జీవుడు భృత్యుడు. పరమాత్ముడు వ్యాపకుడు కాబట్టి జీవసంబంధ మతని కుండును. ఆత్మస్థుడై పరమాత్ముడు శరీరాధిష్ఠాతయగును. కాబట్టి సాక్షాత్సంబంధము జీవునకే యైనను పరంపరగా సర్వకార్యాధిష్ఠాత పరమాత్మ యగుచున్నాడు. అందువలననే

పరమాత్మ జగదధిష్ఠాత యని వినుచున్నాము.

అటులయిన జీవాత్మతోబాటు పరమాత్ముడు నధిష్ఠాత యగుచుండుట వలన జీవాత్మకు బుద్ధిసత్త్వ మెట్లు సన్నిహితమో పరమాత్మయు నట్లు సన్నిహిత మనవలసి వచ్చును. కాబట్టి జీవునకు బుద్ధిసత్త్వసరూపత (సమాన రూపము) కలుగునట్లు పరమాత్మ సారూప్యమును కలుగును గదా? యన:-

**"సమాధి సుషుప్తి మోక్షేషు బ్రహ్మరూపతా"** 5.116

సమాధిః = యోగము, సుషుప్తిః = నిద్ర, మోక్షః = విదేహ కైవల్యము. సమాధి, సుషుప్తి, మోక్షములందు జీవునకు బ్రహ్మ రూపత కలుగును. జీవుడు జాగ్రదవస్థయందు బుద్ధిరూపమునొంది ప్రకృతి యందు వర్తించునట్లు, యోగము, నిద్ర, మోక్షము నను నీ మూడవస్థలలోను పరమాత్మ సమానరూపము నందినవాడై బ్రహ్మానందాది సుఖముల ననుభవించునని భావము.

(జుష్టం యదా పశ్యత్యన్యమీశ మస్య మహిమాన మితి వీతశోకః నిరంజనః పరమం సామ్యము పైతి)

'జీవుడు తనతో నున్న పరమాత్ముని తెలిసికొని, శోకరహితుడై; నిరంజనుడై పరమసామ్యము నందు' నని శ్రుతులందును వర్ణింపబడినది.

సమాధి సుషుప్తులలోను మోక్షమునందు వలెనే బ్రహ్మసారూప్య మేర్పడునెడల మోక్షమునకు నిద్రా సమాధులకుగల భేదమేమి?

**"ద్వయోః సబీజ మన్యత్ర తద్ధతి"** 5.117

ద్వయోః = సమాధి సుషుప్తులలో, సబీజమ్ = బంధహేతువగు క్లేశాది వాసనాసహిత బ్రహ్మ సారూప్యముండును. అన్యత్ర = మోక్షమునందు, తద్ధతిః = ఆ బంధవాసనలేని బ్రహ్మ సారూప్య ముండును ఇదియే భేదము.

లోకమున నిద్రాసమాధులే తెలియబడుచున్నవి కాని మోక్షము తెలియబడుట లేదు కదా! యన:-

**"ద్వయోరివ త్రయస్యాపి దృష్టత్వాన్నతు ద్వౌ"** 5.118

ద్వయోరివ = సమాధి, సుషుప్తుల వలెనే, త్రయస్యాపి = మోక్షము సైతము, దృష్టత్వాత్ = శ్రుతి స్మృతుల ద్వారా చూడబడుట వలన, న తుద్వౌ = సమాధి, సుషుప్తియే కాని మోక్షము లేదనుట యుక్తము కాదు.

సమాధియందు క్లేశాది వాసనలు కుంఠితము లగుటచే జీవునకు బ్రహ్మ సారూప్య మేర్పడిన నేర్పడవచ్చును; కాని, సుషుప్తియం దది యెట్లు సంభవించును?

"వాసనయాఽ నర్థఖ్యాపనం దోషయోగేపిన
నిమిత్తస్య ప్రధాన బాధకత్వమ్" 5.119

దోషయాఽ గేపి = సుషుప్తియందును, నిమితస్య = నిద్రా దోషమునకు, ప్రధాన బాధకత్వం = వాసనలను నశింపజేయు శక్తి యున్నది. కావున, వాసనయా = వాసనవలన, అనర్థఖ్యాపనం న = అనర్థమైన ప్రాకృతిక జ్ఞానము కలుగనేరదు.

సమాధి యందు వాసనలు కుంఠితములై యుండుట వలన జీవునకు బ్రహ్మసారూప్య మేర్పడుచున్నది. అట్లే సుషుప్తియందు కూడా నిద్రాదోషము వలన వాసన లణచబడి యుండును. అందువలన బ్రహ్మసారూప్యము కలుగు నవకాశము గలదని భావము.

యత్నించి బాణమునో యొక మట్టిగడ్డనో విసిరి దూరమునకు పంపునపుడు మొదట యత్నము వలన క్రియ కలుగును; దానివలన వేగనామక సంస్కారము కలుగును; అటుపై మరల క్రియ, మరల సంస్కారము నని యా బాణాదు లొకచో పడువరకు ననేక క్రియలు ననేక సంస్కారములు కలుగుచుండునని కొందఱు చెప్పుదురు. వారి మత మయుక్త మని యీ సూత్రమున చెప్పుచున్నాడు.

"ఏకః సంస్కారః క్రియా నిర్వర్తకో సతు ప్రతి క్రియం
సంస్కారభేదా బహుకల్పనా ప్రసక్తేః" 5.120

ఏకః = ఒక్కటే, సంస్కారః = వేగాఖ్య సంస్కారము, క్రియానిర్వరక్తః = బాణాదులం దొకచో నేర్పడు క్రియల నన్నిటిని జనింపజేయును. బహుకల్పనా ప్రసక్తేః = అనేక సంస్కారముల నంగీకరించు దోష మేర్పడును. కాబట్టి, నతుప్రతిక్రియ సంస్కార లేదాః = ప్రతిక్రియకు నొక్క సంస్కారము చొప్పున ననేక వేగనామక సంస్కారము లంగీకరింపజనదు.

భూమిని భేదించి జనించు నంకురాదులును శరీరములే యని పూర్వము వర్ణింపబడినది. వానియందు నవియు శరీరములే (భోగాయతనములు - సుఖ దుఃఖానుభవ నిలయములు) అని చెప్పదగు బాహ్యజ్ఞానము గోచరము కానందున నవి శరీరము లెట్లగును?

"న బాహ్యబుద్ధినియమో వృక్షగుల్మలతౌషధి వనస్పతి
తృణవీరుధా దీనామపి భోక్తృభోగాయతనత్వం పూర్వవత్"
5.121

పూర్వవత్ = జరాయుజాదులకు వలెనే, వృక్ష.... మపి = వృక్షాదులకును, భోక్తృభోగాయతనత్వం = భోక్తృశరీరత్వము కలదు. నబాహ్యాబుద్ధినియమః = బాహ్యేంద్రియజన్య జ్ఞానమే శరీరనియామక మను నియమము లేదు. వృక్షాదులను శరీరములే యని భావము.

పుష్పించి కాయలు గాచు మామిడి మున్నగునవి వృక్షములు. పొదలవలె నల్లుకొని యుండునవి గుల్మలతలు. ఒక్కమాటు ఫలించి నశించు వరి మున్నగు సస్యములు ఓషధులు. పుష్పింపకయే కాయలు గాచు పనస మున్నగు వృక్షములు వనస్పతులు. గరిక మున్నగునవి తృణములు. అనేక శాఖలు కలిగి యంతట నలముకొను తీగెలు వీరుధములు. ఇవి యన్నియు శరీరములే యని సూత్రాభిప్రాయము.

వృక్షాదులును శరీరములే యనుటకు ప్రమాణము నొసంగుచున్నాడు.

**"స్మృతేశ్చ"** 5.122

శ్రుతి స్మృతులను వృక్షాదులు శరీరములే యని యంగీకరించుచున్నవి.

(అస్యయదేకాం శాఖాంజీవో జహా త్యథసాశుష్యతి! ఛాం. 6. 11. 2)

'జీవుడొక శాఖను విడిచినపుడది యెండిపోవును.' అని ఛాందోగ్యమున వర్ణింపబడినది.

(శరీరజైః కర్మ దోషైర్యాతి స్థావరతాం నరః మ. 12.7)

'మనుజుడు శారీరిక కర్మ దోషముల వలన వృక్షాది శరీరమును బొందును.' అని మనుస్మృతి.

వృక్షాదులు శరీరము లయినచో వానికిని కర్మాధి కారమున్నదా?

**'నదేహమాత్రతః కర్మాధి కారితా వైశిష్ట్య శ్రుతేః"** 5.123

వైశిష్ట్యశ్రుతేః = విశిష్టమగు మనుష్య శరీరధారికే కర్మాధికార మున్నట్లు శ్రుతి చెప్పుచున్నందున, దేహమాత్రతః = దేశము లయినంత మాత్రమున వృక్షాది శరీరధారులకు, న కర్మాధికారితా = కర్మల ననుష్ఠించు యోగ్యతలేదు.

ఇట్టిభేదమేల ? యన :-

**"త్రిధా త్రయాణాం వ్యవస్థా కర్మదేహూపభోగ దేహోభయదేహః"** 5.124

త్రయాణాం = ముప్విధములయిన సర్వప్రాణుల దేహములు, కర్మ...... దేహః = కర్మదేహము ఉపభోగదేహము, ఉభయదేహము నని, త్రిధా = ముప్విధములని, వ్యవస్థా = వ్యవస్థ చేయబడినది.

లోకములో నెల్లరిదేహములు నుపభోగ దేహములే యైనను

గుణప్రధానభావముచే కొందఱి దేహములు కర్మ దేహములనియు, మఱి కొందఱివి ఉపభోగ దేహములనియు, ఇంక కొందఱివి యుభయదేహము లనియు జెప్పబడినవని భావము.

"న కించిద ప్యనుశయినః" 5.125

అనుశయినః = ప్రారబ్ధ కర్మావశేష మున్నట్టి, సర్వకర్మ ఫల త్యాగియైన సన్యాసికి, న కించిదపి = పై మువ్విధము లయిన దేహములతోను సంబంధ ముండదు.

సన్యాసి చేయు ఉపదేశాది కర్మలన్నియు నతనికి స్వాభావికములే కాని బంధహేతుకములు కావని భావము. ఇట్లు మనుష్యులలో కొందఱు కర్మలను ఫలాపేక్షతో జేసి వాని ననుభవించుచుందురు. అట్టి వారు కర్మదేహులు. వృక్షాదులు కేవలము భోగశరీరములు. అట కర్మకవకాశము లేదు. మానవశరీరమే కర్మదేహము, ఉభయదేహము నని చెప్పబడును. బ్రహ్మచారులు వానప్రస్థులు ముఖ్యముగా కర్మల నాచరించుచు భోగాపేక్ష తక్కువ గలిగియుందురు. కాబట్టి వారి దేహము కర్మదేహ మనబడును. గృహస్థులు కర్మల నాచరించుచు విశేషముగ భోగాపేక్ష గలిగియుందురు. కాబట్టి వారి దేహ ముభయదేహ మనబడునని వివేకము.

"న బుద్ధ్యాది నిత్యత్వమాశ్రయ విశేషేఽ పి వహ్నివత్" 5.126

వహ్నివత్ = అగ్నివలె, ఆశ్రయవిశేషేఽ పి = కొండొక విశేషాశ్రయమునందును, బుద్ధ్యాదినిత్యత్వం న = జ్ఞానము, ఇచ్ఛ, యత్నము మున్నగు నవి నిత్యములు కావు.

జ్ఞానేచ్ఛాప్రయత్నాదులు బుద్ధి సత్వము యొక్క పరిణామములు. అయ్యవి తాదాత్మ్యముచే జీవునియందు వ్యవహరింపబడును కాని, బుద్ధిపరిణామములు కాబట్టి యవి యనిత్యములే, నిత్యములు కాజాలవు. వాస్తవమున నవి యనిత్యములయినను జీవాశ్రయము కలవై జీవుడు నిత్యుడు కాబట్టి యవియు నిత్యములగు నవి చెప్పవలనుపడదు. అనిత్య మయిన వస్తువు ఆశ్రయ భేదముచే నిత్యమెన్నడును కాదు. నిప్పు వంటియింటియందున్నపు డనిత్యమై, మరియొక స్థానము నందు నిత్యమగునా? కాజాలదు. అట్లే బుద్ధివృత్తులయిన జ్ఞానేచ్ఛాదులు నని భావము ఆత్మకు స్వరూపమయిన జ్ఞానము మాత్రము నిత్యమే యని తెలిసికొనవలయును.

"ఆశ్రయా సిద్ధేశ్చ" 5.127

బుద్ధి సత్త్వముయొక్క పరిణామములయిన జ్ఞాన సంకల్పాదులు జీవుని గుణములేకాని బుద్ధివృత్తులు కావని నిరూపింపజాలము. కాబట్టియవి యనిత్యములేయని సూత్రాభిప్రాయము.

**"యోగసిద్ధయోఽ ప్యౌషధాది సిద్ధివ న్నాపలాపనీయాః"** 5.128

ఔషధాదిసిద్ధివత్ = ఓషధులు, మణులు మున్నగువాని సిద్ధుల వలె, యోగసిద్ధయః = యోగసిద్ధులును కలవు. కావున, నాపలాప నీయాః = నిషేధింపరాదు.

లోకమున మణులు, ఓషధులు ప్రభావంతములుగ జూచుచున్నాము. అట్లే యోగజసిద్ధులు నంగీకరింపదగినవి. కాబట్టి సాంసిద్ధిక దేహము లున్నవనుటను నిరాకరింపరాదు.

**"న భూతచైతన్యం ప్రత్యేకాదృష్టేః**
**సాంహత్యేఽపిచ సాంహత్యేఽ పిచ"** 5.129

ప్రత్యేకాదృష్టేః = ఒక్కొక్క దానియందు చూడబడనందు వలన, సాంహత్యేఽపిచ = అట్టివి యనేక మొకచో జేరినను వాని యందు చైతన్యమును జూడనేరము. కాబట్టి, భూతచైతన్యం న = భూతములు కలిసినందున వానిలో చైతన్యమేర్పడుననుట తగదు.

ఈ సూత్రమునందు, 'సాంహత్యేఽపిచ' అను పదము రెండు సారులు వాడినందున నొకటి యధ్యాయ సమాప్తిని దెలుపునని గుర్తింపవలయును. కొందఱు, పృథివ్యాది భూతము లొకదానితో మరియొకటి కలిసినపుడు వానియందు చైతన్య ముత్పన్నమగునందురు. పృథివ్యాది భూతములలో నొక్కొక్క దానియందు ప్రత్యేకముగ చైతన్యము కానరానందున, నట్టివి యనేకము కలిసినంత మాత్రమున వాని యందు చైతన్య మేర్పడజాలదని భూత చైతన్యవాదము నీ సూత్రమునందు సూత్రకారుడు నిరాకరించి యున్నాడు.

# షష్ఠాధ్యాయము

పంచమాధ్యాయమునం దితర మతముల నిరాకరణ మొనర్చి, యంతకు పూర్వము నాలుగధ్యాయములందు నిరూపించిన స్వమతమును స్థిరపరుపనుద్దేశించి సూత్రకారుడీ యధ్యాయము నారంభించుచున్నాడు. ముందుగా నాత్మాస్తిత్వమును (జీవుని యునికిని) వర్ణించుచున్నాడు.

**"అస్త్యాత్మా నాస్తిత్వసాధనాభావాత్"** 6.1

నాస్తిత్వసాధనాభావాత్ = ఆత్మ (జీవుడు) లేదని సాధించు హేతువు లభింపనందున, ఆత్మా అస్తి = ఆత్మ యను పదార్థ మున్నది.

ఆత్మ యనున దొకటి లేదనము; కాని, యది శరీరమే కాని, యంతకంటే భిన్నము కాదందురేని:-

**"దేహాదివ్యతిరిక్తోఽసౌ వైచిత్ర్యాత్"** 6.2

వైచిత్ర్యాత్ = దేహముకంటె విలక్షణమైనది కావున, అసౌ = ఆత్మపదార్థము, దేహాదివ్యతిరిక్తః = దేహము, ఇంద్రియములు మున్నగు వస్తువులకంటె వేరైన వస్తువని యెఱుంగవలెను.

**"షష్ఠీ వ్యపదేశాదపి"** 6.3

షష్ఠీవిభక్తితో వ్యవహరించుటవలనను నాత్మదేహము కంటె భిన్నమని సూత్రార్థము.

వ్యపదేశమనగా వ్యవహారము. లోకమున మనము 'నా శరీరము, నా బుద్ధి, నాముక్కు, నాకన్ను' అనియందుము. 'నా శరీరము' అనగా నా యొక్క శరీరము అని పదములను విడదీసి చెప్పవచ్చును. ఇందు 'యొక్క' అనునది షష్ఠీవిభక్తి. ఇయ్యది సంబంధమును బోధించును. కాబట్టి నా శరీర మనగా 'నేను' అనునది వేరనియు శరీరము 'నేను' అను దానికి సంబంధించిన దనియు బోధపడును. ఇట 'నేను' అని చెప్పబడు పదార్థమే ఆత్మయని భావము. కాబట్టి లోక వ్యవహారమున షష్ఠీ విభక్తి ప్రయోగముచేతను ఆత్మపదార్థము శరీరాదులకంటె భిన్నమని తెలియచున్నదని భావము.

'రాహు వేశిరస్సు' అనుటకు బదులు రాహువుయొక్క శిరస్సనియు, రాతిబొమ్మ దేహమనియు ననేక గౌణ ప్రయోగము లున్నవిగదా! అట్లే 'నా శరీరము' అనియు నెందుల కెంచరాదు?

**"న శిలాపుత్రవ ద్ధర్మిగ్రాహకమాన బాధాత్"** 6.4

*ధర్మి బాధాత్ = ధర్మి (పురుషుని – జీవుని) నిగ్రహింప జేయు ప్రత్యక్షాది ప్రమాణములచే బాధింపబడుట వలన, 'నా శరీరము' అనునిట్టి ప్రయోగములు, శిలాపుత్రవత్ న = శిలాపుత్రుని శరీరమన్నట్లు కాదు.*

దేహాదులకంటె భిన్నుడైన జీవుడున్న నుండ నిండు. అయినను, దుఃఖియగు నతనికి కృతకృత్యత యెట్లుగలుగును?

**"అత్యంత దుఃఖనివృత్త్యా కృతకృత్యతా"** 6.5

దుఃఖమత్యంతము నివృత్తి చెందినపుడు అనగా ఆధ్యాత్మిక, ఆధిదైవిక, ఆధిభౌతికదుఃఖములు బొత్తిగా తొలగినపుడు జీవుడు కృత కృత్యుడగును.

సుఖప్రాప్తి కృతకృత్యత యనక దుఃఖాత్యంత నివృత్తి యందు రేల?

**"యథాదుఃఖాత్ క్లేశః పురుషస్య న తథా సుఖాదభిలాషః"** 6.6

*పురుషస్య = జీవునకు, యథాదుఃఖాత్ క్లేశః = దుఃఖము వలన ద్వేషముజనించినట్లు, న తథా సుఖాదభిలాషః = సుఖమువలన కోరిక కలుగదు.*

మనుజుడు లేక ప్రాణి దుఃఖమును బొంది దానిని ద్వేషించినంతగా సుఖమును కామింపడు; సుఖ కామనాపేక్ష కంటె దుఃఖమును ద్వేషించుట మిక్కిలిగ జూచుచుందుము. కాబట్టి పురుషునకు దుఃఖనివృత్తియే సఫలత (కృతకృత్యత) యనదగును.

దుఃఖమును ద్వేషించినంతగా సుఖము నేల కామింపరు?

**"కుత్రాపి కోఽపి సుఖీతి"** 6.7

లోకమున గల ప్రాణులలో నెక్కడనో యొకడు సుఖిగా గోచరించును. కాబట్టి ప్రాణి దుఃఖనివృత్తి కొఱకే యత్నించును అనగా దుఃఖ మెక్కుడగుటచే దానినే యెక్కుడుగ ద్వేషించునని భావము.

ఇందువలన సుఖము దుర్లభమనియే కదా? తోచుచున్నది?

**"తదపి దుఃఖశబలమితి దుఃఖపక్షే నిఃక్షిపన్తే వివేచకాః"** 6.8

*తదపి = దుర్లభమగు నా సుఖము కూడ, దుఃఖశబలమితి = దుఃఖ మిశ్రితము కావున వివేచకాః = వివేకులు, దుఃఖపక్షే= దుఃఖమునందే నిః క్షిపన్తే = స్థాపించుచున్నారు – గణించుచున్నారు.*

అన్నము విషమిశ్రితమని తెలిసిన వాడా యన్నము నభిలషింపనట్లు సుఖము దుఃఖమిశ్రితమని తెలిసికొని దాని నభిలషింపక దుఃఖమును ద్వేషించును. కాబట్టి దుఃఖ నివృత్తియే పరమార్థమని తేలుచున్నది.

లోకమున ప్రతి ప్రాణియు 'నాకు దుఃఖము కలుగకుండు గాక' యని

దుఃఖమును ద్వేషించుటతో బాటు, 'నాకు సుఖము కలుగు గాక' యని సుఖము నభిలషించుటయు జూచుచున్నాము. కాబట్టి సుఖ ప్రాప్తిలేని దుఃఖ నివృత్తి పరమ పురషార్థ మెట్లగును?

**"సుఖ లాభాభావాత్ అ పురుషార్థత్వ మితిచేన్నద్వైవిధ్యాత్"** 6.9

సుఖ............ ఇతిచేత్ = సుఖప్రాప్తి లేనందున నది పరమ పురుషార్థము కాదందురేని, న = కాదు, ద్వై విధ్యాత్ = ద్వివిధముగా నంగీకరించుటవలన.

పరమపురుషార్థము దుఃఖ నివృత్తి రూపమై యొక విధమైనను, దుఃఖ నివృత్తి కలుగుటయే తడవుగా నయత్న సిద్ధమై బ్రహ్మానంద ప్రాప్తియు కలుగును. కావున దోష మావంతయును లేదని భావము.

సాంఖ్య మతమున దుఃఖము బుద్ధి ధర్మము కాబట్టి యది పురుషునందుండదు. బుద్ధియందే యుండును. అట్టి దుఃఖ నివృత్తి పరమ పురుషార్థ మెట్లగునని శంకించుచున్నాడు:–

**"నిర్గుణత్వమాత్మనో ఽసంగత్వ శ్రుతేః"** 6.10

('అసంగోహ్యయం పురుషః.........' బృ. ఆ 5. 3. 15)

'పురుషు డసంగుడు' అను నిట్టి వాక్యములవలన పురుషునకు దుఃఖాది సమస్త గుణములతోను నెట్టి సంబంధమును కానరాదు. అట్టియెడ పురుషునకు దుఃఖనివృత్త్యభిలాష యెట్లు కలుగునని శంకాభిప్రాయము.

సమాధానము:–

**"పరధర్మత్వేఽపి తత్సిద్ధి రవివేకాత్"** 6.11

లోకమున వహ్నితాదాత్మ్యము వలన లోహమునకు దాహకశక్తి యేర్పడినట్లు, దుఃఖాదులు బుద్ధిధర్మములయినను నవివేకమువలన పురుషుడు బుద్ధితాదాత్మ్యముచే వానిని తనవిగా భావించును. కాబట్టి యతడు దుఃఖాదుల నివృత్తి నభిలషించుట యసంగతము కాదు.

అవివేకము వలన పురుషునకు దుఃఖాదు లేర్పడినచో నా యవివేక మెట్లేర్పడుచున్నది?

**"అనాది రవివేకోఽన్యథా దోషద్వయ ప్రసక్తేః"** 6.12

అవివేకము అనాది; అనగా కారణరహితము. అవివేకమున కియ్యది

కారణమని చెప్పవలనుపడదు. దాని కొక కారణ మంగీకరింతు మేని యనవస్థాదోష మేర్పడును. కారణ పరంపర కంతముండదని భావము. అవివేకమే యంగీకరింపమేని ముక్తులును బద్ధులే కావలసివత్తురు. కాబట్టి దోషద్వయ మేర్పడునని సూత్రాభిప్రాయము.

అవివేక మనాది యగునెడల నిత్యమేలకాదు?

"ననిత్యః స్యాదాత్మవ దన్యథాఽనుచ్ఛిత్తేః" 6.13

పురుషునివలె నవివేకము నిత్యముకాదు. అది నిత్యమగు నెడల దాని నాశమే యుండదు.

అవివేకము దేనివలన నశించును?

"ప్రతినియత కారణనాశ్యత్వమస్య ధ్వాంతవత్" 6.14

చీకటి ప్రకాశమువలన నియతముగా నశించునట్లు వివేకమువలన నవివేకము నశించునని భావము.

చీకటి ప్రకాశముచే నశించుట నియతమే కాని అవివేకమునకు వివేకము నియత నాశకారణమా?

"అత్రాపి ప్రతినియమోఽన్వయ వ్యతిరేకాత్" 6.15

ప్రకాశమున్న చీకటి యుండదు. ప్రకాశము లేకున్న చీకటి యుండును. ఇట్టి స్థితియే ప్రతినియమ మనబడును ఇట్లే వివేకమున్న నవివేక ముండదు. వివేకములేకున్న నవివేక ముండును. కాబట్టి వివేకము అవివేకమునకు ప్రతినియత నాశకారణమే యని భావము.

వివేకముచే నవివేకము నశించిన నశించును గాక. పురుషునకు బంధ నివృత్తి యెట్లు కలుగును?

"ప్రకారాంతరా సంభవా దవివేక ఏవ బంధః" 6.16

స్వభావాదులు బంధమునకు కారణము కానందున అవివేకమే బంధము. అవివేక నాశమే బంధ నివృత్తి యని భావము.

బంధ నివృత్తి (అవివేక నివృత్తి) వివేకముచే సాధింపబడుచున్నది. అదియే ముక్తి. కాగా ముక్తి కార్యమగుచున్నది. అందువలన నయ్యది నశించును. కాబట్టి ముక్తునకు పునర్బంధ మేర్పడునా?

"న ముక్తస్య పునర్బంధ యోగోఽప్యనా వృత్తి శ్రుతేః" 6.17

("నచ పునరావర్తతే నచ పునరావర్తతే" ఛాం 8. 15) 'మరల తిరిగిరాడు. మరల తిరిగిరాడు' అను నీ యుపనిషద్వాక్యము వలన ముక్తునకు

పునర్బంధము కలుగదని యెంచవలయు నని సూత్రార్థము.

శ్రుతివాక్యము యుక్తి యగునా?

**"అపురుషార్థత్వ మన్యథా"** 6.18

ముక్తునకు పునర్బంధ మంగీకరించిన నయ్యది పరమ పురుషార్థము కానేరదు. ముక్తి నశించున దగునెడల దానిని పురుషు డర్థింపడని భావము.

**"అవి శేషాపత్తి రుభయోః"** 6.19

మఱియు పునర్బంధ మంగీకరింతుమేని బద్ధులు, ముక్తులు, నను ఁభయలలోను భేదముండనేరదు.

ముక్తియన నేమి?

**"ముక్తిరంతరాయ ధ్వస్తేర్ న పరః"** 6.20

ముక్తిః = ముక్తి అంతరాయధ్వస్తేః = అవివేక నాశనముకంటె' పరః న = భిన్నము కాదు.

అవివేకనాశనమే ముక్తియని భావము.

పూర్వము దుఃఖనివృత్తి మోక్షమని చెప్పి యిపుడు అవివేకనాశనము (అంతరాయ ధ్వంసము) అనుచున్నా రేల?

**"తత్రాప్యవిరోధః"** 6.21

అవివేకము దుఃఖమునకు నిమిత్తము. నిమిత్తనాశము వలన నైమిత్తికము నశించును. కాబట్టి విరోధము లేదని భావము.

అటులయిన శ్రవణమాత్రమున నవివేకము నశించును. అటుపై ముక్తి లభించును. మననాది ఇతర సాధనము లింకేల?

**"అధికారిత్రైవిధ్యా న్ననియమః"** 6.22

వివేకజ్ఞానమున కధికారులగు వారిలో నుత్తమ, మధ్యమ, అధమభేదముండుట వలన నెల్లరికి శ్రవణమాత్రము ననే వివేకోద ము కలుగజాలదు.

ప్రత్యక్ష (అపరోక్ష) వివేకజ్ఞానమే యసంభావనను, విపరీత భావనను దొలగింపగలదు. అయ్యదియే యనాది యగు నవివేకమును బొత్తిగా నశింపజేయును. అట్టి యపరోక్ష వివేక జ్ఞానము శ్రవణ మాత్రముచే నెల్లఱకు జనింపదు. పూర్వ జన్మములందు శ్రవణ మననాదుల నభ్యసించిన పుణ్యాత్ములకే యీ జన్మమున శ్రవణ మాత్రముచే వివేక ముదయించును. అన్యుల కట్లు కాదు. శ్రవణము పరోక్ష (అప్రత్యక్ష) జ్ఞానమునే కలిగించును. కాబట్టి మననాది

ఇతర సాధనము లవసరములే యని భావము.

**"దార్ఢ్యార్థ ముత్తరేషామ్"** 6.23

శ్రవణము వలన నేర్పడిన వివేక జ్ఞానమును దృఢపరచుటకే (అపరోక్షము చేసికొనుటకే) మననాది సాధనముల ననుష్ఠింపవలసి యుండురు.

ఆసనము కుదరకున్న ధ్యానాదులు సిద్ధింపనేరవు. కావున నెట్టి యాసన ముపయుక్త మగును?

**"స్థిర సుఖ మాసనమితి ననియమః"** 6.24

ధ్యానము చేయు వాని కే యాసనము స్థిరమై సుఖము కలిగించునో యదియే యుక్తము. కాబట్టి పద్మాసనాదులలో కొండొక దానిని నియమింప వలను పడదు.

ధ్యాన లక్షణమేమి?

**"ధ్యానం నిర్విషయం మనః"** 6.25

నిర్విషయం = విషయరహితమైన, మనః = మనస్సు, ధ్యానమ్ = ధ్యాన మనబడును.

ఆత్మకాక మిగిలిన పదార్థములనుండి మరలించి యాత్మయందే చిత్తము నిలుపుట ధ్యాన మనబడును. ఇయ్యదియే నిదిధ్యాసన మనబడునని భావము.

ధ్యానము వలన కలుగువిశేష మేమి?

**"ఉభయథా ప్యవిశేషశ్చేన్నైవముపరాగ నిరోధాద్వి శేషః"** 6.26

ఉభయథాప్యవిశేషశ్చేత్ = ధ్యానము చేసినను చేయకున్నను పురుషునకు *గలుగునదేమియు నుండదని శంకింతువేని,* నైవమ్ = అట్లు శంకింపబనిలేదు, ఉపరాగనిరోధాత్ = ధ్యానాదులవలన క్లేశాది వాసన లనెడి యుపరాగము *(వాసనల సంబంధము)* నిరోధింపబడును. కాబట్టి, విశేషః = విశేషము లేకపోదు.

ధ్యానమువలన క్లేశకర్మాదుల వాసనలు నిరోధింపబడుటయే విశేషమని భావము.

నిఃసంగుడు, నిర్వికారుడు నగు పురుషునందు క్లేశాదుల యుపరాగమెట్లు సంభవ మగునన:

**"నిః సంగేఽ ప్యుపరాగోఽ వివేకాత్"** 6.27

పురుషుడు నిఃసంగు డయినను, అవివేకము వలన క్లేశ కర్మాదుల యుపరాగము కలుగును.

ఈ యుపరాగము పురుషున కెట్టిది?

**"జపా స్ఫటికయోరివ నోపరాగః కింత్వభిమానః** 6.28

జపాకుసుమము, స్ఫటికము నను నీ రెండు నొకదాని కొకటి సమీపమున నున్నపుడు, స్ఫటికమునందు జపాకుసుమముయొక్క రక్తవర్ణము ప్రతిబింబించి స్ఫటికము రక్తమగును. పురుషునందు వాసనల ట్లుపరక్తములు కావు. కాని, బుద్ధిసత్వ తాదాత్మ్యము వలన పురుషునకు బుద్ధియందలి వాసనలు తనవేయను నభిమానము కలుగును.

అటులయిన నీ యభిమానము ధ్యానమువలననే తొలగ గలదా?

**"ధ్యాన ధారణాభ్యాస వైరాగ్యాదిభి స్తన్నిరోధః"** 6.29

ధ్యానము, ధారణ, అభ్యాసము, వైరాగ్యము మున్నగు వానిచే వాసనల యభిమానము తొలగ గలదు. కేవల ధ్యానము వలన తొలగనేరదని భావము. సూత్రము నందలి ఆది పదముచే దోష దర్శనము, యమ నియమాది సాధనములు గ్రహింప నగును. పదార్థముల లోని దోషముల నెఱుగుట వలన వానియందు వైరాగ్యము (వితృష్ణ) కలుగును. అటుపై యమ నియమాది సాధనముల ననుష్ఠించుట వలన చిత్త స్థైర్యము కలుగును. అభ్యాస మన నియ్యదియే అనంతరము చిత్తము నాత్మయందు బంధించుట ధారణయగును. పిదప పూర్వము వర్ణించిన ధ్యానము వలన నుపరాగము నిరోధింప బడగలదు.

ధ్యానాదుల వలన సాక్షాత్తుగ నుపరాగ నిరోధము కలుగునా?

**"లయ విక్షేపయోర్ వ్యా వృత్త్యా ఇత్యాచార్యాః"** 6.30

లయ మనగా నిద్రావృత్తి. ప్రమాణము, విపర్యము, వికల్పము, స్మృతి యనెడి వృత్తులు విక్షేప మనబడును. ధ్యానాదుల వలన నీ లయ విక్షేపము లనెడి వృత్తులన్నియు తొలగును. అటుపై వాసనోప రాగ నిరోధ మేర్పడునని సాంఖ్యాచార్యులు నుడువుదురు. కాబట్టిధ్యానాదులుపరాగమును దొలగించుటలో సాక్షాత్కారణము కాక పరంపరా కారణమని భావము.

లయ విక్షేపములను దొలగించుటకు ధ్యానాదు లెట నాచరింపవలయును?

**"న స్థాన నియమశ్చిత్త ప్రసాదాత్"** 6.31

చిత్తము ప్రసన్నముగానున్న ధ్యానాదులు కుదురును. కాబట్టి ధ్యానమున కొకస్థానవిశేష మావశ్యక మను నియమము లేదు. ఎక్కడ చిత్తము ప్రసన్నముగానుండునో యట ధ్యానాదుల నాచరింపవలయునని భావము.

పురుషునందు కలుగు వాసనాభిమానమునకు ముఖ్యకారణమేమి?

"ప్రకృతేరాద్యోపాదానతా అన్యేషాంతత్కార్యత్వ శ్రుతేః" 6.32

ఉపరాగమునకు ప్రథమకారణము ప్రకృతి, మిగిలిన బుద్ధ్యాదులు దాని కార్యములగుట వలన నవి యనంతర కారణములని యెఱుంగవలయును.

పురుషుడు నిత్యుడగుటచే నతడే యేల ముఖ్యకారణము కాదు?

"నిత్యత్వేఽపి నాత్మనో యోగ్యత్వాభావాత్" 6.33

పురుషుడు నిత్యుడైనప్పటికిని ఉపరాగమున కతడు ప్రథమోపాదాన కారణము కాజాలదు. అతనిలో నట్టి యోగ్యతయే లేదు. ఉపాదాన కారణము ముఖ్య కారణము నిత్యుడగుటచే నాద్యకారణము కావచ్చునే కాని యుపాదానము కాజాలడు. ఉపాదానకారణము కావలయుననినచో పరిణామి కావలయును. కాబట్టి ప్రకృతియే యుపాదాన మగును.

కేవల పురుషుడు కాకున్నను నవిద్యాసహిత పురుషుడేల కారణము కాజాలడు?

"శ్రుతివిరోధా న్న కుతర్కాపసద స్యాత్మలాభః" 6.34

ఈ తర్కము శ్రుతివిరుద్ధమయినందున నట్టి తర్కమొనరించు నధమునకు ఆత్మప్రాప్తి కలుగనేరదని సూత్రార్థము. కార్యకారణములు తాదాత్మ్యము లయినందున, జగద్రూప కార్యముగా పరిణమించునట్లు పురుషు నంగీకరింతుమేని కారణరూపమున పురుషుడు సత్యమయినను కార్యరూపమున నతని అసత్య మంగీకరింపవలసి వచ్చును. అట్టియెడ కార్యాత్మనా లేని పురుషుడు కారణరూపమున నెటనుండును? కాబట్టి యాత్మలాభమే సిద్ధింపదని భావము.

స్థావరాధి కార్య జాతమున కంతటికి క్షిత్యాదులే కారణములై యుండ ప్రకృతి యుపాదాన కారణ మెట్లగును?

"పారంపర్యేఽపి ప్రధానానువృత్తి రణువత్" 6.35

అణువత్ = పరమాణువు వలెనే, పారంపర్యేఽపి = పరంపరా కారణము నందును, ప్రధానానువృత్తిః = ప్రకృతి అనువర్తించును

స్థావరాదులకు క్షిత్యాదులు సాక్షా దుపాదాన కారణములు. కాని, ప్రకృతి పరంపరా కారణము. అందువలన ప్రకృతి యుపాదానకారణ మనుటలో దోషము లేదు. ఇట్లే వైనాశికులు కూడ పరమాణువును సంఘాతమునకు కారణముగా నంగీకరింతురు.

ప్రకృతి యుపాదానకారణమైనను నయ్యది విభువెట్లగును?

"సర్వత్ర కార్య దర్శనాత్ విభుత్వమ్" 6.36

బ్రహ్మాండమైన నెల్లయెడల ప్రకృతి వికారములు (కార్యములు) లభించుచున్నందున నయ్యది విభువేయని చెప్పదగును. కాని, ప్రకృతిలోగల విభుత్వము పరమాత్మ యందలి విభుత్వమువలె నిరపేక్షము కాక సాపేక్షమని యెఱుంగ వలయును.

ప్రకృతి విభువై నయెడల నందు జగత్తును సృష్టించుట కనువగు క్రియ కలుగనేరదు. ఎట్లో కలుగునని యంగీకరించినను, తంతువులు వస్త్రమున కుపాదాన కారణ మైనట్లు జగత్తున కది యుపాదానకారణ మెట్లగును?

"గతియోగేఽప్యాద్యకారణతా అహాని రణువత్" 6.37

వైనాశికుల మతమున పరమాణువు సంఘాతమున కుపాదాన కారణమైనట్లు, భగవంతుని సంకల్పము వలన ప్రకృతియందు జగత్సర్జనానుకూలక్రియ కలగుటయే కాక, ఉపాదాన కారణత్వమునకును హానికలుగదు.

క్రియాయోగమువలన ప్రకృతి ద్రవ్యమగును. అందువలన నది పృథివ్యాది ప్రసిద్ధ ద్రవ్యములలో నెందుజేరును?

"ప్రసిద్ధాధిక్యం ప్రధానస్య ననియమః" 6.38

ప్రకృతి (ప్రధానము) లోకమున ప్రసిద్ధము లయిన పృథివ్యాదుల కంటె నధికము. అయ్యది సర్వద్రవ్యములకు మూలకారణము. కాబట్టి ద్రవ్యమయినంత మాత్రమున ప్రసిద్ధ ద్రవ్యములలో నంతర్భాగము కావలయు నను నియమము లేదు.

"సత్త్వాదీనా మతద్ధర్మత్వం తద్రూపద్వాత్" 6.39

సత్త్వము, రజస్సు, తమస్సు నను గుణములు ప్రకృతికి స్వరూపము (లక్షణము) కాబట్టి ప్రకృతి క్రియావంతమై నందున నవియు క్రియావంతములు కానక్కరలేదని భావము.

గుణము (త్రాడు) బంధించుటకు సాధనమైనట్లు సత్త్వ రజ స్తమస్సులు బంధన సాధనము లగుటచే గుణము లనబడుచున్నవి.

ప్రకృతి జడము. ఉపభోగించు యోగ్యత దానికుండదు. అట్టియెడ నీ సృష్టి యెందులకు?

"అనుపభోగ్యేఽపి పుమర్థం సృష్టిః
ప్రధానస్యోష్ట్రకుంకుమ వహనవత్" 6.40

ఒంటె వ్యాపారి కొఱకు (తన కుపయోగము లేకున్నను) కుంకుమ భారమును వహించునట్లు స్వోపభోగము లేకున్నను, ప్రధానము (ప్రకృతి) పురుషుని యుపభోగార్థ మీసృష్టి నొనరించుచున్నది.

ఏకాకి యగు ప్రకృతియం దీ సృష్టి వైచిత్ర్య మెట్లు కలిగినది?

**"కర్మ వైచిత్ర్యాత్ సృష్టి వైచిత్వమ్"** 6.41

ప్రకృతి యొక్కటియే యైనను, సృష్టి నొనరించుటకు దానికి సహకార మొనర్చు (సహకారి కారణములైన) పురుషుని కర్మలు విచిత్రములు. అందువలన సృష్టిలో వైచిత్ర్యమేర్పడు చున్నదని భావము.

కర్మ సహకారము వలన ప్రకృతినుండి విచిత్రసృష్టి కలుగవచ్చును. కాని ప్రలయ మెట్లు కలుగుచున్నది?

**"సామ్య వైషమ్యాభ్యాం కార్య ద్వయమ్"** 6.42

సృష్టి ప్రలయము నను రెండింటికిని ప్రకృతి యొక్కటే కారణము. ఒక్క కారణముచే రెండు పరస్పర విరుద్ధ కార్యము లెట్లేర్పడు నని పై ప్రశ్నాభిప్రాయము. ప్రకృతిలో గలుగు పరిణామము రెండు విధములుగ నుండును. విరూప పరిణామము సృష్టి యనబడును. సరూప పరిణామము ప్రలయ మనబడును. కాబట్టి ప్రకృతియొక్క సామ్యవైషమ్య భావములచే సృష్టి ప్రలయములు కలుగును.

ప్రకృతి నుండి పురుషుని కొఱ కెన్నడు సృష్టి జరుగదు?

**"విముక్త బోధాన్న సృష్టిః ప్రధానస్య లోకవత్"** 6.43

వివేకము కలుగుట వలన ముక్తుడైన పురుషుని విషయమున ప్రకృతి సృష్టికార్య మొనరింపదు. అతని విషయమున ప్రకృతి తాను చేయవలసినది చేసి చరితార్థమైనట్లే. లోకము నందును స్వకార్యమునందు కృత కృత్యులయిన వారు మరల కార్యమునందు ప్రవర్తింపరు గదా? అట్లే ప్రకృతియు ముక్తుని విషయమున సృష్టికై ప్రవర్తింపదు.

ప్రకృతి వ్యాపక మగుటచే బద్ధుల విషయమున భోగార్థము ప్రవర్తించుచుండ ముక్తులకును భోగము కలుగదా?

**"న, అన్యోపసర్పణే ముక్తోపభోగో నిమిత్తాభావాత్"** 6.44

వివేకముకలుగని బద్ధులైన జీవుల యుపభోగార్థము ప్రవర్తించినను, అవివేకమనెడి కారణము ముక్తులకుండదు కావున వారికి ప్రాకృతిక భోగము కలుగనేరదు.

ముక్తులు వేరు బద్ధులు వేరు నని పురుషబహుత్వ మెక్కడిది?

"పురుష బహుత్వం వ్యవస్థాతః" 6.45

లోకమున కొందఱు జన్మించుట, కొందఱు మరణించుట, మఱి కొందఱు ముక్తులగుట, వేరొక కొందఱు బద్ధులగుటయు జూచుచున్నాము. కాబట్టి జీవులనేకులే యని సిద్ధమగుచున్నదని భావము.

పురుషుడొక్కడే యైనప్పటికి నుపాధిభేదముచే జన్మమరణాది వ్యవస్థ సిద్ధింపదా?

"ఉపాధిశ్చేత్తత్సిద్ధౌ పునర్ద్వైతమ్" 6.46

ఉపాధివలన జన్మమరణాది వ్యవస్థ సిద్ధించునెడల నాత్మకంటె భిన్నముగా నొక పదార్థ మంగీకరింపవలసి వచ్చును. అపుడాత్మాద్వైతము సిద్ధించుటకు బదులు ద్వైతమే సిద్ధించును. కాబట్టి యుపాధివలన జన్మమరణాది వ్యవస్థ యేర్పడగలదు; అందువలన నాత్మాద్వైత మంగీకరింప నగుననుట యుక్తము కాదు.

ఉపాధులు పరమార్థములు కావు. అవి యవిద్యా జన్యములు. అందువలన నాత్మాద్వైతమేల సిద్ధింపదు?

"ద్వాభ్యామపి ప్రమాణవిరోధః" 6.47

ఉపాధులు పరమార్థములు కావు; అవిద్యాజన్యము లందురేని, యపుడును ఆత్మ, అవిద్య అను రెండు పదార్థము లంగీకరింపక తప్పదు. అయ్యదియు నద్వైతమును సాధించు ప్రమాణమునకు విరుద్ధమే యగును.

"ద్వాభ్యామప్యవిరోధాత్ న పూర్వముత్తరంచ సాధకాభావాత్" 6.48

ప్రకృతి, పురుషుడు నను నీ రెండు వస్తువులు నవిద్యా త్మకములే యందురేని యదియును తగదు. సాంఖ్యుల మగుమేము ఆత్మలనేకములనియే యంగీకరింతుము. కాబట్టి, ఉపాధివలన జన్మ మరణాది వ్యవస్థ లేర్పడు ననుటయు చైతన్య మద్వైతమే యనుటయు రెండును ప్రమాణ విరుద్ధములే యని భావము.

"ప్రకాశతస్తత్సిద్ధౌ కర్మకర్తృ విరోధః 6.49

ఆత్మ స్వయం ప్రకాశముగల దగుటవలన తన యద్వైతత్వమును తానే సిద్ధింపచేసికొనగలదు. కావున వేరుగా ప్రమాణమొందు చూపనవసరము లేదందురేని, ఆత్మతానే ప్రకాశకము, తానేప్రకాశ్యము కావలసి వచ్చును. అట్టియెడ కర్మకర్తృ విరోధమేర్పడగలదు. అనగా కర్తయే కర్మ కావలసి వచ్చును.

అది యుచితము కాదని భావము.

**"జడవ్యావృత్తో జడం ప్రకాశయతి చిద్రూపః"** 6.50

*జడవ్యా వృత్తః = జడధర్మ రహితుడై, పురుషుడు, జడంప్రకాశ యతి = జడపదార్థములను ప్రకాశింపజేయును. కాబట్టి, చిద్రూపః = ప్రకాశస్వరూపుడు.*

పురుషుడు ప్రకాశమున కాశ్రయుడై స్వాత్మను ప్రకాశింపజేయును. కాబట్టి కర్మ కర్తృ విరోధ ముండనేరదని యందురేని యదియును తగదు. కారణమేమన:- పురుషుడు చిద్రూపుడే - ప్రకాశస్వరూపుడే కాని ప్రకాశమున కాశ్రయుడుకాడు. ఈ సూత్రమునందు జడవ్యావృత్తు డనుటవలన పురుషుడు జడమగు బుద్ధియొక్క ధర్మమైన జ్ఞానమున కాశ్రయుడు కాదనియు జడమును ప్రకాశింపజేయు ననుటవలన నతడు సర్వ సాక్షియనియు చిద్రూపు డనుటవలన నతని స్వరూపము జ్ఞానాత్మకమనియు చెప్పబడినది.

**"న శ్రుతి విరోధో రాగిణాం వైరాగ్యాయతత్సిద్ధేః"** 6.51

పై సూత్రములందు ఆత్మాద్వైతత్వము నిషేధింపబడినది కాని బృహదారణ్యకములోని (స ఏష నైతి నైతి - 6. 2. 4) యనుశ్రుతిచే జగత్తునది లేనట్లు వర్ణింపబడినది. అందువలన నాత్మాద్వైతత్వము సిద్ధింపగలదు. కాబట్టి సాంఖ్యులమతము శ్రుతి విరుద్ధమగు నందు రేని యది యును సరికాదని యీ సూత్రము చెప్పుచున్నది.

(సఏష నైతి నైతి) అనుశ్రుతి, విషయాసక్తు లయిన వారి కీ జగత్తు హేయము - లేనిది, యని చెప్పిననే కాని వారీ జగత్తునుండి విరక్తులు కానేరరని యట్లు చెప్పినది. విషయ విరక్తులే ఆత్మ సాక్షాత్కారమునకు పూనుకొందురు. కాబట్టి శ్రుత్యర్థము నుపపన్న మగును. జగత్తు సత్యమే యని చెప్పు సాంఖ్య మతమును శ్రుతి విరుద్ధము కానేరదని యభిప్రాయము.

జగత్తు సత్య మను టెట్లు?

**"జగత్ సత్యత్వ మదుష్టకారణ జన్యత్వాత్ బాధకాభావాత్"** 6.52

*అదుష్టకారణ జన్మత్వాత్ = దోషయుక్తముకాని ప్రకృతి రూపకారణ జన్య మగుట వలనను, బాధకా భావాత్ = బాధక జ్ఞానమునకు విషయము కానందునను, జగత్సత్యత్వమ్ = జగత్తు సత్యమే.*

అద్వైత వాదులు స్వప్న పదార్థముల వంటిదే జగత్తందురు. కాని, స్వప్నములో మనము జూచు పదార్థములు నిద్రాది దోషయుక్త కారణ

జన్యములు. మఱియు జాగ్రదవస్థ యందు గలుగు జ్ఞానముచే నవి బాధింపబడును. కాబట్టి యవియసత్యములు. కాని, యీ దృశ్యజగత్తుభగవద్ బుద్ధి యుక్త ప్రకృతి జన్య మగుటచే నది సత్యమే. మఱియు నీ జగత్తు స్వాప్నిక పదార్థముల వలె బాధితము కాదు. అందువలనను నియ్యది సత్యమే యని భావము.

**"ప్రకారాంతరా సంభవాత్ సదుత్పత్తిః"** 6.53

మఱియు నీ జగత్తు తన యుత్పత్తికి పూర్వము సూక్ష్మ రూపమున అనగా కారణ రూపమున నుండియే యున్నది. అట్లు సద్రూపమున నుండకున్న నిది యేర్పడుట కవకాశమే లేదు. కారణ రూపమున (సూక్ష్మమున) నుండి కార్య రూపమున పరిణమించుటయే సృష్టి యనబడును. మఱియొక విధమున జగత్తేర్పడ నేరదని భావము.

జగత్తు సత్యమైనచో పురుషునకు గల కర్తృత్వము మాత్రమేల సత్యము కాదు?

**"అహంకారః కర్తాన పురుషః"** 6.54

చేతన ప్రతిబింబముతో కూడి యహంకా రావస్థను బొందిన బుద్ధి సత్త్వమే (అహంకారమే) కర్త యగును కాని పురుషుడు కాడు. పురుషుడు కర్త యగునేని పరిణామి కావలసి వచ్చును. పురుషుడు పరిణామము నొందనివాడు కావున నహంకారమే కర్తయని భావము.

పురుషునకు కర్తృత్వము లేకున్న భోక్తృత్వము కూడ నుండదు కదా?

**"చిదవసానాభుక్తి స్తత్కర్మార్జితత్వాత్"** 6.55

*భుక్తిః = భోగము - సుఖ దుఃఖానుభవము, తత్కర్మార్జితత్వాత్ = జీవునకు సంబంధించిన అహంకారముచే చేయబడిన కర్మలద్వారా ఆర్జింపబడుచున్నందున, చిదవసానా = పురుషునందు పర్యవసానము చెందుచున్నవి.*

పురుషునకు కర్తృత్వము సత్యము కానట్లే భోక్తృత్వము కూడ సత్యము కాని మాట వాస్తవమే. కాని యహంకారము జడమైనందున, దానికి భోగ మసంభవము కాబట్టి, పురుషునకే భోగమని చెప్పుచున్నాము.

కర్మములు అనంతములు కాబట్టి భోగార్థము చంద్రాది లోకములను బొందిన పురుషులకు పునరావృత్తి యుండునా?

**"చంద్రాదిలోకేఽప్యా వృత్తి ర్నిమిత్త సద్భావాత్"** 6.56

పురుషు లొనరించు కర్మలలో గల వైచిత్ర్యము వలన చంద్రాది లోకములకు బోయి యట సుఖ దుఃఖముల ననుభవించి మరల నీ లోకమునకు రావచ్చును. అట్లు వచ్చుటకు తగిన నిమిత్తముండును. కాబట్టి పునరావృత్తి జరుగునని సూత్రార్థము.

చంద్రాది లోకమును బొందిన పురుషు లట ఉపదేశము ద్వారా వివేకజ్ఞానము సంపాదించి ముక్తి వడయుదురేని పునరావృత్తి యెట్లు గలుగును?

**"లోకస్యనోపదేశాత్సిద్ధిః పూర్వవత్"** 6.57

పూర్వవత్ = భూలోకమున నుపదేశమాత్రముచేత భోగాసక్త పురుషునకు వివేకోదయము కలుగునట్లు, లోకస్యనోపదేశాత్ సిద్ధిః = చంద్రాది లోకము నందును ఉపదేశమాత్రమున వివేకము కలుగనేరదు. కాబట్టి, పునరావృత్తి కలుగు నవకాశము కలదని భావము.

(చంద్రమసో విద్యుతం, తత్ పురుషోऽ మానవః స ఏనాన్ బ్రహ్మగమయ త్యేష దేవపథో బ్రహ్మపథ ఏతేన ప్రతిపద్యమానా ఇమం మానవ మావర్తం నావర్తంతే. ఛాం. 4. 15. 6)

అను నీ యుపనిషద్వాక్యమునందు 'చంద్రాదిలోకముల నందిన వారు బ్రహ్మము నందుదురు. మరల నీ మానవ లోకమునకు రారు' అని యేల చెప్పబడినది? అన:-

**"పారంపర్యేణ తత్ సిద్ధౌ విముక్తి శ్రుతిః"** 6. 58

పారంపర్యేణ = బహు కాలానంతరము వైరాగ్య ముత్పన్నము కాగా శ్రవణాదుల ననుష్ఠించిన పిదప, తత్సిద్ధౌ = వివేకము సిద్ధించినపుడు, విముక్తి శ్రుతిః = ముక్తి చెందిన పురుషుడు మరల పునరావృత్తి నొందదని శ్రుతి చెప్పుచున్నది.

వైరాగ్యము కలిగిన మీదట శ్రవణాది సాధనముల ద్వారా వివేకమును సంపాదించిన పురుషుడు ముక్తి నొందు విధాన మీ శ్రుతియందు చెప్పబడినదే కాని చంద్రాది లోకములను బొందిన మాత్రమున పునరావృత్తి యుండదని చెప్పుట శ్రుతి యభిప్రాయము కాదని భావము.

సాంఖ్యుల మతమున పురుషుడు అణువు; కూటస్థ నిత్యుడును. అందువలన నతనిలో గతి యుండదు. అట్టియెడ కర్మ ఫలభోగము కొఱకు చంద్రాది లోకముల కేగుట యెట్లు పొసగును?

**"గతి శ్రుతేశ్చ వ్యాపకత్వేऽ ప్యుపాధి**

**యోగాద్ భోగదేశకాల లాభో వ్యోమవత్"** 6.59

(వ్యాప.....లాభః) పురుషుడు విభువని చెప్పువారి మతమున నుపాధి సంబంధమున దేశ విశేష లాభము గలుగునట్లు, సాంఖ్యుల మయిన మేముకూడా, గతిబోధక శ్రుతి స్మృతులకు లోబడి బుద్ధి సత్త్వము ప్రధానముగా నుండు లింగ శరీర మనెడి యుపాధి ద్వారా పురుషునకు కర్మఫల భోగము కొఱకు దేశాంతర ప్రాప్తి కలుగునని యంగీకరింతుము.

పురుషుని యుపభోగార్థము లోక లోకాంతరములు సిద్ధించునట్లు, శరీరాంతరముకూడ పురుషు డధిష్ఠించుటకు పూర్వము యేల సిద్ధింపదు?

**"అనధిష్ఠితస్య పూతిభావ ప్రసంగాన్న తత్సిద్ధిః"** 6.60

పురుషునిచే నధిష్ఠింపక మున్నే శరీరము సిద్ధింపనేరదు. పురుషుడు లేకున్న శరీరము చెడిపోవును. శరీరమునకు కారణములైన శుక్ర శోణితము పుండులోని చీము వంటివే కదా? కాబట్టి పురుషుడు అధిష్ఠితుడు కాకముందు శరీరము సిద్ధింపదు పురుషు డధిష్ఠింపకున్నను నతని యదృష్ట వశమున శుక్ర శోణితములచే నేర్పడు శరీర మేల చెడక యుండరాదు?

**"అదృష్ట ద్వారాచే దసంబద్ధస్య తదసంభవా జ్జలాది వదంకురే"** 6.61

బీజ మంకురింప వలయుననినచో దానితో సంబంధము గల జలమే కారణమగును. అసంబంధ జలము బీజము సంకురింప జేయజాలదు. అట్లే యసంబద్ధ పురుషా దృష్టమువలన శుక్ర శోణితములు శరీరమును కలిగింపనేరవు. కాబట్టి దూరస్థ పురుషుని యదృష్టముచే శరీరాంతరము సిద్ధించి చెడకుండుట యసంభవమని సూత్రాభిప్రాయము.

**"నిర్గుణత్వా త్తదసంభవా దహంకార ధర్మాహ్యేతే"** 6.62

మఱియు నదృష్టాదులు అహంకార ధర్మములే కాని, పురుష ధర్మములు కావు. పురుషుడు నిర్గుణుడు–నిర్ధర్మి. అతని యందు అదృష్టాదు లుండనేరవు. కాబట్టి పురుషాదృష్టవశమున శరీరాంతర మెక్కడో సిద్ధించుననుట సంగతము కానేరదు.

అటులయిన నదృష్టము జీవ ధర్మముగా నెందులకు చెప్పబడుచున్నది.

**విశిష్టస్య జీవిత్వ మన్వయ వ్యతిరేకాత్"** 6.63

అహంకారభావ మెటనుండునో యటనే జీవ భావముండును. అది లేనిచోట జీవభావముండదు. కాబట్టి యన్వయవ్యతిరేకములతో నహంకార విశిష్ట పురుషుడే జీవుడనబడునని తేలుచున్నది. కేవల పురుషుడు జీవుడుకాడు.

కాబట్టి యదృష్టాదులు జీవధర్మములుగా జెప్పబడుట దోషము కాదు. పురుష ధర్మములు మాత్రము కావు.

జీవుడు చేయు లౌకిక, వైదిక కార్యములు పరతంత్రములై సిద్ధించుచున్నవా? లేక యాత్మతంత్రములేనా?

**'అహంకార కర్త్రధీనా కార్యసిద్ధిః నేశ్వరాధీనా ప్రమాణా భావాత్"** 6.64

కార్యములన్నియు పురుషుని ప్రతిబింబమగు జీవునితో కూడిన అహంకార కర్తృతంత్రములై సిద్ధించునే కాని యీశ్వర తంత్రములై సిద్ధింపవు. జీవుడు తన పురుషకారముచే కార్యములను నెరవేర్చును. ఈశ్వరుడు నెరవేర్చున దేమియు లేదు. ఈశ్వర తంత్రములనుటకు ప్రమాణమును లేదు. కాబట్టి జీవుడు కర్మల నాచరించుటలో స్వతంత్రుడని యెంచవలయును.

జీవుల కార్యసిద్ధి వారి యదృష్టము వలన నేలకాదు?

**"అదృష్టో ద్భూతివత్ సమానమ్"** 6.65

కార్యసిద్ధి యదృష్టమువలన ననుట యుక్తము కాదు. కారణ మేమన:- జీవుల యదృష్టము సైతము వారి పురుష కారము (యత్నము) వలన సాధింపబడునదియే కదా? అనగా కర్మాచరణమెట్లు పురుషయత్న సాధ్యమో అదృష్టము నట్లే యని భావము.

సమస్త కర్మలు పురుషయత్న సాధ్యములగుచో దుఃఖముల నత్యంతము నివర్తింపజేయు ప్రకృతి పురుషవివేకాత్మక మానసకర్మము సైతము జీవునకు యథాకామము (కోరినట్లు సులభముగా) ఏల సిద్ధింపదు?

**"మహతోఽ_న్యత్"** 6.66

అన్యత్ = వివేకమనెడి మానసకర్మము, మహితః = ఉత్తమునకు లభించును.

అనేక జన్మములు నిరంతరముగా నభ్యసించిననే కాని శుద్ధసత్త్వ మేర్పడదు. శుద్ధసత్త్వ మేర్పడిన కాని పురుషుడు ముక్తిననుభవింప యోగ్యుడు కాడు. ప్రకృతి పురుష వివేకాత్మక మానసకర్మము కూడ పురుషకార సాధ్యమేయైనను, బుద్ధిసత్త్వమునందలి మాలిన్యమువలన సులభముగా సిద్ధింపదు. అందువలన మోక్ష మపేక్షించు వ్యక్తి బుద్ధిసత్త్వమును శోధించుటకుగాను యమ నియమాదులను యత్నపూర్వకముగ ననుష్ఠించిన నదియు లభింపగలదని భావము.

దుఃఖనివృత్తి ప్రకృతి పురుషుల సంబంధము విడిపోయిన కలుగునని

చెప్పబడినది కదా? ఆ సంబంధ మెట్లు కలిగినది?

**"కర్మ నిమిత్తః ప్రకృతేః స్వస్వామిభావోఽ ప్యనాదిర్ బీజాంకురవత్"** 6.67

ప్రకృతి పురుషులకు గల సంబంధము స్వస్వామిభావ సంబంధ మనబడును. పురుషుడు స్వామి; ప్రకృతి యతని స్వమ్ (ధనము – సొత్తు) ఇట్టి సంబంధము కర్మ నిమిత్తముగా నేర్పడు ననియు, నదియు బీజాంకురములకు వలె ననాది యనియు కొందఱు చెప్పుదురు.

**"అవివేక నిమిత్తోవా పంచ శిఖః"** 6.68

కాని, పంచశిఖాచార్యుడు మాత్ర మీ ప్రకృతి పురుషులకు గల స్వస్వామిభావ సంబంధము అవివేకము వలన కలుగునని చెప్పుచున్నాడు. ఇయ్యదియే సాంఖ్యుల మతము.

**"అవివేక నిమిత్తోవా పంచశిఖః"** 6.68

కాని, పంచశిఖాచార్యుడు మాత్ర మీ ప్రకృతి పురుషులకు గల స్వస్వామిభావ సంబంధము అవివేకము వలన కలుగునని చెప్పుచున్నాడు. ఇయ్యదియే సాంఖ్యుల మతము.

**"లింగశరీర నిమిత్తక ఇతి సనందనాచార్యః"** 6.69

సనందనాచార్యు డీ సంబంధము సూక్ష్మ శరీరము వలన నేర్పడునని యెంచుచున్నాడు.

**"యద్వా తద్వాతదుచ్ఛిత్తిః పురుషార్థః, తదుచ్ఛిత్తిః పురుషార్థః"** 6.70

ప్రకృతి పురుషులకు గల స్వస్వామిభావ సంబంధము కర్మ నిమిత్తకముగానీ, అవివేక నిమిత్తకముగానీ, సూక్ష్మ శరీర నిమిత్తకము గానీ, యెట్లేర్పడినను నేర్పడవచ్చును. కాని, వివేక జ్ఞానము కలుగకున్నచో నా సంబంధము విడిపోనేరదు. కాబట్టి యా సంబంధ విచ్ఛేదము నార్జించుటయే పరమ పురుషార్థము. దాని వలననే దుఃఖాత్యంత నివృత్తి కలుగును.

నిఖిలశాస్త్రనిష్ణాత శ్రీమత్పండితముక్తి రామోపాధ్యాయశిష్య
పండిత గోపదేవ విరచిత 'అంబా' వ్యాఖ్యాన సహిత
సాంఖ్యదర్శనము సమాప్తము.

## పారిభాషిక పదములు